# పి.వి. నరసింహారావు

## 'ది ఇన్‌సైడర్' తెలుగు అనువాదం

# లోపలి మనిషి


అనువాదం

కల్లూరి భాస్కరం



ఎమెస్కో

Original title
**The Insider**
Novel by
**P.V. Narasimha Rao**
Telugu title
**Lopali Manishi**
Translated by
**K. Bhaskaram**
Edited by
**P.V. Narasimha Rao**
Originally Published in Viking by Penguin Books India (P) Ltd., 1998
11, Panchasheel Shopping Centre,
Panchasheel Park, New Delhi - 110 017
First Published in Telugu, October, 2002
Cover Photograph by Prabuddha Das Gupta
Cover design by Purushoth Kumar G.
Type setting by Pallavi Graphics, Kakinada. Ph·0884-361158
Printed by Vasu Off-set, Vijayawada
Publishers .
**EMESCO BOOKS**
Eluru Road, Vijayawada - 2
Andhra Pradesh, India
Ph . 0866-577498, 575281
e-mail emescobooks@yahoo.com
Price : Rs.**300/-**

**ముద్రణ : వాసు ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ. ఫోన్ : 0866-438324.**

# అంజలి...

ప్రియమైన తెలుగు పాఠకులకు ఎమెస్కో పక్షాన హృదయపూర్వక నమస్కారాలు. ఒక గొప్ప పుస్తకం మొదటి పేజి తెరవడానికి ముందు నేను మీతో రెండు మాటలు ప్రచురణకర్తగా చెప్పాలనుకుంటున్నాను.

1998లో 'ది ఇన్‌సైడర్' విడుదలైనప్పుడు ఆ పుస్తకాన్ని విజయవాడలో మొదటిగా కొన్నవాళ్ళలో నేనొకణ్ణి. ఆ పుస్తకం చదువుతుంటే నాకు ఓ సుదీర్ఘమైన ప్రయాణం చేసిన అనుభూతి కలిగింది. ఆ అనుభూతి నన్ను బలోపేతం చేసేదిగానూ, స్ఫూర్తినిచ్చేది గానూ, జ్ఞానదాయకంగానూ అనిపించింది. వెంటనే శ్రీ పి.వి. నరసింహారావు గారిని ఈ పుస్తకం తెలుగు అనువాదాన్ని ప్రచురించడానికి అనుమతి కోరుతూ ఓ ఉత్తరం రాశాను. ఆ తరువాత కొంతకాలానికి ఆంధ్రప్రభ దినపత్రికలో 'లోపలి మనిషి' శీర్షికన ది ఇన్‌సైడర్ అనువాదం ప్రచురిస్తున్నప్పుడు ఆ అనువాదాన్ని నేను చదివాను అయితే శ్రీ పి వీ గారి నుంచి నాకెటువంటి సమాధానం రాకపోవటంనుంచి నాకీ పుస్తకం ప్రచురించే అవకాశం రాదేమోనని భయపడ్డాను.

2000 వ సం॥లో తెలుగు వచనంలో వేదాలను నేను ప్రచురించడానికి ముందు అలా ప్రచురించాలనే ప్రణాళిక నా దగ్గర లేదు. అయితే వాటిని ప్రచురించడం, జనం విశేషంగా ఆదరించడం నా పట్ల జరిగిన ఓ అద్భుతంగా నేను భావించాను.

ఇప్పుడు ఈ పుస్తకం ప్రచురణా అలాగే జరిగింది .... తేది ఉదయాన్నే మిత్రులు సుప్రసిద్ధ పత్రికాసంపాదకులు కె రామచంద్రమూర్తి గారు నాకు ఫోన్ చేసి పి వీ గారి ది ఇన్‌సైడర్ తెలుగు అనువాదం ప్రచురించే ఉద్దేశం ఉందా అని అడిగినప్పుడు నాకేం మాట్లాడాలో తెలియలేదు. వెంటనే ఆ ప్రతిపాదనను నేనంగీకరించాను.

ఈ పుస్తకం నేను ప్రచురించినట్లయితే తెలుగు అక్షరం పట్ల, తెలుగు సాహిత్యం పట్ల నేను నిర్వర్తించాల్సిన బాధ్యతల్ని నేను సరిగా నిర్వర్తించలేనివాణ్ణయ్యేవాడిని. ఈ పుస్తకాన్ని నేను ప్రచురించడం, ఈ పుస్తకం ప్రచురణ నిమిత్తం పలుమార్లు శ్రీ నరసింహారావు గారితో చర్చించడం, వారితో కొంత సమయం గడపడం నా పట్ల జరిగిన ఓ అద్భుతంగా భావిస్తున్నాను.

స్వాతంత్ర్యానంతర భారత రాజకీయ, సామాజిక చరిత్రలో ప్రయాణానికి బయలుదేరుతున్న మీకు ముందుగానే నా శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను. ఈ పుస్తకం ప్రచురించి మీకందించే అదృష్టం నాకు కలిగినందుకు నన్ను నేను అభినందించుకుంటూ సెలవు తీసుకుంటున్నాను.

**దూపాటి విజయకుమార్**

## ఇంకా కొనసాగుతున్న కథ

# ‘లోపలి మనిషి’

‘లోపలి మనిషి’ కొంచెం అటు ఇటుగా అయిదు దశాబ్దాల రాజకీయ, సాంఘిక, మానసిక స్థితిగతులు; వాటికి అల్లుకున్న ఆలోచనలు అంతర్మథనాల విశ్లేషణాత్మక పునశ్చరణ. ప్రతి తరానికీ తనదైన చరిత్ర, వ్యక్తిత్వం, ఆలోచన ఉంటాయన్న ప్రాతిపదికపై చూస్తే ఈ అయిదు దశాబ్దాలలో కనీసం మూడు, నాలుగు తరాలు (1970ల నాటికి) గడిచాయి. వాటిలో నేను చివరితరం వాణ్ణి.

‘లోపలి మనిషి’ అవతరణలో నేను నిర్వహించిన అనువాదక పాత్రను కాసేపు పక్కన పెట్టి, ఒక పాఠకునిగా, ఒక ఆలోచనాశీలిగా చెప్పవలసివస్తే ’70ల నాటికి దేశమంతటా ప్రాబల్యంలో ఉండి, ‘లోపలి మనిషి’లోనూ చిత్రితమైన ఒకానొక అధికారపక్షం మీద కానీ, ప్రజాస్వామ్యం ముసుగులో కొనసాగిన అప్పటి అధికార రాజకీయాల మీద కానీ కనీసమైన విశ్వాసం, సానుభూతి లేని తరం నాది. పైగా వ్యవస్థితనిర్మాణంపై (ఎస్టాబ్లిష్‌మెంట్) వ్యతిరేకంగా అప్పుడప్పుడే పుంజుకుంటున్న భావాల ప్రభావం కింద బుద్ధి వికాసాన్నీ, ఆలోచనానైశిత్యాన్నీ పొందిన అసంతృప్త, ఆగ్రహతరం కూడా నాది.

ఇక ‘లోపలి మనిషి’ వెలుగు చూసిన నాటికి మరికొన్ని తరాలు గడిచాయి. ప్రాపంచికదృక్పథంలో నా తరానికీ నా ముందు తరాలకీ భిన్నమైన మౌలిక పరివర్తనకు లోనైన తరాలు ఇవి. ఒక నిర్దిష్ట ఉదాహరణ చెప్పాలంటే, భూమి సంబంధాల చర్చ. నా తరం వరకూ కూడా చర్చనీయంగా ఉంటూ వచ్చిన ఈ సమస్య ఇప్పటి తరంలో అసలు ప్రస్తావనకే రావటం లేదు.

ఈ విభిన్న తరాల నేపథ్యం నుంచి చూసినపుడు ‘లోపలి మనిషి’ ప్రాసంగికత (రెలెవెన్స్) ఏమిటన్నదే, ‘ది ఇన్‌సైడర్’ను చదివినప్పుడూ, దానిని తెలుగులోకి అనువదిస్తున్నప్పుడూ కూడా నేను ఎదుర్కొన్న ప్రశ్న. చివరకు నాకు కలిగిన అభిప్రాయం ఏమిటంటే, తరాల అంతరాలను దాటుకుని, దశాబ్దాల దూరాలను ఛేదించుకుని ‘లోపలి మనిషి’ తన ప్రాసంగికతను స్థాపించుకోగలిగిందని. ఈ కారణంచేతనే, ‘మాలపల్లి’, ‘వేయిపడగలు’ వంటి రచనలకు ఉన్న గొప్ప ఐతిహాసికలక్షణాన్ని ‘లోపలి మనిషి’ సంతరించుకుంది– పరిమాణంలోనూ, వస్తువులోనూ కూడా.

'లోపలి మనిషి'లో ప్రతితరం తన ఆశ నిరాశల ప్రతిబింబాన్ని చూసుకుని దాని నిరంతర ప్రాసంగికతను గుర్తించడానికి ఏకైక కొలమానం అందులో చిత్రితమైన ఒక దారుణ వైఫల్యం, ఒక రాజకీయ వైఫల్యం, దశాబ్దాల వెంబడి నిరవధికంగా కొనసాగుతున్న ఘోరవంచనతో కూడిన ఒక మహా వైఫల్యం. అందుకే 'లోపలి మనిషి' ఇంకా కొనసాగుతున్న చరిత్ర. అందులోని ఆనంద్ నిన్నటి తరానికీ, నేటి తరానికీ, బహుశా ముందు తరాలకూ కూడా ప్రాతినిధ్యం వహించే పాత్ర.

ఆనంద్ తలపడినది ఒక త్రికోణనిర్మితస్థితితో. దాని అట్టడుగున ఉన్నది, ఎన్నికలలో వోటర్లుగా తప్ప ఇంకెలాంటి గుర్తింపూ లేని, నోరూవాయీలేని అసంఖ్యాకసామాన్యప్రజానీకం. మధ్యలో ఉన్నది, సిద్ధాంతజ్ఞానంగానీ, నిబద్ధతగానీ, ప్రజాహితదృష్టిగానీ లేని రాజకీయ దళారుల ప్రపంచం. ఆ త్రికోణస్థితిపైన ఏకాకిగా నిలబడిన ఒక స్వాప్నికుడు, ఒక తాత్త్వికుడు, ఒక ప్రజాహితైషి ఆనంద్. అట్టడుగువైపుకు రాజకీయ, శాసనగతిని మళ్ళించడానికి అతను చేసిన నిర్విరామ విఫలయత్నాల విషాదగాథే 'లోపలి మనిషి'. కొన్ని దశాబ్దాలకు విస్తరించిన అతని రాజకీయ చరిత్రలో అంతర్లీనంగా, ఏకసూత్రంగా కొనసాగి అతని కార్యోత్సాహానికి కేంద్రబిందువుగా మారింది భూసంస్కరణలు. అప్పుడు భూసంస్కరణలు కావచ్చు, ఇప్పుడు మరొక అంశం కావచ్చు. ఫలితంలో తేడా ఉండదు.

పైగా పరిస్థితి ఇప్పుడు మరింత భయావహం. ఎందుకంటే ఉపరిభాగంలో ఆనంద్‌తో పోల్చగలిగిన రాజకీయ పాత్రధారి ఎవరూ ఇప్పుడు కనిపించడంలేదు. మిగిలినవి దళారులు, దయనీయ ప్రజలు నిండిన మధ్య, నిమ్న భాగాలే.

కనుక 'లోపలి మనిషి' ఇంకా కొనసాగుతున్న కథ!

నాతో ఈ విశిష్ట రచనను అనువాదం చేయించిన 'ఆంధ్రప్రభ' పూర్వ సంపాదకులు శ్రీ వి.వాసుదేవ దీక్షితులు గారికి, శ్రీ జి. శ్రీరామమూర్తి గారికి; అనువాదయజ్ఞంలో అక్షరక్షరం సహకరించిన మూలకర్త, భారత మాజీ ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు గారికి, దీనిని ఎంతో అందంగా ప్రచురించిన 'ఎమెస్కో' ప్రచురణలకర్త శ్రీ విజయకుమార్ గారికి కృతజ్ఞుణ్ణి.

– కల్లూరి భాస్కరం

# మున్నుడి

లోపలిమనిషి పాఠకుల సమక్షాన ఇదివరలో సీరియల్ రూపంలో వచ్చి, ప్రస్తుతం పుస్తకరూపంలో వెలువడడం నాకెంతో సంతృప్తి కలిగిస్తోంది. ప్రకాశకులకు నా కృతజ్ఞతలు.

ఈ సందర్భంలో కొన్ని ముఖ్యాంశాలు మనవిచేయాలనుకున్నాను. ఈ రచన ఆత్మచరిత్రకాదు. కాల్పనిక రచనవలె రచయిత స్వచ్ఛంద ఊహలను అనుసరించేదీ కాదు. ఇది కల్పనాయదార్థాల సమ్మిశ్రణ సమన్వయాలతో రూపొందింది. భాగస్వామి, సాక్షి, కథాకారుడు, విమర్శకుడు– రచయిత ఈ నాలుగు పాత్రలను ఒకే సమయంలో పోషించే ప్రయత్నం చేస్తున్నాడు. ఈ విశిష్టనేపథ్యంలో ఇదా, అదా, అనే మీమాంస రచనను పుట్టుకతోనే వెన్నాడుతూ ఉంది. దేశస్వాతంత్ర్యోద్యమంలో తుది ఘట్టంనుంచి నేటివరకు లోపలిమనిషిగా రాజకీయసాంఘిక వికాసక్రమాన్ని సాధ్యమైనంత వ్యక్తినిరపేక్షంగా పరిశీలించిన వాణ్ణి కనుక ఈ రచనాసౌధం గట్టినేలపై నిలుచుని ఉందనగలను. రాబోయే కాలంలో అఘాతవిస్మయాలు కలిగించే అనేకసమస్యలను దేశం, ప్రపంచం, ఎదుర్కొన బోతున్నాయి. అందుకని ఈ రచనావస్తువు అనంతంగా ఉంటుంది; అనంతమైన నూతనరచనల సృష్టికి అవకాశాలు కల్పిస్తుంది. ఇది నిస్సందేహం. ఈ ఒరవడిలో ప్రారంభప్రయత్నాలలో ఆవిర్భవించినందుకు లోపలి మనిషి తన భాగ్యానికి సంతోషిస్తున్నాడు.

1960, 70 దశకాలలో నాడు కేంద్రంలో ఉన్న అధికార పార్టీ సామాజిక పరివర్తనానికి సంబంధించిన అనేక క్షేత్రాల్లో అవలంబించనున్న విధానాలను, వాటి అమలుకై కార్యాచరణ సూత్రాలను, రూపొందించిన విషయం సర్వవిదితమే. ఈవిషయాలను ఈ పుస్తకంలో విశ్లేషించడం జరిగింది. ఈ కార్యక్రమాలను అమలుచేసే బాధ్యత ముఖ్యంగా రాష్ట్రప్రభుత్వాలపై ఉండింది. ఏదో ఒక్క రాష్ట్రాన్ని ఎంచుకొని ప్రత్యేకంగా అక్కడ జరిగిన కార్యక్రమాన్ని వర్ణించడంకానీ విమర్శించడంకానీ ఈ రచన ఉద్దేశం కాదు. రాష్ట్రప్రభుత్వం ఇలాంటి మార్పుకు మాధ్యమంగా ఉండడం ముఖ్యఇతివృత్తం. అందుకని ఏదోఒక రాష్ట్రం కథాస్థలంగా, అక్కడి గతివిధుల రూపంలో ఆ కార్యక్రమాల అమలుకు సంబంధించిన అనేకపక్షాలు రచనలో సమావేశపరచడం జరిగింది. ఎక్కడైనా

ఫలానా రాష్ట్రంతో పోలికలు కొన్ని విషయాల్లో కనిపిస్తే, అదే రాష్ట్రంతో ఏమాత్రం పోలికలులేని ఇతర అనేకవిషయాలుకూడా ఉండడం గమనించవలసిన విషయం. ఈ రచన అనువదించబడిన ఐదు భాషారాష్ట్రాల్లోనూ ఇలాగే ఈ రచనలోని పాత్రలతోనూ సంఘటనలతోనూ పోలికలు ఉండడమూ ఉండకపోవడమూ, అక్కడివారు నాకిచ్చిన భోగట్టావల్ల తెలిసింది. అలాంటి వ్యక్తులు అన్ని రాష్ట్రాల్లోనూ ఉన్నారు కనుక దేశమంతటా ఎక్కడైనా కనపడే వ్యక్తులూ దృశ్యాలూ ఈ రచనకు ఆధారంగా ఉండవచ్చునని మనవి. ఈ పాత్రలు నూటికినూరు పాళ్ళు కాల్పనికం కాదు, నూటికినూరు పాళ్ళు వస్తుతః శల్యమాంసయుక్తులైన వ్యక్తులూ కాదు. రకరకాల మనుషుల్లో రచయితకు కానవచ్చిన రకరకాల ప్రవృత్తుల సంమిశ్ర (సింథెటిక్) సృష్టిజనితులు. ఐతే దీనికి తప్పనిసరిగా మినహాయింపు చేయవలసివచ్చినవారు రచనలో ప్రవేశించిన ప్రధానమంత్రులు. వారి విషయంలో కాల్పనికతకు ఆస్కారం లేనందున వారి చిత్రణ ఉన్నదున్నట్టే చేయబడింది.

కావున ఫలానా పాత్ర ఎవరు? రచయిత ఫలానా పాత్రలో తన ఆత్మచరిత్రను చొప్పించాడా? లాంటి ప్రశ్నలకు నేరుగా ప్రత్యుత్తరాలు ఈ రచనలో లభించవని రచయిత మనవి. పాత్రల పరికల్పనకు ఆధారభూతమైన అంశాలను ఉల్లేఖించి, అసలు చెప్పదలచిన విషయంపైకి పాఠకుల దృష్టిని మళ్ళించే ఉద్దేశంతోనే ఈ వివరణ వాక్యాలు ఇక్కడ పొందుపరుస్తున్నాను.

—రచయిత

# లోపలి మనిషి

# 1

ఆనంద్ అని పేరు పెట్టారు అబ్బాయికి, పదకొండో రోజున బారసాల చేసి.

భూమ్మీద పడగానే గుక్క పట్టాడు. అప్పుడు అబ్బాయి నోటికి ఒక మెత్తని వస్తువును అందించారు. పుట్టగానే అతడికి మొదట తెలిసిన వస్తువు అదే.

అమ్మ కడుపులో ఉండగానే నేర్చుకున్నాడో ఏమిటో, నోటికి అందించగానే పాలు పీల్చడం మొదలుపెట్టాడు.

రోజులు గడచిన కొద్దీ పరిసరాలు తెలుసుకుంటున్నాడు. అమ్మ గొంతు ఇట్టే గుర్తు పడుతున్నాడు. తన బుగ్గలపై అమ్మ మెత్తని పెదవుల స్పర్శ ఎంతో ఇష్టంగా ఉండేది. అన్నీ బాగానే ఉండేవి గానీ కంపుకొడుతూ గుచ్చుకునే గరకు గడ్డాల వాళ్ళు ఎవరైనా తన దగ్గరకొస్తే మాత్రం ఏడుపు లంకించుకునే వాడు. వాళ్ళ ముద్దులూ మురిపాలూ అన్నీ ఆ ఏడుపులో కలసి పోయేవి.

కొన్ని నెలలు గడవగానే అబ్బాయి లేచిగుళ్ళనుంచి పదునైన పళ్ళు పుట్టుకొచ్చాయి. వాటి ఉపయోగం అబ్బాయికి వెంటనే తెలిసిపోయింది. అమ్మ పాలు ఇచ్చినప్పుడల్లా గట్టిగా కొరికేవాడు. అమ్మ బాధతో విలవిల్లాడేది. అబ్బాయి పకపకా నవ్వేసేవాడు. ఆ సరదా కాస్తా అలవాటుగా మారి కూర్చుంది. ఏదో ఒకటి చేస్తే కానీ అలవాటు తప్పేలా లేదు. ఓ రోజున పాలు తాగబోతే నోరంతా చేదుచేదు. తాగడం మానేసి చేదునంతా బయటికి ఉమ్మబోయాడు కానీ అతడివల్ల కాలేదు. దాంతో గట్టిగా ఏడుపు అందుకున్నాడు. ఈ సారి నవ్వడం అమ్మ వంతు. అక్కడే ఉన్న ఇరుగుపొరుగు అమ్మలక్కలు కూడా అబ్బాయి అవస్థ చూసి నవ్వు ఆపుకోలేకపోయారు. తల్లిపాలు మాన్పించడానికి వాళ్ళంతా ఉపయోగించిన చిట్కాయే అది. వేపాకులు మెత్తగా నూరి ముద్ద చేసి చనుమొనల చుట్టు పూస్తే చాలు అబ్బాయి మళ్ళీ ఆ వైపు చూడడు.

అమ్మ రోజూ పొద్దుటే ఒళ్ళురుద్ది వేణ్ణీళ్ళతో స్నానం చేయిస్తూ ఉంటే ఎంతో హాయిగా ఉండేది. కింద కూర్చుని చీర కొద్దిగా పైకి లాక్కొని కాళ్ళు బార జాపి అమ్మ అబ్బాయిని తన తొడల మీద కూర్చో బెట్టుకునేది. మొదటమొహానికి, తర్వాత వీపుకీ, ఆ తర్వాత మొత్తం ఒంటికీ నువ్వుల నూనె పట్టించేది. కొన్ని చుక్కలు చెవుల్లో కళ్ళల్లో ముక్కు పుటాల్లో వేసేది. ఆ తర్వాత అబ్బాయి ఒంటికి పట్టేంత ఉడుకునీళ్ళతో స్నానం చేయించేది. అమ్మ చేతుల్లో అబ్బాయి రబ్బరు బొమ్మలా సాగిపోయేవాడు. లేత ఒళ్ళు ఎరుపు రంగుకి తిరిగి పోయేది. ఇదంతా ఇష్టంగానే ఉండేది కానీ కళ్ళల్లో నూనె చుక్కవేసినప్పుడు మాత్రం కళ్ళు మండిపోయేవి. అంతే. అబ్బాయి చేసే ఆగం అంతా ఇంతా కాదు. పెంకులు ఎగిరి పోయేలా కేకలు. అమ్మ పొట్టనీ, రొమ్ముల్నీ బలం కొద్దీ తన్నుతూ ఉండేవాడు.

స్నానం చేయించగానే అమ్మ ఉయ్యాలలో పడుకోబెట్టి సాంబ్రాణి ధూపం వేసేది. అబ్బాయి వెంటనే గాఢనిద్రలోకి జారిపోయేవాడు.

నిద్రపోతున్నప్పుడు ఒక్కొక్కసారి ఏదో పెద్ద ఉపద్రవం ముంచుకొచ్చినట్టు అబ్బాయి ముఖంలో చెప్పలేనంత బాధ తొంగిచూసేది. ఒక్కొక్కసారి ముఖం ఆనందంతో వెలిగిపోతూ ఉండేది. పిల్లలందరిలానే ఏవో ప్రాచీనస్థలకాలాల్లోకి జారిపోయి ఉపచేతనావస్థలో మానవ అస్తిత్వమహారహస్యాలను దర్శించి వాసనారూపంలో అనుభవించేవాడు కాబోలు. ఆ ముఖంలో తొంగి చూస్తున్న వేదన భూత భవిష్యత్‌వర్తమానాలలో మనిషిపడే దుఃఖం తలపుకు రావడం వల్లనేమో. యుద్ధ బీభత్సం, అణు విస్ఫోటం, హంతకుల తుపాకి గుళ్ళకూ, బాంబులకూ నేలకొరిగిన మహాత్మాగాంధీ, ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీల రుధిరం దేశం ధూళిలో కలసి పోతున్న దృశ్యం— ఇవన్నీ అతడి మనోనేత్రం ముందు సాక్షాత్కరించేవి కాబోలు.

నిద్రలోనే ఆ ముఖంలో ఒక్కొక్కసారి ఎంతో ఆనందం, తృప్తి. తాను జగదేక మహాపురుషుడైనట్టు కలగంటున్నాడేమో. పురాణాలు అద్భుతసౌందర్యరాశిగా వర్ణించిన ఇంద్రుడి అర్ధాంగి శచీదేవినో, అంతటి మరో అందగత్తెనో తాను వరించినట్టు ఊహించుకుంటున్నాడో ఏమో. అబ్బాయి కలలు ఎలాంటివైనా అమ్మ మాత్రం కలవరపడిపోయేది. ఏదో దెయ్యం పట్టిందని ఊహించుకుని భయపడిపోయి భూతవైద్యుణ్ణి పిలిపించింది. అబ్బాయి కలలు ఎలా వచ్చాయో అలాగే వెళ్ళి పోయాయి కానీ భూత వైద్యుడు మాత్రం ఆ పేరు చెప్పుకుని ఇంత నగదు, సరుకు మూటగట్టుకుని వెళ్ళిపోయాడు.

మెత్తగా ఉడికించిన ఆహారం, కాస్త ఉప్పువేసి తినిపించడం ప్రారంభించింది అమ్మ. మొదట్లో అబ్బాయికి అదేమంత రుచిగా అనిపించక ముఖం చిట్లించేవాడు. కాని ఆకలి గెలిచింది. రానురాను రుచిమరిగి అది బాగానే ఉన్నట్టు అనిపించేది. ఇంకా ఇంకా పెట్టమని ఏడవడం మొదలుపెట్టాడు. ఊహు. అమ్మ వినిపించుకుంటే కదా! ఓ ముద్ద ఎక్కువైతే అబ్బాయికి అజీర్తి చేయదూ! ముద్ద క్రమంగా పెంచుకుంటూ వెళ్ళవలసిందే.

అబ్బాయి అడుగులు వేస్తున్నాడు. ఆ బుడిబుడి అడుగులు చూసి ఇంటిల్లిపాది ఎంత సంబరపడిపోయారో. అబ్బాయి నడకతోనే మరో చిక్కు వచ్చిపడింది. ఇంట్లో ఏ వస్తువూ ఉన్న చోట ఉండడం లేదు. కుడిచెప్పు సింహద్వారం దగ్గర ఉంటే ఎడమచెప్పు ఇల్లంతా తిరిగి ఎక్కడో పెరట్లో పడిఉండేది. ఒక్కొక్కసారి ఇంట్లో వస్తువులు పూర్తిగా మాయమైపోయేవి.అవి ఏమయ్యాయో ఎవరికీ అంతుబట్టేది కాదు. ఇత్తడిగిన్నె అమాంతం రాకెట్‌లా పైకి లేచి బావిలోకిదూసుకెళ్ళేది. అది పొరపాటున ఎవరికో కంటబడితే తప్ప ఆ రహస్యంఅలాగే ఉండేది. ఈతగాళ్ళకు పిలుపు వెళ్ళేది. వాళ్లు వచ్చి బావిలోకి దిగి గాలించేవారు. పోయాయనుకుని ఆశవదలుకున్న రకరకాల వస్తువులు ఒకటొకొటిగా బయటపడేవి.

అప్పుడే అబ్బాయికొక చెప్పలేని ఇబ్బంది వచ్చి పడింది. పదిహేను రోజుల కోసారి చచ్చినట్టు ఆముదం తాగవలసి వచ్చేది. పిల్లలకు విధిగా ఆముదం పట్టించవలసిందే. ఈ విషయంలో అమ్మది ఉడుం పట్టు. వాళ్ళ అమ్మ తనకు అలాగే పట్టింది. తరతరాలుగా అలా జరుగుతోంది. గ్రామ వైద్యుణ్ణి కదిపితే ఈ విషయం మీద పెద్ద ఉపన్యాసమే ఇస్తాడు. ఆముదం సుగుణాలన్నీ సంస్కృత శ్లోకాలను వల్లెవేస్తూ ముఖ్యంగా పిల్లలకోసం అదెంత అమోఘంగా పనిచేస్తుందో వివరిస్తాడు. ఆయుర్వేదానుసారం కడుపు అన్ని రకాల జబ్బులకు మూలం కనుక మలవిసర్జనలో లోపం రానివ్వకపోతే చాలు, నిండనూరేళ్ళు మనిషి బ్రతికి తీరుతాడని సిద్ధాంతం ప్రతిపాదిస్తాడు, మందువాసన కొట్టే తన దుస్తులను సవరించుకుంటూ. శిశువులతోనే ఆముదం పట్టించడం మొదలుపెట్టాలని శాసిస్తాడు.

ఆనంద్‌కు రోజు నిశ్చయంకానీ, కాలనిర్ణయంకానీ, చేయడం తెలియదు. కానీ ఆముదం పట్టించే రోజూ, వేళా, అదేదో జంతుసహజమైన సహజ జ్ఞానం ద్వారా తెలుసుకునేవాడు. కుటుంబం వారందరూ ఆముదం పట్టించే ముఖ్యకార్యక్రమానికి సన్నద్ధులయ్యేవారు. ఇంతలో అబ్బాయి ఎక్కడో మాయమైపోవడం, ఇంట్లో జనమంతా వాడి కోసం గాలించడం – దీనితో ప్రారంభమయ్యేది వారి దినచర్య. మంచాల కింద, అలమారు వెనుక, ఇంటివెనుక చెట్లపొదల్లో... ప్రతిసారీ దాక్కునే కొత్త తావులు పట్టుకునేవాడు. ఒకనాడు ఎటూతోచక ఒక పెద్దపాటి పెట్టెలో దూరి మూత వేసుకున్నాడు. ఇల్లంతా తిరిగే పనిమనిషి అది చూసి గోలపెట్టి ఉండకపోతే ఊపిరి సలపక ప్రాణం మీదకే వచ్చి ఉండేది.

చివరకు అందరూ కలసి అబ్బాయిని పట్టుకునేవారు, ఓ గంటపాడు గాలించి, పట్టుకోబోయినప్పుడుకూడా తప్పించుకోవడానికి ఎంతో శౌర్యంతో ప్రయత్నించేవాడు. అది ఇంక సాగదని తెలిస్తే తన్నడం, కొరకడం, అరవడం, ఉమ్మడం, పెనగులాడడం, ఏడవడం, గట్టిగా నోరు మూసుకోవడం – వగైరా యుద్ధకళలను ఉపయోగించేవాడు. అబ్బాయి కాళ్ళూ చేతులూ కదలకుండా పట్టేసి నోట్లో బలవంతాన ఒక స్పూను కుక్కేవారు. స్పూనును కొరకలేక ఇక తన ప్రయత్నం విరమించేవాడు. ఆ పాడు ఆముదం గొంతులోకి జారిపోయేది. ప్రతిఘటించలేని నిస్సహాయ స్థితిలో ఏం చేస్తాడు?... అయితే ఈ మహావిపత్తుకు పరిహారమన్నట్టు, అబ్బాయి

నోట్లో అమ్మ ఒక చిటికెడు చక్కెర పోసేది. కష్టసుఖాలను సమదృష్టితో అనుభవించే వేదాంతిలా, ఆ చక్కెర మాధుర్యాన్ని సంతోషంగా చవి చూసేవాడు.

వారాలు దొర్లినకొద్దీ అతను చేసే ధ్వనులు, అర్థమయ్యే పదాలలోకి మారసాగాయి. వాటి అర్థమేమిటో అతడికి తెలియదు. వాస్తవానికి దేనికైనా అర్థముండడమంటే ఏమిటో, అర్థమంటే అర్థమేమిటో – తెలియదు. త్వరలోనే తాను చేస్తున్న ధ్వనులకు కొందరు వ్యక్తులతో ప్రత్యేక సంబంధమేదో ఉన్నట్లు తెలిసింది. 'అమ్మ' అంటే తన తల్లి మాత్రమే, మరెవ్వరూ కాదు. ఇలాగే ఇతరుల గురించి. ఇక తానుకూడా కొన్ని ధ్వనుల కలయిక విని మారు పలకసాగాడు. దాన్ని 'పేరు' అంటారని తర్వాత తెలుసుకున్నాడు. తన పేరు, తన సొంతపేరు, తనది మాత్రమే, తానే దాన్ని ఉచ్చరించే ప్రయత్నం చేయసాగాడు – ఒక్కొకముక్కతో మొదలు పెట్టి, ఒక్కొక పొరపాటుతో మొదలుపెట్టి ... అనా... అనద్... చివరకు ఆనంద్. అలా గుర్తింపు పొంది, మిగతా మానవజాతిలో వేరుగా... ఏకైకంగా. .ఏకాకిగా... నిలిచాడు ఆనంద్.

★ ★ ★

ఆత్మవిశ్వాసం పెరిగనకొద్దీ ఆనంద్ ఇంటి బయటికి వెళ్ళసాగాడు. అక్కడొక అద్భుత రమ్య ప్రపంచం చూశాడు. ముఖ్యంగా పశువుల కొట్టు అతణ్ణి ప్రత్యేకంగా ఆకర్షించింది. ప్రతి సాయంత్రం పశువులు తిరిగిరావడం చూస్తుండేవాడు. వాటి గిట్టలరాపిడితో పుట్టిన ధూళిపొరల నుంచి అవి బయటపడుతుండేవి. కొన్నిటి మెడల్లో కట్టిన గంటల మోతలు వాటి రాకను సూచిస్తూ ఉండేవి.

అమ్మ ఆనంద్‌ని ఆవులదగ్గరికి పోనిచ్చేదికాదు – ముఖ్యంగా ఆ వాడి కొమ్ములతో తమ చిన్ని లేగల క్షేమంపైన ప్రత్యేకంగా నిఘా ఉంచే ఆవుల దగ్గరికి వాటి దగ్గరికెళ్లడమంటే పెద్ద వాళ్ళే జంకేవారు. అయితే అప్పుడు ఆనంద్‌కు భయమంటే ఏమిటో తెలియదు, తెలిసిందంతా ఆశ్చర్యం మాత్రమే. అమ్మ వంటగదిలో ఉన్నప్పుడో, గుడికివెళ్ళి ఆలస్యంగా వచ్చినప్పుడో, గుట్టుచప్పుడు కాకుండా అతను ఆవుల్ని సమీపించేవాడు. అదేం చిత్రమోకాని ఆవుల వల్ల అతనికే అపాయమూ జరగలేదు. ఒక ఆవు ప్రేమతో అతని తలమీద నాకింది కూడా. కాని ఇంతలో పనిమనిషి కేకలు పెడుతూ ఆనంద్‌ను తీసుకెళ్ళింది.

ఉదయం ఆవులు మేతకు వెళ్ళి లేగలు కొట్టంలోనే ఉండిపోయినప్పుడు ఆనంద్‌కు భలే సంతోషంగా ఉండేది. మరే మనిషికి అర్థం కాని భాషలో తాను లేగలతో మాట్లాడేవాడు. లేగలకు మాత్రం తన భాష పూర్తిగా అర్థమయ్యేది తాను కానీ, అవికానీ, అప్పటికి వాక్యరచనా వ్యాకరణమూ అనే వాటిచేత కలుషితం కాలేదు; అందుకని ఒకరినొకరు అపార్థం చేసుకునే ప్రమాదమే లేదు. అమ్మకు మాత్రం ఈ కొత్త స్నేహం చిరాకుగా ఉండేది. తన శరీరమంతా పేడతో నింపుకొని ఆనంద్ తిరిగి వచ్చేవాడు. పరుగులు తీస్తుంటే వాణ్ణి పట్టుకొని– ఆ పట్టుకోవడమే ఒక సమస్య– ఒళ్ళంతా తోమి శుభ్రం చెయ్యాలి. మళ్ళీ ఆ లేగలదగ్గరకు పోవద్దని అమ్మ గట్టిగా హెచ్చరించేది అయితే అమ్మకు మా స్నేహం అర్థంకాదనుకొని ఆనంద్ మళ్ళీ సమయం దొరకడమే

తడవుగా లేగలను కలుసుకుంటూ ఉండేవాడు. పనిమనిషి వారిస్తే ఆమెమీద అరుపులందుకు నేవాడు; లేగలన్నీ అతణ్ణి గట్టిగా సమర్థిస్తూ కోరస్‌లో స్వరం కలిపేవి.

త్వరలో ఆనంద్ కుటుంబంలో తన ప్రాధాన్యం కోల్పోయాడు –ఇంతలో ఒక బుల్లి చెల్లాయి జన్మించింది కనుక. అయితే అమ్మ చెల్లాయిసేవ చేస్తుంటే ఆనంద్‌ను గారాబంగా చూసుకు నేవాళ్ళు కూడా ఎందరో ఉన్నారు. పెదనాన్న ఆనంద్‌ను ఎంతో ముద్దుచేసేవాడు. సాయం సమయంలో ఆయన ఆనంద్‌ను చెరువు గట్టు మీదకి తీసుకెళ్ళేవాడు. ఆనంద్ పెద్దనాన్న కఱ్ఱ తీసుకొని దాన్ని అనేకవిధాలుగా ఉపయోగించేవాడు. ఒకప్పుడు కఱ్ఱను గుఱ్ఱంగా మార్చి దాని మీద స్వారీ చేస్తూ ముందు భాగాన్ని కళ్ళెంలా పట్టుకొని అదలించేవాడు. మరొకప్పుడు దాన్ని తుపాకీగా మార్చి దారిన వెళ్ళే వారిపై దాన్ని ప్రయోగించినట్టు తాను లొట్టలు వేస్తూ తుపాకీ ప్రేలే ధ్వని చేసేవాడు. అవతలి వాళ్ళు బెదిరిపోయినట్టు నటిస్తే ఎంతో ఆనందించేవాడు.

పెదనాన్న ఆనంద్‌కి అద్భుతమైన మనిషిగా కన్పించేవాడు. నాన్నమాత్రం అదోలాంటి బుగులు కొలిపేవాడు ఎందుకో ఆనంద్‌కి తెలియదు, కాని సహజంగా నాన్నను తాను కొంత దూరపు గౌరవంతో చూసేవాడు – నాన్న ఒకింత దర్పంగా ఉండడంచేత కాబోలు.

అమ్మకీ నాన్నకీ మధ్య తేడా కొట్టొచ్చినట్టు కనిపించేది. తనకేదో హక్కున్నట్టు, ఏ మాత్రం సంకోచం లేకుండా పరుగెత్తి అమ్మ ఒళ్లో వాలిపోయేవాడు. ఏడ్చినా, ఏదైనా అల్లరి పని చేసినా అమ్మ భరించేది. ఎప్పుడూ ముద్దు చేస్తూనే ఉండేది. నాన్న అలా కాదు. ఎప్పుడు పడితే అప్పుడు ఆయన చేతుల్లో వాలిపోయే అవకాశం లేదు. ముందుగా అటువైపు నుంచి తగిన సంకేతం రావాలి. నాన్నకీ తనంటే ఎంతో ఇష్టమే. కానీ ఆ యిష్టాన్ని మరీ ఎక్కువగా ప్రకటిం చేవాడు కాదు. అందుకే కాబోలు, నాన్న ముద్దు చేసినప్పుడు అది మరీమరీ బాగుండేది. ఆ ఎదురు చూపుకి తగిన ప్రతిఫలంగా ఉండేది. నాన్న అమాంతం అబ్బాయిని పైకి లేవదీసి గాలిలోకి ఎగరేసి పట్టుకుంటుంటే ఆనందం పట్టలేక కేకలు వేసే వాడు. ఇంకా నాన్న చక్కలి గింతలు పెట్టేవాడు. జుత్తు చెరిపేసేవాడు. బుగ్గలు పుణికేవాడు. రకరకాల ఆటలు ఆడించేవాడు. అవి నాన్న తప్ప మరెవరూ ఆడించలేని ఆటలు. అందులో మరీమరీ ఇష్టమైంది– నాన్న వెల్ల కిలా పడుకుని రెండు కాళ్లూ పైకి చాపి పాదాల మీద తనను పడుకో బెట్టుకుని పడకుండా నిలబెట్టి ఆడించే ఆట. ఒక్కొక్కసారి నాన్న తన ఒకే అరిపాదం మీద ఆనంద్‌ను పడుకోబెట్టి అలా ఆడించేవాడు. అప్పుడు ఆనంద్‌కు కలిగే భయమూ, ఆనందమూ అంతా ఇంతా కాదు. ఒకటే కేరింతలు, కేకలు. ఆకలి అమ్మను గుర్తు చేసే వరకూ ఆటలే ఆటలు.

నాన్న కండలు తిరిగి బలిష్ఠంగా ఉండేవాడు. ఊళ్లో ఘర్షణలు తలెత్తినప్పుడు, ఊళ్లోని రైతుల మీద పొరుగూరు రైతులు దాడులకు దిగినప్పుడు నాన్న చిన్నతనంలో రౌద్రంగా కఱ్ఱ తిప్పుతూ విరుచుకు పడేవాడు భూమి కారణంగానో, మరో కారణంగానో తగాదాలు జరుగుతూఉండేవి. ఊళ్లో రైతులకీ, మిగిలినవాళ్ళకీ నాన్నలో ఊరిని రక్షించగల నాయకుడు కనిపించి, ఎంతో గౌరవించేవారు. అఫ్రోజాబాద్ రాష్ట్రంలో ప్రభుత్వం అప్పటికింకా గ్రామభూముల సరిహద్దుల్ని

ఆధికారికంగా నిర్ణయించలేదు. తాతలనాటినుంచి వస్తున్న పద్ధతినే అంతా పాటించే వాళ్ళు. వివాదం తలెత్తినప్పుడు చర్చించుకుని రాజీ పడేవారు అదికూడా పని చేయనప్పుడు బలప్రయోగానికి దిగేవాళ్లు. ఒక వేళ రాజీకుదిరినా చిన్నచిన్న తగాదాలు తలెత్తుతూనే ఉండేవి. ఇవతలిపక్షం ఎంత బలంగా, దృఢంగా ఉందో పట్టి చూడటానికి అవతలిపక్షం ప్రయత్నించేది. ఆ ఘర్షణలో ఏదైనా ఒక పక్షం తన ఆధిక్యాన్ని రుజువు చేసుకుంటే గొడవలు తగ్గిపోయేవి. అలా తన సత్తా రుజువు చేసుకుని నాన్న గ్రామాధికారి అయ్యాడు.

ఆనంద్‌కి నాన్న గురువు కూడా. రాత్రి భోజనాలైన తర్వాత మండువాలోనో, శీతాకాలమైతే ఇంట్లోనో మంచంమీద విశ్రమించి ఆనంద్‌ను గుండెలమీద కూర్చోబెట్టుకుని భాగవత పద్యాలను దేవతా ప్రార్థనలతో మొదలు పెట్టి వరసక్రమంలో వల్లిస్తూ ఉండేవాడు. నాన్న ఎన్ని పద్యాలు వల్లించేవారో అది ఎంత సేపు సాగేదో ఆనంద్‌కి తెలియదు. మధ్యలోనే నిద్రలోకి జారిపోయేవాడు

కొన్నివారాలకే కొన్నిపద్యాలు ఆనంద్‌కి కంఠతా వచ్చేశాయి. నాన్న అబ్బాయితోపాటు కొంతసేపు గొంతుకలిపి వల్లించి తర్వాత ఊరుకునేవాడు. ఆనంద్ తనే వల్లిస్తూ పోయేవాడు. మధ్యలో తప్పు దొర్లితే నాన్న సరిదిద్దేవాడు. తప్పులు క్రమంగా తగ్గుముఖం పట్టాయి. నాలుగేళ్ళు నిండకుండానే అబ్బాయి అద్భుతమైన జ్ఞాపకశక్తిని ప్రదర్శించడంచూసి అంతా ముచ్చటపడేవారు. ఇమ్‌దాదీ అయ్యవారు ఆనంద్‌కి అక్షరాభ్యాసం చేయించాడు. ఆరితేరిన పండితుడిలా ఆనంద్ పద్యాలు ఏకరువు పెట్టడం చూసి అయ్యవారు ఆశ్చర్యచకితుడయ్యాడు.

ఆనంద్ అయిదో ఏట అడుగుపెట్టాడు. ఊళ్లో ఉన్న ఆ చిన్న స్కూల్లో ఇక చదువు కోవలసిందేమీ లేదు ఆనంద్‌లాంటి వేలాదిమంది బాలలు అలా మూడో తరగతితోనే చదువు విరమించి జీవితాంతం నిరక్షరాస్యులుగానే మగ్గిపోవడానికి ప్రభుత్వం తగిన 'జాగ్రత్త' తీసుకుంది. ప్రజల్ని చదువుసంధ్యలకి దూరంగా ఉంచితే తప్ప వారు సర్కారు గుప్పిట్లో ఉండరని పాలకుల విశ్వాసం. నాన్నకు ఈ విషయం తెలుసు. ఆయన కూడా బాధితుడే. పురాణాల నుంచి, కావ్యాల నుంచి ఆయన వందలకొద్ది శ్లోకాలు, పద్యాలు వల్లించగలిగినా అయితే అదంతా స్వయంగా కష్టపడి నేర్చుకున్న విద్య. సర్కారీభాషగా ఉన్న పర్షియన్‌లో ఒక్కమాట కూడా నాన్నకి తెలియదు అందువల్ల తాను ఎంతగా అవమానంపాలు కావలసివచ్చిందో ఆయనకు తెలుసు. అందుకే ఆనంద్‌ను 'ఆధునిక' విద్యలోకి దించాలని నిశ్చయించుకున్నారు. అక్కడికి ఇరవై మైళ్ళ దూరంలో తన తమ్ముడు ఉంటున్నాడు. ఆ ఊళ్లో ప్రాథమిక పాఠశాల ఉంది. ఆనంద్‌ను ఆ ఊరు పంపించి చదివించాలని నాన్న నిర్ణయించారు.

# 2

ఏప్రిల్ నెల. వేసవి సెలవుల తర్వాత జూన్‌లో ఆనంద్ వెళ్లిపోతాడు. పైకి సంతోషంగా ఉన్నట్టు నటిస్తున్నా అమ్మ గుండెల్లో పుట్టెడు దిగులు. ఆనంద్ మాత్రం నిర్విచారంగా ఉన్నాడు. ఎప్పటిలా ఆటపాటలతో గడిపేస్తున్నాడు.

అది మధ్యతరగతి కుటుంబం. ఇంకా చెప్పాలంటే మధ్యతరగతిలో కూడా మధ్యతరగతి. కష్టాల్ని తట్టుకోలేని దౌర్బల్యం ఒకవైపు, తట్టుకోక తప్పని పరిస్థితి మరో వైపు. ఏ దెబ్బలకైనా వీపు అప్పజెప్పవలసిందే. ఉన్నత- సంపన్న వర్గం వేరు. అది పాలకవర్గానికి దగ్గరగా ఉంటుంది. వాళ్ల నీతినియమాలు కూడా వేరుగా ఉంటాయి. అసలు అటువంటివేమీ ఉండవనడం వాస్తవానికి ఇంకా దగ్గరగా ఉంటుందేమో. సంఘం కట్టుబాట్లను వాళ్లు ఎప్పుడూ లక్ష్యపెట్టరు. వాటితో సంబంధం లేనట్టే ఉంటారు. తాము కోరుకున్నది జరగడానికి ఎంతకైనా తెగిస్తారు. అవడానికి వాళ్లు సంఖ్యలో తక్కువే. అయినా వాళ్ల పలుకుబడి ప్రాభవం అంతాఇంతా కావు. ఆ కుచ్చుటోపీలు, ఆ వేషభాషలు, ఆ ధోరణి- మిగిలిన వాళ్లకీ వీళ్లకీ తేడా స్పష్టంగా కనిపిస్తుంది. ఆ లక్షణాలను లవాజిమాత్ అనే వారు. ఆపాదమస్తకం భూస్వామ్యదర్పం ఉట్టిపడుతూ ఉంటుంది. ఇక నకిలీ భూస్వాములున్నారు. పాలకవర్గకూటమిలో గుర్తింపు కోసం వీళ్లు పడే అవస్థ చూసి తీరవలసిందే. ప్రభువుల్ని ఎంతగా అనుకరిస్తే అంతగా వీళ్లు అల్లరిపాలవుతూ ఉంటారు. అయినా ప్రభువుల చూరు పట్టుకువేలాడు తూనే ఉంటారు. వాళ్ల పరిస్థితి దయనీయం, దుర్భరం.

మరో చివర బడుగువర్గం. సంఖ్యలో ఎక్కువే అయినా అధికారానికీ, అభివృద్ధికీ దూరమైనవాళ్లు. అనామకులు. గుర్తింపుకు, గౌరవానికి నోచుకోనివాళ్లు. బతికే అవకాశం తప్ప మరేమీ కోరుకోని వాళ్లు. పున్నమికో, అమావాస్యకో కడుపునిండే భోజనం, సాయంత్రానికి ఇంత కల్లు. అవమానాలు, తన్నులు రోజూ భరిస్తూనే ఎప్పుడైనా 'దొర' గారు చూసే చల్లని చూపు కోసం ఎదురుచూపు. ఇవీ వాళ్ల బతుకులు. అవమానాలు అగచాట్లు వారిని ఎంత మాత్రం బాధిస్తున్నట్టు కనిపించవు. వాటికి పూర్తిగా అలవాటు పడిపోయినట్టుంటారు అమానుషంగానే కావచ్చు, వాళ్ల పరిధిలో వాళ్లు సంతోషంగా జీవిస్తున్నారని కూడా అనుకోవచ్చు

ఈ రెండు విపరీతప్రవృత్తులకీ మధ్యలో మధ్యతరగతి వేలాడుతూ ఉంటుంది. అభిమానం ఎక్కువ. అవమానాలు తట్టుకోలేరు. అయినా నోరువిప్పి ఏమీ అనలేరు. నిస్సహాయులు. లోలోపలే

కుళ్లిపోతూ ఉంటారు. ఉన్నతవర్గాలు వీళ్లని తృణప్రాయంగా చూస్తాయి. బడుగువర్గాలు వీళ్లను చూసి ముఖం తిప్పుకుంటాయి. చదువుసంధ్యలవల్ల కావచ్చు. మాటలో నడకలో వీళ్లు మిగిలిన వాళ్లకి భిన్నంగా ఉంటారు. గ్రామజీవితంలో వీళ్ళెప్పుడూ పైస్థాయిలో కనపడుతారు. వీళ్లలోనే కొందరు గ్రామాధికారులు. కనుక వీళ్లని రాచరికచిహ్నాలుగా భావించి జనం అసహ్యించుకుంటారు. ప్రజల అణచివేతకు దోహదంచేస్తూ, అవినీతికి వాహకులుగా ఉంటూ వ్యవహరించేవారు. వీళ్ళే స్వయంగా జనాన్ని పీడించి హింసించే చిన్నసైజునియంతలు. అవినీతి ప్రతిరూపాలు. ఈ లక్షణాలు వీరిని గ్రామజీవితంనుంచి మరింత దూరం చేశాయి. సర్కారీ పనుల సందర్భంలో నీచమైన చర్యలు చేయడంతోనే వీళ్ల పొద్దు గడిచిపోతూ ఉంటుంది. అందుకే జనం వీళ్లని సర్కారులో భాగంగానే పరిగణిస్తుంటారు. పదవిలో ఉన్న ప్రతివాళ్లూ వీళ్లని వాడుకునేవాళ్లే కానీ పట్టించుకునే వాళ్లు ఎవరూ ఉండరు. అందుకే నామరూపాలు లేని తరగతిగా మిగిలిపోయారు. ఒంటరి బతుకులు వీళ్లవి. రెండువైపులా నలిగిపోక తప్పదు. జనానికి కళ్ల ముందు కనిపిస్తుంటారు కనుక నిందలన్నీ నెత్తిమీద వేసుకోక తప్పదు. అసలు అవినీతివల్ల లాభంపొందే ఉన్నతాధికారులు అలా కాదు, ప్రజల చూపుమేర దాటి ఎక్కడో దూరంగా ఉంటారు, జనాగ్రహంనుంచి తప్పించుకుంటూ.

ఆనంద్ ఊరిపేరు అనంతగిరి. ఆనంద్ చిన్నతనంలో ఆ ఊరి జనాభా రెండువేలు. ఊళ్లో పురాతననిర్మాణాలు కొన్ని ఉన్నాయి. అయితే వాటి ఆలనాపాలనా పట్టించుకునే వాళ్లులేరు కొన్నింటిని మాత్రం గ్రామస్థులు సంరక్షించుకుంటూ వస్తున్నారు. రెండువందలఏళ్లక్రితం నిర్మించిన బురుజు అందులో ఒకటి. అదిప్పుడు అర్ధశిథిలావస్థలో ఉంది. అలాగే శివాలయం ఊరంతకీ ఎత్తుగా ఠీవిగా కనిపించే హనుమాన్ విగ్రహం. పక్కనే రెండడుగుల వెడల్పు, ఏడడుగుల ఎత్తు ఉన్న రాతిపలక. దానిమీద తెలియని లిపిలో ఒక శాసనం. గ్రామస్థులు ఎప్పటినుంచో వీరహనుమాన్‌ను గ్రామాన్ని రక్షించే దేవతగా కొలుచుకుంటున్నారు. పిశాచాలబారినుంచి గ్రామాన్ని రక్షిస్తాడని వాళ్ల విశ్వాసం. ఊళ్లోవాళ్లే కాకుండా చుట్టుప్రక్కల ఊళ్ల నుంచి కూడా వచ్చి హనుమాన్‌ను పూజించుకుని వెడుతుంటారు. ముఖ్యంగా దెయ్యం పట్టినట్టు అనుమానించిన స్త్రీలను తీసుకొచ్చి కొన్నిరోజులపాటు పూజలు చేయిస్తారు (సాధారణంగా నలభై రోజులు). దెయ్యం వదిలినట్టు భావించుకుని సంతృప్తిగా వాళ్లు తిరిగివెడుతుంటారు. వాయుపుత్రుడైన హనుమాన్‌కి అసాధ్యం ఏదీ ఉండదని వాళ్ల నమ్మకం. శాస్త్రాల్లో నిర్దేశించిన పర్వదినాల్లో, పండితుల సలహాప్రకారం భక్తులు సొంతఖర్చుతో హనుమంతుడి విగ్రహానికి సిందూరం పూయించి తమ ప్రగాఢ భక్తినీ, కృతజ్ఞతనీ ప్రకటించుకుంటూఉంటారు.

చుట్టుప్రక్కల ఉన్న చిట్టడవులు ఒకప్పుడు ఊరికి ఆనుకునే ఉండేవట. తమ చిన్నతనంలో చిరుతపులులు, తోడేళ్ళు ఇళ్లల్లోకి గొడ్లచావిట్లోకి వచ్చేసి లేగదూడల్ని నోట కరుచుకుని పోయేవని పెద్దవాళ్లు చెబుతూ ఉంటారు. డెబ్బై, ఎనభై ఏళ్లలో ఎంతోమార్పు వచ్చేసిందట. ఇప్పుడు చిట్టడవులు ఊరికి మూడునాలుగుమైళ్ల దూరానికి వెళ్ళిపోయాయి. ఆ రోజుల్లో చెట్లని ఎంతో పవిత్రంగా చూసేవాళ్ళు. ఇప్పుడు కూడా కొన్ని ప్రత్యేక సందర్భాల్లో చెట్లను పూజించడంఉంది కాని, అప్పటి భక్తి శ్రద్ధలు లేవు. ఆ రోజుల్లో వేరే ఊళ్ళ వాళ్ళు ఎవరైనా వచ్చి అనంతగిరిలో అక్రమంగా చెట్లు కూలగొడితే వారిని పట్టుకుని ఎలా దేహశుద్ధిచేసేవారో పెద్దలు నేటికీ కళ్లకు

కట్టినట్టు చెబుతూ ఉంటారు. ఇప్పుడు ఈ ఊళ్ళో ఉన్న పనికిమాలిన గాడిదలు కొందరు ఆ దొంగల్లో చేరిపోతున్నారు... ఊరినీ, ఊరి సంపదనీ ఇక ఎవరు రక్షిస్తారని పెద్దలు ప్రశ్నించుకుని నిట్టూర్చుతూఉంటారు. చెడ్డరోజులు వచ్చేశాయని అంతా నిర్ణయానికి వచ్చినట్టే కనిపించేవారు. ఆనంద్ తన చిన్నప్పటినుంచి ఇటువంటి మాటలు వింటూనే ఉన్నాడు.

అఫ్రోజాబాద్ భారతదేశంలోని పెద్దసంస్థానాల్లో ఒకటి. అనంతగిరి ఆ సంస్థానంలో గ్రామం. ఎన్నో ఆటుపోటులు ఎదుర్కొన్న రాష్ట్రం అఫ్రోజాబాద్. మొగల్‌సామ్రాజ్యం బలహీనపడిన తర్వాత, చిట్టచివరి మొగల్ చక్రవర్తికి సుబేదారుగా ఉన్న నాసిర్‌జా స్వాతంత్ర్యం ప్రకటించుకుని ఈ సంస్థానాన్ని స్థాపించాడు. అతని వంశీకులు ఒకటిన్నర శతాబ్దాలు పరిపాలన సాగించారు. భారత స్వాతంత్ర్యసంగ్రామం చివరి పాతికేళ్ల కాలంలో అఫ్రోజాబాద్ పదవ నాసిర్‌జా ఏలుబడిలో ఉంది. ఈ రాజవంశానికి చెందిన ఒక జోస్యం కూడా ప్రచారంలో ఉండేది. స్వాతంత్ర్యం ప్రకటించుకున్నాక నాసిర్‌జా ఆ ప్రాంతంలో ఉన్న ఒక సాధువును దర్శించుకున్నాడట. అతడి వంశీకులు పదితరాలపాటు అవిచ్ఛిన్నంగా రాజ్యాన్ని పరిపాలిస్తారని ఆ సాధువు ఆశీర్వదించాడట. ఆ జోస్యం నిజమైందనే అనుకోవాలి. పదితరాలపాటు నాసిర్‌జా వంశీకుల ఏలుబడి కొనసాగింది. ప్రస్తుతం రాష్ట్రాన్ని ఏలుతున్నవాడు పదోతరంవాడుకనుక ఆ జోస్యం ప్రకారం అతడే చిట్టచివరి పాలకుడు కావాలి. భారత స్వాతంత్ర్యోద్యమం పతాక స్థాయిని అందుకున్న ఘట్టంలో సంస్థానాలన్నీ యూనియన్‌లో కలిసిపోయే అవకాశాలు ప్రస్ఫుటంగా కనిపించాయి. అప్పటికి కొన్ని దశాబ్దాలుగా అఫ్రోజాబాద్ సర్కార్, ప్రజలపై చెప్పనలవికాని అత్యాచారాలు సాగిస్తోంది. దోపిడీలు, హత్యలు, మానభంగాలు, గృహదహనాలు, తిరుగుబాటు సాగిస్తున్నాయన్న అనుమానంతో దాదాపు ప్రతి గ్రామంపై ఉమ్మడి జరిమానాలు! ప్రజలను భయభ్రాంతుల్ని చేయడానికి, వాళ్ళల్లో ఏ కొంచెం ప్రజాస్వామ్యకాంక్ష కనిపించినా అణచివేయడానికి నవాబు, అతడి తొత్తులు ప్రజలను పెడు తున్న చిత్రహింసలు అన్నీ ఇన్నీ కావు. ప్రభుత్వం అణచివేత దుస్సహంగా పరిణమించింది. దేశాన్ని ప్రభంజనంలా ఊపివేస్తున్న స్వాతంత్ర్యేచ్ఛ నవాబు వెన్నులో వణుకు పుట్టించడంతో అతడి అత్యాచారాలు మరింత పేట్రేగిపోయాయి. ఏవైపునా ఎవరూ ఆదుకునేవారు కనిపించక పోవడంతో ప్రజలు నిరాశానిస్పృహలతో కుంగిపోయారు. సాధువు జోస్యం ఒక్కటే ఆ పరిస్థితిలో వారికి కాంతిరేఖలా కనిపించింది. పెదవులు ఎంత గట్టిగా బిగించుకున్నా సాధువు జోస్యం గుసగుసలుగా ఆ నోట ఆ నోట పాకుతూనే ఉండేది.

బ్రిటిష్‌ప్రభుత్వానికి వ్యతిరేకంగా సహాయనిరాకరణోద్యమం ప్రారంభించి మహాత్మాగాంధీ అప్పుడే రాజకీయరంగస్థలిపై ప్రచండరూపంలో ప్రత్యక్షమయ్యారు. దేశమంతటా ఏదో నూత నోత్తేజం, కొంగొత్త ఆశాభావం, సరికొత్త సేవాస్ఫూర్తి, ప్రతిహృదిలో త్యాగమయభావన. దేశంలో ప్రతి అణువూ దేశభక్తితో పులకించిన మహత్తర క్షణాలవి

అయితే సంస్థానాల్లో మాత్రం దీని ప్రభావం నివురుగప్పిన నిప్పులానే ఉండిపోయింది. ఇంచుమించు సంస్థానాధీశులందరూ బ్రిటిష్‌ప్రభుత్వానికి దాసానుదాసులు కావడమే ఇందుకు కారణం. 'ఇతరేతర ప్రభావాలు' తన రాజ్యంలోకి ప్రసరించకుండా నిరోధించడానికి

అఫ్రోజాబాద్‌నవాబు ప్రత్యేకమైన ఉపాయాలు ఆలోచించాడు. మిగిలినదేశానికీ సంస్థానానికీ మధ్య రాకపోకలు, ఉత్తర ప్రత్యుత్తరాలు లేకుండా చేశాడు సంస్థానప్రాంతాల మీదుగా వెళ్ళే రైలు ప్రయాణికులు నేరుగా వెళ్లిపోవలసిందే కాని సంస్థానంలో అడుగుపెట్టడానికి వీల్లేదు. రేడియో లేదు. వార్తాపత్రికలు రావు. రాష్ట్రం మొత్తంమీద సముద్రమధ్యంలో ఒంటరి మట్టిదిబ్బలా ఉండిపోయింది.

ఆనంద్‌కి ఊహ వచ్చేసరికి చుట్టూ ఇటువంటి పరి స్థితి. రాజకీయకార్యాచరణ నిషిద్ధమైనప్పుడు సాంస్కృతికఅభివ్యక్తి అనివార్యమవుతుంది. అసలు సంస్థానాలే కృతిమసృష్టి. సాంస్కృతికంగా అఖండంగా ఉన్న దేశాన్ని రాజకీయ, సామ్రాజ్యవాద అవసరాల కోసం కృత్రిమంగా నిరంకుశంగా చీల్చి పుట్టించిన రాజ్యాలివి. అందుకే నవాబులు, రాజులు తమప్రజల్ని రాజకీయప్రభావాలకు దూరంగా చీకటిగుహలో బంధించి ఉంచారు. అయితే వివిధరాష్ట్రాలప్రజల మధ్య శతాబ్దాలుగా అల్లుకున్న సాంస్కృతికబంధాన్ని విచ్ఛిన్నంచేయడానికి వారుచేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

అఫ్రోజాబాద్‌లోని ఉన్నత అధికారయంత్రాంగంలో ప్రజలభాషలకు ఆదరణలేదు. గౌరవంలేదు. ఆ భాషలు మాట్లాడడమంటేనే మేధావివర్గాలకు నామోషి. అంతేకాదు. వారు దేశభాషల్ని కించపరుస్తూ మాట్లాడేవారు. ఆ భాషల్లో ఉన్న సుసంపన్నసాహిత్యం వాళ్ల చూపుకి ఆనేదికాదు. వాళ్ల దృష్టిలో అవి మొరటుభాషలు. అనాగరికభాషలు. కర్ణకఠోరమైన భాషలు. పరిపాలనావిధుల నిర్వహణకూ, శాస్త్రీయవిషయాల అభివ్యక్తికీ సరిపోని భాషలు. ఈ ధోరణి ప్రజలకు తీవ్ర ఆగ్రహమూ, మనస్తాపమూ కలిగించేది. తమ భాషలమీద వాళ్ళఅభిమానం మరింత పెరిగింది వాళ్లకీ, రాష్ట్రం వెలుపల ఉన్న ప్రజలకీ మధ్య భాష అవినాభావబంధంగా మారిపోయింది.

పండితులు కళాకారులు సాధుసంతులు రాష్ట్రంలో ప్రవేశించడానికి అంతగా ఆంక్షలుండేవికావు. ప్రధానంగా పౌరాణికనాటకాలు ప్రదర్శించే నాటకబృందాలు వచ్చివెడుతూ ఉండేవి. గృహస్థులు ప్రసిద్ధనాటకపద్యాల్ని గొంతెత్తి పాడుతూ ఉండేవారు. నటీనటులకు చక్కని ఆతిథ్యం ఇస్తూ ఉండేవారు. ముఖ్యంగా నటీమణుల్ని ఆదరించడం గ్రామాల్లోని చిన్నదొరలు హోదాగా భావించేవారు. గాలినిండా రామాయణ మహాభారతాలు, ఇతర పౌరాణికగాథల పరిమళమే. పక్కనే ఉన్న బ్రిటిష్ ఇండియానుంచి ప్రసిద్ధనటులువచ్చి తాత్కాలికథియేటర్లలో నాటకాలు ప్రదర్శించి వెళ్ళేవారు. ఊళ్ళల్లో జనం వారి పట్ల ఎంతో మక్కువ చూపించేవారు. నాటకం టిక్కెట్టుఖరీదు రూపాయి నుంచి అణావరకు ఉండేది. అప్పుడప్పుడు హరికథాకాల క్షేపాలు జరిగేవి. స్థానికంగాకూడా ప్రసిద్ధి కెక్కిన నాటకబృందాలుండేవి. వీరు ప్రదర్శించే నాటకాలకు టికెట్టు ఉండేదికాదు. ఇవి ఆరుబయలు నాటకాలు కనుక వర్షా లు వెనకబడిన తరువాత —అక్టోబర్ నుంచి ప్రదర్శించ బడుతూండేవి. అప్పుడే పంట కోతకు వస్తుంది. ధాన్యలక్ష్మి పుష్కలం. నటులకు ప్రతిఫలం వస్తురూపంలోనే ముట్టేది. ఊళ్ళో షావుకార్లు మొట్టమొదట తమ వద్ద ఉన్న ధాన్యాన్ని వాళ్ళకు చెల్లించేవారు ఆ తరువాత రైతులు వాటాలు వేసుకుని కొంత షావుకార్లకు బదులుతీర్చేవారు. కటికపేదలు మినహా ఊరంతా కలిసి పోషించే ఈ నాటకాల్ని సంపన్నులు, పేదలు అనే తేడా లేకుండా అంతా చూసి ఆనందిస్తూ ఉండేవారు. అందువల్ల సంస్కృతి జనజీవితంలో ముఖ్యాంగంగా

మారిపోయింది. క్రమంగా పురాణగాథల్లోని రాజకీయవిషయాలను తీసుకుని రచయితలు, కళాకారులు తమ ప్రతిభమేరకు వాటిని అన్యాపదేశంగా సమకాలీన అంశాలకు ఆపాదించి ప్రదర్శించడమూ ప్రారంభమయింది.

చిన్నారి ఆనంద్ పౌరాణికగాథల్లో పూర్తిగా లీనమైపోయేవాడు. రోజూ రాత్రిపూట నాన్న వల్లించే పద్యాలు ఆనంద్‌ని వేరే ప్రపంచంలోకి తీసుకెళ్ళేవి. రాముడు, కృష్ణుడు, ప్రహ్లాదుడు, ధ్రువుడు మొదలైన పౌరాణిక పాత్రలు చిరపరిచితులైన స్నేహితుల్లా కనిపించేవి. పశువుల చావిట్లోని లేగదూడలతో స్నేహం చేసినంత సహజంగా ఆ పాత్రలతో స్నేహం చేసేవాడు తానే ఆ పాత్రలుగా మారిపోయి అవి స్పందించినట్లు స్పందించే అద్భుతసామర్థ్యం అతడికి తెలియకుండానే అలవడిపోయింది. అహాన్ని విస్మరించి ఇతరుల కష్టసుఖాలలోలీనమయ్యే లక్షణం తనకు ఇందువల్లనే అలవడినట్టు తర్వాత తర్వాత గ్రహించాడు.

అయిదేళ్ళ ఆనంద్ దృష్టిలో హనుమంతుడు ఒక్కడే హీరో అయిపోయాడు. ఆ వానరరూపాన్ని చూస్తే ఒకవైపు వినోదంగానూ ఉండేది అతడు సాధించిన అద్భుతకార్యాలగురించి విన్నప్పుడు అంతకంటె గొప్పవాడు లేడనీ అనిపించేది. తానే హనుమాన్‌గా ఊహించుకొనేవాడు.

తనకి మాత్రం అది ఊహకాదు, నిజం. ఛాతీచుట్టూ ఒక తాడు కట్టుకొని, తోకలా వేలాడదీస్తే చాలు అతడు అక్షరాలా హనుమంతుడే హనుమంతుడి బొమ్మలో ఉన్నట్టు మూతికి ఎర్రటి తిలకం పూసేవాడు. అమ్మ చేసిచ్చిన అట్టకిరీటాన్ని ధరించేవాడు. మేకప్ పూర్తయ్యేది. ఒక అడుగు ఎత్తున్న స్టూలుమీద నిలబడి కిందికి దూకేవాడు— సముద్రాన్ని నిజంగా లంఘిస్తున్నట్టు. ఇంట్లో అంతా ముచ్చటగా చూసేవారు. నాన్నకూడా ఆనందిస్తున్నట్టే కనిపించేవారు. ఆనంద్ భుజాలు గర్వంతో ఉప్పొంగేవి.

కొద్దిరోజుల్లోనే హనుమంతుడితో అతడి తాదాత్మ్యం పతాకస్థాయికి చేరింది. తానే హనుమాన్ అయినప్పుడు ఆనంద్‌గా ఎలా ఉంటాడు! తన జీవితంలోని ప్రతి ఘట్టంలో తన చర్యలకు తాను కర్త కానట్టే వ్యవహరించే ఒక అసాధారణ ప్రవృత్తి అతడిలో కనిపించడానికి కారణం బహుశా ఇదే కాబోలు. అతణ్ణి మిగిలినవారికంటె విశిష్టంగా నిలబెట్టిందీ ఇదే.

పొరుగూరునుంచి ఒక నాటకబృందం వచ్చి హనుమాన్ మహిమల్ని వర్ణించే నాటకం ప్రదర్శించింది. ఆనంద్‌కు పట్టపగ్గాలు లేవు. తనకంటె పెద్దవాళ్ళు నాటకం ప్రారంభమైన గంట, రెండుగంటలకే నిద్రలోకి జారుకున్నారు ఆనంద్ మాత్రం రాత్రంతా అలా రెప్పవేయకుండా చూస్తూనే ఉండిపోయాడు.

మరునాడు ఉదయం ఆనంద్ ఏదో దీర్ఘాలోచనలో ఉన్నట్టు అమ్మ కనిపెట్టింది రాత్రి నిద్రలేదు కనుక పడుకుంటాడులే అనుకుంది కానీ అతడు వేరే ఆలోచనలో ఉన్నాడు. అతణ్ణి హనుమంతుడు పూర్తిగా ఆవహించాడు రాత్రి నాటకంలోని హనుమంతుడి లంకాదహనదృశ్యమే అతణ్ణి వెంటాడుతోంది. వెదురుకర్రలతో ఓ పెట్టెలాంటిది నిర్మించి దానిమీద కాగితాలు అంటించి స్టేజీమీద ఉంచారు అదే లంకానగరం. మంటలు విరజిమ్ముతూ అది తగులబడుతున్న దృశ్యం ఆనంద్‌ని ఎంతో ముగ్ధుణ్ణి చేసింది. తాను నిజంగా హనుమంతుడే అయితే అంతటి ఘనకార్యం

తానూ చేసి తీరవలసిందే కదా!'హనుమంతుడే అయితే' ఏమిటి, తానెప్పుడో హనుమంతుడై పోతేను!...ఏం చేయాలా అని పొద్దుటంతా ఆలోచిస్తూనే ఉండిపోయాడు ఆనంద్. చూడగా చూడగా ఒక ఉపాయం మెరుపులా తట్టింది. అంకుల్ ఉండే పూరిపాక లంకానగరానికి సరిగ్గా సరిపోతుంది. పైకప్పు ఎత్తుకూడా ఉండదు. ఒకవేళ ఉన్నా సరిగ్గా చూరుకింది ఒక చెక్క మంచం ఉంది. దానిమీద నిలబడితే లంక తన చేతికి అందిపోతుంది

అయితే మంట పెట్టడం ఎలా? ఆనంద్‌కి అదంత తేలికనిపించలేదు. అమ్మా నాన్న తనని నిప్పు దగ్గరకు వెళ్ళనివ్వరు. నిప్పు దగ్గరకువెడితే వీపు చీరేస్తాననే నాన్న బెదరింపు జ్ఞాపకమొచ్చింది. నాన్న చొక్కా జేబులో అగ్గిపెట్టె ఉంటుంది, కానీ ఆనంద్ ఎప్పుడూ దాన్ని తాకనుకూడా తాకలేదు. నాన్న అలా అగ్గిపుల్ల గీయగానే మంట ఎలా వచ్చేదో అతనికి ఆశ్చర్యంగా ఉండేది. ఆరోజు పరిస్థితి మాత్రం వేరు. ఏదో చేయాలన్న పట్టుదలతో ఉన్నాడు. ఆశ్చర్యానికి వ్యవధి లేదు. ఎక్కడైనా ఒక అగ్గిపెట్టె దొరకపుచ్చుకోవాలి. అగ్గిపుల్ల గీయడం నేర్చుకోవాలి. మంట తప్పకుండా పుడుతుంది. లంకా దహనం చేయవలసిందే అను కున్నాడు.

సరే... ఇంతకీ అగ్గిపెట్టె దొరకాలికదా... ఎక్కడ దొరుకుతుంది? అగ్గిపుల్ల నుంచి మంట మెరిసినట్టే ఆనంద్ బుర్రలో కూడా తటిల్లున ఉపాయం మెరిసింది. వంటగది దగ్గరే ఉన్న పూజామందిరంలో అమ్మ అగ్గిపెట్టె దాస్తుందన్న సంగతి గుర్తొచ్చింది. ఆ మందిరంలో కొన్ని దేవతా విగ్రహాలు, పటాలు ఉన్నాయి. వాటిల్లో ముఖ్యమైంది తిరుపతి వెంకటేశ్వరస్వామి విగ్రహం. పూజా మందిరం గురించి ఆనంద్‌కి ఎక్కువ తెలియదు. తనుగానీ, మరెవరుగానీ మామూలు బట్టలతో వెళ్ళి పూజామందిరాన్ని ముట్టుకోకూడదు. ఇది ఇంట్లో ఆచారం. అమ్మ ఒక్కతే పొద్దుట స్నానంచేసిన తర్వాత పూజ చేస్తుంది. ఆ తర్వాత దేవుడికి నివేదనం చేస్తుంది అది కాకుండా ఎవరూ ఏమీ తినకూడదు నైవేద్యం విధిగా పెట్టవలసిందే.

అమ్మ పూజాకార్యక్రమానికి ఆనంద్ రోజూ భక్తిశ్రద్ధలతో హాజరయ్యేవాడు. అతని దృష్టిలో భక్తి అంటే పూజ అయిన తర్వాత అమ్మ పెట్టే తియ్యని ప్రసాదమే. దేవుడు అనగానే అతడికి మొట్టమొదట కలిగింది 'మధురమైన' భావన ప్రసాదానికిముందు అమ్మ అందరు దేవుళ్ళకు హారతిచ్చేది హారతిని అందరూ కళ్ళకద్దుకునేవారు. హారతికర్పూరం వెలుగుతున్నప్పుడు వచ్చే వాసనకూడా ఆనంద్‌కి ఎంతో ఇష్టం హారతి— ప్రసాదం— ఈ రెండూ కలిస్తే భలేగా ఉండేది.

హమ్మయ్య! అగ్గిపెట్టె దొరికేచోటు కనిపెట్టగలిగాడు! ఆనంద్ తనలో తనే మురిసిపోయాడు. దేవుడు అప్పుడు మరింత ఇష్టుడుగా కనిపించాడు. అయితే అగ్గిపెట్టెను బయటకు తీసుకురావడం సమస్యగా మారికూర్చుంది. మొట్టమొదట అది గుట్టుచప్పుడు కాకుండా జరగాలి. తనొక్కడే ఆ పనిచేయాలి. మరెవరి సహాయం తీసుకోకూడదు. అమ్మకి తెలియకుండా జరగాలి. 'కుట్ర' అమలు చేయడానికి ఎక్కువ సమయం కూడా లేదు.

ఇంతలో మరో ప్రశ్న. తనాపని ఎలా చేయాలి? ఈ బట్టలతో దేవుడి మందిరాన్ని ఎలా ముట్టుకుంటాడు? దేవుడు మైలపడతాడు. దొంగతనం చేసినా మడిగానే చేయాలి. అయితే అది దొంగతనమనిగానీ, అసలు దొంగతనం అంటే ఏమిటనిగానీ ఆనంద్‌కి తెలియదు.

పదకొండుగంటలవుతోంది. అమ్మ ఊరవతల ఉన్న దిగుడుబావినుంచి మంచినీళ్ళు తీసుకొచ్చే సమయం. దొడ్లో బావి ఉందికానీ నీళ్ళుఉప్పగా ఉంటాయి. ఊళ్ళో బావులన్నీఅంతే

అమ్మ బిందె పుచ్చుకుని బావికి బయలుదేరింది. ఆనంద్ ఏమీ తెలియనట్టు వసారాలో ఆడుకుంటూ కనిపించాడు. అమ్మ అలా కనుమరుగైందో లేదో పరుగుపరుగున దొడ్లోకి వెళ్ళిపోయి బట్టలు విప్పేసి ఒంటిమీద నాలుగైదు చెంబుల నీళ్ళు గబగబా కుమ్మరించుకొని స్నానం చేశాననిపించాడు. దిసమొలతోనే వంటింట్లోకి వెళ్ళాడు. ఏదో తెలియని ఉత్తేజంతో భయంతో పూజామందిరం సమీపించాడు. మొట్టమొదటిసారి దొంగతనం అనే సాహసం చేయబోతున్నాడు— అదికూడా దేవుడి సొత్తు -పైగా ఆయన కళ్ళముందే.

అగ్గిపెట్టె బయటకు తీశాడు. అప్రయత్నంగానే దేవుళ్ళ పటాలకు చేతులు జోడించాడు. దేవతలందరూ అలా కళ్ళప్పగించి చిరునవ్వుతో చూస్తుండగా అగ్గిపెట్టె గట్టిగా పట్టుకుని పూజగదిలోంచి వెంటనే బయటకు పరుగుదీశాడు.

ఇప్పుడిక అంకుల్ పాకకి! అంటే లంకా నగరానికి! హనుమంతుడు చేసిన అద్భుత కార్యాన్ని ఇప్పుడు తాను చేయబోతున్నాడు

చెక్కమంచందగ్గరకు వెడుతూ ఓసారి చుట్టూచూశాడు. కనుచూపుమేరలో ఎవరూ లేరు. బాగుందనుకున్నాడు. అంతలో తనెప్పుడూ అగ్గిపుల్ల వెలిగించలేదన్న విషయం గుర్తొచ్చింది. నాన్న, ఇంకా చాలామంది అగ్గిపుల్ల గీస్తుంటే తాను ఎంతో దగ్గరగా చూశాడు. కానీ అది చూడడంవరకే. స్వయంగా వెలిగించడం వేరు. ఇప్పుడు అదే చేయబోతున్నాడు.

అగ్గిపుల్ల తీశాడు. బొటనవేలుకీ, చూపుడువేలుకీ మధ్య ఉంచుకుని పరిశీలనగా చూశాడు. నిప్పు పుట్టించే నల్లని భాస్వరం తొడుగు అంతుబట్టని రహస్యంలా కనిపించింది. తొట్రుపడుతూ చేతనైనంత వరకూ నాన్నను అనుకరిస్తూ అగ్గిపుల్ల వెలిగించాడు... అంతే. రాబోయే కేకను గొంతులోనే అణచుకొంటూ వెంటనే పుల్ల జారవిడిచాడు. చివరి రెండువేళ్ళు కాలాయి. పెద్దగా కాలకపోయినా అబ్బాయిని మాత్రం భయపెట్టేశాయి...

వేళ్ళు కాల్చుకున్న తన తొలిఅనుభవం గురించి కొద్దిసేపు ఆలోచిస్తూ ఉండిపోయాడు. తర్వాత మరో పుల్ల వెలిగించాడు. తర్వాత మరో పుల్ల. అగ్గిపుల్లని వేళ్ళమధ్య ఎలా ఉంచుకోవాలో, అగ్గిపెట్టెను ఎలా పట్టుకోవాలో క్రమంగా తెలిసిపోయింది కొన్ని పుల్లల్ని తగలబెట్టిన తర్వాత సరిగా వెలిగించడం పట్టుబడింది త్వరగానే నేర్చుకోగలిగాడు

ఇక ఇప్పుడు అసలుపని తొందరపడాలి. అమ్మ ఏ క్షణంలోనైనా తిరిగిరావచ్చు చేస్తున్న పనిని సగంలో విడిచిపెట్టడం ఇష్టంలేదు.

మంచంమీద నిలబడి చేయి పైకిచాచాడు తాటాకులు తన చేతికందే దూరంలోనే ఉన్నాయి. ఆకుల చివళ్ళు ముట్టుకుంటే చిట్లిపోతున్నాయి. వారేవా! అన్నీ అనుకున్నట్టే జరిగిపోతున్నాయి.

అగ్గిపుల్ల వెలిగించాడు. ఎక్కడా చిన్న లోపంకూడా లేకుండా ఎదురుగా చూడముచ్చటైన మంట... అల్లాఉద్దీన్ దీపంలోంచి భూతం వచ్చినట్టు— అతడేం చెప్పినా చేయడానికి సిద్ధంగా

ఉన్నట్టు. మనవాడు ఆదేశించినట్టే భూతం వెళ్ళి తాటాకుల్ని ముద్దాడింది. ఆ తర్వాత జరగవలసిందే జరిగిపోయింది.

అమాంతం కిందికి దూకాడు. బయటకు పరుగెత్తి విజృంభిస్తున్న మంటని చూశాడు. ఆ దృశ్యం ఎంత అందంగా ఉందో అనుకున్నాడు. లంక చాలా గొప్పగా తగలబడిపోతోంది ! నిన్న నాటకంలో చూసినదానికంటె కూడా ఎంతో బాగుందనుకున్నాడు సగర్వంగా. ఒళ్ళు మరచిపోయాడు.

అంతలో పెద్దకేక. మాసిపోయిన బట్టలు తీసుకెళ్ళడానికి వచ్చిన ఆడమనిషి పిచ్చిదానిలా కేకలు పెడుతూ వసారాలోంచి వీధిలోకి పరుగెత్తుకుంటూ వస్తోంది. కొద్ది క్షణాల్లోనే పదిపన్నెండుమంది పాకదగ్గరికి చేరిపోయారు. ఎలా మంటలు ఆర్పాలో నాన్న వాళ్ళకి పురమాయిస్తూ కనిపించాడు. ఆనంద్ భయపడిపోయాడు. అంతవరకూ తెలియని అదోరకం భయం. భయానికి కారణం అతడికే అర్థంకాలేదు. తను అటువంటి పని చేసిఉండకూడదేమోనని చటుక్కున అనిపించింది పశ్చాత్తాపంలోకూడా అదే తొలి అనుభవం... చేసిఉండకూడదు. . చేసిఉండకూడదు. . అయినా చేశాడు! ఇప్పుడేం చేయాలి?

ఎవరూ అతడివైపు చూడడంలేదు. అసలెలా జరిగిందో వాళ్ళకింకా తెలియదు. కానీ ఆనంద్‌కి తెలుసు. నాన్నని అలా చూశాడోలేదో ఏం చేయాలో అర్థమైపోయింది.

అక్కడినుంచి మెల్లగా జారుకున్నాడు. ఎక్కడికి వెళ్ళాలో తెలియదు. అక్కడినుంచి మాయమైపోవాలి. అంతే. కొన్నిగంటలపాటు అలా పరుగెడుతూనే ఉన్నట్టు అతనికనిపించింది. చాలాదూరం వచ్చి ఉంటానని అనుకున్నాడు. భూమి చివరిఅంచుకు చేరుకున్నాడేమో .. మళ్ళీ తిరిగి రాలేడేమో... అమ్మ మళ్ళీ కనిపించదేమో.. పైన మండుటెండ.

ఇంతాచేసి అబ్బాయి పరుగెత్తి పరుగెత్తి చేరుకున్నది ఊరి పొలిమేరకే దిసమొలతో గట్టిగా ఏడుస్తూ పరుగెడుతున్న తనను వీధిలో అంతా చూస్తున్నారన్న సంగతి అతనికి తెలియదు. వాళ్ళకి మంచి వినోదం. ఎంతదూరం పరుగెడతాడో చూద్దామనుకున్నారు. గట్టిగా ఎక్కిళ్ళు పెడుతూ మెలికలు తిరిగిపోతున్న ఆనంద్‌ని ఓ పెద్దాయన చేతుల్లోకి ఎత్తుకుని ఇంటికి తీసుకొచ్చాడు.

అదృష్టం. ఆరోజు నాన్న తనకి కనిపించలేదు. అమ్మ ఒక్కతే . తనను వాటేసుకొని ముద్దులతో నింపేస్తూ ఓదార్చుతూ.

లంకకు చేటు తప్పింది.

# 3

**జూన్** నెల. మృగశిరాకార్తె. తొలకరిజల్లులతో ఊరంతా మట్టివాసన వేస్తోంది. ఆనంద్ షేగావ్ వెళ్ళవలసిన రోజు సమీపిస్తోంది.తాను వేరే ఊరు వెళ్ళబోతున్న సంగతి అతనికి కొద్దిరోజులక్రితమే తెలిసింది. అమ్మని విడిచిపెట్టి వెళ్ళాలంటే భయంగా ఉంది. ఆ సంగతి గుర్తొస్తేచాలు కళ్ళనీళ్ళపర్యంతమైపోతోంది.

ప్రయాణానికి ఏర్పాట్లు జరిగిపోతున్నాయి. అగ్నిపరీక్షకి ఆనంద్‌ని సిద్ధం చేయడంలో అంతా మునిగిపోయారు. షేగావ్ ఎంత బాగుంటుందో కొంతమంది అదేపనిగా వర్ణించి చెబుతున్నారు. ఆ ఊళ్ళో స్కూలు, ఆటస్థలం, అక్కడున్న జారుడుబల్లలు, ఊయలలు... ఓహ్. పిల్లలకి భలే కాలక్షేపం. ఆ స్కూల్లో ఇక్కడున్నట్టు ఒక అయ్యవారు కాదు, ముగ్గురు అయ్యవార్లు ఉంటారట. ధనవంతుల పిల్లలు మాత్రమే నేర్చుకొనే పర్షియన్‌ని కూడా ఆ స్కూల్లో నేర్పుతారట. ప్రతి శుక్రవారం సెలవు. ఈద్, దసరా, దీపావళి వగైరా సెలవులు కూడా ఉంటాయట. మొహర్రం పండక్కి మాత్రం ఏకంగా పదిరోజులు సెలవులు. అప్పుడు ఆనంద్ ఇంచక్కా ఇంటికొచ్చి అమ్మ దగ్గర ఉండొచ్చు. అంటే మిగిలినరోజుల్లో అమ్మకి దూరంగా ఉండవలసిందేకదా! అనుకున్నాడు ఆనంద్. ఈ సెలవులు కాకుండా నవాబుగారింట్లో బిడ్డ పుట్టిన ప్రతిసారీ స్కూళ్ళకు సెలవే. అరవైఏళ్ళు నిండిన నవాబుగారు (దేవుడు ఆయనను రక్షించుగాక) కిందటేడే పదహారేళ్ళ పడుచును పెళ్ళిచేసుకున్నాడు. వారం రోజుల క్రితం ఆయనకు (కొంతమంది నర్మగర్భంగా అంటున్నట్టు, ఆయన తాజాభార్యకు) కొడుకుపుట్టాడు. రాష్ట్రమంతటా ఆనందంవెల్లివిరిసింది. ప్రభుత్వం స్కూలుపిల్లలకు మిఠాయిలు పంచిపెట్టింది 'ముసలి నవాబుగారికి ఎందరెందరో భార్యలు కనుక వాళ్ళందరికీ దేవుడు ఇలాగే తామరతంపరగా సంతానం అనుగ్రహిస్తే బాగుండును రోజుకో బిడ్డ అయితే మరీ మంచిది' అనుకున్నారు పిల్లలు. రాజకుటుంబంలో ఎవరైనా మరణించినా స్కూళ్ళకు సెలవు దొరుకుతుంది. అందుకని నవాబుగారి ఇంట్లో రోజుకొకరైనా చనిపోతే బాగుండునని కూడా పిల్లలు కోరుకునేవాళ్ళు. షేగావ్ స్కూల్లో చేరితే అన్నీ సెలవులేనని ఆనంద్‌కి నచ్చజెప్పే ప్రయత్నం ఇదంతా.

చిన్నాన్న మారుతి, ఆయన భార్య మనోరమాదేవి, వాళ్ళ కొడుకు రాజు, కూతురు కమల— ఇక వీళ్ళగురించి వర్ణన ఎత్తుకునేవారు. ఆనంద్ వీళ్ళ దగ్గరే ఉండబోతున్నాడు. వాళ్ళు చాలా

మంచి వాళ్ళని కొందరంటే, చాలా చాలా మంచివాళ్ళని మరికొందరు వాళ్ళకి వంతపాడేవారు. అంత మంచితనం ఎక్కడా చూడం, ఎంతో ప్రేమతో, దయతో, అభిమానంతో చూసుకుంటారనేవాళ్ళు ఇంకా మరికొందరు. వాళ్ళతో ఉండడమెంత బాగుంటుందో అనేవాళ్ళు అంతాకలిసి ముక్త కంఠంతో. ఆ మాటల్లో కృత్రిమత్వం. ఆనంద్ వాళ్ళ బుట్టలో పడేవాడుకాదు. కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరుగుతుంటే ఓదార్పు కోసం అమ్మవైపు చూసేవాడు.

అమ్మ కూడా అదో రకంగా, దిగులు దిగులుగా ఉంటోంది. ఆనంద్‌కి నచ్చ జెప్పి ఒప్పించే ఉమ్మడి ప్రయత్నానికి దూరంగా ఉండిపోయింది. ఏదో ధ్యాసలో ఉంటోంది. తనలోతనే మథన పడుతోంది. జాగ్రత్తగా చూస్తే ఆ కళ్ళల్లో లీలగా ఎరుపుజీర. అయితే ఆమె ఏడవడం చూసిన వాళ్ళెవరూ లేరు. ఆనంద్‌ని మాటిమాటికీ గట్టిగా గుండెలకు హత్తుకుంటోంది. రేపు తామిద్దరూ పోగొట్టుకోనున్నందుకు ఇప్పుడే పరిహారం తీసుకుంటోందా అన్నట్టు. ఆనంద్ గొంతులో కూడా గాద్గద్యం. చెక్కిళ్ళమీంచి కన్నీళ్ళు జారిపడుతున్నాయి. నిజానికి చిన్నాన్న మరెవరో కాదు, నాన్నకు చిన్న తమ్ముడు. షేగావ్‌లో ఉంటున్న దాయాదులకే దత్తు వెళ్ళాడు. అంటే ఆనంద్ అక్కడికి వెళ్ళి సొంత కుటుంబ సభ్యులతోనే ఉంటాడు ఆ రోజుల్లో స్కూళ్ళు తక్కువ కనుక చదువు కోసం బంధువుల ఇళ్ళల్లో ఉండడం మామూలు విషయం. అందుకు ప్రతిఫలం కూడా ఎవరూ ఆశించేవారుకాదు. ఎప్పుడైనా ఇంత ధాన్యం, కూరగాయలు పంపిస్తే పంపించవచ్చు. అది కూడా స్వచ్ఛందంగానే. 'పేయింగ్ గెస్ట్' పద్ధతి ఆ రోజుల్లో లేదు. పొందిన ఉపకారానికి బదులు తీర్చుకోవడమనే ఆలోచనే తప్పు.

ఆనంద్ మరీ కుంగిపోతాడని ఇంట్లోవాళ్ళు అతని ముందు ప్రయాణం గురించి మాట్లాడడం మానేశారు. అయితే అబ్బాయి ప్రథమ 'విదేశీ'యాత్రలో వెంట ఎవరు వెళ్ళాలన్న విషయం మీద పెద్ద చర్చే జరిగింది చిన్నాన్న మారుతి ఆనంద్‌ని స్వయంగా తీసుకెళ్ళడానికి వచ్చాడు. ఆనంద్‌తో ఒకవేళ అమ్మ వెళ్ళాలనుకుంటే —చిన్నాన్నతో పాటు అదే బండిలో వెళ్ళలేదు. వెళ్ళకూడదు. అది ఆచారం. పల్లెటూళ్ళలోని మధ్యతరగతి గృహిణి - భర్తతో, తండ్రితో, సోదరుడితో తప్ప మరెవరితోనూ ఒకే బండిలో ప్రయాణం చేయకూడదు ముఖ్యంగా భర్తవైపు బంధువులతో అసలే చేయకూడదు. . కనుక అమ్మ కూడా రావాలంటే రెండు ఎడ్లబండ్లు అవసరమౌతాయి. అదీగాక తల్లిని విడిచిపెట్టి ఉండడం ఆనంద్‌కి ఇప్పటినుంచే అలవాటు చేయడం మంచిదని కూడా అందరూ అనుకున్నారు కొత్తచోట్లో అయితే ఇంకా బెంగపడతాడు. అందుకని అమ్మ ఇంటి దగ్గరే ఉండి పోడానికి నిర్ణయం జరిగింది.

ఎడ్లబండి సిద్ధమైంది పొద్దుటే ప్రయాణమయ్యారు నాన్న బండి తోలుతున్నాడు. ఆయన పక్కన ఆనంద్, ఆ చివర చిన్నాన్న. అమ్మ ఆనంద్‌కి ఇష్టమైన పిండివంటలు చేసి బాగా తినిపించింది. ఆమె కళ్ళు మాటిమాటికి తడిసిపోతున్నాయి కన్నీళ్ళు ధారలు కడుతున్నాయి. అది ఆనంద్ కంటబడకుండా జాగ్రత్తపడుతూ ఏవేవో చెబుతోంది ఆనంద్‌కి ఎడ్లబండి అంటే ఇష్టమని అమ్మకి తెలుసు. ఎంతసేపూ దానిగురించే చెబుతోంది. ఆ మాటలు వింటున్న ఆనంద్‌కి

బండిలో నాన్న పక్కన కూర్చోవాలనిపించింది. అడుగు ముందుకు వేయబోతున్న ఎడ్లను కళ్ళార్ప కుండా చూస్తూ ఉండిపోయాడు. ఎడ్లు నడుస్తున్నప్పుడు, వాటి మెడలో కట్టిన మువ్వలు లయబద్ధంగా సవ్వడి చేస్తున్నాయి. ఆ ధ్వనిలో లీనమైన ఆనంద్‌కి అమ్మ ఎప్పుడు కనుమరుగైందో తెలియదు. నాన్న, చిన్నాన్నల మధ్య తను ఇరుక్కుపోయినట్టు హఠాత్తుగా అనిపించింది. అమ్మకు దూరమవుతున్న సంగతి అప్పుడు బాగా అర్థమై ఒక్కసారిగా దుఃఖం ముంచుకొచ్చింది.

ఆనంద్ ధ్యాస మళ్ళించడానికి నాన్న ముచ్చట్లు ప్రారంభించాడు. ఎడ్లు, వాటికున్న రకరకాల పేర్లు, వాటి స్వభావాలు, ప్రత్యేకతల గురించి పూసగుచ్చినట్టు చెప్పడం మొదలుపెట్టాడు. ఆ వివరాలు వింటున్న ఆనంద్ కొద్ది క్షణాలపాటు బెంగమరచిపోయాడు. నాన్న తనని ఒళ్ళో కూర్చోబెట్టుకొని చెర్నాకోల చేతికిచ్చి బండి ఎలా నడపాలో చెబుతుంటే అసలు ఒళ్ళు తెలియలేదు. నాన్న తన చుట్టూ చేయివేసి కూర్చోబెట్టుకున్నా, బండి తనే నడుపుతున్నట్టు ఊహించుకొని ఆనంద్ మైమరచిపోయాడు. కొద్దిసేపు అమ్మగురించి మరచిపోయాడు.

షేగావ్ చేరేసరికి మధ్యాహ్నమైంది. ఇంట్లో అడుగుపెట్టీ పెట్టగానే చిన్నాన్న కొడుకు రాజు, కూతురు కమల గిల్లీదండా ఆడదాం రమ్మని ఆనంద్‌ని లాక్కుపోయారు. చిన్నమ్మ హావభావాలు, ప్రవర్తన ఆనంద్‌కి ఐతే అంత ఇష్టంగా లేవు. ఆ ఆలోచనని అక్కడే తెంచేసి ఆటలో మునిగిపోయాడు. అది కూడా బెంగ మరచిపోయే ప్రయత్నమే కానీ రాజీపడడం కాదు... ఆ కొత్త ఇంట్లో తొలిసారి భోజనాలకు కూర్చున్నప్పుడు మాత్రం అమ్మ జ్ఞాపకమొచ్చి ఆనంద్‌లో దుఃఖం కట్టలు తెంచుకుంది. ఒక్కసారిగా బావురుమన్నాడు.

ఒక్క ముద్దకూడా తినకుండా ఉండిపోయాడు. రాత్రి బాగా పొద్దుపోయేవరకూ నాన్న ఆనంద్‌తోనే ఉన్నాడు. ఎలాగో కాసేపటికి ఆనంద్ మగతనిద్రలోకి జారిపోయాడు.

*(తన జీవితంలో ఎన్నో సంవత్సరాలు దొర్లిపోయిన తర్వాత కూడా—నగరంలో స్కూలుకు వెడుతున్న పిల్లల్ని చూసినప్పుడల్లా ఆనంద్‌కి ఈ సన్నివేశం గుర్తుకొస్తూనే ఉండేది. అమ్మ దగ్గర లేకుండా, అమ్మ చేతి అన్నం తినకుండా ఉండవలసిన పరిస్థితితో అతడెప్పుడూ సమాధానపడలేదు. హఠాత్తుగా ఏదో పోగొట్టుకున్నవాడిలా అయిపోయాడు. అది ఎన్నటికీ తీరని లోటులా అనిపించేది. గుండెకు తగిలిన ఆ గాయం శాశ్వతంగా అలాగే ఉండిపోయింది. తాను అయిదేళ్ళకే అమ్మ లేని అనాథ అయిపోయినట్టు అనిపించేది.)*

చిన్నాన్న ఇంట్లో ఆ తొలి భోజనాలఘట్టం తర్వాత ఆనంద్‌లో ఒక్కుమ్మడి విచిత్రమైన మార్పు వచ్చింది చెప్పినట్టు వింటున్నాడు అణకువగాకూడా ఉంటున్నాడు. అల్లరి పనులు లేవు. దేనికోసం మంకుపట్టులేదు. ఇంట్లో అందరికీ హాయి కలిగింది. ఆనంద్ బుద్ధిమంతుడయ్యాడని మెచ్చుకున్నారు కానీ ఆనంద్‌కి అలా అనిపించలేదు .. వచ్చిందొక రకం నిర్లిప్తత దేనికీ స్పందించక పోవడం. నడకలో యాంత్రికత. దేనినీ పట్టించుకోవాలనిపించదు దేనిమీదా లక్ష్యం లేదు.

కొద్దిరోజులుండి నాన్న వెళ్ళిపోయాడు. ఎప్పుడు వెళ్ళాడో కూడా ఆనంద్ గమనించలేదు. క్రమంగా మామూలు మనిషవుతున్నాడు. కొత్త పరిసరాలకు అలవాటుపడుతున్నాడు. స్కూల్లో

ముగ్గురు టీచర్లూ, టైంటేబుల్ ప్రకారం సాగే పాఠాలూ... అతనికది కొత్త అనుభవం. నవాబు గారు, ఆయన చల్లని పాలన కలకాలం వర్ధిల్లాలన్న ప్రార్థనతో స్కూలు మొదలయ్యేది. ఆయన మహోన్నతుడు, మహోదాత్తుడు, దయామయుడు, తామంతా ఆయనముందు వినమ్రంగా విధేయంగా మోకరిల్లుతున్నారు... ఇదీ ఆ ప్రార్థన సారాంశం. ఆమెన్—మరునాడే ఆనంద్ ప్రార్థన పూర్తి పాఠం అప్పజెప్పడం చూసి టీచర్లు, పిల్లలు కూడా ఆశ్చర్యచకితులయ్యారు చాలామంది పిల్లలకి అతనంటే ఇష్టమేర్పడింది. మరీమేధావిలా కనిపించాడేమోకొంతమందికినచ్చలేదు త్వరలో అతని తెలివితేటలు బయటపడడం ప్రారంభించాయి. స్కూలు జీవితమెంతో నచ్చింది. సంతోషంగా గడిపేస్తున్నాడు.

మొదటి రెండు తరగతుల్లోనే మాతృభాష బోధించేవారు, అది కూడా అయిష్టంగానే. ప్రజల భాష ఒక్కటే నేర్చుకునేవారికి భవిష్యత్తు లేదు. ఆ భాషలో పరీక్ష తప్పినాసరే పైక్లాసుకు పంపించేవారు. సంపన్నవర్గాలు ఆదరించే పర్షియన్‌కే ఎక్కడలేని విలువ. అది నేర్చుకున్నవాళ్ళకే మంచిభవిష్యత్తు స్కూల్లో ముస్లింపిల్లలు తక్కువ సంఖ్యలోనే ఉండేవారు. ముగ్గురుటీచర్లలోనూ ఇద్దరు ముస్లింలే. ఆనంద్ మొదటిసారి మరో మతస్థులతో కలసి చదువుకుంటున్నాడు. అయితే అతనికీ, వాళ్ళకీ కూడా ఆ తేడా కొంచెమైనా కనిపించేది కాదు.

మొహర్రం సమీపిస్తోంది ముస్లింముల్లాలు ఏం చెప్పినా గ్రామస్థుల దృష్టిలో మాత్రం అదికూడా మరో పండుగ. కొద్దివారాలు ముందుగానే పండుగ ఏర్పాట్లు ప్రారంభమయ్యేవి. మిగిలిన పండుగలు జరుపుకున్నట్టే హిందువులు, ఊళ్ళో ఉన్న కొద్ది మంది ముస్లింలతో కలిసి ఈ పండుగ జరుపుకునేవారు. దాన్ని పీర్లపండగని పిలిచేవారు. ఆ రోజున గుండ్రంగా వెదురుబద్దలతో అల్లి దానిచుట్టు చక్కటి జరీవస్త్రంచుట్టి మధ్యలో స్తంభంలా ఒక గడను నిలబెడతారు. దీనిని దట్టీ అంటారు.హిందువులతోసహా సంపన్నులు పీర్లకు దట్టీని సమర్పించేవారు. పీర్లు తమ కోరికలు నెరవేర్చినట్టు విశ్వసించి ఇలా కృతజ్ఞతలు సమర్పించుకునేవారు. కోరికను మన్నత్ అంటారు. మనుషుల కోరికల్లో మతభేదాలేవీ లేనట్టే కోరుకునేవారిలో కూడా ఎటువంటి మతభేదాలు కనిపించేవికావు. దీనిని— ఉమ్మడి నమ్మకమని అనాలో, మూఢనమ్మకమని పిలవాలో... ఎవరికి వారు తేల్చుకోవలసిందే.

రామాయణంనుంచి మొహర్రం వరకూ దూకడం సామాన్య విషయమేమీ కాదు. కానీ ఆనంద్‌కి అదేమంత కష్టమనిపించలేదు. తలచుకుంటే తక్షణం హనుమాన్ కాగలిగినవాడు అంతే తేలిగ్గా పీర్లభక్తుడూ కాగలడు. పీర్లు తీసుకెళ్ళేవారికి పీర్లు 'ఆవహిస్తార'నీ, అప్పుడు వారు పరిసరాల స్పృహ కోల్పోయి అపస్మారకస్థితిలోకి వెళ్ళిపోతారనీ నమ్మేవారు. ఆ స్థితిలో వాళ్ళు నిప్పుల మీద నడుస్తారు. రోజుల తరబడి ఒంటికాలి మీద నిలబడగలరు. విపరీతమైన వేగంతో పరుగెత్తగలరు. మామూలు మనిషి చేయలేని అద్భుతాలన్నీ చేయగలరు. కొంతమంది మొహర్రం పండుగ పదిరోజులూ ఆ స్థితిలోనే ఉండిపోతారు. చివరిరోజున పీర్లకు అల్‌విదా అంటే వీడ్కోలు చెప్పిన తర్వాత క్రమక్రమంగా పూనకం తగ్గుతుంది. ఆ పదిరోజులూ ఊళ్ళో పిల్లలకి పట్టపగ్గాలుండవు.

పీర్లను ఎక్కడికి తీసుకెడితే అక్కడికి వాటితోపాటు వెళ్ళిపోవడం, లేకపోతే కర్రలు, గుడ్డపీలికలు సంపాదించి తామే పీర్లు తయారుచేసి మినీ మొహర్రం జరుపుకోవడం— పూనకాలు వగైరాలతో సహా.

ఓ రోజు— ఆనంద్ పూనకం ఎలా ఉంటుందో చూద్దామనుకున్నాడు. ఒంటికాలు మీద నిలబడ్డాడు— అయిదే నిముషాలు. అయినా కొన్ని యుగాలపాటు నిలబడినట్టనిపించింది. తన దోస్తులలో ఎవరూ అంతసేపు నిలబడలేదు. అదో రకంగా రికార్డు. ఇంకేముంది! ఊళ్ళో పిల్ల లందరి దృష్టిలో ఆనంద్ హీరో అయిపోయాడు. నిజంగా గొప్ప కిరీటమే దొరికిందతనికి

అతనికి తెలియకుండానే లోలోపల ఏదో విలక్షణమైన మార్పు— 'తాను' అనే స్పృహ కోల్పోయి ఇతరజీవులతో తాదాత్మ్యం చెందగలగడం, పరనైజ ప్రవేశం. ఆ సంగతి అప్పట్లో అతనికి తెలియదు. దాని మీద లక్ష్యం కూడా లేదు. అమ్మకు దూరమైన తర్వాత ఆనంద్ అసలు దేనినీ లక్ష్యపెట్టడంలేదు. అంతరంగం దారీతెన్నూ లేకుండా ఎటెటో సాగిపోతోంది.

అదృష్టం! కణకణ మండే నిప్పులమీద నడవమని ఎవరూ అతన్ని అడగలేదు.

★ ★ ★

మొహర్రం సంబరమైపోయిన తర్వాత ఆనంద్ జీవితం యథావిధిగా ఒక గాడిలో సాగి పోతోంది. స్కూలు, ఆటలు, విజయాలు, ప్రశంసలు, ఉత్తేజభరితమైన క్షణాలు... లోలోపల మాత్రం ఏదో కోల్పోయిన అనుభూతి అలాగే ఉంది. అయితే అమ్మగుర్తుకొచ్చినప్పుడల్లా ఇప్పుడు దుఃఖంతో విలవిల్లాడిపోవడం లేదు. కుప్పకూలిపోవడంలేదు అమ్మరూపం ఎలా ఉంటుందో కూడా మరచి పోయాడు. అయినా అమ్మలేని లోటు అంతరాంతరాల్లో బాధిస్తూనే ఉంది. రంపంతో కోసి తనలోంచి ఏదో భాగాన్ని వేరుచేసినట్టూ అదొక వెలితి.

తన వ్యక్తిత్వం ఇప్పుడు పూర్తికంటే తక్కువగా మిగిలింది —చాలా తక్కువగా. అయినా రోజులు గడిచిపోతున్నాయి. ఆరేళ్ళ వయసు. గట్లు తెంచుకుని ముందుకు దూకుతున్న ఉత్సాహం. రోజులు దొర్లిపోకుండా ఎలా ఉంటాయి? మూర్తీభవించిన ప్రతిభ ఆనంద్. జీవితంలోని ముఖ్యధార నుంచి వేరు కాలేదు. ఊళ్ళో మాత్రం అందరికీ విశిష్టంగా విలక్షణంగా కనిపించేవాడు. బాలమేధావి అనిపించుకున్నాడు. ఊళ్ళో పెద్దలు ఆనంద్ భవిష్యత్తును గురించి రకరకాల ఊహలు చేస్తూండేవారు. పోలీస్ సబ్ఇన్స్పెక్టర్ (ఆ రోజుల్లో అమీన్‌సాహెబ్ అనేవాళ్ళు) అవుతాడేమో... దేవుడు దయతోచూస్తే తహశీల్దారు అయినా కావచ్చు... ఇవే వాళ్ళ దృష్టిలో గొప్పహోదాలు. వాళ్ళ ఊహలు ఇంతకుమించి పైకి వెళ్ళేవి కావు. ఆనంద్‌కివేవీ తెలియవు. ముందుముందు ఏదో కావాలన్న ఆలోచనే అతనికి లేదు. భవిష్యత్తనే మాటకే అర్థం తెలియదు. ఇక్కడ కూడా అదోరకం నిర్లక్ష్యం. పూర్తిగా 'ప్రస్తుతం'లోనే జీవించేవాడు.

మొదట క్లాసులో, ఆ తర్వాత స్కూల్లో అందరినీ మించిపోయాడు. చిన్నప్పుడు నాన్న దగ్గర వల్లించిన పద్యాలు, అయ్యవార్లకంటె నాలుగు పద్యాలు ఎక్కువే నేర్చిన పండితుడన్న

పేరు తెచ్చిపెట్టాయి. అయితే తన పాండిత్యాన్ని అతడెన్నడూ ప్రదర్శించుకోలేదు అదీగాక మాతృభాషలో పద్యాలు వల్లించడం ఆ రోజుల్లో ఘనతకు నిదర్శనం కూడా కాదు. ఎదుటి వాళ్ళను మంత్ర ముగ్ధుల్ని చేసేలా అందంగా మృదుమధురంగా పర్షియన్ మాట్లాడగలిగితేనే పాండిత్యానికి వన్నె. ఆ భాషలో అదోరకమైన అధికారం ధ్వనిస్తూ ఉంటుంది. అది అందరినీ ఆకట్టుకుంటుంది ఊళ్ళో ఎక్కువమంది జనానికి అర్థమయ్యే భాష కాదు కనుక, ఆ భాషలో మాట్లాడితే ఎంతో హుందాగా కూడా ఉంటుంది. అదెంతైనా రాజభాష కనుక తెలియనివాళ్ళకు అలాగే అనిపించేది.

ఆనంద్‌కి పర్షియన్ ఇట్టే వచ్చేసింది. పర్షియన్ నేర్పే టీచర్ కుటుంబం కొన్ని తరాల నుంచి ఇక్కడే ఉంటోంది. తమ పూర్వీకులలో ఒకరెప్పుడో లక్నోనుంచి వచ్చి ఇక్కడ స్థిరపడ్డారని ఆ టీచర్ సగర్వంగా ప్రకటించుకుంటూ ఉండేవాడు. అది ఎంతవరకు నిజమో ఇప్పటికీ తెలియదు లక్నోనుంచీ, అప్పట్లో యునైటెడ్ ప్రావిన్సెస్‌గా చలామణి అయిన ఇతరప్రాంతాల నుంచీ వచ్చామని చెప్పుకోవడం ఆ రోజుల్లో గొప్పతనానికి చిహ్నం. హిందువులు, ముస్లింల అన్న తేడా లేకుండా స్థానికుల్ని వీళ్ళు చిన్నచూపుచూసేవారు. ముల్కీలని పిలిచేవారు. పర్షియన్ భాషమీద లక్నోవాళ్ళు సాధించిన అధికారాన్ని ఈ ముల్కీలు ఎప్పటికీ సాధించలేరంటూ ఆ టీచర్ అవకాశం దొరికితేచాలు యద్దేవా చేస్తూ ఉండేవాడు.

ఆనంద్ విషయంలో ఎంత ఇష్టం లేకపోయినా ఆయన తన అభిప్రాయం మార్చుకోక తప్పిందికాదు. పర్షియన్ భాషలో ఆనంద్ పాండిత్యం ముచ్చటగొలుపుతూ ఉండేది. కళ్ళ ముందు కనిపిస్తున్న ఈ వాస్తవంతో తన 'సిద్ధాంతాన్ని' ముడిపెట్టలేక టీచర్ తెల్లమొహంవేసేవాడు. ఆనంద్ పూర్వీకులు కూడా లక్నోనుంచి ఇక్కడికి వచ్చి స్థిరపడి ఉంటారన్న కట్టుకథను సృష్టించి తృప్తిపడ్డాడు. అతడి పర్షియన్ పాండిత్యానికి వేరే కారణం ఉండడానికి వీల్లేదనేవాడు. ఆనంద్ వంశవృక్షాన్ని మార్చయినా సరే తన మూఢనమ్మకాన్ని కాపాడుకోవాలని ఆయన పట్టుదల ఉత్తరభారతం నుంచి నిజంగానే వలస వచ్చిన ముస్లింలకూ, వలస వచ్చినట్టు ఊహించుకునే ముస్లింలకూ ఈ టీచర్ చక్కని ప్రతినిధి. వీళ్ళు మతపరంగా, భాషాపరంగా తామంతా ఒక ప్రత్యేక తరగతిగా భావించుకునేవాళ్ళు. నవాబు నిరంకుశపాలన చరమఘట్టంలో ఈ దురభిమానం నిర్వహించిన విధ్వంసకరపాత్ర అంతా ఇంతా కాదు.

ఇంట్లో ఆనంద్ మీద ఇష్టం, అయిష్టం కలగలుపుగా ఉండేవి. చిన్నాన్న మాతృ భాషలో కవిత్వం రాసేవాడు. అయితే ఆయన అంతగా చదువుకోలేదు. ఆనంద్‌ను చూపించి గర్వపడుతూ ఉండేవాడు. అతణ్ణి తన కలల ప్రతిబింబంగా ఊహించుకుని మురిసిపోయేవాడు. పోలీస్ ఇన్‌స్పెక్టర్, రెవెన్యూ ఇన్‌స్పెక్టర్, తహశీల్దార్ వంటి అధికారులు ఊళ్ళో పర్యటనకు వచ్చినప్పుడు పట్టుబట్టి ఆనంద్‌ను వాళ్ళ దర్శనం చేయించేవాడు. ఆనంద్ ప్రతిభచూసి వాళ్ళుకూడా ఎంతో ముచ్చట పడేవారు. అందుకు చిన్నాన్న ఎంత సంతోషపడిపోయేవాడో! ఆనంద్‌ని ఆకాశానికెత్తేస్తూ అన్న గారికి సుదీర్ఘమైన ఉత్తరాలు రాస్తూ ఉండేవాడు. గ్రామాల్లో అప్పటికి తపాలా సౌకర్యాలు లేవు. ఒక ఊరినుంచి మరో ఊరికి ఉత్తరాలు చేరవేసేందుకు మనుషుల్ని నియోగించేవారు.

చిన్నమ్మ ప్రవర్తన ఆనంద్‌కు విస్మయం కలిగిస్తూ ఉండేది. ఆమె నడకలో తనపట్ల ఇష్టమూ, అయిష్టమూ ఏకకాలంలో తొంగిచూస్తూ ఉండేవి. ముక్కుతూ, మూల్గుతూ, చికాకుపడుతూ ఉండేది. అదనంగా మరో పిల్లవాడికి తాను చాకిరీ చేయవలసిరావడం ఆమెకు ఇష్టముండేదికాదు. వంటవార్పుల్లో అంత నైపుణ్యం కూడా ఆమెకు ఉండేదికాదు ఆమె వంట ఇంట్లో ఎవరికీ రుచించేది కాదు. పగలూ, రాత్రీ అనకుండా ఒళ్ళు అరగదీసుకుంటున్నా ఆమె గురించి ఓ మంచిమాట ఎవరూ అనేవాళ్ళే కాదు. కన్నబిడ్డలే చీటికీ మాటికీ నసపెడుతూ ఉండేవారు. అయినా అంతరాంతరాల్లో ఆమెకి ఎంతో జాలి, దయ. పైకి మాత్రం ఆనంద్‌తోసహా అందరినీ అదేపనిగా సాధిస్తూ ఉండేది. ప్రతిచిన్న విషయానికీ అందరి మీద పెద్దగా నోరుచేసుకుంటూ విరుచుకుపడుతూండేది.

ఆనంద్‌పట్ల ఆమెలో లీలగా అసూయ కూడా తొంగిచూసేదేమో. తన పిల్లలైన రాజు, కమలలకు భిన్నంగా అతడిలో ప్రయోజకుడయ్యే లక్షణాలు కనిపించాయామెకు. రాజు, కమల అల్లరి పిల్లలు. మంకుతనం, మొరటుతనం జాస్తి. అయినా ఆనంద్‌కి వాళ్ళతో గడపడం సరదాగానే ఉండేది.

గ్రామస్థులనుంచి నేర్చుకున్న బూతుపదాలు వాళ్ళ నోట అవలీలగా దొర్లిపోతూండేవి. అర్థం తెలియకపోయినాసరే ఆ పదాల్ని ఎంతో ఇష్టంగా వల్లిస్తూ ఉండేవారు. మాటకి మాట అప్పజెప్పడం తప్ప ఏమీ తెలియని వయస్సు. బిత్తరపోయిన తల్లి కేకలు మొదలెట్టేసరికి పగలబడి నవ్వేస్తూ అవే మాటలు మళ్ళీ మళ్ళీ అంటుండేవారు... ఆనంద్ విలక్షణంగా కనిపించడం వల్ల కాబోలు అతడిమీద వాళ్ళు ఎంతో ఇష్టపడేవాళ్ళు. భిన్న ధృవాల మధ్య ఆకర్షణ! ఆ రాలుగాయి పిల్లల కారణంగా తనకు తెలియకుండానే ఆనంద్ మరో ప్రపంచంలోకి అడుగు పెట్టాడు. అప్పటికతడికి ఏడో ఏడు నడుస్తోంది. ఓ రోజు ఉదయం వాళ్ళిద్దరు ఇంటివెనుక పక్కపక్కన కూర్చుని మూత్రవిసర్జన చేస్తూ కనిపించారు. అందులో నిజానికి విశేషం ఏమీలేదు. స్త్రీ పురుషులనే తేడా లేకుండా బహిరంగంగా కాలకృత్యాలు తీర్చుకోవడం ఈ దేశంలోని గ్రామాల్లో సర్వసాధారణ దృశ్యమే. ఇళ్ళల్లో కానీ, బయటకానీ పాయిఖానాలు ఉండవు. చాటుమాటుగా కాలకృత్యాలు తీర్చుకోవాలనుకుంటే పెరట్లోకి వెళ్ళడం తప్ప మార్గం లేదు. అయితే అందరికీ ఆ అవకాశం ఉండదు యుక్తవయసు వచ్చే వరకు పిల్లలందరూ సిగ్గుబిడియాలు లేకుండా కలిసే ఆ పనులు చేస్తూ ఉండేవారు.

ఆనంద్ వయసున్న ఆడపిల్లలు, మగపిల్లలు శరీరం పైభాగంలోకానీ, కిందిభాగంలో కానీ దుస్తులు లేకుండా తిరగడం పరిపాటి. స్కూలుకి వెళ్ళినప్పుడు తప్ప సాధారణంగా కిందిభాగం నగ్నంగానే ఉంటుంది. ఆ భాగాన్ని కప్పుకోవాలన్న స్పృహ పిల్లలకు ఉండేదే కాదు. స్కూలు నుంచి ఇంటికి రాగానే కిందిభాగంలో దుస్తులు చప్పున వదిలేసేవారు. ఎవరో చూస్తున్నారని కానీ, సిగ్గుకానీ, లింగభేదం కానీ వాళ్ళకి తెలియదు. అదీగాక ఒంటిమీద చొక్కా, లాగు రెండూ ధరించగల స్తోమత లేని వాళ్ళే గ్రామాల్లో ఎక్కువ మంది. పెద్దవాళ్ళు, ముఖ్యంగా పురుషులు

మొలకు మాత్రం ఏదో చుట్టుకుని పైభాగంలో ఆచ్ఛాదన లేకుండా ఉండేవాళ్ళు. పిల్లలు చొక్కా మాత్రం వేసుకొని కింది భాగానికి పూర్ణ స్వేచ్ఛ ఇచ్చేవారు. ఆడవాళ్ళలో పెద్దవాళ్ళు మాత్రమే శరీరాన్ని పూర్తిగా కప్పుకునేవారు. అవికూడా సాధారణంగా చింకిపాతలే.

ఆ రోజు పెరట్లో రాజు, కమల ఒకరి మర్మావయవాన్ని మరొకరు సూక్ష్మ పరీక్ష చేస్తూ ఉండడం ఆనంద్ కంటపడింది. ఆనంద్‌ని చూడగానే వాళ్ళిద్దరూ కేరింతలు కొడుతూ రమ్మని పిలిచారు. అందులో అతనికి ఎటువంటి తప్పూ కనిపించలేదు. కమల రెండుకాళ్ళు విడదీసి ఇంతకుముందు అతడెప్పుడూ శ్రద్ధగా చూసి ఎరుగని భాగాన్ని చూపించింది. కొత్తదనం తప్ప అతనికి మరెటువంటి భావమూ కలగలేదు.

మరునాడు పొద్దుటే నిద్రలేవగానే, తన తొడల మధ్య గట్టిగా నిక్కబొడుచుకున్నట్టు అతనికనిపించింది. ఇంతకుముందు కూడా అలా జరగడం అతనికి గుర్తుంది కానీ, స్పష్టంగా గమనించింది మాత్రం ఇప్పుడే. బహుశా ముందురోజు కమల శరీరభాగాల్ని పరిశీలనగా చూడడం వల్లనేమో. వేరే ధ్యాసలో పడి కాసేపటి తర్వాత చూసుకునేసరికి ఆ భాగంలో ఇంతకుముందు కనిపించిన మార్పు కనిపించలేదు. ఆనంద్ ఆశ్చర్యపోయాడు. శరీరంలో ఆ భాగానికి మాత్రమే అలా మారేశక్తి ఉన్నట్టు మొదటిసారి అతనికి అర్థమైంది. అలా ఎందుకు జరుగుతుంది? ఈ ప్రశ్న అతని బుర్రలో మెరుపులా మెరిసింది. కానీ సమాధానం మాత్రం స్ఫురించలేదు... ఇంతలో స్కూలుకువేళ కావడంతో అప్పటికా విషయం మరచిపోయాడు

అప్పుడప్పుడు నిక్కబొడుచుకునే ఆ భాగం నలుగురి కంటబడకుండా దాచుకోవాలని హఠాత్తుగా అతనికనిపించింది. ఎందుకలా అనిపించిందో కూడా తెలియదు పెద్దవాళ్ళు అవుతున్న కొద్దీ అలా చేయాలి కాబోలునని మాత్రమే అతడికి అర్థమైంది. కమల శరీరం, తన శరీరం ఇతరత్రా ఒక్కలానే ఉన్నా ఒకే ఒక్క భాగంలో మాత్రం తేడాగా ఉండడాన్ని అతడు గమనించాడు. ఆ తేడా ఎందుకో తెలియలేదు. ఆలోచించిన కొద్దీ అతడిలో ఉత్సుకత పెరిగిపోతోంది. అప్పటికా ప్రశ్న వాయిదా వేసేశాడు.

అయితే ఆ సంభ్రమంనుంచి ఆనంద్ పూర్తిగా తేరుకోలేదు. జీవితాన్ని గురించిన అనేక ప్రశ్నలు అతణ్ణి ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. అన్నింటినీ పరిశీలించడం, ఆనుపానులు తెలుసుకోవడం, జ్ఞానాన్ని పెంచుకోవడం అనే పద్మవ్యూహంలోకి నెట్టి అతణ్ణి తలమునకలు చేస్తున్నాయి. ఇంకొకరి సహాయం లేకుండా సొంతబుద్ధికీ, ఊహాశక్తికీ పదును పెట్టి ప్రశ్నపరంపరతో పోరాడడం అతడికి అనివార్యమౌతోంది. రాజుకీ, కమలకీ తనంటే ఇష్టమే, స్నేహభావమే. కానీ మందబుద్ధులు కనుక తన జిజ్ఞాసనీ, జ్ఞానపిపాసనీ తీర్చే శక్తి వాళ్ళకు లేదు. అతడికి కలిగే సందేహాలన్నీ బుద్ధిసంబంధమైనవే కాకపోవచ్చు కూడా.

ఇంకా మరెన్నో రహస్యాలు అతడికి దిగ్భ్రమ కలిగించబోతున్నాయి. ఆడ, మగ అనే రెండు రకాల లింగభేదాలు, వాటి మధ్య తేడాలు అతడికి పూర్తిగా తెలిసొస్తున్నాయి. అయితే వాళ్ళలో కొందరిని స్త్రీలుగా కొందరిని పురుషులుగా సంకేతించడం కానీ, ఆ మాటలకు అర్థాలు

కానీ అతనికి తెలియవు. వాళ్ళు ఒకే జీవికి సంబంధించిన రెండు రూపాలని మాత్రమే తెలుసు. ఇందులో ఉన్న విశేషం ఏమిటన్న ప్రశ్న అతణ్ణి పదే పదే కలతపెడుతోంది. తానెంతో అభిమానించే తన సోదరి కమలకు తనకున్నట్టు మార్పు చెందే ఆ భాగం ఎందుకు లేదు? కొంతకాలం తర్వాత అది మొలిచి వస్తుందేమో ! అదే నిజమైతే పాపం కమల అంతకాలం ఎందుకు ఎదురు చూడాలో!... అంతలోనే ఈ ఊహ అర్థం లేనిదని అతనికే అనిపించింది... మరో ఆశ్చర్యం, తమ మధ్య ఉన్న తేడాను ఎవరూ పట్టించుకోనట్టే కనిపించడం. తనలో రేగుతున్న ఈ ఆలోచనలన్నీ మరెవరితోనూ పంచుకోలేకపోతున్నాడు. అది తప్పని ఒకరు చెప్పకపోయినా ఏదో జంకు. వస్తున్న సందేహాలను లోలోపలే అణుచుకోవడం వల్ల విలక్షణమైన పరిస్థితిలోకి జారిపోతున్నాడు. ఒక్కొక్కసారి ప్రశ్నలతో రాజీపడడం, ఒక్కొక్కసారి ధిక్కరించడం... మొత్తం మీద అతని బుర్ర అరణ్యంలా తయారైంది. తనకు తెలియని రహస్యాలు ఉండడం అతనికి అవమానకరంగా ఉంది. తన మేధాశక్తికి అవో పెద్దసవాలుగా మారాయనుకున్నాడు. అతనికి సమాధానాలు కావాలి— కానీ ఎవరినుంచని అడిగితే జవాబు చెప్పలేడు. సందేహాలు తీర్చేవారు ఒక్కరూ కనిపించలేదు.

ఇంట్లో విడివిడిగా అందరికీ పడగ్గదులు లేవు. చిన్నాన్నకీ చిన్నమ్మకీ ప్రత్యేకంగా ఓ ఇరుకు గది ఉండేది. కానీ వాళ్ళు తరచు అందరూ పడుకునేచోటే వేర్వేరు మంచాలమీద పడుకునేవారు. వాళ్ళకి కొన్ని అడుగుల దూరంలో పిల్లలు చిన్నచిన్న మంచాలమీదో... ఒక్కోసారి నేలమీదో నిద్రపోయే వాళ్ళు. చిన్నాన్న పెట్టే గురక వల్ల, చిన్నమ్మ అదేపనిగా దగ్గుతూ ఉండడం వల్ల, రాజు, కమల నిద్రలో పలవరిస్తూవేసే కేకలవల్ల ఆనంద్‌కి నిద్రాభంగమవుతూండేది. వీటికితోడు రాత్రంతా పిల్లులు ఎలకల్ని వేటాడుతూ అడ్డొచ్చిన వస్తువుల్ని కిందపడేస్తూ నానాహడావుడి చేస్తూండేవి. పనిమనిషి పాలు పితికి పొద్దుటే సరిగ్గా ఐదుగంటలకు తలుపు కొట్టగానే ఆనంద్ ఒక్క ఉదుటునలేచి తలుపు తీసేవాడు. మిగిలినవాళ్ళు అప్పటికి ఇంకా గురకపెడుతూనే ఉండేవారు. ఒకవేళ మెలకువొచ్చినా లేవడానికి బద్ధకించేవారు. రోజూ ఇదే వరస. తమకి నిద్రాభంగమైందని ఎవరూ అనేవాళ్ళు కాదు. పాపం మధ్యతరగతి కుటుంబాలు! మంచాలు, దుప్పట్లు పంచుకున్నట్టే నిద్ర కూడా పంచుకోవలసిందే.

ఓరోజు రాత్రి... అప్పటికి టైమెంతయిందో కూడాతెలియదు... ఆనంద్‌కి హఠాత్తుగా మెలకువొచ్చింది. అక్కడ అసాధారణమైందేదో జరుగుతున్నట్టు అతడికి వెంటనే స్ఫురించింది. ఓసారి కళ్ళు పూర్తిగా తెరిచాడు... అటువైపు చూశాడు... కళ్ళుమూసుకున్నాడు... మళ్ళీ తెరిచాడు... ఈసారి కళ్ళు సగంతెరిచి అటు చూస్తూ ఉండిపోయాడు. లేచి కూర్చునే ఆ దృశ్యాన్ని ఎందుకు చూడలేకపోయాడో, అలాగని పూర్తిగా కళ్ళు మూసుకొని ఎందుకు నిద్రపోలేకపోయాడో వివరించడం కష్టం. పూర్తిగా కళ్ళుమూసుకున్నా, నిద్రపట్టేది కాదని మాత్రం ఎందుకో అతడికి అర్థమైంది. ఒకవేళ నిద్ర పోగలిగినా, కళ్ళు మూసుకోవాలని అనిపించలేదు. నిద్రపోతున్నట్టు కనిపిస్తూనే అన్నీ చూడగలిగినవిధంగా కళ్ళు అరమోడ్పుగా ఉంచి ఆ దృశ్యాన్ని తదేకంగా చూస్తూ ఉండిపోయాడు. మనసులో ఏదో కల్లోలం... కారణం లేకపోయినా శరీరం ఉద్రిక్తభరితమైపోయింది.

చిన్నమ్మ మంచంమీదనుంచి దృష్టిని ఏ మాత్రం మరల్చుకోవాలనిపించలేదు. ఆమె మూలుగుతూ దగ్గుతూ అలాగే పడుకునుంది. చిన్నాన్న ఆమె రెండు కాళ్ళనూ వేరుచేస్తున్నాడు జరుగుతున్నదంతా ఆ గుడ్డిదీపం వెలుగులో ఆనంద్‌కి అంత స్పష్టంగా కనిపించడంలేదు కానీ చిన్నాన్న చిన్నమ్మను పూర్తిగా ఆక్రమించుకోవడం మాత్రం తెలుస్తోంది. ఆ సన్నివేశం అతణ్ణి మరింత గందర గోళం లోకి నెట్టేసింది. వాళ్ళిద్దరూ తగువు పడని రోజు ఈ మధ్య ఉండడమే లేదు... ఆ రోజు మధ్యాహ్నానికి మధ్యాహ్నం తన కళ్ళముందే వాళ్ళిద్దరూ రోజూకంటె తీవ్రంగా ఘర్షణ పడ్డారు... ఆ కలహాలు ముదిరి ఇప్పుడిలా యుద్ధానికి సిద్ధమయ్యారేమో అనుకున్నాడు ఆనంద్. చిన్నాన్న ఎంత కసాయి వాడో! అంత అర్ధరాత్రి వేళ అందరూ నిద్రపోతున్నసమయంలో చిన్నమ్మ ఒంటరిగా ఉండడం చూసి కక్షతీర్చుకుంటున్నాడు. పాపం గట్టిగా కేక కూడా వేయలేకపోతోంది చిన్నమ్మ. ఇంత దారుణాన్ని చూస్తూ ఊరుకోవడం అతనికి కష్టమనిపించింది. చిన్నమ్మ ప్రాణాలు కాపాడడానికి తనే గట్టిగా కేకలు పెడితే? తన తరహాలో తనూ నన్ను బాగానే చూసుకుంటోంది... ఇంతలో చిన్నాన్న తన తలను చిన్నమ్మ తలవైపు వంచుతూ కనిపించాడు. చిన్నాన్న చేతులు ఆమె ఛాతీ మీద, గొంతుకు దగ్గరగా ఉన్నాయి. అంటే చిన్నాన్న చిన్నమ్మ గొంతుపిసికి చంపబోతున్నాడన్నమాట... ఇక లాభం లేదనుకున్నాడు ఆనంద్. గట్టిగా అరవబోయాడో లేదో చిన్నాన్న తత్తరపడుతూ కిందికి దిగిపోయి తన మంచందగ్గరకు వెళ్ళిపోయాడు. ఓరి దేవుడా, అప్పుడే ఆమెను చంపేసినట్టున్నాడనుకున్నాడు ఆనంద్... మరుక్షణంలోనే చిన్నమ్మ పక్కమీద నుంచి లేచి, చీర సవరించుకుని తలుపు తెరచుకుని ఏమీ జరగనట్టు పెరట్లోకి వెళ్ళిపోయింది. ఆమె ఒంటిమీద గాయాల గుర్తులేవీ ఆనంద్‌కి కనిపించలేదు. గొంతులోంచి తన్నుకొస్తున్న కేకను చివరిక్షణంలో తను అణచుకోగలిగినందుకు అతడికెంతో సంతోషం కలిగింది. ఆ తర్వాత ఏం చేయాలో తోచలేదు. తాను చూసిన దృశ్యాన్ని ఎలా అర్థం చేసుకోవాలో కూడా తెలియలేదు. ఒక విషయం మాత్రం ఖచ్చితంగా తెలిసింది... తాను చూసిన ఆ దృశ్యాన్ని ఎప్పటికీ మరచి పోలేడు. అలా ఎందుకు అనిపించిందో అతనికి తెలియదు.

ఆ దృశ్యం మాయంకాగానే, అతనికి అప్రయత్నంగా నిద్రపట్టేసింది. ఎప్పుడు నిద్రపట్టిందో కూడా తెలియదు

# 4

ఉత్కంఠనీ, ఉత్తేజాన్నీ నింపుతూ విజయసోపానాలు ఎక్కిస్తూ రోజులు దొర్లిపోతున్నాయి. ఆనంద్ ప్రతిభాపాటవాలు వికసిస్తున్నాయి. ప్రాథమికపాఠశాలలో అతడింక నేర్చుకోవలసిందేమీ మిగలలేదు. కదిలి ముందుకుసాగవలసిన సమయం వచ్చేసింది. పాఠశాల అనుభవం అతని బుద్ధిని తెరచినపుస్తకం చేసింది. బయటిప్రపంచాన్ని గుర్తించడం, దానికి స్పందించడం నేర్పింది.

అప్పుడప్పుడు అమ్మ వచ్చి చూసి వెడుతూ ఉండేది. సెలవులకు తనూ ఇంటికి వెడుతూ ఉండేవాడు. అయినా వెనకటిలా ఏదీలేదు. నాన్న పరీక్షల గురించి, మార్కుల గురించి, పై చదువుల గురించి, లాభనష్టాలగురించి మాట్లాడేవాడు. ఆనంద్ తడుముకోకుండా జవాబు చెప్పేవాడు. అంతచిన్న వయసులోనే అతడిలో ఎంతోపరిణతి, చురుకుదనం, ప్రజ్ఞ కనిపించేవి. అమ్మదగ్గర మాత్రం అపరిచితుడిలా మారిపోతున్న అనుభూతి. అంటే తన మునుపటిబాల్యానికే తను అపరిచితుడయి పోతున్నాడన్నమాట. అమ్మ మాత్రం అతడిలో తనకు తెలిసిన వెనకటి చిన్నెలు వెతికిపట్టుకోవాలని విశ్వప్రయత్నం చేసేది. బహుశా కనిపించేవేనేమో,ఆమెకే స్పష్టంగా తెలియదు. ఊళ్ళోని ఆవులు, లేగలు, పిల్లులు, అల్లరిపిల్లలు, అంకుల్ ఉండే పాక, మెలికలు తిరిగే మట్టి సందులు —మనుషులే కాదు పరిసరాలుకూడా ఆనంద్ కంటికి కొత్తగానూ, అపరిచితంగానూ కనిపిస్తున్నాయి. అవి క్షీణించిపోతున్నట్టున్నాయి.తన ఎదుగుదలవల్లనై యుండాలి. ఇప్పుడు తాను ఆ మనుషుల్లో, ఆ పరిసరాల్లో ఒకడు కాడు. ఆ ఊరికి అతడి దృష్టిలో ఇప్పుడెటువంటి ప్రత్యేకతా లేదు. ఈ విశాలప్రపంచంలో అది ఓ చిన్నరేణువు మాత్రమే దాదాపు.

అతని ఆలోచనల్లో ఈమార్పు ఒక్క రోజులో వచ్చిపడింది కాదు. అతడికి తెలియకుండానే క్రమంగా ఆవహించింది. అమ్మను విడిచి వెళ్ళడం ప్రతిసారీ అతనికి అగ్నిపరీక్షే. దుఃఖం. ప్రతిసారీ కట్టలు తెంచుకునే దుఃఖం. బండి పొలిమేరలు దాటేవరకు, ఎడ్ల పరుగులో లయ కుదురుకునేవరకు అలా ఏడుస్తూనే ఉండేవాడు. ఎడ్ల కాలిగిట్టలనుంచి రేగే ధూళి తన విషాదానికి అప్పటికి తెరజార్చినట్టుండేది. పశువులు కూడా అలా విశ్వాసంతో, మాటలకందని రీతిలో అతణ్ణి ఓదార్చేవి.

అంతర్గతంగా ఉన్న జిజ్ఞాస, తెలివి అతణ్ణి క్రమంగా లోబరచుకున్నాయి. బయటి ప్రపంచంపట్ల ఉత్కంఠ ఒకవిధంగా అతని దృష్టిని అమ్మ ధ్యాసనుంచి మళ్ళించే సాధనమైంది తొమ్మిదేళ్ళ వయసులో హెడ్మాస్టర్ గదిలో గోడమీద భౌగోళికపటం చూసి ఈ ప్రపంచం తనకుతెలిసిన ఊళ్ళకన్నా ఎంతో విశాలమైందనే విషయం ఆనంద్ మొదటిసారి తెలుసుకున్నాడు. తాలూకా, జిల్లా, చివరకు అఫ్రోజాబాద్ అనే రాష్ట్రం.... ఆ రాష్ట్రాన్ని ఓ రాజు పరిపాలిస్తున్నాడు. ఆనంద్‌తో సహా స్కూల్లో పిల్లలందరూ ఆ రాజు చిరకాలం వర్ధిల్లాలని కోరుతూ రోజూ ఉదయం ప్రార్థనలు చేస్తూఉంటారు. టీచర్లు చెప్పే పాఠాలు మాత్రం రాష్ట్రానికే పరిమితమై ఉండేవి. వాళ్ళకి తెలిసిన ప్రపంచం సరి హద్దు అదే.

మరోసారి హెడ్మాస్టర్‌గదిలోనే ఆనంద్ అట్లాస్‌ను, గ్లోబ్‌ను చూశాడు. అవి రెండూ అతనికి ఎంతో కుతూహలం కలిగించాయి. ఒకటికి పదిసార్లు ఆ గదిలోకి వెళ్ళి వాటిని పరిశీలించే వరకూ అతడు నిద్రపోలేదు. అఫ్రోజాబాద్ అవతలకూడాఎంతో ప్రపంచం ఉందన్న మాట! అట్లాస్‌లో రకరకాల రంగులతో ముద్రించిన హిందుస్థాన్ పటం అతని కంటపడింది. అదే అతడి ప్రథమ భారతదర్శనం. హిందుస్థాన్ వైశాల్యం చూసి అతడు ఉత్తేజితుడైపోయాడు.

అతడిని ఆశ్చర్యంలో ముంచెత్తుతూ మరికొన్ని వింతలు. ఓ రోజున సైకిల్ తొక్కుకుంటూ ఓ మనిషి ఊళ్ళోకి వచ్చాడు. ఆనంద్ తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు అటుగాని ఇటుగాని పడిపోకుండా అది ముందుకు ఎలా వెడుతోందో అర్థంకాలేదు. పిల్లలు అలసిపోయేవరకూ ఆ సైకిల్ వెంటపరుగెత్తి పరుగెత్తి వగర్చుకుంటూ ఆగిపోయారు. ఆనంద్ మాత్రం పరుగు ఆపలేదు. సైకిల్ మీదవెడుతున్న ఆ మనిషి ఆనంద్ పట్టుదల చూసి ముగ్ధుడయ్యాడు. ఆనంద్‌ను సైకిల్ మీద ఎక్కించుకుని కొంతదూరం తీసుకువెళ్ళాడు. ఆనంద్ మైమరచిపోయాడు. గాల్లో తేలిపోతు న్నట్టనిపించింది.

అన్నింటికీ మించి అతనికి సంభ్రమం కలిగించింది మొదటిసారి బస్సులో చేసిన ప్రయాణం. ఆ ఊరికి పాతికమైళ్ళదూరంలో ఉన్న జిల్లా ముఖ్యకేంద్రం గుల్షన్‌పూర్‌లో జరిగే ఓ వివాహానికి చిన్నాన్న చిన్నమ్మ బయలుదేరి వెళ్ళాలి. ఎడ్లబండిలో వెడితే ఎనిమిది గంటల ప్రయాణం. బండి సిద్ధంచేయమని పురమాయించారు కానీ, ప్రయాణానికి ఓ రోజు ముందు ఒకఎద్దుకు 'గాలి'జబ్బు వచ్చింది. ఇక బండిమీదవెళ్ళే ఆలోచన విరమించుకోడంతప్ప చేయగలిగిందిలేదు. డబ్బుకి కటకటగా ఉండడంతో అసలు ప్రయాణమే విరమిద్దామన్నాడు చిన్నాన్న. అక్కడినుంచి లెక్కలు ప్రారంభించారు. చిన్నాన్న, చిన్నమ్మ, వాళ్ళ ఇద్దరుపిల్లలు, ఆనంద్... మొత్తం అయిదుగురు లెక్కతేలారు. ఆనంద్‌ని విడిచిపెట్టి వెళ్ళడం కష్టం. (ఎందుకు విడిచిపెట్టి వెళ్ళకూడదన్న ఆలోచన కూడా ఓ ఘట్టంలో వచ్చింది. కానీ అలాచేయలేమనీ చేయకూడదనీ అనుకున్నారు. ఆనంద్‌ని తీసుకువెళ్ళలేదనితెలిస్తే అతని తల్లిదండ్రులు ఏమనుకుంటారన్న వెరపు వాళ్ళ ఆలోచనకి అడ్డుకట్ట వేసింది ) అంటే మొత్తం అయిదుగురు బస్సులో వెళ్ళాలన్నమాట. ప్రయాణికులు అయిదుగురే కానీ పెద్ద టిక్కెట్లు రెండే. మిగిలిన ముగ్గురూ అరటిక్కెట్లు. అయినప్పటికీ రానూపోనూ చార్జీలు మూడురూపాయలు అవుతాయి. అమ్మబాబోయ్ మూడురూపాయలే అంటూ చిన్నాన్ననోరు

వెళ్ళబెట్టాడు. అదీగాక పట్నం వెళ్ళామంటే ఎడాపెడా ఖర్చు పెట్టకతప్పదు. జరుగుతున్నదేమిటో గ్రహించేలోగానే జేబులో డబ్బు మాయమైపోతుంది... లాభం లేదు, పెళ్ళి విషయం మరచిపొండని అనేశాడు చిన్నాన్న.

అయితే రాజు కమల నానాగొడవచేశారు. వెళ్ళి తీరవలసిందేనని మొండిపట్టుపట్టారు. రాత్రి పొద్దుపోయేవరకూ చిటపటలాడుతూనే ఉన్నారు. ఒకటే ఏడుపు, సాధింపు... మామూలుగా చిన్నమ్మే మొట్టమొదట మెత్తబడింది. తన పట్టు జారిపోతున్న విషయం తెలుసుకున్న చిన్నాన్న కూడా దిగిరాక తప్పలేదు. అయితే అక్కసు అంతా చిన్నమ్మ మీద చూపిస్తూ మాట అనకుండా ఊరుకోలేదు. 'నాకుతెలుసు. ఏవో కొనుగోళ్ళు మొదలుపెట్టి నా పర్సు ఖాళీ చేయడానికి నువ్వే ఏదో ఎత్తువేశావ్' అన్నాడు. చిన్నమ్మ కూడా మూతిముడిచిందికానీ భర్త ప్రయాణానికి ఒప్పుకున్నందుకు సంతోషించింది. ఆనంద్ జరుగుతున్నదంతా మౌనంగా చూస్తూ ఉండిపోయాడు. లోలోపల మాత్రం ఆపుకోలేనంత ఉత్కంఠ.

బస్టాప్‌కి వెళ్ళడానికి ఒక ఎడ్లబండిని ఎరువు తెచ్చుకున్నారు. ఆరోజుల్లో ఎడ్లబండ్లను అద్దెకు తీసుకోవడమనేది లేదు. డబ్బిచ్చి అద్దెకు తీసుకోవడమనే ఆలోచనే కంపరంగా ఉండేది. ఎడ్లబండ్లు ఉన్నవారిలో మాత్రం ఇచ్చిపుచ్చుకునే అలవాటుండేది. ఏకబిగిన ఇరవైమైళ్ళు నడిచి వెళ్ళటం ఆరోజుల్లో అంత అసాధారణమైన విషయం కాదు. దిగువతరగతి జనంలో నడక చిన్నప్పుడే అలవాటై పోయేది. గ్రామాల్లోని మోతుబరులకు ఎడ్లబండి తప్పనిసరి. అది హోదాకు చిహ్నంకూడా.

బస్టాప్ ఊరికి అయిదుమైళ్ళ దూరంలో, జిల్లాలోని ఒకేఒక రోడ్డు మీద ఉంది. అది కాంక్రీటురోడ్డు. కొన్నికొన్నిచోట్ల రోడ్డు బాగానే ఉండేది కానీ, కొన్నిచోట్ల గతుకులు ఉండేవి. బండి చక్రాలకు తొడిగిన ఇనపపట్టీల రాపిడికి నునుపుతేలి అక్కడక్కడ పడిఉన్న కంకరరాళ్ళు మధ్యాహ్న సూర్యుడి వాలుకిరణాలుపడి రకరకాల రంగుల్లో మెరిసి పోతుండేవి.

రోడ్డునూ, బస్టాప్‌నూ, పెట్టేబేడాతో నిలబడి ఉన్న ఇతరప్రయాణికుల్నీ, పరిశీలనగా చూడటంలో ఆనంద్, రాజు, కమల నిమగ్నులయ్యారు మిగిలినపిల్లలతో జతకట్టేసి కేరింతలు కొడుతున్నారు. పెద్దవాళ్ళు మాత్రం బస్సుకోసం ఆందోళనతో ఎదురుచూస్తున్నారు. సీటుకోసం... చివరకు నిలబడే స్థలంకోసం కూడా తాము కండబలం చూపించవలసివస్తుందని వాళ్ళకి తెలుసు

మొదట చిన్నపాటిఉరుమును తలపింపజేసే రణగుణధ్వని, తర్వాత గాడిద ఓండ్రపెట్టినట్టు అదేపనిగా హారన్ శబ్దం... కొన్నిక్షణాల్లోనే ఎంతోసేపటినుంచి ఎదురుచూస్తున్న బస్సు, రేడియేటర్ ముఖం నుంచి ఆగ్రహంతో ఆవిరిపొగలు చిమ్ముకుంటూ ప్రత్యక్షమైంది. ఆవిరి పైకి ఎగతంతుంటే రేడియేటర్ మూత అదోరకం సంగీతం వినిపిస్తూ నాట్యం చేస్తోంది. ఆ రాక్షసాకారాన్ని చూసి ఆనంద్‌కి భయమూ, ముచ్చటా రెండూ కలిగాయి ఇంతటి భారీకాయాన్ని తన జన్మలో ఇంతవరకూ చూడలేదు. బస్సు తమను దాటి యాభై అడుగుల ముందుకు వెళ్ళి, మెకానికల్ బ్రేకులు కీచుమని శబ్దం చేస్తుండగా మెల్లగా ఆగింది

ఇక తొక్కిసలాట. ఆడ, మగ, పిల్లలు బస్సు వెనుక రోడ్డుమీద మబ్బులా పైకి లేచిన దుమ్ములోంచి పరుగుతీశారు. కొన్ని నిముషాల తర్వాత ఆనంద్ చిన్నాన్న, చిన్నమ్మల మధ్య నలిగిపోతూ బస్సులో నిలబడిఉన్నాడు. రాజు, కమల రొప్పుతూ అతన్ని అంటిపెట్టుకుని ఉన్నారు. ఆనంద్‌కి అదెంతో ఉత్తేజకరమైన క్షణం. ఆ బీభత్సాన్ని ఆ ఊపిరాడని పరిస్థితినీ పూర్తిగా మరచిపోయాడు. ఎద్దు కానీ, మరో జంతువు కానీ లాగకుండా దానికదే నడిచే ఓ బ్రహ్మాండమైన బండిలో తాను ప్రయాణం చేస్తున్నాడు! ఆక్షణంలో తన కళ్ళతో తను చూసి ఉండకపోతే ఏమాత్రం తన ఊహకు అందని విషయం అది. ఊపిరి తీసుకోవడం కూడా కష్టమౌతున్న ఆ సమయంలో ఒకేఒక వ్యక్తి పట్ల అతనిలో ఆరాధనాభావం అంకురించింది. అతడు బస్సు డ్రైవర్. ఆనంద్ ఇష్టదేవతల కొలువులోంచి హనుమాన్ నిశ్శబ్దంగా తప్పుకున్నాడు.

అసలు బస్సు ఎలా కదులుతోందనే విషయం మీద ఆనంద్, రాజు, కమల మధ్య ఎడతెరిపిలేని చర్చ. బస్సు అడుగు భాగంలో కనీసం పది పదిహేను ఎడ్లు ఉండి బస్సును ముందుకు లాగు తున్నాయని రాజు నిర్ధారణ చేసేశాడు కమలకు ఈ మాట అంత నమ్మశక్యంగా కనిపించలేదు. ఆనంద్‌కి ఇది అర్థంలేని ఊహ అనిపించింది. అదే విషయాన్ని మరోరకంగా చెప్పాడు. మొత్తంమీద చర్చ అసంపూర్తిగానే ఉండిపోయింది.

పట్నంలో గడపడం కూడా పిల్లలకి ఎంతో బాగుంది. అందుకు ముందుగా చెప్పుకోవలసిన కారణం అక్కడ స్కూలు బెడదలేదు ఎవరికి ఇష్టమనిపించింది వాళ్ళు స్వేచ్ఛగా చేసుకోవచ్చు. పెళ్ళి హడావుడిలో తల్లిదండ్రులు తమ మీద కళ్ళేర్రజేసే అవకాశం చాలా తక్కువ. ఈ పరిస్థితిని ఆసరాగా తీసుకుని రాజు, కమల మరోసారి చిన్నాన్న దగ్గర చిన్నమ్మ దగ్గర మంకుపట్టు ప్రారంభించారు. ఈసారి వాళ్ళ వేధింపు తామింతవరకూ చూసి ఎరగని మరో అద్భుతం చూపించమని. అది మూకీసినిమా. బస్టాప్‌లో పరిచయమైన దోస్తులు ఆ సినిమా గురించి ఊరించే విశేషాలు ఎన్నోచెప్పారు వాళ్ళలో కొందరు తాము నిజంగానే ఆ సినిమా చూశామని గొప్పలు చెప్పుకున్నారు కూడా. చిన్నాన్న ఖర్చు కారణం చూపించి మొదట ఒప్పుకోలేదు. చిన్నమ్మ పైకి ఏమీ అనలేదుకానీ భర్త అభ్యంతరంతోనూ ఏకీభవించలేదు. అమ్మ తమవైపే అన్న సంగతి పసిగట్టి వాళ్ళిద్దరూ మరింత భీష్మించారు. చిన్నాన్న నిర్ణయం కూడా సడలిపోక తప్పలేదు. పైకి ఒప్పుకోకపోయినా చిన్నాన్నకానీ చిన్నమ్మకానీ అంతవరకూ సినిమా చూసి ఎరగరు. చివరకు సినిమాకు వెళ్ళడానికే నిర్ణయం జరిగింది. దాదాపు పదణాలు పిల్లలకోసమే 'దండగ' చేయాల్సివస్తోంది కానీ సినిమా మీద తమకేమీ ఆసక్తి లేనట్టు పెద్దలు (పెద్దరికానికి తగినట్టు మధ్యమధ్య సణుగుడు గొణుగుడు మేళవిస్తూ) కనిపించడానికి ప్రయత్నించారు. ఒక్కొక్కటి రెండణాలు చేసే నేలక్లాసు టిక్కెట్లు తీసుకుని వెళ్ళి కూర్చున్నారు. చెమటకంపు. బీడీలవాసన, హాల్లో పొగతాగడంమీద నిషేధం లేదు. అతుకులు వేసిన తెర. అయితేవాళ్ళకీ, సినిమాకి వచ్చినమిగిలిన ప్రేక్షకులకీ ఇవేవీ పట్టలేదు. హఠాత్తుగా లైట్లు ఆరిపోయి తెరమీద దెయ్యాల్లా ఆకారాలు కదలడం ప్రారంభించాయి. మూకీచిత్ర ప్రపంచంలో సాటిలేని నటుడు మాస్టర్ విఠల్ ఆ సినిమాలో హీరో. ఆనంద్ సినిమాలో లీనమైపోయాడు. పరఃతాల మీదనుంచి గోపురాల మీదనుంచి దూకుతూ

పరవళ్ళుతొక్కుతున్న నదుల్లో ఈదుతూ, ఒంటిచేత్తో వందలాదిమందిని జయిస్తూ, అన్నింటికంటె ముఖ్యంగా హీరోయిన్‌ను రక్షించిన హీరో తనే అయిపోయాడు. సినిమా చివరిభాగం అతడిని మరీమరీ మంత్రముగ్ధుడిని చేసింది. మొదటిసారి హీరోయిన్ —తన హీరోయిన్—అనే ఊహ అతనికి కలిగింది. తనదైన ఓ స్త్రీకోసం, తన హీరోయిన్ కోసం, తాను కూడా అటువంటి అసాధ్య కార్యాలు చేయగలనని మొదటిసారి అనిపించింది. అంత స్పష్టంగానే కాకపోయినా హీరోయిన్ అనే ఆకర్షకమైన సరికొత్త పాత్ర అతని ఆలోచనల్లోకి మొట్టమొదటిసారి అడుగుపెట్టింది.

ఇక సినిమాగురించి రకరకాల వ్యాఖ్యానాలు. తెరవెనుక నిజంగానే కొంతమంది నాటకం ప్రదర్శిస్తున్నారనీ, వాళ్ళ నీడలే తెరమీదపడుతున్నాయనీ చిన్నమ్మ అనుకుంది. చిన్నాన్న ఏకీభవించలేదు. ముందే ఫోటోతీసి తెరమీద చూపిస్తున్నారని ఆయన ఊహ. రాజునీ కమలనీ మాత్రం సినిమాలోని సన్నివేశాలే బాగా ఆకర్షించాయి. మరునాడు సినిమాలో చూసిన కత్తియుద్ధాన్ని అనుకరిస్తూ వేపకొమ్మలతో యుద్ధం చేసి పెళ్ళికొచ్చిన వారికి ఎంతో వినోదం కలిగించారు. తెరమీద కదిలే నీడలు మాట్లాడే రోజు కూడా వస్తుందేమో అనుకున్నాడు ఆనంద్. 'అది అసాధ్యం' అని తేల్చిచెప్పేశాడు చిన్నాన్న.

గుల్షన్‌పూర్ అంతవరకు తమకు తెలియని సరికొత్త ప్రపంచం. ఆనంద్ ఆ పట్టణాన్ని ఎంతో పరిశీలనగా చూశాడు. ఎందుకంటే వేసవి సెలవుల తర్వాత చదువుకోడానికి తాను ఇక్కడికే రాబోతున్నాడు. అతనికి సంతోషంగానూ ఉంది, కొంతవిచారంగానూ ఉంది. అక్కడంతా తేడాగా కనిపిస్తోంది. తనింతవరకు బూట్లుకానీ, చెప్పులు కానీ వేసుకుని ఎరగడు. గ్రామాల్లో పిల్లలు చెప్పులు లేకుండానే తిరుగుతూంటారు. అందుకే వాళ్ళ పాదాలు త్వరగా మొరటు దేలిపోతాయి. మిట్టపల్లాలతో రాళ్ళతో నిండిన నేలమీద ఎంతతేలిగ్గా పరుగెత్తగలరో బురద నీళ్ళలోనూ అంతే తేలిగ్గా నడవగలరు. అరికాల్లో ముల్లుగుచ్చుకుని విరిగినభాగం పాదంలోనే ఉండిపోయినప్పుడు మరో ముల్లుతో క్షణాలలో తీయగలరు. ఇక్కడ పట్నంలో పరిస్థితి వేరు. దాదాపు ప్రతిఒక్కరూ బూట్లో, చెప్పులో ధరించడం ఆనంద్ గమనించాడు. అంతేకాదు, అందరూ ఒకదానిమీదఒకటిగా రకరకాల దుస్తులు ధరించడమూ గమనించాడు. వాటివల్ల వేసవిలో భయంకరమైన చెమటవాసన వస్తూఉంటుంది. ముఖ్యంగా నెక్‌టై అనే పేరుతో పిలిచే గుడ్డపీలిక ఆనంద్‌కిమరీ హాస్యాస్పదంగానూ, అనవసరంగానూ కనిపించింది. పెళ్ళికి వచ్చిన అతిథుల్లో మొట్టమొదటిసారి పట్నంచూసినవాళ్ళు ఆ గుడ్డపీలికమీద చేసిన వ్యాఖ్యానాలు అన్నీ ఇన్నీ కావు. పొగరుమోతుగిత్తను గుంజుకువెళ్ళడానికి ఉపయోగించే పలుపుతాడులా ఉందని ఓ పల్లెటూరి పెద్దాయన వర్ణణ. అయినా విచిత్రం, ఆ రంగుల గుడ్డపీలికను ధరించి వచ్చినవారికే ఎక్కడలేని గౌరవం. ఆనంద్‌కి గానీ, అతని మిత్రులకుగానీ కారణం అంతుబట్టలేదు.

పెళ్ళి అనగానే మిన్నూ మన్నూ ఏకం చేసేంత హడావుడి. పెళ్ళికొచ్చిన బంధుమిత్రులకు మాత్రమే అదివినోదం, వేడుక. వధువు తల్లిదండ్రులకు నిజమైన అగ్నిపరీక్ష. ప్రతిదాన్నీ వాళ్ళే సమకూర్చాలి. డబ్బు చెల్లించుకోవాలి. బంధుమిత్రులకు విందు వినోదాలు చూసుకోవడం,

పెళ్ళికొడుక్కి కట్నకానుకలు సమర్పించడం, పెళ్ళి కూతురికి నగలు చేయించడం, వియ్యంకులకు కానుకలు చెల్లించుకోవడం —అన్నీ వాళ్ళ బాధ్యతే. అవతలివాళ్ళు కట్నకానుకల్ని హక్కుగా భావించి పీడిస్తూ ఉంటారు. వధువు తల్లిందండ్రుల నడుంవిరిచే ఈ డిమాండ్ల జాబితాకు అంతూపొంతూ ఉండదు. పైగా ఇదంతా ఆనవాయితీ అంటారు. పెళ్ళి అయిదురోజులపాటు జరిగే పెద్ద తంతు. వధువువైపు బంధువులు పెళ్ళికి కొన్నిరోజుల ముందే వచ్చి తిష్ఠ వేస్తారు. పెళ్ళి తర్వాతకూడా కొన్ని రోజులో, వారాలో అక్కడే ఉండిపోతారు. ఆ పైన పెళ్ళికొడుకు తరఫువాళ్ళు తమ కేవేవో లోపాలు జరిగినట్టు ఊహించుకుని గొడవ ప్రారంభిస్తారు. అక్కడి నుంచి చిన్నా పెద్దా ఘర్షణలు మొదలవుతాయి. మధ్యతరగతి కుటుంబీకుడు కూతురు పెళ్ళి చేయాలంటే ఇన్ని ఆటుపోట్లు ఎదుర్కోక తప్పదు. వరుడి తల్లిదండ్రుల మంచితనం మీద, ఔదార్యం మీద అంతా ఆధారపడి ఉంటుంది. ఒక్కోసారి బంధువర్గం ఉన్నవీ లేనివీ చెప్పి ఎగదోసినప్పుడు వాళ్ళు కూడా ఘర్షణలో తలదూర్చవలసి వస్తుంది. దానితో అప్పటికే ఉన్న ఉద్రిక్త వాతావరణం మరింత విషమిస్తుంది.

ఆనంద్ దృష్టి అంతా వధూవరులపైనే. వాళ్ళది ఇంచుమించు తన వయసే. పెళ్ళి కూతురికి పదేళ్ళు, పెళ్ళికొడుక్కి పన్నెండేళ్ళు ఉంటాయి. అమ్మాయికి పెళ్ళి రెండేళ్ళు ఆలస్యమైందని కూడా పెళ్ళిపందిట్లో కొందరు చెవులు కొరుక్కున్నారు. హిందూధర్మశాస్త్రం ప్రకారం ఆడపిల్లకు ఎనిమిదేళ్ళు నిండకుండానే పెళ్ళి చేసేయాలి.

ఆ బాలదంపతులతో ఆనంద్ వెంటనే స్నేహం చేసేశాడు. బయట మోగుతున్న మంగళవాద్యాల మీదే వాళ్ళ ఆసక్తి. లోపల జరుగుతున్న ఘర్షణతోకానీ, వల్లిస్తున్న మంత్రాలతో కానీ, విపరీతమైన పొగతో ఇబ్బంది పెడుతున్న హోమంతో కానీ వాళ్ళకి ఎటువంటి సంబంధంలేదు. అంత పొగనీ భరించవలసిందేకానీ పెళ్ళికొడుకూ పెళ్ళికూతురూ అక్కడినుంచి కదలడానికి లేదు. తంతు పూర్తయ్యేవరకు అక్షరాలా వాళ్ళు బందీలే.

మరునాడు ఉదయం ఇంటికి తిరుగుప్రయాణం. ఆనంద్ బంధువుల మధ్య బస్టాప్‌లో నిలబడి ఉన్నాడు. గత కొద్దిరోజుల ఆనందోత్సాహాలను గుర్తుచేసుకుంటున్నాడు.వధూవరు లిద్దరూ తనతో బాగా కలిసిపోయారు. వాళ్ళని విడిచి రావడం అతనికి బాధగానే ఉంది. అసలు పెళ్ళంటే ఏమిటి, తాను ఎవరిని పెళ్ళాడాలన్న ప్రశ్నలు అతని ముందు మెరుపులా తళుక్కుమన్నాయి. ఆ అమ్మాయి చాలా అందంగా సినిమాలో హీరోయిన్‌లా ఉండాలని మాత్రం అతనికి కచ్చితంగా తెలుసు. అంతకుమించి పెళ్ళి గురించి అతడేమీ ఆలోచించలేకపోయాడు. పెళ్ళిగురించి, మనిషి జీవితంలో పెళ్ళికి ఉన్న ప్రాధాన్యం గురించి అతడికేమీ తెలియదు.

పెళ్ళి జరుగుతుండగా అంతటి కోలాహలంలోనూ ఎవరో తనను పెళ్ళికొడుకుగా కనిపెట్టారనీ, తాను కూడా అటువంటి సంకెళ్ళు తగిలించుకునే రోజుఎంతోదూరంలో లేదనీ అతనికి తెలియదు.

# 5

ఒకవైపున రకరకాల స్కూలు కార్యక్రమాల్లో, మరోవైపున విద్యావ్యాసంగంలో ఆనంద్ మునిగితేలుతున్నాడు. అయినాసరే సాంఘికవాతావరణంలోకి చాపకింద నీరులా అడుగుపెట్టిన ఓ మార్పును గమనించాడు. ముందుముందు దేశంలో సామరస్యజీవనాన్ని దారుణంగా దెబ్బతీయబోతున్న వేర్పాటువాదం తొలిసంకేతాలు ఆ మార్పులో కనిపించాయి. ఊళ్ళో ఉన్న ముస్లింలను ఇరకాటంలోపెట్టే పరిణామాలు ఒకటొకటిగా జరిగిపోతున్నాయి. ఆ ఊళ్ళో జన్మించి పట్నంలో ఉద్యోగం చేస్తూ సెలవుమీద ఇంటికి వచ్చే ముస్లింయువకులు తమతోపాటు గ్రామస్థులు కనీవినీ ఎరగని కొత్తకొత్తధోరణులు వెంటబెట్టుకుని వస్తున్నారు. జనాన్ని అవి ప్రభావితం చేస్తున్నాయి. రాజు ముస్లిం కనుక ఇది ముస్లిం రాజ్యమని వాళ్ళ వాదన. మరో అడుగు ముందుకువెళ్ళి, ముస్లిం రాజ్యంలోని ప్రతి ముస్లిమూ రాచరికంలో భాగమే అవుతాడు కనుక అతడు కూడా రాజుగారి సంక్షిప్తరూపమేనని ప్రకటించడం ప్రారంభించారు. ఈ ధోరణినే మరింత సాగదీసి అన్—అల్—మలిక్ (నేనే రాజును) అనే సిద్ధాంతాన్ని వాళ్ళు రూపొందించారు. రాష్ట్రంలోని ముస్లింల విశిష్టతను సూచించే మాటగా అది మారిపోయింది. ఈ సిద్ధాంతం పల్లెటూరిపరిభాషలో గ్రామాల్లోకి కూడా విస్తరించిపోయింది. ఈ సరికొత్తహోదా ప్రధానంగా మతపరమైన గుర్తింపును ప్రకటించుకోడానికి ముస్లింలకు అవకాశమిచ్చింది. అయితే శతాబ్దాలుగా ఇక్కడి ముస్లింలు గ్రామీణజన జీవనంలో ఒకరుగా కలిసిపోయి జీవిస్తున్నారు. వారికి ఈ కొత్తరకం గుర్తింపు అయోమయాన్నీ ఒక్కోసారి విపరీతమైన చికాకునీ కలిగిస్తోంది. అలాగే దానిపట్ల ఆకర్షితులవుతున్నవాళ్ళూ ఉన్నారు. విగ్రహారాధనపై ఆధారపడిజరిపే హిందువులపండగల్లో ముస్లింలు పాలుపంచుకోవడం ఇస్లాం ఒప్పుకోదని కొందరు మతగ్రంథాన్ని ఉటంకిస్తూ ఉద్ఘాటించడం ప్రారంభించారు. చాలామందికి ఇది మింగుడుపడలేదు. దసరా, తదితర పండగల్లో ముస్లింలు పాలుపంచుకోకుండా ఉండడం చాలా కష్టం. కానీ ఈ ఉద్ఘాటన తర్వాత వాళ్ళు చేయగలిగింది లేదు. ఎవరో రుద్దిన ఈ సిద్ధాంతాన్నికాదని, ఉమ్మడి సంప్రదాయాల్ని కాపాడుకునే సాహసం క్రమంగా వాళ్ళలో సన్నగిల్లుతోంది.

అధికారయంత్రాంగం మద్దతుతోనో లేక నిర్వహణలోనో ముస్లింమతంలోకి పరివర్తనలూ జరిగిపోతున్నాయి. గ్రామాల్లో ఇటువంటి పరివర్తనలు కొన్ని శతాబ్దాలుగా జరుగుతూనే ఉన్నాయి. కానీ అవి చాలా సహజమైన పరివర్తనలు. అనంతగిరిలో ఉన్న ఒక రిటైర్డ్ ముస్లిం హెడ్‌కానిస్టేబుల్ ఒక ముస్లిం భార్య ఉండగా, ఒక హిందూయువతిని కూడా పెళ్ళిచేసుకున్నాడు. 'నికా'లో ఆమె పేరును మార్చేశారు. ఆమెకు ఎనిమిది మంది సంతానం. వారంతా ముస్లింలే. ఇటువంటి ఉదంతాలు వేలసంఖ్యలో ఉంటాయి. ఆమెవైపు బంధువులెవరూ ముస్లిం మతం స్వీకరించలేదు. అలాగని ఆమెతో సంబంధాలూ తెంచుకోలేదు. జీవితాలు యధావిధిగానే సాగిపోతున్నాయి. ఆ 'నికా'ను కానీ, తర్వాత కలిగిన ముస్లిం సంతానాన్ని కానీ ప్రత్యేకించి వేలెత్తి చూపించినవాళ్ళు ఎవరూ లేరు.

ఈ మధ్య జరుగుతున్న మతపరివర్తనలు అటువంటివి కావు. మల్లికార్జున్ అనే పెద్ద మనిషి రాత్రికి రాత్రి మహమ్మద్ అలీగా మారిపోతున్నాడు. దాంతోపాటే అంతవరకూ లేని దూకుడు మిడిసిపాటు కూడా అతగాడిలో అడుగుపెడుతున్నాయి. ప్రభుత్వం చూపించే ప్రలోభాలు తప్ప ఈ పరివర్తన వెనుక చిత్తశుద్ధిలేదు, విశ్వాసమూ లేదు. ఈ ధోరణి అందరినీ కలవరపెడు తోంది. మతం మారినా మనిషి నడక మారడానికి అక్కడ తగిన కారణం లేనేలేదు.

ఆనంద్‌కి ఇదంతా అగమ్యగోచరంగా ఉంది. ఈ మధ్య హిందువుల పండగల్లో హిందువులే పాల్గొంటూండడం అతడు గమనిస్తున్నాడు. ముస్లింపెద్దలు ఇలా ముఖం చూపించి అలా వెళ్ళిపోవడమో, ఏదో కారణంచూపించి పండగ రోజుల్లో ఊరికి దూరంగా ఉండడమో జరుగు తోంది. మొత్తం మీద లోపలినుంచి ఏదో పురుగుతొలుస్తున్నదనడంలో సందేహం లేదు. ఉపరితల జీవనంమాత్రం మామూలు గానే సాగిపోతోంది. తరతరాలుగా అల్లుకున్న అనుబంధాలు ఇప్పటికీ గ్రామాన్ని శాసిస్తూనే ఉన్నాయి.

హిందువుకీ, ముస్లింకీ మధ్య అడ్డగీత ఎక్కడ గీయాలో ఆనంద్‌కి తెలియలేదు. ఏదో ఒకమతంలో పుట్టడం యాదృచ్ఛికం, అంతకుమించి మరేమీకాదని అతను అనుకున్నాడు. అతడి స్నేహబృందంలో హిందువులూ ఉన్నారు, ముస్లింలూ ఉన్నారు. వాళ్ళమధ్య తేడాను రుజువుచేసే అంశం ఆనంద్‌కి ఒక్కటీ కనిపించలేదు... అయితే పరిసరాలు గమనించినకొద్దీ అతనికి కొన్ని విషయాలు అర్థమౌతున్నాయి. ఎంతోమంది బాలమేధావులకున్నట్టే, వాస్తవానికి అడ్డంగా పెద్దలు జార్చే మేలిముసుగుల్ని చీల్చుకుని లోపలికి చూడగల నిశితదృష్టి ఆనంద్‌కు ఉంది. తెరవెనుక పనిచేసే శక్తుల్ని క్రమంగా అర్థం చేసుకోవడం ప్రారంభించాడు.

ఓ రోజు ఉదయం స్కూలుకువెడుతుండగా అతని స్నేహితుడు కరీమ్ దారిలో ఎదురయ్యాడు. తన తమ్ముడు నాలుగేళ్ళ రహీమ్‌కు సుంతీ కార్యక్రమం జరుగుతోందనీ, చూడడానికి రమ్మనీ ఆహ్వానించాడు. అదేమిటో ఆనంద్‌కు అర్థంకాలేదు. స్కూలుకు ఆలస్యమైపోతుందని అంటూనే కరీమ్‌తో కలిసి వాళ్ళ ఇంటికి వెళ్ళాడు. అక్కడ పండుగ వాతావరణం వెల్లివిరుస్తోంది. కొందరు పెద్దలు ముంగిట్లో కిర్రుమంచాలమీద, అరుగులమీద కూర్చుని ఉన్నా రు. బీడీలు, చుట్టలు

కాల్చుకుంటూ సంతోషంగా కబుర్లుచెప్పుకుంటున్నారు. వాళ్ళల్లో అఫ్జల్‌చాచా అని అందరూ పిలుస్తున్న ఓ వ్యక్తి అపరిచితుడులా కనిపించాడు. బహుశా నగరంనుంచి వచ్చి ఉంటాడు. ఆయన చేతిలో సిగరెట్. పిడికిలి బిగించి మధ్యవేలికీ రెండోవేలికీ మధ్య సిగరెట్‌పట్టుకుని కాలుస్తున్నాడు. ఆ కాల్చే పద్ధతి మామూలుగా బీడీలుకాల్చే గ్రామస్థులకులేని ఒక విధమైన ప్రత్యేకహోదాను ఆయనకు కల్పిస్తోంది. కళ్ళజోడు పెట్టుకున్నాడు. చేతికి వాచీకూడా ఉంది. అక్కడున్న వాళ్ళెవరికీ అవిలేవు. ఆయన ధరించిన టోపీ కూడా అన్ని తలపాగాలమధ్య ఎంతో విలక్షణంగా కనిపిస్తోంది.

ఇంట్లోకి వెడుతున్న ఆనంద్‌కి రహీమ్ కనిపించాడు. అతని చేతిలో పెద్ద బెల్లంముక్క. లంచంగా ఇవ్వజూపే ప్రత్యేక సందర్భాల్లో తప్ప మామూలు సందర్భాల్లో అయితే నాలుగేళ్ళ కొడుకు ఒక్కసారిగా అంత బెల్లం మింగడానికి ఏ తల్లీ ఒప్పుకోదు. కొద్దినిముషాల్లోనే దాని ప్రయోజనం ఆనంద్‌కి తెలిసిపోయింది. అబ్బాయికి దగ్గరగా కూర్చున్న క్షురకుడు కత్తి తీసుకుని అబ్బాయి జననాంగం ముందుచర్మాన్ని లాగిపట్టుకుని నేర్పుగా కోసివేశాడు. రక్తం ఉబికివస్తుండగా రహీం భయంతో బాధతో కేకలు వేశాడు. ఆనంద్ దిగ్భ్రమ చెందాడు. వెంటనే అక్కడినుంచి వెళ్ళిపోయాడు. ఆ సన్నివేశానికి అర్థం ఏమిటో అతని హిందూమిత్రులలో కానీ, ముస్లిం మిత్రులలో కానీ ఒక్కరూ చెప్పలేకపోయారు.

ఇది చాలా దారుణం అనుకున్నాడు. కొంతమంది పిల్లలు— కమలలాంటి వాళ్ళు 'అది' లేకుండానే పుట్టడం... 'అది' ఉన్న వాళ్ళలో కొంతమంది చేతుల్లో బెల్లంముక్క పెట్టి అందు లోని కొంతభాగాన్ని నిర్దయగా కోసివేయడం... ఇదంతా ఏమిటో ఆనంద్‌కి అర్థం కావడంలేదు... ముస్లింల ప్రత్యేకతల్లో ఒకేఒకటి ఇప్పుడు తనకు తెలిసింది కాబోలనుకున్నాడు... ఏమో, ఎవరు చెప్పగలరు? ముస్లిం కాకపోయినంత మాత్రాన క్షురకుడి కత్తివేటు తన మీదపడదని ఖచ్చితంగా ఎవరూ చెప్పలేరు. ముస్లింలు కాని ఇతరుల విషయంలో ఇటువంటిది ముందెప్పుడైనా జరుగు తుందేమో. ఈ అంశంమీద అతనిలో రేగే ప్రతిఊహలో విలక్షణమైన భావిసూచన.

త్వరలోనే ఊరంతా రకరకాల పండుగ సంబరాల్లో మునిగిపోయింది. శ్రీకృష్ణుని జన్మతిథి— జన్మాష్టమి సమీపిస్తోంది. మూడేళ్ళుగా, అంటే తనకు ఆరోఏడు వచ్చినప్పటినుంచి ఆనంద్ ఈ ఉత్సవంలో పాల్గొంటున్నాడు. ఉత్సవంలో అందరికంటె ఎక్కువ చురుగ్గా పాల్గొంటున్నది అతడూ, అతని స్నేహితుడు కరీమ్‌లే. అసలు ఉత్సవనాయకత్వం అంతా వీళ్ళిద్దరిదే. ఈ ఏడాది ప్రత్యేకించి పెద్దఎత్తున ఉత్సవం నిర్వహించాలని పెద్దల సంకల్పం. పద్దెనిమిదిరోజులపాటు వివిధ కార్యక్రమాలు నిర్వహించాలనీ, చివరిరోజున రోజంతా జన్మాష్టమి జరపాలనీ నిర్ణయించారు. ప్రతిరోజూ సాయంత్రం భాగవతపురాణంలోని ఒక్కొక్క స్కంధాన్ని గానం చేయడానికి అత్యద్భుత గాత్రం ఉన్న ప్రసిద్ధగాయకవిద్వాంసుని రప్పించారు. ఉత్సవాల ముగింపురోజున కృష్ణ లీలల ప్రదర్శన. ఇందులో ఊళ్ళో ఉన్న స్త్రీ పురుషులు, పిల్లలు పెద్దసంఖ్యలో పాల్గొంటారు. ఊళ్ళో ఇన్ని రోజుల పాటు కొనసాగే ఉత్సవం ఇటీవలకాలంలో ఏదీలేదు కనుక అందరూ ఎంతో

ఉత్సుకతతో ఎదురుచూస్తున్నారు. చుట్టుపక్కల ఊళ్ళనుంచి కూడా జనం రాబోతున్నారు. ఉత్సవాల పద్దెనిమిది రోజులూ వేరే ఊళ్ళనుంచి తరలివచ్చే వారికి భోజనవసతికోసం పెద్దలు తగిన ఏర్పాట్లు చేశారు. భోజనం ఉచితమేనని ప్రత్యేకించి చెప్పుకోనవసరం లేదు.

వాతావరణం చూస్తూ ఉండగానే నృత్యగానసమ్మిళితంగా మారిపోయింది. ఊళ్ళో ఉన్న పెద్దలు, చిన్నలు హఠాత్తుగా గుంపులు గుం పులుగా అక్కడ ప్రత్యక్షమై మృదంగధ్వనికి అనుగుణంగా నృత్యం చేస్తూ ఉండడం ఆనందాశ్చర్యాలు కలి గించే సన్నివేశం. మామూలు రోజుల్లో వీరంతా ఊళ్ళో కనిపించడమే అరుదు. పెద్దవాళ్ళు ఏడాది పొడవునా పొలాల్లోనే గడుపుతూ పనులు చేసుకుంటూ ఉంటారు. పిల్లలు చదువుకు దూరంగా తల్లిదండ్రుల శ్రమలో పాలుపంచుకుంటూ ఉంటారు. వాళ్ళ ప్రధాన వ్యాసంగం పశువుల్ని మేపడం. చెట్లు, పొదలు, పక్షులు, గాలికి తలలూపే పంటచేలు... శ్రమభారం... ఇదే రోజూ వాళ్ళ ప్రేక్షక సమూహం.. తమను తాము మరచిపోడానికీ, తమ భాషకందని అజ్ఞాతమైన, సర్వవ్యాపకమైన అలౌకికశక్తిలో లీనం కావడానికీ తగిన స్ఫూర్తిని వాళ్ళుకూడా తమ శక్తిమేరకు తామూ పొందుతూనే ఉంటారు.

శిక్షణకు దూరంగా అడవుల్లో, పొలాల్లో ఉంటున్న ఈ అపరిచిత కళాకారులు ఆటపాటల్లో తమను మించిపోవడం చూసి స్కూలు పిల్లలు ఆశ్చర్యపోయారు. ఉత్సవాలు జరిగిన పద్దెనిమిది రోజులూ ఊళ్ళో ప్రతిచోటా గ్రామస్థుల కళాకౌశలం ఉట్టిపడుతూనే ఉంది. విష్ణువు పూర్ణావతారమైన కృష్ణుడిపట్ల భక్తిపారవశ్యం జాతి, కుల, వర్గ భేదాలకు అతీతంగా సర్వత్రా వ్యక్తమౌతోంది. మధ్య మధ్య శ్రావణమాసం జల్లులు... ఒకటి రెండు జడివానలు... ఉత్సవాలను మరింత ఆనంద భరితమూ, ఉత్తేజపూరితమూ చేస్తున్నాయి. గ్రామం మీద కారుమబ్బులు కమ్ముకున్నప్పుడు భాగవతం గానం చేస్తున్న పండితుడు—ఆగి ఆగి వినిపిస్తున్న ఉరుములతో శ్రుతి చేసుకుంటున్నారా— అన్నట్టుగా మేఘరాగాన్నో, మల్హార్ రాగాన్నో అందుకుంటున్నారు. తొలిచినుకులు బరువు బరువుగా మీదపడి, తనువు పులకరిస్తున్నవేళ ఆయన వెంటనే శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతాన్ని పైకి ఎత్తి గోకులవాసుల్ని కాపాడిన ఘట్టాన్ని ఎత్తుకుంటున్నా రు. ఆయన అందుకున్న వర్ణన దేనిగురించో తక్షణమే ఊహించిన పిల్లలు సంబరం పట్టలేక ఎడమచేతిని పైకెత్తి, చూపుడువేలును ఆకాశం వైపుచాపి, ఆ వేలికొనమీద అంతటి పర్వతాన్ని నిలబెట్టి మోస్తున్నట్టుగా అభినయిస్తూ నృత్యం చేస్తున్నారు.

ఉత్సవాలలో తొలివారం ముగుస్తున్న సమయానికి ఎక్కడచూసినా కృష్ణసంబంధమైన కార్యక్రమాలే. అమ్మమ్మలు, నాయనమ్మలు ఎప్పుడో అరవైఏళ్ళ క్రితం తమ అమ్మమ్మల దగ్గర, నాయనమ్మల దగ్గర నేర్చుకున్న పాటల్ని– సగం సగం జ్ఞాపకం ఉన్న పాటల్ని– చరణాలు తడుముకుంటూ– అప్పటి కప్పుడు అందుకుని ఏకబిగిన పాడి వినిపిస్తున్నారు. ఆ తర్వాత వాళ్ళకంటె చిన్నవాళ్ళు, ఇంకా ఆ తర్వాత మరో తరం ఆడపిల్లలు– ఎప్పటికీ వసివాడని కృష్ణగాథ ఇలా అప్రయత్నంగా మూడుతరాల గొంతుల మీదుగా జాలువారుతోంది. ఇవి ఎవరూ రాయనిపాటలు. ఎవరూ పుస్తకాలకెక్కించని పాటలు. జనం జ్ఞాపకాల దొంతరలో భద్రంగా

ఉంటూ తరంనుంచి తరానికి ప్రవహిస్తున్న పాటలు. అలా ప్రవహిస్తూనే ప్రతి తరంలోనూ అవి కొత్త కొత్త రూపాలను ధరిస్తూ ఉంటాయి. ఆ రూపాలు ఒకదానిని మించి ఒకటి అందంగా ఉంటాయి. ఆ పాటలకు ఒకేఒక ప్రామాణికపాఠమంటూ ఉండదు. ఒక్కొక్క గ్రామానికి ఒక్కొక్క విలక్షణ గేయసంపద. చేతిలో వేణువుతో, నెత్తిన నెమలిపింఛం అలంకరించిన కిరీటంతో.. అచ్చంగా కృష్ణవేషంలో ఎందరెందరో పిల్లలు ప్రత్యక్షమౌతున్నారు. వాళ్ళలో అన్నివయస్సుల వాళ్ళూ ఉన్నారు. అన్ని రంగులవాళ్ళూ ఉన్నారు. ఎర్రగా, నాజూగ్గా కనిపించే ఆనంద్ మొదలుకొని యాభైఏళ్ళు పైబడిన మోటుమనుషుల వరకూ ఉన్నారు. వాళ్ళ ఉత్సుకతకి అవధుల్లేవు. ఆడపిల్లలు కూడా గోపికల వేషం ధరిస్తున్నారు. ఎవరూ నేర్పని నృత్యాలు వాళ్ళు అప్పటి కప్పుడు ప్రదర్శిస్తున్నారు. ఆ రోజుల్లో గ్రామాల్లో ఎవరూ ఎవరికీ ఏదీ నేర్పడమనేదే లేదు. అయినా తరతరాలుగా అదే హృదయస్పందన... అవే సాంస్కృతిక సంప్రదాయాలు... ఏటేటా బలపడుతూ... జనాన్ని ఒకరితో ఒకరిని బంధిస్తూ...

పద్దెనిమిదోరోజు రానే వచ్చింది...అదిఉత్సవం విశ్వరూపంధరించే రోజు... గ్రామాన్ని అత్యద్భుతంగా తీర్చిదిద్దిన తీరు అలనాటి బృందావనాన్ని తలపింపజేస్తోంది భాగవత పురాణం ప్రకారం కృష్ణుడు తన బాల్యజీవితాన్ని అక్కడే గడిపాడట. కళాకారులు పురాణంలో వర్ణించిన ఘట్టాలను అప్పటికప్పుడు ప్రదర్శిస్తున్నారు . ఊళ్ళో ఉన్న రకరకాల వృత్తి పనివాళ్ళ పనితనం ప్రతిఅంగుళంలో తొణికిసలాడుతోంది. వీధుల్లో సందుల్లో ఎక్కడ చూసినా రంగురంగుల పూల సందోహం. మామిడాకుల తోరణాలు. ఆ తోరణాల్లో మధ్య మధ్య పొలాల నుంచి, అడవి నుంచి తెప్పించిన రకరకాల పూలసోయగాలు. ఆనంద్ ఎన్నడూ చూసి ఎరగని ఎన్నెన్నో రకాల పూలు. ప్రతి ఇంటిప్రాంగణాన్ని కడిగి శుభ్రం చేసి కలాపి జల్లి రంగవల్లులతో కనులపండువుగా అలంకరించారు. కృష్ణలీలల పతాక ఘట్టంలో కృష్ణుడు, అతని స్నేహితులు చెలరేగి ఊరిమీద పడిన సన్నివేశాన్ని అభినయించబోతున్నారు. ఊరు ఊరంతా ఉత్సవ ప్రదేశానికి తరలివెళ్ళింది. పాలు, పెరుగు, వెన్న నింపిన మట్టికుండల్ని పదిహేను అడుగుల ఎత్తున అడ్డంగా కట్టిన గడ కర్రలకు వేలాడదీశారు. వేలాది ప్రేక్షకులు ఒళ్ళంతా కళ్ళు చేసుకొని ఆనందంగా తిలకిస్తుండగా కృష్ణుడు, అతని జతగాళ్ళు అంత ఎత్తుకు ఎగబాకి పాలు, పెరుగు దొంగిలిస్తారు. ఈ అత్యద్భుత ఘట్టం కోసమే ఊళ్ళో దొరికే పాలన్నింటిని తెప్పించి జాగ్రత్తచేశారు. ఇరుగుపొరుగు ఊళ్ళవాళ్ళు కూడా ఎంతో ఉదారంగా పాలు తెచ్చి ఇచ్చారు. పిల్లలు తాగేది తక్కువే. వీధుల్లో ప్రవహించేదే ఎక్కువ. అలా పాలు ఒలకడం ఐశ్వర్యానికి చిహ్నం.

కృష్ణ పాత్రధారి మరెవరో కాదు, ఆనంద్. అతని ఆహార్యంలో, అలంకరణలో వీసమెత్తు లోపంలేదు. పండితులవారు వర్ణించిచెప్పిన భాగవతపురాణంలోని కథానాయకుణ్ణే ముమ్మూర్తులా తలపింప జేస్తున్నాడు. ముఖాలంకరణకే గంటకు పైగా సమయం పట్టింది. నీలిరంగు ఆకుపసరు అతణ్ణి బాలకృష్ణుడిగా మార్చివేసింది. మేకప్ అయిన తర్వాత, తనలాగే వేషాలు ధరించిన మిగిలిన పిల్లలతో కలిసి ఆనంద్ నేరుగా కరీమ్ ఇంటికి వెళ్ళాడు. ఎక్కువ సమయం లేదు.

మేకప్ సమయానికి తప్పకుండా వస్తానని చెప్పిన కరీమ్ మాటతప్పాడు. బహుశా నిద్రపోయి ఉంటాడు, సోమరిపోతు... అంటూ వాళ్ళల్లో ఒకబ్బాయి పళ్ళు కొరికాడు. తీరా వెళ్ళేసరికి కరీమ్ ఇంట్లో లేడు. నగరం నుంచి వచ్చిన అఫ్జల్‌చాచా కనిపించాడు. రెండుమూడుసార్లు దగ్గి అఫ్జల్‌చాచా ముభావంగా అన్నాడు. 'కరీమ్ ఎక్కడికెళ్ళాడో నాకు తెలియదు. అయినా వాడితో మీకేం పని? అది మీ పండుగ. హిందువులే ఆ పండుగ జరుపుకోవాలి...'

పిల్లలు నివ్వెరపోయారు. నిరుత్సాహంగా ఉత్సవ ప్రదేశానికి తిరిగివచ్చారు. తర్వాత, పురాణంలో వర్ణించినట్టుగా గోపురంలా నిలబడిన వందమంది పిల్లలమీదనుంచి జాగ్రత్తగా పైకి వెళ్ళి ఆనంద్ పాలకుండను అందుకుని పాలువంచాడు. విచిత్రంగా ఆ పాలు పులుపెక్కాయి.

పాలు పులుపెక్కడం గురించి ఊళ్ళో చర్చమీద చర్చ జరిగిపోతోంది ప్రేక్షకుల ముఖాల్లో పశ్చాత్తాపం లీలగా తొంగిచూసింది. వేరే ఊళ్ళనుంచి వచ్చినవాళ్ళు ఈ పరిణామాన్ని తేలిగ్గా తీసుకోలేదు. 'ఈ ఉత్సవంలోకి అసలు ఓ ముస్లిం కుర్రవాణ్ణి ఎందుకు రప్పించాలి?' అంటూ నిలదీశారు. 'అందుకే హిందువులు వట్టి పిరికివాళ్ళన్నారు. అన్నింట్లోనూ ముస్లింలను తెచ్చి పెడుతూ ఉంటారు. ఈ పనికిమాలిన ధోరణికి తక్షణం స్వస్తి చెప్పాలి' అన్నారు. ఇటువంటి ఉమ్మడి ఉత్సవాల్ని ఎంతో ప్రతిష్ఠగా భావించి నిర్వహించే ఊరిపెద్దలకు ఏనాడూ ఇటువంటి ఊహలు రాలేదు. ఎంతో చిన్నబుచ్చుకున్నారు. త్వరత్వరగా ఉత్సవాన్ని ముగించేసి ఉద్రిక్తత పెరగకుండా నివారించారు.

ఆనంద్ ప్రాథమికవిద్య పూర్తయిపోయింది. ఇక గుల్షన్‌పూర్‌లో ఉన్న హైస్కూల్‌లో చేరాలి. అందులో కష్టం ఏమీ కనిపించలేదు. తాను చదివిన ప్రాథమికపాఠశాల హెడ్మాష్టర్‌తోసహా అందరూ అతనికి సహకరించారు.

ఆనంద్ కొత్త పాఠశాలలో అడుగుపెట్టే రోజుకోసం ఎంతో సంబరంగా ఎదురు చూస్తున్నాడు.అయితే చిన్నాన్న ఇంటినీ, ముఖ్యంగా తనంటే ఎంతో ఇష్టం, అభిమానం చూపించే రాజునీ, కమలనీ విడిచి పెట్టివెడుతున్నందుకు బాధగానూ ఉంది. తన అవగాహనాశక్తి పెరగడానికి ఎంతో దోహదం చేసిన ఆ రోజులతోనూ, ఆ గ్రామంతోనూ తన సంబంధాలు శాశ్వతంగా తెగిపోనున్నాయని అతడు గ్రహించాడు.

# 6

ఆనంద్ హైస్కూలు చదువు రెండో ఏడాది నడుస్తోంది. విద్యార్థిగా అతడి తెలివితేటలు అప్పటికే గుల్షన్‌పూర్ అంతటా పాకిపోయాయి. గుల్షన్‌పూర్ జిల్లాముఖ్యకేంద్రం. అక్కడ ప్రభుత్వకార్యాలయభవనాలు, విశాలమైనరోడ్లు, ఎన్నో పోలీస్‌వాహనాలు, పోలీస్ సిబ్బంది, పెద్ద పెద్ద లౌడ్‌స్పీకర్ల ద్వారా పాటలతో జనాన్ని హోరెత్తించడంలో పోటీపడే హోటళ్ళు ఉన్నాయి కనుక దానిని ఓ పట్నం అనచ్చేమో కానీ, నిజానికది ఓ పెద్దసైజు గ్రామం. పూర్తిగా గ్రామీణ వాతావరణం కనిపించే భాగంలో కూడా అదే కోలాహలం. అదే రణగుణధ్వని. నెత్తిమీద పెద్ద పెద్ద గంపల్లో సరకులు నింపుకుని వీధుల్లో తిరుగుతూ అమ్ముకునే ఆడ, మగ జనం దీర్ఘాలు తీస్తూ వేసే కేకలతో వీధులు సందులు ప్రతిధ్వనిస్తూఉంటాయి. పొరుగూళ్ళనుంచి వచ్చి పాలమ్ముకునే ఆడవాళ్ళు తమకు అక్షరంముక్కరాకపోయినా తాముసరఫరాచేసిన పాల వివరాల్ని పొల్లుపోకుండా బొగ్గుతో ఇంటి గోడలమీద గుర్తు రాసుకునేవారు. ఆ గోడ లెక్కల్ని తారుమారు చేయాలని పిల్లలతోసహా ఎవరికీ ఆలోచన వచ్చేది కాదు. ఎటువంటి వివాదాలకు అవకాశంఇవ్వకుండా సామరస్యంగా అన్నీ తేల్చుకునేవారు. ఆ పరస్పర విశ్వాసం ఎలా సాధ్యమయ్యేదో తలచుకుంటే ఆశ్చర్యంగా ఉంటుంది.

ఆనంద్ పట్నంలో ఉన్న అన్నేళ్ళలో ఎన్నో కొత్త కొత్త పరిణామాలు చూశాడు. నెత్తిమీద పాలబిందెలు పెట్టుకుని అమ్ముకునే పద్ధతి ఒక వైపుకొనసాగుతుండగానే కొందరు పాలవిక్రేతలు ముర్రాజాతి గేదెల్ని కొని పాలవిక్రయంలో కొత్తపద్ధతి ప్రవేశపెట్టారు. పెద్ద పెద్ద పొదుగులు, బలిసిన దూడలు ఉన్న గేదెల్ని ఏకంగా ఇళ్ళకే తీసుకొచ్చి, ఇంటి యజమాని ఎదురుగా పాలు పితికి అమ్మడం ప్రారంభించారు. పాతపద్ధతిలో పాలు అమ్ముకునేవాళ్ళకి (వీళ్ళలో చాలామందికి ముర్రాజాతి గేదెల్ని కొనుక్కునే స్తోమత లేదు) ఈ పద్ధతి ఎంతమాత్రం నచ్చేదికాదు. గేదెనూ, ముఖ్యంగా దాని పొదుగునూ పదిమందికీ చూపిస్తే దిష్టి తగిలి గేదె వట్టిపోతుందనే వాళ్ళు. ఈ కొత్తపద్ధతిమీద మోజుపడినవాళ్ళు కొంతమంది లేకపోలేదుకానీ, చాలామంది నెత్తిమీద పాలు పెట్టుకుని అమ్ముకుంటూ గోడమీద లెక్కలు రాసుకునే వెనకటి పద్ధతినే ఆదరిస్తూవచ్చారు. అదీగాక, పాలమ్మి ఇంటింటికీ తిరిగి ఖర్చు లేకుండా ఆ కబురు ఈ కబురు చేరవేస్తూ ఉంటుంది.

మరో ఊహించని మార్పు... పట్నం ప్రధానకూడలిలో రాత్రికిరాత్రి ఉచిత టీ సరఫరా కేంద్రాలు పుట్టుకొచ్చాయి.అప్పటివరకు పట్నవాసులుకానీ, గ్రామవాసులుకానీ టీ తాగి ఎరగరు. ఎంత ఉచితంగా ఇస్తున్నా మొదట్లో దానిమీద ఇష్టపడినవాళ్ళు కూడా చాలా తక్కువ. స్తోమత ఉన్న వాళ్ళు రోజూ ఉదయమే పాలు తాగేవారు. వేసవి కాలంలో చల్లని మామిడిపళ్ళరసం సేవించేవారు. అంతే. టీని ప్రవేశ పెట్టిన కొంతకాలానికి టీ కంపెనీలు దివాలాతీసే పరిస్థితి ఏర్పడింది. కానీ ఇంతలోనే సరికొత్త ప్రచారపద్ధతుల్ని చేపట్టి క్రమంగా నిలదొక్కుకోడం ప్రారంభించారు. టీతో కానీ, దాని నాణ్యతతో కానీ ఏమాత్రం సంబంధంలేని, అర్ధనగ్నంగా ఉన్న ఆడవాళ్ళబొమ్మలతో రంగురంగుల పోస్టర్లు దర్శనమిచ్చాయి. బురఖాలు, మేలిముసుగులు మాత్రమే తెలిసిన పట్నంలో ఆ అర్ధనగ్నచిత్రాలు పెద్ద అలజడి రేపాయి. మగవాళ్ళు గుంపులు గుంపులుగా వెళ్ళి ఆ పోస్టర్లను గుడ్లప్ప గించి చూడడం ప్రారంభించారు. ఇరుకురోడ్డుమీద ఒక్కోసారి ట్రాఫిక్‌జామ్‌లుకూడా సంభవించాయి. నడుస్తున్న సంప్రదాయానికీ, ఆ అర్ధనగ్నచిత్రాలకీ మధ్య అంతరం కొట్టొచ్చినట్టు కనిపించి జనం కొన్నిరోజులపాటు సభ్యతా ఆఘాతానికి లోనయ్యారు.

ఆతర్వాత టీ కంపెనీలు ఒక ఆసక్తికరమైన నినాదం సృష్టించాయి. 'వేసవిలో వేడి చాయ్ చల్లదనం కలిగిస్తుంద'ని ఆ నినాదం. నమ్మ శక్యంగా లేకపోయినా అది కొంతమందిని ఆకట్టుకుంది. పైగా ఉచితంగా టీ సరఫరా. ఎల్లకాలం ఉచితంగానే సరఫరా చేస్తారన్న అదొరకం భ్రమ. పైసా చెల్లించనక్కర్లేదు. ఏమీ చేయనవసరం లేదు. జీవితాంతం అలా టీసేవిస్తూ ఉండడమే! అందులో పోయేదేముంది?

ఆరుమాసాలు తిరిగేసరికి వేలాదిమంది నాగరికులు (టీ తాగడానికి నాగరికులు కావడానికి ఉన్న సంబంధం ఏమిటో?) జరుగుతున్నదేమిటో అర్ధంచేసుకునేలోపలే టీకి బానిసలైపోయారు. ఆ తర్వాత కొద్దిరోజులకే ఉచిత టీ సరఫరాకేంద్రాలు ఎలా వచ్చాయో అలాగే హఠాత్తుగా అదృశ్యమైపోయాయి. కొందరిలో టీ తాగే బలీయమైన వ్యసనం మాత్రం మిగిలిపోయింది. ఉచిత టీ సరఫరా కేంద్రాల స్థానంలో చిన్నా, పెద్ద తేయాకు పాకెట్లను విక్రయించే కేంద్రాలు వెలిశాయి. అందులో కూడా మరో వింత. దామాషాలో చూస్తే చిన్నసైజు పాకెట్లకంటె పెద్దసైజు పాకెట్ల ధర సరసమనిపిస్తుంది. అంటే పెద్ద పాకెట్ కొనేవారు తక్కువ ధర చెల్లించి ఎక్కువ రోజులు టీతాగచ్చని అందులో దాగిన సందేశం. నువ్వు ఎన్ని హెచ్చు రోజులపాటు టీ సేవిస్తే, అంతచవగ్గా తేయాకు దొరుకుతుంది! చూస్తూ ఉండగానే వ్యసనం కాస్తా పొదుపు చర్యగా మారిపోయింది. క్రమంగా టీ తాగే వ్యసనం పట్నమూ, పల్లే అనే తేడా లేకుండా ప్రతి ఇంట్లోనూ అడుగుపెట్టేసింది.

హిందూ –ముస్లిం చీలిక గ్రామాల్లోకంటె పట్నాల్లోనే ఎక్కువ కొట్టొచ్చినట్టు కనిపిస్తూ ఉంటుంది. అసలు దాని మూలాలు పట్నాల్లోనే ఉండి పల్లెలకు వ్యాపించాయి. ఆ చీలిక ప్రభావం పట్టణ జీవితంలో విడదీయరానిదిగా ఇమిడిపోయినట్టు ఆనంద్ గమనించాడు. అంతేకాదు. గతంలో కంటె ఆ చీలికను ఇప్పుడెంతో ఎక్కువ ప్రమాణానికి పెంచి చూపించడమూ జరుగుతోంది. పట్టణంలోని శిథిలమైన మసీదులకు మరమ్మతులూ, రూపురేఖలు మార్చే ప్రయత్నాలూ హఠాత్తుగా

జరిగిపోతున్నాయి. నిర్మాణాలు యుద్ధప్రాతిపదికపై నడిచిపోతున్నాయి. 'ఈ డబ్బంతా ఎక్కడినుంచి వస్తోంద'న్న ప్రశ్నకూడా పలుసార్లు ఆనంద్ చెవినపడింది —మొదట్లో గుసగుసలస్థాయిలోనూ, తర్వాత గట్టిగానూ. ప్రశ్నే తప్ప జవాబు లేదు. అందుకే మళ్ళీ మళ్ళీ అదే ప్రశ్న దృఢంగా, బలంగా వినిపిస్తోంది.

అలాగే కొన్ని హిందూ మతసంస్థలు అంతే ఆకస్మికంగా —డబ్బు ఎక్కడినుంచి వస్తోందన్న అంతుబట్టని రహస్యంతోసహా —ఒకటొకటిగా వేగంగా పుట్టుకొచ్చేశాయి. అయితే అవి మొదట్లో అంత స్వేచ్ఛగా పనిచేయలేకపోయాయి. ఆ పరిస్థితి కొంతకాలమే. త్వరలోనే ఊకదంపుడు ఉద్ఘాటనలతో హోరెత్తించడంలోనూ, నిర్హేతుకమైనప్రసంగాలు వినిపించడంలోనూ రెండుపక్షాలూ పోటీ పడ్డాయి. ఒకవైపు —రాజుగారు ప్రాతినిధ్యంవహించే మతంలో పుట్టిన ప్రతిఒకరికీ రాజుగారి అధికారాన్ని కట్టబెట్టే అన్ —అల్ —మలిక్ నినాదం! అందుకు జవాబుగా, రాష్ట్రంలోని అధికసంఖ్యాకుల్ని చూపించి, తొంభైశాతం జనాభాకు లేని ఆధిక్యం పదిశాతం జనాభాకు ఎలా లభిస్తుందన్న ప్రశ్న! అందుకే, రాష్ట్రంలో ప్రజాస్వామికప్రభుత్వం ఏర్పడాలి... రాజు ఉంటేగింటే రాజ్యాంగాధినేతగా మాత్రమే ఉండాలి... అయిదువందల సంస్థానాల్లో లేని పరిపాలనావిధానం ఈ ఒక్క సంస్థానంలో ఎందుకుండాలి?... ఇంతకంటె అర్థరహితం ఉండదు!... రాష్ట్రంలోని మెజారిటీ ప్రజలకే పరిపాలనలో ముఖ్యమైనపాత్ర, అధికారాలు ఉండడమే న్యాయం... ఈ రాష్ట్రానికి చిరకాలంగా జరుగుతున్న ఈ అన్యాయాన్ని తక్షణం సరిదిద్దవలసిందే...ఇలా ఉన్నాయి ఆలోచనలు.

బహిరంగసభలూ, ర్యాలీలు ఈ మధ్య తరచుగా జరుగుతూ దూషణప్రతిదూషణలతో మారుమోగుతున్నాయి. ఒకరిపై ఒకరు విషవమనం చేయడం, పరుషపదజాలం గుప్పిస్తూ ఖండనలకు పూనుకోవడం నిత్యకృత్యంగామారిపోయింది. వాతావరణమంతా పరస్పర విద్వేషమయం. అపప్రచారం సభ్యతా సరిహద్దుల్ని పూర్తిగా అతిక్రమించేసింది. పోటీపడి జనాన్ని సమీకరించడానికి అంతూపొంతూ లేకుండాపోయింది. గ్రామాలనుంచి భారీసంఖ్యలో జనాన్ని తరలించుకొస్తున్నారు. వాళ్ళకి అదేపనిగా బోధిస్తున్నది ఒకటే —ప్రతి హిందూపౌరుడూ ప్రతి ముస్లింపౌరుడికీ శత్రువు... అలాగే ప్రతి ముస్లింపౌరుడూ ప్రతి హిందూపౌరుడికీ శత్రువు. అయితే అంతటి ఉన్మత్తదశలోకూడా సాధారణప్రజలు ఈ అర్థరహితవాదాన్ని విశ్వసించ లేకపోతున్నారు. బొత్తిగా వాళ్ళు ప్రభావితులు కాలేదని చెప్పలేకపోయినా, అనూచానంగా వస్తున్న సహజీవన కాంక్ష వారి అంతరాంతరాల్లో భద్రంగానే ఉంటోంది. అయినాసరే, మతదురభిమానంనుంచి వచ్చిపడుతున్న ఒత్తిడిని తట్టుకోవడం నానాటికీ కష్టసాధ్యమౌతోంది ఈ మతపరమైన ఉప్పెనలో చెప్పుకోదగిన విశేషం ఒకటుంది. చిచ్చుపెడుతున్న రెండుపక్షాలనాయకులూ వేరే రాష్ట్రాలనుంచి ఇక్కడికి వస్తున్నవారేకానీ ఈ రాష్ట్రంవాళ్ళు కాదు. రావడం .. గంటో రెండుగంటలో విషం కక్కడం... అదృశ్యమైపోవడం

ఆనంద్‌జీవితం గందరగోళంలో పడి సుడులుతిరుగుతోంది. బయటిప్రపంచంలోని విలక్షణవిపరీతధ్వనులు చదువుపై ఏకాగ్రతను కొంత దెబ్బతీస్తున్నాయి. రోజూ ఏదో ఒక సంఘటన-అప్రయత్నంకావచ్చు, కుట్రఫలితంకావచ్చు —ఉద్రిక్తతను సృష్టిస్తున్నది. కుట్రజనితమైన సంఘటనలే

ఎక్కువ. హైస్కూలు విద్యార్థులు సాధారణంగా ఆ సంఘటనలో తలదూర్చాలనుకోరు. కానీ వారిని అటువైపు నడిపించేవిధంగా తెలివిగా పథకరచన జరుగుతోంది. 'నారా–ఎ–తక్‌బీర్; అల్లాహ్–ఓ– అక్బర్!', 'బజరంగ్‌బలీకి జై' వంటి నినాదాలు రాత్రీపగలూ అనే తేడాలేకుండా గాలిలో విజృంభి స్తున్నాయి. అప్పటికింకా హింసాత్మకఘటనలు జరగకపోయినా అటువంటి పరిస్థితి ఎంతోదూరంలో లేదనిపిస్తోంది. ఉద్రిక్తవాతావరణం సర్వత్రా కనిపిస్తోంది. ఉద్రేకాలు అంచులు తాకుతున్నాయి.

తన తెలివితేటలు పది మంది దృష్టిని ఆకర్షిస్తున్నందుకు సంతోషిస్తూనే ఆనంద్ హిందూ, ముస్లింల మధ్య పెరుగుతున్న అగాధాన్ని గమనిస్తున్నాడు. సంఖ్యాబలాన్ని చూపించేవారు ఒకరైతే ప్రభుత్వాధికారాన్ని ప్రదర్శించుకునే వారు ఇంకొకరు. ఎలా జరుగుతోందో అర్థం కాలేదు కానీ ఒక్కోసారి ఆనంద్ రెండుపక్షాలమధ్య ఇరుక్కుపోతున్నాడు. హిందువు కావడం వల్లనే అతనికి ఆ తెలివితేటలు అబ్బాయని హిందువులు వాదిస్తే, హిందువైనా తెలివైనవాడు కావడం ఆశ్చర్య మేనని ముస్లింలు వ్యాఖ్యానిస్తున్నారు. అంతేకానీ అతణ్ణి అతడుగా చూసే ప్రయత్నం ఏ వైపునా కనిపించడంలేదు. హిందువు, ముస్లిం అనే తేడాల గురించి ఎప్పుడూ ఆలోచించకుండా నిత్య జీవనసమరంలో నిమగ్నులైపోయిన వేలాదిమంది ప్రజల విషయంలోనూ జరిగేది ఇదే. ఇటీవలి వరకు అంటే హిందువో, ముస్లిమో కావడం మంచి చెడులకు కొలమానమయ్యే వరకూ వీళ్ళను నిలబెట్టి లెక్కించిన వాళ్ళూలేరు, పట్టించుకున్న వాళ్ళూలేరు. చుట్టూ సామరస్యం మచ్చుకైనా కనిపించని ఇటువంటి అర్థరహితమైన ధోరణులు వెర్రితలలు వేస్తున్నా తాను జీవిస్తున్న సమాజంలో తనకెంతోకొంత ప్రాముఖ్యం లభించినందుకు ఆనంద్ సంతోషిస్తున్నాడు.

పట్నంలో ఆడపిల్లలకోసం ప్రత్యేకంగా ఓ మిడిల్ స్కూల్ ఉంది. వాళ్ళను స్కూలుకు తీసుకెళ్ళడానికి పెద్దపెద్ద ఎడ్లబండ్లుండేవి. పరదా తప్పనిసరికనుక బండికి ముందూవెనుకా తెరలు కట్టేవారు. మగపిల్లలు ఆ బళ్ళ వెంటపడుతూ ఉండేవారు. వాళ్ళలో ఆనంద్ కూడా ఒకడు. లోపల ఉన్న వాళ్ళను ప్రత్యక్షంగా చూసే అవకాశం లేదు కనుక మగపిల్లలు తమ ఊహాశక్తిమేరకు వాళ్ళ అందచందాల్ని అంచనావేస్తూఉండేవారు. ఆనంద్ తమ బండివెనుక నడుస్తున్న ప్రతిసారీ లోపల ఉన్న ఆడపిల్లలు వెనుక తెరను కొంచెం పక్కకి తప్పించి దొంగ చాటుగా అతన్ని చూడడానికి ఎగబడుతూ మొలకనవ్వులతో పలకరిస్తూ ఉండేవారు. ఆ సన్నివేశం ఆనంద్‌లో గర్వాన్నీ, ఒకింత సిగ్గునూ నింపుతూ ఉండేది. ప్రశంసాసూచకమైన ఆ చూపులు ఏదో తెలియని, మాటలకందని మైమరపును కలిగిస్తూ ఉండేవి. అలా ఎందుకు ఎలా జరుగుతోందో అప్పట్లో అతనికి తెలిసేదికాదు. అందులో సంతోషాన్నిమించి మరేదో ఉన్నట్టూ అనిపించేది. తనలో ఏదో మార్పు వస్తోంది.... బహుశా రావలసినవేళ కంటే ముందే వస్తోంది.... బాల మేధావులందరిలో వచ్చినట్టే.

భవిష్యత్తును అర్థం చేసుకుని విశ్లేషించుకునే వయసు అతనికింకా రాలేదు. ఎన్నెన్ని పెళ్ళిళ్ళు చూశాడో ! పెళ్ళిళ్ళ సీజన్‌లో అయితే లెక్కేలేదు. పెళ్ళిళ్ళకు వెళ్ళిన ప్రతిసారీ కుతూహలం రేపుతూ ఒకటే ప్రశ్న... పెళ్ళి తర్వాత ఏం జరుగుతుంది? జవాబు దొరకలేదు. అయినా ఎందరిలానో

తాను కూడా పెళ్ళిళ్ళకు వెళ్ళి వస్తున్నాడు. పెళ్ళి కూతురు, పెళ్ళి కొడుకు ఎక్కడి నుంచి ఊడిపడుతున్నారు? ఎక్కడెక్కడి వాళ్ళో వచ్చి ఇక్కడ ఎలా కలుసుకుంటున్నారు? ప్రశ్న మీదప్రశ్న. తర్వాత వాళ్ళకేం జరుగుతుంది? పెళ్ళి హడావుడంతా సద్దుమణిగిన తర్వాత వాళ్ళేం చేస్తారు? పెళ్ళికూతురు ఎంతో అందంగా ఉందనో, ఓ మాదిరిగా ఉందనో వర్ణిస్తూ ఉంటారు. ఆ మాటల కర్థమేమిటి? పెళ్ళికూతురు అందం గురించే అందరూ ఎందుకు ఆసక్తి చూపిస్తారు? అసలు అందమంటే ఏమిటి? ఇటువంటి ప్రశ్నలు అతని బుర్రలో మెరిసి మాయమౌతున్నాయి. స్నేహితుల్ని, బంధువుల్ని అడిగినా సగం సగం జవాబులే. తనలాగే అబ్బాయిలందరిదీ ఈ విషయంలో అసంపూర్ణజ్ఞానమే —ఇక ఆడపిల్లల్ని అటువంటి ప్రశ్నలు అడగనేకూడదు. అది తప్పని ఎవరూ చెప్పకపోయినా ఏదో జంకు. ఆడపిల్లల్ని కూడా ఇటువంటి ప్రశ్నోత్తర పరంపరలు వేధిస్తూ ఉండవచ్చుననుకున్నాడు.

ఇలా చుట్టుదారిలో వెళ్ళి వెళ్ళి క్రమంగా భవిష్యత్తు అనే భావానికి రూపకల్పన చేసుకున్నాడు ఆనంద్. అది తన భవిష్యత్తు కావచ్చు, మరెవరిదైనా కావచ్చు. అప్పటికీ అదెలా ఉంటుందో స్పష్టం కాలేదు. బహుశా అస్పష్టత దాని ముఖ్యలక్షణాల్లో ఒకటేమో! ఒకవేళ ముందుగానే దాని రూపురేఖలు తెలిశాయనుకుందాం. అప్పుడు అదెలా ఉంటుంది? ఆపైన తన భవిష్యత్తు ఎలా ఉండాలనుకుంటున్నాడో ఊహించుకోవడం ప్రారంభించాడు.... ఆలోచన, ఎడతెరిపిలేని ఆలోచన. కానీ ఏదీ తేల్చుకోలేకపోతున్నాడు. ఎంత విచిత్రం అనుకున్నాడు. అయినా మళ్ళీ మళ్ళీ ఆలోచిస్తూనే ఉన్నాడు.

చివరకు ఓ నిర్ణయానికొచ్చినట్టు కనిపించాడు. ఎలా రాగలిగాడో తనకే తెలియదు — (నిజానికి అది అసాధ్యమని మాత్రం కనిపెట్టగలిగాడు) —తాను కోరుకున్నట్టు తన భవిష్యత్తును రూపొందించు కోగలిగింది తాను మాత్రమే. ఈ విషయంలో తనెవరినుంచి ఎటువంటి సహాయాన్ని స్వీకరించేది లేదనుకున్నాడు. అప్పటికప్పుడు తన ఊహలోకి వచ్చిన ఎంతోమందికంటె తనను ఉన్నతస్థానంలో ఊహించుకున్నాడు. దేశానికి .. ఆ మాటకొస్తే ప్రపంచానికి... మొత్తం మానవాళికి తనేదో ఒకటి చేయాలి. ఎవరూ ఇంతవరకూ మాటల్లో కూడా ప్రకటించుకోలేకపోయిన ఘనకార్యం చేయాలి. తను సాధించబోయేవి ఆకాశాన్ని చుంబించేంత ఉన్నతంగా ఉండాలి... అయితే ఇంతకీ అవేమిటి? అతనికే తెలియదు.

ఇక కాబోయే అర్థాంగి విషయం. ఆమె తన ఊహకు ప్రతిబింబంగా ఉండాలనుకున్నాడు. తన భార్య ఎలా ఉండాలో ఊహించడంలో ఎన్నో రోజులు గడిపేశాడు ఆనంద్. ఆలోచించినకొద్దీ ఆ ఊహ గజిబిజిగా మారిపోతోంది. అయితే తన ఊహలో ఉన్న అర్థాంగి తన భవిష్యత్తంతటికీ కేంద్రబిందువుగా రూపొందినట్టు అతడికి లీలగా అర్థమౌతోంది. కాబోయే భార్యనే ఊహించుకోలేనివాడు, భవిష్యత్తునెలా ఊహించుకోగలడు?. కనుక... మళ్ళీ మొదటికొచ్చేవాడు... భవిష్యత్తులో తనకు సంబంధించినవన్నీ- ముఖ్యంగా తన భార్య– కేవలం తాను కోరుకున్నట్టే ఉండాలి.. ఆమె తన ఆదర్శాల కనుగుణంగా ఉండాలి. ఈ విషయంలో ... ముఖ్యంగా భార్య విషయంలో ఎంతమాత్రం రాజీపడడు తీరా ఆమె రూపాన్ని ఊహించుకోవడం ప్రారంభించేసరికి అది తన మేధకు అతీతమైన విషయంగా కనిపించేది. ఇలా ఊహించి ఊహించి హఠాత్తుగా

తన ఊహాజగత్తులో ఉన్న అర్ధాంగి ఇతరు లందరినీ మించి తనలో నిహితం కావాలని శాసించాడు. ప్రత్యక్షంగా ఉండడమూ లేకుండడమూ తన అపూర్వభావనా సంపదగా కలకాలం మనాలని నిశ్చయించాడు. తన ఊహాసుందరిని తననుంచి ఎవరూ వేరు చేయలేరు. ... అంతకంటె తక్కువైనా అంతకంటె భిన్నమైనా తాను ఒప్పుకోడు.

ఇలా అనిపించిన కొద్దిరోజులకే త్వరలో తనకు పెళ్ళి జరగబోతున్న విషయమతనికి తెలిసింది. విచిత్రంగా —కొంత నిరుత్సాహపడ్డాడు కానీ హతాశుడు కాలేదు. అప్పటికే తన ఆకాంక్షలు మేళవించి అర్ధాంగికి రూపకల్పన చేసుకున్నాడు కనుక ప్రత్యామ్నాయాన్ని ఊహించుకునే హక్కు పోగొట్టుకున్నాననుకున్నాడు. తన హృదయగతభావనపై పెళ్ళి ప్రభావమేమీ ఉండదనుకుని సమాధానపడ్డాడు. రూపకల్పనకు తానుపడిన పరిశ్రమ ఎంతనిజమో, రూపుదిద్దుకున్న తన అర్ధాంగి కూడా అంతే నిజమనుకున్నాడు. క్రమంగా ఇది అతని ఆలోచనా విధానంలో భాగంగా మారిపోయింది.

ఏదైనా సగమే. దానికి పూరకంగా మరో సగం ఉంటుంది. వస్తువైనా, ఊహైనా, వాదమైనా, కల్పనైనా, తిరుగులేని నిజమైనా... ఏదైనా అంతే. కనుక ఏదీ మారలేదనుకున్నాడు.

ఇది, ఆలోచనాపరుడైన ఒక వ్య క్తి నిస్సహాయస్థితిలో సృష్టించుకునే సాకు మాత్రమేనా, లేక తన లక్ష్యమేమిటో తేల్చుకోడానికి ఇప్పటికీ చీకట్లో తడుముకుంటున్న ఒక అసాధారణప్రజ్ఞ కలిగిన బాలుడికి సహజంగా కలుగుతున్న భావమా అన్నది తేల్చి చెప్పడంకష్టం అప్పుడప్పుడే వికసిస్తున్న వయసు, దానికి తోడు విశేషమైన తెలివితేటలు అతణ్ణి ప్రశ్నార్థకాల అరణ్యంలోకి నెట్టినట్టు కనిపిస్తున్నాయి. ఎంతో వ్యక్తిత్వమూ ఉత్సాహమూ ఉన్న ఒక అబ్బాయికి నీ జీవితంలో నీవు చేయవలసిన నిర్ణయాలన్నింటినీ మరెవరో నీకు బదులు ముందే నిర్ణయించేశారని చెప్పినప్పుడు అతని మనస్థితి ఎలా ఉంటుంది! అక్కడే సంప్రదాయం అడుగుపెడుతుంది. మీరు సంతోషంగా ఉన్నారా అని వేలాది మంది స్త్రీ, పురుషుల్ని అడిగిచూడండి, అవునని వాళ్ళు గట్టిగా జవాబు చెపుతారు. కానీ ఆనంద్ లాంటి వాళ్ళు కొందరు 'లేదు' అని అంతకంటె గట్టిగా కేక పెడతారు. అతని విషయంలో ఇది చాలా మౌలిక ప్రశ్న. అతని జీవితమూలాన్నే స్పృశించే ప్రశ్న. తన జీవితాన్ని మరెవరో జీవించడమనేది విధిలిఖితమైనట్టు, అదే తన జీవితం... అంటే ఆనంద్ జీవితమని తాను విశ్వసించడం అనివార్యమైనట్టు అతనికి అనిపిస్తోంది. ఈ పరిస్థితిలోని అసంబద్ధత అతణ్ణి దిగ్భ్రాంతికి లోను చేస్తోంది. ఇక, జరిగిన ఆ నిర్ణయంలోని మంచిచెడుల గురించి అతడు చెప్పదలిచిందేమీలేదు. దానిని స్వీకరించడంలో అతనికి ఎటువంటి కష్టమూ కనిపించలేదు.

వేసవి సెలవులకు ఆనంద్ ఊరికి వెళ్ళాడు. పెళ్ళిపనులు పతాకస్థాయిలో జరిగిపోతున్నాయి. పెళ్ళికొడుకు ఇల్లు కనుక పెళ్ళి ఇక్కడ జరగదు. పెళ్ళికూతురుండే మరో ఊళ్లో జరుగుతుంది. అయినా వరుడి ఇంటికి కూడా పెళ్ళికళ వచ్చేసింది. పెళ్ళికొడుకు బంధువులు అప్పటికే మందీమార్బలంతో తరలివచ్చేశారు అంతా పెళ్ళివేడుకల్లో మునిగి తేలుతున్నారు. రక రకాల ఘర్షణలకు సిద్ధమవుతున్నట్టున్నారు. అవి లేనిదే పెళ్ళి పూర్తికాదు.

ఎంతో ఆచితూచి ఆలోచించి సంబంధం నిర్ణయించారు మొత్తానికి పెళ్ళి జరగబోతోంది... ఎవరి పెళ్ళి అన్న ప్రశ్నకంత ప్రాముఖ్యం లేదు. జనం పెళ్ళిళ్ళు చేసుకుంటారనడంకన్న వారికి పెళ్లిళ్లు జరుగుతుంటాయనడం సత్యానికి దగ్గర. పెళ్ళి కుటుంబంలో జరిగే ఒక సంఘటన. ఆ కోణంనుంచిచూస్తే వధూవరులు కేవలం నిమిత్తమాత్రులు. కుటుంబవ్యవస్థను నడిపిస్తున్న సాంఘిక చక్రంలో వాళ్ళిద్దరూ రెండు ఆకులు. సంతానాన్ని కని పితృదేవతలకు సద్గతి కలిగించవలసిన వాళ్ళు. ఆ నిరంతరచక్రభ్రమణంలో వారుకూడా ఒక భాగం. తేలిన సారాంశమొకటే. తన జీవితం తన కోసం కాదు. తన పూర్వీకులకోసం తాను జీవించాలి. ఇక్కడ వ్యక్తిగత అహంకారానికి చోటులేదు. 'నేను' అన్న మాటకు ప్రాముఖ్యం లేదు. అనుశాసనం స్పష్టం. అపుత్రస్య గతిర్నాస్తి. (పుత్రసంతానంలేనివాడు మోక్షానికి అనర్హుడు.)

వధువువైపువారు తమకు దూరపుబంధువులే. ఇంతకుమించి ఆనంద్‌కేమీ తెలియదు. తెలుసుకోవలసిన అవసరంకూడా కనిపించలేదు.

కళ్ళు చెవులు ముక్కు ఇచ్చినట్టే భర్తకు ఓ భార్య... భార్యకు ఓ భర్త! అయితే పుట్టినతర్వాత కొంతకాలానికి భార్య అడుగుపెడుతుంది. ఈరెండు పరిణామాల్ని నివారించడం మన చేతుల్లోలేదు. కొన్నికులాల్లో పిల్లలు ఉయ్యాల్లో ఉండగానే వివాహం చేసేస్తారు. బహుశా పుట్టుకకీ పెళ్ళికీ మధ్యదూరం తగ్గించడానికేమో. వేలాదిమంది మారు మాట్లాడకుండా ఆ చట్రంలో ఇమిడిపోతూనే ఉంటారు.

సెలవుల తర్వాత ఆనంద్ గుల్షన్‌పూర్ తిరిగొచ్చాడు. ఆడపిల్లల్ని స్కూలుకు తీసుకెళ్ళే బండి ఎపుడైనా కంటబడితే దారి పక్కన ఆగి ఆ బండి కనుమరుగైపోయేవరకూ అలాగే ఉండిపోయేవాడు.

★ ★ ★

అన్నింటికంటె గొప్పగా ఊహించుకున్న తన భవిష్యత్తు ఇంకా ఇంకా చిక్కుముడిలా తయారవుతోంది. యవ్వనోత్తేజం కట్టలు తెంచుకుంటోంది. విద్యార్థిగా అతని విజయాలు — అతని పాండిత్యం —తెలివితేటలు ఏదో ఒక ప్రత్యేకవిషయం మీద అతని దృష్టిని లగ్నం కానివ్వడం లేదు. ఒక విలక్షణమైన ఆత్మవిశ్వా సం, దాదాపు అహంకారం వంటిది అంచులవైపు నడిపిస్తూ .. తాను సాధించలేనిదేదీలేనట్టు అతనికి అనిపింపజేస్తోంది.

వివాహం అనంతర పరిణామాలు వెంటవెంటనే జరిగిపోతున్నాయి. తను ఊరేగే ఆశల పల్లకి అనుకోని కుదుపుతో ఆగిపోయినట్టు మొదటిసారి అతనికనిపించింది. దేనినైనా సాధించగలనన్న విశ్వాసం హఠాత్తుగా కుంగిపోయినట్టు, తన సంకల్పం లేకుండానే దానికేవో హద్దులు ఏర్పడినట్టు తోచింది. తను ముందు ముందు ఏదైనా కావచ్చు, కాకపోవచ్చు. తను కోరుకోనున్న భవిష్యత్తు కోసం తనింక కలలు కనలేడు. వెనకటికీ ఇప్పటికీ అతని ఆలోచనలో వచ్చిన మార్పు ఇదే. పెళ్ళికి ముందు కూడా ఆ కోరికలేవో కోరుకోలేదు. ఎప్పుడనుకుంటే అప్పుడు కోరుకునే స్వేచ్ఛ మాత్రం భద్రంగా ఉంచుకున్నాడు. ఆ అమూల్య స్వేచ్ఛను పెళ్లి ఇప్పుడు

దూరం చేసేసింది. ఇప్పుడది అంతముఖ్యమైన విషయంగానూ అనిపించడంలేదు. ఆ మాట కొస్తే ఏదీ ముఖ్యమనిపించడంలేదు. జీవితం ఏ మార్గంలోనైనా సాగిపోవచ్చు. ఆ మార్గం తనది, తను కోరుకున్నది కానప్పుడు —ఏ మార్గమైతేనేం!

అయితే ఈ ఆలోచనలన్నీ ఒక స్పష్టమైన రూపం తీసుకోడానికి కొంత సమయం పట్టింది. ఈ లోపల తన చుట్టూ ఉన్న వాతావరణంలో తనొకభాగంగా —క్రియాశీల భాగంగా —ఉండి పోయాడు. ప్రజాస్వామ్యభావన ఎంతోమంది యువకుల్ని ఆకర్షించినట్టే అతనినీ ఆకర్షిస్తోంది అయితే స్థానికప్రభుత్వం ప్రజాస్వామ్యాన్ని రాజద్రోహంగా పరిగణిస్తోందని కానీ, ఆ వైపు మొగ్గు చూపించే ఉపాధ్యాయులపై, విద్యార్థులపై గూఢచారి నివేదికలు తెప్పించుకుంటోందని కానీ అతనికి తెలియదు.

★ ★ ★

స్కూల్లో వార్షికబహుమతిప్రదానోత్సవం. స్కూలు వైస్‌ప్రిన్సిపాల్ ఆనంద్ సాధించిన బహుమతుల జాబితా చదవడం ప్రారంభించారు.

వార్షికపరీక్షల్లో ప్రథమశ్రేణి సాధించినందుకు సార్వత్రిక ప్రతిభా బహుమతి; ఆంగ్లభాషా పరిజ్ఞానానికి ప్రిన్సిపాల్ ప్రత్యేకబహుమతి; గణితంలో, సైన్స్‌లో ప్రతిభ కనబరిచినందుకు ఎక్జిక్యూటివ్ ఇంజనీర్ ప్రత్యేకబహుమతి; భాషాపాండిత్యంలో ప్రత్యేక బహుమతి.

ప్రిన్సిపాల్‌ముఖంలో సంతోషం తాండవిస్తోంది. బహుమతి ప్రదానోత్సవానికి విచ్చేసిన విద్యాశాఖ డైరెక్టర్ కూడా ఆ వివరాలు వింటూ ఎంతో ముగ్ధుడయ్యాడు.

తన విద్యార్థిరత్నాన్ని ప్రేక్షకులకు పరిచయంచేస్తూ ప్రిన్సిపాల్ అన్నారు. 'ఈ పాఠశాలలో అడుగుపెట్టినప్పటినుంచి దాదాపు అన్ని ప్రతిభాబహుమతులను చేజిక్కించుకున్న విద్యార్థిని మీకు పరిచయం చేస్తున్నాను. అతణ్ణి చూసి మేమెంతో గర్విస్తున్నాం. భవిష్యత్తులో ఇలాగే అనేక విజయాలు సాధించాలని కోరుకుంటున్నాం... మాస్టర్ ఆనంద్... వేదికమీదికి రావాలి.'

వేయికళ్ళు వేదికమీద వాలిపోయాయి. పొట్టిగా బక్కపలచగా ఉన్న ఆనంద్ వేగంగా అడుగులువేసుకుంటూ వేదికమీదికి వెళ్లి అటెన్షన్‌లో నిలబడ్డాడు. పలచని ఆ ముఖంలో విప్పారినట్టున్న పెద్దపెద్ద కళ్ళతో డైరెక్టర్‌నీ, ప్రిన్సిపాల్‌నీ, ప్రేక్షకుల్నీ మార్చి మార్చి చూస్తూ నిలబడ్డాడు.

డైరెక్టర్ ఎంతో ఆపేక్షగా ఆనంద్ వైపుచూస్తూ ఆదరపూర్వకంగా మందహాసం చిందించాడు. ఆయన ఎంతో భారీ మనిషి. పెద్ద పెద్ద అరచేతులు. ఆ చేతులతో సన్నని ఆనంద్ చేతిని అందుకుని 'సంతోషం. బహుమతుల్ని తీసుకెళ్ళడానికి జట్కాబండి తెచ్చుకున్నావా లేదా?... కంగ్రాచ్యులేషన్స్... ఈ ప్రతిభను ముందు ముందు కూడా చూపించాలి' అన్నాడు.

ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు. ఆనంద్ సిగ్గుపడిపోయాడు. అయినా లోపల ఎంతో సంతోషం. డైరెక్టర్ ప్రసంగం ప్రారంభించాడు. 'సోదర సోదరీమణులారా! మాస్టర్ ఆనంద్‌ను కలుసుకున్నందుకు చాలా ఆనందంగా ఉంది. అతడు మరో రామానుజం కావాలని కోరుకుంటున్నాను.

ఇతడూ, ఇతడిలాంటి ప్రతిభావంతులూ వారికి భగవంతుడు సంకల్పించిన తమ సామర్థ్యానికి తగిన ఉన్నతోన్నతస్థాయిని అందుకోడానికి దయామయులైన ప్రభువుల ఉదార ప్రభుత్వం పూర్తి సహాయసహకారాలు అందిస్తుంది. భగవత్సంకల్పం దయగల మన ప్రభువుల చేతులమీదుగా నిజమౌతుంది. పాలకులందరిలో వారు ఎంతో వివేకమూర్తులు. మాస్టర్ ఆనంద్ అఫ్రోజాబాద్ రాష్ట్రంమొత్తంలోనే ప్రథమశ్రేణి మేధావిగా ఎదిగి పేరు తెచ్చుకోవాలనీ, ఈ చల్లని ఏలుబడిలో అత్యంత రాజభక్తిపరాయణ పౌరుడు అనిపించుకోవాలనీ కోరుతూ ఆ సర్వేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను...'

ఒక ప్రసంగంలో ప్రభువూ, రాజభక్తి, పౌరులూ మొదలైన మాటలు వినడం ఆనంద్‌కు అదే మొదటిసారి. అటువంటి గంభీరమైన మాటలు ఈ మధ్యనే తరచు వినబడుతూ పట్టణ జనాన్ని ఉక్కిరి బిక్కిరి చేసేస్తున్నాయి. వాళ్ళకింతవరకూ పాలకులు, పాలితులు అన్న రెండు మాటలే తెలుసు. సాంప్రదాయికంగా వస్తున్న అవగాహన అంత మేరకే. కొంతమంది పాలకవర్గంలో పుడతారు, కొంతమంది పాలితులుగా ఉండిపోతారు. అంతే. తాము కోరుకున్నట్టు పుట్టడం ఎవరితరం! ఇక రాజభక్తి... దాని అర్థం ఏమైనా, అది చర్చించవలసిందీ కాదు, ఒకరు నేర్పవలసిందీ కాదు, సహజ సిద్ధంగా ఉండితీరవలసింది. అటువంటి పరిస్థితిలో రాజధానినుంచి వచ్చిన ఈ ఉన్నతాధికారి ప్రత్యేకించి ఈ విషయాల గురించి ఎందు కు నొక్కి నొక్కి వక్కాణిస్తున్నాడు? కొన్నేళ్ళుగా తాను గమనిస్తున్న మార్పులో ఇది కూడా భాగం కాదు కదా అనుకున్నాడు ఆనంద్.

మరునాడు ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్ళాడు. అతని ముఖంలో గాంభీర్యం ఉట్టిపడుతోంది.

'రా, ఆనంద్ రా' అని పిలిచి 'ఏమిటి నీ సమస్య?' అడిగారు ప్రిన్సిపాల్.

'ఏమీలేదు సార్... ఏమీ లేదు' అని ఆగిఆగి జవాబు చెబుతూ తప్పక ఏదో ఉందనే స్ఫురింపజేశాడు ఆనంద్.

ప్రిన్సిపాల్ ఆనంద్‌ను తన కొడుకులా చూసుకుంటాడు. నిజానికి అంతకంటె ఎక్కువగానే కూడా. ఆయన కొడుకు మద్యపానానికి, స్వలింగసంపర్కానికి బానిసయ్యాడు. ఆయనది అసలు లక్నో ప్రాంతం. ఒక ప్రసిద్ధముస్లింజాతీయనాయకుడికి దగ్గరి బంధువు. ఇప్పుడీ సంస్థానానికి వలస వచ్చేశాడు కనుక ఆ బంధుత్వం గురించి ఎక్కడా ఏమీ అనకూడదు. ఉద్యోగానికి సంబంధించిన తన బాగోగులు అలా శాసిస్తున్నాయి. ఆయన ఎంతో మంచివాడు, న్యాయాన్యాయ విచక్షణ ఉన్నవాడు. అటువంటి మనిషికికూడా ఈ మధ్య రెండు మతాలవారితో నిష్పాక్షికంగా వ్యవహరించడం కష్టమైపోతోంది.

'నాకు తెలుసు... ఏదో ఉంది. చెప్పు. చేతనైతే పరిష్కరిద్దాం'

ప్రిన్సిపాల్‌నోట ఆ అనునయవాక్యాలు వెలువడగానే ఆనంద్ ధైర్యంతెచ్చుకున్నాడు. 'పెద్ద సమస్య ఏమీ కాదు సార్... విద్యాశాఖ డైరెక్టర్‌గారు నిన్నటి సమావేశంలో ప్రభుభక్తిని గురించి అంతగా ఎందుకు మాట్లాడారో నాకు అర్థం కాలేదు... ఆయన ఎవరి రాజభక్తినైనా అనుమానిస్తున్నారా? అసలు రాజభక్తి అంటే ఏమిటి సార్?'

ప్రిన్సిపాల్ చాలాసేపు ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోయాడు. యవ్వనంలో అడుగుపెట్టే ఎంతోమంది బాలమేధావుల విషయంలో జరిగేదే ఆనంద్ విషయంలోనూ జరుగుతోందనుకున్నాడు. ఆ మస్తిష్కాన్ని ఏవేవో ప్రశ్నలు తొలిచేస్తూ ఉంటాయి. ఆ మేధాపరిశ్రమకు ఇకమీదట అలుపు విరామం ఉండవు. పాపం అబ్బాయిని అది నిద్రపోనివ్వదు. ఎత్తితే ఆకాశానికెత్తేస్తుంది, లేకపోతే అంతులేని కష్టాల్లోకి తోసేస్తుంది. రెండోది జరగడానికే ఎక్కువ అవకాశం, ఈ విషయంలో మధ్యేమార్గం లేదు —అనుకున్నాడు ప్రిన్సిపాల్.

'నా ప్రశ్న అర్థం లేనిదా సార్?' అడిగాడు ఆనంద్.

'కాదు. అది అర్థంలేని ప్రశ్నకాదు. కానీ ప్రమాదకరమైంది... అవును... అది చాలా ప్రమాదకరమైన మాట' మెల్లగా అన్నారు ప్రిన్సిపాల్.

'అలాగా. సారీ సార్. ఆ ప్రశ్న అడగలేదనుకోండి, జవాబూ చెప్పలేదనుకోండి'

'నాకూ అలాగే అనిపిస్తోంది. రాజభక్తి అంటే ప్రశ్నకు అతీతమైన ఒక ధోరణి అనే నేననుకుంటున్నాను'

'అంటే ఆలోచనకు అవకాశంలేని ఒక గుడ్డి ధోరణి అనుకోవాలంటారా?'

'ప్రశ్నకు అవకాశంలేని ప్రతిదీ ఆలోచనకు అతీతం కావాలని లేదు; ఆలోచించగలిగికూడా ప్రశ్నించలేని పరిస్థితికంటె ఆలోచించకుండా ప్రశ్నించకుండా ఉండగలగడమే బాగున్నట్టు ముందుముందు అనిపించినా అనిపించవచ్చు... ఏమంటావ్?'

'అవును సార్ కానీ మనం వద్దనుకుంటే ఆలోచన ఆగిపోతుందంటారా?'

'నువ్వన్నమాటలో కూడా నిజం ఉందబ్బాయ్. ఆలోచనాపరుడికి ఆలోచనలు సహజంగానే అప్రయత్నంగానే వస్తూ ఉంటాయి.... నివారించడం అతని వల్ల కాదు'

'అదే సూత్రాన్ని అనుసరించి ప్రశ్నించేజీవులు కూడా, అంటే ప్రశ్నించకుండా ఉండలేని జీవులు కూడా ఉండచ్చు కదా సార్'

'అవునవును, ఉంటారు. వాళ్ళల్లో నువ్వూ ఒకడిలా కనిపిస్తున్నావ్...'

'అప్పుడు నేను కూడా రాజద్రోహినౌతానా?'

ప్రిన్సిపాల్ ఆ ప్రశ్నకు విస్తుపోయారు. ఆనంద్ తనను నెమ్మదిగా... ఎంతో తార్కికంగా... జవాబుచెప్పలేని పరిస్థితివైపు నడిపించేశాడు. హఠాత్తుగా ఆయనకు కోపం ముంచుకొచ్చింది. మరో మార్గం కూడా లేదు. 'నువ్వూ, నీ తర్కం!' అంటూ కేకలువేశారు. 'ఇక నీ రంధ్రాన్వేషణ ఆపేసి క్లాసుకు వెళ్ళు... నీ పిచ్చిపిచ్చిప్రశ్నలకు జవాబు చెప్పే తీరిక నాకు లేదు' అనేశారు.

మాడిపోయిన ప్రిన్సిపాల్‌ముఖంలోకి ఓసారిచూసి పట్టలేని ఆశ్చర్యంతో తలపంకిస్తూ అక్కడినుంచి నిష్క్రమించాడు ఆనంద్.

రాజభక్తినిగురించి తాను వేసిన ప్రశ్నకు జవాబురానేలేదని కూడా గమనించాడు.

# 7

పెళ్ళి తర్వాత ఆనంద్‌ను ఒక విచిత్రమైన, బలమైన, అస్పష్టమైన, అప్రకటితమైన నిషేధం ఏదో నియంత్రిస్తున్నట్టనిపిస్తోంది. స్వయంనిర్ణయమనే దారిలో స్వేచ్ఛగా ముందుకు సాగిపోతున్న తన మనోరథాన్ని హఠాత్తుగా వెనకకు మళ్ళించి కుటుంబసంప్రదాయమనే పట్టాలమీదికి ఎక్కించినట్టు, చేతుల్లో ఉన్న స్టీరింగ్ చక్రం నిరుపయోగమైపోయినట్టు అనిపిస్తోంది. అయితే ఈ మార్పుతో రాజీ పడిన వెంటనే ఆనంద్‌కు ఏవో సంకెళ్ళు తెగిపోయినట్టు, ఏదో కొత్త తెగువ పుంజుకున్నట్టు, ఆలోచనలోనూ మాటలోనూ మరింత స్పష్టత వచ్చినట్టనిపించింది. బలమైన ఏదో అదృశ్యశక్తి తనను కర్మణ్యతవైపు నడిపిస్తున్న భావం కలిగింది —ఆ కర్మణ్యత ఎటువంటిదో అతనికి తెలియదు. తెలుసుకోవాలనే లక్ష్యం కూడా లేదు.

ఎడ్లబండి నడపడంపై చిన్నప్పటి మోజు అతనిలో ఇంకా పెరిగింది కానీ తగ్గలేదు. ఆ విద్యలోని మెలకువలన్నీ అతనికి తెలుసు. ఊళ్ళో రెండురకాల ఎడ్లుంటాయి. దున్నడానికీ, బరువులు మోయడానికీ పనికొచ్చేవి మొదటిరకం. నేల తడిగా ఉన్నా పొడిగా ఉన్నా, వేకువ జామున ప్రారంభించి ఏడెనిమిది గంటల పాటు ఏకబిగిన అవి పొలం దున్నుతూనే ఉంటాయి. ఒకవేళ రాత్రి వర్షం వచ్చి పొలంలో నీరు నిలిచిపోతే, చద్దికూడు తర్వాత, అంటే తొమ్మిది గంటలకవి పని ప్రారంభించేవి. బరువుబండిలాగే ఎడ్ల తెలివి తేటలు, గ్రహింపుశక్తి ఆనంద్‌కు ఆశ్చర్యం గొలుపుతూ ఉండేవి. కొంచెమైనా తొట్రుపాటు లేకుండా, అనేక మలుపులు తిరిగిన ఇరుకు సందుల్లోంచి కూడా అవి నేరుగా ఎంతో జాగ్రత్తగా రైతు ఇంటిముంగిట్లోకి బండి లాక్కెడతాయి. ఎదురుగా మరో బండి ఏదైనా వస్తున్నప్పుడు బండిని గోడపక్కకు లాగి, అవతలి బండికి దారి ఇస్తూ తమ శరీరాల్ని పక్కకి వంచుతాయి. వాటికి ఈ మెలకువలన్నీ ఒకరు నేర్పవలసిన అవసరమే ఉండదు. బండివాడు బీడీఆకుతోనో మోదుగాకుతోనో చుట్టిన నాటుపొగాకుచుట్ట వెలిగించి గుప్పుగుప్పున పొగమబ్బులు లేపుతూ ఎవరితోనో దేనిగురించో తగవుపెట్టుకుంటూ తిట్లు లంకించుకుంటూ బండివెనక ఎక్కడో దూరంగా ఉంటాడు.

సత్వరప్రయాణానికి ఉపయోగించే సవారీఎడ్లు రెండోరకం. వాటి వేగం మొదటిగంటలో ఎనిమిది మైళ్ళవరకూ ఉంటుంది —అని వాటి యజమానులు చెబుతూ ఉంటారు. వాటికి ప్రత్యేక శిక్షణ ఇచ్చి జాగ్రత్తగా చూసుకుంటారు. గ్రామాల్లో అటువంటి ఎడ్లు కలిగిఉండడం హోదాకు

చిహ్నం కూడా. ఫలానా రైతు, లేదా ఫలానా భూస్వామిగారి సవారీఎడ్ల లాఘవం ఇటువంటిదట వంటిదని కథలు కథలుగా చెప్పుకుంటూ ఉంటారు. ఒక ఎడ్లజంట రైలుతో పోటీపడి మైలుదూరం పరుగెత్తిందట. మరో ఎడ్లజంట రోడ్డురవాణాసంస్థ బస్సు తనను దాటిపోకుండా అరగంటసేపు ముప్పుతిప్పలు పెట్టిందట. మూడో జంట, యజమానికి రైలు తప్పిపోతే ఒక్కరాత్రిలో తొంభై మైళ్ళదూరం పరుగెత్తి జిల్లాముఖ్య కేంద్రంనుంచి రాష్ట్రరాజధానికి చేర్చిందట! ఇలా ముచ్చట్లమీద ముచ్చట్లు.

ఆనంద్‌కు తన సవారీజంట రాముడు —భీముడు అంటే ఎంతో ఇష్టం. సౌష్ఠవంలో, ఎత్తులో, చివరకు అర్ధచంద్రాకారంలో వంపుతిరిగిన కొమ్ములతోసహా అవి అచ్చంగా కవలపిల్లల్లా ఉండేవి. అంత బాగా కుదిరిన జంటలు చాలా అరుదు. అటువంటి జంట ఎక్కువకాలం జీవించదనే మూఢనమ్మకం జనంలో ఉండేది. ఏదో ఒక ఎద్దుకి మరణమో, అంగవైకల్యమో సంభవించి జంట విడిపోతుందనుకునేవారు. ఆనంద్ ఈ మాటల్ని విశ్వసించేవాడు కాదు. వేగంగా పరుగెత్తే ఎడ్ల రకాలు, వాటి స్వరూపస్వభావాలు, వాటి పోషణ, శిక్షణ, వాటికి వచ్చే వ్యాధులగురించి నాన్నదగ్గర కొన్ని విషయాలు తెలుసుకున్నాడు ఆనంద్. ఏదైనా ఎద్దును అరమైలుదూరం పరుగెత్తించి అది త్వరిత రవాణాపనులకు ఉపయోగిస్తుందో లేదో ఇట్టే తేల్చి చెప్పగలిగేవాడు. పరుగెత్తే టప్పుడు ఎద్దు తన కాలిగిట్టల్ని ఈడ్చినట్టు కనిపించినా, నేలమీద గిట్టను రాపిడిపెట్టినట్టు కనిపించినా, గిట్టను అవతలి కాలికి తాకించినట్టు కనిపించినా ఆ ఎద్దు రవాణావిధులకు పనికిరాదు. ఒకవేళ అందుకు ఉపయోగిస్తే పది ఇరవైమైళ్ళు పరుగెత్తిన తర్వాత గిట్ట నేలతో రాచుకుపోయి లోపలినుంచి రక్తం స్రవిస్తుంది. ఆ ఎద్దు ఇంక మరి దేనికీ పనికిరాదు. పరుగుతీరునుబట్టికూడా ఎద్దు పనికొస్తుందో పనికిరాదో తెలుసుకోవచ్చు. శరీరం అంతటినీ నేలమీంచి పైకిలేపి దూకినట్టు పరుగెత్తే ఎద్దు కూడా రవాణాపనులకు ఉపయోగించదు. అది త్వరలోనే అలిసిపోతుంది. పరుగులో నిలకడ, సౌలభ్యం, శ్వాస నిలుపుకునే లక్షణం, లయ, చురుకుతనం ఉండాలి... ఎడ్లగురించిన తన అంచనాలతో నాన్న పూర్తిగా ఏకీభవించిన ఉదంతాల్ని ఆనంద్ నెమరువేసుకుంటూ మురిసిపోయాడు.

ఇలా ఆలోచనల్లో తేలిపోతూ ఆ రోజు మధ్యాహ్నం ఆనంద్ బండితోలుకుంటూ తన గ్రామంవైపు వెడుతున్నాడు. ఎడ్లను లయబద్ధంగా పరుగెత్తించడానికా అన్నట్టు కూనిరాగాలు తీస్తున్నాడు. నాన్నకు తెలిసినట్టే, రాముణ్ణీ భీముణ్ణీ తేలిగ్గా పరుగెత్తించే ప్రత్యేకమైన కిటుకులన్నీ అతనికీ తెలుసు. మిగిలినవాళ్ళ పద్ధతి వేరు. పొడవడం కొట్టడం చేస్తూ ఉంటారు. ఎడ్లు అందుకు తగినట్టే అయిష్టంగా స్పందిస్తూ ఉంటాయి.

ఆనంద్ ఆలాపన, ఆలోచన, ఎడ్లను అదిలింపు —ఏకకాలంలో జరిగిపోతున్నాయి. భీముణ్ణి ఒకసారి అప్యాయంగా తాకి, ఏవో గుర్తుచేసుకుంటూ లోలోపల నవ్వుకున్నాడు. నిన్నటివరకు ఊళ్ళో ఇంత అచ్చొసిన ఆంబోతు ఇంకోటి లేదు. కనిపించిన ప్రతి ఆవునూ పసిచూస్తూ వెంటపడుతూ ఉండేది. ఆవులుకూడా భీముడంటే పడిచచ్చేవి. తోకలుపైకెత్తి దగ్గరకెళ్ళేవి. ఆరుమాసాలక్రితం బుడ్డ కొట్టేసిన తర్వాత హఠాత్తుగా కుదురువచ్చేసింది. ఒళ్ళొంచి పనిచేస్తోంది. బాధ్యతగా హుందాగా తెలివిగా నడుచుకుంటోంది. ఇప్పుడు దీనితో పోల్చదగిన ఎద్దు దరిదాపుల్లో ఎక్కడా లేదు.

భీముడి గురించిన ఆలోచనలు క్రమంగా తనవైపు మళ్ళాయి. పదహారేళ్ళ పడుచువాడుగా, స్త్రీ, పురుషులమధ్య ఉండే ఆకర్షణగురించి అప్పటికే తానెంతో తెలుసుకున్నాడు. చాటుమాటుగానే అయినా, లైంగికవిషయాలు రాసిన ఎన్నో పుస్తకాలు చదివి తన సహజసిద్ధమైనపాండిత్యంతో అర్థంచేసుకున్నాడు. ఆ వ్యవహారాల్లో అనుభవమున్న తనకంటె పెద్దవాళ్ళకుసైతం తెలియని విషయాలతనికి తెలుసు. అయితే అదంతా పుస్తకజ్ఞానమే — ఒకరకమైన అప్రయుక్త విజ్ఞానమన్నమాట... తన గురించిన ఇటువంటి ఊహలు రాగానే తుడిచివేయడానికి ఆనంద్ గట్టిగా ప్రయత్నించాడు. మరో విషయంమీదికి ఆలోచన మళ్ళించబోయాడు. కొంతకాలంగా– కచ్చితంగా చెప్పాలంటే పెళ్ళయినప్పటినుంచి —ఆలోచనల మళ్ళింపును పట్టుదలతో సాధనచేస్తూనే ఉన్నాడు.

అయితే ఆ తలపులు అంత తేలిగ్గా విడిచిపెట్టేలా లేవు. ఓ రోజు సాయంత్రం చదరంగం ఆడటానికి ఒక స్నేహితుడింటికి వెడుతుంటే సందుమలుపులో గంగి అతణ్ణి అటకాయించింది. గంగి అక్కడే నివసించే ఒక కసాయివాడి కూతురు. ఏడోతరగతిలోనే మూడేళ్ళపాటు ఉండిపోయి స్కూలు మానేసింది. చదువుమీద ఏమాత్రం ఆసక్తిలేదు. ఈ మధ్య మగవాసన తగిలితె చాలు ఆమెలో మోహం పురివిప్పి ఆడుతోంది. పద్దెనిమిదేళ్ళ పరువం. తీర్చిదిద్దినట్టున్న మేని ఎత్తుపల్లాలతో ఒంపుసొంపులతో పూర్తిగా వికసించి, కామోద్రేకాన్ని అమాంతంగా రెచ్చగొట్టేలా ఉన్న అంగసౌష్ఠవం. కొంచెం కురచముఖం. ముఖంమీద మొటిమలు. కామవాంఛ తీరనప్పుడు అలా మొటిమలు పుట్టుకొస్తాయని చాలామంది అనుకుంటారు. చెక్కినట్టున్న ఆమె శరీరం ప్రతి కదలికలో యవ్వనవాంఛ జాలువారుతోంది.

నేరుగా అసలు విషయాని కొచ్చేస్తూ ఆనంద్ చేయి పట్టుకుని అంది. 'మా ఇంటికి రా, ఇప్పుడక్కడెవరూ లేరు...' మరో చేతిని అతని చుబుకంమీద ఆనించింది.

'ఎందుకు?' నివ్వెరపోయిన ఆనంద్ అడిగాడు.

'ఎందుకా? ఆ మాత్రం తెలియదా?' ఆమె మాటల్లో అదొక ఎగతాళి. 'నిన్ను నా తొడల మధ్య నలిపెయ్యడానికి.' హఠాత్తుగా మీదపడిన ఈ వలపుదాడికి ఆనంద్ పూర్తిగా నిర్విణ్ణుడైపోయాడు. తనచేతిపై గంగి పట్టు ఇంకా బిగుసుకుంటోంది. తన చుబుకంపై ఆమె చేతి ఒత్తిడి క్షణ క్షణానికీ పెరుగుతోంది. మోహజ్వాలతో ఎరుపెక్కిన కళ్ళతో ఆమె ఆనంద్ పెదవుల్ని చుంబించడానికి అతని ముఖానికి మరింత దగ్గరగా వచ్చింది. కోపం ముంచుకొచ్చిన ఆనంద్, నడివీధిలో బరితెగించి మీదపడిన ఆ మనిషినుంచి తప్పించుకునే మార్గమేమిటా అని తన తెలివితేటలన్నీ రంగరించి ఆలోచిస్తూనే ఒక్క ఊపుతో తనచేతిని విడిపించుకుని 'నీకేమైనా పిచ్చిపట్టిందా? ఏదైనా చెట్టుమొదలు వెతుక్కో' అన్నాడు పరిహాసంగా. ఏదో జరగరానిది జరిగేలోపల అక్కడినుంచి వేగంగా అడుగులేస్తూ వెళ్ళిపోయాడు. వెనకనుంచి గంగి శాపనార్థాలు అతనికి వినిపిస్తూనే ఉన్నాయి.

గంగిని తప్పుపట్టడమూ అంత న్యాయంకాదేమో మరి. ఈ బాలమేధావినిగురించి ఆమె కూడా ఎంతో విని ఉంటుంది. ఆ సందులోంచి వెడుతున్నప్పుడు తనను చాలాసార్లు చూసింది. ఆమెకు తెలిసిన పద్ధతిలో తనంటే పడిచచ్చిపోతోంది. మామూలు మగవాళ్ళని చాలామందినే చూసింది కనుక ఆమెకిప్పుడు ప్రత్యేకంగా, విలక్షణంగా కనిపించే మగాడు కావాలి. నాజూగ్గా,

అమాయకంగా కనిపించే ఈ మేధావి తనకంటె మూడేళ్ళు చిన్ననీ, ఇంతవరకూ అతనికా అనుభవం లేదనీ తెలిసికూడా వెర్రిమోహం పెంచుకుంది. అతణ్ణి తన సొంతం చేసుకోవాలనీ, అతడికి తానంకితంకావాలనీ, ప్రేమతో లాలిస్తూ సంరక్షిస్తూ తల్లిగా, ఉంపుడుగత్తెగా ఏకకాలంలో రెండు అసాధ్యపాత్రల్ని పోషించాలనీ అనుకుంటోందేమో.

తన గ్రామంవైపు బండిని పరుగెత్తిస్తూ ఆనంద్ ఈ రసాభాసఘట్టంగురించే ఆలోచిస్తున్నాడు. ఈలోగా బండి దారిపక్క ఉన్న శివారుగ్రామంలో ప్రవేశించింది. ఎడ్లు ఇరుకు సందును దాటడంకోసం పరుగు తగ్గించి వేగంగా నడవసాగాయి. బండి కొన్నిఅడుగులు ముందుకి వెడితే చాలు సందు చివరికి చేరుకుంటుంది. హఠాత్తుగా ఆనంద్‌కు ఏవో కేకలు వినిపించాయి.

'నీకు బుద్ధుందా లేదా? నీవు చేస్తున్నదేమిటో నీకు తెలుస్తోందా? నీ దిక్కుమాలిన బండిని ఆపు. వెనక్కు వెళ్ళు!... చెప్పేది వినిపిస్తోందా?... ఆగుతావా లేదా?'

ఆనంద్ ఉలికిపాటుతో తన ఆలోచనలనుంచి బయటపడి ముందుకు చూశాడు. ఎదురుగా కొన్నిఅడుగులదూరంలో మరో బండి. అది అప్పుడే సందులోకి అడుగుపెట్టింది. మెలితిరిగిన మీసాలతో, దానికి తులతూగే గెడ్డంతో ఉన్న ఓ భారీమనిషి ఆ బండి తోలుతున్నాడు. అతని నెత్తిమీద పొడవైన కుచ్చుటోపీ. అతడు తలను అటూ ఇటూ ఊపినప్పుడు టోపీమీద ఉన్న నల్లని సిల్కుకుచ్చులుకూడా ఊగుతున్నాయి.

'బండి ఆపు. వెనక్కెళ్ళు' గట్టిగా కేకలువేస్తున్నాడు.

'ఎలా వెళ్ళనండీ! సందుమొగకి కొన్ని అడుగులదూరంలో ఉన్నాను. బండి వెనక్కు తిప్పడం కష్టం..' అన్నాడు ఆనంద్.

'అయితే ఎడ్లను విప్పేసి వెనక్కెళ్ళిపో.'

'అందుకు చాలాసమయం పడుతుందండీ, మీరే కొన్నిఅడుగులు వెనక్కెళ్ళి నాకు దారివ్వండి. అదే తేలిక...'

ఇంతలో ఆ శివారుగ్రామం పటేలు హఠాత్తుగా అక్కడ ఊడిపడ్డాడు. ఆనంద్‌ను గుర్తుపట్టి, 'ఆనంద్, నువ్వా? ఆ బండిలో ఉన్న మనిషి గిర్దావర్‌సాహెబ్ (రెవెన్యూ ఇన్‌స్పెక్టర్) అని నీకు తెలియదా? ఆయన బండి వెనకడుగు ఎలా వేస్తుంది? ఆయన సర్కారీమనిషి...'

ఈ అసందర్భమైన అధికారప్రదర్శన చూసి ఆనంద్‌లో పట్టుదల పెరిగింది. 'ఇందులో ప్రభుత్వం పరువుప్రతిష్ఠలకు సంబంధించినదేమీలేదు. ఇది కేవలం వెసులుబాటుకు సంబంధించిన విషయం...' అన్నాడు.

ఇందులో తనదే పొరపాటని ఇన్‌స్పెక్టర్ తెలుసుకున్నాడు. అధికారదర్పంతో డబాయించడం వల్ల ప్రయోజనంలేదని గ్రహించాడు. తోకముడుస్తూనే మాటలతో విషంకక్కాడు. 'మీ కుర్రకారు గురించి నాకు బాగా తెలుసు. ఆలాహజరత్‌కీ, ఆయన ప్రభుత్వానికీ వ్యతిరేకంగా మీరంతా కుట్రచేస్తున్నారనికూడా నాకు తెలుసు. హిందువులంతా గాంధీకాంగ్రెస్‌లో చేరిపోయి రాజును కూలదోయాలనుకుంటున్నారు ప్రభువుల ఆధిపత్యాన్ని అడుగడుగునా ధిక్కరిస్తున్నారు. ఇది రాజద్రోహం' అంటూ కేకలువేశాడు.

'చాలించండి, గిర్దావర్‌సాహెబ్‌గారూ... మీ తిట్లు చాలించండి. కాస్త నాలుకను అదుపుచేసుకోండి...' అన్నాడు ఆనంద్.

'ఆలాహజరత్' గారి ప్రతినిధి ఉత్తుత్తి బెదిరింపులు మానలేదు. 'చూపిస్తా. ఈ హిందూ ద్రోహులందరికీ నా తడాఖాచూపిస్తా' అని అరుస్తూనే హిందూపటేల్‌గారి ఇంట్లోకి నడిచాడు. అక్కడ ఆయనకు విందుభోజనం సిద్ధంగా ఉంది.

ఆనంద్ ఇంటికి చేరుకున్నాడు. తనకీ రెవెన్యూఇన్‌స్పెక్టర్‌కీమధ్య జరిగిన వాగ్యుద్ధం గురించి తను రావడానికిముందే ఇంట్లో తెలిసిపోయింది —పైగా రకరకాల వక్రీకరణలతో. నాన్న మండిపడుతున్నారు.

'ఇలా ధిక్కరిస్తూంటే ప్రభుత్వంలో నౌకరీ ఎలా దొరుకుతుందనుకుంటున్నావు? గిర్దావరంటే చిన్నఉద్యోగేకావచ్చు. అయినా ప్రభుత్వం ప్రభుత్వమే. ఆయనను అలా సవాలుచేసి ఉండ వలసింది కాదు. మొత్తం కుటుంబాన్ని కష్టాల్లోకి తోస్తున్నావు.'

'నే నాయనపట్ల దురుసుగా ఏమీ ప్రవర్తించలేదు నాన్నా. తప్పంతా ఆయనదే...' అన్నాడు ఆనంద్ కోపంగా.

నాన్న ఒకింత చల్లబడ్డారు. 'అది నాకు తెలుసు నాయనా! నీ మాటలు నేను నమ్ముతాను. అయినా అంతటి ప్రభుత్వంముందు మనమెంత? ఎవరయినా ఆ గిర్దావర్ మాటలు నమ్ముతారు కానీ నీమాటలు నామాటలు ఎందుకు నమ్ముతారు? మీకోసం మేం పెద్దవాళ్ళమెలాగో పరువూ ప్రాణాలూ కాపాడుకుంటూ వస్తున్నాం. మా శ్రమనంతా నువ్వు మట్టిపాలు చేసేస్తున్నావు. ఎలా బతుకుతావో నాకేమీ అర్థంకావడంలేదు...'

అప్పుడే ఆ క్షణంలోనే ఈ సంస్థాన ప్రభుత్వంలో తాను ఉద్యోగం చేయకూడదని ఆనంద్ నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయం జరగ్గానే ఎంతో తేలికపడ్డాడు. ఆ విషయం తనలోనే దాచుకున్నాడు.

నాన్న నచ్చజెప్పే ధోరణిలో అన్నా రు. 'చూడు నాయనా మన పవిత్రగ్రంథాలు రాజును భగవంతుని అవతారంగా వర్ణించాయి. అది నిజంకావచ్చు, కాకపోవచ్చు. కానీ ఎవరూ కాదనలేని నిజం ఒకటుంది. రాజుగారు ఎప్పుడూ తప్పుచేయరు. ఆయనతో విభేదిస్తే నీదే తప్పని అందరూ వేలెత్తిచూపిస్తారు. తనని అనుసరించనివాళ్ళంతా తనకు వ్యతిరేకులేనన్న తర్కాన్ని రాజులు పెంచి పోషించుకుంటారు. ఈ వాస్తవాన్ని మార్చడం —అందులోనూ నీబోటి అనామకులకు —సాధ్యమని నే ననుకోను. రేపే నువ్వు పట్నానికి వెళ్ళిపోయి చదువు కొనసాగించడం మంచిది. ప్రభుత్వంతో ఘర్షణ చాలించు.'

దానిమేరకు అదొక మంచి సలహానే కానీ ఆనంద్ విషయంలో ఇంక దాని ఉపయోగమేమీ లేదు. అతడు ప్రభుత్వోద్యోగి కావాలనుకోవడంలేదు. మరి ఏంచేద్దామని? ఏంచేయాలో లీలగాకూడా అతనికి స్ఫురించలేదు. అప్పటికతనుచేసింది అర్ధనిర్ణయంమాత్రమే.

మిగిలిన అర్ధనిర్ణయం తీసుకునే రోజుకూడా ఎంతోదూరంలో లేదు. ఇంటికొచ్చిన ఇరవై నాలుగు గంటల్లోనే అవమానంపాలై తిరిగివెళ్ళవలసివస్తోంది. ఆనంద్ చాలా అసంతృప్తి పడ్డాడు. అమ్మ ఒక నేరస్థుణ్ణి చూసినట్టు తనవైపు ప్రశ్నార్థకంగా చూసింది. అయితే, తానామెను విడిచి

వెళ్ళే ప్రతీసారీ ఆమెముఖంలో కనిపించే మూగవేదన ఇప్పుడుకూడా అతనికి కనిపించింది. ఇతరుల చూపులు అర్థం మాత్రం 'నీకు మంచిశాస్తి జరిగిందిలే!' అన్నట్టుంది.

తిరిగి వెళుతున్న ఆనంద్ మనసులో రకరకాల ఆలోచనలు కిక్కిరిసిపోయాయి. తాను విద్యుత్తంత్రిమీద కాలుపెట్టాడు. కనుక విద్యుద్ఘాతాన్ని తప్పించుకోలేడు. ప్రభుత్వమంటే ఆషామాషీకాదని చెట్లు పొదలు సెలయేళ్ళు ఎలుగెత్తి ఘోషిస్తున్న ట్టనిపించింది. ఈ ప్రపంచంమొత్తం అపరాధిగా తనను వేలెత్తిచూపిస్తున్నట్టు ఊహించుకుంటున్నాడు. ఒకవైపు ధైర్యం సడలిపోతున్నా నిబ్బరం తెచ్చుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఒక జాగీర్ గ్రామంమీదుగా అతని బండి సాగిపోతోంది. బాటకు అటూ ఇటూ వరిచేలు. ఏభైమంది ఆడవాళ్ళు నాట్లువేస్తున్నారు. ఒక జానపదప్రణయగీతాన్ని గొంతెత్తి పాడుకుంటున్నారు. ఆ జాగీరుగ్రామం ఆనంద్‌కు బాగా తెలి సిందే. తన గ్రామంలోనూ మరెన్నో గ్రామాల్లోనూ లేని సౌకర్యాలు ఆ గ్రామంలో ఉన్నాయి. పొడవైన విశాలమైన వీధులు, ఒక క్రమపద్ధతిలో నిర్మించిన ఇళ్ళు, గ్రామస్థులలో చక్కని క్రమశిక్షణ, జా గీర్దార్ ఆదేశాలను తు.చ. తప్పకుండా పాటించే పూర్తి విధేయత...! శాంతి, సామరస్యం అక్కడ వెల్లివిరుస్తున్నట్టుగా ఉంటుంది. అయితే దానిని శ్మశానశాంతిగా వర్ణించేవారూ ఉన్నారు. ఎటువంటి వివాదమైనాసరే ఆ గ్రామం సరిహద్దులుదాటి బయటకువెళ్ళటం ఎవరూ ఎరగరు. న్యాయస్థానానికిగానీ ప్రభుత్వకార్యాలయానికిగానీ వెళ్ళవలసిన అవసరమే ఉండదు జాగీర్ మేనేజరే అన్ని అధికారాలూ చలాయిస్తూ ఉంటాడు —సివిల్, క్రిమినల్, రెవెన్యూ వ్యవహారాలతోసహా. ఆయన చెప్పిందే న్యాయం, ఆయన చేసిందే చట్టం.

ఆనంద్ బండి అక్కడకు చేరుకునేసరికి పాట హఠాత్తుగా ఆగిపోయింది. జాగీర్ మేనేజర్ ఒక ఆడమనిషి జుట్టుపట్టుకుని లాగుతూ నోటికొచ్చిన బూతులుతిడుతూ ఆమె రెండు చెంపలూ అదేపనిగా వాయిస్తున్నాడు.

ఆమె బాధతో కేకలు పెడుతూ ఎక్కిళ్ళు పెడుతూ ఏడుస్తోంది. మిగిలిన ఆడవాళ్ళు పాలిపోయిన ముఖాలతో విగ్రహాల్లా నిలబడిపోయి చూస్తున్నారు. మేనేజర్ ఒక్క కేకవేసేసరికి వాళ్ళు వంగి పనిచేయడం ప్రారంభించారు. మేనేజర్ ఆమెను ఇంకా తిడుతూ కొడుతూనే ఉన్నాడు.

వివాదాల్లో తలదూర్చవద్దని నాన్న ఇచ్చిన సలహా గుర్తుచేసుకుని ఆనంద్ ముందుకు వెళ్ళిపోదామనుకున్నాడు. కానీ ఏదో ప్రేరణ అతణ్ణి నిరోధించింది. బండిమీదనుంచి కిందికి దూకి ఆ అమానుషాన్ని ఆపమని మేనేజరుపై అరిచాడు. మేనేజర్ దిగ్భ్రాంతిచెంది ఆమెను హింసించటం విరమించాడు. క్షణకాలంపాటు తనకంటె ఉన్నతమైన ఒకానొకశక్తికి – ఆనంద్ నైతికశక్తికి —అతడు తలవంచాడు. అదికూడా క్షణకాలమే.

దెబ్బలుతిన్న ఆ ఆడమనిషి రెండునెలల పసిపాపను ఇంట్లో విడిచిపెట్టివచ్చింది. పాల కోసం ఏడుస్తూ ఉంటాడనీ ఇంటికెళ్ళి అరగంటలో తిరిగొస్తాననీ మేనేజర్‌ను బతిమాలిందట. మేనేజర్ ఒప్పుకోలేదు. పైగా కసిరికొడుతూ ఎగతాళిగా మాట్లాడి మరింత నొప్పించాడు. 'పాలు పొంగి పొర్లుతున్నాయేం? చళ్ళు పట్టుకుని పిండి ఆ పాలు పిల్లవాడికి పంపిస్తే ఎలా ఉంటుంది? నీకూ నీ బిడ్డకీ సుఖంగా ఉండదూ' అన్నాడు. దీనిమీద మాటామాటా పెరిగింది. పర్యవసానమే ఆనంద్ కంటబడిన దృశ్యం. ఇంతలో గాంభీర్యం తెచ్చిపెట్టుకుని మేనేజర్ అన్నాడు. 'ఈ

లంజల గురించి నీకు తెలియదు ఆనంద్! పని తప్పించుకోడానికి ఏవో సాకులు వెతుకుతూ ఉంటారు. సోమరిపోతుముండలు! ఓసారి పాలుపట్టి రావాలంటారు. ఇంకోసారి ముసలిఅత్తను చూసుకొస్తామంటారు. ఇంకోసారి —పైకి ఒప్పుకోరు కానీ —రంకుమొగుడికి పంగచాపడానికి వెళ్ళొస్తూఉంటారు. క్రమశిక్షణ బొత్తిగా లేకుండా పోయిందంటే నమ్ము. నీకు తెలుసో తెలీదో! నలభయ్యేళ్ళుగా ఈ జాగీర్దార్‌సాహెబ్‌ను సేవించుకుంటూ, ఈ దిక్కుమాలిన ఊరిని ఆయన అదుపాజ్ఞల్లో ఉంచడానికి నేను పడుతున్న శ్రమ అంతా ఇంతా కాదు. ఇప్పుడు ఈ పనికిమాలిన మూక అదుపుతప్పిపోతున్నారా అనిపిస్తోంది. ఈ గాడిదకొడుకులు ఎంతకు తెగిస్తున్నారో నీకు తెలీదు... ద్రోహం, రాజద్రోహం... ప్రతివాళ్ళూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్రచేస్తున్నట్టే కనిపిస్తున్నారు. ఇక ఈ సిగ్గుఎగ్గులేని ఆడవాళ్ళుకూడా అదే వరస...'

మేనేజర్ వదరుతూనే ఉన్నాడు. ఆయన చూడటానికి ఆపాదమస్తకం భక్తితత్పరత నింపుకున్న హిందువులా కనిపిస్తాడు. వైష్ణవమతస్థుడు. ఫాలభాగం అంతటా తిరునామాలు. అటూ ఇటూ రెండు వెడల్పాటి తెల్లని నిలువుగీతలు, మధ్యలో సన్నని ఎర్రగీత. చేతులమీద ఉదరభాగంమీద గుండెల మీద అవే నూటపదకొండు గుర్తులు. ఈ విశ్వాసపాత్రుడైన సేవకుడికి, నాలుగు దశాబ్దాలపాటు పరమ విధేయుడుగా జాగీరులో క్రమశిక్షణ నెలకొల్పిన మనిషికి —ఆకలితో ఏడుస్తున్న పసిపాపకు పాలుపట్టి రావటానికి ఒక తల్లి అనుమతికోరడం సహించరాని క్రమశిక్షణారాహిత్యంగా కనిపించింది...

పాదరసంలాంటి ఆనంద్ బుర్ర ప్రతిచోటా తనకెదురైన వైరుధ్యాల్ని ముక్కముక్కలుగా విడదీసి విశ్లేషిస్తోంది. ఓ ముస్లింప్రిన్సిపాల్ తెలివితేటలుగల ఓ హిందూవిద్యార్థిని అభిమానిస్తాడు ఒక ముస్లింరెవెన్యూఇన్‌స్పెక్టర్ దుస్సహమైన అహంకారంతో నోరుపారేసుకుంటూంటే ఓ హిందూపటేల్ అతణ్ణి హృదయపూర్వకంగా సమర్థిస్తాడు. ఓ హిందూమేనేజర్ హిందూమహిళల్ని నిర్నిరోధంగా అవమానిస్తూ హింసిస్తూ ఒక ముస్లింజాగీర్దారును నలభైఏళ్ళుగా అత్యంత విశ్వాసపాత్రుడుగానూ విధేయుడుగానూ సేవించుకుంటూ ఉంటాడు. ఒక హిందూబాలుడి తండ్రి, ప్రజల్ని అష్టకష్టాలుపెడుతున్న ముస్లింప్రభువుల దుష్టపాలనకు లొంగిఉండమని కొడుకును ఉద్బోధిస్తూ ఉంటాడు...! ఇవన్నీ అతడికి దిగ్భ్రమ కలిగిస్తున్నాయి. ఆలోచించినకొద్దీ హిందూ —ముస్లిం వైరుధ్యం వంటిదేదీ ఎక్కడా లేదని అతనికి స్పష్టంగా అనిపిస్తోంది... మరి హిందూ, ముస్లిం పేర్లతో అరుపులు, కేకలు అన్నీ ఏమిటి? దేనికి? మరికాస్త లోతుగా ఆలోచించాడు. అప్పుడు మరింత స్పష్టంగా విషయాలు బోధ పడ్డాయి.

మెరుపువేగంతో మరో నిర్ణయానికి వచ్చాడు. తాను ఏనాటికీ, ఎప్పటికీ... ప్రజావ్యతిరేకమైన, రాచరికం కొమ్ముకాస్తున్న ఈ హిందూ —ముస్లిం కూటమికి పాదాక్రాంతుడు కాబోడు. ఈ వ్యవస్థను నేలమట్టంచేయాలని కోరుకుంటున్న శక్తులలో తానూ ఒకడవుతాడు —వాళ్ళు హిందువులా, ముస్లింలా అన్న విచికిత్సతో తనకు పనిలేదు.

ఆ క్షణంలోనే తిరుగుబాటువీరుడొకడు ఉద్భవించాడు.

★ ★ ★

నెలరోజులవరకూ అతడి నిత్యకృత్యాలు మామూలుగానే సాగిపోయాయి. ఇంతలో హఠాత్తుగా అతనిచుట్టూ మరో కల్లోలం చెలరేగింది...

స్కూలు లైబ్రరీకి వెళ్ళిరావడం ఎన్నో ఏళ్ళుగా ఆనంద్ దిన చర్యలో భాగం. ఏవో పుస్తకాల పేజీలు తిరగేస్తూ, బీరువాలు గాలిస్తూ, కేటలాగులు శోధిస్తూ గంటలతరబడి కూర్చునేవాడు. అతడు వెళ్ళిపోయిన తర్వాత డజన్లకొద్దీ పుస్తకాలు నేలమీద పడి ఉండేవి. బీరువా అరల్లో పుస్తకాలు చిందరవందరగా కనిపించేవి. లైబ్రేరియన్ కాస్త వయసుమీరినవాడు. రాజుగారి దివ్యత్వంపట్ల ఆయనకు స్థిరమైన అభిప్రాయాలుండేవి. రాచరికాన్ని కూలదోసే ప్రతిప్రయత్నాన్ని ఆయన విపరీతంగా నిరసించేవాడు. ఆయన బ్రిటిష్‌సామ్రాజ్యంవల్ల మనకు కలిగిన ప్రయోజనాలగురించి ఒక పుస్తకం రాయాలని తలపెట్టాడు. అందుకు సమాచారం సేకరించడానికీ, ప్రూఫులు దిద్దడానికీ, ప్రచురణపనులు చూడడానికీ ఆనంద్‌మీద ఆశపెట్టుకున్నాడు. కొంతకాలంపాటు ఆనంద్, ఆయన బాగానే కలిసిపనిచేశారు.

అయితే ఈమధ్య లైబ్రేరియన్‌కు ఆనంద్‌లో కొన్ని ఆందోళనకరమైన లక్షణాలు కనిపిస్తున్నాయి. సాహిత్యానికీ గణితానికీ సంబంధించిన పుస్తకాలు చదవడం మానేసి ఆనంద్ ఇటీవల మారుమూల ఎక్కడో ఉంచిన 'రాజకీయ'గ్రంథాలు వెతికి పట్టుకుంటూ ఉండడం గమనిస్తున్నాడు. చదువులో పైకొచ్చే విద్యార్థులు ఆ పుస్తకాలు చదవడ మెంతమాత్రం మంచిదికాదని లైబ్రేరియన్ ఉద్దేశం. నిజానికి ఆ పుస్తకాలెన్నో లేవు. అయితేమాత్రం ? ఒక నగరాన్ని తగలబెట్టడానికి చిన్న నిప్పురవ్వ చాలదా అని లైబ్రేరియన్ ప్రశ్న. అసలా పుస్తకాలు తెప్పించడానికే లైబ్రేరియన్ ఇష్టపడలేదు. కాని దేశవ్యాప్తంగా ప్రసరిస్తున్న వివిధపరిణామాలగాలులు సోకకుండా మొత్తం ఒక విద్యార్థితరాన్ని బంధించి ఉంచడం సాధ్యంకాదని ప్రిన్సిపాల్ వాదించి లైబ్రేరియన్ అభ్యంతరాన్ని త్రోసిపుచ్చాడు. లైబ్రేరియన్ విధిలేక ప్రిన్సిపాల్ నిర్ణయానికి తల ఊపినా, ప్రమాదకరమైన ఆయన ఉదారవాదంతోమాత్రం ఎప్పుడూ ఏకీభవించలేదు. ఉదారవాదానికి ఒక అడుగుదూరంలో ఉగ్రవాదం, దానికి మరో అడుగు దూరంలో విద్రోహవాదం ఉంటాయని వాదించేవాడు. విప్లవాలు ఆనంద్‌లాంటి కుర్రాళ్ళ బుర్రల్లోనే పుట్టుకొస్తాయని... తానెక్కడో చదివిన మాటల్ని గట్టిగా విశ్వసించేవాడు. అద్భుతమైన మేధాశక్తికి దృఢమైనవ్యక్తిత్వం తోడైతే వాళ్ళు కచ్చితంగా విప్లవకారులవుతారని ఆయన ఉద్దేశం. స్వార్థబుద్ధిని ప్రేరేపించగలిగితే తప్ప అటువంటివాళ్ళను అదుపుచేయడం కష్టం. స్వార్థాన్నికూడా అవలీలగా జయించినవాడైతే అతడు వ్యవస్థకే పెద్ద తలనొప్పిగా పరిణమిస్తాడు. అతనికి వ్యతిరేకంగా ఎవరూ ఏమీ చేయలేరు. ఆనంద్‌లో వచ్చిన మా ర్పును గమనించిన లైబ్రేరియన్ నేరుగా వెళ్ళి 'నేను చెప్పలేదా' అన్న బాణీలో ప్రిన్సిపాల్‌కు నివేదించాడు. ఆ తర్వాత, ఇంకా పైఅధికారుల దగ్గరకు వెళ్ళి స్వయంగా ఈ కబురు చేరవేశాడు. అలా చేయడం నియమనిబంధనలకు విరుద్ధమని అతడికి తెలుసు. కాని ఈ విషయాన్ని తీవ్రంగా పరిగణించాడు కనుక, తాను సక్రమ మనుకున్నదే చేశాడు.

ఇంక, కీలకమైన వాదోపవాదాల ఘట్టం మొదలైంది.

ప్రిన్సిపాల్ తన ఆఫీసులో చికాకుగా పచార్లు చేస్తున్నాడు. ఆనంద్ అమాయకంగా చూస్తూ ప్రశాంతంగా నిబ్బరంగా ఒకమూల నిలబడి ఉన్నాడు.

తలుపు తెరచుకుని లైబ్రేరియన్ ఎంతో గాంభీర్యమూ కాఠిన్యమూ ప్రదర్శిస్తూ అచ్చంగా ప్రాసిక్యూటర్‌లా లోపలికి అడుగుపెట్టాడు.

'ఆనంద్ చదువుతున్న పుస్తకాలేమిటి?' ప్రిన్సిపాల్ లైబ్రేరియన్‌ని అడిగాడు.

'జవహర్‌లాల్‌నెహ్రూ గారి ఆటోబయోగ్రఫీ, లెటర్స్ ఫ్రమ్ ఏ ఫాదర్ టు ఏ డాటర్, ఇంకా —'

'జవహర్‌లార్‌నెహ్రూగారి గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్‌హిస్టరీ' ... అందించాడు ఆనంద్ చార్జిషీటు పూర్తిచేస్తూ.

'ఇది చాలా ప్రమాదకరమైన సాహిత్యమని ప్రభుత్వం గట్టిగా భావిస్తోంది. ముఖ్యంగా ప్రభుత్వంనుంచి ఆదరణ నాశించే ఆనంద్‌లాంటి ప్రతిభావంతులు చదవకూడని సాహిత్యం ఇది...' లైబ్రేరియన్ ప్రాసిక్యూషన్‌కు కేసు సమర్పించాడు.

'ఆ పుస్తకాలనే నువ్వు ఎందుకు ఎంచుకున్నావు?' ప్రిన్సిపాల్ ఆనంద్‌పై దాదాపు అరిచినంత పనిచేస్తూ అడిగాడు.

'అవి నాకు నచ్చాయి కనుక.'

'విద్యాశాఖ డైరెక్టర్ గారు నీ విషయంలో చాలా నిరుత్సాహపడ్డారు. నిన్ను గట్టిగా హెచ్చరించమన్నారు మళ్ళీ అటువంటి పుస్తకాలు చదవనని నీదగ్గరనుంచి వ్రాతపూర్వకంగా హామీ తీసుకోమన్నారు' అన్నారు ప్రిన్సిపాల్.

'కానీ.. నాకు అందులో ఎటువంటి తప్పూ కనిపించడంలేదు సార్.' అన్నాడు ఆనంద్.

'నీకు ఏం కనిపించిందో ఏం కనిపించలేదో అనవసరం. అటువంటి సాహిత్యం ఘనతవహించిన మన రాజుగారిపట్ల ప్రజల విధేయతను దెబ్బతీస్తుందని విద్యాశాఖ డైరెక్టర్‌గారు భావిస్తున్నారు' అన్నారు ప్రిన్సిపాల్.

'అది చాలా చాలా ప్రమాదకరమైన సాహిత్యం' లైబ్రేరియన్ మధ్యలో తలదూర్చుతూ అన్నాడు.

'దయచేసి నన్ను విచారించనివ్వండి' అంటూ ప్రిన్సిపాల్ లైబ్రేరియన్‌మీద మండిపడ్డాడు. విద్యాశాఖ డైరెక్టర్ కు లైబ్రేరియన్ రహస్యంగా నివేదికలు పంపుతున్న విషయం ఆయనకు తెలుసు.

లైబ్రేరియన్ కొరకొరచూస్తూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ప్రిన్సిపాల్ అదేమీ పట్టించుకోలేదు. ఆనంద్‌వైపు బాధగా చూశాడు.

'నాకు తెలుసు, నువ్వేదో ఒకరోజున ఇటువంటి చిక్కుల్లో ఇరుక్కుంటావని' అన్నాడు. ఆ వెంటనే అప్పటికప్పుడు స్ఫురించినట్టు 'అందులో నీ తప్పేమీ లేకపోయినా...' అన్నాడు.

'మీరు దేనిగురించి మాట్లాడుతున్నారు సార్?' అడిగాడు ఆనంద్. 'నేనెందు కు చిక్కుల్లో పడతాను? అసలు నేనేం చేశాను? నాకేమీ అర్థంకావడంలేదు...'

'నాకూ అర్థంకావడంలేదు. నాకు తెలిసిందొకటే. నీ పేరు అవిధేయుల జాబితాలోకెక్కింది —అధికారికంగా' అన్నాడు ప్రిన్సిపాల్.

'నేను అవిధేయమైన పనేమీ చేయలేదు సార్. జవహర్లాల్‌నెహ్రూగారి పుస్తకాలు చదవడానికీ, విధేయతకీ సంబంధమేమిటి? ఈ పెద్దమనుషులంతా కలిసి మీ బుర్రల్లోకి అవిధేయతనే ఆలోచనను ఎందుకు చొప్పిస్తున్నారు? అసలు దీని పూర్వాపరాలేమిటి?'

'అదిగో... అదిగో... నువ్వు అప్పుడే ఆ భాష మాట్లాడుతున్నావ్...'

'సారీ సార్. నా ఉద్దేశం అది కాదు. ఇదంతా కేవలం వేధింపు. అవునా? కాదా?... చెప్పండి. నా కిష్టమైన పుస్తకాలు నేను చదువుకోకూడదా? మరోసారి చెబుతున్నాను... నెహ్రూగారి పుస్తకాలు మానసికంగా నన్నెంతో ఎత్తుకిపెంచాయి. ఆయన తన కుమార్తెకు రాసిన ఉత్తరాలైనా, నాకూ నాలాంటి వేలాదిమందికీ రాసినట్టే అనిపిస్తున్నాయి. ఇప్పుడాయన జైల్లో ఉన్నారు కదండీ' ఆనంద్ అన్నాడు.

'ఆయన ఎక్కడున్నారో నీకెందుకు?... చూడు ఆనంద్. ఎందుకని నన్నడగవద్దు... మరోసారి చెబుతున్నాను. నిన్ను అవిధేయుడుగా, తిరుగుబాటుశక్తిగా వాళ్ళు భావిస్తున్నారు. భగవంతుడు నిన్ను ఆదుకోవాలని కోరుకోవడంమినహా నేను చేయగలిగిందేమీలేదు.'

అదే క్షణంలో ఆనంద్, తన జీవితంలో ఎంతో కీలకమైన మూడో నిర్ణయం తీసుకున్నాడు. సమయం వచ్చినప్పుడు రాజుకు వ్యతిరేకంగా జరిగే తిరుగుబాటులో తానూ భాగమవుతాడు...

ఇప్పటికీ జవహర్లాల్ తన కుమార్తెకు రాసిన ఉత్తరాలు అతణ్ణి ముగ్ధుణ్ణి చేస్తున్నాయి... అవి తనకు సైతం రాసిన ఉత్తరాలే అనిపిస్తున్నాయి..

ఒక విషయం అతనికి స్పష్టమైంది. వ్యక్తిగతవిధేయతను తాను అర్థంచేసుకోలేకపోతున్నాడు. ఒక భావానికి... తాను విశ్వసించే ఒకే భావానికి తాను విధేయుడుగా ఉండగలడు. బహుశా వ్యక్తిపాలనకు అనుగుణంగా పుట్టుకొచ్చిన వ్యక్తిగతవిధేయత అనే ఆలోచన తనకు సరిపడదు. అంటే తార్కికంగా చెప్పుకోవాలంటే తాను ప్రజాస్వామ్యాన్ని అభిలషిస్తున్నాడు. అది రాచరికానికి వ్యతిరేకమని, అందులో వ్యక్తిగతవిధేయతకు తావులేదని స్పష్టాస్పష్టంగా అతనికనిపిస్తోంది. ఈ విషయంలో ప్రజాస్వామ్యం నిజంగానే భిన్నంగా ఉంటుందా, స్వతంత్రులమైన తర్వాత — 'తనను అనుసరించని వారందరూ తన శత్రువులే' అన్న విపరీతధోరణితో పోరాడవలసిన అవసరం ఉండదా అన్న జిజ్ఞాసపూర్వకమైన ప్రశ్నలు అతని బుర్రలోంచి తోసుకొస్తున్నాయి. అతడు అవుననే విశ్వసిస్తున్నాడు...

లోపల... తిరగబడే మనిషి మరింత విజృంభించాడు.

★ ★ ★

# 8

అప్పుడప్పుడు పాఠశాలలో సాంస్కృతిక కార్యక్రమాలు జరుగుతుండేవి. ఉపాధ్యాయులకూ విద్యార్థులకూ మనోరంజన సమకూర్చడానికని వివిధ కళాకారులు వస్తుండేవారు. వారు ఉత్తమ కళాకారులని తెలిసినప్పుడు ఆనంద్ శ్రోతల మొదటిపంక్తిలోనూ, నాసిరకమని ముందే తెలిస్తే చివరి పంక్తిలోనూ కూర్చుండేవాడు. ఒకరోజు సాయంకాలం ఒక ప్రఖ్యాత ఖవ్వాలీ బృందం పాటలు వినిపించే కార్యక్రమం జరిగింది. సగం సగం చార్జైన కారు బ్యాటరీ మీద నడిచే మైకు అప్పుడప్పుడు ఆగుతూ, విచిత్రమైన శబ్దాలు చేస్తూ, అఫ్రోజాబాదు జూలోని వివిధ జంతువుల ఘీంకారాలను గుర్తు చేస్తుండేది. విద్యార్థులను ప్రత్యేకంగా జూ చూడడానికని ఆరోజుల్లో తీసు కెళ్ళేవారు. ఐతే ఆరోజు కార్యక్రమంలో ఎందుకో మైకు చక్కగా పనిచేసింది. దానికి తగినట్టు పాటకచేరి కూడా అద్భుతంగా రక్తికట్టింది. రెండు గంటలు నడిచిన ఆ కార్యక్రమం లాంటిది గుల్షన్‌పూర్ ఊళ్ళోనే అంతకు క్రితమెన్నడూ జరుగలేదని పెద్దలు ప్రశంసించారు.

ఖవ్వాలీ సంగీతంలో ఒక ప్రత్యేకత ఉంది. నిర్గుణోపాసకులైన భక్తకవులు భగవంతుణ్ణి ప్రేయసిగా భావించి తమ అనన్య ప్రేమను వ్యక్తపరుస్తూ మధురగీతాలు ఆలపిస్తుంటారు. ప్రస్తుత బృందంలో ముఖ్య గాయకుడైన గులాం అజీజ్ ఖవ్వాల్ మాత్రం కొన్ని కొత్త పద్ధతులు ప్రారంభించాడు. ఆయన గీతాల్లో భగవంతుని స్మరణే కాక నాసిర్ జాహీ రాజవంశ ప్రశంస కూడా విపులంగా జోడించాడు. రాజుల హయంలో సుఖసమృద్ధులు ఎలా వెల్లివిరిశాయో గొప్పగా వర్ణించాడు. ఈ కావ్యవస్తువు ఖవ్వాలీ సంగీతంలో పొందుపరచవలసింది కాకున్నా ఖవ్వాల్ గారికి ప్రభువులిచ్చిన జాగీర్ల దృష్ట్యా అందరు ఆస్థానికవుల్లా ఈయనకూడా తన ఖవ్వాలీలో పొగడ్తలు ఇమిడ్చాడు. సంగీతసాహిత్య పండితులకిది ఏమాత్రం సమ్మతం కాకున్నా రాజాదరణ పొందిన అజీజ్‌ను గురించి ఏమీ అనలేకపోయారు. ప్రభు ప్రభావం కళలపై పడక తప్పలేదు.

ప్రభువుగారిని గురించిన పొగడ్తల ప్రభావాన్ని ఆనంద్ తనపైన పడనివ్వలేదు. మిగతా కార్యక్రమంలో అందరిలాగే తల్లీనుడై వింటున్నాడు. బాల్యంలో భాగవతసంకీర్తనలో పొందిన ఆనందమే ఖవ్వాలీలోనూ పొందుతున్నాడు. ఆ సప్తస్వర సంగమంలో భాషాభావనవిభేదాలు లుప్తమైపోయాయి. ఆ కళాశబలతను మనస్ఫూర్తిగా అనుభవిస్తున్నాడు.

అదే క్షణంలో ఎవరో నెమ్మదిగా అతని భుజం తట్టారు. అతని దుస్తులూ పొడుగాటి జుట్టూ చూస్తే ఖవ్వాలీ బృందంలో ఒకడు కావచ్చుననిపించింది. వయసులో ఆనంద్ కన్న బహుశా

నాలుగైదేళ్ళు పెద్ద కావచ్చు. పొట్టి ఆకృతి. లెనిన్ నమూనా గడ్డం అతని మొహాన్ని సన్నగా కోలగా అనిపించేటట్టు చేస్తోంది. కళ్ళు మామూలుగానే ఉన్నా చూపు తీవ్రమైందనిపిస్తుంది. అతగాడొక కవి కావచ్చుననుకున్నాడు ఆనంద్. కవుల గొప్పదనం అప్పుడప్పుడు వాళ్ళ గడ్డాల పొడవునుబట్టి అంచనా కట్టబడుతుందనే పరిహాసోక్తులు ఆనంద్ విని ఉన్నాడు. ఏదెలాగున్నా అతనొక విప్లవకారుడని ఆనంద్‌కు స్ఫురించలేదు వాస్తవంలో విప్లవకారుడంటే ఎవరన్నదికూడా అతని కప్పుడు తెలియదు.

ఆనంద్ తన్మయతను గమనించి ఆ యువకుడు చాలా సేపు వేచి ఉండి చివరకు భుజం తట్టాడు. 'గుడ్ ఈవినింగ్. ఆనంద్ నీవేనా?' అని అడిగాడు.

ఔనని ఆనంద్ బదులు చెప్పాడు, ఆశ్చర్యపడుతూ.

'ఆశ్చర్యపడకు, నిన్ను గురించి నేను అఫ్రోజాబాద్‌లో విద్యాశాఖ డైరెక్టర్ గారి ముఖతః విన్నాను. ఆయన నాకు అంకుల్ ఔతాడు. నేను లక్నో విశ్వవిద్యాలయంలో విద్యార్థిని. నాపేరు హఫీజ్,' అని వివరించాడు.

అతనిలో కరచాలనం చేస్తూ 'నీ పరిచయమవడం చాలా సంతోషం, హఫీజ్ భాయ్,' అన్నాడు ఆనంద్. 'కానీ ఈ ఖవ్వాలీ గుంపులో ఎలా చేరావు?'

'అదే నీకు చెప్పాలని ఉబలాటపడుతున్నాను. ముందు సంగీతాన్ని ఆస్వాదించు. నీ తన్మయత్వం చూస్తున్నాను.' ఆనంద్ మళ్ళీ సంగీతాస్వాదనలో మునిగిపోయాడు

పాట కచేరీ అయిపోయిన హఫీజ్ మెల్లగా వచ్చి ఖవ్వాలీపాటల పుస్తకాలు ఉన్న ఓ పెద్ద కవరును ఆనంద్ చేతుల్లో పెట్టాడు. 'ఇందులో ఉన్న ప్రతి పుస్తకం నీకు బాగానచ్చుతుంది, నాకు తెలుసు' అన్నాడు గట్టిగా. తర్వాత అతణ్ణి జనానికి కాస్తదూరంగా తీసుకువెళ్ళి చెవిలో రహస్యం చెబుతున్నట్టు మరోమాట అన్నాడు. 'అందులో కొన్ని వేరేరకం పద్యాలు కూడా ఉన్నాయి. అవి నీకు మరింత నచ్చుతాయి.'

ఆ రాత్రి ఆనంద్ నిద్రపోలేదు. హఫీజ్ తనకిచ్చినవి పద్యాలు కావు, ఎంతో విస్ఫోటశక్తిని దాచుకున్న డైనమెట్లు అనుకున్నాడు. పద్యాల్లోని ప్రతిపంక్తి త్యాగమయభావనను ఉద్దీపింపచేస్తోంది. మాతృదేశవిముక్తికోసం ప్రాణాలకు తెగించి పోరాడే కాంక్షను ఉత్తేజింపజేస్తోంది 'చదివిన వెంటనే చించివెయ్యి' అన్నది ప్రతిపద్యం చివర అత్యవసరంగా పొందుపరచిన ఆదేశం.

ఆ రాత్రంతా హఫీజ్‌తో తన కలయిక గురించి ఆనంద్ అదేపనిగా ఆలోచిస్తూ ఉండిపోయాడు. ఎంతగా తలపగులగొట్టుకున్నా హఫీజ్ అతనికి అర్థంకావడంలేదు. అజ్ఞాతజీవితం గడుపుతూ మారువేషంలో తిరుగుతున్న పారిపోయిన ఖైదీ కాడుకదా? ఒకవేళ తన దళంలోకి యువకుల్ని చేర్చుకునే ప్రయత్నంలో ఉన్నాడా? అయితే అది దేనికి సంబంధించినదై ఉంటుంది? రాజుకు అత్యంతవిధేయుల్లో ఒకరైన విద్యాశాఖ డైరెక్టర్‌కు అతడు బంధువు కావడం ఎలా సాధ్యం? హఫీజ్ కార్యక్రమాలకు ఆయన కూడా ఇష్టపడుతున్నాడా? అలా నిద్రకు దూరమై కొన్నిగంటల పాటు ఆలోచించినతర్వాతకూడా ఆ నాటకమూ, నాటకంలోని పాత్రధారులూ అతనికేమాత్రం అంతుబట్టకుండానే ఉండిపోయారు. ప్రమాదకరమైన ఆ పద్యపాదాలను మనసులో వల్లించుకుంటూనే

హాఫీజ్ ఆదేశాన్ని అప్రయత్నంగా పాటిస్తూ వాటిని చించివేశాడు. నిద్రలో వాటిని పలవరించ కుండా చూడమని మాత్రం దేవుణ్ణి వేడుకున్నాడు.

మరునాడు శుక్రవారం. గులామ్ అజీజ్ ఖవ్వాల్, ఆయన బృందం ఊళ్ళోని ముఖ్యమైన దర్గా (స్థానికంగా మియాకీదర్గా అని పిలిచేవారు) దగ్గర విశాలప్రాంగణంలో పెద్దఎత్తున కచేరీ జరపబోతున్నారు. అన్ని మతాలవాళ్ళు కచేరీకి మూడుగంటల ముందే అక్కడికి చేరుకోడం ప్రారంభించారు. దర్గాకి మూడువైపులా జనం కిక్కిరిసిపోయారు. మిరుమిట్లుగొలిపే పెట్రొమాక్స్ లైట్ల కాంతులతో ఆ ప్రదేశం ఎంతో శోభాయమానంగా ఉంది.

ఆనంద్ ముందుగానేవచ్చి ఖవ్వాలీ గాయకులు కూర్చున్న వేదికకు దగ్గరగా ఒక అనువైన చోట కూర్చున్నాడు. కచేరీ బృందం తమ వాయిద్యాలను శృతి చేసుకుంటున్నారు. ఆనంద్ రెండు కారణాలతో అక్కడికి వెళ్ళాడు. ఒకటి సంగీతం పట్ల ఆసక్తి, రెండోది హాఫీజ్‌ను కలుసు కోవడం.

మధ్యమధ్య మెడ ముందుకి చాచి చూపుచొరబడినంతమేరా, వేదిక సమీపంలోనూ, ఆ చుట్టుపక్కలా గాలిస్తున్నాడు. హాఫీజ్ జాడ కనిపించలేదు. కచేరీ పూర్తికాబోతోంది. శ్రోతల కదలికలు, హావభావవిన్యాసాలు కచేరీ తారస్థాయికి చేరుకోవడాన్ని సూచిస్తున్నాయి. కానీ ఇంకా పూర్తిగా ఆ స్థాయికి చేరలేదు. ఆ తన్మయక్షణాలలో ఒక యువకుడు జనంలోంచి వస్తూ హఠా త్తుగా ఆనంద్‌కు కనిపించాడు. ఆనంద్‌ని కొంత కష్టం మీద సమీపించి ఆయాసపడుతూ అన్నాడు. 'సారీ. నీ మిత్రుడు ఉదయమే అత్యవసరంగా అఫ్రోజాబాద్ వెళ్ళిపోయాడు. నీ కోసం మరో ఖవాలీల కవరు పంపించాడు. ఇవి ఆ మహాగాయకుడు పాడిన తాజాపాటలని చెప్పమన్నాడు.' అంటూ ఒక మూసిన సంచిని ఆనంద్ చేతుల్లో ఉంచాడు.

'మళ్ళీ రేపు కలుస్తాను' అన్నాడు మామూలుగా.

ఆ మాట బాగా పరిచితులైన ఇద్దరు వ్యక్తులమధ్య జరిగే మామూలు సంభాషణలానే ధ్వనించింది. ఆనంద్ కూడా అందుకు తగినట్టే స్పందించి, 'చాలా సంతోషం భయ్యా! రేపు నీకోసం ఎదురుచూస్తాను' అన్నాడు.

ఆనంద్ హాస్టల్‌కు వెళ్ళేవరకు కూడా ఉగ్గబట్టుకోలేకపోతున్నాడు. హాఫీజ్ ఇచ్చిన పద్యాలను గుర్తుచేసుకుంటున్న కొద్దీ అతని దాహం పెరిగిపోతోంది. ఇంకా ఇంకా కావాలని కోరుకుంటున్నాడు. అందుకే దర్గా దగ్గర హాఫీజ్ కోసంఎదురుచూపులు చూచాడు. అతనినుంచి ఏవేవో తెలుసు కోవాలనుకున్నాడు. తనను ఎంతో ఉద్విగ్నపరుస్తూ ఆచరణకు ప్రేరేపిస్తున్న ఒక సరికొత్త ప్రపంచం తన కళ్ళముందు విచ్చుకుందా అనిపిస్తోంది. అది నాదే, నాకోసమే, అప్పటికప్పుడు నాకు తగినట్టు సృష్టించబడిందే... అనుకున్నాడు. హాఫీజ్ రాకపోయినా తనచేతిలోని సంచి తనను వెతుక్కుంటూ వచ్చిన అదృష్టంగా భావించాడు. ఆ జనసమూహాన్ని తప్పించుకుంటూ వెళుతున్న ఆనంద్‌కి హఠాత్తుగా స్కూల్ లైబ్రేరియన్ గుర్తుకొచ్చాడు. జవహర్‌లాల్ నెహ్రూ పుస్తకాలు చదివినందుకే అంతగొడవచేశాడే! ఇప్పుడు తన దగ్గర ఉన్న కొంపలంటించే పద్యాలు ఆయన చదివితే నిలువునా కుప్పకూలిపోతాడేమో! ఆనంద్ లోలోపల నవ్వుకున్నాడు.

ఆ తర్వాత రెండు రోజుల్లోనే ఆనంద్‌లో ఊహించలేని పరివర్తన. అతని గగనవీధిలో సరికొత్త నక్షత్రం అడుగుపెట్టింది. దాని పేరు త్యాగం. జన్మభూమికోసం దేనికైనా తెగించే త్యాగం. దేనికయినాసరే— ఏ పరిమితులూ లేవు, ఏ నిషేధాలూ లేవు, ఏ విచారాలూ లేవు. ఈ రెండురోజుల్లో తాను ఓ నిగూఢవ్యక్తిగా కుట్రదారుగా ఎదిగిపోయినట్టు అతనికే అనిపించింది. తనచేతిలోఉన్న సంచిలో ఒక బాంబు, ఒక తుపాకీ, ఎంతో విధ్వంసకరమైన మరేదో ఆయుధం ఉండచ్చు. ముందుముందు తనకు ఏది కావలసివస్తుందో ఎవరు చెప్పగల రు? తాను ఈ దుర్మార్గప్రభుత్వంతో పోరాడాలి. అఫ్రోజాబాద్ ప్రజల్ని విముక్తులను చేయాలి. తానిప్పుడు జవహర్‌లాల్‌నెహ్రూగారి ఉదాత్తభావాలను ఇంకా జీర్ణించుకుంటూనే ఉన్న విద్యార్థికాదు. ఆ దశను దాటి ముందుకు వెళ్ళిపోయాడు, కచ్చితంగా వెళ్ళిపోయాడు. తానిప్పుడు స్వాతంత్ర్య సమరయోధుడు. ఒక యువకవీరుడు.

గదికి చేరుకునేసరికి రాత్రి భోజనం అతని కోసం ఎదురు చూస్తోంది. అంతా నిద్రపోతున్నారు. గదిలో పడుకున్న మిగిలిన విద్యార్థుల గురక లయబద్ధంగా రకరకాల శ్రుతులలో వినిపిస్తోంది. తానుమాత్రం మేలుకుని ఉన్నాడు. కర్ణకఠోరమైన ఈ గురక మధ్య తానింతకాలం అంత బాగా ఎలా నిద్రపోయానా అనుకుని ఆశ్చర్యపోయాడు. ఏమైనా ఆ రాత్రి తాను నిద్రపోయే ప్రశ్నలేదు. గురక కారణంగా కాదు. సంచిలో ఉన్న ఖవ్వాలీలను ఆస్వాదించడానికి తాను తెల్లవారే వరకు ఎదురుచూడలేడు. ఇక భోజనమంటారా, అతని ఆకలి ఎప్పుడో మాయమైపోయింది.

వత్తి తగ్గించి ఉంచిన హరికేన్ లాంతరు తీసుకుని చప్పుడు చేయకుండా గదిలోంచి బయటకు నడిచాడు. హాస్టల్ ఆవరణలో ఒక మూలకు రెండు కుర్చీలు తీసుకెళ్ళి లాంతరును ఎదురుగా ఒక కుర్చీ మీద ఉంచి మరో కుర్చీలో తాను కూర్చున్నాడు. గదుల్లో ఉక్కపోస్తున్నప్పుడు విద్యార్థులు ఆవరణలో ఇలా కూర్చుని చదువుకోవడం ఎప్పుడూ కనిపించే దృశ్యమే. దీపం పెద్దదిచేసి సంచీ తెరచి కాగితాలు పైకితీసి చదవటం ప్రారంభించాడు. ఆశ్చర్యం. అందులో ఒక్క ఖవాలీ కూడా లేదు. వార్తాపత్రికల కత్తిరింపులు, భగత్‌సింగ్, రాజగురు, సుఖ్‌దేవ్‌ల విచారణకు సంబంధించిన వివరాలు పొందుపరచిన కాగితాలు ఉన్నాయి. ఏవో ఉత్తరాల ప్రతులు, నోట్సు, దేశభక్తి ప్రపూరితమైన ఎన్నో పద్యాలు, రెచ్చగొట్టే సామగ్రి ఉన్న ఇతర పత్రాలు ఉన్నాయి. అవి రహస్యపంపిణీలో ఉన్నట్టు తెలిసిపోతోంది. విపరీతమైన నిస్పృహకు విషాదానికి లోనుచేస్తున్న అప్పటి దేశ వాతావరణంలో కూడా ఆశను, ధైర్యాన్ని రేకెత్తించి మేలుకొలిపే ఉదాత్తసందేశం ఆ పద్యాలలోనూ ఇతర సాహిత్యంలోనూ ఉంది.

ఆనంద్ వాటిని చదువుతూనే ఉన్నాడు. ఆ పద్యాలలో చిత్రితమైన ఉత్తేజకరమైన భవిష్యత్తు అతనిని ఆకర్షించి మళ్ళీ మళ్ళీ చదివిస్తోంది. కేవలం ధారణ చేయడానికే కాదు, అందులోని ఉద్విగ్నతనీ నిర్భీతినీ తన శరీరం అణువణువులో నింపుకోడానికి మళ్ళీ మళ్ళీ చదువుతున్నాడు.

హృదయాన్ని స్ఫూర్తిమంతం చేస్తున్న ఈ గేయాలు దేశమంతటా వందలాదియువవిద్యార్థి సమూహాల్లోప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి.(అఫ్రోజాబాద్ వంటి సంస్థానాలలో మినహా. అక్కడ అవి రహస్య వ్యాప్తిలో ఉన్నా ఉధృతిలో తక్కువేమీకాదు)

చదువుతున్న ఆనంద్ చెక్కిళ్ళమీంచి అశ్రువులు జారిపడుతున్నాయి.

కభీ వహ్ దిన్‌భీ ఆయేగా
కి జబ్ ఆజాద్ హమ్ హోంగే
యహ్ అప్నీ హీ జమీన్ హోగీ
యహ్ అప్నా ఆస్‌మాన్ హోగా
షహీదోంకే మజారోంపర్
లగేంగే హర్ బరస్ మేలే
వతన్ పర్ మర్‌నే వాలోంకా
యహీ బాకీ నిషాన్ హోగా!

ఆ రోజు కూడా వస్తుంది,
మనం స్వతంత్రులమయ్యే రోజు,
ఈ నేల మనదయ్యే రోజు,
ఆకాశం మనదయ్యే రోజు
ఆ రోజు తప్పకుండా వస్తుంది,
మృతవీరుల సమాధులవద్ద
ఏటా జాతర జరిగే రోజు
మాతృభూమికై ప్రాణాలర్పించిన వారి
స్మృతిచిహ్నమై అదొక్కటే వెలిగిపోయే రోజు.

లక్షలాది మంది నాలుకలపై నర్తించిన మరో దేశభక్తి గేయం ఇలా సాగిపోతుంది.

సర్‌ఫరోషీకీ తమన్నా అబ్ హమారే దిల్‌మే హై
దేఖనా హై జోర్ కితనా బాజుయే కాతిల్‌మెహై
వక్త్ ఆనేదే బతాదేంగే తుఝే ఏ ఆస్‌మా
హమ్ అభీసే క్యాబతాయే క్యా హమారే దిల్‌మే హై.

మా హృదయాలనిండా మమ్మల్ని మేము వేల్చుకునే ఆకాంక్ష
హంతకుడి మోచేతి శక్తిని మేము పరీక్షించబోతున్నాం
ఓ గగనమా! ఆ సమయం రానీ, అప్పుడే చూపిస్తాం
మా హృదయంలో రహస్యాన్ని మేము ఇప్పుడే ఎందుకు బయటపెడతాం.

'(వీర మట్టారెడ్డి ఉయ్యాలో
వీర అనంతరెడ్డి ఉయ్యాలో'

'సైసై గోపాలరెడ్డి, రెడ్డి
నీవు నిలిచావు ప్రాణాలొడ్డి'

'బండెనక బండిగట్టి
పదహారు బండ్లుగట్టి'

వంటి తెలుగునాటవిశేష ప్రచారంలో ఉన్న పాటల్లాంటివే ఈ రచనలు కూడా.)

ఇంకా చదవవలసిన కాగితాలు మిగిలిపోయాయి. ఆనంద్ దుఃఖాన్ని ఆపుకోలేకపోతున్నాడు. అనిర్వచనీయమైన భావోద్రేకంతో చలించిపోతున్నాడు. ఆ క్షణంలో దేశంకోసం ప్రాణత్యాగానికి సైతం సంసిద్ధుడైపోయాడు.

ఒక లేఖ అతనిని మరీ మరీ ఆకర్షించింది. అది భగత్ సింగ్ తనతండ్రికి రాసిన ఉత్తరం. అతనిని ఉరిశిక్షనుంచి తప్పించటానికి తండ్రి న్యాయవాదిని ఏర్పాటుచేస్తున్నట్టు తెలిసి ఎంతో ఆవేదనతో రాసినఉత్తరం. 1930 సెప్టెంబరులో భగత్‌సింగ్‌కు మరణశిక్ష విధించబోతున్నట్టు రూఢిగా తెలిసిన తర్వాత అతని తండ్రి సర్దార్ కిషన్‌సింగ్ శిక్ష తప్పించటానికిచట్టపరమైన మార్గాలు అన్వేషిస్తున్నాడు. భగత్‌సింగ్‌కు ఇదెంతమాత్రం ఇష్టంలేదు.ప్రభుత్వంస్వయంగా డిఫెన్స్ న్యాయవాదిని ఏర్పాటు చేస్తానన్నా అతడు తిరస్కరించాడు. తండ్రి చేస్తున్న ప్రయత్నాలు తెలిసి ఆగ్రహించి ఇలా రాశాడు.

నా డిఫెన్సు కోసం మీరు స్పెషల్ ట్రిబ్యునల్ సభ్యులకు ఒక పిటిషన్ దాఖలు చేసినట్లు తెలిసి దిగ్భ్రాంతి చెందాను. స్థిరచిత్తంతో భరించడం అసాధ్యమనిపించేంత తీవ్ర అఘాతంగా ఆ చర్య నన్ను కలచి వేసింది. నా మానసికసంతులనాన్ని అది పూర్తిగా దెబ్బతీసింది. ఈ ఘట్టంలో ఇటువంటి పరిస్థితులలో ఆ పిటిషన్ దాఖలు చేయడం భావ్యమేనని మీరు ఎలా అనుకున్నారో నేను అర్థం చేసుకోలేకపోతున్నాను. తండ్రిగా మీ పట్ల చెరగని భక్తి గౌరవాలు ఉన్నప్పటికీ, కనీసం నన్ను కూడా సంప్రతించకుండా నా తరఫున అటువంటి చర్య తీసుకునే అధికారం మీకులేదని స్పష్టం చేస్తున్నాను. రాజకీయరంగంలో నా అభిప్రాయాలూ మీ అభిప్రాయాలూ ఒకటి కావన్న విషయం మీకు తెలుసు. మీ అనుమతినీ, నిరాకరణనూ పట్టించుకోకుండా నేను ఎప్పుడూ స్వతంత్రంగానే వ్యవహరిస్తున్నాను.

కేసుకు వ్యతిరేకంగా పోరాడమనీ, నిన్ను నీవు రక్షించుకోమనీ మీరు మొదటినుంచి నన్ను ఒప్పించడానికి ప్రయత్నిస్తూనే ఉన్న విషయం ఒకసారి గుర్తు చేసుకోండి. నేను కూడా మొదటి నుంచి ఆ ప్రయత్నాన్ని వ్యతిరేకిస్తున్న విషయం మీ కు తెలుసు. నన్ను నేను రక్షించుకోవాలన్న అభిలాష నాకెప్పుడూ లేదు. ఆ విషయమై నేను ఎప్పుడూ తీవ్రంగా ఆలోచించలేదు. నాది ఒక రూపూరేఖాలేని సిద్ధాంతమా, లేక నా అభిప్రాయాన్ని సమర్థించుకోడానికి నా వాదనలు నాకు వేరే ఉన్నాయా అన్నది వేరు విషయం. ఆ విషయమిక్కడ చర్చించలేను.

నాన్నగారూ, నేను పూర్తిగా విచలితుడనయ్యాను. మీ చర్యను విమర్శిస్తున్నప్పుడు, అభిశంసిస్తున్నప్పుడు సహజమైన సభ్యతా మర్యాదల్ని కూడా పాటించలేనేమోననీ, నా భాషలో ఒకింత పారుష్యం తొంగిచూడకుండా ఉండదేమోననీ భయపడుతున్నాను. ఒక విషయం స్పష్టం చేయనివ్వండి. మీ చర్య నా వెన్నులో పిడిబా కు దిగేసినట్టుగా అనిపిస్తోంది. ఇంకెవరైనా అటువంటి పని చేసిఉంటే ద్రోహపూరిత చర్యగానే పరిగణించి ఉండేవాణ్ణి. అయితే మీ విష యంలో అది వట్టి దౌర్బల్యం - నీచమైన దౌర్బల్యం.

ప్రతివారూ తమ దేశభక్తిని పరీక్షకు పెట్టవలసిన సమయం ఇది. నాన్నగారూ... ఈ విష యంలో మీరు విఫలులయ్యారు. మీరు గొప్ప దేశభక్తులని నాకు తెలుసు. భారతదేశ స్వాతంత్ర్యంకోసం జీవితాన్ని అంకితం చేసినవారని నాకు తెలుసు అటువంటి మీరు ఈ క్షణాన ఎందుకీ మనో

దౌర్బల్యం ప్రదర్శించుకుంటున్నారు? అర్థం చేసుకోలేకపోతున్నాను.

చివరగా మీకూ, నా కేసుపట్ల ఆసక్తి చూపిస్తున్న మిత్రులకూ, యావన్మంది ప్రజలకూ ఒక విషయం తెలియజేస్తున్నాను మీ చర్యను నేను తిరస్కరిస్తున్నాను. డిఫెన్స్‌ను ఏర్పాటు చేసుకోవడం ఇప్పటికీ నాకు సమ్మతంకాదని స్పష్టం చేస్తున్నాను. నా సహనిందితులు డిఫెన్స్ కోరుతూ దాఖలు చేసిన విజ్ఞాపనలను ఒకవేళ న్యాయస్థానం ఆమోదించినా సరే, వన్ను నేను సమర్థించు కునే ప్రయత్నం చేయను. నిరాహారదీక్షసమయంలో నేనిచ్చిన ఇంటర్వ్యూకు సంబంధించి ట్రిబ్యునల్‌కు నేను దాఖలు చేసుకున్న దరఖాస్తుకు అపార్థాలు ఆపాదించారు. నేను వాస్తవానికి డిఫెన్స్‌ను ఏనాడూ ఆశించకపోయినా, పత్రికలు నేను డిఫెన్స్‌ను కోరుకోబోతున్నట్టు రాశాయి. నా సంకల్పంలో ఇప్పటికీ ఎటువంటి మార్పులేదు. బోర్‌స్టల్ జైలులో ఉన్న నా మిత్రులు దీనిని తమపట్ల నమ్మకద్రోహంగా భావిస్తున్నారు. నా వైఖరిని వారికి స్పష్టంచేసే అవకాశం కూడా నాకు లభించలేదు.

ట్రిబ్యునల్‌కు నేను చేసుకున్న దరఖాస్తు గురించిన అన్ని వాస్తవాలు ప్రజలకు తెలియాలని నేను కోరుకుంటున్నాను. కనుక ఈ లేఖను ప్రచురించవలసిందిగా అభ్యర్థిస్తున్నాను

ఆనంద్ ఆ లేఖ ఎంతో జాగ్రత్తగా చదివాడు. కాగితాలు మడిచి జాగ్రత్త చేస్తూ- తనుకూడా ఏదో ఒక రోజున తన తండ్రికి అటువంటి లేఖ రాయవలసివస్తుందా-అనుకున్నాడు.

★ ★ ★

'మొహాన చన్నీళ్ళు కొట్టండి! లేపండి! ఇంత పొద్దెక్కినా కుంభకర్ణుడిలా ఎలా నిద్రపోతున్నాడో?'

కొంతమంది కుర్రాళ్ళు చన్నీళ్ళబక్కెట్టుతో ఆనంద్ మంచం చుట్టూ చేరి కేకలు వేస్తున్నారు. ఆనంద్ ఒక్క ఉదుటున లేచికూర్చుని తనూ కేకలు మొదలుపెట్టాడు. 'నామీద పడ్డారేమిట్రా ఇవాళ? మీలో చాలామందికంటే నేను త్వరగానే లేస్తాను!'

'అయితే ఇవేళ నీకేమైంది, అంత నిద్రపోతున్నావ్? లార్డ్స్‌లో పదిగంటలకు టెస్ట్‌మ్యాచ్ ఉందన్న విషయం మరిచిపోయావా?'

'ఓహ్. అలాగా.. సారీ. మ్యాచ్ విషయం మరిచిపోయాను. ఒక్క అరగంట టైమివ్వండి. టాస్‌వేసేలోగా అక్కడుంటాను. సరేనా?' అన్నాడు ఆనంద్.

వాళ్ళు సరేనంటూ రాత్రి కచేరీలో విన్నకొన్ని ఖవ్వాలీ పాటల చరణాలు రకరకాల అపశ్రుతులతో కర్ణకఠోరంగా పాడుకుంటూ వెళ్ళిపోయారు. ఆనంద్ మొట్టమొదటి చర్య, తన దిండుకింద దాచిన కాగితాలసంచి భద్రంగా ఉందో లేదో చూసుకోవడం. హమ్మయ్య, అది అక్కడే ఉంది. అలాగే తన మీద చన్నీళ్ళు కుమ్మరించే ప్రమాదం కూడా తప్పిపోయింది. ఇంతవరకు బాగానే ఉందనుకున్నాడు.

ఇక లార్డ్స్‌కి... క్రికెట్‌మీద ఉత్సాహంఉన్న విద్యార్థులు, పదిపన్నెండేళ్ళక్రితం యూనివర్సిటీ తరఫున ఆడిన ఒక యువఅధ్యాపకుడి మార్గదర్శనంలో క్రికెట్ ఆడుతూఉంటారు. ఇంగ్లండ్‌లోని క్రికెట్ మైదానాల పేర్లనే తమ మైదానాలకు కూడా పెట్టుకున్నారు. మొత్తం మూడు మైదానాలున్నాయి.

వాటిలో ఒకటి పెద్దది. అక్కడ ఫుట్‌బాల్, హాకీ కూడా ఆడుతూ ఉంటారు. దానికే లార్డ్స్ అని పేరు పెట్టుకున్నారు. ఆ మైదానంలో రెండువైపులా స్టంపులు ఏర్పాటు చేసుకోవచ్చు. మిగిలిన రెండుమైదానాలు దూరంగా ఉన్నాయి. వాటిపేర్లు మాంఛెస్టర్, ఓవల్. ఆ మైదానాల్లో ఒక వైపు మాత్రమే స్టంపులు ఏర్పాటుచేసుకునే వీలుంది. అయినాసరే పిల్లలు రెండోవైపు బౌలింగ్ లైనుకు గుర్తుగా ఒక స్టంప్ నిలబెట్టి ఆడుకుంటూఉంటారు.

ఆ రోజు లార్డ్స్‌లో—స్థానికంగా పేరుపొందిన రెండు క్రికెట్ ప్రత్యర్థి టీముల మధ్య 'మినీ యాషెస్' లాంటిది జరగబోతోంది. ఆనంద్‌కు క్రికెట్‌లో అంత ప్రవేశంలేదు. అతని ప్రావీణ్యమంతా హాకీలో. క్రికెట్ ఆడే రెండు టీముల వాళ్ళకీ అతడంటే మంచి నమ్మకం కనుక అప్పుడప్పుడు అతణ్ణి అంపైర్‌గా వాడుకుంటూ ఉంటారు. మిగిలిన సమయాల్లో ఆటలో అరటిపండులానూ స్కూలుటీముకు హుషారు కలిగిస్తూనూ ఉంటాడు. ఒక్కొక్కసారి ఆటలో అతడిచ్చే సలహాలను, ఎత్తుగడలను టీములో అందరూ స్వీకరిస్తూనే ఉంటారు

పదిగంటలకు పదినిమిషాలుముందుగానే ఆనంద్ లార్డ్స్‌కి చేరుకుని స్కూలుటీమును సమీపించాడు. 'టాస్ గెలిచాం. కానీ పిచ్ తడిగా ఉంది' అన్నాడు కెప్టెన్. ఉదయం తుంపరగా వానపడింది కనుక ఇది అందరూ ఊహించుకున్నదే. కెప్టన్ అవతలి టీమువాళ్ళను బ్యాట్ చేయమని అడిగాడు. ఫీల్డర్లు ఒక్కొక్కరుగా వచ్చి తమప్రదేశాల్లో నిలబడ్డారు. ఎంతో ఉత్సాహభరితంగా ఆటమొదలైంది. అవతలి టీమును తక్కువ స్కోరుకే అవుట్‌చేయాలని ఆనంద్ టీము పట్టుదలతో ఉంది.

ఆనంద్‌కి అక్కడ చేయవలసిందేమీ కనిపించేదు. మెల్లగా అక్కడి నుంచిజారుకొని పక్కనే ఉన్న రోడ్డువైపు నడిచాడు. సమీపంలో ఒక టీస్టాల్ ఉంది. అటువైపు అడుగులేశాడు. అక్కడికి వెళ్ళేలోగానే ఒక నల్లని కుర్రవాడు కల్వర్ట్ మీద కూర్చుని తనవైపే చూస్తూ ఉండడం ఆనంద్ గమనించాడు. ఆగి వెనుతిరిగి అతడివైపు చూశాడు. ఎక్కడో చూసినట్టు ఉందే అనుకున్నాడు. క్షణకాలం ఒకరినొకరు అలా చూసుకున్నతర్వాత ఆ కుర్రవాడు ఆనంద్‌ను సమీపించి చేయి చాచి 'నమస్తే' అని పలకరించారు. 'రాత్రి మనిద్దరం దర్గా దగ్గర కలుసుకున్నాం' అంటూ గుర్తుచేశాడు.

ఇద్దరూ కరచాలనం చేసుకుని కల్వర్ట్ దగ్గరకు వెళ్ళికూర్చున్నారు. అక్కడ ఇంకెవరూలేరు.

'నా పేరు సుదర్శన్. ఇక్కడ చాలా తక్కువమందికి నేను తెలుసు. హఫీజ్ నీతో మట్లాడమని పంపించాడు. ఇంతకీ పద్యాలు ఎలా ఉన్నాయి?'

---

(యాషెస్ : ఇంగ్లండు, ఆస్ట్రేలియాల మధ్య జరిగే క్రికెట్ టెస్ట్ మేచ్‌లను ఈ పేరుతో పిలుస్తూ ఉంటారు. ఆ మాట పుట్టడానికి వెనుక కొంత చరిత్ర ఉంది లండన్‌లోని ఓవల్‌లో ఇంగ్లండు టీము మీద ఆస్ట్రేలియా టీము మొదటి గెలుపు సాధించిన తర్వాత 1882లో ఈ మాట పుట్టింది. ఇంగ్లీష్ క్రికెట్ మరణించిందనీ, దానికి అంత్యక్రియలు జరిపి బూడిదను ఆస్ట్రేలియాకు పంపించారనే నిందార్థక వాక్యం ఈ మాటకు నాంది. మరుసటి సంవత్సరం ఒక వికెట్ స్టంపును కాల్చి బూడిదచేసి ఆ బూడిదను ఓ పాత్రలో ఉంచి ఆస్ట్రేలియా పర్యటనలో ఉన్న ఇంగ్లీష్ క్రికెట్ టీమ్ కెప్టెన్‌కు బహూకరించారు. అప్పటి నుంచి ఇంగ్లండు, ఆస్ట్రేలియాల మధ్య జరిగే క్రికెట్ టెస్టుపోటీలను యాషెస్ అంటున్నారు.)

'అవి నా జీవితాన్నే మార్చివేస్తున్నాయి. నా అనుభూతిని మాటల్లో వర్ణించలేను ..!'

'అవసరంలేదు, నాకు తెలుసు. చేయవలసినదల్లా ఆలోచించి నిర్ణయం తీసుకోవడం. నువ్వు హాఫీజ్ దృష్టిలో ఎలా పడ్డావో నాకు తెలియడంలేదు. ప్రభుత్వందృష్టి నీమీద పడినట్టు అతనికి తెలిసిందేమో? విద్యాశాఖ డైరెక్టర్‌గా ఉన్న అతడి అంకుల్— నిజంగా అంకుల్ కాదులే— ఓ దూరపుబంధువుస్నేహితుడు—ఒకవిధంగా నీ గురించి అతడికి చెప్పి ఉంటాడు. పదిహేను రోజుల తర్వాత మరొకరి ద్వారా నిన్ను కాంటాక్టుచేస్తాను. నీకు మరికొంత సాహిత్యం అందుతుంది. జాగ్రత్తగా ఉండాలి. ఈ లోగా కష్టపడిచదివి పబ్లిక్ పరీక్షలకు సిద్ధంగా ఉండు. వచ్చే జూన్‌లో నీ మకాం అఫ్రోజాబాద్‌కు మారుతుందనుకుంటాను. అవునా?'

"అవును. అయితే నా పరీక్షాఫలితంమీద ఆధారపడి ఉంటుంది.అయినా అది మా నాన్నతీసుకోవలసిన నిర్ణయం'.

'నాకు తెలుసు. ఇక నిన్ను వదలిపెట్టడం మంచిదేమో. మ్యాచ్‌కి వెళ్ళాలి కదా'

'అంటే నీ ఉద్దేశం... నా 'యూషెస్'కనా?

'అంతేకావచ్చు. ప్రస్తుతానికి మన విషయంలో కనిపిస్తున్న రేపటిదృశ్యం అదే. ఉంటాను'

సుదర్శన్ వెళ్ళిపోయాడు.

★ ★ ★

కాలం పరుగెడుతోంది. ఆనంద్, అతడి సహవిద్యార్థులు పబ్లిక్‌పరీక్షల ఘట్టంలోకి అడుగు పెట్టారు పరీక్షలు దగ్గరపడినకొద్దీ రెండు విశేషాలు కనిపిస్తున్నాయి. మొదటిది—హాస్టల్ ఆవరణలో రాత్రంతా లాంతర్లు వెలుగుతూనే ఉంటున్నాయి. విద్యార్థులు బనీన్లతో డ్రాయర్లతో—కూర్చునో, కిందకు వాలిపోయో, వెల్లికిల పడుకునో, పక్కకు తిరిగో, దిండ్లకు గెడ్డం ఆనించో—ఇలా రకరకాల భంగిమలు ప్రదర్శిస్తూ వీలైనన్ని పాఠాలు ముక్కునకరచుకునే ప్రయత్నంలో ఉన్నారు. తేలిగ్గా గట్టెక్కించే నోట్సు మీదే ఆధారపడుతున్నారని ప్రత్యేకించి చెప్పనవసరంలేదు. ఇక రెండవ విశేషం—విద్యార్థుల్లో దైవభక్తి అమాంతం పెరిగిపోవడం. ఊళ్ళోకి దిగుమతయ్యే కొబ్బరికాయలు కాక అదనంగా తెప్పించుకోవలసిన అవసరం కనిపిస్తోంది. పరీక్షల రోజుల్లో దేవాలయాలను, మస్జీదులను, ముఖ్యంగా దర్గాలను, ఊళ్ళో ఉన్నరెండుచర్చిలను ఒకసారిచూస్తే చాలు, వయస్సుతో వృత్తితో సంబంధంలేకుండా అవసరంలో ఉన్న ప్రతివాడూ ఎలా భక్తుడుగా మారిపోతాడో అర్థమౌతుంది.

చేయవలసిన యాత్ర ఒకటి మిగిలిపోయింది. వచ్చే శుక్రవారం అది పూర్తి చేయాలనుకున్నారు. అక్కడికి పన్నెండుమైళ్ళదూరంలో ఎంతో మహిమ కలిగిన సోమేశ్వరస్వామి ఆలయం ఉంది. ఆ స్వామి దర్శనం చేసుకోకుండా గుల్షన్‌పూర్‌లో ఉన్న విద్యార్థి ఎవడూ పరీక్షకుకూర్చునే ప్రసక్తేలేదు. అన్ని మతాల విద్యార్థులు ఆయనను దర్శించుకుంటారు. తామంతా ఒకే పరీక్ష రాయ బోతున్నారు కనుక ఒకే దేవుణ్ణి ప్రార్థించుకుంటేనే ఫలితం బాగుంటుందని వాళ్ళ ఆలోచన. కొద్దిరోజులక్రితం ఖవాలీ కచేరీ జరిగిన దర్గా విషయంలో కూడా అదే లాజిక్ ఏది ఎలా జరగ

బోతున్నా, ఏ రూపంలో ఏ నామంతో అన్న విచికిత్సలేకుండా దేవుడికి మొక్కుకున్నందువల్ల వచ్చిపడే లాభాన్ని వదలుకోవడానికి ఏ విద్యార్థీ సిద్ధంగాఉండడు.

దాదాపు వెయ్యిమంది విద్యార్థులు శుక్రవారం నాడు సైకిళ్ళమీద సోమేశ్వరస్వామి ఆలయానికి బయలుదేరారు. దర్శనలాభంతోపాటు ఎంతో వినోదం కూడా కలిగించే యాత్ర అది. ప్రతి విద్యార్థి తనవెంట దారిలో తినడానికి ఆహారపదార్థాలు తీసుకెళ్ళాడు. దారిలో ఒక ప్రసిద్ధ విహారయాత్రాప్రదేశం ఉంది. అక్కడ ఒక పక్కాబావి ఉంది. అందులోని నీళ్ళు తియ్యగా స్వచ్ఛంగా ఉంటాయి. ఆ నీళ్ళను డీజెల్ఇంజిన్ సాయంతో ఒక రిజర్వాయర్‌లోకి తోడుతుంటారు. ఆ రోజు ఆ ఇంజిన్ ఎంతోసేపు అలా పనిచేస్తూనే ఉంది. పిల్లలూ, ఆ దారిన వెళ్ళే ఇతర బాటసారులూ బావిలో నీళ్ళు అలా ఊరుతూనే ఉండడం, కొన్నిగంటలపాటు ఏకబిగిన నీళ్ళు తోడుతున్నా నీటిమట్టం కొంచెమైనా తగ్గకపోవడం చూసి ఆశ్చర్యపోయారు. చుట్టుప్రక్కల ఏ బావిలోనూ అంత ఊటలేదు కనుక ఈ బావి ఇలా ఉండడం ఆ సోమేశ్వరస్వామి ప్రభావమేనని అందరూ విశ్వసిస్తూ ఉంటారు. దానికి సంబంధించి ఒక కథ కూడా చెబుతారు. ఓ భూస్వామి కలలో సోమేశ్వరుడు కనిపించి అతని పొలంలో ఒక చోటు చూపించి అక్కడ బావి తవ్వితే మంచి జలపడుతుందనీ, ఆ నీళ్ళు ఎంతో తియ్యగా ఉంటాయనీ, అయితే తన ఆలయాన్ని దర్శించడానికి వచ్చే భక్తులకు నీళ్ళు ఉచితంగా అందింప జేయాలని ఆదేశించాడట. భూస్వామి ఎంతో భక్తితో అక్కడ ఆ బావి తవ్వించాడు. సోమేశ్వరుడు చెప్పినట్టే నీళ్ళుపడ్డాయి... పిల్లలు తెచ్చుకున్న అంత రుచిలేని పదార్థాలు కూడా ఆ నీళ్ళతోపాటు తింటే ఎంతో రుచిగా అనిపించాయి. రెట్టింపు ఉత్సాహంతో యాత్ర కొనసాగించే శక్తి తమందరికీ వచ్చిందనుకున్నారు.

ఆనంద్ తాను తెచ్చుకున్న పదార్థాలు తినబోతుండగా, మరో కుర్రవాడు అతనిని పేరు పెట్టి పిలిచి తనను పరిచయం చేసుకున్నాడు. 'నాపేరు బ్రహ్మరాజ్. సుదర్శన్ పంపించాడు. మొత్తానికి నిన్ను ఎలాగో పట్టుకోగలిగాను. బహుశ ఇలా కలుసుకోవడమే సురక్షిత మార్గం అనుకుంటాను. అంతమంది అపరిచిత యాత్రికులమధ్య నువ్వు ఒక్కడివే ఉన్నావు'.

'నిన్ను కలుసుకున్నందుకు సంతోషం బ్రహ్మ.' పాతస్నేహితుడితో అన్నట్టు అన్నాడు ఆనంద్. 'సుదర్శన్' అని పేరు అతడిమీద మంత్రంలా పనిచేసింది. ఏదో గూఢుపుఠాణి, ఏదో సాహసకార్యం చేస్తున్నట్టు ఇద్దరూ ఉత్తేజితు లయ్యారు.

'నేను మీ హాస్టల్‌కు వచ్చినరోజున, నువ్వు కూడా ఈ యాత్రకు వెళ్ళబోతున్నావన్న విషయం తెలియదు. మీ హాస్టల్‌లో పనిచేసే పంకజ్‌తో కాసేపు మాట్లాడాను. చాలామంచివాడు. నువ్వంటే చాలా అభిమానం. నిన్ను తన సొంత కొడుకులా చూసుకుంటానని నాతో చెప్పాడు. 'ఘనత వహించిన ప్రభువులవారి సర్కారీ సేవలో' అని ముద్రించిన ఓ పెద్ద కవరు అతని చేతికి అందించాను. రహస్యపత్రాల్ని చేరవేయడానికి అంతకంటె మంచి ఉపాయంలేదు. లోపల ఏముందో చూసి సమయం వృథా చేసుకోవాలని ఎవడూ అనుకోడు. ఆ కవరు తనే స్వయంగా నీకు అందిస్తానని పంకజ్ చెప్పాడు. అతణ్ణి నమ్మి పొరపాటుచేయలేదు కదా?' సందేహిస్తూనే అడిగాడు బ్రహ్మరాజ్.

'ఎంతమాత్రం పొరపాటులేదు. పంకజ్ ఇక్కడికెంతో దూరంలో ఉన్న ఓ గిరిజన ప్రాంతంనుంచి వచ్చాడు. అతనికి పిల్లలు లేరు. నన్ను అక్షరాలా తన కొడుకులా చూసుకుంటాడు. అతడు మా

గార్డియన్ కూడా. నిజాయితీకి ప్రతిరూపంగా అతని గురించి అంతా చెప్పుకుంటారు. రెండేళ్ళ క్రితం అతడు హాస్టల్‌కి వచ్చినప్పటినుంచి చిన్న దొంగతనం కూడా జరగలేదు. అదిసరే, నువ్వు ఇంతకీ ఏమైనా తిన్నావా లేదా? త్వరలో మేము ఇక్కడినుంచి కదలబోతున్నాం.'

'ఏమీ తెచ్చుకోలేదు. చెడ్డ ఆకలిగా కూడా ఉంది'

'పద, ఆ మర్రిచెట్టు దగ్గర ఉన్న క్యాంటీన్‌కు వెడదాం.'

టిఫిన్ తీసుకుంటూ బ్రహ్మరాజ్ ఆనంద్ చెవిలో గుసగుసగా అన్నాడు 'నేను అందించిన కవరులో మరింత విప్లవసాహిత్యం ఉంది. రకరకాల దస్తూరీలలో రాసిన ముప్పైఎనిమిది నిషేధితపద్యాలు ఉన్నాయి. వాటిని చదివిన ఏ యువకుడూ ఉత్తేజితుడు కాకుండా ఉండలేడు. అద్భుతమైన పద్యాలు.'

'ఎప్పుడు చదువుతానా అనిపిస్తోంది' అన్నాడు ఆనంద్.

తర్వాత ఇద్దరూ మామూలుగా మాట్లాడుకుంటూ సైకిల్‌మీద తాపీగా వెడుతున్నారు. 'ఎందుకో నాకర్థం కావడంలేదు కానీ, హఫీజూ, విద్యాశాఖ డైరెక్టరూ నిన్ను తమ గుప్పిట్లోకి తీసుకోవాలనుకుంటున్నారు. అయితే ఎవరి కారణం వారిదేననుకో. ఎన్నో త్యాగాలకు సిద్ధమై సాయుధపోరాటం సాగిస్తే తప్ప రాష్ట్రప్రజల్ని విముక్తుల్ని చేయలేమన్న హఫీజ్ అభిప్రాయంతో నూటికి నూరుపాళ్ళూ నేనేకీభవిస్తున్నాను. ఖాదిమాన్ (రాజుగారి ప్రైవేట్ సైన్యం) ఉద్యమం నానాటికీ విస్తరించిపోతోంది. ఆ ఉద్యమంతో తమకేమీ సంబంధం లేనట్టు ప్రభుత్వమూ, రాజూ నటిస్తున్నారు కానీ ఉద్యమం వెనుక ఉన్నది రాజేనని ప్రతి ఒకరికీ తెలుసు. ఇక బ్రిటిష్ ఇండియాలో మహాత్మాగాంధీ, ఆయన అనుచరులు అహింస గురించి, సత్యాగ్రహం గురించి మాట్లాడుతున్నారు. నామటుకు నాకు ఆ భాష ఏమీ బోధపడడంలేదు. ఏమైనా ఆ భావాలు ఇక్కడున్న పరిస్థితులకు పనికిరావు... చెప్పు, ఇంతకీ నువ్వేం నిర్ణయించుకున్నావ్? హఫీజ్ తెలుసుకోమన్నాడు. కాన్పూర్‌లో ఉన్న తన మిత్రులకు నిన్ను పరిచయం చేయాలనుకుంటున్నాడు. సుదర్శన్‌కు అసలు ఊపిరిసలపడం లేదు. అందుకే, రాయబోయే పరీక్ష ఏమీ లేకపోయినా నేను కూడా ఇలా యాత్ర చేయవలసివచ్చింది.'

'నువ్వన్నది నిజం. నా కాలేజీ చదువుకు పెద్ద మొత్తంలో స్కాలర్‌షిప్ మంజూరుచేయిస్తానంటూ జిల్లా కలెక్టర్ ద్వారా విద్యాశాఖ డైరెక్టర్ మా నాన్నగారికి కబురు పంపించారు. నాకు మాత్రం ఉద్యమంలో పనిచేయాలని ఉంది ప్రభుత్వోద్యోగం చేయకూడదని నేను నిర్ణయించుకున్నాను. రాచరికవ్యతిరేకోద్యమంలో చేరాలని కూడా నా నిర్ణయం. ఇంతకుమించి మరేవీ నా ఊహాలోలేవు .'

కొద్దిసేపు మౌనంగా ఉండిపోయి బ్రహ్మరాజ్ ఆ విషయం నుంచి సంభాషణ మళ్ళిస్తూ ఆనంద్‌ని అడిగాడు 'రాత్రిపూట ఈ మర్రిచెట్టును నువ్వు గుర్తుపట్టగలవా?'

'తప్పకుండా గుర్తుపడతాను. సోమేశ్వరస్వామిఆలయానికి వెళ్ళే మార్గంలో ఎనిమిదో మైలు రాయికి దగ్గరగా ఉంది.'

'బాగుంది. కొన్ని నిర్ణీతసమయాల్లో నువ్విక్కడికి రావలసి ఉంటుంది. ముఖ్యంగా మసక చీకటివేళ.'

'అదేం పెద్ద సమస్యకాదు. తినడానికి ఏదైనా తీసుకుని మరీ వస్తాను అనుకోకుండా ఊడిపడే అతిథి కోసం మరికాస్త ఎక్కువే తీసుకునివస్తాను...'

'ఈ రాచరికపు చిట్టచివరి అవశేషాన్ని, ఈ అఫ్రోజాబాద్ ప్రభుత్వాన్ని అంతమొందించడమే ఇప్పుడు నీ ప్రధాన కర్తవ్యం.'

ఆలయంవైపు సాగిపోతున్న యాత్రికుల ప్రవాహంలో ఇద్దరూ కలిసిపోయారు.

యాత్రకు వెళ్ళొచ్చాక అప్పుడప్పుడు ఆనంద్ ఆ మర్రిచెట్టు దగ్గరికీ, అక్కడినుంచి అయిదు మైళ్ళ దూరంలో కొండల్లో ఉన్న మరోచోటుకీ వెళ్ళొస్తున్నాడు. దూరంనుంచి చూస్తున్నవాళ్ళకి అక్కడేదో జరుగుతోందన్న అనుమానం కలగనే కలగదు. మర్రిచెట్టు దాటిన తర్వాత సైకిల్‌మీద వెళ్ళడం కష్టం. అక్కడ కలుసుకునే మిత్రులు మసకవెలుగు ముసుగులో మిగిలిన దూరం నడిచి వెళ్ళవలసిందే. వాళ్ళు మొత్తం పన్నెండుమంది వరకూ ఉంటారు. వాళ్ళలో బ్రహ్మరాజ్ ఒక్కడే ఆనంద్‌కి తెలుసు. వివిధదేశాల్లో జరుగుతున్న సాయుధ పోరాటాల గురించి, అమలుచేసే ఎత్తుగడల గురించి, ఆ పోరాటాల్లో సాధించిన విజయాల గురించి చర్చించుకుంటూ ఉండే వారు. అహింసపై,సత్యాగ్రహంపై వాళ్ళలో ఏదో తేలికభావం కనిపించేది. తుపాకులు, ఇతర పేలుడు సామగ్రి వినియోగంలో శిక్షణ పొందే మార్గం వాళ్ళకు కనిపించలేదు. అందుబాటులో తగిన సౌకర్యాలు లేవు. 'పరీక్షలో నెగ్గి, వచ్చే జూన్‌లో అఫ్రోజాబాద్ యూనివర్సిటీలో చేరిన తర్వాత నీకు శిక్షణ లభిస్తుంది'— ఆనంద్‌తో చెప్పాడు బ్రహ్మరాజ్... ఆనంద్‌కు ఎదురుగా ఎటుచూసినా విప్లవ జ్వాల! తన ఉత్సుకతను ఎలాగో అణచుకుంటూ క్రమం తప్పకుండా సమావేశాలకు వెళ్ళొస్తున్నాడు.

★ ★ ★

పబ్లిక్‌పరీక్షలతర్వాత తన ఊరికి వెళ్ళిన ఆనంద్, అందరూ తనవైపే కుతూహలంగా చూస్తూ ఉండడం గమనించాడు. అతడికేమీ అర్థం కాలేదు. ఉత్కంఠను ఆపుకోలేక అమ్మ దగ్గరకి వెళ్ళి కారణం ఏమై ఉంటుందని అడిగాడు. ఆమె ఓసారి అతణ్ణి నఖశిఖపర్యంతం చూసి 'ఈ ఆరెనిమిది మాసాల్లో నువ్వెంత పొడుగెదిగిపోయావో తెలుసా? నా కళ్ళను నేనే నమ్మలేక పోతున్నాను. దిష్టి తగలకుండా ఆ దేవుడు నిన్ను కాపాడాలి' అంది.

తనకెంతో ఇష్టమైన ఊరిబావిలో ఈతకొట్టడానికి వెడుతున్నప్పుడు ఎందరో ఆడపిల్లలు గుమ్మాల్లో నిలబడి తనవైపే చూస్తూ ఉండడం కూడా ఆనంద్ గమనించాడు. రెండేళ్ళక్రితంవరకు బాల్యస్నేహితులుగా వీళ్ళంతా తన దగ్గరకు ఎంతో స్వేచ్ఛగా వచ్చేవారు, మాట్లాడేవారు. కానీ ఇప్పుడు... ఓరి దేవుడా! తానెంత తేడాగా కనిపిస్తున్నాడు! తేడాగానే కాదు, ఎదిగిన మగవాడిలా కనిపిస్తున్నాడు! ఆడపిల్లల్లో కూడా ఏదో మార్పు అతనికి కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. అది శారీరకమైన మార్పును మించిన మార్పు. వాళ్ళందరికీ పెళ్ళిళ్ళయిపోయాయి. కొంతమంది త్వరలోనే కాపురానికి కూడా వెళ్ళబోతున్నారు. ఇదివరకటిలా వాళ్ళ దగ్గరకు తాను వెళ్ళలేకపోతున్నాడు. కనీసం దూరంనుంచి మాట్లాడే సాహసం కూడా చేయలేకపోతున్నాడు. మీద పడుతున్న యవ్వనం, నియంత్రిస్తున్న లైంగికస్పృహ వాళ్ళను ముళ్ళకంచెల్లా చుట్టేస్తున్నాయి. ఎంత ముగ్ధత్వాన్ని కోల్పోయారో— శాశ్వతంగా!

అఫ్రోజాబాద్‌లో జీవితం విజ్ఞానదాయకంగానూ, రాజకీయంగా మహోద్ధృతంగానూ ఉంది. ఆనంద్ తన శిక్షణమీద ఎంతో శ్రద్ధ చూపిస్తున్నాడు. చూసేవాళ్ళకి అది యూనివర్సిటీ ట్రైనింగ్ కోర్ శిక్షణ అనిపించేలా జాగ్రత్తపడుతున్నాడు. ఒకే సమయంలో అనేక ఉద్యమాలు విరుచుకు పడుతున్నాయి. ఉద్యమకారులకు, ఖాదిమాన్‌కు మధ్య జరుగుతున్న ఘర్షణలకు సంబంధించిన వార్తలు రోజూ వచ్చిపడుతున్నాయి. ప్రత్యేకించి ఒక వ్యక్తి చర్యలపై నిఘా వేయడమనేది లేదు. ప్రతిఘటన వాతావరణం ఊహకందని వేగంతో అన్నివైపులకూ విస్తరించి పోతోంది. రాష్ట్రం వెలుపలి పత్రికలు, ఖాదిమాన్ సాగిస్తున్న అత్యాచారాల గురించి, సాధారణ ప్రజలు పడుతున్న కడగండ్ల గురించి విస్తృతంగా రాస్తున్నాయి.

ఇంతలో 'క్విట్ ఇండియా' ఉద్యమం బ్రిటిష్ఇండియా మొత్తాన్ని ప్రభంజనంలా ఊపివేస్తోంది. ఆనంద్ ఆ ఉద్యమం వైపు ఆకర్షితుడయ్యాడు. అతడు, సుదర్శన్ కలిసి రాష్ట్రం సరిహద్దులు దాటి పొరుగు రాష్ట్రానికి వెళ్ళి మహాత్మాగాంధీ ఇచ్చిన 'చర్యో, చావో తేల్చుకోండ'న్న పిలుపును అణువణువునా నింపుకుని ఉత్తేజితులవుతున్నారు. తమకు సాధ్యమైన రీతిలో, స్థానికంగా ఉన్న హఫీజ్ మిత్రులతో తమకున్న పరిమిత పరిచయాలను ఉపయోగించుకుని ఉద్యమంలో పాలుపంచుకున్నారు. క్విట్ ఇండియా ఉద్యమం ముగిసి దేశం స్వతంత్రం కూడా అయిన తరువాత వారు అఫ్రోజాబాద్‌పై దృష్టిని కేంద్రీకరించి, మరికొంత కాలం అక్కడ పనిచేయడానికి తిరిగొచ్చారు.

అఫ్రోజాబాద్‌లోని ప్రధానప్రతిఘటనపక్షం రాష్ట్రవ్యాప్తంగా సత్యాగ్రహోద్యమాన్నీ, స్థానిక రాజకీయఅవసరాలదృష్ట్యా సమాంతర సాయుధపోరాటాన్నీ సాగించాలని నిర్ణయించినట్టు ఆనంద్‌కి తెలిసింది. విప్లవకార్యాచరణకు లక్ష్యమైన ఏకగ్రీవ నినాదం ఒకటే— రాజును పదవీభ్రష్టుణ్ణి చేయాలి! రాష్ట్రాన్ని ఇండియన్ యూనియన్‌లో విలీనం చేయాలి!

# 9

ఆ నిశ్శబ్ద నిశీథికి ఛిద్రంచేస్తూ ఎవ్వరికీ తెలియని తుపాకికాల్పులు హఠాత్తుగా ఎడతెరిపి లేకుండా వినిపించసాగాయి. ఉలికిపడి ఒక్క ఉదుటున నిద్రలోంచి లేచికూర్చున్న గ్రామస్థులు భయంతో వణికిపోతూగుడిసెల్లోనే ఉండిపోయారు. అప్పటికి టైమెంతయిందో కూడా వాళ్ళకి తెలియదు. వాచీలు కాని, గడియారాలుకానీ వాళ్ళెరగరు. రాష్ట్రంలో ఓ మారుమూల జిల్లాలో ఉన్న కుగ్రామం అది. జనాభా వెయ్యిమంది వరకూ ఉంటారు. ఆ నిశ్శబ్దానికి తోడు ఉండుండి వినిపిస్తున్న గుడ్లగూబ అరుపులు. గ్రామం శివార్లలోని ఓ చెట్టుమీద కొంతకాలంగా ఆ గుడ్లగూబ తిష్ఠవేసింది. అప్పటినుంచి కీడును శంకింపజేస్తూ గ్రామస్థుల గుండెల్లో ఏవో తెలియని భయాలు. ఎంత ప్రయత్నించినా ఆ గుడ్లగూబను అక్కడినుంచి కదిలించలేకపోయారు. ఆ గుడ్లగూబ త్వరలోనే వచ్చి మీద పడబోతున్న ప్రళయానికి సూచన అన్న నిశ్చయానికి వచ్చారు. వాళ్ళు భయపడినట్టే విధ్వంసం గుమ్మంలో నిలబడి తలుపుతడుతోంది గ్రామంలో ఉన్న పూజారినోట వాళ్ళు కాళరాత్రి అనే మాట అప్పుడప్పుడు వింటూ ఉంటారు. ఆ రాత్రి ప్రపంచం అంతమై పోతుందట. బహుశా ఈ రాత్రి అదేనేమో— కచ్చితంగా అంతే— అనుకుంటూ కళ్ళుగట్టిగా మూసుకున్నారు – ఆ భయంకర మహావిలయాన్ని, ప్రపంచం అంతరించిపోతున్న ఆ భీకర దృశ్యాన్ని చూడడం తప్పించుకోడానికా అన్నట్టు.

ఆ గ్రామం పేరు వీరాపురం. గ్రామాన్ని ఆనుకుని దట్టమైన అడవి. అది ప్రభుత్వ రిజర్వ్ ఫారెస్ట్. కొన్ని వారాలుగా ఖాదిమాన్ మూక ఊరిమీదపడి సాగిస్తున్న దోపిడీలతో గ్రామస్థులు విలవిల్లాడిపోతున్నారు స్టేట్ పోలీసులూ, అటవీశాఖలోని చిన్నచిన్న ఉద్యోగులూ, స్థానిక భూస్వాములూ ఆ గ్రామం విసిరేసినట్టు ఓ మూల ఉండడం చూసి, గ్రామస్థులకు తగిన రక్షణ లేకపోవడాన్ని అవకాశంగా తీసుకుని విచ్చలవిడిగా బీభత్సం సాగిస్తున్నారు. వరసగా కొన్ని రాత్రిళ్ళు ఖాదిమాన్ కార్యకర్తలు గ్రామంలోకి వచ్చిపడి గొర్రెల్ని, మేకల్ని, కోళ్ళనీ, ధాన్యాన్నీ కొల్లగొట్టుకుపోయారు. ఆపైన ఏమైనా మిగిలిఉంటే స్టేట్ పోలీసులు దోచుకుపోయారు. ఊళ్ళోని యువతుల్ని ఎక్కడికో తరలించుకుపోవడం! దేనికంటే, అక్కడి పరిపాలనకు అద్దంపట్టే రీతిలో క్రూరమైన హాస్యం మేళవించి నర్మగర్భంగా 'సోదా' చేయడానికని చెప్పడం! ఆ యువతులు రేగిన జుట్టుతో, ఒంటినిండా గాయాలతో గ్రామానికి తిరిగివచ్చేవారు. ఒకర్తను కూడా విడిచి

పెట్టకుండా అందరినీ మానభంగం చేసేవారు. ఆ తర్వాత వచ్చివాలి పీక్కుతినే రాబందులు ఫారెస్టు గార్డులూ, ఫారెస్టర్లూ. ఆ ప్రాంతానికి వాళ్ళు మకుటంలేని రాజులు. ఒక్కొక్కడు ఒక్కొక్క నియంత. గ్రామంలో వాళ్ళకి లభ్యంకానిదేదీ ఉండదు. వాళ్ళ అనుగ్రహం లోపిస్తే గ్రామస్థులు— ఆడయినా, మగయినా— రిజర్వ్ ఫారెస్టులోకే అడుగు పెట్టలేరు; చివరకు కాలకృత్యాలు తీర్చు కోడానికి కూడా.

కిందటివారంలో ఖాదిమాన్ మూకలు, పోలీస్ పార్టీలు ఊళ్ళోకి రానిరోజు ఒక్కటీలేదు. కొందరు 'రహస్య కార్య కర్తలు' సమీపంలోని రిజర్వ్‌ఫారెస్ట్‌లో తలదాచుకుంటున్నారన్న వదంతి వ్యాపించింది. గ్రామస్థులు ఆ తిరుగుబాటు శక్తులకు ఆహారమూ, ఆశ్రయమూ ఇస్తున్నట్టు పోలీసులు విశ్వసిస్తున్నారు. గ్రామస్థులకు ఈ విషయాలేవీ తెలియవు. అయినా పోలీసులు మాటిమాటికి వస్తూనే ఉన్నారు. ఊళ్ళో ఉన్న గొర్రెలు, మేకలు, ధాన్యం అదృశ్యమైపోతూనే ఉన్నాయి. ఎందరెందరో ఆడవాళ్ళు తమ కాళ్ళమీదనుంచి రక్తం స్రవిస్తుండగా చినిగిన దుస్తులతో, చింపి రి జుట్టుతో అడవినుంచి తిరిగొస్తూనే ఉన్నారు. అవమానం, నిస్పృహ ముప్పిరిగొన్న గ్రామస్థులు అందుకే కాళరాత్రిని హృదయపూర్వకంగా ఆహ్వానించుకుంటున్నారు. అంతులేని దుఃఖాలనుంచి, బాధలనుంచి అప్పుడే తమకు విముక్తి అనుకుంటున్నారు.

కాల్పుల శబ్దాలు వినిపించిన వెంటనే, ఆ చీకట్లో గుడ్డిదీపాలు మిణుకుమిణుకుమంటూ కనిపించాయి. ఓ డజనుమంది పోలీసులు బరువుగా తొక్కుడు పద్ధతిలో అడుగులు వేస్తూ వీధిలో పరుగులు తీస్తున్నారు. వాళ్ళచేతుల్లో టార్చిలైట్లు, హరికేన్ లాంతర్లు. కొన్ని ఎంపికచేసిన గుడిసెల తలుపులు విరగ్గొట్టి ఓ నలభైమంది స్త్రీపురుషుల్ని గ్రామం మధ్యలో ఉన్న ప్రదేశానికి తీసుకెళ్ళారు. జరుగుతున్నదేమిటో అర్థంకాని ఆ గ్రామస్థులు అయోమయంతో, స్థాణువుల్లా నిలబడిపోయారు. పోలీసులు ఓ పక్క తమమీద బండబూతులు దొర్లిస్తూంటే కళ్ళు చెదరగొడుతున్న లాంతర్ల వెలుగులో గుడ్లుమిటకరించి చూస్తూ ఉండిపోయారు. తిట్ల తర్వాత తన్నులు. బాధతో మెలితిరిగిపోతూ ఎక్కడ నిలబడినవాళ్ళు అక్కడే కుప్పకూలిపోయారు. పోలీసుల నాయకుడు ఓ సబ్‌ఇన్‌స్పెక్టర్. ఏపుగా పెంచిన మీసాలతో, రక్తం ఉబికివస్తోందా అన్నట్టుగా ఉన్న కళ్ళతో మహాక్రూరంగా కనిపిస్తున్నాడు. పిడుగుపాటును తలపించే దెబ్బపడినప్పుడు మాత్రం మెచ్చుకోలుగా ఏదో ధ్వనిచేస్తూ మౌనంగా నిలబడ్డాడు. అతనివెనుక నీడలా ఊరి పటేల్— భయంతో వణికిపోతూ. సబ్‌ఇన్‌స్పెక్టర్ హఠాత్తుగా వెనుతిరిగి పటేల్ చెంప ఛెళ్ళుమనిపించాడు.

'ఎక్కడ్రా ఆ టెర్రరిస్టు? చెప్పరా గాడిదకొడకా?' గర్జించాడు.

పటేల్ బాధతో మూలుగుతున్నాడు

'వాణ్ణి అప్పజెప్పు లేకపోతే నిన్ను నరికిపారేస్తాం. ఈ ఊరిని తగలబెట్టేస్తాం' సబ్‌ఇన్‌స్పెక్టర్ ఆ ముసలివాడిపై కేకలు వేస్తున్నాడు. తనకంటె పైన ఉన్న సర్కిల్ ఇన్‌స్పెక్టర్ తనమీద మండి పడుతూ చేసిన హెచ్చరికను గుర్తుచేసుకుంటున్నాడు. 'ఆ టెర్రరిస్టు కుక్కనీ, వాడి మురానీ చంపిగానీ, ప్రాణాలతో కానీ తీసుకురాకపోయావో నీ ఉద్యోగానికి ఇక నూకలు చెల్లిపోతాయి, జాగ్రత్త '

'దొరా నా మాట నమ్ము... ఆ లంజకొడుకుల గురించి ఇక్కడి వాళ్ళెవరికీ ఏమీ తెలువదు. ఎవరూ వాళ్ళను చూడలేదు. వాళ్ళ నాయకుడు గానీ, మురాలో ఏ ఒక్కడుగానీ మా కంటపడితే మేమే ముక్కలుముక్కలుగా నరికి మీకు అప్పగిస్తాం. .' తడబడుతూ తటపటాయిస్తూ అంటున్న పటేల్ మాటల్ని ఇన్‌స్పెక్టర్ వినిపించుకోడంలేదు. హఠాత్తుగా తనకింది ఉద్యోగి ఒకరిని పిలిచి అతడి చెవిలో ఏదో గుసగుసలాడాడు పోలీసులు బిలబిల్లాడుతూ అన్నివైపులకూ వెళ్ళిపోయి గ్రామాన్ని సోదా చేయడం ప్రారంభించారు. మధ్య మధ్య ఎవరో గ్రామస్థుణ్ణి ఈడ్చుకొస్తున్నారు. నిర్దాక్షిణ్యంగా కొట్టి హింసిస్తున్నారు.



శిథిలమైన ఓ మట్టిగోడ మీద ఆనంద్ ఇబ్బందిగా కూర్చుని ఉన్నాడు. పోలీసుల టార్చిలైట్ల నుంచి తప్పించుకోడానికి ఆ గోడమీదికి పాకాడు కానీ దాగడానికి అది అంత అనుకూలమైన స్థలంలా అతనికి అనిపించడంలేదు. గోడమీద మొలిచిన గడ్డి, కలుపుమొక్కలు తాను పోలీసుల కంటపడకుండా కాపాడగలుగుతున్నాయి కానీ, ఏ కొంచెం జారినా తాను నేరుగా వెళ్ళి పోలీసుల కబంధహస్తాల్లో పడిపోతాడు. ఆ గోడను నిర్మించి కనీసం వందేళ్ళయినా అయుంటుంది. ఎవరో చిల్లరప్రభువు బందిపోట్లనుంచి, అడవి జంతువులనుంచి రక్షించుకోడానికి కట్టించి ఉంటాడు. చాలావరకూ కూలిపోయింది కానీ కొంతమేర మాత్రం కాలానికి ఎదురొడ్డి నిలబడిఉంది. గోడ కిందిభాగం రానురాను శుష్కించిపోయి కంతలు పడింది. ఆ కంతల్లోంచి పిల్లులు, పందికొక్కులు, ఒక్కొక్కసారి చిన్నపిల్లలు కూడా తేలిగ్గా దూరిపోవచ్చు. అడుగుభాగం శిథిలమై విచ్ఛిన్నమైపోయినా, పునాదులు మాయమైనా ఆ గోడ ఇంకా అలా నిలబడి ఉండగలగడం ఆశ్చర్యం కలిగిస్తోంది. శతాబ్దాలుగా జరుగుతున్న దాడుల వల్ల ప్రాణశక్తులు పూర్తిగా క్షీణించిపోయినా, బాహ్యచిహ్నాలను మాత్రం ఎలాగో నిలబెట్టుకున్న ఒక పురాతననాగరికతను గుర్తుకుతెస్తోంది ఆ గోడ.

ఆ గోడ ఎంతవరకు విస్తరించిందో ఆనంద్ గమనించలేకపోయాడు. తరుముకొస్తున్న మృత్యువును తప్పించుకునే క్షణాలలో మాత్రమే సాధ్యమయ్యే ఒక్క గెంతులో ఆ గోడమీదికి లంఘించగలిగాడు. ఎండు గడ్డిచాటున తనను పూర్తిగా దాచుకుంటూ గోడకు కరుచుకుపోయాడు. తక్షణం తాను పోలీసుల కంటబడకుండా ఆ గడ్డే తనను కాపాడింది. ఆ ఆందోళనభరిత క్షణాలలో అదే తనపాలిట వరప్రసాదంగా తలపోశాడు.

పోలీసుపటాలం దృఢనిశ్చయంతో గ్రామంలో కలియతిరుగుతూ ఉండడం అతడి కంటబడుతూనే ఉంది. అడవిలోంచి పారిపోయి వస్తున్నప్పుడు శరీరంమీద పడిన గాట్లు, గాయాల బాధ హఠాత్తుగా తెలిసొచ్చింది. ఆ బాధను మరచిపోవడానికి విశ్వప్రయత్నం చేస్తూ ఏ మాత్రం కదలకుండా అలాగే ఉండిపోయాడు.

ఆనంద్, సుదర్శన్, బ్రహ్మరాజ్, రంగా ముందురోజు రాత్రి అక్కడికి ఆరుమైళ్ళ దూరంలో ఉన్న పోలీస్ ఔట్‌పోస్ట్‌పై దాడిచేసి ఆరు .303 బోల్ట్‌యాక్షన్ రైఫిళ్ళనూ, కొన్ని మజిల్ లోడర్లనూ స్వాధీనం చేసుకున్నారు. ఆ దాడి ఎంతో విజయవంతమైంది. ఒక్కడు కూడా గాయపడలేదు.

తాము ఎంతగానో కోరుకుంటున్న ఆయుధాలు కూడా దొరికాయి. అయితే పోలీసులు మరీ అంత అప్రమత్తంగా లేరు. పారిపోతున్న విప్లవకారుల్ని వెంటాడడం ప్రారంభించారు.

'ఎక్కడా ఎవరూ లేరు సర్కార్' హెడ్‌కానిస్టేబుల్ వచ్చి చెప్పాడు. అతని పొట్ట బోర్లించిన కుండలా ఉంది. అందులోంచి ఏకంగా ఒక మేకపోతు బతుకుజీవుడా అనుకుంటూ బయటపడగలదు. సోదా ప్రారంభించడానికి ముందు అతడు మిగిలిన కానిస్టేబుళ్ళతో కలిసి పటేల్ ఇంట్లో పీకల దాకా కల్లు పట్టించాడు.

'ఎక్కడ చూశార్రా తాగుబోతుముండకొడుకుల్లారా?' సబ్‌ఇన్‌స్పెక్టర్ కేకలువేశాడు.

'అన్నిచోట్లా చూశాం సర్కార్' గొణిగాడు హెడ్‌కానిస్టేబుల్, చేయి వణకకుండా శాల్యూట్ చేయడానికి శత విధాల ప్రయత్నిస్తూ.

'నే నేమైనా తెలివితక్కువముండ కొడుకుననుకుంటున్నారా? మీరే మాత్రం గాలించారో గుడ్డోడు కూడా చెప్పగలడు. ఇక్కడిక్కడే తిరిగొచ్చారు. ఇప్పుడు చెప్పేది జాగ్రత్తగా వినండి. వెంటనే ఆ కుక్కను పట్టుకోలేకపోయారో వచ్చే వారంనుంచి వీధుల్లో అడుక్కుతింటరు. నాకు ఇంకా చిర్రెత్తేలోగా వెళ్ళి బాగా వెతకండి.'

హెడ్‌కానిస్టేబుల్ మిగిలిన కానిస్టేబుళ్ళను తీసుకుని వెళ్ళిపోయాడు. ఇంకా ఇంకా గ్రామస్థులని బయటకులాక్కొచ్చి తిడుతూ కొడుతూ అదేపనిగా హింసిస్తున్నారు. వాళ్ళ కృశించిన శరీరాల మీద పడుతున్న లాఠీదెబ్బల చప్పుడుతో పరిసరాలు ప్రతిధ్వనిస్తున్నాయి.

ఆనంద్ ఉద్రిక్తుడయ్యాడు. తుపాకిపై అతని చేయి బిగుసుకుంది. తలచుకుంటే ఉన్నచోటునుంచే వీధిలో ఉన్న పోలీసులందరిపై గుళ్ళ వర్షం కురింపించగలడు. తనలాగే గ్రామంలో మరోచోట నక్కివున్న మిగిలిన వాళ్ళు కూడా అలాగే అనుకుంటున్నారేమోననుకుని భయపడ్డాడు. అటు వంటి పిచ్చిపని ఎవరూ చేయకూడదని మనసులోనే దేవుణ్ణి వేడుకున్నాడు. అదే జరిగితే ఎందరో అమాయకగ్రామీణులు కాల్పుల మధ్య చిక్కుకుని ప్రాణాలు కోల్పోతారు...

ఇంతలో సబ్‌ఇన్‌స్పెక్టర్ మట్టిగోడవైపు టార్చ్ చూపించి ఒక్క కేక పెట్టాడు, "ఏయ్ రహీం! ఆ గోడ చూశావా? మీదికెక్కి ఎవరైనా ఉన్నారేమో చూడు. త్వరగా... గాడిదకొడకా."

కానిస్టేబుల్ గోడను సమీపించాడు. టార్చ్ పైకిక్రిందికీ ఆడించాడు— అడుగుమోపే ఆధారం కోసం వెతుకుతూ. రాత్రి మొదట్లో కాస్త జల్లుపడి గోడ తడిసి అడుగు జారిపోయేలా ఉంది. ఎక్కడం అంత తేలికకాదు. కానిస్టేబుల్ తటపటాయిస్తూ అక్కడే నిలబడిపోయాడు.

సబ్‌ఇన్‌స్పెక్టర్ ఆదేశం చెవిన పడగానే ఆనంద్ గడ్డకట్టుకుపోయాడు.

తుపాకీని కాల్పులు జరపడానికి వీలైన పొజిషన్‌లో ఉంచుకోడానికి చప్పుడుచేయకుండా ఓసారి చుట్టూచూశాడు. తాను వాళ్ళ కంటబడిన మరుక్షణం మొట్టమొదట సబ్‌ఇన్‌స్పెక్టర్ మీద, ఆ తర్వాత హెడ్‌కానిస్టేబుల్ మీద, ఆతరువాత మిగిలిన పోలీసుల మీద కాల్పులు జరపాలనుకున్నాడు.

కానిస్టేబుల్ అదేపనిగా టార్చ్‌ను పైకీ కిందకీ ఆడిస్తూ గోడకు ఆ చివరనుంచి ఈ చివరివరకు నడిచాడు. హఠాత్తుగా వెనక్కి ఒక్కగెంతుగెంతి, పాము... పాము అంటూ అరిచాడు.

తన పాదాల దగ్గర వందలాది విషసర్పాలు ఉన్నట్టు భయంతో వణికిపోతూ గోడకు దూరంగా పరుగెత్తాడు. అతణ్ణి చూసి సమీపంలో ఉన్న పోలీసులు కూడా పరుగు లంకించుకున్నారు. 'ఆగండ్రా పిరికిపందల్లారా... పనికిరాని గాడిదల్లారా' సబ్‌ఇన్‌స్పెక్టర్ కేకలు వేశాడు. పోలీసులు గొర్రెల్లా ఆగిపోయారు. సబ్‌ఇన్‌స్పెక్టర్ పటేల్‌వైపు ప్రశ్నార్థకంగా చూశాడు

'అవును హుజూర్. ఆ గోడనిండా పాములు... పైగా తాచుపాములు. నాకు అరవై రెండేళ్ళయ్యా! ఆ గోడ ఎక్కగా నేనింతవరకు ఎవర్నీ చూడలేదు. ఆ దొంగ అక్కడే గనక ఉంటే తాచుపాములు కచ్చితంగా వాడి పనిపడతాయ్. నామాటనమ్మండి.. మీ బుల్లెట్లను మిగిలిన లంజకొడుకుల కోసం ఆదాచేసుకోవచ్చు.'

పాముల్ని ఉద్దేశించి ఆనంద్ మనసులో అనుకున్నాడు... మహా యిల్లాలు మా అమ్మ నాగపంచమిరోజున మీ పుట్టల్లో కడవలకొద్దీ పాలుపోసింది. అందుకు ప్రతిఫలం మీరు ఎలా చెల్లిస్తారో చూస్తాను. రాజు పాలు తాగి, తన ప్రజలమీద విషం కక్కుతున్నట్టు మీరు కూడా విషం కక్కుతా రేమో చూస్తాను... రండి, ఆడుకుందాం మిత్రులారా!

పోలీసుపటాలం విజిల్ వేసుకుంటూ, గట్టిగా బూతులు తిడుతూ తలోవైపుకీ చెదిరిపోయింది. కొద్ది నిముషాల్లోనే దెబ్బలుతిన్న గ్రామస్థులు గుడిసెల్లోకి చేరుకున్నారు. వీధి నిర్మానుష్యమైపోయింది.

ఆనంద్ అలాగే కూర్చుని ఉన్నాడు. వీధిలో ఎక్కడైనా అలికిడి అవుతోందేమోనని చెవులు రిక్కించుకున్నాడు. కళ్ళు చీల్చుకుని చూస్తున్నాడు. తన నలుగురు మిత్రులూ ఈపాటికి తప్పించుకుని అడవిలోని మిగిలిన వాళ్ళతో చేరిపోయి ఉంటారనుకున్నాడు. వాళ్ళు దాగిన ప్రదేశం పోలీసులు సోదాచేసిన ప్రాంతానికి దూరంగా ఉంది కనుక తప్పించుకోడం తేలిక.

పారిపోయేమార్గం కోసం అతని కళ్ళు గాలించాయి. ఏమాత్రం సడిచేయకుండా నేల మీదికి జారి సందు చివరివరకూ పాకుతూ వెళ్ళాడు. తుపాకి తయారుగానే ఉంది. దూరంగా కుక్కలు మొరుగుతున్నాయి. తానున్నచోటమాత్రం అంతా నిశ్శబ్దం. దూరంగా పోలీసుల బూట్ల చప్పుళ్ళు ఇంకా వినిపిస్తు న్నాయికనుక వాళ్ళుపూర్తిగా వెళ్ళిపోయేవరకూ పైకి లేవకుండా ఉండడమే మంచిదనుకున్నాడు. అక్కడికి కొన్ని అడుగులదూరంలో ఉన్న ఒక గుడిసె తలుపుసందుల్లోంచి ప్రసరిస్తున్న దీపం వెలుగు అతనినాకర్షించింది. అక్కడ తలదాచుకోవచ్చునను కున్నాడు. గ్రామస్థులు పోలీసుల భయంతో విప్లవకారులకు దూరంగా ఉంటున్నా వాళ్ళపట్ల వ్యతిరేకులుకారు. ఇంతలో పోలీసులు తిరిగొస్తున్న సవ్వడి వినిపించడంతో ఆ గుడిసెలో ఆశ్రయం దొరుకుతుందని ఆశ పడడంమినహా అతడికి మరోమార్గం కనిపించలేదు.

మెల్లగా గుడిసెను సమీపించి చిన్నగా తలుపుతట్టాడు. జవాబులేదు. జాగ్రత్తగా తలుపుతోశాడు. అది తెరచుకుంది. లోపలినుంచి గడియపెట్టినట్టులేదు. కొద్దిగా తెరచి లోపలికి అడుగుపెట్టి తలుపు మూసేశాడు తననుచూసి భయపడి ఎవరూ కేకలు వేయలేదు. బతుకుజీవుడా అనుకుంటూ

గోడకు చేరగిలిపడిపోయాడు. ఓ మూల వెలుగుతున్న ఆముదందీపంనుంచి గుప్పున పొగవస్తోంది. చిన్నప్పుడు తను ఆముదం దీపాల దగ్గర కూర్చుని చదువుకోవడం అతనికి గుర్తొచ్చింది. పట్టుబడడానికీ, చిత్రహింసలకూ, బహుశా చావుకీ వెంట్రుకవాసిదూరంలో ఉన్న తనను ఇప్పుడు అమ్మా నాన్నా చూడగలిగితే ఏమంటారో? బాగా చదువుకుంటాడనీ, మంచి ప్రభుత్వోద్యోగంచేస్తూ తమను పల్లెటూరు మధ్యతరగతి బతుకునుంచి ఉద్ధరిస్తాడనీ ఆశపెట్టుకున్నారు. బ్రిటిష్ సామ్రాజ్యానికి ఎంతో విశ్వాస పాత్రంగా ఉంటున్న అఫ్రోజాబాద్ రాజుకు వ్యతిరేకంగా సాగుతున్న యుద్ధంలో తమ పెద్దకొడుకు చేరిపోతాడని వాళ్ళు కలలో కూడా ఊహించి ఉండరు.

ఇటీవలి పరిణామాలు కలిగించిన సంభ్రమం, ఒంటిమీద గాయాలు, అలసట, ఎట్టకేలకు తలదాచుకునేందుకు చోటు దొరకడం —ఇవన్నీ హఠాత్తుగా కళ్ళముందు కదిలిపోతుంటే సొమ్మసిల్లి నేలమీదికి వాలిపోయాడు. స్పృహవచ్చి చూసుకునే సరికి నేలమీది కాళ్ళుబారజాపి పడుకుని ఉన్నాడు. ముఖంమీద ఎవరో చన్నీళ్ళు చిలకరించినట్టుంది. కొన్నిక్షణాలు స్తబ్ధంగా ఉండిపోయాడు. క్రమంగా తనెక్కడున్నాడో అర్థమైంది. వెంటనే అతడి చేతులు తుపాకికోసం వెతికాయి. పక్కనే ఉంది, నింపిన తూటాలతో. పుంజుకున్న ధైర్యంతో తలుపువైపు దృష్టి సారించాడు. తలుపు సందుల్ని నల్లని బట్టతో చక్కగా కప్పేశారు. అది చీరో దుప్పటో అయుంటుందనుకున్నాడు. తలుపుకి అడ్డంగా రాతిరోలు కనిపించింది. పక్కనే ఓ పెద్దరోకలిబండ. అప్పడప్పుడే తెలివొస్తున్న ఆ స్థితిలో అతడు చిట్టచివరగా చూసింది తనమీదికి వంగుతున్న ఓ అస్పష్టమైన ఆకారాన్ని.

అతికష్టంమీద స్పృహ తెచ్చుకుని చూసేసరికి ఓ వృద్ధురాలు అతనివైపు వంగి పరిశీలనగా చూస్తూ కనిపించింది ఆమె కళ్ళల్లో కలవరం. అతనికి తెలివిరావడం గమనించి ముడతలు పడిన ఆ ముఖంలో చిరునవ్వు తొంగిచూసింది. అపరిచితమైన, అందవికారమైన, అనాగరికమైన, ప్రాచీనత ఉట్టిపడుతున్న వాతావరణంలో తాను ఉన్నట్టు వెంటనే గ్రహించాడు. అతడికే వినిపించేటట్టు ఆమె అడిగింది.

'ఎట్లుంది?'

'బాగానే ఉంది'

'దెబ్బలు నొస్తున్నాయా?'

'కొద్దిగా'

'ఇంట్ల జెరంత జొన్నంబలుంది. తాగుతవా?'

'నాకు ఆకలిగా లేదు'

'అదేంమాట... జెరంత ఎంగిలిపడు'

'తప్పకుండా. కానీ కాస్త ఆగిన తర్వాత... థాంక్స్'

'అదేంది?'

ఆ మాటకర్థం ఎలా వివరించాలో అతనికి తోచలేదు. తప్పకుండా కృతజ్ఞతలు తెలియజేసుకోవలసిన సందర్భం ఏదైనా ఉంటే అది ఇదే ననుకున్నాడు. కొద్దిక్షణాలు ఆలోచిస్తూ ఉండిపోయి తర్వాత 'నువ్వు మా నాయనమ్మలా కనిపిస్తున్నావ్' అన్నాడు.

'మంచిది నాయనా. నేను నీ నాయనమ్మనే. ఎప్పటికీ యాదుంచుకో.'

గుడిసెలో ఓ మూలవైపు చేయిచాపి చూపించింది. దుప్పట్లో చుట్టినట్టు ఉన్న ఓ ఆకారం మెల్లగా కదులుతూ కనిపించింది. ఎవరో అక్కడ నిద్రపోతున్నారనుకున్నాడు. 'అది నా మనవరాలు రామి. నా కొడుకు కోడలు గత్తర్లో చచ్చిపోయింద్రు. నా మనవరాలు ఒక్కతేనాకు దక్కింది. ఇప్పుడో మనవడు కూడా దొరికిండు.' ఆనంద్‌వైపు మురిపెంగా చూస్తూ అందామె.

మాటల సవ్వడికి రామి నిద్రలేచి దుప్పటి తప్పించుకుని చుట్టూచూసింది. ఆ వృద్ధురాలు ఆమెకేదో సైగ చేసింది. అర్థం చేసుకున్న రామి మౌనంగా ఉండిపోయింది. ఆనంద్ మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

'అసలిక్కడి కెందుకొచ్చినవ్?'

'నేనో పార్టీలో సభ్యుణ్ణి. వలంటీర్‌ని'

'అదేంది?'

తమమధ్య మరో అడ్డుగోడ లేచిందనుకున్నాడు ఆనంద్. పార్టీల గురించి కానీ, వలంటీర్ అనే మాటకు అర్థంకానీ ఆమెకు తెలిసే అవకాశం లేదు. చుట్టూ జరుగుతున్నదేమిటో, విప్లవకారులు ఏ లక్ష్యంకోసం పనిచేస్తున్నారో తమకేమీ తెలియకపోయినా పాపం ఈ గ్రామీణులు ఎడతెరిపిలేకుండా అష్టకష్టాలు పడుతూ ఉండడం అతనికి విచిత్రమనిపించింది.

ఆమెకు వివరించడానికి ప్రయత్నిస్తూ అన్నాడు. 'నేనో సిపాయిని... సిపాయి అంటే తెలుసు కదా?'

'తెలుసు, తెలుసు. సిపాయి యుద్ధంచేస్తడు... ఓహో. అందుకే నీదగ్గర తుపాకి ఉందన్న మాట. ఈ ఊళ్ళో కూడా ఓ సిపాయి ఉన్నడు. నెలనెలా అతనికి సర్కారు నుంచి పైసలొస్తయ్. ఎప్పుడో నలభై ఏళ్ళకింద యుద్ధం చేశిండంట. చెప్పుతుంటడు...'

'నేనూ అలాగే సిపాయిని. రాజుకు వ్యతిరేకంగా యుద్ధం చేస్తున్నాను.'

'రాజా? ఎవడా రాజు? ఆడితో యుద్ధమెందుకు చెయ్యాలె? నీవంటి పోరడు అసలు యుద్ధమెందుకు చేయాలె?'

'ఆ రాజు దుర్మార్గుడు. అందుకే అతడితో పోరాడుతున్నాం.'

'అదిసరే... నీవంటి పోరడు రాజుతో ఒక్కడే యుద్ధమెట్ల చేస్తడు?'

'నేను ఒక్కణ్ణేకాదు. మా వెనకాల ఎంతోమంది నాయకులున్నారు. పెద్దపెద్ద నాయకులు...'

'అయితే ఆ నాయకులంత ఏరీ? నీలాంటి పోరలు సర్కార్ తుపాకులముందు ఎందుకు నిలబడాలె? ఆ పని పెద్దోళ్ళెందుకు చెయ్యరు? వాళ్ళకు సిగ్గూ శరం లేదా?'

తనకు రక్షణ ఇచ్చిన ఆ వృద్ధురాలు కురిపిస్తున్న ప్రశ్నలకి జవాబులకోసం తడుముకుంటున్నాడు ఆనంద్. చదువూ సంధ్యాలేని ఆ వృద్ధ మహిళ ప్రాణాలు బలి పెట్టవలసివచ్చినప్పుడు కుర్రవాళ్ళను ముందుకు తోసే పెద్దవాళ్ళ అవకాశవాదం గురించి తనకు బాగా తెలిసినట్టే ప్రశ్నమీద ప్రశ్నలు గుప్పించడం అతనికి ఆశ్చర్యం కలిగించింది.

అంతలో వీధిలో కాల్పుల శబ్దం వినిపించి ఉలిక్కిపడ్డాడు. ఆ వృద్ధురాలు తలుపుకు అడ్డంగా వేసిన చీరను కొంచెం పక్కకి తొలగించి తలుపుసందులోంచి బయటకు తొంగిచూసింది. మరుక్షణం కంగారుగా అడుగులు వేస్తూ వెళ్ళి మూలనున్న దీపం ఆర్పేసింది. గుడిసెలో పూర్తిగా చీకటి. ఆ యువకుణ్ణి, అతని తుపాకితో సహా నిద్రలో ఉన్న మనవరాలు పడుకున్నవైపు దొర్లించింది.

ఎవరో తలుపు బాదుతున్నారు. అసహనంగా తలుపును ఒక్క తన్ను తన్నేసరికి అది తెరచుకుంది. ఇద్దరు పోలీసులు లోపలికి తొంగిచూశారు. వెంటనే ఆ వృద్ధురాలు శోకాలు ప్రారంభించింది. హఠాత్తుగా తారస్థాయిలో మొదలైన ఆ శోకాలకు పోలీసులు నివ్వెరపోయారు. కనీసం ఊపిరి తీసుకునేందుకు కూడా విరామం ఇవ్వకుండా ఆమె శోకాలనుంచి తిట్లజడివానవైపు మళ్ళిపోయింది. టార్చిలైట్లు వెలుగులో పోలీసుల ముఖంలో దిగ్భ్రమ ఇంకా కొట్టొచ్చినట్టు కనిపించింది. ఆమె అలా దుర్భాషలాడుతూనే చీకట్లో వేగంగా కదులుతూ చేతికి అందిన బట్టలతో ఆ ఇద్దరినీ కప్పడానికి చూస్తోంది.

'నాతాన ఏం దోచుకుందురని తలుపు పలగ్గొట్టి వచ్చిన్రురా దొంగముండకొడుకుల్లారా? నా తాన పైసుందా, తిన కూడుందా, బంగారముందా? చాతగానిగాడిదకొడుకుల్లారా! పొండ్రి, ఆ పటేల్‌గాడింటికి పొండ్రి. వాడిదగ్గర పైస బంగారం అన్నీ ఉన్నై. వాడూ మీఅసొంటి ముండకొడుకే. వాని పెళ్ళాం పెయిమీదనుంచి కిందిదాకా బంగారమే. దమ్మొంటే వానిపెళ్ళాన్ని దోసుకోండ్రి, పొండ్రి...'

పరువంలో ఉన్న నర్తకిలా గబగబా అడుగులేస్తూ ఆనంద్ పంట్లాం కనిపించకుండా ఓ చీర చుట్టేసింది. మరో బట్టను అతడి తలకు చుట్టింది. ఆనంద్‌ను గట్టిగా వాటేసుకోమని మనవరాలి చెవిలో చెప్పింది. ఈలోగా దిగ్భ్రమనుంచి తేరుకున్న పోలీసుల్లో ఒకడు ఆమెవైపు టార్చిని ప్రసరింపచేస్తూ అరిచాడు. 'ఏయ్ పొర్లుబోతు ముండా! నీ నడ్డి విరగ్గొట్టేలోపల దీపం ముట్టిస్తవా లేదా?'

ముసల్ది ఎకసెక్కంగా నవ్వి 'నాఅసొంటి ప్యాదది రాత్రంతా ఏడ దీపం వెలిగిస్తది!.. ఉండు. అగ్గిపెట్టె ఎక్కడ సచ్చిందో దేవులాడుత. ముదనష్టంముండకొడుకుల్లారా'

ముసలిదానిమీదే టార్చి ఫోకస్ చేస్తూ నిలబడిన కానిస్టేబుల్ ఒక్కసారిగా బెదిరిపోయాడు. భారంగా ఊపిరి తీసుకుంటూ, వదులు వదులుగా వేలాడుతున్న పీచులాంటి జుట్టుతో, ముడతలు పడిన ముఖంతో గుర్రున చూస్తూ నిలబడిన ముసల్ది పురాణకథల్లో కనిపించే భూతంలా అతనికి తోచింది. పైగా రౌద్రంగా చీపురుకట్ట చేతుల్లోకి తీసుకుంది.

'తుపాకితో ఉన్న పోరడెవడైనా నీకు కనిపించిండా?' కానిస్టేబుల్ అడిగాడు.

ముసిల్ది తిరిగి అరుపులు మొదలు పెట్టింది. 'ఏ పోరడు? ఏ తుపాకి? దేన్నిగురించి అడుగుతున్నవ్ నువ్వు? రాత్రిపూట పోరలు వచ్చుటానికి ఇదేమైన లంజకొంప అనుకున్నవా? నే నేమైన లంజలెక్క కనిపిస్తున్ననా నీకు? ఆడ నా మన్మరాలు, దాని మొగుడు నిద్రపోతాన్రు. గుడిసెల ఇంకెవ్వరూలేరు మమ్మల్ని లంజలనేతందుకు నీకెన్ని గుండెలు? నీపెళ్ళాం, నీ కూతురు లంజరికం చేస్తాన్రేమో, అడుగు పో... ఆ ఇప్పుడు నాకు తెలిసింది నా మన్మరాలిని అడవిలోకి తీసుకుపోయి మానం తీసెతందుకే ఇట్లా వంకపెట్టుకుని వచ్చింండ్రు... నీచపు ముండకొడుకుల్లారా... మాలాంటి ప్యాదోళ్ళమీదికి రాజు మిమ్మల్ని ఇందుకే పంపించిండా? మీ తలపండు నరుక! ఎల్లమ్మా, మల్లమ్మా, మారమ్మా, పోచమ్మా, దుర్గమ్మా, మైసమ్మా — ఈ దేవతలంతా మిమ్మల్ని బూడిద చేయ! పోయి మీ కూతుళ్ళ, అక్కల మానం తీయింండ్రి... నా పిల్లను ఎవరు తాకుతరో చూస్త! వాణ్ణీ, దాన్నీ చంపేసినేను ఉరేసుకుంటా .. మాంకాళి మిమ్ముల మసిచేస్తది లంజకొడకుల్లారా! మీ ఇళ్ళల్ల పీనుగులెళ్ళ! మీ పెళ్ళాలు ముండమోయ! మీ మీద పిడుగుపడ! చూస్తూ ఉండుండ్రి. . నా సాపెన తప్పక తగుల్తది ముండకొడుకుల్లారా!'

ఈ గొడవకి ఇంకా కొందరు పోలీసులు అక్కడచేరి గుమ్మంలోంచి తొంగిచూస్తున్నారు. ముసల్ది అలా విరుచుకుపడడం చూసి ఏం చేయాలో తోచక నిలబడిపోయారు. అప్పుడే సబ్ఇన్స్పెక్టర్, పటేల్ అక్కడికి వచ్చారు. ఒక్క చూపుతో పరిస్థితి అర్థం చేసుకున్న సబ్ఇన్ స్పెక్టర్ ఈ ముసలిదాని గురించి సమయం వృధా చేయడం అనవసరమనుకున్నాడు. గట్టిగా నోరు చేసుకుంటూ 'సరే, సరే... ఊరంతా నిద్రలేచేలా అంతగట్టిగా అరవకు, ముసలిముండా! పోయి పడుకో... ఇంకేమైనా గొడవ చేశావా కాల్చిపారేస్తాను!'

సబ్ఇన్స్పెక్టర్ తన మనుషుల్ని తీసుకుని అక్కడినుంచి వెళ్ళిపోయాడు. తనకు అతి సమీపంలోనే జరుగుతున్న గొడవకు నరాలు బిగుసుకుపోగా అంతవరకు శవప్రాయంగా నిశ్చలంగా పడుకుని ఉన్న ఆనంద్ తేలికపడి, కృతజ్ఞతాశ్రువులతో చిప్పిల్లుతున్న కళ్ళను ఒకసారి మూసుకున్నాడు అతనిని వాటేసుకున్న అమ్మాయి కూడా ఎంతగానో భయపడిపోయింది. లేచికూర్చుని విడిపించుకోడానికి ఎంతో ప్రయత్నించినా అతన్ని కరచుకుని కొయ్యబొమ్మలా అలాగే ఉండిపోయింది వాళ్ళిద్దరినీ ఆ స్థితిలో చూసిన ముసలిదాని ముడతలు పడిన ముఖంలో చిరునవ్వు మెరిసింది.

# 10

'ప్రపంచం నిద్రపోతున్నవేళ స్వతంత్ర భారతం నిద్రలేచింది:.'

1947 ఆగస్టు 15 అర్ధరాత్రి, సరిగ్గా పన్నెండుగంటలకు జవహర్‌లాల్‌నెహ్రూ చేసిన ఈ ప్రకటనకు యావద్భారతం పులకించిపోయింది. దేశమంతటా ఆనందోత్సాహాలు వెల్లివిరుస్తున్న ఆ సమయంలో, ఇక్కడ రాష్ట్రంలో, ఆనంద్‌తోసహా వందలాదిమంది ఇంకా ప్రజాపోరాటంలోనే నిమగ్నులైఉన్నారు. నిద్రకు నోచుకోక కొందరు జైళ్ళలో, కొందరు కీకారణ్యాలలో మగ్గుతూనే ఉన్నారు. అఫ్రోజాబాద్‌లోని గెరిల్లాపోరాటయోధులకు ఈ స్వాతంత్ర్యప్రకటన ప్రత్యేకించి విస్మయం కలిగిస్తోంది. ఒకవైపున బ్రిటిష్‌సామ్రాజ్యవాదశక్తి సగౌరవంగా వీడ్కోలు తీసుకుంటుంటే, ఇంత కాలం ఆ సామ్రాజ్యానికి ప్రధాన సామంతరాజ్యాలలో ఒకటిగా ఉన్న రాజ్యం తనకు తానుగా స్వాతంత్ర్యం ప్రకటించుకోవడం అసాధారణపరిణామం. ఒకటిన్నరశతాబ్దాల క్రితం జరిగినదే పునరావృత్తమవుతుందా అనిపిస్తోంది. ఏదో నాసిర్‌జా తన వంశస్థాపకుని ఆదర్శంగా తీసుకుని భారతదేశంనుంచి విడిపోయి స్వాతంత్ర్యం ప్రకటించుకుని సర్వ సత్తాకరాజ్యంగా తన రాజ్యాన్ని తీర్చిదిద్దుకోవాలనే ఆలోచనలో ఉన్నాడు. బ్రహ్మాండమైన పథకాలు వేస్తున్నాడు. తూర్పుతీరం లోని కొంత ముఖ్యమైన ప్రాంతాన్ని కొనుగోలుచేసి పుట్టబోయే తన స్వతంత్రసామ్రాజ్యానికి సముద్రమార్గం ఏర్పాటు చేసుకోవడం ఆ పథకాలలో ఒకటి. అలాగే వెనకటి నాసిర్‌జాహి రాజులు బ్రిటిష్‌ఇండియాప్రభుత్వానికీ, అంతకుముందు ఈస్టిండియా కంపెనీకీ ధారాదత్తం చేసిన అన్ని ప్రాంతాలనూ ఎలా వీలైతే అలా తిరిగి స్వాధీనం చేసుకోవాలని కలలుకంటు న్నాడు. మొత్తానికి నాసిర్‌జా ఒక పథకం ప్రకారం, పట్టుదలగా మరోసామ్రాజ్యానికి పునాదులువేసే ప్రయత్నం చేస్తున్నాడు. చూడబోతే అది వాస్తవికరూపం ధరించబోతున్నట్టే ఉంది.

అయిదువందలకుపైగా ఉన్న సంస్థానాలు స్వతంత్రభారత సమగ్రతకు ఓ పెద్దసమస్యగా పరిణమించాయి. బ్రిటిష్ ఆధిపత్యం కింద ఎంతో కొంత స్వేచ్ఛనూ, స్వతంత్రప్రతిపత్తినీ అనుభవించిన సంస్థానాధీశులూ, రాజులూ నిష్క్రమిస్తున్న బ్రిటిష్‌ప్రభుత్వం అందించిన బహిరంగప్రోత్సాహంతో హఠాత్తుగా పుంజుకుని ఒక సమాఖ్యగా ఏర్పడి ఆర్భాటం చేస్తున్నారు. అత్యాశపెంచుకున్న భోపాల్ నవాబు పోషణలో ఆ సమాఖ్య ఎంతో చురుగ్గా పనిచేస్తూ దేశాన్ని

మరోసారి చీల్చి మూడవఖండిత భారతాన్ని సృష్టించాలని చూస్తోంది. ఎంతో రక్తపాతానికీ, దుఃఖవిషాదాలకూ దారితీయిస్తూ అప్పుడప్పుడే జరిగిన దేశవిభజన పచ్చిపుండులా ఇంకా బాధిస్తూ ఉండగానే ఈ పరిణామం తలెత్తి మరింత నిస్పృహ కలిగిస్తోంది. మూడోవంతు దేశం తనను తాను చీల్చుకుని వేరుపడే ప్రయత్నాలు పుంజుకోవడంతో రెండోసారి దేశవిభజన జరిగే అవకాశం దేశం ముఖాన వేలాడుతోంది.

అప్పుడప్పుడే ఆవిర్భవించిన స్వతంత్రభారతం ఒకవైపు పురిటి జబ్బులతో సతమతమౌతుంటే, మరోవైపు అఫ్రోజాబాద్ భవిష్యత్తు అనిశ్చితంగా మారింది. కొన్నేళ్లుగా రాజుకీ, ఆయన సైన్యానికీ వ్యతిరేకంగా వీరోచితంగా పోరాడుతున్న ఎందరో యువకులు, యువతులు నూతన భారతప్రభుత్వం తమకు విముక్తి ప్రసాదించే చర్యలు చేపడుతుందని ఆశలు పెట్టుకున్నారు. ఒక విద్యార్థితరం భవిష్యత్తు మొత్తం అస్తవ్యస్తమైపోయింది. వాళ్ల బతుకులు చదువుకీ, ఉద్యమానికీ మధ్య వేలాడుతున్నాయి. దేశంలోని సోదరప్రజానీకం స్వాతంత్ర్యస్పర్శతో ఉత్తేజితులౌతుంటే, వీరుమాత్రం నికృష్టమైన జైళ్లలోనో, పాములూ క్రూరజంతువులూ సంచరించే దట్టమైన అడవుల్లోనో కాలం దొర్లించవలసివస్తోంది. దిగ్భ్రమ కలిగించే వైరుధ్యాలు, విద్రోహపూరితంగా కనిపిస్తున్న అనిశ్చితపరిస్థితి దారుణంగా వెక్కిరిస్తున్న సమయం అది.

ఆగస్టు 15 ఉదయం ఆనంద్ అతని మిత్రులు రిజర్వ్‌ఫారెస్ట్ లోతట్టున ఒక పూరిపాకలో సమావేశమయ్యారు. వాళ్లవద్ద ఉన్న ఒకే ఒక బ్యాటరీరేడియోనుంచి అప్పుడప్పుడు ముక్కముక్కలుగా వార్తలు తెలుస్తున్నాయి. కొన్ని గంటలకోసారి బ్యాటరీని చార్జ్‌చేస్తూ ఉండవలసిందే. అందుకు కిరసనాయిలు అవసరమౌతుంది. ఎన్నో ప్రమాదాలను ఎదురొడ్డి కిరసనాయిలు కొని తెచ్చుకోవలసివస్తూఉంటుంది. ఆ రేడియో ఒక్కటే వాళ్లకి బయటి ప్రపంచంలోకి తొంగి చూసేందుకు ఉపయోగపడుతున్న గవాక్షం. కనుక దానిని పనిచేసే స్థితిలో ఉంచడానికి తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకోవలసిందే.

ఈ రోజు వాళ్లు చాలా ఆనందంగా ఉన్నారు. ఒక తెల్లని గుడ్డ ముక్కను ఎర్రని గుడ్డ ముక్కతో కలిపి (కాషాయం బట్ట దొరకలేదు కనుక) జాతీయపతాకాన్ని తయారుచేశారు. ఆకుపచ్చగుడ్డ ఎక్కడా దొరకలేదు కనుక మూడు టేకుఆకుల్ని ఒకదానితో ఒకటి కుట్టి జెండాలో జోడించారు. ఇటువంటి ఉపాయాలు కని పెట్టడంలో దిట్ట అయిన సుదర్శన్ బొగ్గుముక్కతో తెల్లగుడ్డమీద అశోకచక్రం గీశాడు. ఆ అసాధారణమైన పతాకాన్ని పొడవైన ఒక టేకుచెట్టు చివరనకట్టి ఎగురవేసి, అది టేకాకులతోపాటు అడవిగాలికి ఎంతో హుందాగా ఎగురుతుంటే భక్త్యావేశంతో శాల్యూట్ చేశారు.

ఆ బృందంలో మొత్తం తొమ్మిదిమంది. అంతా ఉన్నత విద్యావంతులు, ఉన్నతాశయాలు ఉన్నవాళ్లు. వాళ్లలో సుదర్శన్, ఆనంద్ సన్నిహిత సహచరులలో ఒకడు. పట్టణవాతావరణంలో పుట్టి పెరిగినవాడు. అయినాసరే ఎన్నో కష్టాలూ, ప్రమాదాలూ తెచ్చిపెట్టే రహస్యకార్యకలాపాలలో పూర్తిగా నిమగ్నుడైన వ్యక్తి. ఎం.బి.బి.ఎస్. చివరి సంవత్సరం చదువుతూ పోరాటంలోకి దూకాడు.

రాజకీయాల్లో పైకి రావాలనే కోరిక అతనికి లేదు. రాష్ట్ర ప్రజలు విముక్తులుకావడం, రాష్ట్రం భారతదేశంలో విలీనం కావడం —ఈ రెండే అతని లక్ష్యాలు. ఆ లక్ష్యాలు నెరవేరగానే మళ్లీ కాలేజీలో చదువు కొనసాగించి మెడికల్ డిగ్రీ తీసుకుని ప్రాక్టీసు ప్రారంభించాలని అనుకుంటున్నాడు. విజ్ఞత, ప్రయోజనవాదం, బాధ్యత, నిజాయితీ మూర్తీభవించినవాడు సుదర్శన్. ఆనంద్‌ను ఎంత మెచ్చుకునేవాడో అంతగానూ అతనిని విమర్శించడానికి వెనుదీసేవాడు కాదు, ముఖ్యంగా తనకు తాను సృష్టించుకున్న మానసికధోరణుల కారణంగా ఆనంద్ ఏవైనా విచిత్రప్రవృత్తులు వ్యక్తంచేసిన సందర్భాల్లో.

బ్రహ్మం—బ్రహ్మరాజ్ అనికూడా పిలుస్తారతణ్ణి —తమ బృందంలో తుపాకులు, పేలుడు సామగ్రి నిపుణుడు. రాష్ట్ర రాజధానిలో పాతనగరంలోని ఓ ఇరుకుసందులో వాళ్ల ఇల్లు. బ్రహ్మం తండ్రి కమ్మరపనిలో మంచి నేర్పరి. రైఫిళ్లు, రివాల్వర్లు కూడా రిపేరు చేస్తూ ఉంటాడు. అందులో రాజకీయసంబంధాలేవీలేవు. రైఫిళ్లు, రివాల్వర్లు ఉన్న సంపన్నుల దృష్టిలో ఆయన మంచిపనివాడుగా పేరు తెచ్చుకున్నాడు. ఆయన మరమ్మతు చేసే తుపాకులు చాలావరకు లైసెన్స్ ఉన్నవే అయినా, ఈమధ్యకాలంలో లైసెన్సులేని తుపాకులు కూడా బ్రహ్మంద్వారా ఆయన ఇంట్లోకి రాకపోకలు సాగిస్తున్నాయి. చదువురాదు కనుక బ్రహ్మాన్ని వాటిగురించి ఆయన అంతగా ప్రశ్నించేవాడు కాదు. చదువు రాకపోవడం వల్ల కాదనీ, బుద్ధిపూర్వకంగానే వాటి గురించి ఆయన అడగడనీ బ్రహ్మం అంటుండేవాడు. 'ఆయన దేశభక్తి పైకి కనిపించేది కాదు,' అంటుండేవాడు. మొత్తానికి ఇంట్లోరిపేర్లు, ఓవర్‌హాలింగ్‌లు చడీచప్పుడు కాకుండా జరిగిపో తూఉంటాయి. బ్రహ్మం కెమిస్ట్రీలో ఎం.ఎస్‌సి. పూర్తిచేశాడు. వెంటనే రాజుకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటంలోకిదిగిపోయాడు. దేశభక్తి, ఆత్మగౌరవం ఉన్న యువకుడుగా ప్రతిఘటనోద్యమానికి దూరంగా ఉండలేకపోవడం తప్పించి అందుకు మరో కారణంలేదు. తిరుగుబాటుస్ఫూర్తి ఆ రోజుల్లో సర్వాంతర్యామిగా ఉండేది.

బృందంలోని మిగిలినవాళ్లు కూడా అంతే. స్వార్థంకానీ, సంకుచిత లక్ష్యాలు కానీ వారికిలేవు. రాష్ట్రం స్వతంత్ర్యమయ్యేవరకు తాము జీవించి ఉంటామన్న నమ్మకం కూడా వారికి లేదు.

'ఏదో ఆశ కనిపిస్తోంది' పతాకావిష్కరణ తర్వాత సుదర్శన్ అన్నాడు. మిగిలినవాళ్లు ఏకీభవించారు. ఇంతలో భారతప్రభుత్వం రాష్ట్రప్రభుత్వంతో 'తాత్కాలిక ఒప్పందం' చేసుకున్నట్టు వార్త వచ్చింది. అంటే అఫ్రోజాబాద్ పరిస్థితిలో ఏదైనా మార్పురావడమంటూ జరిగితే అందుకు మరింత వ్యవధి పడుతుందన్నమాట. పైన దట్టమైన శ్రావణమేఘాలు, కింద, అడుగుతీసి అడుగు వెయ్యలేనంత బురద... ఇదీ రాష్ట్ర ప్రజలమీద వచ్చిపడిన భౌతిక, రాజకీయ వాతావరణం.

దేశం స్వతంత్రమైన తర్వాత మరో పదమూడుమాసాలపాటు రాష్ట్రప్రజలు ఉధృతపోరాటం సాగించవలసి వచ్చింది. ఆ మధ్యలో అంతులేకుండా సాగిపోయిన అమానుషహత్యాకాండ, మానభంగాలు, మతదురభిమానం మూర్తీభవించిన మహోన్మాది రహీమ్ అలీ్వ నాయకత్వంలో ఖాదిమాన్ మూక సాగించిన దోపిడీలు, విధ్వంసాలు... ఆ దుండగుల నీడపడని ప్రాంతమేలేదు.

అన్నేళ్ల స్వాతంత్ర్యసమరకాలంలో బ్రిటిష్ఇండియాలో కూడా ఎక్కడా కనీవినీ ఎరగని స్థాయిలో ఖాదిమాన్ దుష్టులు అత్యాచారాలు సాగించారు. దేశవిభజన వెనువెంటనే ఉత్పన్నమైన రకరకాల సమస్యలను పరిష్కరించుకునే వ్యవధికోసమే కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వంతో తాత్కాలిక ఒప్పందానికి వచ్చిందికానీ అందుకు మరో కారణం లేదు. అయితే రాజు, ఖాదిమాన్ నాయకులు దీనిని కేంద్రం బలహీనతగా అర్థం చేసుకున్నారు. ఫలితంగా ఖాదిమాన్మూకల దోపిడీదాహం వందరెట్లు పెరిగిపోయింది. వాళ్ల హింసలు పడలేక వేలాది కుటుంబాలు అఫ్రోజాబాద్ను అనుకునిఉన్న ప్రదేశాలకు పారిపోయి తలదాచుకున్నాయి. ఈ అత్యాచారాలను నిరసిస్తూ కొన్నివేలమంది సత్యాగ్రహాలు, ప్రదర్శనలు నిర్వహించి అరెస్టయ్యారు. ఉద్యమంతో ఏమీ సంబంధంలేని ఎందరో అమాయక పౌరుల్ని ప్రభుత్వం ఖైదులో పెట్టింది. సాధారణ ప్రజలను భయభ్రాంతుల్ని చేయడానికి తప్ప అందుకు మరో కారణం లేదు.

ఇంతలో మహాత్మాగాంధీ దారుణహత్య అనే దురదృష్టం దేశంనెత్తిన పిడుగులా వచ్చి పడింది. ఈ పరిణామానికి కుప్పకూలిపోయిన ఎందరో చాలాకాలానికిగానీ తేరుకోలేకపోయారు. ఈ దుఃఖంలో ఆనంద్, అతని మిత్రులు పాలుపంచుకుంటూనే, రాష్ట్రప్రజల విముక్తి అవకాశాలు మరింత అనిశ్చితస్థితిలోకి జారిపోవడం గమనించి విపరీతమైన నిస్పృహకు లోనయ్యారు. ఆశను కాపాడు కుంటూ పోరాటం కొనసాగించడం తప్ప చేయగలిగిందేమీ లేదనుకున్నారు. చివరకు రాజు తన అసాధ్యలక్ష్యంవైపు పరుగులు తీస్తూ దారితప్పిపోయాడని కేంద్రం గుర్తించింది. అదీగాక, తాను పుట్టించి పోషించిన ఖాదిమాన్ సంస్థ గుప్పిట్లో ఆయన బందీ అయిపోయాడు. ఖాదిమాన్ కేంద్రంపట్ల శత్రుత్వంతో వ్యవహరిస్తున్న విషయాన్నికూడా కేంద్రనాయకులు గమనించారు. చర్యకు ఉపక్రమించడానికి ఇది తగిన సమయం.

అఫ్రోజాబాద్ ప్రజల్ని దుస్పృహకష్టాల సుడిగుండంలోకి ఇంకా ఇంకా నెట్టివేస్తూ ఆ చర్య ఏదో ఒక కారణంతో ఆలస్యమౌతూనే ఉంది. 'విద్రోహ' చర్యలకు పాల్పడుతున్నట్టు అమాయకప్రజానీకంపై అభియోగం తెచ్చి ఖాదిమాన్ దుండగులు వారిని వేధిస్తూ యథేచ్ఛగా దోచుకుంటున్నారు. క్రౌర్యం కరుడుగట్టిన స్థానికభూస్వాములుకూడా వాళ్లతో పోటీపడి, ప్రజలపై దేశద్రోహనేరాన్ని ఆరోపిస్తూ అరెస్టులు జరిపిస్తున్నారు. అలా జరిపించి వాళ్ల భూముల్ని ఆక్రమించుకోవడం వాళ్ల ఎత్తుగడ. భారత యూనియన్లోని పొరుగురాష్ట్రాల్లో తలదాచుకున్న వారిని మొదట్లో ఆదరంగానే చూశారు. కానీ, క్రమంగా అవినీతిపరులైన దుకాణదారులు, వర్తకులు వారిని దోచుకోడం ప్రారంభించారు. ఉదాహరణకు అఫ్రోజాబాద్నుంచి వలస వెళ్లినవారు దారుణంగా పెంచిన ఇంటిబాడుగలు చెల్లించుకోవలసివచ్చింది. పొరుగురాష్ట్రంనుంచి అవసరార్థం ప్రజలు వలస రావడంతప్ప, మరే కారణం లేకుండా నిత్యావసరవస్తువులధరల్నికూడా విపరీతంగా పెంచివేశారు. 'శరణార్థి ధరలు' అంతటా చలామణిలోకి వచ్చేసరికి పరిస్థితి విషమించింది. స్థానికులు కూడా అవే ధరలు చెల్లించవలసిరావడంతో తమ కష్టాలకు అఫ్రోజాబాద్ శరణార్థులే కారణమంటూ వారిని ఆడిపోసుకోవడం ప్రారంభించారు. స్థానికులకూ, శరణార్థులకూ మధ్య విరోధభావం పెరిగిపోయింది.

ఖాదిమాన్‌ఉద్యమం ఎంతో వేగంగా, గ్రామాలవరకు వ్యాపించిపోయింది. దురదృష్టవశాత్తు అందులో ఉన్నది ప్రధానంగా ముస్లింలు. కొందరు హిందూభూస్వాములు కూడా ఆ ఉద్యమంతో సంబంధం పెట్టుకున్నారుకానీ, వారు పెద్దసంఖ్యలో లేరు. హిందువులు, ముస్లింలు అనే తేడా లేకుండా ఎందరో భూస్వాములు ఖాదిమాన్ సంస్థనీ, అఫ్రోజాబాద్ స్వతంత్ర రాజ్యం కావాలన్న ఆలోచనను హృదయపూర్వకంగా సమర్థించినా, హిందువులు కాస్త చాటుమాటు రాజకీయం నడిపించారు. రాజుపట్ల తమ విధేయతను ఓ పక్క ఇల్లెక్కి చాటుకుంటూనే, ప్లేటు ఫిరాయించే అవకాశాల్ని జాగ్రత్తగా ఉంచుకున్నారు. ఏకకాలంలో జోడుగుర్రాల స్వారీలో తాము నేర్పరుల మని రుజువు చేసుకుంటున్నారా అన్నట్లు వ్యవహరించారు. బ్రిటిష్ ఇండియాలోని పొరుగు రాష్ట్రాలలో ఉన్న కొందరు మేధావులు, అఫ్రోజాబాద్ ప్రభువులనుంచి గౌరవసత్కారాలు అందుకుని, అఫ్రోజాబాద్ స్వతంత్ర, సర్వసత్తాక రాజ్యం కావాలన్న ఆలోచనను అత్యుత్సాహంతో సమర్థించడం ప్రారంభించారు. ఆ ప్రతిపాదనకు ప్రచారం కల్పిస్తూ, అఫ్రోజాబాద్ స్వతంత్రమైతే బ్రిటిష్ ఇండియాలోని రాష్ట్రాలనుమించి అభివృద్ధిని సాధిస్తుందని రుజువు చేయడానికి ప్రయత్నిస్తూ పుస్తకాలూ, వ్యాఖ్యానాలూ గుప్పించడం మొదలుపెట్టారు. అయితే ప్రజలు అలా కడగండ్లు పడుతూనే ఉండగా ఈ రచయితలు మాత్రం చక్కని 'అభివృద్ధి'ని సాధించుకోగలిగారు.

గడుస్తున్న ప్రతి ఒక్కరోజూ, ఖాదిమాన్ మూక సాగిస్తున్న ప్రతి ఒక్క మానభంగంసంఘటన, లూటీలు, దహనకాండలు వాతావరణాన్ని మరింత నిరాశాగ్రస్తం చేస్తున్నాయి. ఆనంద్, ఆనంద్‌లాంటి వందలాది యువకులు వీరోచితంగా పోరాడుతున్నారు. కానీ బ్రిటిష్ ఆయుధ వ్యాపారి హెన్రీకాలన్‌ద్వారా దొంగచాటున తెప్పించుకుంటూ, ప్రభుత్వం ఖాదిమాన్‌లకు ఉదారంగా పంచిపెడుతున్న ఆధునిక ఆయుధాలతో వారు పోటీపడడం అసాధ్యం. వాళ్ల మేలిరకం ఆయుధాల వల్లనే తన మిత్రులు ఎంతోమంది ఎన్‌కౌంటర్‌లో మరణించిన విషయం ఆనంద్‌కు తెలుసు. తానుకూడా అనేకసార్లు మృత్యుముఖంలో ఇరుక్కున్నాడు. కానీ ప్రతిసారి బతికి బయటపడ గలిగాడు. మృత్యువుకూడా యాదృచ్ఛికంగానే కొందరిని స్వీకరించి కొందరిని తిరస్కరిస్తుంది కాబోలు; రెంటికీ తగిన కారణం ఏదీ ఉండదు.

ఓ రోజు ఉదయం గవర్నర్‌జనరల్ రాజగోపాలాచారి ఢిల్లీలో ఒక వ్యాఖ్యచేశారు. 'గవర్నర్ జనరల్‌గా నేను హామీ ఇస్తున్నాను. అఫ్రోజాబాద్ గురించి మీరు ఆందోళన పడవద్దు' అని ఆ వ్యాఖ్య సారాంశం. సుదీర్ఘనిశ్శబ్దం తరువాత వెలువడిన ప్రకటన కనుక అది అందరినీ ఆకర్షించింది. ఆ మాటలో కచ్చితంగా ఏమీ లేక పోయినా ప్రతివారిలో ఆశాభావానికి తిరిగి ప్రాణం పోసింది. ఆనంద్, అతని మిత్రులు తమలో ఏదో నూతనఉత్తేజం, నమ్మకం అంకురించినట్టుగా కొన్ని వారాలపాటు పోరాటాన్ని ఉధృతగతిలో సాగించారు. రిజర్వ్‌ఫారెస్ట్‌లో పలుచోట్ల పోలీసులతో పోరాడి విజయాలు సాధించారు. వాళ్ళలో నూతనసాహసం పుంజుకుంది.

ఈ ఉత్తేజంకూడా ఎంతోకాలం నిలవలేదు. ప్రభుత్వం డజన్లసంఖ్యలో కొత్తకొత్త పోలీస్ అవుట్‌పోస్టులు ఏర్పాటుచేయడం మొదలు పెట్టింది. పోలీసులు తమను మించిపోయిన సంఖ్యలో ఉన్నారనీ, వాళ్ళవద్ద శక్తిమంతమైన ఆయుధాలూ, అపారమైన ప్రేలుడుసామగ్రీ ఉన్నాయనీ

ప్రతిఘటన బృందాలు తెలుసుకున్నాయి. నిరుపేద, నిరక్షరాస్య గ్రామీణులు ఇప్పటికీ 'టెర్రరిస్టు'లకు ఆహారం, ఆశ్రయం ఇస్తూనే ఉన్నారు. ఊళ్ళోని పెద్దలు కాగితంముక్కలమీద సంకేతభాషలో రాసిన వర్తమానాలను మోదుగాకులతో చుట్టిన చుట్టల్లో దాచి జాగ్రత్తగా చేరవేస్తున్నారు. యువపోరాటవీరులకు తాము చేయగలిగిన సహాయాలన్నీ చేస్తున్నారు. అయినా ఇది పూర్తిగా సమతూకం లేనిపోరాటమని వాళ్ళకు తెలుసు. కేంద్రం జోక్యంకోసం రోజులు లెక్కపెడుతూ ఉద్విగ్నంగా ఎదురుచూస్తున్నారు. ఈలోగా పోలీసుల అత్యాచారాలు, విచక్షణారహితంగావిధించే సామూహిక జరిమానాలు వాళ్ళ ధైర్యాన్ని చెదరగొట్టాయి. ఒత్తిడికీ ప్రలోభాలకూ లొంగిపోయి కొందరు గ్రామస్థులు రిజర్వుఫారెస్టులోని ప్రతిఘటనబృందాల రహస్యస్థావరాల గురించి పోలీసులకు సమాచారం అందించటం ప్రారంభించారు. మొత్తంమీద రాజుపక్షానికే కాలం అనుకూలంగా ఉన్నట్టు కనిపిస్తోంది. తాత్కాలికఒప్పందం తర్వాత రాజకీయంగా జరిగిందేమీలేదు. రాచరిక వ్యతిరేకోద్యమం నీరసించిపోయినట్టే కనిపిస్తోంది. సాయుధయువకులముందు మిగిలినవి రెండేమార్గాలు. విజయమో! వీరమరణమో! మధ్యేమార్గంలేదు.

సరిగా ఈ ఘట్టంలో ఆనంద్, అతని సహచరులు ఏదో 'ఘనమైన' చర్య తీసుకోవాలని నిర్ణయించారు. అంతాకలిసి తుపాకులతో ఒక్కసారి విరుచుకుపడాలనుకున్నారు. ఆ బృందంలో తుపాకీ గురిపెట్టడంలో సిద్ధహస్తులు కొందరున్నారు వాళ్ళలో ఆనంద్ ఒకడు. అలాగే వ్యూహ రచనలో సుదర్శన్‌ను మించినవాళ్ళులేరు. దేనికైనా సాహసించడంలో ఆనంద్ ముందువరసలో ఉంటాడు. కష్టాలు ఏప్రమాణంలో పెరిగితే ఆ ప్రమాణంలోనే వాటిని ఎదుర్కొగల శక్తి అతనిలో పెరుగుతుంది. మృత్యువుతో కూడా అతడు ఒక విధమైన సంబంధాన్ని స్థాపించుకున్నాడు అతని చర్యల్లో ఆలోచన లేని తెగువ లేకపోయినా మృత్యువుపట్ల అతని నిర్లక్ష్యానికిమాత్రం అద్దంపడుతూనేఉండేవి. అదే మిగిలినవారిలో అతన్ని విశిష్టంగా నిలబెట్టింది. ఎదురుగా పెద్ద ప్రమాదం పొంచి ఉన్నప్పుడు నాయకత్వం ఆనంద్ స్వీకరించాలన్నది ఆ బృందం చేసుకున్న నియమం. మామూలు వేళల్లో ఆ బృందం నాయకుడు సుదర్శన్. ఆనంద్‌లోని అసాధారణ సాహసప్రవృత్తిని అతడు బాగా అర్థంచేసుకున్నాడు. పోరు ముగిసేసరికి తన ఆప్తమిత్రుడు ఆనంద్ జీవించి ఉండడేమోనని అంతరాంతరాల్లో ఆందోళన పడుతూ సుదర్శన్ అప్పుడప్పుడు విచారంలో మునిగిపోయేవాడు.

ప్రస్తుతం ఒక ముఖ్యమైన పోలీస్‌అవుట్‌పోస్టుపై మెరుపుదాడి చేయాలనీ, భారీసంఖ్యలో తుపాకులు, ప్రేలుడు సామగ్రి స్వాధీనం చేసుకోవాలని వారి నిర్ణయం. వాటిలో హెన్రీకాలన్ ఇటలీ నుంచి తెప్పించిన ఆధునిక ఆయుధాలు కూడా ఉంటాయి. కొద్దిరోజులక్రితం వాళ్ళు ఆ అవుట్‌పోస్టును ఒకసారి చూసివెళ్ళారు. ఆ ప్రత్యేకాకర్షణను దృష్టిలో ఉంచుకునే ఆ అవుట్ పోస్టుపై దాడిచేయాలని నిర్ణయించారు. ఎంతో ఆచితూచి పథకరచన చేశారు. అర్ధరాత్రి తమ స్థావరంనుంచి బయలుదేరి తెల్లవారుఝామున రెండుమూడుగంటల మధ్యలో దాడి నిర్వహించాలనుకున్నారు. ఆలస్యంగా నిద్రపోయేవాళ్ళు, త్వరగా నిద్రలేచేవాళ్ళుకూడా కాల్పులకు అడ్డుపడకుండా అదే తగిన సమయమనుకున్నారు. ముందురోజు సాయంత్రం ఓ గొర్రెలకాపరి

కొద్దిమైళ్ళదూరంలో ఉన్న సంతనుంచి ఒక పెద్దబుట్టతో సీతాఫలాలు తెచ్చిఇచ్చాడు. ఇప్పుడు ఆ బుట్టలో పైన రెండువరసల్లో సీతాఫలాలు ఉంటాయి. అడుగున ముప్పై చేతిబాంబులు ఉంటాయి. ఆ బుట్ట బాధ్యత ఆనంద్‌ది. జాగ్రత్తగా చేతిబాంబులనూ, వాటిపైన సీతాఫలాలనూ సర్దుతున్న ఆనంద్‌కి అమ్మ జ్ఞాపకమొచ్చింది. తనకోసం అమ్మ చక్కని సీతాఫలాలను జాగ్రత్తగా ఏరి ఉంచేది. అవంటే తనకెంతో ఇష్టం. అమ్మదగ్గరకూర్చుని అందులోని తియ్యని గుజ్జును తింటూ నల్లగా నిగనిగ మెరిసిపోయే గింజల్ని ఉమ్మివేయడం తనకెంతో సరదాగా ఉండేది. దూరానికి వాటిని ఉమ్మడంలో మిగిలిన పిల్లలతో తాను ఎలా పోటీపడేవాడో గుర్తొచ్చింది. అమ్మను చూసి ఏడాదిపైగా గడిచిపోయిందనుకున్నాడు. హఠాత్తుగా విచారం కమ్ముకొచ్చింది. ఎలా ఉన్నారో? అసలు జీవించే ఉన్నారా? అనుకున్నాడు. అతికష్టంమీద ఆ ఆలోచనను మళ్ళించుకున్నాడు. రక్తసంబంధాల దౌర్బల్యానికి లోనయ్యే సమయంకాదిది అనుకున్నాడు.

ఆయుధాలు శుభ్రం చేసుకుంటూ, రాత్రి భోజనాలకు వంట ఏర్పాట్లు చేసుకుంటూ, సామాన్లు సర్దుకుంటూ బృందంలోని మిగిలిన వాళ్ళు కూడా ఎవరిపనిలో వాళ్ళు మునిగిపోయారు. కొందరు శూన్యంలోకి చూస్తూ కూర్చున్నారు. సుదర్శన్ కళ్ళుమూసుకుని విశ్రాంతి తీసుకుంటున్నట్టుగా పడుకున్నాడు కానీ ముఖంలో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది. తమకు ఎంతో నష్టం కలిగించే ఒక దుర్ఘటన గురించి వాళ్ళకి తెలిసిఉంటే ఆందోళన మరింత పెరిగిఉండేది. తాము దాడిచేయబోతున్న పోలీస్‌ఔట్‌పోస్ట్‌లో వాళ్ళకి ఒక ఇన్‌ఫార్మర్ ఉన్నాడు. వంటపని అంట్లపని చేస్తూ ఉంటాడు. పిరికివాడుగా, తెలివితక్కువ దద్దమ్మలా కనిపిస్తాడు. చక్కగా వంటచేసిపెడుతున్న అతనంటే పోలీసులకు ఎంతో నమ్మకం. వాళ్ళల్లో వాళ్ళు మాట్లాడుకునే భాష ఇతడికి తెలిసేదికాదు. అది అదనపు రక్షణ. ఎవరైనా కానిస్టేబుల్ కాస్త గుడ్లురిమిచూస్తేచాలు నిలువునా వణికిపోతూ 'హుజూర్, హుజూర్!' అంటూ అతని కాళ్ళమీదపడి ఏడ్చేసేవాడు. అది మిగిలిన పోలీసుదొరలకు ఎంతో వినోదంగా ఉండేది.

నిజానికి, విప్లవకారుల్లో ఒకడైన హరిదీ,అతనిదీ ఒకే ఊరు. ఇద్దరూ బాల్యమిత్రులు. పోలీసుల సమాచారం సేకరించేబాధ్యతను వాళ్ళిద్దరూ మోసేవారు. అందుకు అనుసరించే చుట్టుదారిపద్ధతి ఎంతో ప్రమాదభూయిష్ఠంగా ఉండేది. వంటమనిషిగా పోలీసులతో బాగా కలసిపోయిన రాము ఎవరికీ ఏ కొంచెం అనుమానం కలిగించకుండా రకరకాలమార్గాల్లో సమాచారాన్ని హరికి చేరవేస్తూ ఉండేవాడు. పోలీసులు మాట్లాడుకునే భాష అతనికి తెలియకపోలేదు. కానీ తెలియనట్టు అద్భుతంగా నటించేవాడు. ఆ విషయంలో అతని సంయమనం ఆశ్చర్యంగొల్పుతూ ఉండేది. ఆ రోజురాత్రి పోలీసులు ఈ బృందం ఉంటున్న రహస్యస్థావరం వైపు కదలివెళ్ళనున్న సంగతిని రాము అలాగే తెలుసుకున్నాడు. అది ఊహించని నిర్ణయం. అవకాశం చిక్కీచిక్కగానే రాము ఈ విషయమై బృందాన్ని హెచ్చరించడానికి అడవిలోకి పరుగుదీశాడు. దురదృష్టవశాత్తు దారిలో ఒక తాచుపాముమీద అడుగువేశాడు. అది కాటువేయడంతో గిలగిలకొట్టుకుంటూ కొద్దిసేపటికే కన్నుమూశాడు. పోలీసులు రాబోతున్న విషయం బృందానికి తెలియలేదు.

అందరూ కలిసి అర్ధరాత్రి దాటిన తర్వాత బయలుదేరారు. అరగంటలోనే పోలీసు గస్తీ బృందానికి తారసపడ్డారు. ఊహించని ఈ కలయికకు వాళ్ళూ వీళ్ళూ ఉభయపక్షాలూ నివ్వెరపోయారు. పోలీసులే మొట్టమొదట తేరుకుని కాల్పులు ప్రారంభించారు. తప్పించుకుని తలదాచుకునేందుకు సమయం లేదు. విప్లవకారులు నలువైపులకూ చెదిరిపోయారు. ఈలోగా సుదర్శన్ తొడలోంచి బుల్లెట్ దూసుకుపోయి విపరీతంగా రక్తం కారుతుండగా నేలమీద పడిపోయాడు. ఆనంద్ అతనిని పట్టుకుని ఎలాగో ఓ చెట్టుచాటుకు లాక్కెళ్ళాడు. పోలీసులు కూడా అన్ని వైపులకు చెదిరిపోయి అడవిని గాలించడం ప్రారంభించారు. సుదర్శన్ మూలుగులు బయటకి వినిపించకుండా ఆనంద్ అతని నోటిని తన అరచేత్తో అదిమిపెట్టి పోలీసులు కనుమరుగయ్యే వరకూ చూస్తూ ఉండిపోయాడు. తన మిత్రుని అక్కడ విడిచి వెళ్ళకూడదనుకున్నాడు. అయితే మరికొంతసేపు అక్కడే ఉంటే తమ ఉనికి పోలీసులకు తెలిసిపోవడం ఖాయమనీ అనుకున్నాడు.

వీలైనంత నిశ్శబ్దంగా ఉండమని సుదర్శన్ చెవిలో చెప్పి బుట్టలోంచి ఓ చేతిబాంబు తీశాడు. పిన్ను తొలగించి దూరానికి విసిరేశాడు. పేలుడుతోపాటు పెద్ద మంట. అడవంతా వెలుగుతో నిండిపోయింది. పోలీసులు ఆ దిశగా ముందుకు సాగారు. ఆనంద్ కొద్దిదూరం పరుగెత్తి మొదటిబాంబు విసిరిన ప్రదేశానికి ఎడమవైపున మరో బాంబు విసిరాడు. శత్రువు రెండువైపుల నుంచి దాడిచేస్తున్నట్టు పోలీసులు అనుకుని రెండుబృందాలుగా చీలిపోయారు. ఆనంద్ మిగిలిన బాంబుల్ని కూడా ఒకటితర్వాతఒకటిగా అన్నివైపులకూ విసిరాడు. పోలీసులు పేలుళ్ళు వినిపించిన దిశలో గుడ్డిగా కాల్పులు జరపడం ప్రారంభించారు. ప్రతిఘటనబృందం కూడా ఎదురుకాల్పులు సాగించింది. ఆనంద్ మెల్లగా సుదర్శన్ పడిఉన్న ప్రదేశానికి పాకుతూవెళ్ళి అతనిని రహస్య స్థావరంవైపు గుంజుకు వెళ్ళడం ప్రారంభించాడు మిగిలినవాళ్ళుకూడా స్థావరంవైపు పోలీసుల దృష్టిని ఆకర్షించకుండా తిరిగివస్తారని ఆశించాడు. బాంబుపేలుళ్ళతో అయోమయంలోకి జారి పోయిన పోలీసులు తమ కేంప్‌కి తిరిగివెళ్ళడమే క్షేమమనుకున్నారు. ఆ ఒక్కదిశనుంచి మాత్రమే బాంబుప్రేలుళ్ళు వినపడలేదు. ఆనంద్ అటువైపు బాంబులు విసరకుండా ముందుజాగ్రత్త తీసుకున్నాడు. తెల్లవారేలోగా అందరూ క్షేమంగా స్థావరానికి చేరుకున్నారు. సుదర్శన్ కాక మరొకరు గాయపడ్డారు. ఒక బుల్లెట్ అతని మోచేతిలోంచి దూసుకుపోయింది.

ఇన్‌ఫార్మర్ రాము మరణం గురించి వాళ్ళకు మరునాడు తెలిసింది. పోలీస్‌కేంప్‌మీద దాడిచేసి ప్రమాదం కొని తెచ్చుకోకూడదని నిర్ణయించుకున్నారు. ఆ తర్వాత కొద్దివారాల్లో ఆనంద్ బృందం కొందరు పోలీసుల్ని కాల్చి చంపగలిగింది. అయితే పోలీసు బలగాలు లెక్కకుమించి అంతటా విస్తరించి ఉన్నాయి కనుక ఈ స్వల్పవిజయాల ప్రభావం అంతగా కనిపించలేదు. రాష్ట్రంలోని మిగిలినచోట్ల మిగిలినబృందాలు సాధించిన విజయాలు కూడా ఇలాగే ఉన్నాయి. మొత్తానికి తమ ఓటమి అనివార్యమని అందరికీ తెలిసిపోయింది. అయితే వీళ్ళ దాడులు ఖాదిమాన్ మూకలో వణుకుపుట్టించిన మాట నిజం. రాష్ట్రప్రభుత్వం కూడా భయపడుతున్నట్టు కనిపించింది.

స్వాతంత్ర్యయోధులకు లోపాయికారిగానైనా మద్దతు అందించడానికి కేంద్రప్రభుత్వం తటపటాయిస్తున్నట్టు వదంతులు వ్యాపించాయి. రాష్ట్రప్రభుత్వం సమరయోధుల్లో ఉద్దేశపూర్వకంగా

గంద్రగోళం సృష్టించడానికి పుట్టించిన వదంతి ఇది. రాష్ట్రప్రధానమంత్రి హాషీం అలీ, ఇతర మంత్రులు జవహర్లాల్‌నెహ్రూను కలిసిన ప్రతిసారీ తమ మేధా శక్తినీ, ఆయనపట్ల తమ గౌరవమర్యాదలను అమోఘంగా ప్రదర్శించుకుని మెప్పించినట్లు వార్తలు వినిపించాయి. అయితే హోంమంత్రి సర్దార్ పటేల్‌పై వీళ్ళ పాచిక పారలేదని కూడా అంతస్థాయిలో వదంతులు వ్యాపించాయి. ఈ మంత్రులను ప్రధాని నెహ్రూ 'షరీఫ్' లుగా వర్ణిస్తే లౌక్యంబాగాతెలిసిన సర్దార్‌పటేల్ వీళ్ళను 'పుండాకోర్లు'గా వర్ణించారట. వాస్తవమేమిటో ఎవరికీ తెలియదు. వదంతులు మాత్రం అదే పనిగా విస్తరించిపోయాయి. నిజానికి ప్రధానమంత్రి, హోంమంత్రి కూడా కాశ్మీర్‌సమస్యవంటి తీవ్రసమస్యలతో తలమునక లౌతున్నారు. అఫ్రోజాబాద్‌పై దృష్టి పెట్టడానికి వారికి వ్యవధి సరిపోవడంలేదు. అయినా చర్యతీసుకోడానికి తగిన అదనుకోసం ఓ కన్ను ఇటువేసిఉంచారు. ఏ కారణంతో వారు జాప్యంచేస్తున్నా, ఖాదిమాన్, రాష్ట్రప్రభుత్వం మరింత పేట్రేగిపోవడానికే అది అవకాశం ఇచ్చింది.

ఇక చర్య తప్పదనుకుని అడుగుముందుకు వేసిన తర్వాతమాత్రం కేంద్రం వెనకడుగువేయలేదు. ఎంతో దృఢచిత్తంతో వ్యవహరించింది. ఆ చర్యనుకూడా ఎంతో పకడ్బందీగా అమలు చేయడం అవసరం. ఏ కాస్త లోపంజరిగినా పరిస్థితి అదుపుతప్పిపోతుంది. సర్దార్‌పటేల్ మాటల్లో చెప్పాలంటే రాష్ట్రం అందమైన ఖరీదైన శాలువా. అదిప్పుడు ముళ్ళకంపలో చిక్కుకుపోయింది. గట్టిగా లాగితే అది ఊడివస్తుందికానీ చీలికలుపేలికలైపోతుంది. అలాగని చేతులు కట్టుకుకూర్చుంటే ముళ్ళు ఇంకా ఇంకా దిగబడి శాలువాకు శాశ్వతంగా నష్టంకలిగిస్తాయి. ఒక్క పోగు కూడా రేగకుండా ఒక్కొక్క ముల్లును తప్పించి శాలువాను జాగ్రత్తగా ఇవతలకు తీయాలి. చివరకు సర్దార్‌పటేల్ కేంద్రప్రభుత్వపథకాన్ని ఎంతో కట్టుదిట్టంగా అమలు చేశారు. సెప్టెంబర్ మధ్యనాటికి సైన్యం రాష్ట్రంలోకి అడుగుపెట్టింది. నాలుగురోజుల్లో చర్య పూర్తయింది. ఖాదిమాన్ తోక ముడిచారు. కొంతమంది చెలరేగి వంతెనలు పేల్చడం, కనిపించిన వారిని హతమార్చడం, రాజకీయ ఖైదీలను చంపడానికి జైళ్ళమీద దాడిచేయడంవంటి దురంతాలు సాగించినా త్వరలోనే వారుకూడా పట్టుబడిపోయారు. అయిదోరోజున రాష్ట్రప్రభుత్వసేనలు లొంగిపోయాయి. కొద్దిరోజులకే ఖాదిమాన్ ఉద్యమం ఆనవాలు కూడా మిగలకుండా అంతరించిపోయింది. ఆ ఉన్మత్తగణంలో పనిచేసిన గ్రామీణకార్యకర్తలు తిరిగి గ్రామజనాభాలో కలిసిపోయారు. ప్రధానమంత్రి హాషీంఅలీతో సహా పలువురు రాష్ట్రనాయకులు పాకిస్తాన్‌కు పలాయనం చిత్తగించారు. ఎట్టకేలకు విజయం తమదైనందుకు ప్రజలు తేలికపడి హాయిగా ఊపిరి పీల్చుకున్నారు. వాళ్ళు ప్రతీకారదృష్టితో వ్యవహరించిన ఉదంతాలు చాలా తక్కువ. తమ శిథిలజీవితాలను తిరిగి నిర్మించుకునే ప్రయత్నంలో వాళ్ళు నిమగ్నమయ్యారు. పనికిరాని ప్రతీకారచర్యలకు తీసుకోవడానికి వారికి సమయం లేదు. ఒక సైనికప్రభుత్వం పరిపాలనాబాధ్యతలను స్వీకరించింది. ఇందులో చెప్పుకోవలసిన ఒక ఆసక్తికరమైన విశేషం కూడా ఉంది: నిన్నటివరకు ఖాదిమాన్‌ఉద్యమాన్ని నెత్తినపెట్టుకునిమోసిన కొందరు చిల్లరభూస్వాములు (అక్కడక్కడ పెద్ద భూస్వాములు కూడా) రాత్రికిరాత్రి మల్లెపూవులాంటి గాంధీటోపీతో ప్రత్యక్షమయ్యారు.

అంతటి ఘాతుకాలు సాగించికూడా రాజు తేలిగ్గా తప్పించుకుపోయాడు. భారతయూనియన్‌లో విలీనమైన అఫ్రోజాబాద్ రాష్ట్రానికి రాజ్‌ప్రముఖ్‌గా నియమితుడయ్యాడు.

రాచరికవ్యతిరేకపోరాటంలో పాల్గొని ప్రాణాలతో బయటపడిన యువకులు తిరిగి తమ తమ వృత్తివ్యాసంగాల్లో చేరిపోయారు. తన భవిష్యత్తు ఫలానా విధంగా ఉండాలని ఆనంద్ అనుకోవడంలేదు. చదువుపట్ల పెద్ద ఆకర్షణ తనకు లేదనుకున్నాడు. అలాగే భూస్వామ్య లక్షణాలు ఇంకా ప్రస్ఫుటంగానే కనిపిస్తున్న పోరాటానంతరకాలంలోని రాజకీయాలు కూడా అతనికి ఆసక్తి కలిగించడంలేదు. కాలం చెల్లినవ్యవస్థతో ముఖాముఖీ తలపడాలనుకుంటేనే రాజకీయాల్లో చేరాలి కానీ లేకపోతే అనవసరమని అతనికి తెలుసు అయితే స్వల్పకాలంమాత్రమే జీవించిన ఖాదిమాన్ ఉద్యమంకంటె, ఆ ఉద్యమం తెరవెనుక సూత్రధారి రాజుకంటెకూడా, భూస్వామ్య వ్యవస్థ పురాతనమైనదనీ, దానివేళ్లు చాలా లోతుల్లో బలంగా పాతుకుపోయిఉన్నాయనీ అనుకున్నాడు. ఆ వ్యవస్థతో జరిపే పోరాటం శాంతియుతంగా, రాజ్యాంగబద్ధంగా ఉండడం అనివార్యం. ఆ రంగంలో భూస్వాములు తనలాంటి ఊహాజీవులకంటె కూడా ఎంతో ప్రబలంగా, దుర్భేద్యంగా ఉంటారు. ఇప్పుడున్న వ్యవస్థను పూర్తిగా తొలగించడం అసాధ్యం; కాని దానిని సంస్కరించడం ప్రత్యామ్నాయ వ్యవస్థను నెలకొల్పడంకంటె ఎన్నోరెట్లు కష్టసాధ్యమని ఆనంద్‌కి అనిపించింది.

ఈ సందిగ్ధపరిస్థితిని అర్థంచేసుకున్నవారిలో కొందరు రకరకాల పద్ధతుల్లో భూస్వామ్యవ్యవస్థతో రాజీపడిపోయారు. వాళ్ల చూపులు రాబోయే ప్రజాస్వామ్యవ్యవస్థమీద పడ్డాయి. ఇప్పుడున్న వ్యవస్థను ఏమాత్రం కదిలించకుండా ముందుముందు కూడా కొనసాగించే అవకాశాలు వారికి ప్రజాస్వామ్యంలో కూడా కనిపిస్తున్నాయి. అయితే స్వల్పమైన మార్పులు ఉంటే ఉండవచ్చు. ముఖ్యంగా ప్రజల్లో ఎంతో జాగృతి కనిపిస్తోంది. మళ్లీ వాళ్లను జోకొట్టడం తేలికకాదు. అదొక్కటే ఇంతటి చీకట్లోనూ మెరుస్తున్న ఆశారేఖ. కిందిస్థాయిలోని తన పార్టీ నాయకుల ధోరణి చూసినతర్వాత భవిష్యత్తులో పరిణామాలు ఎలా ఉండగలవో ఆనంద్ నిర్ధారణకు వచ్చేశాడు. ఆ దృశ్యం ఏమాత్రం ఉత్తేజకరంగా అతనికి తోచలేదు. అయితే తాను తప్పుకోవలసిందేనా? తప్పుకున్న తర్వాత ఏం చేయాలి? ఏదో వెనకేసుకోవాలనీ, భద్రత కల్పించుకోవాలనీ అతడికి ఏనాడూ అనిపించలేదు. ప్రశాంతంగా హాయిగా జీవించాలనీ అనుకోవడం లేదు. ఏవో ప్రయోజనాలు, ప్రలోభాలు తనను లొంగదీసుకునే అవకాశంలేదు. సుదర్శన్‌లాంటి కొంతమంది మిత్రులుమాత్రం తాను రాజకీయాల్లో కొనసాగాలని గట్టిగా కోరుకుంటున్నారు. అవి ఎటువంటివన్న విషయం పట్టించుకోవద్దంటున్నారు. 'ఒక లక్ష్యంకోసం— అది ఎటువంటి లక్ష్యమైనా కావచ్చు— మనందరం ప్రాణాలకు తెగించిపోరాడాం. ఫలితాలు ఎలా ఉండబోతున్నాసరే మనలో ఒకడు మనలా కలలుగంటున్న తరంవైపున కోటలో పాగావేయక తప్పదు...' అంటున్నారు.

అన్నింటికంటె ముఖ్యంగా రాజకీయజీవితం ఆనంద్‌కి ఒక నెపంలా కనిపిస్తూవచ్చింది. అయితే దేనికి నెపమని తనలో తనే అనేకసార్లు ప్రశ్నించుకున్నాడు. తనకు పిచ్చెక్కిస్తుందేమో ననిపించే సాధారణజీవితంకింద అణగారిపోకుండా తనను తను రక్షించుకోడానికా? తనకు

ఏమాత్రం చేతకాని పరుగుపందెంలోకి అడుగుపెట్టకుండా తప్పించుకోడానికా? భౌతికమైన ఆస్తిపాస్తులు సంపాదించుకునే ఇచ్ఛ తనకు లేదు కనుక, ఒకవేళ అందుకు ప్రయత్నించినా తనకు ఓటమి తప్పదు కనుకనా? చివరి కారణం తలచుకుంటేనే బాధాకరమనిపించింది. చిన్నతనంనుంచి, తాను అడుగుపెట్టిన ప్రతిరంగంలో తిరుగులేని విజయాలు సాధించాడు. బాలమేధావి అనిపించాడు. తాను ఏంచేసినా వైఫల్యమనేది ఉండదని —పొరపాటుగానే చాలామంది విశ్వసించేవారు. ఈ విశ్వాసం వల్లనే తనకు తెలియకుండానే వైఫల్యాల దెయ్యం తనలోపల ప్రవేశించిందేమో... ఇలా కొన్ని రోజులపాటు ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. తాను ఏ మార్గం తొక్కినా ఒకటే. ఇదా అదా అన్న మీమాంస అనవసరం. దేనినైనా నిశ్చలంగా నిర్మలంగా స్వీకరించే మనఃప్రవృత్తిని ఎంతో సాధన చేసి తాను జీర్ణించుకున్నాడు. అలాగే నిరాశామయమైన, శత్రుత్వపూరితమైన పరిసరాలనుంచి నిరంతరాయంగా వచ్చిపడే ఒత్తిడులను తట్టుకునే నిబ్బరాన్ని కూడా తాను తెచ్చుకున్నాడు.

ఆలోచించగా ఆలోచించగా రాజకీయాలలోని ఆకర్షణ అతనికి కొట్టొచ్చినట్టు కనిపించ సాగింది. రాజకీయరంగానికి నిర్ణీతమైన ఎల్లలూ సరిహద్దులూ లేవు. అవి ఎప్పటికీ అలా విస్తరిస్తూనే ఉంటాయి. అంతులేని అవకాశాల సామ్రాజ్యం అది. కర్తవ్యాలకూ, బాధ్యతలకూ అక్కడ ముగింపు అనేది ఉండదు. ఎదురయ్యే సవాళ్లు అంతరించడమంటూ ఉండదు. భయపెట్టే ఈ లక్షణాలే, ఈ అనంతత్వమే... స్పష్టంగా ఇవే... అతని నిర్ణయానికి దారితీశాయి. ప్రభావితంచేశాయి

రాజకీయాల్లోనే ఉండిపోవాలని నిర్ణయించుకున్నాడు. నిర్ణయమేం, ఉండిపోయాడనడమే నిజానికి సమీపం.

ఇంకా కేంద్రప్రభుత్వం చర్యజరిగి అఫ్రోజాబాద్ భారతయూనియన్‌లో విలీనమైనతర్వాత ఆనంద్ సభ్యుడుగా ఉన్న రాష్ట్రపార్టీ చేపట్టిన సాయుధపోరాట కార్యక్రమం ముగిసింది. 1950 జనవరి 26వ తేదీన భారత నూతనరాజ్యాంగం అమలులోకి వచ్చింది. రాజకీయాల్లో కొనసాగాలనుకుంటే బహుపక్షప్రజాస్వామ్యంలో ఆనంద్‌కూడా పాల్గొనాలి. అప్పటికే రకరకాల పార్టీలు అవతరించాయి. వివిధ రాష్ట్రాల నాయకుల్ని దృష్టిలో ఉంచుకుంటేతప్ప పార్టీలమధ్య తేడాలను నిర్ణయించలేని పరిస్థితి. జయప్రకాశ్‌నారాయణ్, అశోక్‌మెహతా, రామ్‌మనోహర్‌లోహియా వంటి నాయకులు కలిసి ఒక ప్రత్యేక పార్టీని స్థాపించారు. బహుపక్ష ప్రజాస్వామ్యానికి తగిన సమర్థ ప్రతిపక్షాన్ని అందించడం వాళ్ల ఉద్దేశం. కమ్యూనిస్టులు అప్పటికే వివిధరంగాల్లో చురుగ్గా పనిచేస్తున్నారు. విద్యార్థిఉద్యమాల్లో ఆనంద్ వాళ్లతో భుజం కలిపి పనిచేశాడు. వాళ్లుకూడా ప్రజాస్వామ్యప్రక్రియలో భాగస్వాములు కావాలనుకున్నారు. అయితే తెలంగాణా సాయుధ ఉద్యమం ప్రజల జ్ఞాపకాలలో ఇంకా పచ్చగానే ఉంది. నూతనవ్యవస్థలో అది ఒదుగుతుందనిపించడంలేదు. కమ్యూనిస్టుపార్టీ ప్రజాస్వామ్య ప్రక్రియలోకి అడుగుపెట్టింది కానీ హింసావాదాన్ని పూర్తిగా విడిచిపెట్టలేదు. వాళ్ల ఉద్దేశంలో ప్రజాస్వామ్యం ఒక ప్రయోగం మాత్రమే, విశ్వాసం కాదు. ప్రజాస్వామ్యం పట్ల— ప్రస్తుతానికే కావచ్చు— తమకేమాత్రం నమ్మకం లేకపోయినా, ఆ వ్యవస్థ నుంచి సాధ్యమైనన్ని ప్రయోజనాలు పొందడానికి అందులోకి వచ్చి చేరారు.

ఆనంద్ పార్టీవాళ్లు అతనిని ఎంతో మెచ్చుకుంటూ ఉంటారు. అయితే అతడేదో ఒక మూసలో ఒదిగిపోయేవాడు కాడని కూడా వారికి తెలుసు. రాష్ట్రపార్టీ అఖిల భారతపార్టీలో విలీనమైపోయిన తర్వాత ప్రజాస్వామ్యక్రీడలోని మెలకువల్ని ఆనంద్‌కూడా ఒంటబట్టించుకోక తప్పలేదు. మొదట్లో కష్టమనిపించినా క్రమంగా అలవాటుపడ్డాడు. అప్పటికీ రాజకీయజీవితాన్ని ఒక 'ఆట'గానూ, ఒక వృత్తిగానూ పరిగణించలేకపోతున్నాడు. చాలామంది రాజకీయాల్ని ఈ రెండింటిలో ఏదో ఒకటిగా భావిస్తున్నట్టు గమనించాడు. కానీ రాజకీయాలకు అతడిచ్చే నిర్వచనం వేరు. రాజకీయాధికారానికి వ్యక్తుల విజయాలను కొలమానంగా తీసుకునే మాట నిజమే —తీసుకోవాలి కూడా. అయితే అందుకు వ్యక్తిగతఫలితాలు ప్రాతిపదిక కాకూడదు. అసంఖ్యాకజనసమూహానికి జరిగిందేమిటన్నదే ప్రాతి పదిక కావాలి.

ప్రథమసార్వత్రికఎన్నికలప్రకటనతో దేశమంతటా కనీవినీ ఎరుగని కోలాహలం ప్రారంభమైంది. లోక్‌సభకూ, రాష్ట్రాల శాసనసభలకూ టిక్కెట్లు కోరుకునే అభ్యర్థులసంఖ్య హఠాత్తుగా పెరిగిపోవడంతో అధికారపక్షం అన్నివైపులనుంచి విపరీతమైన ఒత్తిడికి లోనవుతోంది. టిక్కెట్లు కోరుకునే వారిలో చాలామందిని ఆకర్షించేది అధికారమే కానీ, మరొకటి కాదని సాధారణ పరిశీలకులకు సైతం తెలిసిన వాస్తవం. అందువల్ల మీదపడే బాధ్యతల గురించి తెలిసినవారు తక్కువ. ఆ బాధ్యతలను స్వీకరించడానికి సిద్ధమయ్యేవారు ఇంకా తక్కువ.

# 11

1951 చివరిలో నూతనరాజ్యాంగానుసారం సార్వత్రికఎన్నికలనిర్వహణకు ప్రకటన జారీ అయింది. దేశమంతా ఏదో పూనకం వచ్చి నట్టుగా ఎన్నికలసం రంభంలో మునిగిపోయింది. ఒకసారి చరిత్రలోకి వెనుతిరిగిచూస్తే, భారతదేశంలో దీనితో పోల్చదగిన ఘటన మరేదీ కనిపించదు. స్థానిక ప్రభుత్వాలనిర్వహణలో పంచాయతీలకూ, జిల్లాబోర్డులకూ, శాసనసభలకూ ఎన్నికలు జరుగుతూనే వచ్చాయి కానీ, ఆ ఎన్నికల్లో వోటుహక్కు రకరకాల పరిమితులకూ, పద్ధతులకూ లోబడి ఉండేది. ప్రాచీనభారతదేశంలోకూడా ఒకవిధమైన ఎన్నికలు జరుగుతూ ఉండేవనీ, కనుక ప్రజాస్వామ్యవ్యవస్థ మనకానాడే ఉందనీ చరిత్రకారులు వర్ణిస్తూఉంటారు. ఏమైనా ఒక సర్వసత్తాకస్వతంత్ర రాజ్యాంగంప్రకారం వయోజనులందరికీ వోటుహక్కు కల్పిస్తూ దేశమంతటా సార్వత్రిక ఎన్నికలు నిర్వహించడమనేది దేశచరిత్రలోనే అపూర్వం, అసాధారణం.

స్వతంత్రభారతంలో జరిగిన తొలిఎన్నికలు ఆనంద్‌కు తొలిఓటమిని చవిచూపించాయి. ఎన్నో సంవత్సరాలు, ఎంతో అంకితభావంతో తాను సేవలు అందించిన ప్రజలు తనను దారుణంగా తిరస్కరించారు. అది అతడు ఊహించని ఓటమి. పార్టీలో ప్రచారవిద్యలో ఆరితేరినవాళ్ళలో తనూ ఒకడు. ఎన్నికలప్రచారం పొడవునా ప్రచారానికి రమ్మని వివిధ నియోజకవర్గాల నుంచి తనకు పిలుపులు వస్తూనే ఉండేవి. ముఖ్యంగా పార్టీ అంత బలంగాలేని నియోజకవర్గాల్లో తన అవసరం మరీమరీ కనిపిస్తూఉండేది. ఎంతో స్పష్టత, తర్కబద్ధత, భావవిస్తృతి, వ్యక్తీకరణలో ఒడుపు ఉట్టిపడే తన ప్రసంగాలు పట్టణవిద్యావంతులనుంచి, గ్రామీణనిరక్షరాస్యులవరకూ అన్నిరకాల శ్రోతలనూ ఆకర్షించాయి. ప్రజలనాడి ఇట్టే పట్టుకుని వారితో తను కలిసిపోగలిగేవాడు. సీనియర్‌నాయకుల్ని జనం ఎద్దేవాచేసి అవమానించిన ప్రదేశాల్లోకూడా తన ప్రసంగాలతో శ్రోతల్ని ఆకట్టుకున్నాడు. ప్రచారం పుంజుకున్నకొద్దీ ఎన్ని వందలమైళ్ళు తిరిగాడో... ఎన్ని సభల్లో మాట్లాడాడో... నిద్రాహారాలు స్నానపానాలు పట్టించుకోకుండా శ్రమించాడు. రాత్రిపూట ఎంత దూరమైనా తానే జీపునడుపుకుంటూ వెళ్ళేవాడు.

ఏవో పాటలు పాడుకుంటూ, లయాత్మకంగా మెలికలుతిరుగుతూ తన కళ్ళముందు విస్తరించే రోడ్డుమీద దృష్టి లగ్నంచేసి పరిసరాలు మరచిపోయేవాడు. ఆ నిశ్శబ్దనిశీథిలో గంటలతరబడి

జీపు శ్రుతిబద్ధంగా శబ్దంచేస్తూ సాగిపోతూఉండేది. ఆ వాహనంతో చక్కగా శ్రుతికలుపుతూ, ఉత్సాహం ముంచెత్తినప్పుడు మధ్యమధ్య గొంతుపెంచుతూ ఆనంద్ పాటలు పాడుకుంటూ ఉండేవాడు. ఆ జీపు తన ఏకైక విధేయసహ చరిలా కనిపించేది. బుట్టలోని కోడిపిల్లల్లా జీపులో కిక్కిరిసికూర్చున్న అతని మిత్రులు కేవలం శ్రోతల్లానే ఉండిపోయేవాళ్ళు. తాను విహరించే రసమయజగత్తు అంచుల దగ్గరే ఆగిపోయేవాళ్ళు. ఒక్కొక్కసారి ఆ తన్మయక్షణాలలో వాళ్ళ ఉనికి తనకు అయిష్టంగాఉండేది. అయినా వాళ్ళకు ఇవ్వవలసిన ప్రాముఖ్యం ఇస్తూనే ఉండేవాడు. అందుకు వాళ్ళు తనపట్ల మరింత కృతజ్ఞతాభావాన్నీ, అభిమానాన్నీ ప్రదర్శించేవారు.

ఎందరో అభ్యర్థుల విజయానికి తోడ్పడిన తాను ఓడిపోవడం ఆనంద్‌కు విచిత్రంగానూ విలక్షణంగానూ కనిపించింది. రహస్యబ్యాలెట్ పద్ధతిలో ఉన్న ఇంద్రజాలం అదే కాబోలు. అంతవరకూ తనమాటల్ని ఎంతో ఆసక్తిగా, శ్రద్ధగా విన్న ప్రజలు కీలకమైన చివరిక్షణంలో తనను తిరస్కరించడానికి కారణమేమిటో వెంటనే తేల్చుకోలేకపోయాడు. తనపార్టీకి ప్రతికూలంగా ఏదో ప్రభంజనం ఆ ప్రాంతాన్ని చుట్టుముట్టింది. అది ఎలా పుట్టిందో ఆ క్షణంలో అర్థంకాలేదు. అది అతార్కికమూ కాదు, అలాగని పూర్తిగా తర్కబద్ధమూ కాదు. మొత్తంమీద అది జీవితంలో —రాజకీయజీవితంలో— ఒకభాగమనిపించింది. ప్రజలు ఆనంద్‌ను, అతనిపార్టీని ఇప్పటికీ అభిమానిస్తూనే ఉన్నారు. అయితే ఆనంద్‌కు వోటువేయలేదు. పెద్దసంఖ్యలో ఉన్న నిరుపేద, నిరక్షరాస్య ప్రజానీకం మొదటిసారి జరుగుతున్న ఎన్నికల్లో మొదటిసారి వోటువేస్తున్నప్పుడు ఇలా జరగడంలో ఆశ్చర్యమేమీ లేదనుకున్నాడు. ఎటువంటి మానసికకారణాలు వోటింగ్‌ను ప్రభావితం చేసి ఉండవచ్చునో వెనుతిరిగి ఆలోచించి ఆ తర్వాత తనలోతను అనుకున్నాడు... పాపం ఏమీ తెలియని వోటర్లు తమకెంతో మేలుచేసిన తనమీద అభిమానం చూపించడానికీ, తనకు ఎన్నికల్లో వోటువేయడానికీ మధ్య ఉన్న సంబంధాన్ని అర్థం చేసుకుని ఉండకపోవచ్చు. ఆ విషయం తనకు తోచలేదు. వోటు వేస్తున్న ఘడియలో హఠాత్తుగా వారిని ఏదో ప్రలోభం లోబరచుకుని అవతలపార్టీకి వోటువేసి ఉంటారన్నది అంత ఊహాకందని విషయమేమీ కాదు. అదీగాక తనకు వోటువేయకపోవడాన్ని వారంత తీవ్రమైన విషయంగా భావిస్తారని తనెలా అనుకున్నాడో! తనకు వోటువేయకపోవడంవల్ల ఎదురయ్యే పరిణామాలు వాళ్ళకేమైనా అర్థమయ్యాయా? తను కానీ, తనపార్టీలోని కార్యకర్తలు కానీ వాటిని వివరించడానికి ఏమైనా ప్రయత్నంచేశారా? మొదటి ఎన్నికే ఐనా ఈ విషయాలన్నీ వోటర్లకు అదివరకే తెలుసుననడానికి ఆధారమేమిటి? ఎన్నికంటే ఒక సార్వజనికశిక్షణావకాశమని పెద్దలంటుంటారు. కాని ఆ శిక్షణ ఇవ్వకుండానే వారు వివేకవంతంగా వోటేయాలనుకుంటే అది అవాస్తవికమనిపించుకోదా?... చివరి రెండురోజులూ వోటర్లు ఆకస్మికంగా, ఇంచుమించు రహస్యంగా తమ కళ్ళముందు వచ్చివాలిన ఆ ప్రలోభంతో ఉబ్బితబ్బిబ్బవుతూంటే తాము మహాత్మాగాంధీ గురించి, నెహ్రూగారి విధానాలగురించి మాట్లాడుతూనే ఉన్నారు. వోటువేసే ఆ క్షణంలో వారిని మరేదో మంత్రించింది. ఏదో కొత్తగా కనిపించేసరికి మోజుపడిపోయారు. ఒక్కొక్క వోటుకీ అయిదెకరాల భూమినీ, ఆవునీ ఇస్తామని అవతలపార్టీ చేసిన వాగ్దానం వాళ్ళ కళ్ళకు మిరుమిట్లుగొలిపింది. అసలా

వాగ్దానం ఎవరు చేశారు? ఎవరికి చేశారు? ఎప్పుడు చేశారు? ఎక్కడ చేశారు? ఎవరికీ ఏమీ తెలియదు, తెలుసుకోవాలనీ అనుకోలేదు. ఎన్నికలు ముగిసేవరకూ ఆ విషయమై ఆగి ఆలోచించిన వాళ్ళే లేరు. దానికితోడు అవతలిపార్టీ కనుక ఎన్నికల్లో ఓడిపోతే మళ్ళీ ఆయుధాలు అందుకుని హింసాత్మకచర్యలు సాగిస్తుందన్న భయాన్ని జనసామాన్యంలో చాపకిందనీరులా ఎక్కించారు. అంతా నిద్రపోతుండగా ఊళ్ళమీదికి వచ్చిపడతారనీ, గడ్డివాములకు నిప్పుపెడతారనీ, నడివీధిలో కత్తుకలు తెగనరుకుతారనీ, 'హిట్‌లిస్ట్'లో ఉన్న వాళ్ళను, బంధువుల ఎదుటే కాల్చిచంపుతారనీ... ఇలా ఏవేవో ఊహించుకున్నారు. 'నిన్నమొన్న జరిగిన ఈ ఘాతుకాలన్నీ మరచిపోయావా? మళ్ళీ అటువంటివి జరగాలని కోరుకుంటున్నావా?... లేదుకదూ?... కనుక నీ వోటు అవతలిపార్టీకి వేయి...' వోటరును 'ఒప్పించ'డానికి ఇంతకంటె తేలికమార్గం లేదు మరి. కాని దీన్ని ప్రజాస్వామ్యాని కొక వికృతస్వరూపమే అనాలి. అయితే ఎన్నికలు పూర్తయ్యేవరకూ ఈ దుస్తంత్రాలగురించి ఎవరికీ తెలియదు.

ప్రతి వోటరూ అయిదెకరాల భూమీ, ఆవూ, తనొక్కడే చేజిక్కించు కోవాలనుకున్నాడు. ఎవరికివాళ్ళు తమకుమాత్రమే అవి ఇవ్వబోతున్నట్టు ఊహించుకున్నారు. మిగిలినవాళ్ళు తమ అభిమాన అభ్యర్థి ఆనంద్‌కి వోటువేసి గెలిపిస్తారు కనుక తన వోటు మరొకరికి వేసినా నష్టంలేదని... అనాలోచితంగా అనుకున్నారు.

ఆవు కోసం అయిదెకరాల భూమికోసం కొన్నిరోజులు ఎదురు చూసి అవి రాకపోయేసరికి మోసపోయామని తెలుసుకున్నారు. మళ్ళీ గుంపులు గుంపులుగా ఆనంద్ దగ్గరికి వెళ్ళి ఒక రితో ఒకరు పోటీ పడుతూ విధేయత చాటుకోవడం ప్రారంభించారు. అతనిపట్ల నమ్మకద్రోహానికి పాల్పడింది తాముకాదనీ, మరొకరనీ అంటూ ఎవరికి వారు అవతలి వాళ్ళను వేలెత్తి చూపించడం మొదలుపెట్టారు. మీరు కూడా ఇతర పద్ధతుల్లో డబ్బు ఖర్చు పెట్టి ఉంటేనా, తప్పకుండా గెలిచి ఉండేవారన్న అర్థాన్ని ధ్వనింపజేస్తూ మాట్లాడారు. కేవలం అభ్యర్థి నీతి నిజాయితీలు చూశో, మహాత్మాగాంధీ, జవహర్లాల్ నెహ్రూ బొమ్మల్ని చూశో – వాళ్ళెంత మహానుభావులైనా కావచ్చు – జనం గెలిపించరన్నారు. మొదటి ఎన్నికలోనే ఎంతో నేర్చుకున్నారన్న మాట!

ఆ ఎన్నిక నిన్నటి విషయం కనుక ఇక మరిచిపోండని ఆనంద్ అనేసరికి వాళ్ళకి గుండెల మీద బరువు దిగిపోయినట్టయింది. అతని మంచితనాన్ని అభినందిస్తూ తమ మధ్య అసలేమీ జరగనట్టు ఎప్పటిలా అల్పమైన పనుల కోసం, సిఫార్సుల కోసం వేధించడం మొదలుపెట్టారు. ఎదురుగా ముఖస్తుతి మాటలు, చాటుగా విమర్శలు, వెక్కిరింపులు. బొత్తిగా [illegible] లేని మనిషిలా ఉన్నాడు.... జరిగిన అవమానం అంతా మరిచిపోయి వారం రోజుల క్రితం తనను వెన్నుపోటు పొడిచిన వాళ్ళ దగ్గరికే ప్రజా సేవ అంటూ పరుగులు తీస్తున్నాడు... చర్మం మరీ దళసరి కాబోలు... వచ్చే ఎన్నికల్లో ఎవరో మట్టి కరిపించేవరకూ ఇలా కళ్ళు మూసుకుని ప్రతివాళ్ళకీ సహాయం చేస్తూనే ఉంటాడేమో... ఇతగాడి వరస చూస్తే అలాగే ఉంది... ఇలా ఉంటున్నాయి వ్యాఖ్యలు.

[library stamp, partly legible: ...SAHITYA... NIKI]

ఆ నీచ ప్రవృత్తి చూసి ఆనంద్ నిర్ఘాంతపోయాడు. కానీ పైకి మామూలుగానే ఉండిపోయాడు. ఎన్నికల ప్రచారం ఖర్చులకోసం పిత్రార్జితంలో కొంతభాగం అమ్మేశాడు తను. దానికి ప్రతిఫలం ఏమీ చూపించలేకపోవడంతో ఇంట్లో అందరూ తన మీద మండిపడుతున్నారు. తన ఓటమికి గ్రామస్థుల్ని బాధ్యుల్ని చేయదలచుకోలేదు. ఆ విషయం వాళ్ళతో స్పష్టంగా చెప్పాడు. వోట్లతోపాటు తను ఎందరో మిత్రులు, శ్రేయోభిలాషుల అండదండలు కూడా కోల్పోయాడు. తనకు దక్కింది వాళ్ళ కోపతాపాలు మాత్రమే. వోట్లు ఎలా 'రాబట్టు' కోవాలో తామిచ్చిన సలహాలను పెడచెవిన పెట్టినందుకు వాళ్ళతనిని చీల్చిచెండాడారు. దానికి తోడు అపజయంపై అతని ప్రతిస్పందన చూసి వాళ్ళు మరింత రెచ్చిపోయారు. ఫలితాలు వెల్లడై తన రాజకీయసహచరులు ఓదార్చడానికి వచ్చినప్పుడు 'అదంతగా పట్టించుకోవలసిన విషయమా?' అంటూ ఆనంద్ తీసిపారేశాడు. ఆ తలబిరుసు సమాధానానికి వాళ్ళు విస్తుపోయారు. వాళ్ళ తప్పు మాత్రం ఏముంది? తన మీద సానుభూతి చూపించే అవకాశం ఆ సమాధానం వల్ల వాళ్ళకి లేకుండా పోయింది. ఓటమి పట్ల అతని నిర్లిప్తత వాళ్ళకి కొరకరానికొయ్యలాగా కనిపించింది. అసలెవరైనా ఎన్నికల్ని అంత తేలిగ్గా తీసుకుంటారా? ... 'మేము ఎప్పుడో చెప్పాం' అనే అవకాశం పాపం వాళ్ళకిక లేదు. ఎంతో తీవ్రంగా తీసుకోవలసిన ఎన్నికల ఓటమిని అతనింత తేలిగ్గా తీసుకుంటున్నాడంటే అది మేకపోతు గాంభీర్యమైనా అయ్యుండాలి, లేకపోతే తమను అవమానించడమైనా అయుండాలి. రెండూ కూడా కావచ్చు, అన్న నిర్ణయానికి వారు వచ్చారు. తనపట్ల వాళ్ళకేదో ద్వేషముందని కాదు. నిజంగా వాళ్ళందరూ తన స్నేహితులే. అయినా సరే, ప్రతిభావంతుడనుకునే వ్యక్తి — అతడు శత్రువే కావచ్చు స్నేహితుడే కావచ్చు —అమాంతం కిందపడినప్పుడు మనిషి అంతరాంతరాల్లో ఎక్కడో లీలగా ఆనందం తొంగిచూస్తుందికాబోలు. రాజకీయరంగంలో ఇది మరింత స్పష్టంగా కనిపిస్తుంది...

కనుక మిత్రుల దృష్టిలో ఆనంద్ పొగరుబోతు, పశ్చాత్తాపం లేనివాడు, నిజాయితీహీనుడు, దుర్మార్గుడు, కపటి అయిపోయాడు. ఇవన్నీ చాటుమాటు అక్షింతలే అనుకోండి. ఇలా అనుకోవడం కూడా శత్రుత్వంతో కాదు. ఇదీ ఒక విధమైన తర్కమే. తామందరూ అతడు ఎలా ఉండాలనుకున్నారో అలా లేకపోవడంవల్ల పుట్టిన తర్కం. వాళ్ళందరూ ఆశించినట్టు అతడు గుండెలుబాదుకోలేదు. ఒక్కముక్కలోచెప్పాలంటే ఇది మరీ విడ్డూరమైన ప్రవర్తన... కనుక క్షమించడానికి వీల్లేదు.

మిత్రులు, మద్దతుదారులు ఇలా నిరాశకూ, ఆగ్రహానికీ లోనైతే కుటుంబ సభ్యులు అతని పట్ల ముభావంగానూ, తిరస్కారంగానూ ఉంటున్నారు. అనూచానంగా వస్తున్న కుటుంబవృత్తిని మానుకొని ఉన్నతవిద్యవెనుక పరుగు లెత్తడం బంధువు లెవరికీ నచ్చలేదు. తమ సలహాలను, అభిప్రాయాలను వినిపించుకోనందుకు ఆనంద్‌పై ఎన్నోసార్లు వారు ఆగ్రహావేశాలు కురిపించారు. ఇప్పుడు ఈ ఓటమితో రోగం కుదిరిందనుకుని ఎంతో సంతోషించారు. (రహస్యంగానే). అయితే ఆనంద్ ఎప్పుడూ వాళ్ళను పట్టించుకోలేదు. తమను మించి ఎవరైనా పైకి వెడితే వాళ్ళు ఓర్వలేరు. తన రంగంలో ఆనంద్ పైపైకి వెడుతున్నకొద్దీ అతని పట్ల వారి ద్వేషం కూడా పెరుగుతూవచ్చింది. అదంతా అనేక విపరీత ధోరణులు కలగలిసిన మధ్యతరగతి మనఃప్రవృత్తి, భయం, అసూయ, దొంగచాటు మెచ్చుకోలు, తెచ్చి పెట్టుకున్న ఉదాసీనత, నిలువునాడాంభికత్వం.

ఆనంద్ ఎంత పనికిమాలినవాడిలా తయారయ్యాడో, తమకు ఎలా తలవంపులు తెచ్చాడో ఇంటికి వచ్చిపోయే జనం మెరమెచ్చు మాటలతో వర్ణించి అదేపనిగా చెబుతూంటే కుటుంబ సభ్యులకు ఊపిరి సలపలేదు. స్కూలుకీ, కాలేజీకీ పంపించి చదివించడానికి వాళ్ళు పడిన పాట్లు అతగాడు అసలేవైనా పట్టించుకుంటే కదా !... మొట్టమొదట రాచరికంతో పోరాటం అన్నాడు, ఇప్పుడు ఎన్నికల్లో పోటీచేసి శుద్ధచవట అనిపించుకున్నాడు. బుద్ధిజ్ఞానంలేనివాళ్ళుకూడా ఓటమి ఖాయమనుకున్నప్పుడు అసలితగాడు ఎన్నికల్లో పోటీచేయడంలో ఏమైనా అర్థముందా? డబ్బుబలం ఉందా, కులబలం ఉందా, ఎన్నికలలో అవసరమైన హంగూ, ఆర్భాటం ఏవీలేకుండానే గెలుస్తానని ఎలా అనుకున్నాడు? పైగా ఓడిపోయికూడా అదేమంత పట్టించుకోవలసిన విషయం కాదంటా డేమిటి?. . రోజు విడిచి రోజు ఇదీవరస. ఎత్తి చూపడానికి ఈ మాటల్లో ఏమీ పస ఉండదు. కనీసం విమర్శ అనడానికికూడా పనికిరావు. పైకితేలే వాస్తవం ఒక్కటే— అది తనపట్ల వాళ్ళ అయిష్టం.

తన భర్త రాజకీయసంబంధాలు వీణకు ఎప్పుడూ ఆందోళన కలిగిస్తూనే ఉన్నాయి. కొన్నేళ్ళ క్రితం ఆనంద్ రాజుకు వ్యతిరేకంగా తుపాకులు బాంబులతో కొన్నిప్రమాదకర చర్యలు సాగించినట్టు లీలగా ఆమెకు తెలుసు. ఆ ఘట్టం తర్వాత అతడు పూర్తిగా రాజకీయాల్లో మునిగితేలుతూ ఉండడం ఆమెకు అసలు నచ్చలేదు. అందులోనూ ఆ రాజకీయాలు పిత్రార్జితంలో కొంత మంగళంపాడించిన తర్వాత మరీనూ. ఇక ఊరుకోవడంలో ఆమెకి అర్థం కనిపించడంలేదు. అందరు సంసారుల్లానే తన భర్త కూడా ఊళ్ళోనే స్థిరపడి పొలంపనులు చేసుకుంటూ, పిల్లల బాగోగులు పట్టించుకుంటూ సాధారణ గృహస్థజీవితం గడపాలని ఆమె కోరిక. అలా కోరు కోవడంలో తప్పేమీలేదు. అయితే వీణతోసహా ఎవరూ ఆనంద్ ఇటువంటి జీవితానికి సరిపోతాడా, సరిపోడా అన్న విషయం ఆలోచించలేదు. ఆమె అయోమయంలోకి జారిపోయింది. క్రమంగా, ఆనంద్ పట్ల సానుభూతి లేని వ్యక్తులకు దగ్గరైంది.

కొన్ని హిందూకుటుంబాలలో ఏదో మాటలకందని భయానకమైన ఉద్రిక్తపరిస్థితి కనిపిస్తూ ఉంటుంది. రోజు రోజుకీ చుక్కచుక్కలుగా అది జీవితాలపై విషబిందువులు రాల్చుతూ ఉంటుంది. వాదోపవాదాలుండవు. కష్టాలూ బాధలూ వెళ్ళబోసుకోవడం ఉండదు. అయినా జీవితాలు కలుషిత మౌతూనే ఉంటాయి. ఏమీజరగదు. మగ, ఆడ -కరుడుగట్టిన మనస్తత్వంలో ముడుచుకుపోయి రోజులు దొర్లిస్తూ ఉంటారు. ఎక్కడా జీవకళ కనిపించని సంస్కృతి— ప్రాచీనమనీ, తెలివైనదనీ, గొప్పదనీ, సహనమూ, సంప్రదాయమూ మూర్తీభవించిందనీ –దీనికే రకరకాల గొప్ప గొప్ప పేర్లు. దీనిని ప్రతిఘటించాలని ఏ కొంచెం కదలిక చూపించినా తక్షణమే నిర్దాక్షిణ్యంగా అణిచివేస్తారు. తిరగబడి నాశనాన్ని కొనితెచ్చుకోవడమో, లేదా రాజీపడి శుష్కమైన ప్రతిష్ఠను మూటగట్టుకుని ప్రశాంతంగా కన్నుమూయడమో... మార్గాంతరంలేదు.

పైకి గంభీరంగా, ప్రశాంతంగా కనిపిస్తున్నా ఓటమి ఆనంద్‌ను లోలోపల కుంగదీసింది. తనెక్కడ పొరపాటు చేశాడో అర్థంకాలేదు. దేశంలో ప్రజాస్వామ్య ప్రక్రియ ఈ పోకడలోనే ముందుముందు కూడా ఉండబోతోందా? మహాఅయితే ఇదొక సుడిగాలిగా, కాకపోతే జూదంగా

పరిణమించదుకదా? ఇందులో తను ఇమడగలడా? తనను ఆడిపోసుకునే బంధువుల మాటలే నిజమేమో! అయితే రాజకీయాలనుంచి తప్పుకోవలసిందేనా? తప్పుకుని ఏంచేయాలి!

ఒంటరిగానే ముందుకు సాగిపోవాలని ఆనంద్ నిర్ణయించుకున్నాడు పూర్తిగా రాజీపడే ప్రశ్నేలేదు. అది తనవల్ల కాదని అతనికి స్పష్టంగా తెలుసు. తిరుగుబాటు తనకు సాధ్యంకాదు ఎందుకంటే కుటుంబనిర్బంధాలనుంచి తాను తప్పించుకోలేడు. ఇంటికి పెద్దకొడుకు కనుక తన మీద బరువు బాధ్యతలు చాలా ఉన్నాయి. ఇద్దరు తమ్ముళ్ళు-అందులో ఒకడింకా పాలుగారే వయసులో ఉన్నాడు- వాళ్ళ బాగోగులు చూసుకోవాలి. ఒక వైపు నిరాసక్తంగా ఉంటూనే బాధ్యతలు నిర్వర్తించడం. ఈ ధోరణి తనను ఎటువైపు తీసుకువెడుతుందో తెలియకుండానే దానికి అలవాటుపడ్డాడు. ఒకటిమాత్రం స్పష్టంగా తెలుసు. మరోవిధంగా అతడు చేయగలిగిందేమీలేదు. ఇతరులకు ఉన్నందుకు ఇదితాను చెల్లిస్తున్న మూల్యం కావచ్చుననుకున్నాడు.

ఎన్నికల పరాజయఖేదాన్ని తనలోతనే మౌనంగా భరించాడు. రాజకీయాల్లోఉన్న తర్వాత ఏవేవో పనులు, అవసరాలు వచ్చిపడుతూనే ఉంటాయి. ఆనంద్ క్రమంగా మరోసారి తన కార్యక్రమాల్లో పూర్తిగా లీనమైపోయాడు.

తొలిఎన్నికలతర్వాత నాలుగేళ్ళపాటు ఆనంద్ నిర్విరామంగా శ్రమించాడు. గ్రామస్థాయి నుంచి రాష్ట్రస్థాయి వరకూ అన్నిఘట్టాలలో తన శక్తియుక్తులు రుజువు చేసుకొన్నాడు. బ్రిటిష్ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగిన స్వాతంత్ర్యపోరాటంలా అఫ్రోజాబాద్ విముక్తి పోరాటం సుదీర్ఘకాలం సాగలేదు కనుక రాజకీయపార్టీస్థాయిలో విభిన్నతరాల నాయకులు ఎక్కువ సంఖ్యలో ఉండడానికి అవకాశమేర్పడలేదు పలువురు సీనియర్ నాయకులున్నా వారు మహాత్మాగాంధీ, జవహర్లాల్ నెహ్రూలనుంచి స్ఫూర్తిని పొంది రాష్ట్రరాజధానిని కేంద్రస్థానంగా చేసుకొని పని చేసినవాళ్ళు ఆనంద్ గ్రామీణప్రాంతంనుంచివచ్చి త్వరత్వరగా నాయకత్వస్థానాలకు ఎదిగిన తొలితరం నాయకులలో ఒకడు.

1952లో ఎన్నికలు ప్రకటించినప్పుడు, రాష్ట్రంలో 'ప్రస్తుత (సిట్టింగ్) సభ్యులు' పేరుతో ఎటువంటి వారసత్వంలేదు. అందుకని ఆనంద్ పార్టీకార్యక్రమాలన్నింటిలో పాలుపంచుకున్నాడు. పార్టీపత్రాలు ప్రకటనల ముసాయిదాలు రూపొందించే అతిముఖ్యులలో ఒకడయ్యాడు. తొలిఎన్నికల తర్వాత జరిగిన వివిధఉపఎన్నికలలో ప్రచారం సాగించి అవతలి పార్టీ అభ్యర్థిని తగినంత మెజారిటీతో ఓడించడానికి తోడ్పడ్డాడు. ఎన్నికలసమయంలో ఆ పార్టీచేసిన అలవిమాలిన వాగ్దానాలేవీ నిజంకాలేదు. అయిదెకరాల భూమి -ఆవు వాగ్దానం ఆ పార్టీ విశ్వసనీయతను దారుణంగా దెబ్బతీసింది. రాష్ట్రంలో ఆ పార్టీ మరెప్పటికీ కోలుకోలేనంతగా కుంగదీయబడినట్టు క్రమంగా రుజువైంది. ఆనంద్ పార్టీపరిస్థితి ఎంతో ఆశావహంగా కనిపిస్తోంది. తొలిఎన్నికలలో తాము వోటువేసి గెలిపించిన పార్టీవిషయమై ప్రజలు పునరాలోచనలోపడ్డారు. ద్వితీయ సార్వత్రికఎన్నికలు సమీపించేనాటికి వారి దృక్పథంలో మార్పు మరింత స్పష్టంగా కనిపించింది.

# 12

'టిక్కెట్' అనేమాట భారతీయభాషలన్నింటిలోనూ సర్వసామాన్యం. అయితే టిక్కెట్లు ఒకరకం కాదు, అనేకరకాలు. రాజకీయాల్లో ఉన్నవాళ్ళు ఏదో ఒక రాజకీయపక్షంనుంచి ఎన్నికల్లో పోటీ చేయడానికి పొందే అనుమతిగా ఆ మాట కు అర్థంచెబుతూ ఉంటారు. ఎన్నికైన అభ్యర్థి శాసన సభలోనో, లేదా తాను పోటీచేసిన మరేదైనా సభలోనో ఆ పార్టీప్రతినిధిగా చలామణి అవుతూ ఉంటాడు. అమల్లోఉన్నది బహుపక్షప్రజాస్వామ్యంకనుక ప్రధానంగా అది పార్టీలపరంగానే పని చేస్తూఉంటుంది కానీ, పార్టీ సంబంధంలేని వ్యక్తులుకూడా స్వతంత్రఅభ్యర్థులుగా పోటీచేయ వచ్చు. పార్టీటిక్కెట్లకోసం తొక్కిసలాట సహజంగా ఎక్కువగానే ఉంటుంది. గెలవాలన్న ఆశతో అభ్యర్థులు డబ్బునో, మరోదానినో ఎరవేసి వోటర్లను లోబరచుకోవడమూ జరుగుతూఉంటుంది. జనాదరణ బాగా ఉన్న పార్టీతరఫున పోటీచేస్తే, ఆఖరిక్షణాల్లో పరిస్థితి తలకిందులైతేతప్ప, గెలుపు ఖాయం కనుక ఆ పార్టీటిక్కెట్టుపై జనం చూపించే మోజు అంతా ఇంతా కాదు.

ద్వితీయసార్వత్రికఎన్నికలు జరగడానికి కొన్నిమాసాల ముందునుంచి టిక్కెట్‌జ్వరాన్ని ఆనంద్ గమనిస్తున్నాడు. మాటలతో చమత్కారాలుచేసే ఓ వ్యక్తి దీనిని 'టికెటేరియా'గా వర్ణించాడు. ఆనంద్ సభ్యుడుగా ఉన్న రాష్ట్రపార్టీవ్యవస్థలో ఇప్పుడు సమూలమైన మార్పేదో కనిపిస్తోంది. తొలిసార్వత్రిక ఎన్నికల్లో అగ్రభాగంలోఉండి పనిచేసిన పలువురు నాయకులు ఇప్పుడు ప్రాముఖ్యంకోల్పోయి తెరమరుగయ్యారు. అనుభవమూ, పరిణతీ ఉన్న నాయకత్వం లోపించడంతో అభ్యర్థులఎంపిక ఒక పద్ధతీ పాడూ లేకుండా సాగిపోతోంది. అభ్యర్థి గుణగణాలకన్నా పార్టీనాయకులతో అతనికున్న వ్యక్తిగతసంబంధాలు ప్రాధాన్యం వహిస్తున్నాయి. ఎవరిని పట్టు కుంటే టిక్కెట్టు చేతిలోపడుతుందో తెలుసుకుని ఆ వ్యక్తిని ప్రసన్నంచేసుకోవడమొక్కటే ముఖ్యమైపోయింది. మహిళాఅభ్యర్థుల విషయంలో, ప్రత్యేకించి మంచివయసులో ఉండి, అందంగా ఆకర్షణీయంగా కనిపిస్తూ, ఎలాగైనా టిక్కెట్టు సంపాదించాలనుకునే మహిళల విషయంలో 'ఎవరికి ఎవరు తెలుసు'ననేది ఒక ప్రత్యేకమైన అర్థాన్ని సంతరించుకుంది.

అటువంటివారిలో అరుణ కూడా ఉండడం సంభవించింది. చామనచాయతో సాదాసీదాగా కనిపిస్తున్నా ఆమెది ఆకర్షణీయమైన విగ్రహం. ఆమె రాజకీయరంగప్రవేశం చేయడానికి మంచి

కారణాలే ఉన్నాయి. ఆ విషయం ఆనంద్‌కు తర్వాత తెలిసింది. అసెంబ్లీ టిక్కెట్టు సంపాదించాలనుకున్న అరుణ కూడా 'ఎవరికి ఎవరు తెలుసు'ననే చక్రభ్రమణంలో ఇరుక్కోక తప్పలేదు. ఫలితం ఆమెకి దిగ్భ్రాంతి కలిగించింది. ఎంపికసంఘంలో ఉన్న ఒక సభ్యుడు ఆమెను 'తెలుసు'కోవాలనుకున్నాడు. ఆ ప్రయత్నంలో ఎదురుదెబ్బ తగిలేసరికి ఆమెకి ఎలాగైనా టిక్కెట్టు రాకుండా చేయాలనుకున్నాడు ఆ పరిస్థితిలో మరో స్త్రీ ఎవరైనా అయితే టిక్కెట్టుకీ, ఎన్నికలకీ ఓ దణ్ణంపెట్టివచ్చి వంటింట్లో పడేది. లేదా నాయకుడి కోరిక తీర్చేది. కానీ అరుణ వేరు. ఆమె ఒక తృతీయమార్గం అనుసరించాలనుకుంది. అలా ఓ రోజు ఉదయం నేరుగా ఆనంద్ డ్రాయింగ్‌రూంలోకి అడుగుపెట్టింది.

క్లుప్తంగా తనను పరిచయంచేసుకుంది. స్వాతంత్ర్యసమరయోధుల కుటుంబంలో పుట్టింది. భర్త ప్రభుత్వోద్యోగంలో ఉన్నాడు. సోషల్‌వర్క్‌లో డిగ్రీ చేసింది. కాలేజీలో ఉన్నప్పుడు పౌర హక్కుల ఉద్యమంలో పనిచేసింది. ఆధ్యాత్మికవిషయాలమీద అమితమైన శ్రద్ధ. ప్రజాసేవ మీద ఆసక్తితో ఇప్పుడు రాజకీయాల్లోకి రావాలనుకుంటోంది. అసెంబ్లీఎన్నికల్లో పోటీచేయడానికి పార్టీటిక్కెట్టుకోసం దరఖాస్తుచేసింది. ఆనంద్‌గారూ! టిక్కెట్టు ఇప్పించరూ, ప్లీజ్!

ఆమె కంఠధ్వనికి ఆనంద్ ఒకింత ఆశ్చర్యపోయాడు. ఎంతో సూటిగా, తేటగా ఎదుటి వాళ్ళను ఒప్పించేలా ఉంది. ఆమె మాట్లాడుతూంటే కొద్దిసేపు పరిశీలనగా ఆమెనే చూస్తూ ఉండిపోయాడు. ఆ ఒంటిచాయ ఆమె ఒంపుసొంపుల్ని మరింత బాగా ప్రస్ఫుటం చేస్తోందను కున్నాడు. లేత ఎరుపురంగు చీరతో ఆమె తన గదిలోకి అడుగు పెడుతున్నప్పుడు కాలేజీలెక్చరరో, సంపన్నవ్యాపారి భార్యో అయుంటుందనుకున్నాడు. రాజకీయాల్లో చేరబోయే మనిషన్న ఆలోచన తనకు రానేలేదు. బురఖాలుతప్ప ఏమీ కనిపించని ప్రాంతంలో ఇదో కొత్తవింతగాకూడా ఉంటుంది... ఆమె మాటలు ఆగిపోయేసరికి అతడు ఊహల్లోంచి బయటపడ్డాడు. అసలు విషయానికొస్తూ అన్నాడు. 'మీరు ఎవరి దగ్గరకో వెళ్ళబోయి నాదగ్గరకొచ్చినట్టున్నారు. నేను ఎంపికసంఘంలో సభ్యుణ్ణి కాదు. పార్టీవ్యవహారాల్లో నాకంత పలుకు బడికూడా లేదు. ఇంతకీ నాదగ్గరకు వెళ్ళ మని మీకెవరు చెప్పారు?'

'స్థూలంగా అందరూ చెప్పారు. ప్రత్యేకించి ఏ ఒకరూ చెప్పలేదు' అరుణ సమాధానం చెప్పింది.

'తమాషాగా ఉందే. నేనుకూడా మీకు స్థూలంగానే మాట సహాయంచేసి ప్రత్యేకంగా ఏ ఒకరికీ చెప్పలేదనుకోండి... అప్పుడు మీపని అవుతుందో, కాదో...?' అన్నాడు ఆనంద్.

'అవునుకదూ!. . మీరు మాట్లాడగలిగినవాళ్ళే... ఒకరున్నారు'

'అలాగా మేడమ్! ఎవరా ఒకరు? ఆయన... లేదా ఆమె.. లేదా అది... పేరేమిటో చెప్పండి'

ఆహ్లాదకరంగా, కాస్త హాస్యం మేళవించి అతడు మాట్లాడేసరికి వాతావరణం తేలికపడి ఆమె ముఖంలో చిరునవ్వు తొంగిచూసింది.

'ఆమే, అదో అయుంటే నాకు సమస్యే ఉండేదికాదు...ఆయన... అతడే!... పేరు రాఘవ్...

'అలాగా... అయితే మీపని జరగడం అసాధ్యం దేవీజీ! అతడైతే నేను మీకేమీ సహాయం చేయలేను. కొంతకాలం క్రితం మేమిద్దరం ఏదో విషయంలో గొడవపడ్డాం. అతడు ఎంపిక సంఘంలో సభ్యుడే. కానీ నేను చెబితే వినడు. మీరే నేరుగా అతని దగ్గరకు వెళ్ళి...'

'వెళ్ళాను'

'ఓహో... వెళ్ళారన్న మాట? అయితే ఏమన్నాడు?'

'చెప్పమంటారా?'

'అది మీ ఇష్టం. అయితే ఒక హామీమాత్రం మీకివ్వగలను. నేను మాటలుమోసే రకం కాదు.'

క్షణకాలం ఆగి నేలచూపులు చూస్తూ చరచినట్టుగా అంది. 'తన పక్కలోకి రమ్మన్నాడు'

ఆనంద్ ఆశ్చర్యచకితుడయ్యాడు. ఆమె నిర్భీతి ఒకవిధంగా అతణ్ణి ముగ్ధుణ్ణిచేసింది. ఆ మాటకు ఎలా స్పందించాలో మాటలకోసం వెతుక్కుంటూనే ఈమె సాధారణ స్త్రీ కాదనుకున్నాడు. పార్టీలో కొంతమంది కామాంధులు ఉన్న విషయం తెలియకపోలేదు కానీ రాజకీయాల్లో అతనికి ఇది ఏమాత్రం పరిచయంలేని కోణం. తను విన్న మాటవల్ల పార్టీపై పడే బురద ఎటువంటిదో ఊహించుకుని అతనిలోని ఆదర్శవాది కలవరపడిపోయాడు.

ఒక నిర్ణయానికి వచ్చి రాఘవ్‌కు ఫోన్‌చేశాడు. అతడితో చాలా తీవ్రంగా మాట్లాడాడు. అటువైపునుంచి సమాధానంకూడా అంతే తీవ్రంగా ఉంది. 'ఆమె విషయంలో నీకంత ఆసక్తి దేనికో?' రాఘవ్ ప్రశ్నలో సూదుల్లా గుచ్చుతున్న వ్యంగ్యం.

'నాకేమీ ఆసక్తిలేదు. నువ్వామెమీద ఎటువంటి ఆసక్తి చూపించావో తెలిసి ఫోన్ చేస్తున్నాను. అది నీకూ, నీ ప్రతిష్ఠకూ ఎంతమాత్రం మంచిదికాదు. ఈ విషయం గుర్తు పెట్టుకుంటావనుకుంటాను' అన్నాడు ఆనంద్.

రాఘవ్ విసురుగా ఫోను పెట్టేశాడు. ఆనంద్‌కూడా రిసీవర్‌ను యధాస్థానంలో ఉంచాడు. అతడి ముఖంలో రౌద్రం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. 'మీరు వెళ్ళండి. అతడి గురించి పట్టించుకోకండి. ప్రతిభకు విలువిచ్చే నాయకులకు పార్టీ గొడ్డుపోలేదు. మీ ప్రయత్నం మీరు చేయండి. తప్పకుండా ఫలితం ఉంటుం'దన్నాడు.

ఆమె కృతజ్ఞతలు చెప్పుకుని వెళ్ళిపోయింది.

ఇంకెవరో వచ్చేసరికి ఆనంద్ అరుణ విషయం మరిచిపోయాడు. కొద్దిరోజులకు వెలువడిన అభ్యర్థుల తుదిజాబితాలో ఆమె పేరు చూసి అతడికి సంతోషమూ, ఆశ్చర్యమూ కలిగాయి. ఎలా సాధించగలిగిందో అర్థంకాలేదు. ఆమె రాఘవ్‌కి లొంగివచ్చే మనిషికాదని అతడికి నమ్మకంగా తెలుసు. ఇంతలో ఇతర వ్యవహారాలు తోసుకురావడంతో ఆమెవిషయం పూర్తిగా మరచిపోయాడు. ఎన్నికలు రెండునెలల దూరంలో ఉన్నాయికనుక ప్రచారానికి పథకం రచించు కోవడంలో

నిమగ్న మయ్యాడు. ఈసారి గెలిచితీరాలని అతని పట్టుదల. రెండోసారి ఓటమిని భరించగల స్థితిలో లేడు.

ఈ ఘట్టంలో అతడు వేరొక నియోజకవర్గమైన శ్రీరాంపూర్‌నుంచి పార్టీఅభ్యర్థిగా పోటీ చేయాలని పైనుంచి ఆనంద్‌కు ఆదేశాలు వచ్చాయి. అతని సొంత నియోజకవర్గం రహీమాబాద్. ఆ నియోజకవర్గంలోనే అతని స్వగ్రామమూ, అతని అంకుల్ గ్రామమూ ఉన్నాయి. రాష్ట్రపార్టీ నాయకులు ఈసారి అతనికి ఆ నియోజకవర్గాన్ని కేటాయించలేదు. ఎందుకని అడిగితే అదే అధిష్ఠానవర్గం నిర్ణయమని చెప్పారు. శ్రీరాంపూర్ 1952 ఎన్నికల్లో పార్టీకి డిపాజిట్‌కూడా దక్కించని గడ్డు నియోజకవర్గం కనుక అక్కడ పార్టీని గట్టెక్కించగల సత్తా ఆనంద్‌కే ఉందని పైవాళ్ళు భావించారట. 'ఇస్తే శ్రీరాంపూర్, లేకపోతే ఏమీలేదు' అని ఎంపికసంఘం సమావేశంలో రాఘవ్ నిష్కర్షగా చెప్పాడు. 'ఆనంద్ అదే జిల్లావాడు. జిల్లాలో అంతటా తెలిసినవాడు. అతని గెలుపు ఖాయం. పార్టీకి ఆ గడ్డు సీటును గెలిపించిపెట్టడం అతని విధి...' అన్నాడు. రాఘవ్ ఆనంద్‌పట్ల తన కోపతాపాలు తీర్చుకునే పట్టుదలతో ఉన్నట్టు దీనితో తేలిపోయింది. ఎంపికసంఘంలోని మిగిలిన సభ్యులుకూడా ఈ విషయంలో రాఘవ్‌పై ఒత్తిడి తీసుకొచ్చే స్థితిలో లేరు. అతని అంగీకారంతో తమతమ అభ్యర్థులు కొందరికి వాళ్ళు టిక్కెట్లు ఇప్పించుకున్నా రు. కేవలం ఒక్కసీటు విషయంలో రాఘవ్‌ను కాదని నష్టం కొనితెచ్చుకోలేరు. అలా మొత్తానికి నిర్ణయం జరిగి పోయింది.

కొత్త నియోజకవర్గంలో ఆనంద్ మరింత ఒళ్ళు అరగదీసుకుని పనిచేయక తప్పదు. అక్కడ తనందరికీ తెలిసినవాడే. కొన్నేళ్ళుగా ఆ ప్రాంతంలో జరిగే బహిరంగసభలకు వెళ్ళివస్తున్నవాడే. ఆ ప్రాంతంలో తనకు చాలామంది మిత్రులున్నారు. కానీ ఒక అభ్యర్థిగా ఆ నియోజకవర్గానికి తాను బయటి నుంచి రుద్దబడ్డాడు. కనుక టిక్కెట్టుకోసం ఆశించి అధిష్ఠాన వర్గం దగ్గర భంగ పడిన స్థానికనాయకులు సహజంగానే తనమీద మండిపడుతూఉంటారు. అసలు రాఘవ్ ఎత్తుగడకూడా అదే. తనపట్ల ఆగ్రహంతో ఉన్న స్థానికనాయకులు తనకు వ్యతిరేకంగా కుట్రచేసి తనను ఓడించడానికి తప్పకుండా ప్రయత్నించాలని.

శ్రీరాంపూర్ నియోజకవర్గం ప్రధానంగా రిజర్వ్‌ఫారెస్ట్‌లో ఉంది. అక్కడి జనం బాగా వెన కబడినవాళ్ళు, నిరుపేదలు. వాళ్ళలో చాలామంది గిరిజనులు. రోడ్లు అనేవే లేవు. ఏడాదిలో ఎనిమిది నెలలూ నేల బురదబురదగా అడుగుపెట్టడానికి వీలులేకుండా ఉంటుంది. ఆ మాసాల్లో ఆ మారుమూల కుగ్రామాలకు ఏ వాహనమూ వెళ్ళదు. ఒక్కొక్కసారి నిరుపేదజనం ఆకలిచావులనుంచి తప్పించుకోడానికి చెట్టుబెరళ్ళను మరిగించి తినడమో, దుంపల్ని నోట కరచుకోవడమో చేస్తూ ఉంటారు. ఆనంద్ సొంత నియోజకవర్గానికీ ఈ నియోజకవర్గానికీ ఏమాత్రం పోలికలేదు. ఈ రెండు ప్రాంతాలూ ఒకే జిల్లాలో ఉన్నాయంటే ఎవరూ నమ్మరు... ఆనంద్ ఈ సరికొత్త పరిస్థితిని వెంటనే అర్థంచేసుకుని తదనుగుణంగా తనను మలచుకున్నాడు. తన సొంత నియోజకవర్గంలోని జనానికి భిన్నంగా కొంచెమైనా కపటంలేని అక్కడి ప్రజల

నిరాడంబర జీవనసరళి చూసి కొద్దిరోజుల్లోనే వారిపట్ల అతనిలో అభిమానం అంకురించింది. ఆందోళన అంతరించి తప్పకుండా గెలుస్తానన్న ధీమా కలిగింది.

ఎన్నికలప్రచారం ప్రారంభించాడు. జనంతో విస్తృతంగా సంబంధాలు పెట్టుకున్నాడు. వ్యక్తిగతంగా, బహిరంగసభలద్వారా వందలమందితో పరిచయం కలిగించుకున్నాడు. స్త్రీలు, పురుషులు, పిల్లలతోసహా అందరినీ ఉద్దేశించిన పార్టీసందేశాన్ని ప్రతిచోట వినిపించాడు. ప్రత్యేకించి పిల్లలకు అతనిపట్ల అభిమానం ఏర్పడింది. అతడెక్కడికి వెళ్ళినా పిల్లలు హర్షధ్వానాలు, నినాదాలు చేస్తూ అతన్ని అనుసరిస్తూ ఉండేవారు. ఊళ్ళలో పిల్లల అభిమానం సంపాదించుకోగలిగితే సగం-గెలుపు సాధించినట్టే. ఆనంద్‌కి అదేమంత కష్టమనిపించలేదు. పిల్లలమధ్య గడపడం అతడికెంతో సంతోషం కలిగిస్తూ ఉండేది.

1952 ఎన్నికల్లో అవతలిపార్టీ చేసిన అయిదెకరాల భూమి, ఆవు వాగ్దానంతో నియోజకవర్గం ప్రజలు దారుణంగా మోసపోయారు. ప్రస్తుత శాసనసభ్యుడిపట్ల వాళ్ళలో భ్రమలు పూర్తిగా అంతరించిపోయాయి. ఆ వాగ్దానం చెల్లించుకోలేక అతడు జనానికి ముఖం చూపించడమే మానుకున్నాడు. ఆ దృష్ట్యా చూస్తే శ్రీరాంపూర్‌లో తాను పోటీచేయడంవల్ల ఆనంద్‌కు కొంత ప్రయోజనం కలిగింది. అయితే అసౌకర్యాలు, ఇబ్బందులు కూడా తక్కువేమీ కావు. రిజర్వ్ ఫారెస్ట్‌లో ఓ చివర, నాగరికత ఆనవాళ్ళు కొంచెమైనా కనిపించని గ్రామాలు ఉన్నాయి. దుర్భరదారిద్ర్యంలో మగ్గుతున్న ఈ గ్రామాల ప్రజల్ని రాచరికప్రభుత్వం ఎన్నో దశాబ్దాలుగా పట్టించుకున్న పాపానపోలేదు. మారుమూల ఎక్కడో, అమానుషపరిస్థితుల్లో జీవిస్తున్న ఈ ప్రజలపై దృష్టిసారించడానికి స్వాతంత్ర్యానంతర నాయకులకుసైతం తీరిక ఉండడంలేదు. అధికార క్రీడలకూ, కుతంత్రాలకే వాళ్ళ సమయం ఖర్చయిపోతోంది.

ఆనంద్ తన ప్రచారకాలంలో సుదూరగ్రామాలతోసహా అన్ని గ్రామాలనూ చుట్టివచ్చాడు. తను నడుపుతున్న జీపును గ్రామస్థులు ఎంతో ఉత్సుకతతో చూడడం గమనించి ఆశ్చర్యపోయాడు. జీపును కానీ, మరో వాహనాన్నికూడా వారింతవరకూ చూసి ఎరగరని, అందుకే వింతజంతువును చూసినట్టు తన జీపును తదేకంగా చూస్తున్నారని ఆనంద్‌కి అర్థమైంది. ఎన్నికలగురించి వాళ్ళలో ఏ ఒక్కరికీ తెలిసినట్టు అనిపించలేదు. ఇంతకుముందు జరిగిన ఎన్నికలగురించికూడా వాళ్ళకేమీ తెలియదు. ఆ ఎన్నికలప్రచారం సందర్భంగా ఈ గ్రామాల్ని సందర్శించిన అభ్యర్థులేలేరు.

అటువంటి గ్రామంలో ఆనంద్‌కి ఒక వృద్ధుడు ఎదురయ్యాడు. చింకిపాత ధరించి ఉన్నాడు. జబ్బుమనిషిలా కనిపించాడు. నీకేమైనా కావాలా అని ఆనంద్ అతణ్ణి అడిగాడు. 'నాకేమీ అవసరం లేద'ని ఆ వృద్ధుడు సమాధానం చెప్పాడు. ఆనంద్ తన ఉద్వేగాన్ని ఆపుకోలేకపోయాడు. కళ్ళు అశ్రుపూరితమయ్యాయి. కోట్లకు పడగలెత్తినవాడూ, ఎంతో అధికారప్రాభవాలు ఉన్న వాడూ, ఎంతో పేరు ప్రతిష్ఠలు ఉన్నవాడుకూడా అనలేని మాట —'నాకేమీ అక్కర్లేదు!'అని. వచ్చే అయిదేళ్ళలోనూ తరచు తనా గ్రామాలకువచ్చి వారి ప్రాథమికఅవసరాలు తీర్చడానికి కృషిచేస్తానని అప్పటికప్పుడే అక్కడికక్కడే వారికి వాగ్దానంచేశాడు. పెద్ద సవాలుగా కనిపిస్తున్న ఆ నియోజకవర్గంలో శాసనసభ్యుడుగా తాను ఏంచేయగలడో స్వయంగా పరిశీలించడానికి ఆ

తర్వాతకూడా ఎన్నో రోజులపాటు మారుమూల గ్రామాలతోసహా నియోజకవర్గమంతటా పర్యటించాడు.

నియోజకవర్గం సరిహద్దు గ్రామాల్లో ప్రచారం నిర్వహిస్తుండగా ఓ రోజు ఉదయం చెవిన పడిన ఓ ముచ్చట అతణ్ణి విస్మితుణ్ణి చేసింది. అంతకు మూడురోజులక్రితం ఆనంద్‌పార్టీకి చెందిన ఓ అభ్యర్థి ఆ గ్రామాలమీదుగా వెళ్ళారట. ఆ అభ్యర్థీ, అనుచరబృందం హడావుడిగా ఓ బహిరంగసభ ఏర్పాటుచేసి ఆనంద్‌కు మద్దతుగా ప్రసంగాలు చేశారట. మరో ప్రాంతానికి ప్రచారానికి వెడుతూ ఈ గ్రామంలో ఆగారని గ్రామస్థుల కథనం.

ఓ వృద్ధమహిళ చెప్పడం ప్రారంభించింది. 'అయ్యా, వాళ్ళతో మంచి పాటలు పాడెటోళ్ళు కూడా వచ్చింద్రు. భలే బాగా పాడింద్రు...' అంతలో ఏదో గుర్తొచ్చినట్టు ఉత్సుకత కనబరుస్తూ అంది 'వాళ్ళలో ఓ సక్కటి ఆడమనిషికూడా ఉంది దొరా. వాళ్ళకి నాయకురాలట. మీ పారిటీ గురించి చాలా మంచిముచ్చట్లు చెప్పింది. ఆమె కండ్లూ, మొకమూ, మాట చాల మంచిగుంది. బాగా సదువుకున్నట్టే కనిపించింది దొరా! మోటరు నడుపుకుంట వచ్చింది. మాట్లాడుతుంటే మా సొంతబిడ్డే అనిపించింది...' అంతలో హఠాత్తుగా ఆమె కళ్ళు కాంతిమంతమయ్యాయి. 'అయ్యా, నీగురించి ఆమె ముచ్చటమీద ముచ్చట చెప్తూనేఉంది.' ముడతలుపడిన ఆ ముఖంలో చిరునవ్వు మెరిసింది —లేదా మెరిసినట్టు ఆనంద్ ఊహించుకున్నాడు. ఆనంద్‌ను సూటిగా ఒక ప్రశ్నవేసింది 'ఐతే దొరా, ఆమె నీకు తెలిసిన మనిషే... అవును కాదా?'

'ఏమో... గుర్తురావడం లేదు' ఆగిఆగి అన్నాడు ఆనంద్, గుర్తుచేసుకోడానికి ప్రయత్నిస్తూనే. తానెంతో గర్వించే తన జ్ఞాపకశక్తికూడా ఇలా విఫలమౌతోందేమని క్షణకాలం అనిపించింది. తనామెకు ఆ జవాబు చెబుతున్నప్పుడే అందులో నిజంలేదని హఠాత్తుగా అతనికే తోచింది. క్షణకాలం అయోమయంగా ఆమెవైపు చూశాడు. ఊహలోనే ఒక్కొక్క ముక్కనూ అతికించి జ్ఞాపకానికి రూపంపోశాడు. అవును... ఆమే! పేరేమిటబ్బా?... అఁ... అరు... అరుణ! కచ్చితంగా అరుణే అయుంటుంది.

ఈ ఉదంతం కొంతకాలంపాటు ఒక తియ్యని స్మృతిగా ఉండిపోయింది. పోలింగ్‌రోజు సమీపిస్తుంటే ప్రచారం పతాకఘట్టానికి చేరుకోవడంతో అది మరపుపొరల్లోకి జారిపోయింది. తమ సొంతపార్టీకే వోటువేయవద్దని తనపార్టీవాళ్ళే కొందరు కొన్నివర్గాల ప్రజలకు నూరిపోస్తున్నారు. ఆనంద్ గెలుపు అసాధ్యమనీ, పార్టీలో సీనియర్ నాయకులే అతడు గెలవకూడదని కోరుకుంటున్నారనీ చెబుతున్నారు. వాళ్ళలో విశ్వసనీయుడుగా కనిపించే ఓ కామందు 'ఈ విషయాన్ని ఘంటాపథంగా చెబుతున్నా' నని మరీ ప్రకటించాడు. గుసగుసల స్థాయిలో మొదలైన ఈ ప్రచారం అర్ధరాత్రిసమావేశాల్లో ఇంకా పుంజుకుని డబ్బూ, సారా పంపిణీతో మరింత జోరందుకుంది. అయితే చివరకు ఈ విద్రోహులు తోకముడవక తప్పలేదు. ఆనంద్ నిర్వహించిన ఉధృత ప్రచారం అప్పటికే అతనిని అజేయస్థానంలో నిలబెట్టింది.

ఆనంద్ అఫ్రోజాబాద్ తిరిగివచ్చి ఫలితాలకోసం ఎదురుచూస్తున్నాడు. తను ఎన్నికైనట్టు ప్రకటన వెలువడగానే, మిగిలిన అభ్యర్థుల అదృష్టం ఎలాఉందో తెలుసుకోవాలనుకున్నాడు.

ప్రత్యేకించి ఒక వ్యక్తి ఫలితంకోసం తాను ఆత్రుతపడుతున్నట్టు గమనించాడు —ఆమె అరుణ. కొన్ని వందలవోట్ల తేడాతో ఆమె ఎన్నికైనట్టు తెలిసింది. విచిత్రంగా, ఆమె గెలుపుతో అతనూ తృప్తి పడ్డాడు.

ప్రమాణస్వీకారం రోజు... చలవరాతి అసెంబ్లీలాబీలు విజేతలతో నిండిపోయాయి. అందరి ముఖాల్లో ఆనందం, ఉద్వేగం వెల్లివిరుస్తున్నాయి. పాతమిత్రులు పరస్పరం ఆలింగనం చేసుకుంటుంటే మొదటిసారి ఎన్నికైనవారు దిక్కులుచూస్తూ నిలబడ్డారు. ఆనంద్‌కూడా మొదటిసారి అసెంబ్లీకి ఎన్నికైనవాడైనా పార్టీవర్గాలలో చిరపరిచితుడే పార్టీలో వాళ్ళు, మిత్రులు అతణ్ణి ఆలింగనం చేసుకుని అభినందనలతో ముంచెత్తుతున్నారు. మగవాళ్ళు ఒకరినొకరు ఆలింగనం చేసుకుంటూ, వీపులు చరచుకుంటూ గట్టిగా కేకలు వేసుకుంటూ, గప్పాలు కొడుతుంటే లాబీలో ఓ చివర నిలబడి ఆ సర్వపురుషసంరంభం చూస్తున్న అరుణ హఠాత్తుగా ఆనంద్ కంటబడింది ఎన్నికల్లో నెగ్గిన ముగ్గురు మహిళల్లో ఆమె ఒకతె. ఖద్దరుదుస్తులు ధరించిన అంతమంది మగ వాళ్ళమధ్య ఆమె భిన్నంగా కనిపిస్తోంది. ఆనంద్ నేరుగా ఆమెను సమీపించి అభినందించాడు. కొద్దిసేపు మాట్లాడిన తర్వాత ఎన్నికలప్రచారంలో ఆమె తనకు సహకరించడం గుర్తొచ్చి కృతజ్ఞతలు తెలియజేశాడు. ఆమె చిరునవ్వు నవ్వి అంది. 'ఓహో! అదా? దానిదేముంది? ఆ ప్రాంతంలోంచి వెడుతున్నానంతే' అంది. ఆమె మాటలు ఎంతో యధాలాపంగా ధ్వనించాయి. ఒకింత అయిష్టంగా ఆనంద్‌కూడా – కొంత కృత్రిమ తాటస్థ్యంతో – అంతే యధాలాపంగా స్పందించాడు.

ప్రచారశ్రమ ముగిసిన తర్వాత కొద్దిరోజులు ఊళ్ళో విశ్రాంతిగా గడపాలనుకున్నాడు ఆనంద్. ఇంట్లో ఈ మధ్యకాలంలో తను రెండురోజుల్ని మించి గడిపిన సందర్భాలే లేవు. ఈసారి అమ్మతో తమ్ముళ్ళతో ఎక్కువరోజులు గడపాలనిపించిందతనికి. తన ఊరికి దగ్గరలోనే తన సోదరి అత్తవారి ఊరు. ఒకసారి వెళ్ళి ఆమెనుకూడా చూడాలనుకున్నాడు. అలాగే తన భార్యను చూసి కూడా కొన్ని నెలలు గడిచిపోయాయి.

పదిహేనురోజులు గడిచాయో లేదో ఆనంద్‌కు విసుగుపుట్టింది. వ్యవసాయం పనులమీదికి బుద్ధి మళ్ళిద్దామనుకున్నాడు కానీ అతనికి చేతకాలేదు. ఇల్లు పొలమూ పట్టించుకోలేని స్థితికి తాను ఎదిగిపోయి చాలా కాలమైంది. ఇప్పుడు తన నియోజకవర్గం బాధ్యత, ఒకవిధంగా మొత్తం రాష్ట్రం బాధ్యత తనమీద ఉన్నట్టనిపించింది. ఆ నూతనకర్తవ్యాల వైపు అడుగువేయమని ప్రతిక్షణం అతని మనసు తొందరపెడుతోంది. ఇది తన దృక్పథంలో వచ్చిన ఎంతో ఆసక్తికరమైన మలుపు. తన కుటుంబాన్నీ, ఆస్తివ్యవహారాల్నీ ఎంతోకాలంగా నిర్లక్ష్యం చేస్తున్నాడు తను. అవిప్పుడు చాలా దుస్థితిలో ఉన్నాయి. తనకు నూతనంగా సంక్రమించిన హోదావల్ల వాటికి కొంత ప్రాధాన్యం ఇచ్చి ఉండవలసిందే కానీ ఆనంద్ అలా చేయలేకపోయాడు. కుటుంబవ్యవహారాలపై శ్రద్ధ చూపించడంపట్ల అతనిలో ఒకవిధమైన జంకు, పిరికితనం పెరిగిపోయాయి. ఇతరులకు సేవ లందించడానికి ఎన్నికైన తను సొంతానికే ఎక్కువ ఆసక్తిని చూపిస్తే ప్రజలు దానిని స్వార్థంగా ఎక్కడ భావిస్తారోనని అతని వెరపు. తన గ్రామం, తన కుటుంబంకూడా తన బాధ్యతలోకే

వస్తాయి. అయినాసరే ప్రజాప్రతినిధుల ప్రాధాన్యాలపై ప్రజలు ప్రత్యేకమైన నిఘా వేసి ఉంచుతారు ఒకవిధంగా ప్రజలిచ్చిన వోటు ప్రతినిధులు తమ కర్తవ్యనిర్వహణలో అనుసరిస్తున్న పూర్వాను క్రమాలను డేగచూపుతో కనిపెడుతూ నియంత్రిస్తుంటుంది. నుయ్యీ గొయ్యీల మధ్య నిర్ణయించు కోలేని అతి క్లిష్టపరిస్థితులతో తలపడడం వరకు, ఆనంద్ అప్పటికి చేరుకోలేదు. కాని ఆ పరిస్థితి కూడా ఎంతో దూరంలో లేదనిపించింది.

అలా జరగచ్చు, జరగకపోవచ్చు కూడా... తనలోతను మథనపడుతున్న ఆనంద్‌కి అమ్మ నిత్యపూజాదికాలు నిర్వర్తించుకుంటున్న దృశ్యం కనిపించింది. తన డోలాయమానస్థితికి కూడా దైవధ్యానం సమాధానం కావచ్చునేమో ననిపించిందతనికి. పూజాపురస్కారాలపట్ల తనకు మొదటినుంచి అంత ఆసక్తిలేదు. ముఖ్యంగా కాలేజీలో అడుగుపెట్టి రాచరికానికి వ్యతిరేక పోరాటంలో పూర్తిగా నిమగ్నుడైన తర్వాత ఆ కోణాన్ని పూర్తిగా విస్మరించాడు. ఇప్పుడు ప్రయత్నించి కాస్త దృష్టిని అటువైపు మళ్ళిస్తే ఎలా ఉంటుందనుకున్నాడు.

తిరుపతి శ్రీవెంకటేశ్వరస్వామిని దర్శించుకున్నాడు. ఆ దివ్యమంగళమూర్తిని చూస్తూ గర్భగుడి వాకిలిదగ్గర నిలబడ్డాడు. తన వ్యక్తిగత, ఆధ్యాత్మికసాధనకు దారి చూపించమని స్వామిని వేడుకో బోతుండగా అక్కడి పూజారి స్వామికి స్వర్ణవజ్రాభరణాలు సమర్పించిన మహారాజుల పేర్ల జాబితా వినిపించడం ప్రారంభించాడు. ఆ జాబితాతోపాటే ఆనంద్ తలకూడా గిర్రున తిరిగి పోయింది. వెంటనే అక్కడినుంచి బయటికివచ్చాడు. మిగిలిన దేవాలయాల్లోకూడా అతనికి అదే అనుభవం ఎదురైంది. దైవసన్నిధిలో, ముఖ్యంగా దేవాలయప్రాంగణాల్లో తనకు శాంతి లభిస్తుందని అతనికి తోచలేదు. భక్తికి ఊపిరి సలుపకుండా చేసే మొక్కుబడి పూజలు, కర్మకాండల పట్ల అతనికేమాత్రం ఆసక్తిలేదు. ఆరోగ్యం, ఐశ్వర్యం, పరీక్షలలో ఉత్తీర్ణత, శత్రువులపై గెలుపు సాధించడం వంటి ఐహికమైన కోరికలను తీర్చే సాధనంగా భగవంతుణ్ణి దిగజార్చడం అతనికి బాధకలిగించింది. వీటన్నింటతో నిరాశ చెంది, తన ఊహాశక్తికీ, తెలివితేటలకూ సవాలుగా కనిపిస్తున్న సమస్యలతో ముఖాముఖి తలపడుతున్న ఆనంద్‌కు, మానసికశాంతి అనేది తనలోపలినుంచే ఉద్భవించాలి కానీ బయట ఎక్కడో లేదన్న వాస్తవం ఎట్టకేలకు అర్థమైంది. తనలోని ఆదర్శవాదాన్ని ప్రేరేపించి ఉత్తేజింపజేస్తున్న తన ఆశయాలు, తన ప్రతి చర్యలో ఆదర్శవాదం ఉట్టిపడాలన్న తన సంకల్పబలం, లక్ష్యంపట్ల తన అంకితభావం —ఇవన్నీ తప్పుడుపనుల ఊతకర్రలమీద ఆధారపడవలసిన అవసరం లేదనుకున్నాడు. ప్రపంచంమీద తనదైన ముద్ర వేయాలన్న ప్రగాఢచింతననుంచి ఉద్భవించిన నిశ్చయం; సంకుచిత, సాధారణ జీవనసరళినీ, కుంగదీ స్తున్న తిరస్కారధోరణినీ జయించి వాటికి అతీతంగా వ్యవహరించాలన్న తన అభిమతం; ఇవే తన లక్ష్యాలు. హనుమాన్‌గానో, తను కాని మరెవరోగాని మారిపోగల మనఃప్రవృత్తి అతనిలో బాల్యంలోనే అంకురించింది. అదిప్పుడు మరింత వికసించి ప్రజల సుఖదుఃఖాలతో పూర్తిగా మమేకమయ్యే స్థాయికి అతని హృదయవైశాల్యాన్ని పెంచివేసింది. అతని మనస్సూ, ఊహాలూ ఎక్కడెక్కడ ఎలా పరిభ్రమిస్తేనేం? చివరకవి ప్రజాసేవ అనే ఏకోన్ముఖకార్యక్రమంవైపే అత నిని నడిపించాయి నిత్యం మరులుగొలిపే రాజకీయాలు అందుకు ఒక సాధనం మాత్రమే.

# 13

అఫ్రోజాబాద్ ప్రెస్‌క్లబ్‌లో ఓ మూల గ్లాసులు గలగలమంటున్నాయి. ఉల్లాసభరితంగా కబుర్లు దొర్లిపోతున్నాయి. ప్రెస్‌క్లబ్ ఈమధ్యనే అవతరించిన సంస్థ. రాచరికం రోజుల్లో పత్రికారంగం అంటూ ఏదీలేదు. చిత్తుకాగితాల్లాంటి వార్తాపత్రికలేవో కొన్ని వస్తూ ఉండేవి. రాజునీ, రాచరికాన్నీ ఆకాశానికెత్తడమే వాటిపని. ఒక యువకుడు ఎంతో ధైర్యసాహసాలతో, ప్రజాస్వామిక లక్ష్యాలను అద్దంపట్టే ఒక వార్తాపత్రికను ప్రారంభించాడు. కొందరు గుర్తుతెలియని వ్యక్తులు ఓరోజు అతన్ని దారుణంగా హత్యచేశారు. అతన్ని హతమార్చింది ప్రజాస్వామ్యభావాలను ప్రచారంచేస్తున్నందుకు కాదనీ, ఒక ముస్లింరాజ్యంలో తానొక ముస్లిం అయుండి కూడా అలాచేస్తున్నందుకని గుసగుసల్లో విశదీకరించడం జరిగింది. రాష్ట్రం వెలుపలినుంచి కూడా పత్రికలు నేరుగా రాష్ట్రంలోకి వచ్చేపడే అవకాశం ఉండేదికాదు. ఏవి రావచ్చునో, ఏవి రాకూడదో ఒక పొడవైన జాబితా ఉండేది. రాకూడని పత్రికల ఆ జాబితా రోజురోజుకూ పెరిగిపోతూనే ఉండేది. రాజుగారికి పత్రికల పొడ ఏమాత్రం గిట్టకపోయినా, ప్రెస్‌క్లబ్‌కు ఓ రాజభవనాన్ని దానం చేశారు. ఆ భవనం అందచందాలు బయటినుంచి వచ్చే వారిని ఆకట్టుకునేవి. దయగల ప్రభువులు కోరుకునేది అంతే.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత పత్రికల ప్రభావం అమాంతం పెరిగిపోయింది. ప్రజలకు ఎటువంటి కత్తిరింపులులేని సమాచారం మొదటిసారి అందుబాటులోకి వచ్చింది. ఆ అదృష్టానికి తోడు పత్రికలవాళ్ళకోసమే ఉన్న ప్రెస్‌క్లబ్‌ను వాళ్ళ చేతుల్లోంచి ఎవరూ గుంజుకోలేదు.

ఆ సాయంత్రం ప్రెస్‌క్లబ్‌లో ఓమూల ఇద్దరు జర్నలిస్టులు ఎదురెదురుగా కూర్చునిఉన్నారు. వాళ్ళఎదురుగా గ్లాసుల్లో మద్యం తళతళలాడుతోంది.

'ఢిల్లీలో ఈరోజు వేడివేడి వార్తలేమిటి' స్థానిక విలేఖరి అడిగాడు మద్యం ఒకటి రెండు గుటకలు సేవించి.

'ఈ రోజేమిటి మిత్రమా? ఈ రాత్రేమిటని అడుగు. రాజకీయాలన్నీ చీకట్లోనే జరుగుతూ ఉంటాయి. ఈ గదిలో మసకమసక వెలుగు, బయట కటికచీకటి! ఎంత సింబాలిక్‌గా ఉందో చూడు.'

'దయచేసి కవిత్వంలోకి వెళ్ళద్దు. ఇంకో పెగ్గుపట్టించి లోపల ఏం జరుగుతోందో చెప్పండి... ఓ.కె.?'

'ఓ.కే. ఓ.కే.' అన్నాడు అప్పటికే నిషా బాగా తలకెక్కిన అవతలి మనిషి. అతడు ఏకకాలంలో ఇరవైకేంద్రాల నుంచి వెలువడే గ్రేట్ ఇండియా టైమ్స్‌కి స్పెషల్ కరస్పాండెంట్. ముఖ్య మంత్రినీ, కొందరు క్యాబినెట్ మంత్రుల్నీ ఇంటర్వ్యూ చేయడానికి ముందురోజే ఢిల్లీనుంచి రాష్ట్రరాజధానికి వచ్చాడు. వచ్చినపని సగంలో ఉండగానే స్థానికవిలేఖరుల ముందు తన దర్పం ప్రదర్శించుకోడానికి అక్కడి కొచ్చాడు. సాయంత్రమంతా తనకు గుర్తొచ్చినవాళ్ళనందరినీ ఏకేకి విడిచి పెట్టాడు. ఈ ప్రపంచమనే ఓ నరకాన్ని, ముఖ్యంగా ఇండియా అనబడే భారత భూఖండాన్ని సృష్టించి ఆ భగవంతుడు ఎన్ని పొరపాట్లు చేశాడో దండకం చదివాడు. ప్రెస్ క్లబ్‌లోని ఒక్కొక్క సభ్యుడే పోయించిన మద్యాన్ని పూటుగా సేవించి నోటికొచ్చిన మాటలేవో మాట్లాడుతూనేఉన్నాడు. తీరూతెన్నూలేని ఆ శుష్క ప్రసంగాలు వినివిని విసిగిపోయి చాలామంది జర్నలిస్టులు అక్కడినుంచి వెళ్ళిపోయారు. కానీ ఉత్సాహం ఉరకలేసే ఒక యువజర్నలిస్టు మాత్రం అక్కడే కూర్చుండిపోయాడు. స్థానికపత్రికల్లో సంచలనం సృష్టించగల ఢిల్లీ కుట్రలూ కుతంత్రాలగురించి కొంత సమాచారం ఆ ఢిల్లీయుని నుంచి ఎలాగైనా రాబట్టాలని అతని ప్రయత్నం.

'అయితే ఢిల్లీనుంచి వార్తలేవీ లేవంటారు? మా రాష్ట్ర రాజకీయాల గురించి లోపాయికారీ సమాచారమే లేదు..?! అంతేనా?' కట్టెవిరిచినట్టు సూటిగా అడిగాడు. కాస్త రెచ్చగొట్టకపోతే ఆ మనిషి అలా వదరుతూనే ఉంటాడని అతనికి అర్థమైపోయింది.

కుర్చీలో ఓ పక్కకి వాలిపోయిన ఆ మనిషి చివాలున తలెత్తాడు. 'ఏమిటి? వార్తలు లేవా? సమాచారం లేదా? వార్తలు లేవనడంలో నీ ఉద్దేశమేమిటి? ఢిల్లీ గాలి నిండా ఎప్పుడూ వార్తలే ఉంటాయి. అయితే వాటిలోంచి కావలసిన వార్తల్ని ఎంచుకోవడంలో ఉంటుంది తెలివి. మీ ముఖ్యమంత్రి ఒక్కడే భూకంపం పుట్టించే వార్త అనుకుంటున్నావేమిటి?'

'కాకపోవచ్చు. కానీ ఈరోజున ఆయనే ఓ పెద్దవార్త' అన్నాడు యువజర్నలిస్టు బింకంగా.

'అవుననుకో... ' ఒప్పుకున్నాడు స్పెషల్ కరస్పాండెంట్. '... అయితే ఆయన గురించి కొత్త వార్తలేమీలేవు. మహేంద్రనాథ్ ఢిల్లీ పెద్దల దృష్టిలో ఇప్పుడు ఓ పొగరుబోతు. కొమ్ములు విసురుతున్న పోట్లగిత్త. అతనికి రోజులు దగ్గరపడ్డాయి. అధిష్ఠానవర్గం అనుగ్రహం అతడి కెప్పుడో తప్పిపోయింది. ముఖ్యంగా జాతీయస్థాయికి ఎదిగిపోవాలని అతడు కలలు కనడం ప్రారంభించాడే... అప్పటినుంచి. ఇవన్నీ పార్లమెంట్ సెంట్రల్‌హాల్‌లోని అతిముఖ్యులనుంచి తెలుసుకున్న విషయాలు' అన్నాడు

'జాతీయ స్థాయికా? ఇదేదో ఆసక్తికరంగానే ఉందే!' సాలోచనగా అన్నాడు స్థానిక విలేఖరి. 'మీరనేది ఆయన రాష్ట్ర రాజకీయాలనుంచి తప్పుకుని కేంద్రానికి వలసపోతాడనా?' అడిగాడు.

'ఏం? ఎందుకాశ్చర్యపోతున్నావ్?' అడిగాడు స్పెషల్ కరస్పాండెంట్. కాస్త నిషా తగ్గి సంభాషణమీద దృష్టి లగ్నంచేసినట్టు కనిపించాడు.

'ఎందుకా?, అదే మాత్రం నమ్మశక్యంగా లేదు కనుక'

'అసలు దేన్నైనా నమ్మమని నీకెవరు చెప్పారు?' తాపీగా గ్లాసు ఖాళీచేస్తూ గాజుగోళాల్లాంటి కళ్ళతో తనకెదురుగా కూర్చున్న యువకుడివైపు ఉగ్రంగా చూస్తూ అన్నాడు స్పెషల్ కరస్పాండెంట్.

ఇతగాడికి కోపంతెప్పించడంలో అర్థం లేదనుకుని యువపాత్రికేయుడు వెంటనే సర్దుకున్నాడు. 'మీరు చెప్పింది నేను కాదనడంలేదు. మహేంద్రనాథ్ కేంద్రంలో ఎలా ఇమిడగలడా అని నా సందేహం. కేంద్రరాజకీయాల్లో ఆయనకు అనుభవం లేదు. ఆయన పూర్తిగా రాష్ట్రంలో పుట్టి పెరిగిన రాజకీయవాది. పైగా కేంద్రానికి వ్యతిరేకిగా ముద్రపడినవాడు.'

'సెంట్రల్ హాలులో జరుగుతున్న ప్రచారాన్నిబట్టి, కొన్ని రాజకీయ కారణాలవల్ల అతని దృక్పథంలో మార్పొచ్చింది. ఏదో ఒకరోజున మొత్తం దేశాన్ని ఉప్పెనలా ముంచెత్తా లను కుంటున్నాడు...'

'వహ్వా! ఇదేదో మంచి స్కూప్‌లానే ఉందే' అన్నాడు యువజర్నలిస్టు ఉత్సాహంగా. 'సరేలెండి. అటోకన్నేసి ఉంచుతాను. ఇక రాష్ట్రంలో వినిపిస్తున్న వదంతుల్నిబట్టి ఆయనిక్కడ ఆడపిల్లలతో క్షణం తీరికలేకుండా ఖుషీగా గడిపేస్తున్నాడు. వేరే ఆకర్షణలేవో కనిపిస్తే తప్ప రాష్ట్రం విడిచి పెట్టి వెళ్ళేలాలేడు. ఇంతమంది ప్రియురాళ్ళను విరహంలోకి నెట్టేసి వెళ్ళిపోవాలనుకుంటున్నాడంటే ఆశ్చర్యంగా ఉండదా? రాత్రికి ఒకరు చొప్పున లెక్కేసుకున్నా వాళ్ళ సంఖ్య మూడంకెలకు చేరుకుంటుంది.'

ఢిల్లీ పాత్రికేయుడు అట్టహాసం చేస్తూ బిగ్గరగా అన్నాడు. 'ఢిల్లీ చేతుల్లో ఉన్న మహేంద్రనాథ్ భోగట్టా ప్రకారం ఆ సుందరీమణుల గుంపులో అన్ని భాషావర్గాలవాళ్ళకీ తగిన ప్రాతినిధ్యమే ఉందిటలే. సరే, అది ఎవర్‌గ్రీన్ టాపిక్కనుకో. అంతకన్నా అత్యవసరమైన విషయం– ఆయనకీ, చౌదరికీ మధ్య తలెత్తిన విభేదాలు. రాష్ట్రరాజకీయాల్ని అవో కుదుపుకుదుపుతున్నాయి. అధిష్ఠానవర్గం కూడా అదిరిపడి లేచికూర్చుని ఈ పరిణామం గమనిస్తోంది. వాళ్ళిద్దరూ ఒకరిఅంతు ఒకరు తేల్చుకునే ప్రయత్నంలో ఉన్నారు. ఇద్దరిలో చౌదరికే ఇప్పుడు ఢిల్లీ ఆశీస్సులున్నాయనుకో.'

'అయితే మీరు చౌదరిని ఎప్పుడు కలుసుకోవాలనుకుంటున్నారు? అపాయింట్‌మెంట్ ఫిక్స్ చేయమంటారా?' యువపాత్రికేయుడు యధాలాపంగా అన్నాడు. స్పెషల్ కరస్పాండెంట్ అసలిక్కడికెందుకొచ్చాడో తెలుసుకోగలిగితే అదే పెద్దస్టోరీ అవుతుంది.

'ఏమో! ఎప్పుడు కలుస్తానో నాకే తెలియదు. చాలామంది మంత్రుల్నీ నాయకుల్నీ కలుసు కోవాలి, థాంక్స్. ఆ విషయం నాకొదిలెయ్. నేను చూసుకుంటాను' అంతే యధాలాపంగా మాటలు సాగదీస్తూ అన్నాడు స్పెషల్ కరస్పాండెంట్. నిజానికి మరునాడే అతడు చౌదరిని కలవబోతున్నాడు. ఆ విషయం స్పష్టంగా చెప్పడం అతనికిష్టం లేదు. అసలు చౌదరిని కలుసు కోడానికే అతడిక్కడికి వచ్చాడు. మిగిలిన కార్యక్రమాలన్నీ దానికి ముసుగు మాత్రమే. అతడు చౌదరిని కలుసుకోడానికి వేరే కారణముంది. న్యూఢిల్లీలోని ఫ్రెండ్స్‌కాలనీలో అతడో ఇల్లు కట్టుకుంటున్నాడు. రెండోఅంతస్థు పని చాలాకాలంగా అసంపూర్తిగా ఉండిపోయింది. నిర్మాణం ఖర్చులు పెరిగిపోవడం అందుకో కారణమైతే, భార్య ఇంటిప్లానులో మాటిమాటికీ మార్పులు చేయించడం మరో కారణం. ఆమె కనుక మరొకరి భార్య అయుంటే 'కొంతమంది అర్ధాంగుల చపలచిత్తం భర్తల్ని ఎలా ఆర్థిక సమస్యల సుడిగుండంలోకి నెట్టేస్తుందో' తన జర్నలిస్టిక్‌ప్రతిభ రంగరించి నిప్పులు చెరుగుతూ రాసిఉండేవాడు. పైగా ఆమె అతగాడికి రెండోభార్య. ఈ మొత్తం విశ్వంలో అతని పాత్రికేయప్రజ్ఞ తేరిపారచూడడానికి కూడా భయపడే ఏకైక వ్యక్తి.

రెండో అంతస్థు అలా అసంపూర్తిగా మిగిలి పోవడం పాటిజర్నలిస్టులూ, ప్రత్యర్థులమధ్య తలవంపుగా కూడా ఉంది. ఇక విధిలేక, అధికారజ్వరంతో వేగిపోతున్న చౌదరిలాంటివాళ్ళు ఈ కష్టంనుంచి తనను గట్టెక్కించగలరనుకున్నాడు. ఇంటర్వ్యూ అనుకున్నట్టు జరిగితే చౌదరిని ఎంతో మహానుభావుడుగా చిత్రిస్తూ తన పత్రికలో రాస్తాడు. రెండో అంతస్థు పని త్వరలోనే పూర్తయిపోతుంది... అయితే ఈ పథకాన్ని ఎంతో జాగ్రత్తగా, చాకచక్యంగా అమలుచేయడం అవసరం. ఎందుకంటే అవినీతికి వ్యతిరేకంగా అలుపులేకుండా పోరాడే కలంయోధుడన్న ప్రత్యేక ప్రతిష్ఠను ఈ ప్రత్యేక విలేఖరిగారు ఈ మధ్యనే సంపాదించుకున్నాడు. ఇప్పుడీ స్థానికవిలేఖరి పిచ్చిపిచ్చి ప్రశ్నలతో పెద్దన్యూసెన్స్‌లా తయారయ్యాడు. తెలివిగా దారి తప్పించాలి. అయితే అదంత తేలికకాదు. కూపీలాగడంలో ఆరితేరిన రెండు జర్నలిస్టు తలకాయలమధ్య యుద్ధంలా ఇది మారినట్టు కనిపిస్తోంది. అంతేకాదు, ఎవరి ప్రయత్నంలో వారు కృతకృత్యులౌతున్నట్టూ కనిపిస్తోంది.

స్పెషల్‌కరస్పాండెంట్ మళ్లీ కేంద్రరాజకీయాలగురించి మాట్లాడ్డం మొదలెట్టాడు. ఈ ఢిల్లీ మనిషినుంచి ఇక రాబట్టగలిగిందేమీలేదన్న నిర్ధారణకు వచ్చిన యువజర్నలిస్టు ఇక నిష్క్రమించడం మంచిదనుకున్నాడు. లేచి నిలబడుతూ అడిగాడు. 'అయితే గియితే మహేంద్రనాథ్ ఎప్పుడు కేంద్రం గూట్లో చేరగలడనుకుంటున్నారు?'

'అది పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది.' అన్నాడు స్పెషల్ కరస్పాండెంట్ నెమ్మదిగా ఎంతో ఆలోచిస్తున్నట్టు కనిపిస్తూ అజ్ఞానాన్ని కప్పిపుచ్చుకునే ప్రయత్నంచేశాడు. దానికి మద్యం ప్రభావం కూడా తోడైంది. తాను రాజకీయద్రష్ట కాకున్నా అలా కనిపించడానికి ప్రయత్నం చేశాడు.

'ఏ పరిస్థితుల మీద?' మళ్లీ రెట్టించి అడిగాడు స్థానిక విలేఖరి.

'ఇది కావచ్చు, అది కావచ్చు.' ఢిల్లీ ఋషిపుంగవుడు ఆలోచిస్తున్నట్టుగా అన్నాడు. 'కేంద్రంలోని అధికారవర్గాల్లో ఎవరైనా మహేంద్రనాథ్‌ను పైకి లాగాలని అనుకుంటున్నారో లేదో నాకంత కచ్చితంగా తెలియదు. నాకు తెలిసినంతవరకు ఇప్పుడు జరుగుతున్న ప్రయత్నమంతా ఆయనను ముఖ్యమంత్రి పదవినుంచి తప్పించడానికే. ప్రతిఫలంగా కేంద్రంలో మరో పదవి ఏదైనా తనకు కావాలని అందుకోసం ఆయనే ప్రయత్నాలు చేసుకుంటున్నాడు.'

ఢిల్లీమనిషి చివరకు వాస్తవానికి కాస్త దగ్గరగానే వచ్చాడు. అయితే నేరుగా కాకుండా చుట్టు తిరిగి వచ్చాడు. అదికూడా యాదృచ్ఛికంగానే తప్ప తగిన సమాచారంతో కాదు. నిజంగానే మహేంద్రనాథ్ కేంద్రంలోకి వెళ్లాలనుకుంటున్నాడు. కేంద్రానికీ, ముఖ్యమంత్రులకీ మధ్య వైరుధ్యం తలెత్తడం కొత్త పరిణామమేమీ కాదు. భారతరాజకీయాల్లో ఆ పరిస్థితి మొదటినుంచి ఉంటున్నదే. కేంద్రంతో రకరకాల విషయాల్లో ఘర్షణపడే మహేంద్రనాథ్‌లు దేశంలో ఏ మూలకెళ్ళినా కనిపిస్తూనే ఉంటారు. దేశం ఇప్పటికీ ఫ్యూడల్‌వ్యవస్థకే దగ్గరగా ఉందితప్ప మౌలికమైన మార్పేమీ ఇంకా కనిపించడంలేదు. పూర్వాచారాలు వెంటనే మార్చుకుని స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం అనే నూతనభావాలను కొద్ది సమయంలోనే అలవరచుకోవడం అంత తేలికకాని మాట నిజమే. కాని దీనిని అర్థం చేసుకునే ఓపిక లేకపోవడంవల్ల దేశంలో అసలెటువంటి మార్పూ కనిపించడంలేదన్న ఆరోపణలకు అనివార్యంగా దారితీయించింది. ఆ మార్పుకాని మార్పు

ఎందరిలోనో కొట్టొచ్చినట్టు కనిపిస్తూ ఉంది. వెనకటి సామంతరాజులు ఇప్పుడు ముఖ్యమంత్రి అనే సరికొత్తఆహార్యంలో ప్రత్యక్షమయ్యారు. సామ్రాజ్యాధికరణం కేంద్రాధికారంగా రూపాంతరం చెందింది. రెండూ పైపైన జరిగిన మార్పులే. లోపల సరుకుమాత్రం చాలావరకు అలాగేఉంది.

శతాబ్దాలుగా దేశంలో కొనసా గుతూవస్తున్న ఫ్యూడల్ రీతి రివాజుల స్థానంలో ప్రజాస్వామ్య తాత్త్వికత కానీ, ఫెడరల్ సూత్రాలు కానీ ఇంకా వేళ్ళు తన్నుకోలేదు. ఏదైనా ఒక మారుమూల గ్రామానికి వెళ్లి ఓ వృద్ధుణ్ణి ప్రభుత్వంగురించి అడిగి చూడండి. 'రాజు లేకుండా రాజ్యం ఎలా ఉంటుంద'న్న సమాధానం అతనినుంచి ఎదురౌతుంది. సంస్థాన ప్రాంతాల్లోనే ప్రజల అవగాహన ఇలా ఉంటుందనుకోనవసరంలేదు. అధికారపురుషుల్ని ఆరాధించడంలో బ్రిటిష్ఇండియాకూడా తీసిపోదు. చదువుసంధ్యల్లేని ఓ మహిళనే కనుక అడిగితే, ఢిల్లీని ఇప్పటికీ ఎవరో 'చక్రవర్తి' పాలిస్తున్నాడనీ, 'రాజు' రాష్ట్రాన్ని లేదా ప్రాంతాన్ని పాలిస్తున్నాడనీ సమాధానం చెబుతుంది. రాష్ట్రమూ, ప్రాంతమూ అన్నదికూడా ఆమెకు తెలియదు. తెలుసుకోవాలని కూడా అనుకోదు. 'మంత్రి'గారు ఎవరైనా గ్రామాన్ని సందర్శిస్తే వెనకాల 'రాజు'గారు కూడా వస్తూనే ఉంటారని గ్రామస్థులు అనుకుంటారు. రాజు—మంత్రి అనేవి చిరకాలంగా వినిపిస్తున్న జంటపదాలు. మనం ప్రాచీనపద జాలంనుంచి శబ్దాల్ని మాత్రమే తీసుకుని వాడుకుంటున్నామనుకుంటాం. అది సరికాదు. మాటలతోపాటు వాటికి సంబంధించిన భావాలు కూడా ఆలోచనలో ప్రవేశిస్తుంటాయి. ఆ విధంగా రాచరికం, రాజుగారి పట్ల భక్తి విధేయతలు సామూహికచేతనలో జీర్ణించుకుపోయాయి.

ప్రభుత్వాన్నీ, అధికారాన్నీగురించి మెజారిటీ ప్రజల ఊహలు, భావాలు ఒకేవిధంగా ఉంటాయి. మళ్లీ ఆ సాదృశ్యం నగర ప్రజల్లోకంటె గ్రామప్రజల్లో ఎక్కువగా కనిపిస్తుంది. ఈ పూర్వభావాల చట్రంలోకే రాష్ట్రపతులు, ప్రధానమంత్రులు, ముఖ్యమంత్రులు, ఇంకా కిందికి వెడితే గ్రామ స్థాయిలో పంచాయతీ సర్పంచ్‌లు ఇటువంటి పదవీధరులు వస్తుంటారు, తమ పనేదో చేసి నిష్క్రమిస్తూఉంటారు. వాళ్ళవాళ్ళ పరిపాలనలో ప్రజల్ని దయతో చూస్తారో, నియంతృత్వమే చలాయిస్తారో —మొత్తానికి వాళ్ళు సాగించేది కూడా పరిపాలనే. ప్రజాస్వామిక ఆచరణలో కూడా 'ఎవరు పరిపాలన చేయాల'న్న ప్రశ్న ఒకటే ఇప్పటికీ పైకితేలుతోంది. ప్రజాస్వామ్యమంటే సారాంశతః ప్రజలు తమను తామే పరిపాలించుకోవడమన్న మూలభావం ప్రజల్లో ఇంకా నాటుకోలేదు.

సగటుప్రజల ఈ రాజకీయఅవగాహనలో మహేంద్రనాథ్ చక్కగా అమరిపోతాడు. మధ్యయుగాల రాజుల్లో కనిపించే లక్షణాలన్నీ ఆయనలోనూ కనిపిస్తాయి. అధికారయంత్రాంగాన్ని ఉక్కుచేతులతో శాసించడం, క్రౌర్యం, అవతలివాళ్లను చిత్రహింసలు పెట్టి ఆనందించే ప్రవృత్తి, దురహంకారం, అసహనం, నిరంకుశత్వం, దురుసుతనం, కర్కోటకత్వం, ఆడవాళ్లను అనుభవించడాన్ని ఒక హక్కుగా భావించడం... ఒకటేమిటి, అన్నీ. ఎన్నికల సమయంలోతప్ప -ప్రజలపట్ల విపరీతమైన తిరస్కారభావం. మధ్యయుగపు సామంతరాజులతో కూడా ఆయనకు దగ్గరిపోలికలున్నాయి. ఉదాహరణకు మొట్ట మొదటి నాసిర్‌జాలాగే ఈయనకూడా కేంద్రంతో కయ్యానికి కాలుదువ్వు తున్నట్టుంటాడు. కేంద్రంపట్ల సామరస్యం కానీ, సుహృద్భావం కానీ మచ్చుకైనా ఆయనలోలేవు. పైకి అనకపోయినా స్పష్టంగా కనిపించే ఈ శత్రుత్వానికి తగిన కారణం కూడా ఉండదు.

ధిక్కరించడంకోసం ధిక్కరించడం... అంతే. ప్రతిక్షణం తిరుగుబాటుకు సిద్ధమౌతున్నట్టే కనిపిస్తాడు. కానీ నిజంగా తిరుగుబాటు చేయడు. ఎందుకంటే తిరగబడవలసిన పరిస్థితేమీ అక్కడ ఉండదు.

ఆయనలోని ఈ ధోరణికి మిత్రులూ, శత్రువులు కూడా రకరకాల అర్థాలు, భాష్యాలూ ప్రచారం చేస్తూఉంటారు. 'పెద్దగా చదువుకోలేదు' కనుక... ఇంకాస్త విడమరిచి చెప్పాలంటే మెట్రిక్యులేషన్ కూడా పూర్తిచేయలేదు కనుక ఆయన అదోరకం న్యూనతాభావంతో బాధపడు తున్నాడని కొందరి వ్యాఖ్యానం. జవహర్లాల్ నెహ్రూ పక్కన నిలబడినప్పుడు తను వెలవెలబోతున్నట్టు ఊహించు కుంటున్నాడని మరి కొందరి వివరణ. నిజంగానే ఆయన జవహర్లాల్‌నెహ్రూను చూసి అసూయపడుతున్నట్టు ఇంకా మరి కొందరి అభిప్రాయం. మోకాలికీ బోడిగుండుకీ ముడిపెట్టినట్టున్నా ఈ అభిప్రాయం కాస్త ఎక్కువ చలామణిలోకి వచ్చేసింది. మహేంద్రనాథ్ భక్తబృందం ఆ మాటను నాలుకమీద వేసుకుని ఏదో రూపంలో ప్రచారం చేయడం ప్రారంభించారు. తమ నాయకుడు పండిట్‌జీకి ఎందులో తక్కువని ప్రశ్నించడం మొదలుపెట్టారు, అలా పోల్చవలసిన అవసరమేదో వచ్చిపడినట్టు. మొత్తానికి మహేంద్రనాథ్‌తో సర్దుకుపోవడం కష్టమన్న అభిప్రాయానికి చాలామంది వచ్చేశారు. ఎందరో ఆయనను విడిచిపెట్టి వెళ్ళిపోయారు. రాష్ట్రంలో ప్రతిఒక్కరూ ఆయనంటే భయపడిపోతున్నారు.

కేంద్రం అంటే ఎంత ముఖంచిట్లించుకునే ముఖ్యమంత్రైనా ఢిల్లీతో సంబంధాలు పెట్టు కోకుండా పనిచేయలేడు. మహేంద్రనాథ్ అదృష్టం కొద్దీ —రానురాను అదే ఆయన పాలిట దురదృష్టంగా పరిణమించిందనుకోండి– ఆయన ఢిల్లీ సంబంధాలు చెడిపోకుండా చౌదరి జాగ్రత్తగా కాపాడుకుంటూ వచ్చాడు. చౌదరి పరిశ్రమల మంత్రిగా ఎంతో సమర్థుడని పేరు తెచ్చుకున్నాడు. మంత్రివర్గంలో ఆయనది ద్వితీయస్థానం. మహేంద్రనాథ్‌కు ఎంతో విశ్వాసపాత్రుడుగా ఉండేవాడు. మహేంద్రనాథ్‌కు రాష్ట్రస్థాయిలో తనను తాను నిష్కలంకమూర్తిగా జనంముందు ప్రదర్శించుకునే అవకాశమిస్తూ చౌదరి తెరవెనుకఉండి పాకీపనంతా తానే చేస్తూవచ్చాడు. ఫలితంగా అతడి పరిచయాలు, ప్రజాదరణ శరవేగంతో పెరిగిపోయాయి.

అధికారమే తప్ప సిద్ధాంతాలు, సూత్రాల వంటి చాదస్తాలేవీలేని రాజకీయవాదుల్లో చౌదరి కూడా ఒకడు. అడపాదడపా ప్రకటనల్లోనూ, తీర్మానాల్లోనూ తొంగిచూసే ఎటువంటి 'ఇజం'మీద ఆయనకు నమ్మకం లేదు. ప్రజలు అర్ధ నగ్నంగా, చదువుకు దూరంగా అమానుషపరిస్థితుల్లో జీవించే దేశంలో సిద్ధాంతాల రాద్ధాంతాలన్నీ దేనికి? అంటుండేవాడు. మంచినీళ్ల బావిని సోషలిస్టు అనాలా? కమ్యూనిస్టు అనాలా? గ్రామాల్లో వేసే రోడ్డుమీద రాజకీయపార్టీల ముద్రలుంటాయా? ఇదంతా బొత్తిగా పనికిమాలిన చర్చ. మనదేశాన్ని మనమే పరిపాలించుకోవాలనుకున్నాం, అందుకే బ్రిటిష్ వాళ్ళను తరిమికొట్టాం, అంతమాత్రాన బ్రిటిష్‌వాళ్ళ పరిపాలనా విధానాల్ని కూడా తిరస్కరించా లనేమీ లేదు. కనుక సిద్ధాంతాల్ని తుంగలోతొక్కి ఉక్కుచేతులతో పరిపాలన సాగించవలసిందే!... ఇది ఆయన నిశ్చితాభిప్రాయం.

ఇటువంటి మనిషి ఎప్పుడో నలభై దశకంలోనే ఒక రాజకీయ పార్టీలో చేరి ఎలా పని చేస్తున్నాడన్న అనుమానం రావచ్చు. ఆయనెప్పుడూ నోరువిప్పి చెప్పుకోలేదు కానీ జవాబు అంత క్లిష్టమైందేమీ కాదు. సోదరుడివరసయ్యే ఆయన దూరపు బంధువొకడు వేరే పార్టీలో

చేరి త్వరలోనే బ్రి.సా.వి. (బ్రిటిష్ సామ్రాజ్య విధేయుడు) అనే పేరు తెచ్చుకున్నాడు. తను ప్రత్యర్థిగా భావించే సోదరుడు కళ్ళుతిరిగేంత ఎత్తుకి ఎదిగిపోవడం చూసిన చౌదరి అతడికి పోటీగా బ్రిటిష్‌వ్యతిరేకాందోళనలో చేరిపోవాలనుకున్నాడు. బ్రిటిష్‌వ్యతిరేకత అంటే సోదరవ్యతిరేకతనే అప్పట్లో అతనికి తెలిసిన అర్థం. పార్టీలో చేరి రాత్రనక, పగలనక పార్టీ గొప్పతనం గురించి ఉపన్యాసాలిచ్చాడు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, తానున్న చోటునుంచి ఒక్క గెంతు గెంతితే వెళ్ళి అధికారంలో పడగల అవకాశం ఉన్నట్టు గమనించాడు. సోదరులిద్దరి తలరాతలూ ఎంత సమానంగా, ఒకదానికొకటి ఎంత అభిముఖంగా ఉన్నాయంటే —తన సోదరుడే బ్రిటిష్ వ్యతిరేకాందోళనలో చేరి ఉంటే చౌదరి ఖచ్చితంగా 'బ్రి.సా.వి.' అనిపించుకునేవాడు. ఒకడు బ్రిటిష్ చక్రవర్తిని వాడుకుంటే, ఇంకొకరు మహాత్మాగాంధీని వాడుకున్నాడు.

చౌదరికి డబ్బుమీద, మాయోపాయాలమీద చెక్కుచెదరని విశ్వాసం. అవి రాజకీయాల నిచ్చెన మీద ఒక్కొక్క మెట్టెక్కడానికి ఆయనకు అక్షరాలా దోహదం చేశాయి-ప్రథమసార్వత్రిక ఎన్నికలవరకు. ఆ ఎన్నికల్లో మాత్రం ఆయన డబ్బుతీసుకుని నెలరోజులపాటు తమకు కావలసినవన్నీ ఆయన దగ్గర దండుకున్నవాళ్ళే ఆయనను తిరస్కరించి, డబ్బుకానీ, సంఘంలో పలుకుబడి కానీ ఏమీలేని ఓ అనామకుణ్ణి ఎన్నుకున్నారు. అవతలివ్యక్తి మనోహర్ మంచివాడు, యువకుడు అనుకున్నారు వోటర్లు.అంతే. ఈ వెన్నుపోటు చౌదరికెంతో ఆగ్రహం తెప్పించింది. వోటర్లు ఇంతగా నమ్మకద్రోహానికి దిగజారిపోయారంటే ప్రజాస్వామ్యం కచ్చితంగా దేశాన్ని భ్రష్టుపట్టిస్తుందంటూ బుసలు కొట్టాడు.

మూడేళ్ళపాటు ఈ అవమానభారంనుంచి చౌదరి తేరుకోలేకపోయాడు. ఓ దార్పుకోసం గ్లాసుమీద గ్లాసు పట్టించడం ప్రారంభించాడు. వ్యభిచారం సాగించాడు. ఎక్కడో ఉన్న నైనితాల్ వరకూ వెళ్ళి జూదమాడాడు. ఓరోజు విచిత్రంగా చౌదరి ఓ పడుపుగత్తెదగ్గర సరికొత్త రాజకీయపాఠం నేర్చుకున్నాడు. తనతో పడుకున్న ఎందరో హైక్లాస్ పడుపుగత్తెలలో ఆమె ఒకతె. రాత్రి చిత్తుగా తాగి కోరిక తీర్చుకుని పడకమీద విశ్రాంతి తీసుకుంటుండగా హఠాత్తుగా ఆమెలో ఏదో తృష్ణ చెలరేగింది. అద్దంలో తన ప్రతిబింబం చూసుకుంది. అప్పుడే మొదటిసారి చూస్తున్నట్టు, స్తనాల బిగువు సడలిపోతోందనుకుంది. కళ్ళకింద నల్లని వలయాలు కూడా కనిపించాయామెకు. హఠాత్తుగా చౌదరి వైపు తిరిగి 'నాలో నీకేం ఆకర్షణ కనిపించింది డార్లింగ్' అడిగింది.

'ఇంకేముంటుంది? నీ రూపం' అన్నాడు చౌదరి ఒకింత ఆశ్చర్యపోతూ.

'నా మేకప్ నీకు నచ్చుతుందా?!'

'పడిచస్తాను. ఇంత బాగా మేకప్ చేసుకునేవాళ్ళని నేనింతవరకూ చూడలేదు.'

'అదిగో, నిజంచెప్పు... నీ పొగడ్తలు నాకక్కర్లేదు. నువ్వా ఉద్దేశంతో అన్నాఅనకపోయినా ఒకవిధంగా నువ్వుచెప్పింది కూడా నిజమేమో, జనం పట్టించుకునేది నీ మేకప్‌నే కానీ నిన్నుకాదు!'

ప్రేమగా ఆమె స్తనాలను నిమురుతున్న చౌదరికి అదే క్షణంలో సత్యం బోధపడింది. పైకి కనిపించే రూపమూ, మేకప్ —వీటినే నీ నిజరూపమనుకుంటుంది లోకం రాజకీయాలు కూడా అంతే. ఆ రాత్రితో అతని రాజకీయఅవగాహన పూర్తిగా మారిపోయింది ఎన్నికల ఓటమివల్ల

కలిగిన అవమానభారం దూదిపింజలా తేలిపోయింది. మూడేళ్ళపాటు ఆ పరాభవాన్ని తలచుకుని తలచుకుని ఎందుకు కుమిలిపోయానా అనుకుని విచారించాడు. తక్షణమే బరిలోకి దూకి తనలో అంకురించిన సరికొత్తజ్ఞానాన్ని ప్రయోగించాలనుకున్నాడు. అలాగే సందర్భానికి తగినట్టు రకరకాల ముసుగులు మార్చే విద్యనుకూడా ప్రదర్శించుకోవాలనుకున్నాడు.

ఆ రోజు సాయంత్రమే ఓ క్లబ్‌లో చౌదరి 'సోషలిస్ట్ సామాజిక వ్యవస్థ'ను ఎద్దేవా చేస్తూ మాట్లాడాడు. మరో వారం రోజుల్లో మద్రాసులో జరగబోయే పార్టీ సదస్సులో దీనిగురించి ఓ చరిత్రాత్మక తీర్మానం చేయబోతున్నారు. సోషలిజమంటే ప్రజలందరినీ సమానంగా దరిద్రుల్నిచేసే ఒకానొక వ్యవస్థ అంటూ ఎవరో ఎగతాళిగా అన్న మాటల్ని కూడా ఉటంకించాడు. 'ఈ క్షణంలో ఈ డాన్స్ ఫ్లోర్‌లో నిలబడి ఉన్న సోదరసోదరీమణులందరూ ఒకే ఎత్తులో ఉండాలన్న సూత్రాన్ని వర్తింపచేస్తే ఎన్ని తలకాయలు, ఎన్ని కాళ్ళు నరకవలసి ఉంటుందో?' అని కూడా అన్నాడు.

ఆ చమత్కారపూరిత వ్యాఖ్యకు అందరూ పగలబడినవ్వారు. అక్కడున్న క్లబ్ సభ్యులందరూ చౌదరిని వరవడిగా తీసుకుని సోషలిజం ఎంత ప్రమాదకర సిద్ధాంతమో, మనదేశం నైజానికి అదెలా సరిపడదో చెప్పి ఏకగ్రీవంగా ఖండించిపారేశారు. ఆ నైజమేమిటో మాత్రం ఎవ్వరూ చెప్పలేదు.

అలా వ్యాఖ్యానించిన కొన్ని గంటలకే, ఆ పడుపుగత్తె జారిన స్తనసంపదను నిమురుతున్న క్షణంలో, అతనికి ఊహించని విధంగా జ్ఞానోదయమైంది. చెట్టుమీంచి యాపిల్ పడడం చూసి ఐజాక్ న్యూటన్ భూమ్యాకర్షణ సిద్ధాంతాన్ని కనిపెట్టినట్టు, ఆమె అలవోకగా అన్న మాటల వల్ల చౌదరి సోషలిస్టు తరహా సామాజికవ్యవస్థయొక్క మూలసూత్రాలను అర్థం చేసుకోగలిగాడు. మరుసటి వారంలో మద్రాసులో జరిగే పార్టీ సదస్సుకు వెడుతూ సోషలిజం గురించి 'సులభ' పద్ధతిలో రాసిన ఓ చిన్న పుస్తకాన్ని రైల్లో ఆమూలాగ్రం చదివి జీర్ణించుకొని మద్రాసులో అడుగు పెట్టే సమయానికి వీరసోషలిస్టుగా మారిపోయాడు. సబ్జెక్ట్‌కమిటీ మీటింగ్‌లో అధికారికతీర్మానానికి ఓ సవరణ ప్రవేశపెట్టాడు. అధికార తీర్మానం ఇప్పుడున్నరూపంలో సాధించగలిగేదేమీ ఉండదని గొంతుచించుకుని వాదించాడు. తీర్మానంలో ఉద్దేశించినట్టు డొంకతిరుగుడు మార్గంలో కాకుండా (ఆయన అభిప్రాయం ప్రకారం) సోషలిస్టు సామాజిక వ్యవస్థ 'ఇప్పుడే ఇక్కడే' స్థాపితం కావాలని పట్టుబట్టాడు. తీర్మానంలో ధ్వనిస్తున్న అర్థం ప్రకారం నమూనామాత్రమే సోషలిస్టుగా ఉండి లోపలి సరకు కేపిటలిస్టుగానే కొనసాగడంవల్ల ప్రయోజనమేమిటని ప్రశ్నించాడు. వేదికమీద కూర్చుని శ్రద్ధగా వింటున్న జవహర్లాల్‌నెహ్రూ వైపు మాటిమాటికీ చూస్తూ, ప్రజల ఆశలూ ఆకాంక్షలూ మనం ఇప్పటికీ అర్థం చేసుకోలేకపోతున్నామంటూ ఎంతో ఆవేశపూరితంగా ఉద్ఘాటించాడు. ఆ తర్వాత చర్చలో జోక్యం చేసుకున్న జవహర్లాల్‌జీ చౌదరివైపు ముద్దుముద్దుగా చూసే సరికి చౌదరి మారుమాట్లాడకుండా తన విప్లవాత్మక సవరణను ఉపసంహరించుకున్నాడు. ఆ మధ్యలో జవహర్లాల్ తనమీద విసిరిన చూపు ఎంతో అర్థవంతమైందనే భావమేదో చౌదరికి స్ఫురించింది.

మత్తెక్కించే ఆ విజయం తర్వాత, వాంతి పుట్టించే రాజకీయ మారువేషాల విద్యలో చౌదరి ఆరితేరిపోయాడు. పార్టీ సిద్ధాంతాల్లో ఒక్కమాట మీద కూడా తనకు విశ్వాసం లేకపోయినా ఆ

మాటల్ని నాలుక చివరినుంచి అదేపనిగా మొక్కుబడిగా దొర్లించడం నేర్చుకున్నాడు. ఆ మంత్రం బాగా పారినట్టే కనిపిస్తోంది. పైగా తనలాంటివాళ్ళు చాలామందే ఉన్నట్టూ గమనించాడు. వాళ్ళెవరికీ విలువలు, నీతినియమాలు, విశ్వాసాల ప్రమాణాలు వేటితోనూ పనిలేదు. మోకాలి వరకే పంచె ధరించి పైన చొక్కా వేసుకోకుండా నిరాడంబరంగా కనిపించడానికి ప్రయత్నిస్తూ గాంధీజీ కళ్ళు కప్పారు. లేదా కప్పినామనుకున్నారు. వ్యక్తిగత జీవితంలో అంత అవినీతిపరులు, అంత వ్యభిచారులు మరొకరు లేరు. కొందరు 'సోషలిస్టు' నాయకులు నగరాల్లో ఎంత విలాసవంతంగా జీవిస్తున్నారో చూసి చౌదరి ఆశ్చర్యపోయాడు. వ్యాపారం ముసుగులో విశృంఖలంగా దోపిడీ సాగించి, ఇంకా రకరకాల అక్రమమార్గాల్లో సంపాదించి సంపద కూడబెట్టారు. మరోవైపున సోషలిజంమీద వాళ్ళ ఉపన్యాసాలు, రాతలు అచ్చవుతూనే ఉన్నాయి. జనం వాటిని చదివి ముగ్ధులౌతూనే ఉన్నారు. ఈ దాంభికులు సాధించిన విజయాలను వరవడిగా తీసుకుని కేవలం ఒకటిన్నర దశాబ్దంలోనే చౌదరి తనెంతో చిత్తశుద్ధితో అనుసరించే అచ్చపు ఫ్యూడలిజంనుంచి నకిలీ సోషలిజంలోకి పూర్తిగా పరివర్తన చెందాడు. ఆ క్రమంలోనే అసాధారణమైన రాజకీయఫలితాలూ సాధించాడు.

మద్రాసు తీర్మానం వేలాదిమంది పార్టీ కార్యకర్తల్ని ఆనందంలో ముంచెత్తింది. పార్టీ రాజకీయ చింతనలో అదో కొత్త అధ్యాయానికి తెరతీసింది. జవహర్లాల్ తాను ప్రగాఢంగా విశ్వసించే సోషలిస్టు ఆదర్శాన్ని పార్టీలో ప్రవేశపెట్టారు. భారత దేశానికి అదొక్కటే సరిపడుతుందని ఆయన తరచు అంటూండేవారు. స్వాతంత్ర్యం వచ్చిన వెనువెంటనే ఇది జరిగి ఉంటే స్పష్టత, బలం సిద్ధించి ఉండేవని కూడా చాలామంది అభిప్రాయపడ్డారు. వాళ్ళల్లో కొందరు కొన్నేళ్ళ క్రితమే ఓ కొత్త పార్టీ స్థాపించారు కానీ, వోట్లకు వచ్చేసరికి 1952 ఎన్నికల్లో జనం జవహర్లాల్‌వైపే మొగ్గిపోయారు. సిద్ధాంతాల సంగతెలా ఉన్నా ఆయన వశీకరణశక్తిదే పైచేయి అయింది. సోషలిస్ట్ లక్ష్యంవైపు అడుగువేయడానికిది తగినసమయమని జవహర్లాల్ భావించేసరికి అప్పటికే పార్టీలో, ప్రభుత్వంలో కీలకస్థానాల్ని ఆక్రమించిన నాయకులు, చౌదరిలా రాత్రికి రాత్రే సోషలిస్టులుగా అవతారం దాల్చారు. తాల్చకతప్పలేదనడం సబబు. దేశంలో సోషలిస్టు ఆదర్శానికి తగిలిన దెబ్బల్లో ఇదికూడా ఒకటి. సోషలిజాన్ని చిత్తశుద్ధితో ఆరాధించే యువకార్యకర్తలు తగు సంఖ్యలో ఉన్నప్పటికీ, వారిని మించిన సంఖ్యలో ఏ ఎండకా గొడుగు పట్టే కల్తీసరకు ఉన్నారు.

సోషలిస్టు ముసుగువెనుక చౌదరి అసలైన రాజకీయతాత్వికత ఉండనే ఉంది. అదెంతో సరళమూ, తర్కబద్ధమూ, ఇంకా చెప్పాలంటే కుతర్కపాండిత్యానికది ఒకరకంగా శిఖరాయమానం. అంతగా అభివృద్ధికాని మనదేశంవంటి దేశంలో ప్రజల్ని సేవించుకునేందుకు సాధనం రాజకీయాధికారం ఒక్కటేననేవాడు. కనుక పేదలకోసం నువ్వు చచ్చేవరకూ అధికారంలో ఉండవలసిందే. ఈ మధ్యలో నువ్వు కోట్లకు పడగలెత్తావనుకో, అది కేవలం యాదృచ్ఛికం. కనుక లాజికల్‌గా తేలుతున్నదేమిటంటే అధికారాన్ని సాధించడానికీ, నిలబెట్టుకోడానికీ నువ్వేంచేసినా చట్టబద్ధమే. ఎందుకంటే అదంతా పేదప్రజలకోసం కనుక.

చిన్నతనంలో చౌదరిని రామాయణంలోని దశరథమహారాజు పాత్ర ఎంతో ఆకర్షించింది వృద్ధాప్యంమీదపడిన దశరథుడు ఇంక తాను పరిపాలనకు తగనని భావించి తన పెద్దకొడుకైన

రాముణ్ణి రాజుగా అభిషేకించి వానప్రస్థానికి వెళ్ళిపోవాలనుకుంటాడు. అయితే ఆ తర్వాత తర్వాత చౌదరిని మరీ మరీ ఆకట్టుకున్న ఉదాహరణ మొగల్ చక్రవర్తి ఔరంగజేబు. తన తండ్రి షాజహాన్ వయసుమీదపడ్డా ఇంకా పరిపాలిస్తూనే ఉండడం చూసి ఔరంగజేబులో ఓర్పు నశించింది. సింహాసనం చేజిక్కించుకోడానికి ముసలితండ్రిని కటకటాల్లోకి తోసేశాడు. ఇదే చాలా ప్రాక్టికల్‌గా ఉందనుకున్నాడు చౌదరి. ఆధునికరాజకీయవిధానంలో అసలిదే కీలకం. అధికారమనేది ఎప్పుడైనా ఎక్కడైనా ఒక వ్యక్తినే ఆశ్రయించి ఉంటుంది. . ఆ వ్యక్తి చక్రవర్తి, రాజు, రాష్ట్రపతి, ప్రధాన మంత్రి, ముఖ్యమంత్రి... ఎవరైనా కావచ్చునని వాదించేవాడు ఇంకొకరితో పంచుకోడానికెంతమాత్రం వీలుకానిది అధికారం 'నువ్వా? నేనా?' తప్ప 'నువ్వూ, నేనూ' అనేది అక్కడ కుదరనేకుదరదు. అధికారాన్ని ఎక్కడైనా పంచుకున్నట్టు కనిపిస్తే అది కేవలం రాజకీయభ్రమవల్ల మాత్రమే. కనుక అధికారాన్ని సాధించుకునే మార్గం ఒకటే.— ఒడిసిపట్టి గుంజుకోవడం. నీతినియమాల గొంతునొక్కిన తర్వాత అతనికింక ఏ సంశయమూ మిగల్లేదు. అంతా స్ఫటికంలా తేటతెల్లంగా కనిపించింది. పథకరచనలో పదునుతేరిన అతని బుద్ధి మిగిలినపని పూర్తి చేసింది.

కొన్నిగంటలపాటు పరమకిరాతకంగా ఆలోచించి ఆలోచించి ఔరంగజేబు టెక్నిక్‌లోని మెలకువలను ఆకళించుకున్నాడు. ఈ ప్రయత్నంలో అతనికి రకరకాల ప్రమాదాలూ ఎదురైనమాట నిజం. అయితే లోపల రగులుతున్న అధికారకాంక్ష అతణ్ణి పడిపోకుండా నిలబెట్టింది. పార్టీఎన్నికల్లో చాలాసార్లు ఓటమి అతణ్ణి వెక్కిరించింది. అందుకు ప్రధానకారణం ఒకటే. అతడి అనుయాయులు కూడా అతనిపై ఔరంగజేబు టెక్నిక్‌ను ప్రయోగించడం మొదలుపెట్టారు. రకరకాల ఎదురుదెబ్బలు తింటూ ఎలాగో నెమ్మది నెమ్మదిగా అధికారస్థానానికి చేరుకోగలిగాడు. కాఠిన్యం, రౌద్రం, నిర్మోహమాటం, నిజాయితీ, విషపూరితప్రవృత్తి, విశృంఖలత్వం, విపరీతకాముకత్వం మూర్తీభవించిన మనిషైనా, విచిత్రంగా జనాదరణగల ముఖ్యమంత్రిగా కూడా పేరు తెచ్చుకున్న మహేంద్రనాథ్‌కు చౌదరి కుడిభుజమయ్యాడు. నాలుగేళ్ళుగా మహేంద్రనాథ్ మంత్రి వర్గంలో చౌదరి ద్వితీయస్థానంలో ఉంటున్నాడు. ఈ మధ్య ఔరంగజేబు అతణ్ణి మాటిమాటికీ ఆవహిస్తున్నాడు. అతని ద్వితీయస్థానాన్ని చూపించి కోపంతో సెగలు కక్కుతున్నాడు. రాత్రిళ్ళు బొత్తిగా నిద్రపోనివ్వడంలేదు. పైకి వెళ్ళేప్రయత్నంలో అడ్డదారులవైపు నడిపిస్తున్నాడు.

స్నేహం కొనసాగినంతకాలం మహేంద్రనాథ్, చౌదరి ఆప్తమిత్రులే. అయితే ఎక్కువకాలం కొనసాగలేనంత మరీమంచి స్నేహం వాళ్ళది. వాళ్ళిద్దరి విభేదాలకు అసలు కారణం మహేంద్రనాథ్ అహంకారం, చౌదరి అధికారకాంక్షలే అయినా, దానికి ముసుగుకప్పేసి పైకిమాత్రం ఆరోపణలు, ప్రత్యారోపణలు గుప్పించుకుంటున్నారు. ఇద్దరూ విడిపోయే అనివార్యపరిణామం తోసుకువచ్చేస్తున్నట్టే కనిపిస్తోంది. సంధి ప్రయత్నాలు విఫలమైపోయాయి.

త్వరలోనే మహేంద్రనాథ్‌వర్గంలోకి సరికొత్త మద్దతుదారులు, శ్రేయోభిలాషులు, వీర విధేయులు వచ్చి చేరిపోయారు. వారు తలకెత్తుతున్న దైనందినకార్యక్రమం ఒకే ఒకటి. చౌదరిమీద ఆయన ద్వేషాన్ని ఇంకా ఇంకా ఎగదోయడం. కేంద్ర నాయకత్వంతో మరింత గట్టిగా పోరాడడానికి ఆయనను పురిగొల్పడం ఈ నూతనవిధేయవర్గం ప్రయోజనాలన్నీ ఈ సరికొత్త వ్యూహంలోనే ఇమిడి ఉన్నాయి మరి. అసలు విషయాన్ని చిలవలు పలవలుగాపెంచి రకరకాల ఉపవివాదాలు

సృష్టించగలిగారు. మహేంద్రనాథ్‌ను ఫెడరల్ ఆదర్శాలకోసం పోరాడే మహావీరుడుగా మార్చివేశారు. ఇంతవరకూ కేంద్రానికి కట్టుబానిసల్లా పడున్నామని వాదించారు. అది కేంద్రానికీ చేటు, రాష్ట్రానికీ చేటు, ముఖ్యంగా ప్రజలకు మరింత చేటన్నారు. ఎంతైనా కేంద్రమూ, రాష్ట్రాలూ ఒకే రాజ్యాంగం కుదుట్లో పుట్టినవి కావా అని ప్రశ్నించారు. కనుక కేంద్రం రాష్ట్రాలపై పెత్తనం చలాయించడం కానీ, నెత్తెక్కి తొక్కడంకానీ కుదరవుగాక కుదరవని తీర్మానించారు. ముఖ్యమంత్రి, అసలు ప్రధానమంత్రి దయాదాక్షిణ్యాలమీద ఎందుకు ఆధారపడి ఉండాలి? ముఖ్యమంత్రి– అందు లోనూ మన ముఖ్యమంత్రి– ప్రధాని ఎందుకు కాకూడదు? ఎప్పుడూ అనుచరుడిగానే ఉంటే తన రాజకీయమూర్తిమత్వాన్ని ఎలా పెంచుకోగలడు?... మహేంద్రనాథ్‌కి అటువంటి ఆకాంక్ష లేవీ ఉండి ఉండకపోవచ్చు కానీ ఇది అధికారకాంక్షకు సంబంధించిన అంశంకాదు. దేశ ప్రయో జనాలతో ముడిపడిఉన్న ప్రశ్న. ఆపైన ఇది అత్యున్నతప్రజాస్వామ్య సూత్రాలతో కూడా జత పడిన విషయమని ప్రత్యేకించి చెప్పుకోనవసరంలేదు...

మహేంద్రనాథ్‌కి జాతీయస్థాయికెదగాలన్న కోరిక ఉందో లేదో ఇంకా స్పష్టంకాలేదు. అయినాసరే అనుచరగణం లోపాయికారీగానో, బహిరంగంగానో ఆయన ఆలోచనను తమ కనుకూలంగా మలచుకోవడం ప్రారంభించారు. దాంతో ప్రధానమంత్రికావాలన్న కోరిక ఆయన రాజకీయచింతనలో సహజంగానే ఉన్నట్టు కనిపించడం ప్రారంభించింది. ఆయన ఆలోచనకు ఆయనను వదిలేస్తే ఏంచేసేవాడో! బహుశా కేంద్రంలో కొందరు మిత్రుల్ని సంపాదించుకునేవాడు. ఈ ఫెడరిలిస్టు మంత్రగాళ్ళను తన్ని తరిమేసి ఉండేవాడు. అయినా ఆయన 'శ్రేయోభిలాషులు' ఆ అవకాశాన్ని కూడా తుంచిపారేశారు కేంద్రం చొదరిని చేర దీసింది కనుక ఆ రాజీమార్గంకూడామూసుకుపోయిందని ఆయనకు నూరిపోశారు. ఈ పరిస్థితిలో మహేంద్రనాథ్ బలవంతంగా ఫెడరలిజం జెండా పుచ్చుకోక తప్పిందికాదు. ఈ లోపల నిజంగానే ఫెడరలిజాన్ని ఆరాధించేవాళ్ళు కొంతమంది, తమకూ ఎంతోకొంత స్థాయికలిగిన నాయకుడుకావాలి కనుక వచ్చి మహేంద్రనాధ్ గుంపులో చేరిపోయారు... నువ్వొకందుకు పోస్తుంటే నేనొకందుకు తాగుతున్నానన్నట్టు.

ఫెడరలిజానికేం? బాగానే ఉంది. అయితే పార్టీలో ఉన్న అంచెలంచెల నాయకత్వం మాటేమిటి? పెద్దతలనొప్పి సమస్యే! రాజ్యాంగపండితులుకూడా ఒప్పుకోక తప్పని సమస్య. ఏకశిలా సదృశంగా ఉండే పార్టీయంత్రాంగం అందరిమీదా స్వారీ చేస్తుందనీ, రాష్ట్రాల నాయకులు దానికి విధేయంగా ఉండితీరవలసిందేనని అనుచరగణం ఎత్తిచూపించారు. కనుక మహేంద్రనాథ్ పార్టీవైపునుంచికూడా తిరుగుబాటు సాగించవలసిందే! పైగా, ఆ చొరవ తెగువ ఆయనకు తప్ప ఇంకెవరికీలేవు. రాజకీయంగా పైకి ఎదగడానికి ఆయనెప్పుడూ కేంద్రం మీద ఆధారపడలేదు. తనలో ప్రతిఅంగుళాన్ని స్వయంకృషితో నిర్మించుకున్న మనిషి. ఆ మహత్తరమైన తిరుగు బాటుతో ఆయన ప్రతిష్ఠ అమాంతం పెరిగి పోతుంది. భారతరాజకీయాల్లో సరికొత్త అధ్యాయం తెరుచుకుంటుంది.. వందిమాగధులు ఇలా అదేపనిగా ఆయనముందు రంగురంగుల ఇంద్ర ధనుస్సులు సృష్టిస్తున్నారు.

చౌదరి తప్పుకున్నతర్వాత ఈ చిత్రమైన మూక మధ్య ఇరుక్కుపోయిన మహేంద్రనాథ్ తలచుకుంటే ఇప్పుడు కూడా ఫెడరలిజం జెండాను అవతలపారేసి కేంద్రంతో సంధిచేసుకో గలడు. అయితే ఓ లోపం ఆయనకు కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. ఢిల్లీలో తన వ్యవహారాలు నడిపించే ఓ మనిషికావాలి. అతడికి చౌదరి యోగ్యతలో సగమున్నా చాలు. కనుచూపు మేరలో అటువంటి మనిషెవరూ ఆయనకు కనిపించడంలేదు. వ్యక్తిగత ప్రతిభతో కాక కుట్రపరిస్థితుల్లో అనుకోకుండా నాయకత్వస్థానాన్ని అందుకున్న ఎందరో నాయకుల్లానే ప్రస్తుతానికి తనిలా ఫెడరలిజం శిలువను మోస్తూ ఉండవలసిందే. లోపల వేరే ఉద్దేశాలూ, ఎత్తుగడలు పెట్టుకొని పైకి రాష్ట్రం స్వయంప్రతిపత్తి కోసం పోరాడే యోధుడిగా తనకేమాత్రం నప్పని వేషం ధరించవలసిందే. అన్నింటినీమించి చౌదరి కేంద్రానికి సన్నిహితంగా ఉండడం ఆయనకి మరీమరీ కంటగింపుగాఉంది. అందులో నిజంకన్నా కల్పనే ఎక్కువైనాసరే.

'ఒక రాష్ట్రనాయకుడి మీద మరొకణ్ణి ప్రయోగించి ఇద్దరినీ కుక్కల్లా ఢిల్లీకి ఎలా పరుగులు తీయిస్తారో చూశావా?' అన్నాడు మహేంద్రనాథ్ ఒక జర్నలిస్టు 'మిత్రుడి'తో– పొరపాటున అతణ్ణి నమ్మి. ఇదో రసవత్తరమైన స్టోరీ అవుతుందనుకుని లొట్టలు వేసుకుంటూ ఆ జర్నలిస్టు మిత్రుడు మహేంద్రనాథ్ వ్యాఖ్యను బయటపెట్టేశాడు. ఇంకేముంది? చౌదరివర్గం దాన్ని రెండు చేతులతో అందిపుచ్చుకుంది. మహేంద్రనాధ్‌ను ఏ క్షణంలోనైనా పక్కకితప్పిస్తారన్న వదంతులతో పార్లమెంటు సెంట్రల్‌హాలు హోరెత్తిపోయింది.

కేంద్రనాయకత్వానికి రాష్ట్రాలలో శాశ్వతశత్రువులు కానీ, శాశ్వతమిత్రులు కానీ ఉండరు. దానికి ఉన్నదల్లా శాశ్వతపరికరమాల మూట. వారిలో ఏ యిద్దరూ ఒకలా ఉండరు. ఏ ఒక్కడూ మిగతా వారిలో ఒక్కడితోనూ ఎప్పుడూ ఏకీభవించడు. ఎవడికివాడు ఢిల్లీలో సొంతంగా లాబీలు నిర్మించుకునే ప్రయత్నంచేస్తూ అవతలివాణ్ణి 'ఢిల్లీ అనుగ్రహం తప్పిపోయింద'న్న కారణంతో పడదోయడానికి చూస్తాడు. ఒకరి అవినీతి, అక్రమాల గురించి ఒకరు కేంద్రానికి నివేదికలమీద నివేదికలు పంపుకుంటూనే ఉంటారు. వాటినిండా అతిశయోక్తులు, అభూతకల్పనలే ఉంటాయి. ప్రతిఒకడూ అవతలివాడిచర్యలపై 'జరగబోయే'సిబిఐ దర్యాప్తుగురించి ఊకదంపుడుగా మాట్లాడుతూనే ఉంటాడు. ప్రధానమంత్రిటేబుల్‌మీద ఉన్న ముఖ్యమంత్రుల జాతకాల్లోని వివరాలను వాళ్ళు పూసగుచ్చినట్టు చెప్ప గలరు. మొత్తంమీద అనుకూల, వ్యతిరేక లాబీలనే తేడా లేకుండా అన్నిలాబీలూ పార్టీకేంద్రనాయకత్వం సర్వశక్తిమంతమనీ, రాష్ట్రనాయకుడెవరైనా పక్కటడుగు వేస్తే అధికారచ్యుతి తప్పదనే విశ్వాసాన్ని పెంచిపోషిస్తూ ఉంటారు.

సీనియర్ శాసనసభ్యులు గతంలో ఇటువంటి నాటకాలెన్నో చూశారు. కొత్తగా శాసనసభలో అడుగుపెట్టినవారికిమాత్రం కుతంత్రాలతో, కుహకాలతో ఇదే తొలిఅనుభవం. రాష్ట్రమంతటినీ ఉక్కిరిబిక్కిరి చేస్తూ తారస్థాయిలో సాగిపోతున్న ఈ రాజకీయమహానాటకంలో ప్రజల ప్రయోజనాలు మచ్చుకైనా కనిపించకపోవడం గమనించి ఆనంద్ నిస్పృహచెందాడు.

అందరూ అందులో బందీఅయి పోయారు -కొందరు ప్రత్యక్షంగా, మరికొందరు పరోక్షంగా.

# 14

ఆనంద్ శాసనసభ్యుడయ్యాక పార్టీలోని ఆ ఇద్దరు దిగ్గజాల కుమ్ములాటకు రెండేళ్ళ పాటు దూరంగా ఉండిపోయాడు. తనను శాసనసభకు గెలిపించిన ప్రజలకు సేవచేయాలని నిశ్చయించుకున్నాడు. రోజుల తరబడి నియోజకవర్గంలోని మారుమూల గ్రామాల్లో పర్యటిస్తున్నాడు. బహుశా రాష్ట్రం మొత్తంలోనే అది బాగా వెనుకబడిన ప్రాంతం. అటువంటి క్లిష్టమైన ప్రాంతంలో సాంఘికపరివర్తన తీసుకురావాలని అతని పట్టుదల. తన ప్రజలకు మేలుచేయడానికి శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తున్నాడు. మిగిలినవాళ్ళ నడక వేరు. మొదటిసారి శాసనసభకు ఎన్నికైన వాళ్ళలో అరుణ, మరికొందరు మినహా మిగిలినవాళ్ళు మహేంద్రనాథ్, చౌదరి మధ్య జరుగుతున్న యుద్ధంలో చేరిపోయారు. త్వరలోనే తాను కూడా ఏదో ఒక పక్షంలో చేరవలసి ఉంటుందని ఆనంద్‌కి తెలుసు. వీలైనంతకాలం నిదానించి చూద్దాం అనుకున్నాడు. పార్టీలో అతని మిత్రులు ఎగతాళి చేయడం ప్రారంభించారు. ప్రజాసేవకుడు దిగివచ్చాడన్నారు. రాజకీయాల్లో ఎ బి సి డి లు కూడా తెలియవన్నారు. సెకండ్‌హాండ్ గాంధీ అన్నారు. పగటికలలు కంటున్నాడని కొందరంటే, 'పైకి కనిపిస్తున్నంత అమాయకుడేమీ కాదు. కుర్రనక్క. అవకాశాల తలుపులన్నీ తెరచిపెట్టుకుని అదనుకోసం చూస్తున్నాడు! తనలాంటి గోడమీది బొమ్మల్ని చాలామందినే చేరదీశాడు. సమయం కనిపెట్టి దెబ్బతీస్తాడు. అతణ్ణేమీ తక్కువగా అంచనా వేయకండి. ముఠాల ఆటలో అప్పుడప్పుడు అలాకూడా జరుగుతుంది. చిట్టచివర ఆటలోకి అడుగుపెట్టినవాడికి ఎక్కడలేని ప్రాధాన్యం వస్తుంది. చివరికి అతడే గోల్ కొట్టేస్తాడు' అన్నారు మరికొందరు. సహచరుల ఒత్తిడి తరచు నిస్పృహ కలిగిస్తున్నా ఆనంద్ తన నిర్ణయం మార్చుకోలేదు. ఈలోగా మహేంద్రనాథ్, పార్టీఅధిష్ఠానవర్గంపై తిరుగుబాటుకు సిద్ధమైనట్టు ఢిల్లీకి కుప్పలుతెప్పలుగా వార్తలు రావడం మొదలైంది. చౌదరి మనుషులు వాటిని వక్రీకరించడం, వాటికి చిలవలుపలవలు చేర్చడం ప్రారంభించారు. వెంటనే ఎవరూ దీనిని కనిపెట్టలేకపోయారు. ఇటీవలికాలంలో ఇంతటి రాజకీయద్రోహాన్ని ఎరగం అని వార్తలు ఉద్ఘాటించాయి. కేంద్రనాయకత్వానికి వ్యతిరేకంగా కుట్రచేయడానికి పలువురు ముఖ్యనాయకులు ఒక అజ్ఞాత ప్రదేశంలో సమావేశ మయ్యారనీ, మహేంద్రనాథ్ ఆ సమావేశానికి హాజరయ్యాడనీ, నిజానికి ఆ సమావేశాన్ని ఆయనే నిర్వహించాడనీ-ఇలా ప్రచారం జరిగిపోతోంది. ఇంతకుమించి చెప్పగలిగినవాళ్ళు ఎవరూ లేరు. ఆ కుట్ర ఏమిటో ఎవరికీ తెలియదు. కుట్ర జరిగిందని కూడా నిర్ద్వంద్వంగా

చెప్పగలిగినవాళ్ళులేరు. బహుశా అటువంటిదేమీ ఉండకపోవచ్చు కూడా. అయినాసరే విమర్శకులు తామే కళ్ళతో చూసినంత కచ్చితంగా కుట్రను వర్ణించడం మొదలుపెట్టారు. ఆ సమావేశంలో జరిగిన ప్రసంగాల్ని రహస్యంగా రికార్డుచేసిన టేప్‌ను సెంట్రల్‌ఇంటెలిజెన్స్ వాళ్ళు సంపాదించారన్నారు. అంతేకాదు, సమావేశం జరిగిన కొద్దిగంటల్లోనే ఆ టేప్ ప్రధానమంత్రికి చేరిపోయిందట. స్వయంగా తామే టేప్‌ను ఢిల్లీకి చేరవేసినంత నమ్మశక్యంగా సాగిపోతున్నాయి వాళ్ళ మాటలు.

ఎక్కడ, ఏ సమయంలో ఏం జరిగినా ఆ వివరాలు కొన్ని గంటల్లోనే ప్రధానమంత్రికి ఎలా తెలిసిపోతాయో రాజకీయవాదులకే అంతుబట్టని ఆశ్చర్యం. (ఇంకాస్త నాటకీయం చేయాలనుకుంటే గంటల్లో కాదు, నిముషాల్లోనే అనికూడా అనగలరు) రాష్ట్రంలో జరుగుతున్న పరిణామాల్ని ప్రధానమంత్రి ఓ కంట కనిపెట్టి చూస్తూనే ఉన్నారనీ, తోకఝాడించే ముఖ్యమంత్రుల్ని తొలగించడానికి తగిన సమయంకోసం చూస్తున్నారనీ చెప్పడం వాళ్ళ ఉద్దేశం. ధిక్కరించే సామంతులపై చక్రవర్తి ఉంచే నిఘాకి ఇది ఆధునికరూపం అన్నమాట.

మహేంద్రనాథ్ ఒక బహిరంగసభలో కేంద్రంపై విమర్శలు గుప్పించినట్టు మరో వార్త. పార్లమెంట్ సెంట్రల్‌హాల్‌లో ఆ ప్రసంగంపై విశ్లేషణ, పునర్విశ్లేషణ అదే పనిగా సాగిపోయాయి. ఎన్నెన్నో రాజకీయభూతద్దాలు ఆ ప్రసంగాన్ని అక్షరక్షరం, మళ్ళీ మళ్ళీ శోధించాయి. ప్రమాదకరమైన విద్రోహచింతనకు ఆ ప్రసంగం అద్దంపడుతోందనీ, భారతదేశ సమైక్యతా సమగ్రతలకే ముప్పు తెచ్చేలా ఉందనీ ఆ తర్వాత అందరూ ఏకగ్రీవంగా ప్రకటించేశారు. నిజానికి ఆ ప్రసంగపాఠాన్ని ఒక్కొక్క పత్రిక ఒక్కొక్క రకంగా అచ్చేసింది. మహేంద్రనాథ్ అదృష్టం వక్రించి ఆయనకు మరింత వ్యతిరేకంగా ఉన్న పారాన్నే సెంట్రల్‌హాల్ పండితులు ఎంచుకున్నారు. చౌదరి ఆశ్రితుల్లో ఒకడుగా ఉంటూ, ఆయన చలవతో ఫ్రెండ్స్‌కాలనీలోని తన నూతనగృహంలో రెండో అంతస్థు నిర్మించుకున్న ఓ స్పెషల్ కరస్పాండెంట్ ఆ ప్రసంగపాఠాన్ని పత్రిక కెక్కించిన విషయం కూడా వాళ్ళకు తెలియదు. మహేంద్రనాథ్ ఆగ్రహం అంతా కేంద్రనాయకత్వం చౌదరి పట్ల ప్రదర్శిస్తున్న అనుకూల ధోరణిపైనే కాని కేంద్రనాయకత్వంమీద కాదన్న సంగతిని కూడా నిపుణులు గుర్తించలేకపోయారు. మొత్తానికి మహేంద్రనాథ్‌పై కేంద్రవ్యతిరేకి అన్న ముద్ర గాఢంగా పడిపోయింది. ఇప్పట్లో ఆ ముద్ర చెరిగిపోయే అవకాశం లేదు.

ప్రధానమంత్రి ఆలోచన ఏమిటో ఎవరికీ తెలియదు. తెలుసునని అనుకున్నవాళ్ళు మహేంద్రనాథ్‌ని ప్రధాని తలనొప్పిగా, పెనుముప్పుగా పరిగణిస్తున్నట్టు నమ్మడం ప్రారంభించారు. అటువంటి ముళ్ళకంపతో సర్దుకుపోవడం ఎలా అన్నది వాళ్ళ ప్రశ్న. కేంద్రం తలచుకుంటే ముఖ్యమంత్రిని తొలగించడం చిటికెలో పని అనీ, కేంద్రనాయకత్వం అధికారపరిధికి మించినదేదీ లేదనీ అందరూ అనుకుంటారు. కానీ ఒక ముఖ్యమంత్రిని తప్పించడం అంత తేలికేమీ కాదు. కేంద్రనాయకత్వం కొంతకాలంపాటు నిస్సహాయస్థితిలో ఉండిపోయింది. ఒక ముఖ్యమంత్రిపై ప్రత్యక్షంగా తిరుగుబాటును ప్రోత్సహించడం కేంద్రానికి అనౌచిత్య ఆరోపణ (తలవంపులు) తెచ్చిపెట్టే వ్యవహారం. ఆ ముఖ్యమంత్రి సొంతపార్టీ మనిషైతే అది నైతికంగా పార్టీనే కుంగదీస్తుంది. మరోపార్టీవాడైతే ఆత్మరక్షణకోసం ముందుగానే అరిచిగీపెట్టి హడావుడిచేస్తాడు. అదీ

గాక సెంట్రల్‌హాల్‌లో నోరూవాయీ ఉన్న కొంతమంది ఎం.పి.ల మద్దతు మహేంద్ర నాథ్‌కూ ఉంది. చౌదరిని ద్వేషించడానికి వాళ్ళ కారణాలు వాళ్ళకున్నాయి. కొన్నిరోజులు గడిచిన తర్వాత మహేంద్రనాథ్ తోక కత్తిరించడానికి అధిష్ఠానవర్గం కొత్త ఉపాయాల్ని కనిపెట్టినట్టు కనిపించింది. మహేంద్రనాథ్‌కి ఇచ్చే ప్రాముఖ్యంలో ఇంతకుముందు లేని వింతవింత మార్పులు చోటుచేసుకున్నాయి. పైకి ఆయన తలనీ, గుండెనీ పొగుడుతున్నట్టు కనిపించారు. మనసులో పొగడదలిచింది ఆయన కండపుష్టిని రాజకీయనిశిత పరిశీలకులకు సైతం ఈ ధోరణి అర్థం కాక అయోమయంలో పడిపోయారు.

ఇది ఢిల్లీతరహా రాజకీయం కాబోలని అందరూ అనుకున్నారు.

అప్పుడే చౌదరి ఢిల్లీలో అడుగుపెట్టాడు. ప్రణాళికా సంఘంతో ఏవో చర్చలు జరపడానికి వచ్చాడన్నారు. పగలు ప్రణాళికాచర్చలు, రాత్రిళ్ళు రాజకీయకుట్రలు! విందులు, చర్చలు, మంతనాలు, కుహకాలు. అవతలివాళ్ళు ఎంతగా రెచ్చగొడుతున్నా మహేంద్రనాథ్ మంత్రి వర్గంనుంచి తప్పుకోడానికి చౌదరి తిరస్కరించాడు. లోపలఉండే అతణ్ణి నాశనం చేయడం చౌదరి వ్యూహం. నిత్యం అవమానాలవిషాన్ని తియ్యనిపానీయంలా సేవిస్తున్నాడు. గుండెల్లో బడబాగ్ని. కానీ ముఖంలో ఆ ఛాయలు కనిపించవు. ఢిల్లీలో పథకాలూ, కుట్రలూ సాగించిన ఆ మూడురోజులూ మహేంద్రనాథ్‌ని ఆకాశానికి ఎత్తుతూ ప్రకటనలు చేశాడు. 'నా ముఖ్య మంత్రి, నా నాయకుడు' అంటూ ఆయనతో తాను రాజీపడిపోయిన అభిప్రాయం కలిగించబోయాడు. మరింత గంద్రగోళం సృష్టించడం ఈ ప్రకటనల వెనుక ఉద్దేశం. అది నెరవేరింది. అందులో నిజం లేదని అందరికీ తెలుసు. అయినా అలా ప్రకటించడం తప్పని ఎవరూ అనలేరు సర్వజ్ఞపీఠంలాంటి పార్లమెంటు సెంట్రల్‌హాల్‌లో ఉండే కొమ్ములుతిరిగిన ఊహాగానపండితులతో సహా అందరినీ ఆ ప్రకటనలు తికమకపెట్టాయి. చౌదరి కొండంత తృప్తితో రాష్ట్రరాజధానికి తిరిగి వచ్చాడు.

కొన్నిరోజులపాటు ఏమీ జరగలేదు. అధిష్ఠానవర్గం మహేంద్రనాథ్‌ని ఇంద్రుడు చంద్రుడు అంటూనే ఉంది. వేరే రాష్ట్రాల్లో జరిగే కార్యక్రమాలకు కూడా ఆయనను ఆహ్వానిస్తున్నారు. వెళ్ళిన ప్రతిచోట ఆయనను 'జాతీయ'ప్రాముఖ్యం ఉన్న నాయకుడుగా చిత్రిస్తున్నారు. ఆయన అహంకారంమీద ఆ పొగడ్తలు స్వాతిజల్లుల్లా పనిచేసి తిరగబడే ఆలోచననుంచి పక్కకి మళ్ళించాయి.

గ్రామీణులకు అలవడే సహజ వివేకం వల్ల మహేంద్రనాథ్ పొగడ్తల రాయుళ్ళంటే జాగ్రత్తగా ఉండేవాడు. మొహంమీదనే నేరుగా స్తోత్ర పాఠాలు చేసే వందిమాగధులు ఆయన చీవాట్లకు భయపడి దూర దూరంగా ఉండేవారు.

ఐనా దేశంలోని ఇతరప్రాంతాల్లో కూడా తనకు బ్రహ్మరథంపట్టేసరికి ఆ సహజ వివేకం అంతరించి, తెలివిలో తనను మించగలిగినవాళ్ళు ఎవరూలేరన్న నమ్మకం ఆయనలో శ్రుతిమించింది. తాను అనుక్షణం పైపైకి ఎదిగిపోతున్నట్టు ఊహించుకున్నాడు. స్తోత్రపాఠకుల విషయంలో ఇంతకుముందున్న జాగ్రత్త ఇప్పుడులేదు. ప్రశంసాదాహం ఆయనను పీడించడం ప్రారంభించింది. ఆయనలో వచ్చిన ఈ మార్పు సన్నిహితులకు వెంటనే అర్థం కాలేదు కాబట్టి

పొగడ్తలతో ఆయనను ఉబ్బేసే ప్రయత్నం ఎవరూ చేయలేదు దాంతో ఆయన మండిపడి ఎవరినిపడితేవారిని పదిమందిలో నిలబెట్టి తూలనాడడం ప్రారంభించాడు. ఆయన ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తాడో తెలియని కళాకళల మనిషని అందరికీ తెలిసినా ఈమధ్య ఆయన ప్రదర్శిస్తున్న అసహనం చూసి శ్రేయోభిలాషులు కూడా విస్తుపోతున్నారు. ఆయనకేమైందో ఎవరికీ అంతు బట్టడంలేదు.

చదువుసంధ్యలరీత్యా చెప్పుకోవాలంటే మహేంద్రనాథ్ ఏ మాత్రం విద్యావంతుడు కాడు. మేధావి అనదగినవాడూ కాడు ప్రత్యర్థులకున్న లౌక్యం ఆయనకు లేదు ఇటీవల శుష్కప్రియాలకు పూర్తిగా మోసపొయాడు. (తన నైజానికి విరుద్ధంగా) తనపై కురిపించే పొగడ్తల్లో ప్రతి మాటనీ ఆయన నమ్మడం ప్రారంభించాడు. తాను ఇంత గొప్ప సుగుణాభిరాముడన్న సంగతి ఇంతవరకు తనకే తెలియనందుకు ఆశ్చర్యపోతున్నాడు. తన అతివినయమే ఇందుకు కారణమని ఒక్కొక్కసారి అతనికనిపించేది. కానీ ఆ అభిప్రాయం ఆయనకు అంతగా తృప్తి కలిగించేదికాదు. అహంకారంతో కళ్ళకు పొరలు కమ్మినప్పుడు ఆయన ఊహ మరోవిధంగా ఉండేది. తన ప్రజ్ఞాపాటవాల్ని ప్రతి ఒక్కరూ బుద్ధిపూర్వకంగా తగ్గించి చూపించారనే నిర్ణయానికి వచ్చేవాడు. ఇంతకంటె కుతర్కం ఉండదు. అయినా ఆయన దేనినీ సహేతుకంగా సరళంగా పరిశీలించి అర్థం చేసుకునే స్థితిలో లేడు. తాను అనుకున్నదే నిజం, నిజమై తీరాలి, అంతకుమించి మరో నిజం ఉండడానికి వీల్లేదు. ఇక ఇందులో వాదోపవాదాలు ఉండవు. అందరిలోనూ అన్నింటిలోనూ తానే అధికుణ్ణని విర్రవీగే ఓ పిచ్చిరాజు కథలాగే తయారైంది ఆయన వాలకం.

అధికారంలోఉన్న రాజకీయ నాయకులను వేలాది ప్రజల కళ్ళు కనిపెట్టి చూస్తూఉంటాయి. ఆ కళ్ళకు వాళ్ళ గోరంత లోపాలు కూడా కొండంత ప్రమాణంలో కనిపిస్తాయి. అందులో దయాదాక్షిణ్యాలు లేవు. మేధావి అన్న ఎరువు తెచ్చుకున్న పాత్రలో మహేంద్రనాథ్ రాష్ట్రం లోనూ అప్పుడప్పుడు వేరే రాష్ట్రాల్లోనూ పర్యటిస్తున్నప్పుడు ఆయనలో ఓ విదూషకుణ్ణి చూసి జనం నవ్వుకునేవారు. వాస్తవంగా మహేంద్రనాథ్ బొత్తిగా బఫూన్ అనదగినంత హాస్యాస్పదుడు కాడు. కానీ ఆయన గురించి అంతా అలాగే అనుకుంటున్నారు, ముఖ్యంగా ఆయన జన్మదినోత్సవాల రసాభాస తరువాత.

మహేంద్రనాథ్‌కి తన అసలు జన్మదినం తెలీదు. తల్లి ఏనాడూ స్పష్టంగా చెప్పలేదు. మహేంద్రనాథ్ పసితనంలోనే తండ్రి ఓ స్థానిక దొమ్మీలో మరణించాడు. పుట్టిన తేదీ చిన్నాన్న ఉజ్జాయింపుగా నిర్ణయించి స్కూల్‌లో వేశాడు. ఫలానారోజు తన జన్మదినం అని మహేంద్రనాథ్ కూడా ఎప్పుడూ ఎవరికీ చెప్పుకోలేదు.

ఆయన ముఖ్యమంత్రి అయ్యాక కొందరు వందిమాగధులు ఆయన జన్మదినోత్సవనిర్వహణ గురించి మాట్లాడడం ప్రారంభించారు. అధికారంలో ఉన్నాడు కనుక ఆయనకొక కచ్చితంగా జన్మదినం ఉండవలసిందేనని వారి సూత్రీకరణ. దానిని ఎంతో సుదీర్ఘంగా ఆలోచించి నిశ్చయించారు. ఆ తేదీ కూడా బహిరంగఉత్సవానికి అనుకూలంగా ఉండాలని తీర్మానించారు. అప్పుడు మరీ ఎండలూ ఉండకూడదు, మరీ చలీ ఉండకూడదు శాసనసభ సమావేశాలు జరుగుతూ ఉండాలి. శాసనసభ్యులు అందరూ రాజధానిలోనే ఉంటారు కనుక వాళ్ళకు వేరుగా టి.ఎ., డి.ఎ.లు

ఇవ్వవలసిన అవసరం ఉండదు. మరీ ముఖ్యంగా పుట్టినతేదీని నిర్ణయించడంలో జోతిశ్శాస్త్రకోణాలను విస్మరించకూడదు. గ్రహాలన్నీ కలిసి స్వయంగా ఎన్నుకున్నా ఇంతకన్నా ఉత్కృష్ట దినం దొరక్కుండా ఉండాలి!

పథకం అమలు మొదలైంది. మహేంద్రనాథ్ ఇన్నేళ్ళలోనూ ఎప్పుడూ తన జన్మదినోత్సవం గురించి ఆలోచించనేలేదంటూ మొదట పత్రికలు విస్తృతప్రచారం ప్రారంభించాయి. తన పుట్టినరోజు ఎప్పుడో నిర్ధారణ చేసుకోవాలని కూడా ఆయన ఎప్పుడూ అనుకోలేదట, అది శుక్లపక్షమో, కృష్ణపక్షమో కూడా తల్లి స్పష్టంగా చెప్పలేకపోయిందట, ఓ బంధువు ఉజ్జాయింపుగా తేదీని నిర్ణయించి స్కూలు రిజిష్టరులో వేయించాడట. అదే మహేంద్రనాథ్ పుట్టినతేదీ అయిందట... పత్రికల కథనాలు ఇలా సాగిపోయాయి. మహేంద్రనాథ్ వినయగుణానికి దీనిని మరో నిదర్శనంగా చూపించి కొన్నిరోజులపాటు ఆయనను పొగడ్తలతో ముంచెత్తారు. ఇంతలో ఓ రోజు ఉదయమే పత్రికలలో బాక్సుకట్టిన వార్త ఒకటి దర్శనమిచ్చింది. మహేంద్రనాథ్ 'అసలు' పుట్టినతేదీ ఇప్పుడే 'యాదృచ్ఛికంగా' వెలుగుచూసినట్టు ఆ వార్త సారాంశం. స్వగ్రామంలో శిథిలమైన ఆయన ఇంట్లో తండ్రి అటకమీదదాచిన, చెదలుపట్టిన కాగితాలకట్టలో ఆ తేదీ రాసి ఉందట.

ఊహించినట్టే ఈ వార్త సంచలనం సృష్టించింది. మహేంద్రనాథ్ అనుచర బృందాలు అద్భుతం, అమోఘం అన్నారు. విలేఖరులు మహేంద్రనాథ్‌పై కొన్ని అర్థరహితమైన ప్రశ్నలు గుప్పించారు. ఆయన ఇదేమంత గొప్పవిషయం కానట్టు కొట్టిపారేశాడు. ఆయన వినయ గుణానికి అది మరో సాక్ష్యం. తక్షణమే సిద్ధాంతులు -నిజానికి సిద్ధాంతుల 'బృందం' –రంగప్రవేశం చేసేశారు. నక్షత్ర, గ్రహసంచారాన్ని పరిశీలించి లెక్కలు వేసి తేల్చిన 'సత్యా'న్ని వారు బయట పెట్టారు. ఎంతో విస్తృతప్రచారం ఉన్న ఒక ఆంగ్ల దినపత్రిక, దాని ప్రాంతీయభాషాపత్రిక తమ సంపాదకీయపుటల్లో వ్యాసపరంపర రూపంలో ఎంతో ఉత్కంఠను రేపుతూ ఆ 'సత్యాన్ని' ఖండఖండాలుగా బయటపెట్టాయి. పాఠకులు ఓ పక్క ఆ వ్యాసాలను ఎగబడి చదువుతూంటే, అంతవరకూ తమకు జ్యోతిష్యంమీద నమ్మకంలేదని ప్రకటించుకున్న రాజకీయనాయకులు, రాజకీయవిద్వాంసులు ఆ వ్యాసాలను ఒకటికి రెండుసార్లు రహస్యంగా, అత్యంత శ్రద్ధగా చదువుకోవడం ప్రారంభించారు... ఓహ్, జననకాలం ఎంత బాగా కుదిరింది, జన్మదినం ఎంత ఆశ్చర్యం గొలుపుతోంది అనుకున్నారు అందరూ... ఎక్కడా చిన్నపాటి మచ్చకూడా లేదు. ఈ 'జాతకుడు' హిమాలయాల స్థాయికి ఎదిగి తీరవలసిందే నన్నాడు ఓ అభిమాని. లేదు లేదు, ఈ జాతకుడికి ఆకాశమే హద్దు అంటూ మరో అభిమాని సవరణ. అందులోనూ ఆ 'జాతకుడు' ఎంతో ప్రజాదరణ ఉన్న ముఖ్యమంత్రి, ఘనత వహించిన తమ నాయకరత్నం కనక మరోలా కావటానికి వీల్లేదు. నక్షత్రాల్ని తప్పుపట్టడం ఎవరితరం? ఆ జననకాలం, ఆ తేదీ ఎంతో అదృష్టానికి నోచుకున్నాయి... ఇన్నాళ్ళకు జ్యోతిశ్శాస్త్రం విశ్వసనీయతను రుజువుచేసే తిరుగులేని సాక్ష్యం దొరికిందనుకున్నారు. శాస్త్రానికే వన్నె తెచ్చిన మహా మనీషి అని మహేంద్రనాథ్ ప్రసిద్ధి నలువైపులా వ్యాపించింది.

కొందరు నిత్యశంకితులు ఇదంతా కల్పన అంటూ చెవులు కొరుక్కున్నారు. చౌదరి అనుయాయులు మాత్రం నీరు గారిపోయారు. కళ్ళూ చెవులు ఉన్న మానవమాత్రుడేవరైనా

నక్షత్రాల శాసనాన్ని ధిక్కరించటమెలా సాధ్యం? వాళ్ళు కూడా తమ సిద్ధాంతులతో సంప్రతించి ఓ పోటీ సిద్ధాంతుల బృందాన్ని ఏర్పాటుచేసి మహేంద్రనాథ్ జాతక చక్రంలోని గ్రహకూటమిలో ఏమైనా లోపాలు ఉన్నాయేమో వెతకమని ఆదేశించారు. కానీ దురదృష్టం... ఒక్క లోపమూ కనిపించలేదు. ఆయన జాతకచక్రం అంత కట్టుదిట్టంగా అమరింది.

తన కళ్ళముందు జరుగుతున్న నాటకాన్ని చౌదరి మౌనంగా చూస్తూ ఉండిపోయాడు. ఈ సరికొత్త జన్మకథ వెనుక ఏదో పన్నాగం ఉన్నట్టు ఆయన పసిగట్టాడు తెరవెనక నిపుణులు ఎంతో చాకచక్యంగా కల్పించి ఉండకపోతే మహేంద్రనాథ్ జాతక చక్రం అంత పకడ్బందీగా ఉండే అవకాశమేలేదని ఆయన ఊహించాడు. శిక్షణ పొందిన తప్పుడుసాక్షి ఇచ్చే తిరుగులేని సాక్ష్యంలాంటిదే ఇది కూడా. తన మార్గంలో తాను కూపీ తీశాడు. ఆ జాతకచక్రం నిజంగానే కల్పితమని తేలిపోయింది. మహేంద్రనాథ్ జ్యోతిషబృందంలో ఉన్న ఓ సిద్ధాంతికి డబ్బు ఆశచూపించి చౌదరి తనవైపు తిప్పుకున్నాడు. అతడు జరిగిన కుట్ర బయటపెట్టాడు. ఈ సంగతి తెలిసిన చౌదరి మనుషులు ఒకరిద్దరు ఈ కుట్రను వెల్లడించితీరాలన్నారు. చౌదరి ఒప్పుకోలేదు. వారు ఆయనవైపు ప్రశ్నార్థకంగా చూశారు. మీరు ఇప్పుడేమన్నా ఈ ఘట్టంలో ఎవరూ నమ్మరు' అన్నాడు చౌదరి. మరి ఏంచేయాలని అడిగారు వాళ్ళు. 'చేయడానికి ఏమీ లేదు... గ్రహాలను వాటిదారిలో వాటిని పోనివ్వండి... మహేంద్రనాథ్ అహం గాలిబుడగలా అలా పెరగనివ్వండి. ఏం జరుగుతుందో నిదానించి చూడండి...' అన్నాడు.

'ఏం జరుగుతుందో కాదు, చౌదరి ఏం జరిగించబోతున్నారో చూడాలి' అన్నాడు ఓ అనుచరుడు.

'మీ ఇష్టం. మీరు ఎలా అయినా అనుకోండి' అన్నాడు చౌదరి గుంభనం నటిస్తూ. నర్మగర్భితమైన తన వ్యాఖ్య అనుచరవర్గంలో ధైర్యం కలిగిస్తుందని ఆయనకు తెలుసు.

దేశం ఇతరప్రాంతాల్లో ఈమధ్య జరిగిన పర్యటనలవల్ల, జాతీయనాయకుడుగా తనకు జరిగిన ప్రచారంవల్ల మహేంద్రనాథ్ పోకడలో ఈమధ్య కాస్త మృదుత్వం ప్రవేశించింది. రెండు మాసాల్లో రాబోతున్న తన జన్మదినోత్సవాన్ని తనస్థాయికి 'తగినట్టు' నిర్వహించాలన్న ప్రతిపాదనను (మొదట్లో త్రోసిపుచ్చినా) మొదటిసారి ఆయన అంగీకరించాడు. 'తగినట్టు' అంటే ఏమిటో నిర్ణయించవలసింది ఆయన విధేయులు. ఉత్సవనిర్వహణ తమ ఊహాశక్తికే పెద్దసవాలుగా వాళ్ళల్లో కొందరు భావించారు. మహేంద్రనాథ్ విధేయగణంలోకి వాళ్ళు కొత్తగా వచ్చి చేరినవాళ్ళు కనుక ఏమాత్రం తక్కువ జరగడానికి వీల్లేదనుకున్నారు. చౌదరి నమ్మకద్రోహానికిపాల్పడి దూరంకావడంవల్ల ఏర్పడిన ఖాళీని భర్తీ చేయవలసింది వాళ్ళే. తమ విధేయత ప్రదర్శించుకోడానికి ఇది మంచి అవకాశం కొత్తగా విధేయతా మతం స్వీకరించిన వాళ్ళు కనుక వాళ్ళ ఉత్సాహానికి పట్టపగ్గాల్లేవు. చౌదరి ఫిరాయింపువల్ల మహేంద్రనాథ్ రాజకీయ ప్రాభవం కానీ, బలం కానీ కొంచెమైనా తగ్గలేదని రుజువు చేయాలనుకున్నారు. జన్మదినోత్సవ నిర్వహణవల్ల వచ్చిపడగల రాజకీయప్రయోజనాల గురించి వాళ్ళు ఆయనకు పూసగుచ్చినట్టు వివరించారు. అది కనీవినీ ఎరుగని ప్రదర్శన కాబోతోంది... దేశం నలువైపులనుంచి నాయకులు వచ్చి ఆ ఉత్సవంలో పాల్గొనబోతున్నారు... మహేంద్రనాథ్ ప్రతిష్ఠ ఆకాశ ప్రమాణానికి ఎదిగిపోతుంది... అంత అంగరంగవైభవంగా జరిగిన ఆ ఉత్సవం తర్వాత మహేంద్రనాథ్‌ని ఇక తేరిపార చూడడానికి

కూడా ఎవరూ సాహసించలేరు... ఆ తర్వాత... ఆయన ముఖ్యమంత్రి పదవినుంచి ఎదిగి... ప్రధాన...అదెంత? తలచుకుంటే అదీ సాధ్యమే...అన్నారు ముసిముసినవ్వులు ఒలకబోస్తూ. మహేంద్రనాథ్ పెద్దగా ఉత్సుకతను ప్రదర్శించలేదు. మొదట్లో ఆ ప్రతిపాదనను కొట్టిపారేశాడు కూడా. కానీ వందిమాగధులు పట్టుబట్టారు. కావాలనే తమ పథకాన్ని గుంభనంగా ఉంచారు. మహేంద్రనాథ్ దృష్టిని తమవైపు తిప్పుకోవడం, ఆయన అంగీకారాన్ని ఎలాగైనా సాధించడం వాళ్ళ ఉద్దేశం.

ఘర్షణముదిరి మహేంద్రనాథ్, చౌదరి ఒకరికొకరు పూర్తిగా దూరమయ్యేరోజు దగ్గరపడినకొద్దీ శాసనసభ్యుల విధేయతలు తారుమారు కావడం ప్రారంభించాయి. కొన్నేళ్ళపాటు పాలు, నీళ్ళలా కలిసిపోయి ఉన్నవాళ్ళు హఠాత్తుగా ఒకరికొకరు ప్రత్యర్థులుగా మారిపోయారు. అంతవరకూ ఒకరితో ఒకరు మాట్లాడుకోనివాళ్ళుకూడా నమ్మశక్యంకాని ప్రేమాభిమానాలు ఒలక బోసుకుంటున్నారు. గోడమీద తిష్ఠవేసిన వాళ్ళను కొన్నిరోజులపాటు అత్యద్భుతమైన అవకాశాలు ఊరించాయి. వైరిశిబిరాలురెండూ వాళ్ళని రకరకాల ప్రలోభాలతోఆకర్షించుకునే ప్రయత్నాలు ముమ్మరం చేశాయి. కాని చివరకు రాష్ట్ర రాజకీయాలను రెండు ధ్రువాలుగా చీల్చే ఆ ప్రయత్నాలనూ, ఆ ఒత్తిడినీ ఆపడం ఎవరితరమూ కానట్టు కనిపించింది. అంతవరకూ ఊగిసలాడుతున్నవారు కూడా ఏదో ఒక శిబిరంలో చేరడం అనివార్యమనిపిస్తోంది. ఎవరికివారు ఏ శిబిరంలో చేరితే తమ పంటపండుతుందో బేరీజు వేసుకోవడంలో తలమునకలౌతున్నారు. ఈ అంచనాల్లో ఎటువంటి విలువలకూ, సూత్రాలకూ చోటు లేదు. ఏదీ అసాధ్యమనిపించడంలేదు. అంతవరకూ ఊహకు సైతం అందని అనుబంధాలు, పొత్తులు ఇప్పుడు నిశ్చలసత్యాలుగా మారిపోతున్నాయి. ఎదురుగా మిరుమిట్లు గొలుపుతున్న రాజకీయ ప్రత్యామ్నాయాల మాయా ప్రపంచపు ఘనాకర్షణ.

చౌదరి ఇంకా మహేంద్రనాథ్మంత్రి వర్గంలో కొనసాగుతూనే ఉన్నాడు. ఆ విషయం దృష్టిలోఉంచుకుని చౌదరి అనుయాయులు ఆచితూచి అడుగువేస్తున్నారు. మొదట్లో ఇరువురిమధ్య సంధికుదర్చడానికి వారు ప్రయత్నించారు. అందులో సదుద్దేశం ఏమీలేదు. ఇద్దరూ ముళ్ళ పొదలే, ప్రమాదకర వ్యక్తులే కనుక ఇద్దరిలో ఏ ఒకరినో ఎంచుకునే క్లిష్టసమస్యనుంచి తప్పించుకోవడం వాళ్ళ ఉద్దేశం. కానీ ఇప్పుడు చేయగలిగింది లేదని వాళ్ళకి అర్థమైంది. రాజీకి ఏమాత్రం **అవకాశం** ఇవ్వనిస్థాయికి వాళ్ళమధ్య కలతలు ముదిరిపోయాయి. ఒకపట్టాన ఎవరికీ బోధపడని బ్రహ్మపదార్థంలాంటి 'కేంద్ర'రాజకీయం కూడా అటువంటి అభిప్రాయాన్నే కలిగిస్తోంది. ముఖ్యమంత్రి పదవి అవిభాజ్యం, మరొకరితో పంచుకోలేనిదన్న వాస్తవాన్ని వాళ్ళూ గుర్తించారు. మహేంద్రనాథ్ లేదా చౌదరి! రాజీకి అవకాశమే లేదు.

పత్రికలు పూనకం పట్టినట్టు సంచలనకథనాలమీద పడ్డాయి. రాజకీయమేధావులు పరంపరగా వ్యాసాలు విశ్లేషణలు గుప్పిస్తున్నారు. కార్టూనిస్టులకు రాత్రింబవళ్ళు చేతినిండాపని. 'క్షుద్ర'మైన పత్రికలుగా అందరూ భావించే పత్రికలతోసహా అన్ని పత్రికల అమ్మకాలు తారస్థాయికి పెరిగిపోయాయి. రాజధాని శివమెత్తినట్టు ఊగిపోతోంది. నిజానికి సామాన్య ప్రజానీకానికి ఇవేవీ అవసరంలేదు. అయినాసరే ఇది తప్ప వాళ్ళ శ్రేయస్సు మరి దేనిలోనూ లేదన్న అందమైన భ్రాంతిని ఎంతో చాకచక్యంగా కలిగించగలిగారు.

పత్రికల్లో కూడా చీలికలు ఉన్నాయి. నిజానికి తమతమ స్వార్థాలననుసరించి అవి తామే చీలికలుగా రూపొందాయి. ఒక ఆంగ్లదిన పత్రిక మహేంద్రనాథ్ వెనక పెట్టని కోటలా నిలబడితే, అదే పత్రికకు చెందిన ప్రాంతీయభాషాపత్రిక చౌదరిని భుజానవేసుకుంది. నిరాశాగ్రస్తులందరూ మహేంద్రనాథ్ శిబిరంలో ఉండిపోతే, ఆశావాదులందరూ చౌదరిని వరించారని -భయ సంకోచాలు పూర్తిగా త్యజించివేసిన ఓ కాలమిస్టు అభివర్ణన. నిజానికి గీతగీసినట్టు అలా ఏమీ జరగలేదు. అయినాసరే ఆ సూత్రీకరణ నమ్మి తీరవలసిన శిలాక్షరంగా చలామణి అయిపోయింది. రెండు శిబిరాలముందు బారులుతీరిన జనసందోహం కూడా కొంతవరకూ ఆ అభిప్రాయం కలిగించారు. తక్షణ ఆశలేవో పెట్టుకున్న వాళ్ళు మహేంద్రనాథ్ చుట్టూ తిరుగుతున్నారు. వచ్చే ఎన్నికల్లో పోటీచేస్తామనికానీ, చేసినా గెలుస్తామనికానీ ఆశలేని వాళ్ళు వాళ్లంతా. వాళ్ళ దృష్టిలో మంత్రిపదవి ఇప్పుడు వస్తే వచ్చినట్టు, తప్పితే మరింక ఎప్పుడూ రాదు. ఏదో ఒక 'కుంభకోణం'లో ఇరుక్కున్న మంత్రులు కొందరున్నారు. ఆత్మరక్షణకోసం వాళ్ళు మహేంద్రనాథ్‌తో అంటకాగక తప్పదు. ఆ పైన ముఖ్యమంత్రి తక్షణమే తమ కేసులపై నిర్ణయం తీసుకోకపోతే నిండా మునిగిపోయే కాంట్రాక్టర్లు కొందరున్నారు. ఇక నేడోరేపో ఉద్యోగ విరమణ చేయబోయే అధికారులు ఉన్నారు. ముఖ్యమంత్రి తమప్రార్థన ఆలకించి ఉద్యోగకాలాన్ని పొడిగించడమో తిరిగి నియమించడమో చేస్తారని వాళ్ళు కొండంత ఆశపెట్టుకున్నారు. ఇంకాఅపైన, ముఖ్యమంత్రి పదవిలో ఎవరున్నా ఆయన కనుసన్నలలో ఉంటూ అదనుచూసుకుని చేయిచాచే భృత్యగణం ఎలాగూ ఉంటారు. వీళ్ళుకాకుండా కులాభిమానంతోనో, పొందిన ఉపకారాలకు కృతజ్ఞతతోనో మహేంద్రనాథ్‌ని నమ్మిన బంటులా సేవించుకుంటున్నవాళ్ళు మరికొందరు. ఇక చివరి కోవగా – ఎన్నిలోపాలు, కటువుతనాలు ఉన్నప్పటికీ ముఖ్యమంత్రి పదవికి చౌదరికంటె మహేంద్రనాథ్ ఎక్కువ అర్హుడని మనస్ఫూర్తిగా విశ్వసించే వాళ్ళూ ఉన్నారు. స్వభావరీత్యా మహేంద్రనాథ్ నిజాయితీపరుడనీ చౌదరి కాడనీ వాళ్ళ నమ్మకం.

మరోవైపు మొదటిసారి శాసనసభకు ఎన్నికైన యువశాసనసభ్యులున్నారు. తామిప్పుడే మంత్రిపదవుల్ని ఆశించడం దండగని వాళ్ళకు తెలుసు. ముఖ్యమంత్రి మారితే తదుపరి తమ భవిష్యత్తు బాగుంటుందని వాళ్ళ ఆలోచన. మహేంద్రనాథ్ కుక్కలకంటే హీనంగా చూస్తూ అవకాశం దొరికినప్పుడల్లా రకరకాల అవమానాలపాలుచేసిన మంత్రులూ కొందరు ఉన్నారు. రెండేళ్ళకో మూడేళ్ళకో ఉద్యోగ విరమణ చేయబోయేవారు పొడిగింపుకోసం, పునర్నియామకం కోసం కొత్తగా ఉదయిస్తున్న చౌదరిని నమ్ముకుంటే మంచిదని భావించి ఆయన అడుగులకు మడుగులొత్తడం ప్రారంభించారు. పార్టీ అధిష్ఠానవర్గంవద్ద చౌదరికి ఉన్న పలుకుబడి గురించితెలిసిన కొందరు ఎం.పీ.లు కేంద్రంలో తమకు అవకాశాలు లభించాలంటే చౌదరిని మంచిచేసుకోవడం ఉత్తమం అనుకున్నారు. వాళ్ళంతా ఆయన గడపముందు బారులుతీరారు. ఇక్కడ కూడా అవకాశవాదులకు క్షణం తీరికలేదు. వాళ్ళ ఉత్సాహం అంతా ఇంతాకాదు. ఇక్కడ కూడా చివరి కోవ ఒకటుంది. చౌదరి కుట్రదారు, అవినీతిపరుడే కావచ్చు, కాని పట్టువిడుపులు ఉన్నవాడు, మాట వినేరకం, ప్రజల సమస్యలపై అవగాహన ఉన్నవాడు, కనుక ముఖ్యమంత్రి పదవికి ఆయనే అర్హుడని ఈ కోవకు చెందిన పలువురు శాసన సభ్యులు నిజంగానే నమ్ముతున్నారు.

నడుస్తున్న ఈ మహానాటకంలో రాజకీయాలతో ప్రత్యక్షసంబంధంలే సంస్థలు, ప్రెస్ జాగిలాలు, జులాయిలుగా తిరిగే వందలాది నిరుద్యోగులు చేస్తున్న హడావుడి అంతా ఇంతాకాదు. ఈ ఆభాస నాటకం పతాకస్థాయికి చేరుకోవడమే వారు ఆశించేది. గొప్ప అయాచిత వినోదం. ఏమీ జరగకపోవడం, ముఖ్యంగా తమను ఆనందపారవశ్యంలో ముంచెత్తే సంచలనాత్మక పరిణామాలు ఏవీ జరగకపోవడం – వాళ్ళకి చెడ్డచికాకు పుట్టిస్తోంది. వాళ్ళకి మార్పుకావాలి. ఆ మార్పు మంచికోసమా చెడుకోసమా అన్నది అనవసరం. మార్పుకోసం మార్పు. అంతే. మహేంద్రనాథ్ కానీ, చౌదరికానీ, లేదా ఇద్దరూకానీ ప్రయాణిస్తున్న విమానం కూలిపోయినా వాళ్ళకి సంతోషమే. పత్రికల్లో ఇద్దరికీ ఘనమైన నివాళులు... ఆ తర్వాత రోజులతరబడి వార సత్వ ఘర్షణపై ఉత్కంఠ భరితమైన ఊహాగానాలు...

మహేంద్రనాథ్‌కు మద్దతుగా, ఆయన పక్షంలో ఇప్పటికే ఉన్న మద్దతుదారులకు ప్రతిగా ఒక తృతీయగణం రంగప్రవేశం చేసింది. ఇందులో ప్రముఖుడు శేఖర్. అతడు యువకుడు, శక్తియుక్తులు ఉన్నవాడు, మరో మేకియవెల్లీ, ఆశాపరుడు, మృదుభాషి, అధర్మానికి జంకనివాడు, అలుపెరుగని కార్యదక్షుడు. చౌదరికి ప్రతిరూపం. ఇంతకుముందు ఆయనకు సన్నిహిత సహచరుడు. ఇద్దరూ ఒకే జిల్లావాళ్లు. చీలిక తర్వాత అదను చూసుకుని శేఖర్ ఎందుకు ఎలా మహేంద్రనాథ్‌వైపు ఫిరాయించాడన్నది రాజకీయవర్గాల్లో ఎడతెగని చర్చకు దారి తీసింది. అది స్వలాభంకోసం జరిగిన ఫిరాయింపేనని కొందరి సూత్రీ కరణ. చౌదరే కనుక అధికారంలోకి వస్తే పాపం శేఖర్ భవిష్యత్తేమిటన్నది వాళ్ల ప్రశ్న... చౌదరి నీడలో ఆయన పదవులు ఆశించవలసిందే. అధికార రాజకీయాల్లో నెంబర్‌వన్, నెంబర్ టూ ఎప్పుడూ వేర్వేరు శిబిరాల్లో ఉండవలసిందే. అది ఉల్లంఘించలేని నియమం. మహేంద్రనాథ్‌వైపు ఫిరాయించి శేఖర్, చౌదరికి సమవుజ్జీ అయ్యాడు. తెలివైన ముండాకొడుకు. ఇప్పుడు మహేంద్రనాథ్ పక్షంలో ఉన్న ఎంతోమంది సీనియర్‌విధేయులకంటె పదిలమైన స్థానంలో ఉన్నాడు. ఆయన త్వరలోనే ఉపముఖ్యమంత్రిఅవుతాడు చూడండి...అన్నారు.

మరో సిద్ధాంతం కూడా చలామణిలో ఉంది. దానికీ సమర్థకులున్నారు... గమనించారో లేదో, శేఖర్ ఆమధ్య జరిపిన ఢిల్లీ పర్యటనలన్నీ చౌదరి ఆదేశాల పాలనలోనే జరిగాయి... పసిగట్టారో లేదో, చౌదరి ఈమధ్య ఢిల్లీ వెళ్లివచ్చిన తర్వాతే శేఖర్ మహేంద్రనాథ్‌వైపు తిరిగి పోయాడు... తెలుసో తెలియదో, చౌదరి ఢిల్లీలో ఉండి కుట్ర సాగిస్తున్నప్పుడు శేఖర్ అక్కడే ఉన్నాడు... వీటన్నింటినీ గమనిస్తే మీకేమనిపిస్తోంది? ఇంకా మీకు అర్థంకాకపోతే విడమరిచి చెబుతా వినండి. ఈ శేఖర్‌గాణ్ణి చౌదరే మహేంద్రనాథ్ శిబిరంలోకి పంపించాడు. చూడండి ఏం జరుగుతుందో! ఎవరూ ఊహించలేనివిధంగా మహేంద్రనాథ్‌ని కూలదోస్తాడు. నయవంచకుడు. చాపకింద నీరు. మహేంద్రనాథ్ పాలిట ఇతడే ముసలం కాబోతున్నాడు. కావాలంటే నా చిట్టచివరి నయాపైస వరకు పందెం కాయడానికి సిద్ధం...

అంతవరకు మహేంద్రనాథ్‌కు అత్యంత విశ్వసనీయులుగా ఉంటూ శేఖర్ రాకతో ప్రాధాన్యం కోల్పోయిన వాళ్ల రుసరుసలు ఇలా ఉన్నాయి అయితే శేఖర్‌పై ద్రోహి అన్న ముద్రవేసే సాహసం ఎవరూ చేయలేకపోయారు. మహేంద్రనాథ్‌పట్ల శేఖర్ విధేయత ఒకరు వంకపెట్ట లేనట్టే ఉంది. మద్దతు సమీకరణలో అతడు ప్రదర్శిస్తున్న వ్యూహచాతుర్యాన్ని కూడా ఎవరూ

వేలెత్తి చూపించలేరు. రాజకీయక్రీడలో అతడికి సరితూగే వాళ్లు ఎవరూ లేరు. అంతవరకు మహేంద్రనాథ్‌కి దివిటీలుపట్టిన మామూలువిధేయులు ఈ సంక్షోభఘట్టంలో ఆయనకు పనికిరాని బరువుగా పరిణమించారు. ఎవరేమనుకున్నా శేఖర్‌మాత్రం నిర్విరామంగా శ్రమిస్తున్నాడు. శాసనసభ్యుల్ని బెదిరిస్తున్నాడు. వాగ్దానాలు గుప్పిస్తున్నాడు. ఊకదంపుడు ఉపన్యాసాలతో హోరెత్తిస్తున్నాడు. తర్కవితర్కాలు సాగిస్తున్నాడు. ఒక్కొక్కసారి కన్నీళ్లతో వేడుకుంటున్నాడు. ఒక్కొక్కసారి ఆగ్రహంతో మంటలు విరజిమ్ముతున్నాడు. చివరకు ఈ విన్యాసాలన్నీ సత్ఫలితాలనే ఇచ్చాయి. ముడుపులకు అభ్యంతరంలేనివాళ్లకు – అంటే నిజానికి దాదాపు అందరికీ – ముడుపులు ముట్టజెప్పాడు. పౌడర్లు, అత్తర్లలో మునిగితేలే భార్యారత్నాలకు మెండైన శయ్యాసుఖం అందించి వారి భర్తల్ని లొంగదీసుకున్నాడు.

ఎందరో రాజకీయవాదుల్ని సంప్రతించి మరీ శేఖర్ వ్యూహరచన చేశాడు. అయితే కీలకమైన ఆలోచన అతనిదే. చౌదరి మహేంద్రనాథ్‌ని విడిచి వెళ్లగానే మహేంద్రనాథ్ పరిస్థితి ప్రమాదంలో పడిన సంగతి అతడికి తెలుసు. చౌదరికి కొండంత అండగా నిలబడిన పత్రికలు మహేంద్రనాథ్‌ని చిన్నబుచ్చడానికి, దొరికిన ప్రతి అవకాశాన్ని వాడుకుంటున్నాయి. తిరుగులేని అధికార వైభవంతో వెలిగిపోతున్నప్పుడు మహేంద్రనాథ్ తమపై కురిపించిన అవమానాలకు పత్రికలు అలా ప్రతీకారం తీర్చుకుంటున్నాయి. పత్రికలు విసురుతున్న వ్యాఖ్యల ఛురికలు మహేంద్రనాథ్‌కి దుస్సహంగా తోచాయి. కోపంతో నిలువునా వణికిపోతున్నాడు. ఆయనలోని అసహనం, దురుసుతనం శత్రువుల జాబితాను ఇంకా ఇంకా పెంచివేస్తున్నాయి. చౌదరిపట్ల శత్రుత్వంతో ఆయన కళ్లు పూర్తిగా మూసుకుపోయాయి. చౌదరి ఫైళ్లపై రాసి పంపించిన ప్రతిపాదనలన్నింటినీ కొట్టిపారేస్తూ అధికార యంత్రాంగాన్ని సంక్షోభంవైపు నడిపించాడు. అటువంటి ప్రతినిర్ణయం పతాక శీర్షికల కెక్కుతోంది. పత్రికలకు ఉప్పు అందించే 'అభిజ్ఞవర్గాలు' ఎలాగూ ఉంటాయి... మరెవరో కాదు చౌదరే.

మహేంద్రనాథ్ తీసుకున్న ప్రజావ్యతిరేకనిర్ణయాలు రాజకీయకల్లోలానికి దారితీశాయి. సర్వత్ర నిరసనప్రదర్శనలు. ఆందోళన సాగించడమే వృత్తిగా చేసుకున్నవాళ్లకి జీవితకాలానికి సరిపోయే మహదవకాశం. మహేంద్రనాథ్ తమపై నిర్దాక్షిణ్యంగా ప్రదర్శించిన దమననీతికి వీరంతా ఇలా ప్రతీకారం తీర్చుకుంటున్నారు. రాష్ట్రప్రభుత్వం అగ్నిపర్వతంమీద కూర్చున్నట్టుంది. విస్ఫోటం మరెంతో దూరంలో లేదనిపిస్తోంది.

సరిగ్గా ఇటువంటిసమయంలో భగవంతుడే పంపించిన ఆపద్బాంధవుడిలా రాజకీయ దివ్యాస్త్రంలా శేఖర్ మహేంద్రనాథ్ బలగంలోకి వచ్చిచేరాడు. మునిగిపోతున్న నాయకుణ్ణి పట్టుకుని ఇంత ఒడుపుగా పైకిలాగిన ఉదాహరణ చరిత్రలో నభూతోనభవిష్యతి అన్నారు పరిశీలకులు. శేఖర్‌ని ప్రశంసలతో ముంచెత్తారు. శేఖర్ ఇప్పట్లో ఎవరూ అందుకోలేని ఎత్తుల్ని అందుకుంటాడు చూడండని జోస్యం చెప్పారు.

# 15

రాజకీయనాటకం క్రమంగా పాకానపడుతుంటే ఆనంద్, అరుణ సహజంగానే అందులో మునిగి పోయారు– అయితే హెచ్చుతగ్గుల తేడాలతో. తరచు వాళ్ళు అసెంబ్లీలోనూ, సమావేశాల్లోనూ, జిల్లాల్లో పర్యటనకు వెళ్ళినప్పుడూ, బహిరంగకార్యక్రమాల్లోనూ కలుసుకుంటూనే ఉన్నారు. వివిధ సభాసంఘాల్లో సభ్యులుగా ఒకరి ఉనికిని ఒకరు చాటుకుంటూనే ఉన్నారు. ఎం.ఎల్.ఎ. హాస్టల్‌లో ఒకరికొకరు యాభైఅడుగుల దూరంలో ఉంటున్నారు. అయినా గత మూడేళ్ళలో వారిద్దరిమధ్య శాసనసభ్యుల పరిచయం తప్ప మరే సంబంధం లేదు. కిందటి ఎన్నికలసమయంలో తన లోలోపల లీలగా మెరిసిన ఓ భావనను ఆనంద్ అణచుకోగలిగాడు.

అయితే ఇన్నేళ్ళ నిరంతరసాహచర్యంవల్ల వారిమధ్య పూర్తిగా వ్యక్తిగతమైన ఒకతటస్థ స్నేహభావన వికసించింది. చనువు, పరిహాసధోరణి, సుహృద్భావాలకే అది పరిమితం. ఎన్నో అంశాలమీద ఒకరినొకరు సమర్థించుకున్నారు. మరెన్నో విషయాల్లో ఒకరితోఒకరు గొంతులుచించి విభేదించుకున్నారు. కొన్ని సందర్భాల్లో ఏకాభిప్రాయంతో పనిచేశారు. ఒక్కోసారి ఎవరిదారిలో వాళ్ళు వ్యవ హరించారు. ఈ కార్యకలాపాలమధ్య క్రమంగా ఒకరినొకరు బాగా అర్థంచేసుకో గలిగారు. చిరకాల స్నేహంవల్ల, సాహచర్యంవల్ల కొన్ని వ్యక్తిగతవిషయాలనుకూడా ఒకరితో ఒకరు పంచుకున్నారు. మూడేళ్ళపాటు. అంతే. ఇంతలో ఒక యాదృచ్ఛికసంఘటన హఠాత్తుగా మార్పు తీసుకొచ్చింది. ఓ రోజు మధ్యాహ్నం అసెంబ్లీఛాంబర్‌లో ఆరోవరసలో ఆనంద్ నిస్తేజంగా కూర్చుని ఉన్నాడు. ఏదో విషయంమీద ఊకదంపుడు చర్చ జరిగిపోతుంటే అనాసక్తంగా వినీ విననట్టు వింటున్నాడు. స్పీకర్‌స్థానంలో అరుణ కూర్చుని ఉంది. ప్యానెల్ స్పీకర్లలో ఒకరుగా ఆమెను స్పీకర్ నియమించాడు. ఆనంద్ సహచరశాసనసభ్యుడు దీపక్ వచ్చి పక్కన కూర్చుని తన మోచేతితో ఆనంద్‌ను పక్కలో తట్టాడు. ఆనంద్ అదిరిపడి అతడివైపు చూసి 'ఏమిటి మిత్రమా? ఏమైంది నీకు?' అడిగాడు.

'ఆ ఎత్తుకుర్చీమీద ఆమె ఎంత అందంగా కనిపిస్తోందో చూశావా?' దీపక్ గుసగుసలాడాడు.

అప్రయత్నంగా ఆనంద్‌చూపులు అధ్యక్షస్థానంమీదికి ప్రసరించాయి. అంతవరకు అక్కడ ఎవరు కూర్చున్నారో అతడు గమనించలేదు. 'ఆమె పెళ్ళయిన ఆడది, బుద్ధిలేని గాడిదా!' అన్నాడు ఆనంద్ తెచ్చిపెట్టుకున్న కోపంతో. అంతకుమించి ఏమనాలో తెలియలేదు.

'అయితే ఏమిటి? పెళ్ళికాని బాలికమన రాజ్యాంగంప్రకారం శాసనసభకెలా ఎన్నికవుతుంది? పెళ్ళీడు దాటిపోయిన వృద్ధబ్రహ్మచారిణి ఐతే తప్ప...'

అదే క్షణంలో అరుణ కూడా ఆనంద్‌వైపు చూసింది. ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి. ఇంతలో డిప్యూటీ స్పీకర్ వచ్చి అధ్యక్షస్థానంలో కూర్చున్నాడు. అరుణ నేరుగా ఆనంద్‌ను సమీపించి, దీపక్‌వైపు కన్నెత్తికూడా చూడకుండా తన సహజధోరణిలో చిరుకోపాన్ని ప్రదర్శిస్తూ అడిగింది. 'హిప్నటిస్ట్‌లా ఎవరివైపు అలా తేరిపార చూస్తున్నారు మిస్టర్ మేధావిగారూ?'

'చట్టంప్రకారమే చెప్పాలంటే ఒక అందమైన యువతివైపు తేరిపార చూడడం శిక్షార్హమైన నేరంకాదు. అందులోనూ శాసనసభలో అటువంటి చూపులకు పార్లమెంటరీహక్కుల రక్షణకూడా ఉంటుంది. అదీగాక అలా చూడడం, గురకపెట్టడంలాంటి అన్‌పార్లమెంటరీ చర్య అని మే (May)గారి పార్లమెంటరీ ప్రాక్టీస్ గ్రంథంలో ఎక్కడా రాసిలేదు. కనుక తేరిపార చూడడమనేది ఒక హక్కు, రాజ్యాంగంలోని తృతీయభాగంలో పొందుపరిచిన ప్రాథమికహక్కుల్లో ఒకటి. ఏమైనా అభ్యంతరా లున్నాయా?' ఆనంద్‌కూడా చిరుకోపంతో అన్నాడు.

అరుణ హాయిగా నవ్వేసింది. కొత్తగా సాధించుకున్న ప్రాథమికహక్కును కసితీరా చలాయించు కుంటున్నట్టుగా వెనుతిరిగి అతడివైపు చూసింది. మామూలుగా కాదు తేరిపార చూసింది.

కొద్దిసేపు విరామం తర్వాత ఏదో ఆలోచిస్తున్నట్టుగా అంది. 'ఈ మూడేళ్ళలో నువ్వు నాతో ఎప్పుడూ ఇలా మాట్లాడలేదు...'

'ఇలా మాట్లాడతానని నేను కూడా అనుకోలేదు' ఒకింత పశ్చాత్తాపాన్ని ధ్వనింపజేస్తూ అన్నాడు. 'అయామ్ సారీ.'

'అయ్యో. లేదు. లేదు. నువ్వేదో తప్పుచేశావని నేననడం లేదు' చిరునవ్వుతో అంది అరుణ.

ఆ చిరునవ్వువెలుగులో తాను నిలువునా తడిసిపోయిన అనుభూతి కలిగింది ఆనంద్‌కి. తన అంతరంగంలో హఠాత్తుగా ఏదో జ్వాల జ్వలించినట్టనిపించింది. అతణ్ణి ఏదో అస్థిమితానికి లోనుచేసింది. అశాంతితోపాటు జ్వరోద్వేగంలాంటిదేదో ఆవరించింది. మరునాడు అసెంబ్లీకికూడా వెళ్ళలేదు. ఆ రోజు సాయంత్రం పడకకుర్చీలో కూర్చుని అలసటతో కళ్ళుమూసుకున్నాడు. అరుణ చడీచప్పుడు కాకుండా లోపలికివచ్చి అతని నుదుటిపై చేయివేసింది. కళ్ళుతెరచి ఆమెను చూశాడు. నమ్మలేనట్టుగా మళ్ళీమళ్ళీ చూశాడు. ఈ మూడేళ్ళలో ఆమె తన క్వార్టర్స్‌కి రావడం ఇదే మొదటిసారి.

ఇద్దరూ ఒంటరిగా ఉన్నారు. కాలిపోతున్న తన చేతిని ఆమె చేతిమీద అదిమాడు. ఆ అదుపు ఏదో సందేశాన్ని ఉద్భవింపజేసే అదుపు —అతిస్పష్టంగా. ఆమె తనచేతిని వెనక్కు తీసుకోలేదు. ఓసారి చుట్టూ పరికించి 'ఎవరైనా వస్తారేమో...' అంది మెల్లగా.

ఒకరినొకరు ఆత్మీయభావంతో చూసుకున్నారు. అతడు నవ్వి 'ఒకరోజులో తగ్గిపోతుందిలే' అన్నాడు

'అవును తగ్గిపోతుందిలే' ఇంచుమించు పాట పాడుతున్నట్టుగా అంది. మాటలకందని విచిత్రమైన స్థితిలో అతణ్ణి వదలి తాను వెళ్ళిపోయింది.

కాస్సేపటికి తేరుకున్నాడుకానీ ఇంతకుముందెన్నడూ అనుభవించని మరింత అయోమయంలోకి జారిపోయాడు. తనకు తెలియని ఏదో విలక్షణస్థితి తనను చుట్టుముట్టినట్టనిపించింది. అందులోంచి తప్పించుకుందామనుకున్నాడు. దాన్ని నిరోధిద్దామనుకున్నాడు, దాన్ని పట్టించుకోకుండా ఉందామనుకున్నాడు, దానిని జయించాలనుకున్నాడు, కళ్ళుమూసుకుని అటువంటిదేమీ లేనట్టు ఊహించుకుందామనుకున్నాడు. వారంరోజులపాటు నగరానికి దూరంగా ఎక్కడెక్కడో తిరిగాడు. అసెంబ్లీ కార్యక్రమాలు వేటికీ వెళ్ళలేదు. తిరిగివచ్చిన తర్వాత అతనితోపాటే అతనిలోని గంద్రగోళం కూడా తిరిగి వచ్చేసింది.

తామిద్దరూ సభ్యులుగా ఉన్న ఒక జాయింట్‌సెలక్ట్‌కమిటీ సమావేశంలో కలుసుకునేవరకూ అరుణ అతణ్ణి మళ్ళీ చూడలేదు. ఇద్దరూ మామూలుగా పలకరించుకున్నారు. చర్చల్లో మునిగిపోయారు. మరో పదినిముషాల్లో సమావేశం ముగుస్తుందనగా ఆనంద్ మెల్లగా అక్కడి నుంచి జారుకుని నేరుగా పక్కనే ఉన్న పార్క్‌లోకి దారితీశాడు. ఎవరూ లేకుండా చూసి ఓ మూల పచ్చిక మీద ఒరిగిపోయాడు. తనలో విజృంభించిన కల్లోలానికి ఆత్మార్పణంచేశాడు.

'డిస్టర్బ్ చేస్తున్నానా?' ఎవరో అడుగుతున్నారు. ఆ కంఠధ్వని మరేదో గ్రహంనుంచి వినబడినట్టుగా ఉంది. కన్నీటిపొరలమధ్య అతడు అరుణవైపు చూశాడు. అతడికి తెలియకుండా ఆమె అతని వెనకే వచ్చింది.

'లేదు. ఇక్కడికి రావడంవల్ల మాత్రం కాదు'

'అంటే మరోవిధంగా డిస్టర్బ్ చేశానా?'

'బాగుంది. నువ్వలా సప్లిమెంటరీలు గుప్పిస్తే నేను అవుననే చెప్పవలసి ఉంటుంది' తన సహజమైన హాస్యధోరణిని తెచ్చుకుంటూ అన్నాడు ఆనంద్.

'అబ్బ. ఆ తెలివితక్కువ మంత్రుల్లా మాట్లాడకు' అంటూ ప్రశాంతంగా కూర్చుంది అరుణ.

ఆ తెచ్చిపెట్టుకున్న హాస్యధోరణి ఎంతోసేపు లోపలి కల్లోలాన్ని దాచలేకపోయింది. తన నిబ్బరం పూర్తిగా చెదిరిపోయినట్టు అతడికే స్పష్టంగా తెలిసిపోతోంది.

అలవాటుకు భిన్నంగా ఇద్దరూ మౌనంగా కూర్చుండిపోయారు. ఆలయంలో దైవసన్నిధిలో భక్తులు ధ్యానిమగ్నులై మౌనంగా కూర్చున్నట్టు.

చీకటిపడుతోంది. ఇద్దరూ వెళ్ళడానికి లేచి నిలబడ్డారు. హఠాత్తుగా ఆమె అంది. 'మా ఇంటికి భోజనానికి రాకూడదూ? నీ కోసం స్వయంగా వండి పెడతాను... ఎనిమిది గంటలకు...సరేనా?'

ఆశ్చర్యపోతూనే ఆనంద్ అంగీకారంగా తలఊపాడు. ఆపైన అనవలసిందేమీ కనిపించక అక్కడినుంచి కదిలాడు.

ఆమెతో డిన్నర్‌కు ఒప్పుకుని తప్పుచేశాననుకుంటూ ఆ తర్వాత గంటన్నరసేపు తనలో తాను మథనపడిపోయాడు. హఠాత్తుగా తనమీద తనకే ఆగ్రహం ముంచుకొచ్చింది. తన మనసునిలా పిచ్చిపిచ్చి ఆలోచనలవైపు ఎందుకు పరుగుతీయనిస్తున్నాడు? అరుణ ఆహ్వానాన్ని ఒప్పుకుంటే తప్పేమిటి? తానింత తెలివితక్కువగా ఎందుకు ప్రవర్తిస్తున్నాడు? వెడితే ఏం జరుగుతుందని? ఇటువంటి ఎదురుతర్కంతో తననుతాను గట్టిచేసుకోవడానికి ప్రయత్నించాడు. అయితే అవి రానురాను అతని ఆగ్రహాన్ని మరింత ఎక్కువ చేశాయి తననిలా విచికిత్సలోకి నెట్టింది కేవలం ఆమె ఆహ్వానం కాదని అతని బుద్ధికి స్ఫురిస్తూనే ఉంది. అంతకుమించినదేదో ఉంది. దానినుంచి తప్పించుకోవడం తన శక్తికి మించినదనిపిస్తోంది తప్పించుకోవాలని కూడా అతడికి అనిపిస్తున్నట్టు లేదు– ఊరికే మథ్యపెట్టుకోవడం దేనికి? ఏం జరిగితే అది జరగనీ అనుకుంటూ చివరకు వెళ్ళడానికే నిర్ణయించుకున్నాడు.

నగరంలోనే దూరంగా మరోచోటికి అతడు వెళ్ళవలసిఉంది. ఓ స్నేహితుడి కారు తీసుకుని అక్కడికి వెళ్ళి ఎనిమిదింబావుకి అరుణ క్వార్టర్స్‌కు చేరుకున్నాడు. కావాలనే ఆలస్యంగా వెళ్ళాడు ఆలస్యంవల్ల సాధించబోయేదేమిటో కూడా అతడికి తెలియదు. ఆమె తనకోసం ఎదురుచూస్తోంది. మరో ఇద్దరు అతిథులు కూడా ఉన్నారు... భార్యాభర్తలు... అరుణ బంధువులట. ఆనంద్‌కి ఏదో బరువు దిగిపోయినట్టూ అనిపించింది, నిరుత్సాహమూ కలిగింది. లోపలినుంచి ఆగ్రహపూరితమైన స్వగతమేదో తన్నుకురాబోయింది కానీ, దానిని అణచుకుంటూ అతిథులతో మర్యాదపూర్వకంగా మాట్లాడుతూ ఉండిపోయాడు.

'అబ్బ, ఏం నవాబులండీ తమరు! మీ క్వార్టర్‌నుంచి యాభైఅడుగుల దూరంలో ఉన్న మా క్వార్టర్‌కి కారు కావలసొచ్చింది' అరుణ హాస్యంగా అంది.

మొన్నటివరకూ మనకో రాజు ఉండేవాడు కనుక నన్ను నవాబు అని పిలిచినందుకు సంతోషమే... పాత బస్తీకి వెళ్ళొస్తున్నాను.'

ఇతర అతిథులున్నారుకనుక సంభాషణలో అతిచనువు ధ్వనించకుండా ఇద్దరూ జాగ్రత్త పడ్డారు. ఆ సమయంలో ఆ జంట అక్కడ ఉండడంవెనుక ఏదో పథకం ఉన్నట్టు ఆనంద్‌కి అనిపించింది. అరుణ ఎత్తుగడను మనసులో అభినందించాడు కూడా. మరోవైపున ఆమె గొంతు పిసకాలన్నంత కోపమూ ముంచు కొచ్చింది.

వెళ్ళిపోడానికి అందరూ లేచినతర్వాత అరుణ ఆనంద్‌తో అంది. 'మంత్రివయ్యాక ప్రజల్ని మంత్రించి ఎలాగూ నీవెంట తీసుకువెడతావ్. ఈ లోపల ఈ మిత్రుల్ని పార్క్ అవతల వాళ్ళ ఇంటివరకు నీ కారులో దిగబెట్టి రాకూడదూ?'

'సంతోషంగా తీసుకెడతా మేడమ్' అన్నాడు ఆనంద్ మొహంనిండా నవ్వు చేసుకుని, ఆమె తనకేదో ప్రత్యేకమైన ఉపకారం చేసిపెడుతున్నట్టు.

అరుణ బంధువులు వారించ బోయారు. కానీ అరుణ వాళ్ళను ఒప్పించింది. కారు తీసుకుని రావడానికి వెడుతున్న ఆనంద్‌ను చూపించి అరుణ వాళ్ళతో అంది. 'మనుషుల్లో చాలా అరుదుగా

కనిపించే విచిత్రమైన జీవిలే. పాపం, వంచన తెలియదు. దుర్మార్గాలు చేతకావు. అయినా రాజకీయాల్లో ఉండగలుగుతున్నాడు –ఉండడమే కాదు, పైపైకి వెడుతున్నాడు. ఈ మనిషిలో ఆశ్చర్యంగొలిపే విశేషం అదే.'

కారు చప్పుడు చేయకుండా వచ్చి గుమ్మం ముందు ఆగింది. ఆడవాళ్ళు వెనకసీట్లో, మగవాళ్ళు ముందుసీట్లో కూర్చున్నారు. ఆనంద్ కారును రివర్స్‌చేసి మెయిన్‌రోడ్డుమీదికి తీసుకెళ్ళాడు. కొద్దినిముషాల్లోనే వెళ్ళవలసిన చోటుకి చేరుకున్నారు. ఆ జంట కిందికిదిగి సెలవుతీసుకుని లోపలికి వెళ్ళిపోయారు. కారులో ఆనంద్, అరుణ ఒంటరిగా ఉండిపోయారు. తన జీవితంలోనే అది మొదటి అనుభవం. అది తాను కావాలని సృష్టించుకున్న అవకాశం కాదనీ, అసలు తనకా ఆలోచనే రాలేదనీ అతడికి మెరుపులా తట్టింది. అంటే అరుణ...? ఆ ఊహకే అతడు కంపించిపోయాడు. లేకపోతే ఇది కేవలం యాదృచ్ఛికంగా జరిగిందేనా? సరే. జరిగేది అలా జరగనిద్దామనుకున్నాడు. రేగుతున్న ఆలోచనల్ని కొద్దిసేపు ఎలాగో జోకొట్టాడు.

'ఇంటికి వెళ్ళిపోదామా?' యధాలాపంగా అడిగాడు.

'వద్దు, దగ్గరలో ఏదైనా థియేటర్ ఉంటే వెడదాం, నీకు దారితెలిస్తే'

కారు పరుగెత్తి ఒక పాతథియేటర్ కాంపౌండ్‌లోకి ప్రవేశించింది. అందులో ఏదో పాత హిందీసినిమా నడుస్తోంది. నోటీస్‌బోర్డుమీద 'చివరిరోజు' అని ఉంది. అరుణ శ్రద్ధగా పోస్టర్లవైపు చూస్తూ నిలబడిపోతే ఆనంద్ కారు పార్క్‌చేసొచ్చి రెండు బాల్కనీ టిక్కెట్లు తీసుకున్నాడు. థియేటర్ ఆవరణలో పదిపన్నెండుమందికంటె జనం లేరు. ఆనంద్ టిక్కెట్లు తీసుకొచ్చి, తన ముందు అరుణ నిశ్శబ్దంగా నడుస్తుంటే బాల్కనీలోకి దారితీశాడు. బాల్కనీలో జనం మామూలు కంటె తక్కువసంఖ్యలో ఉన్నారు. పాత సినిమా చివరిఆటకు జనం ఎప్పుడూ పలచగానే ఉంటారు... ఇదికూడా ఆమె ముందే వేసుకున్న పథకం అనుకుంటున్నావా? అని తనలో తను ప్రశ్నించుకున్నాడు ఆనంద్. ఇద్దరూ ఓ మూలకు వెళ్ళి కూర్చున్నారు.

ఆ సినిమా ఒక మధ్యయుగపు మహారాణికి సంబంధించినది. కొంత చరిత్ర, కొంత కల్పన కలగలిసిన కథ. ఆనంద్‌కీ, అరుణకీ అంతకుమించి మరేమీ తెలియదు. అసలు వాళ్ళు తెరవైపు చూసిందే లేదు. మధ్యలో ఓ అరగంట ఇంటర్వల్ అంతరాయం తప్పిస్తే మూడుగంటలపాటు ఆ మొత్తం బాల్కనీ అంతా తమదే అనిపించింది వాళ్ళకి. ఈ ఊహ వాళ్ళలో అలజడినీ, ఉద్విగ్నతనీ రేపింది. భారతదేశంలో సినిమాలు ఇంత సుదీర్ఘమైనవిగా ఉండడంలోకూడా కొంత ప్రయోజనం లేకపోలేదనిపించింది. లోపలినుంచి ఏదో ఉత్సాహం, ఒకింత ఉద్రిక్తత తోసుకువస్తుంటే ఇద్దరూ మౌనంగా కూర్చుండిపోయారు.

అరగంట గడిచింది. బరువు బరువుగా, ఆవేశపూరితంగా వినిపిస్తున్న ఏవో డైలాగులు, సంగీతం పేరుతో ఏవో రణగుణధ్వనులు, ఎవరో కత్తులు దూస్తున్నారు –ఇంకా ఏవేవో దృశ్యాలు వాళ్ళ దృష్టికి రాకుండానే చకచకా నడిచిపోతున్నాయి. ఆనంద్ హఠాత్తుగా ఉద్వేగానికి లోనయ్యాడు.

ఉబికివస్తున్న భావావేశంతో అరుణ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు. ఆ క్షణాలు శాశ్వతంగా అలాగే ఘనీభవిస్తే ఎంత బాగుండుననుకున్నాడు. అన్నీ మరచిపోవాలనుకున్నాడు. ఆ ఉద్విగ్నభరిత క్షణాలను తుదిశ్వాసవరకూ తను మరచిపోలేననుకున్నాడు.

ఆమెలోకూడా అదే స్పందన. ఇద్దరం లేము, ఉన్నది ఒక్క రేనన్న అద్వైతభావన వాళ్ళని ముంచెత్తింది. నామరూపాలకతీతమైనస్థితిలో పరస్పరం అల్లుకున్న ఆ చేతుల్ని ఏ శక్తి విడదీయలేదనిపించింది.

ఎవరు మాట్లాడతారా అని ఎవరికి వారు ఎదురుచూస్తున్నారు.

మాట్లాడుకున్నది తక్కువే. వాళ్ళచుట్టూ సీట్లమీదుగా ఏవో భయానకమైన దృశ్యాలు రీలు మీద రీలుగా కదిలిపోతున్నాయి.

'ఎప్పుడూ అంత సీరియస్‌గా ఉంటావెందుకు? అంత విచారంగా ఉన్నట్టు కనిపిస్తావెందుకు?' సుదీర్ఘ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ అరుణ మృదువుగా అడిగింది.

'అదో పెద్ద కథలే' అంటూ నిట్టూర్పుతోనే అన్నట్టన్నాడు ఆనంద్, ఆమె సానుభూతిని మనసారా చవిచూస్తున్నట్టు.

'నేనూ ఊహించాను' అందామె అతడి తలను తన చేతితో స్పృశిస్తూ.

ఇంటికి తిరిగివస్తున్నప్పుడు కూడా ఇద్దరూ ఆ పారవశ్యస్థితిలోనే ఉండిపోయారు. కారు రోడ్డుమీంచి పక్కకి జరిగిపోయింది. 'తాగుబోతు డ్రైవింగ్‌కి చక్కని ఉదాహరణ' అంది అరుణ పరిహాసంగా.

'నేరం ఒప్పుకుంటున్నాను. అయితే ఇటువంటి నేరాలు ఇకముందు చేయననిమాత్రం హామీ ఇవ్వలేను' అన్నాడు ఆనంద్.

మరుసటిరోజు ఆనంద్ ఎంతో ఉత్సాహంగా ఉన్నాడు. తనలోని ఆ ఉత్తేజం అణగారిపో కుండా కాపాడుకోడానికి బుద్ధిపూర్వకంగా ప్రయత్నించాడు. అది అణగారిపోవడం తను భరించ లేననుకున్నాడు. తన కింతకాలానికి ఒక సహమార్గగామి లభించింది. తన ద్విధాభావం అంతరించింది. తను అజేయుడైనట్టనిపించింది.

ఆ రోజు మధ్యాహ్నం అసెంబ్లీలో అరుణ అధ్యక్షస్థానంలో ఉంది. ఆనంద్ అటెండర్‌ను పిల్చి మేడమ్ చైర్‌పర్సన్‌కు ఇమ్మని చెప్పి ఒ కాగితం అందించాడు. సమావేశాలు జరుగు తున్నప్పుడు అలా కాగితాలు పంపించడం మామూలే. 'రాత్రి సినిమాలో రాణీగారికి ఏమైంది?' అని ఆ కాగితంమీద రాసుంది. అరుణ అది చూడగానే ముఖం చిట్లించింది. తర్వాత చిరునవ్వు నవ్వి దానిమీద 'షటప్. సభ వాయిదాపడ్డాక పార్క్‌కి రా' అని రాసి పంపించింది.

ఆనంద్ ఆమె ఆదేశించినట్టే వెళ్ళాడు. చాలాసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు. సంజెచీకటి ముసురుకుంటుంటే ఆనంద్ ఆమె ఒడిలో తలవాల్చి పడుకున్నాడు. ఆమె అతడి మెత్తని జుట్టు దువ్వుతూ ఉండిపోయింది. ఆమె వేలికొసలనుంచి ఏదో మధురమైన ఆనందం

తనలోకి ప్రసరిస్తున్నట్టు, తనలోని 'అర్ధభాగా'న్ని, అదెంతోకాలంగా తపిస్తున్న పూర్ణత్వంవైపునకు పురిగొల్పుతున్నట్టు అతనికి అనిపిస్తోంది.

కాసేపటి తర్వాత లేచి కూర్చున్నాడు.

'ఈ మూడేళ్ళనుంచి ఏం చేస్తున్నావు?' అడిగిందామె.

'సంశయిస్తూ, చర్చిస్తూ...'ఆగిఆగి అన్నాడు.

'ఓహో. నీలో నువ్వే ఓ అసెంబ్లీని నిర్వహించావన్న మాట?'

'అవుననుకుంటా. జరిగిన అల్లకల్లోలాన్ని, ఉన్నతప్రమాణంలో సాగిన చర్చల్నిబట్టి దానిని లోక్‌సభ అని పిలవాలనుకుంటాను' తన సహజమైన హాస్యధోరణిలోకి తిరిగివస్తూ అన్నాడు ఆనంద్.

'రూలింగ్ ఇవ్వడానికి అందులో స్పీకర్ ఎవరూ లేరు కనుక చర్చ అలా సాగిసాగి... చివరకు... అటూ ఇటూ కూడా ఇక వాదోపవాదాలు లేని స్థితికి చేరి ఆగిపోయింది.'

సంజెచీకట్లు క్రమంగా చీకటికి చోటిచ్చాయి. కొద్ది క్షణాలు ప్రశాంతంగా, ఏకాంతంగా గడిపే అవకాశం ఇద్దరికీ దొరికింది... తర్వాత వెళ్ళిపోడానికి ఇద్దరూ లేచి నిలబడ్డారు. వెళ్ళ బోతున్న ఆమెను ఆపి ఆనంద్ మరోసారి దగ్గరగా నిలుపుకున్నాడు.

'నీ ఆశకు అంతులేనట్టే ఉంది. ఇక మనం వాస్తవికప్రపంచంలోకి రావలసిన వేళయింది' అరుణ అంది.

'ఇటువంటి క్షణాలు అందించినందుకు నీకెంతో రుణపడి ఉంటాను' అన్నాడు ఆనంద్.

ఆమె హఠాత్తుగా సీరియస్ అయిపోయింది. అదికూడా క్షణకాలం. 'నువ్వు నాకు రుణ పడిందేమీ లేదు. నీకు నువ్వెంత రుణపడి ఉన్నావో నీకు తెలిసినట్టు లేదు...' అంది.

చేతులు కలుపుకొని మెయిన్‌రోడ్డు వరకూ నడిచారు. వీధిదీపాలవెలుగులోకి అడుగుపెట్టబోతుండగా ఆమె అతని భుజాన్ని మెల్లగా తట్టి సందేహిస్తూ అడిగింది. 'ఇదంతా మంచిదేనా?... నా ఉద్దేశం...'

'నీకు పుణ్యముంటుంది అరుణా. దయచేసి మళ్ళీ ఆ మాట అనకు. నీ గురించి నాకేమీ తెలియదు. నీమీద నాకెటువంటి హక్కూ లేదు. కానీ నాకు మాత్రం ఏదో మంచి జరిగిందనుటుంటున్నాను. స్వీకరించు, లేదా విడిచిపెట్టు, కాని వాదించకు' ఆనంద్ ఒక్కుమ్మడిగా అనేశాడు.

కొన్ని అడుగులు వేగంగా ముందుకేసి రోడ్డుమీద వెడుతున్న పాదచారుల్లో కలిసిపోయాడు. అరుణ దిగ్భ్రమతో ఒంటరిగా కాసేపు అలాగే నిలబడిచూస్తూ ఉండిపోయింది.

# 16

శేఖర్ ఏదైనా కార్యక్రమం తలపెట్టాడంటే దాని అంతుచూసేవరకూ నిద్రపోడు. నేలమట్టానికి జారిపోయిన మహేంద్రనాథ్ ప్రతిష్ఠను ఎలాగైనా పైకిలాగడం ఇప్పుడు తన తక్షణ కర్తవ్యమనుకున్నాడు. జనందృష్టిలో అధికారయంత్రాంగంలో దౌర్బల్యం పుట్టించడంలోనూ, నాయకుడి అప్రతిష్ఠే ముఖ్యకారణమౌతుందని నొక్కిచెప్పాడు. మహేంద్రనాథ్‌లో సద్గుణాలెన్నో ఉన్నా ఆయనలోని అవలక్షణాలే ఇంతవరకూ ఎక్కువ ప్రచారంలోకి వచ్చాయి. పైగా వాటిని గోరంతను కొండంతలుచేస్తూ చిత్రించడం మరింత దారుణం. తక్షణం ఈ పోకడను తలకిందులు చేసితీరవలసిందేనని శేఖర్ ఎంతో గట్టిగా వాదించాడు.

అదిగో, 'తక్షణం' అనడంలోనే ఉంది చిక్కంతా. రాజకీయాల్లో ఏ ధోరణినైనా తక్షణం తలకిందులుచేయడం సాధ్యంకాదని తెలియనివాళ్ళు ఉండరు. అయినాసరే, ఎదుటివారికి నచ్చజెప్పి తనదారికి తిప్పుకోవడంలో అద్భుత చాతుర్యం ఉన్నవాడు కనుక శేఖర్ ఆ చిక్కును అవలీలగానే జయించగలిగాడు. ముఖ్యమంత్రిగారి ప్రతిష్ఠను తక్షణం ఇనుమడింపజేయాలన్న ఆలోచనను ఆయన అనుయాయులంతా సమర్థించారు. మహేంద్రనాథ్‌కు ఈ విషయం తెలిసినప్పుడు ఆయన లోలోపల ఏదో అశాంతి బయలుదేరింది. బహుశా ఆ ప్రతిపాదన సరైనది కాదని అతని ఇంగితజ్ఞానం హెచ్చరించి ఉంటుంది. అయితే మరి మార్గాంతరాలేమిటి? పరిస్థితి ఇలా పట్టుజారిపోతూనేఉంటే ఏం జరుగుతుంది? ఆ పరిణామం ఊహించడానికే భయంగొలుపుతోంది. మరోలా చెప్పాలంటే ఏదో ఒకటి చేయడంతప్ప మహేంద్రనాథ్‌కు గత్యంతరం లేదు. అందులోనూ శేఖర్ సూచించినట్టు చేయడంతప్ప మరో మార్గంకూడా లేదు. ఎందుకంటే ఆపాటి పనికొచ్చే ఆచరణాత్మకపథకం మరెవరి దగ్గరా లేదు.

జీవితంలో, ప్రత్యేకించి రాజకీయ జీవితంలో అవకాశాలు ఎల్లప్పుడూ గీత గీసినంత కచ్చితంగానూ, స్పష్టంగానూ దొరకవు. అందుకే మొదట్లో అంతరాత్మ తగదు తగదని చెప్పినా రాజకీయఅస్తిత్వాన్ని కాపాడుకోవడమే అన్నిటికన్న ముఖ్యమని భావించి మహేంద్రనాథ్ క్రమంగా అంతరాత్మను జోకొట్టగలిగాడు. రాజకీయవాదులెవరైనా తమ అస్తిత్వానికి ప్రప్రథమ ప్రాముఖ్యం ఇస్తే ఎవరుమాత్రం ఎందుకు తప్పు పట్టాలి?... ఐనా ఆ మార్గానికి తాను ఆమోదించకూడదనే అనుకున్నాడు. అయితే అనుయాయులు ఆయన ఆమోదం అవసరమేకాని పద్ధతిలో వ్యవహారాలు

చక్కబెడుతున్నారు. తతంగమంతా అరచాటుగానూ, అర్ధసత్యధోరణిలోనూ, జరిగిపోతోంది. తాము చేస్తున్నదే విధంగానూ తప్పుకాదని అనుయాయులు ఆయనకు నమ్మకం కలిగించారు. ఆయన సమాధాన పడ్డాడు– సమాధానపడాలనుకున్నాడు కనుక పడ్డాడు.

అయినా ఒక వ్యక్తి ప్రతిష్ఠను నిర్మించడమెలా? ముందుగా అందుకు తగిన సందర్భం కావాలి- కనీసం ప్రారంభానికైనా కావాలి. 'నేనంటున్న మాటకు మీకేవైనా అభ్యంతరాలున్నాయా?' అడిగాడు శేఖర్– మహేంద్రనాథ్ విధేయుల సమావేశం ఏర్పాటుచేసి. ఎవరికీ ఎటువంటి అభ్యంతరాలు లేవు. ఉండవుకూడా. 'కనుక మనం తగిన సందర్భం వెతకాలి. అది సహజమైంది కావచ్చు, సృష్టించిందికావచ్చు. సాధ్యమైతే సహజమైన సందర్భమే తీసుకుందాం. సాధ్యంకాకపోతే సృష్టిద్దాం. ఒప్పుకున్నట్టేగా?' అడిగాడు మళ్ళీ. సరేనన్నట్టు యాంత్రికంగా తలలూపారు అక్కడి వాళ్ళు. 'ఇక తగిన సందర్భం ఏమిటో మీరుకూడా ఆలోచించండి. మళ్ళీ రేపు కలుసుకుని చర్చిద్దాం. సరేనా?' అన్నాడు శేఖర్. యుద్ధమండలి సమావేశం మరునాటికి వాయిదాపడింది.

మరునాటి సమావేశంలోకూడా వాళ్ళ ముఖాలు ఏ భావమూ వ్యక్తంకాని చవిటిపర్రల్లానే ఉన్నాయి. రాజకీయవర్గాల్లో ఉండే విచిత్రమే అది. నిర్ణయాలు తీసుకునే బాధ్యతనంతటినీ ఒకే ఒక పాపాలభైరవుడికి అప్పగించి కూర్చుంటారు. ఒకవేళ ఆ నిర్ణయం తప్పని రుజువైతే అందరూ కలిసి ఆ వ్యక్తిమీద మేకులు దిగేయడం ప్రారంభిస్తారు. పైగా ప్రతిష్ఠానిర్మాణం అనేసరికి ఎన్నో పాడుపనులు చేయకతప్పదు. అదెవరికీ ఇష్టముండదు. అలాగని ఎవరూ వ్యతిరేకించే సాహసమూ చేయరు. పథకం పారితే అది తమ ఘనతగా చిత్రించుకోడానికి ప్రతివాళ్ళూ ముందుకొస్తారు. మొత్తంమీద యుద్ధమండలి సమా వేశాల్లో అందరూ మూకీభావంతోనే ఉండిపోయారు. అదే సురక్షిత వ్యూహ మనుకున్నారు... శేఖర్‌కి ఈ ధోరణి బాగా అనుకూలించింది. క్రమంగా తన పన్నుగడ చుట్టున్న తెరను తొలగించడం ప్రారంభించాడు. శాసన సభ్యుల నుద్దేశించి అన్నాడు. 'మన ఘనత వహించిన ముఖ్యమంత్రిగారి ప్రతిష్ఠను పైకెత్తేందుకు తగిన చర్య తీసుకోవాలని నిన్న నిర్ణయించు కున్నాం. మనదగ్గర ఇప్పటికిప్పుడు స్పష్టమైన పథకం ఏదీ లేదు కనుక ఈ రోజు సమావేశం చాలించి దాని గురించి మరికొంతసేపు ఆలోచించుకుందాం. ఏమంటారు?'

కొద్దిక్షణాలు ఎవరూ మాట్లాడలేదు. మళ్ళీ మళ్ళీ ఈ విషయంగురించి తలబద్దలుకొట్టుకోవడం ఓ వృద్ధనాయకుడికి ఎంతమాత్రం నచ్చినట్టు లేదు. 'ఎందుకాలస్యం శేఖర్! నువ్వేదో ఆలోచించే ఉంటావ్. ఇప్పుడే చర్చించి ఎందుకు నిర్ణయం తీసుకోకూడదు?' అన్నాడు.

'బాగా చెప్పారు మౌలానా సాహెబ్. నా కేదో ఆలోచన వచ్చినమాట నిజమే. కానీ అదింకా అస్పష్టంగానే ఉంది. దానికొక ఆకారం కల్పించడానికి నాకు సమయం దొరకలేదు. అదీగాక కొంత సమయం తీసుకోవడమూ మంచిదేకదా' అన్నాడు శేఖర్.

శాసనసభ్యులు అప్పటికే తనంటే చిరచిరలాడుతున్నారు. అందుకే వాళ్ళను తను మరీ తొందరపెడుతున్న అభిప్రాయం కలిగించకూడదనుకున్నాడు శేఖర్. తన పథకంలో ముందు ముందు లోపాలు ఎంచే అవకాశం వాళ్ళకి ఇవ్వకూడదనే దానికి ప్రస్తుతానికి 'అస్పష్టత' అనే

ముసుగువేసి ఉంచాడు. అదీగాక తనదగ్గర ఒక పథకం ఉన్నట్టు వాళ్ళకి సూచనగానైనా తెలిస్తే ఇక ప్రత్యామ్నాయం గురించి ఆలోచించడం మానేస్తారు. పైగా తను మహేంద్రనాథ్ విధేయ వర్గంలోకి కొత్తగా వచ్చిచేరినవాడు. ఇంతలోనే ఆ వర్గంలో తన ప్రాముఖ్యం పెరిగిపోవడం సీనియర్ నాయకులకు ఇప్పటికే ఎంతో కంటగింపుగా ఉంటోంది. తన వ్యూహం ఏ ఘట్టంలో నైనా బెడిసి కొట్టిందా, ఇక తనను అథఃపాతాళానికి తొక్కేస్తారు. లేదా నీ చావేదో నువ్వే చావమంటూ తప్పుకుంటారు. తనపట్ల వాళ్ళకి పీకలదాకా అసహ్యం, అయినా తన అవసరం ప్రస్తుతం వాళ్ళకుంది. వాళ్ళ దృష్టిలో తను 'మనవాడు' కాడన్న విషయం శేఖర్‌కి కచ్చితంగా తెలుసు. కాని పరిస్థితులకు తలొగ్గి తనను భరిస్తున్నారు. తటస్థంగా ఉంటారే కాని తన పథకంలో మార్పులు సూచించడానికీ, బాధ్యత పంచుకోడానికీ ముందుకురారు. టైఫాయిడ్ జ్వరంలా ఎంతకాలం తీసుకోవాలో అంతకాలం అతణ్ణి తీసుకోనిద్దామని వాళ్ళు నిర్ణయించుకున్నారు. అదీగాక ఆ కొరకరాని కొయ్యగాడితో మరోవిధంగా ఎలా వ్యవహరించాలోకూడా వాళ్ళకి తెలియదు.

'ఇప్పుడు వెళ్ళిపోయి, వచ్చే సోమవారం మళ్ళీ కలుద్దామా? చెప్పండి...' శేఖర్ అడిగాడు.

'శేఖర్...' మరో వృద్ధశాసనసభ్యుడు సాగదీస్తూ అందుకున్నాడు. 'ఇలా వాయిదావేయడం దేనికో నాకేమీ అర్థంకావడంలేదు. నీ పథకం ఏమిటో మాకు చెప్పాలనుకుంటే దయచేసి ఇప్పుడే చెప్పు. అవతల మనం కొండను ఢీకొనబోతున్నాం. సమయం చాలా విలువైనది. రాత్రికిరాత్రి ఒక నాయకుడి రాజకీయప్రతిష్ఠను ఆకాశానికిపెంచడం సాధ్యంకాదు. మనం మళ్ళీ కలుసుకోనవసరం లేదు. తక్షణమే నడుంబిగించడం మంచిది...'

అవునవునన్నారు మిగిలినవాళ్ళు కోరస్‌గా. కొద్దిక్షణాలు నిశ్శబ్దం రాజ్యంచేసింది. శేఖర్ స్పందనకోసం అందరూ అతనివైపే చూస్తూఉండి పోయారు. శేఖర్ ప్రతిమాటా ఆచితూచి ప్రయోగిస్తూ అన్నాడు. 'ఇటీవలనే బయటపడిన మన నాయకుడి జన్మదినంకన్నా ఇందుకు తగిన సందర్భమేముంటుంది? ఆ తేదీ ననుసరించి మనకింకో రెండుమాసాలవ్యవధి ఉంది. కాస్త కష్టపడి పనిచేశామా ఓ బ్రహ్మాండమైన కార్యక్రమంగా దానిని మార్చగలం. మహేంద్రనాథ్ వ్యక్తిత్వాన్ని మహోన్నతంగా చిత్రించి జనంలో ఆయనపట్ల విపరీతమైన ఆరాధనాభావాన్ని సృష్టించడం మనం చేయవలసిన పని. ఆయన గతంగురించి ఎవరికీ అంతగా తెలియదు. అదొకవిధంగా మనకు కలిసొచ్చిన అదృష్టం. ఆ జాగాలను మనం కోరుకున్న రంగులతో నింపొచ్చు.. సరికొత్త జీవితచరిత్రతో ఆయనను మనం జనంముందు ప్రదర్శించబోతున్నాం. ప్రతివాళ్ళూ ఆయనను ప్రజాసేవకే అవతరించిన సహజనాయకుడుగా . . ఈ ప్రపంచాన్ని, ప్రస్తుతఘట్టంలో ఈ రాష్ట్రాన్ని, ఇంకా చెప్పాలంటే ఈ దేశాన్ని ఉద్ధరించడానికే అవత రించిన యుగపురుషుడుగా భావిస్తారు. ఆయనను ఇక తేరిపారచూసే సాహసంకూడా ఎవరూ చేయలేరు.'

ఈ సారి కూడా ఎవరూ మాట్లాడలేదు. మాట్లాడే సాహసం ఎవరిలోనూ లేదు. ఎందరో నాయకుల జన్మదినాలగురించి వాళ్ళకి తెలుసు వాళ్ళలో సజీవులూ ఉన్నారు, స్వర్గస్థులూ ఉన్నారు. ఆయాతేదీలలో వాళ్ళ జన్మదినోత్సవాలు జరుపుకుంటారు. మరునాడు మరచిపోతారు. ఇదే ఎంతోకాలంగా వస్తున్న వహివాటు. అయితే జన్మదినోత్సవాలను ఇలా ప్రతిష్ఠా నిర్మాణంతో

ముడిపెట్టడమెప్పుడూ జరగలేదు. శేఖర్ ప్రతిపాదించిన పథకం మంచిచెడులను గురించి ఎందరో శాసనసభ్యులు ప్రశ్నలు గుప్పిద్దామనుకున్నారు కానీ, తమలో ఎవరివద్దా స్పష్టమైన ప్రత్యామ్నాయం ఏదీ లేదు. అభ్యంతరాలు మాత్రమే లేవదీస్తే తమ తెలివితక్కువతనం బయటపడుతుంది కనుక ఊరుకోవడమే మంచిదనుకున్నారు. అదీగాక, అలా అభ్యంతరాలు లేవదీస్తే తమ నాయకుడి ప్రతిష్ఠను ఇనుమడింపజేయడం తమకిష్టంలేనట్టు ఎవరైనా పెడర్థాలుతీసే ప్రమాదంకూడా ఉంది... నిజంగా అలా జరుగుతుందో లేదో కానీ, అప్పటికప్పుడు వాళ్ళలా ఊహించుకుని భయపడ్డారు. దాని పరిణామాలు ఎంత తీవ్రంగా ఉంటాయో ఊహించుకున్నారు. చౌదరికీ తనకీ మధ్య జరుగుతున్న యుద్ధంలో తనకు బాగా పనికొచ్చే ఆయుధం శేఖర్ ఒక్కడే ననుకుంటున్నాడు మహేంద్రనాథ్. ఇప్పటికే శేఖర్‌గాడి మాయలో పడిపోయిన ఆయన ఈ శాసనసభ్యుల అభ్యంతరాలగురించి తెలిస్తే ఇంకేమైనా ఉందా? వద్దు వద్దు, తాము శేఖర్ పథకాన్ని వ్యతిరేకించకూడదు, అది తమకెంత నచ్చకపోయినా...

అయినా అప్పటికీ ఆ పథకాన్ని తలచుకుంటే గొంతుక్కి ఈగ అడ్డం పడినట్టనిపిస్తోంది. మింగలేక కక్కలేక సతమతమౌతున్నారు. ఇక ఉండబట్టలేక మౌలానా ఎలాగో కక్కేశాడు. 'నాకు... నాకు... వేరే అభ్యంతరాలేవీ లేవనుకో. ఆలోచనైతే బాగానే ఉంది. కానీ, మహేంద్రనాథ్ ఒప్పుకుంటారనే అనుకుంటున్నావా?' నంగి నంగిగా అన్నాడు.

ఆ ప్రశ్నతో, శేఖర్‌ముఖంతప్ప అందరిముఖాలూ వెలిగిపోయాయి. 'ఆయన ఒప్పుకోడు! ఎంతమాత్రం ఒప్పుకోడు!' అన్నారు మళ్ళీ కోరస్‌గా – గుండెలమీంచి బరువు దిగిపోయినట్టూ, ఒకింత ఉత్సాహంగానూ. గొంతుకలో అడ్డంపడిన ఈగ కాస్తా తియ్యని చాక్‌లెట్‌లా మారిపోయి నట్టుంది.

శేఖర్ కనుబొమలు ముడిచాడు. 'నిజమే. ఆయన ఒప్పుకోడు. అది ఆయన ఔన్నత్యానికి నిదర్శనం. ఎంతోమంది గొప్పవాళ్ళలో కనిపించే వినయగుణమే ఆయనలోనూ ఉంది. తనను ఆకాశానికి ఎత్తిచూపించడమే ఆయనకు నచ్చదు... అయితేమాత్రం ఏమిటి?' అన్నాడు కాస్త రెచ్చగొట్టినట్టుగా.

'ఏమిటంటావేమిటి?' మౌలానా వెంటనే అందుకున్నాడు 'ఆయన ఒప్పుకోకపోతే నీ పథకాన్ని ఎలా అమలుచేస్తావ్? ఆయన పట్టుదల ఎటువంటిదో మా అందరికీ తెలుసు. దేనినైనా కాద న్నాడంటే ఇక ఒప్పించడం ఎవరితరమూ కాదు. ఈ అడ్డంకిని ఎలా దాటగలవ్?'

'ఎటువంటి అనుచరులయ్యా మీరంతా?' శేఖర్ కేకలు ప్రారంభించాడు. 'ఏదైనా చెయ్యాల నుంటే చెయ్యండి, లేకపోతే మీ వల్ల కాదనండి. ఈ మీనమేషాల నాటకం దేనికి? మీకలాగే బాగుంటే మహేంద్రనాథ్‌ను పూర్తిగా భ్రష్టుపట్టిపోయి సన్యాసం తీసుకుని హిమాలయాలకు వెళ్ళిపోనివ్వండి... లేకపోతే అర్థంపర్థంలేని ఈ గొడవంతా ఏమిటి? మహాత్మాగాంధీగారి రోజుల్లోనే ఇంకా ఉన్నామనుకుంటున్నారా? చెప్పండి, ఇప్పుడు మన కెంతమంది జాతీయనాయకులు మిగిలారు? కొందరినైనా తయారుచేసుకోవాలా వద్దా? తయారుచేసుకోవాలనుకున్నప్పుడు ఆ

దిశగా తగిన చర్యలు తీసుకోవాలా వద్దా? మరో స్వాతంత్ర్యోద్యమం మనకోసం రాబోవడంలేదు మనలోమనం ముఠాకలహాల్లో తలమునకలౌతుంటే జాతీయనాయకత్వం ఎలా పుట్టుకొస్తుంది? అడగ్గానే అదేమైనా ఆకాశంనుంచి ఊడిపడుతుందా?... అసలు మన నాయకుడి ప్రతిష్ఠను పెంచడంలో పాపమేమిటి? న్యాయంగా జరిగే ప్రచారంకంటె మించి దాంట్లో ఏముంది? ఉన్నదున్నట్టు చెప్పుకోవడం కూడా తప్పేనా? ప్రపంచంలో అందరూ చేస్తున్న పని అదేనని మీకు చెప్పాలా? వ్యక్తుల పేర్లమీద మ్యూజియంలు ఏర్పాటుచేస్తారు, వాళ్ళకు సంబంధించిన పురాతనపత్రాలు భద్రంచేస్తారు... ఇవన్నీ ఏమిటి? గొప్పగొప్ప నాయకుల జీవితాలపై లోతుగా పరిశోధనలు జరిపించి, వాళ్ళ గుణగణాలను తవ్వితీయిస్తూఉంటారు. వాళ్ళు ఎలా తుమ్మారో, ఎవరెవరితో పడుకున్నారో పూసగుచ్చినట్టు రాస్తారు. వాళ్ళ పేరుమీద అవార్డులు, ఫౌండేషన్లు, ఫెలోషిప్పులు, స్టడీలు, ఛైర్‌లు... ఒకటేమిటి, ఎన్నెన్నో ఏర్పాటుచేస్తూఉంటారు. నాకు తెలియక అడుగుతాను... ఇదంతా ప్రతిష్ఠను పైకెత్తడం కాకపోతే మరేమిటి?... మీరున్నారు. ఒక గొప్పనాయకుడికి ఎంతో విధేయ అనుచరులు. రాజకీయాల్లో తలపండినవాళ్ళు. మీ నాయకుడు కాబోయే ప్రధానమంత్రిగా జాతీయరంగస్థలిపైకి దూసుకువెళ్ళాలని మీరు మాత్రం కోరుకోవడం లేదా? అలాంటి మీరు, ఆయన జన్మదినోత్సవాన్ని ఆయనస్థాయికి తగినట్టు జరిపిద్దామని చిన్న ప్రతిపాదన తెస్తే అదేదో మహాపరాధమైనట్టు రాద్ధాంతం చేస్తున్నారు. సిగ్గు సిగ్గు!'

ఆ వాగ్ధాటి ఆశించిన ప్రభావమే చూపించింది. శేఖర్ చూపిస్తున్నంత ఉత్సాహమూ, ఆసక్తీ తాముకూడా చూపించకపోతే నాయకుడిపట్ల తమ విధేయతను ఎవరైనా శంకించే ప్రమాదముందని వాళ్ళలో ప్రతి ఒకరూ అనుకున్నారు. పైగా అందులో ఏమాత్రం ఆలస్యంకూడా జరగకూడదు. మౌలానా అన్నాడు. 'ఉపన్యాసం ఇక చాల్లే శేఖర్! నీ వాదనతో ఏకీభవించాం... సరేనా? ఇక నువ్వేం చేయదల్చుకున్నావో చెప్పు.'

'మహేంద్రనాథ్‌ను చిరకాలంగా అంటిపెట్టుకుని ఉన్న విధేయులుగా మీరంతా జన్మ దినోత్సవాలకు ఆయన్ని ఒప్పించాలి. మీరు చేయ వలసిందంతే. మిగిలినవి నేను చూసు కుంటాను...' అనేసి శేఖర్ ఆ రోజుకి చర్చ ముగించాడు. మిగిలినవాళ్ళు దిక్కుతోచనిస్థితిలో కూరుకుపోయినా అతడికిమాత్రం ఎంతో సంతృప్తిగా ఉంది.

ఏ విషయంలోనైనా మహేంద్ర నాథ్‌ని ఒప్పించడమెలాగో మౌలానాకిగానీ మిగిలినవాళ్ళకి గానీ తెలియదు. ఆయన ఆదేశాలకు తలొగ్గడం ఒకటే వాళ్ళకు తెలిసింది. తాముగా ఆయనకు సలహాలు, సూచనలు ఇవ్వడమా? ఉహూఁ... అసంభవం! చిర్రుబుర్రులాడే ఆయన ముఖాన్ని చూస్తేనే వెన్నులోంచి వణుకు పుట్టుకొస్తుంది. వాళ్ళ మందకొడితనం, పిరికితనం ఆయనపట్ల భయాన్ని మరింత పెంచేశాయి. చివరకు ఎలాగో ధైర్యం కూడదీసుకుని జాగ్రత్తగా, అతిజాగ్రత్తగా, జన్మదినోత్సవపథకాన్ని వినపడీ వినపడని గొణుగుడుతో ఆయన దృష్టికి తీసుకెళ్ళారు. ఊహించినట్టే ఆయన అంతెత్తున ఎగిసిపడ్డాడు. 'ఉత్సవం జరిపేంత ఏముంది నా పుట్టినరోజులో?' అన్నాడు. తర్వాత ఏదో స్ఫురించినట్టు అన్నాడు. 'ఎందుకో కారణం చెప్పలేను. నాకా ఆలోచన నచ్చడం లేదు. అదేదో తప్పని పిస్తోంది...'

వాళ్ళు ఏమనాలో తోచక వెను దిరిగి వచ్చేశారు. శేఖర్ మళ్ళీ పట్టుబట్టిన మీదట మళ్ళీ వెళ్ళారు. అయితే ఈసారి మహేంద్రనాథ్ తిరస్కా రంలో అంత వేడి వాళ్ళకి కనిపించలేదు; తమ ప్రయత్నాన్ని విరమించవలసినంతగా వాళ్ళు అధైర్యపడలేదు. ఎందుకో మహేంద్రనాథ్ ఒప్పుకుంటాడని వాళ్ళకు స్ఫురించింది. నిజానికి ఒప్పుకున్నాడని కూడా అనిపించింది. అయినా మళ్ళీ ఆయన దగ్గరకు విషయచర్చకెలా వెళ్ళాలో వాళ్ళకి అర్థంకాలేదు. మహేంద్రనాథ్ నడకను, కొన్ని దశాబ్దాలుగా, రకరకాల పరిస్థితుల్లో సన్నిహితంగా గమనించిన వారికే ఆయన నోట ఎంతో గంభీరంగా దొర్లిపడే మాటలవెనుక అసలు అర్థాలు బోధపడతాయి. మౌలానా, అలాంటి పాతకాలపు మరికొందరు, సాహసించి ఆయనపై మళ్ళీఒత్తిడి తీసుకొచ్చారు. మెల్లమెల్లగా ఆయన మెత్తబడడం, లేదా మెత్తబడినట్టు కనిపించడం చూసి వాళ్ళు ఆశ్చర్యం పట్టలేకపోయారు.

అయితే ఈ ఒప్పుకోలు వెనుక కచ్చితమైన ఒక తర్కం ఉంది. తన ప్రతిష్ఠను ఆకాశాని కెత్తుకోవడం అనైతికం, అసంగతమని మహేంద్రనాథ్ నిజంగానే అనుకున్నాడు. ఎవరి విషయంలో ఎలా ఉన్నా తన ఒంటికిమాత్రం అది సరిపడదు. కానీ అవతల చౌదరినాయకత్వంలో తన ప్రత్యర్థులు తనమీద అదేపనిగా సాగిస్తున్న దుష్ప్రచారం మాటేమిటి? అదెంతవరకు సబబు? కొన్ని పత్రికలు రకరకాలుగా తనను కించపరుస్తూ రాయడం ఎంతవరకు న్యాయం? ముఖ్య మంత్రిని ఎల్లప్పుడూ భూతంలానో దెయ్యంలానో చిత్రిస్తూపోతుంటే పరిపాలన ఎలా సాగించగలడు? రాజునుకానీ, ఇప్పటివిధానంలో రాజుస్థానంలో కూర్చున్న మనిషినికానీ సాక్షాత్తు భగవంతుడి అవతారంగా భావించే దేశంలో ఈ బురదచిమ్మే కార్యక్రమం చివరకు ఎక్కడికి తీసుకెళు తుంది? లేదు. తన పరువు ప్రతిష్ఠల్ని ప్రచారంచేసుకోవడంలో ఎటువంటి తప్పూ లేదు. అది కేవలం ఆత్మరక్షణకు...

ఈ మనిషిని శేఖర్ బాగానే అర్థంచేసుకున్నాడని తేలిపోయింది. అతని సహచరులుకూడా ఈ సంకేతాల్ని సరిగానే పోల్చుకోగలిగారు. అనుమతి ఉన్నట్టు తెలిసీతెలియగానే శేఖర్ మహేంద్రనాథ్ జన్మదినోత్సవానికి ఏర్పాట్లు ముమ్మరంచేశాడు. నిర్దిష్టంగా ఎవరూ ఏమీ అనరు, కానీ మహేంద్రనాథ్ మినహా మిగిలిన ప్రతిఒకరికీ జరుగుతున్నవన్నీ క్షుణ్ణంగా తెలుసు. మొత్తం కథ నడిపిస్తున్న శేఖర్ చాకచక్యం పుణ్యమాఅని మహేంద్రనాథ్ సగం వెలుగులో సగం చీకట్లోనూ ఉండిపోయాడు.

ఒక వృద్ధనాయకుని అధ్యక్షతలో జన్మదినోత్సవసంఘం అవతరించింది. ఆయన రాజకీయాల నుంచి తెరమరుగైపోయి చాలాకాలమైంది. ఆయన ఆ పదవికి ఒప్పుకోవడం వెనుక మళ్ళీ జనం దృష్టిలోకి వెళ్ళాలన్న దుగ్ధతప్ప మరే ఉద్దేశమూ లేదు. కమిటీ సాధారణ సమావేశాలకే ఆయనకు పిలుపు వెళ్ళేది. మిగిలిన సమయాల్లో అంతా శేఖర్ ఇష్టారాజ్యం. కమిటీకి ఏకైక కార్యదర్శి అతడే.

ఇక నిధులకోసం విజ్ఞాపనలు మొదలయ్యాయి. కమిటీ పేరుతో బ్యాంక్ఎకౌంట్ ప్రారంభించారు. శేఖర్, కోశాధికారిగా నియమితుడైన అతడి అత్యంత విశ్వాసపాత్రుడు అరవింద్అగర్వాల్ ఉమ్మడినిర్వహణలో ఉంటుందది. అంత ఎక్కువాకాని, అంత తక్కువాకాని మొత్తంతో ఎకౌంట్

ప్రారంభించారు. జమాఖర్చుల లెక్కల్నిమాత్రం ఎంతో పకడ్బందీగా రాసి ఉంచుకున్నారు. ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థుల జమాఖర్చుల వివరాలకుమల్లే అవి చట్టసమ్మతంగా ఉండే మొక్కుబడి తరహాలో ఉన్నాయనేది... వేరే విషయం. ఇక మిగిలిన డబ్బు ప్రవాహరూపంలో అలా వచ్చి పోతూనే ఉండేది. దాని నియంత్రణ అంతా ఒక్క శేఖర్ చేతిమీదుగానే జరిగిపోయేది.

స్వప్రయోజనాన్ని కాంక్షించే సంపన్నులందరూ ఈ ఉత్సవాన్ని తమ పంట పండించుకునే మహదవకాశంగా ఉపయోగించుకున్నారు. కట్నకానుకలు పుచ్చుకుని స్వేచ్ఛగా మహేంద్రనాథ్ దగ్గరికి —అంటే శేఖర్ ద్వారా —వెళ్ళగలిగే అవకాశం వాళ్ళకి తొలిసారి లభించింది. పంచదార ఉనికి కనిపెట్టి చీమలు ఒకదానినొకటి హెచ్చరించుకుంటూ అటువైపు బారులుతీరి సూటిగా పరుగెత్తినట్టే వాళ్ళుకూడా ఒకరినొకరు హెచ్చరించుకుంటూ పరుగులుతీశారు. అంతే ఉత్సాహంతో తాము చదివించిన కట్నకానుకల వివరాల్ని కేంద్రనేరపరిశోధకవిభాగం (సి.బి.ఐ.) ప్రతినిధికొకరికి తెలియజేశారు. మహేంద్రనాథ్ తమను అనేకసార్లు అనేకవిధాలుగా అవమానించిన విషయం వాళ్ళు మరిచిపోలేదు. ఉభయులమధ్య ఇప్పుడు తాత్కాలికంగా పుట్టుకొచ్చిన ఈ సయోధ్యవల్ల వాళ్ళకాయన ఎంతమాత్రం ఇష్టుడుకాలేదు. అతడి పీడ విరగడవాలనే వాళ్ళు హృదయపూర్వకంగా కోరుకుంటున్నారు. సి.బి.ఐ. ఖరీదైన కానుకల వివరాలన్నింటినీ దండగుచ్చి పెద్దజాబితా తయారు చేసింది. ఆ మేరకు ప్రధానమంత్రే స్వయంగా సి.బి.ఐ.కి ఉత్తర్వులు జారీచేశారు —లేదా జారీ చేసినట్టు వార్తలు వ్యాపించాయి.

అందరినీ అన్నింటినీ సమీకరించడంలో శేఖర్కానీ అతని అనుచరులు కానీ ఏమాత్రం లోపం చేయలేదు. రాచరికపురోజుల్ని తలపించేలా జిగేలుమనిపించే దృశ్యాలతో ఉత్సవం ఆడంబరంగా అట్టహాసంగా జరిపించకపోతే ప్రజలహృదయాలకది గాఢంగా హత్తుకోదని పలువురు సూచించారు. రాచరికం అంతరించిన తర్వాత ప్రజలు పాపం తమను మంత్రముగ్ధుల్నిచేయగల అటువంటి మహాప్రదర్శనలకు నోచుకోలేదు. కొన్ని దశాబ్దాలపాటు ఎవరూ మరచిపోలేని స్థాయిలో ఉత్సవం నిర్వహించాలని అందుకే శేఖర్ అనుకున్నాడు. ఉత్సవానికి సంబంధించిన సూక్ష్మ వివరాలు కానీ, అవి ఎంత భారీఎత్తున జరగబోతున్నాయని కానీ మహేంద్రనాథ్కి తెలియకుండా మాత్రం జాగ్రత్తపడ్డాడు. ఆ మాటకొస్తే ఇప్పుడదంతా తెలిసినా కొంపమునిగిపోతుందనేమీ కాదు. అంధవిద్వేషం, అలివిమాలిన స్వాతిశయం, అస్తిత్వదాహం, ప్రత్యర్థులపై ముఖ్యంగా చౌదరిపై ప్రతీకారేచ్ఛా —అన్నీ కలిసి ఒక్కుమ్మడిగా ముప్పిరిగొన్న మహేంద్రనాథ్ తప్పొప్పుల గురించి ఆలోచించేదశను ఎప్పుడో దాటిపోయాడు. ఇంతకంటె కలిసొచ్చే పరిస్థితి శేఖర్కి వేరే ఉండదు. నిజం చెప్పాలంటే చౌదరికీ ఉండదు.

ముఖ్యమంత్రిజన్మదినోత్సవాల బరువుకింద అధికారయంత్రాంగం నలిగిపోసాగింది. వివిధ శాఖల అధికారులు మొదట్లో మెల్లగా, లోపాయికారీగా తర్వాత తర్వాత బాహాటంగా ఉత్సవ సన్నాహంలో కూరుకుపోయారు. ఏవో చిట్కాలు ప్రయోగించి విరాళాలు వసూలుచేశారు. రకరకాల ఏర్పాట్లలో పాలుపంచుకున్నారు. ఉత్సవానికి సంబంధించిన పనులకు ప్రభుత్వసిబ్బందిని వినియోగించారు. అడ్డగోలు నిర్ణయాలను క్రమ బద్ధంచేశారు. మాట విననివాళ్ళను నయానా

భయానా లొంగతీసుకునే ప్రయత్నంచేశారు. ఏదో ఒక మిష చూపించి వాళ్ళపై చర్య తీసుకోబోయారు. ఒకదానివెంట ఒకటి గొలుసుకట్టుగా జరిగిపోతున్నాయి. చివరలో కొద్దివారాలపాటు అదే ఏకైక ప్రభుత్వకార్యక్రమంగా మారిపోయింది. ఉన్నతస్థాయిలో స్పష్టంగా వ్యక్తమైన దానిప్రభావం క్రమంగా కిందికి ప్రసరించింది. కిందిస్థాయి అధికారులుకూడా ఉత్సవంపేరు చెప్పుకుని గ్రామాల్లో ప్రతిఒకరినుంచి విరాళాలు దండుకున్నారు. ఇదే ఒకవిధంగా మంచి శక్తిమంతమైన ప్రచారంగా పరిణమించింది. తమనుంచి ముక్కుపిండి కక్కించిన విరాళాల పుణ్యమాఅని ప్రజలు ముఖ్యమంత్రిగారి ఘనతను మహబాగా అర్థంచేసుకున్నారు.

జన్మదినోత్సవంరోజున ఇరవైకిలోమీటర్లపొడవున బ్రహ్మాండమైన ఊరేగింపు నిర్వహించాలని శేఖర్వర్గం నిర్ణయించింది. ట్రాన్స్‌పోర్ట్‌కమిషనర్ నొక్కవలసిన మీటలు నొక్కేసరికి జనాన్ని చేరవేయడానికి ఇంధనంతోసహా వందలకొలది వాహనాలు 'స్వచ్ఛందం'గా బారులుతీరి నిలబడ్డాయి. డబ్బుతో మదించిన వర్తకవర్గాలూ, ప్రభుత్వ సంస్థలూ దారిపొడవునా, ప్రతి వందమీటర్లకొకటి చొప్పున, అందమైన స్వాగతతోరణాలు ఏర్పాటుచేశారు —అదికూడా 'స్వచ్ఛందం'గానే, ముఖ్యమంత్రిమీద వెల్లివిరుస్తున్న ఆరాధనాభావంతోనే. ఇక స్థానికచలనచిత్రపరిశ్రమ యజమానులు వివిధప్రదేశాల్లో కళ్ళుచెదరగొట్టే సెట్స్ ఏర్పాటుచేయడంలో ఒకరితోఒకరు పోటీపడ్డారు. మహేంద్రనాథ్‌కు సన్మానం జరగబోతున్న ప్రధానవేదికను మిరుమిట్లు గొలిపే ఓ రంగులప్రపంచంలా తీర్చిదిద్దారు. రాష్ట్ర విద్యుచ్ఛక్తిబోర్డుఅధ్యక్షుల వారినుంచి, చీఫ్ఇంజినీర్లనుంచి ఆదేశాలు అందిపుచ్చుకుని ఎలక్ట్రికల్ పరికరాల డీలర్లు తక్షణమే రంగప్రవేశంచేసి రాత్రికీ పగటికీ తేడా లేకుండా చేసేశారు. అంతేకాదు, భగవంతుడు సృష్టించిన దివారాత్రభ్రమణానికే వాళ్ళు గొప్పగా మెరుగులుదిద్దుతూ ఆ వేదికను బహురంగుల కాంతులతో ఎల్లప్పుడూ వెలుగుతూనేఉండే దేదీప్యమానస్థలంగా తయారు చేశారు. నవాబులు, మహారాజుల ప్రాసాదాలనుంచి పెద్దపెద్ద చాందినీదీపాలను, రకరకాల అలంకరణదీపాలనూ, దీపాల పైకప్పులనూ తెప్పించి మహేంద్రనాథ్ ఇంటిని అలంకరించారు. సూపరింటెండెంట్ ఇంజినీర్ దగ్గర బిల్లులు పెండింగ్‌లో పడున్న పబ్లిక్‌వర్క్స్ కాంట్రాక్టర్లు సొంతఖర్చుమీద మహేంద్రనాథ్ ఇంటిని పునర్నిర్మించి అలంకరించే బాధ్యత తీసుకున్నారు. తన నివాసంలో హఠాత్తుగా ప్రత్యక్షమైన చాందినీదీపాలకు మహేంద్రనాథ్ అభ్యంతరంచెబితే, వాటిని కేవలం ఉత్సవాలకోసమే తెప్పించామని, ఉత్సవం పూర్తికాగానే తిప్పిపంపిస్తామని చెప్పి ఒప్పించారు.

తన హోదా అడుగడుగునా దుర్వినియోగమౌతున్నట్టు మహేంద్రనాథ్‌కు మనసులో తెలుసు. కానీ తన రాజకీయజీవితం మొత్తంలోనే ఒక నిర్ణాయాత్మకయుద్ధం మధ్యలో ఉన్నాడు తాను. ఇప్పుడిక వెనకడుగు వేయలేడు. ఆ క్షణంలో చేసేది లేదు; మౌనంగా ఉండిపోయాడు. ఉత్సవాలకోసం 'ఎరువు' తెచ్చిన ఖరీదైన సామగ్రిలో ఏ ఒకదాన్నీ తిరిగిఇచ్చే ప్రసక్తి లేదని ఆయనకు తెలుసు. ఆయన వాటిని కనుక తన యింటి నుంచి విసిరికొడితే అనుచరులు అమందానందంతో ఒకటొకటిగా తమఇళ్ళకు చేరవేసుకుంటారు. ఏదేమైనా ముఖ్యాంశమేమంటే భారీఎత్తున జరగబోతున్న తన జన్మదినోత్సవంరోజున తన ఇంటి అలంకరణాన్ని వేలాదిమంది

సందర్శిస్తారు. ఇక రాజుగారు ప్రజలనుంచి ఏదైనా 'ఎరువు' తెచ్చుకున్నట్టు అనుకునేవాళ్ళెవరైనా ఉంటారా? ఆయన వాటిని 'సొంతం' చేసుకుంటాడు. రాజుగారికి మనసైతే దేన్నయినా ప్రజలు ఆయనకు కృతజ్ఞతాపూర్వకంగా సమర్పించుకుంటారు. ముఖ్యమంత్రి విషయంలోనూ అంతే అనుకున్నాడు మహేంద్రనాథ్. జరగబోయే ఉత్సవం భయానకమైన మలుపులు తిరగకుండా నిరోధించడం కానీ,శేఖర్‌ని నియంత్రించడం కానీ, ఆయనకింక చేతయ్యే పనికాదు. పరిస్థితి పూర్తిగా ఆయన అదుపు తప్పింది.

ఉత్సవదినం సమీపించినకొద్దీ ప్రజల్లో మెల్లమెల్లగా అలజడి మొదలైంది. ఇందులో కొత్తేమీలేదు. పురాతనకాలంలో శ్రీరామచంద్రమూర్తి ఒక రజకుడు తన పట్టపురాణి సీత శీలాన్ని శంకిస్తూ చేసిన వ్యాఖ్యను చాలా తీవ్రంగా పరిగణించి ఆమెను వనవాసం పంపించాడు. మన ఆధునిక చక్రవర్తి మహేంద్రనాథ్ ధోరణి అలా లేదు. తన జన్మదినోత్సవ సన్నాహంపై విమర్శల జడివాన క్రమంగా పెరుగుతున్నకొద్దీ ఆయన చర్మం మరింత బిరుసెక్కుతోంది. పైగా ఆ విమర్శలుకూడా చౌదరి దుస్తంత్రంలో భాగమే అన్నాడు... నేటి భారతదేశం పురాణకాలంనాటి రామరాజ్యంకాదు. అంతకు ఎన్నోరెట్లు సంక్లిష్టం. వెనకటి సత్యాలూ, సూత్రాలూ ఇక్కడ ఇంకెంతమాత్రం చెల్లవు.

ఒకవేళ రాముడి ప్రత్యర్థులే ఆ రజకుడికేవో ముట్టజెప్పి సీతగురించి అటువంటి వ్యాఖ్య చేయించి ఉంటే? అప్పుడుసైతం అది ప్రజాభిప్రాయమే అవుతుందా? ఆ దుష్ప్రచారం అలా కొనసాగుతూనేఉంటే చక్రవర్తి తన సర్వశక్తులనూ ఒడ్డి దానిని తిప్పికొట్టనవసరంలేదా? అంటే ప్రత్యర్థులను మించినస్థాయిలో ముడుపులు, అధికారదుర్వినియోగం, రాజకీయచాణక్యం — ఇవి తప్ప అందుకు వేరే సాధనాలు ఏముంటాయి? శేఖర్, అతని సహచరులు ఈ జవాబు లేని ప్రశ్నలను అందరిముఖాలమీద గుప్పిస్తున్నారు. తమ అంతఃకరణ స్వచ్ఛంగా ఉంది... తమచేతులు పరిశుభ్రంగా ఉన్నాయి... కనీసం చౌదరి అంతఃకరణ, చేతులు మలినమైనంతగా అవి మలినం కాలేదు. అదీ తమకీ అవతలివాళ్ళకీ ఉన్న తేడా... ఇలా ఉంటోంది వాళ్ళ ధోరణి.

ఈ లోపున ప్రజాభిప్రాయం మరింత ఉధృతిని పుంజుకుంది. రెండుపక్షాలూ ఎవరికి అనుకూలంగా వాళ్ళు ఎంతో ఆర్భాటంగా ప్రచారం చేసుకుంటున్నా అసలునిజం ఆ హడావుడి కింద అణగారిపోలేదు. కుమ్మరిపురుగులా తొలుచుకుంటూ వేలాదిమంది మస్తిష్కాల్లోకి ప్రవేశిస్తూనేఉంది. మహేంద్రనాథ్ మనుషులు వాస్తవాన్ని అణగదొక్కడానికి ఎంతగా ప్రయత్నిస్తే అంతగా దాని విశ్వసనీయత పెరిగిపోతోంది.

శాసనసభ సమావేశాలు జరుగుతున్నాయి కనుక వదంతులు అన్నివైపులా కమ్ముకుంటున్నాయి. ఆ నోటా ఆ నోటా ప్రయాణిస్తూ రకరకాల వక్రీకరణలకు లోనవుతున్నాయి. చివరకు రాష్ట్రంలో అవి ప్రవేశించని గ్రామమే లేదు.

ఉత్సవాలపై రాజకీయవర్గాల్లో ఎడతెరిపిలేని చర్చ. రకరకాల స్పందనలు. కొన్ని అర్థవంతమైనవి. కొన్ని అర్థంలేనివి. ఒకవ్యక్తి ఉత్సవాలకు అనుకూలంగా మాట్లాడుతూంటే, అతనిని వ్యతిరేకించడమే పనిగాపెట్టుకున్న మరోవ్యక్తి యాంత్రికంగా వాటిని వ్యతిరేకిస్తాడు. ఆ వ్యక్తిని

వ్యతిరేకించే మరొకడు మొదటివ్యక్తిని సమర్థిస్తూ ఉత్సవాలకు అనుకూలంగా మాట్లాడతాడు. ఉత్సవాలగురించి అతడికేమీ తెలిసిఉండకపోవచ్చు. తెలుసుకోవాలనికూడా అనుకోడు. వ్యక్తిగతస్థాయిలోనూ వ్యక్తిగతం కాని స్థాయిలోనూ అదేపనిగా జరిగిపోతున్న వాదప్రతివాదాలతో వివాదం మరింత వేడెక్కుతోంది. ఏ వాదం ఎలా ఉన్నా పరిణామతః దెబ్బ తగలబోతున్నది మహేంద్రనాథ్‌కేనని స్పష్టమై పోయింది.

ప్రధాన ఉత్సవానికి కొద్దిరోజుల ముందునుంచే రాజధాని ఉద్రిక్తంగా మారింది. అంతటా ఉత్కంఠ అలముకుంది. మహేంద్రనాథ్ జన్మదినోత్సవం తప్ప జనందృష్టిని మరేదీ ఆకర్షించడం లేదు. ఇదికూడా అనూచానంగా వస్తున్న ధోరణే. రాజకుటుంబంలో జరిగే ప్రతి సంఘటన ప్రజలకు ఆసక్తి రేకెత్తిస్తూనేఉంటుంది. రాజుగారి జన్మదినం, పట్టాభిషేకవార్షికోత్సవం, యువ రాజు జననం, రాకుమారి శోభనం, రాజుగారి పరిపాలనకు సంబంధించిన ఏదో ఒక ఉత్సవం, రాజుగారి సంతానం అస్వస్థత, రాజకుటుంబంలోని సభ్యులెవరైనా పులిని వేటాడిన ఉదంతం... ఏదైనాసరే జనానికి ఆసక్తిగొలుపుతూనే ఉంటుంది. వ్యక్తులూ, హోదాలూ మారినాసరే పాలక, పాలిత సంబంధం ఇంకా కొనసాగుతూనే ఉంది —మరోరూపంలో. జనంలో ఉత్కంఠనీ, ఆసక్తినీ రెచ్చగొట్టేమేరకు శేఖర్ వ్యూహం ఫలించిందనే చెప్పాలి.

అయితే మొత్తంమీద వ్యూహం బెడిసికొట్టిందంటే కారణం ఒకటే. ప్రజాభిప్రాయానికున్న సంక్లిష్ట స్వభావాన్ని అది పరిగణనలోకి తీసుకోలేదు. తాతలనాటి భావాలే ఇంకా కొనసాగుతున్నా, రాజుగారిపట్ల చూపించే విధేయత, ఒక ముఖ్యమంత్రిపట్ల చూపించే విధేయత, రెండూ ఒక లాంటివికావు. ప్రజల అంతరాంతరాల్లో ముఖ్యమంత్రి తమలాంటి మానవమాత్రుడే. రాజుగారు అలాకాదు. 'నా విష్ణుః - విష్ణువుతో సమానుజు' ఉత్సవార్భాటం పైపైన ఉత్కంఠ రేపుతున్నా, లోలోపల మెల్లమెల్లగా దానిపట్ల వ్యతిరేకతా విస్తరిస్తోంది. ఇదంతా వ్యర్థప్రదర్శన అంటూ కొన్ని వార్తాపత్రికలు తీవ్రపదజాలం గుప్పిస్తూ సంపాదకీయాలు రాశాయి. ఆ పత్రికల సంపాదకులు చౌదరి మిత్రవర్గంలో వారేనన్న విషయం సాధారణ ప్రజలకు తెలిసే అవకాశం లేదు. ముఖ్య మంత్రి ప్రతిష్ఠను పైకెత్తడం కోసం ప్రభుత్వపథకాలకు కేటాయించిన లక్షలరూపాయలను ఉత్సవాల నిర్వహణకు మళ్ళించారంటూ గ్రేట్‌ఇండియాటైమ్స్‌లో పరిశోధనాత్మకవార్తలు పరంపరగా రావడం ప్రారంభించాయి. మిగిలిన పత్రికలు వాటిని అందిపుచ్చుకుంటున్నాయి. ఉత్తరాలు, చెక్కులు, ఫైళ్ళలోని నోట్స్, ఇంకా రకరకాల సాక్ష్యాలకు సంబంధించిన ఫోటోలతో పత్రికల మొదటి పేజీలు నిండిపో తున్నాయి. కార్టూనిస్టుల కుంచెలకు చక్కని విందుభోజనం దొరికినట్టయింది.

నిజం చెప్పాలంటే, ఉత్సవకార్యక్రమాల్లో ఏ ఒక్కదానికీ ప్రభుత్వధనం వెచ్చించడం జరుగలేదు. ఖర్చుపెట్టిన డబ్బంతా 'విరాళాల'రూపంలో సేకరించిందే. అయినాసరే, ఈ వాస్తవాన్ని నమ్మడానికి ఎవరూ సిద్ధంగా లేరు. ప్రజాధనాన్ని కొల్లగొడుతున్నట్టే అందరికీ అనిపించింది. వ్యతిరేకత ఒకసారి బయటపడిందంటే అది చూస్తుండగానే అన్నివైపులకూ వ్యాపించిపోతుంది. ప్రత్యేకించి విద్యార్థులు వీధికెక్కి ఉత్సవప్రదర్శనను ఎద్దేవాచేస్తూ ప్రతిచోటా అల్లర్లు ప్రారంభించారు. గుంపులుగుంపులుగా వాహనాల్లో తరలివచ్చి శాసనసభ్యుల హాస్టల్ దగ్గర పెద్దఎత్తున నిరసన

ప్రదర్శనలు జరిపారు. ఆ వాహనాలు ఎవరు సమకూర్చారో ఎవరికీ తెలియదు. పోలీసులు చెదరగొట్టినకొద్దీ మరింతమందితో విరుచుకుపడి వీధిపోరాటాలకు దిగుతున్నారు. ఈ నిరసన అంటురోగంలా అల్లరిమూకలవరకు వ్యాపించిపోయింది. గోడలమీద అంటించిన మహేంద్రనాథ్ రంగురంగుల పోస్టర్లపై పేడపూసి, బురదచల్లి వినోదిస్తున్నారు. అతడి లైంగికలీలలను చిత్రించే అసభ్యకరమైన రాతలు గోడలమీద ప్రత్యక్షమౌతున్నాయి. ఇదంతా చౌదరి పన్నుగడ అని కానీ, వీటికి డబ్బు సమకూర్చేది అతడేనని కానీ అనుమానించినవారు తక్కువ. అయితే మహేంద్రనాథ్‌కి ఈ విషయాలన్నీ తెలియవు. అనుచరులు ఆయన దృష్టికివన్నీ రాకుండా తగిన జాగ్రత్త తీసుకున్నారు. మొత్తంమీద ఉత్సవ దినం సమీపించినకొద్దీ వాతావరణం మరీమరీ ఉద్రేకభరితంగా మారిపోతోంది.

ఈ సరికొత్త అలజడిని శేఖర్ గమనించకపోలేదు. వీటివెనుక చౌదరి పన్నాగం ఉందని కూడా అతనికి తెలుసు కానీ ఈ దశలో హడావుడి తగ్గించడానికి తాను చేయగలిగిందేమీ లేదని కూడా అనుకున్నాడు. (నిజం చెప్పాలంటే ఏదైనా చేయాలనికూడా అతడు కోరుకోవడంలేదు) శేఖర్ సొంతశిబిరంలోనే రకరకాల సందేహాలు పుట్టుకొస్తున్నాయి. అతడిమీద రకరకాల ప్రశ్నలు వచ్చిపడుతున్నాయి. మహేంద్రనాథ్‌కు శేఖర్ ఎటువంటి ప్రతిష్ఠ తెచ్చిపెట్టాలనుకుంటున్నాడని గుచ్చిగుచ్చి అడుగుతున్నవాళ్ళూ ఉన్నారు. అందులోని భావం స్పష్టమే. శేఖర్ ట్రోజన్‌హార్స్‌లా (అనుకూల శత్రువు) వ్యవహరించడం లేదు కదా?... ప్రశ్నలేతప్ప జవాబులు లేవు. దాంతో జవాబులేని ఎన్నో ప్రశ్నల్లానే అవికూడా ప్రాముఖ్యం సంతరించుకుంటున్నాయి. శేఖర్ భయపడుతున్నది ఒకందుకే... జరిగిన అల్లరిచాలు, ఇక మొత్తం వ్యవహారాన్ని కట్టిపెట్టండని మహేంద్రనాథ్ ఏ క్షణంలో ఆదేశిస్తాడోనని.

అందుకే రకరకాల మార్గాలనుంచి తన ప్రయత్నాలు ముమ్మరంచేశాడు. ఎందరో శాసన సభ్యుల మద్దతు కూడగట్టుకోడానికి యత్నించాడు. వారిని రకరకాల ఉపసంఘాల్లో నియమించి డబ్బు లావాదేవీలు వాళ్ళ చేతులకే అప్పగించాడు. తాము సాక్షాత్తూ ముఖ్యమంత్రి తరఫున సాధికారికంగానే వ్యవహరిస్తున్నామన్న భావన వాళ్ళకి కలిగించాడు. ఒక్కముక్కలో చెప్పాలంటే, మంచిచెడు అన్న తేడా లేకుండా కార్యక్రమానికి సంబంధించిన అన్ని వ్యవహారాల్లో వాళ్ళకు ప్రమేయం కలిగించాడు... చాలామంది విషయంలో ఈ ఎత్తుగడ పారింది కానీ కొందరి విషయంలో విఫలమైపోయింది. ఇంకా మరికొందరి విషయంలో ఎదురుతన్నింది. వాళ్ళలో ఆనంద్ ఒకడు.

శేఖర్, ఆనంద్ చాలా విషయాల్లో సమవుజ్జీలుగా కనిపిస్తారు. ఇద్దరూ వాగ్ధాటి ఉన్నవాళ్ళు. యువకులు. చురుకుతనం, తెలివితేటలు, కార్యతత్పరత మూర్తీభవించిన వాళ్ళు. కానీ విశ్వాసాలూ, ఆశయాలూ అలాఉంచి ఉద్దేశాల్లోనూ, కార్యసరళిలోనూ ఇద్దరూ ఉత్తరదక్షిణ ధ్రువాలు. శేఖర్‌కి ఫలితంమీదే నమ్మకం ఎక్కువ. దానిని సాధించేందుకు ఉపయోగించే సాధనాలు పరిశుద్ధంగా ఉండాలన్న వాదనను అర్థరహితవాదంగా కొట్టిపారేస్తాడు. జీవితంలో నువ్వు పైపైకి వెళ్ళగలిగాడంటే అందుకు తగిన యోగ్యతలన్నీ వాడికి ఉన్నట్టే జనం ఊహించుకుంటారు... అందులో నువ్వు

విఫలమయ్యాడా వాణ్ణి తిరస్కరిస్తారు, తృణీకరిస్తారు... పైకి చేరుకునే శక్తియుక్తులు వాడికి లేవని తీర్మానిస్తారు... కనుక శిఖరానికి చేరుకునేవరకు వాడు నీతులూ, ధర్మాలూ పట్టుకుని వేళ్ళాడడం తెలివితక్కువంటాడు శేఖర్. అక్కడికి చేరుకున్నాక జనం ఏ నీతి నువ్వు బోధించినా జనం వింటారు. కొండకొనను చేరుకునే ప్రయత్నంలో ఉన్నప్పుడుమాత్రం, తాను తర్వాత బోధించబోయే నీతికి అనుగుణంగా నడచుకోవలసిన అవసరంలేదు. నడచుకోవాలనుకున్నాడా... వాడింకెప్పటికీ శిఖరానికి చేరుకోలేడు... ఈ మహాతత్వాన్ని, లేదా మహా అతత్వాన్ని త్రికరణశుద్ధిగా అనుసరిస్తూ ఉంటాడు శేఖర్ త్వరలోనే ఒకానొక ఉచ్ఛస్థితికి -రాజకీయవాదులందరూ అత్యంత సమర్థుడైన విధ్వంస మూర్తిగా పరిగణించేస్థాయికి – అతడెదిగిపోయాడు. ఈ క్రమంలో చాలా బిరుదులుకూడా సంపాదించుకున్నాడు -రాజకీయటార్పిడో, వక్రబుద్ధి, అంత్యక్రియల నిపుణుడు, శివుడి మూడోకన్ను, భస్మాసురహస్తుడు –ఇలా ఎన్నెన్నో బిరుదులు. ఇంతటి ఘనకీర్తి సంపాదించు కున్నప్పటికీ–లేదా ఈ కీర్తి సంపాదించుకున్నందుకే కావచ్చు – అతడికున్న గిరాకి అంతా ఇంతా కాదు. ఎవరూ అతనిని నమ్మరు. అయినాసరే అతని అవసరం ఎవరికో ఒకరికి ఏదో ఒక సందర్భంలో ఉంటూనే ఉంటుంది.

ఆనంద్ తరహా పూర్తిగా వేరు. అతని పనిలో తనదిగా కనిపించే ఆకాంక్ష ఏదీ లేదు. అలా లేకపోవడం విచిత్రంగానూ అసహజంగానూ కనిపిస్తూ ఉంటుంది. పైగా అది అర్థరహితమూ, తప్పూ అనికూడా అతని శ్రేయోభిలాషులెందరో వ్యాఖ్యానిస్తూ ఉంటారు. ఎల్లకాలం అతను ఆకాంక్షకు దూరంగా ఎందుకుండాలి? ఆకాంక్ష ఉండడంలో తప్పేమీలేదని అందరూ అంటారు. అయితే ఆకాంక్ష అంటే వాళ్ళు తాము మామూలుగా అనుకునే అర్థంలోనే తీసుకునేవాళ్ళు. ఆనంద్‌కు రాజకీయ ఆకలిదాహాలు లేకపోయేసరికి, ఆ నిరాసక్తత వెనుక, కపటబుద్ధి ఏదో ఉన్నట్టు ఊహించు కునేవారు. ఒకరి ఆకాంక్ష అనివార్యంగా వ్యక్తిగత అధికారదాహంగానే ఉండవలసిన అవసరం లేదన్న సత్యాన్ని వాళ్ళు అంగీకరించడానికి సిద్ధంగా లేరు. ప్రజల కోసం ఎవరైనా ఏదైనా చేయాలనుకున్నప్పుడు, చేయదగునని భావిస్తున్నప్పుడు, అదికూడా ఆకాంక్షేనన్న వాస్తవాన్ని వాళ్ళు అంగీకరించరు.

ఓ రోజు సాయంత్రం శాసనసభ్యులహాస్టల్‌లో శేఖర్ ఆనంద్‌ను నిలేసి అతనిలో పైకిరావాలన్న తపన లేకపోవడాన్ని ఎత్తిచూపిస్తూ ఝాడించడం ప్రారంభించాడు.

'అటువంటి తపన ఉండడం తప్పని నేనెప్పుడూ అనలేదే!' అన్నాడు ఆనంద్.

'మరెందుకలా తప్పించుకుని తిరుగుతున్నావ్? అలా పలాయనవాదిలా ఎందుకు మారావ్?' శేఖర్ గట్టిగా కేకలు అందుకున్నాడు. ఇవేళ ఎలాగైనా అతని సంగతి తేల్చాలని నిశ్చయించు కున్నట్టు కనిపిస్తున్నాడు.

'ఈ రోజు నావెనక పడ్డావేమిటి శేఖర్? అయినా నాకు అధికారకాంక్ష లేనందువల్ల నీకొచ్చిన ఇబ్బందేమిటి?' ప్రశ్నించాడు ఆనంద్.

'ఎందుకంటే, ఇక్కడ చాలామంది తెలివితక్కువ దద్దమ్మలు నీ మార్గదర్శనంకోసం ఎదురుచూస్తున్నారు కనుక' శేఖర్ ప్రతి మాటనూ కోపంగా ఒత్తిపలుకుతూ అన్నాడు. ఆ మాటల్లో పరిహాసధోరణికూడా నగ్నంగా బయటపడిపోతోంది.

అనురాగవైముఖ్యాలు కలగలిసిన సంబంధం వాళ్ళిద్దరిది. ఒకరితో ఒకరు చేతులు కలప గలిగితే ఎటువంటి అద్భుతాలనైనా సాధించగలిగిన ప్రజ్ఞావంతులు ఇద్దరూ. కానీ అలా చేతులు కలపడమే అసాధ్యమైన విషయం. అయినా ఒకరి శక్తియుక్తులమీద మరొకరికి ఒకమేరకు గౌరవభావం.

'చూడు మిత్రమా! నేనంటే నీకు ఇష్టంలేదని నాకు తెలుసు. అయినా నన్ను కాదనలేవు. ఇప్పుడు మనం ఎంతో క్లిష్టపరిస్థితిలో ఉన్నాం. ఈ ఉత్సవాల నిర్వహణ అదుపుతప్పిపోతున్నట్టు ఒప్పుకోడానికి నేను సందేహించడం లేదు. తదుపరి కర్తవ్యం నాకు తోచడంలేదు. రాష్ట్రం కుక్కలు చింపిన విస్తరవుతోంది. ఈ ముసలి జలగలు ఒకరి రక్తం తాగాలని మరొకరు తపించు పోతున్నారు. చివరకు ఇద్దరూ రక్తహీనులైపోతున్నారు. నిక్కచ్చిగా చెప్పాలంటే మహేంద్రనాథ్ కానీ, అవతల చౌదరి కానీ ఏ చావు చస్తారో నా కనవసరం. ఏదో దుర్ఘటన జరిగి ఇద్దరూ గుటుక్కుమంటేనే ఈ రాష్ట్రం బాగుపడుతుందని నేను నమ్ముతున్నాను. కానీ దురదృష్టవశాత్తు అటువంటి దుర్ఘటనలు మనం రమ్మన్నప్పుడు రావు. మనం వేరేమార్గం ఆలోచించాలి...' నచ్చ జెప్పే ధోరణిలో అన్నాడు శేఖర్.

'ఎటువంటి మార్గం?' ప్రశ్నించాడు ఆనంద్.

'నేను చెప్పగలిగితే ఇంక సమస్యేముంది?' మండిపడ్డాడు శేఖర్. 'వాస్తవం ఒకటే. ఆ ఇద్దరు దుర్మార్గుల మధ్య కుడియెడమలంటూలేవు. ఇద్దరూ కలిసి ఉన్ననాడు రాష్ట్రంలోని ఉత్తమ రాజకీయవాదులందరినీ నాశనంచేశారు. ఇప్పుడు ఇద్దరూ ఒకరి అంతు మరొకరు తేల్చుకునే ప్రయత్నంలో ఉండి, ఇలాకూడా రాష్ట్రాన్ని ధ్వంసంచేస్తున్నారు. మనెవరమూ ఆ ఘర్షణను ఆపలేం, నన్నడిగితే ఆపకూడదు కూడా. ఏదో ఒక పక్షంలో చేరి ఇద్దరూ బూడిదయ్యేవరకూ నిప్పు ఎగదోస్తూనే ఉండాలంటాను.'

'ఆ ప్రయత్నంలో ఇంకా ఎంతమంది బూడిదవుతారో? ఆలోచించావా?' ఆనంద్ అడిగాడు.

'నిజమే, అదికూడా జరుగుతుంది. కానీ ఈ వెర్రిమొర్రి ప్రజాస్వామ్యంనుంచి పుట్టుకొచ్చిన ఆ దెయ్యాల్ని వదిలించుకోడానికి సమాజం ఆపాటి మూల్యం చెల్లించుకోక తప్పదనే నే నను కుంటున్నాను.'

కొద్దిసేపు నిశ్శబ్దం. శేఖర్ కోపతాపాలను జీర్ణించుకోడానికి ఆనంద్ ప్రయత్నిస్తున్నాడు. దానిలో తాజాదనం కలిగిన మొండిధైర్యమూ ఉంది, మనిషిని కుంగదీసే నిరాశా నిస్పృహలూ ఉన్నాయి.

'చూడు. నీతో నిక్కచ్చిగా సూటిగా మాట్లాడదల్చుకున్నాను' క్షణకాలం ఆగి అన్నాడు శేఖర్. 'కేవలం మనిద్దరిమధ్య మాటగా చెబుతున్నాను. దీన్ని నువ్వు మనిద్దరివరకే ఉంచుతావని నాకు

తెలుసు. ఈ వ్యవహారంలో మిగిలినవాళ్ళకంటె మనిద్దరి ప్రయోజనాలే ఎక్కువగా ఇమిడిఉన్నాయి; దీని భావం తెలుసుకున్నావనుకుంటాను. ఈ ఒక్క సందర్భంలో, అంటే కేవలం ఈ ఒక్క ప్రశ్నమీద మనిద్దరం కలిసి పనిచేయలేమా? ఆ తర్వాత కావాలనుకుంటే ఎవరిదారిలో వాళ్ళం సాగిపోవచ్చు. నువ్వు ఒప్పుకుంటే రాజకీయంగా మన పంట పండుతుంది. ఈ జారుడుబల్ల రాజకీయాల్లో ఏమేరకు నిశ్చితభవిష్యత్తనేది సాధ్యమో ఆ మేరకు మనిద్దరి భవిష్యత్తుకు ఢోకా ఉండదు... ఇంకా స్పష్టంగా చెప్పాలంటే మనిద్దరికీ మంత్రివర్గంలో చోటుదొరుకుతుంది... ఇంకేవైనా ప్రశ్నలున్నాయా?'

'ఒకే ఒకటి' అన్నాడు ఆనంద్ గుసగుసగా. 'ఇందులో ప్రజలకు ఒరిగేదేమిటి?'

'నీ మూర్ఖత్వానికి అంతూపొంతూ లేనట్టుంది' శేఖర్ విరుచుకుపడ్డాడు. 'మిత్రమా, ఇవి కేవలం అధికారరాజకీయాలు. ఈ కశ్మలంలోకి ప్రజల ప్రసక్తి ఏముంటుంది? మహేంద్రనాథ్, చౌదరి —ఇద్దరిలో ఎవరు ఎక్కువ సోషలిస్టో తెలుసుకోవాలనుకుంటున్నావ్. అంతేనా?'

'నువ్వు నా ప్రశ్నను వికృతంగా చెప్పావు. ఐనా నా ప్రశ్న నీకు సరిగానే అర్థమైందనుకుంటున్నాను' అన్నాడు ఆనంద్.

'జవాబు తేలికగానే చెప్పుకోవచ్చు. ఇద్దరూ సోషలిజానికి బద్ధశత్రువులే. అయినా సోషలిజం గురించి పగలూరాత్రీ ఊకదంపుడుగా మాట్లాడడంలో ఇద్దరూ ఆరితేరినవాళ్ళే. పేదలు, అణగారినవర్గాల గురించే తప్ప మహేంద్రనాథ్ మరోమాట మాట్లాడడు. గొప్ప సోషలిస్టు స్ఫూర్తితోనే తాను వందమంది ఆడవాళ్ళతో పడుకున్నాననికూడా ఆయన ఏదో ఒకరోజు ప్రకటించుకున్నా ఆశ్చర్యం లేదు!... ఒక్కమాట చెబుతా విను ఆనంద్! ఈ దిగజారినమూకలో సోషలిస్టు ఆదర్శాన్ని చూడాలనే ప్రయాసలో నిన్ను నువ్వే మోసగించుకుంటున్నావ్. అదంతా మరిచిపోయి తెలివి తెచ్చుకో. నీకిప్పుడు తారసిల్లింది మరొకరకమైన విషయమనేది దయచేసి అర్థంచేసుకో.'

'ఒప్పుకుంటాను శేఖర్! మన రాష్ట్రనాయకత్వం సోషలిస్టుసిద్ధాంతానికి కట్టుబడి ఉన్నదన్న నమ్మకం నాకు ఏ కోశానా లేదు... అయినా నువ్వంటున్నదేమిటో నాకు బోధపడడం లేదు.'

'నే నంటున్నది స్పష్టంగానే ఉంది. ఆ దెయ్యాలపీడ వదిలించడానికి మనిద్దరం కలిసి పనిచేయాలి.'

'ఆ తర్వాత...?'

'ఆ తర్వాత ప్రజలు సుఖంగా ఉంటారు. ఏం! ఆ విషయంలో నీకేమైనా సందేహమా?'

'నిజంగా సుఖంగా ఉంటారా?'

'నీ లాజిక్కంతా ఏమైపోయింది? ఈ దెయ్యాల్ని వదిలించుకోవాలనే అభిప్రాయంతో నువ్వూ ఏకీభవిస్తున్నావ్. దానికదే ఒక ఘనవిజయం కాదా?'

'దానికదే ఘనవిజయమే. అయితే చౌదరీ, మహేంద్రనాథ్‌లతోనే దెయ్యాలు అంతరించి పోతాయను కుంటున్నావా? వాళ్ళ స్థానంలో మరో రెండు క్షుద్రదెయ్యాలు పుట్టుకురాబోవని

నువ్వెలా చెప్పగలవ్? అప్పుడు మళ్ళీ నీ ప్రయత్నాలు ప్రారంభిస్తావా? జీవితాంతం అదే చేస్తూ ఉంటావా? ఎవరి లాజిక్ అర్థరహితంగా ఉంది? నీదా నాదా?'

శేఖర్ ఇరుకునపడ్డట్టు కనిపించాడు. ఆనంద్ కేవలం నకారాత్మ ధోరణితో ఆలోచిస్తున్నాడను కున్నాడు. రేపటిగురించి, ఎల్లుండిగురించి ఆలోచించడానికి ముందు, ఈనాటి పరిస్థితిని ఎలా ఎదుర్కోవాలో ఆలోచించుకోవాలికదా! పగటికలలు కంటున్న ఈ మూర్ఖుడు ఇంత చిన్న నిజాన్ని ఎందుకు గ్రహించడు? చివరకు 'ఒకమాట అడగనా? రాష్ట్రం ఇప్పుడెదుర్కొంటున్న దుస్థితికి నువ్వు చూపించే పరిష్కారమేమిటి?' అన్నాడు శేఖర్.

'ఆ ప్రశ్నే సరైంది కాదని నా ఉద్దేశం. నువ్వెంతసేపూ ఒక తాత్కాలిక పరిస్థితిని తలచు కుని దానికే పరిమితమైపోయి ఆలోచిస్తూ కలవరపడుతున్నావు. అందువల్ల నువ్వు సాధించగలిగిందేమీ లేదు. ఒకవేళ.. మహేంద్రనాథ్, చౌదరి ఇద్దరూ ఎలాగో రంగంమీంచి తప్పుకున్నారనుకో... నీ కార్యక్రమం అంతా అర్థంతరంగా ఆగిపోతుందని నా ఉద్దేశం. అవునా కాదా?'

'అయితే కావచ్చు. కానీ ఊరికే అనుకోమంటే ఏమిటి ప్రయోజనం? ఉన్నచోటే ఉండి పోయి ఎన్నైనా అలా అనుకుంటూనే ఉండచ్చు...'

'నీ ఆలోచనలోని లోపాన్ని ఎత్తిచూపించడానికే నేనలా అన్నాను శేఖర్! నాకు తోచినంత వరకూ, అది సక్రమమైన ఆలోచన కాదు. నా దృష్టిలో రాజకీయవాదులు దేవతలూకారు, దెయ్యాలూకారు. నువ్వన్నట్టు వాళ్ళిద్దరూ దెయ్యాలే అయినప్పటికీ నా అనుకూలాన్ని బట్టి ఆ యిద్దరిలో ఒకరి పక్షం వహించవలసిన అవసరం నావరకు లేదు. అలాగని ఏమీ చేయక తటస్థంగా ఉంటానని కూడా అనుకోవద్దు. ఈ దెయ్యాల్నికూడా నేను ప్రజలదృక్కోణంనుంచి చూసే అంచనావేస్తాను. అంత పైశాచికప్రవృత్తిలోకూడా ప్రజలకేమైనా మంచిచేస్తున్నారా అని చూస్తాను. నా ఉద్దేశంలో ఇదికూడా ఒక కొలమానమే. కనుక ఏదో ఒక రాజకీయమార్గం పైకి తేలేవరకూ నా తీర్పును రిజర్వ్ చేసుకోవడమే నాకిష్టం. ఈలోపల పదవులకోసం నేను తొందరపడను.'

చివరిమాట శేఖర్‌కు బాగా గుచ్చుకుంది. 'అంటే నీ ఊహ... నేను...?' కోపంగా ఏదో అనబోయాడు.

'ఊహ దేనికి? ఇప్పుడే చెప్పావుగా? స్పష్టంగా కనిపిస్తూనే ఉంది.' ఆనంద్ అంతే వాడిగా అన్నాడు. 'నేనుకూడా నీతో ఒకేఒకసారి నిక్కచ్చిగా నిర్మొహమాటంగా మాట్లాడితే నువ్వేమీ అనుకోవుకదా శేఖర్? నిజంగా నీ ప్రయత్నమంతా ఆ దెయ్యాల్ని తరిమికొట్టడానికేనా? గుండె మీద చేయివేసుకుని చెప్పు? ఇవి కేవలం అధికారరాజకీయాలని నువ్వే ఒప్పుకుంటూ అందులోకి ప్రజల్ని ఎందుకు లాగుతున్నావ్? శాసనసభాపక్షం అభీష్టానికి వ్యతిరేకంగా అందులో కృత్రిమ మైన చీలిక ఎందుకు తెచ్చిపెడుతున్నావ్?'

ఒక నిముషం ఆగు... ఆ మాట ఎందుకంటున్నావ్?'

'మహేంద్రనాథ్, చౌదరి ఇద్దరికిద్దరేననీ, ఏ ఒకరినో ఎంచుకునే ప్రశ్న లేదనీ నువ్వే అన్నావా లేదా? మరి ఎవరో ఒకరిని ఎంచుకోమని ప్రతి ఎం.ఎల్.ఏ మీద ఎందుకు ఒత్తిడితెస్తున్నావ్?

ఒకమాట చెబుతా విను శేఖర్. నేను చెబుతున్నది నీకు బాగా గుచ్చుకుంటే గుచ్చుకోవచ్చు. నువ్వు చేస్తున్నదానికీ, ఆ దెయ్యాలమధ్య యుద్ధానికీ ఏమీ సంబంధం లేదు. నీది కేవలం అతితెలివితోకూడిన అవకాశవాదం -దానికి నువ్వేటువంటి ముసుగు తొడిగినా!'

'నువ్వన్న ఆ మాట కర్థమేమిటి?'

'దానర్థం మామూలు భాషలో చెప్పాలంటే మహేంద్రనాథ్ -చౌదరి మధ్య ఉన్న ఘర్షణను ఒడుపుగా ఉపయోగించుకుని మంత్రిపదవిని గుంజుకోవాలనే ఉద్దేశంతోనే ఈ నాటకమంతా ప్రారంభించావు. నీ ఒకడివల్ల సాధ్యం కాదనుకుని ఇప్పుడు నన్నుకూడా లాగుతున్నావ్... నా మీద మండిపడకు, నిన్ను నేనెంత మాత్రం నిందించడం లేదు. ఎంతోమంది చేసేదే నువ్వూ చేస్తున్నావ్. ఇందుకు ఇష్టపడని శాసనసభ్యుల్నికూడా బరిలోకి లాగే నీ ప్రయత్నాన్నే నేను వ్యతిరేకిస్తున్నాను. నీ కపటం కొంచెమైనా అర్థంచేసుకోలేని అమాయకులు వాళ్ళు. మరీ అంత నిర్దయ పనికిరాదు నీకు.'

ఆనంద్ వాదనకు శేఖర్ నిశ్చేష్టుడయ్యాడు. అయితే ఆనంద్ అంత నిర్మొహమాటంగా అంటున్న ఆ మాటలవెనుక దురుద్దేశం కానీ, తనపట్ల వైముఖ్యం కానీ లేవని అతడికి తెలుసు. తన ఆయువు పట్టు కదిలి పోయేంత స్పష్టంగా ఉన్న ఆ మాటలవెనుక సానుభూతినికూడా అతడు పోల్చుకోగలిగాడు.

సంభాషణ ఇక ముందుకుసాగే అవకాశం కనిపించలేదు. శేఖర్ వెళ్ళిపోడానికి లేచి నిలబడ్డాడు. 'మంచిది. ఇప్పుడు నీ ఉద్దేశాలు తెలిశాయి. సరే ఆ విషయం అలా ఉంచు. జరుగుతున్న ఈ గొడవను చూస్తే నీకేమనిపిస్తోంది! దీనికి అంతూపొంతూ ఉంటుందంటావా?' అడిగాడు.

'మనం రాజకీయాల్లో చాలాకాలంగా ఉంటున్నాం. మనం కల్పించే అడ్డుతెరలనన్నింటినీ చీల్చేసి అసలు నిజాన్ని ప్రజలు తమదైన పద్ధతిలో స్పష్టంగా కనిపెట్టగలిగిన సందర్భాల్ని మనం ఎన్ని చూడలేదు? ఉదాహరణకు ఇప్పుడు నువ్వు తలపెట్టిన ఈ జన్మదినోత్సవాన్నే తీసుకో. దానివెనుక ఎటువంటి తార్కికతా లేదు. అయితే అది జనం కళ్ళకు క్షణకాలం మిరుమిట్లు గొలిపితే గొలపవచ్చు. అదిక్కడి రాజకీయవర్గాల్ని మోసగించడానికి పన్నిన పన్నుగడ. మహేంద్రనాథ్‌కి రాష్ట్రంలో ఎంతో ప్రజాదరణ ఉంది కనుక ఆయన జోలికి తాము వెళ్ళలేమనీ, వెళ్ళకూడదనీ కేంద్రనాయకులు భావించాలని కూడా నువ్వు కోరుకున్నావు. ఈ ఆటంతా నీఅంతట నువ్వే ప్రారంభించావు. బండి సక్రమంగా నడిచినంతవరకూ ఈ నాటకాన్ని నీలోనే దాచుకుని ఒక్కడివే నడిపించావు.... ఫలితం వక్రించడం ప్రారంభమయ్యేసరికి నీ ఏకపాత్రాభినయాన్ని దేశభక్తి ఉద్యమంగా పరిణమింపజేయా లనుకున్నావు. ఇటువంటి ఉపాయాలు ఒక్కొక్కసారి ఫలిస్తాయని నాకూ తెలుసు. నీ విషయంలో బెడిసికొట్టింది, అది నీ దురదృష్టం. నీ అంతట నువ్వే రాజకీయచక్ర బంధంలో ఇరుక్కుపోయావు. బయటపడడానికి ఏమైనా చేస్తావిప్పుడు ..... నేనన్న మాటల్లో తప్పేమైనా ఉందా శేఖర్?'

'నీ ఊహాశక్తి పుంజాలుతెంచుకుని పరుగెడుతోందిలే. నేనెందులో ఇరుక్కుపోయినా నా అంతట నేనే బయటపడగలను. నాకెవరి సహాయం అక్కర్లేదు' శేఖర్ అక్కసుగా అన్నాడు.

'కోపం తెచ్చుకోకు శేఖర్. నిన్ను నొప్పించడం నా ఉద్దేశంకాదు. మహేంద్రనాథ్ జన్మదినం వస్తుంది, వెళ్ళిపోతుంది కానీ అదో దుష్ట సంప్రదాయంగా మిగిలిపోతుందని పిస్తోంది. ఈ వ్యవహారంలో నా సహాయాన్ని ఆశించకు. ఈ ఘట్టం అయిన తర్వాత కావాలంటే పరిస్థితిని సమీక్షించుకోవచ్చు. రోజులు ఎప్పుడూ ఒకలాగే ఉండవు కదా!'

'అంటే నీమార్గాలన్నీ తెరిచే ఉంచుకోవాలనుకుంటున్నావన్న మాట?' శేఖర్ యధాలాపంగా అన్నట్టు ధ్వనింపజేస్తూ అన్నాడు. అతడి ముఖంలో మాటలో ఓడిపోయానన్న భావం స్పష్టంగా వ్యక్తమౌతోంది.

'నిజం చెప్పాలంటే ఈ వ్యవహారంలో నాకెటువంటి మార్గమూ కనిపించడంలేదు శేఖర్.'

'నీ స్నేహితులు అడిగితే వాళ్ళకి నువ్వేం చెబుతావ్?'

'అడిగినప్పుడు ఏంచెప్పాలో నాకు తెలుసుననే అనుకుంటున్నాను. మహేంద్రనాథ్, చౌదరిలలో ఎవరో ఒకరిని ఎంచుకోలేని పరిస్థితి ఎప్పటికీ ఉంటుందని నేననుకోను. ఎంచుకునే రోజు తప్పకుండా వస్తుంది. అయితే జన్మదినోత్సవంలాంటి అంశాలమీద కాదు. ఇటువంటి ముసుగు యుద్ధాల వల్ల ప్రయోజనం లేదు. ఆయా అంశాల ప్రాతిపదికమీద తగిన, అర్థవంతమైన రాజకీయ పృథక్కరణకు మనం కృషిచేయాలని నా ఉద్దేశం.

'సిద్ధాంతాలపొడ ఏమాత్రం గిట్టని ఆ యిద్దరితో రాజకీయ పునరేకీకరణ సాధ్యమౌతుందని నువ్వెలా అనుకుంటున్నావో? ఇంతకంటె అమాయకత్వం ఉంటుందా?'

'నీతో నే నేకీభవించలేను శేఖర్. పరిస్థితులు తప్పకుండా పునరేకీకరణకు దారితీయిస్తాయి.'

'నీ కలల్ని నిజంచేయమని ఆ భగవంతుణ్ణి వేడుకుంటానులే. ఏమైనా నువ్విచ్చిన సలహాలకు కృతజ్ఞుణ్ణి' శేఖర్ వ్యంగ్యంగా అన్నాడు. ఓసారి చుట్టుపక్కల పరికించి, మహేంద్రనాథ్‌వర్గంలోని ఇరువురు శాసనసభ్యులు అటువైపు రావడం గమనించి మారుమాట్లాడకుండా అక్కడినుంచి కదిలి వాళ్ళవైపు అడుగులు వేశాడు.

# 17

మినిస్టర్ చౌదరి తన అధికారనివాసంలోని విశాలమైన పచ్చికబయలులో పచార్లు చేస్తున్నాడు. ఒక బంతిని మాటిమాటికీ దూరంగా ఉన్న పూలమొక్కలవైపు విసురుతున్నాడు. తాను పెంచుతున్న అల్సేషన్ కుక్క ప్రతిసారి దాన్ని తీసుకొస్తోంది. బంతిని నోటకరచుకుని వస్తున్న కుక్కనుచూసి అది దాదాపు ఓ ఫుట్‌బాల్ ప్లేయర్‌లా మారిందనుకున్నాడు ప్రశంసాపూర్వకంగా. ఎంతో తెలివిగా చేసే దాని విన్యాసాలు చౌదరికి ఎంతో ఆనందం కలిగిస్తూ ఉంటాయి. చాలాకాలం క్రితం అతనికి అంగవైకల్యంతో ఒక బిడ్డపుట్టింది. తన యవ్వనం ప్రారంభదశలో అంటించుకున్న కొన్ని లైంగికరోగాలే అందుకు కారణమని అందరూ చెప్పుకున్నారు. బిడ్డ చనిపోయింది. అప్పటినుంచి చౌదరి అల్సేషన్లపై మక్కువ పెంచుకుంటే అతని భార్య నళినీదేవి బంధువుల పిల్లలపై మాతృప్రేమ చూపిస్తూ సంతృప్తిపడుతోంది. తను గొడ్రాలిగా మిగిలిపోవడానికి కారణమైన భర్తను లోలోపల ఆమె తిట్టుకుంటూనే ఉంటుంది. భర్త ఉండికూడా విధవరాలినై పోయాననుకుంటుంది. అయితే హిందూగృహిణిస్వభావానికి తగినట్టుగా ఆమె గౌరవపూర్వకమైన ప్రేమతోనో లేదా ప్రేమపూర్వకమైన గౌరవంతోనో భర్తను చూస్తూనే ఉంది.

ఆ రోజెందుకో చౌదరి బంతి ఆటమీద అంతగా దృష్టి లగ్నం చేయలేకపోతున్నాడు. బంతిని తీసుకురావడం అల్సేషన్‌కి కూడా అంత ఉల్లాసం కలిగించడంలేదు. యజమాని బంతిని మరీ మరీ అన్యమనస్కంగా విసురుతున్నాడు. కుక్కకు చికాకు పుట్టే అంత. నేడేదో అనర్థం జరిగి ఉంటుందని కుక్క పసిగట్టింది. చివరకు చౌదరి బంతి విసరడమే మానుకున్నాడు. ఆల్సేషన్ బంతినొకసారి మూచూసి నాలుక వేలాడదీసుకుంటూ చెవులు వాల్చుతూ యజమానివైపు చూసింది. ఆ తరువాత మానవమాత్రుల అయోమయ అతర్క్య వైఖరిని నిరసిస్తూ కలవరపడుతూ అడుగులో అడుగు వేస్తూ ఇంట్లోకి వెళ్ళిపోయింది.

తన లోపల ఎక్కడో తెలియని ఏదో బాధ ఉండుండి సలుపుతున్నట్టు చౌదరి అశాంతితో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. తన రాజకీయభవిష్యత్తును సమీక్షించుకున్నకొద్దీ అతని బుర్రవేడెక్కిపోతోంది. ఇతరుల పథకాలు విజయాన్ని సాధించి తాను స్థిరపడే తన అవకాశాలను వమ్ము చేయకముందే తానేదైనా చేయవలసిన సమయం వచ్చిందని నిశ్చయించాడు. ఇది వరకే చాలాకాలం తాను మహేంద్రనాథ్ తాళానికి అనుగుణంగా నృత్యం చేస్తూ వచ్చాడు.

ముఖ్యమంత్రిగా మహేంద్రనాథ్‌ను ఆకాశానికెత్తడానికి తాను ఢిల్లీ ముఖ్యులతో కలిసి రచించి అమలు చేసిన పథకాలన్నీ తాననుకున్నట్టే ఇటీవల ముఖ్యమంత్రి తలకు బాగా ఎక్కిపోయి, తన పాచిక బాగా పారిందని చౌదరి గమనించాడు. రసాభాసగా ముగిసిన జన్మదినోత్సవమే ఇందుకు నిదర్శనం. ఇప్పుడు మరోపావు కదపవలసిన సమయం వచ్చేసింది. మహేంద్రనాథ్‌కు విధేయుడుగా కనిపిస్తూ ఇంతకాలం ఆయనకు రెండవస్థానంలో ఉన్న తను స్వయంగా ముఖ్యమంత్రి పదవిని సాధించుకునే అందుకు వచ్చింది తగిన అదను. ఐతే జాగ్రత్తగా అడుగువేయాలి.

ఆ దిశగా అతడు తీసుకున్న తొలిచర్య పత్రికల మద్దతును కూడగట్టుకోవడం. పాత్రికేయులు కూడా గతంలో ఆయనవల్ల ప్రయోజనాలు పొందినవాళ్ళేకనుక సహకరించటానికి ఎంతో ఇష్టంగా ఉన్నారు. అయితేవాళ్ళు మహేంద్రనాథ్‌ను మరీ బాహాటంగా కించపరిచే రాతలు రాయలేరు. ఎందుకంటే ఆయన పగబట్టి కాటేసే మనిషి. పత్రికలవాళ్ళు అటువంటి విషపూరితమైన రాతల్ని పెద్దమనిషి తరహా రాజకీయవాదులపైన మాత్రమే ప్రయోగిస్తుంటారు. కాబట్టి ప్రస్తుతం మహేంద్రనాథ్‌ను విమర్శించడానికిబదులు వాళ్ళు చౌదరిలోని సహనాన్నీ, వివేకాన్నీ, దూరదృష్టినీ, సంస్కారం ఉట్టిపడే ఆయన ప్రవర్తననూ, సామర్థ్యాన్నీ, ప్రజల సమస్యలపట్ల అవగాహననూ ప్రశంసలతో ముంచెత్తడం ప్రారంభించారు. ఏ కొంచమైనా స్వార్థస్పృహ లేకుండా (ఏమాత్రం కృతజ్ఞతాభావం లేని) ముఖ్యమంత్రికి అంతకాలంపాటు, ఒళ్ళు అరగదీసుకుంటూ ఆయన చేసిన ఊడిగాలను ప్రస్తావించి మరింత ఘనంగా పొగడడం మొదలుపెట్టారు.

ఊహించినట్టే చౌదరిపై పత్రికలు ప్రచురిస్తున్న స్తోత్రపాఠాలు మహేంద్రనాథ్‌కి ఒళ్ళు మండిపోయింది. తనను తెగడడం కన్న ప్రతిద్వంద్విని పొగడడమే రాజకీయనాయకుల దృష్టిలో ఎక్కువ క్షమించరానిదనిపించుకుంటుంది. ఇక చౌదరిని తక్షణం తొలగించకపోతే తనకే ఉద్వాసన ఖాయమన్నట్టు మద్దతుదారులు మహేంద్రనాథ్‌పై ఒత్తిడి తేవడం ప్రారంభించారు. అది కూడా చౌదరి ఊహించినదే. పెద్ద ఎత్తున రాజకీయకుట్ర జరగబోతున్నట్టు వాళ్ళు మహేంద్రనాథ్‌ను నమ్మించబోయారు. నక్కజిత్తులలో ఆరితేరిన చౌదరి మహేంద్రనాథ్‌ను జోకొట్టి దృష్టి మళ్ళించడానికి, బహుశా బ్లాక్‌మెయిల్ చేయడానికి ఆడవాళ్ళను కూడా ప్రయోగించే అవకాశం లేకపోలేదన్నారు. ఇప్పటికే మహేంద్రనాథ్ పరువుప్రతిష్ఠలు పాతాళమార్గంపట్టేశాయన్నారు. మహేంద్రనాథ్ పరువు దిగజార్చి తనను మహాపురుషుడుగా చిత్రించుకోడానికి చౌదరి పత్రికలవాళ్ళను ఎడాపెడా మేపుతున్నాడని కూడా అన్నారు. ఈ చేదునిజాల్ని తక్షణం గుర్తించి చౌదరి ఆటకట్టించక పోతే జరుగుతున్నదేమిటో అర్థమయ్యే లోగానే మహేంద్రనాథ్ అధికారం కోల్పోవడం ఖాయమని చివరకు తేల్చిచెప్పేశారు.

ఓ రోజున చౌదరి నిర్వహిస్తున్న ఓ ప్రధానశాఖను అతనిచేతుల నుంచి తప్పించేశారు. పార్టీలో కూడా అతని హోదాను దిగజార్చుతూ కార్య వర్గాన్ని పునర్వ్యవస్థీకరించారు. ఆరోజు సాయంత్రం ముఖ్యమంత్రి పాత్రికేయులతో ఇష్టాగోష్ఠిగా ముచ్చటిస్తూ తన దగ్గర ఎవరి ఆటలూ సాగబోవని స్పష్టంచేశాడు. ఎవరేం చేసినా తానూరుకునే రకం కాదని హుంకరించాడు. అత్యాశతో మిడిసి పడేవాళ్ళను ఎక్కడుంచాలో తనకు బాగా తెలుసునన్నాడు. ఎప్పుడో నలభై దశకంలో

రాజధానిలోని వేశ్యావాటికలో తనతోపాటు ఎన్నోసార్లు ఆనందాన్ని పంచుకున్న ఓ సీనియర్ జర్నలిస్టుతో అంతరంగికంగా కాసేపు గుసగుసలాడుతూ అన్నాడు... 'చూడు శర్మా! ఏ లంజా నా కళ్ళు కప్పలేదు. పడక సుఖానికి తప్ప ఏ ఆడదానికీ నేనేమీ ఇవ్వలేదు'... అయితే ఇది శర్మ బయట పెట్టిన సంభాషణ సారాంశం. కొంతమంది నమ్మారు, కొందరు నమ్మలేదు.

అయితే వినిపించిన ఆ ప్రగల్భానికి కొంత ఆధారం లేకపోలేదు. సెక్స్ మహేంద్రనాథ్ దృష్టిలో శరీరానకి దురదపుడితే గోక్కోవడం తప్పించి మరేమీకాదు. మూత్రం చేసుకోడానికీ వ్యభిచరించడానికీ ఆయన దృష్టిలో పెద్దతేడా లేదు. పైగా ఆ లక్షణం అనుకోకుండా ఆయన కీర్తికిరీటానికి కలికితురాయిలా అమరింది. ఏ ఆడదాని ప్రభావానికీ లోబడకుండా ఎంతో నిక్కచ్చిగా వ్యవహరించే పరిపాలనాదక్షుడుగా ఆయనను చిత్రించడం మొదలుపెట్టారు. 'తనను బుట్టలో వేసుకోడానికి ప్రయత్నించే ఏ ఆడదానితో ఎలా వ్యవహరించాలో ఆయనకు బాగా తెలుసు. పక్కలో ఉన్నప్పుడు మాత్రం వాళ్ళను సంతోషపెట్టడంలో ఏ లోటూ రానివ్వడు. అయితే వాళ్ళకు ఆసక్తి ఉన్న ఫైళ్ళను ఏ పరిస్థితిలోనూ తాకనైనా తాకడు. ఆడవాళ్ళతో ఆయన అనుబంధం కామకేళి సాగిస్తున్న ఆ కొద్దిసేపే. పని పూర్తయిన తక్షణం ఒకవిధమైన తిరస్కారభావంతో వాళ్ళను తన్ని తరిమేస్తూ ఉంటాడు తెలుసా?...' అనుయాయుల మాటలు ఇలా సాగిపోతూ ఉండేవి.

అయితే చౌదరిలాంటి లోపలిమనిషితో వ్యవహారం అంత తేలికకాదు. ఇద్దరి మధ్య విభేదాలు పూర్తిగా విషమించిపోయిన తర్వాత మహేంద్రనాథ్ పతనం కోసం ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న వాళ్ళు దీనిని తమ జీవితకాలంలోనే మహదవకాశంగా భావించి రెండుచేతులతో ఒడిసిపట్టుకున్నారు. అధికారం ఉన్నంతకాలం అది శాశ్వతమైనట్టూ సంపూర్ణమైనట్టూ కనిపించినా అధికారంలోఉండే ప్రతిఒకరి జీవితంలోనూ చివరకు ఈ పూర్వకక్షలసాధింపే అనివార్యంగా తరచూ మిగిలేది.

చౌదరికి ఢిల్లీమద్దతు ఏ మేరకుందో మహేంద్రనాథ్‌కి కచ్చితంగా తెలియదు. చౌదరి కొన్నేళ్ళపాటు మహేంద్రనాథ్ పేరుచెప్పుకుని సన్మార్గులు దుర్మార్గులనే తేడా లేకుండా దేశరాజధానిలో పెంచుకున్న పరిచయాలు ఇప్పుడు చక్కగా ఉపయోగపడుతున్నాయి. చౌదరి చేసిన పనులన్నీ మహేంద్రనాథ్ కలలో కూడా చేయగలిగిఉండేవాడు కాదు. ఎవరిలోనైనా వంచన, అవిశ్వాసధోరణి ఏ కొంచెం కనిపించినా మహేంద్రనాథ్ ఆగ్రహంతో మండిపడే రకం. తాను పరిశుద్ధుడనని కృత్రిమంగా తెచ్చిపెట్టుకున్న అభిప్రాయాన్ని నిజమని నమ్ముతూ ఉండిపోయాడు కానీ, అవసరమైన తప్పుడు పనుల్ని మరెవ్వరో (అంటే చౌదరి) చేస్తూ తనను మాత్రం పవిత్రుడుగా కనపడనిస్తున్నాడనే వాస్తవాన్ని గ్రహించలేదు. తీరా అలాంటి చౌదరితో ఎడబాటు దగ్గరకు వచ్చేసరికి మహేంద్రనాథ్‌కు కరచరణాలు ఆడడంలేదు. ఢిల్లీ తనపట్ల పూర్తి వ్యతిరేకభావంతో ఉన్నట్టు అతడి కర్థమైపోయింది. ఒకప్పుడు తనను ఆదర్శప్రాయుడుగా, అవి నీతికి లోబడని వ్యక్తిగా– చౌదరి తనను ఎలా చిత్రిస్తే అలా నమ్మినవాళ్ళే ఇప్పుడు తలబిరుసుమనిషిగా, తన అభిప్రాయాలే సరైనవని వాదించే జగమొండిగా, పొగరుబోతుగా, నిరంకుశుడుగా... ప్రధానమంత్రిపట్ల కొంచెమైనా విధేయతలేని

వాడుగా చిత్రిస్తున్నారు. ఇటువంటి వ్యాఖ్యలూ ఖండనలతోనే పార్లమెంటు సెంట్రల్‌హాలు ప్రతిధ్వనించి పోతోంది... అధికారమదం అతడి తలకెక్కింది, కచ్చితంగా... జాతీయరాజకీయవేదికమీదికి మెరుపులా దూసుకుపోవాలని పగటికలలు కంటున్నాడు... అధికారకాంక్షతో కళ్ళుమూసుకుపోయిన మనిషి విచక్షణను పూర్తిగా కోల్పోయి ఎంత అధమాధమస్థితికి దిగజారిపోతాడు! పైగా అతగాడి యోగ్యతలూ అర్హతలూ ఏమిటి! కాబోయే ప్రధానమంత్రి ఆడది కనిపిస్తేచాలు మీదపడే రకమని ఎప్పుడైనా ఎక్కడైనా విన్నామా? మహిళాఅతిధులతో అతడెలా మాట్లాడతాడు... వాళ్ళలో విదేశీప్రముఖులు కూడా ఉంటారే!... ఓరి దేవుడా! పైపైకి వెళ్ళిపోడానికి ఆ మనిషి కిందామీదా చూడకుండా ఎంత గుడ్డిగా ఆరాటపడిపోతుంటాడు! యోగ్యతలు, అర్హతలతో అసలు పనేలేనట్టు! ఇదంతా హద్దు మీరిపోయింది. ఇక మహేంద్రనాథ్‌గాడి ఆటకట్టినట్టే కనిపిస్తోందిలే... ఢిల్లీలో అతని పాచిపనులన్నీ చక్కబెట్టేందుకు ఇప్పుడు చౌదరి అందుబాటులో లేడు. ఆ చౌదరిప్పుడిక తన తడాఖా చూపిస్తాడు. గుర్తుపెట్టుకో నా మాటలు...

ఇప్పటికే నిలువునా దహించుకుపోతున్న మహేంద్రనాథ్ చెవికి ఈ విషపూరిత వ్యాఖ్యలూ, జోస్యాలూ మెల్లమెల్లగా చేరుతుతున్నాయి, చౌదరి శిబిరంలోని కొందరు అవి చేరవేసే పని చేస్తూనే ఉన్నారు. అతడిలో మరింత ఆగ్రహం రగిలించి పార్టీ అధిష్ఠానవర్గంపై మరింత తిరుగుబాటుకు పురిగొల్పడమే ఆ వెనుక ఉన్న పథకం. మహేంద్రనాథ్ తనలో మిగిలిఉన్న కాస్త ఆలోచనాశక్తిని కూడా కోల్పోయాడు. అధిష్ఠానవర్గాన్ని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నిలదీస్తూ తప్పుడు ప్రకటనలు గుప్పించడం మొదలుపెట్టాడు. చౌదరి విషయానికొచ్చేసరికి ఉచితానుచితాలు పూర్తిగా గాలి కొదిలేసి అతనిమీద తగును, తగదన్న తేడా లేకుండా అన్నిరకాల ఆరోపణలు కురిపిస్తున్నాడు. వాటన్నింటికీ చౌదరి వ్యాఖ్య ఒకటే, 'నో కామెంట్!' ఇద్దరి మధ్య అలా తేడా కొట్టొచ్చినట్టు మామూలుకళ్ళకే కనిపిస్తోంది... మహేంద్రనాథ్ నిష్క్రమణఘట్టం తోసుకొచ్చేస్తోంది, కేవలం కొన్ని రోజుల్లోనే అది జరగబోతోందని పత్రికలు రాయడం ప్రారంభించాయి.

ఇప్పుడు తనేం చేయాలి?... పచ్చికబయలులో పచార్లుచేస్తున్న చౌదరి ఆలోచిస్తున్నాడు. ముఖ్యమంత్రి అతనిపట్ల అలా వ్యవహరిస్తున్నప్పుడు రాజీనామా చేసి తిరగబడడమే తగిన మందని పత్రికలు సంపాదకీయాల్లోనూ, వ్యాసాల్లోనూ వ్యాఖ్యానిస్తున్నాయి. తన సీనియర్ సహచరుల విషయంలో ఇంత దారుణంగా వ్యవహరించే ఏ నాయకుడూ పదవిలో కొనసాగడం కష్టమని అవి నిర్ద్వంద్వంగా ఘోషిస్తున్నాయి.

పత్రికల గోలతో నిజంగానే చెవులు చిల్లులు పడుతున్నాయి. చౌదరి ఎలాగో ధైర్యం కూడ దీసుకుని రాజీనామా చేయనిదే నాటకం పతాకస్థాయికి చేరుకోదని వాటికి తెలుసు. రాజకీయాల్లో రాజీధోరణులు సమస్యలనెంత మాత్రం పరిష్కరించబోవని ఓ సమర్ధ సంపాదకుడు కుండ బద్దలు కొట్టినట్టు చెప్పేశాడు, అదేదో అతిక్రమించ వీలులేని ప్రకృతిసూత్రమన్నట్టు ధ్వనింపజేస్తూ. ఓ వారపత్రిక పరిస్థితిని అత్యంత నిపుణంగా విశ్లేషించి ఓ అద్భుతమైన సిద్ధాంతాన్ని ముందుకు తెచ్చింది. చౌదరి ఇప్పుడెదుర్కొంటున్న దురవస్థ అంతా స్వయంకృతం తప్ప మరేమీ కాదని దాని సారాంశం. రాజకీయాల్లో స్వార్థత్యాగమనేది ఒకహద్దు దాటితే ఆత్మహత్యా సదృశమవుతుందన్న

విషయం, పాపం చౌదరి సకాలంలో తెలుసుకోలేకపోయాడంది. కయ్యానికి కాలుదువ్వే దున్నపోతుల దృష్టికది బలహీనతగా కూడా కనిపిస్తుంది. (మహేంద్రనాథ్‌లాంటి వాళ్ళ దృష్టికని రచయిత చెప్పాలనుకున్నాడు, కానీ చెప్పలేదు) ఈ పొరపాటును సూచిస్తూ ఎంతో లోచూపు ఉట్టిపడే తమ సంపాదకీయాల్లో చిరకాలంగా హెచ్చరిస్తూనే ఉన్నామని కూడా ఆ వారపత్రిక గుర్తుచేసింది. ఎప్పుడు ఎక్కడ అలా రాసిందో మాత్రం చెప్పలేదు. ఎందుకంటే అటువంటి మాటలు ఎన్నడూ రాయలేదు కనుక. అసలు మహేంద్రనాథ్ మంత్రివర్గంనుంచి చౌదరి రాజీనామాచేసి తక్షణం తప్పుకోవడంలోనే మానవాళి విముక్తి ఉందన్నట్టు పత్రికలు రాస్తున్నాయి.

ఇక చౌదరి స్నేహవర్గం. వాళ్ళుకూడా చాలా ఆగ్రహంతో ఉన్నారు. ప్రజలకు ముఖం చూపించలేక పోతున్నామంటూ వాపోతున్నారు. జరిగింది చాలు, చౌదరి తక్షణం తప్పుకోవడం మంచిదని ఒత్తిడి తెస్తున్నారు. చౌదరి నిష్క్రమించాక పట్టుమని పదిహేనురోజులు కూడా మహేంద్రనాథ్ అధికారంలో ఉండలేడని– కేవలం అజ్ఞానం నుంచే ఉద్భవించే అతివిశ్వాసంతో – బల్లగుద్ది జోస్యం చెబు తున్నారు. కుతూహలం ఏ స్థాయికి ఎగబాకిపోయిందంటే, ఇప్పటికే మీరు రాజీనామాచేసేశారా, లేకపోతే ఎప్పుడు చేయబోతున్నారంటూ ఓ జర్నలిస్ట్ సూటిగా అడిగేశాడు. 'మీ భార్యని చావబాదడం ఎప్పుడు మానుకున్నార'ని అడిగినట్టుగా హఠాత్తుగా ఊడిపడిన ఆ ప్రశ్నకు విస్తుపోయిన చౌదరి మౌనం వహించాడు. ఆ మౌనానికి పత్రికలవాళ్ళు తమ లాజిక్కుననుసరించి రాజీనామావార్తను చౌదరి ఖండించలేదన్న అర్థం చెప్పుకున్నారు.

ఇంకేముంది? మరునాడు ఉదయం రాష్ట్రంలోని పత్రికల్లో ఇటువంటి పతాకశీర్షికలు దర్శనమిచ్చాయి. 'చౌదరి నిష్క్రమణ', 'తిరగబడుతూ చౌదరి నిష్క్రమణ!'... చివరి క్షణంలో కాస్త జాగ్రత్త పడాలనిపించింది కాబోలు ఒక పత్రిక మాత్రం ఇలా శీర్షిక పెట్టింది. 'చౌదరి రాజీనామా సమర్పణ?' తన ఆప్తమిత్రుడి శీర్షంకన్నా, ఆకర్షించే శీర్షికే (ప్రాతికేయునికి) ముఖ్యమని చౌదరి మొదటిసారి గ్రహించాడు.... అయితే వాళ్ళ సంచలనాత్మకవార్తల దాహాన్ని తాను బాగానే ఉపయోగించుకోగలనని అనుకున్నాడు.

ఆ పతాకశీర్షికల ప్రభావం ఒక విషయంలో స్పష్టంగా కనిపించింది. సాధారణంగా రోజంతా జనంతో కిక్కిరిసి ఉండే చౌదరి డ్రాయింగ్‌రూం ఆ రోజు పొద్దుటినుంచి బోసిపోయింది. అవతల బారులు తీరిన కార్లు లేవు, కాకుల్లా మూగే వంధిమాగధులు లేరు, కోలాహలం లేదు. సమాధి వినా శ్మశానాన్ని అది తలపుకు తెస్తోంది. నగరంలోని సందులు, గొందులు, శాసనసభ్యుల హాస్టల్ గదులు, అక్కడి అల్పాహార కేంద్రం, జనం గుమికూడడానికి అవకాశమున్న ప్రతిచోటూ ఇప్పుడు కారుహోరన్ల మోతతో హోరెత్తిపోతున్నాయి. చౌదరి ఖాళీచేసిన స్థానాన్ని భర్తీచేయబోయే ఆ అజ్ఞాతవ్యక్తికోసం ప్రతిఒకరూ కళ్ళు చీల్చుకుని గాలిస్తున్నారు. గాలి వాటంకనిపెట్టి దిక్కుమార్చే రాజకీయదళారీలు తాము మోయలేనంత పెద్దపెద్దపూలదండలతో పుష్పగుచ్ఛాలతో పరుగులు తీస్తున్నారు. అదృష్టంవరించే అవకాశమున్నట్టు తాము భావించిన ప్రతిఒకరినీ ఆ దండలతో ముంచెత్తుతున్నారు. అదోవిధమైన దౌర్జన్యమే అనడం మరింత సబబు. జరుగుతున్నదేమిటో కొంచెమైనా బోధపడని ఆ శాసనసభ్యులు దండల దాడివల్ల సిగ్గుతో చితికిపోయేలా ఉంది వారి

ప్రవర్తన. మొత్తంమీద ఆ రోజు మధ్యాహ్నం ఎక్కడ చూసినా జనం పరుగులు తీస్తున్న దృశ్యాలూ- ఒకే వ్యక్తి చేతుల మీదుగా ఎందరెందరికో సత్కారాలు జరిగిపోతున్న అపూర్వసన్నివేశాలు సాక్షాత్కరించాయి. ఆ రోజు ఉదయం వార్తాపత్రికల ఊహాగానాలలో చోటుచేసుకున్న ఆరేడుగురు శాసనసభ్యులు అలా వంధిమాగధుల నుంచి సత్కారం అందుకున్నవాళ్ళుగా లెక్కతేలారు. ఒకే ఒక ఖాళీలో – అదీ అసలు ఏర్పడిందోలేదో తెలియదు – ఇలా ఎందరినో ఊహించుకుంటూ పరుగులు తీయడం ఎంత హాస్యాస్పదమో వాళ్ళకి కొంచెమైనా తోచలేదు. వాడా వీడా అని ఆలోచిస్తూ ఎవరినీ మరచిపోయే పొరపాటు జరగకూడదు. అంతే వారనుకున్నది.

అయితే మధ్యాహ్నం దాటిన తర్వాత వాతావరణంలో మార్పు కనిపించసాగింది– మొదట మెల్లగా, క్రమంగా నాటకీయంగా. నేషనల్ రివ్యూ స్పెషల్ కరస్పాండెంట్, ఎన్క్వైరర్ పత్రిక రాజకీయవిలేఖరికి ఫోన్ చేసి స్కూపును సంపాదించాలనే అత్యుత్సాహంతో చౌదరి రాజీనామావార్తను రాజభవన్‌నుంచి కానీ, ముఖ్యమంత్రి కార్యాలయంనుంచికానీ ధృవీకరించుకోవడం మరిచిపోయామని చెప్పాడు. కనీసం ఇప్పుడైనా వాళ్ళ ధృవీకరణ తీసుకుందామన్నాడు. అక్కడినుంచి మరో విడత కూపీలఘట్టం మొదలైపోయింది. వ్యవహారం మరింత ఆసక్తికరంగా పరిణమించింది. ఈ సంగతి పసిగట్టిన రాజకీయవర్గాలు తమ పొరపాటుని తెలుసుకొని మళ్ళీ చౌదరినివాసానికి ఒక్కుమ్మడిగా పరుగుతీశాయి. ఆయన పచ్చికబయలులో అలా నిరాసక్తంగా తచ్చాడుతూ ఉండగానే ఆయన డ్రాయింగ్ రూమ్‌లోకి జర్నలిస్టులు, స్నేహితులు, విరోధులు బిలబిలవచ్చిచేరిపోయారు.

స్పెషల్‌కరస్పాండెంట్లు తోసుకుంటూ డ్రాయింగ్ రూంలోకి వెళ్ళారు. వాళ్ళ ముఖంలో తెలివీ తెలివిహీనతా ఏకకాలంలో కనిపిస్తున్నాయి. అంతటా కనిపిస్తున్న సూచనను బట్టి తామిచ్చిన పతాక శీర్షికలు వాస్తవానికి మరీ అంతదూరంగా లేవనే అనుకోవాలి. అయినా ఇంతవరకూ అధికారికమైన ధృవీకరణ రాలేదు. 'అందుకూ తగిన కారణాలు లేకపోలేదులే...' చౌదరి ప్రైవేట్ సెక్రెటరీ అందించిన కాఫీలు సేవిస్తూ వాళ్ళు అనుకున్నారు. 'చూడు... ఈ రాజకీయనాయకులున్నారే... వీళ్ళు గుంటనక్కలు... ఎంత మభ్యపెడతారంటే ఏది జరిగినా తానుకాక మరెవడి మీదనో తప్పునెట్టేస్తాడు. ఈ పరస్పరదూషణల్లో పడి ఆ విషయానికున్న వార్తాప్రాముఖ్యం కాస్తా ఆవిరైపోతుంది. దాంతో పత్రికల కొంప మునిగిపోతుంది. అదే పతాక శీర్షికతో ముందుకెళ్ళాలో, ధృవీకరణ కోసం ఆగాలో తెలియని పరిస్థితి. (నిరవధికంగా ధృవీకరణకోసం ఎదురుచూసి చివరకు మూడోమనిషి చేతులమీదుగా వార్తలు అందుకోవడం ఏ విలేఖరికీ ఇష్టముండదు) అందుకే అటువంటి పతాక శీర్షికలు. అవి అర్ధసత్యాలే కావచ్చు కానీ ఈ పరిస్థితుల్లో చేయగలిగింది లేదు. అదీగాక తప్పుడు శీర్షిక ఇచ్చినందుకు పత్రికల్ని తవ్విపాతేసిన సందర్భమేదైనా ఉందా?

ప్రస్తుతవిషయానికొస్తే, మహేంద్రనాథ్‌మంత్రివర్గంనుంచి చౌదరి తప్పుకోవడం ఎప్పుడో తేలిపోయిన విషయమని పాత్రికేయులంతా నిజంగానే విశ్వసించారు. జరుగుతున్న పరిణామాల్ని గమనిస్తే మరోలా జరగడానికి వీల్లేదు. అతని అనుచరులు, అతనిమీద సానుభూతి ఉన్న

పత్రికాసంపాదకులు, పైకి లౌక్యం ప్రదర్శిస్తూనే లోలోపల అధికారులు– దాదాపు ప్రతివాళ్ళూ చౌదరి తప్పుకోవడమే, ఆయనకీ రాష్ట్రానికీ కూడా మంచిదంటున్నారు. ఆ వార్త ధృవీకరణకోసం అందరూ ఎదురుచూస్తుంటే పత్రికావిలేఖరులు మరునాడు ఉదయం పత్రికల్లో రావలసిన మొదటిపేజీ కథనాలకు మనసులోనే రూపకల్పన చేసుకుంటున్నారు. ఏదేమైనా ఈ వార్త మొదటిపేజీకెక్కవలసిందేమరి.

ఆ రోజు ఉదయం 'కాబోయే' ఆరుగురుమంత్రులచుట్టూ బారులుతీరిన రాజకీయదళారులు మరింత ఆదరాబాదరాగా చౌదరి నివాసానికి పరుగులుపెట్టారు. ఆశ, అయోమయాల మధ్య; ఆకాంక్ష, అనిశ్చితల మధ్య వాళ్ళ తలకాయలు ఊగిసలాడుతున్నాయి... ఇంతకీ చౌదరి తప్పుకున్నట్టేనా కాదా అన్నప్రశ్న వాళ్ళను పుండు సలిపినట్టు సలిపేస్తోంది. వాళ్ళ బాధంతా చౌదరి ఉండాలనో పోవాలనో కాదు, జరుగుతున్న పరిణామాలకు అనుగుణంగా తమ రాతలు ఉంటాయో లేదో ననే. పరిణామాలు ఏ మలుపు తిరుగుతాయో అర్థంకానిస్థితిలో కాసేపు వేటాడే జాగిలాలతో మరికాసేపు వేటాడబడే కుందేళ్ళతో కలసి అయోమయంగా పరుగులుతీస్తున్నారు.

చౌదరి చడీచప్పుడు కాకుండా తాపీగా డ్రాయింగ్‌రూంలోకి అడుగుపెట్టాడు. చిరునవ్వు చిందిస్తూ అంతే తాపీగా సిగరెట్ వెలిగించి బిగ్గరగా తేన్చాడు. పాత్రికేయుల్ని ఉల్లాసభరితంగా పలకరించాడు. అందులో ఒకింత వెక్కిరింపు కూడా కొందరికి స్ఫురించింది. ఆ నిబ్బరం అందరినీ నివ్వెర పరచింది. ఎక్కడా చిన్నమరకకూడా లేని మల్లెపువ్వులాంటి దుస్తులతో ఉన్నాడు. ఆపాదమస్తకం ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతోంది. ఇదేమాట ఓ విలేఖరి తనపక్కనున్న విలేఖరితో అంటే 'ఆత్మవిశ్వాసమా గాడిదగుడ్డా! బొత్తిగా సిగ్గులేనితనం' అంటూ బుసకొట్టాడు.

మామూలు పలకరింపులైన కాసేపటికి తమ ప్రశ్నలు దారితప్పేప్రమాదం ఉన్నట్టు పాత్రికేయులకే అర్థమైపోయింది. చౌదరి ఆగ్రహోదగ్రంగా ఉంటాడని వాళ్ళనుకున్నారు. మండి పడిపోతూ ఏవేవో మాట్లాడతాడని, ఆ మాటల్లోంచి ఏవో ప్రశ్నలు అందిపుచ్చుకుని తాము అతడిమీద గుప్పించ వచ్చునని ఊహించుకున్నారు. తీరా అతడంత నిగ్రహంగా, నిబ్బరంగా కనిపించేసరికి ప్రశ్నమీద ప్రశ్న గుప్పించడం కాదు సరికదా, కనీసం తగిన ప్రశ్నతో ప్రారంభమైనా చేయగలమని వాళ్ళకనిపించలేదు. అడగడం మొదలుపెట్టిన వెంటనే ప్రశ్నలమీద పట్టుజారిపోయినట్టు వాళ్ళకే తెలిసిపోయింది.

'మీ రాజీనామా గురించి పత్రికల్లో వచ్చిన వార్తలపై మీ వ్యాఖ్య ఏమిటి సార్?' ఒక సీనియర్ విలేఖరి సూటిగా ప్రశ్నించాడు. నిజానికి వక్రపాండిత్యమంతా రంగరించి అదే ప్రశ్నను మరోలా అడగాలనుకున్నాడు. కానీ అతడికది చేతకాలేదు.

'ఆ వార్తను పంపించిన వాళ్ళలో మీరూ ఉన్నారు. అవునా? కనుక మీకే బాగా తెలుస్తుంది..!' అన్నాడు చౌదరి.

'గవర్నర్ మీ రాజీనామాను ఆమోదించారా?' ఇంకో తెలివైన విలేఖరి అడిగాడు.

'గవర్నర్‌ని అడగాల్సిన ప్రశ్న నన్నడిగితే నేనేం చెప్పను?' చౌదరి తిప్పికొట్టాడు.

అక్కడున్న రాజకీయగబ్బిలాలు ఆ జవాబుకు పగలబడి నవ్వేశాయి. చౌదరి అలా వ్యంగ్యంగా, తప్పించుకునే సమాధానాలివ్వడం వాళ్ళకెంతో బాగుంది. అయితే వాళ్ళు కూడా ఏది నిజమో తెలియని అయోమయంలోనే ఉన్నారు. డొంకతిరుగుడుగా సాగుతున్న ఆ సంభాషణ క్రమంగా వాళ్ళ సహనానికి పరీక్షగా మారిపోయింది. చౌదరి ఈ సస్పెన్స్‌కు ఆనందిస్తున్నట్లు కనిపించాడు. నిజం తక్షణమే బయటపెట్టాలన్న తొందర అతడికేమీ లేదు. ఆ రోజు పత్రికల్లో వచ్చిన ఏ ఊహాగానానికి ఏ విలేఖరి బాధ్యుడో అతనికి బాగా తెలుసు. తమ అతితెలివికి ఉత్తుత్తి సానుభూతిని జోడించి, అందులో మళ్ళీ కాస్త అపహాస్య ధోరణిని మేళవించి వాళ్ళు వార్తాకథనాలు సృష్టించారు. నిజం చెప్పాలంటే వాళ్ళంతా చౌదరి మిత్రవర్గంలోని వాళ్ళే. ఆయనవల్ల ఎన్నో ప్రయోజనాలు పొందినవాళ్ళే. కనుక ఆయనపట్ల వాళ్ళకు శత్రుత్వముండే అవకాశం లేదు. అయినాసరే, ఒక ప్రముఖరాజకీయవాదిపై ఏదైనా వార్త రాయవలసి వచ్చినప్పుడు అతడిపట్ల ఒకవిధమైన తృణీకార భావంతో రాయడం పరిపాటి. అధికారంలో ఉన్న వ్యక్తుల ముక్కుమీద గుద్దే హక్కేదో తనకున్నట్లు దారినపోయే ప్రతి దానయ్య అనుకుంటూ ఉంటాడు. అధికారంలో ఉన్న వాళ్ళు ప్రతివారికీ లోకువే. రాజకీయవాదులకు పడుపుగత్తె స్తనాలతోకూడా కొందరు పోలిక చెబుతూ ఉంటారు. వాటితో తమ ఇష్టానుసారం ఆడుకుని వినోదించే హక్కు తమకున్నట్లు ప్రతివాళ్ళూ భావిస్తూంటారు. ఒక్క మినహాయింపు కూడా లేకుండా పాత్రికేయులందరి దృష్టిలో ఇప్పుడు రాష్ట్రంలో సాగిపోతున్న రాజకీయ నాటకమూ, దానివెనుక ఉన్న వ్యక్తిగతప్రేరణలూ అన్నీ, బోనులో ఉన్న రెండు అడవిజంతువుల మధ్య జరుగుతున్న ఘర్షణలాంటివే. అంటే కేవలం జనానికి వినోదం కలిగించడానికి ఉద్దేశించి నవే. మొత్తంప్రభుత్వ యంత్రాంగం, మంత్రులు, ముఖ్యమంత్రులు, అధికారకూటములు, రాజకీయపక్షాలు, ఎన్నికలప్రణాళికలు, కార్యక్రమాలు, ఎన్నికలు, విజయాలు, అపజయాలు, ప్రదర్శనలు, అల్లర్లు, కాల్పులు, మరణాలు... ఒకటేమిటి, వేలాదిమంది కార్యాచరణతో ముడిపడిఉన్న రకరకాల సన్నివేశాలు, సందర్భాలు, లక్షలమంది భవితవ్యాలు– ఇవన్నీ ఓ సారి నవ్వుకుని మరచిపోదగిన కార్టూన్ సామగ్రిలాంటివైనట్టు. అంతే.

అరగంట గడిచింది, అయినా చౌదరి ఏ సంగతీ బయటపెట్టలేదు. పత్రికల్లో వెలువడిన పరస్పర విరుద్ధ కథనాలను అవకాశంగా తీసుకుని ఆ ఊహాగానాలు ఎంత లోపభూయిష్ఠంగా ఉన్నాయో ఎత్తిచూపించాడు. కట్టుకథల్లా ఆ వార్తలు మంచి ఆసక్తినే రేకెత్తిస్తున్నాయి కానీ వార్తలుగా ఏ మాత్రం విశ్వసనీయం కావు. మొత్తానికి చౌదరి బాగా తయారయ్యే తమ ముందుకి వచ్చాడని విలేఖరులు గ్రహించేశారు.

మరోసారి టీ, బిస్కెట్లు వచ్చాయి. వాతావరణం కొంతవరకు తేలికపడి నట్టనిపించింది. పుండు కెలికినట్టు గుచ్చిగుచ్చి అడిగే ప్రయత్నం వ్యర్థమనీ, నేరుగా అసలు విషయాని కొచ్చేయాలనీ ప్రతిఒకరూ అనుకున్నారు. ఒకే ఒక ఊహాగానం కారణంగా చౌదరితో తమ సంబంధాలు పాడు చేసుకోవాలని ఎవరూ అనుకోవడంలేదు. చివరకు మరీ మరీ సీనియర్ విలేఖరి ఒకరు గొంతువిప్పి అన్నాడు. 'సార్. మాకు అందకుండా బాగానే తప్పించుకున్నారు. ఇంతవరకూ మాకు బోధపడిందేమీ లేదు. మాపట్ల మీరెప్పుడూ అభిమానం చూపిస్తూనేవచ్చారు. అందుకు మేము కూడా కృతజ్ఞులం.'

'నేను రాజీనామాచేసినట్టు మీరూహించినప్పుడు తప్ప... అప్పుడుమాత్రం హఠాత్తుగా మీ దృష్టిలో ఒక అపహాస్యం మనిషినైపోయాను' చౌదరి అద్భుతగులుతూ అన్నాడు.

ఆ రోజు సాయంత్రం చౌదరినోట దూసుకొచ్చిన పదునైన వాగ్బాణం అదే. అయినా ముఖంలో చిరునవ్వు చెరగలేదు. పరిహాసంగా అంటున్నట్టే ఆ మాటల్ని ధ్వనింపజేశాడు. అయినా ఆ మాటతో మళ్ళీ వాతావరణం తిరగబడి ఉద్రిక్తత అడుగు పెట్టింది.

'మీ పట్ల మేము అన్యాయంగా ప్రవర్తించినట్టు మీరు భావిస్తుంటే అందుకు విచారిస్తున్నాం మిస్టర్ చౌదరి! ఆ విషయాన్ని మనం తర్వాత పరిష్కరించుకుందాం. ఇంతకీ మీరు రాజీనామా చేశారా?' ఆ సీనియర్ విలేఖరి ప్రశ్నించాడు.

'లేదు' -బాంబు బద్దలైందా అన్నట్టుగా టేబులుమీద గట్టిగా చరుస్తూ అరిచాడు చౌదరి. ఆ అదురుకి అతడి సిగరెట్‌డబ్బా పక్కకుపడిపోయి టేబుల్ అంచువైపు దొర్లుకుంటూ పోయింది. అక్కడే ఎంతో అప్రమత్తంగా నిలబడిఉన్న ఒక రాజకీయగబ్బిలం దానిని పడిపోకుండా పట్టుకుంది. చౌదరి మరింత సాభిప్రాయంగా స్పష్టంగా అన్నాడు 'ఒకవేళ నేను నిజంగానే రాజీనామా చేసినా మీకా విషయం చెప్పను. ఎవరో మిమ్మల్ని తప్పుదారి పట్టించారు. ఇంకేముంది, బ్రహ్మాండమైన స్కూపు దొరికిపోయిందనుకున్నారు. ఐయామ్ సారీ, ఈ క్షణంలో ఇంతకుమించి నేను చెప్పగలిగింది లేదు...'

గంటసేపటికిపైగా శూన్యంలో వేలాడిన పెన్సిళ్ళు క్లుప్తంగా ఏవేవో నాలుగుమాటలు గెలికాయి. ఇంటర్వ్యూ అర్థాంతరంగా ముగిసి పోయింది. ఒళ్ళు మండిపోయిన కొందరు విలేఖరులు పెన్సిళ్ళతో చౌదరి పొట్టలో పొడవాలనుకున్నారు. విలేఖరుల దృష్టిలో పెదవివిప్పని రాజకీయవాది కంటె రోతపుట్టించే జీవి మరొకడు ఉండడు —నిజానికి అతిగా మాట్లాడే జాతి రాజకీయవాదులే కనుక.

మొత్తానికి చౌదరి రాజీనామా చేయలేదన్న మాట! సిగ్గుఎగ్గూలేని మనిషి. దగాకోరుముండా కొడుకు! రెండురోజులపాటు అందరినీ ఎంత తికమకపెట్టేశాడు! జిత్తులమారినక్క! అందరూ మండిపడిపోయారు -మహేంద్రనాథ్ సన్నిహిత అనుచరులతోసహా. చౌదరి రాజీనామాతో కాగల కార్యం గంధర్వులే తీర్చినట్టవుతుందనుకున్నారు. చౌదరిని మంత్రివర్గంనుంచి తొలగించడం రాజకీయంగా అసాధ్యం. అందువల్ల రాష్ట్రస్థాయిలోనూ, అధిష్ఠానవర్గంస్థాయిలోనూ కూడా ఎడతెరిపి లేకుండా చిక్కులు వచ్చిపడతాయి. ఆ గాడిద ప్రతిచోటా లంచాలు మేపి గట్టిచేసుకున్నాడు. ఎవరినైనా ఎక్కడైనా గీకి చూడండి, చౌదరి డబ్బు గలగలా రాలి పడుతుంది. కనుక వాణ్ణి బయటకు పంపించేందుకు కనిపిస్తున్న మార్గం ఒకటే... ఆత్మగౌరవం కారణాలతో తనే తప్పుకునే పరిస్థితులు సృష్టించడం... కానీ సోదరా! ఎంత పొరపాటు ఆలోచన! చౌదరీ, ఆత్మగౌరవమూనా? అంతకన్నా ఉత్తర ధ్రువాన్నీ, దక్షిణధ్రువాన్నీ కలపడం తేలిక... మహేంద్రనాథ్ అనుచరుల్లో కొందరు ఎద్దేవా చేశారు.

ఆ విలేఖరుల కీలకమైన సమావేశం తర్వాత చౌదరివర్గంలోని ఓ మనిషి అయన దగ్గరకు వెళ్ళి మెచ్చుకోలుగా అన్నాడు. 'అందరి అంచనాలను తలకిందులు చేసేశారు బాస్! ఎలాచేశారు?'

'మీరంతా బుద్ధిలేని గాడిదలైనప్పుడు, ఆసాధ్యాన్ని ఊహించుకుంటున్నప్పుడు నేనేం చేసేది? నా రాజీనామావార్త నగరాన్ని తుపానులా ముంచెత్తినప్పుడు నా డ్రాయింగ్ రూం, నా ఇంటి ఆవరణ ఎలా ఉన్నాయో నువ్వు చూడలేదా? నేను రాజీనామాచేసిఉంటే నా ప్రియతమ అనుయాయుల్లో ఎందరో నన్ను విడిచిపెట్టిపోయేవాళ్ళు కాదా? ఆ లంజకొడుకు మహేంద్రనాథ్‌కు తలవంచి అంత తేలిగ్గా నాకు నేను ఉరేసుకుంటాననుకున్నావా?'

'నిజమే, చాలామంది శాసనసభ్యులు గోడ దూకడానికి ప్రయత్నించారు. కానీ సూత్రాలు, సిద్ధాంతాలు పట్టుకుని వేలాడేవాళ్ళు కూడా పార్టీలో కొంతమంది ఉన్నారు సార్. వాళ్ళు గాలివాటం మనుషులు కాదు. వాళ్ళను మీరు చేరదీస్తే బాగుంటుందనుకుంటాను...'

'నీ ఉద్దేశం... ఎంతసేపూ నక్షత్రాలవైపు చూసే ఆనంద్‌లాంటి వాళ్ళనా?'

'అవును. వాళ్ళు ఓ గ్రూపుగా లేకపోయినా బలమైన వర్గమే.'

'నాకు తెలుసు. వాళ్ళందరి గురించి నాకు తెలుసు. వాళ్ళు లొంగి రావడం చాలా కష్టం. అయినా వాళ్ళతో మాట్లాడడానికి ఇది తగిన సమయం కాదు.'

ఆనంద్‌నూ, అతనిలాంటి ఆదర్శవాదులైన అతని స్నేహితుల్నీ చౌదరి సరిగానే అంచనా వేశాడు. అయితే వాళ్ళను వేరుగానే ఉంచేశాడు. తరచు మూడో వ్యక్తులతో వాళ్ళను ప్రశంసిస్తూ ఉంటాడు. తన ఆసక్తినీ అభిమానాన్ని ప్రదర్శించుకునే పద్ధతుల్లో అది కూడా ఒకటి.

ఇంతలో మళ్ళీ యుద్ధం మొదలైంది. చౌదరి ఆమోదించిన ప్రతిఒక్క ప్రతిపాదననీ మహేంద్రనాథ్ తిరస్కరిస్తున్నాడు. పైగా అవమానకరమైన వ్యాఖ్యలు రాస్తున్నాడు. అధికార వర్గాలకు ఈ కీచులాటలు వినోదాన్నీ, ఒక్కోసారి అయోమయాన్నీ కలిగిస్తున్నాయి. మహేంద్రనాథ్ ఉత్తర్వులు పరుషంగా, అహంకారపూరితంగా ఉంటే చౌదరి వ్యాఖ్యలు హేతు బద్ధంగా, తర్క బద్ధంగా పొందికైన మాటలతో సమతూకంగా ఉండేవి. అయితే అవి సారాంశంలో మహేంద్రనాథ్‌కు పూర్తిగా ప్రతికూలంగా ఉండేవి. ఈ ఫైళ్ళయుద్ధంమీద సచివాలయంలో ఎన్నెన్నో జోకులు కూడా పుట్టుకొచ్చాయి. ఉదాహరణకు గుంటనక్క చౌదరి తన ప్రతిపాదనను మహేంద్రనాథ్ ఆమోదించి తీరాలనుకుంటే దానికి వ్యతిరేకంగా గట్టిగా రాసేవాడు... ఈ టెక్నిక్‌ను ఉపయోగించి ముఖ్యమంత్రినుంచి తనకుకావలసిన అనేక ఉత్తర్వులు తెప్పించుకోగలిగాడని అంతా చెప్పు కునేవారు. కొన్ని సందర్భాల్లో లోపాయికారీగా ఎవరో అందించిన సమాచారాన్ని గ్రహించో, లేక విచిత్రంగా తనకే ఏదో స్ఫురణ కలిగో మహేంద్రనాథ్, చౌదరి అభిప్రాయాలతో ఏకీభవిస్తూ అతని ఎత్తుగడను నీరుకార్చేవాడు... ఇలా కత్తియుద్ధం ఉండుండి పతాక స్థాయిని అందుకుంటూ– ఎటువైపునా ఎవరూ గాయపడకుండానే– చాలారోజులపాటు సాగిపోయింది.

అందుకే ఉన్నట్టుండి ఓరోజు ఉదయం మహేంద్రనాథ్ రాజీనామా వార్త ఊడిపడినప్పుడు రాజకీయవాదులెవరూ నమ్మలేకపోయారు. ఇప్పటికే చౌదరి రాజీనామా వదంతులతో తామోసారి మోసపోయారుకనుక ఈసారి జాగ్రత్తగా ఉండాలనుకున్నారు. మహేంద్రనాథ్ రాజీనామావార్తను తోసిపుచ్చేశారు. విలేఖరుల పరిస్థితి కూడా అంతే. అయినా ఆ వార్తను అందిపుచ్చుకుని చేయవలసిన

హడావుడంతా చేయవలసిందే. ఏదోవిధంగా మహేంద్రనాథ్ వార్తల్లోకి వచ్చాడు! దాంతో వార్తా పత్రికలు అతణ్ణి తొలగించారనీ, తప్పించారనీ, బర్తరఫ్ చేశారనీ, తన్నితగలేశారనీ... ఇలా రకరకాలుగా రాశాయి. ఉన్నదున్నట్టు రాసే పత్రికగా పేరున్న ఓ చిత్తు పత్రిక 'మహేంద్రనాథ్‌ను మెడబట్టి బయటికి గెంటారు!' అని రాసింది. ఓ రోజురోజంతా రాష్ట్ర రాజధాని దిగ్భ్రాంతిలో కూరుకుపోయింది. అసలు నిజం ముక్కముక్కలుగా బయటపడింది. మహేంద్రనాథ్‌ను నేరుగా ప్రశ్నించడానికి, విలేఖరులు సందేహిస్తూనే ధైర్యం కూడదీసుకుని వెళ్ళేసరికి ఆయన మూర్తీభవించిన వినయంలా కనిపించాడు. రాజీనామాతో మహేంద్రనాథ్‌లో సమూలమైన పరివర్తన వచ్చిందని ఎవరో వ్యాఖ్యానించారు కూడా. అంత మృదువుగా ఆయనింతవరకు ఏ విషయం మీదా మాట్లాడలేదన్నారు.

జన్మదినోత్సవాలే చివరకు ఆయన కొంపముంచాయి. తెగించి శేఖర్ ఎటువంటి ప్రయత్నాలు చేసినా ప్రజాభిప్రాయం ఎదురుతన్నింది. ఆ అట్టహాసాన్ని ఆడంబరాన్నీ ప్రజలు ఎంతమాత్రం హర్షించలేదు. చివరి క్షణంలో మహేంద్రనాథ్ ఉత్సవాలకు ముఖం చాటేద్దామనుకున్నాడు కానీ అప్పటికే సమయం మించిపోయింది. అనుయాయులు ఆయన వెనుక పెద్దపెద్ద వలలు పన్నే ఉంచారు. తప్పించుకునే మార్గం లేకపోయింది. బహుశా ఈ సంగతి తెలుసుకునే పరిస్థితితో సమాధానపడి సమర్థించుకోవడం ప్రారంభించాడు. ప్రజలు, ముఖ్యంగా తన అనుచరులు జన్మదినం రోజున తనను సత్కరించాలనుకోవడంలో తప్పేమిటని ప్రశ్నించాడు. జన్మదినోత్సవం నిర్వహించడంలో అంత విశేషమేముందన్నాడు. రాచరికంరోజుల నుంచి ఇక్కడి ప్రజలు అటువంటి బ్రహ్మాండమైన ఉత్సవాలు తిలకించడానికి అలవాటుపడ్డారు. బిచ్చగాళ్ళ స్థాయిలో జరిగే ఏ ఉత్సవాన్నీ వాళ్ళు మెచ్చరు. తన జన్మదినం ఒక నెపం మాత్రమే. ప్రజలకు కళ్ళుజిగేలుమనిపించే ఉత్సవాలు కావాలి. కొన్ని రోజులపాటు వాళ్ళెంతగానో ఆనందించారు. అదేమైనా క్షమించరాని నేరమా? ఈ విషయం మీద కొందరు రాజకీయవాదులు ఎందుకంతగా చిందులు తొక్కుతున్నారు? అమాయక ప్రజల ప్రయోజనాలను బలిపెట్టి సొంత రాజకీయకక్షలు తీర్చుకునే ప్రయత్నం ఎందుకు చేస్తున్నారు?

ఇటువంటి తర్కాలు చివరకు నెగ్గలేదు. ఉత్సవాలగురించి, ప్రజాధనం దుర్వినియోగంగురించి దిగ్భ్రాంతికరమైన సమాచారం ఢిల్లీకి ప్రవహించింది. ఉత్సవాలపై కేంద్ర నేర పరిశోధక విభాగం ఒక భారీ నివేదికను సమర్పించినట్టు తెలియవచ్చింది. ఉత్సవాలకు డబ్బు ఏయే మార్గాల్లో వసూలు చేశారో, అందుకు ఎలా ఎలా ప్రతిఫలం చెల్లించారో, మధ్యలో దళారులు ఏ మేరకు కొల్లగొట్టు కున్నారో మహేంద్రనాథ్ ఆమోదంతోనే ఆయన అభిమానానికి నోచుకున్న శాసనసభ్యులూ, ఇతర అనుచరులూ ఏ మేరకు ముడుపులు జేబులో వేసుకున్నారో (ఈ ఘట్టంలో మాత్రం కల్పనా చాతుర్యం చక్కగా మేళవింపజేస్తూ) ఆ నివేదిక పూసగుచ్చినట్టు వివరించింది. మొత్తంమీద పార్టీ ప్రతిష్ఠ కనీవినీఎరుగని రీతిలో పాతాళానికి కుంగిపోయినట్టు తేల్చేసింది. ఇదంతా మహేంద్రనాథ్ ప్రత్యర్థుల కథనం.

వాళ్ళు మహేంద్రనాథ్‌పై ఎన్ని ఆరోపణలు గుప్పించడానికి వీలుంటే అన్నీ గుప్పించారు. మహేంద్రనాథ్ అనుచరులు పూర్తిగా నిర్వీణ్ణులైపోయారు. జరిగిందేమిటో కొంచెమైనా వాళ్ళకు

అంతుబట్టకుండాపోయింది. మామూలుగానే జరిగిందేమిటన్నది ఎవరికి వారు జరిగినట్టు నమ్మిన దానిమీదే ఆధారపడిపోయింది. ఓ రోజు అర్ధరాత్రి ప్రధానమంత్రి మహేంద్రనాథ్‌ను ఒక ప్రత్యేక విమానంలో ఢిల్లీకి పిలిపించుకున్నారనీ, ఆయన పాల్పడిన నేరాలనూ, ఘోరాలనూ తిరుగులేని సాక్ష్యాలతో ఎత్తిచూపించారనీ బలమైన వదంతులు అంతటా వ్యాపించాయి. అప్పటికప్పుడే, అక్కడి కక్కడే మహేంద్రనాథ్ స్వయంగా రాజీనామా లేఖ రాసిఇచ్చేశాడట. మరునాడు ఉదయం ప్రధాన మంత్రి ఆ లేఖను గవర్నర్‌కు పంపించారట ప్రధాని ఆ లేఖను గవర్నర్‌కి పంపించ లేదనీ, రాజీనామా విషయం మాత్రం గవర్నర్‌కి తెలియజేశారనీ మరో కథనం. ఓ రోజు అర్ధరాత్రి మహేంద్రనాథ్ తనంతటతానే ఢిల్లీకి విమానంలో వెళ్ళిపోయాడనీ, ప్రధానితో ఇంటర్వ్యూను కోరుకున్నాడనీ తృతీయకథనం. ఆ కోరికను తిరస్కరించి ప్రధాని రాజకీయకార్యదర్శిని కలుసుకోమన్నారట. ఆ కార్యదర్శి మహేంద్రనాథ్‌కు వ్యతిరేకంగా ఉన్న సిబిఐ రిపోర్టును చూపించి రాజీనామా చేయాలని కోరాడట. మళ్ళీ అక్కడికక్కడే... మొత్తం మీద అతడు తప్పుకున్నాడు.. మంచే జరిగింది... అంటూ ఊహాగానంలో ఆరితేరిన నాలుకలు సాగదీసు కుంటూ అంటున్నాయి.

వీటికి వ్యతిరేకమైన వదంతులు కూడా అంతే గట్టిగా వినిపిస్తున్నాయి. మహేంద్రనాథ్ ఒకరి ముందు తలవంచుతాడని అంత తెలివితక్కువగా నువ్వెలా అనుకుంటున్నావ్? ఈ దుర్భాషలకు అంతూపొంతూ లేదా! మైగాడ్! అంత ఆత్మగౌరవం ఉన్న రాజకీయ నాయకుణ్ణి దేశం మొత్తం మీద మరొకరిని చూపించగలవా? ఓ సెక్రెటరీ మహేంద్రనాథ్‌ను అభిశంసించడమా? ఆ పరిస్థితి నసలు ఊహించగలమా?... నిజం చెబుతా విను. అధిష్ఠానవర్గమే ఏం చేయాలో తోచని పరి స్థితిలోకి జారిపోయి మహేంద్రనాథ్‌తో ఎలాగైనా రాజీ పడాలనుకుంది. ఆరునెలలుగా చర్చలకు ఢిల్లీ రమ్మని ఆయనను ఆహ్వానిస్తూనే ఉంది. ఆయన దాన్ని తిరస్కరించి రాష్ట్రంలో తన కార్యక్రమాలేవో తాను చూసుకుంటున్న విషయం తెలియంది కాదు. వాస్తవానికాయన అధిష్ఠాన వర్గానికి ఓ అల్టిమేటం కూడా ఇచ్చాడు. చౌదరిని మంత్రి వర్గంనుంచి తన్నితగలేయడానికైనా ఒప్పుకోండి, లేదా తాను తప్పుకోడానికైనా సమ్మతించండి... ఇదే దాని సారాంశం. అయినా అధిష్ఠాన వర్గం ఏమీ తేల్చుకోలేక మహేంద్రనాథ్, చౌదరి మధ్య ఎలాగైనా సంధికుదిర్చే ప్రయత్నాలు చేస్తూఉండిపోయింది. అందుకు మహేంద్రనాథ్ తన వ్యతిరేకతను స్పష్టం చేస్తూనే వచ్చాడు. చివరకు విసిగిపోయి, కనీసం అధిష్ఠానవర్గానికి మాట మాత్రంగానైనా తెలియజేయకుండా రాజీనామాను గవర్నర్ ముఖాన కొట్టివచ్చాడు. ఆయన మనసు పూర్తిగా విరిగిపోయింది. వ్యవహారాన్ని ఇంకా ఇంకా సాగదీసే అవకాశం ఢిల్లీ మనుషులకు ఇవ్వకూడదనుకున్నాడు. ఆ విధంగా అధికారాన్ని త్యాగంచేసి ముందుతరాల రాజకీయ నాయకులకు ఓ ఆదర్శంగా నిలిచాడు... అదీగాక, చూశావూ... రాష్ట్ర రాజకీయాల్లో ఇమడనంత స్థాయికి ఆయన ఎదిగి పోయాడు. సూదిబెజ్జంలో ఏనుగును దూర్చడం ఎవరితరం! ఆయనకు తగినచోటు జాతీయరాజకీయాలే. ఇప్పుడింక సంకెళ్ళనుంచి బయట పడ్డాడు కనుక, చూడండి, తన పూర్తిస్థాయికి తగిన పదవికి ఎదిగి పోతాడు. తన అసలు సత్తా ఏమిటో చూపిస్తాడు! నా మాటలు గుర్తుపెట్టుకో!

ఓరి నాయనో! కోరికలు ఎలా కళ్ళేలు తెంచుకుని పరుగెడుతున్నాయి! ఎప్పుడూ చిరచిర లాడే మనిషి, తన అభిప్రాయమే తప్ప మరొకరి మాట వినిపించుకోని మనిషి, కామం ఉన్మాదస్థాయికి ప్రకోపించిన మనిషి ఈ దేశానికి నాయకత్వం వహించడమా! భగవంతుడి దయవల్ల దీనిని నివారించగలిగిన శక్తి అధిష్ఠానవర్గానికి ఉంది. తలఎగరేసే ముఖ్యమంత్రులతో అధిష్ఠానవర్గం వ్యవహార సరళి ఎలా ఉంటుందో తెలిసినవాళ్ళు తక్కువ. వాళ్ళకువాళ్ళే ఉరివేసుకోడానికి చాలా చాలా అవకాశాలిస్తుంది. అదనుచూసి హఠాత్తుగా నిర్దాక్షిణ్యంగా తాడు బిగిస్తుంది. ఫలానా ఫలానా రాష్ట్రాల్లో ఈమధ్య ఏం జరిగింది? ఒకసారి పడిపోయిన తర్వాత అడ్రసు కూడా లేకుండా గల్లంతైపోయిన ముఖ్యమంత్రుల్ని ఎందరిని చూడలేదు?... దారితప్పిన ముఖ్యమంత్రులకు అధిష్ఠానవర్గం సిద్ధంచేసే సమాధి అలా ఉంటుంది. ఇంకో సంగతి గుర్తుపెట్టుకో, అధిష్ఠానవర్గం ఏంచేసినా అది సక్రమమే, అవతలవాళ్ళు ఏం చేసినా తప్పే! అధికారపక్షంలో అదే నియమం... గమనించావో లేదో అధిష్ఠానవర్గం ఎప్పుడూ పక్షపాతంతో వ్యవహరించదు. ప్రత్యేకించి అదెవరినీ భుజాన వేసుకోదు. దాని మద్దతు, దాని విశ్వాసం తనకే ఉందన్న అభిప్రాయం ఎవడికివాడికే కలిగిస్తుంది. అతగాడు స్వయంగా ఉరి బిగించుకునే వరకూ అందులో తేడా ఉండదు. రాష్ట్ర పార్టీలో ఘర్షణపడుతున్న అన్నివర్గాలమధ్య అధిష్ఠానవర్గం కత్తిమీదసాములాంటి సంతులనాన్ని ఎంతో చాకచక్యంగా పాటిస్తూ వేళచూసుకుని వీలుచూసుకుని తలనొప్పిగా మారిన ముఖ్య మంత్రిని అట్టే నొప్పిలేకుండా పక్కకు తప్పించేసి తన ఆదరానికి నోచుకున్న మరో మనిషిని ప్రజాస్వామ్యపూర్వకమైన ఆర్భాటంతో గద్దెనెక్కిస్తుంది. పల్లకీమోత మళ్ళీ మొదలవుతుంది.

పల్లకీ ఎక్కబోతున్న తాజా పెళ్ళికొడుకు చౌదరి. శాసనసభాపక్షం కొత్తనాయకుడి ఎంపికకు అధిష్ఠానవర్గం ఒక 'పరిశీలకు'ని పంపించింది. ఈ 'పరిశీలకుడు' ఇటువంటి 'ఎన్నిక'ల్లో ఎప్పటికప్పుడు కొత్తకొత్త విధానాలు అమలుచేస్తుంటాడు. ఒక్కోసారి పార్టీనాయకుడి పేరు తామే సూచించాలని, లేదా నామినేట్ చేయాలనీ (సందర్భాన్ని బట్టి ఈ మాటలు మారుతూ ఉంటాయి) ప్రధానమంత్రిని కోరుతూ శాసనసభాపక్షం ఏకగ్రీవతీర్మానం ఆమోదిస్తూ ఉంటుంది. అలా నామినేట్ అయిన వ్యక్తిని శాసనసభాపక్షం 'సక్రమ' పద్ధతిలో ఎన్నికైన వ్యక్తిగానే 'పరిగణించ'వలసి ఉంటుందన్న వాక్యాన్ని కూడా ఆ తీర్మానంలో తరచు పొందుపరచడం జరుగుతూ ఉంటుంది. కొన్ని కొన్ని సందర్భాల్లో ఈ తతంగం ఏదీ లేకుండా 'పరిశీలక'హోదాలో వచ్చినవారే- అతడుకానీ, ఆమె కానీ- ఎంతో చాకచక్యంగా అభ్యర్థిపేరు సూచిస్తూ ఉంటారు. పత్రికలవాళ్ళకి మాత్రం, అధిష్ఠానవర్గం దృష్టిలో అభ్యర్థు లెవరూ లేరనీ ఎన్నిక స్వేచ్ఛగా, సక్రమంగా జరగబోతోందనీ చెబుతారు. పార్టీ 'స్వతంత్రంగా స్వేచ్ఛగా' వరించిన వ్యక్తిని 'ఎన్నికై'నట్టు ప్రకటిస్తారు.

చౌదరిని శాసనసభా పక్షం అలాగే ఎన్నుకుంది. ఇందులో అన్నిటికంటె వింతగొలిపే విషయం— నిష్క్రమించబోతున్న ముఖ్యమంత్రి మహేంద్రనాథ్ ఏ మాత్రం సంకోచించకుండా చౌదరి పేరు ప్రతిపాదించడం!... శేఖర్ అంతే ఉత్సాహంతో ఆ ప్రతి పాదనను సమర్థించడం!

# 18

ముఖ్యమంత్రి పదవికోసం సాగుతున్న ఘర్షణ ఆకస్మికంగా ముగిసేసరికి శాసనసభ్యులు ఒక్క సారిగా అయోమయం సుడిగుండంలోకి జారిపోయారు. తమ మద్దతును కొత్త ముఖ్య మంత్రికి నిస్సంకోచంగా ఎలా మూటగట్టి ఇవ్వాలో నిన్నటివరకు వ్యతిరేకముఠాలో ఉన్నవారికి బోధపడలేదు. న్యాయంగాచెప్పాలంటే ఎం.ఎల్.ఏలు ఏ ముఖ్యమంత్రికీ వ్యతిరేకులు కాదు. ఏ ముఖ్యమంత్రినీ పూర్తిగా సమర్థించేవారూ కాదు ఏ ఒక్కరికో తాళి కట్టిన వారూ కాదు. ప్రతి ముఖ్యమంత్రీ ఇవాళ ఆ కొమ్మమీద వాలి రేపు ఎగిరిపోయే విహంగమని వాళ్ళకు తెలుసు. కొందరు శాసన సభ్యులు మహేంద్రనాథ్‌కు అచంచలురైన విధేయులుగా మరికొందరు ఆయనకు తీవ్రవ్యతిరేకులుగానూ సందర్భానుసారం ఉన్నప్పటికీ ఎక్కువమంది ప్రధానంగా తటస్థులే. తటస్థులుగానే ఉంటూ స్నేహభావంతోనే వ్యవహరించారు. కొందరుమాత్రం అంత స్నేహపూర్వకంగా లేనట్టు కనిపించింది. ఏ శాసనసభ్యుడు ముఖ్యమంత్రినుంచి ఏమాశించాడన్న దానిమీద ఈ వ్యత్యాసాలు ఆధారపడి ఉంటాయి. ముఖ్యమంత్రి చేతుల మీదుగా దేనికైనా ప్రారంభోత్సవం జరిపించాలనుకున్న సందర్భాలలో ఆయనపట్ల తన తటస్థభావాన్ని ఒక్కసారిగా మైత్రీభావంగా మార్చుకోవాలని ఏ శాసనసభ్యుడూ మరీ మరీ అనుకోడు. తన నియోజకవర్గంలోని ఏదైనా పథకానికి నిధులు కావలసివస్తే మాత్రం ముఖ్యమంత్రిని కలిసినప్పుడు కృతజ్ఞతాపూర్వకమైన ఒక చిరునవ్వును ముఖానికి అతికించుకుంటాడు. ఒక్కోసారి శాసనసభ్యుడు ముఖ్యమంత్రి నుంచి వ్యక్తిగతప్రయోజనం ఆశిస్తాడు. అది, అంతగా అర్హతలులేని తన సమీపబంధువుని ఏదైనా ఉద్యోగంలో నియమించడానికి సంబంధించింది కావచ్చు. లేదా తనను ఆర్థికంగా మంచిస్థితిలో ఉన్న ఏదైనా కమిటీకో, కార్పొరేషన్‌కో అధ్యక్షుడుగా నియమించడానికి సంబంధించింది కావచ్చు. అటువంటి సందర్భాలలో, కనీసం కోరుకున్న నియామకం జరిగేవరకూ, ముఖ్యమంత్రిపట్ల శాసనసభ్యుల స్నేహవిధేయతలకు ఎల్లలూ, సరిహద్దులూ ఉండవు. రాజకీయసంక్షోభం తలెత్తి నప్పుడు ముఖ్యమంత్రిటేబుల్‌మీద రకరకాల నియామకాలకు సంబంధించిన ఫైళ్ళు కుప్పలు తెప్పలుగా కనిపించడానికి కారణం అదే. అవి శాసనసభ్యులను ఊరించడానికే కానీ తక్షణ పరిష్కారానికి ఉద్దేశించినవి కావు. సంక్షోభం సమసిపోయేవరకూ అవి అలాగే ఉంటాయి.

గతంలో మహేంద్రనాథ్, చౌదరి ఒకే వర్గంలో ఉన్నప్పుడు శాసనసభ్యులకు చౌదరి ఎక్కువ భక్తసులభుడుగా కనిపించేవాడు. అందరూ ఆయన దగ్గరకే వెడుతుండేవారు. ఒకింత అడ్డదారి తొక్కితే తప్ప జరగని పనుల కోసం ఆశ్రయించడమో, అధికారయంత్రాంగంలో ఉన్న 'ఫలానా మనిషికి ఓ మాట చెప్పమ'ని అర్థించడమో చేస్తూ ఉండేవారు. ఇద్దరి మధ్యా చీలికవచ్చిన తర్వాత ఏం చేయాలో తోచని శాసన సభ్యులు మార్చిమార్చి ఇరువురినీ దర్శించుకుంటూ వచ్చారు. అలా చేయడం అవకాశవాదమని కొందరన్నారు కాని అలా కాదని వాళ్ళవాదం. వాళ్ళిద్దరి ఎడబాటులో తాము ఎటువంటి పాత్ర ధరించిన వాళ్ళు కాదు. కనుక ఇద్దరితోనూ మంచిగా ఉండడం తప్ప తాము చేయగలిగిందేమీలేదన్నది వాళ్ళ తర్కం. అలా ఉండకపోతే ఇద్దరి మధ్యా తాము నలిగిపోవలసి వస్తుంది. తమ తప్పు లేకపోయినా తమ భవిష్యత్తు నాశన మైపోతుంది. వాళ్ళ ప్రాణానికదే పెద్దగండం. అయితే ఎటుంటారో తేల్చుకోండని రెండువైపులనుంచీ క్రమంగా ఒత్తిడి పుంజుకుంటుంది. అప్పుడిక అటో అడుగు ఇటో అడుగు వేయడంలో అర్థమేమీ ఉండదు. ఏదో ఒక శ్రేణిలో చేరిపోవడం అనివార్యమైపోతుంది. అదెవ్వరూ కోరుకోని పరిస్థితి.

రాష్ట్రంలోని లక్షలాదిమంది ప్రజల బాగోగులకు స్పష్టంగా బాధ్యత వహించవలసిన వ్యక్తులు వీళ్ళే... కొత్త ముఖ్యమంత్రి చౌదరి ఒకటి రెండురోజుల్లో తాను పునర్నిర్మించనున్న మంత్రి వర్గంలోకి వీళ్ళనుంచే కొందరిని స్వీకరించాలి... అయితే ఎటువంటి వాళ్ళు వీళ్ళంతా ?... ఒక విచిత్రమైన మూక- సరళత్వమూ, సంక్లిష్టస్వభావమూ ఏకకాలంలో మూర్తీభవించిన వాళ్ళు, రకరకాల కులమతవర్గాల కలగూరగంప, వెన్నెముక లేని వాళ్ళు, రకరకాల ప్రేరణలతో పని చేసేవాళ్ళు, ఒక్కోసారి సంఘటితంగా, ఒక్కోసారి చీలిపోయి వ్యవహరించేవాళ్ళు. మొత్తం మీద ఒక నిర్వచనానికి అందని వాళ్ళు.

సుప్రసిద్ధులనుంచి, కేవలం చేతులెత్తేవారి వరకూ వీళ్ళలో ప్రతి ఒక్కరూ చౌదరికి బాగా తెలిసినవాళ్ళే. అయినాసరే ఇప్పుడు వీళ్ళ జాతకాల్ని అతడింకాస్త నిశితంగా పరిశీలించుకోవలసిందే. జాతకాల పరిశీలన అంటే రాజకీయపరిభాషలో ఆ వ్యక్తికి సంబంధించిన కొన్ని అనుకూల గుణగణాల పరిశీలనే అయినా, ప్రధానంగా ఆ వ్యక్తిలోని చీకటి కోణాలను వెతికి పట్టుకోడానికే ఎక్కువగా పరిమితమౌతుంది. అవసరమైనప్పుడు ఏ మంత్రిని ఎక్కడుంచాలో తెలుసుకోడానికిది ఉపయోగిస్తుంది. ఆ వ్యక్తి ప్రాతినిధ్యంవహించే ప్రాంతం, అతడి రాజకీయజీవితం, అనుభవం, పేరు ప్రఖ్యాతులకే కాకుండా అతడి కులమూ, దాని ప్రభావాలవంటి సాంఘిక నిర్బంధాలను కూడా పరిగణనలోకి తీసుకోవలసిందే. వీటన్నిటికంటే ముఖ్యంగా అతడికి ముఖ్యమంత్రి పట్ల ఒడుదుడుకులమధ్యకూడా చలించని విధేయత ఉండితీరాలి. ఇక ప్రజలు దీనిని 'తూకం' ఉన్న 'ప్రభుత్వ'మనుకునేమేరకు మంత్రుల్లో ఉండవలసిన ప్రతిభనుకూడా నిర్లక్ష్యం చేయడానికివీల్లేదు. దీనికి దృష్టాంతంగా చౌదరి తనకు విశ్వాసపాత్రుడైన ఒక జర్నలిస్టుతో అన్నాడు. 'ఆ సొగసు లాడి అరుణను సంతోషపెట్టే కుర్రాడున్నాడు చూశావూ... ఆలాంటి తెలివితేటలున్నవాళ్ళూ కొద్దిమంది కావాలి.'

జాబితాలోని ఒక్కొక్క పేరే పరిశీలిస్తూ ఉండిపోయాడు...

చౌదరి పరిశీలించిన మొదటి అభ్యర్థి రెహమాన్‌ఖాన్.

రెహమాన్‌ఖాన్ అసెంబ్లీసీటు గెల్చుకున్నట్టు తెలిసి నమ్మలేని అద్భుతమేదో జరిగినట్టు అందరూ అనుకున్నారు. ఓ బ్రహ్మాండమైన 'కెరటం' మీదుగా అతడు గెలుపుతీరం వైపు కొట్టు కొచ్చేశాడు. వృత్తి రీత్యా అతడో టైలర్. నిజాయితీ కలిగిన పార్టీ కార్యకర్తగా తన ఊళ్ళో పేరు తెచ్చుకున్నాడు. అయినా మామూలు సందర్భాల్లో అయితే తన పేరుకి ఎం. ఎల్. ఏ. అనే అక్షరాలు తగిలించుకోవడం అతనికి సాధ్యమయ్యేపని కాదు. ఎన్నికకు కొద్ది వారాలముందు ఎవరైనా ఆ గెలుపును ఊహించి ఉంటే అతణ్ణి అందరూ బుద్ధిహీనుడుగా పరిగణించి ఉండేవారు. మొత్తానికి రెహమాన్‌ఖాన్ ఎలాగో ఆ అద్భుతమైన ఫీటు సాధించగలిగాడు. ఎన్నికైన తర్వాత తనకెంతో ముఖ్యమనిపించిన విషయాలపై అసెంబ్లీలో ఎంతో ఆవేశపూరితంగా మాట్లాడుతూ ఉండేవాడు. అయినా ఎవరిలోనూ ఎటువంటి చలనం లేకపోవడం గమనించి శాసనసభకు ఎన్నికైన రెండేళ్ళకే ఒకవిధమైన నిర్వేదంలోకి జారిపోయాడు. కొంతకాలంపాటు అతణ్ణి పట్టించు కున్నవాళ్ళే లేరు. బలహీనవర్గాల నుంచి వచ్చిన ఎందరిలానో అతడు కూడా మందలో కలిసి పోయాడు. వాళ్ళందరూ ఏదో 'అల' లో కొట్టుకొచ్చినవాళ్ళే. ప్రజల్ని కానీ, ప్రభుత్వాన్ని కానీ తామేవిధంగానూ ప్రభావితం చేయలేమని త్వరలోనే వాళ్ళకి అర్థమైపోయింది. స్తబ్ధతకూ, బద్ధకానికీ, ఉదాసీనధోరణికీ అలవాటు పడిపోయి, భవిష్యత్తుమీద ఆశ కోల్పోయి శాసనసభ్యత్వ కాలం పూర్తి చేయగలిగితే చాలుననుకుంటూ, అవసరమైనప్పుడు క్రమం తప్పకుండా చేతులెత్తే విధిని మాత్రం నిర్వహిస్తూ కాలక్షేపంచేస్తూ ఉంటారు. అయితే రాజ్యసభకో, శాసనమండలికో ఎన్నికలు జరిగే సందర్భాలలో వీళ్ళ విలువ తాత్కాలికంగా పెరిగిపోతుంది. సంపన్న అభ్యర్థుల మధ్య జరిగే కుమ్ములాటలోకి విధిగా అడుగు పెట్టవలసి వస్తుంది. ఈ పరోక్షఎన్నికల్లో కొందరు పెద్ద ఎత్తున సొమ్ము చేసుకోవడమూ జరుగుతూ ఉంటుంది. అటువంటి ప్రలోభాలకు దూరంగా ఉన్న వాళ్ళని కూడా అదే గాటన కట్టేస్తూ ఉంటారు. ఆ బృందంలో ఉన్న ప్రతి ఒక్కరూ అవినీతిపరులేనన్న నిర్ధారణకు వచ్చేస్తారు.

ఇటువంటి సందర్భాల్లో రెహమాన్‌ఖాన్ మింగలేక కక్కలేక బాధపడుతూ ఉంటాడు ఏదైనా ఎన్నిక వచ్చినప్పుడూ, పార్టీ ముఖ్యమైన నిర్ణయం తీసుకోవలసివచ్చినప్పుడూ, సహచరులు అతని అభిప్రాయమేమిటో తెలుసుకునే ప్రయత్నం ఎప్పుడూ చేయరు. అతనికి మనమెంత చెబితే అంత ఉన్నట్టు వ్యవహరిస్తారు. దానికితోడు అతడు కారుచౌకగా అమ్ముడుపోయే రకమని కూడా వాళ్ళనుకుంటారు. ఒకవిషయం వాళ్ళకు స్పష్టంగా తెలుసు. వచ్చేఎన్నికల్లో రెహమాన్‌ఖాన్ తన సీటు నిలబెట్టుకునే అవకాశం ఎంత మాత్రం లేదు. కులబలం, ధనబలం కూడా ఉన్న వ్యక్తితో అతడు తలపడవలసి ఉంటుంది. డబ్బుతో మదించిన ఆ మనిషిని ఆ నియోజకవర్గంలో ఎవరూ ఓడించలేరని అందరూ అనుకుంటూఉంటారు. రెహమాన్‌ఖాన్ పైసకుకొరగాని మైనారిటీ అభ్యర్థే అయినా ఆ 'ఊపు'లో కొట్టుకొచ్చేసి అతణ్ణి మట్టి కరిపించేశాడు. అయితే ఇప్పుడా 'ఊపు' తగ్గుముఖంపట్టేసింది. పార్టీ అంతఃకలహాలు అందుకు కొంత కారణమైతే అసలటువంటి 'ఊపు' ఎంతో కాలం కొనసాగే అవకాశం ఉండదన్నది మరో కారణం. ఆపైన, క్రమశిక్షణను ఉల్లంఘించినందుకు పార్టీనుంచి బహిష్కృతుడైన ఆ కోటీశ్వరుణ్ణి ఈమధ్యనే ఎంతో హంగూ,

ఆర్భాటంతో పార్టీలోకి తిరిగి తెచ్చుకున్నారు. దాంతో రెహమాన్‌ఖాన్ మరింత కుంగిపోయాడు. ఇప్పుడందరూ అతణ్ణి ఒక తడవ ఎం.ఎల్.ఏ. గానే జమకడుతున్నారు. కనుక ఇప్పుడే వీలైనంత సొమ్ము చేసుకుని సభ్యత్వకాలం పూర్తికాగానే తిరిగి టైలరింగ్ వృత్తిలోకి ప్రవేశిస్తాడని ఎంతో తార్కికంగానే అందరూ నిర్ధారణకు వచ్చేశారు.

చౌదరికి రెహమాన్‌అంటే ఇష్టమే. అయినాసరే ఎన్నో విషయాలు ఆచితూచి పరిశీలించు కోవలసిందే. ఒక వైపున రెహమాన్ నిజాయితీపరుడు, మంచివాడు. అయినప్పటికీ బలహీనుడు, పేదవాడు. మరోవైపున కండబలం, అర్ధబలం దండిగా ఉన్న మందీమార్బలంతోసహా ఈ మధ్యనే తిరిగి పార్టీలోకి అడుగుపెట్టిన ఆ సంపన్న అభ్యర్థి తనను ఓడించిన రెహమాన్‌పై ఎలాగైనా ప్రతీకారంతీర్చుకునే ఉద్దేశంలో ఉన్నాడు. కొంత మద్దతు కూడగట్టుకోగలిగితే వచ్చే ఎన్నికల్లో రెహమాన్ టిక్కెట్టు సంపాదించుకోగలడని చౌదరికి తెలుసు. అయితే గెలిచే అవకాశాలు మాత్రంలేవు. అదీగాక రెహమాన్‌ను మంత్రి వర్గంలోకి తీసుకోవద్దని ఆ సంపన్న అభ్యర్థి ఇప్పటికే ఒత్తిడి తెస్తున్నాడు. మొత్తంమీద ఏ రకంగా చూసినా రెహమాన్‌ని మంత్రివర్గంలోకి తీసుకోకపోవడమే మంచిదని చౌదరి నిర్ణయానికొచ్చాడు.

అతడు పరిశీలించిన రెండో అభ్యర్థి సంత్‌రాం.

సంత్‌రాం షెడ్యూల్డు కులాలకు చెందిన ఎం.ఎల్.ఏ. 1952 ఎన్నికల్లో గట్టి పోటీని ఎదుర్కొని తొలిసారిగా శాసనసభకు ఎన్నికయ్యాడు. ఎన్నోసార్లు రాజు తుపాకిగుండ్లకు ధైర్యంగా ఎదురొడ్డి పోరాడిన స్వాతంత్ర్యసమరయోధుడు. నాయకులు అతని దేశభక్తిని వేనోళ్ళ ప్రశంసిస్తూ ఉండేవారు. పోలీసుల దౌర్జన్యాలనూ, హింసనూ తలవంచి భరించమని అతణ్ణి ప్రోత్సహించేవాళ్ళు. అందువల్ల వచ్చే కీర్తిని మాత్రం రకరకాలపద్ధతుల్లో తమ సొంతం చేసుకునేవాళ్ళు సంత్‌రాం ఇందుకు కోపగించేవాడు కాదు. మాతృభూమికోసం హింసనీ, నిర్బంధాన్నీ, చివరకు మృత్యువునుకూడా ఎదుర్కోవడంలో అతడెంతో అలౌకికమైన ఆనందాన్ని అనుభవించేవాడు. అతనిలో ప్రతిఫలాపేక్ష కొంచెమైనా ఉండేదికాదు. స్వాతంత్ర్యంవచ్చిన తర్వాత ఒళ్ళు తెలియని సంతోషంతో అతడు గంతులు వేశాడు. గొంతెత్తి పాటలు పాడాడు. చెక్కిళ్ళనుంచి జారిన ఆనందాశ్రువులు అతడి బవిరిగడ్డంలో చిక్కుకుని ముత్యాల్లా మెరిసిపోయాయి.

అయితే 1952 ఎన్నికలకు పార్టీ అభ్యర్థుల్ని ఎంపికచేసే ఘట్టంలో సంత్‌రాం పేరును దాటించేశారు. ఎన్నికలు ఖర్చుతో కూడుకున్న వ్యవహారం కనుక సంత్‌రాం వంటి నిరుపేదకి టిక్కెట్ ఇస్తే పార్టీ ఆ సీటును పోగొట్టుకోవలసివస్తుందన్న కారణం చూపించారు. టిక్కెట్టును ఆశిస్తున్న అవతలిమనిషి విషయంలో ఆ అనర్హత లేదు. అయితే ఎన్నో త్యాగాలు చేసి, పోరాడిన గొప్ప చరిత్ర కూడా అతడికి లేదు. వ్యవహారం ఎటూ తేల్చలేని గడ్డుసమస్యగా మారేసరికి ప్రధానమంత్రి జవహర్లాల్ నెహ్రూ దృష్టికి తీసుకెళ్ళారు. కాగితాలు తిరగేస్తున్న నెహ్రూ ముఖం కోపంతో ఎర్రబడిపోయింది. సంత్‌రాంకు వ్యతిరేకంగా ఉన్న వాదనలను 'బుద్ధితక్కువ' వాదనలుగా కొట్టి అవతల పారేశారాయన. అప్పటినుంచి సంత్‌రాం ఎం.ఎల్.ఏ.గా కొనసాగుతున్నాడు. పార్టీకి అతడెప్పుడూ విధేయుడుగానే ఉంటూవచ్చాడు. అతని నిజాయితీ, సేవాభావం, ఉన్నదానితోనే

సంతృప్తిపడే అతని నైజం అందరికీ తెలిసినవే. అతడెప్పుడూ ఎటువంటి కుతంత్రాలూ నడిపిన వాడు కాదు. అందుకే మంత్రి కాలేకపోయాడు. కాలేకపోయినందుకు అతడెప్పుడూ ఎవరిమీదా కోపం తెచ్చుకోడం కానీ, విచారించడం కానీ ఎరగడు.

సంత్‌రాం తన మంత్రివర్గానికి గొప్ప అలంకారం కాగలడనుకున్నాడు చౌదరి. మంచి సేవాభావం, త్యాగనిరతి కలిగినదిగా మంత్రివర్గానికి ముద్రవేయించుకోడానికి అతడివల్ల వీలవుతుంది. అదీగాక సంత్‌రాంకు ఢిల్లీలో కూడా ఒకవిధమైన పరిచయాలున్నాయి. తరచు జగ్‌జీవన్‌రాంను కలిసి మాట్లాడివస్తూ ఉంటాడు. మరీ కొంపలు మునిగిపోయే సందర్భాలలో ఆధారపడవలసింది ప్రధానమంత్రితో ఉండే ఒకే ఒక పరిచయంమీదే ఐనా, ఇతరత్రా ఢిల్లీ పరిచయాలు కూడా బాగానే ఉపయోగిస్తుంటాయి.

చౌదరి తన ఎదురుగా ఉన్న కాగితంలోని మిగిలినపేర్లను కూడా పరిశీలిస్తూ పోతున్నాడు. ఒక పేరు దగ్గర అతని చూపులు ఆగిపోయాయి. అది బజరంగ్‌సింగ్. కిందటి ఎన్నికలకు నాలుగుమాసాల ముందు బజరంగ్‌సింగ్ అనే పేరు గల మనిషి ఒకడున్నాడని మహేంద్రనాథ్‌కి తెలియనే తెలియదు. సరిగ్గా ఎన్నికలముందు బజరంగ్‌ను తన మిత్రకోటిలో చేర్చుకోవడమే కాదు, పార్టీ టిక్కెట్టుకు కూడా అతడిపేరు సిఫార్సు చేశాడు. ఆవిధంగా బజరంగ్‌సింగ్ హఠాత్తుగా 'బజరంగ్‌సింగ్, ఎం.ఎల్.ఏ.' అనిపించుకున్నాడు. ఏ లెక్కన చూసినా అది ఉల్కాపాతంలాంటి అభివృద్ధే.

మొదట, పెరిగిన బస్సుఛార్జీలకు వ్యతిరేకంగా పుట్టి ఆ తర్వాత రకరకాల డిమాండ్లతో విస్తరించి రాష్ట్రాన్ని ఏడాదికిపైగా ఊపివేసిన ఒక ఉద్యమం నుంచి పుట్టుకొచ్చిన ఉల్క అది. ఈ ఉద్యమం ప్రజలకీ, ప్రభుత్వానికీ కూడా ఎంతో తలనొప్పిగా పరిణమించింది. వేలాదిమంది విద్యార్థుల్ని తరగతుల బహిష్కరణ, నినాదాల కేకలు, నల్లజెండాల ప్రదర్శనలు, పోలీసులతో దాగుడుమూతలు, రోజూ ఏదో ఒక 'నిరసన దినం' పాటింపు, పరీక్షలతో పనిలేకుండా తమను ఉత్తీర్ణుల్ని చేయాలన్న డిమాండ్ వంటి రకరకాల ఉత్సాహపూరితమైన కార్యక్రమాలవైపు నడిపించింది. వాళ్ళలో కాస్త సాధుస్వభావులు, ఆర్థిక స్తోమత లేనివాళ్ళు ఎలాగైనా పరీక్షల్లో గట్టెక్కి ఉద్యోగం సంపాదించుకోవచ్చునన్న ఆశతో ఉన్నారు. అయితే ఉద్యోగాలేవీ మీ ఒళ్ళో వచ్చిపడడానికి సిద్ధంగాలేవని అల్లరిమూక వాళ్ళకు బోధించారు. కనుక ఎంతో దేశభక్తి నిండిన మన ఉద్యమానికి వెన్నుచూపించి రౌడీమూకకి ఆగ్రహం తెప్పించడం దేనికిలే అని వాళ్ళు కూడా అనుకున్నారు. మొత్తంమీద ప్రతిఒకరూ ఉద్యమంలో చేరిపోవడంతో అదలా నెలల తరబడి సాగిపోయింది. అదో జీవనవిధానం కింద మారింది.

సరిగ్గా అదేసమయంలో రాష్ట్రాన్ని అధికారికంగా సందర్శించడానికి ప్రధానమంత్రి దయతో ఒప్పుకున్నారు. ఆందోళనవల్ల కలవరపడుతున్న ముఖ్యమంత్రికి ఒకవైపున కొంతబరువు దిగిపోయినట్టూ, మరోవైపున దిగులు రెట్టింపయినట్టూ ఏకకాలంలో అనిపించింది. అధికారికమైన ఏర్పాట్లుచూసుకోడానికి తన పోలీసుబలగాలు సరిపోతాయి కానీ, అనధికారికరంగంలో ఉద్యమనాయకుల్ని మించి ప్రకాశించగల నక్షత్ర మేదీ ఆయన కంటికి కనిపించలేదు. ఆ ఘట్టంలో ముఖ్యమంత్రిఅనుచరగణందృష్టికి బజరంగ్‌సింగ్ కనిపించాడు. ఉద్యమనాయకుల్లో ఒకడనీ,

తగిన ధరపలికితే ప్రభుత్వం వైపు ఫిరాయించడానికి సిద్ధంగా ఉన్నాడనీ తప్ప అతడి గురించి మరేమీ ఎవరికీ తెలియదు. బేరం కుదిర్చింది మరెవరో కాదు, అప్పట్లో మహేంద్రనాథ్‌ను కష్టాలనుంచి గట్టెక్కించే బాధ్యతను మీదవేసుకున్న చౌదరే. బజరంగ్ ముఖ్యమంత్రి హృదయాన్ని ఎంతగానో చూరగొన్నాడు. పరిస్థితిని పూర్తిగా కొత్త మలుపు తిప్పాడు.

అతడి వ్యక్తిగతజీవితంగురించి ఎవరికీ అంతగా తెలియదు. అతడు పూర్తిగా 'జీవిత విశ్వ విద్యాలయం'లో చదువుకున్నవాడు. ఇంకా అర్థమయ్యేట్టు చెప్పుకోవాలంటే, బొత్తిగా అక్షరం ముక్క తెలియనివాడు. ఈ విషయాన్ని ఎంతో గర్వంగా చాటుకుంటూ ఉండేవాడు. నేడు చదువన బడే దంతా ఎంతో గొప్పగా కనిపించే వట్టి పనికిమాలిన చెత్త అనేవాడు. స్మగ్లింగ్, దొంగసా రాయి చేరవేత, మొదలైన కార్యక్రమాలు నడిపించడానికీ, లూప్‌లైన్‌లో ఉన్న రైల్వే వేగన్ల తలుపులు బద్దలు కొట్టి లూటీ చేయడానికీ, పేటలో ఉన్న కండగలమూకనంతనీ ఓ ముతా కిందికి తెచ్చి పనులు చేయించడానికీ – దీనికి బండెడు పుస్తకాలు చదవవలసిన అవసరమేముందని ప్రశ్నించే వాడు. ఏ చదువూ లేకనే ఎన్నో ఏళ్ళుగా బజరంగ్ ఇవన్నీ చేస్తూ ఉన్నాడు. అత్యద్భుతమైన విజయాలు సాధిస్తున్నాడు.

హఠాత్తుగా, ఉప్పెనలా ఉద్యమం విరుచుకుపడేసరికి బజరంగ్ రాత్రికి రాత్రి ఒక గొప్ప 'ఆశయా'నికి అంకితమైన మహానాయకుడైపోయాడు. అదెటువంటి ఆశయమన్న ప్రశ్నకు ప్రాధాన్యం లేదు. అందరికీ అసాధ్యమనిపించే వ్యవహారంలో కూడా ఒక అవకాశాన్ని చూడగలిగినవాడు బజరంగ్. త్వరలోనే తన పద్ధతిలో తానుకూడా ఒక నాయకుడుగా ఎదిగి పోయాడు. ఉద్యమకారుల 'యుద్ధ మండలి' సమావేశాల్లో పాల్గొంటూ పథకరచయితగా- సలహాదారుగా- నిపుణుడుగా- ఉద్యమకార్యకర్తగా- ఒకే మనిషి బహురూపాల్లో ప్రత్యక్షం కావడం ప్రారంభించాడు. అంతటి బహుముఖప్రజ్ఞాపాటవాలు కలిగినవాళ్ళు చాలా అరుదుగా ఉంటారు.

ప్రధానమంత్రి రాష్ట్రపర్యటనకు రావడానికి కొద్దిరోజుల ముందు బజరంగ్‌కు గొప్ప అవకాశం తోసుకొచ్చింది. అప్పటికే ఆందోళన నీరసించిన సూచనలు కనిపిస్తున్నాయి. అవులిస్తే పేగులు లెక్కపెట్టగలిగిన బజరంగ్, ఆందోళన పూర్తిగా నీరుకారిపోయే రోజు మరెంతో దూరంలో లేదని పసిగట్టాడు. అంతే, ఎంతో యుక్తితో, మెరుపువేగంతో పావులు నడిపించాడు. ఒకవైపున ఇతర నాయకులు ఏం చేద్దామా అని తర్కించుకుంటూ ఉండగానే రాత్రికి రాత్రి చౌదరితో బేరం కుదుర్చుకున్నాడు. తన ప్లేటుఫిరాయింపును సమర్థించుకుంటూ ముక్తసరిగా ఓ ప్రకటన జారీ చేసేసి అమాంతం బరిలోకి దిగిపోయాడు. అయితే ఈసారి ప్రభుత్వం వైపునుంచి. తనకెంతో విశ్వాసపాత్రులైన రౌడీమూకను వెంటబెట్టుకుని అక్షరాలా ఉద్యమాన్ని తన పాదాలతో తొక్కి తొక్కి చంపాడు. దెయ్యంపట్టినట్టు అదేపనిగా విరుచుకుపడి ఉద్యమకారుల ధైర్యాన్ని పూర్తిగా చెదర గొట్టేశాడు. ఆ తర్వాత కొద్దిరోజులకు నిరసనపేరుతో కొంతసేపు హడావుడి చేశాడు. ఏ విధంగా చూసినా నమ్మ శక్యం కాని గొప్ప విన్యాసమే అదంతా.

ప్రధానమంత్రి ప్రసంగించిన బ్రహ్మాండమైన బహిరంగసభలో బజరంగ్ ఎక్కడబడితే అక్కడ తుపానులా కలయతిరుగుతూ కనిపించాడు. గట్టిగా కేకలుపెడుతూ ఆదేశాలు జారీచేశాడు.

అల్లర్లు సృష్టించగలరనుకున్నవాళ్ళని అదిమిపెట్టి ఉంచాడు. స్కూలువిద్యార్థులవైపు రౌద్రంగా ఉరిమిచూశాడు. రెప్పవాల్చని కాపలామనిషిలా వ్యవహరించాడు. ఈ కొత్తపాత్రను ఎంతో గొప్పగా పోషిస్తూ, జనంలో కలిసిపోయి సభను భగ్నంచేయాలనుకున్న ఆందోళనకారులందరినీ హడలగొట్టేశాడు. బజరంగ్, అతని అనుయాయుల పుణ్యమా అని పాపం వాళ్ళేమీ చేయలేక పోయారు. ఆవిధంగా ఉద్యమం చిట్టచివరి ఆనవాళ్ళు కూడా పూర్తిగా అంతరించిపోయాయి. త్వరలోనే మంట చల్లారిపోయింది.

సహజంగానే ప్రభుత్వవర్గాలకు బజరంగ్ ఓ మహానుభావుడిలా కనిపించాడు. అతణ్ణి ప్రధాన మంత్రి నెహ్రూకు పరిచయం చేశారు. ఆయన కూడా అతడివైపు మెచ్చుకోలుగా చూసి తలఊపారు. తర్వాత పార్టీ టిక్కెట్టు వచ్చి అతడి చేతిలో పడింది. ఆ వెంటనే ఎన్నికల ప్రచారం. వోట్లు ఆకర్షించగలవ్యక్తిగా బజరంగ్ ప్రతిభాపాటవాలు మరింతగా అప్పుడు వెలుగులోకి వచ్చేశాయి. బహిరంగసభలతో అతడికి పనిలేదు. ప్రచారం అవసరం లేదు. మంత్రులు తన నియోజకవర్గాన్ని సందర్శించి తనగురించి పొగుడుతూ మాట్లాడవలసిన అవసరం అంతకంటే లేదు. బజరంగ్ సింగ్ అనబడే ఆ వ్యక్తి ఎన్నికల్లో పోటీచేయడం ఆ నియోజకవర్గంలో దానికదే ఎంతో ప్రభావం చూపించగల గొప్ప ఎన్నికలప్రణాళిక. అతడి అనుచరగణం తక్షణమే రంగప్రవేశంచేసి మిగిలినపని పూర్తిచేశారు.

అసెంబ్లీకి ఎన్నికైన తర్వాత బజరంగ్‌సింగ్ ఒక అజరామరమైన ప్రసంగంచేశాడు. దానిని ఓ పట్టాన మరచిపోవడం కష్టం. అన్ని ప్రసంగాలకూ పరాకాష్ఠగా దానిని అభివర్ణించారు సభ్యులు. లేచి నిలబడి గొంతు సవరించుకుని సరిగ్గా ఆరే ఆరువాక్యాలు మాట్లాడాడు బజరంగ్‌సింగ్. వాటిలో మళ్ళీ సరిగ్గా ఏడు బూతుమాటలు దొర్లిపోయాయి— నాలుగక్షరాల రకం (పచ్చిబూతు). ఎందుకు దొర్లకూడదు? ఎంతైనా అతగాడు జీవిత విశ్వవిద్యాలయంలో నేర్చుకుని ఇంతవరకూ ఎంతో అమోఘంగా ఉపయోగించుకున్న పదజాలమే కదా అది! ఆ మాటల్ని నేరుగా అతడు అసెంబ్లీలోకి తీసుకురావడం ఎంతో సహజమైన విషయం. అందుకే సభలో యాభై మంది సభ్యులు దిగ్గున లేచి నిలబడి 'అన్‌పార్లమెంటరీ! అన్‌పార్లమెంటరీ!.. దయచేసి ఆ మాటల్ని రికార్డులనుంచి తొలగించండి అధ్యక్షా!' అంటూ కేకలు వేయడం, బజరంగ్‌కి కలవరం కలిగించింది. వెండితీగల్లా మెరుస్తున్న జుట్టు, మామూలు కంటె ఎక్కువ దళసరి కళ్ళద్దాలతో ఎంతో హుందాగా కనిపించే స్పీకర్ మహాశయుడు కూడా మొదట్లో మట్టిలో మాణిక్యాల్లాంటి ఆ మాటలకు ఎంతో ఆనందించినట్టే కనిపించాడు. అయినాసరే ఆ మాటల్ని రికార్డులనుంచి తొలగించడానికి ఉత్తర్వుచేశాడు. ఆ అల్లరిమూక సాగించే కాకిగోలను శాంతింపజేయడానికే అలా చేసుంటాడనుకున్నాడు బజరంగ్ కోపంగా. ఆ తర్వాత అతడెప్పుడూ అసెంబ్లీలో నోరువిప్పి మాట్లాడలేదు. మాట్లాడనీ, మాట్లాడకపోనీ... ఎవరూ ఉపేక్షించడానికి వీల్లేని ఎం.ఎల్.ఏ. గానే కొనసాగాడు. దేనినైనా సాధించుకురాగల ఉత్సాహవంతుడు. ముఖ్యమంత్రిగారి అద్భుతదీపంనుంచి పుట్టుకొచ్చిన రాక్షసుడు.

బజరంగ్‌ను మంత్రిపదవిలో నియమించడం చౌదరిలాంటి వాళ్ళకి కూడా అఘాయిత్యంలా కనిపించే విషయమే. అయితే ఎంతో ఉపయోగపడే ఆ మనిషిని, అంతటి కార్యశూరుణ్ణి పనీపాటా

లేకుండా ఉంచడమూ కష్టమే. చౌదరి అతని విషయం లోతుగా ఆలోచించి, చివరకతణ్ణి శాసన సభాపక్షం చీఫ్‌విప్‌గా నియమించాడు. ఆ నియామకం తర్వాత అసెంబ్లీలో పార్టీసభ్యులహాజరు బ్రహ్మాండంగానూ, అనూహ్యంగానూ మెరుగుపడిన విషయాన్ని ఇక్కడ గుర్తు చేసుకుని తీరాలి.

మంత్రివర్గ నిర్మాణం సందర్భంగా చౌదరి పరిశీలనకు తీసుకున్న పేర్లు ఇంకా చాలా ఉన్నాయి. అయితే వాళ్ళందరికీ ఆ పదవికి తగిన అర్హత లేకపోవచ్చు. కానీ వారిలో ఉన్న వైవిధ్యం, వాళ్ళ బహుముఖ గుణగణాలు, లోపాలు చౌదరిని ఆశ్చర్యపరిచాయి. ఈ పరిశీలన వల్ల ఎన్నో విషయాలు తెలుసుకోగలిగాననుకున్నాడు.

ఉదాహరణకు అనిల్‌కుమార్. ఎప్పుడూ ఏవేవో శ్రుతిమించిన ఊహల్లో తేలిపోతూఉంటాడు. ఎప్పుడూ ప్రణయవిహంగాల రెక్కలమీద విహరిస్తూ ఉంటాడు. అందమైన ఆడది కనిపిస్తేచాలు కరిగి నీరైపోతూ ఉంటాడు. అతడీ పిచ్చిలోపడి చాలాకాలమే అయింది. హస్తప్రయోగానికి అలవాటు పడడంతో ప్రారంభించి సినిమాలు విపరీతంగాచూసి మనసుకు పట్టించుకోవడం ఇందుకు కారణం కావచ్చు. ఇతరత్రా అతడికెటువంటి వ్యసనాలులేవు. మద్యం ముట్టుకోడు. ఎంతో పవిత్రంగా ఉంటాడు. ఉపకారస్తుడు. సేవాభావం ఉన్నవాడు. ఎదుటివారిని ఒప్పించేలా ప్రసంగించగలిగినవాడు, ప్రచారకళలో సిద్ధహస్తుడు. అసెంబ్లీకి రెండుసార్లు ఎన్నికయ్యాడు.. ఇన్ని సుగుణాలు ఉన్నప్పటికీ అతడు 'అచ్చోసిన ఆంబోతు'గానే ప్రఖ్యాతుడయ్యాడు.

ఇక మహిళాసభ్యురాలు శాంతాదేవి... ఆకర్షణీయమైన రూపం. మంచిచెడులు తెలిసిన మనిషి. బాగా చదువుకున్నది. ఎంతో చురుకైనది. కానీ కిందటి ఎన్నికల్లో పార్టీటికెట్టు సంపాదించుకోడానికీ అర్హతలేవీ ఆమెకు ఉపయోగపడలేదు. పార్టీ నాయకుణ్ణి ఆకట్టుకున్న తన ఒకే ఒక అర్హత -కామోద్రేకాన్ని రెచ్చగొట్టే తన శరీరమేనని ఆమె తెలుసుకోగలిగింది. అయితే... ఆ కోరిక నామె కాదనాలనుకుంది, కానీ అనలేదు. అలా టిక్కెట్టు సంపాదించి ఎం.ఎల్.ఎ. అయింది. కొంతకాలంతర్వాత ఈ వ్యవహారం రచ్చకెక్కింది. అప్పటినుంచి ఆ మచ్చ ఆమె మీద ఉండిపోయింది. ఆమెనందరూ 'లంజ' అని పిలుస్తూ ఉంటారు.

ఆ తర్వాత ధనపాల్. చక్కటి చరిత్ర కలిగినవాడు. సమర్థుడు. ప్రసిద్ధుడు. కానీ డబ్బు అతని బలహీనత. అదెలా సంభవించిందో అర్థంకాదు. ఎందుకంటే, అతనికే తరగనంత ఆస్తి ఉంది. ఏదైనా పనికోసం తన దగ్గరకు వచ్చిన ప్రతివారినుంచీ 'ఖర్చుల' పేరుతో చిన్నచిన్న మొత్తాలు కూడా పిండుకుంటూఉంటాడు. డబ్బు వసూలు చేయడం అతడికో వ్యసనం. మిగిలిన విషయాల్లో అంతటి ఉపకారస్తుడు ఉండడు. తన పలుకుబడిని పూర్తిగా ప్రజల మంచికోసమే వినియోగించే మనిషి. అందరికీ తలలో నాలుక. రకరకాల పనులమీద వందలమంది ఆయనను కలిసివెడుతూ ఉంటారు. డబ్బులిచ్చి తమ పనులు చేయించుకుంటారు. ఎంతో కృతజ్ఞత ప్రకటించు కుంటారు. అతడి డ్రాయింగ్‌రూంలోంచి ఇవతలికి వచ్చీరాగానే 'లంచగొండి వెధవ' అనితిట్టుకుంటారు. ఆ బిరుదుతోనే అతడు పదిమందికీ తెలిశాడు. ప్రతిఒకరూ ఉపయోగించుకునే, ప్రతిఒకరూ దూషించే లంచగొండి వెధవ.

ఇక పీటర్‌దాస్. అతణ్ణి స్పృహ ఉండగా చూసినవాళ్ళులేరు. చిన్నప్పుడు నగరంలోని ఓ మురికివాడలో ఉంటున్నప్పుడే జులాయిగా తిరిగే తండ్రిదగ్గర తాగుడు నేర్చుకున్నాడు. తదుపరి కష్టపడిపనిచేసి శాసనసభకు ఎన్నికయ్యాడు. ఎప్పుడూ సగంమైకంలో జోగుతూ ఉండడమే అతని సహజస్థితి అనవచ్చు. ఆ స్థితిలో కూడా అతడెవరికీ ఎటువంటి హానిచేసి ఎరగడు. ఈగను కూడా బాధ పెట్టని మనిషి. ఎంతో జాలిగుండె. తొడుక్కున్న చొక్కాను కూడా విప్పి దానం చేయగలిగినవాడు. అంతటి నమ్మకస్థుడు లక్షల మందిలో ఒకడుంటాడు. ఓ అందమైన కన్నెపిల్లను అతడితోపాటు ఒక ఒంటరి దీవిలో విడిచిపెట్టినాసరే ఆమెకెటువంటి అప కారమూ జరగదు. నిత్యసంతోషి. రేపటిగురించిన చింత లేనివాడు. విషాదం అతని దరిదాపుల్లోకిరాదు... ఇన్ని మానవత్వలక్షణాలు ఉన్నప్పటికీ అందరూ అతణ్ణి 'తాగుబోతు' అనే పిలుస్తారు. అతడి అసలు పేరుమరచి పోయారు...

ఆ గుంపులో వీళ్ళు కొందరుమాత్రమే. నమ్మశక్యం కానంత చిత్రవిచిత్రమానవ ప్రవృత్తులు, ఎవరి వర్ణసంయోజనం వాళ్ళదే. ఇంకొకరితో పోల్చడానికి వీలులేదు. వాళ్ళలో ఏ ఒకరూ కారునలుపూ కాదు, అలాగని మంచుతెలుపూ కాదు. వాళ్ళ స్వభావాలలో, వ్యక్తిత్వాలలో కొట్టొచ్చినట్టు కనిపించేది బూడిద వర్ణమే. ఎంతో వైవిధ్యంతో కూడిన సమూహం. ఉమ్మడిగా వాళ్ళను ప్రేరేపించేది ఒకటే-అధికారం. వాళ్ళ మధ్య ఐకమత్యాన్ని తెచ్చిపెట్టే గుణం- స్వార్థం. మొత్తానికి అందరూ ఆడుతున్నది ఈ ఆటే, ఏ పేరిట పిలుచుకున్నా సరే.

*ప్రతిరాజకీయవాదిని అతడి, లేదా ఆమె ప్రధానలోపంతోనే అందరూ గుర్తిస్తున్నారనీ, ఇతరమైన మంచి గుణాలన్నింటినీ ఆ లోపం కప్పివేస్తుందనీ చౌదరికి బాగా అర్థమైంది. రాజకీయరంగంలో ఉన్న ప్రతిఒకడి రథంమీద అతడి అవగుణాల జెండా ఉవ్వెత్తున కొట్టొచ్చినట్టు ఎగురుతూ అతడిలోని బల హీనతలనే ప్రపంచానికి చాటుతూఉంటుంది. అతడిలోని చెడును తప్ప మరి దేనినీ జనం చూడరు, వినరు, మాట్లాడరు.*

ఆ పైన ఓ కన్నూ ముక్కూ లేని అనామక మానవసమూహం. వాళ్ళ గురించి ప్రత్యేకించి మంచిగానీ, చెడుగానీ చెప్పుకోటానికేమీ ఉండదు. సాధారణశాసనసభ్యులు. బ్యాలెట్‌బాక్సులోంచి పుట్టుకొచ్చి అయిదేళ్ళు సభలో కూర్చుని ఎవరి దృష్టికీరాకుండా అదృశ్యమైపోయేవాళ్ళు. ఎటువంటి విశేషమూలేని తమ రాజ కీయజీవితంలో వాళ్ళు సాధించుకో గలిగిందల్లా, స్పీకర్ అనుమతిస్తే సభలో కొద్దినిముషాలు మాట్లాడే అవకాశం, మరణించినతర్వాత శాసన సభలో సంతాపతీర్మానం, రెండు నిముషాలు మౌనం. మరణానంతరంమాత్రమే లభించే జాలిగొలిపే గుర్తింపు!

తన మంత్రివర్గానికి రూపకల్పన చేసుకోడానికి ఈ గుంపునుంచే చౌదరి మనుషుల్ని ఎంపిక చేసుకోవాలి. ఇక తన విధేయులే కాకుండా, మహేంద్రనాథ్ మంత్రివర్గంలో పనిచేసిన తన వెనుకటి సహచరులు ఎలాగూ ఉంటారు. వాళ్ళందరూ పరుగుపరుగున తన డ్రాయింగ్‌రూంలోకి వచ్చేసి తమ మచ్చలేని మద్దతునూ సహకారాన్నీ ప్రకటించేశారు. వాళ్ళను చూసి చౌదరి లోలోపల నవ్వుకున్నాడు. సరిగ్గా ఇరవై నాలుగు గంటలక్రితంవరకూ తనమీద రకరకాల దుర్భాషలు

గుప్పించింది వీళ్ళే. ఇప్పుడు వీళ్ళందరూ తనకు 'మద్దతు' ఇస్తారు, తదుపరి కాబోయే తన ప్రత్యర్థిపై, అతడు ముఖ్యమంత్రి అయ్యే వరకూ, తన మీద చేసిన విమర్శలనే, అంతకంటె నీచమైన విమర్శలనే అతడిమీద కూడా ప్రయోగిస్తారు. ఆ తర్వాత ఈ పెద్దమనుషులందరూ అతడివైపు తిరిగిపోతారు. వీళ్ళందరూ కేవలం 'ముఖ్యమంత్రి మనుషులు', ఆ పదవిలో ఎవరున్నా సరే. వీళ్ళలో కొందరినైనా మంత్రి వర్గంలోకి తీసుకోవలసిఉంటుందని చౌదరికి తెలుసు. కనీసం వాళ్ళ పాచినోళ్ళనూ, దుర్భాషా పాండిత్యాన్నీ ఉపయోగించుకోడానికైనా అది తప్పదు. ఒక మంత్రివర్గం నిర్మించాలంటే ఎన్ని చూసుకోవాలి!

అయితే ఇంతవరకూ ఎంచుకున్న ఎం.ఎల్.ఎ.లెవరూ కీలకస్థానం వహించగలిగిన వాళ్ళుకారు. మంత్రివర్గంలో తనకు అత్యంత సన్నిహితంగా ఉండే స్థానాలను, ఏరికోరి ఎంచుకున్న వాళ్ళకు కేటాయించాలి. కొత్తముఖ్యమంత్రి ఎక్కువగా ఆధారపడేది వాళ్ళ మీదనే. తన 'ఎన్నిక' తర్వాత ఇంటికి తిరిగొచ్చిన వెంటనే చౌదరి ఆనంద్‌కు కబురు చేశాడు. స్నేహపూర్వకంగా కరచాలనంచేసి అన్నాడు. 'నా ఇంటికి వచ్చినందుకు చాలా సంతోషం ఆనంద్. ఇదే మొదటిసారి అనుకుంటాను?'

'అవును... అవును సార్' ఆనంద్ తడబడుతూ అపరాధభావంతో అన్నాడు.

'నువ్వు తరచు ఇక్కడికి వస్తూ ఉండాలని నా కోరిక. మరేం కంగారుపడకు. నిన్ను ఇక్కడికి రప్పించుకోడానికి చక్కని ఉపాయం ఆలోచించాలే'.

'ఏమిటి సార్?'

'నా మంత్రివర్గంలోకి నిన్ను తీసుకుంటున్నాను. మరీ తుప్పుపట్టి పోతున్నావ్. నిన్నేదైనా పనిలో పెట్టాలి.'

'థాంక్యూ!' ఆనంద్ గొణిగాడు. అతడీ పరిణామాన్ని ఊహించలేదు. అయినా అతడి కంఠధ్వని మామూలుగానే ఉంది.

'నీ గురించి ఏం తెలుసుకోవాలో నాకు తెలుసనుకో. నీకు మంచి సాహచర్యం ఉంటుందని మాత్రం హామీ ఇవ్వగలను. ఎవరి సాహచర్యమెవరిదో తెలుసుకోవాలని నీకు అనిపించడం లేదూ?' చౌదరి చిరునవ్వుతో అడిగాడు.

'అది ముఖ్యమంత్రిగారి స్వయంవిచక్షణకు పరిమితమైన విషయమనుకుంటాను' ఆనంద్ అదే గొంతుతో సమాధానం చెప్పాడు.

'అవునవును. నా విచక్షణాధికారాన్ని ఉపయోగించుకునే నీకు చెబుతున్నాను. నీ ఆప్తమిత్రుడు శేఖర్ నీ మంత్రివర్గసహచరుడు కాబోతున్నాడు', చౌదరి చెప్పాడు.

ఆనంద్ విస్తుపోయాడు.

# 19

పార్టీఅధ్యక్షురాలు ఇందిరాగాంధి చౌదరి ప్రతిపాదించిన మంత్రిమండలి జాబితాపై దృష్టిసారించారు. చౌదరిగురించితప్ప అందులోని మిగిలిన వాళ్ళెవరి గురించి ఆమెకంత బాగాతెలియదు. కొన్నేళ్ళక్రితం మద్రాసులో పార్టీసమావేశాలయినప్పటినుంచి ఉత్సాహవంతుడైన సోషలిస్టుగా చౌదరి గురించి నాన్న అప్పుడప్పుడు చెబుతూఉంటారు. ముఖ్యమంత్రి కాకముందు, మహేంద్రనాథ్ మంత్రివర్గంలో నెంబర్ టూగా, చౌదరి తరచు అధిష్ఠానవర్గంతో సంప్రతింపులు సాగిస్తూ ఉండేవాడు కనుక ఆమె అతణ్ణి కలుసుకోవడం, అతనిగురించి వినడం సంభవించింది. చౌదరి, మహేంద్రనాథ్‌ల మధ్య తలెత్తిన వివాదం ఇటు ఢిల్లీలోనూ అటు అఫ్రోజాబాద్‌లోనూ కూడా ఒక్కలానే చర్చనీయాంశమవుతూ వచ్చింది కనుక దాని గురించి కూడా ఆమెకు పూర్తిగాతెలుసు. అయితే చౌదరి మాటల్లో కానీ, చేతల్లో కానీ ఆమె కెటువంటి సోషలిస్టు తరహా ఆలోచనలూ కనిపించలేదు. కేవలం ప్రభుత్వాధికారమూ, దానికి సంబంధించిన అంశాలు తప్ప మరేమీ పట్టనివట్టి రాజకీయవాది మాత్రమే అతడిలో ఆమెకు కనిపించాడు. తండ్రీకూతుళ్ళు ఇరువురూ ఈ జాతి లక్షణాలను బాగా అకళించుకున్నవాళ్ళే. అప్పటికి దేశమంతటా కొట్టొచ్చినట్టు కనిపించే ధోరణి కూడా ఇదే కనుక దానిపై వాళ్ళు ఎటువంటి వ్యాఖ్యలూ చేసేవాళ్ళు కాదు.

మంత్రిమండలి పరిమాణం కొంత పెద్దదిగా ఉన్నట్టు ఆ జాబితాకు జోడించిన ప్రధాన కార్యదర్శి నోటు వేలెత్తి చూపించింది. ఆ విషయం ముఖ్యమంత్రితో చర్చించావా అని ఇందిరాజీ అతణ్ణి అడిగారు. 'చర్చించాను మేడమ్. వివిధ కులాలకు ప్రాతినిధ్యం కల్పించవలసి వచ్చిందనీ, తనకు ముందున్న మహేంద్రనాథ్‌కు సన్నిహితులైన కొందరిని తీసుకోవలసి వచ్చిందనీ ఆయన చెప్పాడు. మతాలు, కులాల ప్రాతిపదికన ప్రాతినిధ్యం కల్పించటం తనకు అనివార్యమైందంటున్నాడు', ప్రధాన కార్యదర్శి సమాధానం చెప్పాడు.

కులం ప్రాముఖ్యం రానురాను పెరిగిపోతూఉండడాన్ని ఇందిరాజీ, అధిష్ఠానవర్గంలోని మిగిలిన వాళ్ళూ గమనిస్తూనేఉన్నారు. నిస్సందేహంగా రాజకీయప్రక్రియలోకి అడుగుపెట్టిన ఈ ధోరణి క్రమంగా మొత్తం ప్రక్రియను లోబరచుకుంటుందా అన్న భయం కలిగిస్తోంది. పరిపాలనా యంత్రాంగం పూర్తిగా నిష్పాక్షికంగా వ్యవహరించవలసిన విషయాలలో కులం ప్రాతిపదికపై

మంత్రులు జోక్యం చేసుకునే సందర్భాలు నానాటికీ పెరిగిపోతున్నాయి. చేయగలిగిందేమీలేదు, ఉన్నట్టు కనిపించడంలేదు. పరిస్థితిని గమనిస్తుంటే కులరహిత సమాజం కనీసం ఇప్పట్లో అసాధ్యమనే అనిపిస్తోంది. కులరహిత భావాల్ని జీర్ణించుకున్న ఒక జాతీయపక్షం ఇటువంటి దుస్థితికి జారిపోవడం విపరీతపరిణామమే ననకతప్పదు.

రాష్ట్రరాజధానిలో మాత్రం విభిన్న వాతావరణం.

ప్రమాణస్వీకారానికి ముందురోజురాత్రి కొందరిలో ఆనందం పొంగి పొర్లుతూంటే ఆనంద్ మాత్రం గాఢమైన ఆత్మపరిశీలనలో మునిగిపోయిఉన్నాడు. ఆలింగనాలు, వెన్నుచరుపులు, సత్కారాలు ఓవైపున ఎడతెరిపిలేకుండా జరుగుతున్నా అతడేదో దీర్ఘాలోచనలో ఒకింత గంభీరంగా ఉన్నాడు. సంతోషం పరవళ్ళుతొక్కుతున్న అతని మద్దతుదారులు డ్రాయింగ్ రూమ్‌లో చేరి కోలాహలంగా మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ పండుగ చేసుకుంటున్నారు. ఇంతలో పట్టలేనంత సంభ్రమంతో అరుణ తుపానులా అక్కడికి ప్రవేశించేసరికి క్షణకాలం నిశ్శబ్దం అలముకుంది. ఏదో బహుమతి గెల్చుకున్న స్కూలువిద్యార్థినిలా ఆమె హడావుడిగా తిరుగుతూ అందరినీ అభినందిస్తూ ఏదో పాట ఎత్తుకుంది. అక్కడున్న అందరూ ఆమెతో మనస్ఫూర్తిగా గొంతు కలిపారు. అంతటా నిజమైన ఉత్సవవాతావరణం.

అందరూ వెళ్ళిపోయినతర్వాత అరుణ, ఆనంద్ ఏకాంతంగా మిగిలిపోయారు. ఆనంద్ మరింత గంభీరంగా మారాడు. అతడంత సంశయగ్రస్తుడుగా డోలాయమానస్థితిలో ఎందుకున్నాడా అని ఆమె ఆశ్చర్యపోయింది. ఆనంద్ కనుబొమలు ముడిచి కొద్ది నిముషాల నిశ్శబ్దం తర్వాత అన్నాడు, 'ఇప్పటికీ సమయం మించిపోలేదు...'

'దేనికి సమయం మించిపోలేదు?' అరుణ ప్రశ్నించింది, అయోమయంగా చూస్తూ.

'బయటపడడానికి,... చౌదరి ఇచ్చిన అవకాశాన్ని తిరస్కరించడానికి.'

'నీ కేమైనా మతిపోయిందా?' అరుణ విరుచుకుపడింది. 'ప్రమాణస్వీకారం చేయబోతున్న సమయంలో ఇలా నీరుకారిపోవడం ఎలా ఉంటుందో ఊహించుకో. నువ్వేమైనా దానివెంట పడ్డావా? పడనప్పుడు ఇలా మాట్లాడడంలో అర్థమేముంది?'

'చూడు అరుణా! నే నేదో త్యాగపురుషుడిలా మాట్లాడడంలేదు. అయినా ఒకటి మాత్రం కచ్చితంగా చెప్పగలను. ఈ పదవి కోసం నేను పెద్దమూల్యమే చెల్లించుకోవలసి ఉంటుంది.'

'ఏం మూల్యం? మూల్యం చెల్లించమని ని న్నెవరడుగుతున్నారు? అర్థంకాని భాషలో మాట్లాడకు. నీ అద్భుతమైన కారణమేమిటో చెప్పు.'

'ఈ పదవిలో ఎన్ని ప్రమాదాలున్నాయో నువ్వేమైనా గ్రహించావా అరుణా?' ఆనంద్ ఆలోచనగా అన్నాడు.

'ఏం ప్రమాదాలు? నేను ఊహించగలిగిందల్లా కొంతమంది ఏడుస్తారు. అంతకుమించి ఏముంటుంది?'

'తొలిరోజునుంచీ మనం ఎన్నో తలవంపుల్ని ఎదుర్కోవలసి వస్తుంది. బతుకు నరకమై పోతుంది.'

'నీతో నేనెంత మాత్రం ఏకీభవించను. వ్యక్తిగతంగా ఎదురయ్యే తికమకలు చాలా అల్పమైనవి. వాటి కారణంగా దేశానికి, రాష్ట్రానికి సేవలందించవలసిన కర్తవ్యంనుంచి నువ్వు పారిపోలేవు. అటువంటి విషయాలు ఆలోచించడమే తప్పు.'

'నా గురించి నేనేమీ ఆలోచించడంలేదు' తనను తాను సమర్థించుకుంటున్నట్టు అన్నాడు ఆనంద్. 'ఎన్ని అపనిందల మధ్యకూడా మగవాడు ఈ పురుషప్రపంచంలో హాయిగా బతికేయ గలడు. మరి స్త్రీ సంగతేమిటి? లేదు లేదు... నావల్ల కాదు.'

'నీ పుర్రెను ఏం తొలుస్తోందో నాకేమీ అర్థం కావడంలేదు. నాతో చెప్పు ఆనంద్. ఏం జరిగింది? నీ కివ్వబోయే శాఖగురించి బాధపడుతున్నావా' అరుణ ప్రశ్నించింది.

'అరుణా, దయచేసి దీన్ని నవ్వులాటగా తీసుకోకు. నా మనస్సంతా అల్లకల్లోలంగా ఉంది...'

'నువ్వీ సణుగుడు ప్రారంభించి గంటయింది. నిన్ను బాధపెడుతున్న ఒక్క దిక్కుమాలిన కారణం కూడా నాకు చెప్పలేదు!' అరుణ వాడిగా అంది.

'నేటి కలగాపులగం పరిస్థితిని చూసి అందులో ఎదురయ్యే అవరోధాల్ని అర్థం చేసుకో. నావిధి నిర్వహణను తలచుకుని భయపడుతున్నానని మాత్రం అనుకోకు. మంత్రిగా నా కర్తవ్యాన్ని చక్కగా నిర్వహించగలనని నాకు తెలుసు. అయితే బాగా పనిచేయడం ఎవడికి కావాలి? మంత్రులు ఎదుర్కొనే అవస్థలెలా ఉంటాయో కొంతకాలంగా నేనెంతో సన్నిహితంగా గమనిస్తున్నాను. నా విషయానికొస్తే, శాఖ ఏదైనా చేయవలసిందెంతో ఉంటుంది. నా దగ్గర పనిచేసేవాళ్ళచేత బోలెడు చాకిరీ చేయించగలను. త్వరలోనే నన్ను వాళ్ళు విషం చూసినట్టు చూసి అసహ్యించు కుంటారు. ఇక రాజకీయవాదులున్నారు. మంత్రిపదవి నాకు కాకుండా తమకు దక్కిఉండవలసిందని అనుకునేవాళ్ళు కనీసం అరడజను మందైనా ఉంటారు. నన్ను వాళ్ళు ద్వేషిస్తారు. నామీద నిర్విరామంగా బురదచల్లడానికి చూస్తారు. ఆ తర్వాత ప్రతిపక్షంలో కొందరు సీనియర్ నాయకులున్నారు. మంత్రుల్ని ఎద్దేవా చేయడం, ఎలాపడితే అలావాళ్ళను అవమానించడం తమ జన్మహక్కుగా భావిస్తూ ఉంటారు. నేను వారి అవమానాలను సహించను కనుక వాళ్ళు కూడా నన్ను తేలిగ్గా విడిచిపెట్టరు. చివరగా పత్రికలవాళ్ళు. వాళ్ళలో కొందరు నాకు మంచిస్నేహితులే ఉన్నారు. వారిలో ప్రతిఒకరూ తమ వృత్తిలో మెరికల్లాంటివారేనని వ్యక్తిగతంగా నేను భావిస్తాను. వచ్చిన ఇబ్బందల్లా, ఎక్కడ ఎటువంటి పొరపాటు జరుగుతోందో వర్ణించడమే వాళ్ళ వృత్తి ధర్మంగా పరిణమించింది. తాము గురిపెట్టడానికి తేలిగ్గా ఏ మంత్రి దొరుకుతాడా అని వాళ్ళు చూస్తారు. మంత్రులందరూ బుద్ధిహీనులేననీ, బుద్ధిహీనులే మంత్రులవుతారనీ చాలామంది విలేఖరులు తమ అంతరాంతరాల్లో తమకు తెలియకుండానే నమ్ముతూఉంటారు. తప్పుడు జవాబులతో గందరగోళం పుట్టించే మంత్రులన్నా, తమ ప్రచారం కోసం అస్తమానం వాళ్ళను ఆశ్రయించే మంత్రులన్నా జర్నలిస్టులు ఎంతో ఇష్టపడతారు. నేను వాళ్ళకు నిరాశ

కలిగించవలసివస్తుంది. దాంతో వాళ్ళు నన్ను క్షమించలేరు. అది వాళ్ళ తప్పుకూడా కాదు, ఎందుకంటే ఎక్కడో ఏదో తప్పు జరుగుతూఉంటే తప్ప వారి వృత్తికి ప్రగతి ఉండదు. ఆ తప్పు మంత్రిచేస్తే మరీ మంచిది. రెండురోజుల క్రితమే ఓ విలేఖరి నా దగ్గరకొచ్చి మంత్రి వర్గంలో నన్ను చేర్చుకోబోతున్నట్టు వచ్చిన ఊహాగానం మీద నామీద ఏవేవో ప్రశ్నలు గుప్పించాడు. నేను తగిన జవాబులిచ్చాను. అతడెంతో కలవరపడిపోయాడు. అది సహజమే. సక్రమంగా ఉన్న సమాధానాలు వార్త కాలేవు. "మీ దగ్గరకి రావడం దున్నపోతు నుంచి పాలు పితకడంలా ఉంది!" అన్నాడతను కోపంగా. మొత్తం సమస్యను నిర్మమదృష్టితో చూసి అంచనా వేయవలసివస్తే నా స్వేచ్ఛను కోల్పోవడంతో పాటు నాకిష్టమైంది ఏదీ నేను చేయలేనేమోననిపిస్తోంది.'

వినీ వినీ అరుణలో సహనం నశించింది. అతడికి మధ్యలో అడ్డుతగిలి మండిపడుతూ అంది. 'ఎంత పనికిమాలిన ఆలోచనలు! ప్రపంచమంతా నీకు వ్యతిరేకంగా ఉన్నట్టు ఎందుకు ఊహించుకుంటున్నావ్? నేటివరకు ఇక ఈ భూప్రపంచంలో నువ్వే మొట్టమొదటి మంత్రివైనట్టూ, చిట్టచివరి మంత్రివీ నువ్వే కాబోతున్నట్టూ!'

'నా గురించి నేను ఆలోచించడంలేదు అరుణా! తనగురించి పదిమందీ ఎటువంటి దుష్ప్రచారం సాగిస్తున్నా, ఇది పురుషప్రపంచం కనుక, మగవాడు దర్జాగా బతికేయగలడు. కాని నా రక్తం తాగడానికి చూసేవాళ్ళు చివరకు నీ రక్తమే చిందిస్తారు.'

ఈ మాట విని అకస్మాత్తుగా అరుణలో విచారం కమ్ముకొచ్చింది. ఆనంద్‌ని మంత్రివర్గంలోకి తీసుకుంటున్నట్టు తెలిసి సంబరపడిపోయింది కానీ ఈ కోణంనుంచి తనంతగా ఆలోచించ లేకపోయింది. ఆనంద్ పదోన్నతిగురించి ఎందరో పనికట్టుకొని తనను అభినందించారు. అందులోని ఆంతర్యం తనకప్పుడు అర్థం కాలేదు. ఆనంద్ ఈ హెచ్చరిక మాటలు అన్న వెంటనే వాస్తవం ఆమెను వరదలా ముంచెత్తింది. అతడి వాదన ఎంత తర్కబద్ధంగా, స్పష్టంగా ఉందో బోధపడింది:— 'ప్రతిఫలం చెల్లించందే ఫలం దొరకదు...' ఇప్పుడామె పూర్తిగా సావధాన స్థితిలోకి వచ్చేసింది.

తన ఆందోళనను ఆనంద్ మెల్లగా ఒక పద్ధతిగా వివరించాడు. 'యుద్ధం దేనిమీద జరుగు తుందో నువ్విప్పుడు అర్థం చేసుకుని ఉంటావు. వాళ్ళు నామీద దేనితో దాడిచేస్తారు? నన్ను అవినీతిపరుడని ఎప్పటికీ అనలేరు. నేను అసమర్థుణ్ణని కూడా అనలేరు. నేను తెలివిహీనుణ్ణన్న ఆలోచనకు కూడా సాహసించలేరు. నేను అహంకారిననో, నా వ్యవహారసరళి ఉండవలసిన పద్ధతిలో లేదనో, వాళ్ళంటే అనవచ్చు. వ్యవహారసరళి ఎలా ఉండాలన్నదలా ఉంచి అసలు 'వ్యవహార సరళి' అన్న మాటకు అర్థమేమిటో కూడా ఎవరికీ తెలియదు. కనుక ఆవైపు నుంచి దాడిచేస్తే వాళ్ళు సాధించగలిగిందేమీ ఉండదు. నేను అవలీలగా వాళ్ళను ఎదుర్కోగలను...'

'నీకు ఆడపిచ్చి ఉందనగలరు వాళ్ళు' అరుణ అందించింది.

'అలా అంటారని నేననుకోను' ఆనంద్ సాలోచనగా అన్నాడు. 'విచిత్రంగా కనిపిస్తుందేమో కానీ, మన సమాజంలో మగవాడి విషయంలో అదంత తీవ్రమైన ఆరోపణ కాదు. ఆడదానివి కనుక నీకంత నచ్చకపోవచ్చు కానీ, నిజం చెప్పాలంటే మనం విశ్వసించే నైతిక ప్రమాణాలరీత్యా

స్త్రీవ్యసనం ఉన్న మగవాణ్ణి ఎవరూ ఏ విధంగానూ నీచంగా చూడరు. అతనిచుట్టూ ఏదో కాంతివలయం కనిపిస్తుంది అందరికీ. నాయకభేదాల్లో అతడు కూడా ఒకడు. ఫ్యూడల్‌వాతావరణంలో స్త్రీవ్యసనం ఇంచుమించు ఒక హోదాకు గుర్తుకూడా. పురుషత్వానికి అదొరకమైన కొలమానం. లేదు, అరుణా! నాకు వాళ్ళు స్త్రీవ్యసనాన్ని ఆపాదించలేరు... ముఖ్యంగా అంతకంటె తీవ్రమైన ఆరోపణ వాళ్ళకు అందుబాటులో ఉన్నప్పుడు.'

'ఏమిటది?'

'నువ్వూ... నేనూ' ఆనంద్ ఆచితూచి అన్నాడు. 'ఎంతోమంది ఆడవాళ్ళు, మొత్తం రాణివాసం అయితే అభ్యంతరం లేదు. కానీ ఒకే ఒక స్త్రీ –ఎంతమాత్రం కూడదు. అవినీతికి అది పరాకాష్ఠ. వీటన్నింటినీమించి ఒక మంత్రి ఒక స్త్రీ! అర్థమైందా సన్నివేశం?'

'అయినట్టే అనిపిస్తోంది' అరుణ గొణిగింది అన్యమనస్కంగా. 'నీ మాటల్నిబట్టి నాకు అర్థమౌతున్నదొక్కటే. రేపటినుంచి సరికొత్త అధ్యాయం ప్రారంభించాలి. నేను నీకు దూరంగా వెళ్ళిపోవాలి' ఆమె తనకు తాను చెప్పుకుంటున్నట్టు అంది.

'అది వీలౌతుందా?'

కాదని తమను పీడించే ఈ ప్రశ్నకు ఒకే క్షణంలో ఇద్దరికీ జవాబు దొరికినట్టనిపించింది.

'ప్రమాణస్వీకారం మధ్యాహ్నం జరుగుతుందనుకుంటాను' ఎట్టకేలకు నోరువిప్పాడు ఆనంద్. 'ఈ లోపల గౌరవంగా బయటపడతాను. అవకాశం కనిపిస్తే ఎగిరి గెంతడానికి చాలామంది సిద్ధంగా ఉన్నారు...'

'వద్దు!' ఆమె గట్టిగా అరిచింది. 'దయచేసి వద్దు! నేను ఒప్పుకోను...'

'ఆవేశపడకు అరుణా!' ఊరడింపుగా అన్నాడు ఆనంద్. 'రాగద్వేషాలకతీతంగా సూటిగా తేటగా ఆలోచించి ఈ సమస్యను పరిష్కరించుకోవాలి. నేను పదవులకోసం తపించిపోవడం లేదు. డబ్బు మీద నాకు వ్యామోహం లేదు. ఇప్పుడు చేస్తున్నట్టే ముందుముందు కూడా ప్రజాసేవ కొనసాగిస్తుంటాను. పదవి వద్దన్నంతలో కొత్తగా వచ్చిపడే సమస్య ఏముంది?'

'నీ కుటుంబం, నీ స్నేహితులు, నీ అనుయాయుల సంగతేమిటి? నిన్ను మంత్రివర్గంలోకి తీసుకుంటున్నట్టు ప్రకటించిన తర్వాత కూడా వాళ్ళకు నిరాశ కలిగిస్తావా?'

అతడు జవాబు చెప్పలేదు. కానీ ఆ ముఖంలో తొంగిచూస్తున్న కలవరపాటును ఆమె అర్థం చేసుకోగలిగింది. ఈసారి ఊరడించడం ఆమె వంతయింది. 'చూడు. ఈ రాత్రంతా ఈ విషయం గురించి వేరువేరుగా ఆలోచిద్దాం. సరేనా? ఒక్క ఆలోచన మాత్రం నీకు అందించి వెడతాను. ఈ ఘట్టంలో తప్పుకోవడం చాలా ఎబ్బెట్టుగా ఉంటుంది అందువల్ల నువ్వు అనవసరమైన చిక్కుల్లో పడిపోవచ్చు. ప్రాధాన్యాలను నిర్ణయించుకోడానికి ఇంకా సమయముందనే నేననుకుంటున్నాను. సమస్యలు నువ్వు ఊహించుకుంటున్నంత గడ్డుగా ఎల్లప్పుడూ ఉండవు.'

'సరే. నీదీ ఊహే, నాదీ ఊహ,' అన్నాడు ఆనంద్. 'అయినాసరే, ఈ విషయంలో ప్రమాదాన్ని రమ్మని పిలిచినట్టు అడుగువేయకూడదని నేననుకుంటున్నాను. చూడు, అధికారంలో ఉన్నవాడు మనసమాజంలో ఎల్లప్పుడూ ముద్దాయే...'

'నేను కాదనను. అయినా ముందే వెనకడుగు వేయడంలో అర్థంలేదు. వాళ్ళందరూ నీమీద కత్తిగట్టారనే అనుకుందాం. అలాగే అధికారమో, అంతకంటె ముఖ్యమని నువ్వు భావిస్తున్న మరొకటో ఎంచుకునే పరిస్థితి తలెత్తిందనే అనుకుందాం. చరిత్రలో చాలామంది విషయంలో అలా జరిగింది. అప్పుడు నీ మార్గాన్ని ఏ క్షణంలోనైనా నిర్ణయించుకోవచ్చు కాదా?'.

'ఏమో చెప్పలేను ఆ పరిస్థితి ఏ రూపంలో ఎలా ప్రత్యక్షమౌతుందో... దానిమీద అంతా ఆధారపడి ఉంటుంది' అన్నాడు ఆనంద్.

'ఇప్పుడు నాతో వాదించకు... సమస్యను వాయిదావేసి నిద్రపో. నా జీవితంలో నిన్ను కోరుకుంటున్నది ఒక్కటేనన్న సంగతి కూడా గుర్తు పెట్టుకో. రేపు నిర్ణయం తీసుకో. పొద్దుట ఆ నిర్ణయంతోనే నిద్రలే. అదేమిటో నాకు చెప్పొద్దు, చేసి చూపించు. సరేనా?'

'నువ్వదేకోరితే అలాగే చేస్తాను' ఆనంద్ గొణిగాడు.

మరోసారి వారిద్దరిమధ్య నిశ్శబ్దం రాజ్యంచేసింది. వాస్తవం వాళ్ళ మస్తిష్కాల్లో పెద్దగా రొదపెడుతూ అలజడి రేపుతోంది. ప్రతిఫలంచెల్లించందే ఫలం దొరకదు...

అరుణ వెళ్ళిపోయినతర్వాత ఆనంద్ ఇక విశ్రమించబోతుండగా స్నేహితుడు డాక్టర్ సుదర్శన్ ఆనందంతో వెలిగిపోతూ లోపలికి అడుగుపెట్టాడు. అప్పటికే అర్థరాత్రి దాటింది. ప్రత్యేకించి ఒక విషయంమీద కాకుండా అవీ ఇవీ మాట్లాడుకుంటూ ఇద్దరూ కొద్దిసేపు గడిపారు. చివరకు దాగుడుమూతల ఆటతో విసిగిపోయి సుదర్శన్ హఠాత్తుగా అన్నాడు 'మంత్రిగా నువ్వు గొప్ప పేరు తెచ్చుకుంటావనీ, అద్భుతంగా రాణిస్తావనీ నాకు తెలుసు. అధికారం నీకు రావలసిన సమయానికే వచ్చింది కానీ...' క్షణకాలం మాటల కోసం తడుముకుని మళ్ళీ కొనసాగించాడు. 'కానీ, ఈ అరుణ అనే మనిషి నిన్ను చెడగొడుతుందా అనిపిస్తోంది.'

కొద్దిక్షణాలు ఒకరినొకరు చూసుకుంటూ ఉండిపోయారు. తర్వాత సుదర్శన్ అన్నాడు 'అలా అని వాళ్ళందరూ అంటున్నారు.'

'నీ సంగతేమిటి? నువ్వేమంటావ్?'

'బాగుంది!' సుదర్శన్ విరుచుకుపడ్డాడు. 'నాకెలా తెలుస్తుంది? అయినా నాకేం తెలుసు?'

'నీకు తెలియందేమిటి?'

క్షణకాలం అప్రతిభుడైన సుదర్శన్ నిస్సహాయంగా భుజాలు ఎగరేశాడు. తర్వాత నచ్చజెప్పే ధోరణిలో అన్నాడు. 'సరే, సరే... నాకు తెలిసినంత తెలుసనుకుందాం. అయినా నువ్వు ఆమె కారణంగా చిక్కుల్లో పడబోతున్నావనేది మాత్రం తిరుగులేని వాస్తవం.'

'ఎటువంటి చిక్కులు? అసలామె ఏం చేసింది? ఇంకాస్త స్పష్టంగా చెబుతావా?'

సుదర్శన్ నిర్దిష్టంగా చెప్పగలిగింది కూడా ఏమీలేదు. ఆనంద్ తను స్థూలంగా చేసే ఉపదేశాలను వినిపించుకునే మానసికస్థితిలో లేడని సుదర్శన్ గ్రహించాడు. వ్యూహం మార్చుకుని మళ్ళీ అప్రధాన విషయాలవైపు సంభాషణ మళ్ళించాడు. నిజానికి తాను చెప్పదలచుకున్నది చెప్పేశాడు. అదనంగా చెప్పవలసింది కూడా ఏమీ లేదు.

అయినా సుదర్శన్ మాట్లాడుతూనే ఉన్నాడు 'చూడు మిత్రమా, ఎన్నో సంవత్సరాలుగా నిన్ను అంటిపెట్టుకునిఉన్న ఆప్తమిత్రుణ్ణి నేనొకణ్ణే...'

'జలగలా' ఆనంద్ మధ్యలోనే తుంచుతూ అన్నాడు.

'అవును జలగలానే!' సుదర్శన్ నవ్వుతూ అన్నాడు. 'నా కోసం నిన్నేమీ అడగలేదు. చదువుకునే రోజులనుంచి మనిద్దరం ఎంతో సన్నిహితంగా ఉంటూవచ్చాం... నీ సంతోషంలోనే నా సంతోషాన్ని వెతుక్కున్నాను. ఎందుకో ఆ దేవుడికే తెలియాలి! అయినా నీవల్ల అందరూ బాధపడడంలోనే నీకు సంతోషం కనిపిస్తుంది కాబోలు. ఈ వైరుధ్యం ఎలా సంభవించింది?'

'సరే. నన్నేం చేయమంటావో చెప్పు డాక్టర్! 'వాళ్ళె'వరి గురించో నువ్వు ప్రస్తావించావు కనుక, వాళ్ళెవరనేది నేనడగను. నేనేం చేయాలని 'వాళ్ళు' ఆశిస్తున్నారో చెప్పు.'

'నాకు తెలిస్తే ఇంకేముంది?' సుదర్శన్ మరోసారి విరుచుకుపడ్డాడు. 'నిన్ననడానికి కూడా ఏమీ కనిపించడంలేదు. అయినా నువ్వు జాగ్రత్తగా ఉండడం అవసరం. అలాగే ఆమె కూడా... ఎలా అన్నది మాత్రం నేను చెప్పలేను. నన్ను అడగద్దు.'

'అడగను' ఆనంద్ గట్టిగా ఒత్తి పలుకుతూ అన్నాడు. సుదర్శన్ క్షణకాలం విస్తుపోతూ అతడివైపు చూశాడు.

'అడగవా? అయితే నువ్వేం చేయదల్చుకున్నావ్?'

'నాకు తెలిస్తే ఇంకేముంది? నన్నావిషయం అడగద్దు!' అన్నాడు ఆనంద్.

ఇద్దరూ మనస్ఫూర్తిగా నవ్వేశారు. 'చూడు. నీ జీవితంలో– అలాగే నా జీవితంలో కూడా రేపు – కలకాలం గుర్తుండిపోయే రోజు. ఈ సమయంలో నీ ఆనందాన్ని భగ్నం చేయడం నా ఉద్దేశం కాదు. ఒకమాట అని వెడతాను. స్థిమితంగా ఆలోచించుకో. వ్యక్తిగత ఇష్టాయిష్టాలకు అతీతంగానే నువ్వెప్పుడూ వ్యవహరిస్తూ వచ్చావు. మంత్రిగా కూడా నీ నడక అలాగే ఉండాలి!'

ఒంటరిగా మిగిలిపోయిన ఆనంద్ భారంగా నిట్టూర్చాడు. తాను వాయిదావేసేసి ప్రస్తుతం నిద్రపోవలసిన నిర్ణయాలు ఇంకా చాలానే ఉన్నాయనుకున్నాడు.

కానీ నిద్రపోలేకపోయాడు. అతణ్ణి అభినందించడానికి పెద్ద శాసనసభ్యుల పటాలం బిలబిలా వచ్చేసింది. వాళ్ళలో సంత్‌రాం, ఇంకా చాలామంది ఉన్నారు. వాళ్ళ సహజసిద్ధమైన నాయకుడు

మరెవరో కాదు, బజరంగ్‌సింగ్. ఇటీవలి సంవత్సరాలలో అతనికి ఆనంద్‌మీద ప్రత్యేకమైన ఇష్టం ఏర్పడింది.

బజరంగ్ మరీ మరీ సంతోషంగా ఉన్నాడు. ఆనంద్‌ను గట్టిగా కౌగలించుకుని నలిపేశాడు. వీపుమీద అదేపనిగా చరిచాడు. మిగిలినవాళ్ళు ఈ సన్నివేశాన్ని ఎంతో ముచ్చటగా చూస్తూ ఉండిపోయారు. అమాంతం ఆనంద్‌ను పైకెత్తి గిరగిరా తిప్పేశాడు. నెమ్మదిగా కిందికి దింపి ఒకింత గంభీరంగా మారాడు. 'పేదోళ్ళను దయగా చూడు ఆనంద్ బేటా' అంటూ సలహా ఇచ్చాడు. 'నీకెవడైనా ఇబ్బంది కలిగిస్తూ ఉంటే నాకు చెప్పు. వాడి మెడవిరిచేస్తాను. ఆ జెండా కారులో కూర్చోగానే నీ కళ్ళు నెత్తికొచ్చాయో జాగ్రత్త. పక్కదారి పట్టినట్టు కనిపించావా నీ మెడ కూడా విరిచేస్తాను! గుర్తుపెట్టుకో!' అంతలోనే అన్నాడు 'ఆ అవసరం రాదులే. నాకు తెలుసు. నువ్వు చాలామంచిగా పనిచేస్తావని నాకు తెలుసు. ఆ విషయం నాకెలా తెలుసునో నాకే తెలియదు. ఏవిఁటి, మీరంతా ఏమనుకుంటున్నారు?'

'నువ్వు బాగా చెప్పినవ్' మిగిలినవాళ్ళు ముక్తకంఠంతో అన్నారు.

ఆ అభిమానవర్షంలో ఆనంద్ నిలువునా తడిసిపోయాడు. అరుణ చెప్పింది నిజమే. తాను ఏవేవో విపరీతాలు ఊహించుకున్నాడు. తనగురించిన స్పృహ తనలో మరీ మోతాదును మించింది కాబోలు... అరుణ మాటలు అతనికి జ్ఞాపకమొచ్చాయి... చేదు, తీపి కలగలిసిన రాజకీయగుళి కను మింగుతున్నవాళ్ళలో తానే మొదటివాడూ కాదు, చివరివాడూ కాదు.

రాత్రంతా అదే వరస. జనం వస్తున్నారు, వెడుతున్నారు. ఆనంద్ వాళ్ళ అభినందనలు స్వీకరిస్తున్నాడు. రణగుణధ్వనులు చేస్తూ వారు తిరిగి వెడుతుంటే హమ్మయ్య అనుకుని ఊపిరి పీల్చుకుంటున్నాడు. ఉషఃకాలం సమీపించేసరికి అతనిలో ఉద్రిక్తత ఇంకా పెరిగి నిద్రపట్టే సూచనలు పూర్తిగా అదృశ్యమైపోయాయి. కిటికీ దగ్గర నిలబడి సూర్యోదయాన్ని వీక్షిస్తుంటే దృఢనిశ్చయంతో, ప్రబలశక్తితో, ఉత్కటానురాగంతో, అరుణ తన కందించిన ఉదాత్తాదేశం తనలో ఆద్యంతం పరివ్యాప్తమైన అనుభూతి-ఆనంద్‌కు కలిగింది.

# 20

'శాసననిర్దేశానుసారం భారతరాజ్యాంగంపట్ల సత్యనిష్ఠతో, విధేయతతో వ్యవహరిస్తాను...'

ప్రమాణస్వీకారపాఠంలోని ఈ మాటలు ఉచ్చరిస్తున్నప్పుడే, ఈ వాగ్దానంలోని అంతరార్థాలను ఆనంద్ తన మనోనేత్రంతో దర్శించాడు. రాజ్యాంగం, సహోదరత్వం, సమానత్వం, ప్రజాస్వామ్యం, రాజకీయ ఆర్థిక సాంఘిక స్వాతంత్ర్యాలపట్ల సత్యనిష్ఠ, విధేయత... ఎంత గురుతర బాధ్యత! అనుకున్నాడు.

... భయపక్షపాతాలుకానీ, రాగ ద్వేషాలుకానీ లేకుండా అన్నివిధాల ప్రజలకూ న్యాయం చేస్తాను...'

ఒక మంత్రి దాదాపు సమదృష్టిని అలవర్చుకున్న స్థితప్రజ్ఞుడుగా ఉండాలని రాజ్యాంగం ఆశిస్తోందన్న ఊహ అతని మస్తిష్కంలో మెరుపులా మెరిసింది. ఇప్పటి మంత్రుల్ని – తనతో సహా – ఒకసారి పోల్చిచూసుకుని నిలువునా కంపించాడు.

'... మంత్రిగా నా దృష్టికి వచ్చిన ఏ విషయాన్ని, నాకు తెలిసిన ఏ విషయాన్ని ఏ వ్యక్తికీ లేదా వ్యక్తులకూ తెలియజేయడం కానీ, వెల్లడించడం కానీ చేయను...'

రకరకాల 'ఉన్నత రహస్యాలు' పత్రికల్లో ప్రత్యక్షమౌతూ ఉండడం గురించి క్షణకాలమతడు ఆలోచించాడు. 'ఉన్నత రహస్యా'లంటే ఉన్నతస్థాయినుంచి కిందికి జాలువారే రహస్యాలని ఎవరో అనడం అతనికి గుర్తొచ్చింది. చేయదగిన, చేయకూడని వాటిగురించి తాను చేసిన ప్రతిజ్ఞను తలచుకోగానే అతనిలో ఒకింత అధైర్యం తొంగిచూసింది. అయినా ఆ ప్రతిజ్ఞలోని గాంభీర్యం అతణ్ణి చలింపజేసింది. ఎంతో పవిత్రవాక్యాల్లా అవి ధ్వనించాయి.

ప్రమాణస్వీకారంతర్వాత రిజిస్టర్‌లో సంతకంచేయడానికి కూర్చున్నప్పుడు అతని చేయి కొద్దిగా వణికింది. ఆత్మవిశ్వాసమూ, దౌర్బల్యమూ ఒకేక్షణంతో తనను ఆవహించినట్టనిపించింది. ఇంతకుముందెన్నడూ అతనికలా అనిపించలేదు. ఆత్మవిశ్వాసాన్ని దౌర్బల్యం నీడలా వెన్నంటి ఉండడం అధికారానికి చిహ్నం కాబోలనుకున్నాడు... నీకు న్యాయమని తోచిందే తాను చేసి ఉండవచ్చు, కానీ మరుక్షణమే తాను సంశయంలోకి పడిపోతావు. ఒక్క సారిగా విమర్శకులు అతనిమీద దాడి చేస్తారు. తాను ఏ పనిని తలకెత్తుకున్నాసరే దానిని న్యాయంగా, సక్రమంగా

నిర్వర్తించలేదని వాళ్ళ నమ్మకం. దానితో అతను మరింత సంశయగ్రస్తుడై పోతాడు. చివరకు... క్రమంగా రాటుదేలి, తానేం చేసినా నేను సక్రమంగా ఉందనుకునే మొండితనం అతన్నావహిస్తుంది.

ప్రమాణస్వీకారంతర్వాత ఆ కార్యక్రమానికి ఆహ్వానితులుగా విచ్చేసిన స్నేహితులు, శ్రేయోభిలాషులు మంత్రులను అభినందనలతో ముంచెత్తారు. అరుణ ఆనంద్‌ను అభినందించి మిగిలిన మంత్రుల్ని పలకరించడానికి వెంటనే అక్కడినుంచి వెళ్ళి పోయింది. సాదాగా కనిపిస్తున్నా ఎంతో అందంగా ఉన్న కాంచీపురం చీరకట్టుకున్న వీణ పిల్లలతో అక్కడక్కడే తిరుగుతోంది. ఎంతో గర్వమూ, సంతృప్తి నిండిన ఆమె చూపులు అటూ ఇటూ కలయతిరుగుతున్నాయి. కీర్తిశేషుడైన నాన్నను గుర్తుచేసుకుని, ఈ సమయంలో ఆయనిక్కడ ఉంటే ఎంత గర్వించేవాడో అనుకున్నాడు ఆనంద్. ఈ మధ్య జ్వరంపడి నీరసించిన అమ్మ కూడా ఈ కార్యక్రమానికి రాలేకపోయిందనుకుని ఎంతో విచారించాడు.

ఒకవిధమైన ఉన్మాదం, మాదకత్వం, చాంచల్యం, సంభ్రమం– వీటినంటిపెట్టుకుని ఉండే అధికారమూ, అది కలిగించే వ్యామోహాల్ని అణచుకుని తాను కోరుకున్నట్టే ఉండగలగడం అనుకున్నంత తేలిక కాదని పదవి స్వీకరించిన తొలిరోజునే ఆనంద్‌కి అర్థమైపోయింది. ప్రజాస్వామ్యంలోని మహత్తును కూడా అతడు గుర్తుచేసుకున్నాడు. తనకంటె ఎంతో పూర్వం నుంచే దేశసమస్యలతో పోరాడుతూ కష్టపడి పనిచేస్తున్న వాళ్ళెందరో ఉన్నచోటే ఉండిపోయారు. తను మాత్రం ఒక్క అంగలో ఉన్నతస్థానానికి చేరుకోగలిగాడు. పైకి అల్పమైనవిగా కనిపించే రోజువారీ విషయాలనుంచి కూడా తను వాస్తవాలను పసిగట్టి సేకరించుకుంటూ ఉండవలసిందే. గుంపులు గుంపులుగా వచ్చే జనాన్ని తాను చిరునవ్వుతో కలుసుకుంటూ ఉండాలి. ఆ 'అల గాజనం' తమ సమయం వృధాచేస్తున్నట్టు మిగిలినవాళ్ళు అనుకుంటూ ఉంటారు. కానీ తనలా అనుకోలేడు. అవును, తన మేధావిమిత్రులు మామూలు జనసమూహాన్ని అలగాజనమనే పిలుస్తూ ఉంటారు. అయితే తామందరూ అభిలషించే ఒకానొక వ్యవస్థను అజ్ఞాతంగా మోస్తున్న పునాదిరాళ్ళు వాళ్ళే. అజ్ఞాతులు, ఆపైన ఉపేక్షితులు, అపహసితులు, తిరస్కృతులు...

వేకువతోనే ఎవరెవరో వచ్చి తన ఇంటిముందు నిండిపోతూ ఉంటారు. అక్షరాలా, తానెంతో గంభీరంగా చేసిన ప్రమాణంలో వర్ణించినట్టే 'అన్ని రకాల ప్రజలు'. అణగారినవాళ్ళు, విచారగ్రస్తులు, నేలబారు మనుషులు, సంశయస్వభావులు, శుష్కించినవాళ్ళు, మొరటుగా కనిపించేవాళ్ళు, పేచీకోరులు, అజ్ఞానులు, మురికితో నిండినవాళ్ళు ఆ చింకిపాతల వెనకకూడా గొప్ప బతుకుతెలివిని దాచుకున్నవాళ్ళు. ఇంటిముందున్న పచ్చికబయలులోకి వాళ్ళు యథేచ్ఛగా అడుగులుపెట్టేస్తూ ఉంటారు. ముందురోజు రాత్రి తుంపరగానీ, మంచుకానీ పడితే, వాళ్ళ చేతికర్రలతో ప్రతిచోటా నేల గుంటలు పడిపోతుంది. నాటురకం నేతకంబళ్ళను వాళ్ళు అస్తవ్యస్తంగా కప్పుకుంటూ ఉంటారు. ఎక్కడైనా కూర్చుంటారు. కూర్చున్నచోటే ఉమ్మేస్తారు. కొంతమంది అలవాటుగా అలా చేస్తూ ఉంటారు. మరికొందరు ఆపుకోలేని దగ్గుతో ఉమ్మేస్తూ ఉంటారు. అది క్షయ అని కూడా వాళ్ళకి తెలియదు. వాళ్ళను ఏ డాక్టరూ ఇంతవరకు పరీక్షించి ఎరుగడు. అదేపనిగా నాసిరకం నాటుపొగాకు నింపి మోదుగాకులతో చుట్టిన చుట్టల్ని వెలిగించి పెద్దగా చప్పుడుచేస్తూ

దీర్ఘంగా పొగపీల్చి వదులుతూ ఉంటారు. ఇంకా ఇంకా దగ్గుతూ ఉమ్మతూనే ఉంటారు. బంట్రోతులు, పనివాళ్ళు, నాగరికులమనుకునే పెద్దమనుషులు– ఇదీ విచిత్రమైన సమ్మేళనమే– అందరూ వీళ్ళనుచూసి మొహాలు చిట్లించుకుంటూ ఉంటారు.

ఈ 'ప్రజలు' రకరకాల అభ్యర్థనలతో వస్తూ ఉంటారు. హాస్యాస్పదమైనవి. ఎవరో తప్పు దారి పట్టించినవి. అర్థరహితమైనవి. అసంబద్ధమైనవి. అనవసరమైనవి. రూల్స్ ప్రకారం చేయసాధ్యం కానివి. అయినా అవి వాళ్ళు నిత్యం ఎదుర్కొనే సమస్యలకు అద్దం పట్టే న్యాయమైన అభ్యర్థనలు. ఆ సమస్యలు నిజమైనవే కావచ్చు, ఊహాజనితమే కావచ్చు, వాళ్ళకు మాత్రం అవి నిజం. ఇతరులకు ఊహాజనితం... రాత్రీపగలూ అనే తేడా లేకుండా వాళ్ళు అతడి చుట్టూ మూగిపోతూ ఉండేవారు. అభ్యర్థనతోనిండిన వాళ్ళ కళ్ళల్లో, లోతుకు పోయిన వాళ్ళ చెక్కిళ్ళలో జీవన విషాదాన్ని ఆనంద్ చదవగలిగేవాడు. పరిస్థితులు, తలరాత, తమంతటతామే అనాలోచితంగా చేసిన పొరపాట్లు, ఎన్నో ఉదంతాలలో వాళ్ళపట్ల ఇతరులు సాగించిన దురన్యాయాలు – వాళ్ళను పక్కకు విసిరేసి ఉండక పోతే వాళ్ళుకూడా ఒకప్పుడు జీవితాల్లో పైకిరాగలిగిన శక్తియుక్తులు ఉన్నవాళ్ళే. వాళ్ళమధ్య ఉన్నప్పుడు, మూర్తీభవించిన ఆ అజ్ఞానాన్నీ, దానితో పాటు చెప్పశక్యంకాని తెలివితేటలనూ దర్శించి అప్పుడప్పుడు అతడు అదరిపోయేవాడు. అటువంటి క్షణాలలో తన అంత రంగంలో ఎంతోకాలంగా సాగుతున్న అన్వేషణకు రూపకల్పనగా నిలచిన తన 'అన్యార్థం', (మరో సగం) తనకు 'సంపూర్ణత'ను ప్రసాదించగలదనుకుంటున్న, నామరూపరహితమైన ఆ కల్పిత వాస్తవం హఠాత్తుగా తనముందుకొచ్చి నిలబడినట్టనిపించేది. చింకిపాతలతో ఒకరినొకరు నెట్టుకుంటూ, తిట్టుకుంటూ, దగ్గుతూ, ఉమ్మతూ, ప్రాధేయపడుతున్న ఆ గుంపులోనుంచి తన 'అన్యార్థం' ఒక దేవతలా పైకివచ్చి తనను తేరిపారచూస్తున్నట్టు ఊహించుకునేవాడు. అయితే అది భ్రమజనితమైన ఊహ మాత్రమే; తరచిచూసినమీదట తన 'అన్యార్థా'న్ని దర్శించాలన్న తహతహ ఈ జన్మలో తీరేదికాదన్న నిశ్చయానికి వచ్చేవాడు.

ఈ ఆర్తుల మధ్య గడుపుతున్న కొద్దీ తనొక వ్యక్తినన్న భావననుంచి బయటపడి పూర్తిగా విభిన్నమైన జీవిగా పరివర్తన చెందినట్టు అతడికి అనిపిస్తోంది. తన వ్యక్తిగత అస్తిత్వానికిప్పుడు ప్రాముఖ్యంలేదు. తన ఆనందవిషాదాలు, తన బంధుమిత్రులు, తన ఇష్టాయిష్టాలు– అన్నీ అంతకంటె ఎంతో విస్తృతమైన ఆవరణలో లయమైపోయాయి. విశ్వజనీనమైన, మానవాళి అస్తిత్వం సమస్తాన్ని తనలో పొదువుకున్న ఆవరణఅది. నిరవధిక స్థలకాలాలకు, మానవీయ స్పందనలకు పరివ్యాప్తమైన మహావరణం అది. ఈ అతీతస్థితి ప్రజాస్వామ్యపు ఆధ్యాత్మికరూపం కానవస్తుందని అతని కనిపించింది. శాసనసభ్యుడుగా తానొక లక్షమంది ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తుంటే మంత్రిగా కొన్నికోట్ల ప్రజల శ్రేయస్సుకు బాధ్యత వహించవలసి ఉంటుందనుకున్నాడు. ప్రాతినిధ్యంనుంచి బాధ్యతకు పరివర్తన– దానికదే పెద్ద మార్పు. ప్రజల చేతుల్లో ఉన్న రాజ్యాధికారం కొంత కాలంపాటు తనకు దత్తమైంది. తననో గలివర్‌గా మార్చింది. లేకపోతే తనుకూడా మరో లిల్లీపుట్ మాత్రమే. ఈ కల్పితగాథ ఒక్కోసారి వాస్తవాన్ని మించిన వాస్తవంగా కనిపిస్తూ ఉంటుంది. కొందరు రాజకీయవాదులు తాము నిజంగానే గలివర్‌లమనుకుంటారు; అందుకు తగిన శాస్తి పొందుతుంటారు. కొంతమందిమాత్రం దానినొక భ్రమగానే భావిస్తూ ఉంటారు. అయినా వాస్తవికతలో

తమ విధ్యుక్త ధర్మాన్ని ఎంతో అంకితభావంతో, ఉత్సాహంతో నిర్వర్తిస్తూ ఉంటారు. అటువంటి కొద్దిమందిలో తాను ఒకడు కావాలనుకున్నాడు ఆనంద్.

మానసిక ఉన్నతిని ప్రసాదించే క్షణాలతో పాటు ఆనంద్‌కు ఎంతో నిస్పృహ, ఆగ్రహం కలిగించే సందర్భాలూ ఎన్నో ఉండేవి. ప్రజలు తనను 'గౌరవనీయ మంత్రి'గారు అని పిలవడం అతనికి విశేషించి కలవరం కలిగించేది. తనకు లెక్కలేనన్ని సుగుణాలు ఆపాదిస్తూ వాళ్ళు ఆహ్వానం పలికేవారు. ఆ అతిశయోక్తుల్ని ఎవరూ నమ్మరు, చివరకు వాటిని వల్లించినవాళ్ళుకూడా. ఒక మంత్రిలో తాము ఆపాదించిన సుగుణాలన్నీ ఉండాలని వారు కోరుతున్నారందామా, అది అపోహలో జన్మించే గొంతెమ్మ కోరికే అనిపించుకుంటుంది; అదొక అసాధ్యమైన కోరిక. మంత్రిగారిలో తాము పేర్కొన్న సుగుణాలన్నీ అప్పటికే రాశిపోసి ఉన్నట్టు ముఖస్తుతి రాయుళ్ళు ఎవరైనా అన్నారంటే కేవలం వాళ్ళు తమ అజ్ఞానాన్ని బయటపెట్టుకుంటున్నట్టే. ఏ విధంగా చూసినా అతనికి మిగిలేది నిరాశే, నిలువునా మోసపోవడమే. దీనికితోడు స్వాగతప్రసంగాలన్నీ ఒకదానికొకటి నకలుగా కనిపించడం, ఆశ్చర్యకరంగా అన్నింటిలోనూ ఒకేవిధమైన ఉపమానాలు దొర్లిపోతూ ఉండడం గమనించి ఆనంద్ విస్తుపోయాడు. అజ్ఞానం మరో అజ్ఞానానికి నకలు దింపడం. బానిసప్రవృత్తి మరో బానిస ప్రవృత్తి అడుగుజాడల్ని అనుసరించడం. మరికొందరు తనను అహంకారం, గర్వం, కాముకత్వం, స్వార్థం, ముఖస్తుతి ప్రియత్వం మూర్తీభవించిన సరికొత్త మనిషిగా భావిస్తూ ఉండడం కూడా అతడు గమనించాడు. చాలామంది దీనిని జీవనవాస్తవంగా స్వీకరించి తమకు తెలిసిన పద్ధతిలో ఆ అహంకారానికి దోహదం చేస్తూ ఉంటారు... తన స్నేహితులు అనబడే వాళ్ళతో సహా తనచుట్టూ ఉన్న వ్యక్తుల ధోరణిలో హఠాత్తుగా వచ్చిన ఈ మార్పుచూసి అతడు దిగ్భ్రమచెందాడు. మంత్రి కాగానే రాత్రికి రాత్రి తాను అల్పుడిగా అధమాధముడిగా మారిపోయాడన్నట్టు! ఎందువల్ల ఇలా జరుగుతోందని ప్రశ్నించుకున్నాడు. అది సర్వత్రా కనిపించే అనుభవానికి పరిణామంగా పుట్టే స్పందనా? విపరీతమైన హెచ్చు తగ్గులతో నిండిన సమాజంలో పురాతనకాలంగా నెలకొన్న భూస్వామ్య వ్యవస్థనుంచి పుట్టుకొచ్చిన భావజాలమా? తనముందు సాగిలపడేవాళ్ళకు తనపట్ల నిజంగా గౌరవం లేదని కూడా అనుకోవచ్చునా? లోపల తనపట్ల తృణీకారభావం పెట్టుకుని పైకి గౌరవం నటిస్తున్నారా? కుక్క మొరగకుండా– బహుశా కరవకుండా – దానికో ఎముకముక్క విసిరేసినట్టు?... లేక ఈ అన్నింటితోపాటు ఊహకందని ఇతర అనేక ప్రేరణల పరిణామంగా రూపొందే వైఖరి కావచ్చునా ఇది?

అధికారం రూపురేఖలగురించి తర్కించుకుంటూ అతడు ఎన్నో గంటలు దొర్లించాడు. ఉదాత్తత కలిగించేది... నిషా కలిగించేది... అవినీతికి అవకాశం కలిగించేది– వీటిలో తనకేది వర్తిస్తుందని తనలోతానే మళ్ళీ మళ్ళీ ప్రశ్నించుకున్నాడు. తనకు చేతనైనంత నిర్మమదృష్టితో పరిస్థితిని విశ్లేషించాడు. పైకి తేలిందేమీలేదు. అంటే అధికార ప్రభావం ఏదీ పడని తటస్థస్థితిలో తాను ఉండగలనని అతనికి అర్థమైంది.

ఉదాత్తత కలిగించడమా? ఈరోజు అధికారం చలాయించే తీరులో ఉదాత్తతంటూ ఏముంది? ప్రధానంగా సొంతంకోసం, యాదృచ్ఛికంగా ప్రజలకోసం... అంతేగా?... మామూలు మనిషి

ప్రాధాన్యక్రమం ఇదే కదా? మొదట స్వార్థం... అది చైతన్యవంతం కావచ్చు. చైతన్యరహితమూ కావచ్చు... ఏదైనా స్వార్థమేగా? ఆ స్వార్థానికి చక్కెరపూత ఉన్నా లేకున్నా స్వార్థం స్వార్థమే ఔతుంది... ఐతే మంత్రికీ మామూలుమనిషికీ మధ్య వ్యత్యాసమేమిటి? ఈ స్వార్థపరార్థాల క్రమాన్ని తలకిందులు చేయలేనప్పుడు మంత్రి చేతిలో అదనంగా అధికారమనే దెందుకుండాలి? అందుకేలాటి కారణమూ లేదని ఆనంద్ నిష్కర్షకు వచ్చాడు. సొంతం కొరకే అధికారమనే భావం అతనిపైన ప్రభావం వేయలేదు.

నిషా కలిగించడమా? అధికారంవల్ల నిషా ఎందుకు రావాలసలు? కేవలం వారంరోజులలోపు...ఇంకా అంతకులోపు... మంత్రులవడమూ, వారి నియామకపు ఉతర్వులు రాసిన సిరా తడైనా ఆరకముందే, అధికార నివాసమూ అధికారవాహనమూ దొరక్కముందే పదవినుంచి దిగిపోవడమూ తాను చూడలేదా?... వాస్తవంలో ఇదొక పరమపదసోపానపటంలాంటి ఆట మాత్రమే అనిపిస్తుంది... మంత్రి అంటే ఎవరో అసాధారణవ్యక్తిఅని ఆనంద్ ఎన్నడూ అనుకోలేదు. అందుకని ఇప్పుడు తననుకూడా తానున్నంతకంటె, తనకున్న విలువకంటె అధికంగా ఎవ్వరూ చూడాలని కోరడంలేదు. అధికారనిషాతో సహా ఏ నిషా ఐనా సరే, తాత్కాలికమే కాబట్టి ఎందరికో అది రావడమూ పోవడమూ వల్ల ఆనంద్ ఆశ్చర్యపడలేదు... ఇక తన మాటా? తనకా నిషా మొదట వచ్చినట్టే తెలియదు.

అవినీతికారకమా? తన విషయంలో అది ఊహించడం కూడా అసాధ్యం. ఎలాంటి అవినీతికైనా సరే, దారితీసే తలంపుకానీ, కోరికకానీ తనలోలేదు. ఈ విషయంలో తాను అదృష్టవంతుడు.

ఈ విషయాలు ఆలోచించిన కొద్దీ తనను గురించిన ఒక సత్యం పదే పదే ఆనంద్‌కు తోచింది. రాజకీయాధికారప్రభావానికి తాను లోనవడం జరగదు. అధికారం నిజంగా తనకు అప్రస్తుతం.

మంత్రి హోదాలో ఆనంద్ శైలి ఉన్నతధ్యేయవాదంపైన ఆధారపడిన కారణాన అప్పుడప్పుడు ఆచరణసాధ్యం కాని పథకాలకుకూడా దారితీస్తూ ఉండేది. ఐతే దానికి పరిహారంగా బుద్ధి నైశిత్యం నిజాయితీ, దాదాపు ఉన్మాదాన్ని అందుకునే కార్యోత్సాహం కానవచ్చేవి. రాజ్యాధికారాన్ని ఉపయోగించే ఉద్దేశాన్ని గురించి తానొక పంథాను రూపొందించుకున్నాడు.

ఒకనాడు అరుణతో ఈ ఉద్దేశాల గురించి చర్చప్రారంభించాడు. ఆనాడెందుకో అలవాటు తప్పిందన్నట్టు అరుణ శ్రోతగా వింటూ కూర్చుంది. ఆనంద్ చెబుతూ పోతున్నాడు. ప్రేరణకు సంబంధించినంతవరకు పూర్వం గుహల్లో నివసించిన మనిషికీ నేటి నాగరికప్రపంచంలోని మనిషికీ తేడా ఏమీలేదు. అందరి లాగే తాను సుఖంగా జీవించాలనే కోరిక ప్రతిమనిషికీ ఉంటుంది. అది మానవసహజం. ఐతే కోరికకూ సామర్థ్యానికి మధ్య ఉన్న తేడా కనిపించిననాడే మానవ జాతిలో అసంతృప్తి జన్మించింది. రెంటికీ మధ్య సాధారణంగా సంతులనం తెచ్చేది ప్రకృతిమాత. ఇందుకు మానవులు కూడా తమకు చేతనైనంత వరకు చేయాలి. ఆ తేడా మరీ పెరిగిపోతే సమాజంలోని సంతులనం చాలా వరకు, ఒక్కొక్కప్పుడు ఆత్మహత్యాసదృశంగా, దెబ్బతినవచ్చు.

అలాంటి ప్రమాదసమయంలో బుద్ధిమంతులు పరిస్థితిని వెంటనే అదుపులోకి తీసుకొని తమ చేతలను గురించి పునరాలోచించుకోవాలి.

ప్రజాస్వామిక సంరచనగా ఒక జాతికి కూడా ఇదే వర్తిస్తుంది. ఇక్కడే మానవులు సృష్టించిన బలవత్తరమైన సంస్థ... అంటే ప్రభుత్వం ఉపకరిస్తుంది. ప్రభుత్వం తానే ఆ తేడాలను పెంచే పాత్రవహించిందో, ఆ సమాజమే ఒకానొక క్షణంలో చిట్లిపోతుంది. ఒక్కొక్కసారి అది విస్ఫోట రూపంలో బద్దలైపోవచ్చు. మరోసారి ఒక కారుముందటి అద్దం(విండ్ షీల్డ్)పై రాయి రువ్వితే అది లెక్కకుమించినన్ని వెంట్రుకవాసి పగుళ్ళుగా నిశ్శబ్దంగా పగిలినా అద్దాన్ని ఎల్లప్పటికీ పనికి రాకుండా చేయవచ్చు. ఉభయపక్షాల్లోనూ శాశ్వతంగా నష్టం కలుగుతుంది. ఇందులో ఏ రకమైన నష్టం ఎక్కువ ఏది తక్కువ అనే మీమాంస వ్యర్థమైంది. రెంటిలో ఏ రకమైన నష్టమూ కలగకుండా కాపాడడంలోనే విజ్ఞత ఉంటుంది.

కనుక ప్రభుత్వం తన శక్తిని వినియోగించి తేడాలు మొదటనే అదుపుదాటి పోకుండా చూడాలి. దానికి సరైన పద్ధతి ఒకటే... అశక్తులకు తన శక్తినివ్వడం; నిర్బలులకు రక్షణ ఇవ్వడం. సాంఘిక అసమానతలను సంతులనం చేయాలి, అవి ఏ కారణంగా పుట్టినవే కావచ్చు. వాస్తవంలో కొంత అసమానత నిరంతరం పుడుతూనే ఉంటుంది. దాని స్వరూపస్వభావాలు రాజకీయ సంస్థల స్వభావంపైన ఆధారపడిఉంటాయి.

ఆనంద్ పార్టీ తన ఎన్నికలప్రకటన ద్వారా ఒక నిర్దిష్టమైన సాంఘికపరి వర్తనం తెచ్చే వాగ్దానం చేసింది. ప్రస్తుతం ఆనంద్ ప్రభుత్వాధికారం ప్రయోగిస్తున్న వారిలో ఒకడు. వాగ్దానం చేసిన ఆ మార్పుతేవడానికే ఆ అధికారం వినియోగించాలి తాను. ఆ మేరకు మాత్రమే ప్రభుత్వాధికారం చేతిలోఉంచుకునే అర్హత తనకుంది. ఆ పరిధి దాటితే తన ఇంటి తలుపు తట్టుతున్న బిచ్చగానికన్న మించి రవ్వంతకూడా తనకా అధికారం న్యాయసమ్మతం కాదు. ఈ దృష్టితో చూస్తే సమస్యంతా వెంటనే తేట తెల్లంగా బోధపడుతుంది.

ఆనంద్ సహచరుల అభిప్రాయాలు కొంత భిన్నంగా ఉన్నాయి. వాళ్ళుతన్ని అందరికీ తెలిసిన అధికారపుచట్రంలో అమరి పొమ్మని కోరుతున్నారు. ఈ చట్రం దీర్ఘకాలంనుంచి స్థిరపడిపోయింది. ఇది తనలో ఏలాంటి అపరిచితవ్యక్తినీ ఇమిడ్చుకోదు. కొత్తగా వచ్చేఏ మౌలికాభిప్రాయాలనూ అంగీకరించదు. పైపెచ్చు ఎంతోకాలంగా స్థిరపడిన ఈ వ్యవస్థను అస్తవ్యస్తం చేయజూచే అభిప్రాయాలను... ఆనంద్‌లాంటివాడి అభిప్రాయాలను... అసలే అంగీకరించదు. ఆ మాటకొస్తే సమస్తమూ ప్రజలపేరనే చేయడం జరుగుతుంది. కానిఎన్నికల్లో తప్ప ప్రజల ప్రసక్తి అంత తరచుగా రాజకీయనాటకంలో రానేరాదు. ప్రజలంటే హిందూ దేవతల్లాంటి వారు. తమ యెదుట పూజారి సమర్పించిన షడ్రసోపేతనైవేద్యాన్ని ఎప్పుడూ అంటరు. అది చివరకు దొరికేది నివేదించిన భక్తులకూ, పూజారికీ మాత్రమే.

ఆ దేవతను ఎవరైనా నైవేద్యం తినేటట్టు చేస్తే ఎలా ఉంటుందో!అలా నిజంగా జరిగితే స్వార్థపరుడైన పూజారి తనకు దొరకదని తెలిసికూడా ఆ షడ్రసోపేతనైవేద్యాన్ని భక్తిపూర్వకంగా

దేవుడికి సమర్పిస్తాడా? ఈ పోలిక పూర్తిగా వర్తించకపోవచ్చు; ఎందుకంటే దేవాలయంలోని దేవుడికి ఆకలి ఉండదని అందరికీ ముందే తెలుసు. కాని అశేషప్రజానీకానికి మానవచరిత్ర మొదలైననాటినుంచీ ఎన్నడూ తృప్తిచెందని ఆకలి నకనకలాడుతూ వచ్చింది. వాళ్ళు వేచి ఉండేది నిజమైన ఆహారంకోసమైతే వాళ్ళకు దొరికేది వట్టి ఉపన్యాసాలూ, వాగ్దానాలూ... ఆ పరిస్థితిని మార్చడానికి ఆనంద్ తనేమైనా చేయగలడా?... తాను కొందరు హిందూదేవతల అద్భుత మహిమను గురించి విన్నాడు. ఆ దేవుళ్ళు నిజంగానే నైవేద్యాన్ని ఆరగిస్తారని జనం నమ్ముతారు. పూజారి దేవతావిగ్రహంముందు నైవేద్యం సమర్పించి గర్భగృహం మూసేసి వెళ్ళిపోతాడనీ, తదుపరి రోజుఉదయం చూచేసరికి స్వామి ఆ రాత్రే నైవేద్యం ఆరగించినట్టు కానవస్తుందనీ జనాల నమ్మకం... కొందరు దేవుళ్ళకు ద్రవపదార్థరూపంలో నైవేద్యం ఎక్కువ ఇష్టం కాబోలు. తమ ముందుంచిన నైవేద్యంలో సరిగ్గా అర్ధభాగం మాత్రమే సేవిస్తారు... ఒకటన్నైతే అరటన్ను, ఒక పురిసెడైతే అరపురిసెడు. ఈవిధంగా మానవ లక్షణాలు కలిగి ఉన్న దేవుణ్ణి... అంత కచ్చితంగా లెక్క ప్రకారం సేవించే దేవుణ్ణి.. ప్రజానీకం మరింత అనన్యభక్తిభావంతో ఆరాధిస్తారు... ఐతే సాక్షాత్తు మానవులమాటకు వస్తే ఆ భక్తిభావ రూపమేమౌతుంది? అతి విచిత్రంగా, భోజనమే చేయని, గాలి కూడా పీల్చనవసరంలేదని నమ్మబడే యోగిపుంగవులపైకీ సాధుపురుషులపైకీ ఆ భక్తి ఎందుకని ప్రసరిస్తుంది? ఇదీ ఒక అద్భుతమే కాబట్టి. భోజనంచేసే శిలావిగ్రహం, భోజనం అక్కర్లేని మానవ మహానుభావుడు.... ఇద్దరూ పవిత్రమూర్తులే, పూజనీయులే.

ఇదీ మన సంస్కృతికి ఒక రూపం. అస్వాభావికమైనదాన్ని అద్భుతమైనదని ఆరాధించడం. ఇంతకూ స్వాభావికమైన దాన్నెందుకు గౌరవించకూడదు? స్వాభావికమైనదాన్ని అస్తమానమూ తిరస్కరించడమెందుకు? అని ఎలుగెత్తి ప్రశ్నిస్తున్నాడు ఆనంద్.

మొట్టమొదట మనిషికీ మనిషికీ మధ్య ఘర్షణకు కారణం వాళ్ళలోని వ్యక్తిగత సామర్థ్యాల తేడాయేనేమో? దాంతోనే అధికారాల్లో తేడా వచ్చిందేమో? ఇదే క్రమంలో సామర్థ్యంనుంచి అధికారం, దానితో వర్చస్వం, దానితో ఆక్రమణం.... ఇవన్నీ వచ్చి ఉండవచ్చునా?... గుహల్లో ఉండే వారిలో అందరికంటె బలవంతుడైనవాడు అందరిలో అందగత్తె ఐన స్త్రీని సొంతంచేసుకున్నాడు, అన్నిటికన్నా రుచికరమైన ఆహారాన్ని గుంజుకున్నాడు, వస్తువులన్నింటిలో మంచిది లాక్కున్నాడు... ఇలాగే బలాన్ననుసరించి అన్నీ జరిగిపోయాయి. ఇక సృష్టికర్తైన దేవుడూ, సంఘటనకర్తైన ప్రభుత్వమూ... ఉభయులూ ఈ తేడాను పెంచుతూనే పోయారు. కుటుంబపెద్ద, గ్రామపెద్ద, తాలూకా పెద్ద, రాజుగారు, చక్రవర్తి... ఇలాగే ఒకరిపైన ఒకరు. వీరిలో ప్రతిఒక్కడూ ఆ తేడాలను తన పద్ధతిలో పెంచుతూ వచ్చినవాడే...

మరి గుహలోని అందరికంటె బలవంతుడైనవాడిని అదుపులో ఎవడు పెట్టాలి? మరొక గుహనివాసి ఆ పనిచేయలేడు. ఎందుకంటే ఇద్దరిలో అతడు తక్కువ బలవంతుడై ఉంటాడు. పలువురు తక్కువ బలవంతులు కలిసి ఏమైనా సాధించగలరేమో?... అది సాధ్యపడవచ్చు. ఐతే వీరందరినీ ఒకచోటికి చేర్చేదెవరు? మళ్ళీ అందరికన్నా బలవంతుడే కావలసివస్తుందేమో? అప్పుడు పరిస్థితి మరింత ఘోరమౌతుంది. పశుబలం స్థానే సంఘటిత పశుబలం ప్రత్యక్షమౌతుంది.

ప్రజాస్వామ్య రూపంలోనే ఏకచ్ఛత్రం బలపడుతుంది. ఇదంతా చివరకు కూలేది నిర్బలుల పైనే! పోనీ ప్రకృతైనా ఈ సంతులనం తేగలుగుతుందా? ఒక పిడుగో, ఒక పొదలోంచి పాకుతూ వచ్చే విష సర్పమో, భూమి జారి మనిషి మీదపడడమో, వ్యాపించిన ఏదోరోగమో... ఐతే వీటివల్ల అందరికంటె బలవంతుడే నశించిపోతాడనే నమ్మకమేముంది? ఆ మాటకొస్తే ఎంత బలవంతుడైతే వాడు నివసించే గుహ అంత ప్రమాదరహితంగా ఉండే అవకాశమే ఎక్కువ. వాడే క్షేమంగా ఉండగలిగి తననుతాను రక్షించుకునే స్థితిలో ఉంటాడేమో!... ఐనా ప్రకృతిజనిత ప్రమాదం కొంతైనా ఉండవచ్చు. అజ్ఞాత ప్రమాదం, దైవికప్రమాదం, భాగవతంలో వర్ణించిన పరీక్షిత్తు మహారాజుకు వలె.

అరుణతో మాట్లాడినకొద్దీ ఈ చర్చ అంతంలేని వలయంలో సాగుతున్నట్టనిపించింది. దైవం- మనిషి- సామర్థ్యం- అధికారం- వర్చస్వం- అసమానత అనే వలయం.. తానూ ఆ వలయంలోనే భాగంగా ఉన్నాడు. లేక వలయానికి చుట్టున్న పరిధిపైన ఎక్కడో ఒక బిందువుగా ఉన్నాడు. లేక దాని కేంద్రబిందువుకూ పరిధికీ మధ్యఎక్కడో ఉన్నాడు. కేంద్ర బిందువుగా మాత్రం లేడన్నదిఖాయం. తనా వలయాన్ని... కేంద్రం, పరిధి మొదలైన అన్నింటితో సహా... మార్చగలుగుతాడా? సాంఘికన్యాయానికి దోహదంచేసేటట్టు వాస్తవపరిస్థితులను మలచగలుగుతాడా? తన చుట్టూరా చూస్తే తరుచూ తానొంటరిగానే ఉన్నట్టనిపిస్తోంది. అత్యధిక సంఖ్యలో తనమాట వీగిపోతున్నట్ట నిపిస్తోంది. అప్పటి అధికార ప్రాసాదంలో తన స్థాయి, తానే స్వతంత్రుడుగా పరిపక్వం చెందిన నేతగా వ్యవహరించడానికి చాలేట్టులేదు. తను నిశ్చయించుకున్నా సాధ్యంకాదు. నిశ్చయించుకున్నాడో లేదో తెలియదు. అదెలా సాధించాలో తనకు తెలిసినా అది సాధ్యపడదు; తనకు తెలుసునో తెలియదో కూడా తెలియదు.

మరైతే ఏం చేయాలి? ఏమీ చేయకుండా ఉండాలా? మరెందరి వలెనో గుడ్డెద్దులా తిరుగుతూ రాజకీయాధికారం నుంచి దొరికిందేదో తీసుకుంటూ ఏ చీకూచింతా లేకుండా హాయిగా కాలక్షేపం చేయడమా? తనెలాగూ సొంతం కోసమంతగా పట్టించుకునేవాడు కానప్పుడు తర్కసమ్మతంగానూ, స్వాభావికంగానూ, జరుగుతున్నదంతా తటస్థంగా చూసే సాక్షిగా మాత్రమెందుకుండకూడదు?... కాని ఆనంద్ స్వభావానికి అకర్మణ్యత సరిపడలేదు. తనిదివరలో తన ప్రాణం తనదికానట్టు, మనిషి ప్రాణంగానైనా దానికేలాటి విలువలేనట్టు, పదేపదే చెలగాట మాడినవాడు. పూర్వపు ఆ 'ఖాదిమాన్' మూకలతోతలపడినప్పుడెన్నోసార్లు చావుతో సంభాషణ సాగించినవాడు. ప్రాణప్రమాదంలో ఉండే ఆ ఉదాత్తోత్సాహం కొరకూ, ఆ స్పృహలేని మైకంకొరకూ, మోయ లేనంతగా ఒక్కుమ్మడిరేకెత్తే ఆశాభావం కొరకూ... పెనుతుపానులాంటి ఆ కర్తృత్వకలాపాన్ని కోరుకున్నాడు, ఆ ప్రమాదమే తదేకధ్యేయమైనట్టు. అందుకని ఈనాడు లక్ష్యరహితంగా తిరుగాడుతుండే ప్రశ్నేలేదు.

అరుణతో ఈ డొంకతిరుగుడు సంభాషణ తరువాత కొద్దిరోజుల్లోనే ఆనంద్‌కు తను నమ్మిన భావాలను ఆచరణరూపంలో పరీక్షించడానికీ, వాస్తవానికీ సిద్ధాంతానికీ మధ్య ఎంత తేడా ఉంటుందో ప్రత్యక్షంగా కనుక్కోవడానికీ, ఒక అవకాశం దొరికింది.

తను తాత్కాలికంగా జైళ్ళశాఖకు మంత్రిగా ఉన్న రోజుల్లో ఒక ఖైదీని గురించిన ఫైలు ఆనంద్ నిర్ణయానికని వచ్చింది. ఆ ఖైదీ ఖూనికేసులో శిక్ష పొంది జన్మఖైదనుభవిస్తున్నవాడు. ఫైలులో రాసిన భోగట్టా ప్రకారం అతనొక ఉన్నత కుటుంబానికి చెందినవాడు. ఆ 'ఔన్నత్యం' ఆ కుటుంబ యాజమాన్యంలో ఉన్న విస్తృత భూసంపదకు సంబంధించింది. ఫైల్‌లో రాసిన నోట్‌లో అతను సుఖంగాఉండే జీవనశైలికి అలవాటుపడ్డవాడనీ, కాయకష్టానికేమాత్రం అలవాటుపడనివాడనీ ఉంది. అందుకని ఖైదీకి సమాజంలో ఉన్న స్థాయికనుగుణంగా 'బి' తరగతి ఇవ్వాలని సెక్రెటేరియట్ వారు సిఫార్సు చేశారు.

ఆనంద్ కేసు వివరాలు పరిశీలించాడు. ఆ ఖైదీ పట్టపగలు నిర్దాక్షిణ్యంగా ఒకే సమయంలో కొన్ని ఖూనీలు చేసినవాడు. మధ్యన రెండువారాల 'పెరోల్'పై విడుదలైనప్పుడుకొందరు కిరాయి హంతకులచేత మరో రెండు ఖూనీలు చేయించాడు. అంతటి ఘోరాపరాధాలకు అతనికి ఉరిశిక్ష ఎందుకివ్వబడలేదోనని ఆనంద్ ఆశ్చర్యపడ్డాడు. వైపరీత్యమేమంటే అలాంటివాడికి 'బి' తరగతివ్వాలని తనికిప్పుడు సిఫార్సు వచ్చింది. శాసనసభాధ్యక్షులవారూ, కొందరు మంత్రులూ, మరికొందరు పలుకుబడిగల శాసనసభ్యులూ... వీరందరూ ఆ ఖైదీ పక్షాన గట్టి సిఫార్సు చేసింది ఆనంద్‌కు గుర్తొచ్చింది. గత మూడురోజుల్లో కొన్ని డెలిగేషన్లుకూడా తనను ఈ సందర్భంలో కలుసుకున్నాయి.

ఆనంద్ ప్రప్రథమంగా తీసుకోవలసివచ్చిన అతిక్లిష్ట నిర్ణయం ఇదే. ఇంతమంది బలపరచిన సిఫార్సును మామూలుగా అంగీకరించటం అన్నిటికంటె తేలికైన పని. అనవాయితీగా వస్తున్న పద్ధతిప్రకారం ఆ ఖైదీని ఖైదీగాకాక భూస్వామిగా పరిగణించడమా? ఈ పద్ధతి దశాబ్దాల తరబడి వస్తూ ఉంది. దాన్ననుసరించడంలో తనకెలాంటి సంకోచమూ ఉండనక్కర్లేదు... ఐనా ఆనంద్ సంకోచించాడు.

ఫైలు గురించి చర్చించడానికి వచ్చిన డెప్యూటీ సెక్రెటరీ విశదీకరించాడు. 'ఇదే ఇప్పటి వరకూ నడుస్తున్న పద్ధతి సార్. మరో ఆలోచనంటూ ఎన్నడూ చేయడం జరుగలేదు'.

'దీన్ని సమర్థించడానికి కారణాలేమో నేను తెలుసుకోవచ్చా?'

'కారణమేదీ లేదు. కానీ చాలా కాలంగా...'

'అది ఫైల్లోనే కనపడుతూ ఉంది', అని ఆనంద్ మధ్యలోనే అందుకున్నాడు. 'ఈ పద్ధతి సరైంది కాదనుకుంటే దీన్ని మార్చడానికి వీల్లేదా?'

'తప్పక మార్చొచ్చు సార్. ఐతే అది రాజకీయ నిర్ణయం..' అన్నాడు అధికారి.

'ఇందులో రాజకీయాంశమేముంది? ఈ ఖైదీపైన ఏదైనా రాజకీయ అభియోగముందా?

'లేదండీ. రాజకీయమంటే...'

'అంటే రాజకీయనాయకులు ఒత్తిడి తెస్తున్నారు కాబట్టి, అంతేనా?'

'తమరన్నది నిజమే సార్. ఈ ఖూనీలకు కుటుంబప్రతీకారాలూ, ముఠాతగాదాలూ, కుల విరోధాలూ... ఇలాంటివే కారణాలండీ. ఇందులో నేరం చేసే ఉద్దేశం సాధారణంగా ఉండదు. రెంటిలో బహుశా ఇదే తేడాకావచ్చు'.

'ఈ కేసులో అపరాధిపట్ల దాక్షిణ్యం చూపించడానికి కారణాలేమైనా ఉన్నాయా?'

'ఏమీ లేవు సార్', అనిచెప్పి అధికారి కొంతసేపు అయోమయంగా ఊరుకుండి వెళ్ళిపోయాడు.

ఆనంద్ ఆలోచించసాగాడు. ఎంతో పలుకుబడిగల హంతకుడు. శాసనసభాధ్యక్షుడు, మంత్రులు, ముఖ్యులైన శాసనసభ్యులు, ఆనవాయితీగా వస్తున్న పద్ధతి, ప్రభుత్వంలో ధనాఢ్యవర్గాలకు పూర్వంనుంచే దొరుకుతూ వచ్చిన ప్రత్యేకసౌలభ్యం, ప్రాచీనా చారంలో ఉండే స్థిరత్వం, సెక్రెటేరియట్ వారి గట్టి సిఫార్సు... ఈ అంశాలన్నీ ఒకదిశలో లాగుతున్నాయి. రెండోదిశలో... అదేదో ఇదమిద్ధంగా చెప్పలేడు, కానీ ఆ పురాతనపద్ధతిని వెంటనే రద్దు చేసేయాలనే తీవ్రాభిప్రాయం... వాస్తవంలో ఇలా రద్దుచేయడంలో నేడే మొదటిసారిచేస్తున్న కొత్తదేమీలేదు. అవసరం తీరినవెంటనే పాత ఉత్తరువులను రద్దుచేయడం అనుదినమూ జరుగుతుంటుంది... ప్రస్తుతపద్ధతిమాత్రం దీర్ఘకాలంనుంచీ, బ్రిటిషువారి హయాంనుంచీ వస్తోంది. ఇది 'కాలపరీక్ష'లో చెక్కుచెదరకుండా నిలిచింది. 'కాల పరీక్ష' అంటే ఎవ్వరూ నేటివరకు నిర్వచనం చెప్పలేదు. ఐతే దీన్ని న్యాయపరీక్షకు మాత్రం నేటివరకెవ్వరూ పెట్టలేదు. అందుకని ఇప్పుడు బాగా ఆలోచించే నిర్ణయం తీసుకోవాలనుకున్నాడు ఆనంద్. తన విశ్వాసాన్ననుసరించి నిర్ణయించడమంటే తాను ఒంటరిగా, శక్తిఉడిగేవరకూ, ప్రచలిత వ్యవస్థకు విరుద్ధంగా చేయవలసిన పోరాటమని తాత్పర్యం కావచ్చు. ఇప్పటికీ ముఖ్యమంత్రి తన నిర్ణయాన్ని త్రోసిపుచ్చవచ్చు. తనకు మిగిలేదల్లా అందరి విరోధం మాత్రమే.

ఐతే తను నమ్మిందానికి తాను కట్టుపడి ఉండాలంటే ఒకేఒక మార్గముంది. దాని పరిణామంగా రకరకాల ఇబ్బందుల తరువాత తన పదవి పోవచ్చు... కాని ఎవరు చెప్పగలరు? ఒకవైపు ఆనంద్ సందేహాలు పెరుగుతుంటే మరోవైపు తాను న్యాయమనుకున్నది చేసి తీరాలనే నిశ్చయం కూడా అంతే పెచ్చుపెరుగుతూ వచ్చింది. ఎవరి సలహా అడగాలో అర్థంకాలేదు. ఇలాంటి విషయాల్లో అరుణ పట్టించుకోదు. ఊరికే సలహా ఇవ్వడానికైనా పట్టించుకోదు. చివరకు తన 'అన్వార్థం'తోపాటు తానొక్కడే మిగిలాడు. నీడలా నిలిచిన ఆ 'అన్వార్థం'మాత్రం ఆ వివేకభరితం, అవివేకభరితం, ప్రమాదభరితం... ఐనా న్యాయసమ్మతం.. ఐన నిర్ణయం తీసుకొమ్మని పురికొల్పుతూ ఉంది.

ఆనంద్ ఆ ఖైదీ దరఖాస్తును త్రోసిపుచ్చాడు. అజ్ఞాతప్రమాదంలోకి దూకాడు.

# 21

బహుశా ఆ రోజు వార్తగా చెప్పుకోదగిందేదీ కనిపించలేదు కాబోలు, ఆ హంతకుడైన భూస్వామి కేసు గురించి ఓ విలేఖరి యాదృచ్ఛికంగా రాసేశాడు. తక్షణమే నిప్పు రాజుకునే సూచనలు కనిపించాయి. ఆ కేసులో ఆనంద్ తీసుకున్న వైఖరిని గ్రేట్ ఇండియాటైమ్స్ తన మొదటి పేజీలో ప్రముఖంగా ప్రచురించింది. వెనువెంటనే దానిపై తీవ్ర స్పందన వచ్చిపడింది. భూస్వామ్యవర్గంలో అది దిగ్భ్రాంతి కెరటాలు రేపింది. ఆనంద్ నివాసంలో ఫోను నిరంతరాయంగా మోగుతూనే ఉంది. ముగ్గురు మంత్రివర్గసహచరులనుంచి కూడా ఆగ్రహావేశాలను ఎదుర్కోవలసివచ్చింది. జైళ్ళశాఖను తాత్కాలికంగా ఆనంద్‌చేతుల్లో పెట్టినందుకు చౌదరినికూడా భూస్వాములు తిట్టిపోశారు.

ఘర్షణ అనుకున్నవేళకే మొదలై పోయింది. ఆనంద్ తనను గాయపరచినట్టు విచిత్రంగా ప్రతి భూస్వామీ అనుకున్నాడు. నిజమే, అన్ని హత్యలు చేయడంవెనుక సమర్థించదగిందేమీ లేదు, భూస్వాములుకూడా అవి సమర్థనీయమని అనడంలేదు. ఆ కేసుకు సంబంధించిన వాస్తవాలను దృష్టిలో ఉంచుకున్నప్పుడు ఆనంద్ అటువంటి నిర్ణయం తీసుకోవడం సమంజసమేనని వాళ్ళూ ఒప్పుకుంటున్నారు. అయినాసరే, ఆ నిర్ణయం సమాజంలోని ఒక పలుకు బడిగల వర్గాన్ని సవాలుచేస్తున్నట్టు వాళ్ళు భావించుకున్నారు. అది తమ ప్రతిష్ఠను మంటగలిపింది. ఒక నేరస్థుణ్ణి విచారించి తీర్పుచెప్పి శిక్షించడం చట్టవిహితమే. అయితే అతడి స్వాతంత్ర్యాన్ని హరించి అతణ్ణి ఖైదులో పెట్టిన తర్వాత ప్రభుత్వమూ నేరస్థుడూ ఇరువురిమధ్య సమానమైన తీర్పు జరిగిందన్నమాట. ఆ తర్వాత ఆ ఖైదీ హోదాకు తులతూగే సౌకర్యాలు కల్పించడానికి ప్రభుత్వం నిరాకరించకూడదు. శిక్ష విధించటంతోపాటు అది అవమానించడం కూడా అవుతుంది. అందుకు ఏ చట్టమూ అనుమతించదు. దానిని చట్టవిరుద్ధమన లేక పోవచ్చుకానీ కచ్చితంగా చట్టాలకు అతీతమైన పోకడ.

వార్తాపత్రికల్లో వచ్చిన కొన్నివ్యాసాల్లో ఈ వాదం చోటుచేసుకుంది. అయితే అందులో ఎవరికీ ఎటువంటి పస కనిపించలేదు. కారణం ఒకటే. గొప్పకులంవారనో, సంపన్నవర్గంవారనో చెప్పి కొందరు హంతకుల్ని జైలులో ప్రత్యేకమైన కనికరంతో చూడడం ప్రజాభిప్రాయానికి పూర్తిగా విరుద్ధం. ఈ ఉపేక్ష భూస్వాముల్లో మరింత ఆగ్రహం రెచ్చగొట్టింది. అయితే ప్రస్తుతానికి తగ్గి ఉండి దెబ్బతీసే అదనుకోసం వేచిచూద్దామని వాళ్ళు నిర్ణయించుకున్నారు.

ప్రజలు ఈ విషయాన్ని ఇంచుమించు మరచిపోయారు. బడా భూస్వామి అయిన చౌదరి మామద్వారా కొందరు భూస్వాములు చౌదరిని కలుసుకున్నారు. తమ వర్గప్రతిష్ఠతో ముడిపడిన విషయంలో ఆనంద్ జోక్యంచేసుకుంటున్నాడని వాళ్ళాయనకి ఫిర్యాదు చేశారు. తనా విషయంలో జోక్యం చేసుకోనని చౌదరి వాళ్ళతో ఖండితంగా చెప్పేశాడు. 'మీలో మీకున్న గొడవలు తేల్చుకోడానికి ఇంత వెర్రిమొర్రి కారణాన్ని పట్టుకుంటారా? దీనివెనుక ఎవరున్నాసరే ఇంతకంటే తెలివితక్కువ ఉండ'దని పొరపాటుకు ఏమాత్రం అవకాశమివ్వని తన రాజ కీయస్ఫురణతో చెప్పేశాడాయన.

అయినప్పటికీ మంత్రివర్గంలోని ఆనంద్ సహచరులు కొందరు ఈ ఉదంతాన్ని ఆనంద్ మీద దాడికి ఉపయోగించుకోవచ్చుననుకున్నారు. విస్ఫోటాన్ని పుట్టించగల శక్తిని తనలో దాచుకున్న ఓ గడ్డిపరకలాంటి విషయం తమ చేతికి అందొచ్చినట్టు వాళ్ళ రాజకీయబుద్ధి పసిగట్టింది. ఆనంద్ మీద వాళ్ళ కిష్టమే. ముఖంమీద అతనిని పొగుడుతూనే ఉంటారు. అయినా మంత్రివర్గసమావేశాల్లో తరచు అతగాడు తమ శాఖలకు సంబంధించిన వ్యవహారాల్లో వేలు పెడుతున్నందుకు వాళ్ళకు కోపంగా ఉంది. ఏదైనా మంత్రివర్గవ్యవహారం చర్చకు వచ్చినప్పుడల్లా సాధారణంగా ఆనంద్ మంత్రివర్గ పత్రాల్ని ఓసారి పైనుంచి కిందివరకు పరికించి, ఎవరైనా కొందరువ్యక్తుల పట్ల ప్రత్యేకమైన ఆదరణ చూపుతున్నట్టు తనకు తోచినప్పుడు ఎంతో పకడ్బందీగా రూపొందించుకున్న వాదాల్ని చీల్చిచెండాడుతూ ఉంటాడు. మంత్రివర్గసమష్టి బాధ్యతా సూత్రంకింద అలా జోక్యం చేసుకునే హక్కు అతడికుంది. అయితే అందువల్ల క్రమంగా ప్రతిఒకరికీ ఇబ్బంది కలిగించాడు. కొన్ని సందర్భాలలో ఆనంద్‌లోని తిరుగుబాటుధోరణికి చౌదరికూడా ఇరుకున పడుతున్నాడు. అయితే పైకి తేలేవాడు కాదు; అంటే ఆదర్శవాది అయిన తన సహచరుడు తన మెడకు తానే బిగించుకోడానికి మరికాస్త ఎక్కువ పొడవున్న ఉరితాడును సిద్ధంచేస్తున్నాడన్నమాట.

మిగిలిన మంత్రివర్గసభ్యులకు అతడి భరతమెలా పట్టాలో అర్థంకావడంలేదు. అతడు దేనికీ లొంగనివాడులా కనిపించడంతో మరింత నిస్స్పృహతో నీరుగారిపోతున్నారు. అతడు అవినీతికి అతీతుడు, అయితే అదంత విశేషంకాదు; అటువంటి వాళ్ళు ఇంకా చాలామంది ఉన్నారు. అతడు సమర్థుడే, అయితే ఆ సామర్థ్యం కూడా ఎందరిలోనో కనిపిస్తున్నదే. ఇతణ్ణి మిగిలిన వారికంటె భిన్నంగా నిలబెట్టే విషయం అధికారంపట్ల ఇతగాడి తటస్థధోరణి. ఆ లక్షణాన్ని అడ్డుపెట్టుకుని ఏ విషయంలోనూ కొంచెమైనా వెసులుబాటుకు అవకాశమివ్వకుండా పట్టువిడుపులులేని ఒకే మూస పద్ధతిలో 'అన్నీ న్యాయ బద్ధంగా' జరగవలసిందేనని శాసిస్తూ ఉంటాడు. శత్రువులూ మిత్రులూ అనే తేడాలేకుండా ఈ ధోరణి ప్రతిఒకరికీ కలవరమూ కోపమూ తెప్పిస్తోంది.

వాళ్ళకి అతనిమీద ప్రేమా, ద్వేషమూ రెండూ ఉన్నాయి. ఇంత బుద్ధిమంతుడు పాతుకు పోయిన వ్యవస్థమీద అంత పగబట్టినట్టు ఎందుకు ప్రవర్తిస్తూఉంటాడని ఆగ్రహంతో ప్రశ్నిస్తూఉంటారు. ఆ వ్యవస్థనుంచి పుట్టుకొచ్చిన ప్రభుత్వాన్నే అడ్డుపెట్టుకొని వ్యవస్థకు ద్రోహం తలపెట్టడం నిజాయితీకి నిరూపణ ఎలా అవుతుంది? అటువంటి విద్రోహచింతవల్ల అతడు బావుకునే

దేముంటుంది? పార్టీ ఆదేశాన్ని మించి అతడిలో మరెటువంటి ఎత్తుగడ వాళ్ళకి కనిపించలేదు. అయితేమాత్రం, పార్టీవిధానాలకు ఏకైక భాష్యకర్తగా అతణ్ణెవరు నియమించారు? పార్టీమీద అతడి శ్రద్ధ మిగిలినవాళ్ళ శ్రద్ధకంటె ఏవిధంగా గొప్పది?.. లేదు, ఇదంత ఆషామాషీ విషయం కాదు. దీనివెనుక అంతకంటె లోతైన, అంతకంటె ద్రోహపూరితమైన, బహుశా రాజకీయేతరమైన దేదో ఉంది. ఒకవేళ విద్రోహచర్యలపై విశ్వాసం ఉన్న మరోరకం రాజకీయశక్తులేవైనా ఇతణ్ణి లోపలికి 'చొప్పించా'యా? బహుశా అదే అయియుంటుంది- అతడి ప్రత్యర్థులు అలా నిర్ధారణ కొచ్చారు. అయితే ఆమాట పైకి అనలేకపోయారు. ఊహాజనితమైన ఈ అభిప్రాయానికి అప్పటికప్పుడు రుజువులు చూపించలేమని వాళ్ళకి తెలుసు. అందుకని తాత్కాలికంగా ఊరు కున్నారు.

సరే. ఈ లెక్కన ఎంతకాలం కొనసాగుతాడు? అధికారంలో ఉన్న ప్రతివ్యక్తి కవచంలో ఎక్కడో ఒక ఛిద్రం ఉండి తీరుతుంది. ఆనందేమీ దిగిరాలేదు. ఎన్నో ఒడుదుడుకులు, పరీక్షలు ఎదుర్కొన్న వ్యవస్థకు తనను తానెలా రక్షించుకోవాలో తెలుసు. ఒక వ్యక్తి దానిని మార్చలేడు, అలాగే ఏమాత్రం తెలివున్నా ఒక వ్యక్తి వ్యవస్థతో తలపడాలని అనుకోడు. ఆనంద్ వ్యవస్థను నాశనం చేయాలనుకుంటే వ్యవస్థే అతణ్ణి నాశనంచేసితీరుతుంది -అంటూ ఉద్ఘాటించారు వాళ్ళు.

మంత్రి అయ్యాక తన వ్యక్తిత్వంలోకానీ, అలవాట్లలో కానీ, నడకలోకానీ, తాను నమ్ముకున్న విలువల్లో కానీ ఎటువంటి మార్పు రాలేదని ఆనంద్ అనుకున్నాడు. బహుశా ఆ విషయంలో అతడు మిగిలినవాళ్ళతో సమానంగా అడుగు వేయలేక పోయాడు. మారుతున్న పరిస్థితికి అనుగుణంగా ఎవరైనా మారగలిగినప్పుడు ఆ మార్పు అంతగా కొట్టొచ్చినట్టు కనిపించడం కానీ, అనుభవానికి రావడం కానీ జరగదు. అయితే మారుతున్న వాతావరణంలో ఏమాత్రం మారకుండా ఉండిపోయిన మనిషి అన్నీ తారుమారు చేసేస్తాడు. తనకు తెలియకుండానే కావచ్చు, ఆనంద్ సరిగ్గా అదే చేశాడు. అమలులో ఉన్న వ్యవస్థ దృష్టిలో ఇది క్షమించరాని నేరం. అప్పుడప్పుడే ఆనంద్ తెలివితేటలు రాణింపుకు వస్తున్నాయి. కనుక అతణ్ణి ఢీకొనడానికి అది తగిన సమయంకాదు. నీ కెంత కక్ష ఉన్నా మధ్యాహ్నసూర్యుడివైపు సూటిగా తేరిపారచూడలేవు. అస్తమయ వేళ వరకూ ఆగవలసిందే. లేదా ఆ ప్రచండతను దట్టమైన మేఘం ఏదైనా కప్పివేసేవరకూ నిరీక్షించ వలసిందే.

ఆ ఎదురుచూపు ఫలించేతరుణం మరెంతో దూరంలో లేదు. మరో ఏణ్ణర్థానికే మేఘాలు సూర్యబింబాన్ని కమ్ముకోవడం ప్రారంభించాయి. అప్పటికి ఆనంద్ విజయాల్ని జనం సహజమని భావించడం ప్రారంభించారు. అతని మేధాశక్తి, సామర్థ్యం, నీతినిజాయితీలు – ఇవన్నీ మెరుపునీ, కొత్తదనాన్నీ కోల్పోయాయి. అతడు మేధావి, సమర్థుడు, నిజాయితీపరుడు కావటంలో కొత్తే ముంది, అతడెప్పుడూ అలాగే ఉన్నాడు. ఓ మంత్రి అలాగేఉండాలి కూడా. మిగిలిన వాళ్ళు అలా లేకపోతే అది భగవంతుడి సృష్టిలో ఉన్న వైవిధ్యం. అదంతగా పెడబొబ్బలు పెట్టవలసిన విషయమేమీ కాదు. మరి ఆనంద్‌ని ఆవరించిన ఆ కారుమబ్బు సంగతేమిటి? అదే, ఆ అరుణ! ఓ మేధావిమంత్రికి అలా బహిరంగంగా సంచరించడానికి ప్రత్యేకమైన లైసెన్సు ఎవరైనా ఇచ్చారేమిటి?

అరుణ ఈ పరిణామాల లోతు కనిపెట్టలేకపోయింది. తన మామూలు తరహాలోనే ముక్కు సూటిగా, మొండిగా, తనువేసే ప్రతిఅడుగూ సరైందే అన్న నమ్మకంతో ఉంది. ఆనంద్ సాధించిన పేరు ప్రతిష్ఠలు, విజయాలవెల్లువలో మునకలేస్తోంది. ఆ గర్వాతిరేకమూ ఆనందమూ వారి వ్యక్తిగత సాన్నిహిత్యంవల్ల కలుగుతున్నవేనని రాజకీయవర్గాలు అర్థం చెబుతున్నట్టు ఆమె తెలుసుకోలేకపోయింది. ఆ ఆరోపణలో ఏ మాత్రం పస లేకపోవడం మరో చిక్కుసమస్య. ఆనంద్ అధికారాన్ని ఎప్పుడూ లక్ష్యపెట్టినవాడు కాదు. అధికారం మౌలికంగా ఉపయోగానికీ, అనువర్తనకూ సంబంధించినదని అతని వాదం. అంతగా ఉద్వేగానికీ ఉత్తేజానికీ లోనుకావలసినదందులో ఏమీలేదు. అధికారం లభించిన వెనువెంటనే కొంత హుషారు కలిగితే కలగవచ్చు. కాని ఆ వ్యక్తి క్రమంగా దేనికీ చలించని ఒక నిర్వికారస్థితికి చేరుకుంటాడు. ఆ తర్వాత అధికారమనేది కేవలం ఉపయోగపడే ఆయుధమే కానీ ప్రదర్శనకుద్దేశించింది కాదు, కరవాలంలా మెరిపించ దగిందీ కాదు. దానిని వినియోగించిన వాళ్ళు ఆ పని ఎంతో నిశ్శబ్దంగా, ఎంతో సమర్థవంతంగా చేశారు. అధికారం మీద మోహం పెంచుకున్నవాళ్ళు పనికిమాలిన అర్థరహితమైన, అల్లరీ ఆర్భాటం చేస్తూ ఉంటారు. స్వభావసిద్ధంగానే ప్రతిదానికీ హడావుడి చేసే అలవాటున్న అరుణ అతడి సలహాను పట్టించుకోలేదు. మద్దతు దారుల మాయమాటలకు లోబడి మరింత విజృంభించి మొండిగా గట్టిగా మాట్లాడడం ప్రారంభించింది. తరచు తనను ఆనంద్‌తో కలుపుకుని 'మేము' అంటూ మాట్లాడసాగింది. చాలామంది కది కర్ణశల్యంగా మారింది. కొందరి బుర్రల్లో జోరీగలా రొద పెట్టింది. కొందరి హృదయాలకు సంతోషమూ కలిగించింది.

అరుణ ఇంటిముందు ఉదయంనుంచి రాత్రి పొద్దుపోయేవరకూ కార్లు బారులు తీరి కనిపిస్తూఉండేవి. రకరకాల దళారులు, రవాణాఆపరేటర్లు, రైస్ మిల్లర్లు, క్రమశిక్షణచర్య నెదుర్కొంటున్న, లేదా ప్రమోషన్ మీద ఆశపెట్టుకున్న అధికారులు, కాంట్రాక్టర్లు, చిల్లరవర్తకులు, ఇంకా రకరకాల అవినీతిపనుల్లో, అక్రమ వ్యవహారాల్లో మునిగితేలే మనుషులు వచ్చి పడుతూ ఉండేవారు. ఆమెభర్త వైపునుంచి, తోబుట్టువులవైపునుంచి, తోబుట్టువుల భర్తల వైపునుంచి తోబుట్టువుల భర్తల తోబుట్టువుల వైపునుంచి... ఆమెతో ఇలా అంతూపొంతూలేని గొలుసుకట్టుపద్ధతిలో, ఏనాడూ విని ఎరుగని చుట్టరికాలు కలుపుకుంటూ వచ్చేవారు. కొంతమంది సహాధ్యాయులమనిచెప్పి, హాస్టల్‌లో ఆమెసహచరులమని చెప్పి హఠాత్తుగా ఊడిపడేవారు. వాళ్ళలో చాలామందిని గుర్తుపట్టడం ఎంత ప్రయత్నించినా ఆమెకు సాధ్యపడలేదు. ఒక వర్తకప్రముఖుడు ఆమె ఎన్నడూ చదివి ఎరగని ఓ కాలేజీ పేరు చెప్పి, ఆ కాలేజీలో తామిద్దరం కలిసి చదువుకున్నామనడం ఈ హాస్యాస్పద ఘట్టానికి నిజంగా పరాకాష్ఠ.

సహాధ్యాయుల హోదానుంచి మరొక గంతు వేస్తే నేస్తాలు, ప్రేమికుల బలగం ప్రారంభమైంది. ఆ వెనుకఉన్న తర్కం అర్థం కానిదీకాదు; రాజకీయాల్లో ఉన్న ఈ ఆడ మనిషి, ఆడ మగ కలిసి చదువుకునే విద్యాసంస్థల్లో చదువుకున్న విషయాన్ని దృష్టిలో పెట్టుకుంటే ఈ పుకార్లకు కొంత విశ్వసనీయత సహజంగానే వచ్చేది. క్రమంగా మాజీ ప్రేమికుల సంఖ్య శరవేగంతో పెరిగి పోయింది. ఆమె కాలేజీలో ఉన్నప్పుడు బలే అందంగా ఉండేదంటూ వాళ్ళలో ఒకతను

గుర్తుచేస్తున్నాడు. సన్నగా, నాజూగ్గా, గలగల మాట్లాడుతూ ఎంతో సోషల్‌గాఉండేది– పలువురి హృదయాల్ని దోచుకుంది.. అయితే, ఆమెతో శయ్యాసుఖాన్ని పంచుకుని ఆమెను మరింత సన్నిహితంగా తెలుసుకో గలిగిన అదృష్టం తనొక్కడికే లభించిందని సగర్వంగా చెప్పుకున్నాడొక ప్రేమికుడు... అరుణతో ప్రణయసాఫల్యం పొందిన అదృష్టవంతుడుగా తనను చిత్రించుకున్న మరో వ్యక్తి, శృంగారక్రీడలో ఆమె నైపుణ్యం గురించి పూసగుచ్చినట్టు వర్ణించేవాడు. అయితే ఈ డాంబికాలనుంచి అతడాశించే తక్షణ ప్రయోజనం ఒకటే. ఒక మాజీ ప్రేమికుడిగా అరుణ దగ్గర తన పలుకుబడి ఉపయోగించి, అరుణతో ఆనంద్‌ను ఒప్పింపజేసి ప్రభుత్వశాఖలోని ఫైళ్ళ పద్మవ్యూహంలోంచి 'నీ ఫైలును ఇవతలకు తీసుకురాగలిగిన వాణ్ణి నేనే' నని బంగారు బాతులాంటి తన మిత్రుణ్ణి నమ్మించడం, అందుకు ప్రతిగా అతడినుంచి కొంత సొమ్ము కమిషన్‌గా రాబట్టడం ఆ నకిలీ ప్రేమికుడి ఎత్తుగడ.

ఆనంద్ వినీలాకాశంలోకూడా సరికొత్త తారలనేకం ప్రత్యక్షమయ్యాయి. ఎందరెందరో సహాధ్యాయులు, కలిసి ఆడుకున్నవాళ్ళు, ఇంకా రకరకాల మిత్రులు నిజమూ నకిలీ అనే తేడా లేకుండా, వివిధ రంగాలనుంచి ఊడిపడినవాళ్ళు... రాజకీయాధికారం రాత్రికి రాత్రి పడిన వానతుంపరలా ప్రభావం చూపడంవల్ల అప్పటివరకు ఎండి బీటలువారిన నేలమీద వెంటనే మొలకెత్తారు వాళ్ళందరూ. ఆనంద్‌తో హాకీ ఆడిన ఓ వ్యక్తి వ్యాఖ్యానం ఇలాసాగిపోయింది. 'ఆనంద్ మా హైస్కూలు టీములో ఉండేవాడులెండి. అతగాడు రైట్-ఇన్, నేను సెంటర్ ఫార్వర్డ్. భలే చురుగ్గా పరుగెత్తేవాడు. మేమెవరం అతగాడితో పోటీపడలేకపోయే వాళ్ళం. అతడి స్టిక్‌వర్క్ చూడ ముచ్చటగా ఉండేది. అయితే అవతలి గోలువైపు ఒక్కడే వెళ్ళిపోయేవాడు. దాంతో తరచుగోల్ చేయలేకపోయేవాడు. అదే అతడిలో ఉన్నలోపం- ఎంతసేపు ఒంటెద్దుపోకడ. ఇప్పుడు రాజకీయాల్లో ఎలా పనిచేయగలుగుతున్నాడా అని ఆశ్చర్యం కలుగుతూ ఉంటుంది. అలాగే.. ఆ ఒంటెద్దు పోకడలోనే సాగుతున్నాడనుకుంటాను....

ఇక ఆనంద్‌తో ఆడుకున్నవాళ్ళు, ఆడుకున్నామని చెప్పేవాళ్ళు ముప్ఫైఏళ్ళక్రితం ప్రచారంలో ఉన్న గ్రామీణక్రీడల పేర్లు ఏకరువు పెట్టేవాళ్ళు- కోతికొమ్మచ్చి, హు-తు-తు, గల్లీదండా... ఆపైన కాముకత్వాన్ని రెచ్చగొట్టేలా ఉన్న 'మాతాహరి' టైపు ఆడవాళ్ళిద్దరు తరచు సచివాలయం కారిడార్లలో కనిపించేవారు. ఆనంద్ నఖశిఖ పర్యంతం తమకెంతో దగ్గరగా తెలిసినట్టు వర్ణించేవారు. తమ ఊళ్ళో సందుగొందుల్లో ఆనంద్ తమతో కలిసి ఎలా తిరుగు తూఉండేవాడో భావగర్భితంగా కలకూజితంగా చెబుతూ ఉండేవారు. ఒంటిమీద దుస్తులు లేకుండా– అబ్బ, దాన్నేమంటారబ్బా– నలుగురికీ చూపిస్తూ ఊపుకుంటూ తిరుగుతూఉండే వాడంటూ ఎంతో రుచిగా చెప్పుకునేవాళ్ళు. అప్పుడు వాళ్ళముఖంలో తెచ్చిపెట్టుకున్న నునుసిగ్గు ఆ మాటలు నిజమని నమ్మించడానికి ఉద్దేశించినట్టుండేది. కాముకత్వాన్ని ప్రేరేపించేలా ఉన్న ఆ వ్యాఖ్యలు మరెందుకోకాదు, ఆనంద్ దగ్గర తమకెంతో చనువున్నట్టు, అతడినుంచి ప్రయో జనం ఆశించే ఓ వాణిజ్య వేత్తను నమ్మించడానికే.

పరువుతీసే ఇటువంటి ఉదంతాలు ఆనంద్‌ను బాధపెట్టాయి; అయితే తాను సేవించ నిర్ణయించుకున్న ప్రజల విస్తృతప్రయోజనాలను దృష్టిలో ఉంచుకుని వీటన్నింటినీ భరించాడు. వైద్యవిద్యలో అదనపు అర్హతలు సంపాదించుకోడంకోసం విదేశంలో చాలాకాలంఉండి అప్పుడప్పుడే తిరిగొచ్చిన అతడి మిత్రుడు డాక్టర్ సుదర్శన్ ఓ రోజుఉదయం ఫోన్‌చేసి తాను నగరానికి తిరిగొచ్చిన విషయం చెప్పాడు. ఆనంద్ ఎంతో సంతోషపడి ఇద్దరం కలుసుకోవాలని సూచించాడు. ఇంతలో ఏదో ఆలోచన స్ఫురించి అన్నాడు. 'ప్రభుత్వం చేతకానితనంమీద నువ్వెప్పుడూ విరుచుకుపడుతూఉంటావు కదా! నీ విమర్శలతో నేను చాలావరకు ఏకీభవిస్తూ ఉంటాను. నేను పనిచేస్తుండగా చూసి నీ అభిప్రాయాలు చెబితే ఎలాఉంటుంది? అది నాకు చాలారకాలుగా ఉపయోగపడుతుంది. రేపు మా ఆఫీసుకొచ్చి రోజంతా నాతో గడిపి మంత్రికావడమంటే ఎలాఉంటుందో చూడకూడదూ? సాయంత్రమయ్యేసరికి ఒకవేళ నువ్వు డీలాపడిపోతే నువ్వు తగిలించుకున్న డిగ్రీలతో జబ్బునయం చేసుకోవచ్చు'...

సుదర్శన్ నవ్వేస్తూ సరే అన్నాడు.

మరునాడు ఆనంద్ తన ఆఫీసులో మిత్రుడి రాకకోసం ఎదురుచూస్తున్నాడు. ఇంతలో తన గదికి అవతల ఎవరో వ్యక్తి తుపానులా విరుచుకుపడినట్టున్న మాటలప్రవాహమేదో అతని చెవినపడింది.

'ఏమిటీ...? ఓ మంత్రి రూల్సు మాట్లాడడమా? దెయ్యాలు వేదాలు వల్లించినట్టు!... సరే... నా తడాఖా చూపిస్తాను! మంత్రిగా ఎంతకాలం ఉంటాడో చూస్తాను! చూస్తూ ఉండండి. వచ్చే ఎన్నికల్లో ఏం జరుగుతుందో! ఎంత విశ్వాసఘాతుకం! ఎంత బేఇమానీ! గుర్రంగుర్తు అభ్యర్థి నుంచి ఊరించే ఆఫర్లు వచ్చినా కాదని రాత్రినక పగలనక కష్టపడి ఈయనగార్ని గెలిపించాం. యాభై జతల ఎడ్లు లాగుతున్న రథంలో కూర్చోబెట్టి ఈయన్ను ఊరూరా ఊరేగించాం. ఆ సైకిల్‌గుర్తు అభ్యర్థిని సపోర్టు చేయనందుకు మా కుల పోళ్ళందరూ మా మీద కోపం చేసినా భరించాం. మరే అభ్యర్థిని సపోర్టు చేసినా, చివరకు ఒకే సమయంలో ఇద్దరు అభ్యర్థుల్ని సపోర్టు చేసినా దక్కించు కోగలిగిన ఎన్నో లాభాల్ని ఈయన ఎన్నికమాయలో పడిపోయి పోగొట్టుకున్నాం. అయినా ఈ కాబోయే మంత్రిగారిని, ఈ పెద్దమనిషి ఆనంద్‌జీని భుజాలమీద మోశామంటే ఎందుకు మోశాం? మాకేదో చేస్తాడని. ఇప్పుడీయన రూల్సు వల్లిస్తున్నాడు...గొప్ప గొప్ప రూల్సు.. మాకేవీ రూల్సు తెలియనట్టు! రామరామ! ప్రపంచానికి ఎంత వినాశకాలం వచ్చింది!'

ఆనంద్ ఆ గొంతు గుర్తుపట్టాడు, భీమశంకర్. తన నియోజకవర్గానికి చెందిన పలుకుబడి గల భూస్వామి. నిబంధనలకు విరుద్ధంగా తన ఊళ్ళో సేద్యపునీటిచెరువు నిర్మాణానికి ఉత్తర్వుచేయమని ఆనంద్‌ను కోరాడు. దానివల్ల అతని అధీనంలో ఉన్న వంద హెక్టార్ల మెట్ట భూమి అప్పటికప్పుడు మంచిమాగాణిగా మారి పోతుంది. ఆనంద్ ఆ అభ్యర్థనను తిరస్కరించాడు. అందుకని మండి పడుతున్న భీమశంకర్, ప్రపంచం హఠాత్తుగా బే-ఇమాన్ రాజకీయవాదులతో ఎలా నిండిపోయిందో చూడమంటూ వదరుతున్నాడు.

మల్లెపూవులాంటి ధోవతి, కళ్ళజోడు, ఇంతమందాన బలిసినట్టున్న బంగారపుచైనుతో రిస్టువాచి ధరించిన ఆ స్థూలకాయుడు అక్కడున్నవాళ్ళను చాలా సేపటినుంచి అలా ఊదరగొడుతున్నాడు. ఆనంద్ గది ఎదుట, సచివాలయంలో పదిమందీ తిరుగుతూ ఎప్పుడూ రద్దీగాఉండే కారిడార్ మధ్యభాగాన్ని ఆ భారీకాయం కమ్మివేసింది. తనమాటలు ఆనంద్ వినాలనే అతడు ఆశించినట్టు స్పష్టంగా తెలిసిపోతోంది.

కొద్ది నిముషాలకే ఆనంద్‌కు మరో గొంతు వినిపించింది. అది డాక్టర్ సుదర్శన్ గొంతని ఆనంద్ వెంటనే పోల్చుకున్నాడు. ఆ తర్వాత ఏదో వాదించుకోవడం వినిపించింది. రూలుప్రకారం చేయకూడనిపని ఎంతమాత్రం చేయడానికి వీల్లేదని సుదర్శన్ నొక్కి చెబుతున్నాడు. దాంతో అవతలి పెద్దమనిషి మరింత రెచ్చిపోయాడు. 'చూడు మిస్టర్' అంటూ బుసకొడుతూఅన్నాడు. 'నాకూ ఒకటి రెండురూల్సు తెలుసు. తెలియవనుకోకు. రూల్సు ప్రకారమే జరగవలసిందేమైనా ఉంటే మా దగ్గరలో ఉన్న సూపర్‌వైజరే చేయగలడు, చాలామంచిమనిషి, మేమిద్దరం బార్‌లో కలుసుకుంటూఉంటాం. జిల్లాఅధికారి కూడా చేసుండేవాడు, మా దగ్గరున్న ఆడాళ్ళక్లబ్‌కి ఆయన పెండ్లాం ప్రెసిడెంటూ, మా యావిడ సెక్రటరీ. ఆ దిక్కుమాలినపని రూల్సు ప్రకారం జరిగే వీలులేనప్పుడే ఇదిగో ఇలా ఈ మంత్రులనబడే గొప్పగొప్పోళ్ళ కాళ్ళా వేళ్ళా పడాల్సి వస్తుంది, నీకు తెలుసునో తెలియదో? ఈయనగారో రూల్సు మాట్లాడుతున్నాడు! మహా రూల్సు!'

ఈ కుతర్కంతో సుదర్శన్ ఒకింత విస్తుపోయాడు. వాంతి కలిగించేలా ఉన్న భీమశంకర్ మాటలకు తగిన జవాబుచెప్పడానికి ప్రయత్నించాడు. 'అంటే మీ ఉద్దేశం, రూల్సును అతిక్రమించడమేనా మంత్రుల ఉద్యోగం?' అడిగాడు.

'రూల్సు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా పనులు జరిపించడానికేనయ్యా ఈ మంత్రులున్నది! - అర్థమైందా? లేకపోతే ఓ ఎల్.డి.సి. కన్నా వాళ్ళేంగొప్ప?'

సుదర్శన్ పగలబడినవ్వుతూ ఆనంద్ గదిలోకి అడుగుపెట్టాడు. అయితే ఆనంద్‌ను చూసిన తక్షణమే అతడి నవ్వు ఆగిపోయింది. 'ఆనంద్ ఏమిటలా ఉన్నావని' ఒకింత ఆందోళనతో ప్రశ్నించాడు.

'బాగానేఉన్నాను, థాంక్స్. ఎక్కువసేపు పనిచేయడం వల్ల టెన్షన్ వల్ల కాస్త అలసిపోయి ఉంటాను' ఆనంద్ జవాబుచెప్పాడు.

'అరె! నేను విదేశాలకు వెళ్ళే ముందుకీ ఇప్పటికీ నీలో ఎంత మార్పు కనిపిస్తోంది!, పదేళ్ళు వయసు మీదపడినట్టు కనిపిస్తున్నావ్!'

'అబద్ధం! మరీ అతిశయోక్తిగా మాట్లాడుతున్నావ్. నేనెంతో బాగున్నాను , నిజం డాక్టర్.'

'గది బయట ఇప్పుడెదురయ్యాడే, అటువంటి బడాచోర్‌లు తగులుకున్నప్పుడు నువ్విలా అలసిపోవడంలో నాకేమీ ఆశ్చర్యం కనిపించడంలేదు'

'అతడి మాటల్లో తప్పేమీలేదు. తన ప్రయోజనాలకు ముప్పొచ్చి పడింది కనుక నన్ను దూషిస్తున్నాడు. అంతేకానీ నా మీద శత్రుత్వంతోకాదు. ఓ స్వల్పమైన నిబంధన... మంత్రి

తలచుకుంటే కాస్త తలక్రిందులు చేయగలిగే నిబంధన... తనకీ తన వంద హెక్టార్ల భూమికీ మధ్యలో వచ్చి నిలబడేసరికి సహజంగానే అతడుచిందులు తొక్కుతాడు. సమస్యల్లా ప్రతి రాజకీయవాది రాబోయే ఎన్నికలనబడే ఓ గడ్డు పరిస్థితిని ఎదుర్కోవలసి వస్తుంది. చాలా కేసుల్లో అక్కడే వాడు దొరికిపోతాడు...'

సుదర్శన్‌ను సోఫాలో కూర్చోబెట్టి టీ తెమ్మని అటెండర్‌ను పురమాయించాడు. 'ఇక ఇప్పుడు చెప్పు. విదేశంలో ఏమేం సాధించుకొచ్చావ్? శిక్షణ మొత్తం మీద పనికొచ్చేదేనా?'

'అవునూ, కాదు. మన దేశంలో మనకిప్పుడేం కావాలో వాళ్ళకి తెలిసినట్టు నా కనిపించ లేదు. విచిత్రంగా అది మనకీ తెలియదు. సరే, పరిస్థితి మారుతుందన్న నమ్మకం నాకుంది. విదేశీయమని పించుకున్న ప్రతిదీ అన్నికాలాల్లోనూ, అన్నింటికీ పనికొస్తుందని నమ్మేదశలోనే మనమింకా ఉన్నాం...'

ఇంతలో ఒక సీనియర్ శాసన సభ్యుడు గదిలోకి అడుగుపెట్టి బిగ్గరగాఅరుస్తూ వాళ్ళ సంభాషణకు అంతరాయం కలిగించాడు. 'చూడండి సార్. ఈ మనిషిని వెంటనే బదలీ చేయించకపోతే మన గ్రూపు మట్టికొట్టుకుపోతుంది, కచ్చితంగా... మిమ్మల్ని హెచ్చరించడాని కొచ్చాను...' అన్నాడు కుండబద్దలుకొట్టినట్టు.

'అదెలా జరుగుతుంది? అతడక్కడికి వెళ్ళి మూడుమాసాలే అయిందే?' ఆనంద్ అన్నాడు.

'అక్కడే ఉంది మతలబు. అక్కడకెళ్ళి ఎంతకాలమైందనేది పట్టించు కోకుండా ఆ గాడిద కొడుకును ఒక్క తన్నుతంతే, ఆ పోస్టులోకి వచ్చే మనిషి మన గ్రూపు చెప్పినట్టు మరింత బుద్ధిగా వింటాడు'.

'అయినా ఆ బదలీకి నేను ఉత్తర్వు చేయలేను; జిల్లా అధికారి...'

'నాకు తెలుసు' మధ్యలో అడ్డు తగులుతూ అన్నాడతను. 'దయచేసి జిల్లాకలెక్టర్‌కు ఫోను కొట్టి వెంటనే బదలీకి ఉత్తర్వులివ్వమని చెప్పండి...'

ఆనంద్ సందిగ్ధస్థితిలోకి జారి పోయాడు. అతడి గొంతు బలహీనంగా వినిపిస్తోంది. తనకు తెలుసు, తను ప్రవాహానికి ఎదురీదుతున్నాడు. 'గ్రూపు' ప్రయోజనం బలవత్తరమైనది, నిర్లక్ష్యం చేయడానికి ఏమాత్రం వీలులేనిది. గ్రూపుకోసం ఏమైనా చేసి తీరవలసిందే, అదిక్కడ శిలా శాసనం లాంటిది. తనకు ఏ గ్రూపూ లేదని చెప్పినందువల్ల ఉపయోగం లేదు. ఎలాగైనా వాళ్ళు ప్రతివాడి మీద ఏదో ఒకగ్రూపు ముద్ర వేసేతీరతారు. అధికారపక్షంలో ఎవరైనా సరే, ఏదో ఒక గ్రూపుకి విధిగా చెందితీరాలి, భారతదేశంలోని ప్రతిహిందువూ ఏదో ఒక కులానికి చెందినట్టుగా.

మరో పెద్దమనిషి తన సమస్యను వెంటబెట్టుకుని వచ్చాడు. 'అందులో కష్టమేమీలేదు ఆనంద్‌గారూ' అని కూడా హామీ ఇచ్చాడు. అతని మేనల్లుడు బి.ఎ. థర్డ్ క్లాసులో పాసయ్యాడట. అయితే మంచి తెలివైనవాడేనట. ఒక ప్రభుత్వరంగసంస్థలో సీనియర్ పోస్టుకి దరఖాస్తుచేశాడట.

ఇంటర్వ్యూ అంత బాగా చేయనిమాట నిజమేనట; అయినా కావలసిన అర్హతలన్నీ అతనికున్నాయట. ఆ ఉద్యోగం అతనికి రావడానికి ఎటువంటి అడ్డంకులూ లేవట. అదృష్టంకొద్దీ ప్రభుత్వరంగం అటువంటి వాళ్ళకి ఉద్యోగాలిస్తూనే ఉంది! అయితే చూశారూ? ఈ రోజుల్లో ప్రతివాళ్ళకీ కాస్త వెనకనుంచిపట్టుకొని తోసేవాళ్ళుండాలి. అంచేత ఆనంద్‌గారూ దయచేసి ఆ జనరల్ మేనేజర్‌కి మా మేనల్లుడి విషయం కాస్త సిఫార్సు చేద్దురూ?

'ఫస్ట్‌క్లాస్ తెచ్చుకున్న వాళ్లెంతోమంది ఆ ఉద్యోగం కోసం ఎగబడుతున్నారు' ఆనంద్ అన్నాడు.

'అయితే ఏమండీ?' ఆ పెద్దమనిషి మొండిగా ఎదురు ప్రశ్నవేశాడు. 'ఏదెలా జరిగినా సరే, నా మేనల్లుడికి ఆ ఉద్యోగం వచ్చితీరవలసిందే.'

మూడోమనిషి తన కుమారుడికి ఇంజనీరింగ్‌సీటు ఇప్పించాలంటూ వచ్చాడు. మెరిట్‌నే దృష్టిలో ఉంచుకుంటే అతడికి సీటువచ్చేఅవకాశం లేనిమాట నిజమేనని ఆ పెద్దమనిషి కూడా ఒప్పుకున్నాడు. ఆపైన... 'గమనించారూ? ఈ మెరిట్ అనే మాటలన్నీ వట్టి చెత్తండీ!' అని అలవోకగా ఓ వ్యాఖ్య విసిరేశాడు. 'యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ గారికి మీరో మాట చెబితే మా వాడి భవిష్యత్తుకిక ఢోకా ఉండదు' అన్నాడు, మరింత ఎఫెక్ట్ కోసం మొహంనిండా నవ్వు చేసుకుంటూ. 'ఒక్కమాట చాలు' మళ్ళీఅన్నాడు.

'అది అసాధ్యమండీ' ఆనంద్ మొత్తుకున్నాడు. 'తెలివితేటలున్న కుర్రాళ్ళు చాలామందున్నారు, సహజంగా వాళ్ళకే ప్రాధాన్యం ఇస్తారు...'

'మావాడే కనుక మేధావి అయుంటే ఈ రోజిలా వచ్చి మిమ్మల్ని ఇబ్బంది పెడతానా?' కలవరపడుతూ ఎదురు ప్రశ్న వేశాడా తండ్రి.

నాలుగోమనిషి డొంకతిరుగుడుగా మాట్లాడడంలో సిద్ధహస్తుడు. 'ఆ రోజున మీరు రాంపూర్‌లో చేసిన ప్రసంగం అద్భుతం సార్' అంటూ మొదలు పెట్టాడు. 'ముగ్ధులైపోయిన జనం నోటివెంట మాటరాలేదంటే నమ్మండి. మీరంటే పడిచచ్చిపోతున్నారు, అలుపు విరామం లేకుండా మిమ్మల్ని పొగడ్తలతో ముంచెత్తుతున్నారు. అయితే అవన్నీ అర్హమైనవే అనుకోండి'

'కానీ సేఠ్‌జీ, ఆరోజున నేనెటువంటి ఉపన్యాసం ఇవ్వలేదే. నా రాంపూర్ పర్యటనను చివరి క్షణంలో రద్దు చేసుకోవలసివచ్చింది' అన్నాడు ఆనంద్.

సేఠ్‌జీ తెల్లబోయాడు. అది కూడా క్షణకాలమే. మరుక్షణం మరో విషయం ఎత్తుకుని ఊదర గొట్టడం ప్రారంభించాడు. లక్ష్యం మాత్రం అదే, ఆనంద్‌ను ఆకాశానికెత్తడం. అక్కడినుంచి వెళ్ళడు, తనొచ్చిన పనేమిటో చెప్పడు. మొదటిసారి వచ్చినప్పుడు పొగడ్తలతో ఉబ్బించడం అతడి టెక్నిక్ కాబోలు. అతని పనేమిటో తెలుసుకోవాలంటే అతడి తదుపరి సందర్శనవరకూ ఆనంద్ ఆగవలసిందే.

తర్వాతకూడా రకరకాల అభ్యర్థనలతో ఎవరెవరో వస్తూనేఉన్నారు. శంకుస్థాపన చేయడానికీ, ప్రారంభోత్సవానికీ, ఫలానా ఫలానా దుకాణాలు ప్రారంభించడానికీ, ఏదో పాఠశాల ఉత్సవాల

ముగింపు కార్యక్రమానికి అధ్యక్షత వహించడానికీ, ఏదో మేళా సందర్భంగా బహుమతి ప్రదానానికీ, బహిరంగసభలో ప్రసంగించడానికీ... వగైరా వగైరా. ఇటువంటి ఆహ్వానాలకు చాలావరకు కారణం ఒకటే... అవతలి 'గ్రూపు' వాళ్ళు తమ కార్యక్రమాలకు ఒక మంత్రిని రప్పించుకుంటున్నారు. కనుక తాము కూడా తమ ప్రత్యర్థులకు తీసిపోమని నిరూపించుకోవాలి కనుక మంత్రికి ప్రతిగా మరో మంత్రిని పిలవవలసిందే. ఇది ప్రతిగ్రూపూ విధిగా పాటించే దైవశాసనంలాంటి రూలు.

ఆ తర్వాత ఓ బ్రహ్మాండమైన పూలదండ మోస్తూ ఓ విచిత్రమైన వ్యక్తి గదిలోకి చొరబడి పోయాడు, అదే పనిగా మాట్లాడుతూ. ఆ పూలదండవల్ల అతడుండే పట్టణప్రాంతంలో తప్పకుండా పూలకు కరువొచ్చే ఉంటుంది. అతడి నడక, అతడి హావభావాలు వర్ణించడానికి అలవికానంత నాటకీయంగా ఉన్నాయి. అతని వాగ్ధార ఆగిన తర్వాత (నిజానికి వాగ్ధార సాగుతున్నప్పుడే అనడం సబబు, ఎందుకంటే అది ఆగిపోవడమంటూ ఉండదు కనుక)- ఒకటి రెండురోజుల్లో ఏదో ఫైలు తన టేబులుమీదికి రాబోతున్నట్టు ఆనంద్‌కి అర్థమైంది. ఆ పెద్దమనిషికి ఆ వ్యవహారంలో వ్యక్తిగతమైన ఆసక్తి ఏదో ఉంది. చప్రాసి మొదలుకుని ప్రతివాళ్ళూ ఆయనకు పనిచేసిపెట్టే ఉద్దేశంతోనే ఉన్నారట. అధికారులు కేసును ఎంతో క్షుణ్ణంగా న్యాయ బద్ధంగా ఇప్పటికే పరిశీలించి సిద్ధం చేశారట. మళ్ళీ ఆనంద్ తలబద్దలు కొట్టుకోవలసిన అవసరమేలేదట. సంతకం చేస్తే చాలట.... అంతేమరి. లేకపోతే మంత్రిగారు కళ్ళుచీల్చుకుంటూ ప్రతికాగితాన్ని ప్రతి వివరాన్ని చూడగలరా ఏమిటి? ఉద్యోగులకు జీతాలిస్తున్నది దేనికంట? ఆనంద్‌గారూ దయుంచి... ఎంతో దయుంచి...?

ఎలాగో ఆ పెద్దమనిషి ఆనంద్‌నుంచి ఏదో అటూ ఇటూ కాని ధ్వనిని మాత్రం రాబట్టుకోగలిగాడు. దానికి రకరకాల అర్థాలు చెప్పుకోవచ్చు. కచ్చితమైన హామీ ఏదీ ఇవ్వనప్పుడు ఆ ధ్వనిని అంగీకారంగా కూడా తీసుకోవచ్చు. ఎట్టకేలకు ఆ మనిషి, తుపానుకు తరువాత రూపొందే ఒకవిధమైన నిశ్చలస్థితిలోకి ఆ గదిని తోసేసి వెళ్ళి పోయాడు.

కొన్నిక్షణాల తర్వాత, అంతవరకూ గదిలో ఓ మూల నిశ్శబ్దంగా కూర్చున్న ఎరుపుముఖంమనిషి హఠాత్తుగా ప్రాణంవచ్చినట్టు ఉపదేశధోరణిలో గట్టిగా మాట్లాడడం ప్రారంభించాడు. ప్రభుత్వ యంత్రాంగంలో మంత్రులు అసమర్థులుగా మారి పోయినట్టు అతని తాజావాదం. వాళ్ళు అన్నీ ఆషామాషీగా తీసుకుంటారు. పైగా భయస్థులు, ఎంతసేపూ రాజకీయవివాదాల్లో మునిగితేలుతూ ఉంటారు. తమ నిర్ణయంకోసం వచ్చే కేసుల్ని శ్రద్ధగా పరిశీలించే తీరికవాళ్ళ కుండదు. అధి కార్లెంత రాస్తే అంత. దానికింది మంత్రిగారు గుడ్డి సంతకం చేసేస్తాడు. అందుకనే ఇప్పుడు అధికారుల పట్టు బాగా బిగుసుకుపోయింది, ఇది ప్రజాస్వామ్యాని కెంత మాత్రం మంచిదికాదు... అంతకు కొద్దిక్షణాలక్రితమే మరో పెద్దమనిషి స్థాపించిన ఓ సూత్రాన్ని ఈయన ఖండించుకుంటూ ఇలా మరో భేషైన సూత్రాన్ని ప్రతిపాదించిన తర్వాత అసలువిషయాని కొచ్చాడు. అవినీతిపరులైన అధికారులు తన కేసును పూర్తిగా వక్రీకరించి పరమ అధ్వాన్నం చేసేశారట. 'తనకు వ్యతిరేకంగా ఉద్దేశపూర్వకంగా రాసిన' తీవ్రవ్యాఖ్యలతో ఫైలు ఆనంద్ టేబిలుమీదకి వచ్చిందట. కేసుకీ, తన పట్ల జరిగిన అన్యాయానికీ మధ్య ఇప్పుడు మంత్రిగారు ఒక్కరే ఉన్నారు. 'ఆ అన్యాయం

వల్ల తన జీవితమే పూర్తిగా నాశనమైపోతుం'దని అతడు వాపోయాడు. 'నాకు తెలుసుసార్. ఈ కేసు మరోమంత్రి దగ్గరకు వెళ్ళకుండా మీ దగ్గర కొచ్చినందుకు నేనెంతో అదృష్టవంతుణ్ణి. చీఫ్ ఇంజనీర్‌తో సహా అధికారులందరి అభిప్రాయాల్ని కొట్టిపారేసి న్యాయం జరిగేలా చూడగల సాహసమూ, సామర్థ్యమూ మీకే ఉన్నాయని నాకు తెలుసు. ఆ విషయంలో నాకేమాత్రం సందేహంలేదు...' అన్నాడతను. ఇంతలో ప్రైవేట్ సెక్రటరీనుంచి బజ్ మోగింది. చీఫ్‌మినిష్టర్ చౌదరి లైన్‌లోకి వచ్చాడు. 'చూడు. ఆ తెగుల్ని నీదగ్గరకు మళ్ళీ పంపిస్తున్నాను, దారిలో ఉన్నాడు...' చెప్పాడాయన.

'ఏ తెగులు?, 'ఆనంద్ అడిగాడు. 'ఇక్కడ తెగుళ్ళు చాలా ఉన్నాయే?...'

'నువ్వన్నదీ నిజమే. అటువంటి వాళ్ళు చాలామందే ఉన్నారు.' చౌదరి ఏకీభవించాడు. 'ఇతగాడో స్పెషల్ వి.ఐ.పి లే. తనే నన్ను ముఖ్యమంత్రిని చేశానంటుంటాడు. అతణ్ణెలా సరిచేయాలో నాకర్థం కావడంలేదు. గో టు హెల్ అనీ చెప్పలేక తరిమేశాను!'

'గో టు హెల్ అంటే నా దగ్గరకు వెళ్ళమనా?' ఆనంద్ ప్రశ్నించాడు కళ్ళను క్షణకాలం మెరిపిస్తూ.

చౌదరి హాయిగా నవ్వేశాడు. 'బాగా అర్థం చెప్పావులే! సరే, అతగాడు నీకు తెలిసే ఉండాలి, అవునా?'

'ఆయననెరుగని వారెవరున్నారు? ఇంతకీ అతడేం కావాలంటాడు!'

'ఏమో. నాకు కొంచెం కూడా అర్థం కాలేదు. ఎప్పుడూ అర్థంకాని ధోరణిలో అలా మాట్లాడేస్తూ ఉంటాడు. నువ్వతణ్ణి తెలివిగా హేండిల్ చేయగలవనుకుంటాను...'

'చేయగలవనే అనుకుంటున్నాను. అదిగో, అప్పుడే వచ్చేశాడు...' అన్నాడు ఆనంద్.

అనుకున్నట్టే తలుపు దఢాలున తెరచుకుంది. తనకుతానే ఉద్ధతిని ప్రదర్శించుకుంటూ స్పెషల్ వి.ఐ.పి.గారు ఠీవీగా నడుచుకుంటూ లోపలి కొచ్చేశాడు. చాలా నీట్‌గా డ్రెస్ చేసుకున్నాడు. ఒక్క వెంట్రుకముక్క కూడా ఉండకూడనిచోట లేదు. అయితే ఎదుటివారికి చీదరపుట్టించే అతగాడి ఒకే ఒక అలవాటు-పెద్దపెద్ద పరిమాణంలో నశ్యాన్ని మాటిమాటికీ తన ముక్కుపుటాల్లోకి కుక్కుకుంటూ ఉండడం, ఆ తర్వాత మంద్రస్థాయిలో వినిపించే ఉరుముల్ని తలపింపజేస్తూ ముక్కుచీదుతూ ఉండడం, వికారం పుట్టించేలా నశ్యం మరకలున్న కర్చీఫ్‌ను నలుగురి ముందూ ప్రదర్శించడం. ఆ గుడ్డముక్కతో అతగాడు ముక్కుతుడుచుకున్నప్పుడు ముక్కులోని నశ్యం దాని కంటుతోందా, లేక దాని కంటుకొని ఉన్న నశ్యం ముక్కు కంటుతోందా, తేల్చి చెప్పడం కష్టంగా ఉండేది.

'ఓహో, మంత్రిగారా!' రెండుసార్లు నశ్యం చొప్పించుకున్న తర్వాత దొరికిన విరామంలో అతడు ప్రారంభించాడు. 'మిమ్మల్ని చూసినందుకు చాలా సంతోషం. ఎలా ఉన్నారు? మంచిది, నా విషయమా? ఏదో అలా నడుపుకొస్తున్నాను. చాలా అలిసిపోయానండీ, నిజం. కాస్త విశ్రాంతి

కోసం ఏదైనా హిల్‌స్టేషన్‌కి వెడితే బాగుంటుందనుకుంటూ ఉంటాను. కానీ ఏం చేయను చెప్పండి? ఆ పి.ఎం. ఒక్కరోజు కూడా నన్నొదిలి పెట్టడు. ఎప్పుడూ ఏదో ఒకటొచ్చి మీద పడుతూ ఉంటుంది. ఓసారి ఆయనన్నక్కడ కూర్చోబెట్టిం తర్వాత ముఖ్యమంత్రిని అలా వదిలేసి వెళ్ళలేను చూశారూ. మొత్తంమీద నాకు కుక్కచావొచ్చిపడింది'.

'అవునవును, చాలా శ్రమతో కూడిన పని' ఎలాగో సాహసం కూడ దీసుకుని అన్నాడు ఆనంద్.

'అదెంత శ్రమో మీకు తెలియదండీ' అన్నాడు ఆ స్వ.ని.ప్ర (స్వయం నియమిత ప్రముఖుడు) 'ముఖ్యమంత్రి నాకష్టసుఖాలు పట్టించుకోడు. తన సమస్యలన్నీ నా ఒక్కడి నెత్తిమీదే పారేసి తను టూర్లకు వెళ్ళిపోతూ ఉంటాడు, మెళ్ళో దండలు వేయించుకోడానికి. నేనిటు ఢిల్లీకి పరుగెత్తి ఆయన తరఫున ప్రధాన మంత్రికి విన్నపాలు చేసుకుంటూ ఉండాలి. ముఖ్యమంత్రి రక్తంతాగడానికి అక్కడ కొందరు పెద్దపులుల్లాంటి ఎం.పి.లు కాచుకుని ఉన్నారన్న విషయం మీకు తెలియందికాదు. మళ్ళీ ఇక్కడికి పరుగెత్తుకొచ్చి వచ్చే ఎన్నికలకు డబ్బు సంచులు సిద్ధం చేయాలి... ఓరి దేవుడా! ఎన్నికలు, మళ్ళీ ఎన్నికలు, ఎప్పుడూ ఏవో ఒక ఎన్నికలే. నిజం చెప్పొద్దూ, ఎన్నికైన ప్రభుత్వం పదవీ కాలాన్ని పదిహేనేళ్ళకు ఎందుకు పెంచరో నా కర్థం కావడం లేదుసుమండీ. కళ్ళుమూసి తెరిచేలోగా నెత్తిమీదికి మరోసారి ఎన్నికలొచ్చి పడిపోతాయి. ఇదేం ప్రజాస్వామ్యమండీ? ఈ మతి మాలిన వ్యవహారం నాకు కొంచెమైనా బోధపడి చావడం లేదు...'

ముఖ్యమంత్రిని సృష్టించిన ఆ పెద్దమనిషి అలా డబ్బాలో రాళ్ళు ఆడించినట్టు, రాజకీయాలు, తత్వశాస్త్రం, విదేశాంగవిధానం, కుటుంబ నియంత్రణ, ద్రవ్యోల్బణం, సోషలిస్ట్ కార్యక్రమం... ఇదీ అదీ అని లేకుండా ఈ భూమండలంలోని సమస్త విషయాలపై ఏకబిగిన మాట్లాడేస్తున్నాడు. దేశ ప్రయోజనాల దృష్ట్యా సోషలిస్ట్ కార్యక్రమాన్ని ప్రవేశపెట్టమని భారతప్రధానికి తనే సలహా ఇచ్చాడట కూడా. ఆ గదిలో ఉన్న వారంతా బందీశ్రోతలుగా మారిపోయి నిస్సహాయంగా వింటూ ఉండిపోయారు. ఆ మాటల జడివానను తట్టుకోవడమెలాగో అర్థం కాక ఇబ్బందిగా కూర్చుండి పోయారు. ఆ మనిషిదగ్గరఉన్న నస్యమంతా చెల్లిపోయి తమ అదృష్టంకొద్దీ మాటలు ఆపేస్తాడని ఆనంద్ ఒకదశలో ఆశపడ్డాడు. కానీ చూశారూ, ఆశ్చర్యం! తన జేబులోంచి మరో పూర్తి ప్యాకెట్ తీసి ఉపన్యాసం కొనసాగించాడు. ప్రైవేట్ సెక్రటరీ హడావుడిగా వచ్చేసి, వెళ్ళవలసిన వేరే కార్యక్రమానికి ఆలస్యమైపోతోందని ఆనంద్‌కి గుర్తుచేసిన తర్వాతనే ఆ వి.ఐ.పి... తన వాగ్ధారలు సృష్టించిన భయంకరమైన ఉప్పెనలో ఇంకా అలాముసక లేస్తూనే ఉన్న ఆ గది నుంచి బయటకు నడిచాడు.

ఆ తర్వాత రకరకాల అభ్యర్థనలతో మరికొందరు- ఉన్నతస్థాయివాళ్ళు, కిందిస్థాయివాళ్ళు, ఆడవాళ్ళు, మగవాళ్ళు, అధికారులు, అనధికారులు, యువకులు, వృద్ధులు, మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు... త్వరత్వరగా వాళ్ళతో మాట్లాడి పంపించేసి ఆనంద్ తాను హాజరుకావలసిన సమావేశానికి బయలుదేరాడు. రోజంతా తాను చూసింది చాలు, ఇక సెలవు తీసుకుంటానన్నాడు సుదర్శన్. అయినా చిరకాలనేస్తం కనుక తనతో రమ్మని ఆనంద్ బలవంతపెట్టాడు. సమావేశంలో

ఎన్నో ప్రసంగాలు, ఎన్నో భాషల్లో, ఎన్నో గంటలపాటు దొర్లిపోయాయి. ఆఖరికి ఎవరు ఏం మాట్లాడారో ఎవరూ చెప్పలేరు. అయినా ప్రతివాళ్ళూ సమావేశం ఎంతో జయప్రదంగా జరిగిందన్న వాళ్ళే. తెలివితేటలు ఉట్టిపడే ప్రసంగం చేసినందుకు ప్రతిఒకరూ ఆనంద్‌ని అభినందించారు.

ఎట్టకేలకు ఇద్దరూ ఆనంద్ నివాసానికి తిరిగొచ్చారు. పూర్తిగా అలసి పోయారు. దాదాపు నిద్రావస్థలో ఉన్నారు. ఆ రోజు అంతటితో పూర్తయినందుకు హాయిగా ఊపిరి పీల్చుకున్నారు. భోజనంతర్వాత సుదర్శన్ సెలవు తీసుకుంటూ, కలవరాన్ని అణచుకోలేక ఒకేఒక ప్రశ్నవేశాడు. 'రోజంతా నువ్వు చాలా పనులు చేస్తూ తీరికలేకుండా గడిపావు. ఇదే నీదినచర్య అయినప్పుడు అసలు ఆలోచించుకొనే వ్యవధి నీ కెక్కడ దొరుకుతుంది?'

ఆనంద్ జీవంలేని నవ్వు నవ్వాడు. 'నేను ఆలోచిస్తానన్న ఆలోచన నీకెలా కలిగింది...?'

నిజమే, ఆలోచనకు సమయమేదీ? అది ఓ అంతులేని కార్యక్రమాల సుడిగుండం, ఆపైన ఎత్తులు పై ఎత్తులు– కోరుకున్న వాళ్ళకి కావలసినంత ఆనందం. చాలామంది దృష్టిలో అదికూడా మరోవృత్తి. సాంఘిక నిశ్రేణికపై ఎగబాకడానికి పుష్కలమైన అవకాశాలు అందిస్తూ, భౌతిక వస్తుదాహాన్నీ, అహాన్నీ, స్వసుఖచింతననూ స్వార్థప్రవృత్తుల్ని సంతృప్తి పరచే మరో వృత్తి, అంతే.

అయినా రాజకీయాలకు మరో ముఖంకూడా ఉంది, ఆ విషయాన్ని ఆనంద్ ఎప్పుడూ మరచి పోలేదు. ఆనంద్ పైకిరావడంచూసి, లోపల ఎటువంటి ఎత్తుగడ లేకుండానే, ఎటువంటి ప్రయోజనం ఆశించకుండానే వేలాదిమంది సంతోషించారు. వాళ్ళలో చాలామంది అతణ్ణి వ్యక్తి గతంగా ఎరగరుకూడా. అయినాసరే, ఆనంద్ మంత్రి కావడాన్ని వారందరూ కారణంలే కుండానే హర్షించారు. వెలిసిపోయి అందవిహీనంగా కనిపిస్తున్న వీధిగోడమీద ఓ కళాకారుడు అందమైన చిత్రంగీసినట్టుగా, పోషణలేక కృశించిపోయిన ఓ వీధి గాయకుడు హఠాత్తుగా గొంతెత్తి అతి మధుర శాస్త్రీయరాగాలు ఆలపించినట్టుగా ఊహించుకుని ఓ మంచిపని జరిగిందనుకున్నారు. ఆనంద్ తన చిన్నతనంనుంచి ఎరిగున్న గ్రామప్రాంతాల ప్రజలు అతనివైపు భయసంకోచాలతో చూశారు. వాళ్ళేమీ మాట్లాడలేదు, ఏం మాట్లాడాలో వాళ్ళకి తెలియదు. రివాజుగా సంతోషాన్ని, ప్రశంసనీ వ్యక్తంచేయడం వాళ్ళకింకా అలవాటుకాలేదు.

మంత్రిగా తన గ్రామాన్ని తొలిసారి సందర్శించిన రోజున, చూపు కరువైన ఓ వృద్ధురాలు మరొకరి చేయూతతో అతికష్టంమీద అడుగుతీసి అడుగువేస్తూ తనవైపు వస్తూండడం అతని కంటబడింది. వెంటనే ఆమెను గుర్తుపెట్టి ఒక్క అంగలో ఆమెను సమీపించి ఆలింగనం చేసుకుని శుష్కించిన ఆమె భుజం మీద తన తల ఆనించాడు. అతడికి స్వాగతం చెప్పడానికి అక్కడికి చేరిన అసంఖ్యాక ప్రజానీకం ఈ సన్నివేశాన్ని దిగ్భ్రమతో చూస్తూ ఉండిపోయారు. ఆ వృద్ధురాలు మీకు తెలుసా అని ఎవరో ఆనంద్‌ని ప్రశ్నించారు. గద్గదస్వరంతో అతడు సమాధానం చెప్పాడు... 'ఆమె నాకు తెలియదా? తన సొంతకొడుకుని అర్ధాకలితో మాడ్చి నాకు స్తన్యమిచ్చిన నా పెంపుడుతల్లి నాకు తెలియదా? ఆమె నాకు తెలియదా?' ఆ వృద్ధురాలు పూర్తిగా నిశ్శబ్దంగా

ఉండిపోయింది. తనంతగా ఎందుకు సంతోషపడుతున్నదో కూడా ఆమెకు తెలియదు. ఆనంద్ ముఖాన్నీ, గొంతునీ, ఛాతీనీ, చేతుల్నీ తడుముతూ ఉండి పోయింది, అంతే. ఆ క్షణంలో ఎందరికో కళ్ళు చెమ్మగిల్లాయి.

అతణ్ణి చూడగానే బాలల ముఖాల్లో అప్రయత్నంగా చిరునవ్వులు మొలకలెత్తేవి. అతడు వెళ్ళిన ప్రతిచోట బాలికలు ఆటోగ్రాఫుల కోసం మూగిపోతూ ఉండేవారు. తమ నోటుపుస్తకాలనుంచి కాగితాలు చింపో, అందుబాటులో ఉన్న మరో కాగితం గుంజుకునో అతడి ముందుంచేవారు. 'ఆనంద్ దాదా' పట్ల వాళ్ళల్లో ఎంతో ఉత్సుకత ఉరకలేస్తూ ఉండేది. ఓసారి ఓ అమ్మాయి కొంచెమైనా జంకు లేకుండా తన ముంజేతిని చాచింది. అణచుకోలేని ఆమె కోరికకు స్పందిస్తూ ఆనంద్ ఆమె ఎర్రని చర్మంమీద బాల్‌పాయింట్ పెన్నుతో సంతకం చేశాడు. ఆమె స్నేహితులు ఆపుకోలేనంతగా తెరలి తెరలి వస్తున్న నవ్వులతో మూర్ఛపోయినంత పనిచేశారు.

సొంతజిల్లాలో తన శాఖాకార్యాలయం సందర్శించడానికి వెళ్ళినప్పుడు ఒక వరసలో నిలబడి తనకు వంగి వంగి దణ్ణాలు పెట్టిన ప్యూన్లలో స్కూల్లో తనతో చదువుకున్న ఓ వ్యక్తిని ఆనంద్ గుర్తుపట్టాడు. అందరితో మాట్లాడినతర్వాత తన సహాధ్యాయి దగ్గరకు వెళ్ళాడు. అతడి కుటుంబంగురించి, పాత స్నేహితులగురించి అడిగి తెలుసుకున్నాడు. ఆ ప్యూన్ ఈ ముచ్చటను కొన్ని మాసాలపాటు గర్వంగా చెప్పుకున్నాడు.

ఓ రోజు ఉదయం ఆనంద్‌కు అతనింటి ఆవరణలో ముడతలుపడిన దేహంతో డెబ్బై ఏళ్ళకు పైబడిన ఓ వృద్ధుడు చేతికర్ర మీద వాలిపోతూ అన్యమనస్కంగా దిక్కులు పరికిస్తూ కనిపించాడు. పరుగుపరుగున వెళ్ళి ఆయనను కలుసుకున్నాడు ఆనంద్. ఆయన ఆ మర్యాదకాయన అప్రతిభుడై పోయాడు. తడబడుతూ తడబడుతూ అన్నాడు 'నన్ను గుర్తుపట్టినారన్నమాట?'

'నా చేత ఓనమాలు దిద్దించిన ప్రథమగురువును ఎలా మరచిపోతాను? లోపలికి రండి అయ్యవారూ, ఈరోజు నాకెంతో సుదినం...' ఇద్దరూ పరస్పరాలింగనంలో చాలాసేపు ఉండిపోయారు. కళ్ళు చెమ్మగిల్లాయి.

చుట్టూ తాండవించే స్వార్థప్రవృత్తికి ఇటువంటి అనుభవాలు పరిహారంగా సంతృప్తినిచ్చేవి. అయితే మంచి చేయడానికి పర్వతాన్ని కదిలించేంత ప్రయత్నం చేయవలసిఉంటుందనీ, చెడు చేయడం ఎంతో తేలికనీ ఆనంద్ గమనించాడు. అంతకంటె దారుణం, అధికారంలో ఉన్న వ్యక్తి చర్యలు బహిర్గతమయ్యే వరకూ, అవినీతి అధర్మాలు మామూలు విషయాలుగా జనం భావించడం.... బహిర్గతమైనతర్వాత వాస్తవికతను మించి వాటిని ఎన్నోరెట్లు ప్రమాణానికి పెంచేసి అదేపనిగా అల్లరి పెట్టడం... ఆరోపణలు ఎదుర్కొంటున్న వ్యక్తి సమ్మెట కింద ఈగలా నిర్దాక్షిణ్యంగా నలిగిపోవడం...

# 22

అత్యుత్సాహంతో, ఒక్కోసారి అవివేకంతో అరుణ ఆనంద్‌ను బహిరంగంగా సమర్థిస్తూరావడం వల్ల క్రమంగా అతడి ప్రతిష్ఠ దెబ్బతినసాగింది. ఆమె విరగబాటు, ఆమె చేస్తున్న ఉద్ఘాటనలు ఆనంద్ రాణింపునుంచి పుట్టుకొచ్చిన దురంహంకారంగా రాజకీయవర్గాలు అర్థం చెబుతున్నాయి. వాళ్ళ సామీప్యం దానికి వెంటనే ముడిపెట్టేశాయి. నిజానికి ఆ రెంటికీ ఎటువంటి సంబంధంలేదు. ఆమె స్వభావంలో ఉద్రేకప్రవృత్తీ, ఘర్షణ వైఖరీ ఎప్పుడూ ఉంటూనే ఉన్నాయి. ఆనంద్ అధికారస్థానానికి చేరుకున్నప్పుడు ఆమె ఎంతో సంతోషించింది. ఒకవేళ ఆనంద్ ప్రతికూల పరిస్థితులమధ్య చిక్కుకున్నా ఆమె అటువంటి మమేకభావంతోనే స్పందించి ఉండేది. రెండు సందర్భాల్లోనూ గుంభనంగా, యుక్తియుక్తంగా స్పందించగలగడం ఆమెకు చేతకాని పని. బహిరంగస్వభావులైన ఎందరో వ్యక్తుల్లానే ఆమె కూడా తనలో పురివిప్పిన అహంభావంనుంచి ప్రేరణ పొందుతూ దాని ప్రాబల్యానికి లోబడిపోతూఉంటుంది. అది అవతలి వాళ్ళకి సహజంగానే కంటగింపు కలిగిస్తుంది. పదిమందిదృష్టినీ ఆకర్షించే రాజకీయరంగంలో సంభవించే ఇంచుమించు అన్ని కీలక పరిణామాలకీ మూలం అహాల మధ్య ఘర్షణే. ఒక్కోసారి అవి అవసరమూ ప్రయోజనకరమూ కావచ్చు, కానీ తరచు సంక్షోభానికే దారితీస్తూ ఉంటాయి.

అరుణ వ్యక్తిత్వం తీవ్రరాగద్వేషభరితంగా ఆమె సహచరులకీ, ఆమెతో సంబంధాలున్న ఇతరులకీ ఎంతో దడ పుట్టిస్తూఉంటుంది. దానికితోడు పట్టువిడుపులు కొంచెమైనా లేని ఆమె ధోరణి మరింత భయపెడుతూఉంటుంది. ఆమె ప్రేమలానే ఆమె ద్వేషం కూడా పరిమితులుదాటి అంతేగుడ్డిగానూ అంతే దహించేదిగానూ ఉంటుంది.

బాల్యంనుంచి ఆమె ఇదేవరస. ఆరోజుల్లో అనేకులు తమతమ కుటుంబాల్లో ప్రప్రథమంగా ఉన్నతవిద్యనభ్యసించారు; కాని ఏఉద్దేశానికో నిర్ణయించుకోలేదు. వారిలానే అరుణకూడా అభ్యసించింది. వాళ్ళ యోగ్యతలు ఉపదేశకులనుంచి పోస్టుమాస్టర్లవరకు అన్నిటికీ పనికివస్తాయి, దేనికీ పనికిరావు. ఆ విద్యాభ్యాస కారణంగా తాము విధిలేక చిక్కుకొని ఉన్న పురాతన భూస్వామ్య వాతావరణంతో వారొక అపరిచితస్థితిని అనుభవిస్తున్నారు. పరిణామంగా చీటికీమాటికీ నిజంగానో ఊహాజనితంగానో తమకేదో అవమానం జరుగుతున్నట్లు వారికి తీవ్రంగా తోస్తుండేది. అరుణ అసలే ఉద్రిక్తస్వభావురాలవడం వల్ల ఆమె విషయంలో సమస్య మరీ విషమిస్తుండేది.

అరుణ బాల్యంలోనే తండ్రి చని పోయాడు. కడగొట్టుసంతానంకనుక ఇంట్లో అందరూ ఆమెను గారాబంగా చూశారు. అలాగే ఆమె మీద పెత్తనమూ చలాయించారు. సోదరులందరూ ఆమెను ముద్దుచేస్తూనే కట్టడిలో పెట్టడానికి చేయగలిగిందంతా చేస్తూవచ్చారు. అక్కలు ఆమెనెంతో మురిపెంగా చూసుకునేవారు, అయితే లెక్కలేనన్ని నిషేధాలతో నీతిబోధలతో ఆమె బతుకును కష్టాలకొలిమిగా మార్చేశారు. ఆమె సొంత ఆలోచనేమిటో, ఆకాంక్ష ఏమిటో తెలుసుకునే ప్రయత్నమెవరూ చేయలేదు. దీనికితోడు వంశప్రతిష్ఠ అనే భూతం ఆమెను నీడలా వెంటాడుతూ వచ్చింది– కుటుంబ ప్రతిష్ఠను ఉద్ధరించవలసిన బాధ్యత తన ఒక్కతెమీదే ఉన్నట్టు.

ఫలితంగా ఆమె రకరకాల మానసికధోరణుల విలక్షణసమ్మేళనంగా తయారైంది. ఆమెలో మంచితనం, ఔదార్యం, ప్రేమ అన్నీ ఉన్నాయి. అలాగే విపరీతమైన మొండితనమూ ఉంది. కుటుంబ సభ్యులు తనమీద రుద్దే విధినిషేధాలపరంపరను ప్రతిఘటిస్తూ ఆమె మరింత మొండిగా మారింది. ఆమె తల్లికి ఇంట్లో ఏవిధమైన గుర్తింపూలేదు. ఆమె ఒకింత అవ్యక్తురాలు. అది నిజమైనా కాకపోయినా, భూస్వామ్యకుటుంబాల్లోని ఎందరో ఆడవాళ్ళను పరిగణించినట్టే ఆమెనూ అలా పరిగణించేవారు. ఆ నిర్లక్ష్యానికి కారణం బహుశా ఒకటే. వాళ్ళతో ప్రమేయం ఉన్న సందర్భాల్లో తప్పించి ఇతర సందర్భాల్లో వాళ్ళు మనుషులుగా కనబడరు. అటువంటి యాంత్రికవాతావరణంలో స్త్రీ ఒక్కమ్మడి విజృంభించి కుటుంబం మీద, ముఖ్యంగా భర్తమీద పెత్తనమైనా చలాయిస్తుంది, లేదా తనకు తానే అనామకత్వాన్ని స్వీకరించి తెరవెనక్కి తప్పుకుని జీవితం పూజాగదిలోనో తీర్థయాత్రలోనో గడిపేస్తుంది. ఆమెకు మూడో మార్గం లేదు.

అరుణ తన దుస్థితిని ముందుగానే అర్థం చేసుకుని తిరగబడింది. మొదట, చదువుతో మొదలైన ఆ తిరుగుబాటు క్రమంగా వివాహంతోసహా అన్నింటికీ విస్తరించింది. ఊళ్ళో ఒక హైస్కూలు ఉంది. ఆమె అన్నలిద్దరు మెట్రిక్యులేషన్ తప్పారు. అందులో అసహజమైందేమీలేదు. వాళ్ళు భూస్వాములు కనుక చదువుసంధ్యల గురించి అంతగా పట్టింపులులేవు. అయితే రెండేళ్ళ తర్వాత అరుణ అదే పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలు కావడంతో ఒక్కసారిగా ఇంట్లో అలజడి చెలరేగింది. అన్నలు గట్టెక్కలేకపోయిన పరీక్షలో చెల్లెలు ఉత్తీర్ణురాలుకావడం క్షమించరాని ధిక్కారంగా అందరికీ కనిపించింది. ఎంత పరువుజార్చే విషయం! కాదామరి? ఊళ్ళో అందరినోటా ఇదే ముచ్చట. అప్పటికే అడ్డూఅదుపూలేని పొగరుబోతుగా ఎదిగిన పెద్దన్న బలరాం 'పనికిమాలిన చదువులు' (అతడన్నమాట) కట్టిపెట్టి కొన్ని తరాలుగా తమ కుటుంబానికి సన్నిహితంగా ఉన్న కుటుంబానికి చెందిన ఓ సంపన్నయువకుణ్ణి పెళ్ళిచేసుకోమని అరుణని ఆదేశించాడు. బలరాం తనమీద ఈర్ష్యతో పెళ్ళి ప్రతిపాదన రుద్దుతున్నాడన్న నిర్ణయానికి వచ్చింది అరుణ. అందుకే అసలు పెళ్ళే చేసుకోనని ఖండితంగా చెప్పేసి కక్ష తీర్చుకుంది. దాంతో ఇల్లు అక్షరాలా ఓ కురుక్షేత్రంలా మారిపోయింది. రాత్రనక పగలనక రోజూ అరుపులూ, వాగ్యుద్ధాలూ. ఇంట్లో అందరూ ఒకరితో ఒకరు పోటీపడి కోపతాపాలుప్రదర్శిస్తూ ఉండడంతో, ఏ ఒక్కరూ నిగ్రహం పాటించే ఉద్దేశంలో లేకపోవడంతో, ఆ యుద్ధం ఎన్నో రోజులు కొనసాగింది. ఓ రోజున నిగ్రహించుకోలేని కోపంతో తిరస్కారంతో అరుణ తన రెండో అన్న ముఖాన ఉమ్మేసి, అతడే

తనను కొట్టి హింసించినట్టు గట్టిగా రాగాలు మొదలుపెట్టడం యుద్ధానికి పతాకసన్నివేశం. తాను కాలేజీలో చదవుకోడానికి ఒప్పుకోకపోతే 'చూస్తూ ఉండండి, నేను ఆత్మహత్య చేసుకుంటా'నంటూ స్పష్టంగా అల్టిమేటమ్ కూడా ఇచ్చేసింది.

ఆ మాట కుటుంబంలో అందరినీ కలవరపరచింది. ముఖాన ఉమ్మేసినందుకు కూడా ఆమెను క్షమించేశారు. ఎంతైనా ఇంట్లో కడగొట్టు పిల్ల. అరుణ నిద్రపోతున్నప్పుడు అర్థరాత్రి హడావుడిగా కుటుంబసమావేశం ఏర్పాటుచేసుకున్నారు. సమస్యను కూలంకషంగా చర్చించుకుని చివరకు అరుణ ఇష్టప్రకారమే జరగనిద్దామని నిర్ణయించుకున్నారు. ఇంట్లో తిరిగి శాంతి అడుగు పెట్టింది. వాళ్ళందరూ కోరుకున్నట్టు ఎంతో విధేయతఉట్టిపడే చిన్నారిచెల్లెలా అరుణ పెద్ద వాళ్ళ కాళ్ళకు మొక్కింది. రెండో అన్నయ్య మీద మరింత ఎక్కువ భక్తి చూపించింది. అతడుకూడా ఆమెను మనసారా ఆశీర్వదించాడు! విపరీతంగానూ అద్భుతనాటకీయంగానూ కనిపించే సయోధ్య.

అక్కలలో ఇద్దరు వితంతువులు. భర్త వైపునుంచి వచ్చిన ఆస్తులను అమ్మేసి పుట్టింట్లో స్థిరపడిపోయారు. కుటుంబం కోసం రెక్కలు-ముక్కలు చేసుకున్నారు. తమ్ముళ్ళనీ, చెల్లెళ్ళనీ పెంచి పెద్దచేశారు. ఇద్దరూ ఆ ప్రాంతంలో ప్రసిద్ధులైన ఓ గురువు గారికి భక్తులు, పవిత్ర జీవితం గడుపు తున్నవాళ్ళు. ఎందరో ఆచార్యులు, ఓ మాదిరి సాధుసంతులు ఇంచుమించు ప్రతినిత్యం ఆ ఇంటికి వచ్చివెడుతూంటారు. శరన్నవరాత్రులలో రోజంతా ఇంట్లో భజనలు మార్మోగుతూనే ఉంటాయి. ఇంట్లో అంతటా వెల్లివిరిసే ఈ ఆధ్యాత్మికవాతావరణం అరుణ నెంతో ప్రభావితం చేసింది. సుడిగాలివంటి ఆమె వ్యక్తిత్వంలో అది వేళ్లుతన్నుకుపోయింది. క్షణక్షణముల్ అన్నట్టుగా ఉండే ఆమె మానసికస్థితి కది కొంత మృదుత్వం మప్పింది. అయితే ఆధ్యాత్మికత ఆమెను తిరుగుబాటుధోరణినుంచి మళ్ళించలేకపోయింది. ఆమె అక్కగార్లనెంతో ప్రేమించేది, అన్నలను గౌరవించేది. కానీ తన జీవితానికిసంబంధించిన నిర్ణయాలు తీసుకోవలసినవచ్చినప్పుడు మాత్రం అక్షరాలా తాను కోరుకున్నట్టే చేసేది.

కొన్నేళ్ళుగా ఇటువంటి నడకకు అలవాటుపడడంవల్ల తిరుగుబాటు ఆమెకో విధమైన వ్యసనంగాకూడా మారింది. ఏదైనా కొత్త ఆలోచన తనను ఆకర్షించినప్పుడల్లా తనకేమాత్రం సంబంధంలేని విషయాల్లోకూడా జోక్యంచేసుకొని వాటిని పరిశీలించడానికి ఆ తిరుగుబాటు ధోరణి ఆమెను పురిగొల్పుతూఉండేది. ఓసారి మొత్తంవేసవి సెలవుల్ని కుటుంబంతో గడపడమన్న ఆలోచనమీద వెగటుపుట్టి ఒక సన్యాసిని ఆశ్రమంలో చేరిపోయింది. అక్కడి జీవనసరళిని ఎంత బాగా జీర్ణించుకోగలిగిందంటే, ఆమె అన్నలు, అక్కలతోసహా ప్రతి ఒకరూ ఆమెను తిరిగి లౌకిక ప్రపంచంలోకి తీసుకు రాగలమన్న ఆశకు నీళ్ళువదిలేసు కున్నారు. అయితే, జూలై మాసం అడుగుపెట్టగానే, ఆమె అసలేమీజరగనట్టు ఓ రోజు ఉదయమే కాలేజీలో ప్రత్యక్షమైంది. ఎంతో అంకితభావం కనబరచిన ఓ భక్తురాలిని తమ గుంపులో కలుపుకోగలిగామని తమను తామే అభినందించుకున్న ఆశ్రమంలోని సన్యాసినులతోసహా అందరినీ ఆమె అలా నిర్విణ్ణులను చేసేసింది.

అన్నగారు చూపించిన వ్యక్తిని పెళ్ళిచేసుకోడానికి తిరస్కరించింది కానీ, అరుణ పెళ్ళికి విముఖురాలు కాదు. మరో యువకుడు తారాసపడినప్పుడు అతణ్ణి పెళ్ళాడడానికి వెంటనే అంగీకరించింది. అతడు పూర్తిగా అపరిచితుడు. అతడితో ఆమె మాట్లాడింది కొద్దిక్షణాలే. అతడిచ్చిన ఒకటిరెండు చమత్కారపూరితమైన జవాబులువిని అతడు తెలివైనవాడనీ, ఇష్టపడతగినవాడనీ నిర్ధారణకొచ్చేసింది. తీరా వివాహం జరిగిపోయిన తర్వాత అతడు తన హృదయాన్నీ, బుద్ధినీ కూడా ఉత్తేజింపచేయలేడని ఆమెకు తెలిసిపోయింది. తాను మోస పోయినట్టు, సర్వస్వం కోల్పోయినట్టు ఆమెకర్థమైంది. అయితే ఆమెలో బలంగా వేళ్ళూనుకున్న అహంభావం నిరాశాభావాన్ని నిరోధించి వివాహబంధంలో కొనసాగేలా చేసింది.

కొన్నాళ్ళు ఆశ్రమ జీవితం, మరికొన్నాళ్ళు సాంఘికసేవాసంస్థల సహవాసం, దీర్ఘకాలం పాటు నిరాశా, నిస్పృహలతో కుంగిపోతూ ఉండడం– ఈ పరిస్థితుల్లో మొత్తానికి అరుణ కాపురం అస్తవ్యస్తంగా మారిపోయింది. భర్త అధికారికవిధులమీద ఎక్కువకాలం పర్యటనలో ఉండవలసి వచ్చినప్పుడు అతడితోపాటువెళ్ళి అప్పుడప్పుడు కాస్త ఎక్కువరోజులపాటు భార్యావిధుల్ని నిర్వర్తిస్తూ వచ్చేది. ఆమె పాకశాస్త్ర ప్రయోగాలలో తయారుచేసిన రకరకాల వంట పదార్థాలను అతడు నిర్బంధంగా మింగవలసివచ్చేది. అందులో కొన్నిచాలాబాగుండేవికానీ, కొన్ని దారుణంగా ఉండేవి. వీటన్నింటినీమించి, హఠాత్తుగా ఆమె నేదైనా ఆధ్యాత్మిక తపన ఆవహించినప్పుడు 'నిరాహార' దినాలు కూడా ఎదురౌతూ ఉండేవి. ఓ గదిలోచేరి తలుపులు బిగించుకుని ధ్యానంలో మునిగిపోయేది. సాధారణంగా రోజంతా ఆమె ఆ స్థితిలోనే ఉండిపోయేది. ఆమెనలా ధ్యానావేశం ముంచెత్తిననాడు, అతడెవరైనా అతిథుల్ని భోజనానికి పిలవడం జరిగితే మాత్రం పరిస్థితి మరింత చిక్కుల్లోపడేది. అతడోవైపున సిగ్గుతో చితికిపోతుంటే అతిథులు తమ సంకోచాలన్నీ అవతలపెట్టి ఏ వస్తువెక్కడుందో తమకు బొత్తిగా తెలియని వంటగదిలోచేరి కొన్నిగంటలపాటు సర్వతంత్రస్వతంత్రంగా సహకారపాకంలో మునిగితేలుతూ ఆనందిస్తూండేవారు.

భర్త పూర్తిగా నిస్సహాయుడు. భార్యను ఎప్పుడూ కోప్పడి ఎరుగడు. అంత చదువుకున్న, అంతపైకెదిగిన భార్య ప్రవర్తనెలా తప్పుపడతాడు? ప్రపంచవిషయాల్లో ఆమె పరిజ్ఞానాన్ని ఆయనెన్నటికీ అందుకోలేడు. ఇంక్రిమెంట్లపై, ప్రమోషన్లపై యావ, పై అధికారుల చల్లనిచూపు తనమీద పడాలని కోరుకోవడం–ఇదే అతడికి తెలిసిన ప్రపంచం. త్వరలోనే అతనిలో న్యూనతాభావం పెరిగి పోయింది. అరుణ విషయానికొస్తే, వివాహమైన మరుక్షణంనుంచే తను భర్తకంటె అధికురాలినని భావించటం ప్రారంభించింది. ఆమె రాజకీయరంగంలోకి ప్రవేశించిన తర్వాత భర్త హాయిగా ఊపిరిపీల్చుకున్నాడు. పదేళ్ళుగా తెరిపిలేకుండా బిగుసుపాటుకులోనైన అతని నాడీమండలం పరిపూర్ణ స్వేచ్ఛ లభించినందుకు ఆనందించింది.

ప్రధానంగా ప్రేమను ఇవ్వడానికీ, స్వీకరించడానికే పుట్టిన జీవి అరుణ. విపరీతమైన ఇంద్రియ మగ్నత, ఆ పైన స్వతంత్రవృత్తి. తనతో సమరపంకాలేని మనిషితో తానేకోరి తగిలించుకున్న వివాహబంధం ఆమె ఉద్రేకస్వభావాన్ని బంధించేగొలుసుగా పరిణమించింది. అప్పటికీ తన

పెళ్ళి ఒక తప్పుడునిర్ణయమని ఒప్పుకోడానికి ఆమె సిద్ధంగా లేదు. నిజానికి తన తప్పుల్ని ఆమె ఏనాడూ ఒప్పుకోలేదు. తా నెప్పుడేది చేసినా సక్రమమే. అవతలివాళ్ళు చేసిన వన్నీ తప్పులే. అటువంటి భ్రమలతో, వాదనలతో సరిపెట్టుకోలేని సందర్భాలు ఎదురైనప్పుడు ఆమె తన తర్కానికి కేంద్రబిందువుగా తన ఆధ్యాత్మికవిశ్వాసాలను బాహాటంగా ఉదహరించేది. అన్ని సమర్థింపులూ విఫలమై, తాను పొరపాటుచేసినట్టు ఒప్పుకోవలసివచ్చినప్పుడు, లేదా వాదంలో తాను వీగిపోయినప్పుడు తాను దేనినీ లక్ష్యపెట్టనని అలవోకగా అనేసి ఊరుకొనేది.

అయితే అది నిజంకాదు; తను ఇతరుల అభిప్రాయలను లెక్కచేయనని మొండిగా ప్రకటించినా, వాటిని తనెంతగానో పట్టించుకుంటున్నట్టు ఆమె గ్రహించేది. మొత్తంమీద రాజకీయజీవితంలో ఆమె ముందుకువెడుతున్నకొద్దీ గతంలో ఆమె చేసిన పొరపాట్లు ఇంకా ఇంకా పొడవైన నీడల్లా ఆమెను వెన్నాడుతున్నాయి.

అయితే ఎంతోకాలం అదుపులో ఉండలేనంతగా విజృంభించే ఉద్రేక స్వభావం ఆమెది. ఆమె అడుగుపెట్టిన సరికొత్తస్వేచ్ఛాపూరితవాతావరణంలో, తన విఫల వివాహం ఆమెను కొందరు పురుషులతో విచక్షణారహితంగా నడిపించింది. అయితే ఎండమావుల్లా ఎప్పటికీ దూరంగా నడిచిపోయే ప్రేమ అనే పదార్థంకోసం ఆమె పడే ఆరాటాన్ని స్వప్రయోజనాలకు వాడుకోడానికే వాళ్ళందరూ ప్రయత్నించారు. ప్రతిసారీ అది శాశ్వతమని భ్రమించి తనను వంచించడానికి ఇతరులకు ఆమె చేజేతులా అవకాశమిచ్చింది. ఆ మగజలగలు ఆమెతో విసిగిపోయినప్పుడు, లేదా విసిగిపోయామని అనుకున్నప్పుడు సహజంగానే ఆమె భ్రమలు చెదిరిపోయి ఆమె కుంగిపోయింది. ఆమెమీద వాళ్ళకున్నది పూర్తిగా కాముకదృష్టి తప్ప మరొకటికాదు. తాము మరో ఆడదానివైపు కన్నెత్తి చూస్తే సహించలేని తమ భార్యలు ఈ విహారాల్ని ఎక్కడ పసిగడతారోనని వాళ్ళు భయపడ్డారు. ఓ ప్రసిద్ధ రాజకీయనాయకుడు కొంతకాలం ఆమె మీద మోజుపడ్డాడు. అందుకామె ఉత్కటంగా స్పందించగానే అర్థంతరంగా అతడు వెనకడుగువేశాడు. 'మైగాడ్! నీవింత పిచ్చి పుట్టిస్తావనినే ననుకోలేదు. ఈ లెక్కన నా రాజకీయజీవితం ఏమైపోవాలి?' అన్నాడు. హృదయంలేని పురుషుని అతిక్రూరమైన ప్రతిస్పందన ఇది. దారుణంగా కుంగదీసే ఇటువంటి అనుభవాల నెదుర్కొన్నమీదట అరుణలో మగజాతిమీదనే అసహ్యం పెరిగిపోయింది.

రాష్ట్రంలో నిన్నమొన్నటివరకూ పరదాపద్ధతి కచ్చితంగా అమలుజరుగుతూ ఉండేది. తరతరాలుగాఉంటున్న ఆ వాతావరణంనుంచి ఒక్క సారిగా వ్యక్తిగతస్వేచ్ఛావాతా వరణంలోకి అడుగుపెట్టేసరికి ఆ స్వేచ్ఛ బట్టబయలుగా లైంగిక స్వేచ్ఛగా కనిపించసాగింది. ఒక ఆడ మగ కలసి కనిపిస్తేచాలు, వాళ్ళు ఏ ఆడ ఏ మగ అయినాసరే, వాళ్ళ మధ్య శారీరకసంబంధాన్ని సూచించే ములుకుల్లాంటి వ్యాఖ్యలు చాలామంది చేస్తూ ఉంటారు. అటువంటి నిషిద్ధ విషయాలను స్పృశించడంద్వారా సాంఘిక నిషేధాలను తామే ఉల్లంఘిస్తున్నామన్న అర్ధచేతనావస్థలో ఒక విధమైన తెగింపుతో విషపూరితమైననోళ్ళు ప్రయత్నిస్తూ ఉంటాయి. అదో పనికిమాలిన వదంతుల మోజు. బురదచల్లే ప్రవృత్తి. తీరని కోరికలవల్ల తమలో గూడుకట్టుకున్న అసంతృప్తినీ, ఆవేశాన్నీ,

ఒక్కసారిగా కుమ్మరించుకునే ప్రవృత్తి. కొందరివిషయంలో అది మరోవిధంగాఉంటుంది. తమ జీవితంలో అద్యంతం ఇష్టంలేకున్నా సమాజం నిర్దేశించిన నియమాలను విధిలేక పాటించిన వారికి, ఇతరులెవరైనా ఆ నియమాలను అతిక్రమించినట్లు కనిపించినా, బహుశా వాళ్ళకు తెలియకుండానే వారు లోలోపల అణచిపెట్టుకున్న అసంతృప్తి వ్యక్తమౌతూఉంటుంది. ఎవరైనా కట్టుబాట్లు తప్పినట్టు కనిపిస్తే వాళ్ళు మండిపడుతూ ఉంటారు.

ఉన్నతిని కలిగించేవాటితోపాటు, అధోగతికి తీసుకెళ్ళే రకరకాల అవకాశాలతోకూడిన రాజకీయ జీవితమధ్యంలో అడుగిడిన అరుణ నానాటికీ పుంజుకుంటున్న వదంతుల్ని పెడ చెవినపెట్టింది. తానున్న పరిస్థితిని అంచనావేసుకునే ప్రయత్నంచేసింది. ఆనంద్ ప్రతిఅంశాన్నీ, మహాత్మా గాంధీ 'దరిద్రనారాయణుడు'గా పేర్కొన్న మనిషి గీటురాయిమీద పరీక్షించడం ఆమె నెంతో ముగ్ధురాల్ని చేసింది. కానీ ఆమెలోని ఉద్రేకస్వభావాన్ని సంతృప్తి పరచలేకపోయింది. ఆమె ప్రతిఒకచర్యలో స్పందనలో కొట్టొచ్చినట్టు కనిపించే నిర్భీతి అవతలివాళ్ళపై దుర్భాషలతో విరుచుకు పడేస్థితికి ఆమెను తీసుకువెడుతూ ఉంటుంది. తనలో జీర్ణించుకుని తన జీవితంలో విడదీయరాని భాగంగా మారి తనను ఈ నిస్సారప్రపంచానికి అతీతంగా తీసుకువెళ్ళే దైవభక్తి ఆమెలోని ఈ నిర్భీతికి కారణం కావచ్చు.

★ ★ ★

1957లో దేశవ్యవస్థలో ప్రముఖమైన మార్పులు చోటుచేసుకున్నాయి. రాష్ట్రాల పునర్విభజన దేశం రూపురేఖల్ని పూర్తిగా మార్చి వేసింది. 1957 శాసనసభఎన్నికలు అరుణ తన అదృష్టాన్ని పరీక్షించుకునే అవకాశం కలిగించాయి. ఎంపికసంఘంలో సభ్యుడైన రాఘవ్‌తో గొడవపడిన తర్వాత ఛోటానాయకుల తరహా బాగా తెలిసొచ్చి మళ్ళీ అటువంటి వాళ్ళను సమీపించడానికి ఆమెకు అహం అడ్డొచ్చింది. ఆమెలో తగిన రాజకీయచాతుర్యం లేదు కనుక, ఆత్మగౌరవాన్ని తాకట్టుపెట్టేందుకు సుముఖంగా లేదు కనుక రాజకీయాలు మరచి పోయి వంటింటికి తిరిగి అంకితం కావడం మంచిదని శ్రేయోభిలాషులు సలహా ఇచ్చారు. రాజకీయాల్లో ఉన్న ఆ స్వల్పకాలంలోనే అవి ఆమె పాలిట ఎంత విధ్వంసకరంగా పరిణమించాయో చూచాయగా అర్థం చేసుకున్న సన్నిహిత స్నేహితులు ఆ రంగంలో నువ్వెప్పుడూ రాణించలేవని ఖండింతగా చెప్పేశారు. పురుషాధిపత్యంలో ఉన్న రాజకీయనరకకూపంలో నువ్వు శాశ్వతంగా ఓ ఆటబొమ్మలా మారిపోతావనీ, చివరకు చెత్తబుట్ట పాలవుతావనీ హెచ్చరించారు.

అరుణ తన జీవితంలో తొలిసారి సందిగ్ధంలోకి జారిపోయింది. రాజకీయాల్లోకి ప్రవేశించక ముందు తనదీ ఒక బతుకేనని ఆమె కెప్పుడూ అనిపించలేదు. జీవితమే ఐతే అది శవప్రాయమైనది తప్ప మరేమీ కాదనుకుంది. కేవలం ఉచ్ఛ్వాసనిశ్వాసాలతోనే చాలామంది ఎలా బతికేస్తారో అనుకుంటూ ఆమె ఆశ్చర్యపోయేది. తానన్నీ చేసింది. ఇంట్లో తిరుగుబాటుచేసింది, చదువుకుంది, పెళ్ళిచేసుకుంది. అన్నీ తన ఇష్టప్రకారమే చేసింది. కేవలం ధిక్కరించడం కోసం, తన మీద రుద్దిన ఆంక్షలన్నింటినీ ఉల్లంఘించడంకోసం చేసింది. ఎల్లవేళలా ఈ ధోరణి పనికిరాదని

ఇప్పుడామెకు తెలిసొచ్చింది. తన జీవితాన్ని ఓసారి వెనుతిరిగిచూసుకుని మొదట్లో స్వేచ్ఛకోసమే స్వేచ్ఛను, తన బాల్యానుభవాలకు విరుద్ధమైన స్వేచ్ఛను కోరుకుంది. ఎప్పుడైతే అటువంటి స్వేచ్ఛను పొందగలిగిందో, అది అర్థ రహితమైన తిరుగుబాటుప్రవృత్తిగా పరిణమించి తన ఇప్పటి వ్యవహారసరళివైపు నడిపించింది. అయితే పునరాలోచనలోపడినమీదట అది అర్థరహితమైనదన్న ఆలోచనను త్రోసిపుచ్చింది. తనదైన అయోమయమార్గంలో ఆమె దేనికోసమో వెదుకులాడుతోంది. ఇంతకీ దేనికోసం?... ఇంకేముంది, స్వేచ్ఛకోసం. స్వేచ్ఛ దాని కది గొప్ప లక్షణమే. కాని తర్కబద్ధం, బాధ్యతాయుతం కాకుండా, చుక్కానిలేకుండా స్వేచ్ఛ ఉండదు. రాజకీయజీవితంలో చుక్కాని మరీమరీ ముఖ్యం. ప్రతిదీ దానిమీదనే ఆధార పడిఉంటుంది. ఈ గ్రహింపుతో ఆమెపై పిడుగుపడినట్టయింది.

రాఘవ్‌తో ఆ నీచమైన అనుభవం తర్వాత అరుణ ఇక అక్కడితో ఊరుకుందామనినిశ్చయించింది. ఆమె ఆత్మసన్మానభావం దాదాపు నీరుగారిపోయింది. అయితే, భౌతికంగా మానసికంగా ఒక విధమైన ఉదాసీనస్థితికి సిద్ధపడుతున్నక్షణంలోనే ఆమెలో మరో తిరుగుబాటు తుపాను సుడులు తిరగడం ప్రారంభించింది. రాజకీయాలలో బతికిబట్టగట్టడంకోసం ఒక ఆడది తనను తానెందుకు దిగజార్చుకోవాలి? ఇటువంటిపరిస్థితిని ఎదుర్కోకుండానే రాజకీయాల్లో రాణిస్తున్న ఆడవాళ్ళులేరా? అటువంటప్పుడు తనొక్కతే ఎందుకు ఇలా...? తన చర్యలకూ, తన దురదృష్టానికీ, కనీసం అందులో ఎక్కువ భాగానికి కొంతమేరకైనా తనే బాధ్యురాలినన్న ఊహ ఆమెకు మెరుపులా స్ఫురించింది. కనుక తాను తిరగడబడడంలో ఎటువంటి తప్పూ లేదు. జరిగిందేమంటే ఒక దశలో పొరపాటున దారితప్పి ప్రమాదపూరితమైన వ్యసనపరమైన అవమానకరమైన మార్గాల వెంబడి ఎటెటో పరిభ్రమించింది.

ఆమె ఎంతటి విపరీతప్రవర్తనకు అలవాటుపడినా, సంఘసేవకు అంకితమైన మనిషిగా మాత్రం మంచి పేరుతెచ్చుకుంది. ఆమెను తమతో శారీరకసంబంధంవైపు ఆకర్షించడానికి ప్రయత్నించి, నెరవేరక ఆమె తిరస్కారధోరణికీ ఆగ్రహోజ్వాలకూ గురైన వాళ్ళు ఆమె 'శీలం' గురించి విపరీతంగా అతిశయోక్తులు రంగరించి దుష్ప్రచారం సాగిస్తున్నప్పటికీ (ఆడవాళ్ళకు సంబంధించినంత వరకూ 'శీలం' అనగానే అది అనివార్యంగా లైంగికప్రవర్తనకు సంబంధించినదనే ప్రచలితాభిప్రాయం) పేద ప్రజానీకంమాత్రం ఆమెను ఆరాధించడం ప్రారంభించారు. పరిణామతః 1957లో బుద్ధిపూర్వకంగానే ఆమె ఎన్నికల సుడిలోకి అడుగుపెట్టింది. శాసనసభ్యత్వం ఆశించింది. ఎవరైనా కాముకుడి విషపుచూపు తనమీద ప్రసరిస్తే వాడి పళ్ళురాలగొట్టాలనికూడా నిశ్చయించుకుంది. 'భగవంతుడా, నన్ను ఆదుకో' అని ప్రార్థించుకుని అధికారపక్షం టిక్కెట్టు కోసం తిరిగి ప్రయత్నాలు ప్రారంభించింది. రాఘవ్‌నుంచి ఎదురైన దౌష్ట్యపు సవాలుతో ఆమె సంకల్పం మరింత రాటుదేలింది.

అప్పుడే, పార్టీ అభ్యర్థుల జాబితాను ఖరారు చేయడంకోసం అధిష్ఠానవర్గం ప్రతినిధిగా లాల్‌బహదూర్‌శాస్త్రి రాష్ట్రసందర్శనకు వచ్చారు. రాజకీయపరిశోధకులు శాస్త్రీజీని ఎలా సమీపించాలా

అని అదేపనిగా తర్కించుకుంటూ, ఆయన మిత్రులు, మిత్రుల మిత్రులు, ఆ మిత్రుల మిత్రుల మిత్రులు.. ఆ గొలుసుకట్టుక్రమంలో చివరగా తమంత తాముగా వెళ్ళి మాట్లాడగలిగినవారిని వెతికి పట్టుకునే ప్రయత్నంలో పరిశోధన సాగించి జాబితా సిద్ధంచేసుకుంటున్నారు. అరుణమాత్రం లాల్‌బహదూర్‌జీని నేరుగా కలవాలనుకుని ఇంటర్వ్యూ కోరింది. విచిత్రంగా, అదెంతో సునాయాసంగా లభించింది. ఆమె పత్రాలను పరిశీలించిన లాల్‌బహదూర్ విచిత్రంగా ఆమెను ఆధ్యాత్మికవిషయాల గురించి కొన్ని ప్రశ్నలడిగారు. మిగిలినవన్నీ అంతే తేలిగ్గా జరిగిపోయాయి. 'ఆమె అర్హతలు నేనుచాలా మెచ్చుకున్నాను' అన్నారు లాల్‌బహదూర్. అంతటితో రాష్ట్ర నాయకత్వంకూడా వెంటనే ఆమోదించింది. అయితే 1952 ఎన్నికల్లో పార్టీ డిపాజిట్ కూడా కోల్పోయిన ఓ గడ్డు నియోజకవర్గాన్ని ఆమెకు కేటాయించింది. 'నా పడకగదిలోంచి ఆమె నడవనప్పుడు, ఎన్నికల్లో కూడా ముందుకు సాగలేదు!' అని ప్రకటించాడు రాఘవ్ తన స్వభావసిద్ధమైన దుష్టబుద్ధిని ప్రదర్శిస్తూ.

అయినా సరే, బొటాబొటీమెజారిటీతోనే కావచ్చు, ఆమె ఎన్నికలో నెగ్గింది. మూడేళ్ళ పాటు రాష్ట్రరాజకీయరంగస్థలిపై తన ఉనికిని ఎంతో శక్తిమంతంగా చాటుకోగలిగింది. తన పార్టీలోని మగవాళ్ళకు, ప్రత్యర్థు లను, విమర్శకులను లక్ష్యపెట్టకుండా నిర్భయంగా వ్యవహరించింది. ఒక వైపున జనంపట్ల సానుభూతినిప్రదర్శిస్తూనే మరో వైపున కుంగదీసేంత విశృంఖలంగా నడుచుకుంది. ప్రత్యర్థులలో ముఖాముఖి తల పడింది. కేవలం తాను ఆడది కావడం అలుసుగా తీసుకుని ఎవరైనా తనను లోకువచేస్తే సహించకూడదని నిర్ణయించుకుంది. ఆ రోజురాత్రి సినిమాహాలు బాల్కనీ మసకచీకట్లో తనతో చేతుల కలయికద్వారా ఆనంద్‌ను తనకొక సందేశమందించనిచ్చిన క్షణంవరకు ఆమె తన వ్యతిరేకులను ఒంటరిగానే ఢీకొంది. వారిద్దరూ ఆ భావానుబంధంలోకి అడుగు పెట్టడానికి అమాయకత్వం ఒక కారణమైతే, దేనినో అన్వేషించాలన్న తపన మరొకకారణం. ఆ ఉద్వేగభరితమైన స్పర్శతో ఆమె భేషజం హఠాత్తుగా, మళ్ళీ కోలుకోలేనంతగా కుప్పకూలి పోయింది. దారీతెన్నూలేకుండా ఆందోళనభరితంగా అనేక సంవత్సరాలపాటు పట్టుజారిపోయే ఇసుకనేలమీద నడిచి నడిచి అలిసిపోయిన ఆమెకు ఆ క్షణంలో హఠాత్తుగా తన పాదాలు దృఢమైన నేలమీద నిలచిన అనుభూతి ముంచెత్తింది. ఉద్రేకం, ఉత్తేజం, పట్టుదల మూర్తీభవించిన ఆమె వెరపూ విచారమూ కొంచెమైనా లేకుండా అతనిలో భాగంగా కలిసి పోయింది.

ఆనంద్ రాజకీయతారాపథంవైపు దూసుకువెడుతుంటే, బహుశా అతనికంటే ఎక్కువగా తానే ఉత్తేజపడింది. అతడి పక్షాన గట్టిగా పోరాడే యోధురాలిగా మారింది. అతని భావాలను చక్కగా విడమరచిచెప్పే ప్రచార కర్తగా మారింది. ఇది అనివార్యంగా అన్నిరకాల దుష్ప్రచారాలకూ అవకాశమిచ్చింది. రాజకీయ రంగంలో ఒకరు మరొకరిపట్ల చూపించే అభిమానం వెనుక, ప్రకటించే మద్దతు వెనుక ఎటువంటి ప్రయోజనాపేక్ష లేదంటే ఎవరూ ఒప్పుకోరు. మగవాడైతే అమ్ముడుపోయా డంటారు; ఆడదైతే శారీరక సంబంధం అంటగడతారు. రెండుసందర్భాల్లోనూ జరిగేది ఆ వ్యక్తి విశ్వసనీయతను కోల్పోవడం. 'ఎప్పుడూ ఆమె అతణ్ణి ఆకాశానికెత్తుతూ

ఎందుకు మాట్లాడుతుంది? ఎవరోఒకరిని ఏదో ఒకరకంగా తెగడడానికితప్ప ఒక మంచిమాట అనడానికి ఆమె నోరు తెరవగా ఎప్పుడూ చూడలేదే' అంటూ స్థానిక రాజకీయవాదులు ఆగ్రహ పూరిత వ్యాఖ్యలు చేస్తూ ఉన్నారు.

'ఆనంద్ ఉత్తముడని అందరికీ తెలుసు కానీ ఆ ఆడమనిషి అతణ్ణి అదేపనిగా పొగుడుతుంటే, అతడి మీద నీ అంచనాను నువ్వే శంకించ వలసి వస్తుంది...'

'నువ్వేం చేయగలవు తమ్ముడూ? అతని ప్రోత్సాహం లేకుండానే ఆమె అతణ్ణి అంతటా పళ్లమ్మినంత పనిచేస్తుందా?.. అంత మేధావికీ తన కేది మంచో తెలియదు. ఎక్కడ ప్రమాదముందో తెలియదనడం మరింత సబబుగా ఉంటుంది'...

'చూశావూ? వ్యామోహమూ, వివేకమూ కలిసి ఉండలేవు. ఒకటొచ్చి మీదపడితే రెండోది పారిపోతుంది....' అతడిమీద ప్రశంసలజోరు తగ్గిస్తే బాగుంటుందేమోనని ఆనంద్ శ్రేయోభిలాషులు ఆమెకు ఒకింత మృదువుగా చెప్పిచూశారు. వాళ్ళ జోక్యానికి ఆమె మండిపడి రెట్టింపు వాగ్ధాటితో మాట్లాడడం ప్రారంభించింది. ఆనంద్ తన సొంతమన్న అభిప్రాయం, ఇతరులపట్ల, ముఖ్యంగా ఆడవాళ్ళ పట్ల అసహనం ఆమెలో మరింతగా పెరిగిపోయాయి. ఆమె అసహనం అనేక ఘర్షణలకు దారితీసింది. మిగిలిన ఆడవాళ్ళు కూడా అంతే తీవ్రంగా స్పందించారు. ఈ అరుణకు ఆనంద్‌మీద అన్ని అధికారాలూ గుత్తగా ఎప్పుడు రాసి చ్చారట? ఆమె అలా పెత్తనం చలాయించే అవకాశం అతగాడు ఎందుకిస్తున్నట్టు? అతడి రక్షణకు తనే దిగొచ్చినట్టు, అతడికి మంచిచెడులు బోధించే అర్హత తనకే ఉన్నట్టూ ఆమె ఎందుకు ప్రవర్తించాలి?'.

'మరీ విడ్డూరం' మరో మహిళ అంది, 'అతనిమీద యాజమాన్యహక్కంతా తనకే ఉన్నట్టు విరగబడిపోతోంది'.

ఆనంద్‌కి ఇవేవీ తెలియవు. కొందరు మిత్రులు హెచ్చరించినా అతడు దృష్టి పెట్టి ఆలోచించ లేదు. మంత్రిగా రకరకాల సంక్లిష్టబాధ్యతల్లో పూర్తిగా మునిగిపోయి ఉన్నాడు. ముఖ్యంగా సాంఘికపరివర్తన అనే మహాయజ్ఞంలో అంతర్భాగాలుగా తాను భావించుకున్న కార్యక్రమాల్లో పూర్తిగా కూరుకు పోయాడు. వేరే విషయాలగురించి ఆలోచించడానికతనికి తీరికలేదు. అయితే అరుణ అందుకొక మినహాయింపు. ఆమె కోసం కొంత సమయం కేటాయిస్తూనే ఉన్నాడు. కానీ అతడు తనమీద తగినంత శ్రద్ధ చూపించడంలేదన్న అసంతృప్తి త్వరలోనే ఆమెలో అంకురించింది, అందుకు కారణం తెలిసికూడా.

# 23

అఫ్రోజాబాద్ ఇంటర్‌కాంటినెంటల్ హోటల్‌లోని కాఫీషాప్‌లో ఓ మూల టేబుల్‌ముందు ముగ్గురు వ్యక్తులు సుఖంగా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. చుట్టుకొలతలో మాత్రమే ఆ ముగ్గురిలో పోలిక కనిపిస్తోంది. అలాగే గడ్డాల సంఖ్య (మొత్తంగా మూడు). ఖాళీగ్లాసులు, బెన్సన్ అండ్ హెడ్జస్ సిగరెట్ పాకెట్లు, పూర్తిగా తినగా మిగిలిన తందూరీ చికెన్ ఎముకలు, ప్లేట్లు టేబులుమీద చిందరవందరగా ఉన్నాయి. వాళ్ళలో ఒకడైన సిక్కు బిల్డర్ అజిత్‌సింగ్ ఢిల్లీనుంచి విమానంలో వచ్చాడు. నగరానికి వచ్చిన మరో వ్యక్తి సిన్హా పాట్నాకు చెందినవాడు. ఫైనాన్స్‌వ్యాపారంతోపాటు కాంట్రాక్టుపనులుకూడా చేస్తూ ఉంటాడు. పాట్నాలోనూ, ఢిల్లీలోనూ కూడా అతనికి ఆఫీసులున్నాయి. మూడోవ్యక్తి రామ్‌ప్రసాద్, ఓ దక్షిణాదిరాష్ట్రంనుంచి వచ్చిన కాంట్రాక్టర్. తనకు అఫ్రోజాబాద్‌లో చాలా కీలకమైన పరిచయాలున్నట్టు చెప్పుకుంటూఉంటాడు.

ఆ ముగ్గురు కాంట్రాక్టర్లు స్థానికంగా ఓ పెద్ద ఇరిగేషన్ ప్రాజెక్టు వ్యవహారంలో తలమునకలైఉన్నారు. రాష్ట్రప్రభుత్వంనుంచి, ఇంకోలా చెప్పాలంటే ఆ శాఖకు ఇన్‌చార్జి మంత్రిగా ఉన్న ఆనంద్‌నుంచి సవరించిన అంచనాకు ఆమోదం సాధించగలిగితే భారీమొత్తంలో లాభం చేసుకోగలుగుతారు. అయితే, వాళ్ళ విజ్ఞాపనను జాగ్రత్తగా పరిశీలించినమీదట ప్రాజెక్టుఖర్చు అంచనాను పెంచడానికి అతడు ఖండితంగా తిరస్కరించేశాడు.

మరోవిడత బ్లాక్‌లేబుల్ స్కాచ్‌కి వాళ్ళు ఆర్డర్ చేసిన తర్వాత సిన్హా నిస్తేజంగా అన్నాడు, 'నేను కాంట్రాక్టర్‌గా ఉంటున్న ఈ ముప్పైఅయిదేళ్ళలో ఇంత బుద్ధిలేని మంత్రినెక్కడా చూడలేదు. ఆ ఫూల్... ముఖ్యమంత్రి మనల్ని నాశనంచేయడానికే ఆనంద్‌కు ఇరిగేషన్‌శాఖ అప్పగించినట్టుంది. బట్టతలమీద వడగళ్ళ వానలా ఉంది మన పరిస్థితి.'

'నేనంత తేలిగ్గా విడిచిపెట్టే రకం కాదు', రామ్‌ప్రసాద్ ఒత్తిపలుకుతూ అన్నాడు. 'ఎంతైనా ఇది భారతదేశం. దేవునిమీద నాకెంతో నమ్మకముంది. ఇంతటి పుణ్యభూమిలో మన నెత్తిమీద ఓ కొరకరాని కొయ్యలాంటి మంత్రిని కూర్చోబెట్టి ఆ భగవంతుడు మనల్ని శిక్షిస్తాడంటే నేను చచ్చినా నమ్మను.'

'రామ్‌ప్రసాద్!' అజిత్‌సింగ్ కలవరస్వరంతో అన్నాడు. 'నీ కిక్కడ మంచి పరిచయాలే ఉండచ్చు. నేనిప్పటికి ఇరవైఏళ్ళుగా ఈ రాష్ట్రంలో వ్యాపారం సాగిస్తున్నాను. అయినా చెబుతావిను, ఈ గాడిదకొడుకు పేరు వింటేనే నాకు అరికాలిమంట నెత్తి కెక్కుతుంది. వీడెంత హానిచేయ గలడో నీకు కొంచెమైనా తెలిసినట్టు లేదు.'

'మై డియర్ సర్దార్, ఓ మాట చెబుతా విను' రామ్‌ప్రసాద్ నిబ్బరంగా ఆత్మవిశ్వాసం ధ్వనింపజేస్తూ అన్నాడు. 'దక్షిణాదిరాష్ట్రాల్లోని ఏ మంత్రి ఎలాంటివాడో నాకు బాగా తెలుసు. 1952 నుంచి జెండాకార్లలో ఊరేగే ప్రతి దగుల్బాజీ మంత్రినీ నే నెరుగుదును. నా కెంత అనుభవముందో మీకే తెలిసినట్టులేదు.'

'నీ బడాయికబుర్లు చాలిస్తావా లేదా రామ్‌ప్రసాద్?' సిన్హా మండిపడుతూ మధ్యలో అడ్డు తగిలాడు. 'ఎక్కడ పని అక్కడే వదిలేసి మనం ఊరికే టైమ్ వేస్ట్‌చేస్తున్నాం. ప్రధానమంత్రి చెబుతున్నట్టు ఇక మనం తక్కువ మాట్లాడి ఎక్కువ పని చేయాలి.'

'ఓహో, ఓహో, అద్భుతం!' రామ్‌ప్రసాద్ అట్టహాసంగా అన్నాడు. 'నువ్వు నాయకుల్ని కోట్‌చేయడం ఎప్పుడు మానేస్తావ్ సిన్హా?' అడిగాడు. మిగిలిన ఇద్దరికంటె కాస్త ఎక్కువ పుచ్చుకున్నాడతను.

'నేనే ఒక నాయకుణ్ణయిన తర్వాత, అప్పుడు.'

'దేవుడే రక్షించాలి' అన్నాడు అజిత్‌సింగ్ పైకప్పుకేసి చూస్తూ, దేవుడి ప్రతిస్పందనకోసం ఎదురుచూస్తున్నట్టు.

'అదిగో, మళ్ళీ మీరు అసలు విషయంనుంచి పక్కకెళ్ళిపోతు న్నారు' సిన్హా తప్పు ఎత్తి చూపిస్తూ అన్నాడు. 'ఇకనైనా మనం...'

'ఇదంతా నీ వల్లే' మధ్యలో తుంచుతూ అన్నాడు రామ్‌ప్రసాద్. 'నువ్వు నాయకుల్ని కోట్ చేయడం మానేస్తేనే మనమేదైనా పథకం వేయగలుగుతాం.'

'ఓకె. ఓకె. నేను మానేశాను. దక్షిణభారతం దేవదూతగారూ! ఇప్పుడు చెప్పండి. ఈ గండం నుంచి మనం ఎలా గట్టెక్కుతాం? విజయసాగర్ ప్రాజెక్టుమీద అదనంగా యాభైకోట్లరూపాయల శాంక్షన్‌ను ఈ దౌర్భాగ్యపు మంత్రిగాడినుంచి ఎలా సాధించడం?'

స్పష్టంగా వివరించిన ఆ గురుతర కార్యభారమే వాళ్ళ నోళ్ళను మూయించడానికి సరిపోయింది. మద్యం సేవిస్తూ, సిగరెట్లు కాలుస్తూ దీర్ఘంగా ఆలోచిస్తూ నిశ్శబ్దంగా ఉండిపోయారు. ఎగిరెగిరి పడుతున్న రామ్‌ప్రసాదే మళ్ళీ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ అన్నాడు, 'చూడండి. మనమంత డీలాపడిపోవలసిన అవసరం కానీ గాభరా పడవలసిన అవసరం కానీ లేదనే నేననుకుంటున్నాను. గతంలో ఇటువంటి సమస్యల్ని ఎన్నింటినో నెగ్గుకొచ్చాను. అయితే ఇప్పటి ఈ పరిస్థితి నిజంగా గడ్డుదే, ఒప్పుకుంటాను. ముఖ్యంగా మంత్రి అనబడే ఆ పంది ఉన్నాడు చూశారూ, తనేదో మహాత్మాగాంధీని సత్యహరిశ్చంద్రుణ్ణీ చంపిపుట్టాననీ ఆ రెండవతారాల్నీ ఇప్పుడు తనొక్కడే

ధరించాననీ అనుకుంటున్నాడు. ఎక్కడా ఎదురుదెబ్బ తిన్నట్టు లేదు. ఈ మొత్తం ప్రపంచం, ఆ మాటకొస్తే ఈ మొత్తం దేశం ఓ మంత్రిగాడి గుత్తసొత్తు కాదు. పైగా దేవుడిదయవల్ల అతగాడు నాయకులందరికీ పైమెట్టుమీద ఉన్నవాడు కూడా కాదు. అతడికీ పెళ్లాం, పిల్లలు, స్నేహితులు, రాజకీయఅనుచరులు ఉన్నారు, అందుక్కూడా మనం దేవుడికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఆపైన అతడు పోరాడి గెలవడానికి ఎన్నికలంటూ ఒకటున్నాయి. కనుక నా మూగమిత్రులారా, ఇప్పటికైనా దారి బోధపడిందను కుంటాను. నన్నడిగితే ఎదురుదాడికి సిద్ధపడాలంటాను. ఊరికే కూర్చుని దిక్కులుచూస్తూ ఆ మనిషికి మనల్ని పాతాళానికి పడదొక్కే అవకాశమివ్వడంకంటే, మనం చేయగలిగిందదేనంటాను.'

ఇంత గొప్పనిర్ణయానికి రాగలిగినందుకు అభినందనసూచకంగా ముగ్గురూ గ్లాసులు పైకెత్తారు.

అన్నివైపులనుంచి దాడి ప్రారంభించారు. సర్దార్ అజిత్‌సింగ్ ఆనంద్ కొడుకులిద్దరిమీద వలవేశాడు. వాళ్ళతో స్నేహంచేశాడు. నగరంలోని అతిపెద్ద హోటలైన ఇంటర్‌కాంటినెంటల్‌లో వాళ్ళిద్దరికీ లంచ్ ఇవ్వడంకోసం బయటికి తీసుకెళ్ళడానికి హెడ్మాస్టర్‌కి లంచమిచ్చి అనుమతి సంపాదించాడు. పిల్లలుకూడా కొత్త 'అంకుల్' వెంట వెళ్ళడానికెంతో ఉబలాటపడిపోయారు. వాళ్ళ నాన్నతో కలిసితిరిగిన పాతస్నేహితుణ్ణని చెప్పాడాయన. విందుభోజనం ఆరగించిన తర్వాత స్థూలకాయుడైన ఆ సర్దార్ వాళ్ళ నూదరగొట్టడం ప్రారంభించాడు.

'చూడండబ్బాయిలూ. మీ నాన్నగారంటే నాకూ ఇష్టమే. కానీ ఆయన తన సొంతపిల్లల్ని కష్టపెట్టడంమాత్రం నా కెంతమాత్రం నచ్చదు. ఎంతో సాహసవంతుడు, మేధావి, కష్టపడి పనిచేసేవాడు. అన్నీ బాగానే ఉన్నాయి. కానీ ఇప్పటి తరంవాళ్ళ కోరికల్ని బొత్తిగా పట్టించుకోడు. దొంగవెధవలు ఎడాపెడా సంపాదించి రాకుమారుల్లా వెలిగిపోతుంటే తానేమో పేదరికంలో జీవించడంలోనే గొప్పతనముందనుకుంటూ ఉంటాడు. ఇటువంటి హోటల్లో మీరెన్నిసార్లు భోజనంచేశారు చెప్పండి? ఓ ఏడాదిలో మీరెన్నిసార్లు కొత్తబట్టలు కట్టుకుంటారు చెప్పండి? మీ నాయనేమో సాదాసీదాగా ఆదర్శవంతంగా జీవించాలంటూ అలవిమాలిన ఆశయాలు రుద్దుతూ ఉంటాడు. తాను చదువుకునే రోజుల్లో ఉన్నట్టు ఒంటిపూట భోజనంతో, ఖాదీ కుర్తా, ధోవతీలతో ప్రతివాళ్ళూ జీవించాలనుకుంటూ ఉంటాడు... తానో సన్నకారురైతు కొడుకుననీ, మీరేమో ఓ మంత్రిగారి కొడుకులనీ మరచిపోతూఉంటాడు. ఇప్పుడు చెప్పండి, ఆయన కొంత ఉదారంగా ఉండవలసిన అవసరం ఉందంటారా లేదా? తన కుటుంబసభ్యులు మరికాస్త ఆనందంగా జీవించే అవకాశం ఆయన ఇవ్వాలా అక్కర్లేదా?'

ఉల్లాసం కలిగించే సర్దార్ ప్రశ్నలకు శ్రీకాంత్, రమాకాంత్ విస్తుపోయారు. హఠాత్తుగా ఊడిపడిన ఈ అంకుల్ మాట్లాడే మాటలకు ఓ తీరూతెన్నూ లేదని గమనించగలిగిన వయసే వాళ్ళది. అయినా ఆ మాటల్లోని అంతరార్థం వాళ్ళకి స్పష్టంగా తెలియలేదు. తమ జీవనసరళి మీద వాళ్ళకెటువంటి అసంతృప్తి లేదు. నిజానికి నాన్నను చూసి వాళ్ళు గర్విస్తూఉంటారు. ప్రతివాళ్ళూ ఆయన నెంతగా గౌరవిస్తూ ఉంటారో వాళ్ళకు తెలుసు. అదీగాక, తమ పరిస్థితి అజిత్‌సింగ్ చెబుతున్నట్టుగా ఏమీలేదు. తమకు కావలసినవన్నీ దొరుకుతూనే ఉన్నాయి. అయితే

ఇంతకుముందెప్పుడూ వాళ్ళు ఓ ఫైవ్‌స్టార్ హోటల్‌లో భోజనం చేసి ఉండకపోవచ్చు (నిజానికా భోజనం వాళ్ళకెంతో బాగుంది). అయినా ఆ అవకాశం తమకు లేకపోయిందే అనుకుని ప్రత్యేకంగా వాళ్ళేమీ బాధపడడంలేదు. ఇక, నాన్న నిరాడంబర జీవనసరళిగురించి నేరుగా ఆయనను ప్రశ్నించడం వాళ్ళు కలలోకూడా ఊహించలేని విషయం. ఆ విషయంలో ఆయనంటే వాళ్ళకి చచ్చేంత భయం.

ఇద్దరిలో చిన్నవాడైన రమాకాంత్ ఇద్దరి తరఫున అజిత్‌సింగ్‌కు సమాధానం చెప్పాడు 'ఇటువంటి విషయాలు నాన్నగారికే బాగా తెలుస్తాయి. ఆయన వేరేదో చేయాలని మీరనుకుంటే మీరు ఆయనతోనే మాట్లాడడం మంచిది.' సర్దార్ అజిత్‌సింగ్ బిత్తరపోయాడు. ఈ పిల్లలుకూడా తండ్రిలా ముదరష్టపు సన్యాసుల్లానూ, దిగొచ్చిన ధర్మమూర్తుల్లానూ మారబోవడం లేదు కదా అనుకున్నాడు. వెంటనే బిల్లు తెప్పించుకుని వాళ్ళతో ముక్తసరిగా మాట్లాడి స్కూల్లో దిగబెట్టి వెళ్ళిపోయాడు.

సిన్హా వీణ మీద దృష్టి లగ్నం చేశాడు. మొదట, స్థానిక పళ్ళమార్కెట్‌లో కొన్ని పెద్ద మామిడిపళ్ళ బుట్టను తన అభినందనలతో పంపించాడు ('మా పళ్ళతోటనుంచి' అని ఆ కార్డు మీద రాసుంది). ఓ రోజు తర్వాత, మంత్రిగారి అర్ధాంగిని మర్యాదపూర్వకంగా కలుసుకోడానికని చెప్పి తన భార్యను పంపించాడు. వాళ్ళద్దరిమధ్య తేడా ఎంతో ప్రస్ఫుటంగా కనిపించింది. నగర వాతావరణంలో పుట్టిపెరిగిన గాయత్రీసిన్హా అధునాతనవేషంలో ఉంటే, వీణ నేతచీరలో ఎంతో నిరాడంబరంగా ఉంది. ఐశ్వర్యం ఉట్టిపడేలా, ఎంతో ఖరీదైన ఆహార్యం ధరించిన ఆ మనిషిముందు మొదట్లో వీణ కాస్త ఇబ్బందిపడింది అయితే కొన్నిసార్లు అలా మర్యాదపూర్వకమైన రాకపోకలు సాగించి ఎలాగో శ్రీమతి సిన్హా, వీణతోనూ, చుట్టంచూపుగా వచ్చిన ఆనంద్ అత్తగారివైపు ఆడబంధువులతోనూ స్నేహం చేసేసుకుంది. ఓ రోజు సాయంత్రం ధగధగ మెరిసిపోతున్న ఓ వజ్రాలనెక్లెస్‌ను హఠాత్తుగా వాళ్ళకు పైకితీసి చూపించింది. అందరూ ఆశ్చర్యంతో నోరు తెరచుకుని చూస్తూ ఉఢిపోయారు. ఆ దిగ్భ్రమ కొద్దిసేపు వాళ్ళలోని వివేకాన్ని హరించివేసినట్టూ కనిపించింది. కళ్ళు గిర్రున తిరిగిపోయిన వీణ బంధువులు, నిజంగానే వాళ్ళిద్దరి మధ్య ఎంతో స్నేహ ముందనీ, ఖరీదైన వస్తువులంటే ఇద్దరికీ ఎంతో మోజనీ ఓ నిర్ణయాని కొచ్చేశారు. మంత్రిగా భర్త బాగా సంపాదిస్తూనే ఉండాలి కనుక వీణ కవి అందని వస్తువులేం కావని కూడా అనుకున్నారు. ఆ నెక్లెస్‌గురించి వాళ్ళందరూ గోలగోలగా అలా మాట్లాడుకుంటుండగానే శ్రీమతి సిన్హా వీణను పక్కకి తీసుకెళ్ళి (మిగిలిన ఆడవాళ్ళు వినగలిగినంత దూరానికే) ఎంతో యథాలాపంగా అంది ' ఈ నెక్లెస్‌ను ఒకరు మీకు ప్రజెంట్ చేయాలనుకుంటున్నారు మేడమ్...'

'ఎందుకేమిటి?' వీణ కూడా అంతే యధాలాపంగా అడిగింది.

ఒకవైపున వీణ అలాప్రశ్నించినా సరే ఆ నెక్లెస్‌ను చూసి, శ్రీమతి సిన్హా మాటలు విన్న ప్రతివాళ్ళూ, వాళ్ళిద్దరూ రహస్యంగా ఏదో ఒప్పందం చేసుకున్నట్టు నిర్ణయానికి వచ్చారు. వాళ్ళు అలా అనుకోవాలనే శ్రీమతి సిన్హా ఎత్తుగడ. ఆ నెక్లెస్ తమ ఒప్పందంలో భాగమని

అందరూ విశ్వసిస్తున్నప్పుడు తానుకూడా అలాగే అనుకుని ఆ నెక్లెస్‌ను ఎందుకు స్వీకరించకూడదన్న తర్కానికి వీణ లొంగి పోతుందని ఆమె ఆశించింది. వ్రతం ఎలాగూ చెడినప్పుడు ఫలితం దక్కించుకోకపోవడంలో అర్థంలేదు

వీణ ధోరణికి శ్రీమతి సిన్హా గుడ్లు వెళ్ళబెట్టింది. 'వాళ్ళెవరో దీనిని నాకెందు కివ్వాలను కుంటున్నారు?' వీణ మళ్ళీ అడిగింది. శ్రీమతి సిన్హా వద్ద జవాబులేదు మంత్రుల భార్యలకు ఎవరైనా వజ్రాలనెక్లెస్‌ను ఎందుకు బహూకరిస్తారని అడిగితే ఏం చెప్పాలి? ఈ ఇంట్లో వాళ్ళందరూ మూర్ఖుల్లానే కనిపిస్తున్నారనుకుంది తనలోతనే. అయితే పూర్తిగా ఆశకు నీళ్ళొదులుకోలేదు.

ఆ నెక్లెస్ తనకెందు కిస్తున్నారో గ్రహించుకున్న వీణ లోపల్లోపల రగిలిపోతూనే చేతనైనంత మర్యాదగానూ, త్వరగానూ శ్రీమతి సిన్హాను అక్కడనుంచి సాగనంపే ప్రయత్నంచేసింది. తర్వాత కూడా శ్రీమతి సిన్హా వీణతో మాట్లాడడానికి రెండు మూడుసార్లు ప్రయత్నించింది. మరో అందమైన వజ్రాలనెక్లెస్‌ను బహుమతిగా పంపించింది కూడా. మంత్రిగారిభార్య ఊళ్ళో లేరంటూ మర్యాదగా ఓ నోటు రాసి దానికి జతపరచి ఆనంద్ ప్రైవేట్‌సెక్రటరీ తిప్పిపంపించేశాడు.

మంత్రిగారి అనుయాయులద్వారా ఆయనను ప్రసన్నం చేసుకోడానికి ప్రయత్నించిన రామ్ ప్రసాద్ పరిస్థితికూడా అంతకంటె గొప్పగా ఏమీలేదు. వారంరోజులతర్వాత ముగ్గురూ తమ అనుభవాలను కలబోసుకోడానికి ఇంటర్‌కాంటినెంటల్ బార్‌లో కలుసుకున్నప్పుడు రామ్‌ప్రసాద్ అన్నాడు, 'ఈ మూర్ఖుడు తనకు తగులుకున్న ఉన్మాదరోగాన్ని నియోజకవర్గమంతటికీ అంటించినట్టున్నాడు. అతడి అనుచరులు అతడిమీద ముసలితల్లిలా ఒకటే ఆపేక్ష చూపిస్తున్నారు. అతడిప్పుడున్నట్టు ఉండడమే తమ కిష్టమట. ఏమైనా అతగాడు మారడు. అటువంటప్పుడు తాను చేయనే చేయనని చెప్పిన పని చేయడానికి అతణ్ణి ఒప్పించే ప్రయత్నంచేసి రెండువైపులనుంచి తలవంపులు తెచ్చుకోవడం దేనికని వాళ్ళ ఉద్దేశం.'

'దారుణం' సిన్హా ఒప్పుకున్నాడు. 'అంటే నువ్వనేది, అతగాడి అనుచరుల్లో డబ్బుకి గడ్డి తినేవాడు ఒకడూ లేడనా?'

'లేకేం, చాలామంది ఉన్నారు. అయితే అతడి నీతినిజాయితీలు చూసి విరక్తిపుట్టి వాళ్ళంతా ఎప్పుడో అతణ్ణి విడిచిపెట్టి అవతలిగ్రూపులో చేరిపోయారు' అన్నాడు రామ్‌ప్రసాద్.

'మద్దతుకోసం ఆనంద్ ఆధారపడేవాడు, తనమాట వినకపోతే అతడికి ఇబ్బందులు సృష్టించ గలిగినవాడు ఒక్కడూ లేడా? మనం లంచంపెడితే అతడి తోక కొంచెమైనా మెలితిప్పగలిగిన వాడు ఒక్కడూ లేడంటావా?'

'ఉన్నాడని నేననుకోను. అతణ్ణి లోబరుచుకోడానికి స్థానికంగా పలుకుబడి ఉన్న కొందరు ప్రయత్నించకపోలేదు. అయితే పంచాయతీ ఎన్నికల్లో వాళ్ళు భారీగా నష్టపోయారు ఆ తర్వాత అతడి తోక అలా కదిలించేవాడెవడూ లేకుండాపోయాడు. మనం ఇంక చేయగలిగిందేమీ లేదేమో ననిపిస్తోంది.'

తిరిగి గ్లాసులు చేతుల్లోకి తీసుకుని మరోసారి ఏంచేయడమా అన్న ఆలోచనలో పడ్డారు, ఈసారి వేరే కోణంనుంచి.

'పైనుంచి ఒత్తిడి తేగలిగిన వాణ్ణి ఎవణ్ణైనా పట్టుకోలేమా?' అజిత్‌సింగ్ సూచించాడు. 'ఉదాహరణకు ఢిల్లీనుంచి! లేదా అసెంబ్లీలో ఓ స్వల్ప వ్యవధి ప్రశ్న వేయిస్తే? నాకు కొందరు నాయకులు తెలుసు..'

'ఆ సంగతి మరచిపో సర్దార్' రామ్‌ప్రసాద్ హెచ్చరించాడు. 'ఆ మార్గంలో వెడితే సర్వ నాశనం తప్పదు. ఆనంద్ మన వాదాన్ని దర్జాగా తోసిపుచ్చేసి కాంక్రీట్‌తో మనకు సమాధులు కట్టేస్తాడు. పైగా నువ్వూ నేనూ కట్టిస్తున్నట్టు సిమెంటు -బూడిద కలగలిపి కాదు, పక్కా ఆర్.సి.సి.తో. ఆ విషయంలో నాదీ పూచీ. ఏదో కారణంవల్ల చౌదరికూడా జోక్యంచేసుకోడు. పైస్థాయిలో కూడా ఆనంద్‌కి కొంత పలుకుబడి ఉంది. కనుక మనమలా చేయలేం.'

సిన్హాకు చిర్రెత్తుకొచ్చి ఒక్కసారిగా విరుచుకుపడ్డాడు. 'అంటే మన పని ముగిసిపోయిందా? అదేనా నువ్వు చెప్పదల్చుకున్నది'

రామ్‌ప్రసాద్ జవాబుచెప్పలేదు. నిస్పృహతోకూడిన నిశ్శబ్దంలో ముగ్గురూ కూరుకుపోయారు. ఇంతలో ఎప్పటిలానే రామ్‌ప్రసాద్ ముఖం హఠాత్తుగా వెలిగిపోయింది. 'మనకి సహాయపడగలిగిన వ్యక్తి ఎవడైనా ఉన్నాడంటే అతడు కేబినెట్‌లో, అంతే ముఖ్యమైన స్థానంలో ఉన్న మరో యువమంత్రి శేఖర్. అతడికి ఆనంద్‌మీద ద్వేషం. బహిరంగంగా అతడితో తలపడగల శక్తి లేకపోయినా, మనం ఏ రూటులో వెళ్ళాలో కొంత ఆలోచన చెప్పగలడని నా నమ్మకం.'

సీసాలు ఖాళీఅయ్యాయి. రెండురోజులతర్వాత, అంటే రామ్‌ప్రసాద్ శేఖర్‌తో మాట్లాడిన తర్వాత మళ్ళీ కలుసుకుందామని నిర్ణయించుకున్నారు. అనుకున్న సమయానికే ముగ్గురూ రామ్‌ప్రసాద్ ఇంట్లో సమావేశమైనప్పుడు రామ్‌ప్రసాద్ ఎటువంటి ఉపోద్ఘాతం లేకుండా నేరుగా విషయానికొచ్చేశాడు, 'మొత్తానికి దొరికాడు. అసలిన్ని రోజులూ నేనంత ఇడియట్‌లా ఎలా మారానో, ఆయన పెళ్ళాం గురించి, పిల్లల గురించి, రకరకాల మూర్ఖుల గురించి మనమెందుకు సమయం వృధాచేశామో నా కర్థంకావడం లేదు. ఆనంద్‌ను ప్రసన్నం చేసుకోడానికి వాస్తవంగా ఉన్నది ఒకేఒక మార్గమని అఫ్రోజాబాద్‌లో ఉన్న ప్రతిఒకరికీ తెలుసు. మనమేమో దాదాపు పదిరోజులు వృథా చేసేశాం!' అంటూ నర్మగర్భమైన మాటలతో ఒక్కసారిగా ఉక్కిరిబిక్కిరి చేసేశాడు.

మిగిలిన ఇద్దరూ సహనం కోల్పోయి అతణ్ణి అటూ ఇటూ ఊపిపారేశారు. 'యూ, రాస్కెల్. అసలు విషయం చెప్పు, త్వరగా!' సిన్హా అన్నాడు.

అజిత్‌సింగ్ చేతులుజోడించి తెచ్చిపెట్టుకున్న ప్రాధేయస్వరంతో అన్నాడు 'మరీమరీ సస్పెన్స్‌తో మా ప్రాణాలుతీయకు, ఓ దక్షిణభారత మహారత్నమా, ఓ శంకరాచార్యా, ఓ రామానుజాచార్యా, రాజగోపాలాచార్యా... లేదా మిమ్మల్ని మీరు పిలుచుకునే మరో మరో చార్యా! ఇక్కడే ఇప్పుడే ఉత్తరభారతం మీకు లొంగి పోయినట్టు ప్రకటిస్తున్నాను! దయచేసి మాకింత వెలుగుచూపించు!'

సస్పెన్స్‌ను పోషించడం రామ్‌ప్రసాద్‌కి భలే సరదాగా ఉంది. మెల్లగా సాలోచనగా చెప్పడం ప్రారంభించాడు. 'అనుకున్నట్టే వెళ్ళి శేఖర్‌ను కలిశాను. కొద్ది నిముషాలకే అతడో విషయం చెప్పాడు. నాకు చటుక్కున తోచలేదు కానీ అది నాకెప్పటినుంచో తెలిసున్న విషయమే. నా అంత మూర్ఖుడుండడు' ఎంతో గంభీరంగా ప్రకటించాడు. 'నా మిత్రులారా... నా దేశ వాసులారా, శేఖర్ ఇచ్చిన సలహాతో నాకు గుర్తొచ్చింది... మనం తలనొప్పి అనుకుంటున్న ఈ మంత్రిగారికి నిజంగా ఒక ప్రబలమైన గుండెనొప్పి ఉంది. వేరే మాటల్లో చెప్పాలంటే, ఒక. ఏ మందామబ్బా... ఆ... ఒక గర్ల్‌ఫ్రెండ్. ఆమె ఒక్కతే అతణ్ణి నిలువునా పూర్తిగా లొంగదీసుకోగలదని నాకర్థమైంది. ఇది నూటికి నూరుపాళ్ళు నికార్సయిన సమాచారం. మన మేలుగోరిన మిత్రుడు మినిస్టర్ శేఖర్ అందించి కట్టుకున్న పుణ్యం ఐతే ఆయననుంచే మనమింత విలువైన భోగట్టా సేకరించామని బహిరంగంగా అంటే మాత్రం అతగాడు లేదు లేదంటూ పూర్తిగా ఖండించిపారేస్తాడు సుమా!'

అతని మిత్రుల ముఖాలనిండా నవ్వులు విరబూశాయి. అంతా ఒకేసారి గలగల మాట్లాడ్డం ప్రారంభించారు. సంభ్రమం కాస్త సద్దుమణిగిన తర్వాత అజిత్‌సింగ్ ఒకింత ఆలోచనలోకి జారిపోయి తర్వాత అన్నాడు 'ఓరిదేవుడా! ఇది భూమండలాన్నే ఊపేసే వార్త, నిజానికి భూకంపం పుట్టించే వార్త! అదిసరే, రామ్‌ప్రసాద్! దుమ్ముకొట్టుకుపోయిన ఎండుగడ్డిమోపులాంటి ఆ సుగుణాలరాశికి, ఆ పనికిమాలిన ఆనంద్‌గాడికి ఓ ఆడది, రక్తమాంసాలున్న ఓ ఔరత్‌దగ్గర కావడం సాధ్యమేనంటావా?'

రామ్‌ప్రసాద్ అంతెత్తున ఎగిరి పడ్డాడు. 'మరీ అంత బుద్ధితక్కువగా మాట్లాడకు. చేతనైతే ఇంతకన్నా మంచి ఆధారం వెతికి పట్టుకురా, లేకపోతే నేను చెప్పినట్టు చెయ్యి! కాస్తంత లోతుకెళ్ళి చూస్తే, ఈ నగరంలోని ప్రతిఒకరికీ మంత్రిగాడి బహిరంగరహస్యం తెలుసునన్న విషయం నీకే అర్థమౌతుంది. ఇప్పటికీ నా మాటలమీద నమ్మకం కుదరకపోతే అసెంబ్లీ వాయిదాపడిన వెంటనే ఆమె ఇంటివైపు వెళ్ళి చూడు. ఇంటిముందు అంత పొడవున బారులుతీరి నిలబడిన కార్లను చూసైనా నీకు నమ్మకం కుదరచ్చు. వాటిని లెక్కబెట్టి చూడు, అవి చాలావరకూ కాంట్రాక్టర్లవైనా అయుంటాయి, లేదా ఇరిగేషన్ డిపార్టుమెంటుతో ఏదోవిధమైన సంబంధం ఉన్నవాళ్ళవైనా అయుంటాయి. పోనీ ఆమె వెళ్ళిన ప్రతిచోటా ఆమె చుట్టూ వేలాడేవాళ్ళను లెక్కపెట్టి చూడు.'

ముగ్గురూ గ్లాసులు ఖాళీచేసి, మరో విడతకు ఆర్డర్‌చేసి తదుపరి చర్యకు రూపకల్పన చేసుకోవడంలో మునిగిపోయారు. రామ్‌ప్రసాద్ తనకు తెలిసిన వివరాలన్నీ వాళ్ళకి చెప్పాడు కానీ, అవంతగా సరి పోయేవి కావు. ఎం.ఎల్.ఏ మాత్రమే కాకుండా అరుణ ఓ సోషల్‌వర్కర్ అనికూడా చెప్పాడతను.

'సోషల్‌వర్కర్ అంటే...?' అజిత్ సింగ్ అడిగాడు.

'చూడు సర్దార్‌జీ' గుంభనంగా నవ్వుతూ అన్నాడు రామ్‌ప్రసాద్ 'మరీ పిల్లవాడిలా ప్రశ్నలడుగుతున్నావ్? సోషల్‌వర్కర్ అంటే అక్షరాలా అదే– సోషల్‌వర్కరేనని తెలియనట్టు నటించకు. విడమరచి చెప్పవలసిన అవసరమేంలేదు. అయినా అది మనకు సంబంధించిన విషయం కాదు. మనం దృష్టిలో ఉంచుకోవల సిందల్లా తరచు ఆమె ఆనంద్‌తో కలిసి తిరుగుతూ జనం

కంటబడుతూ ఉంటుందన్న వాస్తవం. వాళ్ళ గురించి మామూలుగానే ఎన్నెన్నో కథలు ప్రచారంలో ఉన్నా, నాకు తెలిసిందిమాత్రం ఇంతే. అయితే మరిన్ని వివరాలు రాబట్టడమంత కష్టమేమీకాదు.'

కొన్నిరోజులపాటు గాలించినప్పటికీ వాళ్ళు పెద్దగా దొరకపుచ్చుకున్న కచ్చితమైన వివరాలేవీ లేవు. అరుణాదేవి అందంగా ఉంటుందనీ, ఉన్నదున్నట్టు మాట్లాడుతుందనీ, ఔదార్యం, సానుభూతి ఉన్న మనిషని వాళ్ళు తెలుసుకోగలిగారు. ఆమె కెంత డబ్బుందో, ఇంకా ఎంత కావాలని కోరుకుంటుందో ఎవరికీ తెలియదు. ఆమెకున్న, ఆమె కోరుకుంటున్న నగానట్రా, ఆస్తిపాస్తులు, జీవితానికి కావలసిన ఇతర విలువైన సామగ్రి ఏమిటో కూడా ఎవరికీ తెలియదు. అయితే వాళ్ళనా ప్రశ్న మరీ అంతగా వేధించలేదు. ఇటువంటి విషయాల్లో ఆమెకూడా మిగిలినవాళ్ళ కోవలోనే ఉంటుందనుకున్నారు. ఆమె ఎంతో దైవభక్తి కలిగిందనీ, తరచు ఆలయాల్లోనూ, ఆశ్రమాల్లోనూ కనిపిస్తూ ఉంటుందని కూడా వాళ్ళకి తెలిసింది.

ఓ రోజు ఉదయం సిన్హా అరుణ ఇంటికి వెళ్ళాడు. నిజాయితీపరుడుగా పాపభీతి ఉన్నవాడుగా, వృత్తిరీత్యా ఓ కాంట్రాక్టర్‌గా తనను పరిచయం చేసుకున్నాడు. ఋషీకేశ్‌లోని శివానందాశ్రమానికి తాను చిరకాలంగా భక్తుడిగా ఉన్నాననీ, పాండిచ్చేరిలోని శ్రీ అరవిందాశ్రమాన్ని తరచు సందర్శిస్తూ ఉంటాననీ, ముంబయ్ సమీపంలోని ముక్తానంద్ ఆశ్రమానికీ, దేశవ్యాప్తంగా ఉన్న ఇంకా మరెన్నో ఆశ్రమాలకు, ధార్మికసంస్థలకూ ఉదారంగా విరాళాలు ఇచ్చుకున్నాననికూడా చెప్పుకున్నాడు. నిజం చెప్పాలంటే అతడెప్పుడూ ఏ ఆశ్రమంలోనూ అడుగుపెట్టి ఎరగడు. ఇంటర్వ్యూకు విశ్వసనీయతను తేవడానికి ముందురోజు రాత్రే ఓ మిత్రుడి దగ్గర ధార్మిక కేంద్రాలు, సంస్థల జాబితాను సంపాదించాడు. తాను చండీయాగం తల పెట్టాననీ, దానికి సన్నాహక సంఘాన్ని ఏర్పాటు చేయవలసి ఉంటుందనీ అరుణతో చెప్పాడు. ధార్మికవిషయాలలో ఆమెకున్న ఆసక్తి గురించి తానెంతో విన్నాడు కనుక ఆమె ఆ సంఘంలో సభ్యత్వం స్వీకరించి వచ్చే బుధవారంనాడు జరగబోయే సంఘం తొలిసమావేశానికి హాజరైతే తానెంతో చరితార్థుడనౌతానన్నాడు.

అతడి మాటలు ఇట్టే నమ్మేసిన అరుణ సన్నాహకసంఘంలో ఉండడానికీ, దాని ప్రారంభసమావేశంలో పాల్గొనడానికీ ఒప్పుకుంది. పైగా అక్కడికక్కడే, అప్పటికప్పుడే పెద్ద మొత్తంలో విరాళం కూడా ఇచ్చేసింది. సిన్హా తన ఆనందాన్ని అణచుకోలేకపోయాడు. ఓ ట్రే నిండా స్వీట్లు, పళ్ళు, ఊరించే వేడివేడి కాఫీ అతనిముందు ప్రత్యక్షమయ్యాయి. 'ఓ, థాంక్యూ, థాంక్యూ దేవీజీ. ఇవన్నీ అనవసరం. మీరెంతో దయచూపించారు... చాలాచాలా దయచూపించారు. దేవాలయంలో ప్రసాదాన్ని ఎవరూ వద్దనకూడదని నాకు తెలుసు.'

వాటిని సేవించినతర్వాత సిన్హా అన్నాడు, 'మా ప్రయత్నానికి ఓ ఆటంకం వచ్చిపడింది దేవీజీ!'

'ఏమిటది?' ఆమె అడిగింది.

'దేవీజీ. మీరు నాకు సోదరిలాంటివారు కనుక మీకు ఉన్నదున్నట్టు చెప్పాలి. నేనో మామూలు కాంట్రాక్టర్‌నేకావచ్చు, అయినా మీవంటి సజ్జనులు చెప్పగా విన్నాను, దేవుడిముందు మనందరం

సమానులమేనని. ఈ విషయం మీకు చెప్పడం నాకెంతమాత్రం ఇష్టంలేదు, అయినా నన్ను చాలా హీనంగా చూశారు దేవీజీ. ఇంకా చెప్పాలంటే ఓ గజ్జికుక్కలా చూశారు...'

ఎంతో కుమిలిపోతున్నట్టు నటించాడు. అరుణకూడా కలవరపడుతున్నట్టు చూచి అతడెంతో సంతోషపడిపోయాడు.

'అలా మిమ్మల్ని చూసిందెవరు?'

'పోనివ్వండి దేవీజీ, మీకేదో చాడీలు చెప్పినట్టుంటుంది. నాలో నేనే బాధపడతాను లెండి.'

'ఫర్వాలేదు. నాతో చెప్పండి. సందేహించకండి.'

'మీరు మరీ పట్టుబడుతున్నారు కనుక చెప్పేస్తాను, ఏమీ అనుకోకండి దేవీజీ. మన ఇరిగేషన్ మంత్రి ఆనంద్‌జీ నాపట్ల చాలా నిర్దయగా ఉన్నారు. చండీయాగ సన్నాహక కమిటీకి అధ్యక్షులుగా ఉండవల సిందిగా వారిని అర్థించడానికి వెళ్ళాను. అది భగవత్కార్యంకనుక వారే దానిని ప్రారంభించాలని కోరుకున్నాను. అందులో తప్పేమిటో నాకేమీ బోధపడలేదు. కాని వారి ఇంటర్వ్యూకూడా నాకు దొరకలేదు. అయిందేదో అయింది, మీరు దాని గురించి తలచుకుని అట్టే బాధపడకండి. మీరైనా నామీద దయచూపించారు, చాలు.'

'సిన్హాజీ, అలా అనకండి. ఆనంద్‌జీని ఒప్పించడానికి నా శక్తివంచనలేకుండా ప్రయత్నించి చూస్తాను. రేపు ఉదయం ఓసారి నాకు ఫోన్ చేయండి, ఏ విషయం మీకు చెబుతాను' అంది అరుణ.

సిన్హా వెళ్ళిన వెంటనే ఆమె ఆ ప్రయత్నం మొదలుపెట్టింది. ఆనంద్‌కి ఫోన్‌చేసి అంది 'ఎటువంటి మంత్రివి నువ్వు? చండీయాగం కమిటీలో ఉండడానికికూడా నీకు టైము లేదన్న మాట! నీ దృష్టిలో చండీయాగంకన్నా ముఖ్యమైన కార్యం ఏముందటా?'

'చూడు...' తన అయిష్టతను ప్రకటిస్తూ ఆనంద్ అన్నాడు 'ఆ కాంట్రాక్టర్ సిన్హా వట్టివెధవ. నావల్ల కాదు...'

'ఏమిటి నీవల్ల కాదు? అతడు కాంట్రాక్టరైతే ఏమిటట? కాంట్రాక్టర్ మనిషికాదని నువ్వెలా అనుకుంటున్నావ్? పైగా ఇది దైవకార్యం!'

ఇంతవరకూ వ్యవహారం నల్లేరుమీద బండిలా సాగిపోవడం చూసి సిన్హా ఉబ్బితబ్బిబ్బయి పోయాడు. అరుణ జోక్యంచేసుకున్న తర్వాత చండీయాగం సన్నాహక కమిటీకి అధ్యక్షుడుగా ఉండడానికి ఆనంద్ ఒప్పుకున్నాడు. దీనిని సానుకూలం చేయడమెలాగా అనుకుంటూ సిన్హా ఇంతకుముందు కొన్ని రాత్రులపాటు గ్లాసుమీద గ్లాసు విస్కీ సేవిస్తూ బుర్ర బద్దలు కొట్టుకోవ లసివచ్చింది.

సర్దార్ అజిత్‌సింగ్ సాధించిన అద్భుతవిజయంకూడా దీనికే మాత్రం తీసిపోయేదికాదు నాలుగు తరాలుగా అతని కుటుంబం ఢిల్లీలోనే ఉంటూవచ్చింది. కాని అరుణను చూడడానికి వెళ్ళినప్పుడు, నల్ల రాయికూడా కరిగి కన్నీరుపెట్టేంత దయనీయంగా కనిపించాడతను. దేశవిభజనవల్ల

అష్టకష్టాలు పడిన వాళ్ళలో తనూ ఒకడినని చెప్పుకున్నాడు. తన కుటుంబం సర్వనాశనమైపోయిందనీ, తానొక్కడే ఎలాగో తప్పించుకుని బయటపడగలిగాననీ, ముల్తాన్ (ప్రస్తుతం పాకిస్తాన్‌లో ఉంది) సమీపంలో ఉన్న తన గ్రామంనుంచి ఢిల్లీవరకూ కొన్నివందలమైళ్ళు కాలినడకన ప్రయాణం చేసి వచ్చాననికూడా చెప్పుకున్నాడు. దారిలో ఎక్కడా తిండి తిప్పలు లేక రోడ్డుపక్క గుంటల్లో నీళ్ళుతాగి ప్రాణాలు నిలబెట్టుకున్నానన్నాడు. రాత్రిళ్ళు పొలాల్లో పాములు, తేళ్ళమధ్య నిద్ర పోయానన్నాడు. అతికష్టంమీద కళ్ళనుంచి నీటిచుక్కలు పిండుకుంటూ ఎంతో విషాదంనిండిన స్వరంతో ముక్తాయింపుగా అన్నాడు 'మొత్తంమీద నా కాళ్ళమీద నేను నిలబడగలిగాను మాతాజీ! పొట్టకోసం ఎన్ని తిప్పలుపడ్డానో! పెద్దగా చదువుకోలేకపోయినా, మీ దయవల్ల పైకొచ్చాను... కష్టపడి, ఎంతో నిజాయితీగా పనిచేసి కాంట్రాక్టర్‌గా ఎదిగాను... ఇప్పుడు నాకో సమస్య వచ్చిపడింది, దానిని మీరే పరిష్కరించ గలరు.'

'ఏమిటి మీ సమస్య?' అరుణ అడిగింది, దాదాపు కంటతడిపెడుతూ.

'ఒకప్పుడు నాలా, దిక్కూదివాణం లేకుండా తిరిగే పిల్లలకోసం ఓ సంస్థ ప్రారంభించాలనుకున్నాను. ఆ జ్ఞాపకాలు ఇప్పటికీ నన్ను వెంటాడుతూనే ఉంటాయి. ఆ సంస్థ స్థాపకసంఘంలో మీరు సభ్యులు కావాలని నా కోరిక. మన ఇరిగేషన్‌మంత్రి దానికి అధ్యక్షులుగా ఉంటే నా జన్మ ధన్యమైందనుకుంటాను.'

'అదేం సమస్య కాదు...' అరుణ ఏదో అనబోయింది.

'లేదు మాతాజీ, అదే అసలు సమస్య' అజిత్‌సింగ్ అడ్డుతగులుతూ అన్నాడు. 'మంత్రిగారు పిల్లల్ని ఎంతో ప్రేమిస్తారనీ, పిల్లలుకూడా ఆయనంటే ఎంతో ఇష్టపడతారనీ నాకు తెలుసు. అయితే దురదృష్టంకొద్దీ, నేను వారిని అభ్యర్థించడానికి వెళ్ళినప్పుడు నాకు టైములేదంటూ ఆయన నిష్కర్షగా చెప్పేశారు. వారు కాంట్రాక్టర్లను విషప్రాయంగా చూస్తారనుకుంటాను మాతాజీ.'

'ఓ నిముషం ఉండండి', అంటూ అరుణ ఫోన్ తీసుకుని ఆనంద్ పర్సనల్ నెంబర్‌కి డయల్ చేసింది. అతడు లైన్‌లోకి రాగానే పరిహాసంగా అంది 'మంత్రిమహాశయా! యువకుడుగా ఉన్నప్పుడు ఎన్నెన్నో కష్టాలు అనుభవించిన అజిత్‌సింగ్ అనే ఆ మనిషిని తమరెందుకంత ఇబ్బంది పెడుతున్నారు! దేవుడిముఖం చూసి చెబుతున్నాను, మీరు అధికారంలో ఉండగానే ఏదైనా మంచిచేయాలి. లేకపోతే భగవంతుడు మిమ్మల్ని క్షమించడు...'

'సరే, మేడమ్' ఆనంద్‌కూడా హాస్యంగా అన్నాడు, 'భగవంతుడి ముందు లొంగిపోతున్నాను!'

తక్షణమే అన్ని ఏర్పాట్లు జరిగిపోయాయి.

మిగిలిన ఇద్దరితో పోల్చితే రామ్‌ప్రసాద్ విజయం మరీ మరీ అద్భుతం. అందుకు మొట్ట మొదటగా చెప్పుకోవలసిన కారణం, మిగిలిన ఇద్దరికీ లేని ఒక సౌకర్యం అతని కుండడం, అతడు అరుణతో మాతృభాషలో మాట్లాడగలడు. ఆమెను 'అక్కా' అని పిలుస్తూ, అక్కడి ఆచారంప్రకారం తక్షణమే ఆమెతో చుట్టరికం కలిపేసుకున్నాడు. అరుణ అక్కగారి భర్తకు సోదరుడి

వరుసయ్యే ఓ వ్యక్తి కుమార్తె వివాహానికి తానే మధ్యవర్తిత్వం నెరిపాడట. రెండుమూడుసార్లు రాకపోకలు సాగించినమీదట, ఏదో తగుమాత్రంగా కట్టుకున్న తన మూడంతస్తుల భవంతికి అక్కను ఆహ్వానించాడు; ఆ విశిష్ట అతిధికి అతడి భార్య, ముగ్గురు పిల్లలు బ్రహ్మరథం పట్టేశారు. తగిన అదనుచూసుకుని, తాను ధర్మకర్తగా ఉన్న సంగమరుద్రేశ్వరాలయంలో భారీఎత్తున కుంభాభిషేక, మహారుద్రాభిషేక కార్యక్రమాలను తలపెట్టిన విషయం అరుణ చెవినవేశాడు. అక్కా, ఇరిగేషన్‌మంత్రిగారూ –ఇద్దరూ వస్తేతప్ప ఈ కార్యక్రమాలను నిర్వహించేదిలేదని ఖండితంగా చెప్పేశాడు. పైగా రాత్రి సాక్షాత్తు దేవుడు తన కలలో కనిపించిఈ దివ్యసందేశం అందించినట్టు చెప్పాడు. అక్కకి వెంటనే సమస్య బోధపడిపోయి అప్పటికప్పుడు వ్యవహారాన్ని తన చేతుల్లోకి తీసేసుకుంది. గౌరవ అతిథిహోదాలో ఆనంద్ పేరు అవలీలగా చిట్టాలోకి ఎక్కేసింది.

ఈ విజయాలు జేబులో వేసుకున్న తక్షణమే, ఆనందంతో తలమునకలౌతున్న ముగ్గురు కాంట్రాక్టర్లూ తమ పథకంలో వేయవలసిన తదుపరి అడుగుగురించి చర్చించుకోడానికి రామ్ ప్రసాద్ ఇంట్లో సమావేశమయ్యారు. అసలువిషయంలోకి వెళ్ళడానికిముందు ముగ్గురూ గ్లాసులు పైకెత్తి అరుణకు అభినందనలు చెప్పుకున్నారు.

'ఆమె మనిషిరూపంలో జన్మించిన దేవతే...' సిన్హా అన్నాడు.

'నిజమే. ఆమెలో దేవతాలక్షణం ఉంది, ఆ విషయంలో నాకెటువంటి సందేహంలేదు' అన్నాడు అజిత్‌సింగ్. 'బుద్ధితక్కువవెధవలు ఆమెగురించి చెడుగా మాట్లాడుతుంటే నాకు అరికాలిమంట నెత్తికొస్తుంది. వాళ్ళ నక్కడికక్కడే కాల్చిపారేయాలనిపిస్తుంది.'

'అవునవును, నాకూ అలాగే అనిపిస్తుంది' అన్నాడు రామ్‌ప్రసాద్. 'నా జీవితంలో అంతటి పరిశుద్ధురాలిని, అంతటి గుణవంతురాలిని మరొకరిని చూడలేదు. ఆమె ఆనంద్‌కి... అసలటువంటి ఊహ చేయడమే మహాపాపం అంటాను..'

'సరే. ఇంతవరకు అంతా బాగానే జరిగింది' అజిత్‌సింగ్ అసలువిషయానికి శ్రుతిచేశాడు. 'మనం చేయవలసిన చిట్టచివరిదాడి గురించేమిటి? ఏమైతేనేం ఆనంద్‌ను మనం తలపెట్టిన పవిత్రధార్మికకార్యక్రమాల్లోకి ప్రవేశపెట్టగలిగాం. ఈ పైన అడుగు ముందుకువేయడం ఎంతో ఖర్చుతో కూడుకున్న వ్యవహారం. సన్నాహక సంఘాలకేం, బాగానే ఉన్నాయి. మనం ఆడుతున్న ఈ నాటకానికంతకీ కారణమైన అసలువిషయం సంగతేమిటి?'

'సర్దార్జీ చెప్పింది నిజమే. మనం ధార్మికకార్యక్రమాల్ని నిజంగానే చేపట్టడమంటూ జరిగితే ఈ లోపల త్వరగా ఆ ఇరిగేషన్‌ప్రాజెక్టుకు ఆనంద్ అనుమతిని సాధించుకోవాలి. అతగాడు ఆమోదించడమే జరిగితే ఒక చండీయాగం కాదు, శతచండీయాగం, ఇంకా చెప్పాలంటే మరింత ప్రభావంకోసం సహస్రచండీయాగం జరిపిస్తాను...'

'నువ్వన్నది బాగానే ఉంది' రామ్‌ప్రసాద్ ఏకీభవిస్తూ అన్నాడు. 'చేయవలసిందేమిటో నేను చెబుతా వినండి. ముగ్గురంకలిసి ఆమెను శాకాహారభోజనానికి పిలుద్దాం. అతణ్ణి ఎలాగైనా ఒప్పించితీరాలని చెబుదాం. రేపు రాత్రే... ఏమంటారు?'

నిర్ణయించుకున్నట్టే రామ్‌ప్రసాద్ ఇంట్లో వాళ్ళు ముగ్గురూ కలుసుకున్నారు. మిగిలిన ఇద్దరు అతిథుల్ని చూసి అరుణ ఆశ్చర్యపోయి పరిపరివిధాలుగా ఆలోచించే అవకాశమివ్వకుండా, వాళ్ళిద్దరూ తన పాతస్నేహితులేననీ ఏదో పనిమీద ఈ ఊరు వచ్చారనీ, ధార్మికవిషయాలమీద ఎంతో ఆసక్తిచూపించే ఆమెమీద తమకెంతో గౌరవమని చెప్పారనీ, మరోసారి వారిని చూడడానికి మీకుకూడా అభ్యంతరం ఉండదని భావించి ఆహ్వానించాననీ రామ్ ప్రసాద్ చెప్పాడు. అరుణ సహృదయంతో తలూపింది. ఆ సాయంత్రంప్రథమార్థాన్ని వారు లతామంగేష్కర్, విష్ణుపంత్ పగ్నిస్, విష్ణుదిగంబర్ పలూస్కర్, చిత్తూరి నాగయ్య తదితరులు గానంచేసిన భక్తిగీతాలు వింటూ గడిపారు. ఆ ప్రాంతానికి పెట్టినపేరైన తాజా నల్లద్రాక్షరసాన్ని సేవించారు. షడ్రసోపేతంగా సిద్ధంచేసిన భోజనానికి ఉపక్రమిస్తున్నవేళ అరుణ అనుకుంది —అసలువిషయంలోకి ఎంత సేపటికీ రారేమిటని. మిగిలిన ఇద్దరు అతిథుల్ని అక్కడ చూసిన తక్షణమే ఆమె పసికట్టింది, ఈ వ్యవహారంలో భోజనానికి మించినదేదో ఉందని. బహుశా తన సహాయం కావలసిన వేరే ధార్మిక కార్యక్రమాల గురించి మాట్లాడతారు కాబోలు.

రాత్రి గడుస్తున్నకొద్దీ, ఆ ముగ్గురూ సంభాషణను ఎంతో నేర్పుగా విజయసాగర్‌ప్రాజెక్టువైపూ, ఇరిగేషన్ మినిష్టర్‌దగ్గర పెండింగ్‌లో ఉన్న ఫైలువైపూ నడిపించారు. మెల్లమెల్లగా ఒత్తిడి పెంచడం ప్రారంభించారు. ఆ ప్రాజెక్టుకు సంబంధించి ఏం జరుగుతోందో తనకేమీ తెలియదని అరుణ సహజంగానే జవాబుచెప్పింది. చివరకు, ఆ ముగ్గురు తంత్రకర్తలు మంత్రిగారిదగ్గర మీ పలుకుబడి ఉపయోగించి తమను గట్టెక్కించాలని సూటిగా అడిగేశారు.

'మీ రంటున్నదేమిటో నా కర్థంకావడంలేదు. ఆ ప్రాజెక్ట్ విషయంలో నేను చేయగలిగిందే ముంటుంది?' ఎట్టకేలకు ఆమె ప్రశ్నించింది.

వాళ్ళు తమ చెవుల్ని తామే నమ్మలేకపోయారు. మరింత ఎక్కువ డబ్బు గుంజడానికి అమాయకత్వం నటిస్తోంది కాబోలని మొదట వాళ్ళ కనిపించింది.

'అక్కా,' రామ్‌ప్రసాద్ అందుకున్నాడు. 'నువ్వు సాయంచేయకపోతే మేం పూర్తిగా చితికిపోతాం. మా మీద కాస్త దయచూపించు.'

'మనిషిమీద దయచూపించగలిగింది ఆ భగవంతుడే ప్రసాద్‌గారూ' అరుణ ఎంతో ప్రశాంతంగా సమాధానం చెప్పింది. 'న్యాయం మీవైపు ఉంటేమాత్రం, ఆనంద్ మీకు అనుకూలంగానే నిర్ణయం తీసుకుంటాడని కచ్చితంగా చెప్పగలను.'

'మాతాజీ' అజిత్‌సింగ్ అద్భుతగులుతూ అన్నాడు 'ఇది బొత్తిగా దయ, దాక్షిణ్యం లేని ప్రపంచం, సక్రమంగా ఉన్న పనులకుకూడా గట్టి సిఫార్సులు అవసరమౌతాయి.'

'ఆనంద్ విషయంలో కాదు, ఆ హామీ మాత్రం నేనివ్వగలను' ఆమె ఎంతో ధీమాగా అంది.

'దేవీజీ, చూశారూ...' సిన్హా వివరించడం ప్రారంభించాడు. 'ఈ దౌర్భాగ్యపు ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్‌లో చాలా విషయాలు న్యాయబద్ధంగానే ఉంటాయికానీ ముక్కుసూటిగా ఉండవు.

మా కేసు కూడా అలాంటిదే. కనుక మీరు మంత్రిగారికి నచ్చజెప్పకపోతే ఆయన చేయడు. అదీ వచ్చిన చిక్కు.'

'అయితే నిజంగానే ఏదో చిక్కు ఉండే ఉంటుంది' అరుణ ఏకీభవిస్తూ ఉంది. 'వ్యవహారం ముక్కుసూటిగా లేకపోతే అతడు చేయడు, నచ్చజెప్పూ, చెప్పకపో.'

'అక్కా నువ్వాయన్ను ఒప్పించగలవు, నాకు తెలుసు' రామ్‌ప్రసాద్ ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

'లేదు, నా వల్ల కాదు...'

'కాదు, మీ వల్లే అవుతుంది' సిన్హా నొక్కిచెబుతూ అన్నాడు. 'మంత్రిగారి దగ్గర మీ మాట కెంత విలువుందో మాకు తెలుసు దేవీజీ. దయచేసి మమ్మల్ని కాదనకండి. దయచేసి ఫోను తీసుకుని నా చండీయాగం విషయంలో ప్రయోగించిన చిట్కానే ఇంకోసారి ప్రయోగించండి'

'నా అనాధశరణాలయం విషయంలో చేసినట్టే' అజిత్‌సింగ్ వంతపాడాడు.

'నా కుంభాభిషేక కార్యక్రమం విషయంలో చెప్పినట్టే' రామ్‌ప్రసాద్ గొంతుకలిపాడు.

ఆమె చాలాసేపు వారిని తేరిపారచూస్తూ నిశ్శబ్దంగా ఉండిపోయింది. తర్వాత విసుగు ధ్వనింప జేస్తూ అంది. 'ఏమిటి మీరు మాట్లాడుతున్నది? ఏదో దైవకార్యమన్నారని చెప్పి ఆనంద్‌ని ఒప్పించాను. అందులో తప్పేమీ లేదనుకున్నాను. దేవుడికార్యంలో అతడు సహాయపడతాననడమే ఎంతో విశేషం. అతని ప్రభుత్వకార్యక్రమాల్లో నేనెన్నడూ జోక్యంచేసుకోను. ఐయామ్ సారీ, మీ ప్రాజెక్టు విషయంలో నే నేమీ చేయలేను.'

ఆమె వెళ్ళడానికి లేచింది.

పూర్తిగా చేష్టలుదక్కి నిలబడిపోయిన ఆ ముగ్గురూ, ఆమె బయటకు అడుగులువేస్తూంటే యాంత్రికంగా చేతులుజోడించి క్షీణస్వరంతో నమస్కారాలు చెబుతూ ఉండిపోయారు. ఆమెను గేటువరకూ దిగబెట్టి రావాలన్న ఊహ కూడా వాళ్ళలో ఏ ఒకరికీ కలగలేదు. ఆమె కారు బయలుదేరిన శబ్దం విన్న తర్వాతనే వాళ్ళు ఈ లోకంలోకి వచ్చారు. ఉరుకులుపరుగులమీద గేటు సమీపించేసరికి ఆమె వెళ్ళిపోయింది.

మాటల్లో వర్ణించలేనంతగా వాళ్ళలో ఆగ్రహం కట్టలుతెంచుకుంది. ఎవరికివారు తాము తెచ్చుకోగలిగినంత ఉద్రేకంతో ఊగిపోతూ అరుణను తిట్టిపోశారు.

'దొంగ లంజ' పళ్ళు కొరికాడు అజిత్‌సింగ్.

'పట్టి రంకుముండ' కాండ్రించి ఉమ్మేశాడు సిన్హా.

'పనికిమాలిన పాడు లంజ' విరుచుకుపడ్డాడు రామ్‌ప్రసాద్.

'దీనికీ వాడికీ మూడిందిలే. వాళ్ళ సంతోషంలో నిప్పులుపోయకుండా ఊరుకునేది లేదు' సిన్హా విషంపుక్కిలిస్తూ గాండ్రించాడు. మిగిలినవాళ్ళు కూడా వెంటనే అతడితో శ్రుతి కలిపారు.

# 24

ఇద్దరు మంత్రులు ఘర్షణ పడుతుంటే, ఆ ఘర్షణకు దోహదంచేసే కారణాలు చాలా ఉంటాయి. ఉదాహరణకు, ఏదైనా ఓ మంత్రిత్వశాఖ గురించి కావచ్చు. ఎవరికో చేసిన ఒక ఉపకారానికి సంబంధించి కావచ్చు. తమ జిల్లాలో ముఠా తగాదాలకు సంబంధించి కావచ్చు. ఇద్దరిలో ఎక్కువ జనాదరణ ఎవరి కుందన్న ప్రశ్న గురించి కావచ్చు. ముఖ్యమంత్రికి ఎవరెక్కువ సన్నిహితులన్న విషయం గురించి కావచ్చు... అయితే ఆనంద్, శేఖర్‌లమధ్య స్పర్ధకు ఈ కారణాలలో ఏ ఒకటీ వర్తించదు. వాళ్ళిద్దరూ ఒకే మంత్రిత్వశాఖకోసం పోటీపడిన ప్రత్యర్థులు కారు. చౌదరి తమకు కేటాయించిన శాఖతో ఇద్దరూ తృప్తిపడ్డారు ఇతరులకు చేసిన ఉపకారాల విషయంలో వాళ్ళమధ్య ఎటువంటి వివాదమూ లేదు, అటువంటి విషయాలను వాళ్ళంతగా పట్టించుకోరు. ఇక, ఇద్దరూ వాళ్లవాళ్ళ తరహాలో ప్రాముఖ్యం గడించుకున్న వాళ్ళేకనుక ఆ విషయంలో కూడా వాళ్ళమధ్య వివాదానికి అవకాశంలేదు. ఇద్దరూ వేర్వేరు జిల్లాలవాళ్ళు కనుక విరోధాన్ని పెంచే స్థానికకారణాలుకూడా ఏవీలేవు. ఇద్దరూ ముఖ్యమంత్రికి ఉండవలసినంత దూరంలోనే -లేదా వాళ్ళ వాళ్ళ చూపునుబట్టి ఉండవలసినంత దగ్గరలోనే ఉంటూ వచ్చారు. చౌదరి గట్టిపిండమని ఇద్దరికీ తెలుసు. ఒక్క మాటలో చెప్పాలంటే వాళ్ళ ఘర్షణ వెనుక సాధారణంగా రాజకీయవాదుల్ని విడదీసే కారణాలేవీ కనబడవు. ఈ అసాధారణస్థితిని అర్థం చేసుకోలేని రాజకీయ 'పండితులు', కారణం ఉన్నా లేకపోయినా ఆనంద్, శేఖర్ ఒకరి మీద ఒకరు విమర్శలు చేసుకోకుండా ఉండలేరనీ, ఘర్షణ కొరకే ఘర్షణ పడుతుంటారనీ తరచు వ్యాఖ్యానాలు చేస్తుంటారు. ఈ విషయంలో రాజకీయవాదులు, కుక్కలూ ఒకటేనని కూడా తిరస్కారభావంతో అన్నవాళ్ళున్నారు.

శేఖర్, ఆనంద్‌లకు ఒకరిమీద ఒకరికి అభిమానమూ ఉంది, ద్వేషమూ ఉంది. ఆనంద్ మేధాశక్తిని శేఖర్ మెచ్చుకుంటూనే ఉంటాడు. అయితే ఏవో నక్షత్రలోకాల్లోకి చూపులు సారించే మూర్ఖుడని అంటుంటాడు. శేఖర్ సంఘటనా సామర్థ్యాన్ని ఆనంద్ ప్రశంసిస్తూనే అతణ్ణి దుష్ట బుద్ధిగా భావిస్తుంటాడు. అతడేం చేసినా అది వినాశానికే దారితీస్తుందని అతడి ఉద్దేశం. 'వక్ర బుద్ధి' అనడానికతడు నూటికినూరుపాళ్ళూ సరిపోతాడని అతడి అభిప్రాయం. ఆ అభిప్రాయంతో చాలామంది ఏకీభవిస్తారు కానీ, ఆ మాట పైకి అనే వాళ్ళు కొందరే. ప్రమాదం కలిగించగల వ్యక్తులగురించి మాట్లాడేటప్పుడు రాజకీయవాదులు వీలైనంత గుంభనంగా ఉంటారు.

శేఖర్ చిన్నప్పుడే దుర్భరమైన అన్యాయాలు చవిచూశాడు. స్కూలుకి వెళ్ళవలసిన వయసులో అతడిచేత గొడ్లకాపరి పనిచేయించారు అతడుంటున్న భూస్వామి కుటుంబంలోని పిల్లలందరూ మామూలుగా అక్షరాభ్యాసం చేసుకుని స్కూళ్ళలో చేరారు. వాళ్ళుంటున్నది లంకంత ఇల్లు దానిని గడీ అని పిలుస్తారు. ఊరి మధ్యలో ఉంటుంది. చుట్టూ నిప్పచ్చరంగా కనిపించే పూరిగుడిసెలు గడీలో ఉంటున్న మోతుబరులకూ, గుడిసెలో ఉంటున్న పేదలకీ మధ్య కొట్టొచ్చినట్టు కనిపించే ఆ అంతరం ఎందుకో చిన్నతనంలో శేఖర్‌కి ఏమాత్రం అర్థమయ్యేదికాదు. అతడు ఆ గడీలోనే పెరిగాడు కానీ మిగిలిన పిల్లల్లా సుఖసంతోషాలకూ, ముద్దుముచ్చటలకూ నోచుకోలేదు తనలానే నిరాదరణకులోనైన తమకంటె పెద్దవాడు ఒకతను అసలు మర్మం చెప్పేవరకూ, ఇలా ఎందుకు జరుగుతోందో శేఖర్‌కి అర్థం కాలేదు. 'ఓరి చవటా! ఈ విషయాలు నీకు తర్వాత తర్వాత తెలుస్తాయిలే. ఏడుపు దిగమింగు, నోరు మూసుకుని పడుండు. నువ్వు దేశ్‌ముఖ్ కొడుకువేంకాదు. ఆ దిక్కుమాలిన దాసీదాని కొడుకువి. వాళ్ళు ఎప్పుడనుకుంటే అప్పుడు నిన్ను గడీనుంచి తన్నితరిమేస్తారు. నువ్వు తిన్నగా లేకపోతే తప్పకుండా జరిగేదదే..'

'దాసీ అంటే?'

తననింత దారుణంగా చిన్నచూపు చూడడానికి కారణమేమిటో తెలుసుకోవాలన్న ఉత్సుకతను అణచుకోలేక శేఖర్ ప్రశ్నించాడు. అయిదేళ్ళ ఆ వయసులోనే తాను శారీరకబలంలోనూ, బుద్ధిబలంలోనూ గడీలోని మోతుబరి పిల్లలకంటె పైమెట్టుమీద ఉన్నట్టు అతడికి తెలుసు వాళ్ళతో కుస్తీలకు దిగినప్పుడు, పండుగల్లో పాటలు పద్యాలు వల్లించిన సందర్భాల్లో– ఈ విషయం రుజువు చేసుకున్నాడు. దేశ్‌ముఖ్ కుటుంబంలోని పిల్లలకోసం గడీలోనే ఏర్పాటు చేసిన ప్రైవేట్ స్కూలుకు తనను పంపనందుకు అతడి కందుకే కోపం ముంచుకొచ్చింది. మామూలుగా అయితే, తన వయసు పిల్లలందరూ అనుకున్నట్టే స్కూలుకు వెళ్ళకపోతేనే బాగుంటుందని తనుకూడా అనుకుని ఉండేవాడు. అయితే తనకా అవకాశం ఇవ్వకపోవడంతో స్కూలుకెళ్ళి చదువుకోవడం నిజంగా వాంఛనీయమైందని అతనిలో మరింత బలంగా నాటుకుపోయింది. ముఖ్యంగా మిగిలిన పిల్లల్ని నిర్బంధంగా స్కూలుకు పంపుతున్నప్పుడు మరీనూ.

దాసి అంటే ఏమిటో నీకు తెలిసినట్టు లేదే. మీ అమ్మ ఇల్లు ఊడవడం, వాళ్ళు రాణీలని పిలిచే గడీలోని మిగిలిన ఆడవాళ్ళ కాళ్ళు ఒత్తడం నువ్వెప్పుడూ చూడలేదా?' ఆ పెద్దకుర్రాడు బోధించడం ప్రారంభించాడు.

'అవును, చూశాను.' శేఖర్ సమాధానం చెప్పాడు అతడికి లీలగా అర్థమౌతున్నట్టనిపించింది.

'ఆ రాణీల్లో ఎవరైనా మీ అమ్మ కాళ్ళు ఒత్తడమెప్పుడైనా చూశావా?'

'లేదు. కొవ్వెక్కి వికారంగా కనిపించే ఓ ఆడది ఓసారి ఉత్తిపుణ్యాన మా అమ్మను తన్నడం కూడా చూశాను అప్పుడే ఆమె నడ్డిమీద గట్టిగా తన్నాలనుకున్నాను. కానీ మా అమ్మ నావైపు ఉరిమిచూసింది. తర్వాత నన్నా ఆడమనిషి గదికి తీసుకెళ్ళడమే మానేసింది..' శేఖర్ చెప్పాడు.

'రాణీకి దాసీకి తేడా అదన్నమాట. అర్థమైందా?' ఆ పెద్దకుర్రాడు విజయగర్వంతో అన్నాడు. ఓ రాలుగాయి కుర్రాడికి కొన్ని జీవనసత్యాలు బోధించే అవకాశం తనకు లభించినందుకు అతడికెంతో సంతోషం కలిగింది.

'అర్థమైనట్టే ఉంది' శేఖర్ అన్యమనస్కంగా అన్నాడు. 'నాకిది ఇష్టంలేదు, ఎంతమాత్రం ఇష్టంలేదు.'

'నీ ఇష్టాయిష్టాలు ఎవడిక్కావాలి బుద్ధితక్కువ గాడిదా? ఇక్కడ ఇదే రివాజు. గమ్మని ఉండు. నీ పనేదో నువ్వు చూసుకో' పెద్దతను కేకలు వేశాడు.

శేఖర్ మాట్లాడలేదు. కోపంతో బుసలుకొడుతూ ఉండిపోయాడు. తన పేరును చులకన చేస్తూ ఎవరైనా తనను 'శేఖరిగా'అని పిలిస్తే కుతకుత ఉడికిపోయేవాడు. ఓసారి కోపం అపుకోలేక ఆఖరి దేశ్‌ముఖ్ చిన్నకొడుకును 'శీనిగా' అని పిలిచాడు. (పూర్తి పేరు శ్రీనివాస్). అంతే. గడీలో పనిచేసే నౌకర్లలో ఓ పెద్దతను శేఖర్‌కి బాగా దేహశుద్ధి చేశాడు. శరీరానికి తగిలిన గాయాల కన్నా అహానికి తగిలిన గాయాలు అతణ్ణి చాలాకాలం బాధపెట్టాయి.

పెద్దవాడవుతున్నకొద్దీ వింతవింత విషయాలు అతని దృష్టికి రాసాగాయి. అమ్మ, తనూ ఓ చిన్నఇంట్లో ఉండేవారు అమ్మ తనను పెందరాళే నిద్రపుచ్చేది. అర్ధరాత్రి మెలకువొచ్చి చూస్తే అమ్మ తన పక్కన కనిపించేదికాదు అమ్మకి తెలియకుండా కొన్నిసార్లు ఆమె వెనకనే వెళ్ళాడు తను దేశ్‌ముఖ్ అన్నదమ్ముల్లో ఎవరో ఒకరి పడగ్గదిలోకో, ఆ రోజే గడీకొచ్చిన అతిథి పడుకున్న గదిలోకో అమ్మ వెళ్ళడం కనిపించేది. పట్నంనుంచివచ్చి గడీ ఆవరణలోనే ఉన్న గెస్ట్‌హౌస్‌లో దిగిన ఆఫీసర్లకు అమ్మ భోజనం తీసుకువెళ్ళడం కూడా తననేకసార్లు చూశాడు. భోజనం అక్కడపెట్టి వెంటనే తిరిగి రావలసిన అమ్మ అలా చేయకుండా ఎక్కువసేపు గెస్ట్‌హౌస్‌లోనే ఉండిపోయేది. కుతూహలం అణచుకోలేక ఒక్కోసారి తను లోపలికి తొంగిచూసేవాడు. పట్టపగలే తలుపులు లోపల గడియపెట్టి ఉండేవి. కారణం అంతుబట్టేదికాదు. లోపల ఏం జరుగుతోందో అర్థంకాక అతడికంతా అయోమయంగా ఉండేది

ఒక్కోసారి జమీలో పనిచేసే గుమస్తాలో, ఇతర చిల్లర ఉద్యోగులో ఇంటికే వచ్చేవారు. శేఖర్ చేతిలో మిఠాయో, ఆటబొమ్మో పెట్టేవారు. తల్లి ఏదో వంకచెప్పి అతణ్ణి గంట సేపు బయటికి పంపించేసేది. ఓసారి అతను రావలసిన వేళకంటె ముందే ఇంటి కొచ్చేశాడు. తలుపు లోపలినుంచి గడియపెట్టి ఉండడం చూశాడు. తలుపులు విరగ్గొట్టాలనిపించింది. కానీ ఏదో న్యూనతాభావం ముంచుకొచ్చి ఎక్కడికనే ఆలోచన లేకుండా బయటికి పరుగుతీసి ఊరి చివర ఒకచోట రొప్పుతూ నిలబడి పోయాడు. భోరున ఏడవాలనిపించింది. తన అనుభూతిని అతడు చెప్పలేకపోయినా అది నిజం

గడీలోని ప్రతి ఒకరూ తన తల్లిని కామవాంఛకు వాడుతున్నారని క్రమంగా, అత్యంత బాధాకరంగా అతనికి తెలిసొచ్చింది. దేశ్‌ముఖ్ కుటుంబంలో అందరూ, తండ్రీ కొడుకనే తేడా లేకుండా ఎప్పుడు కోరికపుడితే అప్పుడు ఆమెను తమ పక్కలోకి పిలుచుకున్నారు. తండ్రులు అప్పుడప్పుడు కాస్తంత మార్పు కోసం, కొడుకులు సెక్స్‌లో తొలి పాఠాలు నేర్చుకొని సాధనచేయడంకోసం. ఆ పశుత్వాన్ని అంతటినీ ఆమె నోరుమూసుకుని భరించింది. అలా శరీరాన్ని అప్పగించడం భూస్వామ్యవ్యవస్థలో దాసి నిర్వర్తించవలసిన విధిగా ఆమె భావించింది దాని నుంచి ఆమె తప్పించుకోలేక పోయింది. తరతరాలుగా బానిసల్ని అలాగే కట్టడి చేస్తూవచ్చారు.

శేఖర్‌కి ఎనిమిదేళ్ళు వచ్చేసరికి భూస్వామ్యవ్యవస్థ తీరుతెన్నులు బాగా అర్థమై లోలోపల ఆగ్రహం, అసంతృప్తి రగులుకోవడం ప్రారంభించాయి. మిగిలిన పిల్లలతో కలిసి గొడ్లు తోలుకెళ్ళగలిగిన వయసది. గొడ్లు మేస్తుంటే రోజంతా వాళ్ళందరూ ఒకచోట చేరి కబుర్లు చెప్పుకునేవారు. ఆ కబుర్లనుంచి శేఖర్‌కి రకరకాల బూతుమాటలు, తిట్లు పట్టుబడిపోయాయి. 'హోదా' అనే మాట కర్థం లోతుగా గ్రహించుకోగలిగాడు. అలాగే లైంగికవిషయాల్లో మంచి పాండిత్యమూ అలవడింది. అన్నింటినీ మించి ఒకవిధమైన నాటుతెలివి, అనేక ఒడుదుడుకుల్ని తట్టుకుని నిబ్బరంగా నిలబడే తెలివి అతని కబ్బింది. ముందుముందు జీవితంలో ఆ తెలివి అతని కెంతో ఉపయోగపడింది.

అతడి తల్లి గడీలోనే కాదు, మొత్తం గ్రామంలోనే గొప్ప అందగత్తె అనిపించుకుంది. ఆమె తల్లిదండ్రులెవరో ఎవరికీ తెలియదు. గతంలో ఆ జిల్లా మొత్తం కనీవినీ ఎరుగని కాటకంతో విలవిలలాడిపోయినప్పుడు అక్కడికెంతో దూరంలో ఉన్న గ్రామంనుంచి వచ్చి, ఇటీవల స్వర్గస్థుడైన అప్పటి పెద్దభూస్వామికి పన్నెండేళ్ళ వయసున్న కూతురిని తల్లిదండ్రులు అమ్ముకున్నారని మాత్రం చెప్పుకుంటారు. భూస్వామీ, అతడి భార్య ఆమె అందచందాలకు ముగ్ధులైతే, ఓ సంపన్న భూస్వామి కుటుంబంలో పిల్లనమ్ముకుంటే కనీసం తిండికీ బట్టకీ లోటులేకుండా జరిగిపోతుందిలే అనుకుని తల్లిదండ్రులు ఊరటచెందారు ఇక మిగిలిన విషయాలంటారా, ఒక ఆడదిగా ఆమె బతుకు ఎలా అఘోరించినా, కడుపునింపుకోవడంకోసం తక్షణమే పడుపు వృత్తిలోకి దిగే అవసరం తప్పిపోతుంది, అదే చాలు ననుకున్నారు. ఒకవిధంగా చెప్పాలంటే భూస్వాములు ఆమె దేహాన్నీ, బుద్ధినీ, ఆత్మనీ కూడా సొంతం చేసేసుకున్నారు. ఆ రోజుల్లో అందరూ ఆమోదించి సరిపెట్టుకున్న వాస్తవమే అది.

రెండుమూడుసార్లు నిర్బంధ గర్భస్రావాలు జరిపించుకుని, మళ్ళీమళ్ళీ తయారై ప్రతి ఒకళ్ళ చేతుల్లో ఆటబొమ్మలా నలిగిపోతూ వాళ్ళ విశృంఖల, పశువాంఛ తీర్చిన తర్వాత కొంతకాలానికి ఆమెకు శేఖర్ పుట్టాడు. పుట్టడానికి అనుమతింప బడ్డాడనడమే న్యాయం. ఆమెమీద కనికరంతో మాతృత్వాన్ని అను గ్రహించారో లేక పొరపాటున అలా జరిగిందో స్పష్టంగా తెలియదు. ఆమె ఎవరినీ ఏదీ ప్రశ్నించి ఎరగదు. అయితే శేఖర్ ఆరోగ్యంగా, చురుకుతనం ఉన్న కుర్రాడుగా ఎదుగుతుంటే చూసి ఆమె గుంభనంగా ఎంతో సంతోషపడింది.

శేఖర్ తల్లిమీద ఆపేక్ష ఉన్నవాడే. అయితే అతడెన్నెన్నో చూశాడు కనుక ఆమె దేవతో, దెయ్యమో చప్పున తేల్చుకోలేకపోయాడు. తనలో అటువంటి విచికిత్స పుట్టీపుట్టగానే అణచుకునేవాడు. పదేళ్ళవయసులో ఒకేఒక ప్రబలమైన కోరిక దేశ్‌ముఖ్ కుటుంబంలోని మగ పందులు తన తల్లి విషయంలో చేసినవే తాను ఆ కుటుంబంలోని ఆడవాళ్ళందరి విషయంలో చేయాలన్న కోరిక అతణ్ణి లోబరచుకుంది.

లోకజ్ఞానంలో తన వయసు పిల్లలకంటె అతడెంతో ముందుకెళ్ళినమాట నిజమే కానీ, ఆ అదనపు జ్ఞానమే తన తల్లికి జరిగిన అన్యాయం పట్ల అతణ్ణి అశాంతికి లోనుచేసింది జతగాళ్ళతో ఉన్నప్పుడు చెప్పుకునే ముచ్చట్లలో లైంగికవిషయాలే ఎక్కువగా దొర్లిపోతూఉండేవి. వాళ్ళలో పెద్దకుర్రాళ్ళు గడీలో సాగిపోయే కామకలాపాలగురించి అదేపనిగా పోచికోలుకబుర్లు చెబుతూండే

వారు. వాటిలో నిజాలు కొన్నే. శ్రుతిమించిన వాళ్ళ ఊహాశక్తినుంచి పుట్టుకొచ్చిన కల్పనలే ఎక్కువ. గడీలో మగవాళ్ళు పనిగత్తెలవెంట, పడుపుగత్తెలవెంట పడుతుంటే, తెగబలిసి అందవికారంగా కనిపించే వాళ్ళ భార్యలు కాస్త నదురుగా కనిపించే కుర్రనౌకర్లతో కోరిక తీర్చుకుంటూ ఉంటారట. దేశ్‌ముఖ్ భార్యల్లో కొందరు తీరనికామంతో ఆవురావురుమంటూ ఉంటారట పోషణలేక కృశించిన పేదకుర్రాళ్ళను రాత్రీపగలనే తేడా లేకుండా ఎప్పుడైనాసరే పక్కలోకి లాక్కుని కొన్ని మాసాల్లోనే వాళ్ళ శక్తినంతనీ పిండి పిప్పిచేసి విడిచిపెడతారట. ఇక భర్తల ధోరణి మరోరకం. మగతనం లోపించిన ఓ కామందు ప్రతిదీ చూసుకుంటాడు కానీ భార్య పడకగదివైపు మాత్రం చచ్చినాచూడ్డట. గొడ్లు కాచుకునే పేదకుర్రాళ్ళు చెప్పుకునే కథలు ఇలా ఉండేవి. ఈ ముచ్చట్లలో వాళ్ళకెంతో సంతృప్తి దొరుకుతుంది. అవి వాళ్ళ మానసిక ప్రవృత్తులను ప్రతీకారేచ్ఛలతో రాటుదేలేలా చేసేవి.

ఈ విషయంలో శేఖర్ అనుభవం కానీ, అతడి దోస్తుల అనుభవం కానీ పాశవికమైన అణచివేతకులోనైన ఏ ఇతర వర్గం అనుభవానికీ భిన్నమైనవి కావు. క్రోధావేశాలతో లోపల్లోపలే రగిలిపోతూ తమ యజమానులు నాశనమైపోవాలని శపించుకుంటూ ఉంటారు. అయినా జీవితాంతం వాళ్ళకు చాకిరీచేస్తూనే ఉంటారు. ఆ దుస్సహదాస్యంనుంచి వాళ్ళు తప్పించుకోలేరు. ఆ బానిసత్వంనుంచి బయటపడేమార్గం ఉండదు. మనిషి నెత్తురుతాగే ఆ భూస్వాములు విచిత్రంగా తమ నౌకర్లనుంచి విధేయప్రేమనీ, కృతజ్ఞతనీ పొందుతూనే ఉంటారు. కారణం మరేంకాదు, సేవకుల్లో ద్వేషం ఎంత గాఢంగా గూడుకట్టుకున్నా, ఎల్లవేళలా ద్వేషిస్తూ బతకడం వాళ్ళకీ సాధ్యంకాదు. శతాబ్దాలుగా వర్ధిల్లుతున్న అణచివేతవిధానాలను ప్రతి ఘటించి ప్రయోజనంలేదనే తెలివిడి వాళ్ళకెప్పుడో ఒకప్పుడు కలిగితీరుతుంది. రక్తంలో జీర్ణించుకున్న కర్మసిద్ధాంతం ఏదోవిధంగా జీవించడానికి అవసరమైన నెపంతోపాటు వాళ్ళకు తాత్వికమైన ఓదార్పునీ అందిస్తూ ఉంటుంది.

శేఖర్ పెరిగిపెద్దవుతున్న కొద్దీ ముంచెత్తిన అశాంతితో, గుండెల్లో నిరంతరంగా సుడులు తిరిగే క్రోధజ్వాలతో దహించుకుపోయాడు. అతడి బుద్ధికుశలతని ఎవరూ కాదనలేరు. అయినా ఆ బుద్ధి సహజంగా వికసించే అవకాశం లేకుండా చేశారు. దేశ్‌ముఖ్ 'బీజం' కనుకనే అతడికా తెలివితేటలు వచ్చాయని అంటుండేవారు. ఎంతైనా అతని ఒంట్లో ప్రవహించేది భూస్వాముల రక్తమేకాదా అనే వాళ్ళు. అయితే దేశ్‌ముఖ్ సొంతబిడ్డలు, దేశ్‌ముఖ్‌లకే పుట్టిఉంటే అంత మందబుద్ధులుగా, పనికిరాని పీనుగులుగా ఎందుకున్నారో చెప్పినవాడు ఒకడూలేడు. వాళ్ళు అతణ్ణి రకరకాల నిందార్థకాలతో పిలుస్తూఉండేవారు. శతబిందు -అంటే నూరు వీర్యపుచుక్కల నుంచి పుట్టినవాడనీ, సంకరజాతి అనీ, లంజకొడుకనీ... ఇలా లెక్కలేనన్ని అవమానకరమైన విశేషణాల్ని అతనిమీద గుప్పించేవారు అవి అతడికి దుస్సహంగా ఉండేవి. ఈ విషయంలో మిగిలిన పిల్లలతో —చివరకు పెద్దవాళ్ళతోకూడా ఎన్నోసార్లు ఘర్షణపడ్డాడు. తన పుట్టుకను వేలెత్తిచూపించి ఎవరైనా ఆక్షేపించినప్పుడు అతని నవనాడులూ కుంగిపోయేవి. తన మేధాశక్తి, తను సాధించినవి ఎంత గొప్పవైనాకావచ్చు, అయినా ఎవరూ తనను గౌరవించరు. ఎటువంటి గౌరవం, హోదా లేకుండా తను దాసీపుత్రుడుగానే బతికాడు, ఇకముందుకూడా అలాగే బతుకుతాడు. అన్నీ ఈ వాస్తవంలోనే వేళ్ళూనుకున్నాయి

ఓ రోజు ఉదయం శేఖర్ గడీనుంచి అదృశ్యమైపోయాడు. కొద్దిపాటి కలకలంరేగింది, అయితే కొద్దిరోజుల్లోనే అది సద్దుమణిగిపోయింది. అర్ధమనస్కంగానే చుట్టుపక్కల ఊళ్ళువాళ్ళను వాకబుచేశారు. మరింత తీవ్రంగా గాలించేస్థితిలో అతని తల్లి లేదు. గడీలో అందరూ శేఖర్ చచ్చాడనో, దారితప్పి ఎటో పోయాడనో, ఎవరో ఎత్తుకుపోయారనో, ఏదో ఆశచూపించి తీసుకుపోయారనో అనేసి ఊరుకున్నారు. దేశ్‌ముఖ్‌లలో ఏ ఒకడూ పట్టించుకోలేదు. అంత కాలంగా అతడి తల్లిచేత ఊడిగం చేయించుకుంటూ కూడా ఉదాసీనంగా ఉండిపోయారుతప్ప ఆమెమీద కనికరం చూపించినవాళ్ళు ఒకరూ లేకపోయారు. తన ఒకే ఒక కొడుకుని కోల్పోయినాసరే ఆమెమీద సానుభూతి చూపవలసిన అవసరంలేదు; కారణం ఆమె దాసి కనుక.

అలా మొదలైన శేఖర్ ప్రయాణం అడ్డదారులవెంట అనంతంగా సాగిపోయింది. స్మగ్లర్ల స్థావరాల్లో కొన్నాళ్ళు, అనాథశరణాలయాల్లో కొన్నాళ్ళు, జైళ్ళలో కొన్నాళ్ళు; దొంగలమధ్య, జేబుదొంగలమధ్య, వీధుల్లో కాయకష్టంచేసుకునే పిల్లలమధ్య, హోమోసెక్సువల్స్‌మధ్య, తార్పుడుగాళ్ళమధ్య, ఇంకా రకరకాల నేరగాళ్ళమధ్య కాలక్షేపంచేశాడు. వాళ్ళతో స్నేహం చేశాడు, వాళ్ళను అధ్యయనంచేశాడు, వాళ్ళతో ఆత్మీయంగా తిరిగాడు, వాళ్ళను ప్రేమించాడు, ద్వేషించాడు. అన్నింటినీమించి వాళ్ళను వాడుకున్నాడు, తాను పైకివెళ్ళడానికి నిచ్చెనగా చేసుకున్నాడు. కూడుకీ, నీడకీ దిక్కులేని దయనీయపరిస్థితిలో తిరుగుబోతుజీవితం గడుపుతున్నా, ఎలాగో తనంతటతానే తగినంత ధారాళంగా చదవడం రాయడం నేర్చుకున్నాడు. ఎన్నో ఇతర రంగాలలోకూడా సామర్థ్యం గడించుకున్నాడు. తల్లిపట్ల సాగించిన అత్యాచారాలకీ, సంఘబాహ్యుడిగా తాను ఎదుర్కొన్న ఎడతెగని అవమానాలకు ప్రతీకారం తీర్చుకోడానికి తగిన సాధనం ఇదేనను కున్నాడు

ఓ రోజున, దోపిడీలు, హత్యలు సాగిస్తూ అజ్ఞాతజీవితం గడిపే ఓ తిరుగుబాటువర్గంతో కలిసి దాడిలో పాల్గొన్నాడు. నేరస్థులే అయినా వాళ్ళు భిన్నంగా ఉన్నట్టు గమనించాడు. హెచ్చుతగ్గుల తేడాతో వాళ్ళందరూ ఏదో సిద్ధాంతంనుంచి స్ఫూర్తిని పొందినవాళ్ళు. సమాజంలోని అణచివేతవర్గాన్ని నిర్మూలించవలసిందేనని త్రికరణశుద్ధిగా విశ్వసిస్తున్నవాళ్ళు వాళ్ళలో కొందరే. మిగిలినవాళ్ళు ఆ బృందం సిద్ధాంతాలను ఆడంబరంగా వల్లెవేయడమే తప్ప వాటికి ఎప్పుడూ కట్టుబడిఉండలేదు. ఆ సిద్ధాంతం శేఖర్‌ని పెద్దగా ఆకర్షించకపోయినా, భూస్వాముల్ని తుద ముట్టించాలన్న వాళ్ళ ఆలోచన మాత్రం ఎంతగానో నచ్చింది ఆ బృందంతో కొన్నిమాసాలు కలిసిమెలిసి తిరిగిన తర్వాత తనెల్లకాలం రహస్యజీవితం గడపలేనన్న నిర్ధారణకొచ్చాడు.

కుట్రపూరితమైన అతని జీవితం ప్రచ్ఛన్ననేరప్రపంచంతో మంచి పరిచయాలు తెచ్చి పెట్టింది. ఒక స్మగ్లర్లముఠాకు ఎంతో విశ్వాసపాత్రుడుగా మారాడు. ఆ ముఠాకు కొందరు ముఖ్య రాజకీయవాదులతో సన్నిహితసంబంధాలున్నాయి. రాజకీయవాదులమీద అతనికి తెలియకుండానే ఇష్టం ఏర్పడింది. అతడు చూపించే చనువుకు వాళ్ళు అనుకూలంగా స్పందించడం, అతడి సామర్థ్యాన్ని మెచ్చుకోవడం చూసినమీదట ఆ ఇష్టం మరింత పెరిగింది. వాళ్ళకెంతో విశ్వసనీయుడుగా ఉంటూ క్రమంగా నగదునీ, విలువైనసామగ్రినీ ఒకచోటినుంచి మరోచోటుకి చేరవేసే బాధ్యత నిర్వర్తించడం ప్రారంభించాడు. అతడెంతగా ఉపయోగపడతాడో రెండుపక్షాలు చప్పున గ్రహించుకున్నాయి. ఆ ప్రాంతాని కతడు అపరిచితుడు కనుక, పోలీసులు చిత్రహింసలుపెట్టి

నేరం ఒప్పిస్తే తప్ప, ఆ నగదు ఎక్కడిదో బయటపెట్టకుండా బుకాయించి తేలిగ్గా బయటపడగలిగేవాడు. పోలీసులు ఎలాగూ అతణ్ణి మామూలు దొంగగానే జమకడతారు. అప్పుడప్పుడు తన్నులుతినడం తప్ప అతడికి ఇతరత్ర నష్టమేమీ లేదు -నిజానికది స్వల్పమూల్యమే. స్మగ్లరూ, రాజకీయవాదీ ఇద్దరూ క్షేమంగా ఉంటారు. ఎంతో పకడ్బందీగా చేసుకున్న ఏర్పాటు.

అయితే స్మగ్లర్లు, ఇతర నేరస్థులమధ్య జీవించడం శేఖర్‌కి ఎన్నడూ సంతోషం కలిగించలేదు. ఉన్నతస్థితిని అందుకోడానికి సాగించే యాత్రలో స్మగ్లర్లతో సహవాసం ఒక తాత్కాలికమైన మజిలీ మాత్రమే. రాజకీయవాదుల దృష్టి కెక్కిన వెంటనే అతడు స్మగ్లర్లతో సంబంధాలు తెంచేసుకున్నాడు. ఈ మధ్యలో కాస్త చదువుసంధ్యలు నేర్చుకున్నాడు కనుక చక్కని సంఘటనకర్తగా, ప్రచారదక్షుడుగా, నిర్వాహకుడుగా, నెంబర్ టూగా రాజకీయాల్లో రాణించసాగాడు. 1952 ఎన్నికల్లో అతడి నాయకుడు శాసనసభకు ఎన్నిక కావడానికి శేఖర్ అలుపూసొలుపూ లేకుండా చేసిన ప్రయత్నమే ప్రధానంగా దోహదంచేసింది. అలాగని నాయకుణ్ణి నమ్మించగలిగాడు.

నాయకుడు బాగా వయసు పైబడిన తర్వాత ద్వితీయవివాహం చేసుకున్నాడు. మంచి ప్రాయంలో ఉన్న రెండోభార్యవద్ద అతని పరిస్థితి చిక్కుల్లోపడింది. దాంతో శేఖర్‌కీ, ఆమెకీ మధ్య సహజంగానే సంబంధం ఏర్పడడంతో ఎవరూ అనగలిగిందీ, చేయగలిగిందీ ఏమీ లేకపోయింది. శేఖర్ వ్యక్తిగతలక్ష్యాలు తనకు ముప్పుగా తోచి నాయకుడు అతణ్ణి వదిలించుకోవాలనుకున్నాడు కానీ భార్య తనదారికి అడ్డుపడడంతో ఏమీ చేయలేకపోయాడు. 1957 ఎన్నికల్లో ఒక యువకుడికి టిక్కెట్టు ఇవ్వాలని పార్టీ భావించేసరికి ఆ అవకాశం అనివార్యంగా శేఖర్‌కే దక్కింది. అతణ్ణి సమర్థించింది మరెవరో కాదు, అతడి నాయకుడే. తనను గుప్పిట్లో పెట్టుకుని ఆడిస్తున్న భార్య ఒత్తిడిమీద శేఖర్‌కి మద్దతుఇవ్వక తప్పింది కాదు. కొన్ని దశాబ్దాలుగా, అతికష్టంమీద అడుగుతీసి అడుగువేస్తూ పైకి ఎగబాకడానికి ప్రయత్నిస్తున్న పార్టీలోని ఎందరో సీనియర్లను దాటిపోయి అలా ఎం.ఎల్.ఏ శేఖర్ ఒక్కసారిగా రాజకీయగగనంలోకి దూసుకెళ్ళాడు. ఏ ప్రమాణంలో చూసినా ఇది నిజంగా గొప్ప ఫీటు. ఇక అక్కడినుంచి అది తనకు కావలసిన వేగాన్ని తనే తెచ్చుకుంది మిగిలిన కథ బాగా తెలిసిందే.

అఫ్రోజాబాద్‌లో దిగ్గజాలయుద్ధం ముగిసి చౌదరి విజేతగా పైకితేలిన తక్షణమే మంత్రి పదవులకోసం కుమ్ములాట మొదలైపోయింది. ఘర్షణ కొనసాగుతున్న దశలో తాము గీతకు ఎటువైపున ఉన్నామన్న విషయాన్ని ఏమాత్రం పట్టించుకోకుండా ప్రతిఒకరూ చౌదరిని కలిసి విధేయతను చాటుకుని మంత్రిపదవికోసం అర్జీపెట్టుకున్నారు. అయితే ఇందుకు మినహాయింపు కొందరు లేకపోలేదు; ఆనంద్, శేఖర్ లాంటివాళ్ళు. మంత్రిపదవిని కోరుకుంటే కోల్పోవలసిందేమిటో తెలుసు కనుక ఆనంద్ దానిని ఆశించలేదు. ఏదేమైనా చౌదరి తనను విశ్వసించడని శేఖర్‌కు తెలుసు. నిన్నటివరకూ మహేంద్రనాథ్ ముఖ్యసహచరుడిగా తాను నిర్వహించిన పాత్రను ఇంతలో మరచిపోవడం కష్టం కనుక కొత్తముఖ్యమంత్రి తనను ఆదరించడనుకున్నాడు.

తీరా చౌదరి ఆ ఇరువురికీ మంత్రిపదవులు ఇవ్వజూపేసరికి నమ్మశక్యంకాని అద్భుతమేదో అతడు చేస్తున్నట్టు కనిపించింది. రాజకీయవర్గాల్లో విస్మయం దిగ్భ్రాంతి అంచులుతాకింది. ముఖ్యమంత్రితో ఎంతో సన్నిహితస్నేహం ఉన్న ఓ పాత్రికేయుడు ఆంతరంగికసంభాషణలో

ఈ ఎంపికలగురించి ఆయనను గుచ్చిగుచ్చి ప్రశ్నించాడు. రాజకీయవాదులెవరికీ ఈ ఎంపికల్లో ఎటువంటి అర్థం కనిపించడం లేదన్నాడు. చౌదరివద్ద జవాబులు సిద్ధంగానే ఉన్నాయి. 'ముఠా యుద్ధంలో మునిగిపోయినప్పుడు నీ శక్తియుక్తులన్నీ ఒడ్డి పోరాడవలసిందే. యుద్ధమధ్యంలో ఉన్నప్పుడు ఇక ముందువెనుకలు చూసుకోకూడదు. గెలుపు నీ చేతుల్లో వచ్చిపడ్డాక కేవలం కాగడాలుపట్టే వాళ్ళతోపాటు వారిని మించిన ప్రతిభకలవారిని కొందరినైనా వెతికిపట్టుకోవలసిందే. నా మంత్రివర్గంలో నాకు కావలసినంతమంది నమ్మకస్తుల్ని చేర్చుకున్న విషయం నీకు తెలుసు, బయటినుంచి ఇద్దరు సమర్థుల్ని తెచ్చిపెట్టుకున్నంతమాత్రాన కొంపమునిగిపోయేదేమీ లేదు. పైగా అందువల్ల ప్రభుత్వం చక్కని ఫలితాలు చూపించే అవకాశం ఉండచ్చు. చూడు తమ్ముడూ, అప్పుడప్పుడు కాస్త ప్రజలగురించికూడా ఆలోచిస్తూ ఉండాలి' అని వ్యాఖ్యానించాడు.

'మంచిదే, కానీ ఆనంద్ ఏ గ్రూపులోనూ ఎప్పుడూ చురుగ్గా పనిచేయలేదు. అతడు చాలా మందికి తెలియని మనిషి...'

'చాలామందికి తెలియకపోవచ్చు. కానీ నాకు తెలిసినవాడే. అతగాడెప్పుడూ ముఠాల ఆటలో పాల్గొనకపోయినా అతడి నఖశిఖపర్యంతం నాకు బాగా తెలుసు.'

'ఆ రెండో మనిషి శేఖర్ ముఠాలఆటలో అతిగా పాల్గొన్నవాడే కదా? అతణ్ణి ఎలా చేర్చుకుంటున్నావ్?...'

'అతడి విషయంలో తర్కం మరోవిధంగా ఉంటుంది నీకు తెలుసో తెలియదో, శేఖర్ మంత్రివర్గం లోపల ఉన్నప్పటికంటె బయట ఉన్నప్పుడు మరింత ప్రమాదకరమైన మనిషి. ఇక, అతణ్ణి దగ్గరకుతీసిన ప్రతివాళ్ళకీ అతడి ప్రతిభ ఉపయోగపడుతుంది. చౌదరిగ్రూపూ, మహేంద్రనాథ్ గ్రూపు అన్న తేడా అతడికేమీ లేదు...'

'అయితే అతడి తాపత్రయం దేనికంటావ్?'

'నాకు తెలియదు, తెలుసుకునే ఉద్దేశంకూడా లేదు. నాకు తెలిసిందొకటే. కొంతమందిని ముఠాలగూట్లో దూర్చలేం. వాళ్ళ ప్రేరణలేవో వాళ్ళకుండచ్చు-నిజానికి ఉన్నాయి కూడా.'

'వాళ్ళిద్దరూ ఒకరిముఖం ఒకరు చూసుకోరనీ, ఎప్పుడూ ఒకరిమీద ఒకరు కత్తులు దూసు కుంటుంటారనీ చెప్పుకుంటారు.'

'మంచిదే. అది నాకు మరింత అనుకూలం... అవసరమైతే ఒకరిమీద ఒకరిని ప్రయోగిస్తాను. అయినా అటువంటి అవసరం తలెత్తుతుందని అనుకోను.'

'అంత నమ్మకంగా ఎలా చెబుతున్నావ్?'

'ఎప్పుడూ కాళ్ళు జారిపోతూనేఉండే రాజకీయక్రీడలో ఏ దిక్కుమాలినవిషయం గురించైనా పూర్తి నమ్మకమంటూ ఎక్కడుంటుంది? సామెత చెప్పినట్టు, బొగ్గు వ్యాపారం చేస్తూ చేతులు ఎల్లవేళలా మల్లెపూల్లా ఉంచుకోవాలంటే కుదరదు.'

బాగుంది... చౌదరి కచ్చితంగా బుద్ధికుశలతగల రాజకీయవేత్తగా పరిణతి చెందుతున్నాడని ఆ జర్నలిస్ట్ మనసులో అనుకున్నాడు

# 25

ఆనంద్‌ను పడగొట్టడానికి ఓ సమగ్రవ్యూహం సిద్ధమైపోయింది. ఎంతో లోతుగా ఆలోచించి రూపొందించిన వ్యూహమది. దాని ప్రధానరూపశిల్పి శేఖర్.తాను సూత్రధారిగా ఉండి ఎంతో జాగ్రత్త పాటిస్తూ తెర వెనుక నుంచి నాటకాన్ని నడిపించాడు. ఇక పథకాన్ని అమలుచేసినవాళ్ళు ఓ ముక్కు మొహం లేని గుంపు. వాళ్ళలో కాంట్రాక్టర్లున్నారు. ఇతరులున్నారు. వాళ్ళందరూ తమ అవినీతిపథకాలకు ఆనంద్ ఆమోదం సంపాదించుకోలేక అతనిపై కక్ష పెంచుకున్నవాళ్ళు. తమకు అనుకూలంగా శాఖాపరమైన నిర్ణయాలు తీసుకోకుండా ఆనంద్ ప్రదర్శించిన పట్టువిడుపులులేని ధోరణికి కలతపడినవాళ్ళు.అతణ్ణి ద్వేషిస్తూ దెబ్బతీయడానికి తగిన అదనుకోసం చూస్తున్న మంత్రివర్గసహచరులు కొందరు, అందుకు తగిన సమయమిదేనన్న నిర్ధారణ కొచ్చారు. అయితే ఆనంద్ గురించి ముఖ్యమంత్రి మనసులో ఏముందో కచ్చితంగా తెలియక శేఖర్‌లానే వాళ్ళుకూడా గుట్టుగానే వ్యవహారం నడిపిస్తూ జాగ్రత్తపడ్డారు. ఆనంద్‌పై బహిరంగంగా దాడిచేస్తే తమ రాజకీయభవిష్యత్తు ఛిన్నాభిన్నమైపోతుంది ఆపైన చౌదరి ఉనికిత్వానికే చిక్కులు తెచ్చిపెట్టిన వాళ్ళవుతారు.

ఆనంద్ నాశనానికి తలపెట్టిన ఆ పథకానికి, అతడికీ అరుణకీ ఉన్న సంబంధం సహజంగానే కేంద్రబిందువుగా మారింది. మొదట గుసగుసల రూపంలో ప్రచారం లేవదీశారు. తర్వాత ఎంపిక చేసిన కొన్ని విషయాలు పత్రికల కెక్కించడం ప్రారంభించారు. ఆనంద్ సాధించిన రాజకీయవిజయాన్ని ఉద్దేశపూర్వకంగా అరుణకు ఆపాదించడం అందులో ప్రధానాంశం. ఆనంద్ తీసుకున్న నిర్ణయాలవల్ల యాదృచ్ఛికంగా లాభపడినవాళ్ళు అరుణను కలిసి తమపక్షాన జోక్యం చేసుకున్నందుకు కృతజ్ఞతలు చెప్పుకోసాగారు. ఆమె వల్లనే తమకు 'న్యాయం' జరిగిందని అంటూ వచ్చారు. వాళ్ళు దేని గురించి మాట్లాడుతున్నారో అర్థంకాక, వాళ్ళు కురిపించిన కృతజ్ఞతావర్షానికి ఎలా స్పందించాలో ఆమెకి తెలియలేదు. నిజంగా అదెంతో ఇబ్బందికరమైన పరిస్థితి. వాళ్ళు పొరబడుతున్నారనో, భ్రమపడుతున్నారనో చెప్పి నొప్పించడం ఇష్టంలేక ఆమె సాధారణంగా ఒక అస్థిమిత మౌనం పాటిస్తూ వచ్చింది.

*ఘట్టం రెండు:* ఆనంద్ దగ్గర ఆమెకు తిరుగులేని పలుకుబడి ఉందన్న పేరు వచ్చేసింది. నీకేం తెలుసు? ఆమె అక్షరాలా అతని చేయి పట్టుకుని తను కోరినట్టు రాయించుకోగలదు. నీకేమీ తెలియదు, నీ దగ్గరున్నది ఎంతో పాతబడిపోయిన సమాచారం. తాజా ముచ్చట చెబుతావిను.

ఆనంద్ చూడవలసిన ఫైళ్ళు ఇప్పుడు మొట్టమొదట అరుణ దగ్గరకు వెడతాయి. వేరే కాగితం మీద ఆమె ఉత్తర్వులు రాస్తుంది. ఫైల్లోని కాగితాల్లో ఆ ఉత్తర్వుకు నకలు రాసి సంతకం పెట్టడం మాత్రమే అతడు చేసేది. ఆమె ఇప్పుడతనికి ఎంతెంతో ఆంతరంగికకార్యదర్శి. నిజం చెప్పాలంటే అతడికే ఆమె బాస్, అతడే ఆమెకు కార్యదర్శిగామారి ఉండచ్చని కూడా అంటాను.

*ఘట్టం మూడు:* అరుణ నివాసంవద్ద గుంపులుగుంపులుగా జనం. రకరకాల అభ్యర్థనలతో వచ్చిన వాళ్ళు. ఆమె పలుకుబడిని కొనుక్కోడానికి వచ్చినవాళ్ళు. తన పలుకుబడిని వినియోగించ వలసిందిగా ఆమెపై ఒత్తిడి తేవడానికి ప్రయత్నిస్తున్న వాళ్ళు. చివరగా, బ్లాక్‌మెయిల్ చేసి అయినా ఆమెతో సిఫార్సు చేయించుకోవాలని చూసినవాళ్ళు. వీళ్ళలో ఒక్కరూ ఆమె నుంచి ఆమోదాన్ని సంపాదించుకోలేకపోయారు. అయితే దామాషాను వీళ్ళలో కొందరికి అనుకూలంగా ఆనంద్ నిర్ణయం తీసుకోవడం అనివార్యంగానే జరిగింది. అతడి ఏ ఒక్క నిర్ణయంలోనూ అరుణకు ఎటువంటి జోక్యంలేకపోయినాసరే, ఆ నిర్ణయం నీకు అనుకూలంగా జరిగితే అందుకు కచ్చితంగా అరుణ పలుకుబడి కారణం కావలసిందే. ఒకవేళ ఆనంద్ నీకు వ్యతిరేకంగా నిర్ణయం తీసుకున్నాడనుకో, అవతలిపార్టీ అరుణను బుట్టలో వేసుకోగలగడమే అందుకు కారణమై తీరాలి. ఏ కారణంతోనైతేనేం అరుణనివాసానికి జనం గుంపులు గుంపులుగా వస్తూనే ఉన్నారు. వాళ్ళ నుంచి తప్పించుకునే మార్గం లేదు.

*ఘట్టం నాలుగు:* డబ్బు, ఒత్తిడి, బ్లాక్‌మెయిల్ పని చేయనప్పుడు, మీ విలువ మీకు తెలియ దంటూ ఆమె అహాన్ని ప్రేరేపించడం ప్రారంభించారు... మేడమ్, ఇది మీ కర్తవ్యం. మీరు తిరస్కరించ డానికి వీల్లేదు. ప్రజల కోసం మీరాపని చేసితీరాలి. మీరొక్కరే అది చేయగలరు. మంత్రిగారు న్యాయం తప్పని మనిషి, సమర్థుడు, కానీ ఆయనకు క్షణం తీరికుండదు. నా విషయంలో మీరు కాస్తంత సిఫార్సు చేశారా, సమస్య చిటికెలో మటుమాయమై పోతుంది. ప్లీజ్ మేడమ్, ప్లీజ్,ప్లీజ్,ప్లీజ్!

*మధ్య మధ్య:* ఎంతో కృతజ్ఞుణ్ణి మేడమ్. దేవుడు మిమ్మల్ని చల్లగా చూస్తాడు. నా కుటుంబాన్ని గట్టెక్కించారు. (అప్పుడప్పుడు కుటుంబంమొత్తం అక్కడ హాజరవుతూ ఉంటుంది) భార్య, పిల్లలు అందరిఎదుట ఎంతో నాటకీయంగా అరుణ పాదాలమీద పడతారు. దేవుడు మిమ్మల్ని చల్లగా చూస్తాడు– ఆయనను కూడా! దేవుడు మీ ఇద్దరినీ చల్లగా చూస్తాడు... ఇద్దరినీ... ఇద్దరినీ. ఆ ఊహ అలా నిలిచి పోయింది. ఇద్దరు. విడదీయ సాధ్యంకాని ఇద్దరు.

*ఘట్టం అయిదు:* ఎంతో చాక చక్యంగా ఊదరగొడుతుండడం వల్ల జనంలో నాటుకున్న అభిప్రాయాన్ని అనుసరించి ఆ ఇరువురూ అవిభాజ్యులన్న గుర్తింపు మరింత గాఢతను సంతరించు కుని అన్నివైపులకు విస్తరించసాగింది ప్రతి కార్యక్రమానికీ నిర్వాహకులు ఇద్దరినీ ఆహ్వానించడం ప్రారంభించారు. ప్రారంభోత్సవం అతడు, అధ్యక్షత ఆమె. లేదా ప్రారంభోత్సవం ఆమెది. అధ్యక్షత అతనిది. రెండూ కాకపోతే కనీసం ఆమెను ప్రసంగించమనైనా కోరితీరవలసిందే. ఈలోగా ఓ కొత్త వదంతి వ్యాపించింది: అరుణను కూడా ఆహ్వానిస్తే తప్ప ఆనంద్ ఏ ఆహ్వానాన్ని ఒప్పుకోడట తను లేకుండా అతడే కార్యక్రమానికైనా వెడితే పగలు రాత్రి అని లేకుండా ఆమె

అతణ్ణి ఎంతగా సాధించుతుందో మీకు తెలియదా? అతడితో మాట్లాడడమే మానేస్తుంది. ఎంతకాలమంటారా, అది దేవుడికే తెలియాలి, ఇందులో జాలిగొలిపేవిషయం, పాపం ఆనంద్ ఆమెతోడు లేకుండా శ్వాసకూడా పీల్చలేడు. సరే, సరే, అదంతా మంత్రిగారి ప్రేమకలాపంలో భాగమనుకో. అరుణ లేనిదే ఆనంద్ లేడు, చూశావూ? అదీ సంగతి. ఫలితం: ఆహ్వానాలమీద ఆహ్వానాలు, జంటగా యాత్రలమీద యాత్రలు, కలిసి విందుల మీద విందులు, జంటగా కాలక్షేపం చేయడానికి కావలసినంత సమయం. సర్వత్రా వినిపిస్తున్న వ్యాఖ్య: నువ్వు మంత్రివైతే, ఏం చేసినా చెల్లిపోతుంది! మన ప్రజాస్వామ్యం అలా అఘోరించింది తమ్ముడూ!

*ఘట్టం ఆరు:* అరుణతో తాదాత్మ్యం ఆనంద్‌ను పూర్తిగా కమ్మివేసే స్థాయికి పరిణమించింది. అరుణ సర్వకాలసర్వావస్థల్లోనూ ఆనంద్‌కు దగ్గరగా... ఇంకా దగ్గరగా ఉంటుందన్న అభిప్రాయం కలిగే విధంగా శేఖర్ వివిధ సమావేశాలు జరిగేటట్టు చూశాడు. అధికారం ఏ తరహాలో పని చేస్తుందో మీకూ తెలుసంటూ అరుణకు హితబోధ ప్రారంభించారు వాళ్ళు. చక్కెర చుట్టూ ఈగలు ముసిరినట్టు స్నేహితులు, బంధువులు, వందిమాగధులు (మగవాళ్ళూ, ఆడవాళ్ళూ కూడా) అతడిచుట్టూ మూగుతున్నప్పుడు ఏం జరుగుతుందో ఎవరుమాత్రమేం చెప్పగలరు? నిజమే, ఆనంద్ అటువంటి ప్రభావాలకు లొంగేవాడు కాడు, అతడి గురించి మాకు బాగా తెలుసు. పైగా అతడికి మీరెంత చెబితే అంత కనుక దారితప్పే అవకాశం అసలే లేదు. అయినా, పనికొచ్చేదో కాదో తెలియదు కానీ, ఓ మాట అంటాను. నా పిచ్చికానీ మీకన్నీ తెలుసు. ఐతే ఒకటిమాత్రం నాకెంతమాత్రం బోధపడడంలేదు అరుణాజీ. అతగాడి స్నేహితులు, బంధువులు మీ గురించి ఎప్పుడూ చెడుగానే ఎందుకు మాట్లాడుతుంటారు? ఎప్పుడూ గుక్క తిప్పుకోకుండా? మీ మీద వాళ్ళెందుకలా మండిపడుతుంటారు? మీ మీద ఆనంద్‌కు ఎందుకు విషం నూరిపోస్తూ ఉంటారు? అదొక్కటే అర్థం కావడం లేదు నాకు. ఎంత దారుణం! మీరేం చేసినా అతనికోసమేగదా చేశారు?

ఇది మాత్రం నిజమే ఆనంద్ స్నేహితులు, బంధువులు, సహచరులు అందరూ ఒకవైపు; అరుణ ఒక్కతే రెండోవైపు. వ్యక్తిగతస్థాయిలో ఇదీ వరస తీరిన క్రమం. ఒకదాని నొకటి ద్వేషించుకోడానికి రెండుపక్షాలకూ తగిన కారణాలే ఉన్నాయి. అదంతా ఆనంద్ హితం కోసమే, అని వాళ్ళు అనుకుంటూ వచ్చారు. తన హితం ఎందులో ఉందని ఆనంద్ అనుకుంటున్నాడో తెలుసుకునే ప్రయత్నమెవరూ చేయలేదు. అతడు వృద్ధిలోకి రావాలని స్నేహితులు ఆశించారు; ఆ క్రమంలో తాముకూడా పైకి రాగలమనుకోవడం తప్పా? ఆనంద్‌కోసం ఎంతమంది స్వప్రయోజనాల్ని త్యాగం చేయడానికి సిద్ధంగా ఉన్నారన్నది వేరే విషయం. అరుణతో సాన్నిహిత్యం అతణ్ణి నాశనం చేస్తుందని అందరూ ఏకాభిప్రాయానికి వచ్చేశారు. ఆ విషయంలో వాళ్ళందరిదీ ఒకేమాట.

అరుణ ఆలోచనాసరళికూడా అంత స్పష్టంగానూ, అంత దృఢంగానూ ఉంది. అధికారంలో ఉన్న వ్యక్తులకు ప్రబలశత్రువులు ఆలివైపు బంధువులూ, స్వార్థపరులైన స్నేహితులేనని ఆమె నొక్కిచెబుతూ వచ్చింది. కొన్ని సందర్భాల్లో ఆనంద్‌మీద అతడి స్నేహితులే ఒత్తిడి తెచ్చి

తప్పుడు నిర్ణయాలు చేయించినట్టు వాళ్ళూ వాళ్ళూ చెప్పుకోవడం ఆమెకు తెలుసు. లేదా తనకు తెలుసునని ఆమె భావించింది. అందువల్ల నష్టపోయిన వాళ్ళు రకరకాల గూఢమార్గాల్లో ఇదంతా ఆమె బుర్రలోకి ఎక్కించడానికి ప్రయత్నించారు. ఈ గుసగుసలకు శేఖర్ పూనికతో పుంజుకున్న ప్రచారం కూడా తోడైంది. రెండూ కలిసి ఆనంద్ స్నేహితులమీద, బంధువుల మీద, ఏదో పనికోసం ఆనంద్ చుట్టూ తిరిగే జనంమీద, సహచరులమీద, తాను మినహా ప్రతి ఒకరిమీద ఆమెలో ఏవగింపును మరింత పెంచేశాయి. ఉభయ శ్రేయోభిలాషపక్షాలమధ్య ఘర్షణ చూస్తూచూస్తూనే ఉధృతమైపోయింది. ఉద్రేకభరితంగా, పట్టు విడుపులకు కొంచెమైనా అవకాశమివ్వకుండా అంతుచూసేవరకు అది కొనసాగింది. అయితే అది చూసేది ఆనంద్ అంతు.

ఆనంద్‌ను తమతమ గుప్పిట్లో ఉంచుకోవడానికి అందరూ పడుతున్న తాపత్రయం శేఖర్‌కీ, ఆనంద్‌ను వ్యతిరేకించే మిగిలిన వారికీ అయాచితవరంలా కనిపించింది. వాళ్ళలో కొందరు ఆనంద్ అరుణ చాటుగా దూరప్రయాణాలు చేయడానికి వీలైన కార్య క్రమాల్ని, మధ్యమధ్య మజిలీలతో సహా ఏర్పాటు చేస్తూనే వచ్చారు. మిగిలినవాళ్ళు ఆనంద్‌పై సానుభూతిని రంగరించిన ప్రచారం మొదలు పెట్టారు. భ్రష్టుపట్టిపోయాడు, విచ్చలవిడిగా తిరిగే ఓ నెరజాణ వలలో పడిపోయి పూర్తిగా దిగజారి పోయాడన్నారు. ఇలాంటి మాటల్లో అదేపనిగా స్త్రీనే ఆడిపోసు కోవడం ప్రారంభించారు; అదెంతో తేలిక కాబట్టి. ఆనంద్‌ను సర్వనాశనం చేయడానికి చాలా బాగా పనిచేసే వ్యూహంకాబట్టి.

ఈ అపప్రచారం ముమ్మరమౌతున్నకొద్దీ ఆనంద్‌ను ఆదుకోడానికి అనుకోకుండా కొందరు రంగప్రవేశం చేశారు వాళ్ళలో శాసనసభ్యులూ ఉన్నారు. అంతవరకూ ఈ వ్యవహారంలో అనిశ్చితంగా ఉండిపోయిన వాళ్ళు వ్యవహారం శ్రుతిమించిపోతోందన్న నిర్ధారణకు వచ్చారు. కొన్నివారాలపాటు శాసనసభ లాబీల్లో, ఇతర సమావేశ స్థలాల్లో శాసనసభ్యులు గుంపులుగా చేరి ఈ విషయం గురించే చర్చించుకుంటూ వచ్చారు. ఎంత దిగ్భ్రాంతికరం! అంత విశృంఖలంగా ఎవరైనా ఎలా ఉండగలడు? రాజకీయాలు ఏ స్థితికి దిగజారి పోయాయి? ఈ లెక్కన బుద్ధితక్కువ గాడిదలు, బరితెగించిన వాళ్ళు తప్ప ఈ రంగంలో ఎవరు కొనసాగగలరు? ఖర్మకొద్దీ పబ్లిక్ జీవితమంటేనే అంత – వాస్తవంగా అక్షరాలా అంతా పబ్లిక్, బట్టబయలు. ఇక్కడ నిరంతరం మనిషి సెర్చిలైట్ కింద – ఉండితీరవలసిందే. బహిరంగం కానీ, వ్యక్తిగతంకానీ, ఆ వ్యక్తి జీవితంలో ప్రతిక్షణానికీ, నీ ప్రతి కదలికకీ, నువ్వు బాధ్యత వహించవలసిందే. రాజకీయాల్లో ఉన్న వ్యక్తికి వ్యక్తిగత జీవితమంటూ ఉండదు, ఉండాలని ఆశించడం కూడా దండగ. ఇది తిరుగులేని నిజం. అదంతే – స్వీకరించు, మాను,నీ యిష్టం. ఊరికే చిటపటలాడినందువల్ల ప్రయోజనం లేదు... ఒక గ్రూపు వ్యాఖ్యానాలు ఇలా సాగిపోయాయి.

ఈ వాదాన్ని వ్యతిరేకించే వాళ్ళ సమాధానం ఇలా ఉంది : ఎంత అర్థరహితమైన వాదం! రాజకీయాల్లో ఉన్న మనిషికి వ్యక్తిగతజీవితం ఉండకూడదా? వ్యక్తిగతజీవితం లేని ఆడ, మగ రాజకీయవాదుల్ని ఒక్కళ్ళనైనా చూపించు, చూద్దాం. కాస్త సజావుగా మాట్లాడు. ఓ ఆడది

కానీ, మగాడు కానీ ఎవరితో, ఎంతమందితో పడుకుంటున్నారన్నది మిగిలిన వాళ్ళ కనవసరం. ప్రజలు అటువంటి చెత్తని పట్టించుకోరు. ఒక రాజకీయవాది జనంకోసం ఏం చేస్తున్నాడనేదే ముఖ్యం, ముఖ్యం కావాలి కూడా. మిగిలిన చర్చలన్నీ అసలు విషయంనుంచి చూపు మళ్ళించడానికే. ఊరికే ఉబుసుపోకకి అవతలి వాళ్ళమీద బురద చల్లే ధోరణి.

నా ప్రియమైన స్వేచ్ఛా ప్రేమికుడా, ఇది ఇండియా, అంటే భారతదేశం. సనాతన ఋషులు, మునులు సంచరించిన ఇండియా, మహాత్మాగాంధీగారి ఇండియా, ఈ ప్రాథమిక సత్యాన్ని ఎలా మరచిపోగలవ్! ఓ మగాడు, ఓ ఆడది ఎంత సమర్థులైనా కావచ్చు, ఎంత ప్రజాసేవ చేస్తున్నవాళ్ళయినా కావచ్చు, నీతిమాలి నడుచుకుంటున్నప్పుడు ఎలా సరి పెట్టుకుంటావ్?

ఈ చర్చోపచర్చల వెనువెంటనే ఆనంద్ ప్రత్యర్థులు అతడి పరువు దిగజార్చే కుట్రను అమలు చేయడానికి సిద్ధమైపోయారు. వాళ్ళలో శేఖర్‌కన్న రెండడుగులు ముందుకుపోవాలనుకున్న వాళ్ళూ ఉన్నారు. ఎందుకంటే ఆ 'దాసీపుత్రుడు' మరీమరీ కీలకవ్యక్తిగా మారిపోతున్నాడు. అందరినీ మించిపోతున్నాడు. కనుక శేఖర్‌తో ప్రసక్తి లేకుండా వాళ్ళ మేరకు వాళ్ళు, ఓ పెద్ద పెంటకుప్పలాంటి, (అందుకే పెద్దఎత్తున సర్క్యులేషన్ కూడా ఉన్న) ఓ టేబ్లాయిడ్ పత్రికను రంగంలోకి దించారు. దాని యజమానిని తమవైపు తిప్పుకుని, ఆనంద్—అరుణల వ్యవహారంపై ఒక భారీ కథనాన్ని ప్రచురించవలసిందిగా ఎడిటర్‌ను ఆదేశించడానికి ఒప్పించారు. ఆ వ్యవహారం గురించి అడపాదడపా పత్రికలు ప్రచురిస్తూనే ఉన్నాయికానీ అది ప్రాసంగికంగానే; ఆనంద్ జనంలో ఎంతో పేరు ప్రఖ్యాతులున్న సమర్థుడైన మంత్రి కనుక ఆ విషయంలో అతిశయోక్తులు రంగరించి ప్రచురించే సాహసం అప్పట్లో పత్రికలు చేయలేదు. అయితే క్రమక్రమంగా ఆ వ్యవహారం మీద పత్రికలు స్వల్పంగానైనా సరికొత్తగా ఆసక్తి చూపించసాగాయి. ఇక ఇప్పుడు పీపుల్స్ హెరాల్డ్ అనే ఆ టేబ్లాయిడ్, వాళ్ళు ఏయే తేదీల్లో, ఏయే సమయాల్లో ఎక్కడెక్కడ పర్యటించారో ఏకరవు పెడుతూ, అద్భుతమైన ఊహాశక్తిని జోడించిన వర్ణనలతో మొదటిపేజీలో ప్రచురించింది. పాఠకుల్ని గిలిగింతలు పెట్టేలా రాసి తద్వారా టేబ్లాయిడ్ అమ్మకాల్ని పెంచుకునేందుకు తగిన జాగ్రత్త తీసుకుంటూనే ప్రజాజీవనమధ్యంలో ఉన్న ఆడకానీ, మగకానీ అలా ప్రవర్తించడం ఎంతైనా గర్హనీయమంటూ నీతిబోధ చేసింది ఇటువంటి కథనం ఒకటి పత్రికలో రాబోతున్న విషయం శేఖర్‌కి తెలియదు.

ఆ కథనం వెలుగుచూసినసమయంలో ప్రభుత్వవ్యవహారాల మీద ఆనంద్ ఢిల్లీలో ఉన్నాడు. ఎంతో తలవంపులు తెచ్చిపెట్టే పరిస్థితులలో అది అరుణ దృష్టికి వచ్చింది. ఓ రోజు ఉదయం ఆమె అసెంబ్లీలోకి అడుగుపెట్టగానే అంతవరకూ లాబీల్లో గుమిగూడి మాట్లాడుకుంటున్న ఎం.ఎల్.ఏ.లు హఠాత్తుగా మాటలు ఆపేశారు. వాళ్ళు దేని గురించి మాట్లాడుకుంటున్నారో, తనకు తెలియకుండా ఏ విషయాన్ని దాటడానికి ప్రయత్నిస్తున్నారో ఆమెకు అర్థం కాలేదు. అయినా వెంటనే దులపరించుకుంది దాదాపు పురుషుల కోసమే అన్నట్టు తయారైన ఈ ప్రపంచంలో, ఆ పురుషుల్లో కూడా సభ్యత, సంస్కారాలు లేనివాళ్ళే ఎక్కువ మంది ఉన్న ప్రపంచంలో ఆడదై పుట్టినందుకు చెల్లించక తప్పని మూల్యం అది. ఓ సోఫాలో కూర్చుని ఎదురుగా టీపాయ్

మీద విసిరేసినట్టుపడున్న ఆ రోజు వార్తాపత్రికల్ని తిరగేయడం ప్రారంభించింది. తక్షణమే ఆమె దృష్టిని టేబ్లాయిడ్ ఆకర్షించింది కారణం, ఆ పత్రిక మొదటి పేజీలోఆనంద్ ఫొటో తన ఫొటో కనిపించడం. టేబ్లాయిడ్‌ను తన చేతుల్లోకి తీసుకుని బిగ్గరగా చదవడం మొదలుపెట్టింది. సిగ్గుపడి ఎం.ఎల్.ఏ. లు వెంటనే అక్కడి నుంచి జారిపోవడంతో ఆమె ఎదుట జనం పలచబడ్డారు. అప్పుడప్పుడు ముతక భాషలో ఆమెను గురించి మాట్లాడుతూ ఈ వ్యవహారంగురించి రహస్యంగా చెవులు కొరుక్కున్న వాళ్ళు కూడా ఇలాంటి రాతలు మరీ దారుణం అని ముక్కువిరిచారు. ఆ కథనం చదువుతున్న అరుణలో మొదట ఆగ్రహం రగిలింది. తర్వాత నిస్పృహ ఆవరించింది. చివరకు పూర్తిగా కుప్పకూలిపోయింది. కళ్ళు అశ్రుసిక్తమయ్యాయి. చుట్టూ ఉన్న జనం తనవైపే తేరిపార చూస్తున్నట్టు గమనించి నిబ్బరం కోల్పోకూడదని నిశ్చయించుకుని, ఉబికి వస్తున్న కన్నీళ్ళను అదిమిపట్టి లేచి నిలబడింది. ఆనంద్... ఇంకెంతమాత్రం ఆలస్యం చేయకుండా తను ఆనంద్‌తో మాట్లాడాలి.

అతడు ఢిల్లీలో ఉన్నాడని ఆమెకు తెలుసు. వాచీ చూసుకుంది. మధ్యాహ్నం ఢిల్లీ వెళ్ళే ఇండియన్ ఎయిర్‌లైన్స్ విమానాన్ని అందుకోవాలి. అపనిందల బురద చిమ్మిన ఆ పత్రికను చేతిలో పట్టుకొని అసెంబ్లీ భవంతి నుంచి ఆమె బయటకు నడిచింది. శేఖర్ లోపలికి వస్తూ కనిపించాడు. స్నేహ పూర్వకంగా ఆమెను పలకరించాడు. కుంగిపోయినట్టున్న ఆమె ముఖం చూడగానే స్నేహభావం స్థానే ఆందోళన చోటు చేసుకుంది. 'ఏమైంది చెల్లాయి? ఏమిటి విషయం?' అని అడిగాడు. ఆమె చేతుల్లో ఉన్న టేబ్లాయిడ్ చూడగానే విషయం అతడి కర్థమైపోయింది. నెమ్మదిగా ఆమె చేతుల్లోంచి పత్రిక తీసుకుని పరికించాడు —మొదటిసారి. . 'గాడిద కొడుకు' .. అన్నాడు బుసకొట్టినట్టు. అతడికి కోపం ముంచుకొచ్చింది ఈ మధ్యకాలంలో ఎవరిమీదా రాయనంతగా ఈ టేబ్లాయిడ్ మరీ మోతాదును మించి అసత్యాలు రాసింది. ఎవరో చెప్పినందు వల్ల, ఆ ఎడిటర్ తన సమస్త అశ్లీలతా సామర్థ్యం మేరకు రాసినట్టున్నాడు. అరుణ పరిస్థితికి శేఖర్ చాలా బాధపడ్డాడు; అతడి యుద్ధం ఆనంద్‌తోనే, తను శపథం చెసిన ప్రకారం అతణ్ణి ఎలాగూ సర్వనాశనం చేసేతీరుతాడు; అయితే అరుణ మీద అతడికి నిజంగానే అభిమానముంది కనుక ఈ ప్రయత్నంలో ఆమె కూడా నాశనమౌతుందేమోనని విచారించాడు. అయితే అరుణ అతడిపట్ల ఏవిధమైన స్నేహభావం ప్రదర్శించలేదు. కోపంతోనూ, అపనమ్మకంతోనూ అతడి వైపు చూసింది.

శేఖర్ అలా ఆందోళన, ఆశ్చర్యం ప్రకటిస్తుంటే అదంతా కచ్చితంగా నటనే అనుకుందామె. అతడే ఆ కథనాన్ని చొప్పించి ఉంటాడన్న నిర్ధారణ కొచ్చేసింది. అంత ప్రశాంతంగా అలా అమాయకత్వం, ఆందోళన నటిస్తూ అక్కడ నిలబడగలిగిన అతడి కపట ధైర్యాన్ని చూసి ఆమె ఓ పట్టాన నమ్మలేకపోయింది. అతడు ఆనంద్‌ను ఎంతగా ద్వేషిస్తాడో అతణ్ణి పడదోయడానికి ఏ స్థాయికైనా ఎలా దిగజారగలడో ఆమెకు బాగా తెలుసు. ఇప్పుడితగాడు బాధపడుతున్న తనను ఓదార్చే ప్రయత్నం చేస్తున్నాడు. ముంచెత్తిన అసహ్యంతో ఆమె నిలువునా కంపించిపోయింది. తన పట్ల ఆమె మనోభావాలు ఆమె ముఖంలో స్పష్టంగా కనిపించాయి కాబోలు అతడి ఆందోళన స్థానే కోపం మెరుపులా ప్రత్యక్షమైంది.

'దీనికీ నాకూ ఏదో సంబంధమున్నట్టు నువ్వు అనుకుంటున్నావు. అవునా ?' పత్రిక చూపిస్తూ తీవ్రస్వరంతో ప్రశ్నించాడు.

ఆమె జవాబు చెప్పలేదు కానీ ఆమె చూపుల్లోనే కావలసినంత జవాబు దొరికింది. పత్రికను నేలమీద విసిరికొట్టి అతడు కోపంతో విసవిసా అక్కడినుంచి వెళ్ళిపోయాడు. ఆమె ఆ పత్రికను అందుకుని వెంటనే ఎయిర్‌పోర్టుకు బయలుదేరింది.

★ ★ ★

ఢిల్లీలో ప్రభుత్వఅతిథి గృహంలోని తన గదిలో ఆనంద్ అప్పుడే సెంట్రల్ ఇరిగేషన్ మినిస్ట్రీలోని కొందరు అధికారులతో మధ్యాహ్న సమావేశం ముగించుకున్నాడు. ఇంతలో తలుపుతోసుకుని అరుణలోపలికి అడుగుపెట్టింది. అతడు విస్తుపోయి ఆమెనలా చూస్తుండగానే పరుగున వచ్చి అతడి చేతుల్లో వాలిపోయి ఆపుకోలేనంతగా ఏడవడం ప్రారంభించింది. అసలేమీ అర్థంకాని అయోమయంతో ఆనంద్ ఆమెను దగ్గరగా నిలుపుకుని, చూస్తూ ఉండిపోయాడు. అసలేం జరిగిందో? ఒకటి రెండు రోజుల్లో తను అఫ్రోజా బాద్ తిరిగి వెళతాడని ఆమెకు తెలుసు. ఇంతలోనే ఢిల్లీకి పరుగెత్తుకుని రావలసిన అవసర మేమొచ్చిందో?... బాగా దెబ్బ తిన్నట్టు కనిపిస్తున్న ఆమెను ఎలా ఓదార్చాలో అతడికి తెలియలేదు. ఆ దుఃఖం దానంతటదే తగ్గుముఖం పట్టేవరకూ ఊరుకోవడమే మంచిదనుకున్నాడు. నిముషాలు గడిచిన కొద్దీ అదే జరిగింది. అతడు ఓరిమితో నిరీక్షిస్తూ ఉండిపోయాడు.

కాస్త తెప్పరిల్లిన తర్వాత ఆమె హాండ్‌బేగ్ తెరిచి బాగా నలిగిపోయిన టేబ్లాయిడ్‌ని బయటికి లాగి అతడిమీద విసిరేసినంతపని చేసింది ఆ కథనం చదువుతున్నప్పుడు పెదవులు కొద్దిగా బిగుసుకోవడం తప్ప అతడి ముఖంలో నిస్పృహ కానీ, ఆశ్చర్యం కానీ కనిపించలేదు.

ఆ తర్వాత మధ్య మధ్య ఎక్కిళ్ళు పెడుతూనే అసెంబ్లీ లాబీలో తనకు శేఖర్ ఎదురైన విషయం చెప్పి ఈ ఘాతుకం వెనుక అతడే ఉండవచ్చునన్న అనుమానాన్ని బయట పెట్టింది

'నీ ఊహ నిజమే కావచ్చు'.. ఆనంద్ స్వరంలో బాధ తొంగి చూసింది.... 'నేనంటే అతనికి ద్వేషం కనుక నన్ను మాత్రమే పడగొట్టే ప్రయత్నాలు చేస్తూ ఉంటాడనుకున్నాను. కాని ఇప్పుడా యత్నంలో నిన్ను కూడా నాశనం చేసే వరకూ వెళ్ళగలడని అర్థమైంది.

'ఆ లోపల నువ్వే వాడి అంతు చూడాలి' అరుణ అంది. 'అంతకన్నా ముందు ఆ చెత్త నంతటినీ ప్రచురించిన వెధవకి తగిన శాస్తి జరగాలి. ఆ పత్రికను మూయించలేవా? అవసరమైతే చట్టాన్ని కాస్త పక్కన పెట్టి, ఏదైనా అడ్డదారి తొక్కయినా సరే తప్పకుండా మూయించగలవు. నువ్వేదో ఒక ఉపాయం కనిపెట్టగలవనే నా నమ్మకం.'

ఆనంద్ ఆమెనీ ధోరణిలో ఎప్పుడూ చూడలేదు. ఆమె ఎప్పుడూ ముక్కు సూటిగా వ్యవహరించే మనిషి. మాటలు మింగి ఎరగదు... అధికారాన్ని అడ్డు పెట్టుకుని పగతీర్చుకోవాలనుకునే ఈ సరికొత్త కోణాన్ని ఆమెలో ఇప్పుడే చూస్తున్నాడు.

'చెప్పు... ఇప్పుడు మనం ఏం చేయబోతున్నాం?!' ఆమె రెట్టించి అడిగింది.

అతడామె భుజం తట్టి అన్నాడు. 'అది నిజంగా ఘాతుకమే. నీ అంతగా నేనూ కుంగిపోతున్నాను. అయితే నిగ్రహంకోల్పోయి ఎదురుదాడికి దిగినందువల్ల మనం బావుకునేదేమీ ఉండదు. శేఖర్, ఆ ఎడిటర్, ఎవరైనా కానీ —వాళ్ళు ఎదురు చూస్తున్నది కూడా అందుకే. కనుక ఈ అవమానాన్ని శాంతంగా తీసుకోవాలి —తదుపరి ఏం చేయాలో జాగ్రత్తగా ఆలోచించుకుందాం... నా మాటవిను ముందు నువ్వు మనసు కుదుటపరచుకో. . సరేనా ? ఈ విషయంలో మనిద్దరం కలిసి ఉన్నాం. ఇప్పుడు నువ్వు చెప్పావు కనుక ఏదో ఉపాయం చూస్తాను. అదీగాక మొదటే, నేను మంత్రిని కాబోతున్నప్పుడే నిన్ను హెచ్చరించాను, ఇటువంటి పరిణామాలకు మనం సిద్ధం కావలసి ఉంటుందని, ఓసారి గుర్తు చేసుకో'.

అతడు చిరు నవ్వుతో ఆమె కన్నీళ్ళు తుడిచాడు. ఆ మాటల్లో ఆమె స్థిమితపడిన జాడ కనిపించింది.

'సరే ! నీ భావం నాకు అర్థమైంది. అయినా అంత చేసిన వాళ్ళని మనం తేలిగ్గా తప్పించుకుని పోనివ్వం —అవునా ?'

'అవును అరుణా ! కానీ చూడు ఇవి రాజకీయాలు —ఇక్కడ ఏం చేసినా న్యాయమే !'

ఆమెలో మళ్ళీ దుఃఖం కట్టలు తెంచుకునే సూచన కనిపించి అతడన్నాడు. 'చూడు, నేనేదో మార్గం చూస్తాను, ఆ పూచీ నాది. ఇది మురికి కాలువను కెలకడంలాంటి వ్యవహారం. అందువల్ల చాలా దుష్ప్రభావాలు ఉండచ్చు. అందుకే ఒకరి కొకరం తోడుగా ఉన్నప్పుడే వాళ్ళను మనం జయించగలం... సరేనా ?'

ఆమె తలవూపుతూ జీవంలేని నవ్వు నవ్వింది.

ఆనంద్ ఆమెను ఓదార్చుతూనే ఆమెలో ఆ సమయంలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్న వైరుధ్యం చూసి విచలితుడయ్యాడు. ఒకవైపున ఆమె సాహసమూ, ఆధునికతా పుణికిపుచ్చుకుని ప్రజా జీవనంలో కొనసాగుతున్న విముక్తమహిళ, మరోవైపున కట్టుబాట్లకు తలవంచుతూ, రకరకాల సంకీర్ణభావాలకింద నలిగిపోతూ తనెప్పటికీ అందుకోలేనేమోననిపిస్తున్న సంపూర్ణస్వేచ్ఛకోసం ఆరాటపడుతున్న సాంప్రదాయిక హిందూ మహిళకు అవశేషం.

కొద్దిసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు. ఆ తర్వాత అరుణ అడిగింది, 'చెప్పు, తర్వాతి కర్తవ్యమేమిటి?'

'ఏం చేయాలని నీ ఉద్దేశం?' ఆనంద్ అడిగాడు.

'వాణ్ణి సర్వనాశనం చేయాలి.' నేలమీద పడున్న ఆ అభాండాల పత్రికను చూపించి ఉద్రేకంతో ఊగిపోతూ అంది.

'నా మాట వినిపించుకో అరుణా! ముక్కూ మొహంలేని ఓ క్షుద్రుణ్ణి నువ్వెలా నాశనం చెయ్యగలవ్? అవతలివాళ్ళమీద బురద చల్లుతూ బతికే ఓ పరాన్నభుక్కు వాడు... అతడి గురించి ఎవరికి తెలియదు? అవసరమైనప్పుడు అతణ్ణి వాడుకోనిదెవరు?'

'వాడి పని పడతానని, అలాగే శేఖర్ అంతుకూడా చూస్తానని నువ్వు మాటిచ్చావు.' ఆమెకి మళ్ళీ దుఃఖం ముంచుకొచ్చింది.

'అవును. తప్పకుండా చూస్తాను. కానీ నాదైన పద్ధతిలో. వాళ్ళెంత తెలివిగా వ్యవహరిస్తున్నారో నువ్వు చూడలేదా? కనుక ఉద్రేకపడి మూర్ఖంగా ఏమీ చేయను. వాళ్ళు వాస్తవాలకు మసిపూసి ఉండవచ్చు, అయితే అసలు నిజమేమిటో తెలుసుకోవాలనుకునేవాళ్ళు మాత్రం ఎవరున్నారు?'

అరుణ దెబ్బతిన్నట్లు చూసింది. వెంటనే ఆతడామెను అనునయించాడు 'నన్ను అపార్థం చేసుకోకు అరుణా! నేనంటున్నదల్లా మనం మాట్లాడలేని విషయాలు, బహిరంగంగా చర్చకు పెట్టకూడని విషయాలు కొన్ని ఉంటాయనే. కనుక వేరేదైనా మార్గం కనిపెట్టి సమస్యను పరిష్కరించుకోవలసిందే.'

'ఏమిటి నీ మార్గం?' ఆమె నిలదీస్తూ అడిగింది అతడిలో కోపం మచ్చుకైనా కనిపించకపోవడం, ప్రశాంతంగా తర్కిస్తూ ఉండడం ఆమెకు మనఃక్లేశం కలిగించింది.

'నే నిలాగే అన్ని వివాదాలను దులిపేసుకుంటాను. అవి నన్ను నొప్పించలేవు, ఎందుకంటే నాకేదోకావాలనుకుని దేనివెంట నేను పడడంలేదు కనుక. ఎటువంటి అపప్రచారాలకైనా చలించని విధంగా నేనెప్పుడో మనసు రాయి చేసుకున్నాను. ఎదుటివాళ్ళు ఎంత విషం చిమ్మినా, ఎలా వెక్కిరించినా తట్టుకుని నిబ్బరంగా ఉండగలను. నే నేదైనా ఒక నిర్ణయం తీసుకున్నానంటే ఎవరేమన్నా ఆ నిర్ణయంలో కొంచెమైనా తేడా ఉండదు. మనద్దరికీ అది వర్తిస్తుంది. మధ్యమధ్య తలెత్తే అన్ని సమస్యలనూ నిగ్రహంతో ఎదుర్కోవాలని మనం వాగ్దానం చేసుకున్నాం కూడా!'

'వాళ్ళ కెలాగైనా శాస్తి జరగాలనే నా కోరిక' అరుణ మళ్ళీ అంది.

'ఎందుకని? వాళ్ళు నీ మీద అపనిందలు వేశారనా?'

'కాదు, ఎంతమాత్రం కాదు. వాళ్ళు నిన్ను నాశనం చేయాలనుకుంటున్నారు కనుక, నేను వాళ్ళ నాశనాన్ని కోరుకుంటున్నాను.' అరుణ దృఢంగా జవాబు చెప్పింది.

'వాళ్ళు నన్నెందుకు నాశనం చేయాలనుకుంటున్నారని నీవనుకొంటున్నావ్?'

'ఎందుకా? వాళ్ళకి నీమీద అసూయ. వాళ్ళు నీ శత్రువులు, నువ్వున్న పదవిలోంచి నిన్ను తప్పించాలని వాళ్ళ ఎత్తుగడ.'

'ఇప్పుడు అసలు విషయానికి వచ్చావ్.' సడలింపులేని తన తర్కాన్ని కొనసాగిస్తూపోయాడు ఆనంద్. 'అసలుకథలో అది ఒకభాగం మాత్రమే. వాళ్ళు నన్ను ధ్వంసం చేయాలని ఎందుకనుకుంటున్నారంటే, నేను వాళ్ళను ధ్వంసం చేస్తానని భయపడుతున్నారు కనుక. నన్ను వాళ్ళ శత్రువుగా భావిస్తున్నారు. వాళ్ళలా చూసి భయపడే వ్యక్తులలో నేనూ ఒకణ్ణి మన పార్టీలో. అయితే ఇది ముఖాముఖి తలపడేందుకు సమయంకాదు. వాళ్ళ కనుకూలించే యుద్ధభూమిపై నేను పోరాడదలచుకోలేదు. అది వ్యక్తిగత యుద్ధభఊమి. కాని నా పోరాటం వ్యక్తులతో కాదు, నాకు తప్పుగా తోచిన విషయాలతో, నాకు తప్పని తెలిసిన అంశాలతో. అందుకే 'ఎక్స్'నో,

'వై'నో నాశనం చేయడానికి యత్నించి నా శక్తియుక్తుల్ని వృథా చేసుకోవడంమీద నాకు ఆసక్తి లేదు. మన పరువు తీయడానికి జరుగుతున్న ఆ ప్రయత్నమెలా పేలవమైపోతుందో చూస్తూ ఉండు.'

'ఈ ప్రయత్నంలో వాళ్ళు నెగ్గుకురాకపోవచ్చు. కానీ వాడో, వాళ్ళో; నువ్వు పూర్తిగా మట్టికరిచే వరకూ ఊరుకోరనే విషయం నీ కర్థం కావడంలేదా? వాళ్ళమీద నీకు వ్యక్తిగత శత్రుత్వమేమీ లేకపోవచ్చు. కానీ వాళ్ళు కచ్చితంగా నిన్ను వ్యక్తిగతంగానే ద్వేషిస్తున్నారు. నీ అంతు చూసే వరకూ విశ్రమించరు. నువ్విలా వేదాంతిలా మాట్లాడుతూనే ఉండు, వాళ్ళు నీమీద అలా దాడి చేస్తూనే ఉంటారు. వాళ్ళకు ఉచ్చనీచాలు కూడా లేవు, కనుక వాళ్ళ దాడి నీ బలహీనతలమీద జరుగుతుంది. నీకున్న అతి పెద్ద బలహీనత ఇదేనని వాళ్ళ ఆలోచన.'

'ఇలా నా పని పట్టగలమని వాళ్ళు అనుకుంటూ ఉండవచ్చు. అయినాసరే, నువ్వు సూచించిన పద్ధతిలో కనుక నేను ప్రతిచర్యకు పూనుకుంటే వాళ్ళు ఆడించినట్టు ఆడిన వాణ్ణవుతాను.నాకూ ఇతరులకూ మధ్య తేడా జనం దృష్టికి తేడా ప్రస్ఫుటంగా కనిపించేలా నా విధ్యుక్తకృషిని మరింత పెంచడమే నా మార్గం. పని చేసుకుంటూ పోతాను. పని, పని —మతిభ్రమించేవరకూ, చచ్చేవరకూ పనిచేయడమే. అందువల్ల ప్రజల మద్దతు నాకు అపరిమితంగా లభిస్తుంది. అల్ప విషయాలు అప్పుడు ప్రాముఖ్యం కోల్పోయి తెర వెనక్కు తప్పుకుంటాయి. నిజం చెప్పాలంటే నాకు మరో మార్గమేదీ కనిపించడంలేదు. మనుషులందరూ లోపభూయిష్ఠులే కనుక. గొప్పగొప్ప ఫలితాలు సాధించినవాళ్ళందరూ యుగయుగాలుగా ఇలాగే వ్యవహరిస్తూ వచ్చారు. నేను ఎంచుకున్న పోరాటమార్గం కూడా ఇదే '

కొద్దిసేపు అరుణ ఏమీ మాట్లాడలేదు. తర్వాత మెల్లగా సాలోచనగా అంది. 'నీ కారణాలు సరిగానే ఉన్నాయి. కానీ నువ్వు నెగ్గుకురాలేవనే నాకు స్ఫురిస్తోంది. నా మార్గం వేరు. నేను వాళ్ళతో రాజకీయంగా, ముఖాముఖి తలపడతాను. వాళ్ళను నాశనం చేసేవరకూ లేదా ఆ ప్రయత్నంలో నేనే నాశనమయ్యేవరకు నిద్రపోను. ఆ విషయంలో మనిద్దరి సంకల్పబలం సమానమే. ఈ క్షణంలో నన్ను ప్రేరేపిస్తున్నది ఒకటే, విపరీతమైన ద్వేషం. నా నీతి నియమాల గురించి వాళ్ళేమన్నా నేను పట్టించుకోను. అయినా ఏ ఆడదీ సహించలేని, సహించకూడని అంశంమీద వాళ్ళు నామీద దాడి చేశారన్నది తిరుగులేని వాస్తవం. వాళ్ళందరినీ నరుకుతాను, వాళ్ళ వెనుక ఉన్న శక్తుల్ని నరుకుతాను. పార్టీని నరుకుతాను, అవసరమైతే ఆ ప్రయత్నంలో నన్ను నేను నరుక్కుంటాను. భగవంతుడు నా పక్షానే ఉంటాడని నమ్ముతున్నాను. నిన్నెంతో ఆరాధిస్తాను ఆనంద్, కానీ ఇప్పుడుమాత్రం ప్రతీకారేచ్ఛతో దహించుకుపోతున్నాను. నా మార్గానికి అడ్డు తగిలితే ఆ వేడి నీకూ సోకుతుంది. ఇటువంటి విషయాలకు నువ్వు అతీతంగా ఉండడం సమంజసమనే నాకూ అనిపిస్తోంది. నిన్నంతగా అభిమానించడానికి అది కూడా ఓ కారణం. కానీ, ఐయామ్ సారీ, నీలా నేను ఉండలేను. నే నా మూసలో తయారైనదాన్ని కాదు...'

ఇందుకు ఆనంద్ జవాబు చెప్పలేదు, ఆమెవైపు చూసి లాలనగా మందహాసం చేశాడు. ఎంత అందంలో ఎంత దృఢసంకల్పం! – అనుకున్నాడు. ఆమె వాదాన్ని అతడు స్పష్టంగానే

అర్థం చేసుకున్నాడు. ఆమెమీద అలా అపనిందలు గుప్పించి అవమానించినందుకు అతడికి కోపంగానూ ఉంది, విచారంగానూ ఉంది. అయినాసరే తమమీద దాడిచేసిన వాళ్ళమీద గుడ్డిగా ఎదురుదాడిచేయడం సమస్యకు పరిష్కారం కాబోదని అతడు నిర్ధారణ కొచ్చాడు. అది వాళ్ళకే ఉపకరిస్తుంది.

'అరుణా!' అతడు మృదువుగా అన్నాడు. 'నీ ఆవేశాన్ని నేను అర్థం చేసుకోగలను. ఆ అవమానానికి నేను రగిలిపోలేదనీ, కుమిలిపోలేదనీ అనుకోకు. నీ ప్రేరణలూ, ఆవేశాలు ఎలా ఉన్నప్పటికీ, ఈ విషయంలో నన్ను విశ్వసించమని కోరుతున్నాను. ఈ వ్యవహారాన్ని నేను పరిశీలించేవరకూ తొందరపడి ఏమీ చేయనని నాకు మాటివ్వు, సరేనా? మనం తిరిగి వెళ్ళీవెళ్ళగానే ఈ వ్యవహారం మీద దృష్టి పెడతాను.'

అఫ్రోజాబాద్‌కి తిరిగొచ్చిన తర్వాత ఆనంద్ ఈ విషయమై స్నేహితులతో, మద్దతుదారులతో సుదీర్ఘంగా మంతనాలు సాగించి పరిస్థితిని మదింపు వేయడానికి ప్రయత్నించాడు. తనకు వ్యతిరేకంగా జరుగుతున్న కుట్ర తీరుతెన్నులు ఎటువంటివో క్రమంగా తెలుసుకోగలిగాడు. అతడి చిరకాలమిత్రుల్లో చాలామంది తక్షణమే మంత్రివర్గంనుంచి తప్పుకోమని సలహా ఇచ్చారు.

అతడి సన్నిహితమిత్రుడు డాక్టర్ సుదర్శన్ ఖండితంగా చెప్పాడు. 'నా సలహా నీకు నచ్చదని తెలుసు. నీ మొహం ముందు వేలాడుతున్న ప్రమాదమేమిటో కూడా తెలియనంతగా కళ్ళు మూసుకున్నావు. మంత్రిపదవికి రాజీనామా చేయమని నా సలహా. ఇక ఇప్పటినుంచి నువ్వు వేసే ప్రతిఅడుగూ, మధ్యలో మరో మజిలీకూడాలేని అధఃపతనానికేనని నేను నిర్ణయానికొచ్చాను. అధికారంనుంచి నువ్వు ఆశించే వ్యక్తిగతప్రయోజనం ఏదీలేదని నాకు తెలుసు. ఒకవేళ అదే కనుక ఉంటే నువ్విప్పుడు ప్రవర్తిస్తున్నట్టు ప్రవర్తించిఉండేవాడివి కాదు. కనుక వెంటనే తేల్చుకో. సందిగ్ధంనుంచి సకాలంలో బయటపడు!'

ఆనంద్ వెంటనే ప్రత్యుత్తర మివ్వలేదు. సుదర్శన్‌చేసిన ఉద్రేకభరితమైన సలహా అతడి గుండెమూలలను స్పృశించింది. ఆనంద్ రాజకీయాల్లో కొనసాగితీరాలని నచ్చచెప్పి ఒప్పించిన మనిషి ఈ డాక్టరే. రాజకీయజీవితంలో... అడుగడుగునా ఆటంకాలను దాటుకుంటూ సాగవలసిన పరుగుపందెంలాంటి —ఆశ్చర్యం గొలిపే ఆటంకాల పరుగుపందెంలాంటి —రాజకీయ జీవితంలో... ప్రప్రథమంగా ఎదురైన ఒక తీవ్రఅవరోధాన్ని పురస్కరించుకుని ఎంతో ధైర్యశాలి అనిపించుకున్న అదే సుదర్శన్‌కు హఠాత్తుగా పాదాలు చల్లబడి, పారిపోవడానికి పిక్కబలం హఠాత్తుగా పెరగడం చూసి ఆనంద్ విస్తుపోయాడనే చెప్పాలి. అయినాసరే, సమస్యను నిర్మమదృష్టితో పరిశీలించి అతడికి తగిన ప్రత్యుత్తరమివ్వవలసిన కనీస బాధ్యత తనకుందనుకున్నాడు.

సమస్యను నిశితంగా లోతుగా పరిశీలించి తర్కించుకున్నాడు. అరుణను సంప్రతించలేదు; అందువల్ల ప్రయోజనముండదని అతడికి తెలుసు... తన సంతృప్తి మేరకు సమస్యను పరిష్కరించడానికి కేవలం ఒక నెలరోజులు గడువు తీసుకోవాలనుకున్నాడు.

# 26

చౌదరి చీకాకుతో పక్కనే ఉన్న యాష్‌ట్రేలో సిగరెట్టుపీకను నలిపిపారేశాడు. పొద్దుట అల్పాహారం తర్వాత అతడు కాల్చిన పదకొండో సిగరెట్ అది. తన ఆలోచనలను ఓ క్రమపద్ధతిలో పెట్టుకోడానికీ, నిస్పృహను అణచుకోడానికీ ప్రయత్నిస్తూ కొన్ని గంటలుగా తన స్టడీరూంలో ముందుకీ వెనక్కీ పచార్లుచేస్తూనేఉన్నాడు. ముఖ్యమంత్రులకు ప్రేమనీ భయాన్నీ కూడా కలిగిస్తూ ప్రధానమంత్రి పదిహేనురోజులకోసారి క్రమంతప్పకుండా రాసే లేఖ చదివాడతను. జవహర్లాల్‌నెహ్రూ సరళిని ప్రతిబింబించే అందమైనభాషలో రాసిన ఆ ఉత్తరం మిత్రసమ్మతం, దారిచూపించే దీపం, ముందున్న కార్యభారాన్ని తగినవేళ ఉపదేశాత్మకంగా సూచిస్తూ చేసే హెచ్చరిక. అందులో వార్తలూ, వ్యాఖ్యలూ, ఊహలూ, అద్భుతస్వప్నాలూ, సూక్తిరత్నాలూ, విస్తృతజ్ఞానానికి అద్దంపట్టే మాటల మూటలూ—ఇంకా మరెన్నో విశేషాలుంటాయి. మంచి ఊహాశక్తి ఉన్న కొద్దిమంది ముఖ్యమంత్రుల కా లేఖ ఎంతో ఉత్తేజంకలిగిస్తూ కార్యాచరణకు ప్రోత్సహిస్తూఉంటుంది. స్వప్రయోజనంతప్ప మరిదేనికీ సందివ్వని మిగిలిన ముఖ్యమంత్రులు కాలాన్నీ శ్రద్ధనీ వృథాచేసేదిగా ఆ లేఖను బహుశా పరిగణించుకుంటూఉంటారు, ఆ మాట పైకి అనకపోయినా.

పండిట్‌జీ రాసే లేఖలు చదివినప్పుడల్లా చౌదరి కాసేపు ఆరాధనాభావంతో కాసేపు ఆందోళనతో సతమతమౌతూఉంటాడు. అంతర్జాతీయవ్యవహారాలపై అవెంతో మేధా విలసితంగా ఉంటాయి. చౌదరి మొగ్గు అలీనోద్యమంవైపే (ఆ మాట కర్థం ఏమైనా కానీ—అని కొద్దిమంది సన్నిహితమిత్రులతో లోపాయికారీగా అంటుంటాడు) అంతర్గతవ్యవహారాలపై పండిట్‌జీ వెలిబుచ్చే అభిప్రాయాలనుకూడా అతడెంతో ప్రశంసిస్తూఉంటాడు, ఉదాహరణకు మిశ్రమఆర్థికవ్యవస్థ. చౌదరికి మిశ్రమఆర్థికవ్యవస్థ ఎంతో అనుకూలంగా కనిపిస్తూఉంటుంది. గొప్ప 'ఆచరణాత్మ'కమైనదని అప్పుడప్పుడు తనలో తానే అనుకుంటుంటాడు. ఇక ప్రభుత్వ రంగంగురించి అతడికి ఇదమిత్థమైన అభిప్రాయమేమీ లేదు, అయినా అందులోకూడా అతని కనేక సుగుణాలు కనిపిస్తుంటాయి. రాష్ట్రంలోని ప్రభుత్వరంగసంస్థల జనరల్‌మేనేజర్లు ఆయన కోరినవి రకరకాల మార్గాల్లో నెరవేర్చడానికి తహతహలాడిపోతూఉంటారు. ఆ ప్రారంభకాలంలో ప్రభుత్వరంగం లాభాల కోసం (మాత్రమే) పని చేయకూడదనే అభిప్రాయం ప్రబలంగా ఉండేది కనుక ఉద్యోగాలివ్వడంలో సామర్థ్యానికి సంబంధించిన కఠోరవిచక్షణ కానీ, ఫలితాల సాధనకు వీలుగా పరీక్షించడంకానీ ఉండేవి కావు.

కనుక ప్రభుత్వరంగ పరిశ్రమల్లో ఎందుకూ పనికిరాని వాళ్ళను కూడా వందలమందిని నియామకం చేసుకోవచ్చు. ఆవిధంగా నాయకులు తమ రాజకీయమిత్రుల్నీ, మద్దతుదారుల్నీ సంతోష పెట్టవచ్చు. ఇక బావ, బావమరుదుల విషయం చెప్పనే అవసరంలేదు

అయితే ఆ రోజు పొద్దుటే చౌదరిని చికాకుపెడుతున్న పండిట్‌జీ తాజా లేఖలోని విషయం: భూసంస్కరణలు. భూపరిమితిచట్టాలను త్వరగా ఆమోదించి అమలుచేయడమెంత అవసరమో ఆ లేఖ స్పష్టంచేసింది దాదాపు అన్ని రాష్ట్రాల్లో ఆ కార్య క్రమం నత్తనడక నడుస్తోందని లేఖ పేర్కొంది ఇంకెంతమాత్రం ఆలస్యంకావడానికి వీల్లేదని ప్రధానమంత్రి వ్యాఖ్యానించారు. దేశంలో అందుబాటులో ఉన్నవిగా అంచనా వేసిన మిగులుభూముల గణాంకవివరాలు ఏకరవుపెడుతూ, వాటిని భూమిలేని నిరుపేదలకు పంపిణీచేసినందువల్ల వచ్చే అపారప్రయో జనాలను ఆయన నొక్కిచెప్పారు. కౌలుదార్లు యజమానులైతే వ్యవసాయోత్పత్తి ఇబ్బడిముబ్బడిగా పెరిగిపోగలదని స్పష్టంచేశారు. భూసంస్కరణలవిషయంలో ఆయన వాదం ఎంతో తేటగా సూటిగా ఉంది. జవహర్లాల్‌నెహ్రూ ఈ విషయంలో తిరుగులేని నిర్ణయానికి వచ్చేసినట్టు అర్థమైపోయింది

అయితే ఇందులో లోతుగా ఆలోచించవలసిన ఒక ముఖ్యమైన అంశం ఉంది. చౌదరిని ముల్లులాగుచ్చి బాధపెడుతున్నదదే. భూసంస్కరణ అనేది ఎంత వివాదాస్పదమో, ఎంత తలనొప్పి వ్యవహారమో, అదెంతగా సాంఘికఉపద్రవాలకు దారితీయగలదో అతడికి తెలుసు. శాసనసభలో పార్టీకున్న బ్రూటుమెజారిటీని ఉపయోగించుకుని భూపరిమితిచట్టాలను ఆమోదింపచేయవచ్చు చిన్న కానీ, పెద్ద కానీ రైతును తన ఆధీనంలో ఉన్న భూమిని వదులు కోమని ఒప్పించడం సాధ్యమా? అయినా అసలెందుకు వదులుకోవాలి? రైతుదృష్టిలో భూమి కేవలం ఉత్పత్తి సాధనం మాత్రమే కాదు, అంతకు మించినది. అది అంతస్థుకు చిహ్నం. జీవన భద్రతకు ఒక ఆధారం. భూమితో రైతుబతుకు పూర్తిగా పెనవేసుకుపోతుంది, వారిని ఎవరూ విడదీయలేరు. ఎవడైనా భూమిని తెగనమ్ముకుంటే అతణ్ణి ఓ అసమర్థుడిలా చూస్తారు. ఈ కళంకాన్ని అతడు జీవితాంతం మోస్తూఉండవలసిందే... కనుక భూమిమీద పరిమితులు విధించే విషయంలో చౌదరికి తీవ్ర అభ్యంతరాలే ఉన్నాయి. నగరంలో ఉండే మనిషి ఎటువంటి పరిమితీ లేకుండా ఏ మేరకైనా డబ్బును, ఆస్తిని కూడబెట్టుకోవచ్చా? అది సబబా? న్యాయమా? అదీగాక, కేవలం భూమికే పరిమితి విధించడం ఏ విధంగా ఆచరణ సాధ్యం?... గదిలో పచార్లుచేస్తూ చౌదరి తనలోతానే ప్రశ్నించుకుంటున్నాడు

పార్టీ వేదికలమీద కొందరు ముఖ్యమంత్రులు, పార్టీనాయకులు భూసంస్కరణలను ఆకాశాని కెత్తడంలో పోటీపడుతుంటే అతడికి కోపం ముంచు కొచ్చేది. వాళ్ళా నినాదాన్ని ఓ పవిత్రవాక్యంలా, అతిక్రమించరానిదిగా మార్చేశారు. ఆ తర్వాత దానిపై స్వేచ్ఛాయుతమైన చర్చ జరగనే జరగదు. కారణం ఒకటే, ఆ విషయంలో ప్రధానమంత్రి ఆంతర్యమేమిటో తెలిసిపోయిన తర్వాత చర్చించ డానికి-ఎవరూ సుముఖంగా ఉండరు. అలాగని చౌదరి తన అభిప్రాయాలు వెల్లడించడానికి తహతహలాడిపోతున్నాడని కాదు. ఇంకెవరో అసమ్మతి లేవదీస్తారనీ, కనీసం వ్యతిరేక

అభిప్రాయమైనా ప్రకటిస్తారనీ అతడి ఆశ. ఒకే అభిప్రాయంతో ఉన్న వాళ్ళు అందరూ -ఎవరు నోరు విప్పుతారా అనుకుంటూ ఒకరి ముఖం ఒకరు చూసుకుంటూ ఉండిపోతారు. చివరకు ఎవరూ మాట్లాడరు., అందరూ కలిసి ప్రధానమంత్రికి మద్దతు ప్రకటించి ఊరుకుంటారు. వీళ్ళ మద్దతు మరీ అంత అనివార్యంగా కావలసిన స్థితిలో ప్రధానమంత్రి లేడు, అది వేరే విషయం. చౌదరి, చౌదరిలాంటి వాళ్ళు మూగకోపంతో, నిస్పృహతో రగిలిపోతూ సమావేశంనుంచి బయట కొస్తారు.

ఆ తర్వాత చౌదరి కొందరు ముఖ్యమంత్రులతో ఈ విషయం మాట్లాడినప్పుడు వాళ్ళ నుంచి ఆసక్తికరమైన సమాధానాలు ఎదురయ్యాయి. 'రెక్కలు విప్పుకుని విహరించే జవహర్లాల్ గారి ఆదర్శభావాలను ఎదుర్కోడానికి ఒక మార్గం ఉంది' మెరిసే కళ్ళతో ఒకాయన చెప్పుకుంటూవచ్చాడు. 'ఏకగ్రీవంగా తీర్మానాలను ఆమోదింపజేశారా, ఆ విషయంలో మరేమీ చేయనవసరంలేని హక్కును మీరు సాధించుకున్నట్టే! చూశారూ?... చాలా సులువైన మార్గం!'

వివేకం తొణికిసలాడేలా మరో సీనియర్‌నాయకుడన్నాడు. 'చౌదరీజీ, మీ రర్థం చేసుకోవాలి. పండిట్‌జీ మాటల్ని వట్టి ఊహాచిత్రంగా కొట్టిపారేయకండి. ఆచరణలో పనికొచ్చేదెంతో అందులో ఉంది. దానికి ప్రతిచోట మంచి గిరాకీ ఉంటుంది. అసలే దిక్కుతోచనిస్థితిలో పడున్న ప్రతిపక్షం గాలి పూర్తిగా తీసేస్తుంది. భూసంస్కరణలంటూ ఎప్పుడూ గావుకేకలు పెట్టడమే కానీ, అసలు భూమిగురించి వాళ్ళ కేమైనా తెలిస్తే కదా! తమనేవో పార్టీలని పిలుచుకుంటూ ఉంటారు కానీ ఒక్కొక్క అనుచరుడికి పదిమంది నాయకులుంటారు!!'

లౌక్యం బాగా ఒంటబట్టించుకున్న మూడోమనిషి నేరుగా అసలు విషయాని కొచ్చేస్తూ అన్నాడు. 'ఈ చట్టాన్ని ఆమోదిస్తే ఏమిటి నష్టం? పిల్లుల పేర, కుక్కల పేర, పుట్టబోయే పిల్లల పేరా, మనమలు, మునిమనమల పేర తమ భూముల్ని ఎలా బదలాయించాలో భూయజమానులకు తెలియకపోతే కదా! ప్రభుత్వం దగ్గరున్న మిగులు ఎకరాల అంకెలు పెంచడానికి రాతినేలల్ని, చవిటిపర్రల్ని తప్ప వాళ్ళు వదులుకునేదేమీ ఉండదు.'

ఈ విధమైన భాష్యాలు చౌదరికి కొంత ఊరటనిచ్చాయి. అయితే ప్రధానమంత్రి నిశ్చితస్వరం అతడి చెవుల్లో గింగురుమంటోంది. నిమ్మకు నీరెత్తినట్టు కూర్చోవడం అసాధ్యమనిపిస్తోంది. నిలువునా ముంచెత్తే ఆ నిజాయితీముందు కపటం ప్రదర్శించడం హేయమైన పాపమన్న భావం కలుగుతోంది. క్లుప్తంగా చెప్పాలంటే చౌదరి కలవరపాటుకు అసలు కారణం అదే.

చాలా సంవత్సరాల క్రితం, మద్రాసులో జరిగిన పార్టీ సభల్లో తాను సోషలిస్టుతరహా సామాజికవ్యవస్థగురించి ప్రసంగించిన విషయాన్ని అతడు గుర్తుచేసుకున్నాడు. అందులో ఒక్క మాటమీదకూడా తనకు గురిలేకపోయినాసరే అద్భుతంగా మాట్లాడాడు. జవహర్లాల్‌నెహ్రూ తనను చూసి ఆమోదసూచకంగా తలపూపిన సంగతికూడా అతడికి గుర్తొచ్చింది. జవహర్లాల్ ఇప్పటికీ జ్ఞాపకముంచుకున్నాడో, ఏమో? గుర్తుండిఉంటే తననుంచి ఏమిటాశిస్తాడు?... తెలివి మీరిన ఆ ప్రసంగం తాను చేసి ఉండవలసింది కాదనీ, తను విసిరిన ఊకదంపుడుమాటల

ఉచ్చులో ఇప్పుడు తానే ఇరుక్కోవలసి వచ్చిందనీ అనుకుని చౌదరి ఎంతో విచారించాడు. భూస్వాముల చేతుల్లోంచి భూముల్ని గుంజుకుని ముఖ్యమంత్రిగా తానెలా కొనసాగడమో అతని కర్థం కావడంలేదు. ముఖ్యమంత్రిగా తన అస్తిత్వంకంటె ముఖ్యమైంది తన కేముంటుంది?... పైగా, మహేంద్రనాధ్, అతడి అనుయాయులు భూస్వామ్యవర్గాన్ని తనకు వ్యతిరేకంగా రెచ్చగొట్ట డానికి కుట్రచేసినట్టు పత్రికలు ఇప్పటికే రాశాయి... చౌదరి కనుక భూసంస్కరణలు కొనసాగిస్తే భూస్వామ్యవర్గం అతనికి దూరమౌతుందని పత్రికలు అంచనావేస్తున్నాయి. ఒకవేళ ఆ విషయంలో చౌదరి అడుగు తడబడిందే అనుకోండి, అతడిమీద దాడిచేయడానికి మహేంద్రనాథ్‌కి అది కూడా చక్కని ఆయుధమే అవుతుంది. తక్షణమే అధిష్ఠానవర్గందృష్టిలో అతడు పనికిరానివాడైపోతాడు.

భూస్వామ్యవర్గంతో ఘర్షణ అన్న ఊహకే చౌదరి వణికిపోయాడు. అతడి కేమీ పాలు పోవడం లేదు. అన్ని సిగరెట్లు తగలేసి గదిలో అంతసేపు పచార్లుచేసినా కాస్తంతా ఉపాయంకూడా తట్టలేదు. ప్రధానమంత్రినుంచి అటువంటి ఆదేశం వస్తుందని ఊహించి పలువురు విధేయులనూ, సహచరులను కొద్దిరోజులుగా అతడు హెచ్చరిస్తూనే వచ్చాడు. శాసనసభ్యులు భయంతో బిక్కచచ్చిపోయారు. బ్రిటిష్‌వాళ్ళు ప్రవేశపెట్టిన జమీందారీపద్ధతిని కొన్నేళ్ళక్రితం తాము రద్దుచేసుకున్నమాట నిజమే. అప్పుడు ఒక్క కుక్కకూడా మొరగలేదు. అయితే ఆ వ్యవహారం పూర్తిగా వేరని శాసనసభ్యుల వాదన. బ్రిటిష్‌వాళ్ళవైపు మొగ్గుచూపించి, స్వాతంత్ర్యపోరాటకాలంలో ప్రజావ్యతిరేకచర్యలకు పాల్పడిన కారణంగా జమీందార్లు అప్పటికే ఎలాగూ జనాదరణ కోల్పోయి ఉన్నారు. కనుక జమీందారీలను రద్దుచేయడానికి ఎటువంటి ఆటంకమూ లేకపోయింది. అదీగాక స్వాతంత్ర్యం వెనువెంటనే సంస్కరణలకు అనుకూలంగా జనంలో ఉత్సాహం పరవళ్ళు తొక్కిన తొలిఘట్టం అది. అందుకే జమీందారులపీడ విరగడైందనుకుని అందరూ పండగ చేసుకున్నారు. ప్రజల్ని విముక్తులను చేయాలన్న తమ కృతనిశ్చయానికి నిదర్శనంగా ఈ పరిణామాన్ని పార్టీ చూపించింది... ఇప్పుడు, కర్షకులుగా, రైతులుగా పిలవబడే భూస్వాముల విషయాని కొచ్చే సరికి దీనికి పూర్తిగా భిన్నమైన పరిస్థితి ఏర్పడింది. భూస్వాములు తరతరాలుగా హక్కుభుక్తం చేసుకున్న భూమిలో కొంతభాగాన్ని హస్తగతం చేసుకోవడమంటే అధికారపక్షానికి ఆత్మహత్యా ప్రయత్నంకంటె తక్కువేమీ కాదు. పార్టీలోని పలువురు సభ్యులు, ముఖ్యంగా వందలఎకరాల భూములున్న వాళ్ళు గావుకేకలు పెట్టడం ప్రారంభించారు. చౌదరి వాళ్ళ గోడును ఎంతో ఓపికగా వినిపించుకుంటూ వచ్చాడు.

పార్టీలోనే మరికొందరు సభ్యులు– తమకంటూ సెంటుభూమికూడా లేదు కనుక కోల్పోయేదేమీ లేదనుకునే వాళ్ళు –తక్షణమే భూపరిమితిచట్టాన్ని అమలుచేయవలసిన అవసరాన్ని నొక్కిచెబుతున్నారు. కిందటి ఎన్నికల్లో ప్రజలు ఆమోదించిన పార్టీ ప్రగతిశీల కార్యక్రమాలలో ఇదికూడా ఒకటి కనుక చిత్తశుద్ధిని నిరూపించుకోవలసిందే నంటున్నారు. నిర్ణయాన్ని అమలుచేయడంలో వెనకడుగు కానీ, సడలింపుధోరణి కానీ తగవుకాక తగవంటు న్నారు. ఇప్పుడు తీసుకునే చర్యల మీదనే పార్టీ విశ్వసనీయత ఆధారపడి ఉంటుందని స్పష్టంచేస్తున్నారు. మనకిది పరీక్షాఘట్టమని హెచ్చరిస్తున్నారు.

భూపరిమితిపై వ్యక్తుల అభిప్రాయాలుకూడా సాధారణంగా వాళ్ళ వాళ్ళ చేతుల్లో ఉన్న భూమి పరిమాణానికి తగినట్టుగానే ఉంటూఉంటాయి. ఉదాహరణకు ఒక వ్యక్తికి పదిఎకరాలుంటే, పదెకరాలను మించిన భూమికి పరిమితి వర్తించేలా చట్టంచేస్తే ఎటువంటి అభ్యంతరమూ లేదు. అలాగే మిగిలినవాళ్ళు. ఈ విషయంలో పార్టీసమావేశాల్లో చెలరేగే వాగ్యుద్ధాలు పిచ్చాసుపత్రిలో జరిగే దొమ్మీలను తలపింపజేయడం ప్రారంభించాయి. మంత్రుల విపరీతస్పందనపై పత్రికలు వ్యంగ్యపూరిత విమర్శలూ, ఎద్దేవా వ్యాఖ్యలూ గుప్పించడం మొదలుపెట్టాయి.

చౌదరి ఈ సమస్యగురించి కొందరితో ఇంకా అంత వివరంగా చర్చించలేదు. వాళ్ళలో శేఖర్, ఆనంద్ కూడా ఉన్నారు. శేఖర్ తాపీగా లోపలికి అడుగుపెడుతుంటే చూసి చౌదరి పచార్లు ఆపాడు. శేఖర్ నమస్కరించి కూర్చున్నాడు. 'దేని గురించి సార్ ఆలోచిస్తున్నారు?' ఏమీ తెలియనట్టు ప్రశ్నించాడు.

'దేని గురించో నీకూ తెలుసు' చౌదరి చిటపటలాడాడు. 'భూస్వాముల్ని వాళ్ళ భూముల్లోంచి తన్నితగలేసి ఆ ముదనష్టపు మిగులుభూమిని నేను భూమిలేనివాళ్ళకి పంచిపెట్టాలట. ఈ పదిహేనేళ్ళలో భూమిలేనివాళ్ళకి పంచిపెట్టిన లక్షలఎకరాల ప్రభుత్వభూమికి ఏ గతి పట్టిందో అందరికీ తెలుసు. అందులో చాలాభాగం మళ్ళీ భూస్వాముల చేతుల్లోకే పోయింది. భూమిలేనివాళ్ళు అలాగే మిగిలిపోయారు. ఇన్నేళ్ళుగా ఏ కష్టం మొచ్చినా వెన్నుదన్నుగా నిలబడుతున్న సంపన్న రైతులతో శత్రుత్వం తెచ్చుకుంటే తప్ప దేశానికీ పార్టీకీ ముక్తి లేదని ఢిల్లీపెద్దల ఆలోచన. ఇప్పుడు నేనేం చేయాలి?'

'అది పార్టీ ఎన్నికలప్రణాళికలో ఉన్న విషయమే ననుకుంటాను?'

'అవును, ఉన్నదే. అయితే ఏమిటి? ఇంతకన్నా ప్రాధాన్యం ఇవ్వవలసిన వాగ్దానాలు ఎన్నికల ప్రణాళికలో లెక్కలేనన్ని ఉన్నాయి. ఈ దిక్కుమాలినదాన్నే పట్టుకుని మన మెడకు మనమే ఉరెందుకు బిగించుకోవాలి?'

'ప్రధానమంత్రితో మాట్లాడి ప్రాధాన్యాలను ఎందుకు మార్చకూడదు? ముఖ్యమంత్రులందరూ కలిసి మాట్లాడితే ఆయన ఒప్పుకుంటారనే నా నమ్మకం.'

'అదంత తేలిక కాదు. ఇప్పటికే ఆ మహేంద్రనాథ్ భూపరిమితిననినాదాన్ని నాలుకమీద వేసుకుని ఊరేగుతున్న విషయం నీ కేమైనా తెలుసా? ఢిల్లీలో అతని వర్గంవాళ్ళు ఇప్పటికే నా మీద అవాకులు చెవాకులు పేలుతూ నా కాళ్ళకింద మంటలు పెట్టే ప్రయత్నం చేస్తున్నారు. ఆ గాడిదకొడుక్కి భూసంస్కరణలమీద నిజంగానే విశ్వాస ముందనుకుంటున్నావా?'

'మనం వాగ్దానంచేసిన భూపరిమితి లాంటి కార్యక్రమాల్ని నమ్మి జనం మనకు వోట్లు వేశారు. ఆ వాగ్దానాలు చెల్లించుకోవలసిన సమయంలో మీరు వెనకడుగు ఎలా వేస్తారు?..'

'వెనకడుగు వేస్తున్నదెవరు? భూస్వాములు, భూమిలేని లక్షలమంది ప్రజలు ఏ చావు చస్తారో నా కనవసరం. నాకు కావలసిందల్లా పార్టీ ఎలాగైనా అధికారంలో కొనసాగేలా చూడడం. మనం

కేవలం సంస్కరణలు తీసుకురావడానికే, జనానికింత మంచి చేయడానికే దిగొచ్చిన పరోపకార పరాయణులం కాదు. మనం రాజకీయవాదులం. సంస్కరణలూ లేవు, గాడిదగుడ్డూ లేదు, అధికారాన్ని భద్రంగా ఉంచుకోవడమే మనకు ముఖ్యమంటాను. ఆ పనిచేస్తూ దేనినైనా ఎంతైనా సంస్కరించు, మనకు ఆకాశమే హద్దు!'

మొత్తంమీద ఆ సంభాషణ ఎటువంటి పర్యవసానంవైపు నడిపించడంలేదు. అయోమయంతోపాటే చౌదరిలో అసహనం నిమిష నిమిషానికీ పెరిగిపోతోంది. రాజకీయాధికారం ఒక్కటే ముఖ్యం, మిగిలినవన్నీ అప్రస్తుతాలని అతడి నమ్మకం. అయితే ప్రజాస్వామ్యవిధానంలో రాజకీయాధికారమనేది ప్రజలకు పార్టీ చేసిన వాగ్దాన మేమిటన్న దానిమీద ఆధారపడి ఉన్నంతగా, వాస్తవంగా పార్టీ చేసిందేమిటన్న దానిమీద ఆధారపడి ఉండదు! కనీసం ఇప్పటి వాస్తవికత అదే... కాని, అదంత స్పష్టంగా చెప్పలేమని తనే మనసులో సవరణ చేసుకున్నాడు. అధికారమనేది ఫలానాది చేయగలనని మనం ప్రజల్ని నమ్మించడంమీద ఆధారపడిఉంటుంది. అక్కడే ఉంది, మిగిలినవాళ్ళకీ, గొప్ప ప్రజాదరణ ఉన్న నాయకులకీ మధ్య తేడా. ఉదాహరణకి, జవహర్లాల్‌నెహ్రూమీద ఉన్నంత విశ్వాసం రాష్ట్రనాయకత్వంమీద ఎవరికీ ఉండదు. కనీసం జాతీయరాజకీయపక్షాల విషయంలో (అప్పటికింకా ప్రాంతీయపక్షాలు పెద్దసంఖ్యలో రాజకీయ రంగస్థలిమీదికి అడుగుపెట్టలేదు) ఇది తిరుగులేని వాస్తవం. రాష్ట్రాల్లో ఉండే మహేంద్రనాథ్‌లు, చౌదరులు భూస్వాములనుంచి భూములు గుంజుకుని భూమిలేనివాళ్ళకి పంచిపెట్టగలరని కలలో కూడా ఎవరూ ఊహించుకోలేరు. ప్రజలకు వాళ్ళగురించి ఎంతో బాగా తెలుసు కనుక, ఆకాశానికి నిచ్చెన వేయబోతున్నట్టు ఆర్భాటంచేసే ఎన్నికలసమయంలో కూడా వాళ్ళ నోట జాలువారే ఇటువంటి వాగ్దానాల్ని విశ్వసించలేరు. మహేంద్రనాథ్‌ను కానీ, చౌదరిని కానీ, ఆ మాట కొస్తే, తాము వోటు వేయబోతున్న అభ్యర్థిని కానీ వాళ్ళెప్పుడూ పరిగణనలోకి తీసుకోరు. కేవలం పండిట్‌జీకి, ఒకే ఒకరైన పండిట్ జవహర్లాల్‌నెహ్రూకు మాత్రమే వాళ్ళు వోటు వేస్తారు. ఉబుసుపోక మాటలు, మంచి ఆహ్లాదంకలిగించే కుంభకోణాల ముచ్చట్లు చెప్పుకోడానికే వాళ్ళ దృష్టిలో రాష్ట్రనాయకులు పని కొస్తారు, అంతే...

ఇప్పుడు వితరణాత్మక న్యాయమనే ఓ అందమైన భ్రాంతిలో తాను మునిగిపోవాలి. ఆ పేరుతో విప్లవాత్మకమే కాక, అరాచకశక్తిని తమలో దాచుకున్న భూపరిమితిచట్టాలను అమలుచేయవలసిన స్థితిని తాను ఎదుర్కోవాలి. హఠాత్తుగా ఈ విషయం చౌదరి గ్రహించాడు. వాటిమీద అతని కెలాంటి నమ్మకంలేదు, వాటినెలా అమలుచేయాలోకూడా అతనికి తెలియదు. 'మహాగొప్ప భూసంస్కరణలు!' కసితీరా తిట్టుకున్నాడు.

భూపరిమితన్న ఆకర్షణీయమైన నినాదమే లేకపోతే ఎన్నికల్లో తమ పార్టీ పరిస్థితి ఎలా ఉండేది? అంత చికాకులోనూ చౌదరి ఈ ప్రశ్నపై కాస్త లోతుగా తర్కించుకున్నాడు. మిగిలిన పార్టీల స్థితిగతుల్ని దృష్టిలో ఉంచుకుంటే తమపార్టీ ఎలాగైనా గెలిచి ఉండేదన్నది మొట్టమొదటగా అతడికి తోచిన అభిప్రాయం. నిజం చెప్పాలంటే భారతదేశంలో ఎన్నికలు జనానికి ఎంచుకునే

అవకాశం ఇస్తాయి కానీ, అది అత్యుత్తముల కోసం జరిగే ఎంపిక కాదు, పనికిమాలినవాళ్ళలో కాస్త తక్కువ పనికిమాలినవాళ్ళకోసం జరిగే ఎంపిక... మరుక్షణమే అతణ్ణి సరికొత్త సందేహాలు ముంచెత్తాయి. జవహర్లాల్‌నెహ్రూ, భూసంస్కరణలు అనే కలయిక లేకపోయినా పార్టీ ఎన్నికలలో గెలిచి గట్టెక్కిఉండేదని అంత ధీమాగా ఎలా చెప్పగలం?... అవును, పార్టీ గెలుపుకి అదే కారణం! మనసులో తన ఊహను తనే ఖండించుకుంటూ అనుకున్నాడు. జవహర్లాల్‌నెహ్రూ, భూసంస్కరణల సమ్మేళనం... ఆ గొప్ప కలయిక... కాదనడానికి వీల్లేదు, మరో పార్టీ ఏదీ సృష్టించలేకపోయిన అజేయమైన సమ్మేళనం అది.

కనుక అతడి ఆలోచనలు మళ్ళీ మొదటికే—అంటే భూపరిమితి అమలుకీ, రాజకీయాధికారానికి ఉన్న సంబంధం దగ్గరకే వచ్చి —ఆగిపోయాయి. చట్టాన్ని అమలుచేయకపోయావా, పార్టీ ఎన్నికలప్రణాళికను ఉల్లంఘించిన వాడివవుతావు. అమలుచేశావా ఎంతో శక్తిమంతమైన భూస్వామ్య వర్గం నిన్ను కాలరాసి పారేస్తుంది. ఏది చేసినా సర్వనాశనం తప్పదు —ఒకటి వచ్చే ఎన్నికలలో మీదపడే ముప్పు, రెండోది ఇప్పటికిప్పుడు సంభవించే ప్రమాదం.

అన్యమనస్కంగా చుట్టూ పరికించిన చౌదరికి, శేఖర్ సుఖంగా సోఫాలో కూర్చొని కనిపించాడు. ఎదురుగా ఉన్న చిన్న టేబులుమీదికి విశ్రాంతిగా కాళ్ళు బారజాపి ఏ సమస్యలూ సంక్షోభాలూ లేకుండా ప్రపంచం పరమప్రశాంతంగా ఉన్నట్టు తృప్తిగా సిగరెట్ కాల్చుకుంటున్నాడు.

'ఈ సమస్యనుంచి నన్ను బయట[illegible]డేసే ఆలోచన నీ కున్నట్టు లేదు' చౌదరి అన్నాడు. శేఖర్ ఉదాసీనభంగిమ చూడగానే అత[illegible] గొ[illegible]కులో కలవరం తొంగిచూసింది.

'నన్నేం చెప్పమంటారు?' శేఖర్ [illegible] బద్ధకాన్ని వదిలించుకోడానికా అన్నట్టు [illegible] ముందుకు చూస్తూ అడిగాడు. 'ఇది పూర్తిగా నాయకులమధ్య వ్యవహారం. అటు [illegible]వనాయకుడు, ఇటు రాష్ట్రనాయకుడు ఆయనేం కావాలంటున్నాడో మీకు తెలుసు. మీరేం [illegible]కుంటున్నారో అంతకన్నా కచ్చితంగా మీకు తెలుసు. నాకు రెండూ తెలియవు. ఈ పరిస్థితిలో [illegible] నేను పనికొచ్చే సలహాలే మివ్వగలను? ఒకటిమాత్రం చెప్పగలను, నేను మీ సహచరుణ్ణి; [illegible]ంకా చెప్పాలంటే మీరే నియమించగా అయిన మీ సహచరుణ్ణి. కనుక మీకు బాసటగా ఉండగలను.'

'ఏదైనా పరిష్కారం ఆలోచించ లేవా శేఖర్?' చౌదరి ఎంతో ఆశాభావంతో అడిగాడు. '[illegible]భూపరిమితులనే ఎండమావిని ఒకవైపున చూపిస్తూనే, భూస్వామ్యవర్గం తిరగబడకుండా నిరోధించే ఏదైనా ఉపాయం ఆలోచించలేవా? ఎంతో బుద్ధిశాలిగా పేరు తెచ్చుకున్నవాడివి...'

'చిన్న సవరణ' మధ్యలో అడ్డుతగులుతూ అన్నాడు శేఖర్ 'దుర్బుద్ధిశాలి.'

'ఏమైనా బుద్ధిశాలివే కదా! ఏదైనా ఆలోచించు... గట్టిగా ఆలోచించి మనల్ని ఈ గండం నుంచి గట్టెక్కించు' చౌదరి బతిమాలుతున్నట్టు అన్నాడు

ఆ తర్వాత కొద్దిసేపు నిశ్శబ్దం తాండవించింది. ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళు కూరుకుపోయారు. ఏదో ఉపాయం స్ఫురించినట్టుగా హఠాత్తుగా అన్నాడు చౌదరి, 'శేఖర్, ఈ వ్యవహారాన్ని

నువ్వే ఎందుకు చేతుల్లోకి తీసుకోకూడదు? భూసంస్కరణల బాధ్యతను నీకే అప్పగిస్తే...?'

'పోర్టుఫోలియో మార్చడం తేలికే. అంతమాత్రాన మీ సమస్య పరిష్కారమైపోతుందా? నా ఉద్దేశంలో, కాదు...' శేఖర్ అన్నాడు.

'ఎందుకని?'

'నాకో సెంటుభూమికూడా లేదని అందరికీ తెలుసు కనుక ఇదేదో కంటితుడుపుగా చేసిందంటారు. పైగా, భూమిగురించి ఏమీ తెలియని ఓ అజ్ఞానిని భూస్వాముల్ని నాశనంచేయడానికి ప్రయోగించాడంటారు... అంతకంటె ప్రమాదకరం, మహేంద్రనాథ్‌వర్గం దీనిని ఓ కపట నాటకంగా పార్లమెంటుసెంట్రల్‌హాలులో కచ్చితంగా ప్రచారం చేస్తుంది...'

చౌదరి చటుక్కున అర్థం చేసుకున్నాడు, ముఖ్యంగా, మహేంద్రనాథ్ వర్గంగురించి అన్న ఆ చివరివాక్యం తర్వాత. మరో సిగరెట్ వెలిగించి సకిలించాడు 'అయితే చెప్పు, ఈ పనికిమాలిన పని ఎవడు చేయాలంటావ్?'

'చూడండి బాస్' శేఖర్ ప్రారంభించాడు. 'పోర్టుఫోలియోలు మీ విశేషాధికారపరిధిలోకి వస్తాయి. ఎవరు ఏ పనికి సరిపోతారో మీకు తెలుసు. నన్ను ఈ విషయంలో విశ్వాసంలోకి తీసుకుంటున్నందుకు కృతజ్ఞుణ్ణి. అడిగారు కనుక చెబుతున్నాను, నా దృష్టిలో ఉన్న ఒకేఒక తిరుగులేని వ్యక్తి ఆనంద్. నిజానికి అతడికి అప్పగిస్తే చాలా సమస్యలు పరిష్కారమౌతాయి...'

చౌదరి పగలబడి నవ్వాడు. కొద్దిసేపు అలా నవ్వుతూనే ఉండిపోయాడు. 'నువ్వు జీనియస్‌వి శేఖర్. దుష్టబుద్ధివైనా సరే, ఒప్పుకుంటున్నాను' అంటూ మళ్ళీ అట్టహాసం చేశాడు. తెరలితెరలి వస్తున్న నవ్వును ఎలాగో అణుచుకుని అడిగాడు 'ఇప్పుడు చెప్పు, నువ్వు కనిపెట్టిన ఆ రకరకాల పరిష్కారాలేమిటి?'

'మొదటగా చెప్పాలంటే, అతడు భూయజమానులవర్గం వాడు కనుక అతడిపట్ల విశ్వసనీయతకు తిరుగుండదు. రెండోది, భూస్వాములు అంతరాంతరాల్లో అతణ్ణి విశ్వసించకపోయినా బహిరంగంగా వ్యతిరేకించలేరు. మూడోది, ప్రధానమంత్రి అభిమతాన్ని పాటించి అతిముఖ్యమైన కార్యక్రమాన్ని నెరవేర్చే బాధ్యతను మీరు నిజాయితీ, సామర్థ్యం పుష్కలంగా ఉన్న మంత్రికి అప్పగించారు కనుక ఢిల్లీలోని మహేంద్రనాథ్‌వర్గంలో ఎవరూ నోరెత్తలేరు...'

'నాలుగోది, భూస్వామ్యవర్గం దరిమిలాను అతణ్ణి నాశనం చేసేస్తుంది' ముగింపుగా అన్నాడు చౌదరి హాస్యానికి విషపూరితధోరణిని జోడిస్తూ.

'నేను చూసి ఆనందించాలని కోరుకుంటున్నది అక్షరాలా అదేనని కూడా మీరనచ్చు' అన్నాడు వ్యంగ్యానికి ఒకింత గాంభీర్యం మేళవిస్తూ శేఖర్. 'ఆ అవకాశాన్ని నేను కాదనను. అలాగే జరిగితే నేనేమీ దుఃఖంతో కుప్పకూలిపోను. నాకూ ఆనంద్‌కీమధ్య ఎటువంటి ఆదరాభిమానాలు లేవు, దట్సాల్. అయితే మరో మాటకూడా మీకు చెప్పాలి. ఈ వ్యవహారానికి వేరొక కోణం కూడా ఉంది. నిజంగానే ఉంది, మీరు నన్ను నమ్మాలి...'

క్షణకాలం ఆగి చౌదరివైపు చూశాడు, అలాగే కిటికీ అవతల పూలమొక్కలమీదుగా చెల రేగి గంతులేస్తున్న అల్సేషన్‌ను చూశాడు. తన ఆలోచనలకు ఒక క్రమం కల్పించుకోవడంకోసం కాబోలు అతడుకూడా గదిలో పచార్లు ప్రారంభించాడు.

'కానివ్వు శేఖర్... నేను వింటున్నాను' చౌదరి అన్నాడు.

'నాకు తెలుసు మీరు వింటున్నారని. వ్యవహారం చాలా సంక్లిష్టమైంది కనుక తేటతెల్లంగా ఎలా వ్యక్తంచేయాలో నాకు తెలియడంలేదు. చూడండి చౌదరిగారూ, నిష్ఠురసత్యంతో మనం తలపడవలసిన క్షణాలివి. నాకు ఆనంద్‌మీద ఇష్టంలేదు, అతడికి నామీదా అంతే. అయితే ఈ విరోధాలు చాలా అల్పమైనవి. వాటికో అర్థంలేదు. మనం పట్టించుకోవలసింది ఒకటే. ప్రధానమంత్రి మిమ్మల్ని ఓ అద్భుతం చేయమంటున్నారు. మామూలు చట్టాలద్వారా —తెలిసిన, తెలియని రకరకాల లొసుగులతో పుట్టిన మన మామూలు చట్టాలద్వారా —విప్లవం సృష్టించమంటున్నారు. తెలంగాణాప్రాంతం ఇక్కడికెంతో దూరంలో లేదు. కొన్నేళ్ళక్రితం అక్కడ ఇటువంటి కారణంతోనే భయంకరమైన సాయుధపోరాటం జరిగింది. అది విఫలమై రక్తపాతాన్నీ, కడగండ్లనూ మిగిల్చి వెళ్ళింది. భూపరిమితిచట్టాలను వాస్తవంగా అమలుచేసే విషయంలో వ్యక్తిగతంగా మీ కెన్నో అనుమానాలున్నాయి. అయితే మిగిలిన వాళ్ళలా కాకుండా ఒక వ్యవస్థగా భూస్వామ్యాన్ని మీరు సమర్థించేవారు కాదు. అయితే ఈ ప్రయత్నంలో అధికారం కోల్పోకూడదనే మీ చింత. అది ఒకరకంగా మనకు అనుకూలించే విషయం. ఇంతకుముందు ఆ గడ్డమీద చిందిన రక్తానికి తగిన దైవికన్యాయం జరగాలనీ, తగిన ప్రతిఫలం చెల్లించబడాలని నేనుకూడా గట్టిగా భావిస్తున్నాను. మనం అలా చేయగలిగితే అది ఘనవిజయం అవుతుంది. అసలు ప్రశ్నల్లా, ఎలా చేయాలన్నదే. ఇప్పుడు పరిస్థితిని ఓసారి గమనించి చూడండి. ప్రధానమంత్రినుంచి మనకు అనుకూల ప్రేరణ ఉంది. తటస్థుడే అయినా, రాజకీయసుస్థిరత, ఆపైన అప్రమత్తత ఉన్న ముఖ్యమంత్రి ఉన్నాడు. అలాగే చిత్తశుద్ధి, సామర్థ్యం ఉండి ఈ వ్యవహారం ఆనుపానులు క్షుణ్ణంగా తెలిసి విజయంకోసం తుదికంటా కృతనిశ్చయంతో పోరాడగల అంకితభావమున్న మంత్రిని రంగంలోకి దింపగలం. ఈ అనుకూలాంశాలను దృష్టిలో పెట్టుకుని చూస్తే ప్రజాస్వామ్యప్రక్రియలోని అద్భుతమైన ఆచరణశక్తిని రుజువుచేయగల మహత్తర అవకాశంగా —దూరపు అవకాశమని మీరన్నా అనచ్చు —దీనిని నేను భావిస్తున్నాను. నా ఉద్దేశంలో ఇదే మనకు అసలు పరీక్ష. ఎటువంటి ప్రమాదాలు ఎదురైనాసరే పోరాడి తీరాలంటాను.'

'ఇది నిజంగా కొత్తకోణం శేఖర్,' చౌదరి సాలోచనగా అన్నాడు. 'విలువైన కోణం కూడా, ఒప్పుకుంటున్నాను...'

# 27

ఆనంద్ భూసంస్కరణలమంత్రి కాబోతున్న వార్త, కేవలం ఒక రాజకీయవార్తకే సాధ్యమైనంత వేగంగా కార్చిచ్చులా వ్యాపించింది. ఇంకా అధికారికప్రకటన కానీ, ధ్రువీకరణకానీ జరగలేదు. మంత్రిత్వశాఖలమార్పును పొందుపరుస్తూ గవర్నర్‌సంతకానికి అధికారికపత్రాలను పంపించలేదు. మంత్రివర్గపునర్వ్యవస్థీకరణ జరగబోతున్న సూచన కూడా ఏదీ లేదు. చెవినపడుతున్నవన్నీ గాలిబుడగలా అలా పెరిగి ఇలా పేలిపోయే మామూలు ఊహాగానాలే. నీలివార్తలైనా, నిజంవార్తలైనా వాటి వివాదాస్పదస్థితిమీద, ప్రాముఖ్యంమీద లేక వాటి సంచలనాత్మకతమీద ఆధారపడి ఊహాగానాలు పుంజుకుంటూఉంటాయి. నిజం చెప్పాలంటే ఈ దేశంలో ప్రతిచోట ఎల్లవేళలా రాజకీయాల ఊసులే వినిపిస్తూఉంటాయి. ఎవరో అన్నట్టు, ఇద్దరు అపరిచితులు కలుసుకుంటే చాలు వాళ్ళు మాట్లాడుకునేది ఆ రోజు వాతావరణం గురించి... మరునాడు జరగబోయే మంత్రివర్గ పునర్నిర్మాణం గురించి... అంతే.

పత్రికలనిండా పరచుకున్న వార్త ఇదొక్కటే; కొందరు 'అధికారిక'వర్గాలను ఉటంకిస్తే మరికొందరు 'మామూలు అభిజ్ఞ'వర్గాలను. ఇంకా మరికొందరు తామే తెలుసుకున్నట్టు ఆ వార్తను ఉన్నదున్నట్టు రాసేసి ఊరుకున్నారు. ఒకవేళ ఆ వార్తలో చెప్పినట్టు జరగకపోయినా అది వార్తే అవుతుందని వాళ్ళ వాదం. అలా ఎందుకు జరగలేదన్న కారణాలమీద కావలసినన్ని ఊహాగానాలు పండించుకోవచ్చు. ఉదాహరణకు, ఆనంద్‌మీద చౌదరికి విశ్వాసం లేదు కనుక ఆ శాఖను అతని కప్పగించలేదు, ఎంతైనా అతడు ఓ మురామనిషిగా చౌదరికి ఎన్నడూ సన్నిహితంగా లేడు. ముఖ్యమంత్రికి భూసంస్కరణలమీద పెద్దగా ఆసక్తి లేకపోవడం మరో కారణం కావచ్చు. అసలీ గడబిడ అంతా జవహర్లాల్ రాసిన వాడి వేడి లేఖల వల్లనే, లేకపోతే భూస్వాముల ప్రాబల్యంలో ఉన్న ఈ రాష్ట్రంలో భూసంస్కరణలనే మాట ఎవడెత్తగలడంటూ పత్రికలు వ్యాఖ్యానించవచ్చు. ఇవేవీ కాకపోతే చౌదరి ఏవో గట్టి రాజకీయకారణాలతో తన ఆలోచన మార్చుకుని ఉండాలి. ఉదాహరణకు ముఖ్యమంత్రి కోరినంతమాత్రాన ఆనంద్ భూపరిమితిచట్టాన్ని అమలు చేయవలసినట్టుగా చేస్తాడని అతడంత కచ్చితంగా ఎలా అనుకుంటాడు? పట్టువిడుపులు కొంచెమైనా లేకుండా ఒక విధమైన సైద్ధాంతిక ఉన్మాదంతో ఊగిపోయే ఆ మనిషి, ప్రభుత్వాన్ని సమస్యలఊబిలోకి దిగలాగడంతోసహా ఏమైనా చేయగలడు. నిజానికి ఈ కారణంగానే గత రెండుమూడురోజుల్లో వారిద్దరిమధ్య మనస్పర్థలు తలెత్తాయి...

వార్తలో ఈ చివరిముక్క గొప్ప స్కూపులా కనిపించి తదుపరి వ్యాఖ్యలకు కావలసినన్ని అవకాశాలు అందించింది.

అధికారవర్గాల మౌనం అగ్నికి ఆజ్యంపోసినట్టయింది. నగరవాసానికి అలవాటుపడిన ప్రజలు భూసంస్కరణలనే కార్యక్రమం ఒకటున్నట్టు మొదటిసారి తెలుసుకున్నారు. ఆనంద్ ఆ కార్యక్రమాన్ని నిర్వహించబోతున్నాడంటే అదెంతో ముఖ్యమైనదే అయుండాలనుకున్నారు. మొదట ఆ అంశంమీద సదస్సులు గోష్ఠులు జరిగాయి. తర్వాత, మేధావివర్గాల్లో ఈ మధ్య గౌరవనీయతను తెచ్చుకున్న 'వర్క్‌షాప్'లు జరిగాయి. ఆపైన పత్రికల్లో సంపాదకీయాలు, వ్యాసాలు వచ్చాయి. అవి రకరకాల కోణాలనుంచి విషయాన్ని పరిశీలించి చివరకు మూడురకాల నిర్ధారణలకొచ్చాయి. అయితే పర్యవసానం విషయంలో అవన్నీ ఏకాభిప్రాయాన్నే వ్యక్తంచేశాయి. ముందుగా చెప్పుకోవాలంటే, భూసంస్కరణలు మంచివే, కానీ ఈ ప్రభుత్వం వాటిని అమలుచేయలేదు. రెండోది, భూ సంస్కరణలు మన పరిస్థితుల కెంతమాత్రం సరిపోయేవి కావు; కానీ ఈ ప్రభుత్వం వాటిని ఎలాగైనా అమలుచేసి తేనెతుట్టను కదిలించే ఆలోచన చేస్తోంది. మూడోది, భూసంస్కరణలు వాటంతటవి మంచివీ కావు, చెడ్డవీ కావు; కానీ ఈ ప్రభుత్వం వాటి విషయంలో ఏంచేసినా విఫలమౌతుంది. రాబోయే ఉపఎన్నికల్లో వోటర్లను ప్రలోభపెట్టి వోట్లు గుంజుకోడానికే ఈ ఆర్భాటమంతా చేస్తోంది. అమలు చేయనీ, చేయక పోనీ, మొత్తంమీద ఈ ప్రభుత్వం రాష్ట్రాన్ని (రాష్ట్రంలోని పేదప్రజలనే అనుకోండి) మరిన్ని కష్టాల్లోకి నెట్టడం ఖాయం... భూసంస్కరణలమీదకంటె ఎక్కువగా చౌదరినీ, ఆనంద్‌నీ, ఈ నాటకంలోని మొత్తం పాత్రధారులందరినీ ఉద్దేశించి అనేకానేక విజ్ఞతాపూర్వక వ్యాఖ్యలు దొర్లిపోయాయి. అందరూ తేల్చిన సారాంశం ఒకటే. జరిగినవన్నీ తప్పే, జరగబోయేవన్నా తప్పే; కారణం మరేంలేదు, ఈ ప్రభుత్వం చేసినదొక్కటీ ఇంతవరకు సరైందికాలేదు కనుక... ఈ విమర్శల సందడిలో చివరకు భూసంస్కరణల అమలు ఇంతకుముందులానే అస్పష్టంగా మిగిలిపోయింది.

పత్రికల మొదటిపేజీలను ఇందుకు సంబంధించిన తొలివార్తలు ముంచెత్తిన సమయంలో ఆనంద్ ఢిల్లీలో ఉన్నాడు. అదే నెలలో అతడు ఢిల్లీకి వెళ్ళడం అది రెండోసారి. రాష్ట్రాల ఇరిగేషన్‌మంత్రుల సమ్మేళనంలో పాల్గొనడానికి అతడు రాజధాని కొచ్చాడు. తన శాఖగురించి క్షుణ్ణంగా తెలిసి, వాగ్ధాటి, ఎదుటి వారిని ఒప్పించగల నేర్పు, సామర్థ్యం, నిజాయితీ ఉన్న మంత్రిగా అప్పటికే ఆనంద్ పేరు తెచ్చుకున్నాడు. కేంద్రప్రభుత్వాధికారులు మొదట్లో కొంత అయిష్టంతోనూ, క్రమంగా భయంతోనూ అతణ్ణి గౌరవించడం ప్రారంభించారు. మంత్రులమీద తమకున్న చులకనభావాన్ని ధ్రువీకరించుకుంటున్నారా అన్నట్టుగా అతణ్ణి ఓ 'మినహాయింపు'గా పేర్కొంటూ ఉండేవారు... అధికారవర్గాల వ్యాఖ్యలు అలా నర్మగర్భంగానే ఉంటాయి.

తమ వ్యవహారం గురించి ఒక టేబ్లాయిడ్‌పత్రిక ప్రచురించిన వార్తపై పెద్దఎత్తున గగ్గోలు పుట్టిన దరిమిలా, కిందటి వారమంతా ఆనంద్ రాజకీయాలనుంచి శాశ్వతంగా తప్పుకుంటే మంచిదా అని ఆలోచిస్తూ గడిపాడు. చివరకు తన స్వభావసిద్ధమైన సంకల్పశక్తితో రాజకీయాల్లో కొనసాగాలనే నిర్ణయించుకున్నాడు. తన నిర్ణయాన్ని మిత్రుడు సుదర్శన్‌కీ, అరుణకీ మాత్రమే వెల్లడించాడు. ప్రత్యర్థులు ఏ ప్రయత్నాలు చేసినా చేయనీ తాను పట్టించుకోననీ, ప్రజలకు

చేయగలిగిందిచేసితీరాలనే నిశ్చయించుకున్నాననీ, చేయడానికి ఒక రాజకీయవాదిగా తనకు కావలసిన శక్తియుక్తులన్నీ ఉన్నాయనీ స్పష్టంచేశాడు

ఈ పర్యటనలో కూడా ఎప్పటిలానే ప్రభుత్వ అతిథిగృహంలో దిగిన ఆనంద్ రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత కూడా కొన్ని ముసాయిదా తీర్మానాలు పరిశీలిస్తూ ఉండిపోయాడు. ఇంతలో ఫోన్ మోగింది. ముఖ్యమంత్రి చౌదరి లైన్‌లోకి వచ్చాడు. ఆనంద్ వెంటనే సావధానుడయ్యాడు. పలకరింపులైన తర్వాత చౌదరి అడిగాడు... 'సమ్మేళనం ఎలా జరుగుతోంది? పనికొచ్చేదేనా లేక ఏటా జరిగే తంతులానే ఉందా?'

'కొంత అదీ, కొంత ఇదీ' ఆనంద్ సమాధానం చెప్పాడు. 'ఇప్పుడే కొన్ని ముఖ్యమైన తీర్మానాలతో కుస్తీపడుతున్నాను. అంతా బాగా జరిగితే ఏటేటా వల్లిస్తూ తక్షణం మరచిపోయే మూసతీర్మానాలకు ఇవి భిన్నంగా ఉంటాయనే అనిపిస్తోంది...' అంతలో ఏదో గుర్తొచ్చినట్టు అన్నాడు. 'అది సరే, ఇటువంటి సమావేశాల మీద మీరెప్పుడూ పెద్దగా ఆసక్తి చూపించలేదే! ఇంత అర్ధరాత్రివేళ ఫోన్‌చేసి అడగాలని మీకెందు కనిపించింది? మీరు ఫోన్ చేసింది సమ్మేళనం గురించి తెలుసుకోడానికి మాత్రం కాదు. చెప్పండి, ఏదైనా విశేషమా?'

'రాష్ట్రం నుంచి వచ్చే పత్రికలేవీ చూడనట్టు మాట్లాడకు' చౌదరి అన్నాడు. 'భూ పరిమితి చట్టాలమీద ఇక్కడ పెద్దదుమారం రేగుతోంది'

'అలాగా?' లోలోపల నవ్వుకుంటూ అన్నాడు ఆనంద్. 'మీ నర్మగర్భమౌనమే అందుకు కారణమై ఉంటుందిలెండి. జరుగుతున్న రభస మీకు మంచి వినోదం కలిగిస్తూ ఉండాలి.'

'అవునవును' చౌదరి ఒప్పుకున్నాడు. 'అయితే ఈసారి అది ప్రమాదకరమైన మలుపు తిరిగేలా ఉంది. మన మిత్రుడు మహేంద్రనాథ్ పరిస్థితిని తన కనుకూలంగా మార్చుకోడానికి రెండువైపులా ప్రయత్నాలు చేస్తున్నాడు... ఇదో పెద్ద న్యూసెన్స్‌లా తయారవుతోంది.'

'అదీ ఊహించగలిగిన విషయమే.' ఆనంద్ అన్నాడు. 'సరే, నేను చేయగలిగిందేమైనా ఉందా?'

'చేయగలిగిందంటే...' చౌదరి నసుగుతూ అన్నాడు. తర్వాత మాటల్ని ఆచితూచి ఎంచుకుంటూ ప్రారంభించాడు. 'ప్రస్తుతానికి నువ్వు చేయగలిగిందేమీ లేకపోయినా, నిన్ను సంప్రతించడం మంచిదని నా కనిపించింది. కేబినెట్‌లో నువ్వు బృహస్పతివని అందరూ అంటారు కదా...' ఉల్లాసంగా ఉన్నప్పుడు చౌదరి సాధారణంగా అనే మాట ఇది. ఆనంద్‌ను అందరూ బృహస్పతి అనేమారు పేరుతో పిలుస్తూఉంటారు. బృహస్పతి హిందూపురాణాలలో మంచి బుద్ధిశాలి అనిపించుకున్న దేవత. అయితే శేఖర్ అభిప్రాయం వేరుగా ఉంటుంది. ఎవరైనా ఆనంద్ మేధాశక్తిని కానీ, విలువలపట్ల నిబద్ధతను కానీ ప్రశంసిస్తే 'మీ రిచ్చిన బిరుదు అతడికి తగదని నా ఉద్దేశం' అంటుంటాడు. 'ఆనంద్ అన్నివిధాలా యోగ్యుడనే నేనూ అంటాను, అయితే అతడు రాజకీయాలకు పనికిరాడు. మీకు తెలుసో లేదో, బృహస్పతి సూచించే పరిష్కారాలు ఎప్పుడూ ఆచరణయోగ్యంగానే ఉండేవి. కానీ ఆనంద్ అలా కాదు. మార్చడానికి వీల్లేని శిలాక్షరాలుగా తాను విశ్వసించే సూత్రాలను పట్టుకుని మొండిగా వ్రేలాడుతూ ఉంటాడు. అతడు వేరేదో గ్రహానికి

చెందినవాడు, ఒకరకం గ్రహాంతరజీవి. ఇటువంటి వాళ్ళు మ్యూజియంలో ప్రదర్శనకు బాగుంటారు కానీ నిజమైన మేధావులు కారు.'

ఆ తర్వాత అనబోయే మాటల్ని కూర్చుకునే వ్యవధికోసమే చౌదరి తననలా పొగిడినట్టు గ్రహించిన ఆనంద్‌కు వెంటనే ఏమనాలో తోచలేదు. సన్నగా నవ్వి థాంక్స్ అన్నట్టు ధ్వనించేలా ఏదో గొణిగాడు.

'నిన్ను పొగడడంకోసమే ప్రజల కష్టార్జితాన్ని ఖర్చుపెట్టి నీకీ ట్రంక్‌కాల్ చేయడం లేదు' చౌదరి హాస్యధోరణిలో సంభాషణ కొనసాగిస్తూ అన్నాడు. ఆనంద్‌తో అతడి మాటతీరు ఎప్పుడూ అలాగే ఉంటుంది. 'నువ్వు అలా కనక అనుకుంటే...'

'నేనలా అనుకుంటే అది పొరపాటే అవుతుంది!' ఆనంద్ మధ్యలో అందుకుంటూ అన్నాడు 'బృహస్పతులు అటువంటి పొరపాటు ఎప్పుడూ చేయరు. నేను మీకు హామీ ఇస్తున్నాను. అందుకే సూటిగా అసలువిషయం చెప్పమని మిమ్మల్ని అడుగుతున్నాను. భూసంస్కరణల విషయంలో నేను చేయగలిగిందేమిటి?'

'ఇదిగో...' చౌదరి ఉదాసీనంగా అన్నాడు. ఫలానా మార్గం తొక్కాలని కచ్చితంగా అనుకోవడం ఇష్టం లేనప్పుడు చౌదరి అనుసరించే పద్ధతి ఇది. 'నే నేదీ ఇంతవరకూ నిర్ణయించుకోలేదు. ఈ క్షణంలో ఇది కేవలంమనిద్దరి మధ్యా ఉన్న వ్యవహారం. ఈ దిక్కుమాలిన భూపరిమితిసమస్య గొడవ గొడవగా తయారైంది. భూసంస్కరణలశాఖను నువ్వే చూడవలసివచ్చిందనుకో, జస్ట్ అనుకో, అప్పుడు నువ్వేం చేస్తావ్?'

'చాలా పెద్ద ప్రశ్న. ఫోనుమీద జవాబు చెప్పడం కష్టమేమో' ఆనంద్ సాలోచనగా అన్నాడు. 'అయినా చెప్పండి, వాస్తవంగా నేనేం చేయాలని మీరనుకుంటున్నారు? మీరు ఊహిస్తున్న పర్యవసానం ఎలాంటిది?'

'నాకు తెలిస్తే ఇంకేం?'చౌదరి చటుక్కున అన్నాడు. 'అలాగా ఇలాగా అంటూ నాకు స్థిరమైన ఆలోచనలేవీ లేవు. ఇన్నేళ్ళలోనూ ఎప్పుడూ నేను ఏ సిద్ధాంతానికీ బానిసకాలేదు. రాజకీయాధికారం ఒక సిద్ధాంతమని నీలాంటి సిద్ధాంతవాదులు అనుకోరు. కాని అనుకుంటే అదే నా సిద్ధాంతం. కనుక నువ్వేదో చెయ్యి, అది మనల్ని అగాధంవైపు నడిపించకూడదని మాత్రం అంటాను. ఒక ముఖ్యమంత్రి అలా ఆశించడం అత్యాశంటావా? మరోలా చెప్పాలంటే, చౌదరిలాంటి ఓ ముఖ్యమంత్రి?'

'మన పార్టీ కార్యక్రమాలలో ఏ ఒకటీ మనల్ని అగాధంవైపు నడిపిస్తుందని నేను భావించను' ఆనంద్ అన్నాడు. 'పైగా, మనం ప్రజలకు చేసిన వాగ్దానాలన్నీ కేవలం వోట్లు చేజిక్కించుకోడానికేనన్న ఆరోపణలున్నాయి. విమర్శకులు వాటిని శుష్కవాగ్దానాలంటున్నారు. అందుకని మన కార్యక్రమాల వల్ల పార్టీ నష్టపడుతుందని మీరెందుకు అనుమానిస్తున్నారు?'

'కళ్ళముందున్న పరిస్థితిని బట్టి అలా అనిపిస్తోందనుకుంటాను' చౌదరి ఒకింత సంశయంతో జవాబు చెప్పాడు. 'ఎలాగూ రెండుమూడు రోజుల్లో నువ్వూ తిరిగొస్తున్నావు కనుక ఈలోగా కాస్త నెమరువేసుకుంటావని చెబుతున్నాను.'

'సరే. దవడ విరుచుకోకుండా నెమరువేస్తాలెండి' ఆనంద్ నవ్వుతూ అన్నాడు.

'హ హ్హ హ్హ' చౌదరి పగలబడినవ్వాడు. 'మంచిమాట చెప్పావు ఆ సంగతి చెప్పడానికే నా ప్రయత్నమంతా! దవడ విరుచుకోకుండా నెమరువెయ్యి!... మొత్తానికి నే నూహించినట్టే బృహస్పతి అసలు విషయాని కొచ్చాడు! గుడ్‌నైట్.' సంభాషణ ఈ నర్మగర్భవాక్యంతో ముగిసింది.

అర్ధరాత్రి దాటింది. ఆనంద్ తనంతవరకు పరిశీలించిన తీర్మానాలపై దృష్టి లగ్నంచేయలేక పోయాడు. చౌదరి వ్యాఖ్యలతో త్వరలోనే ఏదో ఊబిలో పీకలవరకూ దిగబడిపోనున్నట్టు అనిపించి తనను రకరకాల ఆలోచనలుముసురుకున్నాయి.తనకు భూసంస్కరణలశాఖ అప్పగించాలన్న ఆలోచన కేవలం శేఖర్‌లాంటి వ్యక్తుల బుర్రలోనే పుట్టడం సాధ్యమన్న స్ఫురణ కలిగింది. అంటే తనకు కష్టాలు తెచ్చే ఉద్యమాన్ని శేఖర్ మానడన్న మాట. అసలు శేఖర్ తనను అంతటి ప్రమాదంగా ఎందుకు పరిగణిస్తున్నాడు? త నతనితో పోటీ పడడంలేదు.రాజకీయాధికారాన్నితను లెక్కచేసేవాడు కాదు. ఆ విషయం శేఖర్‌కి తెలుసు. అయినా అతనిలా నావెంట ఎందుకు పడుతున్నాడు? అభద్రతాభావమా! ఆనంద్‌ను తన ఆలోచనా సరళివైపు మళ్ళించుకోలేనని తెలిసి ఇలా చేస్తున్నాడా?... ఎటువంటి కల గలుపు ప్రేరణలతో శేఖర్ తనను నాశనం చేయాలనుకుంటున్నా, అతడి స్థాయికి దిగజారితే తప్ప తాను చేయగలిగిందేమీ లేదనుకుని నిట్టూర్చాడు ఆనంద్. అలా దిగజారకూడదని తనెప్పుడో నిశ్చయించుకున్నాడు కూడా. ఇకత ఎట్టఎదుట ఉన్న తక్షణ సమస్య గురించి యోచించడం ప్రారంభించాడు. భూమి యజమానులు పెద్దసంఖ్యలో ఉండి చురుగ్గా శక్తిమంతంగా పనిచేస్తున్న ఒక రాష్ట్రంలో భూసంస్కరణలఅమలు డైనమైట్‌లాంటిదని ప్రతిఒకరికీ తెలుసు. కొన్ని పార్టీలు గ్రామప్రాంతాల్లో భూస్వాములకు వ్యతిరేకంగా భూమిలేని పాలేర్లను సంఘటితం చేయడానికి ఎంతోకాలం ప్రయత్నించి కష్టాలు కొనితెచ్చుకున్నాయి. చిన్న, పెద్ద భూయజమానులందరూ తమందరినీ ఏకంచేసే ఉమ్మడిసంబంధం భూమేనని రానురాను గ్రహించుకున్నారు. వాళ్ళ వాళ్ళ ఆధీనంలో ఉన్న భూమి పరిమాణాన్ని అనుసరించి భూయజమానులలో చీలిక తీసుకురావడానికి చేసిన ప్రయత్నం నెరవేరలేదు. సన్నకారురైతుల్నీ భూమిలేనివాళ్ళనీ ఏకంచేయాలన్న ఆలోచన సూత్రరీత్యా ఎంత బాగున్నా జనాదరణ పొంద లేదు. ఆచరణలో విజయవంతమూ కాలేదు. భూమిలేనివాళ్ళలోనే చీలికలు తలెత్తాయి. భూయజమానులు గ్రామాల్లో అన్నివైపులా విస్తరించిన తమ పలుకుబడిని ఉపయోగించుకుని ఇలా చీలిక తీసుకురాగలిగారు.

భూమి అంటే అధికారం. గ్రామజీవనంలో అదే సర్వస్వం. గ్రామీణ చైతన్యంలో భూమి సర్వశక్తిమంతం, సర్వవ్యాప్తం, సర్వసాక్షి. భూమి ఎవరూ ఢీకొనలేని సర్వోన్నతశక్తి, ఎవరూ నిరాకరించలేని మహాసత్యం, ఎవరూ విచ్ఛిన్నంచేయలేని జటిల నిర్మితి. శతాబ్దాలుగా ఇది మళ్ళీ మళ్ళీ రుజువౌతూనే ఉన్న నిజం.

భూస్వామి అక్షరాలా ప్రభువుగా చలామణిఅవుతున్న అసంఖ్యాక గ్రామాలు ఆనంద్‌కు తెలుసు. భూస్వామి ఇంటి ప్రాకారాన్నిమించి ప్రాకారం నిర్మించే సాహసం ఎవడూ చేయడు. భూస్వామి దరిదాపుల్లో ఉంటే, చెప్పులతో వీధిలో నడిచే తెగింపు ఎవరికీ ఉండదు. భూస్వామి ఎదురుగా పొగతాగడమనే ప్రశ్న లేనేలేదు. గ్రామంలో ఉన్న నిరుపేదమహిళలందరూ భూస్వామి

కామకేళికి లక్ష్యం కావలసిందే. నిజానికి భూస్వామి రాబందుచూపు తమమీద పడడమే అదృష్టంగా భావించేరీతిలో వాళ్ళ ఆలోచనలు నియంత్రితమై ఉంటాయి. తనకు బాగా పరిచితమైన భూస్వామ్య ప్రాంతాల్లోని ఈ వాస్తవికత దృష్ట్యా భూసంస్కరణలు అమలుచేయడమంటే అర్థమేమిటని తనలోతనే ప్రశ్నించుకున్నాడు ఆనంద్.

భారతదేశంలో భూమికథ హింసతో, రక్తపాతంతో, కన్నీటిమరకలతో నిండి అనంతంగా విస్తరించింది. అధికారికపత్రాలు, ముఖ్యంగా భూమిసమస్యగురించి నిపుణులు రాసిన గ్రంథాలు లోతుగా అధ్యయనంచేసి తెలుసుకున్న ఎన్నో కీలకాంశాలతో హఠాత్తుగా ఆనంద్ మస్తిష్కం కిక్కిరిసిపోయింది. వాటిలో ఒకటి, పందొమ్మిదో శతాబ్దంలో బ్రిటిష్‌పాలకుల ప్రోత్సాహంతో ఒక వ్యవస్థగా ఎదిగిన భూస్వామ్యం పుట్టుకకు సంబంధించినది. కొందరు స్థానికనాయకులు గెరిల్లామార్గంలో దోపిడీలు సాగించి అధికారానికెలా వచ్చారో, జనంనుంచి ఎలా పన్ను వసూలుచేశారో, క్రమంగా బ్రిటిష్‌ప్రభుత్వంతో పొత్తు చేసుకుని దేశంలో విస్తృతభూసంపద మీద తమ ఆధిపత్యాన్ని స్థాపించుకుని జమీందార్లు, పాలెగాళ్ళు అనేబిరుదులతో ఎలా వేళ్ళు తన్నుకుని నిలబడ్డారో అది పూసగుచ్చినట్టు వివరించింది. భూములకు వాళ్ళు రాజస్వం లేదా కప్పం చెల్లించేవారు. అధికారకేంద్రం బలహీనపడినప్పుడు అది అనిశ్చితంగా ఉండేది. బలవత్తరప్రభుత్వం ఏర్పడినప్పుడు ఏటా విధిగా రాజస్వం చెల్లించేవారు. ఆ రోజుల్లో బందిపోటు, రాజు, భూస్వామి వీరందరూ ఒకేవ్యక్తి ధరించే మూడురూపాలుగా పరిణమించిన ఆశ్చర్యజనక సన్నివేశం విశేషంగా చెప్పుకోదగింది.

భూమిచరిత్ర తలపోస్తూ ఆనంద్ టేబుల్‌ముందు అలాగే కూర్చుండిపోయాడు. యుగయుగాలుగా తన సంతానం లక్షలాదిమందిని కడుపులో పెట్టుకుని పోషిస్తున్నదీ భూమాతే వారిని చెప్పనలవికాని కష్టాల్లోకి తోసిందీ భూమాతే ముఖ్యంగా బ్రిటిష్‌పాలన ప్రారంభంనుంచి. 'భూమి సమస్తం గోపాలుడికే చెందుతుం'దని లోకోక్తి. గోపాలుడంటే భగవంతుడు కావచ్చు, లేదా గోసంపద ఉన్నవాడూ, గోవుల్ని పాలించేవాడూ కావచ్చు. మొదట గోవు, తర్వాత గోపాలుడు —ఇదీ వరసక్రమం. పశుపాలకసమాజంలో మనిషి పశువులతోపాటే సంచరించేవాడుకనుక ఇది సహేతుకంగానే కనిపిస్తుంది. ఆ విధంగా భూమి, దానిమీద జీవించే ప్రతి ఒకరికీ సొంతం; చెట్టు తనమీద గూడుకట్టుకున్న ప్రతి పక్షికీ సొంతం; అలాగే నీరు... అయత్నజనితమైన అవ్యాజమైన సృష్టికర్త చలవతో తనలోకి ఎగిరి దూకుతూ, ఈదుతూ, జారుతూ, పిల్లిమొగ్గలు వేస్తూ స్వేచ్ఛగా సంచరించే ప్రతి చేపపిల్లకీ అది సొంతం. ప్రతిదీ ప్రతిఒకరికీ చెందుతుంది. 'చెందడం' అన్నదే సర్వవ్యాపితమైన స్వాభావికస్థితి. అక్కడ ఎటువంటి రికార్డులు లేవు, రిజిస్ట్రేషన్లు లేవు, ఎవరికీ ప్రత్యేకమైన స్వామ్యం లేదు, ఎవరికీ వ్యక్తిగతమైన హక్కు లేదు.

అటువంటి అద్భుతరమ్యవ్యవస్థనుంచి నేటి వ్యవస్థకు చేరుకోవడంలో అభ్యుదయం అన దగినదేమీ లేదని ఆనంద్ విచారంగా అనుకున్నాడు. అయితే గతవైభవస్మరణవల్ల ఎటువంటి ప్రయోజనంలేదని తనకు తానే దృఢంగా చెప్పుకున్నాడు. ఆలోచించవలసింది వర్తమానం గురించి. గతించిన కాలాన్ని మళ్ళీ వెనక్కి తీసుకురాలేం. కాలంచేసిన గాయాలు అంతలో అదృశ్యమైపోవు;అలాగేమనిషి తనకు తాను చేసుకున్న, భవిష్యత్తరాలకు చేసిన గాయాలు కూడా.

మళ్ళీ ముసాయిదాతీర్మానాల పరిశీలన ప్రారంభించాడు. ఇటువంటి చిత్తుప్రతుల్లో చాలా భాగం 'పరిశీలనార్థ'మంటూ ఎలాగో తన దగ్గరకు వస్తుంటాయి. తనోసారి అలా క్రీగంటితో చూస్తే చాలని వాళ్ళు అంటుంటారు. తన పెన్సిల్ తాకితే చాలు వాటికవే సమగ్రతను సంతరించుకుంటాయని చాలామంది నమ్మకం. దీనికి మరో కోణం కూడా ఉంది. ఓసారి ఓ రిసెప్షన్ లో తాగిన మైకంలో ఒకతను అనేశాడు కూడా... 'ఎప్పుడో అరుదుగా మేం ఢిల్లీ వస్తూంటాం. మాకది మంచి ఆటవిడుపు. ఆ విషయంలో అధికారులు, అనధికారులు అంతా ఒకటే. పాపం ఈ ఆనంద్ పనీపాటా లేకుండా ఎందుకు బాధపడాలి? అతడికి ఇంకా ఇంకా పనిచేయడంలోనే ఆనందం. అందుకని ముసాయిదాలను సవరించడం కత్తిరించడం చేస్తూ ఉంటాడు... అతని మానాన అతనూ ఏదో కాలక్షేపం చేయాలా వద్దా చెప్పండి? రాష్ట్రమంత్రుల వార్షిక సమ్మేళనం అనబడే ఓ రంగూ రుచీ లేని మేళా ఆమోదించే ఉప్పుకారం లేని ఆ తీర్మానాలు ఎవరో కొద్దిమంది పగటికలలు కనేవాళ్ళకి తప్ప అటు స్టీల్‌ఫ్రేమ్‌వాళ్ళలో ఇటు ఖాదీఫ్రేమ్‌వాళ్ళలో ఎవరిక్కావాలి చెప్పండి?'

ఆనంద్ ముసాయిదాను చదువుకుంటూపోయాడు, బహుశా మామూలుకంటె వేగంగా. ఆఖరుసారి పైనుంచి కిందివరకూ గబగబ చదివి ఎట్టకేలకు ముసాయిదా ఉండవలసినట్టే ఉందనుకున్నాడు. ఈ మధ్యలో ఓసారి ఏకాగ్రత చెదిరిపోయి చౌదరితో జరిగిన టెలిఫోన్‌సంభాషణ గురించే ఆలోచిస్తూ ఉండిపోయాడు... తన జీవితంలో ఏదో పరివర్తన సంభవించబోతున్నట్టు పదేపదే స్ఫురణ కలుగుతోంది. తనెప్పుడూ ఏదీ లెక్క చేయలేదు. ముందుముందుకూడా దేనినీ లక్ష్యపెట్టబోవడం లేదని ఎప్పటిలా ఈసారి తనకుతాను చెప్పుకోలేకపోవడం మరింత అయోమయ గ్రస్తుణ్ణి చేస్తోంది. ఆ క్షణంలో అతని మస్తిష్కాన్ని ఆందోళన నల్లనిమేఘంలా కప్పేసింది.

తీర్మానాలపాఠాన్ని సరిదిద్దడం పూర్తికాగానే నిద్రకుపక్రమించాలనుకున్నాడు. కానీ అర్ధరాత్రి రెండుగంటలైనాసరే కళ్ళు మూతలు పడే సూచన కనిపించలేదు. అతని ఆలోచనలు మాటి మాటికి పుడమితల్లివైపు... భూమివైపు... పరుగుతీస్తున్నాయి. భూమి సాధారణస్థితినుంచి ఆస్తిగా పరివర్తనచెందినక్రమం, పశువులకాపరినుంచి పండించినవాడికీ ఆ తర్వాత పాలకుడికీ, ఆ తర్వాత చట్టబద్ధంగా ఒడిసి గుంజుకున్నవాడికీ. (కచ్చితంగా అంతే. తన ఆస్తిగానో వారసత్వంగానో చూపించి భూమికి సంకెళ్ళు వేసినవాడు, విస్తారమైన భూభాగాలమీద తన హక్కును ప్రకటించుకున్నవాడు వాస్తవికార్థంలో గుంజుకున్నవాడే తప్ప మరొకడు కాడు). దిగంతాలకు విస్తరించిన అనంతభూగోళంలో అవిభాజ్యమైన భూమి, ఆకాశమూ, నీరూ, నిప్పూ, గాలితోపాటు ముఖ్యతత్వాలలో ఒకటిగా భారతీయసనాతనసంప్రదాయం పేర్కొనే భూమి, కొన్ని లక్షల సంవత్సరాలుగా అనితరసాధ్యమైన సహనంతో, మనం ఊహించనుకూడా ఊహించలేని అన్నిరకాల సంపదనూ తన కడుపులో దాచుకుని పెంచిపోషిస్తున్న భూమి... ఇటువంటి ఈ భూమి, ఈ తత్వం (ఈ మాట సంస్కృతంలోని భూతం అనే మాటకు సమానార్థకం అవునో కాదో అతడికి స్పష్టంగా తెలియదు) చరాచరమైన ప్రతిఅణువునీ తనలో నిక్షిప్తంచేసుకున్న ఈ సమష్టివార సత్వం... నేడు... కార్యాలయంగా పిలవబడే బూజుపట్టిన గదిలో దుమ్ముకొట్టుకుని పడున్న 'దస్తావేజు'ల్లో ఎవరో రాసిన లేదా రాయించుకున్న పేరుతో అనుబంధించి ఎందుకుండాలి?

ఎందుకు?... ఎందుకు? అల్పబుద్ధులు మాత్రమే నాది, నీది అన్న దృష్టితో ఆలోచిస్తారనీ, ఉదార చరితులకు ప్రపంచం సమస్తం ఏకకుటుంబంలా (వసుధైక కుటుంబకమ్) గోచరిస్తుందన్న వైదికసూక్తి హఠాత్తుగా స్ఫురించింది... అంటే ఉదాత్తదృక్పథంనుంచి అల్పబుద్ధికి దిగజారడమే మానవప్రగతిగా పరిణమిస్తోందన్న మాట... అంతే, అలాగే కనిపిస్తోందనుకున్నాడు... అయితే మళ్ళీ అదే ప్రశ్న... ఎందువల్ల ఇలా జరుగుతోంది?

సరిగ్గా ఈ ఘట్టంలోనే అతనికి లోపల ఏదో కలుక్కుమన్నట్టనిపించింది. తనలోని మరో భాగం, భూమిగురించి అలా తలపోస్తున్న భాగాన్ని చూసి పరిహసిస్తూ తూలనాడుతున్నట్టనిపించింది... ఇతరులకు హితబోధ చేసేముందు ఆత్మపరిశీలన ఎందుకు చేసుకోవు? ఎన్నెన్నో ఎకరాల భూమి —అవును, అక్షరాలా భూమే, మిగిలిన భూఖండాల్లానే పృథ్విలో భాగంగా ఉన్న భూమి —నీ పేరుమీద, గొప్ప ఆదర్శవాదిగా వెలిగిపోయే ఆనంద్ అనే పేరుమీద, ముమ్మూర్తులా అదే తాలూకాఫీసులోని ఖాస్రా కాగితాల్లో (భూ యాజమాన్యానికి సంబంధించిన రిజిష్టర్) నమోదై ఉందే?... ఇంతకీ దాని గురించేమంటావ్?

ఈ ఊహలోని చేదునిజం ఛెళ్ళున చరిచినట్లయి ఆదర్శాల రెక్కలమీద అతని విహారం హఠాత్తుగా ఆగిపోయింది. నిజానికి భూమిపైన ఆస్తిహక్కుకు కానీ, అందుకు సంబంధించిన బాదరబందీలకు కానీ తన జీవితంలో అతడేనాడూ ఇష్టపడలేదు. అయితే ఈ సమర్థింపు ఇప్పుడు పనికొచ్చేలా లేదు. ఈ వ్యవస్థలో తానుకూడా భాగమని ఒప్పుకు తీరవలసిందే. వ్యవస్థలో మార్పు అన్నది తనతోనే ప్రారంభం కావాలని అతడు నిశ్చయించుకున్నాడు... తన జీవనవిధానం, తన ఆశయాలు, తన ఆలోచనాసరళి ఇంతదూరం పరిణమించిన తీరుతో తన ఊహలోని అసంబద్ధత అతని దృష్టికి రాకుండా తప్పించుకోలేకపోయింది.

ఎన్నో సంవత్సరాల క్రితం తన తండ్రి స్వర్గస్థుడైనప్పుడు కేంబ్రిడ్జిలోనో, మరేదైనా ప్రతిష్ఠాత్మక విశ్వవిద్యాలయంలోనో రిసెర్చిస్కాలర్ కావాలని మొదట్లో తనల్లుకున్న ఆశలకు నీళ్ళు వదిలేసుకున్నాడు. అప్పుడే తారస్థాయికి చేరుకున్న రెండో ప్రపంచయుద్ధం వల్ల తలెత్తిన అనిశ్చిత పరిస్థితులు అందుకు కారణమయ్యాయి. తను అధ్యయనం చేయాలనుకున్న అంశాలేవీ కుటుంబానికి పనికొచ్చేవి కావు. కేవలం వ్యక్తిగత ఆసక్తులకు లోబడి ప్రయోజక వాదాన్ని విస్మరించ కూడదనుకుని, ఆస్తివ్యవహారాలకు సన్నిహితంగా ఉండే లా కాలేజిలో చేరాడు. కుటుంబానికి చెందిన ఆస్తిపాస్తుల గురించి ఎంతోకొంత పట్టించుకోమన్న తండ్రి ఆదేశానికి అలా తలవంచాడు. విచిత్రంగా ఇప్పుడు తన వ్యవస్థను తనే కూలగొట్టవలసిన బాధ్యత వచ్చి మీద పడబోతోంది. తన లోపల ఓ స్వాప్నికుడు ఉన్నాడు, ఇంతకాలం అతడు ఒడ్డునే నిలబడి వివిధ పరిణామాలను గమనిస్తూ వచ్చాడు. తన వరవడిని హేతుబద్ధం చేసుకుంటూవచ్చాడు, ఒకవైపున మంచిచెడుల విచక్షణను నిలుపుకుంటూనే, తన ఆదర్శాల భావపంజరంలో తను బందీ కాకుండా మాత్రం తగిన జాగ్రత్త తీసుకుంటూవచ్చాడు.

అతని ఊహలు మరోసారి గతంలోకి జారుకుని అత్యంత బాధాకరమైన తండ్రి అవసానఘట్టాన్ని కళ్ళముందు నిలబెట్టాయి. తన అనారోగ్యం విషమిస్తోందని బహుశా నాన్నకి తెలుసు. కానీ అప్పుడే లా పరీక్షకు కూర్చోబోతున్న ఆనంద్‌కు పరీక్షకు వెళ్ళలేని పరిస్థితి కలిగించకూడ

దనుకున్నాడు. పరీక్ష పూర్తికాగానే ఇంటికి తిరిగి రమ్మని చిన్న ఉత్తరం రాసి ఊరుకున్నాడు. ఆఖరిపరీక్షకూడా రాసి ఇంటికి తిరిగొచ్చి, నాన్న పరిస్థితి చూసినమీదట కానీ నాన్న తన క్షేమం కోసం ఎంత ప్రమాదాన్ని స్వీకరించాడో ఆనంద్‌కి అర్థంకాలేదు. గంట గంటకీ పరిస్థితి క్షీణిస్తున్నా అదృష్ట వశాత్తు నాన్న స్పృహలోనే ఉన్నాడు. 'నువ్వు వచ్చావు, చాలా సంతోషం' అన్నాడు భావగర్భితంగా. అప్పటికి కొన్నేళ్ళుగా నాన్న ఏదో ఒక రుగ్మతతో బాధపడుతూనే ఉన్నాడు కానీ, ఆయనకు ప్రాణాంతకంగా మారిన ఇప్పటి ఈ రుగ్మతకు కారణం శారీరకమైంది కాదనీ, అంతకంటె లోతైనదనీ ఆనంద్‌కు తర్వాత తెలిసింది జరిగినవి, తలచుకోలేనంత ఘాతుకంగా ఉన్నాయి. రెండో ప్రపంచయుద్ధం సాగుతోంది. దేశస్థాయిలో 'డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్స్' అమలుచేస్తున్నట్టుగా రాష్ట్రస్థాయిలో 'డిఫెన్స్ ఆఫ్ అఫ్రోజాబాద్ రూల్స్' అమలు జరుగుతున్నాయి. యుద్ధసమయంలో అమలుచేసే నిబంధనలకు సహజంగానే ఉండే కరకుతనానికి, రాష్ట్రప్రభుత్వం కనబరచే విపరీతమతద్వేషం అదనంగా వచ్చి చేరింది. ఓ రోజు రాత్రి, గ్రామస్థులు గాఢనిద్రలో ఉండగా కుచ్చుటోపీ ధరించిన ఓ అధికారి ఫుడ్‌ఇన్‌స్పెక్టర్ హోదాలో వచ్చి గ్రామం మొత్తాన్ని భీతావహం చేసేశాడు. తుపాకులు ధరించిన పోలీస్ పటాలంతోసహా విరుచుకుపడిన ఆ అధికారి గ్రామస్థుల్ని భయపెట్టి ఎడాపెడా దోచుకున్నాడు. ఆనంద్ ఇంటిమీదపడి తండ్రి ఆరోగ్యపరిస్థితిని కూడా పట్టించుకోకుండా దౌర్జన్యంగా నిద్రలేపాడు. ఆ క్షణంలోనే గాదుల్లో ఉన్న ధాన్యంనిల్వల్ని తనిఖీ చేయాలన్నాడు. ఈలోగా ఇరుగుపొరుగువాళ్ళు కళ్ళు నులుముకుంటూ వచ్చి అక్కడ గుమికూడారు జనాన్ని చూసి ఇన్‌స్పెక్టర్ రెచ్చిపోయి మరింత అవమానకరంగా మాట్లాడాడు. గ్రామస్థులనుంచి, ఇరుగుపొరుగువారినుంచి ఎంతో గౌరవమర్యాదలు పొందుతున్న నాన్న తన జీవితకాలంలో ఏనాడూ అటువంటి దుర్భాషలు పడి ఉండరని అందరూ అనుకున్నారు (పైకి మాత్రం ఎవరూ అనలేదు). ఎప్పుడో ఒకమారు ఆ గ్రామానికి వచ్చినప్పుడు జిల్లాకలెక్టర్‌కూడా ఇలా ప్రవర్తించలేదని తమలోతామే అనుకున్నారు. అదంతా తను చెమటోడ్చి పండించిన ధాన్యమని నాన్న ఎంత మొత్తుకున్నా ఇన్‌స్పెక్టర్ వినిపించు కోకుండా డిఫెన్స్‌రూల్స్ చూపించి నాన్నను తక్షణం జైలుకి పంపగలనని బెదిరించాడు. అవమానించడమే లక్ష్యంగా, చెప్పరాని బూతులు దొర్లిస్తూ నాన్నమీద కేకలువేశాడు. పోతూపోతూ గుండెలమీద ఈడ్చితన్నినట్టుగా 'దేశద్రోహి అయిన నీ కొడుకు ఆలాహజరత్ చల్లని ప్రభుత్వాన్ని కూలదోయడానికే వేరే రాష్ట్రంలో చదువుతున్నాడు...' అంటూ గురిచూసి ఓ వ్యాఖ్య విసిరాడు. నాన్న అవసానఘట్టానికి అదే ప్రారంభమైందని గుర్తుచేసుకుంటూ మనక్లేశంతో కుమిలి పోయాడు ఆనంద్.

వైద్యానికి బదులు శ్లోకాలపై మనసు పెడుతూ అప్పటికీ ఆశాభావంతోనే ఉన్న వైద్యుడి మాటల్ని త్రోసిపుచ్చాడు నాన్న. తక్షణమే ఆనంద్‌తో అప్పగింతమాటల్లోకి దిగిపోయాడు. తమ కుటుంబం అధీనంలో ఉన్న భూమి వివరాల పూర్తి జాబితా తెప్పించాడు. ఒక్కొక్క చెలకనీ దాని ప్రత్యేకలక్షణాలతోసహా వర్ణించడం ప్రారంభించాడు. యాభైఏళ్ళుగా ఏకధాటిగా వాటిని సంరక్షించుకుంటూ వాటి గురించిన సుసూక్ష్మవివరాలనుకూడా ఆకళించుకున్నాడాయన. ప్రతి చెలక ఆయనకు బిడ్డతో సమానం. ఒకదానికి నీరెక్కువ కావాలి, మరోదానికి తక్కువ కావాలి. ఒకటి చవిటిపర్ర, ఇంకోటి మంచి తేమ కలిగిన భూమి. ఒకదానిలో వేరుశనగ విరగపండుతుంది కానీ నువ్వులకు పనికిరాదు. అలా చిట్టచివరి చెలకవరకూ ఆయన చెప్పుకుంటూవెళ్ళాడు.

ఆ వివరాలు చెప్పడం పూర్తయిన తర్వాత నాన్న మళ్ళీ భూమిగురించి ప్రస్తావించలేదు. నగదు విషయాలు మాట్లాడడం ప్రారంభించాడు. ఉన్న నగదు స్వల్పమే. గ్రామంలో ఉన్నంతలో లోటు లేకుండా గౌరవంగా జీవించడానికి భూమినుంచి వచ్చేదే సరిపోతుంది. 'గతి లేకపోతే కడుపుమాడ్చుకో కానీ ఎప్పుడూ రుణం చేయకు, అది మహాపాపం, నా మాట గుర్తుంచుకో... ముఖ్యంగా బ్యాంకినుంచి, సర్కారుతో సంబంధమున్న మరో సంస్థనుంచి ఎన్నడూ రుణం తీసుకోవద్దు. వాళ్ళెన్నడు కుర్కీ (రుణం వసూలు కు తీసుకునే చర్యలు) తెస్తారో జప్తు (ఆస్తుల స్వాధీనం) చేస్తారో తెలియదు. వాళ్ళ చేతుల్లో పడితే ఎవరి పరువూ మిగలదు.'

నాన్న త్వరత్వరగా మాట్లాడుతున్నాడు. ఆ మాటల్లోకూడా ఆశ్చర్యం గొలిపేంత స్పష్టత ఉట్టిపడుతోంది. తనకు మిగిలిఉన్న ఆ కాస్త సమయంలోనే చెప్పదలచుకున్నవన్నీ చెప్పాలన్న తహతహతో కాబోలు అన్నమాట మళ్ళీ అనకుండా చెప్పుకుంటూవెడుతున్నాడు. ఆనంద్ ఒక్కసారి ఘొల్లుమనేసరికి నాన్న కోపంగా అతడివైపు చూసి కనుబొమలు ముడిచాడు. తర్వాత క్షీణస్వరంతో అన్నాడు. 'చూడు నాయనా, మనకు లక్ష్మి ఏనాడూ లేదు, ఉన్నదల్లా ఒక్క ధైర్యలక్ష్మి మాత్రమే. ఆమెను దూరంచేసుకోకు, లేకపోతే బతకడానికి నీకు మరే ఆధారమూ ఉండదు...'

ఓ వైపున నాన్న అమ్మను చూసి అప్రయత్నంగా కంటతడి పెడుతూనే, గట్టిగా శోకాలు పెడుతున్న అమ్మపై అంతిమక్షణాలలోకూడా కేకలువేయడానికి ప్రయత్నించడం ఆనంద్‌కు జ్ఞాపకమొచ్చింది. భూదేవంత ఓరిమితో ఆయన సంతానాన్ని కనిపెంచి, ఆయన కోపతాపాలను గుర్తెరిగి మసలుకుంటూ పల్లెత్తుమాట అనకుండా నలభైఏళ్ళు కాపురం చేసిందామె. అందుకు కన్నీళ్ళతో ఆయన కృతజ్ఞతలు చెల్లించుకున్నారు కాబోలు. ఆ కృతజ్ఞతను ఆయన మాటల్లో వ్యక్తం చేయాలను కోలేదు, అనుభూతిచెందడమే కానీ మాటల్లో వాళ్ళేనాడూ ఏదీ వ్యక్తం చేయరు. వాళ్ళ జీవనసరళి అటువంటిది. ఒకరిమీద ఒకరికి ఎంతో ఆపేక్ష, కానీ దానిని ఏనాడూ ప్రకటించి ఎరుగరు.

చివరిసారిగా నాన్న రామనామస్మరణ ప్రారంభించారు. అక్కడున్న అందరినీ తనను అనుసరించ మని సైగచేస్తూ. ఆ పెదవులమీంచి ధ్వనించే నామస్మరణ ఒక్కొక్క ఆవృత్తి గడిచేనకొద్దీ క్షీణించి, మరింత క్షీణించి చివరకు పెదవుల నిశ్శబ్దస్పందనగా పరిణమించింది. మెల్లగా ఇంకా మెల్లగా ఆ కదలికకూడా ఆగిపోయింది. అయిపోయింది... ఆ క్షణాన ఇంచుమించు గ్రామంలోని పెద్దలందరూ అక్కడే ఉన్నారు. గుండెల్ని నీరుచేసేలా ఉన్న వాళ్ళ సుదీర్ఘ రోదనధ్వనులతో పరిసరాలు ప్రతిధ్వనించిపోయాయి. నాన్న ప్రాణాలు కొనిపోవడానికి వచ్చిన యమదూతల్ని తమలో ప్రతి ఒకరూ చూసినట్టుగా, విచిత్రమైన స్ఫురణ ఏదో కలిగి వాళ్ళందరూ అక్కడికి చేరుకు న్నారు. కొన్నేళ్ళపాటు ఊరు ఊరంతా ఆ పుణ్యాత్ముడి అనాయాసమరణంగురించి విశేషంగా చెప్పుకున్నారు. ఎవరైనా మంచంమీద నవసి నవసి మరణించిన సందర్భాల్లో నాన్న అవసానఘట్టాన్ని మరింతగా గుర్తుచేసుకునేవారు.

★ ★ ★

నిద్రపట్టక, గది పైకప్పుకేసి చూస్తూ పడుకున్న ఆనంద్ మనోనేత్రంముందు ఆనాటి దృశ్యాలు ఒకదానివెంట ఒకటిగా కదిలిపోతున్నాయి. బహుశా తనను జీవితాంతం వెంటాడే

నూతనకార్యభారంవల్ల వచ్చి పడగల చిక్కులగురించి అదేపనిగా ఆలోచిస్తూ, ఆలోచిస్తూ, ఆలోచిస్తూ నిశ్చలంగా పడుకుని ఉండిపోయాడు.

'విన్నావా? మొత్తంమీద అదీ భూమికథ' అని ఎవరో కాస్త పెద్దగొంతుతో అంటున్నట్టు ఆనంద్‌కి అనిపించింది. 'నీ తండ్రి తన చివరిక్షణాలలో నీకు వర్ణించి చెప్పిన ఆ చెలకల్లో, నీ తండ్రి ప్రియాతిప్రియమైన సంతానంగా భావించిన ఆ చెలకల్లో వేటిని నువ్వు ప్రభుత్వానికి స్వాధీనంచేస్తావ్? నీ తమ్ముణ్ణి మరెవరికో బహూకరించడంలాంటి ఆ పని చేయడానికి నీకున్న హక్కేమిటి?... నీ విషయంలో భూమి నీ మేధాశక్తికి అవరోధమే అనుకుందాం (నేను మేధావినని నువ్వనుకుంటావ్, కానీ ఎవరికి తెలుసు?); ప్రతిఒకరి జీవితంలోనూ జరిగినట్టే నీ కది లాభనష్టాలతో కూడిన పిత్రార్జితంగా వచ్చింది. నీ జీవితం నువ్వు కోరుకున్న విధంగా సంతోషభరితంగా లేదనీ ఒప్పుకుందాం. అయినాసరే ఎవరో చపలచిత్తులు తప్ప పిత్రార్జితాన్ని ఎవరు నిరాకరిస్తారు? మూర్ఖుడా, వ్యవస్థ అంటే అదే; అందులో నిజంగానే నువ్వు ఇమడలేవు. ఎంతసేపూ వ్యవస్థనే ఎందుకు ఆడిపోసుకుంటావ్? చేతనైతే ఇంతకంటె మంచివ్యవస్థను తీసుకురా. ఎటువంటి వ్యవస్థనైనా భ్రష్టుపట్టించే శత్రువులతో, దోపిడీశక్తులతో, జనాన్ని కాల్చుకుతినే దుష్టులతో పోరాడు. అవును. ధైర్యముంటే వాళ్ళతో తలపడు. శుష్కనినాదాలు విడిచిపెట్టు. ఏవో ప్రాచీనకాలాల్లోకి వెళ్ళిపోయి పంచరంగుల కలలు కనడం మానుకో.'

గెస్ట్‌హౌస్‌కు కూతవేటు దూరంలో ఎక్కడో ఓ కోడిపుంజు అవును అవునన్నట్టు కూసింది...

ఇక ఇప్పుడు నిద్రపోయే ప్రశ్న లేదనుకుంటూ ఆనంద్ పడకమీదినుంచి లేచాడు. కొద్దిగా అలసట తోచిందతనికి. నిద్రలేమిని మించి తాను నిర్విరామంగా సాగించిన కఠోర ఆత్మపరిశీలనే అందుకు కారణం కావచ్చు. గెడ్డం చేసుకోడానికి అద్దంముందు నిలబడిన ఆనంద్‌కు ఎర్రబడి ఉబ్బిఉన్న రెండుకళ్ళూ లీలగా కనిపిస్తున్న చీలికలోంచి తనవైపు ఓరగా చూస్తున్నాయనిపించింది. భగవంతుడా! ఈ లెక్కన భూసంస్కరణలు తననెలా పీల్చి పిప్పిచేయబోతున్నాయి! తనలో తనే ప్రశ్నించుకున్నాడు.

అంతలో గెస్ట్‌హౌస్ పిబిఎక్స్ నుంచి బజ్ మోగింది. 'గుడ్‌మార్నింగ్ సర్. అఫ్రోజాబాద్‌నుంచి మీకు ట్రంకాల్. యుఎన్ఐ నుంచి మీతో అర్జంటుగా మాట్లాడాలంటున్నారు' ఆపరేటర్ చెప్పాడు.

యు ఎన్.ఐ...? ఇంత పొద్దునే? ఆనంద్ క్షణకాలం సంశయించి తర్వాత అన్నాడు 'సరే, ఇవ్వండి.'

మంత్రిత్వశాఖల్లో మార్పును తెలియజేస్తూ ముందురోజు రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత గవర్నర్ చేసిన ప్రకటనగురించి యు.ఎన్.ఐ. విలేఖరి చెప్పిన మాటలు విని ఆనంద్ విస్తుపోయాడు. మొత్తానికి నిర్ణయం జరిగిపోయిందన్నమాట. అంటే చౌదరి తనకు పునరాలోచనకు... పునరాలోచనకే ఏమిటి, అసలు ఆలోచనకే వ్యవధి ఇవ్వకూడదనుకున్నాడన్న మాట! గొప్ప వ్యూహచతురుడు మా ముఖ్యమంత్రి —అనుకున్నాడు ఆనంద్ ఇక ఇప్పుడు తన యావజ్జీవ మహాయుద్ధానికి సన్నద్ధం కావలసిందే. ఈ మార్పుపై కొన్ని 'తక్షణ స్పందన'లను కూడా యుఎన్ఐ విలేఖరి అప్పుడే సేకరించేశాడు. వాటిలో సంతోషాన్ని ప్రకటించినవీ ఉన్నాయి, ఆగ్రహాన్ని వెళ్ళబోసుకున్నవీ ఉన్నాయి.

కబురు అందించినందుకు కృతజ్ఞతలు చెప్పి ఆనంద్ ఫోన్ పెట్టబోతుండగా ఆ విలేఖరి హఠాత్తుగా ఓ ప్రశ్న సంధించాడు. తప్పించుకునే అవకాశం ఇవ్వనంత వేగంగా దూసుకొచ్చిందా ప్రశ్న. 'మిస్టర్ మినిస్టర్, మరి మీ రియాక్షనేమిటి? మీ నూతన కర్తవ్యం గురించి మీరేమనుకుంటున్నారు? మీరు ఉత్తేజితులౌతున్నారా? లేక అపాయభరితమనీ, చిక్కులు తెచ్చిపెడుతుందనీ, ప్రమాద భూయిష్ఠమనీ అనుకుంటున్నారా? ఇవేవీ కాక నల్లేరుమీద నడకలా భావిస్తున్నారా?'

తనకు తెలిసిన విశేషణాలన్నీ ప్రయోగిస్తున్నాడు —అనుకున్నాడు ఆనంద్ చికాకుగా. ఆ తర్వాత పిడుగుపాటులాంటి ప్రశ్న. 'లేదా, నాకింకా ఏమీ తెలియదని మీరన్నట్టు భావించమంటారా?'

ఆ క్షణంలో 'ఆనంద్‌కు తన కర్తవ్యమేమిటో తెలియదు!' అనే శీర్షిక అతని ఊహలో మెరిసింది. 'దయచేసి అలామాత్రం అనకండి' ఆనంద్ చటుక్కున అన్నాడు. ఆ తర్వాత ఆలోచనలు కూడదీసుకుంటూ 'చూడండి, నా నూతన బాధ్యతకు మీరు పేర్కొన్న ప్రతిమాట కొంత కొంత వర్తిస్తుందనే నేను భావిస్తున్నాను, కొంతమేరకే .. దేని దేని తీవ్రత ఎంతన్న విషయం, నేను తిరిగొచ్చి ముఖ్యమంత్రిని సంప్రతించిన మీదట చెబుతాను... సరేనా?'

'సరే' అన్నాడు ఆ విలేఖరి నిరుత్సాహంగా.

'వార్తను మొట్టమొదట మోసుకొచ్చినందుకు మీకు కృతజ్ఞుణ్ణి' ఇంతకుముందు తాను దాటవేస్తూ ఇచ్చిన సమాధానానికి అతడు నొచ్చుకోకుండా ఆనంద్ ఊరడింపుగా అన్నాడు. ఏమైనా ఆ యుఎన్ఐ మనిషి దానిని బొత్తిగా రంగూరుచీ లేని సమాధానంగా భావించియుఎన్ఐ డబ్బును వృధాచేశాననుకుంటాడని ఆనంద్‌కు నమ్మకంగా తెలుసు. 'యుఎన్ఐ చురుకుదనం నన్నెంతో ముగ్ధుణ్ణిచేస్తూ ఉంటుంది' అనికూడా అన్నాడు.

హడావుడిగా అల్పాహారం ముగించాడు. సమ్మేళనానికి సంధానకర్తగా వ్యవహరించిన వ్యక్తి ముందురోజు రాత్రి ఆనంద్ పరిష్కరించిన ముసాయిదాతీర్మానాలను తీసుకెళ్ళడానికి వచ్చాడు. అప్పటికే ఆనంద్ తలపులు సేద్యపునీటిశాఖ నుంచి తప్పుకుని రకరకాల కలగలుపు ఆలోచనలచుట్టూ, ముళ్ళతీగల్లాంటి సరికొత్త సమస్యలచుట్టూ పరిభ్రమిస్తున్నాయి. వాటిలో కొన్నింటికి స్పష్టత ఉన్నా మరికొన్ని ఎంతో అయోమయంగా అస్పష్టంగా ఉన్నాయి. 'వ్యవస్థను అదేపనిగా ఆడిపోసుకోవడం కాదు, చేతనైతే దాన్ని మార్చు; ఎలాగో తెలిస్తే ఆ వ్యవస్థను తొలగించి అంతకంటె మంచి వ్యవస్థను తీసుకురా! తనకుతనే కఠోరంగా గుర్తుచేసుకున్నాడు... అందుకు తను సిద్ధమయ్యాడా అని మాటిమాటికీ ప్రశ్నించుకుంటున్నాడు.

ఉదయం సమ్మేళనం ఎట్టకేలకు ముగిసింది. సమ్మేళనం ప్రారంభించిన మంత్రి కాక మరో కేంద్రమంత్రి ముగింపుప్రసంగం చేశాడు. రెండు ప్రసంగాలలోనూ అదొక్కటే ముఖ్యమైన తేడా. ప్రతిఒకరూ ప్రతిఒకరినీ అభినందించారు. చివరగా, ప్రతిఒకరికీ, భూమండలంలో ఉన్న ప్రతిసంస్థకీ కృతజ్ఞతలు చెబుతూ వందనసమర్పణ. భారతీయుల ఉపన్యాసదాహం ఒకపట్టాన అణచుకోలేనిది కనుక వందనసమర్పణ చేయవలసిన మనిషి సమ్మేళనంలో చర్చించిన కొన్ని అంశాలపై తన సొంత ఆలోచనలు ఏకరవుపెట్టడం ప్రారంభించాడు. ప్రధానవక్తలలో తన పేరు చేర్చనందుకు నిర్వాహకులమీద కక్ష తీర్చుకుంటున్నాడా అన్నట్టుగా తన వ్యవధి తను

తీసుకున్నాడు. ఎట్టకేల కు అతడు ప్రసంగం ముగించిన తర్వాత, అలా ముగించినందుకు అతడు మరో వందనసమర్పణకు అర్హుడనుకున్నాడు ఆనంద్... యు.ఎన్.ఐ. విలేఖరి గుచ్చిగుచ్చి అడిగిన ప్రశ్నలూ, వాటికి తనిచ్చిన మొండి సమాధానాలూ తలచుకుంటూ అతడు భరించలేని అస్థిమితానికి లోనయ్యాడు.

ఆనంద్ పోర్టుఫోలియో మారిన సంగతి అప్పటికే సమ్మేళనస్థలానికి పాకిపోయింది. సభ్యులు అతణ్ణి అభినందించసాగారు, ఈ కొత్త బాధ్యతలో మీనుంచి 'మంచి ఫలితా'లను ఆశిస్తున్నామని కూడా అన్నారు. వారి అభినందనలను వినమ్రంగా స్వీకరిస్తూ, అధికారశ్రేణిలో పైనుంచి కింది వరకూ ప్రతి ఒకరి సానుభూతి, సహాయం, సహకారం తనకు అవసరమేనని మనసులో అనుకున్నాడు. అంతేకాదు, పాతుకుపోయిన వ్యవస్థలో సమూలమైన మార్పు తీసుకురావాలంటే ఇంకా ఎన్నో చాలా అవసరమౌతాయి. ముందుగా వ్యవస్థను తాను అర్థంచేసుకోవాలి, ఎక్కడ ఎందుకు ఎలా ఎవరివల్ల పొరపాటు జరిగిందో తెలుసుకోవాలి...

భూసంస్కరణలశాఖను చూస్తున్న కేంద్రమంత్రిని మర్యాదపూర్వకంగా కలుసుకోవాలను కున్నాడు. భూసంస్కరణలగురించి వాటి అమలుగురించి స్థూలంగా కేంద్రప్రభుత్వం, ముఖ్యంగా మంత్రి ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలని ఆశించాడు. ప్రభుత్వం అభిప్రాయాలు, ప్రధానమంత్రి అభిప్రాయాలు ఒక్కలానే ఉన్నాయా లేదా అన్నది తెలుసుకోవడం అతని ఉద్దేశం. ఇది చాలా ముఖ్యమైన కోణమని, భూసంస్కరణల అమలును బాగా ప్రభావితంచేయగలిగింది ఇదేనని అతని ఊహ.

మంత్రి అతణ్ణి మర్యాదపూర్వకంగానే ఆహ్వానించాడు. టీ తెప్పించాడు. రంగులో, రుచిలో, వాసనలో అది అన్ని ప్రభుత్వశాఖల్లో అందించే టీలానే ఘోరంగా ఉంది. యథావిధిగా ముద్రవేసి 'అభినందనలతో' అన్న కాగితంకూడా అతికించిన ఓ పెద్ద ఫైలు మంత్రి అతనికి అందించాడు. మంత్రిత్వస్థాయిలో దానినెప్పుడూ తాకిన పాపాన పోలేదని తెలిసిపోతూనే ఉంది. ఆనంద్ అడిగిన ప్రతిప్రశ్నకూ ఫైలువైపు చూపించాడా మంత్రి. ఆ విధంగా ఎంతో సమయాన్నీ ఆదాచేశాడు, ఇబ్బందినుంచీ బయటపడ్డాడు. ఆ తర్వాత విచారణ చేసిన మీదట, ఆ మంత్రి నగరంలో పుట్టి పెరిగిన జీవి అనీ, గ్రామీణభారతంతో అతడి పరిచయం, విధిగా హాజరుకావలసిన ప్రభుత్వకార్యక్రమాల్ని మించి ముందుకు పోలేదనీ తెలిసింది.

మంత్రి సూచనపై ఇద్దరు అధికారులు ఆనంద్‌తో భూసంస్కరణల గురించి సవివరంగా చర్చించడానికి గెస్టహౌస్‌కు వచ్చారు. వాళ్ళలో ఒకరి ధోరణి కొంత నిరుత్సాహపూరితంగానూ మరొకరి వైఖరి కొంత అత్యుత్సాహభరితంగానూ ఆనంద్‌కి కనిపించింది. రెండు సందర్భాల్లోనూ వాళ్ళు అట్టడుగు వాస్తవికత కెంతో దూరంగానే ఉన్నట్టు గ్రహించాడు. ఇరవైఏళ్ళ క్రితం తమ తమ రాష్ట్రాల్లో పనిచేసిన ఆ ఇద్దరూ ఆ తర్వాత కేంద్రప్రభుత్వంలోకి వచ్చి రక్షణశాఖనుంచి ఆరోగ్యశాఖకూ, అక్కడినుంచి అటవీశాఖకూ, అక్కడినుంచి ఇరిగేషన్‌శాఖకూ —ఇలా తీరుబడిగా శాఖాచంక్రమణం చేస్తూవచ్చారు. మధ్యమధ్య పశ్చిమదేశాల్లో నియమితులై ఇలాగే రకరకాల విధులు నిర్వర్తించారు పైకొచ్చిన ఎందరో అధికారుల్లానే వీరు కూడా తమ ఉద్యోగజీవితం పొడవునా సామర్థ్యం, లోతైన పరిజ్ఞానం ప్రదర్శించుకుని ఉన్నతాధికారవర్గాలకు

ఆమోదయోగ్యంగానే వ్యవహరించిఉంటారు. ఇప్పటి వాళ్ళ ధోరణనిబట్టి రిటైర్‌మెంటుకు దగ్గరగా ఉన్న తమను నిర్బంధంగా భూసంస్కరణలశాఖలోకి తెచ్చి పడేశారని గింజుకుంటున్నట్టు కనిపించారు. తమను పైకిలాగే వాడెవడూ లేకపోవడం మినహా తామే తప్పు చేయకపోయినా, తమ చివరి పోస్టింగ్ ఇటువంటిది కావడం శిక్షగా భావిస్తున్నట్టు కనిపించారు... ఉద్యోగవిరమణ చేసిన అధికారులను మించిన విషాదగ్రస్తులు మరెవరూ ఉండరు. ఉద్యోగంలో ఉన్నప్పుడు నిరాఘాటంగా అధికారం చలాయించిన వాళ్ళు, ఆ అధికారాన్ని ఎంతో ఆనందంగా అనుభవించిన వాళ్ళు ఉద్యోగవిరమణతో హఠాత్తుగా అనామకులుగా మారిపోతారు. భూసంస్కరణల శాఖలోని కొందరు అధికారుల్ని చూస్తే అటువంటి దురవస్థకు ఇప్పటినుంచే సన్నద్ధమౌతున్నారా అనిపించింది... మొత్తంమీద భూసంస్కరణలకు ఫలప్రదమైన భవిష్యత్తు ఉండగలదని ఆనంద్‌కి అనిపించలేదు. కొంత నిస్పృహకు లోనయ్యాడు. ఇది తనకో బలహీన ప్రారంభమనిపించింది. రాష్ట్రరాజధానికి తిరిగిరాగానే రకరకాల స్పందనలతణ్ణి ముంచెత్తాయి. వాటిలో సలహాలున్నాయి, హెచ్చరికలున్నాయి, శుభాకాంక్షలున్నాయి, ఆపైన దుర్భాషలు ఎలాగూ ఉంటాయి. సుదర్శన్ అతణ్ణి చూడడానికి వచ్చాడు, కోపంతో రగిలిపోతూ. 'ఈ ముఖ్యమంత్రి కచ్చితంగా నిన్ను నాశనంచేయాలని చూస్తున్నాడు' అంటూ గర్జించాడు. 'నీ జాతకం సుఖసంతోషాలకు నోచుకున్నదెలాగూ కాదు, ఇప్పుడైనా మంత్రివర్గంనుంచి బయటపడి క్షేమంగా ఉండడం మంచిదనిపిస్తోంది' అన్నాడు.

'ఒక సాహసికమిత్రుడు మరో సాహసోపేత కార్యకర్తకి ఇచ్చే సలహా ఇదేనా?' ఆనంద్ వ్యంగ్యంగా అన్నాడు.

'కాదనుకో' సుదర్శన్ వెంటనే జవాబుచెప్పాడు. అతడి మాటలో ఒక విధమైన మొండితనం వినిపించింది. 'దీని వెనుక నిన్ను పాతాళానికి తొక్కేసే కుట్ర ఏదీ నీకు కనిపించడం లేదా? వాళ్ళు నీ మానాన నిన్ను బతకనివ్వరా? వాళ్ళకు నువ్వు చేసిన అపకారమేమిటి?'

'డాక్టర్‌సాబ్! ఇది జవహర్లాల్ నెహ్రూకి కలిగిన ఆలోచనని నీకూ తెలుసు. చౌదరి కది ఇష్టంలేదు, కానీ వ్యతిరేకించలేడు. చౌదరి బుర్రలోకి నా పేరు ఎవరు ఎక్కించారన్నది అనవసరం, అతని బుర్ర అతనికీ ఉంది, అది పూర్తిగా డొల్లేమీ కాదు. నేను నీ మిత్రుణ్ణనీ, నన్ను వధ్యశిలమీద చూడడం నీకు ఇష్టంలేదనీ కాస్సేపు మరచిపోయి చెప్పు, పండిట్‌జీ అభిమతాన్ని ఇప్పటి మంత్రివర్గసభ్యుల్లో ఎవరు సమర్థవంతంగా అమలుచేయగలరని నువ్వనుకుంటున్నావ్?'

'ఆనంద్, అలాంటి ప్రశ్నలు నన్నెందుకడుగుతావ్? ఆ విషయంలో నిన్ను మించి మరెవరి గురించీ ఆలోచించలేనని నాకు తెలుసు. అయితేమాత్రం, నీకే ఎందుకు అప్పగించాలని నేనడుగుతున్నాను. ప్రతి మంత్రినీ, కేవలం ప్రతిభను దృష్టిలో ఉంచుకునే ఎంచుకుంటున్నారా? దీని వెనుక ఎటువంటి దురుద్దేశం లేదని నన్ను నమ్మమంటున్నావ్. నీ అంతట నువ్వే ఆ శాఖను కోరుకున్నట్టు మాట్లాడుతున్నావ్.'

సుదర్శన్ కోపతాపాలను పట్టించుకోకుండా ఆనంద్ వివరించుకుంటూ వెళ్ళాడు. 'భూస్వాములు నన్ను ఇష్టపడరని నీకు తెలుసు. అయితే ఇంతవరకది స్థూలమైన దృక్కోణం, అంతగా పట్టించు

కోవలసింది కాదు. ఇప్పుడు చౌదరి వారికీ నాకూ మధ్య ప్రతిపక్ష సంబంధం సృష్టించాడు. భూస్వాములుగా నేను వాళ్ళను నాశనంచేస్తే చేయవచ్చు. నన్నూ నాశనంచేసే ఎత్తుగడకూడా ఇందులో ఉందేమో నాకు తెలియదు. ఏవైపునుంచి చూసినా ఇది చౌదరికి బాగా అనుకూలించే విషయం. 'తన' మనిషి కాని వాణ్ణి, అలాగని మెడపట్టి బయటకు గెంటలేని మనిషిని వదిలించు కున్నట్లవుతుంది, లేదా పండిట్‌జీ ఎంతో అభిమానించే కార్యక్రమాన్ని అమలుచేయగలిగిన హీరోగా తనను చిత్రించుకునే అవకాశం లభిస్తుంది. గెలుపు అతనిదవుతుంది. ఓటమి సహజంగా నాదే అవుతుంది, అందులో ఇమిడిఉన్న ప్రమాదాలతోసహా. చాలామంది భూస్వాములు నాకు వ్యక్తిగతంగా స్నేహితులు. ఏదో దుష్టసంకల్పంతో తమను నొప్పించనని వాళ్ళకు తెలుసు. నేనూ వాళ్ళలో ఒకణ్ణి కనుక నాకున్న భూమిలో తగినంత పరిమాణాన్ని నేనూ కోల్పోతాను. పార్టీ మేనిఫెస్టోలో ఉన్నదే నేను చేయబోతున్నాను. పార్టీ ప్రణాళికకు నేను చెప్పే అన్వయానికి భిన్నమైన అన్వయం చెప్పే వాళ్ళు పార్టీలో చాలామంది ఉన్నమాటకూడా నిజమే. కనుక, నేను వారిని పడగొట్టేలోపల వాళ్ళు నన్ను పడగొట్టగలిగితే, పార్టీ సంకల్పాన్ని ఉల్లంఘించకుండానే గెలుపు తమదనిపించు కుంటారు... ఇదంతా పెద్ద చిక్కుముడిలా ఉంది కదూ?'

'నా కంతా ఆశ్చర్యంగా ఉంది' సుదర్శన్ అన్నాడు. 'అంటే నువ్వనేది, తన వాగ్దానాలను తన ప్రభుత్వమే అమలుచేయకూడదని పార్టీ అనుకుంటోందనా?'

'క్లుప్తంగా చెప్పాలంటే కొందరు పార్టీసభ్యుల ఆలోచనాసరళి అదే' ఆనంద్ జవాబుచెప్పాడు. 'అయితే రకరకాల పదజాలంతో తమ వాదాన్ని వాళ్ళు రూపొందించుకుంటారు. అందుకు కారణాలు స్పష్టమే. వాళ్ళ దృష్టిలో పార్టీ కార్యక్రమం ఆర్భాటంగా ప్రదర్శించుకోదగిందే కానీ, అమలు చేయదగింది కాదు. వాళ్ళు కోరుకునేది ఎన్నికలసమయంలో పనికొచ్చే మాయలు, మంత్రాలు. నేను మాట్లాడుతున్నది కొందరి గురించి, పార్టీలోని అందరిగురించి కాదు. ప్రశ్నల్లా పలుకుబడి, ప్రాబల్యం ఎటువైపు ఉన్నాయనే. కేవలం ఎన్నికలదృష్టితో వ్యవహరించడం నా పద్ధతి కాదు. నేనాశించే పరమప్రయోజనం సాంఘికపరివర్తన. వోట్లు రానీ, రాకపోనీ పార్టీ ఆశించేది కూడా అదేనని నా విశ్వాసం. నిజం చెప్పాలంటే పార్టీ కార్యక్రమం ఎన్నికల ప్రయోజనాల కెంతమాత్రం విరుద్ధమైంది కాదు. ఎన్నికల ప్రయోజనాలు ఎప్పుడైనా దెబ్బతినడమంటూ జరిగితే అది మన ఊగిసలాటవల్ల, మాటకీ చేతకీ మధ్య విస్తరించే అగాధంవల్లనే జరగాలి...'

'నా కంతా అయోమయంగా ఉంది' సుదర్శన్ అన్నాడు. 'నువ్వుకూడా తమలానే భూస్వామ్య వర్గంవాడివే అయినా, ఆ వాతావరణంలోనే పెరిగినా సాంఘికపరివర్తన సిద్ధాంతంపట్ల నీకింత వ్యామోహం ఎలా ఏర్పడిందంటూ కొందరు భూస్వాములు నా దగ్గర ఆశ్చర్యం వ్యక్తంచేస్తూ ఉంటారు. నువ్వు భూస్వాముల పక్షాన పనిచేయాలని సహజంగానే వాళ్ళు ఆశిస్తారు. పార్టీలోపల, బయటా ఉన్న నీ వర్గంవారికి లేని విశ్వాసాలు నీ కెలా ఏర్పడ్డాయి? తమెంతో ఆరాధించే వ్యక్తిలో ఈ ధోరణి ఆ జనాన్ని తికమకపెడుతోంది. .'

ఆనంద్ మౌనంగా ఉండిపోయాడు. తర్వాత తనకు తనే చెప్పుకుంటున్నట్టు ప్రారంభించాడు... 'అవును... సాంఘికపరివర్తన అనివార్యమన్న విశ్వాసం నాకెందుకు కలిగింది? ఇందుకు సంపూర్ణమైన

సమాధానం నా దగ్గర ఉందని కచ్చితంగా చెప్పలేను. ఎంతోమందిలానే నేనుకూడా ఇప్పటి వ్యవస్థ మారాలని విశ్వసిస్తున్నాను. అయితే సమాజాన్ని అన్నివైపులనుంచి గమనించిన మీదట, సమూలమైన పరివర్తన వస్తే తప్ప ప్రయోజనం ఉండదని గ్రహించాను. ఒక వ్యవస్థగా ఆస్తిహక్కు— నీది, నాది అనే భావన —మానవాళి దుఃఖానికి అనేక రకాలుగా కారణమౌతోందని అనుభవ పూర్వకంగా నిర్ధారణకొచ్చాను. ఆస్తి ఎక్కువా, తక్కువా అన్న తేడా ఇక్కడ లేదు. ఒక సమున్నతమహాసౌధం రగిలించగలిగిన ఉద్రేకాలనే దారిద్ర్యం ఓడుతున్న ఒక పూరిపాక కూడా రగిలించగలుగుతుంది. విద్వేషాల విస్ఫోటానికి ఒక పెద్ద ఎస్టేట్ అవసరంలేదు, కొన్ని సెంట్ల భూమి సరిపోతుంది. అందుకే నేను ఐశ్వర్యాన్ని లక్ష్యపెట్టని స్థితికివచ్చాను. మనిషి ప్రాథమికావసరం సంతోషమేనని నా నమ్మకం. సంపదనీ, సంతోషాన్నీ సమానంచేసి ఆ కృత్రిమసిద్ధాంతం పునాదిగా సాంఘికసంబంధాలను నిర్మించి నిర్వచించే వ్యవస్థను నేను ప్రతిఘటిస్తాను... నా మాటల్లో నీకేమైనా అర్థం కనిపిస్తోందో లేదో నాకు తెలియదు; కాని నా జీవనతాత్వికత ననుసరించి, సంతోషంగా జీవించే హక్కు అత్యంత పవిత్రమైన మానవహక్కుగా నేను భావిస్తాను. ఆ హక్కును పక్కకితప్పించేదేదైనా సరే —అది ఆస్తి కానీ, ఆచారం కానీ, అధికారం కానీ, ప్రతిష్ఠ కానీ — అంతమొందించ దగినవే. అప్పుడు ఇదే నా పోరాట పరమార్థం. ఆ క్రమంలో నా విధ్వంసాన్ని నేనే కొనితెచ్చుకోవచ్చు, అలా జరగడానికే అన్ని అవకాశాలూ ఉన్నాయి. అయినా ఈ విష యంలో రాజీపడడమనేది లేదు. అసలెందుకు రాజీపడాలి? అలా రాజీపడి నేను సాధించుకునే దేమిటి? నేను దేనినీ ఆశించడం లేదని మాత్రం నిశ్చయంగా చెప్పగలను. అటువంటి పరిస్థి తిలో ఎందుకు రాజీపడాలి? రాజీపడడంలో అర్థమేముంది? నా కెవరిపట్ల శత్రుత్వం లేదని నీకు తెలుసు, ఎందుకంటే మళ్ళీ అదే కారణం, ఏ విషయంలోనైనా నిర్లిప్తంగా ఉండగలను కనుక.'

'నువ్వు చెప్పిందే సమంజస మనిపిస్తోంది' సుదర్శన్ అన్నాడు. 'కానీ నువ్వు విఫలమౌ తావని నాకనిపిస్తోంది, ఇలా అంటున్నందుకు క్షమిస్తావనుకుంటాను.'

'స్వాప్నికుల ప్రతినిధిగా నువ్వు నన్నీ జీవితంవైపు నడిపించావు, గుర్తుందా?' ఆనంద్ అడిగాడు, ఆందోళన నిండిన మిత్రుడి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

'గుర్తుంది' సుదర్శన్ జవాబు చెప్పాడు. 'నీ గురించి ఇంచుమించు అన్నీ తెలిసిన మనిషినే అయినా నీ సరికొత్త కర్తవ్యానికి సంబంధించిన ఈ దృక్కోణం నా అవగాహనకే అతీతంగా ఉంది. కనుక నేను చెప్పగలిగిందొకటే... నీ ఆశయసాధనలో కృతకృత్యుడివి కావాలని ఆకాంక్షిస్తున్నాను.'

# 28

మంత్రిత్వశాఖలమార్పు జరిగిన వెనువెంటనే ఆనంద్‌కు మొదటిసారి చౌదరితో చిక్కులు తెచ్చి పెట్టగల వాదోపవాదాల ఘట్టాన్ని ఎదుర్కోవలసివచ్చింది. ఆనంద్ తీసుకోబోతున్న వైఖరిపై ముఖ్యమంత్రి తీవ్రమైన, దాదాపు విషపూరితమైన విమర్శలు గుప్పించాడు. అయితే, తలవంచని ఆదర్శవాదానికీ, బరితెగించిన అవకాశవాదానికీ (మృదువైన భాషలో దీనిని ప్రయోజనవాదం అంటారు) మధ్య ఆ ఘర్షణ ఒక విధమైన పరస్పరావగాహన తీసుకురాగలిగింది. భూసంస్కరణలశాఖను ఆనంద్‌కు అప్పగించడం మంచిదనే చౌదరి ఇంతవరకూ భావిస్తూ వచ్చాడు. అయితే ఆలోచించినకొద్దీ ఆ నిర్ణయం సరైనదేనన్న నమ్మకం అతనిలో సడలిపోతోంది. భూమిలేని పేదలను ఆదుకోవాలని అతడూ అనుకుంటున్నాడు, నిజంగానే అనుకుంటున్నాడు; అయితే పూర్వీకుల నుండి చెందిన భూస్వాముల ఆస్తుల్ని నిరంకుశంగా గుంజుకోవడంద్వారా కాదు. ఆనంద్ సరిగ్గా అదే చేయబోతున్నాడని ఇప్పుడతడు భయపడుతున్నాడు.

భూసంస్కరణలపట్ల చౌదరి అభ్యంతరాలకు చాలా కారణాలున్నాయి. మామూలుగా సోషలిజం అంటేనే అతడు ముఖం చిట్లించుకుంటాడు. ఆపైన పార్టీ ఎంతో ఇష్టంగా దానిని కౌగలించుకోవడం అతనికసలే నచ్చలేదు. ఇదంతా దేనికో తనకుమాత్రం తెలియదా? ఎవరిని వంచించడానికీ ప్రయత్నమంతా అని ప్రశ్నించుకున్నాడు. ఈ అంశానికి సంబంధించినంత వరకూ తనకెలాంటి భ్రమలూ లేవు. ఎంతైనా పార్టీలో సోషలిజం అచ్చంగా జవహర్లాల్ బుర్రలోంచి పుట్టిన ఆలోచన. పార్టీలో ఉన్న పలువురు యువకులు (వాళ్ళ ముద్దుపేరు యంగ్‌టర్క్స్) సోషలిజంవైపు నిజంగానే ఆకర్షితులైనమాట వాస్తవమే. అయితే పార్టీలో పాతుకు పోయిన నాయకులతో పోలిస్తే వీళ్ళకంత ప్రాబల్యం, పలుకుబడి లేవు. కొందరు విమర్శకులు వ్యంగ్యంగా అంటుంటారు, 'మన సోషలిస్టు మేధావిమిత్రులున్నారే, వాళ్ళు పాపులారిటీలో మాత్రం అఖండులు. అయితే ఇంతవరకూ ఒక్క ప్రత్యక్ష ఎన్నికలోనూ ఎందుకు పోటీ చేయలేదనో, ఎందుకు గెలవలేదనో ఆక్షేపిస్తారేమో, తప్పుతప్పు'. ఆ రోజుల్లో ఇది వాస్తవమే. అయినా సోషలిస్టునాయక శ్రేణిలో ఆచార్య నరేంద్రదేవ్, జయప్రకాశ్ నారాయణ్, అచ్యుత్‌పట్వర్ధన్, డాక్టర్ రామ్‌మనోహర్‌లోహియా, అశోక్ మెహతా వంటి మేధావులు, అంకితభావంతో పనిచేసే నాయకులెందరో ఉన్నారు. జనందృష్టిలో ఒక్కొక్కరు ఒక్కొక్క శిఖరం అనిపించుకున్నవారే వీళ్ళందరూ. అయితేజాతీయస్థాయిలో ఒక సమైక్య ప్రతిపక్షంగా

పనిచేయగలపార్టీని వీరు నిర్మించలేకపోయారు. అంతర్వి భేదాలవల్ల ఈ గ్రూపు ముక్కలైపోయి సోషలిస్టుపార్టీ, ప్రజాసోషలిస్టుపార్టీ, సంయుక్తసోషలిస్టుపార్టీ, మరికొన్ని చిల్లర పార్టీలుగా చీలిపోయింది. వీరి ప్రభావం త్వరలోనే తగ్గుముఖంపట్టి, తర్వాత ఎప్పుడో ఇందిరాగాంధీ హయాంలో తిరిగి ప్రాముఖ్యంలోకి వచ్చింది.

మరోవైపు సోషలిస్టుమతం పుచ్చుకున్నవాళ్ళున్నారు —కేవలం వ్యక్తిగత కారణాలతో పార్టీని భుజానవేసుకున్న ప్రత్యేకతరహా సోషలిస్టులు. చౌదరి ఈ వర్గానికి ఓ ప్రతినిధి. సోషలిజంపట్ల తనకుందనుకుంటున్న విశ్వాసాన్ని అతడు కేవలం జవహర్లాల్‌కు దగ్గరకావడానికే ఉపయోగించు కున్నాడు కానీ, మరెందుకూ కాదు. కానీ ఆపాటి అనుభవమూ, తెలివితేటలూ ఉన్న మనిషి ఎప్పటికీ తటస్థుడుగానే ఉండిపోవడం కష్టం. అతని పద్ధతిలో అతడూ ఒక ఆలోచించే జంతువే. అతనికీ ఏవో నమ్మకాలున్నాయి. అయితే, రాజకీయప్రయోజనాలకు తగినట్టు వాటిని ఎప్పుడనుకుంటే అప్పుడు మలుచుకోవచ్చు. ప్రయోజనవాదంలో ఉన్న సుగుణం అదే. కొన్ని దశాబ్దాలుగా ఎంతో ఓపికతో పరిశీలనసాగించి, ఎంతో జాగ్రత్తగా కుతంత్రాలూ, కుట్రలూ రచించి చౌదరి ఇందులో అనితరసాధ్యమైన ప్రావీణ్యం గడించాడు.

'ఇక్కడే, ఇప్పుడే' అనే ఊతపదాన్నికూడా అతడు బాగా సాధనచేశాడు. సోషలిజాన్ని ఇక్కడే, ఇప్పుడే స్థాపించాలి, జాతీయకరణ (ప్రతిఒకటీ) ఇక్కడే, ఇప్పుడే చేయాలి. భూసంస్కరణలు ఇక్కడే, ఇప్పుడే అమలుచేయాలి. ఆ నినాదార్భాటం చూసి ఆగ్రహించిన పార్టీవాదులు కొందరు, అవి శుష్కప్రియాలని వాళ్ళకు తెలుసు కనుక, అతణ్ణి 'ఇక్కడే, ఇప్పుడే చౌదరి' అని పిలవడం ప్రారంభించారు. ఆ ముద్దుపేరు అలాగే అతికిపోయింది. అయితే అదంతా ఆటలో భాగం.

అదేపనిగా దంచడంవల్ల అరిగిపోయిన తన ప్రసంగాలకు నెహ్రూమాటల్ని సిగ్గూ సంకోచం లేకుండా రాత్రింబగళ్ళు ఉటంకించడంద్వారా కొంత పైపూత పులుముతూ చౌదరి సోషలిస్టు ప్రచారం సాగిస్తూనేవచ్చాడు. అధికారంనిచ్చెనపై క్రమంగా పైకివెడుతున్నకొద్దీ ఈ ధోరణి తగ్గుముఖంపడుతూ వచ్చింది. సోషలిజాన్ని ఏనాడూ, ఏవిధంగానూ అతడు విశ్వసించిన పాపానపోలేదు. అయితే అతడు సోషలిజాన్ని బహిరంగంగా వ్యతిరేకించలేడు. అది పార్టీసిద్ధాంతంగా మారడం అందుకు ఒక కారణం; సోషలిస్టుచింతనగల పార్టీవాదిగా జవహర్లాల్‌నెహ్రూకు తనపట్ల ఉన్నట్టు చెబుతున్న నమ్మకం మరో కారణం. ప్రధానమంత్రికి 'అత్యంతసన్నిహిత'వర్గాలు అతడికలా చెప్పాయి. ఈ 'వర్గాల'ను గుర్తించడం సాధ్యంకాదు; ప్రతివాడూ తన నమ్మకంమీద లేదా మూఢనమ్మకంమీద ఆధారపడి నిర్ణయించుకోవలసిందే. ప్రధానమంత్రికి అతడిమీదున్న నమ్మకంవల్లనే చౌదరి ఉన్నతస్థానానికి వెళ్ళగలిగాడని కూడా చెప్పుకుంటూఉంటారు. ఆత్మపరిశీలన చేసుకున్న అరుదైన క్షణాలలో, తనగురించి ఆ మహానాయకుడి మదిలో తప్పుడు అభిప్రాయం కలిగించినందుకు చౌదరి పశ్చాత్తాపపడుతూ ఉంటాడు. పండిట్‌జీని మోసగించడం సులభమనే అర్థం కూడా అందులో ఉంది. ఆ లెక్కన ఎంతమంది మాయగాళ్ళు ఢిల్లీలో మారువేషాల్లో సంచరిస్తూ బహుపాత్రాభినయం చేస్తూ ఉంటారో, జవహర్లాల్‌గారి అపాత్రఆదరణకింద ఎలా చలికాగుతుంటారో అనుకుని చౌదరి ఆశ్చర్యపోతూఉంటాడు... ఈ ఆలోచనలను అతడెప్పుడూ

బయటపెట్టలేదు; కానీ పార్టీలో ఎంతోమంది తనలానే వాటిని విశ్వసిస్తున్న విషయం అతనికి తెలుసు. నెహ్రూగారి స్వాభావిక ఔదార్యాన్ని, ఎదుటివారిని తేలిగ్గా విశ్వసించే విశాలదృష్టిని స్వప్రయోజనాలకు వాడుకోడాని కెందరో ప్రయత్నించారు. దానితోపాటే 'నెహ్రూకుటుంబం' మూర్తిమత్వాన్ని మహోజ్జ్వలంగా, ధగద్ధగాయమానంగా చిత్రించే ప్రయత్నాలూ ఓ పద్ధతిప్రకారం లోపాయికారీగా మొదలైపోయాయి. ఆనాడీ ప్రయత్నాలు హద్దుల్లోనే ఉండిపోయాయంటే, పండిట్‌జీ అటువంటివి ఇష్టపడరన్న భయమే అందుకు ప్రధానకారణం.

చౌదరి అధికారనివాసంలో ఆ రోజు ఆనంద్, చౌదరి సమావేశమయ్యారు. కొద్దిపాటి లంచ్ ముగించుకుని ఆనంద్ నూతనబాధ్యతల గురించి చర్చ సాగించారు. ఎక్కువ మాట్లాడింది చౌదరే. ముందుగా చౌదరి సోషలిజాన్ని ఎత్తుకున్నాడు. పట్టణప్రాంతాల్లోని పరిశ్రమలకు, కార్మికసంఘాలకు, జాతీయకరణ మొదలైనవాటికి వర్తించే మేరకు సోషలిజం గురించి ఎలాగైనా ఊదరగొట్టండన్నాడు. భూమి, భూమి సంబంధాల దగ్గరకొచ్చేసరికి సోషలిజం ముళ్ళ కంచెలా పరిణమిస్తుంది అక్కడది ఎంతమాత్రం పనిచేయదని తేల్చేశాడు చౌదరి. గ్రామప్రాంతాల్లో వ్యవసాయకార్మికుల వేతనాలను చాలావరకు వస్తురూపంలోనే చెల్లిస్తూఉంటారు. ఏటా భూస్వామికీ, కార్మికులకూ మధ్య కొంత బేరసారాలు జరుగుతూఉంటాయి. పంట విరగపండినప్పుడు ప్రతిఒకరికీ అదనపులాభం ఉంటుంది; అది భూమాత చలవ. దుర్భిక్షమో, వరదలో, తెగులో సంభవించినప్పుడు ప్రతిఒకరికీ తక్కువే ముడుతుంది. అయినా, మనుషులు, పశువులు కూడా వలసపోవలసిన తీవ్రకరువు కాటకాలలో తప్పించి, పంట దెబ్బతిన్న సంవత్సరాలలో జనానికి దక్కేది ఆకలిబాధను తప్పించుకోడానికి సరిపోతుంది. గ్రామస్థుల సముష్టిచైతన్యం ఆ మేరకు హామీఇస్తుంది. ఒక్కొక్క చేతిపనివాడు అనేకమంది రైతులకు తోడ్పడతాడు, కొరత రోజుల్లో అతనికి ప్రతిఫలం ఒక్కొక్కరినుంచి మామూలుకంటె తక్కువే లభిస్తుంది. దిగుబడి ఎంత తగ్గినా ప్రతి రైతు ఎలాగో కుటుంబపోషణ జరుపు కుంటూనే ఉంటాడు. ఇల్లో, పశువులపాకో కట్టుకోవడం, కొత్త బావి తవ్వించడం, భూమిని బాగుచేసుకోవడం, ఇంకా అనివార్యమైతే కూతురు పెళ్ళితోసహా, ఆ ఏడు తలపెట్టిన అదనపు కార్యక్రమాలన్నింటినీ రాబోయే మంచిరోజులకు వాయిదావేసేస్తాడు. పరిస్థితులతో అలా రాజీపడతాడు. అంటే మంచి కానీ, అంతగా మంచి కానిది కానీ ఎంతో కొంత ఉమ్మడిగా ప్రభావం చూపిస్తుందన్న మాట. గ్రామీణసమాజం ఇలా కొన్ని శతాబ్దాలుగా బతికిబట్టగడుతోంది. సారాంశంలో ఇది సోషలిజం కాదా?

ఇటీవలికాలంలో భూస్వామ్యసంబంధాలు వ్యావసాయికస్థితిగతుల్ని చాలావరకూ వక్రీకరించాయనే అనుకుందాం పెద్దరైతులు అనుసరించే దోపిడీవిధానాలవల్ల ఈ ప్రక్రియ మరింత చేటుగా పరిణమించిందనే అనుకుందాం. భూస్వామి పరమనియంతగా, భూ దురాక్రమణదారుగా పరిణమించాడనే అనుకుందాం. పెట్టుబడిదారీ ధోరణులు గ్రామసమాజాన్ని ధనికులు, పేదలుగా చీల్చి వారిమధ్య ఉద్రిక్తతను పెంచాయనే అనుకుందాం. అన్యాయాలు, అసమానతలు కొన్ని దశాబ్దాలుగా వ్యవస్థను కేన్సర్‌లా కబళిస్తున్నాయనే అనుకుందాం... ఇవన్నీ జరుగుతున్నాయనే అనుకున్నా, ఇప్పుడు దీనికి పరిష్కారమేమిటి? చౌదరి ప్రశ్నించాడు. మనవి

కాకున్నా కృత్రిమంగా అంటుకట్టిన వాటిని రుద్దడమే దీనికి పరిష్కారమా? తలపెట్టిన భూసంస్కరణల ప్రతిపాదనలు అటువంటివే కావా? ఇది వినాశానికి దారితీయదా? మన పార్టీలో ఉన్న బుద్ధి సర్వస్వం ఇదేనా?

ఇటీవలి చరిత్రనే తీసుకో... చౌదరి వివరించుకుంటూ వెళ్ళాడు. ఉదాహరణకు మనిషి సృష్టించిన 1943 బెంగాల్‌కరువులో లక్షలమంది తిండిలేకుండా చనిపోయారు. ఖరీదైన హోటళ్ళలో విందుభోజనాలు చేయగా మిగిలిన ఎంగిలి మెతుకులకోసం, రొట్టెముక్కలకోసం కలకత్తావీధుల్లో మనుషులు, కుక్కలు కలబడ్డారు. అలాంటి పరిస్థితిలో ఈ దేశాన్ని విడిచిపోవడానికి బ్రిటిష్‌వాళ్ళు ఒప్పుకోడంలో ఆశ్చర్యంలేదు. గొంతువరకూ శత్రుత్వం పెంచుకున్న జనాన్ని, దాదాపు దివాలాతీసిన ఆర్థికపరిస్థితిని గమనించి యుద్ధానంతర పునర్నిర్మాణం అసాధ్యమని వాళ్ళు నిశ్చయించుకుని ఉంటారు. అయితే స్వాతంత్ర్యానంతరం దేశం అదృష్టం రానురాను మారుతూవచ్చింది — క్రమంగానే అయినా స్పష్టంగా కనిపించిన మార్పది. ఆ ఘనత రైతులకే చెందుతుంది. అయినా రాజకీయవాదులు ఆ ఘనత తమదిగా ప్రతి ఎన్నికలోనూ చిత్రించుకుంటూ ఉంటారు. అనావృష్టి ఏర్పడితే, అది దైవఘటన. పంట పుష్కలంగా పండిందా, అందుకు పార్టీవిధానాలూ, ఆ విధానాలను అమలుచేసిన ప్రభుత్వాలే కారణం...! వాస్తవం చూస్తే ఎవరూ గుర్తించని, ఎవరూ గౌరవించని అన్నదాతా, ప్రాణదాతా ఆ రైతే. ఏ కొంచెం నిజాయితీ ఉన్నా ఆ విషయం ఒప్పుకుని తీరవలసిందే. ఈ దేశంలో రైతులు రకరకాల పరిమాణాల్లో ఉంటారు —పెద్ద, మధ్యతరహా, చిన్నతరహా, సన్నకారు రైతులు... దేశంలోని రైతులు తమనుతాము బాగుచేసుంటూనే దేశాన్నీ బాగుచేస్తున్నారు. గత పదేళ్ళలో గ్రామాల్లోని వేలాది బావుల్లో పంపుసెట్లు ప్రత్యక్షమయ్యాయి. బ్రహ్మాండమైన రిజర్వాయర్లనుంచి బంజరు భూములమీదుగా ఇప్పుడు కాలవలు ప్రవహిస్తున్నాయి. కాని అస్థిపంజరాల్లా బతుకుతున్న మనుషుల కన్నీళ్ళు తప్ప కొన్ని దశాబ్దాలుగా మరో నీటిచుక్క కనిపించని ప్రాంతాలివి. ఇప్పటికీ మనం భిక్షాపాత్రతో ప్రపంచమంతా తిరుగుతూనే ఉన్నాం. ఇప్పటికీ పి.ఎల్ 480 అవమానభారంకింద సిగ్గుతో చితికిపోతూనే ఉన్నాం. అయినా కొద్ది సంవత్సరాల్లో మనం ఆహారధాన్యాల్లో స్వయం సమృద్ధిని సాధించగలమన్న ఆశాభావంతో ఉన్నాం. ఆ విధంగా దేశం ఒక గొప్పమలుపు తిరగబోయే అవకాశం కనుచూపుమేరలో కనిపిస్తున్న స్థితిలో చక్కగా పాతుకున్న భూసంబంధాలకు భంగంకలిగించడం, గ్రామీణజీవనాన్ని వేళ్ళతో పెళ్ళగించడం తెలివి అనిపించుకుంటుందా? ఇప్పుడది జరిగితే తర్వాతి పరిస్థితిని చక్కదిద్దేదెవరు? స్వావలంబన సాధించబోతున్నామన్న మన హామీలకు ఏ గతి పడుతుంది? మన జాతీయ ఆత్మగౌరవం ఏమౌతుంది?

చివరగా దీనికి రాజకీయదృక్కోణంకూడా ఉంది... చౌదరి కొనసాగించాడు. ప్రతిఎన్నికలోనూ మన పార్టీ వెనుక పెట్టనికోటలా నిలబడుతున్నది రైతే. కనీసం ఈ రాష్ట్రంలోనూ, కొన్ని చుట్టుపక్కల రాష్ట్రాల్లోనూ అదే జరుగుతోంది. భూమిలేని పేదలు చాలావరకూ పార్టీని వ్యతిరేకిస్తున్నారు. వోట్ల గణాంకాలు చూస్తే ఇది స్పష్టంగా అర్థమౌతుంది. పట్టణప్రాంతాలు విధిగా పార్టీకి వ్యతిరేకంగానే ఉంటూ ఉంటాయి. వాళ్ళు ప్రభుత్వవ్యతిరేకులు, ప్రభుత్వం ఎవరిదైనాసరే. ఓ వైపున

ప్రభుత్వంనుంచి అన్ని రాయితీలు గుంజుకునేది వాళ్ళే, క్రమంతప్పకుండా ప్రభుత్వాన్ని దుమ్మెత్తి పోసేదీ వాళ్ళే. గ్రామీణప్రాంతాలు నిస్సహాయస్థితిలో మూలుగుతూనో, పార్టీవిధానాల దుష్పరిణామాల్ని మౌనంగా భరిస్తూనో ఉంటాయి. పట్టణ సంపన్నవర్గాలను చేత్తో తాకే సాహసం కూడా పార్టీకి ఉండదు, ఎందుకంటే వాళ్ళు ఎడాపెడా విరాళాలు ఇవ్వగలరు కనుక. దళారీలనూ, వర్తకులనూ, పరిశ్రమలయజమానులనూ, కార్మికసంఘాలనాయకులనూ, మేధావులనూ, జర్నలిస్టులనూ పార్టీ ఏ విధంగానూ దండించలేదు. దాదాపు వారందరూ పార్టీని ద్వేషించే వాళ్ళే. కొన్ని పత్రికలు రోజులో ఇరవైనాలుగుగంటలూ జవహర్లాల్‌ను వ్యక్తిగతంగా ఇంద్రుడూ చంద్రుడని పొగుడుతూనే, పార్టీలో మిగిలిన ప్రతిఒకరినీ కించపరుస్తూఉంటాయి —బహుశా రోజుకి ఇరవైఅయిదు గంటలు! జవహర్లాల్‌నెహ్రూ అనే దేవత లక్షలమంది దెయ్యాలున్న పార్టీకి నాయకత్వంవహిస్తున్నాడన్నది వాటి అభిప్రాయంలా కనిపిస్తూఉంటుంది. ఆశ్చర్యంగా, అటు వంటి రాతలు రాసికూడా వాళ్ళు బతికిపోతూఉంటారు. రాజకీయదృశ్యం ఇలా ఉన్నప్పుడు, మనల్ని ప్రతిసారీ ఆదుకుంటున్న ఒకవర్గాన్ని పార్టీ దూరంచేసుకునితీరవలసిందేనా? మిగిలినపార్టీలు భూసంస్కరణలు కావాలని గొంతు చించుకుంటున్నారంటే, అది వాళ్ళకు బాగా అతికినట్టు సరిపోతుంది కనుక. భూములు కోల్పోయే వాళ్ళు ఎలాగూ వాళ్ళకు శత్రువులే కనుక. మన మిత్రుల, మన ఏకైకమిత్రుల నాశనాన్ని కోరి మనంకూడా వాళ్ళతో ఈ అమానుషనినాదాల పోటీకి దిగవల సిందేనా? ఇదెటువంటి రాజకీయవివేచన అవుతుంది?

ప్రగతివాదులమనిపించుకోడానికి ఇటువంటి ఆత్మహత్యాప్రయత్నం చేశామనే అనుకుందాం ఇంకో ఏడాది దూరంలో ఉన్న ఎన్నికల్లో మనం ఓడిపోతే ఈ పనికిమాలిన సోషలిజాన్ని ఏ పార్టీ అమలుచేస్తుంది? ఈ దేశంలో రాజకీయసుస్థిరత ఏమైపోతుంది? ముఖ్యంగా జాతీయస్థాయిలో ఒకసారి అస్థిరత్వం అడుగుపెట్టిందంటే దేశం ఏమై పోతుంది?... జవహర్లాల్‌నెహ్రూతోసహా ఎవరికీ స్పష్టత లేని ఈ సందేహాస్పదసిద్ధాంతం తోకపుచ్చుకుని మనం ఏ గంగలోకి అడుగేస్తాం? అసలిందులో ఏమైనా అర్థం కనిపిస్తోందా?

చౌదరివాదం ఎంతో విపులంగా ఎవరూ కాదనలేనంత తర్కబద్ధంగా, ప్రతివాదులకు ఏ కొంచెం సందు ఇవ్వనంత పటిష్ఠంగా ఉంది. ఒక ముఖ్యమంత్రిగా, జవహర్లాల్‌నెహ్రూ అతనినుంచి దేనిని ఆశించాడో అదే చేశాడు. వ్యక్తిగతంగా అతని మొగ్గుమాత్రం స్పష్టంగా అవతలివైపు ఉంది. ఎట్టకేలకు వోట్లు ఆకర్షించగలిగినవాడు జవహర్లాలేనని అతడూ ఒప్పుకుంటున్నాడు. చౌదరిగా అతడికటువంటి నమ్మకాలేవీ లేవు. అతనికి కావలసిందల్లా తన పదవిని కాపాడుకోవడం. తన దృక్కోణాన్ని అనుస రించి విజయాన్ని మించిన విజయం వేరొకటి ఉండదని అతనికి తెలుసు. అదే బాణీలో చెప్పుకోవాలంటే వైఫల్యాన్నిమించిన వైఫల్యమూ ఉండదు.

అంతసేపు ఆ వాదాన్ని ఏకాగ్రతతో వింటూ ఆనంద్ నిశ్చలంగా కూర్చున్నాడు. తర్వాత సమాధిలోంచి బయటపడినట్టు అన్నాడు 'థాంక్స్ ముఖ్యమంత్రిగారూ. కాని నేనేం చేయాలో మీరింకా చెప్పనేలేదు! అది తేల్చడానికే మనమిలా సమావేశమయ్యామనుకుంటాను.'

'తెలుసు, తెలుసు' చౌదరి అన్నాడు. 'బాగా ఆలోచించి ఏదో మార్గం కనిపెడతావను కుంటున్నాను. దీనికి తక్షణ పరిష్కారం కానీ, పూర్తి పరిష్కారం కానీ ఉండదు. ఏదోవిధంగా ఈదుకురావలసిందేనేమో.'

'మీరు కోరుకుంటున్నదదేనా? నా ఉద్దేశం, నే నెలాగో ఈదుకురావాలనేనా?' ఆనంద్ సూటిగా ప్రశ్నించాడు.

'ఓవైపు ఎన్నికలు వచ్చి మీద పడబోతున్న స్థితిలో ఇంతకుమించి ఏంచేయగలం...?' చౌదరి గొణిగాడు.

'ఎన్నికల విషయానికి తర్వాత వద్దాం. పార్టీలోనే ఇంతగా తీవ్రవిభేదాలున్నప్పుడు ఏ దిశగా మనం అడుగేయాలన్నది ఇక్కడ అసలు ప్రశ్న.'

'ఆ పరిస్థితెప్పుడూ ఉండేదే' చౌదరి అన్నాడు. 'సమాజంలో ఉన్నన్ని చీలికలు మనపార్టీ లోనూ ఉన్నాయి. అందుకే మనపార్టీ ప్రతివర్గానికీ ఎంతోకొంత మేలుచేసేదిగా ఉంటుంది. ప్రతి గ్రూపుకీ అది కొంత వరకు ఆశాకిరణం.'

'అలాగే ప్రతి సంఘవిద్రోహులముఠా స్వైరవిహారం సాగించడానికి పనికొచ్చే చక్కని వేదిక కూడా' ఆనంద్ నవ్వుతూ అన్నాడు. కలవరాన్ని దాచుకోడానికా అన్నట్టు చౌదరికూడా నవ్వేశాడు. 'నీ పార్టీమీద నీకే నమ్మకంలేనట్టు మాట్లాడుతున్నావు!' అన్నాడు తత్తరపడుతూ.

'మీ కుందా?' ఆనంద్ ఎదురు ప్రశ్న వేశాడు.

'సరే. నీ భావం నాకర్థమైంది' చౌదరి ఎద్దేవాగా అన్నాడు. 'మనకి ఉందంటే ఉందనీ, లేదంటే లేదనీ! నువ్వు చెప్పదల్చుకున్నదదీ. ఆ లెక్కన చూసినా రకరకాల నమ్మకాలతో, రకరకాల ప్రేరణలతో పనిచేసే రకరకాల గోత్రాలవాళ్ళ పార్టీ మనది... అదలాఉంచు, పరిశోధించి తేల్చిన ఈ గొప్పనిజంవల్ల ఇప్పుడు మనకు ప్రయోజనమేమిటి?'

'ఇది కేవలం పరిశోధించి తేల్చిందే అనుకుంటే, దానికి మరో దృక్కోణం ఉంది.'

'మరో దృక్కోణమా? ఏమిటది?'

'నిజంగానే మనది కార్యకర్తల బలంతో నిర్మించబడిన పార్టీ కానీ, తలుపులు మూసుకున్న పార్టీ కానీ కాదు. అది చాలావరకు ఓ ప్లాట్ ఫారం, ఓ వేదిక, ఒక వ్యవస్థ. దాని చట్రం ఎటు వంటిదైనా, అసలు చట్రమేదీ లేకపోయినా అదెప్పుడూ లక్ష్యరహితంగా, చుక్కాని లేకుండాలేదు. ఎటు వెడుతున్నామన్న స్పృహ పార్టీకి ఎప్పుడూ ఉంటూనే ఉంది. తన చరిత్రలోని ప్రతిఘట్టం లోనూ తన సంకల్పమేమిటో తనకు తెలుసు. ఆయా కాలాల్లో భిన్నభిన్న నాయకులు భిన్నభిన్న లక్ష్యాలు నిర్దేశిస్తూనే వచ్చారు. అయినా ప్రతిసందర్భంలోనూ వాళ్ళ మాటలు ప్రజల ఆలోచనా సరళితో అనుకూలిస్తూనేవచ్చాయి. వాళ్ళ సామూహికచేతనలో మిళితమైపోయాయి. ఇప్పుడు వేసుకోవలసిన ప్రశ్న, నేటి మన లక్ష్యమేమిటన్నదే. ఇక్కడినుంచి మనం ఎటువెడతాం? స్వాతంత్ర్యం

తెచ్చుకున్న తర్వాత కొంతకాలం మనం గమ్యం కోసం తడుముకుంటున్నట్టు కని పించాం. పార్టీని రద్దుచేసి మరింత విస్పష్టలక్ష్యాలు కలిగిన మరోపార్టీని స్థాపించాలని మహాత్మాగాంధీ కోరిన క్షణమది. పార్టీ ఆ సలహాను ఆమోదించలేదు, ఎందుకంటే దేశాన్ని సమైక్యంచేయవలసిన కార్యభారం ఇంకా మిగిలిఉందని భావించింది కనుక. జవహర్లాల్‌నెహ్రూ ఇప్పుడా ప్రక్రియను ముందుకు నడిపిస్తున్నారు. రాజకీయసమైక్యతాలక్ష్యాన్ని సర్దార్‌పటేల్ నెరవేర్చారు. అయినా భావనాత్మకంగా, ఆర్థికంగా దేశం ఇంకా సమైక్యంకాలేదు. వాటివైపు మనం ఇప్పుడిప్పుడే దృష్టిసారిస్తున్నాం. ఎన్నెన్ని రకాల వ్యత్యాసాలున్నప్పటికీ ఈ దేశంలో ఎప్పటికీ కొనసాగుతూ వస్తున్నది సాంస్కృతికసమైక్యత. బ్రిటిష్‌వాళ్ళు దానిని ధ్వంసంచేయడానికి చూసినా అదృష్టవశాత్తు ఈ నేలమీద జన్మించిన మహనీయులు స్వామి వివేకానంద, శ్రీ అరవింద, గాంధీజీ వంటివారు దానిని సంరక్షించారు. చారిత్రక, వలసవాద అఘాతాలను కూడా తట్టుకుని మిగిలిఉన్న ఈ మిశ్రమపునాదులమీద ఇప్పుడు మనం నిర్మాణంచేయవలసిఉంటుంది...'

చౌదరిలో ఓరిమి నశించింది. రాజకీయప్రచారంలో రివాజుగా చోటుచేసుకునే జాతీయ సమైక్యత గురించి తనే లెక్కలేనన్ని ఉపన్యాసాలిచ్చాడు. ఆనంద్‌వైపు ఆగమన్నట్టు చూసి అన్నాడు, 'మై డియర్ పండిట్, అసలు విషయానికి వస్తావా? నువ్వు ఊదరగొడుతున్న సమైక్యతకీ భూసంస్కరణలకీ ఏమిటి సంబంధం?'

'సారీ, ముఖ్యమంత్రిగారూ' ఆనంద్ చటుక్కున అన్నాడు 'ప్రవచించడం, జవహర్లాల్‌గారి అభిమానపాత్రులలో ఒకరైన మీకే సలహా ఇవ్వడం నా ఉద్దేశం కాదు! అది పూర్తిగా అనవసరమని కూడా నాకు తెలుసు...'

'నీ ఉద్దేశం, అసందర్భమని!' చౌదరి అన్నాడు హాయిగా నవ్వేస్తూ.

'అనవసరం' అనే మాటను నేను ప్రత్యేకించి వాడాను' ఆనంద్ వివరణ ఇచ్చాడు. 'బ్రిటిష్ వాళ్ళు మన సాంస్కృతికసమగ్రతను విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నించారని నే నన్నప్పుడు, నా ఉద్దేశంలో సంస్కృతి అంటే భూసంబంధాలతోసహా మొత్తం గ్రామీణజీవితమనే. బ్రిటిష్ వాళ్ళు శతాబ్దికిపైగా వాటిని చెడగొట్టి విడిచిపెట్టారు. ఈ రోజున భూసంస్కరణల అవసరం అందుకే తలెత్తింది. సంస్కరణలంటే మన ఉద్దేశంలో ప్రధానంగా దోపిడీకి అవకాశంలేని మన సాంప్రదాయిక విధానంలోకి తిరిగి మళ్ళడమే. అయితే మారిన పరిస్థితులనుబట్టి అందులో కొన్ని మార్పులు చేసుకోవలసి ఉంటుంది. ఉదాహరణకు వెనకటికంటె విస్తృతసంఖ్యలో ఉండి నానాటికీ పెరిగిపోతున్న జనాభా అవసరాలనుకూడా మనం దృష్టిలో పెట్టుకోవాలి. భూమిమీద ఇప్పుడు ఒత్తిడి పెరిగింది; ఈ భారం తగ్గడానికి అనువుగా కిందటి శతాబ్దంలో గ్రామీణపరిశ్రమలేవీ వికసించలేదు: బ్రిటిష్‌వాళ్ళు వాటిని ధ్వంసంచేశారు... వాళ్ళు పెంచి పోషించిన భూస్వామ్యవ్యవస్థ దోపిడీకీ, సాంఘికశైథిల్యానికీ దారితీసింది నిరుద్యోగం, చాలీ చాలని ఆదాయం గ్రామీణభారతాన్ని కుళ్ళబొడుస్తున్నాయి. లక్షలమంది యువకులు గ్రామాలనుంచి నగరాలకు వలసపోయి శాశ్వతంగా తమ ఆత్మనీ గుర్తింపునీ కోల్పోతున్నారు. ఈ చిరపరిచితమైన దృశ్యం, భూసంస్కరణలకు

దీనితో ఉన్న స్పష్టమైన సంబంధం మీ కెలాంటి అభిప్రాయమూ కలిగించడంలేదా? లేక నేను కేవలం వాదంకోసమే వాదిస్తున్నానను కుంటున్నారా?'

ఈ ప్రశ్న చౌదరికి గుచ్చుకుంది. పూర్తిగా స్వార్థపూరితవైఖరితో రాజకీయరంగప్రవేశంచేసిన తననూ, తనలాంటివారినీ తలచుకుని క్షణకాలంపాటు విచారగ్రస్తుడయ్యాడు. గాంధేయ సామ్య వాదానికి ప్రాతిపదికలుగా అమరిన సర్వసమానత్వం, సమష్టిన్యాయాలపట్ల తమలో మొదటికే నిబద్ధత లోపించింది. జీవితాంతం క్షణభంగురమైన వైభవాన్ని వేటాడుతూ, రాజకీయాధికారమనే క్షుద్రదేవతను ఆరాధిస్తూ గడిపారు. రాముడు, చాణక్యుడు, అశోకుడు, అక్బర్ వంటి మహాత్ములు రూపకల్పనచేసిన, ఈ దేశానికి చెందిన రాజనీతి నమూనాలను తిరస్కరించారు. పూర్తిగా నవీనమైన వృత్తిరాజకీయవ్యవస్థను, కేవలం పశ్చిమదేశాల నమూనాపై ఆధారపడి దేశంలోకి తెచ్చిపెట్టు కున్నాం. ఆ నమూనాలో భాగంగా కొన్ని శతాబ్దాలపాటు నిర్మించుకున్న శిక్షణావ్యవస్థనూ, మానసికసంసిద్ధతనూ, విధాన క్రమతనూ తెచ్చుకోలేకపోయాం. మనం తెచ్చిపెట్టుకున్న ఈ కొత్త భారతీయనమూనా తలబరువుగా, ఎదుగూబొదుగూ లేనిదిగా, వికృతి ఉట్టిపడేదిగా పరిణమించింది. అది చేపా కాదు, పక్షీ కాదు. చౌదరి వెనక్కితగ్గుతూ అన్నాడు 'నువ్వు చెప్పింది నిజమే ఆనంద్, కానీ... నువ్వు చెప్పవలసింది పూర్తికానీ. మనకు అట్టే వ్యవధికూడా లేదు. నిర్ణయాల్ని ఇంకెంతమాత్రం వాయిదా వేయలేం!'

'ఇంక చెప్పవలసిందేమీ లేదనుకుంటాను' ఆనంద్ అన్నాడు. ఇంతకుముందు అలా ప్రశ్నించి చౌదరిని చిన్నబుచ్చాననుకుని అందుకు కొంత పరిహారంగానా అన్నట్టుగా తేల్చేస్తూ. అలా అని ఉండకూడదని కూడా మనసులో అనుకున్నాడు. 'నేను వివరించడానికి ప్రయత్నించిన చిరపరిచితమైన పరిస్థితి. నా ఉద్దేశంలో ఎటువంటి సంస్కరణ అయినా విజయవంతం కావాలంటే అది భూ సంబంధాలతోనే ప్రారంభంకావాలి. ఈ రోజుకీ మన ఆర్థికవ్యవస్థను చాలావరకూ శాసిస్తున్నది భూమే. మిగిలినవన్నీ దానిమీదే ఆధారపడిఉంటున్నాయి. అయినా నేను పిడివాదిని కాదల్చుకోలేదు; హేతుబద్ధతకు తలవంచి పొరపాట్లు సవరించుకోడానికి నేను సిద్ధమే. చెప్పండి చౌదరిగారూ, ప్రారంభించే అంశం మరేదైనా మీ దృష్టిలో ఉందా?'

చౌదరి కొన్నిక్షణాలు మౌనం వహించాడు, బహుశా సమాధానం అన్వేషిస్తున్నాడా అన్నట్టుగా. ఆ తర్వాత ఏదీ తేల్చుకోనివాడిలా 'కానీ, నీ మాటలు కానీ' అన్నాడు.

'అలాగే' అంటూ ఆనంద్ కొనసాగించాడు. 'ఈ క్షణాన భూసంస్కరణలంటే తీవ్రమైన స్పందనలు రెండువైపులా కానవస్తున్నాయి. ఆచరణలో మనం చేయవలసింది మొత్తం వ్యావసాయక సంబంధాలను పునర్వ్యవస్థీకరించడమే —అంతకంటె తక్కువ కాదు. సంపూర్ణత లేనప్పుడు సంస్కరణవల్ల ప్రయోజనం ఉండదు; అరకొర సంస్కరణ విధ్వంసానికే దారితీస్తుంది. ఇప్పటికే ఎంతోకొంత జమీందారీ వ్యవస్థను రద్దుచేయగలిగాం. ఒక వ్యవస్థను తొలగించినప్పుడు ఆ స్థానంలో దేనిని తెచ్చిపెడతారు? మరో స్వయంసమగ్ర వ్యవస్థనే; లేకపోతే ప్రతిదీ అస్తవ్యస్తమై పోయి అయోమయంవైపే నడిపిస్తుంది. ప్రభుత్వభూమిని భూమిలేనివాళ్ళకి పంచిపెట్టాలనే

సదుద్దేశంతోనే మనం ప్రచారం ప్రారంభించి వేల సంఖ్యలో సన్నకారురైతుల్ని సృష్టించాం. వాళ్ళు నిష్ఠదరిద్రంతో కూలీలుగా జీవిస్తున్న వాళ్ళు. భూయజమానుల బాధ్యతను వారంతట వారే నెత్తినవేసుకోగల స్థితిలో వాళ్ళు లేరు. వీళ్ళు తమ కొత్తవృత్తిని లాభసాటిగా మలచు కోడానికి వీలు కలిగించే అనుబంధ కార్యక్రమం ఏదీ మనం ప్రారంభించలేదు. చివరకు పట్టాలు ఇవ్వడంలోకూడా ఎంతో జాప్యం జరుగుతూవచ్చింది. ఫలితంగా వీళ్ళు సకాలంలో బ్యాంక్ రుణాలు కూడా సంపాదించుకోలేకపోయారు. పద్మవ్యూహంలాంటి విధానాన్ని ఛేదించుకుంటూ వెళ్ళి ఆర్థికసహాయాన్ని తెచ్చుకోవడం వీళ్ళ కెలాగూ తెలియదు. ఈ లోపల కిందిస్థాయిలోని రెవిన్యూఅధికారుల కళ్ళకు భూమిపంపిణీ కార్యక్రమం ఓ బంగారుగనిలా కనిపించింది. గ్రామాధికారులతో లాలూచీ పడిపోయి స్వైరవిహారం ప్రారంభించారు... అంతులేకుండా ఎదురౌతున్న ఈ ప్రతిబంధకాలు ఆ కొత్త రైతుల్ని మొత్తంమీద దుస్సహమైన నిస్పృహలోకి నెట్టివేశాయి. చేసేదిలేక, పేదవాళ్ళు తమకు ప్రభుత్వం ఇచ్చిన భూమిని చాలావరకూ నమ్మ శక్యంకానంత చౌకబేరానికి పెద్దభూస్వాములకో, మధ్యతరహా రైతులకో తెగనమ్ముకున్నారు. ఇటువంటి బదలాయింపుల్ని నిషేధిస్తూ మనం కాగితాలమీద ఎన్ని నిబంధనలైనా రాసుకుని ఉండవచ్చు, కానీ అంతిమంగా భూముల్ని బదలాయించుకున్న వ్యక్తుల చేతుల్లోనుంచి వాటిని ఎవరూ విడిపించలేరు, విడిపించగల సాహసం ఎవరికీ లేదు. మనం మళ్ళీ ఇటువంటి పొరపాట్లు చేయ కూడదు. కనుక నేను చెప్పినట్టు స్వయంపోషకమైన, సడలింపుకు వీలున్న వ్యవస్థను తెచ్చుకోవడమే మార్గం. ఒక్కమాటలో చెప్పాలంటే, రెండు శతాబ్దాల క్రితం రూపొంది రానురాను మరింత సంక్లిష్టంగా పరిణమించిన ఇప్పటి విధానానికి స్వల్పవ్యవధిలో తగిన ప్రత్యామ్నాయాన్ని కనిపెట్టి సృష్టించాలి. చరిత్ర మన తరానికి అందించిన కర్తవ్యం ఇది...'

ఆనంద్ మెల్లగా, హెచ్చుతగ్గులు లేని స్వరంతో మాట్లాడుతున్నాడు. అతడి కళ్ళు అర్ధ నిమీలితమయ్యాయి. ఆ యువదార్శనికుని చూసి చౌదరి లిప్తకాలంపాటు అసూయచెందాడు. బహుశా ఈ కలలు కనేవాడి జీవితం నిరర్థకంగానే పరిణమిస్తుందేమోననుకున్నాడు; అంతలోనే, తన జీవితంతోసహా, అసలెవరి జీవితమైనా సాధించగలిగిందేముంటుందన్న ఆలోచన మొదటిసారి అతని బుర్రలో మెదిలి తృటికాలంపాటు అశాంతిని రగిలించింది.

ఆనంద్ కొనసాగించాడు. 'చౌదరిగారూ! మీరిప్పుడే అన్నారు, భూమిలేని పేదలు మన పార్టీకి వ్యతిరేకంగా ఉన్నారని. అలా ఎందుకు జరిగింది? జమీందారీ విధానంరద్దు పార్టీకి కలికితురాయి వంటి విజయం కాదా? పార్టీకి అంత ఘనచరిత్ర ఉన్నప్పుడు, తనను పట్టించుకోవడంలేదన్న భావం కలిగి ఉండకపోతే భూమిలేని కార్మికుడు మనకెందుకు వ్యతిరేకమయ్యాడు? భూస్వాముల్ని మనం చేరదీస్తున్నామన్న నమ్మకం అతనికి కలిగిఉండకపోతే మనకెందుకు దూరమౌతాడు? పార్టీ కార్యకర్తగా నేను గ్రామప్రాంతాల్లో వందలమంది భూమిలేని పేదలతో మాట్లాడాను. స్వగ్రామంలో నా బాల్యస్నేహితులు కొందరితో వ్యక్తిగతంగా పరిచయం పెంచుకున్నాను. వాళ్ళిప్పుడు తెగిన గాలిపటాలు, నిరాధారులు. బొంబాయి, షోలాపూర్‌లలో నేతపనివాళ్ళుగా, క్షురకులుగా జీవిస్తున్నారు. సొంతవృత్తిలోనే కొందరు ధనికులవద్ద జీతగాళ్ళుగా పనిచేస్తున్నారు. ఎంతోమంది పట్టణాలలో

రిక్షా తొక్కి బతుకుతున్నారు. సంపాదించినదంతా సారాకొట్టులో తగలేస్తూ ఉంటారు; కొందరెలాగో గ్రామంలో ఉన్న కుటుంబాలకు కొంత డబ్బు పంపిస్తూఉంటారు... వాళ్ళ జీవితాలకిప్పుడు ఓ అర్థమంటూ ఉందా? ధోరణిలో, ప్రవర్తనలో వాళ్ళమధ్య వ్యక్తిగతమైన తేడాలు ఎటువంటివైనా కానివ్వండి, నా అవగాహనకు అందినంతవరకూ ఇప్పటికీ వాళ్ళు స్వస్థలాలకు తిరిగివెళ్ళి, సాధ్యమైతే కాస్తంత సొంతభూమి సాగుచేసుకుంటూ జీవితం గడపాలని కలలు కంటుంటారు... 'సాధ్యమైతే' అన్నమాటలోనే ఉంది అసలు కీలకమంతా'

'అందుకని భూమిని తిరిగి పంపిణీ చేయాలని నీ ఉద్దేశమా?' చౌదరి ప్రశ్నించాడు.

'నేను నిర్దిష్టంగా భూమికే పరిమితంకావడంలేదు. నేను చెప్పదలచుకున్నదల్లా, ఒకప్పుడు బహుముఖప్రతిభతో అలరారిన గ్రామాలు ఇప్పుడు వట్టిపోతున్నాయనే. ఒకప్పుడు వ్యావసాయిక సమాజం ప్రధానంగా భూమిని ఆశ్రయించుకుని రకరకాల వృత్తులకు కేంద్రంగా ఉండేది. భూస్వామ్యవ్యవస్థ దానిని చెదరగొట్టగానే, దానిచుట్టూ అల్లుకున్నవన్నీ చెల్లాచెదరైపోయాయి. ఈ స్థితిలో రకరకాల ప్రయోజనాలు పరస్పర వ్యతిరేకంగా పనిచేయడం ప్రారంభించాయి. గ్రామీణ పరిశ్రమలు ధ్వంసమైపోయాయి. కనుక భూదాహం అపరిమితంగా పెరిగిపోయింది... అందుకని మనం భూసంస్కరణలతో ప్రారంభించి ఉంటే, మన రాష్ట్రంలోనూ, ఇటువంటి మరికొన్ని రాష్ట్రాల్లోనూ, మనం భూమిలేని పేదల మద్దతు కోల్పోయి ఉండేవారంకామని నాకనిపిస్తోంది. ఇప్పటికీ సమయం మించిపోలేదు. ఈలోపల, మీరు ప్రస్తావించిన రైతుల మద్దతుమీద మనం ఓ కన్నువేసి ఉంచవలసిందే. జమీందారీ విధానాన్ని రద్దుచేసిన రోజుల్లో రైతుల మద్దతు మనకున్నంతగా ఇప్పుడూ ఉందని మీరు నిశ్చయంగా చెప్పగలరా? మనమందరం వ్యవసాయదారులమే; కానీ ఇప్పటికీ వాళ్ళ మద్దతు మనకు తగినంత లభిస్తున్నా, వెనుకటి ప్రమాణంలోనే అది లభిస్తోందన్న నమ్మకం నాకు కలగడం లేదు... మీరేమంటారు?'

'ఒప్పుకుంటున్నాను; అయితే మద్దతు ఎందుకు తగ్గిపోతోందంటావ్?' చౌదరి తిప్పికొడుతున్నట్టు అన్నాడు. 'మనం అదేపనిగా భూసంస్కరణల గురించి, భూమిని తిరిగి పంపకంచేయడం గురించి వాగుతూఉండటంవల్ల కాదా? రైతుల్ని భయపెట్టడమే వాళ్ళ మద్దతు కోల్పోవడానికీ దారితీయదా?'

'మీరన్న మాటలో కొంత వాస్తవం ఉంది, నేనూ ఒప్పుకుంటున్నాను' ఆనంద్ అన్నాడు. 'అయితే రైతు అంటే ఎవరో దయచేసి చెబుతారా? రైతులుకానివారికి, అంటే భూమిలేని కార్మికుల వంటి వారికి వ్యతిరేకంగా రైతులు సంఘటితం కావచ్చు. మరి వాళ్ళలో ఉన్న అంతర్గత విభేదాల మాటేమిటి? కులం మాటేమిటి? వర్గం మాటేమిటి? పెద్ద,చిన్న రైతుల తేడాల గురించేమిటి? వాళ్ళమధ్య ఘర్షణల మాటేమిటి? ఆ ఘర్షణలు ఎన్నికలసమయంలో తలెత్తకుండా ఉండవు. కులశత్రుత్వాలు ఎక్కడినుంచో ఊడిపడడంలేదు, రైతు వోటును అవి ఎంతోకాలం అవిభాజ్యంగా ఉంచలేవు. కులతత్వం పార్టీభేదాలను కూడా అతిక్రమించి విస్తరిస్తున్న విషయం ఎన్నికల్లో, ఉపఎన్నికల్లో మనం చూస్తూనే ఉన్నాం. కులరహితసమాజం గురించి అలుపూ, విరామం లేకుండా

మాట్లాడుతూనే కులంతో సంబంధమున్న ప్రతి అవకాశంనుంచి ఎన్నికలప్రయోజనం రాబట్టుకోడానికి నిరంతరం ప్రయత్నిస్తూనే ఉంటాం... ఈ నిర్ద్వంద్వమైన వాస్తవాల దృష్ట్యా చూసినప్పుడు తనకుతానే ముక్కలుచెక్కలవుతున్న ఒకే ఒక వర్గంమీద ఆధారపడి పార్టీబలాన్ని నిలబెట్టుకోవాలని ఎలా ఆశించగలం? భూపరిమితిచట్టాలకింద భూమిపంపిణీ అన్న ఆలోచన మీకంత రుచించినట్టు లేదు. ఇంతకీ, ఇందువల్ల ఎంతమంది భూస్వాములు వాస్తవంగా భూమిని కోల్పోతారు? సొంత భూమి ఉన్న రైతులు వెయ్యిమందివరకూ ఉన్న నా స్వగ్రామాన్నే తీసుకుంటే, వాళ్ళలో మిగులుభూమి ఉన్న వాళ్ళు, నాతో సహా ముగ్గురో నలుగురో తేలతారు. నలుగురి మిగులుభూమి అంతకంటే ఎందరో ఎక్కువమంది భూమిలేని పేదలకు దత్తమవుతుంది, అందరికీ కాకున్నా. . కనుక ఈ కార్యక్రమాన్ని మనం ఓ పద్ధతిగా కనక అమలుచేస్తే వోటర్ల మద్దతును పార్టీ అదనంగా సాధిస్తుందే కానీ, కొంచెమైనా కోల్పోదు...

ఇక మీరు రాజకీయఅస్థిరత్వంగురించి మాట్లాడారు, అటువంటి ప్రమాదం నిజంగానే మన ముఖాన వ్రేలాడుతోందని నేనూ ఒప్పుకుంటాను. ఇక్కడకూడా ఒకమాట... జవహర్లాల్‌నెహ్రూగారి వ్యక్తిత్వమూ, జనాన్ని ఒప్పించగల ఆయన నేర్పు ఎంతకాలం పార్టీని ఎన్నికల గండం నుంచి గట్టెక్కిస్తూ ఉంటాయి? ఒకవైపున ఆయన సోషలిజాన్ని ఎంతో ఉద్వేగభరితంగా సమర్థిస్తూనే మరోవైపున రాజీపడడానికి సమ్మతించడమూ మనం చూశాం. మనపార్టీలో గణతంత్రపరిషత్ లాంటి మహారాజుల సంఘాలు విలీనమైన ఆ క్షణంలోనే పార్టీలోని సిద్ధాంతపు ఊపు తగ్గిపోయిందని స్పష్టంకాలేదా? అందువల్ల సోషలిజంపట్ల పార్టీ మొగ్గు జవహర్లాల్ ఉన్ననాడే లోపల్లోపలే అనివార్యంగా సడలిపోయింది,... నిజానికి ఈ క్రమంలో సోషలిజంపట్ల ఆయన విశ్వాసంకూడా కొంతమేరకు అనుమానాస్పదమైంది కూడా. తన సిద్ధాంతం విషయంలో కొందరు పార్టీవాదులకు అభ్యంతరాలున్నట్టు అర్థంచేసుకున్న జవహర్లాల్, రెండు పరిణామాల్లో ఒకదాన్ని స్వీకరించక తప్పదనుకున్నారు. తక్షణ అస్థిరత్వాన్నో, దీర్ఘకాల అవనతినో —దేనినో ఒకదానిని. ఆయనలోని చారిత్రకస్పృహ, ప్రస్తుతమైనా సరే దేశాన్ని సమైక్యంగా ఉంచడంకోసం ఆయనను రాజీమార్గంవైపే నడిపించింది. బహుశా అదే సమంజసమూ కావచ్చు. రాజకీయసుస్థిరతను సాధించినదిగా ఆయన పరిపాలనాకాలం చరిత్రలో నిలిచిపోతుంది —ఆ సుస్థిరత్వానికి మూల్యంగా కొంత మేరకు సిద్ధాంతాన్ని సడలించవలసివచ్చింది. మనలో మన మాట, చౌదరిగారూ, కాస్త ఊహించండి. జవహర్లాల్ రంగంనుంచి తప్పుకోగానే రాజకీయసుస్థిరత్వమూ లేని, సైద్ధాంతికబలమూ లేని స్థితిని దేశం ఎదుర్కొనే ప్రమాదం లేదంటారా? అత్యున్నతస్థాయిలో వ్యక్తిత్వశూన్యం సంభవించిన తక్షణమే ప్రాంతీయవాదం, భాషారాజకీయాలు, జాతివిభేదాలు, కేంద్ర రాష్ట్రాల మధ్య ఉద్రిక్తత, ఇంకా మరెన్నో వికృతధోరణులు విజృంభించే అవకాశమే నాకు స్పష్టంగా కనిపిస్తోంది. కనుక రాజకీయప్రయోజనమనే సంకుచితకోణంనుంచి చూసినా, పటిష్ఠమైన విస్తృత ప్రజానీకం మద్ద తును మనం సమీకరించుకోవడం అత్యవసరం కాదంటారా?'

'నా వాదాన్ని నాకే తిప్పికొడుతున్నావ్' చౌదరి వ్యాఖ్యానించాడు. 'ఇంతకీ మనిద్దరం ఏకరవు పెట్టిన సమస్యలన్నింటికీ నీ పరిష్కారమేమిటో బయటపెడతావా?'

'ఇలా అంటున్నందుకు మన్నించండి ముఖ్యమంత్రిగారూ' ఆనంద్ కొనసాగించాడు. 'మీరూ నేనూ వేర్వేరు కాలప్రమాణాలను దృష్టిలో ఉంచుకుని ఆలోచిస్తున్నాం. మీ దృష్టి తక్షణ భవిష్యత్తుమీద, బహుశా రాబోయే అయిదేళ్ళకాలంమీద ఉంది. మీకంటె నేను కనీసం పదేళ్ళు చిన్నవాణ్ణి కనుక సహజంగానే మరింత ఎక్కువకాలంలోకి, పదిహేనునుంచి ఇరవైఏళ్ళ దూరానికి తొంగిచూసి ఆలోచించవలసి వస్తుంది. జవహర్లాల్‌గారి రాజకీయసమ్మోహనశక్తిని ఉపయోగించుకుంటూ ఒడుదుడుకులు లేకుండా పార్టీ సాఫీగా ముందుకెలా సాగిపోతుందన్నదే మీ ఆలోచన. నేనీ కాలాన్ని ఇప్పటికే సురక్షితమైందిగా భావించి జవహర్లాల్ అనంతరపరిస్థితిని గురించి ఆలోచిస్తాను. ఆయన జీవనప్రమాణాన్ని దృష్టిలో ఉంచుకుని నేనిలా అనడంలేదు -ఆయన చిరకాలం జీవించాలనే మనందరి ఆకాంక్ష. కాని జాతీయస్థాయిలో, అంతర్జాతీయస్థాయిలో అత్యంతవేగంగా మారిపోతున్న పరిస్థితులలో ఆయన పలుకుబడి, ప్రభావాలను దృష్టిలో ఉంచుకుని అంటున్నాను. ఆయన మహోన్నతవిధిని నిర్వర్తించారు, నిర్వర్తిస్తున్నారు. అయినాసరే, కాలానుగుణ్యతకీ, పలుకుబడికీ సంబంధించి ఏ నాయకుడికైనా ఎత్తుపల్లాలు తప్పవు... ఎవరి అదుపులోనూ లేని కారణాలవల్ల స్థితిగతులలా మారుతుంటాయి. ఆ మార్పుకీ, అతడి ప్రతిభాపాటవాలకీ ఎటువంటి సంబంధం ఉండకపోవచ్చు కూడా. గతంలో అలా జరిగిన దృష్టాంతాలెన్నో ఉన్నాయి. వాస్తవంగా అలాగే జరగకపోయినాసరే, జరిగే అవకాశాన్ని ఎప్పుడూ కాదనలేం. స్వాతంత్ర్యానంతరకాలంలో ఇప్పుడు కొత్తనీరు వచ్చింది కనుక, రాజకీయపక్షాలను అంచనావేసే ప్రమాణాలు మారిపోతాయని నేనూహిస్తున్నాను. స్వాతంత్ర్యోద్యమస్మృతులు మన ఊహ తలకిందులయ్యేంత వేగంగా క్షీణించిపోతున్నాయి. యువతరం ఆశలూ, ఆకాంక్షలూ ఎన్నడూ లేనంతగా పెరిగిపోతున్నాయి. ఇతర దేశాలు సాధించిన ప్రగతిని వాళ్ళు తప్పకుండా గమనిస్తారు... దూరంనుంచి చూసినప్పుడు ఆ విజయాలు అత్యద్భుతంగా కనిపిస్తాయి... కనుక, పునాదిమీద దృష్టిని లగ్నంచేయకుండా తప్పించుకోలేమని నా ఉద్దేశం. భారతదేశంలో పునాది అంటే గ్రామమే —అంటే నిస్సందేహంగా భూమే... పునాదిని విస్మరిస్తే, మనం చేస్తున్న నిర్మాణాలన్నీ ఇసుకగూళ్ళే అవుతాయి. ఏదీ దృఢంగా ఉండదు, ఏదీ సఫలం కాదు.

'వ్యవసాయరంగంలో కీలకమైన మలుపు సాధించేవరకూ, కనీసం ఆహారంలో కొరత పరిస్థితి నుంచి బయటపడేవరకూ కొన్ని సంవత్సరాలు ఎందుకు ఆగకూడదు?' చౌదరి ప్రశ్నించాడు.

'అప్పుడప్పుడు అలాకూడా ఆలోచించాను చౌదరిగారూ!' జవాబు చెప్పాడు ఆనంద్. 'పంపిణీ న్యాయాన్ని అమలుచేయబోయేముందు సమృద్ధిని ఎందుకు సాధించకూడదు? దరిద్రాన్ని తప్ప ఇప్పటికిప్పుడు నువ్వు పంచగలిగిందేముంది!... ఇది సహేతుకవాదంలానే ధ్వనిస్తుంది. అయితే, పంపకం ప్రారంభించడానికి ముందు సరిపోయినంత ఉత్పత్తి జరిగేవరకూ నిరీక్షించిన ఒక్కదేశాన్ని మీరు చూపించగలరా? ఆ మార్గంలో విజయవంతమైన ఒక్కదేశాన్ని చూపించగలరా? కూడబెట్టుకోవడమే లక్ష్యంగా ఉన్న సమాజంలో వ్యక్తుల స్వభావాన్ని, ఇష్టాయిష్టాలను దృష్టిలో ఉంచుకున్నప్పుడు ఇది ఏ మేరకు ఆచరణసాధ్యమనిపిస్తుంది? మనం సరిపోయినంత ఉత్పత్తి చేశాం కనుక ఇక అందరికీ పంచిపెడదామంటే ఒప్పుకునే ఉత్పత్తిదారు ఎవడైనా ఉంటాడా?

దారిద్ర్యం, సంపన్నత అనేవి సాపేక్షపదాలు; ఎక్కడ అడ్డుగీత గీస్తారు? సంపన్నులు, పేదలు ప్రతి దేశంలోనూ ఉన్నారు, అయితే ఒకదేశంలో సంపన్నుడు మరోదేశంలో దిగువ మధ్యతరగతికి వస్తాడు... అదీగాక చౌదరిగారూ, వేచి చూద్దామన్న వాదాన్ని పరిశీలిస్తున్నప్పుడు మరో కొరకరాని అంశంకూడా స్ఫురించింది. మనం సాధించబోతున్న మలుపు పర్యవసానం ఏమిటి? భారీ ఎత్తున సేద్యపునీటి సదుపాయాలు సృష్టిస్తాం. మేలిరకం విత్తనాలు, లాభసాటి వ్యవసాయ పద్ధతులు, ఎరువులు, క్రిమిసంహారకమందులు వగైరా సాధనసామగ్రిని అందిస్తాం. భూసార పరిరక్షణకు, భూసార పరీక్షకు, పచ్చిఎరువు అందుబాటుకు చర్యలు తీసుకుంటాం చివరగా చెప్పుకుంటున్నా ప్రాధాన్యంలో ముందుగా చెప్పుకోవలసింది మరొకటుంది... వ్యవసాయంపనులకు కావలసిన రుణసహాయాన్ని బ్యాంకులనుంచిఇప్పిస్తాం. లక్షల ఎకరాల మెట్టభూములకు రాత్రికిరాత్రి నీటిసౌకర్యం ఏర్పడిపోతుంది. అంటే, వేలాది ఎకరాల మెట్టభూములున్న భూస్వాముల భాగ్యం పండి హఠాత్తుగా వేలాది ఎకరాల మాగాణిభూముల యజమానులుగా మారిపోతారు. నిజమే... ఈ క్రమంలో సన్నకారురైతులుకూడా కొంత లాభపడతారు, కానీ నేనంటున్నది మొత్తంమీదపడే ప్రభావం గురించి. ఈ ప్రక్రియ గ్రామీణసమాజంలో తెచ్చిపెట్టగల విపరీత వ్యత్యాసాలను ఒకసారి ఊహించండి... ఇందువల్ల భూస్వాముల ఒడినిండే సంపద ఏ ప్రమాణంలో ఉంటుంది! ఆ యాదృచ్ఛికలాభంకోసం వాళ్ళు చేసిందేమిటి? ఏమీ లేదు! సాంఘిక—ఆర్థిక కోణంనుంచి ఆ అసాధారణపరిస్థితిని మనం అంచనావేశామా? హఠాత్తుగా కమ్ముకున్న ఈ వ్యత్యాసాలు నేటి మన గ్రామీణసమాజానికి దుస్సహంగా పరిణమిస్తాయని నేను సహేతుకంగానే భయపడుతున్నాను. గ్రామీణవ్యవస్థ విచ్ఛిన్నమైపోయి అస్థిరత్వంలోకి జారిపోతుంది. విజాతీయమైన ఓ సరికొత్త ధోరణి—సుఖజీవితానికి కావలసిన వస్తువులకోసం ఎగబడే పచ్చి వినియోగదారు మనస్తత్వాన్ని అది జనంలో తెచ్చిపెడుతుంది. సంపన్నులు ఆడంబరంగా వాటిని ప్రదర్శించుకుంటారు, పేదలు లేమితో మరింత కుంగిపోతారు. ఈ పరిస్థితి మరింత ఉద్రిక్తతకు దారితీస్తుంది. భూస్వామ్యవ్యవస్థలో అధికారమూ, ప్రతిష్ఠా ఉన్నతిని నిర్ణయించాయి. ఐశ్వర్యంలో పెద్దభూస్వామి కూడా మధ్యతరగతికంటె మరీ ఎత్తున ఉండేవాడు కాడు. వెనకటి సంస్థానాలకు చెందిన ఎందరో నవాబులు వడ్డీవ్యాపారులకు ఎలా రుణగ్రస్తులయ్యారో గుర్తుచేసుకోండి. వడ్డీవ్యాపారులు నవాబుమీద విపరీతమైన భక్తిగౌరవాలు ప్రదర్శించుకునేవారు; దానితో నవాబు అహం శాంతించేది... ఇప్పుడు డబ్బే అధికారం చలాయించే పరిస్థితి తలెత్తి అది మరింత కంపరం పుట్టించే ఆట కాబోతోంది. గ్రామాలు తమ అంతరాత్మను కోల్పోతాయని భయపడతున్నాను. డబ్బు అనే కొత్తదేవుడు ప్రతిఒకరినీ ఆవహిస్తాడు కనుక నగరీకరణ మనం కలలోకూడా ఊహించలేనంతగా పెరిగిపోతుంది. మరి డబ్బున్న చోటే నగరం అవతరిస్తుంది. రాజకీయరంగంలో పార్టీవిధేయతకు కాలంచెల్లిపోతుంది; ప్రతిచోట డబ్బుదే పైచేయి అవుతుంది —పార్టీటిక్కెట్లు ఇవ్వడంలో, వోట్లు సంపాదించడంలో, ప్రచార సంరంభంలో... ఒకటేమిటి, అన్ని విషయాల్లో. ఈ వ్యవస్థలో పార్టీ నిరుపేద కార్యకర్తకీ, అభ్యర్థికీ చోటెక్కడ?... ఈ పెనగులాట ఫలితం రాజకీయఅస్థిరత్వంమినహా మరేమవుతుంది?'

'నువ్వు జ్యోతిష్కుడిలా మాట్లాడుతున్నావ్ ఆనంద్' చౌదరి హాస్యమూ, వ్యంగ్యమూ కలగలిపి అన్నాడు. 'నోస్ట్రడామస్‌కు ఆధునికరూపంలా మారినట్టు కనిపిస్తున్నావ్'

'నేనా తరహావాణ్ణి కాను. ఆ విషయం మీకూ తెలుసు.' ఆనంద్ అన్నాడు. 'మీరు పరిహాసానికే అలా అంటున్నా, సంప్రదాయభిన్నమైన నా అభిప్రాయాలవల్ల చాలా చిక్కులు ఎదుర్కొన్నాను. అయినా నా అభిప్రాయాలలో ఫలానా పొరపాటు దొర్లిందని కానీ, నేను నిత్యశంకితుడిలా ఏవేవో ఊహించుకుంటున్నాని కానీ ఎవరూ చెప్పలేదు. నాది చాలా సరళమైన సూత్రీకరణ. శతాబ్దాలుగా కొనసాగుతున్న వ్యత్యాసాల బరువుకింద కుంగిపోతున్న వ్యావసాయికసమాజంలో సాంఘికార్థిక సంస్కరణ అనేది భూసంస్కరణలతోనే ప్రారంభం కావాలి. నేను సరైనదనుకుంటున్న క్రమం ఇది. మొట్టమొదట ఉత్పత్తిసాధనాలను పంపిణీచేయడం; ప్రతిఒకరికీ అధికోత్పత్తిసామర్థ్యం అందించడం. రక్తపాతవిప్లవంతో మనం స్వాతంత్ర్యం తెచ్చుకోలేదు. అయినా మన స్వాతంత్ర్యేచ్ఛలో అంతే ప్రగాఢమైన విప్లవస్ఫూర్తి ఉంది. మార్పును కొనితేవడానికి, ఆ మార్పు ఎంత మౌలికమైనా, ఎంత మూలచ్ఛేదమైనా సరే, నాటి ఆ స్ఫూర్తి సరిపోయి ఉండేదని నేననుకుంటున్నాను. తగిన కారణాలతోనే అనుకోండి, జవహర్లాల్, ఆయన సహచరులు దానినలాంటి పరిణామానికని ప్రయోగించకూడదనుకున్నారు. దానినలా దాటి పోనిచ్చారు. సుస్థిరత్వసాధనకే పరిమితమయ్యారు, దానిని సాధించారు. పండిట్‌జీ అనంతరంకూడా సుస్థిరత్వం అలాగే ఉంటుందా? అన్నదే ప్రశ్నలన్నింటినీ మించిన ప్రశ్న. సుస్థిరత్వాన్ని సాధించడానికి వీలుగా మన కార్యక్రమాల్ని రూపొందించినట్టు నా కనిపించడం లేదు. ఈ పరిస్థితిలో మనం చేయగలిగిందొకటే, జనాకర్షణ శక్తి కలిగిన నాయకుడు మళ్ళీమళ్ళీ అవతరించాలని ఆశపడడం, ప్రార్థించడం. నిజంగా నేను కలవరపడుతున్నాను...'

అతని కంఠధ్వని క్షీణించింది. దీర్ఘాలోచనలో ఉన్నట్టున్న అతని కళ్ళు చౌదరి కళ్ళు కలుసుకున్నాయి. ఆ దృక్కుల కింద ముఖ్యమంత్రి ఇబ్బందిగా కదిలాడు. హఠాత్తుగా లేచి నిలబడి ఆనంద్‌ను దగ్గరకు తీసుకుని వీపు చరుస్తూ, ఎంతో ఆదరభావంతో అన్నాడు. 'థాంక్యూ యంగ్‌మన్, నువ్వు కేసు గెలిచావు, డిక్రీ పొందావు. ఓసారి ఢిల్లీ వెళ్ళొచ్చి, దానినెలా అమలుచేయాలో కొద్దిరోజుల్లో నీకు తెలియజేస్తాను...'

మరుక్షణమే, తాను లా కాలేజీలో ఉన్నప్పుడు విన్న నానుడి ఒకటి ఆనంద్‌కి జ్ఞాపకమొచ్చింది. భారతదేశంలో కోర్టుకు వెళ్ళినవాడి కష్టాలు —డిక్రీ పొంది దానిని అమలుచేయాలనుకున్న తక్షణమే ప్రారంభమౌతాయని!... అతడేమీ మాట్లాడలేదు. మహావిజృంభణగా ఆలోచనామథనం జరుగుతున్న చౌదరి బుర్రలో రూపుదిద్దుకుంటున్న సరికొత్త పథకాల రూపురేఖల్ని ఊహించే ప్రయత్నం చేయలేదు.

# 29

కుట్ర, కుతంత్రం సాగిస్తూ శేఖర్ తనలోంచి ప్రచ్ఛన్న సంతోషాన్ని కొన్నిరోజులపాటు అణచుకోడానికే ప్రయత్నించాడు. ఒక్క రాయితో, బహుశా అసలు రాయే లేకుండా తానెన్ని పిట్టల్ని రాల్చబోతున్నాననుకుంటూ మురిసిపోయాడు. అతడికి భూమిలేదు, ఏ కులానికీ చెందినవాడు కాడు. అతని కున్న తిట్టు పేర్లకు లెక్కలేదు. 'ముండాకొడుకు' అనేది సాధారణంగా వినిపించేపేరు. ఈ నిందార్థకాలకు ప్రత్యేకించి అతడు ఎవరినీ తప్పుపట్టలేడు. తన పుట్టుకను వేలెత్తిచూపిస్తూ దొర్లించే అవమానకరపదజాలానికి అతడు త్వరలోనే అలవాటు పడిపోయాడు. జనం బుఱ్ఱల్లోనూ, నాలుకలమీద అంతగా పాతుకుపోయిన మాటలవి. లోపల ఉడికిపోతూన్నా, వాస్తవంగా మాత్రం ఒక విజయం నుంచి మరో విజయంవైపు దూసుకుపోతున్నాడు. జనంలో అతనిపట్ల అసహ్యమూ, తిరస్కారమూ అలాగే ఉన్నాయి కానీ, ఇప్పుడవి చాలావరకూ అతడి పరోక్షంలోనే వ్యక్తమౌతున్నాయి. అతడు సాధించిన ఉన్నతి, ఆ మచ్చను కొంతమేరకు కప్పిపుచ్చినా, ఎన్ని జన్మలెత్తినా ఏ పూతకీ నయంకాని పుండులా సలుపుతూ, రేగుతూ ఆ కళంకం వెన్నంటి ఉంటూనే ఉంది. అదేపనిగా ప్రతీకారదృశ్యాల్ని ఊహించుకుంటూ, అవి కల్పించే మత్తులో మునిగితేలుతూ ఉండడం అతనికో వ్యసనంగా మారింది. తన తల్లినీ, ఆమెవంటి వేలాదిమంది ఆడవాళ్ళనూ శారీరకంగా, మానసికంగా హింసించి అత్యంతకిరాతకంగా ప్రవర్తించిన వర్గాన్ని వ్యూహబద్ధంగా నాశనం చేయడం ఆ కల్పనలో భాగం. తనకు గుర్తింపుకానీ గౌరవంకానీ ఇవ్వని, తను గౌరవ ప్రదంగా జీవించడానికి అవకాశమివ్వని సమాజాన్ని ధ్వంసం చేయడం గురించి అతడు గంటలతరబడి ఏవేవో ఊహలు కల్పించుకుంటూ గడిపేవాడు.

భగవంతుడా! ఈ ప్రపంచాన్ని, కంపుకొట్టే ఈ మొత్తం ప్రపంచాన్ని తనెంతగా ద్వేషిస్తున్నాడో! తాను కేవలం శేఖర్, వట్టి శేఖర్. ఏదీకాని శేఖర్. తను శేఖర్‌రావు కాడు, శేఖర్‌రెడ్డి కాడు, శేఖర్‌చౌదరి కాడు, శేఖర్‌నాయుడు కాడు, శేఖర్‌అయ్యర్ కాడు, శేఖర్‌గుప్తా కాడు, శేఖర్‌యాదవ్ కాడు, శేఖర్‌త్యాగి కాడు, శేఖర్‌శాస్త్రి కాడు, శేఖర్‌జాదవ్ కాడు, ఠాకూర్‌శేఖర్ సింగ్ కాడు, శేఖర్‌మిశ్రా కాడు, శేఖర్‌పాటిల్ కాడు, శేఖర్‌మీనన్ కాడు, శేఖర్‌బెనర్జీ కాడు, శేఖర్‌పట్నాయక్ కాడు, శేఖర్‌ఛలియా కాడు, శేఖర్‌పస్వాన్ కాడు, శేఖర్‌గుజర్ కాడు, శేఖర్‌పదయాచీ కాడు... ఇది అంతులేని జాబితా, ఒకవైపు పురాతనమైనంది, మరోవైపు ఆధునికకాలంలో రాజకీయంగా

కొల్లగొట్టిన సొత్తులో వాటాపంచుకోడానికి ప్రతికులం, ఉపకులం, ఉపకులంలో ఉపకులం ప్రత్యేకమైన గుర్తింపుకోసం పోటీపడినంతకాలం ఈ జాబితా ఇలా అనంతంగానే సాగుతుంటుందనుకున్నాడు. యాదృచ్ఛికమైన పుట్టుక మీద ఆధారపడి నానాటికీ విస్తరించే ఈ డిమాండ్ల రంగంలో చోటు లేనివాడు తనొక్కడే... అదీగాక బ్రాహ్మణుడనో, రెడ్డి అనో, యాదవ్ అనో, జాదవ్ అనో లేదా మరో కులంవాడనో లేబుల్ అతికించుకున్నవాడు, తన తల్లి మరో కులానికి చెందిన ఆంబోతుతో పడుకుని తనను కనలేదని అంత కచ్చితంగా చెప్పగలడా? అని కోపంగా తనలో తనే ప్రశ్నించుకున్నాడు. ఈ దేశంలోకానీ, మరో దేశంలోకానీ, రంకుతనంనుంచి పుట్టినా, ఆ ముద్రపడని సంతానం పెద్దసంఖ్యలో లేరని ఎవరైనా నిస్సందేహంగా చెప్పగలరా? వాళ్ళ తల్లులు వివాహితలు కావడమేనా వారిపై ఆ ముద్రపడకపోవడానికి కారణం? మంగళసూత్రం అనబడే ఆ తాడుముక్క, లేదా కాలిచుట్లు లేదా వివాహాన్ని సూచించే మిగిలిన బాహ్యచిహ్నాలు వీళ్ళ విషయంలో అంతతేడానెలా తీసుకురాగలుగుతున్నాయి? ఎలా?... ఎలా?...

ఇక ఇటుచూస్తే మిరుమిట్లు గొలిపే విజయగాథలా నిలిచినవాడు తానున్నాడు, ఏమీకాని శేఖర్. బ్రాహ్మణపండితులు, చండాలురనే తేడా లేకుండా ఎంతోమంది తన ఆఫీసులోనో, డ్రాయింగ్ రూంలోనో తన పాదాలమీద పడి ఆ సహాయమనీ ఈ సహాయమనీ అర్థిస్తూనే ఉంటారు. ఎదురుగా తనను స్తుతించినవాళ్ళే, చాటున తన గురించి 'ఓ పదుపుగత్తెకు పుట్టిన అక్రమ సంతాన'మని చెప్పుకుంటుంటారు. ఇందులోంచి బయటపడే మార్గంలేదు. ఏదో ఒక కులంలోకి— అది షెడ్యూల్డు అయినా, షెడ్యూల్డు కాకపోయినా తను మారే అవకాశం లేదు. కొన్ని శతాబ్దాలుగా హిందూ సమాజంమీద పెత్తనం చలాయిస్తూవచ్చిన బ్రాహ్మణుడు తన విజ్ఞానాన్ని మరెవరికీ అందించకుండా దాచుకున్నాడు. ఇప్పుడు షెడ్యూల్డుకులం ఇతరులెవరికీ అందని దూరంలో ఉంటూ తనలోతనే ముడుచుకుపోతోంది. అక్రమ సంతానానికికూడా తగిన రిజర్వేషన్ కల్పించాలన్న ఊహ—బహుశా చిత్తశుద్ధి— భారతరాజ్యాంగనిర్మాతలకు ఉండిఉంటే లక్షలాదిమంది ప్రభుత్వం నుంచి ఉద్యోగాలు, రాయితీలు పొందడంకోసం తమను అక్రమ సంతానంగా రుజువుచేసే దొంగ సర్టిఫికెట్లు సంపాదించు కోడానికి ఎగబడుతూ ఉండేవారు. అటువంటి తప్పుడు సర్టిఫికెట్లు అమ్మకం తదితర లావాదేవీలు పెద్దఎత్తున జరిగిపోతూఉండేవి. వాళ్ళలో ప్రతిఒకడూ తన అక్రమజన్మను నిస్సంశయంగా రుజువు చేసుకోడానికి ఇండియన్ ఎవిడెన్స్ యాక్ట్‌ను ఉదహరించుకుని ఉండేవాడనికూడా ఊహించుకుంటూ ఆనందించాడు శేఖర్. తాను తల్లి కడుపులో పడే సమయానికి తన అసలు తండ్రి తన తల్లికి చాలాదూరంలో ఉన్నాడు. కనుక తనతనికి పుట్టి ఉండే అవకాశం లేదనడానికి తిరుగులేని సాక్ష్యాలు దాఖలు చేసుకునేవాడు. అప్పుడు చట్టబద్ధమైన పుట్టుక మహానేరంగా పరిణమించి ప్రతి ఒకరూ దానినుంచి పారిపోడానికి ప్రయత్నించి ఉండేవారేమో... దరిమిలా ఒకమేలు కూడా జరిగేది, కులం పేరు చెప్పుకోడం నామోషీగా మారి నిజమైన కులరహిత సమాజం అవతరించేది. కులరహిత సమాజం గురించి ఇంటికప్పుమీద నిలబడి ఘోషించే పెద్దలు ఆ ఆదర్శాన్ని తాము నిజంగానే విశ్వసించిఉంటే రాజ్యాంగం పీఠికలో ప్రస్తావించి ఊరుకోకుండా ఒకే కులంలో వివాహాల్ని నిషేధిస్తూ చట్టం ఎందుకు

చేయలేకపోయారు? ధర్మశాస్త్రాలపై, మతగ్రంథాలపై ఆధారపడి అనేక వ్యక్తిగత చట్టాలు ఆయా శాఖలమధ్య గోత్రాలమధ్య, రక్తసంబంధాలమధ్య వివాహాలను నిషేధించగలిగినప్పుడు, అటువంటి కారణాలతోనే ఒకేకులంలో వివాహాన్ని ఎందుకు నిషేధించకూడదు?... వారేనాడూ అలా చేయలేదు, ఇప్పుడు కూడా చేయరు, నయవంచకులు... శేఖర్ కసిగా అనుకున్నాడు. కులరహిత సమాజం గురించి ఊరికే వదరుతూ ఉంటారు. మనసులో లేకపోయినా రోతపుట్టేలా దానిగురించి మాట్లాడుతూనే ఉంటారు. వాస్తవానికి వారు తీసుకునే ప్రతిఒకచర్య జాతి పరిశుద్ధతనీ, కులం ఆధిక్యాన్నీ, వంశచరిత్రనీ, కులీనరక్తాన్నీ నొక్కి చెబుతున్నట్టే ఉంటుంది. వీటిలో ప్రతి ఒక్కదాన్ని దాని అత్యంతతీవ్రరూపంలో వీళ్ళు ప్రోత్సహిస్తూనే మనుషులమధ్య సమానత్వం గురించి ఊకదంపుడుగా మాట్లాడుతూ ఉంటారు. అంతెందుకు, గుర్రాలు, కుక్కల విషయం లోనూ వీళ్ళు మేలుజాతి, తక్కువ జాతి అనే తేడా తీసుకొస్తూఉంటారు. అది వాళ్ళ దృష్టిలో ఉన్నతశ్రేణికి చెందిన శాస్త్రం. ఈ పరిస్థితిలో ప్రపంచంలో ఎక్కడైనా సరే మనుషులమధ్య సమానత్వభావనను ఆశించడం వ్యర్థం కాదా!

రాత్రీ పగలూ అతడు ఆవేశంతో దహించుకుపోతున్నాడు. తన కట్టెను కాటికి చేర్చేవరకూ ఏమీకాని శేఖర్‌లానే జీవించవలసిన గతి పట్టింది తనకు. శవ సంస్కారం ఎలాజరగాలన్న విషయంలోకూడా వాళ్ళు ఒకరితల ఒకరు నరుక్కోగలరు. తగలబెట్టాలని వాదించే మందకీ, పూడ్చిపెట్టాలని వాదించే మందకీ మధ్యఘర్షణ చెలరేగడం ఖాయం! .

అలా ఆ రోజు ఉదయం, పగతో రగిలి పోతున్న ఏమీకాని శేఖర్, తనను తాను కులరహితమని ప్రకటించుకునే సమాజంలో లోలోపలి నుంచి కులం కోసం పరితపిస్తున్నాడు. కులం కోరుకునే ఆ కులరహిత పౌరుడి దీనాలాపం అత్యంత బాధాకరమైన వైరుధ్యాన్ని ప్రతిధ్వనిస్తూ మళ్ళీ మళ్ళీ పైకి తన్నుకొస్తూనేఉంది. అయితే తన జీవిత ధ్యేయానికి అతడు నిబద్ధుడయ్యే ఉన్నాడు— ఎంతో సమ్మోహనకరంగా తాను విజయం సాధిస్తాడు, ప్రపంచం తనముందు మోకరిల్లుతుంది. అప్పుడు దానిమీద కసితీరా ఉమ్మేసి పగతీర్చుకుంటాడు. ఆ విషయంలో వెనకడుగులేదు.

తల్లిని గుర్తు చేసుకున్నాడు. ఆమె చనిపోయి పదిహేనుసంవత్సరాలైంది. ఆమె మరణానికి దారితీసిన పరిస్థితులు అతనిని తీవ్రవేదన, జుగుప్సల ప్రవాహంలో ముంచెత్తాయి. ఆమె ఏ కులానికి చెందింది? ఎవరికీ తెలియదు; ఆమె ఎవరికీ చెప్పలేదు. కనుక ఆమెను ఎవరు పెళ్ళాడగలరు? ఆమె లైంగికదాస్యానికే తప్ప పెళ్ళికి పనికిరాదు. ఆమెకే కనుక కులం ఉంటే తాను ఫలానా శేఖర్ అనిపించుకోగలిగేవాడు, ఎందరో ఆడ వాళ్ళలా ఆమె అనాకారిగా ఉండి ఉంటే బహుశా ఒక వ్యక్తికే ఉంపుడుగత్తెగా జీవితం చాలించిఉండేది, ఆ ఒక వ్యక్తి ఆమెను కాస్తంత దయతోనే చూసిఉండేవాడు. అంతటి అందగత్తె ఒకే ఒక భూస్వామి సొత్తుకావడం జరిగే పనికాదు. రూపాయలు పోసి కొనుక్కున్న మనిషికనుక ఎందరికో ఊడిగం చేయవలసిందే. భూస్వాముల విశృంఖలజారత్వం, మధ్యమధ్య గౌరవనీయఅతిథులు, చిల్లరఉద్యోగులు, స్థానికంగా అధికారం చలాయించే ప్రతి ఒకరూ ఆమెపై అత్యాచారాలు జరిపారు. భూస్వాముల ఆదేశంపై ఆమె ఎన్నోసార్లు గర్భస్రావాలు చేయించుకోవలసివచ్చింది ఊళ్ళో ఉన్న ఓ ముసలి మంత్రసాని

ఆ పని నిర్వర్తించేది. ప్రతిఒకరూ ఆ ముసలిదాన్ని చీదరించుకునేవారు.అయినా ఎంతోమంది తరచు ఆమె సేవలు ఉపయోగించుకుంటూనే ఉండేవారు. చిట్టచివరి గర్భస్రావం ఏదో అనారోగ్యానికి దారితీసింది. పొత్తికడుపులో భరించలేనంత నొప్పి. ఒక కేసు దర్యాప్తు కోసం గ్రామానికి వచ్చిన సందర్భంగా ఓ పోలీస్‌అధికారిని భూస్వాములు మంచి చేసుకోవలసి వచ్చింది. అతడి సేవకు దాసీని నియోగించారు. ఫలితంగా లోపల విపరీతంగా రక్తస్రావం జరిగి చివరకు కుప్పకూలిపోయింది. నగరంలోఉంటున్న శేఖర్ చిరునామా తెలిసిన అతడి చిన్నప్పటి నేస్తం ఒకడు శేఖర్‌కి ఎలాగో ఒక ఉత్తరం రాయగలిగాడు. ఆ సమయంలో శేఖర్ ఒక మురికివాడలో జేబుదొంగలమధ్య గడుపుతున్నాడు. తనకు తెలిసిన ఒక కాంపౌండర్‌ను వెంటబెట్టుకుని అతడు పరుగు పరుగున గ్రామానికి చేరుకున్నాడు. అప్పటికామె చనిపోయి (సెప్టిసేమియా వల్ల చనిపోయిందని కాంపౌండర్ చెప్పాడు) మూడు రోజులైంది. దహనం కూడా అయిపోయింది. చితిని సమీపించాడు. అప్పటికే అది చల్లారిపోయింది. చితాభస్మంలో చేయిపెట్టి తల్లి అవశేషాలకోసం వెతికాడు. దుఃఖం కట్టలు తెంచుకుంది. కంటతడి పెట్టడం అతడి జీవితంలో అదే మొదటిసారి, చివరిసారి కూడా. ఆమె పట్ల ఇంతటి ఘాతుకానికి పాల్పడిన ప్రతిఒకరినీ వాళ్ళ కన్నీటిసముద్రంలో ముంచివేస్తానని అప్పుడే, అక్కడే అతడు శపథంచేశాడు.తన కళ్ళు మరెప్పుడూ చెమర్చకూడదని కూడా తనను తాను శాసించుకున్నాడు.

పథక రచనలో ఆరితేరిన తన బుర్రను పూర్తిగా ఉపయోగించుకుంటూ ఇన్నేళ్ళలో తాను చేయదలచుకున్నది చేస్తూనేవచ్చాడు. ఇతరుల కంటికది కుట్రలా, కుతంత్రంలా కనిపించ వచ్చు. అతడికి మాత్రం పూర్తిగా తేటతెల్లం, తర్కబద్ధం. ఎన్నో పార్టీలు మార్చాడు, మార్చిన ప్రతిసారీ సరికొత్త సూత్రీకరణతో సమర్థించుకున్నాడు. ఆక్షేపణలనుంచి తప్పించుకుని ముందుకు పోవడమేకాదు, వేసిన ప్రతి అడుగులో తన ప్రాముఖ్యాన్ని పెంచుకుంటూపోయాడు. ఎవరో ఒకరికి అతడి అవసరం ఉంటూనే ఉంది; ప్రతిభావంతుడైన ఓ కుట్రదారు రాజకీయరంగంలో ఎప్పుడూ నిరుద్యోగిగా పడిఉండడు. ప్రతిఘట్టంలోనూ, తన వెనుక విచ్ఛిన్న మిత్రత్వాల శిథిలాలను రాశులుగా పోసుకుంటూ వెళ్ళాడు. వేసిన ప్రతి అడుగులోనూ లోలోపలికి వేళ్ళూతన్నుకున్న సరికొత్త అనుమానాల పంటకు నాట్లు వేసుకుంటూ పోయాడు.అవి ఎప్పటికీ తొలగని అనుమానాలు —అవి తొలగిపోకుండా ఉండేందుకు అతడు కావలసినంత జాగ్రత్త తీసుకుంటూనే వచ్చాడు.

అతని అదృష్టంకొద్దీ మహేంద్రనాథ్, చౌదరి పట్టువిడవని ప్రబల శత్రువులు. వివిధశ్రేణుల్లోని వారి అనుయాయులుకూడా, కన్నుకు కన్ను అన్న పద్ధతిలో ఘర్షణలో మునిగిపోయారు. మహేంద్రనాథ్ శిబిరం లోపలి వ్యవహారాలు బాగా తెలిసినవాడు కనుక, దానినుంచి ప్రయోజనం పొందడానికి శేఖర్‌ను చౌదరి తనమంత్రివర్గంలోకి తీసుకున్నాడు. మహేంద్రనాథ్ శేఖర్‌పై మంటలుకక్కాడు, కానీ శేఖర్ పట్టించుకోలేదు. నిచ్చెన పైమెట్టువరకూ వెళ్ళి ఆ తర్వాత దానిని ఒక్కతన్ను తన్నాడు. దాదాపు ప్రతిఒకడూ తన రాజకీయ జీవితంలో చేసినట్టే... చివరకు తన అక్రమ జన్మను కూడా అనుకూలంగా వాడుకున్నాడు. పార్టీలోని గ్రూపుల్లోనే మళ్ళీ కులం, ప్రాంతం, జిల్లా, మతం, భాష జాతి మీద ఆధారపడి సబ్—గ్రూపులున్నాయి. కనుక శేఖర్ తన చాకచక్యాన్ని

రంగరించి రక రకాల ముఠాలుగా జనాన్ని కలుపుతూ విడదీస్తూ మొత్తంమీద రాజకీయవాదులందరూ నిత్యం ఒకరితో ఒకరు ఘర్షణపడే పరిస్థితిని తీసుకురాగలిగాడు. అందులో అతడు గొప్పగా రాణించడానికి కారణం, తనకంటూ ఓ కులం, వర్గంలేనివాడుగా అంతటా సంచరించే రాజకీయవాది కావడం, ఏదో గ్రూపుకో తెగకో విధేయుడు కాకపోవడం. ఇది అతడి విలువను విపరీతంగా పెంచివేసింది. తన కళంకితజన్మ కనీసం ఒక్క విషయంలోనైనా, కులం సంకెళ్ళలో బందీలైన మిగిలిన రాజకీయవాదులెవరికీ లేని ఓ అరుదైన అనుకూలాంశంగా పరిణమించడం రెండు విరుద్ధాంశాల అందమైన కలయికగా చెప్పుకోవచ్చు.

పార్టీలో ముఖ్యులనుకుంటున్న వారిని, లేదా భవిష్యత్తులో ముఖ్యులు కాగల అవకాశమున్నవారిని వరసపెట్టి తుదముట్టించడమతని ప్రధాన వ్యూహం. ఒకరి జుట్టు మరొకరికి ముడిపెడితే చాలు, కాగలకార్యం వాళ్ళే పూర్తి చేసుకుంటారు; తనపనల్లా మధ్య మధ్య నిప్పులు ఎగదోస్తూ చూసి ఆనందించడమే. తానింతగా ద్వేషిస్తున్న క్రూరసమాజాన్ని నాశనం చేయాలంటే దానికి ఆధార స్తంభాలుగా ఉన్న వ్యక్తులను ఒక్కొక్కడుగా ఎగరగొట్టడం తప్ప మార్గం లేదు. ప్రస్తుతానికి హిట్ లిస్టులో చివరి మనిషి ఆనంద్. 'అతణ్ణి నాశనం చేయడం చాలా తేలిక. ఎటూ కదలక కూర్చున్న బాతు ! చూస్తే జాలేస్తుంది' అని అప్పుడప్పుడు అనుకుంటుండేవాడు. అయితే ఆనంద్ మీద తన డేగకన్ను పడగానే అతని మీద ఇదివరలో కలిగిన జాలిని వెంటనే తరిమికొట్టాడు.

***తొలి అడుగు :*** అతన్ని ఏదైనా వివాదంలో ఇరికించడం. అరుణతో అతనికున్న స్నేహం బహిరంగవిషయమే కనుక ఇది మరీ మరీ తేలిక. తర్కబద్ధ యోచనకు తలఒగ్గే భక్తుడు ఆనంద్. పేదలపట్ల అపారమైన సానుభూతి. వ్యక్తిగత ఆకాంక్ష బొత్తిగా లేనివాడు. కొంతకాలంపాటు శ్రద్ధాసక్తులతో, చింతనతో అధ్యయనం చేసి సంపాదించుకున్న జ్ఞానకోశం అతడిది. అతని సైద్ధాంతిక తపన. దార్శనికస్వభావాలే అతనిపాలిట చావుదెబ్బలవుతాయి ఈ వ్యామోహం నేటి ఆచరణాత్మక రాజకీయాలకు పనికిరాదని శేఖర్‌కి తెలుసు. అది లోకాచారం; జవహర్లాల్ కూడా చింతనాపరుడే— దానితో అతడు నెగ్గుకురాగలిగాడంటే అతడు జవహర్లాల్ కనుకనే. ఆయనలోని పండితుడు సిద్ధాంతాలు బోధించడం, తక్కువవాళ్ళు ఆ బోధనలను ఉల్లంఘించడం...ఇది జరుగుతూవచ్చింది. చక్కని కార్యవిభజన అనుకున్నాడు శేఖర్ వెక్కిరింపుగా.

ఆనంద్‌ను పడగొట్టడానికి శేఖర్ అనేకమార్గాలు వెతికాడు. అదృష్టవశాత్తు తన ప్రోద్బలం మీద అతనికి భూసంస్కరణల శాఖ అప్పగించడానికి ముఖ్యమంత్రి చౌదరి అంగీకరించడంతో అనుకున్నదానికంటే తేలిగ్గా ఆనంద్ పనిపట్టగలనని శేఖర్ అనుకున్నాడు ఇప్పుడిక రెండువైపులా తనమీదికి నెపం రాకుండా కాపాడుకుంటూ దాడికి సిద్ధమైపోయాడు.

అతడిలా తలపోస్తూ విచ్చుకుంటున్న ఈ నాటకంలో కీలకపాత్ర నిర్వహించగల ఒక ముఖ్యుడైన అతిథి కోసం తన డ్రాయింగ్ రూమ్‌లో నిరీక్షిస్తున్నాడు. అతడు బలరాం, అరుణ పెద్దన్న. తన ప్రాంతంలో పెద్ద భూస్వామి. ఉద్రేక స్వభావి. గాలివాటం మనిషి. దయాదాక్షిణ్యాలు లేనివాడు. తను పరీక్ష తప్పడం, అరుణ తన తరగతికి చేరుకోవడంచూసి చదువు విరమించేశాడు. ఆ

అవమానాన్ని భరించలేకపోయాడు. అరుణ కూడా చదువు మానేసి పెళ్ళి చేసుకోవాలని కుటుంబంలో పెద్దవాడుగా శాసించాడు. ఆ ఆదేశాన్ని అరుణ ఖండితంగా తిరస్కరించి ఒక దూరపు బంధువు సహాయంతో నగరంలోని కాలేజీలో చేరింది. బలరాంలోని పురుషాహంకారం బాగా దెబ్బతింది. ఆ ప్రాంతంలో సమర్థుడైన రైతుగా పేరు తెచ్చుకుని గ్రామానికి సర్పంచ్‌అయ్యాడు. కొమ్ములు తిరిగిన వాళ్ళను కూడా తన దారికి తిప్పుకోగల నాయకుడనిపించుకున్నాడు. అతడిలో ఒక నియంత ఉన్నాడు. తెలివిగా పావులు కదపగల వ్యూహచతురుడూ ఉన్నాడు. మొత్తంమీద చదువుకోనందువల్ల కలిగిన న్యూనతాభావం నుంచి ఎలాగో బయటపడగలిగాడు. అయినప్పటికీ అరుణమీద అతడెంత సోదరప్రేమ కురిపించినా చదువులో ఆమె తననుదాటి ముందుకు వెళ్ళడాన్ని ఇప్పటికీ పూర్తిగా క్షమించలేకపోయాడు. ఆ అన్నాచెల్లెళ్ళు కలుసుకున్న ప్రతి సారీ వాళ్ళమధ్య తీవ్రవాదోపవాదాలూ,విపరీత ప్రేమాభిమానాల ప్రదర్శనా ఏకకాలంలో జరిగిపోతూఉంటాయి. తమ మానసికస్థితుల్లోని అక్షణక్షణపరివర్తనతో జనానికి దిగ్భ్రమ కలిగిస్తూ ఉంటారు.

ఏమైతేనేం బలరాం వంటి ముళ్ళకంపతో తనిప్పుడు పని జరిపించు కోవలసివస్తోందను కున్నాడు శేఖర్. కొన్ని విషయాల్లో అన్నాచెల్లెళ్ళది ఒకటేపోలిక. ఏ క్షణంలో ఎలా ప్రవర్తిస్తారో తెలియని విపరీతప్రవృత్తి, ఆచరణలో ఎంతకైనా తెగించే స్వభావం, ప్రేమాభిమానాల్లో పట్టపగ్గాలు లేని ధోరణి. వివాదాల పరిష్కారంలో సిద్ధహస్తుడని కూడా బలరాం తన ప్రాంతంలో పేరు తెచ్చుకున్నాడు. కళాకళల మనిషి, చపలచిత్తుడు కావడం వల్లనే కావచ్చు, ఒక్కోసారి పరిష్కారం అసాధ్యమనిపించే వివిదాన్ని పైన వేసుకుంటూఉంటాడు; ఉదాహరణకు అత్తమామలవేధింపులను ఎదుర్కొంటున్న ఓ నిస్సహాయ వితంతువు; ఓ సంపన్నభూస్వామి పోలీసులతో చెప్పి అరెస్టు చేయించిన ఓ దళిత కౌలుదారు; ప్రేమించిన యువకునితో కాక బాగా ఆస్తిపాస్తులున్న వృద్ధుడితో బలవంతంగా పెళ్ళి జరిపిస్తున్న ఓ పేద పిల్ల... ఇటువంటి కేసుల్లో బలరాం తన ఇంట్లో తన ఖర్చుతో ఆ యువజంట పెళ్ళి జరిపించి అన్యాయంగా వ్యవహరించిన పోలీస్ అధికారిని రాత్రికి రాత్రి బదిలీ చేయించాడు. అతణ్ణి వ్యతిరేకించడమనే స్థితిని ఊహించుకోవడానికే జనం భయపడిపోతూఉంటారు. అయితే అతడికా పలుకుబడి అంతా తనకున్న వందల ఎకరాల భూముల వల్ల, ఆ భూముల నుంచి వచ్చే రాబడివల్ల వచ్చిందే. ఆ ఐశ్వర్యం లేకుంటే అతడూ ఒక అనామకుడుగానే గుమాస్తా కూలీ ఏదీకాని వాడుగానే మిగిలిపోయేవాడు. ఒక సాధారణ జీతగాడితో, చివరకు తన దగ్గర పనిచేసే ఎందరో వ్యవసాయకార్మికులతో కూడా సరితూగేవాడుకాదు. అది ఎవరూ కాదనలేని వాస్తవం. కనుక తనకున్న భూమిలో దాదాపు సగం భాగాన్ని ప్రభుత్వానికి ధారపోయవలసిరావడం అతనికేమాత్రం రుచించే విషయం కాదని సూక్ష్మ బుద్ధితో పసిగట్టాడు శేఖర్.

శేఖర్ ఎంతో చక్కగా పథకరచన చేసుకున్నాడు. ఎందరో పెద్ద భూస్వాముల్లానే బలరాం కూడా తన వంశచరిత్రను తలచుకుని గర్విస్తూఉంటాడని అతడు గమనించాడు. లేకితనం బాగాఒంటబట్టించుకున్న అతని పూర్వీకుల్లో ఒకతను కిందటి శతాబ్దంలో, వెనకటి నాసిర్‌జాలలో ఒకరి ప్రాపకం సంపాదించి, బహుశా అతడికి చేసిన ఘనమైన సేవలకు గుర్తింపుగా కాబోలు లకబ్ (బిరుదు) తో 'సత్కారం' అందుకున్నాడు. దాంతో ఆ కుటుంబీకుల రక్తం ఒక్క సారిగా

కులీన రక్తంగా మారి పోయింది. ఒక్కొక్క తరం గడిచినకొద్దీ ఆ రక్తం మరింత కులీనతను సంతరించుకుంటూ అందులో వేరే రంగు ఏదీ కలవలేదని బలరాం గొంతెత్తి గర్వంగా ప్రకటించుకునే వరకూ వెళ్ళింది. అది అతడికో యావగా పరిణమించిన విషయమూ శేఖర్ గమనించాడు.

పనివాడు వచ్చి బలరాం రాక గురించి తెలియజేసేవరకూ శేఖర్ ఇటువంటి పోకడలను గురించి ఒక విధమైన తిరస్కారభావంతో ఆలోచిస్తూ ఉన్నాడు. తక్షణమే నవ్వు ముసుగును ముఖానికి తగిలించుకుంటూ, ఎంతో దర్పంగా గర్వంగా నడిచివస్తున్న బలరాంను ఆహ్వానించడానికి గుమ్మంవైపు అడుగులు వేశాడు. ఈ విషయంలో చెల్లెలికీ, అన్నకీ మధ్య - అంటే తన గురించి స్పృహ కొంచెమైనా లేక నిరాడంబరంగా కనిపించే అరుణకీ, దురుసుతనం, దురహంకారం మూర్తీభవించిన ఈ దుర్మార్గుడికీ మధ్య– ఎంతో తేడా ఉందనుకున్నాడు శేఖర్ బలరాంతో కరచాలనం చేస్తూ .

'దయచేయండి రాజా సాహెబ్, దయచేయండి!' సంభ్రమంతో అన్నాడు శేఖర్, బలరాం అహాన్ని అతిశయం అంచులవైపు నడిపిస్తూ. ఒకమంత్రి తనను రాజాసాహెబ్ అని పిలవడం! బలరాం స్వాతిశయం అమాంతం కట్టలు తెంచుకుంది. ఎందుకు పిలవకూడదు? నిన్నటి వరకూ ఈ మంత్రి ఎవడు? ఎన్నో గ్రామాల్లో, ఎన్నో కుటుంబాల్లో వేర్వేరు పితృత్వాలక్రింద పెరుగుతున్న బలరాం అక్రమ సంతానానికీ, ఇతగాడికీ ఏమిటి తేడా? ఎంతైనా లంజకొడుకు లంజకొడుకే. అతడు వేరే ఏ హోదాలో ఉన్నాలేకపోయినా!

'ఎలా ఉన్నారు మంత్రిగారూ?' బలరాం పలకరించాడు. 'వెంటనే వచ్చి మిమ్మల్ని అభినందిద్దామనుకున్నాను. కానీ రాలేకపోయాను. ... మీరు మంత్రి అయినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది.'

శేఖర్ కృతజ్ఞతా సూచకంగా చిరునవ్వు నవ్వి అన్నాడు. 'ఇదంతా మీ వంటి పెద్దల చలవ రాజాసాహెబ్....'

'ఈమధ్య మంత్రిత్వశాఖల్లో ఏవో మార్పులు జరిగినట్టు విన్నానే?' యధాలాపంగా ప్రశ్నించాడు బలరాం. 'నిజం చెప్పాలంటే ఇటువంటి మార్పుల్ని నేను లెక్కచేసేవాణ్ణి కాదు. అవి నన్నేమీ చేయలేవు. పత్రికలు ఈ ఒక్క వార్తనే పట్టుకుని ఎందుకు వేలాడుతున్నాయో నాకర్థం కావడంలేదు.'

'ఈ రోజుల్లో పత్రికల ధోరణి గురించి మీకు తెలియందేముంది రాజా సాహెబ్, ఎంతో అమాయకత్వం ఒలకబోస్తూ అన్నాడు శేఖర్. 'ఈసారి ఎవరెవరి నుంచో దస్తాలకొద్దీ అభిప్రాయాలు సేకరించారట. మీరు చూసే ఉంటారు. అదలా ఉంచండి కానీ, జర్నలిస్ట్ ఎవరైనా మిమ్మల్ని కలిశాడా? మీలాంటి ప్రముఖుల్ని వాళ్ళు విస్మరించడం ఢిల్లీలో కుతుబ్‌మినార్‌ని విస్మరించడం లాంటిదే!'

'అవునవును, ఒకతను ఏదో... దాన్నేమంటారబ్బా, ఆఁ ఏదో ఏజెంట్‌నని చెప్పాడు...'

'అదిగదీ, మీ రంటున్నది న్యూస్ ఏజెన్సీ... కచ్చితంగా అదే. కొంపదీసి అది యు.ఎన్.ఐ. కాదు కదా?'

'అవునవును, ఇప్పుడు గుర్తుకొచ్చింది... అలాంటి పేరే. అతడొచ్చి కలుస్తానన్నాడు. ఈ రోజు డిన్నర్‌కి రమ్మన్నాను. అతడేమడగబోతున్నాడో నాకు తెలియదు...' అతనికి తెలియకపోయినా శేఖర్‌కి మాత్రం ఇప్పటికే అతడడగబోయేదేమిటో తెలుసు, ఎందుకంటే కొద్దిసేపటిక్రితం బలరాం గురించి యు.ఎన్.ఐ విలేఖరికి ఉప్పు అందించింది అతనే. ఆ విలేఖరి మొదట్లో అంత ఉత్సుకత చూపించలేదు కానీ బలరాం అరుణకి పెద్దన్న అని చెప్పగానే ఉత్సాహంగా రంగంలోకి దూకేశాడు. అరుణ సోదరుడు అరుణ ప్రియుడితో ఘర్షణకు దిగుతున్న వార్తకు ఉండే విస్ఫోటశక్తిని తక్షణమే అర్థం చేసుకున్న ఆ విలేఖరి తన అదృష్టానికి మురిసిపోయాడు!

'వాళ్ళందరూ అంతేనండీ' శేఖర్ అన్నాడు. 'తాము దేనిగురించి అడుగుతారో ఎప్పుడూ చెప్పరు. సూటిగా ప్రశ్నలు గుప్పించేస్తారు. అపారమైన అనుభవమూ, జ్ఞానమూ ఉన్నవాళ్ళు కనుక మీరు జవాబుల కోసం తడుముకోవలసిన అవసరం ఉండదనుకోండి. ఈ భూ ప్రపంచంలో ఉన్న ఏ విషయం గురించైనా అతడు మిమ్మల్ని అడగచ్చు. అయినా మీరు తడబడరని కచ్చితంగా చెప్పగలను. తానడగబోయేదేమిటో అతడు ముందుగా చెబితే ఎంత, చెప్పకపోతే ఎంత?'

బలరాం ఉబ్బితబ్బిబ్బయిపోయాడు. ఈ మంత్రి చాలా తెలివైనవాడు, ఎదుటి వాళ్ళను కరెక్ట్‌గా అంచనా వేస్తాడనుకున్నాడు. శేఖర్ పొగడ్తల వలలో పూర్తిగా చిక్కుకుపోయి మనసులోనే అతణ్ణలా అభినందించుకుంటూఉండగా శేఖర్ యధాలాపంగా అంటున్నట్టు అన్నాడు. 'బహుశా రాజాసాహెబ్, ఈ విలేఖరి మిమ్మల్ని అడగదల్చుకున్న విషయాల్లో భూసంస్కరణలు కూడా ఉండవచ్చు. మీకు తెలిసే ఉంటుంది, కొత్తగా భూసంస్కరణల కోసం ఒక మంత్రిత్వశాఖను ఏర్పాటు చేశారు —నా మిత్రుడు ఆనంద్ దానికి ఇన్‌చార్జ్...'

'తెలుసు, తెలుసు, నాకన్ని విషయాలూ తెలుసు' బలరాం వెంటనే అన్నాడు, తనకు తెలిసింది 'అన్ని' విషయాలకంటె తక్కువేమీకాదని చెప్పడానికి తహతహలాడుతూ. 'ఆనంద్ కొంతకాలంగా నాకు తెలిసినవాడే. నగరంలో ఉంటున్నా భూమి గురించి, వ్యవసాయం గురించి, పశువుల గురించి బాగా తెలిసినవాడు, మంచివాడు...'

శేఖర్ నాలుక కరచుకున్నాడు. తనదారికి అడ్డంగా పెద్ద బండరాయి ఎదురైందే అనుకున్నాడు. ఆనంద్, బలరాంల మధ్య స్నేహభావం ఉందన్నది హఠాత్తుగా, అనూహ్యంగా తలెత్తిన అవరోధంలా అతని కనిపించింది. అంతలో ఒక ఆలోచన వచ్చింది. ఇంతకుముందు కూడా అనేకసార్లు ఆ ఆలోచన వచ్చింది. కానీ బలవంతంగా ఏమాత్రం రాజీపడకుండా దానిని అణచుకున్నాడు. అయితే బలరాం, తనూ ముఖాముఖి మాట్లాడుకుంటున్న ఆ క్షణంలో ఆ ఆలోచన మరీ మరీ అతణ్ణి ప్రేరేపిస్తోంది. ఆనంద్ — అరుణల స్నేహం గురించి తన పద్ధతిలో నర్మగర్భంగా సూచిస్తే ఎలా ఉంటుంది? దీనివల్ల తమ వంశం పేరు ప్రతిష్ఠలు ఎలా మంటగలిసిపోతున్నాయో అతని బుర్రలోకి ఎక్కిస్తే? కొన్ని తరాల కిందట అతని పూర్వీకులు సాధించుకున్న లకబ్ ఇప్పుడు అనౌచిత్యానికి లకబ్‌గా పరిణమిస్తుందని అతడికి బోధిస్తే? మగవాడి విషయంలో అది సిగ్గుచేటు కానేకాదు; పైగా అది పురుషత్వానికి చిహ్నంకూడా. దానికి బలరామ్ స్వయంగా ఒక చక్కని ఉదాహరణ. కానీ కుటుంబంలోని ఓ ఆడపడుచు... ఎంత దారుణం!

ఆ మాట చెప్పడం చాలాతేలిక నాలుక చివరివరకు వచ్చింది.. అయినా శేఖర్ అతికష్టం మీద ఎలాగో అణచుకున్నాడు. ప్రమాణ స్వీకారం రోజున ఆనంద్ సరసన నిలబడిన అరుణనూ ఆమె చామనచాయ ముఖాన్నీ, గర్వంతో, ఆనందంతో మెరిసిపోయే ఆమె కళ్ళనూ తను తొలిసారి చూసిన క్షణాన్ని గుర్తు చేసుకున్నాడు. అప్పుడే ఆమెను 'చెల్లాయి' గా సంబోధించాడు. అప్పటినుంచి ఆమెనలాగే పిలుస్తున్నాడు. తనలోని 'కళంకిత' రక్తానికి నిత్యం అందరి నుంచి దుస్సహమైన దుర్భాషలు ఎదుర్కొంటూ తాను గడీలో ఒంటరిగా పుట్టి పెరిగిన రోజులనుంచి ఓ చెల్లాయి కోసం తపించిపోతూ ఉండేవాడు. తన తల్లికి లెక్కలేనన్నిసార్లు నిర్బంధ గర్భస్రావాలు జరిపించిన గడీలోని పెద్దలు ఒక్కసారైనా ఆమెను విడిచిపెట్టిఉంటే తనకో చెల్లాయి పుట్టిఉండేదేమో. కానీ అలా జరగలేదు.... అందుకే అరుణకు ఎటువంటి అపకారం జరగకుండా జాగ్రత్తపడుతూ వచ్చాడు. ఈ బలహీనతకు ఒక్కోసారి తనను తనే నిందించుకునేవాడు, తనెంతో గర్వకారణంగా తలపోసే తనలోని నిర్దాక్షిణ్యప్రవృత్తి కది పూర్తిగా విరుద్ధం. అయినాసరే అరుణను నాశనంచేసే కుతంత్రంవైపు అతడి బుద్ధి మళ్ళేది కాదు. మనిషినుంచి మృగానికి జరిగే తన పరివర్తనలో ఈ లోపం తలెత్త కుండా అతడేమీ చేయలేకపోయాడు. అతడి గుండెల్లో ఓ మూల ఆ తడి అలాగే ఉండిపోయింది.

'భూసంస్కరణల మంత్రిగా ఆనంద్ ఏం చేస్తాడని మీ ఉద్దేశం?' శేఖర్ అడిగాడు, తాను దృష్టి పెట్టవలసిన అంశం అదొకటేనని తెలుసుకుని సంభాషణను మళ్ళీ అటువైపు మళ్ళిస్తూ.

'నా కెలా తెలుస్తుంది?' బలరాం భుజాలు ఎగరేస్తూ ఎదురు ప్రశ్న వేశాడు. 'వాళ్ళేదో చట్టం ఆమోదిస్తారేమో, చూద్దాం మిగిలిన విషయాలు ఒక మంత్రిగా మీకే తెలుస్తాయి...'

'ఇంకా చట్టం రాలేదు' శేఖర్ అన్నాడు. 'పార్టీ విధానాలు అందరికీ తెలిసినవే. అరుణ చూచాయగా మీకు చెప్పే ఉండాలే?'

'అరుణా?' పగలబడినవ్వాడు బలరాం. 'భూమి గురించి పాపం దానికేం తెలుసు? పల్లెలో పుట్టిందన్నమాటే కానీ అదెక్కువగా గడిపింది నగరంలోనే. వరి నేలమీద పెరుగుతుందో నేల కింద పెరుగుతుందో కూడా దానికి తెలిసి ఉంటుందనుకోను. భూమి గురించి, భూ సంస్కరణల గురించి అదేం చెప్పినా నేను పెద్దగా పట్టించుకోను' అంత చదువుకుని ఎం ఎల్.ఏ. హోదాలో ఉన్నప్పటికీ తన చెల్లెలికి తెలియని విషయం కనీసం ఒక్కటైనా ఉందని నొక్కి చెప్పడానికి అతడి అహం తహతహ లాడింది.

'మీరు ఆనంద్‌నే అడిగితే బాగుంటుందేమో' హఠాత్తుగా సరికొత్త ఉత్సాహం ముంచెత్తగా శేఖర్ సూచించాడు. 'నేరుగా సంబంధించిన మనిషి నోట్లోంచి రాబట్టుకోవచ్చు.'

'అవునవును. మంచి ఆలోచన. ఆనంద్‌నే అడుగుతాను. బహుశా రేపు ఉదయమే. అప్పాయింట్ మెంట్ కోసం ప్రయత్నిస్తాను...?'

'వెంటనే అపాయింట్‌మెంట్ ఫిక్స్ చేయమని అరుణ నెందుకు అడగకూడదు?' అన్నమాట శేఖర్ నోటిదాకా వచ్చింది కానీ నిగ్రహించుకున్నాడు. పూర్తిగా శత్రునిశ్శేషం చేసుకోవడమే

తన పథకమైనా ఒక మనిషిని మాత్రం కాపాడాలనుకుంటున్న సంగతి అతనికి పదే పదే స్ఫురణ కొస్తోంది. సంపూర్ణవినాశనం జరిగినప్పుడు దానికి ఏ ఒకరిమీదా ప్రత్యేకించి దయాదాక్షిణ్యా లుండవని అతనికి తెలుసు. అయినా సరే విచిత్రంగా, విడ్డూరంగా, అర్థరహితంగా అరుణ విషయంలో అతడలా ఉండాలని కోరుకుంటున్నాడు. సర్వనాశనం చేయాలన్న తన ఆకాంక్ష ఎంత స్పష్టంగా, ఎంత అసందిగ్ధంగా ఉందో ఈ ఆకాంక్ష కూడా అంత స్పష్టంగానూ, అంతే అసందిగ్ధంగానూ ఉంది.

'పార్టీ విధానం గురించి నాకు కొంత తెలుసు' శేఖర్ కొనసాగించాడు. 'తగిన' సన్నాహం లేకుండా బలరాం ఆనంద్‌ను కలుసుకోవడం అతనికి ఇష్టంలేదు. 'ముందుగా చెప్పుకోవాలంటే వందల ఎకరాల భూమి కొద్ది మంది చేతుల్లో ఉండిపోవడం ప్రజలకూ మంచిదికాదు, భూ యజమానులకీ మంచిదికాదు, సాగుబడికీ మంచిదికాదని పార్టీ భావిస్తోంది. ఒక విధమైన సహకారసేద్యాన్ని ప్రవేశపెట్టాలని పార్టీ ఆలోచన. అలాగే కౌలుదార్లకూ పాలికాపులకూ కాల వ్యవధిని నిర్ణయించి అమలు చేసే చట్టం ఉండాలి. పీడించి పంటలో అధికభాగం గుంజు కోవడం, కౌలుదార్లను తరచు మార్చుతూ ఉండడం అంతం కావాలి. చివరగా, ఇంత పరిమితిని మించి ఏ కుటుంబానికీ భూమి ఉండకూడదు. పరిమితిని మించిన మిగులు భూములు ప్రభుత్వపరం అయిపోతాయి. గ్రామాల్లోని భూమిలేని పేదలకు ఆ భూమిని పంచిపెడతారు... నేను చెబుతున్న రేఖామాత్రమేనని మీకు అర్థమైందనుకుంటాను.'

బలరాం ఎంతో శ్రద్ధగా విన్నాడు. ఆ తర్వాత విరగబడి నవ్వుతూ ఉండిపోయాడు. వినోదం సద్దుమణిగిన తర్వాత మొహం నిండా నవ్వు చేసుకుంటూ అన్నాడు. 'రెవెన్యూ డిపార్ట్‌మెంటులోని ఆఫీసర్లు ఈ చట్టాలు అమలు చేయబోతున్నారు .. అంతేనా?!'

'అవును... అంతేననుకుంటాను' శేఖర్ గొణుగుతున్నట్టు అన్నాడు. 'వాళ్ళు కాకపోతే ఇంకెవరు చేస్తారు?'

'నా కీ సమాచారం చెప్పినందుకు సంతోషం' బలరాం మధ్యలో తుంచుతూ అన్నాడు. 'చట్టాలు రానివ్వండి, ఎన్ని చట్టాలైనారానివ్వండి, ఎన్ని వస్తే అంత ఆనందం. ఎంత త్వరగా వాటిని పాస్ చేయిస్తే అంత సంతోషిస్తాను.'

ఈ ప్రారంభం కోసమే శేఖర్ ఎదురు చూస్తున్నాడు. అవకాశాన్ని వెంటనే అందిపుచ్చుకున్నాడు. గంభీరంగా చూస్తూ అన్నాడు. 'రాజా సాహెబ్, ఈ విషయాన్ని మరీ అంత ఆషామాషీగా తీసుకోకండి. ఎలాంటి కష్ట నష్టాలు రానీ, పార్టీ తన వాగ్దానాన్నిచెల్లించుకుంటుంది. అందులో సందేహం లేదు. గతంలో ఎవరికీ తెలియనంతగా తన కర్తవ్యం ఏమిటో క్షుణ్ణంగా తెలిసిన మంత్రి ఒకడు ఇప్పుడున్నాడన్న విషయం మరిచిపోకండి. అదీగాక అతగాడు కొంచెం కూడా పట్టు విడుపులు లేని భూసంస్కరణవాది అనే వాస్తవం కూడా మీరు తెలుసుకోవాలి. ఇప్పటి నుంచి మీరు తలపడబోతున్న ఆ మనిషి గురించి మీకు బొత్తిగా తెలిసినట్టులేదు. నా మాటకొస్తే వ్యక్తిగతంగా భూయజమానుల మీద నాకు తరగనంత సానుభూతి ఉంటే ఉండచ్చు. శతాబ్దాలుగా

తమ జీవికకు ఆధారం చేసుకున్న భూమిని యజమానుల నుంచి బలవంతంగా గుంజుకునే ఈ విపరీతకార్యక్రమంతో నేను ఏకీభవించకపోవచ్చు. అయినా పార్టీలో క్రమ శిక్షణ పాటించ వలసిన సైనికుడిగా నేను కానీ మీరుకానీ కచ్చితంగా తాను చేయదలచుకున్న ఆ పని చేయకుండా ఆనంద్‌ను ఎలా నిరోధించగలమో అర్థం కావడంలేదు. ఈ వ్యవహారం అనుపానులన్నీ అతనికి తెలుసు. చట్టం అమలులో ఏవో లొసుగులు తప్పకుండా ఉంటాయి కనుక వాటిమీద ఆధారపడవచ్చునని మీరనుకుంటున్నారేమోకానీ వాటి మీద కూడా అతడు ఓ కన్ను వేసేఉంచాడు. ఆ కంతల్నిపూడ్చి మీ అవకాశాల్ని శాశ్వతంగా కత్తిరించకుండా ఉంటాడని ఎంతమాత్రం అనుకోకండి. ఈ బలవత్తరమైన ప్రభుత్వాన్ని సవాలుచేసి ఎవడూ బట్టకట్టలేడు? మీకు తెలియదా?'

రాజాసాహెబ్‌లో కొంత కలవరపాటు తొంగిచూసింది. అయితే శేఖర్ విషప్రవృత్తి స్పష్టంగా బయటపడిపోతోంది కనుక అతడు పూర్తిగా కుప్పకూలిపోలేదు. మంత్రిగాడెవడైనా ప్రతి గ్రామానికీ వెళ్ళి ఏ చట్టాన్నీ, ఎంత దిక్కుమాలిన చట్టాన్నీ అమలుచేయలేడని మనసులో అనుకున్నాడు బలరాం. ఈ ముండాకొడుకు మిన్నువిరిగి మీదపడబోతున్నట్టు ఇలా పొలికేకలు పెడతాడేమిటి?... ఆ క్షణాన ఇదో చిక్కుముడిలా కనిపిస్తున్న మాట నిజమే. జవాబులు లేని మరికొన్ని ప్రశ్నబాణాల తర్వాత బలరాం వెళ్ళడానికి లేచి నిలబడ్డాడు. 'ఏమైనా మంచి సమాచారం అందించారు, సంతోషం. మీ సలహా ప్రకారం అసలునిజాలేమిటో ఆనంద్‌నే అడిగి తెలుసుకుంటాను... మీరన్నట్టు సంబంధించినవాడి నోట్లోంచి' అంటూ కరచాలనం చేశాడు.

'అదీ, అలా చేయండి' బలరాంను కారువరకూ సాగనంపుతూ శేఖర్ అన్నాడు. 'అయితే వాస్తవంగా తను చేయబోతున్నదేమిటో మీకు తెలిసేంతగా ఈమనిషి నోరు విప్పడు. ఈ జోస్యం మీద దేనినైనా ఒడ్డడానికి నేను సిద్ధం. ... ఈ చేదు మాట అంటున్నందుకు ఏమీ అనుకోకండి. మీ శ్రేయోభిలాషిని కనుక ఎంత నిష్ఠురంగా ఉన్నా పూర్తి నిజం చెప్పడం నా బాధ్యత...'

బలరాం పరధ్యానంగా వెళ్ళి కారులో కూర్చున్నాడు. అతడు దఢాలున తలుపుమూస్తుంటే పంచెకొంగు తలుపుసందులో ఇరుక్కుపోయింది. కారు ముందుకు సాగుతుంటే తలుపులోంచి బయటకొచ్చి జెండాలా ఎగురుతున్న గంజిపెట్టిన ఆ తెల్లని అంచువైపు చూస్తున్న శేఖర్, చికాకుతో తలపోస్తూ ఉండిపోయాడు. తన పన్నాగం తిరుగుతున్న విచిత్రమైన మలుపు గురించి ఆశ్చర్యపడుతున్నాడు. శాశ్వతంగా భూస్వాముల అత్యాచారాలను తుదముట్టించడానికి త్రికరణ శుద్ధిగా పోరాడుతున్న ఆనంద్ పట్ల వ్యక్తిగతద్వేషంతో, తనను చిన్నతనం నుంచి చిత్రహింసలు పెట్టిన అదే భూస్వామ్య వర్గానికి సహాయం చేయడానికి తనిప్పుడెందుకు ప్రయత్నిస్తున్నాడు– ఎందుకు?

# 30

చౌదరి నివాసంలో సమావేశమై తన నూతనబాధ్యతలగురించి చర్చించిన తర్వాత ఆనంద్ ఒక రోజంతా ఆఫీసుకు వెళ్ళలేదు. ఇంటివద్దనే ఉండిపోయి నూతనవిధి నిర్వహణలో తనే విధంగా ముందుకు వెళ్ళాలో తన శక్తిమేరకు ఆలోచించుకోవాలనుకున్నాడు. ఉదయమంతా ప్రశాంతంగా యోచించుకుంటూ గడిపాడు. ఇప్పుడు బొమ్మను రెండువైపులా స్పష్టంగా చూడగలుగుతున్నట్టనిపించింది. ఏదైనా సమస్యను పైపైన కా కుండా మూలంలోకి వెళ్ళి ఎదుర్కోవాలనుకున్నప్పుడు ఇదే తగినపద్ధతని అనుకున్నాడు.

నాలుగురోజుల తర్వాత, ఓ రోజు మధ్యాహ్నం అరుణ హఠాత్తుగా తన సహజధోరణిలో చిటపటలాడుతూ వచ్చింది. ఆనంద్ ఆ ధోరణిని అర్థంచేసుకుని వినోదించడానికి ఇప్పటికే అలవాటుపడిపోయాడు. అదనేక అంశాల సమ్మేళనమే కానీ ఇప్పుడు ముఖ్యంగా తాను కోరు కున్నప్పుడల్లా ఆనంద్‌ను కలవలేకపోతున్నందుకు చిరచిరలాడుతోంది. 'నీకు నీ పని తప్ప మరేమీ పట్టడంలేదు. మార్పుకోసం, నేనే నీ అభిమానగ్రంథాన్నో, ఫైలునో అయితే ఎలా ఉంటుం'దని ఎత్తిపొడిచింది. ఆ మాటకు 'ఇప్పటికే నువ్వు నా అభిమానగ్రంథానివి. మామూలు గ్రంథంకాదు, పిచ్చిపట్టిన ఓ మహాకవి రాసిన మహాకావ్యానివి' అన్నాడు ఆనంద్.

ఆనంద్ తన రాజకీయజీవితంలో ముందుకు సాగుతున్నట్టు కనిపిస్తున్న ఆ దశలో అరుణ మాత్రం ఉన్నచోటే ఉండిపోయింది. ఎజెండాలేని సమావేశాలు మొదలుకుని మగరాజకీయవాదుల గురించి అతిశయోక్తులు చెప్పుకునే ఉబుసుపోక కబుర్ల వరకూ అర్థంపర్థంలేని కార్యక్రమాలతో తన సమయం వృధా చేసుకుంటోంది. ప్రభుత్వంనుంచి, ముఖ్యంగా ఆనంద్‌నుంచి ఈ సహాయం ఆ సహాయం చేయించి పెట్టమని వేధిస్తూ తనచుట్టూ చీమల్లా మూగుతున్న స్వార్థపరశక్తులతో ఆమె విసిగిపోయింది. ఆనంద్ ఇరిగేషన్ మంత్రిగా లేకపోయినా కొందరు కాంట్రాక్టర్లు అరుణ దగ్గరకు వచ్చి ఆనంద్‌తో చీఫ్ ఇంజనీర్లకు చెప్పించి తమ పని చేయించమని అడుగుతూనే ఉన్నారు. అందుకు వాళ్ళు చూపించే ప్రతిఫలాలు రకరకాలుగా ఉండేవి. ఆమె ఆగ్రహంతో రగిలిపోయేది. తన ఎదుట ఆనంద్ గురించి ఎవరైనా అమర్యాదగా మాట్లాడితే ఆమెలో ఉద్రేకం పూర్తిగా అదుపు తప్పిపోయేది. ఆమెనలా రెచ్చగొట్టి ఆమెకీ ఆనంద్‌కీ మధ్య సాన్నిహిత్యాన్ని

గురించి రోజురోజుకీ విస్తరిస్తున్న ముచ్చట్లకు సరికొత్త ముచ్చట జోడించడం ఇంచుమించు నిత్యతంత్రంగా మారింది. ఇటువంటి సందర్భాల్లో ఆమె విపరీతస్పందన పరిస్థితిని మరింత విషమింపజేసేది. అయినా ఆమె తన ఆగ్రహావేశాల్ని అదుపు చేసుకునేది కాదు. ఈ విషయంలో ఆమెకు సలహాలు, సూచనలు ఇవ్వకుండా ఆనంద్ తన స్వాభావిక సరళిలో తటస్థంగా ఉండిపోయేవాడు, ఏమైనా చెబితే ఆమె సరిగ్గా దానికి వ్యతిరేకంగా చేస్తుందన్న భయంతో.

'ఏమిటి సమస్య అరుణా?' ఆనంద్ అడిగాడు.

'నువ్వే' అరుణ చటుక్కున అంది. 'ఇంకెవరుంటారు? ఇంకేముంటుంది?'

'అదెప్పుడో తేలిపోయిన విషయం. అటువంటి అల్పవిషయాలకు నువ్వింతగా విరుచుకు పడవే, అవునా?... ఈసారి ప్రత్యేకంగా ఏదో జరిగి ఉండాలి!'

'నువ్వెప్పుడూ ప్రత్యేకమే' అందామె. ఆ తర్వాత ఒకింత చల్లబడి 'నాకే అనుకో...' అని వివరిస్తూ.

'సరే' అంటూ ఆనంద్ ఆమెను ఓ సోఫాలో కూర్చోబెట్టి పక్కన కూర్చున్నాడు 'ఆ సమస్య ఏమిటో తెలుసుకోనీ. మరీ మరీ రికమెండేషన్లతో ప్రాణం తీస్తున్నారా? సూటిపోటిమాటలు మరీ ఎక్కువై పోయాయా? నిన్ను దూరం చేసేంతగా ఊపిరిసలపని కార్యక్రమాల్లో మునిగి పోయాననా?' ఈ ప్రతి ఊహకీ ఆమె తల అడ్డంగా ఊపేసరికి 'సరే, ఇక ఊహించడం నా వల్లకాదు. ఓడిపోయాను. నువ్వే చెప్పెయ్' అన్నాడు.

'నీ కొత్త పోర్ట్‌ఫోలియో నాకు ఆందోళన కలిగిస్తోంది. దానిపై వింటున్న వ్యాఖ్యలకు భయ పడిపోతున్నాను. అది చాలా ప్రమాదకరంగా కనిపిస్తోంది'

'నువ్వు ఎంతో వినుండాలి. వాటిల్లో ప్రత్యేకించి ఎంతోప్రమాదకరంగా కనిపించే కొన్ని ఆణిముత్యాల్లాంటి మాటలు చెబుతావా? అలాగే ఎవరికి ప్రమాదమో ఎందుకు ప్రమాదమోకూడా...'

'ఎక్కడ ప్రారంభించాలో నాకు తెలియడం లేదు. అయినా ప్రయత్నిస్తాను. భూసంస్కరణల బాధ్యత నీకు అప్పజెప్పమని చౌదరిమీద నువ్వెంతో ఒత్తిడి తెచ్చావని వాళ్ళంటున్నారు. ఢిల్లీలో కూర్చుని అందుకోసం ప్రయత్నాలు చేశావట. ఇదెంత అత్యవసరంగా అమలుచేయవలసిన కార్యక్రమమో ముఖ్యమంత్రులకు సూచించడానికి నువ్వే ప్రధానమంత్రిని ఒప్పించావట. ఆ శాఖను తక్షణమే నీకు అప్పజెప్పమని ప్రధానమంత్రికి బాగా సన్నిహితుడైన వ్యక్తితో చౌదరికి నువ్వే చెప్పించావట. తక్షణమే ఎందుకంటే, తనప్పుడు రాష్ట్రరాజధానిలో లేకపోయినా ఆ శాఖను తనకు బలవంతంగా కట్టబెట్టారని అందరూ అనుకోవడం కోసమట. నీ తక్షణ వ్యాఖ్యకోసం ఓ ప్రముఖజర్నలిస్ట్ నీతో మాట్లాడినప్పుడు తప్పించుకునే జవాబులు చెప్పావట. ఎదుటివాళ్ళను తికమకపెట్టే నీ ఆటలో అది భాగమట...'

'చాలా బాగుంది' అన్నాడు ఆనంద్. 'అయితే ఇదంతా నేనెందుకు చేస్తున్నానట? నా ఉద్దేశం ఏమిటనుకుంటున్నారు? లేక పిచ్చాసుపత్రిలో చేర్చడానికి తగినవాణ్ణనుకుంటున్నారా?'

'ఆ విషయానికే వస్తున్నాను' అరుణ అంది. 'నీ ఉద్దేశం గురించి ఒక్కో గ్రూపు ఒక్కో రకంగా అనుకుంటోంది భూస్వాములు మాత్రం తమ నాశనానికే సిద్ధమయ్యావనుకుంటున్నారు.'

'ఎందుకో వివరించే ప్రయత్నం చేశారా?' ఆనంద్ అడిగాడు.

'ఆ విషయంలో ఏకాభిప్రాయం లేదు. ఒక వదంతి మాత్రం వినిపిస్తోంది ఎవరో భూస్వామిని, తన వందెకరాల మెట్టభూమిని నీకు అమ్మమని అడిగావట త్వరలోనే ఒక ఇరిగేషన్ పథకం అమల్లోకి వచ్చి అది మాగాణిగా మారిపోతుందట మెట్టభూమి ధరే నువ్వు ఇస్తాననేసరికి అతడు వీలుకాదన్నాడట. న్యాయం అతడివైపే ఉన్నట్టు స్పష్టంగా కనిపిస్తోంది కూడాను. అందుకని భూస్వాముల భూములన్నీ హరించి వాళ్ళను బిచ్చగాళ్లుగా మార్చేస్తానని శపథం చేసావట'

'మిగిలిన గ్రూపుల వాళ్ళేమంటున్నారు?'

'వాళ్ళు రకరకాలుగా చెప్పుకుంటున్నారు. భూసంస్కరణలను ఆపలేమని తెలుసుకుని, భూస్వాములకు వీలైనంతసహాయం చేయడం కోసం ఆ శాఖ నీకే వచ్చేలా తెరవెనక పథకం నడిపించావట. ఎంతైనా నువ్వు ఆ వర్గం వాడివే కదా అని వాళ్ళ వ్యాఖ్య. ఏమాత్రం సానుభూతిలేని శేఖర్‌లాంటి మంత్రుల చేతుల్లో పడి భూస్వాములు నాశనం కాకూడదనుకున్నావట. ఈ కీలకమైన శాఖకోసం అతడూ నువ్వూ పోటీ పడ్డారని కూడా చెప్పుకుంటున్నారు...'

'ఇంతకీ సాధారణ ప్రజలు ఏమనుకుంటున్నారు?'

'కొద్దిరోజులపాటు నా నియోజకవర్గంలో తిరిగొచ్చాను నిజానికి నిన్ననే ఓ మారుమూల గ్రామానికి వెళ్ళొచ్చాను. మామూలుజనం నువ్వు వాళ్ళకి భూమి ఇస్తావనే అనుకుంటున్నారు. అయితే ఆ భూమిని నిలబెట్టుకోగలమన్న ధీమా మాత్రం వాళ్ళలో కనిపించలేదు. ఆ భూమి ఎలాగూ తిరిగి భూస్వాముల చేతుల్లోకే పోతుందనుకుంటున్నారు. మొత్తం మీద ఆశ, నిరాశల మధ్య వాళ్ళు ఊగిసలాడుతున్నారు...'

'నీ నియోజకవర్గంలో వామపక్ష కార్యకర్తలు ఎక్కువ సంఖ్యలో ఉన్నా రు. వాళ్ళ అభిప్రాయమెలా ఉందో తెలుసుకున్నావా!'

'ఆహాఁ...ఇది అధికారపక్షం విసిరిన మరో పాచిక అనే మొత్తంమీద వాళ్ళలో వ్యక్తమౌతున్న అభిప్రాయం. అయితే ఈసారి వాళ్ళు మరీ ఎక్కువగా మండిపడిపోతున్నారు. ఈ వ్యవహారాన్ని ఇప్పుడంత తేలిగ్గా కొట్టిపారేసేలా లేరు'

'ఏమిటి దానర్థం?'

'నాకు తెలియదు. వాళ్ళు భయపడుతున్నారేమో, లేక అసంతృప్తి పడుతున్నారేమో, రెండూ అయినా కావచ్చు'

ఆలోచనగా తలపంకించాడు ఆనంద్. 'వాళ్ళెందుకు అసంతృప్తిగా ఉన్నారో కనిపెట్టావా?'

'ఏమో, అంతస్పష్టంగా చెప్పలేను. ఆ పార్టీలో కాస్త నోరు తెరిచి మాట్లాడే ఓ పెద్దమనిషి

ఇంతకాలంగా అధికారపక్షానికి వ్యతిరేకంగా తాము గురిపెడుతూవచ్చిన ఓ అంశాన్ని తాము వదులుకోవలసి రావచ్చునన్నాడు. ఆఁ, నిజంగా ఎక్కడ జరుగుతుందిలెమ్మని పైకి బింకం చూపించబోయాడు కానీ, సారథ్యం నీది కనుక ఆ ధీమా సడలినట్టే కనిపించాడు. తమ పార్టీ వాళ్ళకికూడా భూసంస్కరణల గురించి స్పష్టమైన అవగాహనలేదట. అయినా తాము ప్రభుత్వం ఏర్పాటు చేసి ఈ కార్యక్రమాన్ని అమలుచేయడమనేది ఎలాగూ జరగబోవడం లేదు కనుక ప్రస్తుతానికి తాము చేయగలిగింది, ఈ అంశం నుంచి వీలైనంత రాజకీయప్రయోజనం రాబట్టుకుంటూ భూమిలేని పేదలు తమ చేతుల్లోంచి జారిపోకుండా కాపాడుకోవడమేనట'

ఆమె ఈ ఘట్టంలో అర్ధంతరంగా ఆగిపోయి సూటిగా అతని కళ్ళల్లోకి చూస్తూ అంది, 'ఇదేమిటి, నేనిలా పిచ్చిదానిలా వాగేస్తున్నాను? భూసంస్కరణల గొడవలో పడిపోయి నువ్వు మరీ బిజీ అయిపోయావని తగవు పెట్టుకోడానికి నే నొస్తే, నాచేత నువ్వా విషయమే మాట్లాడిస్తున్నావ్! ఇక చచ్చినా మాట్లాడను' అంటూ అసలు మాట్లాడనే మాట్లాడనన్నట్టుగా మూతి ముడుచుకొని కూర్చుంది.

కొద్దిసేపటికి వాళ్ళ ఓరిమి నశించింది... మళ్ళీ ఆనంద్ నూతనబాధ్యతలగురించే మాట్లాడుకోడం ప్రారంభించారు. ఎజెండాలో ఉన్న విషయం అదొక్కటే, వాళ్ళకి నచ్చనీ నచ్చకపోనీ.

'అసలిందులో ఎందుకు ఇరుక్కున్నావ్?' అరుణ కలవరపాటుతో ప్రశ్నించింది. 'మా అన్న బలరాం కూడా నీ మీద కోపంగా ఉన్నట్టు వాళ్ళనుకుంటున్నారు. మీరిద్దరూ ఏమైనా గొడవపడ్డారా? అతడికి నువ్వంటే ఎంతో ఇష్టం కూడా...'

'ఆ విషయంగురించి చర్చించడానికి మేమిద్దరం ఇంతవరకూ కలుసుకోలేదు కూడా. అయినా అతని అభిప్రాయాలు అతనికుండచ్చు, అలాగే అతని అసంతృప్తి కూడా...'

'నీతో కనీసం మాట్లాడకుండానే?'

'అందులో ఆశ్చర్యమేముంది? ఇప్పటికే చాలామంది అతడితో నా గురించి మాట్లాడి ఉండచ్చు కదా, ఇప్పుడు నువ్వు నాకు చెప్పినవన్నీ అతడికి చెప్పి ఉండచ్చు కదా?'

'సరే, ఇప్పుడు చెప్పు. ఇదంతా ఏమిటి? హఠాత్తుగా అందరూ నీ మీదెందుకు విరుచుకు పడుతున్నారు? నువ్వు ఏం చేయబోతున్నావని, ఎందుకని, ఆలోచిస్తున్నారు? అసలీ సాలె గూట్లో నువ్వెందుకు చిక్కుకున్నావ్?'

'నాకు నిజంగా తెలియదు అరుణా' ఆనంద్ అన్నాడు. 'పరిణామాలరీత్యా, నువ్వు విన్నదాంట్లో కొంత వాస్తవం ఉంది. ఉదాహరణకు చౌదరి కొత్తపోర్ట్‌ఫోలియో సృష్టించాడు, నేను ఢిల్లీలో ఉన్నప్పుడే ఆ శాఖను నాకు కేటాయించాడు. చౌదరి ఎందుకలా చేశాడో, ఆయనతో అంత వివరంగా చర్చించిన తర్వాతకూడా నాకు తెలియలేదు. నా వెనకాల రకరకాల వక్రవ్యూహాలు పనిచేస్తున్నాయి. వాటి ఫలితాలను స్వీకరించవలసిన స్థితిలో మాత్రమే నేనున్నాను. నాకు

భూములున్న విషయం తెలిసినదే, భూపరిమితిచట్టం అమల్లోకి వస్తే అందులో నేను సైతం పోగొట్టుకునేది ఎంతో ఉంటుంది. కనుక వాళ్ళు రకరకాల అన్వయాలు కల్పించుకుంటారు. భూయజమానులకే నా మద్దతు ఉంటుందని, ప్రత్యక్షపరిస్థితిమీద ఆధారపడి వారిచ్చే వివరణ అందులో ఒకటి. నా సోదరులమీదే నేను శత్రుత్వం వహించినట్టు చిత్రించేది రెండోది. ఇలాంటివెన్నో... ఇందులో పైకితేలిన అసలునిజమేమంటే, తలకోమాట మాట్లాడుతారేకాని ఒక నినాదాన్ని కార్యక్రమంగా మార్చడం గురించి ఆలోచించేవారు ఒకరూ లేరు. అమలుచేయడమనేది ఎప్పుడో ఆఖర్నే ఉంటుంది... ఇక నా విషయానికొస్తే, ముఖ్యమంత్రి నుంచి తదుపరి ఆదేశాలు అందేవరకూ —అంటే వాస్తవానికి పార్టీఅధిష్ఠానవర్గంనుంచన్నమాట —నిరీక్షించడమే నా పని. ఈ క్షణాన అంతకుమించి నేను చేయగలిగిందేమీ కనిపించడంలేదు.'

'భూసంస్కరణలమీద నీకు దృఢమైన అభిప్రాయాలున్నాయి. అవునా?'

'అవును, అలా ఉండడం సంభవించింది.'

'అలాగే మిగిలిన వాళ్ళకీ ఉంటాయి. వాళ్ళ అభిప్రాయాలు నీ అభిప్రాయాలకు పూర్తిగా భిన్నంగా ఉన్నాయి. అవునా?'

'అవును, ఉన్నాయి'

'రెండింటిమధ్య ఘర్షణ తలెత్తితే ఏం జరుగుతుంది?'

'నాకు తెలియదు. వేచిచూద్దాం'

ఆ దశలో ఫోన్ మోగింది. 'హల్లో' అంటూనే మౌత్‌పీస్ అరచేత్తో మూసి అరుణతో 'మీ అన్న!' అని మెల్లగా చెప్పాడు. 'ఎలా ఉన్నారు బలరాంగారూ? ఎందుకు, ఏమిటందులో ఇబ్బంది! నేను ఫార్మాలిటీలు పట్టించుకోనని మీకు తెలుసు. మీరు ఎప్పుడైనా రావచ్చు. ఇప్పుడు రాగలరా?'

'దారిలో ఉన్నాను' అవతలినుంచి జవాబు. 'గంటక్రితమే ఇంట్లోంచి బయలుదేరాను; వేరేచోటినుంచి మీతో మాట్లాడుతున్నాను'

'అంటే మీరిక్కడికి రావడానికి రెండుమూడునిముషాలకన్నా పట్టదు. తప్పకుండా రండి...'

క్షణకాలం తత్తరపాటు, అనుమానం కలగలిసిన నిశ్శబ్దం. తర్వాత బలరాం అన్నాడు, 'నేనంత దగ్గరలో ఉన్నట్టు మీకెలా తెల్సు?'

'జస్ట్, అలా స్ఫురించింది' ఆనంద్ అన్నాడు. 'మీ రెంత దగ్గరలో ఉన్నా రు. ఎంత దూరంలో ఉన్నారన్నది ముఖ్యంకాదు కదా? మీకోసం ఎదురుచూస్తుంటాను'

'ఎక్కడున్నాడు?' అరుణ అడిగింది, ఆనంద్ రిసీవర్ కిందపెట్టగానే.

'అక్షరాలా రాయివేటు దూరంలో' మందహాసంతో అన్నాడు ఆనంద్. 'నామీద ఎప్పుడూ ఎక్కడి నుంచి రాళ్ళు వచ్చిపడుతుంటాయో, సరిగ్గా అక్కడే —శేఖర్ నివాసంలో'

అరుణ ఒక్కసారిగా సీరియస్ అయిపోయింది.

'ఉల్లాసం తెచ్చుకో అరుణా' ఆనంద్ నవ్వుతూ అన్నాడు. 'మీ పెద్దన్న దారిలో ఉన్నాడు. నిన్నిలాచూస్తే మనిద్దరం దేనికో ఘర్షణపడ్డామనుకుంటాడు. ఎంతైనా ఓ చెల్లెలు ఘర్షణపడితే అన్నతోనే పడాలి. అందులోనూ ఎంత గొప్ప అన్న!' బలరాం ఇంపాలాకారు పోర్టికోలోకి ప్రవేశించే ఇద్దరూ సోఫాలో దూరదూరంగా కూర్చున్నారు.

'ఆనంద్‌గారూ, మిమ్మల్ని చూశాను, చాలా సంతోషం' అని బిగ్గరగా అరుస్తూ తన సహజ ధోరణిలో రాచరికపు దర్పాన్ని ఒలకబోస్తూ బలరాం లోపలికి అడుగుపెట్టాడు. ఆనంద్ లేచి కొంత దూరం ఎదురువెళ్ళి, కరచాలనంచేసి సోఫాలో కూర్చోబెట్టాడు. అప్పుడు బలరాం అరుణను చూశాడు. ఆమె అతడివైపు చిరునవ్వుతో చూసి అంది 'అన్నా! ఎలా ఉన్నావ్? వదిన, పిల్లలు బాగున్నారా?'

'అంతా బాగున్నారు. నువ్వెప్పుడొచ్చావ్? ఏంచేస్తున్నావ్?'

'ఆమె మీమీద రకరకాల పితూరీలు చెబుతోంది!' ఆనంద్ అన్నాడు పగలబడి నవ్వేస్తూ

'ఈ విషయంలో మిమ్మల్ని ఎంతమాత్రం నమ్మను' బలరాం వెంటనే అన్నాడు. 'నా చెల్లాయి గురించి నాకు తెలిసినంతగా, నాగురించికూడా నాకు తెలియదు. అదెప్పుడూ పితూరీలు చెప్పదు. ఒక్కసారిగా విరుచుకుపడిపోతుంది. దులపాలనుకుంటే నా మొహంమీదే దులిపిపారేస్తుంది కానీ మూడోమనిషికెప్పుడూ ఫిర్యాదుచేయదు. మేం నిత్యం కొట్లాడుకుంటూనే ఉంటాం, రాజీపడిపోతూనే ఉంటాం. అది మా వంశలక్షణం...'

'చాలా అద్భుతమైన లక్షణం, సందేహంలేదు!' ఆనంద్ అన్నాడు. 'ఆ లక్షణంవల్ల అప్పుడప్పుడు నాలాంటి అమాయకులు, మూడోమనుషులుకూడా ప్రయోజనం పొందుతూ ఉంటారు.'

ముగ్గురూ హాయిగా నవ్వేశారు. కాఫీలైన తర్వాత బలరాం చుట్టవెలిగించి యధాలాపంగా, తాపీగా నాటి చర్చనీయాంశంలోకి వచ్చేశాడు. 'చూడండి ఆనంద్‌గారూ, భూసంస్కరణలగురించి ఈ గడబిడ, గంద్రగోళం ఏమిటో నా కర్థంకావడం లేదు. నేనేం కలవరపడడం లేదనుకోండి, గ్రామాల్లోమాత్రం కొంత ఆందోళన ఉంది. ఉద్రిక్తతలుకూడా పెరుగుతున్నాయి. ఈ విషయంలో ఏం చేయలేమంటారా?'

బలరాం సహేతుకంగానే భయపడుతున్నట్టు కనిపించాడు. ఆనంద్ ఆ భయాల్ని పూర్తిగా అర్థంచేసుకున్నాడు కూడా. అతడిలోని ఆ సానుభూతి వెంటనే ఇద్దరిమధ్య స్నేహభావన తెచ్చిపెట్టింది. బలరాం ఘర్షణకు సిద్ధపడి వచ్చిఉంటే, ఆ అవకాశం లేదని ఇప్పుడు తెలుసుకుని ఉండాలి. 'చూడండి ఆనంద్‌గారూ' రాజీధోరణిలో ప్రారంభించాడు. 'గ్రామీణపరిస్థితులగురించి, గ్రామప్రజల మనోభావాలగురించి మీకున్న లోతైన అవగాహనను నేనెంతో గౌరవిస్తాను. అందుకే మాలో ఒకరుగా భావించి స్నేహభావంతో మీతో మాట్లాడాలనిపించింది. మిగిలిన మంత్రులతో నేనిలా మాట్లాడలేను. - చెప్పండి, ఇప్పుడు మనం ఏంచేయాలి? రాబోయే భూసంస్కరణల వల్ల మన పరిస్థితి ఏం కాబోతోంది?'

ఆనంద్‌కూడా విస్మితుడయ్యాడు, ఒకింత విస్తుపోయాడనడం సబబు. అతడూ ఘర్షణకు సిద్ధమయ్యే ఉన్నాడు, కనీసం నిర్మొహమాటంగా మాట్లాడాలనుకున్నాడు. బలరాంలో హఠాత్తుగా తొంగిచూసిన మెతకదనం అతణ్ణి నిరాయుధుణ్ణి చేసింది. 'గ్రామప్రాంతాల్లోని సమస్యలగురించి మనకు తెలుసు బలరాంగారూ' యథాలాపంగా ప్రారంభించాడు. 'ఇప్పటి పరిస్థితికి దారి తీయించిన కారణాల్లోకి మనం వెళ్ళాలా? వద్దా? ఉదాహరణకు మీ ప్రాంతాన్నే తీసుకోండి. మీ జిల్లాలో ఏడాదికి సగటున ఎన్ని హత్యలు జరుగుతాయి? మీకేమైనా ఐడియా ఉందా?'

'చాలా ఎక్కువ' బలరాం అన్నాడు.

'వాటిలో భూమిగురించి జరిగేవి ఎంత శాతం?'

'అదికూడా చాలా ఎక్కువే'

'కొన్ని దశాబ్దాలుగా ఇదే పరిస్థితనుకుంటాను?'

'అవును, అక్షరాలా. నాకు ఊహ తెలిసినప్పటినుంచి భూమిగురించి జరిగే నేరాలకు, ఘర్షణలకు విరామం అనేదే లేదు.'

'అంటే గ్రామాల్లో ఉద్రిక్తపరిస్థితులకు భూసంస్కరణలు కానీ, ఈ మధ్యకాలంలో తలెత్తిన మరే పరిణామాలు కానీ కారణం కాదు, అంతేనా?'

'అవును. కానీ భూసంస్కరణలగురించి జరుగుతున్న ప్రచారం ఉద్రిక్తతను పెంచుతోంది', తన అసలు ఆరోపణ కాస్తా ధ్వంసమైపోవడం గమనించి బలరాం గొణుగుతున్నట్టు అన్నాడు.

సరే, మీరన్నట్టే జరుగుతోందనుకుందాం. భూసంస్కరణల ప్రస్తావన అసలు లేదనుకోండి, ఇప్పుడున్న ఉద్రిక్తతపరిస్థితిని తొలగించడానికి మనవద్ద ఏవైనా పథకాలున్నాయా?'

బలరాంలో కలవరపాటు స్పష్టంగా కనిపించింది. ఆనంద్‌నుంచి సమాచారం తెలుసుకోడానికి, భూసంస్కరణలపథకాన్ని మూలమట్టంగా నేలకూల్చడానికి అతడిక్కడికివచ్చాడు. ఇటువంటి శల్యపరీక్షకు సిద్ధమై రాలేదు. సంక్లిష్టవిషయాలపై చర్చించుకుని ఒక అవగాహనకు వచ్చే వ్యక్తుల కోవలోకికూడా అతడు రాడు. ఆరునూరైనా తాను చెప్పిందే సబబనీ, తన తర్కమే నమ్మదగినదనీ భావించే రకం.

'నన్నెందు కడుగుతున్నారు?' అసహనంగా అన్నాడు. 'నేనేం ప్రభుత్వాన్ని నడపడంలేదు. నే నెక్కడ నిలబడ్డానో నాకు తెలుసు కనుక పాత ఉద్రిక్తతలమధ్య నెట్టుకు రాగలను. వాటిని చట్టబద్ధంగానూ, ఇతర మార్గాల్లోనూ ఎదుర్కోగల సత్తా నాకుంది. అది నాకు బాగా తెలిసినస్థలం.'

ఆనంద్‌లోకూడా సహనం నశిస్తోంది. అయినా ముందుగా తనే నిగ్రహం కోల్పోకూడదను కున్నాడు. 'చూడండి బలరాంగారూ! మన మిక్కడ అధికారంగురించి మాట్లాడుకోవడం లేదు. మరోమాట చర్చించడానికైనా, ఇప్పుడేది న్యాయమో మాట్లాడుకోకూడదా?'

'అంటే నేను అన్యాయంగా ఉన్నాననా మీ ఉద్దేశం?'

'అలా నేననలేదు. మీ అభిప్రాయాన్ని అర్థంచేసుకోడానికే ప్రయత్నిస్తున్నాను..' ఆనంద్ అన్నాడు.

'చూడండి, మేం ఎవరికీ ఎటువంటి అన్యాయం చేయలేదు' బలరాం కొనసాగించాడు. 'గ్రామంలో ప్రజల్ని మేం కాపాడుతున్నాం, వాళ్ళకు నాయకత్వం అందిస్తున్నాం, బతుకుతెరువు చూపిస్తున్నాం, ఒకళ్ళనొకళ్ళు చంపుకోకుండా చూస్తున్నాం, ఒకరకంగా శాంతిభద్రతల్ని రక్షిస్తున్నాం. కరువుకాటకాలను, చీడపీడలను తట్టుకుని జీవించడానికి వాళ్ళకు సహకరిస్తున్నాం. వాళ్ళు సంతోషంగా జీవించడానికి ఏంచేయాలో అన్నీ చేస్తున్నాం అప్పుడప్పుడు కాస్త కర్కశంగా ఉంటే తప్ప ఇవన్నీ ఎవరూ చేయలేరు. అది ఆటలో భాగం. ఇందుకు ఎవరైనా మమ్మల్ని ఎందుకు ఆడిపోసుకోవాలో అర్థంకావడంలేదు...'

'నాకు తెలిసినంతవరకూ ఎవరూ ఆడిపోసుకోవడం లేదు' ఆనంద్ అన్నాడు. 'రాచరిక వ్యవస్థలోకూడా ఎన్నో సుగుణాలున్నాయి. ప్రజలు తమ క్షేమంగురించి తాము ఆలోచించుకోవలసిన అవసరంలేకుండా చేశాడు రాజు. అయినాసరే, అయిదువందల సంస్థానాలలో రాచరికాన్ని అంతమొందించాం, అవునా కాదా? భూస్వామ్యవ్యవస్థలో ప్రజలమీద ఎటువంటి ఘనమైన బాధ్యతా ఉండదు. అస్తిత్వమాత్రులుగా ఉంటూ ఆజ్ఞల్ని పాటించడమే వారి పని. అయితే ఆకాంక్షలు మారినప్పుడు పాతవ్యవస్థకీ, నూతనవ్యవస్థకీమధ్య ఘర్షణ సంభవిస్తుంది. మనం తలపడవలసింది వీటితోనే, ఒకటి మంచిదీ, రెండోది అంత మంచిదికానిది...'

బలరాంలో అకస్మాత్తుగా కోపం ముంచుకొచ్చింది. తాను కాలంచెల్లినవ్యవస్థకు చెందిన వాడంటే ఒప్పుకోడానికి అతడు సిద్ధంగాలేడు. 'ఇలాంటి ఉపన్యాసాలు వందలసార్లు విన్నాను. వ్యవస్థ పూర్తిగా మారిపోవలసిన అవసరం నాకేం కనిపించడంలేదు. అలాంటి వినాశకరమైన మార్పును నిరోధిస్తామని నేనంటున్నానంటే, మా వర్గంలో అందరి తరఫున అంటున్న మాట, దేవుడి దయవల్ల మేమే గెలుస్తాం కూడా'

'గెలుపు, ఓటముల కోణంలోకి మనం ఇప్పుడే గెంతకపోవడం మంచిది బలరాంగారూ' ఆనంద్ అభ్యర్థనగా అన్నాడు. 'మనం ఆ ఘట్టానికింకా చేరుకోలేదు, ఘర్షణపడవలసిన అవసరంకూడా లేదు. వ్యావసాయికసమస్యలపై తలెత్తిన ఘర్షణ పరిణామాలెలా ఉంటాయో ఈ మధ్యనే మనం చవిచూశాం. అదృష్టవశాత్తు మనప్రాంతం శాంతియుతంగానే ఉంది; అయితే ఎవరి అదుపులోనూ ఉండని ఆ సంక్షోభం అన్నిప్రాంతాలనూ చుట్టుముట్టడానికి ఎంతో సమయం పట్టదు. దానిని ఎదుర్కోవలసిందే. విస్తారమైన భూమి కొందరి చేతుల్లోనే ఉండిపోయింది. మీరెంత ఉదారులైనా కావచ్చు, భూమిలేని నిరుపేదలు భూయజమానులుగా, కనీసం సన్న కారు భూయజమానులుగానైనా తమనుతాము భావించగల పరిస్థితిని తీసుకురాలేరు.'

'వాళ్ళకు భూమి ఎందుకట?' ఆగ్రహం అణచుకుంటూ బలరాం మధ్యలోనే ప్రశ్నించాడు. 'సారాకోసం ఆ భూమిని తెగనమ్ముకొని, మళ్ళీ వెనకటిస్థితికే చేరుకుంటారు.'

'ఆ విషయం నాకూ తెలుసు' ఆనంద్ ఒప్పుకున్నాడు. 'అయినా అది వేరే విషయం. విశృంఖల వ్యభిచారం సాగించి ఆస్తిపాస్తులన్నీ కోల్పోయిన ఎందరో భూస్వాముల గురించి మీకూ తెలుసు, నాకూ తెలుసు. మరోవైపున, ప్రభుత్వం తమకిచ్చిన తగుమాత్రం భూమితో నూతనజీవితం ప్రారంభించి బాగుపడిన నిరుపేదల్ని వేలసంఖ్యలో నేనూ చూపించగలను. కనుక ఇటువంటి ఉదాహరణలతో భూసంస్కరణలకు అనుకూలంగా కానీ, వ్యతిరేకంగా కానీ మాట్లాడటం కష్టం...'

'మీరేమైనా చెప్పండి ఆనంద్‌గారూ' బలరాం ఖండితస్వరంతో అన్నాడు. 'మీరీ విషయంలో వాస్తవికదృష్టితో కాదు భూస్వాములు మీతో సహకరించి తమ మృత్యుశాసనంమీద తమే సంతకం చేసుకుంటారని నేను భావించడంలేదు '

'వాళ్ళేమీ మృత్యుశాసనంమీద సంతకం చేయబోవడం లేదు, మీకా హామీ ఇస్తున్నాను' ఆనంద్ ఎంతో నిజాయితీగా అన్నాడు. 'మోతబరువుగా, అనుత్పాదకంగా మారిన వ్యవసాయం నుంచి భూసంస్కరణలు పెద్దభూస్వాములకు విముక్తి కలిగిస్తాయి. రకరకాల ఆర్థికవ్యాసంగాలవైపు వాళ్ళు మళ్ళడానికి వీలవుతుంది పరిశ్రమల్లోకి, అనేక ఇతర రంగాల్లోకి అడుగుపెట్టి తమ ఆర్థికవనరుల్ని మరింత లాభదాయకమైన పెట్టుబడికి వాడుకోవచ్చు. భూములు అమ్ముకోవాలనుకునే భూస్వాములకు సాంఘికమైన కళంకాన్ని ఆపాదించే పరిస్థితి గ్రామ ప్రాంతాల్లో ఉంది. ఎవరైనా భూమిని అమ్మజూపితే అదిగో దివాలాతీసినట్టున్నాడంటారు. భూసంస్కరణలు ఆ కళంకాన్ని తొలగించి భూమిని కేవలం ఉత్పత్తిసాధనంగామాత్రమే పరిగణించే కొత్తధోరణిని ప్రవేశపెడతాయి ఇకమీద అదేదో సామాజిక అంతస్థుకు చిహ్నంగా కానీ, మృతసంపదగా కానీ ఉండదు. మొత్తం వ్యావసాయికదృశ్యం ఉత్సాహతరంగితంగా మారిపోతుంది. గ్రామప్రాంతాలు రకరకాల ఆర్థికవ్యాసంగాలతో కోలాహలంగా మారిపోతాయి. రేపటి ఆ వినూత్నదృశ్యస్థితిని కాస్త ఊహించుకోండి బలరాంగారూ...'

'నేను అన్నివిధాలుగా ఒక అనామకుణ్ణి కాబోవడమే నే నూహించుకోగలుగుతున్నది' బలరాం అన్నాడు. 'లేదు... మీ సంస్కరణలకు నేను కట్టుబడడం కానీ తలవంచడం కానీ జరగదు, పరిణామాలు ఎలాగైనా ఉండనీ'

తన అన్నకీ, ఆనంద్‌కీ మధ్య జరుగుతున్న సంభాషణ అరుణకెంతో ఆందోళన కలిగించింది. అతిప్రయత్నంమీద నిగ్రహించుకుంటోంది. ఆమె జోక్యంచేసుకోబోయినప్పుడల్లా బలరాం అవలంభించిన విరోధధోరణి సంభాషణకు ఆటంకం కలిగిస్తూవచ్చింది. చివరకు బలరాం ఆమెను తీసిపారేస్తూ మొరటుగా అన్నాడు. 'నువ్విందులో తలదూర్చకుండా ఉంటావా? ఇవన్నీ నీకు తెలియని విషయాలు'

'నువ్వంటున్నది ఏమాత్రం సబబుగాలేదని గ్రహించేమేరకు నాకూ తెలుసు'

ఆనంద్ సకాలంలో ఆమె మాటకు అడ్డుపడి పెద్దఘర్షణను నివారించాడు.

'అరుణా, ఈ వ్యవహారాన్ని పరిష్కరించడానికి మేం ప్రయత్నిస్తున్నాం. నీ నియోజక వర్గంలో పరిస్థితిని నువ్వు చూసొచ్చావు కనుక నీ సలహాలుకూడా అడుగుతాను. నిజానికి ఈ విషయంమీద మనం మాట్లాడాల్సింది చాలా ఉంది. సరేనా?'

ఆమెను మాట్లాడవద్దనడానికి ఆనంద్ అనుసరించిన శైలి అది. ఆ తర్వాత బలరాం వైపు తిరిగి ప్రశ్నించాడు. 'మార్పును ప్రతిఘటించగలమనీ, గెలుపు సాధించగలమనీ అన్నారు. ఎలా ప్రతిఘటిస్తారు? ఎలా గెలుపు సాధించబోతున్నారు? కాస్త వివరంగా చెబుతారా?'

'అది మా అమూల్యమైన రహస్యం మినిష్టర్‌సాబ్' బలరాం గట్టిగా నవ్వేస్తూ అన్నాడు. 'పరిస్థితి అంతవరకూ వస్తే, మీరొక్కరే ఏటికి ఎదురీదాల్సి వస్తుంది. వాస్తవం చెప్పాలంటే ప్రభుత్వయంత్రాంగం మొత్తం భూస్వాముల కొమ్ముకాస్తుంది. ఈ విషయంలో మీకు నేను హామీ ఇస్తున్నాను'

'మంచిది. మా విలువైన రహస్యాలు మాకూ ఉన్నాయి' ఆనంద్ తిప్పికొట్టాడు. 'ఇక ప్రభుత్వం విషయానికొస్తే, నేను చెప్పగలిగిందల్లా, వేచి చూడాలనే...'

'అంటే రంగంలోకి దిగారన్నమాట!' బలరాం అన్నాడు.

'అని మీరంటున్నారు...' ఆనంద్ అన్నాడు.

ఉడుకుతున్న ఉద్రిక్తతమధ్య కొద్దిసేపు కూర్చుండిపోయారు. అనుకోని టెలిఫోన్‌మోతతో నిశ్శబ్దం చెదిరిపోయింది. ఆనంద్ ఫోన్ తీసుకున్నాడు అవతల ఢిల్లీనుంచి చౌదరి లైన్‌లో ఉన్నాడు. 'ఇక్కడ మన నాయకులతో చర్చలు జరుపుతున్నాను. మన ఉత్తరసరిహద్దుల్లో పరిస్థితి ఏమీ బాగులేదు. అక్కడ కొంత ఉద్రిక్తత వాతావరణం, గంద్రగోళం తలెత్తినట్టు కనిపిస్తోంది. చైనానుంచి ప్రమాదసంకేతాలు ఉన్నప్పటికీ మూడో సార్వత్రికఎన్నికలకు సన్నాహాలు ప్రారంభమౌతున్నాయి. భూ సంస్కరణలు ముఖ్యాంశంగా పార్టీ ఎన్నికలప్రణాళిక రూపుదిద్దుకోబోతోంది. ముసాయిదా రచయితల బృందంలో నిన్నుకూడా చేర్చారు. కనుక మైడియర్ డ్రీమర్, సిద్ధంగా ఉండు; నీ ఊహాశక్తినంతటినీ రంగరించి ప్రజల్ని ఆకట్టుకునేలా అందులో వీలైనన్ని ఆశల్ని ఆకాంక్షల్ని దట్టించు. నీ మాటల రెక్కలమీద కరవుతీరేలా హాయిగా విహరించు. మిగిలిన విషయాలు నేనక్కడికి తిరిగొచ్చాక చర్చించుకుందాం. గుడ్‌లక్!'

# 31

ఢిల్లీలోని రాష్ట్రప్రభుత్వ అతిధిగృహం టికెట్ ఆశించేవారితో, వాళ్ళ మద్దతుదారులతో, వందిమాగధులతో, ప్రత్యర్థులతో క్రిక్కిరిసిపోతోంది. మిగిలిన రాష్ట్రప్రభుత్వాల అతిథిగృహాల్లోనూ, వివిధ 'స్టార్' విలువలతో వెలిగిపోయే హోటళ్ళలోనూ అదే పరిస్థితి. అవన్నీ ప్రజాస్వామ్యానికి దివిటీలు పట్టేవాళ్ళతో పొంగిపొర్లుతున్నాయి. గుంపులు నానాటికీ పెరుగుతున్నాయి. భారతీయ రైల్వేలు వివిధ రాష్ట్రాలనుంచి, ముఖ్యంగా దేశరాజధానికి ఎంతో దూరంలో లేని రాష్ట్రాలనుంచి టికెట్‌లేని ప్రయాణీకుల్ని వేలసంఖ్యలో చేరవేస్తున్నాయి. పార్టీటికెట్‌ను చేజిక్కించుకునే తొందరలో రైలుటికెట్ కొనుక్కోవలసిన అవసరం కొట్టుకుపోయింది. అయితే ఇండియన్‌ఎయిర్‌లైన్స్‌మాత్రం ప్రతిఎన్నికల ఘట్టంలోనూ తన పాతనష్టాల్ని పూడ్చుకుంటూ చక్కని లాభాలు గడించుకుంటోంది.

ఆనంద్ ఈ తొక్కిసలాటని ఎంతో ఆసక్తితోను, ఆశ్చర్యం అంచులుతాకే దిగ్భ్రమతోనూ గమనిస్తున్నాడు. అన్ని రకాలకూ అన్ని శ్రేణులకూ చెందిన రాజకీయవాదుల పెద్దపెద్ద పటాలాలు ప్రతిచోట కనిపిస్తున్నాయి. వాళ్ళు కేంద్రమంత్రులచుట్టూ ప్రదక్షణలు చేస్తున్నారు. అధికారపక్షంలోని కేంద్రపార్లమెంటరీబోర్డుసభ్యుల ఇళ్ళముందు బారులుతీరుతున్నారు. ఎన్నికలసమయంలో హఠాత్తుగా కుక్కగొడుగుల్లా పుట్టుకొచ్చే జ్యోతిష్కుల్ని కలుసుకోడానికి ఎగబడుతున్నారు. చివరగా, ఫలానా ఫలానా నాయకుడికి తాము సన్నిహితులమని చెప్పుకునే వందలాది దళారుల వెంట పరుగులుతీస్తున్నారు. ఆ నాయకుడు తమెక్కడ సంతకంపెట్టమంటే అక్కడ పెడతాడని వాళ్ళు చెప్పుకుంటూఉంటారు. ఇంచుమించు నిర్మానుష్యంగా, నిద్రపోతున్నట్టుండే న్యూఢిల్లీలోని రోడ్లకూ, ఫుట్‌పాత్‌లకూ హఠాత్తుగా ప్రాణం వచ్చేసింది. ఎవరో మంత్రించినట్టు, కాలంకాని కాలంలో మొలుచుకొచ్చే కలుపులా అడవిమొక్కల్లా మనుషులు ప్రతిచోట పుట్టుకొస్తున్నారు. మంత్రుల కార్యాలయాల్లోనూ, నివాసాలవద్ద ఉండే ప్యూన్లు, జమాదార్లు తమ ప్రాంగణాల్లో వరసకట్టిన వేలాదిమంది రాజకీయ అధికారయాచకుల నుంచి బక్షీష్ పేరిట పెద్దమొత్తాల్లో సొమ్ము రాబట్టుకుంటున్నారు. తమ తమప్రాంతాల్లో ఉద్దండులనిపించుకుని అందరితోనూ మొరటుగా, దురుసుగా వ్యవహరించే వ్యక్తులు టికెట్‌యాచకులుగా ఢిల్లీ వచ్చినప్పుడు మాత్రం తమ ముఖాలకు వేడికోలుముసుగులు ధరించి ఈ సందర్భంకోసం ప్రత్యేకంగా నేర్చుకున్న బుజ్జగింపుపోకడలు ప్రదర్శిస్తున్నారు. అధికారదాహం రాత్రికిరాత్రి వాళ్ళని మృదుస్వభావులుగా మార్చివేసింది.

పార్టీకి చెందిన పురుషులు, స్త్రీలు వేర్వేరు జట్లుగా ఏర్పడి న్యూఢిల్లీ రోడ్ల వెంట తిరుగుతూఉంటారు. రాష్ట్రస్థాయిలో తిరస్కృతుడైన ప్రతిఅభ్యర్థీ పార్టీఅధిష్ఠానవర్గానికి అపీల్‌చేసుకోడానికి ఢిల్లీ వస్తూఉంటాడు. ప్రతిఒకరి అభ్యర్థనలోనూ, తనకే పార్టీటికెట్ ఎందుకు ఇవ్వాలో నొక్కిచెప్పే అతడి సేవలకు సంబంధించిన భాగం నాలుగోవంతును (ఒక్కోసారి అంతకంటె తక్కువే) మించి ఉండదు. మిగిలిన మూడువంతులభాగంలో, ఆ నియోజకవర్గంనుంచి దరఖాస్తుచేసుకున్న మిగిలిన అభ్యర్థులపై దూషణలు, వాళ్ళకు టికెట్ ఎందుకు తిరస్కరించాలో సూచించే కారణాలు ఉంటాయి. ఈ వ్యతిరిక్తభాగం మరింత విశదంగా, మిగిలిన దరఖాస్తుదారుల దుర్మార్గప్రవృత్తిని సూచించే భయానకకథనాలతో నిండి ఉంటుంది. ప్రతిఒక్క కేసులోనూ ఇటువంటివన్నీ నమ్ముతూ పోతే, ఎన్నికల్లో నిలబెట్టదగిన ఉత్తమఅభ్యర్థి పార్టీలో ఒకడూ లేడన్న నిర్ధారణకు రావలసివస్తుంది. అభ్యర్థి మగవాడైతే, అతని ప్రత్యర్థుల కథనంప్రకారం అంత అవినీతిపరుడు, అంత అధమాధమ స్త్రీలోలుడు మరొకడు ఉండడు. అభ్యర్థి స్త్రీ అయితే, ఆమె బొత్తిగా నీతీ, జాతీ లేని మనిషి, భారతీయ స్త్రీత్వానికి పెద్ద కళంకం. మహాత్మాగాంధీ ప్రేరణతో నడిచే పార్టీలో అటువంటి మనిషినెలా సహిస్తారు? ఇక అభ్యర్థులు ఒకరి నేరచరిత్రను మరొకరు తవ్వుకుంటారు. తమ ఆరోపణలకు మద్దతుగా కోర్టుతీర్పుల సర్టిఫికెట్ కాపీలు దాఖలుచేస్తూ ఉంటారు. ఈ ఉదంతాలు జుగుప్సతోకూడిన చికాకునీ, చుట్టూ సందేహపూరిత వాతావరణాన్నీ సృష్టిస్తుంటాయి. అభ్యర్థులందరూ ఒకరిపైఒకరు ఇంత ఘోరమైన ఆరోపణలు చేసుకున్న ఈ పరిస్థితిలో, ఇక తీరా ఎన్నికలప్రచారంలో మిగిలినవారినుంచి హృదయపూర్వకమైన మద్దతును పొందగలిగే వ్యక్తిని ఈ అభ్యర్థులనుంచి ఎన్నుకోవడం కష్టమైపోతుంది. అందువల్ల టికెటు పొందిన అభ్యర్థి ఒంటరిగా మిగిలిపోయి తనపాట్లు తనే పడవలసివస్తుంది. వేరేపార్టీల అభ్యర్థులతోపాటు, తన పార్టీలోనే ఉన్న ఎందరో వెన్నుపోటుదారులతో పోరాడవలసి వస్తుంది.

ఇక రాజకీయముద్రలు వేసే కార్యక్రమం ఒకటి జరిగిపోతోంది నెహ్రూజీ ఆదర్శాలను వ్యతిరేకిస్తున్నట్లు అభ్యర్థులు ఒకరిపైఒకరు ఆరోపణలు చేసుకుంటూఉంటారు —ఏ ఆదర్శాలనో ఎవరూ చెప్పరు. వీళ్ళలో ఏ ఒకరూ ఈ ఆదర్శాలేమిటో తెలిసినట్లు కనిపించరు. అదంతా ఓ యాంత్రికప్రక్రియలా, ఓ నినాదంలా, ఓ మాటవరుసలా పరిణమించింది. ఒకడు తన నెంతో అభ్యుదయవాదిగా చిత్రించుకుంటూ మిగిలినవాళ్ళందరినీ అభివృద్ధినిరోధకులనేస్తాడు. ఇంకోడు, నియోజకవర్గంలో తనకున్నంత ప్రజాబలం ఎవరికీ లేదని చెప్పుకుంటే, ప్రజలందరూ అతణ్ణి విడిచిపెట్టి ఎన్నడో వెళ్ళిపోయారని ఇతరులు అంటుంటారు. ఢిల్లీలో కూర్చుని నిజానిజాలు పరిశీలించే అవకాశం ఉండదు. అన్నింటికంటె ముఖ్యం, నెహ్రూకుటుంబంపట్ల విధేయత పట్ల విధేయతక్రమంగా కీలకప్రాధాన్యం సంతరించుకుంది. దాని కనుగుణంగానే అభ్యర్థులపై ముద్రవేయడం మొదలైంది. ఈ ధోరణికి గుర్తించగలిగిన మూలమేదీ లేదు. అయినా అది ప్రత్యక్షవాస్తవంగా మారిపోయింది, ముఖ్యంగా ఉత్తరాదిరాష్ట్రాల్లో.

ఇదేరోజుల్లో ఆనంద్ స్వల్పవ్యవధిలో తరచు ఢిల్లీయాత్రలు చేయవలసివచ్చింది. 'నెహ్రూకుటుంబంపట్ల విధేయత' గీటురాయీ, చర్చనీయాంశమూ అవుతున్న సరళి చూసి అతడు విస్తుపోయాడు. ముందుముందు బహుశా అదే ముఖ్య చర్చనీయాంశం కాగలదనుకున్నాడు.

స్వాతంత్ర్యోద్యమంలో చివరి అయిదుసంవత్సరాలు, తర్వాత ఒకటిన్నర దశాబ్దాల ప్రధాన మంత్రిత్వం కలుపుకుని ఇప్పటికి ఇరవైఏళ్ళుగా అతడు జవహర్లాల్ రాజకీయజీవితాన్ని గమనిస్తూ వస్తున్నాడు.

పండిట్‌జీ వ్యక్తిత్వంచూసి ఆనంద్ ఎంతో ముగ్ధుడయ్యేవాడు. ఆదర్శప్రాయమైన నెహ్రూజీ నడవడిగురించి తలపోస్తూ ఉండేవాడు. మొక్కవోని ఆయన సాహసం. సంప్రదాయబద్ధమైన వాతావరణంలో ఆధునికతను ప్రవేశపెట్టి రెంటిమధ్య ప్రయోజనకరమైన సామరస్యాన్ని సాధించడానికి ఆయన చేసిన ప్రయత్నం. కుంగదీసే సామాజికదురన్యాయశక్తులను ప్రతిఘటించిన ఆయనలోని పురివిప్పిన ఆదర్శవాదం. వ్యక్తుల్ని అంచనావేయడంలో ఆయన కనబరచిన లోపాలు... నెహ్రూపట్ల అంత ఆరాధనాభావం ఉన్నప్పటికీ 'విధేయత' అనే కొత్తనినాదాన్ని ఆనంద్ జీర్ణించుకోలేకపోయాడు. పార్టీపట్ల, చివరకు నెహ్రూమూర్తిమత్వం కలిగిన ఓ వ్యక్తిపట్ల విధేయతను అర్థంచేసుకోవచ్చు. కాని ఆ నినాదాన్ని మొత్తం కుటుంబానికి విస్తరింపజేయడం... ఆనంద్ రాచరికపుహయాంను గుర్తుచేసుకున్నాడు. ఆనువంశికపాలన సాగుతున్న సందర్భంలో సైతం, రాజుపట్ల విధేయత అనే ఆలోచనను తాను చిన్నప్పుడే వ్యతిరేకించిన సంగతిని స్మరించుకున్నాడు. నేటి ప్రజాస్వామికఘట్టంలో ఈ నినాదం అతణ్ణి మరింత విచారగ్రస్తుణ్ణి చేసింది. స్వతంత్రభారతంలో వ్యక్తుల్లో గూడు కట్టుకున్న ఇలాటి దృక్పథాల్లో సమూలమైన పరివర్తన తప్పనిసరిగా రావలసి ఉంటుందన్న అభిప్రాయం అతనికేర్పడింది.

ఈ మధ్య నెహ్రూ ప్రసంగాలు ఒకింత నట్టుతున్నాయి. నిశితపరిశీలకులు ఈ మార్పు గమనించారు. ప్రగతిమార్గంలో తనఅడుగుస్థిరంగా పడుతున్నట్టు కిందటి దశాబ్దంలో అనుకున్న ఆలోచనాపరుడైన భారతీయుడు, 1962 ఎన్నికలకు దేశం సన్నద్ధమౌతున్న ప్రస్తుతఘట్టంలో అలా అనుకోలేకపోతున్నాడు.

ఎక్కడ పొరపాటు జరిగింది, లేదా ఏది పొరపాటుకు దారితీయబోతోంది? ఈ సంక్లిష్టప్రశ్నపై ఆనంద్ తర్జనభర్జనపడ్డాడు. బహుశా అది ఆశించిన ప్రమాణంకన్న ఫలితాలు తక్కువగా లభించడంవల్ల కలిగిన నిస్పృహకావచ్చు. అసలు మొదటనే ప్రజల ఆకాంక్షలు ఆకాశాని కెగబాకి ఉండవచ్చు. స్వాతంత్ర్యాన్ని, దేశం ఎదుర్కొనే అన్ని రోగాలనూ వదలగొట్టే దివ్యౌషధంగా ప్రజలు —కనీసం అంతశ్చేతనలోనైనా భావించారేమో. అలా ఎవరూ అనలేదు, ఎవరి సంగతెలా ఉన్నా పండిట్‌జీ అసలే అనలేదు. అయినా పార్టీ స్థానిక సామంతులు ఈ అపోహను తొలగించా లనుకోలేదన్నది వాస్తవం. ఏదో ఒకేఒక ఫార్ములాను అనుసరించో, ఒకేఒక విధానాన్ని అమలుచేసో, ఒకేఒక చారిత్రకపరిణామంతోనో, అసాధారణ రాజకీయఘటననుంచి పొందిన స్ఫూర్తితోనో భారతదేశం ఎదుర్కొంటున్న సాంఘిక —ఆర్థిక, జాతిపరమైన సమస్యలను పరిష్కరించడం సాధ్యంకాదనే అవగాహన ప్రజలకు కలిగించకుండానే, వాళ్ళు మొదటి పదేళ్ళలోనే రెండు సార్వత్రిక ఎన్నికల్లో విజయం పొందారు. నిజం చెప్పాలంటే ప్రజల్లో తనంతతాను ఉబికివచ్చే ఊపే ఆ విజయానికి దారి తీసింది.

అయితే ఈ మూడవ ఎన్నికలో అలా జరిగే సూచనలు కనపడలేదు. అందుకని ఈసారి ఎన్నికల ప్రయోజనాలకోసం అలవిమాలిన వాగ్దానాలు చేయడంలో రాజకీయపక్షాలన్నీ ఒక

దానితోఒకటి పోటీపడ్డాయి. అసలు ఏ ప్రభుత్వానికైనా వాటిని నెరవేర్చే సామర్థ్యం ఉంటుందా అన్న ప్రశ్నను అవి కొంచెమైనా పట్టించుకోలేదు. ఇందులో మళ్ళీ నెహ్రూజీదే మినహాయింపు. ఆయనెప్పుడూ వాగ్దానాలు చేయలేదు సరికదా, తమపార్టీకే వోటువేయమని ప్రజలకు ప్రత్యక్షంగా విజ్ఞప్తిచేసికూడా ఎరగరు. ఆ విధంగా ఆయన మరో అడుగు ముందుకువెళ్ళారు. ఆయన వ్యక్తిత్వంలో సమ్మోహనశక్తి అటువంటిది కనుక, తనపార్టీవారు ఇచ్చిన హామీలను ఆయన కచ్చితంగా నెరవేర్చుతారని ప్రజలు న్యాయంగానే విశ్వసించారు. 'పండిట్‌జీ ఎంతో హుందాగా సూత్రబద్ధంగా నడుచుకునే మనిషి కనుక వోట్లకోసం ఎలా దేవిరిస్తా'రని వాళ్ళు అనుకున్నారు. ఆయన ఔజ్జ్వల్యం పార్టీ కెంతో ఉపయోగపడింది. అయితే క్రమంగా ప్రజాదరణ తగ్గుముఖం పట్టడమనే స్వాభావికప్రక్రియ మొదలైంది. ఆ ఘట్టంలోకూడా ప్రత్యర్థిపక్షాలు వేటికీ లేని మహదైశ్వర్యంగా తన పార్టీలో జవహర్లాల్ భాసించారనేది తిరుగులేని వాస్తవం. ఏ పార్టీలోనూ నాయకత్వ స్థానంలో జవహర్లాల్‌వంటి వ్యక్తి లేరు.

వాతావరణం నిండా ఏదో అస్థిమితం రూపొందింది. దాన్ని సరిగా అర్థంచేసుకోగలిగిన వాళ్ళు కూడా లేరు. ఆనంద్ వీలైతే దానిని అనుభూతికి తెచ్చుకోడానికి నిశితంగా విశ్లేషించాడు. పైకితేలిన ఒక వాస్తవం ఏమిటంటే, నెహ్రూ దేశసమస్యలతో ఒంటిచేత్తో పోరాడుతుంటే, ఆయన బరువులో పాలుపంచుకోవలసిన వాళ్ళు తాముగా మరికొన్ని సమస్యలు సృష్టిస్తూ ఆయన భుజస్కంధాలమీదికి వాటిని తోసేస్తూ పోతున్నారు. బాధ్యతారహితంగా వర్తించే పార్టీవాదులెందరో ఆయనకు మోయలేని బరువుగా పరిణమించారు. చెప్పుకోదగినదేదీ చేయగలిగిన సామర్థ్యం వాళ్ళకు లేదు. వాళ్ళలో చాలామందికి నెహ్రూ దార్శనికత అర్థంకాలేదు కూడా. బహిరంగ సభలకు రావడం తగ్గి, ఆయనలో ఓపిక సన్నగిల్లుతున్న సూచనలు కనిపించేసరికి ఆయన స్థానంలో అంతటి సమర్థుడిని తీసుకొచ్చి నిలపడం ఎంత కష్టమో స్పష్టమౌతూవచ్చింది. ఆయన నిర్దేశించిన లక్ష్యం ఎంతో ఉన్నతం, విశిష్టం. అందువల్ల ఆయన తర్వాత ఆ ఖాళీని భర్తీచేయడం మరీమరీ అసాధ్యంగా కనిపించింది. సమీపకాలంలోనే ఆయన నిష్క్రమణ జరుగుతుందన్న ఆలోచనలో ఉన్నారు. దేశచరిత్రను మరోమలుపు తిప్పగలిగిందిగా ఆ ఘటనను అంతరాంతరాల్లో అందరూ భావించుకుంటున్నారు. నెహ్రూజీకి కాబోయే వారసులెవరన్న ఊహాగానంతో డజన్లకొద్దీ పుస్తకాలు వెలువడ్డాయి. దేశంముఖాన వేలాడుతున్న సమస్య అదొక్కటేనన్న సంకేతాలను అవి స్ఫురింపజేశాయి. మిగిలిన అనేక విషయాలు కొంతకాలంపాటు తెరమరుగైపోయాయి నిజానికి సమస్య అనదగినదదొక్కటే— నెహ్రూవారసుడి అన్వేషణ. ఆపైన నమ్మకమైన ప్రత్యామ్నాయాలేవీ కనిపించని పరిస్థితి ఎదురైంది. మొత్తానికది ఏళ్ళూ పూళ్ళూ పట్టే ఓ నిరర్థక అన్వేషణగా పరిణమించే ప్రమాదం కనిపించింది.

వాస్తవానికి సమస్యలనేకం; వాటిని ప్రధానంగా ప్రాంతీయమైనవిగా, భాషాపరమైనవిగా, మతపరమైనవిగా వర్గీకరించుకోవచ్చు. 1961 పూర్వార్థానికి ఒకింత ముందునుంచి హోంమంత్రిగా ఉన్న లాల్‌బహదూర్‌శాస్త్రి, ప్రధానమంత్రి పనుపున ఆయా కల్లోలితప్రాంతాలను సందర్శిస్తూ ఈ సమస్యలతో పోరాటం సాగించారు. 1961కి ముందే కొన్ని ఘర్షణలు సంభవించాయి, ఉదాహరణకు 1959లో అస్సాంసాహిత్యసభ అస్సామీభాషను రాష్ట్రంలో అధికారభాష చేయాలని డిమాండ్‌చేసింది. అప్పుడు రాష్ట్రంలోని ఒకప్రాంతంలో, కొన్ని గిరిజనప్రాంతాల్లో బెంగాలీ

మాట్లాడే జనం ఉన్నారు. రెండుభాషలవారికీ సంతృప్తికలిగించే రాజీసూత్రం అవసరమైంది. దురదృష్టవశాత్తు సమస్య భాషారాజకీయాలకే పరిమితంకాకుండా వీధుల్లోకి వ్యాపించిపోయింది. 1960లో హింస చెలరేగింది, 1961 మే లో, బెంగాలీప్రజలు మెజారిటీగా ఉన్న కచార్ జిల్లాలో హింస మరింత ఉగ్రరూపందాల్చింది లాల్‌బహదూర్ అస్సాం వెళ్ళి ఒక రాజీసూత్రాన్ని ప్రతిపాదించగా రెండుపక్షాలు దానికి సమ్మతించాయి. రెండుభాషావర్గాలకీ న్యాయంచేయడానికీ, వాళ్ళ భయ సందేహాలను పోగొట్టడానికీ అది ప్రతిపాదన ప్రయత్నించింది. అయితే ఈ సందడిలో విచిత్రంగా ఇంగ్లీషుకు ఎక్కువ లాభం జరిగింది.

తమిళనాడులో, మరికొన్నిచోట్ల తీవ్ర రాగద్వేషాలు రెచ్చగొట్టిన హిందీవ్యతిరేకాందోళన ఇంతకంటె దారుణం. దీనికి వర్గసంఘర్షణ, ఉత్తర —దక్షిణ విభేదాలవంటి మరికొన్ని అదనపుకోణాలుకూడా ఉన్నాయి. ఈ అశాంతి, అల్లకల్లోలాలు చాలాకాలం చెలరేగి రాజకీయగతినే సమూలంగా మార్చివేశాయి.

ఈ ఆందోళన సందర్భంగా ముఖ్యమంత్రి చౌదరి, ఆనంద్, మరికొందరు మంత్రివర్గ సహచరులు, ఒక విశిష్టమైన అనుభవం పొందారు. భయాందోళనలు కలిగిస్తూనే చక్కని సందేశం అందించిన అనుభవమది. తమిళనాడులోని ఒక సీనియర్‌మంత్రి మద్రాసులో తన కుమార్తె వివాహం జరిపిస్తున్నాడు; దురదృష్టవశాత్తు హిందీవ్యతిరేకాందోళన పతాకస్థాయిని అందుకున్న వారంలోనే ముహూర్తంరోజు వచ్చింది. చౌదరి, ఆయన మంత్రివర్గసభ్యులు వివాహానికి వెళ్ళకుండా తప్పించుకోగల పరిస్థితి లేదు. వెళ్ళాలనే నిశ్చయించుకున్నారు. ఆ శంకలు వెంటబెట్టుకునే వెళ్ళారు; హిందీవ్యతిరేకరాష్ట్రంగా ముద్రపడిన రాష్ట్రానికి తాము చెందము కనుక, తమ రాక ఉద్యమకారుల్ని మరింత రెచ్చగొడుతుందని వాళ్ళకు తెలుసు. దానికితోడు కొద్దిరోజులక్రితమే ముఖ్యమంత్రి చౌదరి హిందీవ్యతిరేకాందోళనకు వ్యతిరేకంగా బహిరంగవిమర్శ చేశాడు. ఇంతలోనే ఆ విషయం జనం మరచిపోగలరన్న ధీమా ఎవరిలోనూ లేదు.

వివాహమంటపానికి కొంతదూరంలో ఉన్న చక్కని హోటల్‌లో బసచేశారు. ముహూర్తం తర్వాత, సాయంత్రం ఆరుగంటలకు, మంటపంవద్ద ఎంతో అందంగా అలంకరించిన తాత్కాలికవేదికపైన సాంస్కృతిక కార్యక్రమం ఉంటుందని వారికి చెప్పారు. ఆ కార్యక్రమంలో ప్రధానాంశమేమిటని ఆనంద్ కుతూహలంతో సంబంధించిన వ్యక్తిని ప్రశ్నించేసరికి ఆ వ్యక్తి ముఖం ఒకింత పాలిపోయింది. బిర్జుమహరాజ్ అనే ప్రఖ్యాత నృత్యగురువు ఉత్తరభారతానికి చెందిన కథక్‌నృత్యం ప్రదర్శించడం నాటి కార్యక్రమంలో ఒక భాగమని చెప్పాడు. ఆ మాట చెవినపడిన ప్రతిఒకరికీ దిగ్భ్రాంతితో మూర్ఛపోయినంత పని అయింది. తమ ఆందోళననెవరూ మాటల్లో బయటపెట్టకపోయినా పర్యవసానం అందరికీ స్పష్టమే. ఉత్తరభారతంనుంచి వచ్చే తన సాటి మంత్రుల్ని రంజింపచేయడంకోసం, దక్షిణభారతానికి చెందిన ప్రసిద్ధభాగవతార్ కచేరితోపాటు బిర్జుమహరాజ్ నృత్యాన్నికూడా తమిళనాడుమంత్రి ఆ కార్యక్రమంలో చేర్చాడు. కొన్ని నెలల క్రితమే ఖరారైన కార్యక్రమం ఇది. ఆనాడు పరిస్థితి ప్రశాంతంగానే ఉండింది.

ఆ విధంగా బిర్జుమహరాజ్ ఆ రోజు సాయంత్రం, ద్రవిడేతరమైన ఒకానొక నృత్యసంప్రదాయంలో తాను శిఖరాయమానమైన ప్రావీణ్యం గడించినందుకు శిక్షగా ఒకవి

ధమైన 'ప్రత్యక్ష చర్య'ను ఎదుర్కోబోతున్నారు. సాయంత్రం అయిదుగంటలకే జనం వివాహమంటపానికి చేరుకోవడం ప్రారంభించారు. పోలీసుబలగాల్ని పెద్దసంఖ్యలో నియమించారు, అయినా ఉద్రేకభరితమైన ఆ వాతావరణంలో ఏమైనా జరగవచ్చునని అందరికీ తెలుసు. రాష్ట్రంలో రెండు వేర్వేరుచోట్ల 'తమిళతల్లి'కోసం ఇరువురు ఆత్మాహుతి చేసుకున్న వార్తను ఆ రోజు ఉదయమే పత్రికలు పతాకశీర్షికతో ప్రచురించాయి కూడా. ఇది వివాహమంటపం చుట్టుపక్కల ఆగ్రహతరంగాలు రేపింది. ఆరుగంటలకల్లా, అక్కడ గుమికూడిన జనంలో ఉద్రిక్తత, కీడును ఆ శంకించే సావధానత కొట్టొచ్చినట్టు కనిపించసాగాయి.

ప్రత్యేకాహ్వానితులు తమతమ సీట్లలో కూర్చున్నారు. దొంగచాటుగా వారు అన్నివైపులా పరికిస్తున్నారు. బహుశా పారిపోవడానికి వీలైన సమీపమార్గాలకోసం కావచ్చు అందరికీ కూల్ డ్రింక్స్ ఇచ్చారు. ఆరు కొట్టేసరికి కార్యక్రమం మొదలైపోయింది. నట్టువాంగంకోసమే లౌడ్ స్పీకర్లు ఏర్పాటుచేసినా, అవి నృత్యదర్శనాపేక్షనే రెచ్చగొట్టాయి. పదినిముషాల్లో గోడవతల ఉన్న వేలాదిమంది జనం గోడదూకి వేదికవైపు దూసుకువెడుతూ కనిపించారు ఒకటిరెండు నిమిషాల్లో అక్కడ లాఠీచార్జికానీ, కాల్పులుకానీ, మరేదైనా హింసాత్మకఘటనకానీ జరిగి కచేరీ భగ్నమైపోవడం ఖాయమనిపించింది. ఆహ్వానితులముఖాలు ఆందోళనతో నిండిపోయాయి

వరదనీటిలా అన్నివైపులనుంచి ముంచుకొచ్చిన జనం హఠాత్తుగా, నమ్మశక్యంకాని విధంగా, ఆగి ఎక్కడివాళ్ళు అక్కడే కూర్చుండిపోయారు. అప్పుడే బిర్జూ మహరాజ్ తాళబద్ధమైన తన అడుగుల కదలికలో తొలివేగాన్ని పుంజుకుంటున్నారు అల్లరిమూకలో ఆశ్చర్యకరంగా అలముకున్న ఆ నిశ్శబ్దం ఆయనను వందరెట్లు ఉత్తేజపరిచినట్టుంది, తన జీవితకాలంలోనే చిరస్మరణీయమనదగిన ప్రదర్శన ఇచ్చారు. చివరగా ప్రదర్శన పతాకఘట్టానికి చేరుకున్నప్పుడు అక్కడున్న జనం —ముఖ్యంగా గోడదూకివచ్చిన జనం —తాముగా స్పందించి అదే తాళానికి బిర్జూ మహరాజ్‌లా లయలోనే నర్తించడం ప్రారంభించారు. అది ఏ ప్రాంతానిదన్న సంగతి మరచిపోయి ఆ మహనీయుడి యావజ్జీవసాధనను ఆశీర్వదించి పునీతం చేస్తున్నట్టు కనిపించారు. ఆ సుశ్రావ్యధ్వనులతో, ఆ లయబద్ధమైన కదలికలతో యావత్ప్రపంచమూ... బహుశా సమస్తవిశ్వమూ నిండిపోయినట్టు వారికి అనిపించింది. ఆగ్రహ, ద్వేషాలకంటె ఎంతో బలవత్తరమైన మహాశక్తి ఏదో అక్కడ సాక్షాత్కరించినట్టనిపించింది; ఆ రసోత్కటస్థితిలో కలిగిన అలౌకికానందమే ఏకత్వభావన కలిగించగల విశిష్టశక్తిగా భాసించింది.

అయితే ఇది సామరస్యభావనను సూచించే ఒక చెదురుమదురు ఘటన మాత్రమే. అప్పటికి హిందీవ్యతిరేకాందోళన ఇతరప్రాంతాలకు విస్తరించిపోయింది. ఉద్వేగపూరితమైన భాషావివాదం హేతుబద్ధ పరిష్కారాలు వేటికీ లొంగనిదిగా కనిపించింది. హిందీఅభిమానులు, ముఖ్యంగా హిందీ మాతృభాషగా ఉన్న వాళ్ళు, హిందీని వ్యతిరేకించేవారినీ, హిందీని రుద్దడానికి ఇష్టపడనివారినీ దేశద్రోహులుగా చిత్రించేవరకూ వెళ్ళిపోయారు. కవ్వింపు చర్యలు, శత్రుత్వపూరిత ఘటనలు —చిన్నవీ పెద్దవీ వందలసంఖ్యలో జరిగి కల్లోలాన్ని మరింత విషమింపజేశాయి.

రాజ్యాంగంప్రకారం భారతదేశంలో 1965 జనవరి 26 నుంచి హిందీ ఏకైకఅధికారభాషగా అమలుజరగాలి. ఈ గడువు హిందీవ్యతిరేకాందోళనను తొందరపెట్టి తగినంత వేడి పుట్టిం

చింది. 1962 ఏప్రిల్‌లో లాల్‌బహదూర్ హోంమంత్రిగా లోక్‌సభలో అధికారభాషాబిల్లును ప్రవేశ పెట్టారు. ఆ బిల్లుప్రకారం 1965 జనవరి 26 తర్వాతకూడా ప్రభుత్వవ్యవహారాల్లో, పార్లమెంటరీచర్చల్లో ఇంగ్లీషు వినియోగం కొనసాగుతుంది. హిందీని రుద్దడం జరగదని నెహ్రూజీ కూడా ప్రజలకీ, పార్లమెంటుకీ హామీ ఇచ్చారు. ఒక్క రాష్ట్రం కోరినప్పటికీ, ఇంగ్లీషు అనుబంధఅధికారభాషగా కొనసాగుతుందన్నారు. కానీ ఈ చర్యలేవీ రేగుతున్న అసంతృప్తిని నివారించలేకపోయాయి.

ఆనంద్‌తోసహా మరెందరో తమిళనాడును, ఆందోళనతో అట్టుడుకుతున్న ఇతర ప్రాంతాలను సందర్శించడానికి వెళ్ళినప్పుడు హిందీవ్యతిరేకతనుంచి పెల్లుబికే ఆగ్రహావేశాల్ని ప్రత్యక్షంగా చవిచూడవలసివచ్చింది. రాష్ట్రంలోని ఒక వైద్యకళాశాల తన శతజయంతి ఉత్సవాలకు అధ్యక్షత వహించవలసిందిగా ఆనంద్‌ను ఆహ్వానించింది. జనం పెద్దసంఖ్యలో హాజరైన ఆ కార్యక్రమం మధ్యలో, ఆందోళనకారులగుంపు ఒకటి, కాలేజివిద్యార్థులు కొందరు గొంతుకలపగా నినాదాలు చేస్తూ సమావేశానికి భంగం కలిగించింది. మంత్రి తన హిందీఅనుకూలవైఖరిని తక్షణమే మార్చుకుంటున్నట్టు అప్పటికప్పుడే ప్రకటనచేయాలనీ, నేటినుంచి హిందీకి వ్యతిరేకంగా పనిచేస్తానని ప్రతిజ్ఞచేయాలనీ వాళ్ళు డిమాండ్ చేశారు. తను కేవలం పార్టీవిధానాన్ని, ప్రభుత్వవిధానాన్ని మాత్రమే అనుసరిస్తున్నాననీ, దానిని మార్చుకునే ప్రశ్న లేదనీ ఆనంద్ ప్రకటించాడు. అంతే, సమావేశాన్ని బలవంతంగా ఆపించి ఆనంద్‌ను ఘెరావ్ చేశారు. ఆందోళనకారులు అతణ్ణి చుట్టుముట్టి, తమకు మద్దతు ఇస్తానని అతడు ప్రకటించేవరకూ కాలేజీని విడిచివెళ్ళేది లేదని స్పష్టంచేశారు. దాంతో ప్రతిష్టంభన ఏర్పడింది. ఉత్సవనిర్వాహకుల్లోకూడా కొందరు ఘెరావ్‌లో చేరారు. ఆనంద్ ప్రశాంతంగా ప్రిన్సిపాల్‌గదిలో కూర్చున్నాడు, బయట కొంతసేపు నినాదాలు మారుమోగాయి. తెల్లవారుజామువరకు ఘెరావ్ కొనసాగింది. అక్కడినుంచి వెళ్ళాలన్న తొందర కానీ, ఆందోళనకారులతో వాదం పెట్టుకునే ఆలోచన కానీ ఆనంద్‌లో కనిపించలేదు. చివరకు జిల్లాకలెక్టర్ ప్రదర్శకులతో చర్చలు జరిపి, తమ అభిప్రాయాలు తెలియజేస్తూ మంత్రికి వినతిపత్రం ఇవ్వడానికి ఒప్పించాడు. ఆ తర్వాత విద్యార్థులు హఠాత్తుగా మెత్తబడిపోయారు, తమ అనుచితప్రవర్తనకు విచారం వ్యక్తంచేశారు.

హిందీవ్యతిరేకాందోళనకు సారథ్యంవహించేపార్టీకి చెందిన ఓ పార్లమెంటుసభ్యుడు ఉద్యమ పర్వానికి చక్కని కొసమెరుపు సమకూర్చాడు. ఆనంద్‌కి అతడు బాగా తెలుసు, ఢిల్లీలో చాలాసార్లు ఇద్దరూ కలుసుకున్నారు. ఒకరోజున ఆ ఎం.పి. మద్రాసునుంచివచ్చి పాలం విమానాశ్రయంలో దిగాడు. అదే సమయంలో ఆనంద్ ఢిల్లీనుంచి అఫ్రోజాబాద్ బయలుదేరాడు. ఇద్దరూ వి.ఐ.పి. లాంజ్‌లో కలుసుకోవడం తటస్థించింది. ఆ ఎం.పి.తోపాటు అతడి కొడుకు కూడా ఉన్నాడు. అతణ్ణి ఆనంద్‌కి పరిచయంచేశాడు. ఆ తర్వాత కొంత పైతృకగర్వంతో అన్నాడు, 'మీకు తెలుసో లేదో, మావాడు ఢిల్లీలో చదువుతున్నాడు, హిందీలో వీడి క్లాసులో ఎప్పుడూ వీడే ఫస్టు!'

ఆశ్చర్యపోతూ ఆనంద్ అన్నాడు 'మీకు హిందీలో ఒక్కముక్కకూడా రాదు, పైగా హిందీకి వ్యతిరేకంగా ఎప్పుడూ ఆందోళన చేస్తూనే ఉంటారు!'

'చూడండి, అవి రాజకీయాలు...'

'ఔనౌను, చూస్తున్నాను, ఇప్పుడు మరింత బాగా చూడగలుగుతున్నాను' ఆనంద్ జవాబు చెప్పాడు

భాషావివాదానికి సంబంధించి కొత్తచట్టం తీసుకొచ్చి రక్షణ కల్పించినప్పటికీ కొన్నిపార్టీలు వేర్పాటుఉద్యమాన్ని కొనసాగించాయి. పూర్తిగా విచ్ఛిన్నవాదధోరణి ఒకటి క్రమంగా పుంజుకోడం మొదలైంది. పర్యవసానంగా, 1963 మేలో ఒక రాజ్యాంగసవరణబిల్లును ప్రతిపాదించడం జరిగింది. దానిప్రకారం భారతయూనియన్‌నుంచి వేరుపడాలన్న ఎటువంటి అభివ్యక్తినైనా దేశద్రోహంగా పరిగణిస్తారు. నెహ్రూజీ ఆరోగ్యం, అధికారం సన్నగిల్లుతున్నకొద్దీ దేశం ఎదుర్కోవలసి వచ్చిన కొత్తసమస్యల్లో ఇవి కొన్ని.

వీటన్నింటినీ మించి 1966 ప్రారంభంలో దేశం ఎదుర్కొన్న అతిపెద్ద అ ఘాతం చైనాతో యుద్ధం. ఒక దశాబ్దకాలంపాటు భారత, చైనాల మధ్య చక్కని సంబంధాలు కొనసాగాయి కానీ, ఆ స్నేహభావం క్రమంగా క్షీణించిన జాడ స్పష్టంగా కనిపించింది. 'హిందీ చీనీ, భాయ్‌భాయ్' వంటి ఉద్వేగభరితనినాదాలతో రెండుదేశాలమధ్య తరచు జరుగుతూవచ్చిన స్నేహపూర్వక పర్యటనలు విషాదకరనిశ్శబ్దంలోకి జారిపోయాయి. సరిహద్దుల్లో ఉద్రిక్తత పెరగసాగింది. అయితే శత్రుత్వాలు ఇంకా పడగవిప్పలేదు కానీ, ఆసియాలోని రెండుమహాశిఖరాలు శాశ్వతసన్నిహిత స్నేహబంధాన్ని అల్లుకున్నట్టుగా జవహర్లాల్ కంటున్న కల చెదిరిపోతున్న సూచనలు — బహుశా శాశ్వతంగా చెదిరిపోతున్న సూచనలు స్పష్టంగా పైకితేలాయి కొందరు దిగ్గజాలు సమానత్వాన్ని విశ్వసించరు. అలా విశ్వసించేవారిని బలహీనులుగా పరిగణిస్తారు. కేవలం బలహీనులు మాత్రమే సమానత్వాన్ని కాంక్షిస్తారని వాళ్ళ ఉద్దేశం.

పరిస్థితులు పూర్తిగా చేజారిపోలేదు. జవహర్లాల్‌నెహ్రూ కళ్ళముందు ఉన్నంతవరకూ అవి చేజారిపోవు కూడా. ఆయన ప్రజలకు ఆరాధ్యదేవత. దేశానికి ప్రధాన స్ఫూర్తిదాతగా ఆయన ఇంకా కొనసాగుతూనే ఉన్నాడు. ప్రజల్ని ఉత్సాహపరచి సమీకరించగల శక్తి ఆయన కొక్కడికే ఉంది. అదే సమయంలో, ఫలితాలు సాధించగల ఆయన సామర్థ్యంపట్ల గతంలో ఎన్నడూలేనంత తరచుగా ఇప్పుడు అనుమానాలు పుట్టుకొస్తున్న మాటా నిజమే. అయినా ఆయన ఎంతకాలం మనమధ్య ఉంటారు? తదనంతరం ఏమిటి?

వేరే పార్టీలు పుట్టించడానికనో లేక వాటికి నాయకత్వం వహించడానికనో ఆయన పాత మిత్రులు కొందరాయనకు దూరమయ్యారు. సామర్థ్యాల విషయానికొస్తే, బహుశా వాళ్ళు సరిపోయినంత సామర్థ్యం ఉన్నవాళ్ళే; అయినా ప్రభావం చూపగలిగినవాళ్ళు కాదు. వారి కీర్తిప్రతిష్ఠలు స్వాతంత్ర్యోద్యమానికి వారందించిన ఘనసేవలకు గుర్తింపుగా లభించినవే, 'మాతృ'సంస్థకు దూరమయ్యే క్షణంవరకూ అవి అలాగే కొనసాగాయి. ఆ తరువాత సామాన్యప్రజలు వారిని ద్రోహులుగానే పరిగణించారు తప్ప, అవిభక్తపార్టీనిమించి ఉజ్జ్వలంగా వెలిగిపోయే సరికొత్తవ్యవస్థను దేనినో వారందించారని, అందిస్తారని, భావించలేదు. ప్రజాస్వామ్యపరిరక్షణకోసం ఉత్సాహభరితమైన ఓ వినూత్న ప్రతిపక్షాన్ని సృష్టించాలన్న వాళ్ళ న్యాయమైన సంకల్పం నిజమైన గుర్తింపు తెచ్చుకోలేకపోయింది. చాలామంది వారిని అసంతృప్తితో వేగిపోతున్న వ్యక్తులుగానే భావించారు. అట్టడుగుస్థాయిలోనే కావచ్చు కానీ, అందుకు వినిపించిన కారణం

విస్మయంగొలిపేంత సరళమైనది. ప్రజలు వోట్లువేసి అధికారం అప్పగిస్తారు కనుక ప్రభుత్వం చట్టాలు తెచ్చి, ప్రజలకు ఉపయోగ పడే విధానాలు అమలుచేస్తుంది. అంతే మధ్యలో కొత్తగా ఈ ప్రతిపక్షం ఏమిటి? జనానికి దీని అనుపానులేవీ తెలియవు. రాజు పరిపాలిస్తున్నప్పుడుగానీ, భూస్వాములు అధికారం చలాయిస్తున్నప్పుడు గానీ వాళ్ళు ఇటువంటిది విని ఎరుగరు. ఈ ఆలోచన వాళ్ళలో పాతుకోలేదు. అదేదో విజాతీయం. వింతగొలిపే విషయం, ఎబ్బెట్టుగా ధ్వనించే మాట. అందుకే అది మద్దతును కూడగట్టుకోలేకపోయింది. అందుకు బదులుగా 'మాతృపక్షా'నికి అనుకూలంగానో, వ్యతిరేకంగానో వోటువేయడమే ప్రజలు నేర్చుకున్నారు. ఒకపార్టీని సహేతుకంగా కాదని మరోపార్టీని అంతే సహేతుకంగా ఎంచుకోవడం వాళ్ళకి తెలియదు.

అయితే ఇదంతా మాటల్లో స్పష్టంగా వ్యక్తమైన సందర్భం లేదు. ప్రజలు తరచు స్థానికపరిణామాలకే స్పందిస్తూ ఉంటారు. ఉదాహరణకు మాతృపక్షం, ప్రజల్లో పేరుప్రతిష్ఠలు లేని మనిషిని అభ్యర్థిగా నియమిస్తుంది; 'న్యాయబద్ధం' కాని కారణాలతో పార్టీ ప్రస్తుతసభ్యునికి టికెట్ నిరాకరిస్తుంది, లేదా, అంతే ప్రజాదరణ, శక్తియుక్తులు ఉన్న అభ్యర్థి మరోపార్టీ తరఫున గానీ, సొంతంగా కానీ బరిలో నిలబడతాడు. ఈ చివరి ఉదంతంలో ప్రజలవోటు ఆ వ్యక్తికే కానీ పార్టీకి కాదు. ఇటువంటివే మరికొన్ని. ఏతావతా వీటివల్ల తేలేదేమిటంటే పార్టీ ప్రజాస్వామ్యం, వాస్తవికార్థంలో ఇంకా వేళ్ళూనలేదని. వీటికితోడు, మాతృపక్షాన్ని విడిచివచ్చిన పలువురు నాయకులకు స్వస్థానాలలో తమ పరిస్థితి అస్థిరంగా మారినట్టు కనిపిస్తుంది. ప్రతి ఎన్నికలోనూ, ఉపఎన్నికలోనూ వారు నియోజక వర్గాల్ని మార్చుకుంటూ ఉంటారు —ఒకసారి బీహార్‌నుంచి, ఒకసారి కర్ణాటకనుంచి, మూడోసారి మధ్యప్రదేశ్‌నుంచి... ఎన్నికలొచ్చిన ప్రతిసారీ 'సురక్షిత' నియోజకవర్గాన్ని వెతుక్కుంటారు. తాత్కాలికంగా పొత్తు కల్పించుకున్న పార్టీలకూ, వ్యక్తులకూ పేరున్న పెద్దమనిషి కావలసివచ్చినప్పుడు వాళ్ళు 'గెస్ట్' అభ్యర్థులుగా కూడా మారుతుంటారు. ఏదో విధంగా, ఏదో ఒక కారణంతో మాతృపక్షాన్ని ఓడించడమే దానివెనుక ధ్యేయం. పార్టీవ్యవస్థ అలా తనలోతనే చుట్టుకుపోతూ ఉంటుంది. ఫలితంగా ప్రజాస్వామ్యం దెబ్బతింటూ ఉంటుంది.

మాతృపక్షాన్ని విడిచివెళ్ళి పోయిన కొందరు నాయకులు అనామకులు, ఏకాకులు అయిపోయి పూర్తిగా నిరాశా నిస్పృహల్లోకి జారిపోయారు. ఆకర్షణీయమైన నినాదాలన్నింటిమీద గుత్తాధిపత్యం జవహర్లాల్‌దే అయింది —సోషలిజం, దున్నేవాడికే భూమి, అభివృద్ధికి ప్రణాళిక, శాస్త్రసాంకేతికవిజ్ఞానం, ఆధునికభారత నిర్మాణం, సహకార సమాఖ్య, పంచాయతీరాజ్ పేరిట పిలిచే ప్రజాస్వామిక వికేంద్రీకరణ... ఒకటేమిటి, ప్రతిదీ. నెహ్రూ ప్రత్యర్థులు అవే నినాదాలు వల్లించినప్పుడు అవి నమ్మదగినవిగా ఉండేవి కాదు.

నెహ్రూలో చెప్పుకోదగ్గ సైద్ధాంతికలోపాలేవీ కనిపించకపోవడంతో విమర్శకులు అవినీతివైపు దృష్టి మళ్ళించారు. స్వాతంత్ర్యోద్యమంనాటి ఆదర్శభరిత వాతావరణం అక్షరాలా విచ్ఛిన్నమైపోయింది. రాజకీయవాదులు, పాలకులు సందర్భానికి తగినట్టు రంగులుమార్చే ఊసరవెల్లుల్లా, నీతినియమాలను సడలించుకుంటూ ఇది 'వాస్తవికవాద'మంటూ వ్యవహరించడం ప్రారంభించారు. అనేక 'కుంభకోణాలు' పైకితేలాయి. వాటిలో దాదాపు ప్రతిఒక్కదానితో మంత్రులకీ,

లేదా ప్రభుత్వంలోనో, అధికారశ్రేణిలో ఉన్నతస్థానంలో ఉన్న వ్యక్తులకూ సంబంధం ఉంటూనే వచ్చింది. నెహ్రూగారి తిరుగులేని ఆధిపత్యం కారణంగా రాజకీయరంగంలో పెద్ద ఒడుదొడుకులేమీ తలెత్తలేదు కనుక సులభంగా దొరికే అవినీతిసమస్య ప్రధానచర్చనీయాంశంగా పరిణమించింది నెహ్రూ, మరికొందరు మినహా అధికారపక్షంలోని ప్రతిఒక్కరూ సర్వవ్యాప్తమైన ఈ అవినీతివిషవలయంలో చిక్కుకుపోయారన్న విశ్వాసాన్ని ఈ కుంభకోణాలు, మెల్లమెల్లగానే అయినా కచ్చితంగా జనంలో పెంచాయి

ఇది కొన్ని అనివార్యఫలితాలకూ దారితీసింది. ప్రజల్లో ఒకవిధమైన వైముఖ్యభావం పెరిగిపోయింది దేశంలోని మొత్తం రాజకీయయంత్రాంగం అంతా అవినీతిలో మునిగితేలుతున్నట్టు వాళ్ళు భావించడం ప్రారంభించారు. మహాత్మాగాంధీ పార్టీలోనే ఇటువంటిది సంభవించినట్టు వారు విశ్వసించడంతో, ఇక ఎటువంటి నైతికవిలువలు బతికిలేవనీ, బతకలేవనీ నిర్ధారణ కొచ్చేశారు. నిజాయితీ, నిరాడంబరత, సత్యసంధత వంటి ఉన్నతభావాలు క్రమంగా ఆదరణ కోల్పోయాయి. అన్నీ సాపేక్షమే; ఏదీ ముఖ్యంకాదు. ఇంచుమించు సంపూర్ణంగా సార్వత్రిక అనైతిక వాతావరణం ఏర్పడిపోయింది. రోతపుట్టించే అవకాశవాదంతోకూడిన సరికొత్త వాతావరణం మరింత అవినీతినే ప్రేరేపించింది. తమ అవినీతిచర్యలు వీధికెక్కినాసరే, పశ్చాత్తాపం చెందినవారు ఒక్కరూలేరు. జనం అభిశంసనతో పాటు వీరి అవినీతికూడా పెరుగుతూ వచ్చింది.

విలువలు, సూత్రాల గురించి పండిట్‌జీ అదేపనిగా మాట్లాడడంవల్ల ఏమిటి ప్రయోజనమని ప్రజలు వ్యాఖ్యానించసాగారు. తన పార్టీమనుషుల్నే ఆయన అదుపుచేయలేరు. అవినీతి, బంధుప్రీతి, ఆశ్రితపక్షపాతం, కులతత్వం, మతతత్వం దేశాన్ని తుపానులా ముంచెత్తుతుంటే ఆయన నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయినట్టే కనిపించారు. వాస్తవానికి, అధికారపక్షంలోని అవినీతిపరులకు జవహర్లాల్ నాయకత్వంలో చక్కని ఆశ్రయమూ, రక్షణా లభిస్తున్నట్టు కూడా జనం విశ్వసించడం ప్రారంభించారు, అలా జరిగి ఉండకపోతే రాజకీయాలు గతంలోవలె మరింత పరిశుద్ధంగా ఉండేవి... ఇది మరీ విపరీతాభిప్రాయం, ఆ విషయం విమర్శకులకూ తెలుసు. అయినా అది పాక్షికంగానైనా వాస్తవమే కనుక, అంతకుమించిన బలవత్తరమైన అంశమేదీ లేని పరిస్థితిలో అదే చర్చనీయాంశ మైపోయింది.

ఇక ఆ తర్వాత ఎన్నికలు. భూస్వామ్య దుర్లక్షణాలతో పంకిలం కావడంతోపాటు ఎన్నికలప్రక్రియ రానురాను అవినీతివిషవలయంలోకి జారిపోతూవచ్చింది. దేశపరిపాలన విషయంలో ప్రజాభిమతాన్ని ప్రతిబింబించడమనే వాస్తవిక ప్రయోజనాన్ని క్రమంగా అవి కోల్పోతూ వస్తున్నాయి. రెండు పక్షాలూ, వ్యక్తులూ అమీతుమీ తేల్చుకోడానికి పనికొచ్చే ఓ అవకాశంగా, ఓ యుద్ధఘట్టంగా ఎన్నికలు పరిణమించాయి. యథేచ్ఛగా ఎవరైనా పార్టీ మారిపోవచ్చు. తమ వీలునుబట్టి ఏ క్షణాన అయినా ఉన్న పార్టీని విడిచిపెట్టి, ఆ తర్వాత మరెప్పుడైనా పార్టీలోకి తిరిగి ప్రవేశించవచ్చు. వోటింగ్ సరళిని కులం, మతమే చాలావరకు నిర్ణయిస్తున్నాయి. రాజకీయనైతికవిలువలు మరీ మరీ అప్రధానంగా మారిపోయి సిగ్గుబిడియాలు కొంచెమైనా లేని క్రాస్ —వోటింగ్‌కు దారితీయిస్తున్నాయి.

పార్లమెంటుకు ఎన్నికలు చాలావరకు రాజకీయకోణంనుంచే జరుగుతున్నా, రాష్ట్రాల శాసన సభలకు జరిగే ఎన్నికల్లో, ఉపఎన్నికల్లో రాజకీయసారాంశం లోపిస్తూఉండడం విషాదకర పరిణామం. యుద్ధంలో శత్రుస్థావరాలను చేజిక్కించుకున్నట్టు అభ్యర్థులు పోలింగ్‌కేంద్రాలను చేజిక్కించుకోవడం జరుగుతోంది. అవసరాన్నిబట్టి వోటర్లనుపై ప్రభావం వేయడానికి, వాళ్ళను భయపెట్టి తరిమికొట్టడానికి విశృంఖలంగా తుపాకులు, బాంబులు ప్రయోగించడమూ జరుగుతోంది. కొన్ని ఉత్తరాదిరాష్ట్రాల్లో ఇది రివాజుగా మారింది. రాజకీయపక్షాలు లిటిగేషన్‌కోర్టుగా మారిపోతే, పార్టీకార్యకర్తలు 'టౌట్లు' (పైరవీకార్లు)గా వ్యవహరిస్తున్నారు. ఇది వెనకటి ఫ్యూడల్‌వ్యవస్థకు కొనసాగింపు. ప్రజాస్వామ్యంలోని వాస్తవికస్ఫూర్తి ఓ చెదిరిపోయిన భ్రమగా, శతాబ్దాలుగా దేశంలో కొనసాగుతున్న ఏకాధిపత్యసంప్రదాయానికి ఓ విషాదచ్ఛాయలా మిగిలిపోయింది.

దేశసమైక్యతలోకూడా పగుళ్ళు కనిపించడం ప్రారంభించాయి. జమ్మూ —కాశ్మీర్ ఓ రాజ్యాంగసమస్యను తెచ్చిపెట్టింది. ఏదైనా ఒక రాష్ట్రానికి, మిగిలినరాష్ట్రాలకు లేని 'ప్రత్యేక ప్రతిపత్తి'ని కల్పించడమన్న భావన ఎందరికో అసంతృప్తి కలిగించింది. అయినప్పటికీ భౌగోళికప్రాంతాలమధ్యనున్న వైవిధ్యం దృష్ట్యా, వాటికున్న జాతిసంబంధమైన, సాంఘిక — ఆర్థిక సంబంధమైన సంక్లిష్ట నేపథ్యాలదృష్ట్యా యాంత్రికసమానత్వాన్ని వర్తింపజేయడం కష్టం. ఈ సందిగ్ధస్థితికి పరిష్కారం సాధించడానికి జవహర్లాల్‌నెహ్రూ ఎంతో ప్రయత్నించారు. అది కొంతకాలం పనిచేసింది కానీ, ఊగిసలాడుతున్న జాతీయసమైక్యతను ఆ తర్వాత దెబ్బతీసింది. మొత్తంమీద, ప్రజల్ని ఉత్తేజపరచగలిగిందేమీ లేకపోవడంతో చాపకింద నీరులా అసంతృప్తి విస్తరిస్తున్న కాలమది. జరిగిందల్లా జారిపడిపోకుండా పట్టుకోవడం; ఒకవైపున అవినీతి, నైరాశ్యం దేశంలో కేన్సర్‌లా విస్తరిస్తున్న ఆ సమయంలో, భారతదేశం విచ్ఛిన్నమైపోకుండా, తగ్గుముఖం పడుతున్న తన సమ్మోహనశక్తి అనే దుర్బలపరికరంతో అలా పట్టుకుని కాపాడుతున్నదికూడా ఒకేఒక వ్యక్తి. ఐక్యతకీ, అనైక్యతకీ మధ్య సుస్థిరత్వానికీ, సంక్షోభానికీ మధ్య ఒకేఒక వ్యక్తి నిలబడి ఉన్నాడు. మిగిలినవారంతా అప్రధానులు.

కుంగతీస్తున్న ఇటువంటి వాతావరణంలో పార్టీఎన్నికలప్రణాళిక ముసాయిదారచనలో పాల్గొనడానికి ఆనంద్ నియుక్తుడయ్యాడు. తన శక్తిమేరకు చేయగలిగింది చేశాడు, అయినా సంతృప్తుడు కాలేకపోయాడు. ఈ క్రమంలో, ఢిల్లీరాజకీయపద్మవ్యూహంలోని కేంద్రస్థానం కుళ్ళి శిథిలమౌతున్నట్టు గమనించాడు. తన రాజకీయస్థితి వికాసంలో అతడు తలపడబోతున్నది ఇదే పరిస్థితి.

# 32

1959 నుంచి భారత—చైనా సరిహద్దుల్లో పరిస్థితి ఉద్రిక్తంగా మారుతూవచ్చింది. సార్వత్రిక ఎన్నికలు సమీపిస్తున్న ఘట్టంలో ఇది యావద్దేశానికీ కలవరం కలిగించింది. స్వతంత్రభారతంలో ఒక అంతర్జాతీయసమస్య జాతీయస్థాయిలో ప్రాముఖ్యాన్ని సంతరించుకోవడం బహుశా ఇదే మొదటిసారి. అంతర్జాతీయవ్యవహారాలను జవహర్లాల్‌నెహ్రూ ఏదోవిధంగా 'చక్కబెట్ట'గలరన్న దేశవాసుల అంచనాను ఇది తలకిందులుచేసింది. ప్రపంచదేశాలమధ్య భారతదేశానికున్న ప్రతిష్ఠాగౌరవాలు చెక్కుచెదరకుండా కొనసాగుతాయన్న విశ్వాసం గతంలో ఉన్నంత దృఢంగా ఇప్పుడు లేదు.

1962లో జరిగిన తృతీయసార్వత్రికఎన్నికలు అధికారపక్షానికి మరోవిజయం తెచ్చిపెట్టాయి. అయితే ఆందోళన మరింత ముదిరిపోయింది. నెహ్రూకిగానీ ఆయన పార్టీకిగానీ విశ్వసనీయప్రత్యర్థులెవరూ పుట్టుకురాలేదు; అయినా ఆయన, ఆయనపార్టీ బలహీనపడడం స్పష్టంగా కనిపిస్తోంది.

చౌదరి అఫ్రోజాబాద్‌లో మరోసారి ముఖ్యమంత్రిత్వం స్వీకరించాడు, రాష్ట్రస్థాయిలో పరిస్థితులు వెనకటిలానే ఉన్నాయి. దేశం ఉత్తర సరిహద్దులకు తన రాష్ట్రం ఎంతో దూరంలోనే ఉన్నా, చైనాసమస్య ఎందరో ముఖ్యమంత్రులకు కలిగించినట్టే ఆయనకీ ఆందోళన కలిగించింది. చైనా సమస్యను ప్రస్తావిస్తూ ప్రధానమంత్రి పదిహేనురోజులకోసారి రాస్తున్న లేఖలను ఆయన జాగ్రత్తగా అధ్యయనంచేస్తున్నాడు. నిజానికి 1949 నుంచి రాస్తున్న అటువంటి లేఖలన్నింటినీ ఫైలుచేయించి అప్పుడప్పుడు వాటిని తిరగేస్తున్నాడు. వ్యక్తిత్వాలఘర్షణను సరిగ్గా పసిగట్టగలిగినవాడు కనుక నెహ్రూ, సర్దార్‌పటేల్ దృక్పథాలమధ్య ఉన్న భేదాల విషయంలో ఆయనలో ఏదో స్ఫురణ —నిజానికి స్ఫురణను మించినది —పనిచేస్తూఉండేది. ఈ రెండు శిఖరాలు బహిరంగంగా ఢీకొంటే ఏంజరిగి ఉండేదని తలపోస్తూ ఉండేవాడు. 1950లో సర్దార్ మహనీయుడు మరణించడంతో ఒకవిధంగా, ఏదో జరగకూడని ప్రమాదం తప్పిపోయిందనికూడా ఆయనకు అనిపించింది.

అక్టోబర్‌లో ఓ రోజు ఉదయం చౌదరిని ఒక విలక్షణమైన అశాంతి ఆవరించింది. ఉత్తరసరిహద్దు ప్రత్యేకించి భయోత్పాతకంగా మారినట్టు కనిపిస్తోంది. ఏదో ఉత్పాతం మీదపడబోతున్నదన్న స్ఫురణ కలుగుతోంది. రాజకీయసంక్షోభాలను ఎదుర్కోడంలో ఎంతో ఆరితేరిన ఒక తలపండిన రాజకీయవాదికి కలిగే గురితప్పని స్ఫురణ అది... అదే జరిగింది —పూర్తిస్థాయిలో చైనా దురాక్రమణ, భారతదేశం ఆ వెన్నుపోటు కలిగించిన దిగ్భ్రాంతిలో తలమునకలౌతుండగానే చైనా దాడిచేసి భారతభూభాగాన్ని ఆక్రమించుకుంది.

1962 అక్టోబర్ 20న పెద్దసంఖ్యలో ఉన్న చైనా శతఘ్నిదళం ఈశాన్యసరిహద్దువిభాగం (NEFA) లోని కమెంగ్ సరిహద్దు డివిజన్‌కు చెందిన నాన్కాఛూ రంగానికి రక్షణగాఉన్న భారతీయసేనపై భారీఎత్తున గుళ్ళ వర్షం కురిపించింది. చైనా పదాతి దళం 160 మైళ్ళవరకు భారతభూభాగంలోకి చొచ్చుకువచ్చి నవంబర్ 20 నాటికి బ్రహ్మపుత్రలోయలోకి అడుగు పెట్టింది. పర్వతప్రాంతాలలో యుద్ధానికి తగిన సాధనసంపత్తికానీ, వాతావరణపరిచితి కానీ, శిక్షణ కానీ భారతదళాలకు లేవు. 'నేఫారివర్స్'గా పిలవబడిన ఈ స్వల్పకాలికయుద్ధం భారత రాజకీయ, సైనిక పునాదుల్ని కుదిపివేసి పరాజితమనస్తత్వాన్ని పెంచివేసింది. ఇంకా నిర్ధారణ జరగని భారత —టిబెట్ సరిహద్దులగురించి చైనాతో ఘర్షణ జరిగే అవకాశాన్ని భారతదేశం ఊహిస్తూనేఉంది కానీ, భారీ సైనికఘర్షణ వచ్చిపడే అవకాశాన్ని ఊహించలేకపోయింది. ప్రభుత్వం దేశాన్ని యుద్ధపరిస్థితికి సన్నద్ధంచేయలేదు. దిగ్భ్రమ, అవిశ్వాసం, ఆగ్రహాలే భారత ప్రతిస్పందనలయ్యాయి. 'మనం నిర్లక్ష్యం వహించాం, నమ్మి మోసపోయా'మని రాష్ట్రపతి ఎస్. రాధాకృష్ణన్ వ్యాఖ్యానించారు ప్రధాని నెహ్రూ రేడియోలో మాట్లాడుతూ వైఫల్యాన్ని విషాదమిళితంగానే అయినా ధైర్యంతో అంగీకరించారు. 'సరిహద్దుల్లో మన సైనికులు ఎదుర్కొన్న ఓటమికీ, మనకు సంభవించిన నష్టాలకూ నే నెంతో మనస్తాపంచెందాను. పెద్దఎత్తున చైనాబలాలు, వారు వెంటతెచ్చుకున్న భారీ శతఘ్నులు, కొండతుపాకులు, పెద్దపెద్ద మోర్టార్లు మన సైనికుల్ని ముంచెత్తాయి.' రక్షణమంత్రి వి.కె. కృష్ణమీనన్‌కూడా ఓటమిని అంగీకరించారు, 'బలగాలసంఖ్యలో ఆయుధ శక్తిలో చైనీయులు మనకంటె ఎంతో ఆధిక్యంలో ఉన్నారు. ఆ సంఖ్యతో, ఆ ఆయుధ సంపత్తితో మనం తూగలేకపోయాం.'

భారతవిదేశాంగవిధానం అస్తవ్యస్తమైపోయింది. నేఫాలో ఎదురైన సంపూర్ణపరాజయం దేశాన్ని ఆగ్రహోద్రగ్రంచేసింది. సైన్యం తీక్ష విమర్శలను, ఎగతాళిని ఎదుర్కొంది. చైనా చొరబాటుతో సరిహద్దురాష్ట్రమైన అస్సాం పరిస్థితి ప్రమాదంలోపడి ప్రజల ఆగ్రహానికి నైరాశ్యం తోడైంది. ముప్పైరోజులతర్వాత చైనా తను ఆక్రమించుకున్న భూభాగాలనుంచి వైదొలగుతున్నట్టు తనంతతానే చేసిన ప్రకటన భారత పరాజయఖేదాన్ని మరింత పెంచింది. బ్రిగేడియర్ జాన్ దళ్వీ మాటల్లో చెప్పాలంటే: '... 1962లో సంభవించింది ఒక జాతీయవైఫల్యం. ఇందులో ప్రతి భారతీయుడూ నేరస్థుడు. అది యుద్ధమార్గదర్శనంలో ఉన్నతస్థాయి వైఫల్యం, ప్రతిపక్షాల వైఫల్యం, సైనికదళాధిపతుల (నేనుకూడా భాగస్వామిగా ఉన్న) వైఫల్యం; ఇంకా అది బాధ్యతాయుత ప్రజాభిప్రాయ వైఫల్యం, పత్రికల వైఫల్యం. భారతప్రభుత్వం విషయంలో అది అన్ని స్థాయిల్లోనూ హిమాలయమంత తప్పిదం...'[2]

---

2) ఇక్కడ పేర్కొన్న అంశాలు బ్రిగేడియర్ జాన్ దళ్వీ రచించిన Himalayan Blunder ఆధారంగా పునర్నిర్మించినవి. అత్యంత సంక్లిష్టమైన ఈ అంశంపై సమగ్ర అవగాహనకు బి.ఎన్. మలిక్ రచించిన The Chinese Betrayal, My years with Nehru, 1948–64, మైకేల్ బ్రెచర్ రచించిన Nehru: A Political Biography, డి.ఆర్. మాంకేకర్ రచించిన Guilty Men of 1962 గ్రంథాలు పాఠకులకు తోడ్పడతాయి. 1962 ఘటనలను అర్థంచేసుకోడానికివి నాకు ఉపకరించాయి — రచయిత.

అశనిపాతంలాంటి చైనా దురాక్రమణవార్త వెలువడిన సమయంలో ఆనంద్ ఒక సుదూరగ్రామంలో పర్యటిస్తున్నాడు. కొన్నిగంటల్లోనే అక్కడి వాతావరణంలో ఆశ్చర్యకరమైన సమూలపరివర్తన కనిపించింది గ్రామంలో ఒక కమ్యూనిటీ రేడియో ఉంది మామూలువేళల్లో జనం ఆ రేడియో వినడంమీద ప్రత్యేకమైన ఆసక్తి చూపించరు. అయితే దురదృష్టకరమైన ఆ రోజు ఉదయం గ్రామస్థులందరూ ఆ రేడియోముందు కూర్చొని ప్రతి బులిటెన్‌ను ఎంతో సావధానంగా వింటూఉండిపోయారు. అది ఓ రోడ్డుపక్క గ్రామం. పంచాయతీకార్యాలయంలో ఉంచిన ఆ రేడియో దురాక్రమణవార్తలను ఘోషిస్తూంటే రోడ్డుమీద ఎక్కడి వాహనాలు అక్కడే ఆగిపోయాయి. ట్రక్కుడ్రైవర్లు వాహనాలు దిగొచ్చి అక్కడి గుంపులో కలిసిపోయి గాలిలో ప్రతిధ్వనిస్తున్న దురాక్రమణవార్తలు వింటూ పళ్ళు కొరుకుతూ ఉండిపోయారు. బస్టాండ్‌లో ఉన్న చిన్న టీకొట్టు యజమాని మరో సందర్భంలో అయితే అనుకోకుండా వచ్చిపడిన గుంపుకు వేడివేడి టీ, తినుబండారాలు అందిస్తూ హడావుడిపడుతుండేవాడు. అక్షరాలా అది దైవకృపగా పరిణమించిఉండేది. కానీ ఆ ఉదయం టీకొట్టుయజమాని నిర్విణ్ణస్థితిలో ఉన్నాడు: కనీసం స్టౌవ్‌మీద టీ కెటిల్‌కూడా ఉంచలేదు. అక్కడికొచ్చి రోజూ టీ తాగేవారికికూడా టీ దొరకలేదు. రేడియోలోంచి వినిపించే ఆ ఒక్క కలవరగాత్రంతప్ప, చుట్టు పక్కల అంతటా నీరవనిశ్శబ్దం. అసలేనాడూ స్కూలు మొహం చూడని, లేదా ఒకటిరెండేళ్ళు స్కూలుకెళ్ళి మానేసిన డజన్లకొద్దీ పిల్లలు రోజంతా ఆటపాటలతో కాలక్షేపంచేస్తూ జులాయిలుగా తిరుగుతూఉండడం పరిపాటి కానీ ఆ రోజు వాళ్ళుకూడా చిన్నబుచ్చుకున్న ముఖాలతో విగ్రహాల్లా నిలబడిపోయారు. వాళ్ళెప్పుడైనా చైనా పేరు వినిఉంటారని కానీ, ఒకదేశం మరోదేశంమీదికి దాడిచేయడమంటే ఏమిటో వాళ్ళకు తెలుసునని కానీ చెప్పడం కష్టం. వాళ్ళకు తెలిసి యూనిఫారంతో కనిపించే ఒకేఒక మనిషి స్థానిక పోలీస్ కానిస్టేబుల్. యుద్ధంవరకూ దేనికి, సైన్యమూ, నౌకాదళమూ, వైమానికదళమూకూడా వారి ఊహకందనివే. అయినా ఆ వార్తతో వాళ్ళు అప్పుడే యుద్ధ రంగంనుంచి తిరిగొచ్చినవాళ్ళలా కుంగిపోయారు. దురాక్రమణవార్తలు ఎంతో వేగంగా — ధ్వనికంటేకూడా వేగంగా వ్యాపించిపోయాయి. అందువల్ల రేడియో విననివాళ్ళకుకూడా ఆ వార్త తెలిసిపోయింది. భారతీయపరిభాషలో మనోవేగం అనదగిన వేగం అది. ప్రతిపౌరుడూ వర్ణింపనలవికాని ఆగ్రహం, ఆవేదన, నిరాశాభావాల మిశ్రమంలో కూరుకుపోయాడు. అన్నింటినీ మించి, ఈ సువిశాలదేశంలో ఎక్కడెక్కడో నివసిస్తున్న ప్రతిభారతీయుడిలోనూ ప్రతిఒకరిలో ఏకత్వభావన ఉబికివచ్చింది.

ఆనంద్ చిన్న డాక్‌బంగళా వరండాలో కూర్చుని ట్రాన్సిస్టర్ వింటున్నాడు. తర్వాత తన బ్రీఫ్‌కేసులో ఎప్పుడూ ఉంచుకునే భారతదేశపటాన్ని తీసి పరిశీలనగా చూశాడు. సరిహద్దుల్లో సైనికచర్యలకు సంబంధించిన వివరాలేవీ అందులో దొరక్కపోవచ్చు కానీ అందుబాటులో ఉన్న రోడ్లకూ సరిహద్దుకూ మధ్య ఎంత దూరం విస్తరించిందో అది స్పష్టంగా సూచిస్తోంది. భౌగోళిక ప్రాతికూల్యంలోని ఆ తీవ్రత భయభ్రాంతుణ్ణి చేసింది. సరిహద్దుల్లో పోరాడే ఒక్కొక్క సైనికుడికోసం నూటయాభైమంది పొలాల్లో, ఫ్యాక్టరీలలో రాత్రనక పగలనక పనిచేస్తూ, మానవుడు కల్పించుకున్న అత్యంత అనుత్పాదకమైన యుద్ధమనే కార్యక్రమానికి తమ చెమట ధారపోయవలసి ఉంటుందని ఆనంద్‌కు తెలుసు. అయినా అది చేయకతప్పదు.

అతడు వెంటనే రాష్ట్రరాజధానికి తిరిగివెళ్ళాలనుకున్నాడు కానీ ఆ గ్రామ సర్పంచ్ మరి కొందరు అదేసమయంలో ఒక పెద్ద సమావేశం ఏర్పాటుచేశారు. తమమీదపడిన విపత్తు ఎటువంటిదో బాలలకు తెలియజేస్తే మంచిదన్న ఆలోచన కలిగిందతనికి ఆ సమావేశానికి వెళ్ళి స్కూలుమ్యాప్ సహాయంతో చైనా దురాక్రమణఫలితాలు ఎలా ఉంటాయో, భారతదేశం ఎదుట ఉన్న కార్యభారం ఎటువంటిదో పిల్లలకు వివరించాడు. వాళ్ళు విషణ్ణవదనాలతో కనుబొమలు ముడిచి అతడు చెప్పింది ఎంతో సావధానంగా విన్నారు. వాళ్ళు మాట్లాడింది చాలా తక్కువ, చిన్నాపెద్దా అందరూ దీర్ఘాలోచనలో లోతైన భావోద్వేగంలో మునిగిపోయారు.

ఆనంద్ వెళ్ళబోతుండగా పదేళ్ళ కుర్రవాడొకడు ముందుకొచ్చాడు. ఆనంద్‌ను భయం భయంగా సమీపించి నమస్కరించాడు. ఏదో చెప్పాలన్న తహతహ ఆ కుర్రవాడిలో. ఆనంద్ కూడా ప్రత్యభివాదంచేసి అన్నాడు 'ఏమిటి బాబూ? ఏమిటి విషయం?'

ఆ కుర్రవాడు తనజేబులో చెయ్యిపెట్టి ఇరవైఅయిదు నయాపైసల నాణెం బయటికి తీశాడు. దానిని బెరుకుబెరుకుగా పట్టుకుని గొణుగుతున్నట్టు అన్నాడు. 'చైనాను ఓడించడానికి ఇవి నేనిస్తున్న పైసలు...'

ఆనంద్ సంతోషంగా ఆ నాణెం తీసుకుని ఆ కుర్రవాణ్ణి దగ్గరికి తీసుకున్నాడు. తన ఉద్వేగాన్ని అతికష్టంమీద అణుచుకున్నాడు. 'మంచిది బాబూ, ఎంతో విలువైన ఈ విరాళాన్ని పండిట్‌జీకి పంపిస్తాను. నీకు రసీదుకూడా అందుతుంది.'

ఈ ఔదార్యం వాతావరణాన్ని ఉత్తేజితంచేసింది మొదటిసారి అక్కడివాళ్ళ ముఖాల్లో వెలుగు తొంగిచూసింది. 'ఊళ్ళోనే నిధి ఎందుకు వసూలుచేయకూడదు?' అన్నాడు సర్పంచ్. 'అవును ఎందుకు చేయకూడదు?'మిగిలినవారు అతనితో గొంతుకలిపారు.

'ఈ గ్రామంలోనే కాదు అన్ని గ్రామాల్లో...' అని మరోమాట జోడించాడు సర్పంచ్.

'అవును' అతనికి అడ్డుతగులుతూ మరో గ్రామస్థుడన్నాడు. 'తప్పకుండా ఇద్దాం. ఇక ఇవ్వలేమని అనిపించేవరకూ ఇద్దాం. ప్రతిఒక్కరం ఇవ్వగలిగినదాన్ని మించి కొంచెంఎక్కువే ఇద్దాం...'

ఆనంద్ తనచెవుల్ని తనే నమ్మలేకపోయాడు. అదే గ్రామాన్ని చూసి తను నిరాశతో కుంగిపోయి ఇరవైనాలుగుగంటలుకూడా కాలేదు. ప్రతిఒకరూ ప్రతిఒకరితో విభేదిస్తారు. ఉమ్మడిక్షేమంకోసం ఒక్కరూపాయి వదులుకోడానికి కూడా ఏ ఒకరూ ఇష్టపడరు. అన్నీ ప్రభుత్వమే చేయాలని కోరుకుంటారు. ఇక్కడేకాదు దేశమంతటా ఇదే పరిస్థితి. దారుణంగా తనకు వ్యతిరేకంగా తననే విభజించుకున్న గృహం, నిజంగా గృహమంటూ ఒకటి ఉంటే...

భగవంతుడా! ఈ దేశం ఒకటికావడానికి విదేశీదురాక్రమణప్రమాదం వచ్చిపడవలసిందేనా?... తన కారు జాతీయరహదారిలోకి మళ్ళుతుంటే అనుకున్నాడతను.

★ ★ ★

కమెంగ్‌లో ఎదురైన సంపూర్ణపరాజయంతర్వాత దేశంలో అలముకున్న నైరాశ్యవాతావరణంలో రెండురకాల ధోరణులు ప్రస్ఫుటంగా కనిపించాయి. భారతదేశం తన సుదీర్ఘచరిత్రలో ఇంత వరకూ ఒక్క యుద్ధంలోకూడా గెలవలేకపోయిందని ఇప్పటికే కుమిలిపోతున్న ప్రజలకు, దేశం స్వతంత్రమై ఎంతో కీర్తిప్రతిష్ఠలు గడించిన ప్రధానమంత్రి నేతృత్వంలో ఉన్నప్పటికీ ఈ వైఫల్యం సంభవించడం మరింత మనస్తాపం కలిగించింది. ఇది మొదటిది. ఇక రెండోది —చైనా అనూహ్యంగా, నిష్కారణంగా వెన్నుపోటు పొడవడం వల్ల ప్రజల్లో కట్టలుతెంచుకున్న ఆగ్రహం. ఎంతో లోతైన, సుస్థిరమైన నాగరికతలు కలిగిన రెండు అతిపెద్ద, పురాతనదేశాలు, చరిత్ర గుర్తుచేసుకోగలిగినమేరకు తమమధ్య శత్రుత్వచరిత్ర లేదు. అయినా హఠాత్తుగా రెంటి మధ్య యుద్ధఘట్టం ఉద్భవించడం నమ్మశక్యం కాని విషయం. ఎవరూ ఏ కారణంతోనూ వివరించలేని, సమర్థించలేని విషయం. (ఇన్నేళ్ళతర్వాతకూడా చైనా దురాక్రమణ సంపూర్ణన్యాయబద్ధతను కాదు సరికదా, రవ్వంత సమర్థనీయతనైనా తెచ్చుకుందా అనేది అత్యంత అనుమానాస్పదం). ఈ రెండు ధోరణుల ఉమ్మడితీవ్రత దేశాన్ని వేళ్ళతోసహా కదిపివేసింది.

పార్లమెంటులో చర్చ ప్రత్యారోపణలతో వాడివాడిగా సుదీర్ఘంగా సాగింది. అన్ని పార్టీలు ప్రభుత్వంమీద నిప్పులుచెరిగాయి. నెహ్రూ ఈ అంశానికున్న చారిత్రకరాజకీయకోణాలను పూసగుచ్చినట్టు వివరిస్తూ ఉభయసభలనూ శాంతింపజేయడానికి శాయశక్తులా ప్రయత్నించారు. స్వేచ్ఛగా జరిగిన ఆ వాదోపవాదాలమధ్య ప్రభుత్వం అసమర్థతపై అందరూ దుమ్మెత్తిపోస్తుంటే యథావిధిగా అందులోకి ఏవేవో విషయాలు వచ్చి చేరిపోయాయి. కమెంగ్ ఓటమిని నెహ్రూ విదేశాంగవిధానవైఫల్యానికే పూర్తిగా అంటగట్టడం జరిగిపోయింది ఎన్ని డొంకతిరుగుళ్ళు తిరిగినా వాదంలోని అంతరార్థం తెలుసుకోవడమంత కష్టంకాదు —అది, అలీనోద్యమం నిరర్థకత, ఏదో ఒక అగ్రరాజ్యకూటమిలో చేరవలసిన అవసరం (అయితే దీనిని ఎంతో నర్మగర్భంగానే సూచించడం జరిగింది.) 'ఒక' అనేది ఒక వ్యక్తీకరణపద్ధతి మాత్రమే; ఆ ప్రశ్నకు సమాధానంగా, 'రెండింటిలో ఏ ఒకదానికి?' అనే ప్రశ్న, ముందుగా ఆ అంశాన్ని లేవనెత్తినవారినుంచే బిగ్గరగా స్పష్టంగా దూసుకొచ్చింది. సహజంగానే ప్రశ్నకు రెండు జవాబులు బయలుదేరాయి.

ఆ చరిత్రాత్మకచర్చ ముగిసిన తర్వాత ఉభయసభలూ ఈ క్రింది తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించాయి.

*'రాజ్యాంగంలోని ఆర్టికల్ 352, క్లాజ్ (1) ప్రకారం రాష్ట్రపతి 1962 అక్టోబర్ 26న ఎమర్జెన్సీ విధిస్తూ జారీచేసిన ఉత్తర్వును సభ ఆమోదిస్తోంది.*

*ఒకరి స్వాతంత్ర్యాన్ని మరొకరు గుర్తిస్తూ, ఒకరితో ఒకరు యుద్ధానికీ, జోక్యానికీ తావులేని శాంతియుతసహజీవనం ప్రాతిపదికపై భారతదేశం చైనాప్రజాప్రభుత్వంపట్ల చెక్కుచెదరని స్నేహసుహృద్భావాలను ప్రకటించుకున్నప్పటికీ చైనా ఈ సుహృద్భావానికీ, స్నేహభావానికీ, రెండుదేశాలూ ఆమోదించిన పంచశీలసూత్రాలకూ ద్రోహంచేస్తూ తన సాయుధదళాలతో భారతదేశం మీద పెద్ద ఎత్తున దాడికి పాల్పడినందుకు ఈ సభ తీవ్రవిచారం ప్రకటిస్తోంది.*

*మన సరిహద్దుల రక్షణకు ఎంతో వీరోచితంగా పోరాడిన మన సాయుధదళాల సిబ్బందినీ, అధికారులనూ సభ అత్యంత ఘనంగా ప్రశంసిస్తూ, మాతృభూమి ప్రతిష్ఠనీ సమగ్రతనీ కాపాడడంలో అసువులుబాసిన అమరవీరులకు గౌరవపూర్వక నివాళి సమర్పించుకుంటోంది.*

*అత్యవసరపరిస్థితికీ, చైనా సాగించిన భారతదురాక్రమణవల్ల ఉత్పన్నమైన సంక్షోభ స్థితికీ అప్రయత్నంగా అత్యద్భుతంగాప్రతిస్పందన చూపిన భారతప్రజానీకానికి కూడా ప్రగాఢ ప్రశంసలు అందజేసుకుంటోంది. ఈ జాతీయఅత్యవసర విపత్తును అన్నివిధాలుగా ఎదుర్కొనడానికి అవసరమైన వనరులసమీకరణకై అన్నివర్గాలనుంచి పెల్లుబికిన బలవత్తరస్పందనకు సభ ప్రగాఢకృతజ్ఞతలు తెలుపుకుంటోంది. స్వేచ్ఛ, ఆత్మ సమర్పణ అనే జ్యోతి సరికొత్తగా జ్వలించి భారతదేశ స్వాతంత్ర్య సమగ్రతల పరిరక్షణకోసం జాతిని పునరంకితంచేస్తోంది.*

*దాడికీ, దురాక్రమణకీ వ్యతిరేకంగా మనం పోరాడుతున్న ఈ క్లిష్ట తరుణంలో సానుభూతినీ, నైతికంగా, వస్తురూపంలో సమర్ధననూ అందించిన ఎన్నో మిత్రదేశాలకుకూడా సభ కృతజ్ఞతలు సమర్పించుకుంటోంది.*

*పోరాటం ఎంతకాలం కొనసాగినా ఎంత ప్రబలంగా పరిణమించినాసరే ఈ పవిత్రభారతభూమినుంచి శత్రువును తరిమికొట్టాలన్న భారతప్రజల దృఢనిశ్చయాన్ని ఈ సభ సడలని ఆశతో, చెరగని విశ్వాసంతో ఉద్ఘాటిస్తోంది.*

వాస్తవానికి 1962లో చైనా దురాక్రమణతోనే ఈ కథ ప్రారంభం కాలేదు. ఏది, ఎందుకు దురాక్రమణకు దారితీయించిందో తెలుసుకోవడానికి కొన్ని సంవత్సరాల గతంలోకి వెళ్లవలసిందే. చైనా విషయంలో భారతదేశ మౌలికవిధానం దేశ ప్రయోజనాలకు విరుద్ధంగా ఉన్నదన్న ఒక అభిప్రాయం బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది. రెండుదేశాలమధ్య ఎప్పటికీ యుద్ధం సంభవించబోదన్న విశ్వాసంమీద ఆధారపడిన ఒక ఉదాసీన విధానానికి ప్రత్యక్ష పర్యవసానంగా దేశం ఏ క్షణంలోనైనా పెద్దయుద్ధాన్ని ఎదుర్కోవలసి రావచ్చునని ఈ అభిప్రాయసారాంశం. ఇక రెండో అభిప్రాయం ప్రకారం మౌలికవిధానం, చారిత్రక వాస్తవాలకు అనుగుణంగా భారత—చైనాల మధ్య చిరమైత్రిని దృష్టిలో ఉంచుకుని రూపొందించుకున్నది కనుక లోపరహితమే. ఈ అభిప్రాయాన్ని అనుసరించి చైనా పాల్పడిన ప్రస్తుతదురాక్రమణ విశ్వాసఘాతుకాన్నీ, నమ్మకద్రోహాన్నీ సూచిస్తోందే కానీ, మామూలుగా ఊహించగలిగిన ఘటన కాదు.

చరిత్రలో చిరకాలంగా భారత—చైనాల మధ్య ఉమ్మడిసరిహద్దు అంటూ ఏదీలేదు. మన ఉత్తరసరిహద్దు టిబెట్. అది ఒకవిధంగా స్వతంత్రదేశం. భారత—టిబెట్‌ల మధ్య కొన్ని శతాబ్దాలుగా స్నేహసంబంధాలే ఉన్నాయికానీ రెండింటిమధ్య శత్రుత్వచరిత్రలేదు. చైనాతో టిబెట్‌కు నిర్వచింపబడని ఒకానొక 'ఆధిపత్య' సంబంధం ఉంటూ వచ్చింది. అది స్పష్టంగా ఎన్నడూ నిర్వచించబడలేదు. ఆ సంబంధాన్ని అమలుచేయడంలోనూ, అమలు చేయకపోవడంలోనూ వ్యక్తమయ్యే ఆ రెండుదేశాల సాపేక్ష సామర్థ్యాలను అనుసరించి ఆ సంబంధం ఆయా కాలాల్లో హెచ్చుతగ్గులకు లోనవుతూ ఉంటుంది. అయితే 'టిబెట్ విముక్తి' గురించి చైనా తరచు మాట్లాడుతూ

ఉంటుంది. అక్కడి కమ్యూనిస్టు ప్రభుత్వానికి ముందున్న ప్రభుత్వాలుకూడా టిబెట్ చైనా అంతర్భాగమేనంటూ వచ్చాయి. చైనా లిబరేషన్ ఆర్మీ ప్రప్రథమంగా 1950లో టిబెట్‌లోకి ప్రవేశించి దీర్ఘకాలవిపరిణామాలకు దారితీయగల చిక్కుసమస్యను భారతదేశానికి తెచ్చిపెట్టింది. అలాగని భారత దేశం జోక్యం చేసుకోవడం సమర్థనీయమనిపించుకోదు. ఎందుకంటే ఇంతకు ముందున్న బ్రిటిష్ ప్రభుత్వం స్వీయకారణాలతో టిబెట్‌పై చైనా 'ఆధిపత్యా'న్ని గుర్తిస్తూ వచ్చింది కనుక భారతప్రభుత్వం ఆ అడుగుజాడనే అనుసరించింది. ఆ సంబంధం ఎటువంటిదైనా టిబెట్ సంపూర్ణస్వాతంత్ర్యానికి మాత్రం అది సుసంగతమైందికాదు. శతాబ్దాలుగా రెండింటికీ మధ్య సాంస్కృతిక, ధార్మిక సంబంధాలున్నప్పటికీ భారతదేశం టిబెట్‌కు ఒక పొరుగుదేశం మాత్రమే. బ్రిటిష్ సామ్రాజ్యవాదప్రభుత్వం 1914లో టిబెట్‌తో చేసుకోగలిగిన ఒప్పందం మినహా రెండుదేశాల మధ్య నిర్దిష్టమైన రాజకీయసంబంధాలేవీ లేవు.

ఈ రకమైన సమర్థింపులో ఎదురయ్యే ఇబ్బంది ఒకటుంది. చైనా తన బలప్రయోగంతో తన 'ఆధిపత్యా'న్ని మరింత పెంచాలని అనుకున్న ప్రతిసారీ దాని పరిమాణం పెరుగుతూ ఉంటుంది. దానిని అస్పష్టంగా ఉంచడంద్వారా ఆశించిన ప్రయోజనం కూడా ఇదే. అందువల్ల, చైనా టిబెట్‌పై తన ఆధిపత్యాన్ని ఏ ప్రమాణంలో రుద్దుతుందో ఆ ప్రమాణానికి అనుగుణంగానే టిబెట్‌పట్ల భారతదేశం గుర్తింపు కూడా ఉంటూవస్తోంది, టిబెట్ కన్నా చైనా బలవత్తర దేశం కనుక. అంతిమంగా ఇందువల్ల టిబెట్ పట్ల భారతదేశం ప్రదర్శించే స్నేహపూర్వకధోరణిలో హెచ్చుతగ్గు ఏర్పడుతుంది. ఈ వైరుధ్యస్థితిని భారతదేశం ఎలా పరిష్కరించగలదు?

దీనికి ప్రతిగా వినిపించే వాదంకూడా ఇంతే చిక్కుముడిలా కనిపిస్తుంది. బ్రిటిష్ఇండియా ప్రభుత్వ వారసత్వాన్ని అందుకున్న నెహ్రూప్రభుత్వం ఆ ప్రభుత్వవిధానాలను అతిక్రమించడం కష్టం. అందుకు ఒకే ఒక మార్గం సాయుధబలప్రయోగం. అంటే చైనాతో యుద్ధానికి తలపడడం. అయితే అటువంటి యుద్ధం పూర్తిగా అసంగతంగా పరిణమించి ఉండేది. అదీగాక నెహ్రూ ప్రభుత్వం మీద అప్పటికున్న కార్యభారాన్ని అర్థంచేసుకోగలగినవాళ్లెవరైనా ఆ సమయంలో యుద్ధానికి సిఫార్సు చేసేముందు పదిసార్లు ఆలోచించవలసిన పరిస్థితి. దేశ రాజ్యాంగం అప్పటికింకా రూపుదిద్దుకోలేదు, ఆపైన దేశ విభజనతో ఉత్పన్నమైన బహుముఖసమస్యలు తక్షణపరిష్కారాన్ని ఆశిస్తున్నాయి. కనుక మార్గాంతరమేమిటి?

1950కి ముందే ఈ ప్రత్యామ్నాయాలన్నింటిగురించి చర్చించిన దాఖలాలున్నాయి; వాటిని విస్మరించలేదు; అవి మనచూపుని తప్పించుకునీపోలేదు. ఎవరోకాదు, భారత ప్రభుత్వంలో ఎంతో ప్రబలుడనిపించుకుని దేశాన్ని రాజకీయంగా సమైక్యం చేయగలిగారన్న ఖ్యాతిని సాధించుకున్న సర్దార్ పటేల్ చైనానుంచి ఎదురుకాగల ముప్పును స్వయంగా నెహ్రూదృష్టికి తీసుకొచ్చారు. చైనా ఉద్దేశాలు, పథకాలకు సంబంధించి ముందుచూపును ప్రతిబింబించే సూత్రీకరణలతో ఆయన ఒక సవివరమైన లేఖ రాస్తూ, అజాగ్రత్తవల్ల ఎదురుకాగల ప్రమాదాల గురించి జవహర్‌లాల్ నెహ్రూను హెచ్చరించారు. చైనాపట్ల అనుసరించే మొత్తం విధానాన్ని లోతుగా పునఃపరిశీలించుకోవాలని గట్టిగా విజ్ఞప్తి చేస్తూ నూతన పరిస్థితిని ఎదుర్కోవడానికి అవసరమైన రకరకాల చర్యల్ని సూచించారు.

చైనాలో కమ్యూనిస్టుప్రభుత్వం బలపడి టిబెట్‌మీదికి సైన్యం నడిపించిన దరిమిలా పరిస్థితిలో వచ్చిన మార్పును తేటతెల్లంగా వివరిస్తూ సర్దార్ తన లేఖలో ఇలా రాశారు :

*కొన్ని శతాబ్దాల తర్వాత ప్రప్రథమంగా భారతదేశం, భారత రక్షణవ్యవస్థ ఒకేసారి రెండురంగాలపై దృష్టిని కేంద్రీకరించవలసివచ్చింది. మన రక్షణ చర్యలు ఇంతవరకూ పాకిస్తాన్‌పై ఆధిక్యానికి సంబంధించిన అంచనాపైనే ఆధారపడి ఉంటున్నాయి. ఇప్పటి మన అంచనాను అనుసరించి ఉత్తర, ఈశాన్యాలలో కమ్యూనిస్టు చైనాను... నిర్దిష్టమైన ఆకాంక్షలు, లక్ష్యాలు ఉన్న కమ్యూనిస్టు చైనాను – కూడా దృష్టిలో ఉంచుకోవలసిందే. అవి మనపట్ల మిత్రత్వాన్ని సూచిస్తున్నవిగా కనిపించడం లేదు. కనుక, నా అంచనా ప్రకారం ఏమాత్రం అజాగ్రత్తగానూ, ఊగిసలాటధోరణితోనూ వ్యవహరించకూడని పరిస్థితి ఇది. మనం సాధించవలసిందేమిటో, అందుకు అనుసరించవలసిన పద్ధతులేమిటో స్పష్టమైన ఆలోచన ఉండాలి. మన లక్ష్యాల రూపకల్పనలో, వాటిని సాధించడానికి ఉద్దేశించిన మన విధానాల అనుసరణలో తడబాటుకానీ, అనిశ్చిత ధోరణి కానీ మనల్ని బలహీనపరిచి ఇప్పటికే కొట్టొచ్చినట్టు కనిపిస్తున్న ముప్పును మరింత పెంచుతాయి.*

ఆ తర్వాత సర్దార్ ఎంతో స్పష్టత ఉట్టిపడే తన శైలిలో, తక్షణమే పరిష్కారం కావలసిన పాలనాపరమైన, సైనికపరమైన విధానాలకూ వాటి అమలుకు తీసుకోవలసిన చర్యలకూ పునాదికాదగిన సమస్యలను వివరించారు.

★ ★ ★

భారతదేశం, చైనా, టిబెట్, రష్యా తదితర ముఖ్యమైన దేశాలు పందొమ్మిదో శతాబ్దంలో తీసుకున్న రాజకీయవైఖరులకూ, భారతస్వాతంత్ర్య సమయంలో వాటి స్థితిగతులకూ సంబంధించి చారిత్రకంగా, చట్టపరంగా విస్పష్టవివరణ అందించడం అంతతేలిక కాదు. అదీగాక, నిజం చెప్పాలంటే తొలినాళ్ళలో భారతదేశం అనుసరించిన విదేశాంగవిధానం బ్రిటిష్‌ప్రభుత్వంనుంచి స్వతంత్రభారతానికి వారసత్వంగా వచ్చిందే కానీ, భారతదేశవిధానం కాదు. భారత ప్రయోజనాల పరిరక్షణ విషయంలో బ్రిటిష్ ఆలోచనలు సహజంగానే ఈ ప్రాంతంలోని బ్రిటిష్ సామ్రాజ్య విస్తృత ప్రయోజనాలలో భాగంగా ఉంటూ వచ్చాయి. ఆ విధంగా టిబెట్‌పట్ల అప్పటి బ్రిటిష్ విధానం, మధ్య ఆసియాలో తాను భావించుకున్న ప్రయోజనాలపైనే ఆధారపడినది. ఆ ప్రాంతంపై రష్యా ప్రాబల్యం సాధించగలదన్న భయమే ఆ దృక్కోణాన్ని ఎక్కువగా ప్రభావితం చేసింది.

భారత ప్రజాభిప్రాయం అనేక సామ్రాజ్యవాద విధానాలనూ, టిబెట్‌లో ఇతర బలహీన దేశాల్లో ఆ సామ్రాజ్యం తీసుకున్న చర్యలనూ ఏకరీతిలో దుయ్యబట్టింది ఇక్కడే. దేశం స్వతంత్రంకావడానికి ఎంతోముందే స్వతంత్రభారతవిధానాలు ఎలా ఉంటే మంచిదో భారత జాతీయ కాంగ్రెస్ ఎన్నో సూత్రాలు రూపొందించింది. కనుక స్వతంత్రభారతంలో నెహ్రూ

ప్రభుత్వం అనుసరించే విధానాలు స్వభావరీత్యా ఇంతకు ముందున్న బ్రిటిష్ ప్రభుత్వం విధానాలకు కార్బన్‌కాపీలుగా ఉండలేవు. తాను చట్టబద్ధవారసుడే అయినా నెహ్రూ తన ఆలోచనాసరళిని పార్టీ ఆలోచనాసరళిని విస్మరించి సంపూర్ణంగా వెనకటి విధానాలనే అమలు చేయలేరు. ఆచరణలో అది స్వతంత్రభారతప్రభుత్వవిధానమే కావాలి, కనుక అలాగే జరిగింది. అంతకంతె తక్కువ కావడానికి వీలులేదు. నెహ్రూ ప్రభుత్వ విధానాలనూ, చర్యలనూ పరిశీలిస్తున్నప్పుడు ఎంతో కీలకమైన ఈ తేడాను దృష్టిలో ఉంచుకోవాలి.

1950 జూలైలో ప్రధానమంత్రి నెహ్రూ ముఖ్యమంత్రులందరికీ రాసిన ఉత్తరం ఇది:

> *భారతదేశం వివిధపరిణామాలు విధించిన అనివార్య పరిమితులకు లోబడుతూనే విదేశీవ్యవహారాలలో, ఇతర వ్యవహారాలలో, తనదైన స్వతంత్రవిధానాన్ని పాటించడానికి ప్రయత్నిస్తోంది. ప్రతిఒక్క చర్య లేదా విధానం అంతకుముందు జరిగిన చర్యలనుంచి, ఇతర ప్రపంచపరిణామాలనుంచి ప్రవహిస్తూఉంటాయి కనుక ఇటువంటి అంశాలలో ఏ దేశమూ నూటికినూరుపాళ్ళు స్వతంత్రంగా ఉండలేదు. అయితే, ఆ పరిమితుల్లోనే ఎంతోకొంత స్వతంత్రంగా ఉండగలిగిన అవకాశమూ ఉంది. మనం మరింత స్వతంత్రంగా ఉండడానికే ఇష్టపడుతున్నాం. అది ఆదర్శప్రాయమేకాదు, ప్రస్తుత సమస్యలను ఎదుర్కొనడంలో ఎంతో ఆచరణయోగ్యమనికూడా నేను భావిస్తున్నాను. అది మన గతంనుంచి సహజంగా అందివచ్చింది కూడా. మరే విధానమైనా పెద్దఎత్తున ఆంతరంగికవిరోధాలకు దారితీయడంతోపాటు మన స్వాభావికప్రగతికి అడ్డుతగిలి మనల్ని కుంచింపచేస్తుంది... మనం విదేశీవ్యవహారాలతో ఒక నిర్దిష్టవిధానాన్ని అనుసరిస్తూ వస్తున్నాం. ఆ విధానం నిస్సందేహంగా మన దేశానికి మంచి ప్రతిష్ఠ తెచ్చిపెట్టి శాంతియత్నాలపై మనం తగు మాత్రంగానైనా ప్రభావం చూపగల అవకాశం కలిగించింది. మనమూ మరికొన్ని దేశాలూ అలా వ్యవహరించి ఉండకపోతే అంతర్గతంగా మనం ఎదుర్కోవలసిన క్లిష్టపరిస్థితులతో పాటుయుద్ధంనిస్సంశయంగామనకు మరింత దగ్గరగా వచ్చి ఉండేది. ఏది ఏమైనా ప్రజల్ని మనవెంట తీసుకువెళ్ళవలసిందే, అధికసంఖ్యాకుల ఆమోదం లేనిదే ఏ విధానమైనా చిరకాలం అమలుజరగలేదు. చేదునిజం తొలితాకిడికే మనం పాతవిధానాన్ని మార్చుకొనిఉంటే అది కొన్ని వర్గాల సమ్మతిని సంపాదించకుంటే సంపాదించుకోవచ్చు కానీ, దేశం ప్రతిష్ఠను అది దారుణంగా మంటకలిపిఉండేది. జరగుతున్న మహత్తరనాటకంలో దేశం అనామక పాత్రధారిగా మిగిలిపోయిఉండేది. కనుక పరిస్థితుల ఒత్తిడి వల్ల కొంత హెచ్చుతగ్గులు ఉన్నప్పటికీ మౌలికవిధానానికే మనం కట్టుబడి ఉంటున్నాం.*

చైనాలా, మరికొన్ని దేశాల్లా స్వాతంత్ర్యసాధనకు భారతదేశం ఉపయోగించుకున్న ప్రధానాయుధం సాయుధవిప్లవంకానీ, సామ్రాజ్యవాదశక్తులతో యుద్ధంకానీ, కాదు. ఈ విషయంలో భారతదేశానిది విశిష్టస్థానం. గాంధీజీ వ్యూహం ప్రజల మస్తిష్కాలలో వేళ్ళూనిపోయింది.

ఆయన దారుణ హత్యలో కనిపించిన దిగ్భ్రాంతికర హింస ఆయన ప్రభావాన్ని పెంచడానికే దోహదమైంది. గాంధీజీ అహింసావాదం ఆచరణాత్మకమైన, లేదా ఆచరణయోగ్యమైన, పద్ధతిగా అప్పటికప్పుడు ఎటువంటి ఆమోదాన్నీ సాధించుకుని ఉండకపోవచ్చు; అయినా, దుర్బల దేశాలను లొంగదీసుకోడానికి ప్రబలదేశాలు అమలుచేస్తున్న ప్రతి విధానమూ, దౌత్యపరమైన ప్రతి ఒక్క ఎత్తుగడ, ప్రతి ఒక్క చర్య, దౌర్జన్యం, కుతంత్రం విఫలమౌతున్నకొద్దీ, అప్పటికి ఆచరణలోకి రాని గాంధేయమార్గం కొన్ని దశాబ్దాలుగా ప్రపంచాన్ని మరీ మరీ ఆకర్షిస్తూవచ్చింది. ఈ విలక్షణ గతితర్కంవల్లకాబోలు, ప్రపంచం గాంధీజీకి ఒక అడుగు దగ్గరగా జరగసాగింది.

అహింసాయుతభారతం అనే గాంధీజీ ఆలోచన, ఒకప్పుడు అశోకుడు నిర్మించిన రాజ్య వ్యవస్థను తిరిగి నిర్మించగలమన్న ఆయన విశ్వాసం మీద ఆధారపడింది. అయితే అది తక్షణమే అమలు చేయగలిగిందని ఆయనెప్పుడూ నొక్కి చెప్పలేదు. జాతీయోద్యమంలో మమేకంగా కలిసిపోయిన గాంధీజీ అహింసావాదం కేవలం బుద్ధిజనితమైన సిద్ధాంతం మాత్రమే కాదు; అది వాస్తవంగా అమలు జరిగింది. దానివల్ల అహింసాయుత ప్రజాఉద్యమమనే గాంధేయ పరిష్కారం, సందర్భంతో నిమిత్తం లేకుండా ఎప్పుడైనా ప్రయోజనదాయకమేనన్న నమ్మకం కలిగింది. హిట్లర్‌కు వ్యతిరేకంగా గాంధేయవిధానం ఫలించి ఉండేదా లేదా, దేశంలోని కొందరు నియంతల ఏలుబడిలో ఉన్న సంస్థానాలలో పనిచేసి ఉండేదా? అన్న ప్రశ్నలూ ఇటీవలి కాలంలో తలెత్తాయి. (నిజానికి ఇటువంటి నియంతృత్వపాలనకు వ్యతిరేకంగా అహింసాయుత ఆందోళనతోపాటు కొన్ని సంస్థానాల్లో కొంతమేరకు సాయుధ పోరాటమూ జరిగింది.) ఈ ప్రశ్నలు సమంజసమైనవే కానీ ప్రధానంగా ఒక నిర్దిష్ట సందర్భానికి రూపొందించుకున్న విధానాన్ని అన్ని పరిస్థితులకూ తక్షణమే అమలుచేయలేమని గ్రహించడమూ అవసరమే అలాగే తగిన మార్పులతో అమలు చేయడానికి చిత్తశుద్ధితో ప్రయత్నం చేయకుండానే మరెక్కడా ఈ విధానం పనిచేయదని పూర్తిగా కొట్టివేయడమూ మంచిదికాదు.

జవహర్లాల్ నెహ్రూకు అహింసమీద కొంతభిన్నమైన అభిప్రాయం ఉండేది. గాంధీజీ అహింసను ఒక మౌలికసిద్ధాంతంగా, సూత్రంగా పరిగణిస్తే నెహ్రూ కొంత సడలింపు ధోరణిలో, అహింసాయుత రక్షణవిధానం పరిపక్వతను పొంది సత్ఫలితాలను ఇవ్వగలిగేవరకూ రక్షణ ప్రయోజనాలకు బలప్రయోగాన్ని ఆశ్రయించవచ్చునని భావించేవారు. అంతవరకూ అహింసావాదాన్ని మార్చడానికి వీలుకాని పిడివాదంగా పరిగణించి కట్టుబడి ఉండలేమని నెహ్రూ అనుకున్నారు. ఒకింత జాగ్రత్తగా పరిశీలిస్తే రెండు వైఖరులూ ఒకే నాణానికి రెండు ప్రక్కలనీ, రెండింటి మధ్యా వాస్తవంగా వైరుధ్యమేదీలేదని అర్థమౌతుంది. జునాగఢ్, కాశ్మీర్, హైదరాబాద్, గోవాలలో నెహ్రూ బలప్రయోగానికి వెనుదీయకపోవడం దీనినే స్పష్టం చేస్తోంది. తన శాంతియుత ప్రతిపాదనలను అంగీకరించకపోతే వేరే పద్ధతులను అమలుచేయవలసివస్తుందని 1950, ఫిబ్రవరి 23 న ఆయన పాకిస్తాన్‌ను హెచ్చరించారు కూడా. 1951 ఆగస్టు 11 వ తేదీన, పార్లమెంటులో రాష్ట్రపతి ప్రసంగంపై జరిగిన చర్చకు సమాధానమిస్తూ నెహ్రూ ఇలా ప్రకటించారు; 'ఏమైనాకానీ భారతదేశం మీద దాడి జరిగే ప్రశ్నలేదు. ఒకవేళ యుద్ధమే సంభవిస్తే మనం దాడికి తలవంచి కూర్చుంటామనుకుంటున్నారా? కచ్చితంగా కాదు.' అదే ప్రసంగంలో ఆయన అన్నారు, 'భారత-పాకిస్తాన్ సంబంధాలు మెరుగుపడాలన్న ఉద్దేశంతోనే నేను యుద్ధాన్ని

త్రోసిపుచ్చాను, కానీ యుద్ధం జరగనే జరగదని చివరిమాటగా ఏకపక్షంగా నేనూ అనలేను. అవతలిపక్షం ఆ ప్రస్తావనతెచ్చి మాటి మాటికీ దాని గురించే మాట్లాడుతూ కేకలు పెడుతుంది కనుక నేను కూడా అందుకు సంపూర్ణంగా సిద్ధపడవలసిందే'. వాస్తవానికి ఆ ఘట్టంలోనే పాకిస్తాన్ ప్రధాని లియాకత్ అలీఖాన్ ఒక సందర్భంలో రెచ్చిపోయి మాట్లాడుతూ భారత దేశంవైపు బాహాటంగా బిగిపిడికిలి చూపించినప్పుడు భారతసైన్యం సరిహద్దుల వైపు కదిలింది. దాంతో పాకిస్తాన్ తోక ముడిచింది. బెదిరింపు దౌత్యానికి ఇది ఉదాహరణ, ఇందువల్ల ఆశించిన ప్రభావమూ కనిపించింది.

నెహ్రూ ఉద్దేశంలో అహింసావాదం కేవలం ఒక విధానమూ, నిర్దిష్ట ఫలితాలను సాధించ గల ఒక పద్ధతీ మాత్రమే... ఆ ఫలితాల దృష్ట్యానే దానిపైఅంతిమంగాతీర్పుచెప్పవలసిఉంటుంది. జాతీయోద్యమం విజయానికి చేరువవుతున్నప్పుడు నలభైదశకంలో ఈ మౌలిక ప్రశ్నలు భారతజాతీయకాంగ్రెస్‌దృష్టిని విశేషంగా ఆకర్షించాయి. పోరాటంలో నిమగ్నులై ఉన్న పార్టీ క్రింది శ్రేణుల్లోని యువతీ యువకులకు చైతన్యవంతమైన ఈ చర్చ ఎన్నో నూతన భావాల ఖజానాగా భాసించింది. ఈ ఘట్టంలో అది కేవలం సైద్ధాంతిక చర్చగా మాత్రమే జరగలేదు. దేశం స్వతంత్రంకాగానే రూపొందించుకోవలసిన జాతీయ విధానంలో అహింసావాదం పాత్ర గురించి త్వరలోనే కీలక నిర్ణయాలు తీసుకోవలసిన ఘట్టం అది. నెహ్రూ అనేక సందర్భాలలోనూ, తన రచనల్లోనూ కూడా సైనిక వాదాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. ఈ దృక్కోణానికి మేళవింపుగా అభివృద్ధికీ, పారిశ్రామికీకరణకూ ఆయన అత్యంత ప్రాముఖ్యం ఇవ్వడమూ కనిపిస్తుంది. పారిశ్రామికీకరణ లేనిదే దేశ రక్షణ అవసరాలనూ తీర్చుకోలేమనీ, విదేశీశక్తులు నిర్విరామంగా దోచుకోవడంవల్ల దుర్భరదారిద్ర్యంలో మగ్గిపోతున్న పెరుగుతున్న జనాభా అవసరాలనూ తీర్చలేమనీ ఆయన గట్టిగా చెబుతూండేవారు. ఇది మొదటిసారిగా అభివృద్ధికీ, రక్షణకీ మధ్య ఉన్న స్పష్టమైన సంబంధాన్ని స్థాపించడానికి దారితీయించింది. 1962 సెప్టెంబరు 3 వ తేదీన రాజ్యసభలో మాట్లాడుతూ, మొదట పాకిస్తాన్‌తో ఆ తర్వాత చైనాతో పరిస్థితి విషమించడంతో మనకు సైనిక సన్నద్ధత ఎంత ముఖ్యమో స్పష్టీకరిస్తూ తత్పూర్వం సైనిక సిబ్బంది సంఖ్యను తగ్గించడంతో సహా రక్షణవ్యయాన్ని కుదించడానికి దారితీయించిన కారణాలను నెహ్రూ వివరించు కుంటూ వచ్చారు.

యాభై దశకం ప్రారంభంలో కాంగ్రెస్‌పార్టీ, తనతోసహా 'ప్రతి ఒక్క రాజకీయవాదీ' (తనతోసహా) రక్షణపై, సైన్యంపై విపరీత వ్యయాన్ని ఎంత తీవ్రంగా విమర్శించేవారో ఆయన గుర్తు చేశారు. రక్షణకోణంనుంచి చూసినా దేశం వాస్తవికశక్తి రక్షణరంగానికి వెన్నుదన్నుగా ఉండే పారిశ్రామికయంత్రాంగం మీదనే ఆధారపడి ఉంటుంది. అత్యవసరపరిస్థితి ఏర్పడినప్పుడు విదేశాలనుంచి దిగుమతయ్యే ఆయుధాలపైనే నిరంతరం ఆధారపడి ఎవరూ ఉండలేరు. పారిశ్రామికంగా బలపడని దేశం సైనికంగా కూడా శక్తిమంతం కాజాలదు.

విదేశీమారకద్రవ్యం తగినంత లేకపోవడాన్ని, వీలైనన్ని నిధుల్ని అభివృద్ధి పథకాలకు మళ్ళించాలన్న అభిమతాన్ని దృష్టిలో ఉంచుకుని రక్షణ అవసరాలకు పరిమితంగానే ఖర్చు పెట్టాలనుకున్నాం. ఇందుకు కారణం, నెహ్రూ అంగీకరించినట్టు 'ఆ సమయంలో చైనానుంచి

మనం ఎటువంటి దాడినీ ఊహించలేదు.... దేశానికి పారిశ్రామిక నేపథ్యాన్ని ఎంత బాగా మనం నిర్మించుకోగలిగితే అంతిమంగా అది దేశరక్షణకూ అంత బాగా ఉపకరిస్తుంది. ఇది చాలా ముఖ్యంగా పరిగణించిన అంశం. కేవలం విమానాల తయారీకి ఒక ఫ్యాక్టరీని స్థాపించుకోవడంవల్ల ప్రయోజనం ఉండదు. శాస్త్రవిజ్ఞానపరమైన మౌలిక సదుపాయాల ఆధారం మీదనే శక్తిమంతమైనరక్షణయంత్రాంగాన్నినిర్మించుకోవాలి. ఆ విధంగా వివిధాంశాలు ఒక దానితో ఒకటి ముడిపడి ఉన్న ప్రక్రియ ఇది.'

ఆర్థికంగా సర్వతోముఖాభివృద్ధిని సాధించవలసిన అవసరాన్ని నొక్కి చెబుతూ నెహ్రూ తన ప్రసంగం ముగించారు. 'ప్రభుత్వం ఏం చేసిందో ఏం చేయలేదో దానికి నేను క్షమాపణ చెప్పదల్చుకోలేదు. అప్పట్లో తలెత్తిన కొన్ని అనివార్యపరిస్థితుల్లో అలా చేశాం. బయటి నుంచి ఓ తుపాకినో, ఓ విమానాన్నో తెప్పించుకుని భారతదేశాన్ని కృత్రిమంగా బలోపేతం చేయడంకాక పారిశ్రామికంగా బలోపేతం చేయడమే మన ముందున్న కర్తవ్యమన్న ఆలోచనతో అలా చేశాం. మనకంటే ఎంతో భిన్నంగా ఆలోచించే ప్రభుత్వమైనాసరే ఆ పరిస్థితుల్లో మరోవిధంగా వ్యవహరించి ఉండేదికాదు. ఆర్థికస్తోమతను పెంచడం చాలా ముఖ్యం, తగినంత ఆర్థిక స్తోమత లేనిదే ఏ దేశమూ పోరాడలేదు, అభివృద్ధిపథకాలనన్నింటినీ నిలిపివేసి ఒక్క రక్షణరంగానికే అన్ని వనరులనూ మళ్ళించాలంటూ అదే పనిగావినిపిస్తున్నడిమాండ్‌ను పండిట్‌జీ సూత్రీకరణ ఎంతో సమర్థవంతంగా తిప్పికొట్టగలిగింది.

అప్పట్లో చెలరేగుతున్న యుద్ధాలలో ఎంతో హింసను నెహ్రూ ప్రత్యక్షంగా చూశారు. యుద్ధాలలో కూరుకుపోయిన అనేకదేశాలలో పరిస్థితులను తెలుసుకోడానికి ఆ దేశాలలో పర్యటించారు. ఆయన యుద్ధాన్ని ఎంతో చీదరించుకున్నారు. అయితే వాస్తవాలను అతిసన్నిహితంగా చూసిన అనుభవంతో యుద్ధంపట్ల ఒకవిధమైన నిర్భీతినీ పెంచుకున్నారు. 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' లో ఆయన ఇలా రాశారు.

> 'యుద్ధాన్ని నేనెంతగా గర్హిస్తున్నా, భారతదేశంపై జపాన్ దురాక్రమణ జరపగల అవకాశం నన్నేవిధంగానూ భయపెట్టడం లేదు. యుద్ధం తన బీభత్సాకృతిలో దేశంమీద విరుచుకు పడితే బాగుండుననికూడా అంతరాంతరాల్లో నేను కోరుకుంటున్నాను. కోట్లాదిప్రజల ప్రత్యక్షానుభవంలోకి వచ్చి, వారిని బ్రిటిష్‌వాళ్ళు రుద్దిన శ్మశానశాంతినుంచి ఇవతలకు లాగి నేటి నిష్ఠురనిజాలముందు నిలబెట్టి తమను చుట్టేసిన గతంనుంచి తప్పుకొని ముందుకుసాగడానికీ, క్షుద్రరాజకీయవివాదాలనుంచీ, తమ బుర్రల్లో దట్టించుకున్న క్షణికసమస్యలను గోరంతలు కొండంతలు చేసుకునే ప్రవృత్తినుంచి బయట పడడానికి ఓ బ్రహ్మాండమైన కుదుపు ఏదో సంభవించాలని నేను ఆశిస్తున్నాను... యుద్ధాన్ని మనమేమీ కోరుకోవడంలేదు, అయినా అది తలుపుతట్టినప్పుడు జాతి రాటుదేలుతుంది, యుద్ధం కలిగించే మహత్తర అనుభవాలనుంచి సరికొత్త జీవితం వికసిస్తుంది. అపార ప్రాణనష్టం సంభవిస్తుంది, నిజమే, కానీ అది అనివార్యం. దీనంగా, హీనంగా జీవించడంకంటె మరణించడమే ఉత్తమం.

మరణంనుంచే కొంగ్రొత్త జీవితం చిగురిస్తుంది. మరణించడ మెలాగో తెలియని వ్యక్తులకూ దేశాలకూ జీవించడ మెలాగో కూడా తెలియదు. సమాధులు ఉన్నచోటే పునరుత్థానమూ ఉంటుంది.

విశ్లేషణల్లో తేలిందేమిటంటే, 1962 ఓటమి తగినంత సిబ్బంది, సాధన సంపత్తి లేకపోవడంవల్ల సంభవించింది కాదు. 1963 సెప్టెంబర్, 3వ తేదీన రాజ్యసభలో చేసిన ప్రసం గంలో నెహ్రూ వ్యాఖ్యానించినట్టు సాధనసామగ్రి చాలినంత ఉంది కానీ, అది దేశంలో అక్కడా అక్కడా చెదిరిపోయిఉంది. సమస్య హఠాత్తుగా ఉత్పన్నమైంది కనక, చాలినంత వ్యవధి లభించక ఆ సాధనసంపత్తినంతటినీ ఒకేచోట సమీకరించలేకపోయాం. అదే ప్రసంగంలో ఆయన మరోఅంశాన్నికూడా అంగీకరించారు: 'చైనా మనమీద దాడిచేయదన్న ఒక యోచనాకోణం మన మెదళ్ళలో ఉంటూవచ్చింది. అది సంపూర్ణసత్యం. గతంలో అటువంటి అపోహ ఉండేది కానీ అది సంపూర్ణంగా కాదు పాక్షికంగా.' ఈ కోణాన్ని సవివరంగా విశ్లేషించుకోవడంతోపాటు, ఇటువంటివి చరిత్రలో అసాధారణమైనవేమీ కావని చెప్పడం అప్రస్తుతం కాదు. రెండో ప్రపంచయుద్ధం మూలకారణాల్లోకి ఒకసారి తొంగిచూసినప్పుడు బ్రిటిష్‌ప్రభుత్వంలో ఇటువంటి యోచనే ఒకటి ఉండేదన్న విషయం స్పష్టమౌతుంది. మ్యూనిచ్ ఒప్పందం కుదరడం వెనుక ఉన్న సుహృద్భావం తక్కువదేమీకాదు, అలాగే, హిట్లర్ బ్రిటన్‌మీద దాడిచేయబోడన్న విశ్వాసంకూడా. అదేసమయంలో నెహ్రూ తన ఫాసిస్టు వ్యతిరేకభావాలను ఉద్ఘాటిస్తూవచ్చారు. మనుషుల్లానే దేశాలుకూడా ఒకవిధమైన పరస్పరవిశ్వాసం ప్రాతిపదికగా నిర్ణయాలు తీసుకుంటూఉంటాయి. ఆ విశ్వాసానికి ద్రోహం జరిగితే అది సంక్షోభానికీ, ఉత్పాతానికీ దారితీయిస్తుంది.

భారతదేశం యోచనాకోణం రెండు రకాలు ఇంటెలిజెన్స్‌బ్యూరో వివరణప్రకారం, చైనా బలాలు ఒక భారత స్థావరంవైపు చొచ్చుకువచ్చినప్పుడు బలప్రయోగానికి పాల్పడలేదు కనుక,వారు మరింత ముందుకు చొచ్చుకు రావడాన్ని నిరోధించడానికి ఏర్పాటుచేసిన భారతస్థావరశ్రేణిపైకూడా వారు బలప్రయోగం జరపరని భావించారు. ఈ అంచనా వెనుక తగినంత తర్కబద్ధత ఉంది కనుక నమ్మదగిన అంచనాగానే కనిపించింది. 'ఇప్పుడొకవేళ చైనా తన ప్రవర్తనా సరళిని మార్చుకుంటే?' అన్న ప్రశ్న ఎవరికీ తట్టలేదు. అటువంటి అవకాశాన్ని ఊహించలేకపోయినందుకు సైనికాధికారులు, విదేశాంగశాఖ, రక్షణమంత్రిత్వశాఖల్లోని ఉన్నతాధికారులు, మంత్రివర్గసభ్యులు, అందరినీమించి జవహర్లాల్ నెహ్రూ-బాధ్యత వహించవలసిందే.

ఇక రెండోరకం యోచన సీనియర్ సైనికాధికారుల మెదళ్ళలోపుట్టి బహుశా జవహర్లాల్ నెహ్రూ ఆలోచననుకూడా ప్రభావితంచేసింది. అప్పటి సైనికదళాల ప్రధానాధికారి జనరల్ తిమ్మయ్య1962జూలైలోఒక వ్యాసం రాస్తూ, ఆనాడు యు.ఎస్.ఎస్.ఆర్. పూర్తి మద్దతుకూడా ఉన్న చైనా సైనికశక్తి, భారత సైనికశక్తికి వందరెట్లు మించినది కనుక, భారతదేశం తానుగా చైనాతో బహిరంగయుద్ధానికి పూనుకోగలదని ఒక సైనికుడిగా తాను భావించలేనన్నారు. సరిహద్దుల్లో చైనా దురాక్రమణను అడ్డుకోడానికి ఆయన ఉద్దేశంలో ఒకే ఒక మార్గం, హిమాలయకనుమల్లో శత్రువుపై దాడిచేయడం. అయితే ఏడాదిలో ఆరునెలలు అవి దాటశక్యం కానివిగా ఉంటాయి. ఈ ప్రాంతంలో చైనా తన ట్యాంకులు, అత్యధికశక్తి కలిగిన ఫిరంగులవంటి

భారీయుద్ధసామగ్రిని ఉపయోగించుకోలేదు కనుక, భారతదేశం తన సైనికశక్తినీ, తేలికరకం యుద్ధసామగ్రినీ సంపూర్ణంగా వినియోగించుకోవచ్చు. ఒకవేళ చైనా బలగాలు మైదానప్రాంతాల్లోకి, పర్వతపాదాలవైపు చొచ్చుకువస్తే, వాళ్ళ కమ్యూనికేషన్‌వ్యవస్థను విచ్ఛిన్నంచేయడానికి గెరిల్లాయుద్ధతంత్రం ప్రయోగించవచ్చు. శత్రుసేనల్ని ఓడించడానికి భారతసైన్యం అప్పుడు తన మేలిరకం శతఘ్నిసంపదనీ, వ్యూహనైపుణ్యాన్నీ బరిలోకి దింప గలిగి ఉండేది.

చైనాబలగాలతో బాగా ఎత్తున ఉన్న పర్వతసీమల్లో గస్తీ ఘర్షణలకు సిద్ధపడడం, లేదా మైదానప్రాంతాల్లో పూర్తిస్థాయి యుద్ధానికి దిగడం వంటి ప్రత్యామ్నాయ అవకాశాలగురించి జవహర్లాల్ నెహ్రూ కూడా మాట్లాడుతూవచ్చారు.

చైనా ఏవో కొన్ని పరిమిత రాజకీయలక్ష్యాలతో ఆచితూచి తగినంత నిగ్రహంతో పరిమిత చర్యకు పూనుకుని ఉండగల అవకాశాన్ని, ఇన్ని వాదాలమధ్య, సైనికాధికారులూ, రాజకీయవర్గాలూ, ప్రధానమంత్రీ పూర్తిగా విస్మరించినట్టే కనిపించారు. చివరకు ఆఖరిక్షణంలో హడావుడిగా కమెంగ్ డివిజన్‌లోని ఎత్తైన ప్రాంతాలకు సేనల్ని తరలించవలసివచ్చింది. అంతకుముందే సేనలు అక్కడ ఉండిఉంటే బాగుండేది. ఎయిర్‌చీఫ్‌మార్షల్ అర్జన్‌సింగ్ ఆ తర్వాత వ్యాఖ్యానించినట్టు, బాగా ఎత్తున ఉన్న వైమానికస్థావరాలనుంచి విమానాల ప్రయోగంలో ఎటువంటి సమస్యలు ఎదురౌతాయో అప్పటికి మనమింకా పూర్తి అవగాహన తెచ్చుకోలేదు. వాటి గురించి అప్పటికే ఆలోచించుకుని ఉంటే 1962 సైనికచర్యలకు మద్దతుగా భారతవైమానికశక్తిని ఉపయోగించుకునే విషయంలో అంత సంకోచం ఉండేది కాదు.

ఈ అంశాలను దృష్టిలో ఉంచుకున్నప్పుడు 1962 ఓటమికి గాంధీజీ ప్రవచించిన అహింసాసిద్ధాంతం కానీ, జవహర్లాల్ నెహ్రూ ఉద్ఘాటించిన అలీనవాదం, అంతర్జాతీయఉద్రిక్తతలకు హేతుబద్ధ పరిష్కారం కానీ కారణాలు కావనీ, చైనావ్యూహాన్ని సకాలంలో ఊహించలేకపోయిన మన వైఫల్యమే కారణమనీ అనిపిస్తుంది. భారత రాజకీయ, సైనికనాయకత్వం గస్తీఘర్షణలా లేక పూర్తిస్థాయి యుద్ధమాఅనిఆలోచిస్తుండగానే చైనా హఠాత్తుగా చొచ్చుకువచ్చి అంతే వేగంగా యుద్ధవిరమణచేసి ఎదుటిదేశాన్ని సైనికపరాభవానికి గురిచేసి ప్రాదేశికనియంత్రణను సాధించే దిశలో ఆలోచనచేసింది.

చైనాసైన్యం సంపూర్ణబలాధిక్యం ఎటువంటిదైనా అందులో కొంత భాగాన్నిమాత్రమే మోహరించగలుగుతుంది కనుక, వాస్తవికార్థంలో అది భారతసైన్యానికి వందరెట్లు మించిన దనడానికి వీల్లేదని ఎవరైనా వాదించవచ్చు. అప్పుడు భారతపక్షంనుంచి మోహరింపజేసే సైన్యం కూడా అలాగే తక్కువే ఉంటుంది కనుక మొత్తంమీద అది పూర్తిగా సమతూకం లోపించిన యుద్ధమే అవుతుంది. అదీగాక, చైనాసైన్యం అప్పటికి కనీసం పాతికేళ్ళుగా నిరంతరాయంగా యుద్ధాలు చేస్తూనేఉంది కనుక ఏ విధంగా చెప్పుకున్నా పోరాటపటిమలో దానిదే పైచేయి అవుతుంది.

మరోవైపు భారతసైన్యం మనకు 'వారసత్వం'గా దక్కిన సైన్యం. 1962 సెప్టెంబర్ 3వ తేదీన నెహ్రూ రాజ్యసభలో చేసిన ప్రసంగంలో అన్నట్టు, 'స్వాతంత్ర్యం వెనువెంటనే మనకో

సైన్యం వారసత్వంగా లభించింది. అదెంతో సామర్థ్యంకలిగిన సైన్యమే, ఉత్తమసైన్యమే. కాకపోతే అది బ్రిటిష్‌సైన్యంలో ఓ స్వల్పభాగంగా ఉంటూవచ్చిన సైన్యం... మన విధానమంతా రూపుదిద్దుకున్నది వైట్‌హాల్‌లో... మన సాయుధబలగాలకు కావలసిన సామగ్రినంతటినీ మనం ఇంగ్లాండునుంచి తెప్పించుకున్నాం.' తేటతెల్లంగా కనిపిస్తున్న ఈ వాస్తవాల దృష్ట్యా చూసినప్పుడు ఆ సమయంలో చైనాతో ఎటువంటి ఘర్షణ ఎదురైనా భారతదేశానికి పరిస్థితి ఎంతో ప్రతికూలంగానే పరిణమిస్తుందనే విషయంలో ఏ ప్రధానమంత్రికీ ఎటువంటి భ్రమలూ ఉండడానికి వీల్లేదు.

చైనా ఆ సమయంలో దాడిచేస్తుందని ప్రధాని నెహ్రూ కానీ, రక్షణమంత్రి కృష్ణమీనన్ కానీ ఊహించలేదన్న సంగతి స్పష్టంగా తెలిసిపోతూనే ఉంది. ఊహించి ఉంటే సెప్టెంబర్‌లో వారిద్దరూ దేశం విడిచివెళ్ళి ఉండేవారు కారు. అంతేకాదు, సైనికసిబ్బంది ప్రధానాధికారి లెఫ్టినెంట్‌జనరల్ కౌల్ సెలవులో ఉన్నారు, డైరెక్టర్‌ఆఫ్ మిలటరీఆపరేషన్స్ దూరంగా విక్రాంత్ యుద్ధనౌకమీద ఉన్నారు. దీనినిబట్టి చైనా తన సైనికచర్యగురించిన నిర్ణయాన్ని అత్యంత గోప్యంగా ఉంచగలిగిందని అర్థమైపోతుంది. ఆ సంగతి పసిగట్టడంలో భారతగూఢచారి యంత్రాంగం సంపూర్ణ వైఫల్యం ఇక్కడ మళ్ళీ స్పష్టంగా కనిపిస్తుంది.

భారతదేశం తనమటుకు తను, హిమాలయ సరిహద్దుదేశాలైన నేపాల్, భూటాన్, సిక్కింలపై అదుపువంటి తన కీలకప్రయోజనాలకు పెద్దఎత్తున ముప్పు ఎదురైతే తప్ప పొరుగుదేశంతో ప్రమాదకరఘర్షణలో చిక్కుకోకూడదని నిర్ణయించుకుంది. హిమాలయసరిహద్దుదేశాలవైపు చైనా చొచ్చుకువచ్చిన ఆధారాలు కనిపించడంతో నెహ్రూ చాలా ఆందోళనకు లోనయ్యారు, అవి భారత 'ప్రభావపరిధి'లోకి వస్తున్న దేశాలుగా తాము భావిస్తున్నట్టు నిర్ద్వంద్వంగా ప్రకటించారు. ఆసియానాయకత్వం విషయంలో ప్రజాస్వామికభారతం, కమ్యూనిస్టుచైనాల మధ్య ఉన్న స్పర్థ ఆయన గమనించని విషయంకాదు. అలాగే, ప్రత్యేకించి ఆర్థికరంగంలో ఢిల్లీ, పెకింగ్‌ల మధ్య జరుగుతున్న పోటీని, ఏ విధానం 'ఫలితాలు రాబట్టగలుగుతుంద'న్న ఉత్సుకతతో మిగిలిన ప్రపంచం గమనిస్తున్న విషయమూ ఆయనకు తెలుసు.

టిబెట్ మరో పెద్ద వివాదాంశం.

టిబెట్ విషయంలో భారతదేశానికిప్రాదేశిక, రాజకీయ ఆకాంక్షలేవీ లేవనీ, ఆ దేశంతో సాంస్కృతిక, వాణిజ్యసంబంధాలను కాపాడుకోవాలనిమాత్రమే ఆశిస్తోందనీ 1950లో పార్లమెంటరీ చర్చలకు జవాబిస్తూ నెహ్రూ స్పష్టంచేశారు. టిబెట్‌కు ఆయుధసంపద లేదు, కనుక చైనాకు ముప్పుతేగలిగింది కాదు; అయినాసరే చైనా టిబెట్‌ను 'విముక్తం' చేస్తామని నొక్కిచెబుతూనే వస్తోంది-ఎవరినుంచి అన్నదిమాత్రం స్పష్టంకాదు. టిబెట్‌పై భారతవైఖరిని విమర్శించేవారు, చైనా ఆధిపత్యంషరతులకు లోబడి టిబెట్ వాస్తవిక (de facto) స్వాతంత్ర్యాన్ని 1914 నాటి సిమ్లాసంధి గుర్తించిన సంగతిని విస్మరిస్తూఉంటారు. చైనారిపబ్లికన్‌ప్రభుత్వం సిమ్లాసంధిపై సంతకంచేయడానికి నిరాకరించింది. ఆ తర్వాత వచ్చిన నేషనలిస్ట్‌ప్రభుత్వం ఆ సంధిని నిర్లక్ష్యం చేయడమే కాదు, ఎప్పుడనుకుంటే అప్పుడు, ఎలా వీలైతే అలా టిబెట్‌పై తన ప్రాబల్యాన్ని స్థాపించుకునే ప్రయత్నమేచేసింది. ఈ ప్రభుత్వం భారత నూతనప్రభుత్వంకంటె తాను ఆధిక్యంలో ఉన్నట్టు భావించుకుంటూ అరువు తెచ్చుకుని పెత్తందారీతో వ్యవహరించ

సాగింది ఆ పరిస్థితిలో, సిమ్లాసంధిని పునఃపరిశీలించాలని భారతదేశం కోరిఉంటే దొంకంతా మళ్ళీ కదిలి భారత -చైనా సరిహద్దుకు ప్రాతిపదికగా ఉన్న మెక్‌మహోన్‌రేఖ చెల్లుబాటు సైతం బహుశా ప్రశ్నార్థకమై ఉండేది. నిన్నటిసంగతి కనుక ఇప్పుడెవరెలా తీర్పు చెప్పినా, టిబెట్ స్వాతంత్ర్యాన్ని భారతదేశం ఏకపక్షంగా గుర్తించడమన్నది ఆ రోజున ఆలోచనకు కూడా అందని విషయం.

అప్పట్లో చైనాసైన్యం ప్రపంచంలోనే అత్యంతశక్తిమంతం. భారత హిమాలయసరిహద్దుకూ, పరిపాలనాక్లేశాన్ని తలకెత్తుకోకుండా బ్రిటిష్‌ప్రభుత్వం విడిచిపెట్టిన మారుమూల గిరిజన ప్రాంతాలకూ అది పెనుముప్పుగా పరిణమించింది. మెక్‌మహోన్‌రేఖ భౌగోళికపటానికే పరిమితమైంది తప్ప, ఆ రేఖకు వందమైళ్ళలోపల భారతదళాలను నియోగించని కారణంగా అది పరిపాలనాయోగ్యమైన సరిహద్దుగా వ్యవహరించబడడం లేదు. ఆ సమయంలో కనుక భారతదేశం చైనాతో యుద్ధానికి దిగిఉంటే, చైనా తన సరిహద్దులను NEFA పర్వతపాదాలకు విస్తరింపజేసుకుని, భారతప్రభావపరిధినుంచి భూటాన్, సిక్కిం, నేపాల్‌లను తప్పించగలిగిన స్థితిలో ఉండేది. హిమాచల్‌ప్రదేశ్, ఉత్తరప్రదేశ్‌లలోని పర్వత ప్రాంతాలకు చైనా ముప్పుగామారి ఉండేది; అలాగే కాశ్మీర్‌లోని లడఖ్‌లో అత్యధికప్రాంతం ప్రమాదంలోకి జారిపోయిఉండేది.

టిబెట్ స్వయంపాలకప్రతిపత్తిని సాధ్యమైనంతమేరకు కాపాడడానికి పండిట్ నెహ్రూ, జోక్యం చేసుకోరాదన్నవిధానాన్నిపాటించారు.చైనాఅనుమాననివృత్తికీ, NEFAపై, ఇతర సరిహద్దుప్రాంతాలపై మన ఆధిపత్యం కుదురుకోడానికీ, 1959 వరకూ టిబెట్‌పై దలైలామా ఆధిపత్యం కొంతమేరకు కొనసాగడానికీ అది తోడ్పడింది.

చైనా ప్రధాని చౌ ఎన్— లై భారతదేశాన్ని సందర్శించినప్పుడు మెక్‌మహోన్‌రేఖగురించి తానెప్పుడూ వినలేదన్నారు. ఇప్పుడటువంటి కీలకాంశమే ప్రమాదంలో పడిపోయింది. ఆ రేఖ ఎప్పుడో రుజువైన తథ్యం. మరోవైపు భారత, చైనా, బర్మాల మధ్య మైత్రీసంబంధాలను పరిరక్షించుకోవలసిన అవసరం. మెక్‌మహోన్‌రేఖను అధికారికంగా గుర్తించడానికి సంబంధించిన టిబెట్ తీర్పును చైనా ప్రభుత్వం తన విధానంలోకి చేర్చుకోలేదు, చేర్చగలననిమాత్రం అంటూ వచ్చింది.

1952-58 కాలంలో సామరస్యపూర్వక వాతావరణం నెలకొనడంతో ఐక్యరాజ్యసమితిలో చైనాప్రవేశాన్ని భారతదేశం ఏటా సమర్థిస్తూవచ్చింది, అలాగే తైవాన్‌తో దౌత్యసంబంధాలు ప్రారంభించలేదు. ఐతే ఉత్తరప్రదేశ్, హిమాచల్‌ప్రదేశ్, లడఖ్, నేఫాలోని కొన్ని ప్రాంతాలు - ఈ ప్రదేశాల్లో చైనా సరిహద్దుల ఉల్లంఘనకు చైనా పూనుకున్న ఉదంతాలెన్నో సంభవించాయి. చైనా ఈ విరామసమయాన్ని బార్డర్ రోడ్లనిర్మాణానికీ, టిబెట్‌పై తన ఆధిపత్యాన్ని పటిష్ఠం చేసుకోడానికీ, ఉపయోగించుకుంది.

దుర్భిక్షం, వరదలు - ఇలాంటి ప్రకృతి వైపరీత్యాలు దేశాన్ని విపరీతనష్టాలకు గురిచేస్తున్న సమయం కూడా అది. ఫలితంగా ఆహారపదార్థాలకు తీవ్రమైన కొరత ఏర్పడింది. భారతదేశం ఏనాటికీ ఆహారధాన్యాల్లో స్వయంసమృద్ధిని సాధించజాలదనీ, కులాలమధ్య వైషమ్యాలు ముదిరి

పోయి దేశం అనివార్యంగా ముక్కలుచెక్కలైపోతుందనీ, పశ్చిమదేశాలు ఊహించుకున్నాయి. ఇలాంటి పరిస్థితిలో హఠాత్తుగా దేశరక్షణసన్నద్ధత ప్రథమ ప్రాధాన్యాంశంగా పరిణమించింది. ఆ పరిస్థితుల్లో భారతదేశం చైనాను సైనికంగా ఎదుర్కోవడం కచ్చితంగా ప్రయోజనకారికాదు. దేశభద్రతబాధ్యత పూర్తిగా సీనియర్ దౌత్యవేత్తలు, రాజకీయవాదుల భుజస్కంధాలమీద వచ్చిపడింది.

ఆ పరిస్థితిని ముందే ఊహించారా అన్నట్టుగా,జవహర్లాల్ నెహ్రూ1946సెప్టెంబర్ 7వ తేదీన ఎక్జిక్యూటివ్‌కౌన్సిల్ ఉపాధ్యక్షుడిగా, విదేశీవ్యవహారాలశాఖకు బాధ్యుడుగా తొలి రేడియోప్రసంగంచేస్తూ ఇలా ప్రకటించారు:

*'ఒకరికి వ్యతిరేకంగా ఒకరు మరొకరితో పొత్తుకలిసి కూటములుగా ఏర్పడి, గతంలో రెండు ప్రపంచయుద్ధాలకు దారితీయించి, ఇప్పుడు మరోసారి అంతకు మించిన విధ్వంసానికి దారితీయగల కూటరాజకీయాలకు వీలైనంత దూరంగా ఉండాలని మనం ప్రతిపాదిస్తున్నాం. శాంతి, స్వాతంత్ర్యం అవిభాజ్యమని మనం విశ్వసిస్తున్నాం. ఎక్కడో ఒకచోట స్వాతంత్ర్యాన్ని నిరాకరించడమంటే అది విధిగా వేరొకచోట స్వాతంత్ర్యాన్ని నిరాకరించడమే అవుతుంది. అది ఘర్షణకూ, యుద్ధానికీ దారితీస్తుంది. వలసవాద, పరాధీనదేశాల విముక్తి విషయంలో, అన్ని జాతులకూ సమానాధికారాలను, సిద్ధాంతరీత్యానూ, ఆచరణరీత్యానూ గుర్తించే విషయంలో మనం ప్రత్యేకించి ఆసక్తిని వహిస్తున్నాం. నాజీల జాతిదురహంకారవాదం ఎక్కడ ఏ రూపంలో అమలుజరిగినా మనం తీవ్రంగా ఖండిస్తాం. ఇతరులపై మనం ఎటువంటి ఆధిపత్యాన్ని ఆశించం, ఇతర ప్రజానీకంపై ఎటువంటి విశేష హక్కునీ కోరుకోం .అయితే మన ప్రజలు ఎక్కడికి వెళ్ళినా వారికి అక్కడి ప్రజలతో సమానమైన గౌరవమర్యాదలు లభించాలని కోరుకుంటాం, వారిపట్ల ఎటువంటి వివక్షనూ సహించం.*

*అంతర్జాతీయవ్యవహారాల్లో ముఖ్యభూమిక నిర్వహించే అదృష్టాన్ని దక్కించుకున్న అమెరికా సంయుక్తరాష్ట్రాలప్రజలకు మన శుభాకాంక్షలు అంద జేస్తున్నాం. ఈ మహత్తరబాధ్యతను సర్వత్రా శాంతి స్వాతంత్ర్యాల పరివ్యాప్తికే వినియోగిస్తారని విశ్వసిస్తున్నాం.*

*ప్రపంచపరిణామాలరూపకల్పనలో అంతే విస్తృతబాధ్యతను మోస్తున్న ఆధునికప్రపంచంలోని మరో ఘనతవహించిన దేశం సోవియట్‌యూనియన్‌కు కూడా శుభాకాంక్షలు అందజేస్తున్నాం. ఆసియాలో వారు మన పొరుగువారుకనుక అనివార్యంగా మనం కలిసి మోయవలసిన కార్యభారం ఎంతో ఉంది. పరస్పరం చేసుకోవలసింది ఎంతో ఉంది.'*

ఈ విప్లవాత్మకవ్యాఖ్య అలీనసిద్ధాంతాన్ని ముందుకు తెచ్చింది. రెండో ప్రపంచయుద్ధానంతర శకం మొదలైన వెనువెంటనే ఏదైనా ఒకదేశం ఇటువంటి సూత్రకల్పన చేయడం ఇదే మొదటి

సారి. భారతదేశం స్వతంత్రంకావడానికి పదకొండు మాసాలముందే భారతదేశ భద్రత, విదేశాంగవిధానాలకు సంబంధించిన మౌలికసిద్ధాంతాన్ని నెహ్రూ ప్రతిపాదించడం ఇక్కడ విశేషం.

ఇంకా చెప్పాలంటే అలీనోద్యమాన్ని స్థాపించడానికి పదిహేను సంవత్సరాల పూర్వం జరిగిందది. నెహ్రూ ప్రసంగంలో సోవియట్ యూనియన్‌ను 'ఆసియాలో మన పొరుగు దేశం'గా పేర్కొనడం గమనార్హం. సాధారణంగా ఆరోజుల్లో కమ్యూనిస్టు పార్టీల ఆలోచనల్లో నెహ్రూను సామ్రాజ్యవాదుల తొత్తుగా భావించడం జరిగేది... అయితే ఆనాడే ఆయన తక్షణభవిష్యత్తును దాటి ఎంతో ముందుకు చూడగలిగారనీ, భారత, సోవియట్ యూనియన్ల మధ్య భౌగోళిక - వ్యూహాత్మక బంధాలను దృష్టిలో ఉంచుకున్నారనీ స్పష్టమౌతుంది.

ఎంతో తలపండిన రాజకీయవాదులుకూడా అలీనవిధానాన్ని తేలికగా జీర్ణించుకోలేకపోయారు. ఎన్.జి. రంగా, హెచ్.వి. కామత్, మౌలానా హస్రత్ మొహానీ, ఎం.ఆర్. మసానీ వంటి దిగ్గంతులు పార్లమెంటులో దానిని ప్రశ్నించారు. కొందరి కది తటస్థవాదంగా కనిపించింది; మరికొందరికి తృతీయశక్తిని సృష్టించడంగా కనిపించింది.

రెండు ధ్రువాల పరికల్పనపై నడుపబడుతున్న అంతర్జాతీయవ్యవస్థలో అలీనవాదం నిర్ణయస్వాతంత్ర్యాన్ని ఉద్ఘాటించే సిద్ధాంతం. తమ శత్రుత్వపు ప్రారంభఘట్టాల్లో రెండుశిబిరాల నాయకులూ ప్రతిదేశం ఏదో ఒక శిబిరంలో చేరి తీరాలని పట్టుబడుతూ అలీనోద్యమాన్ని ఒక అనైతిక తటస్థవాదంగా, లేదా సామ్రాజ్యవాదుల్ని సమర్థిస్తూ, వారి దుర్మార్గాలకు సహకరించడానికి ఓ ముసుగుగా పేర్కొని ఖండిస్తూవచ్చారు. మొత్తం అంతర్జాతీయవ్యవస్థ సైద్ధాంతికంగానే రెండుధ్రువాలుగా చీలిపోయినట్టు ఉభయ శిబిరాలూ విశ్వసించాయి. అలీనదృక్పథం ఈ అభిప్రాయాన్ని తిరస్కరించింది. అలీనదేశాలు ప్రచ్ఛన్నయుద్ధంలో చేరడానికి నిరాకరించాయి.

కాశ్మీర్‌విషయంలో, పాకిస్తాన్‌కు అమెరికానుంచి సైనికసహాయం అందే సందర్భంలో, భారతదేశంపై పశ్చిమదేశాల ఒత్తిడి దండిగా వచ్చింది. ఈలోగా, తిరుగుబాటుమార్గాన్ని త్యజించవలసిందిగా భారతకమ్యూనిస్టు నాయకులకు సోవియట్ నాయకులు సలహా ఇచ్చారు. ఇటువంటి పరిస్థితుల్లో భారతచైనాల మధ్య పంచశీలఒప్పందం చేసుకుంది.

1955లో సోవియట్ యూనియన్ కాశ్మీర్‌విషయంలోనూ, గోవా విముక్తి విషయంలోనూ భారతదేశానికి తన సమర్థన అందించింది. సోవియట్‌యూనియన్, చైనాల మధ్య సంబంధాలు క్షీణించడం ప్రారంభమై సోవియట్ యూనియన్ భారతదేశంతో మైత్రిని కోరుకొనడమే కాక, 1962 యుద్ధానికి బాధ్యత చైనాదేనని స్పష్టంచేసింది. అలా భారతదేశం, సోవియటం యూనియన్ మధ్య సత్సంబంధాలు నెలకొని వారి నుండి ఆయుధసామగ్రి, వైజ్ఞానిక సహకారం మనకు లభించసాగాయి.

పండిట్ నెహ్రూ 1952లో తన పెకింగ్ పర్యటన సందర్భంగా ఇలా అన్నారట. 'ఏదో ఒకరోజున ఈ రెండు ఆసియా మహాకాయాలూ ఒకదానితోఒకటి ఘర్షణకు దిగుతాయి. అది ఆసియాకే మహోత్పాతంగా పరిణమిస్తుంది. ఆ పరిణామాన్ని నివారించడానికి మనమంతా శాయశక్తులా ప్రయత్నించాలి.' విప్లవానంతర నవచైనా ఎలా మారబోతుందో మనం దృష్టిలో

ఉంచుకోవాలని 1950 నవంబర్ 27వ తేదీన నెహ్రూ పార్లమెంటులో ప్రకటించారు. ఆ తర్వాత 1959 డిసెంబర్ 9వ తేదీన ఆయన, 1951లో నియుక్తమైన బార్డర్‌కమిటీని గురించి ప్రస్తావించి శక్తిమంతమైన ఈ రెండుదేశాలూ సరిహద్దు వివాదాన్ని పురస్కరించుకుని ముఖాముఖిగా రూపొందుతున్న చిత్రం 1950 నుంచి ప్రభుత్వంముందు ఉంటూనే వచ్చిందనీ, అయితే ఘర్షణ అయిదేళ్ళలోనా, పదేళ్ళలోనా, పదిహేనేళ్ళలోనా, లేక ముప్పైఏళ్ళలోనా– ఎప్పుడు సంభవిస్తుందనే విషయంలో రెండుదేశాలమధ్య 'అభిప్రాయభేదం' ఉండవచ్చుననీ, అన్నారు. మొదటినుంచి చైనావిషయంలో నెహ్రూకి వేరే అభిప్రాయాలున్నాయన్న మలిక్ వ్యాఖ్యను ఈ వాస్తవాలు బలపరుస్తున్నాయి.

1950 ప్రారంభంనుంచే నెహ్రూ చైనానుంచి ముప్పును ఊహించారనడానికి ఇప్పుడు కావలసినన్ని సాక్ష్యాలున్నాయి. చైనానుంచి ఎదురుకాగల ప్రమాదంగురించి తాము నెహ్రూను హెచ్చరిస్తూనే వచ్చామనీ ఆయన సకాలంలో చర్య తీసుకోలేదనీ కొందరు నాయకులు చెప్పు కున్నారు. ఒకానొక నిర్దిష్టసమయంలో 'సకాలంలో చర్య తీసుకోవడం' అనే మాటకు అర్థమేమిటన్నది ఈ సందర్భంలో కాస్త లోతుగా పరిశీలించడం అవసరం. కేవలం ఒక హెచ్చరికతో రాత్రికి రాత్రి రక్షణసన్నద్ధతను తెచ్చిపెట్టుకోలేం.

చైనాను ఎదుర్కోడానికి అవసరమైన ప్రమాణంలో సైనికసన్నద్ధతను తెచ్చుకోవాలంటే ఎంత గడువు అవసరమౌతుందనేది ఇక్కడ చాలా ముఖ్యమైన ప్రశ్న. ఈ వాస్తవాలనూ, అలాగే జాతీయాభివృద్ధికి సంబంధించిన ఇతర కీలక ప్రాధాన్యాంశాలను పరిగణనలోకి తీసుకున్నప్పుడు దేశరక్షణ యంత్రాంగాన్ని పటిష్ఠం చేయడంలో నెహ్రూప్రభుత్వం నిర్లక్ష్యాన్ని ప్రదర్శించిందన్న ఆరోపణ సహేతుకం కాదని తేలుతుంది ఈ సందర్భంగా గుర్తించదగిన విషయం – ఆ రోజుల్లో (ఆమాటకొస్తే ఈ రోజుల్లోనూ) భారతదేశాన్ని పాశ్చాత్య కూటమివైపు నెట్టాలని తపించే 'ప్రచ్ఛన్న యుద్ధవాదాలు' ఉండేవారు. వాళ్ళలో రాజకీయవాదులే కాదు, పౌర, సైనిక యంత్రాంగాల్లోని పలువురు సీనియర్ బ్యూరోక్రాట్లూ ఉన్నారు. ఆపైన ఇంతకుముందే చెప్పినట్లు 1959 మొదలుకొని చైనా శత్రుత్వ వైఖరిని గురించి నెహ్రూ పార్లమెంటులోను, పత్రికలవారి ముందూ బాహాటంగానే వ్యాఖ్యానిస్తూ వచ్చారు. కనుక 1954-58 మధ్యకాలంలోని 'హిందీ-చీనీ, భాయ్-భాయ్ వాదం' వల్లనే 1962లో మన సన్నద్ధత లోపించిందనే వాదాన్ని ఎలా స్వీకరించగలమో అర్థంకాదు.

1945లో, భవిష్య భారతానికి 'హింద్ స్వరాజ్' నమూనా స్వీకరించాలని గాంధీజీ పట్టు బట్టినప్పుడు నెహ్రూ ఇలా జవాబుచెప్పారు, 'స్వాతంత్ర్యాన్నీ; రాజకీయ, ఆర్థికరూపాల్లో జరిగే విదేశీదురాక్రమణనుంచి రక్షణనీ ఈ సందర్భంలో దృష్టిలో ఉంచుకోవాలి. భారతదేశం సాంకేతికంగా అభివృద్ధిచెందకుండానే నిజమైన స్వతంత్రదేశం కాగలదని నేను భావించడంలేదు. ఈ క్షణాన నేను ఆలోచిస్తున్నది కేవలం సైన్యాలగురించి కాదు, వైజ్ఞానిక ప్రగతి గురించి.' ప్రపంచంలోని ఈ భాగంలోని శక్తులమధ్య పరస్పరసమతుల్యతను సాధించడం ద్వారా భారతదేశభద్రతకు దోహదంకాగల విధానాన్ని అమలుచేయాలని ఆయన ఆ విధంగా నిశ్చయించుకున్నారు. అమెరికా, సోవియట్‌యూనియన్‌ల భౌగోళిక-వ్యూహాత్మకస్థితిని దృష్టిలో ఉంచుకుని, అలాగే పాకిస్తాన్

పట్ల అమెరికా మొగ్గునీ, వలసవాద, నయా-వలసవాదశక్తుల్నీ దృష్టిలో ఉంచుకుని ఒక సమ తుల్యశక్తిగా సోవియట్ యూనియన్‌కు సన్నిహితం కావాలనిఉద్దేశపూర్వకంగానే నెహ్రూ నిశ్చయించుకున్నట్టు కనిపిస్తుంది

★ ★ ★

ఒకసారి వెనుదిరిగిచూసుకుంటే, లడాఖ్‌లో పోరాడి ప్రాణత్యాగంచేసినవారు వ్యర్థంగా ఆ త్యాగం చేయలేదనే ఎవరైనా అంటారు. అలాగే నాన్కాఛూ, వలోంగ్‌లలో జరిగిన పోరాటం ప్రయోజనరహితమనీ అనలేరు. ఆ యుద్ధాలు జరిగి ఉండకపోతే అరుణాచల్‌ప్రదేశ్ భారతభూభాగంగా కొనసాగిఉండేది కాదు ఆ దురదృష్టకరమైన నవంబర్ నెలలో కమెంగ్ డివిజన్‌లో సంభవించిన ఘటనలను ఒక వరసక్రమంలో కనుక మనం పరిశీలిస్తే, మొత్తం వ్యవహారాన్ని గంద్రగోళం పట్టించడానికి ఉద్దేశపూర్వకంగా సృష్టించిన కట్టుకథలు మనకు ఎదురౌతాయి కమెంగ్‌లో లభించిన సాక్ష్యంప్రకారం భారతసైన్యం నాలుగో డివిజన్ కమాండర్ ఆ డివిజన్‌కు పోరాడే అవకాశమివ్వలేదు, కనుక ఆ వైఫల్యం పూర్తిగా స్థానికమైనది. ఆ డివిజన్‌వద్ద తగినంత ఆయుధసంపత్తి లేదు కనుకనే పోరాడలేదన్న సార్వజనిక అభిప్రాయంలో వాస్తవంలేదు. చైనాసైనికులవద్దకూడాలేని ట్యాంకులు, ఫీల్డుతుపాకులు ఈ డివిజన్‌కు ఉన్నాయి. చైనావారిని కనీసం ఏడురోజులపాటు నిలవరించగల సామగ్రి ఈ డివిజన్‌కు ఉంది అదే కనుక జరిగిఉంటే చైనా, యుద్ధాన్ని కొనసాగించగల స్థితిలో ఉండేదా అన్నది సందేహాస్పదమే కొద్దిరోజులపాటు చైనాను కట్టడిచేసిఉంటే 1962 యుద్ధచరిత్ర పూర్తిగా మరోవిధంగా ఉండేది

చైనా తన సైనికచర్యలతో ఏం సాధించాలనుకుందో విశ్లేషించడం కష్టం. అయితే, ఆత్మ రక్షణకోసమే అలా వ్యవహరించిందన్న సూత్రీకరణ అర్థరహితం. సింహావలోకనం చేసుకుంటే, చైనా భారతభూభాగంలోకి లోతుగా చొచ్చుకువచ్చి, ఆ తర్వాత అరుణాచల్‌ప్రదేశ్‌నుంచి ఉపసంహరించుకోవడం వల్ల, ఆ రాష్ట్రం భారతభూభాగమేనని తేల్చినట్టయింది. చైనాసైన్యం మన భూభాగంలోకి చొచ్చుకువచ్చి లడఖ్‌లోని మన చెక్‌పోస్టులు ఆక్రమించుకోడం ద్వారా సంపాదించిన ఇరవై కిలోమీటర్ల వెడల్పు కలిగిన సుదీర్ఘ భూఖండం విలువ, భారతదేశాన్ని పూర్తిగా దూరంచేసుకుని భారీఎత్తున ఆయుధీకరణ కార్యక్రమంవైపు ఆ దేశాన్ని నడిపించడ మనే పరిణామం విలువతో ఎంతమాత్రం సరితూగేది కాదు. అందువల్ల చైనా ఆంతర్యాన్ని రాజకీయపరిధిలోనే అన్వేషించవలసిఉంటుంది

నెహ్రూ ప్రభుత్వాన్ని కూలదోయడం చైనా లక్ష్యంకావచ్చు, లేదా తనకీ సోవియట్‌యూనియన్‌కీ మధ్య జరుగుతున్న సైద్ధాంతికచర్చలో ఆధిక్యం సంపాదించుకోగలనన్న ఆశతో భారతదేశాన్ని పాశ్చాత్యకూటమివైపు నెట్టాలని భావించిఉండవచ్చు. అలా చూసినా, ఇలా చూసినా మొత్తా నికి చైనా తన లక్ష్యం సాధించలేకపోయింది. భారతదేశం ఎదుర్కొన్న సైనికపరాభవం విధానవైఫల్యం కాదు. యుద్ధరంగంలో విఫలుడైన ఆ కమాండర్ అద్భుతమైన పోరాటచరిత్ర కలిగినవాడు, అంతకుముందు పతకాలు అందుకున్నవాడు. మరింత నిర్దిష్టమైన సాక్ష్యం ఏదీ కనిపించని పరిస్థితిలో ఆ వైఫల్యాన్ని అనూహ్యంగా యాదృచ్ఛికంగా సంభవించే చారిత్రకఘటనలలో ఒకటిగా భావించడమే మనం చేయగలిగింది.

1947-64 మధ్యకాలంలో ప్రపంచదేశాలమధ్య సమున్నతస్థాయికి ఎదిగిన భారతదేశప్రతిష్ఠ, 1962 నాటి సైనికపరాజయంతో దారుణంగా కుంగిపోయింది. ఇదే సమయంలో కాశ్మీర్‌లో సైనికచర్య, సంస్థానాల విలీనం, వలసప్రాంతాల విముక్తి –వీటిద్వారా దేశభద్రతకు పటిష్ఠత లభించింది. తిరుగుబాటుధోరణులను విజయవంతంగా నిరోధించగలిగాం. పాశ్చాత్య సైనికకూటమిలో చేరిన పాకిస్తాన్ ప్రభావాన్ని కట్టడిచేయగలిగాం. చివరకు చైనా విషయంలోకూడా పంచశీలఒప్పందంద్వారా తగినంత వ్యవధి సంపాదించుకోవడం, అరుణాచల్‌ప్రదేశ్‌లో మన ప్రాబల్యాన్ని కూడదీసుకోవడం – ఇవి స్వల్పవిషయాలేమీ కావు. వాస్తవానికి మన వైఫల్యాల కన్నా విజయాలే త్రాసులో ఎక్కువ బరువుతూగితే ఆ ఘనత ప్రధాని జవహర్లాల్ నెహ్రూకే దక్కవలసిఉంటుంది. అలాగే, ఆయన విజయాలను పూర్తిగా విమర్శారహిత దృక్కోణం నుంచి చూడడమూ పనికిరాదు. ఆయన సాధించిన విస్తారవిజయాలవెనుక, ఆయనదిగా చెప్పుకుంటున్న ఒకే ఒక ఖరీదైన వైఫల్యం వెనుక ఉన్న కారణాలను నిష్పాక్షికంగా విశ్లేషించుకోవడం అవసరం.

కావలసిన సంపద, వనరుల– వీటి కొరత తీవ్రంగా బాధిస్తున్న స్థితిలో అంతర్జాతీయరంగంలో భారతదేశానికి తగిన స్థానాన్ని నిర్మించడానికీ, ప్రమాదభరితమైన అపరిపక్వదశలో దేశభద్రతకు రక్షణ కల్పించడానికీ ఆయన సాధించిన విజయాలు ప్రత్యేకించి మిరుమిట్లు గొలుపుతాయి. భారతదేశం చిన్నదేశమేమీ కాదు-అత్యధికజనాభా ఉన్న దేశం, ప్రపంచస్థాయిలో కీలకమైన కమ్యూనికేషన్లకు అనువైనప్రాంతంలో ఉన్న దేశం, శతాబ్దాల చరిత్ర కలిగిన దేశం, ప్రజాస్వామిక విలువలూ, లక్ష్యాల పతాకచ్ఛాయలో అహింసాయుత మార్గంలో సుదీర్ఘ కాలం పోరాడి స్వాతంత్ర్యం సాధించుకున్న దేశం, ప్రపంచప్రమాణాలదృష్ట్యా కొంత సాపేక్షంగా నైపుణ్యాలను అభివృద్ధిచేసుకుని పైకివస్తున్న మధ్యతరగతి కలిగిన దేశం, పరిపాలనకూ, ఆర్థిక పటిష్ఠతకూ కావలసిన దృఢమైన మౌలికయంత్రాంగం ఉన్న దేశం. అయితే ఇక్కడి జనాభా చాలావరకు నిరుపేదలు. పారిశ్రామికంగా ఇంకా చాలినంత పునాది ఏర్పడలేదు, స్వాతంత్ర్య సాధన సందర్భంలో ఇక్కడ అంతులేని రక్తపాతం, హింస, పడగవిప్పిన మతవిద్వేషం తాండవించాయి; పూర్వమెన్నడూ కనీవినీ ఎరుగని మేరకు అత్యధికసంఖ్యలో జనం విస్థాపితులైపోయారు. ఎన్నోస్థాయిల అభివృద్ధి దశల్లో ఉన్న వందలాది సంస్థానాలను భారతయూనియన్‌లో విలీనం చేయవలసివచ్చింది. వాటిలో కొన్ని పెద్ద సంస్థానాలు వెలుపలి శక్తులనుంచి ప్రోత్సాహం అందుకుని వేరుపడతామని బెదిరించాయి. వాటినికూడా ఎట్టకేలకు విలీనం చేసుకోగలిగాం, ఒక సంస్థానం విషయంలో బలప్రయోగమూ అనివార్యమైంది.

రెండు కమ్యూనిస్టు మహాశక్తులు-సోవియట్‌యూనియన్, చైనా (అప్పట్లో) మనతో స్నేహభావంతో లేవు. దేశం లోపల కూడా కమ్యూనిస్టు తిరుగుబాటును ఎదుర్కోవలసివచ్చింది. బ్రిటిష్ పాలకులు, వారి ప్రభావంతో అమెరికన్లు కాశ్మీర్ సమస్యపై పక్షపాతంతో వ్యవహరిస్తూ వచ్చారు, దానిని భారతీయ లౌకికవ్యవస్థకీ, పాకిస్తాన్ ద్విజాతిసిద్ధాంతానికీమధ్య పోటీగా మార్చివేశారు. దేశంలోని ఎందరో రాజకీయవాదులు అప్పటి ప్రచ్ఛన్నయుద్ధపు వక్రకోణంనుంచి అంతర్జాతీయ పరిస్థితిని తిలకిస్తూ వచ్చారు; కొందరు పౌర ఉన్నతాధికారులు, సైనికదళాలలోని సీనియర్ సిబ్బంది, స్థూలంగా పత్రికలవాళ్ళూ పాశ్చాత్యదృక్కోణంవైపు మొగ్గుచూపిస్తూ

వచ్చారు. ఇటువంటి పరిస్థితుల్లో అలీనవిధానాన్ని రూపొందించడానికీ, అత్యంత క్లిష్టకాలంలో దానిని కొనసాగించడానికీ, ప్రధానమంత్రి నెహ్రూకు అసాధారణ భవిష్యద్దర్శనం, దూరదృష్టి అవసరమయ్యాయి. భారతప్రధాని ప్రపంచాన్ని భారతకేంద్రిత దృక్పథంనుంచి పరిశీలించి, అంతర్జాతీయరాజకీయాలకు అమెరికా - సోవియట్ సంబంధాలే కీలకమన్న వాదాన్ని తిరస్కరించారు, దానికి అవసరమైన తర్కశుద్ధిని మన దీర్ఘ స్వాతంత్ర్య పోరాటం, భారతదేశం వెనుక ఉన్న వేల సంవత్సరాల నాగరికతా చరిత్ర – ఇవే ఆయనకు శక్తినందించాయన్నది నిస్సందేహం.

సహజంగానే ఆయన అంతర్జాతీయరంగంలో శక్తి ప్రయోగాన్ని తీవ్రంగా విమర్శించారు. నానాటికీ పెచ్చుపెరిగిపోతున్న అణ్వస్త్రాల ప్రమాదాన్ని అనుక్షణమూ ఎదుర్కొంటున్న ప్రపంచంలో, మానవజాతిని రక్షించాలంటే వ్యూహాత్మకతంత్రంలో వివేకం ఎంతో అవసరం. ఆయన ప్రతిపాదించిన ఈ దృక్కోణం, ప్రపంచమంతా శాంతీ అభివృద్ధీ కోరుకుంటున్న ఆయన శైలికి అనుగుణంగా ఉంది. అయితే నాయకత్వస్థాయిలో చేయబడుతున్న ఈ ప్రకటనల దృష్ట్యా దేశానికి కావలసిన రక్షణ సంసిద్ధతను గురించిన గహనచర్చను మానుకోవడం ఏమాత్రం సబబు కాజాలదు. సైనికవ్యవహారాలకు సంబంధించిన అనేక సాంకేతిక పక్షాలను లోతుగా పరిశీలించవలసిన తమ విధ్యుక్త కర్తవ్యాన్ని నిర్వహిస్తూ దేశరక్షణ కొరకు కావలసిన చర్యలను ఎప్పటికప్పుడు పకడ్బంధీగా తీసుకుంటూ ఉండటం అత్యంతావశ్యకం. కాని నెహ్రూ గారి ప్రకటనలను అధికారవర్గం నిష్క్రియత్వానికే సాకుగా వాడుకుంది. ఆ మాటలనే పైనుంచి క్రిందివరకు ఏకరువు పెట్టడమే జరుగుతూ వచ్చింది.

నేడు నిరంతరం వికసిస్తున్న రాజకీయచైతన్యం దృష్ట్యాను, బలవంతాన దేశాలను ఆక్రమించడానికి కావలసిన భారీ వ్యయం దృష్ట్యానూ, యుద్ధాన్ని దేశవిధానంలో భాగంగా ఉపయోగించడం సాధ్యపడదు. నేటి పరిస్థితిలో అవలంభించ వలసింది బలప్రయోగాన్ని బెదిరింపుగా చూపించే దౌత్యకార్యక్రమం. దీనిలో – బెదిరింపు, శత్రు నిరోధం, స్వయంరక్షణ – ఈ మూడు ప్రక్రియలకూ శక్తిని చూపించడమనే విధానాన్ని అవలంభించడం జరుగుతుంది. అంతర్జాతీయ సంబంధాల్లో ఇదొక అవిభాజ్యాంశంగా నేడు రూపొందింది.[3]

**రచయిత విజ్ఞప్తి:**

*భారత స్వాతంత్ర్యానంతరం అర్ధశతాబ్దంలో నెలకొన్న భారత-చైనా సంబంధాలను ఎందరో పండితులు, పరిశోధకులు పరిశీలించారు. తత్పూర్వకాలంలో ఈ ప్రాంతంలో నిరంతరం మారుతూ వచ్చిన పరిస్థితులను గురించిన సాహిత్యం కూడా ఎంతో ఉంది. ఆయా పండితుల అభిప్రాయానుసారం ఈ విధానాన్ని సరైనదిగానో, సరైనది కాదనో, తేల్చడం జరిగింది. ఎక్కువమంది సరైనది కాదనడమే జరిగినట్లుంది.*

---

*3) పై రెండు పేరాల్లో పొందుపరచిన వ్యాఖ్య, భారతప్రభుత్వంలో మాజీ రక్షణసచివుడు కె. సుబ్రహ్మణ్యం అభిప్రాయాలపై ఆధారపడినవి. ఆయన రక్షణ వ్యవహారాల్లో నిపుణుడుగా పరిగణించబడే వ్యక్తి.*

అయితే ఈ అధ్యయనాల్లో, నెహ్రూ తన శైలిలో గాంధీజీ, భారత స్వాతంత్ర్యసిద్ధికి పూర్వమే బహిరంగంగానూ అసందిగ్ధంగానూ స్వతంత్ర భారతదేశం అప్పటికే ఉద్భవించిన రెండు మహాశక్తుల కుమ్ములాటలో పాల్గొనక అలీన విధానాన్ని అనుసరించగలదని ఉద్ఘాటించారని తేలింది. ఈ విధానాన్ని పాశ్చాత్యదేశాలకు వ్యతిరేకమైనదని అపార్థం చేసుకుని అనైతికమైనదని ప్రకటించడం జరిగింది. దీనివల్ల పాశ్చాత్య దేశాల పక్షధరులకు కొంత నిరాశ కలిగి ఉంటుంది. ఈ నిరాశ ఇండియా - చైనా, ఇండియా-చైనా సంబంధాలను- నిజానికి ఇండియాతో సంబంధించిన మరే విషయాన్నైనా సరే - వారు పరిశీలించిన సందర్భంలో వారి వైఖరిని కొంతవరకైనా ప్రభావితం చేసి ఉంటుంది. ఇండియాది బహిరంగరాజనీతి ఐనందున ఈ పండితులకు ఈ దేశాన్ని గురించి అంతా తెలుసు. విదేశాంగ కార్యాలయం ఉన్న సౌత్ బ్లాక్‌లోని మాటలనుంచీ, వదంతులనుంచీ, వాదోపవాదాలనుంచీ, భోగట్టానంతటినీ వారు రాబట్టుకున్నారు. చైనా గురించి మాత్రం వారికి తెలిసింది ఒకే ఒక కథనం. అదే చైనా ప్రభుత్వం ప్రకటించిన అధికారిక కథనం. దానికి భిన్నంగా మరో పక్షమంటూ ఏదీ లేనందున దాన్నే సంపూర్ణసత్యంగా పరిగణించే ప్రవృత్తి ఆ పండితుల మస్తిష్కాల్లో సహజంగానే ప్రబలి ఉంటుంది. ఇండియాలోని అభిప్రాయ వైరుధ్యాలెన్నో స్పష్టంగా కనిపించాయి. పూర్వపు సామ్రాజ్యవాద ప్రభుత్వం కూడా తనకు ప్రబలమనిపించిన కారణాలను బట్టి ఈ వైవిధ్యాలను బుద్ధిపూర్వకంగా కొనసాగనిచ్చింది. లేదా, ఈ విషయం జటిలమైనదని తెలిసి కూడా అప్పుడు ఇండియా స్వాతంత్ర్యానికి సంబంధించిన ఇతర సమస్యలు అకస్మాత్తుగా తలెత్తడం వల్ల వివాదాస్పద విషయాల్లో మౌనం వహించి ఉంటుంది. ఈ విధంగా కొనసాగిన అభిప్రాయ వైరుధ్యాల వల్ల పరిశోధకులకు అనేక వివరాలను పరిశీలించి వైరుధ్యాలను సంక్షిప్తీకరించేందుకూ, విస్తరించేందుకూ, వక్రభాష్యాలు చెప్పేందుకూ, సంపూర్ణ స్వేచ్ఛ లభించింది.

నెహ్రూ పాశ్చాత్యరాజ్యాలవిధానాలను తీవ్రంగా విమర్శించడమేకాక అనేక ఇతరదేశాల నాయకులను అలీనవిధానంవైపు మరల్చి తృతీయప్రపంచానికే ఒక విశిష్టవ్యక్తిత్వం సంపాదిస్తూ వారిని సంఘటితపరచే కార్యక్రమాన్ని కూడా ఉధృతంగా ప్రారంభించాడు. కాబట్టి నెహ్రూపట్ల వారి కినుక వారి అభిప్రాయాల్లో అంతోఇంతో తొంగిచూస్తుంది.

1980 దశాబ్దంలో, అంటే చైనాయుద్ధంతరువాత 20 సంవత్సరాలకు రచించబడిన భారత చైనా యుద్ధసంబంధపరిశోధనలను కొన్నింటిని నేను జాగ్రత్తగా చదివాను. అవెంతో ఆసక్తికరమైనవిగానూ, కొన్ని కోణాలనుంచి చూస్తే ఉపయోగకరమైనవిగానూ నాకు తోచాయి. కాని వారు చేసే ఘటనానంతరవిశ్లేషణ తరచూ వెనుకచూపుపై ఆధారపడిఉందనడానికి నాకు విచారంగా ఉంది.

ఉదాహరణానికి, నెహ్రూగారికి బదులు మరెవరైనా ప్రధానమంత్రిగా ఉండి ఉన్నట్లైతే ఆయన కార్యశైలి మరొకవిధంగా ఉండేదనడం సత్యమేకావచ్చు. కాని సలహాలు స్వీకరించడంలోనూ, విధాననిర్ణయసందర్భంలోనూ ప్రధాన మంత్రే ప్రముఖపాత్ర వహించవలసి ఉంటుందనడంలో సందేహంలేదు. పరిపాలనాయంత్రాంగం ఎంత నిష్పాక్షికంగానూ, వ్యక్తినిరపేక్షంగానూ ఉన్నప్పటికీ రాజ్యసారథ్యంవహించేమనిషి వ్యక్తిత్వప్రభావం... ముఖ్యంగా ఆనాటి పరిస్థితుల్లో... తీసుకునే నిర్ణయాలపై పడక మానదనడం స్పష్టం. చైనావారు వ్యవహరించే అతినిగూఢపద్ధతుల దృష్ట్యా వారి రహస్యోద్దేశాలను నెహ్రూ ప్రభుత్వం సుసమయంలో కనుక్కో లేకపోవడంలో ఆశ్చర్యంలేదు. అంతేకాక ఆ పరిస్థితిలో మరే నాయకుడు వ్యవహరించిఉన్నట్టే నెహ్రూ వ్యవహరించాడన్న ప్రమాణపత్రంవల్ల కొత్తగా వెలుగులోకి వచ్చిన తథ్యమేదీ లేదు. ఇక చెప్పుకోవాలంటే రెండవప్రపంచయుద్ధంలో మిత్రరాజ్యాల కార్యపద్ధతిలో కనిపించిన అనేకానేక లోపాల్లాగేచైనాయుద్ధంలోభారతీయసైనికరాజకీయవ్యూహాల్లోనూ బోలెడన్ని లోపాలు దొర్లాయని నిస్సందేహంగా తేలిపోయింది. ఈతథ్యంతో పాటే 1962 యుద్ధంలో తెలిసివచ్చిన లోపాలను త్వరలోనే సవరించడం జరిగి తదితర ముఖ్యకార్యక్రమాలకు ధనం కావాలనే ఒత్తిడి ఉండినప్పటికీ దేశరక్షణసామర్థ్యాన్ని క్రమేణా పెంచడం జరిగిందన్న విషయంకూడా గమనించవలసిఉంటుంది. వాస్తవంలో 1950 నుంచే దేశరక్షణశక్తిని క్రమేపీ పెంచడం జరిగిందనీ, ఈ విషయంలో నెహ్రూపైన ప్రస్తుతారోపణ ఏమాత్రం సబబు కాదని అంగీకరించవలసిఉంటుంది.

ఐతే ఈ గతిశీలప్రపంచంలో అంతర్జాతీయసంబంధాల్లో ఏ ఒక పరిస్థితీ ఎల్లకాలం యథాతథంగా ఉండదు. యుద్ధానంతరఘట్టంలో ఇండియా, చైనా ఉభయదేశాలకూ తమ పరస్పరసంబంధాలనూ, ప్రపంచంలో తమ పాత్రలనూ పునర్నిర్వచించుకోవలసివస్తోంది. సరిహద్దు విషయంలోకూడా అంతిమ పరిష్కారం ఇంకా జరగకున్నా ఆలోచనల్లో మార్పులు వస్తున్నాయి. రాజకీయ విజ్ఞతనూ, బుద్ధికుశలతనూ అనుసరించి సరిహద్దువివాదం అంతిమనిర్ణయం జరిగేలోగా సరిహద్దుప్రాంతాలను శాంతియుతంగా ఉంచడానికి ఉభయదేశాలు ఒక ఒప్పందంచేసుకున్నాయి.

—రచయిత

# 33

చైనా దురాక్రమణవల్ల కలిగిన అఘాతంనుంచి జవహర్లాల్‌నెహ్రూ అసలెప్పటికీ కోలుకోలేకపోయారు. కొన్ని దశాబ్దాలుగా తాను ఏ లక్ష్యసాధనకోసం కృషిచేస్తూవచ్చారో దానినంతటినీ ఈ పరిణామం పూర్తిగా వమ్ముచేసినట్టు భావించారు. ఆసియాసంఘీభావసంకల్పం హఠాత్తుగా చెదిరిపోయింది. తన వినాశనంవైపు తనే మొగ్గుతున్నట్టు కనిపిస్తున్న ప్రపంచంలో మానవాళి మనుగడకోసం కలిసి నూతనమార్గాన్వేషణ సాగించే తమ న్యాయబద్ధమైనపాత్రను ఈ రెండు ప్రాచీననాగరికతాదేశాలు తలకెత్తుకోగలవని పండిట్‌జీ కంటున్న కలను ఈ ఘర్షణ భగ్నంచేసేసింది. ఆయనను ఎంతో ఉత్తేజితుణ్ణిచేస్తూవచ్చిన ఈ పాత్ర ఒకటిన్నరదశాబ్దాలపాటు భారతప్రజానీకాన్ని మంత్రముగ్ధుల్ని చేసింది. దురాక్రమణతర్వాత విషణ్ణహృదయంతో గతాన్ని నెమరువేసుకున్న నెహ్రూకు తనింతకాలం ఒక అవాస్తవికప్రపంచంలో జీవిస్తూవచ్చానని అంగీకరించవలసివచ్చింది.

దేశం ఈ అఘాతాన్ని జీర్ణించుకోడాని కెన్నోమాసాలు పట్టింది. నెమ్మదిగానే అయినా మొత్తానికి కోలుకోగలిగింది. తన వైఫల్యం వెక్కిరించిన ఆ సమయంలో నెహ్రూకి యావద్దేశం వెన్నుదన్నుగా నిలిచింది. ఎవరూ, ఏ ఒక్క నాయకుడూ జవహర్లాల్ భంగపాటును తమకు అనుకూలంగా మలచుకోలేకపోయారు. జవహర్లాల్‌కు తను దీటైన ప్రత్యామ్నాయం కాగలనని ఏ ఒక్క నాయకుడూ ప్రజల్ని నమ్మించలేకపోయాడు. అదీగాక, ఇటువంటి తాత్కాలిక గ్రహణాలు ప్రజలపై ఏ విధంగానూ నిర్ణయాత్మక ప్రభావం చూపలేనంతగా వారు జవహర్లాల్‌ను ప్రేమిస్తూ వచ్చారు. ఒక చెదురుమదురుఘటనలో ఆయన విజయుడైతే ఎంత, ఓటమి నెదుర్కొంటే ఎంత, పండిట్‌జీ పండిట్‌జీయే.

అయినా జరగవలసిన నష్టం జరిగిపోయింది. 1962 పరాజయంతో భారతదేశప్రతిష్ఠ చాలావరకు దిగజారిపోయింది. ఆర్థికాభివృద్ధిపట్ల ఏకాగ్రత సడలిపోయింది. యుద్ధంలో జయాపజయాలగురించిన నిరంతరధ్యాస లోలోపల అణగిఉన్న వెనకటి అభిప్రాయాలను మేలుకొలిపింది. భారతదేశం తన సుదీర్ఘచరిత్రలో ఎన్నడూ ఏ కీలకయుద్ధంలోనూ విజయం సాధించలేదన్న విషయాన్నిప్రజలకు గుర్తుచేసింది. అన్ని యుద్ధాలలోనూ భారతదేశం ఓటమినే ఎదుర్కొంటూ వచ్చింది. ఈ దౌర్బల్యానికి ఈ దేశంలోని వేదాంతధోరణీ వారసత్వాలే పునాది అని ఎందరో వ్యాఖ్యానించడం ప్రారంభించారు.

అనంతరకాలంలో ప్రతిచర్యలోనూ తొట్రుపాటు, అసంబద్ధత తొంగిచూడసాగాయి. ప్రజలు నెహ్రూమాటల్ని ఎప్పటి గౌరవంతోనే వినిపించుకుంటున్నారు కానీ, ఆచరణలో వెనకటంత శ్రద్ధ ఇప్పుడు లేదు. తన ఉద్దేశాలను అమలుచేయించగలస్థితిలో ఆయన లేరు. క్షీణిస్తున్న ఆయన ఆరోగ్యం సమస్యను మరింత జటిలంచేసింది. అనారోగ్యంవల్ల ఆయన ఇప్పుడు దేనిమీదా దృష్టి లగ్నంచేయలేకపోతున్నారన్న వదంతులు వ్యాపించాయి. తగిన మార్గదర్శనం అందించడంలో ఆయన విఫలుడౌతున్నారు. ఆయననుంచి ఆదేశాలు స్వీకరించడానికి ఏర్పాటు చేసిన భారతదౌత్యాధికారులసమావేశంలో ఆయన కునికిపాట్లుపడ్డారనీ, అది అందరినీ ఇబ్బందిపెట్టి నిరాశకు లోనుచేసిందనీ చెప్పుకున్నారు. మొత్తానికి ప్రభుత్వం దారితప్పి ఎటెటో సాగిపో తున్నట్టే అనిపించింది.

ఈ పరిణామాల నేపథ్యంలోనే కామరాజ్ పథకం వచ్చింది. కేంద్రంలో నెహ్రూకి అత్యంత సన్నిహితులైన కొద్దిమంది బుర్రలో అంకురించిన ఆలోచన అది. బహుశా అది అనంతర కాలాల్లోకూడా నిలిచిపోగల ఒకానొక వివాదాన్ని మొదటిసారి రేకెత్తించింది. అప్పటి కెంతో కాలంగా దాదాపు ప్రతిభావంతులైన నాయకులందరినీ కేంద్ర, రాష్ట్రప్రభుత్వాల్లోకి తీసుకోవడం జరుగుతోంది. ఎన్నికల్లో గెలవలేకపోయినవారినీ, ఏదో ఒక కారణంవల్ల ప్రభుత్వంలోకి తీసుకో లేకపోయిన వారినీ పార్టీపదవుల్లో నియమించడం జరుగుతోంది. ఇందులో మినహాయింపులనేకం లేకపోలేదు కానీ, మొత్తంమీద సరళి ఇదే. రాష్ట్రాల ముఖ్యమంత్రులు, కేంద్రంలోని మంత్రులతోసహా పార్టీలోని ముఖ్యనాయకులను ప్రభుత్వంనుంచి తప్పించి, పార్టీపనులు వారికి అప్పగించాలని కామరాజ్‌పథకం సూచించింది. ఈ బదిలీవెనుకగల అవసరమూ, హేతుబద్ధతా ఎటువంటివో స్పష్టమౌతూనే ఉన్నాయి. అయితే చివరకు జరిగిందేమిటంటే, ప్రభుత్వంనుంచి తొలగించ బడినవారు, పార్టీపనుల్ని ఏమాత్రమైనా చక్కబెట్టగల సమర్థులు కారు. అందరూ చేవచచ్చినబాపతు.

వాళ్ళలో చాలా మందిని పార్టీ పనుల్లో నియమించడమూ జరగలేదు. ఆ విధంగా కామ రాజ్‌పథకం పైకిచెప్పుకున్న ప్రయోజనంకోసం కాక, మరేదో ప్రయోజనంకోసం అమలు జరిగినట్టు కనిపించింది. దాంతో ఆ పథకం చాలావరకూ విశ్వసనీయతను కోల్పోయింది. ఈ లొసుగు ఒక్కసారి పైకితేలేసరికి విపరీతమైన ఊహాగానాలూ, వ్యాఖ్యలూ వ్యాపించి నష్టాన్ని తీవ్రతరంచేశాయి. నెహ్రూవారసత్వాన్ని ఒక నిర్దిష్టదిశలో నడిపించడమే ఈ పథకరచయితల ఉద్దేశమని ఎందరో విశ్వసించడం ప్రారంభించారు. దీనితోపాటే, వారసుడి నియామకం త్వరలోనే జరగబోతున్నట్టూ అర్థంచెప్పుకున్నారు.

కామరాజ్‌పథకం మొదటిసారి వెల్లడైనప్పుడు, అది ఎవరి పేర్లనూ ప్రస్తావించలేదు. ఎంత మందిమీద వేటుపడబోతోందోకూడా చెప్పలేదు. ఎంచుకునే అధికారాన్ని ప్రధానమంత్రికే అప్పగించారు. దేశమంతటా ఊహాగానాలు చెలరేగాయి. రాజకీయవ్యాఖ్యాతలకూ పత్రికల వారికీ కొన్నిరోజులపాటు చేతినిండా పనిదొరికింది. ఎక్స్ అనే ముఖ్యమంత్రి తొలగించదగినవాడని ఒక పత్రిక అభిప్రాయపడగానే, గతంలో పార్టీకి అతడందించిన సేవలను ఏకరువుపెడుతూ త్వరలోనే ఆ పత్రికలో విజ్ఞతాయుతమైన సంపాదకీయం వెలువడుతుంది. ఒకవేళ అంతటి గతచరిత్ర లేకపోయినా సరే, 'ఎక్స్' ముఖ్యమంత్రి పార్టీపనులకు అద్భుతంగా సరిపోతాడని

విజ్ఞుడైన ఆ సంపాదకమహాశయుడు నిర్ధారణచేసేస్తాడు. కామరాజ్‌పథకంప్రకారం ఆ ముఖ్యమంత్రిని బదిలీచేయాలని సంపాదకీయం నొక్కి చెబుతుంది. కొన్నిరోజులపాటు ప్రభుత్వకార్యాలయాల్లో పనులన్నీ స్తంభించిపోతాయి. చర్చోపచర్చల ఉధృతితో సచివాలయాలు మారుమోగుతూ ఉంటాయి.

చౌదరి ఇందుకు మినహాయింపు కాదు. మొట్టమొదట నిష్క్రమించబోతున్నది చౌదరేనన్న మాటను ప్రచారంచేయడంలో మహేంద్రనాథ్‌శిబిరం దొరికిన సమయాన్ని కొంచెంకూడా వృథా చేయలేదు. ప్రధానమంత్రి పార్టీవ్యవహారాల్లో చౌదరిని విశ్వసించినంత గాఢంగా మరెవరినీ విశ్వసించరని వాళ్ళు ఉద్ఘాటించారు. అసలు కామరాజ్‌పథకం వచ్చిందే చౌదరికి పార్టీపని అప్పగించడానికనికూడా వారనడం ప్రారంభించారు. మరికొందరుకూడా ఈ పథకంలోకి వస్తే రావచ్చు, వారెలాగూ పనికిరానిసరుకుకావడం అందుకు ప్రథమకారణమైతే, ఎంతో ఉన్నతంగా ధ్వనించే ఈ పథకాన్ని కేవలం ఒకేఒక వ్యక్తికోసం ప్రవేశపెట్టడం ప్రధానమంత్రికి ఇష్టం లేదన్నది రెండో కారణం. లేదు సార్, మీరలా అంటే ఈ చౌదరిగాడికి లేనిపోని ప్రాముఖ్యం తెచ్చిపెట్టినట్టవుతుంది... కనుక మరోలా చెప్పుకుందాం .. పనికిరానిమూకను ప్రభుత్వంనుంచి తప్పించడమే కామరాజ్‌పథకం వాస్తవికలక్ష్యం కనుక చౌదరిని ఆ పథకంనుంచి మినహాయించడం జరిగేపనికాదని ప్రత్యేకించి చెప్పవలసిన అవసరమే లేదు... మహేంద్రనాథ్‌వర్గానికి కావలసింది చౌదరి నిష్క్రమణమాత్రమే, అతడెలా, ఏ కారణాలమీద నిష్క్రమించబోతున్నాడన్నది వాళ్ళ కనవసరం.

ఈ ఊహాగానంతోపాటే కాబోయే ముఖ్యమంత్రి ఎవరన్న ప్రశ్నా పొడుచుకొచ్చింది. ముఖ్యమంత్రి కావాలనుకునేవారు చాలామందే ఉన్నారు. అంటే, ఎందరో విలేఖరులకు వ్యక్తిగతంగా ఎంతో అదృష్టం కలిసొచ్చిందన్నమాట. డిన్నర్లు (నోరు తడిపేవే అనుకోండి), లంచ్‌లు, రకరకాల మందాల్లో ఉండి ఒకచేతినుంచి మరోచేతికి మారే అంతుచిక్కని చిన్నచిన్న కవర్లు... ఒక్కమాటలో చెప్పాలంటే వాళ్ళ కదంతా ఓ అద్భుతం. వారినుంచి ఆశించే ప్రత్యుపకారం అంత ప్రమాదకరమూ కాదు, అంత ప్రముఖమైనదీ కాదు. వాళ్ళు రాయవలసిందల్లా ఒక్కటే... 'ఎ' అనేవాడు చౌదరికి వారసుడు కాగలిగినప్పుడు, 'బి', 'సి' కూడా అవుతారు, అంతే. ప్రస్తుత ముఖ్యమంత్రికి నిజంగా ఎవరు వారసులౌతారన్న ప్రశ్నతో ఆ కాలమిస్ట్‌కు పనిలేదు. వేర్వేరు వ్యక్తులగురించి వేర్వేరు రోజుల్లో రాయగల సమర్థుడతడు. కొందరు కొమ్ములు తిరిగిన జర్నలిస్టులైతే ఒక్కొక్కరిలోని ప్రతికూలలక్షణాలనే నర్మగర్భంగా ఎత్తిచూపిస్తూ, చివరకు అందరూ సమానంగా పనికిమాలిన వాళ్ళే కనుక ఎంపిక మరింత కష్టసాధ్యమని తేల్చివేసి ఆ విధంగా ఎందరో అభ్యర్థుల అవసరాలను ఏకకాలంలో తీర్చగలిగారు... తమ జేబుల్లోంచి ఉదారంగా తీసిఇవ్వలేకపోయిన ఆశాజీవులకు లభించే పత్రికలమద్దత్తు ఇంతమాత్రమే. కాగల అభ్యర్థులు త్వరలోనే ముసుగుప్రచారం విరమించి ప్రత్యక్షంగా ఒకరిపైఒకరు దాడికి దిగిపోయారు. ప్రతిఒకడూ, దిగ్భ్రాంతికలిగించేలా ఉన్న మిగిలినవాళ్ళ దుర్లక్షణాలను చిత్రించే కథలను తవ్వితీయడం మొదలుపెట్టాడు. మరోసారి పత్రికలు కట్లుతెంచుకుని విజృంభిం చేశాయి.

కనుచూపుమేరలో అధికారం ఊరిస్తున్నప్పుడు మీనమేషాలు లెక్కబెడుతూ ఎవరూ కూర్చోలేరు. మహేంద్రనాథ్, చౌదరి ఇద్దరూ సమాన అభినివేశంతో తమ అనుచరశ్రేణిని ముందుకు నడిపించారు. అదంతా ఓ సంకులసమరం.

ఈ ఉద్రిక్తపరిస్థితి అనేకరోజులు కొనసాగిన తర్వాత, కామరాజ్‌పథకంకింద వేటుపడిన వ్యక్తులపేర్లు వెల్లడయ్యాయి. ఆ జాబితాలో చౌదరిపేరు లేకపోవడంతో కథ పతాకసన్నివేశం నుంచి అమాంతం పాతాళానికి జారిపోయినట్లయింది. అక్కడినుంచి మరో విడత ఊహాగానాలూ, వ్యాఖ్యలూ మొదలయ్యాయి. రాష్ట్రసారథ్యంలో చౌదరి అవసరం ఎంతో బలవత్తరమనడానికి దీనిని, ఓ నిదర్శనంగా అతడివర్గం ఎత్తిచూపించింది. పార్టీవ్యవహారాల్లో చౌదరిలాంటి పుండాకోరును పండిట్‌జీ ఎలా విశ్వసించగలరులే అంటూ మహేంద్రనాథ్‌వర్గం ఈ వాదాన్ని తిప్పికొట్టింది. ఆపైన, ఢిల్లీలో 'కోట్లు' కుమ్మరించి మరీ చౌదరి ముఖ్యమంత్రిపదవిని నిలుపుకున్నాడని, 'అత్యంత విశ్వసనీయవర్గా'లను ఉటంకిస్తూ ప్రచారం సాగించింది. అయితే ఆ కోట్లు ఎవరికి చెల్లించారో వివరించినవారు లేకపోయారు.

కామరాజ్‌పథకం అంతిమంగా సాధించింది శూన్యం. కామరాజ్ పార్టీ అధ్యక్షుడు కావడం మినహా, పార్టీ పనుల్ని తలకెత్తుకున్నవారు మరెవరూ లేకుండాపోయారు. ఎవరో కొద్దిమంది తొలగింపు తప్పించి పథకం మొత్తంమీద బావుకున్నదేమీ లేదు. ఉద్వాసితులను చూసి ఎవరూ కంటతడిపెట్టకపోయినా అది అమలుజరిగినవిధానంమాత్రం విమర్శలకులోనైంది. దేశాన్ని తప్పుదారిపట్టించారన్న అభిప్రాయానికి తావిస్తూ చివరకు పండిట్‌జీ విశ్వసనీయతే దెబ్బతినిపోయింది. జవహర్లాల్‌సరళిని ఇదేమాత్రం అనుసరించలేదని ఎందరో వ్యాఖ్యానించారు.

నిజానికి, చైనాతో ఎదురైన ఓటమికి ఆయన బాధ్యుడుకాడన్నంత గాఢంగా ప్రజలు జవహర్లాల్‌ను ప్రేమించారు. నమ్మకద్రోహానికి బలైన ఓ బాధితుడుగానే ఆయనను పరిగణించారు. అయినప్పటికీ తనపాదాలకింద నేల కదిలిపోతున్న విషయాన్ని జవహర్లాల్ స్పష్టంగా గ్రహించగలిగారు. పార్టీప్రతిష్ఠ మున్నెన్నడూ లేనంతగా కుంగిపోయింది. పండిట్‌జీ జీవితకాలంలోనే ఇలా జరుగుతుందని ఎవరూ ఊహించలేకపోయారు, చివరకు పండిట్‌జీకూడా అనుకోని విషయమది. కామరాజ్ అధ్యక్షతన జరిగిన పార్టీప్లీనరీసదస్సు 'సోషలిస్టునమూనా వ్యవస్థ' అన్న వెనకటిలక్ష్యం (ఇదంత ప్రజాదరణ పొందలేదు) స్థానంలో 'సోషలిజం' అన్న కొత్త లక్ష్యాన్ని ఆమోదించింది. పాతలేబిల్‌కీ, కొత్తలేబిల్‌కీ ఉన్న తేడాను చాలామంది అర్థంచేసుకోలేకపోయారు. సభ్యులు ఈ మార్పుకు తలలూపారు. ఈ మార్పుపై పార్టీశ్రేణుల్లో ఎటువంటి ఆలోచన జరిగిన దాఖలాలు అంతగా కనిపించలేదు.

సదస్సు మధ్యలో జవహర్లాల్ గుండెపోటుకు లోనయ్యారు —కొందరది స్వల్పమైనదన్నారు, మరికొందరు తీవ్రమైనదేనన్నారు. ఎలాగైతేనేం, గుండెపోటు నిజం. సోషలిజాన్ని ఆమోదించడం ద్వారా లక్ష్యానికి మెరుగుదిద్దినందుకు పార్టీలో అంతటా వెల్లివిరుస్తాయనుకున్న ఉత్తేజాన్నీ, ఉత్సాహాన్నీ ఈ విషాదకరపరిణామం చాలావరకూ కమ్మివేసింది. సదస్సు జరిపిన రాజకీయప్రయత్నమంతా నిరర్థకం కాబోతున్నట్టే కనిపించింది.

ప్రత్యేకించి రాష్ట్రస్థాయిలో, మౌలికసూత్రాలపట్ల నిర్లక్ష్యం ఎంత దారుణమంటే, సోషలిజాన్ని పార్టీ సిద్ధాంతంగా ఆమోదించిన కొద్దివారాలకే దానిని అందరూ మరిచిపోయినట్టే కనిపించారు... ఇది ఆనంద్‌కు దిగ్భ్రాంతి కలిగించింది. తనకు సంబంధించినంతవరకూ వ్యవస్థలో సమూల మైన పరివర్తన తీసుకురాగల సిద్ధాంతాన్ని దాని సంపూర్ణరూపంలో పార్టీ ఆమోదించడం తనను వినమ్రుణ్ణిచేస్తూ తను తీసుకునే ప్రతి నిర్ణయంపై తనను లోతైన ఆలోచనకు పురిగొల్పుతున్న ఒక ముఖ్యాంశం. ఏదైనా ఒక ఫైలు పరిష్కారానికి తనముందుకు వచ్చినప్పుడు తనలోపల ఏదో మథనంజరిగి 'నీ నిర్ణయం సోషలిజం అభిమతానికి అనుగుణంగానే ఉండబోతోందా? నీవు తీసుకుంటున్న పరిపాలనాసంబంధమైన ప్రతిఒక్కచర్య ఈ నూతనసిద్ధాంతానికి తగినట్టే ఉందా? ప్రభుత్వమూ, పార్టీ చేపట్టే ప్రతి ఒక్క చర్యలో తన సైద్ధాంతిక నిబద్ధత ప్రతిబింబించక పోతే పార్టీలక్ష్యాలను నువ్వెలా అమలుచేయగలవు?' అని అడుగుతున్నట్టనిపించేది. పార్టీలో మరెందరో నూతనలక్ష్యంపట్ల ఇటువంటి స్పృహతోనే వ్యవహరిస్తున్నా, అతడి సహచరులలో కొందరుమాత్రం దాని సవిమర్శకప్రాముఖ్యాన్ని గ్రహించలేకపోయారు.

సిద్ధాంతపరివర్తనకు తగినట్టుగా ప్రభుత్వకార్యక్రమాల్లోనూ, వాటిని అమలుచేసే పద్ధతుల్లోనూ మార్పురావలసిఉంటుందని వారు విశ్వసించలేకపోయారు... చాలామంది ఎప్పటిలానే తమ తమ వ్యవహారాల్లో మునిగిపోయారు. మహేంద్రనాథ్, చౌదరి యథావిధిగా తమ కుమ్ములాట కొనసాగించారు. అలాగని మధ్యలో పోరు విరమించారని కాదు; వాళ్ళ పోరాటం ద్విగుణీకృతశక్తిని పుంజుకోవడమే ఇప్పుడు జరిగింది. వారిద్దరూ ఒకేపార్టీవారంటే ఒకపట్టాన నమ్మశక్యంకాదు. ప్రతిరాజకీయఘటననీ ఒకరిపై ఒకరు దాడిచేసుకోడానికి అందొచ్చిన అవకాశంగానే వారు వినియోగించుకున్నారు.

నూతనసిద్ధాంతాన్ని స్వీకరించిన ప్రారంభదినాల్లో జరిగిన అటువంటి ఘటనల్లో ఒకటి, శాసనమండలి ద్వైవార్షికఎన్నికలసందర్భంగా సంభవించింది.

★ ★ ★

భారతదేశంలోని మిగిలిన పెద్దరాష్ట్రాల్లో ఉన్నట్టే అఫ్రోజాబాద్‌లోకూడా రెండుచట్టసభల వ్యవస్థ ఉంది. ఎగువసభగా, లేదా సెకండ్‌ఛాంబర్‌గా పిలవబడే శాసనమండలి, భారతపార్ల మెంటరీవిధానంలో అంతర్భాగంగా ఉన్న రాష్ట్రస్థాయిలోని శాసనవ్యవస్థలో ఒక ముఖ్యాంగం. వివిధ ప్రయోజనాపేక్షకులైన ముఖ్యసామాజికవర్గాలు; రాష్ట్రగవర్నర్ నిర్దిష్టసంఖ్యలో నియమించిన వైద్యనిపుణులు, ఆర్థికవేత్తలు, శాస్త్రవేత్తలు, న్యాయశాస్త్రనిపుణులు, ఇంజినీర్లు, విద్యావేత్తలు, సాహిత్యవేత్తలవంటి మేధావులూ, వృత్తివిశారదులూ ప్రాతినిధ్యంవహించే కుదిమట్టపు వ్యవస్థ శాసనమండలి. ఉపాధ్యాయులు, పట్టభద్రులు, స్థానికసంస్థల ప్రతినిధులువంటి రాష్ట్రంలోని ప్రత్యేకప్రయోజనాపేక్షితవర్గాలు ప్రత్యేకంగా విభజించిన నియోజకవర్గాలలో వోటర్లుగా ఉండి నిర్దేశించిన కోటాలో శాసనమండలికి తమతమ సభ్యుల్ని ఎన్నుకుంటారు.

శాసనసభ (దిగువసభ) అటువంటి నియోజకవర్గాల్లో ఒకటి. అందులోని సభ్యులు (ఎం.ఎల్.ఏలు) నిర్ణీతసంఖ్యలో సభ్యుల్ని (తాముకాక మిగిలినవారిని) శాసనసమండలికి ఎన్ను

కుంటారు. ఎగువసభలో వివిధబృందాల అమరిక స్థూలంగా ఇలా ఉంటుంది. శాసనసభకున్న శాసనాధికారాలే శాసనమండలికీ ఉంటాయి. ప్రతిబిల్లూ ఉభయసభల ఆమోదంపొంది, గవర్నర్ అనుమతికూడా పొందినతర్వాతే చట్టమవుతుంది. మనీబిల్లులు, బడ్జెట్, పన్నులప్రతిపాదనల వంటి అంశాలపై మాత్రమే శాసనమండలి వోటువేయజాలదు. అయితే ఇక్కడ గమనించ వలసిన ముఖ్యాంశం, హోదాలో ఎగువసభ సభ్యుడికీ, దిగువసభ సభ్యుడికీ మధ్య ఎటువంటి తేడా లేకపోవడం. నామినేటెడ్‌సభ్యులు మినహా శాసనమండలిలోని ఏ సభ్యుడినైనా మంత్రివర్గంలోకి తీసుకోవచ్చు. అందుకే పదవికోసం పాకులాడేవాళ్ళకు మండలిసభ్యత్వం ప్రయత్నయోగ్యంగానే కనిపిస్తూఉంటుంది. ఇక ఆ ప్రయత్నం బహుముఖంగానూ, ఎంతో ఆకర్షకంగానూ ఉంటుందని ప్రత్యేకించి చెప్పుకోవలసిన అవసరమే లేదు.

చిట్టచివరివర్గంతో అంటే, ఎం.ఎల్.ఏలతో జరిగే ఎన్నిక దామాషాప్రాతినిధ్యవిధానంలో, బదలాయింపుకు అవకాశం ఉన్న ఒకేఒక వోటుతో (సింగిల్ట్రాన్స్‌ఫరబుల్ వోట్) జరుగుతుంది. మనకు తెలిసిన సింపుల్‌మెజారిటీపద్ధతికి ఇది భిన్నంగాఉంటుంది కనుక, ఏ ఉద్దేశంతో దీనిని ఎన్నికలప్రక్రియలో ప్రవేశపెట్టారో, క్రమంగా ఇది చాలావరకు ఎలా దుర్వినియోగమౌతూ వచ్చిందో తెలుసుకోడానికి కనీసం కొన్ని ముఖ్యాంశాలనైనా అర్థంచేసుకోవడం అవసరం.

ఒకనియోజకవర్గం నుంచి ఒకే సమయంలో ఒకరినిమించి అభ్యర్థులను ఎన్నుకోవలసి వచ్చినప్పుడు ఈ పద్ధతి ఉపయోగపడుతుంది. ఉదాహరణకు పోటీలోఉన్న ముగ్గురుఅభ్యర్థులలో ఇద్దరిని ఎన్నుకోవలసివచ్చినప్పుడు, వారిలో ఒకరికి యాభైఒక్కశాతం వోట్లుకనకవస్తే అతడు ఎన్నికైనట్లు అప్పటికప్పుడు ప్రకటించవచ్చు. అప్పుడు రెండోసీటుకి మిగిలిన ఇద్దరిమధ్య, ఫలితాన్ని ఎటూ తేల్చలేనిపరిస్థితి ఉత్పన్నమౌతుంది. కాని ముగ్గురిలో ఏ ఒక్క అభ్యర్థీ సొంతంగా యాభైఒక్కశాతం వోట్లు తెచ్చుకోలేనప్పుడు ఏ ఇరువురైనా కలిసి మూడోవ్యక్తిని ఓడించ గలుగుతారు. వాళ్ళలో ఏ ఇరువురిని ఎలా కలపాలి? దామాషాప్రాతినిధ్యవిధానంలో ఇక్కడే వోటర్లకు ద్వితీయప్రాధాన్యాన్ని ఎంచుకునే అవకాశం లభిస్తుంది. రాజకీయపక్షాలు, అల్పసంఖ్యాకబృందాలు ఎన్నికలఫలితంలో తమ తమ సంఖ్యాబలం, సింపుల్‌మెజారిటీపోల్‌లో కంటె నిర్దుష్టంగా ప్రతిబింబించాలనుకున్నప్పుడు ఈ సూత్రం ఉపయోగపడుతుంది.

ఈ విధానం చూచాయగా ఈ క్రింది పద్ధతిలో పనిచేస్తుంది. ఏదైనా శాసనసభలో ఎం.ఎల్.ఏల మొత్తం సంఖ్యాబలం 122 అనుకుందాం. పోలింగ్‌రోజున వాళ్ళలో ముగ్గురు గైరుహాజరయ్యారు, 119 మంది వోటింగ్‌లో పాల్గొన్నారు; ఈ 119 వోట్లలోనూ ఏదో ఒక కారణంతో రెండువోట్లు చెల్లలేదనుకుందాం. మిగిలిన 117 చెల్లినవోట్లు. వీరంతా కలిసి శాసనమండలికి అయిదుగురు సభ్యుల్ని ఎన్నుకోవలసిఉండగా, ఎన్నికలో మొత్తం తొమ్మిదిమంది అభ్యర్థులు ఎ, బి, సి, డి, ఇ, ఎఫ్, జి, హెచ్, ఐ నిలబడ్డారనుకుందాం... ప్రతివోటరు (ఎం.ఎల్.ఏ)కీ అభ్యర్థులపేర్లను అక్షరక్రమంలో ముద్రించిన బ్యాలెట్‌పత్రం ఇస్తారు. నిబంధనలప్రకారం ప్రతివోటరు తన ప్రాధాన్యాన్ని (ప్రిఫరెన్స్) అనుసరించి అభ్యర్థులపేర్లకు ఎదురుగా 1, 2, 3, 4, 5 ... ఇలా అంకెలు సూచించాలి. అతడు తన ఇష్టానుసారం 1ని మాత్రమే (ఒకే ఒక అభ్యర్థి, ఫస్ట్‌ప్రిఫరెన్స్) సూచించవచ్చు లేదా 1, 2 (ఫస్ట్‌ప్రిఫరెన్స్, సెకండ్‌ప్రిఫరెన్స్) సూచించి మిగిలినవారిని

విడిచిపెట్టవచ్చు, అంటే ఇటువంటి వోటింగ్‌లో ఆయా అభ్యర్థులకు 1, 2, 3 వగైరా ప్రిఫరెన్స్‌లకు సంబంధించి ఆయా నెంబర్లు లభిస్తాయన్నమాట.

ఒక అభ్యర్థి ఎన్నికైనట్టు ప్రకటించడానికి అతడికి రావలసిన ఫస్ట్‌ప్రిఫరెన్స్‌వోట్ల కనీస సంఖ్యను (దీనిని కోషంట్ లేదా కోటా అని పిలుస్తారు) నిర్ణయించడానికి ఒక విధానం పాటిస్తారు. లెక్కింపుకువీలుగా చిల్లరఅంకెల్ని తొలగించడానికి ప్రతిబ్యాలెట్ విలువను 100గా నిర్ణయిస్తారు. ఎన్నికకావలసిన అభ్యర్థులసంఖ్యకు ఒకటి కలుపుకుని అలా వచ్చిన అంకెతో పోలై, చెల్లిన వోట్ల సగటువిలువను భాగించాలి. శేషం ఉంటే విడిచిపెట్టి దానికి ఒకటి కలుపుకుంటే కోటా సంఖ్య వస్తుంది. ప్రస్తుత ఉదాహరణలో, 117 (చెల్లినవోట్లు)ను 100తో హెచ్చించాలి, 117X100= 11700; దీనిని 5+1 = 6తో భాగించాలి, అప్పుడు 1950 సంఖ్య వస్తుంది. ఈ కోషంట్‌కు ఒకటి కలిపి, ఈ ఎన్నికకు కోటాసంఖ్య 1951 అని ప్రకటించడం జరుగుతుంది.

ఉన్నవి అయిదుఖాళీలేకనుక ఎన్నికలో నిలబడిన తొమ్మిదిమందినీ ఎన్నుకోవడం సాధ్యం కాదన్నది స్పష్టమే. పోటీలో ఉన్న ఎ, బి, సి, డి, ఇ, ఎఫ్, జి, హెచ్, ఐ అనే తొమ్మిదిమంది అభ్యర్థులలో, 'సి', 'ఎఫ్'లకు పోలైన వోట్ల విలువ కోటానుమించి అంటే 1951ని మించి ఉందనుకుందాం. ఉదాహరణకు 'సి'కి వచ్చిన వోట్లవిలువ 2100 అనీ, 'ఎఫ్'కు వచ్చిన వోట్ల విలువ 2462 అనీ అనుకుందాం. నిజానికి వాళ్ళకి కోటావిలువకలిగినవోట్లు, అంటే 1951 వోట్లు వస్తే సరిపోతుంది. కానీ 'సి'కి 149 విలువకలిగిన వోట్లు, 'ఎఫ్'కు 511 విలువకలిగిన వోట్లు అదనంగా వచ్చాయి. ఈ అదనపువోట్లు ఏమౌతాయి? సింపుల్‌మెజారిటీఎన్నికలో ఆ వోట్లు వ్యర్థమవడమేతప్పించి పార్టీకి కానీ, గ్రూపుకు కానీ ఎటువంటి అదనపు ప్రయోజనం కలిగించవు. సింగిల్‌ట్రాన్స్‌ఫరబుల్‌వోటుకు అవకాశమిచ్చే దామాషాప్రాతినిధ్యఎన్నికలో ఈ అదనపు వోట్లను మిగిలిన పార్టీఅభ్యర్థులకు, అంటే 2, 3, 4, వగైరా ప్రిఫరెన్స్‌లు తెచ్చుకున్న అభ్యర్థులకు బదిలీచేయవచ్చు. ఈ విధంగా పార్టీఅభ్యర్థులు దామాషాకన్న అదనంగా మిగిలిన ఇతరపార్టీ అభ్యర్థులవోట్లను పంచుకోగలుగుతారు. మొదట ఎక్కువ విలువ కలిగిన మిగులు వోట్లను, ప్రస్తుత సందర్భంలో 'ఎఫ్' తెచ్చుకున్న 511 వోట్లను బదిలీచేయవలసిఉంటుంది. 'ఎఫ్'కు ఫస్ట్‌ప్రిఫరెన్స్‌వోటు ఇచ్చినవారిలో ముగ్గురువోటర్లు 'డి' అభ్యర్థికి రెండో ప్రిఫరెన్స్ వోటును సూచించారనుకుందాం. అప్పటికే 'డి' తనంతటతానే 1600 విలువ కలిగిన ఫస్ట్‌ప్రిఫరెన్స్‌వోట్లు తెచ్చుకున్నాడనుకుందాం. అప్పుడు 1951 కోటాను చేరుకోడానికి 'డి'కి 'ఎఫ్'తెచ్చుకున్న 511 మిగులువోట్లనుంచి 351 వోట్లు అవసరమౌతాయి. మిగిలిన అదనపువోట్ల విలువను (511-351 = 160), అప్పటికే 1400 విలువగల ఫస్ట్‌ప్రిఫరెన్స్‌వోట్లతో వెనకబడిఉండి, 3వ ప్రిఫరెన్స్‌వోట్లను తెచ్చుకున్న అభ్యర్థి 'ఎ'కి బదిలీచేయవలసిఉంటుంది. అప్పుడు 1951 కోటాసంఖ్యను చేరుకునే ప్రయత్నంలో 'ఎ' (1400+160 =) 1560 విలువగలవోట్లకు చేరుకోగలుగుతాడు.

ఈ విధంగా వోటర్ల ప్రిఫరెన్స్‌సూచన ననుసరించి ఆయా అభ్యర్థులు తెచ్చుకున్న మిగులు వోట్లను ఇతరఅభ్యర్థులకు బదిలీచేయడం జరుగుతుంది. పార్టీ చీఫ్‌విప్ ఆదేశాలపైన సొంత

పార్టీఅభ్యర్థుల విషయంలోనూ, లేదా భావసారూప్యంగల వేరేపార్టీఅభ్యర్థుల విషయంలోనూ ఇలా ప్రిఫరెన్స్‌ను గుర్తించడమనేది సాధారణంగా జరుగుతూఉంటుంది.

ఈ విధంగా మిగులువోట్లు బదిలీ అయినతర్వాత, వీటితోసహా అభ్యర్థులూ, వాళ్ళు తెచ్చుకున్న వోట్ల జాబితా తయారవుతుంది.

పైన పేర్కొన్నవిధంగా ఎఫ్, సి, డి అనే ముగ్గురుఅభ్యర్థులూ కోటావోట్లు తెచ్చుకుని ఎన్నికయ్యారనుకుందాం. మిగిలిన ఆరుగురు అభ్యర్థులూ తాము సొంతంగా తెచ్చుకున్న వోట్లవిలువనూ, బదిలీవోట్లవిలువనూ కలుపుకున్నప్పటికీ కోటాపరిమితికి దిగువనే ఉండిపోతారు. అప్పుడు అతితక్కువవిలువగలవోట్లు తెచ్చుకున్న అభ్యర్థితో తొలగింపు ప్రక్రియ మొదలవుతుంది. ఇందుకు ఉదాహరణగా 'జి' అనే అభ్యర్థిని తీసుకుందాం. 'జి' అనే అభ్యర్థి సొంతంగానూ, మిగులువోట్లేమైనా ఉంటే వాటితోసహా 840 విలువగల వోట్లు పొందాడనుకుందాం. ఇతడి బ్యాలెట్ పత్రంలో గుర్తించిన ప్రిఫరెన్స్‌ను అనుసరించి ఈ వోట్లను మళ్ళీ ఇతర అభ్యర్థులకు బదిలీ చేయడం జరుగుతుంది. ఈ ఎనిమిదిమందిలోనూ ముగ్గురు 'ఎఫ్'కు రెండోప్రిఫరెన్స్‌వోటును గుర్తించారనుకుందాం; 'ఎఫ్' ఎన్నిక అప్పటికే జరిగిపోయింది కనుక, అతడికి ఈ వోట్ల అవసరం లేదు. అప్పుడు 'జి' బ్యాలెట్‌పత్రంలో మూడవప్రిఫరెన్స్‌వోటు పొందిన అభ్యర్థికి ఈ వోట్లను బదిలీచేస్తారు. ఈ అభ్యర్థి ఆ వోట్లతో కోటావోట్లస్థాయికి చేరుకోగల డనుకున్నప్పుడే వాటిని అతడికి బదిలీచేస్తారు. అయిదుగురు అభ్యర్థులూ కోటాస్థాయికి చేరుకునేవరకూ ఈ ప్రక్రియ కొనసాగుతుంది. రకరకాల సంఖ్యాబలాలు కలిగిన వివిధపార్టీలకు ప్రాతినిధ్యంవహించే ఈ అయిదుగురూ ఎన్నిక కాగా, మిగిలిన నలుగురుఅభ్యర్థులూ ఓడిపోతారు.

ఈ విధంగా దామాషాప్రాతినిధ్యవిధానంలో ఒకపార్టీకి, లేదా గ్రూపుకీ చెందిన వోట్లను, ఆ పార్టీ, ఆ గ్రూపు ప్రయోజనానికే పూర్తిగా వినియోగించుకోడానికి వీలు కలుగుతుంది. ఎక్కడెక్కడ వోట్లు పోలైనప్పటికీ మొత్తంమీద అవి నియోజకవర్గంలోని అన్నిభాగాలనుంచి వచ్చినవే అవుతాయి. సాధారణంగా వాడుకలో ఉన్న సింపుల్‌మెజారిటీఎన్నికవిధానంలోకంటె ఈ విధానంలో అంతిమఫలితం వోటర్ల వాస్తవిక అభిమతాలకు అతిసన్నిహితంగా ఉంటుంది. అదే ఈ విధానంలో ఇమిడిఉన్న సుగుణమూ, ప్రయోజనమూ. సరళమైన ఒక ఉదాహరణతో రేఖామాత్రంగా ఇచ్చిన సంక్షిప్తవివరణమాత్రమే ఇది. ఇద్దరు అభ్యర్థులకు పోలైన వోట్లవిలువ సమానమైనప్పుడు ఎదురయ్యే సమస్యను పరిష్కరించవలసివచ్చినప్పుడూ, తొలగింపబడిన అభ్యర్థులవోట్లను బదిలీచేయడానికి కసరత్తుచేయవలసివచ్చినప్పుడూ ఈ ప్రక్రియ మరింత సంక్లిష్టంగా కనిపిస్తుంది.

ఎగువసభకు ఎన్నికలు జరుగుతున్నప్పుడు, తన అభ్యర్థులను నిలబెట్టే ఏ పార్టీ అయినా సాధారణంగా చేసే పని —సొంత ఎం.ఎల్.ఏలవోట్లనూ, తనను సమర్థించే ఇండిపెండెంట్ల వోట్లనూ తన అభ్యర్థులమధ్య విభజించడం. ఎన్నికలో పాల్గొనే అన్ని పార్టీలు తమ అందుబాటులో ఉన్న వోట్లతో అదే చేస్తాయి. పార్టీ తన ఒక్కొక్క అభ్యర్థికీ ముందేలెక్కించి నిర్ణయించిన సంఖ్యలో ఒకటి, రెండు, మూడు, నాలుగు... ఇలా ప్రిఫరెన్స్‌వోట్లను కేటాయిస్తుంది. అలా అభ్యర్థు లందరూ కావలసినమేరకు ప్రిఫరెన్స్‌వోట్లు తెచ్చుకుని, ఆ పార్టీ పూర్తిసంఖ్యాబలాన్ని అనుసరించి ఎన్ని సీట్లు రావాలో అన్నిసీట్లూ గెల్చుకుంటా రు. దీనిని నిర్దుష్టంగా జరిపించడంకోసం పార్టీ

మేనేజర్లు పార్టీకిచెందిన ప్రతివోటరుకీ వోటింగ్‌లో ప్రాధాన్యతాక్రమాన్ని (ప్రిఫరెన్షియల్ఆర్డర్) సూచించే స్లిప్పు (కాగితం) అందజేస్తారు. వోటింగ్‌సమయంలో వోటరు ఆ స్లిప్పును బ్యాలెట్ పత్రంపై ఉన్నదున్నట్టు కాపీ చేయవలసి ఉంటుంది. ఉదాహరణకు పార్టీ ఎం.ఎల్.ఏ 'బి' అభ్యర్థి జాబితాలో మొదటిప్రిఫరెన్స్‌వోటును, 'ఎ' అభ్యర్థి జాబితాలో రెండవ ప్రిఫరెన్స్‌వోటును గుర్తించాలని స్లిప్పులో ఆదేశించారనుకుందాం. అప్పుడు పార్టీక్రమశిక్షణకు లోబడి ఆ ఎం.ఎల్.ఏ ఆ క్రమంలోనే, అంటే 'బి' ఎదురుగా 1ని, 'ఎ' ఎదురుగా 2ను బ్యాలెట్‌పత్రంమీద నమోదు చేయవలసిఉంటుంది;

ఇదంతా నిబంధనల ననుసరించి శాసనసమండలి ఎన్నికలలో అనుసరించే పద్ధతి. అంత వరకూ బాగానే ఉంది. అయితే ఇక్కడే చిక్కొచ్చిపడుతుంది. కారణం ఏదైనాకావచ్చు, నువ్వు అమితంగా ద్వేషించే ఒకానొక అభ్యర్థికి మొదటిప్రిఫరెన్స్‌వోటు వేయమని పార్టీ నిన్ను ఆదేశించ వచ్చు... పార్టీ కేటాయించని మరో అభ్యర్థికి నీ మొదటిప్రిఫరెన్స్‌వోటు ఇవ్వాలని నువ్వు కోరుకుంటూ ఉండవచ్చు. అప్పుడు ఏం జరుగుతుంది? రహస్యపరోక్షఎన్నికలో వోటరును తికమకపెట్టే చిక్కుముడి ఇదే. నీ అభిమతానికి విరుద్ధంగా, పార్టీక్రమశిక్షణ కు తలవంచి, అది ఆదేశించినట్టే నువ్వు వోటు వేశావనుకో, అది సీదాసాదా వోటింగ్‌మాత్రమే అవుతుంది; అందులో ఎటువంటి ఉత్తేజం, సాహసం, వచ్చిపడగల ప్రతిఫలం ఏమీ ఉండవు. కాని రహస్య వోటింగులో కూడా తాను మనసారా ద్వేషిస్తున్న అభ్యర్థికి నిజాయితీతో వోటు వేయడమంటే ఇదేమి కృతయుగమా? అందుకని అలా జరగదనే అనుకోవడం సబబు. మరి మార్గాంతరమేమి? తనకు ఇష్టం లేకుండా తన వోటు కేటాయించిన పార్టీ నిర్ణయానికి నిరసన తెలియజేసి పార్టీ నుంచి నిష్క్రమించడం. కానీ అలా ఎవరూ చేయరు. పార్టీని, ముఖ్యంగా అధికారపక్షంగా ఉన్న పార్టీని విడిచిపెట్టి వెళ్లడం అంత తేలికకాదు. ఇలా తార్కికంగా ఆయా అవకాశాల్ని కొట్టివేసినతర్వాత అత్యుత్తమమైన మూడోమార్గానికి చేరుకుంటాడు వోటరు. దీనినే అతను ఎంచుకున్నప్పుడు దాదాపు ఈ క్రింది విధానక్రమాన్ని పాటించవలసి ఉంటుంది - పార్టీ తనకు కేటాయించిన అభ్యర్థి 'శిబిరం'లోనే తను కొనసాగుతూఉంటాడు; అటూఇటూ హడావుడిగా తిరుగుతూ ఆ అభ్యర్థితరఫున చురుగ్గా ప్రచారం సాగిస్తూనే ఉంటాడు, నాకోసం పనిచేసే ముఖ్య కార్యకర్త ఇతడేనన్న నమ్మకం అభ్యర్థికి కలిగిస్తాడు, తర్వాత పోలింగ్‌కేంద్రంలోకి అడుగుపెడతాడు, తనకు కేటాయించకపోయినా తను వోటువేయాలనుకుంటున్న వేరొక అభ్యర్థికి తన మొదటిప్రిఫరెన్స్‌వోటు వేస్తాడు. చివరగా ముఖంనిండా నవ్వు పులుముకుంటూ పోలింగ్ కేంద్రంనుంచి ఇవతలకొచ్చి తనకు కేటాయించబడినా తాను వోటు వేయని అభ్యర్థిని నేరుగా సమీపిస్తాడు, వోటు తనకు వేసినందుకు అతడి కృతజ్ఞతలు అందుకుంటాడు - 'దానికేముందండీ! పార్టీ ఆదేశం కదా!' అని తేలికగా అనేస్తాడు. ఆ తర్వాత సంతోషంగా గడిపేస్తాడు. ఇది రాజకీయ అవినీతికి చక్కని ఉదాహరణ. దీన్ని మామూలు భాషలో మోసం అంటారు.

అటుపిమ్మట ఎవరికీ బద్ధులుకాని ఇండిపెండెంట్ ఎం.ఎల్.ఏలు ఎలాగూ ఉంటారు, వారి విషయంలో ఆకాశమే హద్దు. ఇండిపెండెంట్లు అనుభవించగలిగిన ఇంత ఆనంద భరితమైన, ఇంత లాభసాటిఅయిన మరో సందర్భాన్ని ఊహించలేం.

ఆ విధంగా, దిగువసభనుంచి ఎగువసభకు జరిగే ప్రస్తుత ఎన్నిక అనివార్యంగా పార్టీ, గ్రూపు రాజకీయాల రొచ్చుగా పరిణమించింది. మిగిలిన అంశాలతోపాటు అది మహేంద్రనాథ్ - చౌదరి కుమ్ములాటనుకూడా సంపూర్ణంగా ప్రతిబింబించింది. వాస్తవానికి ఈ నాటకంలో అదే ముఖ్యాంశమైంది. మొదట, రెండుగ్రూపులూ తమ విధేయులకు కౌన్సిల్ఎన్నికలో పార్టీ టిక్కెట్లు ఇప్పించుకోవాలనుకున్నాయి. శాసనసభనుంచి ఎనిమిదిమందిసభ్యుల్ని ఎన్నుకోవలసి ఉండగా అయిదుగురుఅభ్యర్థుల్ని నిరాఘాటంగా గెలిపించడానికి అధికారపక్షబలం సరిపోతుంది. ఆపైన పదహారు అదనపువోట్లు మిగిలిపోతాయి, అవి, తాముగా ఒక అభ్యర్థిని గెలిపించగలిగిన వోట్లు కాకపోయినా, ఏదోవిధంగా - తరచు జరుగుతున్నట్టు నీతిమాలిన విధంగా – మిగిలిన వోట్లు సంపాదించుకోగల ఏ అభ్యర్థికైనా ఆ వోట్లు ఎంతో విలువైనవిగా ఉపకరిస్తాయి. మహేంద్రనాథ్, చౌదరి తమకున్న ఢిల్లీసంబంధాలను ఉపయోగించుకుని అభ్యర్థులఎంపికపై ప్రభావం వేయడానికి చేయగలిగినదంతా చేశారు. అయితే కొందరు అభ్యర్థులకు సొంతంగా ఢిల్లీలో తగినంత పలుకుబడి ఉంది కనుక ఈసారి వాళ్ళ ప్రయత్నఫలితం చాలావరకు అస్పష్టంగానే ఉండిపోయింది. పార్టీటిక్కెట్లు పైనుంచి నేరుగానే వచ్చి వాళ్ళ ఒళ్ళోపడ్డాయి -లేదా అలా అని వారు చెప్పుకున్నారు. ఇందుకు ధ్రువీకరణ అన్నట్టుగా పార్టీ 'అధికారిక' అభ్యర్థులజాబితా నేరుగా ఢిల్లీనుంచే వచ్చింది. దాంతో రాష్ట్రరాజధానిలోని శాసనసభ్యులకు మతిపోయింది.

ఆ జాబితా ప్రతిఒకరినీ నిశ్చేష్టుల్నిచేసింది. అయితే తాము ఆశ్చర్యపోయామని అన్న వాళ్ళు ఒక్కరూ లేరు. రాజకీయవాదుల నైజగుణాలలో అది మరొకటి - ఆశ్చర్యాన్ని బయట పెట్టకపోవడం. ఆశ్చర్యపోవడమనేది అజ్ఞానానికీ, దౌర్బల్యానికీ, మందబుద్ధికీ, బహుశా అంతకంటె హీనమైనదానికీ గుర్తు. రాజకీయవాది ఎవరైనాసరే సర్వజ్ఞుడికంటె ఓ చాయ తక్కువలో కనిపించాడా కొంపమునిగిపోతుంది. ప్రతివారూ అన్నది 'ఆ జాబితా నాకేం ఆశ్చర్యం కలిగించలే'దనే. 'రెండురోజులక్రితమే నాకు ఉప్పందింది. మీకు తెలుసోలేదో, నా ఢిల్లీసోర్సులు అంత కచ్చితంగా ఉంటాయి. ఇంతవరకు నన్ను వాళ్ళు మోసగించలేదు.' మహేంద్రనాథ్, చౌదరి శిబిరాలు రెండూ ఇదే మాటను సమాన అభినివేశంతో ఘోషించుకున్నాయి. ఆ తర్వాత జాబితాలోని మెజారిటీ అభ్యర్థుల్ని 'అస్మదీయులు'గా రెండుశిబిరాలూ చెప్పుకోవడం మొదలు పెట్టాయి.

అధికారపక్షం అభ్యర్థులలో ఒకడైన రామ్‌గోపాల్, అధిష్ఠానవర్గం నియమించిన అభ్యర్థు లందరిలో అత్యంతబలహీనుడన్నమాట పుట్టింది. ఒకటికి పదిసార్లు ఈ అంచనానే వల్లిస్తూ వచ్చేసరికి - అందరూ దానిని ఆమోదించేశారు. అవతలి మనిషి ఆమోదించాడు కనుక ఇతడూ ఆమోదించవలసిందే - ఇలా ఉంటుంది వరస.

ఈ నిరంతరపునరుక్తివల్ల ఏకాభిప్రాయం దానంతటదే ఏర్పడిపోతుంది. అందుకు ఎవరైనా చెప్పగలిగిన కారణం మరేదీ ఉండదు. అతడు నిరుపేద కనుక, పరోక్షఎన్నికకు తూగలేడు కనుకనే అతనిపై అత్యంతబలహీనఅభ్యర్థి అన్న ముద్రవేసినట్టు దరిమిలాను బయటపడుతుంది. ఆపైన అతగాడు ఒకరకం మొండిమనిషి, తనను లోబరచుకోడానికి చూసిన కుతంత్రస్వభావులతో అంత స్నేహంగా లేడు. ఏ ఒక్కముఠాగూట్లోనూ చేరడానికి ఇష్టపడలేదు. కనుక ఎందుకైనా మంచిదని అటు మహేంద్రనాథ్, ఇటు చౌదరి శిబిరాల్లో ఏ ఒకటీ అతడు తనవాడేనని చెప్పు

కునేందుకూ, అతణ్ణి దగ్గరకు తీసుకునేందుకూ ప్రయత్నించలేదు. పార్టీలో అతడు సీనియరే, ముతాకోణంనుంచి చూస్తేమాత్రం ఓ అనాథ. అందుకని రామ్‌గోపాల్ ఓడిపోతాడనే ప్రతిఒక్కరూ ఊహించారు. ఏకంగా ముప్పైఆరుగురు ఎం.ఎల్.ఏలు తమ మొదటి ప్రిఫరెన్స్‌వోటు అతనికే ఇస్తారని ఎవరూ అనుకోలేదు. ఈ వోటింగు విధానంలో ఏ అభ్యర్థికైనా మొదటి లెక్కింపులో గెలిపించడానికి అవసరమైన కనిష్ఠసంఖ్య అది. అధికారపక్షానికిచెందిన మిగిలిన నలుగురు అభ్యర్థులూ గ్రూపుమద్దత్తుకానీ, ఢిల్లీఆశీస్సులుకానీ దండిగా ఉన్నవాళ్ళు. వీళ్ళ ఎం.ఎల్ ఏలుకూడా తగిన ఎరచూపిస్తే ఫిరాయించడానికి సిద్ధపడేవాళ్ళే అయినా ఈ నలుగురిపరిస్థితి రామ్‌గోపాల్ పరిస్థితంత నిరాశాజనకంగా లేదు.

వీరు కాక, తులనాత్మకంగా చెప్పాలంటే, పార్టీలబయట పోటీచేస్తున్న సోమేశ్వర్, బిహారి, రతన్‌లాల్, బాబూమియా అనబడే 'కొవ్వెక్కిన నలుగురూ' వేరొక తరగతిలోకి వస్తారు. ఈ నలుగురూ పరోక్షఎన్నికకు పరిపూర్ణంగా సరిపోతారని అందరి అభిప్రాయం. డబ్బుతో బాగా బలిసి, పచ్చి అవకాశవాదులుగా పేరు తెచ్చుకున్నవారు వీళ్ళు. ఈ ఎన్నికవిధానం తమ తెలివితేటలకు సరితూగేలా ఉందికనుక అందులో పాల్గొనే అవకాశాన్ని అమాంతం దొరకపుచ్చుకున్నారు. ఈ బాపతు అభ్యర్థులు పరోక్ష ఎన్నికల్లో పాల్గొనడం కొంతకాలంగా రివాజుగా జరుగుతూ వస్తోంది. ఎన్నికలో వీళ్ళను గట్టెక్కించగలిగింది వీళ్ళ ధనబలమేననికూడా చెప్పుకుంటారు. వీళ్ళు ఏ పార్టీకీ చెందరు. అధికారపక్షంలోని మహేంద్రనాథ్, చౌదరి వర్గాలలో వీళ్ళు ఎవరికి దగ్గరో చెప్పగలిగినవాళ్ళుకూడా ఎవరూ లేరు. వీళ్ళమటుకువీళ్ళు ఏదో ఒకగ్రూపుకే తాళి కట్టేంత తెలివితక్కువదద్దమ్మలేమీ కాదు, ఎందుకంటే నిన్న నేడు రేపు రెండుగ్రూపుల్నీ పితికి సొంతపనులెన్నింటినో చక్కబెట్టుకోగల సమర్థులు వీళ్ళు.

అసలు ఈ కొవ్వెక్కిన నలుగు రు ఈ ఎన్నికలో అభ్యర్థులెలా కాగలిగారన్నది చెప్పుకోదగిన ముచ్చట. తన అధికారక అభ్యర్థులు ఒక్కొక్కరికీ ముప్పైఆరువోట్లు కేటాయించిన తర్వాత అధికారపక్షంవద్ద పదహారు వోట్లు మిగిలిపోగా, ఇతర పార్టీలన్నింటివద్ద కలుపుకుని పదిహేడువోట్లు అదనంగా మిగిలాయి. ఈ పదహారు ప్లస్ పదిహేడు వోట్లు ఎక్కడికి పోవాలి? రహస్యబ్యాలెట్‌లో ఏ పదహారో, ఏ పదిహేడో తెలుసుకోవడం ఎలా? ఆ నలుగురి ఆకాంక్షలూ ఈ చిక్కుముడిలోనే ఇమిడిఉన్నాయి. వారివారి అభ్యర్థిత్వాలకు పరస్పర స్పర్థ చేసిన దోహదం చేసింది. మరోవిధంగా చెప్పాలంటే ప్రతిఒకడూ, అవతలివాళ్ళు దూకారుకనుక తానూ అనివార్యంగా బరిలోకి లంఘించినవాడే. అన్నిపార్టీలనుంచీ ఫిరాయింపువోట్లు వచ్చిపడతాయన్న ఆశతోనే నలుగురూ ఇండిపెండెంట్లుగా రంగప్రవేశం చేసినవాళ్ళే.

రాజకీయపక్షాల మేరకు, ఆ బలిసిన ఆ నలుగురిలో ఏ ఒకరికీ ఏ పార్టీకూడా 'బహిరంగం'గా మద్దత్తు వాగ్దానం చేయలేదు. అధికారపక్షానికి ఒకేచోట పదహారు మిగులువోట్లు ఉన్నమాట నిజమే కానీ, మిగిలిన పార్టీల అదనపువోట్లు అక్కడా అక్కడా చెదిరిపోయి ఉన్నాయి. ఒకపార్టీకి నాలుగు మిగులువోట్లు ఉన్నా అవి తలొకచోటా ఉన్నాయి; అయినా వాటిని ఎలా సొమ్ముచేసుకోవాలో ఆ పార్టీనాయకులకు కనుక తెలిసిఉంటే- సరే, వాళ్ళకెలాగూ తెలుసు ననుకోండి-ఆ నాలుగువోట్లూ బంగారుగుడ్లు పెట్టగలిగినవే. ఇంకో పార్టీ ఉంది, ఇతరత్ర ఒకళ్ళతో

ఒకళ్ళకు ఎటువంటి సంబంధంలేని ఏడుగురు ఇండిపెండెంట్ ఎం.ఎల్.ఏలు కలిసి హడావుడిగా పుట్టించిన పార్టీ; బేరసారాలు మరింత బాగా జరపచ్చుననుకునే వాళ్ళు తమనో పార్టీగా పిల్చుకున్నారు-ఎంతైనా ఓ వ్యక్తికన్నా ఓ పార్టీ ఎప్పుడూ గట్టిదే. అయితే అది అవసరార్థం చేసుకున్న పెళ్ళి కనుక పునాది ఎప్పుడైనా కదిలిపోవచ్చు; అంతకన్నా లాభసాటి అనిపించినప్పుడు పార్టీని నట్టేటముంచి తప్పుకోగల సమర్థుడే అందులోని ప్రతి ఒక్కడూ.

కోటీశ్వరులైన ఆ నలుగురూ తమ కార్యాలయాల్ని-వాడుకభాషలో 'దుకాణాలు' - తెరవడంలో సమయాన్ని ఏమాత్రం వృధాచేయలేదు. వాళ్ళ ఏజెంట్లు రాష్ట్రరాజధాని అంతటా మూగిపోయారు. అడ్వాన్స్‌గా 'బుక్' చేసుకోవడంకోసం ఎం.ఎల్.ఏల స్వస్థలాలనుకూడా సందర్శించారు.

అత్యంత ఘనంగా తమ ప్రయత్నాలు ప్రారంభించాలనుకున్న సోమేశ్వర్, బిహారీ రెండు ఖరీదైన హోటళ్ళలో యాభై ఎయిర్‌కండిషన్డ్ రూములు బుక్‌చేశారు. అయితే వోటర్లను అలరించడానికి వాళ్ళు చేసిన ఏర్పాట్లగురించి తక్షణమే జనానికి తెలిసిపోయింది, ఆ రెండుహోటళ్ళ గురించి ప్రజలు వింతగా చెప్పుకోవడం ప్రారంభించారు. అలాగని అభ్యర్థులు వాటిని లెక్క చేస్తారని కాకపోయినా ప్రజాభిప్రాయంలో అటువంటివి మరీ అంత 'బట్టబయలు'గా చేయడం ఓ అఘాయిత్యంగా కనిపిస్తుంది. కాస్త కుడీ-ఎడమా పాటిస్తే ఫర్వాలేదు. సారాకొట్లో కూర్చుని ఎవడైనా నిమ్మరసం తాగుతున్నానంటే ఎవరూ నమ్మరు, నిజంగా అతడదే చేస్తున్నాసరే. ఎవడి కంటికైనా దుకాణాన్నిబట్టే తాగేది కనిపిస్తుంది. ఇంకా మాట్లాడితే నిజమైన విచక్షణ, నిమ్మరసం దుకాణంలో కూర్చుని సారా తాగడంలో ఉంది- అది చేతనైతే. మిగిలిన సంపన్న అభ్యర్థులిద్దరూ, రతన్‌లాల్, బాబూమియా సరిగ్గా చేసిందదే రాజధానికి అయిదుమైళ్ళలో పల ఉన్న గెస్ట్‌హౌస్‌లనన్నింటినీ రతన్‌లాల్ బుక్‌చేసేశాడు. అక్కడ విందుభోజనాలకు ఏర్పాట్లుచేసి పడగ్గదుల్ని చక్కగా ముస్తాబు చేయించాడు. విదేశీమద్యం తాజానిల్వలు అందుబాటులో ఉంచాడు. సైగచేస్తేచాలు వచ్చివాలే చక్కని తోడునీ ఏర్పాటుచేశాడు. ఎం.ఎల్.ఏలను రాకుమారుల్లా చూడడానికి ఎన్ని చేయాలో అన్నీ చేశాడు-ఈ వైభోగమంతా పోలింగ్‌వరకే ననుకోండి. అయితే రతన్‌లాల్ 'ప్రదర్శన' మరీ అంత గుట్టుగా ఏమీ ఉండిపోలేదు. గెస్ట్‌హౌస్‌లను బుక్‌చేయడం, వాటిని అలంకరింపజేయడం వంటి భారీ సన్నాహంలో అతడు ప్రభుత్వాధికారుల్నికూడా వాడుకున్నాడు. అతిథిగృహాల్లో జరుగుతున్న విందువినోదాల్లో సంతోషంగా పాలుపంచుకుంటున్న ఎందరెందరో అధికారులే, ఇవతల అదోరకం ఆధికారిక అసమ్మతిని మేళవించి రతన్‌లాల్ గురించి చెవులు కొరుక్కోవడమూ ప్రారంభించారు. అది ప్రభుత్వాధికారులుమాత్రమే చలాయించ గలిగిన విశేషహక్కు-ఒకవైపున ఆనందిస్తూనే, తమకు ఆ ఆనందాన్ని అందించిన వారిపై తీర్పు జారీచేయడం.

అందరికంటె ఎక్కువ గుట్టుగా ఏర్పాట్లు చేసినవాడు బాబూమియా. అతడేం చేశాడో దాదాపుగా ఎవరికీ తెలియదు. ప్రత్యేకంగా వోటర్లను ఖుషీచేయడం కోసమే-ఒక్కొక్కరికి ఒక్కొక్కగది వంతున-అన్ని సౌకర్యాలూ ఉన్న విడివిడి గదుల్ని సంపాదించాడు. అవన్నీ వేర్వేరు ప్రాంతాల్లో ఉన్నాయి-అయితే అన్నీ విలాసవంతమైన ప్రాంతాలే. బాబూమియా సన్నిహితమిత్రులు వ్యక్తిగతంగా ఏర్పాట్లను పర్యవేక్షించారు. ఏ వోటర్ని ఎక్కడ ఉంచాలో, అతడి పరిచర్యను

ఎవరు, ఎలా, ఎప్పుడు చూసుకోవాలో-అన్ని వివరాలతో ఒక భారీపథకాన్ని ముందే సిద్ధంచేసి ఉంచారు. ఒక్కొక్కరికి ఎవరిని 'తోడు'గా నియోగించాలో కూడా అందులో స్పష్టంగా రాసి ఉంచారు. ప్రతిదీ ఎంతో పకడ్బందీగా చేశారు. బాబూమియా అజాగ్రత్తకి కానీ పొరపాటుకి గానీ ఎక్కడా అవకాశమివ్వలేదు.

సంపన్నఅభ్యర్థులు కొంచెంకూడా అటూ ఇటూ కానంత నిర్దుష్టంగా ఎన్నికలయుద్ధానికి సేనల్ని నిలబెడుతుంటే రామ్‌గోపాల్‌తోపాటు మిగిలిన పేదఅభ్యర్థులు ఆగ్రహంతోనూ, నిస్పృహ తోనూ చూస్తూ ఉండిపోయారు. వాళ్ళకు కేటాయించిన వోటర్లలో చాలామందిని, 'బలిసిన ఆ నలుగురూ' తమ హోటళ్ళవైపు, గెస్ట్‌హౌస్‌లవైపు, ప్రైవేట్ అపార్ట్‌మెంట్‌లవైపు ఆకర్షించేశారు. తన వోటర్లలో ఎవరినైనా కలుసుకున్నప్పుడల్లా, తనెవరో గుర్తుపట్టనట్టు, రామ్‌గోపాల్ అనే అభ్యర్థి ఒకడున్నాడని తనకు తెలియనే తెలియదన్నట్టుగా అతడు తనవైపు చూసినట్టనిపించేది రామ్‌గోపాల్‌కి. పోలింగ్‌కు మూడురోజులుందనగా, రామ్‌గోపాల్‌కి కేటాయించిన ముప్పై ఆరుగురు వోటర్లలో కనీసం ఇరవైమంది, మిగిలిన అభ్యర్థులకు కేటాయించిన వోటర్లలోకూడా-ఎందరో తెలియకపోయినా-చెప్పుకోదగినంతమంది 'బలిసిన నలుగురికీ' లొంగిపోయినట్టు ప్రతిఒకరికీ తెలిసిపోయింది; ఏమో, రామ్‌గోపాల్‌కి కేటాయించిన ఆ ముప్పై ఆరుగురూ ఎన్నికల రోజున ఆయనను నిలువునా ముంచేసి అవతలికి వెళ్ళిపోయినా వెళ్లిపోవచ్చుననికూడా ఎవరో అప శకునంమాట అనేశారు. అంచేత అతడి ఓటమి అనివార్యం, మిగిలినవాళ్ళ అవకాశాలుకూడా అంతంతమాత్రంగానే ఉన్నాయి. ఇతరులకంటె రామ్‌గోపాల్‌కే ఈ విషయం బాగా తెలుసు. ఇందులో విచిత్రం ఏమిటంటే అతడికి సానుభూతీ, వాగ్దానాలు దండిగానే లభించాయి కానీ, వోట్లురాలే సూచనలు మాత్రం ఎక్కడా లేవు, 'బలిసిన నలుగురి' విషయానికొస్తే వాళ్ళపట్ల ఏ వైపునుంచి సానుభూతి లేదు, కానీ వోట్లు వాళ్ళ వలలో పడబోతున్నాయి.

గంటలు గడుస్తున్న కొద్దీ, ఎన్నికలప్రక్రియ మెల్లమెల్లగా మరో రంగు తిరగసాగింది. ఇంత వరకూ జరిగింది పేదఅభ్యర్థులవోట్లు 'బలిసిన నలుగురి'వైపు వెళ్ళిపోవడం. పేదఅభ్యర్థులు ఇక సోదిలోకికూడా వచ్చే అవకాశం లేదనీ వోట్లకోసం ఇప్పుడు సంపన్నఅభ్యర్థులు ఒకరి నొకరు కుమ్ముకోవడం ప్రారంభించారని ఆపాటికే అందరూ నిశ్చయాని కొచ్చేశారు. ఈ పోటీ ఎంతో కరకుగానూ ఉంటుంది, ఎంతో గుంభనంగానూ ఉంటుంది. అది అమీతుమీ తేల్చుకో వలసిన యుద్ధం - కొన్ని స్పష్టమైన కారణాలవల్ల అదలా పరిణమించవలసిందేకూడా. ఇప్పుడు జరుగుతున్న ఘర్షణ శాసనసమండలిసభ్యత్వంకోసం కాదు, ఆధికారికంగా ప్రకటించడం మినహా, ఆ వ్యవహారం అప్పటికే తేలిపోయినట్టు లెక్క. ఇప్పుడు ఆ నలుగురూ పోటీపడుతున్నది మంత్రి పదవికోసం. వాళ్ళలో ప్రతిఒకడూ మిగిలిన ముగ్గురినీ ఎన్నికలో ఓడించడానికి ప్రయత్నాలు ప్రారంభించాడు. ఎన్నికలరాజకీయాల్లో దాటకూడని సభ్యతాపరిమితులు ఏవైనా ఉన్నాయనే అనుకుంటె-కుతంత్రం, పరస్పర నిందారోపణలు ఆ పరిమితులన్నింటినీ ఉల్లంఘించేశాయి. అందులో నీతినియమాలు వేటికీ చోటులేదు, వినియోగించని సాధనసంపత్తీ లేదు. ఆ నలుగురిలో ఏ ఒక్కరి చాటుమాటువ్యవహారాలను విచారణజరిపించి మరీ తెలుసుకోవలసిన అవసరమేలేదు. ప్రతి ఒకడూ మిగిలిన ముగ్గురిగురించి ఏమంటున్నారో తెలుసుకుంటే చాలు, ఆ నలుగురిపై

సాధికారికత లభిస్తుంది. ప్రతిఒకరిపై ఓ పుస్తకమే రచించగలిగిన స్థితిలో ఉంటారు. మిగిలిన ముగ్గురు అత్యంత ఉదారంగా అందించే సహాయంతో ఆ పుస్తకాన్ని ప్రచురించుకోవచ్చు కూడా. ఈ నాటకంలో అత్యంత హాస్యాస్పదవిషయం ఏమిటంటే, 'బలిసిన ఈ నలుగురు' ఇండిపెండెంట్ అభ్యర్థులైనా, ఎం.ఎల్.సిగాఎన్నికైతే అధికారపక్షంలోకి తీసుకుంటామనీ, మంత్రి పదవి ఇస్తామనీ ఏవో అనధికారవర్గాలద్వారా వీరిలో ప్రతి ఒకడూ హామీ పొందడం.

ఆ బలిసిన నలుగురికంటె నాలుగాకులెక్కువ చదివిన ఎం.ఎల్.ఏలూ కొందరున్నారు. ఉదాహరణకు రామ్‌గోపాల్‌కు కేటాయించిన ఎం.ఎల్.ఏలలో ఒకడైనా జగ్‌మోహన్‌శర్మనే తీసుకోవచ్చు. కేటాయింపు కాగానే అతడు రామ్‌గోపాల్‌కి కేటాయించిన మిగిలిన వోటర్లందరిపై ఫిర్యాదులు చేయడం ప్రారంభించాడు. 'ఏమిటి ప్రయోజనం? నాలాంటి కొద్దిమంది నిజాయితీ పరులు వోటు వేసినప్పటికీ అతడు గెలవడని అందరికీ తెలుసు. మదించిన ఆ నలుగురూ ఇప్పటికే చాలామందిని తమవైపు లాక్కున్నారు. పార్టీలో క్రమశిక్షణ లేకుండాపోయింది. చూస్తూ ఉండండి, పెద్ద ఎత్తున క్రాస్ వోటింగ్ జరుగుతుంది. చివరకు అందరూ కలిసి నిజాయితీ పరులైన వోటర్లనే నిందిస్తారు, అదీ నా భయం. జరుగుతున్నదంతా చూస్తుంటే, రామ్‌గోపాల్ ఎలా గెలుస్తాడో నాకు అంతుబట్టకుండా ఉంది...' ఈ ఉపోద్ఘాతంతో జగ్‌మోహన్ తన ఫిరాయింపుకు తగిన పునాది వేసుకున్నాడు. బలిసిన నలుగురూ ఏర్పాటుచేసిన శిబిరాలకు వెళ్ళొచ్చాడు, అక్కడున్న ప్రతిఒకళ్ళకీ నిజాయితీమీద ఉపన్యాసం ఇచ్చాడు, ఫిరాయింపులజాడ్యంమీద విచారం వెలిబుచ్చాడు. ఈ లోపల, పోటీలో ఉన్న ఒక్కొక్కరి స్తోమతనీ, బలహీనతల్నీ దృష్టిలో ఉంచుకుని ఎవరినుంచి ఎంత రాబట్టుకోవచ్చునో జాగ్రత్తగా అంచనావేసుకున్నాడు.

సోమేశ్వర్ అద్దెకు తీసుకున్న హోటల్‌గదులకు వెళ్ళినప్పుడు రామ్‌గోపాల్‌కూ, ఇతరపార్టీ అభ్యర్థులకూ కేటాయించబడిన ఎందరో ఎం.ఎల్.ఏలు అతనికి తారసపడ్డారు. మీ చూపు సువిశాలమైన లాంజ్‌కే పరిమితంచేస్తే, ఆ గుంపు అక్కడికేదో కార్యక్రమానికి వచ్చినవాళ్ళలా కనిపిస్తారు. అయితే మూసిఉన్న గదుల లోపలికి కనుక చూస్తే, ఆ అవకాశమే మీకు దొరికి చూడగలిగిఉంటే, – అక్కడ రకరకాల లావాదేవీలు జరిగిపోతున్న దృశ్యం కనిపిస్తుంది. లోపల, బయట అన్నింటినీ పరిశీలించగల నిశితనేత్రం జగ్‌మోహన్‌ది. ఫిరాయింపులవల్ల జరిగే హాని గురించి మరో సంగ్రహోపన్యాసం దంచి, సుష్ఠుగా అల్పాహారం స్వీకరించి అక్కడినుంచి కదిలాడు. తన కార్లో వెనకసీట్లో అతడు కూర్చోబోతుండగా దట్టమైన మీసాలతో అసహ్యంగా ముందుకు పొడుచుకొచ్చిన పన్నుతో ఓ పెద్దతలకాయ అతని మొహానికి తన తలను తాటించి 'ఇరవైవేలు?' అంటూ గుసగుసలాడింది. ఆశ్చర్యపోయినా ఏమాత్రం చలించని జగ్‌మోహన్ బుసకొట్టాడు. 'యూ స్కౌండ్రల్! నిజాయితీపరుడైన ఓ ఎం.ఎల్.ఏను అవినీతిలోకి లాగడానికి నీ కెంత ధైర్యం! గెటౌట్!' దఢాలున తలుపు మూసుకుని డ్రైవర్‌ను త్వరగా పోనివ్వమన్నాడు. వేగంగా కారు కదిలిపోయిన శబ్దం ప్రతిధ్వనులీనుతండగా పెద్దతలకాయమనిషిభుజంమీద ఎవరో చేయివేసి అన్నారు, 'తిక్క కుదిరిందా? గౌరవనీయులైన ఎం.ఎల్.ఏలతో వ్యవహరించే పద్ధతి అది కాదు! నీ కా తెలివిలేదు మిత్రమా!'

అక్కడినుంచి జగ్‌మోహన్ బీహారీ మద్దత్తుదారులున్న హోటల్‌కి చేరుకున్నాడు. అక్కడకూడా అతనికి రామ్‌గోపాల్‌జాబితాలో ఉన్న సహచరవోటర్లు, అన్నిపార్టీలకూ చెందిన మిగిలిన ఎం.ఎల్.ఏలూ కనిపించారు. వాళ్ళు లాంజ్‌లోనూ, కారిడార్లలోనూ నిస్తేజంగా కూర్చునో, నిలబడో ఉన్నారు. అన్ని వైపులకీ దొంగచూపులు బరుపుతూ ముళ్ళమీద ఉన్నట్టు అస్థిమితంగా ఉన్నారు. జగ్‌మోహన్ కారిడార్‌లోకి రాగానే వాళ్ళ మొహాలు ఒకింత పాలిపోయి, మరుక్షణమే ఏదో తెలిసిపోయినట్టు సూచించే మందహాసంతో వెలిగిపోయాయి. మరో వ్యక్తి అందులోనూ ఒక 'నిజాయితీపరుడు' తమ పాపాన్ని పంచుకోడానికి వచ్చేసరికి తమ అంతఃకరణపై ఆ పాపభారం కొంత తగ్గిపోయినట్టనిపించింది వాళ్ళకు. ఉన్నట్టుండి అట్టహాసంగా నవ్వేస్తూ, జోకులువేస్తూ, అదేపనిగా సలుపుతున్న నీతినియమాల అంతర్వాణిని, తాత్కాలికంగానే అయినా తొక్కిపెట్టగలిగారు.

జగ్‌మోహన్ ఆ తర్వాత రతన్‌లాల్ అద్దెకు తీసుకున్న ఒకానొక అతిథిగృహం చేరుకున్నాడు. తన పార్టీకీ, ఇతర పార్టీలకూ చెందిన ఎం.ఎల్.ఏలతో అక్కడకూడా అడ్డూఅదుపూలేని అదే కోలాహలం అతనికి కనిపించింది. తమతో కలిసిపోడానికి కొందరతణ్ణి పురిగొల్పబోతే విరుచుకుపడి వాళ్ళ నోళ్ళు మూయించాడు. ఆ పాటికే, తను పూర్తిగా అవినీతికి అతీతుడన్న అభిప్రాయాన్ని అందరికీ కలిగించగలిగాడు. జగ్‌మోహన్‌శర్మ వంటి పరిశుద్ధుడు వోటరుగా లభించినందుకు రామ్‌గోపాల్ నిజంగా అదృష్టవంతుడన్నారు అందరూ. వోటర్లలో అతడో నాయకరత్నం అయిపోయాడు!

బాబూమియా ఆ మరునాటి ఉదయం అతణ్ణి తన ప్రైవేట్‌గృహాలలో ఒక గృహానికి ఆహ్వానించాడు. బలిసిన నలుగురూ శర్మ మద్దత్తు కూడగట్టుకోవాలని అప్పటికే నిర్ణయించుకున్నారు. బాబూమియా అతనికి చేసిన రాచమర్యాదలకు, మరో అల్పప్రాణిఅయితే క్షణాలలో అవినీతికి దాసోహమైఉండేవాడు. కానీ జగ్‌మోహన్‌శర్మ అలా కాదు; అతడా గుహలోంచి సురక్షితంగా బయటపడ్డాడు. ఆ తర్వాత అంతుచిక్కనిరీతిలో అదృశ్యమైపోయాడు. బలిసిన నలుగురిలో ప్రతి ఒకడూ, మిగిలిన ముగ్గురిలో ఎవరో అతణ్ణి అపహరించుకుపోయాడనుకున్నారు. అతణ్ణి లోబరుచుకోవడాన్ని ఒక మహావిజయంగా వాళ్ళెలా పరిగణించారన్నది ఎంతో ఆశ్చర్యంగొలిపే విషయం. శీలవతిఅయిన ఓ గృహిణిని తనవైపుకు తిప్పుకోగలగడాన్ని కాముకుడు ఎటువంటి 'విజయం'గా భావిస్తాడో వాళ్ళూ అతని విషయంలో అలాగే భావించారు.

అతడదృశ్యమైన ఒక్కరోజులోనే, మిగిలిన ముగ్గురినుంచి అతణ్ణి దూరంగా ఉంచడం కోసం ఎంతటి మూల్యమైనా చెల్లించడానికి బలిసిన నలుగురిలో ప్రతిఒకడూ సిద్ధమైపోయాడు. శర్మ మాత్రం ఆ నలుగురికీ దూరంగా ఉండగలుగుతూ వారినే తనవెంట పడేటట్లు చేసుకోవడంలో పూర్తిగా కృతకృత్యుడయ్యాడు.

శర్మ ఇంత బలమైన అయస్కాంతంగా మారిపోవడం నిష్కారణంగా జరగలేదు. అతడెంతో నిజాయితీపరుడన్న అభిప్రాయంతోపాటు, అన్ని పార్టీలకూ చెందిన కనీసం పదిహేనుగురు ఎం.ఎల్.ఏలు అతని గుప్పిట్లో ఉన్నారనీ, వాళ్ళపై అతడికి పూర్తి అదుపు ఉందనీ ప్రచారం

జరిగిపోయింది. ఈ అభూతకల్పనను బలిసిన ఆ నలుగురి దృష్టికి అతడెలా తేగలిగాడో ఎవరికీ తెలియదు కానీ, ఆ విషయం తానొక్కడికే తెలుసుననీ, జగ్‌మోహన్‌నీ, మిగిలిన పది హేనుగురినీ తనే సంచీలో వేసుకోగలుగుతాననీ ప్రతిఒకడూ అనుకున్నాడు. ఈ ఎన్నికల ఇంద్రజాలంలో ధనమూ, బుద్ధిమాంద్యమూ ఈ రెంటి సమ్మేళనం ఇంత గొప్పగా వ్యక్తమైన సందర్భం వేరొకటి లేదు.

ఎన్నికలతర్వాత చాలారోజులకు జగ్‌మోహన్ సుదూర దక్షిణాన ఉన్న అందమైన హిల్‌స్టేషన్ ఊటీలో గడపడం తటస్థించింది. అక్కడ 'యాదృచ్ఛికం'గా రతన్‌లాల్ మేనగోడల్ని కలుసు కోవడం ఆమెకో హోటల్‌గదిలో పెద్దమనిషి రక్షణ అందించడం జరిగింది... అతడి ఆర్థిక సమస్యలు ఒకటొకటిగా అదృశ్యమైపోయాయి. బిహారీ చప్పుడుకాకుండా వాటి సంగతి చూసు కున్నాడు. అతని కుమారుడికి ఒక ప్రభుత్వరంగసంస్థలో చక్కని ఉద్యోగం దొరికింది, ఆ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ బాబూమియాకు ఎంతో కూరిమి నేస్తం. చివరగా, వితంతువైన అతడి వదినెగారిపేరుమీద ఒక దివ్యమైన ఇల్లు, ఒక్కొక్క ఇటుకగా రూపుదిద్దుకోవడం ప్రారంభించింది. నిజానికా ఇల్లు ఆమె కవసరమూ కాదు, ఆమె కంత స్తోమతా లేదు; సోమేశ్వర్ మేనేజర్ ఆమె తరఫున వ్యవహరించి దానికి కార్యరూపం ఇచ్చాడు. సంబంధితులకు తప్ప ఈ పరిణామాల గురించి ఎవరికీ తెలియదు; జగ్‌మోహన్ మరోవైపున నిజాయితీపరులైన వోటర్లకు ఉజ్జ్వలో దాహరణగా వెలిగిపోతూనే వచ్చాడు.

ఇక ఎన్నికకు తిరిగొద్దాం. పేద అభ్యర్థులకు కేటాయించిన ఆ పదిహేనువోట్లూ జగ్‌మోహన్ గుప్పిట్లోనే ఉన్నట్టు బలిసిన నలుగురూ నమ్ముతూనేవచ్చారు. కనుక అతణ్ణి లోబరుచుకునే ప్రయత్నాలూ కొనసాగించారు. మరోవైపున పేద అభ్యర్థులు అతనికి వంగివంగి దణ్ణాలుపెడుతూ అభ్యర్థన నిండిన చూపులతో అతనిముందు చేతులుజోడించి నిలబడుతున్నారు. వాళ్ళు చేయగలిగింది అంతే. రామ్‌గోపాల్ అతడిమీద విరుచుకుపడగలిగినవాడే కానీ జగ్‌మోహన్ అతడికా అవకాశం ఇవ్వలేదు.

ఎం.ఎల్.ఏ హఫీజుల్లా తీవ్రసందిగ్ధంలో పడిపోయాడు. పార్టీ అతడి మొదటివోటును రామ్ గోపాల్‌కు కేటాయించింది. అందుకని అతడు కారుచౌకగా అమ్ముడుపోగలడని బలిసిన నలుగురిలో ఎవరికివాళ్ళు అనుకున్నారు. వచ్చే ఎన్నికల్లో హఫీజుల్లా తనసీటును నిలుపుకునే అవకాశం లేదని వాళ్ళకు తెలుసు; అసలు 1962 ఎన్నికల్లో అతడు తనసీటు నిలుపుకోవడమే వింతగా చెప్పుకున్నారు. మరో ఊపులో అలా కొట్టుకొచ్చాడు. వచ్చే ఎన్నికల్లో అటువంటి ఊపేదీ ఉండదని వాళ్ళ నమ్మకం, ముఖ్యంగా పండిట్‌జీ ఆరోగ్యం క్షీణిస్తున్న దృష్ట్యా. అయితే అలాగని పైకెవరూ అనలేదు.

పోలింగ్‌కు మూడురోజులముందు హఫీజుల్లా తన స్నేహితుడింటికి వెళ్ళి తిరిగొస్తుండగా చీకట్లో ఓ వీధిమలుపులో నలుగురు బలిష్ఠులు అతనిమీద పడ్డారు. మెరుపువేగంతో అతణ్ణి కట్టేసి, నోట్లో గుడ్డలు కుక్కి, కళ్ళకు గంతలుకట్టి అక్కడ సిద్ధంగాఉన్న ఓ టాక్సీ వెనకసీట్లో బియ్యంబస్తాను కుదేసినట్టు కుదేశారు. హఫీజ్ స్పృహలోకి వచ్చేసరికే టాక్సీ ఎన్నోమైళ్ళ దూరం ప్రయాణించి నిర్మానుష్యంగా ఉన్న ఓ రోడ్డుమధ్య ఆగిపోయింది. అతని పక్కన

కూర్చున్న మనిషి భద్రంగా పిన్నుచేసిన ఓ నీలిరంగుకరెన్సీ కట్టను అతడి జేబులోకుక్కి గద్దిస్తూ అన్నాడు, 'ఇవి పదివేల రూపాయలు. కత్తిలాంటి సరికొత్త నోట్లు నీ మొదటి ప్రిఫరెన్స్‌వోటు బీహారీకే ఇవ్వాలి, బ్యాలెట్‌పేపర్‌లో మొదటిపేరు. పిచ్చివేషాలు వేసావో, జాగ్రత్త. మేం చెప్పినట్టు వినకపోతే నీ టెరమ్ పూర్తిచేయడానికి ప్రాణాలతో మిగలవ్! అర్థమైందా?'

నిర్ఘాంతపోయి నిస్సహాయస్థితిలో ఉండిపోయిన హఫీజుల్లా ఏదో అస్పష్టంగా గొణిగాడు. భయభ్రాంతుడౌతునే జరిగిన అవమానానికి ఎంతో కుంగిపోయాడు. పైగా నెహ్రూజీ నాయకత్వం వహిస్తున్న భారతదేశంలో ఇలా జరగడం!

టాక్సీలో మాటలుపూర్తయ్యే సమయానికి ఎదురుగా ఓ పెద్దవ్యాన్ పెద్దగా చప్పుడుచేస్తూవచ్చి హఠాత్తుగా ఆగిపోయింది.

తక్షణమే ఖాకీదుస్తుల్లో ఉన్న ఏడెనిమిదిమంది అందులోంచి దూకారు. వాళ్ళ చేతుల్లో గురిపెట్టిన తుపాకులు. వాళ్ళ అరుపులతో పరిసరాలు దద్దరిల్లాయి. ఈ లోపల హఫీజుల్లాను బయటికితోసేసి టాక్సీ ఆశ్చర్యకరమైన వేగంతో అక్కడినుంచి పరుగులుతీసింది. ఒంటినిండా బురదతో, బెణికిన కాలుతో, పదివేలరూపాయలకట్టను చేత కరచుకుని తనను సమీపిస్తున్న కొత్తదుండగులవైపు భయంభయంగా చూస్తూ నిలబడిపోయాడు హఫీజుల్లా. వాళ్ళ ఖాకీదుస్తులు చూడగానే భయంతొలగిపోయింది. పోలీసులొచ్చారనుకుని ఎంతో ఊరటచెందాడు. అసెంబ్లీ బడ్జెట్‌సమావేశాల్లో హోంశాఖపద్దులపై చర్చజరుగుతున్నప్పుడు గుర్తుపెట్టుకుని పోలీసులగురించి అత్యంతఘనంగా మాట్లాడాలని అప్పటికప్పుడు నిర్ణయించుకున్నాడు.

అయితే ఆ ఊరట ఎంతోసేపు నిలవలేదు. ఖాకీదుస్తుల్లో తనను రక్షించడానికి వచ్చింది వాస్తవంగా రతన్‌లాల్‌మనుషులని తెలియగానే నివ్వెరపోయాడు. బీహారీ ప్రయోగించిన గూండాల్ని భయపెట్టి తరమడానికి వాళ్ళు నకిలీపోలీసుదుస్తుల్లో వచ్చారు. హఫీజ్ రెట్టింపుభయంతో వణికిపోయాడు. అయితే రతన్‌లాల్‌మనుషులు దాడికి మరోపద్ధతిని ఎంచుకున్నట్టు కనిపించారు. అతనిపై వాళ్లెటువంటి దౌర్జన్యం చేయలేదు సరికదా స్నేహపూర్వకంగా వ్యవహరించారు. అత్యుత్తమ ప్రజాస్వామ్యసంప్రదాయాన్ని నిలబెట్టడంకోసమే అతణ్ణి తాము ఆదుకోడానికి వచ్చామని కూడా చెప్పుకున్నా రు. తన ఇష్టానుసారం వోటువేసేందుకు అతనికున్న హక్కును కాపాడాలన్నదే తమ అభిమతమన్నారు. ఇదేదో వినడానికి చాలా బాగుందే అనుకుంటూ హఫీజ్ వాళ్ళకు కృతజ్ఞతలు చెప్పుకుని వాళ్ళేం చెబుతారా అని నిరీక్షిస్తూ ఉండిపోయాడు.

ముసుగు మెల్లమెల్లగా తొలగడం ప్రారంభించింది. 'హఫీజ్‌సాబ్ మీకు తెలుసు, రతన్‌లాల్ మీ జిల్లావాడు. ఆయన కోటీశ్వరుడనీ, ఎంతో పలుకుబడిఉన్నవాడనికూడా మీకు తెలుసు. మీ నియోజకవర్గంలో ఆయనకున్న బలం ఎటువంటిదో, ఇంతవరకూ జరిగిన ఎన్నికల్లో అదెలా పనిచేసిందోకూడా మీకు తెలుసు. రతన్‌లాల్ మద్దత్తులేనప్పుడు మీలాంటి ఎంతో ప్రజాదరణఉన్నవాళ్ళుకూడా గెలిచేఅవకాశం ఉండదని మీకు ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఈ ఎన్నికలో కనుక రతన్‌లాల్ ఎం.ఎల్.సి అయితే ఆ మద్దత్తు మరింత పెరుగుతుంది. ఒకవేళ ఆయన ఓడిపోతే, అసెంబ్లీకి పోటీచేసి మీ సీటుకోసం మీతో పోటీపడాల్సివస్తుంది...

ఇప్పుడు మీరు మీ మొదటి ప్రిఫరెన్స్‌వోటును ఆ పనికిమాలిన రామ్‌గోపాల్‌కు వేయాలి... అయినా అతడెలాగూ గెలవడని మీకూ తెలుసు. అటువంటప్పుడు మీ వోటును రతన్‌లాల్‌కి వేయడమే మంచిది కాదా...?'

ఎందుకు మంచిది కాదు? ఫిరాయింపుకూడా న్యాయమేననిపించేంతగా ఎంత ఒడుపుగా మాట్లాడారు, పైగా అదికూడా తన క్షేమంకోసమే!... అనుకున్నాడు హఫీజుల్లా. జవాబుచెప్పడానికి మాటలకోసం ప్రయత్నిస్తూ ఏదో గొణిగాడు. ఇక్కడ ఒకే ప్రయోజనంకోసం బిహారీ, రతన్ లాల్ పరస్పరవిరుద్ధమైన టెక్నిక్‌లను ప్రయోగించడం చూడముచ్చటైన సన్నివేశం. ఆ ఎన్నికరోజుల్లో అన్నిరోడ్లూ ఫిరాయింపువైపే దారితీస్తున్నట్టుంటాయి...!

షెడ్యూల్డుకులాలకు చెందిన ఎం.ఎల్.ఏ బంశీధర్‌కూడా ఈ ఎన్నికలో రామ్‌గోపాల్‌కే వోటువేయాలి. మూర్తీభవించిన నిజాయితీగా పేరుతెచ్చుకున్నవాడుకనుక అభ్యర్థులలో ఎవరూ అతడికి ఎరవేసే ప్రయత్నం చేయలేదు. బదులుగా అతని గురించి ఒక లోపాయికారీ ప్రచారం ప్రారంభించారు. పాపం వయసుమీదపడిన బంశీ ముగ్గురు కొడుకులు, నలుగురు కూతుళ్ళతో అంత పెద్దకుటుంబాన్ని ఎంతకాలం అర్ధాకలితో ఉంచుతాడు? మంత్రివర్గంలో చేరే అవకాశాన్ని ఇప్పటికే చాలాసార్లు పోగొట్టుకున్నాడు. బలిసిన ఆ నలుగురూ ఎంతో ఉదారంగా ఇవ్వజూపిన మొత్తాల్ని ఇక ఇప్పుడతడు కాదనడం కష్టం. ఇంతకీ మీకు తెలిసిందో లేదో? అతడిలా చేశాడంటే ఎవరూ నమ్మరు కానీ, ఇప్పటికే అతడు తనకు రావలసింది వసూలుచేసేసుకున్నాడు. నిజాయితీ గురించి నా దగ్గర మాట్లాడకండీ, అదంతా చెత్త, వట్టిచెత్త...

ఈ ప్రచారాన్ని ఎవరూ నమ్మలేదు, అయితే కచ్చితంగా అదే కారణంతో అది వేగంగా వ్యాపించిపోయింది —ఒక నిజాయితీపరుడు మొట్టమొదటిసారిగా అవినీతికి పాల్పడ్డాడన్న చేదునిజం. ఎవరూ నమ్మనూలేదు, అలాగని ఎవరూ ఖండించనూలేదు. ఏమో, నిజం ఎవరికి తెలుసు? పాత్రికేయులు అన్నట్టు దేనినీ కొట్టివేయకూడదు, ఎప్పటికీ కొట్టివేయకూడదు. వదంతి ఎంత నమ్మశక్యంగా ఉంటే అంత మంచిది.

నిజమైనా కాకపోయినా అది రెచ్చగొట్టే కుతూహలం అంతా ఇంతా కాదు. ఏదైనా ఒక మాటను పదేపదే వల్లించారా, జనం నమ్మశక్యంకానిదాన్నికూడా నమ్మడం ప్రారంభిస్తారు. ఆ విధంగా బంశీధర్ ఫిరాయింపు (నిజాయితీనుంచి అవినీతికి) చాలామందికి పాశవికానందం కలిగించింది. తమ గుంపులో బంశీ కలిసిపోయినట్టు భావించుకుని పొంగిపోయారు. అదేదో గొప్ప ఆర్జన. ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న ఘనవిజయం. అదేపనిగా తమను గుచ్చుతున్న కపటత్వమనే ముల్లును తొలగించుకున్నట్టనిపించింది వారికి.

కేవలం రాజకీయవదంతికే సాధ్యమైనరీతిలో ఆ వదంతి విశ్వాసంగా స్థిరపడగానే అనాథ అభ్యర్థి రామ్‌గోపాల్‌పై ప్రజల సానుభూతి మరీమరీ పెరిగిపోయింది. మరిన్ని ఫిరాయింపులు జరగడానికి మరిన్ని ఒప్పందాలు కుదిరిపోయాయి. బంశీధరే ఫిరాయించినప్పుడు, ఇంకెవరు ఫిరాయించకుండా ఉండగలరు?

ఎన్నికలరోజువరకూ, బంశీధర్, హఫీజుల్లాల వోట్లవిషయంలో ఆడించిన నాటకాన్నే మిగిలిన ఎం.ఎల్.ఏల విషయంలోనూ ఆడించడం జరిగిపోయింది. శాసనసభ్యులహాస్టల్ రకరకాల కార్యక్రమాలతో కోలాహలంగా మారిపోయింది. రాత్రి గడుస్తున్నకొద్దీ అందులోని భాగస్వాములు సిగ్గుబిడియాలు విడిచిపెట్టి ఒక్కొక్కటిగా రాజకీయవలువల విసర్జన ప్రారంభించారు. అపహరణలు, భయపెట్టడాలు, డబ్బు, సారా, తార్పుడు, అనునయింపు వగైరావగైరా ప్రలోభాలనన్నింటినీ ప్రయోగించారు; అయితే తామెన్ని విధాలుగా ప్రయత్నించినా చివరకు వోటర్లు తాము కోరుకున్నట్టే వోటువేస్తారనీ వాళ్ళకు నిశ్చయంగా తెలుసు. బీహారీ తన ప్రధాననిర్వాహకుడిదగ్గర విరుచుకుపడ్డాడు 'ఈ సీక్రెట్‌బ్యాలెట్ తగలబడ! ఎవడో గాడిదకొడుకు కనిపెట్టాడు దీన్ని! ఇక్కడేమో నేను నానాగడ్డీ తింటున్నాను. ఇప్పటికి పదిహేనురోజులుగా ఈ పనికిమాలినపందులమీద ఉన్నదంతా ఊడ్చిపెట్టాను. ఇప్పుడు చిల్లిగవ్వ లేదు, అంతా అడుగులేని గోతిలోకేపోయింది. ఆ డబ్బుతో మా నాయన పోరుతున్నట్టు దేవాలయమో, ఆసుపత్రో కట్టించినా బాగుండేది. అబ్బే! రాజకీయవాదీ, దేశభక్తుడూ అయిన బీహారీ అలా చేసేవాడు కాడు! ఇంతకీ, ఇప్పుడు ఈ దిక్కుమాలినరాత్రి నే నెక్కడున్నాను? శూన్యంలో! ఇదే తమ జీవితంలో చిట్టచివరిరాత్రి అయినట్టు వాళ్ళంతా ఖుషీచేస్తున్నారు-లంజకొడుకులు-వాళ్ళ కావిషయం తెలుసు! డెబ్బై మంది వోటర్లకు ఏదో ఒకవిధంగా-నిజానికి వాళ్ళలో చాలామందికి ఒకరకంగా కాదు చాలా రకాలుగా-లంచాలు తినిపించాను. అయినా ఒక్కవెధవనుకూడా నమ్మడానికి వీల్లేని పరిస్థితి. ఎవడేం చేస్తాడో అది వాడికే తెలిసిన రహస్యం-బ్యాలెట్‌రహస్యం!'

బలిసిన నలుగురూ ఇలా చిరచిరలాడుతూ, ఆగ్రహం వెళ్ళగక్కుతూ ఉంటే పేదఅభ్యర్థులు రాత్రంతా నిద్రకు దూరంగానే గడిపారు. మంత్రులు తమ సిబ్బందితో కలిసి తెల్లవార్లూ శాసనసభ్యులహాస్టల్‌పై నిఘావేసి ఉంచారు. ప్రధానంగా తమతమ జిల్లాలకు చెందిన ఎం.ఎల్.ఏలను ఆగంతకులనుంచి, వాళ్ళ ప్రలోభాలనుంచి దూరంగా ఉంచడంకోసం వాళ్ళపై ఓ కన్నేసిఉంచమని తమ మనుషుల్ని పురమాయించారు.

అభ్యర్థులుకాని, వోటింగ్‌లోలేని, అమాంబాబతు రాజకీయవాదుల హడావుడి మరింత ముమ్మరం. ముఖ్యమంత్రి చౌదరి అనుచరులే ఫిరాయింపుల్ని ప్రోత్సహిస్తున్నట్టు నమ్మించడానికి మహేంద్రనాథ్‌వర్గం చేయగలిగిందంతా చేసింది. ఆ నింద మహేంద్రనాథ్‌మీద పడేలాచేసి ఆయనను పార్టీనుంచి బహిష్కరింపజేయడమే వాళ్ళ లక్ష్యం అన్నారు. మహేంద్రనాథ్‌పై కక్షతీర్చుకోడానికే చౌదరి అధిష్ఠానవర్గంతో తనకున్న సాన్నిహిత్యాన్ని వాడుకుంటున్నాడని ఆరోపించారు. మరోవైపున, కొందరు 'అధికారిక' అభ్యర్థులను ఓడించే కార్యక్రమంలోనే మహేంద్రనాథ్‌మనుషులు తలమునకలౌతున్నట్టు చౌదరివర్గీయులు ఇల్లెక్కి అరవడం ప్రారంభించారు. చౌదరిపేరు మంటకలపడానికే వాళ్ళు నిశ్చయించుకున్నారన్నారు. ఈ ఆరోపణలు, ప్రత్యారోపణలు ప్రతిఒకరినీ మరింత గంద్రగోళంలోకి నెట్టేశాయి. అంతిమంగా, దేనినీ త్రోసిపుచ్చలేమన్న నిర్ధారణ కొచ్చేశారు. కనుక ఏకైక సురక్షితమార్గం, అన్నింటినీ విశ్వసించడం... అంటే క్రియలో నువ్వు దేనిని విశ్వసించడానికి ఇష్టపడతావో దానిని స్వేచ్ఛగా విశ్వసించడం.

ఫిరాయింపులు, పునః ఫిరాయింపులు, పునఃపునః ఫిరాయింపుల గురించిన వదంతులు పొగమంచులా వ్యాపించిపోయాయి. ప్రతిఒకరూ ప్రతిఒకరినీ అనుమానిస్తున్నారు. ప్రతిఒకడూ ప్రతిఒకరిడినీ వెంటాడుతున్నారు, ప్రతిఒకడూ ప్రతిఒకడిపై కన్నేసి ఉంచుతున్నారు. అధికారపక్ష అభ్యర్థులు ఎందరు ఓటమిప్రమాదంలో ఉన్నారో మూచూసి అంచనావేసే ప్రయత్నంలో కేంద్రగూఢచారిసిబ్బంది అంతటా కలియతిరిగారు. వాడూవీడనిలేకుండా ప్రతిఒకళ్ళ 'కాకిలెక్క'ల్ని, అభిప్రాయాలనూ అడిగి తెలుసుకున్నారు. ఆ తర్వాత సొంత అంచనాలను రూపొందించుకుని ఢిల్లీకి నివేదికలు పంపించారు. 'వీళ్ళు మన అంచనాలకే మెరుగులు దిద్దితమెంతో లోతుగా పరిశోధించి తేల్చినట్టుగా పైవాళ్ళకి సమర్పించుకుంటారు' అని వ్యాఖ్యానించాడు రంధ్రాన్వేషి అయిన ఓ ఎం.ఎల్.ఏ. 'మన సెంట్రల్ఇంటెలిజెన్స్ బండారం అలా ఉంటుంది!'

ఈ హడావుడి, ఈ తోపులాట వెనుక ఎక్కడో అదృశ్యంగా, ఎవరికీ అనుమానం కలగనివిధంగా, ఈ నాటకంలో కీలకపాత్రధారులైన ఎం.ఎల్.ఏవోటర్లను లోబరచుకునే కార్యక్రమం లోపాయికారీగా జరుగుతూనేఉంది. తమ అహాలను, ఇష్టాలనూ పూర్తిగా చల్లబరుచుకునే ప్రక్రియ పూర్తయింది కనుక ఈ పాటికి వాళ్ళు తిరుగులేని నిర్ణయానికి వచ్చేఉంటారు. ఇన్ని వారాల ఎడతెగని ఆటలో ఇక ఇది చివరిఆట. నమ్మశక్యంకాదు, అయినా నిజం. ముఖ్యమంత్రిచేతికిందఉన్న మీటలు అనూహ్యంగా పనిచేయడం ప్రారంభించాయి. వెగటుపుట్టేస్థాయిలో విచ్చలవిడిగా జరిగిన ధనవినియోగం, మద్యప్రవాహం, కాముకవ్యాపారం మోహంమొత్తేస్థితికి చేరుకోవడంతో గత పదిహేనురోజులప్రయత్నం మెల్లగా బీటలువారింది. మరునాటి ఉదయం వోటువేయబోతున్న వ్యక్తుల మస్తిష్కాలలో అంతుబట్టని రసాయనిక్రియ ఏదో మొదలైంది. తమకే తెలియని ఏదో ఆందోళన లోపలినుంచి వాళ్ళను పీడించడం ప్రారంభించింది.

అదే సమయంలో బలిసిన నలుగురూ సాగించిన నీతిమాలినచర్యలు ఒకదానినొకటి రద్దుచేసుకుని చివరకు వాళ్లలో ఏ ఒకరికీ నికరమైనలాభం కలిగించలేకపోయాయి. గంటలు గడుస్తున్నకొద్దీ ఆ నలుగురి జిల్లాలకు చెందిన మంత్రులు హఠాత్తుగా చురుకుదనం పుంజుకున్నారు. బాహాటంగా వాళ్ళు చేసిందేమీ లేదు, అయినా ప్రధానంగా ఏమీ చేయనట్టు కనిపిస్తూనే ఆ నలుగురి ఓటమి అనే ఫలితసాధనకు అత్యంత నిగూఢంగా కట్టుదిట్టంగా అమలుజరిగిన కార్యక్రమం వాళ్ళది. ఆ నలుగురూ తమ పరిస్థితి ఎంతో పటిష్ఠమని విశ్వసిస్తుండగానే తెర వెనుక ఆపరేటర్లు వాళ్ళ పునాదుల్ని కదిలించడం ప్రారంభించారు. ఈ నలుగురూ బలిసిన ప్రత్యర్థులు తనకు పోటీగా తయారు కాగలుగుతారని భావించిన అధికారంలో ఉన్న ప్రతి వ్యక్తి ఈ పెళ్ళగింపు కార్యక్రమంలో డైనమైట్లా పనిచేశాడు. ఇతరుల్ని అధికారంలోకి రాకుండా నిరోధించడానికి వీరు తమ అధికారాన్ని వినియోగించుకున్నారు. అయితే పైకిమాత్రం అంతా గప్‌చిప్. విచ్చలవిడిధోరణి కొనసాగుతూనే ఉండి, ప్రచారం అంతిమఘట్టానికి చేరుకున్నకొద్దీ మరింత విశృంఖలంగా పరిణమించింది.

ఆఖరిక్షణాలలో అనుకోని మరో ప్రతిక్రియ పైకి పొడుచుకొచ్చి ఆ నలుగురి శిబిరాల్లో తీవ్రమైన అలజడిరేపింది. ఫిరాయింపుదార్లను సంతోషపెట్టి కూడగట్టుకునే తొందరలో ఆ

నాలుగుశిబిరాలనిర్వాహకులు అంతవరకూ తమకోసం నిజాయితీగా పనిచేస్తున్న వోటర్లనూ, కార్యకర్తలనూ పొరపాటున నిర్లక్ష్యంచేశారు. అది చాలా తీవ్రమైన లోపం, వ్యూహపరమైన తప్పిదం; అయితే అది ఆశ్చర్యజనకమేమీ కాదు. భర్త, భార్యని కాదని ఉంచుకున్నదానికి ప్రాధాన్యం ఇవ్వడం, భార్య, భర్తని కాదని ప్రియుడి వైపు మొగ్గుచూపించడం లాంటిదది అప్పటికే తమ చెప్పుచేతల్లో ఉన్నట్టు అనుకున్నవారికీ, మరింత ప్రయత్నంతో లొంగదీసుకోవలసినవారికీ మధ్య- సాదాసీదాగా కనిపించే నమ్మకస్థులకీ, అనిశ్చితంగా కనిపిస్తూ ఆకర్షించే వారికీ మధ్య పాటించే తేడా. అయితే రాజకీయజీవితంలో భార్యకీ, ఉంచుకున్నదానికీ, భర్తకీ, ప్రియుడికీ, విశ్వాసపాత్రుడికీ కపటికీమధ్య విభజనరేఖ ఎంతో అసాధారణమైనంత సన్నగా ఉంటుంది. పెద్ద ప్రయత్నం లేకుండానే ఒకరితో ఒకరు కలిసిపోగలరు. ఆ నలుగురి తరఫున ఒళ్ళొంచి ఎంతో నిజాయితీగా కష్టపడిన విస్మృతవోటర్లు ఆగ్రహంతో రగిలిపోయారు. ఫిరాయింపు అంత గౌరవప్రదం, అంత లాభదాయకం అయినప్పుడు చచ్చు విధేయత ఎవడిక్కావాలనుకున్నారు కక్షగా. బుద్ధీజ్ఞానం ఉన్నవాడెవడైనా లెక్కకురాని చుట్టంలా ఉండడాన్ని కోరుకుంటాడా!

తెల్లవారుతున్నకొద్దీ ఓ సరికొత్త తాత్వికత అంకురించడం ప్రారంభించింది. సూర్యుడు ప్రకాశిస్తున్నప్పుడు, పైసా ఖర్చులేకుండానే నువ్వా వెలుగులో మునిగితేలతావు; అంతేకానీ నువ్వు సూర్యుడికి బాకీపడేదేమీ ఉండదు. డబ్బు విషయంలోనూ అంతే; అది ఉమ్మడిసంపద, అది నీ దగ్గరకొస్తే తీసుకోవడమే నీ పని పైగా ఎప్పుడనుకుంటే అప్పుడు వచ్చేదికూడా కాదది. అలాగే మద్యం; అది దేవతలు సేవించిన సోమం; దేవతలు తమను పూజించే ప్రతిఒకళ్ళకీ చెందినట్లే అదికూడా అందరికీ చెందవలసిందే. సెక్స్‌విషయమూ అంతే, అందమైన ఆడవాళ్ళవిషయంలో ఎలా మెలగినా అందమే. దున్నేవాడిదే భూమి. తీసుకునేవాడిదే డబ్బు. తాగేవాడిదే మద్యం. స్త్రీలోలుడిదే స్త్రీ: ఇలా సందర్భాన్నిబట్టి నినాదాలు మార్చుకోవాలి. అలా ఉషఃకాంతులలో చీకటి కొట్టుకుపోతున్నకొద్దీ సరికొత్త మాయావాదం అందరినీ లోబరుచుకుంది. మొత్తంమీద వోటర్లు తామెవరికీ ఎలానూ రుణపడిలేమనుకున్నా రు. ఎంతైనా ఇది స్వతంత్ర దేశం, తమందరూ స్వతంత్రపురుషులు, స్వతంత్రస్త్రీలం అనుకున్నారు, అదోరకం మైకంలో బలిసిన ఆ పంది కొక్కులు నలుగురూ తమగురించే మనుకుంటున్నారు? తమను, గౌరవనీయశాసనసభ్యులైన తమను వాళ్ళు కొనే ప్రయత్నంచేస్తారా?

మరునాడు పోలింగ్ ప్రశాంతంగా ముగిసింది. ఆ నలుగురి మద్దత్తుదారులు పెద్దపెద్ద పూలదండలతో వోట్లలెక్కింపు జరుగుతున్న ప్రదేశాన్ని కమ్మేశారు. తమ హీరో త్వరలోనే మంత్రిగా ప్రమాణస్వీకారం చేయబోతున్నట్టు ప్రతి శిబిరమూ వేటికవే ఊహించుకున్నాయి. రామ్‌గోపాల్‌తోపాటు, ఓటమి అనివార్యమని అందరూ అనుకుంటున్న మిగిలిన అభ్యర్థులూ, ఇంకా మొదలుకాకుండానే అవమానంముగియడానికి నిరీక్షిస్తున్నట్టుగా ఓ మూల గుంపుగా కూర్చుండిపోయారు. వాళ్ళను గమనించినవాళ్ళే లేరు. మొదటి లెక్కింపు పూర్తికావచ్చింది, త్వరలోనే ఫలితాలప్రకటన జరగబోతోంది. ఆ నలుగురు, వాళ్ళ మద్దత్తుదారులు ఎంతో తేలిక పడినట్టుగా వాళ్ళ మొహాల్లో నవ్వులు విరబూస్తున్నాయి.

ఇంతలో, ధోవతీకుర్తా ధరించిన నడివయసు, బట్టతలమనిషి ఒకడు కౌంటింగ్‌గదిలోంచి కంగారుగా దూసుకొచ్చి బిహారీఅనుచరుడి చెవిలో ఏదో గుసగుసలాడాడు. అతడా గుసగుసను మరొకరి చెవినవేశాడు. అతిత్వరలోనే అది బుసతోకూడిన సవ్వడిగా, మర్మరధ్వనిగా, సుదీర్ఘమైన మూలుగుగా మారి పోయింది. మాటపెగలనిస్థితిలో ఒకరినొకరు చూసుకుంటూ ఉండిపోయారు. 'పిచ్చెత్తిన వెధవలు! నీతిజాతిలేని లంజకొడుకులు!' వాళ్ళలో ఒకడు పట్టలేని కోపంతో ఊగి పోతూ అన్నాడు.

ఆ తర్వాత అది కట్టలుతెంచుకున్న మహాప్రవాహంలా ముందుకు దూకింది. రామ్‌గోపాల్ ఒక్కటే మొదటిలెక్కింపులో ఎన్నికయ్యాడు అత్యాశ్చర్యకరంగా ఏమాత్రం నమ్మశక్యంకాని రీతిలో నలభైతొమ్మిది ఫస్ట్‌ప్రిఫరెన్స్‌వోట్లు తెచ్చుకున్నాడు! నలభైతొమ్మిది! 'నలభైతొమ్మిది!' అంటూ అక్కడి గుంపు దిక్కులు పిక్కటిల్లేలా అరిచారు.

రామ్‌గోపాల్ ఓ మూల వెనక్కివాలిపోయి కూర్చున్నాడు, కళ్ళుమూసుకున్నాడు. ఎవరో అతనిమీదపడి 'నలభైతొమ్మిది' అంటూ అరిచారు. రామ్‌గోపాల్ యాంత్రికంగా, ఏమీ అర్థం కానివాడిలా ఆ మాట వల్లించాడు, 'నలభైతొమ్మిది...?' అంతలో, తనప్పుడే విన్న ఆ మాట తాత్పర్యం ఎటువంటిదో పూర్తిగా బోధపడగానే గట్టిగా ఓ కేకపెట్టి స్పృహతప్పి నేలమీదికి ఒరిగిపోయాడు. అతనిలో అన్నిరోజులుగా గూడుకట్టుకున్న ఉద్రిక్తత ఒక్కసారిగా పైకుబికి అతణ్ణి ముంచెత్తింది.

ఆ తర్వాత పెద్దఎత్తున రేగిన గలభాలో అంబులెన్స్‌కోసం రిటర్నింగ్ ఆఫీసర్ పెట్టిన వెర్రికేక ఒక్కటే ఆఖరున అందరికీ వినిపించింది.

# 34

1964 మే 27వ తేదీన జవహర్లాల్ నెహ్రూ అస్తమించారు. ఆయన మరణం ఊహించనిదేమీ కాదు. కొంతకాలంనుంచి, ముఖ్యంగా చైనాయుద్ధంలో ఓటమి ఎదురైనప్పటినుంచి దేశవిదేశాలలో ప్రతి ఒక్కరూ ఈ పరిణామంగురించి ఎంతో ఆందోళనతో మాట్లాడుకుంటూనే ఉన్నారు, నేడో రేపో ఆ వార్త వింటామనే అందరూ భయపడుతున్నారు. అయినా ఆ వార్త అశనిపాతంలానే వచ్చి పడింది. యుద్ధపరాజయంతో అప్పటికే కుంగిపోయిన దేశం ఈ రెండో దుర్భరాఘాతంతో దుఃఖసముద్రంలో మునిగిపోయింది.

భగవంతుడా! ఇప్పుడు రావలసిన ఆపద కాదు! మొట్టమొదట ఆ వార్త వినగానే తమ చెవుల్ని తామే నమ్మలేకపోయిన ప్రతిఒకరూ అనుకున్నమాట ఇది. చైనాతో ఓటమి కలిగించిన నిస్పృహనుంచి దేశం తేరుకోకుండానే, ఇది వచ్చిపడవలసిన ఆపద కాదు. దేశాన్ని సంఘటితంగా ఉంచగలిగిన ఏకైకవ్యక్తిగా జవహర్లాల్ నెహ్రూ ఉనికి దేశానికి అత్యవసరమైనపరిస్థితిలో ఇది రావలసిన ఆపద కాదు... ఆయన లేని శూన్యం ఊహించడానికే భయంగొలుపుతున్నస్థితిలో రావలసిన ఆపద కాదు... పార్టీ, ప్రజలకు చేసిన వాగ్దానాలను కొంతవరకైనా నామమాత్రంగానైనా నెరవేర్చగలనని భావించే సమర్థనాయకుడు ఒక్కడైనా లేనిస్థితిలో మీదపడదగిన ఆపద కాదు. దేశవిదేశాల్లోని ఎందరో కలహస్వభావులు, దుస్తంత్రప్రవీణులు, ఆయన జీవించి ఉండగా కన్నెత్తిచూడడానికే భయపడి ఆయన అంతంకోసం కాచుకుని ఉన్నవేళ రావలసిన ఆపదకాదు.

ఆ రోజు మధ్యాహ్నం ఆనంద్ ఒక జాయింట్‌సెలక్ట్‌కమిటీసమావేశంలో తీవ్ర వాదోపవాదాల్లో మునిగి ఉన్నాడు. మునిసిపాలిటీలలో ఏ ప్రాతిపదికపై ఇంటిపన్ను విధించాలి? ఇదీ చర్చిస్తున్న అంశం. ఇంటి కిరాయివిలువ ప్రాతిపదిక కావాలన్నది ఇంచుమించు ఏకాభిప్రాయం. కమిటీలోని పలువురు సభ్యులకో లేదా వాళ్ళ దగ్గరబంధువులకో మునిసిపల్ పరిధిలో సొంతఇళ్ళు ఉన్నాయి. 'కాలపరీక్ష'కు నిలిచిన కిరాయివిలువ అనే సూత్రాన్ని మార్చడానికి వాళ్ళు ససేమిరా సిద్ధంగాలేరు. మునిసిపల్‌పరిపాలనామంత్రి సామర్థ్యంమీద ముఖ్యమంత్రి చౌదరికి తగినంత నమ్మకంలేక అతనికి సహాయమందించడంకోసం ఆనంద్‌ను ఆ కమిటీలో నియమింపజేశాడు. 'అటువంటప్పుడు అతణ్ణి మంత్రివర్గంలోకి ఎందుకు తీసుకోవాలి?' అని ఎవరో ఒకసారి ముఖ్య

మంత్రిని ప్రశ్నించారు కూడా. 'అన్నిరకాలవాళ్ళూ కలిస్తేనే ఒక మంత్రివర్గం అవుతుంది మిత్రమా, మూగవాళ్ళుకూడా పనికొస్తారు. తగిన కులంలో పుట్టినవాళ్ళయితే నిజానికి వాళ్ళే బాగా పనికొస్తారు' అన్నాడు చౌదరి. ఆ విధంగా ఆనంద్ ఆ సమావేశంలో అతిథిగా పాల్గొన వలసివచ్చింది, అయినా మెజారిటీ అభిప్రాయానికి వ్యతిరేకంగా ఇంటి మార్కెట్‌విలువను ప్రాతిపదికగా తీసుకుని పన్ను నిర్ణయించాలని వాదిస్తూ అందరికీ కోపం తెప్పించాడు. సమావేశానికి అధ్యక్షతవహించిన సంబంధితమంత్రి ఆ వాదంతో ఏకీభవించలేదు, కోపంతో కుతకుతలాడాడు. అయినా ఆనంద్‌వాదాన్ని బాహాటంగా వ్యతిరేకించే సాహసంచేయలేక పోయాడు. అతని దృష్టిలో ఆనంద్ ఒక ఆగంతుడికింద లెక్క, చౌదరి అతణ్ణి తీసుకొచ్చి ఈ కమిటీకి తగిలించాడు. ఆనంద్ చేసిన విధ్వంసపుసూచనతో చౌదరి ఏకీభవిస్తాడో ఏకీభవించడో అతడికి కచ్చితంగా తెలియదు. అయినా ముఖ్యమంత్రిని ఇరుకునపెట్టేలా తను వ్యవహరించడానికి లేదు.

వాదన తలాతోకా లేకుండా సాగిపోయింది. ఎంతోకాలంగా అమలు జరుగుతున్న సూత్రాన్ని నువ్వెలా కాదంటావ్? మరో ప్రాతిపదిక అంతకంటె బాగా పనిచేస్తుందనీ, మునిసిపాలిటీల ఆదాయం పెంచుతుందనీ అంత ధీమాగా ఎలా చెబుతావ్? దేశంలోని మరే మునిసిపాలిటీలోనైనా అది గొప్పగా పనిచేసిన దాఖలా ఏమైనా ఉందా? గుచ్చుకునే వ్యంగ్యంతో ఓ సభ్యుడు వ్యాఖ్యానించాడు. 'మినిస్టర్ ఆనంద్‌గారు ఈ భూప్రపంచంలో ప్రతివిషయంగురించి క్షుణ్ణంగా తెలిసినట్టు కనిపిస్తున్నారు. అయితే నేనిక్కడ ఓ విషయం గుర్తుచేయదల్చుకున్నాను. వనరులెలా పెంచుకోవాలన్నదే ఇప్పుడు చర్చనీయాంశం కానీ సోషలిజంగురించి ఆకాశపంచాంగం విప్పు కోడం కాదు! పన్ను విధింపు పద్ధతిని హఠాత్తుగా మార్చేసి ప్రమాదాన్ని ఎలా నెత్తికెత్తుకుంటాం? మీకు తెలుసు, ఇప్పటికే క్రయవిక్రయాలకోసం ఆస్తులవిలువ తక్కువచేసి చూపించడం పెద్దఎత్తున జరిగిపోతోంది. ఈ పరిస్థితిలో కొంగ్రొత్త కోరలతో పుట్టుకొచ్చినట్టున్న ఆనంద్‌గారి ఆలోచ నను మనం ఆమోదిస్తే, పన్ను తప్పించుకోడానికి విక్రయపత్రాలలో హాస్యాస్పదంకాగలిగినంత అతితక్కువధర చూపిస్తారనడంలో నా కెటువంటి సందేహంలేదు, చివరకు మునిసిపాలిటీలకు ఇప్పుడొస్తున్న ఆదాయంకూడా ఉండదు. ఈ విస్తారనష్టాలకు ఆనంద్‌గారు బాధ్యతవహిస్తారా? ఈ చట్టంద్వారా మునిసిపాలిటీలు మూతపడేందుకు ఆయన సిఫార్సు చేస్తున్నారా?'

అన్నివైపులనుంచి తనమీద దాడిజరుగుతున్నట్టు ఆనంద్ గ్రహించాడు. జవాబుచెప్పమని అధ్యక్షుడు తనను కోరినప్పుడు సావధానస్వరంతో ప్రారంభించాడు. 'అధ్యక్షా! ఇంటిపన్ను గురించేకాకుండా రాష్ట్రంలోని మునిసిపాలిటీల పరిపాలనకు ఒక సమగ్రచట్టంగురించి మనం యోచిస్తున్నవిషయాన్ని మీ దృష్టికి తీసుకొస్తున్నాను. మార్పుకోసం ఉద్దేశించిన ప్రతిఒక్క ప్రతిపాదననీ విడిగా పరిశీలించినప్పుడు అది అనిశ్చితంగానూ, ప్రమాదభూయిష్ఠంగానూ కనిపిస్తుంది. నూతనవాస్తవికతలో, చెల్లించగలిగినవాళ్ళనుంచి, చెల్లించదగినవాళ్ళనుంచి, చెల్లించితీరవలసినవాళ్ళనుంచి ప్రధానంగా మనం వనరులు సమీకరించుకోవాలి. ఇంటిమార్కెట్ విలువమీద ఆధారపడి ఇంటిపన్ను నిర్ణయించాలన్న నా సరళసూత్రీకరణ ఎంతో పటిష్ఠమే కాదు, తప్పించుకోలేనిది కూడా. ఇతరపార్టీలకుచెందిన గౌరవనీయసభ్యులు సోషలిజాన్ని

ఎద్దేవాచేస్తే చేయవచ్చు. కానీ అది అధికారపక్షం ఎంచుకున్న విధానం. ఇప్పుడు గౌరవనీయ సభ్యుడు వెక్కిరింపుగా ప్రస్తావించినా, నేను అక్షరాలా దానినే సూచిస్తున్నాను. పగటికలను స్ఫురింపజేసే అభిప్రాయాన్నే నేను కరకుదేలిన ఓ కొత్త మునిసిపల్‌చట్టంగా మారుస్తున్నాను. అలా చేయడానికి నాకు అధికారం ఇచ్చింది మరెవరోకాదు, మన గౌరవనీయ ప్రధానమంత్రి జవహర్లాల్ నెహ్రూ...'

సరిగ్గా అదేక్షణంలో ఎవరో ఒక చీటీ తెచ్చి అధ్యక్షునిచేతికిచ్చారు. ఆయన దానివైపు చూశారు, మళ్ళీమళ్ళీ చూశారు. గదినిండా నిశ్శబ్దం అలముకుంది, అందరినీ విపరీతమైన ఉత్కంఠ ముంచెత్తింది. మెల్లగా, దుఃఖితప్తస్వరంతో అధ్యక్షుడు ప్రకటించాడు, 'మిత్రులారా, చాలా దిగ్భ్రాంతికలిగించే వార్త. మన ప్రియతమప్రధాని జవహర్లాల్ నెహ్రూ ఇక లేరు'

సమావేశంలో ఉన్న ప్రతిఒకరిలో ఆవేదనాపూర్వక నిశ్వాసం తోసుకొచ్చింది. ఆనంద్‌మినహా అందరూ కొన్ని క్షణాలలో ఆ గదిలోంచి వెళ్ళిపోయారు. మోచేతులు టేబిల్‌కు ఆనించి, అరచేతులమధ్య తలఉంచుకుని ఆనంద్ చాలాసేపు అలాగే కూర్చుండిపోయాడు. ఎన్నో సంవత్సరాలక్రితం నాన్న దూరమైనప్పుడుకూడా కలగనంత దుఃఖోద్వేగానికి ఇప్పుడు లోనయ్యాడు. జవహర్లాల్ ఒక వినూత్నభావప్రపంచానికి రూపకల్పనచేసి అందించాడు, అసంఖ్యాక జన సమూహంలో ఆశావహస్ఫూర్తినీ, ఉత్తేజాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ మేలుకొలిపాడు. భారతదేశం ప్రపంచంలో తన స్థానాన్ని నిర్వచించుకునేందుకు దోహదంచేశాడు. ముందెన్నడూ ఇలా ఒక నిష్ఠదరిద్రదేశం ఠీవిగా శిరసెత్తుకుని సంపన్నదేశాల కళ్ళలోకి తేరిచూడగలిగిన సందర్భం లేదు. ముందెన్నడూ, అధికారధనబలాలతో మదించిన శక్తులు, ప్రపంచసమితుల్లో ప్రసంగించడానికి జవహర్లాల్ లేచినిలబడిన వెంటనే తోకముడిచి మౌనంవహించిన సందర్భాలవంటి సందర్భం పూర్వమెన్నడూలేదు... మృతప్రాయమైన జాతీయోత్పత్తిఅంకెలకంటె జాతిగౌరవానికే ప్రాముఖ్యం ఇచ్చుకున్న సందర్భమది. సంపన్నదేశాలు తమ మనసుల్లో అపహాస్యం చేయాలని ప్రయత్నించాయి; కాని అదంతా వారి మనసుల్లోనే. బహిర్గతంగా మాట్లాడే దమ్ములు వారికిలేవు. అయితే ఆంతరంగిక విధానాలు, వాటి అమలుకు సంబంధించి సొంతపార్టీలోనే ఎందరో జవహర్లాల్ ఆదేశాల్ని ఉల్లంఘించారు —ఎంతో భక్తిపూర్వకంగానే ఉల్లంఘించారు! ఆయన అస్తమయంతో ఇక ఇప్పుడేం జరుగుతుంది? —ఆనంద్ ప్రశ్నించుకున్నాడు. సిద్ధాంతబద్ధతను మచ్చుకైనా నిలుపుకోవడం సాధ్యమౌతుందా? దిక్కులేనితనం, శూన్యం, నిరాశ ఒక్కసారిగా అతణ్ణి ఆవరించేశాయి.

ఎవరో తనభుజాన్ని మృదువుగా స్పృశించినట్టనిపించి తలతిప్పిచూశాడు. ఎదురుగా అరుణ. ఆమెకళ్ళు ఎర్రగా ఉబ్బిఉన్నాయి. ఇద్దరూ ఆ హాల్లోంచి కదిలి పార్కు వైపు అడుగులువేశారు. దూరంగా ఓ మూల బెంచీ మీద కూర్చుని దుఃఖంలో కూరుకుపోయారు.

ఆనంద్ జ్ఞాపకాలదొంతరలోకి జారిపోయాడు. వాటిలో కొన్ని పాతవి, కొన్ని ఇటీవలివి. నెహ్రూ ఆత్మకథ చదువుతున్నందుకు ఓసారి పాఠశాలఅధికారులు తనను శిక్షించారు. ఆకాలంలో

ఎన్నోమాసాలపాటు తన మెరిట్‌స్కాలర్‌షిప్‌డబ్బు కూడబెట్టి రహస్యంగా రాష్ట్రం విడిచివెళ్ళే వరకూ తను పండిట్‌జీని ప్రత్యక్షంగా చూడలేదు. అప్పట్లో బొంబాయిప్రెసిడెన్సీలో భాగంగాఉన్న గుజరాత్‌ప్రాంతంలోని హరిపురాలో జరుగుతున్న పార్టీ ప్లీనరీసదస్సుకు వెళ్ళాడు తను. అంత జనసందోహాన్ని అతడెన్నడూ చూడలేదు. సువిశాల మైదానంలోకి అడుగుపెట్టీపెట్టగానే దట్టమైన జనసమ్మర్దంలో చిక్కుకుపోయాడు, ముందుకీ వెళ్ళలేకపోయాడు, వెనక్కీ రాలేకపోయాడు. ఊపిరాడక చచ్చిపోతానేమో ననుకున్నాడు. అయితే ఆ బలమైన తోపులాటలో తన ప్రయత్నం లేకుండానే అంగుళంగుళంగా బహిరంగసభాస్థలికి చేరుకోగలిగాడు. చేరుకున్నవెంటనే తనకు కలిగిన అసౌకర్యాన్ని మరిచిపోయి చుట్టూఉన్న కాఠియావాడీ గ్రామీణుల్లానే జాతీయనాయకుల్ని ఒక్కొక్కరినే గుర్తుపట్టడంలో మునిగిపోయాడు —జవహర్లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్, సర్దార్ వల్లభభాయ్‌పటేల్, మౌలానా ఆజాద్, పట్టాభి సీతారామయ్య, ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ (అందరికంటె ఎత్తుగా), ఇంకా ఎందరెందరో. ముంచెత్తిన భావావేశంతో ఒక్కొక్కసారి ఆగుతూ, ఒక్కొక్కసారి ఝురీవేగంతో ముందుకుదూకుతూ నిజాయితీఉట్టిపడేస్వరంతో సాగిన జవహర్లాల్ నెహ్రూ అభిభాషణను తాను వినడం అదే మొదటిసారి. ఆ సందర్భం, ఆ కంఠధ్వని తన జీవితాంతం గుర్తుండిపోతాయి. శిరస్సున ఎంతో అందంగా అమర్చుకున్న గాంధీటోపీతో నెహ్రూరూపం అతని జ్ఞాపకాలలో చెరగనిముద్రలా మిగిలిపోయింది. నెహ్రూలోని దేశభక్తి, ఆదర్శవాదం, ఉదారవాదం, ఇతరులలో ఎంతో అరుదుగా కనిపించే, నిర్వచనానికి అందకపోయినా ఇంచుమించు ప్రస్ఫుటంగా తొంగిచూసే, సుసూక్ష్మవివేచనాకౌశల్యంవంటి గుణగణాలు ఆనంద్‌ను ముగ్ధుణ్ణిచేశాయి. అతణ్ణి మరీమరీ లోగొన్నది, ఈ అరుదైన సర్వగుణసమ్మేళనం ఒకేవ్యక్తిలో గోచరించడం. ఆ సదస్సు తర్వాత జవహర్లాల్ రచనలకోసం ఇంకా ఎన్నెన్ని గ్రంథాలయాలు అతడు గాలించాడో లెక్కలేదు. తనపైన రాజకీయంగా ప్రప్రథమంగా, ప్రముఖంగా ప్రభావితంవేసింది నిస్సందేహంగా నెహ్రూయే.

తదుపరి అతనిపై గాఢంగా ముద్రవేసిన సమాగమం త్రిపురిలో జరిగిన పార్టీప్లీనరీసదస్సు. అప్పట్లో మధ్యపరగణాలుగా పిలవబడిన ప్రాంతంలో నర్మదాతీరంలో ఉన్న జబల్పూర్‌కు సమీప కుగ్రామం అది. బ్రిటిష్ఇండియాలో జరిగే రాజకీయసభలకు వెళ్ళడానికి గుట్టుచప్పుడు కాకుండా సంస్థానరాష్ట్రం విడిచివెళ్ళేవిద్యలో ఆనంద్ అప్పటికే ఆరితేరాడు. త్రిపురిలోనే నెహ్రూజీలో శీఘ్రకోపాన్ని తిలకించే అవకాశం కలిగింది. ఆయన ఓ బహిరంగసభలో మాట్లాడుతూఉండగా ఒక విమానం పెద్దశబ్దంతో చుట్టూతిరుగుతూ శ్రోతల ఏకాగ్రతను మళ్ళించింది. జవహర్లాల్ ఆగ్రహంతో ఊగిపోతూ, సమావేశస్థలికి దగ్గరగా ఏ విమానం రావడానికి వీల్లేదని గట్టిగా కేకలుపెట్టారు. ఆ ఉత్తర్వును ఆచరించేదెవరా అనుకుంటూ ఆనంద్ ఆశ్చర్యపోయాడు! అయితే విచిత్రంగా ఆ విమానం మళ్ళీ ఆ దరిదాపులకు రాలేదు. ఇతర లక్షణాలతోపాటు నెహ్రూలోని ఆ చండశాసనప్రవృత్తికూడా ఆనంద్‌ను విశేషంగా ఆకర్షించింది. బహుశా నాయకుల వ్యక్తిత్వంలో ఒకింత శీఘ్రకోపం (నిజమైనదైనా, తెచ్చిపెట్టుకున్నదైనా) తప్పనిసరిగా మిళతమైఉండాలేమోనని తలపోసేస్థితికివచ్చాడు. ఓరిమిపట్ల బొత్తిగా ఓరిమి

లేనివాళ్ళే చాలామంది అనుకుంటూ లోలోపలే నవ్వుకున్నాడు తనలో ఆ కోపలక్షణం మచ్చుకైనా లేదని తనకు తెలుసుకనుక ప్రత్యేకించి ఆ స్పృహ అతనికి కలుగుతూవచ్చింది. ఆవేశాన్నీ, కలవరాన్నీ నిగ్రహించుకోవడంలో, తనను లోలోపల దహిస్తున్న అటువంటి భావాలను మరెవరూ కనిపెట్టకుండా జాగ్రత్తపడడంలో తనకుతనే తగిన శిక్షణ ఇచ్చుకున్నవాడు కావడంతో జవహర్లాల్‌ను మరింత గాఢంగా అభిమానించసాగాడు

నెహ్రూ ఆగ్రహప్రదర్శనను ప్రత్యక్షంగా దర్శించిన మరో సందర్భాన్ని అతడు గుర్తుచేసుకున్నాడు. పునేలో నెహ్రూ ప్రసంగించబోయే ఒక పార్టీసమావేశానికి వెళ్ళాడు ఆనంద్. సమావేశానికి ముందు నెహ్రూ, ఫెర్గూసన్‌కాలేజి విద్యార్థుల నుద్దేశించి మాట్లాడారు. ఆ సమావేశంలో ఎదురైన ఒక ఆసక్తికరమైన ఉదంతాన్ని స్మరించుకున్నాడు ఆనంద్. పునేలో (అప్పట్లో పూనా) ఆ కాలేజీలో చదువుతున్న ఒక మిత్రుణ్ణి కలుసుకోడానికి వెళ్ళిన ఆనంద్ పండిట్‌జీ ప్రసంగం వినడానికి ఎంతో ఉత్సాహంగా అక్కడికి చేరుకున్న గుంపులో చేరాడు. వలయాకృతిలో ఉన్న కాలేజిథియేటర్ స్తోమతనుమించి జనం చేరడంతో, నెహ్రూ అడుగుపెట్టేసమయానికి అక్కడంతా గోలగోలగా తయారైంది. ఆ గొడవను తొక్కిపెట్టడానికీ, బహుశా పండిట్‌జీని కొంతైనా శాంతింప చేయడానికీ కొందరు విద్యార్థులు నినాదాలు (పండిట్‌జీ జిందాబాద్ వగైరా) చేయడం ప్రారంభించారు. అయితే ఈ ప్రయత్నం బెడిసికొట్టింది. పండిట్‌జీ మరింత ఆగ్రహోదగ్రులయ్యారు. అప్పుడే ఆయన యుద్ధంవల్ల ఛిద్రమైన ఓ దేశం సందర్శించివచ్చారు. అక్కడి ప్రజల కడగండ్లు ఆయన ప్రత్యక్షంగా చూశారు కనుక ఆ జ్ఞాపకాలు ఆయన మస్తిష్కంలో పచ్చిపచ్చిగా ఉన్నాయి. కాస్త గోల సద్దుమణగగానే, విద్యార్థుల బాధ్యతారహితప్రవర్తనపై ఆయన ఒక్కసారిగా విరుచుకుపడ్డారు. ఆ క్షణాన వేరేదేశాల్లో విషాదకరఘటనలు జరిగిపోతున్నా పట్టించుకోని విద్యార్థులను తప్పుపట్టారు. ఆయన ఎంతగా మండిపడ్డారంటే, భారతదేశంలోనే కొన్నిప్రాంతాల్లో కావాలని బాంబులు కురిపిస్తేతప్ప విద్యార్థులు తెలుసుకోలేరనేశారు! (అదృష్టవశాత్తు పునేమీదనే బాంబులు పడాలని ఆయన అనలేదు). అలా ఆయన కోపంవెళ్ళగక్కినతర్వాత పూర్తిగా నిశ్శబ్దం అలముకుంది, ఆ తర్వాత ఎంతో ఉద్రేకపూరితమైన, ఉత్తేజకరమైన చక్కని ప్రసంగంచేశారు నెహ్రూ.

నెహ్రూ బహుముఖవ్యక్తిత్వంలోని వివిధకోణాలను ఒకదానివెంట ఒకటి గుర్తుచేసుకుంటూ ఉండిపోయాడు ఆనంద్. ఒక రంగంలో కాదు, ఆలోచనకీ, ఆచరణకీ సంబంధించిన అనేక రంగాలలో ఆయన దేశానికి మార్గదర్శనంచేశారు. దేనిని తాకితే దానిని ఉజ్వలింపజేశారు — ఆయన చేయిపడని రంగమేలేదు. జైలులో గడిపిన ప్రతిసందర్భంలోనూ చిరస్థాయిగాఉండిపోయే విలువైనరచనలుచేశారు, ఎంతో విషయపరిజ్ఞానం ఎంతో స్పష్టతఉట్టిపడే రచనలవి. జవహర్లాల్ ఖైదులో ఉన్నప్పుడు సాహిత్యం, బయటఉన్నప్పుడు రాజకీయాలు లాభపడ్డాయని అన్నవారు ఎందరో. ఆయనలోని మహోన్నత సంస్కారం మొక్కబోని నిజాయితీతో మరింత సాంద్రతను సంతరించుకుంది. అత్యంతప్రతికూలక్షణాలలోకూడా పాశ్చాత్యమస్తిష్కాలను తనవైపు తిప్పుకోగలిగిన వ్యక్తిత్వం ఆయనది. ఆయనలో మొరటుతనం మచ్చుకైనా లేదు ఇందువల్ల సహచరసమూహంలో ఉన్నప్పుడు, వాళ్ళు సద్గుణసంపన్నులే అయినప్పటికీ, ఆయనో వింత

జీవిగానూ, ఆ గుంపులో ఏమాత్రం అతకనిమనిషిగానూ కనిపించేవారు. పండిట్‌జీ భారతరాజకీయరంగస్థలిపైకి అడుగుపెట్టిన అదోరకం 'విజాతీయుడు' కాదుకదా అనుకుని ఆనంద్ ఒక్కొక్కసారి ఆశ్చర్యపోతూ ఉండేవాడు ఆ అపసవ్యపు ఆలోచనకు తనలోతనే నవ్వుకుంటూ ఉండేవాడు.

ఒకానొక సన్నివేశం ఆనంద్ జ్ఞాపకాల్లో నిలిచిపోయింది. ఓ పెద్దనదిమీద తలపెట్టిన సేద్యపు నీటిప్రాజెక్టుకు శంకుస్థాపనచేయడానికి ఆయన రాష్ట్రాన్ని సందర్శించారు. నిరక్షరాస్యులు అధిక సంఖ్యలో ఉన్న గ్రామీణులు వేలాదిమంది ఆయన 'దర్శనం'కోసం అక్కడికి చేరుకున్నారు. ఆకట్టుకునే రమణీయనదీదృశ్యాన్ని, చుట్టూఉన్న హరితగిరులనీచూస్తూ పండిట్‌జీ తనను తను మరిచిపోయారు. తను విస్తృతంగా రచించిన నదీలోయనాగరికతపై ఆ రోజు అద్భుతోపన్యాసం చేశారు. ఆయన వాగ్ధాటి అమోఘం, అదెంతో సమాచారమిళితమూ, సరళమూ. అక్కడి నిరక్షరాస్యప్రజానీకానికి ఆయన ప్రసంగాన్ని అనువదించి చెబుతున్నప్పుడు గంటన్నరసేపు స్త్రీపురుషులు మంత్రముగ్ధులై వింటూఉండిపోయారు. పండిట్‌జీ ప్రసంగంలోని ప్రతిమాటనీ ప్రతిఒక్క గ్రామీణుడూ అర్థంచేసుకున్నాడనీ, జాతిఘనతను తలచుకుని తనెంత గర్వించాడో అంతగానూ గర్వించాడనీ ఆనంద్ నిస్సందేహంగా భావించాడు. అదో మరపురాని ప్రసంగ విన్యాసం, నెహ్రూజీ హృదంతరంనుంచి నేరుగా దూసుకొచ్చిన వాక్ప్రవాహం.

అలీనవాదం, శాస్త్రీయదృక్పథం, మిశ్రమఆర్థికత, సోషలిజం, స్వతంత్రగణతంత్రరాజ్యాల కామన్వెల్త్ అనే ఊహ, ప్రభుత్వరంగం, జాతీయప్రయోగశాలల అవతరణ, ప్రణాళికా సంఘం, పంచవర్షప్రణాళికల ఆవిర్భావం, నిరాయుధీకరణ, దేశాలమధ్య ఆర్థికసహకారం, యుద్ధవైముఖ్యం, ఐక్యరాజ్యసమితిపాత్ర, సాహిత్య, సంగీత, నృత్య, కళా అకాడెమీల స్థాపన, జాతీయపురస్కారాల ఏర్పాటు —ఇలా ఎడతెగని ఎన్నెన్నో ఆలోచనలతో, దృశ్యపరంపరతో ఆనంద్ మస్తిష్కం కిక్కిరిసిపోయింది.

ఆ దురదృష్టకర మధ్యాహ్నవేళ అరుణ పక్కన కూర్చున్న ఆనంద్ నిరంతరాయంగా మాట్లాడుతూనే ఉన్నాడు —ఒకసారి గద్గదస్వరంతో, ఒకసారి లోపలి అలజడికి అద్దంపట్టే స్వగతాలతో. ఏవేవో తలపులమధ్య హఠాత్తుగా విచారం కమ్ముకురాగా 'ఇప్పుడేం జరుగుతుంది...?' అని తనలో తనే గొణుక్కుంటున్నాడు. కరిగిపోతున్న గతాన్నీ, భయంగొలుపుతూ అతిసన్నిహితంగా కమ్ముకున్న భవిష్యత్తునూ, నిర్విరామంగా నిర్దాక్షిణ్యంగా ముందుకు సాగిపోతున్న వర్తమానాన్నీ అతడు ఏకకాలంలో దర్శిస్తున్నాడు... అరుణ నిశ్శబ్దంగా వింటూ, ఓదార్చే ప్రయత్నంచేస్తోంది. దేశభవిష్యత్తు గురించిన సందేహాలు పూర్తిగా ముంచెత్తేసరికి క్రమంగా ఆనంద్ మనఃస్థితిలో మార్పువచ్చింది. ఆగ్రహపరితాపాల జంటతాకిడికి నిలువునా చలించిపోయాడు.

'కాని ఇప్పుడు, భవిష్యదాఘాతాలనుంచి మనల్నిమనం రక్షించుకోడానికి ఈ పెద్దమనిషి చేసిన వ్యవస్థ ఏమిటి?' ఆనంద్ ఇంచుమించు అరచినట్టుగా అన్నాడు. ఆనంద్ మాటల్లోని

అవిధేయతకు అరుణ విస్తుపోయి బెదురుచూపులు చూస్తూఉండిపోయింది. 'ఆయన మనకెన్నో ఉదాత్తభావాలు అందించాడు, వ్యక్తిగతంగా ఓ మహాదర్శంగా నిలిచాడు, మహోజ్జ్వలకార్యాలు సాధించాడు, ప్రపంచసమితుల్లో అనన్యమైన గౌరవాన్ని తెచ్చిపెట్టాడు, భౌతికవికాసానికి విస్తృతనేపథ్యం రచించాడు, దృఢమైన సైద్ధాంతికనిబద్ధతను అందించాడు, భవిష్యత్తుపట్ల ఆశలు రగిలించాడు .. నిజమే... నిజమే... నిజమే! కానీ ఈ వారసత్వాన్ని అందిపుచ్చునే మనిషి ఏడీ? తనకోసం ఒక మహోజ్జ్వలస్థానాన్ని సృష్టించుకున్నాడు, కానీ ఆయన వారసులు దేశాన్ని ఎటు తీసుకువెడతారు? తను మహాత్మాగాంధీకి వారసుడైనప్పుడు, తన వారసుడెవరు? సమష్టినాయకత్వమా? దేనికని? ఎవరికోసం! దేశభవిష్యత్తుకోసం తను అల్లిన ఆశలపందిరిని నిలబెడుతున్నది కేవలం తన ఒక్కడి వ్యక్తిత్వమేనని ఆయన ఎందుకు తెలుసుకోలేకపోయాడు? తన అస్తమయంతర్వాత దానిని నిలబెట్టేదెవరు? ఏదీ ఆ స్థిరవిశ్వాసం? ఏదీ ఆ భవిష్యద్దర్శనం? ఆ దీపం కొండెక్కేముందు వెలిగించిన మరోదీపం ఏదీ? నెహ్రూవాదంగా ముద్రవేయించుకున్న నెహ్రూఆలోచనాసరళికి పార్టీ తప్పక కట్టుబడేఉంటుందని మనకు హామీ ఇవ్వగలిగిన వారెవరు? మిశ్రమస్థితి అనేది యథాతథస్థితిని కొనసాగించడానికే ఉద్దేశపూర్వకంగా ఉపయోగించడం జరిగితే మిశ్రమఆర్థికవ్యవస్థ ఏమాత్రం పనికొస్తుంది? భౌతికసౌకర్యాలు కల్పించే తొందరలో మానవతాకోణాన్ని విస్మరించినప్పుడు జాతీయప్రణాళిక సాధించగలిగిందేముంటుంది? సోషలిజం వాస్తవికనమూనా ఎలా పరిణమించబోతోంది?... నేనిటువంటి పెద్దపెద్ద ప్రశ్నలు వేయడానికి తగనంత అల్పుణ్ణని నాకు తెలుసు. అయినా మనకు ఇష్టంఉన్నా లేకపోయినా మనల్ని అంగుష్ఠమాత్రులే ఇప్పుడు పరిపాలించబోతున్నారన్నది తిరుగులేని వాస్తవం మరో జవహర్లాల్ ఎవరూ దిగిరాబోవడంలేదు. ఆయన మరో అయిదేళ్ళు జీవించిఉంటే, పార్టీ కొద్దిమాసాలక్రితం భువనేశ్వర్‌సమావేశంలో నిర్ద్వంద్వంగా ఆమోదించిన ఆయన ఊహలోని సోషలిజంచిత్రం ఒక నిర్దిష్టమైనఆకృతిని ధరించిఉండేది. ఇప్పుడు సోషలిజంపేరుతోనూ, ఆ శైలిలోనూ మరేదో సంభవించబోదన్న హామీ ఏదీ?...'

ఆనంద్ అలా మాట్లాడుతూనే ఉండిపోయాడు. ఒక పథకంప్రకారం నడిచే ఇంతటి భారీ యంత్రాంగంలో తనొక నలుసునని కానీ, ప్రపంచచరిత్రలోనే తనకంటూ ఒక సుస్థిరస్థానాన్ని ఏర్పరచుకున్న ఒక మహానాయకుడిపై తను ఆక్రోశం వెళ్ళగక్కుతున్నానని కానీ అతని కా క్షణంలో స్ఫురించలేదు. అరుణ మెల్లగా అతడిభుజంతట్టి అంది, 'ఏమైంది నీకు? ఎందుకంత నిరాశావాదిలా మాట్లాడుతున్నావ్?'

'నేను నిరాశావాదిని కాను అరుణా, నన్నపార్థం చేసుకోకు' ఆనంద్ కోపంగా అన్నాడు. 'ఢిల్లీలో ఉన్న నాయకులమీదే కాదు, దేశంలో ఇతరత్రా ఉన్న నాయకులమీదకూడా నా కెటువంటి అగౌరవం లేదు. వాళ్ళందరూ దేశభక్తులు, గొప్ప స్వాతంత్ర్యసమరయోధులు, పరిపాలనాదక్షులు, చక్కని సంఘటనా సామర్థ్యం ఉన్నవాళ్ళు, అలుపెరుగని కార్యకర్తలు. అయినాసరే మన పార్టీలో ఈ క్షణాన దార్శనికుడు ఒక్కడూ నాకు కనిపించడంలేదు. అంటే, నా ఉద్దేశంలో దానర్థం, మనందరం క్షుద్రవివాదాల్లో కూరుకుపోయే ప్రమాదం తలెత్తబోతోందన్న

మాట. జనాన్నికూడా అనివార్యంగా మనం ఆ స్థాయికి దిగజార్చుతాం. అంటే, దానర్థం మళ్ళీ, కులం, మతం, ముఠాతత్వం, ప్రాంతం మొదలైనవి దేశాన్ని విధ్వంసంవైపు నడిపించే మేరకు ముదిరిపోతాయన్నమాట... నెహ్రూ తపనంతా దేశసమైక్యతకే ఉండేది. ఆ ఐకమత్యం ఎలా సాధ్యమౌతుంది? అందులో మిళితమైన అంశాలేమిటి? దానిని అనివార్యంగా జాతీయలక్ష్యాలతో మేళవించనవసరంలేదా? సారాంశంలో అది సైద్ధాంతికం కావడంలేదా? జనం ఒకవైపున దేశానికి సేవచేస్తున్నట్టు చెప్పుకుంటూనే మరోవైపున పరస్పర విరుద్ధప్రయోజనాలకోసం ఘర్షణపడుతున్నప్పుడు సమైక్యత సాధ్యమని ఎలా భావించగలం? నే నిక్కడ ప్రస్తావిస్తున్నది మౌలికవైఖరుల గురించి, వ్యక్తిగతవివాదాలు, ఘర్షణలగురించి కాదు. సోషలిజాన్ని ఏకగ్రీవంగా ఆమోదించడంతోనే ప్రభుత్వం నడకలో అది ప్రతిబింబిస్తుందనీ, జాతి మౌలికలక్ష్యంగా మారుతుందనే ప్రతిఒకరూ ఆశిస్తారు. వేరే దేశాలనుంచి ఎరువుతెచ్చుకున్న సోషలిజంకాదు, పండిట్‌జీ అనేకసార్లు స్పష్టంగా నొక్కిచెప్పినట్టు ఈ దేశపు స్వభావానికి అనుగుణంగా రూపొందించుకున్న స్వదేశీసోషలిజం —మన పెద్దలు దీనినే యుగధర్మ అన్నారు. ప్రభుత్వం తీసుకునే చర్యల నిగ్గుతేల్చే గీటురాయి అదే కావాలి. నిజం చెప్పాలంటే ఇకమీదట ఇలా జరుగుతుందని నాకు అనిపించడంలేదు. పండిట్‌జీ మరణంతో మొట్టమొదట చావుదెబ్బతినబోతున్నది సోషలిజమేనని నేను భావిస్తున్నాను.'

మే మాసాంతంకనుక ఆ రోజు పగలు సుదీర్ఘంగా ఉంది; దేశానికి దాపురించిన కష్టంతో అది మరింత సుదీర్ఘంగా, మరింత దుర్భరంగా తోచింది. పబ్లిక్‌పార్క్‌లోని బూరుగుచెట్లు, తమాలవృక్షాల నీడలు పొడవుగా పరచుకుంటున్నాయి. దుఃఖభారంతో కుంగిపోయి అలసిపోయిన ఆ ఇరువురూ అతికష్టంమీద లేచి అక్కడినుంచి కదిలారు. ఆనంద్ తన నివాసానికి చేరుకునేసరికి ప్రపంచం నలుమూలలనుంచి వందల సంఖ్యలో సంతాపసందేశాలు ప్రవాహంలా వచ్చిపడుతున్నట్టు తెలిసి ఆ పరిణామం కలిగించిన వెలితి ఎంత పెద్దదో, ఎంత బాధాకరమైనదో మరింత బాగా అర్థమైంది. దేశంలో, విదేశాల్లో, సర్వత్రా ఏర్పడిన వెలితి అది.

ఒకవైపున నెహ్రూ అంతిమ యాత్రకు ఏర్పాట్లు జరుగుతుండగానే మరోవైపున ఆయన రాజకీయవారసుడెవరన్న ప్రశ్న తోసుకొచ్చింది. భారతరాష్ట్రపతి 'తాత్కాలిక' ప్రధానిగా గుల్జారీలాల్‌నందాను నియమించారు కానీ, 'తర్వాత ఎవర'న్న ప్రశ్న ఆ కొద్దిరోజుల్లో లక్షలాది మస్తిష్కాలను కసరత్తుచేయించింది. అధికారపక్షానికిచెందిన పార్లమెంటుసభ్యులమధ్య అదే పనిగా మంతనాలు జరిగిపోతుండగా, దేశమంతటా ఆలోచనాపరులైన స్త్రీపురుషులు సంపూర్ణరాజకీయచిత్రంలో దానినొక కీలకమైన పరివర్తనగా ఊహించుకున్నారు. అది కేవలం అధికారానికి సంబంధించిన ప్రశ్న కాదు. కేవలం వ్యక్తిత్వానికి సంబంధించిన ప్రశ్న కచ్చితంగా కాదు. అలాగే పేరుప్రఖ్యాతులకు సంబంధించిన ప్రశ్నకూడా కాదు. పాక్షికంగా వీటన్నింటికీ సంబంధించినదే అయినా వీటన్నింటినీ మించిన ప్రశ్న. అది నాయకత్వానికి సంబంధించిన ప్రశ్న, 'దేనికి నాయకత్వం?' అని ప్రశ్నించుకున్నప్పుడు, అది వాస్తవంగా దేశభవిష్యత్తుకు సంబం

ధించిన ప్రశ్న. అయితే, ప్రశ్నలన్నింటినీమించిన ఈ ప్రశ్నను పత్రికలు చాలావరకూ విస్మరించాయి. సమర్థులూ కాని, స్థిరత్వమూ లేని ఇద్దరు అభ్యర్థులమధ్య ఎంపికకు సంబంధించిన ప్రశ్నగానే వాటిలో అనేకం దానిని పరిగణించాయి. వర్తమానపరిస్థితిని వారు అతిసామాన్యమైనదిగా విశ్లేషించారు. రాజకీయప్రక్రియ అంటే అధికారంకోసం, వ్యక్తిగతంగా పైకి రావడంకోసం పాకులాడుతూ పరస్పరం గొంతులు కోసుకోవడమేతప్ప మరేమీకాదన్న అభిప్రాయాన్ని ప్రజలబుర్రల్లో ఎంతో బలంగా చొప్పించడం జరుగుతూవచ్చింది.

రోజు తిరగకుండానే ముఖ్యమంత్రులందరూ ఢిల్లీలో సమావేశమయ్యారు. ప్రప్రథమంగా చేరుకున్నవారిలో చౌదరికూడా ఉన్నాడు. ఆనంద్‌ను తనవెంట రమ్మన్నాడు, 'దేశంలో నీకున్న పరిచయాలను పరీక్షించుకోవచ్చు, అలాగే నీ బుర్రకు పనిచెప్పచ్చు' అన్నాడు హాస్యంగా. ఇండియన్‌ఎయిర్‌లైన్స్ విమానంలో ప్రక్కపక్కనే కూర్చుని పార్టీలోపలి కుమ్ములాటగురించి మాట్లాడుకోవడం ప్రారంభించారు. 'తగనివేళ మరణించాడాయన' చౌదరి అన్నాడు. 'పార్టీలో అంతా గంద్రగోళంగా ఉంది.'

'ఎందుకలా అనుకుంటున్నారు?' ఆనంద్ యుక్తిగా ప్రశ్నించాడు, చౌదరి మనసులోమాట బయటపెట్టించడంకోసం.

'ఏమో, నాకు తెలియదు, నా కది అంతుచిక్కలేదు' చౌదరి ఒప్పుకున్నాడు. 'ఇలా జరుగుతుందని ప్రతివాళ్ళకీ ముందే తెలుసు. అయినా ముందుగానే నోరువిప్పి అనగలిగిన సాహసంకానీ, ఏదైనా చేయగలిగిన సాహసంకానీ ఎవరిలోనూ కనిపించని ఉదంతాల్లో ఇదికూడా ఒకటి. ఇటువంటి పరిణామం రాదులే అన్న భరోసాతో ఉండిపోయాం. తలచుకుంటే అంతా ఆశ్చర్యంగానూ, అసంబద్ధంగానూ కనిపిస్తోంది.'

'ఆ మహనీయుడి మరణం, ఇకమీద తిరుగబోయే మలుపుల్ని అంచనావేయడం అసాధ్యమనిపించేటంత కీలకఘటన కావడమే ఇందుకు కారణమంటారా? ఆయన చుట్టూ ఉన్న జనం నిరంతరం దిగులుచెందుతూ ఉండడానికీ, ఒకరితోఒకరు తీవ్రంగా విభేదించుకోడానికీ ఇదే కారణం కావచ్చునంటారా? అంతగా దిగులుపడుతున్నారు కనుకనే వాస్తవంగా ఆ ఘటన వచ్చి మీదపడే వరకూ ఆ వాస్తవాన్ని పట్టించుకోకూడదనుకున్నారా?' ఆనంద్ సూచనగా అన్నాడు.

'కావచ్చు...' చౌదరి సాలోచనగా అన్నాడు. 'నాకు తెలిసినమేరకు ఇప్పటికీ వాళ్ళు చీలిపోయే ఉన్నారు'

'చీలిపోవడం దేనిగురించి?... వారసత్వసమస్యపైనా?'

'అవును... వారసత్వసమస్యమీదే ననుకుంటాను'

'స్పష్టమైన వారసుడెవరూ లేడు కనుకనే అంటారా?'

'ఆమోదయోగ్యుడైన వారసుడు లేడు కనుక' చౌదరి సమాధానం చెప్పాడు 'కానీ ఈ శల్యపరీక్షకూడా సింపుల్‌గా తేల్చివేసే ప్రయత్నంగానే కనిపిస్తోంది. వ్యవహారం అంతకెన్నో రెట్లు సంక్లిష్టమని నేను భావిస్తున్నాను. అయితే ప్రస్తుతానికి అంతా అగమ్యగోచరం'

'పార్టీసిద్ధాంతాలకీ దీనికీ ఏమైనా సంబంధం ఉందంటారా?'

'ఉండచ్చు, ఉండకపోవచ్చు. సైద్ధాంతికకోణాలూ, వ్యక్తిగతకోణాలూ ఇందులో కలిసి పోయే ఉంటాయి'

'మీ దృష్టిలో పట్టు దేనిది?'

'నేను పెద్ద సిద్ధాంతవాదినికానని నీకు తెలుసు. ఇక్కడ సిద్ధాంతాల పట్టింపు పెద్దగా ఉంటుందని నే ననుకోను, అయినా నే నింతవరకూ ఓ కచ్చితమైన అభిప్రాయానికి రాలేదు... ఇంతకీ మై డియర్ బృహస్పతీ, మన పరిస్థితి ఎలా పరిణమిస్తుందని నువ్వనుకుంటున్నావ్?'

ఇంతలో పాలం విమానాశ్రయానికి చేరుకోవడంతో వారి సంభాషణ కు అంతరాయంకలిగింది. ఇద్దరూ వేర్వేరు బృందాలను కలుసుకుంటూ రోజంతా తిరుగుతూనే ఉండిపోయారు. పార్లమెంటుసెంట్రల్‌హాల్‌లోనివ్యక్తులతోసహా విడివిడిగా వ్యక్తులతో, బృందాలతో సమావేశాలు జరిపి సాయంత్రం రాష్ట్రప్రభుత్వఅతిథిగృహంలోని ముఖ్యమంత్రిగదిలో ఇద్దరూ కలుసుకున్నారు. ఉద్రేకాలు పురివిప్పుతున్నట్టు కనిపించాయి. ఆరోపణలు, ప్రత్యారోపణలు గాలినిండా వ్యాపిస్తున్నాయి. చివరకు డబ్బు ఎరజూపారన్న మాటకూడా వినిపించింది. కుంగదీసే వాతావరణం మెల్లగా అడుగుపెడుతున్నట్టు ఆనంద్‌కి అనిపించింది.

గంద్రగోళపరిస్థితిలోకూడా అతడు ఒక అమరికను కనిపెట్టగలిగాడు. 'పండిట్‌జీ మనుషులు' ఒకవైపు, 'నెహ్రూ వ్యతిరేక' కూటమిగా చెప్పుకునేవారు మరోవైపు. తికమకపెట్టే అంశాలింకా అనేకం ఉన్నాయికనుక ఇది స్థిరమైన అమరిక ఏమీ కాదు. అయినా వాళ్ళ వాళ్ళ వ్యాఖ్యలను బట్టి, వ్యక్తులనేపథ్యాలు తెలిసిన, వాళ్ళ వైఖరులనుబట్టి ఎవరైనా కల్పించుకోగలిగిన అమరిక ఇది. మిగిలిన విషయాలను మంతనాలు, లోపాయికారీ ప్రచారాలు చూసుకున్నాయి.

పత్రికలు దీనిని కేవలం వారసత్వయుద్ధంగా చిత్రించడాన్ని ఆనంద్ గమనించాడు. నిన్నటి వరకూ వాళ్ళందరూ పండిట్‌జీకి సహచరులు. అటువంటప్పుడు వారిలో కొందరిపై నెహ్రూవ్యతిరేకులన్న ముద్రవేయడంలో అర్థమేమైనా ఉందా అని కొన్ని సంపాదకీయాలు ప్రశ్నించాయి. దానినో దుష్ప్రచారంగా తేల్చివేశాయి. అదంతా వట్టి ప్రచారవిన్యాసం. నెహ్రూ పేరును స్వార్థప్రయోజనాలకు దుర్వినియోగంచేయడానికి తలపెట్టిన కుతంత్రం. ఈ సమీ కరణలో సైద్ధాంతికకోణం లేనేలేదు. అదో పన్నాగం, ద్రోహం, అధికారంకోసం బరితెగించిన పోకడ. అంతకంటె ఎక్కువా కాదు, తక్కువా కాదు.

లోపాయికారీగా సాగిపోతున్న వ్యవహారాలను సన్నిహితంగా గమనించినమీదట, ఇది కేవలం అధికారంకోసం ఇద్దరువ్యక్తులమధ్య జరుగుతున్న పోటీ కాదనుకున్నాడు ఆనంద్.

పగలు కొంతసేపు కన్నాట్‌ప్లేస్‌ప్రాంతంలో కలయతిరిగిన తర్వాత ఓ మిత్రుణ్ణి కలుసుకోడానికి పాతఢిల్లీకి వెళ్ళాడు. వాతావరణంలో ఉద్రిక్తత స్పష్టంగా కనిపిస్తోంది. ప్రతిపౌరుడూ జాతీయ అభిప్రాయసేకరణలో పాలుపంచుకుంటున్నట్టు, తన భావాలను స్పష్టంగా బలంగా వ్యక్తపరుస్తున్నట్టు అతని కనిపించింది. నెహ్రూకు సంబంధించిన దేనినో పరిరక్షించితీరాలనీ, దేనినో నిలబెట్టితీరాలనీ ప్రజలు కోరుకుంటున్నారు, తహతహలాడుతున్నారు. అయితే నెహ్రూకి సంబంధించినదేది ప్రమాదంలో పడిందో ఎవరూ స్పష్టంగా చెప్పలేకపోయారు. అదేమైనా సరే రక్షింపబడితీరాలని వారి ఆకాంక్ష.

ఆలోచనలను కూడగట్టుకుని, వర్తమానపరిస్థితిని చౌదరికి నివేదించడానికి సిద్ధమైనప్పుడు ఆనంద్ మదిలో ఈ సన్నివేశాలు మెరుపులా మెరిశాయి.

'ఈ రోజంతా మీ రెవరెవరిని కలుసుకున్నారు?' ఆనంద్ ప్రశ్నించాడు.

'నాయకులందరినీ, ఇతర ముఖ్యమంత్రుల్నీ, పార్టీనాయకుల్నీ కలుసుకున్నాను. రాష్ట్రానికి చెందిన పలువురు ఎం.పిలు నన్ను కలిసి మాట్లాడారు.'

'సరే, నేను వేరే జనంమధ్య తిరిగాను. అక్షరాలా వీధుల్లోకి పోయాను... జనం వాళ్ళలోవాళ్ళు ఎంతో చైతన్యంతో మాట్లాడుకుంటున్న మాటలు నా చెవినపడ్డాయి. వాళ్ళ అనుభూతిలోతు కనిపెట్టడానికి నేను స్వయంగా కొంతమందితో మాట్లాడాను. చాందినీచౌక్ వెళ్ళి వివిధవర్గాల ప్రజలమధ్య తిరిగాను. ఢిల్లీయూనివర్సిటీకేంపస్‌కి వెళ్ళి, వచ్చే నెలలో జరగబోయే ఓ సెమినార్ గురించి కొందరు విద్యావేత్తలతో మాట్లాడాను.'

చౌదరిలో ఒకింత అసహనం తొంగిచూసింది. అతడికి కావలసింది అవునూ, కాదూ అన్న సూటిసమాధానం.

'నీ దినచర్యవివరాలన్నీ నా కెందుకయ్యా' మధ్యలోనే తుంచుతూ అన్నాడు. 'ఢిల్లీలో నువ్వు కలుసుకున్న ఈ మర్యాదస్తులకీ, అంతగా మర్యాదస్తులు కానివాళ్ళకీ, రాజకీయంగా జరుగుతున్న కుమ్ములాటకీ ఏమిటి సంబంధం? ఇది పూర్తిగా పార్టీ అంతరంగికవ్యవహారం... ఈ పోరులో మనం ఓడిపోయే గుర్రంమీద పందెం కాయలేం; కాస్తే నిలువునా మునిగిపోతాం కనుక రాష్ట్రంకోణంనుంచి మనకిది చాలా కీలకమైనఅంశం. జవహర్లాల్ నెహ్రూలాంటి మనిషికాకుండా పగబట్టి కాటేసే మనిషి ప్రధానమంత్రిఅయితే, ఈ ఎన్నికలో మనం ఆయన్ని వ్యతిరేకించామని అనుకుంటే మనకి కుక్కచావూ, రాష్ట్రానికి అధోగతీ తప్పవు... నీకు తెలుసునో తెలియదో, ప్రధానమంత్రి అధికారమహాత్యం అలా ఉంటుంది! కనుక నీ వీధిముచ్చట్లగురించిన సోషలిస్ట్‌చెత్తంతా నా కొద్దు.'

'అదీ ఒక కోణమే చౌదరిగారూ, విలువైన కోణంకూడా' ఆనంద్ అన్నాడు 'అయినాసరే, ఈ వారసత్వవివాదంగురించి సామాన్యుడు ఏమనుకుంటున్నాడో తెలుసుకోడానికే నా ప్రయత్నమంతా. మన పార్లమెంటరీపార్టీ ప్రజల ఆలోచనాసరళిని ఏ మేరకు ప్రతిబింబిస్తోందో తెలుసుకోవడం చాలా ముఖ్యం. మీరన్నట్టు తక్షణ వారసత్వవివాదానికీ దీనికీ సంబంధం

లేకపోవచ్చు, కానీ పార్టీ భవిష్యత్తుతో అంతకుమించి ముడిపడిన విషయం పూర్తి అయిదేళ్ళపాటు జవహర్లాల్‌నాయకత్వానికి ప్రజలు వోటువేశారు మిగిలిన గడువుకి పార్టీనాయకుని ఎంచుకోవడంలో వారి కెటువంటి ప్రమేయం లేకపోవచ్చు, అయినప్పటికీ కిందటిసారి తాము వోటేసిన నాయకుడిపంధాను పార్టీ ఏ మేరకు అనుసరిస్తోందో తెలుసుకుని ఒక నిర్ధారణకు రావడానికి ఎవరికివాళ్ళు ప్రయత్నిస్తారు అవునా కాదా?'

'కావచ్చు' చౌదరి ఒప్పుకున్నాడు. 'అయినా అసలీ ప్రశ్న ఎలా తలెత్తుతుంది? ప్రజలు ఎన్నుకున్నది పార్టీని కాదా?'

'అవునా? నిజంగానే మీ రా మాట అంటున్నారా? జవహర్లాల్‌వ్యక్తిత్వానికి ఇక్కడ ఎటువంటి ప్రమేయంలేదంటారా? జవహర్లాల్‌నెహ్రూనాయకత్వాన్నిచూసే ప్రజలు పార్టీకి వోటు వేశారంటే మీరు ఏకీభవించరా?'

'అవునవును, అంతేనేమో అనుకుంటాను. ఆ దృష్ట్యాచూస్తే నువ్వన్నది రైటే' చౌదరి అన్నాడు. 'ప్రధానంగా వోట్లురాబట్టగలిగింది ఆయనేనని నేనూ ఒప్పుకుంటాను నెహ్రూ అనంతరం పార్టీలోపల జరుగుతున్న మొట్టమొదటిఎన్నిక ఇదే కనుక, పార్టీ ఆయనపంధానే అనుసరించాలని ఆశించేహక్కు ప్రజలకు తప్పకుండా ఉంటుంది మరోలా వ్యవహరించడానికి జనాదేశం అనుమతించదు. అయినా ఈ వింగడింపువల్ల ఏమిటి ప్రయోజనం? పార్టీనడకలో ఎటువంటి తేడా ఉండబోవడంలేదు కదా? పార్టీ తన నాయకుడిగా ఎవరిని ఎన్నుకున్నా అతడు నెహ్రూవిధానాలను అమలుచేయవలసిందే కదా?'

'చేస్తాడంటారా?' ఆనంద్ ఎదురుప్రశ్న వేశాడు.

'బాగుంది . చేస్తాడనే నా విశ్వాసం'

'స్థూలంగా ప్రజలు అలా విశ్వసించడంలేదు...'

'అలా ఎందుకనుకుంటున్నావ్? అంత ధీమాగా ఎలా చెప్పగలవ్?'

'ఇదిగో ఇక్కడే నా వీధిముచ్చట్లు అవసరమౌతాయి' ఆనంద్ జవాబుచెప్పాడు 'ఇది చాలా క్లిష్టకాలం. వీధిమనిషి దీనికి అప్రయత్నంగా స్పందించగలుగుతున్నాడు మీరు నమ్మండి నమ్మకపొండి, ప్రజాభిప్రాయాల్లో ఒక స్పష్టమైనసమీకరణ ఇప్పటికే జరిగిపోయింది. నెహ్రూ తాత్వికత కొనసాగాలన్న అభిప్రాయానికి సర్వత్రా మద్దత్తు వ్యక్తమౌతోంది. ఈ విషయంలో నా కెటువంటి సందేహంలేదు... కాగలిగిన వారసుల గురించి మాట్లాడుకుంటున్నప్పుడు వాళ్ళలో ఒకరిని అత్యంత స్పష్టంగా నెహ్రూమనిషిగా గుర్తించి, అవతలిమనిషి గురించి అంతే స్పష్టంగా నెహ్రూవ్యతిరేకపంధాకు చెందినవాడుగా చెప్పుకుంటున్నారు ఎందుకలా భావిస్తున్నారో ఒక్కడూ నాకు చెప్పలేకపోయినా, వాళ్ళలాగే భావిస్తున్నారన్నది నిజం. ఇదే విస్తృతజనాభిప్రాయమైనట్టు స్పష్టంగా కనిపిస్తోంది. కష్టాలు కొనితెచ్చుకోవాలనుకుంటేనే మనపార్టీ ఈ ధోరణిని నిర్లక్ష్యం చేస్తుంది...'

'నువ్వంటున్నది సహేతుకమే కావచ్చు' చౌదరి అనిశ్చితస్వరంతో అన్నాడు. 'చెప్పు, నెహ్రూ అను కూల, వ్యతిరేక పంథాలను వాళ్ళెలా పోల్చుకోగలుగుతున్నారు?'

'వాళ్ళు మాటల్లో అంత స్పష్టంగా వ్యక్తీకరించగలిగినవాళ్ళు కాదు, నిజానికి నేనూ కాదు' ఆనంద్ జవాబుచెప్పాడు. 'అయినా గంటక్రితం గెస్ట్‌హౌస్‌లో జరిగిన ఓ ముచ్చట మీకు చెబుతాను. ఎక్కడెక్కడో తిరిగి మంచిఆకలిమీద ఉన్నాను. బేరర్‌ని పిలవడందేనికి, త్వరగా ఏమైనాచేసిపెడతారేమో చూద్దామని నేనే వంటగదివైపు నడిచాను. లోపలికి అడుగుపెట్టబోతుండగా ఇద్దరు బేరర్లు అటువైపు తిరిగి గట్టిగా మాట్లాడకుంటూఉండడం చెవినపడింది. తీరాచూస్తే వాళ్ళ సంభాషణ జరగబోయే వారసుడి ఎంపికగురించి. వాళ్ళలో ఒకడన్నాడు, 'అరే భాయ్, యే తో పైసావాలోఀ ఔర్ గరీబోంకా ముకాబ్లా హై! (చూడు తమ్ముడూ, ఇది ధనికులకూ, పేదలకు మధ్య పోటీ!)'... నెహ్రూఅనుకూలపంథాఅంటే వాళ్ళదృష్టిలో పేదలకు అనుకూలపంథా అన్నమాట. లాల్‌బహదూర్‌శాస్త్రి వాళ్ళదృష్టిలో నెహ్రూఅనుకూల అభ్యర్థి. పోటీపడుతున్న అవతలిమనిషి మొరార్జీదేశాయ్. ఇది మితిమీరిన సరళీకరణేకావచ్చు, కానీ సారాంశంలో ఇది నడుస్తున్న వ్యవహారంపై వాళ్ళ అభిప్రాయం. ఎటువంటి హేతువాదాలతోనూ దానిని మార్చలేరు...'

'నేను ఎవరితరఫున పనిచేస్తున్నట్టు జనం భావిస్తున్నారు?' చౌదరి హాస్యంగా అడుగుతున్నట్టు అడిగాడు, కానీ ఆ ప్రశ్నలో కొంత జిజ్ఞాసా తొంగిచూసింది.

'నా టాక్సీడ్రైవర్, అతడి స్టాండ్ గెస్ట్‌హౌస్‌కి దగ్గరలోఉంది లెండి, మిమ్మల్ని మొరార్జీ దేశాయ్ ఖాతాలో వేశాడు'

ఆ మాటకు చౌదరి పగలబడి నవ్వుతాడనుకున్నాడు ఆనంద్. కానీ నవ్వలేదు. కొద్దిసేపు నిశ్శబ్దంగా ఉండిపోయాడు. తర్వాత అన్నాడు 'నువ్వు చెప్పిందాంట్లో వాస్తవముంది ఆనంద్. మిగిలిన ముఖ్యమంత్రులతో, నాయకులతోకూడా మాట్లాడతాను. వాళ్ళెలాగూ అన్నికోణాలనూ దృష్టిలోఉంచుకునే ఆలోచిస్తారు, అయినా తెలిసిన ప్రజాభిప్రాయంగురించి మరికాస్త నొక్కిచెప్పడంవల్లకూడా ఉపయోగముంటుంది...'

తన ప్రైవేట్‌కార్యదర్శిని పిలిచి కొందరితో అప్పటికప్పుడు, మరికొందరితో మరునాటి ఉదయం అప్పాయింట్‌మెంట్ ఫిక్స్‌చేయమని చెప్పాడు. ఎన్నో సంవత్సరాలక్రితం ఓ హిల్‌స్టేషన్‌లోని హోటల్‌లో బెడ్‌రూమ్‌లో ఒక పడుపుగత్తె అనుకోకుండా 'మేకప్' గురించి తనకు జ్ఞానోదయంకలిగించిన సన్నివేశాన్ని గుర్తుచేసుకున్నాడు పార్టీకి ఇంతకాలంఉన్న ఒకే ఒక ముసుగు జారిపోయింది కనుక పార్టీమేకప్ మార్చవలసినఅవసరంగురించితనలోతానే తర్కించుకున్నాడు. ఆ విషాదఘడియలోకూడా, ఎందులోనూ మంచిని చూడలేని అతడి నైజగుణం క్షణకాలం పైకితోసుకొచ్చింది. నిన్నటివరకూ జవహర్లాల్‌ను భౌతికంగా వాడుకుంటే ఇప్పుడిక ఆయనపేరునూ, జ్ఞాపకాలనూ వాడుకోవలసిందే.

మరునాడు ఆనంద్ ఒక పార్లమెంటుసభ్యుడితో కలిసి సెంట్రల్‌హాల్‌కు వెళ్ళి కొన్నిగంటలు అక్కడ గడిపాడు. పార్లమెంట్ సభలకు అప్పగించేముందు దేశభవిష్యత్తును మొట్ట మొదట

వండే భారీవంటపాత్ర అదే. సభ్యులతో, సభ్యులుకానివారితో, జర్నలిస్టులతో కలిసిపోయి ఉద్ధృతంగా నిరంతరాయంగా జరుగుతున్న చర్చను గమనిస్తూఉండిపోయాడు. పార్టీలో జరగబోతున్న ఎన్నికగురించి వాళ్ళు చెప్పుకుంటున్న ప్రతిమాటనీ ఎంతో సావధానంగా విన్నాడు. ప్రత్యేకించి, సెంట్రల్‌హాల్‌లోని సందడిని, ముందురోజు మధ్యాహ్నం గెస్ట్‌హౌస్‌లో తన చెవినపడిన బేరర్ల సంభాషణతో పోల్చిచూసుకునే ప్రయత్నంచేశాడు.

గంటలు గడుస్తున్నకొద్దీ మంతనాలు ఊపు అందుకున్నాయి. ప్రతి ఒకరూ, ప్రతిఒకరినీ కలుసుకుంటున్నారు, ప్రతిఒకరితో మాట్లాడుతున్నారు; ప్రతిఒకరినీ ఒప్పించే ప్రయత్నంచేస్తున్నారు- అంతా గందరగోళం. చీకటిపడుతున్న సమయానికి, తమ ఊహల్ని కలబోసుకోడానికి చౌదరి, ఆనంద్ మళ్ళీ సమావేశమైనప్పుడు, చౌదరిముఖం సంతోషంతో వెలిగిపోతూఉండడం ఆనంద్ గమనించాడు. పార్టీనాయకత్వానికి పోటీ నివారించగలిగామని చౌదరి ఉప్పొంగిపోతూ ప్రకటించాడు.

ముఖ్యమంత్రులు, సీనియర్ నాయకులు, ఆ క్షణంలో పదవిలో ఉన్నారా లేదా అన్న దానితో నిమిత్తంలేకుండా దేశంలోని ఎందరెందరో విజ్ఞులు గంటలతరబడి ప్రయత్నించి రాజీ కుదిర్చిన పర్యవసానం అది. దేశానికి దాపురించిన విపత్తుకు దేశమంతా ఒక్కకుటుంబమై వ్యక్తీకరించిన స్పందన అది. ఎంతో నిజాయితీతో చర్చించుకున్నమీదట ప్రధానమంత్రిగా లాల్‌బహదూర్‌శాస్త్రిని ఎన్నుకోవాలన్న ఏకాభిప్రాయానికివచ్చారు. మొరార్జీదేశాయ్‌నికూడా ఇందుకు ఒప్పించగలిగారు.

చౌదరిమాటల్ని ఎంతో సావధానంగా విన్న ఆనంద్ అనిశ్చితస్వరంతో అన్నాడు, 'అలాగా...'

చౌదరికి కోపం ముంచుకొచ్చింది. 'ఏమైందయ్యా నీకు?' అంటూ విరుచుకుపడ్డాడు. 'ఎంతచేసినా నిన్ను మెప్పించలేమనిపిస్తోంది. మేమిక్కడ పార్టీలో ఓ పెద్దసంక్షోభాన్ని నివారిస్తే ఎంతో బుద్ధిశాలివనిపించుకున్న నువ్వు మొహం వేలాడేస్తున్నావ్. కేంద్రమంత్రివర్గం చాలా వరకూ జవహర్లాల్‌మంత్రివర్గంలానే ఉండబోతోంది కనుక క్రియలో గతానికీ ఇప్పటికీ తేడా ఉండదన్న విషయం నీ కర్థమైందా లేదా?'

'అయింది, జవహర్లాల్‌మాత్రం అక్కడ లేకపోవడం మినహా...'

'బాగుంది, ఆయనెలా ఉంటాడు? ఆయనను తిరిగి రప్పించడం సాధ్యమనా నీ ఉద్దేశం? ఆయన లేని లోపం మినహా, దేశంమొత్తంమీద ఆయన నిర్దేశించినమార్గంలోనే సాగిపోతుంది.'

'మనం వేచిచూడవలసింది అక్షరాలా అదే' ఆనంద్ అన్నాడు నర్మగర్భంగా.

# 35

తాను క్రాస్‌రోడ్స్‌లో ఉన్నాడా? భారతదేశం క్రాస్‌రోడ్స్‌లో నిలబడిందా? తన పార్టీ క్రాస్‌రోడ్స్‌కు చేరుకుందా? నిజంగానే జవహర్లాల్‌నిష్క్రమణ క్రాస్‌రోడ్స్‌ను సంకేతిస్తోందా?

అలాగే, దేశం పరివర్తనదశలో ఉందా? సమాజం పరివర్తనదశలో ఉందా? ఈ పరివర్తనకీ జవహర్లాల్ మరణానికీ ఉన్న సంబంధమేమిటి? లేని సంబంధమేమిటి? వాటిమధ్య బాహ్యంగానూ లేదా నిగూఢంగానూ ఉన్న లంకె ఏమిటి!

తామరాకుమీద నీటిబొట్టులా ఆనంద్ అధికారాన్ని వినియోగిస్తూనే దానికి అంటనివాడిలా —ఏకకాలంలో పాత్రధారిగానూ, ప్రేక్షకుడుగానూ ఉండిపోయాడు. లక్షలాదిమంది సహదేశభక్తుల్లానే అతడుకూడా జవహర్లాల్ నెహ్రూ జరామరణాలకు అతీతుడని —దాదాపు, అంతరాంతరాల్లో భావిస్తూవచ్చాడు. వారసత్వంపట్ల పార్టీలో మొగ్గుకానీ, తపనకానీ అతనికి కనిపించలేదు. వారసత్వంపట్ల కాదు, సైద్ధాంతికవారసత్వంపట్ల అని తనను తాను సవరించుకున్నాడు. మరోవిధంగా చెప్పాలంటే మూలసూత్రాలు కొనసాగడంపట్ల ఎవరిలోనూ తపనలేదు, మారుతున్న కాలానికీ, పరిస్థితులకూ వర్తింపచేయడానికివీలుగా సిద్ధాంతమూలసూత్రాల పునరన్వయంపట్ల ఆసక్తి లేదు. క్లుప్తంగా చెప్పాలంటే నెహ్రూ మహాత్మా గాంధీని, ఆయన ఆదర్శాలను ముందుకుసాగించినట్టు నెహ్రూను, నెహ్రూ ఆదర్శాలను సాగించేవారు ఒక్కరూలేరు.

కేంద్రప్రభుత్వం చాలావరకూ ఒకేపార్టీలోపల సంకీర్ణవ్యవస్థలా ఉంది, అదొక అసమాన సంకీర్ణవ్యవస్థ మొత్తంమీద అదో విచిత్రధోరణి. 'పండిట్‌జీ మనుషులు' ఉండడానికి పెద్దసంఖ్యలోనే ఉంటారు, కానీ వాళ్ళు కేవలం పండిట్‌జీమనుషులుగానే కొనసాగుతూఉంటారు. నిత్యం ఆయన పేరుజపిస్తూ ఆయన భావాలకు ఎప్పటికీ కట్టుబడిఉంటామని ప్రతినచేస్తూ ఉంటారు. వారిని పండిట్‌జీ పెంపుడుచిలకలని ఎవరైనా నిరభ్యంతరంగా అనవచ్చు. ఆయన ప్రతిష్ఠను సంరక్షించడమే వారి పని. అయినా వారు ప్రయోజనకరమైన ఒకవిధిని నిర్వర్తించగలుగుతున్నారు. ఆయన స్మృతికి తాజాదనం తీసుకురాగల సామర్థ్యం తమకు లేకపోయినా దానిని సజీవంగామాత్రం ఉంచగలుగుతున్నారు. ఆ స్మృతి, సందర్భవశాత్తూ, వాళ్ళకు మనుగడ కల్పించింది.

ఇక 'నెహ్రూ వ్యతిరేక'వర్గం ఉంది. అంతకన్న నిర్దుష్టవర్ణన లేకనే వారిపై అలా ముద్ర వేయడం జరిగింది. వారుసైతం జవహర్లాల్‌తో ఉంటూనేవచ్చారు; వాళ్ళలో చాలామంది విధేయతలో ఇతరుల కేమాత్రం తీసిపోరు. అయితే వాళ్ళు సరిపెట్టుకోలేకపోయిందల్లా వారి అభిప్రాయంలో ఆయన విహరించే స్వాప్నికజగత్తుతోనే, సమస్యలపట్ల ఆచరణసాధ్యంకాని ఆయన వైఖరితోనే, హేతుబద్ధంకాని ఆయన దృగ్దర్శనంతోనే. వీళ్ళూ ఆయన వెనకాల చెవులు కొరుక్కుంటూనే ఎదురుగామాత్రం ఆయనతో ఏకీభావం ప్రకటిస్తూవచ్చారు. జనం తమను అనుమానించని మేరకు, ప్రత్యర్థులను దూరంగా ఉంచగలిగిన మేరకు వాళ్ళాయనను ప్రశంసిస్తూనూ వచ్చారు.

నెహ్రూభజనపరులు తమపై నెహ్రూవ్యతిరేకులన్న ముద్రవేయడం వాళ్ళకు విపరీతమైన కోపం తెప్పించింది. వాళ్ళెవరికీ 'వ్యతిరేకులు' కారు. సత్వరపరివర్తనంటే వాళ్ళకు నచ్చదు, అంతే. ఒక వినూత్న, విశుద్ధశకం రాత్రికిరాత్రి అవతరిస్తుందని వాళ్ళు ఆశించడంలేదు. అటుపైన వాళ్ళలో చిల్లరనాయకులకు యథాతథస్థితి కొనసాగింపుమీద విపరీతమైన ఆసక్తి ఉంది; ఎందుకంటే వాళ్ళ రొట్టెలకు ఇంతమందాన వెన్నరాయబడింది అటువైపునే. వాళ్ళదృష్టిలో ఎటువంటి మార్పైనా, అధోగతికినడిపించే మార్పే అవుతుంది —ముఖ్యంగా తమవిషయంలో. మార్పు రావడానికి వీల్లేదన్న తమవాదానికి మద్దత్తుగా వీళ్ళు గాంధీజీని ఉదహరించడం మరో అసాధారణ సన్నివేశం... గాంధీ నెహ్రూలు ఆశించిన పరిణామసారం ఒకటే అయినప్పటికీ, వారి అనుయాయులుమాత్రం ఇప్పుడు తమ అనుకూల్యాన్నిబట్టి వాళ్ళను పరిస్పరాభిముఖంగా నిలబెట్టారు.

రాష్ట్రరాజకీయదృశ్యంలో సంభవించిన నాటకీయపరివర్తనకూడా తక్కువదేమీకాదు. నాయకులిప్పుడు 'వాస్తవికదృక్పథం' మీద మరింత ఎక్కువ ఒత్తుపెడుతున్నారు. 'ప్రయోజనవాదా'న్ని ఉత్తమోత్తమగుణంగా ఉద్ఘాటించడమూ తరచు జరుగుతోంది. నెహ్రూ తన విధానాలను, వాటికి తాను చేసిన సవరణలను ఎప్పటికప్పుడు ప్రకటిస్తూ ఉండేవారు. ఆ శకం అర్థంతరంగా ముగిసిపోయింది. నెహ్రూవిధానాలు కొనసాగుతాయన్న మాటనుమించి ఎవరు అదనంగా ఏమీ అనడంలేదు. ఆ విధానాలేవో విశదీకరించే శ్రమను నెత్తినవేసుకోడానికి ఎవరూ సిద్ధంగాలేరు. చట్టసభల కార్యకలాపాలు పూర్వస్మృతులమీద ఆధారపడి సాగించే తంతుగా దిగజారిపోయాయి.

ఈ మార్పు క్రమంగా సంభవించిందే, అలాగని అందుకు ఎక్కువ వ్యవధినీ తీసుకోలేదు. అలాగే రాజకీయంగా దృగ్గోచరమౌతున్నాపైకి తెలిసేంతగా ఏదీ జరగడంలేదు. ఏడాదిలోపలే మార్పు స్పష్టమైపోయింది. ఊకదంపుడు ఉద్ఘాటనలసరళిలో పెద్ద మార్పు లేకపోయినా, దాని ప్రభావం —లేదా ప్రభావరాహిత్యం —ఇప్పుడు తేటతెల్లంగానే కానవస్తోంది. భారతదేశం ఎందుకో వెనకముందవుతోంది, లోపలికి దృష్టిసారిస్తోంది. భాష, మతం, ప్రాంతం, కులం; ఇటువంటి చాపల్యాలన్నీ మరింత పొడవైననీడల్ని పరవడం ప్రారంభించాయి.

రాష్ట్రాలలో సరికొత్త ఆకర్షణకేంద్రాలు ప్రారంభమయ్యాయి. ముఖ్యమంత్రుల అధికారం, పలుకుబడి పెరిగిపోయాయి. వాళ్ళ కంటికి ప్రధానమంత్రి మెతకమనిషిలా కనిపిస్తూవచ్చారు, అయితే ఆ మాట బాహాటంగా అన్నవాళ్ళెవరూ లేరు. లాల్‌బహదూర్ తనమేరకు తాను శిఖరాయమానుడే, జవహర్లాల్‌కు కుడిభుజంగా వ్యవహరించిన మనిషి. వినమ్రతా, నిజాయితీ మూర్తీభవించిన పెద్దమనిషిగా యావద్దేశం ఆయనను గౌరవించింది. కొన్నేళ్ళక్రితం సుదూర దక్షిణాదిన ఒకచోట రైలుప్రమాదం సంభవించినప్పుడు రైల్వేమంత్రిగా అందుకు బాధ్యత వహిస్తూ నెహ్రూమంత్రివర్గంనుంచి రాజీనామాచేసి తన నైతికస్థైర్యాన్ని రుజువుచేసుకున్న వ్యక్తి. చాలామంది ఆ రాజీనామాను అర్థరహితచర్యగా భావించారు. ఒకమంత్రి నైతికబాధ్యతాపరిధిని ఆ చర్య హాస్యాస్పదస్థాయికి తెగలాగిందన్నారు. 'ఈ లెక్కన, మంత్రులు వచ్చేరైళ్ళు, పోయేరైళ్ళుగా మారి కేంద్రమంత్రివర్గం ఒక రైల్వేప్లాట్‌ఫారంగా మారుతుంది!' అంటూ కొందరు విమర్శకులు ఎద్దేవా చేశారు. 'మరీ తక్కువచేసి మాట్లాడుతున్నావ్. అప్పుడు ప్రతిరోజూ రాజీనామాలు, ప్రమాణస్వీకారాలు చేయడమే కేంద్రమంత్రివర్గం ఏకైకకార్యక్రమంగా మారిపోతుంది! ముఖ్యంగా దేశంలో శాంతిభద్రతలరంగంలో సంభవించే నిత్యపరిణామాలదృష్ట్యా హోంమంత్రుల్ని గంటగంటకీ మార్చుకోవలసివస్తుంది...!' అద్భుతగులుతూ మరోవ్యక్తి అన్నాడు.

నువ్వన్నది కరెక్ట్ కాదు. రాజ్యాంగంప్రకారం శాంతిభద్రతలు రాష్ట్రాల పరిధిలోకి వస్తాయన్న విషయం నువ్వు మరిచిపోతున్నావు. పైగా అది సాధారణంగా ముఖ్యమంత్రి అధీనంలో ఉంటుంది...' ఒక రాజ్యాంగనిపుణుడు వ్యాఖ్యానించాడు.

'అద్గదీ! అప్పుడు రాష్ట్రంలో ఎక్కడోఒకచోట హత్యజరిగిన ప్రతిసారీ ముఖ్యమంత్రి చౌదరి తప్పు కోవలసిందే'

ఈ వెక్కిరింపువ్యాఖ్యలెలా ఉన్నా, లాల్‌బహదూర్ గాంధేయదృక్పథంమీద ఆధారపడిన నైతికబాధ్యతాసూత్రాన్ని వ్యక్తిగత ఆచరణద్వారా ఎంతో ప్రభావవంతంగా స్థాపించారు. అయినా ప్రధానమంత్రిగా తిరుగులేని ఆధిపత్యం ప్రదర్శించడానికి ఆయనకా సత్కీర్తి చాలినంతగా అక్కరకురాలేదు. జవహర్లాల్, లాల్‌బహదూర్‌ల మధ్య తేడా ఎంత కొట్టొచ్చినట్టు కనిపించే దంటే, అది వాళ్ళమధ్య పోలికల్ని పూర్తిగా కప్పివేసింది. అదీగాక వాళ్ళమధ్య ఉన్న భావసారూప్యమూ స్పష్టంకాలేదు. విశ్వజనీనుడు, దార్శనికుడు, ప్రజలమనిషి, రచయిత, భావుకుడు, విద్వాంసుడు, చరిత్రకారుడు, శాస్త్రవేత్త, 'చాచా' మూర్తిమత్వం కలిగినవాడు — వీటిలో ఏ ఒక్కటీ లాల్‌బహదూర్‌లో ప్రతిఫలించలేదు. మాజీ ప్రధానికి ఒక విశ్వసనీయ సహచరుడిగానే జనం ఆయనను పరిగణించారు; కనుక ఆయన ఒక నీడమాత్రమే. ఆయన స్వయంసిద్ధప్రతిభ చాలావరకు నిరూపణ కానేలేదు. ఆయన ముమ్మార్తులా గాంధేయవాది అనడంలో ఎటువంటి సందేహంలేదు; అయితే గాంధేయముద్రను నెహ్రూవ్యతిరేకవర్గం సొంతంచేసుకోవడంతో ఆయన అగస్త్యభ్రాతగానే ఉండిపోవలసివచ్చింది. ఆయన ఉత్తమఅనుచరుడే కానీ, విధానాలను అన్వయించగల సమర్థుడు కాడు. ఎంత ఉత్తముడైనా, ఎంత విశ్వసనీయుడైనా కేవలం అనుచరమాత్రుడుగానే ఉన్న వ్యక్తి ప్రధానమంత్రిగా దేశానికి

సుదీర్ఘకాలం నాయకత్వం ఇవ్వలేదు... ఆయన సారథ్యంలో పరిస్థితులు చేజారుతున్నట్టు, అదుపుతప్పుతున్నట్టు కనిపించాయి. దానితోపాటే, లోపలి కుమ్ములాట, ఒక్కోసారి బాహాటంగా ఒక్కోసారి చాటుమాటుగా రేగుతూనేఉంది.

నూతనప్రధానమంత్రి, ఆయనకింద నూతనప్రభుత్వం ఉన్నమాట నిజమే. అయినాసరే, నిశితపరిశీలకుల కెవరికైనా తేటతెల్లంగా కలుగుతున్న భావం, నెహ్రూవారసత్వవివాదం ఇంకా పరిష్కారంకాలేదనే. లాల్‌బహదూర్ తన వారసుడు కావాలని నెహ్రూ కోరుకున్నట్టు చాలామంది విశ్వసించారు; అలాగని అది అసందిగ్ధమూ కాదు, సర్వత్రా ఆమోదించినదీకాదు. ప్రత్యర్థివర్గాలమధ్య కుదిరిన తాత్కాలికసంధివల్ల పరిస్థితులు పూర్తిగా కుదుటపడలేదు. అనివార్యఘర్షణను వాయిదావేయడంమాత్రమే అది చేయగలిగింది.

నెహ్రూకూటమి, నెహ్రూవ్యతిరేకవర్గం అనే రెండు ప్రధానవర్గాలతోపాటు, లాల్‌బహదూర్ మంత్రివర్గంలో సమాచార ప్రసారశాఖామంత్రిగా చేరిన నెహ్రూకుమార్తె ఇందిరాగాంధీచుట్టూ ఒక సరికొత్త వర్గం అవతరించింది. కొన్నినెలలపాటు ఎటువంటి ప్రకంపనలూ పుట్టుకురాలేదు. అయినా పార్టీలోనూ, దేశంలోనూ యువతరం —అందులోనూ మహిళలు —ఆమెవైపు సహజంగానూ, అనివార్యంగానూ ఆకర్షితులయ్యారు. ఆపైన, అంతవరకూ ప్రజలు నెహ్రూపై నిలుపుకున్న ఆదరాభిమానాలను ఆయనకుమార్తెగా ఆమె పొందగలిగింది, అవి సహజంగా అనివార్యంగా ఆమెకు బదిలీఅయిపోయాయి.

వ్యవహారాల్ని తనచేతుల్లోకి తీసుకోడానికి లాల్‌బహదూర్‌శాస్త్రి కొంతసమయం తీసుకున్నారు. ముఖ్యమంత్రులందరితో సంబంధాలు నిర్మించుకుని నెహ్రూవారసత్వాన్ని ముందుకు తీసుకువెళ్ళగల వ్యక్తిగా తనను స్థాపించుకునేందుకు ప్రయత్నించారు. ప్రజలూ ఆయనకు అనుకూలంగానే స్పందించారు. నెహ్రూప్రతిబింబాన్ని లాల్‌బహదూర్‌లో వెతికిపట్టుకోడానికి ప్రయాసపడ్డారు. నెహ్రూ లేనిలోపాన్ని భర్తీచేయగల సమర్థుడు లాల్‌బహదూర్అన్న విశ్వాసాన్ని పెంచుకోవాలనుకున్నారు, తమకు నాయకుడేలేడన్న పరిస్థితి తలెత్తడం వారికే మాత్రం రుచించని విషయం. కానీ ఆ కృత్రిమవిశ్వాసంవల్ల వాళ్ళు కోరుకున్న ప్రయోజనమేమీ నెరవేరలేదు. అది వాళ్ళ తప్పూ కాదు, లాల్‌బహదూర్ తప్పూ కాదు. నెహ్రూస్థానాన్ని సంపూర్ణంగా భర్తీచేయడం ఏ ఒక్కడికీ సాధ్యంకాదన్నదే ఇందులో ఇమిడిఉన్న కఠోరవాస్తవం.

నెలలు గడుస్తున్నకొద్దీ దేశంలో ఎన్నడూ లేనంతగా విఘటనప్రవృత్తులు తలెత్తాయి. ప్రతి రాష్ట్రంలోనూ అధికారపక్షం నిట్టనిలువుగా చీలిపోయింది. నెహ్రూ, నెహ్రూవ్యతిరేకవర్గాల ఘర్షణగా ప్రత్యక్షంగా రూపొందని చోట్ల, అది అధికారముఠావారికీ, అసమ్మతివాదులకీ మధ్య చీలికగా పైకితేలింది. మరోలా చెప్పాలంటే, అది అధికారం 'ఉన్న'వారికీ, అధికారం 'లేని'వారికీ మధ్య ఘర్షణ. ఒకే పార్టీలో ఉంటూ పరస్పరం వ్యతిరేకించుకునేవాళ్ళు తాము విడివిడిగా ప్రతిపక్షంతో వహించే విరోధంకంటె ఎక్కువ విరోధాన్ని ఒకరిపైఒకరు ప్రదర్శించుకుంటున్నారు. కారణం అంత గహనమైందేమీ కాదు; సమీపఎన్నికల్లో ఏ ప్రతిపక్షమూ అధికారాన్ని చేజిక్కించుకోలేదులే అన్న అధికారపక్షం ధీమా. ప్రజల ఆలోచనలనూ, మనోభావాలనూ పొరపాటుగా అంచనా

వేసుకున్న ఫలితమిది. అధికారపక్షంలోని వ్యక్తులు అధికారంకోసం దేవులాడడం నిత్యకృత్యంగామారింది. ఇరవైనాలుగుగంటలూ అదే ధ్యాస. పంజాబీసుబా (రాష్ట్రం) ఏర్పాటుచేయకపోతే ఆత్మాహుతి చేసుకుంటానని సంత్ ఫతేసింగ్ బెదిరించారు. రెవరెండ్ మైకేల్‌స్కాట్, ఆయన అనుయాయులు తిరుగుబాటుమంటల్ని, వేర్పాటువాదాన్ని రెచ్చగొడుతుండడంతో ఈశాన్యప్రాంతంలో ఇంచుమించు అరాచకదృశ్యం తాండవిస్తోంది. పలువురు సమర్థులైన ముఖ్యమంత్రులు కనుమరుగైపోయారు. పంజాబ్‌కుచెందిన ప్రతాప్ సింగ్ హంతకుల తూటాలకు బలయ్యాడు. కాశ్మీర్ బక్షీ, ఒరిస్సా పట్నాయక్ నిష్క్రమించారు. ఆ రాష్ట్రాల్లో తలెత్తిన సంక్లిష్టరాజకీయపరిస్థితుల్ని చక్కదిద్దడం వాళ్ళ వారసులకు తలకుమించినపనిగా పరిణమించింది.

నెహ్రూశకం అంతరించిన తర్వాత అడుగుపెట్టిన సంక్షోభమూ, అస్థిరత్వమూ విదేశాంగ విధానంలో మరింత ప్రస్ఫుటంగా కనిపించాయి. అంతర్జాతీయవ్యవహారాల్లో ప్రయోజనకరమైన జాతీయవిధానంగా అలీనవాదానికి రూపురేఖలుదిద్దినమనిషిఇకలేరు. అధునికప్రభావాలతోపాటు, మన పురాతనగ్రంథాలలో పేర్కొన్న, మన సముజ్జ్వలసంప్రదాయంలో భాగమైన 'మధ్యేమార్గవాదా'న్ని కూడా దృష్టిలో ఉంచుకుని ఆయన అలీనవాదానికి అర్థవివరణచేశారు. మనదేశంలో అది కేవలం అవసరార్థం రూపొందించుకున్న భావం మాత్రమే కాక అనాయాసంగా జీర్ణించుకోగల విశ్వాసంగా మారింది. అయితే దేశనాయకుల్లో అలీనవాదాన్ని జనసామాన్యానికి విప్పిచెప్పినవాళ్ళు లేకపోయారు. విదేశాంగవిధానం సామాన్యప్రజానీకానికి సంబంధించినది కాదని వాళ్ళు భావించడం అందుకు మొదటి కారణం. మామూలు ప్రజలకు దాని తీరుతెన్నులు అర్థంకావులే అని భావించడం రెండో కారణం. వీలైన ప్రతిసందర్భంలోనూ నెహ్రూ ఒక్కరే విదేశాంగవ్యవహారాలగురించి మాట్లాడుతూఉండేవారు. ఆయన సహచరులలో చాలామంది పండిట్‌జీ 'చాదస్తా'ల్లో ఒకటిగా దానిగురించి చెప్పుకునేవారు. ఎలాగో దానిని భరించకతప్పదని ఒకరిచెవిలో ఒకరు గుసగుసలాడుకునేవారు. దేశాన్ని కుంగదీస్తున్న అంతర్గతసమస్యలకూ, దాని అంతర్జాతీయసంబంధాలకూ ఉన్న ముడి ఎటువంటిదో వ్యక్తీకరించడంలో పార్టీనాయకులు చాలావరకూ విఫలులయ్యారు. విదేశాంగవిధానం ప్రజల మనోభావాలతో ఏమాత్రం సంబంధంలేని, 'సౌత్‌బ్లాక్' కార్యక్రమంగానో, నెహ్రూఅభిమానాంశాలలో ఒకటిగానో మిగిలిపోయింది. ఇక ఇప్పుడు, అలీనోద్యమం అస్తిత్వంలోకి వచ్చిన రెండేళ్ళకే దాని ప్రధానవ్యవస్థాపకులలో ఒకడైన వ్యక్తిని మృత్యువు మననుంచి దూరంచేసింది. ఆ తాత్వికతను విపులీకరించడానికి, వట్టి నకలు కానివిధంగా దేశానికి తనదైన విశిష్టశైలిలో దానిని ప్రజల్లోకి తీసుకువెళ్ళడానికి సరిపోయే అంతకాలం ఆయన జీవించలేదు. నెహ్రూవారసులకు మిగిలిందల్లా ఆయన వివిధసందర్భాలలో, విదేశాంగవిధానానికి సంబంధించిన వివిధకోణాలపై చేసిన ప్రసంగాల సంకలనం. అవి సందేహాలకు తావులేనంత తేటతెల్లంగానే ఉన్నాయి కానీ, ముక్కముక్కలుగా ఉన్నాయి. విదేశాంగకార్యాలయంతో సహా—లాల్‌బహదూర్ నాయకత్వంలోని ప్రభుత్వం, ఒకవైపు మాటల్లో అలీననిబద్ధతను యధావిధిగా ప్రకటించుకుంటూనే, అంతసూత్రాల అర్థంకోసం తడుముకుంటూ ఉండిపోయింది. వాస్తవిక దృష్టి కేంద్రీకరణ లోపించడంతో భారతవిదేశాంగవిభాగంలోని దౌత్యాధికారుల్లో కొందరిపై

సోవియట్‌అనుకూలురుగా, కొందరిపై అమెరికాఅనుకూలురుగా ముద్రవేయడం జరిగింది అతికొద్దిమందిమాత్రమే అలీనవాదవారసత్వాన్ని నెత్తినపెట్టుకున్నవారయ్యారు.

అలీనవాదంపై కూలంకషపరిజ్ఞానం లోపించడం విమర్శలకు అవకాశమిచ్చింది. అయితే ఆ పరిస్థితి చర్చను ప్రోత్సహించలేదుసరికదా, విధానాన్ని చులకనచేసింది. ప్రధానమంత్రి లాల్‌బహదూర్‌శాస్త్రి కైరోలో జరిగే అలీనదేశాలశిఖరాగ్రసమ్మేళనానికి వెళ్ళినప్పుడు, ఆయన ఎక్కడ, ఎలా చపాతీలను, శాకాహారభోజనాన్ని తయారుచేసుకున్నారన్న అంశంమీదే పత్రికలు ఎక్కడలేని ఆసక్తి చూపించాయి. పత్రికలకు కనిపించిన విశేషం ఒకటే — ఈ 'దేశవాళీ' ప్రధానమంత్రి మున్నెన్నడూ విదేశాలను సందర్శించి ఎరుగరు. ఇతర ప్రభుత్వాధినేతలు ఈ నూతనప్రధానిని ఎలా సమీపించాలో, జవహర్లాల్ నెహ్రూతో కల్పించుకున్న సాన్నిహిత్యాన్ని ఈయనతో ఎలా కొనసాగించాలో తెలియక తికమకపడిపోయారు.

రంధ్రాన్వేషులు భారతదేశాన్ని ఎవరి చెలిమికీ నోచుకోని దేశంగా, అలీనవాదం అనే అర్థరహితమార్గలో ఒంటరిగా క్లేశభరితమైన ప్రయాణంసాగిస్తున్నదేశంగా చిత్రిస్తూవచ్చారు. టిటో నాయకత్వంలోని యుగొస్లావియా అలీనవాదాన్ని అనుసరించిందంటే, ఆ దేశం ఉన్న ప్రత్యేకపరిస్థితులలో ఆయనకు పనికొచ్చేవిధానం అదొక్కటే కనుకనని వాళ్ళ సూత్రీకరణ. భారతదేశంవిషయంలో అలీనవాదం ఆచరణయోగ్యమూ కాదు, అవసరమూ కాదు, పైగా ఆత్మహత్యాసదృశమని ఉద్ఘాటించారు. ఏదోఒక కూటమిలో చేరితీరవలసిందే; తటస్థంగానూ, అలీనంగానూ ఉండిపోవడం కష్టం. (ఈ రెండు మాటలూ సమానార్థకాలనీ, ఒకదానికొకటి పర్యాయపదాలనీ వీరు భావించారు) మంచి పేరూ పలుకుబడీ ఉన్న ఓ రాజకీయవాది భారత దేశాన్ని 'అవతలివైపు ఒరిగిన తటస్థ'దేశంగా వర్ణించాడు కూడా — తన వైపు ఒరగలేదన్న దుగ్ధతోనేకావచ్చు. మరొకడు తన తెలివినంతనీ రంగరించి, అలీనవాదం అనైతికమని ముద్రవేశాడు... దేశంలోపలేఉన్న ఎందరో కువిమర్శకులు ఆణిముత్యాల్లాంటి ఈ మాటల్ని ఎంతో రుచిగా వల్లిస్తూవచ్చారు. అయితే భారతదేశం ఏ కూటమిలోచేరాలన్న ప్రశ్నవచ్చేసరికి నిలువునా చీలిక తలెత్తింది. భారతదేశం సోషలిజాన్ని స్వీకరించింది కనుక సోవియట్‌కూటమిలో చేరాలని కొందరంటే, భారతదేశం ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజా స్వామ్య దేశంకనుక అమెరికా నాయకత్వం లోని పాశ్చాత్యకూటమిలో చేరాలని మరి కొందరన్నారు. దేశం ప్రజాస్వామికసోషలిజాన్ని స్వీకరించేసరికి రెండుకూటములూ విస్తుపోయాయి. భారతదేశాన్ని ఏదో ఒక గూట్లో చేర్చడం వాళ్ళతరంకాలేదు.

వీటన్నింటికీతోడు లాల్‌బహదూర్ అనారోగ్యంగురించిన వార్త వచ్చిపడి అనిశ్చిత వాతావరణాన్ని ఉధృతంచేసింది. భారతప్రధానిగా ఉన్న వ్యక్తికి ఉక్కునరాలు, పోతఇనుమును తలపింపజేసే దేహదారుఢ్యమూ అవసరం, అంతకు తక్కువైతే వీల్లేదు. అదృష్టవశాత్తు, మరణించ డానికి కొద్దినెలల ముందువరకు నెహ్రూకు ఇవన్నీ ఉన్నాయి. ఆయన తక్షణవారసుడి ఆరోగ్యం అంతంతమాత్రంగా ఉండదగిన పరిస్థితి కాదు, ముఖ్యంగా గుండె అసలే బలహీనంకాకూడదు. సరిగ్గా లాల్‌బహదూర్ ఎదుర్కొంటున్న రుగ్మత అదే.

ఈ లోపల, ఇతర ముఖ్యమంత్రులతో పోటీపడుతూ చౌదరి, రాష్ట్రంలో మూడురోజులపాటు ప్రధానమంత్రి అధికారికపర్యటన జరపడానికి ఏర్పాట్లుచేశాడు. అఫ్రోజాబాద్ ప్రజలు ఈ సందర్శనపై ఎంతో ఆసక్తి చూపించారు, నాయకుడు నెహ్రూకీ, విధేయఅనుచరుడు శాస్త్రీజీకి మధ్య ఉన్న తేడాను స్వయంగా తిలకించే కుతూహలంతోనే కావచ్చు. ప్రధానమంత్రి అయిన కొద్దిమాసాల్లోనే లాల్‌బహదూర్‌పై వాళ్ళు అభిమానం పెంచుకున్నారు, ప్రతిభాపాటవాలతో నిమిత్తంలేకుండానే వాళ్ళు నెహ్రూవారసుడిపై అభిమానాదరాలు కురిపించడానికి సిద్ధంగా ఉన్నారు. చివరకు ఆయన వామనాకృతి, పరిసరాలను చైతన్యవంతంచేసే నెహ్రూకంఠధ్వనికి పూర్తిగా భిన్నమైన ఆయన కీచుగొంతుకూడా ఒక విధంగా జనానికి ఇష్టమే కలిగించాయి... అయితే అదంతా అభిమానంనుంచి పుట్టిన ఇష్టమేకానీ, ఆయనపట్ల విశ్వాసాన్ని సూచించేదే కానవసరంలేదు. లాల్‌బహదూర్ అదోరకం ప్రొబేషన్‌లో ఉన్నట్టుగా వాళ్ళు భావిస్తున్నట్టు కనిపించారు. వాళ్ళు ఆయన నెంతగానో బలపరిచారు, ఆయన క్షేమాన్ని కాంక్షించారు; అందులో సందేహంలేదు. అయితే ఆయనను గురించిన సంశయస్థితినుంచి బయటపడాలన్న నిర్ణయానికి అప్పటికీ రాలేకపోయారు.

ప్రధానమంత్రి విమానాశ్రయానికి చేరుకున్నప్పుడు, ఆయనకు స్వాగతంచెప్పడానికి జనం పెద్దసంఖ్యలో విచ్చేశారు. అసంఖ్యాకప్రజానీకం రోడ్లమీద బారులుతీరినిలబడి ఆయన హోదాకు తగినట్టు జయజయధ్వానాలుచేశారు. అయినా ఎందరికో కనిపించినట్టే సుసూక్ష్మమైనతేడాఏదో ఆనంద్‌కి కనిపించింది —లేదా కనిపించినట్టు భావించాడతను. నెహ్రూ ప్రత్యక్షమవడంతోనే వాతావరణం ఉత్తేజితమైపోయి జనంలో బ్రహ్మాండమైన కదలికపుట్టేది. పొట్టిగా,' నమ్రత ఉట్టి పడేలా ఉన్న రూపంతో ఒకింత మందకొడిగా కనిపించే లాల్‌బహదూర్ ఉనికి పూర్తిగా భిన్నమైన ప్రభావం కలిగించింది; ప్రజలు ఆయనమీద ఒకవిధమైన వాత్సల్యాన్ని ప్రదర్శించారు. లాల్ బహదూర్ బలమూ, బలహీనతకూడా అందులోనే ఉన్నాయి. ఆనంద్‌కి ముచ్చటా, కలవరమూ ఏకకాలంలో కలిగాయి.

చౌదరి తన మంత్రుల్ని పరిచయంచేశాడు. ఆనంద్ ప్రధానమంత్రితో కరచాలనంచేస్తున్నప్పుడు ఆయనముఖం ఒకింత పాలిపోయిఉన్నట్టు గమనించాడు. ఆయన కవళికలలో అలసట తొంగిచూస్తోంది. అది తన భ్రమ కావచ్చులే ననుకొని ఆ అభిప్రాయాన్ని తుడిచేసుకోడానికి ప్రయత్నించాడు. 'ఇతడు ఆనంద్, భూసంస్కరణలమంత్రి, ఈ పర్యటనలో, ఇకనుంచి మీరు రాష్ట్రంలో జరిపే ప్రతి పర్యటనలో ఇతడే మీ ఆధికారికఅనువాదకుడు!' అని తనగురించి చౌదరి లాల్‌బహదూర్‌కు పరిచయంచేస్తుంటే ఆనంద్ అడుగుముందుకువేసి సావధానుడై నిలబడ్డాడు. ఆ మాటలకు కలిగిన ఆశ్చర్యంనుంచి అతడింకా తేరుకోకుండానే చౌదరి అతని భుజంనొక్కి గుసగుసగా అన్నాడు, 'హుషారుగా వెళ్ళవయ్యా, నీకు చేయడానికి మంచిపని దొరికింది!' ఆనంద్ పక్కకి దృష్టి సారించేసరికి, శాస్త్రీజీతో కరచాలనంచేస్తున్న శేఖర్ అసంతృప్తితో కనుబొమలు ముడవడం స్పష్టంగా కనిపించింది.

పర్యటనకార్యక్రమం పూర్తిగా కిక్కిరిసిపోయింది. చౌదరివర్గం ఒకరోజులో అయిదుబహిరంగసభలు ఏర్పాటుచేస్తే, మహేంద్రనాథ్‌వర్గం తనకు పలుకుబడి ఉన్న ప్రాంతాల్లో అంతేసంఖ్యలో బహిరంగసభలకు పట్టుబట్టింది. ఒకదానిపై ఒకటి ఆధిక్యం సంపాదించుకునే తహ తహలో అస్వస్థుడుగా ఉన్న ప్రధానమంత్రిని పది బహిరంగసభలకు తిప్పి, ఆయన ఆయుఃప్రమాణాన్ని తగ్గింపజేస్తున్నామన్న వాస్తవాన్ని ఏ వర్గమూ గ్రహించుకోలేకపోయింది. ఒకవైపున తన వైద్యుడు వద్దని వారిస్తున్నాసరే శాస్త్రీజీ, విపరీతమైన అలసట కలిగించగల ఎడతెగని రిబ్బన్ల కత్తిరింపు కార్యక్రమాలకు ఒప్పేసుకున్నారు. బాగా పలుకుబడి ఉన్న ఓ దేవాలయ ధర్మకర్త ముఖ్యమంత్రి మనుషుల ద్వారా ప్రధాని తన దేవాలయాన్ని సందర్శించే కార్యక్రమాన్నికూడా వాటిలో చొప్పించగలగడం ఈ ధోరణికి పరాకాష్ఠ.

కార్యక్రమాన్ని ఖరారుచేస్తున్నదశలో ఈ పన్నాగంగురించి అరుణ తెలుసుకోవడం సంభవించింది. పట్టలేనంత కోపంతో ఆమె చౌదరి దగ్గరకు దూసుకువెళ్ళి 'ఏమిటి మీరు చేస్తున్నది? ఆ దేవాలయద్వారంవద్దకు చేరుకోడానికి వందమెట్లు ఎక్కాలన్న విషయం మరిచి పోయారా? ప్రధానమంత్రిని చంపేసి ఆయన శవాన్ని ఢిల్లీ పంపాలనుకుంటున్నారా?' అంటూ కేకలువేసింది. అప్పుడు అక్కడే ఉన్న ప్రభుత్వప్రధానకార్యదర్శి జోక్యంచేసుకుని, ప్రభుత్వ యంత్రాంగం ఆ మెట్లను 'యధోచితం'గా దృష్టిలో ఉంచుకునే ప్రధానమంత్రిని సౌకర్యవంతమైన ఒక కుర్చీలో కూర్చోబెట్టి దేవాలయానికి తీసుకువెళ్ళడానికి చక్కని ఏర్పాట్లు చేసిందని — ఒకవిధమైన ఆధికారికమైనగర్వంతో విన్నవించాడు. ఆ మాటకు అరుణ మరింత మండిపడిపోయింది. 'అంటే, భారతప్రధాని దేవాలయంమెట్లు ఎక్కడానికి కుర్చీమీద ఆధారపడతారని ఫొటోసాక్ష్యంతో సహా మీరు ప్రపంచానికి చాటదల్చుకున్నారన్నమాట? పదిమందిలో ఆయనను ఎంత నవ్వులపాలు చేయబోతున్నారు! సిగ్గులేకపోతే సరి!' వాళ్ళు నెమ్మదిగా దేవాలయ సందర్శనను మిగిలిన కార్యక్రమాలనుంచి తొలగించేవరకు ఆమె అలా విరుచుకుపడుతూనేఉంది. ఆ దేవాలయధర్మకర్తా, కొందరు శాసనసభ్యులూ బండబూతులతో ఆమెమీద విషంకక్కారు. 'ఈ లంజ లాల్‌బహదూర్‌శాస్త్రి సంరక్షకురాలు ఎప్పుడైందట?' అని ప్రశ్నించారు. వచ్చే ద్వైవార్షికఎన్నికల్లో రాజ్యసభసీటు చేజిక్కించుకోవాలనుకున్న ఆ ధర్మకర్త ప్రధానిదృష్టిని ఆకర్షించడానికి ఈ ఎత్తువేశాడు. ఇప్పుడాయన పథకం నీరుగారిపోయింది. దేవుణ్ణీ, ప్రధానమంత్రినీకూడా అలా వాడుకోవాలనుకున్నాడు కానీ, మధ్యలో అరుణ అనవసరజోక్యం, ఆ రాకాసినోరు అతణ్ణి హతాశుణ్ణి చేసేశాయి.

చివరకు ప్రధానమంత్రి ప్రసంగాలు, ప్రారంభోత్సవకార్యక్రమాలతోసహా అన్నింటినీ మరుగునపడేస్తూ ఆ వివాదం అనివార్యంగా మరునాటి పత్రికలకు ఎక్కనేఎక్కింది —అన్ని పత్రికల్లోనూ బాక్సు కట్టించుకునిమరీ ఆ వార్త ప్రత్యక్షమైంది. ఆ పత్రికయాజమాన్యానికి అధికారపక్షంమీద ఉన్న ఇష్టాయిష్టాలనుబట్టి ఆ బాక్సు సైజులోనూ, అందులోని అంశాలకూ తేడాలు ఉంటే ఉండవచ్చు. రెండోరోజున ప్రధానమంత్రి ప్రసంగాలను అనువదించి చెబుతున్నప్పుడు, ఆయన ఆలోచనలలో పొంతన తగ్గినట్టు, మాట నట్టుతున్నట్టు ఆనంద్ గమనించాడు. ఆ బాక్సువార్తల్ని ఆయనదృష్టికి తీసుకొచ్చిఉంటారని ఊహించాడు.

ఆ బాక్సువార్తలు —వాటి అంతరార్థాలతోసహా —మరోవ్యక్తి నిశితపరీక్షకు లోనయ్యాయి. ఆ వ్యక్తి పాకిస్తాన్అధ్యక్షుడు ఆయూబ్ఖాన్ (ఫీల్డ్మార్షల్). దేశంలోని పత్రికాపాఠకులందరికీ అది ఓ మామూలువార్తాంశం కావచ్చు కానీ ఆయనకలా కాదు. ఒక జీవితకాలంలోనే — ఆయన దేశ జీవితకాలంలోనే అది ఒక మహదవకాశం. రెండువిషయాల్లో భగవంతుడు పాకిస్తాన్పట్ల చాలా నిర్దయగా వ్యవహరించాడు. మొదటిది, దేశం అవతరించిన కొన్నిమాసాలకే జరిగిన జిన్నా అస్తమయం కాగా రెండోది నూతనసరిహద్దుకు ఇవతల జవహర్లాల్ నెహ్రూ సంపూర్ణారోగ్యం, దీర్ఘాయుర్దాయం. ఇప్పుడు, ఇంచుమించు పద్దెనిమిదేళ్ళతర్వాత అల్లా తన అనుగ్రహవీక్షణాన్ని పాక్పై ప్రసరింపజేస్తున్నట్టు కనిపించాడు లోపల దాదాపు సంక్షోభపరిస్థితి, దేశనాయకుడుగా ఇంకా స్థిరపడని, అస్వస్థ ప్రధాని —ఇలా భారతదేశం అదృష్టం వెక్కిరించడంలో తొంగిచూస్తున్న అత్యుత్తమఅవకాశాన్ని ఆయూబ్ఖాన్ జారవిడవడం అసంభవం. ఇప్పుడు తప్పితే తనెన్నటికీ ఏమీ చేయలేననుకున్నాడు.

చూస్తుండగానే సన్నసన్నగా ఉరుములు మొదలయ్యాయి. అదికూడా ప్రాముఖ్యం అంతంత మాత్రంగాఉండే కచ్ ప్రాంతంలోని 'రన్' అనబడే రంగంలో. వాస్తవికలక్ష్యాన్ని మరుగుపుచ్చడానికి జరిపే అభ్యాసప్రదర్శనకాకపోతే ఆ ప్రదేశాన్ని ఎంచుకోడంలో అర్థంలేదు. ఇక వాస్తవికలక్ష్యం కాశ్మీర్ తప్పించి మరొకటి కావడానికి వీల్లేదు. రన్ ఘటనల్ని, భారతీయపత్రికలతోసహా ఒక్కరూ తీవ్రంగా పట్టించుకున్నట్టు కనిపించలేదు. అంతకంటె పెద్దప్రమాదమే ఏదో ముంచుకురాబోతున్నట్టు ఎవరూ గ్రహించలేకపోయారు. పాకిస్తాన్బూచిని చూపించి దేశం ఎదుర్కొంటున్న వాస్తవిక సమస్యలనుంచి ప్రజలదృష్టిని మళ్ళించడంకోసం ప్రభుత్వం పన్నిన ఎత్తుగడలోభాగంగా చిత్రించి సరిహద్దుఘర్షణలను పత్రికలు కొట్టిపారేశాయి. లేనిచోట వివాదాన్ని రగుల్కొలపడంద్వారా పాకిస్తాన్ అక్షరాలా తొలివిడత విజయంసాధించినప్పుడు, ఏంచేయాలో ఎవరికీ తోచలేదు

కొద్దివారాల్లోనే పరిస్థితులు స్థిరపడుతున్నట్టు కనిపించాయి. ఆయూబ్ తనమేరకుతాను ముందుగా ఓసారి కదిపిచూశాడు. తాను కోరుకున్న రంగంలో స్వల్పకాలంలో మెరుపుదాడిచేసి ముందుకు చొచ్చుకువెళ్ళినప్పుడు భారతరక్షణదళాలు ఎలా తిప్పికొట్టగలుగుతాయో తెలుసుకోవాలనుకున్నాడు. భారతపక్షానికివస్తే ఏదీ రుజువుకాలేదు, కాకుండానూలేదు. రన్ ప్రాంతంలో ఘర్షణకు దిగడం సైనికాధికారులకు ఇష్టంలేదు; శ్రమకు తగిన ఫలితం ఉండదని వాళ్ళకి తెలుసు. భారతదేశానికి దురాక్రమణకాంక్ష ఎటూలేదు కనుక వాళ్ళు ఇతరేతర ప్రయత్నాలకూ దిగలేకపోయారు. ఎక్కడిదక్కడే అనిశ్చితంగా ఉండిపోయింది. మనవైపు వ్యక్తమౌతున్న భయాందోళనలు పూర్తిగా నిరాధారమైనవన్న తమ అభిప్రాయాన్ని ఈ పరిస్థితి ధ్రువీకరిస్తున్నట్టు పత్రికలు చెప్పుకున్నాయి. అయినా వాస్తవంలో, చెదురుమదురుఘటనలగురించి రోజూ ఏవో వార్తలు వస్తూనేఉండడంతో వాటిని అప్రధానఘటనలుగా ఎవరూ కొట్టివేయలేక పోతున్నారు. ప్రజల ఓరిమినశించేస్థాయికి అవిశ్వాసపూరిత వాతావరణమూ, అస్థిమితమూ ముదిరిపోయాయి. బహిరంగసమావేశాల్లో, పార్లమెంటులో, కాఫీహోటల్కబుర్లలో —ఎక్కడ పడితే అక్కడ యుద్ధంఒక్కటే చర్చనీయాంశమైపోయింది. సచివాలయాల్లో ఈ చర్చ మరింత గట్టిగా వినిపించసాగింది ఈ వంకతో అధికారులు రోజువారీపనులు ఎగ్గొట్టడం ప్రారంభించారు.

మంత్రిగా ఆనంద్‌కు, పెద్దగా చేయవలసిన పనేదీ కనిపించడంలేదు. దేశం యుద్ధభయాన్ని ఎదుర్కొంటున్నప్పుడు భూసంస్కరణలు ఎవడిక్కావాలి? అతని వెర్రిని ఎత్తిచూపించి వెక్కిరించ డానికి సహచరులకు ఓ అవకాశందొరికింది. 'నిన్నుచూసి అందరూ నవ్వుకుంటున్నవిషయం నీకు తెలుస్తోందా లేదా? భూస్వామ్యవర్గాన్ని దూరంచేసుకునే సమయమేనా ఇది? ఐకమత్యం తక్షణావసరమైనప్పుడు జనాన్ని విడదీసే అటువంటి వివాదాస్పదచర్యగురించి ఎలా పట్టుపట్టగలవ్? ఈ పరీక్షాఘట్టంలో దేశభక్తి ఏమని ప్రబోధిస్తోంది? దానిగురించి ఆలోచించావా?...' పట్టరానికోపంతో సెగలుకక్కుతూ ఆనంద్ మౌనంగా ఉండిపోయాడు. పాకిస్తాన్‌అధ్యక్షుడు ఫీల్డ్‌మార్షల్ ఆయూబ్‌ఖాన్ అప్పటికప్పుడు భారతదేశంలోని భూస్వాములకు కూరిమినేస్తంగా మారిపోతాడని అతడు కొంచెమైనా ఊహించలేదు.

ఒకరోజు ఉదయం అతడు పత్రికలు తిరగేస్తుండగా అటెండర్ 'అఫ్జల్‌ఖాన్' అని ఉర్దూలో రాసిఉన్న ఒక చీటీ తీసుకొచ్చి ఇచ్చాడు. ఆ పేరుకింద, జిందగీ ఔర్ మౌత్ కా సవాల్ హై (ఇది చావుబతుకుల సమస్య) అన్న వాక్యం ఉంది. తెలిసిన పేరులానే ఉంది, కానీ మనిషిని పోల్చుకోలేకపోయాడు. క్షణకాలం తర్కించుకుని ఆయనను లోపలికి తీసుకురమ్మని అటెండర్‌కు చెప్పాడు. మరికొద్దిక్షణాలలోనే ఒక వృద్ధుడు చేతికర్రఊతంతో, తడబడే నడకతో గదిలోకి అడుగుపెట్టాడు. ఆనంద్‌కు అదేపనిగా వంగివంగి దణ్ణంపెడుతూ ఓసారి అతనిమీద పడబోయాడు. ఆనంద్ వెంటనే కుర్చీలోంచి లేచి ఆయనను పట్టుకున్నాడు. ఆ తర్వాత ఆ వృద్ధుడివైపు పరీక్షగా చూసి 'చాచా! నువ్వా...?' అంటూ సంభ్రమంతో ఒక్క కేకవేశాడు.

'అవును సర్కార్... మీ చాచానే, ఊళ్ళో నీకూ, నీ దోస్తులకూ బాగా తెలిసిన ఆ బే నసీబ్‌గాణ్ణి...'

తృటికాలంలో నాటిదృశ్యం ఆనంద్‌మదిలో విస్పష్టంగా మెరిసింది. ఊళ్ళో జన్మాష్టమి ఉత్సవం... చివరిరోజు... పిల్లలు కృష్ణలీల ప్రదర్శిస్తున్నారు... ఆనంద్‌మిత్రుడు కరీమ్ ఎందు చేతనో రాలేకపోయాడు... తనూ, మరికొందరు అతనికోసం అతనింటికి వెళ్ళారు... చాచా అయిష్టంగా భృకుటి ముడిచి తమను తీసిపారేస్తూ మాట్లాడాడు, హిందువుల పండుగలగురించి అహంకారపూరితమైన వ్యాఖ్యలేవోచేశాడు... కరీమ్, అవును కరీమ్... తన ఆప్తమిత్రుడు... చివరిసారిగా అతనిగురించి తాను విన్నది, పాకిస్తాన్ వెళ్ళిపోయాడని... అదే చాచా ఇప్పుడు, ముప్పైఅయిదేళ్ళతర్వాత తనను కలుసుకోడానికి వచ్చాడు! ఒకవైపున ఆ వృద్ధుడు ఆనంద్ తనను ఆదరంగా ఆహ్వానించినందుకు చెప్పలేనంత కృతజ్ఞతాభావంతో సతమతమౌతుంటే, ఆయనను గుర్తుపట్టగలిగినందుకు ఆనంద్ తనకుతనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

ఆనంద్ ఆయనను సోఫాలో కూర్చోబెట్టాడు. 'సర్కార్' పక్కన కూర్చోడానికి ఆ వృద్ధుడు ఎంతో తటపటాయిస్తుంటే బలవంతంగా కూర్చోబెట్టవలసివచ్చింది. టీ తెప్పించి ఇచ్చిన తర్వాత, తన అనుకోని రాకకు ఆయన చెప్పబోయే కారణంకోసం ఎదురుచూస్తూ ఉండిపోయాడు.

'బడేభాయ్‌సాహెబ్ హాలం బాగాలేదు... ఇయ్యాలో రేపో అన్నట్టున్నడు' అఫ్జల్ మొదలు పెట్టాడు. ఆనంద్ చటుక్కున గ్రహించాడు —బడేభాయ్‌సాహెబ్ అంటే కరీమ్ తండ్రి. ఆయనను గుర్తుచేసుకోడానికి ప్రయత్నించాడు. చాలా సరదామనిషి, తన అయిదెకరాల సాగు చూసుకుంటూ, తీరికసమయాల్లో ఏవో చిల్లరపనులు చేసుకుంటూ ఎప్పుడూ గ్రామాన్ని అంటిపెట్టుకునే ఉండేవాడు... ఆయన అసలుపేరు ఎవరికీ తెలియదు; ఊరు ఊరంతా ఆయనను 'బడేసాబ్' అని పిల్చేది. కురాన్‌నుంచి అనేక ఆయత్‌లనే కాదు, భాగవతంనుంచి లెక్కలేనన్ని పద్యాలూ వల్లిస్తూఉండేవాడు. హిందువుల పండగలనీ, ముస్లింల పండగలనీ చూడకుండా అన్ని పండగలకూ వచ్చి జనంలో కలిసిపోయేవాడు. అన్నింటినీమించి బడేసాహెబ్ సుప్రీంకోర్టులాంటివాడు. ఊళ్ళో అన్ని తగాదాలూ అంతిమపరిష్కారానికి ఆయన పూరింటిముందుకే వచ్చేవి. గ్రామస్థులు ఆయనను మూర్తీభవించిన న్యాయదేవతగా భావించుకునేవారు.

'ఈ సారి ఏం భరోసా లేదు' చాచా కొనసాగించాడు. 'డాక్టరు కొన్నిదినాలేనన్నడు. కొడుకులు బిడ్డలు గురించి భాయిసాబ్‌కి ఎటువంటి ఫికర్ లేదు. వాళ్ళ సంసారాలు మంచిగున్నయని సంతోషిస్తున్నడు. కాని ఈసారి వాళ్ళను సూడాలని పట్టుబడుతున్నడు. బాకీ సబ్ ఆయనదగ్గరే ఉన్నరు... ఒక్కడుతప్ప... నీకు తెలిసేఉంటది... కరీమ్. ఊకె భాయ్‌సాబ్ కరీమ్ పేరే కలవరిస్తుండు. కరీమ్‌ను ఆఖరుసారి సూడాలని ప్రాణాలు బిగవట్టుకున్నట్టున్నడు... కాని...' వృద్ధుడు హఠాత్తుగా ఆగిపోయి చేతులుజోడించి రుద్ధకంఠంతో అన్నాడు, 'ఇప్పుడు సర్కార్ ఒక్కరే మమ్ముల ఆదుకోగలరు. హమారేకో కుచ్ సమఝ్‌మే నహీ ఆతా!...'

'చాచా' ఆనంద్ అన్నాడు, 'ఇన్నేళ్ళూ కరీమ్ ఆనుపానులు కనిపెడుతూ ఉండలేక పోయినందుకు చాలా బాధపడుతున్నాను. పాకిస్తాన్‌లో ఉన్నాడనిమాత్రం తెలిసింది. ఈ మధ్యలో చాలాసార్లు ఈ దేశానికి వచ్చే ఉంటాడు; కలవడం సంగతలా ఉంచు, కనీసం ఆ గాడిద తనొచ్చినట్టు కబురుకూడా చేయలేదు. ఇప్పుడుమాత్రం వచ్చి తండ్రిని చూడ్డానికి అతని కొచ్చిన ఇబ్బందేమిటీ? ఇంతకీ పాకిస్తాన్‌లో ఏం చేస్తున్నట్టు?'

'పాకిస్తాన్‌మిలట్రీలలో ఏదో ఆఫీసర్ అట —కర్నలో ఏదో, అదేమిటో నాకు తెలువది బేటా...' చాచా నట్టుతూ జవాబుచెప్పాడు.

ఆనంద్ నివ్వెరపోయాడు. తను భారతసైన్యంలో కర్నల్‌గా ఉన్నట్టు, కర్నల్ కరీమ్ నాయకత్వంలోని పాకిస్తానీదళాలు సాగిస్తున్న దాడులను తిప్పికొడుతున్నట్టు తృటికాలం ఊహించుకున్నాడు.

'అలాగా' ఎంతో నిదానంగా అన్నాడు, 'నేను ఏం చేయగలుగుతానో అది చేస్తాను చాచా, అయితే హామీమాత్రం ఇవ్వలేను, నీకుమాత్రం తెలియదా?...'

'తెలుసు బేటా. అంతా తక్‌దీర్ (తలరాత)' ముంచుకొచ్చిన దగ్గుతెరమధ్య అన్నాడా వృద్ధుడు, 'అల్లా నిన్ను చల్లగా చూస్తడు బేటా...' అంటూ మరోసారి వంగి దణ్ణంపెట్టి బాధగా వెనుతిరిగాడు.

చాచా ఇచ్చివెళ్ళిన పత్రాలు పరిశీలించినమీదట, భారతదేశసందర్శనకు కరీమ్ చేసిన అభ్యర్థనను కేంద్రప్రభుత్వం ఇప్పటికే తిరస్కరించినట్టు ఆనంద్‌కు అర్థమైంది. ఆ నిర్ణయాన్ని తిరగదోడించడం మాటలుకాదు. కేంద్రప్రభుత్వంలోని హోంశాఖ సహాయమంత్రితో మాట్లాడాడు కానీ అతడంత సానుకూలంగా స్పందించలేదు. అయితే ఆ మరునాడు మధ్యాహ్నం ఓ పోలీస్అధికారి పాకిస్తాన్‌కుచెందిన కల్నల్ అబ్దుల్‌కరీమ్ పుట్టుపూర్వోత్తరాలను విచారించడంకోసం ఆనంద్‌ను కలిశాడు. అతనితో తన చిన్నప్పటి సావాసం, అతని కుటుంబం గురించి తప్ప తన కతడిగురించి మరేమీ తెలియకపోవడం గమనించి ఆనంద్ ఒకింత దిగ్భ్రాంతికి లోనయ్యాడు. అతడిగురించి చాలా క్లుప్తంగా, ఇంచుమించు నాలుగు పొడిమాటలు చెప్పగలిగాడు. ఆ కాస్త వివరణకే ఆ అధికారి ఎంతో సానుభూతి చెందినట్టు కనిపించి ఆనంద్ ఎంతో తేలికపడ్డాడు.

అంతలోనే, ఆ మరునాడే భారత —పాకిస్తాన్‌ల మధ్య యుద్ధం తథ్యమన్న వార్త పిడుగులా వచ్చిపడింది. రక్షణసిబ్బందికి మంజూరుచేసిన సెలవు తక్షణమే రద్దయిపోయింది. కల్నల్ కరీమ్ తన తండ్రిని చూడడానికి భారతప్రభుత్వం బహుశా అనుమతించి ఉండేదేమో కానీ, జనరల్ ఆయూబ్‌ఖాన్ సంకల్పం మరోలా ఉంది. కొద్దిరోజులకే బడేసాహెబ్ చనిపోయాడు. ఆ తర్వాత కరీమ్‌గురించి ఆనంద్‌కు ఎటువంటి కబురూ తెలియలేదు. మిగిలిందల్లా, పాకిస్తాన్‌సైన్యంలో ఆనంద్‌కు ప్రాణస్నేహితు డొకడున్నాడన్న, శేఖర్ ఎంతో జాగ్రత్తగా దృష్టిలో నిలుపుకున్న సమాచారం.

ఆ క్షణంలో ఆ సమాచారంవల్ల శేఖర్‌కి వచ్చిపడే ప్రయోజనంలేదు. కాని, ఆనంద్ దేశ భద్రతకు ముప్పుగా పరిగణించగలదన్న ఎంతో విలువైన ఆ అపనిందలో ఇమిడిఉన్న విధ్వంస శక్తిని నిర్లక్ష్యంచేయడం కష్టం. శేఖర్ అంచనావేసినట్టు, కావలసిందల్లా, ఓ కీలకసందర్భం, ఆనంద్‌కి పాకిస్తాన్‌సైన్యంలో ఓ సన్నిహితమిత్రుడున్నాడనే ఎంతో అసాధారణ ఆసక్తిజనకమైన వార్తను ప్రచారంలోకి తీసుకురాగల ఓ విశ్వసనీయ విలేఖరి. ఆపైన —ఇంతటి విలువైన సమాచారాన్ని ఎంతో సమర్థంగా, పట్టుదలగా గుసగుసలరూపంలో ప్రచారంలోపెట్టి, చివరగా అత్యున్నత అధికారవర్గాలచెవికి చేర్చగల సామర్థ్యం శేఖర్‌కు ఉండనే ఉంది.

# 36

చాచా అఫ్జల్ ఖాన్ రాకతో ఆనంద్ ఆలోచనలో పడిపోయాడు. గత ముప్పై సంవత్సరాల్లో చాలా మారినట్టనిపించాడు. కాని నిజంగా మారాడా? ఒకవిధంగా చూస్తే చాచాయే ఆనంద్‌ను కరీంతో వేరుచేశాడు. ఆ ఆలోచనతో ఆనంద్ కంపించిపోయాడు. అదెలా జరిగింది? అఫ్జల్ చాచా, బడేసాబ్ ఇద్దరు అన్నదమ్ములను పరస్పరం పోల్చి చూచాడు. చాచా మూలతః ఒక పట్టణవాసుడైన పరాన్నభుక్కు. గ్రామంలో పుట్టినప్పటికీ అతను గ్రామానికి అపరిచితుడు. 'అనన్-మాలిక్' వివాదాన్ని పూర్తిగా జీర్ణించుకుని దాన్ని ముస్లిం రాజ్యంలో నివసించే ముస్లిం పౌరని విశిష్టస్థానానికి ప్రతీక అంటూ నమ్మినవాడు... కనుక రాజరికం అంతమయ్యాక చాచావంటి వారికి ఎటుపోవాలో, ఏమనుకోవాలో, తోచలేదు. చాచా ఇప్పుడే వంగివంగి చేసిన సలాంల అర్థం, 'నేనిప్పుడు రాజును కాను; నాకిష్టమున్నా లేకున్నా నీవే రాజువు,' అన్నట్టు. జరిగిన మార్పల్లా ఒక రాజుకు బదులు మరో రాజు రావడమే, అన్న భావం ఆనంద్‌ను కలవరపెట్టింది, విచిత్రమైన వేదన కలిగించింది.

ఇందుకు పూర్తిభిన్నంగా, బడేసాహెబ్ ఊరిమట్టితో పెనవేసుకున్న మనిషి. ఇక్కడే చెమటోడ్చాడు, ఆడుకున్నాడు, పండుగ పబ్బాల్లో పాలుపంచుకున్నాడు, పోరాటాలు చేశాడు, జారత్వం సాగించాడు. నడిచే నిఘంటువులా, ఊళ్ళలో వినిపించే నోటికొచ్చిన రకరకాల బూతుమాటలు దొర్లించాడు, కరవుకాటకాలకీ, వరదలకీ విలవిల్లాడాడు, భూమి తగాదాలతో ముడిపడిన అనేక దాడుల్లో పాల్గొన్నాడు, అవసరమైనప్పుడు రాజీపడ్డాడు, రకరకాల వివాదాలు తీర్పుకోరి తనముందుకువచ్చినప్పుడు మచ్చలేని న్యాయం అందించాడు —ఒక్కమాటలో చెప్పాలంటే ఊరు ఊరంతా ఆయనలో రూపుకట్టింది. నలుగురుభార్యలతో పద్నాలుగుమంది సంతానాన్ని కన్నాడు. ఒక భార్య పెళ్ళికిముందు ముస్లింకాదు. ఆపైన వేర్వేరు పితృత్వాలతో చలామణి అవుతున్న ఆయన సంతతి కూడా సంఖ్యలో తక్కువేమీకాదు. అరవైఏళ్ళకుదాటి విస్తరించిన ఆయన యవ్వనకాలంలో, ఊళ్ళోని ఎందరెందరో పడతులు ఆయన వలపుచూపుల్లో తడిసి పరవశించారు. అటువంటి చాటుమాటు సరసాలకు తగిన రహస్యప్రదేశాలకు ఊళ్ళో లోటుండేదికాదు. ఆయన వాటిని చక్కగా ఉపయోగించుకునేవాడు. ఏపుగా పెరిగిన మొక్క జొన్నచేలు; వరికంకులు గింజపడుతున్న దశలో పిట్టల్ని తరమడానికి ఎత్తుగా కట్టిన మంచె; పొలంబావిచుట్టూ మట్టిదిబ్బలమధ్య పల్లంగా ఉన్న పసిరికనేల; చెట్లకంటె కురచగా, పొదలకంటె

ఎత్తుగా ఉన్న దట్టమైన మొక్కలగుంపుమధ్య తీర్చిదిద్దినట్టున్న ప్రదేశం. ఏ మాట కామాట చెప్పుకోవాలంటే, ఊళ్ళో ఆయనొక్కడే అచ్చోసిన ఆంబోతు కాదు. నడిచే కామోత్సవంలో నాయకపాత్రవహించే ఎందరో తిరుగుబోతుల్లో ఆయనా ఒకడు మాత్రమే. ఓపలేని ఇంతటి తాపంలో, మతంపేరుతో మడి పాటించాలన్న ఆలోచన ఏ ఒక్కరికీ కలగలేదు

దశాబ్దాల తర్వాత, శరీరపటుత్వం కలిసిరాని పరిస్థితిలోకూడా బడేసాహెబ్ రసికతను సూచించే ఛలోక్తులు, ముచ్చట్లు వ్యాపిస్తూనేవచ్చాయి. ఆడ, మగ అని లేకుండా ఊళ్ళోని కుర్రకారుకవి చక్కిలిగిలిపెట్టేవి. ముఖ్యంగా అప్పుడు ఆడపిల్లలముఖాల్లోని నునుసిగ్గును సూచించే మొలకనవ్వుల కోసమైనా అతడికి జీవించాలనిపించేది.

తరతరాలుగా మార్పులేకుండా వస్తున్న ఈ ప్రశాంత వాతావరణంలో చాచా అఫ్జల్ మతతత్వం మంట రగిలించాడు. ఎవరు ఎవరితో పడుకున్నారనేదికూడా మతకోణంనుంచి పరిశీలించ వలసిన ఓ ముఖ్యాంశంగా మారిపోయింది. మగవాడు ఫలానా మతస్తుడైతేనే ఆ పరాయి శారీరకసంబంధం అనుమతిపొందుతుంది. అన్-అల్-మాలిక్ తర్కంనుంచి పుట్టుకొచ్చిన సిద్ధాంతమది. అదే తర్కం గ్రామీణజీవితంలోని ప్రతికోణానికీ విస్తరించడం ప్రారంభించింది. ఒక మతానికి ఆధిక్యం కట్టబెట్టడం జరిగిపోయింది. అదిప్పుడు దాదాపు చట్టాలకు అతీతమైనది, అసలు తనే చట్టం, చట్టమే తను. దీనిపై ఎవరైనా ఊహించగలిగిన ప్రతిక్రియలే వ్యక్తంకాసాగాయి.

బ్రిటిష్ ఆధిపత్యంలో మతతత్వం ప్రధానంగా విభజించి పాలించడాని కుద్దేశించిన ఒక రాజకీయాస్త్రం. ఓ ముస్లింరాజు ఏలుబడిలో అది సంపూర్ణంగా సర్వవిధాలుగా ముస్లిం గుత్తాధిపత్యంగా పరివర్తనచెందింది. ముస్లింరాజ్యంలో ప్రతిముస్లింపౌరుడిలోనూ ఈ రాజాంశ కొంత ప్రతిఫలిస్తుంది కనుక, లేదా ఉంటుంది కనుక అతడికి లేదా ఆమెకు ఒక ప్రత్యేకస్థానం ఉంటుందన్నది ఇందుకు సిద్ధాంతప్రాతిపదిక.

ఇంతలో దేశవిభజన జరిగింది, దానితోనే ఒక మార్పూ సంభవించింది. అయితే అది కేవలం పైపైన వచ్చిన మార్పు. చాపకింద నీరులానే అయినప్పటికీ, లౌకికవాదోక్తులతోపాటే మతతత్వమూ విస్తరించడం ప్రారంభించింది. మతపరమైన ఉద్రిక్తత కొన్నిప్రాంతాల్లో హింసాత్మక పరిస్థితికి దారితీయించి, క్రమంగా ఈ ప్రాంతాల్లో అది ప్రాణాంతకంగా పరిణమించింది. పాకిస్తాన్ ఆవిర్భావానికి మూలమైన ద్విజాతిసిద్ధాంతంతో భారతదేశానికి ఎటువంటి బాదరాయణ సంబంధమూ లేదు. అయినాసరే, ఒకేజాతి అనిపించుకోడానికి అవసరమైన జాతిపరమైన, మానసికమైన ఏకత్వభావం దేశంలో సర్వత్రా విస్తరించలేదు. కేవలం కొన్ని సంస్థల నినాదంగా మారిన ఈ సమష్టిభావం సువిశాల గ్రామీణప్రాంతాల్లో ఒక అవిచ్ఛిన్నసంప్రదాయంగా కొనసాగుతూ వచ్చినా, పట్టణప్రాంతప్రజల హృదయాల్లో, బుద్ధిలో వేళ్ళూనుకోలేదు. ఓ వైపున మనస్తాపం, మరోవైపున అనుమానం జాతిజీవనంలోకి చొరబడడం ప్రారంభించాయి. కాలం గడిచినకొద్దీ మతాలమధ్య అగాధమూ విస్తరించసాగింది. దేశం దేహంలోకి ప్రవేశించిన ఈ సరికొత్త విషక్రిమి లోపల్లోపలే దొంగచాటుగా రకరకాల మార్పులు తెచ్చిపెట్టింది. అల్లర్లు చెలరేగినప్పుడల్లా మొదటి అగ్నికణం అన్యప్రాంతాలనుంచే వస్తూఉండడం సర్వసాధారణమైపోయింది. ఏదో కిటుకును ప్రయోగించి ఈ మతకల్లోలాలకర్తలకు ముక్కుమొహం లేకుండా జాగ్రత్తపడడమూ

జరుగుతూ వచ్చింది. హిందువులు, ముస్లింలు ఒకరినొకరు ఊచకోత కోసుకుంటున్నా, ఇటువంటి అనేక ఉదంతాలలో హతుడూ, హంతకుడూ ఒకరికొకరు పూర్తిగా అపరిచితులే. స్వగ్రామంలో కానీ, తమ మొహల్లాలోకానీ జరిగే మతపరమైన హత్యాకాండకు స్థానికులు సాధారణంగా దూరంగానే ఉండేవారు. కనుక హంతకులు తమ ఆగ్రహప్రకటనకు వేరే ప్రాంతాలకు వెడుతూ ఉండేవారు. ఆ నరమేధం అంతా వ్యక్తినిరపేక్షంగానే జరిగిపోతూఉండేది. తమ ఉన్మాదప్రకోపానికి బలవుతున్న వ్యక్తులపై వాళ్ళకు ద్వేషమూ ఉండదు, సానుభూతీ ఉండదు. అంతా యాంత్రికం, సంహారంకోసం సంహారం, అకారణంగా జరిగే ఊచకోత.

పాకిస్తాన్‌తో సైనికఘర్షణలు దేశంలోని పరిస్థితులను మరింత విషమింపజేశాయి. దేశాన్ని ఒక లౌకికవ్యవస్థగా తీర్చిదిద్దడానికి నెహ్రూ జరిపిన మహోన్నతకృషి తగుమేరకు ఫలించకపోలేదు. అయితే అది చాలావరకూ ఆయన వ్యక్తిగత సమ్మోహనశక్తివల్ల కలిగిన ఫలితమే. ముస్లింమైనారిటీపట్ల హిందువులలో అనుమానాలు ఎంతగా బలపడిపోయాయంటే, లౌకికతా ఆదర్శాన్ని స్థాపించడానికి నెహ్రూ జరుపుతున్న నిర్విరామయత్నంపై తరచు ఎత్తిపొడుపు వ్యాఖ్యలు వినిపిస్తూవచ్చాయి. ఒక సీనియర్‌నాయకుడికి ఆపాదించి చెప్పుకున్న అటువంటి ఒకానొక వ్యాఖ్యప్రకారం, భారతదేశంలో జాతీయవాది అనదగిన ఏకైకముస్లిమెవరంటే జవహర్లాల్‌నెహ్రూ అని!... ఆ విధంగా నెహ్రూ ఒక్కరే లౌకికవాదంకోసం పోరాడే యోద్ధగా మిగిలిపోగా, హిందువులు, ముస్లింలనే తేడాలేకుండా మిగిలిన ఎందరో నాయకులు మనసులో విశ్వాసం లేకపోయినా లౌకికతా నినాదాల్ని వల్లిస్తూవచ్చారు. లౌకికతా ఆదర్శం ఎంతో దృఢంగానూ, ఎంతో సహజ సిద్ధమైనదిగానూ కనిపిస్తూవచ్చినా, పూర్తిగా ప్రభావం వేయలేక పోయింది. కారణం స్పష్టమే; పరిహద్దుకు అవతల వేరొక దేశం ద్విజాతి సిద్ధాంతానికి ఓ సజీవచిహ్నంలా, లౌకికవాదానికి నిర్ద్వంద్వ తిరస్కృతిలా నిలిచిఉండడం. పర్యవసానంగా నెహ్రూ సంరక్షణలో లౌకికవాదం భారతదేశ ఘనవిశ్వాసంగా పరిణమించినప్పటికీ, దానికి సుస్థిరమైన ఇరుసు కానీ, పటిష్ఠమైన పునాది కానీ లేకుండాపోయింది. అటుపైన, సరిహద్దు అవతలివైపునుంచి రోతపుట్టేలా అదేపనిగా జరుగుతున్న భారతవ్యతిరేక దుష్ప్రచారం పరిస్థితిని మరింత సంక్లిష్టంచేసింది. పాకిస్తాన్ నాయకులకు స్వీయదేశనిర్మాణమనే అత్యవసర కార్యక్రమంమీద కాక, భారతదేశాన్ని ఆడిపోసుకోవడంపైనే మితిమీరిన ఆసక్తి అన్నది స్పష్టమైపోయింది.

దేశంలో సంపూర్ణంగా లౌకికవాతావరణాన్ని ప్రతిష్ఠించడం అంత తేలికేమీ కాదు. మత కల్లోలాలతో దేశం అట్టుడుకుతున్నరోజుల్లో నెహ్రూ కల్లోలితప్రాంతాలకు వెళ్ళి దుండగులను స్వయంగా ఎదుర్కొన్నారు. విరుచుకుపడుతున్న మూకతో ముఖాముఖి తలపడ్డారు, బాకు దిగేయబోతున్న చేతుల్ని ఒడిసిపట్టుకున్నారు. ఆయన సాహసోపేతప్రవృత్తికి అద్దంపట్టే కథలు అంతటా ప్రచారమయ్యాయి కానీ హింసను అణచివేయడంలో కానీ, నెహ్రూ అడుగుజాడల్ని అనుసరించేలా మిగిలినవారిని ఉత్తేజితుల్ని చేయడంలో కానీ అవంత అక్కరకురాలేదు. అటువంటి ఒకానొక ఉదంతం ప్రకారం, ఓ రోజున నెహ్రూ, కుమార్తె ఇందిరతో కలిసి ఢిల్లీలోని ఓ మతకల్లోలిత ప్రాంతంలో పర్యటిస్తుండగా, ఎవడో ఒక ఆగంతకుడు హఠాత్తుగా ఇందిర చేయిపట్టుకుని తనవైపు గుంజుకున్నాడు. పటరాని ఆగ్రహంతో నెహ్రూ ఆ వ్యక్తి చెంప ఛెళ్ళుమనిపించారు. ఆ మనిషి

ప్రశాంతంగా చెక్కిలి తడుముకుంటూ విషాదమిళితమైన ఓ చిరునవ్వు నవ్వి అన్నాడు, 'పండిట్‌జీ, నేనిప్పుడు చేసినదానికే మీరింత ఆవేశపడినప్పుడు, లాహోర్‌లో నా భార్యకీ, సోదరికీ జరిగినదానికి నేనేం చేయాలంటారు?' ఆ ప్రశ్నకు కంటతడిపెట్టిన పండిట్‌జీ ఆ యువకుడికి క్షమాపణ చెప్పారట.

దేశవిభజన తర్వాత, రెండు దశాబ్దాలపాటు ఉపఖండంలో పరిస్థితి మొత్తంమీద ప్రశాంతంగానే ఉంది. భారత —పాకిస్తాన్ సరిహద్దుకు అటూ ఇటూ శాంతియుత సహజీవనం కొనసాగింది. సరిహద్దుప్రాంతాల్లో నివసించే సాధారణప్రజానీకం ప్రత్యేకించి హింసకు మొగ్గేవారు కాదు. సరిహద్దుకు ఎటువైపునున్నా అందరూ ఒక కుదుట్లోవాళ్ళే. దేశవిభజనకు ముందునుంచే వాళ్ళమధ్య చెదురుమదురుగా స్వల్పఘర్షణలు జరుగుతూఉండడం పరిపాటి. వీళ్ళు చాలావరకూ పశువుల్ని మేపుకునే సంచారజాతి. రన్ అనే ప్రాంతంలో వ్యవసాయం లేదు, ఎందుకంటే ఆ ప్రాంతం ఏడాదిలో ఆరేడునెలలు ఉప్పునీట మునిగిఉంటుంది. ఈ ప్రాంతంలో వస్తువుల అక్రమరవాణాతో సహా రకరకాల చట్టవిరుద్ధవ్యాపారాలు పుంజుకున్నాయి. దేశవిభజన తర్వాతకూడా కొత్తసరిహద్దు వెంబడి అవి కొనసాగుతూనేవచ్చాయి. భౌగోళికస్థితిరీత్యా సంభవించిన సహజపరిణామం ఇది. స్థానిక కుటుంబాలకు సరిహద్దుకు రెండువైపులా బంధుబలగాలు ఉన్నాయి కనుక పరస్పర సహకారంతో గుట్టుగా సాగించవలసిన ఇటువంటి కార్యకలాపాలకు ఈ ప్రాంతం ఎంతో అనువుగాఉంటూ వచ్చింది.

దేశవిభజన పూర్తిగా ఒక విలక్షణపరిణామం. దేశాన్ని రెండుగా విభజించి పూర్తిగా కృత్రిమమైన ఓ సరిహద్దురేఖ గీయాలని బ్రిటిష్‌వాళ్ళతో కలిసి నిర్ణయించినవాళ్ళు —ముఖ్యంగా బొంబాయికీ, యునైటెడ్‌ప్రావిన్సెస్ (తర్వాత దీనికి ఉత్తరప్రదేశ్ అని పేరు పెట్టారు)కీ, అఖండభారతంలోని మిగిలిన ప్రాంతాలకీ చెందిన నాయకులు. సరిహద్దుప్రాంతాల్లోని ప్రజలకు ఈ నిర్ణయంలో ఎటువంటి పాత్రా లేదు, ఉన్నా అతిస్వల్పం. అలా నిర్ణయం జరిగినంతమాత్రాన సరిహద్దుకు ఇరువైపులా ఉన్న ప్రజలు అప్పటికప్పుడు ఒకరికొకరు అపరిచితులుగా మారిపోరు. సోదరులు తమ బంధాన్ని తెంచుకోలేరు. స్నేహితులు, బంధువులు అనాదిగా వస్తున్న రక్తసంబంధాలను, ఆచార, వివాహబంధాలను విచ్ఛిన్నం చేసుకోలేరు. పరస్పర ఆర్థికసహకార జీవనం హఠాత్తుగా అదృశ్యమైపోదు. రెండుదేశాల నాయకులు ఎలా సంకల్పించుకున్నా, వాస్తవికవిభజనరేఖను స్థాపించలేకపోయారు. ఏదెలా ఉన్నా మొత్తంమీద సరిహద్దురేఖ ఎక్కడుందో విస్పష్టంగా తెలిసినవాళ్ళు ఒక్కరూ లేరు.

అదేం సరిహద్దు! అక్కడ ఎటువంటి కొండగుర్తులూ లేవు, ఎటువంటి నీటిచారికలూ లేవు. సాధారణంగా జనాన్ని తమతమ హద్దుల్లో బంధించే అంశాలూ, అడ్డుగోడలూ ఏవీ లేవు. అంతర్జాతీయసరిహద్దుగా గుర్తించడానికి అవసరమైన లక్షణాలేవీ దానికి లేవు. ఉదాహరణకు, ఓ గ్రామం ఒకవైపున ఉంటే, ఆ గ్రామానికి సంబంధించిన వ్యవసాయభూములూ, రకరకాల ఇతర వ్యావృత్తులూ అవతలివైపు ఉంటాయి. ఎప్పటికప్పుడు మారిపోయే ఇసుకదిబ్బలమధ్య సరిహద్దురేఖ గీయడం ఎలా సాధ్యం! కంచె నిర్మించవచ్చుననుకున్నా, వ్యక్తులు, బృందాలు తమ అవసరాన్నిబట్టి దాని ఉనికిని మార్చరన్న హామీ ఏదీ? అదీగాక ఈ ప్రదేశాలపై నిరంతరం

నిఘా ఉంచగలిగిన వాళ్ళెవరు? రెవిన్యూగ్రామం హద్దుల్లోనే తన యావత్ప్రపంచం ఇమిడి ఉన్నట్టు భావించే వారు —దేశవిభజన కానీ, కాకపోనీ —ఆ హద్దులకు అవతల ఏం జరుగుతున్నా పట్టించుకోరు. కొన్ని శతాబ్దాలుగా వాళ్ళు అదేవిధమైన జీవితాన్ని సంతృప్తిగా దొర్లిస్తూవచ్చారు.

రాజస్థాన్‌లోని సరిహద్దుప్రాంతాల్లో ఇసుకదిబ్బల అమరికలో ఒక విలక్షణత గోచరిస్తూఉంటుంది. పరిహద్దుకు సమాంతరంగా అవి సాగిపోయినప్పుడు, పాకిస్తాన్‌వైపు వాటి వాలు పెద్దదిగా ఉంటుంది. పాకిస్తాన్‌దళాలకు ఇది వ్యూహాత్మకంగా అనుకూలించే అంశం. ఇసుకదిబ్బలు సరిహద్దుకు నిలువునా కొనసాగినప్పుడు లాభనష్టాలు ఇరువైపులా సమానంగాఉంటాయి. ఇంతకుముందెన్నడూ ఎవరూ ఈ అంశాలను గుర్తించకపోయినా, దేశవిభజనతర్వాత రాత్రికి రాత్రి అవి ప్రాముఖ్యాన్ని —ఒక్కొక్కసారి కీలకప్రాముఖ్యాన్ని సంతరించుకున్నాయి.

ఈ ప్రాంతానికి ఉత్తరదిశలో, అటు పంజాబ్ ఉత్తరపుకొనవరకూ, సరిహద్దుకు రెండువైపులా నదులు, కాలువలతో ఎక్కడికక్కడ చీలిపోయిన విశాలభూభాగం ఉంది. దానికింకా అవతల, కొంత భారతదేశంలో కొంత పాకిస్తాన్‌లో ఉండి, పాకిస్తాన్ హస్తవంగా తన ఆశలన్నీ మీదు కట్టుకున్న జమ్ము-కాశ్మీర్ రాష్ట్రం ఉంది. మిట్టపల్లాలతో పర్వతమయంగా ఉండే ఈ ప్రాంతం సెలయేళ్ళు, లోయలు, ఇతర అవరోధాలతో ఖండితమై కనిపిస్తుంది. కొనసాగుతున్న భారత-పాకిస్తాన్ ఘర్షణల్లో వాస్తవిక యుద్ధభూమి ఇదే.

వేర్వేరు రంగాలనూ, విభాగాలనూ పేరుపేరునా చెప్పుకోవలసిన అవసరంలేదు. ప్రతి ఒకటీ సైనికఘర్షణకు తగిన రంగస్థలం కాదగిందే. కొన్ని ప్రదేశాలలో భారీఎత్తున యుద్ధం జరిగే అవకాశముంటే, మరికొన్ని ఆకస్మికంగా దెబ్బతీసి తప్పించుకునే గెరిల్లాచర్యలకు అనుకూలంగా ఉంటాయి.

1947లో కాశ్మీర్‌విషయమై ప్రప్రథమంగా జరిగిన ఘర్షణ పూడ్చలేని శత్రుత్వానికి దారి తీసింది. రెండోసారి, 1964లో కచ్ ప్రాంతపు రన్‌లో స్వల్పస్థాయిలో సంభవించిన ఘర్షణ జనరల్ అయూబ్‌ఖాన్‌లో ప్రతీకారదాహాన్ని మరింత పెంచింది. పాకిస్తాన్ సాయుధదళాలు యుద్ధసామర్థ్యంలోనూ, ఆయుధసంపత్తిలోనూ భారతదేశంమీద ఆధిక్యస్థితిలో ఉన్నాయన్న అభిప్రాయం ఆయనకు కలగడానికి ఈ ఘర్షణ దోహదమైంది. రన్ ప్రాంతంలో గెలుపు చవిచూసిన తర్వాత ఇక మడమ తిప్పకూడదనుకున్నాడు. భారతదేశం ఇంతలో కోలుకోలేనంతగా స్వల్పవ్యవధి దెబ్బతీసేందుకు పథకరచన చేశాడు.

కచ్ ప్రాంతంలో తొలి ఉరుములు 1956లోనే వినిపించాయి. అయితే భారత కేంద్ర రిజర్వ్ పోలీసుబలగాలు ఆ ప్రాంతంలో గస్తీ ప్రారంభించేసరికి అవి వెంటనే సద్దుమణిగిపోయాయి. 1964 మే వరకూ, అంటే ఎనిమిదేళ్ళపాటు —మరోవిధంగా చెప్పాలంటే భారతనాయకత్వపరివర్తన తథ్యమనుకున్న రోజు వరకూ గస్తీ కొనసాగింది. అంతకుముందు సంవత్సరాలలో భారతదేశం ఏమరపాటుకు లోనయ్యే అవకాశాన్ని అనువుగాతీసుకుని పాకిస్తాన్‌వైపునుంచి కొన్ని చొరబాటు యత్నాలు జరిగాయి. ఈ ప్రాంతంలో ఎన్నటికీ తీవ్రస్థాయి ఘర్షణ జరగబోదని భారతదేశం అంతవరకూ భావిస్తూవచ్చింది.

భారతదేశంవైపు మూడుమైళ్ళ లోతట్టున, కంజర్‌కోట్‌ను చుట్టుకునిఉన్న ప్రాంతం కదనభూమిగా మారింది. భారత భూభాగంలోని వివిధ ప్రదేశాలలో ఒకటిన్నరమైళ్ళు లోపలికి చొచ్చుకువచ్చేలా పాకిస్తాన్ ఒక రోడ్డు నిర్మించింది. 1964 చివరిలో అక్కడ కలకలం వినవచ్చిన తర్వాతే ఆ విషయం భారతప్రభుత్వం దృష్టికి వచ్చింది. దౌత్యపరమైన సంప్రతింపుల దరిమిలా, కంజర్‌కోట్ ఎప్పుడూ పాకిస్తాన్‌లో భాగంగానే ఉంటూవచ్చిందని పాకిస్తాన్ ఉద్ఘాటించింది. కంజర్‌కోట్‌నుంచి ఉపసంహరించుకోవాలని మనం పట్టుబట్టేసరికి పాకిస్తాన్ మనపై శతఘ్నులు పేల్చింది. లెక్కకుమిక్కిలిగా ఉన్న పాకిస్తాన్‌సేనలు పద్నాలుగుగంటల భీకరపోరాటం తర్వాత, పరిమితసంఖ్యలో ఉన్న భారతరిజర్వ్‌పోలీస్ బలగాలను వెనకడుగు వేయించగలిగాయి. ఆ తర్వాత పాకిస్తాన్ చర్చలకు ప్రతిపాదనచేసింది. మనం ఆ ప్రతిపాదనను తిరస్కరించి పాకిస్తాన్ కంజర్‌కోట్‌నుంచి తప్పుకోవలసిందేనని పట్టుబట్టింది. ఈలోగా పాకిస్తాన్ పెద్దఎత్తున దాడి చేయడానికి రంగం సిద్ధంచేసుకుంది. మే మాసంలో రన్ ప్రాంతాన్ని సముద్రజలాలు ముంచెత్తే ప్రమాదం సంభవించింది. ఘర్షణ సందర్భంగా పాకిస్తాన్ తను ఆక్రమించుకున్న ప్రదేశాల నుంచి వైదొలగడానికి తిరస్కరించింది. పాకిస్తాన్ ఆక్రమణకు ప్రత్యామ్నాయంగా వేరొకచోట తగు చర్య తీసుకోబోతున్నట్టు ప్రధానమంత్రి లాల్‌బహదూర్‌శాస్త్రి సూచించారు. అందులో ఇమిడిఉన్న అసందిగ్ధసందేశం పాకిస్తాన్‌కి అర్థమైపోయింది. తక్షణమే బ్రిటిష్‌ప్రధాని జోక్యం చేసుకుని కాల్పులవిరమణకు ప్రతిపాదించారు. మరో నెలరోజులు చెదురుమదురు ఘర్షణలు కొనసాగినతర్వాత కాల్పులవిరమణ జరిగింది. కంజర్‌కోట్‌తో సహా తాజాగా తాను ఆక్రమించు కున్న ప్రదేశాలనుంచి తప్పుకోడానికి పాకిస్తాన్ అంగీకరించింది. అందుకు ప్రతిగా సమీపంలోని ఓ రోడ్డుమీద గస్తీహక్కును సాధించుకుంది. ఇలా ఒకపక్క ఈ ప్రాంతం క్రమంగా చల్లబడు తుండగా, మరో పక్క జమ్ము —కాశ్మీర్‌లో అసలుయుద్ధం మొదలైపోయింది.

చైనా 'భాయ్'తో ఇటీవలి అనుభవం భారతప్రజల మస్తిష్కంలో ఇంకా పచ్చిగానే ఉంది. చైనా —పాకిస్తాన్ మైత్రితోపాటు, విస్తరిస్తున్న చైనా తరహా 'జాతీయవిముక్తి'వాదం భారత దేశానికి పెనుముప్పుగా పరిణమించింది. భారతవ్యతిరేకతే దానికి పునాది. పాకిస్తాన్‌కు పెకింగ్ నుంచి సైనికసహాయం పెరుగుతున్నకొద్దీ భారతప్రజలవైఖరి కాఠిన్యాన్ని సంతరించుకోసాగింది. ప్రత్యేకించి సైనికాధికారులు కాశ్మీర్‌లో విద్రోహాన్ని పసిగట్టి సహజంగానే అప్రమత్తులయ్యారు. చాపకింద నీరులా వచ్చిపడిన చైనాదాడికి భిన్నంగా, ఈ అవకాశం ముందే స్పష్టంగా కనిపించింది. చైనాతో పాకిస్తాన్ నూతనసాన్నిహిత్యం భారతదేశాన్ని భయపెట్టడాన్ని మించి, భారత-పాకిస్తాన్‌ల మధ్య ఉద్రిక్తతలను శిఖరస్థాయికి తీసుకెళ్ళింది. దాంతో భారతప్రజల సంకల్పశక్తి మరింత రాటుదేలిపోయింది.

పాకిస్తాన్ దుష్ప్రచారం ఎలా ఉన్నా, పాకిస్తాన్‌పై దుందుడుకుగా దాడిచేసే ఆలోచన కానీ, అందుకు అవసరమైన సన్నద్ధతలో కానీ భారతదేశం లేదన్నది నిర్వివాదం. ప్రముఖ విశ్లేషకుడు, రచయిత రస్సెల్‌బ్రైన్స్ మాటల్లో చెప్పాలంటే:

*'ఉద్దేశాల్నీ, బలాబలాల సంతులనాన్నీ అంచనా వేయాలంటే 1965 మధ్యలో సైన్యాల ఉనికి పరిస్థితిని గమనించవలసి ఉంటుంది. ఇండియా కాశ్మీర్‌లో 150,000 సైనికులతో కనీసం మూడు డివిజన్ల పటాలాన్ని ఉంచిందని అంచనా వేయవచ్చు. కమ్యూనిస్ట్ చైనాతో*

ఉన్న సరిహద్దునూ, పాకిస్తాన్‌తో ఉన్న 470 మైళ్ళ యుద్ధ విరమణ రేఖ హద్దునూ, సంరంక్షించే బాధ్యత ఈ పటాలంపైన ఉంది. ఇండియా-పశ్చిమ పాకిస్తాన్ మధ్య ఉన్న 800 మైళ్ళ బార్డర్‌లో కొంత భాగానికి రక్షణ అందించడానికి కూడా ఉపయోగించబడి ఉండవచ్చు. మరొక ఆరు భారత సైన్యం డివిజన్లు హిమాలయ ప్రాంతంలో తూర్పు పాకిస్తాన్ సమీపంలో ఉంచబడి ఉన్నాయి. వీటిలో కొంతభాగం అవతలివైపు ఉన్న ఒక పాకిస్తాన్ డివిజన్ సైన్యాన్ని ఎదుర్కోవాలి. ఇందులో ఎక్కువలో ఎక్కువ రెండుమూడు డివిజన్లు చాలునని న్యూ ఢిల్లీ వర్గాల అంచనా. ఇది మినహా సైన్యం చైనాతో ఇండియాకున్న 1800 మైళ్ళ బార్డర్‌లో, లడాఖ్ భాగం తప్ప, తక్కినదంతటినీ రక్షించాలి. దీని తాత్పర్యమేమంటే ఇండియా-పశ్చిమ పాకిస్తాన్ బార్డర్ రక్షణకు ఇండియాకు అందుబాటులో ఉన్న మొత్తం బలం ఎనిమిది డివిజన్లమాట. దీంట్లోంచే రిజర్వ్ భాగాన్నీ ఇతర అవసరాలకు కావలసిన బలాన్నీ సమకూర్చుకోవాలి. వీటిలో నాలుగైదు డివిజన్లు లాహోర్- కాశ్మీర్ సెక్టర్‌లోనూ, మిగతావి రిజర్వుగానూ ఉంచబడ్డాయని భావించవచ్చు.

ఈ అంకెలు సక్రమమైనవే అనుకుంటే, లేదా ఒక అంచనాకు సమీపానికి వచ్చి ఉంటే, అవి సూచించే శక్తిసామర్థ్యాల ప్రకారం భారతదేశం పెద్ద ఎత్తున యుద్ధాన్ని రెచ్చగొట్టే స్థాయిలో దురాక్రమణ జరపగల స్థితిలోనూ లేదు, అందు కనుకూలించే అనువైనస్థలంలోనూ లేదు. నియతసైన్యంలో సగభాగం రక్షణ విధులలో పూర్తిగా నిమగ్నమై ఉంది కనుక, చైనా, పాకిస్తాన్‌లు రెండువైపుల నుంచి నికరమైన ప్రమాదం తలెత్తగల పరిస్థితిలో, దానిని వేరొకచోట వినియోగించడం ఏమాత్రం ఆచరణసాధ్యం కాదు. కనీసం సూత్రరీత్యానే కావచ్చు, పాకిస్తాన్ తన అనియత సేనల్ని (అంటే సక్రమమైన మామూలు పద్ధతిలో రిక్రూట్ చేయబడక ఎప్పుడంటే అప్పుడు రంగంలోకి దించబడే మూకలన్నమాట) సమర్థవంతంగా వినియోగించుకుంటే అవి కాశ్మీర్‌లోని కీలక విభాగాలను ఆక్రమించుకుని అక్కడి భారతసైన్యాన్ని దిగ్బంధం చేయగల స్థితిలో ఉంటాయి. కీలక స్థానంలో ఉండి, ముందుగా భారత సేనలే దెబ్బతీయడానికి బాగా అనుకూలించే ప్రాంతం పంజాబ్. అయితే అక్కడ విడిసిన సైన్యంలో సగభాగం-స్వయంగా దాడి సాగిస్తూనే, అవసరమైన రిజర్వ్‌ను నిలుపుకోడానికి కావలసినంత సంఖ్యలో లేదు. ప్రత్యేకించి కీలకమైన పంజాబ్‌లో పటిష్ఠమైన రక్షణ కలిగి ఉన్న ప్రాంతాలపై దాడిచేయడానికి ఒక శత్రుసైనికుడికి ప్రతిగా ముగ్గురు సైనికుల్ని నియోగించవలసి ఉంటుందని విస్తృతాభిప్రాయం. రెండువైపులా యుద్ధ పరిస్థితిని ఎదుర్కోవలసిన ప్రమాదం అంతరించినప్పుడు, పర్వతసీమల్లో విడిసిన ఒకటి రెండు డివిజన్ల సేనను పంజాబ్‌లో వినియోగించినా, అప్పటికి ముందస్తు దెబ్బతీయడానికి సైనికాధిక్యం కనీసస్థాయిలో ఉండిపోతుంది. ఏతావాతా తేలుతున్నదేమిటంటే, ఏదో ఒకవైపు దాడి సంభవించినప్పుడు పరిమితంగానైనా ముందస్తుచర్యకు దిగే సామర్థ్యం భారతసైన్యానికి ఉన్నప్పటికీ, తార్కికంగా పరిశీలిస్తే, భారీ యుద్ధాలకు తెరదీయగల సుస్థితిలో అది లేదు. దాని నియతసైన్యం ఎక్కువభాగం ప్రధానయుద్ధరంగమైన కాశ్మీర్-లాహోర్ విభాగంలో కేంద్రీకృతమై ఉంది. పాకిస్తాన్ రవాణామార్గాల నిడివి తక్కువ కావడమే కాదు, అవి మరింత బాగా అక్కరకొస్తాయి కూడా. అలాగే పాకిస్తాన్‌కు రెండోవైపు యుద్ధ భయం

*లేదు, కాపలా కాయడానికి మూడో దేశం దేనితోనూ దానికి సుదీర్ఘమైన సరిహద్దు లేదు, అది చేసుకున్న సహాయ ఒప్పందం వల్ల కమ్యూనిస్టు ముట్టడి ప్రమాదం తప్పిపోయింది. మొత్తంమీద బలగాలసంఖ్యనీ, ముఖ్యంగా పారిశ్రామిక సామర్థ్యాన్నీ దృష్టిలో ఉంచుకున్నప్పుడు సుదీర్ఘ పోరాటాలను తట్టుకునే శక్తిలో పాకిస్తాన్ భారతదేశంతో సరితూగగలిగింది కాదు. మెరుపుదాడికి దిగడమే దానికి బాగా అనుకూలంగానూ, ప్రయోజనకరంగానూ ఉంటుంది.'*

రెండుదేశాల రాజకీయవిధానాలలో ఉన్న వ్యత్యాసాన్ని ఇక్కడ దృష్టిలో ఉంచుకోవాలి. భారతదేశం అలీనపంథాను త్రికరణశుద్ధితో అనుసరిస్తూవస్తోంది. పాకిస్తాన్ ఇందుకు భిన్నంగా, భారతదేశ రాజకీయప్రభావాన్ని తన సైనికశక్తితో నిర్వీర్యంచేయడానికి కాబోలు, సెంటో (సెంట్రల్ ట్రీటీ ఆర్గనైజేషన్) వంటి ప్రాంతీయకూటములలో చేరింది. 1962 ఓటమి, నెహ్రూ అలీన విధానంపై విమర్శలను ముమ్మరంచేసింది. అలీనభారతం ఎవరి చెలిమికీ నోచుకోనిదిగా, వెలుపలినుంచి సైనికసహాయంపట్ల ఏమాత్రం ఆశలేనిదిగా కనిపించింది. పాకిస్తాన్‌కుమాత్రం ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు బయటిదేశాల సైనికసహాయం అందుబాటులో ఉంటూ వచ్చింది. బ్రెన్స్ మాటల్లో చెప్పాలంటే.–

*1962 సంక్షోభం దరిమిలా అంతర్జాతీయంగా తాను ఏకాకినయ్యానన్న భావం భారతదేశాన్ని ముంచెత్తింది. ఒక భారతీయ రచయిత నుడివినట్టు, తగిన ఆయుధసంపత్తిని సమకూర్చుకోవడంకోసం భారతదేశం అంతర్జాతీయంగా అన్వేషణ సాగించినప్పుడు తిరస్కృతే ఎదురైంది. 'విదేశాలలో మన దౌత్యనీతిని గౌరవించేవారే కరువయ్యారు. ఆఫ్రో –ఆసియా అభిప్రాయంలో మనం ఉన్నతస్థానంనుంచి ఒక్కసారిగా కిందపడిపోయాం. మనతో మైత్రిని కాంక్షించేవారు ప్రపంచంమొత్తంమీద ఒక్కరూ లేనట్టు కనిపించాం. ఈ పరిస్థితినుంచి బయటపడడానికి మనం చేస్తున్న ప్రయత్నాలు బోనులో చిక్కుకున్న జంతువు దానిని ఛేదించుకుని బయటపడడానికి జరిపే విశ్వప్రయత్నాలనే తలపింపజేశాయి.' పాకిస్తాన్ కవ్వింపులకు మన ప్రతిస్పందన మరింత కాఠిన్యాన్ని సంతరించుకోడానికి, ఏకాకులమైపోయామన్న భావనకూడా ఇతోధికంగా దోహదంచేసినట్టే కనిపించింది.*

అలీన విధానంలో ఎదురయ్యే వ్యావహారిక పక్షాలు ఈ సందర్భంలో మళ్లీ మళ్లీ స్పష్టమయ్యాయి. ఆచరణలో ఆ సూత్రానికి తాత్కాలికంగా ఇబ్బందులు వచ్చాయి. సైనిక ముఠాలతో లీనమైన దేశాలు తక్షణ లాభాలు పొందాయి. బ్రైన్స్ మాటల్లో చెప్పాలంటే–

*'అలీనదేశమూ, అలాగే దేశస్థులూ ఒక్కొక్క అంతర్జాతీయఘటననూ విడివిడిగా పరిశీలించి మంచిచెడులు బేరీజు వేసుకుని తమ వైఖరిని నిర్ణయించుకోవలసి ఉంటుందన్న నెహ్రూ తాత్వికతకు పరిణామంగానే ఈ ఏకాకితనం సంభవించింది. వ్యక్తులకున్నట్టే ఇటు వంటి స్వాతంత్ర్యాన్ని వినియోగించుకునే దేశాలకుకూడా తగినంత స్వేచ్ఛ ఉంటుంది కానీ మిత్రులు కొద్దిమందే ఉంటారు. యుద్ధానికి తలపడి, తమ అధికారాన్ని స్థాపించు కోవడంమీదే ఎక్కువగా దృష్టిని లగ్నంచేసే పక్షాలు, అదేస్థాయిలో శాంతిపరిరక్షణకు తగిన దౌత్యపరమైన చర్యలూ తీసుకోకపోతే సత్వరమే ఆ అధికారం కుప్పకూలిపోతుంది.*

వాస్తవంలో ఉభయపక్షాల సైనిక సన్నద్ధతననుసరించి వారి విధానాలు నిర్ణయించడం జరిగింది – కనీసం అల్పకాలావధికి సంబంధించినంతవరకు, ఒక అలీనదేశం కొంతవరకు ఏకాకిగా ఉండిపోయే ప్రమాదమెప్పుడూ ఉంటుంది కనుకనే అటువంటి దేశం జాగరూకతతోనూ, సన్నద్ధంగానూ ఉండకతప్పదు. భారతదేశంలో ఈ వాస్తవాన్ని ఆదినుంచీ గుర్తించడం జరిగింది. రక్షణ విషయంలో ఆత్మనిర్భరతపైన ఆధారపడుతూ రూపొందించబడిన దేశవిధానాలను పరిశీలిస్తే ఈ విషయం తేటతెల్లమౌతుంది. అందుకని ఆ దేశం చేయవలసిందల్లా తన స్వల్పకాలిక అవసరాల్ని సరిగా అంచనా వేసుకుని సమకూర్చుకోవడం. ఇదే ఆ దేశం అనుసరిస్తున్న జాగ్రత్తకూ దౌత్యసామర్థ్యానికీ అగ్నిపరీక్ష. బ్రైన్స్ మాటల్లో–

*'పాకిస్తాన్ గెరిల్లాదాడికి సర్వసన్నద్ధమై దాడి ప్రారంభించినట్టు, దానికి వీలైనంత వెన్నుదన్నుగా ఉండడానికి తన శతఘ్ని సేనను జాగ్రత్తగా మోహరింపజేసినట్టు నమ్మకమైన సాక్ష్యం లభించింది. గెరిల్లాదాడిని ఎదుర్కోడానికి పూర్తిగా సన్నద్ధమైలేకపోయినా భారత అధికారవ్యవస్థ మొత్తంమీద ఆ ప్రమాదాన్ని గుర్తించి అప్రమత్తమైంది కానీ, సాంప్రదాయక పద్ధతుల్లోనే అటువైపునుంచి దాడిజరిగే ప్రమాదాలను చాలావరకు గమనించకుండానే ఉండిపోయింది. జూలైలో కేంద్ర హోంమంత్రిత్వశాఖఅధికారులు శ్రీనగర్‌లోని రాష్ట్ర ప్రభుత్వాధికారులతో సమావేశమై గెరిల్లావిద్రోహచర్యలకే అవకాశాలున్నాయనీ, పాకిస్తాన్ తమతో భారీఎత్తున సాంప్రదాయికయుద్ధం సాగించడానికి సన్నద్ధమైలేదనీ నిర్ణయించారు. ఆగస్టు రెండవతేదీన భారతసైన్యంలోని ఒక సీనియర్ కమాండర్ శ్రీనగర్‌లోని అధికారులతో మాట్లాడుతూ, కాశ్మీర్‌పోరాటంలో తదుపరిఘట్టం బహిరంగంగా బలాబలాలు తేల్చుకునే పద్ధతిలో కాక, హత్యలు, టెర్రరిజం రూపంలో ఉంటుందని స్పష్టంచేశారు. ఇంకోపక్క, ఇదే రోజుల్లో పాకిస్తాన్ సాంప్రదాయక యుద్ధశక్తిని పెద్దఎత్తున సమీకరించుకుంటున్నట్టు వివిధ గూఢచారిసంస్థలు నికరమైన సమాచారాన్ని సేకరించాయి. ఐక్యరాజ్యసమితిలోని ఒకప్రత్యేకవిభాగానికి చెందిన ఓ యూరోపియన్ అధికారి జూలైలో పంజాబ్‌లో పర్యటించి వచ్చి ఈ సమాచారం బయటపెట్టాడు: 'పాకిస్తాన్ సైన్యం పంజాబ్‌లో భారీఎత్తున శతఘ్నిశకటాలను మోహరిస్తోంది. భారతీయులు నిద్రపోతున్నారు, తమమీద ఎటువంటి ఉత్పాతం వచ్చి పడబోతున్నదో వాళ్ళకు తెలియదు.' పాకిస్తాన్, చరిత్రగతినే మార్చి వేసే తలంపుతో అన్నిటికీ తెగించి దాడిజరుపడానికి నిర్ణయించుకున్నట్టు, అప్రకటిత సమాచారాన్ని సంగ్రహించుకోగలిగిన విదేశీపరిశీలకులు నిర్ధారణకు రావడమూ ఆ రోజుల్లోనే జరిగింది.*

పాకిస్తాన్ పథకం విపులంగానూ నిర్దుష్టంగానూ ఉంది. జమ్మూ కాశ్మీర్‌లో మొదలై – ఈ నాడెంతో నమ్మశక్యం కానిదిగా కనబడే – ఢిల్లీలో విజయోత్సవ పరేడ్‌తో ఆసాంతం కావలసింది. జనరల్ అయూబ్ ఖాన్ తన ఈ కల నిజమౌతుందనే విశ్వసించాడు. కచ్ రన్‌లోని సంఘటనలు – ఏ కారణం చేతనో – ఒక్క పాకిస్తానీ సైనికుడు నలుగురు ఇండియా సైనికులతో సమానమన్న మిథ్యాభావాన్ని ధ్రువపరిచాయి. అక్కడి సంఘటనలవల్ల ఇలాంటిదేదీ రుజువుకాలేదు. అయినా మతోన్మాద మనస్తత్వంపై నిరంతర విషప్రచారం ద్వారా కల్పించబడిన ఒత్తిడి ఈ మూఢ

విశ్వాసానికి ఆధారమైంది. జనరల్ అయూబ్‌ఖాన్‌కు తన అద్భుత విజయదినం త్వరలోనే ఉదయించనున్నదన్నట్టు భాసించింది.

రెండువైపులనుంచి దాడిజరపడానికి పాకిస్తాన్ సైనికాధికారులు పథకం రచించారు; మొదటిది, ఉత్తరదిశలో ఛాంబ్ నుంచి కార్గిల్ వరకూ ఉన్న జమ్ము కాశ్మీర్ రంగం; రెండోది, దక్షిణాన ఛాంబ్ నుంచి ఫజిల్కా వరకూ ఉన్న పంజాబ్‌రంగం. పాక్‌ఆక్రమితకాశ్మీర్‌కు చెందిన సేనల్ని, పెద్దసంఖ్యలో అనియత 'వలంటీర్' సేనలనీ కాశ్మీర్‌రంగంలో మోహరించారు. వాటికి మద్దత్తుగా పాకిస్తాన్ శతఘ్నిసేనను నిలబెట్టారు. ఏ క్షణంలోనైనా బరిలోకి దిగడానికి వీలుగా పాకిస్తానీ నియతసేనల్ని సంసిద్ధంగా ఉంచారు. పాకిస్తాన్ నియతసేనలు, వైమానికదళంతో కలిసి పంజాబ్‌రంగంలో దాడిసాగిస్తాయి. ఇలా రెండువైపులనుంచి అదాటుగా, చురుకుగా ముట్టడి సాగిస్తే కొద్దిరోజుల్లోనే జమ్ము కాశ్మీర్ చేజిక్కుతుందనీ, పంజాబ్‌రంగంలోని పాకిస్తానీసేనలు సరిహద్దుకీ, ఢిల్లీకీ మధ్యనున్న భారతభూభాగంమీదుగా విజయగర్వంతో కదంతొక్కుతూ ముందుకు సాగిపోతాయనీ పాకిస్తాన్ భావించింది. జనరల్ అయూబ్‌ఖాన్ అద్భుతకల్పనాశక్తిని మేళవించి రచించుకున్న అందమైన ఊహాచిత్రంప్రకారం, ఆ తర్వాత ఆయన భారతసైన్యం లొంగుబాటుకు ఆమోదంతెలిపి, భారతప్రభుత్వానికి తన షరతులు నిర్దేశిస్తాడు.

1965, ఏప్రిల్ మే మధ్యరోజుల్లో పాకిస్తాన్ భారతస్థావరాలపై అయిదుసార్లు దాడులు జరిపింది. భారతదేశానికి కంటిబెదురుపెట్టడం, ఆ స్థావరాలకు సంబంధించిన కీలకసమాచారాన్ని రాబట్టుకోవడం వాటి లక్ష్యం. ఇందుకు ప్రతీకారంగా భారతసైనికులు ఒక పాకిస్తానీస్థావరాన్ని ఆక్రమించుకున్నారు. ఐక్యరాజ్యసమితి మధ్యవర్తిత్వంతో దానిని తిరిగి అప్పగించేశారు. లడఖ్‌లోని కార్గిల్ సమీపంలో జరిగిన ఈ ఆక్రమణద్వారా భారతసైన్యం తన శక్తినీ, దృఢవిశ్వయాన్నీ ప్రకటించుకున్నట్టయింది. రెండుదేశాలూ కచ్ ఒప్పందంమీద సంతకాలుచేసినరోజునే భారతదేశం పాకిస్తాన్‌స్థావరాన్ని తిరిగి అప్పగించడం విశేషంగా చెప్పుకోదగినది. అయితే మూడువారాల్లోనే ఆ ప్రాంతంలో తిరిగి హింసాత్మకఘర్షణలు చెలరేగాయి. పాకిస్తానీదుండగులు పెద్దసంఖ్యలో భారత భూభాగంలోకి అక్రమంగా చొరబడ్డారు. పౌరజీవనం విశేషించి విచ్ఛిన్నంకాకపోయినా పలుచోట్ల భారీయుద్ధమే సంభవించింది. పాకిస్తానీనాయకులు జమ్ము కాశ్మీర్‌పై ముట్టడికి ఎంతోముందుగానే పథకం రచించుకున్నారు కనుక, కచ్‌ఒప్పందాన్ని వారేమాత్రం పట్టించుకోలేదని తేలిపోయింది.

త్వరలోనే, పన్నెండువందలమైళ్ళపొడవు కలిగిన ప్రాంతాలకు– తరచుగా ఘర్షణలు సంభవిస్తున్న సుదూరప్రాంతాలనుకూడా కలుపుకుంటే అంతకంటె ఎక్కువ దూరానికే – యుద్ధం వ్యాపించిపోయింది. అయితే ప్రధానయుద్ధం పంజాబ్‌లోనే కేంద్రీకృతమైంది. సెప్టెంబర్ 8వ తేదీన, ప్రధానయుద్ధరంగానికి దాదాపు నాలుగువందలమైళ్ళదూరంలో నైరుతిదిశలో పాకిస్తాన్‌లోని సింధ్‌కీ, మన రాజస్థాన్‌కీ మధ్యనున్న సరిహద్దువెంబడి, పశ్చిమాభిముఖంగా భారతసేనలు చొచ్చుకువెళ్ళడం ప్రారంభించాయి. ఆ చొరబాటును శత్రువు కన్నుకప్పడానికి ఉద్దేశించిన ఎత్తుగడగా ఆ తర్వాత వివరించడం జరిగింది. ఎడారికి పశ్చిమంగా ఉన్న కరాచీనగరంనుంచి పాకిస్తాన్‌సేనల్ని కదలకుండా చూడడమే దీనినుంచి ఆశించిన ప్రయోజనమని భారతీయనిపుణులు నిర్ధారణకొచ్చారు... మరోసారి బ్రైన్స్ మాటల్లో:

'లాహోర్ రంగంలో భారత సేనలు సెప్టెంబర్ 6వ తేదీన ముందుకు సాగి వెరగుపాటు కలిగించే దాడి చేశాయి. అంతకు కొద్ది సమయం పూర్వమే పాకిస్తాన్ సైన్యంవారు తమ 10వ డివిజన్‌ను అక్కడి రక్షణ స్థావరాల్లో ప్రవేశ పెట్టారు. బి.ఆర్.బి. కాలువకు తూర్పున పాకిస్తాన్ సైన్య సామగ్రి ఏదీ లేదు. అభిజ్ఞవర్గాల అభిప్రాయంలో అప్పటికీ పాకిస్తాన్ వారు, ఇండియా అంతర్జాతీయ సరిహద్దును దాటుతుందని నమ్మ లేదు. వారింకా ఇండియా సేన దౌర్బల్యాన్ని గురించిన తమ కల్పనా ప్రపంచంలోనే మునిగితేలుతున్నారు. అందుకని ఇండియా సేన చేసిన దాడి శీఘ్రగతిని వారు ఊహించలేకపోయారు. ఇండియా దాడిలో కవచ సామగ్రి చేత కూడుకున్న మూడు డివిజన్‌లను ప్రయోగించినట్లు భారతసైన్యం కథనం; అయితే చివరి వరకు ఐదు డివిజన్‌లను దింపడం జరిగిందని తెలుస్తోంది. ఆరంభంలో దాడి త్వరితగతిలో సాగింది. రాత్రి వరకు సైన్యంలోని మధ్యభాగం రెండు కీలకమైన గ్రామాలను ఆక్రమించుకుంది. ఉత్తరభాగానికి చెందిన పదాతిదళం యూనిట్లు గ్రాండ్ ట్రంక్ రోడ్ వెంట ముందుకు సాగుతూ లాహోర్ శివార్లలో చేరుకుని, అవతలివైపు నుండి తీవ్ర ప్రతిఘటన ద్వారా వెనక్కి నెట్టబడ్డాయి. ఈ పురోగమనం వల్ల ఇండియా సేనలు లాహోర్ నగరాన్ని ఆక్రమించాలనుకున్నాయనీ, వాటిని ఆపివేయడం జరిగిందనీ, ఒక అభిప్రాయం పొడచూపింది. తమ కవచసామగ్రి కన్నా వేగంగా పదాతిదళం ముందుకు సాగిపోతుంటే దాన్ని వెనక్కి తరలించడం జరిగిందని భారతసైన్యం పక్షాన వివరించడం జరిగింది. ఆ తరువాత నిలకడగా జరిగిన భీషణ యుద్ధంలో కీలకమైన వాగువంతలను, వంతెనలను, సురక్షితం చేయబడిన గ్రామాలను, ఆక్రమించుకోవడం కొరకు సర్వప్రయత్నాలు జరిగాయి. ఈ యుద్ధం ఆరంభం నుంచి సెప్టెంబర్ 23న కాల్పుల విరమణ జరిగే వరకూ సాగుతూ ఉంది. సరిహద్దు నుంచి కాలువ వరకు ఇటూ అటూ తూలుతూ, బరువైన ఆయుధాలను అధికంగా ఉపయోగించింది. చివరకు పాక్ సైన్యం బి.ఆర్.బి కాలువపై ఉన్న 70 వంతెనలను ధ్వంసం చేసింది. ఆ కాలువే తరువాత ఇరుపక్షాల వాహనాల రాకపోకలకు ఈ భాగంలో అవరోధంగా పరిణమించింది.

ఒక కీలక యుద్ధంలో సెప్టెంబర్ పదవ తేదీనరోజంతా పోరాడిన భారత సేనలు బుర్కి అనే గ్రామాన్ని చేజిక్కించుకున్నాయి. ముందుకు చొచ్చుకువెడుతున్న నడిమిదండుకు లక్ష్యంగామారిన బుర్కి-కెనాల్ తూర్పుతీరంమీద, చొరబాటును కట్టడిచేయగలస్థానంలో ఉంది. భారీరక్షణతో అదో ప్రధానదుర్గంగా మారిపోయింది. భారతవర్గాల కథనంప్రకారం, గ్రామాల్లోని మట్టిగుడిసెలను తలపింపజేసేలా మూడడుగుల ఎత్తున్న గోడలతో గుళికరూపంలో ఉన్న పదకొండు కాంక్రీట్‌పెట్టెల్ని అమర్చారు. శతఘ్నిద్వారాన్ని ఉక్కు తలుపులతో మూసిఉంచారు. ఒక్కొక్క పెట్టెలో ముగ్గురు సైనికులకు సరిపోయే సామగ్రిని అందుబాటులో ఉంచారు. రాత్రివేళ యుద్ధం ప్రారంభమైంది. రెండువైపుల ట్యాంకుల్ని బరిలోకి దింపారు. పాకిస్తాన్ శతఘ్నిదళం 150 మిల్లీమీటర్ తుపాకుల వరకూ ఉపయోగిస్తూ అసాధారణ మనిపించేంత భారీగా గుళ్ళవర్షం కురిపించింది. గ్రామం స్వాధీనంలో ఉండడంవల్ల, ఇతర విభాగాలనుంచి అందే సహాయకచర్యలవల్ల, మధ్యప్రాంతంలోని ఇచ్ఛోగిల్‌కెనాల్ పొడవునా పాకిస్తాన్ గుళ్ళవర్షం కురిపిస్తున్నప్పటికీ భారత సేనలు చెప్పుకోదగిన పరిమితి

మేరకు కెనాల్‌పై ఆధిపత్యంసాధించాయి. ఈ ప్రదేశం లాహోర్‌కేంద్రస్థానానికి పన్నెండుమైళ్ళ దూరంలో ఉండగా లాహోర్‌విమానాశ్రయానికి కేవలం అయిదుమైళ్ళ దూరంలోనే ఉంది; ఇందుకే అమెరికన్‌అధికారులు లాహోర్‌లోని అమెరికన్లను అక్కడినుంచి విమానమార్గంలో తరలించడానికివీలుగా కాల్పులను తాత్కాలికంగా విరమించి సహకరించవలసిందిగా తమను అభ్యర్థించవలసివచ్చిందని భారతసైన్యం కొంత గర్వంతో ప్రకటించుకుంది.

సుదూర ఉత్తరాన, కెనాల్ తూర్పుతీరంలోనే ఉన్న రక్షణదుర్గమైన డోగ్రాయ్ గ్రామం కోసం నిర్విరామంగా జరిగిన యుద్ధం ఉధృతపోరాటాలలో రెండవది. ఈ గ్రామం పాకిస్తాన్‌లో ఏడుమైళ్ళలోపల అమృత్‌సర్‌కు పశ్చిమంగా గ్రాండ్‌ట్రంక్‌రోడ్డుమీద ఉంది. లాహోర్‌కు ఎనిమిదిమైళ్ళదూరంలో, ఆ నగరానికి వెలుపలిరక్షణలోభాగంగా ఉన్న గ్రామమది. కాల్పుల విరమణకు కొన్నిగంటలముందు భారత సేనలకు పట్టుబడిన ఈ గ్రామం అంతకుముందు జరిగిన భీకరయుద్ధంలో కనీసం మూడుసార్లు చేతులుమారింది. భారతపక్షంవైపునుంచి యుద్ధానికి ప్రత్యక్షసాక్షులుగా ఉండి, తొలికథనాలను రిపోర్టుచేసిన విదేశీవిలేఖరులలో ఒకరైన న్యూయార్క్‌టైమ్స్ విలేఖరి థామస్ ఎఫ్. బ్రాడీ వెల్లడించినదానినిబట్టి సరిహద్దునుంచి కెనాల్ వరకూ గ్రాండ్‌ట్రంక్‌రోడ్డుమీద ప్రతిఒక్కగజంకోసం పెనగులాట జరిగింది. డోగ్రాయ్ సమీపంలో, ఎటుచూసినా అతనికి యుద్ధశిథిలాలే కనిపించాయి. కాల్పుల్లోనో, పేలుళ్ళలోనో ధ్వంసమై అచేతనంగాపడి ఉన్నట్యాంకులుడజనువరకూ కనిపించాయి. అంతిమపోరాటం తర్వాత డోగ్రాయ్ గ్రామమే దారుణంగా దెబ్బతినిపోయింది. అయితే పాకిస్తాన్ సేనలు షెర్మాన్‌ట్యాంకులు, బారులుతీరిన రికాయ్‌లెస్ రైఫిళ్ల మద్దత్తుతో సమీపంలోని లోతైన కందకాల్లో తిష్ఠవేశాయి. సెప్టెంబర్ 23వ తేదీన బ్రాడీ పంపించిన ఆ రిపోర్టు, ఆ సమయంలో న్యూయార్క్‌టైమ్స్‌లో సమ్మె జరుగుతుండడంతో ఎప్పటికీ వెలుగుచూడలేకపోయింది.

పాకిస్తాన్‌సైనికవర్గాలు డోగ్రాయ్‌యుద్ధానికి సంబంధించిన ఈ సమాచారాన్ని ధ్రువీకరించాయి కానీ, కాల్పులవిరమణకు ఒకింతముందుమాత్రమే గ్రామం పశ్చిమశివార్లను భారత సేనలు పట్టుకోగలిగాయని చెప్పుకున్నాయి. ఈ ప్రాంతంలో కెనాల్‌మీద ఉన్న బాతాపూర్ వంతెనను చేజిక్కించుకోవడంలో భారత సేనలు విఫలమయ్యాయి. వాటి ప్రధానలక్ష్యం ఇదేననికూడా పాకిస్తాన్ సేనలు వాదించాయి. ఆ వంతెననుకనుక స్వాధీనంచేసుకోగలిగితే భారత సేనలు గ్రాండ్‌ట్రంక్‌రోడ్డు వెంబడి లాహోర్‌వైపు సైనికశకటాలతో మరింత లోపలికి చొచ్చుకువెళ్ళగలిగి ఉండేవి. మరో కీలకలక్ష్యమైన భియానివంతెనను స్వాధీనంచేసుకోడానికి భారత సేనలు రెండువైపులా కాచుకుంటూ కెనాల్‌వెంబడి మరింత ఉత్తరదిశగా సాగిపోయాయనీ, ట్యాంకులకు మార్గం సుగమంచేసుకోడానికి పదిహేనుసార్లు దాడులు జరిపినాసరే వంతెనను స్వాధీనంచేసుకోలేకపోయాయనీ పాకిస్తాన్ చెప్పుకుంది.బుర్కి చుట్టుపక్కల యుద్ధం ఎంత భీకరంగా జరిగిందో పాకిస్తాన్‌కథనాలుకూడా బయటపెట్టాయి. అయితే యుద్ధతీవ్రతదృష్ట్యా ఇది భారతసైన్యం వేసిన పెద్దతప్పుటడుగుగా అవి చిత్రించాయి.

ఈ ప్రాంతంలో యుద్ధం దాదాపు నిర్విరామంగా సాగింది. ట్యాంకులు, భారీశతఘ్నులనుంచి తుపాకులవరకూ అన్నిరకాల ఆయుధాలనూ వినియోగించడం జరిగింది.

విదేశీ అభిజ్ఞవర్గాల ప్రకారం ఒకదశలో పాకిస్తానీ సేనలు భారత సేనల్ని డోగ్రాయ్‌కి ఏడుమైళ్ళ దూరంలోని ఇంచుమించు నిష్క్రమణ రేఖ వరకూ తరిమికొట్టగలిగాయి. ఆ తర్వాత కొంత భూభాగాన్ని అవి మళ్ళీ చేజిక్కించుకో గలిగాయి. ఒకరికి నలుగురుచొప్పున తమవైపు సైనికులు హెచ్చుసంఖ్యలో ఉన్నారన్న వాదంతో విభేదిస్తూ తమ ప్రధానరక్షణవ్యవస్థ లోకి చొచ్చుకురాకుండా భారతసేనల్ని నిలవరించి తాము అత్యంత వీరోచితంగా లాహోర్‌ను రక్షించుకున్న యుద్ధంగా పాకిస్తాన్ దీనిని అభివర్ణించింది.

యుద్ధం ముగిసే సమయానికి కెనాల్ తూర్పుతీరంలోని ముప్పైమైళ్ళకు మించిన ప్రాంతం తమ అధీనంలో ఉన్నట్టు భారత సేనలు చెప్పుకున్నాయి. కెనాల్ మొత్తం తమ అధీనంలో ఉన్నట్టు చెప్పడం ఇందులోని ఆంతర్యం. అయితే వాస్తవాధీన రేఖ జలమార్గానికి తూర్పుదిశగా వక్రగతిలో సాగి పోతున్నట్టు పాకిస్తాన్ వాదించింది. ఏదేమైనా కెనాల్‌మీద ప్రధానమైన వంతెనలన్నీ ధ్వంసమయ్యాయి కనుక, సైనికశకటాలను తూర్పు, పశ్చిమాలలో ఎటు కదలించాలన్నా కెనాల్ అడ్డంకిగా మారింది. పాకిస్తాన్‌వైపునున్న సరిహద్దులో 140 చదరపుమైళ్ళప్రాంతాన్ని భారత సేనలు ఆక్రమించుకున్నాయి. నిష్పాక్షికవర్గాలుసైతం స్థూలంగా ధ్రువీకరించిన అంకె ఇది. పాకిస్తాన్ భూభాగంలోకి మరీ చొచ్చుకువెళ్ళే ప్రయత్నం చేయకుండానే శత్రుబలోద్ధతిని దెబ్బతీయడం, ఆత్మరక్షణలోభాగంగా జరిగిన ఈ ముందస్తుదాడినుంచి ఆశించిన ప్రయోజనమన్న భారదేశంవాదాన్నే నమ్మవలసివస్తే ఆ ప్రధానలక్ష్యం నెరవేరినట్టే కనిపించింది. అయితే అసలు లక్ష్యం దురాక్రమణ, లేదా లాహోర్‌ను అన్నివైపులనుంచి ముట్టడించడమేనని పాకిస్తాన్ నొక్కి చెబుతూ బ్రిగేడ్ లేదా అంతకుమించిన బలంతో పాకిస్తాన్‌రక్షణవ్యవస్థను విచ్ఛిన్నంచేయడానికి, భారత సేనలు పదమూడుసార్లు భారీఎత్తున దాడులు సాగించాయని స్పష్టంచేసింది. పాకిస్తాన్ 'విజయా'న్ని ఆకాశానికెత్తే ప్రయత్నం నిర్విరామంగా జరిగి లాహోర్‌లో యుద్ధచిహ్నాన్ని నెలకొల్పే ఏర్పాట్లు జరిగిపోయాయి.

దక్షిణంవైపునున్న భారతసైన్యంలోని ఎడమదండుపై పాకిస్తాన్ పెద్దఎత్తున ఎదురుదాడి ప్రారంభించింది. ఫిరోజ్‌పూర్‌నుంచి ఖెమ్‌కరణ్‌మీదుగా పాకిస్తాన్‌లోని కాసూర్‌వైపు పురోగమిస్తున్న భారత సేనలు తమ ప్రారంభలక్ష్యాలను అవలీలగానే చేజిక్కించుకున్నాయి. అయితే అటువైపునుంచి ప్రతిఘటన అంతంతమాత్రంగా ఉండడంతో కమాండింగ్‌అధికారి శత్రువు ఏదో వలపన్ని ఉండవచ్చునని భయపడి ముందుకువెళ్ళే ప్రయత్నం విరమించుకుని సట్లెజ్‌పశ్చిమతీరంవైపు వెనకడుగువేశాడు. సెప్టెంబర్ ఏడవతేదీన పాకిస్తాన్ సైనిక శకటాలతో దాడి ప్రారంభించడంతో భారత సేనలు వెనుతిరిగి బయలుదేరినచోటికే చేరుకున్నాయి. పాకిస్తాన్ ప్రధానట్యాంక్‌దళం సియాల్‌కోటలో ఉన్నట్టు భారతగూఢచారివర్గాలు తెలియజేశాయి. భారత సేనలు లాహోర్‌ను ముట్టడించగలవని భయపడి ఆ ప్రమాదాన్ని నివారించడానికి పాకిస్తాన్ వాస్తవానికి తన ట్యాంక్‌బలాన్ని కాసూర్ చుట్టుపక్కల కేంద్రీకరించింది. అమెరికన్‌లేసృష్టించి శిక్షణ ఇచ్చిన ఈ ట్యాంక్‌దళానికి భారీ అమెరికన్‌ట్యాంక్‌దళానికి భారీ అమెరికన్‌ప్యాటన్‌ట్యాంకులు, తేలికరకం అమెరికన్ షెర్మన్లు, మధ్యరకం ఫ్రెంచ్‌ఛాఫీలు

ఉన్నాయి. అమెరికా నేతృత్వంలో రెండవట్యాంక్‌డివిజన్ ఇంకా పూర్తికాలేదు కనుక భారత దేశానికి ఏదైనా ప్రమాదంఅంటూ ఎదురైతే శతఘ్ని, పదాతి సేనలతోకూడిన ఈ భూచరయుద్ధశకటాలనుంచే ఎదురుకావాలి. యుద్ధానికిముందు అమెరికా ఆయుధసంపత్తిని తలచుకుని భారతదేశం ఎంతో ఆందోళన చెందింది. ఒక సైనికాధికారి 'అజేయమైనవిగా భావిస్తున్న అనేక ప్యాటన్‌ట్యాంకులకు వ్యతిరేకంగా' వీరోచితంగా పోరాడినట్టు ఆయన నుద్దేశించిన ఒక అధికారికప్రశంసాపత్రంలో పేర్కొనడంలో బహుశా ఈ ఆందోళన స్పష్టంగా ప్రతిబింబించింది...

సెప్టెంబర్ 8వ తేదీన రాత్రి పాకిస్తాన్ మొదటి ట్యాంక్‌డివిజన్ పదాతి సేనల మద్దత్తుతో పెద్దఎత్తున దాడి ప్రారంభించింది. రాత్రివేళ యుద్ధం సాగించడానికి వీలుగా ప్యాటన్‌ట్యాంకులకు అతినీలలోహిత 'నేత్రాలు' ఉంటాయి కనుక దాడికి రాత్రిసమయాన్నే ఎంచుకుంది. భారతపక్షాన అత్యుత్తమమైనవిగా పేరుపొందిన భారీ సెంచూరియన్ ట్యాంకులు సూర్యాస్తమయంతర్వాత ఉపయోగపడవు. పాకిస్తాన్ 225 ట్యాంకుల్ని బరిలోకి దింపినట్టు భారతసైనికవర్గాలు అన్నాయి కానీ అటువంటి డివిజన్లలో ట్యాంకులసంఖ్య 125 —150 మధ్యనే ఉంటుంది. ఆపైన పాకిస్తాన్ కమాండర్ తగినన్ని బలగాలను రిజర్వ్‌లో ఉంచగలిగినట్టుకూడా చెప్పుకున్నారు. భారతదేశం పేర్కొన్న 'ఒకరికి నలుగురు' అన్న ప్రమాణానికి కొంత తగ్గిఉండవచ్చు కానీ మొత్తంమీద భారతపక్షాన ఉన్న సెంచూరియన్లు, షెర్మన్‌లకు తగినంత ఎక్కువ నిష్పత్తిలోనే పాకిస్తాన్ తన ట్యాంక్‌దళాన్ని భారీఎత్తున యుద్ధంలోకి దింపింది. అత్యంత నిర్దయాత్మకమైన ఈ యుద్ధఘట్టంలో తిరుగులేని పైచేయి సాధించడానికి పాకిస్తాన్ తదుపరి ఒకటిన్నరరోజుల్లో భారతసైనికశ్రేణులపై విడివిడిగా అయిదుసార్లు దాడులు సాగించింది కానీ కోరుకున్న విజయం సాధించలేకపోయింది. ఒకదశలో పాకిస్తాన్ సేనలు భారతభూభాగంలోకి పదిహేనుమైళ్ళమేరకు చొచ్చుకురాగలిగినా, భారత సేనలు వాటిని తిప్పికొట్టాయి. మొదట్లో, అంచనాలనుమించిఉన్నట్టు కనిపించిన ఈ దాడి తర్వాత ఆగిపోయింది. జలమార్గం అడుగున రహస్యంగా సొరంగం నిర్మించింది కనుకనే పాకిస్తాన్ భారీఎత్తున బలగాలను బి.ఆర్.బి కెనాల్ దాటించగలిగిందని భారతవర్గాలు పేర్కొన్నాయి. ఈ సొరంగనిర్మాణంగురించి భారతదేశానికి ముందుగా తగినంత అవగాహన లేకపోయింది.

భారత సేనలను ఉచ్చులో బిగించడానికి ఒక పథకం అమలుచేయబోయి పాకిస్తాన్ విఫలమైంది. ఆ పథకాన్ని భారత సేనలు ఆ తర్వాత చేజిక్కించుకోగలిగాయి. సరిహద్దుకీ బియాస్‌నదికీ మధ్య ఖేమ్‌కరణ్‌నుంచి గ్రాండ్‌ట్రంక్‌రోడ్డువరకూ వాయవ్యంగా విస్తరించిన తగినంత భూభాగాన్ని ట్యాంక్‌యుద్ధంద్వారా ఆక్రమించుకోవడం ఆ పథకం లక్ష్యం. రోడ్డు నానుకుని బియాస్, దాని కీలకవంతెన అమృత్‌సర్‌కు తూర్పుగా ఇరవైఏడుమైళ్ళదూరంలో ఉన్నాయి. ఒక ట్యాంక్‌దండు నదికి ఒకింత సమాంతరంగా చొచ్చుకువెళ్ళి దీనిని స్వాధీనంచేసుకోవాలి. పశ్చిమంనుంచి దాడిచేస్తున్న దండు అమృత్‌సర్‌ను చేజిక్కించుకోవడం కానీ, కనీసం దానిని నిర్వీర్యంచేయడంకానీ చేయాలి. నడిమిదండునుకూడా గ్రాండ్‌ట్రంక్‌రోడ్డు వైపు సాగవలసిందిగా ఆదేశించారు. ఈ పథకం అనుకున్నట్టు అమలుజరిగితే భారత

సేనలు బియాస్‌నదికీ, సరిహద్దుకీ మధ్య చిక్కుకుపోయి, పాక్‌సేనలచేతుల్లో విడివిడిగా ఊచకోతను ఎదుర్కోవలసివచ్చేది. మాంకేకర్ మాటల్లో చెప్పాలంటే 'ఆ పథకమే కనుక నెరవేరిఉంటే మన సేనలు సమస్తం బియాస్ అవతలివైపు ఉండిపోయి తూర్పున ఢిల్లీ వరకూ గ్రాండ్‌ట్రంక్‌రోడ్డుకు పూర్తిగా రక్షణలోపించి శత్రుసేనలకది రాజమార్గంగా మారి పోయేది. ఆ విధంగా ఢిల్లీవరకూ 'కదంతొక్కుతూ' సాగిపోవాలన్న అయూబ్‌కల వాస్తవరూపం ధరించడానికి ఒకఅడుగు దూరానికి చేరుకునిఉండేది.'

యుద్ధపథకాన్ని, అక్కడి భౌగోళికస్థితినుంచి ఉత్పన్నమయ్యే కీలకమైన చిక్కుల్ని తప్పించుకోడానికివీలుగా తార్కికమైనయుక్తితో రూపొందించడం జరిగింది. అక్కడ, సరిహద్దు ప్రాంతంనుంచి ఒకింత ఈశాన్యంగా అనేక కాలువలు, మురుగుకాలువలు ప్రవహిస్తున్నాయి. మరింత సౌలభ్యస్థితిలో ఉన్న గ్రాండ్‌ట్రంక్‌రోడ్డుకు చేరుకోడానికి, జలమార్గాలను దాటి కాకుండా, వాటివెంబడే ముందుకు సాగవలసిందిగా పాకిస్తాన్‌దండును ఆదేశించడం జరిగింది. భారతరక్షణవ్యవస్థకూడా తార్కికంగానే స్పందించింది; భూభాగాన్ని ఎంత వీలైతే అంత ఉపయోగించుకుంటూ రోడ్డుకు దారితీసే మార్గాలను మూసివేసింది. పాకిస్తాన్‌యుద్ధపథకం చేజిక్కడానికిముందే భారతసైన్యాధికారులు ఈ రక్షణపథకాలను రచించుకున్నారు. భారతసేనలు భూభాగాన్నీ, సైనికసంపత్తినీ ఎంతో ఒడుపుగా ఉపయోగించుకుంటూ బలవత్తరమైన శత్రుసేనలను ఎదుర్కొని విజయంసాధించగలిగినట్లు యుద్ధానంతర పరిశీలనలుకూడా ధ్రువీకరించాయి.

అక్కడికి కాస్త దూరంలో ఉన్న అసల్‌ఉత్తర్‌గ్రామ సమీపంలో పెద్ద గుర్రపునాడాఆకారంలో వన్నిన ఉచ్చువైపు పాక్‌సేనల్ని ఆకర్షించడానికి తమ ట్యాంక్, పదాతిదళాలను ఖేమ్‌కరణ్‌నుంచి ఒకింత వెనక్కిమళ్ళించినట్లు భారతసైనికవర్గాలు చెప్పుకున్నాయి. అంతటా కమ్ముకున్న పదాతిదళం, కేంద్రీకృత శతఘ్నిదళం తొలిదాడుల్ని విడివిడిగా తిప్పికొట్టాయి. సెప్టెంబర్ పదవతేదీ ఉదయం, పదాతిదళం మద్దత్తు కలిగిన తన ప్రధానట్యాంక్‌డివిజన్‌ను రంగంలోకి దింపి భారతసేనల వెనకభాగానికి చేరుకోడానికి పాక్‌సేనలు ఉధృతప్రయత్నాలు సాగించాయి. సేద్యపునీటి కందకాలవల్ల, భారతసేనలు కీలకమైనచోట్ల గండికొట్టిన కారణంగా ఆ ప్రాంతం ముంపుకు గురికావడంవల్ల ట్యాంకులు ముందుకుసాగలేకపోయాయి. దాంతో ట్యాంకులదాడిని చెరకుతోటలవైపు మళ్ళించవలసివచ్చింది. తొమ్మిదడుగులఎత్తున ఉన్న ఆ చెరకుతోటలవెనుక భారతసెంచూరియన్‌దండు పొంచిఉంది. అక్కడి ఇరుకు భూభాగం, కొత్తగా ఏర్పడిన చిత్తడి నేలలు ప్యాటన్‌ట్యాంకుల అత్యధికవేగాన్నీ, అనాయాస గమనాన్నీ బాగా తగ్గించగలిగాయి. ఏపుగా పెరిగిన చెరకుపొలాలవల్ల పాక్‌సైనికుల చూపు మందగించి ప్యాటన్‌ట్యాంకుల లక్ష్యవిస్తీర్ణంకూడా ఆ మేరకు తగ్గిపోయింది. భారతవర్గాలప్రకారం అది సెంచూరియన్లకు పద్దెనిమిదివందలగజాలనుంచి వెయ్యిగజాలవరకూ ఉంటుంది. అదీగాక, అటూఇటూ ఊగుతున్న చెరకుగడలు పాకిస్తాన్‌ప్యాటన్ల ఉనికిని బట్టబయలుచేస్తుండగా, భారతట్యాంక్‌దళం ప్రచ్ఛన్నంగా ఉండగలిగింది.

*చెరకుతోటలకు ఓ మూల కమ్ముకున్న పాకిస్తానీట్యాంక్‌దళం తన ఉనికిని బయటపెట్టుకోగానే, అగడ్తలలో ఉన్న భారతసైనికశకటాలు —వాటిలో అధికభాగం అమెరికన్లు రూపొందించిన షెర్మన్లు —కాల్పులు ప్రారంభించాయి. కెనడా రూపొందించిన విపరీతవేగం కలిగిన 70 ఎం.ఎం. ట్యాంక్ ఫిరంగులను భారతసైనికులు ఎంతో చక్కగా ఉపయోగించుకున్నారు. రూపొందించింది అమెరికా అయినా భారతదేశంలోని ఫ్యాక్టరీలలో తయారైన 106 ఎం.ఎం. రికాయ్‌లెస్‌రైఫిళ్ళను ఈ ట్యాంకులకు మద్దత్తుగా వినియోగించారు. భారత సైనికశకటాలు, శతఘ్ని, వైమానిక, పదాతి దళాలు ఈ సరళిలో రెండుసార్లు పాకిస్తానీ చొరబాటుయత్నాలను నిరోధించగలిగాయి. ఆ తర్వాత ఎదురుదాడి నిలిచిపోయింది. పాకిస్తాన్‌సేనలు ఖేమ్‌కరణ్‌వైపు వెనకడుగువేసి, అక్కడ కందకాలలో మాటువేసి కాల్పుల విరమణసమయానికి భారతభూభాగం లోతట్టున మూడుమైళ్ళవిస్తీర్ణం, పదిమైళ్ళపొడవు ఉన్న భూఖండాన్ని తమ అధీనంలో ఉంచుకున్నాయి. తాము అరవై పాకిస్తానీట్యాంకుల్ని ధ్వంసంచేసి, మరో పది ట్యాంకులను సురక్షితంగా చేజిక్కించుకోగలిగామని యుద్ధభూమిలోని భారతసైనికాధికారులు చెప్పుకున్నారు. ఆ తర్వాత భారతవర్గాల అంచనాప్రకారం మొత్తం తొంబైఏడు ట్యాంకులను ధ్వంసంచేయడమో, పట్టుకోవడమో సంభవించింది. స్వతంత్రవర్గాల ననుసరించి ఈ యుద్ధంలో పాకిస్తాన్ కోల్పోయిన ట్యాంకులు నలభైవరకూ ఉండవచ్చు. భారతసైనికవర్గాలు చెప్పుకున్నట్టు, అత్యంత ముఖ్యమైన యుద్ధఘట్టంగా వర్ణించదగిన ఈ యుద్ధంలో భారతసేనలు నిస్సందేహంగా కీలకవిజయం సాధించాయి. అయితే పాకిస్తాన్‌దాడి న్యూఢిల్లీ లక్ష్యంగా జరిగిందని కానీ, దేశరాజధానికి ముప్పుతేగలిగినస్థాయిలో పాకిస్తాన్‌కు సైనికసామర్థ్యం ఉన్నట్టు రక్షణమంత్రిత్వశాఖ భావించినట్టు కానీ ఈ వర్గాలు చెప్పుకోలేదు. 1965 ఆగస్టులో జమ్ము కాశ్మీర్‌ప్రాంతంలోని అనేకరంగాలలో పెద్దఎత్తున యుద్ధం సంభవించింది. కాశ్మీర్‌లోయలో కొంతభాగాన్నైనా చేజిక్కించుకోడానికి పాకిస్తాన్ బరిలోకి దూకింది. పలుచోట్ల, భారతసేనల అధీనంలో ఉన్న రేఖనుదాటి ముందుకు చొచ్చుకొచ్చింది. పాకిస్తాన్ ఎప్పుడనుకుంటే అప్పుడు భారీఎత్తున విరుచుకుపడితే, దానిని ఎదుర్కో లేనివిధంగా పురోభాగంలోని భారతసేనలను చిన్నచిన్న తునకలుగా విభజించడం ఈ చొరబాటులోని ఆంతర్యం.*

యుద్ధానికి రంగస్థలాలుగామారిన ముఖ్యప్రదేశాలు: కిషన్‌గంగవ్యాలీ, రాజూరీ రంగం, ఉడీ, కార్గిల్, టిథ్వాల్, బెడోర్, పుంఛ్, కహుటా, రాజాచాంద్, మెంధార్, నౌషేరా, ఛంబ్ అటుపైన, 1965 ఆగస్టులో భారతసేనలు మూడువారాలపాటు చరిత్రాత్మకపోరాటం సాగించిన హాజీపీర్ కనుమ, హాజీపీర్ కణితి.

పాకిస్తానీ చొరబాటుదార్లు ఓటమిని చవిచూస్తున్న దశలో పాకిస్తాన్‌సైన్యం నియతయుద్ధచర్యలు ప్రారంభించింది. ప్రసిద్ధికెక్కిన అమెరికన్ ప్యాటన్‌ట్యాంకులను, సేబర్ జెట్లను రంగంలోకి దింపింది. భారతసేనలు వాటిని మట్టికరిపించాయి. దరిమిలాను భారతప్రజలు వీటిని ఎంతగా ఎగతాళిచేసేవారంటే, వాటిని నిర్మించిన దేశం సిగ్గుతో చితికిపోతూ ఒకదశలో, పట్టుబడిన ప్యాటన్‌ట్యాంకులను ప్రదర్శించవద్దని భారతప్రభుత్వాన్ని ప్రాధేయపడవలసివచ్చింది.

1965, సెప్టెంబర్ 1వ తేదీన ఛంబ్‌రంగంలో పాకిస్తాన్ దాడి ప్రారంభించింది. ఆత్మ రక్షణకు పూనుకున్న భారతసైన్యంకంటె సంఖ్యలో, సంపత్తిలో ఎంతో ఆధిక్యస్థితిలోఉన్న తనబలగాల్ని రంగప్రవేశంచేయించింది. సెప్టెంబర్ 23వ తేదీన కాల్పులవిరమణ జరిగేవరకూ భారతవైమానికదళం నేలమీద పోరాడుతున్న సేనకు మొక్కవోని మద్దత్తు అందించింది.

పాకిస్తాన్‌వైపునుంచి ఎదురవుతున్న విపరీతమైన ఒత్తిడినుంచి ఛంబ్‌ప్రాంతాన్ని తప్పించడానికి పంజాబ్‌రంగంలో రెండోయుద్ధరంగాన్ని తెరవాలని భారతదేశం తీసుకున్న నిర్ణయం ఈ యుద్ధఘట్టం మొత్తంలో అత్యంతకీలకమైన అడుగు. ఇటువంటి నిర్ణయం తీసుకోవడానికి ఎంతో సాహసం, దృఢనిశ్చయం అవసరం. సారాంశంలో ఇది ఆత్మరక్షణ అనే మాటలోని అర్థాన్ని నూటికి నూరుపాళ్ళు ప్రతిబింబిస్తున్న చర్య. భారతసేనలు ఇచ్ఛోగిల్‌కెనాల్‌దాటి లాహోర్‌నగరశివార్లకు చేరుకోగలిగాయి. పాకిస్తాన్ అప్పటికెన్నో మాసాలుగా ద్రోహపూరితంగా భారత భూభాగాలపై దాడిచేస్తూ దొంగచాటుగా లోపలికి చొరబడుతున్నదన్న వాస్తవాన్ని అసలేమాత్రం పట్టించుకోకుండా, ఊహించిన సరళిలోనే, బ్రిటన్, అమెరికాలు భారత్ చేసిన ఈ పురోగమనానికి అభ్యంతరం లేవదీశాయి.

అద్వితీయదేశభక్తితో భారతప్రజలందరూ ఒక్కటై ఉవ్వెత్తున లేచారు. 1962లో చైనా దాడి జరిపిన మూడేళ్ళకే మరోయుద్ధం వచ్చిపడడం ఊహించడానికే పరమఘాతుకంగా కనిపించే విషయం. నెహ్రూ అస్తమయంతర్వాత ప్రప్రథమంగా ఎదురైన ఈ అగ్నిపరీక్షను భారతప్రజలు వీరోచితంగా ఎదుర్కొగలిగినట్టు భావించి ఆనంద్ గర్వించాడు. అమానుషత్వాన్ని ప్రతిబింబించే యుద్ధంతో ఏమాత్రం పొసగని పెద్దమనిషితరహాలో వ్యవహరించే ఒక నాయకుడి నేతృత్వంలో భారతదేశం పోరాడింది. ఇంతటి కార్యభారానికి ఆయన సరిపోతారా అన్న ఏకైక, అప్రకటిత ప్రశ్న ప్రతిఒకరినీ కలవరపెట్టింది. యుద్ధం దీర్ఘకాలం కొనసాగినా, స్వల్పకాలంలోనే ముగిసినా మొత్తంమీద అది చేయవలసిన విధ్వంసాన్ని చేసే తీరుతుంది. శత్రుత్వాలకు అంకురార్పణ జరగడానికీ, అవి విస్తరించడానికీ పాకిస్తాన్ పూర్తిగా బాధ్యతవహించవలసినస్థితిలో తిరుగుఆక్రమణ జరపడం మినహా మనకు మార్గాంతరం లేకపోవడం గమనించదగినది.

మొత్తానికి ఇరవైరెండురోజుల్లోనే యుద్ధం పరిసమాప్తమైంది. దేశనాయకుడిగా లాల్‌బహదూర్ మూర్తిమత్వం ఒక్కసారిగా నింగికెగిసింది. ఊగిసలాట మచ్చుకైనా కనిపించని నిర్ణయాలతో పాటు దృఢనిశ్చయాన్ని వ్యక్తీకరింపజేస్తూ ఆయన చేసిన ప్రకటనలు కొద్దిరోజుల వ్యవధిలోనే ఆయనకు కనీవినీఎరుగని ఔజ్జ్వల్యాన్ని తెచ్చిపెట్టాయి.

ఆ తర్వాత తాష్కెంట్ ఒప్పందం వచ్చింది.

# 37

తెల్లవారుజాము రెండుగంటలైంది. ఆనంద్ పడగ్గదిలో ఉన్న డైరక్ట్ టెలిఫోన్ కర్ణకఠోరంగా మోగింది. హఠాత్తుగా మోగడంవల్లకాబోలు అది మరింత కర్ణకఠోరంగా ధ్వనించింది. అప్పుడప్పుడే గాఢనిద్రలోకి జారుకుంటున్న ఆనంద్ ఆ ధ్వనికి ఉలికిపడ్డాడు. నిద్ర చెదిరిపోయింది.

అర్ధరాత్రి దాటేవరకూ దూరదూరప్రాంతాల్లో పర్యటిస్తూ భారత పాకిస్తాన్ సంక్షోభంలో దేశం విధానాన్ని బహిరంగసభల్లో విశదీకరిస్తూవస్తున్నాడు ఆనంద్. పగ, ప్రతీకారధోరణుల తీవ్రత అంతరించి తాష్కెంట్‌చర్చలు ప్రారంభమైనందుకు స్థూలంగా అందరూ తేలికపడినట్టే కనిపించారు. అయినా మరోపక్క చర్చల్లో ప్రతిష్టంభన ఏర్పడినట్టు తెరిపిలేకుండా వార్తలు వచ్చిపడుతూనే ఉన్నాయి. యుద్ధజ్వాల మళ్ళీ ప్రజ్వలించే అవకాశం కలవరపాటును సూచించే ఊహాగానాలకు దారితీస్తూనే ఉంది.

'నిద్రపోతున్నారా?...' అవతలివైపునుంచి కంఠం ఖంగున మోగింది.

'ఇంకా లేదు, హరిరామ్'. యుఎన్ఐ విలేఖరి గొంతు చటుక్కున గుర్తుపట్టి ఆనంద్ అన్నాడు. 'నిన్నూ, నీలాంటి అదృష్టవంతులైన విలేఖరులనూ తక్షణం నిద్రపుచ్చే వైట్‌హార్స్‌ను నేను ఆవహింపచేసుకోలేనని నీకు తెలుసుకదా!'

'పరాచికాలాడకండి' కీడును సూచించే కంఠధ్వనితో హరిరామ్ మధ్యలో, తుంచుతూ అన్నాడు. 'ఓ దుర్వార్త. లాల్‌బహదూర్ మరణించారు. గుండెపోటుతో, తాష్కెంట్‌లో.'

ఆనంద్ పడకమీద నిటారుగా లేచి కూర్చున్నాడు, నిద్ర ఎగిరిపోయింది. కాల్పులవిరమణ తర్వాత తాష్కెంట్‌చర్చలు మొదలైనప్పటినుంచి జనంలో ఆశ, రగులుతున్న ఆగ్రహమూ కలగలిసిన ఒక విలక్షణస్థితిని ఆనంద్ గమనిస్తున్నాడు. ఢిల్లీనుంచి సుదూరప్రాంతాల్లోకూడా ఇది స్పష్టంగా కనిపిస్తోంది. ప్రధాని లాల్‌బహదూర్‌శాస్త్రి తాష్కెంట్ మధ్యవర్తిత్వానికి అంగీకరించడం మంచిదా కాదా అన్న విషయంమీద ఎడతెగని చర్చ జరిగిపోతోంది. భారత సేనలు ఒకసారి సరిహద్దును దాటి చొచ్చుకువెళ్ళినతర్వాత, దేశాన్ని ఆధిక్యస్థితిలో నిలపడానికి ఆ చొరబాటు కొనసాగిఉండవలసిందన్న అభిప్రాయం చాలామందికి ఉంది. లాహోర్‌ను చేజిక్కించుకుని పాకిస్తాన్‌ను పాదాక్రాంతం చేసుకుని ఉండవలసిందని వాళ్ళ అభిప్రాయం.

పత్రికల విమర్శల్లో హాజీపీర్ 'బుడిపె'ను ప్రత్యేకించి ప్రస్తావించడం జరుగుతోంది. కాల్పుల విరమణకు ఒప్పుకోడంద్వారా లాల్‌బహదూర్ వెలుపలిశక్తుల ఒత్తిడికి లొంగిపోయారనీ, దేశ భద్రతాప్రయోజనాలను ఇది మంటకలిపేచర్య అనీ విమర్శకులు తప్పుపట్టడం ప్రారంభించారు.

యుద్ధసమయంలో మనసేనలు ఆక్రమించుకున్న పాకిస్తాన్‌భూభాగాలు కొన్నింటిని తిరిగి అప్పగించే విషయంలో ప్రధానమంత్రికీ, సైనికదళాలప్రధానాధికారి జనరల్ చౌదరికీమధ్య తీవ్ర వాదోపవాదాలు జరిగినట్లు వదంతి వ్యాపించింది. ప్రభుత్వం మెతకదనానికి నిరసనగా సైనికదళాలప్రధానాధికారి రాజీనామాచేస్తానన్నారనీ, వాస్తవానికీ చేశారనీ, కొన్ని పత్రికలు ఊహాగానాలు ప్రచురించాయి. ఈ ఊహాగానానికి పూర్తిగా విరుద్ధమైన మరో వదంతీ అంతే బలంగా వినిపించింది; దాని ప్రకారం సైనికదళాల ప్రధానాధికారే కాల్పులవిరమణను ఆమోదించ వలసిందిగా సిఫార్సుచేశారు. మరికొన్ని రోజులపాటు సైనికచర్య కొనసాగించినందువల్ల ప్రయోజనమేమైనా ఉంటుందా అని (మనవద్ద భారీపరిమాణంలో ప్రేలుడుసామగ్రినిల్వలు ఉండగా, పాకిస్తాన్‌వద్ద అవి చాలావరకూ నిండుకున్నాయా అని ఆయన అడిగినట్లు ఆ వదంతి సారాంశం) నిజానికి లాల్‌బహదూర్ వాకబుచేశారట. (అప్పట్లో కేంద్రహోంశాఖ కార్యదర్శిగా ఉన్న ఎల్.పి. సింగ్, శాస్త్రీజీపై తాను రచించి 1996లో ప్రచురించిన ఓ పుస్తకంలో ఇది నిజమేనని ధ్రువీకరించారు).

దేశవ్యాప్తంగా పార్లమెంటులోపల, బయటకూడా జరిగిన చర్చల్లో సహజంగానే దేశప్రతిష్ఠకు సంబంధించిన ఉద్వేగపూరితభావన కీలకస్థానం వహించింది. యుద్ధంలో భారత సైన్యం సాధించిన విజయాలకు సర్వత్రా ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. అయినా ప్రభుత్వం డోలాయ మానస్థితిలో ఉన్నట్లు చాలామంది భావించారు. అంతర్జాతీయశక్తుల్ని బుజ్జగించడంకోసం మన వీరజవాన్లు సాధించిన మహత్తరవిజయాలను త్యాగంచేయడానికి ప్రభుత్వం సిద్ధపడిందని వారు ఆరోపించారు... చివరగా తాష్కెంట్‌లో చర్చల ఏర్పాటుకు సోవియట్‌ప్రభుత్వం ముందుకు రావడంకూడా అలుపెరుగని వ్యాఖ్యలకు ఇతివృత్తమైంది. వివిధవర్గాలు రష్యన్లకు రకరకాల ఉద్దేశాలను ఆపాదించాయి. ఉదాహరణకు, ఈ ఘర్షణనుంచి చైనా, అమెరికాలు లబ్ధిపొందకుండా నివారించి భారతదేశంలో తమ 'పలుకుబడి పెంచుకునేందుకు' సోవియట్లు చేసిన ప్రయత్నంలో ఇది భాగమని కొందరు విశ్వసించడం జరిగింది. అలాగే, తమ ప్రయత్నాలతో పాకిస్తాన్‌ను కూడా మెప్పించి, చైనాపట్టునుంచి అది తప్పుకునేలా చూడాలనికూడా వారు భావించారు. చివరగా, ఈ ప్రాంతంలో వ్యూహాత్మకప్రాబల్యాన్ని పెంచుకోవాలన్న చైనా ఎత్తుగడకు వ్యతిరేకంగా భారత పాకిస్తాన్‌లు రెండూ తమ శత్రుత్వాన్ని మాపుకుని, ఐక్యసంఘటనను సమకూర్చగలవని మాస్కో, వాషింగ్టన్‌లు రెండూ తలపోశాయి. అయితే, 1966, జనవరి 4వ తేదీన తాష్కెంట్ సమ్మేళనం ప్రారంభమయ్యేనాటికి ఇవేవీ పూర్తిగా స్పష్టంకాలేదు. ఈ చర్చలు విఫలమైతీర తాయనే చాలామంది విశ్వసించారు. అప్పుడున్న వాతావరణంలో ఏ ఒక్క అంశంమీదనైనా భారత, పాకిస్తాన్‌లు ఒప్పందానికి రాగలవని ఎవరూ ఆశించలేకపోయారు. కాల్పులవిరమణ కొనసాగుతోంది కానీ మంట పూర్తిగా చల్లారలేదు. రెండుపక్షాలూ భీష్మించుకుని కూర్చున్నాయి.

తెగని వివాదాంశం మళ్ళీ కాశ్మీరే. అది చర్చనీయాంశం కాకూడదని భారతదేశం కోరుకోగా, కేవలం ఆ ఒక్క అంశంగురించే కాకపోయినా, ప్రధానాంశాలలో ఒకటిగా దానిని చేర్చితీరవల సిందేనని పాకిస్తాన్ పట్టుబట్టింది. ఎంతో ముఖ్యమూ, అత్యవసరమనుకున్న ఏ ఇతరాంశమూ సోదిలోకి రాకుండాపోయింది.

ఆనంద్‌తోపాటు, దేశంలోని వివిధరాష్ట్రాల మంత్రివర్గాలలోని అతని సహచరులందరూ అత్యంత జటిలపరిస్థితిని ఎదుర్కోవలసివచ్చింది. వాళ్లలో, భవిష్యత్తులోకి దృష్టి సారించ గలిగిన కొందరు దేశం చిరకాలంపాటు ఆర్థికసంక్షోభంలోకి జారిపోయే అవకాశాన్ని అర్థం చేసుకున్నారు. కదనోత్సాహం త్వరలోనే తగ్గుముఖం పడుతుంది కానీ, అందువల్ల దేశ ఆర్థికతకు తగిలిన గాయాలనొప్పినుంచి ఒకపట్టాన తప్పించుకోలేం. ఆ అనివార్యపరిస్థితిలో ప్రజలను సమాధానపరిచే కర్తవ్యం వారిమీద పడింది. దానర్థం ఒకటే, శతాబ్దాలుగా కష్టాలూ, కడగండ్లూ ఎదుర్కొంటూ మొదటిసారి ఇప్పుడిప్పుడే; తమకు సాంఘికన్యాయం జరగబోతోందని ఎంతో ఆశతో ఎదురుచూస్తున్న అట్టడుగువర్గాలు మరికొంతకాలం దారిద్ర్యంలోనే మగ్గవలసివస్తుంది... అటువంటి కోట్లాది నిరుపేదలు తమ భవిష్యత్తును నాశనంచేసే దుష్టశక్తిగా దేశరక్షణను భావించి ఆడిపోసుకోకూడదు. ఈ పరిణామాన్ని నివారించడం ఎవరితరం? నిర్దేశించుకున్న సాంఘి కార్థికలక్ష్యాలకు దెబ్బతగలకుండా పొదుపుకార్యక్రమాలను ఎలా రూపొందించడం? విధాన నిర్ణేతలు ఎదుర్కొన్న చిక్కుప్రశ్నలు ఇవే. మొత్తంమీద తేలింది, ప్రజలకు వాస్తవాలు బోధించి, సమాధానపరచడం ఒక్కటే గత్యంతరమని.

రెండుదేశాలు పొగలుకక్కే తుపాకులను ఒకదానిపై ఒకటి గురిపెట్టి కూర్చున్నాయి. యుద్ధంవల్ల ఏర్పడిన ఉద్రిక్తపరిస్థితిని తక్షణమే తొలగించడం దేనికీ సాధ్యంకాలేదు. అయినా అవసరాలు శాంతి నెలకొనితీరాలని ఒత్తిడితెస్తున్నాయి. భారతదేశంలోని గ్రామీణప్రాంతాల్లో తీవ్రదుర్భిక్షం తలెత్తింది. ఆకలిచావుల్ని నిరోధించడం అతిముఖ్యకర్తవ్యంగా పరిణమించడంతో, ఆహారధాన్యాలు ఎక్కడ లభ్యమైతే అక్కడ కొనుగోలుచేయడానికి కేంద్రప్రభుత్వం ప్రపంచదేశాలవైపు అనివార్యంగా అడుగువేయవలసివచ్చింది. ఆహారధాన్యాలతోపాటు, ఒక్కొక్కసారి అవికూడా లేకుండానే, స్వావలంబన అవసరంగురించి ఆ దేశాలనుంచి ఒకవిధమైన తృణీకారభావంతో మిళితమైన దీర్ఘోపన్యాసాలనూ అందుకోవలసివచ్చింది. భారతదేశం ఏనాటికీ స్వావలంబనను సాధించ లేమన్న దృఢవిశ్వాసం ఆ దేశాలది. పరిస్థితి మొత్తంమీద కుంగదీసేదిగానూ ఎంతో గడ్డుగానూ కనిపించింది.

రెండుదేశాలమధ్య శత్రుత్వం ఎలా ఉన్నప్పటికీ, అంతూపొంతూలేని ఆయుధపస్పర్ధను తట్టుకునే స్తోమత ఉభయులకూ లేదు కనుక వివాదపరిష్కారందిశగా ఏదో ఒకరూపంలో ప్రారంభం జరగాలని తాష్కెంట్‌సమ్మేళనంలో రెండుదేశాలూ గుర్తించగలిగాయి. అయితే, ఏదెలా జరిగినాసరే, దేనికీ ఒప్పుకోడానికి వీల్లేదన్న దరిదాపు జనాదేశానికి రెండుదేశాల నాయకులూ తలవంచక తప్పనిస్థితి. నిజానికి అలా ఆదేశించినవాళ్ళెవరూ లేకపోయినా, ఏదైనా ఒప్పందం అనేసరికి

ఇచ్చిపుచ్చుకోవడం ఉంటుంది కనుక, తమదేశాలతరఫున చర్చల్లో పాల్గొంటున్న నాయకులు ప్రజలు తమపై వంచనానేరాన్ని ఆపాదించగలరని సహజంగానే జంకుతారు. రెండుదేశాలప్రజలు ఆ ఒప్పందాన్ని– అసలెటువంటి ఒప్పందాన్నయినా శత్రువుకు లొంగిపోవడంగానే పరిగణిస్తారు.

ఎంతో ప్రయాసతోకూడిన ఆ సంప్రతింపులు ఊహించిన సరళిలోనే సాగిపోయాయి, ఏ పక్షమూ మెట్టుదిగిరాలేదు. అయితే, రెండుపక్షాలూ ఇక చర్చలు విరమించి నిష్క్రమించబోతున్న ఘట్టంలో సోవియట్ ప్రధానమంత్రి ఎంతో శ్రమకోర్చి నిర్విరామంగా అటూఇటూ రాకపోకల దౌత్యం నెరిపి చర్చల్లో అద్భుతమైన మలుపును సాధించగలిగారు. రెండుపక్షాలూ ఏమాత్రం ఏకీభావానికి రాలేకపోయిన కాశ్మీర్‌ప్రస్తావనను ఉభయులకూ తాత్కాలికంగా సంతృప్తికలిగించే పదజాలాన్ని ఉపయోగించి సంధిపాఠంలో చేర్పించగలిగారు. అయినా ఒప్పందం సాధ్యమయ్యే సూచన ఎటువైపునా కనిపించలేదు. ఒక భారతీయవిలేఖరి మాటల్లో చెప్పాలంటే, 'ఏదో అద్భుతం జరిగితే తప్ప, ఏకాభిప్రాయం కుదరలేదన్న అసందిగ్ధప్రకటనతో తాష్కెంట్ సమ్మేళనం ముగియ వలసిందే...'

శాంతికాముకుడైన లాల్‌బహదూర్‌శాస్త్రికి ఇదంతా పెద్ద అగ్నిపరీక్షలా పరిణమించింది. ఇంతకు ముందొకసారి ఆయనకు గుండెపోటు వచ్చిన వైనంకూడా దీనికి తోడైంది. ఏ ఒకరైనా దీనికి ఎలా స్పందించాలో తెలుసుకునే లోపలే విపరీతమైన గుండెపోటుతో ఆయన కుప్ప కూలి కన్నుమూశారు.

లాల్‌బహదూర్ అంత్యక్రియలకు హాజరుకావడానికీ, తదుపరి చర్యపై సంప్రతింపులకు అందుబాటులో ఉండడానికీ ముఖ్యమంత్రి చౌదరి ఉదయమే తొలివిమానంలో ఢిల్లీకి బయలు దేరివెళ్ళాడు. ప్రధానమంత్రి మరణంతో దేశం యావత్తూ మొదలుతెగిన చెట్టులా అయిపోయింది. ఏణ్ణర్థంక్రితం నెహ్రూ మరణం ఇలాగే దేశాన్ని దిగ్భ్రాంతపరిచింది. అయితే ఆ పరిణామానికి దేశాన్ని సన్నద్ధంచేయడానికి ఆయన సహచరులు, ఇతర నాయకులు చేసిందేమీ లేకపోవచ్చు కానీ, అది అనూహ్యమైన పరిణామమేమీ కాదు. లాల్‌బహదూర్, ఒక రాజీఅభ్యర్థిలో స్వాభావికంగా ఉండే అన్ని సంకోచాలను వ్యక్తీకరిస్తూ మధ్యంతర ప్రధానిగా అవతరించారు. పాకిస్తాన్‌తో యుద్ధం సంభవించేవరకూ దేశందృష్టి కాయన స్వీయనాయకత్వ స్థాపనకు పూనుకోలేని మనిషిగానే కనిపించారు. ఆ తర్వాతే తానుగా నాయకత్వలక్షణాన్ని స్థాపించుకోవడం ప్రారంభించారు. దాంతో ఎట్టకేలకు ప్రధానమంత్రి సామర్థ్యంగురించి సలుపుతున్న సందేహాలన్నీ సద్దుమణిగి పోయాయి... ఇది ఆయన హఠాన్మరణాన్ని మరింత విచిత్రమూ, విషాదభరితమూ చేసింది. కొడిగట్టేముందు దీపం ఒక వెలుగు వెలిగిన చందంలా ఉందిది.

చౌదరి తనతోపాటు ఆనంద్‌తోసహా నలుగురు మంత్రుల్ని వెంటబెట్టుకుని ఢిల్లీ వెళ్ళాడు. సంతాపసభలతో సహా రకరకాల సమావేశాలు జరుగుతున్న పార్లమెంట్‌సెంట్రల్‌హాల్‌కు, రెస్టారెంట్లకు, ఇతర ప్రసిద్ధప్రదేశాలకు వీరు వెళ్ళివస్తున్నారు. అధికారపక్షానికి చెందిన ముఖ్య మంత్రులమధ్యకూడా ముమ్మరంగా సంప్రతింపులు జరిగిపోతున్నాయి. పార్టీ అధ్యక్షుడు కామరాజ్,

ఇంకా పలువురు ప్రముఖులు సమస్య పరిష్కారానికి శక్తికిమించి కృషిచేస్తున్నారు. దేశచరిత్రలో ఇది అత్యంతవిషమఘట్టం. ఏణ్ణర్థంక్రితం నెహ్రూ అస్తమయం భర్తీచేయలేని లోటు కల్పించివెడితే, రాజకీయకేంద్రస్థానంనుంచి లాల్‌బహదూర్ ఆకస్మికనిష్క్రమణ మరో శూన్యాన్ని తెచ్చిపెట్టింది. దారితోచని నిస్సహాయస్థితి దానికి తోడైంది. నెహ్రూ అనంతరం, పార్టీకిచెందిన ఇద్దరు సీనియర్ నాయకులలో ఎవరో ఒకరిని ఎంచుకునే అవకాశమైనా కనిపించింది. అయితే శాస్త్రి మరణానంతరం అందరికీ ఆమోదయోగ్యుడైన సీనియర్‌నాయకుడు ఒక్కరూ కనిపించలేదు. ఎవరివరకో ఎందుకు, కామరాజే ప్రధానమంత్రి కావచ్చు కదా అని కొందరు ఊహచేశారు కానీ ఆ ఊహ గాలిబుడగలా ఇట్టే అదృశ్యమైపోయింది. అలా ఎందుకు జరిగిందో ఎవరికీ తెలియదు. అందుకు బదులుగా ఆయన 'నియమించిన'వారే ప్రధానమంత్రి అవుతారని ప్రతిఒకరూ తలపోశారు. ఏలికను సృష్టించి అందించగల దక్షుడుగా (కింగ్‌మేకర్) ఆయన కీర్తిప్రతిష్ఠలు బహుశా స్వీయ అభిమతానికి తగినట్టుగానే ఇనుమడించాయి. ఆ విధంగా వారసత్వనాటకంలో ఆయన కీలక పాత్రధారి అయ్యారు. స్వాతంత్ర్యం తర్వాత, అధికారపక్షం అధ్యక్షులలో రాత్రికిరాత్రి అంత ప్రాముఖ్యాన్ని సంతరించుకున్న వాళ్ళు మరొకరు కనిపించరని ఎందరో రాజకీయపండితులు వ్యాఖ్యానించారు.

కామరాజ్‌నోట ఎంతో నర్మగర్భంగా తమిళంలో వెలువడే 'పార్కలామ్' ('చూస్తాం') అనేమాట ఢిల్లీఅంతటా మారుమోగిపోయింది. ఆయనకు ఎవరు ఇష్టుడుకారో కొంతవరకూ స్పష్టమైపోయింది ఆ వ్యక్తి మొరార్జీదేశాయ్. అందుకు, 1964లో నెహ్రూ మరణానంతరం పేర్కొన్న కారణాలూ, వాదాలే తప్ప కొత్తవి లేవు. జ్ఞాపకాలు ఇంకా తాజాగానే ఉన్నాయి. మొరార్జీ నెహ్రూవిధానాలను సమర్థించేమనిషి కాదన్న అభిప్రాయం ఇంకా అలాగే ఉంది... ఆ మనిషిమీద కామరాజ్‌కు ఎంతో వైముఖ్యం అన్న విశ్వాసం అందుకు తోడైంది.

మరోవైపున, యువలెజిస్లేచర్లబృందం ఒకటి ప్రధానమంత్రిపదవికి తమ అభ్యర్థిగా ఇందిరాగాంధీని చూపించడానికి నిర్విరామప్రయత్నాలు సాగించింది. మొదట్లో ఈ ప్రత్యామ్నాయ అభ్యర్థిత్వాన్ని ఎవరూ అంత తీవ్రంగా తీసుకోలేదు. ఆమె దేశమంతటికీ బాగా తెలిసిన వ్యక్తే, కానీ ఆ తెలియడం చాలావరకు ఆ తండ్రి కూతురుగానే. కొన్నేళ్ళక్రితం ఆమెను పార్టీఅధ్యక్ష స్థానానికి పెంచడాన్ని ఒక వితరణగానూ, లేదా, ఘనతవహించిన ఆ తండ్రిపట్ల కృతజ్ఞతాపూర్వకచర్యగానే చాలావరకూ పరిగణించారు. ఆమె స్వతంత్రించి తీసుకున్న కొన్ని చర్యలు, వాటికవి ఎంతో ప్రాముఖ్యం కలిగినవే కానీ, వాటిని నెహ్రూనిర్ణయాలుగానో, లేదా ఇరువురి నిర్ణయాలుగానో అంతరాంతరాల్లో భావించడంవల్ల ఎవరూ వాటిని పెద్దగా పట్టించుకోలేదు. లాల్‌బహదూర్ మరణానంతరమే ప్రజలూ, రాజకీయవాదులూ మొదటిసారి ఆమెను గట్టిగా పట్టించుకోవడం ప్రారంభించారు. ఆమె బయటిమనిషికూడా కాదు, లాల్‌బహదూర్‌మంత్రివర్గంలో సమాచార, ప్రసార శాఖల మంత్రిగా ఉన్నారు. లాల్‌బహదూర్ జీవించి ఉండగానే ఆయన వారసురాలిగా ఆమెను పెంచే ప్రయత్నమేమైనా జరుగుతూవచ్చిందా అన్నది ఆనంద్‌కీ, అతడిలాంటి మరెందరికో అర్థంకాలేదు. అయితే ఆ మేరకు అడపాతడపా వార్తలు వ్యాప్తిలో

ఉంటూనేవచ్చాయి. అసలు లాల్‌బహదూర్‌ను ప్రధానమంత్రిపీఠంమీద ప్రతిష్ఠించడమే ఇందిరా గాంధీకి మార్గం సుగమంచేయడానికని కొందరు సూచనగా, మరికొందరు నిర్ద్వంద్వంగా అంటూవచ్చారు. కొందరికది శ్రుతిమించిన ఊహాగానంగానే ధ్వనిస్తూవచ్చినా, విశ్వసించినవాళ్ళూ ఉన్నారు. ఏదేమైనా, కొందరి బుర్రల్లో తిష్ఠవేసేంతగా ఆసక్తిజనకమూ, పత్రికల ఊహాగానాలు నిరంతరంగా సాగడానికి సరిపోయేంత వివాదాస్పదమూ అయిన కోణమిది.

1967 సార్వత్రికఎన్నికలు పట్టుమని ఏడాదిదూరంలోకూడా లేవు. నెహ్రూ లేకుండా జరుగుతున్న ప్రప్రథమ ఎన్నికలవి. అన్నింటినీమించి ఈ ఊహ ముందెన్నడూ లేనంతగా విశ్వరూపందాల్చి భయపెట్టింది. పార్టీలో దూరదృష్టిగల నాయకులు జనసమ్మోహనశక్తి కలిగిన నాయకత్వం ఎంత అవసరమో అర్థంచేసుకోగలిగారు. ఇందిరాగాంధీ ఈ అవసరాన్ని తీర్చ గలుగుతారా? ఎంతో ప్రామాణికంగా పరిగణించిన ఒక వార్తప్రకారం, లాల్‌బహదూర్ మరణ వార్త అందుకున్న మరుక్షణమే కామరాజ్ 'ఇందిర' అని తనలోతనే గొణుక్కున్నారట... అది నిజమోకాదో తెలిసినవాళ్ళెవరూ లేకపోయినా, కామరాజ్‌తరహాలో అది ఏకాక్షరస్పందననే ధ్వనింపజేసింది.

అయితే నడక డొంకదారి పట్టిపోయింది. 1964లో చేసినట్టే పార్టీలోని సీనియర్ ముఖ్యమంత్రులు రాజీకి ప్రయత్నించారు. కానీ ఈసారి వాళ్ళ ప్రయత్నాలు విఫలమయ్యాయి. పోటీ అనివార్యమని తేలిపోయింది. అధికారపక్షచరిత్రలో ప్రప్రథమంగా పార్లమెంటులోని ఆ పార్టీసభ్యులు చీలికవోటుతో తమ నేతను ఎన్నుకోబోతున్నారు. చేదు నిజం ఛెళ్ళున చరచిన క్షణాలవి.

మరోసారి సేనల మోహరింపు జరిగిపోయింది; అయితే ఈసారి అందుకనుసరించిన ప్రమాణసంపుటి వేరు. మొరార్జీ, మొరార్జీగానే మిగిలిపోగా ఇందిరాగాంధీ నెహ్రూదివిటీని చేబూనిన మనిషిగా ఆయన వారసురాలుగా కనిపించారు. 1967 ఎన్నికలలో పార్టీకి వోట్లు రాబట్టే విషయంలో ఆమెతో పార్టీలో పోటీపడగలవాళ్ళెవరూ లేరు. ఆనువంశికతవల్ల కలిగిన విశేషప్రతిపత్తి, ఆకర్షణ, పడుచుదనం, గొప్ప ఫలితాలు సాధించగలదన్న నమ్మకం ఇంకెవరూ తులతూగలేనంత బలవత్తర సమ్మేళనం ఇది.

మిగిలిన ముఖ్యమంత్రుల్లానే చౌదరి కూడా జోడుగుర్రాలస్వారీ చేయవలసిన క్లిష్టపరిస్థితిని ఎదుర్కోవలసివచ్చింది. ఒకదశలో ఉభయుల్నీ శత్రువుల్ని చేసుకునే పరిస్థితినీ ఆయన ఎదుర్కొన్నాడు. అంటే దానర్థం, ఏ గుర్రం గెలిచినా ఆయన అధికారచ్యుతి ఖాయమన్నమాట. అయితే ఆయన తెలివిగా తన సహచరులను రంగంలోకి దింపడంవల్ల గెలుపు తథ్యమనుకున్న పక్షంలోనే అంతిమంగా చేరగలిగాడు. ఆయన రెండుమార్గాలనూ తెరచే ఉంచుకున్నాడు. ఒకటి ఆనంద్‌ద్వారా, రెండోది శేఖర్‌తోపాటు, పార్టీ పాతకాపుల్లో ఒకరైన మరో మంత్రిద్వారా. ఇందిరాగాంధీ సొంతశిబిరంమీద దృష్టిపెట్టమని తన భార్య నళినీదేవిని నియోగించి చౌదరి స్వయంగా రెండుశిబిరాల్లోనూ హాజరువేయించుకున్నాడు.

అప్పటికి కొంతకాలంగా పార్టీలో యువకవర్గాలకు బాగా పరిచితుడైన ఆనంద్ ఆ విధంగా మొదటిసారి, కరడుగట్టిన సోషలిస్టుల చూపుల్లో పడ్డాడు. వాళ్ళలో ఉత్సాహం ఉరకలేస్తోంది. ఇందిరాగాంధీని తీసుకొచ్చి ప్రతిష్ఠించే ప్రయత్నం కొందరిదైతే, మొరార్జీని రాకుండా నిరోధించే ప్రయత్నం మరికొందరిది. ప్రజలు ఇందిరాగాంధీని సమర్థించడానికి ప్రధానకారణాలు ఈ రెండే అయినా, వేరే పరిగణనలూ ఉన్నాయి: వ్యక్తిగత అధికారకాంక్షలూ, ఇతరేతర శత్రుత్వాలూ వగైరాలు. జమిలిగా అల్లుకున్న అనేకాంశాలతో పరిస్థితి సాలెగూడును తలపింపజేస్తోంది; జరుగుతున్న పరుగుపందెంలో వ్యక్తిగతంగా తలదూర్చని ఆనంద్‌కి ఇదంతా వేడుక పుట్టించింది.

అతడికి ఇందిరాగాంధీతో వ్యక్తిగతసాన్నిహిత్యం లేదు కానీ, ఆమె సన్నిహితసహచరులకు చాలామందికి అతడు తెలుసు. కొన్ని మాసాల క్రితం, సమాచారమంత్రిత్వశాఖకు సంబంధించిన ఒక కార్యక్రమాన్ని ప్రారంభించడానికి ఆమె రాష్ట్రరాజధానికి వచ్చినప్పుడు అతడొకే ఒకసారి ఆమెను కలుసుకున్నాడు. మళ్ళీ అదికూడా మరో మంత్రికి బదులుగానే. సమాచారశాఖమంత్రి ఆ సమయంలో అస్వస్థుడుకావడంతో ఆయన తరఫున ఆ కార్యక్రమంలో పాల్గొనడానికి ఆనంద్‌ను నియోగించారు.

ఎన్నిక ఘట్టం సమీపించినకొద్దీ అభ్యర్థులిరువురూ ప్రజలదృష్టిలో తమతమ విలక్షణముద్రల్ని మరింత స్పష్టంగా సంతరించుకోసాగారు. మొరార్జీ సంపన్నవర్గాలకు అనుకూలుడుగా కనిపించారు; అందుకు భిన్నంగా ఇందిరాగాంధీ, ఇంతకుముందూ పేదలపక్షమే వహించినట్టు, లేదా ఇక ముందు వహించబోతున్నట్టు కనిపించారు. వెలుగూ, నీడలా అవి ఒకదానినొకటి ప్రస్ఫుటం చేయసాగాయి. కాస్త నిశితంగా పరిశీలిస్తే ఈ స్థూలవర్గీకరణలో ఉన్న లోపాలు కనిపించి ఉండేవేమో. అయితే నిశితపరిశీలన జరిపేంత నిదానం ఉన్నవాళ్ళు చాలా తక్కువ. ప్రజలకూ, పార్టీలోని అధికసంఖ్యాకులకూ తమ ఆదరాభిమానాలను కుమ్మరించుకోడానికి ఓ మనిషి కావాలి. అందుకు, ఇందిరాగాంధీయే తమ ఇష్టానికి దగ్గరగా ఉన్నట్టు భావించారు. మిగిలిన కార్యకారణ నిరూపణప్రక్రియ అంతా ఆ తర్వాత అనుసరించింది.

ఎన్నికకు ముందురోజు రాత్రి చౌదరి ప్రీ ఫైనల్ సంప్రతింపులకోసం తన మంత్రివర్గదళానికి (గూఢచారులని మీరనదలచుకుంటే, మీ ఇష్టం) కబురుచేశాడు. పార్టీసభ్యులు పైకి కచ్చితంగా అనకపోయినా మద్దత్తు ఇందిరాగాంధీవైపు మళ్ళిపోతున్నట్టు ప్రస్ఫుటంగా కనిపిస్తూవచ్చింది. తెరవెనుక సాగుతున్న రహస్యకార్యకలాపాల గురించి అనేక కథనాలు వ్యాప్తిలోకి వచ్చేశాయి. ఫలితం ఎవరికివారు ఊహించుకోవలసిందేనన్నట్టుగా కనిపించింది.

మొరార్జీశిబిరంపై నిఘావేయడానికి నియుక్తుడైన శేఖర్, మరో మంత్రి చంద్రమోహన్ అక్కడికి విడివిడిగా రాకపోకలు సాగించి పరస్పరవిరుద్ధమైన భోగట్టా చేరవేశారు. వయసులో పెద్ద, స్వభావరీత్యా నమ్మదగినమనిషిగా కనిపించే చంద్రమోహన్ మొరార్జీకి తిరుగులేని మద్దత్తు ఉన్నట్టు ఉద్ఘాటించగా, శేఖర్ అన్నాడు 'మన సీనియర్ సహచరుడు సేకరించిన

సమాచారంలో ఒక్కముక్కకూడా నేను విశ్వసించను. నా అంచనాప్రకారం అవకాశాలు ఇద్దరికీ సమానంగా ఉన్నాయి. వాస్తవంగా లెక్కింపు జరిగినతర్వాతే నిజం బయటపడుతుంది...'

'అలా ఎందుకనుకుంటున్నావ్?' చౌదరి ప్రశ్నించాడు.

'ఏముంది, సింపుల్, ముందు నన్నో ఎదురుప్రశ్న వేయనివ్వండి. ఓ పెద్దరాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉన్న మీరు జోడుగుళ్ళ తుపాకిని ఎందుకు పేలుస్తున్నారు? రెండుశిబిరాల్లోనూ తలోఅడుగు ఎందుకువేశారు?'

'ఎందుకంటే, ప్రధానమంత్రి ఎవరు కాబోతున్నాసరే, ఆ పక్షం వహించకపోతే అది ఆత్మహత్యా సదృశమౌతుంది కనుక. దేశంలో మనకున్న ఒకేఒక అధికారకేంద్రం ప్రధానమంత్రి అని నాకు తెలుసు. ఆ విషయంలో ఎటువంటి భ్రమలకూ తావులేదు. నేను మళ్ళీమళ్ళీ చెబుతున్నట్టు, ఒక ముఖ్యమంత్రి కాస్త పక్కటడుగు వేశాడా, అధికారంనుంచి జారిపోయాడన్నమాటే...'

'ఒప్పుకున్నాం. అదే కొలమానాన్ని మీరిప్పుడు దిక్కులేని పార్లమెంటుసభ్యులందరికీ ఎందుకు వర్తింపజేయరు? నెహ్రూ వాళ్ళను ఎంపికచేశారు, ఇప్పుడాయన లేరు. శాస్త్రీజీకి వాళ్ళలో చాలామంది తెలిసే ఉంటారు; ఇప్పుడాయనకూడా లేరు. మొరార్జీ, ఇందిరాగాంధీలలో ఎటువైపు తమరొట్టెకు వెన్నరాయబడిఉందో వాళ్ళకెలా తెలుస్తుంది?' శేఖర్ అన్నాడు.

'ఒప్పుకున్నాం' అతడిమాట అతడికే అప్పగిస్తున్నట్టు చౌదరి అన్నాడు. 'ఎం.పిలు మొరార్జీవిషయంలోనే మద్దత్తును నటిస్తున్నట్టు నువ్వెలా అనుకుంటున్నావ్? ఇందిరాజీ విషయంలో కూడా వాళ్ళ సమర్ధన అంతే నటన కావచ్చు కదా?... దీనికేం చెబుతావ్?'

'చాలా తేలిక. ఇందులో మనస్తత్వసంబంధమైన వైరుధ్యం ఒకటుంది. మొరార్జీ ఒకసారి లాల్‌బహదూర్‌కి అనుకూలంగా వెనక్కితగ్గారు కనుక ఈసారి ప్రధానమంత్రిపదవికోసం తన హక్కును మరింత గట్టిగా స్థాపించుకుంటారని వాళ్ళు భావిస్తారు. అదీగాక, వయసుదృష్ట్యా ఆయనకా పదవి వస్తే ఇప్పుడు రావాలి, లేకపోతే మరెప్పటికీ రాదని వాళ్ళకు తెలుసు... మరోవైపున వాళ్ళ కాయనపట్ల ఇష్టంలేదు, ఆయన నాయకత్వంలో తమకు భద్రత ఉంటుందని వాళ్ళనుకోలేరు. ఆయన జగమొండి, కొరకరాని కొయ్య, ఆపైన పగబట్టి కాటేసే మనిషి నిజమో, అబద్ధమో, ఆయనగురించి సెంట్రల్‌హాల్ అభిప్రాయం ఇదీ. తులనాత్మకంగా చూస్తే ఇందిరాజీ వాళ్ళకి ఎంతో ఔదార్యం, మెతకదనం... బహుశా వాస్తవంగా వాళ్ళు ఆశిస్తున్నట్టు ఎలా వంచితే అలా వంగే రకం.' శేఖర్ సమాధానం చెప్పాడు.

'ఆ లెక్కన వాళ్లందరూ ఇందిరాజీ వెనక బారులుతీరాలి కదా...' చౌదరి వాదించాడు.

'అవును, అయితే రెండు అడ్డంకులున్నాయి. ఒకటి, కొందరు రాష్ట్రనాయకులు మొరార్జీని పూర్తిగా భుజానవేసుకున్నారు. తమ ఎం.పిలపై విపరీతమైన ఒత్తిడి తెస్తున్నారు. రెండోదీ, నిజంగా కీలకమైనదీ ఏమిటంటే, కక్షసాధింపు స్వభావం ఉన్న అభ్యర్థిని సాధారణంగా ఎం.పిలు బాహాటంగా వ్యతిరేకించరు... రహస్యబ్యాలెట్ అయితే దానిదారి వేరు.'

'మొత్తంమీద నీ భోగట్టా యుక్తియుక్తంగానే ఉంది.' చౌదరి వ్యాఖ్యానించాడు. తనా మాట అంటున్నప్పుడే మంత్రి చంద్రమోహన్ ముఖం ఒకింత పాలిపోవడమూ గమనించాడు. చౌదరి అతనివైపు తిరిగి బుజ్జగింపు స్వరంతో అన్నాడు, 'చూడు మిత్రమా, మనలాంటి సీనియర్లు ఇలాంటి మతలబుల్లోకి వెళ్ళరు. శేఖర్ మాటలు ఎంత యుక్తియుక్తంగా ఉన్నట్టు ధ్వనించినా వ్యవహారాలు అక్షరాలా అలాగే జరుగుతాయని చెప్పడానికి లేదు. జరగబోతున్న పరిణామాలు నీ సమాచారమే సరైనదని రుజువుచేసినా చేయవచ్చు'

శేఖర్, ఆనంద్ మందహాసంతో ఒకరినొకరు చూసుకున్నారు.

చౌదరి ఆనంద్‌వైపు తిరిగి పరిహాసంగా అన్నాడు 'మన బృహస్పతిగారి భోగట్టా ఏమిటి? ఇందిరాజీ అవకాశాలెలా కనిపిస్తున్నాయి నీకు? ఘనంగానా? హీనంగానా? మధ్య రకంగానా?...'

'ఘనంగానే ఉన్నాయి' ఆనంద్ జవాబుచెప్పాడు. 'అయితే ఎం.పిలు కనీసం తమ కళ్ళూ, చెవులూ తెరచుకుని వ్యవహరిస్తే, వాళ్ళ వ్యక్తిగత అభిప్రాయాలెలా ఉన్నా'

'సరే, అది అయితేగియితే సంగతి, అవునా? వాళ్ళు నిజంగానే కళ్ళూ, చెవులూ తెరచుకునే ఉన్నారని నువ్వనుకుంటున్నావా?'

'నే నలాగే నమ్ముతున్నాను. పార్టీకి ఇది ఒక అపూర్వక్షణం. ఏ సభ్యుడూ ఈ సంగతి విస్మరించలేడు. పోటీ కనుక జరిగితే– అదెలాగూ తథ్యంలానే కనిపిస్తోంది– ఇందిరాజీదే గెలుపు...'

'పోటీ అంటూ జరిగితే నీ కళ్ళు చల్లబడతాయి, సందేహం లేదు. లాల్ బహదూర్, మొరార్జీల మధ్య మేము రాజీ కుదిర్చినప్పుడు నువ్వు మొహం వేలాడ వేసిన విషయం నాకు గుర్తుంది. ఇప్పుడు నీ ప్రార్థన ఫలించినట్టు కనిపిస్తోంది...' చౌదరి ఒకింత వ్యంగ్యంగా అన్నాడు.

'అవి కేవలం నా ఒక్కడి ప్రార్థనలే కావు. పార్టీని ఒకతాటిమీదికి తీసుకొచ్చి, తన వాగ్దానాల పట్టాల మీదికి ఏకధ్యాసతో దానిని ఎక్కించి నడిపించేదేదైనా స్వాగతించదగినదే...'

'మరో రకంగా చెప్పాలంటే, ఇందిరాజీ హయాంలో భూసంస్కరణలు తక్షణమే అమలు జరుగుతాయని ఆనంద్ ధీమా కాబోలు' శేఖర్ తృణీకారభావం ద్యోతకమయ్యేలా నవ్వుతూ అన్నాడు.

'ఎవరి హయాంలో అది జరగదో నాకు కచ్చితంగా తెలుసు. భారత దేశంలోని శేఖర్‌లు అందరూ ఒక్కటై ఎదుర్కొన్నా సరే ఇందిరాజీ హయాంలో మనమందుకు ప్రయత్నించి తీరతాం' ఆనంద్ రౌద్రంగా తిప్పికొట్టాడు.

# 38

ఇందిరాగాంధీ పార్లమెంటరీపార్టీ నాయకురాలిగా ఎన్నికై ప్రధానమంత్రి అయ్యారు. మొరార్జీదేశాయ్‌ని ఉపప్రధానమంత్రిగా తన మంత్రివర్గంలో చేర్చుకున్నారు. మొత్తం మీద ఈ పర్యవసానానికి సంతృప్తిచెందినవారిలో ఆనంద్‌కూడా ఒకడు. అయితే అతడు వివేకబుద్ధితో తెరచాటునే ఉండిపోయాడు. అధికారపక్షం చీలికవోటుతో ప్రధానమంత్రి ప్రతిష్ఠితురాలుకావడం, తన అభిప్రాయాలతో విభేదించే మనిషిగా పదిమందికీ తెలిసిన ఉపప్రధానమంత్రితో కలిసి ఆమె పనిచేయవలసిరావడంలో ఇమిడి ఉన్న చిక్కుల్నివిశ్లేషించడాని కతడు యత్నించాడు. అది ప్రమాదసంకేతం కావచ్చునా? లేక దానినొక అపూర్వఅవకాశంగా భావించాలా? ఏ విధంగా చూసినా ఈ పరిణామం బలవత్తరమైన సవాలుగానే తోచింది. అయితే ఆ సమయంలో దానిని ఊహించడానికీ, గుర్తించడానికీ ఇష్టపడినవాళ్ళసంఖ్య చాలా తక్కువ చాలా మంది ఉత్సవ నిర్వహణలోనూ, పదవులకోసం ఎగబడడంలోనూ మునిగిపోయారు. రాష్ట్రస్థాయిలోనే ఉండిపోవడం వల్ల ఆనంద్‌కి అటువంటి బాదరబందీ ఏమీలేదు, ఆ విధమైన ఇచ్ఛాలేదు. రాష్ట్రానికి సంబంధించినమేరకు ఇందిరాగాంధీకి విజయం చేకూర్చిన ఘనతను అతడు ముఖ్యమంత్రి చౌదరికే ఆపాదించాడు. తనలా అనడం, రాబోయే పరీక్షలకు చౌదరిని సన్నద్ధంచేయడానికే గానీ, అతణ్ణి సంతోషపెట్టడానికి కాదని మనసులో అనుకున్నాడు... ఇందిరాగాంధీకి తనవైన అభిప్రాయాలు కొన్ని ఉన్నట్టు అతడు గమనించాడు. కొద్దిసేపు ఆమెతో ముచ్చటించే అవకాశం దొరికినప్పుడు, ఆమెకోసం ముఖ్యమంత్రి చౌదరి ఎంత చిత్తశుద్ధితో శ్రమించి పనిచేశాడో వివరించాడు. అప్పుడామె ముక్తసరిగా'నాకు తెలుసు...' అంటూ చిరునవ్వు నవ్వారు. ఆ నవ్వులో వాస్తవం తనకు తెలుసునని ఆమె అసందిగ్ధంగా సూచించినట్టయింది.

నూతనప్రధానితో అంటకాగేందుకు జరుపుతున్న తన ఆర్భాటయత్నాల జోరు తగ్గించమని శేఖర్ అదే కారణంతో చౌదరికి సలహా ఇచ్చాడు. 'చూడండి, మన మామె శ్రేయస్సునే కోరు కుంటాం; ఆమెమేలిముత్యమే, అందులో సందేహం లేదు. అయితే కేంద్రంలో అస్థిరత్వం నీడలు పరచుకున్న విషయాన్ని విస్మరించి ఏ ముఖ్యమంత్రీ బతికిబట్టకట్టలేడు. ఈ సున్నిత ఘట్టంలో ఆచితూచి వ్యవహరించడం ఎంతైనా అవసరం.'

తమ తమ పాత్రల్ని పోషించి వాళ్ళు అఫ్రోజాబాద్ తిరిగొచ్చారు. రాజకీయతారాపథంలో చౌదరి పైపైకి దూసుకుపోయాడు.

రాష్ట్రాని కతడే నాయకుడనీ ప్రధానమంత్రికి అత్యంతసన్నిహిత సలహాదారులలో ఒకడనీ ప్రజలు అతడిగురించి చెప్పుకోసాగారు. ప్రతి ఒకరూ భయభక్తులతో అతనిగురించి మాట్లాడు కుంటున్నారు, ఎంతో సాఫల్యం మూటగట్టుకున్న ముఖ్యమంత్రిగా ఆయనను సంభావిస్తున్నారు. ఆయన గుప్పిట్లో లేదా హిందీభాషీయులైన ఆయన అనుయాయుల మాటలో చెప్పాలంటే ముఠ్ఠీలో రాష్ట్రం సురక్షితంగా ఉన్నట్టు తలపోస్తున్నారు. అంతగా ప్రాధాన్యం లేని ఆనంద్ లాంటి వాళ్ళను గుర్తించినవాళ్ళే లేరు. ప్రత్యేకించి వాళ్ళను గుర్తించవలసిన అవసరమూలేదు. ఏనుగు అడుగులా ముఖ్యమంత్రి అడుగుకూడా మిగిలినవాళ్ళ అడుగులన్నింటినీ తనలో కలిపేసు కోగలిగినంత విశాలంగా ఉంటుంది. నర నరంలో అవకాశవాదాన్ని జీర్ణించుకున్న ఢిల్లీలోని ఆత్రగాళ్ళు ఎందరో, వేరే కారణాలతోనే కావచ్చుగాక, కొన్నేళ్ళక్రితం మహేంద్రనాథ్‌ను పొగడ్తలతో ఆకాశానికెత్తేసినట్టుగానే ఇప్పుడు చౌదరిని సింహప్రమాణానికి పెంచేశారు.

మహేంద్రనాథ్‌వర్గం ఆగ్రహంతో రగిలిపోయింది. జనం చౌదరిని ప్రశంసలతో ముంచెత్తుతూఉండడం, అతడి అనుగ్రహంకోసం దేవులాడడం వారు సహించలేకపోయారు. ఈ ధోరణి ఇలాగే కొనసాగితే ఇందిరాగాంధీ చిక్కుల్లోపడడం ఖాయమని వాళ్ళు జోస్యం చెప్పారు. చౌదరి ఒక బద్మాష్, ఏమాత్రం నమ్మదగని మనిషి, ఆ విధేయతంతా నటన, నా మాట గుర్తుపెట్టుకోండి, అతడామెను నట్టేటముంచడం ఖాయం అన్నారు అసంతృప్తితో కుత కుతలాడుతున్న ఎందరో నాయకులు. చౌదరి కేవలం 1967 ఎన్నికలకే ఆమెను ఉపయోగించు కుంటాడు, ఆ విధంగా వచ్చే అయిదేళ్ళూ తన పరిస్థితి పదిలంగాఉంటుంది. ఇందిరాగాంధీ అంతవరకూ అధికారంలో కొనసాగరని అతడి ఊహ. పరమనీచుడు!

మహేంద్రనాథ్ అనుయాయుల కలా గంగవెర్రులెత్తడానికి కారణం, ఇందిరాగాంధీ భవిష్యతుకాదు, తమ భవిష్యత్తు. సార్వత్రికఎన్నికలకు పూర్తిగా ఏడాదికూడా గడువులేని స్థితిలో చౌదరి ఇలా అధికారంలో పాతుకుపోయిఉంటే తమకు రాజకీయఅజ్ఞాతవాసం తప్పదు. ప్రస్తుత శాసనసభలో తమకున్న బలానికి తగిన నిష్పత్తిలో కూడా అధికారపక్షం టిక్కెట్లు లభించవు. తమను నాశనంచేయడానికి చౌదరి అడవిపందిలా చెలరేగిపోతాడు. పోనీ అతణ్ణి ఉబ్బేసి పని గడుపుకుందామా అనుకుంటే, అందుకు సమయం మించిపోయింది. చౌదరి లొంగిరాడు, తన దరిదాపుల్లోకికూడా తమను రానివ్వడు. మొగుడు చచ్చి ఎంత కాలమైనాసరే అతడి పేరుతోనే చలామణికాక తప్పని వితంతువులా మహేంద్రనాథ్ ముద్రమోయవలసిన దుర్గతి తమకు పట్టిందనుకున్నారు.

అయినా ఆశ చంపుకోలేక వాళ్ళలో చాలామంది చౌదరి అనుగ్రహం సాధించుకోడానికి మిన్నూమన్నూ ఏకంచేయడం ప్రారంభించారు. ఎన్నికలు సమీపించినకొద్దీ వాళ్ళ తోపులాట మరింత హేయంగానూ, దీనంగానూ కనిపిస్తూవచ్చింది. నిన్నటివరకూ తాము హీరోగా ఆరాధించిన మహేంద్రనాథ్‌ను, చివరికి చౌదరివర్గంలోసైతం ఏ ఒక్కరూ ఉపయోగించని నోటికొచ్చిన తిట్లతో బహిరంగంగా దుయ్యబట్టడం ప్రారంభించారు. వాళ్ళూవీళ్ళూ అని చూడకుండా చౌదరివర్గంలోని ప్రతిఒకళ్ళనీ మేపడానికి ప్రయత్నించారు. ప్రత్యేకించి ఆయన వ్యక్తిగతసిబ్బందిని,

ముఖ్యంగా ఆయన జమాదార్ (హెడ్ ప్యూన్)ని కూడా విడిచిపెట్టలేదు. ఇతగాడు రాష్ట్రరాజధానిలో మూడు పెద్ద భవంతులు, రెండు టేక్సీలతోపాటు స్వగ్రామంలో రెండుపంటలు పండే పదిహేనెకరాల మాగాణినికూడా సొంతం చేసుకున్నాడని అందరూ చెప్పుకున్నారు. కేవలం ఒక జమాదార్, ఆ విషయం మరచిపోకండి!

మహేంద్రనాథ్ మాజీ అనుచరులు ఇంత తాపత్రయానికి పూనుకోడానికి ఏకైకకారణం తమకిక శాశ్వతవైధవ్యం ప్రాప్తించినదన్న కంగారే. ఈ చాటుమాటు వ్యవహారాలన్నింటికీ అదే మూలం. మరోవిధంగా చెప్పాలంటే, ఒకప్పుడు తమ ప్రభువూ, యజమానీ అయిన మహేంద్రనాథ్ ఇప్పుడు పూర్తిగా చచ్చినట్టేనని వాళ్ళు విశ్వసించారు. ఇక్కడే వాళ్ళు పప్పులో కాలేసినట్టు ఆ తర్వాత తెలిసివచ్చింది. వాళ్ళలో కొందరు మహేంద్రనాథ్‌పై అత్యంతపరుషమైన దుర్భాషలు కుమ్మరిస్తున్న సమయంలోనే కేంద్రంలో ఆయనను ఒక ముఖ్యమైనపదవిలో ప్రతిష్ఠించినట్టు వాళ్ళమీద పిడుగులా వార్త వచ్చిపడింది. వాళ్ళందరిపాలిట అది ఇంచుమించు విద్యుదాఘాతంలా పరిణమించింది.

కేంద్రం అంతర్యమేమిటో చౌదరికి కొద్దిరోజులక్రితమే తెలిసింది. ఢిల్లీలో అతనికున్న పరిచయాలు, పలుకుబడి దృష్ట్యా ఈ పరిణామాన్ని ఊహించలేకపోవడం కానీ, ఏ కాస్త సూచన కనిపించినా పట్టనట్టు ఊరుకోవడం కానీ జరిగేవికావు. వెంటనే ప్రధానమంత్రికి ఫోన్‌చేసి, మహేంద్రనాథ్ చిరకాలంగా పదవులకు దూరంగా ఉంటున్నాడు కనుక ఢిల్లీలో మీకు అర్థమనిపించిన ఏదో ఒక పదవిలో ఆయనను నియమిస్తే బాగుంటుందని ఎంతో నిర్ద్వంద్వంగా సిఫార్సు చేశాడు. మహేంద్రనాథ్‌పై ఎంతో ప్రేమనీ, ప్రశంసనీ ఒలకబోశాడు. నమ్మకస్తుడైన ఓ జర్నలిస్టుతో మాట్లాడుతూ, ఒకేసారి రెండురకాలుగా దెబ్బతీసే ఎత్తుగడగా దీనిని వర్ణించాడు. ప్రప్రథమంగా చెప్పుకోవలసింది అతడూ (చౌదరి), మహేంద్రనాథ్ ఎలాగో రాజీపడ్డారనీ, మహేంద్రనాథ్‌ను కేంద్రంలో చేర్చుకుంటే ఉభయుల బలగాలు విలీనమౌతాయని ఢిల్లీముఖ్యులు నిర్ధారణకొస్తారు. ఆ కోణంనుంచి చూస్తే మహేంద్రనాథ్‌కి మిగిలేది మట్టే, శేషజీవితమంతా తన ఊళ్ళో ఎడ్లతోక పుచ్చుకుని కాలక్షేపం చేయవలసిందే. ఇందుకు ప్రత్యామ్నాయంగా, అవసరమైనప్పుడు చౌదరికి వ్యతిరేకంగా ఒక ఆయుధంగా ఉపయోగించుకోవచ్చునన్న తలంపుతో కేంద్రం మహేంద్రనాథ్‌ని దగ్గరకు కూడా తీసుకోవచ్చు. రెండురకాలుగా అంటే మహేంద్రనాథ్‌కి పునరావాసం లభించినా, లేక పాతాళానికి పడిపోయి నాశనమైపోయినా – అందుకు కొంత ఘనత తనదే అవుతుంది. మొత్తంమీద తనకీ రాష్ట్రానికీ పీడవిరగడవుతుంది.

మహేంద్రనాథ్‌పట్ల చౌదరిప్రేమ ఎంత నికార్సయినదో పూర్తిగా తెలిసిన ప్రధానమంత్రి 'ఆయన ఇక్కడ ఉండాలని మీరు కోరుతున్నారా?' అని మాత్రమే అన్నారు. ఆ మాట అన్న తీరులో తొంగిచూసిన భావాన్ని చౌదరి చటుక్కున అర్థంచేసుకున్నాడు. అతితెలివిని చాటుకోడానికి ఇంతకుముందు చేసిన ప్రయత్నంనుంచి వెనక్కితగ్గి, 'మేడమ్, అతడిక్కడ ఉండకపోవడమే నాకు కావలసింది' అంటూ ఈసారి నిజాయితీగా జవాబుచెప్పాడు. ఒకవైపున విస్తుపోతూనే ఏమాత్రం తొణకని ఉక్కులాంటి నిగ్రహంతో ఆమె ఆ క్షణంలో చిందించిన మందహాసాన్ని చౌదరి ఊహించుకున్నాడు.

అంతే త్వరితగతిని, అర్ధరాత్రి ట్రంకాల్‌ద్వారా స్వగ్రామంలో ఉన్న మహేంద్రనాథ్‌తో స్వయంగా తనే మాట్లాడాడు, అప్పుడు రెండువైపులనుంచి టెలిఫోన్‌లైన్లమీదుగా ప్రవహించిన తేనెకాల్వలను గమనించిన వాళ్ళెవరూ, ఆ క్షణంవరకూ ఆ ఇద్దరిమధ్య మాటలుకూడా లేవన్న విషయాన్ని కలలోకూడా నమ్మలేరు... ప్రత్యేకంగా ఒక కారు జిల్లాకలెక్టర్‌ని తీసుకొని మహేంద్రనాథ్ గ్రామంవైపు పరుగుతీసింది. ప్రస్తుత ముఖ్యమంత్రి వేయికళ్ళతో తనను కనిపెట్టి చూస్తూ ఉంటాడు కనుక మాజీముఖ్యమంత్రితో తానెలా వ్యవహరించాలో తెలియని అయోమయావస్థనే కలెక్టర్ అంతకుముందు రోజువరకూ ఎదుర్కొన్నాడు. 'ఈ రోజుల్లో పూర్ సివిల్‌సర్వెంట్లు ఎదుర్కొనే ఈతిబాధ లెలాంటివో నువ్వు ఊహించనుకూడా ఊహించలేవు, నిజంగా నరకం అనుభవిస్తున్నారనుకో' అంటూ ఓ మిత్రుడిదగ్గర ముందురోజే తన గోడు వెళ్ళబోసుకున్నాడు. తాను అప్పుడప్పుడే, ఒక్కగెంతులో చీఫ్‌సెక్రటరీ హోదాకు ప్రమోటయ్యాడా అన్నట్లుగా మహేంద్రనాథ్ గ్రామంవైపు వెడుతున్న కలెక్టర్‌ముఖంలో కొండంత ఊరట తొంగిచూస్తోంది. జరగబోయే మహేంద్రనాథ్ నిష్క్రమణ అతణ్ణి సంతోషపరవశుణ్ణి చేస్తోంది. అలాగని కలెక్టర్ విధినిర్వహణలో మహేంద్రనాథ్ జోక్యంచేసుకుంటున్నాడని కాదు. ఆ అధికారివైపునుంచి అటువంటి ఫిర్యాదులేవీ లేవు. ఒక సివిల్‌సర్వెంట్ దృక్కోణం సహజంగా అలాగే ఉంటుంది. తన అధికారపరిధిలో వి.ఐ.పి. ఎవరైనా ఉంటేచాలు తనరెక్కలు కత్తిరించినట్లు ఊహించుకుంటాడు.

రాష్ట్రరాజధానిలోని విమానాశ్రయంలో వి.ఐ.పి.లాంజ్‌లో అడుగుపెట్టిన మహేంద్రనాథ్‌కి, తనకి స్వాగతంపలకడానికి పెద్ద పూలదండతో ఎదురుచూస్తున్న చౌదరి కనిపించాడు. రెండు శిబిరాల అనుచరగణాలూ అక్కడ శ్రేణులుతీరి నిలబడ్డాయి. మరీ అంతగా తెగించని కొద్దిమంది తప్ప తాజాగా గోడదూకిన వాళ్ళెవరూ ఆ దరిదాపుల్లో లేరు. ఆ కొద్దిమందికూడా అప్రమితంగా దూరదూరంగానే వేల్లాడారు. హాజరువేయించుకునే తహతహతో అక్కడికి వచ్చారే కానీ, మహేంద్రనాథ్‌తో మాటకలిపే సాహసం చేయలేకపోయారు. ఆయన నోరు ఎటువంటిదో వాళ్ళకు బాగా తెలుసు కనుక చూస్తూ చూస్తూ దగ్గరకు వెళ్ళలేరు.

తాను ఢిల్లీకి వలసపోవడం, చౌదరి కోరిక నెరవేర్చడానికి ప్రధానమంత్రి అనుసరించిన మార్గమనే విషయంలో మహేంద్రనాథ్‌కి ఎటువంటి సందేహంలేదు. 'ఆమెకి తగిన పాఠం చెబుతాను. వాళ్ళ స్థావరంలోనే వాళ్ళ కెటువంటి పెనుసమస్యలమంటలు సృష్టించగలనో కేంద్రానికి చూపిస్తాను. శేషజీవితమంతా పశ్చాత్తాపంతో కుమిలిపోయేలా చేస్తాను!' అంటూ అంతరంగికులతో బుసకొట్టాడు. అయితే అతడి బాహ్యప్రవర్తనలోమాత్రం గమనించదగినంత మార్పు వచ్చింది. కొద్దివారాలక్రితం 'పూర్ లేడీ'లా అతనికి కనిపించిన ఇందిరాగాంధి ఇప్పుడు హఠాత్తుగా అతడి అంచనాలో 'గ్రేట్ లేడీ' అయిపోయింది అదికూడా అతని బహిరంగవ్యాఖ్యలలోనే.

ఇందిరాగాంధి అనుకూల, వ్యతిరేక శిబిరాల పరస్పర ఆక్షేపణలు కొన్నిమాసాలపాటు కొనసాగాయి. ఉభయవర్గాలూ పార్లమెంటరీపార్టీ లోపల బలవంతపుసంధిని పాటిస్తూ ప్రభుత్వం తన నిర్ణీతకాలాన్ని పూర్తి చేసుకోనిచ్చినా, తాడోపేడో తేల్చే అసలుయుద్ధానికి ఉభయులూ సంసిద్ధులౌతున్నారు. అభ్యర్థులఎంపిక ప్రక్రియమీదుగా ఈ యుద్ధం కొనసాగి, ప్రతివర్గమూ

అవతలివర్గం అభ్యర్థి గెలుపును నిరోధించాలని నిశ్చయించుకోవడంతోనే ఎన్నికల్లోకి ప్రవేశిస్తోంది. ఆ విధంగా అధికారపక్షం ఆత్మవిధ్వంసానికి దారితీస్తుండగా మిగిలిన రాజకీయపక్షాలను, ముఖ్యంగా స్వతంత్రఅభ్యర్థులను అయత్నలాభాలు ఊరిస్తున్నాయి.

మహేంద్రనాథ్, చౌదరి రాష్ట్రంలో భారీయుద్ధానికి సమాయత్తమవుతున్నారు ఇప్పుడు మహేంద్రనాథ్ కేంద్రంలో పదవిలో ఉన్నాడు కనుక, ఆ యుద్ధం ఇకమీదట అసమానులమధ్య జరిగే యుద్ధం కాదు. ఢిల్లీలో మహేంద్రనాథ్ ఉనికివల్ల తన ఆటలు సాగని సందర్భాలలో చౌదరి పెదవివిప్పి దానిగురించి ఏమీ అనలేదు అతడిగురించి సిఫార్సుచేసింది తనే కనుక ఏమీ అనలేదుకూడా. తూకం రెండువైపులా సమానంగా ఉండడానికి సాధారణంగా కేంద్రం అనుసరించే పద్ధతి అదే; నిన్నగాక మొన్న, మహేంద్రనాథ్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు అదే వ్యూహంనుంచి తాను లబ్ధిపొందాడన్న విషయాన్ని చౌదరిఇంతలో విస్మరించలేదు, తనకిప్పుడు మిగిలి ఉన్న మార్గం ఒకటే, పోరాటం.

పార్టీ మొత్తంమీద ఎన్నికలదృశ్యాన్ని మదింపువేసుకోడానికెంతో ముందుగానే ఉభయముఠాల పరస్పర విధ్వంసపథకాలు మొదలైపోయాయి. ప్రతి నియోజకవర్గానికి ఇద్దరేసి అభ్యర్థులతో రెండుగ్రూపులూ తమతమ జాబితాలు సిద్ధంచేసేసుకున్నాయి. ఆ ఇరువురిలో ఒకరిని 'అధికారిక' అభ్యర్థిగా ఎంపికచేయమని గ్రూపు పట్టుబడుతుంది. ఒకవేళ ఆ అభ్యర్థి టిక్కెట్టు సంపాదించ లేకపోతే ఆ గ్రూపు తన పూర్తిమద్దత్తుతో రెండో అభ్యర్థిని ఇండిపెండెంట్‌గా బరిలోకి దింపు తుంది. ఆ మద్దత్తు వివిధతరగతులకు చెందిన పార్టీ కార్యకర్తలద్వారా లభిస్తుంది. కొంతమంది 'అధికారిక' అభ్యర్థికి (ఇతడు సాధారణంగా అవతలిగ్రూపుకి చెందినవాడై ఉంటాడు) వ్యతిరేకంగా వీధికెక్కి ప్రచారంసాగిస్తారు. మరికొందరు ఏదో ఒక వంకతో ప్రచారానికి దూరంగా ఉండి పోయి ధర్మమా అధర్మమా అన్నది పట్టించుకోకుండా ఏమి చేసైనాసరే అధికారికఅభ్యర్థి పరాజయానికి యథాశక్తి కృషిచేస్తారు. చాలావరకు అది అధర్మమార్గమే అవుతుంది. వాళ్ళలో మరీమరీ మేధావులు చివరివరకు పార్టీ అధికారిక అభ్యర్థితోనే ఉండి చివరకు ట్రోజన్‌గుర్రాల్లా లోపలినుంచి విద్రోహంసాగియి అతడి విజయావకాశాలను దెబ్బతీస్తారు. ఈ టెక్నిక్ గత కొన్ని దశాబ్దాలలో ఎంతో బాగా రాటుదేలింది. ఇందులో మహేంద్రనాథ్, చౌదరి ఒకరినిమించి ఒకరు ఘనాపాఠీలే. అయితే గతంలో ఆ ఇరువురూ కలిసి తమ ఉమ్మడిప్రత్యర్థులకు వ్యతిరేకంగా ఈ కళను సాధనచేస్తే, ఇప్పుడు కనీవిని ఎరుగనంత కిరాతకంగా ఒకరిపైఒకరు ప్రయోగించు కోడానికి సిద్ధపడ్డారు. ఈ ఎన్నికలవేళ ఇదే టెక్నిక్‌ను అన్ని రాష్ట్రాలలోనూ కలిపి సాక్షాత్తుగా దేశం మొత్తంమీద నాలుగువేలకు పైచిలుకు ఉన్న దాదాపు అన్ని అసెంబ్లీ నియోజక వర్గా లోనూ అమలుచేయడం జరగబోతోంది. ఆ విధంగా సూత్రరీత్యానూ, ఆచరణరీత్యానూ ఇది ఒకేదేశం అన్నది మరోసారి రుజువుకాబోతోంది!

ఆనంద్ మంత్రిగా తన విధులు నిర్వర్తిస్తూనే, తను ఏ మేరకు వ్యక్తిగతశ్రద్ధ చూపించగలడో ఆ మేరకు తన నియోజకవర్గంమీద క్రమంతప్పకుండా శ్రద్ధచూపిస్తూ సంరక్షణ చేసుకుంటూ వస్తున్నాడు. నియోజకవర్గ ప్రజలు తన పనితీరుపట్ల స్థూలంగా సంతృప్తి చెందినట్లే కనిపించారు.

అయినా తన నియోజకవర్గంలో ఏదో కల్లోలం పుట్టుకొచ్చినట్టు చివరిక్షణంలోకానీ అతనికి తెలిసిరాలేదు పైకి అంతా బాగానే ఉన్నట్టు కనిపిస్తున్నా లోపల్లోపల ఏదో ఉడుకుతోంది. తన నియోజకవర్గం బాగా వెనుకబడినప్రాంతం కనుక, ప్రజలు సాధారణంగా సరళస్వభావులూ, ముక్కుసూటిగా వ్యవహరించేవారూ కనుక మొదట్లో దీనినతడు గమనించలేకపోయాడు. వాళ్ళు తనకు ద్రోహంచేయరు లేదా అలాగని అతడు నమ్మాడు. ఒకరోజున తన ఆఫీసులో ఫైళ్లలో తలదూర్చిఉండగా అరుణ ఎక్కడినుంచో హఠాత్తుగా ఊడిపడింది. వేర్వేరుచోట్ల ఏవో రాజకీయ కార్యక్రమాల్లో ఇద్దరూ తలమునకలౌతూ ఉండడంతో ఈ మధ్య వాళ్ళు తరచు కలుసుకోవడంలేదు. ఆమె తిన్నగా అసలు విషయాని కొచ్చేసింది.

'నీ నియోజకవర్గంలో జరగరానిదేమైనా జరుగుతోందా?'

'నాకు తెలిసినంతవరకు ఏమీలేదు', గతంలో ఆమె ఎప్పుడూ తన నియోజకవర్గంమీద ఆసక్తి చూపించలేదన్న విషయాన్ని దృష్టిలో పెట్టుకుని ఒకింత విస్మయంతో జవాబుచెప్పాడు ఆనంద్.

'భూసంస్కరణల కలల్లో మునిగితేలుతూ బొత్తిగా తీరికలేకుండా ఉన్నావు. అందుకే నీ నియోజకవర్గంలో భూమి జారిపోతున్నా నీకు పట్టలేదు' ఆమె చిరచిరలాడుతూ అంది.

'ఏమిటి విషయం? అసలేం జరుగుతోంది?' కుతూహలం ఇనుమడించగా ఆనంద్ అడిగాడు.

'శ్యామ్‌సుందర్ అనే భూస్వామి పేరెప్పుడైనా విన్నావా? అతడు నీ నియోజకవర్గం వాడేనా?'

'అవును, అతడు నాకెంతో సన్నిహితమిత్రుడు కూడా. నియోజక వర్గంలో రెండుమూడు గ్రామాల్లో మంచి పలుకుబడి ఉన్నవాడు'

'సరే, నేను నీకు చెప్పగలిగిందల్లా, నీ సన్నిహితమిత్రుడి విషయంలో జాగ్రత్తగా ఉంటే మంచిదని. అతడూ నేనూ ఆరోగ్యశాఖామంత్రిగారి ప్రైవేట్‌సెక్రటరీతో ఆయన గదిలో ఒకే సారి ఉండడం సంభవించింది. నన్నతడు వ్యక్తిగతంగా ఎరగడనుకో. ఉన్నంతసేపూ, నీ నియోజక వర్గంలో తనకెంత పలుకుబడి ఉందో, వచ్చే ఎన్నికల్లో నిన్నెలా ఓడించబోతున్నాడో సెక్రటరీ దగ్గర గప్పాలుకొడుతూనే ఉన్నాడు. తర్వాత మంత్రిగారి ఆఫీసునుంచి నేను తిరిగొస్తుంటే, అతడు శేఖర్ ఆఫీసులోకి వెడుతూ కనిపించాడు. ఇదంతా కాకతాళీయమే కావచ్చు, కానీ నీ జాగ్రత్తలో నువ్వు ఉండడం మంచిది.'

ఆనంద్ కొద్దిసేపు గంభీరంగా యోచిస్తూ ఉండిపోయాడు. అరుణ ఊపిరిబిగబట్టి అతని జవాబుకోసం నిరీక్షించింది.

'మంచి సలహా చెప్పావు అరుణా, ఆ విషయం నేను పరిశీలిస్తాను...

'ఏమిటి? పరిశీలిస్తావా? ప్రతినిముషం నీ దృష్టికొచ్చే రోజువారీ వ్యవహారాలను పరిశీలించినట్టే పరిశీలిస్తావా? ఓ పక్క నీ ఆప్తమిత్రుడే నీ నియోజకవర్గంలో నీకు అడ్డంతిరిగితే 'పరిశీలిస్తాను' అంటూ మంత్రులు వల్లించే ఊతపదం వల్లిస్తావా? నిండా మునిగేలోగా మేలుకుంటే మంచిది

ఆనంద్! అత్యంతవివాదాస్పదమంత్రిగా నువ్వే ఎన్నికల్ని ఎదుర్కొంటున్న సంగతి మరచిపోకు... నిమ్మకు నీరెత్తినట్టు ఎలా ఉన్నావో చూసుకో! మైగాడ్! పరిశీలిస్తాడట, పరిశీలిస్తాడు'

'నిజమే, అది అనదగిన మాట కాదు' ఆనంద్ తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో అన్నాడు. 'ఆ విషయంమీద తక్షణమే దృష్టిపెట్టి శ్రద్ధగా ఆలోచిస్తాను.'

'అదిగో, మళ్ళీ అదే ఊతపదం' అరుణ గద్దిస్తూ అని, పగలబడి నవ్వేసింది. ఆ తర్వాత ఒకటిరెండు యథాలాపవ్యాఖ్యలు చేసి వెళ్ళిపోయింది ఆనంద్ గాఢచింతనలో మునిగిపోయాడు. అరుణ ప్రవర్తనలో, ధోరణిలో ఈమధ్య ఏదో మార్పువచ్చినట్టు అతడు గమనించాడు. నిజంగా వచ్చిందా లేక తనలా ఊహిస్తున్నాడా?

ఇంతకుముందుకంటే ఆమెలో ఇప్పుడు మరింత అసహనం, దూకుడు, మొరటుతనం కనిపిస్తున్నాయి ఎడాపెడా వివాదాల్లో తలమునకలౌతోంది. చివరకు తన కోపతాపాల్ని ఆనంద్ మీద కుమ్మరిస్తోంది. ఆమెకు మరోదారి లేదు కనుక దానినతడు అర్థంచేసుకోగలడు. ఆమె ఆగ్రహప్రదర్శనంతా చివరకు తప్పనిసరిగా పశ్చాత్తాపఘట్టంతో ముగుస్తుంది. ఆమె ప్రచండ కోపాన్ని అంతటినీ భరించడం, ఆ తర్వాత ఓదార్చడం... తనకిదో నిత్యకృత్యంగా మారి పోయింది. ఆమె కేమైందోననుకున్నాడు.

అప్పుడే శ్యామ్‌సుందర్ వచ్చినట్టు ఆనంద్ ప్రైవేట్‌సెక్రటరీ ఇంటర్‌కామ్‌లో చెప్పాడు. ఏదో అత్యవసరమైన అభ్యర్థనతో, ఓ నిమిషం మాట్లాడాలన్నాడట...

'సరే, పంపించు' అన్నాడు ఆనంద్. అరుణ మండిపడుతూ అన్నమాటలింకా అతడిచెవుల్లో గింగురుమంటున్నాయి.

స్థూలకాయంతో, ఉట్టిపడే అతిశయంతో శ్యామ్‌సుందర్ ఆపాదమస్తకం భూస్వామిలానే ఉంటాడు. స్కూల్లో ఆనంద్‌తో కలిసి చదువుకున్నాడు. వేట, చక్కని విందుభోజనం, ఈరెంటి తర్వాత అతడికి ఎందుకో ఆనంద్‌మీదే ప్రత్యేకమైన మక్కువ . అతని ఊరు రిజర్వ్‌ఫారెస్టు సరిహద్దును ఆనుకునేఉంటుంది. ఆడ, మగ, పిల్లలతోసహా ఊరంతా అతనిగుప్పిట్లో ఉండి, అతడు పిలిస్తే పలుకుతుంది. అయితే బొత్తిగా అతని చెప్పుచేతల్లో లేని; దిక్కుమాలినదొకటుంది. అది మధుమేహం. అందుకతడి మండిపాటు అంతా ఇంతా కాదు. ఈ మధ్య అతని బ్లడ్ సుగరూ, అతడెంతో ఇష్టంతో ఆరగించే స్వీట్లూ, ఇన్సులిన్ ఇంజెక్షన్లడోసూ అన్నీ ఏకకాలంలో పెరిగిపోతుంటే, వాటితో అతడి సహజఉద్రేకప్రవృత్తీ పోటీపడుతోంది.

• స్కూల్లో పాతమిత్రుడైన ఆనంద్‌ను శ్యామ్‌సుందర్ అక్షరాలా సొంతంచేసేసుకున్నాడు. తన అరచేతిలోంచి ఊడిపడిన మంత్రిగా సగర్వంగా ప్రకటించుకున్నాడు (ఒక మంత్రిని తన సన్నిహితమిత్రుడుగా చెప్పుకునే అవకాశం ఎంతోమంది భూస్వాములకుండదు). ఓ సారి ఆనంద్ శ్యామ్‌సుందర్ గ్రామాన్ని సందర్శించినప్పుడు తరచు అక్కడికి వస్తూఉండాలని పట్టుబట్టాడు అన్ని కార్యక్రమాల్లోనూ అతడొక్కడే పెత్తందారు. లంచ్ శ్యామ్‌సుందర్ నివాసంలో, బహిరంగసభలు శ్యామ్‌సుందర్ కోటీఆవరణలో శ్యామ్‌సుందరే వాటికి అధ్యక్షుడు మొత్తంమీద అన్నీ శ్యామ్‌సుందరే.

గ్రామస్థుల్లో ఒక్కరుకూడా ఆనంద్ దరిదాపుల్లోకి రావడానికి వీల్లేదు. శ్యామ్‌సుందర్ పనివాళ్ళే గ్రామస్థులనుంచి పిటిషన్లు తీసుకుని కట్టకట్టి ఆనంద్ పర్సనల్ అసిస్టెంట్‌కి అందజేసేవారు. అయితే చాలామంది గ్రామస్థులు రాష్ట్రరాజధానికో, జిల్లా ముఖ్యకేంద్రానికో వచ్చి ఆనంద్‌ని విడిగా కలుసుకునేవారు. ఊళ్ళో భూస్వామి దాష్టీకానికీ అత్యాచారాలకూ తామెలా బలవుతూ బాధలు పడుతున్నారో వర్ణించి చెప్పేవారు.

గత రెండు సార్వత్రికఎన్నికల్లో శ్యామ్‌సుందర్ గ్రామం ఆనంద్‌కు తిరుగులేని మద్దత్తు నందించింది. అతనికి వ్యతిరేకంగా పడిన వోట్లు చాలా తక్కువ. ఈ విజయాన్ని చేకూర్చిన ఘనత అత్యంత ప్రబలుడైన శ్యామ్‌సుందర్‌దా, లేక అణగారిన నిరుపేద గ్రామస్థులదా అంటే తేల్చిచెప్పడం కష్టం. గ్రామంలో ఏ ఒక్క రూ అతనితో బహిరంగంగా విభేదించే సాహసానికి పూనుకోలేని పరిస్థితిలో, ఆ ఘనత అంతా తనదేనని శ్యామ్‌సుందర్ చాటుకున్నాడు. ఆనంద్ మేరకు ఆనంద్ సాధ్యమైనంతవరకూ ప్రతిఒకరికీ సంతృప్తికలిగేలా వ్యవహరిస్తూ వస్తున్నాడు.

రిజర్వ్‌ఫారెస్టులోని మంచి నాణ్యతకలిగిన టేకుచెట్లను అక్రమంగా కూల్చివేయడంలో శ్యామ్‌సుందర్‌పాత్రగురించి ఆ తర్వాత ఏడాదిలో ఆందోళనకలిగించే అనేకవార్తలు ఆనంద్ చెవినపడసాగాయి. ఆ కలపను రహస్యంగా నగరంలో విక్రయించడం జరుగుతోంది. తన గ్రామంలోని ఎందరో నిరుపేదకార్మికుల సహాయంతో శ్యామ్‌సుందర్ ఇందుకోసం రోజూ వంద ఎడ్లబండ్లను ఉపయోగిస్తున్నాడట. ఇక, లాభాల్లో వాటా ఇచ్చే ఒప్పందంమీద స్థానికంగా ఉన్న అటవీశాఖలోని కిందిస్థాయి అధికారులనుంచి ఇందుకు ఇష్టపూర్వక సహకారం ఎలాగూ ఉంటుంది. ఆనంద్‌కి మరీ ఆగ్రహం తెప్పించింది ఈ మధ్య తెలిసిన ఒక వార్త (అయితే అదింకా ధ్రువపడలేదు). ఎంతో అబ్బురమైన నిజాయితీకలిగి కొత్తగా ఆ ప్రాంతంలో నియమితుడైన ఓ ఫారెస్ట్‌రేంజ్ అధికారి భారీపరిమాణంలో అక్రమంగా రవాణాఅవుతున్న కలపను స్వాధీనం చేసుకున్నప్పుడు, అది మంత్రి ఆనంద్‌కు పంపిస్తున్న సరుకని శ్యామ్‌సుందర్ ఏజెంట్ బుకాయించాడట. 'నీకు తెలవదా ఏం? మంత్రిగారు అఫ్రోజాబాద్‌లో ఇల్లు కట్టుకుంటాండు' అన్నాడట బెదిరించే స్వరంతో.

ఆనంద్ ఈ ఆలోచనల్లో మునిగితేలుతుండగా శ్యామ్‌సుందర్ వచ్చి కరచాలనంచేసి భుజంమీద చరిచి అన్నాడు 'నమస్కార్ ఆనంద్ భాయ్, నిన్ను కలవడం నాకెంతో సంతోషం. అదిసరే, పనిఒత్తిడిలోకూడా అంత చురుగ్గా ఎలా ఉండగలుగుతున్నావ్?'

'చురుగ్గా ఉన్నానా? ఉంటే సంతోషమే కదా!' ఆనంద్ చిరునవ్వుతో అన్నాడు. 'ఇంతకీ ఏమిటిలా హఠాత్తుగా ఊడిపడ్డావ్? ఎప్పుడొచ్చావ్? ఊళ్లో అంతా బాగేనా?'

'ఆహాఁ. దేవుడి దయవల్ల. ఇంకో అరగంటలో నువ్వు కేబినెట్‌మీటింగ్‌కి వెళ్ళాలని నాకు తెలుసు, కనుక తిన్నగా అసలు విషయాని కొచ్చేస్తాను. ఏమంటావ్?'

'దానికేముంది?... చెప్పు'

'నాకెంతో దగ్గరైన స్కూలునేస్తానివీ, మంత్రివీ అయిన నిన్ను ఇన్నేళ్ళలోనూ ఒక్కపని చేసిపెట్టమనికూడా అడగలేదు. ఆ సంగతి నీకు తెలుసు. అవునా కాదా?'

'అవును, గత రెండు ఎన్నికల్లోనూ నువ్వు చేసిన సాయానికి ఎంతో కృతజ్ఞుణ్ణి. అవసరంలో ఆదుకుంటున్న నిజమైన నేస్తానివి నువ్వు'

'ఆనంద్‌భాయ్, నిన్నిప్పుడు ఒక వ్యక్తిగతసాయం అర్థించడానికొచ్చాను ఇదే మొదటిదీ, చివరిదీ, అందుకు హామీ ఇస్తున్నాను...'

'ఆ మాటలన్నీ ఎందుకు శ్యామ్? నన్నేం చేయమంటావో దయచేసి సూటిగా చెప్పు. నే నెంతమాత్రం సందేహించనని నీకు తెలుసు'

'తెలుసు, తెలుసు. మరీ పెద్దపనేం కాదు. నా దగ్గర బంధువొకతను ఎక్జిక్యూటివ్‌ఇంజినీర్‌గా ఉన్నాడు. నాకతడు బాగా కావలసినవాడు. ఇప్పుడు పనిచేస్తున్న ఓ ఇరిగేషన్‌ప్రాజెక్టునుంచి అతణ్ణి హఠాత్తుగా బదిలీచేశారు ఓ ఏడాదిపాటు అతణ్ణెలాగైనా అక్కడ ఉంచగలిగితే తప్ప ఇజ్జత్ దక్కదు. ఇది అతడి ఇజ్జత్‌కీ, నా ఇజ్జత్‌కీ కూడా సంబంధించిన వ్యవహారం. నిజంచెప్పా లంటే అతని పరువుతోకంటె నా పరువుతో ఎక్కువ ముడిపడిన ప్రశ్న. ఎలాగైనాసరే అతని బదిలీ రద్దుకావాలి...'

'అలాగా...' ఆనంద్ సాలోచనగా అన్నాడు. 'ఇరిగేషన్‌శాఖ ఇప్పుడు ముఖ్యమంత్రి చేతుల్లోనే ఉంది'

'అందుకే నీ దగ్గరకొచ్చాను. ఆయన్ను నేను వ్యక్తిగతంగా ఎరగను. ముఖ్యమంత్రి అంగీకారంలేనిదే పనిచేసిపెట్టడానికి చీఫ్‌ఇంజినీర్ జంకుతున్నాడు...' అన్నాడు శ్యామ్‌సుందర్.

'నేను తప్పకుండా ముఖ్యమంత్రితో మాట్లాడుతాను శ్యామ్' ఆనంద్ హామీ ఇచ్చాడు. 'అదంత కష్టమైన పనని నేననుకోను'

'నువ్వు సీరియస్‌గా తీసుకుంటే ఏదీ కష్టంకాదు' శ్యామ్‌సుందర్ నిశ్చితస్వరంతో అన్నాడు. ఆ వ్యాఖ్య ప్రశంసలా ధ్వనించినా, అందులో ఏదో హెచ్చరికకూడా ఇమిడిఉన్నట్టనిపించింది. గూఢంగా ఉన్నా అది తెలిసిపోతూనే ఉంది. శ్యామ్‌సుందర్ వెడుతూ వెడుతూ, దట్టించిన మరోవ్యాఖ్యకూడా చేశాడు. 'నీకు తెలుసు ఆనంద్‌భాయ్, ఇలాంటి విషయాలు నేను పట్టించు కోను. నాకు ఇష్టమైన పద్ధతిలోనే జీవితాన్ని గడుపుకుంటూవస్తున్నాను. ఇజ్జత్‌కు దెబ్బతగిలే పరిస్థితే వచ్చిందా ఇక ముందువెనకలు చూడను. అది నా అహంకారమే అనుకో, మరేమైనా అనుకో, అది నా రక్తంలోనే ఉంది. తప్పకుండా నా కీపని చేసిపెడతావనుకుంటున్నాను...'

ఆ మాటలముసుగులో ఏదో బెదిరింపే మళ్ళీ ఆనంద్‌కి ధ్వనించింది. లేక తనూరికే ఊహించుకుంటున్నాడా? కొద్దిసేపతడికి ఆలోచన తోచలేదు. కొన్ని నిమిషాల క్రితమే అరుణ వెల్లడించిన విషయాలు నేపథ్యంలో పెట్టుకుని తాను శ్యామ్‌సుందర్‌ను అంచనావేస్తున్నాడా?

★ ★ ★

మంత్రివర్గసమావేశం ముగిసిన కొద్దిసేపటితర్వాత చౌదరివెంట ఆనంద్ అతడి గదిలోకివెళ్ళి ఎక్జిక్యూటివ్ఇంజనీర్ బదిలీగురించి చెప్పాడు. చౌదరిని అతడు వ్యక్తిగతస్వభావం కలిగిన ఓ సహాయాన్ని అర్థించడం బహుశా ఇదే మొదటిసారికనుక, తన నియోజకవర్గంలో శ్యామ్‌సుందర్ ఎంత ముఖ్యుడో, రాబోయే సార్వత్రికఎన్నికలలో అతని మద్దత్తుమీద తనెలా ఆధారపడవలసి వస్తుందో పూసగుచ్చినట్టు వివరించాడు. చౌదరి అతడు చెప్పినదంతా సావధానంగా విని, చీఫ్ఇంజనీర్‌తో మాట్లాడతానని హామీ ఇచ్చాడు.

ఆ వెంటనే వరసగా సెలవులు వచ్చాయి. సెలవులైన వెంటనే చీఫ్ఇంజనీర్ కొన్నిరోజులపాటు తనఖీపర్యటనకు వెళ్ళిపోయాడు. ఈ మధ్యలో ఆనంద్ ఆ ఎక్జిక్యూటివ్ఇంజనీర్ పరిస్థితి గురించి వాకబుచేస్తూనే ఉన్నాడు. చివరకు, 'తక్షణ'మే తన బాధ్యతల్ని వేరొకరికి అప్పగించి, 'ఇరవైనాలుగు గంటల్లో' కొత్తచోట విధుల్లో చేరమనీ, చేరిన విషయం తెలియజేయమనీ అతడికి తాజాఉత్తర్వులు వచ్చినట్టు తెలిసి నిర్ఘాంతపోయాడు. తన జోక్యం శ్యామ్‌సుందర్‌బంధువు వ్యవహారాన్ని మరింత విషమింపజేసినట్టు ఆనంద్‌కు అర్థమైంది. అత్యవసరంగా మరోసారి ముఖ్యమంత్రితో మాట్లాడాలనుకున్నాడు.

ఆనంద్‌నుంచి టెలిఫోన్ వచ్చిన సమయంలో చౌదరి ఓ జర్నలిస్టుమిత్రుడితో తాపీగా కబుర్లుచెబుతున్నాడు. ఆందోళన నిండిన స్వరంతో ఆనంద్ చెబుతున్న ప్రతిమాటకూ అతడెంతో ఆనందిస్తున్నట్టు కనిపించాడు. సంభాషణ చివర 'నేను పరిశీలిస్తాను ఆనంద్' అని ఓ పొడి మాట అనేసి రిసీవర్ కింద పెట్టేశాడు.

ఆ తర్వాత తన ఇంటర్‌కామ్ బజర్‌ను కసితీరా నొక్కి సెక్రటరీమీద కేకలు లంకించుకున్నాడు. 'ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్‌కి చెందిన ఆ బుద్ధిలేని చీఫ్ఇంజనీర్‌కి కలుపు, వెంటనే!' అవులిస్తే పేగులు లెక్కపెట్టగల ఆ సెక్రటరీ, చీఫ్ఇంజనీర్‌ని ఫోన్‌లో పట్టుకోవడమే కాదు, అతడికి సకాలంలో అందించవలసిన ఉప్పు అందించాడు 'సార్, ఎందుకో తెలియదు కానీ బాస్ మండిపడుతున్నారు. దెబ్బతిన్న మూడ్‌లో ఉన్నారు... మాట్లాడండి...'

చీఫ్ఇంజనీర్‌నుంచి గౌరవపూర్వకమైన సంబోధన వినీవినగానే చౌదరి అరుపులు ప్రారంభించాడు, 'అంటే ఆ నీతిమాలిన గాడిదకొడుకు ఇంకా ఆ పాతపోస్ట్‌లోనే ఉంటూ ఎడాపెడా పొలిటికల్‌ప్రెషర్ తెస్తున్నాడన్న మాట, అవునా?' ఫలానా అని పేరు చెప్పకుండా బాస్ అలా మండిపడడంతో చీఫ్ఇంజనీర్ తికమకపడిపోయాడు. మాటల్లో పొంతన లోపించేంత ఆగ్రహంతో ముఖ్యమంత్రి ఉండిఉండాలి, లేదా ఆయన ఉద్దేశంలో ఇరిగేషన్‌శాఖలోని ఏ ఇంజనీర్ అయినా 'నీతిమాలిన గాడిదకొడుకు'కన్న బిరుదానికి సమానంగా అర్హుడై ఉండాలి. అస్పష్టంగా గొణగడం మినహా చీఫ్ఇంజనీర్ చెప్పగలిగిన సమాధానం ఏమీ లేకపోయింది.

చౌదరి కాస్త మామూలు మెత్తదనం తెచ్చుకుని అన్నాడు 'వాడెవడో తేల్చుకోలేక పోతున్నావా? అదే, ఆ పెద్ద ఇరిగేషన్‌ప్రాజెక్టులో తన పోస్టింగ్ కొనసాగించుకోడానికి అన్నివైపులా డబ్బు విరజిమ్ముతున్నాడే, వాడు... మంత్రి ఆనంద్ జిల్లాలో పనిచేస్తున్న ఎక్జిక్యూటివ్ఇంజనీర్... వాడింకా అక్కణ్ణుంచిపోలేదా?'

'సార్, అతనికి నిన్ననే టెలిగ్రాం ఉత్తర్వులు పంపించాం'

'నీ టెలిగ్రాం తగలడ!' చౌదరి విరుచుకుపడ్డాడు. 'ప్రభుత్వఉత్తర్వుల్ని ఖాతరు చేయనందుకు వాణ్ణి సస్పెన్షన్‌లో ఉంచు, ఈ రోజే, ఇప్పుడే!' అంటూ రిసీవర్‌ను బలంగా విసిరికొట్టేసరికి అది వెళ్ళి క్రెడిల్‌కు అవతలపడింది.

'ఆశ్చర్యం' జర్నలిస్ట్ నోరువెళ్ళబెట్టాడు 'మిమ్మల్నింత కోపంలో ఎప్పుడూ చూడలేదు'

'అప్పుడప్పుడు కోప్పడడమూ అవసరమే, నాలుగైదు తిట్లు జోడిస్తూ' చౌదరి ప్రశాంతంగా జవాబుచెప్పాడు, అప్పటికే అతడు మామూలుస్థితి కొచ్చేశాడు.

'ఆనంద్ కోరిక ఎందుకు తీర్చకూడదు? ఎంతైనా అతడు మీ సహచరుడే కదా?' జర్నలిస్ట్ అడిగాడు ఒకింత అయోమయంతో.

'ఎందుకు తీర్చాలి?' చౌదరి ఎదురుప్రశ్న వేశాడు. 'ముందస్తుగా చెప్పాలంటే అతడు నా గ్రూపువాడు కాదు కనుక అతడి భవిష్యత్తుగురించి పట్టించుకోవలసిన అవసరం నాకులేదు. ఆ జాగ్రత్త ఏదో నా మరో సహచరుడు శేఖర్ ఎలాగూ తీసుకుంటాడు...'

'ఆ సజ్జనుడు ఓడిపోవాలని మీరెందుకు కోరుకుంటున్నారు?'

'అతడు ఓడిపోవాలని నేను కోరుకుంటున్నట్టెవరన్నారు? తన ఏడుపేదో తను ఏడ్చుకోవలసిందే, రాజకీయాల్లో ఎవరైనా అంతే. అయితే అతడు తప్పకుండా గెలుస్తాడు, ఆ విషయంలో నాకు సందేహమేమీ లేదు. నా తృప్తికోసం ఆ భోగట్టా సేకరించుకున్నాను. ఇక్కడ నువ్వు అర్థంచేసుకోవలసింది, అతగాడికి నేనే విధంగానూ రుణపడిలేనని. అందరికీ మంచిచేసే మంచివాళ్ళజాబితాలోకి వచ్చేవాణ్ణి కాదు నేను... అదీగాక అతణ్ణి తన నియోజక వర్గానికే బంధించి ఉంచకపోతే, మిగిలిన ఎందరో అభ్యర్థులకోసం అతడు రాష్ట్రమంతా తిరగడం ప్రారంభిస్తాడు. వాళ్ళతణ్ణి నెత్తినపెట్టుకోవడం మొదలెడతారు. అలా జరగనిచ్చేంత మూర్ఖుణ్ణి కాదు నేను!'

'ఆ ఎక్జిక్యూటివ్ఇంజినీర్ ఆనంద్ చెబుతున్నంత నిజాయితీపరుడేనంటారా?'

'నాకు తెలియదు, తెలుసుకోవలసిన అవసరం నాకు లేదు. ఆనంద్‌కీ లేదు. గడ్డిమోపులో సూదులు వెతకడంలాంటి పిచ్చిపనిని పైన వేసుకుని సమయం వృథాచేసుకోను' చౌదరి ఎద్దేవాగా అన్నాడు. 'నా పాయింట్ నువ్వు అర్థంచేసుకోవడం లేదు శర్మా. పగటికలలుకనే ఈ మనిషి ఎటువంటివాడో చూశావా? తన సొంతఎన్నిక విషయాని కొచ్చేసరికి, తన నియోజక వర్గంలోని ఒక పలుకుబడిగల భూస్వామిని సంతోషపెట్టడానికి ఏ దారి తొక్కడానికైనా సిద్ధపడి పోయాడు. అతడు మంచివాడా, చెడ్డవాడా, పొగరుమోతా అన్నది అలా ఉంచు. ఆ లెక్కన ఈ దిక్కుమాలిన ఎన్నికల్లో గెలవడానికి రాష్ట్రం మొత్తంమీద నే నెంతమంది భూస్వాముల కాళ్ళుపట్టుకోవాలి? ప్రత్యేకించి నెహ్రూ లేకపోవడంవల్ల తలెత్తిన ప్రస్తుత అనిశ్చితపరిస్థితుల్లో... అదీగాక, శర్మా, మనలో మన మాట, ఇక్కడ ఇంకా చాలా అంశాలున్నాయి'

'ఎలాంటివి...?'

'నేను ఎదుర్కొనే అనిశ్చితపరిస్థితినే తీసుకో... కొత్త ప్రధానమంత్రి లోక్‌సభఎన్నికల్లో అఖండమైన మెజారిటీ తెచ్చుకుందనుకో, అప్పుడు నే నెక్కడుంటానో నాకెలా తెలుస్తుంది? మార్పుకోసం, ఆమె భవిష్యత్తులో సిద్ధాంతాల చాదస్తాలున్న ఓ జంతువును ముఖ్యమంత్రిగా ఎంపికచేయదని అంత ధీమాగా ఎలా చెప్పగలను?'

'ఆనంద్‌లాంటి వాళ్ళనా...?'

'ఆనంద్ కాకపోతే వాడి తమ్ముడు మరొకడు ఎవడైతే నాకెందుకు, ఈ పాతకాపు చౌదరి కానప్పుడు?'

★ ★ ★

'నీకు మళ్ళీ మళ్ళీ చెబుతూనే ఉన్నాను, నా ప్రియసహచరుడు ఆనంద్ భూస్వామ్యవర్గాన్ని విషప్రాయంగా చూసి ద్వేషిస్తూ ఉంటాడని. తన స్కూల్‌మేట్ కానీ, క్లాస్‌మేట్ కానీ ఎవరి విషయంలోనైనా అతడి ధోరణి అచ్చంగా అలాగే ఉంటుంది...' శేఖర్ నిష్కర్షగా అన్నాడు.

'అర్థమైంది, అర్థమైంది' శ్యామ్‌సుందర్ తలపంకిస్తూ అన్నాడు.

'నువ్వేమంత పెద్దసహాయం అడిగావని? అన్యాయంగా జరిగిన ఓ బదిలీని రద్దుచేయమన్నావ్... అతణ్ణి అక్కడే ఉంచేలా చూడమన్నావ్. ముక్కుసూటిగా పోయే నీ స్కూల్‌మేట్ మంత్రిగారు, గత రెండు ఎన్నికల్లో నీ సేవలకు ప్రతిఫలంగా సస్పెన్షన్ మంజూరు చేయించారు!'

'చేసిన మేలు మరిచిపోయే గాడిదకొడుకు!' శ్యామ్‌సుందర్ పళ్ళునూరాడు. 'వాడికి తగిన బుద్ధి చెబుతాను, తడాఖా చూపిస్తాను! అదిసరే, నా బంధువు బదిలీ సంగతేమిటి? పాపం నామీదే పూర్తిగా ఆధారపడి ఉన్నాడు...'

'నువ్వేమో ఎంతో అమాయకంగా, నీ మేధావి స్కూల్‌మేట్ మిత్రుడిమీద పూర్తిగా ఆధారపడ్డావ్!' శేఖర్ దెప్పిపొడుపుగా అన్నాడు. 'అయినా శ్యామ్‌జీ, ఫర్వాలేదు. నీ సమస్య పరిష్కారమై పోయింది. నువ్వు ఆనంద్‌చుట్టూ కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నప్పుడే నేను అన్ని ఏర్పాట్లూ చేసేశాను. నీ బంధువు నిన్న దాఖలుచేసిన రిట్‌పిటిషన్‌పై తీర్పు వెలువడేవరకూ అతని సస్పెన్షన్‌తోసహా ప్రభుత్వం తీసుకున్న అన్ని చర్యల అమలునూ నిలుపుచేస్తూ హైకోర్టు ఉత్తర్వు చేసినట్టు గంటక్రితమే నాకో బారిస్టర్‌మిత్రుడు చెప్పాడు. అంటే కనీసం రెండేళ్ళు పడుతుందన్న మాట. నువ్వతణ్ణి అక్కడుంచమని అడిగింది ఏడాదిపాటు. అవునా?' శేఖర్ మొహం విజయగర్వంతో వెలిగిపోయింది. 'కనుక ఇప్పుడిక స్థిమితపడు!'

'స్థిమితపడడమా?' శ్యామ్‌సుందర్ అంతెత్తున లేచాడు. 'నా ప్రియమిత్రుణ్ణి, నమ్మకస్తుడైన నా స్కూల్‌మేట్‌ని ఎన్నికల్లో చిత్తుచేసిన తర్వాతే స్థిమితపడేది!'

శేఖర్ విషపునవ్వు నవ్వాడు.

# 39

'బ్రహ్మాండం!' శ్యామ్‌సుందర్ నిజంగానే ముగ్ధుడైపోతూ అన్నాడు. శేఖర్ అంతిమంగా తన పథకానికి 'ఆనందోసైడ్' (ఆనంద్ హత్య) అని పేరు పెట్టి దాన్ని బయటపెట్టాడు. ఆ పథకం రూపుదిద్దుకోడానికి ముందు వాళ్ళిద్దరూ ఎన్నో సుదీర్ఘ సమావేశాలు జరిపారు. ముందుగా ఆ పధకానికి స్థూలమైన రూపు రేఖలు రచించుకున్నారు. ఆ తర్వాత ఒక్కొక్క ముక్కనే తీసుకుని తగిన వన్నెచిన్నెలు దిద్దుతూ సూక్ష్మాంశాలతో సహా దానికొక సమగ్రతను తెచ్చారు.

మొట్టమొదట ఆనంద్‌తో పోటీపడగల అభ్యర్థి కావాలి. అందుకు పనికొచ్చేవాడు ఒక్కడూ తక్షణమే అందుబాటులో లేని వాస్తవాన్ని ఇద్దరూ అంగీకరించారు. ఆనంద్‌ను ఢీకొనడానికి ఎవడూ సరిపోడని వాళ్ళకూ తెలుసు. ఏవో కొన్ని పేర్లు పరిశీలించారు, తీరా వాళ్లను కదిపే సరికి వాళ్ళు తిరస్కరించారు. శ్యామ్‌సుందర్, శేఖర్ ఎంత డబ్బు ఖర్చుపెట్టడానికి సిద్ధంగా ఉన్నారో తెలిసి మొదట్లో కొంతమంది ఆసక్తి చూపించకపోలేదు. అయితే లోపల్లోపలినుంచి ఏదో జడుపు ఆవహించగా ఈ వస్తాదులు అడుగు వెనక్కి తీసుకున్నారు. వాళ్ళలో ఒకరిద్దరు పాపపరిహారార్థమా అన్నట్టుగా, జరుగుతున్నదంతా ఆనంద్ చెవిన వేశారుకూడా. ఆనంద్ తమ గ్రామాలకు ఎంతటి మహత్తరసేవలు అందించాడో వాళ్ళకు తెలుసు.

పోటీ చేయడానికి ఇష్టపడకపోయినా, అవతలి అభ్యర్థికి మద్దతు ఇవ్వడానికి సుముఖంగా ఉన్నవాళ్ళు ఎందరో ఉన్నారు. ఆ విషయంలో వాళ్ళ ఉత్సాహం అంతా ఇంతాకాదు. ఈ పోకడను ఎవరో ప్రశ్నించినప్పుడు వాళ్ళు ప్రత్యేకించి ఆసక్తిగొలిపే కారణం చూపించారు. 'చూడండి, ఆనంద్ పోటీ చేయడం ప్రారంభించినప్పటినుంచి ఈ నియోజకవర్గంలో డబ్బు, సారా వగైరా కనిపించకుండా పోయాయి. ఆ కరవు తీరవలసిన సమయం ఇప్పుడొచ్చింది. ఎన్నిక తర్వాత ఎం.ఎల్.ఎ. అందించే సేవలతో పాటు ఎన్నిక సమయంలో కూడా వోటర్లకు ఏవో కొన్ని లాభాలు కలగవలసిందే... ఏదేమైనా మాలాంటివాళ్ళు కేవలం పనిచేయడానికే ఇష్టపడతారు. అంతేకానీ చూస్తూచూస్తూ కష్టాలు కొనితెచ్చుకోరు. మేం చేసేది మంత్రసానిపని, ప్రమాదం అంటూ ఉంటే అది తల్లికో, బిడ్డకో, లేదా ఇద్దరికో ఉంటుంది కానీ మంత్రసానికొచ్చే నష్టమేమీ ఉండదు!'

అభ్యర్థికోసం జరిపే అన్వేషణ ఏమాత్రం ముందుకుసాగకపోవడంతో సహనం నశించి శ్యామ్‌సుందర్ తనే పోటీ చేయడానికి సంసిద్ధత వ్యక్తం చేశాడు. అందులోని లాభనష్టాలను వివరంగా విశ్లేషించుకున్న మీదట శేఖర్ ఆ ప్రతిపాదనను తిరస్కరించాడు. తన వాదాన్ని తేటతెల్లంగా వివరించి అన్వేషణను కొనసాగించడానికి శ్యామ్‌సుందర్‌ను ఒప్పించాడు. 'రెండు ఎన్నికల్లో నువ్వు ఆనంద్‌కు మద్దతు ఇచ్చావు. అతడికి అత్యంత సన్నిహిత మిత్రుల్లో ఒకడిగా ఉంటున్నావు; మీ ఇద్దరికీ చెడిన విషయం ఇప్పటికీ చాలామందికి తెలియదు. కనుక నువ్వు హఠాత్తుగా అతడి ప్రత్యర్థిగా అవతారం ఎత్తడాన్ని వాళ్ళంత మనస్ఫూర్తి చర్యగా తీసుకోరు. ఏదో విషయంలో మీరిద్దరూ గొడవపడ్డారనీ మంత్రిగా అతడు నీ కోరికను తిరస్కరించడమే అందుకు కారణం కావచ్చుననీ వాళ్ళు అర్థం చెప్పుకుంటారు. ఎలా చూసినా నువ్వు పోటీచేయడం ఏ కారణంలేని అర్థరహితచర్యగా పరిణమిస్తుంది. ఇలా అంటున్నందుకు నువ్వు నన్ను క్షమించాలి, వాస్తవం కూడా అదే. లేదు శ్యామ్‌జీ, నువ్వు మరో వ్యక్తిగురించి ఆలోచించడం మంచిది...'

తదుపరి, ఆనంద్‌కు పోటీగా అభ్యర్థిని బరిలోకి దింపగల రాజకీయపక్షమేదైనా ఉందా అని వారు చర్చించారు. శ్యామ్‌సుందర్ మద్దతును, అతడి మిత్రుల పలుకుబడిని దృష్టిలో ఉంచుకుని ఆనంద్‌కు పోటీగా అభ్యర్థుల్ని నిలబెట్టడానికి వివిధ రాజకీయపక్షాలు వాస్తవానికి సుముఖంగానే ఉన్నాయి. తమకు అంతగా విజయావకాశాలు లేకపోయినా, ఈ ఎన్నికద్వారా నియోజకవర్గంలో అడుగుపెట్టే అవకాశం దొరుకుతుందని అవి అంచనా వేశాయి. రాయబారులు, బంధువులు, పార్టీ కార్యకర్తలద్వారా ఈ మేరకు శ్యామ్‌సుందర్‌కి తాముగా సంకేతాలూ పంపుకోవడం ప్రారంభించాయి. అయినా ఈ విషయంలోనూ శేఖర్‌నుంచి పెదవి విరుపే ఎదురైంది. 'నేను చెబుతున్నాను, విను. ఆనంద్ తన నియోజకవర్గాన్ని అక్షరాలా అధికారపక్ష దుర్గంగా మార్చేశాడు. మరో పార్టీ ఏదీ అక్కడ బతికి బట్టకట్టలేదు, పైగా ఆనంద్‌ను వ్యతిరేకించి... ఆ సంగతి మరచిపోయి ఆనంద్ ప్రతి అభ్యర్థినీ తరిగిపోగులు పెట్టగలడు. నిజం చెప్పాలంటే వేరే ఏ రాజకీయపక్షం అక్కడ పోటీకి తలపడినా, ఆనంద్ విజయావకాశాలకే అది దోహదపడుతుంది. పార్టీ విధేయతను చూపించి అతను జనాన్ని తనవైపు తిప్పుకోగలడు, లేదు, శ్యామ్‌జీ, మరో పార్టీ ఏదీ అతనితో తూగలేదు.'

'ఏతావాతా నువ్వనేదేమిటి?' విసుగు ధ్వనించే గొంతుతో శ్యామ్‌సుందర్ నిలదీశాడు. 'మనం మళ్ళీమళ్ళీ మొదటికే వస్తున్నాం.'

'నిదానించు శ్యామ్‌జీ. ఆనంద్‌లాంటి ఓ అధికారపక్షం అభ్యర్థిని ఓడించడమంటే మాటలు కాదు. దయచేసి కాస్త నిగ్రహం పాటించు. అభ్యర్థికోసం ఓ వైపున అన్వేషణ సాగిస్తున్నప్పుడే, మరోవైపున కొంత వేరే ఆలోచనా చేశాను. ఒకవిధంగా అన్ని విషయాలు ఖరారు చేసేశాననుకో' శేఖర్ అన్నాడు.

'అన్నీ ఖరారు చేసేశావా?' శ్యామ్‌సుందర్ ఆశ్చర్యంతో ప్రశ్నించాడు. 'అయితే ముందే ఆ విషయం నాకెందుకు చెప్పలేదు? ఇన్ని రోజులూ గుడ్డిగా ఈ వెతుకులాట అంతా ఎందుకు జరిపినట్టు?'

'చూడు శ్యామ్‌జీ, ముందసలు వ్యవహారాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నిద్దాం.' శేఖర్ అభ్యర్థన పూర్వకంగా అన్నాడు 'మనిద్దరి లక్ష్యం ఆనంద్‌ను ఓడించడమే అయినా సమస్యను మనం వేర్వేరు కోణాలనుంచి చూస్తున్నాం. నీ కోణం పూర్తిగా వ్యక్తిగతం. నాది వ్యక్తిగతంతో పాటు రాజకీయం కూడా. ఒకరకంగా ఉమ్మడి లక్ష్యంకోసం ఒకరినొకరం ఉపయోగించుకుంటున్నాం. మన వేర్వేరు కోణాల్లో ఎన్నో చిక్కులూ ఇమిడి ఉన్నాయి. తదుపరి అడుగు వేయబోయే ముందు ఆ చిక్కుల్ని విప్పుకోవాలి.'

'అవునవును. నువ్వు చెప్పింది నిజమే.' శ్యామ్‌సుందర్ అన్నాడు. 'అయితే మనం ఇలా ఎంతకాలం ఆ చిక్కులగురించి ఆలోచిస్తూ కూర్చోవాలి? ఇంతకీ ఏమిటవి...?'

'మచ్చుకి ఒకటి చెప్పుకోవాలంటే, ఆనంద్ ఓటమివల్ల ఆ నియోజక వర్గంలో అధికారపక్షం బలహీనపడకూడదు...'

'అంటే ఏమిటి నీ ఉద్దేశం?'

'నేను చెప్పింది సూటిగానే ఉంది. చూడు శ్యామ్‌జీ, నేను ఆనంద్‌ను వ్యతిరేకిస్తాను. అయితే అతనిని ఓడించే ప్రయత్నంవల్ల నా పార్టీ నష్టపోవడానికి నేను ఇష్టపడను. ఇందులో నా రాజకీయభవిష్యత్తు కూడా ఇమిడిఉంది. అదీగాక ఆనంద్‌కు వ్యతిరేకంగా మొత్తం భూస్వామ్య వర్గాన్నే మనం సమీకరించుకోవాలి. అధికారపక్షానికి చెందిన ఓ ప్రముఖ అభ్యర్థిని ఓడించడానికి తాము ప్రయత్నించినాసరే, పార్టీ తమకు అనుకూలంగానే ఉన్నట్లు భూస్వాములను మనం నమ్మించగలిగితేనే ఇది సాధ్యమౌతుంది. చివరగా, మరో పార్టీ ఆనంద్ నియోజక వర్గంలో బలపడడం నాకు ఇష్టంలేదు. అది ప్రజలకీ మంచిదికాదు, నీకూ మంచిదికాదు...'

'బాగుంది నువ్వనేది. అందువల్ల నాకొచ్చే నష్టమేమిటి?' శ్యామ్‌సుందర్ భుజాలు ఎగరేస్తూ అన్నాడు.'అయినా ఈ రాజకీయాల చెత్త నాకు అర్థం కాదులే!'

'అందరికీ నష్టమే శ్యామ్‌జీ.' శేఖర్ వివరించాడు. 'అయినా ఇప్పుడు నేను మరీ లోతుల్లోకి వెళ్ళను. ఇంతకుముందే చెప్పినట్టు ఇప్పుడు నా దగ్గర బ్లూప్రింట్ సిద్ధంగా ఉంది. మొత్తానికి మనకు పనికొచ్చే ఓ అభ్యర్థిని పట్టుకోగలిగాను.'

'ఎవడతను? వెంటనే నాకు చెప్పొచ్చుకదా?'

'అతడి పేరు బయటపెట్టేముందు నా దృష్టిలో ఉన్న కొన్ని విషయాలు నీకు వివరించాలి. వాటిలో ఏ ఒక్కఅంశంతో నువ్వు ఏకీభవించకపోయినా, నాకు చెప్పాలి. అప్పుడు మనం మళ్ళీ సమీక్షించుకోవచ్చు...'

'ఓరి దేవుడా! ఈ తాత్సారం చూస్తుంటే నా ఉత్సాహం నీరుగారిపోతోంది. దయచేసి వెంటనే ఆ పేరేదో బయటపెట్టకూడదా?' శ్యామ్‌సుందర్ నిష్ఠురంగా అన్నాడు.

'దయచేసి ఒక నిముషం ఓపిక పట్టు' శేఖర్ అభ్యర్థనగా అన్నాడు. 'నేనింతకుముందే అన్నట్టు మరో పార్టీ అభ్యర్థి మనకు అవసరంలేదు. కనుక అతడు ఇండిపెండెంట్ అయివుండాలి.

నీలా అతడు మంచి ప్రాబల్యం కలిగిన కులానికి చెందినవాడై ఉండాలి. ఎటువంటి మచ్చలూ లేని యువకుడై ఉండాలి. కనీసం తనగురించి వ్యతిరేకంగానో, అనుకూలంగానో చెప్పుకోడానికేమీ లేనివాడై ఉండాలి. అనామకుడైన అభ్యర్థిమీద వోటర్లు ఒక ప్రత్యేకమైన అభిమానం చూపిస్తుంటారు. సాధారణంగా అతడు ఉత్తముడుగానే భావించి ఆదరిస్తూ ఉంటారు. ఇక అతడు మధ్యతరగతికి చెందినవాడై ఉండాలి. సంపన్నుడుగా కనిపించకూడదు. చివరిగా, అతడి రూపురేఖలు జనాన్ని ఆకట్టుకునేవిగా ఉండాలి. అందువల్ల ఈ ముక్కుపచ్చలారని కుర్రాడికి ఓ అవకాశం ఎందుకివ్వకూడదని సగటు వోటరు అనుకుంటాడు. కేవలం మార్పుకోసం మార్పును ఆశించే వోటర్లు ఎందరో ఉన్నారు. ఇక ఇప్పుడు...' ఈ ఘట్టంలో శేఖర్ నాటకీయంగా క్షణకాలం ఆగి చివరకు ప్రకటించాడు. 'ఇంక అతడి పేరు చెబుతాను. మరెవరో కాదు, నీ బావమరిదికి బావమరిది —రవికుమార్!!'

ఆనంద్‌కు వ్యతిరేకంగా జరిగిన కుతంత్రాలూ, వెన్నుపోటు తతంగాల వంటివే, 1967 ఎన్నికల ముందు, దేశంలో నాలుగువేలకు పైబడి ఉన్న శాసనసభా నియోజకవర్గాలెన్నింటిలోనో పునరావృత్తమయ్యాయి. సరిగా ఈ క్రమంలోనే ఎన్నికల ప్రక్రియ వాస్తవంగా కుళ్ళడం మొదలైంది.

★ ★ ★

'టిక్కెట్ సీజన్' మొదలైంది. టిక్కెట్‌నుకోరి దేశం అన్నివైపులనుంచి వేలాదిమంది జనం తమకు పదిరెట్లు మించి ఉన్న తమ అనుచరబలగాలతో సహా యధాప్రకారం ఢిల్లీని ముట్టడించారు. వాస్తవిక అధికార కేంద్రం ఏదన్న విషయంలో విపరీతమైన గంద్రగోళం నెలకొని ఉంది. ఆ అధికారకేంద్రం ప్రధానమంత్రి అవుతారా! లేక పార్టీ అధ్యక్షుడు అవుతారా! వారిద్దరూ కాక సంబంధిత రాష్ట్రాల ముఖ్యమంత్రులు అవుతారా? లోక్‌సభకు అభ్యర్థుల ఎంపికలో ముఖ్యమంత్రి ఏ మేరకు కీలకపాత్రధారి అవుతాడు? ఆ ఎంపిక బాధ్యత పూర్తిగా ఇందిరాగాంధీకే విడిచిపెట్టారా?... ఎన్నికల అనంతరం కేంద్రంలో ఏర్పడే అధికారపక్ష వ్యవస్థ ఈ చివరి ప్రశ్నమీద ఆధారపడిఉంటుంది.

ముఖ్యమంత్రులందరూ యధావిధిగానే ఢిల్లీలో తిష్ఠ వేశారు. అయితే ఇందిరాగాంధి రంగ ప్రవేశంతో రాజకీయమైన కూడికలు, తీసివేతల విషయంలో మొదటిసారి వాళ్లు అనిశ్చితపరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చింది. ఒకరి పట్ల మరొకరిలో విస్తరించిన అనుమానాలు ప్రతిక్షణం వాళ్ళను కుంగదీస్తూ వచ్చాయి. ఆ క్రమంలో చాలావరకూ వాళ్ళు ఢిల్లీలోని తమ విశ్వసనీయవర్గాలపై ఆధారపడవలసివచ్చింది. అయితే ఆ వర్గాల భోగట్టా సైతం సందేహాస్పదంగా, నమ్మదగనిదిగా ఉంటూవచ్చింది.

'కిచెన్ కేబినేట్' పేరుతో ఇందిరాగాంధీ చుట్టూ కేంద్రంలో ఒక సరికొత్త ఆంతరంగిక కూటమి అవతరించింది. కనీసం దూరప్రాంతాల ప్రజలకు దానిగురించి అప్పటికేమీ తెలియదు. అంతవరకు అధికారాన్నీ, ప్రాబల్యాన్నీ చలాయిస్తూ వచ్చిన వయసుమళ్ళిన నేతలు ఇంకా

చక్రం తమ చేతుల్లోనే ఉన్నట్టు పైకి చెప్పుకుంటున్నా పట్టుజారడంవల్ల లోపల్లోపల వాళ్ళు విలవిల్లాడడమూ జరుగుతోంది. అధికారశకటాన్ని నడిపించే కొత్తశక్తులు ఇంకా స్పష్టంగా పైకి తేలలేదు. బహుశా అవింకా నిర్మాణదశలోనే ఉన్నాయి. మొత్తంమీద కాకలుతీరిన రాజకీయ వాదులకు సైతం ఢిల్లీ ఓ చిక్కుముడిలా కనిపించింది.

ఇందిరాగాంధి మరో ప్రశ్నార్థకం. పాతుకుపోయిన నాయకుల దృష్టిలో ఆమె ప్రధానంగా వోట్లను ఆకర్షించే ఒక పరికరం, పార్టీని తిరిగి అధికారంలోకి రప్పించడానికి ఉపయోగపడే ఒక సాధనం. ఆ విధిని మిగిలిన అందరికంటె ఆమె చక్కగా నిర్వర్తించగలదని వాళ్ళూ ఒప్పుకున్నారు. అయితే వాళ్ళ దృష్టిలో ఆమె ఉపయోగం అంతటితో ముగిసిపోతుంది. పార్టీ అధికారంలోకి రాగానే ఆమె వెనుక సీట్లోకి తప్పుకుంటుంది, లేదా తాము ఆమెను తప్పుకునేలా చేస్తారు. వాళ్ల దృష్టిలో అదే ఆమెకు యోగ్యమైన చోటు. ఆమె కంటె అనుభవజ్ఞుడైన నాయకుడు చక్రం చేతుల్లోకి తీసుకుని దేశానికి సారథ్యం వహిస్తాడు. అయితే ఆ వ్యక్తి ఎవరో వాళ్ళు చెప్పలేదు చెప్పలేరు అనడం మరింత సబబుగా ఉంటుంది. వాళ్ళలో కొందరి ఉద్దేశం ప్రకారం ఆమెకూ ముందుముందీ అవకాశం రావచ్చు. లేదా మరికొందరి ప్రకారం రాకనూపోవచ్చు. ఏదేమైనా ఎన్నికల తర్వాత ఆమె ప్రధానమంత్రిగా కొనసాగడం కల్ల.

'నన్నడిగితే అంతకంటె అవాంఛనీయం ఉండదు కూడా' అన్నాడు, ఒక ఉత్తరాదిరాష్ట్రానికి చెందిన సీనియర్ ముఖ్యమంత్రి, తన పొరుగు రాష్ట్రానికి చెందిన ఒక నాయకుడితో.

'నువ్వు తెలివిహీనుల, ఇంకా చెప్పాలంటే పూర్తిగా మతిచెడినవాళ్ళ ఊహాస్వర్గంలో జీవిస్తున్నట్టు కనిపిస్తున్నావు మిత్రమా! ఒకసారి అత్యున్నత పదవిని అధిష్ఠించిన తర్వాత నెహ్రూ కుటుంబం అధికారాన్ని అంత తేలిగ్గా విడిచిపెడుతుందనుకుంటున్నావా? ఇందిరాగాంధీ ఎంత మొండిదో, ఆరునూరైనా తలచుకున్నది సాధించడానికెలా ప్రయత్నిస్తుందో, ఎంత కొరకరానికొయ్యో నీకు బొత్తిగా తెలిసినట్టులేదు. మహాత్మాగాంధీ ఇష్టానికి వ్యతిరేకంగా ఆమె ఫిరోజ్‌గాంధీని పెళ్ళాడిన విషయం నీకు గుర్తులేదా? ఆ వివాహానికి జవహర్లాల్ మాత్రం ఇష్టపడ్డారనా? నన్నడుగు చెబుతా, నేను అలహాబాద్ వాణ్ణి... నెహ్రూ కుటుంబం గురించి నాకన్ని విషయాలూ తెలుసు. చూస్తూఉండు మిత్రమా, ఇందిరాగాంధీని ఇప్పుడు గద్దెమీంచి ఎవరూ దింపలేరు!'

'ఆమె గురించి నీ అంచనా సరైనదే కావచ్చు. అయితే ఆమె చేయగలిగింది శూన్యం. అడుగడుగునా ఆమెకు కష్టాలు తప్పవు. ఆ తండ్రి కూతురుగా జనాన్ని ఆకర్షించి క్షణిక వైభవంతో వెలిగిపోవడం వేరు, ఈ దేశానికి సారథ్యం వహించడం వేరు. మైగాడ్! ఒక మహిళ, అందు లోనూ అట్టడుగు వాస్తవాలకు దూరంగా పాశ్చాత్యప్రభావంలో పెరిగిన ఓ మహిళ... అటువంటి మనిషిని పూర్తికాలం ప్రధానమంత్రి హోదాలో ఎలా ఊహిస్తున్నావ్?'

అధికారపక్షంలోని ఎందరో నాయకుల వ్యాఖ్యలూ, ప్రతివ్యాఖ్యలూ అలా సాగిపోతున్నాయి. వాళ్ళ తపనంతా తక్షణ భవిష్యత్తు గురించి అదికూడా తమ భవిష్యత్తుకు సంబంధించే కానీ,

దేశ భవిష్యత్తుకు సంబంధించి కాదు. ఎదురుగా అన్నీ ప్రశ్నార్థకాలే వేలాడుతున్న స్థితిలో కోరి ప్రమాదం కొనితెచ్చుకోకూడదనే ప్రతి ఒక్కరూ అనుకున్నారు. ఏమైనాకానీ, ఈ గడ్డు పరిస్థితిలో రాజకీయంగా లాభసాటి కాగల తావులో ఉండవలసిందే. ముఖ్యమంత్రులు, మంత్రులు, శాసన సభ్యులు, పార్లమెంట్ సభ్యులు ఇప్పటివాళ్ళు, కాగోరుతున్న వాళ్ళతోసహా అందరూ ఎన్నికల్లో తమకంటూ ఓ సురక్షిత స్థానాన్ని చేజిక్కించుకోవాలి, లేదా నిలుపుకోవాలి. అనిశ్చితంగా, అంధకారబంధురంగా ఉన్న భవిష్యత్తులోకి అనాయాసంగా దూసుకుపోవడానికి ఆ సురక్షిత స్థానం, ఇటు ఆత్మరక్షణకూ, అటు దాడికీ కూడా ఉపయోగించే ఆయుధం.

ఇప్పుడు వాళ్ళున్న మానసికస్థితినిబట్టి, రాబట్టుకోవలసిన సద్యః ఫలితం తప్ప మరేదీ ముఖ్యం కాదు.

ఇంతకుముందు జరిగిన అన్ని ఎన్నికల్లోనూ అవకాశవాదం స్వైరవిహారం సాగించిన మాట నిజమే. అయితే గత ఎన్నికల్లో ప్రస్ఫుటమౌతూవచ్చిన సత్వరప్రయోజనవాదంలో రెండు అంశాలు కొట్టొచ్చినట్టు కనిపించేవి. మొదటిది, వివిధ రాజకీయపక్షాలను అంటిపెట్టుకుని ఉన్న సైద్ధాంతిక కోణం జనం ఒక అభిప్రాయానికి రావడానికి తోడ్పడుతూ ఉండేది. దక్షిణాదిన కమ్యూనిస్టు పార్టీ, ఉత్తరాదిన జనసంఘ్ రామరాజ్యపరిషత్తుల సమ్మేళనం వేటికవే వేర్వేరు గుర్తింపులున్న పార్టీలు. రామరాజ్యపరిషత్తు జవహర్లాల్ నెహ్రూకు వ్యతిరేకంగా అభ్యర్థిని నిలబెట్టినప్పుడు, తన సనాతనహైందవదృక్పథాన్ని, సంస్కరణలకు వ్యతిరేకి అన్న గుర్తింపును అది ప్రదర్శించుకుంది. కనీసం ఒక్క ఎన్నికలోనైనా ఆ వ్యూహం ఫలిస్తుందని ఆ పార్టీ భావించింది దాదాపు అలాగే జరిగింది. పండిట్‌జీ తన ప్రతిష్ఠతో సరితూగేంత పెద్దఎత్తున కాక, తగు మాత్రపు తేడాతోనే గెలుపొందగలిగారు. అయినా ఒకసారి ఆయన విజేత అనిపించుకున్న తర్వాత అది హిందూ ప్రజానీకం అసందిగ్ధంగా ఇచ్చి తీర్పే అనిపించుకుంది. నెహ్రూ, ఆయన పార్టీ ప్రతిపాదించినట్టే ప్రజలు హిందూ చట్టంలో సంస్కరణను ఆమోదించారు... తదనుగుణంగానే పార్లమెంట్‌లో చట్టం తీసుకురావడం ద్వారా సంస్కరణా జరిగింది.

రెండోది, నెహ్రూ తన పార్టీకి ఎప్పటికప్పుడు విప్లవాత్మకమైన మెరుగులు దిద్దుతూనే వచ్చారు. ఆయన ఏదైనా వాగ్దానం చేస్తే, దానిని నిలబెట్టుకుంటారని ప్రజలు అంతర్గతంగా విశ్వసిస్తూ వచ్చారు కనుక, ఫలానా విషయంలో ఆయన సాధించిందేమిటన్న ప్రశ్న ఎన్నడూ తలెత్తలేదు. దాదాపు ఒంటిచేత్తోనే ఆయన చేయగలిగింది చేసి చూపించారు. ఏదేమైనా, తన వాగ్దానాన్ని చెల్లించుకోడానికే ఆయన నిరంతరం ప్రయత్నిస్తూ ఉంటారన్నది ప్రజల విశ్వాసంగా ఉంటూవచ్చింది.

ఈ రెండు అంశాలూ 1967 ఎన్నికలకు చాలాముందే అదృశ్యమైపోయాయి. పాకిస్తాన్‌తో యుద్ధం మానసికధోరణులలో సమూలమైన పరివర్తన తెచ్చిపెట్టింది. పొరుగున ఉన్న శత్రు దేశానికి వ్యతిరేకంగా దేశరక్షణ వ్యవస్థను తీర్చిదిద్దుకోవడమెలా అన్న సరికొత్త ఆందోళనతో జనం ఉక్కిరిబిక్కిరయ్యే పరిస్థితిని అది తెచ్చిపెట్టింది. ప్రజల మస్తిష్కాలలో చైనా భయం కొంతమేరకు తగ్గుముఖంపట్టినా, పాకిస్తాన్ తీవ్రమైన అలజడిని రేపుతూనే ఉంది. ఎన్నికలలో

చర్చనీయాంశం ఒకటే : దేశరక్షణ వ్యవస్థను ఎవరు పటిష్ఠంగా నిర్మించగలుగుతారు? పార్టీ ఎన్నికల ప్రణాళికలో ఎవరేమి చెప్పుకున్నా ఇదే కీలకాంశం అయింది. ఒక మహిళ ప్రధానమంత్రి పదవికి పోటీపడుతుండడం, కొందరు సీనియర్ నాయకుల కూటమి ఆమెను పక్కకి నెట్టి వేసేందుకు యత్నాలు చేస్తుండడంతో ఈ కోణం ప్రజల్ని మరింత వివశుల్ని చేయడం ప్రారంభించింది. భయం, అయోమయం ముప్పిరిగొన్న పరిస్థితిలో, తమకు అభయప్రదానం చేయగల నెహ్రూవంటి పరిచితవ్యక్తి ఎవరూలేని వాస్తవికతలో ప్రజలు ఇదివరలోలాగే వోటు వేస్తారని ఆశించడానికి వీల్లేదు.

రెండు ప్రధాన ప్రశ్నలు తలెత్తాయి. ఇందిరాగాంధి మళ్ళీ ప్రధానమంత్రి అయితే, ఇప్పుడున్న క్లిష్టపరిస్థితులనుంచి దేశాన్ని ఉద్ధరించగలుగుతారా? ఆమె ఉద్ధరించలేరనుకున్నప్పుడు మరి ఎవరు? ఈ రెండు ప్రశ్నలకూ ఏవైపునుంచీ విశ్వసనీయమైన జవాబులు లభించలేదు. వాస్తవంలో ఎన్నికలు, చీకట్లోకి లంఘించడంగానే పరిణమించాయి. ప్రజల్ని ఒకపక్క ఇలా అయోమయావస్థ పీడిస్తుంటే, రాజకీయవాదులకు స్వీయఅస్తిత్వమొక్కటే ముఖ్యాంశంగా మారిపోయింది. సైద్ధాంతికత, నిబద్ధత అడుగంటిపోగా వచ్చి అవకాశవాదం వాటిస్థానాన్ని ఆక్రమించింది

ఎప్పుడైతే సైద్ధాంతికత అప్రధానంగా మారిపోయిందో, అప్పుడిక వోటర్ల ఇష్టాయిష్టాలను వేరే కారణాలు ప్రభావితం చేస్తాయి. ఉదాహరణకు కులం. వెనకటి ఎన్నికలలో కులం ప్రభావం లేదని కాదు, ఉంది. అయితే ఇప్పుడది శక్తిమంతమైన ఎన్నికల ఆయుధంగా మారింది. పార్టీ విభేదాల ప్రసక్తి లేకుండా, తమ తమ కులానికి చెందిన అభ్యర్థులకే వోటివ్వాలన్న సంకల్పం లోపాయికారీ అవగాహనగా వోటర్లలో పెరిగిపోసాగింది. నిర్దిష్ట కులానికి చెందిన వివిధ పార్టీలలోని స్థానికనాయకులు రహస్య సమావేశాలు జరుపుకున్నారు. ఈ రాజకీయవ్యభిచారం వల్ల ఏ పార్టీ, లేదా ఏ కులం, లాభపడిందో స్పష్టం కాకపోయినా, ఇంచుమించు అన్ని పార్టీలవారూ కులాన్ని వాడుకుని లాభం మూట గట్టుకుంటున్నట్టే కనిపించారు. రాజకీయ ప్రక్రియ లోపల్లోపల కుళ్ళడం అలా ప్రారంభమైంది. దాని నుంచి దేశం ఎప్పటికీ కోలుకోలేకపోయింది.

ప్రతినియోజకవర్గంలోనూ ఆయాకులాల అమరికమీద ఆధారపడి, మెజారిటీ సాధనకు వీలుగా కులాల మేళవింపును రూపొందించుకున్నారు. చిట్టచివరి పోలింగ్ కేంద్రంవరకూ, కులాల వారీగా వోటర్ల జాబితాలను సిద్ధంచేసుకున్నారు. మొహంమీద రాసుకోకపోయినా ప్రతి అభ్యర్థి తన కులాన్ని సూచించే ముద్రల్ని మోస్తున్నట్టు తెలిసిపోతూనే ఉంటుంది. కొందరి విషయంలో కులం కొట్టొచ్చినట్టు కనిపించే ఓ అనర్హత అవుతుంది. కొందరి విషయంలో అది అర్హత అవుతుంది. విశ్వవిద్యాలయపండితులు కులానికిసంబంధించిన అంశాలపై పరిశోధనలు కూడా చేపట్టారు. క్రమేణా కులతత్వం ఇంచుమించు సగౌరవకార్యకలాపంగా రూపొందింది.

ప్రతిచోట కులతత్వం వెర్రితలలు వేస్తూ ఉండడంతో కులపరమైన ఘర్షణలు నిత్యకృత్యంగా పరిణమించాయి. వివిధకులాల వాళ్ళు సొంతంగా ప్రైవేట్ సైన్యాల్ని నిర్మించుకుని పోషించుకోవడం ప్రారంభించారు. దాంతో గ్రామీణప్రాంతాల్లో తరచు అల్లర్లు, తీవ్రస్థాయి ఘర్షణలు

నిరోధించడం (ముఖ్యంగా ఎన్నికల్లో ఫలానావైపు మొగ్గు చూపించేవారుగా పదిమందికీ తెలిసిన ఆయా వర్గాలకు చెందిన వోటర్లను) ఈ ప్రైవేట్ సైన్యాలనుంచి కోరుకునే ప్రయోజనం. బంది పోట్లను తలపింపజేసే ఈ దళాల చేతుల్లోని పెద్దపెద్ద లారీలు మనుషుల మీద విశృంఖల తాండవం సాగిస్తూ, కొబ్బరికాయల్ని పగులగొట్టినట్టు తలలు పగలగొడతాయి.తరచు ఈ లాఠీల స్థానాన్ని కత్తులు, బాకులు, తుపాకులు, నాటుబాంబులు ఆక్రమిస్తూ ఉంటాయి అయితే ఈ కిరాతకదమనకాండకు ఉపశమనంగా అప్పుడప్పుడు ఉదారంగా కానుకలు ముడుపులు ముట్ట జెప్పడమూ జరుగుతూ ఉంటుంది. వోటరు ఎవరైనా పోలింగ్ కేంద్రం దరిదాపుల్లోకి వెళ్ళకుండా ఉండడానికి ఒప్పుకుంటే అతడు పోలింగ్‌నాడు రోజంతా మద్యంలో మునిగి తేలగలిగినంత డబ్బు చేతిలో పడుతుంది. ఒక కులానికి చెందిన లేదా ఒక వాడకు చెందిన వోటర్లను చెప్పు చేతల్లో ఉంచుకోగలిగిన సామర్థ్యాన్ని అనుసరించి ఎడాపెడా సొమ్ము చేసుకోగలిగిన దళారీలు గ్రామప్రాంతాల్లో పుట్టుకొచ్చారు. ఫలానా అభ్యర్థికి వోటు వేయించడమో, లేదా అసలు ఎవరికీ వోటు వేయకుండా చూడడమో అభ్యర్థి ఎలా కోరుకుంటే అలాచేసిపెట్టడం వీళ్ళవంతు. ప్రత్యేకించి ఉత్తరాది రాష్ట్రాల్లో ఓ కొత్త తరహా ఎన్నికల జమీందారీ తలెత్తి కొన్నేళ్ళలో దేశమంతటా విస్తరించి పోయింది.

పోలింగ్ కేంద్రాల స్వాధీనం అనే ఒక అసాధారణ కార్యక్రమం చూస్తూండగానే ఒక లలితకళగా వృద్ధి చెందింది ఓ వందమంది బలిష్ఠులు లాఠీలతోనో, తుపాకులతోనో విరుచుకుపడి పోలింగ్‌కేంద్రాన్ని చుట్టుముడతారు. పోలింగ్ సిబ్బందినీ, అక్కడ నియమితులైన ఒకరిద్దరు పోలీస్‌కానిస్టేబుళ్ళనూ క్షణాల్లో లొంగదీసుకుంటారు. ఆ తర్వాత తమ అభ్యర్థికి అనుకూలంగా బ్యాలెట్ పేపర్లపై తామే ముద్రగుద్దేసి బ్యాలెట్‌బాక్సుల్ని నింపేస్తారు. ఆ తర్వాత అసలు వోటరు తన హక్కును వినియోగించుకోడానికి పోలింగ్ కేంద్రానికి వెడితే, తన వోటు ఎవరో వేసేసిన విషయం తెలుస్తుంది.అప్పుడతడు చేయగలిగిందేమీ ఉండదు. పోలింగ్ సిబ్బంది కనుక సహకరిస్తే, వాళ్ళకు డబ్బు, మద్యం, మగువ వంటి కానుకలు ఎంతో ఉదారంగా లభిస్తాయి... ప్రతిఘటిస్తే, వాళ్ళను పక్కకునెట్టేసి దుండగులు బ్యాలెట్‌పత్రాలపై మూకుమ్మడి ముద్రలు గుద్దేసే కార్యక్రమాన్ని నిరాఘాటంగా కొనసాగిస్తారు. ప్రతిపార్టీ తన కెక్కడ వీలైతే అక్కడ ఇదే ప్రక్రియను అమలుచేస్తూ ఉంటుంది కనుక ఏవైపునుంచీ ఫిర్యాదులు రావు. ఇదంతా ఎన్నికలాటలోభాగమే. ఏదైనా ఒకపార్టీ, మరోపార్టీ స్వాధీనం చేసుకోగలిగినన్ని పోలింగ్ కేంద్రాలను స్వాధీనం చేసుకోలేకపోతే, అది దానిదురదృష్టం, అంతే. ఎన్నికల సమయంలో ఏది చేసినా 'సక్రమ'మే అయినప్పుడు, దేశంలో జరిగేవన్నీ సక్రమ ఎన్నికలే అవుతాయి!

ఈ పరిణామాలతో దిగ్భ్రాంతి చెందిన ఆనంద్, నూతనపరిస్థితిని ఎదుర్కోడానికి ఏదైనా మార్గం కనిపెట్టడం మినహా గత్యంతరం లేదనుకున్నాడు.

నామినేషన్ల దాఖలుకు గడువు మరునాటితో ముగుస్తుందనగా ముందురోజు, తన నియోజకవర్గంలోని ఒక సర్పంచ్ శ్రీధర్‌కోసం ఎదురుచూస్తూ ఆనంద్ లాన్‌లో అస్థిమితంగా పచార్లు చేస్తున్నాడు. వెనకటి ఎన్నికలనుంచి శ్రీధర్ అతడి పేరును ప్రతిపాదించడం పరిపాటిగా

జరుగుతోంది. శ్రీధర్ కాస్తమందకొడిగా కనిపించే మనిషి అయినా కష్టపడి పనిచేసే కార్యకర్త. ఆనంద్‌కి అత్యంతసన్నిహిత అనుచరుడు. ఆనంద్ ద్వారా అతడు తన గ్రామానికి ప్రాథమిక ఆరోగ్యకేంద్రం, పశువుల ఆసుపత్రి, అప్రోచ్‌రోడ్డు, హైస్కూలు వంటి సౌకర్యాలను సాధించు కోగలిగాడు. ఆనంద్‌పట్ల కృతజ్ఞత ప్రకటించుకుంటూ అతడి కార్యోత్సాహాన్నీ పాండిత్యాన్నీ ప్రశంసిస్తూ ఉంటాడు.ఆనంద్ తన నియోజకవర్గంలో పర్యటనకు వెళ్ళిన ప్రతిసారి, శ్రీధర్ విధిగా అతణ్ణి తన గ్రామానికి తీసుకువెళ్ళి బహిరంగసభ ఏర్పాటు చేస్తూ ఉంటాడు.

ఎట్టకేలకు శ్రీధర్ గేటుదగ్గర ప్రత్యక్షమయ్యాడు. నేరుగా ఆనంద్‌ను సమీపించాడు. అతడి ముఖం ఒకింత పాలిపోయి ఉంది. వేగంగా ఊపిరితీసుకుంటూ 'మిమ్మల్ని నాకోసం ఎదురు చూసేలా చేశాను, సారీ సార్...' అనేసి ఊరుకున్నాడు. ఆనంద్ అతణ్ణి కూర్చోమని కూడా అనలేదు, 'దానికేంలే శ్రీధర్' అని మాత్రం అన్నాడు.

'మీరు నామినేషన్ పేపర్లు దాఖలు చేశారా సార్? ఇప్పుడు సమయం ఆట్టేలేదు. రేపు చివరిరోజు, రిటర్నింగ్ ఆఫీసర్ నూటయాభైమైళ్ళదూరంలో ఉన్నాడు' అన్నాడు శ్రీధర్.

'నీ కోసం మూడురోజులుగా ఎదురుచూస్తున్నాను. గత ఎన్నికలనుంచి పాటిస్తున్న ఆనువాయితీ తప్పడం నాకిష్టం లేదని నీకు తెలుసు. నేను దాఖలు చేసే మొదటి నామినేషన్ పత్రం మీద నా పేరు ప్రతిపాదించవలసింది నువ్వే. కనుక ఈరోజు సాయంత్రానికే మనం అక్కడికి చేరు కోవాలి...' ఆనంద్ అన్నాడు.

వాళ్ళిద్దరూ జిల్లా ముఖ్య కేంద్రానికి చేరుకునేసరికి, ఆనంద్ మద్దత్తుదారులనేకమంది అక్షరాలా అతణ్ణి చుట్టుముట్టి శ్రీధర్‌ను ఆనంద్ నుంచి దూరం చేయడానికి శ్యామ్‌సుందర్ మనుషులు అతడికి ముడుపులు ముట్టజెప్పినట్టు రుజువు చేసే అనేక ఉదంతాలు ఏకరవు పెట్టడం ప్రారంభించారు. శ్రీధర్ ఆనంద్ పేరును ప్రతిపాదించాలన్న ఆలోచనను వాళ్ళు వ్యతిరేకించారు. 'మొదటిది కానీ చివరిది కానీ, ఏ నామినేషన్ పత్రంమీదనైనాసరే, వీడు ప్రతిపాదించడం మేము ఒప్పుకోం' అని నిర్ద్వంద్వంగా తీర్మానించారు.

'అది న్యాయంకాదు' ఆనంద్ అడ్డుచెప్పాడు. 'రేపు నామినేషన్ పత్రం దాఖలు చేయడానికి శ్రీధర్ నాతోపాటు ఇక్కడికొచ్చాడు'.

'ఏదో పొరపాటు జరుగుతోంది, మిమ్మల్ని హెచ్చరిస్తున్నాం' అని వాళ్ళు నిష్కర్షగా అని తమ సందేహాల్ని మళ్ళీ మళ్ళీ వల్లించారు. అయితే ఆ చివరిక్షణంలో ఆనంద్ తన ప్రతిపాదకుణ్ణి మార్చలేడనీ వాళ్ళు గ్రహించారు. అంతటితో ఆ చర్చ విరమించారుకానీ, అనుయాయులు అయిష్టంగా తలలు అడ్డంగా ఆడిస్తూనే ఉన్నారు.

ఎప్పటిలా అభిమానుల ఆనందోత్సాహాలమధ్య శ్రీధర్ ఆనంద్ తరఫున మొదటి నామినేషన్ పత్రం దాఖలు చేశాడు, ఆ తర్వాత మరి ముగ్గురు దాఖలు చేశారు (ఎన్నికల చట్టంప్రకారం ప్రతిఅభ్యర్థి నాలుగుసెట్ల నామినేషన్‌పత్రాలు దాఖలు చేయవచ్చు) తమ మద్దతును ప్రకటించడానికి పెద్దసంఖ్యలో జనం ఆఫీసు ఆవరణలో గుమికూడారు. ఆనంద్‌తో కలిసి ఆఫీసులోంచి బయటికి

వస్తున్న శ్రీధర్‌ను చూడగానే వాళ్ళ హర్షధ్వానాలు హఠాత్తుగా ఆగ్రహధ్వానాలుగా మారిపోయాయి. తనకు తెలియని దేమిటో వాళ్ళకు తెలిసినట్టుందని ఆనంద్ మనసులో అనుకుంటూ విస్మితుడయ్యాడు. అక్కడ గుమిగూడిన గుంపు విచక్షణలో ఏదో అసాధారణాంశం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది, మనుషుల గురించి అంచనాల్లో అదెప్పుడూ పొరపాటుపడదు.

'ఆ మనిషి ఇంకా మీతో ఎందుకున్నాడు?' ఎవరో అరిచారు.

'అతడు ద్రోహి!' మరొకరు కేకపెట్టారు.

'చూస్తూ ఉండండి, అతడు మిమ్మల్ని ముంచేసి వెళ్ళిపోతాడు', మూడో మనిషి చిందులు తొక్కాడు.

ఆనంద్ వాళ్ళను శాంతింపచేయడానికి ప్రయత్నించాడు. అతడి అభ్యర్థనపై వాళ్ళు అయిష్టంగానే మౌనం వహించారు. ఈలోపల శ్రీధర్ అక్కడినుంచి చల్లగా జారుకున్నాడు. అతడక్కడినుంచి ఎప్పుడు తప్పుకున్నాడో, ఎక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలియలేదు. పోటీ అభ్యర్థి రవికుమార్‌కి సంబంధించిన పోస్టర్లు అతికించిన ఒక జీపులోకి శ్రీధర్ ఎక్కడం తను చూశానని అక్కడికి కొద్దిదూరంలో ఉన్న ఒక కిళ్ళీకొట్టు యజమాని తనంతట తనుగా సమాచారం అందించాడు. తన షాపులో సిగరెట్ ప్యాకెట్ కొంటూ, 'ఒక ద్రోహి ఏం చేయగలడో ఆ గాడిద కొడుకులకి చూపిస్తాను!' అని కూడా శ్రీధర్ అన్నట్టు ఆ పాన్‌షాప్ యజమాని చెప్పాడు.

ఆ పాన్‌వాలా అందించిన సమాచారంలోని నిజానిజాలను తేల్చుకునే అవకాశం ఆనంద్‌కి లేకపోయినా, శ్రీధర్ ప్రవర్తన అది నిజమేనని నమ్మించేటట్టేఉంది. అప్పటికీ కాస్త ఆగి, తన అనుచరులు హఠాత్తుగా, తీవ్రంగా రెచ్చగొట్టడమే శ్రీధర్ చేత అలాచేయించిందా అని యోచించాడు. ఏదేమైనా ఇప్పుడు చేయగలిగింది లేదు. సామెత చెప్పినట్టు, బాణం విల్లు విడిచి ముందుకు దూసుకుపోయింది.

మరో గంటలో ఒక కరపత్రం ఆనంద్ చేతికి అందింది. శ్రీధర్ సంతకంతో ఉన్న ఆ కరపత్రం తీవ్రదుర్భాషలతోనిండి, ఆనంద్ సమ్మతితోనో, లేక అతడు ఉద్దేశపూర్వకంగా చూసీ చూడనట్టు ఊరుకోవడం వల్లనో జరిగినవిగా చెబుతూ రకరకాల అవినీతి ఆరోపణలను అది దండగుచ్చింది.

ఆనంద్ తన నియోజకవర్గానికి పనికొచ్చేపని ఒక్కటీ చేయలేదని అది ప్రకటించింది. అతడు మంత్రికాగానే ప్రజలు కొండంత ఆశలు పెంచుకున్నారు. అయినా నియోజకవర్గం బాగోగులు చూడడానికి మంత్రిగారికి సమయం దొరికినట్టులేదు. నియోజకవర్గంలోని ముఖ్యులైన సర్పంచ్‌లకు సైతం తన దర్శనభాగ్యం దుర్లభమయ్యేంతగా ఆయన సొంతపనుల్లో బిజీ అయిపోయాడు... ఈ ఘట్టంలో కరపత్రంలోని భాష అసభ్యత అంచులు తాకింది. మొత్తం నియోజకవర్గానికి సేవలు అందించవలసిన ఆనంద్, కేవలం ఒకేఒక మహిళ సేవలో ఎలా తరించాడో వర్ణించింది. చివరిగా, ఆనంద్ తన నామినేషన్‌పత్రం మీద తన చేత దౌర్జన్యంగా సంతకం పెట్టించాడని,తనను ఇంద్రుడనీ, చంద్రుడనీ పొగడడానికి ఆనంద్ కిరాయికి తెచ్చుకున్న

మూక తనను బహిరంగంగా ద్రోహిగా పిలవడంతో భగవంతుడు తన కళ్ళు తెరిపించాడని అనేవరకూ శ్రీధర్ వెళ్ళిపోయాడు. రిటర్నింగ్ అధికారి కార్యాలయం ముందే పట్టపగలే వాళ్ళు తనను హతమార్చడానికి చూశారని కూడా ఆరోపించాడు. గత కొన్నేళ్ళపాటు తాను పూర్తిగా ఆనంద్‌తో అంటకాగినందుకు ఇప్పుడు ప్రతినిముషం పశ్చాత్తాప పడుతున్నానని చెప్పుకున్నాడు. చివరగా, 'ఈ దురహంకారిని, ఈ నీతిమాలిన మనిషిని, ఈ లంచగొండిని, ప్రజావ్యతిరేక చర్యలకు పాల్పడే ఈ మంత్రిని తన్ని తరిమేసి ఇటువంటి అవాంఛనీయ వ్యక్తులనుంచి, నడమంత్రపు మనుషులనుంచి రాష్ట్రాన్ని కాపాడవలసింది'గా ప్రజలకు ఉద్బోధించాడు.

ఆ తర్వాత ఆనంద్ వ్యతిరేకదూషణ నిత్యకృత్యంగా మారిపోయింది. అధికారపక్షం తన ఎన్నికలయంత్రాన్ని పనిచేయించేస్థితిలో పెట్టడానికి ఎంతో ముందుగానే నియోజకవర్గంలోని ప్రతిగ్రామంలో, ప్రతిగోడమీద రవికుమార్ పోస్టర్లు వెలిశాయి. ఎన్నికలప్రచారంలో ఇది నిజంగా ఒక గుణపాఠం. శ్రీధర్ పేల్చిన తొలిరాకెట్‌లానే, ప్రతిపక్షంకూడా అన్ని విషయాల్లోనూ ముందే పథక రచన చేసుకుని ఎంతో సమర్థవంతంగా అమలుచేసిన విషయం స్పష్టంగా తెలిసిపోతూనే వచ్చింది. ఆనంద్ అనుచరులు నోరు తెరచుకుని చూస్తూ నిలబడి పోయారు. తొలివిడత ప్రచారకాండలో పైచేయి, రవికుమార్‌దే .. లేదా శ్యామ్‌సుందర్‌దే... లేదా శేఖర్‌దే అయింది. వాస్తవంగా శేఖర్‌దే... ఆనంద్ అనుచరులలో కలవరపాటు స్పష్టంగా కనిపించింది, అధైర్యం అంచులమీద వారిని నిలబెట్టింది.

వాస్తవంగా వాళ్ళ దాడి కేంద్రీకృతమైంది ఒకే ఒక అంశంమీద: అది ఆనంద్ 'అక్రమ సంబంధం'. అది ఓ కెరటంలా హఠాత్తుగా ఎగిసిపడి పట్టణాలలో, గ్రామాలలో చర్చనీయాంశ మైపోయింది. సుదూర గ్రామాలలోని ప్రజలు ఇంతకుముందెప్పుడూ ఈ ముచ్చట విన్నవాళ్ళు కాదుకనుక, పోస్టర్లవైపు చూసి ఇది నిజమా? అన్నట్టుగా ఒకరిముఖాలు ఒకరుచూసుకున్నారు. ఆ తర్వాత వాళ్ళు కాస్త నిదానించినట్టు, ఆ భోగట్టాను ప్రశ్నిస్తున్నట్టు, పోస్టర్‌లో కామోద్రేక పూరితమైన వర్ణనలను అంచనా వేయడంలో ముందువెనుకలౌతున్నట్టు కనిపించారు... తదుపరి పరిణామాలకోసం ఎదురు చూశారు.

అధికారపక్షానికి చెందిన, తుప్పుపట్టిన ఎన్నికల యంత్రం ఎట్టకేలకు, మెల్లగా, అతిమెల్లగా పనిచేయడం ప్రారంభించింది. అది బయటకొచ్చి గ్రామాల్లో ప్రభావం చూపించడానికి ఎంతో వ్యవధిపట్టింది. మహాత్మాగాంధీ దానిని ఆదుకున్నారు. దాని ప్రయోజనాల పరిరక్షణకు జవహర్లాల్ నెహ్రూ ఒక కాపలాదారుగా నిలిచారు. గ్రామాల్లో అప్పటికింకా 'నెహ్రూ కుమార్తె'గానే గుర్తింపు పొందుతున్న ఇందిరాగాంధీ ఎన్నికలరంగస్థలిపైకి భారీఎత్తున అడుగుపెట్టారు... ఎన్నికల ప్రచారంలో భాగంగా ఇందిరాగాంధీని తమ నియోజకవర్గాన్ని సందర్శింపజేయడానికి పార్టీ అభ్యర్థులమధ్య తీవ్రమైన పోటీ ఏర్పడింది. ఆమె వచ్చి కనిపిస్తే చాలు, తమ విజయావకాశాలు ఇనుమడిస్తాయని, అప్పటి వాతావరణంలో తగినంత సకారణంగానే, వాళ్ళందరూ విశ్వసించారు.

ఇందిరాగాంధీ ఎన్నికల పర్యటన కార్యక్రమాన్ని రూపొందించడానికి ముఖ్యమంత్రి చౌదరి; శేఖర్, మరి ఇరువురితో ఒక కమిటీని వేశాడు. శేఖర్ ఎంతో శ్రమించి దాదాపు పార్టీ అభ్యర్థు లందరికీ సంతృప్తికలిగించేలా పర్యటన కార్యక్రమాన్ని సిద్ధం చేశాడు. ఓ సాయంత్రం మొత్తాన్ని ఆనంద్ నియోజకవర్గానికి కేటాయించాడు, ఆ రోజు అదే చిట్టచివరి కార్యక్రమం. ఆనంద్‌పట్ల అతనికున్న విరోధాన్ని దృష్టిలో పెట్టుకుని శేఖర్ నిష్పాక్షికతను అందరూ అభినందించారు. ఎవరో ఈ విషయం చౌదరి వద్ద ప్రస్తావించినప్పుడు ఆయన పెద్దగా నవ్వేశాడు... ఆనంద్ ఏమీ మాట్లాడలేదు. తన నియోజకవర్గానికి కూడా సమయం కేటాయించండని కోరాడుకానీ, ఎన్నికల కార్యక్రమానికి శేఖర్ ఇన్‌చార్జి కావడంతో దానిని సాధించుకోడానికి ప్రత్యేకమైన ప్రయత్నమేమీ చేయలేదు. ఆమె సందర్శనను అభిలషిస్తున్న ఎందరో పార్టీ అభ్యర్థులకు అంతేకాక తనమూలాన అవకాశం లేకుండా పోవడమూ అతనికంత న్యాయంగా తోచలేదు.

పర్యటన ఖరారైన తర్వాత నియోజకవర్గంలో తగిన ఏర్పాట్లు ప్రారంభించాడు. తన నియోజకవర్గం మధ్యలో ఉన్న ఒకగ్రామానికి ఇందిరాగాంధీ రాత్రి తొమ్మిది గంటలకు చేరుకోవలసిఉంది. ఆమె రావలసిన సమయానికి అయిదుగంటల ముందునుంచే జనం పెద్దసంఖ్యలో సమావేశస్థలికి రావడం ప్రారంభించారు. గుంపులు ఇంకా ఇంకా విస్త రించి, ఆ ప్రాంతంలో ఎన్నడూ కనీవినీ ఎరుగని ప్రమాణానికి చేరుకున్నాయి. అయితే గ్రామం ప్రవేశ మార్గాలన్నింటివద్ద కొందరు అపరిచితులు నిలబడి వస్తున్న జనాన్ని తిప్పిపంపించే ప్రయత్నాలు సాగించారు. 'ఇందిరాగాంధీ పర్యటన కార్యక్రమంలో ఈ గ్రామాన్ని చేర్చలేదు...' అంటూ నమ్మబలకడం ప్రారంభించారు... పెద్ద సంఖ్యలో జనాన్ని సమీకరించి, తనే ప్రసంగించడం కోసం ఇదంతా ఆనంద్ పన్నిన పన్నాగమని కూడా వారు స్పష్టం చేశారు. 'తన ఉపన్యాసం వినడానికి అంతంతదూరాలనుంచి ఎవరూ రారు కనుక, ఆ నీతిమాలిన ముండాకొడుకు మీకు పెద్ద అబద్ధం చెప్పాడు. మీ అంతటమీరే చూస్తారుగా, ఈ పాపిష్టి వాడి తరఫున వకాల్తా పుచ్చుకోడానికి ఇందిరాగాంధీ ఏమాత్రం దిగిరారు. వీడుబొత్తిగా నీతీ జాతీలేని తిరుగుబోతు, ప్రభుత్వానికీ, పార్టీకీ మాయని మచ్చ!'

తమను తిరగ్గొట్టడానికి ఇన్ని ప్రయత్నాలు జరిగినా, జనం అక్కడికి రావడమూ తగ్గలేదు, వచ్చిన జనం తిరిగి వెళ్ళడమూ జరగలేదు. మరోవైపున, ప్రధానమంత్రి రావలసిన వేళ దాటిపోయినా, ఆమె వస్తున్న సూచనలు కనిపించకపోవడంతో ఆనంద్‌లోనూ ఆందోళన విజృంభించింది. సభను విరమించుకోవడం మంచిదని కొందరు శ్రేయోభిలాషులు అతనికి సలహాఇచ్చారు. ప్రజలకు ఇటువంటి అసౌకర్యం కలిగిస్తే మీపట్ల వాళ్ళలో వ్యతిరేకత ఏర్పడు తుందన్నారు. ఈ శ్రేయోభిలాషులను గతంలో ఆనంద్ ఎప్పుడూ కలుసుకుని ఎరగడు; వాళ్ళు వేరే ప్రాంతంనుంచి వచ్చినవాళ్ళు. వాళ్ళ ఉచ్చారణను బట్టి, నగరంనుంచి బహుశా రాష్ట్ర రాజధాని నుంచి వచ్చిఉంటారని ఆనంద్ ఊహించాడు. ఆ ఊహకి ప్రేరణ ఏమిటో తెలిసి పోతూనేఉంది; ఆనంద్ అబద్ధాలకోరని జనాన్ని నమ్మించడానికి శేఖర్ ఇలా ఉచ్చుపన్నాడు.

అర్ధరాత్రి దాటింది. ప్రధానమంత్రి మరోగంటలో అక్కడికి చేరుకుంటారని ఓ కాకికబురు అందింది. అయితే,అప్పుడున్న అనిశ్చితపరిస్థితి దృష్ట్యా ఆ మేరకు ఎటువంటి ప్రకటన చేసినా వ్యర్థం. ఇందిరాగాంధీ రాక మరింత ఆలస్యం కావచ్చునని మరో కబురుఅందడంతో, అసలెటువంటి ప్రకటనా చేయకూడదని ఆనంద్ నిశ్చయించుకున్నాడు. ఉండాలో వెళ్ళిపోవాలో తమ ఇష్టానుసారం జనమే తేల్చుకోవాలని మాత్రం సూచన ప్రాయంగా అన్నాడు. తనమటుకు తాను, ఎంత పేపైనా నిరీక్షిస్తాడు.

వెళ్ళిపొమ్మని తమపైఒత్తిడి తెస్తున్నవారికి నిరుత్సాహం కలిగిస్తూ దాదాపు ప్రతిఒకరూ నిరీక్షిస్తూ ఉండిపోయారు. తూర్పున వెలుగురేఖలు తొంగిచూస్తున్న సమయానికి ఇందిరా గాంధీ అక్కడికి చేరుకునేసరికి, ఆమె దర్శనంతో జనం ఆనందపరవశులయ్యారు. ఆమె ఏం చెప్పారో ఎవరూ వినిపించుకోలేదు, వినాలని కూడా అనుకోలేదు. దేనినైనా స్పష్టంగా వినగలిగిన శక్తి కూడా వాళ్ళకు లేదు. వాళ్ళకు అర్థమైనదల్లా పార్టీఎన్నికల గుర్తు. రాత్రంతా ఎదురుచూపులవల్ల కలిగిన అలసటనంతటినీ వాళ్ళు మరచిపోయారు.

కొంత వాకబు చేసిన మీదట, ఆలస్యానికి కారణమేమిటో ఆనంద్‌కి తెలిసింది. ఎన్నికల ప్రచారసమయంలో ఇటువంటి ఆలస్యాలు మామూలే అయినా, ఆ రోజు సాయంత్రాన్ని ముందుగా నిర్ణయించని మజిలీలతో, సమావేశాలతో నింపేసి ఆవిధంగా ఆలస్యం జరగడానికి శేఖర్ ప్రత్యేకమైన జాగ్రత్త తీసుకున్నాడు. ఆ రాత్రి ఎలాగైనా సరే ఇందిరాగాంధీ ఆనంద్ నియోజక వర్గానికి చేరుకోకుండా చూడాలన్నదే అతడి ఆంతర్యం. ఆ విషయంలో అతడు కృతకృత్యు డయ్యాడుకానీ, ఆమె వచ్చేవరకూ జనం ఎంతో విధేయంగా ఎదురుచూసి అతడి పథకాన్ని నీరుకార్చారు.

అప్పుడు కూడా ఆనంద్ ఏమీ మాట్లాడలేదు. అన్నింటినీమించి, ఎన్నికల ప్రచారంలో దర్శనాపేక్ష అనే సరికొత్తధోరణి అతడికి ఎబ్బెట్టుగా తోచింది. ఇంతకుముందు ఎన్నికల్లో కూడా జనం నెహ్రూను దర్శించడానికి ఎగబడేవారన్న విషయం అతడు గుర్తుచేసుకున్నాడు. అయినా నెహ్రూ అప్పటి సమస్యలను జనానికి విడమరచి చెప్పడంమీద ఎక్కువ శ్రద్ధ చూపించేవారు. ఆయన ఉపన్యసిస్తుంటే జనం సంపూర్ణనిశ్శబ్దంతో ఆలకించేవారు ఇప్పుడు అదే జనం కేవలం ప్రధానమంత్రిని చూడడానికి ఎగబడుతున్నారు. ఈ విపరీత ధోరణి, కేవలం ఉనికిమీద, జనాకర్షణమీద ఆధారపడిన ఈ ధోరణి, దర్శనం తప్పమరేమీ అవసరంలేని ఈ ధోరణి భావి పరిణామాలకు సూచన అవుతుందా? అలసిపోయిన జనం తిరుగుముఖం పడుతుంటే ఆనంద్ ఆలోచనల్లోకి జారిపోయాడు.

# 40

భయపడినట్టే, 1967 సార్వత్రికఎన్నికలఫలితాలు దేశాన్ని గంద్రగోళంలోనూ, దాదాపు అస్థిరత్వంలోనూ ముంచెత్తే ప్రమాదం కనిపించింది. ఎన్నికల ఇష్టారాజ్యంలో తామరతంపరగా రకరకాల పార్టీలు, గ్రూపులు పుట్టుకొచ్చాయి. వివిధరాష్ట్రాల్లో రాత్రికిరాత్రి అవకాశవాద కూటములు కుక్కగొడుగుల్లా వెలిశాయి. పార్టీల చిత్రవిచిత్ర సమ్మేళనలు సంకీర్ణ ప్రభుత్వాల్ని ఏర్పాటు చేశాయి. తొలిసారి భారతదేశంలో ప్రజాస్వామ్యం దారితప్పుతున్న సూచనలు పొటమరించాయి. మళ్ళీ ఇదంతా నెహ్రూ అంతర్ధానఫలితమే.

ఈ ఎన్నికలో ఆనంద్ గెలుపు వోట్ల లెక్కింపువరకూ అనిశ్చితంగానే పరిణమించింది. ప్రచారం పొడవునా అది ఆశనిరాశల మధ్య ఊగిసలాటగానే మారింది. అతడీసారి తన నియోజక వర్గానికే పరిమితంకావడంవల్ల, గతంలో తనమీద ఆధారపడిన ఎందరికో ఈసారి సహకరించ లేకపోయాడు. రవికుమార్ ప్రచార్భాటం ఆనంద్ అనుయాయుల్లో ధైర్యాన్ని చెదరగొట్టింది. వారిలో తిరిగి విశ్వాసాన్ని ప్రోదిచేసి, తనకు వోటువేయమని గ్రామస్థులకు నచ్చజెప్పే కర్తవ్యాన్ని అతడే నిర్వర్తించవలసి వచ్చింది. రవికుమార్ పుణ్యమాఅని, పోలింగ్‌కు రెండురాత్రుల ముందు నియోజకవర్గంలో మద్యం వరదలై పారింది. ఒంటిమీద స్పృహ ఉన్న మనిషిఒక్క గ్రామంలోనూ ఎక్కువమంది కనిపించలేదంటే అతిశయోక్తికాదు. ఆత్మగౌరవం ఉన్న వాళ్ళు తలుపులు బిగించుకుని అజ్ఞాతంగా ఉండిపోయారు. ఆనంద్, అతడి కార్యకర్తలు రాత్రిపూట అనేకసార్లు ఆ ప్రాంతంలో పర్యటించినప్పుడు, గ్రామస్తులు వాళ్ళను తప్పించుకు తిరిగారు. కొంతమంది యువకులు జట్లుజట్లుగా మోటార్ సైకిళ్ళపై గ్రామగ్రామానికీ తిరుగుతూ రవికుమార్‌కి వోటు వేయకపోతే హత్యతోసహా తీవ్రపరిణామాలను ఎదుర్కోవలసి ఉంటుందని బహిరంగంగా భయ పెట్టడంతో పరిస్థితి మరింత గంభీరంగా మారిపోయింది. పెద్దఎత్తున మారణాయుధాల ప్రదర్శన జనాన్ని భయభ్రాంతుల్ని చేసేసింది.

ఇంతగా తెగించినా రవికుమార్ విజయావకాశాలు పుంజుకున్న సూచనలు కనిపించలేదు. ఉదాహరణకు పోలింగ్‌కు ముందురోజు రాత్రి ఆనంద్ అనుచరులు, ఆనంద్‌కు ప్రత్యేకించి సన్నిహితుడైన ఓ సర్పంచ్‌ను పట్టుకున్నారు. అతడు చిత్తుగా తాగి ఉన్నాడు. అడుగడుక్కీ తూలిపడుతూ పూర్తిగా అదుపు కోల్పోయిన స్థితిలో ఉన్నాడు. తన ఇంట్లోకి ఆనంద్ అడుగు పెట్టగానే ఒక్కసారి తుళ్ళిపడి ఒకవిధమైన స్పృహలోకి వచ్చినట్టు కనిపించాడు. ఆనంద్‌కు

నమస్కరించి, అతిథుల కోసం అల్పాహారం, టీ తెచ్చిపెట్టమని పురమాయిస్తూ హడావుడి చేశాడు. అతడు పూర్తిగా తెలివిలో ఉన్నట్టుగా ఆనంద్ అతడితో మామూలుగానే మాట్లాడుతూ గ్రామంలో ఎన్నికల సరళి గురించి వాకబు చేశాడు. సర్పంచ్ మొహంలో కలవరపాటు తొంగి చూసింది. "గట్లెందుకు అడుగుతున్నరు సామీ! గీ ఊరిమీద మీకేమైనా అనుమానమా?" అని తీక్షణంగా ప్రశ్నించాడు.

అది జవాబు తోచని క్లిష్టమైన ప్రశ్నకనుక, 'లేదులేద'ని అర్థోక్తిగా అనడం మినహా ఆనంద్ మరేమీ అనలేకపోయాడు. ఆ తర్వాత అతడి అనుచరుల్లో ఒక వ్యక్తి అందిపుచ్చుకుని ఎన్నికల్లో అవినీతిపోకడ లెలాఉన్నాయో, వోటర్లు లంచాలకు లొంగిపోతే ప్రజల ప్రయోజనాలు ఎలా దెబ్బతింటాయో ఏకబిగిన ఉపన్యాసం ప్రారంభించాడు. ఆ దాడికి సర్పంచ్ చెవులప్పగించాడు. అతడున్న పరిస్థితిలో ఆ ఉపన్యాసం భరించలేనంత సమయం తీసుకున్నట్టనిపించింది. 'ఓ పెద్ద మనిషి! నాకు కోపం తెప్పించకు. మినిష్టర్‌సాబ్‌కు నా గురించి బాగా తెలుసు. మాటలు ఆపుతావా లేదా?'

అవతలి మనిషి క్షణకాలం నోటికి తాళం వేశాడు, అంతలోనే మళ్లీ ఏదో అనబోయేసరికి సర్పంచ్ మధ్యలో ఆ ప్రయత్నాన్ని తుంచేశాడు.

'నీ పెద్ద పెద్ద మాటలు పెద్దేట్ల గలువ!' అంటూ గొంతుపెంచాడు. 'ఈ ఇలాకల మొదటి సారి ఓ మడిసి జెర సారాపోపిచ్చిండు. నీ పనింతకిమాలిన మాటలతో ఇప్పుడే నువ్వు మా కడ్డుపడాలా? జమిందార్లు తినీతాగీ తైతక్కలాడుతుంటే కూటికి లేనోళ్ళు ఇంతకాలం చూసుకుంట కూసోలేదా? ఆళ్ల బతుకుల్ల మొదటిసారి పేదోళ్ళ కింత పలావ్ తినబెడతాంటే నీకు కడుపు మంటదేనికి? తప్పుగా అనుకోకసామీ,' ఆనంద్ వైపు తిరిగి అన్నాడు 'ఈణ్ణిక్కడినుంచి పొమ్మని చెప్పు. మా వూరి వోట్లకోసం ఇసుంటోళ్ళ సాయం నీ కొద్దు తెలిసిందా'?

'బాగా తెలిసింది,' సంతోషించినట్టు కనిపించడానికి ప్రయత్నిస్తూ ఆనంద్ అన్నాడు. అయితే నీతిబోధకు ఉపక్రమించిన ఆ మనిషికి ఈ మాటల్లో ఎటువంటి పొంతన కనిపించ లేదు. 'అవినీతిచర్య'గా చట్టం స్పష్టంగా నిర్వచించిన చర్యను సర్పంచ్ సమర్థిస్తున్నట్టు అర్థం చేసుకున్నాడు. అది తగదుగాక తగదని మనసులో అనుకుని మళ్లీ తాజా నీతుల్ని, ఈసారి మరింత పట్టుదలగా వల్లించడం ప్రారంభించాడు.

'ఈ నియోజకవర్గం వోట్లను పైసలకీ, సారాకీ అమ్ముకోవడం సిగ్గుచేటు...' అతడు మరింత ముందుకు వెళ్ళేలోపల, చిత్తుగా తాగున్న సర్పంచ్ చేయి పైకెత్తి మొహం బద్దలుకొట్టేంతపని చేశాడు. 'యింకోమాట అన్నావంటె ఈడనే, ఇప్పుడే నీ బొక్కలు యిరగ్గొడ్త!' అంటూ కేకలు అందుకున్నాడు. 'నా ఊరి గురించి గసుంటిమాట అనెతందుకు నీకెంత దమ్ము? బుద్ధిలేనోడా! ఉత్తగ వొచ్చిన సారాకు, తిండికీ, వోటుకు ఏమిటి సంబంధం? నాతో వోటేయించడానికీ, మానిపించడానికీ నువ్వెవడివి? నువ్వెవడివనుకుంటున్నవ్? నాకేమైనా దొరవా? తనకాడ పనిజేసెటోడు ఎవలికి వోటేస్తడో ఏ దొరకైనా తెలుస్తదా?' అతడలా చెలరేగిపోయేసరికి సమా వేశం ఇక విరమించడం మంచిదని ఆనంద్‌కు అనిపించింది. సర్పంచ్ తన తాగుబోతు పద్ధతి

లోనే కావచ్చు, రహస్య వోటింగ్‌లో ఉన్న పవిత్రత గురించి చెప్పి తనకళ్ళు తెరిపించాడ మనుకున్నాడు... ఆ గ్రామం మొత్తం మూకుమ్మడిగా ఆనంద్‌కే వోటువేసినట్టు ఆ తర్వాత తెలి సొచ్చింది. అలాగే మరెన్నో గ్రామాలు. అయితే ఈ లోపల అతడి మానసిక సమస్థితికి తగిలిన దెబ్బ అంతాఇంతా కాదు.

★ ★ ★

ఇందిరాగాంధీ కేంద్రంలో మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశారు. అయితే ఆ ప్రభుత్వం విశ్వాసాన్ని ప్రోది చేసుకోగలిగిందని చెప్పడం కష్టం.

చౌదరి మళ్లీ రాష్ట్ర ముఖ్యమంత్రి అయ్యాడు, ఆనంద్ మంత్రివర్గంలో కొనసాగుతున్నాడు అయితే గతానికీ, ఇప్పటికీ ఏ విషయంలోనూ పోలికలేదు, అరుణతోసహా. ఆమెలో ఎంతో మార్పు. ఉద్రేక ప్రవృత్తి ఆమెలో నానాటికీ పెరిగిపోతోంది. తన పార్టీతోసహా అన్నింటినీ అదేపనిగా దుయ్యబడుతోంది. దేశంలోని అస్థిరరాజకీయ వాతావరణం ఆమెను పూర్తిగా అయోమయంలో ముంచెత్తుతూ ఆమె నరాల బిగువును హరింపజేస్తోంది. ఏ విషయంలోనూ ఆమెలో అనుకూల ధోరణి లేదు, అన్నింటినీ ఖండించడమే పనిగా పెట్టుకుంది. వ్యక్తిగతరాజకీయాల్లో నిరంతరం మునిగి తేలుతూ ప్రతిచోటా శత్రువుల్ని సృష్టించుకుంది. తనకే కాదు, ఆనంద్‌కి కూడా.

కేవలం శాసనసభ్యురాలిగా తుప్పుపట్టి పోతుండడమే ఆమె చిటపటలకు కారణమని చాలామంది భావించారు. రాజకీయవాదికానీ, అధికారికానీ, వర్తకుడుకానీ ఎన్నటికీ పైకివెళ్ళే అవకాశం కనిపించనప్పుడు ఇలా తయారుకావడం సహజమేనని వాళ్ళలో కొందరు సూత్రీ కరించారు అది వాస్తవం. అయితే అరుణ విషయంలో ఈ అంశం ఒక ప్రత్యేకప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. 'చూడు తమ్ముడూ, ఆమెకో సమస్య ఉంది, చాలా చిక్కు సమస్య', విమ ర్శకుల్లో ఒకడు సానుభూతి పరుడిలా నటిస్తూ అన్నాడు. 'సమస్యేమిటంటే ఆనంద్, ఆమె- ఇద్దరూ మంత్రులు కాలేరు'.

'ఎందుకు కాకూడదు?' పళ్ళికిలిస్తూ మరో వ్యక్తి అడ్డు తగిలాడు. 'ఇద్దరు ఆత్మీయ స్నేహితులు మంత్రివర్గసహచరులు కాకూడదని రాజ్యాంగంలో రాసుందేమిటి?'

'లేదు, అందుకే బతికిపోయాం' అవతలి మనిషి అశ్లీలసూచకంగా తలపంకిస్తూ అన్నాడు.

'చౌదరికీ, ఆయన మిగిలిన మంత్రులకీ చక్కని కాలక్షేపం!' మూడోవాడు ప్రతిమాటనీ ఎంతో రంజుగా ఆస్వాదిస్తూ అన్నాడు. 'మంత్రివర్గంలో కొంత కదలిక ఉంటుంది...'

'ఎందుకుండదూ?' రెప్పవాల్చని కావలాదారులాంటి ఓ పత్రికావిలేఖరి మధ్యలో అందు కున్నాడు. 'కనీసం అదొక వార్తయినా అవుతుంది, కొన్నిరోజులపాటు, కనీసం ఒక్కరోజుకైనా....'

రాజకీయాలు పనికిమాలినవని చివరకు రాజకీయవాది కూడా భావించేరోజు ఏదో ఒకసమయంలో రాకుండా ఉండదన్నది వాస్తవం. అవి ఏమాత్రం ఆశావహంగా కనిపించవు, ఎటువంటి ప్రతిఫలమూ అందించవు. ఏమాత్రం ఆత్మసంతృప్తినీ కలిగించవు. పైగా అన్నివై పులనుంచి అదేపనిగా బురదచల్లించుకునే పరిస్థితి దాపురిస్తుంది. అందులోంచి బయటపడే

మార్గమూ తోచదు. ఎవరితో పోరాడాలో తెలియదు. చివరకు నీడలతో యద్ధం చేసిచేసి అలసి పోతారు. అరుణ పరిస్థితలాగే ఉంది. ప్రత్యేకించి దేనికైనా అనుకూలంగానో, వ్యతిరేకంగానో కాకుండా ప్రత్యేకించి ఏ ఒకరితోనో తలపడడం కాకుండా అన్నివైపులా చుట్టబెడుతూ ప్రతి ఒక్కరి సహనానికీ ఆమె పరీక్షగా మారింది. అందరినీ అయోమయంలో ముంచెత్తుతోంది. తీవ్ర నిరాశా నిస్పృహలతో ఆమె సతమతమవుతున్నట్టు రాజకీయవర్గాలు భావించాయి. పాపం పూర్తిగా ఏకాకి అయిపోయిందని మరికొందరు అంటూ వచ్చారు. 'చివరకు ఆనంద్ కూడా ఆమెకు దూరంగా పారిపోతున్నట్టున్నా'డన్నారు ఇంకా మరికొందరు, ఉత్తుత్తి సానుభూతిని కుమ్మరిస్తూ. పార్టీలో మరీమరీ విషపునోళ్ళు అరుణ రాజకీయంగా ముట్లుడిగిపోయిన స్థితిలో ఉందంటూ వ్యాఖ్యానించాయి. నీలివార్తల నిపుణులు ఎంత నైచ్యానికి దిగజారినా, అరుణలో నైరాశ్యపు ఛాయలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయన్నది ఎవరూ కాదనలేని చేదునిజం.

అదోపెద్ద నాలుగురోడ్ల కూడలి, అక్కడి వరకూ నిన్ను తీసుకెళ్ళిన రోడ్డు అక్కడితో ఆగిపోతుంది. అక్కడనుంచి మొదలయ్యే మార్గాలలో నువ్వు దేనినో ఒకదానిని ఎంచుకోవలసి ఉంటుంది. వృత్తి విరమణనో, లేదా ఎన్నికల ఓటమినో దృష్టిలో ఉంచుకొని నీ పలుకుబడినీ, పరిచయాలను ఉపయోగించుకొని డబ్బు మూటగట్టుకోవచ్చు. నీకు పాతవృత్తి అంటూ ఏదైనా ఒకటుంటే పూర్తిస్థాయిలో తిరిగి అందులోకి ప్రవేశించడానికి సన్నద్ధం కావచ్చు. పూర్తిగా సరి కొత్త వ్యాపకాన్ని కల్పించుకొని అందులో కృషికొనసాగించాలని నిర్ణయించుకోవచ్చు. మరో దారేదీ కనిపించనప్పుడు ఎంతగా ఆసక్తి సన్నగిల్లినా, ఎంతగా విసుగనిపిస్తున్నా శాసనసభ్యుడిగానే కొనసాగాలని నిశ్చయించుకోవచ్చు. అయితే రాజకీయాల్లోకి అడుగుపెట్టిన తొలిరోజున ఎంత ఉత్సాహం ప్రదర్శించారో, అంతే ఉత్సాహంతో జీవితాంతం కొనసాగిన వ్యక్తుల ఉదాహరణలూ లేకపోలేదు కానీ అటువంటి నిత్యోత్సాహుల సంఖ్య చాలా తక్కువ.

దురదృష్టవశాత్తు ఎంచుకోవడానికి అరుణకి మరోమార్గమంటూ లేకపోయింది. రాజకీయాలు ఆమెకి విసుగెత్తించాయి. తన జీవితంలో పెద్దవెలితి ఏర్పడినట్టు ఆమె భావించింది. పని పట్ల ఆనంద్ శ్రద్ధ చూసి ఆమె ఒకప్పుడు ముగ్ధురాలైంది. అయితే పైకి ఎప్పుడూ ఒప్పుకోకపోయినా, తుదీమొదలూ లేని రాజకీయాలపట్ల ఆనంద్ నిబద్ధత ఆమెకి చికాకు పుట్టించసాగింది. ప్రయోజన రాహిత్యభావం ఆమెలో క్రమంగా బలపడుతూ వచ్చింది. కేవలం ఉబుసుపోకకు సృష్టించే నీలివార్తలకు ఆమె లక్ష్యంగా మారడమే కాదు, ఆమె ప్రవర్తన ఆమె కూడా కాదనలేని, తప్పించు కోలేని విధంగా భయభ్రాంతి కలిగించే ఒక వాస్తవంగా పరిణమించింది.

బంధువులకూ, స్నేహితులకూ ఆమె పూర్తిగా దూరమైపోయింది. వాళ్ళు ఆమె మొహం మీద ఏమీ అనకపోయినా, చాటున రెండు రకాల ఆమె మీద నిందలు కుమ్మరిస్తూ వచ్చారు. వాళ్ళ తర్కం క్రూరమైనదే కావచ్చు, కానీ అత్యంత స్పష్టం. ఆమె ఆనంద్‌కు మరీ సన్నిహితంగా వెడితే వెళ్ళింది, ఇప్పుడైనా ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చు కదా? భూస్వాముల్ని నాశనం చేయాలన్న తన దిక్కుమాలిన నిర్ణయాన్ని మార్చుకోమని ఆమె ఆనంద్‌కు నచ్చజెప్పలేదా? భూములపై పరిమితి విధించే విషయంలోనే అతడలా పిచ్చిపట్టినట్టు ఎందుకు వ్యవహరిం చాలి? పట్టణ ఆస్తులసంగతేమిటి? నింగినంటే భవంతులు, గుట్టలుగా పోగుబడి ధగధగామెరిసి

పోతున్న నగానగ్రా, స్టాకుల షేర్లు, వీటి గురించేమంటాడు? అలాగే నానాటికీ బలిసిపోతున్న నల్లబజారుల గురించి, నిరంతరం సమ్మెలతో, పరిపాలనను అస్తవ్యస్తం చేసే చర్యలతో ప్రభుత్వాన్ని బెదిరించి గుంజుకునే హెచ్చుమొత్తం జీతభత్యాల గురించి, రకరకాల అదనపు రాబడుల గురించి ఎందుకు మాట్లాడడు? ముడుపులు, తలుపుచాటున బల్లకింద జరిగే రకరకాల అక్రమ లావాదేవీల గురించే మంటాడు? పేకాట టేబుళ్ళదగ్గర, ఫైవ్‌స్టార్ హోటళ్ళ పడకల మీద జరిగిపోయే ఉద్యోగాలు, పదవుల అమ్మకాల గురించే మంటాడు? హైదరాబాద్ నిజాంను (ఒకప్పుడు ప్రపంచం మొత్తంమీద సంపన్నుడనిపించుకున్నవాడు) సైతం బిచ్చగాడి స్థాయికి తగ్గించగల కాంట్రాక్టర్ మహరాజుల మాటేమిటి? సంస్కరణవిధానాలేవీ ఈ వర్గాలను ఎందుకు తాకలేకపోతున్నాయి? అత్యంతభయానకమైన ఈ పరాన్నభుక్కుధోరణివైపు, దోపిడీ వైపు ఆనంద్ తనదృష్టిని కొంచెమైనా ఎందుకు మళ్ళించలేకపోతున్నాడు? తన సొంత వేళ్ళనే నిర్మూలించుకునేందుకు ఎందుకంతగా పట్టుబడుతున్నాడు?

ఆమేదో తనే నిందితురాలైనట్టుగా వాళ్ళామెతో అదేపనిగా వాదిస్తూవచ్చారు. వాళ్ళ దృష్టిలో ఆమె నిందితురాలే. ఇదామెలో ఉద్రేకం, వేర్పాటుతనం పెరిగిపోడానికే దోహదం చేసింది. ఉద్రేకం ఆనంద్‌మీద, వేర్పాటుతనం తనచుట్టూ ఉన్న ప్రపంచంనుంచి. అలాగని ఆమె అతడితో ఎన్నడూ వాదం పెట్టుకోలేదు. అందుకవసరమైన ఓపిక ఆమెలో లేదు. వాదించడానికి తనకంటూ ఏదో ఒక స్థిరమైన విశ్వాసనిబద్ధతాలేదు. ఆమెకి తెలిసిందల్లా జరుగుతున్న రాజకీయయుద్ధంలో తను ఇరుపక్కల కాల్పుల మధ్య చిక్కుకుపోయాననే. అందులోంచి బయటపడే దారేదీ ఆమెకు కనిపించలేదు.

ఇక దేశరాజకీయ పరిస్థితికివస్తే, అధికారపక్షం మున్నెన్నడూలేనంతగా విభజితమైపోయింది. సహచరుడికీ, సహచరుడికీ మధ్య శత్రుత్వం. సభ్యుడికీ సభ్యుడికీ మధ్య వ్యతిరేకత. ఇందిరాగాంధీపై విమర్శలు వెల్లువెత్తాయి. దేశరాజధానిలోని రాష్ట్ర ప్రభుత్వ అతిథి గృహంలో పార్టీకి చెందిన ఒక సీనియర్ సభ్యుడు తన సహచరుడి దగ్గర ఇలా వెళ్ళబోసుకున్నాడు: ఆమె తన నీడ చూసుకొని తనే ఎందుకలా భయపడుతోంది? ఏదో విధంగా, తిమ్మిని బమ్మినిచేసి ఆమె ఇప్పుడు ప్రధానమంత్రి అయింది! తిమ్మిని బమ్మినిచేసి అయిందంటే నీకేమైనా అభ్యంతరమా? అలాకాకపోతే మరెలా అయింది?... సరే ఏదో విధంగా అయింది. అయిన తర్వాత అందరినీ కూడదీసుకుని ప్రజాసేవకు నడుము బిగించవచ్చుకదా? ప్రధానమంత్రి పదవికి తనే ఎన్నడైనా అర్హురాలిననీ, ఆ పదవికి తనే సహజంగా అధికారిననీ, ప్రధానమంత్రిత్వం తన శాశ్వతభవిత్యమే తప్ప మరెవరిదీ కాదనీ క్షణక్షణం రుజువు చేసుకునే ఆ ఆరాటమంతా దేనికి? గౌరవనీయులైన తన సీనియర్‌సహచరుల మీదికి తన కిచెన్‌కేబినెట్‌ను ఎందుకు ఉసిగొల్పుతోంది? అంత హీనంగా చూడడానికి వాళ్ళు చేసిన నేరమేమిటి?

అతడిమిత్రుడు జవాబు చెప్పాడు: 'బాగుంది మిత్రమా నువ్వనేది. మానవమనస్తత్వానికి సంబంధించిన మామూలు వాస్తవాలను కూడా నువ్వు విస్మరిస్తున్నావు. నన్నడుగు చెబుతాను. ఇందిరాగాంధీ ఎప్పటికీ—మళ్ళీ అంటున్నాను—ఎప్పటికీ తన విపరీతమానసికధోరణులనుంచి బయటపడలేదు— నిజంగా అదెంతో సంక్లిష్టమైన మానసిక ప్రవృత్తి. అందులో ఒక విధమైన

న్యూనతాభావం, అభద్రతాభావం, తన అనర్హతపట్ల ఒప్పుకోలు ఇమిడి ఉన్నాయి. ఎంతసేపూ తన శక్తియుక్తుల ఆధిక్యం ఇంత అద్భుతమైనదని నొక్కి చెప్పుకోవడం మీదే ఆమె ధ్యాస. దానికితోడు, అన్నింటినీమించి ఎంతో గొప్పవాడైన తనతండ్రిని కూడా జనం మరిచిపోయేంత ఘనకీర్తిని సంపాదించుకోవాలన్న తపనతో ఆమె వేగిపోతోంది.. ఇంకా అంతకుమించిన ఆకాంక్షలెన్నో ఆమెకున్నాయి. ఆ పైన ఆడది కావడంతో ఆ మనసులో ఏముందో ఎవరికీ అంతుపట్టదు. నా మాటలు గుర్తు పెట్టుకో తమ్ముడూ, ఇందిరాగాంధీ ఇక పాతుకుపోయింది. చాలాకాలం వరకు దేశంలో ఆమె ప్రధాన చర్చనీయాంశంగా నిలిచిఉంటుంది. వాస్తవమే మంటే, మంచికేకానీ చెడుకేకానీ, దేశానికి ఆమెతోపాటు– నిజానికి ఆమెకింద– మనడం నేర్చుకోక తప్పదు.' తీవ్రతలో కొంత హెచ్చుతగ్గుల తేడాతో ఇవే మనోభావాలు దేశంలోని కొన్నివర్గాలలోవ్యక్తమౌతూ వచ్చాయి.

ఇందిరాగాంధీ ప్రధానమంత్రి అయినందుకు అరుణ ఆనందానికి పట్టపగ్గాలు లేవు అయితే ఆసంతోషానికి సైద్ధాంతిక ప్రాతిపదిక ఏమీలేదు. అలాగే ప్రబలమైన స్త్రీవాద దృక్కోణం నుంచి పుట్టుకొచ్చినదీ కాదు. స్థూలంగా పురుషులపట్ల ఆమెకున్న అయిష్టానికి అది పొడిగింపు మాత్రమే ఇందిరాగాంధీ తనను పరాభవించడానికి చూసిన 'మగపందు'ల ముక్కుబద్దలు కొట్టడమే ఆమెకి సంతృప్తి కలిగించింది.

అయితే ఈ ఆనందం క్షణికమే. అరుణ ఎదుర్కొనే సమస్య– అదేదైనా కావచ్చు, ఎప్పటిలా దహిస్తూనే ఉంది. ఓ రోజు సాయంత్రం గొప్ప సంభ్రమస్థితిలో హఠాత్తుగా ఆనంద్ ఎదుటికి దూసుకొచ్చింది.

'ఏదో దేవత ఆవహించినట్టు కనిపిస్తున్నావ్ అరుణా!' ఆనంద్ పరిహాసంగా అన్నాడు. 'అల్ప మానవులతో చెప్పదగిన విషయాలేమైనా ఉన్నాయా?' ఆమెను కూర్చోబెట్టి ఎప్పటిలానే లాలనగా మాట్లాడాడు ఆనంద్.

'నేను సరిగ్గా అదే ప్రశ్నపై కొన్నిరోజులుగా తర్కించుకుంటున్నాను. ఎన్నో జరిగాయి, ఎంతో మారింది. నన్ను వాళ్ళు తిరగబడే పరిస్థితివైపు నెట్టారని నీకు తెలుసు. పార్టీలో ఉన్నందుకు నాకు మంచి శాస్తే జరిగింది. దానితో నాకు తెగతెంపైనట్టే. నాకూ, నాలాంటి వాళ్ళకి ఈ పార్టీవల్ల మరెటువంటి ప్రయోజనం ఉండదనే అనిపిస్తోంది'.

ఆనంద్ మాట్లాడలేదు. అరుణ గతంలో ఇలాగే ఉన్నట్టుండి విరుచుకుపడిన అనేక ఉదంతాలు అతడు గుర్తు చేసుకున్నాడు. తిరిగి తెలివి తెచ్చుకునే వరకు ఆమె మానాన ఆమెను విడిచి పెట్టడమే మంచిది, తన అడుగులు తూకం తప్పుతున్న విషయాన్ని ఆమె తనంతటతనే తెలుసుకుని, సరిదిద్దుకోవాలని అతడు భావించాడు. ఆమె గురించి అతడు ఆందోళనతో సతమతమవుతున్నాడు కానీ, ఏం చేయాలో తెలియడంలేదు. అయినా, విచిత్రంగా, ఆమె ఆకస్మిక విజృంభణను నివారించడానికి అతడేమైనా చేయాలని అందరూ ఆశించారు. అతడామెను అదుపుచేస్తే మంచిదని కొందరు తలపోస్తే, ఇకనైనా అతడామెతో సంబంధాలు తెంచుకోవడం మంచిదని మరికొందరు భావించారు. ఇంకా మరికొందరి దృష్టిలో అతడు పూర్తిగా నిస్సహాయుడు.

'ఇందిరాగాంధీ మరే ఇతర ప్రధానమంత్రికీ భిన్నంగా ఉంటుందని నే ననుకోవడంలేదు' అరుణ అర్థమనస్కంగా వ్యాఖ్యానించింది. అంతలోనే ఏదో ఆలోచన స్ఫురించినట్టు అంది. 'మనమందరం తగినకారణాలతోనే ఆమెను సమర్థించామనుకో, అందుకు నేనెంతమాత్రం విచారించడంలేదు. అయినా కొంతమేరకు భ్రమలు తొలగిపోయినట్టు నా కనిపిస్తోంది. ఎందుకో కారణం చెప్పలేను. ఆమెనుంచి ఏ మాశించానో నాకే తెలియదు నా మేరకు నాకు అదంతా అర్థరహిత మనిపిస్తోంది.'

'నేను అర్థరహితమని అనుకోవడంలేదు. అదెంతో ప్రాముఖ్యం ఉన్నదే అయియుంటుంది కానీ, దానిని నువ్వు పోల్చుకోలేక పోతున్నావు. అంతమాత్రాన నువ్వు చేసింది తప్పుకాదు' ఆనంద్ అన్నాడు.

'ఒప్పూ అవదు' అరుణ ఠకీమని అంది.

'అవును' ఆనంద్ అంగీకరించాడు. 'ఒక్కొక్కసారి ఏది ఏమిటో పోల్చుకోలేం'.

'వేదాంత సూత్రీకరణలు నా కవసరం లేదు,' అరుణ మృదువుగానే అద్భుతగులుతూ అంది. 'నన్ను వేపుకుతింటున్న అశాంతినుంచి బయటపడడమే నాకు కావలసింది... నే నేమిటో రుజువు చేసుకునే ఘనకార్యం ఏదైనా చేసి చూపించాలని కొంతకాలంగా నా కనిపిస్తోంది'.

'ఎలాంటిది...?' యధాలాపంగా అన్నట్టు ధ్వనింపజేస్తూ ఆనంద్ అడిగాడు. అప్పటి కామె ఏదీ ఆలోచించుకోలేదని అతడికి నిశ్చయంగా తెలుసు కాస్త అవకాశమిస్తేచాలు, ఆమె ఏమాత్రం హేతుబద్ధంకాని ఉద్రేకాల ఉప్పెనలు సృష్టించగల సమర్థురాలని అతడికి తెలుసు కనుక అటువంటి అవకాశమివ్వాలనీ అతడు కోరుకోలేదు. అయినా ఆ ప్రశ్న అడగనే అడిగేశాడు.

'నాకే తెలియదు .' ఆమె గొంతు పూడిపోయింది. అయితే కొన్ని క్షణాలలోనే ఆమె ఆపాదమస్తకం పెనుగాలికి తీగ కంపించినట్టు కంపించిపోయింది. రౌద్రంగా అంది, 'అవును... అంతే! పార్టీమీద తిరగబడతాను. . దాన్ని తన్నితగలేస్తాను... ధిక్కరిస్తాను... ప్రతిఘటిస్తాను...'

ఆనంద్ నిర్ఘాంతపోయాడు. నిమిషంక్రితం ఆమెను ప్రేరేపించినందుకు పశ్చాత్తాపపడ్డాడు. తనలా చేసి ఉండకూడదు. ఇంకేమీ అనకుండా ఊరుకున్నాడు.

'నేనేం చేయబోతున్నానో నీకు తెలుసుకోవాలని లేదా? నేనేం చేసినా నువ్వు లెక్కచేయవు, అంతేనా? ఏంచేసినా నీదేం పోతుందనేనా నువ్వనుకునేది?'

ఆమె అతణ్ణి మళ్లీ దిగ్బంధం చేసింది. లెక్క చేయనని ఎలా అనగలడు! 'నువ్వేం చేయదలచుకున్నా సరే, అలా ఎందుకు చేయాలనుకున్నావో కారణం తెలుసుకోవాలనే నేను కోరుకుంటాను అరుణా!' మృదువుగా అన్నాడు అలా ఆమె ఆలోచనాధోరణినుంచి క్షణకాలం పక్కకి తప్పించవచ్చునని అతడి ఆలోచన.

'ఎందుకా?' ఆమె కంఠం ఖంగున మోగింది. 'నే నేమిటో నిరూపించుకుంటానని చెప్పలేదా? అత్యద్భుతమైన మన పార్టీలో నేను కేవలం నీ స్నేహితురాల్ని, నీకు భజన చేసేదాన్ని. నాకు వేరే గుర్తింపేమీ లేదు. భూమిని కుదిపేసేంత ఘనకార్యం నేను దేశానికేదీ చేసి ఉండకపోవచ్చు. కానీ మినిస్టర్ ఆనంద్‌ను పట్టుకుని వేలాడడం మినహా నేను మరేమీ చేయలేదని ఎంత నికృష్ట

నాయకుడైనా అనలేడు. ఇలా కట్టె విరిచినట్టు మాట్లాడుతున్నందుకు కంగారు పడకు. కాస్త నిదానంగా ఆలోచించి, నేనిప్పుడు చెప్పింది మన పార్టీ వర్గాల విషయంలో నగ్నసత్యం అవునో కాదో తేల్చిచెప్పు. నీ జీవితంలోకి అడుగుపెట్టడం ద్వారా వాళ్లకు షాక్ కలిగించానో లేదో నాకు తెలియదుకానీ, ఇప్పుడు కచ్చితంగా వాళ్లకు షాక్ తగిలించబోతున్నాను'

ఆమె ఏం చేయదలచుకున్నదో అప్పుడుకూడా ఆనంద్ అడగలేదు ఆమె నిర్దిష్టమైన పథకం ఏదీ వేసుకుని ఉండదనే అనుకున్నాడు. ఆమెను జోకొట్టి అదంతా మరిచిపోయేలా చేయడానికా అన్నట్టు లాలనగా ఆమె తల నిమురుతూ ఉండి పోయాడు అస్థిమిత నిశ్శబ్దంలో కొన్ని నిముషాలు గతించాయి.

'ఏం చేస్తానో తెలుసా?' ఒక్క ఉదుటున లేచి తెగించినట్టుగా అంది. 'రాష్ట్రపతి ఎన్నికలో పార్టీకి వెన్నుపోటు పొడుస్తాను. సుబ్బారావుకి మద్దతు ఇస్తాను.'

'ఏమిటీ?' ఆనంద్ తన చెవుల్ని తనే నమ్మలేక ఒక్క కేక పెట్టాడు

'అవును, సుబ్బారావుకే' అరుణ ఆ పేరును మరింత ఒత్తిపలుకుతూ మళ్లీ వల్లించింది. 'కోకా సుబ్బారావుకే! నా కాయన తెలియనే తెలియడు నాకు తెలిసిందల్లా మన పార్టీకి వ్యతిరేకంగా నిలబడే దమ్మున్న అభ్యర్థి ఆయనొక్కడే ఇప్పటి నా అంచనాలో అదే గొప్ప అర్హత!'

ఆ పైన ఆమె అదేపాటగా 'కోకా సుబ్బారావు... సుబ్బారావు . సుబ్బా సుబ్బారావు... రావు రావు రావు!' అని పాడడం ప్రారంభించింది.

'ఈ చెత్తమాటలు మానేస్తావా లేదా?' ఆనంద్ కోపంగా అరిచాడు. 'నీకు పిచ్చిపట్టింది! దేనికైనా హద్దుంటుంది.!'

'ఏది హద్దు మంత్రిగారూ?' అవహేళనగా అంది 'మీరనే ఆ హద్దు కొద్దిరోజుల్లో విస్తరిస్తుంది, మీరే చూస్తారు. పార్టీ నాయకులు నా ఇంటి గుమ్మంముందు మోకరిల్లిన దృశ్యాన్ని మీరే చూస్తారు. ఇందిరాగాంధీనుంచి నాకో తియ్యతియ్యని ఉత్తరం కచ్చితంగా వస్తుంది. ఆమె కిచెన్‌కేబినెట్‌లోని కొందరు సభ్యులనుంచి పిలుపు వచ్చినా రావచ్చు. . ఐనా నేనిదంతా ఎందుకు చెప్పేస్తున్నాను? నిజానికి నీకేమీ చెప్పకూడదు! నువ్వు వీరవిధేయుడివి, నేను తిరగబడ్డదాన్ని అవతలి శిబిరంలో ఉన్న మనిషి దగ్గర నా గుట్టెందుకు బయటపెట్టాలి? ఇంకాస్త స్పష్టంగా చెప్పాలంటే శత్రుశిబిరంలో ఉన్న మనిషి దగ్గర?'

అంతగా రెచ్చగొట్టిన తర్వాత విరుచుకుపడకుండా ఉండడానికి ఆనంద్‌కు తన నిగ్రహశక్తినంతటిని కూడదీసుకోవలసివచ్చింది. కొన్నేళ్ళుగా ఆమెలో అణచిపెట్టబడి ఇప్పుడు అదుపుతప్పిన ఆగ్రహాన్నీ, అక్కసునీ అతడు అర్థం చేసుకోగలిగాడు. అందువల్ల ఆమె కోల్పోయేదేమీ ఉండదని అతడికి తెలుసు. ఆమె కోరుకునేదీ ఏమీలేదు. పరస్పర శత్రుత్వంతో, నిరంతరం కుట్రలు కుతంత్రాలలో మునిగితేలుతూ ఆమె చీదరించుకునే ఆ ముఠాల్లోని వ్యక్తులనుంచి ఆమె ఎలాగూ ఏదీ ఆశించదు. ఇక్కడే చాలామంది నాయకులు తమ అనుచరుల ఉద్దేశాలను తప్పుగా అంచనా వేస్తుంటారు; కనీసం కొందరు అనుచరుల విషయంలోనైనా. ప్రతి రాజకీయవాదీ పదవుల నిచ్చెనమీద ఎగబాకాలనే కోరుకుంటాడనుకుంటారు. అతడుకానీ, ఆమెకానీ

దేనినో సాధించడంకోసమే రాజకీయాల్లోకి వచ్చారనుకుంటారు. ఆ దేనినో సాధించడానికి అతడు లేదా ఆమె ఏమైనా సరే చేస్తారు అదే అతనికి లేదా ఆమెకు చెల్లించవలసిన మూల్యంగా పరిణమిస్తుంది —అదే వారి పాలిటి సర్వస్వం అవుతుంది. ఓటమి, నిరాశ, అన్నింటినీమించి అవమానం. . అన్నింటితో సర్దుకుపోతారు. చాలామంది విషయంలో ఈ పూర్వనిర్ధారితఅభిప్రాయం నిజమే అవుతుంది కానీ, మినహాయింపులూ ఉంటాయి. ఆ మినహాయింపుల జాబితాలోనే అరుణకూడా చేరుతుంది

★ ★ ★

భారత రాష్ట్రపతి రాజ్యాంగాధినేత[4]. ఇంగ్లండ్ రాజుతో లేదా రాణితో ఆయనను పోల్చవచ్చుకాని ఒక ముఖ్యమైన తేడా ఉంది. బ్రిటిష్ సింహాసనం వారసత్వంగా సంక్రమించేది కాగా, భారత రాష్ట్రపతిని ఎన్నిక ద్వారా నియమించడం జరుగుతుంది. పార్లమెంట్ సభ్యులు, రాష్ట్రాల శాసనసభల సభ్యులతో కూడిన వోటర్ల పరిమిత సమూహం ఆయనను ఎన్నుకుంటుంది. రాష్ట్రపతికి వాస్తవిక రాజకీయాధికారం ఏమీ ఉండకపోయినా, దేశం ఒక వ్యక్తికి ఇవ్వగలిగిన అత్యున్నత ప్రతిష్ఠనీ, విశిష్ఠ గౌరవాన్నీ ఆ హోదా ప్రతిబింబిస్తూ ఉంటుంది. ప్రభుత్వ నిర్ణయాలు రాష్ట్రపతి పేరిట జారీ అవుతూ ఉంటాయి. సాయుధ బలగాలకు సర్వసైన్యాధ్యక్షుడు ఆయనే ప్రధానమంత్రినీ, మంత్రులనూ, సుప్రీంకోర్టు, హైకోర్టు న్యాయమూర్తులను, రాష్ట్రాల గవర్నర్లనూ, ప్రభుత్వంలోని వివిధ ఉన్నతోన్నత స్థానాలలోని వారినీ ఆయనే నియమిస్తారు. విదేశీ రాయబారుల నియామకానికి సంబంధించిన ప్రామాణిక పత్రాలను ఆమోదించేది కూడా ఆయనే. వాస్తవంగా తనకోసం ప్రభుత్వం రూపొందించి అందించిన ప్రసంగపాఠాన్నే పఠించవలసి వచ్చినా 'నా ప్రభుత్వం' ఎటువంటి మహత్తర కార్యాలు చేయబోతున్నదో విశదీకరిస్తూ పార్లమెంట్ ఉభయ సభలనుద్దేశించి ప్రసంగిస్తారు. అన్నింటికంటె ముఖ్యం, ప్రభుత్వ సారథ్యం వహిస్తున్న ప్రధానమంత్రి సహా, మార్గదర్శనాలను అపేక్షించే కుటుంబంలోని పెద్దగానూ, పితృస్థానీయుడుగానూ రాష్ట్రపతిని పరిగణించడం జరుగుతూ ఉంటుంది.

రాష్ట్రపతి పదవికి ఇంతకుముందు జరిగిన రెండు ఎన్నికల్లోనూ ఫలితం ముందే తేలిపోయింది. అధికారపక్షం నిలబెట్టిన అభ్యర్థులిరువురూ — డాక్టర్. రాజేంద్రప్రసాద్, డాక్టర్. రాధాకృష్ణన్ సులభంగా విజయం సాధించారు. రాజేంద్రప్రసాద్ ఆ సరళిలోనే రెండోసారికూడా ఎన్నికయ్యారు. రెండు సందర్భాల్లోనూ— డాక్టర్ రాజేంద్రప్రసాద్‌ను రెండోసారి ఆ పదవికి ఎన్నుకునే విషయంలో, ఆ తర్వాత డాక్టర్ రాధాకృష్ణన్ దేశ రాజకీయనాయకత్వంనుంచి వచ్చిన వారు కాదు కనుక, ఆయన అభ్యర్థిత్వం విషయంలో —కొన్ని అభ్యంతరాలు వ్యక్తం కాకపోలేదు. అయితే జవహర్లాల్ ఒకసారి నిర్ణయం తీసుకున్న తర్వాత దానిని తిరగదోడే ప్రశ్నలేదు. పార్టీ తన అభ్యర్థిపై ఆమోదముద్ర వేసితీరవలసిందే. ఆ విధంగా పార్టీ అభ్యర్థి అప్రతిహతంగా రాష్ట్రపతి భవన్‌లోకి ప్రవేశించ గలిగారు.

---

[4] రాజ్యాంగాధినేత అంటే కేవలం రాజ్యాంగాన్ననుసరించి ఆయన విధులు మామూలుగా కేంద్ర మంత్రివర్గం నిర్ణయాన్ని ఆమోదిస్తూ ఉండడం వరకే పరిమితమై ఉంటాయి. నిర్ణయాలు తీసుకునే అధికారమంతా మంత్రి వర్గానికి ఉంటుంది.

డాక్టర్ రాజేంద్రప్రసాద్ పదవిలో ఉన్నప్పుడు రాష్ట్రపతి అధికారాల విషయంలో కొంత వివాదం తలెత్తింది. ఈ విషయంలో రాజేంద్రప్రసాద్‌కీ, జవహర్లాల్‌నెహ్రూకి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు సుదీర్ఘంగా సాగాయి. అయితే వాళ్ళ మధ్య గుర్తుపట్టగలిగినంతగా ఎటువంటి పొరపొచ్చాలు కనిపించలేదు ఆ ఇరువురి వ్యక్తిత్వాల మధ్య ఘర్షణ తలెత్తిందన్న భ్రమను రేకెత్తించే ప్రయత్నంలో ఢిల్లీలోని రాజకీయ అధికప్రసంగులు సృష్టించిన వదంతులను ఎవరూ విశ్వసించలేదు... ఏమైనా, ఆ వివాదం ఎప్పుడో సద్దుమణిగిపోయింది.

ఇప్పుడు, 1967లో రాజకీయజగతిలో చీలికలు నానాటికీ ప్రస్ఫుటమౌతూవచ్చాయి. ఇందిరాగాంధీ, ప్రప్రథమంగా ఒక మైనారిటీ మతస్థులనుంచి అభ్యర్థిని —డాక్టర్ జాకిర్‌హుస్సేన్‌ను నిలబెట్టాలని నిర్ణయించారు జాకిర్‌సాహిబ్‌కు ఎవరూ వ్యతిరేకులు కారు. అర్హతల విషయంలో ఆయనకెవరూ వంక పెట్టలేరు. విద్వత్తు, హుందాతనం, లౌకికచింతన ఉన్నవాడు, గొప్ప స్వాతంత్ర్య సమరయోధుడు, అత్యుత్తమ విద్యావేత్త, ఆలోచనాపరులందరూ ఆయన అభ్యర్థిత్వాన్ని శ్లాఘించారు. ఈ నిర్ణయం వల్ల మహాత్మాగాంధీ ఆత్మ శాంతిస్తుందని ఎందరో అన్నారు. ఇందిరా గాంధీకి న్యాయంగానే అభినందనలు పుష్కలంగా అందాయి అంతా బాగున్నట్టే కనిపించింది.

ఆ తర్వాత లోపల్లోపల పొగ బయలుదేరింది. జాకిర్‌సాహిబ్ నామినేషన్‌లో ఇందిరాగాంధీ తన 'సీనియర్' సహచరులను సంప్రతించిందీ, లేనిదీ ఎవరికీ తెలియదు. ఆమెకానీ, ఆ మాట కొస్తే ప్రధానమంత్రి పదవిలో ఉన్న మరెవరుకానీ నిబంధనల ప్రకారమో, లేదా అనువాయితీని అనుసరించో అలా సంప్రదించాలా, అక్కర్లేదా అన్నదికూడా ఎవరికీ ఇదమిత్థంగా తెలియదు. కొందరి ఉద్దేశంలో అది పార్టీ వ్యవహారం. నిర్ణయాధికారం పార్టీ పార్లమెంటరీ బోర్డుది. అయితే ఆ బోర్డులో ఉన్నది చాలావరకూ వాళ్లే, ఆ 'సీనియర్' సహచరులే. కనుక ఆ కోణంలోకి తలదూర్చడం వల్ల మొదటికే మోసం. అయినాసరే, అది ఇందిరాగాంధీ వ్యక్తిగతంగా తీసుకున్న నిర్ణయమన్నమాట ప్రచారంలోకి వచ్చేసింది. దశాబ్దాల అనుభవం ఉన్న పార్టీలోని సీనియర్ సభ్యుల సమష్టి విజ్ఞతను ఆమె పరిగణనలోకి తీసుకోలేదు. అదెంత మంచినిర్ణయమైనా సరే, దానిని దెబ్బతీయడానికి ఆ ఒక్క కారణమే చాలునన్నట్టుగా వాదం సాగిపోయింది.

నిజానికిది సిద్ధాంతానికి సంబంధించిన విషయమని కూడా వాళ్లు స్పష్టం చేశారు. ఆరోపిత వాస్తవాల దృష్ట్యా ఆ మాట నిజమేకూడా. అయితే జవహర్లాల్‌నెహ్రూ ప్రధానమంత్రి పదవిలో ఉంటే ఆ సిద్ధాంతపు సోది వచ్చిఉండేదా అని ఆలోచించినవాళ్లు ఒక్కరూ లేకపోయారు. అంటే, మరోసారి ప్రధానమంత్రి వ్యక్తిత్వమే తేడా తెచ్చిపెట్టింది. ఇటువంటి కీలకమైన విషయంలో ఇందిరాగాంధీ సొంత ఇష్టాయిష్టాలననుసరించి వ్యక్తిగత నిర్ణయం తీసుకుని పెత్తనం చలాయించడానికి ఎలా ఒప్పుకుంటారు? అలా జరగడానికి ఎంతమాత్రం వీల్లేదంటూ ఆమె వ్యతిరేకులు ఉద్ఘాటించారు.

అయితే జాకిర్‌సాహిబ్‌తో తలతూగే అభ్యర్థిని వెతికిపట్టుకోవడం మాటలుకాదు. అర్హులనిపించుకున్నవాళ్లు కూడా వెనక్కు తగ్గారు. రాష్ట్రపతి ఎన్నికలో అధికారపక్షం అభ్యర్థితో మరే అభ్యర్థీ పోటీ పడలేరన్నది అందుకు ప్రథమ కారణం. ఇక అప్పటి పరిస్థితినిబట్టి ఆ సందర్భం ఈ దేశపు లౌకికవాద నిబద్ధతకు పరీక్షగా పరిణమించడం రెండోకారణం. అందుకే జాకిర్

సాహిబ్ వంటి విశిష్టమూర్తిమత్వం కలిగిన ఓ మైనారిటీ అభ్యర్థికి వ్యతిరేకంగా పోటీ చేయడానికి ఎందరో విఖ్యాతవ్యక్తులు ముందుకు రాలేకపోయారు. ఆయనను వ్యతిరేకించడమే ఒక అపచారంగా కనపించింది లేదా అలాగని, కనీసం అంతరాంతరాల్లోనైనా వాళ్లనుకున్నారు. పైకి అనక పోయినా అది మంచిచెడుల వివేచనకు సంబంధించిన లోతైన ప్రశ్నగా పరిణమించింది. 'చూశావా, ఇందిరాగాంధీ మనకెటువంటి సందిగ్ధ పరిస్థితి తెచ్చిపెట్టిందో' అంటూ సీనియర్ రాజకీయవాదులు ఆగ్రహాన్ని కుమ్మరించుకున్నారు. 'ఆమె మనకక్షరాలా అగ్నిపరీక్ష తెచ్చిపెట్టింది... మనం జాకిర్‌సాహిబ్‌ను సమర్థించామా, ఆమె ఎటు నడిపిస్తే అటు నడిచే గొర్రెల మందలా మారిపోతాం. ఆ ఎన్నికవల్ల వచ్చే ఘనకీర్తినంతటినీ ఆమె మూటకట్టుకుంటుంది. పోనీ, ఆయన అభ్యర్థిత్వాన్ని వ్యతిరేకిద్దామా అంటే జనం మనల్ని హిందూమతతత్వవాదులని తిట్టిపోస్తారు.'

కోకా సుబ్బారావు భారత ప్రధానన్యాయమూర్తిగా ఉన్నప్పుడు, గోలఖ్‌నాధ్ అనే కేసులో తన తీర్పుతో చరిత్ర సృష్టించారు. తదుపరికాలంలో ఆ తీర్పు ఒక వరవడిగా రూపొందింది. ఆ తీర్పుపై చాలాకాలంపాటు వివాదం చెలరేగింది. ఆ విధంగా మంచికో, చెడుకో రాష్ట్రపతి ఎన్నికలో పోటీచేసే అభ్యర్థికి కావలసిన ముఖ్యమైన అర్హతను ఆయన చూపించుకోగలిగారు. ఆయన గురించి పదిమందికీ తెలిసిఉండడమే ఆ అర్హత. ప్రసిద్ధుడు కావడమే కాదు, చెప్పుకో దగిన ప్రాముఖ్యం కలిగిన సైద్ధాంతిక కవచాన్ని ఆయన సమకూర్చుకోగలిగారు. అప్పటికే గోలఖ్‌నాధ్ తీర్పు రాజ్యాంగమేఘగర్జనగా మారి చూస్తుండగానే రాజకీయపు గాలిదుమారంగా పరిణమించింది. అందులోని వస్తువు విస్తృతప్రజానీకంతో ప్రత్యక్షంగా ముడిపడినట్టిది.

క్లుప్తంగా చెప్పాలంటే, భారత రాజ్యాంగంలోని తృతీయాధ్యాయంలో (భావప్రకటన హక్కు, సంఘంగా ఏర్పడే హక్కు, ఏ వృత్తినైనా అవలంబించే హక్కు, మతసంబంధమైన స్వేచ్ఛా మొదలైన) 'ప్రాథమికహక్కులు', చతుర్థాధ్యాయంలో (ప్రజాసంక్షేమానికి దోహదంచేసే సాంఘిక వ్యవస్థ ఏర్పాటు, గ్రామపంచాయతీల సంఘటన, పిల్లలకు ఉచిత విద్య, షెడ్యూల్డ్ జాతుల జనజాతుల విద్యా ఆర్థిక సంబంధమైన హితాల రక్షణ, మాంసంకొరకు పాడిఆవుల, దూడల కోత నిషేధించడం, మద్యపాన నిషేధం అమలుచేయడం, లఘుపరిశ్రమల అభివృద్ధి, పర్యావరణ పరిరక్షణ, వన్యమృగ ప్రాణరక్షణ మొదలైన) 'రాజ్యవిధానపరమైన ఆదేశికసూత్రాలు' పొందు పరచబడి ఉన్నాయి. ఏదేని సందర్భంలో ఆ ప్రాథమికహక్కులకూ ఈ ఆదేశికసూత్రాలకు మధ్య వైరుధ్యం వస్తే రెంటిలో ఏది నెగ్గాలి?... నేరుగా ఇలాంటి ప్రశ్నే ఉద్భవించిన గోలఖ్ నాథ్ కేసులో ఆనాడు సుప్రీమ్‌కోర్టులో ప్రధానన్యాయమూర్తిగా ఉన్న కోకా సుబ్బారావు ఆ రెండు అధ్యాయాలమధ్య ప్రాథమికహక్కులకే ప్రాధాన్యం ఉంటుందని నిర్ద్వంద్వంగా నిర్ణయించడం జరిగింది. అట్టి హక్కులను ఉల్లంఘిస్తూ ఏ రాజ్యవిధానాన్నీ అమలుపరచడం రాజ్యాంగరీత్యా చట్టబద్ధం కాదు. ఈ తీర్పు పరిణామంగా లక్షలాది జీవితాలపై ప్రభావం పడుతుంది; కనీసం ఆ సందర్భంలో జనం అలా భావించారు. ప్రజాభిప్రాయం తారస్థాయి నందుకుంది. దాని పర్యవసనాలు నేటివరకూ అనుభవంలోకి వస్తున్నాయి.

రాజ్యాంగవివాదం మాత్రమే కాదు, సుబ్బారావు అభ్యర్థిత్వంలో అంతకుమించిన అంశాలూ ఉన్నాయి. భారత పౌరుడికి ఎన్ని హక్కుల్ని ఊహించడానికి వీలుందో వాటన్నింటికోసం పోరాడే

యోద్ధగా ఆయన కనిపించారు. గొప్పవ్యక్తి, గొప్ప అభ్యర్థి. దేశానికి స్వాతంత్ర్యం తెచ్చి పెట్టిన అంతటి ఘనమైన పార్టీ, హక్కుల స్వాతంత్ర్యాల పరిరక్షణకు కంకణం కట్టుకున్న మహనీయుణ్ణి ఓడించాలనుకోవడం చాలా బాధాకరం, అదెంత అవివేకం! ఎంత విషాదకరం! ఈ ఉన్మాదానికి అడ్డుకట్టవేయగల సాహసి అధికారపక్షంలో ఒక్కడూ లేడా? రాజ్యాంగం హామీ ఇచ్చిన ప్రాథమికహక్కులను పార్టీ వ్యతిరేకించితీరవలసిందేనా?

వివిధ రాజకీయపక్షాలు సుబ్బారావుకు మద్దత్తుగా నిలిచాయి అయితే ఆయన మద్దత్తుదారులు గట్టిపోటీని ఇవ్వగలరే కాని చివరకు ఆయన ఓటమి తథ్యం. 1967 ఎన్నికల తర్వాత పార్లమెంటు లోనూ, రాష్ట్రాల శాసనసభల్లోనూ తన సంఖ్యాబలం తగ్గినాసరే అధికారపక్షమే విజేతకావడం ఖాయం. అధికార పక్షంనుంచి తగుమేరకు ఫిరాయింపులు జరిగితేనే ఫలితం తారుమారై, పార్టీలోని విరోధులు తీవ్రంగా అభిలషిస్తున్నట్లు ఇందిరాగాంధీకి అదొక గుణపాఠం అవుతుంది.

ఇక యోధులశ్రేణికి మరోవైపు సుబ్బారావు విరోధులున్నారు సుబ్బారావు రాష్ట్రపతి అభ్యర్థిగా ముందుకురావడానికి ఎంతో ముందుగానే, గోలఖ్‌నాథ్ తీర్పు న్యాయస్థానాలను కుదిపేసినప్పటినుంచే వాళ్ళు జోరుగా పనిచేయడం ప్రారంభించారు ఏలాటి అడ్డూ అదుపూలేని స్వేచ్ఛకోసం, సంపూర్ణ ఇష్టారాజ్యం కోసం, ఆర్థిక పరిభాషలో చెప్పాలంటే విశృంఖల ప్రైవేటీకరణ కోసం పోరాడుతున్న మనిషిగా ఆయనను చిత్రించారు. సోషలిజానికీ, జవహర్లాల్ నెహ్రూ విశ్వసించిన విలువలన్నింటికీ అది విరుద్ధం. గోలఖ్‌నాథ్ తీర్పు వల్ల, ప్రభుత్వం తలపెట్టిన సంక్షేమ, అభివృద్ధి చర్యలన్నీ స్తంభించిపోవటం ఖాయమని వాళ్ళు స్పష్టంచేశారు. విశృంఖల ధోరణి కలిగిన ఏ దుర్జనవ్యక్తి అయినా సరే అప్పుడు మొత్తం సమాజాన్ని గొంతు నులిపి ఉక్కిరిబిక్కిరి చేయగలడు. రాజ్యాంగంలోని చతుర్థాధ్యాయం ఎప్పటికీ మృతాక్షరంలానే మిగిలి పోతుంది. గోలఖ్‌నాథ్ తీర్పుతర్వాత పూర్తి పెట్టుబడిదారీవిధానమే ఏకైక రాజ్యవిధానంగా మిగులుతుంది. దానిని తమ రాష్ట్రపతి మూర్తీభవించాలని భారతప్రజలు కోరుకుంటున్నారా?

అధికారపక్షంలోనే రెండు అభిప్రాయాలు పక్కపక్కన రూపొందాయి. మొదటిది జాకిర్‌సాహిబ్‌కు అనుకూలంగా పైపైన ప్రకటించుకునే 'అధికారిక' అభిప్రాయం. రెండోది, అంతే దృఢంగా సుబ్బారావుకు అనుకూలంగా వ్యక్తమయ్యే లోపాయికారీ అభిప్రాయం. సుబ్బారావుకు మద్దత్తుగా బాహాటంగా వాదించిన వాళ్ళెవరూ లేకపోయినా, ఫిరాయింపు సన్నాహాలు చురుగ్గా జరిగిపోతూనే వచ్చాయి. వాస్తవంగా అది, జాకిర్‌సాహిబ్, సుబ్బారావులలో ఎవరో ఒకర్ని ఎంచుకోవడానికి సంబంధించిన ప్రశ్నకాదు. తరచిచూస్తే, అది ఇందిరాగాంధీ ఉచ్ఛస్థితిని అందుకోవడం పతనం కావడమా అన్నదానికి సంబంధించిన సమస్య. ఇక రాష్ట్రస్థాయికి వస్తే, అధికారపక్షంలోనే ఉన్న రెండు గ్రూపులలో ఏదో ఒకదానిని ఎంచుకోవడానికి సంబంధించిన ప్రశ్న. దానికితోడు ఎంపికను వ్యక్తిగతకార్పణ్యాలు కూడా శాసిస్తాయి కొందరి దృష్టిలో జాకిర్‌సాహిబ్ అక్షరాలా అవతారపురుషుడు. మిగిలిన వాళ్ళ దృష్టిలో సుబ్బారావు సాక్షాత్తు భగవత్స్వరూపం.

ఓ రోజు ఉదయం ఢిల్లీలోని పార్లమెంట్ సెంట్రల్ హాల్లో సుబ్బారావు గుణసంపదను కీర్తించడానికి ఏర్పాటైన ఒక అఖిలపక్ష పార్లమెంటరీ బృంద సమావేశంలో అరుణ పాల్గొంది. పార్లమెంటు ఉభయ సభల్లో తీరూతెన్నులేని చర్చలేవో జరుగుతుండడంతో ఆ బృందం సభ్యుల

సంఖ్యాక్రమంగా పెరుగుతూ వచ్చింది బృందం సభ్యుల మధ్యనే చర్చ చోటుచేసుకున్నా ఎవరికివారు తోచినట్టు మట్లాడుతుండడంతో ఆ చర్చకు తలాతోకా లేకుండా పోయాయి. వారిలో ఏ ఒకడు కానీ ఏ ఒకర్త కానీ తన మనోగతం ఇదని స్పష్టంగా తేల్చి చెప్పలేదు. దాంతో ఆ చర్చ అప్పటికే ఉన్న ఉద్రిక్త పరిస్థితిని మరింత పెంచింది చర్చలో పాల్గొంటున్న మిగిలిన వాళ్ళపై కన్నేసి ఉంచడానికే కొందరక్కడికి వచ్చి కూర్చున్నట్టు గుసగుసలు వ్యాపించాయి. చర్చలో ఎవరేం మాట్లాడారో అక్షరం కూడా పొల్లుపోకుండా ఇందిరాగాంధీ నిమిషాలవారీ నివేదికను తెప్పించుకున్నట్టు కూడా చెప్పుకున్నారు. తన అంచనాలను తాను రూపొందించు కోవడంలో ఆమె తలమునకలౌతోంది ఎంతైనా ఇది ఆమె ప్రతిష్ఠతో ముడిపడిన విషయంకదా, అని ఒకరినొకరు హెచ్చరించుకున్నారు.

కూడికలు తీసివేతలు మరింత గంద్రగోళం కలిగించసాగాయి. అధికారపక్షం నుంచి ఫిరాయించ డానికి ఇంతమంది సిద్ధంగా ఉన్నా రంటూ రాష్ట్రస్థాయిలో ఎందరో నమ్మశక్యం కాని అంకెల్ని ప్రదర్శించడం ప్రారంభించారు. పార్లమెంటు సభ్యుల్లోనే తీసుకుంటే సుబ్బారావుకి మద్దత్తు ఇచ్చేవారుగా వందమంది లెక్కతేలారని వాళ్ళ పేర్లతో సహా చెప్పుకొచ్చారు. అయితే ఆ లెక్కింపు సమయంలో అక్కడ హాజరైన వారిలో ఆ పేర్లున్న వాళ్ళలో ఒక్కరూలేదు. 1965లో పాకిస్తాన్‌తో యుద్ధం జరిగిన వెనువెంటనే ఇందిరాగాంధీ దేశం నెత్తిమీద ఓ ముస్లిం అభ్యర్థిని రుద్దబోవడం ఎంతో అవివేకపూరితమైన ఉన్మత్త చర్య అంటూ నోరుచేసుకోగలిగిన కొందరు సభ్యులు వాదించారు. ప్రత్యేకించి జాకిర్‌సాహిబ్ విషయంలో అది పరమఅన్యాయం అన్నారు వాళ్ళు, ఆయన పట్ల ప్రగాఢ భక్తిని ప్రదర్శించుకుంటూ. ఆయన ఓడిపోయారనుకోండి— అహా, అనుకోండి— దేశానికెంతటి తలవంపు! దేశం ఇప్పుడున్న ఘట్టంలో కొనితెచ్చుకోదగిన ప్రమాదమేనా ఇది? అని వాళ్ళు ప్రశ్నించారు. ఫిరాయింపు వెనుక ఉన్న తర్కానికి అరుణ లోబడిపోయింది. సుబ్బారావును ఆరాధించే ఎం.ఎల్.ఎ లు తన రాష్ట్రంలో డజన్ల సంఖ్యలో ఉన్నారని ఆమె స్పష్టం చేసింది. పెద్దఎత్తున ఫిరాయింపులు జరుగుతాయని జోస్యం చెప్పింది. సెంట్రల్ హాలులో ఆమె రాత్రికి రాత్రి ప్రసిద్ధురాలైపోయింది. పత్రికలు ఆమెను సింహినీ ప్రమాణానికి పెంచేశాయి.

జర్నలిస్టులు ఈ విషయమై సీనియర్ నాయకుల వ్యాఖ్య కోరినప్పుడు వాళ్ళు చాలావరకూ కప్పదాటు జవాబులే ఇచ్చారు. వాళ్ళలో ఒకరు అయిష్టతను ధ్వనించే గొంతుతో అన్నాడు. 'విప్ ప్రకారం పార్టీ జాకిర్‌సాహిబ్‌కే వోటు వేస్తుందనుకోండి. అయినా ఈ ఘట్టంలో అభ్యర్థి ఎంపిక గురించి, ఎన్నిక సమయం గురించి మాట్లాడుకోవడం తగదేమో. చూడండి, జరిగిందేదో జరిగిపోయింది. ఊరికే తవ్వుకోవడం వల్ల ఏమిటి ఉపయోగం? ఒకవేళ ఆయన గెలవలేక పోతే పరిస్థితేమిటన్నది మీ ప్రశ్న. దానిపై నేను చెప్పగలిగిందేమీలేదు. జాకిర్‌సాహిబ్ తప్పకుండా గెలుస్తారని నా ఉద్దేశం. అయినా జయాపజయాలు ఆటలో భాగం, అవునా కాదా? ఇంతకీ ఆయనను ఎవరు ఎంపిక చేశారని కదూ మీరు అడుగుతున్నది? ఎవరు చేస్తే ఏమిటి? ఇందిరా గాంధీ ఒక్కరే చేశారనుకుందాం. అయితేమాత్రం ఏమిటి? ప్రధానమంత్రి నాతో సంప్రతించ లేదని చెప్పమనా మీ ఉద్దేశం? అయినా అదంత ముఖ్యంకాదు. ఇక పర్యవసానాలంటారా,

భరిస్తాం, తప్పుతుందా? పార్టీ నిలబడినా పడిపోయినా నాయకత్వం నిర్ణయాలవల్లే జరగాలి. ఇంతవరకూ అదేపరిస్థితి, ఇకముందూ అంతే...'

ఇందులోని అంతరార్థాన్ని విలేఖరి క్లుప్తంగా వివరిస్తూ రాశాడు 'పార్టీ సీనియర్ నాయకుడు నాయకత్వాన్ని ఖండించారు. రాష్ట్రపతి అభ్యర్థి ఎంపిక ఇందిరాజీ వ్యక్తిగతనిర్ణయానుసారం జరిగిందన్నారు పార్టీ అగ్రనేతలను సంప్రతించలేదన్నారు. జాకిర్‌సాహిబ్ పరిస్థితి ప్రమాదంలో పడిందనీ, ఆయన ఓడిపోతే అందుకు ప్రధానమంత్రే పూర్తి బాధ్యత వహించవలసి ఉంటుందనీ స్పష్టం చేశారు...'

ఇంటర్వ్యూ సమయంలో అక్కడే ఉన్న ఒక సహచరుడితో ఆ విలేఖరి అన్నాడు. 'అతడక్షరాలా అలా అనలేదనుకో... కానీ తన ఉద్దేశం అదికాదని అతడూ అనలేదు!'

ఇందిరాగాంధీ వెనుతిరిగిచూడలేదు. మరోసారి తిరుగులేని నిర్ణయం జరిగిపోయింది. ఫిరాయింపుకు సిద్ధపడినట్టు కనిపించినవాళ్ళతో ఎవరైనా మాట్లాడిన జాడగానీ, బుజ్జగించిన జాడకానీ కనిపించలేదు. అధికారపక్షం అభ్యర్థి ఓడిపోతాడనీ, ప్రధానమంత్రి తలఎత్తుకోలేని దుస్థితిలోకి జారిపోతారనీ విడుపు లేకుండా జరిగిన ఊహాగానాల మధ్య డాక్టర్ జాకిర్‌హుస్సేన్ రాష్ట్రపతిఎన్నికలో కోకా సుబ్బారావుపై విజయం సాధించారు.

'ఏం జరిగిందో నాకు తెలుసు', పార్టీకి చెందిన మరో సీనియర్ నాయకుడు అన్నాడు. 'జరగబోయే దదేనని కూడా నాకు తెలుసు. నీకు తెలుసో తెలియదో, ఇందిరాజీ అప్పటికే వామపక్షాల పూర్తి మద్దత్తును కూడగట్టుకున్నారు. తన సొంత పార్టీ సహచరులపై తను పైచేయి సాధించుకోడానికి ఆమె కమ్యూనిస్టులపై ఆధారపడడం ఎంత సిగ్గుచేటు!'

'సరే... నేనెంతమాత్రం ఆశ్చర్యపోవడంలేదు', ఇంకో నాయకుడు అందుకున్నాడు. సుబ్బారావు స్వరాష్ట్రంలో ఆయన సన్నిహిత బంధువులతో ఎప్పటికప్పుడు మంతనాలు జరుపుతూ వచ్చిన వ్యక్తిగా ఈయన పదిమందిలో ప్రచారమయ్యాడు. 'నా మాటల్ని గుర్తుపెట్టుకో, ఇందిరాగాంధీ కచ్చితంగా దేశాన్ని తీసుకెళ్ళి కమ్యూనిస్టుల చేతుల్లో పెడుతుంది. ఆమె అదేకృతనిశ్చయంతో ఉంది. నిక్కచ్చిగా నా అభిప్రాయం చెప్పమంటే, ఆమెకీ కమ్యూనిస్టులకీ పెద్దతేడా లేదంటాను!'

ఇందిరాజీ ఏమాత్రం జంకూ గొంకూలేకుండా సాధించిన ఆ విజయాన్ని ఆమె విరోధులు ఏనాటికీ క్షమించలేకపోయారు.

# 41

ఇందిరాగాంధీ విజయం సాధించారు ఎవరిమీద? అది తేల్చిచెప్పడం అంత తేలికకాదు. అనివార్యంగా, ఆమె విజయం అధికారపక్షంలోని సహచరులలో ఆమెపట్ల అక్కసును మరింత పెంచింది. తన సుదీర్ఘచరిత్రలో పార్టీ మరోసారి అంతర్గత ఘర్షణలవల్ల చీలిపోయే ప్రమాదం నానాటికీ స్పష్టపడుతూ వచ్చింది. కొంత సమయం పడితే పట్టవచ్చు కానీ, చీలిక తథ్యమన్న విషయంలో సందేహానికి తావు లేకపోయింది.

దేశంలో అప్పుడున్న రాజకీయవాతావరణం, అభివృద్ధిమార్గంలో దృఢంగా అడుగు పడుతుందన్న ఎటువంటి హామీని ఇవ్వలేకపోయింది. ఆయా ముఠాలు పరస్పరం అదే పనిగా కుమ్ములాడుకుంటూ నిర్మాణాత్మకంగా ఏమీ జరగలేని పరిస్థితిని సృష్టించాయి. దేశం ఎదుర్కొంటున్న సమస్యలపట్ల అన్ని పార్టీలు ఆందోళన ప్రకటిస్తున్నవే, కానీ వాటి విషయంలో ఏదైనా చేయడానికి ఏ పార్టీకీ తీరికా లేదు, ఇచ్ఛా లేదు; తమలోతాము ఘర్షణపడడంలో అవి తలమునకలవుతున్నాయి. వేర్పాటువాద, ప్రాంతీయవాద ధోరణులు పుంజుకుంటూ ఉన్నాయని అధికారపక్షం విచారం వెలిబుచ్చడం ప్రారంభించింది. ఈ పరిణామాలకు నాయకులు ఒకరి నొకరు నిందించుకోవడం మొదలుపెట్టారు. ప్రాంతీయవాదం పెచ్చరిల్లడానికి కారణం చాలా వరకూ జాతీయస్థాయిలో జనాన్ని ప్రభావితుల్ని చేయగల నాయకత్వంలో లేకపోవడమన్న విషయాన్ని వారు గుర్తించలేకపోయారు. అది ప్రజల్లో వచ్చిన పరివర్తన కానేకాదు. దేశ నాయకత్వమే తన మరుగుజ్జపోకడను అలా ప్రజానీకంలో ప్రతిఫలింపజేసుకుంటోంది.

1967 సార్వత్రికఎన్నికల తర్వాత, ఒక విషయం అసందిగ్ధంగా తేలిపోయింది. ఇందిరా గాంధీ జవహర్లాల్ కారు. అధికారపక్షం లోపల సమష్టి నాయకత్వంగానీ (అటువంటి దెలాగూ లేదు), అధికారపక్షానికి వెలుపల ఉన్న నానాగోత్రాల నాయకుల గుంపు కానీ నూతన సంక్లిష్ట పరిస్థితికి పరిష్కారాన్ని సమకూర్చలేవు. పార్టీ బలవత్తరమైన ఒక అధినేతను అందించడమో, లేదా అరాచకత్వం అంచులమీద-నిలబడిన రాజకీయపరిస్థితిని ఎదుర్కోవడమో దేనినో ఒక దాన్ని ఎంచుకోవలసిన అనివార్యత తోసుకొచ్చింది.

పటిష్ఠనాయకత్వాన్ని స్థాపించ వలసిన అవసరాన్ని గుర్తించినా, అందుకు ఉద్దేశించిన అన్వేషణ ఇందిరాగాంధీని దాటిపోలేకపోయింది. ఆమె అప్పటికింకా నాయకురాలు కాలేదు.

అయినాసరే, 'నాయకత్వస్థానాన్ని ఎవరు భర్తీచేయగలరు?' అన్న ప్రశ్నకు అందరినీ మించి ఆమె ఒక్కరే అత్యుత్తమ సమాధానంగా తోచారు .. అప్పుడు నెలకొన్న పరిస్థితికి సరిగ్గా సరిపోయే క్లుప్తీకరణ ఇది. సందర్భవశాత్తు, ఇంకెంతమాత్రం సందేహానికీ, కాదనడానికీ అవకాశంలేని ఇందిరాగాంధీ స్వీయ ఆకాంక్షలూ, దేశం అవసరాలూ ఒకదానికొకటి అతికినట్టు సరిపోయాయి విరోధులు గుడ్డిగా ఆమెను వ్యతిరేకిస్తూనే ఉన్నారు. పరిస్థితిని అదుపులో ఉంచడానికి మొక్కవోని ఆమె సంకల్పశక్తీ, దృఢనిశ్చయప్రవృత్తీ దేశానికి ఎంతో అవసరమన్న వాస్తవాన్ని వాళ్ళు గుర్తించలేకపోయారు. వాళ్ళలో ఎవరికివారు నాయకత్వ స్థానానికి తామే అన్నివిధాలా అర్హులమని ఎలా తలపోశారో అర్థంకాదు. ఈ ఘట్టంలో ఎంతో కీలకమనదగిన అటువంటి తులనాత్మక పరిశీలనకు పూనుకున్న వాళ్ళూ లేకపోయారు. వాళ్ళలో చాలామంది నాయకత్వస్థానానికి ఇందిరాగాంధీ అనర్హురాలన్న తమ అభిప్రాయాన్ని రకరకాల వక్రమార్గాల్లో ఊకదంపుడుగా ఉద్ఘాటించడంతో సరిపెట్టుకున్నారు. అన్నింటినీ మించి, పార్టీలో పాతకాపులకు అభిముఖంగా తనెక్కడ నిలబడి పోరాడుతున్నదీ ఇందిరాగాంధీకి ఎంత తెలుసో, ఇందిరాగాంధీకి అభిముఖంగా తామెక్కడ నిలబడ్డారో వారికికూడా అంతే తెలుసు. ఆ విధంగా అభద్రతాభావం పరస్పరమూ సంపూర్ణమైంది. ఆ పరిస్థితుల్లో పైపై మర్యాదలు తప్ప నిజంగా అవసరమైన కనీస అవగాహనకీ, స్నేహభావానికీ కూడా వాళ్ళమధ్య అవకాశం కనిపించకుండాపోయింది.

దృశ్యమానపరిస్థితులు వెనకటిలానే కొనసాగుతూ ఉండిఉంటే రాజకీయపరమైన ఈ చీలికలనూ, చీలికశకలాలనూ దేశం నిబ్బరంగా ఎదుర్కొని ఉండేది. అయితే ఇప్పుడు దేశం కనీవినీ ఎరుగని సంక్షోభంలో చిక్కుకుపోయింది – నిజానికి ఒక్క సంక్షోభం కాదు, సంక్షోభ పరంపర. గతంలో ఎన్నడూ లేనంతగా ఇప్పుడు దేశానికి రాజకీయసుస్థిరత్వం అత్యవసరంగా పరిణమించింది. కొన్ని సంక్షోభాలు అంతర్గతమైనవి, కొన్ని బాహ్యమైనవి. ఉదాహరణకు, కరవుకాటకాలు, చీడపీడలు పూర్తిగా అంతర్గతమైనవి కాగా, చైనా దురాక్రమణ, పాకిస్తాన్‌తో యుద్ధం వంటివి బాహ్యమైనవి. ఈ సమస్యల సంపుటిని విడివిడిగా ఎదుర్కోవడం మరీ అంత కష్టమేమీ కాదు. అయితే 1967లో పశ్చిమబెంగాల్‌ను ఆనుకుని ఉన్న వాయవ్య సరిహద్దుల వద్ద పొడసూపిన సరికొత్త పరిణామం అంతర్గత, బాహ్య కారణాల సంక్లిష్టసమ్మేళనం. అది, భారతదేశ సాంఘికరాజకీయ వ్యవస్థను వేళ్ళతోసహా కుదిపివేస్తుందనిపించింది. దేశ రాజకీయ వ్యవస్థకు ఎదురైన ఆ సరికొత్త సవాలు: నక్సలిజం.

నక్సల్‌బాడీలో మొదలైన ఉద్యమం అది. పశ్చిమబెంగాల్‌లోని డార్జిలింగ్ జిల్లాలో హిమాలయ పాదపర్వతశ్రేణుల మధ్య, ప్రధానంగా గిరిజనులు నివసించే అరవై, డెబ్బై గ్రామాల సముదాయం నక్సల్‌బాడీ. నేపాల్, సిక్కిం, భూటాన్, టిబెట్ (అంటే చైనా), తూర్పు పాకిస్తాన్ (ఇప్పుడు బంగ్లాదేశ్)లకు ఆనుకొని ఉన్న మన సరిహద్దుల్లో దేనినుంచైనాసరే, కొండలు గుట్టల వెంబడి (నలభై నుంచి డెబ్బై మైళ్ళు) తేలికగా ప్రవేశించడానికి వీలైన దూరంలో ఉందది. కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్ట్ - లెనినిస్ట్) పంథాను అనుసరించే ఈ నూతనపక్షం ప్రస్తుత సాంఘిక రాజకీయ వ్యవస్థను సమూలంగా కూల్చివేసి, సరికొత్తవ్యవస్థను దాని స్థానంలో నిలపాలని లక్ష్యంగా

పెట్టుకుంది. మావోసేటుంగ్ ప్రబోధించినట్టు 'తుపాకి గొట్టం'ద్వారా రాజ్యాధికారాన్ని చేజిక్కించుకోవాలని దాని సంకల్పం. గ్రామీణప్రజల్ని సమీకరించి అధికారాన్ని హస్తగతంచేసుకునే సంకల్పంతో దేశవ్యాప్తంగా నక్సల్‌బాడీయంత్రాంగాన్ని నిర్మించడానికి అది తలపెట్టింది. నిరుపేదలు, అణగారిన గిరిజనులు, పాలికాపులు, విద్యార్థులు; భూస్వాముల, పోలీసుల అణచివేతకు గురవుతున్న మిగిలిన ఆయా వర్గాల ప్రజలు వీరి అపేక్షిత జనసమూహంలోకి వస్తారు. 1967 ఎన్నికల తర్వాత దేశంలో నెలకొన్న అస్తవ్యస్తస్థితి తాము పుంజుకోడానికి అనువైన వాతావరణాన్ని ఏర్పరచినట్టు నక్సల్‌బాడీవాదులు గమనించారు.

అధికారవ్యవస్థను పూర్తిగా సంభ్రమాశ్చర్యాలలో ముంచితేల్చుతూ ఈ నూతనవాస్తవం రంగప్రవేశం చేసింది. పార్టీ అవతరించిన వెనువెంటనే గ్రామాలపై సంపూర్ణ ప్రాబల్యాన్ని సాధించింది. విప్లవపంథా తన 'ప్రజా న్యాయస్థానా'లలో ఎందరో వ్యక్తులమీద వర్గశత్రువులన్న ముద్రవేసి భౌతికంగా కడతేర్చడం జరిగిపోయింది. వెంటవెంటనే సంభవించిన ఈ పరిణామాలు రాజకీయవాదులకు అటువైపు దృష్టినిలిపి ఆలోచించవలసిన అగత్యాన్ని తెచ్చిపెట్టాయి. ఈ సరికొత్త విస్ఫోటం ముందుగా గ్రామప్రాంతాల్లోనే సంభవించినా అది అక్కడికే పరిమితం కాకుండా దేశమంతటా దిగ్భ్రాంతి కెరటాలు రేపింది.

ఈ పరిణామానికి ఆనంద్ కలవరపడ్డాడు. విచిత్రంగా, అతడిపై కత్తి కట్టిన భూస్వాముల పరిస్థితీ అలాగే ఉంది. వాళ్ళమధ్య నడుస్తున్న శాసనపరమైన ఘర్షణ పూర్తిగా నిరర్థకంగా పరిణమించింది. సైద్ధాంతిక, రాజకీయ, సాంఘిక, ఆర్థిక, పరిపాలనా కోణాలతోసహా సమాజానికి చెందిన అన్ని కోణాలనూ ఈ వినూత్నదృశ్యస్థితి కమ్మివేసింది.

అయినా కొంతకాలంపాటు రాష్ట్రంలో ఒకింత నిమ్మకు నీరెత్తిన ధోరణి కనిపించింది. నక్సల్‌బాడీ ఇక్కడికి వెయ్యిమైళ్ళకు పైబడిన దూరంలో ఉంది. ముక్కూమొహం తెలియని సరిహద్దువద్ద ఏవో ప్రత్యేకమైన సమస్యలతో సతమతమవుతున్న ప్రాంతంలో ఎక్కడో ఉంది. కనుక 'ఇప్పటికిప్పుడే' అనవసరంగా ఆందోళనపడనవసరం లేదని శాసనసభ్యులు సర్దిచెప్పుకున్నారు. భవిష్యత్తులోకి దృష్టి సారించగలిగిన ఎందరో వ్యక్తులు మాత్రం నక్సల్‌బాడీలో ఇమిడిఉన్న హెచ్చరికనూ, అది దేశంమీద పరవనున్న పొడవైన నీడల్ని స్పష్టంగా గమనించ గలిగారు.

ఓ రోజు ఉదయం, తన టేబుల్‌మీద, ముఖ్యమంత్రి చౌదరి తనకు పంపించిన ఒక పోలీస్ నివేదిక ఆనంద్ కంటబడింది. రాష్ట్రంలోని ఒక గిరిజనజిల్లాలో, రిజర్వ్‌ఫారెస్టు లోతట్టున ఉన్న కొన్ని గ్రామాలలో పరిమిత స్థాయిలో తిరుగుబాటు సంభవించిన వైనాన్ని ఆ నివేదిక ప్రస్తావించింది. ఆ ప్రాంతంలో సాధారణపాలనాయంత్రాంగం అంత సమర్థవంతంగా పనిచేయడంలేదు. ఫారెస్టు గార్డులూ, భూస్వాములూ, లేదా వారి ఏజెంట్లూ, వడ్డీవ్యాపారులూ ఆ ప్రాంతాన్ని యథేచ్ఛగా 'ఏలు'కుంటున్నారు. గిరిజనుల బతుకులపై వాళ్ళే పూర్తిగా ఆధిపత్యం చలాయిస్తున్నారు అప్పటికనేక దశాబ్దాలుగా అలాగే జరుగుతోంది.

బ్రిటిష్‌హయాంనుంచికూడా మైదానప్రాంతవాసులు గిరిజనప్రాంతాల్లో భూముల్ని కొనుగోలు చేయడానికి ఏజెన్సీచట్టాలు అనుమతించవు అయినా కొన్ని దశాబ్దాలుగా మైదానప్రాంతాలకు చెందిన భూస్వాములు, పెద్దరైతులు ఏవో ఉపాయాలతో పైకి చట్టబద్ధంగా ఉన్నట్టు కనిపిస్తూనే రకరకాల అక్రమమార్గాల్లో సరిగ్గా అదే చేస్తూ వస్తున్నారు. రెవెన్యూశాఖకు చెందిన కిందితరగతి అధికారులు ఆ అక్రమచర్యలలో కుమ్మక్కయ్యారు. పర్యవసానంగా గిరిజనులు భూములు కోల్పోయి నిష్ఠదరిద్రులయ్యారు. కొన్నేళ్ళుగా గిరిజనులు భూస్వాములనుంచి తమభూముల్ని తిరిగి తమకు అప్పగించాలని కోరుతున్నట్టు ఆ నివేదిక వెల్లడించింది అలా అడుగుతున్నందుకు ప్రతిఫలంగా భూస్వాములు వారిని మరింత అమానుషంగా అణచివేయడం ప్రారంభించారు.

ఆ నివేదిక ప్రకారం, వారంరోజులక్రితం దేశం సుదూరప్రాంతంనుంచి ఒక ఆగంతకుడు (తర్వాత అతణ్ణి చారుమజుందార్‌గా గుర్తించడం జరిగింది) ఆ ప్రాంతానికి వచ్చి స్థానిక గిరిజననాయకులతో సమావేశం నిర్వహించాడు. స్థానిక పాఠశాలలో పనిచేసే ఒక ఉపాధ్యాయుడు దుబాషీగా వ్యవహరించాడు. అదేరోజు రాత్రి వివిధ గ్రామాలనుంచి వచ్చిన వందమంది గిరిజనులు ఒకచోట కూడి, బకాయిలు వసూలుచేసుకోడానికి ఆ ప్రాంతానికి వచ్చిన ఓ భూస్వామి మీద దాడిచేశారు. అతడి వెంట ఉన్న ఇద్దరు అంగరక్షకులనూ చంపేసి, జీపులోంచి అతణ్ణి ఇవతలకు లాగి గొడ్డళ్ళతో, కత్తులతో ముక్కముక్కలుగా నరికేశారు. మరునాటి ఉదయానికి ఆ వార్త ఆ ప్రాంతమంతటా వ్యాపించిపోయింది. మూడోరోజుకల్లా భూస్వాములందరూ జిల్లాముఖ్యకేంద్రాలకు పారిపోయి తలదాచుకున్నారు. అంతే హుటాహుటిన భూస్వాములబృందం ఒకటి ముఖ్యమంత్రి చౌదరిని కలుసుకుని ఆ ప్రాంతంలో అరాచకత్వాన్ని తక్షణం నివారించడానికి తగిన పటిష్ఠచర్యలకు ఉత్తర్వులు ఇవ్వవలసిందిగా విజ్ఞప్తిచేసింది పలువురు శాసనసభ్యులు పత్రికాప్రకటనలద్వారా ఆందోళన వ్యక్తంచేశారు. రాష్ట్రంలోని అత్యంత 'సున్నిత'మైన ప్రాంతంలో శాంతిభద్రతల సంరక్షణలో రాష్ట్రప్రభుత్వ సంపూర్ణవైఫల్యాన్ని కొందరు ప్రతిపక్షనాయకులు దుయ్యబట్టారు. కొద్దిరోజుల తర్వాత వాళ్ళే మరో ప్రకటనచేశారు. దానివెంట మరో ప్రకటనా వెలువడింది. అన్నీ ఆఫ్రోజాబాద్‌నుంచే.

ఆనంద్ ఆ పోలీస్‌నివేదిక గురించి తలపోస్తూ, చౌదరి దానిని తనకెందుకు పంపించాడా అనుకుంటూ ఉండగా, ముఖ్యమంత్రినుంచి ఫోన్ మోగింది. 'ఆనంద్, మంచి దీర్ఘాలోచనలో ఉన్నట్టున్నావ్' అన్నాడు. 'ఆ ప్రాంతంనుంచి జనం వలసవచ్చేస్తున్నారు, ఏం చేయాలో ఎవరికీ తోచడంలేదు. దారుణ హింసాకాండకు సంబంధించిన కథలతో జనం పట్టణాలలోకి వచ్చిపడుతున్నారు. ఊరికే ఉద్రిక్తపరిస్థితిని పెంచేస్తున్నారు. ఎంతో ప్రశాంతంగా ఉండే ఆ ప్రాంతం రాత్రికిరాత్రి అంతగా ఎలా అంటుకుపోయిందో అంతుబట్టకుండా ఉంది...'

'రాత్రికిరాత్రి సంభవించింది కాకపోవచ్చు ముఖ్యమంత్రిగారూ,' ఆనంద్ అన్నాడు 'ఎన్నో దశాబ్దాలుగా లోపల్లోపల ఉడుకుతూ ఉండవచ్చు. ఇప్పుడు కావలసిందల్లా ఆ మంటను ఎవడో ఒకడు ఎగదోయడం...'

'అలా ఎందుకనుకుంటున్నావ్?'

'ఎందుకంటే, స్వాతంత్ర్యానికి ఎంతో ముందే బ్రిటిష్‌ప్రభుత్వం ఏజెన్సీ గిరిజనులకు సంబంధించి చేసిన చట్టాలను కొంతకాలంగా నేను పరిశీలిస్తున్నాను. మైదానాల ప్రాంతాల నుంచి వెళ్ళి అక్కడి భూముల్ని ఆక్రమించుకున్న మన పెద్దమనుషులు వెనకటి బ్రిటిష్ చట్టాలనుకూడా తుంగలో తొక్కారు. పదేళ్ళకోసారి సేకరించే జనాభా లెక్కల్ని పరిశీలిస్తే గిరిజనప్రాంతాల్లోని గిరిజనేతరుల జనాభాలో విపరీతమైన పెరుగుదల కనిపిస్తుంది. దీనిని ఎలా అర్థంచేసుకోవాలి? మన మైదానప్రాంత మిత్రులు గిరిజనులకు సేవలు చేయడానికే అక్కడికి వెళ్ళారంటారా? గిరిజనులపట్ల బయటివాళ్ళు సాగిస్తున్న దోపిడీ అత్యంత క్రూరం.'

'సరే, అదంతా గతజలసేతుబంధనం.' చౌదరి అన్నాడు, 'ఇప్పటినుంచి మనం ఏం చేయాలో ఆలోచిద్దాం. సాయంత్రం ఒకసారి రాకూడదూ? కాస్త బుర్రలకి పనిచెబుదాం, అసలవంటూ ఉంటే... మరికొందరినికూడా పిలుస్తాను'

'శేఖర్‌నీ, అతడి భూస్వామి దోస్తుల్నీ!', ఆనంద్ తప్పకుండా వస్తానని అంటూనే, తనలో తను అనుకున్నాడు.

★ ★ ★

చౌదరి ఆ చెప్పుకోదగిన బృందాన్నే తన నివాసంలో సమావేశపరిచాడు. ఆనంద్ ఊహించినట్టే వాళ్ళలో శేఖర్‌కూడా ఉన్నాడు. భూస్వామ్య సహోదరులకు ప్రతినిధిగా బలరాం విచ్చేశాడు. కల్లోలితప్రాంతంనుంచి తాజా సమాచారంతోసహా వచ్చిన ఓ సీనియర్ పోలీస్‌అధికారి వాళ్ళలో ఉన్నాడు. నాలుగోవ్యక్తి పాతికేళ్ళలోపు వయసున్న ఓ యువకుడు, ఆనంద్ అతణ్ణి అంతకు ముందెన్నడూ చూడలేదు. కలకత్తా విశ్వవిద్యాలయంలో పరిశోధనచేస్తున్న విద్యార్థిగా అతణ్ణి పరిచయంచేశారు. నక్సలిజం సిద్ధాంతమూ, ఆచరణ గురించీ, నక్సల్‌బాడీప్రాంతంలో దాని పుట్టుకగురించి అతడివద్ద అవసరమైన సమాచారమంతా ఉంది. రాష్ట్రంలోని కొన్ని మారుమూల ప్రాంతాల్లో దాని ప్రభావాన్ని అధ్యయనంచేయడానికి అతడిక్కడికి వచ్చాడు. ఆ విధంగా అతడు స్థానికపోలీసులకు పరిచయమయ్యాడు, వాళ్ళ ద్వారానే చౌదరి అతణ్ణి ఈ సమావేశానికి ఆహ్వానించాడు.

ఆ యువకుడి వివరణలో ఎంతో స్పష్టత, నిజాయితీ ఉట్టిపడ్డాయి. అతడు కేవలం పరిశోధక విద్యార్థేనా, లేక పార్టీ కార్యకర్తా అన్నది స్పష్టంకాలేదు. ఆనంద్ అతడి పేరేమిటో అడగబోయి అంతలోనే ఆ ప్రశ్నను నాలుకమీదే అణచివేసుకున్నాడు. తను అజ్ఞాతవాసం చేసిన రోజుల్లో ఒకరోజు వాడిన పేరు మరోరోజు వాడని సంగతి అతనికి గుర్తొచ్చింది. ఆ యువకుడి నిజాయితీ అతణ్ణి ముగ్ధుణ్ణిచేసింది. కళ్ళముందు కదలాడుతున్న ఏదో స్వర్ణయుగం అతడికి మాటలు అందిస్తున్నదా అనిపించింది. నలభైదశకంలో ఆనంద్ స్వయంగా నిర్మించుకున్న స్వాప్నిక ప్రపంచం అతడి జ్ఞాపకాలను వరదలా ముంచెత్తింది.

ఆ యువకుడు భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమచరిత్ర మూలాలను స్పృశిస్తూ మాట్లాడాడు. 'భారతరాజకీయవ్యవస్థపట్ల కమ్యూనిస్టులు రూపొందించుకున్న దృక్పథం ప్రకారం భారత దేశస్వాతంత్ర్యం ఒక భ్రాంతి మాత్రమే. దేశాన్ని పీడిస్తున్న సమస్యలకు పార్లమెంటరీవిధానం నిజమైన పరిష్కారాన్ని అందించలేదు. సమస్యల పరిష్కారంలో కేవలం రాజ్యాంగబద్ధమార్గాలకే కట్టుబడి ఉండడానికి కమ్యూనిస్టులు ఒప్పుకోరు. ఈ విషయంలో అన్ని పంథాల కమ్యూనిస్టుల మధ్య ఏకాభిప్రాయం ఉందనే నేననుకుంటున్నాను. స్వాతంత్ర్యానంతరం రాజ్యాంగపరంగా, చట్టపరంగా అందుబాటులోకి వచ్చిన అవకాశాలను పార్టీ ప్రయోజనాలకోసం ఎలా ఉపయోగించు కోవాలన్న విషయంలోనే వాళ్ళమధ్య అభిప్రాయ భేదాలున్నాయి. వాళ్ళలో కొందరి దృష్టిలో అవి పాక్షికప్రయోజనాలైతే, మరికొందరి దృష్టిలో అవి ఉత్తుత్తి ప్రయోజనాలు మాత్రమే...'

'ఇప్పుడు కొన్ని వర్గాల కమ్యూనిస్టుల్లో ఆ దృక్పథం మారింది కదా?' చౌదరి ప్రశ్నించాడు

'అవునూ, కాదు' ఆ యువకుడు సమాధానం చెప్పాడు, 'అప్పుడప్పుడు పార్టీ చేసే తీర్మానాలు ఎలాగైనా ఉండనివ్వండి, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని వాళ్ళందరూ బేషరతుగా ఒప్పుకు న్నారని నే ననుకోను.' ఆ తర్వాత ఏదో ఆలోచన స్ఫురించగా అన్నాడు, 'పార్లమెంటరీవిధానంపట్ల కమ్యూనిస్టేతరవర్గాల ఆమోదంకూడా ఏకగ్రీవమూ, అంతిమమూ కాదని నా అభిప్రాయం. నిజానికది అంతిమంకాజాలదు, ఇంత నిక్కచ్చిగా చెబుతున్నందుకు మీరేమీ అనుకోకపోతే, కాకూడదు కూడా'

ఆశ్చర్యంగా, చౌదరి ఈ అభిప్రాయాన్ని ఖండిస్తూ తీవ్రమైన మాట ఏదీ అనలేదు. అయినా ఆనంద్ ఆ యువకుడితో వాదానికి పూనుకున్నాడు. 'నువ్వు కలకత్తానుంచి వచ్చినవాడివి కనుక, ఈ సమావేశం జరిగినంతసేపూ నిన్ను కామ్రేడ్ బెనర్జీ అని పిలుస్తాను, సరేనా?' అంటూ ప్రారంభించాడు 'ఈ చివరి అంశాన్ని కాస్త వివరిస్తావా? ప్రజాస్వామ్యం విషయంలో నీ అభ్యంతరాలను అంత స్పష్టంగా ఎలా ప్రకటిస్తున్నావ్?'

'నేను ప్రత్యేకించి ప్రజాస్వామ్యంగురించి మాట్లాడడంలేదు. అదీగాక, ఆ మాట కమ్యూనిస్టు పదజాలంలోనూ ఉన్నదే. ఇక్కడ అసలు విషయం, ఈ దేశం అనుసరిస్తున్న బ్రిటిష్‌నమూనా పార్లమెంటరీవిధానం. నా వయస్సు ఇరవైనాలుగేళ్ళే కనుక నేను సన్నిహితంగా చూసిన ఎన్నికలు ఎన్నో లేవు. రెండు ఎన్నికల్ని పరిశీలించిన అనుభవంతో, ఈ విధానం త్వరలోనే పూర్తిగా కుప్పకూలిపోగలదన్న నిశ్చయానికి రాగలిగాను. ఇది పార్లమెంటరీ ప్రజాస్వామ్య చిహ్నాలను తగిలించుకున్న సరికొత్త ఫ్యూడలిజమే అవుతుంది. బల్లమీద మిగిల్చిన ఏవో ఎంగిలి మెతుకులుతప్ప జనసమూహానికి దీనివల్ల ఎటువంటి మంచీ ఉండదు, లాభమూ ఉండదు.'

'స్వాతంత్ర్యం తర్వాత ప్రజలు సంపాదించుకున్న చెప్పుకోదగిన లాభాలను బల్లమీద ఎంగిలి మెతుకులని నువ్వెలా భావిస్తున్నావో నా కర్థం కావడంలేదు,' శేఖర్ మధ్యలో అందు కుంటూ అన్నాడు. 'ఇప్పటి దేశపరిస్థితిని 1947 నాటి దేశపరిస్థితితో ఏ ప్రమాణంతో పోల్చి చూసినా కళ్ళు రెండూ మూసుకుని కూడా కాదనలేనంత బ్రహ్మాండమైన తేడా కనిపిస్తుంది...'

'కావచ్చు', కామ్రేడ్ బెనర్జీ అన్నాడు 'అయితే ఏదైనా నిర్దిష్టపరిస్థితిని మీరు ప్రజల దృష్టి కోణంనుంచి చూడాలి తప్ప కేవలం గణాంకనిపుణుడిలానో, చరిత్రకారుడిలానో చూడకూడదు. బ్రిటిష్‌వాళ్ళు మనకు ఎటువంటి మేలూ చేయలేదని మీరుకూడా బహుశా వాదించలేరు. వాళ్ళు మనకు కొన్ని మౌలిక సదుపాయాలు సమకూర్చారు. దేశప్రజలకందరికీ ఉమ్మడిశత్రువుకావడం వల్లనే కావచ్చు, మనలో జాతీయతాస్ఫూర్తిని రేకెత్తించారు. ఇప్పటికీ బ్రిటిష్‌పాలనను ప్రశంసించేవాళ్ళు చాలామంది ఉన్నారు. అంతమాత్రాన భారతప్రజలు బ్రిటిష్‌పాలన కొన సాగాలని కోరుకుంటున్నట్టు కాదు గ్రామాల్లో జీవించే నిరుపేదకు స్థానికభూస్వామీ లేదా జన కంటకుడైన ఓ కిందితరగతి అధికారీ ముమ్మూర్తులా బ్రిటిష్‌ప్రభుత్వాన్నే తలపింపజేస్తారు. స్వాతంత్ర్యాన్ని అతడు అలాగే అంచనావేస్తాడు కానీ, సామ్రాజ్యవాదులు చేసిన ప్రకటనలను బట్టికాదు... ప్రజల స్వాతంత్ర్యానంతర అనుభవాన్ని దృష్టిలో ఉంచుకునే, ఈ రాష్ట్రంలోని శాసనసభా విధానాలవల్లనైనా, ఒక పంథా కమ్యూనిస్టుల ఏలుబడిలో ఉన్న పశ్చిమబెంగాల్ లోనైనా ఫలితం ఒక్కలానే ఉంటుందని సి.పి.ఐ (ఎం.ఎల్) నిర్ధారణకొచ్చింది...'

చైనాతరహా విప్లవంపట్ల సి.పి.ఐ (ఎం.ఎల్) విధేయత, వివిధ విప్లవబృందాలమధ్య తారతమ్యాలతోసహా మార్క్సిస్టుసిద్ధాంతంగురించి ఎన్నో అంశాలను ఆ యువకుడు విశదీకరించడం ప్రారంభించాడు. రాష్ట్రం ఎదుర్కొంటున్న తక్షణసమస్యతో దానికంతటికీ ప్రమేయం ఉండక పోవచ్చు కానీ, నక్సలిజం అవతరణకు తెరవెనుక ఎంతో లోతుగా, ముమ్మరంగా సైద్ధాంతికమథనం జరిగినట్టు అందువల్ల స్పష్టమైంది. ఒక విషయం మాత్రం నిర్ద్వంద్వంగా తేలినట్టు కనిపించింది. అది భారతదేశంలోని పార్లమెంటరీవిధానాన్ని నక్సలైట్లు పూర్తిగా తిరస్కరించడం. చివరకు పార్టీప్రయోజనాలకోసమైనా ఈ విధానాన్ని వాడుకోవడంపట్ల వారికి విశ్వాసంలేదు. వారు కోరు కుంటున్నది సంపూర్ణ విచ్ఛిత్తి, ఆ శిధిలాలపై నూతనవ్యవస్థానిర్మాణానికి కృషి చేయాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు.

'నూతనవ్యవస్థ అంటే నక్సల్‌బాడీలో మొదలై కొద్దిరోజుల క్రితం ఈ రాష్ట్రంలో మా అందరికీ రుచి చూపించిందే, అదేనా?' గొంతులో ఒకింత వ్యంగ్యం మేళవించి శేఖర్ ప్రశ్నించాడు.

అందులోని ఆక్షేపణను బెనర్జీ వెంటనే అర్థంచేసుకున్నాడు. అయినా తడబడలేదు, నిగ్రహం కోల్పోలేదు. యధాలాపంగా అన్నట్టు అన్నాడు, 'యుద్ధసమయంలో తీసుకున్న చర్యలను, సాధారణ పరిస్థితుల ప్రమాణాలతో పరిశీలించి తీర్పు చెప్పలేం. అయినా మీరు ఏ విషయంగురించి మాట్లాడుతున్నారో నాకు తెలియదు, కనుక దానిపై అర్థవంతమైన ఎటువంటి వ్యాఖ్యా చేయలేను. నేను ఏ రాజకీయపార్టీవాణ్ణి కాదు; కేవలం పరిశోధక విద్యార్థిని మాత్రమే. రాజకీయభవిష్యత్తు చెప్పగలిగిన సమర్థుణ్ణి కాదు. నక్సలైట్‌ఉద్యమ పర్యవసానం గురించి నేను కానీ, మరొకరు కాని ఇప్పటికిప్పుడే గుడ్డిగా ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకోవడం పొరపాటంటాను. 1947 నుంచి మీరు ఎన్నికలు జరుపుకుంటున్నప్పటికీ ఈ క్షణాన అన్ని విధానాలూ ప్రయోగాత్మక దశలోనే ఉన్నాయి. ప్రజలు అంతిమంగానూ, నిర్ద్వంద్వంగానూ ఏదో ఒక విధానాన్ని స్వీకరించారని నేను భావించడం లేదు... నా అంచనా తప్పే కావచ్చు, ఇక్కడకూడా నేను పిడివాదిని కాదల్చు

కోలేదు. బహుశా చివరకు చూడవలసిందేమంటే, ఏ విధానం ప్రజలకు సత్ఫలితాలందిస్తుందని..'

మొదటిసారి బలరాం చర్చలోకి అడుగు పెడుతూ అన్నాడు, 'అతడన్నది నిజం. ఊకదంపుడు మాటలెలా ఉన్నా, ఫలితాలు సాధించే విషయంలో నిగ్గుతేలడమే ప్రధానం.'

ఆ మాటల ప్రాముఖ్యాన్ని చౌదరి, శేఖర్, ఆనంద్ చటుక్కున అర్థంచేసుకున్నారు రెండు ధ్రువాల కలయికనూ గమనించారు: భూస్వామి, అతణ్ణి తుడిచిపెట్టడానికి సిద్ధమైన నక్సలైటు. మొదట్లో అది కాస్త తికమకపెడుతున్నట్టు కనిపించింది. అంతమాత్రాన దాని నెవరూ కొట్టివేయలేరు. గ్రామీణభారతంతో ప్రమేయం మౌలికంగా ఈ రెండు శక్తులకే పరిమితమైందికాదా అనుకున్నాడు ఆనంద్. అంటే మహాత్మాగాంధీగారి గ్రామీణభారతంతో మహేంద్రనాథ్, చౌదరి, శేఖర్, ఆనంద్ పరిణామతః ఇందిరాగాంధీ వీళ్ళెవరికీ ఎటువంటి ప్రమేయం లేనట్టేనా? తన అత్యంత ప్రముఖ శత్రువు సమక్షంలో బలరాం ఎంతో ప్రశాంతంగా కనిపిస్తుండగా, మిగిలిన ఇరువురినీ అలజడి రేపే ఇటువంటి ఆలోచనలే వేధిస్తున్నట్టు కనిపించాయి.

'నక్సలైట్ఉద్యమం పరిమితస్థాయిలోనూ, అక్కడా అక్కడా చెదిరిపోయి ఉన్నప్పుడు అది విజయవంతమై ఏవో అద్భుతఫలితాలు సాధించగలదని నువ్వెలా అనుకుంటున్నావ్, కామ్రేడ్ బెనర్జీ?' ఆనంద్ ప్రశ్నించాడు.

'1885లో భారతజాతీయకాంగ్రెస్ ప్రారంభమైనప్పుడు దానికి గొప్ప ప్రజాదరణ ఉందని నేననుకోను. ఇక్కడ గమనించవలసిన విషయం, బలంగా వేళ్ళు తన్నుకోగలిగిన శక్తి నక్సలిజానికి ఉందన్నది. అది విజయవంతం కాగలిగిన మేరకు భారతదేశంలోని పరిస్థితులు పరిపక్వమయ్యాయని నాయకులు విశ్వసిస్తున్నారు. చైనాకంటెకూడా ఎక్కువగా నేటి భారతదేశం సాయుధపోరాటానికి మొగ్గు చూపుతున్నట్టు వాళ్ళు భావిస్తున్నారు. పోరాటం మొదట కొన్ని దుర్గమప్రాంతాలలో వృద్ధిచెంది, ఆ తర్వాత క్రమంగా అవలీలగా దేశమంతటా విస్తరిస్తుంది.'

'గ్రామీణప్రాంతాల్లో పార్టీకి ప్రధానసమర్థకులు ఎవరు?' ఆనంద్ అడిగాడు. జవాబు తెలిసి కూడా అడుగుతున్న ప్రశ్నలానే అది ధ్వనించింది. ఏమైతేనేం, ప్రశ్న అడగనే అడిగేశాడు.

'అదందరికీ తెలిసిన విషయమే', బెనర్జీ ఊహించిన సమాధానమే చెప్పాడు. 'భూమి లేనివాళ్ళు, సన్నకారురైతులు ఉద్యమానికి మూలస్తంభాలు. అంతిమంగా మొత్తం రైతాంగాన్ని ఉద్యమంలో భాగస్వాముల్ని చేయాలని ఆలోచన. ఈ వర్గాలు పోరాటంలోకి వచ్చి చేరినప్పుడు ఉన్న కొద్దిమంది భూస్వాములకూ, ప్రభుత్వం ఏజెంట్లకూ, గ్రామీణప్రాంతాలలో పూర్తిగా నిలవ నీడలేని పరిస్థితి ఏర్పడుతుంది. ఇప్పటికే జరుగుతున్నట్టు, వాళ్ళు అనివార్యంగా నిష్క్రమించ వలసివస్తుంది. అదను చూసుకుని ఓ పథకంప్రకారం కొంతమందిని హతమార్చివేస్తే ఈ ప్రక్రియ ఉధృతినీ వేగాన్నీ పుంజుకుంటుంది. క్రమంగా ప్రతి గ్రామమూ విప్లవానికి స్థావరంగా మారుతుంది. అక్కడ ప్రభుత్వం పెత్తనం ఇక చెల్లదు. ఆ తర్వాత నగరాలను చేజిక్కించుకోడానికి ఎంతో సమయం పట్టదు...'

'భూస్వాములు గ్రామాలను విడిచిపెట్టి వెళ్ళిపోవలసిన అవసరమేముంది?' ఆనంద్ ప్రశ్నించాడు. 'పట్టణ వాతావరణంలో అతడెలా ఇముడుతాడు? నగరాల్లో పాగావేయడానికి అవసరమైన శిక్షణకానీ, ఆ దృష్టికాని అతడి కిప్పటికిప్పుడు లేవు. అవునా కాదా?'

'అవును' బెనర్జీ సమాధానం చెప్పాడు. 'అయితే నక్సల్‌నాయకత్వం దీనిగురించి తలలు బద్దలుకొట్టుకోవలసిన అవసరంలేదు. భూస్వాములు నిస్పందేహంగా తమదారేదో తాము చూసుకుంటారు. కొందరు నగరాలకు వలసపోయినా చాలామంది నూతనగ్రామీణవ్యవస్థతో సమాధానపడి అందులో కలిసిపోతారు. వంతెనదాకా వచ్చిన తర్వాత దానినెలా దాటాలో వాళ్ళకు తెలుసు...'

నీ అభిప్రాయంకూడా అదేనా అన్నట్టుగా ఆనంద్ బలరాంవైపు చూశాడు. బలరాంకూడా ఆనంద్ వైపు చూసి అనిశ్చితంగా అన్నాడు. 'ఇదంతా కేవలం ఊహాగానం. మీదీ ఊహే, నాదీ ఊహే.'

'బాగా చెప్పారు' శేఖర్ అన్నాడు. 'మేమంతా తర్కించుకుంటున్నది మీ ఊహ ఏమిటన్నదే రాజాసాహిబ్'. బలరాంను రెచ్చగొట్టి ఆనంద్‌కీ అతడికీ మధ్య తీవ్ర వాగ్యుద్ధం సృష్టించాలని అతడి ఆలోచన. సాధ్యమైతే సోషలిస్టు స్వాప్నికుడిపైకి నక్సలైట్‌నూ, భూస్వామినీ ఉభయుల్నీ ఉసిగొల్పడం ఎంతైనా అవసరం.

'అయితే నా ఊహ ఏమిటో చెబుతా వినండి,' బలరాం ఒకింత తీక్షంగా అన్నాడు. 'ఏదో ఒకవిధంగా భూస్వామి తన మనుగడను కాపాడుకుంటాడు. అందుకు కావలసిన శక్తియుక్తులన్నీ అతడికున్నాయి. అతణ్ణి మీరు నాశనంచేయలేరు, చట్టబలంతో కానీ, ఆయుధబలంతో కానీ...'

చర్చను మళ్ళీ పట్టాలమీదికి తీసుకురావడంకోసం చౌదరి జోక్యంచేసుకున్నాడు. 'చూడండి, కామ్రేడ్ బెనర్జీనుంచి కొంత సమాచారం తెలుసుకోవడం మన ఉద్దేశం. అతణ్ణి ఇంకేమైనా అడగవలసిన విషయాలు ఉన్నాయా?'

'అతణ్ణి మరీమరీ ప్రశ్నలతో వేధించడం న్యాయంకాదు', ఆనంద్ అన్నాడు, చర్చను ఇంచుమించు ముగింపుకు తెస్తూ. 'నాకు అంతుబట్టని దొకటుంది కామ్రేడ్ బెనర్జీ! అన్ని పరిస్థితులలోనూ నక్సలైట్లు గ్రామీణప్రజల మద్దత్తుపై ఆధారపడవచ్చునని నువ్వెలా అనుకుంటున్నావ్? కొంతకాలంక్రితం తెలంగాణాలో సాయుధపోరాటం జరిగింది; ఆ అనుభవంగురించి మేము విన్న విషయాలు నీ నమ్మకాన్ని బలపరిచేవి కావు. ఆ రహస్యోద్యమం తన వాడినీ, వేడినీ కోల్పోగానే ప్రజలు దానిని విడిచిపెట్టి వెళ్ళిపోయారన్నది మా కందిన సమాచారం. వాళ్ళలో చాలామంది ఆ తర్వాత ఇన్‌ఫార్మర్లుగా మారారు. ఆపైన ఉద్యమంలో పనిచేసేవాళ్ళు పలువురు తమ చేతికందిన వనరులను స్వప్రయోజనాలకు వాడుకోవడంతో ఉద్యమం మరింత నీరుగారిపోయింది.'

'మీరన్నది సహేతుకమే కావచ్చు' బెనర్జీ అంగీకరించాడు. 'డబ్బూ, రహస్యజీవనాల జమిలి ప్రభావం ఒక్కోసారి ఉద్యమంలోని మంచినికూడా తుడిచిపెట్టవచ్చు. అయినాసరే, తెలంగాణా పోరాటానికీ, ప్రస్తుత నక్సలైట్‌ఉద్యమానికి మధ్య చాలా తేడాలున్నాయి ఒక్కటి

చెప్పుకోవాలంటే, తెలంగాణాపోరాటం వరవడిగా తీసుకోడానికి చైనా విప్లవం వంటి నమూనా ఏదీ లేకపోయింది. అదీగాక, కనీసం ప్రస్తుతానికే అయినా నక్సల్‌నాయకత్వం ఒకప్రాంతంలో సంపూర్ణ ఆధిపత్యం సాధించగలిగినట్టుగా, తెలంగాణా పోరాటం ఒక నిర్దిష్టప్రాంతంలో అంతగా వేళ్ళూతన్నుకున్నది కాదు. ఏదేమైనా ఇప్పుడే నేను ఏ విషయంలోనూ అంతిమనిర్ధారణకు రావడంలేదు, నేనే కాదు, ఎవరూ రాలేరు, రాకూడదు కూడా. నిర్ద్వంద్వమైన నిజం ఏమిటంటే, మీ పార్టీనాయకత్వం భారతదేశంకోసం నిర్ణయించిన వ్యవస్థ, మున్నెన్నడూ లేనంతగా పునాదుల్లో పగులుతీసినట్టు కనిపిస్తూఉండడం.'

విషయం తేటతెల్లమైపోయింది, సమావేశం ముగిసింది. కామ్రేడ్ బెనర్జీ వెళ్ళడానికి ఉద్యుక్తుడయ్యాడు. సరిగ్గా అప్పుడే ఆనంద్ ఎంతో కీలకమైన చివరిప్రశ్నను అతడిమీద సంధించాడు. 'అట్టడుగు స్థాయిలో అసంతృప్తికి దారితీయిస్తున్న ప్రధానకారణాలు తొలగిపోయాయే అనుకో అప్పుడేం జరుగుతుంది?'

'అప్పుడు సమస్యే ఉండదు,' బెనర్జీ ముఖంలో కాంతి తొంగి చూసింది. 'మీరన్నది అయితే గియితే సంగతి. మీ విధానం దేనిని సాధించగలదని నన్ను అనుకోమంటున్నారో దానిని సాధించలేదన్న దృఢవిశ్వాసమే నక్సలిజం మౌలికసిద్ధాంతం. కనుక ఈ ఊహాగానంవల్ల ప్రయోజనమేముంటుంది? నేను చెప్పగలిగిందల్లా, ప్రస్తుతానికి జరుగుతున్నది నిర్మమదృష్టితో పరిశీలిస్తూ ఉంటానని మాత్రమే.'

బెనర్జీ చౌదరితోనూ, మిగలిన వాళ్ళతోనూ కరచాలనం చేసి పోలీస్‌అధికారి వెంటరాగా నిష్క్రమించాడు. మిగిలిన నలుగురూ ఎవరికివారు ఆలోచనలో కూరుకుపోవడంతో దీర్ఘనిశ్శబ్దం ఆవరించింది. చౌదరే మొట్టమొదట గొంతువిప్పాడు. 'బాగుంది, బాగుంది' మోతాదును మించిన పెద్దగొంతుతో అన్నాడు. 'పరిస్థితి మీకెలా కనిపిస్తోంది?'

'చూపు పడిన మేరలో పరిస్థితి గంభీరంగానే కనిపిస్తోంది' శేఖర్ వ్యాఖ్యానించాడు. 'అయితే చివరకు నక్సలిజం విజయవంతమౌతుందని నే ననుకోను. వాళ్ళు మరీ ఆదర్శవాదుల్లానూ, అమాయకుల్లానూ కనిపిస్తున్నారు కనుక వాళ్ళనంత తీవ్రంగా తీసుకోనక్కర్లేదు. ఏదో ఇతర గ్రహంనుంచి దిగొచ్చిన వాళ్ళలా ఉన్నారు.'

'ఇంతకీ ఇప్పటి సంగతేమిటో?' చౌదరి గొంతు పెంచుతూ అన్నాడు. 'ఈ క్షణాన మీకు కనిపిస్తున్నదేమిటి? రక్తపాతం; శాంతిభద్రతల పూర్తి వైఫల్యం; ముఖ్యమంత్రిమీద మేకులు దిగ్గొట్టే అవకాశం; ప్రకటనలు, వాటికి జవాబుగా మరికొన్ని ప్రకటనలు; అతిశయోక్తులు రంగరించిన వార్తలు; ఘోరమైన ఇంటర్వ్యూలు, వేటకుక్కల్లాంటి విలేఖరులకు కడుపునిండా విందుభోజనం; ఇక మహేంద్రనాథ్ ఢిల్లీలో కూర్చుని, తన హయాంలో ఇటువంటి వెన్నడూ జరగలేదనీ, ఇదంతా నా అసమర్థత ఫలితమేననీ అదేపనిగా మొరుగుతూ ఉండడం... ఓరి దేవుడా? ఎంత చిక్కొచ్చిపడింది!

ఇది ఒకవిధంగా దిగ్భ్రాంతి కలిగించే ప్రతిస్పందన. చౌదరి ప్రస్తుతం గురించి, తన పదవికి ఎక్కడ ముప్పు ముంచుకొస్తుందోనని ఆందోళనపడుతున్నాడు. ఢిల్లీలో మహేంద్రనాథ్

తనమీద ఎలా బురదచల్లుతాడో ఊహించుకోడంతోనే సతమతమవుతున్నాడు.. నిజానికిది ఎంతో అసాధారణ పరిస్థితి. తక్షణ సాంఘిక రాజకీయ సమస్యలు భవిష్యత్తులో కూడా ఎంతో దూరానికి తమ సుదీర్ఘచ్ఛాయల్ని పరవబోయే అవకాశం భయపెడుతోంది. అయినా చౌదరి వాటిని పరిమిత వర్తమానంనుంచే వీక్షిస్తున్నాడు. ఒకపక్క వ్యవస్థ మూలమట్టంగా తుడిచిపెట్టుకుపోతోంది. అయినా రాష్ట్రనాయకులు తమ వ్యక్తిగతభవిష్యత్తుగురించే ఆలోచిస్తున్నారు. వర్తమానాన్ని అధిగమించి ఆగామిస్వప్నాలను కనగలిగిన జవహర్లాల్ తమ మధ్య లేడే అని ఆనంద్ మనసులో మధనపడ్డాడు. తక్షణ ప్రయోజనవాదమే ఇక ఇప్పుడు మిగిలిన ఏకైక సిద్ధాంతం.

'మీరేమీ మాట్లాడనే లేదు బలరాంగారూ', అప్రయత్నంగా తన అక్కసును అలా వెళ్ళ బోసుకున్న తర్వాత చౌదరి మళ్ళీ నిదానిస్తూ అడిగాడు. అలా వెళ్ళబోసుకున్నందుకు బహుశా మనసులో విచారించి ఉంటాడు 'ఎంతైనా రాజకీయనాయకులు ఈ రోజుండి రేపు వెళ్ళి పోయే వాళ్ళు; ఈ కొత్త ఉపద్రవం ప్రత్యేకించి మీ వర్గానికే ముప్పుతేబోతోంది. పరిస్థితి మీకెలా అనిపిస్తోంది?'

'దారుణంగానే కనిపిస్తోంది, అయితే ఇది పూర్తిగా అపరిచితమైనదేం కాదు' కలవరపాటు తోపాటు నిబ్బరమూ ధ్వనిస్తున్న గొంతుతో బలరాం అన్నాడు. 'నన్ను మీరు పిచ్చివాడిగా జమకట్టినాసరే, అడిగారు కనుక ఈ ఒక్కసారికి కుండ బద్దలుకొట్టినట్టు నా అభిప్రాయం చెప్ప దల్చుకున్నాను. అట్టడుగు వాస్తవాలనుంచి పక్కటడుగు వేసింది మీ పార్టీయేనని నా అభిప్రాయం. 1947లో స్వాతంత్ర్యం వచ్చిన క్షణంనుంచి దేశ ప్రజలు చిట్టచివరి మగ, ఆడ, పిల్లల వరకూ అందరూ ప్రజాస్వామ్యాన్ని జీర్ణించుకున్నారని మీరనుకున్నారు. రాత్రికిరాత్రి దేశం ప్రజాస్వామిక రిపబ్లిక్‌గా అవతరించేసినట్టు నమ్మారు. ఆ తర్వాత మిగిలిందల్లా ఎన్నికలు... ఎన్నికలు... మరిన్ని ఎన్నికలు. అలాగే వాగ్దానాలు... వాగ్దానాలు... మరిన్ని వాగ్దానాలు. సరే, పర్యవసానంలో ఆ వాగ్దానాలకు ఉల్లంఘనలు... ఉల్లంఘనలు... మరిన్ని ఉల్లంఘనలేననుకోండి. నిజానికి జనం చూడగలిగినవీ, లేదా వాళ్ళకు మీరు చూపించగలిగినవీ తరచు వాగ్దానాల ఉల్లంఘనలే కానీ నికరమైన ఫలితాలు కావు. మీరు రూపొందించిన వ్యవస్థలో ప్రతి రాజకీయపక్షమూ ఇతర పార్టీల వైఫల్యాలనే గట్టిగా నోరుచేసుకుని ప్రచారం చేస్తూ ఉంటుంది. ఎన్నో రాజకీయపక్షాలు ఇంతవరకూ అధికారాన్ని సాధించలేకపోయాయి కనుక ఏదైనా చేయగలిగిన అవకాశం వాటికి లేకపోయింది. దాంతో వాళ్ళకి మళ్ళీ మళ్ళీ పాడడానికి ఒకేపాట మిగిలింది, అది మీ పార్టీ వైఫల్యాల పాట. అందువల్ల సహజంగానే ప్రజల ఆలోచనలు వైఫల్యాలచుట్టూనే తిరుగుతూ వస్తున్నాయి. ఎటువైపు చూసినా వైఫల్యాలే తప్ప మరేమీ లేదని వాళ్ళు విశ్వసించడం ప్రారంభించారు...'

'దీనికీ నక్సలిజానికీ ఏమిటి సంబంధం బలరాంగారూ?' చౌదరి ప్రశ్నించాడు, రాజా సాహిబ్‌గారి శాఖాచంక్రమణంపట్ల ఒకింత విసుగుతోనే.

'మీ అందరిలా నేను బాగా చదువుకున్న వాణ్ణి కాదు' బలరాం అవహేళన ధ్వనించేలా అన్నాడు. 'నా జీవితం పొడవునా వాళ్ళమధ్యనే జీవిస్తున్నాను కనుక నాకు గ్రామీణప్రజల మనోభావాలు క్షుణ్ణంగా తెలుసు భూస్వామ్యవ్యవస్థ వైఫల్యాలను మీ పార్టీ వాడుకుంటే; ఇప్పుడు నక్సలైట్లు మీ విధానంలోని వైఫల్యాలను వాడుకుంటున్నారు అవి మరింత కొట్టొచ్చినట్టు కనిపించే వైఫల్యాలు. నన్నడిగితే ఇది దేవుడు చేసిన న్యాయం అంటాను, ఈసారి అధికారం వోట్ల లెక్కింపుద్వారా రాదు. ఎలాగైనా అధికారం చేజిక్కించుకోవడం, శత్రువుల్నీ, చివరకు సన్నిహితమిత్రుల్నికూడా అధికారంనుంచి పడదోయడం ఇలా విసుగూ విరామంలేని ఓ ఆటగా రాజకీయాలను దిగజార్చివేసిన మీ విధానాన్ని నిలువునా తిరస్కరించమని నక్సలైట్లు ప్రజలకు ఉద్బోధిస్తున్నారు. అధికారపక్షం నిరంతరం అధికారంగురించి, అధికారాన్ని నిలుపుకోవడం గురించే తప్ప మరో ఆలోచన చేయడానికి ఈ విధానం అవకాశమివ్వనే ఇవ్వదు. మీరు అధికారశిఖరంమీద ఉన్నప్పుడు ప్రజలు మీ విధానాన్ని ఆమోదించారనుకుంటారు. అది కేవలం మీ అభిలాషను ప్రతిబింబించే ఆలోచన. ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు భూస్వామ్యవ్యవస్థకూడా అలాగే ఊహించుకుందనుకుంటాను. ఇప్పుడలా ఆలోచించే వంతు నక్సలైట్లదయింది, పర్యవసానాలు ఎలా ఉండబోతున్నప్పటికీ...'

'మరీ అన్యాయంగా మాట్లాడుతున్నారు', చౌదరి అడ్డుతగులుతూ అన్నాడు 'అయినా ప్రస్తుతానికి నేను మీతో వాదించను. మీ ఉద్దేశంలో ప్రజలు ఎటువంటి వ్యవస్థను ఆశిస్తున్నారు?'

ముక్కుసూటిగా మాట్లాడడంవల్ల కలిగే లాభనష్టాలను అంచనావేస్తున్నాడా అన్నట్టుగా బలరాం క్షణకాలం ఆలోచిస్తూ ఉండిపోయాడు. వచ్చిపడబోయే భూపరిమితిచట్టం ముప్పు తలచుకుని అప్పటి కెంతోకాలంగా అతడు రగిలిపోతున్నాడు. అది దేశాన్ని సర్వనాశనంచేసే చర్య అని మనస్ఫూర్తిగా భావించడంతో పాటు, చట్టం అమలులోకి వస్తే సొంతభూమిలో పెద్దభాగాన్ని కోల్పోవలసిరాగల పరిస్థితి అతడికి కంటగింపు కలిగిస్తోంది. ఇంతకీ ఆ చట్టం అమలులోకి వస్తే... ఆ 'అయితేగియితే'లోనే అతడి అస్తిత్వం ఇమిడిఉంది. తను కనుక నిరోధించగలిగితే ఆ చట్టం రాబోదు. ఇక ప్రస్తుతానికి వస్తే, మెల్లగా, సాలోచనగా తన మౌనాన్ని ఛేదిస్తూ అన్నాడు, 'మనందరం స్నేహితులం కనుక మనం నిజాయితీగా మాట్లాడుకోవచ్చు. ప్రజలు ఎటువంటి వ్యవస్థను కోరుకుంటున్నారని మీరడిగారు. నిజంగా నన్నడిగితే, ఎటువంటి విధానంగురించి ప్రజలు తీర్పు చెప్పగల స్థితిలో లేరంటాను. వాళ్ళ విజ్ఞత గురించి, వివేకం గురించి మీరు బహిరంగప్రసంగాలలో చేసే ఊకదంపుడు ఉద్ఘాటన లెలాగైనా ఉండనివ్వండి; నా ఉద్దేశంలో ఇప్పటికీ వాళ్ళు చాలావరకు మూగలే. ఏదో ఆశ చూపిస్తేనో, భయపెడితేనో పనిచేయడమే తప్ప స్వచ్ఛందంగా పనిచేసే స్థితికి వాళ్ళింకా రాలేదు. నా బొటనవేలికింద వాళ్ళను నొక్కిఉంచాను; అయినా అంతిమంగా వాళ్ళకు జరిగిన అపకారమేమీ లేదు, వాళ్ళ మానాన వాళ్ళు తృప్తిగానే జీవిస్తున్నారని నా నమ్మకం. మీరు, మీ పార్టీ వాళ్ళను ఏవో భ్రమల తోనూ, ముడుపులతోనూ మంత్రించి ఉంచారు. ఇప్పుడా మంత్రకట్టు సడలిపోతోంది, ఇక ఇప్పుడు విప్లవం పేరుతో నక్సలైట్లు వాళ్ళ మెడలు వంచి తామెలా కోరుకుంటే అలా వాళ్ళతో

పనిచేయించుకుంటారు. అదికూడా, రేపోమాపో అంతకంటె ప్రబలశక్తి మరొకటి అవతరించి వాళ్ళను కుప్పకూల్చేవరకే. విరామం అంటూ లేని ఈ తమాషాలో ప్రజల స్వాతంత్ర్యాలోచనకు చోటెక్కడ? . వాళ్ళేమి ఆశిస్తున్నారో నాకు తెలియదు; నాకు తెలిసిందల్లా వాళ్ళకు తేలిగ్గా అర్థమై వాళ్ళను విధేయంగా ఉంచగలిగిన ఉక్కుపిడికిలి. అదిగో ఇక్కడ నేనూ, నక్సలైట్లు ఒకే కోవలోకి వస్తాం, పైకి వినిపించే ఉద్ఘాటనల తేడాలు ఎలా ఉన్నప్పటికీ . చౌదరిగారూ, నేను చెప్పింది మీకు రుచించదని నాకు తెలుసు. చదువు సంధ్యల్లేని ఓ అజ్ఞాని ప్రేలాపనగా భావించి మరిచిపోండి. మీరెలా అనుకున్నాసరే, నేను చెప్పదలచుకున్నది చెప్పాను!'

బలరాం వాక్పారుష్యం అక్కడ ఒక విలక్షణమైన స్తబ్ధతను తెచ్చిపెట్టింది. ఆ అస్థిమిత వాతావరణంలో కొన్ని క్షణాలు దొర్లిన తర్వాత అతడు వెళ్ళడానికి లేచి నిలబడ్డాడు. అందరితో కరచాలనం చేసి గుమ్మంవైపు అడుగులు వేస్తూ, అంతలో చివాలున వెనుతిరిగి, 'ఇంకో విషయంకూడా మీకు చెప్పాలి నక్సలైట్లు భూస్వాముల మిత్రులు కారు. అలాగే శత్రువులూకారు. కేవలం భూస్వాముల్ని హతమార్చి ప్రజలదృష్టిలో హీరోలుగా వెలిగిపోవాలనే వాళ్ళ ఆకాంక్ష. ఆ తర్వాత వాళ్ళు భూస్వాముల్ని మించిన నియంతలవుతారు. మీ ప్రజాస్వామ్యం నక్సలైట్ల చేతులకు జనాన్ని అప్పగించడానికే భూస్వామ్యవ్యవస్థను నాశనంచేసింది. వాస్తవానికి మీరొక అవాంతర ఘట్టమే, ఇంకా చెప్పాలంటే తాత్కాలికంగా పనికొచ్చిన తెప్పలాంటి వాళ్ళు మీరు' అనేసి తన సహజశైలిలో అట్టహాసంగా నిష్క్రమించాడు.

మిగిలిన ముగ్గురు శూన్యదృక్కులతో ఒకరినొకరు చూస్తూ ఉండిపోయారు. వ్యవస్థాపర మైన సంక్షోభం అనివార్యమనిపిస్తుండగా సరికొత్త బరువుకింద వాళ్ళ మస్తిష్కాలు నలిగి పోయాయి. అయినా మనమెంత వాళ్ళం? ఇటువంటి సమస్యలను పరిష్కరించవలసింది జాతీయనాయకత్వం... అది చక్కని సాకుగానే కనిపించింది కానీ, ఇంతకీ జాతీయనాయకత్వమంటే ఏది? ఎవరు? ఇందిరాగాంధీ? మొరార్జీదేశాయా? ఇందిరాగాంధీ విదిల్చిన రాజకీయ సంపదను అనుభవిస్తూ తెగబలిసి, ఆమె ఉజ్వలవైభవంతో చలికాచుకునే రకరకాల చీలికవర్గాలా? శకల శకలాలుగా ఉన్న ప్రతిపక్షమా? (సాంకేతికంగా చూస్తే ఇందులో ఏ ఒక్క శకలమూ 'పార్టీ' అనిపించుకోదు). హఠాత్తుగా వాళ్ళకో భావం స్ఫురించింది. ఇటువంటి పరిస్థితి ఎదురైనప్పుడు జవహర్లాల్ ఏంచేసి ఉండేవారో? తమ మధ్య అభిప్రాయభేదాలెలా ఉన్నా, 'జవహర్లాల్ కనుక ఇప్పుడిక్కడ ఉండి ఉంటే' అన్న ఆలోచన ఆ ముగ్గురి మస్తిష్కాలలోనూ తటిల్లున మెరిసింది.

చౌదరి ఆనంద్‌వైపు చూసి అన్నాడు, 'మధ్యాహ్నంనుంచి నువ్వు మౌనంగానే ఉన్నావు. ఇంతకీ నీ బుర్రలో ఏం ఉడుకుతోంది? ఏదైనా పనికొచ్చేదేనా? కామ్రేడ్ బెనర్జీతో బృహస్పతి సాగించిన చర్చవల్ల మనకేమైనా కాస్త జ్ఞానం ఒంటబట్టిందా?'

'నాకు తెలియదు' ఆనంద్ సమాధానం చెప్పాడు. 'స్వాతంత్ర్యానంతరం మరోసారి, మనం ఎంచుకున్న వ్యవస్థకు తీవ్ర ప్రతిఘటన ఎదురైంది. నేను మళ్ళీ ఆ ప్రశ్న దగ్గరకే వస్తున్నాను... మనం ఈ వ్యవస్థచేత క్రియలో ఏవైనా ఫలితాలు చూపింపజేసి దేశాన్ని రక్షించగలమా?'

# 42

వ్యవస్థకు ఎదురైన ప్రమాద సంకేతాన్ని ఎవరూ గమనించలేదు. అధికారంకోసం సాగించే క్రీడ మరింత నిర్విరామగతిని అందుకుంది. అధికారపక్షం, చీలికను నివారించగలిగిన స్థితిలోలేదు. మిగిలిన మార్గమల్లా, ఇప్పటికే జనానికి హామీ ఇచ్చిన కార్యక్రమం విషయంలో అందరూ ఏకమై ఇంకెంతమాత్రం జాప్యంలేకుండా అమలు చేయడం. అయితే ఇప్పుడది సోదిలోకి కూడా రాని ప్రశ్న. పైకి ఎవరెలా మాట్లాడుతున్నా పార్టీలోనే ఆ కార్యక్రమానికి ఏకగ్రీవసమర్థన లేదు. అందులోని అంశాలపట్ల, మరీకొట్టొచ్చేవిధంగా దానిఅమలులో పాటించవలసిన వేగమూ, నిర్దిష్ట కాలపరిమితి విషయాలలో అభిప్రాయభేదాలు పొడసూపాయి.

వివిధ రాష్ట్రాల్లోని ప్రభుత్వాలు కుప్పకూలడంతో అస్థిరత్వచిత్రం సంపూర్ణతను సంత రించుకుంది. కేవలం అధికారసాధనే లక్ష్యంగా అవకాశవాదంతో పొత్తులు కలుపుకోవడంద్వారా 1967 లో పుట్టుకొచ్చినవవి. విచిత్రంగా వాటి పతనం కూడా అటువంటి అవకాశవాదంవల్లనే సంభవించింది. అది మరోలా జరిగే అవకాశమేలేదు. మొత్తంమీద అయిదేళ్ళ కాలపరిమితి పూర్తికాకుండా మధ్యలోనే అవి కూలిపోయాయి. ఇది దేశాన్ని నివ్వెరపరచింది. అటు భూమి కానీ, ఇటు రైతుకానీ సిద్ధంగా లేనివేళ, నడివేసవిలో కుంభవృష్టి కురిసిన చందంగా కనిపించింది ఈ పరిణామం: అది ఉభయులకీ చెరుపుచేసేదే తప్ప మేలుచేసేదికాదు.

అయితే సైద్ధాంతికవ్యభిచార ఫలితంగా అధికారదాహం తీవ్రతరవేగాన్ని పుంజుకుంది. ప్రభుత్వం ఏంచేసిందీ, ఏం చేయదలచుకున్నదన్నవి ఇంకెంతమాత్రం వార్తాంశాలుకావు. ఎవరు మంత్రి అయ్యారు, ఎవరికి మంత్రివర్గం నుంచి ఉద్వాసన జరిగిందనేవే పాఠకులకు ఆసక్తి కలిగించే వార్తలయ్యాయి. అధికారం ఒక క్రీడలా, రోమన్ సామ్రాజ్యంలో మల్లయోధుల మధ్యజరిగే యుద్ధాల్లా, లేదా మధ్యయుగాలనాటి భారతదేశరాజ్యాల్లోని కోడిపందాలు, ఎడ్ల పందాల్లా మంచి వినోదసాధనంగా మారింది... ఇందులో ప్రజల కెటువంటి ప్రమేయంలేదు. ఆనంద్, అతడితో ఆలోచనాసారూప్యం ఉన్న ఇతరులు నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయారు. దేశవ్యాప్తంగా ఉన్న తన పార్టీకి చెందినవారినే కాక ఉత్తరాదిరాష్ట్రాల్లో సంకీర్ణ ప్రభుత్వాల్లోని పలువురు మంత్రులనూ, శాసనసభ్యులనూ కూడా ఆనంద్ కలుసుకుంటూ ఉండేవాడు. వాళ్ళమధ్య పరిచయం ప్రగాఢమౌతున్నకొద్దీ సహజంగానే మనసు విప్పి ఒకరి భావాలు మరొకరు పంచు

కోవడం ప్రారంభించారు దాదాపు ప్రతిఒకరూ ఒకేవిధమైన ఆవేదనను వెళ్ళబోసుకుంటూ వచ్చారు.

ఆగస్టులో కొన్ని రాష్ట్రాల్లో కుంభవృష్టి సంభవించగా, మిగిలిన రాష్ట్రాల్లో దుర్భిక్షపరిస్థితులు తాండవిస్తున్నాయి. ప్రకృతి ఒక్కొక్కసారి ఎంత నియమరహితంగా, ఎంత క్రూరంగా వ్యవహరిస్తూ ఉంటుందంటే, ఏదైనా రాష్ట్ర ప్రభుత్వం అతి ప్రయత్నంమీద దుర్భిక్ష నివారణ పథకం అమలు ప్రారంభించబోయిందో లేదో, రాత్రికి రాత్రి కుంభవృష్టి సంభవించి అంతటినీ అస్తవ్యస్తం చేసేస్తుంది. దాంతో రాష్ట్ర ప్రభుత్వం వరదసహాయక చర్యలు చేపట్టవలసివస్తుంది. వానరాకడ, రాజకీయ నాటకంలో మెలికలు, మలుపులు ఒక్కలానే ఊహకందని విధంగా ఉండడం ఆనాటి భారత దేశదృశ్యంలో గమనించదగిన విశేషం.

ఆనంద్ ఏదో కాన్ఫరెన్స్ పనిమీద, ఎప్పుడూ వెడుతున్నట్టే ఓసారి ఢిల్లీ వెళ్ళాడు. పార్లమెంటు సభ్యుడుగా ఉన్న ఓ మిత్రుడు లోక్‌సభకు, సెంట్రల్ హాల్‌కు చెందిన విశిష్ట అతిథుల గేలరీలో కూర్చోడానికి అతనికి పాస్ తెప్పించాడు. ఆనంద్ కొద్ది సేపు గేలరీలో కూర్చొని ఆ తర్వాత సెంట్రల్ హాల్‌లో తచ్చాడాడు.

సెంట్రల్ హాల్‌లో ఉద్రిక్త వాతావరణం నెలకొంది. చూడగలిగిన కళ్ళు, పసిగట్టగలిగిన ఇంద్రియవైశిత్యం ఉన్నవాళ్ళెవరూ దానిని గమనించలేకపోవడం కానీ, పొరబడడంకానీ అసాధ్యం. అక్కడికి అడుగుపెట్టిన తక్షణమే, దేశం ఏదో అతిముఖ్యమైన పరిణామాన్ని ఎదుర్కోబోతున్నదన్న స్ఫురణ బలంగా కలిగితీరుతుంది

గౌరవనీయసభ్యులు ఇద్దరు, ముగ్గురు, నలుగురు చొప్పున కూర్చొని గుసగుసల మంతనాలలో మునిగిపోయి ఉన్నారు. హాలులో దూరంగా ఓ మూల ఎనిమిదినుంచి, పదిమందివరకూ పాల్గొన్న ఒకటిరెండు పెద్దగుంపులూ ఉన్నాయి. కేంటీన్ బేరర్లు పక్కలనుంచి, టేబుళ్ళ మధ్య నుంచి ఎలాగో సందుచేసుకుంటూ నెమ్మదిగా ముందుకీ వెనక్కీ రాకపోకలు సాగిస్తున్నారు. వాళ్ళ చేతుల్లోని ట్రేలనిండా దేశానికి శాసన ప్రదానంచేసే వ్యక్తులకు ఉద్దేశించిన ఆహారపదార్థాలు. శాసనగతిని అంటే పరిణామతః దేశం భవితవ్యాన్ని నిర్ణయించడంలో ఆ ఆహారపదార్థాలు కీలకపాత్రవహిస్తాయనే అనుకోవాలి. బేరర్లు మోస్తున్న బరువూ, వాళ్ళమందగమనమూ మన దేశ పురోగతికి అడ్డంపడుతున్నట్టున్నాయి. ఎంతో తాపీగా, ఉదాసీనంగా, ఏమాత్రం తొందర లేకుండా ఉన్నవాళ్ళ ఆ నడకలోనూ తనదైన ఏదో హుందాతనం ఉట్టిపడుతోంది.

సెంట్రల్ హాలులో ఇటువంటివి సుపరిచితదృశ్యాలే అయినా ఆరోజు మాత్రం ఏదో విపత్తు ముంచుకురాబోతున్నదన్న ఒక అపరిచితస్పృహ వాటిని కమ్మేసింది. సభ్యులు కలవరం నిండిన స్వరంతో గుసగుసలాడుకుంటున్నారు. ఒకవైపున సభలో మాటిమాటికీ కోరం గంట మోగుతుంటే, అక్కడికి భిన్నంగా సెంట్రల్ హాలులో అసాధారణ మనదగినంత భారీగా సభ్యులు హాజరున్న విషయాన్నిఆనంద్ గమనించాడు.

ఆ రోజు ప్రధాన ప్రవేశద్వారంవద్ద ఉపవిశిష్టులైన తొలి బృందం సభ్యులలో ఉత్తరప్రదేశ్‌కు చెందిన శ్రీ పాండే, కేరళకు చెందిన శ్రీ మీనన్, పశ్చిమ బెంగాల్‌కు చెందిన శ్రీ బందోపాధ్యాయ

ఉన్నారు. ముగ్గురూ అధికారపక్షంవారే. సీనియారిటీలో మధ్యమ శ్రేణిలోకి, పలుకుబడిలో కిందితరగతిలోకి వస్తారు. బిగ్గరగా, గట్టిగా మాట్లాడగల సమర్థులు కనుక కీలకవిషయాలపై చర్చ జరిగేటప్పుడు తరచు వీరిని బరిలోకి దింపుతూ ఉంటారు. పూనకం పట్టినట్టు వీళ్ళు ప్రధానమంత్రిని సమర్థిస్తుంటారు. ఆమె సభలో ఉన్నారంటే వీళ్ళకిక పట్టపగ్గాలుండవు.

'నేను చెబుతున్నాగా, ఈసారి పెద్దఎత్తునే జరగబోతోంది...' చుట్టూ దొంగచూపులుబరుపుతూ మీనన్ అన్నాడు.

'ఏమో' పాండే సాలోచనగా అన్నాడు. 'ఈ మాట ఇప్పటికెన్నిసార్లు వినలేదు...'

'ఇప్పుడలా కాదు' బందోపాధ్యాయ ధృవీకరిస్తున్నట్టు అన్నాడు. 'చూడబోతే నిజంగా పెద్దఎత్తునే జరగబోతున్నట్టు నాకూ అనిపిస్తోంది...'

ఈ దశలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన డాక్టర్ చింతాద్రిపేటపాడు వీరవెంకటలక్ష్మీ ప్రసన్న రామ సోమయాజులు అడుగుపెట్టాడు. దక్షిణమధ్య ప్రాంతానికి చెందిన అంత పొడవాటి పేరును పలకడం కష్టంగా మారడంతో ఎం.పి.లు దానిని తగినట్టుగా క్లుప్తీకరించారు మొదటి, చివరి అక్షరాలను కలిపి సింపుల్‌గా డాక్టర్ చీలూ అని పిలుస్తూఉంటారు. 'పెద్దఎత్తున' అనే మాట వినీవినగానే డాక్టర్ చీలూ బ్రేకు వేసినట్టు హఠాత్తుగా ఆగిపోయాడు. మంచి వైద్యుడు కనుక పెద్దఎత్తున అనగానే, గుండెపోటును తప్ప మరోదానిని అతడు ఊహించలేడు. ఆందోళనతో అడిగాడు, 'పెద్దఎత్తునా? ఎవరికీ? పెద్దఎత్తున గుండెపోటు ఎవరికొచ్చింది?' మిగిలిన వాళ్ళ జవాబు కోసం చూడకుండానే డాక్టర్ ఆందోళన కుమ్మరిస్తూ అలా మాట్లాడేస్తూనే ఉన్నాడు, 'ఘోరం, చాలా ఘోరం. వెల్లింగ్టన్ నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళొస్తున్నాను. సగంపార్లమెంటు శాశ్వతంగా అక్కడే తిష్ఠవేసిందా అనిపించింది. తగినంత కోరంతో ఆ నర్సింగ్‌హోమ్‌లోనే పార్లమెంటు సమావేశం జరుపుకోవచ్చు. చాలా దారుణం...'

'తగ్గండి, డాక్టర్, తగ్గండి' బందోపాధ్యాయ జోక్యం చేసుకుంటూ అన్నాడు. 'కంగారు పడకండి; ఇంకా ఎవరికీ గుండెపోటు రాలేదు. మేం మంత్రివర్గంలో మార్పుల గురించి మాట్లాడు కుంటున్నాం'.

డాక్టర్‌లోని సానుభూతి కాస్తా ఒక్కసారిగా జిత్తులమారి రాజకీయవాదిలో కనిపించే ఉత్సాహంగా మారిపోయింది. కుర్చీలో కూలబడ్డాడు. 'అవునవును' కూనిరాగం తీస్తున్నట్టు అన్నాడు. 'నేనూ ఏదో విన్నాను. గాలినిండా మంత్రివర్గంలో మార్పుల గురించిన కబుర్లే. పుప్పొడిలా లేదా కాలుష్యంలా – రెంటిలో ఏదో నాకు తెలియదు' జరగబోయే మార్పుల వేళ గురించి, వాళ్ళవాళ్ళ అవకాశాల గురించి మిగిలినవాళ్లు సవివరంగా సమీక్షిస్తుంటే డాక్టర్‌కూడా వాళ్ళలో కలిసి పోయాడు.

ఆరు వరసలకు అవతల, కుడివైపున మరో గుంపు కూర్చుని ఉంది. అందులో కర్ణాటకకు చెందిన సోమనాథ్, హర్యానాకు చెందిన చౌదరి రామ్‌నారాయణసింగ్, బీహార్‌కు చెందిన పాపేశ్వర్‌ఝా, మేఘాలయాకు చెందిన స్టీఫెన్‌సన్, ఆపైన భారీకాయంతో పైపెదవి మీద

తీర్చిదిద్దినట్టుంటే ఇంకా కొడవలి వేటుపడని పచ్చికబయలులోని చిన్నఖండాన్ని తలపుకి తెస్తున్న మీసకట్టుతో ఒక మహిళా సభ్యురాలు ఉన్నారు రాజ్యాంగం హామీఇచ్చిన స్త్రీ పురుష సమానత్వాన్ని ఇంచుమించు రుజువు చేస్తున్నదా అన్నట్టుగా ఉంది ఆ మీసకట్టు. ఇక ఆమె ఛాతీ చుట్టుకొలతలోనూ, చూడడానికీ కూడా భూమధ్యరేఖను గుర్తుకుతెస్తోంది. అదామెను ఓ కదిలే గ్లోబులా కనిపింపజేస్తోంది. ఆమె సొంత రాష్ట్రంలో ఆమెలానే ఎందరో ఆడవాళ్లకు పైపెదవిపైన స్పష్టంగా కనిపించే మీసకట్టు ఉంటుందిట లేదా అలాగని అందరూ చెప్పుకుంటూ ఉంటారు.

ఈ గ్రూపులోని సభ్యుల సరాసరి వయస్సు డెబ్బైలోపుంటుంది. పడుతూ లేస్తూ ఎలాగో అయిదు ఎన్నికల ప్రభంజనాలను తట్టుకుని ఎట్టకేలకు ఇటీవలి ఎన్నికల్లో విజయవంతంగా పార్లమెంట్‌లోకి రాగలిగారు. జరగబోయే మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణలో ఎంతమంది సీనియర్ మంత్రులపై వేటుపడుతుందో వాళ్లు ఊహాగానాలు సాగించడం సహజమే. డెబ్బైపడిలో ఉన్నా కొంతమంది మంత్రులు ఇంకా పనిచేయగల స్థితిలో ఉండడం వాళ్ళకు చికాకు పుట్టిస్తోంది. గట్టిప్రాణాలు, అలా బతికేస్తూనే ఉంటారు; అందులోనూ మరింత దారుణంగా అధికారాన్ని పట్టుకుని అలా వేలాడుతూనే ఉంటారు. మిగిలిన డెబ్బైపడివాళ్లపట్ల ఇది దురన్యాయం. అప లెన్నటికీ అధికారంలోకి రాలేని భయానకపరిస్థితిలో వాళ్లు చిక్కుకుపోయారు. ఆపైన, మంత్రి వర్గంలో యువరక్తాన్ని నింపాలంటూ తాజాగా వినిపిస్తున్న చెత్తను తలచుకుని వాళ్లు మరింత రగిలిపోటున్నారు. దానికి వ్యంగ్యాన్నికూడా జోడిస్తూ, ఔనౌను యువరక్తంతోపాటు తాజా మాంసం కూడా! అని చమత్కరిస్తున్నారు.

'ఈసారి ముసలికాపుల్ని పూర్తిగా ఏరిపారేస్తారు చూడండి' అన్నాడు రామ్‌నారాయణ్ ప్రతిమాటనీ కసితీరా పలుకుతూ. 'ప్రధానమంత్రి అంతమందినీ, ఇంతకాలంగా ఎలా ఉండని స్తున్నారో నాకేమీ అర్థం కావడంలేదు. వాళ్ల మంత్రిత్వశాఖల్లో ఏ పనీ కాక అవి పూర్తిగా చతికిల బడడయో ఆశ్చర్యం ఏమీలేదు ఈ మధ్యలో దేశానికి కుక్కచావు...'

'పైగా అనుభవం ఉన్న ఒక్క మహిళా ఎం.పీ లేదు,' రోమకళ తాండవించే మహిళాసభ్యురాలు అందుకుంటూ అంది. 'గృహిణులు ఎదుర్కొనే కష్టాలు ఈ ఆపసోపాలు పడే ఈ వెర్రిమొగాళ్లకి అర్థమౌతాయని ఎవరైనా ఎలా అనుకుంటారో నాకు తెలియడం లేదు. ఒక మహిళ ప్రధాన మంత్రిగా ఉండగా ఇలా జరగడం! ఎంత విచిత్రమో చూడండి.'

ఎంతో సున్నితమూ, క్లిష్టమూ అయిన ఈశాన్య ప్రాంతంలోని మైనారిటీలను ఎలా నిర్లక్ష్యం చేస్తున్నారో మధ్యమధ్య వ్యాఖ్యలు జోడిస్తూ స్టీఫెన్‌సన్ కూడా ఈ దుయ్యబట్టే కార్యక్రమంలో ఎంతో ఇష్టంగా చేరిపోయాడు...అంతలో, ఓ భారీ మంత్రిత్వశాఖను నిర్వహిస్తున్న శ్రీ నాగ్, బెంచీల వరసల మధ్య దారి చేసుకుంటూ తమను సమీపిస్తుండడం చూసి హఠాత్తుగా వాళ్లు చర్చ ఆపేశారు. భగవంతుడి ఆదేశంపైన చెబితే తప్పమరే పరిస్థితిలోనూ మంత్రిపదవి నుంచి తప్పుకునేది లేదని తెగేసి భీష్మించిన డెబ్బైపడి మంత్రులలో శ్రీ నాగ్ ఒకడు. వర్తులంగా ఉన్న అతడి ఆకారం మూడుగోళాలతో రూపొందినట్టు కనిపిస్తుంది. అందులో సహజంగానే

మొదటగా చెప్పుకోదగిందీ, అతిపెద్దదీ మొండెం. రెండోది ఆ మొండెంమీద నిలబడిన పుచ్చకాయ ఆకారంలోని తలకాయ. అందులోంచి వికసించిందా అన్నట్టుగా మొటిమలు బొడిపెంతో నిండి భారీ పరిమాణంలో ఉన్న ముక్కు మూడవది. అతడి మొహమంతా ఆ ముక్కే, మిగిలినవేవీ చెప్పుకోదగినవికావు. అందుకే అతణ్ణి అందరూ శ్రీ నాక్ (ముక్కుగారు) అని పిలవడం ప్రారంభించారు. తనలా డెబ్బైపడివాళ్లే కనుక సహజంగానే అతడి అడుగులు ఆ గ్రూపువైపు పడ్డాయి. కొద్దిసేపు వాళ్ల దగ్గర ఆగాడు. కూర్చోమని వాళ్లు అభ్యర్థించారుకానీ మర్యాదగా అతడు తిరస్కరించాడు. కారణం మరేంలేదు, ఒకసారి కూర్చున్నాడంటే మళ్లీ లేవడానికి విశ్వప్రయత్నం చేయవలసివస్తుంది. మనిషి కుప్పకూలినవాడిలా కనిపిస్తున్నాడని ఆ గ్రూపులో వాళ్లు అనుకున్నారు. అతడి మొహం చూస్తూంటే వృద్ధమంత్రులమీద వేటుపడడం ఖాయమనే అనిపిస్తోందనుకున్నారు. శ్రీ నాగ్ వాళ్లతో ఒకటిరెండు పలకరింపు మాటలుమాట్లాడాడు. తన అధ్యాయం పూర్తికానున్నట్టు తనకు తెలుసునన్న విషయం వాళ్లకి తెలుసునని అతడికీ తెలుసు.

అంతలో హఠాత్తుగా ఏదో కలకలం ప్రధానమంత్రి సెంట్రల్ హాలును వడివడిగ దాటుతూ ప్రత్యక్షమయ్యారు. ఒక సభ నుంచి మరో సభలోకి వెడుతున్నారు ఒక్క ఉదుటున అందరూ లేచినిలబడ్డారు. అలా ఒకే సారి లేచి నిలబడడం ఒకవిధమైన నేత్రభ్రాంతిని కల్పించడంతో సెంట్రల్‌హాలు పైకప్పు కూడా మరింత పైకి లేచిందా అనిపించింది. ఆమె అభివాదాలు స్వీకరిస్తూ, చిరునవ్వులు చిలకరిస్తూ, అధికారానికి సౌజన్యాన్ని మేళవిస్తూ, మళ్ళీ ఆ అధికార, సౌజన్యాలను రెండింటికీ, స్పష్టంగా కనిపించే ఉత్కంఠ, నిగూఢత్వాల ముసుగు కప్పుతూ ఒక క్రమవేగంలో ముందుకు సాగిపోయారు. తన నాడి ఒకింత వేగంగా కొట్టుకుంటున్నట్టు అక్కడున్న ప్రతి సభ్యుడికీ అనిపించింది. ఆమెను ఇప్పటికి వెయ్యిసార్లయినా చూసిఉంటారు. అయినాసరే 'మార్పులు చేర్పుల సీజన్' కావడంతో తనవైపు ఆమె ప్రత్యేకమైన చూపును ప్రసరింపజేసిందని ప్రతి ఒక్కసభ్యుడూ ఊహించుకున్నాడు. ఆ చూపులో ఒక ఆదరణ, ఒకసూచన స్ఫురించాయి. ఆ సూచన వాళ్ళ మెదళ్ళలో ఒక దృశ్యాన్ని ఆవిష్కరింపజేసింది: అది మంత్రిగా తాము ప్రమాణ స్వీకారం చేస్తున్న దృశ్యం. ప్రధానమంత్రి ఏం చేసినా అనూహ్యంగానే చేస్తారు కనుక సాధారణంగా మంత్రి పదవిని ఆశించని వాళ్ళు కూడా మంత్రి కాబోతున్నట్టు ఊహించుకుంటారు. మంత్రివర్గనిర్మాణంలోని మోహపెట్టే తర్కం అలా ఉంటుంది.

ఇంకాస్త ముందుకివెడితే, డెబ్బైపడిలో ఉన్న వాళ్ళ గుంపుకి నైరుతిగా కొద్దిమంది యువ ఎం.పి.లు కూర్చుని ఉన్నారు. వాళ్ళలో చాలామంది మొదటిసారి సభ్యులైన వాళ్ళు. మంత్రి పదవులకు వాళ్ళ పేర్లను కనీసం పరిశీలనకు తీసుకోవడం కూడా అసాధ్యమైన విషయం. అప్పుడే వాళ్ళకా అవకాశం రాదు. వాళ్ళలో ఉల్లాసం ఉరకలేస్తోంది. ఎలుకల పరుగుపందెంలో పాల్గొంటున్న ఏనుగుల్ని చూసి వాళ్ళు బొత్తిగా భయభక్తులు లేకుండా కేరింతలు కొడుతున్నారు ఆ బృందంలో ఉత్తరప్రదేశ్‌నుంచి వచ్చిన కవీ, వ్యంగ్యరచయితా మీర్జా ఒకడు. ఇతడిది అందమైన బొమ్మలాంటి మొహం, సున్నితమైన పెదవులు, హిప్పీజుట్టు, తీర్చిదిద్దినట్టున్న అతని నోట్లోంచి ఆ సందర్భానికి తగిన ఉర్దూద్విపదలు అప్రయత్నంగా జాలువారుతున్నాయి, వాటితోపాటు అదేపనిగా పాన్ తుంపరలు వచ్చి పడుతున్నాయి. ఇక వాళ్ళలోనే మధ్యప్రదేశ్ నుంచి వచ్చిన

చౌబే ఉన్నాడు. ధారాళంగా పాన్ తుంపరలు వర్షించడంలో అతడూ ఘనుడే. ఆ ప్రమాణంలోనే అతడి నోట్లోంచి వెలువడే బూతుజోకులు కూడా అతడికెంతో ప్రఖ్యాతి తెచ్చిపెట్టాయి, ముఖ్యంగా మహిళా సభ్యుల్లో. 'ఆడవాళ్ళను అల్లరిపెట్టే ఆ పోకిరిమాటల'పట్ల వాళ్ళు నిరసన తెలియ జేయడం పరిపాటిగా మారింది, వాటిని విని మనసారా ఆనందించిన తర్వాతే అనుకోండి. ఆపైన పంజాబ్‌నుంచి వచ్చిన బేదీ, అతడి కారునలుపు గెడ్డం ఎర్రటి అతని ముఖానికి చక్కని ఫ్రేమ్‌లా అమరిపోయింది. బూతుజోకుల్లో అతడూ గొప్ప పండితుడే, కాదనే సాహసం ఎవరూ చేయకపోవడంతో, ఎన్నో విషయాల్లోలానే ఈ విషయంలోనూ దేశం మొత్తం మీద పంజాబ్‌దే అగ్రస్థానమని అతడెంతో సగర్వంగా ప్రకటించుకుంటూఉంటాడు. అధికారపక్షానికి చెందిన వీళ్ళుకాక, ప్రతిపక్షానికి చెందిన మరికొందరు సభ్యులుకూడా ఉన్నారు. వాళ్ళకు ఎటువంటి పదవులూ రాబోవడం లేదు. వాళ్ళు ఎటువంటి అలజడికీ లోనుకావడంలేదు. కనుక అధికార పక్షానికి చెందిన సభ్యులు ఒకచోట చేరి కలవరపాటుతో మంతనాలు జరుపుకుంటుంటే, ఒడ్డున కూర్చుని చూస్తూ ఆనందిస్తున్నారు. మధ్యయుగాల్లో పురుషత్వం లోపించిన కొంతమంది నవాబులు మరెవరో కామకలాపాలు సాగిస్తుంటే దగ్గరనుంచి చూసి సంతృప్తిచెందిన వైనాన్ని వాళ్ళలా గుర్తుచేస్తున్నారు.

'నే చెబుతున్నా వినండి', మీర్జా ఆ బృందంలోని మిగిలినవాళ్ళకి హామీ ఇస్తున్నట్టు అన్నాడు. 'ఆ పురుష మహిళాసభ్యురాలి చెవిలో గుసగుసలాడుతున్నాడే, ఆ మంత్రి ఒకటి రెండు రోజుల్లో బొంబాయిలోని జస్లోక్ ఆసుపత్రిలో చేరడం ఖాయం...'

'అంటే నువ్వనేది లోక్‌సభనుంచి జస్లోక్‌సభకు వెడతాడనా?' చౌబే ఎగతాళిగా అన్నాడు.

'ఎంతైనా అది పర్‌లోక్‌సభకన్న మంచిదేగా' బేదీపన్ చేశాడు. అలా మంత్రి పదవిని ఆశించే వారిపై వాళ్ళు జోకులు పేల్చుతూ ఆట పట్టిస్తూ కూర్చున్నారు. తమకు లభ్యం కాదనుకున్న వాటిని చులకనగా తీసిపారేసే ధోరణి వాళ్ళ మాటల్లో అంతర్లీనంగా కనిపిస్తుంది. మొత్తంమీద, నిర్దిష్టమైన కారణం లేకపోయినా ఈ బృందం సభ్యులు కూడా ఏదో ఉద్రిక్తతకు లోనవుతూనే ఉన్నారు. ఒకవైపున పట్టనట్టు ఉంటూ మరోవైపున అతిగా పట్టించుకుంటూనే ఉన్నారు. ఎందుకు, ఎలా అంటే కారణం చెప్పలేరు. మొత్తంమీద ఉద్రిక్తత అంతటా వ్యాపించింది. ఎవరూ అతీతులు కారు.

ఒక దక్షిణాది పత్రికకు పని చేస్తున్న ఢిల్లీలోని ఓ స్పెషల్ కరస్పాండెంట్ రాసిన రెండు కాలంల వార్తతో ఇదంతా మొదలైనట్టు ఆనంద్ గుర్తు చేసుకున్నాడు. ఆ వార్తలోని దొంక తిరుగుడు మాటలన్నింటినీ కత్తిరించుకుంటూ లోపలికి తొంగిచూస్తే తేలుతున్నభావం ప్రధానమంత్రి తన పార్టీ లోపలే సరికొత్త ప్రతిభ కోసం చూస్తున్నారని. ఆమె తన మంత్రి వర్గానికి కొత్తరూపు కల్పించి దానిని మరింత సమర్థవంతంగా, మరింత క్రియాశీలంగా మార్చాలనుకుంటున్నారట. ఆ విలేఖరి మరో అడుగు ముందుకెళ్ళి, మంత్రివర్గానికి భారంగా పరిణమించిన 'చచ్చు పుచ్చు' సరుకునంతటినీ ఏరివేసే అవకాశాల గురించి జోస్యం చెప్పాడు. మచ్చుకి చెప్పుకోవాలంటే, డిప్యూటీ మంత్రులన్న మొత్తం తెగ అంతా అనవసరమేనని ఆ జర్నలిస్ట్ వ్యాఖ్యానించాడు.

వాళ్ళలో కొందరికి పదోన్నతి లభించగా, మిగిలిన వాళ్ళకు శిరచ్ఛేదం జరగవచ్చు. ఆ క్రమంలోనే తమ ఉపయోగాన్ని కోల్పోయి కూడా పదవుల్లో కొనసాగుతున్న డెబ్బైపడి వాళ్ళు కూడా చేరి ఉన్నారు.

చాలామంది పాఠకులు ఈ స్పెషల్ కరస్పాండెంట్ సర్వజ్ఞుడని నమ్ముతూ ఉంటారు ఇతగాడి జోస్యాలు నిజమైన సందర్భాలు చాలా అరుదు, అయినా సరే అటువంటి ప్రతి జోస్యాన్ని అతడి పాఠకులు విశ్వసిస్తూనే ఉంటారు. అది తమకు బాగా అనుకూలంగా ఉందనుకున్న వాళ్ళు మరింత గట్టిగా విశ్వసిస్తారు. ఆ వార్త తమ అవకాశాలను త్రోసిపుచ్చినట్టు భావించిన మిగిలిన వాళ్ళు, దానిని ఆ కరస్పాండెంట్ ఊహాలోంచి పుట్టుకొచ్చిన మరో నీలివార్తగా కొట్టిపారేస్తారు. పాత్రికేయతలోని మరులుగొలిపే ఈ వార్తాశకలం ఎంత ప్రభావం చూపించిందంటే, అది వెలుగుచూసిన ఇరవైనాలుగు గంటల్లో, దేశంలో ఎక్కడెక్కడ పర్యటిస్తున్న మంత్రులూ ఢిల్లీ చేరుకొన్నారు తమ తనిఖీ కార్యక్రమాలనూ, సమ్మేళనాలనూ, సదస్సులనూ, గోష్ఠులనూ, నియోజకవర్గసందర్శనలనూ, విశ్రాంతి మకాములనూ, విహార యాత్రలనూ అన్నింటినీ అర్ధంతరంగా విడిచిపెట్టి వచ్చేశారు. ఇక వివిధ అంశాల మీద, భారతదేశం వైఖరి ఏమిటో వివరించడానికి పంపించిన ప్రతినిధివర్గాలకు నాయకత్వం వహిస్తూ విదేశాలకు వెళ్ళిన వాళ్ళు ఎయిర్ ఇండియా ఎంత త్వరగా తమకు సీటు చూపించగలిగితే అంత త్వరగా ఢిల్లీకి తిరిగొచ్చారు మిగిలిపోయిన తమ కార్యభారాన్ని వాళ్ళు తమ తర్వాతివారికీ, డిప్యూటీలకూ, భారతరాయ బారులకు, అంతిమంగా ఆ భగవంతుడికే అప్పగించేశారు. అలాగే మంత్రిపదవిపై ఆశలు పెంచుకున్న వాళ్ళు తాము ఎక్కడెక్కడ ఉన్నాసరే, ఏ ప్రయాణసాధనం అందుబాటులో ఉంటే దానిని అందుకుని రికార్డుటైములో వచ్చి వాలిపోయారు నిజానికి వాళ్ళకు కబురంపిన వాళ్ళెవరూ లేరు. దూరదూరంగా దాగుడుమూతలాడే అధికారపు గుబాళింపును పసికట్టడానికి ఎవరి కబురుతోనూ పనిలేదు. అదెవరికోసమూ ఆగదు. పార్లమెంట్ సెంట్రల్ హాలుకు ఒక్క సారిగా ప్రాణం వచ్చినట్టయింది.

ప్రతి మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణ వెనుక తనదైన హేతుబద్ధత ఉంటుంది. ప్రస్తుత సంద ర్భంలో అది పెద్దఎత్తున జరగబోతోంది కనుక అందులో ప్లస్‌లు, మైనస్‌లు– కొత్తగా చేర్పులూ, ఉద్వాసనలూ – ఉండితీరవలసిందే. ముందుగా ఉద్వాసన భాగాన్నే తీసుకుంటే ఉద్వాసితుల జాబితాలోకి రాదగిన మంత్రులు చాలామందే ఉంటారు. అందులో కచ్చితంగా తప్పించ వలసిన వాళ్లు కొంతమంది ఉంటారు. అయితే వాళ్లెవరన్నది, మీరు ఎవరి అభిప్రాయాన్ని కోరారో వాళ్లు చెప్పేదానిమీద ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు శ్రీ సుందరం మంత్రిగా తను పనికిరాడని రుజువు చేసుకున్నాడు. ఒకవేళ అతణ్ణి తొలగిస్తే ఎం.పి. శ్రీ ఆర్ముగానికి మంత్రిమండలిలోకి ప్రవేశించే అవకాశాలు మెండుగా ఉంటాయి, లేదా అలాగని అతడను కుంటాడు. కనుక శ్రీ సుందరం విధ్వంసప్రతాపం గురించి, తన (తమ) రాష్ట్రానికి అతడు తెచ్చిపెట్టిన అప్రతిష్ఠగురించి, వచ్చే ఎన్నికల్లో అతడి నిష్ప్రయోజకత్వం గురించి శ్రీ అర్ముగం ఊకదంపుడుగా ఉపన్యసిస్తుంటాడు. నెల రోజులక్రితం ఇదే శ్రీ ఆర్ముగంగారు సుందరాన్ని

ఆకాశాని కెత్తేశాడు. అయితే అది పూర్తిగా నెలరోజుల క్రితం అనుకోండి రాజకీయవాదులు మరీ అంతకాలంపాటు తమ అభిప్రాయాలను మార్చుకోకుండా ఎలా ఉండగలరు! అదీగాక అప్పుడింకా మంత్రివర్గంలో మార్పులు, చేర్పుల గురించిన మాట వినరాలేదాయె. ఇప్పుడు పరిస్థితిలో గుణాత్మకమైన మార్పు వచ్చేసింది. అయినా ఎప్పుడూ ఒకే తీరుగా ఉండడమనే సుగుణం కేవలం గాడిదలకే చెల్లునని ఎవరో అననే అన్నారుకదా!

శ్రీ ప్యారేలాల్, శ్రీ కుట్టి, డాక్టర్ (శ్రీమతి) శర్మ మంత్రులుగా పనికిరారని ప్రతివాళ్లు తేల్చేశారు. అయినా వాళ్లలో ప్రతి ఒకరికీ తమవైన ప్లస్ పాయింట్లున్నాయి. 'ఎక్స్'మీద వేటు పడిందనుకోండి, అతడు స్వరాష్ట్రానికి తిరిగివెళ్లి ముఖ్యమంత్రి బతుకుని ముల్లకంపలోకి నడిపిం చేస్తాడు. ప్రధానమంత్రి, 'వై'ని కనుక తప్పిస్తే, అతడి రాష్ట్రంలోని భూస్వాము లందరూ దీనికో దానికో, అనుకూలంగానో, వ్యతిరేకంగానో ఆందోళన ప్రారంభించేస్తారు– దేనికోసం అన్నదానితో ఇక్కడ నిమిత్తం లేదు. ఒకవేళ 'జడ్'ను తొలగిస్తే, అతగాడు అక్కడికక్కడే కుప్ప కూలిపోతాడు; కారణం అతడు బాగా ముదిరిపోయిన గుండెజబ్బు మనిషి. రోగనిర్ధారణకు వైద్యశాస్త్రం పాటించే కొలమానాలన్నింటినీ త్రోసిరాజని, రాజకీయాధికారం ఒక్కటే అతడి గుండెను కాపాడుకుంటూ వస్తోంది అత్యంత ప్రబలమైన ఒక కులం లాబీకి చెందిన మరో మంత్రిగారున్నారు. ఆ కులం ప్రయోజనాలను ఆయన ఎంతో జాగ్రత్తగా పోషించుకుంటూ వస్తున్నాడు. ఆయనను కనుక తొలగించారా, ఆ కులం ఆగ్రహోదగ్రమై పోతుంది. ఇంకో మంత్రిగారు ఎంత పనికిరాని మనిషంటే, అతణ్ణి తొలగించడంకూడా పనికిమాలిన చర్యే అవుతుందని ప్రధానమంత్రి భావిస్తుంది. ఏతావతా దీనినిబట్టి తేలుతున్నదొకటే, ఎవరినైనా మంత్రిపదవినుంచి తప్పించడం అనుకున్నంత తేలికకాదు, కొంతమంది విశ్వసిస్తున్నట్టు.

అలాగే, కేవలం ప్రతిభను కొలమానంగా తీసుకుని కొందరిని మంత్రివర్గంలోకి తీసుకోవ డమూ సులభంకాదు. ప్రతిభ గురించే మాట్లాడవలసి వస్తే, మంత్రివర్గనిర్మాణానికి కావలసి వచ్చే ప్రతిభ అనేకరకాలుగా ఉంటుందని ఎవరైనా ఒప్పుకుని తీరాలి. ఉదాహరణకు కులం, డబ్బు, జుట్టు ముడిపెట్టే నేర్పు, వ్యక్తిగత విధేయత వగైరాలు కూడా ప్రతిభలోకే వస్తాయి. అది కేవలం ఒక యోగ్యుణ్ణి ఎంచుకోడానికి పరిమితమయ్యే వ్యవహారమనుకుంటారేమో, కాదండీ, అదంత సరళమైంది ఎంతమాత్రం కాదు. యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ వంటిది కానేకాదు. ఉదాహరణకు, ఒక రాష్ట్రంనుంచి అప్పటికే ఇద్దరు మంత్రులున్నారనుకోండి, అదే రాష్ట్రానికి చెందిన మూడోమనిషి ఎంతటి అద్భుతప్రజ్ఞావంతుడైనా సరే, సాధారణమార్గాల్లో అతడికి మంత్రివర్గ ప్రవేశం లభించదు. అతడికి అవకాశాలు మిగిలిన ఇద్దరి గ్రహగతులమీద, ఆపైన సహజంగానే తన జాతకంమీద ఆధారపడి ఉంటాయి. అటుతర్వాత రష్యన్, అమెరికన్ లాబీల గురించిన క్లిష్టమైనప్రశ్న ఉత్పన్నమవుతుంది. ప్రధానమంత్రి ఇందులో ఏదో ఒక లాబీకి చెవియొగ్గుతూ ఉంటారని అంత గట్టిగా నమ్మేవాళ్లు ఒక్కరూ ఉండరు. అయినాసరే, మంత్రి కావాలని ఆశించి కాలేకపోయినవాళ్లు ఒక సాకుని చూపించుకోడానికి రాజకీయవర్గాల్లో ఈ లాబీలు పిలిస్తే పలుకుతుంటాయి. మంత్రి పదవికి తగడన్న ముద్ర వేయించుకోడం కన్న, పెట్టుబడిదారీలాబీవల్లనో, కమ్యూనిస్టు లాబీవల్లనో నష్టపోయిన మనిషిగా ముద్ర వేయించు

కోవడం ఎంతైనా గౌరవప్రదంగా ఉంటుందికదా! గతంలో పలువురు మంత్రులు తప్పుకోవలసిన పరిస్థితి అనేకసార్లు తలెత్తిందనీ, అయితే ఏదో ఒక లాబీ అడ్డుపడి వాళ్లను కాపాడిందని కూడా కథలు వినిపిస్తుంటాయి. ఎలా కాపాడాయో చెప్పినవాళ్లు మాత్రం లేరు.

వివిధ ఘటనలు, ఈసారి భారీ ఎత్తున మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణ తథ్యమన్న అభిప్రాయం కలిగించాయి. పలువురు మంత్రులపాలిట,'ఢిల్లీలో ఉండడమా, మానడమా?' అన్నది అసలు సమస్యగా మారిపోయింది ప్రధానమంత్రి అందరు మంత్రులనుంచి రాజీనామా లేఖలు కోరినట్టు అదేపనిగా ఒక వార్త వినిపించింది. ఇదే నిజమైతే కొన్నిరోజులపాటు ఢిల్లీనుంచి అదృశ్యమైపోతే బహుశా తాత్కాలికంగా ప్రమాదాన్ని తప్పించుకోవచ్చు. ఈ లోపల ప్రధానమంత్రి రాజీనామాల విషయంలో పునరాలోచించవచ్చుననో, లేదా అనుకోనిదేదైనా సంభవించి మంత్రివర్గపునర్వ్యవస్థీకరణ తక్షణావసరంగా కనిపించకపోవచ్చుననో ఆశపడడానికి ఎప్పుడూ అవకాశముంటుంది. ఒకసారి దేనినైనా ఆపగలిగితే, అదింక నిరవధికంగా ఆగిపోతుందనే అనుకోవచ్చు. ప్రభుత్వంలో చిరకాలంగా పాతుకుపోయిన వాళ్లందరికీ అది అనుభవైకవేద్యమే. ఫలితంగా దేశవ్యాప్తంగానూ, ఎక్కడ సాధ్యమైతే అక్కడ విదేశాల్లోనూ మంత్రులు తమ పర్యటనకాలాన్ని ఒక్కుమ్మడిగా పొడిగించుకున్నారు. ఆ విధంగా ఢిల్లీకి హుటాహుటిన తిరిగి వచ్చే మంత్రులతో, భయభ్రాంతులై ఢిల్లీనుంచి పరుగులు తీసే మంత్రులతో రెండువైపుల రద్దీ పెరిగిపోయింది.

ఎందరో సీనియర్ మంత్రులు ఢిల్లీలోని విల్లింగ్టన్ నర్సింగ్‌హోమ్‌లో చేరిపోయారు. అక్కడి నుంచి వాళ్లు బొంబాయిలోని జస్లోక్ ఆసుపత్రికి ఉత్తీర్ణత పొందారు. వాళ్లలో కొంతమంది న్యూయార్క్, బోస్టన్, హూస్టన్, లండన్ లేదా వియెన్నా లకు దారితీయడం ద్వారా తమ రోగాల్ని అంతర్జాతీయం చేసేశారు అయినా ఈ మంత్రులు స్వయంగా చేసుకున్న ప్రకటనలను బట్టి వాళ్లెన్నడూ ఎటువంటి రుగ్మతలకీ లోనై ఎరుగరు. 'చెకప్' చేయించుకోవడం తప్ప వాళ్లకు మరే అవసరమూ లేదు. ఈసారికూడా చెకప్‌కోసం జరిగిన ఎడ్మిషన్లు పెద్దసంఖ్యలోనే ఉన్నాయి కానీ, చెకప్‌లు మరీ ఎక్కువ సమయం తీసుకుంటున్నాయి కొందరు మంత్రులు 'అప్రకటితం'గా జబ్బుపడ్డారంటూ విరోధులు విజయగర్వంతో కేకలు వేయడం ప్రారంభించారు.

పార్లమెంట్ ప్రస్తుత సమావేశాలకు రెండువారాలముందు న్యూఢిల్లీని విపరీతతాపంతో కూడిన హడావుడి, ఉన్మత్త ఊహాగానాలూ చుట్టుముట్టేశాయి. మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణకు అదే తగిన అదను. వారం తిరిగిందంటే ఇక దానిగురించి మరచిపోవచ్చు. ఎందుకంటే సాధారణంగా సమావేశాలు జరుగుతున్నప్పుడు కానీ, దానికి ఒకింత ముందుగానీ పునర్వ్యవస్థీకరణ జరగదు. కనుక జరిగితే ఇప్పుడు జరగాలి, లేకపోతే ఇప్పట్లో జరగవు. ఆశాజీవుల అదృష్టదురదృష్టాల గురించిన ఊహాగానాలు రోజురోజుకూ, గంటగంటకీ మారిపోసాగాయి. ఓ శనివారంనాడు, శ్రీ నాగ్ నిష్క్రమణ ఖాయమన్నారు అందరూ అయితే ఆదివారం వార్తాపత్రికల్లో ప్రధానమంత్రి, శ్రీ నాగ్ దేనిగురించో నవ్వుకుంటున్న ఫొటో ప్రత్యక్షమైంది. తక్షణమే శ్రీ నాగ్ అనుయాయులు ఆ ఫోటోగ్రాఫ్‌ను విజయకేతనంలానూ, ప్రత్యర్థుల భరతం పట్టే దుడ్డుకర్రలానూ, ప్రతిఒకరినీ

మంత్రించే మంత్రదండంలానూ ఉపయోగించడం ప్రారంభించారు. శ్రీ నాగ్ నిష్క్రమిస్తాడని ఎవరంటారో ఇప్పుడనమనండి చూద్దాం అంటూ ఆ ఫొటో చూపించి నిలదీశారు, బుద్ధిలేని గాడిదల్లారా, మీకు తెలియదేమో, ఇప్పుడు శ్రీ నాగ్ ప్రధానమంత్రికి చాలా సన్నిహితుడు... అయితే నాగ్ వ్యతిరేక వర్గం అంత తేలిగ్గా ఓటమి ఒప్పుకునే స్థితిలో లేదు. చూద్దాంగా ఎవరి అంచనా నిజమౌతుందో అన్న నర్మగర్భిత సమాధానంతో వాళ్లను ఎదుర్కొన్నారు. కావాలంటే మీరు గొప్పగా చూపిస్తున్న ఆ ఫొటోనే ఓసారి చూడండి. ప్రధానమంత్రి చిరునవ్వు ఎంతో సహజంగానూ, హృద్యంగానూ ఉంటే శ్రీ నాగ్ ఇకిలింపు ఎంత వికారంగా ఉందో! ఆ మనిషిలో ఆందోళన, భయం స్పష్టంగా తెలిసిపోతున్నాయి గుడ్డివాడుకూడా ఆ తేడా కనిపెట్టగలడు. సందేహానికి అవకాశమే లేదు, శ్రీ నాగ్ మూటాముల్లే సర్దుకోక తప్పదు. అదీగాక, దారితప్పి అత్యాశలకుపోతున్న ఓ ప్రియస్నేహితుల్లారా, ప్రధానమంత్రి గురించి మీకు అసలేం తెలుసు? మోతాదును మించి ఆమె స్నేహభావం ప్రదర్శిస్తున్నట్టు అవసరాన్ని మించి చిరునవ్వులు చిందిస్తున్నట్టు కనిపించారంటే దానర్థం సంతోషంగా వీడ్కోలు చెప్పడమేనని మీకు తెలియదు లాగుంది. నిండా మునిగిపోతున్న మై డియర్ కామ్రేడ్స్, అది చరిత్ర, మీరు తెలుసుకోవలసిన చరిత్ర. సాగనంపేవాళ్ల కోసమే ఆమె తన నిండునవ్వుల్ని ప్రత్యేకించి ఉంచుతారు. అంచేత, ఆ ఫోటోగ్రాఫ్‌ని ఎగరేస్తూ ఆ మొరుగుడంతా దేనికోసం! అంతకన్నా వీడ్కోలు సమావేశానికి ఏర్పాట్లు చేసుకోవడం మంచిది.

అలా రేగిన వివాదాలు, అన్వయాలు, సవాళ్ళు, ప్రతిసవాళ్ళు నరాల దౌర్బల్యం తెచ్చి పెట్టేస్థాయిలో ఊహాగానాలను రెచ్చగొట్టాయి. శుక్ర, శనివారాలు పునర్వ్యవస్థీకరణకు కీలకమైన రోజులన్నమాట పుట్టుకొచ్చింది. పునర్వ్యవస్థీకరణలు చాలావరకుశనివారం రాత్రి రూపుదిద్దు కొని, మరునాడు ఉదయం జరిగాయని గణాంక వివరాలు సూచిస్తున్నాయిట. నిజమైనా కాకపోయినా అదో మూఢనమ్మకం. దాంతో ఆదివారం సమీపిస్తుండడంతో ఉద్రిక్తత నిమిష నిమిషానికి పెరిగి పోతూవచ్చింది.

శుక్రవారం మధ్యాహ్నం విజ్ఞానభవన్‌లో ప్రధానమంత్రి శాస్త్రసాంకేతిక విజ్ఞానం మీద అంతర్జాతీయసదస్సును ప్రారంభించారు. భారత పార్లమెంటు సభ్యులు హాలులోని ముందు అర్థభాగం మొత్తాన్ని ఆక్రమించేసుకుని సదస్సుకు హాజరవుతున్న విదేశీశాస్త్రవేత్తల్ని పూర్తిగా ఆశ్చర్యచకితుల్ని చేసేశారు. ప్రధానమంత్రి ప్రసంగిస్తున్నప్పుడు వాళ్ళమధ్య, తలలూపడంలో అక్షరాలా పోటీ చెలరేగింది. ఆమె వెళ్ళిపోగానే హాలులోని ఆ అర్థభాగం పూర్తిగా ఖాళీ అయి పోయింది... శాస్త్ర సాంకేతిక విజ్ఞానం పట్ల భారత పార్లమెంటేరియన్ల శ్రద్ధాసక్తుల్ని చూసి ముగ్ధుడైపోయిన ఓ విదేశీశాస్త్రవేత్త, వాళ్ళలో ఒకరిని దానిగురించి ప్రశ్నించాడు. ఆ ఎం.పి.కి ఇంగ్లీషురాదుకనుక, ఓ జర్నలిస్టు దుబాషీగా వ్యవహరించాడు ఆ విదేశీయుని ప్రశ్నకు ఆ ఎం.పి. సూటిగా సమాధానం చెప్పాడు తన మాతృభాషలోనే అనుకోండి, 'సైన్సు, టెక్నాలజీ? లేదు తమ్ముడూ! పి.ఎం. వచ్చారు కనుక మేమూ వచ్చాం!' ఆ జర్నలిస్టు చిరునవ్వుచిందిస్తూ దానినిలా అనువదించాడు, 'సర్, మా ప్రధానమంత్రిగారి ఉత్తేజకరనాయకత్వంలో పార్లమెంటు సభ్యులందరూ సైన్సు, టెక్నాలజీలలో గణనీయమైన ఆసక్తిని పెంపొందించుకున్నారు!'

కేంద్ర సచివాలయంలో జరుగుతున్నవి కూడా ఏమంత తక్కువ ఆసక్తిగొలిపేవికావని ఆనంద్‌కి తెలిసింది. మామూలుఫైళ్ళ మామూలు నడక కూడా పూర్తిగా స్తంభించిపోగా, కొన్ని ఫైళ్ళు అసాధారణవేగంతో కదిలిపోతున్నాయి. కనీవినీఎరుగనంత క్షుణ్ణంగా, సమర్థవంతంగా వాటిని పరిశీలించి పరిష్కరించడం జరిగిపోతోంది. మంత్రులలో ఎవరు పోతారో చెప్పగలిగిన వాళ్ళెవరూ లేరు. ఎవరికి వాడు తన కోరిక ప్రకారం జోస్యం చెబుతున్నాడు. అందులో తప్పే ముంది? వాస్తవంగా ఆ ఘటన జరిగేవరకూ ఎవరిదైనా ఊహే. ఇంకొకరి పతనం నుంచి మనిషి పొందజూసే క్షుద్రసంతృప్తి అందులో లభిస్తుంది. పరిణామతః, ఇంచుమించు ప్రతి మంత్రికీ ఉద్వాసన జరుగుతున్నట్టే కనిపించింది. ఇక శ్రీ నాగ్ మంత్రిత్వశాఖలోని సెక్రటరీ శ్రీ నాగ్ వద్దకు వెళ్ళకుండా ప్రతిఫైలును అటకాయించడంలో తలమునకలైపోతున్నాడు. ఏవో అర్థంలేని ప్రశ్నలతో అడ్డుపడుతున్నాడు. వెళ్ళిన ఫైళ్ళను తనవద్దకే తిప్పిపంపించమంటూ తాత్కాలిక ఉత్తర్వులు కూడా జారీ చేశాడు తిరిగి రప్పించుకోవడం సాధ్యం కాదనుకున్న కీలకమైన ఫైళ్ళను, మరెవరూ చేజిక్కించుకునే అవకాశం లేకుండా 'కాన్ఫిడెన్షియల్' లాకర్‌లో కుక్కేశాడు. శ్రీ నాగ్‌కీ అతడికీ మధ్య కొంతకాలంగా కుమ్ములాట నడుస్తోంది. రెండేళ్ళక్రితం ఓ లైసెన్స్ మంజూరు విషయంలో ఇద్దరూ తీవ్రంగా ఘర్షణపడ్డారు. ఆ యుద్ధం ఒక 'కుంభ కోణం' రూపంలో పైకితేలి పార్లమెంటులో ఇబ్బందికరమైన అనేక చర్చోపచర్చలకు అవకాశమిచ్చింది... పాత కక్షలు తీర్చుకోడానికి సెక్రటరీకి ఇదే తగిన అదను. మంత్రివర్గం నుంచి శ్రీ నాగ్ గెంటివేతకోసం ఎంతోతహతహతో ఎదురుచూస్తూ, అతని తప్పులీ్న, అధికార దుర్వినియోగాన్నీ సూచించే ప్రతి ఆనవాలునీ రికార్డుల్లో భద్రంగా ఉంచడానికి ఆ సెక్రటరీ ఏం చేయాలో అన్నీ చేస్తున్నాడు. శ్రీ నాగ్ ప్రతిష్ఠను శాశ్వతంగా దెబ్బతీయగల ఒక విచారణ కమిషన్ నియామకానికి అవసరమైన పూర్వరంగాన్ని అతడప్పటికే రచించి ఉన్నాడు. ముఖ్యమైన పత్రాల ఫొటోస్టాట్ నకళ్ళతో సహా సంబంధిత సమాచారాన్ని ప్రతిపక్ష సభ్యుల్లో ఎవరెవరికి అందించాలో కూడా అతడు ఆచితూచి ఎంచుకున్నాడు.

శనివారం రాత్రి. ఉద్రిక్తత అమిత దుస్సహంగా పరిణమించింది. ప్రతి మంత్రిగారి ఆంత రంగిక కార్యదర్శి, ఇతర ప్రతిఒక్కమంత్రిగారి ఆంతరంగిక కార్యదర్శి నుంచి తాజా సమాచారాన్ని రాబట్టడానికి ప్రయత్నించాడు. ఇంక మంత్రుల భార్యలు గత్యంతరం లేనిస్థితిలో ఆ రాత్రివేళ భగవంతుణ్ణే ఆశ్రయించి ఎడతెగని పూజలు, ప్రార్థనలతో ఆ సర్వశక్తిమంతుడిపై అంతిమక్షణాలలో ఒత్తిడి తేవడానికి ప్రయత్నిస్తున్నారు. దేశంలోని సుదూరప్రాంతాలకి వెళ్ళే టెలిఫోన్ లైన్లన్నీ జాం ఐపోయాయి. అప్పటికే దాదాపు నెలరోజులుగా తీవ్రమైన ఒత్తిడికి లోనవుతున్న టెలి ఫోన్ ఆపరేటర్లు అనూహ్యసంఖ్యలో వచ్చిపడుతున్న మెరుపుకాల్స్ రద్దీని తట్టుకోలేక సతమతమౌతున్నారు. ఆ కాల్స్ 'అధికారిక' మన్న సర్టిఫికెట్‌తో కేంద్ర లేదా రాష్ట్ర ప్రభుత్వ ఖాతాలో ఎలాగూ చేరబోయేవే .

వేటు పడినట్టేనా? నిష్క్రమించబోతున్న మంత్రులందరూ రాజీనామాలు సమర్పించేశారా? ఇంతకీ ఎవరెవరు? ప్రధానమంత్రి కొత్త జాబితాను ఖరారుచేసి రాష్ట్రపతిభవన్‌కు పంపించేశారా?... నువ్వు చెబుతున్నది కచ్చితమేనా? ఈ రాత్రివేళ రాష్ట్రపతిభవన్‌లో ఏదైనా అసాధారణమైన

సందడి కనిపిస్తోందా! ప్రధానమంత్రి నివాసంలో పరిస్థితేమిటి? విలేఖరులు ప్రెస్‌క్లబ్‌లో ఆన వాయితీగా సాగించే మందువిందు కూడా మానేసి అటుఇటూ తిరుగుతూ ఏమైనా హడావుడి పడుతున్నారా? .. సంభాషణ మధ్యలో టెలిఫోన్ లైన్లు డెడ్ అయితే ఉద్రేకం కట్టలుతెంచుకున్న రాజకీయవాదులు బిగ్గరగా, ఇంకా బిగ్గరగా కేకలు లంకించుకుంటున్నారు. ఫోన్లు లేకపోయినాసరే దేశమంతా దద్దరిల్లేలా పెడబొబ్బలు పెడుతూ ఎంత దూరమైనా సంభాషణ సాగించేలా ఉన్నారు.

అయితే ఒక విషయం మాత్రం సార్వత్రికంగా స్పష్టమైంది. శిరచ్ఛేదం జరగబోతున్నట్టు కనిపిస్తున్న ఏ మంత్రిపై ఎవరికీ సానుభూతి లేదు. ఎక్కడలేని స్తోత్రపాఠాలు గుప్పించిన స్వాగతోపన్యాసాలను రజతపేటికల్లో వాళ్ళకు అందించిన వాళ్ళూ, రోజుకు ఇరవైనాలుగు గంటలూ వాళ్ళను పొగడ్తలతో ఆకాశానికి ఎత్తేసిన వాళ్ళూ, ఇప్పుడు ఆ మంత్రులు తొలగింపుకు తిరుగులేని కారణాల అన్వేషణలో నిమగ్నులైపోయారు. అదిప్పటికెప్పుడో జరిగిఉండవలసిందని ఉద్ఘాటిస్తున్నారు. అందులోని సందేశం స్పష్టమే: ఎవరో కొందరిని మినహాయిస్తే, అధి కారంలో *ఉన్న ప్రతిఒక్కడూ, మృత్యుఘడియలో లానే అధికార పతనదశలో కూడా ఒంటరిగానే మిగిలిపోతాడు. రెండింటిలో మృత్యువే నయమనిపిస్తుంది, ఎందుకంటే అది కనీసం సాను భూతినైనా రేకెత్తిస్తుంది.*

ప్రమాద గర్భితమైన ఆ రాత్రి క్రమంగా గడవసాగింది.

ఆదివారం ఉదయం, రాష్ట్రపతిభవన్ జారీ చేసిన ఒక ప్రకటనను పత్రికలు ప్రచురించాయి. భారతరాష్ట్రపతి, ప్రధానమంత్రిసలహాపై ఇద్దరు డిప్యూటీ మంత్రులు నిర్వహిస్తున్న శాఖల పరస్పర పరివర్తనకు దయతో ఉత్తర్వు చేసినట్టు ఆ ప్రకటన సారాంశం...

అలా పరిస్థితి పతాకఘట్టంవరకు వెళ్ళి హఠాత్తుగా జారిపోవడం తరచు జరుగుతూనే ఉంటుంది. మంత్రివర్గపునర్వ్యవస్థీకరణ ప్రతిసారీ ఆశలను రేకెత్తిస్తూ, సంభ్రమానికి లోను చేస్తూనే ఉంటుంది. పత్రికల్లో అది ప్రముఖంగా చోటు చేసుకుంటూ ఉంటుంది కానీ ఆ వార్తల వల్ల ఎటువంటి ఫలితాలూ ఊడిపడవు. నిజంగా జరగని పునర్వ్యవస్థీకరణకు సంబంధించిన ఊహాగానం కొన్ని పేర్లను ముందుకు తెస్తుంది, ఎందరి ప్రతిష్ఠనో దెబ్బతీస్తుంది. అన్నివైపులా అనుమానాలకు, ఆవేశాలకు దారితీయిస్తుంది. వ్యక్తిగతకార్పణ్యాలను పెంచుతుంది. విపరీత నిస్పృహకులోనుచేసే ఈ వాతావరణానికి ఎడతెగని కీచులాటలు, ఎలాగైనా సరే అధికారం లోకి రావాలన్న లేదా అధికారాన్ని నిలుపుకోవాలన్న తహతహ తోడవుతాయి. లెజిస్లేటర్లు పరస్పరం శాశ్వతబద్ధవైరులుగా మారి, శాశ్వత శత్రు శిబిరాలుగా వ్యవహరించే పరిస్థితికి ఇది దారితీయిస్తుంది. ఇదంతా రాజకీయ కార్యాచరణలానే కనిపిస్తుంది కానీ దానివెనుక ఉన్నది పగా ప్రతీకారేచ్ఛలతో కూడిన ఫ్యూడల్ మనస్తత్వమే. ఆ వ్యక్తులింక ఒకే పార్టీలో సహజీవనం చేయలేరు. ఈ కారణాలన్నీ కలిసి, ఇటీవలి చరిత్రలోనే అత్యంతనిర్దయాత్మకమైన, అత్యంత విధ్వంసకరమైన చీలికవైపు పార్టీని నడిపించాయి.

# 43

అధికారపక్షం నిట్టనిలువునా చీలిపోవడంవంటి కీలకపరిణామానికి రకరకాల జటిలప్రేరణలే కారణమౌతాయి. అయినా నాటకంలోని పాత్రధారులు సాధారణంగా సొంతరంధిలో కూరుకుపోయి తప్పుడుఅంచనాలకు లోనవుతూఉంటారు. 1969 చీలిక విషయంలోనూ అంతే జరిగింది. దేశరాజకీయజీవనంలోని తదనంతర పరిణామాలపై ఇంతటి నిశ్చయాత్మకప్రభావం చూపించిన ఘటన మరొకటిలేదు. ఏదోవిధంగా దానికి దోహదం చేయని రాజకీయవాది లేడు, తీరా జరిగిన తర్వాత ఆ నిందను ఒకే ఒక వ్యక్తి నెత్తిమీద వేయడానికి విడుపులేని ప్రయత్నాలు జరిగి పోయాయి. ఆ వ్యక్తి: ఇందిరాగాంధి.

అదే జరగబోతున్నదని ప్రతి ఒకరికీ తెలుసు. నిజానికి ఆ పరిణామానికి ముందు యావద్దేశమే రెండు ఆలోచనాపంథాలుగా చీలిపోయింది. ఇందులో ఘర్షణలకు దారితీయించిన ప్రాంతీయ వ్యత్యాసాలు, స్థానికవిభేదాలు కూడా ఉండవచ్చుకానీ, కాలం గడిచినకొద్దీ రేఖకు ఒకవైపునున్న వారిని ధనికుల అనుకూలురుగానూ, మరోవైపున ఉన్నవారిని పేదల అనుకూలురుగానూ చూడడం జరిగింది.

ఓ రోజున ఆనంద్ కొన్ని జటిలమైన ఫైళ్ళతో సతమతమవుతుండగా ముఖ్యమంత్రి చౌదరి, ఎంతో గౌరవనీయుడైన ఓ ఢిల్లీ జర్నలిస్టును పరిచయం చేయడానికి ఫోన్ చేశాడు. ఆయన ఒక జాతీయ వార్తాపత్రికకు గతంలో సంపాదకుడుగా పనిచేశాడు. కేంద్రకేబినెట్‌వర్గాల కాయన తలలోనాలుకలా ఉంటాడు. ఏదో భోగట్టాకోసం రాష్ట్ర రాజధానికి వచ్చాడు. ఆనంద్ ఆయనతో సమావేశమై జాతీయ పరిస్థితి గురించి చర్చిస్తే ఎలా ఉంటుంది?

'అలాగే', ఆనంద్ సమాధానం చెప్పాడు. వెంటనే ఏదో స్ఫురణకలిగి అన్నాడు, 'ఆయన మీకు బాగాతెలిసినవాడు కనుక, కాస్త ఉప్పు అందిస్తారేమిటి? జరగబోయే పార్టీ అంతర్గత కురుక్షేత్రంలో తలపడుతున్న ఏదో ఒకగ్రూపు నుంచి ఈయన ఏదైనా సందేశాన్ని వెంటబెట్టు కుని రాలేదు కదా?'

'నాకెలా తెలుస్తుంది? అదేదో నువ్వే కనుక్కుంటే బాగుంటుందేమో!' చౌదరి జవాబు చెప్పాడు.

'ఆ వ్యక్తి స్థాయీ, అత్యున్నతవర్గాలతో ఆయనకున్న సన్నిహిత సంబంధాలూ, జాతీయ రాజకీయ సంరంభం దృష్ట్యా, బాధ్యత కలిగిన ఢిల్లీ జర్నలిస్ట్ ఎవరైనా కేవలం ఒక రాష్ట్రాన్ని సందర్శించడానికని ఢిల్లీ వదలిపెట్టడం కొత నమ్మశక్యంగా తోచని కారణంగా... ఆయన పర్యటనలో వేరేదో అంతరార్థం ఉన్నట్టు మీకు అనిపించడంలేదా?' ఆనంద్ గుచ్చి గుచ్చి అడిగాడు.

'కావచ్చు' చౌదరి అన్నాడు. 'అయినా ఈ ప్రశ్నలన్నీ నామీద ఎందుకు గుప్పిస్తున్నావ్?'

'మరేంలేదు, తనిక్కడికి ఎందుకొచ్చాడో మీకేమైనా సూచనగా చెప్పాడేమోనని. ఒకవేళ చెప్పిఉంటే, ఆయననుంచి నేనేం కూపీతీయాలో మీరు చెబుతారని. మరీ ముఖ్యంగా నే నాయనకు ఏం చెప్పాలో తెలుసుకుందామని!'

చౌదరి కొద్దినిముషాలు మౌనం వహించి అన్నాడు, 'చూడు, నీ సొంతఅంచనాను ఏవిధంగానూ ప్రభావితం చేయడం నాకిష్టంలేదు. ఏం మాట్లాడాలో నీఅంతట నువ్వే నిర్ణయించుకోవడం మంచిది. ప్రస్తుతానికి ఎటువంటి క్లూలు ఇవ్వను. చర్చ పర్యవసానం ఏమిటో నాకు వీలైనంత త్వరగా తెలియజేయి'.

గుంటనక్క! ఒకవైపున గంద్రగోళం సృష్టిస్తూనే తన అవకాశాలు తెరచి ఉంచుకున్నాడు. నిస్సందేహంగా తన తీర్పును ప్రభావితం చేయడమే చౌదరి ఉద్దేశమని ఆనంద్‌కి అర్థమైపోయింది. అదికూడా ఒకవిధమైన వక్రమార్గంలో. లేదా ఒక చర్చను లేవదీయించి తాను సుఖంగా గోడ మీద పిల్లిలా కూర్చుని ఆ చర్చ ఎలా పరిణమిస్తుందో చూద్దామనుకుంటున్నాడేమో. ఇందిరాగాంధీ తరఫున ఆనంద్ బహిరంగంగా వకాల్తా పుచ్చుకుంటే, బహుశా అందుకు విరుద్ధమైన వైఖరిని మరో మంత్రి తీసుకోవాలని అతడి అభిమతం. తను మాత్రం ఫలితం నిర్ధారణయ్యేవరకూ ఎటూ మొగ్గకుండా కాలక్షేపం చెయ్యవచ్చని అతడి ఊహ. ఏదేమైనా ముఖ్యమంత్రి హస్తంలేకుండా ఈ జర్నలిస్టు ఇక్కడికి రావడమన్నది కల్ల.

ఈ అంశాలన్నింటినీ ఆనంద్ తన బుర్రలో నిక్షిప్తం చేసుకుంటూ అన్నాడు, 'సరే, వెంటనే ఆయనను పంపించండి. ఈ లోపల ఫైళ్ళను పక్కన పెట్టేసి ఆయన కోసం కాఫీ తెప్పిస్తాను...'

మరో ఇరవై నిముషాల్లో, శుభ్రంగా, దిట్టంగాఉండి, ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతున్న శంకర్‌దాస్‌ను ఆనంద్ ప్రైవేట్‌సెక్రటరీ గదిలోకి ప్రవేశపెట్టాడు. ఆ మనిషి నిబ్బరంలో నడకలో ఒకవిధమైన ఔచిత్యం వ్యక్తమవుతోంది.

చిత్రికపట్టినట్టున్న సంక్షిప్త వాక్యాలూ, ఎక్కుపెట్టినట్టున్న ప్రశ్నలూ ఆయన బుద్ధివైశిత్యాన్ని వెల్లడిచేస్తున్నాయి. ఉచ్చస్థితిలో ఉన్నప్పుడు తన ముక్కుసూటి సంపాదకీయాలతో అన్నివర్గాల్లోనూ ప్రకంపనలు రేపి ఉంటాడు. మొత్తంమీద, విజ్ఞత, విజ్ఞానం, స్వారస్యం, స్పష్టత, నిబద్ధత ఉట్టిపడే పాతకాలం జర్నలిస్టుగా, రాజకీయవ్యాఖ్యాతగా ఆనంద్‌కు స్ఫురించాడు. ఆయన వైఖరిలో దేశభక్తి, స్వాతంత్ర్యసమరముద్ర స్పష్టంగా కనిపిస్తున్నాయి. దేశం స్వాతంత్రోద్యమ

చరిత్రలో ఆత్మార్పణబుద్ధి సంపూర్ణంగా వెల్లివిరిసిన ఒక శకానికి చెందినవాడాయన డెబ్బై నాలుగేళ్ళ ప్రాయంలో కూడా ఎంతో ఉల్లాసంగా, ఆరోగ్యంగా ఉండి తన తరానికి చెందిన ఎందరిలానో అందుకు గర్విస్తున్నవాడిలా కనిపించాడు.

దాస్ వచ్చీరాగానే ఆనంద్‌తో వ్యక్తిగత సాన్నిహిత్యాన్ని స్థాపించుకున్నాడు. తన కుమారుడితో అతణ్ణి పోల్చి, పరోక్షంలోనే తన భార్యనూ మిగిలిన కుటుంబసభ్యులనూ అతడికి పరిచయం చేసి ఢిల్లీవచ్చినప్పుడల్లా తన ఇంటికివచ్చి భోజనం చేసి మాట్లాడి వెళ్ళవలసిందిగా అప్పటి కప్పుడే ఆహ్వానం అందించాడు. ఆ విధంగా చనువుతో కూడిన సంబంధాన్ని స్థాపించాడు... ఏమైనా అందుకు ప్రయత్నించాడు. పాతతరానికి చెందిన ఆ వ్యక్తిలోని కలుపుగోలు తనంలో నిజాయితీతోపాటు ఔన్నత్యమూ చూచి ఆనంద్ ముగ్ధుడయ్యాడు.

దేశవిదేశాల్లోని వర్తమాన రాజకీయ పరిస్థితితో సహా అనేక విషయాలమీద చర్చ ప్రారంభమైంది. దేశం ఎదుర్కొంటున్న ఆర్థిక సంక్షోభం గురించి దాస్ ఏకబిగిన మాట్లాడాడు. పాకిస్తాన్‌లో ఇటీవల జరిగిన యుద్ధంవల్ల తలెత్తబోయే దుష్ప్రభావాలు తనకు కళ్ళకు కట్టినట్టు కనిపిస్తున్నాయన్నాడు. దిక్కుమాలిన అనావృష్టి, వరదలూ పరిస్థితిని మరింత విషమింపజేశాయన్నాడు. ఉత్పాతాల నివారణకు ప్రభావపూరితమైన కలిసికట్టుచర్య లేవీ తీసుకోవడం లేదంటూ విచారం వెలిబుచ్చాడు. ఆయన ప్రదర్శించిన వాక్చిత్రంలో ఎంతో స్పష్టత, వాస్తవికత, ఆమోదయోగ్యత ప్రస్ఫుటించాయి.

చివరగా ఆయన తన వాదనలోని కీలకాంశానికి వచ్చాడు. అధికార పక్షం చీలిపోవడానికి ఇదా సమయం అంటూ నిలదీసి ప్రశ్నించాడు. ఆమె (అంటే ఇందిరాగాంధీ) మిగిలిఉన్న తన పదవీకాలంలో పార్టీని కూడకట్టుకోకూడదా! వచ్చే ఎన్నికల్ని తన నాయకత్వంలో రెండో ఎన్నికల్ని ఆమె పటిష్ఠమైన ఐకమత్యంతో ఎదుర్కొంటే మంచిదికాదా?

ఈ ప్రశ్నలు ఒక అభియోగ పత్రంలా ధ్వనించాయి. మర్యాద పూర్వకమైన పదజాలంతో పొదిగినవైనా విపరీతపాక్షికతనే ప్రతిబింబించాయి. అన్నింటికంటె దారుణంగా అవి మరీ భోళా తనాన్నిప్రదర్శించేవిగానూ, ఊకదంపుడు ఉద్ఘాటనలుగానూ ఆనంద్‌కి తోచాయి.

ఆనంద్ విస్మితుడయ్యాడు. కొంత విచారమూ అతణ్ణి ఆవరించింది. నాగరికత కేవలం ఒక ముసుగులానేఉపయోగపడుతున్నప్పుడు, కుండబద్దలుకొట్టినట్టు మాట్లాడడమే దానికి తగిన సమాధానమవుతుంది. అయితే ఆనంద్ ఆ ఆయుధాన్ని ఆశ్రయించలేదు. అది బాగా పనిచేస్తుందని అతడికి తెలుసు, అయితే ఈ పెద్దమనిషి కొన్ని నిముషాల్లో నేతనతో పెంచుకున్న సాన్నిహిత్యం దెబ్బతింటుందని భయపడ్డాడు. ముందెన్నో అవకాశాలకు తావిచ్చే ఈ సంబంధం తెగిపోకూ డదనుకున్నాడు.

'దాసుగారూ! దేశ చరిత్రలో మీరెన్నో విపరిణామాలను చూసుంటారు. దయచేసి చెప్పండి, అధికారపక్షం చీలిపోవడానికి అవకాశమిచ్చే ప్రత్యేకసందర్భం ఏదైనా ఉంటుందంటారా? ముందుగా అటువంటి పరిస్థితులు ఊహాకందేవిగా ఉంటాయంటారా?'

'లేదు, సాధారణంగా ఉండవు' దాస్ ఒప్పుకున్నాడు.

'బాగా చెప్పారు.' ఆనంద్ అన్నాడు. 'నాకు ఢిల్లీ రాజకీయాల గురించి అంతగా తెలియదు కనుక పూర్తిగా మీ మీదే ఆధారపడతాను. ఇప్పుడు చెప్పండి, చీలికను రుద్దుతున్న దెవరు? ఇందిరాగాంధీయేనా?'

'నిస్సందేహంగా' దాస్ ఉద్ఘాటనగా అన్నాడు. 'తన సీనియర్ సహచరులపై ఆమెకి విశ్వాసం లేదు. అలాగని ఆమె వాళ్ళను తన్నితరిమెయ్యలేదు. అంచేత తనకంటూ ఒక సామ్రాజ్యం నిర్మించుకుని, దానిని ప్రజలకు ఆమోదయోగ్యం చేయడంలో తాను మాత్రమే ప్రాధాన్యం వహించాలని ఆమె కలలుకంటోంది, ఈ క్రమంలో పార్టీ సర్వనాశనమయ్యే ప్రమాదం తలెత్తినా సరే. .'

'దాసుగారూ! రెండేళ్ళ క్రితం, సార్వత్రికఎన్నికలు జరిగాయి. నాకు తెలిసినంతవరకూ ఆ ఎన్నికల్లో పార్టీలోని ప్రముఖులమాటే పూర్తిగా నెగ్గింది. అప్పుడు రంగంలోఉన్న ఒకే ఒక కొత్తవ్యక్తి ఇందిరాగాంధీయే. మరి అప్పుడు దేశంలోని ప్రధానభాగంలో పార్టీ ఎందుకంత దారుణంగా ఓడిపోయిందంటారు?'

ఆ ప్రశ్న అందించిన అవకాశాన్ని వెంటనే దొరకపుచ్చుకుంటూ దాస్ అన్నాడు. 'పార్టీలో తలనెరిసిన నాయకులు చేస్తున్న వాదన సరిగ్గాఅదే. ఇది విభేదాలు మాపుకోవలసిన సమయమే కానీ, చీలిపోవలసిన ఘడియకాదు...'

'వాళ్ళంటున్న మాటలో నిజముంది. కానీ దాసుగారూ, నాకీ సంగతి చెప్పండి. విభేదాలు మాపుకోవడమంటే ఏమిటి? సూటిగా చెప్పాలంటే నాయకురాలైన ఇందిరాగాంధీ తన సీనియర్ సహచరుల చెప్పుచేతల్లో ఉండాలనే కదా దానర్థం? వాళ్ళ అభిప్రాయసారాంశం అదేకదా?'

'బాగుంది. నేను మాట్లాడుతున్నది ఆ అర్థంలోకాదు. ఎంతైనా మంత్రివర్గం అనేది ఒక జట్టు. అది జట్టుగానే వ్యవహరించాలి. పండిట్‌జీ హయాంనుంచి అలాగే జరుగుతోంది...'

'ఆ అభిప్రాయంతో చాలామంది ఏకీభవిస్తారనుకోను' ఆనంద్ అన్నాడు. 'వాళ్ల ఉద్దేశంలో పండిట్‌జీ మంత్రివర్గమంటే కేవలం పండిట్‌జీయే; మిగిలిన వాళ్ళందరూ ఆయన అడుగు జాడల్లో నడవవలసిందే, ముఖ్యంగా సర్దార్ పటేల్ మరణానంతరం అదే పరిస్థితి. బహుశా ఇప్పుడు వాళ్ళు కోరుకుంటున్నది పాత్రల్ని తారుమారు చేయాలనే. ఎందుకంటే, ఇందిరా గాంధీ పండిట్‌జీ కారుకనుక ఆమె కేవలం వోట్లు ఆకర్షించే పాత్రకే పరిమితం కావాలి. మిగిలిన వ్యవహారాలన్నీ సీనియర్ సహచరులు చూసుకుంటారు. ఒక పార్టీ కార్యకర్తగా నే నీ పాత్రల గురించి పట్టించుకోను. నాకు కావలసింది ఫలితాలు. ఎట్టఎదుట కనిపిస్తున్న వాస్తవం ఏమిటంటే, సీనియర్ నాయకులు నిర్దేశించిన కార్యక్రమాలు 1967 ఎన్నికలలో ప్రజల ఆకాంక్షల స్థాయిని అందుకోలేకపోయాయి. ప్రజలకు కావలసింది మార్పు– సమూలక్షాళన, పునరీక్షణ, పునరుత్తేజం, సంపూర్ణ పరివర్తన, పాక్షిక పరివర్తన – మీరే పేరుతోనైనా పిలుచుకోండి, వాళ్లకు అత్యవసరం కావలసింది అదే. .!

'మీ రిప్పటికే ఒక నిర్ధారణకొచ్చేసినట్టున్నారు' మొదటిసారి కొంత అసహనాన్ని ప్రదర్శిస్తూ దాస్ వ్యాఖ్యానించాడు. '1967లో పార్టీ అపజయానికి ప్రధాన కారణం అనైక్యతేనన్న విస్తృతాభిప్రాయానికి మీ సమాధానం ఏమిటి?'

'ఏదో ఒక్క కారణం వల్లనే పార్టీ మెరుగైన ఫలితాలు సాధించలేకపోయిందని నేననుకోను' ఆనంద్ వ్యాఖ్యానించాడు. 'ఒక రాజకీయపక్షంలో ఐకమత్యం ఎప్పుడూ అవసరమే. అయితే ఆ ఐకమత్యం దేనిని సాధించడంకోసం? అదికూడా ఎంతవరకు? ఉదాహరణకు 1952 ఎన్నికల్లో జవహర్లాల్‌నెహ్రూ అత్యున్నత నాయకస్థానంలో ఉన్నప్పుడు మేము మా జిల్లాలో కలసికట్టుగా పనిచేశాం. అయినా దాదాపు అన్నిస్థానాల్లోనూ ఓడిపోయాం. కారణం, మరింతగా ఆకట్టుకో గలిగిన రాజకీయశక్తి ఒకటి వోటర్లపై ప్రభావం వేయగలిగింది కనుక. అందుకని ఇప్పుడు నాయకులందరూ కూర్చుని వోటర్లను ఆకర్షించగల సరికొత్త కార్యక్రమాన్ని రూపొందించే ఆలోచన ఎందుకు చేయరు? అప్పుడే సమస్యతో నేరుగా తలపడినట్లవుతుంది. ఏమంటారు? నాయకత్వం కలిసికట్టుగా అలా చేయగలిగితే అంతకంటె అత్యద్భుతమేముంటుంది? దయచేసి చెప్పండి దాసుగారూ! అలా జరుగుతుందంటారా? ఢిల్లీ తంత్రాంగాలను పరిశీలిస్తున్న మీదట మీరెటువంటి నిర్ధారణ కొచ్చారు?'

శంకరదాస్ కొన్ని క్షణాలు మౌనం వహించాడు. ఆ తర్వాత నిస్సహాయత ధ్వనించేలా నిట్టూర్పు విడిచి అన్నాడు. 'అలా జరిగినప్పుడుకదా! కాలపరీక్షకు నిలిచిన విధానాలనూ, కార్యక్రమాలనూ ఇందిరాజీ అతిక్రమిస్తున్నంతకాలం పార్టీలో ఐక్యకార్యాచరణకు అవకాశం ఉంటుందని నేననుకోను ఆనంద్‌గారూ! అసలు చిక్కు అదేనని నా అభిప్రాయం...'

'ఒక్క నిముషం ఆగండి దాసుగారూ!' ఆనంద్ అడ్డుతగులుతూ అన్నాడు. 'విధానాలనూ, కార్యక్రమాలనూ మీరు ఒకేగాట ఎందుకు కట్టేస్తారు? నా ఉద్దేశంలో పార్టీ మౌలిక విధానాలు ఎప్పుడూ వివాదాంశాలు కాలేదు; అవి సక్రమమైనవి, కాలపరీక్షలో నెగ్గినవి. అంతకంటె మెరుగైన విధానాలను ఏ పార్టీ చూపించలేకపోయింది. అయితే కార్యక్రమాల విషయం వేరు. అవి ఆయా కాలాల్లోని అవసరాలనుబట్టి మారుతూ ఉంటాయి, మారితీరాలి కూడా. వాటి ఊనికను మార్చు కోవచ్చు, ప్రాధాన్యాలను మార్చుకోవచ్చు, ప్రజల ఆకాంక్షలకు తగినట్టు వాటిలో సవరణలు చేసుకోవచ్చు. మార్పు అనివార్యమని 1967 ఎన్నికలు నిర్ద్వంద్వంగా రుజువు చేశాయి. నాకు అర్థమైనంతవరకూ, వచ్చిన తేడాఅల్లా కార్యక్రమాల విషయంలోనే...'

నోరు విప్పడానికి ముందు మళ్ళీ కొద్దిసేపు శంకర్‌దాస్ ఆలోచనలోకి జారిపోయాడు. 'మీరు చూపించిన తేడా సరైనదేనని నాకు అనిపించడంలేదు. అది ఒకవేళ సరిగానే ఉందనుకున్నా, సర్వసమ్మతి కలిగిన కార్యక్రమాన్ని అమలు చేయాలన్న ఆలోచనను ఇందిరాగాంధీ సమర్థిం చరనే నా అభిప్రాయం. పార్టీలోని తన సహచరులపైకన్నా ఆమె కమ్యూనిస్టుసిద్ధాంతవాదులమీదే ఎక్కువ ఆధారపడుతున్నారు. మొత్తంమీద పార్టీని ఏకం చేస్తున్న పారంపరికభావాలనూ, సంస్కృతినీ ఆమె చావుదెబ్బ తీస్తున్నారు...'

ఒక పార్టీ పారంపరిక భావాల గురించి, సంస్కృతి గురించి నేను తీర్పు చెప్పగలగినవాణ్ణి కాదు.' ఆనంద్ ప్రత్యుత్తరమిస్తూ అన్నాడు. 'అయితే ఈ పార్టీకి చెందిన పారంపరిక భావాలూ, సంస్కృతీ కూడా అప్పుడప్పుడు మార్పుకు లోనవుతూనే ఉన్నాయని నా విశ్వాసం. పార్టీ చరిత్రలో ప్రతినిర్ణయాత్మక ఘట్టంలోనూ మార్పు సంభవిస్తూనే ఉంది. మహాత్మా గాంధి నేతృత్వంలో భారత ప్రజానీకం పెద్దఎత్తున పార్టీ ప్రభావంలోకి వచ్చినప్పుడు దాని పునాదిలోనూ, సంస్కృతిలోనూ బ్రహ్మాండమైన మార్పు వచ్చింది. గాంధీజీ 'చర్యో, చావో' తేల్చుకోమని పిలుపు ఇచ్చినప్పుడూ అటువంటి అసాధారణ పరివర్తనే సంభవించింది. రాజకీయోద్యమాన్ని ఆర్థికస్వావలంబనతో ఆయన ముడిపెట్టినప్పుడు కచ్చితమైన మార్పు చోటుచేసుకుంది. అంతకు ముందు అధినివేశ ప్రతిపత్తి అన్న లక్ష్యంనుంచి పూర్ణస్వరాజ్య లక్ష్యంవైపు పార్టీ మళ్ళినప్పుడు కూడా దాని పారంపరిక యోచనలో సమూల పరివర్తన వచ్చింది. మీరన్నట్టు ఇందిరా గాంధీ పార్టీ పారంపరిక యోచనను మార్చడానికి యత్నిస్తున్నారనుకున్నా అలా యత్నించడం ఇదే మొదటిసారికాదు, ఇదే చివరిదీ కాబోదు... కనుక నాయకులు జరగబోయేది అర్థం చేసుకుని క్లేశరహితంగా అది జరగడానికి ఎందుకు తోడ్పడకూడదు?!'

శంకర్‌దాస్ తన వాదం వీగిపోతున్నట్టు అర్థం చేసుకున్నాడు. ఆనంద్ మాటలు వింటున్న కొద్దీ తనెంతగా స్వాభిలాషకోణంనుంచి వాదిస్తున్నాడో అతనికి అర్థమైంది. ఒకింత భుజాలు ఎగరేస్తూ అన్నాడు, 'మీ వాదం అర్థవంతంగానే ఉందికానీ, చాలామంది దృష్టిలో జరుగుతున్నది అధికారంకోసం కుమ్ములాటే తప్పించి, మరొకటి కాదు.'

'అదే నిజమైతే అటువంటి విద్రోహ క్రీడలో పాల్గొనడానికి నాకు తగిన కారణమే లేదు.' ఆనంద్ ఠకీమని జవాబు చెప్పాడు. 'ఇక్కడ మేము అట్టడుగు స్థాయిలో అనేక గడ్డు సమస్యలతో పోరాడుతున్నాం. ఒక సాధారణ గ్రామీణుడి కంటితో పరిస్థితిని చూడడం మినహా మరోవిధంగా చూడవలసిన అవసరం మాకేముంది? అధికారంకోసం కుట్రలు, కుతంత్రాలు ఇక్కడ, రాష్ట్రస్థాయిలో జరగడం లేదని నే ననడంలేదు, జరుగుతున్నాయి, మరింత నీతిబాహ్యంగా జరుగుతున్నాయి. అయితే సంక్షోభం విషమించినప్పుడు ఏదో ఒకవిధంగా, ఏదో ఒక ఘట్టంలో మాలోని చీలిక వర్గాలన్నీ కేంద్రంతో పొత్తు కలిపేసుకుంటాయి. ఇప్పుడు మా మొహాన వ్రేలాడుతున్నవి రాబోయే ఎన్నికలు. ఆ తర్వాత వచ్చే ఎన్నికలు... పార్టీ ప్రయోజనాల రీత్యానే మేము నిరంతరాయంగా ప్రజలకు ఏదో ఒక మేలు చేస్తూ ఉండవలసిందే. ఒక ఎన్నికకుముందు ఏదైనా ఒక గ్రామానికి మంచినీళ్ళ బావి కల్పించగలిగితే తదుపరి ఎన్నికలో ఆ బావిగురించి మాట్లాడవలసిన అవసరముండదు. పార్టీ కార్యక్రమానికి, ఇదిగో ఇక్కడే ప్రాధాన్యమూ ప్రాసంగికతా లభిస్తాయి. జాతీయ నాయకుల వ్యక్తిత్వాలలో పోల్చితే నేనెంతో చిన్నవాణ్ణని నాకు తెలుసు. అయితే వాళ్ళ కార్యక్రమాలను పోల్చిచూసి తప్పకుండా ఒక నిర్ధారణకు రాగలుగుతాను... ఒప్పుకుంటారాదాసు గారూ?'

'ఒప్పుకుంటాను సరే, కార్యక్రమాల్లో మీరు తేడా ఎక్కడ పట్టుకోగలుగుతారు? అది పార్టీ కార్యక్రమమే కానీ, ఒక వ్యక్తి, అతడెంత ఉన్నతస్థానంలో ఉన్న వ్యక్తి అయినా కానివ్వండి నిర్దేశించిన కార్యక్రమం కాదు...'

'ఆ విషయంలో నాకు సమస్యేమీ లేదు.' ఆనంద్ అన్నాడు. 'అయితే పార్టీ కార్యకర్తగా, వచ్చే ఎన్నికల్లో నిలబడబోయే అభ్యర్థిగా పార్టీ కార్యక్రమాన్ని చూపించి ఎన్నికలో నెగ్గుకురాగలననే విశ్వాసం నాకు కలగాలా లేదా? చెప్పండి దాసుగారూ, అధిష్ఠానవర్గంనుంచి అటువంటి కార్యక్రమం రాగలదని మీరు విశ్వసిస్తున్నారా?'

'ఏమో, అంత నమ్మకంగా చెప్పలేను' శంకర్‌దాస్ జవాబిచ్చాడు. 'అయినా, నా కింకా మొత్తం వ్యవహారం తెలియదు. బ్యాంకుల జాతీయకరణ వంటి అంశాలలో అధిష్ఠానవర్గంలో తీవ్రవిభేదాలున్నట్టు మాత్రం నిశ్చయంగా తెలుసు. ఈ ఆలోచన జనరంజకంగానూ, ఆకర్షణీయంగానూ ఉండవచ్చు. కానీ కొత్తవిధానంలో బ్యాంకులు ఎటువంటి పూచీకత్తులు లేకుండా పెద్ద సంఖ్యలో పేదలకు రుణాలు ఇవ్వవలసివస్తుంది. దాంతో అవి నష్టాలబరువుకింద కుంగిపోయి, జరుగుతున్నదేమిటో తెలుసుకునేలోగానే దేశఆర్థికస్థితి కుప్పకూలిపోతుంది...'

'మీరలా ఎందుకనుకుంటున్నారు దాసుగారూ!' ఆనంద్ మధ్యలో అడ్డుతగులుతూ ప్రశ్నించాడు. 'రుణం తీసుకున్న పేదలగురించి మీ రా నిర్ధారణ కెలావచ్చారు? జనంలోకి వెళ్లి ఎవరైనా అధ్యయనాలు జరిపి ఆ నిర్ణయానికి వచ్చారా?'

'నాకు తెలియదు,' శంకర్‌దాస్ అన్నాడు 'నిజానికి అధ్యయనం చేయవలసిన అవసరం నాకేమీ కనిపించడంలేదు. బాకీ చెల్లించలేని స్థితిలో ఉన్న ఒక నిరుపేద చెల్లించకపోవడం సహజమేకదా?'

'గ్రామప్రాంతాల్లో శతాబ్దాలుగా వడ్డీవ్యాపారం చేస్తున్న వేలాదిమంది అనుభవం మీకు తెలుసోతెలియదో? పేదలకు తామిచ్చిన రుణాల్ని వసూలు చేసుకోవడంలో వాళ్ళేమైనా ఇబ్బందినెదుర్కొంటున్నారా? అదే నిజమైతే వాళ్ళు అదే వ్యాపారాన్ని అంటిపెట్టుకునిఉండి క్రమేణా సంపన్నులు, ఇంకా సంపన్నులు కావడం ఎలా సాధ్యమై ఉండేది? ఇక సకాలంలో చెల్లింపుల విషయానికొస్తే బడా భూస్వాములనుంచే పెద్దఎత్తున భూమిశిస్తు బకాయిలు పేరుకుపోయాయన్న విషయం మీకు తెలియదా! నిజం చెప్పాలంటే ప్రభుత్వానికి పన్నులెగగొడుతూ పెద్ద మొత్తాల్లో బకాయి పడడం మా గ్రామ ప్రాంతాల్లో హోదాకు చిహ్నం!'

డ్రాయింగ్ రూంలో వాళ్ళు కూర్చున్నచోటునుంచి కిటికీలోంచి చూస్తే విశాలమైన రోడ్డు, రాకపోకల రద్దీ కనిపిస్తాయి. ఎడతెరిపిలేని మనుషులకేకలు, వాహనాల రణగుణధ్వనులు చెవినపడతాయి: కూతలు, కూనిరాగాలు, బుసబుసధ్వనులు, చెవులకు హోరెత్తించే చప్పుళ్ళు, గోలగోలగా వినిపించే కబుర్లు, టపటపలు, గొణుగుళ్ళు, ఉరుములు.. అంతా అచ్చం భారతీయనగరాల్లో వినిపించే సంకీర్ణవాద్యఘోష. విరామంలేకుండా బస్సులు, కార్లు, ట్రక్కులు, టేక్సీలు, త్రిచక్రవాహనాలు, సైకిల్‌రిక్షాలు, సైకిళ్ళు, పెద్దపెద్ద బళ్ళు, కూరగాయలతో తోపుడు బళ్ళు వాళ్ళకళ్ళముందు అటునుంచి, ఇటు నుంచి ప్రవాహంలా సాగిపోతున్నాయి. ఫుట్‌పాత్‌లను దుకాణాలు, బిచ్చగాళ్ళగుంపులు ఆక్రమించుకున్నాయి. ప్రధానరహదారిని పాదచారులు ముంచెత్తుతూ తరచు రాకపోకల్ని స్తంభింపజేస్తున్నారు. పేవ్‌మెంట్‌లమీద అక్కడా అక్కడా

తమ పవిత్రగ్రంథాలతో జ్యోతిష్కులు కనిపిస్తున్నారు. వాళ్ళలో కొందరివద్ద పంజరంలో ఉంచిన మైనా పిట్టలున్నాయి. మనుషుల భవిష్యత్తును సూచించడానికి ఆ చిన్నపిట్టల్ని భగవంతుడు మాధ్యమంగా వాడుకుంటాడని నమ్మకం. జ్యోతిష్కుడు తన వంతుగా దానికి కొంత వ్యాఖ్యానాన్ని, సలహాలను జోడించి, ఎంతో ఉత్సుకతతో తన వద్దకు వచ్చినవాళ్ళకి తెలియజేస్తూ ఉంటాడు, అప్పటికప్పుడు ప్రతిఫలం తీసుకునే అనుకోండి ఇంత హడావిడి చోటుచేసుకున్నా ఒక మంత్రి నివాసానికి ఎదురుగా ఉండడం వల్ల ఈ ఫుట్‌పాత్‌మీద రద్దీ తక్కువగానే ఉంది. ప్రభుత్వం తన మంత్రులపట్ల చూపే మితిమీరిన పక్షపాతానికి నిదర్శనంగా నగరవాసులు దీనిని ఎత్తిచూపించడం కద్దు. 'మిగిలిన వాళ్ళ ఇబ్బందుల్ని బొత్తిగా పట్టించుకోర'ని వాళ్ళు తిట్టు కుంటుంటారు.

ఆ విపరీత సంరంభం ఆకట్టుకోవడం వల్లనో, లేక ఆలోచనా విజృంభణకు కొద్దిసేపు విరామం ఇవ్వడం కోసమో శంకర్‌దాస్, ఆనంద్ కొన్ని నిముషాలపాటు ఆ వీధిసన్నివేశాన్ని చూస్తూ ఉండిపోయారు. హఠాత్తుగా దాసు వైపు తిరిగి ఆనంద్ అన్నాడు. 'ఇక్కడే ఇప్పుడే కొన్ని ప్రత్యక్షవివరాల్ని సేకరిద్దామా దాస్‌గారూ?'

శంకర్‌దాస్ అతడివైపు అయోమయంగా చూస్తుండగా ఆనంద్ మళ్ళీ అన్నాడు, 'ప్రత్యక్ష, తక్షణ సమాచారం సేకరిస్తా చూడండి'. ఫోన్ తీసుకుని తన ప్రైవేట్‌సెక్రటరీకి స్థానికభాషలో క్లుప్తంగా ఏవో ఆదేశాలిచ్చాడు. శంకర్‌దాస్ ఇనుమడించిన ఆసక్తితో చూస్తుండగా సెక్యూరిటీ గార్డు ఒక మహిళను, కూరగాయలు నిండిన ఆమె తోపుడుబండితో సహా కాంపౌండ్‌లోకి వెంటబెట్టుకుని వచ్చాడు. ఆమె ముఖంలో భయం ఆశ, అయోమయం ముప్పిరిగొన్నాయి అరగంట క్రితం కానిస్టేబుల్‌కు తాను రెండురూపాయల మామూలు చెల్లించినా ఒక పోలీసు మనిషి తనను ఇక్కడికెందుకు తీసుకొచ్చాడో అర్థంకాక భయం; తనబండిలోఉన్న తాజా కూరగాయలు ఒక పెద్ద బంగళాలో ఉన్న వాళ్ళదృష్టిని ఆకర్షించినందుకు ఆశ; ఇటువంటి పరిస్థితి గతంలో తనకెప్పుడూ అనుభవంలోకిరాలేదు కనుక అయోమయం.

ఆనంద్ శంకర్‌దాస్‌ను తీసుకొని డ్రాయింగ్ రూంనుంచి ఇవతలకువచ్చి ఆ కూరలమ్మితో మృదువుగా, దయగా, చనువుగా మాట్లాడడం ప్రారంభించాడు. ఎంతో లాలనగా మాట్లాడుతూ ఇంతవరకు ఎవరికీ కాగితం మీద పెట్టాలని కూడా అనిపించని ఒక బాధాకరమైన కథనాన్ని మెల్లమెల్లగా ఆమెనుంచి రాబట్టాడు. విస్తుపోయిచూస్తున్న తన ప్రైవేట్ సెక్రటరీతో ఆమె వద్ద కూరగాయలు కొనమని చెప్పి ఆమెతో మాట్లాడడం, ఆమె కూరగాయలు తనకెంతో నచ్చాయన్న అభిప్రాయాన్ని ఆమెకి కలిగించిపంపించాడు. తర్వాత మళ్ళీ శంకర్‌దాస్‌ను డ్రాయింగ్ రూంలోకి తీసుకెళ్ళాడు. ఏం చేయాలోతోచని ఆ పెద్దమనిషి మారు మాట్లాడకుండా యాంత్రికంగా ఆనంద్‌ను అనుసరించాడు.

'చాలా కృతజ్ఞుణ్ణి దాసుగారూ!' ఆనంద్ ప్రారంభించాడు. ఆ పేద మహిళ మనసులో ఏముందో ఇప్పటికప్పుడు శోధించి తెలుసుకోడానికి మీ ప్రశ్నలే నన్ను పురిగొల్పాయి. ఆమె

కథ ఎంతో ఆకట్టుకునేదీ, హృదయాన్ని కలచివేసేదీ కూడా. నగరానికి దక్షిణంగా ముప్పై మైళ్ళ దూరంలో ఉన్న గ్రామం ఆమెది. భర్తతో కలిసి పదేళ్ళ క్రితం ఇక్కడికి వచ్చింది. భర్త సైకిల్‌రిక్షా తొక్కుతాడు. ఆ రిక్షాను అతడు ఓ వర్తకుడిదగ్గర అద్దెకొనుగోలు పద్ధతిలో తీసుకున్నాడు. దినసరిఅద్దె చెల్లించగా, వాళ్ళు జీవించడానికి మిగిలేది చాలా తక్కువ. ఒక్క పొద్దుకూడా పూర్తిగా కడుపునింపుకోలేని దుర్భరస్థితి. ఆ రిక్షా సొంతం చేసుకోడానికి భర్త రాత్రనక పగలనక కష్టపడ్డాడు. అంతలో రోగమొచ్చి హఠాత్తుగా చనిపోయాడు. అదేం రోగమో కనిపెట్టి చికిత్స చేసిన వాళ్ళెవరూ లేరు. భార్య నిరాధారంగా మిగిలింది. ఓ వడ్డీవ్యాపారి వద్ద అయిదువందల రూపాయలు అప్పుచేసి తోపుడు బండి కొనుక్కుని నగరంలోని వీధుల్లో సందుల్లో కూరగాయలు అమ్ముకుంటూ బతుకుతోంది. నగరంలో ఎక్కడ చూడండి, అటువంటి బళ్ళు వందలసంఖ్యలో కనిపిస్తాయి. ఒక్కొక్క బండి యజమాని వెనుక ఎటువంటి విషాదగాథలు గూడుకట్టుకున్నాయో ఎవరికి తెలుసు? దినసరి పెట్టుబడికోసం ఆమె మరో వడ్డీవ్యాపారి దగ్గర ప్రతిరోజూ యాభై రూపాయలు బదులు తీసుకుని సాయంత్రానికి రెండురూపాయల వడ్డీని కూడా కలిపి ఆ యాభై రూపాయలను తిరిగి చెల్లించేస్తూ ఉంటుంది. ప్రతిరోజూ ఆమె ఈ లావాదేవీని సాగిస్తూనే ఉంటుంది, ఆ విషయం మరచి పోకండి; ఆమె ఈవిధంగా ఎంత వడ్డీ చెల్లిస్తోందో మీరే ఊహించుకోవచ్చు. ఈ వృత్తాంతంలో దిగ్భ్రాంతి కలిగించే అంశం ఏమిటంటే, ఆ వడ్డీవ్యాపారిపట్ల ఆమె అపారమైన కృతజ్ఞతను ప్రకటించుకుంటూ, మనస్ఫూర్తిగా అతడి మేలుకోరుకుంటూ ఉండడం. నాలుగేళ్ళుగా చెమటోడ్చి శ్రమ పడుతున్నా, బండి కొనుక్కోడానికి తీసుకున్న అప్పును ఆమె ఇంత వరకూ చెల్లించలేకపోయింది. కేవలం వడ్డీ మాత్రం ముట్టజెప్పగలుగుతోంది. అసలుమొత్తాన్ని ఆమె ఏనాటికీ చెల్లించలేదన్నది ఇందు వల్ల స్పష్టమైపోతోంది.'

శంకర్‌దాస్‌కు ఇంతకుమించిన విశదీకరణ అవసరం లేకపోయింది 'బ్యాంకుల్ని జాతీయం చేయడం మీరెందుకు కోరుతున్నారో ఇప్పుడు నాకర్థమైంది', అని మనస్ఫూర్తిగానే అన్నాడు. 'అయితే ఈ వ్యవహారమంతా ఆ కూరలమ్మి దృక్కోణంనుంచి కనిపించినంత తేలికదైతే ఎంత బాగుండేదో, అని నేనూ అనుకుంటాను. ఏదేమైనా ఇక పార్టీలో చీలికరాకతప్పదు. దేవుడే మిమ్మల్ని చల్లగా చూడాలి, పార్టీని రక్షించాలి!'...

మరుసటి ఉదయం, రాష్ట్రపతి జాకీర్ హుస్సేన్ హఠాన్మరణ వార్త దేశాన్ని దిగ్భ్రాంత పరిచింది...

# 44

ఒక రాజ్యాంగాధినేత మరణం సాధారణంగా ఒక పెద్ద రాజకీయతుపానుకు కారణం కానవసరంలేదు. అయినా డాక్టర్ జాకీర్‌హుస్సేన్ అస్తమయం అధికారపక్షానికి మరో అగ్ని పరీక్షగా పరిణమించింది. రెండేళ్ళక్రితం ఆయన ఎన్నిక పార్టీ ముక్కలయ్యే పరిస్థితిని తెచ్చి పెట్టింది. ఇందిరాగాంధీ ఆధిపత్యాన్నీ, చాకచక్యాన్నీ అది సంపూర్ణంగా పరీక్షించింది. ఆయన మృతి పార్టీచీలికను వేగిరపరచి ఎవరూ తప్పించజాలనిదిగా దానిని మార్చివేసింది.

రాష్ట్రపతిపదవికి జరిగే నూతనవారసత్వపోరాటం పూర్తిగా విలక్షణ రూపం తీసుకుంది. ఈసారి అధికారపక్షం వెలుపలినుంచి అభ్యర్థి ఎవరూ ముందుకురాలేదు. అంతర్గతవిభేదాలెలా ఉన్నప్పటికీ, ప్రతిపక్షం మూకుమ్మడిమద్దత్తు ఇచ్చినాసరే రాష్ట్రపతిఎన్నికలో గెలిచి గట్టెక్కుతానని బయటిఅభ్యర్థి ఎవరూ ఆశ పెట్టుకోనవసరంలేదని ఇప్పటికే స్పష్టమైపోయింది. కోకా సుబ్బారావు ఒక్కరే గెలుపుకి కాస్త దగ్గరగావచ్చారు,అంతే. దేశంలో కోకాసుబ్బారావులు ఎందరో లేరు. ఏమైనా ఈ ఎన్నిక జరిగిన తర్వాత ఈ రెండేళ్ళలో పరిస్థితులు ఎంతగానో మారాయి. అదీగాక ఆ ఎన్నికకు అభ్యర్థుల వ్యక్తిత్వప్రమేయం ఏమీలేదు. పరిస్థితిని ఇబ్బడి ముబ్బడి చేయడానికి అధికార పక్షంలో చీలిక, రాష్ట్రపతిఎన్నిక యాదృచ్ఛికంగా ఒకేసారి తొసు కొచ్చాయి. చీలిక నుంచి రెండు పార్టీలు పుట్టుకురావడం మాత్రం యాదృచ్ఛిక పరిణామం కాక, ఉద్దేశపూర్వక నిర్ణయఫలితం.

అధికారపక్షానికి చెందిన ఆధికారికఅభ్యర్థి ఎన్నిక వివాదానికి దారితీసింది. రాష్ట్రపతిఎన్నికకు అభ్యర్థిని ఎవరు ఎంచుకుంటారు? పార్టీ పార్లమెంటరీబోర్డా? పార్టీ అత్యున్నతకార్యవర్గమా? పార్లమెంటులోని పార్టీసభ్యులా?... పత్రికల్లో, పార్లమెంట్ సెంట్రల్‌హాల్‌లో, మేధావివర్గాల్లో, ప్రతిచోటా దీనిపై ఎంతో వేడివేడిగా చర్చలు జరిగిపోయాయి. అయితే మారుతున్న పరిస్థితికి అనుగుణంగా ప్రతిఒకరి అభిప్రాయాలుకూడా మారుతుండడంతో, తరచు జరుగుతున్నట్టే ఇప్పుడూ చర్చ అనిశ్చితంగానే మిగిలిపోయింది. ఈ అయోమయఘట్టంలో చీలికకు వేగుచుక్కల్లా అధికారపక్షంనుంచి ఇద్దరు అభ్యర్థులు పైకితేలారు. పార్టీ పార్లమెంటరీబోర్డు తన చరిత్రలోనే ప్రప్రథమంగా మెజారిటీ నిర్ణయంతో సంజీవరెడ్డిని తన అభ్యర్థిగా ఎంపికచేసింది. ఆయన నామినేషన్‌పత్రంపై ప్రతిపాదకురాలుగా ఇందిరాగాంధీ సంతకంచేశారు. కొద్దిరోజులకే, అప్పుడు

ఉపరాష్ట్రపతిగా ఉన్న గిరివైపు ఆమె తన మొగ్గును మార్చుకున్నారు. ఇందిరాగాంధీ ప్రోత్సాహంతోనే గిరి రంగప్రవేశంచేశారని ప్రతిఒకరూ విశ్వసించారు. ఈ పిల్లమొగ్గకు ముందుముందు భారీ మూల్యం చెల్లించుకోవలసివచ్చింది ముత్రాప్రయోజనాలకోసం విలువల్నికూడా బలిపెట్టే మనిషిగా ఆమెను కనిపింపజేసింది ముత్రాప్రయోజనాలకోసంకూడా కాదు; మరింత నిక్కచ్చిగా చెప్పాలంటే అచ్చంగా తనమనుగడకోసం.

అవును, అది నిజమే. ఆమె భావించుకున్నట్టు తనమనుగడకోసమే ఇతరులు భావించు కున్నట్టూ అది అందుకోసమే. మొదటగా చెప్పుకోవాలంటే, అభ్యర్థులఎంపిక జరిగిన తీరు, నూతన రాష్ట్రపతి ప్రధానమంత్రిపట్ల అంకుశంలా వ్యవహరిస్తారనో లేదా కేవలం రబ్బర్‌స్టాంపులా వ్యవహరిస్తారనో రెంటిలో ఏదో ఒకటన్న విలక్షణఅభిప్రాయాన్ని కలిగించింది. ఇంతకుముందు కోకా సుబ్బారావు ఎన్నిక ప్రచారసమయంలో రాజ్యాంగదత్తమైన రాష్ట్రపతి 'అధికారా'ల గురించి చర్చ రేగుతూవచ్చింది. భారతరాష్ట్రపతి కేవలం రాజ్యాంగాధినేతగా వ్యవహరిస్తూనే, కొన్ని సందర్భాలలో ప్రధానమంత్రి నిర్ణయాన్ని త్రోసిపుచ్చగలుగుతారనీ, కనీసం ఒత్తిడి తీసుకురా గలుగుతారనీ, కీలకవిషయాల్లో అతడి లేదా ఆమె నిర్ణయాలను ప్రభావితం చేయగలుగుతారనీ ఒక అస్పష్టఅభిప్రాయం, చెప్పుకోదగినంత విస్తృతస్థాయిలో కాకపోయినా, నోరుచేసుకోగలిగిన ప్రాబల్యవర్గాలలో పొడసూపుతూ వచ్చింది. ఆ అభిప్రాయమే ప్రస్తుత ఎన్నికల గురించిన చర్చలకు కేంద్రస్థానంగా మారింది.

ఘర్షణపరిస్థితి పార్టీ అధ్యక్షుడూ, ప్రధానమంత్రీ పరస్పర వ్యతిరేకశిబిరాలలో ఉన్నట్టు చూపించింది. పార్టీలో అత్యున్నతవ్యవస్థ అయిన వర్కింగ్‌కమిటీ రెండుగా చీలిపోయింది. వర్కింగ్‌కమిటీలోని ఇద్దరుసభ్యులను పార్టీ అధ్యక్షుడు తొలగించారు వర్కింగ్‌కమిటీలో మైనారిటీగా ఉన్న తనవర్గానికి మెజారిటీ కల్పించేందుకే ఆయన ఈ చర్య తీసుకున్నట్టు అందరూ గ్రహించారు.

దేశవ్యాప్తంగా ఉన్న పార్టీసభ్యుల్లో ఢిల్లీకుతంత్రాలు మరీమరీ కలవరం పెంచుతున్నాయి ప్రత్యేకించి చౌదరి పూర్తిగా బేజారుపడిపోతున్నాడు. రాష్ట్రనాయకుల్ని, ముఖ్యమంత్రుల్లో ప్రతి ఒక్కడూ తానే పక్కన ఉన్నాడో స్పష్టంగా తేల్చిచెప్పవలసిన పరిస్థితి తోసుకొచ్చేసింది. అలాఏదో ఒక పక్షాన్ని ఎంచుకోవడం బొత్తిగా అర్థరహితమనిపిస్తోందతనికి. ఎడమకన్నునో, కుడికన్నునో ఎంచుకోమంటే ఎంత మూర్ఖంగా, ఎంత విపరీతంగా ఉంటుందో ఇదీ అలాగే ఉందనుకున్నాడు. బలవంతంగా రుద్దుతున్న ఈ ఎంపికవల్ల తన భవిష్యత్తు తలకిందులయ్యే పరిస్థితిని ఊహించుకుంటూ అతడు కుతకుతలాడుతున్నాడు.

తన మానాన తన నోదిలేస్తే చౌదరి యథాతథస్థితివైపే మొగ్గు చూపించి ఉండేవాడు. ఇందిరాగాంధీ ప్రవర్తన ఏకపక్షంగానూ, నిరంకుశంగానూ ఉంటున్నట్టు అతడికీ అనిపిస్తోంది. తనలానే ఆలోచించే ఇతర ముఖ్యమంత్రులతో రోజూ మంతనాలు సాగిస్తూనే ఉన్నాడు. అయినా మరోవైపు తనలానే వాళ్ళుకూడా ప్రధానమంత్రిని మంచిచేసుకోవడానికి నిర్విరామంగా ప్రయత్నిస్తున్న సంగతీ అతనికి తెలుసు. అటుపైన రాష్ట్రంలో మహేంద్రనాథ్‌వర్గం అతడిమీద కుమ్మరించే శాపనార్థాలను కాచుకుంటూఉండాలి. మహేంద్రనాథ్ స్వయంగా ఢిల్లీలో ఉండి,

రెప్పవాల్చని నిఘాపెట్టి చౌదరికి వ్యతిరేకంగా కుతంత్రాలు సాగించడంలో క్షణం తీరికలేకుండా గడుపుతున్న స్థితిలో ఇలాకాచుకోవడం అంత తేలిక కాదు.

అయితే ఏ పక్షమూ ఇంకా తన నిజస్వరూపాన్ని బయటపెట్టలేదు. ప్రతిఒకరూ ప్రతి ఒకరినీ చేరదీయడానికి యత్నిస్తూ, ఆ విధంగా తమ కపటప్రవృత్తినీ, మోసాన్నీ కప్పిపుచ్చు కోడానికి ప్రయత్నించే మునిమాపువేళ అది. ఢిల్లీలోని అధిష్ఠానవర్గానికి దరిదాపుల్లో సంచరించే స్వయంనియమితనాయకులు పలువురు సొంతరాష్ట్రంలో తమకంటూ ఓ పునాది, మద్దతు తరచు లోపించడంవల్లనే కావచ్చు, అప్పటికప్పుడు అఖిల భారతరాజకీయాల్లోకి లంఘించి, అధిష్ఠానవర్గ 'పరిశీలకులు'గా 'దూత'లుగా అవతారమెత్తి హడావుడి చేస్తున్నారు. రాజకీయపరిస్థితిని పరిశీలన చేయడానికని రాష్ట్రరాజధానులకు తరలివెడుతున్నారు. తమ అధ్యయనాంశాలను ప్రధానమంత్రికి గానీ, పార్టీ అధ్యక్షుడికి గానీ నివేదిస్తూ ఉన్నారు. ప్రస్తుతఘట్టంలో రెండు అధికారకేంద్రాలు తలెత్తాయి మరి. ఈ అధికప్రసంగులు రాష్ట్రంలో ప్రతిఒకరికీ చీదరపుట్టిస్తుంటారు, అయినా ఆ మాట పైకి ఎవరూ అనలేరు.

అటువంటి ఒకానొక 'దూత' రంజన్‌బాబు మరునాడు రాష్ట్రసందర్శనకు రాబోతున్నాడు. చౌదరికి అతడంటే వైముఖ్యం, మహేంద్రనాథ్ గుండెనిండా అతడంటే అసహ్యం. ఈ ఒక్క విషయంలో రెండుముఠాలదీ ఏకాభిప్రాయం. అయినా అతడికి ఎర్రతివాసీ పరచడంలో మాత్రం ఉభయముఠాలూ ఒకదానితో ఒకటి పోటీపడ్డాయి. రాజకీయంగా అతగాడి పలుకుబడిస్థాయి ఎలాంటిదైనా, చక్రంతిప్పడంలో సిద్ధహస్తుడని వాళ్ళకు తెలుసు. ఎలాంటి సిగ్గూ సంకోచమూ లేకుండా గడ్డితినడంలో కూడా అతడంతటివాడతడేనని అందరూ చెప్పుకుంటూ ఉంటారు.

రంజన్‌బాబుకు ఎలా రాచమర్యాదలు చేయాలో చౌదరి ఎంతో సీరియస్‌గా పూసగుచ్చినట్టు చెబుతుంటే ఆనంద్, శేఖర్ పగలబడి నవ్వేశారు.

'అంత నవ్వెందుకొస్తోంది మీకు?' చౌదరి కోపంగా ప్రశ్నించాడు.

'ఎందుకంటారా? ప్రజాస్వామ్యానికి లేచిన ఓ అద్భుతమైన ఉలిపిరికాయ రేపు రాష్ట్రాన్ని తుపానులా ముంచెత్తబోతున్నందుకు' శేఖర్ మళ్ళీ నవ్వాడు.

'మాకు నీ సహాయం వద్దు, గెటౌట్, అని వాణ్ణి గెంటేయరెందుకు?' ఆనంద్ అడ్డుతగులుతూ అన్నాడు.

'నన్ను బయటికి పంపించడానికి మీరిద్దరూ కలిసి కుట్రచేస్తున్నారేమిటి?' చౌదరి పరిహాసంగా అన్నాడు. 'మనం సరిగా మర్యాదచేయకపోతే వీడెళ్ళి మహేంద్రనాథ్ గూట్లో చేరతాడు!'

'అతగాడికి చేయవలసిన మర్యాదలన్నీ చేద్దాం. అదలా ఉంచండి. ఇంతకీ ఈ పనికిమాలిన కుంకకు అంత ప్రాముఖ్యం ఎక్కడినుంచొచ్చిందని? ప్రధానమంత్రి ఇతడు చెప్పినవి చెవిన పెడుతుందనుకుంటున్నారా? వాస్తవంగా ఇతడికున్న పలుకుబడి ఏమిటి?'

'ఆ వివరాల్లోకి వెళ్ళి మీ శక్తినెందు కు వృధాచేసుకుంటారు? ఇక్కడ గమనించవలసిన రూలేమిటంటే, వాడికేం కావాలో అదిచ్చేసి త్వరగా పీడ వదిలించుకోవడం. శవాన్ని అట్టేసేపు ఇంట్లో ఉంచుకుంటారా?'

'ఉంచుకోరు' ఆనంద్ ఒప్పుకోలుగా అన్నాడు. 'అయితే చూడండి, శవాలు మనల్ని అంతగా ఇబ్బంది పెట్టవు. మొత్తానికి మీరు మాకు అమూల్యమైన శిక్షణే ఇస్తున్నారు'.

'చూడండి', చౌదరి ఉద్ఘాటనగా అన్నాడు, 'నేనేం చేస్తున్నానో నాకు తెలుసు, ఆ విషయంలో మీకు సందేహం అవసరంలేదు. ఈ రంజన్‌గాణ్ణి నేనేం లెక్కచేసేవాణ్ణి కాదు. అయినా నాయకులు తమలోతాము ఘర్షణపడుతున్నప్పుడు, ఇలాంటి జలగలన్నీ పైకితేలుతూ ఉంటాయి. ఇతణ్ణి ఈ రాష్ట్రానికి వెళ్ళమని నాయకుడెవడైనా నిజంగా పంపించాడో లేదో నాకీక్షణంవరకూ నిశ్చయంగా తెలియదు. తన చేతి వెనుకభాగంలో ఏముందో తనకు తెలిసినంత క్షుణ్ణంగా ఈ రాష్ట్రం గురించి తెలుసునని అధిష్ఠానవర్గంలోని ఛోటానాయకుడెవరి దగ్గరో వీడు గప్పాలు కొట్టుంటాడు. జరగబోయే రాష్ట్రపతిఎన్నికను దృష్టిలో పెట్టుకుని ఇక్కడి పరిస్థితిని అంచనావేసొస్తానని చెప్పిఉంటాడు. నే చెబుతున్నా వినండి, తమను తమే నియమించుకున్న ఇలాంటి సత్యశోధకులు చాలామంది రాష్ట్రంచుట్టూ వేలాడుతున్నారు. ఇంతకీవీరి విధేయతలే ఎటు మొగ్గుతున్నాయో ఎవరికీ తెలియదు.'

శాసనసభ్యులు మరోసారి ముఠాకలహాలమధ్య చిక్కుకుపోయారు. ఈ ఎన్నికలో అభ్యర్థులిరువురూ ఒకేపార్టీనేపథ్యం ఉన్నవాళ్ళు కావడంతో ముఠాయుద్ధాల మనస్తత్వం మరింత పెద్దగా వాళ్ళను ఆవహించింది. పోటీవెనుక ఉన్న హేతుబద్ధత ఏమిటో ఎవరికీ అర్థంకావడం లేదు. అది కనీవినీ ఎరుగని పోటీ. ఉన్నతస్థాయిలోనే పచ్చిముఠాతత్వం తాండవిస్తున్నప్పుడు పార్టీ అధిష్ఠానవర్గం కిందిస్థాయిలో క్రమశిక్షణను ఎలా నిలబెట్టగలుగుతుంది? ఎంతో నిస్పృహకూ, అధైర్యానికీ లోనుచేస్తున్న సన్నివేశం అది. మున్నెన్నడూ లేనంతగా పార్టీ నీతినియమాలకు తిలోదకాలిచ్చిందా అనిపిస్తోంది.

మిగిలిన రాజకీయపక్షాలకుకూడా పరిస్థితి అంతే అగమ్యగోచరంగా కనిపిస్తోంది. వాటి కంటూ ఒక అభ్యర్థి లేకుండాపోయాడు; కనుక ఉన్న అభ్యర్థులలోనే ఎవరో ఒకరిని 'రెండో సుబ్బారావు'గా కల్పించుకొని తృప్తిపడాలి. అది వాళ్ళకు రాజకీయఅవసరం. దాంతో వాళ్ళు కొంతఇష్టంగానూ కొంత అయిష్టంగానూ అధికారపక్షంలోని ముఠాకలహాలలోఅంతర్భాగమ య్యారు. త్వరలోనే వాళ్ళలో కొందరు సంజీవరెడ్డికి, మరికొందరు గిరికి అనుకూలంగా ద్విగుణీకృత ఉత్సాహంతో బరిలోకి దిగిపోయారు. అభ్యర్థులిరువురి పక్షాన వకాల్తా పుచ్చుకుని తమతమ వాదాల్ని అదేపనిగా ఉద్ఘాటించడం ప్రారంభించారు. ఈ విధంగా దేశంలో రాజకీయపక్షాలన్నీ అదృశ్యమైపోయినట్టు కనిపించింది. మిగిలినవల్లా రెండేరెండు దేశవ్యాప్తముఠాలు. భవిష్యత్తులో రాజకీయచరిత్రకారుడు ఈ పరిణామాలను ఉల్లేఖిస్తూ తనలోతను నవ్వుకోకుండా ఉంటాడా? అంతకంటె దారుణంగా, భవిష్యత్తరాలవాళ్ళు అవహేళనగా బహిరంగంగానే పగలబడి నవ్వరా?... ఎందువల్ల ఇదంతా జరుగుతోంది? జవహర్లాల్‌నెహ్రూ కనుమరుగవడంవల్ల కాదా?... ఆనంద్ తర్కించుకున్నాడు.

పైరవీలకు, దళారీలకు పెద్దపీట లభిస్తున్న ఈ వాతావరణంలో రంజన్‌బాబు, ఆ బాపతు వాళ్ళు కుక్కగొడుగుల్లా వ్యాపించడంలో ఆశ్చర్యమేమీ లేదు అదంతా ఓ జుగుప్సావహ

కార్యక్రమం. ఎంతోమంది నకిలీలు వైరిశిబిరాల శ్రేయోభిలాషుల్లా మారువేషాలుధరించి రాత్రికి రాత్రి ప్రత్యక్షమైపోయారు. కొంతమంది ఇందిరాగాంధీ కిచెన్ కేబినెట్‌తో తాముగా అంటకాగటం మొదలెడితే, మరికొందరు మొరార్జీశిబిరానికి అధికారికబాకాలుగా తమనుతాము ప్రకటించుకున్నారు. అందరూ కలిసి ముఖ్యమంత్రులతోసహా రాష్ట్రనాయకులందరి తలలపై అక్షరాలా వీరవిహారం చేయడం ప్రారంభించారు.

రంజన్‌బాబు పర్యటనను పురస్కరించుకుని జరుగుతున్న ఆర్భాటానికి ఆనంద్ చాలా వరకూ దూరంగానే ఉండిపోయాడు. శేఖర్ అలాకాదు, ఇటువంటి ఉత్సవాల నిర్వహణలో సిద్ధహస్తుడు. 'నీలాంటి అనుభవంలేనివాళ్ళవల్ల ఈ ఘనమైన కార్యక్రమం చిందరవందర కావడం నా కిష్టంలేదు' అన్నాడు చౌదరి ఆనంద్‌తో, తనదైన శైలిలో, పరిహాసంగానే అయినా నిజంచెబుతూ. రెండేళ్ళక్రితం జరిగిన రాష్ట్రపతిఎన్నికను ఎవరూ గుర్తుపెట్టుకోని సంగతి కూడా ఆనంద్ గమనించాడు. ఆయా శక్తులమధ్య సరికొత్త సమీకరణలు రూపుదిద్దుకోవడం ప్రారంభించాయి. అధికారపక్షంలోని ఎందరో సభ్యులు యధావిధిగా గ్రూపులు ఫిరాయించేశారు. ఇందిరాగాంధీ, మొరార్జీ ఉభయులూ ప్రస్తుతఎన్నికకు తమకొరకై సరికొత్తబాంధవ్యాలు కల్పించుకునే ప్రయత్నంలో వెనకటిఎన్నికను పూర్తిగా విస్మరించేశారు. వోటర్లుమాత్రం వాళ్ళే, కానీ ఈసారి రెండు పెద్దపెద్ద తిరగలిరాళ్ళమధ్య ఇరుక్కుపోయారు ముఠా ఫిరాయింపు ఏదో గౌరవ ప్రదమైన కార్యక్రమమైనట్టు ఉభయముఠాలూ వాళ్ళను అటువైపు పురిగొల్పాయి; దాని నింతకాలం అంటిపెట్టుకుని ఉన్న మచ్చ ఇప్పుడు తొలగిపోయినట్టే కనిపించింది. ఒక ఫిరాయింపు సహజంగానే మరో ఫిరాయింపుకీ, మరోమరో ఫిరాయింపుకీ దారితీయిస్తుంది. ఒక్క వోటు కనుక చేతిలో ఉంటే ఇప్పుడు ఎవరు ఏంచేసినా చెల్లిపోతుంది.

ఎప్పటిలానే అరుణ పోటీ హంగుదార్లమధ్యలో చేరిపోయింది. ఆమె ఉచ్చైస్స్వరం ప్రతిధ్వనులీనని చర్చలే ఎక్కడా లేవంటే అతిశయోక్తి కాదు. ఆమె రెండు లాబీలతోనూ సంబంధం పెట్టుకుంటూ రెండింటి పక్షానా వాదోపవాదాలు సాగిస్తూ ఉన్న గందరగోళానికి మరింత చేర్చడమే జరుగుతోంది.

ఇందులో గమనించవలసిన వాస్తవం ఏమిటంటే, రెండేళ్ళక్రితం సుబ్బారావు పోటీ సందర్భంలో ప్రధానరాజకీయస్రవంతికి దూరమైన అరుణ మళ్ళీ అందులోకి రాలేకపోవడం. అయితే విచిత్రంగా, ఆమెతోసహా సుబ్బారావుజండాను మోసినవాళ్ళందరూ గత రెండేళ్ళలో తమ ప్రాముఖ్యం ఇనుమడించిందనుకున్నారు. చికాకులు తెచ్చిపెట్టడంలో తమ ప్రజ్ఞను వాళ్ళు రుజువుచేసుకున్నారు. ఇప్పుడు రెండుగ్రూపులూ వాళ్ళను చేరదీయడానికీ, లేదా ఉన్నవాళ్ళు జారుకోకుండా కాపాడుకోడానికీ ఏంచేయాలో అన్నీ చేస్తున్నాయి. అనుశ్రుతంగా గ్రూపుల్లో ఉండిన పాతవిధేయులు ఇప్పుడు మాసిపోయినట్టనిపించారు.

ఓ రోజు ఉదయం ఆనంద్ తన డ్రాయింగ్‌రూంలో కూర్చొని ఏవో కాగితాలు పరిశీలిస్తుండగా అరుణ అక్కడికి అడుగుపెట్టింది. పక్కగుమ్మంలోంచి దొంగచాటుగా ప్రవేశించి వెనుకనుంచి అతడి కళ్ళుమూసింది. 'ఎవరో కానీ, మతిపోయిన మనిషే ఐ ఉండాలి!' అన్నాడు ఆనంద్. ఆమెను వెంటనే గుర్తుపట్టి.

'మతిపోయింది నీకు!' ఆమె తెచ్చిపెట్టుకున్న కోపాన్ని ప్రదర్శిస్తూ అంది. 'నీ ఇంట్లోకి ఓ అసమ్మతివాది అడుగుపెడితే నీకు భయంవేయడం లేదా? ఇందిరాగాంధీ గూఢచారులు చూసి ఆమెకి చెబితే ఆమె ఏమంటుంది? నీ ఉద్యోగం ఊడిపోదా?'

ఆమె 'ప్రముఖ అసమ్మతివాది'గా ముద్రవేయించుకున్న సుబ్బారావుఘట్టంనుంచి వాళ్ళ మధ్య ఇటువంటి పరాచికాలు మామూలే. ఆమె ప్రముఖురాలు ఎందుకైందంటే, ఎంతోమందిలా ఆమె తన ఫిరాయింపును గోప్యంగా ఉంచలేదు కనుక. ఒకవైపున స్వాభావికమైన నిజాయితీ, మరోవైపున పెంకితనం కలగలిసిన ఒక మానసికధోరణిని ఆమె పెంచుకోవడం స్పష్టంగా కనిపిస్తోంది. తనదైన చెప్పీచెప్పని పద్ధతిలో దానిని తొలగించడానికి ఆనంద్ ప్రయత్నించాడు కానీ, ఫలితం లేకపోయింది, ఉండదని అతడికీ తెలుసు. కొత్తగా తెచ్చిపెట్టుకున్న 'ప్రాముఖ్యం'తో తనెంతో వెలిగిపోతున్నానని ఆమె అనుకుంటున్నా, ఎవరిమీదనో తనుకూడా స్పష్టంగా చెప్ప లేని ఒకవిధమైన అక్కసు ఆమెలో పెరిగిపోయింది. తను పార్టీతోపాటు సామరస్యంతో నడవడం లేదని ఆమెకు తెలుసు. ఇందిరాగాంధీ నాయకత్వం ఇప్పుడు గట్టిపడింది, ఇంతకుముందు జరిగిన రాష్ట్రపతిఎన్నికలో సిద్ధించిన ఫలితంతో అది మరింత బలోపేతమైంది... మురాదృష్టి ఉన్న మనిషికాదు కనుక, మిగిలినవాళ్ళు ఏదో ఒక గ్రూపులో లీనంకాగలిగినా ఆమెమాత్రం ఎందులోనూ ఇమడని మనిషిగా మిగిలిపోయింది. అరుణ దురవస్థకు సంబంధించి చేయ గలిగిందేమీ లేదని ఆనంద్‌కి తెలుసు. బహుశా ఏదైనా నూతనపరిస్థితిమాత్రమే ఆమెను కాపాడాలి– ఆమెనుంచి ఆమెను.

ఆమె ప్రవర్తన తరచూ అతడికి ఎబ్బెట్టు పరిస్థితిని తెచ్చిపెట్టింది తనమీద పడుతున్న మచ్చగురించి చౌదరికూడా సూచనగా అతణ్ణి హెచ్చరించాడు. అయినాసరే ఆనంద్ కృత నిశ్చయంతోనే ఆమె విషయంలో జోక్యం చేసుకోలేదు. బహిరంగంగా ఒప్పుకోవాలనే ఉద్దేశం ఆమెకు మచ్చుకైనా లేకపోయినా, కిందటి రాష్ట్రపతిఎన్నికలో తను నీతిబద్ధంగా వ్యవహ రించలేదన్న విషయాన్ని ఆమె గ్రహించిందని అతడికి తెలుసు. తన మొండితనందృష్ట్యా ఇప్పుడామె ఏంచేస్తుంది? విచిత్రంగా ఆనంద్ నిర్లిప్తవైఖరి ఆమె ఆగ్రహాన్ని ఇనుమడింపజేసింది. అతను చూపిస్తున్న ఉదాసీనతను తన పట్ల ఉదాసీనతగా భావించుకుంది. అయినా తన చర్యలను మార్చాలని అతడు ప్రయత్నించి ఉంటే తను మరింత ఆగ్రహించి ఉండేదానినని ఆమెకి తెలుసు. ఏతావతా చెప్పాలంటే; అతడేం చేయాలో ఆమె కోరుకుంటున్నదో ఆమెకే తెలియదు.

'నన్ను పూర్తిగావదిలేశావు', ఆమె ఫిర్యాదు చేసింది. 'నేను పెంకిఘటాన్ననీ, సమస్యలు సృష్టిస్తాననీ, మోచేతి కురుపుననీ నిర్ణయాని కొచ్చేసినట్టున్నావ్ ...'

'నువ్వేమంటున్నావో నా కర్థం కావడంలేదు', ఆనంద్ శాంతంగా జవాబిచ్చాడు. 'ఈ ఉపోద్ఘాతం దేనిగురించో నాకు తెలియడం లేదు...' ఆమెను కుర్చీలో కూర్చోబెడుతూ.

'రెండేళ్ళపాటు దారీ తెన్నూలేని నడిసముద్రంలో వదిలేశావ్,' ఆమె అదే నిష్ఠురస్వరంతోఅంది. 'కాస్త సలహా చెప్పి నన్ను అదుపులో పెట్టచ్చు కదా? నేను ఊబిలో దిగబడితే బయటికి లాగే బాధ్యత నీకు లేదా?'

'ఆ విషయంలో నీతో నేనెంతమాత్రం ఏకీభవించను', ఆనంద్ ప్రత్యుత్తరమిచ్చాడు. 'రెండేళ్ళ క్రితం నాతో ఏమన్నావో గుర్తుందా? ఫిరాయింపువల్ల నీ ప్రాముఖ్యం పెరుగుతుందని వాదించావు. నీవేమిటో రుజువు చేసుకుంటానన్నావు. నీ తడాఖా చూపిస్తానన్నావు. ఇందిరాగాంధీ నిన్ను వెతుక్కుంటుందనీ, కబురు పంపిస్తుందనీ, బుజ్జగిస్తుందనీ అన్నావు... ఎంతగా కనిపించవచ్చుకానీ, అప్పుడు నువ్వన్నమాటలు ఉద్దేశపూర్వకంగా అన్నవి కాకపోయినా, సుబ్బారావును సమర్థించిన వాళ్ళందరూ దరిమిలాను గౌరవనీయతను సంపాదించుకోగలిగారు కనుక నీ పద్ధతిలో నువ్వు చేసింది సక్రమమే కావచ్చని నేనూ అనుకున్నాను. కనుక నేను చేయాలనుకున్నా, చేయగలిగే ఉన్నా నిన్ను బయటపడేయడంలో కానీ, నీ ప్రయత్నాన్ని విరమింపజేయడంలో కానీ ఆనాడు అర్థమేముండి ఉంటుంది?'

'అసలు నా కదలికలు నువ్వేమైనా గమనిస్తున్నావా?'

'నువ్వేమనుకుంటున్నావ్?' అతడు ఎదురు ప్రశ్నించాడు.

'నే నేమనుకుంటే ఏంలే', అతడి ప్రశ్నను తీసిపారేస్తూ అంది. 'ఈ మధ్య నేను ఢిల్లీ వెళ్లినప్పుడు ఏంజరిగిందో తెలుసుకోవాలని నీకు లేదా?'

'నాకు చెప్పాలని నువ్వనుకుంటున్నావో లేదో నాకు కచ్చితంగా తెలిస్తే కదా!'

'నువ్వన్నది ముమ్మాటికీ నిజం,' ఆమె ఠీవి కలబరుస్తూ అంది. 'నా ఆత్రుత కొద్దీ నీకు చెప్పాలనుకోలేదు, తెలుసుకోడానికి నువ్వు మహాఇదయిపోతున్నావని నాకు తెలుసు కనుక చెప్పాలనుకున్నాను'

'సరే, నువ్వే గెలిచావు. ఇప్పుడు చెప్పు,' అతడు ఒప్పుకోలుగా అన్నాడు.

ఆమె ఇంకాస్త దగ్గరగా కూర్చుంటూ మొదలుపెట్టింది. 'ఢిల్లీలో నేను ఎవరిని కలుసుకున్నానో చెప్పుకో చూద్దాం...'

'నీ ప్రశ్నలోనే ఉంది జవాబు ఇందిరాగాంధీని...'

ఆమె ఆనందంతో వెలిగిపోయింది. 'నాకెంతో సంతోషంగా ఉంది. ఆమె చిరునవ్వుతో పలకరించి ఎంత ఆప్యాయంగా మాట్లాడిందో! ఇంతవరకూ ఆమెను కలుసుకోనందుకు నేనెంత మూర్ఖురాలినో అనిపించింది. ఆమె గురించి అడ్డమైన ప్రకటనలూ చేశాను. ఆమెకవన్నీ తెలిసే ఉంటాయి. అయినా నామీద ఎంతో అభిమానం చూపించింది. నే నిప్పటివరకూ కలుసుకున్న మహోదాత్త వ్యక్తులలో ఆమె ఒకరనిపించింది. ఈసారి నా ఢిల్లీ పర్యటన ఎంత ఉత్తేజకరంగా సాగిపోయిందో!'

ఎట్టకేలకు గాలి మళ్ళినట్టుందని ఆనంద్ పసిగట్టాడు. ఇక ఇప్పటినుంచి అరుణ ఉద్ఘాటనల నిండా ఇందిరాగాంధీయే ఉంటుందనుకున్నాడు. 'మంచిమాటచెప్పావు అరుణా, నీ సామర్థ్యంపై ఇందిరాగాంధీ కచ్చితంగా మంచిఅభిప్రాయమే ఏర్పరచుకుని ఉంటుంది.'

'అదేదో అపసవ్యపు పొగడ్తలా ధ్వనిస్తోంది!' ఆమె ఆక్షేపణగా అంది. 'అయినా నిన్ను తప్పుపట్టనులే. ప్రస్తుతానికి క్షమించేస్తున్నాను.'

'ఎంతోగొప్పగా ఉదారంగా నన్నిలా దయదల్చినందుకు నేనెవ్వరికి రుణపడి ఉన్నానో!' ఆనంద్ అల్లరిగా అన్నాడు

'నిస్సందేహంగా ఇందిరాగాంధీకే!' ఆమె నిస్సంకోచంగా జవాబుచెప్పింది. 'గిరిగారు గెల్చి, రాష్ట్రపతిభవన్‌లోకి అడుగుపెట్టేవరకూ ఆయన కోసం నేనీ రోజునుంచి రాత్రీ, పగలూ పనిచేయబోతున్నాను.'

'ఓహ్, అలా నిర్ణయం తీసేసుకున్నావన్నమాట!' ఆనంద్ ఆశ్చర్యం నటిస్తూ అన్నాడు 'ఇప్పుడు నన్నేం చేయమంటావ్? ఎందుకు?'

'ఏముంది, సింపుల్.' ఆమె ఉద్ఘాటనగా అంది. 'నువ్వూ అదే చెయ్యి. కారణాలంటావా, నన్నడగకు! కారణాలను నేను నమ్మనని నీకు తెలుసు!'

'అవును, నాకు తెలుసు' అతడు బదులిచ్చాడు 'నీ కేదో పూనకం పట్టి పనిచేస్తుంటావు దురదృష్టవశాత్తు నా కలాంటి పూనకం రాదు. నేను ఆలోచించిగానీ పనిచేయలేను.'

'ఆలోచించకు! ముందు పనిచేసి, తర్వాత కారణాలూ, వాదనలూ వెతుక్కో! రాజకీయాల్లో రాణించాలంటే అదొక్కటే మార్గం!' అరుణ అంది.

'నీ సలహాకు కృతజ్ఞుణ్ణి' అనంద్ అల్లరిగా అన్నాడు. 'దాని గురించి ఆలోచిస్తాను.'

'అదిగో మళ్ళీ ఆలోచిస్తానంటున్నావ్?' ఆమె నిలదీస్తున్నట్టుగా అంది. 'ఆలోచించవద్దని చెప్పానా లేదా?'

'అవును చెప్పావు, ఆలోచించకుండా ఉండడం గురించి తప్పకుండా ఆలోచిస్తాను', ఆమె భుజం తట్టుతూ ఆనంద్ అన్నాడు.

'నువ్వు బొత్తిగా పెంకిఘటానివి!' ఆమె ప్రత్యుత్తరమిచ్చింది.

'సరే... నేరం ఒప్పుకుంటున్నాను,' అన్నాడతడు.

ప్రస్తుతానికి వాళ్ళ మధ్య ఆమాత్రం సంధి కుదిరింది, అదేచాలు. వాళ్ళిద్దరూ ఒకే శిబిరంలో ఉండడానికి అది దోహదం చేసింది కానీ వాళ్ళ మధ్య ఉన్న విభేదాల్ని అది పూర్తిగా పరిష్కరించలేకపోయింది. స్నేహితులు శత్రువులన్న తేడా లేకుండా అందరూ వాళ్ళమీద ఎత్తిపొడుపు మాటలు సంధిస్తూనే ఉండడంతో ఇద్దరి మధ్యా అగాధం మరింత విస్తరించింది

గిరిని సమర్థించాలన్న అరుణ తాజా నిర్ణయం కూడా ప్రతికూలవిమర్శలకు అవకాశమిచ్చింది ఒక ఆడది మాత్రమే మరో ఆడదాన్ని లొంగదీసుకున్నట్టుగా ఇందిరాగాంధీ ఆమెను లొంగ దీసుకోగలిగిందని కొందరు చెప్పుకున్నారు. నిరంతరం ఆలోచనలో... ఎడతెరిపిలేని ఆలోచనలో... ప్రపంచం ఉనికి అంతా తన ఆలోచన మీదే ఆధారపడినట్టుండే ఆనంద్‌ను ఆపైన అరుణ లొంగదీసుకోగలిగిందని మరికొందరు చెప్పుకున్నారు.

ఈ విమర్శల వెల్లువ నిర్హేతుకం కాదు తమ పక్షంలో ఉండి ఆమె నానా హంగామా చేస్తుందని ఆశించిన వాళ్ళు ఎదిరి పక్షంలో అదే హంగామాను అంతకంటె బిగ్గరగా చేస్తున్నందుకు

కోపగించారు. నిజం చెప్పాలంటే, ఆమె ముందుగానే ఏ పక్షానికీ ఎటువంటి హామీ ఇవ్వలేదు. ఒక్కోసారి సెగలు కక్కుతూ, ఒక్కోసారి చల్లారిపోతూ, ఎగిసిపడే మంటమీద నీళ్ళు కుమ్మరిస్తూ ఆమె ఇంతవరకూ కళాకళలుగా వ్యవహరిస్తూ వచ్చింది. కొన్నిరోజులపాటు రెండు శిబిరాల వాళ్ళనీ అది సంతోషపెట్టింది. తీరా ఎన్నిక దగ్గరపడిన సమయంలో ఆమె ఒక నిర్ణయానికి వచ్చింది. అది అంతవరకూ ఉన్న సమతూకాన్ని దారుణంగా దెబ్బతీసింది. అరుణలా నోరు చేసుకోగలిగినవాళ్ళు, కృతనిశ్చయంతో వ్యవహరించగలిగినవాళ్ళు చాలా తక్కువ. పోరాటస్ఫూర్తిలో ఆమెకు సాటిరాగలవాళ్ళు బహుకొద్దిమంది. ఆమె ఇందిరాగాంధీ శిబిరంలోకి గెంతడంతోనే ఎంతోమంది ఛోటానాయకులు నీరుగారిపోయారు. ఇదేం ఊహించనిది కాదులే అన్నాడు వాళ్ళలో ఒకతను... ఈసారి సెంట్రల్‌హాలులో ఆమె విరుచుకుపడడం మొదలెట్టినప్పుడే నా కనుమానం కలిగిందన్నాడు ఇంకొకడు. ఆనంద్ అరుణల సంబంధాన్ని ఇందిరాగాంధీతప్ప ఇంకెవరూ మన్నించలేదు, అందుకని ఇద్దరూ తమకు తగిన గూడు ఎంచుకున్నారని ఉద్ఘాటించారు ఇంకా మరికొందరు. ఈక్రమంలో వాళ్ళు చివరకు ఇందిరాగాంధీ పేరును కూడా బురదలోకిలాగి ఆమెనీ ఆడిపోసుకోసాగారు.

అప్పటికే అరుణను పీడిస్తున్న విపరీతమానసికధోరణులకు ఇది అదనంగా వచ్చిచేరింది. భంగపడిన ఆమె ప్రతిష్ఠ (లేక తనపై అలా మరకపడినట్లు ఆమెకూడా సుప్తచేతనలోనే అంచనాకు వచ్చిందా?) ఆమెను అంతరాంతరాల్లో ఏమూలనో కుంగదీయడం ప్రారంభించింది. తన విరోధులు తనకు ప్రత్యుత్తరం ఇవ్వలేకపోయినప్పుడు 'దాని మాటల్ని ఎవరు పట్టించుకుంటార'ని ద్వేషంతో చులకనచేసి మాట్లాడడం ఆమె చెవినపడుతూ వచ్చింది. వారికది సులభంగా బయటపడేందుకో మార్గం. తమ తెలివితక్కువతనాన్ని దాచుకోటానికి ఓ చక్కనిసాకు. తనలో ఉన్నంత కోపోధృతి ఆనంద్‌లో లేకపోవడమూ ఆమె మళ్ళీ మళ్ళీ గమనిస్తూ వచ్చింది. మరీ నిదానస్తుడు గానూ, మరీ ఉదాసీనుడు గానూ ఆమెకతడు కనిపిస్తూ వచ్చాడు. క్రమంగా ఈ పరిస్థితి ఆమెకు దుస్సహంగా తోచసాగింది.

ఆమెలో హఠాత్తుగా పొడసూపిన అన్నింటికన్నా విపరీతమైన అనుమానం, ఆనంద్ ఉదాసీనతకు అతడి మంత్రిపదవితో ఏదో సంబంధం ఉన్నట్టు ఆమె కనుగొనడం, లేదా కనుగొన్నాననుకోవడం. ఆమె బుర్రలో ఈ ఆలోచన ఒక్కసారి అలా మెరిసిందో లేదో ఇక ఆమె దానిని పూర్తిగా సంపూర్ణంగా విశ్వసించడం మొదలుపెట్టింది. ఇటువంటి అనుమానం ఆమెలో రేగిన విషయం సహజంగానే ఆనంద్‌కు తెలియదు. ఆమె కూడా అతడిదగ్గర ఎప్పుడూ ఎప్పుడూ అనలేదు. ఎప్పుడూ దేనినీ మనసులో అణుచుకోని ఓ వ్యక్తి ఉద్దేశపూర్వకంగా ఈ అంశాన్ని అణచిపెట్టుకోవడంతో క్రమంగా వారిమధ్యదూరాన్ని పెంచింది.

అదృష్టవశాత్తూ, రాష్ట్రపతి ఎన్నిక అనే మరింత అత్యవసర సందర్భం తోసుకురావడంతో, దానితోపాటే రాష్ట్రరాజధానికి రంజన్‌బాబు పర్యటన ప్రకటించబడడంతో ఈ పరిస్థితికి తాత్కాలికంగా విరామం లభించింది; అతిముఖ్యమైన అతిథిని స్వాగత సత్కారాలతో అలరించాలంటే అన్నిరకాల విరోధాలనూ పక్కనపెట్టకతప్పదు.

# 45

'యువర్ అటెన్షన్ ప్లీజ్, లేడీస్ అండ్ జెంటిల్మెన్, యువర్ అటెన్షన్. ఇండియన్ ఎయిర్‌లైన్స్‌కు చెందిన బోయింగ్ 987 విమానం ఢిల్లీనుంచి వచ్చి ఉన్నది. మళ్లీ వినండి...' అఫ్రోజాబాద్ విమానాశ్రయంలో విలక్షణమైన సందడి, మర్మరధ్వని, సంచలనం చోటుచేసుకున్నాయి. ఓ పెద్దగుంపు ఉమ్మడి లక్ష్యం వైపు సంభ్రమంతో ఎదురుచూస్తున్నట్టు స్పష్టంగా తెలిసిపోతోంది. ఖాదీదుస్తులు, గాంధీ టోపీలు ధరించిన ఓ పెద్దపటాలం విమానం నిలిచిఉన్న ప్రదేశానికి స్వయంచోదకంగా సాగిపోతోంది. గ్రౌండ్ సిగ్నల్‌మన్ చేతిలో పసుపురంగు టేబుల్ టెన్నిస్ బ్యాట్ లాంటి పలక ఉంది. దానిని ఊపుతూ రాకాసి ప్రమాణంలో ఉన్న విమానం ఎక్కడ ఆగాలో అతడు నిర్దేశిస్తున్నాడు. ఏనుగుచేత ప్రదక్షిణం చేయిస్తూ ఒక స్టూలుమీద కూర్చొనేలా చేసే సర్కస్ రింగ్‌మాస్టర్‌ని గుర్తుచేస్తున్నాడు. ఆగ్రహం పొగలు కక్కుతూ, అదేపనిగా కర్ణ కఠోరంగా బుసబుస ధ్వనిచేస్తూ ఆ భారీ జంబో ఎట్టకేలకు అతడు ఆగమన్నచోటే ఆగి పోయింది. ఈ లోపల ఖాదీపటాలం విమానం ద్వారం వద్ద మూగిపోయింది. ప్రయాణికులు దిగడానికి ఉపయోగించే నిచ్చెనకూడా అతికష్టంమీద అంగుళంగుళంగా విమానంవైపు జరగడానికి అనుమతించడానికి కూడా ఆమూక సహించలేనట్టు కనిపించింది.

తలుపు తెరచుకోగానే ప్రత్యక్షమయ్యే తొలి ప్రయాణికుడు సాధారణంగా వి.ఐ.పి.యే అవుతాడు. రాజకీయవాదులకు సహజసిద్ధమైన నమస్కారభంగిమలో వలె చేతులు జోడించాడు. అతడి వేళ్లకు ఉన్న వజ్రపుటుంగరాలు ఉదయసూర్యకిరణాలు పడి ధగధగా మెరిసిపోతున్నాయి. చప్పిడిముక్కు, పొడుచుకొచ్చిన పళ్లు, బట్టతలతో ఉన్న ఆ మనిషిమీద వేలాది కళ్ళు వాలిపోయాయి. అందవికారానికి అతిచక్కని ఉదాహరణగా అతణ్ణి అభివర్ణించవచ్చు. అయితే ఇప్పుడు అతడే అందరి దృష్టిలో 'రాజకీయ మన్మథుడు'. భారతదేశంలోని రాజకీయ యాచకులందరికి ప్రస్తుతం అతడే ఇలవేల్పు. అధిష్ఠానవర్గానికి అతడు 'అత్యంత సన్నిహితుడ'ని వాళ్ళ విశ్వాసం. క్షణంలో, రకరకాల సైజుల్లో ఉన్న వందలాది పూలదండలు అతనిమీద దాడిచేసి తమ బరువుకింద అక్షరాలా అణచి పారేశాయి. 'రంజన్‌బాబు జిందాబాద్' అంటూ ఎవరికి వారు పోటీపడి గాత్రబలం అంతటినీ కూడ దీసుకుని చేస్తున్న నినాదాలతో పరిసరాలు మారుమోగిపోయాయి. మొత్తంమీద అది, దేవిరింపుతో కలిసిన అతిచక్కని భజన సన్నివేశం.

'స్వాగతం రంజన్‌బాబూ, హృదయపూర్వక స్వాగతం!' ముఖ్యమంత్రి చౌదరి ఉప్పొంగిపోతూ అన్నాడు. 'చాలాకాలం తర్వాత మా రాష్ట్రానికి వచ్చారు. చాలా సంతోషం! మీకు ఎంతగానో కృతజ్ఞులం...'

'ఓహ్, అలా అనకండి దయచేసి. రావడం నా బాధ్యత హాంజీ! ఇంత ఆదరపూర్వక స్వాగతానికి నేనెంతో కృతజ్ఞుణ్ణి!' రంజన్‌బాబు వీలైనంత వినయాన్ని ధ్వనింపజేస్తూ అన్నాడు.

'మీ లగేజ్ ఏది సార్?' చేయవలసిన పనిమీద శ్రద్ధవహించే ఎం.ఎల్.ఎ. ప్రమోద్‌రాయ్ అడిగాడు. అతడు మహేంద్రనాథ్ ముఠాలో మనిషని అందరికీ తెలుసు. 'కాస్త ఆ కాగితాలిస్తారా? ఇంతకీ మీ బ్రీఫ్‌కేస్ ఎక్కడుంది? మీతో మీ పర్సనల్ అసిస్టెంట్ కూడా వచ్చాడా?'

'నేను చాలా సింపుల్ మనిషిని మిత్రమా!' రంజన్ అన్నాడు. 'నాకు పి.ఎ. లేడు, బ్రీఫ్‌కేసూ లేదు. ఒకే ఒక్క సూట్‌కేస్ —ఇదిగో కాగితం' జేబులు గాలించి ఎట్టకేలకు పైకితీశాడు. ప్రమోద్‌రాయ్ తక్షణమే దానిని అందుకున్నాడు. నోరు కాకపోయినా అధిష్ఠానవర్గంనోట్లో బాకాలాంటి ఆ మనిషిని సంతోషపెట్టడానికి ఏమైనా చేసి తీరవలసిందే.

తదుపరి ఆ పటాలం రంజన్‌బాబు చుట్టూ వ్రేలాడుతూ టర్మినల్ భవనంలోకి తిరిగివచ్చింది. అక్కడక్కడ కాస్త సందు విడిచిపెట్టింది. ధైర్యం చేయగలిగిన కొంతమంది పాత్రికేయులు అందులోంచి ఎలాగో లోపలికి చొచ్చుకుపోయారు. గౌరవనీయ అతిథికి కేకవేస్తే వినిపించేంత దూరానికి మాత్రం వెళ్ళగలిగారు. చుట్టూ దడికట్టేసిన స్థానిక నాయకులు, ప్రెస్‌మన్‌కానీ, పోస్ట్‌మన్‌కానీ —బయటివాడెవడూ తమ గుంపును చీల్చుకుని ఏ పరిస్థితిలోనూ ముందుకు వెళ్ళనిచ్చేలాలేరు కనుక పాత్రికేయుల ప్రశ్నలు పెడబొబ్బలుగా మారి నాయకుల తలల మీదుగా ప్రయాణం చేశాయి.

'ఏ పనిమీద వచ్చారు సార్?' పి.టి.ఐ. విలేఖరి అడిగాడు.

'ఓహ్. అది చాలా సింపుల్ పనండీ' రంజన్‌బాబు కూనిరాగం తీస్తున్నట్టు అన్నాడు. 'సింపుల్ పనిమీద వచ్చిన సింపుల్ మనిషిని నేను. మీకు తెలియదా ఏం?'

'మాకా విషయం తెలుసుసార్' యు.ఎన్.ఐ. విలేఖరి తిప్పికొట్టినట్టుగా అన్నాడు. 'మీరెంత సింపులో దేశమంతటికీ తెలుసు. మీరొచ్చిన ఆ సింపుల్ పనేమిటో దయచేసి మాకు చెబుతారని...'

'సింపుల్ పనే కానీండీ, మీకు చెప్పేంత మరీ సింపుల్ కాదు, చూశారూ...' రంజన్‌బాబు అన్నాడు.

'అలాగా' సమాచార్ భారతి విలేఖరి అందుకున్నాడు. 'మీచేత ఏమైనా చెప్పించడానికి మేమే మాటలు అందించి సహకరిస్తాం సార్... ముఖ్యమంత్రిమీద వచ్చిన తీవ్రమైన ఆరోపణల్ని పరిశీలించడానికే అధిష్ఠానవర్గం మిమ్మల్ని ఇక్కడికి పంపించిందన్నమాట నిజమేనా?'

పి.టి.ఐ. విలేఖరి, పోటీలో తాను వెనుకబడిపోతే ఎలా అనుకున్నట్టున్నాడు, ఇబ్బంది కలిగించడంలో ఏమాత్రం తక్కువకాని మరో ప్రశ్న వెనువెంటనే సంధించాడు. 'రాష్ట్రపతి ఎన్నిక సందర్భంగా ఇక్కడి గ్రూపుల బలాబలాలను అంచనా వేయడానికే మీరిక్కడికి వచ్చారనుకోవచ్చా?'

'అధిష్ఠానంవర్గం నియమించిన అధికారిక అభ్యర్థి అవకాశాలెలాఉంటాయి?' ఓ స్థానిక పత్రికకు చెందిన విలేఖరి ప్రశ్నించాడు. నిజానిజాలు తేల్చుకోకుండా వార్తల రూపంలో నిత్యం కట్టుకథల్ని అందించడం ఈ పత్రికకు ఓ రివాజు.

'ముఖ్యమంత్రి చౌదరి గోడమీద పిల్లిలా వ్యవహరిస్తున్న మాట నిజమేనా? గిరికి అనుకూలంగా ఆయనను ఒప్పించడానికే మీ రిక్కడికి వచ్చారా?' మరో విలేఖరి అడిగాడు. అతడి పత్రిక సంజీవరెడ్డిని అదేపనిగా ఆడిపోసుకుంటూ ఉంటుంది.

'సంజీవరెడ్డి పార్టీ అధికారిక అభ్యర్థి అన్న విషయంతో మీ రేకీభవిస్తారా లేదా?' ఓ ప్రత్యేక విలేఖరి గొంతు చించుకుంటూ అడిగాడు. ఎక్కడో ఏవో కొంపలు మునిగిపోతున్నట్టు చిత్రించే వార్తనో, లేదా అధమపక్షం ఏదైనా వివాదాస్పదమైన వార్తనో ఇతనినుంచి ఇతని పత్రిక ఆశిస్తూ ఉంటుంది. ఎక్కడైనా ఏమైనా మంచి జరుగుతున్నట్టు వార్త రాస్తే, తన ఉద్యోగం ఊడిపోవడం ఖాయమన్న నిర్ణయానికి అతడెన్నడోవచ్చేశాడు.

రానురాను ప్రశ్నలు తామరతంపరగా పెరిగిపోయి మరింత ఇబ్బందికరంగా మారుతున్నాయి. గుంపు కదిలిపోతుండడంతో విలేఖరులు ఆతృతకొద్దీ వరసపెట్టి ప్రశ్నలు గుప్పించడం మొదలు పెట్టారు. సమాధానాలు కూడా అదే వరసలో వస్తాయని ఎదురుచూశారు. అయితే రంజన్‌బాబుకు వేరే ఆలోచనలేవో ఉన్నాయి. చుట్టూ మితిమీరినన్ని ప్రశ్నలు వ్రేలాడుతున్నాయి. వీటిలో ఓ ఒక్క ప్రశ్నకూ అతడెలాగూ జవాబు చెప్పదలచుకోలేదు. తప్పించుకోడానికి అతడి కిప్పుడు చక్కని ఉపాయం తట్టింది.

బలవంతంగా చిరునవ్వు తెచ్చి పెట్టుకుని సాగదీస్తూ అన్నాడు. 'మిత్రులారా, మీరు మరీ దూరం వెళ్ళిపోతున్నారు, వెంట వెంటనే ప్రశ్న మీద ప్రశ్న గుప్పించేస్తున్నా రు. ఇంకోసారి ఎప్పుడైనా మీ ప్రశ్నలకు తప్పకుండా జవాబు చెబుతాను, హాంజీ... ఇప్పటికి సెలవ్!' అంటూ, ఆగ్రహంతో బుసలుకొడుతున్న జర్నలిస్టుల్ని వదిలేసి ఎక్కడా వంగని పందిరిరాటలా ముందుకు సాగిపోయాడు.

అప్రయత్న, సంచారపత్రికాగోష్ఠి అలా ముగియగానే సింపుల్ రంజన్‌బాబును, ఎంతో సింపుల్‌గా ఉండే హోటల్ చంద్రగుప్తా ఇంటర్‌కాంటినెంటల్‌లోని ఓ సింపుల్ ఎయిర్ కండిషన్డ్ స్పెషల్ సూట్‌లోకి తోడ్కొని వెళ్ళారు.

ఆ తర్వాత స్వాగత సత్కారాల పోటీ ప్రారంభమైంది. స్థానిక విలేఖరులకు రాయడానికి మరో వార్త కనిపించలేదు. రంజన్‌బాబు పర్యటనను మించిన వార్తాంశం మరొకటి ఉండడమూ అసాధ్యమే. దేశానికి రంజన్‌బాబు ఎంతో అంకితభావంతో అందించిన లెక్కలేనన్ని ఘన సేవలను ప్రస్తుతిస్తూ స్థానికవందిమాగధుల నుంచి విడుపులేని ప్రకటనల ప్రవాహం పత్రికల్ని ముంచెత్తివేసింది. ప్రచురించడానికి మరేదీ కనిపించక పత్రికల్ని వాటితోనే నింపవలసివచ్చింది. ఆ ప్రకటనల పరిమాణాన్నిబట్టిచూస్తే, తరగని దేశభక్తితో రంజన్‌బాబు చేసిన సేవలకు భారత మాత అసలెప్పటికైనా రుణం తీర్చుకోగలదా అనిపించింది. అతడి పర్యటన రాష్ట్ర ప్రజలకు గొప్పవర ప్రసాదంగా ఆ ప్రకటనలు అభివర్ణించాయి. అయితే ఎందుకో, ఎలాగో వివరించిన వాళ్ళు ఒక్కరూ లేరు. ప్రజలు తమ అంతరాంతరాల్లోంచి ఉబికివచ్చే కృతజ్ఞతాభారంతో

ఆయనను స్వాగతిస్తున్నారు—వగైరా వగైరా వాక్యాలతో అవి నిండిపోయాయి. ఇందులో ఒక్కము క్కని విశ్వసించినవారు రాసిన వాళ్ళలోకానీ, చదివిన వాళ్ళలోకానీ ఒక్కరూలేరు.

గౌరవ అతిథికి స్వాగతం చెప్పడానికి జరుగుతున్న పోటీ పరాకాష్ఠకు చేరినకొద్దీ మధ్యాహ్న, రాత్రి విందులకూ, టీ పార్టీలకూ, అల్పాహార కార్యక్రమాలకూ వచ్చిపడుతున్న ఆహ్వానాల వరదను ఎలా నిరోధించాలో ఎవరికీ అర్థంకాలేదు. చౌదరి వర్గానికి చెందిన సేఠ్‌లు, మహేంద్రనాథ్ శిబిరానికి చెందిన షావుకార్లతో పోటీకి దిగారు. శత్రుశిబిరాలకు చెందిన ఉద్దండులు బహిరంగంగా ఘర్షణలకు పాల్పడిన సంఘటనలతోపాటు ఓ కత్తిపోటు ఘటనా జరిగింది. రెండు పక్షాలకూ చెందిన యువక రౌడీలు ఆ రోజు రాత్రీ పగలూ అనేకసార్లు వీధుల్లోకివచ్చి బాహీబాహీ కలబడ్డారు. మహిళామండళ్ళు పోటీపడి ఊరేగింపులు సాగిస్తూ పూనకం వచ్చినట్టు చెలరేగిపోయి ఒకరి పుచ్చును ఒకరు వేలెత్తి చూపించుకున్నారు. దుర్భాషాపూరితమైన ఈ జీవితకథనాలు ఎక్కడా సంక్షిప్తీకరణ అన్నదిలేకుండా సర్వసమగ్రంగా ఉన్నాయి.

ఆ తర్వాత 'దయ'తో బహిరంగ ఉత్సవాలకు విచ్చేయవలసిందిగా రంజన్‌బాబుకు కుప్పలు తెప్పలుగా ఆహ్వానాలు వచ్చిపడసాగాయి. అప్పటికే చౌదరి అభిమానులు చలనచిత్ర నటీమణు లతో కూడిన రెండు బృందాల మధ్య కుస్తీ పోటీలను ఏర్పాటు చేశారు. దానికి ప్రారంభోత్సవం చేయవలసింది రంజన్‌బాబు. అతడాపని ఎలా చేస్తాడో గడుగ్గాయలు ఎంతో కమ్మగా ఊహించు కోవడం ప్రారంభించారు. మరోవైపున మహేంద్రనాథ్ అనుయాయి ప్రమోద్‌రాయ్ కేవలం అవయవలావణ్యం గీటురాయిగా, సగటు వయసు ముప్పై మించని ఓ అందమైన ఖవ్వాలీ గాయనీమణుల జట్టును పోగుచేసి వాళ్ళ విశేష కార్యక్రమం ఏర్పాటు చేశాడు. ఇక న్యాయవాదుల పోటీ సంఘాలు రెండు, ఎవరి ఆహ్వానాన్ని మన్నించాలో తేల్చుకోలేని సందిగ్ధస్థితిలో రంజన్‌బా బును నిలబెట్టాయి. ఒక సంఘం తనను తను 'అభ్యుదయశీలి'గా చిత్రించుకుంటుంటే, మరో సంఘం తనను 'ప్రజాస్వామికం'గా అభివర్ణించుకుంటూ ఉంటుంది. ఈ ఇంటిమీది కాకి ఆ యింటిమీద వాలడానికి వీల్లేదన్నంత కచ్చితంగా ఉంటుంది ఈ సంఘాల్లోని సభ్యత్వం, రంజన్‌బాబు అభ్యు దయాన్నో, ప్రజాస్వామ్యాన్నో— దేనినో ఒకదానిని ఎంచుకోక తప్పేటట్లులేదు. ఏ సంఘమూ మరో సంఘంతో రాజీపడే అవకాశమే లేదని న్యాయశాస్త్రకోవిదులు నిర్ణయానికి వచ్చేశారు... కేవలం రంజన్‌బాబును తమ ఉత్సవానికి ఆహ్వానించడం కోసమే రాత్రికిరాత్రి అనేకానేక సంఘాలు పుట్టు కొచ్చేశాయి. ఎన్నడూ ఆలోచనకైనా అందని కార్యకర్తల నామధేయాలతో ఎప్పుడూ కనీవినీ ఎరు గని సంఘాల లెటర్‌హెడ్ల ప్రచురణతో అనేక ప్రింటింగ్ ప్రెస్సులకు చేతినిండా పని దొరికింది. అంత తక్కువ వ్యవధిలో అంత ఎక్కువ సృష్టి జరిగిపోవడం నిజంగా అద్భుతం- ఇందులో రెండు గ్రూపులూ సమానంగా పాలుపంచుకున్నాయి కనుక రెట్టింపు అద్భుతం.

రంజన్‌బాబు రాష్ట్ర సందర్శన ఒక కీలక సమయంలో సంభవించింది కనుక అది కూడా కీలకమే అయింది. దేశానికి రాజకీయభారమితిలా పనిచేసే 'తృతీయసభ' లాంటి పార్లమెంట్ సెంట్రల్ హాల్‌లో ఆందోళనమిళితమైన ఊహాగానాలు సాగుతున్నాయి. అధికారపక్షంలో తథ్యమనిపిస్తున్న చీలిక గురించి జరుగుతున్న వేడివేడి వాదోపవాదాలతో హాలు మారుమోగుతోంది. ముఖ్యమంత్రులందరూ పరస్పరభ్రాతృయుద్ధోద్యోగంలో, రాజకీయ బేరసారాల్లో తలమునకలౌతున్నారు.

అధిష్ఠానవర్గం తమపట్ల తలపెట్టిన వైఖరి విషయంలో కేంద్రం ముఖ్యమంత్రుల నెప్పుడూ డోలాయమానంగానే ఉంచుతూ ఉంటుంది కనుక ఇలా జరగడం అసాధారణంకాదు. ప్రారంభంలో ప్రతి ముఖ్యమంత్రీ హీరోలానే కనిపిస్తాడు. ఆ తర్వాత విలన్‌గా మారిపోతాడు.

కొన్నేళ్ళ క్రితం మహేంద్రనాథ్ విషయంలో ఇలాగే జరిగింది. ఇక ఇప్పుడు చౌదరి వంతు. కనుక మహేంద్రనాథ్ వర్గానికి చెందిన ఎం.పి.లు చౌదరి నిష్క్రమించబోతున్నాడన్న ప్రచారాన్ని కసితీరా ప్రారంభించేశారు. చౌదరి ఒకేసారి జోడుగుర్రాలసవ్వారీకి యత్నించినట్టు వాళ్ళ ఉద్ఘాటన. ఫలితం: రెండూ అతణ్ణి ఈడ్చితన్నాయి. మొరార్జీదేశాయ్‌కి అతడంటే ఎలాగూ ఏవగింపే, ప్రధానమంత్రి ఇందిరాగాంధీ కూడా ఎట్టకేలకు అతడి ద్రోహబుద్ధిని అర్థంచేసుకుని, తన్ని తగలెయ్యడానికి ఒప్పుకున్నారు. అంచేత ఏ విధంగా చూసినా, 'ఆ గాడిదకొడుకు' నిష్క్రమణ ఖాయమని వాళ్లు నిర్ధారించేశారు.

ఈ ఎం.పి.లతో కూడిన ప్రతినిధిబృంద మొకటి ప్రధానమంత్రిని కలుసుకుని చౌదరి పాల్పడిన 'అత్యంతఘోర'మైన తప్పుల్ని విశదీకరించడంద్వారా యధావిధిగా ఇందుకు ప్రయత్నాలు మొదలైపోయాయి. చౌదరిగురించి వాళ్ళు నిర్ద్వంద్వంగా ఇలా చెప్పారు. ఎ) పార్టీ కార్యక్రమాల నతడు ముందుకు తీసుకుపోలేడు. బి) వచ్చే ఎన్నికల్లో పార్టీకి విజయం చేకూర్చగల సామర్థ్యం అతనికి లేదు. సి) ఎప్పుడూ మతాపక్షపాతంతోనే వ్యవహరిస్తూ ఉంటాడు కనుక ప్రభుత్వంలో సుస్థిరతను కాపాడలేడు. డి) అతడిపట్ల మెజారిటీ శాసనసభ్యుల్లో విశ్వాసం లేదు. ఇ) పచ్చి అవినీతిపరుడు, ఆ విషయం జనం కోడై కూస్తున్నారు. ఎఫ్) 'అభ్యుదయ' దృక్పథం బొత్తిగాలేని మనిషి. జి) అన్నింటికంటె ముఖ్యంగా అతడు ప్రధానమంత్రికి విధేయుడు కాడు. అత్యంత ఆంతరంగికులతో మాట్లాడుతున్నప్పుడు, రాష్ట్రపతి ఎన్నికకు సంబంధించి ప్రధానమంత్రి తీసుకున్న చర్యలపట్ల అసమ్మతిని వ్యక్తం చేశాడు. కనీసం ప్రకటించవలసినంత సమ్మతిని ప్రకటించలేదు. ఈ మధ్య బొంబాయిలో అతడికీ మొరార్జీదేశాయ్‌కీ మధ్య జరిగిన ఒక ఆంతరంగిక సమావేశంలో తన మద్దతు ఆయనకే ఉంటుందని రహస్యంగా వాగ్దానం చేసినట్టు తమ వద్ద నికార్సయిన సాక్ష్యం ఉందని కూడా వాళ్ళు ఘోషించారు. 'అభివృద్ధి నిరోధక స్వార్థపరశక్తు'లతో నువ్వా, నేనా అన్నట్టు జరుగుతున్న నేటి ఘర్షణలో చౌదరి బొత్తిగా ఆధారపడదగని మనిషనీ, విశ్వసించదగని వ్యక్తనీ వాళ్ళు పునరుద్ఘాటించారు. పార్టీని కాపాడడానికి, ఇందిరాగాంధీని బలోపేతం చేయడానికి మిగిలిన ఏకైక మార్గం, 'సాధ్యమైనంత త్వరగా' అతణ్ణి ముఖ్యమంత్రి పీఠం నుంచి పడదోయడమని వాళ్ళ తిరుగులేని నిష్కర్ష.

ప్రధానమంత్రి వాళ్ళ మాటలువిని చిరునవ్వుచిందించి ఊరుకున్నారు తప్ప అలా, ఇలా ఒక్కమాట కూడా అనలేదు. అనే అలవాటు ఆమె కెటూ లేదు. అయినా సరే, చాలామంది ఎం.పి.లు ప్రధానమంత్రి చిరునవ్వుకు భాష్యం చెప్పగల ప్రజ్ఞావంతులుగా తయారయ్యారు చాలాకాలంగా. లేదా అలా వాళ్ళు చెప్పుకున్నారు. ఇందిరాగాంధీతో ఇంటర్వ్యూ పూర్తి అయిన వెనువెంటనే చౌదరివ్యతిరేకవర్గానికి చెందిన ఎం.పి.లు. ప్రధానమంత్రి చిరునవ్వులోని అంతరార్థాన్ని విశ్లేషిస్తూ చౌదరికి ఏ రోజునైనా ఉద్వాసన జరగవచ్చునని ఉద్ఘాటించారు. అదింక కేవలం సమయసందర్భాలకు పరిమితమైన వ్యవహారమని స్పష్టం చేశారు.

మొదటి ప్రతినిధిబృందం కలుసుకున్న వెనువెంటనే, ఈసారి చౌదరి వర్గానికి చెందిన రాష్ట్ర ఎం.పి.ల ప్రతినిధి బృందం ప్రధానమంత్రిని కలుసుకుని ఆమె నిలా నమ్మించబోయింది. ఎ) ముఖ్య మంత్రి చౌదరి మహాద్భుతంగా పనిచేస్తున్నాడు; బి) త్వరగా నిర్ణయాలు తీసుకుని అంతకంటె త్వరగా అమలులోకి తీసుకొచ్చే మనిషాయన; సి) ప్రధానమంత్రి కాయన అత్యంత విధేయుడు— ఆ మాటకొస్తే నెహ్రూ కుటుంబం మొత్తానికే ఆయన నమ్మినబంటు; హనుమంతుడి రొమ్ము లా, ఎవరైనా సర్జన్ ఆయన రొమ్మును కనుక చీల్చిచూస్తే గుండెమీద చెక్కి ఉన్న ప్రధానమంత్రి రూపమే ప్రత్యక్షమౌతుంది. డి) రాష్ట్రంలో సుస్థిరత్వాన్ని కాపాడాలన్నా, వచ్చే ఎన్నికల్లో పార్టీకి విజయం చేకూర్చాలన్నా చౌదరికి మద్దతు కొనసాగించడమూ, ఆయనను మరింత బలోపేతం చేయడమే మార్గం... ప్రధానమంత్రి ఈ ప్రతినిధివర్గాన్ని కూడా చిరునవ్వుతోనే ఆదరించారు. చిరునవ్వుకు అర్థవివరణ చేయడంలో వీళ్ళూ సమాన ప్రజ్ఞావంతులే కనుక అధిష్ఠానవర్గం నూటికి నూరుశాతం చౌదరిని సమర్థిస్తున్నట్టు నిర్ధారణకొచ్చేశారు. నూటికినూరు శాతం మాత్రమే ఎందుకంటే మద్దత్తు శాతాన్ని అంతకుమించి పెంచే అవకాశంలేదుమరి!

ఇవే గ్రూపులు మొరార్జీనీ కలుసుకుని, అంతే సమధికోత్సాహంతో చౌదరికి అనుకూలంగా లేదా వ్యతిరేకంగా తమ వాదాలు వినిపించాయి. ఒకపాఠం: చౌదరి మహాదుర్మార్గుడు, మీకు మాత్రం తెలియదాసార్? (నా కెలా తెలుస్తుంది? మొరార్జీ తటాలున ఎదురుప్రశ్న సంధించారు. ఆయనకు తెలుసుకనుకనే అలా అన్నారని ప్రతినిధివర్గం ఆ ప్రశ్నకు అర్థం చెప్పుకుంది. ఎంతైనా మొరార్జీ తనకి తెలుసునని ఎలా చెబుతారు? అదీగాక అటువంటి స్వయంప్రకటసత్యం ఆయనకు తెలియ కుండా ఎలా ఉంటుంది?) అతడు ఇందిరాగాంధీకి చంచాగా మారాడు, మీ మీద బురదచల్లడానికి తెగించాడు సార్... మేమందరం కొన్ని దశాబ్దాలుగా మిమ్మల్ని అభిమానిస్తున్న వాళ్ళంసార్ (వాళ్ళలో చాలామందికి అలాచెప్పుకోడానికి తగినంత వయసు లేదని మొరార్జీ గమనించారు). ఈ వాస్తవా లను మీ దృష్టికితీసుకురావాలనుకున్నాం సార్. మూకుమ్మడిగా మీ వోట్లు గిరికివేయండని రాష్ట్రా నికిచెందిన ఎం.పి.లపై, ఎం.ఎల్.ఏలపై చౌదరి విపరీతమైన ఒత్తిడి తెస్తున్నాడు. మన ఆధికారిక అభ్యర్థి అయిన సంజీవరెడ్డిని బాహాటంగా విమర్శిస్తున్నాడుసార్. అతగాడు ఇటువంటి కుతంత్రాలకుపాల్పడుతున్నట్టు మీకు తెలిసిఉండకపోవచ్చు. (అలాఎందుకనుకుంటున్నారు? నాకం తాతెలుసునని మీరు ఇప్పుడే కదా అన్నారు? అన్నారా లేదా? మొరార్జీ తిప్పి కొట్టారు)

రెండో పాఠం: మమ్మల్ని ఆదరించినందుకు కృతజ్ఞతలుసార్, ముఖ్యమంత్రి చౌదరికి వ్యతి రేకంగా కొంతమంది అబద్ధాలు ప్రచారం చేస్తున్నారుసార్. వాస్తవానికాయన మన ఆధికారికఅభ్యర్థి సంజీవరెడ్డి కోసం అహర్నిశలూ కృషి చేస్తున్నా రు సార్! (పార్టీకి చెందిన ఓ ముఖ్యమంత్రి పార్టీ అభ్యర్థి కోసం పనిచేయడంలోఅబ్బురం ఏముంది? మొరార్జీ ఎదురుప్రశ్నవేశారు. ఆమాటతో ఒక్కసారిగా ప్రతినిధివర్గంమీద చన్నీళ్ళు కుమ్మరించినట్టయింది) మీకూ తెలుసుసార్, చౌదరికి మీరంటే వల్లమాలినంత ఆరాధన (నాకు తెలిసినప్పుడు మళ్ళీ ఎందుకు చెబుతున్నారు? మొరార్జీ నిలదీశారు). ఆయన ఇందిరాగాంధీని నఖశిఖ పర్యంతం వ్యతిరేకిస్తున్నారు (అదో ప్రత్యేకమైన అర్హతా? మొరార్జీ మధ్యలో తుంచుతూ అడిగారు). ఆయనకు మీరు గట్టిమద్దత్తు ఇవ్వాలి సార్.. (ఆయనేమైనా ఎన్నికలో నిలబడ్డాడా? మొరార్జీ ప్రశ్నించారు).. ఇలా ప్రశ్నలు, ఎదురు ప్రశ్నలతో ఇంటర్వ్యూలు పూర్తిఅయిన తర్వాతకూడా తమ పరిస్థితి ఏమిటో ఏ గ్రూపుకీ అర్థంకాలేదు. సరిగ్గా

ఆ కారణంతోనే మొరార్జీ తమ పాతంతోనే ఏకీభవించారని రెండుగ్రూపులూ దేని కవే విశ్వసించి అలా ముక్తకంఠంతో చెప్పుకుంటూ వచ్చాయి.

రాష్ట్రంలో పరిస్థితిని అక్కడి కక్కడే తెలుసుకోవడంకోసం రంజన్‌బాబు విచ్చేస్తున్నవార్త వ్యాపించగానే రెండు పక్షాలూ ఆ అత్యద్భుత వ్యక్తి ఎంపికలో ముఖ్యపాత్ర తమదంటే తమదని ఎంతో ఆర్భాటంగానూ తమకంతోనూ చెప్పుకోవడం ప్రారంభించాయి. రంజన్‌బాబుతో ఎంతో సన్నిహితవ్యక్తిగతమైత్రీ-ఆపైన ఎటూ అధిష్ఠానవర్గం ఆశీస్సులూ తమకే ఉన్నట్టు చెప్పుకుని రెండు పక్షాలూ రొమ్ము విరుచుకున్నాయి.

★ ★ ★

అఫ్రోజాబాద్‌లో రంజాన్‌బాబు పట్టపగ్గాలు లేకుండా ఉన్నాడు. అయితే చౌదరి గురించి మాట్లాడేటప్పుడు జాగ్రత్త పాటిస్తున్నాడు. అర్ధరాత్రి దాటిన తర్వాత, 'యాదృచ్ఛికంగా నగరానికి వచ్చిన కూరిమి నేస్తమైన ఓ డాక్టర్ మిత్రుడితో కలిసి తన హోటల్ గదిలో విశ్రాంతి తీసుకుంటున్నాడు. కార్యశూరుడైన ప్రమోద్‌రాయ్ కేవలం 'రంజన్‌జీకి కంపెనీ' ఇవ్వడంకోసం ప్రత్యేకంగా అతణ్ణి త్రివేంద్రం నుంచి విమానంలో రప్పించాడు. చౌదరిని ఆ డాక్టర్ దుమ్మెత్తిపోస్తుంటే రంజన్ ప్రోత్సాహసూచకంగా ధ్వనించే శబ్దాలుచేస్తున్నాడు.

'అవినీతితో పుచ్చిపోయాడు', డాక్టర్ అన్నాడు.

'ఉహూఁ... డబ్బు టన్నుల్లో ఉందన్నమాట!' రంజన్ అన్నాడు.

'అవును, సిగ్గు బిడియాలు బొత్తిగాలేని స్త్రీలోలుడు' డాక్టర్ అన్నాడు.

'ఆహా! సొంత జనానా కూడా ఏర్పాటు చేసుకున్నాడేమిటి?' రంజన్ అన్నాడు.

రంజన్ వెంటవెంటనే స్పందిస్తున్నాడు కానీ, అందులో చౌదరిపట్ల డాక్టర్ ఆశించినంత వ్యతిరేకత వ్యక్తం కావడంలేదు. దాంతో డాక్టర్ తన తదుపరిఅస్త్రాన్ని బయటికి తీశాడు. 'ఇక తాగుడంటావా... చేప తాగినట్టు తాగుతూ ఉంటాడని అందరికీ తెలుసు.'

'ఇంకేం? ఉండవలసినవన్నీ ఉన్నాయన్నమాట'. రంజన్ వ్యాఖ్యానించాడు. 'భాక్రాసైజులో అతడి దగ్గర విదేశీమద్యం రిజర్వాయర్ ఉండి ఉంటుంది...'

ఈ వ్యాఖ్యల్ని ఎలా అర్థం చేసుకోవాలో డాక్టర్‌కి తోచలేదు. 'ఈ దిక్కుమాలిన డొంకతిరుగుడంతా దేనికి?' అనుకున్నాడు మనసులో. మరోపావు కదిపిచూశాడు. 'ఈ ముఖ్యమంత్రి ప్రధానమంత్రికి పూర్తిగా అవిధేయుడు. రాష్ట్రంలోఎవరినడిగినా ఆ విషయం చెబుతారు. రాష్ట్రపతి ఎన్నికలో గిరికి వ్యతిరేకంగా పనిచేస్తున్నాడు. ఈమధ్య అతడి మాటలధోరణిని గమనిస్తుంటే ఈ విషయంలో సందేహానికి అవకాశమే లేదనిపిస్తోంది...'

'మంచిది డాక్టర్. ఆ మనిషిని ఎలా డీల్ చేయాలో నాకు తెలుసు, అది నాకొదిలెయ్. మన పాతరోజుల జ్ఞాపకార్థం ఇప్పుడు మనం చేయవలసింది...' అంటూ రంజన్‌బాబు, చీకటి నిండిన ఆ గదిలో సీసాలా కనిపిస్తున్న ఓ వస్తువును పైకి తీశాడు.

★ ★ ★

'లేదుమిత్రమా, వెరీవెరీసారీ,' రంజన్ ప్రారంభించాడు. 'నువ్వు ముఖ్యమంత్రికి ఎంతో అంత రంగికుడివి, కనుక తిన్నగా విషయం చెప్పేస్తాను. ఆయనకు వ్యతిరేకంగా చాలామంది నోట చాలా విషయాలు విన్నాను.'

కంపరం, ఆగ్రహం, వినోదం కలగలిసిన మానసికస్థితిలో కూడా శేఖర్‌కు ఆ ఇంటర్వ్యూ వేడుక పుట్టిస్తోంది. చౌదరి ఏ పాపం ఎరగడనీ, ఆయనకు వ్యతిరేకంగా కుట్రజరుగుతోందనీ, ఆయన విరోధులు చెబుతున్నవన్నీ వట్టి అబద్ధాలనీ రంజన్‌బాబుకు నచ్చజెప్పడానికి (తాను చెబుతున్న మాటల్లో తనకే నమ్మకం లేకపోయినా సరే) గంటసేపటినుంచి విఫలయత్నం చేశాడు. పూర్తిగా రెండు పగళ్ళు, రెండు రాత్రులు ఆయా వ్యక్తులతోనూ, చిన్న చిన్న గ్రూపులతోనూ సుదీర్ఘ సంప్రతింపులు జరిగిన తర్వాత ఇది చిట్టచివరి ఇంటర్వ్యూ. ముఖ్యమంత్రి విరోధులు అవినీతి, దుష్పరిపాలనకు సంబంధించి అత్యద్భుతకథలు వినిపించారు. వాస్తవం లేశమాత్రంగానైనా ఉండడానికి అవకాశంలేని కాకమ్మకథల్లా అవి ధ్వనిస్తున్నా, వాటిని సృష్టించినవారు మాత్రం వాటిని సాక్షాత్తు దేవదూత నోటవెలువడిన సత్యాల్లా చెప్పుకున్నారు. అధిష్ఠానవర్గం ప్రతినిధిగా వచ్చాడు కనుక మాటల్లోఒకవైపు మొగ్గినట్టు కనిపించకపోయినా రంజన్‌బాబు ముఖ్యమంత్రి విషయంలో తన కలవరాన్ని సూచనగా వ్యక్తం చేయనే చేశాడు.

చౌదరి ఆదేశం ప్రకారం అతణ్ణి 'ఖుష్' చేయడానికే తనక్కడికి వచ్చాడు. 'సో మిస్టర్ శేఖర్', రంజన్ సంభాషణను ముగిస్తూ పరిహాసంతోపాటు కీడునూ ధ్వనింపజేస్తున్నట్టు అన్నాడు, 'గుడ్‌లక్, నేను చెప్పవలసినవి నేనుచెబుతాను. గుడ్‌బై'. అప్పుడే అక్కడే అతడి చప్పిడి ముక్కు మీద గుద్దాలని శేఖర్‌కి అనిపించిందికానీ, కోపాన్ని ఎలాగో అణచుకుని రంజన్‌మీద మరింత మర్యాదను కుమ్మరించాడు.

మొత్తంమీద నల్లేరుమీద నడకలాసాగిపోయిన ఈ ఆత్మవంచనపర్వంలో అసమ్మతిని ప్రకటించిన ఏకైక వ్యక్తి అరుణ. రంజన్‌బాబు గురించి ఆమెకేమీ తెలియదు. అయినా విమానాశ్రయంలో అతణ్ణి చూసిన క్షణంలోనే అతడిపట్ల ఏవగింపు కలిగిందామెకు, బహిరంగంగా అతనిపై వ్యతిరేకవ్యాఖ్యలు చేయడం ప్రారంభించింది. ఆ క్రమంలో ప్రత్యర్థిగ్రూపులు రెండింటికీ ఆమె కంటగింపుగా పరిణమించింది. ప్రతిగ్రూపు తనను అవతలి గ్రూపుకు చెందిన మనిషిగా చిత్రిస్తుండడంతో ఆమె మరింత మనస్తాపంచెందింది. 'చౌదరి, మహేంద్రనాథ్ ఇద్దరి- కిద్దరూ దగాకోరులే' అంటూ ఇల్లెక్కి చాటడం ప్రారంభించింది. ఆపైన 'ఢిల్లీ నుంచి దిగొచ్చిన ఈ మేధావి వీళ్ళిద్దరినీ మించిన మాయగాడు!' అంది. పరిస్థితి విషమించకుండా నివారించడానికి చిట్టచివరియత్నంగా కొందరుశాసనసభ్యులు ఆమెతో వాదనకి దిగారు. తమతమ గ్రూపులకు మరీ నష్టం జరగకుండా రంజన్‌బాబు పర్యటన ఏదోవిధంగా పూర్తయితే చాలునని వాళ్ళు ఆశించారు. అరుణ ఎంతో కొంత గౌరవించే మౌలానా ఆమెను శాంతింపచేయడానికి ప్రయత్నించాడు. 'నువ్వు చెబుతున్న దానిలో వాస్తవం ఉండచ్చు అరుణా, అయినా నీ విమర్శలవల్ల పార్టీకి జరిగే మేలేమిటి? పార్టీ ఇప్పుడు ఎటువంటి సంక్షోభాన్ని ఎదుర్కొంటోందా నీకు తెలియదా?'

'ఈ బరితెగించిన అవకాశవాదులు పార్టీకి చేస్తున్న మంచేమిటి మౌలానా?' ఆమె ఠకీమని ఎదురు ప్రశ్న వేసింది. 'అతడి చుట్టూ కుక్కల్లా తిరిగి వీళ్ళు ఏం సాధించబోతున్నారట?'

'నీతో నేను వాదించలేను', మౌలానా అలసట ధ్వనించే గొంతుతో అన్నాడు. 'ఇతగాడు చౌదరికి వ్యతిరేకంగా ప్రధానమంత్రికి ఫిర్యాదుచేసి తీరతాడనే అనుకుంటున్నాను!'

'చేస్తే చేసుకోనివ్వండి, నేనేం లెక్కచేయను. ఢిల్లీలో వీడిబండారం నేను బయటపెడతాను, ఇందిరాజీకి చెబుతాను'!

లెక్కచేయను... లెక్కచేయను... లెక్కచేయను... ఇదీఆమె పల్లవి. అయితే లెక్కచేయకుండా ఉన్నవాళ్ళు ఒక్కరూ లేరు. అలాగే ఆమె లెక్కచేయబోదని విశ్వసించే వాళ్ళూలేరు. అదంతా ఆత్మవంచనలో భాగం. రంజన్‌బాబు ఇవ్వబోయే రిపోర్టును ప్రతివాళ్ళూ లెక్కచేసేవాళ్ళే.

దరిమిలాను, రంజన్‌బాబుకు వ్యతిరేకంగా మాట్లాడిన ఏకైక యోద్ధగా అరుణ మిగిలి పోయింది. ఆమె చేసింది తప్పని ఎవరూ అనుకోలేదు, ఒప్పనీ ఎవరూ అనలేదు. ఆమె తప్పుచేసిందని అన్నవాళ్ళు ఎందరో ఉన్నా, అసలేమీ అననివాళ్ళు అంతకుమించి ఉన్నారు. కేవలం ఆమె నొక అస్పృశ్యురాలిగా పరిగణించి ఊరుకున్నారు.

★ ★ ★

ఓ సరోవరాన్ని తలపింపజేసేలా ఉన్న తెల్లని టోపీల తలలు మరోసారి విమానాశ్రయం అంతటా నిండిపోయాయి. మహేంద్రనాథ్ అనుయాయులు అక్షరాలా నృత్యం చేశారు. వాళ్ళ అడుగులు గాలిలో తేలిపోతున్నాయి. వాళ్ళ తలలు మేఘమండలాన్ని తాకుతున్నాయి. ఆశ్చర్య మేముంది? ముఖ్యమంత్రి చౌదరిపై వాళ్ళు అత్యద్భుతవిజయం సాధించారు. ముందురోజు రాత్రి ప్రమోద్‌రాయ్‌తో, అతడి సహచరులతో మాట్లాడుతున్నప్పుడు రంజన్‌బాబు పెదవులపై మెరిసిన చిరునవ్వులో ఏదో దివ్యత్వం వెల్లివిరిసింది. ఒక అందవికారమైన ముఖాన్ని దివ్య దరహాసం వెలిగించడం అసంగతంలా కనిపించవచ్చు కానీ, అది వాస్తవం. రంజన్‌బాబు నివేదిక ఒక వారం రోజుల్లో, లేదా నెలరోజుల్లో, లేదా మీమీ ఆశలస్థాయిని బట్టి మీరు నిర్దేశించుకున్న గడువుల్లో చౌదరి భరతం పట్టించడం దాదాపు ఖాయమన్న మాట అర్ధరాత్రి సమయానికి అంతటా వ్యాపించిపోయింది.

ఈ రోజుకోసం తమెంత శ్రమించి పనిచేశారు? ఆ చౌదరి ఎంత కొరకరాని కొయ్యలా పరిణమించాడు! అందుబాటులో ఉన్న శాసనసభ్యులందరినీ తనవైపు తిప్పుకుని తన స్థానాన్ని దుర్భేద్యం చేసుకున్నాడు. ఇప్పుడు మహేంద్రనాథ్‌వర్గీయులుకూడా ఆటలోని ప్రతిఅంశంలో తమేమీ తీసిపోలేదని రుజువు చేసుకున్నారు.

అమాంతం పైకి దూసుకుపోవాలని తపించే యువకుడు ప్రమోద్‌రాయ్ ఒక ఉపఎన్నికలో పోటీచేసి శాసనసభలోకి అడుగుపెట్టడం, స్వల్పకాలంలోనే పైకి ఎదిగిపోవడం గ్రూపు పాలిట భగవత్ప్రసాదంగానే రుజువైంది. ఎక్కడ ఏ తాడు గుంజాలో కనీసం శేఖర్‌కి తెలిసినంత క్షుణ్ణంగా ప్రమోద్‌కీ తెలుసు...

'రంజన్ బాబు జిందాబాద్!' అంటూ ప్రమోద్‌రాయ్ నాయకత్వంలోని గుంపు నినాదాలు చేసింది. అరుపుల్లో తాము వెనకబడిపోకూడదన్నట్టు చౌదరి మనుషులూ అటువంటి నినాదాలే

అందుకున్నారు. రంజన్ సెలవుతీసుకుంటూ అరిగిపోయిన జోకులు పేల్చుతుంటే అక్కడి రాజకీయ నిర్బంధశ్రోతలు బలవంతంగా విరగబడి నవ్వవలసివచ్చింది.

'థాంక్స్, ముఖ్యమంత్రిజీ' రంజన్ చౌదరితో అన్నాడు. 'మీ చూడచక్కని నగరంలో ఎంతో హాయిగా గడిపాను; ఎంతో సద్వినియోగమూ అయింది, హాంజీ...'

'ఎంతమాట, రంజన్‌జీ,' చౌదరి కూజిత స్వరంతో అన్నాడు. 'ఆనందమంతా మాది...'

'నా కర్థం కావడంలేదూ... నమ్మ శక్యంకాని ఇంత శక్తిని మీరెక్కడ దాచుకున్నారు,' ప్రమోద్ రాయ్ వెంటనే అందుకుంటూ అన్నాడు. 'మీరు గమనించారాసార్? వచ్చినప్పటినుంచి గడియారంలా పనిచేస్తూనే ఉన్నారు. మాలాంటి యువకుల్ని సిగ్గుతో చితికిపోయేలా చేశారు. విశ్రాంతి తీసుకోడానికి కాస్తంత వ్యవధైనామీకు ఉంటుందా అని?'

'దాన్దేముంది, నా పనే నాకు విశ్రాంతి' రంజన్ వినయం ఒలకబోస్తూ అన్నాడు.

'లేడీస్ అండ్ జెంటిల్మెన్, యువర్ అటెన్షన్ ప్లీజ్... ఇండియన్ ఎయిర్‌లైన్స్ ఎనౌన్సెస్ ది డిపార్చర్ ఆఫ్...' అంటూ ఎనౌన్స్‌మెంట్ మొదలుకాగానే గాంధీ టోపీలు ధరించిన పటాలం విమానం ఉన్న దిశగా ముందుకు కదిలింది. అంతలో హఠాత్తుగా పుట్టుకొచ్చిన అలలా అక్కడ ఒకింతసంచలనం సంభవించింది. నెమ్మదిగా కదులుతున్న కిక్కిరిసిన ట్రాఫిక్‌లోకి ఏదైనా ఒక వాహనం వేగంగా దూసుకొచ్చినప్పుడు కనిపించే విలక్షణమైన కదలిక అది. ముఖ్యమంత్రి చౌదరి వ్యక్తిగతభద్రతా సిబ్బందిలోని ఓ పోలీస్ అధికారి, చివరినిముషంలో అడుగు పెట్టేవారిలా పరుగు పరుగున అక్కడికి వచ్చాడు. అయితే ఆ పరుగులో ఒక పన్నాగం, ఆ తొందరలో ఒక సమయస్ఫూర్తి ఉట్టిపడుతున్నాయి. గుంపులోంచి సునాయా సంగా సాఫీగా ముందుకు చొచ్చుకువచ్చేశాడు కానీ, దాదాపు సూట్‌కేస్ సైజులో ఉన్న పెద్ద బ్రీఫ్‌కేసును ఎంతోమంది మోకాళ్ళకూ, తొడలకూ తాటించక తప్పలేదతనికి. నునుసిగ్గు దొంతరలు మొహంలో స్పష్టంగా కనిపిస్తుండగా, వినబడేలా వగరుస్తూ ఎట్టకేలకు రంజన్‌బాబును సమీపించి ఆయాస పడుతూ అన్నాడు. 'సారీసార్, హోటల్లో మీ బ్రీఫ్‌కేసును మరచిపోయారు. థాంక్‌గాడ్, సమయానికి మీవస్తువును మీ కందించగలిగాను..'

క్షణకాలంపాటు రంజన్‌బాబు ఆ బ్రీఫ్‌కేసువైపు శూన్యదృక్కులతో చూశాడు. వెనువెంటనే దానిని గుర్తుపట్టాడు. ఎందుకు గుర్తుపట్టడు! ఎంతైనా అది తనదేగా మరి!

'ఓహ్! హాంజీ, థాంక్యూ... థాంక్యూ!' అన్నాడు. అతడిగొంతు మోతాదుమించి బిగ్గరగా వినిపించింది. రంజన్‌బాబు తన మతిమరుపు గురించి అతికష్టంమీద వివరీకరిస్తుంటే వేలాది చూపులు ఆ బ్రీఫ్ కేసుకు అతుక్కుపోయాయి. ఆ ఆఫీసర్ దానిని అత్యంతభద్రంగా —టైమ్ బాంబును తలపింపజేసేలా —విమానంలో రంజన్ సీటు దగ్గరకు మోసు కెళ్ళాడు. కొన్ని నిమిషాల్లో రంజన్ నిచ్చెన పైమెట్టుకు చేరుకుని అభిమానులకు చేయిఊపుతూ, నమస్తే భంగిమను ప్రదర్శిస్తూ, తనవేళ్ళకు ఉన్న వజ్రపుటుంగరాలు మరోసారి ఉదయసూర్యుడి కిరణాలుపడి మెరిసిపోతుండగా తృప్తి చెందిన దేవతలా వెలిగిపోయాడు.

# 46

ఒకేపేరు కలిగిన రెండుపార్టీలు ఒకేసారి రాజకీయరంగస్థలిమీద ప్రత్యక్షమయ్యాయి. ఎనిమిది దశాబ్దాల పోరాటమూ, త్యాగమూ, ప్రజాదరణల వల్ల పోగుబడిన 'సత్కీర్తి'ని (గుడ్ విల్) వదులుకోడానికి రెండింటిలో ఏదీ సిద్ధంగా లేదు. అయితే అదాఇదా అన్నది తేల్చుకోవలసినప్పుడు, దేశమంతా ఆమోదించిన వ్యక్తి నాయకత్వం వహిస్తున్న పార్టీయే అసలైన పార్టీ అన్న ముద్ర వేయించుకోవడం సహజం. ప్రత్యేకించి ఇందిరాగాంధీకి కచ్చితంగా అనుకూలించే అంశమిదే. రెండోపార్టీకి అటువంటి తురుపు ముక్క లేదు.

సరిగ్గా అదేకారణంతో ఇందిరాగాంధి వెంటఉండే మందీమార్బలం క్రమంగా అమాంబాపతు జనాలతో నిండిపోతూ వచ్చింది. వేర్వేరు ప్రయోజనాలు, ఒక్కోసారి పరస్పరవిరుద్ధ ప్రయోజనాలు కలిగి దిగ్భ్రమగొలిపేలా ఉన్న నానాగోత్రాల వాళ్లు ఆమెచుట్టూ చేరిపోయారు.

ఆమె పార్టీకిఘనవిజయం కలిగిన తొలిఉరవడిలో ఆమె అనుచరుల అసలు గుణగణాలు చాలావరకూ సోదిలోకి రాకుండానే ఉండిపోయాయి. పార్టీలో ప్రతిఫలిస్తున్న సైద్ధాంతిక అనేకత్వాన్ని విశ్లేషించడానికి అది తగిన సమయం కాదనుకున్నారు. సుస్థిరత్వమే ఆ క్షణంలో కొట్టొచ్చినట్టు కనిపించిన అవసరం. దేశాన్ని నిరాఘాటంగా ఏలడానికి ఆమె లోక్‌సభలో మెజారిటీ సాధించవలసిందే. మిగిలినవన్నీ రెండో శ్రేణికి చెందిన విషయాలు... ఈ అవసరం అక్షరాలా అమాంబాపతు జనాల నిర్నిరోధ ప్రవేశానికి పార్టీ తలుపుల్ని బార్లా తెరచింది. మహేంద్రనాథ్, చౌదరి, ఆనంద్, శేఖర్, అరుణ, రెహమాన్‌ఖాన్, సంత్‌రామ్ శాసనసభల లోపలా బయటా ఉన్న ఇంకా మరెందరో ఆమె ఛత్రచ్ఛాయలోనే ఉన్నట్టు పరిగణింపబడ్డారు. తమలోతాము రాజీకి అవకాశమివ్వకుండా ఎంతగా ఘర్షణపడుతున్నా, వీళ్లలో ఏ ఒక్కరూ అవతలి పార్టీవైపు అడుగువేయలేదు. భూస్వాములు, కౌలుదార్లు, పెట్టుబడిదారులు, కార్మికులు, మహారాజాలు, నిష్ఠదరిద్రులు, బిచ్చగాళ్ళు, మహిళలు, బలహీన వర్గాల వాళ్లు, వాళ్లను దోచుకునే వాళ్లతో సహా అన్నివర్గాలవాళ్లు ఇందిరాగాంధీని అనుసరించారు. లేదా అలా చెప్పుకున్నారు. మరే పార్టీకి లేనంత నిశిత సైద్ధాంతిక నిబద్ధత తనకున్నట్టు చెప్పుకునే పార్టీ ఇటువంటి మితిమీరిన వలసకు ఎలా సమ్మతించిందో వివరించిన వాళ్లు ఒక్కరూ లేకపోయారు. అరకొర వివరణలైతే అసంఖ్యాకంగానే ఉన్నాయి. అయితే అవన్నీ అస్పష్టంగానూ, సమాధానపరచలేనివిగానూ

మిగిలిపోయాయి. ఇందిరాగాంధీ అన్నిరకాల స్వార్థా లకు కూడలిగా మారారన్నది ఒక్కటే స్పష్టంగా పైకితేలిన వాస్తవం.

'ఏదో ఒకవైపు నిర్ణయం ఎందుకు తీసుకోరు?' రంజన్‌బాబు రాష్ట్ర రాజధానిని సందర్శించి వెళ్లిన కొన్నిరోజులతర్వాత చౌదరిని ఆనంద్ అడిగాడు. 'రాష్ట్రపతి ఎన్నిక రోజుల్లోకివచ్చింది, అయినా మీరింకా ఊగిసలాడుతూనే ఉన్నారు. ఇది నే నంటున్నమాటకాదు, ఎన్నో పత్రికలు రాస్తున్నాయి...'

'ఇప్పుడు ముందువెనకలు చూసుకోకపోతే, వెళ్లి వెళ్లి గోతిలో పడతాను' చౌదరి తటాలున అన్నాడు పళ్లునూరుతూ. 'ఈ రంజన్‌గాడు కచ్చితంగా నాకు వ్యతిరేకంగా మోసే ఉంటాడు'

'అంతపెద్ద బ్రీఫ్‌కేసును వెంటతీసుకుని వెళ్లినాకూడా?' ఆనంద్ ఆశ్చర్యంగా అడిగాడు.

'వాడి దగ్గరికి ఇంకెన్ని బ్రీఫ్‌కేసులు వెళ్లాయో ఎవరికి తెలుసు? ఒకదానికొకటి సరి... అయినా నాకు వ్యతిరేకంగా చెప్పేఉంటాడని నా ఉద్దేశం. కనుక ఇందిరాగాంధి నన్ను నమ్మదు, తన అభ్యర్థికి నేను మద్దతు ఇచ్చినాసరే. మొరార్జీ వర్గంకూడా నేను తమను సమర్థిస్తానని అనుకోదు; నాకంటె మహేంద్రనాధ్ ఎక్కువ నమ్మకస్తుడనుకుంటుంది. ఏంచేయాలో తోచడంలేదు...'

'ఏమీ చేయకుండా కూర్చుంటే మాత్రం ఏమవుతుంది?' ఆనంద్ కలవరపడుతూ అన్నాడు. చౌదరిని ఇందిరాగాంధీ శిబిరంవైపు నడిపించాలన్న అతడి ఆతృత తెలిసిపోతూనే ఉంది. అయినా చౌదరి కాలు కదిపేది లేదని మొండికేసి కూర్చున్నాడు. 'నీ ఆలోచనేమిటో నాకు తెలుసు. మహేంద్రనాథ్ ఏంచేయబోతున్నాడో తెలిస్తేకానీ నేను అంగుళం కూడా కదలను.'

'అంటే, ఆయన ఒక పక్షం వహించాడని తెలిస్తే, మీరు రెండోపక్షంలో చేరుతారా...'

'కచ్చితంగా అంతే. అతడున్న వైపు నేను ససేమిరా ఉండను. నా కొకప్పుడు బాస్ కనుక అక్కడ అతడే సీనియర్ అవుతాడు. నేను రెండోతరగతి పౌరుణ్ణవుతాను. ఏం? నేను అన్యాయంగా మాట్లాడుతున్నానంటావా?'

'ఎంతమాత్రం కాదు' ఆనంద్ ఒప్పుకున్నాడు. 'అయితే మహేంద్రనాథ్ ఎత్తుగడల్ని మీరెలా కనిపెట్టగలరు? అతడూ మీ అంత తెలివిగానే గుంభనంగా ఉంటున్నాడు కదా?'

'ఇక్కడే నా కేబినెట్‌లోని బృహస్పతి తన బుద్ధిని ఉపయోగించాలి' చౌదరి మధ్యలో తుంచుతూ అన్నాడు. 'చూడు, మైడియర్ మేధావీ, రంజన్‌బాబు తలనొప్పి నేను నీకు అంటించలేదు, అతడి విషయం శేఖర్ చూసుకున్నాడు. మన ఎంఎల్ఏలు నేనాశించినట్టు కావలసినంత గంద్రగోళం సృష్టిస్తూ ఎన్నిక విషయంలో ఇప్పటికే బిజీబిజీగా పనిచేస్తున్నారు. ఇప్పుడు కావలసింది, కచ్చితమైన నిర్ణయానికి దారితీయించే విలువైన సమాచారం. అర్థమైందా?'

'అయింది', ఆనంద్ పొడిపొడిగా అన్నాడు.

'నీ కప్పగించిన పనిని ఎలా నిర్వర్తించాలని మాత్రం నన్నడగద్దు... అర్థమైందా?' చౌదరి ఉగ్రంగా అన్నాడు.

'అర్థమైంది', ఆనంద్ తెచ్చిపెట్టుకున్న బెదురుతో అన్నాడు. 'అర్థం చేసుకోవలసినవి ఇంకేమైనా ఉన్నాయా?'

'ఉన్నాయి, ఉన్నాయి', చౌదరి కొనసాగించాడు. 'అన్నింటికంటె ముఖ్యమైంది సమయ పరిమితి. ఇప్పటినుంచి నీకు నలభైఎనిమిది గంటల గడువు ఇస్తున్నాను. పని పూర్తిచేయలేక పోయావో, అటోఇటో నిర్ణయించుకోమని నాకు సలహాఇచ్చే హక్కును కోల్పోతావు'

'అర్థమైంది', ఆనంద్ ముక్తసరిగా అన్నాడు.

అయితే అర్థమైనంత మాత్రాన సరిపోదు. మహేంద్రనాథ్, చౌదరి తమతమ చర్మాలను కాపాడుకోడానికి మొరార్జీదేశాయ్‌నీ, ఇందిరాగాంధీని కూడా కొల్లగొట్టడానికి సమకట్టిన యుద్ధమిది. కనుక సహజంగానే తమ పథకాలనూ, ఎత్తులనూ అత్యంత రహస్యంగానే ఉంచుతారు. ఈ పరిస్థితిలో ఫలానాక్షణంలో ఒకరికి వ్యతిరేకంగా మరొకరు ఎటువంటి ఎత్తులు వేస్తున్నారో తెలుసుకోవడం ఎలా? ఆనంద్ గాఢచింతనలో మునిగిపోయి ఇంటికి తిరిగివచ్చాడు.

కొద్దిక్షణాల్లోనే ప్రైవేట్ సెక్రటరీ ఇంటర్‌కామ్‌లో చెప్పాడు, 'ఎంఎల్ఏ ప్రమోద్‌రాయ్ మీతో మాట్లాడాలంటున్నారు సార్.'

ఆనంద్ లిప్తకాలంపాటు తెల్లబోయి, సరే అన్నాడు.

'ఆనంద్‌గారూ, కొద్దిసేపు మీతో మాట్లాడాలి. రావచ్చా?' ప్రమోద్ అడిగాడు, ఏ భావమూ ద్యోతకం కాని గొంతుతో.

'తప్పకుండా రా, ప్రమోద్', ఆనంద్ అన్నాడు. 'ఇంతకీ విషయమేమిటి?'

'రేపు నా నియోజకవర్గంలో ఒక ముఖ్యమైన కార్యక్రమం ఉంది. దానికి ప్రారంభోత్సవం చేయడానికి ఒప్పుకున్న కేంద్రమంత్రి హఠాత్తుగా జబ్బుచేసి రాలేకపోతున్నాడు. మీరు నన్ను ఆదుకోగలరనిపించి...'

'ఓ.కే', ఆనంద్ క్షణకాలం ఆగి అన్నాడు. 'వెంటనే రా. నేనేం చేయగలనో చూద్దాం'.

అయితే ప్రమోద్‌రాయ్ ఆనంద్‌కి చెప్పింది పూర్తినిజం కాదు. కేంద్రమంత్రి నిరాకరించిన తర్వాత, ఒకరోజు రోజంతా అతడు శేఖర్‌తోసహా ముగ్గురుమంత్రుల్ని ఒప్పించడానికి ప్రయత్నించాడు. వాళ్లందరూ తిరస్కరించారు. అందుకు రకరకాల కారణాలు చెప్పారుకానీ, అసలు కారణమల్లా, మహేంద్రనాథ్ ప్రథమ అనుచరుడితో ఆ క్షణాన రాసుకుతిరగడం ఇష్టం లేకపోవడమే. శేఖర్ ఒకవైపున తన నిస్సహాయతను వ్యక్తంచేస్తూనే మరోవైపున అతడి (ప్రమోద్) అభ్యర్థనను అంగీకరించగల మంత్రి 'బహుశా' ఆనంద్ ఒక్కడేనని సూచనగా అన్నాడు; తన సలహాలో విశ్వసనీయతను చొప్పించడానికి, యధాలాపసూచనగా కనిపింపజేయడానికీ, 'బహుశా' అనేమాటను తగినంతగా ఒత్తిపలికాడు.

ప్రమోద్‌రాయ్ మంత్రుల నివాసాలకు తరచు వెళ్లేమనిషి కాదు. కయ్యానికి కాలుదువ్వే అసమ్మతివాది, రాష్ట్రంలో మహేంద్రనాథ్ గ్రూపు ప్రయోజనాల కోసం పనిచేస్తూ ఉంటాడు.

చౌదరినుంచి తీవ్రప్రతిఘటన ఎదురైనాసరే మహేంద్రనాథ్ లెక్కలేనన్ని పావులు కదిపి ఇటీవలి ఉపఎన్నికలో ప్రమోద్‌కి పార్టీ టిక్కెట్టు ఇప్పించాడు. ఆతర్వాత అతణ్ణి గెలిపించడానికి తన ఆర్థిక, రాజకీయ బలగాలన్నింటినీ ముందుండి నడిపించాడు. తనకు ముఖ్యమంత్రి చౌదరి 'ఆశీస్సులు నిండుగా ఉన్నట్టు' చెప్పుకున్న స్వతంత్ర అభ్యర్థిపై ప్రమోద్ ఎలాగో పంటిబిగువున విజయం సాధించాడు... ఆ అభ్యర్థి జిల్లా యంత్రాంగం నుంచి లోపాయికారీ మద్దతును దండిగా అందుకున్నాడు, ముఖ్యమంత్రి 'ఆశీస్సులు' ఆ రూపంలో ప్రతిఫలించాయి. మహేంద్రనాథ్ దీనిపై అధిష్ఠానవర్గానికి గట్టిగా ఫిర్యాదు చేశాడు; చౌదరి నిర్ద్వంద్వంగా ఆరోపణను తిరస్కరించాడు. యధావిధిగా, అంతకుమించి ఏమీ జరగలేదు.

తమపార్టీ తరఫున పోటీచేసే ప్రతి అభ్యర్థి రెండురకాల ప్రత్యర్థుల్ని ఎదుర్కోవలసి వస్తుందని అధికారపక్షంలో ఓ సార్వత్రిక విశ్వాసం. అందులో ఒకరు వేరేపార్టీ అభ్యర్థి అవుతాడు, అది మామూలే. రెండోవ్యక్తి, అదే పార్టీలోని అసమ్మతివాది అవుతాడు. అదృశ్యంగా ఉంటూనే మరింత ఎక్కువ నష్టం కలిగిస్తాడు. ఈ ఇరువురిపై విజయం సాధించిన అభ్యర్థి నిజంగా గొప్ప ఆధారస్తంభం; లేకపోతే ఎందుకూ కొరగానివాడు... ప్రమోద్‌రాయ్ ఎన్నికయ్యాడు. అతనిని సత్కరించడానికి ఏర్పాటైన బహిరంగసభకు చౌదరి టంచన్‌గా అధ్యక్షత వహించాడు. ఎన్నికలో తనకు 'అమూల్య'మైన మద్దత్తు అందించినందుకు ప్రమోద్‌రాయ్ చౌదరికి ఎనలేని కృతజ్ఞతలు సమర్పించాడు. ఆత్మవంచన ఉట్టిపడే ఈ ఘట్టాన్ని తిలకించిన ప్రేక్షకులు తీవ్రదిగ్భ్రాంతిలో మునిగిపోయారు.

రాష్ట్రంలో చెదిరిపోయిన మహేంద్రనాథ్ బలగాలను కూడదీసి చౌదరిని ప్రత్యంగుళం ఢీకొనడంలో ప్రమోద్ ఒక్క క్షణం కూడా వృథా చేయలేదు. వీలైన ప్రతి సందర్భంలో మంత్రుల్ని దుయ్యబడుతూ ఎద్దేవా చేశాడు. మహేంద్రనాథ్ ముఖ్యమంత్రిత్వంనుంచి తప్పుకున్నప్పటి నుంచి రాష్ట్రం కుక్కలు చింపిన విస్తరి అయిందని సూచించే లెక్కలేనన్ని అన్యాపదేశవ్యాఖ్యలు గుప్పిస్తూ వచ్చాడు. ఈ స్థితిలోనే రాష్ట్రం ఇకముందుకూడా ఉండడం ఖాయమని, ఎప్పుడూ గురితప్పని జ్యోతిష్కుడు చెప్పినంత ఘంటాపథంగా అంటూ వచ్చాడు.

పార్టీ పునాదుల్ని పెళ్ళగించడానికా అన్నట్టు సిద్ధమైన ఈ నీతిమాలిన నడమంత్రపు మనిషిని చూసి చౌదరి ఆగ్రహంతో మండిపోయాడు. 'అధికార పక్ష ప్రయోజనాల పరిరక్షణ' కోసమేనన్న ఉద్ఘాటనను కవచంలా వాడుకుంటూనే చేటుతెచ్చే విమర్శలతో, ములుకుల్లాంటి వ్యంగ్యోక్తులతో ప్రమోద్ ప్రభుత్వానికి తలవంపులు తెచ్చాడు. అనతికాలంలోనే ఆ సామర్థ్యంలో అతడు పలువురు ప్రతిపక్ష నాయకులనే మించిపోయాడు. ప్రభుత్వయంత్రాంగంలో రహస్య లావాదేవీలు అతడికి పరంపరగా కనబడుతూ వచ్చాయి. అధికారులనుంచి సంపాదించిన పత్రాల ఫొటోస్టాట్ నకళ్ళు, రిఫరెన్సులతో సహా సంబంధిత వివరాలనన్నింటినీ పత్రికలకు అందించడమో శాసనసభ దృష్టికి తీసుకురావడమో చేశాడు. అవినీతికి తగిన రుజువులు చేజిక్కించుకోవడంలో తను విఫలమైన-అరుదైన సందర్భాలలో కూడా, తన అభియోగాలకు లక్ష్యమైన వ్యక్తులపై పదిమందిలో అనుమానాలు రేకెత్తేవరకూ నానా అల్లరీ సాగించాడు.

అయితే అతడికి కొంచెమైనా సందివ్వని ఇద్దరే ఇద్దరుమంత్రులు శేఖర్, ఆనంద్. వాళ్ళ శాఖలు సమర్థమార్గదర్శనంలో బయటినుంచి దాడికి ఏమాత్రం అవకాశమివ్వనంత పకడ్బందీగా పని చేస్తున్నాయి.

ఇద్దరిమధ్య తేడాను కూడా ప్రమోద్ వెంటనే పట్టుకోగలిగాడు. శేఖర్, రాజకీయ రీతిరివాజులకోణంనుంచిచూసినా అనవసరమనిపించేంత దుర్మార్గంగా వ్యవహరిస్తూ ఉంటాడు. అతడిలోని విధ్వంసబుద్ధి సాధారణరాజకీయ స్వార్థప్రేరణను మించిన ఏవో లోతుల్లోంచి తన్నుకొస్తున్నదా అనిపిస్తూ ఉంటుంది; నిజానికి ఒకరకంగా అదీ స్వార్థరహితమేకానీ ప్రజా శ్రేయస్సుకు పనికొచ్చేదికాదు. సామర్థ్యమూ, ప్రమాదకరప్రవృత్తీ, కలగలిసిన కుట్రబుద్ధికి ఓ విలక్షణమైన, బహుశా విషాదకరమైన మచ్చుతునకగా ప్రమోద్ అతణ్ణి అర్థం చేసుకున్నాడు. అతడికి తగినంత దూరంలో ఉంటూ తటస్థసంబంధాలే కొనసాగిస్తూ వచ్చాడు.

ఇక ఆనంద్, ప్రమోద్ దృష్టికి ఒక చిక్కుముడిలానూ, తెరచిన పుస్తకంలానూ కూడా కనిపిస్తాడు. శాసనసభలో ప్రమోద్ అతడిపై దాడిచేయడానికి కొన్నిసార్లు ప్రయత్నించాడు కానీ, ఆనంద్ హాస్యంమేళవించిన తక్షణ సమాధానాలతో అతడి ప్రశ్నల్ని అప్పటికప్పుడే తుత్తునియలు చేశాడు. ఆనంద్‌తో మాట్లాడడం తేలికేగానీ అతణ్ణి సమాధానపరచడం కష్టమని ప్రమోద్ అర్థం చేసుకున్నాడు. ఆనంద్‌ను ఏ ముఠా గూట్లో ఇరికించాలో అతడికి బోధపడలేదు; ముఠాచట్రంలో బొత్తిగా ఇమడనిమనిషిగా కనిపించాడు. అతడు ఇందిరాగాంధీ వెనుక దృఢంగా నిలబడ్డవాడేకానీ, అతడి విధేయత ఒకపట్టాన అంతుబట్టేదికాదు. ఇందిరాగాంధీకి, పార్టీకి సంబంధం చాలామంది చెబుతున్నదానికంటె భిన్నమైనదన్న ఆనంద్ వ్యాఖ్య తరచు అతడి చెవినపడుతూనే ఉంది. ఆనంద్ దృష్టిలో ఇందిరాగాంధీ ఒక వ్యక్తికాదు, పార్టీకి ప్రతీక. అలా అనడం వెంట్రుకను రెండుగా చీల్చేప్రయత్నంగా ప్రమోద్ భావించాడు. వందిమాగధులు ఆపాదిస్తున్న మహారాణి పాత్రనుంచి, అనువంశికతాకోణం నుంచి ఆనంద్ ఆమెను కాపాడే ప్రయత్నం చేస్తున్నాడని ప్రమోద్ అభిప్రాయం. శతాబ్దాలుగా రాచరికం సాంఘికార్థికవ్యవస్థకు పునాదిరాయిగా ఉంటున్న దేశంలో ఇందిరాగాంధీని నూతనమహారాజ్ఞిగా చిత్రించే యత్నంచేయడంలో ఆశ్చర్యమేమీలేదు. అవకాశవాద, స్వప్రయోజనపరులు హ్రస్వదృష్టితో ఆమెనో విగ్రహంగా మార్చి ఆరాధించడాన్ని వ్యతిరేకిస్తూ ఆనంద్ సాగిస్తున్న పోరాటాన్ని ప్రమోద్ అభినందిస్తున్నా, రాష్ట్రపతి ఎన్నిక విషయంలో ఇందిరాగాంధీ చిత్తశుద్ధితోనే వ్యవహరించినట్టు తనను తను సమాధానపరచుకోలేకపోయాడు. ఆ తండ్రికి కూతురుగానో, అధికారాన్ని అన్యాయంగా చేజిక్కించుకున్న రాజకీయవాదిగానో, అతీతశక్తులు కలిగిన మనిషిగా లేదా అసాధారణ వ్యక్తిగానో కాకుండా లోపాలతో సహా ఆమెను ఆమెగా చిత్రించినందువల్లనే దేశం మరింత లాభపడుతుందన్న ఆనంద్ ఉద్ఘాటనతో మాత్రం ప్రమోద్ ఏకీభవించాడు.

చౌదరి విషయంలో ప్రమోద్ పూర్తిగా వాస్తవికమైన అంచనాకు రాగలిగాడు. అతడు మొదలూ, చివరా కూడా రాజకీయవాదే. తాను ఇష్టపడినంత కాలం ముఖ్యమంత్రి పదవిలో ఉండడం, పార్టీలోపలా బయటా ఉన్న ప్రత్యర్థులను కడతేర్చడం అతడి అభిమతం. పైకి మాత్రం చౌదరి

తేనెకురిపిస్తాడు. అందులో ఏమాత్రం ఆశ్చర్యపోవలసింది లేదనుకున్నాడు ప్రమోద్. తను కూడా ఏదో ఒకరోజున చౌదరికి విశ్వాసపాత్రుడు అయినా కావచ్చునని అతడికి తెలుసు. పాత్రలు మారతాయని తెలియనివాడేమీ కాదతను.

భవిష్యత్తు ఎలా ఉండబోతున్నా ప్రస్తుతానికి ప్రమోద్ రాష్ట్రంలో మహేంద్రనాథ్ ప్రయోజనాలు పరిరక్షించవలసిన మనిషి. ఆ పాత్రకు తను ఇష్టపడుతున్నాడా లేదా అన్న ఆలోచనకు అతడెప్పుడూ పూనుకోలేదు. కేవలం మహేంద్రనాథ్ మద్దత్తుతో, పోషణతో ఉపఎన్నిక ద్వారా తొలిసారి రంగప్రవేశంచేసిన ఒక అనామకుడైన జూనియర్ శాసనసభ్యుడుగా తనలాంటి ఆలోచన చేయకూడదని అతడికి తెలుసు. మహేంద్రనాథ్ జెండాను నిటారుగా నిలబెట్టడానికి అత్యుత్తమమైనదైనా, అతి హీనమైనదైనా, ఏదైనా తను చేయవలసిందే... అతడు చౌదరిని కలుసుకున్న సందర్భాలు చాలా తక్కువ. చౌదరి తన్ను ఆదరించడని అతడికి తెలుసు. అదీగాక, యధాలాపంగా కలుసుకున్నా అనేకమంది నోళ్ళు నొక్కుకుంటారనీ అతడికి తెలుసు. ఎం.ఎల్.ఏ. అనే ఈగలను గుంజుకోవడంలో చౌదరి అపారమైన శక్తియుక్తులు కలిగిన సాలీడులాంటివాడని, అతడెలాగైనా ప్రమోద్‌ను తన గూట్లోకి ఆకర్షించగలడని వాళ్ళు అంటారు. మరోవైపున మహేంద్రనాథ్‌లోని అనుమాన ప్రవృత్తీ, ఆగ్రహోద్ధృతీ కూడా అంతే అపరిమితంగానూ, భయం గొలిపేవిగానూ ఉంటాయి... కనుక, భర్త మినహా మరో మగవాణ్ణి కన్నెత్తి చూడడానికి కూడా వీలులేని శీలవతి అయిన హిందూగృహిణిలా ఉండడమే మంచిదని ప్రమోద్ నిశ్చయించుకున్నాడు. వీసమెత్తు వంక పెట్టడానికి వీలులేని పతివ్రతలా ఉండదల్చుకున్నాడు.

అయితే ప్రమోద్ ఒక కర్తవ్యాన్ని నెరవేర్చవలసినవాడు. మహేంద్రనాథ్ పట్ల కేవలం తన పాతివ్రత్యాన్ని రుజువుచేసుకోవడం కోసమని పరదా చాటున కూర్చోలేడు. రాష్ట్రపతి ఎన్నికలో మహేంద్రనాథ్ అభ్యర్థికి గట్టిమద్దత్తును సమీకరించడం విధేయుడుగా తన కర్తవ్యం. ఇంతకీ ఆ అభ్యర్థి ఎవరు? చౌదరి మద్దత్తు ఇచ్చే అభ్యర్థికాక ఆవతలి అభ్యర్థి అన్నది తప్ప నిజానికి అతడెవరో ప్రమోద్‌కీ తెలియదు. చౌదరిఅభ్యర్థి ఎవరు? మహేంద్రనాథ్ మద్దత్తు ఇచ్చే అభ్యర్థికాక అవతలి అభ్యర్థి. అలా ఎవరికివారు, ఎవరిఅభ్యర్థి ఎవరన్న ఊహాగానంలో మునిగిపోయారు. మొత్తంమీద రాజకీయముష్టియుద్ధానికి ఇది చక్కని ఉదాహరణ.

మహేంద్రనాథ్, చౌదరి విధేయతలు ఎటు మొగ్గుతున్నాయనే విషయంలో ప్రమోద్‌కీ తన అనుమానాలు తనకున్నాయి కానీ వాటిని బయట పెట్టలేడు, పెట్టకూడదు కూడా. అయినా తనకంటూ ఏవో స్ఫురణలు కలిగాయికనుక ఏ మార్గంలో వీలైతే ఆ మార్గంలో వాటి నిజానిజాలను నిర్ధారించుకుని నాయకుడికి తెలియజేయవచ్చు. ఆ క్రమంలో ఆనంద్ ఉపయోగపడతాడనిపించింది.

ఎంతో అయిష్టంగానే ప్రైవేట్ సెక్రటరీ తనను ఆనంద్ డ్రాయింగ్ రూంలోకి తీసుకువెడుతుండగా, రెండు ప్రయోజనాలను ఆశించి ఇంతకుముందు టెలిఫోన్‌లో తను ఆనంద్‌కు ఆహ్వానం అందించిన సంగతిని ప్రమోద్ గుర్తు చేసుకున్నాడు; మొదటిది బహిరంగ కార్యక్రమం, రెండోది సాధ్యమైతే ఆనంద్ ఆలోచనాసరళి ఎలా ఉందో తెలుసుకోవడం. ఆనంద్ ఏవైనా క్లూలు

అయితే అతడికి కొంచెమైనా సందివ్వని ఇద్దరే ఇద్దరుమంత్రులు శేఖర్, ఆనంద్. వాళ్ళ శాఖలు సమర్థమార్గదర్శనంలో బయటినుంచి దాడికి ఏమాత్రం అవకాశమివ్వనంత పకడ్బందీగా పని చేస్తున్నాయి.

ఇద్దరిమధ్య తేడాను కూడా ప్రమోద్ వెంటనే పట్టుకోగలిగాడు. శేఖర్, రాజకీయ రీతిరివాజులకోణంనుంచిచూసినా అనవసరమనిపించేంత దుర్మార్గంగా వ్యవహరిస్తూ ఉంటాడు. అతడిలోని విధ్వంసబుద్ధి సాధారణరాజకీయ స్వార్థప్రేరణను మించిన ఏవో లోతుల్లోంచి తన్నుకొస్తున్నదా అనిపిస్తూ ఉంటుంది; నిజానికి ఒకరకంగా అదీ స్వార్థరహితమేకానీ ప్రజా శ్రేయస్సుకు పనికొచ్చేదికాదు. సామర్థ్యమూ, ప్రమాదకరప్రవృత్తీ, కలగలిసిన కుట్రబుద్ధికి ఓ విలక్షణమైన, బహుశా విషాదకరమైన మచ్చుతునకగా ప్రమోద్ అతణ్ణి అర్థం చేసుకున్నాడు. అతడికి తగినంత దూరంలో ఉంటూ తటస్థసంబంధాలే కొనసాగిస్తూ వచ్చాడు.

ఇక ఆనంద్, ప్రమోద్ దృష్టికి ఒక చిక్కుముడిలానూ, తెరచిన పుస్తకంలానూ కూడా కనిపిస్తాడు. శాసనసభలో ప్రమోద్ అతడిపై దాడిచేయడానికి కొన్నిసార్లు ప్రయత్నించాడు కానీ, ఆనంద్ హాస్యంమేళవించిన తక్షణ సమాధానాలతో అతడి ప్రశ్నల్ని అప్పటికప్పుడే తుత్తునియలు చేశాడు. ఆనంద్‌తో మాట్లాడడం తేలికేగానీ అతణ్ణి సమాధానపరచడం కష్టమని ప్రమోద్ అర్థం చేసుకున్నాడు. ఆనంద్‌ను ఏ ముఠా గూట్లో ఇరికించాలో అతడికి బోధపడలేదు; ముఠాచట్రంలో బొత్తిగా ఇమడనిమనిషిగా కనిపించాడు. అతడు ఇందిరాగాంధీ వెనుక దృఢంగా నిలబడ్డవాడేకానీ, అతడి విధేయత ఒకపట్టాన అంతుబట్టేదికాదు. ఇందిరాగాంధీకి, పార్టీకి సంబంధం చాలామంది చెబుతున్నదానికంటె భిన్నమైనదన్న ఆనంద్ వ్యాఖ్య తరచు అతడి చెవినపడుతూనే ఉంది. ఆనంద్ దృష్టిలో ఇందిరాగాంధీ ఒక వ్యక్తికాదు, పార్టీకి ప్రతీక. అలా అనడం వెంట్రుకను రెండుగా చీల్చేప్రయత్నంగా ప్రమోద్ భావించాడు. వందిమాగధులు ఆపాదిస్తున్న మహారాణి పాత్రనుంచి, అనువంశికతాకోణం నుంచి ఆనంద్ ఆమెను కాపాడే ప్రయత్నం చేస్తున్నాడని ప్రమోద్ అభిప్రాయం. శతాబ్దాలుగా రాచరికం సాంఘికార్థికవ్యవస్థకు పునాదిరాయిగా ఉంటున్న దేశంలో ఇందిరాగాంధీని నూతనమహారాజ్ఞిగా చిత్రించే యత్నంచేయడంలో ఆశ్చర్యమేమీలేదు. అవకాశవాద, స్వప్రయోజనపరులు హ్రస్వదృష్టితో ఆమెనో విగ్రహంగా మార్చి ఆరాధించడాన్ని వ్యతిరేకిస్తూ ఆనంద్ సాగిస్తున్న పోరాటాన్ని ప్రమోద్ అభినందిస్తున్నా, రాష్ట్రపతి ఎన్నిక విషయంలో ఇందిరాగాంధీ చిత్తశుద్ధితోనే వ్యవహరించినట్టు తనను తను సమాధానపరచుకోలేకపోయాడు. ఆ తండ్రికి కూతురుగానో, అధికారాన్ని అన్యాయంగా చేజిక్కించుకున్న రాజకీయవాదిగానో, అతీతశక్తులు కలిగిన మనిషిగా లేదా అసాధారణ వ్యక్తిగానో కాకుండా లోపాలతో సహా ఆమెను ఆమెగా చిత్రించినందువల్లనే దేశం మరింత లాభపడుతుందన్న ఆనంద్ ఉద్ఘాటనతో మాత్రం ప్రమోద్ ఏకీభవించాడు.

చౌదరి విషయంలో ప్రమోద్ పూర్తిగా వాస్తవికమైన అంచనాకు రాగలిగాడు. అతడు మొదలూ, చివరా కూడా రాజకీయవాదే. తాను ఇష్టపడినంత కాలం ముఖ్యమంత్రి పదవిలో ఉండడం, పార్టీలోపలా బయటా ఉన్న ప్రత్యర్థులను కడతేర్చడం అతడి అభిమతం. పైకి మాత్రం చౌదరి

నచ్చక. 'రేపు మీకు కార్యక్రమాలేవీ లేవుసార్', అయిష్టంగానే ఇంటర్‌కామ్‌లో చెప్పాడు. 'అయినా ఒకసారి ముఖ్యమంత్రిగారితో మాట్లాడితే మంచిదేమో. కొద్దిరోజులపాటు మంత్రులందరినీ హెడ్‌క్వార్టర్స్‌లోనే ఉండమని ఆయన చెప్పారు.'

'ఓ.కె. నే నాయనతో చెబుతాను. నా పర్యటనకార్యక్రమాన్ని జారీ చేయి. కలెక్టర్‌కి పోస్టులో కార్యక్రమవివరాల్ని పంపించడానికి వ్యవధిలేదు, ఫోన్ చేసి చెప్పు.'

'అలాగే సర్', దాచినా దాగని తన వ్యతిరేకతను బయటపెడుతున్నట్టు సెక్రటరీ అన్నాడు.

అతడి అభ్యంతరమూ సహేతుకమే. తన పర్యటన గురించి ఆనంద్ ఫోన్‌చేసి చెప్పగానే చౌదరి మండిపడ్డాడు.

'నీ టైము ఎందుకు వేస్ట్ చేసుకుంటున్నావో నాకర్థం కావడంలేదు.' అయిష్టంగా సణుగుతూ అన్నాడు. 'నేను నీకో పని అప్పగిస్తే, నువ్వేమో...'

'మీరు మరోమాట కూడా అన్నారు' ఆనంద్ అన్నాడు 'నా కప్పగించిన పనిని ఎలా నిర్వర్తించాలో నే నడగకూడదు, అవునా?'

'అవును, కానీ'

'అంటే దానర్థం, ఈ మధ్యలోనే నే నాపనిని ఎలా నిర్వర్తించబోతున్నానో మరెవరూ అడుగకూడదనేకదా!'

'అవునవును, అంతేననుకుంటా. సరేకానీ, అది నీ ఖర్మ', చౌదరి అర్థంతరంగా ఫోన్ పెట్టేశాడు.

ఇంతలోనే ఆ వార్త ఎలా వ్యాపించిందో తెలియదు, ప్రమోద్‌రాయ్ నియోజకవర్గాన్ని సందర్శించాలన్న ఆనంద్ తెలివి తక్కువ నిర్ణయం గురించి అప్పటికే కొంతమంది చౌదరికి ఫోన్‌చేసి వాకబు చేశారు. చాలా అప్రతిష్ఠ అన్నారు చాలామంది. పిచ్చెత్తినట్టుందన్నారు మరికొందరు. ఈ లెక్కన మనగ్రూపు మట్టికొట్టుకుపోతుందని ఉద్ఘాటించారు ఇంకా మరికొందరు. ప్రత్యేకించి శేఖర్ ఏదో కీడును సూచించే వ్యాఖ్య చేసేసరికి, సాధారణంగా ఆనంద్‌ను గురించి అతడు చేసే వ్యాఖ్యల్ని అంతగా పట్టించుకోని చౌదరి కూడా నిజంగా వణికిపోయాడు.

చివరకు, తమాయించుకోలేక ఆనంద్‌కి మరోసారి ఫోన్‌చేసి ఎటువంటి ఉపోద్ఘాతమూ లేకుండా అన్నాడు 'ఆ ప్రమోద్‌గాడితో పూసుకుతిరగడం సరైనదేనని నువ్వు నిజంగా అనుకుంటున్నావా? ఇప్పటికైనా మానుకోలేవా? నీ పర్యటనను ఆపించడానికి కేబినెట్ అత్యవసర సమావేశాన్ని ఏర్పాటు చేశాననుకో?'

దాదాపు రోజంతా ఓ ప్రబలశత్రువుతో కలిసి ప్రయాణం చేయడానికి అంత ఆకస్మికంగా తనెలా ఒప్పుకున్నాడో ఆనంద్‌కీ పూర్తిగా అంతుబట్టలేదు. ఇంతాజేసి, మాటల సందర్భంలో ప్రమోద్ అప్రయత్నంగా దొర్లించిన 'బొంబాయి... వాయిదా అసాధ్యం... చాలామంది వస్తున్నారు...' అనే మాటలలో అస్పష్టంగా మెరిసిన ఏదో స్ఫురణతో తను పనిచేస్తున్నాడు చివరకు అదంతా

కేవలం తన కల్పనాశక్తినుంచి పుట్టుకొచ్చిన ఊహగా పరిణమించినా పరిణమించవచ్చు. అయినాసరే, ఈ ఆధారాన్ని కూడా తను వదలుకున్నప్పుడు చౌదరి తనకు అప్పగించిన పరిశోధనను నిర్వర్తించడానికి మరే ఆధారం ఉంటుంది? ఇక చౌదరి ప్రశ్నకు ఇలా అన్నాడు, 'గతంలో నేను కేబినెట్ సమావేశాలకు గైరుహాజరైన సందర్భాలు లేవంటారా?'

'అవునవును, ఉన్నాయనుకుంటా. ఏమైనా నీతో వేగడం కష్టం.' చౌదరి రుసరుసలాడాడు. 'ఇందులో ఉన్న రిస్క్‌ను గుర్తు చేయడమే నా ఉద్దేశం'

'ముఖ్యమంత్రిగారూ' ఆనంద్ అడ్డు తగులుతూ అన్నాడు. 'నేను చేస్తున్నదేమిటో నాకు బాగా తెలుసు. మన ఒప్పందం ప్రకారం ఇంతకుమించి మీకు వివరించవలసిన అవసరం లేదు, అయినా వివరిస్తాను. రాష్ట్రపతి ఎన్నికలో మహేంద్రనాథ్ ఏం చేయబోతున్నాడో తెలుసుకోడానికి నాకు మీరు నలభైఎనిమిది గంటల వ్యవధి ఇచ్చారు. ఇంతలో, అదృష్టవశాత్తు, ఈ క్షణాన మహేంద్రనాథ్ బాగోగులు చూస్తున్న ఏకైక వ్యక్తితో నేను సంబంధం పెట్టుకోవడం జరిగింది. నా ఈ చర్యలో మీకు ఎటువంటి అర్థమూ కనిపించడంలేదా?'

'సరే, కనిపిస్తోంది, కానీ ఎంతవరకు'

'ఇందులో అన్నిరకాల ప్రమాదాలు ఇమిడి ఉన్నాయని నాకు తెలుసు' మరోసారి ఆనంద్ అడ్డుతగిలాడు. 'అయితే ఏమీ చేయకుండా ఏ ఫలితమూ సాధించలేం. నేను చేస్తున్నది బహుశా శేఖర్‌కి నచ్చదు. దానినిబట్టి నా దారి సరైనదేనన్న నమ్మకం స్ఫురిస్తోంది నాకు.'

'శేఖర్‌కీ దీనికీ ఏమీ సంబంధం లేదు,' చౌదరి బుకాయింపుగా అన్నాడు. 'నాకే హెచ్చరించాలనిపించింది, హెచ్చరించాను, అంతే'

'సరే, నన్నేం చేయమంటారు? నేనీ ప్రశ్న వేయకూడదని మీరే అన్నారు, అవునా కాదా? మళ్లీ వెనక్కి వెళ్లి సందిగ్ధ స్థితిలోనే ఉండదల్చుకున్నారా?'

'అదింక అసాధ్యమని నీకూ తెలుసు, నాకూ తెలుసు' చౌదరి ఒప్పుకోలుగా అన్నాడు. 'సరే, నీ వెర్రిమొర్రి పథకం ప్రకారమే కానీ, అదెటువంటిదైతే నా కెందుకు? ఫలితాలు మాత్రం చూపించు...'

'శాయశక్తులా ప్రయత్నిస్తాను...' ఆనంద్ అన్నాడు.

'గుర్తుపెట్టుకో, నాకు మాత్రం ఫలితాలు కావాలి' వీలైనంత రౌద్రాన్ని ప్రకటిస్తూ చౌదరి మరోసారి అన్నాడు.

మరునాటి వేకువనే ఆనంద్, ప్రమోద్ కలిసి ప్రమోద్ నియోజకవర్గానికి కారులో సుదీర్ఘ ప్రయాణానికి సమకట్టారు. ఎవరికి వారు తమ తొలిపావును ఎలా కదపాలో యోచిస్తూ గంటసేపు ఏకాక్షరపదాలతో మాట్లాడుతూ గడిపారు. తను నేరం చేయడం లేదు కదా అనిపించింది స్వభావతః ఆనంద్‌కి. నమ్మి వచ్చిన ప్రమోద్‌రాయ్‌ని తను వంచించడం లేదా, అన్యాయంగా వాడుకోవడం లేదా? ఓ మంత్రిగా తనతో పనిపడి వస్తే అందులోంచి ప్రయోజనం పిండు

కోవాలనుకోవడం ఏం న్యాయం? అంతలో అతని ఆలోచనలు భిన్నమైన మలుపు తిరిగాయి. తను చేస్తున్న మహాపాపం ఏమిటి? తనలో తాను కోపంగా ప్రశ్నించుకున్నాడు. ఎన్నికల్లో అందరూ చేసేదే తనూ చేస్తున్నా ఎందుకంత మథనపడుతున్నాడు? అదలా ఉంచి, ఏ విధంగా చూసినా అమాయకుడేమీకాని ప్రమోద్‌రాయ్‌నుంచి రహస్యాలు రాబట్టగలనని తనుమాత్రం ఎలా అనుకున్నాడు? అతడుకూడా తన విషయంలో అదే ఆట ఆడుతున్నాడనీ, ఆటలో తనను చిత్తు చేయబోడనీ అంత కచ్చితంగా తనెలా అనుకోగలడు? కనుక మైడియర్ డ్రీమర్, శాంతించు తనకు తను చెప్పుకున్నాడు.

అటు ప్రమోద్‌కూడా కలగలపు ఆలోచనల్లో మునిగితేలుతున్నాడు. నిజాయితీపరుడుగా, స్వచ్ఛమైన వ్యక్తిగా ఆనంద్‌ను అతడు అంచనా వేసుకున్నాడు. ఇప్పుడేమో అతడి బుర్రలో ఏముందో వెతికి పట్టుకునే ప్రయత్నంలో ఉన్నాడు. ఇంతకీ దేనికోసం? సరే, ఆలోచిస్తే చాలా విషయాలున్నాయి. మచ్చుకి చెప్పుకోవాలంటే, ఆనంద్‌ను మహేంద్రనాథ్ శిబిరంలోకి తీసుకు రాగలడేమో చూడచ్చు. ఒకవేళ చౌదరి ఇందిరాగాంధీ అభ్యర్థిని కాక అవతలి అభ్యర్థి వైపు మొగ్గితే మహేంద్రనాథ్, ఆనంద్ ఇద్దరూ ఎంత ఇష్టం లేకపోయినా ఒకే శిబిరంలో అంటే ఇందిరాగాంధీ శిబిరంలో ఉండవలసివస్తుంది. బహుశా అంతకన్నా అనువైన పరిస్థితి మరొకటి ఉండదు. ఈ విషయంలో ప్రమోద్ ఇంతకుముందే కొంత ప్రయత్నం చేశాడు. అరుణతో అతడు జరిపిన సుదీర్ఘ సంభాషణల్లో, ఇందిరాగాంధీపట్ల ఆనంద్ అంకితభావం గురించి (ప్రస్తుతం తన అంకితభావం గురించికూడా) ఆమె అన్ని విషయాలూ చెప్పింది. కనుక ప్రమోద్ అరుణ ఆనంద్ మహేంద్రనాథ్ ఇందిరాగాంధీ ఒక జట్టుగా ఉన్న దృశ్యాన్నీ, చౌదరిని కిటికీలోంచి అంతులేని అరణ్యంలోకి విసిరేసిన దృశ్యాన్నీ చిత్రించుకున్నాడు. అయితే ఇది పగటికల తప్ప మరొకటికాదని త్వరలోనే అర్థం చేసుకున్నాడు. తన బాస్ మహేంద్రనాథ్ ఇందిరా గాంధీకి అనుచరప్రాయుడుగా ఉండవలసిన పరిస్థితికి ఇష్టపడతాడన్న నమ్మకం అతనికి చిక్కలేదు. అలాగే ఇందిరాగాంధీ, చౌదరికంటె మహేంద్రనాథ్ మెరుగని ఎప్పటికీ అనుకునే అవకాశంలేదనీ అతడికి కచ్చితంగా తెలుసు. ఆమె చేయగలిగిందల్లా ఇద్దరిమధ్య సమతూకం కాపాడడం ఆ పని ఇప్పటికే చేస్తోంది. అంతేతప్ప మహేంద్రనాథ్ కోసం చౌదరిని వదిలేయడం కలలో మాట. ఇక 'చౌదరిని వదిలేయా'లన్నదే మహేంద్రనాథ్ ఏకైక డిమాండ్. అతడు చౌదరితో కలిసి ఒకే శిబిరంలో ఉండడమన్నది అది ఇందిరాగాంధీ శిబిరమే కానీ, మరొకరి శిబిరమే కానీ – ఇంకెంత మాత్రం సాధ్యమయ్యేదికాదు. 'ఆ గాడిద కొడుకు'తో స్వర్గసుఖాలు పంచు కోవడం కంటె సంతోషంగా నరకానికి వెళ్లడానికే మహేంద్రనాథ్ సిద్ధపడతాడు. ఏదేమైనా ఈ ఎన్నిక మేరకు మహేంద్రనాథ్ తనను ఏం చేయమంటే అది చేయడమే తన కర్తవ్యమని ప్రమోద్ మెల్లగా సరిపెట్టుకుంటూ వచ్చాడు.

ఆ అంశంలోకి ఇద్దరూ పూర్తిగా తలదూర్చే లోపలే వెంట వెంటనే వస్తున్న రోడ్డు ప్రక్క గ్రామాలను కారు దాటవలసి వచ్చింది. ప్రజల అభివాదాలు స్వీకరించడం కోసమో, టీ తాగడం కోసమో, ప్రతిచోటా పిటిషన్లు తీసుకోవడం కోసమో వాళ్ళు దాదాపు ప్రతి ఊళ్ళో ఆగవలసి

వచ్చింది. మంత్రులు సందర్శనకు వచ్చినప్పుడు లేదా ఆ దారి వెంట వెళుతున్నప్పుడు, తమ సమస్య పరిష్కారమౌతుందన్న ఆశ పెద్దగా లేకపోయినా ప్రజలు అలవాటుగా పిటిషన్లు సమర్పించుకుంటూ ఉంటారు. ఈ రివాజులో మునిగిపోయి ప్రమోద్, ఆనంద్ తమ చర్చను తాత్కాలికంగా విరమించారు.

ఈ మధ్యలో ప్రతి ఊళ్ళోనూ జనం ఈ అసాధారణద్వయాన్ని విడ్డూరంగా చూస్తూ వచ్చారు. అధికారపక్షంలోని గ్రూపుల కాంబినేషన్ల గురించి అప్పటికే పుంఖానుపుంఖంగా రాశారు కనుక పరస్పర శత్రుశిబిరాలకు చెందిన ఇద్దరు రాజకీయవాదులు కలిసి ప్రయాణించడం అందరిలో సంభ్రమం రేకెత్తించింది. ఆ సుదీర్ఘ ప్రయాణం పొడవునా ఎందరివో కనుబొమలు పైకి లేచాయి. గమ్యస్థానం చేరుకునేసరికి ప్రతి ఒక్కరూ బొత్తిగా నమ్మశక్యం కానట్టుగా వారివైపు చూస్తూ ఉండిపోయారు. కార్యక్రమానికి ముందూ, అది జరుగుతున్నప్పుడూ, ఆ తర్వాత ఆశ్చర్యద్యోతకాలైన వ్యాఖ్యలు అసాధారణ ప్రమాణంలో వెల్లువెత్తాయి.

'రాష్ట్రానికి మంచిరోజులు వచ్చినట్టున్నాయి. ఆనంద్‌జీ, ప్రమోద్‌జీ కలిసి విచ్చేయడం నిజంగా సంతోషకర పరిణామం' అన్నారు కొందరు. 'బహుశా దీనర్థం, వెనకటి మంచిరోజుల్లోలా మహేంద్రనాథ్, చౌదరి మళ్ళీ దగ్గరవుతున్నారని కాబోలు.'

'దయచేసి లేనిపోని ఊహల్లో తేలిపోతూ ఒళ్ళు మరచిపోకండి. ఈ ఇద్దరు పెద్దమనుషులూ కలిసి రావడంలో అంతరార్థమేమీ లేదు. ఏమీ లేకపోవడాన్ని మించి మరేమీ లేదు, ఏమీ లేకపోవడం కంటె మరేమీ కాదు... మహేంద్రనాథ్, చౌదరి ఎప్పటికీ —మరోసారి చెబుతున్నాను ఎప్పటికీ —ఒకటికాలేరు. ఇద్దరూ కలిసి రాష్ట్రంలో అధికారపక్షాన్ని భ్రష్టుపట్టించి... రాజకీయ కార్యకర్తల్ని కట్టుబానిసల్ని చేసి... ఎంతో వృద్ధిలోనికి రావలసిన ఎంతోమంది చక్కని కుర్ర వాళ్ళ రాజకీయభవిష్యత్తును నాశనంచేసి ప్రతి ఒక్కరినీ పనికిమాలినవాళ్ళుగా మార్చివేసిన ఆ స్వర్ణయుగం మళ్ళీ రాదు.'

'ఆ సంగతెలా ఉన్నా ప్రమోద్ ఒక అసాధ్యాన్ని సాధ్యంచేశాడనే అంటాను! మహేంద్రనాథ్‌కీ, ఆనంద్‌కీ మధ్య ఇప్పుడు సంధానకర్త అతడే. ఆ గాడిదకొడుకు చౌదరి గుడ్లు తేలేస్తుంటే ఇప్పుడు ఇద్దరూ రాష్ట్రపతి ఎన్నికలో కలిసి పనిచేస్తారు చూడండి. ఏమైతేనేం మచ్చలేని వ్యక్తులు దగ్గరవడం మంచిదే కదా!'

'నీ అంచనా సరైనదని నా కనిపించడం లేదు... నా అనుమానం చౌదరి, ఆనంద్ కలిసి ఈ ఉచ్చు పన్నారని; చూస్తుండగానే మన ఉపఎన్నిక ఎం.ఎల్.ఏ. ప్రమోద్ అందులో పడిపోతున్నాడు. ఇలా అంటున్నందుకు ఏమీ అనుకోకుగానీ, నీది బొత్తిగా అర్థంలేని ఊహ. తోకే కుక్కను ఊపుతున్న చందంగా ఉంది.'

'నీతో నే నెంత మాత్రం ఏకీభవించను... ప్రమోద్ శక్తియుక్తుల గురించి నీకు తెలియదు. ఆనంద్‌నీ, శేఖర్‌నీ మించిన ఉద్దండుడు. నా మాటలు గుర్తుపెట్టుకో, అతడు తప్పకుండా చౌదరి పీడ వదిలిస్తాడు.'

ఇత్యాదిగా ముచ్చట్లు సాగిపోతున్నాయి. నిజంగా అది ఊహాగానాల విందుభోజనం. రాష్ట్రపతి ఎన్నికలో ఎవరు ఎవరిని సమర్థిస్తున్నారన్న విషయంలో అలముకున్న అనిశ్చిత పరిస్థితిలో రాజకీయ మురాజీవులు, పండిట్‌లు తమ ఊహాశక్తిని సంపూర్ణంగా బయటపెట్టుకునేందుకు ఆనంద్–ప్రమోద్ సమ్మేళనం చక్కని అవకాశమిచ్చింది.

పెద్దపెట్టున హరషధ్వానాలూ, ఉత్తేజభరితమైన ఈలలూ, ఎడతెరిపిలేని గుసగుసల మధ్య కార్యక్రమం జరిగిపోయింది. రాష్ట్రపతి ఎన్నికకు సంబంధించి ఆనంద్ ఇంతవరకూ ఆశించిన ఏ సమాచారమూ రాబట్టుకోలేకపోయాడు. ప్రమోద్ ఆహ్వానాన్ని అంగీకరించి చీకట్లోకి లంఘించానా అనుకుని విచారించడం ప్రారంభించాడు. అయితే కార్యక్రమం తర్వాత కిక్కిరిసిన జనంతో మొదలైన భోజనాల ఘట్టంలో హఠాత్తుగా వెలుగు కనపడసాగింది. ఆనంద్ కలుపుగోలుతనం, స్నేహభావం గమనించి కాబోలు చాలామంది స్వేచ్ఛగా మాట్లాడడం ప్రారంభించారు. చౌదరి గురించి, ఇందిరాగాంధీ గురించి రకరకాల వ్యాఖ్యలు ఆనంద్ చెవినపడ్డాయి. ఆనంద్‌తో అరమరికలు లేకుండా మాట్లాడుతున్న వాళ్ళందరూ, తాము కూడా భాగస్వాములుగా ఉన్న మహేంద్రనాథ్ ప్రమోద్ కూటమిలోకి ఆనంద్ కొత్తగా వచ్చి చేరినవాడుగా తలపోసినట్టు స్పష్టమైంది. ఒక్కొక్క ఆవృత్తి గడిచినకొద్దీ వాళ్ళ పాఠం బట్టబయలవుతూ వచ్చింది. మరో విధంగా చెప్పాలంటే చౌదరి, ఇందిరాగాంధీలపై విమర్శ మరింత పదునెక్కుతోంది. చౌదరి ఇందిరాగాంధీ ఒకేజట్టు అన్న ఊహ వాళ్ళు చేసే ప్రతిఒక్క వ్యాఖ్యకూ ఆధారమైనట్టు తెలిసిపోతోంది. తీరూతెన్నూ లేని ఆ సంభాషణల్లోంచి మెల్లగా అయినా కచ్చితంగా వాస్తవం తొంగిచూడసాగింది.

ఇది ప్రమోద్ కోరుకున్న పరిణామం కాదు. ఆనంద్, తనూ కలిసి ఉన్నట్టు ప్రదర్శించుకుని చౌదరివర్గాన్ని గందరగోళంలో పడేయాలని అతడనుకున్నాడు. కానీ జరిగింది దానికి పూర్తి భిన్నం; తన నియోజకవర్గ ప్రజలే అతిగా మాట్లాడుతూ చౌదరినీ, ఇందిరాగాంధీని ఒక గాటకు కట్టేశారు. దాంతో మహేంద్రనాథ్ ఇందిరాగాంధీ వ్యతిరేకశిబిరంలో ఉన్నట్టు, సంజీవరెడ్డి తరఫున పనిచేస్తున్నట్టు ప్రకటించినట్టయింది. ఉద్దేశపూర్వకంగా కాకపోయినా గుట్టు బయటపెట్టేశారు.

ప్రమోద్ ఇరకాటంలో పడిపోయాడు. తన మద్దతుదారుల అత్యుత్సాహాన్ని కొంచెమైనా తగ్గించాలని విఫలయత్నం చేశాడు. మంచి వాగ్ధాటి ఉన్న తన సహచరులలో ఒకడైన సుందర్జీని ఉద్దేశించి సాగదీస్తూ అన్నాడు, 'చూడండి సుందర్జీ, మీరు ఏవో చిలవలూ పలవలూ చేర్చి మాట్లాడుతూ తొందరపడి నిర్ణయాలకు వచ్చేస్తున్నారు. రాష్ట్రపతి ఎన్నికలో తమ వైఖరి ఏమిటో మహేంద్రనాథ్ కానీ, చౌదరి కానీ ఇంతవరకూ స్పష్టంగా సూచించనే లేదు...'

సుందర్జీ ఉత్సాహంతో ఉరకలేస్తున్నాడు. తన రాజకీయ సూక్ష్మబుద్ధిని ప్రదర్శించుకునే తహతహలో ఒడలు మరచిపోయాడు. ప్రమోద్ మాటల్లోని ఆంతర్యాన్ని అర్థం చేసుకోకుండా రాజకీయ స్థితిగతులపై తన ఊహల్ని ఏకరువు పెడుతూ పోయాడు. 'ప్రమోద్ మీరేమైనా చెప్పండి, పరిస్థితిని నేను సరిగానే మదింపు వేసుకున్నాను. ఇది నిస్సంశయం. మహేంద్రనాథ్ నిర్ణయం ప్రపంచానికి రహస్యం కావచ్చు; కానీ మీకూ నాకూ కాదు. అదీగాక ఆనంద్ తెలివైన

వారు, స్నేహపాత్రుడు. భగవంతుడే పంపించాడా అన్నట్టు సరైన సమయంలో ఆయన మహేంద్రనాథ్ పక్షానికి వచ్చారు. మన అంచనాలను ఆయనతో పంచుకోడానికి సందేహించ నక్కర్లేదు. ఇందిరాగాంధీ ప్రధానమంత్రి అయితే కావచ్చు, దాదాపు తన సీనియర్ సహచరులందరినీ శత్రువుల్ని చేసుకుంది. ఆ పంక్తిలో ఎటువంటి ఉద్దండులున్నారో చూడండి: మొరార్జీ దేశాయ్, కామరాజ్, అతుల్యఘోష్, నిజలింగప్ప, రామ్‌సుభాగ్‌సింగ్, ఎస్.కె. పాటిల్, సంజీవరెడ్డి... ఎటువంటి దేశభక్త సమూహం! ఇందిరాగాంధీ వెనక ఇక మిగిలిందెవరు? వట్టి గడ్డిపరకలు. పార్లమెంటరీపార్టీలో ఆమె ఇంకెంతమాత్రం మెజారిటీని నిలుపుకోలేరు. కనుక ప్రధానమంత్రిగా ఆమెకిక రోజులు దగ్గర పడినట్టే. ఒక అభ్యర్థి పేరు ప్రతిపాదించి ఆయనకు పోటీగా మరో అభ్యర్థిని నిలబెట్టడం ఎలాంటిదో ఒకసారి ఊహించుకోండి! రాజకీయఅవినీతికి అది పరాకాష్ఠ!'

అదేపనిగా సాగుతున్న ఈ దాడిని తట్టుకోవడం ఆనంద్‌కి కష్టంగా తోచింది. వాళ్ళ మాటల్ని ఆలకిస్తూ నిశ్శబ్దంగా ఉండిపోడానికి తన ఓరిమినంతటినీ అతడు కూడదీసుకోవలసి వచ్చింది. సుందర్జీ పూనకం వచ్చినట్టు మాట్లాడేస్తున్నాడు. 'నే చెబుతున్నా చూడండి ఆనంద్‌జీ. మీకు సకాలంలో సరైన నిర్ణయం తీసుకున్నారు. మీరంటే మాకెంతో గౌరవం. అయినా చౌదరి మంత్రివర్గంలో ఉండడం వల్ల మీతో స్వేచ్ఛగా మాట్లాడలేకపోయాం. కేబినెట్‌లో ఉన్నంతమాత్రాన అతగాడి ద్రోహపూరిత పంథాను తుచ తప్పకుండా అనుసరించాలనేం లేదనుకోండి. అన్ని విధాలా అర్హులు కనుక మీరు మంత్రిపదవిలో ఉన్నారు. ఇప్పుడు మీరు సహజంగానే ఇందిరాగాంధీ ప్రభావంనుంచి బయటపడవలసిందే కనుక అదెంత త్వరగా జరిగితే అంత మంచిది. మీ రాజకీయ భవిష్యత్తు అంతా ముందే ఉంది. కనుక జాతీయస్థాయిలో మీరు తగిన శిబిరంలో ఉండడం మంచిది.'

సుందర్జీని మరో అంశంవైపు మళ్ళించడానికి ప్రమోద్ శాయశక్తులా ప్రయత్నించాడు కానీ అతడు లొంగిరాలేదు. మిన్ను విరిగి మీద పడినా సరే ఆనంద్‌నీ, మంత్రముగ్ధులై వింటున్న మిగిలిన శ్రోతల్నీ, తన లక్ష్యాన్ని వదిలిపెట్టేది లేదన్నట్టున్నాడు. తనెంతసేపు మాట్లాడితే తన శ్రోత అంత ముగ్ధుడౌతాడని అతడి ఆలోచన. ముందుముందు తలెత్తే రాజకీయఅవసరాల్లో పనికిరాగల మనిషిగా ఆనంద్ తనను గుర్తుపెట్టుకుంటాడని అతడి ఆశ. ఆ మొండిబండ మహేంద్రనాథ్ వీడంటే పడి చచ్చిపోతాడు కనుక, ఈ నడమంత్రపు ప్రమోద్‌గాడు ఉన్నట్టుండి ఎంఎల్‌ఏగా ఊడిపడ్డాడు కానీ నిజానికి వీణ్ణి ఈ స్థాయికి పెంచిన ఉపఎన్నికలో పార్టీ టిక్కెట్టు పుచ్చుకోడానికి అన్నివిధాలా అర్హతలున్నవాడు తను కాదా? సుందర్జీ ఇందుకు మహేంద్రనాథ్‌నీ, ప్రమోద్‌నీ కూడా క్షమించలేకపోయినా ఆ చేదుమాత్రను ఎలాగో దిగమింగవలసి వచ్చింది. దిగమింగక చేసేదేముంది? జిల్లా మొత్తం మహేంద్రనాథ్ ఉక్కుపిడికిట్లో ఉందాయె; అంత డబ్బుండి, అన్ని మాయలు నేర్చిన ముఖ్యమంత్రి చౌదరి కూడా జిల్లాలోకి చొరబడలేకపోయాడు. పైగా ఎవరైనా తోక ఝాడిస్తే అప్పటికప్పుడు పీక తెగ్గోసి ఆటవికన్యాయాన్ని అమలుచేసే జిల్లాగా కూడా అది ప్రసిద్ధికెక్కింది. కనుక నాయకుడన్న 'ముద్ర' వేయించుకున్న మహేంద్రనాథ్‌కి జిల్లాలో ఎక్కడా చెప్పుకోదగ్గ రాజకీయవ్యతిరేకత లేనేలేదు. ఆ విధంగా సుందర్జీ ప్రమోద్‌కు వంత పాడవలసిన వాడయ్యాడు. అయినాసరే, అమోఘమైన తన తెలివి

తేటల్ని, శౌర్యసాహసాల్ని అన్నింటినీమించి ఈ నియోజకవర్గంనుంచి ఎంఎల్ఏ కావడానికి ప్రమోద్‌ను మించి తనకున్న అర్హతల్ని ప్రదర్శించుకోవడానికిదే తగిన సందర్భం. ఉపఎన్నిక తర్వాత అక్కడికి వచ్చిన ప్రతి ఒకరి దగ్గర తన గురించి గొప్పలు చెప్పుకుంటూనే ఉన్నాడు. అవి వినడం ఈ రోజు ఆనంద్ వంతయింది. రాష్ట్రపతిఎన్నికలో పోటీపడుతున్న సంజీవరెడ్డి, గిరిలతో కానీ, రాష్ట్రస్థాయిలో పరస్పర విధ్వంసానికి పూనుకున్న వస్తాదులు మహేంద్రనాథ్, చౌదరిలతో కానీ దీనికంతటికీ ఎటువంటి సంబంధం లేదు. అయినాసరే దేనినీ నిర్లక్ష్యం చేయడానికి వీల్లేని రాజకీయ క్రీడారంగంలో ఇలాంటి స్థానికాంశానికి కూడా దానికుండే ప్రాముఖ్యం ఉండితీరుతుంది.

మొత్తానికి సుందర్జీ భగ్నమనోరథం —అతడి అత్యుత్సాహం వల్ల, ఆనంద్ తమ పక్షంలోకి ఫిరాయించాడన్న అపోహవల్ల ప్రమోద్ రహస్యపన్నాగాన్ని బట్టబయలైపోయింది.. చౌదరి తనను ఏ సమాచారాన్ని రాబట్టమన్నాడో సరిగ్గా ఆ సమాచారమే ఆనంద్‌కి ఎదురైంది. ఆనంద్‌ని తన నియోజకవర్గానికి ఆహ్వానించి పెద్ద పొరపాటే చేశానని ప్రమోద్ పశ్చాత్తాపపడడం ప్రారంభించాడు.

ప్రమోద్ అవస్థను ఆనంద్ ఊహించగలగాడు. సుందర్జీ నోట వెలువడుతున్న ప్రతిమాటనీ జాగ్రత్తగా బుర్ర కెక్కించుకుంటూనే వాటిమీద తనకే మాత్రం ఆసక్తి లేనట్టు కనిపించడానికి ప్రయత్నించాడు. ఈ నర్మసంభాషణల యుద్ధం వాస్తవంగా దేనికి దారితీయించిందో ప్రమోద్‌కి తెలుసునని అతడికి తెలుసు. తన గురించి అతిగా అంచనావేసుకున్న ప్రమోద్‌కు కొన్ని గంటల్లో అసలు నిజం బయటపడడం ద్వారా బహుశా తగిన శాస్తి జరగబోతోంది.

రాజధానికి తిరుగు ప్రయాణంలో ప్రమోద్ చాలావరకూ చిరచిరలాడుతూ, లోలోన తననుతను నిందించుకుంటూనే ఉండిపోయాడు. ఓ గంటసేపు అలా అస్థిమితంగా గడిచిన తర్వాత పూర్తిగా బయటపడిపోయాడు. సంజీవరెడ్డికి కొమ్ముకాయాలని మహేంద్రనాథ్ ఎన్నడో నిర్ణయించుకున్నాడన్న వాస్తవాన్ని వెళ్ళగక్కేశాడు. అదెలాగూ గంట క్రితం, కార్యక్రమం సందర్భంగా బయటపడిన విషయమే. ఈ సమాచారాన్ని వెల్లడిస్తున్న ఘట్టంలో కూడా అతడి ధోరణి అంతు బట్టనిదిగానే ఉండిపోయింది.

'రాష్ట్రపతి ఎన్నికలో సంజీవరెడ్డి గెలుస్తారనే నమ్మకం నీకుంది, అవునా?' ఆనంద్ యధాలాపంగా అడిగినట్టు అడిగాడు.

'ఆ గెలుపోటములతో నాకుగాని మరొకరికి గాని ఏమిటి సంబంధం?' ప్రమోద్ తటాలున ఎదురుప్రశ్న వేశాడు. 'మేం కేవలం పనిమనుషులం, పనిచేస్తాం, అంతే.'

'అలా ఎందుకంటున్నావ్?' ఆనంద్ ప్రశ్నించాడు. 'ఆయన గెలిస్తే మీ గ్రూపు గెలిచినట్టే అవుతుంది కదా, కనీసం ప్రధాన నిర్వాహకులకైనా మంచి భవిష్యత్తు ఉంటుంది కదా?'

'ఆనంద్‌గారూ, మీ కన్నీ తెలిసిపోయాయి. మీకు తెలియని ఒకే ఒక నిజం చెబుతా వినండి. భవిష్యత్తు ప్రత్యేకించి గొప్పగా ఉంటుందని నా కేమీ అనిపించడం లేదు. నేను సంజీవరెడ్డి

తరఫున పనిచేస్తున్నానే కానీ మా ఇద్దరిమధ్య అభ్యర్థి —వోటరు సంబంధం లేదు. వేరే రాష్ట్రానికి మాజీ ముఖ్యమంత్రి, పదేళ్ళ క్రితం నేను విద్యార్థిగా ఉన్నప్పుడు పార్టీకి అధ్యక్షుడుగా ఉన్నారని తప్పించి ఆయన గురించి నాకేమీ తెలియదు. నేను మహేంద్రనాథ్ కోసం వోట్లు సేకరిస్తున్నా నన్నదే ఇక్కడ గమనించవలసిన వాస్తవం. నే నాయన నిర్బంధంలో ఉన్న వోటర్‌ని, ఆయనకు వెట్టిచాకిరీ చేస్తున్న వాణ్ణి. నాకు గ్రూపుల మీద విశ్వాసం లేదు, అయినా గ్రూపుకు బానిసనై పోయాను. దానిలోంచి బయటపడలేను. మొదటిసారి ఉపఎన్నికలో గెలుపొందిన నేను చూడ వలసిన రాజకీయజీవితం చాలా ఉంది, బహుశా మరో అయిదు ఎన్నికలు. మొరార్జీదేశాయ్‌నీ, సంజీవరెడ్డినీ నమ్ముకున్నందు వల్ల నా కెటువంటి భవిష్యత్తు ఉంటుందో అర్థం కావటం లేదు. నిస్సంశయంగా నేను వారిని గౌరవిస్తాను. అయితే వాళ్ళను పట్టుకుని వేళ్ళాడమంటారా, అది వేరు.'

'అంతేకదా మరి', పశ్చాత్తాపపూరితమైన ప్రమోద్ మాటల ఉధృతికి సానుభూతితో అడ్డుకట్ట వేయడానికి యత్నిస్తున్నాడా అన్నట్టుగా ఆనంద్ అర్థోక్తిగా అన్నాడు. 'నీకు మాత్రం తెలియని దేముంది ప్రమోద్, రాజకీయపరిస్థితులు నిత్యం మారిపోతూ ఉంటాయి. దాటవలసిన కొత్త మలుపు ఎప్పటికప్పుడు ఎదురవుతూనే ఉంటుంది. నీ విశ్వాసాలను బట్టి, పరిస్థితులను బట్టి అనివార్యమనిపించినప్పుడు వంకరటింకరగా అగుడులేస్తూనైనా సరే, ఏదో కొత్తగమ్యాన్ని చేరుకుంటావు.'

'ఆ విషయం నాకు తెలుసు' ప్రమోద్ అన్నాడు. 'అయినా అలా ఎందుకు జరుగుతోంది? నా సొంత పార్టీ నుంచే ఇద్దరు అభ్యర్థులలో ఒకరిని ఎంచుకోవలసిన పరిస్థితి ఎందుకు దాపురించాలని నాకు నేనే ప్రశ్నించుకుంటూ ఉంటాను. రాష్ట్రపతి ఎన్నికలో ఇందిరాజీ, మొరార్జీదేశాయ్‌లలో ఒకరిని ఎంచుకుంటున్నానంటారా?'

'అవును... ఒకవిధంగా అంతేనేమో' ఆనంద్ సమాధానమిచ్చాడు. 'లేదు, అలా జరగడం లేదు', ప్రమోద్ గుర్రుమన్నాడు. 'అలా ఎంచుకునే స్వేచ్ఛ నా కుందని ఎంతమాత్రం అనిపించడం లేదు.'

'చూడు ప్రమోద్, నీ కా స్వేచ్ఛ ఉంది, కానీ దానిని నువ్వు వినియోగించుకోలేక పోతున్నావు. ప్రస్తుతం గ్రూపులాట నీ స్వేచ్ఛను నిరోధిస్తోంది. సైద్ధాంతిక నిబద్ధత ఉన్న యువతీయువకులు పెద్దసంఖ్యలో రాజకీయాల్లోకి వచ్చినప్పుడు స్వతంత్రంగా ఎంచుకునే ప్రక్రియ తేలికవుతుంది. వాస్తవంగా అలా జరుగుతుందో లేదో నాకు తెలియదు కానీ, జరగాలని కోరుకుంటున్నాను. గాంధీ —నెహ్రూ వారసత్వ ప్రాబల్యం శాశ్వతంగా ఉండదు. కనుక అధికారపక్షంలో ఆత్మ విశ్వాసం హఠాత్తుగా అడుగంటిపోవడం సంభవిస్తూనే ఉంటుంది. ముఠాతత్వం, కులతత్వం, మతతత్వం, ఇంకా రకరకాల పెడధోరణులు త్వరితగతిన పెరిగిపోతాయి. మంచి సేద్యపు పద్ధతులు లోపించినప్పుడు కలుపుమొక్కలు పెరిగిపోతాయి, అవునా కాదా? పార్టీ ప్రతిష్ఠను నిలబెట్టడానికి మనం కష్టపడి పనిచేయవలసిందే. మరో మార్గం లేదు.'

'మహేంద్రనాథ్ వంటి వ్యక్తి మార్గదర్శకత్వంలో నేను చేయగలిగిందేముంది? ఇలా అంటున్నందుకు నన్ను అపార్థం చేసుకోకండి, నే నింత వాణ్ణి కావడానికి ఆయనే కారణం, కనుక ఆయనకు నేను విధేయుడుగా ఉండవలసిందే. కాని మహేంద్రనాథ్‌కీ, సైద్ధాంతికతకీ పొత్తెలా సాధ్యం? ఇదే ప్రశ్న చౌదరికీ వర్తిస్తుం దనుకోండి.'

'అలాగని అస్త్రసన్యాసం చేయకు ప్రమోద్' ఆనంద్ అన్నాడు. 'పనిచేయడానికి పరిస్థితులు అనుకూలించాలనుకుని ఎదురుచూస్తూ కూర్చుంటే నువ్వు ఎప్పుడూ ఏ పనీ చేయలేవు. నీ గ్రూపుని అంటిపెట్టుకునే ఉండు, కానీ దానికి బానిస కావద్దు. కళ్ళూ, చెవులూ తెరచి ఉంచుకో. పరిస్థితులు తప్పకుండా మెరుగుపడతాయి.'

ప్రమోద్‌కి అలా ప్రశాంతంగా ఒక చక్కని సలహా ఇచ్చాడే కానీ, ఆ రోజు ఉదయం తను రాష్ట్ర రాజధానిని విడిచి వెళ్ళిన తర్వాత ఏం జరిగిందో ఆనంద్‌కు తెలియదు. ఆనంద్ పర్యటన గురించి చౌదరి, శేఖర్‌లు ఇద్దరికే తెలుసు; మిగిలిన వాళ్ళకి తెలిసింది అరకొర సమాచారమే. ఆనంద్, ప్రమోద్ కలిసి వెళ్ళడం కొందరు స్వయంగా చూశారు. దారిలో స్థానికుల నుంచి అభివాదాలు స్వీకరించడానికి వారు ఆగిన గ్రామాలనుంచి ఫోన్ ద్వారా కొందరు తెలుసుకున్నారు. చివరగా, ప్రమోద్ నియోజకవర్గంలో కార్యక్రమం జరుగుతున్నప్పుడు, ఆ తర్వాత జరిగిన పరిణామాల గరించిన అన్ని వివరాలు చాలామందికి తెలిసిపోయాయి. ఆనంద్, ప్రమోద్ తిరుగు ప్రయాణంలో ఉండగానే, అక్కడ దొర్లిన ప్రతి మాటా పత్రికలకూ, రాజకీయవాదులకూ చేరిపోయింది. పర్యవసానంగా, వారిద్దరూ ఆనంద్ నివాసానికి చేరుకునేసరికి విలేఖరుల పటాలమూ, అన్ని చోట్లా తిరుగుతుంటే పనిలేనివారి సమూహమూ నర్మగర్భితమైన చిరునవ్వులతో, చిక్కు ప్రశ్నలతో పలకరించాయి.

నాటి పరిణామాలను రాష్ట్ర రాజకీయ చరిత్రలో గొప్ప మలుపుగా వారు భావించారు. ఆనంద్ మహేంద్రనాథ్ వైపు ఫిరాయించాడా? లేక ప్రమోద్‌రాయ్‌ని చౌదరిపక్షంలోకి మళ్ళించడంలో కృతకృత్యుడయ్యాడా? ఊహాశక్తి శ్రుతిమించిన కొందరు వ్యాఖ్యాతలు ఇవేమీకాని సరికొత్త వివరణను అందించబోయారు : తాము అదేపనిగా వ్యక్తిగత ఘర్షణలలో మునిగితేలుతూ ఉండడం పొరపాటన్న సంగతిని మహేంద్రనాథ్, చౌదరి ఎట్టకేలకు గ్రహించారన్నది దాని సారాంశం. వాళ్ళిద్దరినీ ఒకటి కావడానికి ఆనంద్ ఎలాగో ఒప్పించాడనీ, రాష్ట్రపతి ఎన్నికలో ఒకే అభ్యర్థికి ఇరువురూ మద్దత్తు ఇవ్వడం అందుకు చక్కని అవకాశమని నచ్చజెప్పాడనీ — ఊహలు ఇలా సాగిపోయాయి.

ఆనంద్, ప్రమోద్‌ల మీద గుప్పించిన ప్రశ్నలలో ఇవన్నీ ప్రతిఫలించాయి. ఆ ప్రశ్నలన్నీ పరస్పర విరుద్ధంగా ఉండడంతో ఆనంద్ చేసిందల్లా ప్రతి ప్రశ్ననూ మరో ప్రశ్నతో బేరీజువేసి అన్నింటినీ త్రోసిపుచ్చడం. అయినా ఇంటర్వ్యూ చివర నర్మగర్భంగా అన్నాడు. 'ఒకటి రెండు గంటలు వేచి చూడండి; ఈ లోపల ఇక ప్రశ్నలేవీ అడగద్దు.' ఆ మాట అచ్చంగా పతాకశీర్షిక కాకపోవచ్చు, అయినా పతాకశీర్షికకు పనికొచ్చే గూఢార్థం ఏదో అందులో ఉంది.

మరునాడు పత్రికలన్నీ ఒక్కపెట్టున నినదించాయి, 'గిరికి మద్దత్తుగా చౌదరి!'...

# 47

రాష్ట్రపతి ఎన్నికలో వి.వి. గిరి విజయం సాధించారు. అయితే సంజీవరెడ్డి ఓడిపోయారని చెప్పడం కష్టం. ఇందిరాగాంధీ సంగతేమిటి? ఆమె విషయంలో ఇది గెలుపులో ఓటమిగా అభివర్ణించారు కొందరు. ఎట్టకేలకు ఆమె అభివృద్ధినిరోధకశక్తుల్ని అంతమొందించారనీ, స్వార్థ పరశక్తుల్ని నాశనం చేయగలిగారని ఉత్సాహపరులు కీర్తించారు. ఆమె ఘనవిజేత, ఘనవిజేత, ఘనవిజేత—అంటూ కొనియాడారు వందిమాగధులు. అయితే ఆచితూచి అంచనావేసే పరిశీలకులు మాత్రం, ఆమె విధ్వంసకరమైన ఓటమినుంచి ఎలాగో బయటపడగలిగిందన్నారు.

ఇందిరాగాంధీకి ఎదురైన ప్రతికూల పరిస్థితులను, ఈ ఎన్నికతో ముడిపడిన ఆమె స్వీయ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకున్నప్పుడు ఇది చెప్పుకోదగిన విజయమే. ఆమె అభిమానులు చెప్పుకున్నట్టు, 'ఘనత' వహించడానికి తగిన శక్తియుక్తులు ఆమెకున్నట్టు ఇది రుజువుచేసింది. అయినా వెంట్రుకవాసి తేడాతో సాధించిన ఆ విజయం ఆమె అతికష్టంమీద నెగ్గుకురాగలిగిన స్థితినే ప్రదర్శించింది. మిగిలిన పార్టీల నుంచి —ముఖ్యంగా వామపక్షాలనుంచి ఆమె చెప్పుకోదగినన్ని వోట్లు సంపాదించగలిగారు. కేవలం అధికారపక్షం వోట్లనే లెక్కలోకి తీసుకున్నప్పుడు, ఆమె ఓడిపోయారన్న కొందరి అభిప్రాయమూ సహేతుకంగానే కనిపించింది. మొత్తంమీద రాష్ట్రపతిఎన్నిక పర్యవసానంగా ఇందిరాగాంధీ అస్తిత్వమూ, తద్వారా ఆమె ప్రభుత్వమూ అస్థిరత్వానికి లోనయ్యాయి.

ప్రభుత్వాన్ని సమర్థవంతంగా నడపడమే రానురాను కష్టసాధ్యంగా పరిణమించింది. ప్రభుత్వోద్యోగుల వర్గం ప్రభుత్వ నిర్ణయాలను నీరుకార్చివేస్తూ, ఊగిసలాట ధోరణిని కనబరుస్తూ, ఇందిరాగాంధీ 'మైనారిటీ' ప్రభుత్వం చరమఘట్టంలో ఉందా అన్నట్టుగా వ్యవహరించసాగింది. ఇంతాజేసి అప్పటికామె ప్రభుత్వం గడువు సగమే పూర్తయింది. దారితప్పడం మెల్లగా మొదలైపోయింది. ప్రభుత్వగమనం ఎటో ఎవరికీ బోధపడని పరిస్థితి ఏర్పడిపోయింది. ఇందిరాగాంధీ విధానాలు ఎవరికీ అర్థంకాలేదు; అప్పటికింకా అవి ఒక ఆకృతిని సంతరించుకోలేదు.

ఆమె విధానాల్లో ప్రప్రథమంగా చెప్పుకోదగిన అంశం, బ్యాంకుల జాతీయాకరణ. దారిద్ర్యంపై ముఖాముఖీదాడికి ఉద్దేశించిన చర్య అది. ఆమె దానిని ప్రారంభించడమైతే ప్రారంభించారు కానీ దేశవ్యాప్తంగా దానిని అమలుచేయడానికి అధికారవర్గం తన దీర్ఘావధి తాను తీసుకుంది.

అది దాని తప్పుకూడా కాదు. రిక్షా కార్మికులకు, కూరగాయల వర్తకులకు రుణాలు ఇవ్వడమనే ఆలోచననే బ్యాంకింగ్‌వ్యవస్థ జీర్ణించుకోలేకపోయింది. అదీగాక జాతీయాకరణ అంటే సర్వాధికారాలు అధికారవర్గానికి అప్పగించడమే. దాంతో అది కొన్ని అనివార్య వైపరీత్యాలకు దారి తీయించింది. ఒక సాధారణ ప్రభుత్వోద్యోగి అప్పటికప్పుడు వడ్డీవ్యాపారిగా ఎలా మారగలడు? అంతకంటె దారుణం, లాభాలకోసం పనిచేసే ఒక బ్యాంక్ హఠాత్తుగా జనహితైషిగా మారిపోయి ఎందుకూ కొరగాని నిరుపేదను ప్రయోజకుణ్ణి చేయడంలాంటి కార్యక్రమాలకు డబ్బు ఎలా విరజిమ్మగలుగుతుంది? ఇటువంటి చర్యలు ఇందిరాగాంధీ జనాకర్షకప్రతిష్ఠకు అతికినట్టు సరిపోవచ్చుగాని, అలాంటి దివాలాకోరు బ్యాంకింగ్ విధానంమీద ఆధారపడి దేశ ఆర్థికవ్యవస్థ ఎలా ముందుకు పోగలుగుతుంది? అన్నింటినీమించి, ఎంత అంకితభావంతో శ్రమించినాసరే నూతనపథకం నుంచి రాత్రికిరాత్రి ఎవరూ ఫలితాలు రాబట్టలేరు —ఆపైన అటువంటి అంకిత భావం ఎలాగూ లేదు. 1970లో అందుకవసరమైన పునాదివ్యవస్థ దరిదాపుల్లో కూడా లేదు. ఈ లోపల పథకానికి వ్యతిరేకప్రచారం దేశవ్యాప్తంగా ఊపునందుకుంది. కొన్ని వర్గాలు బాహాటంగానే వ్యతిరేకించినా, ఆమె యత్నాలపై వ్యతిరేకస్పందన ప్రధానంగా గుసగుసల రూపంలో ఆ నోట ఆ నోట ముమ్మరంగా పాకిపోయింది.

'ఇందిరాగాంధీ నూతనవిధానంలో బ్యాంకులు అక్షరాలా ధర్మసత్రాలుగా మారిపోతాయి. మాటల కెలాంటి ముసుగువేస్తేనేం, ఇదీ వాస్తవం. ఇంతకీ బ్యాంకులకు డబ్బు ఎక్కడినుంచి వస్తోంది? లక్షలాది మధ్యతరగతి జనం రెక్కలు ముక్కలు చేసుకుని సంపాదించి దాచుకున్న డిపాజిట్ల ద్వారా వస్తోంది. సోదర సోదరీమణులారా, అది మీ దగ్గర తీసుకున్న డబ్బు, లక్షలాది గృహిణులు ఆపదలో అక్కరకొస్తుందని చెప్పి అయిదూ, పదీ చొప్పున కూడబెట్టుకున్న డబ్బు. తమ తక్షణావసరాలు కూడా తగ్గించుకుని —మంచిబట్టల మీద కూడా కోరిక చంపుకుని, నోరు కట్టుకుని, సహజంగా ఆడవాళ్ళు ఆపేక్షించే కొద్దిపాటి నగానట్రను కూడా ఒక్కోసారి త్యాగం చేసి పొదుపు చేసుకున్న డబ్బు. కూతురు పెళ్ళికోసమో, కొడుకు కాలేజీ చదువుకోసమో వాళ్ళు దాచుకున్న డబ్బు. ఓ మోస్తరు ఇల్లు కట్టుకోడానికి పదేళ్ళూ, ఇరవై ఏళ్ళూ పైసా పైసా కూడబెట్టుకున్న డబ్బు... బ్యాంకులు మీ దగ్గరనుంచి అలా డబ్బు సేకరించి, మీ ప్రయోజనంకోసమే పెట్టుబడి పెడుతుంటాయి...

'కానీ, సోదర సోదరీమణులారా, ఇప్పుడిక అటువంటి కలల్నీ, పథకాల్నీ మరచిపోవడం మంచిది. మీ డబ్బు మురికికాల్వల్లోకి ప్రవహించబోతోంది. మీ కొడుకులు వీధుల్లో అడుక్కు తింటారు, మీ కూతుళ్ళు వృద్ధకన్యలుగా మిగిలిపోతారు లేదా వ్యభిచారిణులుగా మారిపోతారు; వాళ్ళకు తగిన సంబంధాలు తీసుకురాలేరు... మీ వైపునుంచి ఎటువంటి తప్పూలేకపోయినా ఇవన్నీ జరిగిపోతాయి —ఇందిరాగాంధీ ఆడిస్తున్న నాటకంలో అత్యంత విషాదకరమైన భాగం అదే. మళ్ళీ అంటున్నాను —ఇందులో మీనుంచి వీసమంత తప్పు కూడాలేదు. మీరు డబ్బు దాచుకుంటున్నది బ్యాంకుల్లోనే కానీ ధర్మసత్రాల్లో కాదు. అయినాసరే, ఘనతవహించిన మన ప్రధానమంత్రి ఇందిరాగాంధీ పుణ్యమా అని బ్యాంకులిప్పుడు మీ డబ్బును విశృంఖలంగా విరజిమ్మబోతున్నాయి... కనీసం మీ డబ్బును మీరు తిరిగి తీసుకోగలరని కూడా నాకు తోచడం

లేదు. ఏమైనా, ఒక విషయం మాత్రం గుర్తుపెట్టుకోండి. దానమిచ్చింది ఎవరూ తిరిగి ఇవ్వరు, కనుక మీ డబ్బు మీ కెప్పటికీ తిరిగిరాదు, ఎప్పటికీ...' అయినా మొత్తంమీద మధ్యతరగతి భయభ్రాంతం కాలేదు. బ్యాంకులు వట్టిపోతాయంటూ కొందరు ప్రఖ్యాత ఆర్థికవేత్తలు, రాజకీయవాదులు పలికిన జోస్యం కేవలం అభిలాషజనితమైన ఆలోచనగానే రుజువైంది.

ఈ లోపల ఇందిరాగాంధీ క్రమంగా అమరవీరులకుండే మూర్తిమత్వాన్ని సంతరించుకోసాగారు. ఆమె నొక్కదాన్ని చేసి ఈ ముసలినక్కలు ఎలా వేధించుకు తింటున్నారో చూడండని జనం వాళ్ళలో వాళ్ళు అనుకోవడం ప్రారంభించారు. ఎంతైనా ఆమె జవహర్లాల్ కుమార్తె, నిన్నటివరకూ ఆయన బూట్లు నాకిన వాళ్ళే ఇప్పుడాయన కుమార్తెను నిప్పుల్లోకి నడిపిస్తున్నారు —బొత్తిగా కృతజ్ఞత లేని గాడిదకొడుకులు!

ఆ విధంగా ప్రజల సానుభూతి మీదనే ఇందిరాగాంధీ రాజకీయబలం చాలా వరకూ ఆధార పడుతూ వచ్చింది. ఒక ప్రసంగంలో, తన సీనియర్ సహచరులు తననెలా చిత్రహింసలు పెడుతున్నారో వర్ణిస్తున్నప్పుడు ఆమె కంఠంలో లిప్తకాలంపాటు ఒకింత గాద్గద్యం తొంగి చూసింది. చాలామంది అది తెచ్చిపెట్టుకున్న గాద్గద్యమన్నారు; అయినా అది ప్రజల — ముఖ్యంగా మహిళల మనసుల్లో ముద్రపడిపోయింది. 'సిండికేట్' పేరుతో చలామణి అవుతున్న ఇందిరాగాంధీ ప్రత్యర్థిబృందంనుంచి దీనితో తులతూగే ఎటువంటి సమాధానమూ లేకపోయింది.

చౌదరికి ముళ్ళమీద ఉన్నట్టుంది. బ్యాంకుల జాతీయాకరణ ఆలోచన అతడికి నచ్చ లేదు, అయినా పార్టీ కీలక సమావేశంలో అందుకు సంబంధించిన తీర్మానాన్ని తను సమర్థించక తప్పలేదు. ఆ చర్యకున్న అపారమైన రాజకీయశక్తిని అతడు గ్రహించకపోలేదు; అయినా అతడొక విధమైన అస్థిమితానికి లోనవుతున్నాడు. అలా చేసి ఉండవలసింది కాదని నిజంగానే భావిస్తున్నాడు.

మిగిలిన రాజకీయవాదులు, శాసనసభ్యులు బ్యాంకుల జాతీయాకరణ గురించి తమకేమీ అర్థంకాకపోయినా వోట్లరూపంలో దాని ప్రయోజనాలను లెక్కించడం ప్రారంభించారు. గ్రామీణ వాస్తవికతకు అనుగుణంగా పార్టీ నూతన పథకాన్ని ఎలా మలచాలో చర్చించడానికి వాళ్ళకు తీరికలేదు. వాళ్ళు చూడగలిగినవల్లా వోట్లు... వోట్లు... వోట్లు...

పార్టీ లోపలా, బయటా ఇందిరాగాంధీని వ్యతిరేకించే వారు బ్యాంకుల జాతీయాకరణకు వ్యతిరేకంగా తమ గుసగుసల ప్రచారాన్ని ఉధృతంచేశారు... కొందరికది ఇందిరాగాంధీ నుంచి పుణ్యానికి లభిస్తున్న దానంలా కనిపించింది. దేశాన్ని దివాలాతీయించడానికి ఇందిరాగాంధీ రచించిన బ్రహ్మాండమైన పథకంగా మరికొందరు ముద్రవేశారు. అంతే తప్ప, దారిద్ర్యం రుణగ్రస్తత తిరిగి దారిద్ర్యం అనే విషవలయంపై ముఖాముఖిదాడికి సమకట్టిన ఒక సాహసోపేత ప్రయత్నంగా దానిని చూపించడానికి యత్నించిన వారు బహు కొద్దిమంది. దేశ ఆర్థికతకు ఎడతెగని బరువుగా పరిణమించిన కోట్లాదిమంది బతుకుల్లో కాస్తయినా వెలుగునింపే యత్నంలో ఒక మంచిమలుపుగా ఆ చర్యను అర్థం చేసుకున్న వారు కూడా కొద్దిమందే. విస్తరించి ఉన్నప్పటికీ బలహీనమైన పునాదుల మీద నిలబడిన దేశ ఆర్థికతకు తగిన ఊతమిచ్చి గట్టిపరిచే చర్యగా దానిని చూడగలిగిన వారు సైతం మళ్ళీ కొద్దిమందే.

ఆనంద్ నిస్పృహచెందాడు. పదిమందిలో మాత్రం చౌదరి బ్యాంకుల జాతీయీకరణను ఆకాశాని కెత్తేస్తున్నాడు. సన్నిహితులతో సాగించే ఆంతరంగిక సంభాషణల్లో ఆ చర్యను చులకనచేసి మాట్లాడుతున్నాడు. ఏదో విధంగా ముల్లెను చేజిక్కించుకోడానికి దేశమంతటా పెనుగులాట మొదలైపోయింది. రుణాల మంజూరులో 'సహకరించ'డానికని చెప్పి రాత్రికిరాత్రి పైరవీగాళ్ళు, దళారులు పుట్టుకొచ్చేశారు. అయితే వాళ్ళ అసలు ఎత్తుగడల్లా, కొంత డబ్బును తమ జేబుల్లోకి రప్పించుకోవడం.

పథకం ప్రకటించిన కొన్ని మాసాల్లోనే లెక్కలేనన్ని సమస్యలు ఎదురయ్యాయి. దళారుల జోక్యం ఉన్నప్పటికీ రుణదరఖాస్తుల పరిష్కారానికి ఎక్కువ వ్యవధి పడుతుండడంతో పేదలందరూ బ్యాంక్‌రుణాలు పొందలేకపోయారు. అధికారపక్షపు తక్షణ ఎన్నికల ప్రయోజనాలపై చెప్పుకోదగిన ప్రభావమేమీ కనిపించలేదు. అదీగాక, పేదలకు ఇచ్చే రుణాలకింద బ్యాంకులు స్వల్పమొత్తాన్నే కేటాయించగలిగాయి. ప్రత్యర్థులు ముందుగానే పథకంపై అన్నివైపులనుంచి దాడి సాగించడంతో అసలు పథకం ప్రారంభమే అనుమానాస్పదంగా కనిపించింది. ఈ చర్యనుంచి అధికారపక్షానికి ఉండగల ఎన్నికలప్రయోజనాలను ప్రత్యర్థులు పూర్తిగా అర్థంచేసుకున్నారు. తమ ప్రయోజనాలకిది పెద్ద బెడదగా వాళ్ళకు కనిపించింది. దానిని అపఖ్యాతిపాలుచేసి ఓడించడానికి ఏమైనా చేయడానికి అది వారిని పురిగొల్పింది. రుణదరఖాస్తుల పరిష్కారంలో జాప్యం చేసినందువల్ల బ్యాంక్‌మేనేజర్లకు మంచి 'లాభాలు' కనిపించాయి. రుణస్వీకార ప్రక్రియ నత్తనడక నడుస్తూ విపరీతమైన నిస్పృహకు లోనుచేసేదిగా పరిణమించింది. ఎంత ఎక్కువ ఆలస్యంచేస్తే అంత ఎక్కువ మొత్తంలో ముడుపులు రాబట్టుకోగల అవకాశాలు బ్యాంక్‌సిబ్బందికి కనిపించాయి. చిన్న ఊళ్ళోని బ్యాంక్‌కు మేనేజర్‌గా ఉన్న వ్యక్తి ఏడాదికి కనీసం లక్షరూపాయలు సంపాదించుకోలేకపోతే, బొత్తిగా పనికిమాలినవాడికింద లెక్క. ఈ పథకాన్ని పెద్దయెత్తున ధర్మార్థం డబ్బు పంచిపెట్టే కార్యక్రమంగా అందరూ అభివర్ణించడం మొదలుపెట్టారు. ముట్టజెప్పిన భారీముడుపుల్ని కూడా దృష్టిలో పెట్టుకుంటే, రుణం తీసుకున్నవాడు దాన్ని తిరిగి చెల్లించడమనేది అతడిని పూర్తిగా దివాలాతీయించి అతడి వెన్ను విరిచి తీరుతుంది.

మరోవైపున, అది పేరుకి మాత్రమే రుణమనీ, దానిని తిరిగి చెల్లించవలసిన అవసరం లేదనీ స్వీకర్తకు నర్మగర్భంగానూ, స్పష్టంగానూ ఒక విధమైన హామీ లభించింది. 'ఏ మూర్ఖుడైనా ప్రభుత్వరుణాన్ని తిరిగి చెల్లించినట్టు ఎప్పుడైనా విన్నావా? నువ్వు కాస్త చురుకుదనం తెచ్చుకోవాలి మిత్రమా! ఓ డజనుమంది ఎం.ఎల్.ఏలనో, ఓ ఇద్దరు ఎం.పిలనో పట్టుకుని చెల్లింపు గడువును వాయిదావేయాలని నానా అల్లరీచేయాలి ఆ తర్వాత పూర్తిగా మాఫీచేయించడానికి ప్రయత్నించాలి. ఎం.ఎల్.ఏ. పలుకుబడి అందుకు కాకపోతే మరెందుకు? అయినా ఈ సున్నితమైన వ్యవహారాలు మధ్యవర్తులు ఎటూ చూసుకుంటారు. అందుగురించి బెంగపడకు. అధికారపక్షం నీకు రుణం ఇప్పిస్తే, దానిని తిరిగి చెల్లించవలసిన అవసరం లేకుండా చూసే బాధ్యత మా పార్టీ తీసుకుంటుంది, అందుకు నాదీ పూచీ...'

ఈ వివాదం ఇలా అదేపనిగా రగులుకుంటున్న కొద్దీ, ప్రభుత్వం నడక కష్టమైపోతోంది. లోక్‌సభలో, ఉందా లేదా అన్నట్టున్న మెజారిటీ కారణంగా ఇందిరాగాంధీకి అడుగడుగునా

అడ్డంకులు ఎదురౌతున్నాయి. క్షుద్రవివాదాలపై ఉభయులలో తరచుగా చీలికలు తలెత్తుతూ ఆ మహోన్నతసభల కార్యకలాపాలను ఒక ప్రహసనంగా మార్చివేస్తున్నాయి. వోటింగ్ అనేది గౌరవనీయసభ్యుల తిరుగులేని హక్కే కావచ్చు; కానీ హాస్యాస్పదమైన స్థాయికి పెంచినప్పుడు వోటింగ్ ప్రక్రియ ఒక పునః పునః ప్రహసనంగానూ, విసుగుపుట్టించే కాలహరణచర్యగానూ పరిణమిస్తుంది. తన ప్రజాస్వామికమైన లోతునీ, పవిత్రతనీ కోల్పోతుంది. ఉభయసభల్లో అదుపుతప్పిన పోకడలు నిత్యకృత్యాలుగా మారాయి. వాదనాపటిమస్థానాన్ని అరుపులు, కేకలు దాదాపు సంపూర్ణంగా ఆక్రమించుకున్నాయి.

విమర్శకులిప్పుడిక ఇందిరాగాంధీ జీవితంలోని వ్యక్తిగతకోణాలపై దృష్టి లగ్నంచేయడం ప్రారంభించారు. ఎంతో ఖరీదైన ఒక ఉన్నికోటుకు సంబంధించిన కథ పైకి తేలింది లేదా సృష్టించబడింది– ఇందులో ఏది జరిగిందో కచ్చితంగా ఎవరికీ తెలియదు. ఆ కోటును ఒక సంపన్న విదేశీ వాణిజ్యప్రముఖుడు ఇందిరాగాంధీకి బహూకరించాడని, ప్రభుత్వ నిబంధనలకు విరుద్ధంగా ఆమె దానిని స్వీకరించిందనీ అన్నారు. డబ్బుకీ, ఖరీదైన వస్తువులకీ ఇందిర లొంగిపోతుందని చెప్పడం అందులోని ఉద్దేశం. 'జవహర్లాల్‌నెహ్రూ తన చితాభస్మాన్ని దేశానికి, తన కుటుంబ జవహరీని కుమార్తెకి ఇస్తూ విల్లు రాశారు' అని ఎంతో పదునైన వ్యంగ్యాన్ని మేళవిస్తూ ఒక ప్రముఖ ప్రతిపక్షనాయకుడు అన్న మాటలివి. పండిట్‌జీ తన వీలునామాలో రాసిన అత్యంత కారుణ్యభరితవాక్యాలపై చేసిన వ్యాఖ్య ఇది. తన దేహాత్మలు రెండు దేశానికే చెందుతాయనీ అంతిమసంస్కారానంతరం తన చితాభస్మాన్ని మాతృభూమిలోనూ, నదుల లోనూ కలపాలని తాను కోరుకుంటున్నానని ఆయన రాశారు... మనసు చలింపజేసే ఈ వాక్యాలకు సగటుపౌరుడు ప్రతిఒకడూ కంటతడిపెట్టగా ఈ ప్రతిపక్షనాయకుడు వాటినిలా కించపరుస్తున్నాడు. దిగ్భ్రాంతిగొలిపే విషయం.

ఇందిరాగాంధీ స్థితి ఎంత బలహీనంగా కనిపిస్తున్నా, ప్రజల దృక్కోణంనుంచి ఆమెను నిందించడానికి విమర్శకులకు ఒక్క ఆధారమూ కనిపించలేదు. అయినప్పటికీ పార్లమెంటులో స్పష్టమైన మెజారిటీ లేని పరిస్థితి ఆమె విధానాలకు అవరోధంగా మారి, ఆమె సామర్థ్యాన్ని చాలావరకూ కుంగదీసింది. ఆమె చేస్తున్నది నామమాత్ర పరిపాలన. ప్రతి కీలకనిర్ణయానికీ మెజారిటీ మద్దత్తు అవసరం కనుక ఏ రంగంలోనూ ఆమె సమూలమైన మార్పును తలపెట్టలేరు. ఆమె కమ్యూనిస్టుల సహాయాన్ని అర్థించిన ప్రతిసారీ విమర్శకులామెను వారి సహాయాత్రికురాలిగా, రష్యాతొత్తుగా, ప్రజాస్వామిక జాతీయభావజాలానికి ఒక వైరుధ్యంగా, ఒక నియంతృత్వశక్తిగా చెండాడడం ప్రారంభించారు.

అది 1970. సరికొత్తతీర్పును అభిలషిస్తూ ఇందిరాగాంధీ ప్రజలవద్దకు వెళ్ళడానికి ఇంకా రెండేళ్ళు, రెండు గడ్డుసంవత్సరాలు గడవాలి. నిరక్షరాస్యులు, నిరుపేదలు, జ్ఞానశూన్యులైనా ఎంతో వివేకవంతులైన భారతీయ వోటర్లు, ఆలోచనల్లో, ఆదర్శాల్లో తలెత్తిన ప్రతిష్టంభనను ఏదో ఒక రూపంలో తొలగించాలంటే నిండు రెండేళ్ళకాలాన్ని ఎంతో ప్రయాసభరితంగా దొర్లించాలి. ఈ నిరీక్షణ దుస్సహం. అదిగాక, ఈ లోపల పరిపాలనా స్తంభన విధ్వంసకరమైన

అశాంతికీ దారితీయించవచ్చు. రాజకీయవాతావరణం త్వరితగతిన మారిపోతున్న ఘట్టంలో అంత సుదీర్ఘకాలనిర్దేశం వల్ల అయోమయం, అరాచకం తప్ప మరే ప్రయోజనం ఉండదు.

స్పష్టమైన మెజారిటీ లేకపోవడమే ఇందిరాగాంధీకి అడ్డంకిగా మారిందన్న వాస్తవాన్ని ప్రజలు గమనించకపోలేదు. 1967లో ఆమెకు అధికారం అప్పగిస్తున్నప్పుడు ఇలా జరగాలని వారు కోరుకోలేదు. అందువల్ల వచ్చే ఎన్నికల్లో అందరికంటె ఉన్నతంగా కనిపించిన నాయకత్వానికీ, పార్టీకీ స్థిరమైన మెజారిటీ కల్పించాలని వాళ్ళు కోరుకుంటారు. ఇంతకీ ఆ పార్టీ ఏది? ఆ నాయకుడెవరు?... రెండేళ్ళ తర్వాతే మీరు నిర్ణయించగలుగుతారని ప్రజలకు చెబుతూ వస్తున్నారు. అయితే ఇందిరాగాంధీలానే వారు కూడా తీర్పును వాయిదావేసే మానసికస్థితిలో లేరు.

తిరుగులేని తర్కబద్ధత కలిగిన మరో పార్శ్వంకూడా ఈ అంశానికి ఉంది. గడువుకంటె రెండేళ్ళ ముందు ఎన్నికలను ఎదుర్కోడానికి లెజిస్లేచర్లలో ఒకశాతంమందికూడా సిద్ధంగా లేరు. ఆ పరిణామాన్ని ఊహించడానికే వాళ్ళు భయపడిపోతున్నారు. గడువు మధ్యలోనే తిరిగి వోటు వేయవలసిన పరిస్థితిని ప్రజలమీద రుద్దడం వారిని అవమానించడమేనని వారి వాదన. అలా చేయడానికి మీకున్న హక్కేమిటి? అయిదేళ్ళపాటు పరిపాలించడానికి మీకు అధికారమిస్తే మీ పార్టీ చీలిపోయి ముక్కచెక్కలైపోయింది. ఓపక్క అధికారంకోసం పచ్చిగా పెనుగులాడుతూ అన్నిరకాల సైద్ధాంతిక విచికిత్సలూ లేవదీస్తున్నారు. పార్టీలో వ్యక్తిత్వాల మధ్య ఘరషణ తెచ్చిపెట్టింది మీరే. ఉన్నతస్థాయిలో వీధికెక్కి ఒకరిపై ఒకర బురద చల్లుకుంటున్నది మీరే. మిమ్మల్ని మీరు గ్రూపులుగా విడదీసుకుని తప్పుడు నినాదాలతో ప్రజల్ని కూడా చీల్చడానికి ప్రయత్నిస్తున్నారు. మీలోని అసహనం సభ్యతా సంస్కారాల పరిమితుల్ని ఉల్లంఘించడానికి చేజేతులా అవకాశమిచ్చుకున్నది మీరే. ఇప్పుడు మాలో ఎవరిని ఇష్టపడతారో గడువుకంటె ముందే నిర్ణయించమని జనాన్ని అడుగుతామంటున్నారు. ఎంత బరితెగింపు!

మీ ఉభయుల్లోనే ఎవరో ఒకరిని ప్రజలు ఎందుకు ఎంచుకోవాలో మీలో మీరెప్పుడూ ప్రశ్నించుకోలేదు. రెండు వేర్వేరు పార్టీలుగా చెప్పుకుంటున్న మీ పార్టీలు నిజానికి రెండు గ్రూపులు కావా? ఒకేపార్టీకి చెందిన రెండు ముఠాల్లోనూ ఏదో ఒక ముఠాను జనం ఎందుకు ఎంచుకోవాలి?... ఏదేమైనా ఇందులో ఎం.ఎల్.ఏలు, ఎం.పిలు చేసిన పాపం ఏమీ లేదు. వాళ్ళు నిరపరాధులు. గొర్రెల్లా ఎంతో విశ్వాసపాత్రంగా, నోరు మెదపకుండా నాయకుల్ని అనుసరిస్తూ వాళ్ళు ఆడమన్నట్టు ఆడడమే వాళ్ళు చేసిందల్లా. ఇప్పుడు, రెండుగ్రూపుల వాళ్ళూ వాళ్ళ విధేయతకు తగిన సత్కారం చేయవలసింది పోయి వోటర్లనే తోడేళ్ళకు వారిని అప్పగిస్తున్నారు! సిగ్గులేకపోతే సరి!...

చౌదరి మండిపడుతున్నాడు. ముందురోజు అతడు ఇందిరాగాంధీ వాదాన్ని సమర్థిస్తూ మాట్లాడినవాడే. అయినా ఈ రోజు ఉదయమే ఆందోళన కలిగించే సరికొత్త వదంతి ఏదో చెవినపడడంతో ఆగ్రహంతో బుసకొడుతున్నాడు. 'ఇది చాలా దారుణం!' అంటూ కొందరు విధేయుల దగ్గర పెడబొబ్బలు పెట్టాడు. 'ఈ లెక్కన ఏడాదిలో ప్రతి నెలా మనం దిక్కుమాలిన ఎన్నికల్ని ఎదుర్కోవలసి వచ్చేలా ఉంది. ముఖ్యమంత్రులు ఎల్లప్పుడూ గాడిదచాకిరీ చేస్తూ ఉండవలసిందే! ఓరి దేవుడా! ఎంత అవస్థ వచ్చిపడింది!'

'నిన్న మీరు ఢిల్లీలో ప్రధానమంత్రిని కలిసినప్పుడే ఎందుకు చెప్పలేదు?' సమావేశంలో పాల్గొన్న ఒక వ్యక్తి అడిగాడు. 'ఎంతైనా ఆమె కూడా మీలాంటి సీనియర్ ముఖ్యమంత్రుల నుంచి సకాలంలో తగిన సలహాను ఆశిస్తూనే ఉంటారు కదా!'

'మీ కేమయ్యా, గదిలో కూర్చుని ఎన్నైనా చెబుతారు.' చౌదరి ఎద్దేవాగా అన్నాడు. 'నా అవస్థ మీకు తెలియదు. ఏ ముఖ్యమంత్రీ నోరు మెదపడు. ప్రతివాడూ ఇందిరాగాంధీ నిర్ణయాన్ని ముందే ఆమోదించేసి కూర్చుంటాడు. ఇక, ముఖ్యమంత్రులందరూ ఆమెకు వ్యతిరేకంగా, మొరార్జీదేశాయ్‌కి అనుకూలంగా ఉన్నట్టు ఎం.పిలు ముఠాలుగా వెళ్ళి రోజూ ఆమెకునూరిపోస్తూ ఉంటారు... నా మిత్రుడు మహేంద్రనాథ్ ముప్పొటలా ఈ పనిమీదే ఉంటాడు... ప్రధానమంత్రి అడగందే సలహా ఇచ్చి అతగాడి ప్రార్థన ఫలించేట్టు చూడడం నా కిష్టం లేదు. ఏం చేయాలో ఆమెకు బాగానే తెలుసు'

'అటువంటప్పుడు ఈ కోపతాపాలు దేనికి?' ఇంకొకడు అడిగాడు.

'బాగుంది! ఎవడి గదిలో వాడు కోపతాపాలు కుమ్మరించుకోకూడదా?' అక్కడున్న వాళ్ళ నందరినీ నవ్వుతెరలలో ఉక్కిరిబిక్కిరి చేస్తూ చౌదరి ఒక్క అరుపు అరిచాడు. 'ఇక్కడ కూడా కోపాన్ని వెళ్ళగక్కుకోలేకపోతే నాకు పిచ్చెక్కుతుంది. వీధిలో నిలబడి జుట్టు పీక్కుంటూ, బట్టలూడదీసుకుంటూ పదిమందికీ వినోదం అందిస్తూ మీ కంటబడవలసి వస్తుంది!'

చాలామంది ముఖ్యమంత్రులు ఎదుర్కొంటున్న దుస్థితి అదే. మధ్యంతరఎన్నికల ఆలోచనతో విభేదించినవారే కాదు; సమర్థిస్తున్న వారి పరిస్థితి కూడా అలాగే ఉంది. అయితే, సమర్థిస్తున్న వారి వైఖరి సహజంగానే భిన్నంగా ఉంటుంది. ఉదాహరణకు ఒక ముఖ్యమంత్రి మధ్యంతర ఎన్నికల్ని గట్టిగా సమర్థిస్తాడు, అయితే ఏదో ఒక దిక్కుమాలిన కారణంతో, అవి జరగవు. అప్పుడతని పరిస్థితి ఏమిటి? లెజిస్లేచర్‌పార్టీలోని అసమ్మతివాదులనుంచి విపరీతస్థాయిలో వేధింపులను ఎదుర్కొంటున్న ఒక ముఖ్యమంత్రి విషయంలో ఇప్పటికే ఇది జరిగింది కూడా. లోక్‌సభకు జరిగే మధ్యంతరఎన్నికలతో పాటు శాసనసభకుకూడా మధ్యంతరఎన్నికలు జరిపించడానికి ముఖ్యమంత్రి విశ్వప్రయత్నాలు సాగిస్తున్నాడంటూ అసమ్మతివాదులు — కొన్ని పత్రికల చురుకైన మద్దత్తుతోనే అనుకోండి —వదంతిని వ్యాపింపజేయడం ప్రారంభిం చేశారు. ఇందిరాగాంధీ ఆదరణను చూరగొనడం; గడువుకంటె ముందే ఎం.ఎల్.ఏలను వోటర్ల వైపు నడిపించి వాళ్ళకు తగిన గుణపాఠం చెప్పడం; అన్నింటికంటె ముఖ్యంగా, ముఖ్యమంత్రిగా తన అధికారాన్ని అడ్డుపెట్టుకుని తనకు లొంగిరాని ప్రస్తుత ఎం.ఎల్.ఏలకు పార్టీ టిక్కెట్ రాకుండా చూడడం. దీని వెనుక అతడి ఆంతర్యమంటూ సహేతుకమైన వివరణే ఇచ్చారు... పార్లమెంటుకు మధ్యంతరఎన్నికలు జరపాలా వద్దా అన్న ప్రధానప్రశ్న ఇంకా ఎటూ తేలకుండానే, ముఖ్యుడూ, తగినంత స్థిరత్వం కలిగిన వాడూ అయిన ఒక ముఖ్యమంత్రి ఆ విధంగా సమస్యలఊబిలో దిగబడిపోయాడు... ఆ క్రమంలో తను రెండోవాడు కాకూడదని చౌదరి భావిస్తే అతణ్ణెలా తప్పుపట్టగలరు?

ఇక శేఖర్, అతడి విషయంలో అందరూ ఊహించగలిగినట్టే రెండువైపులనుంచీ ఉత్సాహంగా నరుక్కొస్తున్నాడు. ఎన్నో ప్రమాదాలతో కూడిన ఆ పిల్లిమొగ్గలఆట అంత తేలిక కాదు, అయినా అతడెంతో ప్రావీణ్యంతో నెగ్గుకు రాగలుగుతున్నాడు.

ఎన్నో నియోజకవర్గాల్లో విస్తృత సంబంధాలున్నవాడు కనుక ఏ ఎం.ఎల్.ఏ. పరిస్థితి ఎలాగుందో ఇట్టే తెలుసుకోగలడు. ఎన్నికల్ని తలచుకుని కుంగిపోతున్న ఎం.ఎల్.ఏలపై దృష్టి సారించి, లోక్‌సభ మధ్యంతరఎన్నికలతో పాటే రాష్ట్రశాసనసభకూ ఎన్నికలు జరిపించేలా చూడవలసిందిగా 'ఒకానొకరు' చౌదరిపై ఒత్తిడి తెస్తున్నట్టుగా వారిని నమ్మించాడు... లోక్‌సభకు మధ్యంతరఎన్నికలు సంభవిస్తే చౌదరి తన చంచాలకు పార్టీటిక్కెట్లు సంపాదించి వారిని లోక్‌సభకు పంపించ గలడన్న అభిప్రాయాన్ని కూడా శేఖర్ లోపాయికారీగా కలిగిస్తూ వచ్చాడు.

వాళ్ళు ఉండడానికి ఇందిరాగాంధీపక్షంలోనే ఉంటారు, కానీ వాస్తవంగా వాళ్ళ విధేయత చౌదరివైపు ఉంటుంది. ఇందిరాగాంధీతో బేరసారాలు సాగించగలిగిన అతడి శక్తి అలా నిరంత రాయంగా వర్ధిల్లుతుంది. మహేంద్రనాథ్ పూర్తిగా మట్టికొట్టుకుపోతాడు. చౌదరికి ప్రత్యక్షంగా ఎటువంటి ఉద్దేశాలు ఆపాదించకుండా శేఖర్ జాగ్రత్తపడ్డాడు. 'ఒకానొకరు' లేదా 'ఒకానొక శక్తి' ఏదో చేస్తున్నట్టే ఎప్పుడూ సూచిస్తూవచ్చాడు. విన్నవాళ్ళు ఎవరి నిర్ధారణలకు వాళ్ళు వచ్చేవారు. అనుమానసూచి మాత్రం తరచు ఆనంద్‌నే చూపిస్తూ ఉండేది.

అలాగే ఆనంద్ తన ముక్కుసూటి వ్యాఖ్యలద్వారా ఆ అనుమానాలకు బలం కలిగించేవాడు. పేదలకు పనికొచ్చేదేదైనా చేయడానికి తగిన పార్లమెంటరీ మద్దత్తు లేనప్పుడు ఇందిరాగాంధీ పాలనవల్ల ఒరిగేదేమిటని అతడి ప్రశ్న. సహచరులందరూ ఆమెను ఏకాకినిచేసి వెళ్ళిపోయారు కనుక, ప్రజలవైపు మరలడంతప్ప ఆమెకు గత్యంతరం లేదు. ఆమె కనుక కోరితే ప్రజలు ఆమెకే అనుకూలంగా నిర్ద్వంద్వమైన తీర్పు ఇచ్చి తీరగలరని ఆనంద్ ఉద్ఘాటన.

అయితే శేఖర్ అంత కచ్చితంగా అనుకోవడం లేదు. ఈ విషయంలో అతడు కూడా 'సర్వజ్ఞు'లనిపించుకుంటున్న వ్యక్తుల మెజారిటీలో ఒకడుగా చేరిపోయాడు. అందు కతడు చూపించబోయిన ప్రధాన కారణం, ప్రజల మనస్సులలో ఏముందో ఎవరూ పసిగట్టలేరు; నిజానికి పసిగట్టకూడదు కూడా. ఎన్నికలకు ఏణ్ణర్థానికిపైగా వ్యవధి ఉంది. తనకున్న పరిమితుల దృష్ట్యా ఇందిరాగాంధీ పెద్దగా ఏమీ చేయలేకపోవచ్చు కానీ, తన శక్తియుక్తులు రుజువు చేసు కోడానికి ఈ వ్యవధిని చక్కగా ఉపయోగించుకోవచ్చు. ఆ తర్వాత ప్రజల దగ్గరకు వెడితే వాళ్ళామెకు మరో పర్యాయం అధికారం అప్పగించే అవకాశ ముంటుంది. అలాకాక ఇప్పుడే ఎన్నికలు రుద్దడం వారికి కోపమే తెప్పిస్తుంది. ఈ క్రమంలో ఆమె తన అసంఖ్యాక విధేయులకు కూడా ఆగ్రహం తెప్పించి దూరంచేసుకోవలసి వస్తుంది. ఎన్నో ప్రతికూలపరిస్థితులకు ఎదురొడ్డి వాళ్ళామెను ఇంతకాలం ఎందుకు సమర్థించారు? మధ్యంతరఎన్నికల పేరుతో తమ కుర్చీని తమే కూల్చుకోడానికి కాదు కదా?

కిందటి ఎన్నికలలో పరాజితులైన పార్టీవాదులతోనూ, అసెంబ్లీకి జరిగే మధ్యంతరఎన్నికలపై 'ఆశలు పెంచుకుంటు'న్న వారితోనూ మాట్లాడుతున్నప్పుడు మాత్రం శేఖర్ మరోరకం రాగాన్ని

ఆలపించాడు. చౌదరి మధ్యంతరఎన్నికలకు సుముఖమేనన్నాడు. యువకులు, మరింత ప్రతిభావంతులు లోక్‌సభలోకి, అసెంబ్లీలోకి అడుగుపెట్టాలని ఆయన ఆకాంక్షిస్తున్నట్టు చెప్పాడు. అయితే... పదిక్షణాలపాటు ఉత్కంఠపూరితమైన విరామం ఇచ్చి మళ్ళీ అందుకున్నాడు... ఆయనను ఒకానొక వ్యక్తి ఆపుతున్నాడు, తత్పరిణామంగా చౌదరి ఇందిరాగాంధీని ఆపుతున్నాడు. మరోసారి ఎన్నికలో గెలుస్తానన్న నమ్మకంలేనివాడు తప్పించి ఆ ఒకానొకడు ఇంకెవరవుతాడు? తన పరువును పూర్తిగా మంటగలుపుకున్నవాడు కనుక ఈ సారి ప్రజలు తనను చెత్తకుండీలోకి విసిరేస్తారని తెలుసుకున్న వాడెవడో అయుండచ్చు... మంత్రిపదవిలో ఉండి, తన గడువు చివరిరోజు వరకూ, మరోవిధంగా చెప్పాలంటే తన మంత్రిత్వజీవితంలో చిట్టచివరిరోజు వరకూ పదవిలో కొనసాగాలని కోరుకుంటున్న వాడెవడో అయుండచ్చు! మళ్ళీ అతడి దాడికి లక్ష్యం ఆనంద్ మినహా మరెవరూ కాదు. ఆ సంగతి ప్రతిఒకరికీ అర్థమైపోయింది.

రోజురోజుకీ గంద్రగోళం పెరుగుతోంది; ఎవరూ ఇంక దేనిగురించీ మాట్లాడడం లేదు. ఓ రోజు ఉదయం, ఆందోళనకు లోనవుతూ, అసలేం జరుగుతోందో తెలుసుకోవాలనుకున్న ఎం.ఎల్.ఏలతో ఆనంద్ డ్రాయింగ్‌రూం నిండిపోయింది. ఆనంద్ తన దృక్కోణాన్ని తనకు చేతనైనంత స్పష్టంగా వివరించబోయాడు. కానీ అతడి ప్రయత్నం పెద్దగా ముందుకు సాగ లేదు. ఎం.ఎల్.ఏలు తాము చెప్పదల్చుకున్నదేమిటో చెప్పడానికే కృతనిశ్చయంతో ఉన్నట్టు కనిపించారు. వాళ్ళ వ్యాఖ్యలనుబట్టి అక్కడికి రావడానికి ముందే వారి కెవరో చక్కని శిక్షణ ఇచ్చి పంపించినట్టు అర్థమైపోయింది. అందుకని ఆనంద్ కాస్త వెనక్కి తగ్గి ఓపికతో వినసాగాడు. సెక్రటరీ వచ్చినవారికీ టీ వగైరా ఏర్పాటు చేయడంలో నిమగ్నుడయ్యాడు.

అందరిలో వృద్ధుడైన మౌలానా నేరుగా విషయాన్ని లేవనెత్తుతూ అన్నాడు. 'ఆనంద్, నేనిప్పుడు ఎం.ఎలం.ఏ.గా నా తుది అవధిలో ఉన్నాను. దాన్ని నువ్వు సగంలోనే కత్తిరించాలని పూనుకున్నావు...'

పాపం మౌలానాకు మళ్ళీ ఎన్నికలో నిలిస్తే ఓడిపోతాననే భయం పట్టుకుంది. ఆయన్ని అర్థం చేసుకోవచ్చుననుకున్నాడు ఆనంద్. కాని పెద్దాయన కోపమంతా తనమీదికెందుకు విరుచుకుపడుతోందో అతనికర్థం కాలేదు. అది ఘోరమైన అన్యాయం. 'మౌలానా, మీకు తెలుసు, నాకు మీరంటే ఎంత గౌరవమో. అందుకే నా నోట మాట పెకలడం లేదు. నేను మీతో వాదించదలచుకోలేదు. కాని ఒక్క మాట చెప్పండి, రాష్ట్ర శాసనసభకు ఇప్పుడు మధ్యంతర ఎన్నికలు ఎవరైనా ఎందుకు కోరుకుంటారు?'

'ప్రతివాడూ ఇక్కడ ఎన్నికలు జరుగుతాయనే అంటున్నాడు' మౌలానా ప్రకటించాడు.

'మీరంటున్న ప్రతివాడు ఎవడో దయచేసి చెబుతారా?'

'ప్రతివాడంటే ప్రతివాడూ,' మౌలానా అన్నాడు. అంతకన్న స్పష్టంగా చెప్పడానికిష్టం లేక. ఆ మాట అంటున్నప్పుడే మౌలానా మనసుకు స్ఫురించింది – 'ప్రతివాడు' అంటే ఒక్కడేనని : శేఖర్.

'సరే, దీన్ని కాస్త పరిశీలిద్దాం,' ఆనంద్ ప్రారంభించాడు. 'ముఖ్యమంత్రి చౌదరి తన మెజారిటీ కోల్పోయారని మీరనుకుంటున్నారా?'

'ఎంతమాత్రం కోల్పోలేదు,' మౌలానా గట్టిగా అన్నాడు; మిగతా వారందరు అదేమాట కోరస్‌గా ధ్రువపరిచారు.

'మరే కారణంగానో ఆయన ప్రభుత్వం నడపలేని పరిస్థితి ఏమైనా ఉందా?'

'ఏ మాత్రం లేదు,' అన్నారందరూ.

'ఐతే మౌలానా, ఇక్కడ మధ్యంతర ఎన్నికలెందుకు కావాలి? మీరు పేర్కొన్న 'ప్రతివాదు' దీనికేం కారణం చూపించాడు?'

మౌలానా నిరుత్తరుడయ్యాడు. మరెవడో ఒక వదంతిని ఉటంకిస్తూ గొణిగాడు. 'ఆనంద్, నువ్వే లోకసభ ఎన్నికలతో పాటు శాసనసభకూడా ఎన్నికలు జరిగితీరాలని పట్టుపడుతున్నా వంటున్నారు....'

'దయచేసి ఈ రెంటినీ కలగలిపి గజిబిజికి దారితీయకండి,' ఆనంద్ వివరించాడు. 'లోకసభకు మధ్యంతర ఎన్నికలు కావాలని నేను నిస్సందేహంగా కోరుతున్నాను. దీనికి కారణాలు స్పష్టం. ఇప్పుడున్న పరిస్థితిలో ఇందిరాగాంధీకి నిశ్చిత జనాదేశం లేదు. తన కార్యక్రమాలకు ఆమోదాన్ని పొందాలంటే ఆమెకుకావలసినంత దృఢంగా లేనేలేదు. తన కార్యక్రమాన్ని జనం ముందుంచి అటో ఇటో వారి ఆదేశం తీసుకోవలసిన అవసరం ఆమెకెంతైనా ఉంది. నా అభిప్రాయంలో ఆ ప్రశ్నను మరో రెండేళ్ళు ఎండగట్టి ఉంచడం సబబుకాదు.... ఇది నా అభిప్రాయం మాత్రమే. నేను పార్లమెంటు సభ్యుణ్ణి కాను, కేంద్రమంత్రినీ కాను. అక్కడి నిర్ణయాలతో నాకే ప్రమేయమూ లేదు. రాష్ట్రస్థాయిలో మాత్రం ఈ ప్రశ్నలేవీ మన ఎదుట లేవు. అందుకని ఇక్కడ మధ్యంతర ఎన్నికను ఎలా సమర్థించడం వీలౌతుందో నాకు బోధపడడం లేదు.'

'నిజమే... ఎవరో మాకలా చెప్పారు కనుక...'

'ఎవరేం చెప్పారో పక్కకు పెట్టండి.' ఆనంద్ కచ్చితంగా అన్నాడు. 'సమస్యను స్వయంగా పరిశీలించి నిర్ణయించండి.'

చర్చ అలా అనిర్దిష్టంగా సాగుతుంటే ఇంతలో ఆనంద్ ప్రైవేట్ సెక్రటరీ నెమ్మదిగా అతని చేతికి ఒక చీటీ అందించాడు. దాన్ని చదివి వెంటనే ఆనంద్ ప్రకటించాడు. 'వార్త వినండి, ఇప్పుడిప్పుడే రాజ్యసభలో సంస్థానాధీశుల ప్రివీ పర్సుల బిల్లు ఒక మెరుపువోటులో ఓడిపోయింది....'

నలువైపులా నిశ్శబ్దం అలముకుంది. కొంతసేపటికి ఎవరో అన్నారు. 'ఇది ఘోరమే. అయితే ఆ బిల్లును మళ్ళీ ప్రవేశపెట్టి పాస్ చేయించవచ్చుగా?'

'మెరుపువోటు ప్రభుత్వ బలానికి నిదర్శనం కాదు' మరొకడు ఉద్ఘాటించాడు. 'మళ్ళీ బిల్లు తెచ్చి తప్పకుండా పాస్ చేయించుకుంటారు.'

కొద్ది నిముషాల పాటు వాళ్ళలో వాళ్ళు రణగుణధ్వనిగా చర్చించుకుంటుండగా ఆనంద్ కిటికీలోంచి బయటికి దృష్టి సారించి నిశ్శబ్దంగా ఉండిపోయాడు. అది హఠాత్తుగా వాళ్ళ దృష్టిని ఆకర్షించడంతో అందరూ ఏదో కీడును స్ఫురింపజేసే నిశ్శబ్దంతో అతడివైపు సాభిప్రాయంగా చూశారు...

'లోక్‌సభ మధ్యంతర ఎన్నికల్లోకి లంఘించడానికిది ఎంత అద్భుతమైన అవకాశం!' ఆనంద్ మెల్లగా, దాదాపు ఎవరికీ వినబడనట్టుగా అన్నాడు.

అక్కడున్న మిగిలిన వాళ్ళలో ఏవో అనుమానాలు పొడసూపాయి కానీ, ఈ విషయంలో వాళ్ళు చేయగలిగిందేమీ లేదు; రాష్ట్రస్థాయిలో ఎన్నికల గురించి ఆనంద్ ఏమీ మాట్లాడలేదు కనుక మొత్తంమీద వాళ్ళు ఊపిరి పీల్చుకున్నారు; తమ గడువు అర్ధంతరంగా ఆగిపోదన్న నమ్మకం వాళ్ళకు చిక్కింది. శేఖర్ అనవసరంగా భయాలు రేకెత్తించాడు. మరికొద్ది నిమిషాలు అక్కడ గడిపి బతుకుజీవుడా అనుకుంటూ నిష్క్రమించారు.

ఆనంద్ మరికొంతసేపు అలాగే కూర్చుండిపోయాడు. మరోసారి ఏవేవో సందేహాలు అతణ్ణి ముప్పిరిగొన్నాయి. ఇందిరాగాంధీ మధ్యంతరఎన్నికలకు మొగ్గుతారో లేదో అతడికి తెలియదు. ఒకవేళ మొగ్గితే అది సక్రమనిర్ణయం అవుతుందా? అవుతుందనే అతడి ఊహ. అయినా అతడి మస్తిష్కంలో లాభనష్టాల ఘర్షణ ఉధృతంగా సాగిపోయింది. వాస్తవానికది తెగింపుకీ, వివేకానికీ మధ్య ఘర్షణ; ముందుచూపుకీ, తక్షణ భద్రతాదృష్టికీ మధ్య పెనగులాట. ఇది కుడికన్నునో, ఎడమకన్నునో ఎంచుకోవడంలాంటి ప్రమాదకరమైన ధోరణి. సమానస్థాయి కలిగిన రెండు అత్యవసరవస్తువులలో ఒకదానిని ఎంచుకోవడం ఎలా? ప్రమాదగర్భితమైనప్పటికీ అనివార్యమూ అనిపించే ఓ అవకాశాన్ని ముందుకుతెచ్చారు ఇందిరాగాంధీ. దేశానికి నాయకత్వం వహించడానికి తగిన వ్యక్తి ఇందిరాగాంధీ అని ఆనంద్ విశ్వసించాడు; అయితే పార్టీలో ఎంత మంది తనలా ఆలోచిస్తున్నారు? వాళ్ళు ఆమెపై కురిపిస్తున్న ప్రశంసలు అందుకు వాళ్ళు ఉపయోగిస్తున్న అర్థరహితపదజాలం, ఆమెపై వాళ్ళు గుప్పిస్తున్న దుర్భాషలు– ఇవేవీ ఆమె స్వాభావికనైజాన్నీ, ఆమె సంకల్పశక్తినీ, ఆమె బలాన్నీ, ఆమె నిశ్చయబుద్ధినీ, ప్రేరణనూ– ఏమాత్రం ప్రతిబింబించడం లేదు. వారికివేవీ అర్థమే కానట్టు స్పష్టంగా తెలుస్తోంది.

మరోవైపున పార్టీలో చీలిక తనదైన ప్రభావమూ చూపించింది. ఆనంద్, అతడి మిత్రులు కొందరు చీలికకు సంతోషించారు; ఇప్పటికీ దానిని సమర్థిస్తూనే ఉన్నారు. అయితే ఆ చీలిక నుంచి దాని సృష్టికర్తలు ఆశించిన ఫలితాలు కనిపించకపోవడమూ ఆనంద్ గమనించక తప్ప లేదు. అది అత్యుత్సాహానికీ, అతిజాగ్రత్తకీ మధ్య పునస్సమీకరణను తెచ్చిపెట్టింది; మరోకోణంనుంచి చెప్పుకోవాలంటే దుందుడుకుతో కూడిన అనుభరాహిత్యానికీ ఉదాసీన పూరితమైన జడత్వానికీ మధ్య, విభజనరేఖకు రెండువైపులా ఉద్రేకం, నిష్క్రియాపరత్వం, రాజకీయ విగ్రహారాధన, శుష్కదురహంకారం వంటి అనారోగ్యకర ధోరణులు ప్రాబల్యం వహించసాగాయి. ప్రయోజనకర లక్షణాలు అట్టడుగుకు జారిపోవడం, కనీసం తెరవెనుకకు తప్పుకోవడం రెండువైపులా సంభవించింది.

అయితే ఇందిరాగాంధీ తన సంకెళ్ళ నుంచి బయటపడి రెక్కలు తెచ్చుకుని తీరాలనే ఆనంద్ భావించాడు. కేవలం మధ్యంతరఎన్నికల ద్వారానే అది సాధ్యమౌతుందన్న నిశ్చయానికి వచ్చాడు. ఆమె అత్యవసరంగా నెరవేర్చవలసిన ఇతర కార్యాలు ఉన్నాయి. తన ప్రయత్నానికి సహకరించే సహచరబృందాన్ని ఆమె రూపొందించుకోవాలి. మొరార్జీదేశాయ్‌నో, లేదా 'సిండికేట్'నో విమర్శించే ప్రతిఒకడూ ఆమె సహచరుడు కాలేడు. ఆమె వందిమాగధులు, ఆమె చుట్టూవేళ్ళాడే వాళ్ళు అందరూ ఆమె కార్యక్రమం అమలులో సహకరించగల యోగ్యులు కానవసరం లేదు.

మెరుపువోటు వీగిపోయిన అనంతరం, తగిన వ్యక్తుల ఎంపిక ఇందిరాగాంధీకి గతంలో కంటె మరింత కీలకంగా పరిణమించిన విషయాన్ని ఆనంద్ అర్థం చేసుకున్నాడు. ఎంద రెందరో అప్రసిద్ధులు ఇందిరాగాంధీకి 'విధేయ' అనుచరుల రూపంలో అంతటా ప్రత్యక్షమవు తుండడమూ అతడు గమనించాడు. ప్రతిభా, సిద్ధాంతనిబద్ధతా మచ్చుకైనా లేని ఎందరెందరో పార్టీలో శరవేగంతో పైపైకి పోవడాన్నీ అతడు పరికించాడు. స్థానికఎన్నికల్లో కూడా తమ సత్తా నిరూపించుకోలేకపోయిన వాళ్ళు, మధ్యంతరఎన్నికలే వస్తే లోక్‌సభకు తాము అభ్యర్థులమైనట్టు కలలు కనడం ప్రారంభించారు.

చీలికవల్ల అనేక ఖాళీలు ఏర్పడ్డాయి; ఎంపిక ఘట్టానికి చేరుకున్నాక, ఆ ఖాళీలలో తమను నియమించాలని తహతహలాడే వారి సంఖ్య మరింత పెరిగిపోతుంది. ప్రస్తుతం ఆమె వెంట ఉన్నా, ఆమెకంతగా 'విధేయులు' కానివారి నెందరినో తొలగించబోతున్నారన్న గుసగుసలూ వ్యాపించాయి.

ఇక అవకాశవాదులు, ఎందులోనూ మంచిని చూడలేనివారు పార్టీ కార్యక్రమాన్ని పూర్తిగా పక్కన పెట్టేసి కేవలం పార్టీ టిక్కెట్టు కోసమే వెంపర్లాడడం అప్పటికే ప్రారంభించేశారు. ఈసారి 'ఇందిరాగాంధీ ప్రభంజనం' ఉన్నప్పుడు వెంటనే ఆమె గుంపులో ఎందుకు చేరిపో కూడదు? సిద్ధాంతాన్ని పట్టుకు వేళ్ళాడితే ఏమొస్తుంది ఇప్పుడు కావలసిందల్లా విధేయత ఒక్కటే... నువ్వెంత గట్టిగా జైకొడితే, బహిరంగ ప్రసంగాలలో నువ్వెన్నిసార్లు ఇందిరాగాంధీ పేరు వల్లిస్తే అంత విధేయుడివైనట్టు. అత్యద్భుత స్తోత్రపాఠాలే, అతిశయోక్తులే నీ విధేయతకు గీటురాళ్ళు. ఇందిరాగాంధీ వల్లనే సూర్యుడు తూర్పున ఉదయిస్తున్నాడనీ, సకాలంలో వరషాలు కురుస్తున్నాయనీ అన్నావంటే నువ్వు అత్యంత విధేయుల జాబితాలో చేరిపోతావు. 'సైనికు'డ నడం ఇప్పటి ఫ్యాషన్.

కేవలం ఆమెకు పెనుభారంగా పరిణమించేవారితో, ఆమె వైభవం కింద వెలిగిపోవాలనుకునే వారితో, ఆమె అధికారంనుంచి ప్రయోజనం పొందాలనుకునే వారితో ఇందిరాగాంధీ శిబిరం పొంగిపొర్లుతున్నట్టు ఆనంద్ గమనించి కలవరపడ్డాడు. ప్రతిగా వాళ్ళామెకు కొంచెమైనా బలం కల్పించలేరు; అది వాళ్ళకే లేదు. ఇతరత్రా ఎంతో ఉత్తేజంగొలిపే ఒక ఉదాత్తస్వప్నానికి ఇది కుంగదీస్తున్న మరో పార్శ్వం. గతంతో తెగింపులకీ, భారతరాజకీయాల్లో నూతన శకా విర్భావానికీ నిబద్ధ ఆచరణతో కూడిన రాజకీయాలకూ హామీ ఇస్తున్న స్వప్నమది.

ఆ తర్వాత అందరూ ఊహిస్తున్నట్టే, భయపడుతున్నట్టే లోక్‌సభకు మధ్యంతరఎన్నికల ప్రకటన దూసుకొచ్చింది.

# 48

దేశం ఉధృత సంరంభంలోకి లంఘించింది. గడువుకంటె ముందు పూర్తిగా ఏడాది వ్యవధి ఇంకా మిగిలి ఉండగానే లోక్‌సభకు తొలిసారి జరుగుతున్న ఎన్నికలివి. ఇలా జరపడమిదే మొదటిసారి. దీనిపై విస్తృతచర్చలు జరిగిపోయాయి. రకరకాల విమర్శలూ, భాష్యాలూ వినిపించాయి. చాలావర్గాలనుంచి వ్యక్తమైన ప్రాథమిక స్పందన ఇలా ఉంది: జవహర్లాల్ నెహ్రూ ఇటువంటి పరిణామానికి సమ్మతించి ఉండేవారా? ఉండేవారు కాదన్నదే ఏకగ్రీవాభిప్రాయం. ఈ మూలప్రాతిపదిక తరువాత వచ్చిన ప్రజల అభిప్రాయాలు వేర్వేరుగా చీలిపోయాయి. అధికారంకోసం ఎంతకైనా తెగించే ఇందిరాగాంధీకి బదులు నిదానస్థుడైన మొరార్జీదేశాయ్ ప్రధానమంత్రి అయుంటే పార్టీలో చీలిక తలెత్తి ఉండేది కాదని కొందరు ఉద్ఘాటించారు. లేదండీ, ఈ విషయంలో మీరు పూర్తిగా పొరబడుతున్నారంటూ మరి కొందరు ప్రత్యుత్తరమిచ్చారు. మొరార్జీదేశాయ్ నాయకత్వం వహించే ఉంటే 1967 ఎన్నికల్లో పార్టీ అధికారంలోకి వచ్చిఉండేదే కాదు. కచ్చితంగా వచ్చి ఉండేది కాదు. ఇందిరాగాంధీయే పార్టీని రక్షించారు, ఆ విషయంలో ఎటువంటి అపోహలు పెంచుకోకండి. చీలిక తర్వాత ఆమె పార్టీని చక్కదిద్ది శక్తిమంతంచేశారు. ఇప్పుడామె పార్టీ దేశానికి మరింత ఏకీకృత కార్యక్రమాన్ని ఇవ్వడానికి ప్రయత్నిస్తూ మధ్యంతర ఎన్నికలకు సమకట్టింది. ఈ సత్యాన్ని గుర్తించి వాటిని ఎదుర్కోవడమే మన కర్తవ్యం. మరో జవహర్లాల్ ఎవరూ లేరిప్పుడు. జవహర్లాల్ కల్పించిన సుస్థిరత్వ వాతావరణాన్ని మొరార్జీదేశాయ్ కొనసాగించి ఉండేవారన్నది కేవలం ఉబుసుపోకకు చేసే ఊహాగానం. ఏమైనా అదలా జరగలేదు. శుష్క ఊహాగానాల ప్రచారం వల్ల ఏమిటి ఉపయోగం? ఇప్పుడేం చేయాలో అది చేయడం అవసరం. కనుక ప్రజల నిర్ణయానికే వదిలేద్దాం... క్లుప్తంగా చెప్పాలంటే జరగబోయే ఎన్నిక దేశం నలుమూలలా చైతన్యవంతమైన, ఒక్కోసారి ఉద్వేగభరితమైన చర్చకు వస్తువుగా మారింది.

ఆనంద్ రాష్ట్రంలోని ఓ మారుమూల జిల్లాలో పర్యటిస్తూ మధ్యంతరఎన్నికల వార్త రేడియోలో విన్నాడు. ఎన్నికలు లోక్‌సభకు మాత్రమేనని ఆ వార్త స్పష్టం చేసింది. లోక్‌సభతో పాటే రాష్ట్రాల శాసనసభలకూ ఎన్నికలు జరపడం అంతవరకూ ఆనవాయితీగా వస్తున్నా ఈసారి అలా జరగడం లేదు.

'ఇక్కడి ఎన్నికలెప్పుడు జరగబోతున్నాయి?' అని అడిగాడొక గ్రామసర్పంచ్ ఆనంద్‌ను.

'వచ్చే సంవత్సరం' అన్నాడు ఆనంద్.

'దేవుడి దయ,' అంటూ ఆ సర్పంచ్ మళ్ళీ అడిగాడు, 'మా వరకు పార్లమెంటు ఎన్నికకూ శాసనసభ ఎన్నికకూ వ్యత్యాసమేముంటుంది?'

ఆ వ్యత్యాసం కాస్త సంక్లిష్టమైంది. రెండు ఎన్నికల్లో ఎదుర్కొనే సమస్యలు భిన్నంగా ఉంటాయి. ఇలా మొదటిసారి జరుగుతోంది. కనుక ప్రజలు తమ దృక్కోణంలో ఈ వ్యత్యాసాన్ని అర్థం చేసుకోవాలి. తన పార్టీ ఈ వ్యత్యాసాన్ని విపులంగా వివరించనందుకు ఆనంద్ కొంత బాధపడ్డాడు. ఈ మధ్యంతర ఎన్నికల్లో ఇందిరాగాంధీ మొరార్జీ దేశాయి నెదుర్కొంటున్నారని మాత్రమే ఇంతవరకు చెప్పడం జరిగింది.

ఎందరో గ్రామస్థులు ఆనంద్ చుట్టూ మూగారు – కొందరతణ్ణి చూడాలని, మరికొందరు ఆనంద్ తమను చూడాలని మధ్యంతర ఎన్నికల గురించి మాట్లాడుకున్నారు. వచ్చినవారందరూ ఆనంద్‌పై రకరకాల ప్రశ్నలు సంధించారు. ముఖ్యంగా వాళ్ళు తెలుసుకోదలచింది, ఈ ఎన్నికలో తమకేం లాభించబోతోందని. సర్వసాధారణంగా అస్పష్టంగా కబుర్లలో చెప్పేలాభం కాదు, కచ్చితంగా లెక్కవేసుకునేటట్టుండే లాభం.

ఆనంద్ వాళ్ళకు ఇందిరాగాంధీ వ్యక్తిత్వాన్ని గురించీ, ఆమె మహత్తరమైన సేవలగురించీ చెప్పడంతో ప్రారంభించాడు. అదే తనకు సరైన మొదటిమాటగా తోచింది. దాని ప్రభావం వెంటనే పడింది. అందరూ ఇందిరాజీ హర్షించారు. తదుపరి తన ఎనభైపడిలో ఉన్న వ్యక్తి క్షీణ స్వరంతో అడిగాడు, 'ఇందిరాగాంధీ దేశానికేం చేయబోతోంది?'

ఈ ప్రశ్న వస్తుందని ఆనంద్ అనుకున్నాడు. ఇందిరాగాందీ ధనికుల ధనాన్ని పునర్విభజన చేస్తుందనీ, ఆ కార్యక్రమలో భాగంగా సంస్థానాధీశుల భరణాలను రద్దుచేస్తుందనీ, వివరించాడు.

'భరణమంటే ఏమిటి?' అని ప్రశ్నించాడా వృద్ధుడు.

ఈ ప్రశ్న గురించి ఆనంద్ ఆశ్చర్యపడలేదు. గ్రామవాసులు సంస్థానాధీశుల రాజభరణాల గురించి తెలుసుకొని ఉంటారని అతననుకోలేదు. రాజభరణాల గురించీ వివరిస్తూ, ఇందిరాజీ వాటినెందుకు రద్దుచేయాలని నిర్ణయించారో చెప్పాడు. ఆ సంస్థానాధీశులకు భరణాలు పొందే హక్కులేదనీ, గతించిన యుగానికి చిహ్నాలైన వాళ్ళకు నేడుకూడా ప్రజాధనం ఇవ్వడం అన్యాయమని విశదీకరించాడు. ఆ డబ్బు ప్రజల అభివృద్ధికి ఖర్చుపెట్టవచ్చునని నచ్చచెప్పాడు.

కాని శ్రోతల మొహాలు నిస్పందితంగానే ఉండిపోయాయి. చివరకు ఆ ఎనభై పడికి చెందిన వృద్ధుడు కొంత సంకోచిస్తూ అన్నాడు. 'అంటే మీరనేది, కొంతకాలం క్రితం మనను ఏలిన రాజులకు దొరికే డబ్బు ఇక దొరకదనేనా?'

'ఔను, అంతే', ఆనంద్ జవాబిచ్చాడు, ఆ మనిషి చివరకు తనమాట అర్థం చేసుకున్నందుకు సంతోషిస్తూ...

'అయ్యా, వాళ్ళకు వస్తున్న డబ్బు ఇప్పుడెగ్గొట్టడం ఏం బావుంటుంది? వాళ్ళు మొన్నటివరకు ఈ రాజ్యానికంతటికీ కామందులు కారా? మీరిచ్చే భరణాలో వాటినేమంటారో ఇప్పుడివ్వడం మానేస్తే వాళ్లెలా బతకాలి? వీధుల్లో బిచ్చమెత్తుకోవాలా? ఇందిరాగాంధీ ఈ పనిచెయ్యడం న్యాయమౌతుందా?'.... తదుపరి ఆ వృద్ధుడు ఆనాటి రాజుల ఔదార్యాన్ని గురించీ, వాళ్ళు అప్పటికప్పుడే తమ మనసుకు వస్తే కొందరు వ్యక్తులకు అడక్కుండానే అపారలాభాలెలా ప్రసాదించేవారో, తన తరం వారు రాజులకెలా విధేయులై ఉంటూ వచ్చారో – చక్కగా వర్ణించాడు. 'ఆయన రాజుగానూ నేను బీద ప్రజల్లోనూ పుట్టామంటే అదంతా కర్మ,' అంటూ వివరించాడు. 'ఆయనెందుకు శిక్ష అనుభవించాలి? ఐనా వాళ్ళందర్నీ బికార్లు చేస్తే మీకు దొరికే డబ్బు మాత్రం ఏపాటి? ఆ మిగిలిన డబ్బులో మా బీదవారికెంత దొరుకుతుందంటారు?'

ఆ వృద్ధుని వైఖరికి ఆనంద్ నిర్ఘాంతపోయాడు. నేటికీ, ప్రజాస్వామ్యావతరణ జరిగిన తర్వాత కూడా, వ్యక్తిగత విధేయత ఇంత ప్రగాఢంగా ఉండడం అతణ్ణి అయోమయంలోకి తోసేసింది. ప్రజల దృష్టిలో రాజులు తమ అధికారాన్ని ఎన్నడైనా కోల్పోయారా అన్న ప్రశ్న అతణ్ణి తికమకపెట్టింది. ఆనాటి రాజులు చేసిన ఘోర అత్యాచారాలను ప్రజలు పూర్తిగా మరచిపోయినట్టున్నారు. తదుపరి అవతరించిన ప్రభువుల లెక్కలేని అక్రమచర్యలే అందుకు కారణమనం నిస్సందేహం. నిజమే. జవహర్లాల్‌నెహ్రూను ప్రతిఒక్కరూ ప్రేమించిగౌరవించారు. అయినా ఆయనకూడా గ్రామీణుల దృష్టిలో ఘనతవహించిన రాజుకు ఒకవిధమైన ప్రతిరూపం కాదా అని ఆనంద్ తనలో తను ప్రశ్నించుకున్నాడు. అవినీతిపరుడైన ఒక వర్తకుణ్ణి, ఒక ఫ్యూడల్ ప్రభువుని మించి ప్రజలు అవినీతిపరుడైన ఒక సర్పంచ్‌ను, ఒక లెజిస్లేచర్‌ను ఏవగించు కుంటున్నారు. విచిత్రంగా కనిపిస్తుంది కానీ ఇది వాస్తవం. వర్తకుడు ప్రజల దృష్టిలో సహజంగానే అవినీతిపరుడు, అలాగే ఒక భూస్వామి కూడా నియంతృత్వం, అవినీతి మూర్తీభవించిన వాడే. కానీ ఈ సర్పంచ్‌గాడి సంగతేమిటి? ఏడాది క్రితంవరకూ వీడి చిన్న చిన్న అప్పులకోసం దేవిరించేవాడు. ఇప్పుడు, సర్పంచ్ అయిన తర్వాత అతడు కట్టుకున్న రెండతస్థుల మేడ చూడండి! అంతెందుకూ, ఎన్నో తరాల పాటు కూడబెట్టి కట్టించిన దేశ్‌ముఖ్ గడీ అంత పెద్దదది. కనుక, వచ్చిన మార్పు దేశం బాగుపడడాని కొచ్చిందా? లేక మరింత అధోగతి పట్టించడాని కొచ్చిందా?

గ్రామస్థుల అనూహ్య ప్రతిస్పందనకు ఆనంద్ వద్ద జవాబు లేదు. దోపిడీదారు వేషంలో వచ్చిన మార్పు మార్పే కాదు; లేదు,లేదు. అది మరింత అధమస్థితిని కోరి వచ్చిన మార్పు అని తనను తను సవరించుకున్నాడు. 'సుదూర రాజధాని నుంచి పరిపాలించిన మా రాజును తిరిగి మా కివ్వండ'ని గ్రామస్థులు అడుగుతున్నట్టనిపించింది. 'ఈ నడమంత్రపు సర్పంచ్ గాణ్ణి మా భుజాలమీంచి తప్పించి పుణ్యం కట్టుకోండి! ఇదే గ్రామంలో రోజులో ఇరవైనాలుగు గంటలు నా మీద పెత్తనం చలాయిస్తూ నన్ను అవమానిస్తున్నాడు! వాడి మొహం చూస్తేనే నాకు అసహ్యం! వాడి నడమంత్రపు అధికారం తగలడ!'

ఇటువంటి గ్రామీణులకు ఇందిరాగాంధీ ఇవ్వగలిగిందేమిటో ఆనంద్‌కి అర్థంకాలేదు. అది వాళ్ళు పూర్తిగా అర్థం చేసుకోగలిగినదై ఉండాలి. అది తమకు ప్రయోజనకరమని వాళ్ళు విశ్వసించగలిగినదై ఉండాలి. తమ బతుకుల్లో నిజమైన మార్పు తీసుకొస్తుందని వాళ్ళు నమ్మగలిగినదై ఉండాలి. ఇంతకీ ఏమిటది? ఆలోచించడం ప్రారంభించాడు. తనలానే కోట్లాదిమంది ఆలోచన ప్రారంభించాలని మనసారా కాంక్షించాడు ఇందిరాగాంధీతో సహా.

ఉదాహరణకు గ్రామీణ నిరుపేదలనే తీసుకోవచ్చు. వారికి భూమి ఇస్తామని ప్రభుత్వం ఒక దశాబ్దకాలంగా వాగ్దానంచేస్తోంది. తానీ క్షణాన ఇదే ఆటలో కూరుకుపోయి ఉన్నాడు. ఇంతవరకూ తనేమాత్రం భూమిని వారికివ్వగలిగాడు? ఎంతో ఇవ్వలేదని తనలో తనే ఒప్పుకున్నాడు. లెక్కలేనన్ని కేసుల్లో భూయజమానులు భూపరిమితి చట్టాలను ఉల్లంఘించారు. అతడు రోజు రోజూ కఠినమైన ఉత్తర్వులు జారీ చేయిస్తూనే వచ్చాడు. అయినా క్రియలో జరిగిందేమీ లేదు. జిల్లా అధికారులు ఆ ఉత్తర్వులను శిరసావహించినట్టు కనిపిస్తారు. అది కూడా నివేదికలు పంపించడానికే. కానీ తీసుకున్న చర్య దాదాపు లేదు... ఎందుకలా జరుగుతోంది?

ఆనంద్ గమనించిన ప్రప్రథమ కారణం ఇంతవరకూ అమలులో ఉన్న పరిమితులు, నిరుపేదలకు పంచడానికి తగినంత మిగులు భూమిని రాబట్టుకోవడం సాధ్యంకాదు. అత్యధిక స్థాయిలో ఉన్నాయి. తన గ్రామంతో సహా, మచ్చుకు కొన్ని గ్రామాలను పరిశీలించాడు. ప్రభుత్వం చట్టాన్ని ఎంతో నిజాయితీగా అమలుచేసినా సరే, ప్రస్తుత చట్టం ప్రకారం మిగులుభూమి ఉన్న యజమానులు చాలా కొద్దిమందే పైకి తేలతారు. కనుక ఇందిరాగాంధీ భూపరిమితి చట్టానికి తగిన పదును తేగలుగుతారా? తనలో తను ప్రశ్నించుకున్నాడు. ఇంతవరకూ సమాధానం తేలేరనే. ఆమె పార్టీలోని పలువురు సీనియర్ నాయకులు ఆ చర్య ముందుకు సాగకుండా అడ్డుపడుతున్నారు. నిజంగా సాధించిన ఫలితాలంతగా లేకపోయినా ఏదో సాధించిన నట్టు నమ్మించబోయే వాగాడంబరమే వాళ్ళకు కావలసింది. ఆనంద్‌లాంటి కొందరు ఎంత కృతనిశ్చయంతో ప్రయత్నించినా ఈ పరిస్థితిలో రవ్వంత మార్పు లేదు.

కనుక, అమలులో ఉన్న —ఉన్నదున్నట్టు చెప్పాలంటే —అమలుజరగని కార్యక్రమానికే మెరుగులు దిద్దినంతమాత్రాన ప్రజలు ఉత్తేజితులు కారు. అదీగాక, ఆ కార్యక్రమం అవిభక్త అధికారపక్షపు ఉమ్మడిసొత్తు కనుక అవతలిపక్షం కూడా దానిపై తన హక్కును ఉద్ఘాటించుకుంటుంది. కనుక ఈ సారి ఆ కార్యక్రమం ఇందిరాగాంధీ సొంతమనిపించేలా, అవతలిపక్షం తనదని చెప్పుకోడానికి గానీ, అనుకరించడానికి గానీ వీలుకానిదిగా అత్యంత విభిన్నంగా ఉండాలి... కీలకమైన కొలమానాలు ఇవే అవుతాయి.

ఆ పైన గ్రామీణభూమికి జతగా పట్టణభూమి ఉంది. గ్రామీణ వ్యవసాయభూములకు సంబంధించి ప్రభుత్వం కొన్నేళ్ళ క్రితం కనీసం ఒకమాదిరి పరిమితి చట్టాలనైనా చేసింది. అయితే నగరాల్లో సంపన్నుల చేతుల్లో ఉన్న ఖరీదైన భూములపై ఎటువంటి పరిమితుల విధింపూ జరగలేదు. అందు కెంత చక్కని వాదాలు ముందుకు తెచ్చినా, అవిభక్త అధికారపక్షం

ఈ విపక్షను సమర్థించుకోలేకపోయింది. ప్రభుత్వం పట్టణాలపట్ల పక్షపాతం చూపుతోందని రైతులు నిందించసాగారు. దీనిని తిప్పికొట్టగల వాదమేదీ లేకపోయింది.

అమలుచేయగల అవకాశాన్ని కనుక ఇందిరాగాంధీ తక్షణమే అంది పుచ్చుకోగలిగితే, ఇది మరో విలక్షణ కార్యక్రమం అవుతుంది. అవతలిపక్షం —సిండికేట్ —ఈ కార్యక్రమాన్ని అంత పూనికతో చేపట్టలేదని ఆనంద్‌కు స్ఫురించింది. వాళ్ళు మహాఅయితే దానిని యధాలాపంగా ప్రస్తావిస్తే ప్రస్తావించవచ్చు. ఇందిరాగాంధీ ఈ కార్యక్రమాన్ని శక్తిమంతంగా ముందుకు తీసుకురావడానికి సాధ్యమౌతుందా? పట్టణ సంపన్నవర్గాల అసంతృప్తిని కొనితెచ్చుకోడానికి ఆమె సాహసించగలుగుతారా? ఆమె అందుకు తెగిస్తారో, తెగించరో?... తెగిస్తారనే అతడి కనిపించింది. కానీ పూర్తిగా నమ్మకం చిక్కలేదు. ఎన్నికల వాగ్దానాలు విశ్వసనీయతను కోల్పోయి, పార్టీల ఎన్నికల ప్రణాళికలు చిత్తుకాగితం స్థాయికి పడిపోయిన ఈ ఎన్నికలఆటలో అతడికి దేనిపట్లా నమ్మకం చిక్కడంలేదు... ఈ దుస్థితిని ఇందిరాగాంధీ మార్చగలుగుతారా? మాగ్నకార్టాకు ఉన్నంత పవిత్రతను ఎన్నికల ప్రణాళికకు తెచ్చిపెట్టగలుగుతారా? అంటే ఆచరణలో, ఆ ప్రణాళిక ద్వారానే తను నిలబడడమో, పడిపోవడమో —తేల్చుకుంటానని సంకల్పిస్తారా? ఈ ప్రశ్నకు చెప్పుకునే జవాబులోనే ప్రజాస్వామ్యభవితవ్యం నిక్షిప్తమై ఉందని ఆనంద్ అనుకున్నాడు.

ముందుగా మౌలికాంశాలలోకి ఎందుకు తలదూర్చకూడదు? రెండేళ్ళ క్రితం పార్టీలో సంభవించిన చీలిక ప్రజల ఊహలో ఓ సాధారణ రాజకీయపరిణామం కాదు —మహాత్మా గాంధీ వారసత్వమే రెండుముక్కలైపోయింది. జవహర్లాల్ నెహ్రూ ఉజ్వలస్వప్నం మధ్యలోనే చెదిరిపోయింది. కోట్లాదిప్రజల ఆకాంక్షలకు అద్దంపట్టిన పార్టీ పారంపరిక చింతన సమస్తం రెండుగా విభజితమైపోయింది. అలా అనుకోవడం కచ్చితంగా సరికాదని ఆనంద్ అనుకున్నాడు. మహాత్మాగాంధీ వారసత్వాన్ని ఎలా చీల్చగలరు? నెహ్రూ స్వప్నాన్ని ఎలా చెదరగొట్టగలరు? వేటికవే అనుపమానమైనవి, విభజనకు లొంగనంత అసాధారణమైనవి. కోట్లాది ప్రజల ఆకాంక్షలను ఎవరూ ఛేదించలేరు; అలా భావించడంకంటె అవివేకం ఉండదు.

అయితే మరి, అధికారపక్షంలో సంభవించిన చీలిక దేనిని సంకేతిస్తోంది. మళ్ళీ మూలాల్లోకి వెళ్ళమని ఆనంద్ మరోసారి తనకుతాను చెప్పుకున్నాడు. ఇపుడు అధికారపక్షంలో రెండు శిబిరాలున్నాయి. వేటికవే తమను అసలు పార్టీగా పిలుచుకుంటున్నాయి. ఉమ్మడివారసత్వాన్ని విభజించడం ఎవరికీ సాధ్యంకాదు కనుక, వేటికవే తమను మూలభూతమైన, సంపూర్ణమైన పార్టీగా చిత్రించుకుంటూ అవతలిదానిని బహిష్కృతుల గుంపుగా వర్ణిస్తున్నాయి. ఉన్నది ఒకే పార్టీ, అది మాదేనని రెండూ చెప్పుకుంటున్నాయి. ఆ విధంగా ఒకపార్టీ రెండుగా కనిపిస్తోంది, లేదా రెండు పార్టీలూ ఒకేపార్టీ అన్న భ్రమ కలిగిస్తున్నాయి. ఇందులో ఏది నిజం? ఈ ప్రశ్నపై ఎన్నిసార్లు తర్కించుకున్నా సంతృప్తికరమైన సమాధానానికి రాలేమని ఆనంద్ నిర్ధారణకొచ్చాడు.

ఈ లోపల చీలికవల్ల వ్యవహార సంబంధమైన చిక్కులు కొన్నిపైకి తేలాయి. అవిభక్తపక్షానికి చెందిన ప్రతిదీ రెండు కొత్తపార్టీల మధ్య వివాదాంశంగా మారింది. సర్వత్ర —అటు జనంలోనూ,

ఇటు పార్టీ కార్యకర్తల్లోనూ ఇది పూర్తి గంద్రగోళాన్ని సృష్టించింది. పేరు, జెండా, ఎన్నికల చిహ్నం, ఆఫీసు, రికార్డులు —ఇలా ప్రతిఒకదానికోసం రెండు గ్రూపులూ చట్టసంబంధమైన ఘర్షణకు పూనుకున్నాయి.

ఎన్నికల చిహ్నానికి సంబంధించి ఒక హాస్యాస్పద పరిస్థితి తలెత్తింది. రెండు పార్టీలూ ఒకే గుర్తుకోసం పోటీపడ్డాయి. ఎన్నికల చిహ్నానికుండే మహత్తు అంతా ఇంతా కాదు. ప్రజలు దానిని తేలిగ్గా పోల్చుకుంటారు. అది ఏ పార్టీకి దక్కితే అది అసలైన పార్టీగా తనను చిత్రించుకోవడం దానికి వీలవుతుంది. అర్థాత్తూ రెండోదానికి కొత్తపార్టీ అన్న ముద్ర వేయించుకోవలసి వస్తుంది. అందుకే గుర్తుకోసం ఘరషణ మరింత తీవ్రరూపం దాల్చింది. ఈ పరిస్థితులలో ఎన్నికలకమిషన్ తన కందుబాటులో ఉన్న ఏకైకమార్గాన్ని అనుసరించవలసి వచ్చింది. పాత గుర్తును 'స్తంభింప'జేసి రెండు పార్టీలకూ కొత్తగుర్తులు కేటాయించింది.

ఇక పార్టీల పేర్లు మరో క్లిష్టసమస్యను తెచ్చిపెట్టాయి. చివరకు ఎన్నికలకమిషన్ రెండు పార్టీలు ఒకే పేరుని కలిగిఉండడానికి అనుమతిస్తూ, ప్రతిపార్టీ తమ అధ్యక్షుల పేర్లలోని మొదటి అక్షరాన్ని బ్రాకెట్‌లో సూచిస్తూ పేరుకు జోడించాలని అదేశించింది. ఆ విధంగా ఇందిరాగాంధీ నాయకత్వంలోని పార్టీ (ఐ) అనే తోకను, రెండోపార్టీ మరో తోకను తగిలించుకోవలసి వచ్చింది. కొంతకాలంపాటు దీనినుంచి ఎన్నో ఛలోక్తులు పుట్టుకొచ్చాయి. ఇద్దరు అధ్యక్షుల పేర్లూ ఒకే అక్షరంతో మొదలైనప్పుడు, అంతకంటె సమస్యగా ఇద్దరు అధ్యక్షుల పేర్లూ ఒకటే అయినప్పుడూ ఏంచేస్తారు? అప్పుడు పార్టీల మధ్య తేడాను సూచించడానికి తండ్రి పేరునో, భార్య పేరునో తీసుకొచ్చిపెడతారా? అని చమత్కరించారెవరో.

అవిభక్త పార్టీకి దేశవ్యాప్తంగా ఎన్నెన్నో కార్యాలయ భవనాలున్నాయి. ఈ భవనాలు ఎవరి ఆధీనంలో ఉండాలన్నది గడ్డుసమస్యగా పరిణమించింది. చట్టరీత్యా పోరాటంతో పాటు గూండాల స్వైరవిహారమూ సాగిపోయింది. భవనాల స్వాధీనం, పునః స్వాధీనం, పునః పునః స్వాధీనం— ఈ తంతు కొన్ని మాసాల పాటు, కొన్ని సందర్భాల్లో సంవత్సరాల పాటు సాగిపోయింది. ఇది రెండుపార్టీల ప్రతిష్ఠనీ దెబ్బతీసింది. దేశ విదేశాలలోని పత్రికలు ఈ పేచీలను భయానక పదజాలంలో చిత్రించాయి. ఇందులో మేధావులకు అధికారపక్షం విచ్ఛిన్నమైపోతున్న దృశ్యం కనిపించింది —దీనిని మరింత ఒత్తిచెప్పడంకోసం 'తాము నిస్సహాయంగా చూస్తూ ఉండగానే' అన్న మాటలు కూడా వాళ్ళు జోడిస్తూ వచ్చారు. దేశాన్ని ఐక్యంగా ఉంచగల మరోపార్టీ ఏదీ లేదు కనుక ఈ ఘర్షణల వల్ల దేశం ముక్కలైపోయే పరిణామాన్ని ఊహిస్తూ —కొందరది తథ్యమని తేల్చి చెబుతూ —ఢిల్లీలోని ఎందరో విదేశీరాయబారులు తమ తమ దేశాలకు సుదీర్ఘమైన నివేదికలు పంపించారు. భారతదేశం చుట్టుపక్కల ప్రాంతాల్లోనూ, సుదూరంగా ఉన్న వెనకటి వలస రాజధానుల్లోనూ అనేకమంది రాజకీయవాదులకు ఈ పరిస్థితి నోరూరించసాగింది. ఇక పత్రికావ్యాఖ్యాతలు ఇందిరాగాంధీయే చీలికను తెచ్చిపెట్టిన దుష్టశక్తిగా, విచ్ఛిన్నానికి ఏకైక బాధ్యురాలుగా ఏకగ్రీవంగా నిర్ణయించేశారు.

భౌగోళిక రాజకీయ దృక్కోణం నుంచి చూస్తే అధికారపక్షంలో చీలిక అనేది దేశం నిర్లక్ష్యం చేయజాలని ప్రమాదకర పరిణామం. నెహ్రూ మరణానంతరం, అస్థిరత్వసంకేతంగా కనిపించిన ఇటువంటి పరిస్థితే పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ ఆయూబ్‌ఖాన్‌ను దుస్సాహసానికి పురిగొల్పలేదా? ఇప్పుడు జనరల్ యాహ్యాఖాన్ రూపంలో ముప్పు కనిపిస్తోంది. ఈ రెండు సందర్భాల మధ్య ఇతరత్రా ఉన్న తేడా స్వల్పమే.

పార్టీలో చీలిక తెచ్చి దేశవిచ్ఛిత్తికి కారకురాలయ్యారన్న అపఖ్యాతిని ఇందిరాగాంధీ తెచ్చిపెట్టుకోకూడదు. నిజానికి దానికి పూర్తి వ్యతిరేకంగా జరగాలి. దేశం బలోపేతమూ, సుస్థిరమూ కావడానికి దోహదపడే అంశంగా ఆమె చీలికను మలచుకోవాలి. మరోవిధంగా చెప్పాలంటే, ఆమె పార్టీ 1971 ఎన్నికల్లో మహత్తరవిజయం సాధించాలి. మార్గాంతరం లేదు. అవతలిపార్టీ —సిండికేట్—దేశానికి సుస్థిరమైన, శక్తిమంతమైన ప్రభుత్వాన్ని అందించలేదన్నది సుస్పష్టం. అందించగలమని ఆ పార్టీ నాయకులు ఉద్ఘాటించుకుంటున్నా, అది ప్రజల విశ్వాసాన్ని చూరగొనడంలేదు... వాళ్ళు చేయగలిగిందల్లా ఎన్నికల్లో ఇందిరాగాంధీ అవకాశాలను కొంతమేరకు తగ్గించడం. ఇది ఇందిరాగాంధీని బలహీనపరచడంతో పాటు దేశాన్ని కూడా బలహీనపరుస్తుంది.

అలా మరోసారి ఇందిరాగాంధీయే అందరి దృష్టికీ కేంద్రస్థానంగా మారారు.

ఇది మళ్ళీ ఆనంద్‌ను ఆ వృద్ధగ్రామీణుడు నిష్కరషగా అడిగిన ప్రశ్న దగ్గరకు తీసుకెళ్ళింది. పేదలకూ, అణగారినవారికీ, నిస్సహాయులకూ, అధికారశూన్యులకూ ఇందిరాగాంధీ ఇవ్వజూపేది ఏమిటి? ఈ ప్రశ్న జరగబోయే మధ్యంతరఎన్నికలకే పరిమితమయ్యేది కాదు. ఇది ప్రస్తుత, ఆగామి ప్రధానమంత్రులందరిని ఉద్దేశించి అడగదగిన ప్రశ్న. ఇది కేవలం స్వార్థపూరిత ప్రశ్న కానేకాదని కూడా ఆనంద్‌కి అర్థమైంది. ఇదనేక విధాలుగా దేశభక్తియుతమైన ప్రశ్న, దేశ పటిష్ఠతకీ, సుస్థిరతకీ సంబంధించిన ప్రశ్న. సామాజిక గోపురానికి అడుగున విస్తరించి ఉన్న పునాదికి సంబంధించిన ప్రశ్న.

గ్రామస్తులతో మాట్లాడి డాక్‌బంగ్లాకు తిరిగివచ్చేసరికి ఆనంద్ బాగా అలిసిపోయాడు. తను చాలాకాలంగా అకుంఠితదీక్షతో ఇందిరాగాంధీ తరఫున పనిచేస్తున్నా తన కామెతో సాన్నిహిత్యం లేదనీ, ఆమె మస్తిష్కంలో ఏముందో, లేదా కీలక విధానాంశాలలో ఆమె అభిప్రాయాలెటువంటివో తనకు తెలియదనీ అతడు గ్రహించాడు. కేవలం తనామెకు దాదాపు బాకాగా వ్యవహరించడం తగినదేనా? తన ఆలోచనల మూసలోనే ఇందిరాగాంధీ మూర్తిమత్వాన్ని తాను రూపొందించుకోలేదు కదా? తన వైఖరి సక్రమమైనదేనని నిస్సంశయంగా తనెలా భావించగలడు? తను పాఠశాలలో చదువుకునే రోజులనుంచీ తర్కించుకుంటూ వచ్చిన వ్యక్తిగత విధేయత అనే వివాదాస్పద భావానికి ఇదో మరో రూపం కాదా? ఇదంతా ఆత్మవంచనకాదా?

వేధించే ఈ సందేహాలు అతణ్ని తేనెటీగల్లా కుడుతున్నాయి. తన ఆలోచనలు అర్థరహితమనిపించే స్థాయికి ఎగబాకుతున్నాయనిపించింది. ఇటువంటి క్షణాలలో శేఖర్ తర్కమే యుక్తియుక్తంగా ఉంటుందేమో ననిపిస్తూ ఉంటుంది. తనూ, శేఖర్ కూడా చీలికవైపు మొగ్గు

చూపిన వాళ్ళే. ఇద్దరూ ఇందిరాగాంధీని సమర్థిస్తున్న వాళ్ళే. అయితే అందుకు వాళ్ళ కారణాల్లో మాత్రం ఉత్తర దక్షిణ ధ్రువాల మధ్య ఉన్నంత తేడా ఉంది.

శేఖర్ చీలికను కేవలం ఒక జీవితంలోని వాస్తవంగానే పరిగణించాడు. సమర్థమైన ప్రతి పక్షం అంటూ లేనప్పుడు అధికారపక్షం సహజంగానే చీలిపోయి ప్రజాస్వామ్యవాహనాన్ని నడిపించడానికి అవసరమైన ఇంధనాన్ని ప్రతిపక్షానికి సమకూర్చుతుంది. ఎవరైనా చేయ వలసిందల్లా జరుగుతున్న రాజకీయపరిణామాలలో తనకు అనుకూలించే పక్షంలో తాను ఉండగలిగేలా చూసుకోవడం. ఆ పక్షం ఎల్లప్పుడూ అధికారపక్షమే కానవసరం లేదు. ఒక్కోసారి కొద్దికాలంపాటు అవతలిపక్షంలో ఉన్నా ఎన్నో లాభాలు మూటగట్టుకోవచ్చు. తదుపరి దీర్ఘ కాలం అధికారయోగాన్ని అనుభవించే స్థితికి అమాంతం దూసుకుపోవచ్చు. ముఖ్యంగా ఎన్నికలకు చేరువలో చీలిక సంభవించినప్పుడు.

ఇందిరాగాంధీ వైపు అతడెందుకు మొగ్గాడు? 'ఏముంది మిత్రమా, చాలా సింపుల్, ఆమె ఈ ఎన్నికల్లో గెలవబోతోంది. గెలిచి ఏం చేస్తుందో నేనైతే చెప్పలేను. అది రేపటి సంగతి. తక్షణ కర్తవ్యంమీదే నాకు నమ్మకం. కనుక నేను గెలిచే పక్షంలో ఉండితీరవలసిందే. అలాగే తమకున్న అపారమైన వనరుల దృష్ట్యా, పావులు కదపడంలో ఉన్న ప్రావీణ్యం దృష్ట్యా అవతలిపక్షం కూడా తగినన్ని సీట్లు తెచ్చుకుంటుంది. ఈ అధికారపక్షముంది చూశావూ, అందులో సంపూర్ణ ఐకమత్యం వెల్లివిరియడం దేశానికే అసలు మంచిది కాదు!' అని శేఖర్ ఎవరితోనో అన్నట్టు తెలిసింది.

ఇవీ, ఇతర పార్టీలనుంచి వినిపించిన ఇటువంటి వ్యాఖ్యలూ ఆనంద్‌కి కోపం తెప్పించాయి. అయితే రాజకీయవాదుల వైవిధ్యపూరిత చర్యలన్నింటి వెనుక ఒకే విధమైన ప్రేరణ ఉంటుందని ఆశపడడమూ పొరపాటేనని, ఆలోచించిన మీదట అతడికే తోచింది. సిద్ధాంతాలతో నిమిత్తం లేకుండా రకరకాల ప్రేరణలతో పనిచేసేవారు ఇందిరాగాంధీ పార్టీలోనే, ఎందరో ఉన్నారని అతడికి తెలుసు. ఇలా తలపోస్తున్న అతడికి హఠాత్తుగా ప్రశ్నలకే ప్రశ్న అనదగిన ప్రశ్న ఎదురైంది: ఇంతకీ ఆమె ప్రేరణ ఏమిటి? అంతలోనే, దైవదూషణ లాంటి తప్పుచేశానన్న భావంతో పెదవి కొరుక్కుని ఆ ప్రశ్నను తుడిచేసుకున్నాడు.

రాష్ట్ర రాజధానికి తిరిగొచ్చి చౌదరిని కలుసుకున్నాడు. చౌదరి యథావిధిగా పట్టపగ్గాలు లేనట్టున్నాడు. కారణం —నమ్మండి, నమ్మకపొండి —మహేంద్రనాథ్ ఎట్టకేలకు మొరార్జీ పార్టీకి తన విధేయతను ప్రకటించడం. ఆనంద్ అడుగుపెట్టేసరికి చౌదరి తన డ్రాయింగ్‌రూంలో అక్షరాలా పురివిప్పి నాట్యం చేస్తున్నాడు. 'నవ్వవయ్యా, గట్టిగా నవ్వు... ఇది పండగ చేసుకోవలసిన సందర్భం. ఆ గాడిదకొడుకు పీడ విరగడైంది... ఎట్టకేలకు మనకు మనశ్శాంతి దక్కింది!... ఇప్పుడిక చౌదరి తడాఖా చూస్తావు. ఎన్నికలలో నిలబడితే వాణ్ణి ఓడించి తీరతాను. వాడి మొహాన్ని బురదలో పొర్లిస్తాను. ఆ తర్వాత ఇక మహేంద్రనాథ్ పేరు వినపడదు... వాడి గురించి ఓ చక్కని అంతిమవాక్యం నువ్వే ఎందుకు రాయకూడదు? రచనా కౌశలంలో నీ ప్రతిభను ప్రదర్శించుకోడానికి ఇంతకుమించిన మంచి అవకాశం దొరకదు!'

'ఆయన ఎన్నికలో నిలబడకపోవచ్చు,' ఆనంద్ అన్నాడు.

'లేదు, లేదు, నిలబడతాడు. నేను చెబుతున్నానుగా!' చౌదరి తటాలున అన్నాడు. 'అతడి గురించి నాకు తెలిసినంత నీకు తెలియదు. తప్పకుండా నిలబడతాడు, తప్పకుండా...'

ఒక్కొక్క వల్లింపుకీ అతడి ఊనిక తగ్గుముఖంపట్టి ఉద్ఘాటనలో అనిశ్చితి తొంగిచూసింది. అంతలో ఏదో మెరుపులా స్ఫురించి అరిచాడు, 'నిలబడకపోతే వాడి రంగే బయటపడిపో తుంది! అదే వాడి అంతిమవాక్యం అవుతుంది, చూసుకో!'

ఈ విషయంపట్ల ఆనంద్ వైఖరి చౌదరి ఆనందోత్సాహానికి భిన్నంగా ఉంది. అతనికి ఇదొక అప్రముఖాంశం. గెలుపు-ఓటములను అంతగా ఉత్సాహ నిరుత్సాహాలు కలిగించే సంఘటనలుగా అతడు భావించడం లేదు. ఇంతటి పెనుతుఫానులో వ్యక్తులు లేస్తారు, పడిపోతారు. దేశానికదంత ముఖ్యం కాదు. ముఖ్యమైన అంశం పార్టీకి దొరికే మొత్తం సీట్లు. తద్వారా తమ బతుకులను మారుస్తానని ఇందిరాగాంధీ చేసిన వాగ్దానాలకు వాళ్లెంతవరకు స్పందించారన్నది ముఖ్యాంశం.

ఈ ఎన్నికకు సంబంధించిన మరో కోణం అతణ్ణి అన్నింటినీ మించి కలవరపెట్టింది. వోటు వేసే ముందు వోటర్లు మంచిచెడులు గట్టిగా ఆలోచించుకోలేకపోతే అయోమయపరిస్థితిలోకి జారిపోతారని అతడి కనిపించింది. జవహర్లాల్ నెహ్రూపై వారి నమ్మకం తిరుగులేనిది కనుక వెనకటి ఎన్నికల్లో వాళ్ళకు గట్టిగా తమే యోచించవలసిన అవసరం లేకపోయింది. ఎవరో కొందరు వివరాల్లోకి, కఠోర వాస్తవాల్లోకి వెళ్ళగలిగినా, చాలామంది వాటికి దూరంగానే ఉండి పోయారు, పార్టీ మళ్ళీ మళ్ళీ అధికారంలోకి వస్తూనే ఉంది. జవహర్లాల్ జీవించి ఉన్నప్పుడే కొంతమేరకు భ్రమలు చెదిరిపోవటం ప్రారంభమైనా —అది ఆయన నేతృత్వం గురించి, ఇతర సద్గుణాల గురించి కాదు, తన స్వప్నాలను సాకారం చేయగల ఆయన సామర్థ్యాన్ని శంకించవలసి రావడం వల్ల. ఆయన మహోన్నతుడన్న వారే చాలామంది. అయితే ఆయన శిరస్సు మేఘ మండలాన్ని తాకుతూ ఉండడంతో, తన పాదాల కింది నేల జారిపోతున్న విషయాన్ని గమ నించలేకపోయారని వ్యాఖ్యానించిన వారూ లేకపోలేదు. గొప్ప స్వాప్నికుడు ప్రధానమంత్రి అయినంతమాత్రాన సరిపోదని ప్రజలు భావించడం ప్రారంభించారు. కలలు మాత్రమే కడుపు నింపవన్నది వారి వ్యాఖ్య.

అదీగాక ఇందిరాగాంధీ జవహర్లాల్ కారన్న మౌలిక వాస్తవాన్ని విస్మరించడానికి వీల్లేదు. ఆమె విషయంలో స్వాప్నికదృష్టి ఎంతమాత్రం పనిచేయదు. ఆమె తలపడవలసింది కటిక వాస్తవాలతో. అవేమిటో కళ్ళ ముందు కనిపిస్తూనే ఉన్నాయి. సంపన్నులు మరింత సంపన్నులవుతున్నారు, పేదలు మరింత పేదలవుతున్నారు. ప్రభుత్వ కార్యక్రమాల వల్ల పేదలకు ఎంతో కొంత లాభం జరుగుతున్నా, అది రోజురోజుకీ పెరుగుతున్న సంపన్నుల సంపదతో పోల్చిచూస్తే ఆనకుండానే పోతోంది. పేదలు దాదాపు ఉన్నచోటే ఉండిపోయిన స్థితిలో సంపన్నుల అధికవృద్ధి ఒక శాశ్వతవ్రణంలా బాధించసాగింది. అమలులో ఉన్న ప్రభుత్వ పథకాల ప్రయోజనాలు

కూడా చేరవలసిన వాళ్ళకు చేరకుండా పోతున్నాయి. పెరిగిపోతున్న అసమానతలతో పాటే సాంఘిక ఉద్రిక్తతలూ పెరిగిపోతున్నాయి. దేశంలోని కొన్ని ప్రాంతాలలో మొదలైన నక్సలైట్ ఉద్యమం —ఇంకా అంత విస్తృతం కాకపోయినా, కొట్టొచ్చినట్టు కనిపిస్తూ, దేశం అనుసరిస్తున్న ప్రజాస్వామిక ప్రక్రియలో బయటపడిన పరిమితులకు అద్దం పడుతోంది. తార్కికంగా చెప్పుకోవాలంటే సోషలిజం అనే నూతన సైద్ధాంతికతలో భాగంగా అట్టడుగు జనానికి 'పైకి వెళ్ళడానికి' దారి దొరికిందన్న దృశ్యాన్ని చూపించడంలో సహాయకారిగా, పైనున్న వారిని కొంత కిందికి దింపడం ఆవశ్యకమైనట్టు స్పష్టంగా కనిపించింది. కొందరు నాయకులకు రుచించినా రుచించకపోయినా నాణేనికి ఉన్న ఆ రెండు పార్శ్వాలూ ఒకదానితో ఒకటి ముడిపడినవే. ఈ పరిస్థితిని ముఖాముఖి ఎదుర్కోవడమొక్కటే మార్గమనిపిస్తున్న దశలో ఇందిరాగాంధీ ఏం చేయబోతున్నారు.

ఈ సవాలునుంచి సంపూర్ణస్పందనకు అద్దంపడుతూ అత్యంత ఉత్తేజకరమైన సంకేతం ఆవిర్భవించింది. దేశం ఎదుర్కొంటున్న రుగ్మతకు మూలకారణమూ —దాని సర్వస్వం కూడా – దారిద్ర్యమే కనుక గరీబీ హటావో నినాదం రూపుదిద్దుకుంది. విద్యుద్వేగంతో అది ప్రజల్ని ఆకట్టుకుంది. పాఠాంతరాలు, అనువాదాలూ, టీకా, తాత్పర్యాలూ, వివరణలతో పనిలేకుండా ఆ నినాదం దేశం నలుమూలలకూ పాకిపోయింది. తమిళంలో అది గరీబీ హటావో, మణిపురిలోనూ గరీబీ హటావో. అదొక పిడుగుపాటు. అదొక అతీంద్రియస్ఫురణ. అదొక విప్లవం. దాని సృష్టికర్త ఎవరో, లేదా ఆ నినాదరూపశిల్పి ఎవరో బహుశా ఎవరికీ తెలియదు; ఆ స్ఫూర్తికి ఏది మూలమో ఎవరికీ తెలియదు. కానీ ఆ వ్యక్తి తన ఆత్మలోతులనుంచి ఉత్తేజితుడై ఉంటాడు. ఆ నినాదం శుద్ధకవిత్వం, దివ్యసంగీతం, వేదమంత్రం. అందరికీ అన్నీ తనే అయిన నినాదం అది... ప్రభావంలో అది అత్యద్భుతం ప్రభావంలోనే కాదు, క్లుప్తతలో, ముచ్చటగొలిపే సారళ్యంలో అది దాదాపు 1942 నాటి క్విట్ ఇండియా నినాదానికి సాటివచ్చే నినాదం.

దానిని మించగలిగినదేదీలేదు —ఏదీ లేదు. అదొక ఉత్తుంగతరంగాన్ని రేపింది —ఏ ఒక్కరూ నిరోధించలేని మహోద్ధృత తరంగం అది. ఆ కెరటం మీదుగా ఎన్నో గడ్డిపరకలు సైతం అత్యంత వైభవోపేతంగా ఒడ్డు చేరుకోగలిగాయి. దానిని నిరోధించబోయిన పాషాణపర్వతాలెన్నో కుప్పకూలి నీట మునిగిపోయాయి.

ఆ మాటలు ఒక రాజకీయ మహోద్భుతాన్ని శిల్పీకరించాయి.

ఇంకేవీ సోదిలోకి రాలేదు —అభ్యర్థులు, కులాలు, మతాలు, ప్రసంగాలు, ప్రచారాలు, పొత్తులు, ఎత్తుగడలు, డబ్బు, కండబలం... ఏవీ.

ప్రజలు కేవలం వోట్ల లెక్కింపు కోసమే ఎదురుచూశారు; ప్రచారం ప్రారంభం కావడానికి ముందే వారికి ఫలితం తెలిసిపోయింది.

ఇందిరాగాంధీకి జై! దిక్కులు పిక్కటిల్లాయి.

ఆమె నాయకత్వం రాత్రికిరాత్రి పరిపక్వతను సంతరించుకుంది — శాశ్వతంగా.

# 49

ఇందిరాగాంధీ విజయంతో దేశమంతటా ఉత్సవ వాతావరణం వెల్లివిరిసింది. నిష్కాపట్యం, జాగృత చైతన్యం కలగలిసిన గ్రామీణ నిరుపేద ఒకింత దర్పంతో తిరగడం ప్రారంభించాడు. తన గరీబీ (పేదరికం) త్వరలోనే తొలగిపోతుందనుకున్నాడు. అంతటా ఉత్తేజం నింపిన ఆమె విజయం తొలినాళ్ళలో నిజంగానే అన్ని సామాజికవర్గాల్లో ఆనందోత్సాహాలు మిన్నుముట్టాయి.

ఉదాహరణకు భూస్వామ్యవ్యవస్థను తనలో మూర్తీభవింపజేసుకున్న బలరాంలాంటి వ్యక్తుల నుంచి సైతం ఇందిరాగాంధీ ఉత్సాహభరిత సమర్థనను అందుకోవడంలో ఇది స్పష్టంగా ప్రతిబింబించింది. భూస్వామ్యవర్గం మూకుమ్మడిగా ఇందిరాగాంధీని ఎందుకు సమర్థించాలో అతడు తనదైన తర్కాన్నీ రూపొందించుకోగలిగాడు. ఒక్కోసారి అధికారపక్షంలోని దిగ్గజాల కంటె కూడా బాగా వాదించగలిగాడు. అతడికి ఉపన్యాసాలిచ్చే ప్రవృత్తి కాదు. పైగా అతడి భూస్వామ్య మనస్తత్వం ఎన్నికలప్రచారాన్ని ఓ పెద్ద మోసంగా పరిగణించి చులకనగా చూస్తూ ఉండేది. అయితే ఈ ఎన్నికలో అతడు కేవలం ఒక భూస్వామ్యకులీనుడికే చేతనైన పద్ధతిలో భూసంస్కరణ ఆవశ్యకతపై అందరినీ ఒప్పించేలా మాట్లాడగలిగాడు. 'ఈ నక్సలైట్లను చూడండి. గ్రామీణప్రజల బతుకుల్లో నిప్పులు పోస్తున్నారు. ఇంతకాలం ఊరు బాగోగులు భూస్వామ్యే చూసుకుంటూ వచ్చాడు. నేటి వాతావరణంలో అతడు ఇమడగల పరిస్థితి కనిపించడం లేదు. అంచేత ఏమిటి చేయడం? భూమిలేనివాళ్ళకి భూమి ఇచ్చి నక్సలైట్ల బారినుంచి కాపాడమని ఇందిరాగాంధీ చెబుతున్నారు. నూటికి నూరుపాళ్ళు ఆ మాటతో నేను ఏకీభవిస్తున్నాను. కనుక మిత్రులారా, ఇందిరాగాంధీపార్టీకి వోటువేయండి. రక్తపాతంనుంచి గ్రామాలను కాపాడి హత్యలు, దోపిడీలనుంచి మిమ్మల్ని మీరు కాపాడుకోండి!'

ప్రచారసమయంలో ఈ ప్రసంగాలు వింటూ అరుణ పగలబడి నవ్వేసింది. కొన్ని సమావేశాలకు హాజరైన ఆనంద్ కూడా, ఎటుబడితే అటు వంగే భూస్వామ్యవర్గస్వభావాన్ని చూసి విస్తుపోయాడు. ఫాసిజం నుంచి నక్సలిజం వరకూ వారు సర్దుకుపోని పరిస్థితే ఉండదనిపించింది. ఎన్నికల ప్రచారంలో ఆనంద్ పని ఎంతో తేలికైపోయింది. భూస్వామే భూసంస్కరణల అవసరాన్ని నొక్కిచెబుతున్నప్పుడు భూసంస్కరణలమంత్రి అదనంగా చెప్పవలసిందేముంటుంది? కనుక బలరాం మాటల్నే సమర్థించి ఊరుకునేవాడు. అయినా అతడి ఆంతర్యాన్ని శంకించకుండా

ఉండలేకపోయాడు. ఈ సరికొత్త ఉద్ఘాటన అంతా మానసిక పరివర్తన ఫలితమేనని నమ్మలేకపోయాడు.

తన అన్నలో భూసంస్కరణలపట్ల కొత్తగా పుట్టుకొచ్చిన ప్రేమను అరుణ కూడా విశ్వసించలేకపోయింది. 'నీలో వచ్చిన మార్పు వెనక అంతబట్టని కారణమేదో ఉన్నట్టుంది భయ్యా' అంది అల్లరిగా. 'ఇందిరాగాంధీవైపు ఉండడంవల్ల నీకేదో లాభం కనిపించినట్టుంది?'

'ఎవరివైపునున్నా నాకు లాభాలు కనిపిస్తూనే ఉంటాయి' బలరాం చివాలున జవాబిచ్చాడు.

'నక్సలైట్లవైపున్నా...' అరుణ ఎద్దేవాగా అంది.

'ఆహా. వాళ్ళవైపునుంటే ఇంకా ప్రత్యేకమైన లాభాలుంటాయి' బలరాం ఏమాత్రం తొణక్కుండా జవాబుచెప్పాడు.

ఈ విధంగా అన్ని సామాజికవర్గాలూ ఇందిరాగాంధీ పాలనతో మైత్రిని స్థాపించుకోవడం ప్రారంభించాయి. ఇప్పుడామె వెనకటి ఇందిరాగాంధీ కారు. జవహర్లాల్ కుమార్తెగా కాక, తనకు తానుగా అత్యున్నతస్థాయిని అందుకున్న నాయకురాలు. జవహర్లాల్‌ను గీటురాయిగా తీసుకుని ఇందిరాగాంధీని పరీక్షించి తండ్రీ కూతుళ్ళ తారతమ్యాలను ఏకరవుపెట్టే రోజులు వెళ్ళిపోయాయి. అలా పోల్చినప్పుడు ఆమెలో కొన్ని లక్షణాలు కొరవడినట్టు, కొన్ని అంశాల్లో లోపాలు ఉన్నట్టు, ఇతరత్రా తండ్రితో సమానురాలైనట్టు జనం భావించేవారు. పర్యవసానం విధిగా ఇందిరాగాంధీకి ప్రతికూలంగానే ఉండేది. ఇప్పుడు, 1971 ఘనవిజయం తర్వాత, తనంతతనే ఒక గీటురాయి కాకపోయినా ఒకరితో పోల్చవలసిన పరిస్థితినుంచి మాత్రం బయటపడ్డారు.

ఆమె దేశపరిపాలనకూ, అంతర్గతసమస్యల పరిష్కారానికే తనను పరిమితం చేసుకోలేదు. ఏ ప్రధానమంత్రీ తప్పించుకోలేని ఒకానొక అంతర్జాతీయపాత్రను భారతదేశం పోషించవలసి ఉంది. నెహ్రూ దీనిని అద్వితీయంగా పోషించి తనకీ, దేశానికీ కూడా ఎంతో ప్రతిష్ఠను తెచ్చిపెట్టారు. తన కాలంలో ఆయన ప్రపంచంలోనే గొప్ప రాజనీతిజ్ఞులలో ఒకరుగా వెలిగిపోయారు. ఆయనా, దేశమూ నిర్వహించిన ఆ పాత్ర ఆయన మృతితో ముగిసిపోలేదు సరికదా, దిగజారుతున్న అంతర్జాతీయపరిస్థితి, భారతదేశం చుట్టుపక్కల ఏర్పడిన ఉద్రిక్తవాతావరణం దృష్ట్యా అది మరింత సంక్లిష్టంగా మారింది. పాకిస్తాన్ సుస్థిరత నింకా సాధించలేదు, దాని అంతర్గత వైరుధ్యాలూ, చీలికలూ విషమించి క్రమంగా, ఆ దశాబ్దిలోనే మహత్తరమనదగిన పరిణామాన్ని తెచ్చిపెట్టాయి. అది బంగ్లాదేశ్ ఆవిర్భావం. ఈ చరిత్రాత్మకపరిణామంలో ఇందిరాగాంధీ కీలకపాత్రపోషణ కూడా, ఆమె 1971 ఎన్నికల ఘనవిజయం వెన్నంటే వచ్చింది. ఆమె కీర్తి మిన్నంటిన క్షణాలవి. పాకిస్తాన్ పాలకవర్గాలు ఆమెపట్ల శాశ్వతంగా భయ, ద్వేషాలు పెంచుకోడానికి ఇది కారణమైంది. తమ దేశపు ప్రాక్, పశ్చిమభాగాలను కలిపిఉంచుకోలేకపోయిన తమ వైఫల్యాన్ని కప్పిపుచ్చుకోడానికి ఇది ఒక వంకగా వాళ్ళకు పనికొచ్చింది.

★ ★ ★

నాటకీయత, సాహసికత, తిరుగుబాట్లు, వెన్నుపోట్లు, పోరాటాలు విజయాలు, అణచివేత, అంతిమంగా స్వాతంత్ర్యసిద్ధి బంగ్లాదేశ్ ఒక ఐతిహాసిక గాథ.

పాకిస్తాన్ ఏర్పడిన తర్వాత మధ్య మధ్య స్వల్పకాలిక పౌరప్రభుత్వాలు మినహా రెండు దశాబ్దాలకుపైగా సైనిక నియంతల ఏలుబడే కొనసాగుతూ వచ్చింది. పాకిస్తాన్ భౌగోళికంగా, జాతిపరంగా వైవిధ్యభరితమైన దేశం, పైగా అది అంతర్గతంగా ప్రజాస్వామికవాతావరణం కలిగి ఉన్నది కాదు. ఇతర కారణాలతో పాటు ఈ కారణం కూడా సైనికనియంతలు అవలీలగా అధికారాన్ని తమ చేతుల్లోకి తీసుకోడానికి అవకాశమిచ్చింది.

ప్రత్యేకించి, పాకిస్తాన్ ప్రాక్ పశ్చిమభాగాలలోని ప్రజలమధ్య చెప్పుకోదగిన సాదృశ్యాలు లేవు, మతం ఒక్కటే వారిని ఏకజాతీయత కలిగిన దేశంగా బంధించి ఉంచింది. సమైక్యం కావాలన్న మౌలికేచ్ఛ లేకపోవడంతో పాటు, వారిని విడదీస్తున్న భౌగోళికదూరంకూడా సమైక్యతా యత్నంలో సమస్యలు సృష్టించింది. పాకిస్తాన్ ఏర్పడిన నాటినుంచి, సైనిక, పౌరఉద్యోగుల సంఖ్యాబలం, ఆర్థికాభివృద్ధితో సహా అన్ని అంశాలలోనూ రెండుప్రాంతాల మధ్య అసమానతలే నెలకొని ఉన్నాయి. ఉదాహరణకు దేశవిభజనసమయంలో పాకిస్తాన్‌వైపు మొగ్గిన నూటముప్పై ముగ్గురు ఇండియన్ సివిల్ సర్వీస్ అధికారులలో ఒక్కరే బెంగాలీ.

తూర్పు పాకిస్తాన్ ప్రజలు రెండు విషయాల్లో తాము అధికులమని భావిస్తారు. అవి: భాష, సాంస్కృతిక వారసత్వం. దాంతో పశ్చిమపాకిస్తాన్ నాయకులు ఉర్దూను దేశమంతటికీ అధికార భాషగా చేయబోయేసరికి బెంగాలీని అధికారభాషల్లో ఒకటిగా గుర్తించాలన్న డిమాండ్ తూర్పుపాకిస్తాన్‌లో వెంటనే పుట్టుకొచ్చింది. జాతిపరమైన మనోభావాలతోనే కాదు, ఉద్యోగావకాశాలలో, సాంఘికప్రతిపత్తితో కూడా భాష ప్రత్యక్షంగా ముడిపడి ఉంది. పాకిస్తాన్‌లో అటు ఉర్దూ, ఇటు బెంగాలీ మాట్లాడే ప్రజానీకమంతటికీ ఈ విషయం బాగా తెలుసు.

1946లో అప్పటికింకా పాకిస్తాన్ ఊహల్లో రూపుదిద్దుకుంటుండగానే ఈ విషయంలో అభిప్రాయభేదాలు పొడసూపాయి. అయితే పాకిస్తాన్‌రూపంలో కలగబోయే సరికొత్త గుర్తింపు కలిగించిన బ్రహ్మాండమైన ఉత్తేజంలో ఇది అందరికీ స్వల్పవిషయంగానే కనిపించింది. పాకిస్తాన్ ఆవిర్భవించిన వెంటనే భాషావివాదానికి సంబంధించిన వాస్తవాలు ఒక్కసారిగా తెరముందుకు వచ్చాయి. 1948లో ప్రభుత్వం ఢాకా సచివాలయంలోని కిందిస్థాయి ఉద్యోగాలలో బెంగాలీ భాషేతరులను పెద్దసంఖ్యలో నియమించడంతో వ్యతిరేకత కట్టలు తెంచుకోవడం ప్రారంభించింది. తూర్పు పాకిస్తాన్‌కు చెందిన సాహిత్యవేత్త అబ్దుల్ మన్సూర్ అహ్మద్ ఇలా అంటారు:

*'పందొమ్మిదో శతాబ్ది మధ్యలో బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు పరిషియన్ స్థానంలో ఇంగ్లీషును అధికారభాషగాప్రకటించి ఎందరో ముస్లిం విద్యావంతులను అప్పటికప్పుడు 'నిరక్షరాస్యులు'గా, ప్రభుత్వోద్యోగాలకు 'అనర్హులు'గా మార్చివేసినట్టే ఉర్దూను పాకిస్తాన్‌లో అధికారభాషగా ప్రకటించి తూర్పు పాకిస్తాన్‌లోని ఎందరో విద్యావంతుల్ని రాత్రికిరాత్రి 'నిరక్షరాస్యులు'గా ప్రభుత్వోద్యోగాలకు 'అనర్హులు'గా చేసివేశారు.'*

ఉర్దూను పాకిస్తాన్‌లో ఏకైక అధికారభాష చేయాలన్న ప్రతిపాదనకు ఊతమిచ్చింది స్వయంగా జిన్నా. ద్విభాషాసూత్రాన్ని ఆయన నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. కైద్ ఎ ఆజమ్ ఇచ్చిన తీర్పే అంతిమం. ఏకైక దేశభాషగా ఉర్దూ పాకిస్తాన్ జాతీయచిహ్నం కావాలన్న సిద్ధాంతానికే జిన్నా అంటిపెట్టుకుని ఉండిపోయారు. అంతే తప్ప అత్యధిక సంఖ్యాబలం ఉన్న తూర్పుపాకిస్తాన్ ప్రజలకు ఉర్దూ తెలియదనీ, ఉర్దూలో వాళ్ళు మాట్లాడరనే వాస్తవాన్ని పట్టించుకోలేదు. బెంగాలీని అధికారభాషల్లో ఒకటిగా గుర్తించాలని డిమాండ్ చేస్తున్నవారిని 'పాకిస్తాన్ శత్రువులు'గా, 'వెలుపల శక్తులనుంచి ఆర్థికసహాయం పొందుతున్న... పిఫ్త్ కాలమిస్టులుగా' ఆయన చిత్రించారు. బలప్రయోగంతో అణచిపారేస్తామని కూడా బెదిరించాడు. భాషాపరంగా, సాంస్కృతికంగా తూర్పుపాకిస్తాన్‌కు ఉన్న ప్రత్యేకతల్ని తుడిచిపెట్టి పాకిస్తాన్‌లో ఐక్యతను స్థాపించడం ఆయన వ్యూహం. జిన్నా అనంతర నాయకులు కూడా ఇదే వ్యూహాన్ని మొండిగా కొనసాగించారు. అప్పటి పాకిస్తాన్ ప్రధాని ఢాకా పర్యటనకు వెళ్ళినప్పుడు ఉర్దూ 'ఒక్కటే' పాకిస్తాన్ అధికారభాష అంటూ నిర్ద్వంద్వమైన ప్రకటనచేశారు.

1953లో తూర్పు పాకిస్తాన్‌లో ఒక్కుమ్మడి బెంగాలీకి అనుకూలంగా తిరుగుబాటు ప్రజ్వరిల్లింది. ఎందరో సాహసిక యువకులు తూటాలకు ఎదురునిలిచారు. అయితే భాషా వివాదం మొత్తం వివాదానికి ఒక సన్ననికొన మాత్రమే. రకరకాల కారణాలతో తూర్పు పాకిస్తాన్‌ను ముంచెత్తిన అశాంతికీ, అసంతృప్తికీ అది కేవలం ఒక సూచిక. ప్రజల ఊహలో 'వలసపీడన'కు అద్దంపడుతున్న పశ్చిమపాకిస్తాన్ నుంచి తూర్పుపాకిస్తాన్ విముక్తికి తలపెట్టిన పోరాటంగా అది క్రమంగా విస్తరించింది. మతసంబంధం బలహీనపడింది. ప్రత్యామ్నాయంగా, లౌకిక వాద ప్రేరితదేశంగా తాము అవతరించాలన్న యోచన తూర్పుపాకిస్తాన్ ప్రజల్లో కనీసం అక్కడి ఆలోచనాపరుల్లో బలం పుంజుకోసాగింది.

భాషారాజకీయాలు తొలిమంట రాజేయగానే అంతే కీలకమైన, బహుశా అంతకుమించిన ఇతర అంశాలు కూడా పైకి తోసుకొచ్చాయి. జనాభారీత్యా తమదే పైచేయి కనుక, దామాషాను చట్టసభలో, పరిపాలనలో తమకు పెద్దవాటా ఇవ్వాలని తూర్పుపాకిస్తాన్ డిమాండ్‌చేసింది. దీనికితోడు, కొన్ని నిర్దిష్టమైన అంశాలను కేంద్రప్రభుత్వం తన పరిధిలో ఉంచుకుని మిగిలిన అంశాలలో తూర్పుపాకిస్తాన్‌కు స్వయంపాలక ప్రతిపత్తి నివ్వాలన్న డిమాండు కూడా ముందు కొచ్చింది. పశ్చిమప్రాంతాని కిది ఎంతమాత్రం ఆమోదయోగ్యం కాలేదు. పర్యవసానంగా రాజ్యాంగనిర్మాణప్రక్రియ కొన్నేళ్ళపాటు సాగదీయబడి 1954లో అర్థతరంగా ఆగిపోయింది.

ఆ తర్వాత 'సమానత్వసూత్రం' ఒకటి పుట్టుకొచ్చింది. దాని ప్రకారం, రెండు అధికార భాషలు, సాంస్కృతిక స్వయంప్రతిపత్తితో సహా తూర్పు పశ్చిమ ప్రాంతాలు రెండింటికీ సమాన ప్రాతినిధ్యం అమలుజరగాలి. మొదట్లో రెండు ప్రాంతాలూ ఇందుకు సమ్మతించాయి కానీ, నడుస్తున్న రాజకీయప్రక్రియ నంతటినీ ఆయూబ్‌ఖాన్ సైనికప్రభుత్వం అంతిమంగా హస్తగతం చేసుకోవడంతో వెనువెంటనే పశ్చిమప్రాంతం ఈ ఒప్పందాన్ని ఉల్లంఘించింది.

ఆయూబ్ రకరకాల ఉత్తర్వులకు సమకట్టాడు. బెంగాలీ లిపిని రోమన్ లిపిలోకి మార్చా లనుకున్నాడు. బెంగాలీనుంచి సంస్కృతపదాలను ఏరివేసి వాటికి సమానార్థకాలైన పర్షియన్, అరబిక్ పదాల్ని వాటి స్థానంలో చొప్పించి భాషను 'సంస్కరించే' ప్రయత్నం చేశాడు. చివరగా, హిందూకవుల బెంగాలీరచనల్ని పాఠ్యపుస్తకాలలో చేర్చడాన్ని నిషేధించాడు. ప్రభుత్వపోషణలో ఉన్న ప్రసారసాధనాలు, పత్రికలు తూర్పుబెంగాల్‌నుంచి రవీంద్రనాథ్ టాగోర్‌ను వెలిబోయాయి. ఈ చర్యలు అప్పటికే రగులుతున్న మంటకు మరింత ఇంధనాన్నే అందించాయి. తూర్పుబెంగాల్‌కు చెందిన అగ్రశ్రేణి కవులు స్వతంత్రదేశావిర్భావాన్ని సంకేతిస్తూ స్వాగతిస్తూ హృదయాలలో ఉత్తేజమూ, ఉద్వేగమూ నింపే దేశభక్తిగీతాలను విరచించి గానంచేశారు.

ఆర్థికదృష్టికోణంనుంచి చూస్తే, తూర్పుబెంగాల్ మొదటినుంచి నష్టదాయకస్థితిలోనే ఉంది. తూర్పు ప్రాంతంలో ముస్లిం జనాభా ఎక్కువ కనుక ఆ ప్రాతిపదికపై 1947లో బెంగాల్‌ను తూర్పు, పశ్చిమాలుగా రెండుముక్కలు చేయడం జరిగి దరిమిలాను తూర్పుబెంగాల్ తూర్పుపాకిస్తాన్ అయింది. పశ్చిమబెంగాల్ ఆర్థికంగా, పారిశ్రామికంగా మిగిలిన భారతదేశంలో కలిసిపోయినా, అవతలి ముక్క భౌగోళికంగా, సాంస్కృతికంగా పశ్చిమపాకిస్తాన్‌కు దూరంగానే ఉండిపోయింది. పాకిస్తాన్‌లో ఏమైనా అభివృద్ధి అంటూ జరిగితే అది కేవలం తూర్పుపాకిస్తాన్ ప్రయోజనాలను బలిపెట్టడంద్వారానే జరిగింది.

రెండుప్రాంతాలమధ్య ఒక విధమైన వలససంబంధం వృద్ధిచెందుతూ వచ్చింది. జనుము, తేయాకు తూర్పుపాకిస్తాన్ నుంచి ఎగుమతవుతూ ఉంటాయి; అందువల్ల లభించే విదేశీమారక ద్రవ్యం మాత్రం పశ్చిమ పాకిస్తాన్‌లోని పారిశ్రామికవేత్తలు తమకోసం పెట్టుబడిని పోగుచేసు కోడానికి ఉపయోగపడింది. పశ్చిమపాకిస్తాన్‌లో తయారైన వస్తువులకు తూర్పు పాకిస్తాన్ ఒక లాభసాటి మార్కెట్‌గా మారిపోయింది.

తూర్పుభాగాన్ని పశ్చిమ పాకిస్తాన్ ఆర్థికంగా ఎలా కొల్లగొట్టిందో చెప్పుకోడానికి ఇదొక ఉదాహరణ మాత్రమే. తూర్పుప్రాంతం అభివృద్ధి మీదకంటె పశ్చిమ పాకిస్తాన్ అభివృద్ధి మీదే పెట్టుబడిలో అత్యధికభాగాన్ని ప్రభుత్వం మదుపుపెట్టింది. 1963 —1966 మధ్యకాలంలో తూర్పు పాకిస్తాన్‌లో ప్రైవేట్ పెట్టుబడి దేశం మొత్తంలోని పెట్టుబడిలో అయిదోవంతు మాత్రమే. ఈ అసమానతను కప్పిపుచ్చడానికి ప్రభుత్వం పరిపాలనా సంబంధమైన రకరకాల చిట్కాలను ప్రయోగించింది. అసమానత మరింత ప్రస్ఫుటమై మనస్తాపం పెంచడానికే ఆ చిట్కాలు తోడ్పడ్డాయి. తూర్పుభాగంనుంచి పశ్చిమభాగానికి బదిలీఅయిన వనరుల విలువ ఏడాదికి 200 మిలియన్‌డాలర్లుగా అంచనావేయడం జరిగింది. జరిగిన అన్యాయం ఎవరి దృష్టినీ తప్పించు కోలేనంతగా కొట్టొచ్చినట్టు కనిపిస్తూనే ఉంది. మొత్తంమీద తూర్పుపాకిస్తాన్ దారిద్ర్యమే పశ్చిమ పాకిస్తాన్ సంపదకు దోహదమైందన్నది స్పష్టం.

విద్య, ఆరోగ్యం, సాంఘికసేవల విషయంలో కూడా తూర్పుప్రాంతాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేయడం జరిగింది. అక్షరాస్యత విషయానికొస్తే దేశవిభజన సమయానికి మెరుగైన స్థితిలో ఉన్న తూర్పుపాకిస్తాన్, 1970 నాటికి విద్యారంగంలో అట్టడుగుస్థాయికి జారిపోయింది. పదహారు

పరిశోధనా కేంద్రాలలోనూ పదమూడు పశ్చిమప్రాంతంలోనే ఉన్నాయి. స్కాలర్‌షిప్పులు, శిక్షణ వసతులలో కూడా దానికే సింహభాగం లభించింది.

తాలూక్‌దార్ మునిరుజ్జమాన్ మాటల్లో చెప్పాలంటే:

*'తూర్పుపాకిస్తాన్ ప్రజల దృష్టిలో ఆయుబ్‌ప్రభుత్వం తన హేతుబద్ధతను కోల్పోడానికి ఇదంతా దారితీయించింది. చట్టబద్ధతను కోల్పోవడం మేరకే ఈ పరిణామం పరిమితం కాలేదు. అంతకుమించిన నష్టమెంతో సంభవించింది. ఒకవైపున ఆర్థికాభివృద్ధి నిత్యప్రయోజన స్థాయిని మించి ఎంతో ఉన్నతస్థాయికి పెరిగిపోయింది. దీనివల్ల మరోవైపున జనంలో పెరుగుతున్న ఆర్థికపరమైన నైరాశ్యస్థితి అదుపుమించిపోకుండా ఆవగలిగిన సైద్ధాంతిక, రాజకీయవిలువల వికసనం జరగలేదు. తూర్పు, పశ్చిమ పాకిస్తాన్‌ల మధ్య దీని పరిణామంగా నెలకొన్న ఆర్థిక అసమానతల గురించిన నిరంతర చర్చ తూర్పుపాకిస్తాన్‌లోని విద్యావంతులలో తమకు తీరని నష్టం జరిగిందన్న తీవ్ర పరితాపాన్ని పెంచిపోషించింది. పశ్చిమపాకిస్తాన్‌తో తమకున్న వలసముడిని పూర్తిగా తెంచుకుంటే తప్ప తూర్పుపాకిస్తాన్ ఆర్థికంగా పురోగమించలేదంటూ కొందరు తూర్పుపాకిస్తాన్ నాయకులు అత్యంత ప్రబలంగా ముందుకుతెచ్చిన వాదాన్ని ఆమోదించడానికిది వారిని మానసికంగా సిద్ధంచేసింది...*

ఆర్థికరంగంలో ఏర్పడిన 'కొరత'ను పూడ్చడానికి ఎటువంటి రాజకీయ న్యాయసూత్రాలు అమలుజరగలేదు. పైగా, 1965 జనవరిలో జరిగిన అధ్యక్షఎన్నికలతో న్యాయబద్ధమైన పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపై తూర్పుపాకిస్తాన్ ప్రజలు పెంచుకున్న ఆశలు (అధికారంలో తూర్పు ప్రాంతానికి దక్కవలసిన న్యాయమైన వాటాతో సహా) భగ్నమైపోయాయి. ప్రజలకు తనపట్ల సమ్మతి లేకపోయినాసరే తనను తొలగించలేని విధంగా ఆయూబ్ ఎన్నికల నియమావళిని రూపొందింపజేశాడు. నూతనవిధాన రూపకల్పనలో అవే అతడు ప్రదర్శించిన తెలివితేటలు.

చివరకు 1965 నాటి భారత పాకిస్తాన్ యుద్ధంలో కూడా పశ్చిమభాగం ఒక్కటే ప్రాముఖ్యం వహించింది. ఈ విషయంలో పశ్చిమపాకిస్తాన్ పాలకులు తూర్పుపాకిస్తాన్ ప్రజల్ని సంప్రతించడం కానీ నిర్ణయాలలో వారికి పాత్ర కల్పించడం కానీ చేయలేదు. ఈ నిర్లక్ష్యం తూర్పుపాకిస్తాన్ ప్రజల హృదయాలను లోతుగా గాయపరిచింది. పశ్చిమపాకిస్తాన్ పాలకులు తూర్పుప్రాంత రక్షణను మొత్తం పాకిస్తాన్ రక్షణలో భాగంగా చూడలేదన్న సంగతినీ వాళ్లు గ్రహించారు. ఉదాహరణకు, యుద్ధ సమయంలో భారతదేశం తలచుకుంటే మిగిలిన భూ భాగంతో తూర్పు పాకిస్తాన్ సంబంధాలను పూర్తిగా విచ్ఛిన్నం చేయగలిగి ఉండేది. అప్పుడు పశ్చిమభాగం చేయగలిగిందేమీ ఉండదు, బహుశా ఏదైనా చేయాలని కూడా అనుకొని ఉండేది కాదు. దాంతో తూర్పుప్రాంత ప్రజలు తమ క్షేమం తమే చూసుకోవలసి వస్తుందనుకున్నారు.

ఈ విపర్యయాల మధ్యలోనే, తూర్పుపాకిస్తాన్ అన్ని విధాలా స్వయంసంపూర్ణమైనదన్న సరికొత్త చైతన్యమూ అంకురించి విస్తరించసాగింది. సంపన్న భాషా వారసత్వం, పురాతన సంస్కృతీ, విస్తారమైన సహజవనరులతో పాటు, కొన్ని దశాబ్దాలుగా ఒకరి చేతికింద అణిగి మణిగి ఉండవలసిన పరిస్థితిని తమమీద రుద్దడంపట్ల ఏహ్యాభావాన్ని అందరూ ఉమ్మడిగా

అనుభవిస్తూ భావనాత్మకంగా ఏకమైన అత్యంత బుద్ధిశాలులైన ప్రజలు తూర్పుపాకిస్తాన్‌లో ఉన్నారు. పరిపక్వమైన తమ ఊహాక్షేత్రంలో వారు వేర్పాటులోనే ఉజ్జ్వలభవిష్యత్తను దర్శించసాగారు.

ఈ పరిస్థితి షేక్ ముజిబుర్ రెహమాన్ వంటి జనసమ్మోహనశక్తి కలిగిన నాయకుడి ఆవిర్భావానికి అవకాశమిచ్చింది. 'స్వయంప్రతిపత్తి' సూత్రం పేరిట తూర్పుపాకిస్తాన్‌కు దాదాపు స్వాతంత్ర్యాన్ని కల్పించడానికి ఉద్దేశించిన ఒక బ్లూప్రింట్‌ను ఆయన ముందుకుతెచ్చారు. ఆయుబ్‌ఖాన్ తన వైఖరిని 'ఆయుధభాష'కే అంటిపెట్టుకుని ఉండిపోయాడు. దీనితో రెండుప్రాంతాల మధ్యనున్న విశ్వాసరాహిత్యం మరింత విషమించి ప్రజలస్థాయికి విస్తరించిపోయింది. 'భారతదేశం తోడ్పాటుతో తూర్పుపాకిస్తాన్‌ను విడగొట్టడానికి' కుట్రపన్నాడన్న అభియోగాన్ని ఆయుబ్ వెనువెంటనే షేక్ ముజీబ్‌పై సంధించాడు. స్పెషల్ ట్రిబ్యునల్ ద్వారా ఆయన విచారణ జరిగి, విచారణాంశాలను ప్రతిరోజూ పత్రికలు ప్రచురించాయి. దాంతో ఉద్రిక్తత మరింత పెరిగి పోయింది. ప్రజలలో శత్రుత్వభావం నానాటికీ విషమరూపం ధరించింది. షేక్ ముజీబ్ ఖైదు నుంచి విడుదల కాగానే జరగవలసింది జరిగిపోయింది; ఆయన మహనీయుడుగా, దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడే అగ్రశ్రేణియోద్ధగా మారిపోయారు.

1970 సార్వత్రికఎన్నికలలో షేక్ ముజీబ్ నాయకత్వంలోని అవామీలీగ్ పార్టీ తూర్పు పాకిస్తాన్‌లోని మొత్తం 162 స్థానాలలోనూ 160 స్థానాలను చేజిక్కించుకుని ఘనవిజయం సాధించింది. భారతదేశంతో స్నేహసంబంధాల కృషిని ఆ పార్టీ తన ఎన్నికల ప్రధానాంశంగా ముందుకు తెచ్చింది. పశ్చిమభాగానికి వస్తే, 'భారతదేశంతో వేయి సంవత్సరాల యుద్ధాన్నీ, పాకిస్తాన్‌లో పటిష్ఠమైన కేంద్రప్రభుత్వ స్థాపన'ను తన నినాదాలుగా చేసుకున్న జుల్ఫిఖార్ అలీ భుట్టో నాయకత్వంలోని పాకిస్తాన్ పీపుల్స్‌పార్టీకి మెజారిటీ లభించినా మొత్తంమీద మిశ్రమ ఫలితమే వ్యక్తమైంది. ఊహించినట్టే, ఆ విధంగా రెండుప్రాంతాలలోనూ తీర్పు పరస్పర విరుద్ధంగా పరిణమించింది. రెండుప్రాంతాల ప్రజలూ పూర్తిగా విభిన్నమార్గాలు పట్టదలుచుకున్నట్టు స్పష్టమైంది.

అయినప్పటికీ ఎన్నికలఫలితాన్ని బట్టి పాకిస్తాన్ కేంద్రప్రభుత్వనాయకత్వం షేక్ ముజీబ్‌కే దక్కవలసి ఉండింది. అంటే దేశసమైక్యతను కాపాడవలసిన బాధ్యత ఆయన తన భుజస్కంధాల పైనే వేసుకోవలసి వచ్చేది. అంటే తన 'సమాఖ్య' డిమాండ్‌ను అనివార్యంగా సవరించుకుని మొత్తం దేశానికి అనుకూలించే పద్ధతిని కనుగొనవలసి వచ్చేది.

ఈ ఘట్టంలో వ్యక్తిగతాంశాలు పొటమరించాయి. మొత్తం పాకిస్తాన్‌కు షేక్ ముజీబ్ నాయకుడు కావడాన్ని పశ్చిమ పాకిస్తాన్‌లోని నాయకులు వ్యతిరేకించారు. 'బెంగాలీలు మమ్మల్ని పాలించ డానికి ఒప్పుకో'మన్నది పశ్చిమ పాకిస్తాన్ అంతా అసందిగ్ధంగా మోగిన నినాదం. రెండు భాగాల మధ్య అంతర్గతంగా ఉన్న ప్రాంతీయమైన, జాతిపరమైన, సాంస్కృతికమైన విభేదాలకు అది మరింత ఊతమిచ్చింది. పశ్చిమపాకిస్తాన్ ప్రజలు తూర్పుపాకిస్తాన్ ప్రజల్ని తమకంటె అన్నివిధాలా తక్కువవారుగా పరిగణించారు. ఘర్షణ పొడవునా ఈ రకమైన మానసికవికారం ప్రదర్శితమౌతూనే వచ్చింది. 1970 సార్వత్రికఎన్నికల తర్వాత దేశ నాయకత్వం బెంగాలీల చేతుల్లోకి రావలసి ఉన్న తరుణంలో ఈ ధోరణి మరింత విజృంభించింది.

తూర్పుపాకిస్తాన్ విషయంలో ఎటూ తేల్చుకోలేకపోతున్న పశ్చిమపాకిస్తాన్ నాయకుల సందిగ్ధవైఖరి భుట్టోచే ఒకదానివెంట ఒకటిగా అవివేకపుటడుగులు వేయించింది. 'రెండు మెజారిటీ పార్టీలు', 'రెండు పాకిస్తాన్‌లు' ఉన్నట్టు ఆయన ప్రకటనచేశాడు.

ఈ చివరి ప్రకటన భవిష్యవాణిగా పరిణమించబోతోంది.

★ ★ ★

సరిహద్దుకు ఇవతల, భారత ప్రధానమంత్రి ఇందిరాగాంధీ లోక్‌సభకు అత్యంతకీలకమైన ఎన్నికను ఎదుర్కొనబోతున్నారు. పాకిస్తాన్ నాయకుల చూపులకు ఆమెలో, భారతదేశంలో దుర్బలస్థితి కనిపించింది. ఇటువంటి పరిస్థితికోసం వాళ్ళెప్పుడూ ఎదురుచూస్తూనే వచ్చారు. లేదా ఇందిరాగాంధీలో ఉండిన వాస్తవికశక్తియుక్తుల్ని వారు సరిగానే అంచనావేసుకుని ఆమె అధికారానికి ఎగబాకకుండా నిరోధించాలని ఉద్దేశించి ఉండవచ్చు. పరిణామతః తమ రాజకీయ దుర్విమర్శలకు వారామెను ఏకైకలక్ష్యంగా చేసుకున్నారు. దిక్కుతోచని నిస్సహాయస్థితిలో, అంతర్గతసంక్షోభంనుంచి తమ దేశప్రజల దృష్టిని మళ్ళించడంకోసం ఉధృతస్థాయిలో భారతవ్యతిరేక విషప్రచారానికి పూనుకున్నారు. తూర్పుపాకిస్తాన్ సంక్షోభమూలాలను వక్రీకరించడానికి, కప్పిపుచ్చడానికే వారు ప్రయత్నించారు.

1971 జనవరి 30వ తేదీన, నలుగురు సిబ్బందీ, ఇరవైఎనిమిదిమంది ప్రయాణీకులతో వెడుతున్న ఇండియన్ ఎయిర్‌లైన్స్ ఫొకర్ ఫ్రెండ్‌షిప్ విమానాన్ని కొందరు దుండగులు లాహోర్‌కు దారిమళ్ళించారు. దుండగులు నలభైఎనిమిది గంటల పాటు కఠిననిర్బంధంలో ఉంచి ప్రయాణీకుల్ని పాకిస్తాన్ విడిచి వెళ్ళనిచ్చారు. పాకిస్తాన్‌ప్రభుత్వం ఆ దుండగులకు వెనువెంటనే ఆశ్రయమిచ్చింది. కాశ్మీర్‌ను భారతదేశం నుంచి విముక్తం చేయడానికి పోరాడుతున్న వీరులుగా వారిని పాకిస్తాన్ పత్రికలు చిత్రించాయి. అంతకుముందు కాశ్మీర్‌లో అరెస్టయిన కొందరు 'అల్‌ఫతా' విద్రోహుల్ని విడుదలచేయాలని ఆ దుండగులు డిమాండ్ చేశారు. ఇందిరాగాంధీ తక్షణమే ఆ డిమాండ్‌ను తిరస్కరించారు. విమానం దారిమళ్ళింపు వెనుక పాకిస్తాన్‌ప్రభుత్వ ప్రోత్సాహ సహకారాలు ఉన్నాయంటూ ఇందిరాగాంధీ తీవ్రస్థాయిలో దుయ్యబట్టారు. లాహోర్‌లో పాకిస్తాన్ సైనికాధికారుల కళ్ళముందే భారతవిమానాన్ని దుండగులు ఎలా పేల్చివేయగలరని ఆమె ప్రశ్నించారు. ఇద్దరు దుండగులూ పాకిస్తాన్‌లోనే గెరిల్లాయుద్ధతంత్రంలో శిక్షణపొందినట్టు స్పష్టమైన రుజువులు లభించాయి.

లోక్‌సభఎన్నికలలో పెద్దఎత్తున మెజారిటీ సాధించి 1971 మార్చిలో ఇందిరాగాంధీ తిరిగి అధికారంలోకి వచ్చారు. కొన్ని మాసాలపాటు ఆమెను ఆడిపోసుకున్న సిండికేట్, ఇతరులూ ఘోరమైన పరాజయాన్ని మూటగట్టుకున్నారు. ఆమె ఎదురులేని నాయకత్వస్థానాన్ని అందుకున్నారు; అయినా ఆమె ప్రత్యర్థులు తలవంచారేకానీ నిష్క్రమించలేదు.

తన మనుగడకోసం ఆమె ఇంకా పోరాటాన్ని కొనసాగించక తప్పని పరిస్థితి. అప్పటి ఆ పరిస్థితుల దృష్ట్యా చూస్తే పాకిస్తాన్‌ను రెండుముక్కలు చేయడంగురించి ఆమె యోచించడం

కానీ, అందుకు కుట్రపన్నడం కానీ ఊహకందని విషయాలు. అయితే ఈ లోపల తూర్పు బెంగాల్ నుంచి పశ్చిమబెంగాల్‌కు శరణార్థుల వలస మొదలైపోయింది తక్షణమే దానిపై దృష్టి పెట్టవలసిన అవసరం తలెత్తింది అంటే దానర్థం, ఆ వలసకు కారణమైన మూల సంక్షోభంలోకి ఇందిరాగాంధీ లోతుగా జోక్యం చేసుకోవలసి రావడమే.

ప్రభుత్వమూ, ప్రజలన్న తేడా లేకుండా భారతదేశంలో అందరూ ఎన్నో మాసాలుగా — నిజం చెప్పాలంటే ఎన్నో సంవత్సరాలుగా పాకిస్తాన్ పరిణామాలను మామూలుకంటె మించిన ఆసక్తితోనూ, ఆందోళనతోనూ గమనిస్తూ వస్తున్నారు; నిజానికి గమనించకుండా ఉండనూలేరు. రెండుదేశాలూ ఒకవిధమైన తమకంతో పరస్పరం దృష్టి పెట్టుకోవలసిన పరిస్థితిని దేశవిభజనే తెచ్చిపెట్టింది.

అయినప్పటికీ ఈ విషయంలో ఎటువంటి బహిరంగప్రకటన చేయడమూ ఇందిరాగాంధీ ప్రభుత్వానికి ఇష్టంలేకపోయింది. మార్చి 15వ తేదీన తూర్పు పాకిస్తాన్ స్వయంపాలకప్రతిపత్తి గురించి షేక్ ముజీబ్ ఏకపక్షంగా ప్రకటనచేశారు. యాహ్యాఖాన్ చర్చలు జరపడానికి ఢాకా వెళ్ళాడు, కొద్దిరోజుల తర్వాత భుట్టో వెళ్ళి ఆయనతో కలిశాడు ఈ మధ్యలో పాకిస్తాన్ సైన్యం తూర్పు పాకిస్తాన్‌లో తన ఊచకోత కొనసాగిస్తూనే ఉంది. పరిస్థితిని ఎదుర్కొనే బాధ్యత సైన్యానికే అప్పగించి యాహ్యాఖాన్ మార్చి 25వ తేదీన కరాచీకి తిరిగి వెళ్ళిపోయాడు. సైనికులు ముజీబ్‌ను అరెస్టుచేశారు, ఎందరో మహిళల్ని చెరచారు, వందలాది కార్యకర్తలనూ, మేధావులనూ, విద్యార్థులను, తమ కంటికి కనిపించిన ప్రతిఒకరినీ హతమార్చివేశారు. తూర్పుపాకిస్తాన్‌లోని ఏడుకోట్ల యాభైలక్షల మంది ప్రజలు స్వతంత్ర బంగ్లాదేశ్‌పౌరులుగా అవతరించినట్టు స్వాధీన్‌బంగ్లా బేతార్ కేంద్రంగా నామకరణంచేసిన ఒక రహస్య రేడియో కేంద్రంనుంచి షేక్ ముజీబ్ ప్రకటన చేశారు. (గృహిణి, ఒక యువ స్వాతంత్ర్య సమరయోధుడి తల్లి అయిన జహానారా ఇమామ్, నాటి బాధితప్రజల ప్రగాఢ మనోభావాలకూ, ఉద్రేకాలకూ అద్దంపడుతూ రాసుకున్న డైరీలోని కొన్ని భాగాలను ఈ అధ్యాయం చివర చేర్చడం జరిగింది).

★ ★ ★

ఓ రోజు మంత్రివర్గసమావేశంలో, ముఖ్యమంత్రి చౌదరి ముఖంలో ఆనందం తొణికిసలాడుతున్న సంగతి ఆనంద్ గమనించాడు. ఆ క్షణంలో తనకుమాత్రమే తెలిసిన దేనిగురించో అతడు పొంగిపోతున్నట్టు కనిపించాడు. 'అన్నీ చకచక జరిగిపోతున్నట్టున్నాయి' అని నర్మగర్భంగా అనేసి వెంటనే ఎజెండాలోని అంశాల్లోకి తలదూర్చాడు.

అతడు జారవిడిచిన ఆ సూచన అందరి బుర్రల్నీ తొలచడం ప్రారంభించింది. పరిశీలనలో ఉన్న మంత్రివర్గాంశాలమీద దృష్టి కేంద్రీకరించలేకపోయారు. ఆనవాయితీగా జరిగే చర్చా, వాదోపవాదాలు లేకుండానే కొన్నిటిని వాయిదావేసేశారు, కొన్నింటిని ఆమోదించారు. మామూలుగా ఇతర మంత్రులు ఎంతో వేడుకగా ఎదురుచూసే పరుషవాగ్యుద్ధమేదీ ఆ రోజు ఆనంద్, శేఖర్‌ల మధ్య సంభవించలేదు.

వాళ్ళిద్దరూ ఒకరిమీద ఒకరు విసురుకునే వాగ్బాణాలకు ప్రత్యేకించి ఆనందించే చౌదరి ఓసారి ఓ జర్నలిస్టు మిత్రుడితో అన్నాడు కూడా. 'ఇటీవలి ఎన్నికల తర్వాత ఇటువంటి పహిల్వాన్‌లు చాలామంది ఇందిరాగాంధీ శిబిరంలోకి చేరిపోయినట్టున్నారు. వాళ్ళలో ప్రతిఒకడూ ఇందిరా గాంధీకి విధేయత చాటుకునేవాడే; మళ్ళీ వాడే మిగిలిన వాళ్ళమీద తిట్లు లంకించుకుంటూ ఉంటాడు... చెప్పొద్దూ... ఆమెమీద నాకెంతో ప్రశంసాభావం ఉంది, అయితే అంతకుమించిన జాలీ ఉంది...' ఇటువంటి వ్యాఖ్యల్ని అతడెప్పుడూ బహిరంగంగా చేయనూ చేయడు, అతడి కెంతో సన్నిహితులు విశ్వాసపాత్రులైన జర్నలిస్టులా మాటల్ని ఎప్పుడూ పత్రిక కెక్కించనూ లేదు. అయినా 'ఆరితేరిన' ఇందిరాగాంధీ సహచరులెందరో ఆమె గురించి వెలిబుచ్చే అప్రకటిత అభిప్రాయాలను వాళ్ళ కథనాలు చాలావరకూ ప్రతిబింబిస్తూనే ఉంటాయి. రాజకీయవాదులే కాక అధికారవర్గం కూడా చాలావరకు తమ అంతరాంతరాల్లో ఆమెకు అననుకూలాభి ప్రాయాలున్నవారే.

మంత్రివర్గ సమావేశం అలా నిరాసక్తంగా సాగుతుండగా ఒక అటెండర్ ఓ కాగితం తీసుకుని మెల్లగా లోపలికి అడుగుపెట్టాడు. ఓ పొడవైన పత్రంలో భాగంగా కనిపిస్తున్న ఆ కాగితంమీద ఇంగ్లీషు మొదటిబడిలోని అక్షరాలు కనిపిస్తున్నాయి. తనకు తెలిసిన గౌరవాన్నంతటినీ ప్రదర్శనకు పెడుతున్నట్టు ఆ అటెండర్ తన అరచేతులు రెండింటినీ పళ్ళెంలా చేసి అక్షరాలున్న భాగం పైకి కనిపించేలా ఆ కాగితాన్ని అందులో ఉంచి ముఖ్యమంత్రి ముందు నిలబడ్డాడు. ఆయన ఆ కాగితాన్ని అందుకునేవరకూ అలాగే నిలబడి తర్వాత వెనకడుగులు వేస్తూ నిష్క్రమించాడు. అందరి చూపులూ ఆ కాగితంమీద వాలిపోయాయి. జరుగుతున్న సమావేశం గురించి మంత్రి వర్గం కాస్సేపు మరచిపోయింది.

'పిటిఐ వార్తో యుఎన్ఐ వార్తో అయుంటుంది' ఆనంద్ తను కూర్చున్న చోటునుంచే కాగితంమీద అక్షరాలు చూస్తుస్తూ అన్నాడు. 'అందులో ఏముందో తెలుసుకోవాలని మే మందరం తహతహలాడుతున్నాం...'

చౌదరి ఆ కాగితాన్ని ఓసారి పరికించి, మళ్ళీ మంత్రివర్గపత్రాల్లోకి దృష్టి సారించి అస్పష్ట మందహాసంతో గొణుగుతున్నట్టు అన్నాడు, 'పరిశీలించవలసిన అంశాలు ఇంకా కొన్ని మిగిలి పోయినట్టున్నాయి.'

ఆ టెలెక్స్‌వార్త ఏమిటో తెలుసుకోవాలన్న ఉత్కంఠ అందరినీ ముంచెత్తింది. అదేమిటో తమకు చెప్పమని అందరూ ముక్తకంఠంతో చౌదరిని అడిగారు. అప్పటికి కొన్ని వారాలుగా తూర్పు పాకిస్తాన్ పరిణామాలు యావద్భారతం దృష్టినీ లోబరచుకుంటున్నాయి. ఏదో మహత్తర పరిణామమే జరగబోతున్నట్టు అనిపిస్తోంది —కానీ అదేమిటో ఎవరికీ తెలియదు. తూర్పు పాకిస్తాన్ ప్రజలపై పాకిస్తాన్ సైన్యం సాగిస్తున్న అత్యాచారాల గురించిన వర్ణనలతో పత్రికలు నిండిపోతున్నాయి. షేక్ ముజీబ్ భారతదేశంలో అప్పటికే సుప్రసిద్ధుడూ, బహుధా ప్రశంసలు చూరగొంటున్న నాయకుడూ అయిపోయారు. తూర్పుపాకిస్తాన్ ప్రజల కడగండ్లకూ, త్యాగాలకూ భారతీయహృదయం నుంచి తక్షణ, అప్రయత్నస్పందన వ్యక్తమౌతోంది. బుద్ధుడి నుంచి గాంధీ

వరకూ శతాబ్దాలుగా పరిఢవిల్లుతున్న అవిచ్ఛిన్న వారసత్వం అది. భారతప్రజలు షేక్‌ముజీబ్‌ను మహావీరుడుగా –'తమ సొంత వీరుడు'గా పరిగణించడం ప్రారంభించారు.

'ఇది చాలా గొప్పవార్త,' టెలెక్స్‌లోకి చూపులు బరుపుతూ చౌదరి అన్నాడు. 'బంగ్లాదేశ్ అవతరించింది'

'బంగ్లాదేశ్?' ఒకింత విస్తుపోతూ ఒక సీనియర్‌మంత్రి ఆ మాటను పునరుచ్చరించాడు.

'అవును, ఇప్పుడు బంగ్లాదేశ్; నిన్నటివరకూ తూర్పుపాకిస్తాన్,' చౌదరి వివరించాడు 'ఒక నూతనదేశం, ఒక నూతన జాతీయత... ఇప్పుడిక పాతపేరుతో తమనెలా పిలుచుకుంటారు?'

'బంగ్లాదేశ్,' ఆ పేరులోని అందాన్ని ఆస్వాదిస్తూ అందరూ పాటపాడుతున్నట్టు ఒక్క గొంతుతో అన్నారు.

'బంగ్లాదేశ్ తాత్కాలికప్రభుత్వం తమను గుర్తించవలసిందిగా ఇతర ప్రభుత్వాలను కోరింది. మన ప్రధానమంత్రికి కూడా తెలియజేయడం జరిగింది,' చౌదరి తన అభిప్రాయమేమిటో అంతగా బయటపెట్టకుండానే అన్నాడు.

'మనం వెంటనే గుర్తింపును ప్రకటించాలి,' పలువురు మంత్రులు ఉద్ఘాటించారు.

'మనదేశమే మొట్టమొదట ఆ పనిచేయాలి' ఆనంద్ పట్టలేని ఉద్వేగంతో అరచినంత పనిచేశాడు.

''అవును, కచ్చితంగా' శేఖర్ వెంటనే అందుకుంటూ అన్నాడు.

'మై ఫ్రెండ్స్, అదంత తేలిక కాదు' చౌదరి ఎత్తుకున్నాడు. 'ప్రధానమంత్రి నిన్న ముఖ్య మంత్రులందరికీ రాసిన లేఖవల్ల పరిస్థితి గురించి నా కన్ని వివరాలూ తెలిశాయి. తమ తూర్పు భాగంలో ఆమె కుంపటిరాజేస్తోందని పాకిస్తానీలు ఎప్పుడూ నిందిస్తూనే ఉన్నారు ఇందిరాగాంధీ అంటే ఇష్టపడనివాళ్ళ తక్షణ సమర్థనతో వాళ్ళు ప్రపంచమంతటా ఆమెను యాగీ చేస్తూనే ఉన్నారు.'

'వాళ్ళకు ఆమె మీద ఎందుకు ఇష్టం లేకపోవాలి?' మంత్రుల్లో ఒకరు అందుకున్నారు. 'లోక్‌సభఎన్నికల్లో గెలవడం మినహా ఆమె ఎవరికేం అపకారంచేసింది? ఆమె ఏ దేశాన్నీ ఏ విధంగానూ నొప్పించలేదే!'

'అదంతా పెద్దకథలే' చౌదరి అన్నాడు. ఆనంద్‌వైపు తిరిగి 'ఈ క్షణాన వాళ్ళు ఇందిరా గాంధీని ఇష్టపడకపోవడానికి నువ్వేలాంటి కారణం చూపిస్తావ్?'

'కొన్ని చారిత్రక కారణాల వల్ల కొన్ని అంతర్జాతీయశక్తులు మన దేశాన్నీ, పాకిస్తాన్‌నూ సమానంగా చూడలేవనీ, చూడబోవనీ నా కనిపిస్తోంది. పాకిస్తాన్‌వైపే కొంత మొగ్గు ఉండ డానికి అవకాశముంది. ఆ దేశం పుట్టుకతోనే సంక్రమించిందది. అదే ఇక్కడి లోతైన ప్రశ్నఅని నేను భావిస్తున్నాను. అయినా నాకు పెద్దగా తెలుసుననీ చెప్పలేను...'

'భూసంస్కరణల గురించి తప్ప ఆయన కింకే విషయాలూ పెద్దగా తెలియవు లెండి,' ఎవరో అతణ్ణి దెప్పిపొడవడానికి యత్నిస్తూ అన్నారు.

ఆనంద్ ఆ వ్యాఖ్యను పట్టించుకోలేదు, తన సహచరులలో చాలామందికి భూసంస్కరణలు రుచించని విషయమని అతడికి తెలుసు. ఏ మాత్రం తొణక్కుండా తన మాటలు కొనసాగించాడు. 'అంతర్జాతీయ సంబంధాల గురించి మనలో ఎవరికీ అంతగా తెలియదు. ఆ విషయంతో మనకిక్కడ ఎటువంటి ప్రమేయం లేదు. ఈ క్షణాన కొన్ని పశ్చిమదేశాలు ఇందిరాగాంధీని ఇష్టపడడంలేదని నే ననుకుంటున్నాను. ఆ అయిష్టానికి కారణం ఆమె ఏదో చేసిందని కాదు, బంగ్లాదేశ్‌తో సహా అనేక అంశాలమీద ఆమె తీసుకోబోయే చర్యలకు భయపడి అని నా అభిప్రాయం. .'

'బంగ్లాదేశ్ విషయంలో ఆమె ఏం చేస్తుందని వాళ్ళు భయపడుతున్నారని మీ రనుకుంటున్నారో తెలుసుకోవచ్చా?' మరో మంత్రి వ్యంగ్యాన్ని మేళవించిన గొంతుతో ప్రశ్నించాడు.

'చూడండి, సయీద్‌గారూ,' ఆనంద్ తిప్పికొడుతున్నట్టు అన్నాడు. 'మనకది తెలియదు— కనీసం నాకు తెలియదు. తెలియదని తెలుసు. అయినా మనలో ప్రతిఒకరికీ ఒక స్ఫురణ కలుగుతూనే ఉంది; ఈ ఆటలో మనమందరం పీకలవరకు కూరుకుపోయిన పరిస్థితిలో అమాయకత్వాన్నీ, అజ్ఞానాన్నీ నటించినందువల్ల ప్రయోజనంలేదు. ఇప్పటికిప్పుడు వాస్తవంగా జరుగుతున్నది అవిభక్తభారతాన్ని ఒకవిధంగా రెండోసారి విభజించడం. తొలి విభజనకు మద్దత్తు ఇచ్చినవాళ్ళు సహజంగానే రెండో విభజనకు ఇష్టపడరు. అది తమ పన్నుగడ దారుణంగా విఫలమైందనడానికి తిరుగులేని రుజువూ, తమ ముఖాన పెద్ద చరుపూ అవుతుంది. ఇందిరా గాంధీ బంగ్లాదేశ్‌కు మద్దతు ఇస్తే ఆ చరుపు మరింత దుస్సహమవుతుంది... ప్రధానమంత్రి లాభనష్టాలను బేరీజువేస్తూ తనకు కావలసిన వ్యవధి తాను తీసుకుంటున్నారనుకుంటున్నాను...'

'ఇక్కడ నువ్వు చెప్పింది నిజం', చౌదరి ధ్రువీకరించాడు. 'ఏ విధంగా చూసినా ఈ విషయంలో ఆమె బాగా ఆచితూచి అడుగేస్తోంది... అయినా మన మెందుకింత సంకోచించాలి? అవతల ఓపక్క పాకిస్తానీలు, వాళ్ళ కొమ్ముకాసే ప్రపంచదేశాలవాళ్ళూ ఇప్పటికే నానా అల్లరీచేస్తున్నారు.'

ఈ మధ్యలో ఎవరూ గమనించకుండానే మంత్రివర్గసమావేశం గాలికెగిరిపోయింది. ఇందిరా గాంధీ వేయబోయే తదుపరి అడుగు గురించి దేశంలో ప్రతిచోటా అంతులేని ఊహాగానాలు సాగిపోయాయి. ఆమె చర్య తీసుకుంటారా? తీసుకోరా? ఆమె చర్య తీసుకోవాలా? తీసుకో కూడదా? ఆమె చర్య తీసుకోగలరా? తీసుకోలేరా? ఈ చివరిప్రశ్నకు అవునన్న సమాధానమే అనివార్యంగా వ్యక్తమైంది. తీసుకోదలచుకుంటే ఆమె చర్య తీసుకోగలదన్న వాళ్ళే అందరూ...

ఒకదేశం తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకోవడం వేరు; ఆ స్వాతంత్ర్యాన్ని నిజంచేయడం వేరు. 1971 మార్చి 28వ తేదీన బంగ్లాదేశ్ తాత్కాలిక ప్రభుత్వం స్వాతంత్ర్యప్రకటన చేసింది. ఏప్రిల్ 10వ తేదీన ఒక రహస్యప్రదేశంలో సర్వసత్తాకప్రజాస్వామ్య గణతంత్రరాజ్యంగా బంగ్లాదేశ్ అవతరించింది. ఏప్రిల్ 17వ తేదీన ఆ మేరకు లాంఛనప్రకటన జరిగింది.

విముక్త ప్రాంతంలోనే మౌదంగా అనే గ్రామం ముజీబ్‌నగర్‌గా పునర్నామకరణంతో అవతరించి నూతన గణతంత్రరాజ్యానికి రాజధాని అయింది.

ఇప్పుడు నూతనప్రభుత్వం పాకిస్తాన్‌ప్రభుత్వంలో పనిచేస్తున్న పలువురు బెంగాలీ దౌత్యాధికారుల, ఇతర అధికారుల సేవలను అందుకోగల స్థితిలో ఉంది. కలకత్తాలో పాకిస్తాన్ డిప్యూటీ హైకమిషనర్‌గా ఉన్న హుస్సేన్ అలీ నూతనప్రభుత్వానికి విధేయత ప్రకటించాడు. తన కార్యాలయాన్ని బంగ్లాదేశ్ దౌత్యకార్యాలయంగా మార్చివేశాడు. భారత భూభాగంలో బంగ్లాదేశ్‌కు కాలూనే స్థలం అలా దొరికింది.

దేశాన్ని విముక్తంచేయవలసిన మహత్తర కార్యభారం ఇంకా మిగిలిపోయింది. నూతన ప్రభుత్వం దానిని స్వల్పవ్యవధిలో సాధించగల పరిస్థితిలో లేదు. నూతనంగా సృష్టించబడి తర్వాత ముక్తిబాహినిగా పేరుమార్చుకున్న బంగ్లాదేశ్‌విముక్తిసైన్యం అత్యంతశక్తిమంతమైన పాకిస్తాన్‌సైన్యాన్ని ఎదుర్కొని అప్పట్లో చేయగలిగిందేమీ లేకపోయింది.

బంగ్లాదేశ్‌ను గుర్తించితీరాలని భారతదేశంలో ఈ మూలనుంచి ఆ మూల వరకూ ఒత్తిడి క్రమంగా పుంజుకోసాగింది. ఇందిరాగాంధీప్రభుత్వం ఊగిసలాటపై, తాత్సారంపై అదేపనిగా నిశితవిమర్శలు వచ్చిపడుతున్నాయి. అక్కడికీ తన ఆలోచనేమిటో వివిధ సూచనల ద్వారా వెల్లడించి ఇందిరాగాంధీ పార్లమెంటునీ, ప్రజలనీ శాంతింపజేయడానికి ప్రయత్నించారు. అయినప్పటికీ, బంగ్లాదేశ్ ప్రజల కడగండ్లకు చలించిపోయి ప్రవాహంలా ముందుకు దూకుతున్న ప్రజాభిప్రాయం, సానుభూతికెరటం ఆమెను చాలావరకు నిరంతరం తనను తాను సమర్థించుకోవలసిన స్థితికి నెట్టివేశాయి.

'ఇదంతా వట్టి కాలయాపన', అధికారపక్షంలోని ఎందరో యువసభ్యులు హాహాకారాలు చేశారు. 'మిగిలిన పార్టీలు ఏమంటున్నాయో కాస్త వినిపించుకోండి. మన మిప్పుడేం చేస్తే ఏమిటుపయోగం, ప్రజాభిప్రాయానికి దూరమైపోయాం'. వ్యవహారం ఎంతో సున్నితమైంది కనుక ప్రభుత్వం ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిదని ఇందిరాగాంధీ పార్లమెంటులో శాయశక్తులా వాదించారు. ప్రభుత్వం తగిన సమయంలో తగిన నిర్ణయం తీసుకుంటుందని సూచనప్రాయంగా అన్నారు —'అదికూడా కేవలం సిద్ధాంతప్రకటనరూపంలో కాదు', అని కూడా నర్మగర్భంగా అన్నారు. ఏ పరిస్థితిలోనూ మనం 'అంతర్జాతీయ నియమాల'ను పాటించి తీరవలసిందేనని స్పష్టంచేశారు. భారతదేశవైఖరిని ప్రపంచదేశాలకు వివరించడానికి ప్రభుత్వం పెద్దఎత్తున ప్రచారంకూడా చేపట్టింది. బంగ్లాదేశ్‌నుంచి ప్రవాహంలా వచ్చిపడుతున్న శరణార్థుల సమస్యను తలకెత్తుకోవలసిన గురుతరబాధ్యత భారతదేశానికి ఉందని ఇందిరాగాంధీ స్పష్టంచేశారు. శరణార్థుల సంఖ్య రోజురోజుకీ పెరిగిపోతోంది.

'ఇదంతా వ్యర్థం', అంటూ ఎందరో విమర్శకులు ఆగ్రహం వెలిగక్కారు. 'ఈ విషయంలో మనదేశంపై సానుభూతి చూపించడానికి ఎవరూ సిద్ధంగా లేరు. పాకిస్తాన్ తూర్పుప్రాంతంలో కల్లోలానికి మూలం భారతదేశమేనన్న పాకిస్తాన్ దుష్ప్రచారాన్నే అందరూ నమ్ముతున్నారు. ఇందిరాజీ దేనికోసం ఎదురుతెన్నులు చూస్తున్నారో, ఎవరిని ఒప్పించాలని చూస్తున్నారో

అర్థంకావడం లేదు ఈ లోపల బంగ్లాదేశ్‌లో పాక్‌సైన్యం అత్యాచారాలు నానాటికీ పెరిగిపో తున్నాయి ఆమె ఏదైనా చర్యకు నిర్ణయం తీసుకునే లోపల వాళ్ళు దేశాన్ని సర్వనాశనం చేసేస్తారు...'

నిజంగానే, భారతదేశాన్ని దుష్టశక్తిగా చిత్రించడానికి పాకిస్తాన్ దుష్ప్రచారయంత్రాంగం నిర్విరామంగా పనిచేస్తోంది. వారు అకారణంగా తీసుకుంటున్న చర్యలూ, ప్రతిచర్యల దృష్ట్యా తమ పాకిస్తాన్ కేంద్రనాయకత్వం తూర్పుభాగాన్ని దక్కించుకోగలమన్న ఆశకు అప్పటికే నీళ్ళు దేశం వదిలేసుకుని ఉండాలి. పాకిస్తానీలు భారతదేశంపై గుప్పించిన ఆరోపణలన్నింటినీ ఒకచోట చేర్చితే ఓ ఉద్గ్రంథమే తయారవుతుంది. అవామీలీగ్, ఇందిరాగాంధీ కలిసి పాకిస్తాన్‌ను ముక్కలుచేయడానికి కుట్రపన్నారన్నది వాటిలో కీలకమైనది.

ఉమ్మడిమతం అన్న పటిష్ఠమైన పునాదిమీద ఒక సర్వసత్తాక స్వతంత్రదేశం అవతరించి అప్పటికి పూర్తిగా పాతికేళ్ళు కాలేదు. ఇప్పుడా దేశంలో అర్ధభాగంతో సంబంధం తెంచు కోడానికి సర్వశక్తులూ కూడదీసుకుని పోరాడుతోంది —ఆ విషయంలో పరిపూర్ణ దృఢనిశ్చయంతో ఉంది. తెంచుకోవాలన్న ఈ తహతహ వెనుక ప్రబలమైన కారణాలే ఉండి ఉండాలి పాకిస్తాన్ ప్రభుత్వం నిలబెట్టిన అడ్డుగోడల్ని చీల్చుకుంటూ బంగ్లాదేశ్ అవతరణ వెనుకనున్న అన్ని వాస్తవాలు మెల్లగానే అయినా కచ్చితంగా బయటపడసాగాయి. ప్రపంచవ్యాప్తంగా అనేక పత్రికలు ఆ రహస్యపుముసుగు తొలగించి లోపలికి తొంగిచూడసాగాయి. పాకిస్తానీసైన్యం తూర్పు పాకిస్తాన్ ప్రజలపై విరుచుకుపడి ఎలా ఏ ప్రమాణంలో ఊచకోత సాగించిందో —అన్ని వాస్తవాలనూ అవి క్రమంగా బయటపెట్టాయి. స్వతంత్రబంగ్లాదేశ్ అనివార్యమని త్వరలోనే అందరికీ స్పష్టమైపోయింది.

భూ మండలంలో ఇక ఏ శక్తీ దానిని ఆపలేదు... ఆపకూడదనికూడా అంతర్జాతీయంగా కీలకపాత్రవహించే శక్తులు క్రమంగా నిర్ణయానికొచ్చాయి.

అప్పటికీ ఇందిరాగాంధీప్రభుత్వం బంగ్లాదేశ్‌ప్రభుత్వాన్ని గుర్తించడానికి విముఖంగానే ఉంది, అయితే ఆ దేశంలోని స్వాతంత్ర్య సమరయోధులకు సహకరించడానికి ప్రభుత్వమూ, ప్రజానీకమూ నిబద్ధమై ఉన్నాయి. అందులో ఎటువంటి ప్రయత్నలోపం కానీ, వనరుల లోపం కానీ చేయలేదు.

మానవతాదృక్కోణానికి వస్తే, బంగ్లాదేశ్ శరణార్థుల సమస్య ఓ చిక్కుసమస్యగా పరిణమిం చింది. గతంలో భారత —పాకిస్తాన్ సరిహద్దులు దాటి దేశంలోకి వచ్చిన ఏకమతస్థులైన శరణార్థుల కున్నట్టు ఈ సారి వచ్చే తూర్పుపాకిస్తాన్ శరణార్థులకు మతపరమైన ప్రాతిపదిక లేదు. అది కేవలం రాజకీయమైన వలస. వాళ్ళు స్వాతంత్ర్యాన్ని అభిలషిస్తున్న ప్రజలు. పాకిస్తాన్‌ప్రభుత్వం వాళ్ళను వేధింపులకు గురిచేసి, వాళ్ళపై యుద్ధం ప్రకటించి తమ ఇళ్ళూ, ఊళ్ళూ విడిచి పెట్టి రావలసిన పరిస్థితి సృష్టించింది. వారిని యుద్ధబాధితులుగా ఇందిరాగాంధీ పేర్కొన్నారు. 1971 అక్టోబర్ నాటికి తూర్పుపాకిస్తాన్ జనాభాలోని పదమూడుశాతం ప్రజలు ఆశ్రయంకోరి భారతదేశానికి తరలివచ్చారు. 'అంత స్వల్పకాలంలో అంత భారీఎత్తున వలసరావడం మనకు

తెలిసిన చరిత్ర మేరకు కనీవినీ ఎరుగని విషయ'మని ఇందిరాగాంధీ వ్యాఖ్యానించారు. శరణార్థులకు శాశ్వతంగా దేశంలో ఆశ్రయం కల్పించాలని ఆమె అనుకోలేదు. కొంతకాలం వాళ్ళకు నీడ కల్పించి తాము క్షేమంగా తిరిగివెళ్ళడానికి వీలైన పరిస్థితులు అక్కడ నెలకొన్న తర్వాత వారిని పంపించివేయాలన్నదే ఆమె విధానం, అంటే స్వతంత్రబంగ్లాదేశ్ అవతరించితీరాలని మరో అర్థం. మరో మార్గంలేదు.

ఆశ్చర్యంగా —బలరాం అధ్యక్షతన —అఫ్రోజాబాద్‌లో బంగ్లాదేశ్ సహాయక సంఘం ఒకటి ఏర్పడింది. దానిని ఎవరు ఏర్పాటుచేశారు, ఎలా చేశారన్నది ఓ పెద్దకథ; ఏమైతేనేం, జరుగుతున్నదేమిటో తెలుసుకునేలోపల అది జరిగిపోయింది. ఏ మాట కా మాటే చెప్పుకోవాలి, ఆ కార్యక్రమంలో బలరాం త్రికరణశుద్ధిగానే పనిచేశాడు. తనకూ, కమిటీకీ కూడా కొంతపేరు సంపాదించుకున్నాడు. తన జీవితంలో మొదటిసారి దేశభక్తిని చవిచూశాడు. అందులో ఉన్న మత్తునీ, మహత్తునీ కూడా గమనించాడు. వచ్చే ఎన్నికల్లో పోటీచేయడానికి అతడు సిద్ధపడుతున్నాడనీ, తర్వాత తప్పనిసరిగా మంత్రి కూడా అవుతాడని స్నేహితులూ, శ్రేయోభిలాషులూ ప్రచారం ప్రారంభించారు. భూస్వామ్యవర్గం ఆ ప్రచారానికి ఎంతో ఉత్సాహంగా స్పందించింది.

అరుణ తన కార్యక్రమాలపై వ్యాఖ్యానించినప్పుడు బలరాం నిరసన సూచకంగా అన్నాడు, 'ఈ గంద్రగోళమంతా సృష్టించమని నే నేమీ పాకిస్తాన్‌ని రెచ్చగొట్టలేదు. మన దేశమూ, ఇందిరాగాంధీ బంగ్లాదేశ్ గొడవలోకి తలదూర్చడానికి నేను కారణం కాదు. ఇలాంటి విషయాల్లో ఎవరి అదుపూ ఉండదు. దేశం ఏదైనా సమస్యలో కూరుకుపోయినప్పుడు అందరూ ద్వేషించే భూస్వామి కూడా చేయి అందించకతప్పదు. ఒక రాజకీయవాది ఎవణ్ణయినా ఈ సహాయక సంఘం నెత్తిన తీసుకొచ్చి పెట్టు, వాడు తొంభైతొమ్మిదిపాళ్ళు సగంనిధుల్ని దుర్వినియోగం చేస్తాడని నేను పందెం కాస్తాను.'

'నీ కార్యక్రమాన్ని నే నేమీ విమర్శించడం లేదు భయ్యా,' హఠాత్తుగా అతడలా విరుచుకుపడినందుకు విస్తుపోతూ అరుణ అంది. 'ఆశ్చర్యమనిపించి...'

'నాకు తెలుసు, తెలుసు, నేనీ బంగ్లాదేశ్ సహాయకార్యక్రమంలో ఇంత చురుగ్గా పని చేయడం నీకు ఆశ్చర్యంగానే ఉంటుంది. చూడు చెల్లాయి, సిద్ధాంతాలు వల్లించే ఆ మంత్రి ఆనంద్ సలహాల కనుగుణంగా నువ్వు నీ అభిప్రాయాలు మలుచుకున్నావని నాకు తెలుసు. అందుకే ఇప్పటికైనా నువ్వు తెలుసుకుంటే మంచిదని నా అభిప్రాయం. ఈ దేశం మనుగడ భూసంస్కరణలతోనో, భూస్వాముల్ని బిచ్చగాళ్ళను చేయడంతోనో మొదలూ కాదు, అంతమూ కాదు. మన తాత ముత్తాతలు —నీ తాత ముత్తాతలూ, నా తాత ముత్తాతలూ —మనం కొంత సుఖంగా బతకడానికి ఏదో ఇంత భూమి ఇచ్చిపోయినంత మాత్రాన, మనమేదో ఘోరమైన పాపం చేసినట్టు ఎవరూ చూడక్కర్లేదు. భూస్వాముల విలువేమిటో ఇప్పుడు చూపిస్తాను, నువ్విలా చూస్తూ ఉండు!'

తన అన్న అంత చెలరేగి ఎందుకు మాట్లాడుతున్నాడో అరుణకి అర్థంకాలేదు.

'భూస్వాములను మీరెంత అవమానించాలో అంతా అవమానించారు.' బలరాం కొన సాగించాడు. 'మీ ఎన్నికల వాగ్దానాలూ, ఊకదంపుడు ఉపన్యాసాలూ అన్నీ వాణ్ణొక్కణ్ణి చేసి తుడిచిపెట్టడానికే. వేటకుక్కల్ని ఉసిగొల్పడానికి మీ కెవడో ఒకడు కావాలి! ఏదో ప్రభంజనం సృష్టించి వోట్లు ఒళ్లో వేసుకోడానికదొకటే మీకు తెలిసిన మార్గం... కానీ చూస్తూ ఉండు! ఇందిరాగాంధీ భూమిలేని పేదల్నే పట్టించుకుంటుందో లేక చరిత్రలో తనకు గొప్పచోటుకోసం చూసుకుంటుందో...'

'చెల్లాయి, నీకో విషయం తెలుసా? ఎనభై ఏళ్ళ క్రితం మన ప్రాంతంలో దారుణమైన కాటకం ఏర్పడినప్పుడు మన ముత్తవ్వ విమలాదేవి తన గాదెల్లో ధాన్యంతో ఊరంతటినీ పోషించిన సంగతి నువ్వెప్పుడైనా విన్నావా? ఇప్పటికీ కాటక పరిస్థితులేర్పడిన ప్రతేడూ విమలాదేవి గురించి కొత్తకథలు అల్లుకుంటూ ఆమెను గుర్తుచేసుకుంటూ ఉంటారు జనం... అప్పట్లో రాజకీయవాదులతో ఏదైనా సహాయక కమిటీ ఉండి ఉంటే వాళ్లలో ఒక్కడూ తన గాదెల్లోంచి ఒక్కగింజ విదిల్చి ఉండేవాడు కాదు. పైగా ప్రభుత్వనిధుల్ని, ధాన్యాన్ని తమ సహాయం కోసమే ఇచ్చినట్టు వాళ్ళలో వాళ్ళు పంచుకుని, ఆకలిగొన్నవాళ్ళకు మొండిచెయ్యి చూపించే వాళ్ళు.'

దాదాపు అక్షరగంధం లేని తన అన్న భూస్వామ్యవర్గాన్ని సమర్థించడం కసం అంత బలమైన తర్కాన్ని సృష్టించగలగడం చూసి అరుణ తెల్లబోయింది. అతడిలో వచ్చిన మార్పును కిందటి లోక్‌సభఎన్నికల్లోనే పసిగట్టింది కానీ, రాజకీయవాదుల్ని అతడింతగా ద్వేషిస్తున్నాడని అప్పుడనుకోలేదు.

'నీ వాదాన్ని నెగ్గించుకోడం కోసం విమలాదేవిని అవినీతిపరులైన కొందరు రాజకీయవాదులతో ఎందుకు పోలుస్తావ్?' నిలదీసింది.

'నేనేం వాదంకోసం అనడంలేదు,' బలరాం తటాలున అన్నాడు. 'ఎంతో చదువుకున్న నా చెల్లాయికి, ఇంతవరకు ఆమె తెలుసుకోని జీవనవాస్తవాలు బోధిస్తున్నాను, అంతే.'

'కొన్ని మాసాల క్రితం, ఎన్నికల ప్రచారంలో భూసంస్కరణల గురించీ, సోషలిజం గురించీ గొప్పగొప్ప ఉపన్యాసాలిచ్చావే?'

'అవును ఇచ్చాను,' బలరాం అన్నాడు. 'ఇప్పుడు కూడా ఇస్తాను... భూసంస్కరణలు మంచివే; సోషలిజమూ మంచిదే. అయితే ఎవరో కొద్దిమంది ఆనంద్‌లాంటి పగటికలలు కనే మూర్ఖులూ, సిద్ధాంతవాదులూ తప్ప వాటిని అమలుచేయాలని ఎవరూ కోరుకోవడం లేదు ఇక ఇందిరాగాంధీ అంటావా, ఆమెకూడా భూసంస్కరణల్ని కోరుకుంటున్నదనడంలో నా కెటువంటి సందేహమూ లేదు; అయితే భూసంస్కరణల గురించి ఆమె తపన, రాజ్యాధికారాన్ని చేజిక్కించుకుని, నిలుపుకునే అతిపెద్ద వ్యూహంలో ఒక భాగం. ఇప్పుడామెకి అంతకంటె మిరుమిట్లుగొలిపే బంగ్లాదేశ్ వ్యవహారం దొరికింది, అదే అధికారాన్నీ, ఘనకీర్తినీ తెచ్చిపెడుతుంది. తనా ఘనతను సాధించడంలో ఉపయోగపడగల వాళ్ళందరినీ ఉపయోగించుకుంటుంది. నా పద్ధతిలో నేనూ వాళ్ళలో ఒకణ్ణి.'

బలరాం తర్కం వాస్తవానికి మరీ అంత దూరంగా ఏంలేదు. అరుణ తమ సంభాషణ గురించి ఆనంద్‌తో చెప్పినప్పుడు, అతడు క్షణకాలం ఆలోచనలోకి జారిపోయి, ఆ తర్వాత అన్నాడు 'ఇందిరాగాంధీ ఏంచేస్తారో నాకు తెలియదు కానీ, ఇప్పటికి ఎనిమిది మాసాలుగా దేశమంతా బంగ్లాదేశ్‌వ్యవహారంలో కూరుకుపోయింది, పార్టీ మేనిఫెస్టో తెరమరుగైపోయింది... ఇది చాలా బాధాకరం. పార్టీ తానుగా నిలబడే ఒక గొప్ప అవకాశం చేజారిపోతోంది. ఎప్పటిలా ఇప్పుడు కూడా అధినాయకపుఘనత మీద ఆధారపడి ఊపిరి నిలుపుకోవలసిందే.'

నెలలు గడుస్తున్నాయి కానీ, ప్రజల సంకల్పంనుంచి పుట్టిన బంగ్లాదేశ్ ఇంకా వాస్తవిక రూపం ధరించలేదు. పాకిస్తాన్‌దళాల జాతివిచ్ఛేదకాండ, రాజకీయచిత్రంలో అనిశ్చితి కొనసాగుతూనే ఉన్నాయి. తూర్పుప్రాంతంలో తిరుగులేని నాయకుడైన షేక్ ముజీబ్‌తో చర్చలకు యాహ్యాఖాన్ తిరస్కరించాడు. పైగా భారతదేశంతో చర్చలకు ప్రతిపాదన చేశాడు. ఇందిరాగాంధీ దానిని తిరస్కరించారు. పాకిస్తాన్ నాయకులు వివాదాన్ని తమలో తాము పరిష్కరించుకోవలసిందేనని ఉద్ఘాటించారు. భారతదేశం జోక్యం చేసుకోదన్నారు.

పాకిస్తాన్‌నాయకుల దృష్టిలో బంగ్లాదేశ్‌సమస్యకు మూలకారణం కచ్చితంగా భారతదేశమే. వివాదంలోకి తలదూర్చడానికి ఇందిరాగాంధీ తిరస్కరించడంతో, భారతదేశంపై దాడిచేయడమే సమస్యకు పరిష్కారమార్గమన్న నిర్ణయానికి వాళ్ళు వచ్చారు. ముక్తిబాహిని గెరిల్లాచర్యలను ఎదుర్కోలేని నిస్సహాయస్థితిలో భారత సరిహద్దుల లోపలి ప్రాంతాలపై పాక్‌సైనికులు బాంబులు కురిపించారు. భారతసైనికులు దానికి తగిన ప్రతీకారం చేశారు. అలా మొదలైన ఘర్షణలు మెల్లగా పూర్తిస్థాయి యుద్ధానికి దారితీయించాయి. 'పాకిస్తాన్ సైనికపాలకులు భారతదేశంతో యుద్ధమే కోరుకుంటే అది పాకిస్తాన్ నేలమీదనే జరుగుతుంది కానీ, భారత భూభాగం మీద కాద'ని భారత రక్షణమంత్రి జగ్‌జీవన్‌రాం నవంబర్ 28వ తేదీన ప్రకటన చేశారు.

రెండుదేశాలు యుద్ధోన్ముఖమైనట్టు డిసెంబర్ 3వ తేదీన ప్రకటన జరిగింది. సహజంగానే, రెండు ప్రభుత్వాలూ పూర్తిగా పరస్పర విరుద్ధమైన కారణాలే చూపించాయి.

ఇండియావైపునుంచి ముందస్తుగా దాడి జరగకుండా నిరోధించడానికీ, తూర్పురంగంలో మన ఒత్తిడిని తగ్గించడానికీ పాకిస్తాన్ మన పశ్చిమప్రాంత వైమానికక్షేత్రాలపై దాడులు జరిపింది. అయితే, ఏదీ పాకిస్తాన్‌కు అనుకూలించలేదు.

యుద్ధం విరుచుకుపడిన రెండురోజుల తర్వాత భారతదేశం బంగ్లాదేశ్‌ను స్వతంత్రదేశంగా గుర్తించింది. రెండుదేశాలూ ఒక ఒప్పందం చేసుకుని సంయుక్త సైనికచర్యలు, శరణార్థులను తిరిగి స్వదేశానికి తరలించడం తదితర కీలకాంశాలతో ఒక కార్యాచరణ పథకాన్ని ప్రకటించాయి.

యుద్ధం పద్నాలుగురోజుల్లో ముగిసింది. పాకిస్తాన్‌సైన్యం డిసెంబర్ 16వ తేదీన ఢాకాలో లొంగిపోయింది. బంగ్లాదేశ్ విముక్తమైంది. ఇందిరాగాంధీ ఖ్యాతి ప్రపంచమంతటా మోగిపోయింది.

కొన్ని దేశాలు ఆమెను ఆరాధించాయి, కొందరు ద్వేషించారు, కొందరు భయపడ్డారు, కానీ అంతటా అందరూ ఆమెను గౌరవించారు. భారతపార్లమెంటులో ప్రముఖ ప్రతిపక్ష నాయకుడు అటల్‌బిహారీ వాజ్‌పేయి ఆమెను దుర్గగా, కాళిగా పేర్కొని ప్రస్తుతించారు.

1971 డిసెంబర్‌లో బంగ్లాదేశ్‌యుద్ధం సంభవించినప్పుడు, 1972 జనవరిలో జరగవలసిన రాష్ట్రశాసనసభ ఎన్నికల్ని ప్రభుత్వం వాయిదావేసింది. యుద్ధ పరిసమాప్తితో, ఇందిరాగాంధీ ద్విగుణీకృతవైభవంతో అదే సంవత్సరం మార్చిలో దేశం ఎన్నికలకు సమకట్టింది.

ఈ సారి అధికారపక్షం నమ్మశక్యం కానంత అవలీలగా విజయం సాధిస్తుందిఎ అందరూ జోస్యం చెప్పారు.

అదే జరిగింది.

* * *

## జహానారా ఇమామ్ డైరీ : కొన్ని భాగాలు

బుధవారం 10, మార్చి, 1971

స్వయంప్రతిపత్తి స్వాతంత్ర్యం చర్చలో యువజనులు ఏకాభిప్రాయానికి రాలేకపోయారు. ఎనభైఏవడిలో ఉన్న భాషాణీ నిన్న పల్టాన్‌లో ఒక బహిరంగసభలో మాట్లాడుతూ సంపూర్ణస్వాతంత్ర్యాన్ని డిమాండ్ చేశారు. నిన్న సాయంత్రం 3 గంటలకు మౌలానా భాషాణీ అధ్యక్షతన బెంగాల్ స్వాతంత్ర్యోద్యమ సమన్వయసంఘం సమావేశం జరిగింది.ూప్రభుత్వం మార్చి 25లోగా తూర్పు పాకిస్తాన్‌కు స్వాతంత్ర్యం ప్రకటించకపోతే 1952లో చేసినట్టు ముజీబ్‌తో కలిసి నేను ఉద్యమం ప్రారంభిస్తానుఎఅన్నారాయన.

భాషాణీ చేసిన ఒక ప్రకటన నన్నెంతో ఆకట్టుకుంది. ూపాకిస్తాన్‌కు ప్రధానమంత్రి కావడం కన్నా బెంగాల్‌కు నాయకుడు కావడం ఎంతో గౌరవప్రదంఎ అన్నారాయన. ఈ మాటలు మిల్టన్ ప్యారడైజ్ లాస్ట్‌లోని ఒక వాక్యాన్ని గుర్తుచేశాయి: ూస్వర్గంలో దాస్యంకంటె నరకాన్ని ఏలడం ఉత్తమం.ఎ

ఆదివారం 14, మార్చి, 1971

స్వయంప్రతిపత్తి ఉద్యమానికి కవులూ, రచయితలూ సంఘీభావం ప్రకటిస్తూ రచయితల ఉద్యమకేంద్రం పేరుతో ఒక సంఘంగా ఏర్పడ్డారు. హసన్ హఫీజుర్ రెహమాన్ దీనికి కన్వీనర్. సికిందర్ అబూ జాఫర్, అహ్మద్ షరీఫ్, షౌకత్ ఉస్మాన్, షంసుర్ రెహమాన్, బద్రుద్దీన్ ఉమర్, రొమేష్‌దాస్‌గుప్తా, సయ్యద్ ఆతీకుల్లా, బుర్హానుద్దీన్‌ఖాన్ జహాంగీర్, రుక్నుజ్జమాన్‌ఖాన్, అబ్దుల్ గఫార్ చౌదరి, సూఫియా కమల్, జిల్లుర్ రెహమాన్, అబ్దుల్ ఘనీ హజారీ తదితరులు సభ్యులు. ఈ రోజు సాయంత్రం 5కు బంగ్లా అకాడెమీలో కమిటీ సమావేశం జరిగింది. అహ్మద్ షరీఫ్ అధ్యక్షత వహించారు.

స్వయంప్రతిపత్తి ఉద్యమంలో కవులు, రచయితల పాత్ర గురించి రొమేష్‌దాస్‌గుప్తా, అలాఉద్దీన్ అల్ ఆజాద్, బుర్హానుద్దీన్‌ఖాన్ జహాంగీర్, హసన్ హఫీజుర్ రెహమాన్, రబేయా ఖాతూన్, అహ్మద్ సఫా ప్రభృతులు అనర్గళోపన్యాసాలు చేశారు.

నేను రచయిత్రినీ కాను, వక్తనూ కాను. హాల్లో వెనుకవరస కుర్చీలో కూర్చున్న నేను ఆ ఉద్వేగభరిత ప్రసంగాలకు చలించిపోయాను. సమావేశం తర్వాత బంగ్లా అకాడెమీకి సమీపం

లోనే ఉన్న షహీద్‌మినార్‌కు ఊరేగింపు సాగింది. నా మోకాలినొప్పి మళ్ళీ వచ్చింది ఊరేగింపులో పాల్గొనడానికి ధైర్యం చాలలేదు.

కళాకారులు కూడా ముందుకొచ్చారు.

మార్చి 1వ తేదీ నుంచి రేడియో, టెలివిజన్, సినిమా కళాకారులందరూ సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. కళాకారులఉద్యమసంఘం పేరుతో ఇప్పుడొక సంస్థగా ఏర్పడ్డారు. అలీమన్సూర్ అధ్యక్షుడు, సయ్యద్ అబ్దుల్ హాదీ కార్యదర్శి, లైలా అర్జుమంద్‌బానూ కోశాధికారిగా నియమితులయ్యారు. ముస్తఫా జమాన్ అబ్బాసీ, ఆహెదూర్ రహీమ్, ఫిర్‌దౌసీ రెహమాన్, బషీర్ అహ్మద్, ఖాన్ అతాఉర్ రెహమాన్, అల్తాఫ్ మహమ్మద్, గులామ్ ముస్తఫా, క్రముల్ హసన్, అజిత్‌రాయ్, హసన్ ఇమామ్, కమల్ లోహానీ, జి.ఎ. మన్నాన్, అబ్దుల్ అహద్, సమర్ దాస్, గహర్ జమీల్, రజాక్ తదితరులు సభ్యులు.

రేడియో, టెలివిజన్ కేంద్రాల వద్ద సైనికబలగాలు మోహరింపును కళాకారులఉద్యమసంఘం తీవ్రంగా వ్యతిరేకించింది.

గురువారం 18, మార్చి, 1971

ఢాకా టెలివిజన్ తన అత్యద్భుత సంగీత కార్యక్రమాల ద్వారా స్వయంప్రతిపత్తి ఉద్యమాన్ని శిఖరస్థాయికి తీసుకువెళ్ళింది. అటువంటి కార్యక్రమాలను మున్నెన్నడూ చూడలేదు. ఫిర్‌దౌసీ రెహమాన్, సబీనా యాస్మిన్, షహనాజ్ బేగం, అంజుమన్ ఆరా బేగం, ఖందాకర్ ఫారూఖ్ అహ్మద్, రతీంద్రనాథ్ రే వంటి ఢాకాలోని అగ్రశ్రేణి కళాకారులందరూ ఉద్యమవైభవాన్ని ప్రతిబింబించే అత్యంత ఉద్వేగభరితగీతాలు ఆలపిస్తున్నారు. టెలివిజన్ తెర అంతా విండి పోయేలా, ఏదో కెమెరాట్రిక్కుతో వీళ్ళ ముఖాలనే వేలాదిముఖాలుగా చూపిస్తూ దేశవ్యాప్తంగా ప్రేక్షకుల హృదయాల్లో పెనుతుపానులు సృష్టిస్తున్నారు.

అలా ఎలా చేయగలుగుతున్నారని మాసుమాని అడిగాను.

అవన్నీ చేస్తున్నది అంకుల్ మొంటూ– మాసూమా జవాబు.

మొంటూ ముస్తఫా అన్వర్ ఢాకా టెలివిజన్ డైరెక్టర్‌జనరల్. ఏదో సందర్భంలో అతణ్ణి పట్టుకుని టెలివిజన్‌లో ఆ కొద్దిమంది ముఖాలనే వేలాదిముఖాలుగా ఎలా చూపిస్తున్నారని అడిగాను. సిగ్గును సూచించే మందహాసం చేసి అన్నాడు, “మా దగ్గర ఆధునిక పరికరాలేవీ లేవు. అద్దాలూ, ఇతర సామగ్రి ఉపయోగించి ఎలాగో తంటాలుపడుతున్నాం.”

మొంటూ స్వభావమే అంత. ఎందులోనూ తన గొప్పతనాన్ని ఒప్పుకోడు, తనగురించి చెప్పుకునేటప్పుడు ఎంత బిడియపడిపోతాడో!

మొంటూ రూపొందించిన ఈ వినూత్న కార్యక్రమాల ద్వారా కొన్ని దేశభక్తిగీతాలు విశేష ప్రజాదరణ పొందాయి “నా ఇంటి కెవరో నిప్పు పెట్టారు. నా శాంతి నెవరో అపహరించారు”, “ఈ నేలమీద నా జననం, జన్మజన్మాల పుణ్యాం”, “నా ఏకతారా, ఈ దేశవిభవాన్ని పాడు మనసారా”. టెలివిజన్‌లో ఈ గీతాల ప్రసారం ఉధృతమౌతున్న కొద్దీ సాధారణంగా శాంతికాముకులై

సుఖజీవనాన్ని ప్రేమించే ఎందరెందరో బెంగాలీలు ఉత్తేజితులై వీధుల్లో, పచ్చికబయళ్ళలో, రేవుల్లో, చతుష్పథాలలో కొనసాగుతున్న దేశభక్తి మహోద్యమంలోకి వచ్చి చేరిపోతున్నారు.

బుధవారం 4, ఆగస్టు, 1971

పగళ్ళూ, రాత్రులూ ఇప్పుడు ఏవేవో ఘటనలతో కిక్కిరిసిపోతున్నాయి. ఎవరెవరో సందర్శకులు నిర్విరామప్రవాహంలా వచ్చిపడుతున్నారు. తరచ వినిపించే విస్ఫోటధ్వనులకు మేము అలవాటుపడిపోతున్నాం. ఒకటి రెండు భీషణధ్వనులు వినిపిస్తే కానీ మాకు నిద్రపట్టడం లేదు. దాదాభాయ్, ముర్తజా, బంగా, ఫకీర్ అందరిదీ ఇదే పరిస్థితి. పేలుళ్ళశబ్దాలే చక్కని నిద్రమందులా పనిచేస్తున్నాయి కనుక వాలియమ్ అమ్మకాలు పడిపోయాయని నా మిత్రులు కొందరు చమత్కరించారు కూడా. ఎప్పుడైనా రాత్రిళ్ళు శబ్దాలు వినబడకపోతే నేను కలవరపడిపోతాను. కొంపదీసి పిల్లల పాకిస్తానీలకు దొరికిపోలేదు కదా? అని.

లేదు, అలా జరిగుండదు. తొలిజాములో పేలుళ్ళు వినిపించకపోయినా మలిజాములో తప్పకుండా వినిపిస్తాయి. మాకు ఓదార్పునిస్తాయి

పిల్లలు రోజురోజుకీ తెగిస్తున్నారు. జనం వాళ్ళకు వృశ్చికాలని ముద్దుపేరు పెట్టారు. నిన్నటికి నిన్న, సూర్యాస్తమయానికి కాస్తముందు ఈ వృశ్చికాలలో కొందరు స్టేట్‌బ్యాంక్ దగ్గరలో ఉన్న ఆర్మీచెక్‌పోస్టుమీద చేతిబాంబు విసిరారు సైనికులు వాళ్ళలో ఒక్కరినీ పట్టుకోలేకపోయారు. సరిహద్దుల్లో పాకిస్తానీలతో ముఖాముఖీ పోరాడుతున్న వృశ్చికాలు ప్రాణాలకు తెగించి అత్యద్భుత శౌర్యసాహసాలు ప్రదర్శిస్తున్నారని స్వాధీన్‌బంగ్లాబేతార్ తెలియజేసింది. వాళ్ళొక మహత్తరలక్ష్యం కోసం పోరాడుతున్నారు, మాతృభూమికోసం మరణించడమే గౌరవప్రదమైన మరణమని వారు విశ్వసిస్తున్నారు అపఖ్యాతిని కౌగిలించుకోవడంకంటె అమరత్వాన్ని ఆలింగనం చేసుకోడానికే వారు సిద్ధపడ్డారు.

స్వాధీన్‌బంగ్లా బేతార్‌నుంచి ఎవరిదో పాట వినిపిస్తోంది.

యువ నావికులం మేం, ఈ కల్లోల
సాగరాన్ని తరిస్తాం
యువ సైనికులం మేం, స్వాతంత్ర్యం కోసం పోరాడతాం
ఉప్పొంగే యువతరం మేం, మాకు
లంగరు లేదు రేయింబవళ్ళు లేవు
మాకు తెలిసినవి రెండే, చుక్కానిపై
చయి, ముందుకే పదవోయి

వింటున్న నా చెక్కిళ్ళమీంచి అశ్రువులు జారిపడ్డాయి.

గురువారం 12, ఆగస్టు 1971

మూడురోజులుగా రూమీ కంటబడడమే గగనమైపోయింది. ఇంటికొచ్చి ఓ రెండుగంటలుండి మాయమైపోతున్నాడు. మొన్న బోడీ, జ్యూయెల్ అనే ఇద్దరు గెరిల్లామిత్రుల్ని భోజనానికి వెంటబెట్టుకుని వచ్చాడు. బోడీ ఎకనమిక్స్‌లో మాస్టర్‌డిగ్రీ చేస్తున్నాడు, జ్యూయెల్ పేరుపొందిన క్రికెటర్. ముగ్గురూ మధ్యాహ్నం భోజనంచేసి వెళ్ళి రాత్రికి మళ్ళీ తిరిగిరాలేదు. నిన్న మధ్యాహ్నం ధోలూ, చిస్తీలను భోజనానికి పిలిచాం. ఆగస్టు 15న వాళ్ళిద్దరూ ఇస్లామాబాద్‌కి తిరిగి వెళ్ళిపోతున్నారు. భోజనంచేస్తూ ధోలూ అడిగాడు, 'రూమీ ఏడ? మనతో భోజనానికి రాడా?'

'బయటికెళ్ళాడు. ఏ క్షణంలోనైనా రావచ్చు' చెప్పాను నేను. రూమీ తిరిగొచ్చేసరికి సాయంత్రమైపోయింది, అప్పటికే ధోలూ, చిస్తీ వెళ్ళిపోయారు. ఇస్లామాబాద్ వెళ్ళిపోయేలోగా ఓసారి అంకుల్‌నీ, ఆంటీనీ చూసిరా అని రూమీకి చెప్పాను. నిన్న కూడా పొద్దుటే వెళ్ళిపోయిన వాడు రాత్రిదాకా తిరిగిరాలేదు. నేను చేయవలసిందేమీ లేకపోయినా రాత్రిళ్ళు నిద్రపట్టడం లేదు. ఏదో కలవరం, ఆందోళన. రూమీ దాచకుండా అన్ని విషయాలూ నాకు చెప్పకూడదా అనిపించింది.

మధ్యాహ్నం డైనింగ్‌టేబుల్‌మీద భోజనం ఉంచి రూమీకోసం ఎదురుచూస్తున్నాను. రూమీ వస్తూనే 'అమ్మా, బాగా ఆకలిగా ఉంది, తినడానికేమైనా పెట్టు' అన్నాడు. అంతలోనే టేబుల్ వైపు చూసి 'ఇంకేం, భోజనం సిద్ధంచేసే ఉంచిందన్నమాట, మా అమ్మ నిజంగా గ్రేట్' అన్నాడు.

భోజనం వడ్డిస్తూ అన్నాను, 'నిన్న సాయంత్రం హోటల్ ఇంటర్‌కాంటినెంటల్‌లో ఏమైందో తెలుసా? కొన్ని వృశ్చికాలు ఓ గదిలో చేతిబాంబు పేల్చారు!'

'అవును, నాకు తెలుసు. గదిలో కాదు, గ్రౌండ్‌ఫ్లోర్‌లో లాంజ్ పక్కన ఓ బాత్‌రూంలో'

'అప్పుడు నువ్వక్కడున్నావా? ఎవరు పేల్చారో నీకు తెలుసా?'

'అమ్మా—' రూమీ గొంతులో కోపం ధ్వనించింది. నాకూ కోపం ముంచుకొచ్చింది. 'సరే, నాకెం చెప్పద్దులే. అయినా తెలుసుకోడానికి నా మార్గాలు నాకు లేవనుకోకు. ఈ సిటీలో వార్తలు జెట్ విమానాలకన్నా వేగంగా వ్యాపిస్తుంటాయి'.

రూమీ మందహాసం చేశాడు, నేను కోపంగా మేడమీద ఉన్న నా గదిలోకి వెళ్ళిపోయాను.

కాసేపటి తర్వాత రూమీ నా బెడ్‌రూంలోకి వచ్చి నా పక్కనే కూర్చున్నాడు. 'అది చేతిబాంబు కాదమ్మా, ప్లాస్టిక్‌బాంబు, దానిని పికె అంటారు.'

నే నేమీ మాట్లాడలేదు. 'అదెవరు చేశారో నీకు తెలియదు, నాకూ తెలియదు. మేలాఘర్ వెళ్ళినప్పుడు వాళ్ళ గురించి తెలిసింది.'

నేను మౌనంగానే ఉండిపోయాను. రూమీ కూడా కాస్సేపు మౌనం వహించి తర్వాత అన్నాడు, 'పికె అచ్చంగా, ఫర్నిచర్ తయారుచేసేవాళ్ళు వాడతారే, ఆ లప్పంలా ఉంటుంది. పసుపురంగులో ఉంటుంది. అదంత ప్రమాదకరంగా కనిపించదులే.'

అప్పటికీ నే నొక్క ముక్కకూడా అనలేదు. నాకు బుద్ధొచ్చింది. రూమీ నా కెంత చెప్ప దలచుకున్నాడో అంతే చెబుతాడని నాకు తెలుసు. ఎంత ఒత్తిడి చేసినా అదనంగా వాడినుంచి ఏమీ రాబట్టలేను. రూమీ కాస్సేపు ఈలవేసి తర్వాత ఓ పాట అందుకున్నాడు.

'నువ్వెలా కనిపిస్తూ ఉంటావ్?
ఏమిటి నీ దుస్తులు?
నువ్వు వదులుచొక్కా
వేసుకుంటావా?
లేక బిగుతు పంట్లాం ధరిస్తావా?
నీ జుట్టు పొడుగా, పొట్టా?
నువ్వు చెట్లకొమ్మలమీద గడుపుతూ
ఉంటావా?
లేక టీ దుకాణాల దగ్గర వేళ్ళాడుతూ
ఉంటావా?
నీకోసం వారు వెతుకుతున్నారు
సైనికులు, రహస్య గూఢచారులు,
వాళ్ళ తొత్తులు,
నీకోసం ఇల్లిల్లూ వెతుకుతున్నారు.'

నేను లేచి కూర్చుని అడిగాను, 'ఎవరు రాశారు?'

'ఢాకాలో ఉండే ఒక ప్రముఖ కవి. అతడి పేరు నాకు గుర్తులేదు. షహాదత్, ఆలం ఈ గీతాన్ని మేలాఘర్‌కు తీసుకొచ్చారు. ఓ కాపీ మేము ఉంచుకుని అసలుప్రతిని కలకత్తాలోని ఓ పత్రికకి పంపించాం.'

'ఈ గీతం మీలాంటి వాళ్ళ గురించే.'

'అవును. దాని శీర్షిక 'గెరిల్లా'. మిగిలిన పంక్తులు కూడా విను:

నిన్ను కనిపెట్టడానికి
వాళ్ళు ఆకాశపుటనంత నీలిమలోకి
చొచ్చుకుపోతారు
లేదా సప్తసముద్రాల లోతుల్ని
గాలిస్తారు.
నువ్వూ —భవిష్యత్తూ

చెట్లపట్టాలు వేసుకుని మును
ముందుకు సాగిపోతూ ఉంటారు
నీ పదధ్వనులు నాకు అంతటా
వినిపిస్తాయి

నేను కాస్సేపు నిశ్శబ్దంగా కూర్చుండిపోయాను. తర్వాత అడిగాను, 'షహాదత్, ఆలం ఈ మధ్య ఢాకా ఎందుకు రావడంలేదు?'

'వస్తూనే ఉన్నారు, అయితే ఎక్కువ రోజులు ఉండడం లేదు.'

'నీతో వాళ్ళెప్పుడూ రాలేదా?'

రూమీ చిరునవ్వు నవ్వి అన్నాడు, 'అమ్మా, ఎంత చెప్పినా నీ కర్థం కాదు!'

'ఆ కవి పేరేమిటో తెలుసుకుందామని?', గొణిగినట్టు అన్నాను.

రూమీ అన్నాడు, 'పేరు తెలుసు కానీ మరచిపోయాను. ఢాకాలోనే ఉంటాడు. మనందరం ఆ పేరు మరచిపోవడం మంచిది. మనకీ, ఆ కవికీ కూడా అదే క్షేమం.'

ఇద్దరం ఇలా ఎలకా, పిల్లీ ఆట ఆడాం. మళ్ళీ రూమీ అన్నాడు, 'మన కెంత తక్కువ తెలిస్తే అంత మంచిది. ఎందుకంటే, చిత్రహింసలు పడలేక కీలకమైన సమాచారాన్ని బయట పెట్టేస్తాం.'

అతడా మాట ఎప్పుడూ చెబుతూనే ఉంటాడు కానీ, నేనే మరచిపోయి రకరకాల ప్రశ్నలు వేస్తూ ఉంటాను. చిరునవ్వు నవ్వి అన్నాను, 'పెద్దదాన్ని అవుతున్నాను కదా, మతిమరుపూ పెరిగిపోతోంది. మనిద్దరం చోట్లు మార్చుకున్నట్టున్నాం. ఇప్పుడు నువ్వు నాకు నాన్నవీ, నేను నీకు కూతుర్నీ!'

# 50

1972లో రాష్ట్రాల శాసనసభలకు జరిగిన ఎన్నికలు ఇందిరాగాంధీకి మరో మహత్తర విజయాన్ని తెచ్చిపెట్టాయి. ఎట్టకేలకు ప్రజలు ఆ అమ్మ ఒడిలో తమ అదృష్టాన్ని దర్శించగలిగారా అనిపించింది. తాము తాపీగా అలా కూర్చుని చూస్తుండగానే ఆమె తమ సమస్యలను ఒకటొకటిగా లేదా అన్నింటినీ ఒకేసారి పరిష్కరించేస్తారని వాళ్ళు హృదయపూర్వకంగానే విశ్వసించారు.

దురదృష్టవశాత్తు వాళ్ళ భ్రమలు త్వరలోనే చెదిరిపోనున్నాయి. ఎంత గాఢంగా, ఎంత త్వరగా ఆశలు పెంచుకుంటే అంత గాఢంగానూ, అంత త్వరగానూ నైరాశ్యంలోకి జారిపోవడం ఎప్పుడూ జరిగేదే. కొందరి ఉద్దేశంలో, ఇప్పటికే అత్యున్నత వైభవశిఖరాగ్రానికి చేరుకున్న ఇందిర ఇక చూడగలిగిన ఎత్తులేవీ లేవు. మరింత స్పష్టీకరించాలంటే ఆమె కిందికి జారిపోవడమే తథ్యమని మరికొందరి వివరణ. కొందరి దృష్టిలో అదెంతో బాధాకరం; మరికొందరి దృష్టిలో అదొక అనివార్య పరిణామం. అయితే ఈ రెండు గ్రూపులూ ఆమె భవిష్యత్తును పూర్తిగా స్వప్రయోజనకాంక్షనుంచే అంచనావేశాయి. దేశ భవితవ్యం వాళ్ళకు పట్టలేదు.

రకరకాల వ్యాఖ్యలు దొర్లిపోతున్నాయి. ఎవరైనా చిటారుకొమ్మన ఎంతకాలం ఉండగలరు? అది సాధ్యమా? ఆ అనివార్యపతనం ఎంత త్వరగా సంభవిస్తుంది? కొందరి అంచనాలో బహుశా కొన్నిమాసాలు. ఈ లోపల అధికారపక్షం ఏం చేస్తుంది?... పార్టీ ఏం చేస్తుందనా మీ ప్రశ్న? ఏ పార్టీ? ఇంకెక్కడి పార్టీ? ప్రియమిత్రమా, నీకు తెలియదా, పార్టీ, నాయకురాలు రెండూ ఇప్పుడు ఇందిరాగాంధీయే. చక్రం ఆమె చేతుల్లో ఉన్నప్పుడు ఇంకెవరైనా పనిచేయ గలరని నువ్వెలా అనుకుంటున్నావ్?'

అధికారపక్షానికి చెందిన రాజకీయవాదులకు అందరికీ కాకపోయినా, చాలామందికి తమ కళ్ళెదుట రకరకాల అవకాశాలు తెరచుకున్నట్టు కనిపించాయి. చేయవలసిందల్లా రాజకీయంగా అనువైన తావుల్లో తాము ఉండగలిగేలా చూసుకోవడమే అందుకేం చేయాలి? ఆ ప్రక్రియ ఒకింత ప్రయత్నంతో కూడుకున్నదే. మొట్టమొదట నీ గురించి ఇందిరాగాంధీ చెవినపడేలా చేసుకోవాలి, తర్వాత నిన్ను చూసి, నీ గుణగణాలను గుర్తించి, అన్నింటికీ మించి తనపట్ల, ఒక్కోసారి మొత్తం నెహ్రూ కుటుంబం పట్ల అందిగ్ధ విధేయతను నీ కనుకూలంగా అంచనా వేయగలిగేలా చేసుకోవాలి. చివరిది అప్పటికింకా తప్పనిసరి కాలేదు. కారణం మరేమి లేదు,

ముప్పొద్దులా జవహర్లాల్ నెహ్రూ పట్ల విధేయతను చాటుకుంటూ వచ్చిన వారితో ఆమె అంతగా పొసగలేదు. వాళ్ళ సంఖ్య అపారం, ఇంకా రోజు రోజుకీ పెరుగుతూనే ఉంది తన తండ్రికి తామందరూ ఎంత సన్నిహితులో ఆమె తెలుసుకోవాలనీ, తగినట్టుగా తమను సత్కరించాలనీ వాళ్ళ ఆకాంక్ష. లేకపోతే ఆమె కృతఘ్నురాలని వాళ్ళు అందామనుకున్నారు కానీ అనలేదు. అది యుక్తిగా, సూచనప్రాయంగా సాగించే ఒక విధమైన బ్లాక్‌మెయిల్ కనుక ఆమెకు కోపం తెప్పించే ఉంటుంది. అదీగాక, తన ఉనికి కోసం ఆమె జవహర్లాల్ విధేయులెందరితో పోరాడ లేదు? కనుక ప్రస్తుతానికి ఆమె కోరుకునేది తనపట్ల విధేయత. ఆ పైన మెల్లగా అతిమెల్లగా... తన చిన్నకొడుకు సంజయ్‌పట్ల విధేయత.

తిరుగులేని తన ఆధిపత్యాన్ని పురస్కరించుకుని ఇందిర దేశరాజకీయాల రూపురేఖల్ని పూర్తిగా మార్చివేయటానికి సమకట్టారు. తన ఈ స్థితికి బంగ్లాదేశ్ విజయమొక్కటే కారణం కాదు కనుకనే ఆమె అలా చేయగలిగారు. గరీబీ హటావో నినాదాన్ని పార్టీ ఎన్నికల ప్రణాళికకు కలికితురాయిని చేయడం ద్వారా 1971 లోక్‌సభ ఎన్నికల్లో ఘన విజయం సాధించి బంగ్లాదేశ్‌కు ముందే ఆమె తన అసాధారణదక్షతను రుజువుచేసుకున్నారు. తీరా ఆచరణ దగ్గరకు వచ్చేసరికి ఆమె ప్రారంభించిన కార్యక్రమాలు చాలావరకూ రాష్ట్రప్రభుత్వాల పరిధిలోకి వస్తాయి. రాష్ట్రాలకు నిధులు మంజూరుచేయడం మినహా వాటి విషయంలో కేంద్రం ప్రత్యక్షంగా చేయగలిగిందేమీ లేదు. అయితే ఇప్పుడు తనకు లభించిన సంపూర్ణప్రాబల్యం దృష్ట్యా, ఇందిరాగాంధీ వేటిని తలపెట్టారో అవన్నీ సహజంగానే జరిగిపోతాయి. ఆమె పార్టీ అధికారంలో ఉన్న రాష్ట్రాల్లో ఇది తేలిక. ఈ రాష్ట్రాల్లో ముఖ్యమంత్రులు ఆమెపట్ల అచంచల విధేయత ప్రకటిస్తూ ఆమె కేంద్రాధి కారానికి సాధనాలుగా మారిపోయారు.

నిరంకుశమూ, నిగూఢమూ అయిన ఒక్క ఊపుతో మెరుపువేగంతో నివ్వెరపాటు కలిగించే నిశ్చయాత్మకతతో ఇందిరాగాంధీ తన పార్టీకి చెందిన ముఖ్యమంత్రుల రాజకీయోన్నతికి భరత వాక్యం పలికేశారు. వాళ్ళనామె తొలగించి ఉండకపోవచ్చు; కానీ మెల్లగా బయటకు సాగనంపారు. బంగ్లాదేశ్ విజయవైభవం కింద వాళ్ళు వెలిగిపోతున్న ఘట్టంలో, తమకు మరోవిడత అధికారాన్ని అందించగల శాసనసభ ఎన్నికలకు వాళ్ళు పథకరచన ప్రారంభించనున్న ఘట్టంలో.

ఆ ప్రక్షాళన దిగ్భ్రాంతికరమైన ప్రభావాన్ని చూపించింది. రాజ్యాంగరీత్యా రాష్ట్రపరిధిలో దాదాపు ప్రధానమంత్రికి సమానమైన అధికారం కలిగి ఉంటున్న ముఖ్యమంత్రి విలువను అది మొదటిసారి తగ్గించివేసింది. ఇప్పుడు ముఖ్యమంత్రి, ప్రధానమంత్రి– ఇంకా చెప్పాలంటే పార్టీనాయకత్వం– ఆయా వ్యక్తుల్ని నామినేషన్ చేసే వివిధ పదవులలో ఒకటిగా మారి పోయింది. ఆ పైన ఇందిర శక్తిమంతులైన వెనకటి ముఖ్యమంత్రుల స్థానంలో వేరొక తరహా వ్యక్తుల్ని నియమించారు. వీళ్ళు పూర్తిగా 'తన'ముఖ్యమంత్రులు. అనుశ్రుతంగా అందరికీ తెలిసిన రాజకీయప్రమాణాలతో చూస్తే వాళ్ళు నామమాత్రులే . అయినప్పటికీ తను సంకల్పించిన విప్లవాత్మకమైన మార్పుల్ని తీసుకురాగల ప్రత్యేకప్రతినిధులు కాగలరని భావించి వారి నామె ఎంచుకున్నారు. ఆమె నిర్ద్వంద్వసమర్థకులు ముందుకు తెచ్చిన భాష్యం ఇది.

ఆమె ఆంతర్యం వాళ్ళకు తెలుసునని కాదు, మొత్తంమీద వాళ్ళామె తరఫున వకాల్తా పుచ్చుకుని ఈ భాష్యం చెప్పారు.

రాజకీయశ్రేణులంతటా ఇది దిగ్భ్రాంతికెరటాలు రేపింది. పాత బాస్‌లందరినీ నిలువునా కుదిపివేసింది. ఇందిర ఇప్పుడెవరినైనా బాస్‌గా పేర్కొనగలరు. అధికారపక్షంలో గలభా, గందరగోళం తలెత్తాయి. దీనినుంచి ప్రత్యక్ష పర్యవసానం ఒక్కటే – పార్టీని దాదాపు సొంతఆస్తిగా పరిణమింపజేస్తున్న ఇందిరాగాంధీ సంపూర్ణాధిపత్యం. ఇంతకాలం ఆమెదే తుదిమాట అవుతూ వచ్చింది. ఇప్పుడామె అన్నదే మాట, మొదలూ, తుదీ కూడా అదే...పార్టీలోని ఎందరినుంచో వినిపించిన వ్యాఖ్య ఇది.

దేశంలో ఎందరో పరిస్థితిని అలాగే భావించుకున్నారు. సంపూర్ణఅధికారశక్తి ఇందిరాగాంధీయే. పార్టీ ఆమెకు చెందినది మాత్రమే. పార్టీని తనకోసమే ఆమె వాడుకోదల్చుకున్నారు.

ఆనంద్ దీనిని తీవ్రంగా వ్యతిరేకించాడు. సర్వాధికారాలు ఇప్పు డామెవేనని అతడూ అంగీకరించాడు. అయితే సంపూర్ణాధికారం దానికదే అంతిమలక్ష్యం కాదు అదలా కావడానికి ఉద్దేశించింది కాదని అతడు వాదించాడు.

సరే, ఏమిటా అంతిమలక్ష్యం? దేశ విదేశాల్లో లక్షలాదిమంది బుర్రలను తొలుస్తున్న అనుమానానికి వాగ్రూపం కల్పిస్తున్నట్టు శేఖర్ ప్రశ్నించాడు. నాటి శాసనసభా కార్యక్రమాల ప్రారంభానికి ఎదురుచూస్తూ ఎంట్రన్స్‌హాల్‌లో కూర్చుని వాళ్ళిద్దరూ ఇందిరాగాంధీ తాజా ఎత్తుగడ గురించి చర్చించుకుంటున్నారు.

'శేఖర్, నీ ప్రశ్నకు ఏదో ఒక్క సమాధానమే చెప్పడానికి లేదు,' ప్రతిమాటనూ ఆచితూచి ప్రయోగిస్తూ ఆనంద్ అన్నాడు. 'నేనేమీ ఇందిరాగాంధీ తరఫున మాట్లాడటం లేదు, నన్నామె ఎరుగదు కూడా. రాజకీయ కార్యకర్తలు తమ నాయకుడి ఆంతర్యం తెలుసుకోడానికి ప్రయత్నించినట్టే నేను కూడా దూరంనుంచి ఆమె మనసులో ఏముందో కనిపెట్టడానికి ప్రయత్నిస్తున్నాను, అంతే. సంపూర్ణాధికారాన్ని కోరుకుంటున్నారన్నది నీ నమ్మకమైతే, మరెందుకోసమో ఆమె అటువంటి అధికారాన్ని ఆశిస్తున్నారని నా నమ్మకం. అది కేవలం అధికారం కోసమే అధికారాన్ని కోరుకోవడం కాకపోవచ్చు. ఈ తదుపరి ప్రశ్నమీద నీ ఊహలు ఎందుకు సాగకూడదు? ఆమెకు సంపూర్ణాధికారమే ఉందనుకుందాం, అటువంటి అధికారాన్ని ఆమె ఎందుకు ఆశిస్తున్నట్టు? దానినుంచి ఆమె ఆశిస్తున్నది ప్రధానంగా ప్రజాహితమేనని నా నమ్మకం. ఆమె చేస్తున్నది ఒప్పుకావచ్చు, లేదా అది పూర్తిగా తప్పుగానే పరిణమించవచ్చు. అంతిమంగా, ఆమె తమకు చేసిందేమీ లేదని ప్రజలు అన్నా అనవచ్చు. ఇప్పుడామె గురించి మాట్లాడుకుంటున్నది మనం, అంటే ఆమె సహచరులం, అనుచరులం. ఆమెను అర్థంచేసుకోలేనప్పుడు ఆమెతో మనం ఉండవలసిన పనేలేదు...

'ఆ విషయం గురించి ఇప్పటికే మనం లెక్కలేనన్నిసార్లు మాట్లాడుకున్నాం, ఒకింతవాడిగా అన్నాడు శేఖర్. తను ఇందిరాగాంధీ వెంట ఎందుకున్నాడన్న ప్రశ్నకు సమాధానం చెప్పిత

మతనికి ఇష్టంలేదు. 'ఆమె పార్టీకి నాయకురాలు; ఆమె ప్రధానమంత్రి, భారతదేశం అనబడే ఈ అరాచకదేశాన్ని ఏలడానికి ఆమెకు అనుచరులు కావాలి పైగా ఆ ఏలడం కూడా ఆరువేల మైళ్ళ దూరంలో ఉన్న మరోరకం ప్రజలనుంచి ఎరువు తెచ్చుకున్న నియమనిబంధనలతో, అదికూడా ఎందుకంటే, నూటయాభై సంవత్సరాలు వాళ్ళు మనపై పెత్తనంచేశారు కనుక,' అన్నాడు టూకీగా.ఎ

అది మార్చి కారణమేఎ, ఆనంద్ అన్నాడు. ాఅయితే మొత్తం కథంతా అదేకాదు. ఓ పక్క ఎందరో సీనియర్‌నాయకులు ఆమెను విడిచిపెట్టిపోయినా మనం ఆమె విధేయులుగా కొన సాగడం వెనుక అంతగా స్పష్టపడని కారణమేదో ఉండాలి ఆమె దేనినో సాధించడంలో సహకరించ డానికి నేను యత్నిస్తున్నా ననుకుంటున్నాను. వాస్తవంగా అదేమిటో నేనూ వివరించలేను, ప్రజలూ వివరించలేరు. అది కేవలం మన రాజకీయప్రయోజనాలకే సంబంధించినది కాకుండా దేశ భవిష్యత్తుకు సంబంధించినదని నా విశ్వాసం. ఇక్కడ నేను మాట్లాడుతున్నది కేవలం నా గురించే కాకుండా మనందరి గురించని నా అభిప్రాయం.ఎ

'నాకు తెలియదు', శేఖర్ వాదించాడు. ా'ఒక్కోసారి నీ కలలజబ్బు అంటురోగంలా మారుతూ ఉంటుంది. నేను కలలుకనే బాపతు కాదు. నా దృష్టిలో ఇదంటా వట్టిరాజకీయం, అంతకంటె ఎక్కువా కాదు, తక్కువా కాదు.'

'అటువంటప్పుడు నువ్వు కూడా ఆమెను ఆడిపోసుకునే వాళ్ళలో ఎందుకు చేరకూడదు?' ఆనంద్ నిష్కరషగా ప్రశ్నించాడు. 'నువ్వేలాగూ వాళ్ళతో ఏకీభవిస్తూనే ఉన్నావు...ఎ'

'పూర్తిగా కాదు', శేఖర్ తటాలున అన్నాడు. 'అక్కడే వచ్చింది చిక్కు. మిగిలిన వాళ్ళు ఆమెను కేవలం ఆడిపోసుకుంటారు. అంతకుమించి వాళ్ళు చేయగలిగింది లేదు. వాళ్ళ దారి అక్కడితో ఆగిపోతుంది. దేశాన్ని ఎక్కడికి తీసుకువెళ్ళాలనుకుంటున్నారో వాళ్ళకే తెలియదు, తెలుసుకోవాలని కూడా అనుకోరు... నాది పూర్తిగా భిన్నమైన పరిస్థితి. ఇందిరాగాంధీ తన అపరిమితాధికారాన్ని ఎలాగైనా వినియోగించుకోవచ్చుగాక, అందులో ప్రజలకు కీలకప్రమేయం ఉండదనే నా విశ్వాసం. వాళ్ళెప్పుడూ ఉంటారు. అయితే వేరే లక్ష్యాలు సాధించడంలో ఆమెకు పనికివచ్చే పరికరాల్లానే ఉంటారు. తమే ఆమెకు లక్ష్యంగా ఉండరు...'

'అయితే నీ ఉద్దేశంలో ఆమె చరమలక్ష్యం ఏమిటి?' ఆనంద్ ప్రశ్నించాడు.

'నాకెలా తెలుస్తుంది?' శేఖర్ ఎదురుప్రశ్న సంధించాడు. ా'ఏమైనా ఈ ప్రేరణలు ఒక దానితో ఒకటి అల్లుకుని ఉంటాయి. ఏది అంతిమలక్ష్యం కాదని నేను భావిస్తున్నానో చెప్పాను. అంతిమలక్ష్యం ఏదో చెప్పగల స్థితిలో నేను లేను. అది అహం కావచ్చు, ఘనకీర్తిని మూట గట్టుకోవాలన్న దుగ్ధ కావచ్చు, చరిత్రలో చోటుకోసం తపన కావచ్చు. పేరు చిరస్థాయిగా నిలిచిపోవాలన్న ఆకాంక్ష కావచ్చు. ఏదైనా ఎటువంటిదైనా కావచ్చు. అదేమిటో ఇప్పటికిప్పుడు నువ్వూ నేనూ తెలుసుకోలేం. అది ఏదీ లేకపోవడమూ కావచ్చు, ప్రత్యేకించి ఆమె నిర్దేశించు కున్నదేదీ కాకపోవచ్చు.'

ఇదీ ఊహాగానాల సరళి. రెండువైపులా రేగిన తీవ్ర వాగ్వాదాలు ఒకదానినొకటి ఖండించు కున్నాయి. పార్టీ లోపల ఆంతరంగిక సంభాషణల్లో మొగ్గు వ్యతిరేకాభిప్రాయాలవైపే కనిపించింది. బహిరంగంగా మాత్రం అంతా అనుకూలధోరణే. ఇక పత్రికల విషయానికొస్తే ఆమెపై విమర్శలు గుప్పించినవే ఎక్కువ. విదేశాల్లో ఉన్న వారికి ఆమెలో ఒక నియంత రూపుదిద్దుకోవడం కనిపించింది.

మొత్తంమీద ప్రజలనుంచి మాత్రం అనుకూలతే వ్యక్తమైంది. పత్రికలు చదవగలిగిన కొద్ది మంది అక్షరాస్యులలోనూ కొందరు అప్పుడప్పుడు కనుబొమలు పైకెత్తుతూ వచ్చారు. అయితే శాశ్వతంగా వాళ్ళు అదే స్థితిలో ఎలాగూ ఉండలేరు కనుక వాళ్ళు కూడా ఇందిరాగాంధీకి జైకొట్టే బృందంలో చేరిపోయారు.

మంత్రివర్గంలో తరచు మార్పులూ, చేర్పులూ, తొలగింపులూ, ముఖ్యమంత్రులుగా ఎవరెవరినో నియమించడాలూ ప్రజల్లో పెద్దగా అలజడి రేపలేదు. వాళ్ళలో రాజకీయాలను శ్రద్ధగా గమనించే వారు మాత్రం వీటిని ఆసక్తితో తిలకిస్తూవచ్చారు. జనసామాన్యంలో ఈ పరిణామాలు చాలావరకూ ఎటువంటి కదలిక పుట్టించలేదు. ఇందిరాగాంధీ ఏంచేసినా స్థూలంగా వాళ్ళు ఆమెనలా చేయనివ్వడమో, ఒక్కోసారి హర్షిస్తూ స్పందించడమో, జరుగుతూ వచ్చింది. ఆమె ఎవరైనా ఒక ముఖ్యమంత్రిని తప్పించదలచుకుంటే తప్పకుండా అతడేదో తప్పుచేసి ఉంటాడని వారు అనుకోసాగారు. ఇందిరాగాంధీ ఓ కొత్తవ్యక్తిని (అంతకంటె అపరిచితుడనడం సబబు) ముఖ్యమంత్రిపీఠంమీద ప్రతిష్ఠిస్తే అతడెవరో మంచి బుద్ధికుశలుడూ, తన ఆలోచనకు కలిసొచ్చేవాడూ, ప్రజల అవసరాలకు స్పందించేవాడూ అయుంటాడన్నది ప్రజాభిప్రాయంగా పరిణమించింది. రాజకీయ సొరచేపలు ఇన్నేళ్ళూ ప్రజల కంటబడకుండా అతణ్ణి ముసుగులో దాచి ఉంటాయనీ, అందుకే అజ్ఞాతంగా ఉండిపోయాడనీ అనుకున్నారు. ఎంతైనా రాజకీయాలంటే కుక్క మరో కుక్కను చంపి తినడమే కదా... ఇప్పుడీ కొత్తమనిషి ఏంచేస్తాడో చూద్దాం. మనకు పోయేదేముంది? ఇంతకన్నా చెడిపోయేదేముంటుంది.

ఆనంద్ కిది కలవరపాటు కలిగిస్తూనే సవాలుగా పరిణమించింది. ఇందిరాగాంధీ నాయకత్వానికి తను అందమైన కాల్పనికతను జోడిస్తున్నాడన్న స్పృహ అతడి కంతగా కలగలేదు ఎందుకలా జరిగింది? పూర్తిగా తనామెతో మమేకం కావడం వల్ల, వాస్తవిక దృక్కోణాన్ని కోల్పోవడం వల్లనా? ఆదర్శవాదప్రేరితమైన ఒకానొక నాయకత్వారాధనా మనస్తత్వంతో ఇందిరాగాంధీని దేశోద్ధరణకు దిగొచ్చిన దేవదూతగా తను నిస్సందేహంగా పరిగణించాడా? తన తార్కికతనూ, వస్తుగతదృష్టినీ పూర్తిగా కోల్పోయాడా? ఒక్కోసారి తన మిత్రులూ, సహచరుల వద్ద తను పరిహాసభాజనుడుగా మారినట్టు అతడి కనిపించేది. శేఖర్ చెబుతున్నదే సబబనీ తనదే తప్పనీ దాదాపు విశ్వసించే స్థితికి వచ్చాడు. అయితే ఒక విధమైన కంపరంతో ఆ ఆలోచననే ఏవగించుకున్నాడు.

ఎంత అర్థరహితం! అంత బరితెగించిన వక్రదృష్టి ఒప్పెలా అవుతుంది? తనకు ఇందిరా గాంధీ ఓ అంతుబట్టని మనిషన్న సంగతి అతడు ఒప్పుకున్నాడు. తనకే కాదు, శేఖర్‌కీ, ఇంకా ఎందరికో ఆమె అటువంటిదే.

తన దృష్ట్యా ఆలోచిస్తే తనకామె ఒక మాధ్యమం. తను నమ్మిన లక్ష్యసాధనకు మార్గం. నిజానికి ఇటువంటి నిర్వచనం అతడికి నచ్చలేదు, అయితే ఆయా అంశాలను తను చూస్తున్న పద్ధతిని వివరించడానికి ఇంతకంటె మెరుగైన వర్ణన కనిపించలేదు. తను ప్రజలకూ, దేశానికీ సేవ చేస్తున్నాడు కానీ ఇందిరాగాంధీకి కాదు. అర్థం చేసుకోగలిగిన వాళ్ళు కొందరే ఉండచ్చుగాక, ఈ విషయంలో తన ఆలోచన స్ఫటికసదృశం. విచిత్రమేమిటంటే ఆమెను తూలనాడేవారికి, ఆమె మాత్రమే అంతిమలక్ష్యం. శేఖర్ అన్నట్టు అంతకుమించి వాళ్ళు చూడలేరు... కనుక ఆనంద్ ఆమె అంతుబట్టని స్థితితో సహజీవనం చేస్తూనే, ఆ క్రమంలో ప్రజాసేవ చేస్తూనే, ఆ ప్రక్రియలో తనూ ప్రజాసేవ చేస్తూ ఉండవలసిందే. 'ఆ ప్రక్రియ' అనడంలోనే ఉంది కీలకమంతా.

తన ప్రజాసేవా ప్రక్రియను అతడు ఇందిరాగాంధీ అంతుబట్టని నైజంతో సమన్వయం చేసుకోవాలి. ఆమె లేనిదే తను తలపెట్టిన పద్ధతిలో ప్రజాసేవకు మార్గంలేదు. ఈ లంకె అతణ్ణి విచిలితుణ్ణి చేసింది. ఎన్నో సంవత్సరాలుగా పార్టీకి సేవలందిస్తూ, రాష్ట్రాలలో పార్టీ పునాది చెక్కుచెదరకుండా కాపాడుకుంటూ వస్తున్న ముఖ్యమంత్రుల తొలగింపు ఆ క్రమంలో తాజా పరిణామం. ఉదాహరణకు చౌదరి. అతడు డజన్లకొద్దీ హేయమైన పాచికలు ప్రయోగించి, తనదారికి అడ్డువచ్చిన వ్యక్తులలోని బలహీనతలన్నింటినీ ఒడుపుగా ఉపయోగించుకుని వాళ్ళను లొంగదీసుకున్నాడు. అతడు సిద్ధాంతవాది కాడు, వేడుక సోషలిస్టు కూడా కాడు, అయితే తన పదవికి ప్రమాదం తెచ్చుకోకుండానే వీలైనంతవరకూ ప్రజలకు ప్రయోజనం చేకూర్చాలన్నది అతడిలో ప్రధాన ప్రేరణ. అతడు ఇందిరాగాంధీతో రాజకీయ సహగమనానికి సిద్ధపడతాడని ఎవరూ అనలేకపోవచ్చుగానీ, అతడామెకు వ్యతిరేకంమాత్రం కాడు. ఏదెలా ఉన్నా, అతడి రాజకీయచాతుర్యానికీ, లేదా అతడి వ్యూహరచనా నైపుణ్యానికీ ఆమెకూడా వంకపెట్టలేదు... అయినా చౌదరి భవితవ్యం ఇప్పుడు డోలాయమానంలో పడింది. అతడు కూడా నిష్క్రమిస్తాడా? ఎప్పుడు? ఎందుకు?

అసలతడెందుకు నిష్క్రమించాలి? శాసనసభలోని తన పార్టీసభ్యులపై అతడికి పూర్తి అదుపు ఉంది. అతడు కోరిందే తడవుగా, అతడిపట్ల తమ విశ్వాసాన్ని ఉద్ఘాటిస్తూ దాదాపు ఏకగ్రీవం అనదగిన తీర్మానాన్ని ఆమోదించడానికి వాళ్ళు సిద్ధంగా ఉంటారు. రాష్ట్ర అధికార యంత్రాంగం అతడికి తలలోనాలుకలా వ్యవహరిస్తూ నిశ్శంకగా అతడి ఆదేశాలను అమలుచేస్తూఉంటుంది. మొరటుతనం, దురుసుతనం మూర్తీభవించిన మహేంద్రనాథ్‌కంటె విభిన్నవ్యక్తిగా తనను నిరూపించుకున్నాడు. ఆదరణ చూపిస్తూనే, ఎవరినీ అవమానించకుండానే చౌదరి పని రాబట్టుకుంటాడు ఈ వైఖరే అధికారవర్గంలో అతడిపట్ల ఇష్టాన్నీ, గౌరవాన్నీ ఇనుమడింపజేసింది. నీతినిజాయితీల కతడు ఉజ్వలోదాహరణ అని ఎవరూ అనుకోరు, అయితే అతడు తన చుట్టూ డబ్బు సంబంధమైన అనేకానేక కుంభకోణాలను పేర్చుకున్నవాడూ కాడు. ప్రజల్ని తనవైపుకి ఎలా తిప్పుకోవాలో అతడికి తెలుసు, వాళ్ళకతడు సహనయోగ్యుడుగానే కనిపించాడు. అతడేమీ దేవత కాడు, అయినా మన గ్రహం నుంచి దేవతలేనాడో పారిపోయారు.

ఈ దిక్కుమాలిన మనుషుల మధ్య మనం జీవించక తప్పదు. వాళ్ళలో ఈ చౌదరి మరీ అంత హీనుడేమీ కాదుష అన్నది జనవ్యాఖ్య. అంచేత చౌదరి ఎందుకు నిష్క్రమించాలి?... ఈ ప్రశ్న రాష్ట్రమంతటా మళ్ళీమళ్ళీ ప్రతిధ్వనించింది.

అయినప్పటికీ, నిష్పాక్షికులనుంచి కూడా మరో అభిప్రాయం వ్యక్తమౌతూవచ్చింది. చేసిందే మరింత ఎక్కువగా చేస్తూ చౌదరి ఎంతకాలం అధికారంలో కొనసాగాలని మీ ఉద్దేశం? చేసిందే మరింత ఎక్కువగా చేయడమంటే ప్రజలకు ఏమీ చేయకపోవడమే కదా! జీవితంలో రుచిని నింపేది మార్పే కనుక కొత్తమసాలాకోసం ఎందుకు ప్రయత్నించకూడదని వాళ్ళ ప్రశ్న. ముఖ్య మంత్రి ఎలాగూ రాజు కాడు. మీ దుస్తులనూ, మీ బూట్లనూ, మీ ఫ్యాషన్లనూ, మీ జీవన సరళులనూ అన్నింటినీ మార్చుకుంటున్నప్పుడు, మార్పుకోసం మీ ముఖ్యమంత్రినెందుకు మార్చుకోకూడదు?

ఈ వాచాలత కర్ణకఠోరంగా మారింది. ఎందులోనూ మంచిని చూడలేని వక్రమనస్తత్వమే ఒకవిధంగా ప్రజాజీవనాన్ని నడిపిస్తోంది. తెలిసినదానికీ, తెలియనిదానికీ మధ్య అది వంతెన. ఉన్నదానికీ, ఉండాలనుకుంటున్నదానికీ మధ్య వంతెన. ఈ రూపంలో ఇప్పుడున్న అర్థభాగానికీ, జీవనగతిక్రమంలో నువ్వు కోరుకుంటున్న మరో అర్థభాగానికీ మధ్య వంతెన.

ఇదిలాఉండగా, చౌదరి పైకి నవ్వేస్తూ, చమత్కారాలు గుప్పిస్తూ ఉన్నాడు కానీ లోలోపల కోపంతో ఉడికిపోతున్నాడు. మహేంద్రనాథ్‌కీ, అతడి అనుచరగణానికీ ఇది పరమానందం కలిగిస్తోంది. ఢిల్లీలోనూ, రాష్ట్రంలోనూ లెక్కలేనన్ని పాచికలు నడపడానికి మహేంద్రనాథ్ కిప్పుడు రెండుచేతులు సరిపోవు, రెండువందల చేతులూ కావాలి. పైగా అతడిప్పుడు అధికారపక్షంలో లేడు కనుక తన ప్రాబల్యాన్నీ, తన స్థాయినీ పోషించుకోడానికి మరింత సంక్లిష్టవ్యూహాన్ని ఆశ్రయించకతప్పదు. ఒకప్పుడు అధికారపక్షంలో ఉన్న వ్యక్తి వాస్తవంగా దానినెప్పటికీ విడిచివెళ్ళకపోవడమన్నది ఇక్కడ ఆసక్తిజనకమైన విషయం. పార్టీ విడిచివెళ్ళినా సరే, రకరకాల మార్గాల్లో పార్టీలో వేలుపెడుతూనే ఉంటాడు తప్ప, అందులో ఇమిడిఉన్న ప్రయోజనాలను ఎప్పుడూ కోల్పోడు. ఏదో ఒకరోజున, ఏదో ఒక పద్ధతిలో పార్టీలోకి పునరా గమనాన్ని అతడు ఎప్పుడూ త్రోసిపుచ్చాలనుకోడు. చాలామంది విషయంలో, పార్టీనుంచి నిష్క్రమించడమనేది, పార్టీని అప్పటికి ఆవరించి ఉన్న చీలికవర్గాలనూ, విచ్ఛిన్నశక్తులనూ నిర్మూలించిన తర్వాత మరింత బలాధిక్యంతో తిరిగి పార్టీలోకి ప్రవేశించే విస్తృతవ్యూహంలో భాగమవుతుంది. దేశంలోని ప్రతిపార్టీ తన పనితీరును చక్కదిద్దుకునే బదులు లోపాయికారీగా అధికారపక్షాన్ని వాడుకునే ప్రయత్నంలో తలమునకలవుతూ ఉంటుంది. అంటే దేశంలో ఏకైకపక్షం అధికార పక్షమేనని అందరూ ఒప్పుకోకనే ఒప్పుకున్నట్టు! మరి బహుపక్ష సమాజంలో ఈ వింత ఎలా నప్పుతుంది?... అయినా ఇదే జరుగుతోంది.

ఇందిరాగాంధీ పాలనపై కొన్నివర్గాల ప్రజల్లో, రాజకీయవర్గాల్లో వినిపిస్తున్న అపహాస్య ధోరణి, ఆనంద్ తన వాదాన్ని పటిష్ఠం చేసుకోడానికి అవసరమైన మర్మాన్ని ఆనంద్‌కి అందించింది. అదేమిటంటే పార్టీ ఎప్పుడూ చేసే పనే పదే పదే చేస్తూండడం వల్ల ప్రయోజనం లేదు.

లేకపోగా అది ఉన్న ప్రయోజనాల్ని కూడా దెబ్బతీస్తుంది; నిజానికిప్పటికే అది జరిగింది కూడా. వర్తమానవ్యవస్థ అసమానతలు మరింత పెరగడానికే ఎలా దోహదం చేస్తున్నదో అందరూ చూస్తూనే ఉన్నారు. సాంఘికఉద్రిక్తతలు అపారవిధ్వంసానికే దారితీస్తాయని నక్సలైట్లు ఇప్పటికే హెచ్చరిక జారీచేశారు. కనుక మార్పు రావలసిందే. ఎవరికిష్టం ఉన్నా లేకపోయినా ఇందిరాగాంధీ ఆ మార్పుకు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఉన్న వ్యవస్థకే ఆమె ప్రాతినిధ్యం వహించలేరు. సంపూర్ణపరివర్తనకు ఆమె ఉపక్రమించవలసిందే. అది పైపై మార్పుగానూ, పాక్షికమైన మార్పు గానూ ఉండలేదు. ఆమె ముఖ్యమంత్రుల్ని మార్చడమనేది కూడా ఈ ఆమూలాగ్రమైన మార్పులో ఒక ముఖ్య మైన భాగం. శిఖరస్థానంలో నూతనాధికారాలతో ప్రత్యక్ష మైన ప్రధానమంత్రికి ఈ నూతన ముఖ్యమంత్రులు పూరకంగా ఉండి పనిచేయవలసి ఉంటుంది. వాస్తవికార్థంలో చెప్పాలంటే, వారు మొత్తంలో మిగిలిన అర్థభాగం.

అతడు శక్తివంతంగా వాదిస్తున్నాడే కానీ, తనకు వాస్తవపరిస్థితి ఏదీ తెలియదన్న స్పృహకూడా మరోపక్క అతణ్ణి బాధిస్తూనే ఉంది. తనంత పట్టుదలగా ముందుకు తెస్తున్న సిద్ధాంతంలోని నిజానిజాలను పరీక్షించుకునేందుకు కావలసిన ఆధారభూమిక అతడి వద్దలేదు. తన ఆలోచనల సౌధం కూడా పేకమేడలా కూలిపోవచ్చు. తను పూర్తిగా పొరబడ్డాడని వాస్తవాలు రుజువుచేస్తే ఏమవుతుంది? ఇందిరాగాంధీ అనుసరించే మార్గం తనూహించుకుంటున్న మార్గానికి భిన్న మైనదని తేలితే ఏమవుతుంది? తన ఊహలో రూపుదిద్దుకుంటున్న పథకాలు తన ముఖంమీదే పేలిపోతే ఏమవుతుంది. తనప్పు డెక్కడుంటాడు? స్వాప్నికుడైన ఆనంద్, సోషలిస్ట్‌గా చెరగని ముద్రపడిన ఆనంద్, నిస్వార్థుడూ, జనహితైషీ, ప్రజాసేవకుడూ అయిన ఆనంద్ ఏమైపోతాడు?

మిత్రులతో వాదోపవాదాలు సాగించాడు. వాళ్ళలో ఒక్కరూ అతనికి సంపూర్ణ సమర్థన అందించలేదు. ఇందిరాగాంధీకి వాళ్ళు వ్యతిరేకులు కారు; ఆ విషయం వాళ్ళందరూ స్పష్టం చేశారు కూడా. నిజం చెప్పాలంటే ఆమెను వ్యతిరేకించకపోవడంలోనే గొప్పసుగుణం ఇమిడిఉన్నట్టు వ్యవహరించారు. ఆమెలో దేనిని తాము సమర్థిస్తున్నారో విప్పిచెప్పిన వారు చాలా కొద్దిమందే. వారిలో చాలామంది ఇందిరాగాంధీని చిత్తశుద్ధితో ప్రశంసిస్తున్న వాళ్ళే. అయితే వాళ్ళు వ్యక్తి ఆరాధననూ, రాజకీయసమర్థననూ కలగాపులగం చేసేశారు. శుష్క ప్రశంసలు ఆనంద్‌కి కోపం తెప్పించాయి కానీ అతడా మాట అనలేదు. ఆ ధోరణిని ఇంకెంతమాత్రం అతడు భరించలేని స్థితిలో ఓ రోజు మధ్యాహ్నం అరుణ హఠాత్తుగా అతని ముందు ప్రత్యక్ష మైంది. కోపంతో విరుచుకుపడ్డాడు.

'ఇది చాలా అక్రమం!' అతడు ఒక్కపెట్టున ఆక్రోశించాడు. 'వీళ్ళు ఇందిరాగాంధీని, పార్టీని నాశనం చేయడానికి సిద్ధమయ్యారు!'

'ఓ పగటికలల పెద్దమనిషీ, కాస్త శాంతించు!' అరుణ అంది. 'అందరినీ చుట్టేసి మందమీద మిరియాలు చల్లకు. ఇందిరాగాంధీ నియంత కావచ్చు, కాకపోవచ్చు. నువ్వుమాత్రం కచ్చితంగా కాదుకదా? ఏదో అనకుండా, ఏదే చేయకుండా ఉండలేని అల్పజీవుల మీద నువ్వెందుకు ఆగ్రహిస్తావ్?'

'అందువల్ల ఎంత నష్టం జరుగుతుంతో నీ కర్థం కావడం లేదు అరుణా?' ఆమెతో తీవ్రంగా విభేదిస్తూ ఆనంద్ అన్నాడు. 'విలువల విషయంలో మన మెంత మూల్యం చెల్లించవలసి వస్తోందో నువ్వు గ్రహించడం లేదా? ఈ నష్టాన్ని మనం భరించగలమా? దేశం భరించగలదా?'

'నువ్వు దేనిగురించి మాట్లాడుతున్నావ్? కాస్త స్పష్టంగా చెబుతావా?'

'ఒకటేమిటి, ఇప్పుడు చాలా ఆలోచనలు నా బుర్రలో సుడులు తిరుగుతున్నాయి'ఎ కోపాన్ని నిగ్రహించుకుంటూ ఆనంద్ ప్రారంభించాడు. 'నీకు వివరించడానికి ప్రయత్నిస్తాను. మనం అనేక రాష్ట్రాలలో అత్యద్భుత ఎన్నికల విజయం సాధించిన మాట నిజమే. అధికారంలోనూ, ప్రజాభిమానంలోనూ ఇందిరాగాంధీ అత్యున్నతశిఖరానికి చేరుకున్న మాట నిజమే. కానీ ఆ శిఖరాగ్రంమీద ఆమె ఎంతకాలం ఉండగలుగుతుంది? ఆ మహోద్ధృతతరంగంమీద ఎంత కాలమని ఊరేగగలుగుతుంది?ఎ

'నువ్వు చెప్పింది వాస్తవం,'ఎ అరుణ అంది.'ా'ఆ కెరటం త్వరలోనే తగ్గుముఖం పడుతుంది. నీలానే పార్టీలో ఎందరో అది తలచుకుని ఆందోళన పడుతూనే ఉన్నారు. అయినా నువ్వెందుకు ప్రశ్నలు గుప్పిస్తున్నావ్? నువ్వు ఇందిరాగాంధీ ఆలోచనలకు అర్థవివరణ చెయ్యగలిగినవాడివి. నీకు నువ్వుగా నియమించుకున్న వాడివే కావచ్చుగాక, ఆమె అంతఃకరణకు కాపలాదారువి. అటువంటప్పుడు నువ్వే సమాధానాలెందుకు అన్వేషించకూడదు? ఈ క్షణాన అతికొద్దిమందికే ఇందిరాగాంధీ అర్థమైనట్టు కనిపిస్తోంది. ఆమె ఇప్పుడు చేస్తున్నవన్నీ ఎందుకు చేస్తోందో ఎవరికీ తెలియదు. ప్రధానమంత్రి తన పార్టీకి చెందిన ముఖ్యమంత్రులనే పడదోస్తున్న పరిస్థితిని ఒకసారి ఊహించుకో! గతంలో ఇలాంటిది ఎప్పుడైనా జరిగిందా? ఆమె అనుచరుల కిదంతా నిరంకుశంగానూ, ఏకపక్షచర్యగానూ కనిపిస్తే వాళ్ళ నెందుకు తప్పుపట్టాలి? ఆమెది సర్వాధికారశక్తి కనుక వాళ్ళు తమ మనోగతాన్ని బయటపెట్టలేరు. ఆమెను ఢీకొనగలిగిన వాళ్ళం కామని వాళ్ళకి తెలుసు. ఆమెను విమర్శించలేరు కనుక పొగుడుతున్నారు, అంతే. రాజకీయవాదులు ఏ విషయం గురించైనా ఎంతోకాలం మౌనంగా ఉండలేరన్న కోణం నుంచి చూస్తే ఇది నీకే అర్థమవుతుంది. వాళ్ళామెను ఎందుకు పొగుడుతున్నారో ఎందుకు అర్థం చేసుకోవు? అది నిజమైన పొగడ్త కాదనే నువ్వూ నమ్ముతున్నావు, అవునా? అది నిజమైన ప్రశంసే అయితే వాళ్ళామెను సమర్థిస్తున్నట్టే లెక్క. కాదనే నువ్వూ అనుకుంటున్నావు కనుక దాని అంతరార్థాన్ని నువ్వు అర్థంచేసుకోవాలి. ఏ వైపు నుంచి చూసినావాళ్ళను తప్పుపట్టవలసిన అవసరం నీకు తెలియదు. అయినా ఆమె ఆంతర్యాన్ని విప్పి చెప్పడానికి బయలుదేరావు. ఆమె చర్యల్ని సమర్థిస్తావు కానీ నీది బలమైన వాదం కాదని నీకూ తెలుసు. కనుక ప్రతివాళ్ళనూ విమర్శించడంతోనే నీకు సరిపోతోంది. ఇదంతా అర్థం లేని ఆర్భాటం!!'

ఆనంద్ జవాబు చెప్పలేదు. ఆమె చేసిన పరుషవ్యాఖ్యల ప్రభావాన్ని జీర్ణించుకోడానికి ప్రయత్నించాడు. అవి ఆమె మాటలు కావని అతనికి తెలుసు. అస్థిమితంగా, ఆగ్రహంగా ఉన్న ఎందరో ఆలోచనలనే అవి ప్రతిధ్వనించాయి. మిగిలినవాళ్ళందరూ నోళ్ళు మూసుకోవడమో,

లేదా శుష్కప్రశంసలు కురిపించడమో చేస్తే తన వద్ద నిర్భయంగా ఇటువంటి అభిప్రాయాలు వ్యక్తంచేయగలిగింది అరుణ ఒక్కతే.

తను పరుషంగా మాట్లాడిన విషయాన్ని అరుణకూడా అర్థంచేసుకుంది. ఆ పరుషత్వానికి కారణం ఆమె ప్రత్యామ్నాయ దృక్కోణాన్ని ప్రదర్శించడమే. పరిశీలన, అన్వయాలపై ఆధారపడి రాజకీయస్థితిగతులపై రూపొందించుకున్న తనవైన అభిప్రాయాల నుంచి ఆనంద్ దృష్టిని మరోవైపునకు మళ్ళించడానికి ఇంతకంటె మార్గంలేదు. ఆ అభిప్రాయాలలో చాలా అంశాలు ఊహాజనితమైనవిగానూ, తరచు విపరీతంగానూ, విస్తృతవ్యాప్తి కలిగినవిగానూ ఉంటాయి అంతా ఒకే ఒక వ్యక్తి ఇందిరాగాంధీపై ఆధారపడి ఉండడంతో ప్రయోజనం ఉంటుందన్న హామీ లేకపోయినా వర్తమాన సంక్లిష్టపరిస్థితిని పోల్చుకోడానికవి ప్రయత్నించాయి. ఆమె పార్టీని ఎలా నిర్మిస్తారు, ఆమె ప్రతిపాదనలకు ప్రజలు ఎలా స్పందిస్తారన్న దానిపై సమస్తం ఆధారపడి ఉంది...

పాదరసంలాంటి స్వభావం కావడంతో అరుణ హఠాత్తుగా ఉల్లాసభరితంగా మారిపోయింది. మృదుమధురస్వరంతో అంది, 'కోప్పడకు, నువ్వెప్పుడూ సక్రమమైనదే చేయడానికి ప్రయత్నిస్తావు, చేస్తావు అని నాకు తెలుసు. అయితే ఇప్పటి పరిస్థితుల్లో సమర్థంగా పనిచేయాలంటే నువ్వు ఇందిరాగాంధీ శక్తిని కూడా తెచ్చుకోవాలి. అదెలా సాధ్యమౌతుంది? ఆమె ,ఢిల్లీలో ఉంది, ఎవరో చెప్పినట్టు ఢిల్లీ సుదూరాన ఉంది... ప్రధానమంత్రిని సవిమర్శకంగా అర్థంచేసుకోడానికి యత్నిస్తున్న అతికొద్దిమందిలో ఒకడివైన నీకు అందనంత దూరంలో ఉంది. ఆమె నర్థంచేసుకోడానికి ఉన్న మార్గం సవిమర్శకంగా అర్థం చేసుకోవడం ఒక్కటే.'

అవగాహన తొణికిసలాడుతున్న ఆమె కళ్ళలోకి చూశాడు ఆనంద్. తమ ఇష్టానికి వ్యతిరేకంగానే కావచ్చు వ్యక్తిగత సంబంధాలపై రాజకీయఅనివార్యతలదే పై చేయిగా మారిన స్థితినుంచి ఉత్పన్నమయ్యే మానసికసంఘర్షణను ఇద్దరూ సమానంగా ఎదుర్కొని క్రమంగా అందులోంచి బయటపడ్డారు. పనిమీద ఆనంద్ ధ్యాస ఎవరూ ఏమీ చేయలేనంత గాఢంగా ఉంటుందని అరుణ అర్థంచేసుకుంది. అరుణ బొత్తిగా హేతుబద్ధత లేని విపరీతచర్యలకు పాల్పడుతూ ఉంటుందని ఆనంద్ కూడా గ్రహించుకున్నాడు; ఉభయులూ ఇకమారలేరు. పూర్వం ఈ పరిణామాలను వాళ్ళు ఊహించినవారు కాదు, ఇప్పుడు వాటినుంచి తప్పించుకోలేరు. అదీగాక కాలక్రమేణా వారిలో ఆగి ఆలోచించే ధోరణి, నిదానం, నిర్లిప్తత పెరుగుతున్నాయి. పదేళ్ళ క్రితం, ఈ ప్రపంచాన్ని తాము మార్చగలమనీ, మార్చుతామని అదొక చెప్పరాని ధీమాతో ఇద్దరూ అనుకునేవారు... కానీ వాళ్ళలో ఇప్పుడా నమ్మకం సడలిపోయింది. అయినా జీవితం వారిని నిరాశాభరితుల్ని చేయలేదు. ఆశకు పూర్తిగా నీళ్ళు వదులుకున్నారు.

'నువ్వైనా నన్ను అర్థంచేసుకున్నావు అరుణా,' ఆనంద్ ప్రారంభించాడు. 'నా వ్యవహారణ నీకు సరైందిగానే కనిపించినందుకు కృతజ్ఞుణ్ణి. అయినాసరే నా ఆలోచనల్లోని లోటుపాట్లు నువ్వు నిశితంగా పరీక్షించి, నేను కాలం వృథాచేస్తున్నానో ఏమో, చెప్పాలి. ఒక స్వతంత్ర దేశంగా మనం బ్రిటిష్‌తరహా పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని ఎంచుకున్నాం. అదిక్కడ పని

చేయదనే చాలామంది అన్నారు కానీ, పండిట్‌జీ, ఆయన సహచరులు చేసి తీరుతుందనే నొక్కిచెప్పారు. దీని గురించి నెహ్రూ తన రచనల్లో ప్రసంగాల్లో ఎంతో విపులంగా వాదించారు. ఈ తరహా విధానం గురించి ప్రజలతో మాట్లాడి ఒప్పించారు. తను జీవించి ఉన్నంతకాలం ఈ విధానాన్ని పరిపోషిస్తూ, లౌకికవాదజాతీయత, భిన్నత్వంలో ఏకత్వం ప్రాతిపదికలుగా కిందిస్థాయివరకూ ప్రజాస్వామ్యవికేంద్రీకరణతో, ఆర్థికస్వావలంబనతో, ప్రణాళికాబద్ధ అభివృద్ధితో ఆ విధానాన్ని బలోపేతంచేయడానికి ప్రయత్నించారు. జటిలమైన ప్రతిఒక్క అంశాన్నీ విడమరచి చెప్పి మిగిలిన ప్రతిఒక్క జటిలమైన అంశంతోనూ దానిని సమన్వయం చేయగలిగారు. అలా సరళమూ, సహజసుందరమూ అయిన ఒక సంపూర్ణచిత్రాన్ని ఆవిష్కరింపజేయగలిగారు. ఒకసారి వెనుదిరిగి చూస్తే ఆయన తదనంతరం ఏం జరిగిందో మనకు తెలుసు. ఆయన దేనిని నిర్మించడానికి ప్రయత్నించారో, ఎవరినైనా ఒప్పింపజేయగల తన విశిష్ట వ్యక్తిత్వంతో దేనిని నిలబెట్టడానికి చూశారో అది క్రమంగా కుప్పకూలిపోవడం చూశాం... నెహ్రూ అస్తమయంతో ఆయన వారసత్వం కూడా రెండుగా ముక్కలవుతుందని ఒక్కొక్కసారి నాకు అనిపించేది. ఇందిరాగాంధీ, సిండికేట్‌గా చెప్పబడుతున్న వారు కూడా ఆయనలో భాగాలే కానీ అవి ఎలాగో సామరస్యాన్ని కుదుర్చుకున్న భాగాలే. ఇప్పుడా రెండుభాగాలూ విడిపోయి ఆధిక్యంకోసం ఘర్షణపడుతున్నాయి. వ్యక్తులను పక్కనపెడితే ఈ రోజున్న పరిస్థితి అదే... ఇప్పుడా రెండుభాగాలూ కలిసి ఉండలేవు; యాంత్రికంగా సహజీవనం చేయలేవు, సామరస్య వాతావరణంలోనే అవి కలిసి ఉండగలుగుతాయి. నెహ్రూతోనే ఆ సామరస్యం అదృశ్యమైపోయింది, వారిని కలిపిఉంచగల అంశమేదీ లేకపోవడం దానికి కారణం. మరోసారి నే నిక్కడ వ్యక్తుల గురించి మాట్లాడడం లేదు, ఎలాగైనా రాజకీయవాదులు సంచారజీవులే. ఇప్పుడు ఇందిరాగాంధీని ఆడిపోసుకుంటున్నవారు రాత్రికిరాత్రి ఆమె జట్టులో చేరిపోయినా నేను ఆశ్చర్యపోను. ఒకవేళ అలా జరిగినాసరే అది నెహ్రూ పునరుత్థానానికి సూచన కాబోదు. ఆయనలోని ఆ రెండుభాగాలూ ఆ తర్వాతకూడా విడివిడిగానే ఉండిపోతాయి. నూతన సమ్మేళనం ఆచరణలో ఒకభాగం ఆలోచనాసరళినే స్వీకరించి రెండోదానిని విడిచిపెడుతుంది. ఆ విధంగా అదో ఇదో ఎంచుకోవలసిన పరిస్థితి స్పష్టంగా పైకి తేలుతుంది. మంచికే అనుకో, చెడ్డకే అనుకో ఇందిరాగాంధీ తనమార్గాన్ని తను నిర్ణయించుకోవలసిందే... క్రియాశీలరాజకీయాల్లోకి ప్రవేశించాలనుకున్న క్షణంలోనే ఈ విషయం ఆమెకు తెలుసుననే నా నిశ్చయం, తండ్రి జీవించి ఉన్నప్పుడే పార్టీ నాయకురాలుగా ఆమె తీసుకున్న కొన్ని సాహసోపేత స్వతంత్రచర్యలు ఈ అభిప్రాయాన్ని బలపరిచేవిగానే ఉన్నాయి. పార్టీలో ఎందరో నాయకులు అప్పుడు దేనికోసం పనిచేశారో, ఇప్పుడు దేనికోసం పనిచేస్తున్నారో తెలుసుకుని వాళ్ళను అంచనావేయగల అవకాశం ఆమెకు దొరికింది... ఇప్పుడామె ప్రధానమంత్రి, సర్వోన్నత నాయకురాలు, అక్కడితో అది మొదటి అధ్యాయం...'ఎ

'ఇంక రెండో అధ్యాయమేమిటో చెప్పు,' అరుణ అడిగింది. అతడి భాష్యాలతో, అభిప్రాయాలతో తను తరచు విభేదిస్తే విభేదించవచ్చు కానీ, స్వీయసిద్ధాంత వివరణకు పూనుకున్నప్పుడు అతడి వక్తృత్వం ఎంతో ఆకర్షణీయంగా ఉంటుందని ఆమెకు తెలుసు. ఈ మధ్య

అతడు తన అభిప్రాయాల విషయంలో తను పట్టిన కుందేటికి మూడుకాళ్ళు అన్న చందంగా వ్యవహరిస్తున్నట్టూ ఆమె గుర్తించింది. ముఖ్యంగా సాంఘిక, రాజకీయరంగాలలో జరుగుతున్న అక్రమాలపై అతడు సాగించే రకరకాల పోరాటాల విషయంలో. చిరకాలంగా తనకు తెలిసిన విస్పష్టఆలోచనాశీలి అయిన ఆనంద్ అతడిలో ఆమెకు తరచు కనిపించడంలేదు. అతడిలో మార్పు వచ్చిందని తనలో తనే అనుకుంది. ఒక పోరాటవాదిని ఎంతోకాలం సంకెళ్ళలో ఎలా ఉంచగలరు? అందుకు ప్రయత్నించిన ప్రతిసారీ అతడు జారిపోవడానికే చూస్తాడు! అతడి కోసమైనా అతడి పోరాటం విజయవంతమైతే బాగుండును!

'రెండో అధ్యాయం మన కళ్ళముందే ఉంది', ఆనంద్ కొనసాగించాడు. 'అందులో సమస్తం ఇందిరాగాంధీయే, ఎవరూ ఢీకొనని, ఢీకొనలేని ఇందిరాగాంధీ! తన అత్యద్భుత విజయాల తర్వాత, ఆమె తీసుకున్న కొన్ని చర్యలు దేశప్రతిష్ఠకు మచ్చతేవడం ప్రారంభించాయి. ముఖ్య మంత్రుల తొలగింపు మనం పోషించుకుంటూ వస్తున్న ప్రజాస్వామిక విలువల్ని ధ్వంసంచేస్తున్నమాట నిజమే.ఎఅందుకనుసరించిన పద్ధతి రాజ్యాంగవిరుద్ధమేమీ కాదు. అయినా అది, రాజ్యాంగానికి విరుద్ధమూ అనుకూలమూ కాని రాజ్యాంగాతీత చర్య... ఇందులో తొలగింపు ఒక్కటే ఉద్దేశసర్వస్వంగా భావించలేమనుకున్నప్పుడు, దాని వెనుక దేశానికి మంచిచేసే ప్రేరణ ఏదో ఉందనుకున్నప్పుడు – ఉందనే నా విశ్వాసం – ప్రజలకు దానిని వివరించవలసి ఉంటుంది. నేను అర్థం చేసుకున్న మేరకు, అన్వయించగలిగిన మేరకు ఆమె చర్యల్లోని ఆంతర్యాన్ని వివరించడానికే నా ప్రయత్నం అయితే నా మాటల్ని పట్టించుకోడానికి నే నెంతవాణ్ణి? ఈ లోపల పత్రికలు రచ్చకెక్కించి నానా యాగీచేస్తున్నాయి. ప్రచారం ఏకపక్షంగా మారినప్పుడు ఇది అనివార్యం. నేను ఇతరుల ముందు ఇలా మనస్తాపాన్ని వెళ్ళబోసుకోనని నీకు తెలుసు. బయట నేను ఇందిరాగాంధీ ఏం చేసినా సమర్థించే వీరసమర్థకుణ్ణి. నే నామెకు వకల్తా తీసు కోవడం చూసి నే నామెతో సహగమనానికి కూడా సిద్ధపడతానని మిత్రులు హేళన కూడా చేస్తున్నారు. నా ఆవేదన వాళ్ళకి తెలియదు, అది ప్రధానంగా ఆమెను సమర్థించడం నుంచి పుట్టుకొచ్చిన ఆవేదనే అనుకో. మొత్తానికి ఈ రోజు నీ ముందు నా దుఃఖాన్ని వెళ్ళబోసు కున్నాను. ఈ మధ్య ఇది నాకు మరీ దుర్భరంగా మారిపోయింది.'

'ఎందుకీ ఆవేదన? నువ్వు రాజకీయవాదివి, రాజకీయవాదులు ఆవేదనకు లోనుకారు. పోరాడి పరిస్థితులను లొంగదీసుకోవడమో, తలవంచడమో చేస్తారు. నువ్వు ఆవేదన ఎందుకు చెందాలో నా కర్థంకావడం లేదు.'

'నువ్వన్నది నిజం. అయితే ఈ ఆవేదన వ్యక్తిగతమైనది కాదు,' ఆనంద్ వివరించాడు. 'ఇదే దేశానికీ, ప్రజలకూ సంబంధించినది. వాళ్ళ ప్రపంచమంతటికీ ఇందిరాగాంధీ ఇప్పుడు కేంద్రస్థానంగా పరిణమించింది ఆమె ఏం చేస్తోంది, ఎలా చేస్తోందన్నది వాళ్ళకు చాలా ముఖ్యం. వాళ్ళకూ, వ్యవస్థకూ కూడా... ఆపైన ప్రతిఒకరికి మరింత ముఖ్యంగా కనిపిస్తున్నది ఆమె సాఫల్యం.

'ఒప్పుకుంటాను. వర్ధమానదేశాలలోని ప్రజల జీవననాటకంలో ప్రభుత్వానిదే ముఖ్యపాత్ర. ఈ క్షణాన దేశంలోని ప్రజల ఆశలూ, ఆకాంక్షలు అన్నీ ఇందిరాగాంధీమీదే లగ్నమై ఉన్నాయి... ప్రధానమంత్రికి నీ గురించి తెలియదని అనుకోడానికి తగిన కారణం ఏదీ లేకపోయినా ఆమె న న్నెరగదంటున్నావు. అయితే నువ్వనుకుంటున్నంత అనామకుడివేమీ కావు నువ్వు. సరే, ఆ విషయం వదిలెయ్... ఇంతకీ నీ ఆవేదన దేనిగురించి? నీకు ఆవేదన కలిగిస్తున్నదేమిటి? నిన్ను అంతగా బాధపెడుతున్నదేమిటో ఒక్కటి చెబుతావా?'

'ఈ క్షణంలో నన్ను బాధపెడుతున్నదొక్కటే అరుణా, ఇప్పుడు ప్రజలమాట తెరమరుగై పోయింది. ముఖ్యమంత్రులమార్పు ఒక్కటే చర్చనీయాంశమైకూర్చుంది. ఆ చర్యకు వ్యతిరేకంగా ముందుకుతెస్తున్న వాదాలు యుక్తియుక్తంగానే ధ్వనిస్తున్నాయి. ఇందిరాగాంధీని అభిమానించే వారు కూడా ఈ విషయంలో ఆమెను సమర్థించలేక పోతున్నారు. అయితే నా కనిపిస్తున్నది, ఆమె దృక్కోణంలో సహేతుకత ఉన్నదనే. ఆమె చర్యలో వ్యక్తిగతమైనదేమీ లేదు. ఈ ముఖ్య మంత్రులందరూ పటిష్ఠస్థితిలో ఉన్నవాళ్ళు, సమర్థులు, తమ మద్దత్తు అవసరమైన సమయంలో ఆమెకు వెన్నుదన్నుగా నిలబడిన వాళ్ళు ఇప్పుడామె వాళ్ళను తొలగించదలిచిందంటే, ఇకమీద వాళ్ళు చేయలేనిదానిని దేనిలో దృష్టిలో ఉంచుకునే అయియుండాలి.ఎ

'వాళ్ళు చేయలేరని నువ్వంత నమ్మకంగా ఎలా చెప్పగలవు?'ఎఅరుణ ఎదురుప్రశ్న వేసింది. 'వాళ్ళు సమర్థులని నువ్వే ఒప్పుకుంటున్నావా లేదా?' ఆమె కోరుకున్నది వాళ్ళు కచ్చితంగా చేసి చూపించగలరు, అదీగాక పరీక్షించి చూడకుండానే పనికిరారని నువ్వెలా నిర్ణయానికి రాగలవ్? కనుక ఆమె ముఖ్యమంత్రుల ఉద్వాసనపథకం ఏ విధంగానూ సమర్థించు కోలేనిది. వాళ్ళ విధేయతపట్ల నమ్మకంలేకనే ఆమె వాళ్ళను తొలగించదలచుకున్నదన్నది ఒక్కటే అర్థమవుతున్న కారణం... కాదంటావా?'

'ఎప్పుడూ వింటున్న మాటే ఇది. అయినాసరే, ఇందిరాగాంధీ ముఖ్యమంత్రులను చూసి భయపడిపోతున్నారనీ, కేవలం తన భద్రతకోసమే వాళ్ళను తొలగించదలచుకున్నారనే వాదనతో నేను ఏకీభవించను. ఆ ఆరోపణను నేను నిర్ద్వంద్వంగా తిరస్కరిస్తాను. మన ముఖ్యమంత్రులు అసలు చేయలేనిదంటూ ఏదీ లేదా అన్నది నా ప్రశ్న. వాళ్ళు ఏదైనా చేయగలరన్న ఉద్ఘాటనను నేను ఒప్పుకోను. చక్కగా యథాతథస్థితిని కొనసాగించే ముఖ్యమంత్రులే మనకున్నారని నా విశ్వాసం. ఉన్నస్థితిని కాపాడే పని వాళ్ళు బాగా చేయగలరు, నిస్సందేహంగా చేసి చూపించారు కూడా. అయితే వాళ్ళు మౌలికమైనమార్పును తీసుకురాగలరన్న నమ్మకం నా కెంతమాత్రం లేదు. దశాబ్దాలుగా తాము జీవిస్తున్న విధానాన్ని వాళ్ళు వదలుకోలేరు. తమ అభివృద్ధిమూలాన్నే వాళ్ళు ప్రశ్నించలేరు, తమ బొద్దుతాళ్ళను తామే తెంచుకోలేరు... అది వాళ్ళ తప్పూ కాదనుకో; ఆ విషయంలో నాకేం సందేహమూ లేదు.'

'కాస్త ఆగుతావా?' అరుణ అడ్డుతగులుతూ అంది. 'ముఖ్యమంత్రులపై ఎంత తీవ్రమైన ఆరోపణ చేస్తున్నావ్ ఆనంద్! నువ్వేమనుకుంటున్నావో కానీ ఒక అంచనాలా కాక ఒక వంకలా

కనిపించే నీ ఆలోచనను ఎవరూ ఆమోదించరనిమాత్రం నేను నిశ్చయంగా చెప్పగలను. ఆరోపణే అంటావో, మరే పేరుతో పిలుస్తావో నీ ఇష్టం కానీ ఇంతకీ నువ్వన్నదానికి ఆధారమేమిటి?'

'నన్ను నమ్ము అరుణా, ఇది ఆరోపణ కాదు,' ఆనంద్ నిజాయితీ ఉట్టిపడే స్వరంతో అన్నాడు. 'మన ముఖ్యమంత్రుల మీద నాకు అపారమైన గౌరవముంది... అయితే పరిస్థితిని ఏకమొత్తంగా చూడు – ఏకమొత్తం అనే మాటను నొక్కి చెబుతున్నాను. ఇందిరాగాంధీ ప్రకటితం కావడం దానికదే చరిత్రలో ఒక మలుపు, మలుపు కావలసిందే కూడా. ప్రజల కామె ఓ సరికొత్త సందేశాన్నీ, సరికొత్త సంకేతాన్నీ, నూతనశకాన్నీ భవిష్యత్తుపట్ల వినూత్నమైన హామీనీ ఇవ్వ వలసి ఉంది. అవే పనులు అంటే 1967 నాటి పనులే మరీమరీ చేస్తూ, ఆ మాటలే మళ్ళీ మళ్ళీ మాట్లాడుతూ ఆమె ఉండలేదు. ఆ ఘట్టంలోనే దేశం ఒక చతుష్పథానికి చేరుకుంది. మార్పూ, విధ్వంసాలలో అంతిమంగా దేనినో ఒకదానిని కోరుకుని తీరవలసిన పరిస్థితి ఉత్పన్న మైంది. మార్పునే కోరుకుంటే ఎవరో ఒకరు దానికి వేగుచుక్క కావాలి, నాయకత్వం వహించాలి. కాకతాళీయంగా ఆ పాత్ర ఇందిరాగాంధీదైంది. అయినా ఇందిరాగాంధీ మార్పుకు ప్రతినిధి మాత్రమే, దానికి ప్రత్యామ్నాయం కాదు. నాకైతే ఈ తేడా స్ఫటికమంత స్పష్టంగా కనిపిస్తోంది. ఇందిరాగాంధీని ఒక దేవతగా ఆరాధించేవారితో ఇక్కడే నేను విభేదిస్తాను. నన్ను బాధిస్తున్నది కూడా ఇదే.'

'ఎందుకు బాధించాలి? ఇందిరాగాంధీ అన్నింటినీ మార్చివేస్తోంది కదా? మార్పుకు ప్రతినిధిగా పనిచేస్తోంది కదా?'

'నిజమే. కొంతవరకూ,' అరుణ ముక్కుసూటిప్రశ్నతో దొరికిపోయాననిపించి ఆనంద్ కాస్త ఎక్కువ విరామం తీసుకుని జవాబు చెప్పాడు. 'నా కిక్కడ రెండు లోపాలు కనిపిస్తున్నాయి. మొదటిది – విమర్శకులు, సమర్థకులనే తేడా లేకుండా అందరూ మార్పుకు సంబంధించిన ప్రతి కోణాన్నీ ఒక విశాలవృత్తంలో భాగంగా చూడడానికి బదులు విడివిడిగా చూస్తున్నారు. అంచేత ఇందిరాగాంధీ తీసుకున్న ప్రతి చర్యనీ వ్యక్తిగతంగానూ, వేరుగానూ చూసి విమర్శిస్తున్నారు. ఆమె నిరంకుశురాలు, స్వార్థపరురాలు, కేవలం వ్యక్తిగతఅధికారాన్ని నిర్మించుకుంటున్న వ్యక్తి, నియంత. ఇక రెండోది ఈ విమర్శలన్నింటికీ ఆమె ఎదురొడ్డి నిలబడగలరనే అనుకుందాం, ఆమె అంతిమంగా దేనినైనా సాధించగలుగుతారా? ఇంతకీ దేనిని సాధించాలి? ఆ సాధించ బోయేది ప్రజల ఆకాంక్షలతో సరితూగుతుందా? ఆమెను దేవతామూర్తిలా ఆరాధించేవారు సాధించలేదని నిర్ద్వంద్వంగా అంటారు! సాధించగలరని ఇప్పటికిప్పుడు అనలేను కానీ సాధించ గలరనీ అంత కచ్చితంగా చెప్పలేను...'

'నీ మాటలు దాదాపు దైవదూషణలా వినిపిస్తున్నాయి!' అరుణ నవ్వుతూ అంది. 'ఆమె వీరవిధేయులు కనుక నీ రహస్యాలోచనలను పసిగడితే నిన్ను పాతాళానికి పడదొక్కిపారేస్తారు. సరే, ఇప్పుడు చెప్పు, ఆమెనుంచి నువ్వు స్పష్టంగా ఏమిటి ఆశిస్తున్నావ్?'

'మాటల్లో చెప్పడం కష్టం,' ఆనంద్ విపులీకరించాడు. 'నే నంటున్నది అర్థరహితంగా కనిపించచ్చు గానీ, ఆమె స్థితి పటిష్ఠమైనదీ, అంత పటిష్ఠంకానిదీ అనికూడా అనిపిస్తుంది.

ఆమె అత్యున్నత నాయకురాలు, ఘనతవహించిన వ్యక్తి, బంగ్లాదేశ్‌కు రూపుదిద్దిన మనిషి, ఇప్పుడు ప్రపంచప్రసిద్ధురాలు. ఆమెకు అపార ప్రజాబలం ఉంది కానీ, ఉన్నతశ్రేణులలో సంపూర్ణమైన సైద్ధాంతిక సమర్థన లోపించింది. సమూలపరివర్తన తీసుకురావాలని ఆమె ఆకాంక్ష. అయితే నిరుత్తేజితులైన సహచరులూ, స్పందన లోపించిన అధికారులూ ఆమెకు అడ్డంకిగా మారారు. ఆమె అత్యంత సాహసోపేతురాలే కానీ, పూర్తిగా దుస్తంత్రాలలో కూరుకుపోయి లోపల, బయట గోతులు తవ్వుతున్న స్వార్థపరశక్తులతో ఆమె తలపడవలసి వస్తోంది. ఆమెను తూర్పారబట్టేవారు లెక్కకుమించి ఉన్నారు. అది అర్థంచేసుకోదగినదే అయితే ఆమెను విపరీతంగా ద్వేషిస్తూ, సహేతుకవిమర్శకులుగా చలామణి అవుతున్న కరడుగట్టిన ప్రత్యర్థులూ ఎక్కువ సంఖ్యలోనే ఉన్నారు. ఈ ప్రత్యర్థులు వెనకటి ఫ్యూడల్ అవశేషాలు. విమర్శకులు ప్రజాస్వామ్యంలో సహజంగానే ఉంటారు ఉండాలి కూడా. ఇప్పుడిప్పుడే రూపుదిద్దుకుంటున్న తెగ ఇది. విమర్శకులకన్నా, శత్రుత్వపూరితులైన ప్రత్యర్థులకన్నా హానికరమైన వాళ్ళు, నా ఉద్దేశంలో, ఆమెను ఆరాధిస్తూ, అదేపనిగా ఆకాశానికెత్తేసే మూర్ఖులే. ఆమె ఎందుకు గొప్పదో, ఏం చేయాలనుకుంటున్నదో, అందుకు తాము ఎలా వాస్తవికసమర్థన అందించగలరో ఎలాగూ అందించరనుకో వాళ్ళకు తెలియనే తెలియదు. తప్పుడు కారణాలతో వాళ్ళామెకు ప్రశంసల భజంత్రీలు మోగిస్తూఉంటారు, ఆ విధంగా ఆమెకు తీరని అపకారం చేస్తూ ఉంటారు. తలబరువుగా మారిన ఇటువంటి సరుకుతో ఆమె పార్లమెంటరీ ప్రజాస్వామ్యవిధానాన్ని పనిచేయిస్తూ ఫలితాలు సాధించాలి. ఇప్పటికిప్పుడు ఇలా అనడం తొందరపాటే అవుతుందేమో, కానీ నక్సలిజమే అదేతరహా నక్సలిజమైనా కానీ ఆమె ప్రధాన ప్రతికూలశక్తిగా మారుతుందని నా కనిపిస్తోంది. ఈ విశ్లేషణ నుంచి అంతిమంగా తేలుతున్నదేమిటంటే, తుపాకితో పనిలేకుండా విప్లవం సాధ్యమేనని ఆమె నిరూపించుకోవాలి. మహాత్మాగాంధీ అహింసను ప్రబోధించారు. ఆధునికరాజ్యవ్యవస్థలో దానిని ఆచరణలో రుజువుచేయవలసిన మహత్తరకర్తవ్యం ఇందిరాగాంధీమీద పడిందని నా నమ్మకం...'ఏ

'మహాత్మాగాంధీ ఆశయాలు సరైనవని రుజువుచేయడానికి ఆమె ముఖ్యమంత్రులను బయటికి గెంటివేస్తోందంటావ్, అంతేనా?!' ఒకింత వ్యంగ్యం మేళవించి బిగ్గరగా నవ్వేస్తూ ప్రశ్నించింది అరుణ.

'నీ సందేహం నా కర్థమైంది,' అరుణా,ఏ ఆనంద్ ప్రశాంతంగా జవాబిచ్చాడు. 'నా వాదాన్ని బలంగా ముందుకు తేలేకపోయానని దానర్థం. నా మాట నమ్ము అరుణా, స్తంభించిపోయిన నేటి పరిస్థితినే కొనసాగించి మనం దేశాన్ని రక్షించలేం. మన ముఖ్యమంత్రిని నేనెంత అభిమానించి గౌరవిస్తానో నీకు తెలుసు. అయినాసరే, ఆయనతోసహా ముఖ్యమంత్రులెవరూ పవిత్రగోమాతలు కారు. కచ్చితంగా కారు. ఈ ఘట్టంలో వ్యక్తిగతాన్నీ, వ్యక్తిగతంకానిదాన్నీ వేరుపరచడం కష్టం. అయినా వేరుపరచక తప్పదంటాను, లేకపోతే చిక్కుల్లో పడిపోతాం. మంచికో, చెడ్డకో పాత ముఖ్యమంత్రుల్ని తొలగించి కొత్తవారితో ప్రయత్నించి చూద్దామని ఇందిరాగాంధీ అనుకుంటున్నారు. ఇప్పుడు మన విమర్శలామె సంకల్పాన్ని మార్చలేవు. ప్రశ్నల్లా ఒకటే; ఈ కొత్త ముఖ్యమంత్రులెలాంటివారు, ఏ రకమైన ఎజెండాను అనుసరిస్తారు? మరో విధంగా చెప్పాలంటేనామినేట్ఏ చేసిన సందర్భంలో తర్వాత వీళ్ళకు ఎటువంటి ఎజెండా అప్పగించారు?'

ఈ విషయంలో తాను అల్పసంఖ్యాకవర్గమని ఆనంద్‌కు తెలుసు. ముఖ్యమంత్రుల తొలగింపు ముఖ్యంగా అది జరుగుతున్న తీరునుబట్టి చూస్తే సమర్థనీయంగా కనిపించడంలేదు. ఎవరి ఆమోదం లేకపోయినా ఎవరూ ఏమీ చేయలేనిదిగా అది పరిణమించింది. సందేహాలను పటాపంచలుచేసేలా మిరుమిట్లుగొలిపే ఫలితాలను చూపించినప్పుడే అది దేశప్రజల ఆమోదం పొందుతుంది.

చౌదరి ప్రశాంతంగా కనిపిస్తున్నాడు. అది ప్రమాదగర్భితమైన ప్రశాంతతని ఆనంద్ అనుకొన్నాడు. చౌదరి గురించి తెలిసిన వారెందరో ఏకీభవించిన విషయమిది. అతడు మూతి ముడిచినట్టు కనిపించడం లేదు, జరగబోయే తన నిష్క్రమణ గురించి ఎవరితోనైనా, ఏ సమయంలోనైనా చర్చించడానికి సిద్ధంగా ఉన్నాడు. ఇందిరాగాంధీకి చేరే తన గురించిన విషయాలను తానునుకున్నట్టు మలుచుకోవడానికి అతనికి కట్టుదిట్టమైన ఏర్పాటు ఉంది. ఆమె స్వయంగా కోరినదే తడవుగా నిన్నటి చొక్కా విడిచేసినట్టు పదవిని విడిచిపెట్టడానికి తను సిద్ధంగా ఉన్నట్టు ఈ సూత్రాల ద్వారా ఆమెకు నమ్మకం కలిగించబోయాడు. ఏ ప్రమాణంలో చూసినా అది నటనానైపుణ్యానికి పరాకాష్ఠ. ఇందిరాగాంధీతో సహా అందరికీ అది నటనేనని తెలుసు. ఎలాగైనా పదవికి అంటకాగాలని పైకి తెలిసిపోయేలానే అత్యంత దయనీయ ప్రయత్నాలు సాగించిన మిగిలిన ముఖ్యమంత్రుల తీరులా కాకుండా అది పరిపూర్ణతను ప్రతిబింబించిన మహానటనగా అందరూ ఏకీభవించారు.

కాలం గడుస్తున్నకొద్దీ, వేటుపడబోతున్న ముఖ్యమంత్రుల ధోరణే చర్చలో కేంద్రస్థానం వహిస్తూవచ్చింది. పదవిని ఎవరెలా పట్టుకువేళ్ళాడుతున్నారు, లేదా ఎవరెలా త్యాగానికి సిద్ధపడుతున్నారన్నవే ఒక్కొక్కరిని అంచనావేయడానికి కొలమానాలుగా మారాయి. ఆశ్చర్యకరంగా ఆ నిరంకుశమైన తొలగింపులోని న్యాయాన్యాయాల విచికిత్స క్రమంగా విస్మృతిలోకి జారిపోయింది. ఆ కోణం ఏ విధంగా చూసినా అప్రధానంగా మారిపోయింది. అందుచేత తను చేసిన తప్పులోనే ఒప్పు ఉన్నదని ఇందిరాగాంధీ రుజువు చేసుకున్నట్టయింది. ఆమె ఎవరైనా ముఖ్యమంత్రికి ఉద్వాసన పలికినప్పుడు ఒక్క కుక్క కూడా ఎటూ అవి పెద్దసంఖ్యలో మాత్రం లేవనుకోండి మొరగలేదు. రాజకీయవదరుబోతులు తొలగింపుకు లోనైన వ్యక్తిలోని లోపాల గురించిన చర్చనూ, ఆ పదవికి పోటీపడుతున్న ప్రముఖుల అవకాశాల విశ్లేషణనూ తక్షణమే ప్రారంభించేశారు. పోతున్నవాడిని గురించి ఆలోచించినవాడే లేడు.

అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేస్తూ చౌదరి హఠాత్తుగా వేదాంతిలా మారిపోయాడు. 'ఎవరు ముఖ్యమంత్రి అయితే ఏమిటిట?' ఓ రోజు సాయంత్రం తన నివాసంలో కొద్దిమంది శాసన సభ్యులనుద్దేశించి అతడు వేసిన ప్రశ్న ఇది. నిర్లిప్తంగా ఉన్నట్టు కనపడబోయాడు కానీ నమ్మేంత వెర్రివాళ్ళు ఎవరూ లేరని అతడికీ తెలుసు. 'ఉన్నంతకాలం ఉన్నాను. ఇకనైనా రాష్ట్రాన్ని ముందుకు తీసుకెళ్ళే అవకాశం ఎవరైనా ఓ యువకుడికీ, మరింత సమర్థుడికీ అప్పగించడం ఎంతైనా న్యాయం కదా...' పదవిమీద మోహం మొత్తినట్టుగా ఆయన మాట్లాడిన తీరులో ముఖ్యమంత్రిత్వమంటే ఫ్యాక్టరీలో షిఫ్టు నిర్వహించడం లాంటిదేనన్న భావం ధ్వనించింది. తనను

లోపలినుంచి దహిస్తున్న విపరీతమైన నిస్పృహను కప్పిపుచ్చుకునే వ్యర్థప్రయత్నమే అక్కడున్న కొందరికి (అలాగే, మంచి ఊహ కలిగిన పరిశీలకులకు కూడా) అతడి ధోరణిలో కనిపించింది. దీనికితోడు ప్రత్యర్థి మహేంద్రనాథ్ తన పార్టీలో లేకపోయినా, తనను నాశనంచేయడానికి ప్రతిపక్షానికి శక్తిమంతమైన ఆయుధాలు అందిస్తున్నాడన్న అనుమానం ఒకటి. తగినన్ని రుజువులు లేకపోయినా సరే, చౌదరి దీనిని నమ్మేశాడు. ఒకవిధమైన ఉన్మాదం అతణ్ణి అలా నమ్మింప జేసింది; ఆ విషయంలో అతణ్ణి వ్యతిరేకించడం దండగని పార్టీలో అందరికీ తెలుసు. ఇక మిగిలినవాళ్ళు, నాటకంలో అదికూడా భాగమనే అనుకున్నారు.

ఎప్పుడనేది అలాఉంచి, అసలు చౌదరి నిష్క్రమిస్తాడా అన్నదే ఎవరికీ కచ్చితంగా తెలియదు. కనుక తెలివైన రాజకీయవాదుల్లా ఆ ప్రశ్నల్ని పక్కకినెట్టేసి, అందరూ అతడి వారసుడిమీద తమ దృష్టిని కేంద్రీకరించారు. అయితే చౌదరి నిష్క్రమణ తథ్యమనే చాలామంది ఉద్ఘాటించారు. ఆ వ్యక్తిలో తెలియనితనం ఎంత ఎక్కువగా ఉంటే అతడి ఉద్ఘాటన అంత బలంగా ఉంటూ వచ్చింది. చౌదరి పదవిలో కొనసాగుతాడని కొంతమంది నమ్మబలకడానికి యత్నించారు కానీ, తమ మాటల పట్ల తమకే నమ్మకం లోపించిందా అన్నట్టుగా వాళ్ళ గొంతులు బలహీనంగానే ధ్వనించాయి. మొత్తంమీద పత్రికలవాళ్ళకీ, ఈ వ్యవహారంలో ఏ విధంగానూ స్వప్రయోజనం మిళితమైలేని ఎందరో పాఠకులకూ చౌదరి కొనసాగడంకన్నా, నిష్క్రమణే సంచలనాత్మక వార్తగా కనిపించింది. అదే వాళ్ళ దృష్టిని ఎక్కువగా ఆకర్షించింది.

మరీ అంత అమర్యాదకరంగా తొలగించడానికి చౌదరి చేసిన పాపమేమీ లేదు. స్థూలంగా అదే జనాభిప్రాయం. కాకపోతే పరివర్తన సూచనలు స్పష్టంగానే కనిపిస్తున్నాయి. మార్పుకీ ఇందిరాగాంధీ సర్వంసహాధికారానికీ విడదీయలేని లంకె ఉన్నట్టు అప్పటికే అందరూ నిశ్చయానికి వచ్చేశారు. అధికారం ఉన్న చోట చాంచల్యమూ ఉండవలసిందే, తార్కికతనూ, సహేతుకతనూ త్రోసిరాజనకపోతే అది అధికారమే కాదు. అది జనాన్ని నిర్విణ్ణతకూ, దిగ్భ్రాంతికీ లోనుచేసి తీరవలసిందే... కనుక, రాజకీయవాదులూ, అలాగే ఆవురావురుమంటున్న అసంఖ్యాక పాత్రికేయులూ చౌదరి నిష్క్రమణ ఖాయమన్న నిర్ణయానికి వచ్చేశారు.

భూమిశిస్తు, భూసంస్కరణల రాష్ట్రమంత్రుల సమ్మేళనంలో పాల్గొనడానికి ఆనంద్ వేరొక రాష్ట్రరాజధానికి వెళ్ళాడు. ఆ రాష్ట్రంలో ప్రధానమంత్రి ఏరికోరి ఎంపికచేసిన కొత్త ముఖ్యమంత్రి అప్పుడప్పుడే పదవీబాధ్యతలు స్వీకరించాడు. పార్టీలో ఎన్నడూ అతడు ప్రముఖుడనిపించుకున్నావుడ కాడు. పార్టీ సమావేశాల్లో అతడు అడపాతడపా మాట్లాడేవాడు కానీ, ఆయన మాట్లాడుతుండగా వినడానికి బదులు కాఫీకని బయటికి బయలుదేరిపోతున్న సభ్యులు పోతూ పోతూ ఒక్క క్షణమైనా ఆగి ఆయన మాట విందామని అనుకునేంతగానైనా వాళ్ళను ఆకట్టుకోగలిగిన సందర్భమొక్కటీ లేదు. ఇప్పుడాయనకు ఒక్కసారి పదోన్నతి లభించడంతో ఆయన సహచరులు ఆయనలో కొత్తగా చూసిందల్లా, ఆయన మొహంమీద ఈ చెవినుంచి ఆ చెవివరకు తగిలించుకున్న ఇందిరాగాంధీ అట్టబొమ్మ మాత్రమే.

ఆ రాష్ట్రంలో ప్రస్తుతం భూసంస్కరణమంత్రిగా పనిచేస్తూ ఈ సమ్మేళనానికి హోస్ట్‌గా విధులు నిర్వర్తిస్తున్న మంత్రి ఆనంద్‌కు చాలా పరిచితుడు. గత రెండేళ్ళుగా ఎనలేని బాధకు లోనౌతు గొణుగుతున్నాడాయన. ఆ శాఖంటే మనస్ఫూర్తిగా మండిపడుతూ ఆ నాటి ముఖ్యమంత్రి వద్ద తనకు కావలసినత పలుకుబడి లేకపోవడమే తన ఈ దుస్థితికి కారణమన్న నిష్కర్షకు వచ్చి ఇన్నాళ్ళూ విలపిస్తూవచ్చాడు. ఇటీవల కొత్త ముఖ్యమంత్రి రావడంతో తన జాతకం మారుతుందనీ, ఆర్థిక, వాణిజ్యపన్నుల వంటి అత్యుత్తమశాఖలు కాకున్నా కనీసం ఎక్సైజు శాఖ వరకైనా తను చేరగలుగుతానని ఆశిస్తున్నాడు.

సమావేశంలో పాల్గొన్నవారు అనేక అంశాలు చర్చించి అనేక నిర్ణయాలు తీసుకున్నారు– రికార్డు కోసం. ఈ కసరత్తు అంతా ఆనంద్‌కి విసుగు పుట్టించింది. చర్చమీద ధ్యాస తప్పిపోయింది. అసంతృప్తితో వేగుతున్న ఆ మంత్రిని పట్టుకుని కొత్తముఖ్యమంత్రి పూర్వాపరాల గురించి, అతడి ఆలోచనాసరళి గురించి ప్రశ్నలు గుప్పించాడు. 'అంత అనామకుణ్ణి మీరు ఊహించను కూడా ఊహించలేరు', ఆ మంత్రి సమాధానం చెప్పాడు. 'కొందరతణ్ణి అనామకుడన్నారు. మిగిలినవాళ్ళు శూన్యశాఖను ఏలుతున్న మంత్రిగా అతడికి ముద్దుపేరు పెట్టారు. ఇంకా మరికొందరు ముద్దుపేరు పెట్టడానికి కూడా తగడని తేల్చిపారేశారు.ఎ

'పార్టీ ప్రణాళికలో పేర్కొన్న భూసంస్కరణలు, భూపరిమితులు మొదలైన కార్యక్రమాల మీద అతడి అభిప్రాయమేమిటి?' ఆనంద్ సూటిగా ప్రశ్నించాడు.

'చాలా బలమైన అభిప్రాయమే.' అవతలి మనిషి నొక్కిచెబుతున్నట్టు అన్నాడు.

ఆనంద్ హఠాత్తుగా ఉత్తేజితుడయ్యాడు. తీరా ఆ మంత్రి తన మాటలోని అర్థాన్ని విపులీకరించేసరి అంత ఎత్తునుంచి అమాంతం కిందపడిపోయినట్టనిపించింది. 'నే నంటున్నది ఇప్పుడున్న పరిస్థితికి భంగం కలిగించే ఏ చర్యనైనా బలంగా వ్యతిరేకిస్తాడ'ని అంటూ, వెంటనే అతడు మరో మాట కూడా జోడించాడు. 'అయితే అతడు ఇందిరాగాంధీనీ, ఆమె కార్యక్రమాన్నీ సంపూర్ణంగా సమర్థిస్తాడనుకోండి...'ఎ

ఈ వ్యాఖ్యను జీర్ణించుకోడానికి ఆనంద్‌కు కొంత సమయం పట్టింది. కనీసం ఈ రాష్ట్రంలో నాయకత్వం మార్పువెనుక సైద్ధాంతిక ప్రాతిపదిక ఏదీ లేదన్న మాట. ఒక్కసారిగా అతణ్ణి నిస్పృహ ఆవరించింది.

'ఇప్పుడు మీ పాత ముఖ్యమంత్రి ఏం చేస్తాడు?!' ఏదో ఆలోచన స్ఫురించి ప్రశ్నించాడు.

'అతడు చేయబోనిదల్లా పార్టీ విడిచివెళ్ళడం,' అవతలి వ్యక్తి అన్నాడు. 'అలాచేస్తే మిగిలేది రాజకీయ అరణ్యవాసమేనని అతడికి తెలుసు. మీ రాష్ట్రంలో ఒకప్పుడు తిరుగులేనినాయకుడుగా చలామణి అయిన మహేంద్రనాథ్ పరిస్థితి ఇప్పుడేమిటి? ఇతరుల దారిలో ఓ ముళ్ళకంపలా తన వెనకటి అతిశయానికి ఓ మసకనీడలా మిగిలిపోయాడు. లేదు, మా ముఖ్యమంత్రి పార్టీలోనే ఉంటాడు. ఇందిరాగాంధీ దిగొచ్చేవరకూ– తను చాలుననుకునే స్థాయికి దిగొచ్చేవరకూ – అతడు మాకు నరకం చూపిస్తాడు. అలాగని తిరగబడతాడనుకోకండి. మరో పదవి కావాలని

కూడా అడగడు. ఆమె ఏది ఇవ్వజూపితే అదే తీసుకుంటాడు, అయినా రాష్ట్రంలో మంటపెడుతూనే ఉంటాడు. పైకి పురుషోత్తముడిలానే కనిపించడానికి ప్రయత్నిస్తాడు. అయినా కొత్త ముఖ్య మంత్రి దారిలో ప్రతి అంగుళంలో కచ్చితంగా మందుపాతరలు పెట్టి చివరకు వాటిని పేల్చి అతణ్ణి తునాతునకలు చేసేస్తాడు.'

'ఎందుకంత పగ? వాళ్ళిద్దరి మధ్య సయోధ్య లేదా?'

'ఎందుకు లేదు? ఉంది. వాళ్ళిద్దరూ మంచి స్నేహితులు. అయినా చూడండి, ఇది ప్రతిష్ఠకు సంబంధించిన విషయం. ఎవరికైనా, చివరకు ప్రధానమంత్రికైనా సరే, ఒక ముఖ్యమంత్రిని తొలగించే అధికారం ఎక్కడుంది? అతడామెకేమైనా పనిమనిషా? ఈ అసలు కీలకప్రశ్న మీకు అర్థంకావడం లేదా?'

'అవునవును, అర్థమైంది', ఓ పక్క నీరుగారిపోతూనే అంగీకరించాడు ఆనంద్.

తిరుగు ప్రయాణంలో ఆనంద్ ఢిల్లీ మీదుగా రావలసివచ్చింది. అక్కడో రాత్రి గడిపి చౌదరిమీద వచ్చిపడబోతున్న ఆపద గురించి సాధ్యమైనన్ని ఊహాగానాలు సేకరించాడు. రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత, నెరుస్తున్న మీసకట్టు, గంభీరమైన విగ్రహం, తరచిచూసే కళ్ళు, ఎక్కడా మరకలేని తెల్లని ఖద్దరు దుస్తులతో ఉన్న ఓ పెద్దమనిషి అతణ్ణి చూడడానికి ప్రభుత్వఅతిథిగృహానికి వచ్చాడు. ఆనంద్ ఆయన గురించి విన్నాడు కానీ, ఎప్పుడూ కలుసు కోలేదు. అప్పట్లో ఆయన ఏ పదవిలోనూ లేకపోయినా అధికారంలో ఉన్నవారిని కూడా నడిపించే తెరవెనుక సూత్రధారులలో ఒకడుగా రాజకీయవాదులు ఆయన గురించి అనుకుంటూ ఉంటారు. వీధికెక్కి ఆయన పెద్దగా మాట్లాడే మనిషి కాదు. అదే ఆయన ప్రాముఖ్యాన్ని ఇనుమడింపచేసింది. ఆ వేళకాని వేళ ఆ పెద్దమనిషి ఆనంద్‌ను చూడాలనుకోవడంలో ఏదో మర్మం ఉన్నట్టనిపించింది. ఇందిరాగాంధీ పద్ధతులు చిత్రవిచిత్రంగా ఉంటాయని జనం అనుకోగా ఆనంద్ ఎన్నోసార్లు విన్నాడు. ఇప్పుడు వాళ్ళతో అతడూ మనసులో గొంతు కలిపాడు.

ప్రత్యేకించి ఫలానా అంశమని కాకుండా ఇరువురూ అరగంటసేపు మాట్లాడుకుంటూ గడిపారు. ఆ మనిషి ఎంతో గుంభనగా తన గురించి ఆరా తీస్తున్నట్టు, తనను అంచనా వేస్తున్నట్టు ఆనంద్‌కు అనిపించింది. అయినప్పటికీ, చౌదరి రాష్ట్రంలో సుస్థిరత్వాన్ని సాధించగలిగాడనీ, ఆయన ముఖ్యమంత్రిగా కొనసాగడం అవసరమనీ తన నిర్ద్వంద్వమైన అభిప్రాయాన్ని ఆనంద్ వ్యక్తంచేశాడు. ఆ పెద్దమనిషి కూడా అవునన్నట్టు తలఊపాడు, లేదా అలాగని ఆనంద్ అను కున్నాడు. ఆయన ఎలా వచ్చాడో అలాగే నిశ్శబ్దంగా హఠాత్తుగా వెళ్ళిపోయాడు. ఆయన రాకపోకలలోని ఆంతర్యమేమిటో అర్థంకాక అతిథిగృహం మెట్లమీద ఆనంద్ విస్తుపోతూ నిలబడిపోయాడు.

# 51

'అతడికి ఢిల్లీ వెళ్ళవలసిన అవసర మేమొచ్చింది? అర్ధరాత్రి సంప్రతింపులకే నంటే కాదంటారా? మరో మాటల్లో చెప్పాలంటే కుట్రచేయడానికి కాదంటారా? మీకు తెలియదు, మీ బృహస్పతి కొంతకాలంగా ఢిల్లీలో మీ పాదాలకింద గోతులు తవ్వే ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు. అతడికీ నాకు విరోధం కనుక మీరు నా మాటలు నమ్మరు. అయినాసరే, నాకు తెలిసిన విషయాలు మీకు చెప్పకుండా ఉండలేను...ఎ'

తనను తొలగించే ప్రయత్నం వెనుక మూలవిరాట్టు ఆనందేనని, ఎన్నడూ లేనంతగా చిరచిరలాడిపోతున్న చౌదరిని నమ్మించడానికి శేఖర్ అరగంటనుంచీ ప్రయత్నిస్తున్నాడు. అన్యాయంగా తీనంద్‌ను ఇరికించడానికి అతడికి మరే ఆధారమూ కనిపించదు కనుక, ఢిల్లీలో అతడు రాత్రి బసచేయడాన్ని తన దుస్తంత్రానికి పనికొచ్చే సాక్ష్యంగా దొరకపుచ్చుకున్నాడు. వాస్తవానికి వస్తే, రాష్ట్రరాజధానికి ఢిల్లీ మీదుగా తిరిగి రావలసిందే కానీ మరో మార్గం లేదు. ఆ సమయంలో అఫ్రోజాబాద్‌కు నేరుగా వెళ్ళే విమానం ఏదీ లేదు కనుక రాత్రి అక్కడ మకాంచేయక తప్పదు. కనుక ఢిల్లీలో ఆనంద్ సమావేశాలపై, అతణ్ణి కలుసుకోడానికి వచ్చే వ్యక్తులపై ముఖ్యంగా పార్టీలోని ఆ పెద్దనాయకుడు ఆనంద్‌ను కలుసుకోవడంపై శేఖర్ నిఘావేసి ఉంచాడు. అందులో ఏదో ప్రమాదసంకేతం కనిపించి చౌదరి దీర్ఘాలోచనలోకి జారిపోయాడు.

తన ఢిల్లీలో ఏర్పాట్లలో ఎక్కడో ఏదో లోపం ఉంది. ఎక్కడో దేనినో తను విస్మరించాడు. మొత్తానికి కాలుజారాననుకుని కలవరపడ్డాడు.

నువ్వు ఊరికే 'నువ్వు ఊరికే అన్నీ ఊహించుకుంటూ ఉంటావ్',ఎఅని ఎద్దేవగా శేఖర్‌తో అన్నాడు.

'నన్ను నమ్మకూడదనుకుంటే మానెయ్యండి,' శేఖర్ దెబ్బతిన్న గొంతుతో అన్నాడు. 'కానీ నాకు చేతకానివి నాకు అంటగట్టి నిందించకండి. నేను చాలా సాదాసీదా మనిషిని, ఆ సంగతి మీకూ తెలుసు. ఊహల్లో జీవించడం ఆనంద్‌కే చెల్లింది కానీ నాకు కాదు. కనుక మీ మనసుకు నచ్చే ఆలోచనల్లోనే తేలిపోతూ ఆనందించండి; సమస్య మీదీ...'

అలక నటిస్తూ శేఖర్ వెళ్ళిపోగానే, చౌదరి బోనులో చిక్కుకున్న జంతువులా తన డ్రాయింగ్ రూంలో పచార్లు చేయడం ప్రారంభించాడు. ఆలోచనకు ఆగ్రహం మేళవిస్తూ తన రాజకీయ

వ్యూహంలోని ప్రతిఅంశాన్నీ సుసూక్ష్మంగా పరీక్షించుకున్నాడు. ఏదెలా జరిగిఉంటుందని తర్కించుకున్నాడు; కాస్త సందుకూడా వదలకుండా ఎంతో పకడ్బందీగా రూపొందించుకున్న తన పథకంలో ఈ వెంట్రుకవాసి సందు ఎప్పుడు ఎలా ఏర్పడింది? ఆనంద్‌ని, శేఖర్‌నీ కూడా తను నలుసులుగానే పరిగణించాడు. ఢిల్లీ పరిణామాల గురించి ఆనంద్‌కేమీ తెలియదు; అతడు కేవలం ఒక ప్రేక్షకుడు. ఇక శేఖర్ ఎంత నమ్మబలికేలా మాట్లాడినా, ఆనంద్‌మీద విసరడానికి ఏదైనా రాయిని దొరకపుచ్చుకోడానికే అతని ప్రయత్నమంతా. ఇంతకీ తనెక్కడ పొరపాటు చేశాడు? ఇంతవరకూ దీని నంతటినీ తనెలా పసిగట్టలేకపోయాడు? ఢిల్లీలోని తన మనుషులు కచ్చితంగా తనను మోసంచేశారు, తనను దారుణంగా దెబ్బతీశారు. ఢిల్లీ వెళ్ళి తనే స్వయంగా జోక్యంచేసుకుంటే? కాని తక్షణమతో ఆ ఆలోచనతో అతడు విభేదించాడు ఈ సమయంలో ఏ ముఖ్యమంత్రీ ఢిల్లీలో మంతనాలు సాగించకూడదు. చాలా ప్రమాదకరం. అక్కడిప్పుడు ముసుగులే కనిపిస్తాయి కానీ ముఖాలు కావు. ఒక పేరాట్రూపర్ ఎంతో ఆత్మవిశ్వాసంతో దూకబోతే, పేరాచూట్ తెరచుకోవడంలో విఫలమైతే ఎలా ఉంటుందో అలా ఉందతనికి. ఏది చేయడానికీ సమయం మించిపోయింది.

చౌదరి కోపంతో రగిలిపోయాడు. పార్టీలోపలా బయటా కూడా ఉన్న మహేంద్రనాథ్ మనుషులూ, ఆ బాపతు ఇతరులూ తనను పడగొట్టడానికి చూస్తున్నట్టు అతడికి తెలుసు. తనేమీ అకారణంగా కలతపడడం లేదు; వాళ్ళు ఇందుకు భిన్నంగా వ్యవహరిస్తారని తనెప్పుడూ అనుకోలేదు. అందుకని ఆలోచనకు కూడా వాళ్ళు అనర్హులనుకున్నాడు.. ఇప్పుడతడు ఇందిరాగాంధీపట్ల ఆగ్రహంతో, పట్టరాని ఆగ్రహంతో ఉన్నాడు. దేశంలో ఆమెను పటిష్ఠంగా నిలబెట్టే కొద్ది ఆధారస్తంభాలలో తనొకడినని అతడనుకుంటూ వచ్చాడు. లాల్‌బహదూర్‌శాస్త్రి మృతి తర్వాత ఒక్కొక్క ఘటననీ సుసూక్ష్మంచేసి పరిశీలిస్తే విధేయత, సామర్థ్యం అనే రెండు పరీక్షలలో తను ఎప్పుడూ నెగ్గుతూనే వచ్చాడు చివరకు ముఖ్యమంత్రిపదవి నుంచి కూడా సగౌరవంగా సహజఘటనాక్రమంలో తను స్వయంగానే తప్పుకుని ఉండేవాడు. (ఈ ఆలోచన అతడికి మొదటిసారి కలిగింది). కానీ ఈ విధంగా తనను సాగనంపడమా! ఇలాంటి అవమాన కరమైన సంభావ్యతను మాత్రం అతడు జీర్ణించుకోలేకపోతున్నాడు.

అప్పటికింకా తన భవితవ్యం గురించిన నికరమైన సమాచారమేదీ అందకపోయినా, రేపటి దుస్థితిని ఈ క్షణమే ఊహించుకోవడం ప్రారంభించాడు. తనికముందు ముఖ్యమంత్రిగా లేక పోతే ఏమౌతుంది? తర్వాత వచ్చేదెవరు? ఆనంద్? శేఖర్? తన మంత్రివర్గంలో ద్వితీయస్థానంలో ఉన్న బిపిన్‌చంద్ర? ఏ ప్రమాదమూ లేని నెంబర్ టూ, అందరిలోనూ పెద్దవాడు, మంచివాడు, ఎవరికీ ఏ అపకారమూ చేయలేని, తనొకడున్నాడన్న స్పృహను కూడా ఎవరికీ కలిగించలేని బిపిన్‌చంద్ర? లేక ఎం.పిలు చడీచప్పుడు కాకుండా తమలో ఎవరినైనా రాష్ట్రానికి దిగుమతి చేయించుకోబోతున్నారా?... అయితే అతడెవరు?

ఎవరో మృదువుగా తలుపు తట్టిన చప్పుడు వినిపించి ఊహల్లోంచి బయటపడ్డాడు. ఆనంద్ లోపలికి అడుగుపెట్టాడు. చౌదరికి అభివాదంచేస్తూనే, సిగరెట్టుపీకలతో పొంగిపొర్లుతున్న

యాష్ట్రేవైపు చూసి ౹మై గాడ్!౹ అంటూ ఆశ్చర్యం వ్యక్తంచేశాడు చౌదరికికూడా మొదటి సారి ఆవైపు చూసి ఒకింత విస్మితుడయ్యాడు. నవ్వేస్తూ అన్నాడు, 'ఆ దేవుణ్ణి తలచుకోవడమే మంచిది. మనందరినీ ఇప్పుడు ఎవరో ఒకరు కాపాడవలసిందే! ఇంతకీ నువ్వెప్పుడొచ్చావ్?'

'ఉదయం ఫ్లైట్‌కి' ఆనంద్ అన్నాడు. ౹ఇంటెలిజెన్స్‌వాళ్ళు మీకు చెప్పే ఉంటారు౹ అని అనబోయి, అంతలోనే సర్దుకుని 'నా తప్పు లేకపోయినా రాత్రంతా నిద్రలేకుండా ఢిల్లీలో గడిపి!' అన్నాడు. ఈ విషయం ఇంటెలిజెన్స్ సిబ్బంది చౌదరికి తెలియజేసే ఉంటారు. ఇక శేఖర్‌కి తన వేగులు ఎలాగూ ఉన్నారు

ముళ్ళమీద నిలబెడుతూ కాసేపు నిశ్శబ్దం తాండవించింది. ఎప్పుడూ ఉండే ఛలోక్తులూ పరిహాసాలూ ఈసారి లేవు.

చౌదరి హఠాత్తుగా అన్నాడు. 'చిల్లర వివరాలన్నీ పక్కకుపెట్టి ఒక్కమాటలో చెప్పు, ఆమె నన్ను సాగనంపాలనే అనుకుంటోందా?'

ఆనంద్ ఆలోచించకుండా అనేశాడు, 'అవును, అయినా నా దగ్గర అందుకు సంబంధించిన ఆధారమేదీ లేదు, ఎటువంటి క్లూ లేదు. '

'నేను ఆధారం చూపించమనడం లేదు,' చౌదరి అడ్డుతగులుతూ అన్నాడు.

ఈ మర్మగర్భసంభాషణ ఆనంద్‌ను కల్లోలపరచింది. ఓ కారణం లేదు, ఓ క్లూ లేదు, ఓ నేపథ్యం లేదు; అయినా జవాబు విషయంలో ఇద్దరిదీ ఏకాభిప్రాయమే. తొందరపడి ఇచ్చిన జవాబును వెనక్కి తీసుకుందామని ఆనంద్ ప్రయత్నించాడు. చౌదరి చెయ్యి ఊపుతూ ఆ ప్రయత్నాన్ని త్రోసిపుచ్చి అన్నాడు, 'మనం ఇందిరాగాంధీ గురించి మాట్లాడుకుంటున్నాం; ఇది నీ కేమాత్రం సంబంధం లేని విషయం. ఓసారి భవిష్యత్తులోకి తొంగిచూసి నీకేం కనిపిస్తోందో చెప్పు...'

'రెండురోజుల క్రితం నేను వెళ్ళివచ్చిన రాష్ట్రంలో జరిగిన ముఖ్యమంత్రి మార్పునుబట్టి చూస్తే నా కేదీ స్పష్టంగా కనిపించడం లేదు.'

'ఒక రాష్ట్రంలో జరిగినట్టే మరో రాష్ట్రంలో జరగాలనేమీ లేదు,' చౌదరి ఖండితంగా అన్నాడు. 'వేరే రాష్ట్రాల సంగతి విడిచిపెట్టి ఈ రాష్ట్రంలో పరిస్థితులను దృష్టిలో పెట్టుకుని నా ప్రశ్నకు జవాబు చెప్పు.'

'ఈ రాష్ట్రంలో ముఖ్యమంత్రిని మార్చాలనుకోవడం పొరపాటేనని నే ననుకుంటున్నాను, ఈ మాట మిమ్మల్ని సంతోషపెట్టడానికి అంటున్నది కాదు...'

'నువ్వు ఊరికే ఉబ్బేసే మనిషివి కావని నాకు తెలుసు; ఆ విషయంలో నువ్వు నన్ను నమ్మించే తంటాలు పడనవసరం లేదు. అయితే ఇప్పుడే నువ్వు అన్నావ్, మార్పు జరగబో తున్నట్టే ఉందని, కనుక'

'మీరు నా మాట పూర్తిచేయనిస్తే కదా,' అద్భుతగులుతూ అన్నాడు ఆనంద్. 'ఇక్కడ మార్పును నివారించవలసిందే, కనీసం కొద్దికాలమైనా.'

'ఎలా?'

'అది మీరు చూసుకోవలసింది,' ఆనంద్ నిశ్చితంగా అన్నాడు.

'సారీ, అది అసాధ్యం,' అంతే నిశ్చితంగా చౌదరి అన్నాడు. 'గత కొన్ని వారాలుగా నేనేమీ చుక్కల్లోకి చూస్తూ కూర్చోలేదు. ఆత్మగౌరవం దిగజార్చుకోకుండా చేయగలిగిందంతా చేశాను. ప్రయోజనం శూన్యం. మార్పు జరగచ్చు, జరగకపోవచ్చు తెలిసినవారు ఒక్కరూ లేరు.'

'దారులన్నీ మూసుకుపోయినట్టే కనిపిస్తోంది' ఆనంద్ సాలోచనగా వ్యాఖ్యానించాడు.

'నిస్సందేహంగా, క్షుణ్ణంగా,' తనలో పెరుగుతున్న అందోళననూ, ఎంతోకాలంగా రేగుతున్న ఆగ్రహాన్ని బలవంతాన నిగ్రహించుకుంటూ చౌదరి అన్నాడు.

అతడు చెప్పింది ముమ్మాటికీ నిజమనుకున్నాడు ఆనంద్. ఏ రాష్ట్రం పరిస్థితి ఆ రాష్ట్రానిదే, ఒక రాష్ట్రంలో జరిగిన మార్పుకీ, లేదా మార్పు సంభవించకపోవడానికీ సూచన కావలసిన అవసరం లేదు. ఆ వెనుక ఒక సామాన్యసరళికోసం వెతకడం దండగ లేదా ఏకమొత్తంగా చూసినమీదట అనిపిస్తున్నదదే.

ఒక ఆలోచన ఆనంద్ మదిలో మెరుపులా మెరిసింది మరీ విడ్డూరమైన ఆలోచన అనిపించి తక్షణమే దానిని తుడిచేసుకున్నాడు. జరుగుతున్నదంతా కేవలం మార్పుకోసం మార్పేనా? ఆ వెనక కనిపెట్టగలిగిన ఒక సరళి అంటూ ఏదీ లేదన్నదే నిజమైతే మార్పు దానికదే లక్ష్యంగా మారిందా? ఎవరికీ తను భద్రంగా ఉన్నాడన్న భావం కలగనివ్వకుండా, ఎవరూ తన స్థానంలో వేళ్ళూనకుండా, అందరికీ కంపనం పుట్టిస్తూనే ఎవరికీ దెబ్బతగలకుండా, పెద్దపెట్టున కుదుపు తీసుకురావడమే దీని వెనుక ఉద్దేశమా? ముఖ్యమంత్రులు తామా ఉన్నతపదవిలో ఉన్నందుకే కాకుండా, తమ రాజకీయఅస్తిత్వానికే తనకు రుణపడిఉండాలని ఇందిరాగాంధీ ఆశిస్తున్నారా? రాజకీయఅంగుష్ఠమాత్రులను, ఇంకా చెప్పాలంటే అన్ని తావుల్లోనూ అన్ని వ్యవస్థలలోనూ, మంత్రివర్గాలలోనూ కూడా చెప్పినట్టు వినే మరుగుజ్జులను— రాజకీయమైన రంగువేసి, ఇష్టానుసారం తన ఇష్టానుసారం దానిని తుడిచివేయడానికి వీలైన మరుగుజ్జులను – ఇందిరాగాంధీ కోరుకుంటున్నారా? ఇది బొత్తిగా న్యాయం లోపించిన విపరీతాలోచనేని ఆనంద్ మనసులో అంగీకరించాడు. అయినా, దేశంలో గావిజ్ఞతాభిప్రాయం శరవేగంతో ఆ ఆలోచనవైపే పరుగు తీస్తున్న విషయమూ అతడు గమనించాడు. అంటే, పర్యవసానంలో ప్రధానమంత్రి తన వ్యక్తిగతాధిపత్యం ఎప్పటికీ సుస్థిరంగా నిలుపుకోవడం కోసం స్వయంగా దేశాన్ని అస్థిరత్వంపాలు చేస్తున్నట్టుగా, విధ్వంసబీజాలు నాటుతున్నట్టుగా ప్రజలు భావిస్తున్నారని తాత్పర్యం.

పూర్తిగా అర్థరహితమైనదిగా ఆనంద్ ఆ ఆరోపణను త్రోసిపుచ్చాడు. ఏదో ఒక నాటకీయ పరిణామం సంభవించి అదెంత అవివేకపుటారోపణో వెల్లడిచేస్తుందనీ, ఇందిరాగాంధీ నిష్కళంక మూర్తిగా ఆవిర్భవించడానికి దోహదంచేస్తుందనీ అతడు గాఢంగా ఆశించాడు. కొందరు

కొత్తముఖ్యమంత్రులైనా ఈ తీవ్రఅభియోగంలో నిజం లేదని నిరూపించి, ప్రజల ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకునే ముఖ్యమంత్రుల మార్పు జరిగిందని తేటతెల్లం చేయగలుగుతారా? ఆమె సాధించిన బంగ్లాదేశ్ విజయాన్ని కూడా మించి స్వదేశజనందృష్టిలో ఆమె అద్భుతవ్యక్తి అని తేలడం అత్యంత ముఖ్యమన్న ఊహ విచిత్రంగా అతడికి కలిగింది... జరుగుతున్న అనేక దాడులనుంచి ఆమెను రక్షించగల కవచం అతని దృష్టిలో, ఒకే ఒకటి: అది భారత ప్రజానీకం.

చౌదరి తన ఆలోచనల్లో తను మునిగితేలుతుంటే ఆనంద్ ఆలోచనలు మరోదారిపట్టాయి. కేవలం స్వార్థకారణాలతోనే ప్రస్తుత ముఖ్యమంత్రుల్ని తొలగిస్తోందన్న అభియోగాన్ని మాపుకోడానికి ఇందిరాగాంధీ ఇప్పటికిప్పుడు ఆదర్శప్రాయులైన ముఖ్యమంత్రుల్ని ఎలా సృష్టించగలుగుతారో అతడికి అర్థంకాలేదు. కొత్తముఖ్యమంత్రులు పార్టీకార్యక్రమాలకు పూర్తిగా అంకితమై ఉన్నప్పటికీ, ఆమెకు విధేయులుగా ఉంటారా! ఆ వ్యక్తిలో ఈ రెండులక్షణాలూ ఇమిడిఉంటే, ప్రజలకు ప్రయోజనం చేకూర్చి, విధేయతను అర్థవంతంచేస్తాడని ఆనంద్ సర్దిచెప్పుకున్నాడు; ఇందిరాగాంధీకి విధేయులుగా ఉండడం ఏమంత మహాపాపం కాదనే ఎవరైనా అంటారు కనీసం ప్రజల దృష్టిలో అది పాపం కానే కాదు.

ఇంతకీ, కొత్తముఖ్యమంత్రుల ఎంపికలో ఇందిరాగాంధీ ఇటువంటి ప్రమాణాలను దృష్టిలో పెట్టుకుని ఉండరని త నెందుకనుకోవాలి? నిజమే, తనీ మధ్య చూసివచ్చిన రాష్ట్రంలో కొత్త ముఖ్యమంత్రి ఈ ప్రమాణాలను పూర్తిగా అందుకోగలిగి ఉండకపోవచ్చు. పైగా అరకొర సమాచారం మీద ఆధారపడి వేసిన అంచనా అది. ఆనంద్ దానిని సంపూర్ణంగా విశ్వసించనూ లేదు ఒకవేళ ఆ రాష్ట్రం విషయంలో తన అంచనా సక్రమమే అనుకున్నా, మిగిలిన రాష్ట్రాల విషయంలో ముందుగానే గుండెలు ఎందుకు బాదుకోవాలి? ఇంతకీ ఏమిటా మిగిలిన రాష్ట్రాలు? ప్రత్యేకించి ఏమీ లేనిదానికి త నెందుకింత గడబిడ చేస్తున్నాడు? ఇందిరాగాంధీకి లక్షలాది భారత ప్రజానీకానికీ ఉన్న బాంధవ్యాన్ని తలపోస్తూ అతడు చౌదరి దగ్గర సెలవు తీసుకున్నాడు. ఈ అనుబంధం పటిష్ఠంగా ఉంటే ఇందిరాగాంధీ పరిస్థితి కూడా భద్రంగా ఉంటుంది. ప్రజలలో తనపట్ల అభిమానాన్ని నిలుపుకోడానికి ఇందిరాగాంధీ ఏం చేయాలో అన్నీ చేస్తారన్న విశ్వాసం అతడికుంది; అంతిమంగా ఆమె నెగ్గుకురాగలిగింది ఈ మార్గంలోనే.

★ ★ ★

రాష్ట్రరాజధానిలో ఉద్రిక్తత పుంజుకుంటోంది. రాజకీయంగా ఎప్పుడెలా వ్యవహరిస్తుందో తెలియని అరుణ ఇప్పుడు సరికొత్త వైఖరిని తీసుకుంది. చౌదరి నిష్క్రమించితీరాలన్నది ఇప్పుడామె లేవనెత్తిన నినాదం. యధావిధిగా ఆమెను సీరియస్‌గా పట్టించుకున్న వారు తక్కువ. ఆయ నెందుకు తప్పుకోవాలన్నది వారి ప్రశ్న. అందుకు తనవద్ద జవాబు లేకపోయినా, ఆయన కొనసాగడానికి ఒక్కటంటే ఒక్క కారణం కూడా లేదని ఆమె ఇల్లెక్కి అరవడం ప్రారంభించింది.

ఇందిరాజీ రాష్ట్రాలలో మార్పును కోరుకుంటున్నారు. ఈ రాష్ట్రం ఎందుకు మినహాయింపు

కావాలని అరుణ నిలదీసింది. చౌదరేమైనా దిగొచ్చాడా ఏం? అతడేమైనా నిజాయితీపరుడా? పేదలపక్షం వహించే వాడా? ఏం చేసినా తనవాళ్ళకు చేసుకున్నాడు కానీ, రాష్ట్రానికి చేసింది ఒక్కటైనా ఉందా? నూతనసందర్భంలో ప్రజలు అతడినుంచి ఆశించగలిగిందేముంటుంది? మిగిలిన రాష్ట్రాలు విప్లవాత్మక కార్యక్రమాలతో ముందుకుపోతుంటే ఈ రాష్ట్రం ఒకవ్యక్తి ఇష్టా రాజ్యంగా ఎందుకు పడుండాలి?

అరుణ దేనినైనా విశ్వసించినప్పుడు (అది క్షణికవిశ్వాసమే అయినప్పటికీ) అందులో వ్యక్తమయ్యే అసాధారణబలం, దానిని ప్రచారం చేయడంలో ఆమె ప్రయోగించే అపారమైన శక్తీ ఇవే ఆమె బలం, బలహీనత కూడా. ఏదైనా చర్యకు దిగబోయేముందు చూచాయగా ఆనంద్‌కు దాని గురించి చెబుతూనే ఉంటుంది కానీ, ఆమె ఆలోచన వివేకవంతమైంది కాదని అతడి కనిపిస్తే మనసు మార్చుకుంటుందన్న హామీ ఎంతమాత్రం లేదు. ఒకసారి ఒక నిర్ణయానికి వచ్చిందంటే ఇక ఆకాశవాణిసంచారకేంద్రంగా మారిపోతుంది. చిన్నాచితకా అని చూడకుండా అందరినీ కలుసుకుంటుంది, శత్రుమిత్రభేదాలు చూడకుండా ఎవరినైనా అటకాయించి బుర్ర కడిగి విడిచిపెడుతుంది. ఓ ప్రభంజనంలా చుట్టేస్తూ అందరినీ బెంబేలెత్తిస్తుంది.

చౌదరి కాళ్ళకింద మంటలు పెట్టడానికే ఆనంద్ అరుణ విజృంభణను ఉపయోగించు కుంటున్నాడని ఒక్కసారిగా గుసగుసలు గుప్పుమన్నాయి. అతగాడు ప్రమోద్‌రాయ్ నియోజక వర్గాన్ని సందర్శించడానికి వెళ్ళడం కేవలం యాదృచ్ఛికం కాదని నీకు చెప్పానా లేదా? ఎంతైనా మొదట్లో ఆనంద్ మహేంద్రనాథ్‌కి సన్నిహితుడు కాడా? పోనీ కాడనే అనుకున్నా, మహేంద్రనాథ్‌తో సాగించే యుద్ధాలలో చౌదరికి ఇతగా డేనాడూ సన్నిహితంగా లేడని ఒప్పు కుంటావా?... ప్రతిఒక్క నాయకుడూ తన జీవితంలో ఏదో ఒక ఘట్టంలో అత్యంతఖరీదైన తప్పుచేస్తాడు శేషజీవితమంతా దానికి మూల్యం చెల్లించుకుంటూనే గడుపుతాడు. చౌదరేం మినహాయింపు కాదు. అతడు చేసిన తప్పు అతడికి మోయలేని భారం అవుతుంది; చూస్తూ ఉండండి ఆనంద్ గొర్రెల తలవంచుకుని నాయకుణ్ణి అనుసరించిపోయే రకమేమీ కాదు. అతడు స్వభావరీత్యా స్వతంత్రుడు, తనకంటూ ఏవో ఆలోచనలున్న వాడు, ఎప్పుడూ ఓ కంట కనిపెట్టి చూడవలసిన వాడు. శేఖర్ అన్నివిధాలా అతడికి దీటు వచ్చేవాడే కానీ, ఇంకా అనేకవిధాలైన లొసుగులు అతనికున్నాయి. జనం ఇప్పటికీ చాటున అతడి కళంకితజన్మను ఎత్తిచూపిస్తూనే ఉంటారు. అతడి దౌర్బల్యాలు లెక్కలేనన్ని ఉన్నాయి. వాటిలో ఒకదానిని అందుకుని ఎప్పుడైనా అతడిమీద దాడిచేయవచ్చు. ఆనంద్ విషయానికొస్తే అతడి ఏకైక దౌర్బల్యం: అరుణ. అదిప్పుడు పాతబడిన కథ. అదీగాక వాళ్ళ వెనకటి ఉరవడి తగ్గిఉండవచ్చు కానీ పూర్తిగా పోలేదు. ఓ రోజు గొడవపడతారు, రేపు మళ్ళీ కలిసిపోతారు. తను నాశనం చేయదల్చుకున్న వాళ్ళ మీదికి ఆమె నలాగే అతడు పురిగొల్పుతూ ఉంటాడు. అయినా అరుణ చంచలస్వభావం దృష్ట్యా, బహిరంగంగా అతణ్ణెవరూ వేలెత్తి చూపించలేరు... చౌదరిలాంటి అఖండుడికి అసలు ఆనంద్‌ను మంత్రిని చేయాలనే ఆలోచన ఎలా వచ్చిందనే నేను ఆశ్చర్యపోతూ ఉంటాను. ఎవరైనా పెరట్లో తాచుపాముల్ని పెంచుకుంటారా చెప్పు?...

ఆ విధంగా ఆనంద్ రాజకీయవదంతులకు, ఊహాగానానికి లక్ష్యంగా మారిపోయాడు. చౌదరి ఎదుర్కొంటున్న అస్థిరపరిస్థితి అందరి దృష్టిని ఆనంద్ వైపు మళ్ళించడం విచిత్రం. ఆనంద్‌ను రచ్చకీడ్చే ప్రయత్నంలో భాగంగా ఇందుకు శేఖర్ దోహదం ఎలాగూ ఉంది అయితే కథ అంతటితో ఆగలేదు. రాజకీయజంతువులు ఒకవిధమైన స్ఫురణతో అతణ్ణిరాకాబోయే వారిలో ఒకడుఎగా చూడడం ప్రారంభించారు త్వరలోనే వాళ్ళుతణ్ణి రాఏకైకవారసుడుఎగానే తలపోయడం మొదలుపెట్టారు. ఈ తాజావదంతి చూస్తుండగానే అంతటా పాకిపోయింది. అది చౌదరి చెవినకూడా పడకపోలేదు. నిజానికి అతడే, ముఖ్యమంత్రిత్వం కోసం ముగ్గురు నలుగురు బరిలో ఉన్నట్టు లోపాయికారీగా కొన్ని వదంతులు పుట్టుకురావడానికి తనదైన పద్ధతిలో దోహదంచేశాడు. తద్వారా ముఖ్యమంత్రి తనే కావాలని చౌదరి ఆశిస్తున్నట్టు వాళ్ళలో ప్రతి ఒకరూ అనుకున్నారు. ఇది చౌదరి తీసుకున్న ఓ తాత్కాలికచర్య.. బహుశా తను కోరుకున్నట్టుగా ఉపయోగపడేరకం కాదు కనుక ఆనంద్‌ను చౌదరి ఈ విషయంలో సంప్రతించలేదు. ఆనంద్ ఢిల్లీనుంచి తిరిగొచ్చిన కొద్దిరోజుల తర్వాత చౌదరి ఈ అంశంగురించి అతడితో చర్చించబోతే ఆనంద్ అన్నాడు, 'దయచేసి ఈ రాష్ట్రంలో ముఖ్యమంత్రి మార్పు గురించి మాట్లాడకండి. ఏది జరగవలసి ఉందో అది జరగనివ్వండి. ఢిల్లీలో నన్ను కలుసుకున్న మనిషి ద్వారా నా అభిప్రాయం ఇందిరాగాంధీకి తెలియజేశాను. ఆమె మిమ్మల్ని ఎందుకు తప్పించదలచు కున్నారో తెలిస్తే తప్ప అదనంగా నేను చెప్పగలిగిందేమీ లేదు...'

'నీ అభిప్రాయం వీస్తున్న గాలినీ, మండుతున్న మంటనూ ఆపలేదులే!' చౌదరి ఆక్షేపణగా అన్నాడు. 'మన మంత్రివర్గసహచరులు కొందరు ఇప్పటికే వారసత్వంపోటీలోకి దిగిపోయారు.'

'పాపం మీ ప్రమేయం లేకుండానే అది జరిగిపోయింది!' ఆనంద్ అల్లరిగా నవ్వుతూ చురక అంటించాడు

చౌదరికి కోపం ముంచుకొచ్చింది. 'చూడు ఆనంద్, మానవమాత్రుల ఆకాంక్షల్ని ఎవరూ నిరోధించలేరు. నా అంతట నేను దేనినీ ప్రారంభించలేదు. ఏం జరిగినా ఘనత నాదే అనిపించు కోడానికి కేవలం మార్గాన్ని సుగమంచేశాను, అంతే. ఇందిరాగాంధీ నేను దిగిపోవాలని కోరు కుంటున్నట్టు వాళ్ళకు తెలుసు. ఎవరికీ ఏమీ తెలియదు, అయినా అందరికీ అన్నీ తెలుసు కనుక నిజంగా మార్పు తథ్యమని తేలినప్పుడు, ఆ వచ్చేవాడు చౌదరి అడ్డుపడినాసరే తను ముఖ్యమంత్రి కాగలిగానని అనుకోకూడదు. ఎందుకంటే అది నిజంకాదు కనుక, నే నెవరినీ వ్యతిరేకించడం లేదు కనుక. రాష్ట్రానికో ముఖ్యమంత్రి కావలసిందే; చౌదరి కాకపోతే, మరొకడు. ఎంపిక దగ్గరకు వచ్చేసరికి కేవలం గుణాగుణాలను బట్టే ఎవడూ వెళ్ళడు. ఫలితం ఎలాగైనా పరిణమించవచ్చు కనుక ప్రతివాళ్ళూ బరిలోకి దిగారు. అందులో ఆశ్చర్యమేముంది? ఎప్పుడూ జరుగుతున్నట్టే ఇప్పుడుకూడా ప్రతివాళ్ళూ వెర్రిగా ఎగబడడంతోనే తంతు మొదలవుతుంది. ప్రస్తుతానికది లాటరీలానే కనిపిస్తుంది. తర్వాత క్రమంగా కొద్దిమంది పైకితేలతారు. ఆపైన బొమ్మా బొరుసా అన్నట్టుగా బరిలో ఇద్దరు మిగులుతారు. ఆఖరికి ఆ అదృష్టవంతుడో, దురదృష్టవంతుడో ఇందిరాగాంధీ బ్యాగ్‌లోంచి ఊడిపడతాడు.'

అప్పటికీ ప్రత్యామ్నాయాల గురించి యోచించడం ఆనంద్‌కు ఇష్టంలేదు. ప్రస్తుతానికి చౌదరే అధికారంలో కొనసాగవలసిన అవసరాన్ని అతడు ఉద్ఘాటిస్తూనే వచ్చాడు. రాజకీయ చాతుర్యంలో, అవగాహనలో, అన్నింటినీ మించి సైద్ధాంతికతపట్ల వెసులుబాటు వైఖరిలో ఆయన స్థానాన్ని భర్తీచేయగలవారు ఒక్కరూ అతడికి కనిపించలేదు. సోషలిజం సంగతి దేవుడెరుగు, అతడే రకమైన సిద్ధాంతాన్నీ నెత్తిన పెట్టుకున్నవాడు కాదు. అయినా సోషలిజంతోసహా అతడే సిద్ధాంతానికీ వ్యతిరేకీ కాడు. అతడి తాపత్రయమల్లా స్థిరంగా పాతుకుపోయిన తన ఆనవాయితీ పరిస్థితికి చేటు రాకుండా చూసుకోవడం, నాటి కీలకసమయంలో ఈ తాటస్థ్యమే ఏ ముఖ్యమంత్రి అయినా ప్రదర్శించదగిన ఉత్తమోత్తమ మార్గమని ఆనంద్ అనుకున్నాడు. అధికారంలో కొన సాగాలనే చౌదరి ఆకాంక్షనూ, అయినాసరే ఢిల్లీనుంచి సంకేతం వచ్చినట్టు అనిపించిన తక్షణమే తానుగా ఢిల్లీ అభిమతాన్ని నెరవేర్చడానికి అతడు ముందుకురావడాన్నీ ఆనంద్ గమనించాడు. నిజంగా ఆ ఉద్దేశం లేకపోయినా అందుకు తహతహలాడుతున్నట్టు కనిపించడానికి యత్నించాడు. అదెంతో తెలివితోకూడిన బహిరంగవేషం, ఎవరూ నిజాయితీరహితుడని తనను వేలెత్తి చూపించలేని విధంగా దాని నతడు ప్రదర్శించాడు. ఒకవేళ తను దిగిపోవలసివచ్చినా, తన ప్రస్తుతవైఖరి ఆ పరిణామానికి పూర్తిగా అనుగుణంగానే ఉంటుంది. వంచనాశిల్పం మేళవించి ఎంతో నేర్పుగా రక్తికట్టించిన గొప్పప్రదర్శన అది

రాష్ట్రంలో కళ్ళముందున్న అత్యుత్తమ ముఖ్యమంత్రి చౌదరి ఒక్కడేనని ఇప్పటికీ ఆనంద్ అసందిగ్ధంగా భావిస్తున్నాడు. ముఖ్యమంత్రులు స్వర్గంనుంచో, నరకంనుంచో ఏమీ ఊడిపడరు. ఏదైనా ఒక అంశాన్ని ప్రత్యేకంగా ప్రస్తావించాలనుకున్నప్పుడు కుర్చీలో వెనక్కివాలిపోయి చేతులు ముందుకు చాచడం చౌదరి అలవాటు. ఆ అలవాటుకు భిన్నంగా ఈసారి టేబులుమీద ముందుకు ఒరిగి నేరుగా ఆనంద్ కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు, 'అసలుప్రశ్నను నువ్వు చాలా రోజులుగా దాటేస్తున్నావు. ఇంకెంతో కాలం తప్పించుకోలేవని నీకూ తెలుసు. ఈ కీలకమైనప్రశ్నపై నీ బుర్రలో ఏ ఆలోచనా లేనట్టు కనిపిస్తున్నావు కానీ, అది పూర్తిగా డొల్లకాదని నాకు తెలుసు. కనుక నీ ఆలోచనలేమిటో ఎందుకు బయటపెట్టకూడదు?'

'మీ రన్నది నిజం. నా ఆలోచనల నాకున్నాయి,' ఆనంద్ సమాధానం చెప్పాడు. 'మీకు వారసుడు కాదగిన వాడెవడని ఆలోచిస్తునే ఉన్నాను, కానీ ఒక్కడూ కనిపించలేదు. కనుక మీరు తప్పుకోవడమే అనివార్యమైతే, ఎవడైనా వారసుడు కావచ్చు. ఇదేమంత ఇదమిద్ధమైన అభిప్రాయంకాదని మీకు చెప్పనక్కర్లేదు. అదీగాక నా ఆలోచన బయటపెట్టడమంటే ఎందరో శత్రువుల్ని సృష్టించుకోవడమే, కనుక మౌనం వహిస్తున్నాను...'

'నువ్వు గుంభనంగా ఉంటావనీ, ఎక్కువకాలం నోటికి తాళం బిగించుకునే ఉంటున్నావనీ నాకు తెలుసు,' చౌదరి అన్నాడు. 'అయితే కొన్ని కొన్ని సందర్భాలలో నీ మౌనం తీవ్ర పరిణామాలకు దారితీస్తుంది. ఏమైనా నీ ఆలోచనలు బయటపెట్టడానికి వెనకాడుతున్నావు, కనుక నీ అభిప్రాయాలేమిటని ఇక నేనూ అడగదల్చుకోలేదు.'

'సరిగ్గా చెప్పారు,'ఎఆనంద్ తుంచుతూ అన్నాడు. 'నా ఆలోచనలు బహిరంగంగా వెల్లడించడానికి వెనకాడుతున్న మాట నిజమే, అయినాసరే ఉటంకించడానికి సిద్ధమే ముఖ్యంగా మీ ముందు.'

'అయితే వాస్తవంగా నువ్వే మనుకుంటున్నావో చెప్పు' చౌదరి అన్నాడు.

'మీరు తప్పుకోవలసివస్తే, మీరు సూచించినవాడే మీ వారసుడు కావాలని నేను కచ్చితంగా భావిస్తున్నాను.'

'అది సాధ్యమని నేను అనుకోను,' ఇప్పటికే ఆ విషయంగురించి తనూ ఆలోచించి ఒక నిర్ధారణ కొచ్చినట్టుగా చౌదరి అన్నాడు. 'కనీసం ఢిల్లీముఖ్యుల ప్రస్తుత ఆలోచనాసరళి నీ ఊహను సమర్థించేలా లేదు. అదీగాక, నేను ముఖ్యమంత్రిగా కొనసాగడం ఇందిరాగాంధీకి ఇష్టంలేనప్పుడు, వారసుడి ఎంపికలో ఆమె నా సలహా ఎందుకు వినిపించుకుంటుందో నాకు అర్థంకావడం లేదు.'

'అంటే మీ ఉద్దేశం, ఆ రెండు సన్నివేశాల మధ్య తేడాలేదని. అంతేనా?'

'లేకేం. ఉంది; అయితే ఆమెకు నచ్చజెప్పగలిగిందెవరా అని? ఏదేమైనా, అన్ని అంశాలనూ దృష్టిలో ఉంచుకుని, ఆచితూచి నిర్ణయానికి రావడానికి ఆమెకు తీరికా లేదు'

'ఆచితూచో, మరోవిధంగానో నిర్ణయాలు తీసుకునే తీరిక ఆమెకి లేకపోలేదు. రాష్ట్రానికి సంబంధించి ఇది చాలా కీలకవ్యవహారం అందుబాటులో ఉన్న అవకాశాల మంచిచెడుల గురించి ఎవరో ఒకరు ఆమెకు నిర్మొహమాటంగా చెప్పాలి కనీసం అందుకు ఎవరో ఒకరు ప్రయత్నమైనా చేయాలి.ఎ

చౌదరిలో స్పందన కనిపించలేదు. ఆయనలో త్వరగా నిర్లిప్తత చోటుచేసుకుంటున్నట్టు ఆనంద్ అనుమానించాడు. ఇదాయన స్వభావానికే విరుద్ధం; అంత తేలిగ్గా చేతులెత్తేయడానికి ఒప్పుకోని గట్టిపిండం ఆయన. కనుక ఈ ఉదాసీనానికి, కనిపిస్తున్నదానిని మించి వేరే కారణమేదో ఉండాలని ఆనంద్ అంచనాకొచ్చాడు. సిగరెట్టు మీద సిగరెట్టు తగలేస్తూ చౌదరి గాఢమైన ఆలోచనల్లో జారిపోయాడు. లోపల జరుగుతున్న కల్లోలమథనానికి పొగ విరుగుడా అన్నట్టుగా మహోధృతంగా ధూమసేవనంచేస్తూ ఉండిపోయాడు.

'మీరోసారి ఇందిరాగాంధీతో సూటిగా అన్నివిషయాలూ ఎందుకు చర్చించకూడదు?' ఆనంద్ ప్రశ్నించాడు.

'దేనిగురించి?'ఎ చౌదరి తటాలున ఎదురుప్రశ్న వేశాడు, ఒకింత విస్మయంగానే.

'పార్టీకి చెందిన ప్రధానమంత్రితో అదేపార్టీకి చెంది తప్పుకోబోతున్న ఓ ముఖ్యమంత్రి ప్రయోజనకరమైన చర్చ జరపడానికి చాలా విషయాలుంటాయి. మిగిలిన విషయాలతో పాటు మీ కాబోయే వారసుడిగురించి కూడా మాట్లాడచ్చు' ఆనంద్ అన్నాడు.

'ఆమె నన్ను ఇష్టపడడం లేదు కారణమేమిటో నేను తెలుసుకోలేక పోతున్నాను' చౌదరి ఆలోచనగా అన్నాడు. అంతలోనే విరుచుకుపడుతూ 'కనుక నా వారసుడిగురించి ఆమెతో ఎందుకు చర్చించాలి? వాడిగురించి నే నెందుకు పట్టించుకోవాలి?' అన్నాడు.

ఆనంద్ మౌనం వహించాడు. ఆయనతో వాదించడం ఇష్టంలేక కాదు, ఈ విషయంలో చౌదరి ఆంతర్యమేమిటో నిర్ద్వంద్వంగా తెలిసిపోయింది కనుక. ఇంక దానిగురించి వాదించడానికేమీ లేదు. కొన్ని నిమిషాలు దొర్లిన తర్వాత, వెళ్ళడానికి ఉద్యుక్తుడయ్యాడు. ఆ కొన్ని కర్కశ క్షణాలలోనే అతడికీ, చౌదరికీ మధ్య ఒక అడ్డుగోడ లేచింది.

ఒకే ఒక మాటతో తను ఆనంద్ ముందు బయటపడిపోయినట్టు చౌదరి గ్రహించాడు. ఎవడైనా అంతే. తన వారసుడెవరన్నది అతడికి అనవసరం. చౌదరి ధోరణి కూడా అలాగే ఉంటుంది; శత్రుత్వానికి పరాకాష్ఠ అనదగినట్టుగా. ఇందులో వ్యక్తిగతమేమీ లేదని తనను తాను సమాధానపరచుకున్నాడు చౌదరి. తాను తప్పుకోవాలని ఇందిరాగాంధీ కోరుకున్నప్పుడు, తన ఆలోచనేమిటో వెల్లడించవలసింది ఆమె, తనకు ఇవ్వవలసిన, ఇవ్వదగిన గౌరవం ఇవ్వ వలసింది ఆమె. తను అధికారాన్ని పట్టుకువేళ్ళాడాలని అనుకోవడం లేదు, లేక అనుకుంటున్నాడా? నిచ్చితంగా తనకే తెలియదు. అయినా తను పూర్తిగా ఆత్మవంచన చేసుకోవడం లేదని తనకు తను సర్దిచెప్పుకుంటూ, తన దృష్టిలో ఇందిరాగాంధీ ఎలా వ్యవహరిస్తే ఉచితంగా ఉండేదన్న అంశం మీదే ఎక్కువగా దృష్టి కేంద్రీకరించాడు. ఆమె అలా వ్యవహరించలేదు, ఇకముందు కూడా వ్యవహరించేటట్టు లేదు. చౌదరి నిరంతరం ఆగ్రహంతో రగులుతూ ఉండడాని కది ఒక సాకుగా పనికొచ్చింది. నమ్మకస్థుల వద్ద తన ఆక్రోశాన్ని వెళ్ళగక్కుకుంటూనే వచ్చాడు

'ప్రధానమంత్రిత్వం ఇప్పుడు గుత్తపెత్తనంలా మారిపోయింది. మనం ఏ అగాధంలోకి పోతున్నామో తెలియడం లేదు. రాష్ట్రానికి నేను చేయగలిగింది చేశాను. అంతకంటె మెరుగ్గా ఎవడు చేస్తాడో చేయమనండి. అయినా ఎవరు మటుకు శాశ్వతం...'

'ఆమె మిమ్మల్ని ఎందుకింత అవమానిస్తోంది?' అంతరంగికులలో ఒకడు అడిగాడు. ఎవరైనాసరే, మీ సహకారం లేకుండా రాష్ట్రంలో ఏం చేయగలుగుతాడు? ఈ మాత్రం గ్రహింపు కూడా ఆమెకు లేదా?' ఈ ప్రశ్నకు చౌదరి భుజాలు ఎగరేసి ఊరుకున్నాడు.

రోజులు గడుస్తున్న కొద్దీ అతడిలో అసంతుష్టికూడా పెరుగుతూ వచ్చింది. అయినాసరే, అన్యుల నోటి మీదుగా తన ఆలోచనలు బయటపెడుతూ తను మౌనంగానే ఉండిపోయాడు. అప్పుడప్పుడు ఒకటీ అరా సూటిపోటిమాటలు విడిచిపెడుతూ వచ్చాడు. అది మినహాయిస్తే, ముఖ్యమంత్రిత్వంనుంచి తప్పుకోబోతున్నందుకు సంతోషిస్తున్నవాడిలానే అందరికీ కనిపించాడు.

చౌదరి నిష్క్రమణ ఇప్పుడిక అందరి దృష్టిలో మామూలు విషయమైపోయింది. అయితే, మహేంద్రనాథ్‌తో తాళి కట్టించుకున్న ఓ పత్రికమినహా అతణ్ణి దిగిపొమ్మని అడిగినవాళ్ళెవరూ లేరు. ఎక్కువ పత్రికలు చౌదరి లేకపోతే ప్రపంచం అంతమైపోతుందన్నంత హడావుడి చేశాయి.

బహుశా తమ ప్రపంచమని వాళ్ళ ఉద్దేశం కావచ్చు, ఎందుకంటే చౌదరి సాస్నేహపూర్వకపు ఆదరణమీద అవి అంతగా ఆధారపడిఉన్నాయి కనుక.

వారాలు గడుస్తున్న కొద్దీ, చౌదరి తన పదవిని కాపాడుకోడానికి వేయగలిగినన్ని ఎత్తులు వేస్తూ వచ్చాడు. ఢిల్లీలో తన లాబీ పరిమితంగా, దాదాపు అగోచరంగానే ఉండచ్చు కానీ, ఆధారపడదగినదని అతడికి తెలుసు. ప్రధానమంత్రి వ్యక్తిగతసహాయకులలో ఒకరిద్దరు అందులో ప్రథమశ్రేణిలోకి వస్తారు. అనేక సందర్భాలలో ఆమెను కలిసి మాట్లాడే అవకాశమున్న మధ్య రకం రాజకీయవాదులు తర్వాతి శ్రేణిలోకి వస్తారు. ప్రపంచంలోని ఏ విషయం గురించైనా వీరు స్వేచ్ఛగా ఆమె దగ్గర వదరుతూ ఉంటారు. పెంపుడుజంతువులపై చూపించేంత ఆదర భావంతో ఆమె వింటూ ఉంటారు. అలా ఆమె సమయం వృధాచేస్తున్నట్టు కనిపిస్తారు కానీ నిజానికి అలా కాదు. సాధారణంగా వట్టి అజ్ఞానమే తాండవించే ఆ ఉబుసుపోక కబుర్లు, వదంతులు, ఊహాత్మకకథనాల బండెడు చెత్తనుంచికూడా ఇందిరాగాంధీ ఒక్కోసారి విలువైన కీలకమైన సమాచారాన్ని సంగ్రహించుకుంటూ ఉంటారు. ముందుముందు ఎప్పుడైనా ఉపయోగించడానికి వాటి నామె తన మస్తిష్కపు మారుమూలపొరల్లో ఎక్కడో దాచుకుంటారు. ఆమె ఇసుకనుంచి కూడా నూనె తీయగల నేర్పరి అని కొందరు అభిమానంతో, కొందరు భయంతో, అనుకుంటూ ఉంటారు.

వీరునుంచే కాకుండా ఇంటెలిజెన్స్‌వర్గాల నుంచి కూడా సమాచారం రాబట్టుకోవడం జరుగుతూ ఉంటుంది. దురదృష్టవశాత్తు ఈ ఇంటెలిజెన్స్ యంత్రాంగంలో ఎక్కువభాగం అంతగా రహస్య సమాచారం సేకరించగలిగిందిగానూ, ఆధారపడదగిందిగానూ ఉండదు; వాళ్ళూ వీళ్ళూ అనుకునే మాటలనే సర్కారీపరిభాషలో ఒకచోట చేర్చి ఇస్తూ ఉంటారు. సాధారణంగా వాళ్ళం దించేది పనికిమాలిన సమాచారంగానే ప్రధానమంత్రి భావిస్తూ ఉంటారు కానీ, గుట్టలకొద్దీ ఉండే ఆ నివేదికల్లో కూడా కొన్ని విలువైన మెరుపులు బయటపడుతూనే ఉంటాయి. కత్తి వాదరను తలపింపజేసే ఏకాగ్రతతో వాటినామె శల్యపరీక్షకు లోనుచేస్తూ ఉంటారు.

ఇక ఈ నిచ్చెన పైమెట్టుమీద ఇందిరాగాంధీ సన్నిహితవిశ్వాసపాత్రులు ఉంటారు. వాళ్ళలో కొందరు కేవలం చూరుపట్టుకు వేళ్ళాడేవాళ్ళలానే కనిపిస్తారు కానీ నిజానికి ఎంతో పలుకు బడి కలిగినవారుగా, వెయ్యికళ్ళతో అన్నింటినీ కనిపెట్టి చూసేవారుగా వాళ్ళగురించి చెప్పు కుంటుంటారు. వాళ్ళలో కొందరు పండిట్‌జీకి కూడా విశ్వాసపాత్రులుగానే ఉంటూ రావడం వల్ల వాళ్ళ ప్రాముఖ్యం మరింత ఇనుమడించింది; నిజం చెప్పాలంటే వాళ్ళలో కొందరు ఆ కుటుంబం మొత్తానికే అత్యంతసన్నిహితులు, ఆ కుటుంబంలో తమూ సభ్యులేనన్నట్టు మెల గుతూ ఉంటారు.

రకరకాల తెగలకు చెందిన ఈ ఆంతరంగికగణంనుంచే హాదువ్వడానికి వీలైన కొందరు వ్యక్తులను రాష్ట్రనాయకులు కళ్ళు చెదరగొట్టే ప్రలోభాల ఎరవేసి ఎంతో ఓపికగా పోషించు కుంటుంటారు. వీళ్ళలో ఇందిరాగాంధీ విశ్వాసాన్ని మిక్కిలిగా చూరగొనే ఆప్తవర్గం ముఖ్య మంత్రులకు ఎంతో విలువైన లాబీలుగా ఉపయోగపడుతుంటారు. వీళ్ళ అనుగ్రహవీక్షణం

కోసం ముఖ్యమంత్రులు ఏమైనా చేస్తారు. అయితే అగ్రభాగన ఉన్నట్టు చెప్పబడే వీళ్ళలో చాలామంది అలాగని నటించేవారో, అవినీతికి ప్రతిరూపాలైన పరాన్నజీవులో అయుంటారు. ఆ విషయంకూడా ముఖ్యమంత్రులకు క్షుణ్ణంగా తెలుసు అయినా వాళ్ళు సైతం ఎడాపెడా సొమ్ము చేసుకుంటూనే ఉంటారు, భగవంతుడి రాజకీయసృష్టిలో ప్రతి ఒకరికీ చోటుంటుంది. పదిరాళ్ళు విసిరితే తగిలేది ఒక్క రాయేనన్న లౌకికసూత్రాన్ని బాగా ఒంటబట్టించుకున్న ముఖ్యమంత్రులు యథాశక్తి వాళ్ళను కూడా సంతోషపెడుతూ ఉంటారు. ఒక్క రాయైనా గురికి తగలాలంటే ఎన్నో రాళ్ళను వృథాచేయక తప్పదు. అదీగాక వేరే మార్గాల్లో ముఖ్య మంత్రులు నాలుగురాళ్ళు సంపాదించుకునే అవకాశాలు మెండుగా ఉన్నంతకాలం ఎన్ని రాళ్ళు వృథా అయినా నష్టమేమిటి?

చౌదరి ఇన్ని తెగలవాళ్ళనీ నేర్పుగా తన వలలో వేసుకోగలిగాడు. వీళ్ళలో అగ్రశ్రేణిని అలంకరించే పలువురు ప్రముఖులలో గోపికిషన్ కూడా ఒకడు. ఢిల్లీ అధికారయంత్రాంగంలో ఎంతో అట్టహాసంగా వెలిగిపోయే రాజకీయ కార్యకర్త అతడు. ఢిల్లీలో ఉన్న ప్రతివాళ్ళకీ అతడు తెలుసు, లేదా వ్యక్తిగతంగానో, ప్రేక్షకపాత్రలోనో కనీసం అతడి గురించి విని ఉంటారు కొందరతణ్ణి ఓ చారిత్రకపురుషుడుగా అభివర్ణిస్తే, మరికొందరు పరమనీచుడగా చిత్రిస్తూ ఉంటారు ఇందిరాగాంధీ అతడి సలహాలకు ఎంతో గౌరవభావంతో చెవియొగ్గుతూ ఉంటారని కూడా చెప్పుకుంటారు. ప్రధానమంత్రి వ్యక్తిగతసహాయకులు కొందరిని గోపీకిషన్ తన జేబులో వేసుకోగలిగాడని నమ్మేవారు కూడా చాలామందే ఉన్నారు. ఇది అతడి విజయాలకిరీటంలో కలికితురాయి అనదగ్గ విజయం. ప్రధానమంత్రి వ్యక్తిగతసిబ్బంది ఆ మాటకొస్తే నెంబర్‌వన్ స్థానంలో ఉన్న ఎవరి వ్యక్తిగతసిబ్బంది అయినా— మొత్తం తుట్టనంతటినీ నెత్తిన వేసుకోవలసి వస్తూ ఉంటుంది. నెంబర్‌వన్ మీద కుమ్మరించాలనుకున్న శాపనార్థాలన్నీ వీళ్ళ మీద కుమ్మరించి జనం అదోరకమైన ఆనందం పొందుతూ ఉంటారు. ఢిల్లీలో ఉండే ఇంకా ఎందరో దళారులు గోపికిషన్‌లానే, తమ జేబులో కూడా ప్రధానమంత్రి వ్యక్తిగతసహాయకులు కొందరు ఉన్నట్టు చూపించడానికి ప్రయత్నిస్తూ ఉంటారు. అటువంటి పలుకుబడి ఉన్న ప్రతిఒక్క నాయకుడికీ కొందరు ఆశ్రితులు ఉంటూనే ఉంటారు. వీళ్ళ ప్రగల్భాలలో నిజం ఎంతో ఎవరికీ కచ్చితంగా తెలియదు; చాలావరకూ అదంతా వట్టి ఊకగా తేలినా ఆశ్చర్యంలేదు. అయితే చౌదరిమాత్రం ఎందుకైనా మంచిదని తెలివిగా ఇటువంటి దళారులందరినీ సంతోషంలో ముంచి తేల్చుతూ వస్తున్నాడు.

ఆనంద్ వెళ్ళిపోయిన తర్వాత చౌదరి ఎంతోసేపు టెలిఫోన్‌లో గోపీకిషన్‌తో మంతనాలు సాగించాడు. వాళ్ళ సంభాషణ ముగిసేలోపల, పిటిషన్లు, అభ్యర్థనలు, ఆహ్వానపత్రాలు... వీటితో నిండిపోయిన టేబుల్ని ముంచెత్తే స్థాయికి యాష్‌ట్రే పొంగిపొరలేవరకూ లెక్కలేనన్ని సిగరెట్లు తగలేశాడు.

# 52

గోపీకిషన్ ఉదయం సరిగ్గా ఏడుగంటలకు తన సంచారం ప్రారంభిస్తాడు. గోపీకిషన్ సంచారం ప్రారంభించే సమయానికి ఉదయం సరిగ్గా ఏడు గంటలవుతుందనడం అంతకంటె సబబుగా ఉంటుంది. న్యూఢిల్లీ అశోకారోడ్‌లో ఉన్న రాజప్రాసాదాన్ని తలపింపజేసే తన నివాసం నుంచి అతడు అడుగుబయటపెట్టే వేళ చూసి మీ గడియారాలు సరిచేసుకోవచ్చు. గడ్డకట్టే చలిలోనే కానీ, నిప్పులుచెరిగే వేసవిలోనే కానీ అతడి ఈ ప్రాతఃకాల దినచర్యలో మార్పు ఉండదు. ఈ విషయంలో అతడి పేరుప్రతిష్ఠలు అచంచలమైనవి. ఎవరో ఈ విషయాన్ని ఓసారి ప్రధానమంత్రిదృష్టికి తీసుకెళ్ళారు కూడా. సమాధానంగా ఆమె చిరునవ్వు చిందించి ఊరుకున్నారు.

ఆ రోజు అతడు మరీ పట్టపగ్గాలు లేనట్టున్నాడు. ముందురోజు రాత్రి ముఖ్యమంత్రి చౌదరి ఫోన్‌చేసి చాలాసేపు అతడితో మాట్లాడాడు. ప్రత్యేకించి ఈ ముఖ్యమంత్రి ఫోన్‌చేసినప్పుడల్లా అతడి ఆనందానికి అవధులుండవు. ఎందుకంటే గోపీకిషన్ పాలిట ఇతగాడు అయాచితవరంగా పరిణమించాడు. ఎప్పటికీ వట్టిపోని పాడియావు. అన్ని రుతువుల్లోనూ కోరినవి ఇచ్చే కామధేనువు, కల్పవృక్షం! ఢిల్లీలాబీని పోషించడమంటే ఎన్ని నక్కజిత్తులు తెలిసి ఎంత పలుకుబడి ఉన్న ముఖ్యమంత్రులైనాసరే ప్రధానంగా డబ్బు నోట మాట్లాడవలసిందే రాష్ట్రాలనుంచి ఢిల్లీలో డబ్బు కుండపోతగా కురవవలసిందే, మరోమార్గం లేదు. చౌదరికి ఈ గ్రహింపు దండిగానే ఉంది. ఎందరో రాష్ట్రనాయకుల్లానే ఇతడుకూడా గోపీకిషన్ ఇందిరాగాంధీకి అత్యంతసన్నిహితుడని సకారణంగానే విశ్వసిస్తూ ఉంటాడు. గోపీకిషన్ ూకిచెన్‌క్యాబినెట్‌ూలో మనిషని గట్టిగా అన లేకపోయినా, వంటింటి సంభారాలు సమకూర్చే వ్యక్తుల్లో ఒకడుగా ప్రఖ్యాతుడే. చౌదరిలాంటి సూక్ష్మబుద్ధులకు ఇదే చాలు. ఇంట్లో నౌకరుకు మాత్రం తనదైన పలుకుబడి ఎంతోకొంత ఉండకుండా ఎలా ఉంటుంది? రాత్రి సంభాషణలో ముక్తాయింపుగా ూఅతి త్వరలోనే తనొక ూసూట్‌కేస్‌ను పంపించబోతున్న విషయాన్ని గోపీకిషన్‌కు అతడు సూచనప్రాయంగా చెప్పనే చెప్పాడు. అది తలచుకుని గోపీకిషన్ అమందానంద కందళితుడైపోతున్నాడు.

కారులో కూర్చోబోతుండగా మురికిదుస్తులతో ఒక రైతు తనవైపు తొట్రుపడుతూ వస్తూ గోపీకిషన్‌కు కవిపించాడు. అతడి చేతుల్లో చెమటతో తడిసిన కాగితం ఉంది అది పిటిషన్

అని తెలిసిపోతూనే ఉంది. క్షణం అటూ ఇటూ కావడానికి వీల్లేని తన దినచర్యలో జాప్యానికి కారణభూతుడు కాబోతున్న ఆ మనిషిని చూసి గోపీకిషన్ ముఖం చిట్లించుకున్నాడు. ఎన్నికల్లో ఎవరికి వోటేశారో ఆ దేవుడికే తెలియాలిగానీ, వీళ్ళు మామీద సర్వహక్కులు కొనేశామన్నట్టు ఉంటారనుకున్నాడు కసిగా. మా పదవీ, మా పేరు ప్రతిష్ఠలూ .. ఒకటేమిటి అన్నింటికీ మేం తమకు రుణపడి ఉండాలన్నట్టు వ్యవహరిస్తారు. మరీ ముఖ్యంగా మేం అధికారంలో కొనసాగుతూ ఉండడం తమ చలవేననుకుంటారు... ఆ రైతు కారుకు పది అడుగుల దూరంలో ఉండగానే 'ఆఫీసుకి రా; ఇక్కడకాదు!' అంటూ ఒక్క కేక పెట్టి తలుపు దభాలున మూసుకున్నాడు గోపీకిషన్.

మెత్తటి వెనకసీట్లో వెనక్కి వాలిన మరుక్షణమే, తాత్కాలికంగా ముంచెత్తిన ఆ కోపాన్ని మరిచిపోయి తననెంతో ఉత్తేజింపజేసే మృదువైన ఊహల్లో మునిగితేలడం ప్రారంభించాడు. ఓ కుర్చీకాలికి తన శరీరాన్ని రాపాడించుకుంటూ తృప్తిగా తేన్చే పిల్లిలా... సఫలరాజకీయ వాదులకు ఓ సజీవసాక్ష్యంగా ఢిల్లీలో చాలామంది అతణ్ణే చూపిస్తుంటారు. అతడు సఫలరాజకీయవాదీ, సఫలవ్యాపారీ కూడా. ఆ ఇద్దరినీ విడదీయడం కష్టం; గోపీకిషన్ విషయంలో వాళ్ళిద్దరూ సయామీస్‌కవలల్లాంటి వారు. రాజకీయం అనబడే వ్యాపారంలోని కిటుకులన్నీ అతడికి నేర్పిన తొలిగురువు అతడి తండ్రి లాలా హరికిషనే...

అదంతా ముప్పైఅయిదేళ్ళక్రితం మొదలైన ప్రక్రియ... అదేమంత సులువైన వ్యవహారం కాదు. అయినా అదెంతో సంభ్రమాన్నీ, మత్తునీ కలిగించే ప్రక్రియ. మొత్తానికి సయామీస్‌కవల లిద్దరూ బాగుపడ్డారు. కాలగతిలో పరస్పర ప్రోద్బలంతో ఇద్దరూ దుక్కల్లా తయారయ్యారు. తనకెంతో ప్రియతముడూ, అమోఘమైన తెలివితేటలూ, ముందుచూపూ ఉన్న తన తండ్రి జాగ్రత్తగా పన్నిన పథకం ప్రకారం గోపీకిషన్ స్వచ్ఛందంగా జైలుకెళ్ళాడు. లాలాజీ ఏది పట్టుకుంటే అది విధిగా బంగారం కావలసిందే. ముఖ్యంగా వ్యాపారం- ఎగుమతి, దిగుమతి, రవాణా, బులియన్, జవుళి, సారా – నువ్వేదంటే అది... ఆ రోజులనాటి బ్రిటిష్‌ప్రభుత్వాన్ని ఏదో కనికట్టువిద్యతో అతడు లొంగదీసుకున్నాడు. అతడి విజయరహస్యం అదే. రాయ్‌బహదూర్ బిరుదాన్ని అందుకోబోతున్న వారిలో అతడుకూడా ఒకడని అప్పట్లో కొంతకాలం పాటు చెప్పు కున్నారు. అయితే ఓ పక్క తన వ్యాపారం తాను ముమ్మరంగా చేసుకుంటూనే, నిష్క్రమణకు సిద్ధంగా ముళ్ళమీద ఉన్నదా అన్నట్టుగా, నాటి ప్రభుత్వంలో ఒక విలక్షణమైన కలవరాన్ని అతడు వెంటనే పసిగట్టగలిగాడు. తనేమీ అస్థిరంగా లేనని చూపించుకుంటున్న ఆ ప్రభుత్వం ప్రయత్నమేమో అది. కానీ ఆ ప్రయత్నం అంతగా నెరవేరుతున్నట్టు కనిపించలేదు... మరో వైపున దేశంలో జైలుకు వెళ్ళడమనేది అత్యున్నతగౌరవనీయతను సంతరించుకుని జైలుకు వెళ్ళిన వారికి సమీపభవిష్యత్తులో ఉజ్వలావకాశాలు కనిపించసాగాయి... తన కుమారుడు గోపీకిషన్ వీలైనంత త్వరగా జైలుకువెడితే బాగుంటుందన్న స్ఫురణ లాలాజీకి కలిగింది. గాంధీజీ అనుయాయులు (అసలీ, నకిలీ అని తేడా లేకుండా) దేశభక్తితో జైలుకు వెళ్ళడమనేది ఎప్పుడుపడితే అప్పుడు లభించే అవకాశం కాదు. ఆ పెద్దాయన ఎప్పుడే ఉద్యమాన్ని ప్రారంభిస్తాడో, ఎప్పుడు హఠాత్తుగా ఉపసంహరించుకుంటాడో ఎవ్వరూ చెప్పలేరు. అందుకని

అవకాశం వచ్చిన క్షణంలోనే దానిని దొరకపుచ్చుకోవాలి. అంచేత రేపు కలిసొచ్చే రోజు కోసం నువ్వు దేశభక్తుడిగా చరిత్ర నిర్మించుకోవాలనే అనుకుంటే ఇప్పుడే తొందరపడాలి, ఏ అవకాశం కనిపిస్తే ఆ అవకాశాన్ని ఒడిసిపట్టుకోవాలని లాలాజీ హితబోధ చేశాడు. అసలటువంటి రోజు రాబోతున్నట్టు ఎందరో గమనించడానికి చాలాముందే అతడు కనిపెట్టేశాడు...

త్వరలో ఆ అవకాశం రానే వచ్చింది. లాలాజీ తొందరపడిపోయాడు. ఓ లక్షాధికారి కుమారుడికి సహజసిద్ధంగా లభించే విలాసవంతమైన జీవితాన్ని త్యాగంచేయడానికి కాస్త ముందువెనకలాడుతూనే గోపీకిషన్ సిద్ధమయ్యాడు. ఏ ప్రమాణంతో చూసినా అదేమంత తీసిపారేయదగిన స్వార్థత్యాగం కాదు పోనీ అతడలా అనుకున్నాడు. వేలాదిమంది సత్యాగ్రహుల్లా 'సి' క్లాసులో మగ్గిపోవలసిన అవసరం రాదన్న హామీ లభించిన వెనువెంటనే తను ధరించబోయే నూతనపాత్ర అతడిలో అమితమైన ఉత్సాహాన్ని రేకెత్తించింది; 'ఎ' క్లాసు కాకపోతే మానె, కనీసం తనకు 'బి' క్లాస్ దొరుకుతుంది. ఆలోచనాపరుడైన లాలాజీ ఆ ఏర్పాటు చేయనేచేశాడు. ఈ విషయంలో ఒక అధికారి సహాయాన్ని అర్థించబోయేసరికి, ఆ అధికారి నిశ్చేష్టుడయ్యాడు. లాలాజీ ఆలోచనేమిటో అతడికి బొత్తిగా అంతుబట్టలేదు. ఓ లక్షాధికారి కొడుకేమిటి, ఏవో నినాదాలుచేసే పనికిమాలిన బజారుమూకతోపాటు స్వచ్ఛందంగా అరెస్టుకావడమేమిటి? ఇది మరీ అఘాయిత్యంగా ఉందే అనుకున్నాడు.

లాలాజీకి నిష్కర్షగా చెప్పేశాడు. 'ఇవి రాజకీయాలు లాలాజీ! వ్యాపారస్థులైన మీరు గానీ, మీ కొడుకుగానీ తలదూర్చవలసినవి కావివి...' అంటూ వారించాడు.

'రాజకీయాలు కూడా వ్యాపారమేనండీ,' ఎనోట్లోంచీ, ముక్కుపుటాల్లోంచీ వెలువడే చిలుం పొగతో దట్టమైన మబ్బులు సృష్టిస్తూ లాలాజీ అన్నాడు. ఓ నిమిషం సాలోచనగా ఉండిపోయి మళ్ళీ అన్నాడు, 'నన్నడిగితే జీవితమంటేనే వ్యాపారం అంటాను; అంతకుమించి మరేమీకాదు...'

'అదిసరే లాలాజీ, మీ కొడుకు విషయంలో మీ రంత నిర్దయగా ఉంటే ఎలా చెప్పండి? అతణ్ణి జైలు కెళ్ళమని మీరెలా చెప్పగలుగుతున్నారు? ఇది మరీ దారుణంగా ఉంది. మీరు పెద్ద పొరపాటు చేస్తున్నారు!'

'నా కదంతా తెలియదు!' లాలాజీ అసహనంగా అన్నాడు. 'నాకు తెలిసిందల్లా నేను మంచి సావాసంలో ఉన్నానని, అద్భుతమైన సావాసం. మోతీలాల్ నెహ్రూ, జవహర్లాల్ నెహ్రూ, రాజేంద్రప్రసాద్, అబుల్ కలామ్ ఆజాద్, రాజాజీ వీళ్ళందరూ జైలుకు వెడుతున్నారు. జైలు కెళ్ళినందువల్ల ఎప్పుడో ఒకప్పుడు ఏదోవిధమైన లాభం వాళ్ళకు కలుగుతుందనే నా వ్యాపారబుద్ధి చెబుతోంది.'

'అదికాదు లాలాజీ, జైలుకు వెళ్ళడం దేశభక్తుల విధ్యుక్తధర్మంగా వాళ్ళందరూ భావిస్తున్నారు...'

'వాళ్ళ గురించి నాకు తెలియదు, అనవసరం కూడా. నా కొడుకు జైలుకు వెళ్ళడమనేది నా కుటుంబపు రాజకీయపెట్టుబడిగా నేను అనుకుంటున్నాను మంచివ్యాపారం!'

'మీరేమైనా అనండి లాలాజీ, చేజేతులా మీ కొడుకును నాశనంచేస్తున్నారు. మీరేం చేస్తు న్నారో మీకే అర్థంకావడం లేదు. మీ కుటుంబానికి శాశ్వతంగా మచ్చ తెచ్చుకుంటున్నారు. ఇలా అంటున్నందుకు ఏమీ అనుకోకండి గానీ, అక్షరాలా మీ వినాశాన్నే కొనితెచ్చుకుంటున్నారు...'

లాలాజీ నిశ్చలంగా కూర్చుండిపోయాడు. ఆ కూర్చున్న క్షణమూ సుదీర్ఘక్షణంలా అని పించింది. బ్రిటిష్‌రాజ్యంలోని ఓ అధికారని అతడి ముఖంమీదే కాదనడమా ఆ రాజ్యానికి రోజులు సమీపిస్తే సమీపించవచ్చు గాక? అదంత మర్యాదకాదనే నిర్ణయానికి వచ్చాడు. అదీగాక, ఎవరు చెప్పగలరు, ఈ రాజ్యం మరికొన్నేళ్ళు ఉన్నా ఉండవచ్చు... ఏమైనా తను బెసగడానికి వీల్లేదు. జైలుకెళ్ళే ఓ మహదవకాశాన్ని తను చేజేతులా జారవిడుచుకోలేడు. దేశం స్వతంత్రమయ్యే లోపల బహుశా ఇదే చివరి అవకాశం. ఏదేమైనా తన కుటుంబానికి జైలుకెళ్ళిన చరిత్ర ఉండితీరవలసిందే, ఎందుకోసమైనా కానీ. ఇటువంటి అవకాశాన్ని వదలుకోడానికి తనేమీ తెలివితక్కువ దద్దమ్మ కాడు. తన మేలుకోరే ఆ అధికారి అలా అభ్యం తరం చెప్పి ఉండచ్చు కానీ, అదతడికి కోపమే తెప్పించింది. నిష్కర్షగా చెప్పాలంటే వ్యాపా రం ఎలా నడపాలో ఒక వ్యాపారికి బోధించవలసిన అవసరం ఈ మందబుద్ధికి ఎంతమాత్రం లేదని కూడా లాలాజీ అనుకున్నాడు. అదీగాక క్లబ్బులు తాగుడు వ్యభిచారం మరిగి శాశ్వతంగా కుటుంబవిచ్ఛిత్తికి పాల్పడకుండా తన కొడుకును చక్కదిద్దుకోవాలసిన అవసరమొకటి లాలాజీకి ఉంది. చర్చను అక్కడితో విరమించడానికి నిర్ణయించుకున్నాడు.

'దిక్కుమాలిన జైల్లో ఉంటే గోపీకిషన్ ఆరోగ్యమేమవుతుందో ఆలోచించారా?' ఆ అధికారి ప్రశ్నించాడు.

'అదంతా నేను ముందే ఆలోచించాను, మీ కెందుకూ?' లాలాజీ అన్నాడు. 'గోపీ ఇంట్లో తినేదే అక్కడా తింటాడు, అలాగే మిగిలినవి కూడా...'

'చాల్లెండి,'ఎ విధేయుడైన ఆ అధికారి అద్భుతగులుతూ అన్నాడు బ్రిటిష్‌రాజ్యంలోని జైళ్ళలో ముందుగానే ఎటువంటి వసతులు సమకూర్చుకోవచ్చునే మరీ విస్తరించి చెప్పే అవకాశం ఆయన కివ్వడం ఇష్టంలేక. 'నా కంటె మీకే అన్నీ బాగా తెలుసు లాలాజీ,ఎ అన్నాడు ఎట్టకేలకు తగ్గుతూ. మీరు కోరింది నే నెప్పుడు కాదన్నాను...'ఎ

'నాకు తెలుసండీ, తెలుసు... ఇంతవరకూ చేసిన ఉపకారాలన్నింటికీ కృతజ్ఞుణ్ణి,' లాలాజీ అన్నాడు, చర్చ ముగిసినందుకు ఎంతో సంతోషంగా.

ఆ విధంగా, సూక్ష్మబుద్ధి అయిన తన తండ్రి పన్నిన వ్యూహంలో భాగంగా గోపీకిషన్ స్వచ్ఛందంగా జైలుశిక్ష అనుభవించాడు. మిసమిసలాడే ఆరోగ్యంతో జైలునుంచి విడుదలైన అతణ్ణి చూసి స్నేహితులు చివరకు తల్లికూడా ఆశ్చర్యపోయారు. మిగిలిన ఎందరో సత్యా గ్రహులు జీవచ్ఛవాల్లా మెల్లగా నడుస్తూ బయటకు రాగా మనవాడు గుండ్రంగా ఊరిన బుగ్గలతో అడుగులో సరికొత్త చురుకుతనం ముద్రపడుతుండగా బాగా బరువుచేసిన మనిషిలా కనిపించాడు. ఇతర సత్యాగ్రహులకు, జైలుగేటుదగ్గర నిలబడి పూలదండలతో స్వాగతం చెప్పడాని కొక్కరూ

రాలేదు; అక్కడినుంచి ఎక్కడికి వెళ్ళాలో కూడా వాళ్ళకు తెలియదు. సంప్రదాయబద్ధ సమాజంలో జైలుకు వెళ్ళడాన్ని ఓ కళంకంగా భావిస్తారు కనుక స్వగ్రామంలోని తమ కుటుంబసభ్యులు తమను ఆదరిస్తారన్న గట్టినమ్మకం వాళ్ళలో కనీసం కొంతమందికి లేదు. ఒక్కముక్కలో చెప్పాలంటే, జైలుకు వెళ్ళిన ఎంతోమందికి జైలుజీవితం ఆహ్లాదకరమైన అనుభవం ఎంత మాత్రం కాదు. గోపీకిషన్ దారి వేరు, అతడు మంచి బరువు పుంజుకోవడమే కాకుండా తన తొలివిజయాన్ని పురస్కరించుకుని తలపెట్టిన బ్రహ్మాండమైన ఊరేగింపులో పాల్గొనడానికి ప్రత్యేకంగా అలంకరించిన రథాన్ని అధిరోహించిన తక్షణమే ాానాయకుడనన్న గుర్తింపుతో పహా అతడిపై ప్రశంసలు వెల్లువెత్తాయి. గేటుదగ్గర గుమికూడిన జనం ఈ సన్నివేశానికి ఎంతో ముగ్ధులైపోయారు. వాళ్ళలో, విడుదలైన ఇతర ఖైదీలను కూడా చూసిన కొందరు అనుకున్నారు, వాళ్ళూ జైలుకెళ్ళిన వాళ్ళే, ఈయనా జైలుకెళ్ళిన వాడే ఎ

★ ★ ★

గోపీకిషన్ కారు న్యూఢిల్లీవీధుల్లో పరుగుతీస్తోంది. ట్రాఫిక్ అంతగా లేదు; మధ్యమధ్యలో ట్రక్కులు ఉరుముతున్నట్టు శబ్దంచేస్తూ పక్కనుంచి వెళ్ళిపోతున్నాయి. పేపర్ కుర్రవాళ్ళు ఉదయం పత్రికలదొంతర్లను సైకిళ్ళకు కట్టుకుని వేగంగా సైకిల్ తొక్కుకుంటూ వెళ్ళిపోతున్నారు. ఉదయభానుడి లేతకిరణాలు ఏమాత్రం వేడి అనిపించనంత మృదువుగా ఉన్నాయి.

ఫుట్‌పాత్ అంచు దగ్గర గోపీకిషన్ కారు హఠాత్తుగా కీచుమంటూ ఆగిపోయింది. తొలి యవ్వనంలో ఉన్న కుర్రవాడిలా గోపీకిషన్ కారులోంచి ఒక్క దూకు దూకాడు. గోపీకిషన్ దాదాపు పరుగువీరుడిలా తనవైపు వస్తుంటే ఫుట్‌పాత్‌మీద నడిచివెడుతున్న ఓ మనిషి విస్తుపోయి ఇబ్బందికరంగా చూస్తూ ఆగిపోయాడు. ఆ సందర్భానికీ, వాళ్ళ పరిచయానికీ ఏమాత్రం పొసగనంత ఎక్కువపాళ్ళలో సంతోషమూ, అభిమానమూ రంగరించి ాానమస్తే, నమస్తేజీ అంటూ గోపీకిషన్ ఒక్క కేక పెట్టాడు. ఆ పాదచారి అంతరాంతరాల్లోని ఆలోచనలను కనుక చదవగలిగి ఉంటే ాావట్టి దళారీవెధవఎ అని అతడు గొణుక్కోవడం మీకు వినిపిస్తుంది. అయితే అప్పటికే గోపీకిషన్ బలవంతంగా అవతలిమనిషి చేతిని తన చేతిలోకి తీసుకుంటూ గాఢాలింగనంతో అతణ్ణి నలిపివేస్తూ ఉక్కిరిబిక్కిరి చేసేశాడు. ఆ క్షణంలో వాళ్ళిద్దరినీ చూసిన వాళ్ళెవరైనా ఇరవైఏళ్ళ తర్వాత కలుసుకున్న కాలేజిమిత్రులు కాబోలు ననుకుంటారు. నిజానికి వాళ్ళిద్దరూ రెండురోజుల క్రితమే మొదటిసారి కలుసుకున్నారు, అదికూడా యధాలాపంగా. కేంద్రప్రభుత్వంలో పర్మిట్లు జారీచేసే మంత్రిత్వశాఖలో ఉన్నతాధికారి అయిన ఆ వ్యక్తి మార్నింగ్‌వాక్‌కి వెళ్ళే మార్గంలోనే తానుకూడా వెళ్ళేటట్టు గోపీకిషన్ ఏర్పాటు చేసుకున్నాడు.

ఎంతసేపూ గోపీకిషనే మాట్లాడుతున్నాడు, ఆ అధికారిని బందీచేయడానికి మాటలతోనే వలపన్నుతున్నాడా అన్నట్టుగా. మధ్యమధ్య ప్రధానమంత్రి పేరూ, ఆమె కెంతో నమ్మకస్థుడైన ఒక అనుచరుడి పేరు ప్రస్తావిస్తూ ఆ వలను మరింత దృఢతరం చేస్తున్నాడు. ఆ వలనుంచి బయటపడేందుకు ఒకేఒక మార్గం – అది గోపీకిషన్ మాటిమాటికీ గుర్తుచేస్తున్న ాాఫలానా ఫైలు.ఎఆ అధికారి వినిపించీ వినిపించనట్టు ఏదో గొణిగి ఎట్టకేలకు విముక్తుడయ్యాడు. గోపీకిషన్

విజయగర్వంతో తిరిగి తన కారులో కూర్చుని, బతుకుజీవుడా అనుకుంటూ వెళ్ళిపోతున్న ఆ అధికారికి వినిపించేంత బిగ్గరగా 'పి.ఎం. ఇంటికి ఛలో!' అని డ్రైవర్‌ను అదిలించాడు.

అయితే ఆ అధికారి కనుమరుగైన వెంటనే గోపీకిషన్ మరోచోటికి తీసుకెళ్ళమని డ్రైవర్‌కి చెప్పాడు. 'అచ్ఛా జీ'ఎఅంటూ డ్రైవర్ తలపూపి లోలోపల ఒకింత నవ్వుకుంటూ కారును ఓ సందులోకి తిప్పాడు. ఆ సందు మరికొన్ని సందులు, గొందుల సాలెగూటివైపు నడిపించింది. సందుకు ఇరువైపులా కొన్నిరోజులుగా పోగుబడి గుట్టలుగా పేరుకున్న చెత్తనుంచి దుర్భరమైన దుర్వాసన వస్తోంది. ప్రతిరోజూ ప్రధాన రహదారుల్ని మాత్రం శుభ్రంచేస్తే చాలనుకుంటారు మునిసిపల్ అధికారులు. పైకి ప్రదర్శించదలచుకున్న ప్రదేశాలనే శుభ్రంచేసి ఊరుకుంటారు. ఇతరత్రా నమ్మశక్యం కానంత మురికి పేరుకుని ఉంటుంది–బయటపెట్టని మన ఆలోచనల్లో మాదిరిగా ..

భారీగా తెరలు వ్రేలాడదీయబడి, లోపల నిప్పచ్చరంగా ఉన్న పాతఢిల్లీలోని ఓ ఇంటి ముందు ఎట్టకేలకు కారు ఆగింది. మిత్రుడు అష్రఫ్ తనకోసం అసహనంగా ఎదురుచూస్తున్నట్టు గోపీకిషన్ గమనించాడు. అతడు పెదవి విప్పి ఏదో అనే లోపలే అష్రఫ్ అన్నాడు, 'త్వరగా పద, కప్పు టీ తాగడానికి కూడా వ్యవధి లేదు. ఆ రైతులు పొద్దుటినుంచి మనకోసం ఎదురుచూస్తున్నారు...'

'అంత తొందరపెట్టేస్తున్నావేమిటి అష్రఫ్‌భాయ్?' గోపీకిషన్ ప్రశ్నించాడు

'అంటే నీకేం తెలియదన్న మాట?' అష్రఫ్ పట్టరానంత ఆశ్చర్యంతో ప్రశ్నించాడు. 'వరద పరిస్థితి గురించి నువ్వేమీ వినలేదన్నమాట? నీ కేమీ...'

'ఓహ్, అదా?' తేలికపడ్డట్టు ఊపిరి పీల్చుకుంటూ గోపీకిషన్ సాగదీస్తూ అన్నాడు. 'వరద గురించి నాకు తెలియకేం, తెలుసు; అయినా తర్వాత పోవచ్చులే.'

'ఐయామ్ సారీ, ఆలస్యం చేయడానికి వీల్లేదు. అవతల పరిస్థితి దారుణంగా ఉంది.'ఎ

'నేనూ సారీనే అష్రఫ్‌భాయ్, అటు సూర్యు డిటు పొడిచినా సరే మొట్టమొదట కొందరిని కలుసుకునే నా కార్యక్రమం పూర్తికావలసిందే... నాకు అదే ముఖ్యం.ఎ

'నువ్వు స్పృహలో ఉండే మాట్లాడుతున్నావా గోపీకిషన్?' అష్రఫ్ మండిపడుతూ నిలదీశాడు. 'ఓ పక్క వరదనీరు గ్రామాల్లోకి ప్రవేశించి వేలాదిమందిని దిగ్బంధంచేస్తే వేరే విషయాల గురించి నువ్వెలా ఆలోచిస్తున్నావ్?'

'నాకు తెలుసు,' తుంచుతూ అన్నాడు గోపీకిషన్. 'నేను కొందరిని కలిసిరావడం అంత కంటె ముఖ్యం'

'ఇంతకీ నువ్వు కలుసుకునే దెవరినో తెలుసుకోవచ్చా?' అష్రఫ్ వ్యంగ్యంగా ప్రశ్నించాడు. అతడి అరమోడ్పుకళ్ళలో చెప్పలేనంత అసహ్యం తాండవిస్తోంది.

'ఎందుకు తెలుసుకోకూడదూ... తప్పకుండా తెలుసుకోవచ్చు,'ఎ వ్యంగ్య ధోరణిలో అవతలి

మనిషితో పోటీపడుతున్నట్టు ఆచితూచి అన్నాడు గోపీకిషన్. 'నీకు కాకపోతే ఇంకెవరికి చెబుతాను మౌల్వీసాహిబ్? అన్నిటికంటె నాకు ముఖ్యమైన వేమిటంటే ఓసారి ప్రధానమంత్రి నివాసానికి వెళ్ళడం, ఆ తర్వాత లెఫ్టినెంట్ గవర్నర్‌ను కలవడం, ఇంకా నీకు తెలుసుకోవాలనిపిస్తే, ఆ తర్వాత...'

'లేదు. నాకు తెలుసుకోవాలని లేదు!' అష్రఫ్ ఒక్కపెట్టున విరుచుకుపడ్డాడు. 'నువ్వింత కఠినుడివని నే నెప్పుడూ అనుకోలేదు' ఆవేశంతో అతడి గొంతు పూడుకుపోయింది.

'కోప్పడకు మిత్రమా, కోప్పడకు!' అవతలి మనిషి ఆగ్రహానికి కొంచెమైనా చలించకుండా గోపీకిషన్ అన్నాడు. 'కఠినుడే అను, నీ కిష్టమైన మరే పేరుతోనైనా పిలు కానీ, నే నవేమీ కాదు. నాదంతా వ్యాపారసరళి. నేను కేవలం ప్రాక్టికల్ మనిషినీ, ప్రయోజనవాదినీ..'

'నువ్వవేమీ కాదు, ఆ విషయం కచ్చితంగా చెప్పగలను,' అష్రఫ్ గట్టిగా అరిచాడు. 'ఓ పక్క ఊళ్ళకు ఊళ్ళు కొట్టుకుపోతుంటే ఈయనగారు ప్రధానమంత్రి ఇంటిచుట్టూ వేళ్ళాడ తాడట!... నే నిది క్షమించలేను... క్షమించ...'

'ఇక ఈ పనికిమాలిన సణుగుడు మానేసి నేను చెప్పినట్టు చేస్తావా లేదా?' అవతలి మనిషి నివ్వెరపోయి నోరు మూసుకునేలా గోపీకిషన్ తన గొంతును తారస్థాయిలో పెంచి ఒక్క అరుపు అరిచాడు. 'నీ నీతిబోధ లిక చాలించు. తక్షణం వెళ్ళి ప్రధానమంత్రి ప్రైవేట్ సెక్రటరీని కలుసుకో... ఉన్నపళంగా...'

'ఇప్పుడా? దేనికి?'అష్రఫ్ విస్తుపోతూ ప్రశ్నించాడు.

'దీనికో దానికో ఏదో దిక్కుమాలిన దానికోసం, పనికిమాలిన దానికోసం!' గోపీకిషన్ రౌద్రంగా అన్నాడు. 'వెళ్ళు. అతణ్ణి కలుసుకో. ఆదాబ్ అర్జ్ చెప్పు, లేదా మీ మౌల్వీలు అనే దేదైనా అను. ఆ తర్వాత ఒక్కసారి ఘొల్లుమను. ఏం? అనగలవా? ఎప్పుడనుకుంటే అప్పుడు కన్నీళ్ళు తెచ్చుకోగలవా? ఏడవగలవా?... ఏదోవిధంగా అలాచేసి వరదలు కలిగించిన బీభత్సాన్నీ, ప్రజల కడగండ్లనూ కళ్ళకు కట్టినట్టు వర్ణించి చెప్పు. నువ్వెలా ఊళ్ళల్లోకి వెళ్ళావో... ఒకే ఒకడు గోపీకిషన్, కొంచెమైనా అలుపెరుగని గోపీకిషన్, గొప్ప కార్యశీలి అయిన గోపీకిషన్ పిచ్చెత్తినవాడిలా హుటాహుటిన ఎలా పరుగులు తీస్తూ నీకు కనిపించాడో... పేదలకు సాయం చేస్తూ ప్రధానమంత్రి పేరుమీద వాళ్ళనెలా ఓదార్చాడో, ఆమె సానుభూతి సందేశాన్ని వాళ్ల కెలా అందించాడో... తన ఘనతేమీ లేనట్టు, అంతా ఆమెదే అయినట్టు ఎలా వ్యవహరించాడో... ఇందిరాజీపట్ల గోపీకిషన్ పరిపూర్ణ విధేయతను చూసి నువ్వూ, అక్కడున్న జనం ఎలా చలించి కంటతడిబెట్టుకున్నారో చెప్పు... ఆపైన ఇదే తరహాలో ఇంకా నీకేమైనా చెప్పాలనిపిస్తే చెప్పు... అర్థమైందా?'

'కానీ... కానీ...' నట్టుతూ ఏదో అనబోయాడు అష్రాఫ్.

'నీ కానీల నలా ఉంచు. ఆట్టే సమయం లేదు.' గోపీకిషన్ మధ్యలోనే అటకాయిస్తూ అన్నాడు. 'ఖర్చులకోసం ఇదుంచుకో. ప్రశ్నలడగద్దు. తక్కువ మాట్లాడు. అసలు మాట్లాడ

కుండా ఉంటే మరీమంచిది. కేవలం నేను చెప్పింది చెయ్యి. ఇక నేను వెళ్ళిపోవాలి' అంటూ ఓ కరెన్సీ నోట్లకట్టను అష్రఫ్ జేబులోకి కుక్కి గోపీకిషన్ అక్కడినుంచి నిష్క్రమించాడు.

'కారాపు!' హఠాత్తుగా ఫుట్‌పాత్ మీద జనాన్ని చూసి గోపీకిషన్ ఒక్క కేక పెట్టాడు. డ్రైవర్ వీలైనంత గట్టిగా బ్రేకులు నొక్కాడు. కారు ఆగిపోయింది. గోపీకిషన్ తన సహజశైలిలో మార్జాలవిన్యాసాన్ని తలపింపజేసే చురుకుదనం ఉట్టిపడేలా కారు దిగి అయోమయంగా దిక్కులు చూస్తున్న జనంలోకి నేరుగా లంఘించాడు. అతడు ఊహించింది కరెక్టే, వీళ్ళు వరదబాధిత గ్రామీణులు. ప్రధానమంత్రి నివాసంవైపు వెడుతున్నారు. సందేహం లేదు, తమ కడగండ్లు చెప్పుకోవడానికే.'

'ఓహ్! నా సోదర సోదరీమణులారా!' గోపీకిషన్ రాగాలు తీస్తూ గుండె బాదుకోవడం ప్రారంభించాడు. 'ఎంత కష్టమొచ్చిపడింది మీకు! ఇంతకీ ఏ ఊరినుంచి వస్తున్నారు? సీతాపూర్? ఓహ్! జిల్లాలో ఆ చివరికెళ్ళి ఇప్పుడే తిరిగొస్తున్నాను. తిన్నగా లెఫ్టినెంట్ గవర్నర్ దగ్గరికి పోతున్నాను. ఆ తర్వాత ప్రధానమంత్రిని కలుస్తాను. ఓరినాయనో! ఎంత నష్టం జరిగిపోయింది! ఎంత దారుణమైన ఉత్పాతం! ఓహ్... ఓహ్... ఓహ్!ఎ అంటురోగం లాంటి అతడి శోకాలాపనకు అక్కడున్న గుంపు కూడా అలాగే స్పందించింది. అధికారుల కాఠిన్యం, అధికారేతరుల అలసత్వం వాళ్ళలో ఆశను పూర్తిగా అణచిపారేశాయి. గోపీకిషన్ పిల్లిశోకాలతో వాళ్ళు మరింత నిరాశ లోకి జారిపోయారు. నడివయసులో ఉన్న ఓ రైతు ఆ గుంపుకి నాయకుడు. గట్టిపిండంలానూ, ఓ పట్టాన నమ్మని మనిషిగానూ కనిపించాడు. గోపీకిషన్ అతణ్ణి పక్కకు తీసుకెళ్ళి, గుసగుసలాడుతున్న అభిప్రాయం కలిగించకుండా జాగ్రత్తపడుతూనే అతడి చెవిలో ఏదో చెప్పే వరకూ గోపీకిషన్ కల్లబొల్లి ఏడుపుకు అతడు లొంగిరాలేదు. అటుతర్వాత, అతగాడి బెట్టు క్సాస్తా చుట్టూ ముంచెత్తిన కన్నీటి ప్రవాహంలో కలిసిపోయింది. గోపీకిషన్ పురమాయించిన మీదట, ఎవరో సమీపంలోని టీస్టాల్ నుంచి టీ తెప్పించి అందరికీ ఇచ్చారు. ఈ లోపల ఆ నాయకుడూ, గోపీకిషనూ కాస్సేపు మాట్లాడుకున్నారు.

'నేను చెప్పింది గుర్తుందిగా? మాట తప్పేవాణ్ణి కాదు' గోపీకిషన్ అంతే యధాలాపధోరణిలో అతడి చెవిలో గుసగుసలాడాడు. 'ఈ లోపల నువ్వు నేరుగా ప్రధానమంత్రి నివాసానికి వెళ్ళు. ఇంకో అరగంటలో ఆమె జనాన్ని కలుసుకోవడం ప్రారంభిస్తారు. వెళ్ళు, వరద గురించి, మీకు జరిగిన నష్టాల గురించి, మీ సమస్యల గురించి చెప్పు. ఇంకో విషయం, లాలా గోపీకిషన్ ఒక్కడే బాధితుల్ని ఆదుకోవడానికి పరుగుపరుగున వచ్చాడనీ, రాత్రనకా, పగలనకా వాళ్ళకు వీలైనంత సహాయం అందిస్తూ వచ్చాడనీ చెప్పడం మరిచిపోకు... అర్థమైందా?...'

'కానీ... కానీ...' ఆ నాయకుడు సందేహిస్తూ ఏదో అనబోయాడు.

'కానీలకు సమయం లేదు. ఇప్పుడు నే నిచ్చిన మాటకు నీ బంధువుకో, నీ స్నేహితుడికో నువ్వెవరికి సిఫార్సుచేస్తే వారికి ఒక ప్యూన్ పోస్టును కూడా కలుపుకో... ఇప్పుడిక నేను వెళ్ళాలి. సాయంత్రం కలుసుకో, ఏడింటికి, ఒక్కడివే...' అనేసి గోపీకిషన్ తన సహజసిద్ధమైన ఉల్లాసభంగిమలో అదృశ్యమయ్యాడు. బాధిత రైతాంగం కృతజ్ఞతాభరితంగా తాము స్వీకరించిన టీతో పాటే నమ్మశక్యంకాని అతడి అభినయచాతుర్యాన్నీ దిగమింగుతూ ఉండిపోయారు.

★ ★ ★

'ఓహ్, గోపీకిషన్' ఆహారమంత్రిత్వశాఖ భవంతి వెలుపల తన కెదురుపడిన గోపీకిషన్‌తో, ఒక్కొక్క మాటనూ ఎంతో రంజుగా ఆస్వాదిస్తూ రంజన్‌బాబు అన్నాడు. 'ఈ సారి నువ్వు పప్పులో కాలేశావు! అందులోంచి ఎలా బయటపడతావో నాకేమీ అర్థం కావడం లేదు! మా చెడ్డ చిక్కులోనే పడ్డావ్... చొచ్చొచ్చొ...'

రంజన్‌బాబంటే గోపీకిషన్‌కు విషంతో సమానం. ఒకరి అంతు ఒకరు చూడడానికి ఎంతకైనా తెగిస్తారు రాజకీయంగానే కాదు, ఆ చిట్టచివరి పనికైనా సిద్ధమౌతారు. ఇద్దరూ అధికారపక్షానికి చెందిన వారే. అంటే పట్టువిడుపులు కానీ, రాజీకుగానీ అవకాశం లేనంతగా సహజ, శాశ్వత బద్ధవైరులన్న మాట. వాళ్ళమధ్య ముప్పైఏళ్లుగా రాజుకుంటున్న యుద్ధమది. దేశంలో ఈ భాగంలో శాంతిని పునరుద్ధరించే సంకల్పం కలిగి ఆ భగవంతుడు ఇద్దరిలో ఒకరిని తన వద్దకు రప్పించుకునే వరకూ అది కొనసాగడం ఖాయం.

గోపీకిషన్ ముఖం వాడిపోయింది. అయితే అది క్షణకాలమే. కేవలం ఆరితేరిన రాజకీయ వాదికే సాధ్యమైనంత వేగంతో తన మునపటి ఉల్లాసాన్ని, నిబ్బరాన్ని తెచ్చుకుని ఎదురు దాడికి దిగాడు. 'అందుకోసమే పాపం నువ్వు చాలాకాలంగా ప్రార్థిస్తున్నావ్ రంజన్. కానీ ఏం చేస్తాం, భగవంతుడు నిన్ను దయతల్చడం లేదు. నీ ప్రార్థన ఫలించే అవకాశం ఎన్నటికీ రాదు. ఎప్పటిలా నా పాదాలు నేలమీద స్థిరంగానే ఉన్నాయి; లేనిపోనివి ఊహించుకోకు. అయినా అదేమిటో చెప్పు. నాకోసం కాదు, నువ్వు టెన్షన్‌లోంచి బయటపడతావని ఏ క్షణంలోనైనా పేలిపోయేలా ఉన్నావ్!... వింటున్నాను, చెప్పు.'

'అదృష్టమనేది ఎవరినీ శాశ్వతంగా వరించదు లాలాజీ.' ఎ రంజన్‌బాబు వేదాంతధోరణిలో అన్నాడు. 'వరించేలా ఉంటే దానిని అదృష్టమని అనరు. నీ పతనయాత్రకు కారణమేమిటో తెలుసుకోవాలనుకుంటున్నావు, అంతేనా? సరే చెబుతా విను. కిందటివారం దక్షిణఢిల్లీలో నువ్వు చేసిన ప్రసంగం నీకు గుర్తుండే ఉంటుంది...'

'ఏ ప్రసంగం? నేను చాలా ప్రసంగాలు చేస్తూ ఉంటాను...'ఎ

'నీతో అక్కడే వచ్చింది చిక్కు లాలాజీ,' రంజన్‌బాబు అన్నాడు. 'ఇక ఇప్పుడు తెలుసు కుంటావులే. తక్కువ మాట్లాడు, ఎక్కువ పనిచేయి అని పైవాళ్ళు చెప్పిన తర్వాత కూడా నువ్వు అదేపనిగా మాట్లాడుతూనే ఉంటావు కదా!'

'నేను దేనిగురించి మాట్లాడాను?'

'నాకు తెలుసు, తెలుసు. నీ ఉపన్యాసాల్లోనేమో తక్కువ మాట్లాడి ఎక్కువ పనిచేయండని జనానికి ఉద్బోధిస్తూ ఉంటావు. ఈ క్రమంలో నీ మాటల వరదే ఊళ్ళను ముంచెత్తేస్తోంది. నువ్వేమీ అనుకోనంటే చెబుతాను, ఇది పైవాళ్ళ దృష్టికి కూడా వెళ్ళింది. ఒకసారి కాదు, చాలాసార్లు...'

'సందేహమేముంది, నువ్వే ఆ పుణ్యం కట్టుకుని ఉంటావ్!' గోపీకిషన్ అక్కసుగా అన్నాడు.

'సరే, నేను నిర్దోషినని చెప్పడం లేదనుకో. కానీ అది వేరే సంగతి. నేను ప్రత్యేకించి

ప్రస్తావిస్తున్నది నువ్వు కమ్యూనిస్టు నాయకులతో కలిసి ఒకే వేదికనుంచి చేసిన ఉపన్యాసం గురించి...'

'అయితే ఏమిటట?' అవతలి మనిషి మాట్లాడుతున్నప్పుడే అసలు విషయం గ్రహించిన గోపీకిషన్ అమాయకత్వం నటిస్తూ నిలదీశాడు.

'ఏమీలేదు,' రంజన్‌బాబు మర్మగర్భంగా అన్నాడు. 'నువ్వేమీ లేదనుకుంటే ఏమీలేదు! ఇన్నేళ్ళుగా ఓ పక్క నువ్వు కమ్యూనిస్టులతో చెట్టపట్టాలు వేసుకు తిరుగుతూ నన్నేమో మితవాద అభివృద్ధినిరోధకశక్తిగా చిత్రిస్తూ వచ్చావు. ఇప్పుడు నువ్వూ నాతోపాటు చేరిపోయావ్!' విపరీతమైన ద్వేషభావంతో నవ్వుతూ అన్నాడు.

'ఇన్ని రోజులుగా ఈ దుష్ప్రచారం సాగిస్తున్నది నువ్వన్నమాట, అవునా?' గోపీకిషన్ అన్నాడు. 'అదిసరేకాని మిత్రమా, నువ్వు ఢిల్లీకి దూరంగా ఎన్ని రోజులున్నావో తెలుసుకో వచ్చా?'

'ఒకే ఒకసారి. కొద్దిరోజుల క్రితం అఫ్రోజాబాద్ వెళ్ళొచ్చాను. అయితే ఏమిటిట?'ఎ

'హహ్హహ్హ!' గోపీకిషన్ వికటాట్టహాసం చేశాడు. 'ఏం లేదు, ఏం లేదు. మైడియర్ వన్నెకాడా, ఈ గోపీకిషన్ నిన్నెన్నోసార్లు చావుదెబ్బ తీశాడు. గణాంకవివరాలే విప్పవలసి వస్తే లెక్కలే నన్నిసార్లు...'

'అవునవును. నువ్వాడిన రకరకాల బూకరింపులూ నాకు బాగా తెలుసులే.' రంజన్‌బాబు అన్నాడు, ఒకింత జావకారిపోతూనే, 'చూద్దాంగా!'

'తప్పకుండా, తప్పకుండా.' గోపీకిషన్ పాటపాడుతున్నట్టు అన్నాడు. 'తప్పకుండా చూద్దాం. నిజానికి నే నిప్పటికే కొన్ని వ్యవహారాలు చూశాను కూడా, నీ గురించి, నా గురించీ. అర్థ మైందనుకుంటాను...'ఎ అంతకుమించి విస్తరించకుండా శత్రువును ఒకింత కలవరపాటుకు లోనుచేస్తూ ధీమా ఉట్టిపడేలా అతడితో కరచాలనం చేశాడు. కొన్ని క్షణాలలోనే తన మామూలు ధోరణికి వచ్చేశాడు.

కారు వేగంగా పరుగుతీస్తుండగా, ఇంతకుముందు అతడు కనబరచిన ధీమా మెల్లమెల్లగా ఆవిరైపోయింది. ఏదో కీడు స్ఫురించేలా రంజన్‌బాబుతో తనలా అన్నాడేకానీ, వాస్తవంగా ఏం చూశాడో అతడికే అంత కచ్చితంగా తెలియదు. నిజమే, ప్రధానమంత్రి కమ్యూనిస్టులను విమర్శించినట్టు తెలిసిన తక్షణమే అతడుకూడా వాళ్ళపై మహోధృతంగా దాడిచేశాడు. ఇంకా చెప్పాలంటే, కమ్యూనిస్టులు గతంలో చేసిన, ఇప్పుడు చేస్తున్న, ఇకముందు చేయబోతున్న తప్పులతో సహా ఎత్తిచూపించి ఢిల్లీలో మరెవరూ చేయనంతగా చీల్చిచెండాడాడు. ఈ విషయంలో చొరవ చూపించిన ప్రప్రథమ ఢిల్లీ నాయకుడు అతడే అవడం దానికదే ఏమంత తక్కువ భుజకీర్తి కాదు. అయితే కొద్దిరోజుల తర్వాత ప్రధానమంత్రి కమ్యూనిస్టుల గురించి మంద్రస్థాయిలో ఏదో మాట్లాడి తన తుపాకులు జనసంఘ్ మీదికి గురిపెట్టేసరికి, జరగని సమావేశంలో తను ప్రసంగించని ఓ ప్రసంగాన్ని ఓ వార్తాసంస్థద్వారా గోపీకిషన్ హడావుడిగా ప్రచురింపజేశాడు.

ఆ ప్రసంగం జనసంఘ్‌ను ముక్కముక్కలుగా నరకడానికి ఉద్దేశించినదని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. కమ్యూనిస్టు పార్టీ మంచిదా, చెడ్డదా లేక మధ్యస్థమా అన్న దిక్కుమాలిన ఆలోచనలతో అతడూ బుర్ర చెడగొట్టుకున్న పాపాన ఎన్నడూ పోలేదు. అలాగే జనసంఘ్ నలుపా తెలుపా లేక ఏడురంగుల హరివిల్లా అన్నదీ ఎన్నడూ పట్టించుకోలేదు. అతడికి కావలసిందల్లా ఒక్కటే. ప్రధానమంత్రి పంచలో తను ఉండేలా చూసుకోవడం; రంజన్‌బాబూ, ఆ బాపతు వాళ్ళూ అధిష్ఠానవర్గీయుల ముందు తనను అప్రతిష్ఠపాలు చేయడానికి సక్రమ, అక్రమమార్గాల్లో సాగించే నిరంతర ప్రయత్నాలను చిత్తుచేయడం. ఈ లక్ష్యసాధనకోసమే అతడు రకరకాల ప్రకటనలు గుప్పిస్తూ రకరకాల ప్రసంగాలూ చేస్తూ ఉంటాడు. అవి తరచు అతణ్ణి ఓ విదూషకుడిగా చూపిస్తూ ఉంటాయి. అయినా, ఎప్పుడో ఒక రాజకీయవాదిగా ముదిరిపోయిన గోపీకిషన్ నలుగురూ తన గురించి ఏమనుకుంటున్నా అంతగా పట్టించుకోడం మానేశాడు. నిజం చెప్పాలంటే, కనీసం కొన్ని సందర్భాలలోనైనా రాజకీయాల్లో జోకర్‌లా కనిపించినందువల్ల కొన్ని కొన్ని ప్రత్యేక ప్రయోజనాలు ఉంటాయనీ అతడు గ్రహించాడు మిగిలినవాళ్ళలా కాకుండా, రాజుగారి సమక్షంలో హాస్యగాడు ఎంత మూర్ఖంగా మాట్లాడినా చెల్లిపోతూ ఉంటుంది. కనుక ఎంత అజ్ఞానిలా కనిపిస్తే అంత మంచిదన్న నిర్ణయానికి వచ్చి అప్పటినుంచి నిశ్చింతగా గడిపేస్తున్నాడు.

రంజన్‌బాబు చౌదరికి వ్యతిరేకంగా మహేంద్రనాథ్ తరఫున పనిచేస్తున్నాడని గోపీకిషన్‌కు తెలుసు. ఈ మధ్య రంజన్ అఫ్రోజాబాద్ సందర్శించి బ్రీఫ్‌కేసుతో తిరిగొచ్చిన సంగతి అతనికి తెలుసు. ఆ బ్రీఫ్‌కేసు వచ్చింది చౌదరికి దగ్గరినుంచి; అయినా రంజన్ అతడికి వ్యతిరేకంగా పనిచేస్తున్నాడు. ఇందిరాగాంధీ ఎదురుగా రంజన్ ఎన్నడూ నోరు విప్పడనీ గోపీకిషన్‌కు తెలుసు. ఇతరత్రా అయితే ఇండియాగేటంత వెడల్పుగా నోరు తెరుస్తూ ఉంటాడు. అతడి మాట అన్ని వైపులా వ్యాపించి ముఖ్యమంత్రుల్ని ప్రతిష్ఠించేవాడుగా, పడగొట్టేవాడుగా అతడికి ఘనకీర్తిని తెచ్చిపెట్టింది.

గోపీకిషన్, రంజన్‌బాబు లాబీయింగ్ కళలో సమఉజ్జీలు. ఇద్దరూ కపటవేషగాళ్ళే; అయినా ఇద్దరికీ రాష్ట్రాల్లో పాడియావులున్నాయి.

అయితే పులిమీద పుట్రలా వరదలొచ్చిపడడం, అందుకు అత్యవసరచర్యలు తీసుకోవలసి రావడమే ఈ క్షణాన గోపీకిషన్‌కు మాచెడ్డ చికాకు కలిగిస్తోంది. అతడి బాధంతా బాధిత ప్రజల గురించి కాదు, తన గురించి. ఓ పక్క ఢిల్లీకి దూరంగా ఉండి, వరదబాధితులకు సహాయ సహకారాలు అందిస్తూ, మరోపక్క ఢిల్లీలోనే ఉండి విరోధుల విషప్రచారాన్ని తిప్పికొట్టడం ఒక్క మనిషికెలా సాధ్యమౌతుంది? ఎక్కడైనా ఏదైనా ఉపద్రవం ముంచుకొస్తే చాలు, అధికార పక్షంలో ఉండి, అధికారంలో ఉన్న వ్యక్తికి వ్యతిరేకంగా పనిచేసే లాబీ ఒక్కసారిగా చురుకుతనం పుంజుకుంటుంది. అంచేత, వరదబాధితులను ఆదుకోవడం కోసం తాను ఢిల్లీ విడిచివెడితే భారీమూల్యం చెల్లించుకోవలసి వస్తుందన్న నిర్ధారణకొచ్చాడు గోపీకిషన్. శత్రువుల ఆట కట్టించడానికి తనేమైనా చేయకపోయాడా, వాస్తవానికి తనే అందరినీ మించిన వరదబాధితుడైపోతాడు. అంచేత ఏమిటి చేయడం? ఈ సందిగ్ధస్థితిపై కాస్సేపు ఆలోచన సాగించి చివరకు ఓ నిర్ణయానికి వచ్చాడు. వరదబాధితులకు సహాయం చేయడానికి పరుగులుతీయడం కన్నా,

శత్రువు దాడినుంచి తన పదవిని కాపాడుకోవడమే మరింత అత్యవసరచర్య అనుకున్నాడు. కాస్త ఆలస్యమైనా వరదబాధితులను తను ఎటూ ఆదుకుంటాడు. బాధితులు ఎలాగూ బాధితులే; కొద్దిరోజులు ఆలస్యమైనంత మాత్రాన వాళ్ళ దుర్భరస్థితిలో చెప్పుకోదగిన మార్పేమీ వచ్చిపడదు. కనుక మొట్టమొదట తను ఢిల్లీ వ్యవహారాలు చక్కదిద్దుకోవడమే మంచిది. వరదబాధితులకు తాను ఎటువంటి సేవలు చేయకపోయినా సరే, ఘనమైన సేవలు అందించినట్టుగా చూపించిన కథనాలతో, ముందస్తు సాక్ష్యాలతో పైవారి మనసుకెక్కేలా చూసుకుంటే చాలు. ఈ వైపు కనక పరిస్థితిని పదిలం చేసుకున్నామా, ఆ తర్వాత వరదబాధితులకు సహాయచర్యలపై దృష్టి కేంద్రీకరించవచ్చు ననుకున్నాడు. తదనుగుణంగానే కార్యనిర్వహణకు పూనుకున్నాడు.

పరిస్థితిని ఎదుర్కోడంలో తను కనబరుస్తున్న నైపుణ్యానికి అతడెంతో సంతోషించాడు. కనీసం ఇంతవరకు. అయినాసరే ఇటువంటి విషయాల్లో ఎక్కడో అక్కడ ఏదో ఒక లోపం తలెత్తుతూనే ఉంటుందని తెలియనివాడేమీ కాదతడు. ఉన్నట్టుండి తాడే పాము కావచ్చు. ప్రమాదం లేదనుకునే పచ్చిగడ్డిలోంచి పసరికపాములు పుట్టుకురావచ్చు. ఈ ఊహలు అతణ్ణి ఒకింత అస్థిమితానికి లోనుచేశాయి; అయినా సామెత చెప్పినట్టు రోకట్లో తలదూర్చిన తర్వాత రోకటిపోటును ఎలా తప్పించుకుంటాం?... ఈ ఆలోచనలను విదిలించుకుని అతడు స్థైర్యాన్ని నిలుపుకునే ప్రయత్నం చేస్తుండగానే కారు ప్రధానమంత్రి నివాసంముందు ఆగింది. యధాప్రకారం అందులోంచి ఒక్క దూకుదూకి, మిన్ను విరిగి మీదపడినా లక్ష్యపెట్టని నిత్యోల్లాసిగా ముసుగు ధరించాడు. సెంట్రీలు, గార్డులే మొదట అతడికి అభివాదంచేశారో, లేక అతడే వాళ్ళకు అభివాదంచేశాడో తేల్చిచెప్పడం కష్టం. అది ఏకకాలంలో జరిగిన ప్రక్రియ. అయితే వాళ్ళ పరస్పర సుహృద్భావాన్ని బట్టి గోపీకిషన్ ప్రధానమంత్రి నివాసానికి నిత్యసందర్శకుడనీ కనీసం రిసెప్షన్ రూం వరకైనా నిరాఘాటంగా వెళ్ళగలిగినవాడనీ అర్థమవుతుంది.

సరిగ్గా అప్పుడే, ఓ ఇరవైమంది రైతులబృందం ప్రధానమంత్రిని దర్శించుకుని ఇవతలకు వస్తోంది. వాళ్ళ ముఖాలు సంతోషంతో వెలిగిపోతున్నాయి. వెంటనే గోపీకిషన్‌ను గుర్తుపట్టి నమస్కరించారు. గోపీకిషన్ వాళ్ళకో నవ్వు పారేసి, అతి ముఖ్యమైన విషయం మాట్లాడుతున్న అభిప్రాయం కలిగిస్తూ అన్నాడు, 'ఆమెను కలిశారా? మంచిపని చేశారు. ఇప్పుడే నే నామెను కలవబోతున్నాను. ఉదయం ఇంటర్వ్యూలు అయిన వెంటనే ఆమె నాకు కబురుచేస్తారు. అప్పుడైతే అన్ని విషయాలు వివరంగా చర్చించడానికి వీలవుతుంది...' ఆ మాటలకు తృప్తిపడిన రైతులు రోడ్డువైపు అడుగులేశారు.

గోపీకిషన్ ఆ పరిసరాల్లో కొట్టొచ్చినట్టు కనపడేవాడిలానూ, పని హడావుడిలో ఉన్నవాడిలానూ కనిపించడానికి ప్రయత్నిస్తూ, ప్రతి ఒకరినీ పలకరించాడు. అంతలో యాభైగజాల దూరంలో ప్రధానమంత్రి వ్యక్తిగతసహాయకులలో ఒకడు అతనికి కనిపించాడు. తనంతవరకు మాట్లాడుతున్న వ్యక్తితో అర్థంతరంగా మాటలు ఆపేసి గోపీకిషన్ అక్షరాలా పరుగుపరుగున ప్రధానమంత్రి అసిస్టెంట్‌ను సమీపించి అతడికి అభివాదంచేసి చేయి పట్టుకుని ఊపివేస్తూ, గాఢాలింగనం చేసుకుని ఎంతో అట్టహాసంగా తన స్నేహభావాన్ని ప్రదర్శించుకుని దాని ప్రభావం ఎలా ఉంటుందో చూడడానికా అన్నట్టు వెనకడుగు వేసి నిలబడిపోయాడు.

ఇంతలో రైతులతో కూడిన మరో బృందం రిసెప్షన్ దగ్గరకు వచ్చింది. వాళ్ళుకూడా గోపీకిషన్‌ను గుర్తించి నమస్కరించారు. మళ్ళీ ముఖంలోకి గాంభీర్యాన్ని తెచ్చుకుని గోపీకిషన్ వాళ్ళతో అన్నాడు, 'ప్రధానమంత్రిని కలుసుకోవడానికి వచ్చరన్నమాట? మంచిపని చేశారు. నే నిప్పుడే ఆమెను కలుసుకున్నాను. ఆమె చాలా ముందుగానే నాకు కబురు పెడుతూ ఉంటారు. మిగతా జనం వచ్చేలోపల ముఖ్యమైన అంశాలను ఆమె దృష్టికి తీసుకుని వెళ్ళడానికి అందు వల్ల వీలవుతుంది...' అలా ఈ బృందానికి కూడా నమ్మబలికిన తర్వాత అనేక గ్రామాల్లోని వరద బాధితులకు తను ఇరవై నాలుగు గంటలూ ఎలా సేవలు అందిస్తున్నాడో వారికి చెప్పి 'అతి త్వరలోనే' వాళ్ళ గ్రామాన్ని కూడా సందర్శిస్తానని హామీ ఇచ్చాడు ప్రధానమంత్రి సమక్షానికి వెళ్ళినప్పుడు ఆ రైతుబృందం బుర్రల్లో అతడిచ్చిన మోసపు హామీలే ప్రముఖంగా గుర్తుంటాయని గోపీకిషన్ ఆశ. ఇంతటి మానవ ప్రయత్నం చేశాక మిగిలిన భారం ఆ భగ వంతుడి మీద వేయడం తప్ప ఎవరైనా చేయగలిగింది ఏముంటుంది? ఆయనకీ చేయడానికి కొంత పని అప్పజెప్పాలి కదా అనుకున్నాడు గోపీకిషన్.

ప్రధానమంత్రిని కలుసుకునే ఉద్దేశం తనకు అణుమాత్రం లేకపోయినా గోపీకిషన్ ఆమె నివాసంలో దాదాపు మూడుగంటలపాటు వేళ్ళాడాడు. తను కోరుకున్నంతకాలం పదవిలో కొనసాగడానికి అదొక్కటే మార్గం. అప్పుడే వచ్చిన సందర్శకులకు తనిప్పుడిప్పుడే ప్రధానమంత్రిని కలిసొచ్చానని చెబుతాడు. ఎవరైనా ఆమెను కలుసుకుని ఇవతలకు వస్తూ కనిపిస్తే ఇప్పుడే తనామెను కలుసుకోబోతున్నట్లు చెబుతాడు. రెండువిధాలా అది అమోఘమైన ఎత్తుగడ. అయితే అతడు వ్యర్థంగా అక్కడ వేళ్ళాడతాడనుకుంటే పొరపాటు. ప్రధానమంత్రి నివాస ప్రాంగణం లోని తనకు వ్యతిరేకంగా దుష్ప్రచారానికి సమకట్టిన (పచ్చికలో) విషనాగులేమైనా కనిపిస్తాయేమోనని అతడు గాలిస్తూ ఉన్నాడు. అటువంటి అనుమానాస్పదుడొకణ్ణి వెతికి పట్టుకుని డబాయింపు, ఎద్దేవా కలగలసిన ధోరణిలో చిత్తుచిత్తు చేశాడు. ఆ మనిషి తోక ముడిచి వెళ్ళి పోయాడు. గోపీకిషన్ తన నిఘా కొనసాగించాడు.

అయితే అతడి కంటపడని పాములూ అక్కడ ఉన్నాయి. గోపీకిషన్ వేయి కళ్ళతో నిఘా పెట్టినా సరే అవి ప్రధానమంత్రి నివాసంలో ఎవరికిపడితే వారికి అతడికి వ్యతిరేకంగా నూరి పోశాయి. వరదబాధితులకు అతడు వీసమెత్తు సహాయం కూడా చేయలేదు. ఎప్పుడూ ఢిల్లీలోనే ఉండి సొంత పనులు చక్కదిద్దుకుంటూ ఉంటాడు. రోజూ తన కార్యాలయానికి కూడా వెళ్ళడు. దాదాపు నిరక్షరకుక్షి. ఆపాదమస్తకం అవినీతిపరుడు. లక్షలు సంపాదించాడు. ఢిల్లీలో ప్రతి చోటా తన మనుషుల్ని చొప్పించాడు. నల్ల బజారు విక్రయాలన్నింటిలోనూ అతడికి వాటా ఉంది. ఆ బాపతు వ్యాపారం నిరాఘాటంగా వర్థిల్లడం అతడి చలవే. గోధుమ, బియ్యం, వస్త్రాలు, ఎరువులు... ఒకటేమిటి, దిక్కుమాలిన అన్ని వ్యాపారాలూ గోపీకిషన్‌వే. కమ్యూనిస్టులతో కూడా అదేపనిగా పూసుకు తిరుగుతూ ఉంటాడు. అతడు రాజకీయంగా గుండెలమీద కుంపటి. అతడెటువంటి బాధ్యతాయుతపదవిలో ఉన్నా ప్రమాదమే. అదీకాక ఎంతో కాలంగా అధికారంలో ఉంటూనే ఉన్నాడు. ఇకనైనా అతణ్ణి తప్పించి ఓ యువకుణ్ణి, మరింత చురుగ్గానూ, విధేయం గానూ పనిచేసేవాణ్ణి తీసుకురావడం మంచిది.

దాదాపు పదకొండు కావస్తోంది. ప్రధానమంత్రి తన కార్యాలయానికి బయలుదేరతారు కనుక ఇప్పుడిక అతడు తన నిఘా సడలించుకోవచ్చు. గోపీకిషన్ ప్రధానమంత్రి కార్యాలయాన్ని విడిచిపెట్టి తన కార్యాలయానికి చేరుకున్నాడు. అక్కడ కొందరు అనుయాయులు అతడికోసం ఎదురు చూస్తూ కనిపించారు. 'మళ్ళీ ఏం కొంపమునిగింది?' అంటూ ఒక్క మొరుగు మొరిగాడు. 'ఓరి దేవుడా! కొద్ది నిమిషాలైనా ప్రశాంతంగా గడపడానికి లేదా? రోజులో ఇరవై నాలుగు గంటలూ నరాలు తెంచుకోవలసిందేనా? సరే, సమస్యేమిటో చెప్పండి.

వందిమాగధుల్లో ఒకడు ముందుకొచ్చి అన్నాడు. 'ఏం లేదు లాలాజీ. నిన్న రాత్రి బెంగుళూరులో ప్రముఖ వ్యక్తి ఎవరో చనిపోయారని పత్రికల్లో వచ్చింది. మీరు సంతాప సందేశం పంపుతారేమోనని...'

'దానికేం... దానికేం' పొంగిపోతూ అన్నాడు గోపీకిషన్. ఎక్కడో బెంగుళూరులో ఎవరో చనిపోయారు. అంతేకదా అనుకుని తేలికపడ్డాడు. 'ప్రగాఢమైన సానుభూతిని తెలియజేస్తూ తప్పకుండా సందేశం జారీ చేయిస్తాను. రాసుకోండి. ఈ అకాలమృతికి నేను దిగ్భ్రాంతిచెందానని రాయండి. దేశానికి ఆయన చేసిన ఘనమైన సేవలను ఏకరవుపెట్టండి. ఆయన జైలుకు వెళ్ళిన విషయం ప్రస్తావించండి. నేనూ, ఆయనా ఒకే జైల్లో ఉన్నట్టు కూడా మీరు రాసుకోవచ్చు. ఏ జైల్లో ఉన్నామో రాయకండి. ఆయన మరణించారన్న వార్త నేను నమ్మలేకపోతున్నానని రాయండి. ఇప్పటికీ ఆ అందమైన రూపం నా కళ్ళముందు మెదలుతూనే ఉందనీ, ఎంతో పొడుగ్గా వద్దు వద్దు, పొడుగనీ, పొట్టి అనీ రాయొద్దు... చక్కటి మీసకట్టుతో ఎందుకు లెండి, మీసం తీసేయండి, అది పొరపాటుగా మారే ప్రమాదం ఉంది... ఆయన గంభీర కంఠధ్వని, ఆయన నడకలో ఉట్టిపడే హుందాతనం, ఆయన పాండిత్యం వద్దు వద్దు పాండిత్యం గురించి రాయకండి. దానికిబదులు విజ్ఞత అనండి. ప్రమాదం లేనిమాట... ప్రధానమంత్రిపట్ల ఆయన విధేయత వగైరా వగైరా. ఆయన మరణంతో యావద్దేశమూ, ముఖ్యంగా మద్రాసు రాష్ట్రమూ ఒక గొప్ప నాయకుణ్ణి కోల్పోయామని రాయండి..'

'ఇంతకీ అది మద్రాసు రాష్ట్రమేనంటారా లాలాజీ? చనిపోయిన వ్యక్తి బెంగుళూరుకు చెందినవాడు.' అక్కడ గుమిగూడిన బాకకాలలో ఒకడన్నాడు.

'ఎందుక్కాదు, దక్షిణాదిన ఉన్న వాళ్ళందరూ మద్రాసీ అవుతారా కాదా?' గోపీకిషన్ అన్నాడు. 'అయినా చచ్చిపోయిన వాడికోసం ఊరికే టైమెందుకు వేస్ట్ చేస్తారు? మామూలుగా రాసే పొగడ్తలన్నీ రాయండి చచ్చిపోయినవాణ్ణి ఎంత పొగిడినా ఎవరూ ఏమీ అనుకోరు...'

వాళ్ళు సెలవు తిసుకుని వెళ్ళిపోతుండగా గోపీకిషన్ వాళ్ళలో ఒకడిని ప్రక్కకు తీసుకుని వెళ్ళి అడిగాడు. 'అది సరే, చనిపోయిన నాయకుడి పేరేమిటి ?'

ఆ మనిషి గొంతు సవరించుకుని వినయంగా అన్నాడు, 'నాయకుడు కాదు సార్, నాయకురాలు. పేరు రంగనాయకమ్మ...' తను చేసిన దారుణమైన తప్పును గ్రహించుకోగానే గోపీకిషన్ జారిపోయిన దవడలు చలించిపోయాయి.

అతడు గొంతెత్తి ఏదో అనే లోపలే అవతలి మనిషి అన్నాడు. 'కంగారు పడకండి లాలాజీ, మీ సంతాప సందేశాన్ని స్త్రీ లింగంలోకి మార్చేస్తాం. దానికి తగ్గట్టు వర్ణనలు కూడా మారుస్తాం. సమస్య లేదు...'

దివంగత నేత వ్యవహారాన్ని అలా పరిష్కరించిన తర్వాత గోపీకిషన్ వరదసమస్యకు వచ్చాడు. ఓ అరగంట సేపు గుక్కతిప్పుకోకుండా తన అనుయాయులకు ఉద్బోధ చేశాడు. మేఘగర్జనలను తలపింపజేసే ఆ ఉపన్యాసం ముగుస్తున్న ఘట్టంలో ఇంతకు ముందు తాము చేసిన పనికి ఇస్తామని చెప్పిన మొత్తం ఇంతవరకూ ఇవ్వలేదని ఓ అనుయాయి ఎంతో మర్యాదగా గోపీకిషన్‌కు గుర్తు చేశాడు. మిగతా ధరలు పెరగచ్చు. తగ్గచ్చు. కానీ 'ఖర్చుల' పేరుతో చలామణి అయ్యే రాజకీయ ధరలు మాత్రం ఎప్పటికీ తగ్గడమంటూ ఉండదని గోపీకిషన్ చిరచిరలాడాడు. కట్టుకథలు ప్రచారం చేయడం అంత తేలికకాదు. అంత చవకా కాదన్నాడు ఓ అనుయాయి. అవి కేవలం కట్టుకథలైనందువల్ల కాదు, అవతలి గ్రూపు వాళ్ళు అంతే భారీగా ఖర్చు పెట్టి నిలబెట్టిన కట్టుకథల వంతెనను కుప్పకూల్చవలసింది వాటితోనే. 'కావాలంటే ఈ వరద సహాయక చర్యల్నే తీసుకోండి లాలాజీ' అంటూ అతడు విశదీకరిస్తూ పోయాడు. 'నేను చెబుతున్నా చూడండి, ఆ రంజన్‌బాబు మనుషుల ఆట కట్టించడం కష్టం. ఈ రోజు పొద్దుటేమైందనుకున్నారు? ఓ హోటల్‌లో కూర్చుని వరద బాధితులకు మీరెలాంటి సేవలు చేస్తున్నారో, చిన్నదైనా మంచి పలుకుబడి ఉన్న గ్రూపు వాళ్ళకు ఊదరగొడుతున్నాను. అంతలో ఆ గూండాగాడు... సర్దూసింగ్ అందరినీ తోసుకుంటూ అక్కడికొచ్చి నే చెబుతున్నవన్నీ అబద్ధాలంటూ కేకలు లంకించుకున్నాడు. వరద బాధిత గ్రామాలకు స్వయంగా వెళ్ళి చూసొచ్చానని, లాలా గోపీకిషన్ ఊసు తన కెక్కడా వినిపించలేదని తెగేసి చెప్పాడు. లాలాజీ ఎప్పుడూ ప్రధాని ఇంటి చుట్టూనే వేళ్ళాడుతూ ఉంటాడని, తన గొప్ప గొప్ప సేవల గురించి తప్పుడు వార్తలు ప్రచారం చేయించుకుంటూ ఉంటాడని అన్నాడు. 'సరిగ్గా ఈ నిమిషంలోనే అతగాడు దర్యాగంజ్‌లో ఉండే, ఆ సిగ్గులేని లంజ మున్నీబాయ్ పక్కలో కులుకుతూ ఉంటాడని కూడా అన్నాడు. దాని ద్వారానే అతడు ముడుపులు అందుకుంటూ ఉంటాడని, అందులో సగం వాటా దానికే పోతుందనీ, అది...'

'చాల్లే ఆపు!' గోపీకిషన్ ఒక్క కేక పెట్టాడు. కోపంతో అతడి ముఖం పాలిపోయింది. 'అప్పటి కప్పుడే నువ్వు వాడి మెడ విరిచిపారేయాల్సింది! వట్టి అబద్ధాలకోరు!

'నిజమే ననుకోండి, కన్నాట్‌ప్లేస్‌లో అతణ్ణి మించిన అబద్ధాలకోరే లేడు', అవతలి మనిషి వెంటనే ఒప్పుకున్నాడు. 'అయినా నేనేం చేసేది చెప్పండి? అబద్ధాలమీదా, భ్రమల మీదా కాకపోతే మనం వేటిమీద బతుకుతున్నాం? మీకు చెప్పేంతవాడినా లాలాజీ? అబద్ధం మీద నిజం ఎప్పుడు గెలిచింది చెప్పండి? పోనీ మన ఢిల్లీలో? అబద్ధానికి అబద్ధమే విరుగుడు. ఆ అబద్ధాల్ని మేనేజ్ చేయడం డబ్బుతో ముడిపడిన వ్యవహారం.'

డబ్బు, డబ్బు, డబ్బు! గోపీకిషన్ గొంతు చించుకున్నాడు. 'ప్రతిసారీ అదే పాట! ఇంతకీ ఆ సర్దూసింగ్‌గాడి విషయంలో ఏమైనా చేశావా?'

'చేశాను. వాణ్ణెలాగో దారికి తెచ్చాను. రెండువేలు కేష్, రేపు పొద్దున, హోటల్‌లో, లేకపోతేనా అంటూ బెదిరించాడు...'

'ఇక నోరు మూసుకో!' గోపీకిషన్ తుంచుతూ అన్నాడు. 'నీ పనికిమాలిన బెదిరింపులూ నువ్వూ!' అవతలి తలుపు మూసేసి పదివేలరూపాయలు తీసి తనకెంతో నమ్మకస్తులైన అనుయాయులకు పంచిపెట్టాడు. తక్షణమే ద్విగుణీకృతమై పొంగి పొరలుతున్న విధేయతతో వాళ్ళు అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

గోపీకిషన్ కనుసన్నలలో పనిచేసే బలగాలలో ఇదొక చిన్న దళం మాత్రమే. ఈ ఆటలో డబ్బు మంచినీళ్ళలా ప్రవహిస్తూ ఉండవలసిందే. అయితే, తన లాబీయింగ్ సేవలపై ఆధార పడే ముఖ్యమంత్రి చౌదరి లాంటి పాడియావులున్నంతవరకూ ఆ సేవలు ఎలాగూ అక్షయంగా ఉంటూనే ఉంటాయి. డబ్బు గురించి అతడికి అంతగా చింతపడవలసిన పనిలేదు. అతడి సొంత డబ్బు మాత్రం భద్రంగానే ఉంటుంది ఇతరుల డబ్బుతో తన లాబీకి పోషణ జరిగి పోతూ ఉంటుంది.

తేలికపడినవాడిలా నిట్టూర్పుపుచ్చుతూ గోపీకిషన్ ఈజీ చైర్‌లో కూలబడ్డాడు. విపరీతమైన అలసటతో, ఏం బతుకిది, కుక్కబతుకు అంటూ గొణుక్కున్నాడు. కొన్ని దశాబ్దాల క్రితం తన కిలాంటి 'వ్యాపారా'న్ని అంటగట్టిన తన తండ్రి ఆ క్షణంలో ఎదురుపడితే పీకనులిమి చంపేసి ఉండేవాడు. అయితే తండ్రి కొన్నేళ్ళ క్రితమే సురక్షితంగా చనిపోయాడు. కనుక గోపీకిషన్‌లో హఠాత్తుగా మొలకెత్తిన పితృహత్యావాంఛ పగటికలగానే మిగిలిపోయింది.

సరిగ్గా అప్పుడే గోపీకిషన్ అనుచరులు వెడుతూ వెడుతూ కొంత తెరిచి ఉంచిన ముందు తలుపు సందులోంచి ఓ తల ఎంతో హెచ్చరికగా తొంగి చూస్తూ కనిపించింది. ఆ తలకాయకు తగిలించి ఉన్న శరీరం సంశయిస్తూనే, భయం భయంగానే అయినా దృఢనిశ్చయంతో మెల్లగా ముందుకు అడుగులేసింది. నగరానికి పనిమీద వచ్చే గ్రామీణ భారతీయుడిలోని విలక్షణతరహా, ఒక పరిశోధకుడిలా సూక్ష్మదర్శినితో పరిశీలించదగినదిగా ఉంటుంది. పైకి కనిపించే అమాయకత్వం వెనుక, నిరాడంబరసరళి వెనుక మంచి గడుసుతనమూ ఉంటుంది. ఆ గడుసుతనం అతని అమాయకత్వాన్నీ, నిరాడంబరాన్నీ పెంచి చూపిస్తూ, హాస్యాస్పదమైన ఆహంతో ఎగిరిపడుతూ ఆదమరుపుగా ఉండే నగరజీవిలో గ్రామీణుడి గురించి ఒక తప్పుడు ఊహ కలిగిస్తూ ఉంటుంది గ్రామీణుడికి ఆ ముసుగు ఇంచుమించు అన్ని వేళలా అనుకూలిస్తూనే ఉంటుంది. అయితే చాలా అరుదైన సందర్భాలలో అతడా ముసుగు తొలగించుకున్నప్పుడు అతడిలోని ఆగ్రహం, భీకరత్వం నగరవాసిని పూర్తిగా ముంచెత్తివేస్తాయి. తొంగిచూస్తున్న ఆ తలకాయ, హెచ్చరికగా ముందుకు అడుగు వేస్తున్న ఆ శరీరమూ పొద్దుటే తన ఇంటి వద్ద తనకెదురైన రైతువేనని గోపీకిషన్ గుర్తుపట్టిన తక్షణమే అటువంటి అరుదైన ఓ సందర్భం హఠాత్తుగా అక్కడ ఉత్పన్నమైంది.

సరే, దేనికైనా హద్దుంటుంది, ఇక సహించకూడదనుకున్నాడు. అయితే అవతలి మనిషి కూడా అదే నిర్ణయానికి వచ్చినట్లు తదుపరి పరిణామం వల్ల తేలింది. గొంతు తారస్థాయికి పెంచి పెడబొబ్బలు పెడుతూ గోపీకిషన్ ఆ రైతు మీద పడి అతడి చేతిలోని పిటిషన్ గుంజుకుని

చించి పోగులు పెట్టాడు. 'చీడలా పట్టుకున్నావ్. పో ఇక్కడి నుంచి' అంటూ గర్జించాడు. 'నిన్నిక్కడి కెవరు రానిచ్చారు? ఇలా తోసుకు రావడానికి నీ కెంత ధైర్యం? ఇదేమైనా నీ తాత సొత్తా?'

'లేకపోతే నీ తాత సొత్తా?' గోపీకిషన్ విస్తుపోతూ చేష్టలు దక్కి మిన్నకుండిపోయేలా ఆ రైతు ఒక్కసారిగా ఉగ్రరూపం దాల్చి విరుచుకుపడుతూ ఎదురు కేకలు లంకించుకున్నాడు. తన పిటిషన్ ముక్కముక్కలై నేలమీద దొర్లుతున్న ఆ దృశ్యం అతడిలో విపరీతమైన ఆగ్రహాన్ని రెచ్చగొట్టింది. ఓటమి, నిస్పృహల వల్ల లోలోపల పేరుకున్న క్రోధమే అలా బద్దలైంది.

'ఎవడివయ్యా నువ్వు? నువ్వేమైనా దేవుడివా? నా కేమైనా యజమానివా? నా పిటిషన్‌ను చించిపారేయడానికి నీ కెంత ధైర్యం? నా కిప్పుడర్థమైంది. ఆ సర్జూసింగ్ చెబుతున్నదంతా నిజం! నువ్వు బొత్తిగా కనికరంలేని పశువ్వి? సిగ్గులేని లంచగొండివి! పేద వరద బాధితుల కోసం చిటికెన వేలితో కూడా ఏమీ చేయని వాడివి. ఈ పరిస్థితిలో కూడా జనానికి లంచాలు ఇచ్చి నీకు అనుకూలంగా అబద్ధాల ప్రచారం సాగించుకుంటున్నావ్? తెగబలిసిన తొత్తుకొడకా!... నేనేం చేస్తానో చూడు! ఇప్పుడే ఈ నిమిషంలోనే మాతాజీ దగ్గరికి వెళతాను. రంజన్ బాబు తన కారులో నన్నక్కడికి తీసుకు వెడతాడు... నీ గురించి నా కంతా తెలుసు... ఆ మున్నీబాయ్.....ని ఎలా నాకుతావో?'

పల్లెపట్టుల్లోని తాజాదనానికి అద్దంపడుతూ ఎప్పటికీ తరగనిదిలా కనిపించే నాటుమోటు బూతుల గనిలోంచి తీసిన పదజాలంతో మిళితమైన ఆ తిట్ల జడివాన నిరాటంకంగా కొన సాగింది. సర్జూసింగ్... రంజన్‌బాబు... మున్నీబాయి! గోపీకిషన్ హఠాత్తుగా పక్షవాతం వచ్చినవాడిలా అయిపోయాడు. బుర్రలో ఎక్స్‌ప్రెస్ రైళ్ళు పరిగెడుతున్నాయా అన్నట్టుగా అతని తల గిర్రున తిరగడం ప్రారంభించింది.

ఆ కేకలు ఆఫీసు సిబ్బందిని కల్లోలపరచగా ఇద్దరు ముగ్గురు ప్యూన్లు తమ బాస్‌ను కాపాడడానికి ముందుకొచ్చారు. రైతు మీద వాళ్ళు చెయ్యి వెయ్యబోయేసరికి అతడు రౌద్రంగా కర్ర తిప్పుతూ ఘీంకరించాడు. 'ఆవో సాలా! మీ తలకాయలు పగలగొట్టి మీ మెదళ్ళను, నా పిటిషన్‌ను విసిరికొట్టినట్టు నేలమీదికి విసిరికొడతాను...' ముగ్గురు ప్యూన్లూ తమ బాస్‌ను, ఆ రైతును , అతని చేతిలోని కర్రను అలాగే వదిలేసి పోలీసుల్ని పిలవడానికి పరుగుతీశారు. ఢిల్లీలోని నాగరిక పౌరుల్లా వాళ్ళు ప్రదర్శించగలిగిన సాహసం అంతమాత్రమే.

పోలీసులక్కడికి చేరుకునే లోపలే అక్కడి సన్నివేశం హఠాత్తుగా మారిపోయింది. సమీపంలోని వీధి చివరన నిరీక్షిస్తున్నట్టున్న ఒక కారు కొద్ది నిమిషాల్లోనే అక్కడ ప్రత్యక్షమైంది. రంజన్ బాబు, సర్జూసింగ్, మరో ఇద్దరు అందులోంచి దూకి గోపీకిషన్, రైతు ఒకరినొకరు గుర్రుగా చూసుకుంటూ నిలబడిన ఆ ప్రదేశానికి హుటాహుటిన చేరుకున్నారు. రంజన్‌బాబు తక్షణమే వ్యవహారాన్ని తన చేతుల్లోకి తీసుకుని పరిస్థితి విషమించకుండా నివారించి శాంతిస్థాపనకు యత్నించేవాడిలా ఆ రైతును అవతలకు తీసుకువెళ్ళాడు. గోపీకిషన్ పూర్తిగా కుప్పకూలి పోయాడు. ఆ రైతు పిటిషన్‌ను చించి పోగులు పెట్టిన ఆ క్షణాన్ని మళ్ళీ వెనక్కి తీసుకు

రావడానికి తన సమస్త సంపదనూ అర్పించి ఉండేవాడు. తనకు పక్షవాతం వస్తుందేమోనని అతడికి హఠాత్తుగా అనిపించింది. కానీ రాలేదు. ఆ తర్వాత తనకు గుండెపోటు వచ్చినట్టు ఊహించుకున్నాడు. కానీ అది కూడా అతణ్ణి కనికరించలేదు. చివరకు తాను స్పృహ కోల్పోయినట్టు ఊహించుకున్నాడు. అయితే అది కూడా జరగలేదు. ఇటువంటివేవీ తనను ఆదుకోకపోవడం గమనించి అతడు విషణ్ణభావంతోనే విస్మితుడయ్యాడు. ఎప్పటిలా తను సంపూర్ణ ఆరోగ్యంతో ఉండడం అతణ్ణి తీవ్ర నిరాశకు లోనుచేసింది! తన నరాల సత్తువను కసితీరా తిట్టుకున్నాడు. పెదవులు బిగించాడు, కళ్ళు మూసుకున్నాడు. సుదీర్ఘంగా నిట్టూర్పుపుచ్చుతూ ఉండిపోయాడు. ఈ దుస్థితినుంచి బయటపడే కొద్దిపాటి ఉపాయం కూడా అతడికి తోచలేదు. తన మొత్తం రాజకీయ జీవితంలో ఇంతటి దారుణ సంక్షోభాన్ని అతడెప్పుడూ ఎదుర్కోలేదు. ఆ క్షణంలోనే రంజన్‌బాబు ఆ రైతును ప్రధానమంత్రి ఎదుట నిలబెడతాడని అతడికి తెలుసు.

ఇంతలో అతడి కో శుభవార్త చేరింది. ఎదురుచూడని వార్తేమీ కాదు కానీ అతడున్న ఆ దురదృష్టకర ఘడియల్లో ఎదురు చూసిన వార్త కూడా అమితానందం కలిగిస్తుంది. ముఖ్యమంత్రి చౌదరి తన మాట నిలబెట్టుకున్నాడు. రాష్ట్ర రాజధాని నుంచి సూట్‌కేస్ వచ్చింది. ఢిల్లీలోని రాష్ట్ర అతిథి గృహం కమిషనర్ ఫోన్ చేసి రాష్ట్రానికి చెందిన అరుదైన పురాతన సామాగ్రి, కళాఖండాలు ఉన్న ఒక సూట్‌కేసును (దాని నతడు సింపుల్‌గా పెట్టె అన్నాడు, హిందీలో బక్సా) తమ ముఖ్యమంత్రి పంపించినట్టు చెప్పాడు. ఆ బక్సాను అతడి నివాసానికి చేర్చినట్టు కూడా చెప్పాడు. అటుపైన చౌదరి మంత్రులలో ఒకడైన శ్రీ శేఖర్ ఢిల్లీ వచ్చినట్టు తెలియజేసి 'మీకాయన తెలుసనుకుంటాసార్' అన్నాడా కమిషనర్. (నాకు తెలియదులే అయినా బక్సాతోపాటెవరొచ్చినా వాళ్ళనిట్టే గుర్తుపట్టగల ననుకున్నాడు గోపీకిషన్). 'ఆయన మిమ్మల్ని మర్యాదపూర్వకంగా ఓసారి కలుసుకోవాలనుకుంటున్నాడు సార్. ఢిల్లీ వచ్చినప్పుడల్లా మిమ్మల్ని కలుసుకునే వెళతానంటున్నాడు. (అబద్ధం, ఇంతవరకూ నన్నెప్పుడూ అతడు కలుసుకోలేదు. అయినా ఫర్వాలేదు, చౌదరి అతన్ని పంపించాడు. ముఖ్యమంత్రి డబ్బు తగలబెట్టి ఇక్కడ తడు జల్సా చేస్తూ ఉండి ఉంటాడు అనుకున్నాడు గోపీ కిషన్)... అత్యంత గోప్యంగా తన పడగ్గదిలోకి తీసుకెళ్ళి అందులోని పురాతన సామాగ్రిని, కళాఖండాలను వెలికి తీయడంలో గోపీకిషన్ క్షణం కూడా వృధా చేయలేదు... అందవలసిన సమయానికి అందాయి. రంజన్‌బాబు గాడి కుర్చీ కింద పేల్చడానికి పనికొచ్చే కావలసినన్ని డైనమైట్లు అందులో ఉన్నాయి.

రంజన్‌బాబు ఎత్తుగడ తెలియజేసి మిత్రుల్ని అప్రమత్తం చేయడానికి గోపీ కిషన్ ఎన్నో టెలిఫోన్ కాల్స్ చేశాడు. అయితే ఒక్కరూ స్పందించలేదు. మచ్చుకు కొన్ని స్పందనలను-లోపించిన స్పందనలనడం అంతకంటే ఉత్తమం— పరిశీలించిన మీదట ఎక్కడో పెద్ద పొరపాటు జరిగిందని అతడు నిర్ణయానికి వచ్చాడు. మామూలు రోజుల్లో అయితే కొన్ని గంటలపాటు ప్రయత్నించినా గోపీకిషన్‌ను ఫోనులో పట్టుకోవడం కష్టం. అతడి టెలిఫోన్ లైన్ ఎప్పుడూ రద్దీగానే ఉంటుంది. అతడి అనుచరులు ఫోన్‌లో కంటే స్వయంగా వెళ్ళి అతన్ని కలిసి పనులు చక్కబెట్టుకుని వస్తుంటారు. అయితే ఆ రోజున మాత్రం అతడి విధేయ అనుచరులు సైతం ఇళ్ళలో ఉండకపోవడమే మంచిదనుకున్నట్టున్నారు. తన అనుచరులతో మాట్లాడడానికి గోపీ

కిషన్ స్వయంగా ప్రయత్నించినాసరే, వాళ్ళ కుటుంబ సభ్యుల నుంచి 'బాహార్' అనే మాట ఒక్కటే విధిగా ఎదురవుతూ వచ్చింది. అది యాదృచ్ఛికం కాదని అతడికి తెలుసు. ఒక రాజకీయవాది కెరీర్‌లో రాబోతున్న కచ్చితమైన పరివర్తనకు అది సూచన. దీనిని పసిగట్టిన గోపీకిషన్ తక్షణమే కార్యాచరణలోకి లంఘించాడు.

అతడి కారు పాత ఢిల్లీ రహదారుల వెంట, వీధుల వెంట, ఇరుకు సందుల వెంట హడావుడిగా పరుగులు తీసింది. అటూ ఇటూ ఉన్న గోడల్ని గీసుకుంటూ గోతుల్లో పడి స్ప్రింగులు విరుచుకుంటూ పోయింది. కారు ఇక ముందుకు వెళ్ళలేని పరిస్థితిలో గోపీకిషన్ కిందికి దూకి, తన అనుచరులను కూడదీసుకుని శత్రువులతో పోరాటానికి సమాయత్తం చేసే బ్రహ్మాండమైన ప్రయత్నంలో భాగంగా ముందుకు పరుగులు తీశాడు. ఎలాగైనా తన ఉనికిని కాపాడుకోవాలని అదో రకం స్ఫురణతో శిఖరాయమానమనదగిన సామర్థ్యంతో పని చేసే క్షణాలవి.

మెల్లగానే అయినా స్థిరగమనంలో ఎదురుదాడి ఉధృతిని పుంజుకుంది. రెండే రెండు రోజులు తిరిగేసరికి క్లబ్బుల్లో, కాఫీ హోటళ్ళలో రంజన్ బాబు, అతని బృందం వాళ్ళ దుష్కృత్యాల గురించే అందరూ మాట్లాడుకోవడం ప్రారంభించారు. ముందుగా సార్వజనిక చర్చనీయాంశమైన అవినీతి గురించి. వసంతవిహార్‌లో ఉన్న తన మహాసౌధానికి రంజన్‌బాబు నాలుగో అంతస్థు కట్టించుకుంటున్న సంగతి నువ్వు గమనించలేదా ఏమిటి, నిజంగా గమనించలేదా? అయితే నువ్వు ఢిల్లీలో ఏమిటయ్యా చూసింది ? లేకపోతే కళ్ళు మూసుకుని వీధులెంట తిరుగుతూ ఉంటావా? సరే, కనీసం ఇప్పుడైనా వాటిని విశాలంగా తెరచి ఉంచుకోవడం మంచిది; రంజన్‌బాబుకు చెందిన నాలుగు అంతస్థుల ప్రాసాదం వంటి రమణీయ దృశ్యాలను చూడడానికే ఆ కళ్ళు ఉన్నది... ఇక ఆశ్రిత పక్షపాతం మరో అతి ముఖ్యమైన చర్చనీయాంశం. రంజన్‌బాబు బంధువర్గంలో ప్రతి ఒక్కరూ ఢిల్లీలో ఎక్కడో ఒకచోట మంచి ఉద్యోగంలో ఉన్నారన్న విషయం నీకు తెలుసా? ఢిల్లీలో ఇంతగా నిరుద్యోగం ఎందుకు తాండవిస్తోందో నువ్వు తెలుసుకోదలచుకుంటే రంజన్‌బాబు ఒక్కడే దానికి ఏకైక కారణభూతుడని తేలిపోతుంది. అతడు ఇతరుల కోసం ఒక్క ఉద్యోగమైనా విడిచిపెడితే కదా! ఉద్యోగాలు పుట్టడానికి ముందే వాటిని చేజిక్కించుకోగల ఘనుడు. ఇక అతడి ఆడపిచ్చి గురించి ఎంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది. మన నాగరిక సమాజంలో అటువంటి చీడపురుగును ఎలా భరిస్తాం చెప్పండి? ఏ వయసు ఆడదైనా ఎలా కనిపించే ఆడదైనా సరే ఒంటరిగా అతడితో ఇంటర్వ్యూ కోరుకునే సాహసానికి పాల్పడదు. అతడు ఢిల్లీకే పెద్ద కళంకం. అచ్చోసిన ఆంబోతు. పైగా తన రాసలీలల గురించి గర్వంగా చెప్పుకుంటూ ఉంటాడు. ఆ విషయంలో అతడి ప్రగల్భాలకు అంతూపొంతూ ఉండదు, సిగ్గుమాలిన రకం.

ఇక ఇప్పుడు అసలు విషయానికి వస్తే —ఎంతో ఉత్తముడైన గోపీకిషన్‌కి వ్యతిరేకంగా ఈ రంజన్‌బాబుగాడు లేనిపోని అపనిందలు వ్యాపింపజేస్తున్నాడంటే నువ్వు నమ్మగలవా? రైతులకు లంచాలు ఇచ్చి ప్రధానమంత్రి దగ్గరకు పంపించి గోపీకిషన్ పరువు తీసే రకరకాల కట్టుకథలు చెప్పిస్తున్నాడు. మంచికి రోజులు కావు. ఎంత దారుణం!

దీని వెనుక ఉన్నది ఎంతో సరళమైన రాజకీయతర్కం. నేను వెధవనైతే నువ్వు వెధవన్నర. ఇద్దరమూ కనుక నోరుమూసుకుని ఊరుకుంటే ఇద్దరమూ యోగ్యులమనిపించుకుని జనం కళ్ళు కప్పే అవకాశం ఉంటుంది. అలా కాక ఇద్దరమూ నోరుపారేసుకుంటూ ఉంటే ఒకరిమాట ఇంకొకరిమాటను రద్దు చేసేసి ఇరువురమూ వెధవలమనే అనిపించుకుంటాం. రెండు పక్షాలూ సమానంగా నీచమైనవే అయినప్పుడు ఒక్కొక్క పక్షాన్నీ ఇతర ఆధారాలపై అంచనా వేయ వలసి వస్తుంది. ఇదే ఆటను రకరకాలుగా ఆడవచ్చు కానీ మొత్తం మీద ఫలితం సాధారణంగా ఒకటే అవుతుంది. అది, అసలు సమస్యలు అప్రధానమైనవిగా మారిపోవడం.

గంటలు గడుస్తున్నకొద్దీ ప్రవాహరూపం ధరించిన పరస్పర దుష్ప్రచారకాండ వరద బాధితుల సహాయానికి సంబంధించి గోపీకిషన్ నిర్వ్యాపారమనే అసలు సమస్యను తెరమరుగు చేయడంలో విజయవంతమైంది. ఇక ఇప్పుడెవరూ వరదల గురించి చర్చించడం లేదు; నడుస్తున్న రాజకీయ నాటకంలోని పాత్రధారుల మంచిచెడుల గురించిన చర్చ ఒక్కటే కేంద్రస్థానం వహించింది. గోపీకిషన్ అందుకు తనను తనే అభినందించుకున్నాడు. తాజా పెట్టుబడిరూపంలో భారీ మొత్తాలు విడుదల చేశాడు. ఎన్నడూ వరద బాధిత ప్రాంతాల్ని చూసి ఎరగని ఎందరో ఢిల్లీ పౌరులు టాస్క్‌ఫోర్స్ బృందాలుగా ఏర్పడి అంతటా తిరగడం ప్రారంభించారు. వరద బాధితుల పాత్రను తమే అభినయిస్తూ లాలాగోపీకిషన్ ఎంతటి ఎనలేని సేవలు అందించాడో వెల్లువెత్తిన ఖుదా కి కసమ్ ప్రమాణాలతో వర్ణించసాగారు. జాగ్రత్తగా రూపొందించిన కార్యక్రమం ప్రకారం వారు మంత్రుల్ని, పార్టీ నాయకుల్ని, జర్నలిస్టులనీ, పార్టీ కార్యకర్తల్ని, పత్రికా కార్యాలయాల్ని, రెస్టారెంట్లనీ, షాపింగ్ సెంటర్లని, రైల్వే వెయిటింగ్ రూములనూ, పార్లమెంట్ హౌస్‌ను, రాష్ట్ర పతి భవన్‌ను, ఎక్కువ ప్రచారం లభించే కీలకమైన ఇతర ప్రదేశాలను చుట్టిరావడం మొదలు పెట్టారు. ఒక్క రోజులో గోపీకిషన్ పేరు ప్రతిష్ఠలూ, విశ్వసనీయతాకోణమూ ఉచ్చ స్థితిని అందుకుంది. వరద బాధితులకకు అతడి సేవలు క్రమంగా సంశయాత్మక స్థితిని, పాషాణప్రా యమైన తటస్థస్థితిని దాటిపోయి విశ్వసనీయతా ప్రాంగణంలోకి విజయవంతంగా అడుగుపెట్ట గలిగాయి.

అప్పటికి గోపీకిషన్ అస్థిమితంగానే ఉన్నాడు. ఇంత చేసినా పరిస్థితిలో ఎక్కడో ఏదో పొరపాటు దొర్లుతోంది. దానినతడు పసిగట్టగలిగాడు. కానీ దాని ఉనికిని పట్టుకోలేకపోయాడు. అతడు తన సుదీర్ఘ రాజకీయ జీవన క్రమంలో వందలాది నీలి వార్తలనీ, పోటీ నీలివార్తలనీ ప్రచారం చేయించగలిగాడు. ఆ ఆటకు తనవైన కార్యచోదకశక్తి, అంతర్గతంగా పుంజుకునే స్వభావమూ ఉన్నాయి. దానికి సాటి రాగలిగింది లేదు; ఆ ఆట అతడికో వ్యసనంగా పరిణ మించింది. ఒక్కోసారి గెలుపువల్ల కలిగే తన్మయత్వంతో, ఒక్కోసారి ఓటమివల్ల ద్విగుణీకృతమయ్యే ప్రతీకారేచ్ఛతో, రెండు విధాలా తనకు రాజకీయమైన 'కిక్కు' ఇచ్చే తన బద్ధ శత్రువు రంజన్ బాబును కూడా ఒక విధంగా ప్రేమించే స్థితికి వచ్చాడు. ఇన్నేళ్ళుగా ఆ ఆటవల్ల కలిగే సంభ్రమాన్నే ఆనందిస్తూ వచ్చాడు తప్ప గెలుపును కానీ, ఓటమిని కానీ లేదా పరిసమాన స్థితిని కానీ అతడెన్నడూ పట్టించుకోలేదు. అది వ్యసనం కోసమే వ్యసనంగా పరిణమించింది.

తన చూపుకందనిచోట పడవ అడుగున ఎక్కడో అనూహ్యంగా చిల్లిపడి లోపలికి నీరు ప్రవేశిస్తున్నట్లుగా తన సంభ్రమంలోకి ఒక విధమైన శూన్యం చొరబడుతున్నదన్న భావం ఆ రోజు మొదటిసారి అతడికి కలగడం ప్రారంభించింది. టెలిఫోన్‌కు దగ్గరగా తనకెంతో ఇష్టమైన ఈజీఛైర్‌లో కూలబడి తనదైన సరికొత్త, అసాధారణ మనస్థితి గురించి తర్కించుకోడానికి ప్రయత్నించాడు. ఈ లోపల ఫోన్ మోగడం మొదలైంది. ఫోన్ మోగిన ప్రతిసారీ తన లోపల ఎక్కడో నరాలు ఒకింత చచ్చుబడిపోయిన అనుభూతి కలుగుతోందతనికి మున్నెన్నడూ కలగని ఒక అసాధారణ అనుభవం ఇది. ఇంతకు ముందు ఫోన్ మోగినప్పుడల్లా ఆ ధ్వని తన రాజకీయ విశ్వాంతరాళంలో దివ్య సంగీతంలా ఎంతో కర్ణపేయంగా వినిపిస్తూ ఉండేది

ఈ నూతన మనస్థితిని ఎలాగైనా విదిలించుకునే నిశ్చిత ప్రయత్నంలో అతడు లేచి నిలబడ్డాడు అలసిపోవడం వల్లనే తనకీ వికారాలు కలుగుతున్నట్టు సర్దిచెప్పుకోబోయాడు. మున్నీబాయితో ఓ గంట కాలక్షేపం చేస్తే ఈ నిస్తేజమంతా దూదిపింజంలా ఎగిరిపోతుందేమో... వద్దు, వద్దు,. అదిప్పుడు చాలా ప్రమాదంతో కూడుకున్నదని అంతలోనే అనుకున్నాడు అదీగాక ప్రస్తుత ఘట్టంలో మున్నీబాయితో గడపడం అసంబద్ధంగా ఉంటుందనీ అతనికి తోచింది. శవయాత్ర సమక్షంలో రాసలీలకు పాల్పడినట్టుంటుంది. ప్రస్తుత సందర్భానికది ఏ మాత్రం అతికేదికాదన్న నిర్ధారణకు వచ్చి మళ్ళీ ఏవేవో ఊహాపోహల్లో కొట్టుకుపోవడం ప్రారంభించాడు

ఆ రోజంతా గోపీకిషన్‌ను తికమకపెట్టే పరిణామాలే జరుగుతూ వచ్చాయి ప్రతిసారీ ఏదో తనను ఉన్నట్టుండి అణిచిపారేస్తున్నట్లు, మరేదో తనను హఠాత్తుగా ఉత్తేజ భరితుణ్ణి చేస్తున్నట్లు అతనికి అనిపించసాగింది. అంతలో మంత్రి శ్రీ శేఖర్ రాక గురించి ప్రయివేట్ సెక్రటరీ తెలియజేశాడు బక్కా చేతికందీ అందగానే ఇతగాడు ఊడిపడతాడని గోపీకిషన్ ఊహించలేదు.

శేఖర్ గోపీతో కరచాలనం చేశాడు. ఆ ఢిల్లీ శాల్తీ మీద చూపుపడిన తక్షణమే అతడి పట్ల శేఖర్‌లో తిరస్కారం ఏర్పడింది. తొలి చూపులోనే రోత అంకురించిందనదగిన సందర్భమది. ఆనవాయితీ ప్రకారం అనుపానులు క్షుణ్ణంగా తెలుసుకునే వచ్చాడు. కనుక, ఈ మధ్య రాష్ట్ర రాజధానిలో తను శాంతింపజేయడానికి యత్నించిన రంజన్‌బాబుకు గోపీకిషన్ బద్ధ శత్రువని శేఖర్‌కి తెలుసు, ఈ ఇరువురు రాజకీయదళారులలో ఎవరిని తను ఎక్కువగా ద్వేషిస్తున్నాడో ఒక పట్టాన అతడు తేల్చుకోలేకపోయాడు. రంజన్‌బాబు చప్పిడి ముక్కు, పొడుచుకొచ్చిన గోపీకిషన్ కోర దంతాలతో చక్కగా అతికినట్టు సరిపోతుంది. స్వభావంలోనే కాదు, స్వరూపంలో కూడా ఇరువురి మధ్యా ఎంచి చూపగలిగిన తేడా ఏదీ కనిపించదు. చౌదరి అప్పగించిన ఈ నికృష్టమైన పని నాకు సైతం వెగటు పుట్టిస్తోందే అనుకున్నాడు శేఖర్. అతని సౌజన్య సంస్కారం అంతరాంతరాల్లో చాలా లోతున ఎక్కడో అణగారి ఉంటుంది. అతణ్ణి ఎల్లవేళలా అంటిపెట్టుకుని ఉండే దుష్ట ప్రవృత్తి మమూలు సందర్భాల్లో ఆ లోతును అందుకోలేదు. అయినాసరే ఈ ఒక్కసారికి మాత్రం గోపీ —రంజన్ ద్వయం తన హృదంతరాన్ని కూడా కెలికి, తనలో ఉన్నట్టు ఎప్పుడూ అనుమానమాత్రంగా కూడా అనుకోని తన అంతరాత్మను మేలుకలిపిన

విషయాన్ని అతడు గమనించక తప్పలేదు .. అంతలో, తను కనుక పాచికలు సక్రమంగా నడపగలిగితే ఈ వ్యవస్థనూ, దానితో పాటు ఆనంద్‌లాంటి వ్యక్తులనూ లోపలి నుంచి ధ్వంసం చేయాలన్న తన ప్రతిజ్ఞాపాలనమార్గంలో కొన్ని అడుగులు ముందుకు చేరుకోగలుగుతానన్న ఊహ అతనికి మెరుపులా కలిగింది. ఆ ఆలోచన గోపీకిషన్ పట్ల అతడి వైముఖ్యాన్ని కొంత సడలించింది. ఎంతైనా చివరిస్థాయిలో తన పథకానికి సహాయకారి అయ్యేవాడిగా మరి!

ముఖ్యమంత్రిత్వం కోసం జరిగే పరుగుపందెంలో పాల్గొనే గుర్రాల్లో ఇతడు కూడా ఒకడని గోపీకిషన్ అనుకున్నాడు. చౌదరి తరఫున మాట్లాడడానికే వచ్చి ఉండవచ్చు కానీ సాధ్యమైతే తన నెత్తికే కిరీటాన్ని అలంకరించుకోవడానికి వెనుదీయడనుకున్నాడు. ఇతగాడి అధికారకాంక్ష మీద తన మాటల మత్తుమందు జల్లి చూస్తే ఎలా ఉంటుందా అని వితర్కించుకున్నాడు. అతడి కటువంటి కాంక్ష ఉందో లేదో గోపీకిషన్‌కు స్పష్టంగా తెలియని మాట నిజమే అయినా ఉన్నట్టు భావించి మాట్లాడడం వల్ల లాభంలేకపోయినా నష్టమూ ఉండదనుకున్నాడు. ఎంతైనా ఇది ప్రతివాడూ కేవలం తనకోసమే పాల్గొనే ఆట కాదా అని కూడా భావించుకున్నాడు. గతంలో తనెప్పుడూ శేఖర్‌ను కలుసుకున్న గుర్తు రాలేదతనికి. అధికారికమైన పనిమీదతప్ప (తన రాజకీయ అస్తిత్వానికి అత్యవసరమనిపించే 'నికృష్ట' కార్యాలు కూడా అందులో భాగమే) తన మంత్రులు తరచూ ఢిల్లీ యాత్ర చేయడం చౌదరికి ఇష్టముండదు.

ఇంటర్వ్యూలో తొలి నిమిషాలు అందువల్ల మామూలు పలకరింపుల స్థాయిలోనే దొర్లిపోయాయి.

అయితే 'పురాతన సామాగ్రి, కళాఖండాల' సూట్‌కేస్ గురించి రాక తప్పని ప్రస్తావన త్వరలోనే వచ్చింది. శేఖర్ తిన్నగా అసలు విషయానికి వచ్చేశాడు.

'ఇంతకీ మనం ఏ ఘట్టంలో ఉన్నాం గోపీకిషన్‌జీ?' అని ప్రశ్నించాడు.

'మీరడుగుతున్నది ముఖ్యమంత్రి చౌదరి గురించేనా?' గోపీ ఎదురు ప్రశ్న వేశాడు.

'కాకపోతే ఇంకెవరి గురించి?' శేఖర్ గొంతులో ఒకింత చిరాకు ధ్వనించింది.

'తప్పకుండా పని జరుగుతుంది శేఖర్‌జీ!' గోపీకిషన్ తాపీగా అన్నాడు. గోపీకిషన్‌లో నిరాసక్త ధోరణిని శేఖర్ వెంటనే పోల్చుకున్నాడు. 'ఇంతకీ ఎలా పని జరిపిస్తారు? వివరాలు కాస్త స్పష్టంగా చెబితే చౌదరి సంతోషిస్తారు...' అన్నాడు

ఆ ప్రశ్నతో తను బోనులో చిక్కుకుపోయినట్టు అనిపించింది గోపీకిషన్‌కి. చౌదరికి తనెలా సహాయపడగలడో అతడికి లేశమాత్రమైనా ఆలోచన కూడా లేదు. తను ఎవరెస్ట్ శిఖరాన్ని చేరుకోగలగడం ఎంత నిజమో, నేరుగా ఇందిరాగాంధీ దగ్గరకు వెళ్ళగలగడమూ అంతే నిజం. అతడు చేయగలిగిన మొత్తం ప్రయత్నమల్లా ప్రధానమంత్రి ప్రయివేట్ సెక్రటరీలలో ఒకరిని దొరకపుచ్చుకోగలగడం, అదీగాక వరద బాధితులకు సహాయ చర్యల వ్యవహారంలో తను అప్పటికి కొన్ని రోజులుగా పీకల వరకూ మునిగిపోయి ఉన్నాడు. చౌదరికి తను చేయగలిగిన సహాయమల్లా అతడు పంపించిన బక్సాను అందుకోవడం, ఇప్పుడూ శేఖర్‌గాడు ప్రతిఫలం కక్కమని నిలదీస్తున్నాడు.

'సంబంధిత వ్యక్తులతో మాట్లాడాను' అంటూ ఆకుకి అందకుండా, పోకకి పొందకుండా ప్రారంభించాడు. 'చౌదర్ జీ క్షేమంగానే ఉంటారు. ఆయన్నెవడూ కదపలేడు...'

'మిగిలిన వాళ్ళేమనుకుంటున్నారో నా కనవసరం' శేఖర్ అసహనంగా అడ్డు తగులుతూ అన్నాడు. 'దయచేసి చెప్పండి గోపీకిషన్‌జీ, ఇందిరాగాంధీ నిర్ణయం ఏమిటి?'

'నేనిప్పుడు తెలుసుకోబోతున్నది అదే' గోపీకిషన్ అవలీలగా అబద్ధమాడేశాడు. 'నే నిప్పుడదే పనిలో ఉన్నాను, నన్ను నమ్మండి శేఖర్‌జీ. చౌదరిని తప్పించవద్దని ఇందిరాగాంధీని ఒప్పించ గలననే అనుకుంటున్నాను. అయితే ఒక విషయంలో మిమ్మల్ని హెచ్చరించక తప్పదు. ఆయనకిక్కడ ప్రతికూల వాతావరణమే కనిపిస్తోంది. అయితే చౌదరికి వ్యతిరేకంగా రాత్రీ పగలు పనిచేసే గాడిద కొడుకు రంజన్‌బాబు ఒక్కడేననుకోండి. అయినా వాడెంత, ఓ గడ్డి పరక. ప్రధానమంత్రి దగ్గర తనకున్న పలుకుబడి గురించి వాడెలాగైనా గప్పాలు కొట్టుకోని వవ్వండి. నే చెబుతున్నాగా, వాడి పప్పులేవీ ఇక్కడ ఉడకవ్...'

చౌదరి విషయంలో తనేం చేయబోతున్నాడో సూచనగానైనా శేఖర్‌కి చెప్పకుండానే గోపీ కిషన్ అలా వదరుతూనే ఉన్నాడు. కారణం స్పష్టమే. ఏం చేయాలో అతడికే తెలియదు. ఇంతకు ముందు రంజన్‌బాబు ముక్కుపగులగొట్టాలని అనిపించినట్టే ఇప్పుడు కూడా ఒక్క దెబ్బతో గోపీకిషన్ పళ్ళు రాలగొట్టాలని శేఖర్‌కి అనిపించింది. అయితే తాను కేవలం చౌదరి పనుపున వచ్చాడు అవతలివాడు ఎంత రెచ్చగొట్టినా హింసామార్గం పట్టడానికి తగిన ఆదేశం తనకు లేదు. ఓ ప్రక్క 'పురాతన సామాగ్రి, కళా ఖండాలతో' నిండిన అంత పెద్ద బక్సా ఢిల్లీకి చెందిన బోగస్ లాబీయిజం అనే అడుగులేని గోతుల్లోకి జారిపోతున్న దృశ్యాన్ని మనోనేత్రంతో దర్శిస్తూనే మరో ప్రక్క గోపీకిషన్ ఊకదంపుడు హామీలకు ఎంతగానో ముగ్ధుడైపోయినట్టు కనిపించాడు.

గోపీకిషన్ భవంతి నుంచి బయటపడగానే దారుణంగా కంపుకొడుతున్న ఓ పబ్లిక్ యూరినల్ నుంచి బయటపడినంత హాయి కలిగిందతనికి. ఏదో తెలియని ఉత్తేజం కలిగిందన్నా తప్పు లేదు. తన 'విధేయ' అనుచరులు తన పేరు చెప్పుకుని రోజులో ఇరవై నాలుగు గంటలూ ఏంచేస్తూ ఉంటారో ఇందిరాగాంధీకి అసలు తెలుసా అనుకున్నాడు. ఒకవేళ తెలిసినా ఆమె పట్టించుకోదు.

ఆనంద్ చూడగలిగినట్టు ఇందిరాగాంధీలో ఎటువంటి పరితాపాన్ని కానీ, నిజాయితీని కానీ అతడు చూడలేడు, అతడి ఉద్దేశంలో ఆమె మొదలూ చివరా కూడా కేవలం రాజకీయవాది. నిజమే కానీ, ఊహాజనితమే కానీ - గోపీకిషన్, రంజన్‌బాబులకు ఆమె ఆశ్రయం ఎంత అవసరమో, వాళ్ళూ ఆమెకంతే అవసరం. అది పరస్పర అనుకూల్యతతో ముడిపడిన విషయం.

అతడా ప్రాంగణం దాటివచ్చిన వెనువెంటనే కుంభవృష్టి మొదలైంది. కొన్ని నిమిషాల్లోనే న్యూఢిల్లీలోని రోడ్లను వర్షపు నీరు ముంచెత్తింది. శేఖర్‌లో గోపీకిషన్ పట్ల హఠాత్తుగా ఉబికి వచ్చిన ఏవగింపు పొంగిపొర్లుతున్న వర్షపు నీటితో పోటీపడింది. కారు అశోకా రోడ్డులోకి అడుగు పెట్టగానే తను తన పార్టీ ముఖ్య కార్యాలయానికి సమీపంలోనే ఉన్నానన్న సంగతి

అతడు గ్రహించాడు. తన కాలేజీ నేస్తం ఒకతను పార్టీ ప్రధాన కార్యదర్శులలో ఒకడు. తన ఆకస్మిక సందర్శనతో మిత్రుణ్ణి ఆశ్చర్యంలో ముంచితేల్చడానికి కొద్ది నిమిషాలు అక్కడ ఆగితే ఎలా ఉంటుందనిపించింది. పార్టీ ముఖ్య కార్యకర్తతో కాసేపు ఊసులాడితే రాష్ట్రంలోని చిక్కు పరిస్థితి గురించి ఢిల్లీ నుంచి ఉపయుక్త సమాచారమేదైనా దొరకచ్చు. గోపీకిషన్‌ను కలిసి వట్టి చేతులతో తిరిగొచ్చిన తర్వాత ఆ రోజుకి తను చేయవలసింది ఏమీలేదు. తన మిత్రుడైన పార్టీ ప్రధాన కార్యదర్శి నుంచి గోపీకిషన్ బాపతువాళ్ళు ఏడాది పొడుగునా ఢిల్లీని ఎలా దుర్గంధభూయిష్ఠం చేస్తూ ఉంటారో తెలుసుకోగలిగితే బహుశా తనకోపం అదుపులోకి రావచ్చు. మిగిలిన వాటిని మించి ఈ ప్రేరణతోనే పార్టీ ముఖ్య కార్యాలయంలోకి కారు మళ్ళించమని శేఖర్ డ్రైవర్‌కు చెప్పాడు.

శేఖర్ వెళ్ళిపోవడంతోనే కొండంత బరువు దిగిపోయినట్లు గోపీకిషన్ ఊపిరి పీల్చుకున్నాడు. అతడి నడకలో ఎంత ద్వేషభావమో, అతడి పోకడలో ఎంత తృణీకార భావమో అనుకున్నాడు. అయినా ఒక రకంగా అతణ్ణి నిందించడానికి లేదు. తనకు చౌదరి ముడుపులు చెల్లించింది తన నుంచి ఉత్తుత్తి హామీలతో శుష్క ప్రోత్సాహక వచనాలతో ఓదార్పు పొందడానికేమీ కాదు. అయినా అతడూ ఒక విషయం తెలుసుకోవాలి. మామూలు వ్యాపారాలకు వర్తించే 'పెట్టిన డబ్బుకు సరిపడ ప్రతిఫలం' పొందడమనే సూత్రం రాజకీయాలకు వర్తించదు. రాజకీయాలనే ఆటలో ఎప్పుడూ ఏదో ఒకటి ఒడ్డుతూ పోవలసిందే. కేవలం బుద్ధిలేని గాడిద మాత్రమే ఫలితం గురించి ఆలోచిస్తూ ఉంటాడు. ఇది పూర్తిగా మరో రకం జూదం; ఫలితం ఎలా ఉండబోతోందో ఎవరికీ తెలియదు. అది వచ్చేటప్పుడు మెరుపులా వస్తుంది. అంత ఇంటెలిజెన్స్ ఉన్నాసరే రాష్ట్రాల నుంచి వచ్చే ఈ గాడిదలు ఢిల్లీ లాబీల కార్యకుశలత ఎలాంటిదో ఎప్పటికీ అర్థం చేసుకోలేరనుకున్నాడు గోపీకిషన్. తన విషయానికొస్తే బక్సా సురక్షితంగా తన చేతికి చేరింది కనుక, శేఖర్‌ని తనింక పట్టించుకోవల్సిన అవసరంలేదు. అతణ్ణి గుర్తుపట్టవలసిన అవసరం కూడా ఇక తనకు లేదని తీర్మానించుకున్నాడు. ఇంతకీ లాబీయింగ్ అంటే ఏమిటనుకుంటున్నారు వాళ్ళు? రాష్ట్రాల్లో ముఖ్యమంత్రులు, మంత్రులు చేసినట్టుగా టెలిఫోన్‌లో ఆదేశాలు మొర గడమనుకుంటున్నారా?

అంతలో హటాత్తుగా ఫోన్ మోగడంతో ఒక్కసారిగా అతడు అప్రమత్తుడయ్యాడు. ఫోన్ రెండోసారి మోగకుండా మధ్యలోనే గొంతు నొక్కడానికా అన్నట్టుగా తూకం తప్పిన బల ప్రయోగంతో రిసీవర్ అందుకున్నాడు. ఆ వేగిరపాటు రెండు గ్రహాలు ఢీకొనకుండా నివారిస్తున్నాడా అన్న చందంగా కూడా అది కనిపించింది. ఆ వెంటనే భయాందోళనలకు అద్దం పడుతూ అతి బిగ్గరగా 'హల్లో' అనే కేక అతడి గొంతులోంచి వెలువడడం, అతడి ముఖంలో ఆశ్చర్యాగ్రహాలు రెండూ కలగలసి తాండవించడం జరిగిపోయాయి. కారణం, అది రాంగ్‌నెంబర్.

అలవిమాలినంత అసహనంతో గోపీకిషన్ వరండాలో ముందుకి, వెనక్కి పచార్లు చేస్తున్నాడు. అయిదారుగురు సహచరులు కలిసికట్టుగా అక్కడికి ఊడిపడేసరికి ఏకాంత దుఃఖం నుంచి విముక్తి లభించి అతడికెంతో ఊరట కలిగింది. గత మూడురోజులలో తాము సాధించిన ఫలితాల గురించి అసాధారణ సంభ్రమంతో వారు వివరించుకుంటూ వచ్చారు. రెండువందల మందితో

కూడిన ఓ పటిష్ఠమైన లాబీ, ఇంచుమించు కంప్యూటర్‌తో పోల్చదగినంత కచ్చితంగా, నిర్విరామంగా పని చేస్తున్నట్టు అదే క్షణంలో విజయగర్వంతో వాళ్ళతనికి హామీ ఇచ్చారు. వాళ్ళు ఓ పద్ధతి ప్రకారం అధికార రాజకీయాలూ, నాయకత్వమనే చక్రవ్యూహపు దారులవెంట పురుగుల్లా తొలుచుకుంటూ లోపలికి వెళ్ళగలిగారు. ఈ క్షణాన అగ్రశ్రేణిపై ఆఖరి దాడి జరుగుతోంది. నిజానికది ఈపాటికి పూర్తయ్యే ఉంటుందని కూడా పట్టరానంత సంబరంతో వారు ప్రకటించారు. అయితే అది కష్టసాధ్యమన్న మాట కూడా దానికి జోడించారు. రంజన్‌బాబు నిలబెట్టిన దండు అక్షరాలా దుర్భేద్యమైనది కనుక, ఆటలోని ప్రతి అంశంలో అతడికి తాము దీటురావాలంటే శక్తియుక్తులన్నీ కూడదీసుకోకతప్పదు అంటే గూండాలకు పోటీగా గూండాలు, నాయకులకు పోటీగా నాయకులు, డబ్బుకు పోటీగా డబ్బు, బెదిరింపులకు పోటీగా బెదిరింపులు, పదుపు గత్తెలకు పోటీగా పడుపుగత్తెలు అన్నమాట మీ కెందుకు బాస్, మీరిక నిశ్చింతగా ఉండండన్నారు, సొగసులీనే ముక్తకంఠంతో ఎట్టకేలకు ఓడ ఒడ్డు చేరింది.

వాళ్ళాడిన ప్రతిమాటా గోపీకిషన్‌కు దేవతావాణిలా వినిపించింది. వాళ్ళ వాగ్దానపరంపర చక్కని ఓ జోల పాటలా అలసిన అతడి నరాలకు ఎంతో సాంత్వనం కలిగించింది. అయితే అదతణ్ణి నిద్రపుచ్చలేక పోయింది; పైగా చెప్పుకోతగిన రీతిలో అతడిలో ఏదో సరికొత్త జాగృతి కలిగింది. అతడి ముఖం దేదీప్యమానంగా వెలిగిపోతూండగా, ఆలోచన అభిలాషణలు కల గలిసిన ప్రవాహంలోకి అతడొక్కసారిగా లంఘించాడు. క్లుప్తంగా చెప్పాలంటే అది వరద సహాయక చర్యలకు సంబంధించిన విస్తృత కార్యక్రమం. మరునాడే తను ఆ కార్యక్రమాన్ని చేపడతానని, ఆ తర్వాత ఇక విశ్రమించేదిలేదని అతడు శపథం చేశాడు. తన లాబీ అసత్య ప్రచారంలో భాగంగా తానేమీ చేసినట్టు ఇప్పటికే చెబుతూ వచ్చిందో అవన్నీ ఇప్పుడు నిజంగా చేసి చూపిస్తాడు. తన లాబీతో తనే పోటీపడతాడు. వాస్తవం కల్పనస్థాయిని అందుకోవడమే కాదు దానిని అధిగమించిపోతుంది. ఆహారం, దుస్తులు, మందులు, పశుగ్రాసం, నగదు ప్రతి అంశానికి సంబంధించిన ప్రతి వివరంలోనూ తను వ్యక్తిగతంగా శ్రద్ధ తీసుకుంటాడు. ఆఫీసర్లను దూదేకినట్టు ఏకుతాడు; సోమరిపోతుల్ని తక్షణం బదిలీ చేయిస్తాడు. అవినీతితో కుళ్ళిపోయిన వెధవల్ని క్షణమాలస్యం చేయకుండా ఉద్యోగాల నుంచి పీకిపారేస్తాడు. మొత్తం అధికార యంత్రాంగాన్ని నలబై ఎనిమిది గంటల్లో ప్రక్షాళన చేసేస్తాడు. అయినా రంజన్‌బాబుగాడు తనపై బురద చల్లుతూనే ఉంటాడా, వాడి చావేదో వాడు చావని, తన బద్ధశత్రువు ఏం చేసినా సరే తను పట్టించుకోడు... ఓ పకడ్బందీ పథకాన్ని రచించుకుంటూనే అతడలా డంబాలు పలుకుతూ పోయాడు. అతడి అనుచరులు దిగ్భ్రాంతితో నమ్మశక్యంకానంత సంపూర్ణ నిశ్శబ్దంతో అతడి మాటలు వింటూ ఉండిపోయారు.

ఈసారి టెలిఫోన్ కోపంగా కొంపలు మునిగిపోయినట్టుగా మోగడం ప్రారంభించింది. టెలిఫోన్ ఉన్న ప్రతివాడూ అది మోగుతున్నప్పుడు ఆ ధ్వనిలో అంతర్లీనంగా స్ఫురించే తేడాలను బట్టి ఆ టెలిఫోన్ మూడ్సను గమనించగలిగి ఉంటాడు. ఒకసారి విషాదంగా, ఒకసారి సంతోష భరితంగా, ఒకసారి శ్రావ్యంగా, ఒకసారి భయజనకంగా. అయితే గోపీకిషన్ తన ఊకదంపుడు వాక్ప్రవాహంలో పూర్తిగా మునిగిపోయాడు కనుక ఈ తేడాలను గమనించే స్థితిలో లేడు.

మామూలుగా రిసీవర్ అందుకుని, తన ఉపన్యాసాన్ని ఆపేసి వింటున్నాడు... వింటూనే ఉన్నాడు... గోపీకిషన్ ముఖం మీదుగా ఆ టెలిఫోన్ సంభాషణను వినడానికి ప్రయత్నిస్తూ అతడి అనుచరులు నిశ్చలంగా నిలబడిపోయారు.

'హాల్లో... గోపీకిషన్ జీ? ప్రైమ్ మినిస్టర్ పి.ఎ.ని మాట్లాడుతున్నాను. ఎలా ఉన్నారు సార్? నేనా, బాగానే ఉన్నాను. థాంక్యూ. మీకో కబురు చెప్పాలి సార్. అర్జెంటే అనుకోండి ఆ రంజన్‌బాబు మీ మీద ఎలా దుష్ప్రచారం చేస్తున్నాడో మీకు తెలుసు కదా? పి.ఎం. దీనిని చాలా తీవ్రంగా పరిగణిస్తున్నారు. మీకు న్యాయం చేసే ఉద్దేశంతోనే ఈ వ్యవహారాన్ని త్వరగా తేల్చేయాలనుకుంటున్నారు. అందుకు సంబంధించిన ఫీల్డ్ రిపోర్ట్ ఇప్పుడామె పరిశీలనలో ఉంది. వరదబాధితులకు మీరెంతో చేశారు కనుక, అది మీకు అనుకూలంగానే ఉంటుందను కుంటున్నాను. దయచేసి ఈ విషయంలో మీరోసారి పార్టీ జనరల్ సెక్రటరీని కలుస్తారా? పి.ఎం. కలవమంటున్నారు. జనరల్ సెక్రటరీ కూడా మీరాక కోసమే ఎదురు చూస్తున్నారు. దయచేసి తక్షణం వెళ్ళి ఆయనను కలుసుకుంటారా? మంచిది. నేనిప్పుడే మీరొస్తున్న విషయం జనరల్ సెక్రటరీకి చెబుతాను. థాంక్స్ ఎ లాట్ సార్, నమస్తే...'

గోపీకిషన్ అప్రతిభుడై నిలబడిపోయాడు. రిసీవర్ ఇంకా అతడి చేతిలోనే ఉంది. డైల్‌టోన్ గురించి కూడా మరిచిపోయాడు. ఆ తర్వాత రిసీవర్‌ను క్రెడిల్ మీదికి జారవిడిచి మెల్లగా, శవం శ్మశానంలోకి నడుస్తున్నట్లుగా తన ఇంట్లో ఓ మారుమూల ఏకాంత ప్రదేశం వైపు నడిచాడు. అనుచరులు అతడు వెళ్ళినచోటికి అతణ్ణి అనుసరించి వెళ్ళలేకపోయారు.

★ ★ ★

'ఏమిటిది గోపీకిషన్ జీ?' పార్టీ జనరల్ సెక్రటరీ నిలదీస్తున్నట్టు అడిగాడు, స్పష్టంగా తెలిసిపోయే ఆగ్రహ స్వరంతో.

'ఏమిటేమిటి సార్?' గోపీకిషన్ ఎదురు ప్రశ్న వేశాడు. తనలోపల సుడులు తిరుగుతున్న సంక్షోభానికి ఏమాత్రం పొసగని నిబ్బరాన్ని కనబరుస్తూ. ఒక్కొక్క నిమిషం గడుస్తున్న కొద్దీ ముఖం మరింత ఎర్రబడుతున్నా ఆ పార్టీ ప్రధాన కార్యదర్శిని కలుసుకోవడానికి గోపీకిషన్ తగిన మానసిక సంసిద్ధతతోనే వచ్చాడు. అతడు వేసిన ఎదురుప్రశ్న పార్టీ ప్రధాన కార్యదర్శిని మరింత ఆగ్రహోదగ్రుణ్ణి చేసింది. బొత్తిగా బరితెగింపు పోకడే అందులో ధ్వనించింది.

'ఐ యామ్ సారీ, గోపీకిషన్‌జీ?' తగినంత నిగ్రహం కనబరుస్తూ అన్నాడు ప్రధానకార్యదర్శి. 'ఒక్క వరదబాధిత గ్రామాన్ని కూడా మీరు వెళ్ళి చూడలేదని చాలా తీవ్రమైన ఫిర్యాదు మాకు అందింది...'

'ఎవరన్నా రలా ?' గోపీకిషన్ ప్రశ్నించాడు.

'ఇంకెవరు? రంజన్‌బాబూ, అతడి మనుషులూ...'

'నేను వెళ్ళలేదని వాళ్ళకెలా తెలుసు? వాళ్ళేమైనా ఆ గ్రామాలకు వెళ్ళొచ్చారా?'

'సరే వాళ్ళూ వెళ్ళలేదు. ఆ విషయం నాకు తెలుసు. అయినా అది అప్రస్తుతం అధికారంలో ఉన్నది మీరు, జవాబు చెప్పుకోవలసింది మీరు...'

'నిజమే మిస్టర్ సెక్రటరీ', గోపీకిషన్ ఒత్తిపలుకుతూ అన్నాడు. 'జవాబుదారు నేనే. దయ చేసి చెప్పండి. నేను తప్ప ఘనత వహించిన మన పార్టీలో జవాబుదారులు ఇంకెవరూ లేనే లేరంటారా?'

'లేరని కాదు... అందరూ జవాబు చెప్పుకోవలసిన వాళ్ళే. అయినా మీరు అధికారంలో ఉన్నారు కనుక...' సెక్రటరీ గొణుగుతున్నట్టు అన్నాడు.

'అధికారం, అధికారం, అధికారం!' పోల్చుకోదగినంత తీక్ష్ణ స్వరంతో గోపీకిషన్ ఎదురు దాడికి దిగాడు. 'మొత్తానికి ఇదంతా దాని గురించన్నమాట? ఇప్పటికే మీకు ఈ విషయంలో జవాబు దొరికిందా లేదా చెప్పండి మిస్టర్ సెక్రటరీ? నే నొక్కణ్ణే అధికారంలో ఉన్నానా? నే ననుకుంటున్నది పార్టీ అధికారంలో ఉందని, ఓ వ్యక్తి కాదు. కనుక ఓ వ్యక్తికి వ్యతిరేకంగా పార్టీలో మిగిలిన వాళ్ళు దుష్ప్రచారం సాగిస్తుంటే ఆ వ్యక్తి కనీసం ఆత్మరక్షణ కోసమైనా అటువంటి పనే చేయడా చెప్పండి?'

'మరి ప్రజల సంగతేమిటి? 'మిమ్మల్ని ఉన్నత పదవికి ఎన్నుకున్నది వాళ్ళు?'

'అది ఉత్తిమాట మిస్టర్ సెక్రటరీ, ఆ విషయం మీకూ తెలుసు' గోపీకిషన్ జవాబు చెప్పాడు. ప్రజలు నన్ను ఎన్నుకున్నది శాసనసభకు, ఆ తర్వాత నాకు ఎటువంటి పదవి లభించినా అది వాస్తవానికి నామినేషన్ మాత్రమే. శాసనసభ్యుడిగా అయిదేళ్ళూ కొనసాగగలను కానీ, నా నామినేషన్ పదవికి అటువంటి భద్రత ఏదీలేదు. ఎవడైనా ఏ క్షణంలోనైనా నన్ను పడగొట్టవచ్చు. కనుక ప్రతిక్షణం నన్ను నేను కాపాడుకుంటూ ఉండవలసిందే. మిగిలిన పనులకు నాకు తీరికేది మిస్టర్ సెక్రటరీ ?'

ప్రధాన కార్యదర్శి ఒకింత తెల్లబోయినట్టు కనిపించాడు, అయినా తన వాదానికి దృఢంగా అంటిపెట్టుకుని ఉండిపోయాడు. 'కానీ చూడండి గోపీకిషన్‌జీ' ఒకింత అస్పష్ట ధోరణిలో ప్రారంభించాడు. 'కనీసం మీ నియోజకవర్గాన్ని పట్టించుకోవాలా? అక్కర్లేదా?'

'సారీ మిస్టర్ సెక్రటరీ, గోపీకిషన్ అడ్డు తగిలాడు. నా నియోజకవర్గం అల్లా ప్రధాన మంత్రి నివాసమే. ఆ విషయంలో మీ కెటువంటి అపోహలూ అనవసరం. దయచేసి నా దగ్గర ఎప్పుడూ వినిపించే మామూలు రాజకీయ నినాదాలు ఏకరువు పెట్టకండి.'

'గోపీకిషన్‌జీ, ఇది చాలా దారుణం. మీకు ఒక్కటంటే ఒక్క గ్రామాన్నికూడా వెళ్ళి చూడ లేదు. మీరేదో చాలా అద్భుతంగా పని చేశారని మీ మిత్రులు అదేపనిగా ప్రచారం చేస్తున్నారు. ఏమైతేనేం. ఇప్పుడు అసలు నిజం బయటపడింది...!

'అవును నిజం' రెట్టిస్తున్నట్టు గోపీకిషన్ అన్నాడు 'అసలు నిజం కనిపెట్టారు! ముఖ్యంగా ఈ విషయంలో, అవును అదే జరిగింది. బహుశా నేను అతితెలివికి పోయి ఉండచ్చు. కాలం నాకు కలిసిరాకపోవచ్చు. పరిస్థితులు ఒకదానిమీద ఒకటి వచ్చిపడి పోయాయి. అవును, నిజం

ఒప్పుకుంటున్నాను. అయినా మీరెన్నడూ పట్టించుకుని ఎరగని వేరే నిజాలు కూడా చాలా ఉన్నాయి. ఉదాహరణకు కిందటేడాది తీవ్ర అనావృష్టి పరిస్థితులు ఏర్పడినప్పుడు పూనకం పట్టినవాడిలా పనిచేశాను. ఓ తిండి లేదు, తిప్పలు లేవు. నేను ఢిల్లీలో లేకపోవడాన్ని ఆసరాగా తీసుకుని అన్ని రోజులూ ఆ రంజన్‌బాబు నా వెనకాల గోతులు తవ్వుతూనే ఉన్నాడు. నా ప్రతిష్ఠను మళ్ళీ కూడదీసుకోడానికి పూర్తిగా నాలుగు మాసాలు పట్టింది. అది కూడా కేవలం లాబీయింగ్ ద్వారానే. నేనెంత పని చేశానో ఈ క్షణం వరకూ గుర్తించిన వాడేలేడు. కిందటేడాదే మా ఇద్దరినీ పిలిచి ఎందుకు అడగలేకపోయారు, మిస్టర్ సెక్రటరీ? ఈ లాబీయింగ్ రోగం నుంచి బయటపడడానికి ఒక్కసారైనా ఎందుకు ప్రయత్నించరు? నే నొక్కణ్ణే తప్పు చేయలేదు. అయినా నేనే బలి పశువును కావలసివస్తోంది. ఈ విధానమే కుళ్ళిపోయింది మిస్టర్ సెక్రటరీ, అలాగే పార్టీ కూడా.. ఘనత వహించిన మన పార్టీ ఇప్పుడు ఏ స్థితిలో ఉంది మిస్టర్ సెక్రటరీ?...

అలా అంటూనే గోపీకిషన్ లేచి నిలబడి తను ముందే రాసుకొచ్చిన రాజీనామా లేఖను, నిర్ఘాంతపోయి చూస్తున్న జనరల్ సెక్రటరీ చేతిలో పెట్టి అక్కడి నుండి నిష్క్రమించాడు. అతడు వెళ్ళిపోయిన తర్వాత, జనరల్ సెక్రటరీ మెల్లగా అడుగులేస్తూ తన కార్యాలయానికి ప్రక్కనే ఉన్న గదిలోకి వెళ్ళాడు. అక్కడ అతడి కోసం ఓ వ్యక్తి ఎదురు చూస్తున్నాడు. అతడు తన కాలేజీ నేస్తం శేఖర్. గోపీకిషన్ రాకతో వాళ్ళిద్దరి సంభాషణకు అంతరాయం కలిగింది. ఇద్దరూ ఒకరివైపు ఒకరు మాటలుడిగి చూస్తుండిపోయారు. గోపీకిషన్ ఉపన్యాసం వాళ్ళ చెవుల్లో గింగురుమంటోంది... 'మన పార్టీ ఇప్పుడు ఏ స్థితిలో ఉంది మిస్టర్ సెక్రటరీ?'

రాష్ట్ర రాజధానికి తిరిగొచ్చిన శేఖర్, చౌదరిని కలిసి ఢిల్లీ పరిణామాల గురించి సంగ్రహంగా వివరించాడు. 'మీ బక్సా గురించి మీరిక మరిచిపోవచ్చు?' అని కూడా అన్నాడు, విషపూరితమైన ముసిముసి నవ్వుతో.

చౌదరి అతడు చెప్పినవి సావధానంగా విన్నాడు. 'ఇక ఇప్పుడు నేను నా సొంత సూట్‌కేసును సర్దుకోవలసిందేనేమో' అంటూ భీకరంగా వ్యాఖ్యానించాడు. అప్పటికే పొంగిపొర్లుతున్న యాష్‌ట్రేలో సిగరెట్టు పీకను కసితీరా నొక్కుతూ.

# 53

గోపీకిషన్ రాజీనామా —మరింత కచ్చితంగా చెప్పాలంటే అతడి తొలగింపు – కొద్దిపాటి ఆశ్చర్యాన్నే రేకెత్తించింది. కొద్దిపాటి ఎందుకంటే అప్పటికే ఉన్నత స్థానాలలో ఉన్న వారి తొలగింపు, దానికి లోనైన బాధితులతో సహా, ఎవరికీ దిగ్భ్రాంతిని, ఆగ్రహాన్ని కలిగించడం మానేసింది. తమ చరమాంకాన్ని వాళ్ళు ముందుగానే ఊహించుకోగలుగుతున్నారు. కనుక వాళ్ళలో చాలా మంది ఆ పరిణామానికి మానసికంగా ముందే సిద్ధమైపోతున్నారు. తొలగింపు అనేది గ్రహణంతో సమానమైనదని వారికి తెలుసు. అన్ని గ్రహణాలలానే అది కూడా తాత్కాలికం. అధికారపక్షపు రాజకీయ వినీలాకాశంలో అది రాహు కేతువుల ఉనికితో పోల్చదగిన ముచ్చట. హిందూ జ్యోతిష్కులలో ప్రతి ఒక్కడూ హామీ ఇచ్చినట్టుగా ప్రతి ఒక్క గ్రహానికీ —రాహు కేతువులతో సహా —తగిన శాంతి చేయించుకోవచ్చు. అలా వాటి ఆగ్రహాన్ని చల్లార్చి 'జాతకుడి' పట్ల అవి ఎప్పటిలా ప్రసన్నంగా ఉండేలా చేసుకోవచ్చు.

గోపీకిషన్ పతనఘట్టం పుట్టించిన ఆసక్తి కొద్ది రోజులకే అదృశ్యమైపోయింది. అయితే ముఖ్యమంత్రి చౌదరికి మాత్రం అది తీవ్ర అఘాతం అతడు తన గుడ్లనన్నింటినీ గోపీకిషన్ ఒక్కడి బుట్టలోనే పెట్టలేదన్నది వాస్తవమే. రాజకీయాలంటే పాము —నిచ్చెనల ఆటనీ, ముఖ్యంగా ఇప్పుడు పాములపై, నిచ్చెనలపై కూడా ఏకచ్ఛత్రాధిపత్యం ఇందిరా గాంధీదేనని గ్రహించ కుండా ఉండలేని గడుసుపిండమే అతడు. రంజన్‌బాబు తనకు ద్రోహం చేసినా సరే, ఎప్పుడెవడు ఎలా ఉపయోగపడతాడో ఎలా చెప్పగలమన్న వ్యవహార సూత్రం మీద ఆధారపడి చౌదరి మరోవైపు నుంచి అతణ్ణి కూడా దువ్వుతూనే వస్తున్నాడు. ఓ ఘట్టంలో అటు గోపీకిషన్‌కీ, ఇటు రంజన్‌బాబుకి కూడా ఉమ్మడి ఖాతాదారు కాగలిగిన విశిష్టమైన ఘనత తాను సాధించుకున్నా నన్న విషయాన్ని అతడు గమనించకపోలేదు. గోపీ —రంజన్ అనే సమానంతర రైలు పట్టాలను కలపగలగడమనే అసాధ్యాన్ని సుసాధ్యం చేసిన వ్యక్తిగా తన పేరు అధికారపక్ష చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతుందేమోనని కూడా అతడి కనిపించింది. కానీ ఆ అపూర్వమైన ఘనత దక్కినట్టే దక్కి చేజారిపోయింది. రంజన్ అతడి బక్సాలనైతే ఆమోదించాడు కానీ, వెనువెంటనే అతణ్ణి ముంచడానికి వెనుకాడలేదు. గోపీకిషన్‌తో చౌదరి సాన్నిహిత్యం అతడికి దుస్సహంగానే కనిపించింది. చౌదరి డబ్బును తప్ప అతడి గురించి మరిదేన్నీ ఆమోదించడం అతనికి సాధ్యం

కానిదిగా తోచింది. ఇక డబ్బు సంగతంటారా అది వచ్చేది నాసిక్ ప్రింటింగ్ ప్రెస్ నుంచి కనుక కచ్చితంగా అది చౌదరిదేనని చెప్పడానికి వీల్లేదు! రంజన్‌ను అలా ఉంచి అతడి మిగిలిన సోర్సులు కొంతవరకు ఆధారపడదగినవిగా చౌదరికి కనిపించాయి. అయితే గోపీకిషన్ అవమాన పూర్వక నిష్క్రమణ తర్వాత అవి కాస్త బెదురుతున్నట్టు కనిపించాయి. దాంతో చౌదరి జాతకం హఠాత్తుగా అధఃపాతాళానికి జారిపోయింది. ఇందిరాగాంధీ ఆశీస్సులు తనకు అత్యవసర మనిపించే క్షణం వరకూ, అవి తనకు తప్పకుండా ఉన్నట్టే అతడు విశ్వసిస్తూ వచ్చాడు ఆ క్షణంలో మాత్రం ఇందిరాగాంధీ అంతా మసకమసకగా కనిపించేంత దూరానికి జరిగిపోతున్నట్టు అతడెలానో గ్రహించగలిగాడు. అటువంటి విలక్షణ స్థితిని ఎదుర్కొన్న ఎందరో తికమకపడినట్టే అతడూ పడుతున్నాడు.

అయితే చౌదరి ఏమాత్రం భయభ్రాంతుడు కాలేదు. తను భయభ్రాంతుడైనట్టు ఎవరికీ కనిపించకుండా జాగ్రత్తపడ్డాడనడం అంతకంటె సబబు. తనను తొలగించిన పక్షంలో ముఖ్య మంత్రి పదవి కోసం పోటీపడే పరస్పర ప్రత్యర్థులుగా, అప్పటికే తన మంత్రివర్గ సహచరులు ముగ్గురిని బరిలోకి దించాడు. అటు తరువాత ముగ్గురికీ, విడివిడిగానే అనుకోండి. ఢిల్లీ వెళ్ళి తమ అదృష్టాన్ని పరీక్షించుకోమని నూరిపోశాడు. చౌదరి మద్దత్తు పూర్తిగా తనకే ఉందన్న అభిప్రాయాన్ని ముగ్గురికీ కలిగించాడు. వాళ్ళు అతడి ఉచ్చులో పడిపోయి ఒకరినొకరు దుమ్మెత్తిపోసుకోవడం ప్రారంభించారు. ఇంకా ఇంకా బక్సాలు ఢిల్లీకి చేరుకోసాగాయి. ఇందిరా గాంధీకి ఆప్తులమని చెప్పుకుంటూ ఎందరెందరో రాజకీయ దళారులు ఉన్నట్టుండి ఆకాశం నుంచి ఊడిపడ్డారు. ఈ పరుగుపందేన్ని అక్షరాలా నిజమనుకున్న ఓ మంత్రి నిరుపేద కుటుంబం నుంచి వచ్చిన వాడు. తను తప్ప తన మంత్రులెవరూ డబ్బు సంబంధాలు పెట్టుకోకుండా చూడడంలో చౌదరి విశేషమైన జాగ్రత్త తీసుకుంటాడు కనుక అతడు పేదవాడుగానే మిగిలిపోయాడు. ముడుపులు తీసుకునే విద్యలో అనుభవం లేని వాడు ఎలా పట్టుబడిపోతాడో ఆ మంత్రి కూడా అలాగే ఒక నేరం మొదటిసారి చేస్తూ పట్టుబడిపోయాడు. ఆ ఒక్కసారికి మాత్రం ముడుపులు అందుకునే ఆత్రుతతో (ఇంతటితో ఆగిపోయి తిరిగి ఎప్పటిలా నీతి నిజాయితీ బద్ధమైన తన అసలు స్వభావానికి మళ్ళిపోవాలన్న ఊహతోనే కావచ్చు) బొత్తిగా చవటలా లావాదేవీ సాగించి పీకలోతు కష్టాల్లో కూరుకుపోయాడు. రాష్ట్రంలో ప్రతి ఒక్కరూ దిగ్భ్రాంతి చెందారు. చౌదరితో సహా ఆ కుంభకోణం నుంచి బయటపడే దారేదీ కనిపించలేదు. అటు చౌదరీ తన మంత్రిని ఆ గండం నుంచి గట్టెక్కించాలని అనుకోలేదు. ముఖ్యమంత్రి పదవి కోసం తన అదృష్టాన్ని పరీక్షించుకోవాలన్న ఓ మంత్రి ఆ ప్రయత్నంలో ఉన్న పదవిని కూడా ఊడగొట్టుకుంటే అది వాడి ఖర్మ అనుకున్నాడు. మొత్తానికి ఆ మంత్రికి ఉద్వాసన జరిగిపోయింది. రెండు దశాబ్దాల పాటు నిజాయితీబద్ధంగా చేసిన ప్రజాసేవ ఒక్కసారిగా మట్టికొట్టుకుపోయింది. కొద్ది వారాల్లోనే అతడు రాజకీయ అజ్ఞాతంలోకి జారిపోయాడు. పట్టించుకున్న వారు లేరు, అయ్యో అనుకున్న వారు లేరు.

ఈ ఉదంతం ఇందిరాగాంధీ చెవినపడిందో లేదో స్పష్టంగా తెలియదు. నిజాయితీ పరు డనిపించుకున్న ఓ మంత్రి మొదటిసారి అవినీతిపరుడుగా మారిన ఓ అసాధారణ ఉదంతంగానే

ప్రజలు దీనిని పరిగణించారు. ప్రతి ఒక్కరూ అవినీతిని ఖండించాలన్నది కాకుండా చేతకాని వాడు అవినీతి జోలికి పోకూడదన్నది ఇందులోంచి పిండి తీసిన నీతి.

అప్పటికి చౌదరి వారసుడి కోసం అన్వేషణ ప్రారంభమైందన్న విషయం జనం మామూలు గానే చెప్పుకునే ముచ్చటైపోయింది. అటువంటిదేదో జరుగుతున్నట్టు ఎవరూ అననూలేదు. ఇదమిత్థంగా దాని గురించి ఎవరికీ తెలియనూ తెలియదు. అయినా ఆ వార్త అంతటా పాకి పోయింది. పత్రికలు యధావిధిగా ఊహాగానాలను పండిస్తూ కాబోయే అభ్యర్థులుగా ఎవరెవరినో చూపించడం ప్రారంభించాయి. వాళ్ళల్లో అత్యంత ప్రసిద్ధుల నుంచి అత్యంత అనామకుల వరకూ ఉన్నారు. అత్యంత అర్థరహిత అభ్యర్థుల విషయం ఇక చెప్పనే అవసరంలేదు. చివరకు ఆశ్చర్యకరమైన ఎంపిక జరిగినా జరగవచ్చునన్న జోస్యం దగ్గర పత్రికల కథనాలు ఆగుతున్నాయి. ఈ జోస్యం అందరి అవకాశాలనూ సమానం చేసి ఆనందప్రదమైన అనిశ్చిత స్థితిలో వారిని ఓలలాడిస్తోంది.

'ఈ ఆశ్చర్యకరమైన ఎంపిక ఎటువంటిది కావచ్చునంటారు?' ఢిల్లీ నుంచి తిరిగి వచ్చి తన విఫలయత్నం గురించి చౌదరికి తెలియజేసిన కొన్ని రోజుల తర్వాత శేఖర్ చౌదరిని ప్రశ్నించాడు.

గత కొద్ది రోజులుగా చౌదరి ఆలోచనలేమిటో అతని సన్నిహిత మిత్రులకు కూడా అంతు బట్టకుండా ఉన్నాయి. నిబ్బరంగా నిమ్మకునీరెత్తిన వాడిలా కనిపిస్తున్నాడు. నిజం చెప్పాలంటే మామూలు కంటే మించిన మోతాదులో తను శాశ్వతంగా అధికారంలో ఉండబోతున్న వాడిలా తన దైనందిన విధులు నిర్వహిస్తున్నాడు. ఎక్కడా వీసమెత్తు వంక పెట్టడానికి వీలులేని మహా నటన. అయితే అంతటి నిర్వికారముద్రలోనూ అలజడి ఆనవాళ్ళు తొంగి చూస్తూనే ఉన్నాయి. అగ్నిపర్వతం బద్దలయ్యే ప్రమాదం, తదనంతర బీభత్సం కళ్ళముందు రూపుకడుతూనే ఉన్నాయి.

కీలకనాటకానికి తననుతను సమాయత్తం చేసుకుంటున్నాడా అన్నట్లుగా చౌదరి ఆ రోజు తగలేస్తున్న లెక్కలేనన్ని సిగరెట్ల పరంపరలో మరో దానిని వెలిగించాడు.

'నాకెలా తెలుస్తుంది?' భుజాలు ఎగరేస్తూ అన్నాడు. 'ముఖ్యమంత్రుల పుట్టుకకీ, చావుకీ రంగస్థలమైన ఢిల్లీకి రాకపోకలు సాగించింది నువ్వూ. అయినా వెళ్ళిపోవడానికి సిద్ధంగా ఉన్న వాడికి తన వారసుడెవరన్న చింత అనవసరం.'

'నా తర్వాత జల ప్రళయం... అంతేనా మీరనేది?'

'అవును, ఎందుకు కాదు?' చౌదరి ఎదురు ప్రశ్నించాడు. 'చూడు, ఇందిరాగాంధీ పార్టీలో వెన్నెముకంటూ ఒకటున్నాడని అనిపించుకోగలిగిన చిట్టచివరి ముఖ్యమంత్రిని ఈ రాష్ట్రానికీ నేనే అవుతానని కచ్చితంగా చెప్పగలను!'

'అదేదో అజరామరమైన భుజకీర్తిగా మీరు భావిస్తున్నట్టున్నారు' శేఖర్ ఒకింత హేళనగా అన్నాడు.

'నా కటువంటి భ్రమలేవీలేవు, ఆ సంగతి నీకూ తెలుసు' చౌదరి తిప్పి కొడుతున్నట్టు అన్నాడు. 'నీకు నవ్వుగానే ఉంటుంది. కానీ ఈ రాష్ట్రం గురించి నేను ఆందోళన పడుతుంటానని నీకూ తెలుసు. మహేంద్రనాథ్ ఇక్కడ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు కేంద్రానికి నేను ఇష్టుణ్ణయ్యాను. సరే అదంతా రాజకీయాల్లో భాగం. ఆ రాజకీయాలు నావీ, ఇందిరాగాంధీవీ కూడా. మహేంద్రనాథ్‌కి వ్యతిరేకంగా ఆమె నన్ను వాడుకుంది. అందుకు ప్రతిఫలంగా రాష్ట్రంలో అత్యున్నత పదవి నాకు లభించింది. ఇప్పుడు నే నామెకు వదిలించుకోదగిన వాడిగానో, చీడగానో కనిపిస్తున్నాను. పక్కకి తప్పించవలసిన మనిషిగా లేదా చిన్నబుచ్చదగిన మనిషిగా కనిపిస్తున్నాను. ఎలా చూసినా నేను నిష్క్రమించవలసిందే. అయినా నాదైన ఆలోచన నాకూ ఉంది. ఈ ముఖ్య మంత్రి పదవికి తప్ప నేను ఇందిరాగాంధీకి మరే విధంగానూ రుణపడిలేను. నేను తప్పు కున్నాక ఆమెకా విషయం తెలిసొస్తుంది. ఏ పదవీ శాశ్వతం కాదు. కనుక నేను తప్పుకున్న తర్వాత ప్రజలు ఏమంటారో తెలుసుకునే ప్రయత్నం చేస్తున్నాను. ఒక రాజకీయవాది విలువకు అసలైన గీటురాయి అదే.'

'జనం ఏమనుకుంటారని మీరు భావిస్తున్నారు?'

'నాకు తెలిస్తే ఇంకేం?' చౌదరి రెట్టిస్తున్నట్టు అన్నాడు. 'బహుశా నీ అభిప్రాయానికి, ఆనంద్ అభిప్రాయానికి మధ్యస్థంగా ఉండే అభిప్రాయాన్ని వాళ్ళు వ్యక్తం చేయచ్చు...'

'ఎంత గొప్ప విశదీకరణ?' శేఖర్ ఆశ్చర్యస్ఫోరకంగా అన్నాడు. 'రెండు అజ్ఞాత విషయాలతో మూడోదానిని వివరించే ప్రయత్నం! అది సరే, ముందు మీరు కాబోయే వారసుడి గురించి ఎందు కాలోచించరు? ఇప్పుడు హఠాత్తుగా ప్రజాభిప్రాయాన్ని ఎందుకు ఆశ్రయిస్తున్నారు? ముందూ మునుపూ ఎప్పుడైనా ప్రజాభిప్రాయాన్ని పట్టించుకున్నారు కనుకనా?'

'ఇప్పుడు మాత్రం పట్టించుకుంటున్నా ననుకుంటున్నావా?' చౌదరి జవాబు చెప్పాడు. 'మై డియర్ ఫ్రెండ్, నువ్వు తెలుసుకోవలసిన వాస్తవం ఏమిటంటే ఈ పాతకాలపు చౌదరి ఇంకా... మరోసారి అంటున్నాను... ఇంకా తన రాజకీయ చరమాంకానికి చేరుకోలేదు. ఇంకా చూడవలసిన జీవితం చాలా ఉంది. కనుక పదవి నుంచి తప్పుకునే ఘట్టంలో తగు మాత్రం అనుకూల ప్రజాభిప్రాయం అవసర సమయంలో ఆదుకుంటుందని ఊహ. కనీసం నా నుంచి ఎంతో ఉదారంగా సహాయాలు అందుకున్న ఎందరో జర్నలిస్టులలో, అందరూ కాకపోయినా కొందరైనా నన్నంత త్వరగా విడిచిపెట్టిపోరులే అనుకుంటున్నాను. నేనేం వాళ్ళను కృతజ్ఞత చూపించుకోమని అడగను; ఆ విషయంలో నేను వాస్తవికవాదిని, నేను కోరేదల్లా మీకే మరి కొంత మంచి భవిష్యత్తు కావాలనుకుంటే నన్ను కాస్త క్షేమంగా ఉండనివ్వండని మాత్రమే. అయితే తక్షణ కర్తవ్యం వారసుణ్ణి వెతికి పట్టుకోవడమేనని నేనూ ఒప్పుకుంటున్నాను. అంతకన్న మెరుగైనదేమంటే తనంతట తనే వారసుడు బయటపడేలా చేయడం!'

'ఆ మాటలోని అంతరార్థం ఏమిటో?' శేఖర్ ప్రశ్నించాడు. బాగా గంజి పెట్టబడి, మల్లె పువ్వుల్లా తెల్లగా పైకి పొడుచుకు వచ్చిన అగ్రభాగంతో స్వల్పంగా పక్కకి ఒరిగిన ఆ గాంధీటోపీ కింద మహోధృతంగా పనిచేస్తున్న అనేక మెలికలు తిరిగిన ఆ బుర్రను ఊహించుకుని వెరగు పడుతూ.

'ఏముంది సింపుల్‌' చౌదరి వివరించాడు. 'ఈ క్షణాన నేనో పనికిమాలిన వాణ్ణి. న్యాయంగా అయితే దిగిపోతున్న ముఖ్యమంత్రిని అతడి వారసుడి విషయంలో సంప్రతించాలి. కానీ ఆ లాంఛనం వల్ల ఒరిగేదేమీ ఉండదు. ప్రస్తుత ఘట్టానికొస్తే నేను సూచించిన పేరును తక్షణమే కొట్టిపారేస్తారు. అది నాకు బాగా తెలిసిన ఓ అప్రకటిత సూత్రం. చాలా కేసుల్లో అలా జరగడం నేను చూశాను.'

'అప్పుడు, ఏదో ఒక పేరును -లేదా ఆ పేరునే మీరెందుకు సూచించకూడదు?' తగు మాత్రంగా తెచ్చి పెట్టుకున్న తహతహను ప్రదర్శిస్తూ శేఖర్ అన్నాడు.

చౌదరి ఒక్కసారి పగలబడి నవ్వేశాడు. కాస్సేపు తనివితీరా అలా నవ్వుతూనే ఉండి పోయి చివరకు అన్నాడు. 'నువ్వు జీనియస్‌వి శేఖర్, ఎప్పుడూ ఒప్పుకుంటున్నట్టే ఇప్పుడూ ఒప్పుకుంటున్నాను. ఎంత అమోఘమైన ఆలోచన, నా చేత ఆనంద్ పేరు చెప్పించాలని, అద్భుతమైన ఎత్తుగడ!' మళ్ళీ విరగబడి బిగ్గరగా నవ్వుతూ ఉండిపోయాడు

'సరే, మీరు నన్నెటూ సరిగానే అంచనా వేశారు కనుక మీ పొగడ్తను తిరస్కరించలేను, శేఖర్ ఒప్పుకోలుగా అన్నాడు. 'అయినా అది తగిన పేరు కాదంటారా? నా అభిప్రాయమెలాంటిదైనా కానివ్వండి. తనదైన తరహాలో చాపకింద నీరులా, అంతుపట్టని రీతిలో ఆనంద్ పేరు ఇప్పటికే ప్రచారంలో ఉన్న సంగతి నిజంకాదంటారా? ఇక్కడా, ఢిల్లీలో – ముఖ్యంగా ఢిల్లీలో జరుగు తున్నదేమిటో మీకు తెలుసుననే అనుకుంటున్నాను '

'అంటే నీ ఉద్దేశం, ఆనంద్ ఇక్కడా, ఢిల్లీలో తన పేరు తనే ప్రచారం చేయించు కుంటున్నాడనా?'

'ఆ సుగుణాలరాశి అటువంటి పని ఎప్పుడూ చేయడని మీకూ తెలుసు, నాకూ తెలుసు!' ఏదో అప్రియసత్యం చెబుతున్నట్టుగా శేఖర్ ఛీత్కరిస్తూ అన్నాడు. 'అయితే కొన్ని పేర్లు వాటికవే ప్రచారమౌతూ ఉంటాయి. కొన్ని సందర్భాలలో ఒక్కొక్క పేరునూ తొలగిస్తూ పోగా మిగిలిన పేర్లు ప్రచారంలోకి వస్తుంటాయి. కొన్ని సందర్భాలలో కొన్ని పేర్లు కేవలం యాదృచ్ఛికంగా ప్రచారంలోకి వస్తుంటాయి. మొత్తం మీద ఇది మీ అభ్యర్థి అన్న అనుమానం ఆమెకు కొంచెమైనా కలిగించకుండా ఇందిరాగాంధీచేత మీ మనిషిని ఎంపిక చేయించగలగడానికి సంబంధించిన ప్రశ్న.'

'అది సాధ్యమని నే ననుకోను శేఖర్. ఆమె గురించి నాకు తెలిసినంతలో అటువంటి పొరపాటు ఎప్పుడూ చేయదు. నన్ను దిగిపొమ్మని ఇంతవరకూ ఆమె ఎటువంటి సంకేతం పంపించలేదు. అయినా ఆ మేరకు వదంతులు, సూచనలు రోజు రోజుకీ బలపడుతున్నాయి. ఆమెకు సంబంధించిన మిస్టరీలలో ఇది కూడా ఒకటి ఇప్పటికే ఊహలు చేసి చేసి అలిసిపోయాను. నేనుగా తప్పుకోవడం అసాధ్యమనే అనుకుంటున్నాను; అంతకంటే హాస్యాస్పదం ఉండదు. అయినా తన మంచితనాన్ని నేను నిలుపుకోవాలంటే తప్పుకోవడానికి నా అంతట నేనే ఏదైనా మార్గం వెతుక్కోవాలని ఆమె కోరుకుంటోంది చాలా చిక్కు సమస్య. నా దగ్గర ఎటువంటి పరిష్కారం లేదు!'

మళ్ళీ మళ్ళీ బయలుదేరిన చోటికే వస్తూ ఇరువురూ సమస్యపై క్షుణ్ణంగా చర్చ జరిపారు. తన సందిగ్ధం నుంచి బయటపడడంగానీ, శేఖర్‌ని సమర్థవంతంగా నిరుత్తరుణ్ణి చేయడం కానీ

చేయకుండానే చివరకు చౌదరే చర్చ విరమించాడు. ఈ ముసలి నక్క ఏదో ఒక గూడుపుఠాణీ చేయకుండా ఊరుకునేరకం కాదనుకున్నాడు శేఖర్. అతడి నుండి సెలవు తీసుకుంటూ ఊరుకుంటే అతడు చౌదరెందుకౌతాడు? ఎప్పటిలానే కేవలం పైకి తేలడం లేదంతే అనుకున్నాడు, చౌదరి మరో సిగరెట్ చేతిలోకి తీసుకుంటుండగా.

★ ★ ★

'అసాధ్యం'! – ఆనంద్ లాంటి ఓ 'సజ్జనుడు' ముఖ్యమంత్రి కాగల అవకాశంపై రాష్ట్రం లోని 'సర్వజ్ఞ' వర్గాలంతటా దాదాపు ఏకగ్రీవంగా వ్యక్తమైన తీర్పు ఇదీ. 'నీకు అర్థంకాదు' ఓ రాజకీయవాదికి మరో రాజకీయవాది వివరించే ప్రయత్నం చేశాడు. 'ముఖ్యమంత్రిగా రాణిం చాలంటే రెండు లక్షణాలలో ఒకటి తప్పకుండా ఉండాలి. రెండూ ఉంటే మరీ మంచిది. ఒప్పు కానీ, తప్పుకానీ తను ఏం చేయదలచుకుంటే అది చేయగలిగిన కరకుతనం అతడికి ఉండాలన్నది మొదటిది! ఇంకా చెప్పాలంటే తప్పు చేయడంలో కరకుతనం మరింత ఎక్కువ ఉండాలి. ఇక రెండోది - అతడు తలపడవలసింది దుష్టశక్తులతోనే కనుక మరింత సమర్థవంతంగా వాటిని ఎదుర్కోడానికి స్వభావ రీత్యా అతడు కూడా దుష్టుడై ఉండాలి. చిల్లర విషయాలన్నీ పక్కన పెట్టి నేను కేవలం ముఖ్యవిషయం చెబుతున్నాను. నాకు ఏ ముఖ్యమంత్రిపట్లా వ్యతిరేక భావంలేదు, మరెవరైనా కానీ, ఇంకా నన్నడిగితే చౌదరిని మరింతగా ఇష్టపడతానని చెబుతాను...'

'ఏం లాభం? ఇందిరాగాంధీ అతణ్ణి ఇష్టపడడంలేదు'. అవతలి మనిషి తక్షణ సమాధానం ఇది. 'అంచేత ఆమె ఇష్టపడే మరో పేరేదైనా చెప్పు.'

'చెబుతున్నానుగా, ఆనంద్ మాత్రం కాదు. నన్నే కనుక ఎంచుకోమంటే శేఖర్‌ని ఎంచు కుంటాను. అతడైతే అతికినట్టు సరిపోతాడు.'

రాష్ట్రంలోని భూస్వామ్య కూటమి రాత్రికి రాత్రి అప్రమత్తమైపోయి బరిలోకి దూకినట్టు అదేపనిగా వదంతులు వినిపించసాగాయి. ఓ 'కూటమి' గా అది విపరీత ప్రమాణంలో చురుకుదనం పుంజుకుని, దుర్భాషలకు దిగినా, భూస్వాములు వ్యక్తిగత స్థాయిలో చేసే బహిరంగ వ్యాఖ్యలలో మాత్రం కొంత నిదానం, జాగ్రత్త కనబరుస్తున్నారు. ఈ తేడా కొట్టొచ్చినట్టు కనిపించింది. దేనినీ - సంపూర్ణంగా దేనినీ త్రోసిపుచ్చలేమనడానికి ఇది సూచన. 'కారణం మరేం లేదు', బలరాం వివరించాడు. 'ఈ రాష్ట్రంలో ఎవరెటువంటి ఆలోచనైనా చేయనీ, అంతిమంగా జరిగే దానికీ ఆ ఆలోచనకూ ఎటువంటి సంబంధమూ ఉండదు. జరగబోయేదేమిటో తెలిసింది ఆ ఒక్క ఇందిరాగాంధీకి మాత్రమే. మిగిలినదంతా ఒట్టి కంఠ శోష.'

ఆనంద్ అభ్యర్థిత్వం అసాధ్యమన్న అభిప్రాయం 'ప్రతి ఒక్కరి'లో ఎంతగా పుంజుకుంటుంటే అంతగా అతడి పేరు 'గాలి'లో తేలియాడుతూ ఉండగలగడం చెప్పుకోదగిన విచిత్రం. పత్రికలతణ్ణి ఆరంభశూరుడుగా తేల్చిపారేశాయి. 'ఆయన పట్ల వ్యక్తిగతంగా మాకేమీ లేదు' అంటూ ఓ సంపాదకీయం బుజ్జగింపు పోకడలో రాసుకుంటూ వచ్చింది. 'అయితే ఇటువంటి విషయాలను ఎవరైనా వాస్తవదృష్టితో చూడక తప్పదు. ఆనంద్ మంత్రిగా తాను చేయవలసిన విధులన్నింటినీ అమోఘంగా నిర్వర్తించారన్నది ఎవరూ కాదనలేని విషయం. అయినప్పటికీ భూ పరిమితుల

పేరుతో పుట్టుకొచ్చిన వివాదం ఆయన అవకాశాలకు అవరోధంగా మారితీరగలదన్న అభి ప్రాయానికి ఎవరూ రాకుండానూ ఉండలేరు. ఆయన చేసింది తప్పా, ఒప్పా అన్నది ఇక్కడ ప్రశ్న కాదు. అసలు ప్రశ్నల్లా ఆయన రాష్ట్రాన్ని సమర్థవంతంగా పాలించగలరా అన్నదే.'

అతడిలో అసంతృప్తి కలిగించే లక్షణాలు వాళ్ళకు చాలా కనిపించాయి. కాని తమ మాటల్లో తమకే విశ్వాసమున్నట్టు వాళ్ళకు తోచలేదు. ఆనంద్ 'మరీ ఇలాంటి వాడు, మరీ అలాంటి వాడు' కనుక అతడి అభ్యర్థిత్వం పరిశీలనాయోగ్యం కాదన్నది వాళ్ళు ముందుకు తెచ్చిన దిగ్భ్రమ కలిగించే హేతువు. ఈ 'మరీ ఇలాంటి వాడు, మరీ అలాంటి వాడు' వాదనను ప్రతి కూల విమర్శ అనడానికి వీల్లేదు – కనీసం స్థూల దృష్టికైనా అది ప్రతికూల విమర్శగా కని పించేది కాదు అయినా ఆనంద్ అభ్యర్థిత్వాన్ని అది నిలువునా త్రోసిపుచ్చింది. 'ఎందుకని అడగద్దు, అతడు పరిశీలనార్హుడు కాదు అంతే' అన్నది ఆనాటి సంపాదకీయాల విజ్ఞతాసారం.

రాజకీయవాదులు స్పష్టంగా పైకి అనకపోయినా, ఆనంద్‌ను సమర్థించడంలో అరుణ కనబరుస్తున్న అత్యుత్సాహం వాళ్ళకు అభ్యంతరకరంగా కనిపించింది. కారణమేదైనా కానీ, అసలు ఏ కారణమూ లేకనేపోనీ ప్రతివాళ్ళకు ఆనంద్‌ను వ్యతిరేకించే హక్కు ఉంది. కానీ అతడికి అనుకూలంగా మాట్లాడే హక్కు మాత్రం అరుణకు లేదు. ఈ అర్థరహిత ధోరణి వల్ల అనేక తగాదాలు పుట్టుకురావడం, వాటిలో నిస్సందేహంగా అరుణదే పైచేయి కావడం జరిగాయి ముఖ్యమంత్రి కావాలని ఆనంద్ ఆశిస్తున్నాడని అనుకుంటే, ఆ తగాదాలు అంతిమంగా అతనికే హాని కలిగించాయి. అయితే మానవ సహజమైన అటువంటి ఆకాంక్ష ఎవరికైనా ఉంటుందన్న అస్పష్టమైన, స్థూలమైన ఊహ మీద ఇది ఆధారపడినదే తప్ప అతడికి నిజంగా ఆ కోరిక ఉన్నట్టు తమకు కచ్చితంగా తెలిసి అనుకున్నది కాదు.

అనిశ్చితత్వం నిరవధికంగా సాగుతున్నట్టే కనిపించింది. ఆ సుదీర్ఘ నిరీక్షణలో ఒకానొక దశలో శేఖర్ కేవలం ప్రేక్షకుడిగా ఉండడం విరమించి ఒక విధమైన పాత్రధారిగా మారిపోయాడు. కారణం తెలియదు కానీ ఆ క్షణం వరకూ తను కూడా పరుగుపందెంలో ఉన్నట్టు అతడూహించుకున్నవాడు కాడు. స్కూల్లో ఆనంద్ సహాధ్యాయి, ఇప్పుడు శత్రువుగా మారిన ఒకప్పటి మిత్రుడు శ్యామ్‌సుందర్ ఫోన్‌లో చేసిన ఓ సుదీర్ఘ సంభాషణ అతడిలో అటువంటి ఊహరేకెత్తించింది. ఎన్నికల్లో ఆనంద్‌ను ఓడించడానికి తాను చేసిన ప్రయత్నం విఫలమైనా, ఆనంద్ అంతుచూడడ (ఆనందో సైడ్)మనే తన లక్ష్యాన్ని శ్యామ్ వదులుకోలేదు. ఇప్పుడు ఆనంద్ ముఖ్యమంత్రి పదవికి ఎగబాకే అవకాశం తలుపుతడుతున్న స్థితిలో రాష్ట్రానికి అంతకు మించిన సర్వనాశనాన్ని, వ్యక్తిగతంగా తనకు అంతకన్నా దుస్సహ పరాభవాన్ని, అతడు ఊహించ లేడు. అప్పటికా సంభావ్యత కేవలం ఊహాజనితస్థితిలోనే ఉండవచ్చు. అయినా సరే భూస్వామ్య వర్గం ఏమరి ఉండడానికి వీల్లేదు. శేఖర్‌తో శ్యామ్‌సుందర్ జరిపిన సంభాషణ రెండు వైపులా నిర్ణయాన్ని దృఢతరం చేసింది. అమోఘమైన పథకం వెంటనే తయారైంది.

శ్యామ్‌సుందర్ స్వగ్రామానికి సమీపంలోని రిజర్వ్ ఫారెస్ట్ నుంచి పది ట్రక్కుల పరిమాణం కలిగిన మేలిరకం కలప అపహరణకు గురైనట్టు ఓ క్రిమినల్ కేసుదాఖలయ్యేందుకు ఏర్పాటు చేశారు. తగిన ఎరలు వేసి అటవీశాఖ అధికారుల నుంచి, ఓ పోలీస్ అధికారి నుంచి ఇందుకు

సహాయం తీసుకున్నారు. శ్యామ్‌సుందర్‌కు అత్యంత విశ్వాసపాత్రులైన పది, పన్నెండు గురు గ్రామీణులు అర్ధరాత్రి చీకటి మాటున సరకును బళ్ళకెత్తించారు. ఆ కలపను తామే పడగొట్టామని, సమీపంలోని రోడ్డు దగ్గర నిలిపిన 'మంత్రి ఆనంద్ సాహెబ్' గారి ట్రక్కు దగ్గరకు సరకును బళ్ళల్లో తరలిస్తున్నామని తమకు తెలిసిన దేవుళ్ళూ, దేవతల మీద ఒట్టుపెట్టి మరీ వాళ్ళు అధికారులకు చెప్పారు. కేసుకు మరింత బలం చేకూర్చడానికి అన్నట్టు రెండు రోజులపాటు గాలించి ట్రక్కు డ్రైవర్‌గా భావించబడిన ఓ వ్యక్తిని అరెస్టు చేశారు. ఆనంద్‌ను ప్రధాన నిందితుడుగా, బళ్ళవాళ్ళను, నకిలీ ట్రక్కు డ్రైవర్‌నూ సహనిందితులుగా పేర్కొంటూ పోతపోసిన ఇనుమును తలపింపజేసే ప్రాథమిక సమాచార నివేదిక (ఎఫ్.ఐ ఆర్ )ను దాఖలు చేయించారు.

ఈ అద్భుతమైన ఏర్పాటు శ్యామ్‌సుందర్‌కు ఎంతో సంతృప్తినిచ్చింది. అయితే అతడి మస్తిష్కం లోలోపల ఎక్కడో ఒకింత జడుపు బయలుదేరింది. రిజర్వ్ ఫారెస్ట్‌లోని కలపను అక్రమంగా పడగొట్టి నల్లబజారుకు తరలించే శ్యామ్‌సుందర్ వ్యాపారం గురించి ఊళ్ళో అందరికీ తెలుసు. సరకు పంపించిన ప్రతిసారీ అధికారుల నోరు మూయించడానికి ఆనంద్ పేరు వాడుకుంటూ వచ్చాడు. ఈ లెక్కన ఆనంద్ రాష్ట్ర రాజధానిలో డజన్లకొద్దీ భవనాలు నిర్మించుకుని ఉండాలంటూ ఈ మధ్య ఊళ్ళో గడుగ్గాయిలు చెవులు కొరుక్కోవడం కూడా ప్రారంభించారు. అయితే పెద్ద వాళ్ళు గదమాయించి వాళ్ళ నోళ్ళు మూయిస్తూ వచ్చారు. ఏమనుకుంటాన్రు? మన దొరగారూ, మంత్రిగారు మంచి దోస్తులు. బుర్ర తక్కువ గాడిదెల్లారా, పెద్దోళ్ళ ఇసయాలు మీ కెందుకు? గమ్మునుండండి!' అంటూ హెచ్చరించారు.

ఇది 1967 ఎన్నికల ముందు, శ్యామ్ ఆనంద్‌కు ఆప్తమిత్రుడుగా ఉన్నప్పుడు. అయితే ఆ ఎన్నికల సమయంలో అంతా మారిపోయింది. తన ఊళ్ళో వోట్లు ఆనంద్‌కు పడకుండా చూడడానికి శ్యామ్‌సుందర్ తన యావత్తు శక్తియుక్తులనూ, తన అధికారాన్ని పూర్తిగా వినియోగించాడు.

తనిప్పుడూ ఎంతో అసాధ్యమైన అద్భుతాన్ని సాధించానని శ్యామ్‌సుందర్ పొంగిపోతున్నాడు. తన పని వాళ్ళతోపాటు ఆనంద్ కూడా ఇప్పుడు ఓ దొంగతనం కేసులో నిందితుడు -ఎంత తెలివిగా అతణ్ణి ఇరికించాడు! తన పాత స్కూలు మిత్రుడు ఆనంద్ కటకటాల వెనుక ఉన్న దృశ్యాన్ని ఊహించుకున్నాడు. అలాగే ఆరేళ్ళపాటు అసెంబ్లీ సభ్యత్వానికి అతడు అనర్హుడైన పరిస్థితిని కూడా.

ఇటువంటి ఉత్తేజభరిత ఊహల్లో మునిగితేలుతూ శేఖర్ ఎంతో తాపీగా తన డ్రాయింగ్ రూమ్‌లోకి అడుగుపెట్టిన విషయాన్ని కూడా అతడు గమనించలేదు. శేఖర్ భుజం తట్టేసరికి ఈ లోకంలోకి వచ్చాడు. మరుక్షణమే ఆనంద్ కటకటాల వెనుక ఉన్న ఆనందకర దృశ్యాన్ని తన మనోనేత్రంతో దర్శిస్తూ పరిసరాలు మరిచిపోయాడు. శేఖర్ అతికష్టంమీద అతణ్ణి స్పృహలోకి తీసుకుని రావలసి వచ్చింది.

'ఇందులో పొంగిపోయేందుకేమీ లేదు శ్యామ్‌జీ. నీ ప్రయత్నంలోని అసలు కీలకాన్ని నువ్వు అర్థం చేసుకున్నట్టు లేదు.'

'ఎందుకలా అంటున్నావు?' ఒకింత కోపంతో రెట్టిస్తున్నట్లు అన్నాడు శ్యామ్‌సుందర్. 'మన మిత్రుడు తిన్నగా జైలుకు వెళ్ళడంటావా?'

'ఎందుకు వెళ్ళడు, వెళతాడు. ఆరోపణ రుజువైతే!'

'అదేమిటి, అలా అంటున్నావ్?' అయినా నీ లిటిగేషన్లు నాకు అర్థం కావులే, ఈ పన్నుగడ అంతా నీదీ?

'అవును నాదే - అందులో నువ్వు వంక పెట్టగలిగిందేమీ లేదు. అయితే ఇది తప్పుడు కేసని మనిద్దరికీ తెలుసు. నిజం బయటపడితే ఏం జరుగుతుందో కూడా నీకు తెలుసు..'

శ్యామ్‌సుందర్‌కు కోపం ముంచుకొచ్చింది - ఒక్కసారిగా అప్రమత్తుడయ్యాడు. 'అంటే నన్ను బెదిరిస్తున్నావన్నమాట?' అంటూ అరుపు లంకించుకున్నాడు. 'నేను జైలుకు వెళ్ళాల్సి వస్తుందనా నువ్వంటున్నది ?'

'కోప్పడకు మిత్రమా. ఎవడూ జైలుకెళ్ళడు. ఈ పన్నాగం వెనుక ఉన్న అసలు ఉద్దేశం ఆనంద్ ముఖ్యమంత్రి కాకుండా చూడడం... ఆ సంగతి గుర్తుందా ?'

'గుర్తులేకేం? దాంతో పాటు నేననుకున్నది-'

'ఎవరూ అనుకోనిది నువ్వనుకుంటే నేనేం చేసేది శ్యామ్‌జీ. అసలు విషయానికొస్తే అసెంబ్లీ లోకి అడుగు పెట్టకుండా ఆనంద్‌ను నిరోధించలేకపోవడం ఎంత నిజమో, అతణ్ణి జైలుకు పంపించడమూ అంతే నిజం...'

'అయితే ఇదంతా చేయడంలో అర్థమేముంది ?'

'చాలా ఉంది శ్యామ్‌జీ. ఆనంద్ ముఖ్యమంత్రి కాకుండా మనం అడ్డుకోగలిగితే రాష్ట్రంలోని భూస్వాములందరూ నా వైపు తిరిగిపోతారు. ఇప్పుడు చెప్పు. ఈ ఒక్కసారికి నీ డబ్బు సంచుల కట్లు మరికాస్త వదులు చేయగలవా ?'

'దానికేం?... అదో సమస్య కాదు' శ్యామ్‌సుందర్ అన్నాడు. 'ఇంతకీ నువ్వనేదేమిటి?'

'దయచేసి విను. పైసాలోనే పరమాత్మ ఉన్నాడని విశ్వసించే ఎంపిక చేసిన కొందరు జర్నలిస్టుల పేర్లున్న రెండు జాబితాలు నీ కిస్తాను. ఒక జాబితా రాష్ట్ర రాజధానికి చెందిన వాళ్ళది. రెండోది ఢిల్లీ వాళ్ళది. రేపే ఓ నమ్మకస్తుణ్ణి నీ దగ్గరికి పంపిస్తాను! అన్ని విషయాలూ వాడే చూసుకుంటాడు. ఆనంద్‌పై వచ్చిన దొంగతనం కేసు గురించి ఒకేరోజున ఇక్కడి పత్రికలు, ఢిల్లీ పత్రికలు పతాక శీర్షికలో ప్రచురిస్తాయి. కనీసం వారంరోజుల పాటు అసలదెలా జరిగిందో ఆసక్తికరమైన ఉపఖ్యానాలు వెలువడుతాయి. దాంతో నీ స్కూలు మిత్రుడి పనిసరి.... అర్థమైందా?'

'బాగానే ఉన్నట్టుంది. కానీ అతడు మంత్రిగానే కొనసాగుతాడు కదా? అప్పుడు కేసే మవుతుంది?'

'దాని ఉపయోగం వారం రోజుల వరకే. ఆ తర్వాత హుష్‌కాకి. అది నిన్ను కాపాడేందుకు చేసిన ఏర్పాటు. ఆ తర్వాత మనం తలకెత్తుకోవలసిన పెద్ద పని. భూ సంస్కరణల శాఖను

ఆనంద్ చేతుల నుంచి తప్పించే ముఖ్యమంత్రిని వెతికి పట్టుకోవడం. అంత ముఖ్యమైన మరో శాఖ దేనినైనా అతడికి కట్టబెడితే కట్టబెట్టనీ, ఆనంద్ లాంటి సమర్థుల అవసరమున్న కీలక శాఖలు రాష్ట్ర ప్రభుత్వంలో లెక్కలేనన్ని ఉన్నాయి ఆ విధంగా అంతా సుఖాంతం.

అతడన్నట్టే వేసుకున్న పథకం ప్రకారమే మూడోనాడు పతాక శీరిషికలు ప్రత్యక్షమయ్యాయి. కథనాలు చాలా దారుణంగా ఉన్నాయి. అయినా నిజమనిపించేటట్టే ఉన్నాయి. ఫలితంగా, ఇటు రాష్ట్ర రాజధానిలోనూ, అటు ఢిల్లీలోనూ ఇంగితజ్ఞానం ఉన్నవాడెవడూ ముఖ్యమంత్రిత్వం కోసం జరిగే పరుగుపందెంలో ఊహలో కూడా ఆనంద్‌ను సమర్థించలేని పరిస్థితి ఉత్పన్నమైంది.

దిగ్భ్రాంతి గొలిపే ఆ వార్తల్ని విశ్వసించకుండా ఉండడానికి తగిన కారణమేదీ కనిపించ లేదు. ప్రతి వివరమూ ఎంతో యుక్తియుక్తంగా తగినన్ని రుజువులతో కనిపిస్తోంది. రిజర్వ్ ఫారెస్టు ప్రాంతాల్లో కలప అపహరణ జరుగుతూ ఉండడం మామూలే. అధికారులు చూసీ చూడనట్టు ఊరుకుంకుంటారు. కల ధరలు ఆకాశాన్ని అంటుతూ ఉంటాయి. కనుక అక్రమ కలప వ్యాపారంతో తెగబలిసిపోయే నల్ల బజారు అటు ఇళ్ళు కట్టుకునే వారికి, ఇటు అదనపు లాభాలు జేబులో వేసుకునే కాంట్రాక్టర్లకూ చెప్పలేనంత ఊరట కలిగిస్తూ ఉంటుంది. కనుక ప్రజలు కూడా పట్టించుకోరు. ఫలితంగా స్థానిక అటవీ, పోలీస్ అధికారులు రెండు చేతులా ఆర్జిస్తూ బాగుపడుతుంటారు.

ఈ పరిస్థితిని దృష్టిలో ఉంచుకుని చూసినప్పుడు పెద్ద ఎత్తున కలప దొంగతనం జరిగిందన్నది ఎవరికీ ఆశ్చర్యం కలిగించే వార్త కానేకాదు. ఎటొచ్చీ ఇందులో ఆశ్చర్యం గొలిపేదల్లా మంత్రి ఆనంద్ ఈ వ్యవహారంలో ముద్దాయికావడం, లేదు, నమ్మదగిన వార్తలా లేదని కొందరు కొట్టిపారేశారు ఇతరులు వెంటనే వారితో విభేదించారు. 'అచ్చులో వచ్చిన ఆ సమాచార మంతా అబద్ధమెలా అవుతుంద'ని వాళ్ళ ప్రశ్న. అంతుబట్టని రీతిలో విచిత్రంగా వారిలో ప్రతి ఒక్కరూ ఆనంద్ పట్ల తమలో జారిపోతున్న విశ్వాసాన్ని ఎలాగైనా కూడదీసుకోడానికి ఆ వార్తకు ఏదో ఒక విధమైన నిరాకరణ కోసం ఎదురు చూడడమో, లేక ఆ వార్త నిజమేనని భావించడానికి మరింత ప్రబలమైన సమర్థన కోసం ఎదురుచూడడమే చేశారు

వార్తా పత్రికలు మరిన్ని నాటకీయపరిణామాలతో నిండిపోగలవని కొద్దిరోజుల పాటు అందరూ ఆశించారు. జనాన్ని అంతగా లోబరచుకున్న ఘట్టంలో అంతలోనే ఉడిగిపోవడానికి అదేమంత ఆషామాషీ భోగట్టా కాదు. ఎవరి సంగతెలా ఉన్నా భూస్వామ్య కూటమి మాత్రం ఈ వ్యవహారం చేరుకోవలసిన అంతిమ ఘట్టానికీ -చట్టపరమైన ముగింపునకూ చేరుకోవడానికి ఏం చేయడానికైనా సిద్ధమైపోయింది. ఎందరో జర్నలిస్టులను, ముఖ్యంగా టేబ్లాయిడ్ రిపోర్టర్లను అన్ని రకాల ప్రలోభాలతో ఆకరిషించుకున్నారు. తమ మనుగడకు ఏకైక ప్రమాదకారిగా పరిణమించిన ఆనంద్‌ను సర్వనాశనం చేయడానికి ప్రతివాళ్ళూ కాళ్ళూ కీళ్ళూ విరుచుకునేంత పని చేశారు.

అయినా ఆనంద్‌పై దాడికి దిగిన వాళ్ళు ఆట్టేకాలం తాము సృష్టించిన ఊపును నిలబెట్ట లేకపోయారు. మెల్లగా వ్యవహారం బెడిసికొట్టడం ప్రారంభించింది. అది కూడా శ్యామ్ సుందర్ స్వగ్రామంలో మొదలుబ కావడం మరో విచిత్రం. చదువు సంధ్యలుండి శ్యామ్‌సుందర్‌ను

వ్యతిరేకించే ఊళ్ళోని పెద్ద మనుషుల్లో ఒకతను తాలూకా కేంద్రానికి వెళ్ళడం తటస్థించింది. భోజనం చేయడానికి హోటల్‌కి వెళ్ళినప్పుడు టేబుల్ మీద ఓ వార్తా పత్రిక కంటబడింది. అందులోని పతాక శీర్షిక చూసి చదవడం ప్రారంభించాడు. సంచలనం పుట్టించడానికి అవసరమైన అన్ని మసాలాలూ ఉన్న ఆనంద్‌ను గురించిన కథనమే అది. అందులోని అబద్ధాలకు విస్తుపోయిన ఆ పెద్ద మనిషి ఇంటికి తిరిగి రగానే నిరక్షరాస్యురాలైన తన భార్యకు ఆ వార్త గురించి గుసగుసగా చెప్పాడు. వెంటనే చదువు రాని అమ్మలక్కల నోట ఆ వార్త గుసగుస ఊరంతటా పాకిపోయింది. అంతిమంగా రిజర్వ్ ఫారెస్ట్‌లోని కలపతో పదేళ్ళుగా శ్యామ్‌సుందర్ సాగిస్తున్న అక్రమ వ్యాపారం గురించిన సమాచారం ముక్కలు ముక్కలుగా రాష్ట్ర రాజధానిలోని కొన్ని వర్గాల చెవికి చేరిపోయింది.

తక్షణమే ఆనంద్ నిర్మించుకున్నట్టు చెప్పిన 'దివ్య భవనం' అందరి దృష్టికి కేంద్ర స్థానం అయిపోయింది. రాజధానిలో ఉన్న కాకలుతీరిన పరిశోధనాత్మక జర్నలిస్టులు కూడా ఆ ఊహాసౌధం ఉనికిని కనిపెట్టలేకపోయారు. తమ అన్వేషణను విరమించుకోవడం వారికి అనివార్యమే అయింది. దీనితో ఫోటోలు, ఇతర వివరాలతో ఆ రసవత్తర కథనాన్ని మరింత కొనసాగించడానికి తగిన అవతకాశం వాళ్ళకు లేకుండా పోయింది. అయితే ఆ అసలు కథకు మూల పురుషులైన వారికి వాస్తవం తెలుసు కనుక ఫోటోలతో వారి కెటూ నిమిత్తం లేదు. అదీగాక ఆనంద్ గురించిన ఆ కథను విశ్వసించిన వారు చాలా తక్కువమంది.

మొత్తం మీద ఆ కట్టుకథ యొక్క ప్రతి ఆవృత్తీ ఎంతో ఊపుతో మొదలై, తగిన రుజువులు లేనందువల్ల చివరికి నీరసించి తేలిపోగా దాని అవశేషాలు అక్కడా అక్కడా గిరికీలు కొట్టసాగాయి.

దాదాపు ఇదే సమయంలో ఈ అద్భుత గాథకు అరుణ మరో ఆసక్తికరమైన ఉపాఖ్యానాన్ని జోడించింది. ఆనంద్‌కు వ్యతిరేకంగా పన్నిన ఈ కుట్రకు ఆమె పట్టరాని ఆగ్రహంతో ఉడికిపోతోంది. ఓ రోజు ఉదయం ఆమె మంత్రివర్గంలో మూర్తీభవించిన నిర్వ్యాపారం అనదగిన అటవీ శాఖ మంత్రి దగ్గరకు వెళ్ళింది. కేవలం అతడి కులాన్ని దృష్టిలో ఉంచుకుని ముఖ్యమంత్రి అతన్ని మంత్రివర్గంలో చేర్చుకున్నాడు. రిజర్వ్ ఫారెస్టును తన సొంత సొత్తుగా భావించే శ్యామ్ సుందర్ లాంటి వాళ్ళకు ఈ అటవీ శాఖ మంత్రి అమితానందం కలిగిస్తూ ఉంటాడు. అతడేదైనా చేసేదెటూ ఉండదు, కనుక తప్పు చేసే ప్రమాదం అసలే ఉండదు. అయితే ఇతరత్రా ఆ మంత్రి ఎంతో సజ్జనుడుగా, నిజాయితీపరుడుగా పేరున్న వాడు.

అరుణంటే భయపడే మంత్రులలో అతడూ ఒకడు కనుక, ఆమెతో ఘర్షణకు దిగడం అలా ఉంచి వీలైనంతవరకకూ ఆమెతో మాట కూడా కలపకుండా జాగ్రత్తపడుతూ ఉంటాడు. నిజానికది తనకు కొత్తచోటైనా బాగా పరిచితమైన చోటుకు వచ్చినట్టుగా ఆమె తన డ్రాయింగ్ రూమ్‌లోకి అడుగుపెడుతూంటే ఆ మంత్రి స్వాగత సూచకంగా ఏకాక్షరధ్వని చేయడం తప్ప మరేమీ చేయలేక పోయాడుప. ఏదొచ్చిపడినా ఎదుర్కోకతప్పదనుకుంటూ భయసూచకమైన నిశ్శబ్దంల్లోకి జారిపోయాడు. ఈ లోపల ఆమె ఆగ్రహాన్ని చల్లార్చడానిరా అన్నట్టు అటెండర్ వేడి వేడి కాఫీ తీసుకొచ్చి ఇచ్చాడు.

ఆ మంత్రిగారి ఉద్రిక్త పూరితమైన నిరీక్షణా సమయాన్ని తగ్గిస్తూ అరుణ తిన్నగా అసలు విషయానికి వచ్చేసింది. 'మీ సహచర మంత్రి ఆనంద్ రిజర్వ్ ఫారెస్ట్‌లో కలప దొంగతనానికి పాల్పడిమన వైనం గురించి మీ కేమైనా తెలుసా ?'

'ఓహో —అదా... పత్రికల్లో వచ్చిన వివరాలు తప్ప అదనంగా నా కేమీ తెలియదు.

'అదేమిటి ? మీ రేమో సంబంధిత మంత్రి, ఆనంద్ మీ మంత్రివర్గ సహచరుడు అవునా కాదా?'

'అలాంటి విషయాలు సిసిఎఫ్ (చీఫ్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్) స్థాయిలో వాళ్ళూ, ఇంకా కింది స్థాయివాళ్ళూ చూసుకుంటారు...'

'మంత్రిగారికి సంబంధమున్న విషయమైనా అంతేనా ?'

'అలాగైతే అది ముఖ్యమంత్రిగారు చూసుకోవలసిన వ్యవహారం.'

'చూడండి, నేను ఎం. ఎల్. ఎ. గా మీ దగ్గర కొచ్చాను. ఆ కలప రవాణా జరిగిన గ్రామాన్ని సందర్శించాలనుకుంటున్నాను. మీరు కూడా ఆ గ్రామాన్ని అధికారికంగా సందర్శించడానికి ఆకస్మిక సందర్శనే అనుకోండి ఎందుకు రాకూడదు ? నిజం తెలుసుకోవలసిన విధి మీకుందా లేదా?'

ఆ లోగా మంత్రిగారు కొంత నిబ్బరాన్ని తెచ్చుకోగలిగారు. 'అది నా డ్యూటీయే అనుకోండి. అయితే చెప్పండి. ఆనంద్ దొంగతనం కేసును నేనే, నా స్థాయిలోనే దర్యాప్తు చేయాలని నిజంగానే మీ రనుకుంటున్నారా ? మీ ఉద్దేశం కచ్చితంగా అదేనా?'

తనెంతో తెలివిగా ప్రశ్నించానని, దీంతో ఆమె ఖంగుతుంటుందని మంత్రి తలపోశాడు. ఆనంద్‌కు సంబంధం ఉన్నప్పుడు అరుణ ఎలా... ఇక ఆమె కచ్చితంగా తోకముడుస్తుందనుకుంటూ తనను తనే అభినందించుకున్నాడు.

అయితే అరుణ తకీమని అంది, 'ఎందుకు కాదు? విలువైన అటవీ సంపదను దొంగిలించడానికి కేబినెట్ మంత్రుల కేమైనా ప్రత్యేక ఆధారాలున్నాయా? అంచేత సమస్యేముంది? తన సహచరుడు పాల్పడిన దారుణమైన నేరాన్ని విచారించే బాధ్యతను అటవీ శాఖ మంత్రి స్వయంగా నిర్వర్తించడం సబబుగా ఉంటుంది. క్రిందిస్థాయి అధికారుల కెందుకు అప్పగించాలి?'

దాంతో మంత్రిగారి గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్టయింది. ఏమైనాసరే ఈ రాక్షసిని చంకనబెట్టుకుని ఏమాత్రం ఇష్టంలేని పర్యటనకు తను బయలుదేరకూడదనుకున్నాడు. తన పర్యటనా కార్యక్రమం ముందే ఏదైనా ఏర్పాటు అయిందేమోనని డైరీ గాలించడం ప్రారంభించాడు. ఈ ప్రయత్నంలో తన ప్రయివేట్ సెక్రటరీని కూడా తికమకపెట్టేశాడు. మంత్రిగారికి నిజంగా ఏం కావాలో ఎంత బుర్ర బద్దలుకొట్టుకున్నా సెక్రటరీకి అర్థం కాలేదు. కొన్ని మాసాల వరకూ మంత్రిగారి టూర్ ప్రోగ్రామ్ నిర్ణయమైపోయిందని అతడు అడ్డంగా అబద్ధమాడగలడు. అలాగే లక్కీగా, తదుపరి రెండు మూడు రోజులు ఆయన పూర్తిగా ఖాళీగానే ఉంటారని ఆనందం తొణికిసలాడే ముఖంతో అననూ అనగలడు. కానీ తన బాస్ నుంచి కచ్చితమైన సంకేతం ఏదీ అందక అక్కడే బొంగరంలా తిరుగుతూ ఉండిపోయాడు.

కొద్దిసేపు ఈ ప్రహసనాన్ని గమనించిన తర్వాత అరుణ అంది. 'సరే మంత్రిగారూ, మిమ్మల్నిక ఇబ్బందిపెట్టనులెండి. కొంతమంది ఎంఎల్ఎలనూ, ఇతరులనూ తీసుకుని నేనే ఆ గ్రామానికి వెళతాను. తన బ్రహ్మాండమైన భవన నిర్మాణ పథకం గురించి ఎవరికీ ఏమీ చెప్పకుండా ఆనంద్ ఇలా ప్రభుత్వ ఆస్తిని కొల్లగొట్టడం అన్యాయం, ఇంతకీ ఆ నిర్మాణం ఎక్కడ జరుగుతోందో మీ కేమైనా తెలుసా మంత్రిగారూ?'

ఇదేమిటి, వీళ్ళిద్దరూ కొంపదీసి గొడవ పడ్డారేమిటి? ఆనంద్ అంతు చూడాలన్న అంత పట్టుదల దేనికామెకు? అసాధ్యమనుకున్నది హఠాత్తుగా సాధ్యమైపోయిందేమిటి ? అరుణ సెలవు తీసుకుని వెళుతుంటే మంత్రి ఏవేవో ఊహాగానాల్లో మునిగిపోయాడు. ముఖంలో గర్వం తొణికిసలాడుతుండగా అరుణ అతడి నివాసం నుంచి బయటికి వచ్చింది. ఆమె పెదాలపై ఏదో మర్మాన్ని సూచించే చిరునవ్వు మెరిసింది. మంత్రిగారి ప్రయివేట్ సెక్రటరీ తక్షణమే దానిని గమనించగలిగాడు.

అక్కడినుంచి ఆమె నేరుగా శేఖర్ నివాసానికి వెళ్ళింది. ఆమె గురించి అందరికీ బాగా తెలుసు కనుక 'సాహిబ్ బిజీ హై' (బాస్ బిజీగా ఉన్నారు) అనగలిగిన సాహసం ఏ ప్రయివేట్ సెక్రటరీకి ఉండదు. అరుణ రాక గురించి టెలిఫతి ద్వారా తెలిసిన వాడిలా శేఖర్ వెంటనే రిసెప్షన్ రూమ్‌లోకి వచ్చాడు ఆదరంగా ఆమెను ఆహ్వానించి డ్రాయింగ్ రూమ్‌లోకి తీసుకెళ్ళాడు.

'నేనో పనిమీద వచ్చాను' ఎటువంటి ఉపోద్ఘాతమూ, పలకరింపులు లేకుండానే ఆమె ప్రారంభించింది అతడితో పలకరింపు మాటలు ఆమె ఎన్నడూ పంచుకుని ఎరుగదు. 'సహాయం చేస్తారా?'

'ఏమిటా పని చెల్లాయ్ ?'

'ఓ దారుణమైన నేరాన్ని బయటపెట్టాలి...'

'ఇంతకీ నేరస్థుడెవరు ?'

'ఎవరైతేనేం ? చుట్టం విషయంలో నైనా చట్టం చట్టమేనని మీ రెప్పుడూ వినేలేదా ? ఉన్నతస్థాయిలోని అవినీతికి వ్యతిరేకంగా పోరాడడం నా పని; మీ కేమైనా అభ్యంతరమా?'

శేఖర్ చటుక్కున అర్థం చేసుకున్నాడు. అరుణ కొనసాగించింది. 'కొంత మంది ఎం.ఎల్.ఏ. లతో కలిసి రేపు నేరం జరిగిన గ్రామానికి వెళ్ళిరావాలనుకుంటున్నాను. ఓ ప్రెస్ పార్టీని తీసుకుని మీరు కూడా మాతో రావాలని నా కోరిక. అది మీ కర్తవ్యమే కాదు, వ్యక్తిగతంగా మీకో అవకాశం కూడా. వస్తారా ?'

'సారీ చెల్లాయ్', శేఖర్ అన్నాడు 'రేపు నేను రాలేను; సెక్రటేరియట్‌లో నాకు చాలా ముఖ్యమైన పనులున్నాయి. నన్నడిగితే నిన్ను కూడా అక్కడికి వెళ్ళొద్దంటాను...'

'ఎందుకని?

'అది అడగద్దు; రెండు మూడు రోజుల పాటు పత్రికలు చదువు. దయచేసి ఆనంద్ కోసమైనా...'

'నేను బయటపెట్టదల్చుకున్నది అవినీతిపరుడైన ఆ మంత్రినేనే. మీ అంతట మీరు నాకు సహకరించలేరా ?'

శేఖర్ ఒకింత అయోమయంగా చూశాడు. ఎంతో నిజాయితీతో అన్నాడు. 'చూడు చెల్లాయ్, జరిగిందేదో జరిగిపోయింది. నువ్వే గెలిచావు; ఆట అయిపోయింది. ఈ కేసులో ఏమీ లేదు. ఈసారి ఆనంద్ ఉన్నత స్థానానికి వెడతాడు. ఈ ఒక్కసారికి నా మాట విను.... ఎక్కడికీ వెళ్ళొద్దు... దయచేసి... సరేనా?'

అరుణ నవ్వు ముఖంతో తలూపింది.

తదుపరి మూడు రోజుల్లో కలప దొంగతనం గురించి పూర్తిగా విభిన్న కథనం వెలువడింది. అది ఆనంద్‌ను సంపూర్ణంగా నిర్దోషిగా తేల్చివేసింది. కానీ 'నేరం' గురించి మాత్రం ఇదమిత్థంగా ఏమీ తేల్చకుండానే ఉండిపోయింది. ఈసారి వెనుకటి విలేఖరులతో కాకుండా కొత్త విలేఖరులతో ఆ కథనాన్ని ముందుకు తేవలసి వచ్చింది; వీళ్ళు కూడా స్వీయ నామధేయాలతోనే (బైలైన్) ఆ వార్త రాశారు. పర్యవసానంగా శ్యామ్‌సుందర్ తన డబ్బు సంచుల మూతులను ఇంతకు ముందు కంటే ఎక్కువ వదులుచేయవలసి వచ్చింది. ఏమైనా కానీ, పాతాళానికి పడిపోయే ప్రమాదాన్ని ఎదుర్కొంటున్న తన ప్రతిష్ఠను అతడు పునరుద్ధరించుకోక తప్పదుమరి.

ఈ లోపల అత్యాశ్చర్యకరంగా, కేంద్ర హోమ్ మంత్రి రాష్ట్ర రాజధానికి జరపబోయే ప్రత్యేకపర్యటన గురించిన వార్త హఠాత్తుగా పత్రికలలో ప్రధాన శీర్షిక అయింది. కొన్ని మాసాల క్రితమే రూపొందించిన ఒక సాహిత్య కార్యక్రమంలో పాల్గొనడానికే ఆయన వస్తున్నట్టు పైకి చెప్పడం జరిగింది. ఆ కార్యక్రమం గురించి స్థూలంగా జనానికి ఈ విషయం తెలిసినా, తీరా అది క్రియారూపం ధరించే సమయానికి స్థానికరాజకీయవాదుల దృష్టిలో, పత్రికల వారి దృష్టిలో సాహిత్యకోణం అప్రధానమైపోయింది. అందుకు బదులుగా రాష్ట్రంలోని రాజకీయ పరిస్థితిపై కేంద్రమంత్రి ముఖ్యమంత్రి చౌదరితో 'లోతుగా' చర్చించబోతున్నట్టు ఎవరూ త్రోసిపుచ్చ లేని హేతుబద్ధతలోనే పత్రికలు రాసుకుంటూ వచ్చాయి. వాటిలో కొన్ని, ఇంకా ఖాళీ కాని ముఖ్యమంత్రి పదవికి జరుగుతున్న వారసత్వ ఘర్షణను కూడా ప్రస్తావించడం ద్వారా చర్చనీయాంశం గురించి ఒక విధమైన స్పష్టీకరణ ఇవ్వబోయాయి.

చౌదరికీ, కేంద్ర మంత్రికీ మధ్య చర్చ పూర్తిగా సుహృద్భావవాతావరణంలో జరిగింది. ఎంతో క్లిష్ట సమయంలో రాష్ట్రానికి సమర్థవంతమైన పాలన అందించగలిగారంటూ చౌదరిని కేంద్ర మంత్రి పొగడ్తలతో ముంచెత్తాడు అదేదో వడ్డీలు ప్రశంసలా ధ్వనించింది. లేదా చౌదరికి అలా అనిపించింది. చర్చ చివరిలో, 'త్వర త్వరగా మారుతున్న ఒకానొక పరిస్థితిని ఎదుర్కోడానికి తీసుకోవలసిన చర్యల' గురించి యధాలాపంగా ప్రస్తావించడం, ఉభయులూ దాని అవసరాన్ని గుర్తించడం జరిగిపోయాయి. ఆ తర్వాత అప్రధానమైన ఏవో చిల్లర విషయాల గురించి మాట్లాడుకున్నారు.

అంతలో ఏదో గొర్తొచ్చినట్టు హోమ్ మంత్రి అంతే యధాలాపంగా 'మీ మంత్రులలో ఒకరి గురించి ఈ విడ్డూరం వార్త ఏమిటండీ?' అంటూ లేవనెత్తాడు. చౌదరి దాని గురించి కొన్ని వివరాలు ఏకరువు పెట్టి ఐ. జి. (సి.ఐ.డి.) రిపోర్టు ఉన్న కవరును ఆయన చేతుల్లో పెట్టాడు.

'ఓహో, ఇదెందుకులెండి' అంటూనే హోమ్ మంత్రి ఆ కవరును పరిశీలనగా చూసి తన బ్రీఫ్‌కేసులో పెట్టుకున్నాడు.

'సమస్యేమీ లేదు', చౌదరి ఎంతో నిబ్బరంగా, సౌజన్యంగా ఉట్టిపడేలా అన్నాడు. 'ఈ రోజు పొద్దున్నే ఆ కవరు నా చేతికందింది. మీ రెలాగూ ఇక్కడే ఉన్నారు కనుక దాని గురించి మీకు తెలపాలనుకున్నాను.'

'థాంక్యూ, మంచిపని చేశారు' హోమ్ మంత్రి అన్నాడు.

దొంగతనం కేసు గురించి ఆ తర్వాత ఒక్క ముక్క కూడా వినిపించలేదు. పత్రికల్లో శీర్షికలు ఉన్నట్టుండి మారిపోయాయి. మొదట్లో అత్యుత్సాహంతో తమ పేర్లతో ఆ వార్తను బయటపెట్టిన విలేఖరులకు కొంత తలవంపు పరిస్థితే వచ్చిపడింది (అందుకు వాళ్ళకు మంచి పరిహారం లభిస్తే లభించచ్చుగాక). ఇక ఇప్పుడు తమ సంచలనాత్మక కథనాలను పాఠకులు మరిచిపోతారులే అని వాళ్ళు ఆశించరు —పత్రికలు రాజకీయాల్లో అవినీతి గురించి పెద్ద మనిషి తరహాలో నీతి బోధకు ఉపక్రమించాయి. దాంతో అంతా సాధారణ పరిస్థితికి వచ్చేసింది.

అలాగని మరీ ఎక్కువ రోజులపాటు అవి పాఠకులకు నాటకీయ శీర్షికల కరవు తెచ్చి పెట్టలేదు. చౌదరి హఠాత్తుగా ఒకే ఒక వాక్యంతో తన రాజీనామాలేఖను పార్టీ అధ్యక్షుడికి పంపించాడు. అయితే వెనువెంటనే ధ్రువీకరణ రాకపోవడంతో ఇది కూడా సందేహాస్పద వార్తగానే కనిపించింది అయితే ఈ సారి మాత్రం, చౌదరి స్థానంలో కొత్త నాయకుణ్ణి 'ఎన్నుకోడానికి' జరగబోయే శాసనసభాపక్షసమావేశానికి కేంద్ర హోమ్ మంత్రి, పార్టీ వర్కింగ్ కమిటీలోని ఒక సీనియర్ సభ్యుడు హాజరవుతారని అధిష్ఠానవర్గం ప్రకటించింది.

ఎట్టకేలకు మిస్టరీ అంతా మంచులా విడిపోయింది.

రాష్ట్ర రాజధానికీ, ఢిల్లీకీ మధ్య వ్యవహారం ఎన్ని మెలికలూ, మలుపులూ తిరిగిందో ఎవరికీ తెలియదు కానీ శాసన సభా పక్ష సమావేశానికి పట్టుమని ఒక్క రోజు కూడా గడువులేని స్థితిలో ప్రధాన అభ్యర్థిగా ఆనంద్ పేరు పైకితేలింది. అంతిమంగా అతడు ముఖ్యమంత్రి అయినప్పుడు రాజధానిలో ఏ సంపాదకమహాశయుడూ ఎటువంటి విస్మయాన్ని వ్యక్తం చేయలేదు. అదే జరిగితీరుతుందని వాళ్ళకి 'ముందే' తెలుసు. మొత్తం మీద ఈ ఎంపికనూ, రాష్ట్ర భవితవ్యాన్ని తలచుకుని వాళ్ళు మరీ అంత ఉబ్బితబ్బిబ్బు కాలేదు. ఏదైనా ఒక ప్రత్యేకాంశంమీద (భూ సంస్కరణల వంటివని యధాలాపంగా పేర్కొంటూనే) తనకు వ్యక్తిగతంగా ఉన్న ఉత్సాహాన్ని తగ్గించుకుని ఈ క్షణం నుంచి ఆనంద్ ముఖ్యమంత్రిలా వ్యవహరించకపోతే రాష్ట్రంలో సుస్థిరత్వానికి తావుండదని ఓ కీలకమైన సంపాదకీయం ఎంతో దూరదృష్టితో హితబోధ చేసింది. తాము భూస్వాముల తరఫున వకాల్తా తీసుకోవడంలేదని కూడా అది నిర్ద్వంద్వంగా స్పష్టం చేసింది. కేవలం వాస్తవాలను ఎత్తిచూపడమే తమ అభిమతమని ఉద్ఘాటించింది. కనుక భూస్వాముల నుంచి గుంజుకున్న భూముల్ని పంపిణీ చేస్తామన్న వాగ్దానంపై ఆశలు పెంచుకున్న మూకను రాష్ట్ర నిర్వహణలో తన ప్రధాన చోదకశక్తిగా, ముఖ్యమంత్రిగా భావిస్తే తర్వాత పశ్చాత్తాపపడ వలసి వస్తుంది. ఇందులోని అంతరార్థాన్ని ఆనంద్ చటుక్కున అర్థం చేసుకున్నాడు.

ప్రమాణ స్వీకారోత్సవం నిరాడంబరంగా, సాదాసీదాగా జరిగిపోయింది. కేంద్ర హోమ్ మంత్రి, పార్టీ సీనియర్ నాయకుడూ తిరిగి ఢిల్లీ వెళ్ళిపోయారు. కొత్త ముఖ్యమంత్రి ఢిల్లీ వచ్చి మొదట ప్రధానమంత్రిని సందర్శించుకుని మంత్రివర్గ జాబితాను ఖరారు చేసుకుంటే 'బాగుంటుంద'ని వారు సూచించి మరీ వెళ్ళారు.

'మరోలా చెప్పాలంటే ఆమె ఆదేశాల ప్రకారం... సారీ, కేవలం ఆమె ఆదేశాల ప్రకారం మాత్రమే కాదు,. ఇక ఇప్పటి నుంచి నిన్నూ, రాష్ట్రాన్ని తమ బొటన వేలు కింద అదిమి పెట్టే ఆమె చుట్టూ ఉన్న జనాల ఆదేశాల ప్రకారం అన్నమాట !' ప్రమాణస్వీకారం తర్వాత చౌదరి యధాలాపంగా అంటున్నట్టు వివరించుకుంటూ వచ్చాడు.

ఆనంద్ సమాధానం చెప్పలేదు. ఈ హఠాత్పరిణామం దృష్ట్యా అతడు ఆలోచించుకో వలసినవి చాలా ఉన్నాయి. అంతటా కంటికి కనిపించని వాడి కత్తులతో నిండిన ఓ అజ్ఞాత సింహాసనంలోకి తను అమాంతం ఎగిరొచ్చి పడ్డాడు.

మరునాడు ఉదయం చౌదరి నివాసానికి వెళ్ళాడు. అతడే అన్నట్టుగా 'తనకు తక్షణ పూర్వమే ఆ పదవిని ఎంతో ఆదర్శప్రాయంగా నిర్వహించిన వ్యక్తి ఆశీస్సులూ, సలహాల కోసం' అది మిశ్రమఅనుభూతులతో కూడుకున్న సమావేశం. సౌజన్యం, ఉద్రిక్తతా కలగలిసిపోయాయి. అనేక అంశాలలో బలవత్తరమైన రెండు అభిప్రాయాలు ఘరషణపడ్డాయి. అయినాసరే భవిష్యత్తును ఎంచుకోవాలన్న సమష్టి సంకల్పం అందులో ప్రతిబింబించింది.

'ఇక ఇప్పుడు మంత్రుల విషయంలో మీ కచ్చితమైన సలహా కావాలి' —నూతన సందర్భంలో అతి ముఖ్యమైన అంశానికి వస్తున్నట్లు ఆనంద్ ప్రారంభించాడు.

'అది ముఖ్యమంత్రి విశేషాధికారపరిధిలోకి వచ్చే విషయం, అవునా కాదా?' చౌదరి ప్రశ్నించాడు.

'సరే,. అది సిద్ధాంతం, ఆ సంగతి నాకు తెలుసు' ఆనంద్ అన్నాడు 'కానీ మీ నుంచి నాకు ఆచరణాత్మకమైన సలహా కావాలి'.

'ఇక్కడ నీకు తెలియని వాళ్ళెవరు ? కనుక కులానికి సంబంధించిన కోణాన్ని, ముఠా ఒత్తిళ్ళను దాటేద్దాం. నీ కంటూ ఏ గ్రూపు లేదనే నేననుకుంటున్నాను, నువ్వు కొత్తగా ప్రారంభించాలని అనుకుంటే తప్ప —'

'లేదు లేదు' మధ్యలో తుంచుతూ ఆనంద్ అన్నాడు 'నా కది చేతకాని విషయం ? అదీగాక అటువంటి అవసరం ఉందని కూడా నేననుకోను.'

'మరి నువ్వు ప్రధానంగా ఎవరి మద్దతు మీద ఆధారపడతావ్ ?'

'ఫలితాల మీద, మొదలూ చివరా కూడా ఫలితాల మీదే ఆధారపడతాను, కనుక ఓ భగవంతుడా నువ్వే ఆదుకోవాలి?' ఆనంద్ స్వరంలో ఒకింత ఉద్విగ్నత తొంగిచూసింది.

'ఈ ఆటలో పాత కాపును కనుక ఫలితాల గురించి నాకు అంతగా తెలియదు. నీ సిద్ధాంత బద్ధత, ముందు చూపును ప్రతిబింబించే నీ విశ్వాసాలతో నెగ్గుకురావాలనే నా ఆకాంక్ష. ఇంతకీ

శేఖర్ విషయంలో ఏం నిర్ణయించావ్?'

'నిర్ణయానికేముంది ? అతడు మంత్రివర్గంలో ఉండాలనే నేననుకుంటున్నాను, లేకపోతే ఆ స్థానాన్ని భర్తీ చేయడం కష్టం.'

'నీ కిప్పుడు సలహాలివ్వదగిన వాణ్ణి కాదు; సలహాలిచ్చే కొత్త కొత్త జనాలు నీ కిప్పుడు చాలామందే ఉన్నారు పనికొచ్చేదో పనికిమాలిందో కానీ ఒక మాట మాత్రం చెబుతాను శేఖర్ విషయం నీకు నిజంగా ఓ పరీక్షే అవుతుంది.'

సమావేశం పూర్తిగా సుహృద్భావపూర్వకరంగా ముగిసింది. హఠాత్తుగా వాళ్ళిద్దరి సంబంధాల్లో అడుగు పెట్టిన ఏవో హద్దులు ఆశ్చర్యం గొలిపాయి. వాళ్ళిద్దరి మధ్యా ఎప్పుడూ కనిపించే హద్దులెరగని స్నేహపూర్వకమైన పరిహాస ధోరణి ఇంతలోనే ఏమైపోయింది ?

రెండురోజుల తరువాత ఆనంద్ ప్రధాన మంత్రిని ఆమె సౌత్‌బ్లాక్ ఆఫీసులో కలుసుకున్నాడు అది స్వల్పకాలిక సమావేశమే కానీ, మరీ అంత స్వల్పం కాదు. ఆ తర్వాత మంత్రివర్గ నిర్మాణం గురించి మాట్లాడడానికి హోమ్ మంత్రిని, పార్టీ అధ్యక్షుడిని కలుసుకున్నాడు. ఆ కసరత్తుకు పూర్తిగా మూడు రోజులు పట్టింది. ఆనంద్ ముఖ్యంగా సమావేశమైనది హోమ్ మంత్రితోనూ, పార్టీ అధ్యక్షుడితోనూ; మిగిలినవన్నీ కేవలం మర్యాదపూర్వకమైన సందర్శనాలే. ప్రధానమంత్రి పట్ల తనకున్న అతివిధేయత పుణ్యమా అని నూతన ముఖ్యమంత్రి స్వయంగా ఏ నిర్ణయాలూ తీసుకోలేని నిస్సహాయత స్థితిలోకి జారిపోయినట్టు, తన మంత్రివర్గాన్ని రూపొందించవలసిందిగా ప్రాధేయపడుతూ ఎవరెవరి చుట్టూనో (వాళ్ళలో కొందరు అధికారంలో ఉన్నవాళ్ళు, మరి కొందరు ఏ అధికారంలోనూ లేనివాళ్ళు) తిరుగుతున్నట్టు ఆ కొన్ని రోజుల్లోనే రాష్ట్ర రాజధానిలో పత్రికలు చిత్రించాయి.

శేఖర్‌ను మంత్రివర్గంలోకి తీసుకోడానికి ప్రధాని సుముఖంగా లేరని ఢిల్లీలో ఉన్నప్పుడే ఆనంద్‌కి సూచనగా తెలిసింది. అయితే అంతిమంగా మీ జట్టును ఎంచుకోవలసింది మీరేనని, అన్ని విషయాలూ మీకే బాగా తెలుస్తాయని కూడా ఆ సందేశం తెచ్చిన వారు అనకపోలేదు అయినా ఆ సూచనను త్రోసిపుచ్చడానికి వీల్లేదని ఆనంద్‌కు తెలుసు; వాస్తవంగా అది ఆదేశమే.

రాష్ట్ర రాజధానికి తిరిగొస్తే జాబితాలో శేఖర్ పేరు లేకకపోవడం సంచలనమే కలిగించింది. 'నేను చెప్పానా లేదా, రాష్ట్రానికి ఇక వెన్నెముక ఉండదని ? మనం నామినేటెడ్ ముఖ్య మంత్రుల శకంలోకి అడుగుపెట్టాం' —చౌదరి ఓ జర్నలిస్టు మిత్రుడి దగ్గర వ్యాఖ్యానించాడు

# 54

ముఖ్యమంత్రి నివాసంలోకి ఓ నిరంతర ప్రవాహంలా సందర్శకులు వెళుతున్నారు. మళ్ళీ ఇవతలకు ప్రవహిస్తున్నారు. వాళ్ళలో మీరు ఊహించుకోగలిగిన అన్ని రకాల వాళ్ళూ ఉంటారు. నిజమైన శ్రేయోభిలాషులు, మిత్రులు, మిత్రులుగా నటించే వాళ్ళు, ముఖస్తుతికి పాల్పడే వాళ్ళు, అవకాశవాదులు, రాజకీయ దళారులు, ఆ ప్రాగణంలో ఏదో ఒక మూల తాము కనిపించడం ఒక్కటే లక్ష్యంగా వేళ్ళాడేవాళ్ళు! ప్రతిచోటా వినిపించే మంత్రం ఒక్కటే... కంగ్రాట్యులేషన్స్ ఆనంద్ భాయ్! మీరు ముఖ్యమంత్రి కావడం పరమాద్భుతం! నే చెబుతున్నా చూడండి, రాష్ట్రానికి గొప్ప మేలు జరగబోతోంది. మీరా పదవికి ఎంతైనా తగిన వారే అనుకోండి; ఆ మాట నే నెప్పుడూ అంటూనే ఉన్నాను. అయితే చూడండి. అర్హులైన వాళ్ళందరికీ తమ అర్హతకు తగిన పదవి లభించదు. ఇవి జిత్తులమారి రాజకీయాలండీ ! ఏమైనా భగవంతుడు మిమ్మల్ని చల్లగా చూస్తాడు, దుష్ట గ్రహాల చూపు మీ మీద పడకుండా కాపాడతాడు!

ఆనంద్‌కు తనకంటూ మద్దతుదారులూ, అభిమానులూ ఉన్నారు కనుక వాళ్ళు నిజంగానే సంతోషించారు; అయితే ఈ సందర్భాన్ని పురస్కరించుకుని అంగరంగ వైభవంగా ఉత్సవం జరపడానికి రాజకీయంగా ప్రత్యేకమైన గ్రూపేదీ అతడికి లేదు. కనుక అభిమానుల సంతోషం మిరుమిట్లుగొలిపేలా వ్యక్తం కాలేదు

నిజం చెప్పాలంటే ఆనంద్ నూతన పదవీ బాధ్యతలు స్వీకరించిన ఘట్టంలో ఒకవిధమైన స్తబ్ధ వాతావరణమే నెలకొంది. అనేకవర్గాల్లో తీవ్రమైన ఆత్మపరిశీలన ప్రారంభమైంది. మొత్తంమీద అదోరకమైన గంభీరత . చివరకు ఏదో అవాంఛనీయస్థితిని సైతం శంకించే ధోరణి కనిపించాయి. తగినంత జాగ్రత్తతోనే తప్ప అంతకుమించి స్పందించలేనంత స్వల్పంగానే, జనానికి కొంత వరకు తెలిసిన ఓ పరదేశి ఎవరో అడుగుపెట్టిన చందమే అందులో వ్యక్తమైంది. ఎవరికీ సాధారణంగా ఆమోదయోగ్యం కానిదేదో ఘటన జరిగిపోయిందన్న అనాసక్త వైఖరి కొందరిలో కనిపించింది. ఆ పరిణామంలోని ఆకస్మికత కొంత అపనమ్మకానికి తావిచ్చింది. సిద్ధాంత రీత్యా ఒక ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎవరైనా ఎటువంటి స్థానానికైనా ఎదగవచ్చునన్నది నిజమే అయినప్పటికీ, స్థూలంగా ప్రజాభిప్రాయానికి ఎవరైనా ఏ పదవికైనా ఎగబాకడం సమ్మతం కాదన్నట్టే కనిపించింది.

ప్రప్రథమంగా చెప్పుకోవాలంటే, ఎటువంటి ఎంపిక ఇది? ఇందిరాగాంధీయే ఆనంద్‌ను ముఖ్యమంత్రిగా నామినేట్ చేసినట్టు స్పష్టమైపోయింది. మిగిలిన వాళ్లలోలేనిదేదైనా అతడిలో ఆమెకు కనిపించిందా? ఎవరిలోనూ లేని అరుదైన సామర్థ్యాలు అతనికున్నాయా? అణువణువునా ఆమెపట్ల విధేయత ఉన్నవాడా? చౌదరి ఎందుకు పనికిరాకుండా పోయాడు? అతడి నిష్క్రమణ ఓ అతిపెద్ద మిస్టరీలో భాగం కాదా? ఇంతకీ ఇందిరాగాంధీ అనబడే ఆ ఖండితచిత్రాన్ని సక్రమంగా అతికి చూపించగలిగిన వాళ్లెవరు?

ఆనంద్ రాష్ట్రంలో ఏ ఒక్క అపేక్షిత వర్గానికి కొమ్ముకాస్తున్నవాడు కాడు. అతడు ప్రత్యేకించి ఒక వర్గానికి చెందడు, ప్రబలకులానికి చెందడు, తను మమేకం కాదగిన ఏ వర్గమూ అతనికి లేదు. మామూలు పరిస్థితులలో, చివరకు అదృష్టమార్గంలోనైనా సరే అతడింతటి స్థానానికి చేరుకోగలిగేవాడా? ఇందిరాగాంధీ వల్లనో, ముఖ్యమంత్రుల్ని నామినేట్ చేయడమనే ఈ బుద్ధి తక్కువ విధానం వల్లనో తప్పించి కచ్చితంగా చేరుకోగలిగి ఉండేవాడుకాడు. ఇదే ఏకగ్రీవంగా వెలువడిన తీర్పు. ఏతావతా తేలిన నీతి : ఇందిరాగాంధీ ఆశీస్సులే కనుక నీకుంటే, వర్గం, అనుభవం, పలుకుబడి, సుదీర్ఘ ప్రజాసేవ లేదా అపారమైన ధనబలం, కండబలం అందు బాటులో ఉన్న అత్యంత బలవత్తరమైన కులం —వగైరాలతో సహా మీరేమీ నీకు అవసరం లేదు. ఇవన్నీ అప్రధానమైపోతాయి నువ్వామెకు ఇష్టుడవైతే చాలు, ఆ పదవిలో నామినేట్ అయిపోతావు. అంతే . ఇంతకీ ఈ నామినేషన్ వ్యవహారమంతా దేనికి? అది ప్రశ్నలన్నింటినీ మించిన ప్రశ్న. ఇక సమాధానాలంటారా, ఊహల ఉడ్డీనతలో ఒకదానినొకటి మించినవి.

పలుకుబడి దండిగా ఉన్న పెద్దమనుషులు రూపకల్పన చేసిన, మెజారిటీ పత్రికలు గట్టిగా బాకా ఊది వినిపిస్తున్న తొలిసిద్ధాంతం ప్రకారం ఇందిరాగాంధీ సంపూర్ణాధికారేచ్ఛ ఎన్నటికీ తీరని దాహంలాంటిది కనుక తను ప్రధానమంత్రి కావడానికి ముందునుంచే రాజకీయంగా చరిత్ర సృష్టించుకున్న వారిని ఆమె సహించలేదు. ముఖ్యమంత్రులందరూ తనకు జూనియర్లుగా ఉండాలనీ, తద్వారా పూర్తిగా తన చెప్పుచేతల్లో ఉండాలనీ ఆమె ఆకాంక్ష. అంచేత పార్టీ చీలిపోయిన తర్వాత కూడా తన నాయకత్వంలో కొనసాగుతున్న ప్రముఖులొక్కొక్కరినే ఆమె వెళ్లగొడుతున్నారు. ఆమెతో పోరాడి చీలిక మురాలను స్థాపించినవారు అదృష్టవంతులు. తేనె లొలికే చిరునవ్వులతోనే కావచ్చు కానీ, ఇలా అవమానకరంగా వెళ్లగొట్టబడే దుస్థితినుంచి తప్పించుకున్నారు.

ఇంతే యుక్తియుక్తంగా కనిపించే రెండో సిద్ధాంతం ప్రకారం, తమ ఉపయోగాన్ని మించి అధికారంలో వేళ్లాడుతూ అధికారపు బంతినుంచి అంగుళంకూడా కదలకుండా తిష్టవేసుకున్న శక్తమంతులైన స్థానిక సామంతుల పునాదులు కదిలించడానికే ఇందిరాగాంధీ కొత్త ముఖ్య మంత్రుల్ని నామినేట్ చేస్తున్నారు. ఈ సామంతులు మురాలు నిర్మించుకున్నారు. ఎన్నికల్లో గెలవడానికి ఏం చేయాలో వాళ్లకు క్షుణ్ణంగా తెలుసు. అంచేత ఎన్నికల్లో గెలుస్తూఉంటారు. అధికారంలో కొనసాగుతూ ఉంటారు. ఒకవేళ ఎన్నికల్లో గెలవలేకపోతే పార్టీలో తమ స్థానాన్ని పదిలం చేసుకుంటూ తదుపరి ఎన్నికల్లో తిరిగి అభ్యర్థులుగా ప్రత్యక్షమవుతూ ఉంటారు. ఈ తోపులాట క్రమంలో అధికారం కేవలం అధికారం కోసమే అన్నట్టు పరిణమిస్తుంది. జనానికి

ఒరిగేదేమీ ఉండదు; యథాతథమైన స్థితి కొనసాగుతూ ఉంటుంది. సార్వత్రికంగా వ్యక్తమౌతున్న అభిప్రాయాన్ని అనుసరించి నేటి మారిన కాలానికి సరిపోయే వేగంతో కదిలి ముందుకు సాగడానికే ఇందిరాగాంధీ నామినేషన్ పద్ధతిని ఆశ్రయించారు. ఆనంద్ కూడా ఈ అభిప్రాయాన్నే సమర్థించాడు. గతంలో అనేకసార్లు ఈ విషయాన్ని విపులీకరిస్తూ వచ్చాడు కానీ ఆ నామినేషన్ రాయి తనమీదే వచ్చిపడుతుందని ఊహించలేదు. తీరా వచ్చిపడిన తర్వాత చౌదరితో సహా వెనుకటి ముఖ్య మంత్రుల పనితీరునూ తను పరోక్షంగా విమర్శించినట్టు కనిపించేందుకు ఒకవిధంగా అతడికి ఎబ్బెట్టు స్థితినెదుర్కొనవలసి వచ్చింది.

తన నామినేషన్ సిద్ధాంతానికి గండికొట్టిన తొలి అంశం శేఖర్‌ను మంత్రివర్గంలోకి తీసుకోలేకపోయిన తన నిస్సహాయత. తీసుకుంటాడని అనుకున్న వాళ్లు లేరు. అయితే శేఖర్‌ను అతడు మంత్రివర్గంలోకి తీసుకోడని జనం అనుకుంటే వాస్తవం అతడు తీసుకోదలచి కూడా తీసుకోలేకపోవడం. ఇదెలా జరిగిందో తెలిసిన వాళ్లు కొద్దిమంది మాత్రమే. నామినేటెడ్ ముఖ్యమంత్రి పరిమితాధికారాన్ని ఆనంద్‌కి చవిచూపించిన తొలి అంశమిది. శేఖర్‌కు వాస్తవమేమిటో తెలిసే అవకాశం ఎటూలేదు. ఒకవేళ చెప్పినా అతడు విశ్వసించడం కల్ల. నమ్మశక్యం కానిది చెప్పడాని కెవరూ ఇష్టపడరు కనుక అతడితో ఎవరూ చెప్పనూలేదు. అదీ మంచిదే. ఎందుకంటే ఆనంద్ నాయకత్వంలో పనిచేయడం శేఖర్‌కు అంతగా సంతోషం కలిగించే విషయమూ కాదు. ఆనంద్ తనను మంత్రివర్గంలోకి తీసుకోనందుకు నిందిస్తూనే శేఖర్ ఈమాట తన మిత్రుల వద్ద నిష్కర్షగా అంటూనే వచ్చాడు కూడా.

బంగ్లాదేశ్ విజయం తెచ్చిపెట్టిన ఔజ్జ్వల్యం క్రింద ఇందిరాగాంధీ ఇంకా ప్రకాశిస్తూనే ఉన్నారు. బంగ్లాదేశ్ విజయం చిరకాలంపాటు జాతీయంగా, అంతర్జాతీయంగా ఆమె ప్రతిష్ఠను ధగద్ధగాయమానం చేస్తూనే ఉంటుందని ఎందరో అనుకున్నమాట వాస్తవమే. అయితే అంతర్జాతీ యంగా తెచ్చుకున్న ఈ ఘనకీర్తి దేశం అంతర్గతంగా ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారంలో ఏమరుపాటు కారణం కాకూడదని ఆనంద్ దృఢంగా విశ్వసించాడు. నేడు సర్వవ్యాప్తమై ఎంతో అరిష్టాన్ని తెచ్చిపెట్టే తన అత్యంత నగ్నరూపంలో దేశానికొక మొండిసవాలుగా పరిణమించింది దారిద్ర్యం. దానికి వ్యతిరేకంగా చేపట్టిన 'గరీబీ హటావో' నినాదానికి ప్రత్యక్ష కార్యాచరణ రూపం దిద్దవలసిన విద్యుక్తబాధ్యత ఇందిరాగాంధీ పార్టీకి ఉంది. ఇదిగో, ఈ విషయంలోనే తన నామినేటెడ్ ముఖ్యమంత్రుల మద్దత్తు ఆమెకెంతో అవసరం.

శేఖర్ విషయంలో ఎదుర్కొన్న వైఫల్యం తరువాత మంత్రుల ఎంపికలో ఒకింత హెచ్చరిక పాటిస్తే మంచిదని కొందరు మంత్రులు ఆనంద్‌కు సలహా ఇచ్చారు. ఎక్కువ శ్రమనీ, కాలాన్ని వినియోగించవలసిన మంత్రిత్వ శాఖలను జూనియర్ మంత్రులకు అప్పగించి తను పర్యవేక్షణకూ, శాఖల మధ్య సమన్వయానికి పరిమితమైతే బాగుంటుందన్నారు. రాష్ట్ర రాజకీయ వ్యవహారాల నియంత్రణ, ప్రత్యేకించి పార్టీ వ్యవహారాల నియంత్రణా ఎలాగూ అతడు చూసుకోవలసినవే. ఒక ముఖ్యమంత్రి నుంచి మరో ముఖ్యమంత్రికి పారంపరికంగా అందివస్తున్న విజ్ఞత మీద ఆధారపడిన ఈ సూచన ఎంతో అర్థవంతమైనది. అయితే తనకర్థమైన మేరకు, పార్టీ మేనిఫెస్టో తనకు అప్పగించిన విధిప్రకారం గ్రామీణ వ్యవసాయ సంబంధాల్లో మౌలిక పరివర్తన తీసుకు

రావడం కూడా, అదంత స్పష్టంగాకనపడకున్నా, తన కార్యపరిధిలోకి వస్తుందని ఆనంద్ అర్థం చేసుకుని తన ఎజెండాలో చేర్చుకున్నాడు. భారతదేశ పరిస్థితులలో ఆర్థికకార్యకలాపాలకు ప్రారంభఘట్టం భూమి సంబంధాలేనని అతని దృఢ విశ్వాసం. దానిని సాధించాలంటే ప్రభుత్వంలో అత్యున్నతస్థాయిలో ఉన్న వ్యక్తి దానిని సంపూర్ణంగా అంకితుడైనప్పుడే దీర్ఘకాలిక ఫలితాలుతే గలుగుతామని నిశ్చయించాడు. ఈ కార్యక్రమం ప్రస్తుతం చాలా మందకొడిగా సాగుతోంది. మార్పు పట్ల ఒక విధమైన జడత్వం, లోలోన ప్రతిఘటన ధోరణి వ్యక్తమౌతుంటాయి. ఈ ప్రతిఘటన వెనుక అనివార్యంగా స్వార్థ ప్రేరణలే ఉంటాయనడానికి లేదు; అటువంటి ప్రేరణలతో పాటు ఈ ఘట్టంలో మార్పు కోరదగినది కాదని ఆయా ఉదంతాలలో కొందరు వ్యక్తులు నిజాయితీతోనే విశ్వసిస్తూ ఉంటారు.

అక్షరాలా ఉత్సవ వాతావరణం అనలేకపోయినా ఒకవిధమైన కృత్రిమ ఆర్భాటంలోనే కొద్దిరోజులు గడిచాయి. నాయకత్వం మార్పును గుర్తించాము సుమా అని ప్రకటించుకునే పోకడ మాత్రమే అందులో కనిపించింది. ఏవో సత్కార కార్యక్రమాలు, ర్యాలీలు, సమావేశాలు జరిగిపోయాయి. ఆ ఘట్టాలలో ప్రతి ఒక్కరూ చెప్పినవీ, చేసినవీ అన్నీ సవ్యంగానే ఉన్నాయి. అయితే పిండితార్థం దగ్గరికి వచ్చేసరికి వేదికమీద ఉన్నవాళ్లకి కానీ, శ్రోతలకు కానీ వాళ్లు చెప్పిన మాటల్లో ఏమీ భాసించలేదు. ఆనంద్ చేయగలిగిందల్లా నిర్వాహకుల పట్ల ఎటువంటి అమర్యాదనూ, ఉపేక్షాభావాన్నీ చూపించకుండా ఆ కార్యక్రమాలన్నింటిలో పాల్గొంటూ వాళ్ల నందరినీ భరించడం —ఈ క్రమంలో. ఇంతవరకూ తనకు ముఖపరిచయం మాత్రమే ఉండి ఇకనుంచి నూతన ప్రభుత్వం చేపట్టబోయే అనేక కార్యక్రమాలలో వారిచేత పని చేయించవలసిన అనేక వ్యక్తులతో అతడి పరిచయం పెంపొందింది.

ఈ వ్యక్తుల శ్రేణిలో మొట్టమొదటగా రాష్ట్ర సర్వీసులన్నింటికీ పెద్ద దిక్కు చీఫ్ సెక్రటరీ వస్తాడు. తను మొదటిసారి మంత్రి అయినప్పటి నుంచి ఆనంద్ ఇతణ్ణి మంత్రివర్గ సమావేశాల్లోనూ, అప్పుడప్పుడూ ఇతర సందర్భాల్లోనూ, కలుసుకుంటూనే ఉన్నాడు. అన్ని వ్యవహారాల్లోనూ అన్నివేళలలోనూ ఇతడు చాలా నిర్దుష్టంగా – అప్పుడప్పుడు తప్పనిపించే అంత నిర్దుష్టంగా– ఆచితూచి వ్యవహరించే మనిషి. అతడి గురించి ఒక ఆసక్తికరమైన ముచ్చటను ఆనంద్ తన జూనియర్ సహచరులకు తరచు చెబుతుంటాడు. చాలా సంవత్సరాల క్రితం, తను తొలిసారి మంత్రివర్గంలో చేరిన రోజుల్లో ఓసారి మంత్రివర్గ సభ్యులకు అధికారవర్గపు తరఫున డిన్నర్ ఏర్పాటు చేశారు. ఒకింత ముందుగానే అక్కడికి చేరుకున్న ఆనంద్ ఓ మూల కూర్చుని జరుగుతున్న తతంగం తిలకిస్తూ ఉండిపోయాడు. ఆతిథ్యం ఇస్తున్నది చీఫ్ సెక్రటరీ కనుక వస్తున్న ప్రతి మంత్రికీ స్వాగతం చెప్పే కర్తవ్యం అతనిదే. ప్రతిసారీ ఆ యా మంత్రుల స్థాయికి తగిన నిష్పత్తిలోనే చీఫ్ సెక్రటరీ తన కదలికను నియంత్రించడం ఆనంద్‌కు ఎంతో వినోదం కలిగించింది. అప్పటికి జూనియర్ అయిన ఆనంద్ అడుగుపెట్టినప్పుడు చీఫ్ సెక్రటరీ కేవలం చేతులు జోడిస్తూ, విశాలమైన తన పృష్ఠభాగాన్ని కుర్చీనుంచి వేరు చేయకుండానే లేవబోతున్న భంగిమను ప్రదర్శించి కూర్చునే ఉండిపోయాడు. విద్యాశాఖమంత్రి విచ్చేసినప్పుడు మాత్రం తన పిరుదుల్ని కుర్చీనుంచి ఒకింత పైకి లేపుతూ నమస్కరించాడు, అంతే. హోమ్ మంత్రి

రాగానే చీఫ్ సెక్రటరీ లేచి నిలబడి మంత్రికి ఎదురేగడానికా అన్నట్టు కొన్ని అడుగులు ముందుకు వేశాడు. అలా వస్తున్న ప్రతి మంత్రి స్థాయికి తగినట్టు తన దూరాన్ని నియంత్రించుకుంటూ వచ్చాడు. చివరగా ముఖ్యమంత్రి చౌదరి అడుగు పెట్టినప్పుడు చీఫ్ సెక్రటరీ ఆయనవైపు తన దృఢకాయంతో సాధ్యమైనంత అతివేగంగా పరుగుతీశాడు. సివిల్ సర్వీసులో కనిపించే నిర్దుష్టక్రమాన్ని చూసి ఆనంద్ ఎప్పుడూ విస్తుపోతూనే వచ్చాడు ఇన్నేళ్ళలోనూ చీఫ్ సెక్రటరీ 'తూచినట్టు' ఉండే తన వ్యవహరణకు సంబంధించి అనేక దృష్టాంతాలు అందించాడు. అతనికి సంబంధించిన ప్రతి అంశంలోనూ, ప్రతి కదలికలోనూ 'స్థాపిత వ్యవస్థ' (ఎస్టాబ్లిష్‌మెంట్) ఉట్టిపడుతూ ఉంటుంది. దానిని పసిగట్టడం తేలిక, మార్చడం అతికష్టం...

చీఫ్ సెక్రటరీని తగిన మర్యాదతో ఆహ్వానించాడు ఆనంద్. మొదట కొన్ని దైనందిన అంశాల గురించి మాట్లాడుకుని పరిష్కరించారు. ఆ తర్వాత నియమ నిబంధనలు, చట్టాలు, ప్రోటోకాల్ వంటి విషయాల్లో ప్రభుత్వం అత్యవసరంగా చేయవలసిన మార్పులేమైనా ఉన్నాయా అని ఆనంద్ యధాలాపంగా ప్రశ్నించాడు. 'నాకు తోచినంత వరకూ ఏమీ లేవు సర్' .. చీఫ్ సెక్రటరీ ఎంతో ఆత్మవిశ్వాసంతో జవాబు చెప్పాడు.

'నేను కొంత కాలంగా భూ సంస్కరణల వ్యవహారాన్ని చూస్తున్న సంగతి మీకు తెలుసు. ఈ విషయంలో చేయవలసినదేదైనా ఉందని మీరు అనుకుంటున్నారా ?

చీఫ్ సెక్రటరీ ఒకింత విరామం తీసుకుని అన్నాడు —'అవును సర్, అనుకుంటున్నాను, మీరు అనుమతిస్తే...'

'చెప్పండి ..!' 'దయచేసి ఆ శాఖను మరెవ్వరికైనా అప్పగించండి సార్, ఇప్పుడా వ్యవహారాలు చూడడానికి మీకు తీరిక ఉండదు...'

ఆనంద్ సమాధానం చెప్పలేదు. కొన్ని నిమిషాల తరువాత చీఫ్ సెక్రటరీ అక్కడి నుండి నిష్క్రమించాడు. ఆనంద్ దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. భూ సంస్కరణల నినాదాన్ని ఒక నిశ్చితకార్యక్రమంగా మార్చడానికి తనింతవరకూ చేసిందంతగాలేదు. ఇఖ అమలుమాట మరీ దూరంగా ఉంది. శాసనకోశంలో దానికి సంబంధించిన చట్టమైతే ఉంది కానీ అతి వట్టి డొల్ల. అందులో లెక్కలేనన్ని లొసుగులు. వాటిని ఉపయోగించుకుని ఉద్దేశపూర్వకంగానే కానీ, తీవ్ర నిర్లక్ష్యంవల్ల నిష్క్రియత్వ వైఖరివల్ల ఆచరణలో అది మృతాక్షరమే అవుతోంది —నిజానికిప్పటికే అయింది. ఆ చట్టాన్ని తను సమూలంగా మార్చవలసి ఉంది. ఇప్పుడీ చీఫ్ సెక్రటరీ ఇందిరా గాంధీ తలపెట్టిన ఆ విశిష్ట కార్యక్రమాన్ని మరో మంత్రి కెవరికైనా అప్పగించి చేతులు దులుపుకోమంటున్నాడు —శాశ్వతంగా దానిని సమాధి చేయడానికి.

మరునాడు ఆనంద్ రెవెన్యూ సెక్రటరీని పిలిపించాడు. ఇతణ్ణి దగ్గరకు తెచ్చుకోవడం కాస్త సులువు. భూపరిమితులనే ఈ సరికొత్త ఉన్మాదం అతడికీ నచ్చలేదు. ఈ విషయం అతడు నిర్మొహమాటంగా చెప్పాడు కూడా. భూమిలేని పేదల సమస్యను పరిష్కరించడమలా ఉంచి ఈ ఆలోచన ఎప్పటికీ ఎలా సఫలంకాదో తేటతెల్లంగా వివరించాడు. అంతలోనే అడ్డంగా తిరిగిపోయి, 'కానీ సర్, కొత్త విధానం ఎటువంటిదైనా సరే, దానిని అమలు చేయడానికి మేము

సిద్ధంగా ఉన్నాం నేను పార్టీ మేనిఫెస్టోను, అందులో పేర్కొన్న ఉదాత్త లక్ష్యాలతో సహా క్షుణ్ణంగా అధ్యయనం చేశాను' అని ముగించాడు.

ఆ మాటలోని అంతరార్థం స్పష్టమే. అధికార వర్గం ఇవ్వగలిగిన సలహా ఏదీ లేదు. ఏ రంగంలోనైనా మార్పు అవసరమని వారు భావించడంలేదు. వాళ్ళ ఉద్దేశంలో అంతా సజావుగానే ఉంది. అయితే ప్రభుత్వం కొత్తగా ఏదైనా చేయాలని సంకల్పిస్తే కింది నుంచి పైస్థాయి వరకూ అధికారులందరూ ఆదేశాలను పాటిస్తారు, అంతే.

రెవెన్యూశాఖలో భూ సంస్కరణలకు ఇన్‌చార్జిగా ఉన్న అధికారి కూడా కొత్తగా చెప్పగలిగిందేమీ లేకపోయింది. కొన్ని మాసాలపాటు ఆనంద్‌తో కలిసి పని చేశాడు కనుక తన బాస్ ఆశిస్తున్నదేమిటో అతడికి బాగా తెలుసు. అయితే అప్పుడు ఆనంద్ ఒక్కడే తన బాస్ కాడు. ముఖ్యమంత్రి చౌదరి ఏవో అజ్ఞాత సూత్రాల ద్వారా దూరంనుంచే రెవెన్యూ శాఖను తన విశిష్టశైలిలో నియంత్రిస్తూ వచ్చాడు. దాంతో ఈ అధికారికి —ఇంతవరకూ కత్తిమీద సాము చేస్తూ గడపవలసి వచ్చింది. ఇప్పుడితగాడు కొత్త ముఖ్యమంత్రి భూ సంస్కరణల గురించి బొత్తిగా ఏమీ తెలియని, పార్టీ మేనిఫెస్టో పట్ల అంతగా అంకితభావం లేని మరో మంత్రి కెవరికైనా ఆ శాఖను అప్పగిస్తే బాగుండునని మనసారా ప్రార్థించుకుంటున్నాడు ఒకవేళ అది జరగనప్పుడు, నిజంగా కూడా తనది మిడిమిడి జ్ఞానమే కనుక ముఖ్యమంత్రి దానిని అర్థం చేసుకుని తనను మరో శాఖకు బదిలీ చేసినా చాలునని వేడుకుంటున్నాడు.

పార్టీ వాదిగా ఆనంద్ ఈ విషణ్ణ పరిస్థితికి కంపించిపోయాడు అంతిమంగా అతడు భూ సంస్కరణల శాఖతో పాటు లాండ్ రెవెన్యూ, సంస్కరణలు, సీలింగ్స్, సెటిల్‌మెంట్, భూమి హక్కులు, రిజిస్ట్రేషన్‌లతో కూడిన అతిపెద్ద గంపెడుశాఖను తన అధీనంలోకి తీసుకున్నాడు.

ఆ తర్వాత చాలా రోజులపాటు ఆనంద్ దాదాపు రాష్ట్రం నలుమూలలా జరిగిన అనేక కార్యక్రమాలలో పాల్గొనవలసి వచ్చింది. వాటిలో ఆటల పోటీల ప్రారంభోత్సవం మొదలుకొని పార్టీ ర్యాలీలకు హాజరుకావడం, సంస్కృత విద్వాంసులకు అవార్డుల ప్రదానం, జిల్లా అటవీ అధికారుల సమ్మేళనంలో పాల్గొనడం వంటి, ఒక ముఖ్యమంత్రి తప్పనిసరిగా కొంత సమయం కేటాయించవలసిన అనేక కార్యక్రమాలున్నాయి. తన ప్రభుత్వపు పౌర సంబంధాలను ఎంతో మెలకువగా పోషించుకోవలసిన బాధ్యత కూడా అతడికుంది. పత్రికలు వక్రీకరణలూ, అతిశయోక్తులకూ, అసత్య ప్రచారానికి పాల్పడే ప్రమాదం ఎప్పుడూ ఉంటుంది. కనుక దానిని నివారించడానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకోక తప్పదు. ఒకే శాఖను చూసుకోవలసిన మంత్రికీ, అనేక శాఖలు పర్యవేక్షించవలసిన ముఖ్యమంత్రికీ ఉన్న తేడాను ఆనంద్ వెంటనే అర్థం చేసుకున్నాడు. అన్నింటినీ మించిన మహత్తర కార్యభారం నిత్య సమస్యాత్మకమైన శాంతి భద్రతల పరిరక్షణ అనే గురుతర బాధ్యత. అందుకనే చౌదరి యథాతథ స్థితిని కొనసాగించే తత్త్వాన్ని అంతగా జీర్ణించుకోవడంలో ఆశ్చర్యపడవలసిందేమీలేదని అతనికి తోచింది.

ఇప్పుడు ప్రభుత్వ శిఖరాగ్రం చేరుకున్న ఆనంద్‌కు తాను హఠాత్తుగా ఒంటరివాడినై పోయినట్లనిపించింది. అయితే అంత ఎత్తు నుంచి అట్టడుగు వాస్తవాలను మరింత విశాలంగా చూడ

గలిగిన అవకాశమతనికి లభించింది. పూర్తిగా వారం రోజులపాటు తన శాఖతో సంబంధం లేని కార్యకలాపాలలో మునిగితేలిన తర్వాత భూ సంస్కరణల గురించి కొద్దిసేపు ఆలోచించే తీరిక లభించింది. తన కింద ఆ శాఖ మరీ భ్రష్టుపట్టిందా అనిపించింది. తప్పు చేశానన్న భావం కలిగింది. అయితే బొత్తిగా ఆసక్తిలేని మంత్రులెవరికో అప్పగించడం కంటే అవకాశ మున్నంతలో తనే వ్యక్తిగతంగా శ్రద్ధ చూపించడం మంచిదన్న నిర్ణయానికి వచ్చాడు. అసలు సమస్య, ఎవరో కొంత మంది భూ యజమానుల నుంచి కొంత భూమిని స్వాధీనం చేసుకుని భూమిలేని వారికి ఇవ్వడం మాత్రమేకాదన్న గ్రహింపూ అతడికి కలిగింది. భూ యాజమాన్యంలో సమూలపరివర్తననే తీసుకుని రావలసి ఉంటుంది. కేవలం ఒక చట్టం చేయడం ద్వారా భూ యజమానుల నుంచి భూమి హక్కును తప్పించడం సాధ్యమౌతుందా ? చారిత్రక కారణాల వల్లనే కావచ్చు. అనాదిగా భౌతికంగా, మానసికంగా భూమితో తమ జీవితాలు ముడివేసుకున్న సంప్రదాయ బద్ధులైన పెక్కుమంది విషయంలో అది సముచిత వ్యవహరణ అవుతుందా? సంస్కరణ ప్రయత్నాలను వారు ప్రతిఘటించకుండా ఊరుకుంటారా ? ప్రతిఘటిస్తే ఏమవుతుంది?

'దున్నే వాడిదే భూమి' అన్న నినాదం కేవలం భూమికి సంబంధించినది మాత్రమే కాదని పార్టీలోని కొందరు మేధావులు ముందే ఊహించగలిగారు. ఈ నినాదం ద్వారా పార్టీ వాస్తవంగా యధాతథస్థితిపై తొలిసారిగా ప్రత్యక్ష యుద్ధం ప్రకటించింది. ఎందరో నాయకులు, కార్యకర్తలు ఈ దృక్కోణాన్ని ఆమోదించలేదు. మేనిఫెస్టో కేవలం వోట్లు రాబట్టుకోడానికేనని స్పష్టం చేశారు. అమలు చేయడమంటారా ? అది కేవలం సాపేక్షం, ఆయా పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది.

ఆనంద్ ఆ తరహా అభిప్రాయాలు కలిగిన మిగిలిన వాళ్ళు ఏ కార్యక్రమమైనా నూటికి నూరు శాతం ఫలించడం సాధ్యంకాదని భావించారు. అయితే భూమి విషయానికి వస్తే అందులో ఒక విలక్షణమైన పారదర్శకత ఉంది. దానినెవరూ తమంతతామే దాచి పెట్టడానికి వీలుండదు. అంతా ప్రత్యక్షంగా కనిపిస్తూనే ఉంటుంది. రెవెన్యూ రిజిస్టర్లలో రాతలు ఎలాగైనా ఉండనీ, చిన్నా పెద్దా అన్న తేడా లేకుండా భూ యజమానుల్లో ఎవరెవరికి ఎంతెంత భూమి ఉందో ఊళ్ళో ప్రతి ఒకరికీ తెలుస్తుంది. కనుక పార్టీ వాగ్దానం ప్రకారం పరిమితులను అమలు చేయడమే మొదలైతే దానిని ఎంత నిర్దుష్టంగా, లేదా ఎంత అరకొరగా అమలు చేస్తున్నదీ, గ్రామస్థులు ఇట్టే తెలుసుకోగలుగుతారు. వాళ్ళ యోచనా కోణం నుంచి చూస్తే భూ పరిమితుల విధింపు చాలా సరళమైన వ్యవహారం. అది నూటికి నూరు శాతం – అంతకు తక్కువకాకుండా – నిర్దుష్టంగా అమలుచేయాడానికి వీలైనది. అసలు ప్రశ్నల్లా ఆచరణలో ఏమేం చేయాలన్నది. ఈ అంశాలను భూ సంస్కరణల శాఖలోని అధికారులకు ఆనంద్ సాకల్యంగా వివరించి ప్రభుత్వానికి సంబంధించిన ఇతర అత్యవసర వ్యవహారాల్లో మునిగిపోయాడు.

నెహ్రూ అనంతరం దేశ చరిత్రలో, తిరిగి రాబట్టుకోలేని లేదా పునరావృత్తం కాని స్వర్ణ విరామం అనదగిన కాలం ఇది. ఎంతో జనాకర్షణశక్తి కలిగిన నాయకురాలు, అత్యంత సుస్థిర ప్రభుత్వం, అంతటా అన్నీ అదుపులో ఉన్న పరిస్థితి, చేతికందిన హరిత విప్లవం తొలిపంటసిరులు, భారత–బంగ్లాదేశ్‌ల మధ్య సమరస వాతావరణం, ఒక్క పాకిస్తాన్‌తో మినహా ఇరుగుపొరుగు

దేశాలతో మైత్రీ సంబంధాలు ఎటువంటి ఉపద్రవాలను ఎదుర్కోవలసిన అవసరం తలెత్తని ఎంతో విలువైన ఏణ్దర్థం కాలం, ఎందరో యుక్త ఆలోచనాపరులు భావించినట్టు మార్పును ఉద్దేశించిన ఏ కార్యక్రమంతోనైనా ప్రభుత్వం శాశ్వతప్రభావం చూపించగలిగిన ఊపును అందించడానికి వీలైన కాలం. కొద్దిరోజులపాటు అదే జరిగింది పరిపాలనా యంత్రాంగం ఒక్కసారిగా కార్యక్షేత్రంలోకి లంఘించింది.

మొదటగా అధికారపక్షపు వర్కింగ్ కమిటీ న్యూఢిల్లీలో సమావేశం జరిగింది. పార్టీ మేనిఫెస్టోను ఆధారంగా తీసుకుని విస్తృతమైన ఎజెండాను రూపొందించింది అది దేశవ్యాప్తంగా భూమిలేని పేదల్లోనూ, ఇతర పేద ప్రజానీకంలోనూ పెద్ద ఎత్తున ఆశలు రేకెత్తించింది. ఆ సమావేశానికి పత్రికలు విస్తృత ప్రచారం అందించాయి. పత్రికల వారికి (అక్షరాలా వారికి కాకపోయినా, కోటీశ్వరులైన వాళ్ళ యజమానులకు) రాత్రికి రాత్రే భూ సంస్కరణల మీదా, సమసమాజ లక్ష్యంతో అధికారపక్షం తలపెట్టిన ఇతర చర్యల మీద నిజంగానే అంత ఆసక్తి పుట్టుకొచ్చిందా? లేకక విజ్ఞులైన కొందరు భావించినట్టు ఇందిరాగాంధీ ఆధిపత్య స్థానంలో ఉన్నప్పటికీ అధికార పక్షం లోలోపల సాగుతున్న కుతంత్రాల రీత్యా వాళ్ళ దృష్టికి వస్తున్నట్టు తోస్తున్న రసభంగ ఘట్టానికి తగిన ఊతం కల్పిస్తున్నారా?

గ్రామాల్లో భూ పరిమితులతోపాటు వర్కింగ్ కమిటీలో చర్చకు వచ్చిన మరో సంక్లిష్ట స్థానం —పట్టణ భూములపై పరిమితి. అది మరింత వివాదాస్పదంగా మారింది. పట్టణ సంపన్న కూటమి యావత్తూ బరిలోకి దిగిపోయింది. తన సమస్త వనరులనూ, ప్రభుత్వంలో, రాజకీయపక్షాలలో తనకున్న పలుకుబడి నంతటినీ అది మోహరించింది. సమావేశంలో పెద్ద ఎత్తున ప్రతిష్టంభన తలెత్తింది. అనుకున్న మార్గంలో సమావేశాన్ని ముందుకు నడిపించడం కూడా సాధ్యమయ్యేలా లేదని ఇందిరాగాంధీ గ్రహించారు. దున్నేవాడిదే భూమి అన్న నినాదాన్ని జీర్ణించుకుని వ్యవసాయ భూములకు పరిమితి విధించడానికి అనుకూలంగా అనర్గళోపన్యాసాలు చేసినవారు హఠాత్తుగా అడ్డం తిరిగి, పట్టణ భూములపై పరిమితి విధించడమెలా అసాధ్యమో వివరిస్తూ ఎలుగెత్తి మహోద్రేకంతో ఉపన్యాసాలు చేశారు. దాదాపు అంతర్యుద్ధం వైపు నడిపించే మహోపద్రవమే సంభవిస్తుందని భీకర స్వరంతో హెచ్చరించారు. వ్యవసాయ భూములపై పరిమితికి విరోధులైనవారు కూడా ఇదే అదనని పట్టణ నాయకుల పద్ధతిలోనే తమ అభ్యంతరాలను తారస్థాయిలో మళ్ళీ చెప్పడం ప్రారంభించారు. అధికారపక్షం పట్టణ వర్గాలపట్ల తన పక్షపాతాన్ని అత్యంత నగ్నంగా ప్రదర్శించుకుంటోందని ఈ సమావేశంలోని చర్చల ద్వారా స్పష్టమైపోయిందని ఉద్ఘాటించారు. ఇక ఈ క్షణం నుంచి గ్రామీణ ప్రజలు ఈ పార్టీని సమర్థించడం కల్ల అంటూ ఆవేశంతో ఊగి పోతూ జోస్యం చెప్పారు. ఇంతకాలం పార్టీ మెరమెచ్చులకు మోసపోయి సమర్థించారు ఇక ఇప్పుడు తెలివి తెచ్చుకుంటారన్నారు. పట్టణాలలోనే కానీ, గ్రామాలలోనే కానీ పరిమితులు విధించడమన్న ఆలోచనే ఒక దుస్తంత్రమని తేల్చివేశారు. ప్రజల్లో ఒక్కొక్కరికి ఎంతెంత భూమి ఉండాలో నిర్ణయించి చెప్పే హక్కు ప్రభుత్వానికెవరిచ్చారు ? ఈ వెర్రి మొర్రి పథకం విషయంలో ఎంత మెల్లగా అడుగేస్తే అంత మంచిది. దీనికి బదులు మేనిఫెస్టోలోని మిగిలిన అంశాల మీద దృష్టిపెట్టవచ్చు కదా !

మొత్తం మీద అది సంపూర్ణ ప్రతిష్టంభన, ఆ అంశంమీద రోజంతా చర్చించిన తర్వాత ముఖ్యమంత్రులతో, కమిటీ సభ్యులతో ప్రధాన మంత్రి విడివిడిగా చర్చించి తన నిర్ణయాన్ని ప్రకటించాలని తీర్మానించారు.

ఇంకా నిర్ణయం ప్రకటించడం మేమిటని ఆనంద్ ఆశ్చర్యంగా అనుకున్నాడు. మేనిఫెస్టోలో ఒక వాగ్దానం అంటూ చేసిన తర్వాత పార్టీ దాని నుంచి వెనకడుగువేయడం అసాధ్యం. ప్రధాన మంత్రితో ఆయా ముఖ్యమంత్రులు విడివిడిగా జరిపిన చర్చల గురించి తెలుసుకోడానికి ప్రయత్నించాడు. అయితే వాళ్ళు కూడా ఆ విషయంమీద అంతే అస్పష్టస్థితిలో ఉన్నారు.

ఆనంద్ వంతు వచ్చేసరికి రాత్రి తొమ్మిదయింది. పార్టీ ప్రభుత్వాలకు మేనిఫెస్టోలో నిర్దేశించిన కర్తవ్యంమీదే చర్చ కేంద్రీకృతమైంది. ఇందిరాజీ మాటలు ప్రారంభంలో ఎంతో ఉత్సాహపూరితాలుగా ధ్వనించాయి. అయితే చర్చ ఒకింత పుంజుకున్న తర్వాత, భూపరిమితుల విధింపువల్ల తలెత్త బోయే వివిధ తీవ్ర పర్యవసానాలను వాళ్ళు స్పృశించవలసి వచ్చింది. తమ మిగులు భూమిని వదులుకోడానికి భూయజమానులను ఒప్పించడం ఎంతో కష్టంతో కూడుకున్న వ్యవహారం. అసలు 'మిగులుభూమి' అన్న ఆలోచనే వారికి సమ్మతంకాదు. దానికేమాత్రం ఇష్టపడక విరోధించే రైతుల నుంచి భూమిని స్వాధీనం చేసుకోవడమెలా? ఎంతైనా కొన్ని తరాలుగా వాళ్ళు దానిమీద జీవిస్తున్నారు. ప్రత్యక్షంగా భూమితో సంబంధంలేని జమిందార్ల విషయం పూర్తిగా వేరు తమకెంత భూమి ఉన్నదో కూడా వాళ్ళకు తెలియదు. కనుక యాభైదశకంలో జమీందారీలను రద్దుచేస్తూ తీసుకున్న చర్య వాళ్ళనంతగా అల్లకల్లోలం చేయలేదు. కొంతకాలం వ్యాజ్యాలు నడిపారు కానీ, అది కూడా నష్టపరిహారం ఎక్కువగా రాబట్టుకోడానికేగానీ, భూమికోసంకాదు. చివరకు ప్రభుత్వం నుంచి ఎంత పిండుకోగలరో అంత పిండుకున్నారు. అదీగాక వారు ఇప్పటికే నగరాల్లో స్థిరపడి ఏవో వ్యాపారాల్లో, ఇతర లాభసాటి వ్యాపకాల్లో మునిగిపోయారు. కనుక ఎక్కడో మారుమూల ఊళ్ళో భూములు కోల్పోయినా వాళ్ళ ఆర్థిక పరిస్థితి తలకిందులైపోదు. అయితే గ్రామాల్లో నివసించే బడారైతులు ఆ గ్రామాల్లో నాయకులుగా చలామణి అవుతున్నారు. వారు మొదటినుంచి అధికారపక్షానికి తలలో నాలుకలానే ఉంటూ వచ్చారు.

వాదోపవాదాలు పరిచిత సరళిలోనే ఉన్నాయి; ఎన్నో సంవత్సరాలుగా మళ్ళీమళ్ళీ చెవినపడుతున్నవే అవి. రోజురోజంతా జరిగిన పార్టీ వర్కింగ్ కమిటీ సమావేశంలో అనేకమంది ముఖ్యమంత్రులు ఎంతో బలంగా వాటిని ఉద్ఘాటించారు. రాత్రి ఇందిరాగాంధీతో తాము విడివిడిగా జరిపిన చర్చల్లో కూడా వాటినే వాళ్ళు పునరుద్ఘాటించి ఉంటారనడంలో సందేహం లేదు. అందులోని లాభనష్టాలను అప్పటికెన్నోసార్లు బేరీజువేసుకున్న ఇందిరాగాంధి, ప్రతిసారీ అప్పుడే మొదటిసారి వింటున్నట్టుగా వాళ్ళ అభిప్రాయాలు విన్నారు. ఆనంద్ ఆమెతో జరిపిన సమావేశంలో భూపరిమితుల గురించి తనెంతో ఇష్టపడే సిద్ధాంతాలనే మరోసారి వల్లించాడు. భూయాజమాన్యానికి ఒక సరికొత్త అర్థం కల్పించకపోతే భారతదేశంలో వాస్తవికమైన మార్పు అసాధ్యమని స్పష్టం చేశాడు. ఇప్పటివరకూ, భవిష్యత్తులో మరికొంత కాలం, గ్రామీణ భారత దేశంలో భూమి ఒక్కటే ప్రధాన ఉత్పత్తి సాధనం. పరిశ్రమలు లేదా సర్వీసు రంగాలలో ఉద్యోగా

వకాశాలు చాలినమేరకు అభివృద్ధి చెందేవరకైనా భూయాజమాన్యం సామాజిక న్యాయ సూత్రానికి తగినట్టు ఉండవలసిందే. ఎటొచ్చీ ప్రారంభఘట్టంలో భూపరిమితుల విధింపులో తగిన మెలకువతో వ్యవహరించడం అవసరం. ఒకసారి అది జరిగిందంటే గ్రామాల్లో విప్లవాత్మక పరిణామాలు అడుగుపెడతాయి. భూపరిమితులవల్ల ఆర్థికతను రకరకాల దారులవైపు మళ్ళించడానికీ, ఇంతకాలం భూస్వాముల గుప్పిట్లో అర్ధాకలిబతుకులు ఈడుస్తున్న అసంఖ్యాక గ్రామీణ చేతివృత్తులవారిని ఆ వరవడిలోకి తీసుకురావడానికి ప్రభుత్వానికి వీలవుతుంది. క్రమంగా, చక్కని సమతూకం వెల్లివిరిసే ఆర్థిక వ్యవస్థ రూపుదిద్దుకుంటుంది.

తన ప్రతిస్పందన ఏమిటో కనబరచకుండానే అతడు చెప్పిన మాటలు, ఇందిరాజీ శ్రద్ధగా ఆలకించారు. తనకంటేముందు ఆమెతో మాట్లాడిన, తన అభిప్రాయాలకు భిన్నమైన అభిప్రాయాలు వ్యక్తీకరించిన ముఖ్యమంత్రులకు కూడా ఆమెనుంచి ఇలాగే ఎటువంటి ప్రతిస్పందనా లభించి ఉండదని ఆనంద్ అనుకున్నాడు. ఇది అందరికీ బాగా తెలిసిన ఆమె వ్యవహార సరళి.

ఆ తర్వాత ఆనంద్ రాష్ట్రంలో ప్రచారంలో ఉన్న ఓ ముచ్చటను ఆమెకు వినిపించాడు. భూపరిమితి చట్టానికి అనుగుణంగా తమ భూముల్ని విడివిడిగా తమపేర రాయించుకోవడం కోసం భూస్వామ్యవర్గానికి చెందిన కొందరు జంటలు ఉత్తుత్తి విడాకులు తీసుకున్నారు. పేరాసకు అద్దంపట్టే ఈ విపరీతానికి ఇందిరాగాంధీ పగలబడినవ్వేసి అడిగారు. 'భూమికోసం జరిపే ఈ వైవాహికవంచనను మీరెలా ఎదుర్కోవాలనుకుంటున్నారు?'

'మేము దాని గురించి తల పగలగొట్టుకున్నాం మేడమ్, అయినా ఏంచేయాలో తోచలేదు, భూమిమీద మోజుతో ఎంతకైనా తెగిస్తారు...' ఆనంద్ అన్నాడు.

'మొత్తానికి మీరు కాపురాలు కూల్చదలచుకున్నారన్నమాట!' ఇందిరాజీ చమత్కరించారు.

'లేదు మేడమ్, ఆ ఉద్దేశం మాకెంత మాత్రం లేదు. మాకు కావలసిందల్లా ఆ నకిలీ విడాకులు తీసుకున్న దంపతులకు చెందిన భూమి. ఇతరత్రా సంతోషంగా సాగుతున్న వాళ్ళ కాపురాల్లో తలదూర్చాలన్న దురుద్దేశం మాకు లేదు'

ఈ హాస్యోక్తులతో సమావేశం ముగిసింది. ఆనంద్‌కి అర్థమైన పర్యవసానం ప్రకారం, భూపరిమితి విధింపు కార్యక్రమంలో ముందుకుసాగడానికి ఇందిరాజీ సుముఖంగా ఉన్నారు. ఇందుకామె మద్దత్తు పూర్తిగా ఉంటుంది. ఇతర ముఖ్యమంత్రుల కామె ఆదేశాలేమిటో తెలుసుకోవలసిన అవసరం అతనికి కనిపించలేదు. ముఖ్యమంత్రులందరికీ ఆమె నుంచి ఒకేవిధమైన ఆదేశాలు లభిస్తాయన్నది నిర్వివాదం— మరోలాజరిగడానికి వీల్లేదని అతడనుకున్నాడు.

తదనుగుణంగానే రాష్ట్ర ప్రభుత్వం కొత్త పరిమితి చట్టాలను ఖరారు చేసింది. బాగానే ఉంది కానీ, వేలాది గ్రామాల్లో వాటిని అమలుచేయడానికి కచ్చితమైన నిర్దిష్టమైన వ్యూహం ఏమిటి? బడ్జెట్‌లో అందుకు జరపవలసిన కేటాయింపు పరిమాణం ఎంత? ఎవరెవరి చేతుల్లో ఎంతెంత భూమి ఉందో నికరమైన వివరాలు సేకరించడానికి ఎంత వ్యవధి పడుతుంది? ఈ మొత్తం కార్యక్రమం పూర్తికావడానికీ, అనంతర చర్యలకూ ఎంత సమయం పడుతుంది? భూమిలేనివాళ్ళకి మిగులుభూమి పంపిణీకి అవసరమైన వ్యవధి ఎంత? ఈ కీలకాంశాలను

తక్షణమే పరిశీలించే బాధ్యతను ప్రభుత్వం రెవిన్యూశాఖకు అప్పగించి రెండుమాసాల్లో పూర్తి నివేదిక ఇవ్వవలసిందిగా ఆదేశించింది. ఏ పరిస్థితిలోనూ గడువు పొడిగించడం జరగదని స్పష్టం చేసింది.

రెవిన్యూ శాఖ మెచ్చుకోదగినంత వేగంతో పనిచేసింది. రెండుమాసాలకు బదులు, ఆరు వారాలలోనే తనపని పూర్తిచేసింది. ఏడోవారంలో మొదటి రోజున, చక్కగాటైపుచేసిన పత్రాలతో అందంగా బైండ్ చేయబడిన నివేదిక ఆనంద్ టేబులుమీద ప్రత్యక్షమైంది. ఎంతో ముగ్ధుడైన ఆనంద్, ఆ నివేదికను స్వయంగా తనకు సమర్పించడానికి వచ్చిన చీఫ్ సెక్రటరీని అభినందించాడు.

ఫైలు తెరచి, సారాంశాన్ని పొందుపరుస్తూ అధికారులు రాసిన నోటు పరికించాడు. మొదటిపంక్తి చూస్తూనే కుర్చీలో ఒక్కసారిగా నిటారుగా కూర్చున్నాడు. నమ్మశక్యం కానట్టు ఆ సారాంశం వైపు తేరిపారచూస్తూ ఉండిపోయాడు. అందులోని ఆఖరిపేరాలో ఇలా ఉంది:

<u>ప్రతిపాదిత చట్టంలో పేర్కొన్నట్టు భూపరిమితుల విధింపు కార్యక్రమాన్ని పూర్తి చేయడానికి కావలసిన మొత్తం వ్యవధి మూడు సంవత్సరాల నాలుగుమాసాలు, అందుకయ్యే ఖర్చు 65 కోట్ల 78 లక్షల రూపాయలు.</u>

ఆనంద్ అప్పటికప్పుడు లెక్కలు వేసి చట్టం —తన చట్టం —అమలు, ఈ శాసనసభ తదుపరి రాబోయే అయిదేళ్ళగడువు మధ్యలో పూర్తవుతుందని గ్రహించాడు! మరో శాసన సభ మరో మాటల్లో చెప్పాలంటే తదుపరి ప్రభుత్వ హయాంలో! టేబులుకు అవతలిపక్క ఉప్పొంగిపోతూ నిలబడి ఉన్న చీఫ్ సెక్రటరీకి 'కృతజ్ఞతలు' చెప్పడం కన్నా అతడు అనగలిగిందేమీ కనిపించలేదు. ఆ నివేదిక సిద్ధంకావడానికి తామెంత కష్టపడి పనిచేశారో ముఖ్యమంత్రికి చెప్పాలని అతడాశించాడనడంలో సందేహంలేదు. అయితే పాలిపోయిన ఆనంద్ ముఖం చూడగానే, వివరంగా చర్చించడానికి మధ్యాహ్నం మరెప్పుడైనా వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు.

అయితే ఆ నివేదిక గురించిన వార్త అప్పటికే బయటికి పొక్కిపోయింది. భూపరిమితుల కార్యక్రమాన్ని పెద్దఎత్తున ఎద్దేవా చేస్తూ పత్రికల సాయంకాలం ఎడిషన్లు వచ్చేశాయి. ఆనంద్ ఫలితాలకు హామీ ఇస్తున్నారు —మరోలా చెప్పాలంటే, తదుపరి ముఖ్యమంత్రి హయాంలో పేదలకు భూమి ఇస్తామంటున్నారు! అదికూడా బహుశా మరోపార్టీ ముఖ్యమంత్రి హయాంలో! రాష్ట్రంలోని భూమిలేని నిరుపేదలకు అంతపెద్ద ముల్లె అందిస్తున్న ఆయన ఔదార్యం ఎంత గొప్పది! మరుసటి వారాల్లో వెలువడిన సంపాదకీయాలు, కార్టూన్లు తృణీకారమూ, వెక్కిరింపుల ప్రమాణాలనన్నింటినీ బద్దలుకొట్టాయి. అంత పెద్దఎత్తున ఆర్భాటమూ ప్రగల్భోక్తుల తర్వాత ప్రభుత్వ కార్యక్రమం అధికారపక్షమనేది దివాలా తీసిన బ్యాంక్ పేరిట ఓ పోస్ట్‌డేటెడ్ చెక్కును జారీ చేయబోతున్నందుకు వాటిలో వ్యంగ్యసంతృప్తిచ్ఛాయలూ తొంగిచూశాయి.

ఆనంద్ మొదలు తెగిన చెట్టులా కుప్పకూలిపోయాడు. అధికారశ్రేణి తనను నిలువునా వంచించారని మొదట్లో అనుకున్నాడు కానీ తర్వాత వెంటనే సరిదిద్దుకున్నాడు. అధికారశ్రేణి ఎక్కడ తప్పుచేసింది? ఆ నివేదికను ఆమూలాగ్రం ఎన్నిసార్లు పరిశీలించినా అధికారులు

ఎక్కడా పొరపాటు చేయలేదన్న అభిప్రాయమే కలిగింది నివేదిక రూపకల్పనకు చేసిన సమంజస ప్రయత్నమే అందులోని ప్రతిఅక్షరంలో తొంగిచూసింది. అదెంతో పకడ్బందీగా ఉంది.

ఒకవిధమైన నిస్పృహస్థితిలో ఆనంద్ ఎం.ఎల్.ఏ.లతో, మాజీ ఎం.ఎల్.ఏ.లతో, ఎంపీలతో, మాజీ ఎంపీలతో, మాజీ మంత్రులతో, సీనియర్ అధికారులతో, భూసంస్కరణలకు అనుకూలంగా పట్టుదల కనబరుస్తున్న కమ్యూనిస్టుమేధావులతో, ఆసక్తిపరులైన ఇంకా అనేకమందితో ముమ్మరమైన సంప్రతింపులు ప్రారంభించాడు. ఎందుకైనా మంచిదని, బలరాంలాంటి కరడుగట్టిన భూస్వాముల తోసహా, ఈ కార్యక్రమాన్ని విమర్శించే వారిని కూడా ఇందులో చేర్చాడు.

పర్యవసానానికొస్తే, ప్రభుత్వయంత్రాంగం అడ్డంతిరిగి ఈ కార్యభారాన్ని పూర్తిచేయడానికి తమకు మూడున్నర సంవత్సరాల గడువూ ఇచ్చి తీరవలసిందేనని నిష్కర్షగా చెప్పేసింది. అక్షరాలా అది ప్రభుత్వాన్ని నవ్వులపాలు చేసిరెద్ధి. ఏదైనా పనిని వేగంగానూ, మెరుగ్గానూ చేయాలంటే అందుకోకచ్చితమైన మార్గమంటూ ఉండితీరాలి.

పార్టీ మేనిఫెస్టో రాసినవాళ్ళు గడువుగురించి ఎందుకు ఆలోచించలేదు? ఇక ఇప్పుడు ఎవరూ చేయగలిగింది లేదు.

ఆనంద్ తన నైజానికి విరుద్ధంగా టెలిఫోన్ తీసుకుని శేఖర్ నెంబర్‌కు డయల్ చేశాడు. ఇటువంటి సంశయ స్థితిలో తను శేఖర్‌కి ఫోన్ చేయవలసి వస్తుందని అతనెప్పుడూ అనుకోలేదు. ఇప్పుడు సాధారణ శాసనసభ్యుడుగానే ఉన్న శేఖర్ కూడా ఆనంద్ నుంచి తనకు ఫోన్ వస్తుందని ఊహించలేదు. అతడికి ఆనంద్ దురవస్థ చాలావరకూ అర్థమైపోయింది. సమస్యపై గట్టిగా ఆలోచన చేశాడు. ఒక్క ఏడాదిలో పూర్తి చేయడంకోసం మూడున్నర సంవత్సరాల కార్యభారాన్ని కుదించడం ఎవరికైనా ఎలా సాధ్యమో అతనికి ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. గడువు మధ్యలో కార్యక్రమాన్ని ఆపడమూ మంచిదికాదు. పూర్తి చేయలేమని అనుకున్నప్పుడు అసలు ప్రారంభించకపోవడమే ఉత్తమమని అతడి సలహా.

ఈ లోపల అనేక గ్రామాల్లో భూ పరిమితుల గురించిన భయాలు వ్యాపించి పోయినట్టు కుప్పతెప్పలుగా వార్తలు రాసాగాయి. తమ భూమి పరిమాణం ఎంతన్న దానితో నిమిత్తం లేకుండా భూ యజమానులందరూ భయభ్రాంతులైపోయారు. ప్రభుత్వం బిల్లు ఇంకా శాసనసభలో ప్రవేశపెట్టలేదు. కనుక ఒక్కో కుటుంబం ఎంత భూమి ఉంచుకోవచ్చునో వాళ్ళకు తెలియలేదు. దాంతో ఏపాటి భూమి ఉన్న వారైనాసరే ప్రభుత్వం దానిని స్వాధీనం చేసుకుని పేదలకు పంచిపెడుతుందనుకున్నారు. అసంతృప్తి తారస్థాయికి పెరిగిపోయింది. ప్రతిఒక్కరూ ఆగ్రహంతో కుతకుతలాడిపోతున్నారు. అనేక గ్రామాల్లో కమ్యూనిస్టులు భూముల్ని దౌర్జన్యంగా ఆక్రమించుకోవలసిందిగా పేదల్ని రెచ్చగొట్టారు. ఎలాగూ అవి వాళ్ళకే వస్తాయి కనుక చట్టం వచ్చే వరకూ ఎదురుచూడడం దేనికి?

ఇంత దారుణమైన విశ్వసనీయతా సంక్షోభాన్ని తన జీవితంలో ఎన్నడూ ఎదుర్కోలేదను కున్నాడు ఆనంద్. అసలా నివేదిక తయారు చేయించడమే తప్పయిందనుకుంటూ పశ్చాత్తాప పడసాగాడు. మిగిలిన రాష్ట్రాల్లో అలా కాదు. సమస్య దానంతటదే పరిపక్వంకాని లేదా దారి

తప్పి ఎటో కొట్టుకుపోనీ, మనం తొందరపడడం దేనికనుకుని అనేక మంది ముఖ్యమంత్రులు దీనినెంతో తేలిగ్గా తీసుకున్నారు. తనొక్కడే ఉలిపికట్టెలా మరోదారి పట్టాననుకున్నాడు ఆనంద్. తన విశ్వాసాలు తప్ప ఏ వైపు నుంచీ తనకు మరో మద్దతు లేదు.

ఈ సంక్షోభం కొనసాగుతున్నన్ని రోజులూ ఆయా విషయాల రూపురేఖలు ఎలా పరిణమించాయో తెలుసుకోడానికి అరుణ తరచ అతన్ని కలుసుకుంటూనే వచ్చింది. ఆనంద్ అదే లోకంగా తన పనిలో మునిగిపోవడం ఆమెకు నచ్చలేదు. అదే అతడి పతనానికి కారణమవుతుందని ఆమె భయపడింది. అతడు తలకెత్తుకున్నది ఎవరి మెప్పూ నోచుకోని ఇటువంటి కార్యభారంలో ఆమెకే సత్ఫలితమూ, సంతృప్తీ కనిపించలేదు. అయితే ఆనంద్‌లా శాంతంగా, నిబ్బరంగా కాక నిర్హేతుకంగా, దుడుకుగా వ్యవహరించే మనిషి కనుక సమస్య పరిష్కారంలో ఆమె అందించగల సహాయమూ లేదు.

ఉత్సాహం మరీ శ్రుతిమించిన ఓ బుద్ధిహీనుడుగా తాము బహిరంగంగానే ఆడిపోసుకుంటున్న ముఖ్యమంత్రి ఇలా చిక్కులో పడిపోవడం చూసి భూస్వామ్య కూటమి ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయిపోయింది. మంచి శాస్తి జరిగిందన్నారు వాళ్ళలో చాలా మంది పళ్ళు ఇకిలిస్తూ. ఆ తర్వాత చనిపోయినవాళ్ళూ, పుట్టని వాళ్ళతో సహా కుటుంబ సభ్యులందరి పేర్లలోకీ తమ భూముల్ని బదలాయించే కార్యక్రమంలో మునిగిపోయారు. ఆ జాబితా పూర్తయ్యాక తమ పెంపుడు కుక్కల్నీ, పిల్లుల్నీ కూడా మనుషులుగా మర్చేసి వాటి పేర భూములు రాసేశారు. కోస్తా ప్రాంతంలో ఎందరో భూ యజమానులు తమ వ్యవసాయ భూముల్లో గుంటలు తవ్వించి సముద్ర జలాలతో వాటిని ముంచెత్తించారు ఉప్పు తయారీ పేరుతో పరిమితి నిబంధనల నుంచి తప్పించుకోవడం దాని వెనుక ఉన్న పన్నాగం. ఆ కొద్ది వారాల్లోనూ వాళ్ళు సృష్టించగలిగిన రకరకాల అక్రమ పద్ధతులు మామూలు మనుషుల ఊహాశక్తి హద్దులన్నింటినీ అధిగమించి పోయాయి.

పతాకఘట్టం నుంచి పరిస్థితి ఒక్కసారిగా కిందికి జారిపోయి ఇంచుమించు ఒక ప్రహసనంలా మారిపోయిన ఈ ఘట్టంలో భూస్వామ్య లక్షణాలు పోతపోసినట్టుండే బలరాం, తనదైన శైలిలోనే కావచ్చు అంతటా అలముకున్న ఆ చీకట్లో కొంత వెలుగు ప్రసరింపజేశాడు. ఏవో తీర్థయాత్రలు చేస్తూ చాలా రోజుల పాటు దూరంగా ఉండి ఆనంద్ నివాసానికి వచ్చాడు. తన యాత్రా వివరాలను పూసగుచ్చినట్టు వివరించి ఆయా పుణ్యక్షేత్రాల నుంచి తెచ్చిన కొంత ప్రసాదం ఆనంద్‌కు ఇచ్చాడు. ఆనంద్ అతడికి కృతజ్ఞతలు చెప్పి నెమ్మదిగా సంభాషణను భూపరిమితుల వ్యవహారంలో ఏర్పడిన ప్రతిష్టంభనవైపు నడిపించాడు. అతడు చెప్పినవి బలరాం ఓపిగ్గా విని తొలిరాకెట్ పేల్చుతున్నట్టుగా అన్నాడు. 'మీ కెప్పుడూ ఉన్న సమస్యేగా, మరోసారి పైకొచ్చిందన్నమాట. మీకెందుకు చూస్తూ ఉండండి, మీ రెవెన్యూ శాఖ వాళ్ళు మీరు తప్పకుండా అందించే అదనపు సిబ్బందిని కూడా తీసుకుని మూడున్నరేళ్ళు పనిని సాగదీస్తూ హాయిగా కాలం దొర్లించేస్తారు. ఆ తర్వాత ఏదో సాకు చూపించి మరో మూడేళ్ళ గడువు అడుగుతారు. పని మధ్యలో ఉండగా మీరూ కాదనలేరు. అంతాజాసి చివరకు మొండిచెయ్యి చూపిస్తారు. నే చెబుతున్నాగా...'

వాళ్ళలా మాట్లాడుకుంటుండగా రాష్ట్రంలోని గ్రామాధికారుల సంఘం పెద్ద ఎత్తున ప్రద ర్శన జరుపుతూ అక్కడికి వచ్చినట్టు ఆనంద్ సెక్రటరీ తెలియజేశాడు. వాళ్ళ తరఫున ఓ ప్రతినిధి వర్గం ముఖ్యమంత్రిని కలవడానికి వచ్చింది

'వాళ్ళు చీడపురుగులండీ' బలరాం నొక్కి చెబుతున్నట్టు అన్నాడు. 'ఎప్పుడూ జీతాలు పెంచమని అడుగుతూనే ఉంటారు రికార్డులు తారుమారు చేస్తూ ఊళ్ళను లూటీ చేయడమే వాళ్ళపని! సరే, ముఖ్యమంత్రి అన్నాక అన్ని రకాల వాళ్ళనూ కలుసుకోక తప్పదు కదా. మంచిది ఇక నేను వెడతాను. సెలవ్' లేచి ద్వారం వైపు అడుగులు వేసి అంతలోనే ఆగి వెనక్కి తిరిగి అన్నాడు. 'ఓ చిన్న సలహా ఇస్తాను, ఆనంద్‌గారూ ఈ గ్రామాధికారులున్నారే వీళ్ళు గుంటనక్కలు. తమ ఊళ్ళో ఉన్న భూములకు సంబంధించిన ప్రతి చిన్న వివరమూ తమ అరచేతి గురించి తెలిసినంత స్పష్టంగా వాళ్ళకు తెలుస్తుంది. తప్పుడు నమోదులన్నీ వాళ్ళ చేతుల మీదుగానే జరిగిపోతుంటాయి. అయినా వాళ్ళను మంచి చేసుకుంటూ ఉండ వలసిందే. నేనెప్పుడూ అదే చేస్తుంటాను....'

ప్రతినిధివర్గం వచ్చి నిన్నటివీ, నేటివీ, రేపటివీ కూడా కలుపుకుని సకల డిమాండ్లతో ఓ సుదీర్ఘమైన వినతి పత్రం సమర్పించింది. తక్షణమే సమాధానం చెప్పాలని కూడా నిలదీసింది., సంతృప్తికరమైన సమాధానం లభించకపోతే సమ్మెకు దిగుతామన్నది అందులో ఇమిడిఉన్న సూచన. త్వరలోనే భూమి శిస్తు వసూళ్ళు ప్రారంభమౌతాయి కనుక సమ్మె బెదిరింపుకు ఇదే తగిన అదను. ఆనవాయితీ ప్రకారం ముఖ్యమంత్రితో ఘర్షణకు దిగాలి. తర్వాత గ్రామాధికారులు సమ్మెకు సిద్ధమైపోతారు. ఏ పక్షానికాపక్షం దిగేది లేదంటుంది. దాంతో ప్రతిష్టంభన మొదలు. అటు తర్వాత గీచిగీచి బేరమాడడాలు ప్రారంభమౌతాయి. వాళ్ళెలాగో మొత్తానికి రాజీకి దిగొస్తారు. సమ్మె విరమిస్తారు. తర్వాత అంతా బాగు, అందరూ భాయీ, భాయీ, ప్రస్తుతం వీరందరూ ఆ సుపరిచిత ఘట్టాల మీదుగానే సాగుతున్నారు. ఆనంద్‌లో హఠాత్తుగా ఏదో ఆలోచన మెరిసి, ఆ ప్రతినిధివర్గం నాయకుడితో అన్నాడు. 'మంచిది శర్మగారూ, ఎప్పుడూ ఉండే గొడవలేగా అవలా ఉంచండి. ఈసారి మీకో కొత్త ప్రతిపాదన చేయబోతున్నాను.'

'ఏమిటి సార్, అది?' అనుమానంగా అడిగాడు శర్మ.

'రేపు ఇదే వేళకు నన్ను కలుసుకుంటారా? మీ డిమాండ్లనూ, మీ వృత్తికి సంబంధించిన మరికొన్ని విషయాలనూ పరిశీలించాలనుకుంటున్నాను. నేను చేయబోయే ప్రతిపాదన మీకు తప్పకుండా నచ్చుతుంది...'

ప్రతినిధివర్గంలో కొందరు ఏవో గుసగుసలాడుకున్నారు. కానీ మరునాడు తిరిగి కలుసు కోడానికి అందరూ అంగీకరించారు. ప్రతి ఒకరూ ఒకింత అయోమయగ్రస్థులయినట్టు కని పించారు. తనామాట ఎందుకన్నాడో ఆనంద్‌కు అంతకచ్చితంగా తెలియదు. మెరుపులా ఏదో స్ఫురించి అన్నమాట అది. కారణం తేటతెల్లంకావడానికి కొంత సమయం పడుతుంది. ప్రతినిధివర్గ సభ్యులు విధేయతతో చేతులు జోడించి నమస్కరించి అక్కడి నుండి నిష్క్రమించారు.

# 55

గ్రామీణ ప్రాంతాల్లో గ్రామాధికారి గతంలోనూ, దేశంలోని అనేక రాష్ట్రాల్లో నేడు సైతం బహుముఖ ప్రయోజనాలు నెరవేర్చే ఉద్యోగి. అతడి విధులు అనేకంగానూ, అనేక రకాలుగానూ ఉంటాయి. స్థానిక పరిస్థితుల మీద ఆధారపడి అతడు అనధికారిక న్యాయాధికారిగానూ వ్యవహరిస్తూ ఉంటాడు. ఒక్కోసారి మంచి మాటలతో, ఒక్కోసారి గద్దింపు, బుకాయింపు ధోరణితో అతడు చలాయించే అధికారాన్ని చదువు సంధ్యలు లేని అమాయక గ్రామీణులు మారు మాట్లాడకుండా ఆమోదిస్తుంటారు. ఆ గ్రామాధికారుల్లో ఒకరు గ్రామానికి సంబంధించిన భూమి రికార్డులను సంరక్షిస్తూ ఉంటాడు. రాష్ట్ర ప్రభుత్వంలోని వివిధ నిర్మాణాలకూ, ప్రణాళికల అమలుతో ముడిపడి ఉన్న అనేకాంశాల సంపుటికీ ఈ రికార్డులే పునాదులు. గ్రామంలో వరషపాతంతోపాటు అగంతకులు, తిరుగుబోతులు, అనుమానాస్పద వ్యక్తులు, బిచ్చగాళ్ళు. నాటక బృందాలు, సంచార జాతులు, పండితులు, ఇంకా అనేక రకాల సందర్శకుల రాకపోకలను కూడా గ్రామాధికారి నమోదు చేస్తూ ఉంటాడు. ఇటువంటి సందర్శకులు వచ్చి వెళ్ళడం సాధారణ గ్రామస్థుని కంటబడితే పడవచ్చు కానీ అతడది గమనంలోకి తీసుకోడు. ఆ రోజు లేదా ఆ వారంలో జరిగిన సంఘటనలకు సంబంధించిన అనేక నివేదికలు పంపించడంతోపాటు గ్రామాధికారి అనేక రిజిస్టర్లను నిర్వహించవలసి వస్తూ ఉంటుంది. ప్రతిఫలం విషయానికి వస్తే అతడికి లభించేది సముద్రంలో నీటిబొట్టు. వివిధ ప్రభుత్వ శాఖలకు అతడు చేసిపెట్టే పనులకూ దానికీ ఏమాత్రం పొంతన ఉండదు. అయితే అతడికి లభించేది ప్రతిఫలంకాదని, ఒకవిధమైన గౌరవ వేతనమని జనసామాన్యం భావిస్తూ ఉంటారు. ఆ ఉద్యోగం అనువంశికంగా ఉన్నప్పటి నుంచి ఇదే ఆనవాయితీ కొనసాగుతోంది. (ఇప్పటికీ కొన్ని రాష్ట్రాలలో ఇది అనువంశికమే). ఇతరాంశాలకు వస్తే అతడు భూమిలో వానపాములానో లేదా అడవిలో పెద్దపులిలానో (నక్క అంటే పోలిక మరింత బాగా కుదురుతుందేమో) జీవిస్తుంటాడు. భూమిలో, అడవిలో కావలసినంత స్వేచ్ఛ ఉంటుంది కనుక గ్రామాధికారుల సంపాదన పూర్తిగా వాళ్ళ వాళ్ళ సామర్థ్యం మీద ఆధారపడి ఉంటుంది.

పొలంలో కానీ, ఊళ్ళో కానీ వాళ్ళు కష్టించి పనిచేయగా చూసిన సందర్భం ఒక్కటీ ఉండదు. కనుక సహజంగానే వాళ్ళ మనుగడ పరాన్నభుక్కుల మనుగడనే తలపింపజేస్తుంది. వాళ్ళు జీవిస్తూ ఉండడమే గ్రామీణ ప్రమాణాలతో పోల్చితే దర్జాగా జీవిస్తూ ఉండడమే – గ్రామీణ ప్రమాణాలతో పోల్చితే దర్జాగా జీవిస్తూ ఉండడమే–జనం కంటపడుతూ ఉంటుంది.

అందుకని జనం సాధారణంగా గ్రామాధికారుల్ని ఈసడించుకుంటూ ఉంటారు. బహుశా కొందరు ద్వేషిస్తూ ఉంటారు. అయినా సరే ఏదో ఒక విషయంలో ఏదో ఒక సమయంలో ఊళ్ళో దాదాపు ప్రతి ఒక్కరికీ అతడి సహాయాలు అవసరమౌతూనే ఉంటాయి.

ఓ రెవెన్యూ అధికారి గానీ, పోలీస్ అధికారి కానీ ఊళ్ళోకి వచ్చినప్పుడు గ్రామాధికారి అసలు విలువ గ్రామస్థులకు బోధపడుతూ ఉంటుంది. తాను కోరుకున్న రీతిలో ఆయా అంశాలను అతడు వారికి విశదీకరిస్తూ మాట్లాడతాడు (వివాదాస్పద విషయాల్లో అయితే తన 'క్లయింట్' తనకు చెల్లించిన ముడుపులకు తగినట్టు) అందుకే గ్రామాధికారి ఎంత నలుసులా కనిపించినా సరే లౌక్యం తెలిసినవారు అతడితో ఘర్షణలకు దూరంగానే ఉంటుంటారు.

తలక్రిందులుగా నిర్మితమైన అవినీతి గోపురానికి పునాది అనదగిన వాడు కూడా గ్రామాధికారే ముడుపుల వసూళ్ళకు సంబంధించిన సోపానక్రమంలో పైన చిట్టచివరి మెట్టు మీద ఉన్న వాడికే అందరికంటే పెద్దవాటా లభిస్తుంది. అంతా చేసి గ్రామాధికారికి లభించేవి అట్టడుగున ఉన్న కొన్ని చితుకులు మాత్రమే. అయినా ఊళ్ళో ఆ భాగమే కంటికి నదురుగా కనిపిస్తుంది. పెద్దవాటా కబళించేవారు ఎక్కడో దూరంగా ఉంటారు. ఎక్కడున్నాసరే దొంగసొత్తు గట్టుచప్పుడు కాకుండా వాళ్ళకు చేరిపోతూ ఉంటుంది.

తరతరాలుగా వేలాది గ్రామాలు ఈ తరహాలో జీవిస్తూ వచ్చాయి. అవినీతిలో కలగలుపైన ఈ పద్ధతి క్రమేణా జీవితంలో ఒక భాగంగా పరిణమించింది. అయితే సమాజం ఆధునిక మవుతున్న కొద్దీ గ్రామాధికారి పట్ల ఏవగింపూ పెరుగుతూ వచ్చింది. వీరిలో కొందరు పాల్పడే అవినీతి అక్రమాలు గమనించినమీదట ఆ ఏవగింపు వందరెట్లు పెరిగిపోయింది. ఆ ఉద్యోగాన్ని రద్దు చేయాలన్న డిమాండ్ వినిపించసాగింది. అయితే వాళ్ళను తొలగించి ఆ- ఖాళీలలో మామూలు ఉద్యోగులను నియమించడం ఎంతో ఖర్చుతో కూడుకుని తలకు మించిన భారమవుతుంది. గ్రామాధికారులు కూడా బలవత్తర ఉద్యోగ సంఘాలను అవతరింపజేసి సమ్మెలు, ప్రదర్శనల రూపంలో తమ సత్తాను ప్రదర్శించుకోవడంలో క్షణం కూడా వృధా చేయలేదు. ఈ ఘరషణ క్రమం తప్పని ఒక వార్షిక తతంగంలా మారిపోయింది. వాళ్ళలో వాళ్ళకున్న తగాదాలు పరిస్థితిని మరింత విషమింపజేసి అనేక సంఘాలు పుట్టుకురావడానికి దారి తీయించాయి. ఎప్పటికప్పుడు తమ డిమాండ్లను పెంచుకుంటూ రావడంలో ఈ సంఘాలు ఒకదానితో ఒకటి పోటీపడ్డా అత్యంత అసాధ్యమనదగిన కోర్కెలలో మొదటిగా చెప్పుకోదగిన కోర్కె నే కనీసపు కోర్కెగా వాళ్ళు ప్రతిసారీ ముందుకుతేవడం, ప్రభుత్వం అనివార్యంగా దానిని త్రోసిపుచ్చడం జరుగుతూ ఉంటుంది. ఆ తర్వాత రోజుల తరబడి చర్చలు సాగుతూ ఉంటాయి. ఉద్యోగ సంఘాలలో వాటి నాయకుల్లో ఉన్న శత్రుత్వాలు పరిస్థితిని మరింత దిగజార్చివేస్తాయి. మరో ప్రక్క ప్రభుత్వమూ, నిరుపేద గ్రామాధికారీ నష్టపోతూనే ఉంటారు.

ఎన్నో సంవత్సరాలుగా నిజం చెప్పాలంటే ఎన్నో దశాబ్దాలుగా ఇదే పరిస్థితి. మహేంద్రనాథ్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు పరిస్థితి క్షీణించడం ప్రారంభించి చౌదరి హయాంలో కూడా అదే పరిస్థితి కొనసాగింది. నిర్దిష్టంగా చెప్పుకోవడానికేమీ లేకపోవచ్చు కానీ, ఆనంద్ ముఖ్యమంత్రి

అయిన తర్వాత పరిస్థితిలో ఒకింత మెరుగుదల కనిపించింది. ఆనంద్ ఒక గ్రామ ప్రాంతం నుంచి వచ్చినవాడని, స్వర్గస్తుడైన అతని తండ్రి గ్రామాధికారిగా పనిచేసినవారనీ గ్రామాధికారులకు తెలుసు. కనుక ఊహామాత్రంగానైనా తమ గురించి తెలుసుండి తమ సమస్యల పట్ల, తమపట్ల ఆయనకు సానుభూతి ఉండే ఉంటుంది. అయితే వాళ్ళలో కుశంకితులు మాత్రం ఇలా ఆశలు పెంచుకోవడం లేనిపోని కలలుకనే ధోరణిగా కొట్టిపారేశారు. 'మనవాడు' అనుకుని వెడితే గ్రామాధికారులకు ఎదురయ్యేది మరింత భంగపాటు మాత్రమేనని ఉద్ఘాటించారు. శుష్కమైన ఊహాగానాలు మానేసి కొత్త ముఖ్యమంత్రిని ఒక ఊపు ఊపి చూస్తే మంచిదని, అప్పుడు వివిధ సంఘాలు నిర్ణయానికొచ్చాయి.

ఆనంద్ చొరవతో ఏర్పాటైన రెండో సమావేశం యధావిధిగా చిరచిరలతో, పరస్పర ఆరోపణలతోనే మొదలైంది. ఏళ్ళతరబడి సమస్యలు పేరుకు పోయాయి. ఎప్పటికప్పుడు ఏవో తాత్కాలిక ఉపశమనాలు తప్ప ఇంతకుముందు బాధ్యతాయుత స్థానాల్లో ఉన్నవాళ్ళు సమస్యకు శాశ్వత పరిష్కారం కనుగొనేందుకు ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు అలా రెండు పక్షాలూ పాత కధనే మరోసారి వల్లించిన తరువాత శాశ్వత పరిష్కారం కోసం సమస్య మూలంలోకి వెళ్ళాలన్న ఆసక్తిని ఆనంద్ వ్యక్తపరిచాడు. ముఖ్యమంత్రినోట అటువంటి మాట వినిపించడమే ఆ ప్రతినిధి వర్గానికి సరికొత్త అనుభవం. ఉద్రిక్త వాతావరణం క్రమంగా తగ్గుముఖం పట్టి చర్చలలో ఒకింత ఉల్లాసకర ధోరణి అడుగు పెట్టింది. పూర్వం తను చదువుకుంటున్నప్పుడు, ఒక వేసవి సెలవుల్లో గ్రామాధికారుల రిజిస్టర్లన్నింటిలో తనెలా పట్టు సంపాదించాడో ఆనంద్ వారికి వివరించి చెప్పేసరికి వాతావరణం ఒక్కసారి సుహృద్భావ పూరితంగా మారిపోయింది. ఆ వరవడిలోనే ఆనంద్ అన్నాడు. 'నేనంటున్నది మీకు విచిత్రంగానే ఉంటుంది. కానీ మీ తరఫున వాదించడానికి మీ ప్రతినిధి వర్గంలో ఒక సభ్యుడిగా మీ మధ్యలోకి వచ్చి కూర్చోగలను.'

ఆ స్నేహపూర్వక సంభాషణతో ఆఖరికి వారిని షడ్రసోపేతమైన లంచ్‌కి ఆహ్వానించాడు. మళ్లీ అదీ రాష్ట్ర చరిత్రలో ప్రప్రధమమే లంచ్ తర్వాత చర్చ కొనసాగించినప్పుడు రెండుపక్షాల ముఖ్యంగా ప్రతినిధివర్గం వైఖరిలో తేడా కొట్టొచ్చినట్టు కనిపించింది. 'దీర్ఘకాలంగా అపరిష్కృతంగా ఉన్న మా సమస్యలను ప్రభుత్వం పరిశీలించాలన్నదే మా అభ్యర్థన సార్' ఒక యూనియన్ నాయకుడు అన్నాడు.

సౌజన్యంలో తాను వెనుకబడిపోకూడదన్నట్టు మరో నాయకుడు వెంటనే అందుకున్నాడు. 'వ్యవహారాలు కాస్త ముందుకు సాగుతూఉంటే, మీరు మమ్మల్ని విశ్వాసంలోకి తీసుకుంటుంటే ప్రభుత్వం ఎంత గడువైనా తీసుకోవచ్చుసార్, మేం అర్థం చేసుకోగలం.'

రెవెన్యూశాఖ గ్రామాధికారుల ప్రతినిధులను సంప్రతించి వాళ్ళ సమస్యలను క్షుణ్ణంగా పరిశీలించాలని అంతిమంగా ఆనంద్ నిర్ణయించాడు. అది సవివరమైన నివేదికను సమర్పించవలసి ఉంటుంది. (తనకే సమర్పించాలని కూడా ఆనంద్ నొక్కిచెప్పాడు.) ఆ తర్వాత అంతిమ చర్చలకు వారిని ఆహ్వానించి ఏళ్ల తరబడి వాళ్ళను వేధిస్తున్న సమస్యలకు శాశ్వత పరిష్కారం సాధించడం జరుగుతుంది.

ముఖ్యమంత్రికి ఎనలేని కృతజ్ఞతలు తెలుపుకుంటూ ప్రతినిధివర్గం వెళ్ళడానికి లేచింది. కుశంకితులు కూడా కృతజ్ఞతాసమర్పణలో పాలుపంచుకోకుండా ఉండలేకపోయారు. అయితే వాళ్ళలో ఒకరన్నారు, 'ఇంతకుముందు సంవత్సరాలలో అనేక హామీలు ఇచ్చి నిలబెట్టుకోలేక పోయారు. ఈ ప్రభుత్వం అలా చేయదని ఆశిస్తున్నాం సార్.'ఎ

వాళ్ళు కుర్చీల్లోంచి లేవబోతుండగా ఆనంద్ యదాలాపంగా 'మరో విషయం' అంటూ వాళ్ళనోక్షణం కూర్చోమన్నట్టు సైగచేశాడు 'మీరేమీ అనుకోకపోతే నాదో చిన్న అభ్యర్థన ..'

ప్రతినిధివర్గం మళ్ళీ కూర్చుండిపోయింది. ఆ అభ్యర్థనేమిటో వాళ్ళు ఊహించుకునేలోగా కాఫీలు వచ్చాయి. ఆయన అభ్యర్థన ఇదేనేమోనని అతిథులు అనుకుంటుండగా ఆనంద్ ప్రారంభించాడు. 'ఈ రోజున మనం పరస్పరం స్నేహితులమయ్యాం. అదృష్ట్యా నాకోసం మిమ్మల్ని ఓ పని చేసిపెట్టమని అడగాలనుకున్నాను. మీదైనందిన విధులకీ దానికీ ఏమాత్రం సంబంధం లేదు. మరో విషయం కూడా ఇప్పుడే చెబుతాను. నేను కోరేపని మీరు చేసి తీరాలన్న నిర్బంధమేమీలేదు. మీరు తిరస్కరించినాసరే నేను తప్పుగా భావించను. ఈరోజు జరిగిన సమావేశంలో అధికారికంగా ఇచ్చిన హామీలన్నింటికీ కట్టుబడేఉంటాను.'

ఈ ఉపోద్ఘాతం వాళ్ళకి ఓ పట్టాన అర్థం కాలేనంత అస్పష్టంగా ఉంది. అయినా తను కోరబోయే సహాయానికున్న స్వచ్ఛంద స్వభావాన్ని ఆనంద్ నొక్కిచెప్పడం వల్ల అదేమిటో తమకు తెలియకపోయినా మాట ఇచ్చితీరవలసిన అనివార్యత వారికి కల్పించింది.

ప్రతినిధివర్గంలోని ఓ పెద్దమనిషి అన్నాడు. 'మీరేం కోరినా మేము తప్పకుండా చేస్తాంసార్, చెప్పండి, ఏం చేయమంటారు...?'

'ముందు మీరు కొన్ని ప్రశ్నలకు సమాధానం చెప్పాలి.' ఆనంద్ ప్రారంభించాడు. 'అప్పుడే నా పని ఫలానా అని చెప్పడం సాధ్యమవుతుంది. ఓ సగటు గ్రామాన్ని తీసుకోండి, ఉదాహరణకు నాలుగువేల సర్వే నెంబర్లున్న వ్యవసాయభూమి కలిగిన గ్రామం. ఆ గ్రామంలో ఓ పదిహేను వందల మంది పట్టాదార్లు ఉన్నారనుకుందాం. ఉజ్జాయింపుగా, కేవలం ఉజ్జాయింపుగానే, వాళ్ళలో ఎంతమందికి ముప్పై ఎకరాల మేరకు రెండు పంటల మాగాణి లేదా దానికి సమానమైన మెట్టభూమి ఉంటుందో చెప్పగలరా?'

'ఓ సందేహం సార్!' ఓ యువసభ్యుడు చెయ్యి ఎత్తుతూ అన్నాడు. 'మీ ఉద్దేశంలో ఎంత మాగాణి భూమికి ఎంత మెట్టభూమి సమానం అవుతుంది?'

'భూమి సారాన్ని బట్టి అది ఒక్కొక్కచోట ఒక్కొక్క రకంగా ఉంటుందని మీకూ తెలుసు. కనుక ఉజ్జాయింపుగా రెండు పంటలు పండే ఒక భూమిని ఒకేపంట ఉండే రెండు మాగాణి భూములకు సమానంగాను, ఒకే పంటపండే ఒక మాగాణి భూమిని మూడెకరాల మెట్టకు సమానంగానూ తీసుకుందాం...'

అయిదు నిమిషాల్లో అన్నివైపుల నుంచి జవాబులు కుప్పతెప్పలుగా వచ్చిపడ్డాయి. 'నా ఉద్దేశంలో...ఎ వాళ్ళలో ఓ పెద్దమనిషి ఉన్నాడు, 'ఓ సగటు గ్రామంలో ఆ పరిమాణంలో

భూములున్న పట్టాదార్లు పాతిక, ముప్పైమంది ఉంటారుసార్!'

ప్రతినిధివర్గంలోని కొందరు చెవులు కొరుక్కోకపోలేదు కానీ, మొత్తంమీద అందరూ ఆ మాటతో ఏకీభవించినట్టే కనిపించారు. గుసగుసలు ఆగిపోగానే ఆనంద్ అన్నాడు, 'చూడండి, ఇవన్నీ ఉజ్జాయింపు లెక్కలే. మీ జవాబుకి కృతజ్ఞుణ్ణి. ఇప్పుడు మరో ప్రశ్న. ఈ పాతిక ముప్పై మందికి సంబంధించిన వివరాలన్నింటినీ సేకరించి ఒకచోట పొందుపరచడానికి మీకు ఎన్ని రోజులు, లేదా ఎన్ని వారాలు పడుతుంది?'

ప్రతినిధివర్గంలో కొందరు అణచుకోడానికి ప్రయత్నిస్తూనే పైకి వినపడేలా నవ్వుకోవడం ఆనంద్ చెవినపడింది. ఆనంద్ ఆ ప్రశ్న అడిగినతీరు వృత్తిపరమైన వాళ్ళ గర్వభావాన్ని గాయపరిచినట్టుంది. ఈసారి వాళ్ళలోంచి ఓ యువకుడు పళ్ళు ఇకిలిస్తూ అన్నాడు. 'రోజులూ...వారాలా సార్? మమ్మల్ని ఆట పట్టిస్తున్నారు! ఈమాత్రం పనికి రోజులూ వారాలూ ఎందుకుసార్?'

'మీ సామర్థ్యాన్ని కించపరచడం నా ఉద్దేశం ఎంతమాత్రం కాదు. దయచేసి నన్నపార్థం చేసుకోకండి!' ఆనంద్ వెంటనే అన్నాడు. 'పని స్వచ్ఛందమైనది కనుక...'

'అయితే మాత్రం తేడా ఏముంటుంది సార్!' పెద్దమనిషి ఎంతో తమకంతో అన్నాడు. 'పని ఎలాంటిదైనా కానివ్వండి. మీకోసం ఉచితంగా చేసి పెడతాం. ఇక మీ ప్రశ్నకు జవాబంటారా, ఒక్కో గ్రామంలో అటువంటి భూముల వివరాలు సేకరించి రాయడానికి మాలో ఏ ఒక్కరూ రెండుగంటల సమయాన్ని మించి ఎక్కువ తీసుకోరని కచ్చితంగా చెప్పగలను...'

ఆ మాటకు మిగిలిన సభ్యులందరూ గొంతెత్తి తమ ఆమోదం ప్రకటించారు. ఇది వాళ్ల సామర్థ్యానికి సంబంధించిన ప్రశ్న; కనుక తమ నేర్పును రుజువు చేసుకోవాలన్న సవాలుకు వాళ్లనుంచి అలా తక్షణ ప్రతిస్పందన వ్యక్తమైంది.

'చాలా సంతోషం' ఆనంద్ అన్నాడు 'ఇక మీరిప్పుడు చేయవలసిందేమిటో స్పష్టంగా చెబుతాను. మనం ఇంతకుముందు చర్చించుకున్న ప్రకారం మీ గ్రామాల్లోని భూమి యాజమాన్యం గురించిన వివరాలను నిర్దిష్ట నమూనాలో మీ మీ తహశీల్ కార్యాలయాలకు పంపించాలి. మొదలుపెట్టిన రోజునుంచి ఏడురోజుల్లో ఈ పని పూర్తికావాలి... సరేనా?' వాళ్లందరినీ చిరునవ్వుతో పరికించాడు.

'సరే, సర్!' వాళ్లు నిశ్చితస్వరంతో సమాధానమిచ్చారు.

'చివరగా మరో మాట. మీరీ పని స్వచ్ఛందంగానే కానీ ఉచితంగా చేయనక్కర్లేదు. అదిగో, అప్పుడే మీ ముఖాల్లో మార్పు కనిపిస్తోంది. కోప్పడకండి. మీ తక్షణ స్పందనకూ, మీ మంచి తనానికి కృతజ్ఞుణ్ణి. కానీ మీనుంచి ఉచిత సహాయాన్ని నేను ఆమోదించను. ఈ పనిని సకాలంలో పూర్తిచేసిన ప్రతి గ్రామాధికారికీ ప్రభుత్వం అదనంగా ఒక నెల జీతం కానీ, దానికి సమానమైన మొత్తంగానీ చెల్లిస్తుంది.' ఈ మాటకు ఒకింత నిరసన సూచకంగా వాళ్లలో గుసగుసలు వినిపించాయి.

అయినప్పటికీ ఆనంద్ తన ప్రతిపాదనను మరోసారి నొక్కిచెబుతూ అన్నాడు, 'ఇంకొక్క విషయం మీకు స్పష్టం చేస్తాను. మీరు పంపించబోయే సమాచారం అతిముఖ్యమైనది. మీ గ్రామీణ సమాజాన్ని అది సమూలంగా మార్చివేస్తుంది. భూమిలేని లక్షలాదిమంది నిరుపేదలకు అది లాభం కలిగిస్తుంది. గ్రామం ఎంత పురాతనమో మీ సేవలు అంతే పురాతనం. మీ తాత ముత్తాతలు తరతరాలుగా అందించిన సేవకు ఏ ప్రభుత్వమూ ఎప్పటికీ పూర్తిగా ప్రతిఫలం చెల్లించుకోలేదు. మీ అనువంశిక ఉద్యోగాల భవితవ్యం ఎలా పరిణమించబోతోందో నాకు తెలియదు. ఈ విషయంలో చట్టపరమైన, రాజ్యాంగపరమైన చిక్కులేవో ఉన్నాయంటున్నారు. తరతరాలుగా మీరు జీవిస్తున్న గ్రామాలపట్ల కృతజ్ఞతాభిమానాలతోనైనా మీరు నూటికి నూరుశాతం కచ్చితమైన సమాచారం అందిస్తారని ఆశిస్తున్నాను. ఒకవేళ అంత కచ్చితమైన సమాచారం అందించలేమని మీకు అనిపిస్తే ఈ విషయం ఇప్పుడే నిర్భయంగా చెప్పి దీనిగురించి మీరు మరచిపోవచ్చు. ఏ విషయమూ మీరు స్పష్టంగా చెబితే సంతోషిస్తాను. ఎందుకంటే, సమాచారం కచ్చితంగా లేకపోతే శిక్ష చాలా తీవ్రంగా ఉంటుంది.'

ఇప్పుడీయన తమ నిజాయితీని శంకిస్తున్నాడనుకున్నారు ప్రతినిధివర్గ సభ్యులు. ఇక వెనుకడుగు వేసేది లేదు. ఆ పెద్దమనిషి దాదాపు వెనువెంటనే సమాధానం చెప్పాడు. 'మీ సవాలును మేం స్వీకరిస్తున్నాం సార్. మీ రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లు మాకు అడ్డురాకుండా చూసి పుణ్యం కట్టు కున్నారంటే, మీరు కోరినట్టు నూటికి నూరుశాతం కచ్చితమైన సమాచారం అందించగలమని హామీ ఇస్తున్నాను...'

గ్రామాధికారులు పని ప్రారంభించడానికి ఓ తేదీని నిర్ణయించడం జరిగిపోయింది. ఎంతో స్నేహ సుహృద్భావ వాతావరణంలో వారందరూ ఆనంద్‌వద్ద సెలవు తీసుకున్నారు ఇది వాళ్లకెంతో ఆహ్లాదకరమైన పని మార్పు. సచివాలయంలోని పక్కగదుల్లో ఉండి ఇదంతా గమనిస్తున్న చీఫ్ సెక్రటరీ, తదితరులు కుతకుతలాడిపోయారు. ప్రోటోకాల్‌రీత్యా చూస్తే, పరిపాలనా యంత్రాంగంలో అట్టడుగున ఉండే ఉద్యోగుల ప్రతినిధులను ముఖ్యమంత్రి అంత అరమరికలు లేని స్నేహభావం కురిపిస్తూ కలుసుకుని మాట్లాడడానికి ఒప్పుకోవడమే ఊహకందని విషయం. 'ఈ పరిణామం తర్వాత తహశీల్దార్లు కానీ, ఇతర అధికారులు కానీ ఈ బందిపోట్లను ఎలా అదుపుచేసి క్రమశిక్షణలో ఉంచగలుగుతారు?' అన్న చింతలో మునిగిపోయారు. 'వీళ్లు తమ ఊళ్లకు తిరిగివెళ్లి ముఖ్యమంత్రి దగ్గర తమ పలుకుబడి గురించి గప్పాలు కొట్టుకుంటారు. ఎంత దురదృష్టకర పరిస్థితి!' అయితే ఈ మొత్తం సమావేశంలో వాళ్లకు మరీ కంటగింపు కలిగించిన అంశం, వాళ్లు ముఖ్యమంత్రికి ఇచ్చిన మాట. భూయజమాన్యానికి సంబంధించిన మొత్తం ప్రాథమిక సమాచారాన్ని దాదాపు ఉచితంగా, దాదాపు తక్షణమే అందిస్తామనడం! ఒక్క దెబ్బతో రెవెన్యూ శాఖ పేరుతో ఒక శాఖ ఉండడమే అనవసరమన్నట్టు తేల్చిపారేశారు!'

అంత విస్తారమైన సమాచారం గ్రామాలనుంచి తహశీల్ కార్యాలయాలకు చేరే ఏర్పాట్లు చేయడంతోనే; అక్కడినుంచి జిల్లాకు, జిల్లా నుంచి రెవిన్యూబోర్డుకు, అక్కడినుంచి రెవిన్యూ సెక్రటేరియట్‌కు అంతిమంగా రెవిన్యూమంత్రిగా తన వద్దకు దానిని రప్పించుకోవడం ఆనంద్‌కు

ఎంతో సులువైంది. అందుకు నిర్దేశించుకున్న మొత్తం గడువు అయిదువారాలు. అంతకుముందు ఉన్నతస్థాయికమిటీ అంచనావేసిన మూడు సంవత్సరాల నాలుగు మాసాల గడువూ, 65 కోట్ల 78 లక్షల రూపాయల ఖర్చూ వంటి భయపెట్టే అంకెలు ప్రతివాళ్ళ ముఖంమీద ఓ అతిపెద్ద జోక్‌లా వేల్లాడసాగాయి... అయితే ఆ నివేదిక రూపకల్పనలో పాత్ర వహించిన ఉన్నతాధికారులతో ఆనంద్ దానిగురించి చర్చించలేదు. ఆ నివేదికకు బాధ్యులైన వారినందరినీ తలవంపు పరిస్థితి నుంచి తప్పిస్తూ గుట్టుచప్పుడు కాకుండా చక్కగా దానినెక్కడో పూడ్చిపెట్టేశాడు.

రైతాంగంలో ఇప్పటికే ఉన్న భయాలను పెంచడానికి భూస్వామ్యవర్గం అదేపనిగా వదంతులు వ్యాపింపజేస్తూనే ఉంది. చిన్న, పెద్ద, సన్నకారు అనే తేడా లేకుండా పరిమితిచట్టం ప్రతి రైతుకీ వర్తింపజేస్తారని వాళ్ళు నమ్మబలుకుతున్నారు. మరోపక్క రైతుల భయాందోళనలను భూతద్దంలో చూపించడానికి పత్రికలు అలుపెరుగని కృషి చేస్తున్నాయి. 'ఇందిరాగాంధీ పార్టీవల్ల రైతులకు ఎన్నటికీ న్యాయం జరగబోదని స్పష్టంచేస్తున్నాయి. ఆ పార్టీకి వాళ్ళు అందించే అచంచల సమర్ధనకు ప్రతిగా వాళ్ళకు దక్కేది దారుణ నిర్లక్ష్యమేనన్నారు. ఇప్పుడు ఇందిరా గాంధీ ఏకంగా వాళ్ళ భూముల్ని గుంజుకోడానికే సమకట్టింది. సోవియట్‌యూనియన్‌లో మాదిరిగా అక్కడామె కచ్చితంగా సమష్టివ్యవసాయాన్ని ప్రవేశపెడుతుందని మీ చిట్టచివరి నయాపైసా వరకూ పందెం కాసుకోవచ్చు. కమ్యూనిస్టులపట్ల ఆమె ఎప్పుడూ పక్షపాతం కనబరుస్తూనే ఉంది. చూస్తూ ఉండండి, దేశవ్యాప్తంగా సమష్టివ్యవసాయాన్ని స్థాపించేవరకూ ఆమె నిద్ర పోదు. ప్రతిరైతూ వ్యవసాయకూలీగా మారిపోతాడు,' అని కొందరు సంపాదకీయ మహాశయులు ఉద్ఘాటించారు.

ఈ భయాందోళనలు తొలగించడానికి కేంద్రరాష్ట్రప్రభుత్వాలు శాయశక్తులా ప్రయత్నించాయి. కానీ, ప్రబల వదంతులు వాటికి ద్విగుణీకృతమైన ఊతమిస్తూనే వచ్చాయి. ఈ వదంతులను రెచ్చగొడుతున్నది ప్రధానంగా భూస్వాములే. రైతులలో అలజడి, ఆందోళనలు పెరిగిపోతున్నాయి.

ఎట్టకేలకు ఒకింత వెలుగురేఖ తొంగిచూసింది. ముప్పై ఎకరాలను మించిన రెండుపంటల మాగాణి గురించిన వివరాలనే ప్రభుత్వం కోరిందన్న వాస్తవాన్ని పత్రికలు బయటపెట్టాయి. ఈ వార్తతో రైతులు స్థిమితపడ్డారు. వాళ్ళ భయానుమానాలు తగ్గుముఖం పట్టాయి. ఈసారి వాస్తవంగా తమకున్న భూములపరిమాణం దృష్ట్యా చర్చించుకోవడం ప్రారంభించారు. చట్టంప్రభావం తమ మీద ఏ మేరకు పడుతుందో ప్రతిరైతూ అర్థంచేసుకున్నాడు. చాలా గ్రామాల్లో కొద్దిమంది విషయంలోనే చట్టం వర్తిస్తుందని వాళ్ళు గ్రహించారు. అసంఖ్యాక రైతాంగం దాని పరిధిలోకి రాదు. ఈ సంభావ్యతపట్ల వెంటనే రైతులకు నమ్మకం చిక్కింది. 'పరిమితి విధింపు నుంచి బయటపడ్డామ'ని భావించిన లక్షలాదిమంది సన్నకారు రైతులు తమ హృదంతరాలనుంచి ఆనంద్‌కు కృతజ్ఞతలు చెప్పుకున్నారు. తమ భూమి భద్రంగా ఉండడమే కాదు, జలగల్లా పీడించే రెవిన్యూ ఇన్‌స్పెక్టర్లకు పెద్దమొత్తాల్లో చేతులు తడపవలసిన బెడద కూడా ఇందువల్ల తప్పిపోతుందనుకున్నారు.

ఇదిలా ఉండగా, ఉత్తుత్తి భూమి బదలాయింపులూ, భూమి పరిమాణాన్ని చిన్న చిన్న ముక్కలుగా విడగొడుతూ చేస్తున్న నకిలీ విభజనలూ, పెద్దఎత్తున నిర్నిరోధంగా జరగసాగాయి. ఎన్నో సంవత్సరాలుగా ఇవి జరుగుతున్నట్టు గ్రామాల్లో దాదాపు అందరికీ తెలుసు. నెహ్రూ హయాంలో భూపరిమితుల గురించిన ఆలోచన మొట్టమొదట వ్యక్తమైనప్పుడే ఇది ప్రారంభమైంది ఈ మధ్య, ఆనంద్ ముఖ్యమంత్రి అయిన ఈ కొద్ది నెలల్లో అది భయజనక ప్రమాణానికి పెరిగిపోయింది. ఈ బదలాయింపుల కారణంగా వేలాది గ్రామాల్లో రాత్రికి రాత్రి భారీసంఖ్యలో మిగులు భూములు అంతర్ధానమైపోయాయి ఇందిరాగాంధీకి ఎంతో అభిమానపాత్రమైన చట్టం శాసనసభ ఆమోదం కూడా పొందకుండానే విచ్ఛిన్నమైపోతున్న దృశ్యం ఆనంద్ కళ్ళకు కట్టింది.

నూతన భూపరిమితులచట్టం తుది మెరుగులు దిద్దుకుంటోంది రైతులను రెచ్చగొట్టేలా కనిపిస్తున్న అన్ని కోణాలకూ పత్రికలు సాధ్యమైనంత ఎక్కువ ప్రచారం ఇవ్వదలచుకున్నాయి కనుక చట్టం గురించిన ప్రతి అంశమూ వెంటనే తెలిసిపోతోంది. రోజులు గడిచిన కొద్దీ నకిలీ విభజనలూ, బదలాయింపులూ, విడాకులూ, బహూకరణలూ, భూయజమాన్యానికి సంబంధించిన లాలూచీ డిక్రీలు, శాశ్వత ప్రాతిపదికపై ఉత్తుత్తి లీజులూ మన ఊహాశక్తితో పోటీపడుతూ చట్టం కన్నుగప్పే పన్నాగాలూ రకరకాలుగా సాగిపోతున్నాయి.

ఈ పన్నుగడల ముందు తను పూర్తిగా చిత్తయిపోయినట్టు ఆనంద్ గమనించాడు. చట్ట పవిత్రతను మంటగలిపే ఈ బరితెగింపు ఉల్లంఘనలను నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయాడు. సాంఘికపరివర్తనకూ, ఆర్థిక పునర్వ్యవస్థీకరణకూ శాసననిర్మాణం ఇంకెంతమాత్రం తోడ్పడదు. కొన్ని మాసాలక్రితం కామ్రేడ్ బెనర్జీ ఎంతో విశ్వాసాన్ని రంగరిస్తూ చెప్పిన జోస్యం ఆనంద్‌కు జ్ఞాపకమొచ్చింది. ఆ క్షణంలో అతడు తన ఎట్టఎదుట నిలబడి కొంత హేళనగా, కొంత సానుభూతితో తనవైపు చూసి నవ్వుతున్నట్టనిపించింది. ఆనంద్‌జీ, మీ చిత్తశుద్ధిని నేను అభినందిస్తాను. ఆ మధ్య చౌదరి నివాసంలో మీరన్న మాటలు గుర్తున్నాయా? భూసంస్కరణల పట్ల మీ అంకిత భావం చూసిన మీదట, మీరు రూపకల్పనచేసిన దానినిబట్టి చట్టం విజయవంతమౌతుందేమోనని నా కనిపించింది. నక్సల్ కామ్రేడ్ల విధానాల పట్ల దాదాపు వ్యతిరేకమైన అభిప్రాయాన్నే వ్యక్తం చేశాను. ప్రజాస్వామ్యవిధానం పరిధిలోనే మీలాంటి కార్యవాదులు చేస్తున్న పోరాటం దృష్ట్యా వాళ్ళ పద్ధతులు అనవసరమౌతాయేమోననికూడా తోచింది. కాని ఇప్పుడలా అనిపించడంలేదు... ఇప్పుడు మీకూ, నాకూ కూడా తెలిసొచ్చింది. భూస్వాముల గురించీ, స్వార్థపరశక్తుల గురించీ, మీ సంస్కరణల అమలులో తలెత్తే లోపాల గురించీ, ఇంకా అనేక విషయాల గురించీ ఇప్పుడు ఉభయులకూ తెలిసొచ్చింది. దేశం కొరకు మీరెన్నుకున్న ప్రజాస్వామ్యం గురించి ప్రజలకు తెలిసిరావడానికి ఇక ఆట్టే వ్యవధి పట్టదు...'

కిందటిసారి సమావేశం గురించి ఆనంద్‌కు జ్ఞాపకమున్న తరహాలో నిగ్రహం, దృఢత్వం కలగలిసినట్టుగా కాక కామ్రేడ్ బెనర్జీ గొంతు ఈసారి బిగ్గరగా నొక్కిచెబుతూ ముఖ్యమంత్రి మస్తిష్కంలోనూ అతడి నఖశిఖపర్యంతమూ ప్రతిధ్వనులీనుతూ బలీయంగా అటు చెవియొగ్గేలా

చేసింది. 'ఇప్పటికి కొన్ని దశాబ్దాలుగా మీరు పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అమలుచేస్తున్నారు', ఆ గొంతు కొనసాగింది. 'మన కల్తీ కమ్యూనిస్టులు కూడా సంక్లిష్టమైన తమ కర్తవ్యాలను గాలికొదిలేశారు. వక్రమార్గాలవెంట ఎలాగో వాళ్ళుకూడా నిష్క్రియత, స్వార్థం మూర్తీభవించిన మీ శ్రేణుల్లోకి వచ్చి చేరిపోయారు. సందేహంలేదు. వంచనలో వాళ్ళు మీకన్నా నికృష్టులు; కనీసం మీ రెన్నడూ కమ్యూనిజాన్ని కావిలించుకోలేదు. ఇంతకీ, చెప్పండి ఆనంద్‌జీ, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ద్వారా మీరు ఏ సమస్యలు పరిష్కరించగలిగారు? రాజకీయసమస్యలనా? సాంఘికసమస్యలనా? ఆర్థికసమస్యలనా? నిక్కచ్చిగా నిజం చెప్పాలంటే యథాతథస్థితిని మరింత బలోపేతం చేయడానికే మీ శక్తియుక్తులన్నీ వినియోగించారు. ఆ పనిని సామ్రాజ్యవాద ప్రభుత్వం మీకన్నా సమర్థవంతంగా చేసిఉండేదేమో వాస్తవంగా ఎవరైనా కోరుకునేది మార్పు. ఆ దిశలో ప్రజాస్వామ్యం సాధించినదేమిటి? మీ తళుకుబెళుకుల ప్రభుత్వవర్గాలలో చేరని నాబోటివాళ్ళ దృష్టిలో మీరు తెచ్చినట్టు న్యాయంగా చెప్పుకోగలిగిన మొత్తం మార్పు అత్యల్పం. అసలే లేదని అనను. మార్పు కొంచెమైనా లేకపోతే ఈ విధానం ఎప్పుడో అంతరించిపోయి ఉండేది. మీ నాయకులు తెచ్చిందల్లా తమ మనుగడకు సరిపోయినంత మార్పు; ఎన్ని అవాంతరాలు ఎదురైనాసరే, సహజప్రక్రియలో ప్రతిచోటా కొంతమార్పు దానికదే వస్తుంది. అయితే ఎవరి ప్రయోజనం కోసం ఆ మార్పును తలపెట్టారో వాళ్ళకు దానినుంచి అందినది అతిస్వల్పం. దీనిని మీరు కాదనగలరా?'

కామ్రేడ్ బెనర్జీ అలా మాట్లాడుతూనే ఉన్నాడు. అతడి గొంతు బిగ్గరగా, మరింత బిగ్గరగా వినిపిస్తోంది. అతడి స్వరం మరీమరీ నిందాపూరితంగా మారుతోంది. అతడి మాటలకు చెవియొగ్గడమే తను చేసిన తప్పు అనుకున్నాడు ఆనంద్. ఒకసారి వాళ్ళకు నిర్బంధశ్రోతలుగా చిక్కిపోయామంటే ఈ యువతీప్రవాదులు ఓ పద్ధతిలో మనమీద దాడి ప్రారంభిస్తారు. ఎంతసేపూ వ్యతిరేకధోరణి తోనూ, విధ్వంసదృష్టితోనూ ఉంటారు తప్ప ఇదీ ప్రత్యామ్నాయమంటూ ఒక్క సూచనకూడా చేయరు. . అయితే బెనర్జీని తప్పుపడుతున్నాడే కానీ తనది ఒప్పని తనూ రుజువు చేసుకోలేకపోయాడని ఆనంద్ గ్రహించాడు. బెనర్జీ నిరంతరాయంగా, నిర్దాక్షిణ్యంగా తన దాడిని కొనసాగించాడు. 'మీ మీద నాకు సానుభూతి ఉంది ఆనంద్‌జీ, నన్ను నమ్మండి. అయినా మీ తప్పు మీరెప్పుడు తెలుసుకుంటారు? నా వయస్సు కేవలం ఇరవైయారు సంవత్సరాలే, అయినా భారతదేశంలో ప్రజాస్వామికవ్యవస్థ నా కళ్ళముందే పూర్తిగా కుప్పకూలిపోతున్న దృశ్యాన్ని నేను చూడగలుగుతున్నాను. మీలో నేను ఒక కుశాగ్రబుద్ధిని చూడగలిగాను. మీలాంటివాళ్ళు చాలామంది ప్రత్యామ్నాయ వ్యవస్థల అన్వేషణకే జీవితాలను అంకితం చేశారు. అయితే ఇంతవరకూ ఒక్కరూ కృతకృత్యులు కాలేదు. ఆ రోజున చౌదరి నివాసంలో మీతో మాట్లాడు తున్నప్పుడే నేను అనుకున్నాను, మీకు తగనిచోట ఉన్నారని, నవ్యశకాన్ని ఆవిష్కరించగల మార్పుల గురించి నూతన సభ్యతానిర్మాణం గురించి నిరంతరం యోచించే ఒకానొక విషాద గ్రస్థ కూటమికి చెందినవారు మీరు. ఇటువంటివారు కృతకృత్యులైనసందర్భాలు చాలా అరుదు, ఆ విషయం వాళ్లకు ముందే తెలుసు. తమవల్ల ప్రపంచానికి ముక్కముక్కలుగానైనా కొంత

జ్ఞానం, కొంత లోచూపు అందుతున్నంతవరకూ తమ వైఫల్యాలకు బెదిరిపోరు. అయితే దేశమంత జల్లెడలోని కంతలను పూడ్చడానికి ప్రయత్నిస్తూ మీరు మీ జీవితాన్ని వ్యర్థం చేసుకుంటున్నారని నా కనిపిస్తోంది. ఇలా అంటున్నందుకు బాధగానే ఉంది కానీ మీరు తప్పకుండా విఫలులౌతారు. తమ భూముల్ని... తమ హోదాను గుంజుకునే ప్రయత్నం చేసినందుకు వాళ్లు మిమ్మల్ని కచ్చితంగా శిక్షిస్తారు.. మీ నిజాయితీకి శాస్తిగా ఉరికంబమెక్కిస్తారు. తొందరపడండి ఆనంద్‌జీ, మీ జీవితాన్ని కాపాడుకోడానికి తొందరపడండి; అర్థవంతమైనదేమైనా చేయండి. ఈ భూసంస్కరణల ప్రహసనంలా విఫలమయ్యేదైనా సరే, ఒక ద్రష్టకు తలతూగే పని ఏదైనా చేయండి. మీ బుద్ధికౌశల్యాన్ని ఎవరూ లెక్కచేసే వారుండరు. వాళ్లు మిమ్మల్ని పక్కకి విసిరికొట్టే లోపల, మీలోని నిజమైన మూర్తిని ధ్వంసం చేసి, మీరు మరెప్పటికీ లేవకుండా మీ మీదికి తప్పుడు ప్రజాభిప్రాయమనే వేటకుక్కల్ని ఉసిగొలిపే లోపల తప్పించుకోండి. మీ స్వప్నాలనూ, మీ స్వాప్నికతనూ రక్షించుకోండి! కదలండి, కదలండి! మూర్ఖులు కాకండి!'

చెవుల్ని హోరెత్తించే ఉద్బోధలకూ, ఆరోపణల జడివానకూ ఆనంద్ వణికిపోయాడు. తల బద్దలైపోతుందా అనిపించిందతనికి. మరుక్షణమే అంతా నిశ్శబ్దం, తుపాను వెలసిన తరువాత అలముకున్న ప్రశాంతస్థితి... సముద్రం, ముందెన్నడూ ఎటువంటి కల్లోలమూ ఎరుగదా అన్నంత నిశ్చలంగా మారిపోయింది. ఉదయభానుడి కిరణాలు సోకి తీరం ధగధగా మెరిసిపోతోంది. ఓ అందమైన బాలిక తనవైపు పరుగు పరుగున వస్తూ కనిపించింది. అతడు ముందుకు వంగి ఆమెను తన చేతుల్లోకి తీసుకున్నాడు. తన చేతుల్లో ఆమె అతివేగంగా, నమ్మశక్యం కానట్టుగా, ఎంతో రమణీయంగా విప్పారుతున్నట్టనిపించింది. తన కళ్లు భరించలేనంత దేదీప్యమానంగా వెలిగిపోతోంది... హఠాత్తుగా అతడికి స్ఫురించింది... ఆమె తన మరోసగం, తనకెంతో బాగా తెలిసిన, తన జీవితపర్యంతమూ తెలిసిన, ఒక జన్మలోకాదు, ఎన్ని జన్మలో తనకే తెలియని అనేక జన్మలనుంచి తన జీవనానుభూతికి మాత్రమే తెలిసిన తన మరోసగం!

ఆనంద్ రెప్పలు కిందికి వాల్చాడు. ఆ ప్రకాశాన్ని సూటిగా చూడగలగడం తనకు అసాధ్యమనిపించింది... అది ఒక భౌతికరూపమో, రూపరహిత అకారమో అతడే తేల్చుకోలేకపోయాడు. దాని ఉనికిమాత్రం అతడి అనుభూతికి అందుతోంది. తన దేహాత్మలతోనే కాదు, వాటి కతీతమైన స్థితిలో కూడా అతడికది అనుభవంలోకి వస్తోంది

తనెన్నడూ విని ఎరుగని మృదుమధురమైన ఓ దివ్యవాణి అతడికి వినిపించింది... దేవలోకంనుంచి తేలివస్తున్న హాయి గొలిపే ఒక జోలపాటలా, నిర్భయాన్నీ నిబ్బరాన్నీ కలిగించే అమ్మ నోటిపాటలా అది వినిపించింది. 'కలవరపడుతున్నావా?' తేనె లొలికే స్వరంతో ప్రశ్నిస్తున్నట్టు వినిపించింది. ఏం చెప్పాలో అతడికి అర్థంకాలేదు.

ఆ తర్వాత ఆమె తన చెవిలో గుసగుసలాడుతున్నట్టనిపించింది. 'మరీ అంత కలత పడిపోతావేం! అది చాలా చిన్నవిషయం...' ఎవరో స్పృశించిన అనుభూతి కలిగిందతనికి... మళ్లా అదే గొంతు వినిపించింది. ఎంతో క్లుప్తమైన, బిగువైన పరిష్కారసూత్రం తక్షణమే అతడి స్ఫురణలోకి

వచ్చేసింది. 'అర్థమైందా?' కొండంత ధైర్యాన్ని ప్రసాదిస్తూ అడిగింది ఆ స్వరం. అవునవును, అర్థమైంది.. ఎంత సరళమైన పరిష్కారం! భగవంతుడా! నిజంగా ఎంత సరళమైన తరుణోపాయం! 'కృతజ్ఞుణ్ణి, కృతజ్ఞుణ్ణి! కృతజ్ఞణ్ణి!' ప్రతిసారీ బిగ్గరగా మరింత బిగ్గరగా తన మరోసగంతో అన్నాడు. అంతలో హఠాత్తుగా కళ్లు తెరుచుకున్నాయి. 'ఏమైంది?' అని ఎవరో అడగడం అతడి చెవిన పడింది. ఎవరోకాదు, వీణ. అతడు బిగ్గరగా కృతజ్ఞతలు చెబుతుంటే ఆమెకు మెలకువ వచ్చింది. 'ఏదైనా కలా?' అడిగిందామె. 'అవును' అని గొణిగాడతను.

'రెవెన్యూ సెక్రటరీని పిలిపించగలవా?' ప్రత్యేకించి ఒకరిని ఉద్దేశించి కాకుండా చీకట్లో ఆ అభ్యర్థన అతని నోట దూసుకువచ్చింది. వీణ లైటువేసి విస్తుపోయి భర్త ముఖంలోకి చూసింది. అతడు వెనక్కి వాలి, హఠాత్తుగా జీవనరహస్యం తెలిసినవాడిలా నవ్వుకున్నాడు అప్పటికి సమయం తెల్లవారుఝాము 3 గంటలు.

★ ★ ★

'భూపరిమితుల చట్టంనుంచి తప్పించుకోడానికి నకిలీ లావాదేవీలు జరుగుతున్న వైనం మీకేమైనా తెలుసా?' మరునాడు పొద్దుటే రెవెన్యూ సెక్రటరీని పిలిపించి అడిగాడు ఆనంద్

'తెలుసు సార్, ఇప్పుడది చాలా చోట్లకు పాకిపోయింది.'

'జిల్లా కలెక్టర్లనుంచి మీకు నివేదికలు అందుతున్నాయా?'

'ఈమధ్య అంతగా రావడంలేదు సార్, కానీ గత ఆరుమాసాలుగా ఇటువంటి అక్రమ లావాదేవీలు బాగా పెరిగిపోయినట్టు స్థూలంగా మా దృష్టికి వచ్చింది.'

'ఈ విషయంలో మనమేమైనా చేయగలమని మీరు భావిస్తున్నారా?'

అ అధికారి కొద్దిక్షణాలు ఆగి మెల్లగా అన్నాడు, 'కొత్తచట్టం ఇంకా రాలేదు కనుక మన మేమైనా చేయగలమని నాకెంతమాత్రం అనిపించడం లేదు సార్. బిల్లు చట్టమయ్యేనాటికి ప్రభుత్వానికి దక్కబోయే మిగులు భూమి బాగా తరిగిపోతుందేమోననిపిస్తోంది.'

ఈ మాటలకు ఆనంద్ ఏమాత్రం చలించలేదు. ఇప్పుడతడు ఓ దెయ్యం పట్టిన మనిషి. ఆ సలహాకు కృతజ్ఞతలు చెప్పి రెవెన్యూ సెక్రటరీని పంపించేశాడు. తర్వాత లా సెక్రటరీకి కబురు చేశాడు అతడు కూడా అదే నిస్పృహాయతను వ్యక్తం చేశాడు. ఏమీ చేయలేం, ఏమీ... అదే వల్లింపు.

'మీ శాఖలో మంచి లీగల్ డ్రాఫ్ట్స్‌మన్ ఎవరు? ముసాయిదా ఖరారు చేసే చివరి ఘట్టంలో సెక్రటరీ స్వయంగా మెరుగులు దిద్దుతారనుకుంటాను. అవునా?

'అవును సార్! డ్రాఫ్టులన్నీ ఖరారు రూపంలో నా దగ్గరకు వస్తుంటాయి. మనకు ముగ్గురు డ్రాఫ్ట్స్‌మన్ ఉన్నారు. ఆ ముగ్గురిలో చెప్పుకోదగినవాడు అసిస్టెంట్ సెక్రటరీ నాగరాజు. న్యాయశాస్త్ర విషయాల్లోనూ, ముసాయిదా రచనలోనూ చాలా సమర్థుడు...'

'అతడితో కాస్త మాట్లాడాలనుకుంటున్నాను' ఆనంద్ అన్నాడు.

ఈ మాట వినగానే సెక్రటరీ విద్యుద్ఘాతానికి లోనైనట్టు అయిపోయాడు. 'మంచిది సార్, అయితే అతడు చాలా ముభావంగా ఉండే మనిషి. మీరు ఒప్పుకుంటే నేనే అతణ్ణి మీ దగ్గరకు తీసుకొస్తాను.'

'మీ కాశ్రమ వద్దులెండి. నా దగ్గరికి పంపిస్తే చాలు సామర్థ్యమూ, బిడియమూ కలగలిసిన ఆ అరుదైన మనిషిని చూడాలనుంది.'

లా సెక్రటరీ అయిష్టంగానే అక్కడినుంచి నిష్క్రమించాడు. అతడికి మరోదారి లేదు. తన దగ్గర పని చేసే ఓ జూనియర్ నేరుగా ముఖ్యమంత్రి దగ్గరికి వెళ్ళి తన ప్రతిభను ప్రదర్శించుకోడం అతడికి బొత్తిగా రుచించని విషయం.

మరో నిమిషంలో టెలిఫోన్ మోగింది. అవతల అరుణ. ఆమె గొంతు విని అతడు ఉలిక్కిపడ్డాడు. 'హల్లో, పగటికలల మనిషి ఎలా ఉన్నావ్?'

'చాలా కష్టంలో ఉన్నాననుకుంటున్నాను' ఆనంద్ జవాబిచ్చాడు. 'ఇంతకీ నా విరోధులెలా ఉన్నారు?'

'పట్టపగ్గాల్లేనట్టున్నారు' —అరుణ జవాబు చెప్పింది. 'మన భూస్వామ్య సహోదరులు ముమ్మర కార్యక్రమాల్లో మునిగి తేలుతూ నిజంగా పండుగ చేసుకుంటున్నారు. నిమిషం కూడా వృథా చేయడంలేదు. మీ సీలింగ్ బిల్లు ప్రవేశపెట్టే లోపలే వాళ్ళు తమ భూముల నకిలీ పంపిణీని పూర్తి చేయడం ఖాయం... ఇక మా సోదరుడు మంచి ఆరోగ్యంతో ఉరకలేస్తూ తన శక్తియుక్తులన్నీ దట్టించి మరీ పని చేస్తున్నాడు. అతడి ఇల్లు లాయర్లతో, తహశీల్దార్లతో, నాయిబ్ తహశీల్దార్లతో, చివరకు జిల్లా కలెక్టర్లతో లెక్కలేనంతమంది రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లతో ఇరవై నాలుగు గంటలూ క్రిక్కిరిసి ఉంటోంది. సరే, సంతోషంగా కాపురాలు చేసుకుంటున్న ఎందరో దంపతులు దొంగ విడాకులు పుచ్చుకున్న విషయం ఈ మొత్తం వ్యవహారంలో ప్రత్యేకాకరషణన్న సంగతి నీ కెటూ తెలిసినదే. తామొక పెద్ద నాటకంలో పాత్రలు పోషిస్తున్నట్లు ఊహించుకుని వాళ్ళందరూ ఉబ్బితబ్బిబ్బయిపోతున్నారు. సలహాల కోసం, ఆశీస్సుల కోసం తామర తంపరగా అక్కడికి వెళుతున్నారు.... నిజంగా చూసి తీరవలసిన సన్నివేశం.'

'ఇంకేమైనా విశేషాలున్నాయా?'

'సరే... నీ దగ్గర దాపరికమెందుకూ? భయ్యా ఒక్కోసారి పరధ్యానంగానూ, నిస్పృహగానూ కనిపిస్తున్నాడు. పది మందికీ ఎంతో నిబ్బరంగా ఉన్నట్టు కనిపిస్తున్నాడు. కానీ ఒంటరిగా ఉన్నప్పుడు మాత్రం ఒకింత అలజడిపడుతున్నట్టు నాకు అనిపించింది. నిన్న రాత్రి మేమిద్దరం కలిసి భోజనం చేశాం. భూ పరిమితుల గురించి, ఆ చట్టం గురించీ ఆయనింతవరకూ నాతో ఎప్పుడూ చర్చించలేదు. భోజనాలైన తర్వాత నావైపు చూస్తూ సీరియస్‌గా అన్నాడు. 'ఈ దిక్కుమాలిన గొడవలో మనం తలదూర్చకుండా ఉండి ఉంటేనే బాగుండేదేమో అనిపిస్తోంది.

ఆనంద్ తరహాను బట్టి ఎవరైనా అతడితో గొడవ పడడానికి ఇష్టపడరనిపిస్తోంది. అదీగాక భూమిని జాగ్రత్త చేసుకోవడానికి మనం చేస్తున్న హడావుడి ప్రయత్నాలన్నింటినీ అతడిప్పటికీ భగ్నం చేయగలిగినవాడే. ఎంతైనా అతడు లోపలి మనిషి!'

ఆనంద్ నిట్టూర్పు పుచ్చి మరికొంత సేపు మాట్లాడిన తర్వాత ఫోన్ పెట్టేశాడు. అంతలో మృదువుగా తలుపు తట్టిన చప్పుడు వినిపించింది. లోపలికి రమ్మని ఆనంద్ అనగానే అసిస్టెంట్ సెక్రటరీ నాగరాజు బిడియపడుతూ అడుగు పెట్టాడు. ఆనంద్ లేచి దగ్గరలో ఉన్న ఓ సోఫాలో కూర్చుని నాగరాజును తన ప్రక్కన కూర్చోమన్నాడు. చనువును సూచించే ఈ చర్యతో నాగ రాజులోని బిడియం చాలా వరకూ తగ్గింది.

తను ప్రస్తుతం కొత్త భూ పరిమితి బిల్లు ముసాయిదాను ఖరారు చేస్తున్నట్లు నాగరాజ్ నివేదించాడు. తన స్థాయిలో ఆ పని పూర్తి కావడానికి మరో మూడు రోజులు పడుతుందన్నారు.

'ఏమిటి ప్రయోజనం? నీ ప్రయత్నమంతా వృధా, కారణం నీకు తెలిసే ఉంటుంది.

'తెలుసు సార్... కానీ చూచాయగానే; నకిలీ బదలాయింపులూ, పంపిణీలూ చాలా జరిగి పోతున్నాయి.'

'అవునవును ! దీనిని నిరోధించే మార్గమేమైనా ఆలోచించగలవా?'

నాగరాజ్ చాలాసేపు ఆలోచిస్తూ నిశ్శబ్దంగా ఉండిపోయాడు. ఆ తర్వాత తల ఊపుతూ అన్నాడు. 'చట్టపరమైన ఈ లావాదేవీలను ఆపడానికి చట్టబద్ధమైన మార్గం లేదేమో ననిపిస్తోంది సార్.'

'ఆ లావాదేవీలు చట్టబద్ధమైనవేననుకుంటున్నావా?'

'కచ్చితంగా కావు సార్... కానీ కావని రుజువయ్యే వరకూ చట్టబద్ధమైనవిగా కనిపించే అన్ని లావాదేవీలను చట్టబద్ధమైనవేనని చట్టం భావిస్తుంది. వేల సంఖ్యలో ఉన్న ఈ లావాదేవీ లన్నింటినీ ప్రభుత్వం సమీక్షించి ఒక్కొక్క దాని వెనుక దురుద్దేశం ఉన్నట్టు ఎలా రుజువు చేయగలుగుతుంది?

'నీవు చెప్పింది నిజంగా నాగరాజ్! ఆ వైపు నుంచి చూసినప్పుడు మనం చేయగలి గిందేమీ ఉండదు... న్యాయానికీ చట్టానికీ విరోధాభాస పరిస్థితి కనబడుతోందిక్కడ... సరే, ఇప్పుడు జాగ్రత్తగా విను. నీ అభిప్రాయం నిష్కర్షగా చెప్పాలి. ముందుగా నేనొక ఆర్డినెన్స్ జారీ చేయించాలనుకుంటున్నాను. ఈ రోజు అర్థరాత్రి దాటిన తర్వాత ముప్పై ఎకరాలను మించిన రెండు పంటల మాగాణీ కానీ, తత్సమానమైన భూమి కానీ ఉన్నవారు ఏ మార్గంలో కానీ తమ భూమిని మరొకరికి బదిలీ చేయాలంటే అందుకు జిల్లా కలెక్టర్ నుంచి ముందుగా అనుమతి పొందడాన్ని ఆ ఆర్డినెన్స్ నిర్బంధం చేస్తుంది. గుర్తు పెట్టుకో. భూమి బదలాయింపును నేను ఏకమొత్తంగా నిషేధించడంలేదు.... రెండోది, నీ విప్పుడు ఖరారు చేస్తున్న బిల్లులో ఒక ప్రొవిజన్ ఉంటుంది. దాని ప్రకారం భూ పరిమితి చట్టం అమలులోకి రావడానికి ఆరు మాసాల

తక్షణ పూర్వం నుంచి జరిగిన బదలాయింపులు కానీ, విడాకుల డిక్రీలు కానీ, కోస్తా ప్రాంతాల్లో భూమిని ఉప్పు నీటికయ్యలుగా మార్చడం కానీ, పిత్రార్జిత భూముల్ని విభజించడం కానీ చట్ట వర్తింపు నుంచి తప్పించుకోవడానికి ఉద్దేశించినవి కాక న్యాయంగా జరిపినవేనని జిల్లా కలెక్టర్ భావిస్తే తప్ప చట్ట ప్రకారం భూ పరిమాణాన్ని లెక్కించేటప్పుడు పరిగణనలోకి తీసుకోబడవు. ఇక జిల్లా కలెక్టర్ చట్టంలోని సంబంధిత ప్రొవిజన్లలోని నియమ నిబంధనలను బట్టి నిర్ణయం తీసుకుంటాడు.'

'మరి విడాకుల విషయమేమిటి సార్? చట్టం వాటిని కూడా పరిగణనలోనికి తీసుకోదం టారా?'

'తీసుకోదు. ఈ విషయంలో కూడా చిన్న ప్రొవిజన్‌ను కల్పిస్తాం. దాని ప్రకారం చట్టం అమలులోకి రావడానికి ముందు ఆరు మాసాల లోపల మంజూరైన ఎటువంటి విడాకులనైనా ఆ కుటుంబపు భూమికి వర్తించే పరిమితి నుంచి తప్పించుకోడానికి చేసిన ప్రయత్నంగానే చట్టం భావిస్తుంది. అయితే దీనిని సవాలు చేసే అవకాశం ఉంటుంది అప్పుడు ఆ దంపతులు భూపరిమితి చట్టం నుంచి తప్పించుకోవడానికి కాక వేరే కారణాలతోనే తాము విడాకులు తీసుకున్నట్టు రుజువు చేసుకోవాలి. . మిగిలిన వాస్తవాలలానే ఇది కూడా నిరూపణకు సాధ్య మైనది. నిరూపణ చేయవలసింది అనే నేను అనుకుంటున్నాను.... నేనీ మాట ఎంతో విచా రంతో అంటున్నాను. శాసన నిర్మాణమనే ఆయుధం కేవలం సాంఘిక పరివర్తనకే ఉద్దేశించినదైనప్పుడు ఎవరైనా అంత బరితెగించి దానిని వంచించడానికి ప్రయత్నించడం ఎలా సమంజసమవుతుంది? దిగజారిన సాంఘిక మూల్యాలు పవిత్రమైన వివాహ వ్యవస్థను కూడా భ్రష్టు పట్టించదలచుకున్నప్పుడు ప్రభుత్వం తప్పనిసరిగా చర్య తీసుకోవాలని నేను భావిస్తున్నాను '

'ఒక్క సందేహం సార్'. నాగరాజు ప్రారంభించాడు. 'చట్టం అమలులోకి రావడానికి ముందు ఆరు మాసాలను తెంపు కాలంగా మనం నిర్ణయించినప్పుడు ఒకవేళ ఏ కారణం చేతనైనా చట్టం అమలులో జాప్యం జరిగితే ఆ నడిమికాలంలో రకరకాల అక్రమ లావాదేవీలు మరోసారి చట్టబద్ధమయ్యే ప్రమాదం ఉంటుంది కదా...'

'బాగా చెప్పావ్ నాగరాజ్' ఆనంద్ అన్నాడు. 'ముసాయిదా బిల్లులో కాల పరిమితి సూచించే టప్పుడు ఏ పరిస్థితిలోనూ అటువంటి సంధి కాలానికి అవకాశమివ్వకుండా నీవు జాగ్రత్తపడాలి.'

'మీ ఉద్దేశం అర్థమైంది సార్. ముసాయిదాను దానికనుగుణంగానే తయారు చేస్తాను.'

నాగరాజ్ అభిప్రాయం కోసం ఆనంద్ అతడి ముఖంలోకి పరిశీలనగా చూశాడు. ఉద్రిక్తత గోచరించే అతడి పెదవులు, సంపూర్ణ సంతృప్తిని సూచించే విశాలమైన నవ్వుగా విస్తరించాయి. ఎట్టకేలకు నవ్వుతూ అన్నాడు. 'మంచి పకడ్బందీగా ఉంది సార్, ఇక దీనినెవరూ రద్దు చేయించలేరు. నాకు ఈ విషయంలో అణుమాత్రం కూడా సందేహం లేదు సార్.'

'నాకీ స్ఫురణ ఎలా కలిగిందో, ఎందుకు కలిగిందో నాకే తెలియదు, తనకు కలలో జరిగిన సముజ్జ్వల సాక్షాత్కారానికి సంబంధించిన జ్ఞాపకంలోకి జారిపోతూ ఆనంద్ అనుకున్నాడు. 'దాని కొకపేరు కూడా నాకు స్ఫురించింది. స్ఫురింపచేయబడిందనడం సబబు. ఆ పేరు 'శాసన పూర్వ జాగ్రత్త'. నా అంతట నాకీ ఆలోచన వచ్చి ఉండేది కాదు... శాసన యుద్ధంలో అనుసరించవలసిన ఇటువంటి వ్యూహంలో మనందరం సిద్ధహస్తులం కాగలమనిపిస్తోంది !'

నాగరాజు ముగ్ధుడై పోయాడు.

'ఇప్పుడిక సమయం వృధా చేయడానికి లేదు నాగరాజ్.' ఆనంద్ వెంటనే అన్నాడు. 'ఇప్పుడు ఆరు గంటలయింది. సరిగ్గా రాత్రి పదకొండు గంటలకు అత్యవసర మంత్రివర్గ సమావేశాన్ని ఏర్పాటు చేస్తున్నాను. ఆలోగా ఆర్డినెన్స్‌కు సంబంధించిన అన్ని వ్యవహారాలూ పూర్తి కావాలి, పదకొండున్నర కల్లా మంత్రివర్గం దానిని ఆమోదిస్తుంది. సంతకం కోసం నేను స్వయంగా దానిని గవర్నర్ దగ్గరకు తీసుకు వెళతాను. గవర్నర్ సంతకం జరిగే వరకూ ఈ వ్యవహారం గురించి ఎవరికీ తెలియకూడదు. మరో అధికారి ద్వారా కాకుండా నీవే నేరుగా ఫైలు నాకు దాఖలు చేయాలని ఆదేశిస్తున్నాను... అన్ని విషయాలూ స్పష్టమైనట్టే కదా?'

'అయ్యాయి సార్', ఆ క్షణమే శాఖాపరమైన నియమావళి నంతటినీ ప్రక్కన పెడుతూ నాగరాజు ప్రత్యుత్తరమిచ్చాడు. అంతలో హఠాత్తుగా ఏదో గుర్తొచ్చినట్టు అన్నాడు. 'కానీ సార్, రాజ్యాంగం ప్రకారం ఇది ఉమ్మడి జాబితాలోకి వచ్చే అంశం. ఆర్డినెన్స్‌కు భారత రాష్ట్రపతి ఆమోదం కూడా అవసరమౌతుంది....'

'అవునవును. ఆ విషయం నేను మరిచేపోయాను' ఆనంద్ భృకుటి ముడుస్తూ అన్నాడు. 'సరే, మన పథకాన్ని కొద్దిగా సవరించాం. నేను గవర్నర్ సంతకం చేయించిన తర్వాత చీఫ్ సెక్రటరీ, రెవెన్యూ సెక్రటరీ, నీవూ రాత్రికి రాత్రే కేంద్ర ప్రభుత్వానికి రాయవలసిన ఉత్తరాలు అన్నీ తయారు చేయాలి. నీవూ, రెవెన్యూ సెక్రటరీ పొద్దుటే తొలి విమానంలో ఢిల్లీ వెళ్ళిపోయి అక్కడి తంతు నడిపించాలి. ఒక టేబుల్ నుంచి మరో టేబుల్‌కు ఫైలును పరుగెత్తించాలి. కేంద్ర మంత్రివర్గంతోనూ, ఇతర సంబంధితులతోనూ నేను ఫోన్‌లో మాట్లాడతాను. ఈ ఆర్డినెన్స్ కొత్త హక్కులను సృష్టించడంకానీ, ఉన్న హక్కుల్ని తొలగించడంకానీ, చేయడంలేదు కనుక ఢిల్లీలో జాప్యానికి ఆస్కారం ఉండదు. ఈ విషయంలో నీ కెటువంటి కష్టమూ ఉండదని నిశ్చయంగా చెప్పగలను. ఎల్లుండి కల్లా మీరు తిరిగి రావాలి.'

'నోట మాట రానంతగా నాగరాజు ఉక్కిరిబిక్కిరైపోయాడు. సవినయంగా నమస్కరించి అక్కడి నుంచి నిష్క్రమించాడు. ఆ క్షణంలోనే శివమెత్తిన వాడిలా అంకిత భావంతో పనిలో మునిగిపోయాడు.

మరునాడు ఉదయం ఆర్డినెన్స్ వార్త రాష్ట్రాన్ని ఓ భూకంపంలా దెబ్బతీసింది.

# 56

'ఇది పరమ ఘాతుకం!' శేఖర్ ఒక్కపెట్టున అరిచాడు. 'భూస్వాములందరిపైనా, వాళ్ళలో ప్రతిఒక్కరిపైనా ఇది అక్షరాలా యుద్ధప్రకటన. దేశానికెంతో ఉపయోగపడే ఒక నిస్సహాయ వర్గం మీద ఏకంగా ప్రభుత్వమే జరుపుతున్నదాడి!' ఓ్

బలరాం ఎదుట అతడు ఆ ఆర్డినెన్స్‌పై నిప్పులు చెరిగాడు. బలరాం అసలు మాట్లాడలేక పోతున్నాడు. ఆగ్రహం, అశక్తత రెండూ అతణ్ణి ముప్పిరికొన్నాయి. 'ఆర్డినెన్స్?.. ఆర్డినెన్స్?' అంటూ గొణుగుతూ పళ్ళుకొరుకుతున్నాడు. ు

'ఇంత మూలమట్టంగా, ఇంత నిర్దాక్షిణ్యంగా మొత్తం ఒకవర్గాన్నే మట్టుబెట్టమని ఏ ముఖ్య మంత్రినీ, ఏ పార్టీ అధిష్ఠానవర్గమూ ఇంతవరకు ఆదేశించలేదు. ఏ ప్రజాస్వామిక శాసన ప్రక్రియలోనూ ఇలాంటి దాడి కనీవినీ ఎరగం. ఇంతకీ మంత్రివర్గంలోని ఆ దద్దమ్మలందరూ ఈ రాక్షసనిర్ణయానికి ఎలా ఆమోదముద్ర వేశారో?'

బలరాం ఆగ్రహావేశాలతో పోటీపడడానికి శేఖర్ శాయశక్తులా ప్రయత్నించాడు. నిజాని కతడంతగా ఆవేశపడిపోడానికి తగిన కారణం లేదు. తనదంటూ కాస్తంత భూమిలేదు సరికదా, భూస్వాములమీద అతనికి రవ్వంత సానుభూతి కూడా లేదు. అయినాసరే, లేని ఆవేశాన్ని తెచ్చుకుని దానినెంతో నేర్పుగా హద్దులు దాటించడమే కాక, అది బలరాంలోని ఆవేశాన్ని మించిపోయేలా కనిపించేటట్టు చేశాడు.

'శేఖర్ గారూ, మీరైనా మంత్రివర్గంలో ఉండుంటే ఇలాంటి ప్రమాదం జరగనిచ్చేవారు కాదు,' అన్నాడు బలరాం.

అలా కొయ్యబారిన స్థితిలోనె ఎంతో ఉద్వేగంతో లేచి నిలబడ్డాడు. పట్టరానికోపంతో పూడుకుపోయిన గొంతుతో మూడే మూడు మాటలు, మూడు ప్రకంపనాల్లాంటి మాటలు, అన్నాడు. 'వాడు తొలగి పోవాలి!'

ఆగ్రహంతో వణకుతున్న చేత శేఖర్‌తో కరచాలనం చేసి డ్రాయింగ్ రూంలోంచి నిష్క్రమించాడు.

★ ★ ★

'శాసనపూర్వ జాగ్రత్త'గా ముఖ్యమంత్రి ఆనంద్ సంకల్పించిన ఆ ఆర్డినెన్స్ తుదిమెరుగులు దిద్దుకుంటున్న రోజునే - ఆ రాత్రి - ఒక యువక భూస్వామి ఈమధ్యనే తను విడాకులిచ్చిన మాజీ భార్యతో ప్రణయకేళిలో మునిగితేలుతున్నాడు. పైగా అది ఫాల్గుణ మాసంలో (ఫిబ్రవరి) వచ్చే కాముని పున్నమిరోజు (హోలీ) కూడా. మన పురాణ కథల ప్రకారం అది కామదహనం చేయవలసిన రేయిగా ప్రసిద్ధికెక్కింది. అయితే ఆ జంట మీద ఆ పున్నమిరేయి కలిగించిన ప్రభావం దానికి పూర్తి విరుద్ధంగా ఉంది. తమ ఉత్తుత్తి విడాకుల పుణ్యమా అని రెండు పంటలు పండే మాగాణి ప్రాంతంలోని మిగులు భూమి అంతా తమకిందే ఉండిపోబోతోంది. కనుక వాళ్లలో ఒకరిమీద ఒకరికి తమకం అతిశయించింది. వాళ్ళేకాదు, అఫ్రోజాబాద్ రాష్ట్రంలోని అలాంటి వందలాది జంటలు ఆ రాత్రి తనివితీరా దాంపత్యసౌఖ్యంలో మునిగి తేలడానికి విడాకులు కారణం కావడం ప్రపంచవైవాహికసంబంధాల చరిత్రలోనే ఒక అసాధారణ సన్నివేశం.

'అబ్బ, నాకెంత సంతోషంగా ఉందో!' తియ్యని మూలుగుల మధ్య గుసగుసలాడింది, భార్య అయీ కాని ఆ చెలి.

'నాక్కూడా!' అన్నాడు ఆమెకు భర్త అయీ కాని ఆ చెలికాడు. ఏకకాలంలో అటు దాంపత్య సంబంధం, ఇటు దాంపత్యేతర సంబంధం కలగలసిన ఆ (స్వకీయపరకీయ సమ్మిశ్రిత) ప్రత్యేకసంపర్కరుచిని వారు పూర్తిగా అనుభవించారు. నాలుగునెలల క్రితం తమకు విడాకులు మంజూరు చేస్తూ ఇచ్చిన పత్రానికి ఫ్రేముకట్టి ఎంతో ప్రేమగా, గౌరవంగా, తాము పడుకున్న మంచానికి దగ్గరగా గోడమీద వారు వ్రేలాడదీసుకున్నారు. వరాలదేవిగా దానిని ఆరాధించుకుంటున్నారు.

కానీ ఏం లాభం! వారు చెలరేగి ప్రణయకేళి సాగించిన ఇరవైనాలుగు గంటల్లోనే ఆర్డినెన్స్ ప్రత్యక్షమవడంవల్ల, దేవుడి వరమనకున్న ఆ విడాకుల అందమైన ఫ్రేమును విరిచి ముక్కలు చేసేశారు.

★ ★ ★

'గత ఆరుమాసాల్లో దాదాపు ఎనభైశాతం విడాకుల కేసులు డిక్రీ అయ్యాయి సార్,' సగర్వంగా అన్నాడు రెవిన్యూ కార్యదర్శి. 'ఆ మిగులు భూములన్నీ ఇప్పుడు ప్రభుత్వపర మవుతాయి.'

'థాంక్యూ, రెవిన్యూ శాఖ చాలా బాగా పని చేసింది,' అన్నాడు ఆనంద్, మనఃపూర్వ కమైన మెచ్చుకోలు స్వరంతో.

ఈ కృతజ్ఞతాపూర్వక అభినందనను ఎలా స్వీకరించాలో రెవిన్యూ కార్యదర్శికి అర్థం కాలేదు. ఆ అభినందనకు అర్హ మైన పనేదో అతని శాఖ చేసిందని అతనంతగా అనుకోడం లేదు.

'నేను అభినందించానని అందరికీ చెప్పండి, ఇంకా చేయవలసింది చాలా ఉంది,'

అన్నాడు ఆనంద్.

ఆ తర్వాత ఆనంద్ న్యాయశాఖకార్యదర్శితో మాట్లాడి, రెవిన్యూశాఖ సేకరించిన గణాంక వివరాలను అతనికిచ్చి, న్యాయశాఖ అందించిన సహకారానికి కూడా కృతజ్ఞతలు చెప్పి ఆ శాఖలోని ప్రతీవారికీ తన అభినందనలు అందజేయమని కోరాడు. 'భూపరిమితి బిల్లులో, కొన్ని ముఖ్యమైన క్లాజుల కిందికివచ్చే ముసాయిదా నియమావళికి సంబంధించిన కొన్ని అంశాలపై నాకు వివరణ కావాలి. మీ డ్రాఫ్ట్స్‌మన్ నాగరాజ్‌ను పంపించండి. ముసాయిదా నియమావళిని రూపొందించడానికి మనం బిల్లు ఆమోదం వ రకు ఆగనవసరం లేదు.. ఇప్పటినుంచే ముసాయిదా నమూనాను సిద్ధం చేసుకుంటే, బిల్లు ఆమోదం పొందాక అందు లోని ప్రోవిజన్లను దృష్టిలో పెట్టుకుని త్వరగా దానికి తుదిరూపం ఇవ్వచ్చు. ముసాయిదాను మీరొకసారి సరిచూసిన తర్వాతే నా దగ్గరకు పంపుతారనుకోండి. ఈ లోపల కొన్ని మూల భూతసూత్రాలపై నాకు అవగాహన అవసరం.'

'మంచిది సార్, వెంటనే అతణ్ణి పంపిస్తాను,' అన్నాడు న్యాయశాఖ కార్యదర్శి, బాస్ పిలిచింది తననుకాదన్న భావాన్ని ఆ మాటలో సరిగా అర్థం చేసుకుని.

నాగరాజ్ రాగానే ఆనంద్ ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా అన్నాడు, 'ఈరోజు నుంచి మొదటి ముసాయిదా బిల్లు ప్రకారం ముసాయిదా నియమావళిని సిద్ధం చెయ్యి శాసనస భలో పెట్టబోయే బిల్లునూ, న్యాయశాఖ అందించిన సంబంధిత నియమావళినీ కలిపి పరిశీ లించాలి. ఇది అతిశీఘ్రంగా జరగాలి. సమయం చాలా ముఖ్యం.'

'సరే సర్, వాటిలో చాలావరకు సిద్ధంగా ఉన్నాయి. పూర్తయినమేరకు, మీ పరిశీలన కోసం, ఆదేశాల కోసం, తీసుకొచ్చాను,' అంటూ ఒక పెద్ద ఫైలును మర్యాదపూర్వకంగా ఆనంద్ టేబుల్‌మీద ఉంచాడు నాగరాజ్.

★ ★ ★

భూపరిమితి బిల్లులోని వివిధ ప్రోవిజన్ల గురించి వివరించి, స్థూలంగా ప్రజల మనో భావాలను గమనించడానికి ఆనంద్ రాష్ట్రమంతటా విస్తృతంగా పర్యటించాడు శ్రోతల ఆమోదం పొందడానికి ప్రతి అంశాన్ని పూసగుచ్చినట్టు వివరిస్తూ అక్షరాలా ప్రజాభిప్రాయ సేకరణ శైలిలో ప్రసంగాలు చేశాడు. భూమిలేని పేదలు ఆర్డినెన్స్ ప్రాముఖ్యాన్ని వెంటనే అర్థం చేసుకొని దానినొక గొప్పవరంగా ప్రశంసించడం ఆనంద్‌కు ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగించాయి. ఆర్డినెన్స్‌కు వ్యతిరేకంగా అప్పటికే పత్రికలు యుద్ధం ప్రకటించాయి కనుక ఈ సభల వివరాలు అంత ప్రధానంగా పత్రికలకెక్కలేదు అయితే, ఆర్డినెన్స్‌లోని ప్రోవిజన్లు యధాతథంగా పత్రికల్లో ప్రచురింపబడి ( పత్రికలు దీనిని మాత్రం తప్పించుకోడంగానీ, వాటికి మసి పూయడం కానీ చేయలేకపోయాయి) ఎవరికి వ్యతిరేకంగా అవి ఉద్దేశింపబడినవో విపులంగా చెప్పాయి కనుక పేదల అనుకూలస్పందన ( వాస్తవంగా వారికి వ్యక్తిగతంగా భూమి దక్కుతుందా, దక్కదా అన్న ప్రశ్నతో ప్రసక్తి లేకుండా) అత్యద్భుతంగా ఉంది. ప్రప్రథమంగా ఒక శాంతిపూర్వక శాసనం, సాంఘికన్యాయం కోసం ఉపయోగించబడుతున్న

మహత్తరఆయుధంగా పరిగణన పొందింది. ముఖ్యంగా, ఉత్తుత్తి విడాకులు మంచి వినోదాన్నీ, వెక్కిరింపునీ సృష్టించాయి. అనేక గ్రామాల్లో గ్రామస్థుల దృష్టికి రాకుండా దాగని, దాచడం సాధ్యం కాని, అలాంటి విడాకులు పొందిన కుటుంబాలపై రకరకాల జోకులు వెల్లువెత్తడమేకాదు, బాహాటంగా నిందలు గుప్పించకపోయినా ఆ కుటుంబాలు నిశితమైన సాంఘిక అమర్యాదకు గురయ్యాయి. ఈ పరిణామం ఆనంద్‌పై భూస్వామ్యవర్గంలో ఉన్న ద్వేషభావానికి మరింత పదును పెట్టింది. ప్రజలనుంచి వచ్చిన అచంచలమైన మద్దతును దృష్టిలో పెట్టుకుని చూస్తే, ఆ ఆర్డినెన్స్ అధికారపక్షానికి ఆత్మహత్యాసదృశమవుతుందని పత్రికలు చెప్పిన జోస్యానికి ఆస్కారమే కనిపించలేదు.

★ ★ ★

'బయటపడే దారేదీ కనిపించడం లేదు,' చౌదరి దగ్గర శేఖర్ గొణిగాడు... 'ఆర్డినెన్స్ చాలా పకడ్బందీగా, ఎవరూ భేదించలేనట్టుగా ఉంది.. హైకోర్టులో రిట్ పిటిషన్ల గతేమైందో మీకు తెలుసా?'

'ఇంతకు ముందే తెలిసింది,' చౌదరి అన్నాడు. 'వాటన్నింటినీ ప్రాథమిక దశలోనే కొట్టిపారేశారు, కారణాలు స్పష్టమే. ఒకవేళ ఏ జడ్జి అయినా వాటిలోకి తొంగిచూడాలనుకున్నా చూసి ఉండడు. ఎందుకంటే వాటిలో ఏ ప్రాథమికహక్కు ఉల్లంఘనా లేదు, ఏ భూస్వామి హక్కునూ అవి హరించలేదు.'

'భూస్వాములు సుప్రీంకోర్టుకు వెళ్ళడానికి పెద్దపెద్ద లాయర్లను పెట్టుకుంటున్నారట...'

'సరే, వాళ్ళను అదృష్టం వరించాలని కోరుకుందాం. ప్రయత్నిస్తే తప్పేముంది? అప్పుడప్పుడు అద్భుతాలు జరుగుతుంటాయి. మనిషి నమ్మకం పుంజుకునేది వాటినుంచేగా! అయినా కనీసం కొద్దికాలంపాటైనా మనం గమ్మున ఊరుకోవడం మంచిదని నా ఉద్దేశం. తక్షణ బాధితులు ఎలాగూ పోరాడతారు, పోరాడనీ. పెద్ద అలొచ్చిపడినప్పుడు రాజకీయ వాదులు తలొంచడమే మంచిది!'

'ఓ పక్క బిల్లు శాసనసభలో ఒక్కొక్కమెట్టు దాటుకుంటూ దూసుకొచ్చేస్తోంది. బహుశా ప్రస్తుత సమావేశాల్లోనే ప్రాథమికపరిశీలన ముగించి, క్లాజులవారీ పరిశీలన సగం వరకైనా పూర్తిచేసేలా ఉన్నారు. బిల్లు ఆమోదంలో జాప్యం చేయడానికి స్పీకర్‌పై ఒత్తిడి తేవడానికి నా శాయశక్తులా ప్రయత్నించాను. ఎంత ముఖ్యమైన వ్యవహారమైనా సకాలంలో ఎప్పుడు పూర్తయింది కనుక! స్పీకర్ కూడా మనకు సానుభూతిపరుడే. ఒకప్పుడు సీనియర్ క్రిమినల్ లాయర్. భూస్వాముల పెత్తనం కింద ఉన్న జిల్లాల్లో ఎన్నెన్ని హత్యలు జరుగుతాయో, ఆ దామాషాలో ఆయన ఆదాయం కూడా ఇబ్బడిముబ్బడిగా పెరుగుతుండేది. నిజానికి సభాకార్యక్రమాల జాప్యానికి ఆయన చేయగలిగిందంతా చేశాడు కూడా. అయినా ఫలితం పెద్దగా లేదు. నిర్ణీతసమయం కంటే ముందే బిల్లు ఆమోదం పొందేలా కనిపిస్తోంది.'

'అరె, ఆశ్చర్యంగా ఉందే, నే ననుకోవడం, శాసనసభ ఎత్తుగడలన్నింట్లో ప్రభుత్వ వ్యవహారాలను అటకాయించడమే తేలికని...' చౌదరి అన్నాడు.

'మామూలుగా అంతే అనుకోండి. కానీ ఈ దిక్కుమాలిన ఆర్డినెన్స్ రాష్ట్రంలో అంతటా పేదవర్గాల్లో ఎంతో ఉత్తేజం పుట్టించింది. ప్రజలే నేరుగా శాసనసభచర్చల్లో పాల్గొంటున్నారా అనిపిస్తోంది. ఇక మీ ఇందిరమ్మ తన గరీబీహటావో నినాదంతో ఆ ఆనంద్‌గాడికి కావలి దేవతలా ఉండనే ఉంది. నే చెబుతున్నా చూడండి, ఈ ఇందిరా-ఆనంద్ లిద్దరూ కలిసి రాష్ట్రంలో శాంతిసుస్థిరతలకు పూర్తిగా మంట పెట్టేస్తారు. పరిస్థితి నిజంగా గుబులుగుబులుగానే ఉంది.'

'నేను రోజూ అసెంబ్లీకి రావడం లేదనుకో, కాని నీవి మరీ అతిశయోక్తులనిపిస్తోంది,' చౌదిరి అన్నాడు.

'దయచేసి కొన్నిరోజులు అసెంబ్లీకి హాజరై ఎం.ఎల్.ఎ ల నడకెలా ఉందో మీ కళ్ళతో మీరే చూడండి. తామే ప్రవేశపెట్టిన సాచివేత తీర్మాలన్నింటినీ టకటకా ఉపసంహరించు కుంటున్నారు, ఇప్పుడు భూపరిమితి బిల్లుమీద కాకుండా, మరి దేనిమీద దృష్టిపెట్టినా అదేదో అతినీచమైనపాపమైనట్టు! వాళ్ళ వాళ్ళ నియోజకవర్గాల్లోంచి వాళ్ళమీదకు ఆనంద్ ఒత్తిడి తెప్పించే ఉంటాడు. చివరకు ఆ నడపీనుగ మౌలానాగాడు కూడా భూస్వాముల మీద రంకెలేస్తున్నాడు. నా కళ్ళనూ, చెవులనూ నేనే నమ్మలేకపోతున్నాను చౌదిరిగారూ, దయచేసి నన్ను నమ్మండి.'

'అయినా మనం గమ్మునుండి వేచి చూద్దామనే అంటాను నాకైతే భూస్వాములమీద అంతగా ప్రేమ మండిపోడం లేదు శేఖర్. కానీ ఈ భూపరిమితుల తడాఖాను నేను ముందే పసిగట్టి ఉండవలసింది. ఈ క్షణంలో నేను ముఖ్యమంత్రిగా ఉండుంటే ఎంత బాగుండే దనిపిస్తోంది!' అన్నాడు చౌదరి, ఏదో ఊహాచిత్రాన్ని చూస్తునట్టు.

శేఖర్ మాట్లాడలేదు, తనలో అనుకున్నాడు, 'ప్రగాఢప్రేరణతో, ఎంతో దృఢసంకల్పంతో ప్రయోగించిన ఇలాంటి ఆర్డినెన్స్ గురించి, ఈ నయవంచకుడికి ఆలోచన తట్టడమెలా సాధ్యం? ఓరి దేవుడా! ఈ క్షణంలో ఆనంద్‌ను నేనెంతగా ద్వేషిస్తున్నానో! అతని తెగువ ముందు, చిత్తశుద్ధి ముందు, నేనెంతో అల్పుడుగా కనిపిస్తున్నాను!'

కొద్ది విరామం తర్వాత, 'ఇప్పటికీ నాకు స్పీకర్ వైపునుంచి నరుక్కురావడమే ఉత్తమ మనిపిస్తోంది. నువ్వతణ్ణి ఎలాగో మరింత ఘెరావ్ చేయాలి శేఖర్,' చౌదరి అర్ధోక్తిగా అన్నాడు.

'నేను ప్రయత్నించలేదనా మీ ఉద్దేశం? ఆ విషయంలో నేను చేయని ప్రయత్నం లేదు. శాసనసభసమావేశాల సమయాన్ని రాత్రి వరకూ పొడిగించాలన్నప్పుడు అనారోగ్యం వంక చూపించి తాను కూర్చోలేనని స్పీకర్ తప్పించుకున్నాడు. దాంతో ఆనంద్ ఠక్కున డిప్యూటీ స్పీకర్‌ను కుర్చీ ఎక్కించాడు. మీకు తెలుసుగా, వాడు కుర్ర గాడిద, పైగా ఆనంద్ అంటే పడి చస్తాడు. ఇంకేముంది? ఆనంద్ రుద్దిన అదనపు గంటలకు వీడి అదనపు గంటలు తోడయాయి. శనివారాలు కూడా పనిదినాలుగా మారిపోయాయి. సభ్యుల్ని ఇలా గొర్రెల మందలా పరుగులు తీయించడాన్ని ప్రశ్నించే దమ్ము ఒక్కడికీ - అసెంబ్లీలోని ఏ ఒక్క పార్టీ నాయకుడికీ, గ్రూపు నాయకుడికీ లేదు. మొత్తానికి పరిస్థితి చాలా దారుణంగా ఉంది చౌదరిగారూ! అనుక్షణం ప్రజల కొరడా ఝుళిపింపులే సభ్యుల్ని నడిపిస్తున్నాయి. ఈసారి

తమ ఎం.ఎల్.ఎ బానిసగాళ్ళు ఏ మాత్రం బెసగడానికి వీల్లేదని, రాష్ట్రంలోని ప్రతి మారుమూలపల్లె కూడా ఒక అదృశ్య ఆదేశంజారీ చేసినట్టుంది.'

చౌదరి దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. చివరికి అన్నాడు, 'నువ్వేదో ఇందిరా గాంధీ-ఆనంద్‌ల కాంబినేషన్ గురించి అన్నట్టున్నావ్?'

'అవును, దానిని విడగొట్టడం ఎవడితరమూ కాదని కూడా అన్నాను.'

'దానిని ఏదీ, అసలేదీ విడగొట్టలేదంటావా?'

'ప్రస్తుతానికైతే నాకే ఉపాయమూ తట్టడం లేదు,' శేఖర్ సాలోచనగా అన్నాడు. ఆ క్షణంలో అతనికే వెలుగూ కనిపించని మాట నిజమే కానీ, ఆ చీకటి సొరంగం ముఖద్వారంలో స్పష్టాస్పష్టంగా సన్నని వెలుగురేక అతని మనోనేత్రంముందు కనిపించకపోలేదు.

★ ★ ★

జాతీయస్థాయిలో ఇందిరాగాంధీ కీర్తికిరీటంలో మరో కలికితురాయి అమరింది. స్వాతంత్ర్యాంతర్వాత మొదటిసారిగా భారతదేశం ఆహారధాన్యాలలో స్వయంసమృద్ధిని సాధించింది. 1971లో దేశంలో రికార్డుస్థాయిలో, దాదాపు 42 మిలియన్ టన్నుల ధాన్యం పండింది. 1956 నుంచి అప్పటివరకూ పి.ఎల్. 480 క్రింద అమెరికా నుంచి జరుగుతూ వచ్చిన ఆహార ధాన్యాల దిగుమతిని దేశం ఆపేసింది.

ఇది ఊహించడానికి కూడా వీలుకాని ఒక పరమాద్భుతవిజయం. భారతదేశం క్షణ క్షణానికీ పెరిగిపోతున్న తన జనాభాకు సరిపోయినన్ని ఆహారధాన్యాలను ఏ నిర్దిష్ట కాలపరిమితిలోనూ పండించలేదని అంతవరకూ నిపుణులు (ముఖ్యంగా విదేశీ నిపుణులు) జోస్యం చెబుతూ వచ్చారు. దేశం ఆత్మగౌరవానికి తగులుతున్న ఈ దెబ్బను ఇందిరా గాంధీ ఎన్నో సంవత్సరాలపాటు మౌనంగా సహించి ఊరుకున్నారు. చివరికిప్పుడు, తమకె లాంటి యూనివర్సిటీ డిగ్రీ లేకపోయినా, ఫెలోషిప్పులపై విదేశాలకు వెళ్ళి అక్కడ వ్యవసాయవిద్యలో శిక్షణ పొంది కూడా ఎన్నడూ నాగలి పట్టికానీ, ట్రాక్టర్ నడిపికానీ ఎరుగని సంపన్న భూస్వాముల పుత్రరత్నాల ఆసరా తమకు లేకపోయినా, భారతీయకర్షకులు హఠాత్తుగా తమ సామర్థ్యాన్ని ప్రపంచానికి చాటిచెప్పారు. వారు చేసిందల్లా, తమకు ఉపయోగపడుతుందనుకున్న ప్రతి ఆధునికశాస్త్రీయవిధానాన్నీ స్వీకరించడమే. తమ అవసరాలకు, పరిస్థితులకు సరిపడదనుకున్న దానిని నిర్మొహమాటంగా తిరస్కరించారు. ప్రపంచవ్యాప్తంగా ఉన్న నిత్య శంకితులు దీనితో విస్తుపోయారు. ఎట్టకేలకు, భిక్షాపాత్ర రూపంలో దేశానికి పట్టిన కళంకం తుడిచిపెట్టుకుపోయింది.

ఆ వెనువెంటనే, దేశంలో అత్యున్నత ప్రతిష్ఠా పురస్కారమైన 'భారతరత్న' ఇందిరా గాంధీని వరించింది. అది ఆమె తనకు తనిచ్చుకున్న పురస్కారమని కొందరు రంధ్రాన్వేషకులు చిత్రించ ప్రయత్నించినా ఇతరులెవరికీ అలా అనిపించలేదు. అన్నివర్గాల ప్రజలనుంచి వచ్చిన ప్రశంసల హోరులో ఆ విమర్శలు సద్దుమణిగిపోయాయి.

ఇందిరాగాంధీ ఇప్పుడు తిరుగులేని నాయకురాలు. ఒకరు సవాలు చేయలేని, సవాలు చేయని భారత ఏకైక అధినాయకురాలు. బంగ్లాదేశ్ విముక్తి ప్రదాత. దేశంలోని అభివృద్ధి నిరోధకశక్తిని మట్టుపెట్టిన మహానేత. దుర్గ, కాళి, శక్తి. సర్వత్రా శత్రుసంహారిణి .. భారతీయజన సమూహానికి శతాబ్దాలుగా, సహస్రాబ్దాలుగా తెలిసిన, పౌరాణికవిశ్వాసాలతో ముడిపడిన మూలరూపం. ఒక వ్యక్తిలో ప్రజలకు ఆ దివ్యశక్తి ప్రతిరూపమో, లేక ఆ శక్తితో సామ్యమో కనిపించినప్పుడు ఆ భావం ఉన్నంతకాలం చెదరని విశ్వాసం ద్వారా వారిమధ్య రాజకీయబంధం కూడా నీడలా అనుసరిస్తుంది- (అంటే అనుసరించినంతకాలం, అన్నమాట.) ఇది అందరూ అవలోకించగల వాస్తవం. అయితే తరచు జరుగుతూనే ఉన్నట్టు, ఆ అవలోకన వాస్తవాన్ని కూడా అధిగమించినట్టు కనిపిస్తుంది.

ఉబుసుపోని క్షణాలలో నోటి దురుసుతో ఇంతవరకూ ఆమె గురించి కొందరు చేస్తూ వచ్చిన వెకిలి వ్యాఖ్యలూ, పార్లమెంట్ సెంట్రల్ హాల్‌లో నోటి మీద బొత్తిగా అదుపులే కుండా అన్న మాటలూ ఇప్పుడు గతంలో కలసిపోయాయి. పైగా అలాంటి తప్పుడు మాటలు నేనెప్పుడూ అననే లేదంటూ ప్రతి ఒకడూ ఒట్టేసి మరీ ఉద్ఘాటించడం మొదలుపెట్టాడు. ఇది రాజకీయప్రత్యర్థులు అల్లిన కట్టుకథ. అబద్ధం, అంతా అబద్ధమే, దారుణమైన అబద్ధం అంటూ ఎవడికి వాడు గొంతు పెంచి అరవడం ప్రారంభించాడు. ఆ ధోరణి అతనిపై వచ్చిన ఆరోపణను మరింత బలపరచేటట్టే వినిపించింది. నిజం ఇదీ అని చెప్పడానికి అంత నోరు చేసుకుని కృతకమైన ఖండనలకు దిగవలసిన అవసరం లేదని చాలామంది అనుకున్నారు, కొంతమంది ఆ మాట పైకే అన్నారు. ఇందిరాగాంధీకి సమాచారం అందించే వేగులతో, ఇతరత్రా కథలు మోసే వారితో బ్రహ్మాండమైన ఒక యంత్రాంగం ఉందనీ, అది సర్వాంతర్యామి అనీ, మాటలకందనిదనీ ఎందరో నమ్మడం ప్రారంభించారు. మామూలుగా నమ్మదగినదానికీ, ఆమె గురించి తప్పనిసరిగా, తప్పించుకోలేని విధంగా నమ్మబడుతున్న దానికీ, మధ్యనున్న అగాధాన్ని దాటడానికి ఊహాశక్తినే ఆశ్రయించవలసి వచ్చింది.

అంత గొప్ప సరళిలో అధినేత ఉన్నతశిఖరాగ్రానికి చేరుకున్న తర్వాత చేసేదేమిటి?... మొదటగా ఎక్కడికక్కడ వందిమాగధులు పుట్టుకొస్తారు. భూపరిమితి శాసన ప్రక్రియను పూర్తిచేసేశామని రాష్ట్రాలు ఒకదాని వెంట ఒకటి నివేదికలు పంపడం ప్రారంభించాయి. ఆమె నిర్దేశించిన గరీబీహటావో కార్యక్రమాలన్నింటినీ - అక్షరాలా అన్నింటినీ- అప్పటికే అమలు చేసేసి ప్రజలకు కనీవినీ ఎరుగని లాభాల పంట పండించేశామని చెప్పడానికి పోటీ పడ్డాయి. (ఇలా ఉద్ఘాటించే నాయకునికి అసలా కార్యక్రమాలేమిటో కూడా తెలియకపో వచ్చు, అతడు బాగా గుర్తుపెట్టుకునేదల్లా ఎన్నిసార్లు వీలైతే అన్నిసార్లు, ఎంత గట్టిగా వీలైతే అంత గట్టిగా ఇందిరాగాంధీ పేరును వల్లిస్తూ ఉండటం!) చూడబోతే, ఒక్కసారిగా దేశ వ్యాప్తంగా అందరిలో హృదయపరివర్తన వచ్చేసిందా అన్నట్టుగా వ్యవహారం నమ్మలేనంత సరళంగా, వేగంగా, సులువుగా కనిపించింది. అయితే దురదృష్టవశాత్తూ ఇందుకు అఫ్రోజాబాద్ రాష్ట్రం ఒక్కటే మినహాయింపు. ప్రతిచోటా గారడీని తలదన్నే ఈ విజయమహాద్భుతాన్ని నమ్మలేనట్టుగా గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయాడు ఆనంద్. మధ్యయుగాలనాటి ప్రభువుల

ఆస్థానాలలో ఉండేదనుకునే వాతావరణమే అందులో అతనికి కనిపించింది. కొన్ని రాష్ట్రాలలో భూపరిమితిపై చర్చ మొక్కుబడిగా జరిగిందనీ, వీలైనంత తక్కువ వ్యవధిలో చర్చ జరిపించా మనిపించాయనీ, ప్రతిపక్షాల నుంచి విమర్శలు వెల్లువెత్తాయి. భూమిలేని పేదలకు పంపిణీ చేయడానికి వాస్తవంగా ఎంతభూమి ఉన్నదని అడిగితే చివరకు రెవిన్యూమంత్రులు కూడా కచ్చితంగా చెప్పలేకపోయారు. సర్వత్రా ముంచెత్తిన విజయఘోషలో అన్ని గణాంకాలూ గాలికి కొట్టుకుపోయాయి. చట్టంలోని సారాన్నీ, స్ఫూర్తినీ నీరుకార్చడానికి భూస్వాములు, నిపుణులైన వారి న్యాయవాదులు, కనిపెడుతున్న మార్గాలను చూసి ఆనంద్ రాజకీయేతర మిత్రులు, శ్రేయోభిలాషులూ జావగారిపోయారు. అందరికంటె ఎక్కువగా డాక్టర్ సుదర్శన్ ఆగ్రహంతో బుసకొట్టాడు. ఆనంద్‌ను ముందుకు పొమ్మని చెప్పి ఒక నిర్దాక్షిణ్యవర్గంనుంచి సర్వనాశనాన్ని కొని తెచ్చుకోమనీ అనలేడు. అలాగని భూమిలేని లక్షలాది నిరుపేదలను అనాథలను చేసి సంపూర్ణ వైఫల్య పరాభవాన్ని మోస్తూ తెరచాటుకు తప్పుకోమని చెప్ప లేడు. అలా చేయడం, రంగంలో తనకు తక్షణ ప్రత్యర్థులైన భూస్వామ్యవర్గానికో లేదా అంతకంటె ఘోరంగా వ్యవస్థనే సమూలంగా తిరస్కరిస్తున్న హింసాసమర్థులకు విజయం కట్టబెట్టడమే. మౌలికమైన, అర్థవంతమైన మార్పును తేగల సమర్థసాధనంగా ప్రజాస్వామ్యం భారతదేశంలో విఫలమైందని ఒప్పుకోవడమే. ప్రజాస్వామ్యం అప్పుడప్పుడే సామాజిక పరివర్తనకు ఒక గీటురాయిగా మారుతోందికూడా. చూడబోతే, ఆనంద్ వెనకడుగు వేయడం మరింత నిరుత్సాహజనకంగా, విధ్వంసకరంగా కనిపించింది. బహుశా అతడలాంటి ఆత్మహత్యామార్గం పట్టకుండా ఉండవలసింది. తన తలపువ్వు వాడకుండా ఏదో చేశాన నిపించి ఆ తర్వాత గుండె మీద చేయివేసుకుని హాయిగా ఉండవలసింది. అంత పీకిపాకాన పెట్టే స్థాయిలో భూ పరిమితులను అమలు చేసే ప్రత్యేకబాధ్యతను అసలతనికి అప్ప గించిందెవరట? ఎవరైనా వేటు వేయడానికి వీలుగా తన మెడను ముందుకు, మరీ ముందుకు చాచమని అతణ్ణి ఎవరడిగారు?

అసలా దిక్కుమాలిన ఆర్డినెన్స్ దేనికి? ఉన్నపళంగా దానిని తెచ్చి ప్రయోగించమని అతన్నెవరడిగారు? అది పార్టీ ప్రణాళికను మరీ అతిగా పట్టించుకోడం కాదా? ఇది కచ్చితంగా ఉన్నవ్యవస్థలో చీలికలు తెచ్చి ఛిద్రం చేసే ధోరణి. ఈ ధోరణి ఉభయపక్షాలను అంతులేని లిటిగేషన్‌లోకి తోసెయ్యదా? ఆ సర్వనాశన ప్రక్రియనుంచి వాళ్ళనెవరు కాపాడతారు? అప్పటికి ఆనంద్ ఎక్కడుంటాడు? - ఎక్కడ ఉండనిస్తారతగాణ్ణి? ఈ ప్రక్రియనంతనీ పూర్తిచేసి, రాష్ట్రంలోని భూమిలేని ప్రతి ఒక్కడికీ మిగులు భూమి దక్కేలా చేసి, ఆ తర్వాత దాని ఫలితం అతనికి అందేలా చూసే వరకూ తను అధికారంలో ఉంటానని ఆనంద్ ఎలా అను కుంటున్నాడు? తను నామినేటెడ్ ముఖ్యమంత్రి అయ్యుండి కూడా తన ప్రభుత్వానికి అలనాటి బి.సి.రాయ్‌ల్లా, మోహన్‌లాల్ సుఖాడియాల్లా మరీ ఎక్కువ ఆయుర్దాయాన్ని ఆశించడం అవాస్తవికం కాదా?

క్రమంగా, ఇందిరాగాంధీ విజయవైభవాలు కలిగించే తన్మయత్వంలో మునిగితేలడం ప్రజలకు దాదాపు అలవాటుగా మారింది. దానిని ప్రశ్నించేందుకెవరూ సాహసించ లేరు.

ఇందిరాగాంధీ ఏం చేసినా తప్పుగానే భావించే కొన్ని ప్రతిపక్షాలూ కొందరు రంధ్రాన్వేషులూ ఇందుకు మినహాయింపు. తమకర్థమైన ప్రజాస్వామ్యం ప్రకారం ఆ పంథానే అనుసరించాలి కనుక, దాని నుంచి వారెటూ తప్పించుకోలేరు ఇక, ఆమె నొక దేవతామూర్తిగా ఆరాధించే వారి ప్రకారం దేశంలో ఎక్కడ ఇందిరాగాంధీ కార్యక్రమాలు అమలు జరుగుతున్నా సరే, వాటిలో వీసమెత్తు లోపం ఉండటానికి వీల్లేదు . ఆనంద్ ఏ రాష్ట్రనాయకునితోనూ వివాదానికి తలపడలేదు కానీ, పార్టీ విశ్వసనీయత, భవిష్య ప్రయోజనాలు చాలావరకు ఆధారపడిన ఈ కీలక కార్యక్రమంలో ఎటువంటి మాయలూ, మోసాలూ చోటుచేసుకుంటున్నాయో ప్రధాన మంత్రికి నివేదించడం తన కర్తవ్యమనుకున్నాడు. కుతూహలం కొద్దీ, దేశం వివిధ ప్రాంతాలలో కొందరు ప్రసిద్ధ భూస్వాముల కింద ఎంతెంత భూమి ఉందో ఆరా తీసే సరికి దాని పరిమాణం నాలుగంకెల్లో ఉండడమే కాదు, అది ఏకంగా నాలుగు రాష్ట్రాలకు, కొన్ని సందర్భాలలో అయిదు రాష్ట్రాలకు విస్తరించి ఉన్నట్లు తేలింది. ఈ వాస్తవం అతనికి కలవరం కలిగించింది. అయితే ఈ వాస్తవం నిరంతరం మరుగునపడుతూనే వచ్చింది. శాశ్వతంగా సమాధవు తుందా అనిపించింది.

సొంతభూమి ఏకంగా అయిదు రాష్ట్రాలకు విస్తరించడమా? ఇంతకుముందు అలాంటి దెన్నడూ వినలేదు. ఒకే రాష్ట్రంలో ఎంతో కొంత భూమి ఉన్నవాడిగా, ఈస్టిండియా కంపెనీని తలపింపజేసే ఒక భూస్వామిని పందొమ్మిదవందల డబ్బై దశకంలో అతడు ఊహించ లేకపోయాడు. ఒకే వ్యక్తి ఆధీనంలో రాష్ట్ర సరిహద్దులు దాటి భూమి విస్తరించి ఉన్నప్పుడు ఎటువంటి మోసాలకు అవకాశముంటుందో ఆలోచించడం ప్రారంభించాడు. వేర్వేరు రాష్ట్రాల్లో ఉన్న అలాంటి భూమిని వెతికి పట్టుకోవడం ఎలా? ఆలోచించినకొద్దీ అతనికది మరింత చిక్కుముడిలా తయారవుతోంది. వీలైనంత త్వరగా ఈ విషయాలను నిష్పాక్షికంగా పరిశీలించాలని, విమానంలో అఫ్రోజాబాద్‌కు తిరిగొస్తూ అతను నిర్ణయించుకున్నాడు. ఈ కోణాన్ని పార్టీ క్షుణ్ణంగా పరిశీలించని సంగతీ అతనికి అర్థమైంది. అయితే మాత్రం? ఆ మాటకొస్తే అసలు పార్టీ అంటే ఏమిటి? పార్టీలోని ఒక సభ్యుడిగా ఈ చిక్కులన్నింటినీ పార్టీ దృష్టికి తెచ్చి, వాటిని జాగ్రత్తగా విప్పుకునేలా చూసే బాధ్యత తనకు లేదా? ఇప్పుడు తనకు అనుమానం రానేవచ్చింది. ఈ పరిస్థితిలో ఒకవేళ తన రాష్ట్రంలోనే వ్యక్తుల అధీనంలో వేర్వేరు రాష్ట్రాలకు విస్తరించిన భూమి ఉన్నట్టు తేలితే ఏం చేయాలి? ఏ భూస్వామి ఎక్కడెక్కడ చట్ట విరుద్ధంగా భూమి దక్కించుకున్నా, అందులోని ప్రతి సెంటు భూమీ తనకు, అంటే ముఖ్యమంత్రి ఆనంద్‌కు, న్యాయబద్ధంగా తిరిగి రావలసిందేనన్న ఆలోచనను, అప్పటికే ఒక విధమైన మూఢనిబద్ధతలోకి జారిపోయిన అతని బుద్ధి ప్రేరేపిస్తూ వచ్చింది. ఎలాగైనా సరే, ఆ భూమిని, అందులో ప్రతి అంగుళాన్నీ తను తిరిగి సాధించి తీరవలసిందే. తన చట్టాన్నీ తన ప్రభుత్వాన్నీ లొసుగుల బారిన పడకుండా చూసుకోవలసిన బాధ్యత తన కుంది. ఆలోచనల్లో ఇలా గాఢంగా కూరుకుపోయినప్పుడల్లా తను మరీ శ్రుతిమించి వ్యవహరి స్తున్నాడా అని కూడా అనిపించేదతనికి. ఈ లెక్కన శాసనసభల్లో గంటగంటకీ ఆమోదం పొందే ఎన్ని చట్టాలు నిజమైన పరిశీలనకు నిలబడతాయి?

'భూస్వాముల మీద శత్రుత్వం అతణ్ణి రోజురోజుకీ ఉన్మత్త స్థితికి తీసుకెడుతోంది!' అఫ్రోజాబాద్‌లోని గౌరవనీయ పౌరులు కొందరు జారీచేస్తున్న తీర్పు ఇదీ. రంపపుకోతలాంటి ఈ వ్యాఖ్యలు తన విషయంలో ఎంతవరకు న్యాయమని తనను తనే ప్రశ్నించుకునేవాడు. 'న్యాయంకాదని' తనే జవాబు చెప్పుకునేవాడు. అలాంటి విమర్శలను నివారించడానికి తను చేయగలిగిందేమీలేదు, తన పరిపూర్ణతృప్తి మేరకు తన విధిని నిర్వర్తించడం తప్ప. ఓరి దేవుడా! ఒక విధిని నిర్వర్తించడానికీ, చాలా బాగా నిర్వర్తించడానికీ, మధ్య ఇంత అగాధం ఉంటుందా? ఆ రెండూ పూర్తిగా ఒకదానికొకటి భిన్నమైనవిగా కనిపిస్తున్నాయే! ప్రజాస్వామ్యప్రక్రియను ఎవరైనా మరీ అంత అతిగా పట్టించుకుంటే దేనినీ నిర్దుష్టంగా చెయ్యలేరన్న చేదునిజం ఛెళ్ళున చరచి వారి గుండెలు బద్దలు కావా?

★ ★ ★

ప్రయాణీకుల బృందాలతో అఫ్రోజాబాద్ విమానాశ్రయం ఎప్పటిలా కోలాహలంగా ఉంది. 'హజ్' యాత్రకు వెళ్ళే యాత్రికుల బృందం వాటిలో పెద్దది. వాళ్ళు బొంబాయివెళ్ళి అక్కడి నుంచి ఓడలో సౌదీఅరేబియాకు వెళ్ళాలి. వాళ్ళు ధరించిన, ఎక్కడా కుట్టుపడని పాలనురుగలాంటి ఏకవస్త్రపు 'లుంగీలు' వెయిటింగ్ హాల్‌ను తళతళలాడే మంచుభూమిగా మార్చేశాయి. పేద ముస్లింలు ఎన్నెన్నో సంవత్సరాలపాటు, బహుశా తమకు అరవై, డెబ్భై ఏళ్ళు వచ్చేవరకు తమ స్వల్పసంపాదన నుంచి పైసా పైసా కూడబెట్టుకుని ఆ డబ్బుతో హజ్ యాత్రకు వెళ్ళివస్తుంటారు, మతగ్రంథం నిర్దేశించిన విధి అది... ఆ దృశ్యం ఎంతో హత్తుకునేలా ఉంది. పవిత్రత వెల్లివిరిసే ఇటువంటి యాత్రికులనూ, తమ జీవితకాలపు ఆకాంక్ష త్వరలో నెరవేరబోతున్నందన్న సంతృప్తి నిండిన వారి ముఖాలలో పొంగిపొరలుతున్న పారవశ్యాన్నీ ఆనంద్ ఇంత పరిశీలనగా చూడటం ఇదే ప్రథమం. ఏడు కొండలెక్కి తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించుకోడానికి వెళ్ళే వేలాదిమంది యాత్రికులలో కూడా ఇదే భక్తి తన్మయత్వం తరగలెత్తుతూ ఉంటుంది. మతభేదాలతో నిమిత్తం లేకుండా మనుషులందరినీ అలరించే ఆ పవిత్రభక్తిపూరిత పరిసరాలలో కొన్ని నిమిషాలపాటు ఆనంద్ లీనమైపోయాడు. ఢిల్లీలో విమానం ఎక్కినప్పటినుంచీ, భూకుంభకోణంలో భూస్వాములు పన్నే అసహ్యకరమైన పన్నాగాల గురించే అతడు ఆలోచిస్తున్నాడు. హజ్ యాత్రికులు ఆ ఆలోచనలకు విరామమిస్తూ క్షణకాలం ఆ ఆధునిక విమానాశ్రయాన్ని ఒక పవిత్ర ప్రాంగణంగా మార్చేశారు.

వెయిటింగ్ హాల్‌లో అటూ ఇటూ తిరుగుతున్న జనసందోహంలో ఆనంద్‌కు హఠాత్తుగా రాష్ట్రప్రభుత్వన్యాయశాఖ కార్యదర్శి ఉమాశంకర్, డ్రాఫ్ట్స్‌మన్ నాగరాజ్‌తోపాటు కనిపించాడు. ఇద్దరూ చేతులు జోడించి నమస్కరిస్తూ అతణ్ణి సమీపించారు. అతడు దిగీదిగగానే అత్యవసరంగా ఏదో విషయం మాట్లాడాలన్న తొందర వాళ్ళలో తొంగిచూసింది. వెంటనే తన నివాసానికి వెళ్ళి, అక్కడ వేచి ఉండమని ఆనంద్ వాళ్ళకు చెప్పాడు. ఆ తర్వాత ఇతర సిబ్బందినీ, అధికారులనూ; చేయడానికీ, చెప్పడానికీ ప్రత్యేకించి ఏమీ లేకపోయినా ముఖ్యమంత్రి వస్తున్నా, వెడుతున్నా, టంచన్‌గా విమానాశ్రయంలో ప్రత్యక్షమయ్యే రాజకీయజీవుల్నీ

పలకరించాడు.

డ్రాయింగ్‌రూంలో కూర్చుంటూనే న్యాయశాఖకార్యదర్శినీ, నాగరాజ్‌నీ పిలిపించాడు. న్యాయశాఖ కార్యదర్శి ఆందోళనగా కనిపించాడు భూపరిమితుల వ్యవహారాన్ని చూడ వలసింది అతనే. రాష్ట్రంలో భూపరిమితుల కురుక్షేత్రం మొదలైపోయింది కూడా. అతడు తానుగా పెద్ద భూస్వామేమీకాదు, అయితే అతడు కలవరపడుతున్నది - ఉంటుందో, ఊడు తుందో తెలియని తన భార్య అదృష్టం గురించి. నేడో రేపో ఆమె తన తండ్రినుంచి పెద్ద ఎస్టేట్‌ను వారసత్వంగా అందుకోబోతోంది. అదందేలోపలే, పట్టువీడని భూకబ్జాదారుగా మారిన ముఖ్యమంత్రి ఆనంద్ డేగచూపుల కింద, తన భర్త ఆ క్షణంలో తుదిమెరుగులు దిద్దుతున్న చట్టం ప్రకారం, అందులో మూడోవంతు భూమిని ఆమె ప్రభుత్వానికి ధారపోసుకోవాలి! ఇక లా సెక్రటరీ దుస్థితిని ఎవరైనా ఊహించుకోవచ్చు– ఓ పక్క కాల్చుకుతినే బాస్, ఇంకోవైపు కాళ్ళక్రింద మంటపెట్టే భార్య. ముందుచూస్తే నుయ్యి, వెనుకచూస్తే గొయ్యి!

సెక్రెటరీ కాఫీలు సెర్వ్ చేయిస్తుండగా ఆనంద్ అడిగాడు, 'విషయమేమిటి ఉమాశంకర్ గారూ? మీరిద్దరూ ఎయిర్‌పోర్ట్‌కి పరుగెత్తుకొచ్చారంటే, చాలా అర్జంటు విషయమే అయుంటుంది.'

'కొంతవరకు అవునుసార్!' లా సెక్రటరీ మొదలుపెట్టాడు. 'మీరు ఈరోజు మధ్యాహ్నమే పర్యటనకు వెళ్ళిపోతారనీ, కొద్దిరోజులవరకూ రారనీ తెలిసింది. ఇది తక్షణం పరిష్కరించు కోవలసిన విషయమనిపించింది. భూపరిమితి చట్టంలో రెండు పంటల మాగాణి భూమి ఒక కుటుంబం కింద వాస్తవంగా ఎంత ఉండవచ్చన్న క్లాజుకు సంబంధించి మనమింకా నిర్ణయం తీసుకోలేదు. మీరు పర్యటనకు వెళ్ళేలోపల మీ నిర్ణయమేమిటో చెబితే, మీరు తిరిగొచ్చే టప్పటికి బిల్లులో ఆ భాగాన్ని సిద్ధం చేస్తాం.'

'నాకు తెలుసు ఉమాశంకర్‌గారూ! ప్రస్తుతానికి ఈ విషయంలో చిన్న చిక్కుంది. తొందర పడితే అందరం ఇబ్బందుల్లో పడిపోతాం. 10 నుంచి 20 ఎకరాల మధ్యలో పరిమితిని ఏ అంకె దగ్గరైనా నిర్ణయించుకోవచ్చని పార్టీ ప్రణాళిక సిఫార్సు చేసింది. భూసారం రీత్యా దేశంలో భూమి రకరకాలుగా ఉంటుంది కనుక ఇలా సిఫార్సు చేయడం అవసరమే కావచ్చు. కానీ అదే అన్నిరకాల తంత్రాలకూ అవకాశమిస్తుంది. నామీద దుష్ప్రచారం ముమ్మరం చేయడానికి పార్టీలోని నా మిత్రులు కొందరు ఈ నిర్ణయం కోసమే ఎదురుచూస్తున్నా ఆశ్చర్యపోను. అధిష్ఠానవర్గాన్ని సంప్రదించి ఆలిండియా నమూనాలో మనం ఎక్కడ, ఏ కొలమానానికి సరిపోతామో చూస్తాను. ఓ వారం రోజుల్లో ఓ సమ్మేళనంలో పాల్గొనడానికి నేను ఢిల్లీ వెడు తున్నాను. అప్పుడీ విషయంలో ఒక నిర్ణయం తీసుకుని, అవసరమైతే అక్కడనుంచే మీకు తెలియజేస్తాను. అంతవరకు మీరు ఎదురుచూడక తప్పదు... '

'మంచిది సార్, అంతవరకూ ఆగుదాం...'

'అదిసరే, ఈసారి నా ఢిల్లీ యాత్రలో నాకో గొప్ప విషయం తెలిసింది. ఏకంగా నాలుగైదు రాష్ట్రాల్లో భూములున్న భూస్వాములున్నారట. ఇక వాళ్ళ ఎస్టేట్లు ఏ సైజులో ఉంటాయో మీరే ఊహించుకోండి. ఇలాంటి జాతి మన రాష్ట్రంలోనూ ఉందంటారా?'

'ఉన్నారనుకోనుసార్, పొరుగురాష్ట్రాల్లో భూములున్న వాళ్ళుంటే ఉండచ్చు, అయినా రెవిన్యూ శాఖవారిని అడిగి తెలుసుకుంటాను.'

'ఇతర భూస్వాములనుంచి ఈ అంతర్రాష్ట్రభూస్వాముల్ని వేరుచేయడానికి మీరేదైనా ఉపాయం చూడాలి. చట్టం ప్రకారం ఈ పెద్ద మనుషులు దాఖలు చేయవలసిన డిక్లరేషన్ పత్రాలను మరో రంగులో ప్రచురిస్తే ఎలా ఉంటుంది?'

'మంచి ఐడియా సార్, మనం వెంటనే ఈ పద్ధతిని ప్రవేశపెట్టొచ్చు,' సెక్రటరీ ఉమా శంకర్ జవాబు చెప్పి నిష్క్రమించాడు.

★ ★ ★

'అతను అఖండుడు. అంత తేలిగ్గా ఉచ్చులో పడడు,' ముక్కుపుటాల్లోంచి దట్టమైన సిగరెట్ పొగ వదులుతూ చౌదరి అన్నాడు. 'నాకేలాంటి ఆశ్చర్యమూ లేదు, అలాగని నిరాశా చెందను.'

'ఆ సంగతి నాకు తెలుసు!' శేఖర్ గొణుగుతూ అన్నాడు. 'అయినా ఇది కచ్చితంగా నిరాశ కలిగించే విషయమే. ఇప్పుడు మనమేం చేయాలి?'

చౌదరి సిగరెట్ పొగలోంచి శేఖర్ వైపు చూశాడు, పొగచూరి ఆ మనిషి మరీ వికృతంగా తయారయ్యాడన్నట్లుగా. అతనిలో ఒక విభిన్నమైన మనిషి, బహుశా ఒక అసహ్యకరమైన మనిషి, మామూలు రాజకీయవాదికెప్పుడూ చేతకానంతగా అసహ్యం గొలిపే మనిషి, తనకు కనిపిస్తున్నాడనుకున్నాడు. ఒక మనిషి భావిస్తున్నదానికీ, చేస్తున్న దానికీ వెనుక హేతువేమిటో రాజకీయాలొక్కటే వివరించలేని ఒక రాజకీయాతీతస్థితిలోకి ప్రవేశించాడా అన్నట్టు కనిపిస్తున్నాడు శేఖర్.

'ఈ దరిద్రగొట్టు భూపరిమితి వ్యవహారాన్ని నువ్వంతగా మనసుకు పట్టించుకుంటున్నావే, అది వింతగా ఉంది శేఖర్,' చౌదరి ఒకింత తీవ్ర వ్యంగ్యంతో అన్నాడు. 'దానికి నువ్వంత ఇదవడం దేనికి? ఆ అవసరం నీకేముంది? నీదంటూ ఒక సెంటు భూమి లేదు. ఎంతైనా ఆనంద్, తను ప్రజలకు ఏదో మంచి చేస్తున్నాననుకున్నాడో ఏమో, చట్టాన్ని పకడ్బందీగా అమలుచేయడానికి ఏంచేయాలో అది చేస్తున్నాడు. మనం అతనితో ఏకీభవించకపోవచ్చు. ముఖ్యంగా ఇలాంటి సున్నితమైన, క్లిష్టమైన వ్యవహారాల్లో అతని దూకుడుతో... అతని పోరాటం ఎలా ముగుస్తుందో నాకు తెలియదు; అయినా ఏమాటకామాట చెప్పుకోవాలంటే మహాభారతంలోని అభిమన్యుడిలా పోరాడుతున్నాడతను. మనమంతా అతని పతనాన్ని కోరే వాళ్ళమే; అయితే అది పూర్తిగా రాజకీయకారణాలతో. దాని న్యాయబద్ధత దానికుంటుంది. వాస్తవంగా మనం గురి పెట్టింది మరెవరినో. ఆనంద్ కేవలం ఒక ముసుగు మాత్రమే. నిజం చెప్పాలంటే దీనికీ భూపరిమితిచట్టానికీ అవినాభావసంబంధమంటూ లేదు. మన రాజకీయాల ఆట కొనసాగించడానికి ఈ రోజు భూపరిమితి వ్యవహారం అవుతుంది, రేపు మరొకటి, ఏదైనా కావచ్చు. నిన్న-ఇవ్వాళ-రేపు ఇదే రివాజు ఇది కేవలం ఆట కోసమే ఆడే ఆట.

కనుక ఇందులో నిరాశపడవలసిందేమీ లేదు మనకు సులువు కావాలని ఆనంద్ తన ప్రయత్నాల్లో ఓటమిని కొనితెచ్చుకుంటాడా చెప్పు? నాకతని మీద సానుభూతేమీ లేదు. అలాగని తను గట్టిగా నమ్మిన దారిలో అతడేం చేస్తున్నా, ఏం చేయకపోయినా, అందుకు నేనతణ్ణి ద్వేషించను. నువ్వూ అతడితో రాజకీయంగా నీ శాయశక్తులా పోరాడు, ఒకవేళ విజయం అతణ్ణే వరించినా, అతణ్ణి నిందించకు... కనుక ప్రస్తుతానికేమీ తలపెట్టకు, తగిన సమయమొచ్చే దాకా ఆగుదాం.'

శేఖర్ ముఖంలో హఠాత్తుగా రంగులు మారడం చూసి చౌదరి మళ్ళీ అన్నాడు, 'సరే, ఈ రోజు మరికొంత ఆలోచిస్తాలే, రేపు కలుసుకుందాం.'

ఆ రోజు సాయంత్రం చౌదరి, గ్రేట్ ఇండియా టైమ్స్ సంపాదకుడు నందివర్ధన్‌ను డిన్నర్‌కు ఆహ్వానించాడు. ఒక్కణ్ణే భూపరిమితి చట్టంలోని దాదాపు ప్రతి ఫుల్‌స్టాప్ దగ్గర, కామా దగ్గర కోట్లాదిరూపాయల కుంభకోణం పడగవిప్పుతోందని నందికి నమ్మబలికే ప్రయత్నం చేశాడు. ఈ ఘోరమైన కుంభకోణం భోగట్టాను దొరకపుచ్చుకుని గ్రేట్ ఇండియా టైమ్స్ గ్రేటర్ ఇండియా టైమ్స్ కావచ్చునని అందులో చెప్పకుండా చెప్పిన సూచన. నేరుగా దేవతా హస్తాల్లోంచి అందొచ్చే ఇలాంటి కుంభకోణాలు ఎప్పుడనుకుంటే అప్పుడు రావు.

ఎడిటర్ నందివర్ధన్ నిశ్చేష్టుడయ్యాడు. చౌదరి మాటల్ని ఎంత మాత్రం నమ్మలేక పోయాడు. ఆనంద్ ముఖ్యమంత్రి కావడానికి ముందు అతని మీద కలపదొంగతనం కేసు బనాయించిన ఉదంతంలో ఇప్పటికే అతడు వేళ్ళుకాల్చుకున్నాడు. వేళ్ళే ఏమిటి, మోచేయి వరకూ మాడ్చుకున్నాడు. ఆ ఉదంతంలో గ్రేట్ ఇండియా టైమ్స్ అతి పెద్ద మురికిపాత్రనే పోషించింది. సమర్థుడుగా పేరున్న ఈ ఎడిటర్ అప్పటినుంచి ఆనంద్ ఎదురైనప్పుడల్లా సిగ్గుతో కుంచించుకుపోతున్నాడు. ఆ పత్రిక పాత్రపై ఆనంద్ సూచనగా కూడా ఎలాంటి మనస్తాపం వ్యక్తం చేయకపోయినా, ఆ భంగపాటు నంది జ్ఞాపకాలలో ఎలాగో ముద్రపడిపోయింది. 'లేదండీ, ఆనంద్ గురించి ఈ చెత్తనంతనీ నేను నమ్మలేను..' నిశ్చయంగా చెప్పేశాడు.

'మిమ్మల్నెంతమాత్రం తప్పుపట్టను,' చౌదరి ఎంతో నిర్వికారంగా ప్రారంభించాడు. 'ఒకసారి చేసిన తప్పు మరొకసారి చేయకూడదనుకోడం మంచి నిర్ణయమే. అయితే ఈ లెక్కన మీరు పత్రిక ఎలా నడుపుతారు? మీకేదో ఉపకారం చేయడానికి ఈ భోగట్టా ఇవ్వడం లేదు, తుచ్ఛమైన ఇలాంటి అక్రమ ఒప్పందాల వల్ల మట్టికొట్టుకుపోయే భూమిలేని నిరుపేదలకు సహాయం చేయడమే నా ఉద్దేశం. అసలిది వార్తే కాదనీ, పనికొచ్చే వార్తే కాదనీ, మీరనుకుంటే మీమీద జాలిపడి మరో పత్రికకు అందించడంతప్ప నేను చేయగలిగిందేమీ లేదు. ఎంతైనా నన్నూ ఒక వదరుబోతుగానో, పట్టించుకోనవసరం లేని సొర్సుగానో మీరు కొట్టిపారెయ్యలేరు; ఒకటికి రెండు సార్లు ధృవీకరించుకునీ మరీ ఈ భోగట్టా మీ కందించడంలో నేను చేస్తున్నది ఒక దేశభక్తుడి కర్తవ్యానికేమాత్రం తక్కువ కాదు. మీ కిష్టం లేకపోతే అది మీ ఖర్మ!'

డిన్నర్ పూర్తయింది, అలాగే వాళ్ళ సంభాషణ కూడా. చౌదరి అత్యద్భుతంగా నటించిన ఆ బిర్రబిగువు ధోరణీ, నివురుగప్పిన నిప్పులాంటి కోపమూ, ఎడిటర్‌ను పూర్తిగా అయోమయంలో

పడేశాయి.

ఎంతైనా చౌదరి అధికారంలో ఉన్నప్పుడు గ్రేట్ ఇండియా టైమ్స్ మరింత 'గ్రేట్' కావడానికి సహాయం చేసినవాడు. ఏ రాజకీయవాదీ ఎల్లప్పుడూ అధికారంలో ఉండదనీ, అలాగని ఎల్లప్పుడూ అధికారానికి దూరంగానూ ఉండదనీ నందికి తెలుసు. అదీగాక, ఇలాంటి కీలకమైన విషయాల్లో అంతిమనిర్ణయాధికారం సంపాదకునికుండదు. అతనిమీద ఓ యజమాని ఉంటాడు. సకాలంలో ఆ సంగతి గుర్తురావడంతో అతను కాస్త మెత్తబడ్డాడు. 'ఆలోచించుకో డానికి ఒక రోజు వ్యవధి కావాలని...' సన్నాయినొక్కుల్లా ఆగి ఆగి అన్నాడు. చౌదరి అలా కుదరదనేశాడు. తనంతటివాడు అందించిన భోగట్టాను ఇంకొకరితో ధృవీకరించుకోడమా? అలాంటి ధిక్కారాన్ని అతడెలా సహిస్తాడు? 'నేనేమైనా చిల్లరమనిషిననుకుంటున్నారా? నా విషయంలో ఇలాంటి ప్రవర్తనను సహించను. గుడ్‌నైట్ మిస్టర్ నందివర్ధన్!' . . . అతని పూర్తి పేరుతో సంబోధిస్తూ అనేసి తటాలున మౌనం వహించాడు. దానర్థం, లేదా తను సూచించాలనుకున్న అర్థం, తనకెంతో బాధ, కోపం కలిగాయని.

రాటుదేలిన ఈ రాజకీయవాది ముందు తాను చిత్తయిపోయాననుకున్నాడు నందివర్ధన్. ఇతడందించే వార్త కనుక నిజమైతే, దానిని మరో పత్రిక దొరకపుచ్చుకుంటే బ్రహ్మాండమైన రహస్యసమాచారం చేజారిపోతుంది ఒకవేళ అది అబద్ధమే అవుతుందనుకుందాం. అయితే మాత్రం? రోజూ వచ్చే అలాంటి వార్తల్లో అదీ ఒకటవుతుంది. అంతేగా? మెరుపు వేగంతో పరిస్థితిని పునరాలోచించుకుని ఈ రహస్యసమాచారం తన చేయిదాటి పోకూడదని నిర్ణ యించుకున్నాడు. 'ఓకే, నాకు సమ్మతమే. ఇప్పుడిక అసలు విషయానికి రండి,' అన్నాడు.

అధమపక్షం ఒక దశాబ్దకాలంపాటు గుర్తుండిపోయే రహస్యభోగట్టాగా దానిని మలచే ప్రయత్నంలోనే ఇద్దరూ ఆ రాత్రి చాలా భాగం గడిపేశారు. 'అసలీ ఆటంతా దేనికో ముందు మీకు చెప్పనీండి,' అంటూ చౌదరి ఎత్తుకున్నాడు. 'ఈ భూ పరిమితుల బిల్లును మీరు క్షుణ్ణంగా చదివారని నేననుకోను; దానిమీద పిడుగులు కురిపిస్తూ సంపాదకీయం రాస్తే రాయొచ్చుగాక, మీలాంటి బిజీ ఎడిటర్‌కు దానిని చదివే తీరికెక్కడుంటుంది? క్లుప్తంగా చెప్పాలంటే, ఏ భూస్వామికైనా ఒక పరిమితిని మించిన భూముంటే దానిని గుంజుకోడానికే ఈ చట్టం. దానికిచ్చే నష్టపరిహారం చాలా స్వల్పం, అసలుండనే ఉండదనుకోండి. ప్రస్తుతం ఆ బిల్లు మీద అసెంబ్లీలో చర్చ జరుగుతున్న సంగతి మీకు తెలుసు. అందులో అతి ముఖ్యమైన ఒక క్లాజుంది, అది ఆనంద్‌కు దండిగా డబ్బు దండుకునే అవకాశమిచ్చే క్లాజు. రాష్ట్రంలో భూ పరిమితి ఎంతుండాలనేది నిర్ణయించకోడానికి సంబంధించినది. మిగిలిన క్లాజులతో పాటు దాన్ని కూడా ఎప్పుడో నిశ్చయించి ఆమోదించి ఉండవలసింది. కాని అంత కనకవర్షం కురిపించేదాన్ని, పళ్ళరసం లోంచి చిట్టచివరి చుక్కను కూడా పిండుకో కుండా - అంటే చివరి రూపాయి వరకూ వడుక్కోకుండా - ఆనంద్ ఎలా ఆమోదించనిస్తాడు? దాంతో ఆ వ్యవహారం కాస్తా ఆరని మంటలా - కచ్చితంగా చెప్పాలంటే మంటలాకా దనుకోండి, కొమ్మను వ్రేలాడే మిగల పండిన పండులా వ్రేలాడుతోంది. అధిష్ఠానవర్గం వీళ్ళమీద పూర్తి నమ్మకంతో రెండు పంటల మాగాణి విషయంలో పరిమితి రేంజిని 10

నుంచి 20 ఎకరాల వరకు నిర్ణయించి వాస్తవ పరిమాణాన్ని నిర్ణయించుకునే అవకాశాన్ని శాసనసభలకే విడిచిపెట్టేసింది. ఇలా ఈ రేంజి రూపంలో పళ్ళరసం చేతికందడంతో ముఖ్యమంత్రి ఆనంద్ స్వయంగా భూస్వాములతో మంతనాలు ప్రారంభించాడు - అఫ్ కోర్స్ తన 'నెచ్చెలి' అరుణ ద్వారానే అనుకోండి ఈ రోజు ఉదయమే నాకు తెలిసిన సమాచారం ప్రకారం , 10-20 ఎకరాల రేంజి మధ్య ముడుపులు ఏ పరిమాణంలోనైనా ఉండచ్చు మన ఘనత వహించిన సోషలిస్టు ముఖ్యమంత్రి పాతికకోట్లకు ఒక్క రూపాయి కూడా తగ్గనని భీష్మించుకుని కూర్చున్నాడు. ఇది రాష్ట్రం కనీవినీ ఎరుగని అతి గొప్ప బేర సారాల ముచ్చట కాబోతోంది. అది కూడా ఒక సోషలిస్టుగా ముద్రపడిన, మూర్తీభవించిన పరిపూర్ణ నిజాయితీపరుడుగా పదిమందీ చెప్పుకునే ముఖ్యమంత్రి నుంచి. ఆపైన దీని ప్రభావాలూ, పర్యవసానాలూ లెక్కలేనన్ని ఉంటాయనుకోండి. ఇంత భారీ లావాదేవీల్లో అవెలాగూ ఉంటాయి. కనుక మైడియర్ నందీ, మీరేమీ అనుకోకపోతే, ఈ రుచికరమైన మేతను నెమరువేసుకుంటూ, దీనికింకా ఎలాంటి రంగులు, హంగులు దిద్దచ్చో ఆలోచించుకునే అవకాశమంతా మీకే వదిలేస్తాను. ఆ కళ గురించి గ్రేట్ ఇండియా టైమ్స్‌కు నేను మరీ వివరించి చెప్పక్కర్లేదుగా!'

'ఇంతకీ ఆనంద్ ఆ అంకెనెలా నిర్ణయిస్తాడంటారు? అంతిమంగా ఎక్కడ ఖరారు చేస్తాడు? అదికూడా ఏ ప్రమాణంలో?' నంది అడిగాడు

'అదిగో, మీరప్పుడే తొందరపడిపోతున్నారు. సరిగ్గా ఈ ఘట్టంలోనే గ్రేట్ ఇండియా టైమ్స్ తన వ్యాఖ్యలతో తను సృష్టించే గందరగోళంలో పనితనం చూపించాలి. ఊరికే కాస్తమంట ఎగదొయ్యండి, ఆ తర్వాత మొదలయ్యే వినోదాన్ని చూసి ఆనందించండి. నా పార్టీ వాళ్ళు చాలామంది తక్షణమే దీన్ని అందిపుచ్చుకుని దేశమంతటికీ ఎలా మోసేస్తారో మీరే చూద్దురుగాని. మా వాళ్ళలో చాలామంది ఆ పగటికలలగాణ్ణి ముక్కముక్కలుగా నరకడానికి ఇలాంటి అమూల్యమైన అవకాశం కోసమే ఎదురుచూస్తున్నారు. కొందరు బిల్లు మీద వ్యతిరేకతతో, చాలామంది తిమ్మిని బమ్మిని చేసైనా సరే ముఖ్యమంత్రి గద్దెను చేజిక్కించుకోవచ్చన్న ఆశతో! చూశారూ.... ఇంత జనాభా ఉన్నదేశంలో ఒకే మనిషి చాలాకాలం ముఖ్యమంత్రి పదవిలో ఉంటానంటే ఎలా సహిస్తాం? కనుక మిగిలినవాళ్ళు ఊరికే క్యూలో నిలబడ్డం కాదు, ఇప్పుడున్న వాణ్ణి బయటికి తోసెయ్యడానికి బ్రహ్మాండమైన తోపుడు బలాన్ని ప్రయోగిస్తూనే ఉంటారు. చూస్తుండండి, ఈ కుంభకోణం ప్రతిధ్వనులు పార్లమెంటు సెంట్రల్ హాల్‌ను మోతెక్కించేస్తాయి. ఈ సందట్లో, ఇప్పటిదాకా ఆమోదం పొందని భూ పరిమితి చట్టాలన్నీ వీలైనన్ని లొసుగులతో శరవేగంతో ఆమోదం పొందేస్తాయి. అడిగే వాడెవడూ ఉండడు. నెహ్రూ, ఇందిరాజీల స్ఫూర్తితో రూపొందిన ఈ అద్భుతమైన చట్టం ఇలా అతుకుల బొంతగా తయారవడానికి బాధ్యుడుగా, అవినీతిపరుడైన ముఖ్య మంత్రిగా, ఆనంద్‌ను అందరూ తిట్టిపోస్తారు!'

వృత్తిలో తలపండిన గ్రేట్ ఇండియా టైమ్స్ సంపాదకుడు కూడా ఈ భయానకచిత్రాన్ని జీర్ణించుకోలేకపోయాడు.. 'క్షమించండి చౌదరిగారూ... ఇది కాస్త శ్రుతిమించిన ఊహాగానంగా

కనిపిస్తోంది,' అన్నాడు హెచ్చరికగా. 'నా ఉద్దేశం, ఆనంద్‌ను అవినీతిపరుడంటే ఎవరూ నమ్మరు, అందులోనూ ఈ చట్టానికి సంబంధించి... మనం ఎలాంటి కథ అల్లుతామన్నది వేరే విషయం. కానీ దానిని నమ్మేవారెవరూ ఉండరనే సంగతి మనం దృష్టిలో పెట్టుకోవాలి...'

'ఆ విషయం పాఠకులకొదిలేయండి నందిగారూ,' చౌదరి అన్నాడు 'ఆ తర్వాత మా పార్టీకొదిలేయండి. మా పార్టీ గురించి మీకన్నా నాకు బాగా తెలుసునని మీరు ఒప్పుకోవాలి అదీగాక, ఒక రాజకీయనాయకుడి గురించి జనంలో సాధారణంగా ఉండే ఇమేజ్‌ను కూడా దృష్టిలో ఉంచుకుని మీరు నిశ్చింతగా ఉండచ్చు. అలాగే, ఉన్నతస్థానాల్లో అవినీతి గురించిన ప్రతి కథనూ నమ్మేసే మన నిజాయితీపరులైన ప్రజల్ని కూడా. ఇలాంటి విషయాల్లో నాకు టన్నులకొద్దీ అనుభవం ఉంది. మిగతావన్నీ వదిలేసి మీరు కనీసం నన్ను నమ్మితే చాలు నే చెబుతున్నాగా - తన లావాదేవీల్లో బిజీగా ఉన్న ఆనంద్ తనవెనుక జరుగుతున్న ఈ చక్కని, చెక్కుచెదరని, పన్నాగాన్ని చచ్చినా కనిపెట్టలేడు. దీంతో అతగాడి కల చెదిరిపో తుంది– దాంతోనే అతని నిద్ర కూడా, నాదీ హామీ!'

ఈ విధ్వంసానికంతకీ తన పత్రిక తెరతీయబోతుందా? ఎంత నమ్మశక్యం కాకుండా ఉంది! చౌదరి దగ్గరసెలవు తీసుకుంటూ, గ్రేట్ ఇండియా టైమ్స్ సంపాదకుడు ఇలా కొంత అయిష్టంగానే అనుకున్నాడు. ఇంటికి తిరిగి వెడుతున్నప్పుడు ఏవేవో కలగాపులగపు ఆలోచనలు అతణ్ణి ముసురుకున్నాయి. అతనిలో ఇంకా రేఖామాత్రంగానైనా ఉన్న సుప్తసంస్కారం కాస్సేపు తీవ్ర అశాంతిని రేకెత్తించింది. ఇంట్లోకి అడుగుపెడుతూనే నేరుగా తన ఒకే ఒక్క కొడుకు గదిలోకి వెళ్ళాడు. అక్కడ స్పాస్టిక్ రోగంతో మంచం పట్టి క్షీణించిపోయిన కొడుకు రక రకాల జంతువుల ధ్వనులు చేస్తూ ఎవరికీ అర్థంకాని భాషలో నిస్సహాయంగా మూలుగుతు న్నాడు. తల్లి కస్తూరి మూర్తీభవించిన విషాదంలా అతని మంచం ప్రక్కనే కూర్చుని అతనేం చెబుతున్నాడో తెలుసుకునేందుకు విఫలయత్నం చేస్తోంది. నంది అశ్రువులతో నిండిన ఆమె కళ్ళలోకి చూశాడు. అతడు చూసిన క్షణమే ఆమె కళ్ళనుంచి అశ్రువులు జలజలా రాలాయి. పది నిమిషాల క్రితం తను చూసిన చౌదరి కుట్ర నిండిన రూపాన్నీ, ఆ క్షణంలో తన ఎదురుగా నిలిచిఉన్న కస్తూరి దయనీయరూపాన్నీ పోల్చి చూసుకుని ఆపాదమస్తకం చలించిపోయాడు. దగ్గర్లో ఉన్న ఒక ఈజీచైర్లో కూలబడిపోయి రెండు చేతుల్లో ముఖం దాచుకున్నాడు. చాలాసేపు అలాగే ఉండిపోయాడు. అప్పుడతను అనుభవిస్తున్నంత దుఃఖాన్ని చరిత్రలో ఏ బానిసా అనుభవించి ఉండడు.

కొన్ని నిమిషాలకు కస్తూరి ఎక్కిళ్ళు తగ్గుముఖం పట్టాయి. వాటి స్థానంలో నిస్సహాయ క్రోధం కట్టలు తెంచుకుంది. 'ఇన్ని శాపాలు తగిలినా మీకింకా బుద్ధి రాలేదు.. మీ పత్రిక ద్వారా లక్షలాది నిరుపేదల ఉసురుపోసుకుంటున్నారు. చెబుతూనే ఉన్నాను... వినిపించు కుంటేగా... నాకు తెలుసు, ఎప్పుడు వినిపించుకున్నారు కనుక!' ఆమె నిశ్శబ్దంగా ఏడుస్తూ ఉండిపోయింది.

నందివర్ధన్ ఆమె నోట ఆ మాట వినడం నూరోసారి. అయినా ఏమిటుపయోగం? నిజమే, భూమి లేని నిరుపేదవర్గాలపై తను శత్రుత్వం వహించడానికి ఎలాంటి కారణమూ లేదు.

అదంతా గ్రేట్ ఇండియా టైమ్స్ యజమాని చంపాలాల్ అగర్వాల్ నిర్వాకం. బడా భూస్వామి అయిన బలరాం మామ ద్వారా అతడు భూస్వాముల లాబీకి చాలా సన్నిహితమిత్రుడు. పలుకుబడి రీత్యా చెప్పుకోవాలంటే అదెలాంటిదైనా కానీ, అతడు అఫ్రోజాబాద్ రేస్ కోర్స్ క్లబ్‌కు సెక్రటరీ కూడా... కస్తూరి దేవతల శాపానికి భయపడుతుంటే, నందివర్ధన్ ధుమ ధుమలాడే అగర్వాల్ వికృతముఖాన్ని తలచుకుని వణికిపోతున్నాడు. మొత్తానికి అదీ ఇదీ కూడా ఆ కుర్రాణ్ణి ఆదుకోలేకపోయాయి.

★ ★ ★

ఓ పక్క శాసనసభలో భూ పరిమితుల బిల్లు పరిశీలన జరుగుతుండగానే మరో పక్క రాష్ట్రంలో భూసారం రీత్యా భూమిలో ఉన్న తేడాల గురించి, దిగుబడి తారతమ్యాలతోసహా తదితర విషయాల గురించి, సవివరంగా అధ్యయనం చేసి తగిన సిఫార్సులు చేయడానికి న్యాయశాఖకు చెందిన నాగరాజ్ మెంబర్ సెక్రటరీగా సెటిల్మెంట్‌శాఖలోని నిపుణులతో ఆనంద్ ఓ చిన్న కమిటీని నియమించాడు ఆ అధ్యయనం సకాలంలో పూర్తయి అప్పు డప్పుడే సిఫార్సులను రూపొందించడం జరిగింది.

ఎంతో శ్రమతో కూడిన ఆ పని గురించీ, నాగరాజ్ కమిటీ ఎంతో దీక్షగా అందులో మునిగి తేలుతుండటం గురించీ, చౌదరికంతా తెలుసు. నాగరాజ్ అతనికి వ్యక్తిగతంగా కూడా తెలిసినవాడే. తను ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు చాలాసార్లు అతనిపై స్వారీచేశాడు. అతని సామర్థ్యాన్నీ, రుజుత్వాన్నీ ప్రశంసించిన సందర్భాలూ ఉన్నాయి అయితే నాగరాజ్ ఎంత మంచివాడైనా, చౌదరి రాజకీయ పన్నాగంలో అతని లెక్కా వాతా ఏముంటుంది? ఇందిరా గాంధీ గారాల సోషలిస్టు బిడ్డను పతనం చేయడం ద్వారా ఆమెను బలహీనపరచి ఆమెకు గుణపాఠం నేర్పాలన్న తన ప్రయత్నంలో చౌదరికి రెండో ఆలోచన ఎందుకుం టుంది?... 'ఎప్పుడనుకుంటే అప్పుడు చౌదరిని తొలగించడం ఆమెగారికి తేలికే కావచ్చు. కానీ ఆ స్థానంలో అంతే కుదురైన మనిషిని తీసుకురావడమంటే పిల్లలాట కాదని ఆమె తెలుసుకోవాలి', అనుకున్నాడు హేళనగా.

గ్రేట్ ఇండియా టైమ్స్ ఎడిటర్‌ను ఆరోజు సాయంత్రం మరోసారి డిన్నర్‌కు ఆహ్వానించాడు. 'వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లు కాలం భలే కలిసొచ్చిందిలే!' అన్నాడు ఉప్పొంగిపోతూ. అంతా యాదృచ్ఛికంగా జరిగినదానికి ఎవరిని అభినందించాలో అతనికి అర్థం కాలేదు. భూ పరిమితి నిర్ణయంలో కొనసాగుతున్న అనిశ్చితి, అతని విజయోత్సాహాన్ని ద్విగుణీకృతం చేసింది. ఆనంద్ ప్రభుత్వాన్ని పడగొట్టడానికి తను ఆడుతున్న ఆటను ఇంత బాగా పండిస్తున్న ఘనత ఆ భగవంతునిదేననిపించి ఆయనకు హృదయపూర్వక కృతజ్ఞతలు చెప్పుకోవాలని పించింది. 'ఎడిటర్జీ, మీరు రాయబోయే దాన్లో నాగరాజ్ కమిటీని కూడా యధాలాపంగా ప్రస్తావించి, నిపుణులు రూపొందించిన ఆ కమిటీ నివేదిక ఆధారంగా మన సోషలిస్టు ముఖ్య మంత్రి పది-ఇరవై ఎకరాల పరిమితి మధ్య ఏ అంకెనైనా నిర్ణయించవచ్చంటూ కాస్త సస్పెన్స్‌ను కూడా జోడించచ్చు. వాస్తవంగా కమిటీ సిఫార్సేమిటన్నది పట్టించుకోకండి. బాస్‌కు కావల

సిన సందు కల్పించి అతణ్ణి క్లీన్‌గా చూపించడం వరకే ఇలాంటి కమిటీల వల్ల ఉపయోగం..' అన్నాడు.

★ ★ ★

నాగరాజ్ సచివాలయంలో ముఖ్యమంత్రి కార్యాలయం వద్ద ఎదురుతెన్నులుచూస్తూ నిలబడ్డాడు. ముఖ్యమంత్రిని అత్యవసరంగా కలవాలని వచ్చాడతను. ఎవరెవరో సందర్శకులు ప్రవాహంలా వచ్చి బాస్‌ని కలిసి వెడుతుండగా, తనవంతు కోసం ఎదురుచూస్తూ, ఎంతో శ్రమతో కూడినా మొత్తం మీద విజయవంతంగా పూర్తి చేసిన కమిటీ కార్యభారాన్ని మనసు లోనే సమీక్షించుకున్నాడు. ఆనంద్‌కు ఇవ్వడానికి కమిటీ నివేదిక తొలి అధికారిక ప్రతిని కూడా తనతో తీసుకొచ్చాడు. వెనకటి సెటిల్మెంట్ రికార్డుల మీదా, ఇతర రాష్ట్రాలకు చెందిన తులనాత్మక సంఖ్యల మీదా ఆధారపడి రాష్ట్రంలోని వివిధ జిల్లాల్లో ఉన్న భూముల సారవంత తను అధ్యయనం చేయడం నిజంగా ఎంత కత్తిమీద సామో 'అతనికర్థమైంది. కొన్ని ఇతర రాష్ట్రాలలోని ప్రాంతాలు రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ వరకూ అఫ్రోజాబాద్‌లో భాగంగా ఉండి తరువాత వేరుపడ్డాయి. అనేక రాష్ట్రాల్లో చాలాకాలంపాటు తాజాగా అధ్యయనం జరగలేదు. భూముల సారవంతతను నిర్ణయించడానికి అనుసరించే ప్రమాణాలు వివిధ రాష్ట్రాల్లో వివిధంగా ఉంటూ వచ్చాయి. బ్రిటిష్ ఇండియాలో కూడా వేర్వేరు ప్రమాణాలు అమల్లో ఉండేవి. చారిత్రక కారణాల వల్ల, ఇతర కారణాల వల్ల వాళ్ళ సెటిల్మెంట్ చర్యల నేపథ్యం వేర్వేరుగా ఉండ డంతో ప్రెసిడెన్సీ నుంచిప్రెసిడెన్సీకి ప్రమాణాలు మారుతూ ఉండేవి ఉదాహరణకు ప్రెసిడెన్సీ -ఎ లో గవర్నర్ లార్డ్ ఎక్స్‌గారు పద్దెనిమిదో శతాబ్ది ప్రారంభంలోనే సెటిల్మెంట్ చర్యలు చేపట్టగా, ప్రెసిడెన్సీ-బిలో గవర్నర్ లార్డ్ వై గారు కొన్ని కులాల గురించి, వారి ఆచారాల గురించి, ముఖ్యంగా స్త్రీ పురుష సంబంధాల్లో వాళ్ళ స్వేచ్ఛాప్రవృత్తి గురించి పూస గుచ్చినట్టు వర్ణిస్తూ జిల్లా గెజిటీర్లను వెలువరించడం మీదే ఎక్కువ ఆసక్తి చూపించారు. (తన ఈ ఆసక్తిని ఆయన పూర్తిగా అకడెమిక్‌గాను, ఆంత్రొపొలాజికల్‌గానూ అభివర్ణించుకు న్నారు కానీ, లేడీ వై మాత్రం దాన్ని మరోలా భావించి విడాకులకు అల్టిమేటమ్ ఇచ్చే వరకూ వ్యవహారం వెళ్ళింది.) మొత్తంమీద దీనివల్ల వివిధరాష్ట్రాల్లో సెటిల్మెంట్ చరిత్రలలో వ్యత్యాసాలు చోటు చేసుకున్నాయి.

నాగరాజ్ ఇలాంటి ఆలోచనల్లో మునిగి తేలుతుండగానే ఆనంద్‌నుంచి అతనికి పిలు పొచ్చింది. కమిటీ పనిని నాగరాజ్ ఆనంద్‌కు క్లుప్తంగా నివేదించాడు. కమిటీ సిఫార్సులు పొందుపరచిన ఫైలు అంతిమ పరిష్కారానికీ, ఉత్తర్వులకూ సాయంత్రానికల్లా మీ టేబుల్ మీద ఉంటుందని చెప్పాడు. ఆ తర్వాత తన బ్రీఫ్ కేసులోంచి కమిటీ భారీ నివేదిక ప్రతిని బయటికి తీసి ఆనంద్ పరిశీలనకు ఇవ్వబోయాడు. ఆనంద్ క్షణకాలం ఆలోచించి, 'నేను ఢిల్లీ నుంచి తిరిగొచ్చే వరకు దానినలా ఉంచు నాగరాజ్. ఈ రెండ్రోజుల్లో నేను దానినెలాగూ చూసే అవకాశం లేదు,' అన్నాడు. నివేదికలోని కీలకమైన విషయాలను వివరించే సన్నాహంలో వచ్చిన నాగరాజ్, కాస్త నిరాశ చెందాడు. అయినా ఆనంద్ ఆదేశాన్ని శిరసావహిస్తూ వెళ్ళి పోయాడు.

ఇది జరిగిన కొన్ని గంటల్లోనే, శేఖర్ తీవ్ర నిరాశా నిస్పృహలతో ఆ సాయంత్రం చౌదరిని కలిసి, సచివాలయవర్గాలనుంచి ఇదివరలో తమకు రూఢిగా తెలిసిన సమాచారానికి భిన్నంగా, నాగరాజ్ కమిటీ నివేదిక ఫైలు ఆ రోజు రాత్రికి ఆనంద్‌కు చేరబోవడం లేదని చెప్పాడు. మరునాటి ఉదయం తను ఢిల్లీకి బయలుదేరి వెళ్ళేముందు ఆనంద్ కచ్చితంగా ఆ ఫైలు మీద భూ పరిమితి అంకె వేస్తాడని కూడా వాళ్ళనుకున్నారు. తమనుకున్నది జరిగితే, ఆనంద్ ఢిల్లీలో, ఇందిరాగాంధీ చెప్పులు నాకుతుండగానే తామిక్కడ గ్రేట్ ఇండియా టైమ్స్ ద్వారా అతణ్ణి రాజకీయంగా భూస్థాపితం చేసే పెద్ద బాంబ్ పేల్చి ఉండేవారమని- తన లోని ద్వేషాన్నంతనీ కుమ్మరించుకుంటూ అన్నాడు శేఖర్.

ఆనంద్ తీసుకున్న నిర్ణయంతో వచ్చిన మార్పు సరికొత్త చిక్కుముడిలా, ఊహించని ఎత్తుగడలా పరిణమించడంతో చౌదరీ, శేఖర్‌లు దీనికి విరుగుడు కనిపెట్టడానికి మొత్తం వ్యవహారాన్ని తాజాగా విశ్లేషిస్తూ అర్ధరాత్రి వరకూ గడిపారు.

శేఖర్ ఆ రాత్రంతా ఏవో పన్నాగాలూ, పథకాలూ ఆలోచిస్తూ మేలుకునే గడిపాడు. భళ్ళున తెల్లవారింది కానీ అతనికి పనికొచ్చే ఉపాయమేదీ తట్టలేదు. ఏదేమైనా ఈ క్షణాన ఆనంద్‌కు రక్షణదుర్గంలా ఉన్న అఫ్రోజాబాద్‌లో ఉండి చేయగలిగిందేమీ లేదు. అన్ని కుతంత్రాలకూ కేంద్రస్థానమైన ఢిల్లీకి వెళ్ళి చౌదరీ తనూ కలసి పాచికలు నడిపించి ఏదో ఒకటి జరిగేలా చూడడమొక్కటే మార్గాంతరమన్న నిర్ణయానికొచ్చాడు. దుస్తులు వేసు కుంటుంటడగా మరో అద్భుతమైన ఆలోచన తట్టిందతనికి. ఆనంద్‌కు వ్యతిరేకయుద్ధంలోకి మహేంద్రనాథ్‌ను కూడా పూర్తిగా లాగచ్చు. చౌదరిని మహేంద్రనాథ్ విపరీతంగా ద్వేషిస్తూ, రాజకీయంగా అతణ్ణి అంతమొందించడంలోనే ఆనందాన్ని జుర్రుకోవచ్చు, అది నిజమే. అయితే ఆనంద్ రూపంలో ఇప్పుడో సరికొత్త విపత్తు ఆ ఇద్దరికీ గ్రహణం పట్టించే పరిస్థితి దాపురించింది. ఇందిరాగాంధీ అనబడే ఆ చారిత్రకమూర్తి అండదండలతో కనీసం మరో ఇరవైయేళ్ళపాటు అఫ్రోజాబాద్ గద్దెను ఆ మూడో మనిషి చేజిక్కించుకోవడం చౌదరి కెంత ఇష్టముండదో మహేంద్రనాథ్‌కూ అంతే ఇష్టముండదు. కనుక ఉమ్మడిలక్ష్యం కోసం మహేంద్రనాథ్ చౌదరితో చేయికలపడానికి కచ్చితంగా సందేహించడనుకున్నాడు శేఖర్. అయితే పరస్పర శత్రుత్వం రీత్యా ప్రత్యక్షంగా ఉభయులూ చేయికలపకపోవచ్చు, సూత్రధారిగా తెరవెనుక ఉండి పావులు కదపడంలో సిద్ధహస్తుడయిన తన ద్వారా అది జరగవచ్చు నను కున్నాడు.

ఈ లోపల శేఖర్‌కు మరిన్ని విద్యుదాఘాతాలు కాచుకుని ఉన్నాయి. ఆనంద్ తనకు అందుబాటులో ఉన్న శాసనయంత్రాంగాన్ని వినియోగించుకుని ఒక పద్ధతి ప్రకారం అడుగేస్తూ అడుగడుగునా తన ప్రత్యర్థులను చిత్తు చేశాడు. యధాలాపంగా గ్రేట్ ఇండియా టైమ్స్ పత్రికను చేతుల్లోకి తీసుకున్న శేఖర్, అఫ్రోజాబాద్ రాష్ట్ర ప్రభుత్వం జారీచేసిన క్రింది ప్రకటన చూసి కుప్పకూలిపోయాడు.

అగ్రోజాబాద్ రాష్ట్రప్రభుత్వము

(భూసంస్కరణల శాఖ)

రాష్ట్రప్రభుత్వం ఇటీవల నిర్వహించిన సర్వేలో మిగులు భూములున్నవారుగా నిర్ణయించబడిన వ్యక్తుల అధీనంలో ఏ పరిమాణంలో మిగులుభూమి ఉందో నికరంగా లెక్కించడానికి వీలుగా నిర్ణీత పరిమాణంలోనూ, అంతకంటె ఎక్కువగానూ ఉన్న భూములను గ్రామాల వారీగా తనిఖీ చేసే కార్యక్రమాన్ని చేపట్టడానికి, ఏదైనా భారతీయవిశ్వవిద్యాలయానికి చెందిన గ్రాడ్యుయేట్లనుంచి, డబుల్ గ్రాడ్యుయేట్లనుంచి దరఖాస్తులు కోరబడుతున్నవి. స్వచ్ఛందంగా ఈ కార్యనిర్వహణకు ముందుకొచ్చే వారిని తగు సంఖ్యలో (త్వరలోనే ఇందుకు సంబంధించిన వివరాలను నోటిఫై చేయడమవుతుంది) బృందాలుగా రూపొందించి రాష్ట్రప్రభుత్వపు ఏర్పాట్లలో భాగంగా ఆయా గ్రామాలను సందర్శింపజేయడం జరుగుతుంది. ప్రతి జిల్లాలోను జిల్లా కలెక్టర్, మరి కొందరు సీనియర్ అధికారులు ఈ కార్యక్రమానికి బాధ్యులుగా వ్యవహరిస్తారు. స్వచ్ఛందకార్యకర్తలు వారి సొంత జిల్లాలో కాకుండ, వేరొక జిల్లాకు వెళ్ళి పనిచేయడానికి సమస్త వసతులు కల్పించడం జరుగుతుంది. భూ పరిమితుల చట్టాన్ని అత్యవసరంగా అమలు చేయవలసిన ఆవశ్యకత దృష్ట్యా ఈ మొత్తం కార్యక్రమం వీలైనంత తక్కువ గడువులో పూర్తి కావలసి ఉంటుంది. ఇది స్వచ్ఛంద కార్యక్రమం కనుక ఎటువంటి ప్రతిఫలం చెల్లించబడదు. పైన పేర్కొన్న తనిఖీ కార్యక్రమంలో పాల్గొన్న ప్రతి ఒకరికీ రాష్ట్ర ప్రభుత్వం సాంఘికసేవా సర్టిఫికెట్లను ప్రదానం చేస్తుంది. తమ సంసిద్ధతను తెలియజేస్తూ దరఖాస్తులను డిప్యూటీ సెక్రటరీ, భూసంస్కరణల శాఖ (సీలింగ్స్)కు — తేదీవరకు పంపుకోవాలి...

డెప్యూటీ సెక్రెటరీ,

రెవెన్యూ శాఖ (భూసంస్కరణ సెక్షన్.)

ఈ ప్రకటన చదువుతున్న శేఖర్‌లో అల్పాహారపు ఆకలేకాదు, మానసిక సమస్థితి కూడా మాయమైపోయింది. అంతలో ఫోన్ మోగింది. అవతల చౌదరి. 'శేఖర్, పత్రికల్లో మరో బాంబు పేలింది, నువ్వు చూసే ఉంటావ్,' అన్నాడు గంభీరంగా.

'చూడకేం, చూశాను,' ఆగ్రహాన్ని అతికష్టంమీద అణచుకుంటూ శేఖర్ అన్నాడు. 'చౌదరి గారూ, ఇదెంత పిడుగుపాటులాంటి పరిణామమంటే, ఇప్పుడే ఓ భూస్వామి మిత్రుడు ఫోన్ చేసి తనకు నక్సలైట్లను దగ్గరకు తీయాలనిపిస్తోందన్నాడు. అతనికి మరో మార్గమేదీ కనిపించటం లేదట... నిండా మునుగుతున్న భూస్వాములకు చట్టాలు, రాజ్యాంగం ఎటువంటి ఆశాభావాన్ని కలిగించలేకపోతున్న స్థితిలో, మనలోమనమాటగా చెప్పాలంటే, నాకూ మరో మార్గం కనిపించడం లేదు, అయితే ఈ మాట నేను ఇల్లెక్కి అనబోవడం లేదనుకోండి. నిజం చెప్పాలంటే, ప్రజాస్వామికప్రక్రియలో వేరే బలహీనతలేవైనా ఉండనీండి, అందులో పట్టువిడుపుల ధోరణనే

ఒక సుగుణం, సమాజంలోని అవాంఛనీయవ్యక్తుల విషయంలోనైనా సరే ఒక మానవత్వ వైఖరి ఉంటాయి. సమూలంగా మట్టుబెట్టడాన్నికాక, సంస్కరణనే అది విశ్వసిస్తుంది. భూస్వామ్యనేపథ్యంలో పెరిగినవాడిగా, ప్రజాస్వామ్యాన్ని, భూస్వామ్యవ్యవస్థకు భిన్నంగా చూపించేది ఈ సుగుణమేనని నేననుకుంటాను. కానీ ఆనంద్ ఇప్పుడు ప్రజాస్వామిక శాసనప్రక్రియను ఒక దౌర్జన్యపూరితమైన అణచివేతగా మార్చేశాడు... దీనివల్ల గాయపడ్డ మనిషి, ఇందుకు వ్యతిరేకంగా తుపాకి పట్టుకోడం మినహా ఇంకేం చేయగలడు?'

'ప్రజాస్వామ్యం కచ్చితంగా పనిచేస్తే దానికి వ్యతిరేకంగా హింసను రెచ్చగొట్టడానికి నువ్వో కొత్త సిద్ధాంతాన్ని కనిపెట్టినట్టున్నావే', చౌదరి గట్టిగా నవ్వేస్తూ అన్నాడు. తనేదైనా కీలకవిషయాన్ని చెప్పబోయేముందు దానికి హాస్యాన్ని మేళవించడం అతని అలవాటు. 'పైగా మెతకదనమే ప్రజాస్వామ్యపు ఏకైక సుగుణమని కూడా నువ్వు ఉద్ఘాటిస్తున్నావు. అయినా నీకు గట్టిగా ఓ మాట చెబుతా, విను. ఈ భూస్వాముల వల్లో పడకు. వాళ్ళు తమ నిరాశానిస్పృహల్నే బయటపెట్టుకుంటున్నారు. ఆ మాటకొస్తే వాళ్ళే వ్యవస్థనూ లెక్కచేయరు. వాళ్ళకు కావలసిందల్లా తమ తక్షణలాభాలు... ఇక మన రాజకీయవాదుల విషయమంటావా, మనకు వ్యవస్థే చాలా ముఖ్యం. ఎందుకంటే, మంచైనా, చెడైనా మనం వ్యవస్థ ద్వారానే చేయాలి. మధ్య మధ్య మనం కూడా దాన్ని భ్రష్టు పట్టిస్తూ ఉంటామనుకో, అది వేరే విషయం, అలాగని దాన్ని పూర్తిగా తన్ని తగెలయ్యలేం...'

మరో వారంరోజులకు పత్రికలు ప్రముఖంగా ప్రచురించిన ఒక వార్త ప్రకారం, రాష్ట్రప్ర భుత్వం ప్రకటించిన పథకానికి స్పందిస్తూ తొమ్మిదివేల దరఖాస్తులు వచ్చాయి. త్వరలో రాష్ట్రవ్యాప్తంగా ప్రారంభం కాబోయే భూమికమతాల తనిఖీ కార్యక్రమంలో సేవలు అందించ డానికి అత్యున్నత విద్యావంతులూ, ఆదర్శబద్ధులూ అయిన యువతీయువకులు ఇంత పెద్ద సంఖ్యలో ఉత్సాహంతో ముందుకు రావడంతో ఇకమీద ఎవరైనా తమ మిగులుభూమిని ప్రభుత్వం కంటబడకుండా దాచడం అసాధ్యమని అందరికీ తెలిసిపోయింది.

శేఖర్ దీంతో పూర్తిగా నీరుగారిపోయాడు. సెంటు భూమి కూడా లేని రాజకీయవాదిగా ఇంతకాలం తను భూస్వామ్యవర్గాన్ని మనసారా ద్వేషిస్తూ వచ్చాడు. ఆ నేపథ్యంలో ఇప్పుడు ఆనంద్ అత్యద్భుత రీతిలో తెరతీసిన ఈ శాసనపరమైన మహాక్రమణ ('కూ') వాస్తవంగా తన బుద్ధిలోనే ఊపిరిపోసుకుని ఉండవలసిందన్న ఆలోచన అతణ్ణి చిత్రవధ చేస్తోంది. అయితే చివరకు అతడి ఆ వక్రబుద్ధే అతణ్ణి వ్యక్తిగత ప్రతీకారేచ్ఛవైపు తప్పుదారి పట్టించి అంతిమంగా కొండచిలువలా చుట్టేసింది. చౌదరీ, శేఖర్‌లు ఇరువురూ అయోమయావస్థలో పడిపోయారు ఇద్దరూ ఆనంద్‌కు వ్యతిరేకంగా అడవిమృగాల్లా పోరాడినవారే. కాని ఇద్దరూ రాజకీయవాదులుగా తమ అంతరాంతరాల్లో భూపరిమితి కార్యక్రమానికి తామే రూపకర్తలం కాలేకపోయామే అనుకుంటూ కుమిలిపోతున్నవారే. మధ్యలో వీడెవడు, ఈ ఆనంద్‌గాడు? అని నిలదీయడమే వాళ్ళ ఉద్దేశంలా కనిపించింది.

'ఇప్పుడు నన్నేం చేయమంటారు?' విపరీతమైన నిస్పృహతో చౌదరిని అడిగాడు శేఖర్.

'ఏముంది, ఆ కాంబినేషన్‌ను విడగొట్టడమే, ఇంతలోనే మరచిపోయావా?' చౌదరి ఎంతో ప్రశాంతంగా, సాలోచనగా అన్నాడు.

# 57

ఆనంద్ ఎయిర్‌పోర్టుకు బయలుదేరాడు. కారు ఎక్కబోతుండగా ప్రైవేట్ సెక్రటరీ వగర్చు కుంటూ వచ్చాడు. 'డిజిపి నుంచి కాల్‌సార్, చాలా అర్జంటంటున్నారు.'

ఆనంద్ ఫుట్‌బోర్డు మీంచి అడుగు వెనక్కు తీసుకుని వరండాలోకి తిరిగొచ్చాడు. ఈలోపల పి.ఎస్. ఫోన్ తెచ్చి రిసీవర్ అందించాడు 'యెస్, మీనన్, ఏమిటి సంగతి?' ఆనంద్ అడిగాడు.

'మీ కమ్యూనిస్టు మిత్రులు సార్. రహీంనగర్ తాలూకాలో భూస్వాముల భూముల్ని దౌర్జన్యంగా ఆక్రమించుకోమని భూమిలేని పేదల్ని గత మూడురోజులుగా రెచ్చగొడుతూ నానా బీభత్సం చేస్తున్నారు. త్వరలో మీరు తీసుకురాబోయే చట్టం పుణ్యమా అని ఎలాగూ ఆ భూముల్ని వాళ్ళకే పంచిపెడతారు కనుక వాటినిప్పుడే ఆక్రమించుకోడంలో తప్పు లేదని స్థానిక నాయకులంటున్నారు ఇందులో విచిత్రం ఏమిటంటే, జనాలు మొదట 'ముఖ్యమంత్రి ఆనంద్ జిందాబాద్! భూ పరిమితి చట్టానికి జై!' అంటూ నినాదాలు చేసి ఆ తర్వాత భూముల ఆక్రమణకు వెడుతున్నారు. వింతగా ఉంది సార్, అనుకోని వైపునుంచి మీకు కితాబులు!' డిజి అన్నాడు.

'ఈ విషయాన్ని తక్షణం పరిశీలిస్తాను,' ఆనంద్ ముసిముసి నవ్వులు నవ్వుతూ అన్నాడు. 'మీకు నా ఆదేశం ఏమిటంటే, మీ జిల్లా స్థాయి అధికారిని, ముఖ్యమంత్రికి అనుకూలంగా చేస్తున్న నినాదాలవల్ల మోసపోవద్దని చెప్పండి. అఫ్రోజాబాద్‌లో చట్టవిరుద్ధంగా ఆక్రమించు కున్న ప్రతిచోటుకీ, కట్టిన ప్రతి కాలనీకీ, మహాత్మాగాంధీ పేరో, కనీసం జవహర్‌లాల్ నెహ్రూ పేరో పెడతారని మీకు తెలుసుననుకుంటాను. ఈ క్షణంలో అమలులో ఉన్న చట్టం ప్రకారం చర్యతీసుకోండి. చట్టాలను సక్రమంగా అమలు చేయడం మీదే తప్ప మనకిలాంటి గిమ్మిక్కుల మీద నమ్మకం లేదు. ఆరునెలల తర్వాత కొత్త చట్టం అమల్లోకి వచ్చాక, ఇప్పుడాక్రమించు కున్న వాళ్లకే ఆ భూమి దక్కితే దక్కనివ్వండి, అది వేరు. అయితే ప్రస్తుతానికదంతా బూకరింపే. నిబంధనలు అమల్లోకి వచ్చాక వాస్తవంగా ఎవరు లబ్ధిదారులవుతారో ఇప్పుడే ఎవరూ కచ్చితంగా చెప్పలేరు. అప్పుడు కూడా వాళ్ళకే ఆ భూమి దక్కితే నేను స్వయంగా

వెళ్ళి పట్టాలిచ్చి అభినందించివస్తాను. వీలైతే ఆమేరకు ఎయిర్‌పోర్ట్ నుంచే శాసనసభలోని కమ్యూనిస్టు పార్టీ నాయకుడికి మాటిచ్చి వెడతాను. వీలుకాకపోతే ఢిల్లీలో అడుగుపెట్టిన తక్షణమే మాట్లాడతాను. ఈలోపల నా తరపున ఈ సంగతి ఆయనకు చెప్పండి... ఈపాటికే నేను దారిలో ఉండాలి. గుడ్ డే అండ్ గుడ్‌లక్!'

ఇది జరిగిన కాస్సేపటికే రాష్ట్రప్రభుత్వం మీద, ప్రత్యేకించి ముఖ్యమంత్రి మీద తీవ్ర విమర్శలు గుప్పిస్తూ ప్రకటనలు జారీ అయ్యాయి. మరునాటి-ఉదయం పత్రికల్లో అవి ఏకంగా 72 పాయింటు హెడ్‌లైన్ శీర్షికతో దర్శనమిచ్చాయి. భూపరిమితులకు ఏకైక శత్రువు ముఖ్యమంత్రి ఆనందేనని చిత్రిస్తున్నట్టే అవి కనిపించాయి. ఆనంద్‌కు వ్యతిరేకంగా నిరసన తెలపడానికి అన్ని ప్రతిపక్షాలతో ఒక పెద్ద బహిరంగసభ కూడా జరిగింది. ప్రతిపార్టీ భిన్న భిన్న పదజాలంతో అతనిపై తిట్లు కురిపించింది. అయితే సంయుక్త తీర్మానంలో అతణ్ణి తిట్టడానికి ఏ పదజాలం ఉపయోగించాలన్న విషయంలోనే వాటి మధ్య తీవ్రఅభిప్రాయభేదాలు తలెత్తాయి. కమ్యూనిస్టు నాయకుడు 'అభివృద్ధి నిరోధకు'డన్న మాటను సూచించగా, జన సంఘ్‌కు అలాంటి పదజాలం రుచించలేదు. చివరకు, 'నియంతృత్వవాది' అనే మాట దగ్గర అందరూ రాజీపడ్డారు. అది నిజానికి ఇందిరాగాంధీని గురించి ఇదివరకే బాగా ప్రచారం లోకి వచ్చిన విశేషణం.

ఢిల్లీలో అడుగుపెట్టగానే ఆనంద్ ఎవరినీ కలుసుకోలేదు. ప్రధానమంత్రితో తనకు అపాయింట్ మెంట్ తీసుకోమని రెసిడెంట్ కమీషనర్‌ను ఆదేశించాడు. ఈ లోపల ఉన్న గందరగోళానికి కొత్తది జోడించడం అతనికిష్టంలేదు. ఢిల్లీలో ఉన్న జోరీగలూ, స్వయంనియమిత నిపుణులూ తన బుర్రలోకి ఏవేవో ఎక్కించడానికి సిద్ధంగా ఉన్నారని అతనికి తెలుసు. ఇప్పుడతను భూపరిమితి బిల్లులో అతిక్లిష్టమైన ప్రశ్నను ఎదుర్కొంటున్నాడు. ఏక సూత్రత లోపించిన చరిత్రవల్ల, గడిచిన దశాబ్దాలలో అనుసరించిన ఏకపక్ష వైఖరి వల్ల, దేశంలో సారవంతతకు సంబంధించి భూముల్లో ఉన్న నమ్మశక్యంకాని తేడాలవల్ల, సహజంగానే అదో క్లిష్టమైన సమస్యగా మారి కూర్చుంది. వీటన్నింటినీ కొన్ని కేటగరీల కిందికి కుదించడం గుండెను వయ్యలు చేసే పెద్ద కసరత్తు. అది ఎప్పటికీ నూటికి నూరు పాళ్ళు నిర్దుష్టమనిపించు కోలేదు. ఒక దృక్కోణంతో ఒక వర్గీకరణ సరిగా ఉందనుకుంటే, అంతే సబబైన మరో దృక్కోణంతో మరొకటి కూడా అంతే సరైనదని వాదించే అవకాశం ఉంటుంది. వాస్తవానికి దగ్గరగా ఉండే కొన్ని కొలమానాలమీద, అందుబాటులో ఉన్న అంకెల మీద, ఆధారపడి పని జరపడానికి వీలైన ఒక నమూనాను నిర్ణయించడం, సాధ్యమే అయినా, దాన్ని ఒప్పనీ రుజువు చెయ్యగలం, కాస్త అటూ ఇటూ చేసి ఒప్పుకాదనీ రుజువు చెయ్యగలం. అదీగాక, అధికార పక్షం మినహా, ప్రభుత్వం ఏది చేసినా అది సక్రమమేనని ఒప్పుకోడం ఎప్పుడూ జరగనిది కనుక మెజారిటీ పక్షాలు దానిని తప్పనే అంటాయి. ఆపైన ముఖ్యమంత్రి గారి 'లోపాయి కారీ' బేరసారాల వదంతులెటూ ఉంటాయి కనుక, (ఈపాటికే ఆ వదంతి కాస్తా దివ్యసత్యంగా పరిణామం చెందింది) కొందరు ఇది మరీ దారుణంగా ఉందని కేకలు పెట్టచ్చు. కనీసం

పరిహారం కూడా ఇవ్వకుండా భూమిని దౌర్జన్యంగా గుంజుకోడం తప్ప మరేంకాదని మరి కొందరు నిశిత విమర్శలు సంధించవచ్చు. ఏదో కొంత 'మొత్తాన్ని' (అమౌంట్) చెల్లించాలని చట్టం ఆదేశించి ఉండవచ్చు కానీ, ఆ మొత్తం ఎంత హాస్యాస్పదమైనంత తక్కువంటే చప్రాసీలకు బక్షీసు ఇవ్వడానికి కూడా సరిపోదు. మొత్తానికి గొప్ప మొత్తమే!

ప్రధానమంత్రితో అతని సమావేశం క్లుప్తంగా ముగిసింది. తనకెదురుగా ఉన్న ఒక కాగితం వైపు చూస్తూ ఆమె ఒక విలువైన సమాచారం మాత్రం ఇచ్చారు. 'మీకు బలరాం అనే భూస్వామి తెలుసా ఆనంద్‌జీ?' మృదువుగా అడిగారు. ఆనంద్ తెలుసునని చెప్పి ఆమె చెప్పబోయే మిగిలిన మాటల కోసం ఎదురుచూస్తూ ఉండిపోయాడు. 'ఆయన నాకో పెద్ద ఉత్తరం రాశాడు. ఓ పక్క భూస్వాములు ఇప్పుడిప్పుడే దేశంలో ఆహారసమృద్ధి అనే అద్భుతాన్ని సాధిస్తే, ఈ రాష్ట్రంలో పట్టపగ్గాల్లేని ఈ ముఖ్యమంత్రి (మీ గురించి అతడన్న మాట-అన్నారామె చిరునవ్వుతో) భూపరిమితులనబడే ఆటవిక చట్టం ఎలాగైనా రుద్ది ప్రతి అన్నదాతనూ నిష్ఠదరిద్రంలోకి నెట్టడానికే కంకణం కట్టుకున్నా'డని అందులో ఫిర్యాదు చేశాడు.'

భూ పరిమితుల చట్టం నుంచి తప్పించుకోడానికి వీలైన ప్రతి అవకాశాన్నీ అందిపుచ్చుకుంటూ భూస్వాములు ఎంత అప్రమత్తంగా వ్యవహరిస్తున్నారో అనుకుని ఆనంద్ విస్తుపోయాడు. 'ఇది ఆసక్తికరమైన ముచ్చటే మేడమ్. మీ రనుమతిస్తే, పరిమితికన్నా తక్కువ భూమి ఉన్న లక్షలాది చిన్న, సన్నకారు రైతులే వాస్తవంగా ఆహార సమృద్ధికి ఎలా బాధ్యులో నేనతనికి వివరిస్తాను.'

ఇక, భూపరిమితి ఏ పరిమాణంలో ఉండాలన్న కీలకమైన విషయంలో, సంబంధిత మంత్రిని కలిసి మాట్లాడండని సూచించి ఆమె ఊరుకున్నారు. ఆ మంత్రి కొంతకాలం క్రితం ఆనంద్ కలసినవాడే. ఆయన సాధకబాధకాలన్నీ తెలిసినవాడే కానీ, భూముల సారవంతత విషయంలో ఉన్న మెలికలు ఆయినకంత బాగా తెలియవు. వాళ్ళిద్దరూ చర్చించుకుంటుండగా ఒక ప్రముఖపాత్రికేయుడు మంత్రిని కలవడానికి వచ్చాడు. మంత్రి అతణ్ణి లోపలికి పిలిచాడు. అతడాయనకు ఎంతో నమ్మకస్థుడన్న సంగతి అర్థమై పోతూనే ఉంది. జరుగుతున్నచర్చకు అతణ్ణి దూరంగా ఉంచవలసిన అవసరం మంత్రికి కనిపించలేదు. చర్చ వాడివాడిగా తయారైంది. తన రాష్ట్రంలో వేర్వేరు భూ పరిమితి పరిమాణాల్ని వర్తింపచేయడంలోని ఇబ్బందులను ఆనంద్ వివరించుకుంటూవచ్చాడు. ఒక పాత్రికేయుని ఎదుట ఇదంతా చర్చించడానికి ఆనంద్ కొంత ఇబ్బంది పడుతూ చూపులతోనే ఆ సంగతి సూచించాడు. ఆ విషయంలో మీరెలాంటి శంకా పెట్టుకోనక్కర్లేదంటూ మంత్రి వెంటనే అభయమిచ్చాడు. 'మిస్టర్‌లాల్ నా ఆంతరంగికుడు, ఎలాంటి రహస్యమైనా అతని దగ్గర భద్రంగా ఉంటుంది,' అన్నాడు.

ఓ కచ్చితమైన నిర్ధారణకు రాకుండానే చర్చ ముగిసింది. చర్చ తర్వాత కూడా పరిమితి విషయంలో తనెక్కడున్నాడో ఆనంద్‌కి అర్థం కాలేదు. మంత్రిగారి వద్ద సెలవు

తీసుకుని తిరిగొచ్చిన తర్వాత చాలా అస్థిమితానికి లోనయ్యాడు. ప్రధానమంత్రి తనతో బలరాం ఉత్తరం గురించి తప్ప మరేమీ మాట్లాడకపోవడం అతనికి ఒకింత ప్రశ్నార్థకంగానే కనిపించింది. అది యథాలాంపగానో అనుద్దేశంతోనో అయుండడానికి వీల్లేదు, ఇందిరాజీ తగిన అవసరం లేకుండా దేనిగురించీ మాట్లాడేవారు కాదు. చాలా లోతు, గుంభనం, ఉన్న మనిషి. ఆ ప్రస్తావన కర్థం - ఒకవేళ హరితవిప్లవానికీ భూస్వాములకూ మధ్య ఒక అస్పష్టమైన ముడి ఆమె ఆలోచనల్లో క్రమంగా రూపుదిద్దుకుంటోందా? ఏమో తనకు తెలియదు.

మరునాటి ఉదయమే అతను అఫ్రోజాబాద్ తిరిగొచ్చాడు.

★ ★ ★

ఆ రోజు మధ్యాహ్నం, భూముల వర్గీకరణకు నియమించిన నిపుణుల కమిటీ సిఫార్సులు తెలుసుకోడానికి కమిటీ సభ్యుల్ని పిలిపించాడు. తనకప్పగించిన అంశాన్ని వీలయినంత వస్తుగత దృష్టితో పరిశీలించి మొత్తంమీద కమిటీ తన విధిని బాగా నిర్వర్తించింది. అయితే భూ పరిమితి విషయంలో కమిటీ కచ్చితమైన పరిమాణాన్ని సిఫార్సు చేయలేదు, రాష్ట్రం లోని వేర్వేరు ప్రాంతాల్లో పరిమితిని నిర్ణయించడానికి వీలుగా విపులమైన మార్గదర్శకాలను మాత్రం అందించింది. అది చేయగలిగింది కూడా అంతే.

సాయంత్రంవరకు సభ్యుల వివరణ కొనసాగుతున్నప్పుడే ఢిల్లీ, అఫ్రోజాబాద్‌ల మధ్య ఏదో ఉడుకుతున్నట్టు కనిపించింది. ముక్కముక్కలుగా ఒక వార్త రూపుదిద్దుకోవడం మొదలెట్టింది. ఎన్ని ఎకరాల మేరకు పరిమితి విధించాలన్న విషయంలో సభ్యుల అభిప్రాయాలు తెలుసుకు న్నా, ఆనంద్ వాటిని పట్టించుకోకుండా భూస్వాముల లాబీతో జరిపిన బేరసారాలను ఆధారం చేసుకుని రాత్రికల్లా తన గారడీ అంకెను ఖరారు చేస్తాడని ఆ వార్త సారాంశం. కనుక, సభ్యుల అభిప్రాయం తెలుసుకోవడమనేది కేవలం కంటితుడుపు చర్య. ఒక సోషలిస్టుగా ముఖ్యమంత్రి విశ్వసనీయతను ఏదోవిధంగా ప్రదర్శించడానికి జరిగిన ఏర్పాటు. ఈ వార్తకు ఢిల్లీనుంచి కూడా వెంటనే మద్దతు లభించింది.

నాగరాజ్‌తో కలిసి రకరకాల లెక్కలు వేస్తూ, వివిధ అవకాశాలను పరిశీలిస్తూ అర్ధరాత్రి వరకు ఆనంద్ తన స్టడీ రూంలోనే గడిపాడు. అదే సమయంలో వార్తా పత్రికల కార్యాలయాల్లో కూడా చాలాసందడి చోటు చేసుకుంది. అఫ్రోజాబాద్ - ఢిల్లీల మధ్య అదే పనిగా ఫోన్లు మోగుతున్నాయి. 'లాండ్‌లార్డ్ లాబీ' అన్న వర్ణనకు సరిపోతాడనుకున్న ప్రతివాడితో సంభాషణలు జరిగిపోతున్నాయి.

అర్ధరాత్రి రెండయేసరికి ఇద్దరూ అలసిపోయారు. అయినా అపరిమితమైన ఆనందం వాళ్ళను ముప్పిరిగొంది. ఉన్నంతలో తాము చేయగలగింది చేశామన్న సంతృప్తి వెల్లి విరిసింది. మూడో మనిషెవరూ అక్కడ లేడు. పరిమితిని పన్నెండున్నర ఎకరాలుగా (హెక్టార్లలో దానికి సరిపోయే పరిమాణాన్ని బిల్లులో పొందుపరచడం జరుగుతుంది) నిర్ణయించారు. ఆ నిర్ణయానికి రావడం వెనుక కారణాల సుదీర్ఘ వివరణను కూడా ఆనంద్ దానికి జతపరిచాడు.

ఆ తర్వాత ఫైలు మీద సంతకం చేశాడు. నాగరాజ్ సెలవు తీసుకున్నాడు. భోజనం కూడా చేయకుండా ఆనంద్ మరుక్షణమే నిద్రకుపక్రమించాడు.

★ ★ ★

రాష్ట్రంలో ఒక్కో కుటుంబానికి సగటు భూ పరిమితి 19.75 ఎకరాలుగా ఉండవచ్చునన్న పెడబొబ్బలాంటి పతాకశీర్షిక మరునాటి ఉదయం గ్రేట్ ఇండియా టైమ్స్‌లో ప్రత్యక్షమయింది. 'ఉండవచ్చు'నన్న మాట మొత్తం వార్తలో ఏమూలో సమాధి అయిపోయింది. దాంతో ఎవరూ దానిని గ్రహించలేకపోయారు. తుది నిర్ణయమదేనని వార్త చదివినవారికర్థమైంది.

★ ★ ★

పొద్దుటే గ్రేట్ ఇండియా టైమ్స్ తొలికాపీ స్టాండ్స్‌లోకి అడుగుపెట్టినప్పటి నుంచి నగరంలో ఒక విలక్షణమైన సవ్వడి మొదలైపోయింది. అలాగని భూపరిమితి ప్రకటన గురించి ఎందరో గొప్ప ఆసక్తితో ఎదురుచూస్తున్నారని కాదు; కానీ బ్రహ్మాండమైన వార్తేదో రాబోతోందని ప్రతి పాఠకుడికి ఏదో స్ఫురణ కలిగింది. నాగరాజ్ ఎప్పటిలా తన అపార్ట్‌మెంట్ తలుపు తెరిచి వీధి మట్టానికి కొంచెం పైన, కింది నుంచి రెండో మెట్టు మీద పడున్న పత్రికను చేతి లోకి తీసుకున్నాడు. మెట్లెక్కుతూ 'యధాలాపంగా మొదటి పేజీలోకి చూశాడు. అంతే, తను నిలబడి ఉన్న మెట్టుకి అతుక్కుపోయాడా అన్నట్టు గడ్డకట్టుకుని నిలబడిపోయాడు. తన కళ్ళను తనే నమ్మలేక వేళ్ళతో వాటిని రుద్దుకుంటూ మరింత పరిశీలనగా చూశాడు; అయినా 19.75 అనే ఆ అంకె అలాగే ఉంది. లోపలి నుంచి తన్నుకు రాబోయిన కేకను అణచివేయడానికి అరచేయిని నోటికి అడ్డు పెట్టుకున్నాడు

తనేం చేస్తున్నాడో తెలియని స్థితిలోనే గబగబా దుస్తులు వేసుకుని ఆటోలో ఆనంద్ నివాసానికి పరుగెత్తాడు. గేటు తెరచుకునేవరకు ఆగే సహనం కూడా లేనివాడిలా పిచ్చెత్తినట్టు లోపలకి దూసుకొచ్చాడు. చేతనైనంత గట్టిగా ఒక్క గావుకేక పెట్టి ముఖ్యమంత్రిని పిలిచి ఎంత విపత్తు ముంచుకొచ్చిందో చెబుదామనుకున్నాడు. మతిపోయిన ఆ పరిస్థితిలో అంత కన్నా ఏం చేయాలో అతనికి తోచలేదు. ఏవో విషపుచుక్కల్ని పిండుతున్నాడా అన్నట్టుగా గ్రేట్ ఇండియా టైమ్స్ పత్రికను చేతితో గట్టిగా కరచి పట్టుకున్నాడు.

అతడాట్టేసేపు ఎదురుచూడవలసిన అవసరం లేకపోయింది. ఆనంద్ అప్పుడే మేలుకున్నాడు. ప్రతిరోజూతో పోలిస్తే కొంత ఆలస్యంగా లేచినట్టే లెక్క. నాగరాజ్ రాక గురించి తెలిసి నిద్ర దుస్తులతోనే డ్రాయింగ్ రూంలోకి వచ్చాడు. అడుగు తీసి అడుగు వేయబోయే స్థితిలో, స్తంభించి పోయిన ఒక నడపీనుగలానే నాగరాజ్ కనిపించాడతనికి. హఠాత్తుగా ఆనంద్‌ను ఆందోళన ముంచెత్తింది.

నమస్కారం చేయడం కూడా మరచిపోయి, వణికే చేత్తో పత్రికను అతనికందించి మిడి గుడ్లతో చూస్తూ ఉండిపోయాడు నాగరాజ్. నీటిచారతో అతని కళ్ళు ఒకింత మెరుస్తున్నట్టు

కూడా ఆనంద్‌కు అనిపించింది. న్యాయశాఖలో కేవలం డ్రాఫ్ట్స్‌మన్‌గా ఉన్న ఒక వ్యక్తి తన పనితో ఇంత ఉద్వేగపూరితంగా తాదాత్మ్యం చెందగలడా? సానుభూతితో చలించిన ఆనంద్ తనలో తనే అనుకున్నాడు. అతణ్ణి కూర్చోమని చెప్పి ఆ వార్తను చదవడం ప్రారంభించాడు. సందేహం లేదు, అది పిడుగుపాటు లాంటి వార్తే.

అతని మొట్టమొదటి ప్రతిచర్య - ఆపాటికి వరండాలో పోగుపడిన పత్రికలన్నింటినీ తీసుకుని రమ్మని అటెండర్‌తో చెప్పడం. వాటి మొదటి పేజీలోకి గబగబా ఒకసారి తొంగిచూసేసరికి ఆ వార్త గ్రేట్ ఇండియా టైమ్స్ తప్ప మరో పత్రికేదీ ప్రచురించని సంగతి అర్థమైంది. ఆనంద్ దేనికోసం వెతుకుతున్నాడో గ్రహించిన నాగరాజ్ కొంతవరకు ఊరట చెందాడు. 'మొత్తానికి ఇది 'గ్రేట్' ఇండియా టైమ్స్ పనే నాగరాజ్ - చాలా గ్రేటే!'

'ఈ అబద్ధం ఇప్పటికే చాలా దెబ్బ తీసుంటుంది సార్,' వీణ తెచ్చి అందించిన కాఫీ తాగుతూ బిక్కమొహంతో గుసగుసగా అన్నాడు నాగరాజ్.

'అవునవును. ఇంకా నష్టం జరగకుండా తక్షణం చర్య తీసుకోవాలి,' అన్నాడు ఆనంద్. 'చూడు, ఇప్పటినుంచి కొన్ని రేడియో బులిటెన్లు జారీ అయ్యేలా చూడు రేడియోలో ప్రాంతీయ వార్తల ద్వారా ఆ వార్తకు నిర్ద్వంద్వమైన అధికారిక ఖండన జారీ అయ్యేలా, అదే తదుపరి బులిటెన్లలో కూడా ప్రసారమయ్యేలా చూడు.. వెంటనే అన్ని వార్తాసంస్థలకు తెలియజేస్తూ, అలాగే, ఎంతవరకు ఉపయోగిస్తుందన్నదలా ఉంచి, బిగువైన పదజాలంతో గ్రేట్ ఇండియా టైమ్స్‌కు ఖండన పంపించు. ముఖ్యమంత్రి ఈ విషయం మీద సరిగ్గా సాయంత్రం మూడు గంటలకు సచివాలయంలో తన కార్యాలయంలో ప్రెస్ కాన్ఫరెన్స్ ఏర్పాటు చేసి సవివరంగా మాట్లాడతారని కూడా ప్రకటించు. అందుకు సకాలంలో ఏర్పాట్లు పూర్తి చేయమనీ, అందరినీ పిలవమనీ, ఇన్ఫర్మేషన్ డైరెక్టర్‌కు చెప్పు. చీఫ్ సెక్రటరీ, రెవిన్యూ న్యాయశాఖ కార్యదర్శులు కూడా ప్రెస్ కాన్ఫరెన్స్‌కు హాజరయ్యేలా చూడు. నువ్వెలాగూ ఉంటావు. ఇక ఇంటికి వెళ్ళి కాస్త అల్పాహారం తీసుకో. దీన్ని మరింతగా మనసుకు పట్టించుకోకు. రాజకీయాల్లో ఇలాంటి దారుణాలు ఏ క్షణంలోనైనా జరుగుతాయి. వాటిని ఎదుర్కోడానికి సిద్ధంగా ఉండాలి.'

★ ★ ★

'నన్ను డిస్టర్బ్ చేయద్దని నీకు చెప్పానా లేదా?... ఏమిటీ న్యూసెన్స్?' అరుణ సగం నిద్రలోనే, తను నిద్రలేవడానికి సగం తిరస్కారాన్ని ధ్వనిస్తున్న గొంతుతోనే అరచింది.

'సారీ మేడమ్, మీ అన్నయ్యగారు ఫోన్ చేస్తున్నారు, చాలా అర్జంటంటున్నారు. బలవంతంగానైనా మిమ్మల్ని లేపమని అడుగుతున్నారు. ఇప్పుడే మాట్లాడాలంటున్నారు. అయినా నాకు ధైర్యం చాలడం లేదు!' శాసనసభ్యుల హాస్టల్‌లోని పిబిఎక్స్ ఆపరేటర్ దిక్కుతోచని స్థితిలో పడిపోయింది. ఓ పక్క ధైర్యం చాలదంటూనే అరుణను ఆమె నిద్ర లేపుతూ ఉంది.

'ఏ అన్నయ్య? ఎలాంటన్నయ్య? నా అన్నయ్యలెవరూ నన్ను నిద్రలేపమని ఆర్డర్ జారీ చెయ్యరు! తమనెవరైనా నిద్రలేపడానికి ప్రయత్నిస్తే ఏమవుతుందో వాళ్ళకు తెలియదా? నేనూ అంతే, నీకు తెలుసో తెలియదో!'

ఇలా నాటకీయ సంభాషణ జరుగుతుండగానే అరుణ ఒప్పుకోకుండానే నిద్రలేవనే లేచింది. ఇంకా నిద్ర పోతున్నట్టే నటిస్తోంది. మొత్తానికి టెలిఫోన్ ఆపరేటర్ ఆమెను మేలుకొలపడంలో విఫలమయింది. ఆవిధంగా తను ఏ అన్నయ్య ఉత్తర్వులతోనూ కాకుండా తనంత తనే, తన స్వయంనిర్ణయంతోనే, మేలుకుంటున్నానన్న గ్రహింపు ఆపరేటర్‌కు కలిగిస్తూ లేచింది. ఒక్క ఉదుటున వయ్యారంగా లేచి పక్కమీద బుద్ధ భంగిమలో కూర్చుండిపోయింది.

'భగవంతుడా! పొద్దునే ఏ అన్నయ్య నుంచీ ఎలాంటి ఆదేశాలూ లేవు,' అని తనలో తనే సంతృప్తిపడుతూ చేతులు పైకి చాచి ఒళ్ళు విరిచి బద్ధకాన్ని వదిలించుకుంది. అన్నయ్య నుంచి పిలుపు సలుపుతుంటే అడిగింది, 'ఇంకా ఆయన లైన్లో ఉన్నాడా? ఉంటే వెంటనే కనెక్షన్ ఇయ్యి....'

'నువ్వు కోపంగా ఉన్నావని తెలుసు అరుణా, అదిసరే, ఈరోజు గ్రేట్ ఇండియా టైమ్స్ పత్రిక చూశావా?'

సహనానికి అదే ఆఖరి హద్దు. ఆమె ఒక్కసారిగా రెచ్చిపోయింది 'నీ వల్ల నన్ను డిస్టర్బ్ చేసినందుకు టెలిఫోన్ పిల్లను చంపేసినంత పనిచేశాను. అదిచాలక ఇప్పుడా దరిద్రపు పేపరు చూశావా అని అడుగుతున్నావు. నువ్వు అసలు స్పృహలోనే ఉన్నావా? లేక ఇంకా నిద్ర మత్తులోనే ఉన్నావా?'

'సారీ, చెల్లాయి' బలరాం క్షమాపణ అర్థిస్తున్నట్లు అన్నాడు. 'రాష్ట్రంలో భూ పరిమితిని 19.75 ఎకరాలుగా నిర్ణయించినట్టు ఇప్పుడే చూశాను. దాదాపు భూస్వాములు కోరబోయేది కూడా అదే!'

'ఇంత గొప్ప వార్త చెప్పడానికి నన్నెందుకు డిస్టర్బ్ చేయాలి? నీ ల్యాండ్‌లార్డ్ వర్గాల్లో నువ్వే టాంటాం చేసుకోవచ్చుగా? దానిని గురించి వాళ్ళనే కూసుకోమను!'

'తప్పకుండా అదే చేసుండేవాణ్ణి,' బలరాం అన్నాడు. 'కానీ నాకావార్తలో పెద్ద కొండెలుక చచ్చిన వాసన వస్తోంది. కచ్చితంగా ఎక్కడో ఏదో పెద్ద పొరపాటు జరిగిపోయిందని అనిపిస్తోంది... మనం ఎంత తెలివి తక్కువ దద్దమ్మలమో కొన్ని గంటల్లో రుజువవచ్చు. గెలుపు తనదే అనిపించుకుని ఆనంద్ మనను చూసి పగలబడి నవ్వచ్చు . . .'

'అయితే ఏమంటావు? పాపం నిరుపేద భూస్వాముల్నీ, ఉత్తుత్తి విడాకులు తీసుకున్న యువజంటల్ని చూసి నవ్వద్దని చెప్పమంటావా? కొన్ని సెంట్ల భూమి కోసం సిగ్గెగ్గులకు విడాకులిచ్చేశారు వాళ్ళు!'

'కుడితిలో పడ్డ ఎలకలా ఉంది మన పరిస్థితి. నిజం కావడానికి వీల్లేనంత అతి మంచి వార్త ఇది. ఈ లోపల, బేరసారాలలో మధ్యవర్తివనుకుంటున్న నిన్నూ, నన్నూ సన్మానాలతో విందు ఆహ్వానాలతో ముంచెత్తడానికి భూస్వాములు తయారవుతున్నారు. నిజం బయట పడిందంటే సన్మానాలు కాస్తా శాపనార్థాలవుతాయి. ఈ ఉపద్రవంనుంచి తప్పించుకోడానికి మనం ఏం చేయాలి?'

'ఏదైనా చేసుకో కానీ, నన్ను నీ సలహాదారుగా మాత్రం చేసుకోకు. నీ మంచికే చెబుతున్నాను... తర్వాత కలుద్దాం... ఇప్పుడు నన్ను కాస్త నిద్రపోనీ...' అనేసి ఆమె ఫోన్ పెట్టేసింది.

★ ★ ★

'మంచి పని చేశారు!' చౌదరి ప్రోత్సాహసూచకంగా అన్నాడు - శేఖర్, ఎడిటర్ నందివర్ధన్ ఒకరినొకరు చూపులతోనే అభినందించుకుంటుండగా. అది ఉదయం 8 గంటల సమయం.

'కానీ, సాయంత్రం మూడింటికి ప్రెస్ కాన్ఫరెన్స్ ఉంది. అప్పుడు అసలు నిజం బయట పడుతుంది,' ఎడిటర్ అన్నాడు. 'ఇంతకీ ఈ కుట్ర ద్వారా మనం సాధించిందేమిటి?'

కొన్ని నిమిషాలపాటు నిశ్శబ్దం రాజ్యం చేసింది. చివరకు శేఖర్ అన్నాడు. 'సరే, మీరు ప్రచురించిన అబద్ధాలను ప్రభుత్వం ఎటూ ఖండిస్తుంది. అలాకాక వాటికి మూర్ఛపడిపోతుందని మీరనుకున్నారా?' అంతలో ఏదో గుర్తొచ్చినట్లు హఠాత్తుగా అడిగాడు, 'అన్నట్టు మీరు మధ్యాహ్నం ఎడిషన్ తెస్తారు కదూ! అది ప్రెస్ కాన్ఫరెన్స్‌కంటె ముందేగా?'

దాని గురించి మొదటిసారి గుర్తొచ్చినట్లుగా నందివర్ధన్ అవునంటూ తలూపాడు. 'వండర్‌ఫుల్! మెయిన్ పేపరు ప్రచురించిన స్కూప్‌ను ధ్రువపరచడానికి వీలైనంత మసాలాను జోడించి మధ్యాహ్నం ఎడిషన్ తీసుకురావాలి. ఈ రోజు ఉదయం గ్రేట్ ఇండియా టైమ్స్‌లో వచ్చిన వార్త చూసిన తర్వాతే... తన అక్రమ లావాదేవీల కుట్ర పూసగుచ్చినట్టుగా బయట పడిన తర్వాతే... ముఖ్యమంత్రి హఠాత్తుగా మేలుకొని, బెంబేలు పడిపోతూ హడావుడిగా మధ్యాహ్నానికల్లా సీలింగ్ అంకెల్ని మార్చేశాడని మీరు ఘంటాపథంగా రాయచ్చు. చివరినిమిషంలో ఎలాగైనా కుంభకోణాన్ని కప్పి పుచ్చే ప్రయత్నానికి దిగి ప్రెస్ కాన్ఫరెన్స్‌లో కొత్త అంకెల్ని బయటకు తీయచ్చు. ముందురోజు రాత్రి ఫైలుమీద సంతకం చేయడానికి ముందే, తనకు అందవలసిన ముడుపుల్ని చివరి పైసా వరకు జేబులో వేసుకోనే వేసుకున్నాడు. పాపం భూస్వాముల పరిస్థితి, సొమ్మూ పోయింది, శనీ పట్టిందన్నట్టుగా తయారైంది. ఇప్పుడిక మన సోషలిస్టు ముఖ్యమంత్రిగారు సాయంత్రం మూడుగంటలకు - భూస్వామి అనబడేవాడు ఈ నేల మీద బతకడాన్నే అసాధ్యం చేసేసే అంకెను ప్రకటించగా మీరు చెవులారా వినబోతున్నారు. ఇక భూస్వాములు తాతముత్తాతలనుంచి వస్తున్న ఆస్తుల్ని చివరి సెంటు వరకూ అయినకాడికి తెగనమ్ముకుని ఏ పట్నానికో వలసపోయి అంతరించిపోతారు. సోదర సోదరీమణులారా, ఇదీ మిమ్మల్ని ఉద్ధరించడానికి వచ్చిన సోషలిజం.. ఇంకా కావలసిన చిలవలు పలవలు చేర్చి ఆ వార్తకు మరింత శక్తిని ఎలాగూ దట్టిస్తారనుకోండి. ఒకటి

మాత్రం గుర్తు పెట్టుకోండి సుమా, ప్రెస్ కాన్ఫరెన్స్‌కు ముందే మధ్యాహ్నం ఎడిషన్ అందరి చేతుల్లోనూ ఉండాలి. ఇది చాలా ముఖ్యం...'

'తప్పకుండా!' ఎడిటర్ నందివర్ధన్ డాబుసరిగా హామీ ఇచ్చాడు.

★ ★ ★

ఆనంద్ ప్రెస్ కాన్ఫరెన్స్‌లో మాట్లాడే సమయానికి గ్రేట్ ఇండియా టైమ్స్ మధ్యాహ్నం ఎడిషన్ అందరి చేతుల్లోకి చేరిపోయింది. ప్రెస్ కాన్ఫరెన్స్‌లో ప్రకటించాలనుకున్న అంశాన్ని అదప్పటికే వక్రీకరించింది కనుక ప్రెస్ కాన్ఫరెన్స్ ఒక వ్యర్థ విన్యాసంగా మారింది. ఆయా శాఖల కార్యదర్శులు, నాగరాజ్, విలేఖరుల సమావేశం నడుస్తున్న తీరును దిగ్భ్రమతో చూస్తూ ఉండిపోయారు.

క్రాస్ ఎగ్జామినేషన్‌కూ నిందారోపణలకూ ఆనంద్ ప్రశాంతంగా సమాధానం చెప్పాడు. గ్రేట్ ఇండియా టైమ్స్ కథనం అబద్ధాల పుట్ట అని తేల్చాడు గానీ అందులో పూర్తిగా కృతకృత్యుడు కాలేకపోయాడు. వాస్తవాలు విప్పి చెప్పేటప్పుడు అతడు మితిమీరిన ఆగ్రహాన్నీ ప్రదర్శించలేదు, అనురక్తినీ చూపలేదు విలేఖరులూ, కొందరు ఎడిటర్లూ అతని పనిపట్టడానికి సంధించిన పదునైన అనేక ప్రశ్నలకు జవాబు చెప్పకుండా ఊరుకున్నాడు. ప్రెస్ కాన్ఫరెన్స్ సుదీర్ఘంగా సాగి కొన్ని కొన్ని సందర్భాలలో విషపూరితంగా మారింది. ప్రశ్నలడిగే వారికి దాడిచేయడానికి కొత్త కోణాలేవీ కనిపించలేదు. మిగిలినవారి విషయానికొస్తే, ఆనంద్‌ను నమ్మినవారు నమ్మారు, నమ్మదలచుకోనివారు నమ్మలేదు, నమ్మడం నమ్మకపోవడమనేది ముందే నిశ్చితమైపోయుంటాయి. ప్రెస్ కాన్ఫరెన్స్‌లో అన్నవాటితో, విన్నవాటితో వాటికి సంబంధం లేదు.

ప్రెస్ కాన్ఫరెన్స్ ముగిసిన తరువాత ఆనంద్‌నుంచి తదుపరి ఉత్తర్వులేమైనా ఉంటే తెలుసుకోడానికి అధికారులందరూ అతని ఛాంబర్‌లోకి వెళ్ళారు 'ఇది పరమ దారుణం!' అంటూ చీఫ్ సెక్రటరీ బుసకొట్టాడు. 'ఈ పచ్చి అబద్ధంతో వాళ్ళేం సాధించదలచుకున్నారో నా కర్థం కావడం లేదు. పైగా వెంటనే దానిపై పూర్తి ఖండన వెలువడ్డం జరిగిన మీదట!'

'అదే సద్దుమణిగిపోతుంది,' కలవరపడుతున్న చీఫ్ సెక్రటరీని ఓదార్చుతున్నట్టు అన్నాడు ఆనంద్. 'రాజకీయాల్లో ప్రతిదాని వెనుక ఒక అపవాదు ఉండవలసిందే. ఈ రభసనంతనీ పక్కన పెట్టి ఇప్పుడు మనం చేయవలసిందల్లా బిల్లులో నికరమైన సీలింగ్ అంకెను చేర్చడం...'

★ ★ ★

గ్రేట్ ఇండియా టైమ్స్ దేశవ్యాప్తంగా వివిధ భాషల్లో వెలువరించే తన తొమ్మిది ఎడిషన్లలో ఆ రోజు ఉదయం ప్రచురించిన ఆ గిలిగింతలు పెట్టే కథనమే పార్లమెంటు సెంట్రల్ హాల్ పెదవులపై అవ్యక్త రాగాల నీనింది. అఫ్రోజాబాద్ రాష్ట్రానికి చెందిన ఎం.పి.లు మొదట్లో దానిని నమ్మలేకపోయారు. కానీ క్రమంగా ఆ అపనమ్మకం కొద్ది కొద్దిగా సడలుతూ వచ్చింది.

ఇతర రాష్ట్రాలకు చెందిన ఎం.పి.లు, ముఖ్యంగా ఆనంద్ గురించి ఏమాత్రమూ తెలియని వారు తెచ్చి పెట్టుకున్న ఒకవిధమైన నిశ్చయభావంతో ప్రకటిస్తున్న వ్యతిరేకాభిప్రాయం బరువు ముందు అఫ్రోజాబాద్ ఎం.పి.ల అభిప్రాయం తేలిపోవడం ప్రారంభించింది. అందులో ఆశ్చర్యపడాల్సిందేముంది? 10 నుంచి 20 ఎకరాల మధ్యలో ఏ మేరకైనా భూ పరిమితిని స్థిరపరచవచ్చని అధిష్ఠానవర్గం సిఫార్సు చేస్తున్నప్పుడే భూముల సారవంతతలో ఉన్న తేడాలతో పాటు, ముఖ్యమంత్రుల నీతి నిజాయితీలలో కూడా తేడాలుంటాయని ఊహించి ఉండాల్సింది, కనుక ఇపుడు వారేం చేసినా అది చట్టబద్ధమే - న్యాయవాది కూడా అయిన ఒక ఎం.పి నిర్లిప్తంగా చేసిన వ్యాఖ్య ఇది.

ఏమైతేనేం, అఫ్రోజాబాద్ భూస్వాములు నిజంగా అదృష్టవంతులన్నది ఏతావతా తేల్చిన సారాంశం. భూ పరిమితి పరిమాణాన్ని నిర్ణయించడంలో బేరసారాలు జరపడానికీ, రాష్ట్రంలో భూస్వాముల ఎలాంటి ప్రయోజనాలనైనా కాపాడటానికీ వాళ్ళు తమ సోదరిని ఏకంగా ముఖ్యమంత్రి ఇంట్లోనే ప్రతిష్ఠించగలిగారు. ఇంక తొందరెందుకు? ప్రతి క్లాజునీ, సబ్-క్లాజునీ తాపీగా పరిశీలించి చర్చించుకోవచ్చు. మన స్టార్ సోషలిస్ట్ ముఖ్యమంత్రి ఆనంద్ అంతా సోషలిస్ట్‌గానే ఉందని సర్టిఫై చేసేస్తాడు! నిజంగా ఎంత అద్భుతమైన సన్నివేశం!

ఆ సమయంలో సెంట్రల్ హాల్‌లో ఉండడం తటస్థించిన కేంద్ర హోం మంత్రి అక్కడ వినిపించిన ప్రతిమాటనూ ఎంతో జాగ్రత్తగా చెవిన వేసుకున్నాడు. కొద్దివారాల క్రితమే కొత్తగా మంత్రిగా నియమితుడైన ఈ వ్యక్తి కిచెన్ కేబినెట్‌లో ఒకడుగా అంతా చెప్పుకుంటారు. ఆయన స్వయంగా నోరు విప్పి ఏ వ్యాఖ్య చేయలేదు సరికదా, జరుగుతున్న చర్చపై తన కేమంత ఆసక్తి లేనట్టే కనిపించడానికి ప్రయత్నించాడు. అయితే ఈ హోం మంత్రి ఎప్పుడు సెంట్రల్ హాల్‌లో ఉండడం సంభవించినా అదో ముఖ్యమైన కూపీ లాగడానికే నన్నది ఎం.పి.ల నమ్మకం. ఇప్పుడు సెంట్రల్ హాల్‌లో తన చెవిన పడిన చర్చల సారాంశాన్ని కచ్చితంగా అతి తర్వలోనే ఆయన ప్రధానమంత్రికి మోస్తాడని వాళ్ళ నిశ్చితాభిప్రాయం. 'అతి త్వరలో ఏమిటి, దాదాపు తక్షణమే' అన్నారు కొందరు, సమయప్రాధాన్యాన్ని నొక్కి చెబుతూ..

ఆ రోజు రాత్రి కేంద్ర హోం మంత్రి అఫ్రోజాబాద్‌లోని చౌదరినుంచి ఫోన్‌కాల్ అందుకున్నాడు. వాళ్ళిద్దరూ పాత మిత్రులు, నలభై దశకంనుంచి పరిచయస్థులు. వాళ్ళ సంభాషణ సుదీర్ఘంగా సాగింది. ఇదివరలో అఫ్రోజాబాద్ ప్రభుత్వనాయకత్వాన్ని (అంటే చౌదరిని) మార్చడం హోం మంత్రికి ప్రత్యేకించి సంతోషం కలిగించే విషయమేమీ కాకపోయినా, ప్రధానమంత్రి అభిమతమేమిటో తెలుసుకున్నాక ఆ విషయంలో ఆయన ఒక్కమాట కూడా ఆమెతో అనలేదు.

★ ★ ★

ఆయా పరిణామాలు ఊహించని మలుపు తిరిగి భూ పరిమితుల చట్టాన్ని పక్కకు నెట్టేసి అంతకంటె పెద్ద సమస్యను దేనినో ముందుకు తెస్తాయన్న ఆశతో సీలింగ్ బిల్లు ఆమోదంలో నిరవధికమైన జాప్యం జరిగేలా చూడటానికి ప్రత్యర్థులు ప్రయత్నాలు ప్రారంభించారు. అప్పటికింకా ఇందిరా గాంధీ తనకు తగిన 'పునరావాసం' కల్పించకపోవడంతో ఎం.ఎల్.ఏ.గానే కొనసాగుతున్న చౌదరీ, శేఖర్ ఈ విషయంలో మళ్ళీ ఒకటయ్యారు. గతంలో అంత సన్నిహిత మిత్రులు కాకపోయినా, ఆనంద్‌ను పట్టి వల్లర్చే విషయంలో మాత్రం ఎవరి అవసరం కోసం వారు దగ్గర కావడంలో ఎంతో 'వాస్తవిక' దృష్టిని కనబరిచారు.

ఓ రోజు ఉదయం, శాసనసభలో ప్రశ్నోత్తరాల కార్యక్రమం జరుగుతుండగా, అసెంబ్లీలోని ముఖ్యమంత్రి ఛాంబర్‌లో తీవ్రవాగ్యుద్ధం చోటుచేసుకుంది. భూ పరిమితుల చట్టాన్ని చేపట్టి అదేపనిగా దానిని వివిధ శాసనఘట్టాలను దాటిస్తూ ముందుకు నడిపించడం ప్రారంభించిన తర్వాత చివరకు ప్రశ్నోత్తరాల కార్యక్రమం కూడా చప్పచప్పగా తయారయింది. మామూలు సమయాల్లో అయితే, ఇబ్బందికరమైన అనుబంధ ప్రశ్న ఎదురైతే తబ్బిబ్బు పడిపోయే మంత్రులు, ఆ రోజు లిస్ట్‌లో సంబంధిత ప్రశ్న రాకపోయినా, లేదా ఆ ప్రశ్న అడిగిన సభ్యుడు సభకు రాకపోయినా ఊపిరి పీల్చుకుంటారు. ఒక్కోసారి సాధ్యమైతే మంత్రే ఆ సభ్యుడు గైర్ హాజరయ్యేలా 'మేనేజ్' చేస్తాడు. ప్రశ్నోత్తరాల సమయం పూర్తయిందో లేదో, ఉబుసుపోక కబుర్లకు వేదికలయిన కాఫీ కార్నర్‌కో, లైబ్రరీకో, లాబీల్లోకో హఠాత్తుగా సభ్యుల వలస మొదలవుతుంది. అక్కడ అన్నివిధాల ఉల్లాసం లభిస్తుంది.

ఆ రోజు ఈ సంరంభమంతా మాటు మణిగింది. అతి త్వరగా సీలింగు బిల్లును ఆమోదించాలనే వారికీ, దానినెలాగూ తాము ఓడించలేమని తెలుసు కనుక బిల్లు ఆమోదంలో సాధ్యమైనంత ఆలస్యం జరిగేలా చూడాలని కోరుకునేవారికీ మధ్య తీవ్ర వాగ్యుద్ధం జరుగుతోంది. సభావ్యవహారాలసలహా సంఘంలోని పలువురు సభ్యుల కేకలతో ఆనంద్ ఛాంబర్ ప్రతిధ్వనిస్తోంది. రాబోయే హోలీ పండుగ సందర్భంగా తమకు ఆరు రోజుల సెలవు కావాలని కొందరు పట్టుబట్టారు. మిగిలినవారు ఈ ప్రతిపాదనను గట్టిగా వ్యతిరేకించారు. 'ఇంతకు ముందెప్పుడైనా హోలీ పండుగకు ఇన్ని రోజులు సెలవు తీసుకున్నామా?' అంటూ వాళ్ళలో ఒక సభ్యుడు అందుకున్నాడు. 'ఈసారే అన్ని రోజుల సెలవెందుకంట? భూ పరిమితుల బిల్లును రెండు, మూడు పరిశీలనలు పూర్తి చేసి ఆమోదంకోసం గవర్నర్‌కు పంపించాలి. అమలు తక్షణం ప్రారంభించాలి. ఆ చట్టాన్ని ప్రప్రథమంగా అమల్లోకి తెచ్చిన రాష్ట్రం మనదే కావాలి. ఈ చట్టం కింద భూమి లేని పేదలకిచ్చే మిగులుభూమిలో తొలి ఎకరం మన రాష్ట్రానికి చెందినదే కావాలి...' ఈ విధంగా ఆ శాసనసభ్యుడు, గ్రామీణ విప్లవం ఇక్కడే, ఈ 'మన' రాష్ట్రంలోనే ఎలా మొగ్గ తొడగాలని ఆకాంక్షిస్తున్నాడో విపులంగా వర్ణిస్తూ గట్టిగా వాదించడం ప్రారంభించాడు.

'తొందరేముంది తమ్ముడూ?' మరో శాసనసభ్యుడు అతనికి అడ్డుతగులుతూ అన్నాడు. 'భూమేమైనా పారిపోతుందా? లేక రాత్రికిరాత్రి భూమిలేని లక్షలాదిమంది రాష్ట్రం విడిచిపెట్టి ఎక్కడికైనా వలసపోతున్నారా? నీకు మరీ అంత అత్యుత్సాహం పనికిరాదు. ప్రజలు ఎంతో

ఆనందంగా, ఉత్సాహంగా జరుపుకునే ముఖ్యమైన పండుగ హోలీ శాసనసభ ఈ ఘట్టంలో వాళ్ళ ఆనందాన్ని ఎందుకు చంపెయ్యాలి? మనమొక్కళ్ళమేనా, శాసనసభ సిబ్బంది ఉన్నారు, వాళ్ళ కుటుంబాలున్నాయి, బంధువు లున్నారు - సాంప్రదాయికంగా వస్తున్న సెలవులకు కూడా వాళ్ళు నోచుకోలేదా?'

అలా చర్చ అంతూ పొంతూ లేకుండా సాగుతూనే ఉంది. మొత్తానికి ఆ ఇష్టాగోష్ఠి సమావేశం, ఏ నిర్ణయానికీ రాకుండా ముగిసింది. కాస్సేపట్లో స్పీకర్ ఛాంబర్‌లో జరగబోయే సభా వ్యవహారాల సలహా సంఘం రెగ్యులర్ సమావేశానికి అందరూ వెళ్ళిపోయారు.

మొదట్లో ఆనంద్ ఏమీ మాట్లాడలేదు క్యాలెండర్‌లోకి చూస్తే, నిజానికి అదేదో కొద్ది రోజులకుపరిమితమయ్యే వ్యవహారం కాదని అర్థమైంది. వివిధరాజకీయపక్షాలు తక్కువ వ్యవధితోనే తమ జాతీయసమ్మేళనాలను ఏర్పాటుచేసుకున్నాయి. ఆయా పార్టీల శాసనసభ్యులు-ముఖ్యంగా వాటి శాసనసభాపక్షనాయకులు తమ పార్టీ సమ్మేళనంలో పాల్గొనడానికి దేశంలోని వేర్వేరు ప్రదేశాలకు వెళ్ళవలసి ఉంటుంది. వేర్వేరు తేదీలలో జరిగే ఈ సమ్మేళనాలు మొత్తంమీద రెండు నెలల కాలానికి విస్తరించాయి. ఆ తర్వాత ఇక అందుబాటులో ఉండేది శాసనసభ బడ్జెట్ సమావేశాలు. వీటన్నిటి దృష్ట్యా తేలుతున్నదేమిటంటే, వార్షిక బడ్జెట్ ఆమోదం తర్వాతే భూ పరిమితుల బిల్లును చేపట్టడం సాధ్యమవుతుంది. ఆ తర్వాత కూడా ముఖ్యమంత్రికీ, ఇతర మంత్రులకూ ఏవేవో ముందస్తు వ్యాపకాలు ఉంటూనే ఉంటాయి. అలా బిల్లు ఆమోదం వర్షాకాల సమావేశాలవరకూ దేకుతుంది... సభావ్యవహారాల సలహాసంఘంలో సభ్యుడయిన శేఖర్ ఈ అవకాశాన్ని ఊహించుకుని ఎంతో ఉత్సాహం పుంజుకున్నాడు. అతని ముఖం ఆనందంతో వెలిగిపోయింది. భగవంతుడు తన మొర ఆలకించాడనుకున్నాడు.

'బిల్లు ఆమోదానికి ఎన్ని పనిదినాలు అవసరమవుతాయని మీరనుకుంటున్నారు?' స్పీకర్, ముఖ్యమంత్రిని అడిగాడు. ఆనంద్ డిప్యూటీ స్పీకర్ సలీముల్లా వైపు చూశాడు.

'నేను ఉజ్జాయింపుగా లెక్కేశాను. దాదాపు పదిహేడు రోజులు అవసరమవుతాయి. సెలవులు, ఆదివారాలు కలుపుకుంటే ఇరవై నాలుగు రోజులు.'

'వర్షాకాల సమావేశాలవరకూ అన్ని అదనపు రోజులు మనకు లభ్యమవుతాయని నే ననుకోను' స్పీకర్ ఒకింత ఖండితంగా అనేశాడు. 'అసలా ప్రశ్నే లేదు', అందరూ కుతూహలంగా తనవైపే చూస్తుండగా మళ్ళీ అన్నాడు. 'ముందు చెప్పాలంటే, కొద్ది రోజులు తప్ప నేనే అందుబాటులో ఉండను. లోకసభ స్పీకర్‌తో పాటు మూడు ఖండాలలోని వివిధదేశాలలో పర్యటించడానికి వెడుతున్నాను. ఈ రోజు పొద్దునే స్పీకర్ నుంచి నాకు ఆహ్వానం అందింది.'

ఆనంద్ డిప్యూటీ స్పీకర్ వైపు చూశాడు. 'నాకు కూడా ఉమ్రాహ్ యాత్రకు బయలుదేరాలనుంది,' డిప్యూటీ స్పీకర్ అన్నాడు. 'అయితే ఇక్కడి పరిస్థితి దృష్ట్యా నా యాత్ర మానుకుని బిల్లు ఆమోదం పొందేవరకు సభాధ్యక్షబాధ్యత నిర్వహిస్తాను,' అని వెంటనే కాస్త వ్యంగ్యం జోడిస్తూ అన్నాడు.'అల్లా భూమిలేని పేదవాళ్ళమీద దయచూపించి నన్ను క్షమిస్తాడన్న

నమ్మకం నాకుంది. అదీకాక, నాకింకా వయసు మీరలేదు కనుక కొన్ని నెలల తర్వాత కూడా యాత్రకు వెళ్ళగలను. వెడితే ఇప్పుడే వెళ్ళాలి, లేకపోతే ఇంకెప్పటికీ వెళ్ళలేననే సమస్య నాకు లేదు.' స్పష్టంగా చివరి వ్యాఖ్య, తన విదేశీ పర్యటన అవకాశాన్ని వదులుకోలేని వృద్ధుడయిన స్పీకర్‌ను ఉద్దేశించి చేసిందే.

'బాగుంది,' చర్చ ముగిస్తూ ఆనంద్ అన్నాడు. 'ఇరవైనాలుగుగంటలూ పనిచేసే సభాధ్యక్షుడు దొరికాడు. అంతగా అత్యవసరం కాని వ్యవహారాలను పక్కన ఉంచి, అలా రోజులు ఆదా చేసి బడ్జెట్ సమావేశాల్లో సీలింగ్స్ బిల్లు ఆమోదించగలమనే అనుకుంటున్నాను.' సభా వ్యవహారాల సలహా సంఘం కూడా ఆ మేరకు నిర్ణయించింది.

సమావేశం తర్వాత ఆనంద్, సలీముల్లా కలసి ఆనంద్ ఛాంబర్‌కు తిరిగి వచ్చారు. 'సభా వ్యవహారాల సంఘం నిర్ణయించినట్టుగా బడ్జెట్ సమావేశంలో బిల్లును మనం ఆమోదింప చేయగలమని మీరు కచ్చితంగా అనుకుంటున్నారా?' అడిగాడు సలీం.

'నిజం చెప్పాలంటే, నే ననుకోవడం లేదు,' ఆనంద్ జవాబిచ్చాడు. 'సభలో బిల్లుపై చర్చకు తగినంత సమయం తీసుకోవాలని నా ఉద్దేశం. అంతకన్నా ముఖ్యం - రాష్ట్రమంతా పర్యటించి కొత్త చట్టం గురించి అన్ని విషయాలూ ప్రజలకు నేరుగా వివరించడం. ఈ చట్టం విషయంలో అది చాలా ఉపయోగపడే చిట్టచివరి అంశం. శాసనసభలో పగలూ, రాత్రీ కూర్చుని బిల్లును ఆమోదింపచేస్తే, నరాలు తెంపేసే ఉద్రిక్తత నుంచి, అగ్నిపరీక్షనుంచి మనం బయటపడగలగడం నిజమే. కానీ ఇదంతా దేని గురించో ఎవరికీ తెలియదు. మన నిద్రమత్తు విలేఖరులు క్లుప్తంగా ఇచ్చే సమాచారం వల్ల పత్రికాపాఠకులకర్థమయ్యేదేమీ ఉండదు.'

'మీరు చెప్పినదాన్లో ఎంతో వాస్తవముంది ఆనంద్ భాయ్,' సలీమ్ అన్నాడు. 'నేను చూస్తున్నాగా, అసెంబ్లీలో ముఖ్యమైన వేళల్లో ఎలాంటి కీలకమైన అంశాలనూ ప్రతిపక్షం చేపట్టనివ్వదు. ప్రజలకే మాత్రం ఆసక్తి లేని అన్ని రకాల సంచలనవిషయాలను ముందుకు తెచ్చి భూ పరిమితుల వంటి ముఖ్యమైన వ్యవహారాలను అర్ధరాత్రికి నెట్టేస్తారు. వాళ్ళు దానినెలాగూ ఓడించలేరు కనుక ఎవ్వరూ గమనించని సమయంలో ఆమోదిస్తారనుకోండి...'

'ఈ రోజున ప్రతిపక్షం ఎత్తుగడలలో బాగా వేళ్ళూనుకున్న వాటిలో ఇది కూడా ఒకటి. ఆ పార్టీల దృష్ట్యా చూసినా ఇది భావ్యమేనని నేను చెప్పలేను, కానీ జరుగుతున్నదదే. అందుకే అంతిమంగా బిల్లు ఆమోదానికి వర్షాకాలసమావేశాల ప్రథమార్థాన్నే నేను దృష్టిలో పెట్టుకుంటున్నాను. అయితే, ఇది చాలా అత్యవసరమైన వ్యవహారమన్న అభిప్రాయం సడలకుండా ఎప్పుడూ ఒత్తిడిని కొనసాగిస్తూనే ఉండాలి. సభావ్యవహారాలలో దీనికున్న అగ్రస్థానాన్ని నిలబెడుతూనే ఉండాలి. లేకపోతే వాళ్ళు ఏవేవో ఆటంకాలు సృష్టిస్తూనే ఉంటారు...'

'ఇంతకీ ఆనంద్ భాయి, వాతావరణంలో ఈ ఉద్రిక్తత, ఈ గుసగుసలు ఏమిటంటారు? మనకు తెలియని తెరవెనుక కారణమేమైనా ఉందంటారా? నాకంతా అయోమయంగా ఉంది...'

'లేకేం, ఉంది. ఎన్నో ఉన్నట్టే అదీ,' ఆనంద్ అన్నాడు. అంటూ తన 'టాప్ సీక్రెట్' డ్రాయిర్ లోంచి ఒక సి.ఐ.డి. నివేదికల దొంతర తీసి డిప్యూటీ స్పీకర్‌కు అందించాడు. వివిధ జిల్లాల్లో - ముఖ్యంగా ఉద్యమాలకు పేరుపొందిన జిల్లాల్లో అంతటా అశాంతినీ కల్లోలాన్నీ రెచ్చగొట్టడానికి ఎలా కుట్ర జరుగుతుందో ఆ నివేదికలు స్పష్టమైన వివరాలిచ్చాయి. అక్కడ, ఉద్యమాలు జరిపించడమే వృత్తిగాఉన్న ముఠాలు చురుగ్గా పనిచేస్తున్నాయి. కారణమేమైనా సరే. ఉద్యమవిజయానికి హామీ ముందే లభిస్తుంది. ఇంతవరకూ సిఐడి విభాగం కనిపెట్టలేకపోయిందొకటే, ఏ అంశం మీద, లేదా ఏ అంశాల మీద ఉద్యమం రాజేస్తున్నారన్నదే. ఎందుకంటే, ఆందోళనను రెచ్చగొట్టడానికి అవకాశమిచ్చే కారణాలనేకం ఉంటాయి. ఇక సమయసందర్భాల విషయానికొస్తే సీలింగ్స్ బిల్లు ఆమోదసన్నాహాలను దృష్టిలో పెట్టుకుని అల్లర్లకు కుట్ర జరుగుతోందనిపిస్తోంది. శాసనసభలో దానిపై చర్చ కొనసాగుతున్న కొద్దీ ఉద్యమాల ఉధృతి కూడా పెరుగుతుంది. ఇక బిల్లులోని వివిధ ప్రొవిజన్లకు వ్యతిరేకంగా రాష్ట్ర రాజధానిలో ప్రదర్శనలు కూడా జరగబోతున్నాయి. ఉద్యమకారులు అసెంబ్లీ భవనాన్ని ఘెరావ్ చేసి సభాకార్యక్రమాలకు అంతరాయం కలిగించబోతున్నారు. దాంతో ఏ రోజు కా రోజు సభను అర్ధాంతరంగా వాయిదా వేసే పరిస్థితి ఏర్పడుతుంది. ఇదంతా సాధారణంగా అనుసరించే సరళి.

నివేదికలు చదివి సలీముల్లా మొహం పాలిపోయింది. ఇంటెలిజెన్స్ బ్యూరో నివేదికల్లో మరి కొన్ని కుట్రల గురించి ప్రస్తావన ఉంది. అవి అమలు జరిగితే కొన్ని సున్నితమైన ప్రాంతాల్లో రక్తపుటేరులు పారతాయి. మిగిలినవాటితోపాటు ఉద్దేశపూర్వకంగా పెద్ద ఎత్తున మతపరమైన దాడుల్ని రెచ్చగొట్టే కుట్ర కూడా ఉంది. భారీ రైల్వే స్టేషన్ భవంతుల మీద, ఇతర కేంద్రప్రభుత్వ ఆస్తుల మీద హింసాత్మకమైన దాడులకు కూడా పథకరచన జరిగింది. ఇంటెలిజెన్స్ నివేదికల ప్రకారం వీటన్నింటి వెనుక ఉద్దేశం ఒకటే. రాష్ట్రాన్ని పూర్తిగా అరాచకత్వంలో ముంచితేల్చుతున్న ఒక ఉన్మత్త ముఖ్యమంత్రికి మద్దతు ఇచ్చి తనెంత పొరపాటు చేస్తున్నారో ప్రధానమంత్రి గ్రహించేలా చేయడం. చివరగా, ఈ అరాచకచర్యలన్నింటికీ ఆర్థిక సహాయం అందిస్తున్న శక్తుల గురించి చూచాయగా సూచించడం జరిగింది. అయితే అదింకా ప్రాథమికసమాచారం మాత్రమే.

శాసనసభలో రెండు టర్మ్‌ల అనుభవం, మంచి చురుకుదనం ఉన్న యువకుడైన డిప్యూటీ స్పీకర్ తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు. రాజకీయవాదులు కూడా ఇంతరాక్షసంగా, ఇంత నిర్దాక్షిణ్యంగా వ్యవహరించగలరా అనుకుని విస్తుపోయాడు. అంతలోనే, సిఐడి నివేదికలోని ముఖ్యాంశాలను మరోసారి పరిశీలించి వెంటనే తనను తాను సరిదిద్దుకున్నాడు. దీనికంతటికీ ముందుభాగంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నది రాజకీయవాదులే కానీ, సమస్య మూలంలో పొంచి చూస్తున్నది, నేలతల్లిని పిండి సంపాదించిన వనరులన్నింటినీ ఈ విధ్వంసాగ్నిలో కుమ్మరిస్తున్న, స్వార్థం మూర్తీభవించిన భూస్వామే. తనూహించుకున్న దృశ్యానికి నిలువునా వణికిపోతూ సలీమ్ నిశ్చలస్వరంతో ఆనంద్‌తో అన్నాడు, 'కడవరకూ నేను మీతో ఉంటాను భయ్యా, మీ అనుమతిలేకుండా అఫ్రోజాబాద్ నుంచి అడుగు బయటపెట్టనని హామీ ఇస్తున్నాను. బిల్లుకే నా మొట్టమొదటి ప్రాధాన్యం, ఈ క్షణంనుంచి అదే నాకు సర్వస్వం! . . '

★ ★ ★

శాసనసభలో సీలింగ్స్ బిల్లు పరిశీలన జరుగుతుండగానే, ఎం.ఎల్.ఏలకు వారి నియోజకవర్గాల నుంచి బెదిరింపు లేఖలు అందాయి. ఆ 'నిరంకుశ చట్టాన్ని' ఆమోదిస్తే తమ గ్రామాల్లోకి అడుగుపెట్టలేరని ఆ లేఖల్లో హెచ్చరించారు అక్కడక్కడ వాళ్ళ బంధువులపై చేయి చేసుకున్నారు. వాళ్ళలో చాలామందికి చెందిన గడ్డివాములకు, ఆరు బయట ఉన్న అలాంటి ఇతర ఆస్తులకు రాత్రిపూట కొందరు గుర్తుతెలియని వ్యక్తులు నిప్పుపెట్టారు.

సాధారణ ప్రజానీకం మాత్రం, శాసన సభలో తమకింత మంచి చేసే వ్యవహారమే సాగుతోందని సంతోషించారు. సీలింగ్స్ బిల్లుకు అనుకూలంగా ప్రదర్శనలు నిర్వహించి తమ ఉత్సాహాన్ని వాళ్ళు ప్రదర్శించుకోవాలని కూడా అనుకున్నారు. అయితే వాళ్లు నిరుపేదలు. ప్రదర్శనకు భారీ ఎత్తున జనాన్ని సమీకరించుకోలేరు. మరో పక్క భూస్వాములు, శాసనసభలో బిల్లుపై చర్చ జరుగుతున్నన్ని రోజులు మొత్తం అఫ్రోజాబాద్ రాష్ట్రాన్నే ఒక ప్రభుత్వ వ్యతిరేక శిబిరంగా మార్చివేయగలిగారు. అలాగే, బిల్లు పట్ల సంతోషం వ్యక్తం చేస్తున్న వారిలో చాలామంది నిరక్షరాస్యులు, అసంఘటితులు కనుక ప్రచారసాధనాలద్వారా తమ అభిప్రాయాలను ప్రకటించుకోలేరు. ఇందుకు భిన్నంగా భూస్వాములు బిల్లు వ్యతిరేక ప్రదర్శనల వివరాలతో, స్వాతంత్ర్యానంతరం ప్రప్రథమంగా చూస్తున్న అత్యంతపాశవిక చర్యగా బిల్లును అభివర్ణించే ఆకర్షణీయమైన నినాదాలతో పత్రికలు నిండిపోయేలా చేయగలిగారు. 'ఇలా పొయ్యిలు, కొంపలు ఆర్పడానికేనా వేలాదిమంది స్వాతంత్ర్యసమరయోధులు, స్వాతంత్ర్యసమరంలో తమ సర్వస్వం త్యాగం చేసింది?' ఇదీ ప్రదర్శకుల ప్రశ్న. 'ఇలా అన్నదాతల నోట్లో మట్టికొట్టి బికారుల్ని చేయడానికేనా భరతమాత ఘన పుత్రులు సర్దార్ భగత్ సింగ్, సుఖదేవ్ లాంటి వందలాదిమంది ప్రాణాలర్పించినది?' అని కూడా వాళ్ళు అడుగుతున్నారు. మహాత్మా గాంధీ జీవించి ఉంటే ఆయన ప్రజలను నిలువుదోపిడీ చేసే ఈ విపరీత హింసను ఆమోదించేవారా? అన్నది వారి మరో ప్రశ్న. ఇలా మహాత్ముని విప్లవకారులనీ కూడా భూస్వాముల ప్రయోజనాలకు పనికొచ్చే పరికరాలుగా మార్చేశారు.

రాష్ట్రరాజధానిలో పోలీసుబలగాన్ని గణనీయంగా సమీకరించవలసి వచ్చింది. చెదురుమదురుగానైనా, ప్రతిరోజూ పగలూ రాత్రీ కూడా కత్తిపోటు సంఘటనలు మామూలైపోయాయి. బయటినుంచి వచ్చే సందర్శకులకు అఫ్రోజాబాద్, ఎవరికీ భద్రతలేని, ఏ క్షణంలోనైనా ఏదైనా జరిగే అవకాశమున్న అతి పెద్ద నేరాల పుట్టగా కనిపిస్తూ వచ్చింది ఈ ప్రజావ్యతిరేక శాసనాన్ని రాష్ట్రప్రభుత్వం అంత మొండిగా ఎందుకు జనం మీద రుద్దుతోందన్న ప్రశ్న ప్రతి ఒకరిలో బయలుదేరింది. పైగా ఇది పర్యాటకులు వచ్చే సీజన్ కావడంవల్ల అఫ్రోజాబాద్ సందర్శనకు (పదిహేడో శతాబ్దికి చెందిన సమాధులు, కోటల్లో రాజుల స్నానశాలలు, వగైరా చూడడానికి) వచ్చిన ఎందరో విదేశీపర్యాటకులు భయభ్రాంతులైపోయారు. బిక్కచచ్చిపోతూ, 'గొప్పదేశానికే వచ్చాంలే', అని గొణుగుతూ వెంట ఉన్న మహిళా యాత్రికులు తెచ్చిన ఒత్తిడికి లొంగి, విశ్రాంతిగా గడపడానికి ముందు చేసుకున్న ఏర్పాట్లనన్నింటినీ రద్దు చేసుకున్నారు. ఢిల్లీకో, బొంబాయికో తిరిగి వెడుతూ ఆ 'సోషలిస్టు కూపంలో' తామున్నంతసేపూ ఎంత

అభద్రతాభావంతో గడిపారో భయంకరమైన కథనాలు అంతటా ప్రచారంచేశారు. ఆ కథనాలను, భారతదేశంలో విదేశీ విలేఖరుల రిపోర్టులతో కూడా బేరీజు వేసి, పాత్రికేయ ప్రజ్ఞను రంగరిస్తూ వాటిని కనీసన్యాలానికి సరిపోయేటట్టు చక్కగా కుదించి లండన్, న్యూయార్క్‌లలోని ప్రతిష్ఠాత్మకమైన పత్రికలు మనసుకు హత్తుకునేలా ప్రచురించాయి. మొత్తంమీద వాటి సారాంశంఒకటే. భారతదేశంలో, ప్రధానమంత్రి నియమించిన ఒక సోషలిస్టు భావాలుగల ముఖ్యమంత్రి పాలనలోఉన్న ఒక రాష్ట్రంలో తుపాకీ గురిపెట్టి సామూహికంగా భూయజమానులనుంచి వారి ఆనువంశికభూముల్ని హరించివేస్తున్నారు! అలా, ఇందిరాగాంధీ నియంతృత్వపాలనలో భారతదేశప్రజాస్వామ్యాన్ని ఒక విలక్షణముద్రతో ప్రదర్శిస్తున్నారు!

రోజు వెంట రోజు సభామోదం పొందుతున్న ప్రొవిజన్ల వివరాలను పత్రికలు తెలివిగా కప్పి పుచ్చుతున్నాయి. ప్రదర్శనల దృశ్యాలు, హింసాత్మక సంఘటనల వార్తలే పత్రికలనిండా పొంగిపొరలుతున్నాయి. శాంతిభద్రతల పరిస్థితి పూర్తిగా అదుపు తప్పుతోందనీ, ఈ మూర్ఖపు చట్టాన్ని తేకుండా ఇకనైనా నివారించాలనీ, భయాందోళనలకు గురవుతున్న పౌరులకు కొంచెమైనా ఊరట కలగాలంటే బహుశా తగినంత కాలంపాటు రాష్ట్రపతిపాలన విధించవలసి ఉంటుందనీ - ఇటువంటి నిర్ధారణలు ప్రప్రథమంగా గ్రేట్ ఇండియా టైమ్స్‌లో తొంగిచూశాయి. తక్షణమే వివిధ భాషలలోని అనేక పత్రికలు ఆబగా వాటిని అందిపుచ్చుకున్నాయి. ఈ క్రమంలో సీలింగ్స్ బిల్లూ, దాని వాస్తవిక స్ఫూర్తీ పూర్తిగా కనుమరుగైపోయాయి. కొన్ని సందర్భాలలో సైన్యాన్ని పిలిపించవలసి వచ్చింది. సైన్యం కవాతు తరచు జరుగుతూ వచ్చింది. అసలు విషయం మరుగున పడిపోయి కేవలం దానిపై జరిగిన, జరిపించిన, సంఘటనల చిత్రణ మాత్రమే పూర్తిగా ప్రజల దృష్టిని హైజాక్ చేసే విపరీత పరిస్థితులలో ఇదొకటి. కొందరు అమాయక ప్రజల కష్టార్జితాన్ని కొల్లగొడుతున్న ప్రభుత్వం, దాని పర్యవసానంగా తలెత్తిన ప్రజాఉద్యమాన్ని పాశవిక సైనికబలంతో అణచివేస్తోంది - ఇదీ అంతటా చక్కర్లు కొడుతున్న పారాంతరం. ప్రదర్శనలు జరుపుతున్న గుంపులు, తుపాకీ పుచ్చుకున్న సైని సిబ్బంది ఫొటోలతో దాదాపు అన్ని పత్రికలు నిండిపోతున్నాయి. ఇక పత్రికల్లో వెల్లువెత్తిన కరిచే కార్టూన్ల సంగతి చెప్పనే అక్కర్లేదు.

కొన్ని రాజకీయ పార్టీలు భూ పరిమితి బిల్లును సమర్థిస్తున్నాయి కనుక ప్రదర్శనలను వ్యతిరేకించాయి. అయితే, వాటి దృష్టిలో, కారణం ఏదైనా సరే ఆందోళన దానికదే మంచిది కనుక ప్రదర్శనలకు వ్యతిరేకంగా నిర్దిష్టమైన ఎటువంటి కార్యాచరణకు దిగకుండా అవి ఊరుకున్నాయి. 'ఏదేమైనా, భూ పరిమితుల చట్టం తెచ్చిన ఘనత అధికారపక్షానికే దక్కుతుంది. మేము మాటల్లో బిల్లుకు మద్దతు ఇస్తే ఇవ్వచ్చు తప్ప, కష్టాల్లో కడగండ్లలో కూరుకుపోయిన ప్రభుత్వాన్ని కాపాడాల్సిన అవసరం మాకేముంది? దాని బాధ అదే పడాలి,' సామాజికఅన్యాయంపై రాత్రింబగళ్ళు నిప్పులు కక్కే ఒక నాయకుని వివరణ ఇలా ఉంది.

ఆనవాయితీగా ఉండే కోతలుగానీ, తర్జనభర్జనలు కానీ పెద్దగా లేకుండానే వార్షిక బడ్జెట్ ఆమోదం ముగిసింది. ఆచరణలో ఉన్న అభ్యాసం ప్రకారం అధికారపక్షం దానిని అత్యద్భుతమైన

బడ్జెట్‌గా అభివర్ణిస్తే, ప్రతిపక్షం పూర్తిగా ప్రజావ్యతిరేక బడ్జెట్‌గా తిట్టిపోసింది. రెంటిలో ఏ వర్ణనకు సంబంధించి కూడా విపులంగా చర్చలు జరగలేదు. తెగేవరకూ లాగే పనికి ఎవరూ పూనుకోలేదు. బడ్జెట్ ఆమోదం పొందక పోతే ఏప్రిల్ మొదటి తేదీన ప్రభుత్వంలో ఉన్న ఎవరికీ జీతాలు రావనీ; బడ్జెట్‌ను, కొన్ని శాఖల పద్దులను ఆమోదించడం మినహా గత్యంతరం లేదనీ, అందరికీ తెలుసు. అదంతా ఒక తంతుగా జరిగే వ్యవహారం. ఇప్పుడందరి దృష్టి క్లాజులవారీగా జరిగే సీలింగ్స్ బిల్లు చర్చమీదే ఉంది. ఉభయసభలలో అరుపులు, గర్జనల మధ్య, బయట ఎడతెరిపిలేకుండా జరిగే ఉద్యమాలు, ఊరేగింపుల మధ్య, బిల్లులోని ముఖ్యాంశాలపై సాధారణచర్చ రూపంలో ప్రథమ పరిశీలన ముగిసింది. ఆనంద్, ఆయా పార్టీలకు చెందిన మరికొందరు వాగ్ధాటి గల సభ్యులు ఎంతో ప్రజ్ఞావంతంగా, ఎదుటివారిని సమాధానపరచగలరీతిలో తేటతెల్లంగా చేసిన ప్రసంగాలు పత్రికలలో సవివరమైన ప్రచురణకు నోచుకోలేదు. వెక్కిరింపులు, కేకల గురించిన విశేషాలైతే కాలాలతరబడి ఆక్రమించాయి.

స్పీకర్ వృద్ధుడు, పైగా జబ్బు మనిషి, కనుక ఆయన రోజూ సభకు రాకపోవడానికి సంజాయిషీ ఇచ్చుకోనవసరం లేదు. డిప్యూటీ స్పీకర్ సలీముల్లా అపారమైన సామర్థ్యంతో పరిస్థితిని తన చేతుల్లోకి తీసుకున్నాడు. నిర్వహణపటిమతోనూ, గొంతుబలంతోనూ కూడా అతడు ప్రతిపక్షసభ్యుల నోటికి తాళం వేయగలిగాడు. చర్చ మొదట్లో మందగతిలో సాగినా, బిల్లు పట్ల వ్యతిరేకత నీరసించి, కృత్రిమంగా మారడంతో చర్చ వేగాన్ని పుంజుకుంది. ప్రథమ పరిశీలన పూర్తవగానే ఉత్సాహవంతులైన ఎం.ఎల్.ఏలు సలీమ్‌ను అభినందిస్తూ అతని వెన్నుపై చరుపుల వర్షం కురిపించారు. చివరకు అతని స్టీమ్ రోలర్ సత్తాను ప్రతిపక్షసభ్యులుకూడా మెచ్చుకోకుండా ఉండలేకపోయారు. ఆనంద్ అతణ్ణి ఎంతో ఆదరంగా అక్కున చేర్చుకున్నాడు

బిల్లు రెండవ పరిశీలన కూడా వెంటనే ప్రారంభమైపోయింది. ముందే చెప్పినట్టుగా స్పీకర్ మొదటి మూడురోజులే సభకు అధ్యక్షత వహించాడు. ఆ తర్వాత సలీముల్లా స్టీమ్‌రోలర్ రంగ ప్రవేశం చేసింది. బిల్లును అడ్డుకోగలమని అప్పటికెవరిలోనైనా ఏ కొంచెమైనా ఆశ మిగిలుంటే అది అసాధ్యమని ఈపాటికి అర్థమైపోయింది. చౌదరి, శేఖర్‌లు బిల్లును బాహాటంగా వ్యతిరేకించలేదు. నిజానికి చౌదరి, జవహర్‌లాల్ నెహ్రూ ఆకాంక్షల ప్రతిబింబాన్ని ఆ బిల్లులో చూస్తూ, దానికి తన మద్దతు ప్రకటిస్తూ కొన్ని మంచి మాటలు చెప్పాడు. 'పార్లమెంటు సెంట్రల్ హాల్లో చౌదరికి సారంగాలూ గోతులూ తవ్వే వారి నోళ్ళు మూయడానికంతే చాలున'ని ఒక సభ్యుడు వ్యాఖ్యానించాడు.

# 58

ఓ రోజు ఉదయం, ఉద్యమ రూపురేఖలనే మార్చేసే ఒక ఆందోళనకరవార్త మోసుకొచ్చాడు డిజిపి మీనన్. 'దిగ్భ్రాంతి కలిగించే పరిణామం సార్, జిల్లా పరిషత్తుల అధ్యక్షులలో నలుగురు మినహా అందరూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా మారిపోయి నిన్నటినుంచి భూ పరిమితుల వ్యతిరేక ఆందోళనకు ఆజ్యం పోయడం ప్రారంభించారు. నేను ఈ విషయం మీ దృష్టికి తెచ్చేముందే వాస్తవాలను ఒకటికి రెండు సార్లు ధ్రువీకరించుకున్నాను. దాదాపు వీళ్ళందరూ అధికారపక్షానికి చెందినవారే, గ్రామ ప్రాంతాల్లో బాగా పట్టున్నవారే. ఏకంగా జిల్లా పరిషత్తుల నిధుల్ని, వాహనాలను, సిబ్బందిని కూడా అందుకు వినియోగిస్తూ ఉద్యమం ఉధృతిని పెంచుతున్నారు. ఇక మేమేం చేయాలి సార్? మీ ఆదేశాలు కోరుతున్నాను. ఇది వట్టి శాంతిభద్రతల సమస్యకాదు, దీనికి స్పష్టమైన రాజకీయకోణం కూడా కనిపిస్తోంది...'

ఆనంద్ నివ్వెరపోయాడు. ఈ పరిణామాన్ని తను ముందే ఊహించి ఉండవలసిందనుకున్నాడు. ఈ అధ్యక్షులందరూ ముఖ్యమంత్రి చౌదరి ఏరికోరి తెచ్చుకున్నవారు, ఆయన హయాంలోనే ఏకగ్రీవంగా ఎన్నికైన వారు. అయితే వాళ్ళలో ఏ ఒక్కరితో అటు వ్యక్తిగతంగానూ, ఇటు అధికారికంగానూ, ఆనంద్‌కెలాంటి వైమనస్యం లేదు. ప్రజలెన్నుకున్న సంస్థలుగా, జిల్లా పరిషత్తుల విధులు అవసరాల పట్ల అతడికి గల తపనను, నిజాయితీని వారు గుర్తించినవారే. వారితో అంతా సాఫీగానే జరుగుతూ ఉంది . . . ఇంతవరకు.

అయినా ఈ అధ్యక్షులందరూ ఇప్పుడు పోరుబాట పట్టారంటే అందుకు కారణం కొంతవరకు భూ పరిమితి చట్టం పట్ల వారికి గల అయిష్టత, చాలావరకు వారి గురువైన చౌదరి పట్ల చూపవలసిన రాజకీయవిధేయత. అజ్ఞాతవర్గాలే అయినా నమ్మకమైన వర్గాల ద్వారా చౌదరి వాళ్ళకు పంపించిన ఆదేశాలివి : 'ఈ ముఖ్యమంత్రి మీ కాలిగోరుకూడా కదపలేడు, నా మాట నమ్మండి. మీరింకా నిండు రెండేళ్ళు అధికారంలో ఉంటారు. అంటే నిండు రెండేళ్ళు ఈ ఉద్యమం మీ చేతుల్లోనే ఉంటుంది. అయితే మీ మిగిలిన పదవీకాలంలో సగమైనా గడవడానికి ముందే ఈ ఆనంద్‌గాడి ప్రభుత్వం అంతరించిపోతుంది. అందుకు నాదీ హామీ!'

ఉద్యమంలో వారు బాహాటంగా, అధికారికంగా, పాల్గొంటే ఊహించని పరిణామాలుంటాయని ఆనంద్ స్థానికప్రజాప్రతినిధులకు నచ్చజెప్పే ప్రయత్నం చేశాడు. దాన్ని శేఖర్

ఖండిస్తూ ఇలా వివరించాడు, 'అది వట్టి బుకాయింపు. పంచాయతీలు, జిల్లా పరిషత్తుల చట్టాన్ని ఆమూలాగ్రం ఎన్నంటే అన్నిసార్లు చదువుకో. మీ స్థానిక సంస్థలను గురించి రాష్ట్ర ప్రభుత్వానికి ఎలాంటి అధికారాన్ని కట్టబెట్టే ప్రొవిజన్ అందులో ఒక్కటైనా ఉంటే చూపించు. ఆ చట్టాన్ని ఆమోదించే ముందు మేం మీ పక్షాన చాలా పోరాటాలు చేశాం. ఆ సంగతి నీకూచాలా బాగా తెలుసు. కనుక ఇక్కడ వారి పప్పులుడకవు. అదీగాక, నేడు నీ నాయకుడిపట్ల అచంచలవిధేయత, విశ్వాసపాత్రతకన్నా ముఖ్యమైంది.

మరేదీ లేదు. నిన్నింత ఉన్నతస్థానంలో కూర్చోబెట్టింది చౌదరేనన్న సంగతి మరచిపోకు, నిన్నిక్కడ ఉంచగలగిన సామర్థ్యం కూడా అతనికొక్కడికే ఉంది!'

జిల్లాపరిషత్ అధ్యక్షుల ఆగడాలు అన్ని ఔచిత్యాలనూ అతిక్రమించిపోయి ప్రభుత్వానికి గడ్డు సమస్యగా మారి కూర్చున్నాయి. సంబంధిత చట్టంలోని ప్రొవిజన్లను ఆనంద్ ఒకటికి రెండుసార్లు ఎంత గాలించినా సందు దొరకలేదు. జిల్లా పరిషత్తు వాహనాలనూ, సిబ్బందినీ, నిధుల్నీ పరిషత్తు చేపట్టిన కార్యక్రమాలకు మాత్రమే వాడాలన్నది నిజమే. అయితే, 'జిల్లా పరిషత్తు కార్యక్రమాలు ఇవీ' అని ఒక్క అధ్యక్షుడు మినహా ఇంకెవరు నిర్వచించగలరు? చట్టంలో నిర్దేశించిన, రోజువారీగా అమలుజరిగే రకరకాల పనులలో ఎక్కడ 'దుర్వినియోగం' జరిగిందని వేలెత్తి చూపగలం? అది సాధ్యమయ్యేదికాదు. ఇక్కడ ఒక ప్రజాప్రాతినిధ్యసంస్థ చేసిన శాసనాన్ని వమ్ము చేయడానికని మరొక ప్రజాప్రాతినిధ్యసంస్థను ప్రయోగించడం జరుగుతోంది. ఇందుకు పాల్పడింది కూడా ఆ ప్రజలచే ఉభయసంస్థలకు ఎన్నుకోబడినవారే.

అంటే ప్రచలిత వ్యవస్థను కేవలం రాజకీయ కుయుక్తుల ద్వారా విపర్యస్తం చేసి, దానికి పూర్తిగా విభిన్నమైన మరొక విషయంలో కక్ష సాధించుకోవడానికి చేసే తతంగమన్నమాట. రాజకీయ ఉన్మాదానికి ఇదే చివరి హద్దు!

'ఇదీ పరిస్థితి. దీనిని సమర్థవంతంగా ఎదుర్కొనడానికి రాజ్యాంగ, శాసనపరమైన సాధనాలను మీరు కనిపెట్టాలి,' అన్నాడు ఆనంద్, ప్రభుత్వంలో తనకు సహకరించే ఉన్నతస్తంభాలైన చీఫ్ సెక్రటరీ, రెవిన్యూ సెక్రటరీ, లా సెక్రటరీ, పంచాయితీ రాజ్ సెక్రటరీ, డిజిపి మీనన్, డిఐజి (సిఐడి), న్యాయశాఖకు చెందిన ఇద్దరు డ్రాఫ్ట్స్‌మెన్, మరికొందరు ముఖ్యులతో. 'ఇంకోటి గుర్తుపెట్టుకోండి. ఏ న్యాయసూత్రంతోనూ, ఎలాంటి రాజకీయాలతోనూ ఇక్కడ సంబంధంలేదు. లక్షలాదిమంది నిరుపేదలు ఎంతో ఆత్రుతతో ఎదురుచూస్తున్న సీలింగ్స్ చట్టం ఆమోదాన్నీ అమలునూ అడ్డుకోడం లక్ష్యంగా ఊతమిచ్చిన ఉద్యమానికి జిల్లా పరిషత్తుల ఆస్తులనూ సిబ్బందినీ, ఏ హద్దూ అదుపూ లేకుండా దుర్వినియోగం చేయడమే ఇది. ఇది సహించరాని విషయమని మీరు కూడా ఒప్పుకుంటా రనుకుంటాను.'

అధికారులలో చాలామంది చౌదరికింద పనిచేసినవారూ, నడుస్తున్న ఉద్యమంలో అతని పాత్ర గురించి తెలిసినవారూ కనుక దీనిపై పెద్దగా ఎలాంటి ప్రతిస్పందన వ్యక్తం చేయలేదు. ఇవన్నీ వారి దృష్టిలో ముఖ్యంగా 'రాజకీయపుటెత్తులు, పై ఎత్తులు'; అధికారవర్గం ఇందులో ఆచితూచి అడుగెయ్యాలి. ఇంకా చెప్పాలంటే ఇలాంటి వ్యవహారాల్లో సాధ్యమైనంతవరకు అసలు

అడుగెయ్యకపోవడమే ఉత్తమం. దాంతో, జిల్లా పరిషత్తు ఆస్తులను అలా ఉపయోగించడం సరికాదంటూ అందరూ ఒకవిధమైన స్థూలాభిప్రాయాన్ని ప్రకటించేసి ఊరుకున్నారు. ఇలాంటి పరిస్థితిని ఎదుర్కోడానికి ప్రత్యక్షంగానో, అర్థాత్తుగానో, సందు కల్పించేదేదైనా దొరుకుతుందేమోనని-దొరకదని వాళ్ళకు కచ్చితంగా తెలిసినా- పంచాయితీరాజ్ చట్టంలోని ప్రొవిజన్లను క్షుణ్ణంగా గాలించడం ప్రారంభించారు.వ్యక్తిగతంగా, లేదా చెదురుమదురుగా జరిగే దుర్వినియోగాన్ని ఏదో ఒక నిబంధనతో అడ్డుకోవచ్చుకానీ, రాజకీయప్రేరణలో ఉద్దేశపూర్వకంగా రాష్ట్రవ్యాప్తంగా జరిగే దుర్వినియోగం విషయంలో ఏంచేయాలో చట్టం నిర్దేశించలేదు. కనుక ఫలితం మీద ఏ కొంచెమైనా ఆశ పెట్టుకుని దానిని ఎదుర్కోడమైతే అసాధ్యం. ఎంతో విశదంగా రూపొందించిన నోట్సు ముందుపెట్టుకుని ఇప్పటికే అనేకసార్లు అధికారులు వ్యక్తం చేసిన ఏకాభిప్రాయం ఇదే. దాదాపు అవే మాటలు ఈ సమావేశంలో తిరిగి వల్లించారు.

ఇంతలో కేంద్ర హోం మంత్రి నుంచి అర్జెంటు కాల్ వచ్చిందని చెప్పి పక్కగదిలోకి రావలసిందని పర్సనల్ సెక్రటరీ, ఆనంద్‌ను ఇంటర్‌కామ్‌లో కోరాడు.

క్షణకాలం ఆనంద్ కనుబొమలు ముడిపడ్డాయి. వెంటనే దానిని సర్దుకొని పక్కగదిలోకి నడిచాడు. న్యాయశాఖలో రెండో డ్రాఫ్ట్స్‌మన్ జాన్‌పాల్ నాగరాజ్ చెవిలో గుసగుసలాడాడు. 'అదిగో, ఏదో ముప్పు ముంచుకొస్తోంది. అది కూడా కచ్చితంగా ఢిల్లీ నుంచే!' ముఖ్యమంత్రి తనను విస్మరించి సంప్రదింపుల కోసం ఒకటికి రెండుసార్లు నాగరాజ్‌నే పిలుస్తున్నందుకు జాన్‌కు కోపంగా ఉంది. పరిపాలనాకోణంనుంచి చూస్తే ఇది క్షమార్హం కాని వివక్షే. లా సెక్రటరీ ఉమాశంకర్ కూడా ఈ విషయంలో కుతకుతలాడుతున్నాడు. తన బాధను జాన్‌తో పంచుకున్నాడు కూడా. అయితే ఉమాశంకర్ దానిని లోలోపలే అణచుకున్నాడు. అసలామాటకొస్తే భూ పరిమితుల చట్టమే అధికారయంత్రాంగమంతటికీ పుండు సలుపుగా తయారైంది. ఉన్నతాధికారులు, మరీ అంత ఉన్నతులు కాని అధికారులనెందరినో రకరకాల పద్ధతుల్లో, రకరకాల స్థాయీబేధాల్లో అది దెబ్బ తీసేలా ఉంది. ఇక మీదట భూమిని నమ్ముకుని దానిమీద తమ 'సేవింగ్స్'ను పెట్టుబడి పెట్టడానికి లేదు. దానికి బదులు ఇప్పుడు బంగారం వైపు మొగ్గారు. అయితే ఆ తెల్లటోపీల కింద మెలికలు తిరిగిన బుర్రల్లో ఆ పసిడిముద్దకు ఎలాంటి ప్రమాదాలు పొంచున్నాయో ఎవరికి తెలుసన్న అనుమానం కూడా మరో పక్కనుంచి వారిని పీడిస్తూనే ఉంది.

హోం మంత్రిగారి సందేశం పొంతనలేని వాక్యాలతో కూర్చినట్టుంది. ఒక ప్రయోజనాన్ని ఆశించే అదలా ఉన్న విషయం తెలిసిపోతున్నా, ఆనంద్‌కు అదొక చిక్కుముడిలానే కనిపించింది. అఫ్రోజాబాద్‌కు సంబంధించిన సమాచారమంతా ఇంటెలిజెన్స్ వర్గాల ద్వారా తనకెప్పటికప్పుడు చేరుతున్నా, హోం మంత్రి ముక్కుసూటిగా మాట్లాడకపోవడానికి తగిన కారణం లేదనుకున్నాడు ఆనంద్. హోం మంత్రి సంభాషణ ముగిస్తూ- అప్పటికి నాలుగోసారో అయిదోసారో- ప్రధానమంత్రి చాలా ఆందోళన పడుతున్నారన్నాడు. ఈ సూచన వట్టి సూచనకాదు- మొత్తం గుట్టంతా అందులోనే ఉన్నట్టనిపించింది.

ఇందిరాగాంధీ ఆందోళన పడుతున్నారన్న కొత్త నిజం తెలియడంతో, ఆ ఆందోళన దేని గురించో, అది ఏ రకం ఆందోళనగా ఆమె భావిస్తున్నారో, ఆ ఆందోళనకేది పరిష్కారమని ఆమె

అనుకుంటున్నారో, ఆ ఆందోళనను తగ్గించడానికి, సాధ్యమైతే పూర్తిగా తొలిగించడానికి తనేం చేయాలని ఆమె ఆశిస్తున్నారో, ఆనంద్ పరిపరివిధాల ఊహలతో కుస్తీ పట్టవలసివచ్చింది. ప్రధానమంత్రి ఆందోళనకు గల ఈ కోణాల గణనం పూర్తయ్యేసరికి అతడు అధికారులతో సమావేశం జరుగుతున్న తన గదిలోకి తిరిగి వచ్చి కూర్చున్నాడు.

అప్పటికి, అతని ముఖంలో ప్రధానమంత్రి ఆందోళన గురించిన ఆలోచనా ఛాయలు మచ్చుకైనా లేవు. జిల్లా పరిషత్ అధ్యక్షుల విషయానికి తిరిగివస్తూ తన కెదురుగా ఉన్న అధికారుల గుంపు వైపు ప్రశ్నార్థకంగా చూశాడు. వాళ్ళలో వాళ్ళు గుసగుసలాడుకుంటూ కొంత వెతుకులాట సాగించిన తర్వాత, చీఫ్ సెక్రటరీ అన్నాడు, 'ప్రస్తుతానికి వ్యవహారం పీటముడిపడినట్టే కనిపిస్తోంది సార్. మీరనుమతిస్తే మరింత సావధానంగా పరిశీలించి, ఏదైనా దారి దొరికితే రేపు మళ్ళీ సమావేశమవుదాం.'

అధికారుల మూడ్‌నీ, మరింత వ్యవధి కావాలని అడగడం వెనుక గల కారణాన్ని అర్థం చేసుకున్న ఆనంద్ సమావేశాన్ని మరునాటికి వాయిదా వేశాడు. కానీ, కొరకరాని కొయ్యలాంటి ఆ సమస్యపై ఇలాంటి సమావేశాలు ఇంక జరగబోవని అతనికి బాగా తెలుసు. అదీగాక ఏ అధికారీ అలాంటి గుంపులో ఉన్నప్పుడు తన మనోగతాన్ని బయటపెట్టడని కూడా ఆ కొన్ని నిమిషాల్లోనే ఆనంద్ అర్థం చేసుకున్నాడు. ప్రతి అధికారీ ముఖ్యమంత్రితో ఏకాంతంగా తన అభిప్రాయాన్ని చెప్పడానికి ఇష్టపడతాడు. అందువల్ల అతనికెన్నో లాభాలుంటాయి, కనీసం ఎటువంటి నష్టం ఉండదు.

సమావేశం ముగిసి అధికారులు వెళ్ళిపోయారు. వారిలో చివరి మనిషి కూడా నిష్క్రమించిన తర్వాత ఆనంద్ పర్సనల్ సెక్రటరీ ఒక సీల్డ్ కవర్ తెచ్చి అందించి, సి.ఎం. మాత్రమే చూడాలంటూ ఇప్పుడే డ్రాఫ్ట్‌మన్ నాగరాజ్ దీనిని తన చేతికిచ్చాడని ఆనంద్‌తో చెప్పాడు. కొంత ఆత్రుతగా (తన తొందరకు తనలో తనే నవ్వుకుంటూ) ఆనంద్ కవరు విప్పాడు. విచిత్రంగా అందులో ముఖ్యమంత్రి కార్యాలయంలోని స్టేషనరీ నుంచి తీసుకున్న చిన్న కాగితంమీద చేత్తో రాసిన ఈ క్రింది లేఖ ఉంది.

'సర్,

సీలింగ్స్ బిల్లు విషయంలో మీరెంతో ఆదరంతో నాకిచ్చిన చనువును పురస్కరించుకుని ఇది రాస్తున్నాను. భూస్వాములు సృష్టించిన ఈ విపత్కరపరిస్థితిని ఎదుర్కొనడానికి తక్షణం ఒక ఆర్డినెన్స్ ద్వారా పంచాయతీలు, జిల్లా పరిషత్తుల చట్టాన్ని రద్దుచేయడం ఒక్కటే మార్గాంతరమని ఇప్పుడే నాకు తట్టింది. ఇటీవల ఒక ఉన్నతాధికార సంఘం వెల్లడించిన విషయాలను దృష్టిలో ఉంచుకుని జిల్లా పరిషత్తు చట్టంలోని ప్రొవిజన్ల సమూలసంస్కరణ విషయంలో ఇచ్చిన రిపోర్టు గురించి అదృష్టవశాత్తు ప్రభుత్వం ఇంకా నిర్ణయం తీసుకోవలసి ఉంది. యథావిధిగా, ప్రభుత్వానికి దురుద్దేశాలు ఆపాదిస్తూ, స్టే ఉత్తర్వులను కోరుతూ ఆర్డినెన్స్‌కు వ్యతిరేకంగా హైకోర్టులో తామరతంపరగా రిట్ పిటిషన్లు దాఖలవుతాయి.ప్రభుత్వం శాయశక్తులా పోరాడక తప్పదు. అడ్వకేట్ జనరల్ కాస్త బుద్ధి పెట్టగలిగితే ఆర్డినెన్స్‌ను నెగ్గించగలరు. సుదూర ప్రభావం కలిగించే ఈ

చర్యను బాహాటంగా సూచించడానికి నేను చాలా చిన్నవాణ్ణి. ఒకవేళ మీకిది ఆమోదయోగ్యమైతే ఈ ఆలోచన చెప్పిన ఘనతను లా సెక్రటరీకో, అస్థాయి గల మరొకరికో ఇస్తే కృతజ్ఞుణ్ణి

విధేయుడు,

నాగరాజ్

★ ★ ★

జిల్లా పరిషత్తుల వ్యవహారాన్ని సవివరంగా చర్చించడానికి రాత్రి 8 గంటల ప్రాంతంలో ఆనంద్, లా సెక్రటరీ ఉమాశంకర్ ఒక్కణ్ణే పిలిపించాడు. ముఖ్యమంత్రి పిలుపు ఉమాశంకర్‌కు కొంతవరకు ఊరట కలిగించింది. నాగరాజ్ లేకపోవడం అతని అంతశ్చేతనలో, బహుశా బహిశ్చేతనలో కూడా, ఆ ఊరటను మరింత పెంచింది. అధికారవర్గం తమ మధ్యగల హెచ్చుతగ్గుల తేడాను అతిగా పట్టించుకుంటూ ఒకరిని చూసి ఒకరు ఈర్ష్యపడే తీరు చాలా వింతగా ఉంటుంది. ఉదయం ఉద్యోగంలో చేరిన అధికారి అదే రోజున మధ్యాహ్నం ఉద్యోగంలో చేర్రిన అధికారికంటె పూర్తిగా ఒక శతాబ్దకాలం సీనియర్ అయిపోతాడు.

'ముక్కుసూటిగా చట్టం ప్రకారం వెడితే ఇది లొంగే సమస్యగా కనిపించడం లేదు ఉమాశంకర్ గారూ,' ఆనంద్ అన్నాడు. 'అయినా, ఇలాంటి చిక్కుముడులు విప్పడంలో దశాబ్దాల అనుభవం ఉన్న వ్యక్తిగా మీ అభిప్రాయం తెలుసుకోవాలనుకుంటున్నాను. ఈ ప్రతిష్టంభననుండి బయటపడే దారి ఏదో ఉండకపోదని నా మనసు చెబుతోంది. సాధారణ పరిస్థితులకు వర్తించే చట్టబద్ధవ్యవహరణ ఇక్కడ వర్తించదు. అలాగని కొన్ని అరాచకశక్తులు బుద్ధిపూర్వకంగా ఇలా బరితెగించినపుడు ప్రభుత్వం నిస్సహాయంగా చూస్తూ ఊరుకోనూ లేదు. మనం ఏం చేస్తే మంచిదంటారు?'

ఉమాశంకర్‌కు ఎలాంటి ఉపాయం తోచడం లేదు. ఇప్పుడున్న చట్టం ఏవిధంగానూ ఉపయోగించదు. పైగా ఇప్పటికప్పుడు దానిని సవరించడమూ కష్టమే. ఇప్పుడెలాంటి శాసనపరమైన దుస్సాహసం చేసినా దురుద్దేశం ఆపాదిస్తూ కచ్చితంగా కోర్టు దాన్ని కొట్టిపారేస్తుంది. ఎప్పుడూ ప్రజల కళ్ళముందు తిరిగే అధికారయుక్తులైన మరొక స్థాయి ప్రజాప్రతినిధుల తెగతో రాష్ట్ర ప్రభుత్వానికిప్పుడు విభేదం తారసిల్లింది. నిజానికి వాళ్ళకు శాసననిర్మాణబాధ్యతేదీ ఉండదు. కాని అపారమైన అధికారాలతో వాళ్ళు ఎల్లప్పుడూ కార్యనిర్వాహకులుగా తమ పరిధిలో రాజ్యమేలుతూ ఉంటారు. జిల్లాలకు జిల్లాలు వాళ్ళ ఉక్కు పిడికిట్లో ఉంటాయి. ముఖ్యంగా వాహనాలు, బహుశా ఐ.ఏ.ఎస్. క్యాడర్ తప్ప వివిధ స్థాయిల్లో గల సిబ్బంది వాళ్ళ అధీనంలో ఉంటారు. జిల్లా యంత్రాగాన్ని, ప్రజలను కూడా రకరకాల పద్ధతుల్లో వాళ్ళు తమ చెప్పుచేతుల్లో ఉంచుకోగలరు. ఎవరి ఆదుపాజ్ఞల్లోనూ ఉండని ఇలాంటివారిని అదుపుచేయడం ఎలా? ఉమాశంకర్ బుర్ర చించుకున్నాడు కానీ పనికొచ్చే సలహా ఏదీ ఇవ్వలేకపోయాడు. అయినా సాధారణస్థితికి భిన్నమైన ఎలాంటి సూచనైనా ముఖ్యమంత్రి నోట వెలువడితే మాత్రం పరిశీలనకు తనెంతైనా సిద్ధంగా ఉన్నట్టు కనిపించాడు.

కొద్ది నిశ్శబ్దం తర్వాత ఆనంద్ యథాలాపంగా అన్నాడు. 'అన్నట్టు ఉమాశంకర్‌గారూ, జిల్లా పరిషత్తుల పనితీరును సవివరంగా అధ్యయనం చేయడానికి ప్రభుత్వం ఒక ఉన్నతాధికారసంఘాన్ని నియమించింది కదూ! ఆ సంఘం సిఫార్సులేవైనా మీకు గుర్తున్నాయా?'

ఉమాశంకర్ ముఖంలో కొంత వెలుగు తొంగిచూసింది. 'అవును సర్, ఆ సిఫార్సుల పరిశీలన ఇంకా జరగలేదు. ఈలోపల వేరే అత్యవసరవిషయాలు వచ్చిపడ్డాయి. ఈ విషయం గురించి నాకు పూర్తిగా తెలియదు. ఈ మధ్యనే రిటైరైన నా సీనియర్ ఆ కమిటీకి మెంబర్ సెక్రటరీ గా ఉండేవారు...'

'ఇప్పుడా సిఫార్సులను బయటకు తీసి, మనమీ గండంనుంచి బయటపడే దారేమైనా చూపుతాయేమో చెబుతారా? రెండో కంటికి తెలియకుండా ఈ పని మీ రొక్కరే చేయాలి. సాధ్యమైతే రేపు సాయంత్రం 4 గంటలకల్లా నాకు ఏ విషయం చెప్పాలి . . .'

'తప్పకుండా సార్. అదే పని మీద ఉండి రేపు మిమ్మల్ని కలుస్తాను,' అన్నాడు ఉమాశంకర్.

★ ★ ★

మరునాడు, అక్షరాలా నాగరాజ్ సూచించిన పద్ధతిలో నిర్ణయానికి రూపకల్పన చేసి కొద్ది మంది అధికారుల ముందు ఆనంద్ తన ఆలోచన వెల్లడించాడు. ఆ తర్వాత ఉమాశంకర్ వైపు తిరిగి, 'ఈ ప్రతిపాదనను క్షుణ్ణంగా పరిశీలించి సరిగ్గా సాయంత్రం 5 గంటలకల్లా ఫైలు కేబినెట్‌కు పంపించండి. ఆ వేళకే వేరే అంశాల గురించి మంత్రివర్గసమావేశం కూడా ఉన్నట్టుంది. ఆ తర్వాత ఎంత వీలైతే అంత త్వరగా గవర్నర్ సంతకం తీసుకోవాలి. ఆయనకు జ్వరం తగిలినట్టు విన్నాను.'

సాయంత్రం 5-30 ప్రాంతంలో మంత్రివర్గం ఆర్డినెన్స్‌ను ఆమోదించింది. గవర్నర్ సంతకం కాలేదు కనుక బహిరంగ ప్రకటన జరగలేదు. అయినా, రాజకీయరాక్షసత్వానికి పరాకాష్ఠగా ఈ రాష్ట్రంలో ఎన్నడూ కనీవినీ ఎరుగని కక్ష సాధింపు ఆర్డినెన్స్ త్వరలో విరుచుకు పడబోతుందన్న వార్త అప్పటికప్పుడు బయలుదేరింది. మరునాడు రాబోయే పత్రికలు రాష్ట్ర ప్రభుత్వాన్ని ఖండించడానికి తీవ్రతలో సరికొత్త ప్రమాణాలను అందుకోడానికి సన్నద్ధమైపోయాయి. రాజ్‌భవన్‌నుంచి రాబోయే వార్త కోసం ఎదురుచూస్తూ పత్రికల కథనాలు తుదిమెరుగులు దిద్దుకుంటున్నాయి.

గవర్నర్ సంతకం చేయడమే తరువాయి, అయితే అర్ధరాత్రి సమయానికి ఆనంద్‌కు ఢిల్లీ నుంచి ఫోన్‌కాల్ వచ్చింది. ఈసారి కేంద్ర హోం శాఖ సహాయ మంత్రి నిహాల్‌చంద్ నుంచి. అతడు చాలా ఏళ్ళుగా ఆనంద్‌కు వ్యక్తిగత మిత్రుడు. ప్రధానమంత్రికి సన్నిహితుడని కూడా అతని గురించి చెప్పుకుంటారు. అతడేదైనా సందేశం వినిపించాడంటే అది కచ్చితంగా ఆమె నుంచి వచ్చినట్టే. మామూలు పలకరింపులయ్యాక, నిహాల్‌చంద్ సంభాషణను చాకచక్యంగా జిల్లా పరిషత్ అధ్యక్షుల వ్యవహారం వైపు నడిపించాడు. పి.టి.ఐ. యు.ఎన్.ఐలు 'తక్షణ ప్రచురణకు కాదన్న' హెచ్చరికతో అప్పటికే ఆర్డినెన్స్ గురించి వివరాలిచ్చి ఉన్న సంగతి ఆనంద్‌కి తెలుసు.

కనుక ఇంటెలిజెన్స్ బ్యూరోతో పాటు, ప్రధాన వార్తా సంస్థలు కూడా ఆర్డినెన్స్ వార్తను ఢిల్లీకి చేరవేసేశాయి. గుసగుసలు మొదలైన తక్షణమే చౌదరి, శేఖర్‌లు టెలిఫోన్‌లకు అతుక్కుపోయారు. తమ సొంత పదజాలం జోడించి ఆ వార్తను వ్యాపింపచేయడంలో నిజానికి వాళ్ళదే ప్రధాన పాత్ర.

ఆనంద్ ఈసారి ఎదురుదాడిని ధ్వనించే ఉద్వేగస్వరంతోనే నిహాల్‌చంద్‌కు పరిస్థితి వివరించుకుంటూ వచ్చాడు. తనకు గుర్తున్నంతవరకు ఇంతకుముందెన్నడూ అతడీ స్వరంతో మాట్లాడలేదు. ఇది అతనికి హఠాత్తుగా ఎదురైన కవ్వింపుచర్య. సీలింగ్స్ బిల్లునూ, పేదలకేమైనా చేయాలని తనింతవరకూ కన్న కలలనూ అది కాలరాసేలా ఉంది 'ఇందువల్ల నాకేదో పోతుందని నేను బాధపడడంలేదు నిహాల్‌జీ!' ఉద్ఘాటింపుగా అన్నాడు. 'పోయేదేదైనా ఉంటే అది పార్టీకీ, ప్రత్యేకించి ప్రధానమంత్రికే. ఓ మాట గట్టిగా చెబుతున్నాను వినండి. కేవలం ఎన్నికల అవసరం దృష్ట్యా చూసినా కనీసం రెండు ఎన్నికల వరకు పేద ప్రజలను పార్టీపట్ల కృతజ్ఞతాబద్ధులుగా, విధేయులుగా, ఉంచగలిగిన భూ పరిమితుల్లాంటి మరో కార్యక్రమం ఏదీ మన మేనిఫెస్టోలో లేదు. కనుక రాజకీయ సుస్థిరత్వకోణం నుంచి చూసినా ఇది తప్పించుకోలేని కార్యక్రమం. నిరాశానిస్పృహల్లో మునిగితేలుతున్న కొందరు రాజకీయవాదుల ప్రోద్బలంతో జిల్లా పరిషత్తుల అధ్యక్షులు ఇలా దేశభవిష్యత్తును ధ్వంసంచేయడానికి బరితెగిస్తే మనమెలా ఒప్పుకుంటాం? ఇప్పుడున్న పరిషత్తులు పోయినా, గత అనుభవాల దృష్ట్యా తీసుకొచ్చిన సమగ్ర సంస్కరణలతో, బహుశా మరింత నిబద్ధతా, అంకితభావం గల అధ్యక్షులూ, సభ్యులతో రెండు మాసాల వ్యవధిలో కొత్త పరిషత్తులు ఎన్నికవుతాయి. ఆ మేరకు ఇప్పటికిప్పుడే నేను హామీ ఇస్తున్నాను.'

ఆనంద్ అన్న ఏ మాటనూ కేంద్రసహాయమంత్రి విశ్వసించకపోలేదు, అయినా అతని అభిప్రాయానికి భిన్నమైన అభిప్రాయాన్ని వివరించుకుంటూ వచ్చాడు. ఇందిరాగాంధీ పేరు ప్రస్తావించకుండా అన్నాడు. 'మీరు చెప్పింది రైటే కావచ్చు ఆనంద్‌జీ, కానీ మీ రాష్ట్రంలో సాగుతున్న ఈ తరహా ఉద్యమాలను, వాటి ఉధృతిని, మిగిలిన రాష్ట్రాలు తట్టుకోలేవు. దురదృష్టవశాత్తు ఇక్కడేమనుకుంటున్నారో చెబుతా వినండి. మీరు న్యాయబద్ధమైన ఉద్యమాన్ని అణచివేయడమే కాక, ఎన్నికైన స్థానికసంస్థలను ఒక్క కలంపోటుతో తుడిచిపెట్టేస్తున్నారట. ఈ చర్య దేశవ్యాప్తంగా అవాంఛనీయపరిణామాలకు దారితీయించే ప్రమాదం ఉంది. మీ రాష్ట్రంలోని జిల్లాపరిషత్తుల అధ్యక్షులు మంచి ధనబలం, పలుకుబడి ఉన్నవారని కూడా వింటున్నాను. వాళ్ళనిలా హఠాత్తుగా తొలగించడం వ్యక్తిగతంగానూ, ఇతరత్రాకూడా దారుణంగా రెచ్చగొట్టడమే అవుతుంది. దానివల్ల జరగబోయేది కేవలం ఉద్యమం మరింత ఉద్ధృతం కావడమే. అఫ్రోజాబాద్ నుంచి రోజులో ఇరవైనాలుగుగంటలూ వెల్లువెత్తుతున్నది ఈ జోస్యాలే. ఈ విషయంలో మీతో ఏకీభవించే ఒక్క మాటకూడా మాకు చేరడంలేదు.కనుక మీరీ రెండు అంశాలను బేరీజు వేసుకుని ప్రశాంతంగా ఆలోచించుకుని సరైన నిర్ణయానికి రావడమే సహేతుకంగా కనిపిస్తోంది. ఈలోగా యధాతథస్థితిని కొనసాగించడమే మంచిదేమో చూడండి. సీలింగ్స్ బిల్లు విషయంలో మీరు ఏది మంచిదనుకుంటే అదే చేయచ్చు. తమతమ పరిస్థితులకు అనుగుణంగా ఈ చట్టం తీసుకువచ్చే సౌలభ్యం రాష్ట్రాలకు ఎటూ ఉంది.'

'మీ అభిప్రాయాన్ని ఖండించడం నా ఉద్దేశం కాదు మై ఫ్రెండ్' ఆనంద్ అన్నాడు. 'సీలింగ్స్ బిల్లు విషయంలో ఎవరి ఇష్టం వచ్చినట్టు వారు చేసుకునే సౌలభ్యమేమీ లేదనే నా ఉద్దేశం. మన మేనిఫెస్టోను అలా అర్థం చేసుకుంటే పూర్తిగా పొరపాటే అవుతుంది.' అంతలో అలలా ఏదో ఆలోచన వచ్చి అన్నాడు. 'గవర్నర్ ఇప్పటికే ఆర్డినెన్స్ మీద సంతకం చేసుంటే నేనేం చేయాలి?'

'మా అభిప్రాయం తెలియజేయడం వరకే నేను చేయగలిగింది, మిగిలింది మీ చేతుల్లో ఉంది. అలా ఉందని కూడా మాకు తెలుసు . . .' అంటే ఆ క్షణంవరకు గవర్నరు ఆ ఫైలుమీద సంతకం

చేయలేదన్న విషయం హోం మంత్రికి తెలుసునన్నమాట.

సంభాషణ తర్వాత చాలాసేపు ఆనంద్ అలాగే కూర్చుండిపోయాడు. ముఖ్యమంత్రి అయిన తర్వాత మొదటిసారిగా ఇప్పుడే, ప్రధానమంత్రి పడుతున్న ఆందోళన గురించి తనకు మాటిమాటికీ చెప్పడం, తను వినడం జరుగుతోంది. అస్పష్టంగానే కావచ్చు, ఇప్పుడు ఇతర రాష్ట్రాల ప్రస్తావన ద్వారా ఒక సందేశమూ అందించినట్టయింది. అంటే, మిగిలిన రాష్ట్రాలదో దారి, నీదో దారి అయిందని అధిష్ఠానవర్గం భావిస్తున్నట్టు తన దృష్టికి తెస్తున్నారా? దానర్థం, పార్టీ మేనిఫెస్టోను తనర్థం చేసుకున్నదొకటైతే అధిష్ఠానవర్గం ఆంతర్యం మరోలా ఉందని చెప్పడమా? ఆనంద్ పూర్తిగా అయోమయావస్థలో కూరుకుపోయాడు.

ఆర్డినెన్స్ ఫైల్‌తో రాజ్‌భవన్‌కు వెళ్ళబోయే ముందు అంతిమసమీక్ష కోసం నాగరాజ్‌కు కబురు చేశాడు. ఇప్పుడు ఢిల్లీతో మాట్లాడిన తర్వాత అతనిముందున్నవి రెండే రెండు స్పష్టమైన మార్గాలు.నాగరాజ్‌ను తనదగ్గరకు రప్పించుకోవడం అందులో ఒకటి. కొన్ని నిమిషాల క్రితం తాను ఢిల్లీతో జరిపిన సంభాషణ దృష్ట్యా చూస్తే, అలా చేయడం ఆర్డినెన్స్‌ను దాదాపు నిలుపు చేయడమే, అంతిమంగా విరమించడమే అవుతుంది. ప్రధానమంత్రి 'ఆందోళన' గురించి మాటిమాటికీ సూచించడానికీ, ఢిల్లీకి చౌదరి ఏక బిగిన చేస్తున్న ఫోన్ కాల్స్ దానికి జతకావడానికీ, ఇవన్నీ కలిసి చివరకు, సహాయమంత్రి నిహాల్‌చంద్‌నుంచి పిలుపుగా పరిణమించడానికీ ఇంతకుమించి వేరే అర్థమేదీ ఉండదు. చివరకు చట్టబద్ధంగా కూడా ఉద్యమకారుల చేతిలో ఉన్న హంగులన్నీ అలాగే ఉంచుతూ ఆనంద్ ఆ ఉద్యమాన్ని ఎదుర్కోవలసి ఉంటుంది. ఢిల్లీ నుంచి సందేశం రూపంలో ధ్వనించింది ఇదే. ఇక రెండో మార్గం, జ్వరంతో బాధపడుతూ కూడా ఫైలు మీద సంతకం చేయడానికి ఎదురుచూస్తున్న గవర్నర్ వద్దకు నేరుగా వెళ్ళమని నాగరాజ్‌కు ఫోన్ చేసి చెప్పడం. ఇలా చేయడం నల్లేరు మీద నడక, నిష్కంటకం, కేంద్రమంత్రికి తను ఇప్పటికే సూనచప్రాయంగా చెప్పింది, తమ పథకాన్ని ఉన్నదున్నట్టుగా మరింత ముందుకు తీసుకెళ్ళేది. గవర్నర్ సంతకం అయిన తర్వాత అక్కడినుంచి నేరుగా ప్రభుత్వముద్రణాలయానికి చేరి, తెల్లారేసరికల్లా ఆర్డినెన్స్ అధికారిక గెజిట్ నోటిఫికేషన్ రూపంలో బయటికి వస్తుంది.

ఆనంద్ కళ్ళు మూసుకుని ఈ రెండింటిలో ఏది ఉత్తమమా అని యోచిస్తూ ఉండిపోయాడు. అంతలో తనకు బాగా పరిచితమైన, తనలోని మరో అర్థభాగంగా పిలుచుకునే రూపం,

మూసుకున్నకళ్ళముందు కనిపించింది. ఏదో చెప్పినట్టనిపించింది. శక్తియుక్తులన్నీ ఉన్న శత్రువులతో తను ఒంటరిగా పోరాడడమే గత్యంతరమని నిర్ణయానికొచ్చాడు. నాగరాజ్‌ను తన నివాసానికి పిలిపించాడు. ఆర్డినెన్స్ ఫైలు ఇక ముందుకు వెళ్ళలేదు.

★ ★ ★

ఏ కాస్త ఉప్పందినా దొరకపుచ్చుకుంటున్న పత్రికలు తమ సంపాదకీయాస్త్రాలతో వార్తా బాంబులతో సిద్ధంగా ఉన్నాయి. అయితే రాజ్‌భవన్ నుంచి ఒక్క మాట కూడా లేదు. ఆ గౌరవనీయ ప్రాంగణంలోకి ఏదీ వెళ్ళిందీ లేదు, తిరిగి బయటకొచ్చిందీ లేదు. దాంతో అవి తమ ఆయుధాల పదును తగ్గించుకునైనా మొత్తం మీద ప్రయోగించడమైతే ప్రయోగించాయి. తాము తవ్వి పెట్టాలనుకున్న ఆర్డినెన్స్ రాకపోయినంతమాత్రాన అంత నేర్పుగా కూర్చిన పదజాలాన్ని ఎలా వ్యర్థం చేస్తారు? ఏదేమైనా దారుణమైన కుట్ర ఏదో జరుగుతోందని (అదేమిటో వారు అప్పటికప్పుడు తెలుసుకోలేకపోవచ్చు) అతి తీవ్ర ఆరోపణ వినిపించింది తమకు కావలసింది అదే - కనీసం ఆరోజుకు.

అదే సమయంలో చౌదరి తన డ్రాయింగ్ రూంలో శేఖర్‌తో కరచాలనం చేసి ఉప్పొంగిపోతూ అన్నాడు, 'తొలి గెలుపు మనదే, ఇక ముందుకు సాగడమే మన పని!'

★ ★ ★

అది భూస్వాముల అనూహ్యఘనవిజయం. జిల్లా పరిషత్తులు కేవలం ఒక నెపం మాత్రమే. ఈ ఘట్టంతో ఢిల్లీ కాళ్ళు చల్లబడిపోతాయని చౌదరి కలలో కూడా అనుకోలేదు. అఫ్రోజాబాద్‌కు మాత్రమే పరిమితం చేసి ఈ పరిణామానికి అర్థం చెప్పడం సాధ్యంకాదు. ఢిల్లీ దృష్టిలో ఆనంద్ ఎంతైనా తన శాసనయుద్ధాన్ని ఎంతో ధైర్యంగా, సమర్థవంతంగా, సాగిస్తున్నాడు. అన్నీ అదుపులోనే ఉన్నాయి. రాష్ట్రప్రభుత్వాన్ని ఒడ్డున చేర్చడానికి కేంద్రం ప్రత్యేకించి ఎటువంటి పాక్షికపాత్రనూ పోషించవలసిన అవసరం లేదు, ఆ మేరకు ఇంతవరకు ఆనంద్ ఎలాంటి అభ్యర్థనా చేయలేదు కూడా. కనుక, చౌదరీ శేఖర్‌లు తమ మిత్రబృందంతో కలసి రాజకీయవర్గాలను, మీడియాను తెలివిగా ఉపయోగించుకుంటూ ఏమైనా చేసి ఉండవచ్చు. కాని కేంద్రం స్వయంగా జోక్యం కలిగించుకోడానికి మరేదో విస్తృత నేపథ్యం ఉండితీరాలి. అయితే ఇదంతా ఇందిరాగాంధీకే ఆపాదించాలని ఎవరూ అనలేదు. బొత్తిగా ఊహించరాని వ్యాఖ్య అది. మొత్తం మీద వినవచ్చిన వ్యాఖ్య ఒకటే. జిల్లా పరిషత్ అధ్యక్షుల నుద్దేశించిన ఆర్డినెన్స్‌ను నిలిపివేయమని ఇందిరాగాంధీ ఆనంద్‌ను ఆదేశించి మంచి పని చేశారు. అయితే రాష్ట్రంలో అనేకమంది అన్నట్టుగా ఆ చర్య కనుక మరింత కల్లోలానికే దారితీయిస్తే, అది ఇందిరాగాంధీ ఆదేశం కాదు, కానేకాదు! అటువంటి ఆత్మహత్యాసదృశమైన ఆదేశం ఇవ్వాలన్న ఆలోచన కూడా ఆమెకు రాదు...

ఆకుకూ అందని, పోకకూ పొందని ఈ భాష్యానికి ఆనంద్ విస్తుపోయాడు. ఎటువంటి ముద్రలతోనే కానీ, పరిస్థితులలోనే కానీ, ఇదంతా కేవలం ఆమె జోక్యం వల్లనే జరిగిందని అతనికి అంతరాంతరాల్లో తెలుసు. అన్నివైపుల నుంచీ తన పరిస్థితిని ప్రమాదభరితం చేసుకోకుండా తను నేరుగా ఢిల్లీ వెళ్ళి ఇందిరాజీతో మాట్లాడడం ప్రస్తుతం జరిగే పనికాదు. ఫోన్‌లో ఆమెకు

వివరించడానికి అతడు ప్రయత్నించకపోలేదు. అయితే ఆమెను సమాధానపరచగలిగానని అతనికనిపించలేదు. ఆమె ఎంతో తపన, సానుభూతి ధ్వనింపజేశారు. తను చెబుతున్నది వినడానికెంతో ఉత్సుకతచూపించారు. మొత్తంమీద మెచ్చుకోలుగానే మాట్లాడారు. అంతమాత్రమే. ఎంతో మంచివిగా తోచే, తోచడమే కాక నిజంగా మంచివిగానే ఉన్న, ఎన్నో విషయాలు ఆమె మాట్లాడారు. అయినా వెన్నుదన్నుగా ఉన్న ఇందిరాగాంధీనుంచి, ఆమె కార్యక్రమాన్ని అమలుచేస్తున్న ముఖ్యమంత్రి అపేక్షిస్తున్న అసందిగ్ధసమర్థనను ధ్వనించే నిర్ణయాత్మక క్లుప్తపదాలు మాత్రం రాలేదు. ఆలోచించిన మీదట, ఒక వేళ ఆమె నుంచి తను ఇప్పుడు విధిలేక (ప్రప్రథమంగా) బహిరంగ సమర్థన ఆశిస్తున్నాడు కనుకనే అది రాలేదన్న విషయం (ప్రప్రథమంగానే) ఇంత తీవ్రంగా తనను కలవరపెడుతుండవచ్చు. అన్నివైపులా ప్రతికూలశక్తులు కమ్ముకున్న తన ప్రస్తుతస్థితిలో ఆమెనుంచి వీలైనంతబహిరంగ సమర్థన అతను ఆశించినమాట నిజం. కాని, తన లోపలి ఆలోచనలు ఎంత బలమైనవైనా ఆమె వాటిని బాహాటంగా ఎన్నడూ వెల్లడించరన్న విషయం గుర్తొచ్చింది. అంతటితో ఆమె మనోగతాన్ని తెలుసుకోలేక అతడు మరింత దిక్కుతోచని స్థితిలో పడిపోయాడు.

సీలింగ్స్ బిల్లు గురించిన ఆలోచన అంకురించిన క్షణంనుంచి తనకు ప్రధానమంత్రి మద్దతు కచ్చితంగా ఉంటుందని అతను నమ్ముతూ వచ్చాడు. ప్రధానమంత్రి పేరుతో, పార్టీ మేనిఫెస్టో పేరుతోనే తనేం చేసినా చేశాడు. తన వర్గాన్ని వదిలేసినందుకు భూస్వాములు రాత్రింబగళ్ళు తననెంత ఆడిపోసుకుంటున్నా, సత్యనిష్ఠమీద ఆధారపడిన తన దృక్పథమే వారినుంచి తప్పించుకునే మార్గాన్ని తనకు చూపించింది. కానీ ఇప్పుడు ఢిల్లీనుంచి ఇలా ఎదురైన దాదాపు తటస్థ ప్రతిస్పందన అతనికి మొదటిసారిగా కలవరపాటు సంకేతాలను జారీచేసింది స్థానికసంస్థలను ధ్వంసం చేయడానికే అతను కంకణం కట్టుకున్నాడనే ఆరోపణలో వీసమెత్తైనా సత్యం లేదు. పంచాయితీ రాజ్ సంస్థలపట్ల ఆనంద్ నిబద్ధత ఎలాంటిదో ప్రతి ఒకరికీ తెలుసుకనుక ఈ దుష్ప్రచారాన్ని రాష్ట్రంలో ఎవరూ నమ్మలేదు. అయితే ఢిల్లీ చెవులకు ఆ తప్పుడు సమాచారం విశ్వసనీయమని తోచడంతో, పంచాయతీరాజ్ వ్యవస్థను సమర్థించే పార్టీ సహచరులందరికీ అసంతృప్తి కలిగింది. అలా భావించడంసహజమే. ఉన్నతాధికారసంఘం చేసిన ఉపయుక్త సూచనలన్నింటిని తను కొత్త చట్టంలో పొందుపరుస్తానని ఆనంద్ దాదాపు రోజూ విలేఖరుల సమావేశంలో స్పష్టం చేస్తూ వచ్చాడు. కానీ అవేవీ వార్త కాలేకపోయాయి. అంత నమ్మదగ్గవి కానట్టు మొక్కుబడి ప్రచురణకే నోచుకున్నాయి. పత్రికలవారి దృష్టిలో అతి పెద్ద వార్తగా చలామణి అయింది ఒకటే - ప్రస్తుతమున్న జిల్లా పరిషత్తు అధ్యక్షులు ముఖ్యమంత్రి గ్రూపు వారు కారు కనుక, అన్ని విధాల ఆయనకు తొత్తులు కావడానికి ఒప్పుకోలేదు కనుక, ఏదోఒక సాకుతో స్థానికసంస్థలను తుడిచిపెట్టాలనే ఈ ప్రయత్నం. ఈ కట్టుకథను చిలవలుపలవలతో ఎన్నో రెట్లు పెద్దది చేసి ఒక ప్రామాణిక వాస్తవంగా దేశమంతటా ప్రచారం చేస్తూవచ్చారు. ఆనంద్ ప్రతిచోటా పంచాయతీరాజ్ వ్యతిరేకిగా, తద్వారా అధికారపక్ష వ్యతిరేకిగా, కనిపిస్తూ వచ్చాడు.

పూర్తిగా అయోమయంతో కూరుకుపోయిన ఆనంద్, ఈ విషయంలో తనకు అండదండగా ఉన్న డిప్యూటీ స్పీకర్ సలీముల్లాను పిలిపించాడు. ఇద్దరూ సమస్యను పదే పదే తరచి చూస్తూ,

ఆనంద్ ప్రధానమంత్రితో ఫోన్‌లో జరిపిన సంభాషణ ద్వారా దుర్భేద్యమైన ఆమె అంతరంగంలో ఏముందో అర్థం చేసుకునే ప్రయత్నం చేశారు. సలీమ్‌కు తిన్నగా చౌదరీ శేఖర్‌లే స్ఫురించారు. 'అఫ్‌కోర్స్,దేశంలో అంతటా ఉన్న భూస్వాముల మిత్రుల్లూ, శ్రేయోభిలాషుల హస్తం కూడా ఉంటుందనుకోండి,' అన్నాడు. 'అధికారపక్షం మేనిఫెస్టో ఏమీ రహస్యం కాదు కదా. ఈ చట్టం కింద భూమి కోల్పోయే వారంతా సంఘటితులై, దానిని జాప్యం చేయించడానికో, ఓడించడానికో శాయశక్తులా ప్రయత్నించడం సహజమే కదా! భారతదేశంలో అంతటా భూమే జీవన సర్వస్వం. అఫ్రోజాబాద్‌లో ఇందుకు భిన్నంగా ఎందుకుంటుంది?'

'ఇంతకీ మనం ఏం చేద్దామంటావ్?' ఆనంద్ అడిగాడు.

సలీమ్ కొద్దిసేపు దీర్ఘాలోచనలో ఉండి, ఆ తరువాత అన్నాడు, 'ఇక్కడి పరిస్థితిదృష్ట్యా మీరిపుడుఅఫ్రోజాబాద్ విడిచి వెళ్ళలేరు. కనుక ఆనంద్ భాయ్, నాదో సూచన. నేనే ఒకసారి ఢిల్లీ వెళ్ళి తెరవెనుక సమాచారం ఏమైనా రాబట్టగలనేమో ప్రయత్నిస్తే ఎలా ఉంటుంది? రాకపోక ఖర్చు తప్ప దీనివల్ల కలిగే నష్టమేమీ ఉండదు.'

ఆనంద్‌కు అది మంచిఆలోచనే అనిపించింది. సలీమ్‌కు ఢిల్లీలో సొంతంగా కొన్ని పరిచయాలున్నాయి. అఫ్రోజాబాద్‌లోని కొన్ని కుటుంబాల పురాతనపు వేళ్ళు ఢిల్లీలో ఉన్నాయి. తరతరాలుగా వాళ్ళ మధ్య బంధుత్వాలు కొనసాగుతున్నాయి. అతని బంధువర్గంలో కొందరికి జవహర్లాల్ నెహ్రూతో సాన్నిహిత్యం ఉంటూ వచ్చింది. తద్వారా వారి వారసులు ఇందిరాజీకి మిత్రులయ్యారు. అలాగని ఈ సంబంధాల మీద ఆధారపడి భూ పరిమితుల వంటి ఒక నిర్దిష్ట విషయంలో ఇందిరాజీ ఆంతర్యమేమిటో తెలుసుకోగలమనుకుంటే పొరపాటే. అయితే మరోపక్క, 'ఒక ముఖ్యమంత్రి అత్యుత్సాహం పుణ్యమా అని,' అఫ్రోజాబాద్‌లో ఇప్పుడు శాంతిభద్రతల పెను సమస్య ఉద్భవించిందన్న నిష్కర్షకు, లేదా తప్పుడునిష్కర్షకు, అందరూ వచ్చినట్టు కనిపించారు. ఢిల్లీలో స్వయంనియమితశాంతిభద్రతల నిపుణులకు కూడా కొదువ లేదు. ఆ విధంగా, ప్రధానమంత్రి నమ్మకస్థులుగా చలామణీ అయ్యేవారితో సహా, అభిప్రాయకర్తల ప్రతిస్పందనలను, కొంతవరకు సేకరించడం సాధ్యమేననిపించింది. ఆ అభిప్రాయం ఇందిరాగాంధీపై కూడా ఇంతో అంతో ప్రభావం వేసే ఉంటుంది.

మరునాడు ఉదయమే, సలీమ్ గుట్టుచప్పుడు కాకుండా విమానమెక్కాడు. అయితే ఈ లోపల ఎయిర్‌పోర్టులో తచ్చాడుతున్న ఒక విలేఖరి అతణ్ణి చూడనే చూశాడు. ఏదైనా రాజకీయపక్షి ఢిల్లీ దిశగా రెక్కలు విప్పుకుంటుందేమో చూద్దామని వచ్చా డతను. వారి మధ్యపలకరింపులు మినహా మరేమీ జరగలేదు. ఉదయం లేస్తూనే పత్రికలూ, రాష్ట్ర సి.ఐ.డి. నోట్స్ జతపరచిన తాజా ఇంటెలిజెన్స్ నివేదికల పరిశీలనలో ఆనంద్ మునిగిపోయాడు. హఠాత్తుగా ఒకచోట అతని దృష్టి నిలిచిపోయింది. దానినే పదే పదే చదివాడు. ఏ కోణంనుంచి చూసినా అది మాములు విషయాలకు భిన్నంగా ఉంది. కాంతీపూర్ అనే పట్టణంలో గోడలపై రాతలకు సంబంధించిన భోగట్టా అది. జిల్లా ముఖ్యకేంద్రమైన కాంతీపూర్ ఎంతో పురాతన వారసత్వంగల పట్టణంగా, ఎందరో కవులు, నవలాకారులు, సంస్కృతవిద్వాంసులకు నిలయంగా, సాహిత్య, సంస్కృతీ

సంపన్నతలో ఆ ప్రాంతంలో ఇతర పట్టణాలకే తలమానికంగా సగర్వంగా వర్ధిల్లుతున్న పట్టణం. సిఐడి నివేదిక ప్రకారం ఆ పట్టణంలో దాదాపు ప్రతి గోడమీదా ఇందిరాగాంధీకి వ్యతిరేకంగా ఊహకు అందగలిగినన్ని (లేదు లేదు, వాటిని ఊహించడం కూడా కష్టమే) అత్యంత హేయమైన అశ్లీలపు రాతలు, వాటికి సరిగ్గా సరిపోయే బొమ్మలతో, కార్టూన్లతో, అసహ్యకరమైన చిత్రాలతో, చదవలేని వాక్యాలతో చోటుచేసుకున్నాయి. 'ఇతరులను హింసించడంలోనే ఆనందం పొందే ఒక నీతిమాలిన, నిరంకుశ, అవినీతి భూయిష్ఠ ముఖ్యమంత్రిని, రాష్ట్రంలోని రైతులను వారి చివరి కుటుంబంవరకూ తుడిచిపెట్టడానికే నిర్ణయించుకున్న వ్యక్తిని, సమర్థిస్తుండడమే ఇలా ఈ మురికినంతనీ ఆమెపై కుమ్మరించడానికి కారణంగా కనిపిస్తోంది. దీనినో భారీ దుష్ప్రచార కార్యక్రమంగా చేపడుతున్నారు కనుక ప్రతి పట్టణంలో లేదా ప్రతి గ్రామంలో, రాయడానికి వీలున్న ప్రతి గోడమీద, ప్రజలపై బలమైన ప్రభావం చూపగల మరిన్ని అశ్లీలాలూ, అసహ్యకరమైన వ్యాఖ్యలతో ఇవే రాతలు ప్రత్యక్షం కావడానికి మరెంతో సమయం పట్టదని కూడా సి.ఐ.డి. నివేదిక హెచ్చరించింది. గోడలమీద ఈ రాతల కార్యక్రమం అర్థరాత్రి పూట జరుగుతోందనీ, ఈ రాతగాళ్ళకి కర్రలు, అక్కడక్కడ తుపాకులు కూడా పట్టుకున్న రౌడీ మూక రక్షణ కూడా ఉందని తెలుస్తోందనీ నివేదిక వెల్లడించింది

ఈ నివేదిక చూసి ఆనంద్ దుర్భరమైన దిగ్భ్రాంతికి లోనయ్యాడు. సభ్యతాసంస్కారాలున్న ఏ మనిషైనా ఇంత అధమాధమస్థాయికి దిగజారగలడా? చివరకు ఇందిరాజీ విషయంలో కూడా వాళ్ళింత అమానుషంగా ప్రవర్తించగలరా? దేనికైనా హద్దుంటుంది హద్దుదాటితే, గౌరవ మర్యాదలతో జీవించే ఏ భారతీయ మహిళయినా సహనం కోల్పోతుంది. ఈ వాస్తవాన్ని దృష్టిలో పెట్టుకునే ప్రత్యేకించి ఇందిరాజీని ఉద్దేశించి ఈ జుగుప్సాకరమైన రాతలు రాయిస్తున్నారా?... ప్రజాదరణలోనూ, అధికారస్థితిలోనూ ఆమె ఉన్నతశిఖరాలనందుకున్నారు. ప్రతిదీ ఆమెకు పూర్తి అనుకూలంగా రూపుదిద్దుకుంటోంది. ఈ దశలో ఆమె ఇంత దారుణఅవమానాలను ఎదుర్కోవలసి రావడం, ఆనంద్‌కు ఆమె నుంచి 'మద్దతు' లభిస్తోందన్న ఊహాప్రాయమైన ఏకైక కారణం వల్ల కాదా? ఇతర రాష్ట్రాలలో తిరుగుబాట్లు, వచ్చే ఎన్నికలలో ఘోర పరాజయంతో సహా అనేక భయానక పర్యవసానాల దృష్ట్యా చూసినపుడు ఈ మద్దతు ఏ మాత్రం పనికివస్తుంది? ఉన్నదున్నట్టు చెప్పాలంటే గ్రామ ప్రాంతాల్లో అంతటా లోతుగా పాతుకుపోయిన పలుకుబడి గల సంపన్నవర్గాలు ఇలా అధికార పక్షానికి వ్యతిరేకంగా చెలరేగిపోయినపుడు రేపటి ఎన్నికలలో పార్టీ అవకాశాలెలా ఉంటాయి? ఇది దుర్భేద్యమైన వాదంగానే ధ్వనించింది. ఇలా తెలివితక్కువగా తను ఇందిరాగాంధీ పతనానికి కారణమవుతున్నానే అనుకుని ఆనంద్ ఇంచుమించు పశ్చాత్తాపానికి లోనయ్యాడు.

సాయంత్రం సలీముల్లా నుంచి ఫోన్ వచ్చింది. ఢిల్లీ అంతటా ఆనంద్‌కు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున జరుగుతున్న దుష్ప్రచారం రూపురేఖలను సలీమ్ కొంతవరకు వివరించగలిగాడు. గాలి ఎటు వీస్తోందో తెలుసుకోడానికి మరికొందరితో పాటు అతడు రంజన్‌బాబును కూడా కలిశాడు. రంజన్‌బాబు చౌదరితో చేయి కలిపాడని, ఆనంద్‌ను పడగొట్టడానికి తనవంతు ఎంత భీభత్సం చేయాలో అంతా చేస్తున్నాడని మాత్రం సలీమ్‌కు అర్థమైంది. 'మీ ముఖ్యమంత్రి ముక్కూ మొహం కూడా నాకు తెలియదు. నేను అఫ్రోజాబాద్ వచ్చినపుడు అతగాడు నా కెక్కడా కనిపించలేదు.

అలాంటి గడ్డిపరక అక్కడ జరుగుతున్న హైపవర్ గేమ్‌లో కుప్పకూలడంలో ఆశ్చర్యంలేదు. భూ సంస్కరణల విషయంలో అతడు ఉత్సాహవంతుడని కూడా విన్నాను. అలా తన గొయ్యి తను తవ్వుకోడంలోనూ ఆశ్చర్యం లేదు. అధికారంలో ఉంటూ, అంతా మేనిఫెస్టో ప్రకారమే జరిగితీరాలని పట్టుబట్టేవాణ్ణి నేనింతవరకూ చూడలేదు. అధికారంలో లేనప్పుడు నువ్వేమైనా చెప్పు కానీ, ముఖ్యమంత్రి అయ్యాక అవన్నీ మరచిపో! కనుక మిత్రమా, అనడానికి నాకూ బాధగానే ఉంది కానీ, అతణ్ణిప్పుడు దేవుడు కూడా రక్షించలేడు!'

ఈ పరిణామాలను వివరిస్తున్నప్పుడు సలీమ్ గొంతులో ఆగ్రహం ధ్వనించింది. కాంతీపూర్ గోడలమీద రాతల తాజా సి.ఐ.డి నివేదిక గురించి ఆనంద్ చెప్పగానే అతడు పట్టరాని క్రోధంతో ఊగిపోయాడు. 'ఏమైనా కానీ ఆనంద్‌భాయ్, మన మీ పచ్చి బ్లాక్‌మెయిల్‌కు ఎదురొడ్డి నిలబడాల్సిందే. రే పుదయానికి నేను తిరుగొస్తున్నాను. ఇక్క డిక తెలుసుకోవలిసినవేం లేవు' కొద్ది క్షణాలు ఆగి అన్నాడు, 'ఆ గోడల మీద రాతలతో వాళ్ళేం చేయబోతున్నారో నా మనసుకు తడుతోంది. దాని గురించి ఫోన్లో చెప్పను. నన్ను తిరిగి రానివ్వండి...'

★ ★ ★

నరాలు తెంపేసే ఉద్రిక్తత మధ్య శాసనసభ వర్షాకాలసమావేశాలు ప్రారంభమయ్యాయి. శాసనసభ్యులు రెండువైపులా నలిగిపోవలసి వస్తోంది. ఒకవైపు నుంచి, బిల్లు విషయంలో ముందుకు సాగి తక్షణం ఆమోదించాలని సాధారణ ప్రజల నుంచి ఒత్తిడి; మరోవైపు నుంచి బిల్లు ఆమోదాన్ని వర్షాకాలసమావేశాల తర్వాత వరకు నెట్టమని భూస్వాముల గూండాలనుంచి అంతే ఒత్తిడి. గ్రామాల్లోని భూమి లేని పేదలు ఎం.ఎల్.ఏల బంధువులను స్నేహితులను మూకుమ్మడిగా డిమాండ్ చేస్తుంటే, 'ఈ దరిద్రపు చట్టం, ఈ సమావేశాల్లోనే ఆమోదం పొందితే తీవ్రపరిణామాలు ఎదుర్కోవలసి వస్తుంద'ని గూండాలు, పరిచితులైన అసాంఘికశక్తులూ వారిని బెదరించడం జరుగుతోంది. అంతేకాదు, వాళ్ళు మరోఅడుగు ముందుకేసి, చెప్పింది చేసి చూపిస్తామని నిరూపించడానికా అన్నట్టు భూ పరిమితులపై సానుభూతి గలకొందరు ఎం.ఎల్.ఏల గడ్డివాములకు, పశువుల పాకలకు నిప్పు పెట్టారు. అల్లర్లు జరుగుతున్న ప్రాంతం మినహా ఇతరచోట్ల స్థానిక పోలీసులు చాలా చురుగ్గా పనిచేస్తున్నారన్న అభిప్రాయం సాధారణంగా కలుగుతూ ఉంటుంది. వాళ్ళు చురుకుగా లేరని మాత్రం ఎవరూ అనలేరు.

శాసనసభ సమావేశాలలో డిప్యూటీ స్పీకర్ సలీముల్లా హీరోగా వెలిగిపోయాడు. అతడు చర్చ పొడవునా చాలా ఉదారంగా వ్యవహరించాడు. అయితే బిల్లు ఆమోదానికి సంబంధించిన కీలక ఘట్టాలలో ఎటువంటి అభ్యంతరాలనూ, అవరోధాలనూ అనుమతించలేదు. ప్రతిక్లాజుమీద, వాళ్ళువాదించి వాదించి అలసిపోయి ఇక రుజుమార్గంలో బిల్లును ఆటంకపరచలేమని అనుకునేవరకూ,ఎంతో ఉదారబుద్ధితో సుదీర్ఘచర్చకు అవకాశమిచ్చాడు. ఆపైన మాత్రం తప్పుడు మార్గంలో బిల్లును దెబ్బ తీయడానికి కొంచెమైనా సందివ్వలేదు. తనను బెదిరించే ప్రయత్నం చేసినప్పుడు అణుమాత్రం కూడా వంగలేదు. అలా ప్రజాస్వామికప్రక్రియకు తిరుగులేని రక్షకుడుగా నిలబడ్డాడు.

చర్చలు దాదాపు ముగింపు దశకు చేరుకున్న తర్వాత, అది మధ్యాహ్నభోజనవిరామసమయం. మరో రెండు రోజుల్లో తామింతకాలం పడిన శ్రమంతా ఒక కొలిక్కి వస్తుంది. సలీమ్‌తో కలిసి ఆనంద్ అల్పాహారం తీసుకుంటూ అడిగాడు. 'కాంతిపూర్ గోడ రాతల విషయంలో వాళ్ళేం చేయబోతున్నారో తట్టిందని ఢిల్లీ నుంచి ఫోన్లో మాట్లాడుతూ అన్నావు, గుర్తుందా?'

'ఆ, గుర్తుంది,' సలీమ్ అన్నాడు. 'ఇందిరాగాంధీ విదేశీపర్యటననుంచి వచ్చీరాగానే వాటిలో మరింత అశ్లీలంగా ఉన్న చిత్రాల ఫొటోలను, ఆ రాతల ఇంగ్లీషు అనువాదాన్ని ఆమెకు బహూకరిస్తారనడంలో నాకెలాంటి సందేహం లేదు. అది కాస్త ఎక్కువ వ్యవధి తీసుకుంటుండటం వల్ల మనం బతికాం, లేకపోతే ఇప్పటికే ఆమె ఆ ఫొటోల విషయంలో ఏంచేయాలా అని గట్టిగా ఆలోచిస్తూ ఉండేవారు. ఒకవేళ ఆమె విదేశాల్లోనే ఉండి వివిధ దేశాల ప్రభుత్వాధినేతలతో చర్చలు, సమావేశాలు జరుపుతున్నప్పుడే వాటిని పంపి ఉంటే చెప్పలేం.. మనం అనుకున్న అనేక కార్యక్రమాల్లో ఒక్క కార్యక్రమాన్ని అమలు చేస్తున్నందుకే ఇన్ని వెన్నుపోట్లకు అవరోధాలకు పాల్పడుతున్నారే, మన మింకేం సాంఘిక పరివర్తన తేగలం ఆనంద్ భాయ్? చివరకు మనం ఎవరిని మోసం చేస్తున్నాం? ఈ రోజు ఇందిరాగాంధీ సర్వశక్తిమంతురాలు, కానీ మేనిఫెస్టోను అమలుచేయడం లేదని చెప్పి ఆమె ఒక్క ముఖ్యమంత్రిని - ఒక్కడంటే ఒక్కణ్ణి - తొలగించారా? ఎందుకు తొలగించరు? మీరు, మీలాంటి అనేకులు కేవలం ఆమె ఇష్టపడ్డారు కనుకనే పదవుల్లో ఉన్నారని అందరికీ తెలుసు. మీరందరూ నిర్ద్వంద్వంగా నిస్సంశయంగా నామినేటెడ్ ముఖ్యమంత్రులు. మరోవిధంగా మీరా పదవిని ఎన్నడూ ఆశించలేరు. మీకు కులబలం లేదు, ధనబలం లేదు, కండబలం లేదు, కేవలం నిబద్ధత, నిర్వహణ మాత్రమే మిమ్మల్ని నిలబెట్టగలవు. మీరో పక్క రెక్కలు ముక్కలు చేసుకుని మీ కప్పగించిన పనిని పూర్తి చేయడానికి చూస్తుంటే, దాని గురించి తనకేమాత్రం తెలియనట్టు నటిస్తూ ఆమె, తన నోట ఒక మంచి మాటకైనా నోచుకోని ఈ పనంతా ఎందుకు చేయిస్తున్నారు?'

'ఈ ఒక్క రాష్ట్రాన్ని దృష్టిలో పెట్టుకుని మాట్లాడద్దు సలీమ్', ఆనంద్ అన్నాడు. 'ఇది-అనేక చిక్కుముడులు, వైవిధ్యాలు ఉన్న దేశమని మనకు తెలుసు. అధినేతకూ, దేశానికీ మనం సాయపడే మార్గం ఒకటే. ఎక్కడ ఏ పదవిలో ఉన్నా మన విధిని అత్యుత్తమంగా, త్రికరణశుద్ధిగా నిర్వర్తించడమే. ఈ క్షణాన ఇంతకుమించి నేనేమీ ఆలోచించలేను. సీలింగ్స్ చట్టం అమలులోకి వచ్చాక దాని ద్వారా సాంఘికపరివర్తన దిశగా నిజమైన తొలి ఊపును అందించడంలో మనం కృతకృత్యులమయ్యాక, అప్పుడే మార్పును వ్యతిరేకిస్తున్నవారి ముఖాల్లోకి సూటిగా చూడగలం. ఈ రోజు మన బుర్రలను తొలిచివేస్తున్న ప్రశ్నలు అప్పుడే మన అధినేతను అడగగలం.'

★ ★ ★

బలరాం మనసంతా పాడైపోయింది. కాంతీపూర్ గోడ రాతలపై అసభ్య చిత్రాలపై ఇందిరాగాంధీపై కురిపించిన అశ్లీల పదజాలంపై అతనిలో అంతర్గతంగా ఉన్న సంస్కారం తిరుగుబాటు చేసింది. ఆ ఫొటోలను తీసుకొచ్చి చూపించిన యువకులపై ఒక్క పెట్టున కేకలు వేశాడు. అతనినుంచి మెచ్చుకోలును, మరింత మద్దతును ఆశించి వచ్చిన వాళ్ళకు, అరుపులు,

మరిన్ని అరుపులు మాత్రమే దక్కాయి.

'ఇది సిగ్గుచేటు!' అంటూ గర్జించాడు. 'లెక్కలేనన్ని కారణాలతో నేను ఇందిరాగాంధీని వ్యతిరేకిస్తూ ఉండచ్చు. కానీ ఆమె మన ప్రధానమంత్రి. పైగా చదువులు వెలగబెట్టామంటారు. దేశాధినేతపట్ల ఇలా ప్రవర్తిస్తారా? నేను దీనిని సమర్థించను, ససేమిరా సమర్థించను!'

అదే క్షణంలో శేఖర్ అక్కడికి అడుగుపెట్టాడు. సంప్రదింపుల నిమిత్తం బలరాం అతనిని ఆహ్వానించాడు. తక్షణం పరిస్థితిని అర్థంచేసుకున్న శేఖర్ తెలివిగా ఆ యువకుల్ని అక్కడి నుంచి పంపించివేశాడు. ఆ తర్వాత సోఫాలో వయ్యారంగా కూర్చుని అన్నాడు, 'యువకుల్ని మరీ అంత బెదర గొట్టకూడదు రాజా సాహెబ్, పెద్దలేం చేయమంటే అదే చేశారు వాళ్ళు...'

'వాళ్ళను పెద్దలంటారా మీరు? సారీ, నేను వాళ్ళను మనుషులని కూడా పిలవను! ఇదంతా రాజకీయమని చెప్పడమా మీ ఉద్దేశం?... నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది!'

'రాజా సాహెబ్, ఒక్కోసారి అధినేతకు ఆగ్రహం తెప్పించడానికని ఏదో ఒకటి చేయక తప్పదంటే మీరు ఒప్పుకుంటారా లేదా? అలాగే బలమైన భావోద్వేగపు ఒత్తిడిలోనే ఒక్కోసారి మనుషులు తప్పుడు నిర్ణయం, తొందరబాటు నిర్ణయం, తీసుకుంటారన్న వాస్తవంతో మీరు ఏకీభవిస్తారా లేదా? దయచేసి ఇప్పుడు బొమ్మకు అటుపక్క చూడండి. ఇంతవరకు ఎవరూ - కనీసం అఫ్రోజాబాద్‌లో ఏ ఒక్కరూ - ఇందిరాగాంధీ ఆగ్రహంతో రేగిపోవడం చూడలేదు. ఆమె ఎప్పుడూ ప్రశాంతంగా, నిండుకుండలా కనిపిస్తారు. ఆమె అలా ఉన్నంతవరకు ఆమెనూ, ఆనంద్‌నూ, విడదీయడమనేమన ఆలోచన ఎప్పటికీ ఫలించదు. మరిన్ని జిల్లాల్లోని గ్రామాలకు, పట్టణాలకు, ఆ తర్వాత ఇతర రాష్ట్రాలకు ఈ వ్యాధి వ్యాపిస్తేనే ఆనంద్‌కు మద్దతు ఇవ్వడంవల్ల వ్యక్తిగతంగా తన ప్రతిష్ఠ, తననాయకత్వం సర్వనాశనమైపోతాయని ఆమెకు స్పష్టంగా అర్థమవుతుంది. మీరేమో ఆ కుర్రాళ్ళని తరిమేశారు, నిజానికి మరికొన్ని జిల్లాల్లో కూడా ఇలాంటి పనిని వారికి అప్పగించి ఉండవలసింది.'

'నేను మాత్రం దీనికి అంగీకరించలేను శేఖర్‌గారూ! ఇంతవరకు జరిగిన నిర్వాకం చాలు!' ఖండితంగా అన్నాడు బలరాం.

ఇలా సంభాషణ జరుగుతుండగా చౌదరి చడీ చప్పుడు లేకుండా డ్రాయింగ్ రూంలోకి వచ్చి బలరాం ఉద్ఘాటన విన్నాడు. శేఖర్ గొంతు విప్పేలోగా జోక్యం చేసుకుంటూ అన్నాడు, 'మీరన్నది కరెక్ట్ బలరాం గారూ, ఇక ఆ గోడరాతలుండవు . . .

శేఖర్ నివ్వెరపోయాడు. తన చెవుల్ని తనే నమ్మలేని వాడిలా చౌదరివైపు చూశాడు. అరగంటక్రితమే వివిధ జిల్లాల్లోని అనేక గ్రామాలకు ఈ గోడరాతల ప్రచారం విస్తరించాలనీ, వాహనాల రాకపోకలు అతిగా ఉండని అర్ధరాత్రి వేళ దూరదూర ప్రదేశాలకు వెళ్ళి సిమెంట్, బిటుమెన్ రోడ్లమీద ఈ రాతలురాయించి, బొమ్మలు గీయించాలనీ అతడు తనతో చెప్పాడు. అటువంటిది, ఇంతలోనే ఇలా ప్లేటు ఫిరాయించడం చూసి శేఖర్ విస్తుపోయాడు. అతని ముఖం వెలవెలబోయింది.

'మరీ అంత ఆశ్చర్యపోకు శేఖర్', చౌదరి వివరించాడు. 'నువ్వెళ్ళిపోయిన తర్వాత కాస్త ఆరా తీశాను. కొన్ని చోట్ల నిఘా వేసి ఆ అర్ధరాత్రి కళాకారుల్ని కొందరినైనా పట్టుకోమని ఆ డిజిపి మీనన్‌గాణ్ణి ఆనంద్ ఆదేశించినట్టుంది. ఆ డిజిపిగాడికి తన వృత్తి తప్ప ఇంకేం పట్టవు. వాడికి వీళ్ళు పట్టుబడ్డారంటే, వాళ్ళ వెనుక ఉన్న నాయకుల గోత్రాలు కూడా తేలిగ్గా బయటపడిపోతాయి. ఆ మీనన్‌కు ఇదంతా కొట్టిన పిండి. ఇప్పటికే కొన్ని నిజాలు అతడికి తెలిసిపోయాయని నా అనుమానం. ఇక ఆ తర్వాత జరిగేది నువ్వే ఊహించుకో. కనుక కొంతకాలం పాటు గోడరాతలొద్దు.'

'అయితే, ఈ లోగా ఏం చేయాలి?' శేఖర్ నిస్పృహ నిండిన కంఠంతో అన్నాడు.

'కాస్త మంచి ఫొటోగ్రాఫర్లను పట్టుకున్నావంటే ఇప్పుడున్న సరుకే సరిపోతుంది. ఇందిరాగాంధీకి కావలసింది పరిమాణం కాదు, ప్రభావం వేసే గుణం. ఆమె నాణ్యత గురించి పడిచస్తుంది. కనుక ఆమెతో తలపడాలనుకునేవాడు కూడా దానికి తులతూగాలి'.

కాంతీపూర్ గోడరాతల వ్యవహారం అక్కడితో ముగిసింది. వెలుగురవ్వలు కురిపించే తన వ్యవహారపు మంటను అది మరింత ముందుకు తీసుకెళ్ళలేదు.

* * *

యాదృచ్ఛికతకు అదో పరిపూర్ణ ఉదాహరణ. ఇందిరాగాంధీ ప్రయాణిస్తున్న ఎయిరిండియా స్పెషల్ వన్ రాత్రి 11 గంటలకు పాలం విమానాశ్రయానికి చేరుతున్న ఘడియలోనే ఇక్కడ అఫ్రోజాబాద్‌లో అర్ధరాత్రి వేళ భూపరిమితుల బిల్లు అంతిమ ఆమోదం పొందబోతోంది. బిల్లు తృతీయ పరిశీలనా, ఆ చరితార్ధ క్షణాలలో తమ పేరును చిరస్థాయిగా నిలుపుకుంటూ సభ్యులు చేసిన సుదీర్ఘ ప్రసంగాలూ ముగిశాయి. ఆనంద్, ఈ అసాధారణ సందర్భానికి తగినట్టు తన భవిష్యద్దర్శనం ఎల్లలను మరింత విస్తరింపచేస్తూ చర్చకు సమాధానమిచ్చాడు. అఫ్రోజాబాద్ రాష్ట్ర ప్రజానీకమంతటికీ ప్రాతినిధ్యం వహిస్తూ శాసనసభంతా ఏకఖండమై ప్రకటించిన ఆ చరిత్రాత్మక ఆమోద సన్నివేశంలో అంతవరకూ పరుషపదజాలంతో సాగిన వాగ్యుద్ధాలు, ఆరోపణ ప్రత్యారోపణలు అత్యాశ్చర్యకరంగా అత్యుద్భుతరీతిలో విలీనమైపోయిన్నట్టనిపించాయి. ఆ ఉదాత్త గంభీర క్షణాలలో, సుదీర్ఘమైన అత్యంత ప్రయాసభరితమైన చర్చల అంతిమఫలంగానే అది భాసించింది. ప్రతి సభ్యుడూ, తాను ఎటు వోటు వేశాడన్న దానితో నిమిత్తం లేకుండా, అధికారపక్షం తన మేనిఫెస్టో ద్వారా చేసిన అతి పవిత్ర వాగ్దానమైన సామాజిక పరివర్త ప్రక్రియకు తను సైతం ఒక వేగుచుక్క కాగలగినందుకు గర్విస్తున్నట్టే, ఉత్తేజితుడవుతున్నట్టే, కనిపించాడు. సమష్టి శ్రేయస్సునే సార్వత్రికఆదర్శంతో అన్ని పార్టీలు మమేకమైపోయినట్టే కనిపించాయి. నెలల తరబడి పడిన శ్రమంతా, స్వల్పపరిమాణంలోనే అయినా, దరిద్రనారాయణుల ఉద్ధరింపు అనే ఒక మహాద్భుతచర్యగా పర్యవసించబోతోంది.

'డిప్యూటీ స్పీకర్ సర్, ఈ ఒక్క చర్య దానికదే పేదరికాన్ని అంతమొందిస్తుందని ఎవరూ అనలేరు' ఆనంద్ శాసనసభకు తన చిట్టచివరి విజ్ఞాపనను ప్రారంభించాడు. 'కానీ ఎక్కడో ఒకచోట, ఏదో ఒక సమయంలో, ఎవరో ఒకరు తుపాకీ గొట్టంతో పనిలేకుండా ఈ

చిన్నముందడుగు వేయవలసిందే. ప్రజాస్వామ్యమనే ఇంద్రజాలంతో అది మహోన్నత విప్లవానికి దారితీస్తుంది. ఈ చట్టం ద్వారా మనం అవతరింపచేయబోయే లక్షలాది భూ యజమానులు మన గరీబీ హటావో ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకువెళ్ళడానికి సరికొత్త ఆధారభూమిక అవుతారు. ఆ భవిష్య ద్దర్శనంవైపు మరిన్ని అంగలు వేయడానికి నూతన ప్రేరకశక్తి అవుతారు. ఏవో కొన్ని ఎకరాల భూమి లభించినంత మాత్రాన ఈ కొత్త రైతు దానితో ఏమీ చేయలేడు. కనుక నా ప్రతిపాదన ఏమిటంటే, అతడికి అవసరమయ్యే ఎద్దులు, వ్యవసాయ పరికరాలు, ఎరువులు, అందుబాటులో ఉన్న వనరుల ద్వారా, లేదా

కొత్త బావుల ద్వారా సేద్యపునీరు, బ్యాంక్ ఋణాలతక్షీ సహా అందించడానికి అన్ని రాజకీయ పక్షాల భాగస్వామ్యంతో ఒక విస్తృత కార్యక్రమాన్ని చేపట్టడం. ఈ సామగ్రిని అందించడంలో, సీలింగ్స్ చట్టం కింద భూమి పొందిన వారికే స్పష్టమైన ప్రాధాన్యం ఇస్తాం. అధికారులు, అనధికారులు, విద్యార్థులు, అన్ని పార్టీలకు చెందిన యువకుల ద్వారా ప్రతి ఒక్క రైతుతో మనం నిత్యసంపర్కంలో ఉంటాం. లక్ష్యం పట్ల అచంచలమైన అంకితభావం ఉన్నప్పుడు ఇటువంటి స్వచ్ఛంద సహాయం పుష్కలంగా లభిస్తుందని నేను ఘంటాపథంగా చెప్పగలను. మిగులు భూముల పంపకం పూర్తయ్యేసరికి, గ్రామీణ నిరుద్యోగం, తగినంత ఉపాధిలోపం వంటి సమస్యలలో వాస్తవంగా మన మెక్కడున్నామో అర్థమవుతుంది. తమ చిన్న, మధ్య తరహా పరిశ్రమల పథకాలతో సిద్ధంగా ఉండమని ఇప్పటికే నేను పరిశ్రమలశాఖను ఆదేశించాను. అందువల్ల పరిహారరూపంలోనో, ఇతర విధంగానో కొంత డబ్బు పొందినవారు, దానిని అత్యవసరాలకో, అనుత్పాదకప్రయోజనాలకో ఖర్చు పెట్టకుండా ఉపయోగకరమైన, లాభదాయకమైన వాటిపై పెట్టుబడి పెట్టడానికి వీలవుతుంది. అయిదేళ్ళ తర్వాత ఎలా ఉంటుందో ఊహించుకోండి. మన గ్రామీణవ్యవస్థ అసంఖ్యాకమైన చిన్న, మధ్య తరహా రైతులతో, వాళ్ళలో ప్రతి ఒకరూ పంట పంటకీ పెంచే లాభసాటి దిగుబడితో, ఈ వ్యవసాయోత్పత్తిని సరుకులుగా మార్చి గ్రామాలలో సంపదను వెల్లు వెత్తించే అసంఖ్యాక గ్రామీణ పరిశ్రమలతో, కళకళలాడుతుంది. ఇది కొత్త విషయం కాదు, రెండువందలేళ్ళ క్రితం ఈ దేశంలో సర్వత్రా విలసిల్లిన సన్నివేశమే ఇది. గాంధీజీ ప్రభావాన్ని ఎంతో కొంత జీర్ణించుకుని, ఆయన తమకు మహాత్ముడెందుకయ్యాడో గ్రహించిన ఎందరో బడుగుజీవుల చిరకాల స్వప్నమైన ఈ మహత్తర భవిష్యద్దర్శనానికి, ఈ మహోన్నత ప్రక్రియకు, ప్రారంభం చేయవలసిందిగా సభ్యులకూ, ఈ మహనీయశాసనసభ ద్వారా యావన్మంది రాష్ట్రప్రజలకూ, నేను విజ్ఞప్తి చేస్తున్నాను....'

కట్టలు తెంచుకున్న ఉత్సాహోద్వేగాల మధ్య, పెద్ద పెట్టున బల్లల చరుపుల మధ్య 'ఇందిరాగాంధీకి జై' అంటూ మిన్నంటే నినాదాల మధ్య - 'అఫ్రోజాబాద్ భూ పరిమితుల చట్టాన్ని ఆమోదించడమైనదం'టూ చెమ్మగిల్లిన కళ్ళతో ప్రకటించాడు సలీముల్లా.

# 59

అఫ్రోజాబాద్ శాసనసభలో భూపరిమితి బిల్లుపై వోటింగ్ జరుగుతున్న సమయంలోనే ఇందిరాగాంధీ, కాంతీపూర్ కుడ్యాలపై వెలసిన, కొన్ని ఎంపికచేసిన ఛాయాచిత్రకళాఖండాలనూ, వాటికింద అతి సరళమైన ఇంగ్లీషులో, చదవడానికి కూడా సిగ్గుపడేలా ఉన్న వ్యాఖ్యలనూ చూస్తూ ముఖం చిట్లించారు. ప్రతి చిత్రం కింద 'గౌరవనీయ ప్రధానమంత్రికి అఫ్రోజాబాద్ ముఖ్యమంత్రి గౌరవపురస్సరంగా బహూకరించిన'దనే వాక్యం ఉంది. ఆ ఫొటోలన్నీ ఉంచిన పెద్ద కవరు మీద, 'ఇందిరాజీకి, ఆమె మూర్ఖమిత్రుడు, ముఖ్యమంత్రి ఆనంద్ - అభినందనలతో', అని స్పష్టంగా టైప్ చేసి ఉంది.

ఎనిమిదిగంటలపాటు విమానప్రయాణం చేసి బాగా అలసిపోయిన ఇందిరాగాంధీ విశ్రాంతి తీసుకునే ముందు దీర్ఘా లోచనలో మునిగిపోయారు. ఈ ఫొటోగ్రాఫుల గురించి ఇంకా చాలామందికి తెలిసినట్టు లేదు. వీటి గురించి పూర్తి వివరాలు ఒక్క హోంమంత్రికే తెలుసు. ఇంకా మరెన్నో చోట్ల ఈ చిత్రాల నకళ్ళు ప్రత్యక్షం కాబోతున్నాయనీ, రెండురోజుల తరువాత రాష్ట్రస్థాయి, ప్రాంతీయపత్రికలు వీటిని పెద్దఎత్తున అందిపుచ్చుకోబోతున్నాయనీ హోంమంత్రికి ఇంటెలిజెన్స్‌వర్గాల ద్వారా సమాచారం అందింది కూడా.

ఇది అత్యవసరంగా దృష్టిపెట్టవలసిన వ్యవహారమనడంలో సందేహం లేదు. కనుక హోం మంత్రి మరునాడు తెల్లారుతూనే ఇందిరాజీని కలసి అఫ్రోజాబాద్‌లో పెద్దఎత్తున సాగుతున్న ప్రచారకాండ గురించి వివరించాడు. నలభైలనుంచీ తనకు మిత్రుడయిన చౌదరి ద్వారా ఎప్పటికప్పుడు దీని గురించి అతడు సమాచారం తెప్పించుకుంటూనే ఉన్నాడు. ఆనంద్ అనబడే బ్రేకుల్లేని వాహనం పిచ్చెత్తినట్టు దూసుకుపోతున్న ఫలితంగా పార్టీకి, స్వయంగా ఇందిరాజీకి ఎలాంటి విపత్తు కాచుకుని ఉందో నర్మగర్భంగా ఆమెకు నివేదించుకుంటూ వచ్చాడు ఎప్పటికప్పుడు అతని మాటలనామె సావధానంగా విన్నా, ఆ భోగట్టాను అతనికందించిన రాజకీయవర్గాల గురించి ఆమెకు బాగా తెలుసు కనుక అతని మాటల్లోని ధ్వనికామె ప్రభావితురాలు కాలేదు. ఎక్కడైనా సరే, స్వార్థపరశక్తులతో పోరాటం కష్టమూ, ప్రమాదభూయిష్ఠమూ కనుక, ఒకవేళ ఆనంద్ అదే చేస్తూ ఉంటే అందులో అతణ్ణి తప్పుపట్టవలసిందేమీ లేదనే ఆమె తలపోస్తూ వచ్చారు.

అయితే ఈసారి పరిస్థితి భిన్నంగా కనిపిస్తోంది. ఎలా? ఎలాగంటే యావద్దేశమూ అధికారపక్షమూ కూడా ప్రమాదంలో పడబోతున్నాయంటూ హోంమంత్రి వివరించడం ప్రారంభించాడు. కొంతమంది ఉన్నవాళ్ళనుంచి లాక్కున్న భూమి కొందరు లేనివాళ్ళకు దక్కచ్చు, దక్కకపోవచ్చు. అయితేఈ వ్యవహారం ఇక్కడితో ఆగడం లేదు. లేదు మేడమ్, నిజం చెప్పాలంటే ఈసారి గురి మీరు. మీమీద అదేపనిగా బురద చల్లుతూ మీ వ్యక్తిగతప్రతిష్ఠకే దారుణమైన మచ్చ తెచ్చేలా ఇలా భారీ ఎత్తున దుష్ప్రచారం జరుగుతున్న స్థితిలో, నిరక్షరాస్యులూ, ఏదిచెప్పినా ఇట్టే నమ్మేసే ప్రజలున్న ఈ దేశానికి మీరెలా నాయకత్వం వహించగలరు? ముంచుకొస్తున్న సంక్షోభాన్ని పార్టీ సీనియర్ నాయకులందరూ గట్టిగా పట్టించుకోవలసిన సమయమొచ్చిందని నాకనిపిస్తోంది. ఇందులో మిమ్మల్ని వ్యక్తిగతంగా లాగారు కనుక దయచేసి నన్ను చొరవ తీసుకోనివ్వండి. ముఖ్యమంత్రి ఆనంద్ చాలా మంచి పేరుప్రతిష్ఠలున్నవాడే. అతడు చేసింది నిస్సందేహంగా గొప్పపనే. భూమిలేని లక్షలాది ప్రజలకుపార్టీ చేసిన వాగ్దానం పూర్తిచేయడం ప్రశంసనీయమని నేనూ ఒప్పుకుంటాను. కనుక ఆనంద్‌ను ఎంతైనా అభినందించవలసిందే. అయితే, ఎన్ని అడ్డంకులెదురైనా చట్టం ఎట్టకేలకు ఆమోదం పొందనే పొందింది. తన సహజగతిలో అమలులోకీ వస్తుంది. దీని గురించి ఇకమీదట రక్తపాతం, అల్లర్లు జరగకూడదు. ఏదైనా ఒక రాష్ట్రంలో ఒక చట్టాన్ని అమలు చేయడం ద్వారా సాక్షాత్తు ప్రధానమంత్రి పీఠానికే ముప్పు తేవచ్చునా అన్నది సీనియర్ నాయకులిప్పుడు ఆలోచించవలసిన విషయం. మనం ఏం చేసినా కాస్త ముందూ వెనుకా చూసుకోవాలి. ఎట్టి పరిస్థితిలోనూ ప్రధానమంత్రిని బలిపెట్టలేం! ప్రధానమంత్రి కన్నా ఎవరూ ఎక్కువ కాదు, ఈ విషయంలో నాకు రెండో ఆలోచన లేదు. ఈ దేశంలోని లక్షలాదిమంది భావన కూడా ఇదే...'

నిజంగా ఇదొక విపరీత సన్నివేశమే. ప్రధానమంత్రి సుస్థిరత్వాన్నో, ఒక ముఖ్యమంత్రి కొనసాగింపునో - రెంటిలో ఏదో ఒకదానిని ఎంచుకోక తప్పదని ఇందులోని సూచన. అసత్యాని కింతకన్నా పరాకాష్ఠ ఉండదు. ఏమైతేనేం, దీనిని దేశం మొత్తానికే ఎదురైన పెనుసవాలుగా చిత్రీకరించేశారు. మేధావులు, గౌరవనీయపౌరులన్న ముసుగులో భూస్వాములు, వివిధవృత్తులకు చెందిన నిపుణులు, వివిధ రాజకీయపక్షాలనాయకులు వరసపెట్టి గుప్పిస్తున్న ప్రకటనలు దీనిని ధ్రువీకరించేలా ఉన్నాయి. ప్రధానమంత్రి జరుగుతున్నదేమిటో ఆకళింపుచేసుకునే లోగానే, వివిధ రైల్వే స్టేషన్ భవనాల కూల్చివేత, జాతీయరహదారులపై పెద్ద ఎత్తున గోతుల తవ్వకాల వంటి ఘాతుకాలు జరిగి రాకపోకలకు తీవ్ర అంతరాయం సంభవించింది. పెరా మిలటరీ దళాలను రప్పించవలసి వచ్చింది. ఎక్కడినుండి ఎలా వచ్చాయో ఎవరికీ తెలియని ఎంతో ఖరీదైన అత్యాధునిక ఆయుధాలను అనూహ్యమైన పెద్ద సంఖ్యలో సంపాదించిన వందలాది యువకులకూ, పెరా మిలటరీ దళాలకూ మధ్య తీవ్రఘర్షణలు చోటు చేసుకున్నాయి. ప్రతి కాల్పుల ఘటన రాష్ట్ర వ్యాప్తంగా ఉద్రిక్తతనూ, ఆగ్రహావేశాలనూ రెచ్చగొట్టింది. దాంతో పత్రికల దృష్టి సహజంగానే అఫ్రోజాబాద్‌పై కేంద్రీకృతమైంది దీనిని దారుణమైన శాంతి భద్రతల సమస్యగానే అవి చిత్రించాయి. అందులోనూ కొంత వైవిధ్యం లేకపోలేదని కొన్ని అభిప్రాయపడ్డాయి.

ఆ అసభ్య చిత్రాలు, రాతలు ఇతర ప్రదేశాలకు వ్యాపించకుండా కట్టుదిట్టమైన చర్యలు తీసుకున్నా, ప్రధానమంత్రి పరువు దిగజార్చే అలాంటి రాతలు, బొమ్మలు లేని గోడంటూ రాష్ట్రం మొత్తం మీద లేనేలేదనే అభిప్రాయం ఇతర రాష్ట్రాలలోని ప్రజలకు కలిగింది. కొన్నిరోజులు గడిచేసరికి, ముఖ్యమంత్రి చేసిన ఘోరమైన తప్పులవల్ల రాజ్యాంగనిర్దేశాల కనుగుణంగా రాష్ట్రంలో పరిపాలన కొనసాగలేని దశకు పరిస్థితి విషమించిదన్న భావం కేంద్రనాయకత్వానికి కలగసాగింది. అఫ్రోజాబాద్ రాష్ట్రంలో ఆ క్షణంలో నెలకొన్న స్థితికి రాజ్యాంగంలోని 356వ అధికరణం అతికినట్టు సరిపోయేలా కూడా కనిపించింది. రాష్ట్రానికి సంబంధించిన ఇంటెలిజెన్స్ నివేదికలను కేంద్ర హోం, న్యాయమంత్రిత్వశాఖలు క్షుణ్ణంగా పరిశీలించడం, ఒక ముసాయిదా ప్రతిపాదనను రూపొందించడం కూడా జరిగిపోయాయి. సంబంధితమంత్రివర్గ ఉపసంఘం రెండు రోజుల్లో దానిని పరిశీలించబోతోంది.

ఈ విషయాలేవీ ఆనంద్‌కు తెలియవు. శాంతిభద్రతలపరిస్థితిగురించి రాష్ట్ర గూఢచారి విభాగం తనకిచ్చిన చిత్రం పూర్తిగా వేరు. జిల్లాల్లో అక్రమఆయుధాలతో అరాచకం సృష్టిస్తున్న అనేక మురాలను పోలీసులు నిర్బంధంలోకి తీసుకున్నారనీ, వారి ద్వారా అల్లర్ల వెనుక ఎవరెవరున్నారో కచ్చితంగా గుర్తించడం జరిగిందనీ సి.ఐ.డి. నివేదికలు స్పష్టం చేశాయి. అసలునేరస్థులెవరో బయటపెడితే (రెండురోజుల్లో ఆ నివేదికల మదింపు పూర్తయిన తర్వాత) ఎన్నో ఆశ్చర్యరాలు ముంచెత్తి, కల్పనకన్నా వాస్తవమే ఎన్నోరెట్లు విస్మయం కలిగిస్తుంది. మొత్తంమీద ఇంటెలిజెన్స్‌బ్యూరో నుంచి కేంద్ర హోంమంత్రికి అందిన నివేదికలకూ, రాష్ట్ర గూఢచారి విభాగం నుంచి ముఖ్యమంత్రికి అందిన నివేదికలకూ, ఎక్కడా పోలిక లేదు. అలా వివిధసంస్థలు భిన్న భిన్న రాజకీయ ప్రయోజనాల కోసం పనిచేస్తున్నట్టు కనిపించాయి.

దాంతో మరునాడు ఉదయమే కేంద్ర హోంమంత్రి ఫోన్ చేసి అందించిన సందేశం ముఖ్యమంత్రిని ఆశ్చర్యంలో ముంచెత్తింది. రేపు సాయంత్రం పార్టీపార్లమెంటరీ బోర్డు అత్యవసరంగా సమావేశం కాబోతోందనీ, దయచేసి వీలు చేసుకుని ఆ సమావేశంలో పాల్గొనడానికి ఢిల్లీ రమ్మనీ దాని సారాంశం.

'ఈ పరిస్థితిలో రాష్ట్రాన్ని విడిచి పెట్టి రమ్మంటారా?' ఆనంద్ అడిగిఊరుకున్నాడు. సమాధానం ఆశించలేదు.

మరునాటి పత్రికలు, జరగబోయే సమావేశం గురించి ప్రస్తావించి, రాష్ట్రంలో కొద్దికాలంపాటు రాష్ట్రపతి పాలన విధించే అవకాశమున్నట్టు స్పష్టంగా సూచించాయి. కొన్నిరోజుల క్రితమే శాసనసభ్యులు సీలింగ్స్ బిల్లును ఆమోదించారు కనుక చాలామంది సభ్యులు అప్పటికింకా రాజధానిలోనే ఉన్నారు. ఆరోజు ఉదయం వెలువడిన వార్త పెద్ద సంచలనం సృష్టించడంతో అధికారపక్ష సభ్యులందరూ భయాందోళనలతో ముఖ్యమంత్రి నివాసంలో గుమిగూడారు. వాళ్ళనుంచి ఢిల్లీకి వ్యతిరేకంగా పెద్ద ఎత్తున నిరసనధ్వనులు దూసుకొచ్చాయి. బజరంగ్‌సింగ్ లాంటి పెంకిఘటాలు ఉద్రేకపూరిత ప్రసంగాలు చేశారు. ఆగ్రహావేశాలు వెలిగక్కుతూ అధిష్ఠానవర్గాన్ని బాహాటంగా విమర్శిస్తూ ఆ సమావేశం సుదీర్ఘంగా సాగింది. అఫ్రోజాబాద్ రాజుకూ,

భూస్వామ్య వ్యవస్థకూ వ్యతిరేకంగా నిన్న మొన్న తమ ప్రాణాలు ఒడ్డి పోరాడిన కొందరు గట్టి పిండాలకు- రాజు ఉండనీ, లేకపోనీ- కేంద్రం ప్రస్తుత వైఖరిలో అవే భూస్వామ్యశక్తులకు దాసోహమవడమే కనిపించింది. భూ పరిమితుల చట్టాన్ని తక్షణం అమలు చేయాలన్న అభిప్రాయానికి అంకితమైన సభ్యులు, ఆ చట్టం ఆనంద్‌కాక మరెవరు ముఖ్యమంత్రి స్థానంలో ఉన్నా అమలు జరగదుగాక జరగదంటూ గొంతెత్తి ఘోషించారు. ఆనంద్ అధికారంలో కొనసాగి తీరవలసిందేనని తేల్చారు. రాష్ట్రపతిపాలన విధిస్తారన్న వదంతి కేవలం భూ పరిమితుల విధింపు కార్యక్రమాన్ని నీరుగార్చడానికే తప్ప మరొకందుకుకాదని కొందరు ఆరోపించారు. కనుక, ఈ అసంపూర్ణ కార్యక్రమాన్ని పూర్తి చేయడానికి, ఇప్పుడిప్పుడే ఆమోదించిన చట్టంలోని సంకల్పానికి ఆచరణ రూపం కల్పించడానికి మనమే మరో పార్టీని ఎందుకు ఏర్పరచకూడదని పట్టుదలగా వాదించారు. చివరకు సభ్యుల ఉద్రేకపూరిత ఉద్ఘాటనలు, ఆ దిశలోనే పుంజుకున్నాయి. వారి మాటల్ని ఆనంద్ ఎంతో ఓపికగా విన్నాడు. అయితే అలాంటి అనాలోచితసూచనలను వ్యతిరేకిస్తూ అతికష్టం మీద వారిని సమాధానపరిచే ప్రయత్నం చేశాడు. రాష్ట్రపతిపాలన విధిస్తారన్న వార్త నిజంకాదని నొక్కిచెబుతూ, ఎయిర్ పోర్టుకు వెళ్ళడానికి కారెక్కే క్షణం వరకూ అతడు సభ్యుల్ని బుజ్జగిస్తూ గడిపాడు

★ ★ ★

ఇండియన్ ఎయిర్ లైన్స్ విమానంలోకి ప్రవేశించగానే తన పక్క సీట్లోనే సలీముల్లా నిండుకుండలా కూర్చుని ఉండటం చూసి ఆనంద్ ఆశ్చర్యపోయాడు. అతడు చిరునవ్వుతో అన్నాడు, 'ఈ రోజు సమావేశంలో ఉద్రేకాలు ఎలా కట్టలు తెంచుకున్నాయో మీరు చూచారు. కనుక నేనక్కడ మీ పక్కన ఉండటం అనవసరమనిపించింది. అందుకని వచ్చే రెండు గంటలు విమానంలో మీకు కంపెనీ ఇస్తే మంచిదనుకున్నాను.'

'మంచి పని చేశావు,' అన్నాడు ఆనంద్ నవ్వుతూ.

అయితే, విమానం పైకి లేస్తుండగానే, సలీముల్లా బుర్రలో ఏదో తీవ్రమైన విషయమే ఉన్నట్టు ఆనంద్‌కు అనిపించింది.

'ఢిల్లీలో దిగగానే ఏం చేద్దామనుకుంటున్నారు ఆనంద్‌భాయ్?' సలీముల్లా నుంచి ఆ అనివార్య ప్రశ్న రానే వచ్చింది.

'ముందు దిగనీ, తర్వాత మనమెందులోకి దిగామో తెలుస్తుంది... ఈ కొత్త పరిస్థితిలో కాస్త ఆలోచనాసాయం చేయడానికి నువ్వు నాతో రావడం మంచిదే అయింది...' ఆనంద్ అన్నాడు.

'ఎం.ఎల్.ఏల మనోభావాలెలా ఉన్నాయో మీరే చూశారు. మొత్తానికి మూడోకంటికి తెలియకుండానే తెరవెనుక ఏదో గూడుపురాణీ జరుగుతోందనే నాకు అనిపిస్తోంది..'

'అదేమై ఉంటుందంటావ్?' ఆనంద్ ప్రశ్నించాడు

'మనకు అపజయమే కాచుకుందని నాకనిపిస్తోంది, ఇలా అంటున్నందుకు మీరేమీ

అనుకోవద్దు. కిందటివారం శాసనసభలో అంత అద్భుతవిజయం సాధించిన తర్వాత కూడా పార్టీకి ఈ పరిస్థితి రావడమే విడ్డూరం. ఇది ముందుముందు చట్టం అమలులో రాబోయే ఉపద్రవాలను ఊహించుకుని హఠాత్తుగా వచ్చిన అధైర్యం నుంచి కలిగిన నిర్వేదమనుకుంటాను.'

'వాస్తవమేమిటో నాకూ తెలియదు కానీ, నువ్వా వాస్తవానికి ఎంతో దూరంలో లేవని నా కనిపిస్తోంది.' ఆనంద్ అన్నాడు. 'నేను కేవలం ఒక నిమిత్తమాత్రుణ్ణని నీకు తెలుసు. కేవలం ప్రభుత్వాన్ని నిర్వహించే విధానం మాత్రమే కాక తద్వారా సాంఘికన్యాయాన్ని సాధించి తుపాకీకి దీటైన శాంతియుత ప్రత్యామ్నాయంగా నిలిచే నూతన ప్రజాస్వామ్యంగా నేను ఊహించిన బృహన్నిర్మాణంలో నేనొక చిన్న పరికరాన్ని మాత్రమే. గత ముప్ఫైఏళ్ళలో అభివృద్ధి చెందిన అనేకదేశాల్లో ప్రజాస్వామ్యం మొగ్గతొడగడం మాడిపోవడం వెనువెంటనే జరుగుతూ వచ్చాయి. భారతదేశం ఒక్కటే ఇప్పుడు దానికి అంతిమ స్థావరం, ఇందిరాగాంధీ ఒక్కరే దానికి అంతిమరక్షకురాలు. కనుక ఇందిరాగాంధీ ఎంత బలోపేతంగా ఉంటే అదీ అంతే బలోపేతంగా ఉంటుంది. అంతకంటె ఎక్కువా కాదు, తక్కువా కాదు ఈ ఘట్టానికి చేరుకోవడంలో ఆమె ప్రజాస్వామ్యబద్ధంగా స్థాపితమైన తన ప్రభుత్వాన్నీ, ప్రజల గుర్తింపు, ఆమోదాలు పొందిన తన నాయకత్వాన్నీ, సాధనాలుగా ఉపయోగించడానికి తగినంత మెలకువతోనూ, నిశ్చయబుద్ధితోనూ, ఇంతవరకు కృషి చేశారు. అవును - 'ఇంతవరకు', అని నేను మళ్ళీ చెబుతున్నాను. మళ్ళీ 'ఇంతవరకు' ప్రజలు అత్యద్భుతంగా స్పందించారు. ఒక క్రియాశీలసహచరునిగా, ఆమె సాధించినదానినీ, సాధించలేకపోయినదానినీ నేను కచ్చితంగా ఇలాగే అంచనా వేస్తాను ఆమె స్వీయప్రేరణలతోనూ ఉద్దేశాలతోనూ నాకు సంబంధం లేదు. ఆమె నాయకత్వాన్ని *నేనే* స్వీకరించాను, ఎందుకంటే అది *నా గమ్యమైన సాంఘికన్యాయం దిశలో ఒక ముందడుగు వేసే* అవకాశాన్ని నా కందించింది. ఈ క్షణం వరకు నాకెలాంటి సమస్యగానీ, నా బుర్రలో ఎలాంటి గందరగోళంగానీ లేవు అయితే *ఆమె* అస్తిత్వానికీ, *నా సాఫల్యానికీ* మధ్య పోటీ పెట్టడంలో నా మిత్రులిప్పుడు విజయం సాధించినట్టు కనిపిస్తున్నారు. ఈ పోటీయే ఒక అభూతకల్పన. నిజానికి, *ఆమె* అస్తిత్వం, నా అస్తిత్వం పరస్పరపూరకాలు. ఆమె కేంద్రంలో ఉన్నారు. కానీ నా సాఫల్యం ద్వారా చాలావరకు ఆమె తన ఉనికికి పుష్టి సాధించుకోగలుగుతారు. తాత్కాలికంగా భ్రమపడితే పడచ్చుగాక, కాని నా వైఫల్యం ఏవిధంగానూ ఆమె శక్తికి దోహదం చేయలేదు. ఆమె సాధించిన బంగ్లాదేశ్ లాంటి వేరే విజయాలు ఉన్నమాట నిజమే. అయితే అవి దూరంనుంచి ప్రశంసలందుకున్న విజయాలు. అందుకు భిన్నంగా పేదరికం తగ్గింపునకు చేసే ఏ చిన్న ప్రయత్నమైనా సరే, ఆమె నాయకత్వం పునాదులను మరింత పటిష్ఠం చేస్తుంది. ఆ పునాదిలో నేనొక మొండిరాయిని. మేము కలిసి ఉండడంలోనే దేశభవిష్యత్తు ఇమిడి ఉంది.'

'కానీ, అఫ్రోజాబాద్‌లోని మన మిత్రులు ఆమెనుంచి మిమ్మల్ని విడదీయడానికే ఈ కొత్త చిట్కా కనిపెట్టినట్టు కనిపిస్తున్నారు. పునాదిలో బలమైన రాయి అనుకుంటున్నదే దానిని బలహీన పరుస్తోందని ఢిల్లీ పెద్దలు వాళ్ళకు వాళ్ళే నిర్ధారణ కొచ్చినట్టున్నార్ను. ఈ రోజు జరిగే పార్టీ పార్లమెంటరీ బోర్డు సమావేశం కొంత భిన్నంగానే ఉందబోతోందని నా మనసు చెబుతోంది ఇది

మీకో, లేక అఫ్రోజాబాద్‌కో పరిమితమయ్యే వ్యవహారమనిపించడం లేదు. మీరింతకుముందన్నట్టు మీరుభయులూ నిమిత్తమాత్రులే.'

'సాయంత్రానికి ఏదో ఉప్పందుతుంది కదా, ఆ తర్వాత సావధానంగా ఆలోచిద్దాం,' అన్నాడు ఆనంద్.

★ ★ ★

ఆనంద్ ప్రయాణిస్తున్న విమానం ఇంకా గాల్లో ఉండగానే, ముఖ్యమంత్రి ఆనంద్ కేంద్రంపై పూర్తిస్థాయిలో తిరుగుబాటు ప్రకటించబోతున్నాడనీ, పార్టీకి చెందిన మెజారిటీ శాసనసభ్యులతో కలసి పార్టీనుంచి నిష్క్రమించి మరో రాజకీయపక్షాన్ని అవతరింపజేయబోతున్నాడనీ, రాష్ట్రంలో ప్రభుత్వం ఏర్పాటుకు తనకు గల అధికారాన్ని ఉద్ఘాటించబోతున్నాడనీ, ప్రధాని ప్రిన్సిపల్ సెక్రటరీకి కాపీ పెట్టిన ఒక అత్యవసర నివేదిక, తన 'వర్గాల' ద్వారా హోంమంత్రికి అందింది. పౌరుల నుంచి వచ్చినట్టు కనిపింపజేసే వందలాది టెలిగ్రామ్‌లూ వచ్చిపడ్డాయి. ఆశ్చర్యకరంగా అన్ని టెలిగ్రాములలోని పాఠం ఒకటే.

అధిష్ఠానవర్గం ఈ నివేదికలను జీర్ణించుకునే లోపలే ఆనంద్ ఢిల్లీకి వచ్చి ఉన్నాడు. ప్రధానమంత్రితో సమావేశానికి అభ్యర్థించాడు. వెంటనే అతనికి అపాయింట్‌మెంట్ దొరికింది.

ప్రధానమంత్రితో తన సమావేశం సుహృద్భావపూర్వకం జరగడమలా ఉంచి, మామూలుగా కూడా లేదని ఆనంద్‌కు అనిపించింది. ఆనంద్ అధికారపక్షాన్ని విడిచిపెట్టి సొంతంగా వేరే పార్టీ పెట్టబోతున్నాడన్న నివేదిక కాపీని ఆమె కూడా చూసినట్టే కనిపించారు. అయితే తన మాటల్లో కానీ, హావభావాల్లో కానీ ఆ విషయం బయటపెట్టలేదు. ఆనంద్‌కు ఆ విషయం చూచాయగా కూడా తెలియదు. అయినా ఆమెలో ఏదో మార్పును పసిగట్టగలిగాడు. శాసనసభలో అన్ని గండాలను దాటుకుంటూ సీలింగ్స్ బిల్లును ఆమోదింపచేయగలిగినందుకు ఆమె చిరునవ్వుతో అభినందించారు. ఆనంద్ అందుకు థాంక్స్ చెబుతూ అన్నాడు. 'అసలు పని ఇప్పుడు ప్రారంభమవుతుంది మేడమ్. లక్షలాదిమంది పేదలకు ఆ భూమిని పంచాలి, వాళ్ళను లాభసాటి రైతులుగా తీర్చిదిద్దాలి.'

'అవునవును,' అంటూ ఆమె సంభాషణను శాంతిభద్రతలపరిస్థితివైపు మళ్ళించి, ఇప్పటి పరిస్థితిపై మీరేమనుకుంటున్నారని ప్రశ్నించారు.

'శాంతిభద్రతల విషయంలో మేము ఆందోళన పడిన మాట నిజమే మేడమ్. కాని అదంతా గతం. ఇప్పుడు పరిస్థితంత విషమంగా లేదని చెప్పగలను.'

'మీరు నిజంగా అలా అనుకుంటున్నారా?'

'అవును మేడమ్,' అతడు ఆత్మవిశ్వాసాన్ని ధ్వనింపచేస్తూ అన్నాడు,' రాజధానిలోను, రెండుమూడు జిల్లా ముఖ్య కేంద్రాల్లోను భారీ నిరసన ప్రదర్శనలు జరిగితే జరగచ్చు కానీ, గత పన్నెండు రోజుల్లోను ఎక్కడా హింసాత్మక సంఘటనలు లేవు. బిల్లు ఆమోదం పొందినప్పటినుంచి నిరసన ప్రదర్శనలు కూడా తగ్గుముఖం పడుతున్నాయి.'

'రానున్న ఒక ముఖ్యమైన పండుగను దృష్టిలో పెట్టుకుని ఉద్యమానికి తాత్కాలికంగా విరామమిచ్చారనీ, పండుగ తర్వాత రెట్టింపైన ఉధృతితో హింసాత్మకచర్యలు తిరిగి ప్రారంభమవుతాయనీ, మాకందిన నివేదికలు చెబుతున్నాయి.'

ఆనంద్ ఏమీ మాట్లాడలేదు. ఆ క్షణం వరకూ తన ఊహకు కూడా అందని ఆ సరికొత్త సమాచారానికి నివ్వెరపోయాడు. ఆ తర్వాత ప్రధానమంత్రి దేశవ్యాప్తంగా ఉన్న విషమపరిస్థితుల గురించి, శాంతిభద్రతలులేనిదే ఏదీ సాధ్యం కాదంటూ వాటినెలాగైనా కాపాడవలసిన అవసరం గురించి వివరించుకుంటూ వచ్చారు.

'అవును మేడమ్! మీతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. మనం సమస్య మూలకారణాల్లోకి వెళ్ళవలసి ఉంటుంది . . .'

'ప్రతి సమస్యకూ ఒక కారణమంటూ ఉండదు,' ఆమె మధ్యలోనే తుంచుతూ అన్నారు. 'చాలా సందర్భాల్లో సమస్య కోసమే సమస్యను సృష్టించడం జరుగుతుంటుంది. వాటిని భిన్నమైన పద్ధతిలోఎదుర్కోక తప్పదు. ఇక్కడ ప్రధాన ప్రేరణ రాజకీయం. కేంద్రంలోని ప్రభుత్వాన్ని అస్థిరపరచడమే ఇందులో వాళ్ళు ఆశించే ప్రయోజనం.'

తన అభిప్రాయానికి సమర్థనగా ఆమె దేశంలోని వివిధ ప్రాంతాలకు సంబంధించిన వివిధ ఉదాహరణ లిచ్చుకుంటూ వచ్చారు. ఒక్కొక్క రాష్ట్రం గురించి స్పృశించి మళ్ళీ అఫ్రోజాబాద్ విషయానికి వచ్చి 'గత అనేక వారాలుగా' తన దృష్టికి వస్తున్న కొన్ని తీవ్రమైన సంఘటనల గురించి ప్రస్తావించారు. ఆనంద్‌కు ఈ సంఘటనల గురించి తెలియనే తెలియదు. అవి నిజమైతే తన దృష్టికి రాకుండా ఉండవు. ఆమెకందిన నివేదికలు తప్పుడు సమాచారంతో తెలివిగా కూర్చిన దొంతరని అతనికి నిశ్చయంగా తెలుసు... కానీ ఆ మాట పైకి అనే అవకాశం లేదు.

అంతలో ఆమె నిజాయితీ ఉట్టిపడేలా దృఢస్వరంతో అన్నారు, 'చూడండి ఆనంద్‌జీ, మీ రాష్ట్రంలో మీరు అత్యుత్తమమైన పనిచేశారు. మిమ్మల్ని చిన్నబుచ్చాలని మాకు ఏ కోశానా లేదు. అయితే పరిస్థితి మీ రాష్ట్రానికీ, దేశానికీ కూడా ముప్పుతెచ్చేలా కనిపిస్తోంది...' ఆమె అర్థోక్తిలో ఆపేసి తన ఎదురుగా ఉన్న టెలిగ్రాముల దొంతరను చూస్తూ ఉండిపోయారు.

'నాకు పూర్తిగా అర్థమైంది మేడమ్, కృతజ్ఞుణ్ణి,' ఆనంద్ సమాధానం చెప్పాడు. 'నా సంపూర్ణ సహకారం మీకెప్పుడూ ఉంటుందని హామీ ఇస్తున్నాను.'

★ ★ ★

మరో రెండుగంటల్లో పార్లమెంటరీ బోర్డ్ సమావేశం జరగబోతోంది. గెస్ట్‌హౌస్‌లోని ముఖ్యమంత్రి సూట్‌లో ఆనంద్, సలీమ్ కూర్చుని ఉన్నారు.

'నేను ఢిల్లీ వచ్చిన ప్రతీసారీ, ఏదో ఒక కొత్త విషయం కనిపెడుతూనే ఉంటాను,' గాంభీర్యానికి కాస్త చమత్కారం జోడిస్తూ అన్నాడు సలీమ్.

'ఈ కొన్ని గంటల్లోనే కొత్త విషయమేం కనుక్కున్నావు?' ఆనంద్ ప్రశ్నించాడు.

'మా కజిన్ ఇంట్లో కొందరు రాజకీయవాదులు కలిశారు. ఇక్కడ నా బంధువులు కొందరు రాజకీయాల్లో లేకపోయినా నెహ్రూ కుటుంబానికి సన్నిహితులన్న సంగతి మీకు తెలుసుకదా! అఫ్రో జాబాద్ కేంద్రంగా సాగుతున్న రసవత్తరనాటకం గురించి ఢిల్లీలో ఎవరికీ ఏ కొంచెం కూడా తెలియదని నాకు అర్థమైంది. ముఖ్యమంత్రి నిష్క్రమించబోతున్నారనీ, రాష్ట్రపతి పాలన విధించబోతు న్నారనీ వాళ్ళకు పత్రికల ద్వారానే తెలిసింది. తన పార్టీకి చెందిన ఏ ముఖ్యమంత్రి మీదయినా అ యిష్టత ఏర్పడితే ఇందిరాగాంధీ అతణ్ణి తక్షణం తొలగించివేస్తారని వీళ్ళందరి సమష్టి అవగాహన. దీని తదుపరి చర్యేమిటంటే, వెంటనే మరొకరిని ముఖ్యమంత్రి పీఠం మీద కూర్చోబెట్టడం, లేదా కొద్దికాలంపాటు రాష్ట్రపతిపాలన విధించడం. వీళ్ళందరి దృష్టిలో అదో నిత్యకృత్యం లాంటిది. ఇందిరాగాంధీ నిర్ణయాలను దైవదత్తమైన ఆదేశాల్లా వీరు తమ అంతశ్చేతనలో నమ్ముతూ ఉండడమే ఆశ్చర్యం గొలుపుతోంది. చట్టాలు, రాజ్యాంగం, ఎప్పుడవసరమైతే అప్పుడు తల ఊపడానికి ఆమె నిర్ణయాల వెనుక అడుగులో అడుగు వేసుకుంటూ రావలసిందే!'

ఆనంద్ ఏదో అనబోయే లోపలే తలుపు చప్పుడయింది. అందులో ఏదో అర్జంటన్న ధ్వని కూడా ఉంది. ఆనంద్ లోపలికి రండనగానే, కేంద్ర హోంశాఖ సహాయమంత్రి నిహాల్‌చంద్ లోపలికి అడుగుపెడుతూ, 'చెప్పకుండా వచ్చినందుకు సారీ ఆనంద్‌జీ', అని అంతలో అక్కడ సలీమ్ కూడా ఉండటం చూసి ఆగిపోయాడు. 'నేను మీ మాటలకు అడ్డురావడంలేదు కదా?' అన్నాడు. అతనికి సలీమ్ పరిచితుడే, అతనిని కూడా పలకరిస్తూ కరచాలనం చేశాడు.

'సరే, హోం మంత్రులు చేసేదే అది కదా!' అని ఆనంద్ చమత్కరించి, 'కానీ ఈ చొరబాటు స్వాగతం చెప్పదగినదే,' అన్నాడు.

ముగ్గురూ హాయిగా నవ్వేస్తూ సోఫా మీద చతికిలపడ్డారు. 'నే నిప్పుడే గుజరాత్‌నుంచి తిరిగొస్తున్నాను. నిజం చెప్పాలంటే ఎయిర్‌పోర్ట్‌నుంచి నేరుగా ఇక్కడికే వస్తున్నాను...' నిహాల్ చంద్ అన్నాడు.

ఆనంద్‌కు గుజరాత్ పరిస్థితి తెలుసు. అది అఫ్రోజాబాద్ పరిస్థితికేమంత భిన్నం కాదు. అక్కడ అధికారపక్షం చేపట్టిన భూ పరిమితి విధింపు కార్యక్రమానికి బద్ధుడైన 'నామినేటెడ్ ముఖ్యమంత్రి' ప్రస్తుతం సంకులసమరంలో ఉన్నాడు. నీతినియమాలకు పూర్తిగా తిలోదకాలిచ్చి అధికారం కోసం పెనుగులాడుతున్న సహచరుల నుంచి నిప్పుల జడివాన నెదుర్కొంటున్నాడు. వాళ్ళలో చాలామంది భూ పరిమితి కార్యక్రమాన్ని వ్యతిరేకిస్తుండగా, కొందరు ఏదోవిధంగా, ఏం చేసైనా సరే ముఖ్యమంత్రి గద్దెను చేజిక్కించుకోవాలని చూస్తున్నారు. ఒక పక్క సైద్ధాంతిక భావజాలం, మరో పక్క వట్టి అధికార క్రీడ - వీటి పరస్పర ప్రభావాలతో కూడిన సాలెగూడు ఇది. అయితే వారి వారి ప్రయోజనాలు ఎలాంటివన్న విషయంలో స్పష్టత ఉండదు. గుజరాత్ గాంధీ మహాత్ముడు పుట్టిన రాష్ట్రం కనుక ప్రతివాడూ ఏకంగా మహాత్మునికి ముడిపెడుతూ ఒక్కొక్క నినాదాన్ని వల్లిస్తూ ఉంటాడు. ప్రతివాడూ మహాత్మునికి తను ఏ కొంచెమో, వారసుడయినట్టు మాట్లాడుతుంటాడు. మొత్తంమీద జరిగేదేమిటంటే అందరూ కలసి

ముఖ్యమంత్రి అనే జీవిని అన్నివైపులనుంచి ఒత్తి పారెయ్యడం. ఆయన నిష్క్రమణ అనేది ఇతరులు చొరబడడానికి మార్గాలు తెరిచే సింహద్వారం లాంటిది.

ఆనంద్ ప్రశ్నార్థకంగా తనవైపు చూస్తుండగానే హోం మంత్రి అన్నాడు. 'వివరాలలో స్వల్పమైన తేడా ఉండచ్చు కానీ మొత్తానికి అదే కథ. ఎప్పుడన్నదే ప్రశ్న. బహుశా కొద్ది నెలలు . . .'

అంటే ఒకటికి రెండయ్యాయన్నమాట! ఆనంద్ కంతా చిక్కుముడిగా కనిపించింది. 'ఇంతకీ నేను చేయవలసిందేమిటి?' హోం మంత్రిని ప్రశ్నించాడు. ఇంకో గంటలో జరగబోతున్న పార్లమెంటరీ బోర్డు సమావేశానికి ముందుగానే తనకు అత్యవసరంగా ఏదో సందేశం అందించవలసిన అవసరం లేకపోతే ఎయిర్‌పోర్ట్ నుంచి మంత్రి నేరుగా ఇక్కడికే దూసుకురాడన్నది స్పష్టమైంది.

'మీరు పార్టీని విడిచిపెట్టి కొత్త పార్టీని ప్రారంభించబోతున్నారని నా సీనియర్ మంత్రి ఇందిరాజీకి చెప్పారు...' యధాలాపంగా అన్నట్టు అన్నాడు. ఆనంద్ సమాధానం చెప్పబోతుండగా సలీమ్ జోక్యం చేసుకుని అన్నాడు. 'అవును... అది అఫ్రోజాబాద్‌లోని పార్టీ ఎం.ఎల్.ఏ.ల నిర్ణయం. ఆనంద్‌కు మరో మార్గం ఉందని నేననుకోను. కొత్తపార్టీ ఏర్పరచబోయే ప్రభుత్వం నేటి నుంచి ఆరునెలల్లోగా భూ పరిమితుల కార్యక్రమం అమలును పూర్తి చేస్తుంది. దేశంలో ప్రతిచోటా పార్టీలో కావలసినంత అసమ్మతి ఉందని నాకు తెలుసు. అయితే అఫ్రోజాబాద్‌లో మాత్రం మెజారిటీ శాసనసభ్యులు భూ పరిమితుల కార్యక్రమానికే అంకితమై ఉన్నారు. ఇక అసమ్మతివాదుల్లో చాలామంది నిస్సహాయస్థితిలో ఏవో వెర్రిమొర్రి కుట్రలు, కుహకాలు చేస్తూ శాసనసభ బయటే ఉన్నారు. ఈ పరిస్థితిని ఆసరా చేసుకుని ఇందిరాజీకి మరో చోట ఎక్కడా ఎలాంటి మాట రాకుండా ఆమె కార్యక్రమాన్ని రాష్ట్రంలో పూర్తి చేయడం ప్రయోజనకరం కాదా, చెప్పండి మంత్రీజీ? మేమా విషయం చర్చించుకుంటుండగానే మీరు వచ్చారు...'

'అయితే రావలసిన సమయానికే వచ్చానన్నమాట!' సలీమ్ సంధించిన పదునైన వాగ్బాణాలకు ఎలా సమాధానం చెప్పాలో తెలియక నిహాల్‌చంద్ అన్నాడు. అయితే, పార్టీని విడిచిపెట్టే ఆలోచన ఏదైనా నిజంగా ఉంటే అంత కుండబద్దలు కొట్టినట్టు ఆ విషయం ప్రకటించరని అతనికి తెలుసు. కాని దానిని ఉత్తుత్తి బెదిరింపుగానూ తోసిపుచ్చలేకపోయాడు. సలీమ్ ఆ మాటల్ని చాలా సీరియస్‌గా అంటున్నట్టే ధ్వనింపచేశాడు. దాంతో ఆ విషయాన్ని దాటేస్తూ ఆనంద్‌తో అన్నాడు. 'పార్టీ శాసనసభాపక్షనాయకునిగా మీరు యధావిధిగా కొనసాగుతారని చెప్పడానికే నేనిక్కడకు వచ్చాను.'

'అదెలా?' మళ్ళీ సలీమ్ అడ్డుతగిలాడు. 'రాష్ట్రపతి పాలనలో అదెలా సాధ్యం?'

'రాష్ట్రపతి పాలన ఉండనీ, ఉండకపోనీ, శాసనసభ మాత్రం రద్దు కాదు,' నిహాల్‌చంద్ ఖండితంగా అన్నాడు.

'మేము కొద్ది రోజుల క్రితమే ఆ చట్టాన్ని తెచ్చింది, రాష్ట్రపతిపాలనలో అమలు జరగటం కోసమా? ఆనంద్‌భాయ్ కాకుండా మరెవరో దానిని బాగా అమలు చేస్తారనా?' సలీమ్ మరో

తూటా పేల్చాడు. ఆనంద్ కూడా చేయలేనంత సమర్థవంతంగా అతడు సంభాషణ నడిపిస్తున్నాడు.

పూర్తిగా తలవంపు పరిస్థితిలో జారిపోయి మాటలుడిగిన మంత్రి వేడుకుంటున్నట్టుగా ఆనంద్‌వైపు చూశాడు. అప్పటికే ఒక నిశ్చయానికొచ్చి ఇక ఏ సమస్యా నన్ను అంటలేదనుకునే వ్యక్తి ముఖంలో వెల్లివిరిసే ప్రశాంతతతో ఆనంద్ సలీమ్ వైపు చూశాడు. కానీ సలీమ్ వ్యవహారాన్ని అక్కడితో ఆగనిచ్చేలా లేడు.

'నేను మా ఎం.ఎల్.ఏ.లకు చెప్పుకోవలసిఉంటుంది మంత్రిగారూ. కనుక దయచేసి నాకు వివరంగా చెప్పండి. అధికారంలో, ప్రజాదరణలో మీరు శిఖరాగ్రాన్ని అందుకున్నారు. 1972లో, కేవలం ఒక ఏడాది క్రితం, మీరు చేసిన వాగ్దానాలు చెల్లించుకుంటారని ఈ దేశంలోని పేదలు కొండంత ఆశతో ఎదురుచూస్తున్నారు. అంత స్పష్టమైన, అంత దృఢమైన, హామీలు ఇంతవరకు ఎవరూ ఇవ్వలేదు. దాంతో స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మొట్టమొదటిసారి ప్రజలు మిమ్మల్ని సీరియస్‌గా తీసుకున్నారు. మిమ్మల్ని నమ్మారు. భూ పరిమితుల కార్యక్రమాన్ని వ్యతిరేకించినవారంతా ఈ క్షణాన చెట్టుకొకరు, పుట్టకొకరుగా చెదిరిపోయి ఉన్నారు. అటువంటప్పుడు ముందుకు వెళ్ళడంలో మీ కేమిటి ఇబ్బంది? ఈ సమయంలో నీళ్ళు నమలడం వల్ల మీకొచ్చే ప్రయోజన మేమిటి?'

'నీళ్ళు నమిలే ప్రశ్న లేదు, మీకు నేను హామీ ఇస్తున్నాను,' మంత్రి వెంటనే అందుకుంటూ అ న్నాడు. 'మీ రాష్ట్రాన్ని మీరు మేనేజ్ చేసుకుంటే ఎవరూ అభ్యంతరపెట్టరు - మేనేజ్ చేయడమంటే మీ రాష్ట్రంలో జనజీవితంతో ముడిపడిన ప్రతి అంశాన్నీ అన్నమాట. అయితే పార్టీ అధిష్ఠానవర్గం రెండు నిర్దిష్టమైన విషయాలను దృష్టిలో పెట్టుకోక తప్పదు. రాష్ట్రప్రభుత్వం ఎలాంటి చర్య తీసుకున్నా దాని పర్యవసానాలు ఆ రాష్ట్రంలోనే ఎలా ఉంటాయన్నది ఒకటి. ఇతర రాష్ట్రాలమీద, దేశం మొత్తం మీద ఎలా ఉంటాయన్నది రెండు...'

'మీరన్నది బాగానే ఉంది మంత్రిగారూ,' సలీమ్ పట్టువిడవకుండా కొనసాగిస్తున్నాడు. 'ఎలాంటి పర్యవసానాలనయినా గతంలోకంటె సమర్థంగా ఎదుర్కొని అదుపు చేయగల స్థితిలో మీరున్నారని మా నమ్మకం, ముఖ్యంగా మిమ్మల్ని ఇప్పుడున్న స్థాయికి పెంచిన భూ పరిమితుల కార్యక్రమం అమలు విషయంలో. ఈ అంచనాతో అధిష్ఠానవర్గం విభేదిస్తుందంటారా? అయితే ఎందువల్ల?'

'నేను చెప్పగలిగిందొకటే సలీమ్ భాయ్. అధిష్ఠానవర్గం ఆయా సమస్యలను సుదూరదృష్టితో చూడక తప్పదు. అనేకసమస్యలు పరిశీలించవలసి వ చ్చినప్పుడు మామూలు అవసరానికి మించిన దూరదృష్టితో చూడవలసివస్తుంది. కొన్ని సమస్యలు హఠాత్తుగా ముంచుకొస్తాయి. పైగా అవి గీత గీసినట్టు స్పష్టంగా ఉండకపోవచ్చు. ఒక పట్టాన అంతుపట్టని సంకీర్ణస్థితిలో ఉండచ్చు. ఈ రోజు తేటతెల్లంగా ఉందనుకున్న సమస్య విషయంలో మనం తీసుకున్న చర్యయొక్క పర్యవసానాలు, రేపు ఎదుర్కొనబోయే గడ్డు సమస్యలపై మనం తీసుకునే వైఖరి మీద పడచ్చు. ఇది పార్టీ భరించవలసిన తలనొప్పి, కనుక హెచ్చరికగా ఉండవలసిందే...'

'అధిష్ఠానవర్గంతో వాదించడం నా అభిమతం కాదు,' సంభాషణను ముగిస్తూ సలీమ్ అన్నాడు. 'అయితే ఒక మాట మాత్రం అనకుండా ఉండలేను. ఇది రోజూ ఎదురయ్యే చిల్లరమల్లర సమస్యల్లో ఒకటి కాదు. నా అభిప్రాయం రేపు పూర్తిగా తప్పని రుజువు కావచ్చు - కావాలనే నా కోరిక కూడా- నాకు గట్టిగా అనిపిస్తున్న దేమిటంటే, నిజంగా ప్రమాదంలో పడింది పార్టీ విశ్వసనీయత, తద్వారా దాని భవిష్యత్తు. సేనల్ని యుద్ధరంగానికి తెచ్చి మోహరించిన తర్వాత, యుద్ధానంతరపర్యవసానాల గురించి ఊగిసలాడుతూ చింతించడంలో నాకెలాంటి అర్థమూ కనిపించడం లేదు. ఆ పర్యవసానాలను ముఖాముఖిగా ఎదుర్కొంటేనే అనుకున్న లక్ష్యానికి సురక్షితంగా చేరుకోగలమేమో!'

ఆనంద్ సౌత్ బ్లాక్‌కు బయలుదేరే వేళయింది. చర్చ ముగిసింది. కేవలం ముగిసింది.

★ ★ ★

పార్లమెంటరీ బోర్డు సమావేశంలో ఆనంద్ ముఖ్యమంత్రి పదవికి రాజీనామా సమర్పించాడు. దానిమీద ఎలాంటి చర్చ లేదు, ప్రశ్నలు లేవు, జవాబులు లేవు. అందరూ ఊపిరి పీల్చుకున్నారు. తను ముఖ్యమంత్రిగా ఉన్నన్ని రోజులు తనకు 'అచంచలమైన' సహకారం అందించిన ప్రధానమంత్రికీ, అధిష్ఠానవర్గంలోని సభ్యులందరికీ కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. అందుకు ప్రతిగా కొందరు సభ్యులు అతడు నిర్వహించిన ఉత్తమకార్యాలను ప్రశంసిస్తూ భవిష్యత్తులో అతడు ఎలాంటి బాధ్యతలు చేపట్టినా అందులో కూడా కృతకృత్యుడు కావాలని ఆకాంక్షించారు.

ఆనంద్ నిష్క్రమించిన తర్వాత, పార్లమెంటరీ బోర్డులో సభ్యుడయిన హోంమంత్రి ఒకింత విషపూరితంగా అన్నాడు, 'అతడు సొంతంగా వేరే పార్టీ పెట్టబోతున్నాడు మేడమ్. లేకపోతే అంత తేలిగ్గా ఎందుకు వదిలేస్తాడు?'

'ఆ రిపోర్టు ఎంతవరకు కరెక్టో నాకు సందేహమే,' ప్రధానమంత్రి నిశ్చలంగా అన్నారు.

ఎవరూ మాట్లాడలేదు.

★ ★ ★

గెస్ట్‌హౌస్‌కు తిరిగొచ్చిన ఆనంద్, కొంతసేపటి క్రితం ప్రధానమంత్రి తనతో అన్న మాటల అంతరార్థమేమిటా అని తర్కించుకుంటూ దీర్ఘాలోచనలో మునిగిపోయాడు. రాష్ట్రమంత్రివర్గంలో సభ్యుడుగా తను ప్రమాణ స్వీకారం చేసిన రోజును అతను గుర్తు చేసుకున్నాడు. రాజకీయాధికారం మత్తెక్కించడమే కాదు, ఎంతో ఉదాత్తతను తెచ్చిపెడుతుందని ఆ రోజున తను అనుకున్నాడు. ఇప్పుడు మరో రకమైన ప్రశ్నలు అతణ్ణి చుట్టుముట్టాయి. రాజకీయాధికారం క్రమంగా విషాదానికి దారితీయిస్తుందా? ఈ అశాంతి, విషాదం ఏదో కొరత వల్ల, ఏదో వైఫల్యంవల్ల కలిగేవా? వాస్తవానికి దగ్గరగా వచ్చినట్టనిపించింది కానీ, నికరంగా తేల్చుకోలేకపోయాడు. గత ఎన్నికల తర్వాత తన పనితీరు, అంతకు ముందూ, దరిమిలా ప్రజలు తనపై పెంచుకున్న ఆశలకు అనుగుణంగా లేదని పార్టీ భావించడం ప్రారంభించిందా? అఫ్రోజాబాద్‌కు సంబంధించినంతవరకు ఆనంద్ అంతర్గత భావన అదే. కొన్ని నిమిషాల క్రితమే తన పదవికి తను రాజీనామా చేశాడు. అది,

తాను చేస్తున్న పనిలో లోపాల వల్ల కాదనీ, అసలా పని చేయడం వల్లనేననీ అతనికి తెలుసు. నిజం నిక్కచ్చిగా చెప్పాలంటే, ఇందిరాజీ తనను బలిపెట్టింది మరెవరో తనదైన భూ పరిమితుల విధింపు కార్యక్రమా న్ని మరింత పటిష్ఠంగా అమలు చేస్తాడనికాదు - ఆ కార్యక్రమం పార్టీ కాళ్ళ కింద పెను 'మంట'లా మారడం వల్ల, తాత్కాలికంగానైనా శాంతినీ, సుస్థిరత్వాన్నీ తెచ్చుకోడానికి వెనకడుగు వేయడం అనివార్యం కావటం వల్ల. ఇంతవరకూ విరోధిస్తున్నవారితో ఇకమీదట కూడా శత్రుత్వాన్ని కొనసాగించడం లాభసాటి కాదు కనుక వారి సహకారాన్ని కూడగట్టుకోవడమూ అవసరమే. బయటి ప్రపంచానికి ఇదంత తేటతెల్లంగా కనిపించకపోవచ్చు. ఏదేమైనా రాష్ట్రంలోని ఇటీవలి పరిణామాలన్నింటినీ పూర్తిగా విభిన్నమైన కోణం నుంచి చూపించడానికీ, తన రాజీనామాను సుదీర్ఘంగా సాగినఒక విషాదభరిత ఘట్టానికి సంతోషకరమైన ముగింపుగా చిత్రించడానికీ, పత్రికలు నరాలు తెంచుకుని పనిచేస్తాయి. తన విషయంలోనే ఇలా జరిగిందన్న చింత తనలో ఏ కోశానా లేదు. ఎవరి విషయంలోనయినా ముగింపు ఇలాగే పరిణమించి ఉండేది. తన ఈ ఊహ తప్పయితే ఎంత బాగుండునని ఇప్పుడతనికి అనిపిస్తోంది. దేశ క్షేమం కోసం అది పూర్తిగా తప్పుడు ఊహ కావాలని ప్రగాఢంగా కోరుకుంటున్నాడు...

అంతలో మిశ్రాజీ అనే పెద్దమనిషి నౌకరిని వెంటబెట్టుకుని ప్రైవేటు సెక్రటరీ లోపలికి వచ్చాడు. ఆయన అందరికీ సుపరిచితుడు. ఆనంద్ ఆయనను వెంటనే గుర్తుపట్టాడు. తను ముఖ్యమంత్రిగా 'నామినేట్' కావడానికి కొద్ది రోజుల ముందు, ఓ రోజు రాత్రి ఇలాగే అనుకోకుండా ఆయన తనను కలసి మాట్లాడి వెళ్ళారు. ఇంత హఠాత్తుగా ఎందుకొచ్చారా అని అనుకుంటూనే ఆనంద్ సాంప్రదాయిక శైలిలో వంగి ఆయన పాదాలు స్పృశించి కుశలప్రశ్నలు వేశాడు. పండిట్‌జీ రోజులనుంచి కూడా నెహ్రూ కుటుంబానికి సన్నిహితమిత్రుడుగా మిశ్రాజీ గురించి చెప్పుకుంటారు. సున్నితమైన వ్యక్తిగత విషయాలను చక్కబెట్టడానికి ఇందిరాజీ తరచు ఆయనను పంపిస్తూ ఉంటారు. ఆయనకు టీ తెమ్మని చెప్పి, ఆయనేం చెప్పబోతారా అని ఎదురుచూస్తూ ఆనంద్ ఉండిపోయాడు. తను ముఖ్యమంత్రి కావడానికి ముందు ఈయన తనను కలుసుకోవడం, ఇప్పుడు ఆ పదవినుంచి తప్పుకున్న వెంటనే మళ్ళీ కలుసుకోవడంలో విచిత్రమైన యాదృచ్ఛికత ఉందనిపించింది.

'కాలచక్రపరిభ్రమణం ఎంత నిగూఢంగా ఉంటుంది!' నిజాయితీ ఉట్టిపడే స్వరంతో ఆయన ప్రారంభించాడు. 'మీరు ఎదుర్కొంటున్న ఒడుదుడుకుల్ని నేనోపక్క ప్రశంసాభావంతో, మరోపక్క భయాందోళనలతో, గమనిస్తూనే ఉన్నాను. వాస్తవికమైన మార్పుకు ఇందిరాజీ ఎంత చేయగలరో అంతా మీ హయాంలో జరిగింది. 'రేపేమిటి?' అన్న ప్రశ్న అనుక్షణం మనల్ని వెంటాడుతున్న సమయంలో మీరు చేసిన పనికి సరైన వెల కట్టడం కుదిరేది కాదు. మీరు జరిగినదానికి ఆగ్రహంతోఎగిసిపడే రకం కాదని నాకు తెలుసు. ఇప్పుడు మీరేమనుకుంటున్నారు?'

'భవిష్యత్తును తలచుకునే చింతిస్తున్నాను మిశ్రాజీ,' ఆనంద్ అన్నాడు. 'ఇందిరాజీ గురించీ, దేశంగురించే నేను ఆలోచిస్తున్నాను. ఏ దేశచరిత్రలోనయినా చాలా అరుదుగా సంభవించే అత్యంత విశిష్టమైన సమ్మేళనంగా రెంటినీ నేను కలిపే చూస్తాను. పేదల పేరు చెప్పి ఆమె

సాగిస్తున్నది కేవలం అధికారక్రీడేననీ, అంతకంటె మరేమీ కాదనీ ప్రత్యర్థులు నిరంతరం ఇల్లెక్కి ఘోషిస్తూ ఉంటారు. అది నిజం కావచ్చు, కాకపోవచ్చు, ఆమె ఏ ప్రేరణతో పనిచేస్తున్నారన్నది నాకు అనవసరం. ఎందుకంటే, ప్రత్యేకించి ప్రతివాళ్ళూ ఆడుతున్నది అదే ఆట కనుక. ఆ విషయంలో ప్రత్యర్థులకు ఆమెపై ఎలాంటి ఫిర్యాదున్నా, ప్రజలు దానివల్ల అతిగా ఎందుకు ప్రభావితులు కావాలో నాకు అర్థం కావటం లేదు. నా ఊహలో ఉన్న ఇందిరాగాంధీ చిత్రం, పేదలు ఆమె గురించి కల్పించుకున్న చిత్రం, ఒక్కలాంటివే కనీసం ఇప్పటివరకు. అయితే పేదల మనసులలో ముద్రపడిన ఆ చిత్రం ఇప్పుడు మారిపోవచ్చుననే నా భయం. నా అభిప్రాయం పూర్తిగా తప్పే కావచ్చు, అయినా నేను గట్టిగా విశ్వసిస్తున్నదేమిటంటే, ఓటమికి కూడా సిద్ధపడి ఇందిరాగాంధీ పోరాడినంతకాలం ఆమె ఎప్పుడూ ఓటమి చెందలేదు. గెలుపు వెంట గెలుపు సాధిస్తూ అప్రతిహతంగా ముందుకుసాగారు. ఆ పోరాటంలో ప్రజలు ఆమెకు అత్యద్భుతరీతిలో మద్దతు ఇచ్చారు. కానీ ఇప్పుడు... ఆమె ఓడిపోవడానికి ఇంకెంతమాత్రం సిద్ధంగా లేరన్న ఆలోచన నన్ను తీవ్ర అశాంతికి లోను చేస్తోంది.'

'మీరు చెప్పినదాంట్లో నిజముంది,' మిశ్రాజీ అన్నారు. 'అయితే నాయకులందరి జీవితాల్లోనూ మార్పులు వస్తూనే ఉంటాయి. ముఖ్యంగా సాధించిన విజయమే రకరకాల రీతుల్లో ప్రతిబంధకంగా మారినప్పుడు. వయస్సు, కుటుంబం, లాంటి వ్యక్తిగత అంశాలు కూడా పనిచేస్తాయి. కచ్చితంగా నాకు ఏ విషయం తెలియదు, కేవలం లోకానుభవం దృష్టిలో పెట్టుకుని చెబుతున్నాను.'

'అయితే మీరు క్షమిస్తానంటే ఒక మాట అంటాను మిశ్రాజీ. *దుర్గ* గురించి, *కాళి* గురించి ఆలోచించేటప్పుడు వ్యక్తిగతసమస్యలను చూడగలమా? నా ఉద్దేశంలో దుర్గలా కొనసాగడాన్ని మించిన ఘనసాఫల్యాన్ని దేనినైనా, ఎవరైనా ఊహించుకోగలరా? నే నీమాట అంటున్నది కూడా ప్రజలను ... ఇందిరాజీ అక్కున చేర్చుకున్న పేద ప్రజలను దృష్టిలో పెట్టుకునే.'

'ఏమైతేనేం, అప్పుడే రేపనేది వచ్చి మీమీద పడిపోయింది. ముఖ్యమంత్రిగా కాకపోయినా శాసనసభాపక్షనాయకునిగా మీరు కొనసాగాలని ఆమె ఆశిస్తున్నారు. అదో గడ్డు పరిస్థితే, పైగా ఇంతవరకూ ఆ ఆనవాయితీ ఉన్నట్టు లేదు. ఏం నిర్ణయించుకున్నారు?'

'అదెలాగూ శిరసావహిస్తాననుకోండి. భవిష్యత్తులోకి ఒకింత ముందుకు చూసి మీకు వాగ్దానం చేస్తున్నాను. నా జీవితాంతం ఆమెకు బాసటగా ఉంటాను. ఆమెకు నా అవసరం ఉండకూడదని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. అయితే తమ సొంతానికేమైనా లక్ష్యపెట్టని ఎవరో కొందరి అవసరం ఆమె కికమీద తప్పకుండా ఉంటుంది. ఆమె కూడా ఓటమికి అతీతురాలేమీ కాదని ఆమె విరోధులు, దేశ విరోధులు, ప్రప్రథమంగా వాసన పట్టినట్టు కనిపిస్తోంది. అప్పుడామె *దుర్గా* కాదు, *కాళీ* కాదు, కేవలం ఇందిరాజీయే అవుతారు. రెంటి తేడాను మీకు మీరే ఊహించుకోగలరు. పేదల పక్షాన పోరాడినంతకాలం ఆమె తిరుగులేని అజేయశక్తిగా నిలబడ్డారు. కానీ ఇప్పు డామె, ఫలితం ఎలా ఉంటుందో తెలియని అనిశ్చితిస్థితిలో సొంత పోరాటం సాగించవలసివస్తుంది.'

బయటికే తెలిసిపోయేలా మిశ్రాజీ నిలువునా కంపించారు. మరో మాట మాట్లాడకుండా చేతులు జోడించి నిశ్శబ్దంగా, ఒక నీడలా గదిలోంచి నిష్క్రమించారు.

# 60

## ఉపసంహారం

హోం శాఖ సహాయమంత్రి నిహాల్ చంద్ అన్నదే నిజమయింది. అఫ్రోజాబాద్ ప్రభుత్వం కూలిపోయిన కొద్దిమాసాల్లోనే - సరిగ్గా అవే పరిస్థితులలో కాకపోయినా, స్థూలంగా అవే కారణాల మీద గుజరాత్ ప్రభుత్వం కూడా పతనమయింది. భూ సమస్య - విశాల పృథ్వి - మరో రాష్ట్రప్రభుత్వాన్ని బలితీసుకుంది.

అక్కడితో అంతా సద్దుమణిగింది. సాంఘికపరివర్తన దిశలో ఒక పరిమితిని మించి నువ్వు ముందుకు దూసుకుపోలేవు. విప్లవాత్మకవైఖరిలో అంతర్గతంగా ఉన్న ప్రమాదాలు అపాటికి ప్రతిఒకరికీ అర్థమయ్యేవిగా తేటతెల్లమైపోయాయి. ఎవరైనా అధికారశిఖరాగ్రానికి చేరుకున్న తర్వాత దానిని నిలబెట్టుకోవలసిందే. అంతకంటె ఏదీ ముఖ్యంకాదు. ఇందుకు యధాతథస్థితితో రాజీపడవలసిందే. ఎందుకంటె నీవుకూడా శిఖరంపైన యధాతథస్థితినే కోరుకుంటున్నావు కనుక. అయితే తన విప్లవాత్మకగమనంలో ఇందిరాగాంధీ, ఆనంద్‌లాంటి కొందరు బ్రేకులు లేని క్రియాశీలయోధుల్ని సృష్టించగలిగారు. వారిలో వెల్లివిరిసిన ఉత్సాహోత్తేజాలు తుపాకీతో పనిలేకుండానే సాంఘికపరివర్తన సాధ్యమన్న దృష్టి కలిగించాయి. అప్పటికీ ఆమె ఇంకా ముందుకు సాగి ఉండేవారు. అయితే ఆ ప్రక్రియలో ఇంతకుముందు గడించిన ప్రయోజనాలు చేజారిపోయే ప్రమాదం తలెత్తింది. ఒక వ్యూహంగా కూడా అది ఎంతవరకు వాంఛనీయం?... ఆ మాటకొస్తే సమూల పరివర్తన కోసమే అయినా? భారీనష్టం భయపెడుతున్న స్థితిలో అలా ఆగి ఆలోచించవలసివచ్చింది.

నిక్కచ్చిగా విశ్లేషించుకుంటే, ఆనంద్ ఇందిరాగాంధీకి ఏమవుతాడు? విభిన్ననేపథ్యంలో విభిన్నమైన పెంపకంలో, విభిన్నలక్ష్యాలతో ఒక సుదూర విభిన్న ప్రాంతంనుంచి వచ్చిన వాడతను... అన్నీ విభిన్నమే. అతడు తనకు అప్పగించిన పనిని అంకితభావంతో నెరవేర్చే ఒక విశ్వసనీయ సహచరుడు మాత్రమే. అయితే ఇంత సువిశాలప్రపంచంలో భూ పరిమితుల విధింపు ఒక్కటే నెరవేర్చదగినకార్యమా?

ఆనంద్ మొండిపట్టు వల్ల తన పదవికే ప్రమాదం ముంచుకొచ్చిందని ఇందిరాగాంధీ భయపడ్డారా? అలా కనిపించి ఉండవచ్చుకానీ, ఆ మేరకు స్పష్టమైన సూచ నేదీ లేదు. ఆనంద్‌ను తప్పించడమే సమస్యను సాఫీగా పరిష్కరించే మార్గమనీ, అంతగా ఆమె కోరుకుంటే, ఇంతకంటె ఎక్కువ అంకితభావమూ, ఎక్కువ మేధాశక్తీ అవసరమైన భారీఅంశాల మీద దృష్టిని కేంద్రీకరించే అవకాశం కల్పించవచ్చుననీ, పార్టీలో విజ్ఞులైన సీనియర్ నాయకులు అప్పుడప్పుడు అంటూనే వచ్చారు.

అయితే ఆమె చేత అటువంటి ప్రకటన చేయించగలిగిన వాళ్ళెవరు?

ఆమెకీ సలహా ఇవ్వగలగిన వాళ్ళెవరు? ఎలా ఇస్తారు?

ఇందులో ఏదీ అంత తేలిక కాదనుకున్నారు వాళ్ళు.

క్రమంగా ఇందులో ప్రతిఒక్క పనినీ గుంభనంగా పూర్తి చేయగలిగారు. భూ సంబంధాల సంక్షోభంనుంచి ఇందిరాగాంధీ బయటపడ్డారు. ఆనంద్‌కు పార్టీ పని అప్పగించడం జరిగింది. విధుల మార్పు గురించి, దాని వెనుక కారణం గురించి, అతడు మనసులో ఎలా భావించినా పైకి ఒక్క మాట కూడా అనలేదు.

ఓ బ్రహ్మాండమైన అధికారయంత్రాంగంలో దాదాపు తనో భాగమైనట్టుగా అతడు క్రమంగా ఉన్నతస్థానాలకు చేరుకోగలిగాడు. నువ్వింతవరకు నిర్వర్తించిన పదవిలో ఏం చేశావని ఎవరూ అడగలేదు... ఎన్నికలు వచ్చినప్పుడు పార్టీ మునిగినా, తేలినా, కేవలం నాయకురాలి జనవశీకరణశక్తి మీద ఆధారపడే జరిగిపోయింది. వోటర్లను ఆకర్షించడానికి అదొక్కటే పనికొచ్చిన సాధనమయింది. ఆ విధంగా పనితీరుకూ, ఎన్నికలఫలితాలకూ దృశ్యమానసంబంధమేదీ లేకుండా పోయింది.

దేశసంక్షోభం అరాచకపు అంచులకు చేరుకుందనిపించినప్పుడు జాతీయఅత్యవసర పరిస్థితి ప్రకటించడం జరిగింది. దేశంలోని ప్రజాస్వామికవ్యవస్థలన్నీ తీవ్ర ఆఘాతానికి లోనయ్యాయి.

ఇందిరాగాంధీ ఒడుదుడుకులు ఎదుర్కొంటున్నప్పుడూ, గెలుపు కెరటాల మీద తేలిపోతున్నప్పుడూ కూడా ఆనంద్ ఆమె వెంటనే ఉన్నాడు. అయితే భూమి (విశాల పృథ్వి) ఆమె చేజారిపోగానే దేశభవిష్యత్తు మీద ఆమె పట్టు కూడా శాశ్వతంగా సడలి పోయిందన్న విచారకరభావం ఆతనిలో అశాంతిని రేపుతూనే ఉంది.

ఆమె సలహాదారు లనేకులు ప్రయత్నించి చూసిన ఋణమేళాలూ, భూమిలేని పేదలకు ఉద్దేశించిన కార్యక్రమాలూ, గృహనిర్మాణ పథకాలూ, అటువంటి మరెన్నో చర్యలూ - గ్రామీణ సన్నివేశాన్ని విప్లవీకరించే కృషిలో, భూ సంస్కరణలకు ప్రత్యామ్నాయం కాలేకపోయాయి. ఈ లోపల ఇతర అంశాలు కేంద్రస్థానంలోకి దూసుకొచ్చేశాయి. అధికారపు చిటారు కొమ్మమీద నాలుగేళ్ళు కూడా పూర్తిగా లేకుండానే 1977లో ఇందిరాగాంధీ నమ్మశక్యం కాని రీతిలో స్వయంగా పరాజితులయ్యారు.

ఎమర్జెన్సీ గందరగోళం తర్వాత కేంద్రంలో మరో పార్టీ అధికారంలోకి వచ్చింది. మొరార్జీ దేశాయ్ - గతంలో ప్రధానమంత్రి పదవిని ఆశించి, పార్టీ ఇందిరాగాంధీ వైపు మొగ్గడంతో బంగపడిన అదే మొరార్జీ భాయ్ - ప్రధానమంత్రి అయ్యారు. దరిమిలాను రుజువైనట్టు, కొన్ని పార్టీలు ప్రభుత్వాన్ని నడపడానికి కాక, కేవలం ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికే గుమిగూడి అవతరింపజేసిన కొత్తపార్టీకి ఇప్పుడాయన నాయకుడయ్యారు.

ఇందిరాగాంధీని తీహార్ జైలుకు పంపించడం ద్వారా దేశానికి ఆమె చేసిన సేవలకు లోక్‌సభ ప్రతిఫలం చెల్లించింది. ఆమె మీద పెట్టిన ఇతర క్రిమినల్ కేసులేవీ (ఎక్కడో మారుమూలనున్న మణిపూర్‌లో కోడిపిల్లను దొంగిలించారన్న కేసుల్లాంటివి) నేర నిరూపణ దశకు చేరుకోలేకపోయాయి.

మొరార్జీప్రభుత్వం పట్ల భ్రమలు చెదిరిపోయిన ఘట్టంలో ప్రజలు ఇందిరాగాంధీకి పునరాహ్వానం అందించారు. మొరార్జీ ప్రభుత్వానికి చెందిన పార్టీ అంతర్గతకలహాల వల్ల చీలికలు పేలికలైపోయింది. లోక్‌సభకు 1980లో జరిగిన మధ్యంతర ఎన్నికల్లో తిరిగి ఇందిరా గాంధీ అధికారంలోకి వచ్చి ప్రధానమంత్రి అయ్యారు. ప్రపంచ సమితులలో మరోసారి భారతదేశప్రతిష్ఠను ఇనుమడింపజేశారు. ఆమె అధికారపునఃస్వీకరణసమయానికి దేశమంతటినీ కొత్తతరం కమ్మివేసింది; వాళ్ళ ఆకాంక్షలలో సమూల పరివర్తన తొంగిచూసింది. విద్యావ్యాప్తి పుణ్యమా అని భూదాహం క్రమంగా తగ్గుముఖం పట్టి ఉద్యోగదాహానికి దారి కల్పించింది. ఉన్నతశ్రేణులలో ఈ ఎరుక కలగడానికి కొంత వ్యవధి పట్టింది.

ఆ తర్వాత ఆపరేషన్ బ్లూస్టార్, ఆ వెనువెంటనే ఇందిరాగాంధీ దారుణహత్య జరిగిపోయాయి.

ప్రధానమంత్రి పదవిలో నియమించడానికి రాజీవ్‌గాంధీ పేరును, పార్టీ పార్లమెంటరీ బోర్డులోని మిగిలిన సభ్యులతో కలసి ఆనంద్ రాష్ట్రపతికి సిఫార్సు చేశాడు.

అనేక మహత్తరపరిణామాలతో నిండినదిగా చెప్పుకోదగిన మరో అయిదేళ్ళ గడువు రాజీవ్ గాంధీ ఏలుబడిలో దొర్లిపోయింది. అన్య సహచరులతో కలిసి ఆనంద్ ఆయనకు సలహాసహకారాలు అందించాడు.

ఆ తర్వాత అధికారపక్షం ఓటమి పాలై, 1989లో మరో పార్టీ ప్రభుత్వం అవతరించి, తొమ్మిది మాసాలకే కూలిపోయింది. అనంతరం మరో ప్రభుత్వం పుట్టి కొన్ని మాసాలు అధికారంలో ఉంది. 1991లో మళ్ళీ లోక్‌సభకు ఎన్నికల ప్రకటన జరిగింది. ప్రచారఘట్టం సగంలో ఉండగానే మానవరూపంలోని ఒక బాంబ్ రాజీవ్‌ను బలితీసుకుంది.

క్రియాశీలరాజకీయాలనుంచి విరమించుకోవాలని నిర్ణయించుకుని లోక్‌సభకు పోటీ చేయడానికి విముఖత చూపించిన ఆనంద్, రాజకీయపరిణామాలు అసాధారణమైన ఒక మలుపు తిరిగిన ఘట్టంలో, ఆకస్మికంగా, అనూహ్యరీతిలో ప్రధానమంత్రి బాధ్యతను తన భుజస్కంధాలకు ఎత్తుకోవలసి వచ్చింది. అతని జీవితంలో ఒక వినూత్నదశ ప్రారంభమైంది.